# కాంగ్రెస్సు చరిత్ర

రచయిత

భోగరాజు పట్టాభిసీతారామయ్య

ప్రకాశకులు

అఖిలభారత జాతీయమహాసభా

కార్యనిర్వాహకవర్గము

అలహాబాదు

౧౯౩౫



భారతజాతీయ మహాసభాధ్యక్షుడు

బాబు రాజేంద్రప్రసాదు

బొంబాయి : 1934

మాతృదేశ విమోచనార్థము

పరమోత్సాహముతో మహాత్యాగమును చేసిన

అసంఖ్యాకులైన హిందూస్థాన

కుమారీకుమారులు

ఏ సేవావ్రతమునుననుష్ఠించిరో

కాంగ్రెసు యోగములకు

ఏ పరమార్థము

అవతరించిన సాధనమైనదో

అట్టి

సత్యమునకు, అహింసకు

సమర్పితము

## వి ష య సూ చి క


౧. సంస్కరణ, స్వపరిపాలనముల

శకము ౧-౧౬౨

౨. హెూముకూలుశకము ౧౬౩-౨౬౦

౩. స్వరాజ్యశకము ౨౬౧-౪౮౭

౪. సంపూర్ణ స్వరాజ్యశకము ౪౬౧-౬౨౨

౫. పోరాటములశకము ౬౨౫-౭౩౧

౬. పునర్నిర్మాణశకము ౭౭౫-౮౬౮

అనుబంధములు ౧-౬౨

# ఉపోద్ఘాతము

50 సంవత్సరములక్రిందట అఖిలభారతజాతీయమహాసభ మొట్ట మొదటిపర్యాయముగా బొంబాయి నగరమందు సమావేశ మయ్యెను. కొలదిమంది ప్రతినిధులు అప్పుడు సభకు హాజరైయుండిరి. వారు ప్రజలచే ఎన్నుకోబడినవారు కాకపోయినను ప్రజాసేవాతత్పరు లనదగియుండిరి. ఆనాటినుండియు యీసభ ప్రజాస్వాతంత్ర్యమునకై కృషి చేయుచునేయున్నది. ప్రారంభదశలో ఈ సభోద్దేశము సరిగా నిర్వచింపబడియుండలేదు. కాని, మొదటినుండియు ప్రజాస్వామ్య పరి పాలనాపద్ధతినే కోరుచుండెను. ఈవిశాలభారత దేశములో గల వివిధ మతములవారికిని, సంఘములవారికిని ప్రతినిధులు ఎన్నుకోబడి ఆప్రతి నిధులవల్లనే పరిపాలనావ్యవహారములు నిర్వహింపబడవలెనని కోరు చుండెను.

బ్రిటిషుగవర్నమెంటువారును, బ్రిటిషు రాజకీయవేత్తలును సమయస్ఫూర్తిగా భారతీయుల కోరికలను మన్నించి, భారతదేశా భ్యుదయముకొరకై భారతదేశమును భారతీయులే పరిపాలించుకొను టకు హక్కులను అవకాశములను ఒసంగునట్టి ప్రజాప్రాతినిధ్యముగల పరిపాలనాసంస్థలను ఏర్పాటుచేయగలరను నమ్మకముతో యీ కాంగ్రెసుసభ ప్రారంభమైనది. ఇట్టి నమ్మకము, ఇట్టి విశ్వాసము కాంగ్రెసు సభోపన్యాసములయందు ప్రారంభదశలో ప్రతిధ్వనించు చున్నది. భారతదేశములోనిసంగతిసందర్భములను, భారతీయులకోరిక లను బ్రిటిషువారికి సరిగా తెలియజేసినయెడల బ్రిటిషుపార్లమెంటువారు భారతీయులకుగల ప్రతిబంధకములను తొలగించి పరిస్థితులను చక్క

బరచి భారతీయులకు స్వపరిపాలనా స్వాతంత్ర్యమును వారు ప్రసాదించెదరను దృఢవిశ్వాసముతో ఆనాటి కాంగ్రెసుసభలయందు తీర్మానములు చేయబడెను. దేశ కంటకమైన శాసనములను తొలగించవలసినదనియు సంస్కరణములను చేయవలసినదనియు కొన్ని సూచనలను గవర్నమెంటువారికి ఆసభాతీర్మానములలో చేయుచువచ్చిరి. కాని, ఇంగ్లాండులోను ఇండియాలోను అధికారము వహించియున్న బ్రిటిష్ గవర్నమెంటువారి చర్యలవల్ల ప్రజలకు గల నమ్మకము, ఆశ, క్రమేణ అడుగంటినవి. భారతదేశములోని ప్రజలయందు జాతీయాభిమానము స్వదేశాభిమానము వికసించుచున్నకొలంది, బ్రిటిష్ గవర్నమెంటువారి ధోరణి మరింత బిరబిగిసినది. కర్జనుప్రభువు బెంగాలు రాజధానిని రెండుభాగములుగా విభజించినప్పుడును, ఆ బెంగాలు విభజనానంతరము దేశములో ప్రజాందోళనము ప్రజ్వలించినప్పుడును, బ్రిటీష్ ప్రభుత్వమువారియందు ప్రజలకు ఏర్పడియుండిన భక్తితాత్పర్యములు పటాపంచలైనవి. అప్పుడే భారతజాతి కొక నూతనజ్ఞాన ప్రబోధముకలిగినది. ఆ ప్రబోధతరంగమునకు దోహదముగా ప్రపంచ పరిస్థితులుకూడ కొన్ని తోడ్పడియుండెను. అప్పుడే, యీ ౨౦ వ శతాబ్దారంభమున రష్యాజపాను యుద్ధములో జపాను దేశమునకు జయముకలిగెను. భారతదేశములో ప్రజలకు ప్రభుత్వమువారియెడల భక్తి విశ్వాసములు కొంత తారుమారైనను పూర్తిగా యింకను నశించలేదు. ఇంకను కొంత రాజభక్తివిశ్వాసములు ప్రజలలో మిగిలియుండుటవల్లనే గత ఐరోపా సంగ్రామకాలమందు బ్రిటిష్ గవర్నమెంటువారికి బాసటమైనిలిచి బ్రిటిష్సామ్రాజ్యముయొక్క ఆపద్దశలో భారతీయులు తోడ్పడి సహాయముచేసిరి. అప్పటికి బెంగాలురాష్ట్ర విభజన రద్దుచేయబడి యుండుటవల్లను, సంగ్రామమువల్ల సంభవించిన క్లిష్టపరిస్థితులను ప్రజలు సరిగా అర్థముచేసికొనగల్గుటవల్లను, బ్రిటిష్ వారియెడల భక్తివిశ్వాసములు మరొకమారు ప్రజాహృదయమందు

అంకురించెను. ఈ కారణములవల్ల భారతీయు లప్పుడు బ్రిటిష్ వారికి సహాయము చేసియుండిరి. భారత దేశము అప్పుడు బ్రిటిష్ వారికి చేసిన దివ్యమైన సేవాసహాయములను బ్రిటిష్ రాజకీయవేత్తలందరును కొనియాడి యుండిరి. ఒకజాతివారిపైన ఇంకొక జాతివారు తమ నిరంకుశాధికారమును చలాయింపకుండుటకును, ఎవరి బాగోగులను వారే స్వయముగా నిర్ణయించుకొనుటకు కర్తలనియెడి స్వయంనిర్ణయధర్మమును ప్రతిష్ఠించుటకును, ప్రజాస్వాతంత్ర్య ప్రభుత్వధర్మమును కాపాడుటకును, ఐరోపాసంగ్రామములో బ్రిటిష్ వారు కత్తికట్టి పోరాడియుండిరి. అట్టి ధర్మయుద్ధానంతరము భారత దేశములోకూడ బాధ్యతాయుతప్రజాస్వాతంత్ర్యప్రభుత్వము ప్రతిష్ఠింపబడు ననెడి యాశలు భారతీయులకు కలిగెను. ౧౯౧౭ వ సం. లో బ్రిటిషు గవర్నమెంటు వారి తరఫున ఇండియా కార్యదర్శిగా రొకప్రకటన చేసియుండిరి. భారతీయులకు దశాంతర్దశలుగా క్రమశః స్వపరిపాలనాధికార మొసంగబడునని వాగ్దానము చేసిరి. ఈవాగ్దత్తవిషయమై భారతీయులలో అభిప్రాయభేదములు కలిగెను. ఇండియా కార్యదర్శిగారును, వైస్రాయిగారును యీవిషయములో ప్రజాభిప్రాయమెట్లున్నదో దరియాప్తులు చేసినకొలది, యీ యభిప్రాయభేదములు మరింత తీక్ష్ణముగా కన్పించెను. ఇండియాకార్యదర్శి చేసిన వాగ్దాన మెటువంటిదో తెలిసెను. అది ౧౯౨౦ సం.లో ఇండియాఆక్టు రూపమున అమలులోనికివచ్చెను. ఈరాజ్యాంగ శాసనమును బ్రిటిషువారు పొదుగుచుండిన దినములలో, ఐరోపాయుద్ధమందు బ్రిటిషువారికి జయము కలిగెను. కాని, ఐరోపాఖండములో బ్రిటిషువారికి మంచిరోజులు తిరిగివచ్చినకొలది, భారత దేశముయెడల వారికిగల ధోరణి వక్రింపజొచ్చినదనెడి భావము భారతీయులకు కలిగినది. ఈ అభిప్రాయము దృఢమగుటకు తగిన సందర్భకారణములుకూడ కన్పించినవి. ఖిలాఫతువిషయములో మహమ్మదీయులకు బ్రిటిషువారు వాగ్దానభంగము చేసియుండిరనుట యొక్క

పెద్దకారణ మయ్యెను. ఐరోపాసంగ్రామదినములలో భారతదేశాంతః కలహములను నివారించుటకై తీవ్రనిబంధనలుగల దేశసంరక్షణార్థమైన శాసనమొకటి ఆగంతుకముగా అమలుపరచబడి యుండెను. కాలావసరమునుబట్టి ప్రజలుదానిని సహించియుండిరి. కాని యుద్ధానంతరముకూడ ఆ తీవ్రనిబంధనలను శాశ్వతముగా శాసించుటకు పూనుకొని రౌలటుచట్టము నొకటి తయారుచేసిరి. ప్రజలకుండవలసిన ప్రాతిపదిక పౌరజనస్వామ్య స్వాతంత్ర్యములుకూడ యీ రౌలటు శాసనమువల్ల తొలగింపబడినవయ్యెను. ఇదికూడమరొకకారణ మయ్యెను. ఈకారణములవల్ల దేశములో నొక తీవ్రాందోళన ముద్భవించెను. దక్షిణాఫ్రికాలో అనుష్ఠింపబడి సాధకము చేయబడిన సత్యాగ్రహమును గాంధీమహాత్ముడు యీదేశములోకూడ ఇంతకు ముందు చాంపరానులోను కెయిరాలోను స్వల్పపరిమితిలో అవలంబించి యుండెను. అట్టి సత్యాగ్రహపద్ధతిని మహాత్ముడు, పైజెప్పిన దేశానర్థకములను ప్రజానర్థకములను, తదితర కష్టనిష్ఠురములను తొలగించుటకై, ప్రతిక్రియగా ప్రథమతః భారతీయుల కుపదేశించెను. భారతీయులు దానిని దివ్యాస్త్రముగా అవలంబించిరి. పంజాబురాష్ట్రమందును, అహమ్మదాబాదునందును దురదృష్టవశమున కొన్ని ప్రజాకల్లోలములు సంభవించి రక్తపాత మయ్యెను. ప్రాణనష్టమయ్యెను. దాని వెనువెంటనే జలియన్వాలాబాగులో జనసంహారము జరిగెను. పంజాబురాష్ట్రములో సైనికచండశాసనము అమలుపరచబడెను. ఈ దురంతములు జరిగినతోడనే ప్రజలలో ఉద్రేకము ప్రజ్వలించెను. ఈ దురాగతముల సత్యాసత్యములను పరిశీలించుటకై నియమింపబడిన హంటరు కమిటీవారు తమ నివేదికను ప్రకటించిన పిమ్మటకూడ యీ ఉద్రేకము, యీ రోషావేశము చల్లారలేదు. ఈ నివేదికను విమర్శించుచు పార్లమెంటుసభలో జరిగిన వాదప్రతివాదనలవల్ల యీ ఉద్రేకము మరింత ఉగ్ర మయ్యెను. అప్పుడు ప్రారంభమైన సహాయ

నిరాకరణోద్యమము ప్రభుత్వబిరుదముల నిరాకరించుట తోడను, శాసనసభాబహిష్కారము తోడను, ప్రభుత్వపోషితవిద్యాశాలా బహిష్కారము తోడను, సర్కారు కోర్టులను బహిష్కరించుట తోడను, విదేశవస్త్ర బహిష్కరణముతోడను ఉపక్రమింపబడెను. ఇదిగాక, కాంగ్రెసుమెంబర్లను విరివిగా చేర్పింపసాగిరి. కాంగ్రెసు కమిటీలను విరివిగా ఏర్పాటుచేయసాగిరి. గ్రామతగాదాలను పరిష్క రించుటకై పంచాయితీలను ఏర్పాటు చేయసాగిరి. తిలక్ స్వరాజ్యనిధిని వసూలుచేయసాగిరి. జాతీయ విద్యాలయములను ప్రతిష్ఠింపసాగిరి. రాట్నములపై నూలువడుకుట, చేమగ్గములపై బట్టలు నేయుట పునరుద్ధ రింప సాగిరి. ఈ మహాసంకల్పమంతయును క్రమానుగతముగా అను ష్ఠానములోనికి రావలసియుండెను. చిట్టచివరకు శాసనోల్లంఘనము, పన్నుల నిరాకరణము జరుగవలసియుండెను. కాంగ్రెసు సభా సిద్ధాం తముకూడ మార్పుచేయబడెను. "శాంతియుతమైన న్యాయసమ్మత మైన పద్ధతులవల్ల స్వరాజ్యమును సాధించుటయే కాంగ్రెసుయొక్క మూలసిద్ధాంత"మని నిర్వచింపబడెను. ఈ యుద్యమమువల్ల దేశ మంతటను నూతనోత్తేజముకలిగెను. దీనివెన్వెంటనే గవర్నమెంటువారు కూడ ప్రజలను పీడింపసాగిరి. ౧౯౨౧సంవత్సరాంత్యమునందు స్త్రీలును, పురుషులును వేనవేలుగా బందిఖానాలలో బంధింపబడిరి. ప్రముఖులైన నాయకులుకూడ పలువురు చెరసాలల కేగిరి. సర్కారువారితో సమా ధాన మొనగూర్చుటకై ప్రయత్నములు చేయబడెను. కాని ఆప్రయత్న ములు విఫలము లయ్యెను. అందువల్ల బార్డోలీపరగణాయందు పన్నుల నిరాకరణమును ఉపక్రమింపవలసియుండెను. కాని, సంయుక్తపరగణాల యందును, చౌరీచౌరాలోను తీవ్రమైన అల్లరులు జరుగుటవల్ల పన్నుల నిరాకరణోద్యమమును నిలిపివేయవలసివచ్చెను. అనంతరము, సహాయ నిరాకరణోద్యమ కార్యానుక్రమణికలోని ఒక్కొక్క అంశమును

క్రమేణవిరమించుటయును, ఉపసంహరించుటయును జరిగెను. చిట్ట చివరకు కాంగ్రెసువాదులు శాసనసభలలోకూడ ప్రవేశించిరి.

౧౯౨౦ సం॥లో యీ దేశమందు అమలుపరచబడిన రాజ్యాంగ విధానము ఏవిధముగా పనిచేసినదో నిర్ణయించి లోపాలోపములను పరిశీలించి నూతనరాజ్యాంగసంస్కరణము లెట్లుండవలెనో సూచించుట కొరకై సైమనుకమిటీ నియమింపబడెను. సైమనుకమిటీ ఏర్పాటుచేయబడినప్పుడు దేశములో మరొక నూతనాభ్యుత్థానము కలిగెను. అప్పుడు కాంగ్రెసుసభ తదితర ప్రజాసంస్థలతో ఏకమై అధినివేశ ప్రతిపత్తినే భారతదేశపరమావధిగా నిరూపించుచు నొక రాజ్యాంగవిధానమును తయారుచేసి, గవర్నమెంటువారి యామోదమునకై సమర్పించెను. గవర్నమెంటువారు యీ రాజ్యాంగప్రణాళికకు సమ్మతింపనియెడల, కాంగ్రెసుసభయొక్క పరమావధి పూర్ణస్వరాజ్యమును సంపాదించుటయే యని ౧౯౨౯ సంవత్సరమందు లాహోరులో జరిగిన కాంగ్రెసు సభయందు తీర్మానించబడెను. ఈ పూర్ణస్వరాజ్యమును సాధించుటకై న్యాయసమ్మతమైన శాంతియుతమైన మార్గముల నవలంబింపవలెననియు, నీతిలేని శాసనములను ఉల్లంఘించుటకును పన్నులను చెల్లింపక నిరాకరించుటకును ౧౯౩౦ సంవత్సరారంభమందు పూనుకొనవలెననియు, సిద్ధాంతీకరింపబడెను. ఇంగ్లాండులోని ఆంగ్లప్రభుత్వమువారు ఒకసభను లండనులో సమావేశపరచిరి. దానికి గవర్నమెంటువారే ఏరికోరినియమించిన భారతీయులను ప్రతినిధులుగా ఆహ్వానించిరి. భారతదేశమున కెటువంటి రాజ్యాంగ విధానముండదగునో తమకు సలహా యివ్వవలసినదని ఈ ప్రతినిధులనుకోరిరి. ఒక వైపున యీ సంప్రతింపులను లండనులో చేయుచు, మరొక వైపున యీ దేశములో జరుగుచున్న శాసనోల్లంఘనోద్యమమును అణచివేయుటకై అనేక నిర్బంధపద్ధతులను అమలుపరచుచు, ఆగంతుక

ముగా చండశాసనములను పెక్కింటిని స్వతంత్రాధికారముతో జారీ చేయసాగిరి.

౧౯౩౧ సం॥రం మార్చి నెలలో గవర్నమెంటువారి తరఫున అప్పుడువైస్రాయిగానుండిన ఇర్విన్‌ప్రభువుగారికిని, కాంగ్రెసు తరఫున గాంధిమహాత్మునకును ఒకఒడంబడికజరిగెను. ఆఒడంబడికయొక్క పర్యవసానముగా శాసనోల్లంఘనము తాత్కాలికముగానిలిపివేయబడెను. గాంధిమహాత్ముడు ౧౯౩౧ సంవత్సరాంత్యమందు లండనులోని రౌండుటేబిలుసభకు హాజరయ్యెను. అనుకొనిన ప్రకారముగానే యీ రౌండుటేబిలుసభవల్ల లభించిన సారాంశ మేమియు లేదు. ౧౯౩౨ సంవత్సరారంభములో కాంగ్రెసుసభవారు సత్యాగ్రహోద్యమమును విధిగా తిరిగి యుపక్రమింపవలసినవారైరి. ౧౯౩౪ సంవత్సరము వరకును దానిని సాగించి తిరిగినిలిపివేసిరి. ౧౯౩౦-౩౨ సం॥ల మధ్యజరిగిన యీయుద్యమముయొక్క రెండంకములలోను లక్షలకొలది స్త్రీలును, పురుషులును, బిడ్డలునుకూడ జెయిళ్లకు సిద్ధమైరి. లాటీ దెబ్బలను తినిరి. పలువిధములయిన క్రూరహింసలకు ఒడిగట్టిరి. ప్రాణమును మానమును ధనమునుకూడ గోల్పోయిరి. సర్కారువారిపటాలములు జనసమూహములపై తుపాకులను పేల్చుటవల్ల చాలమంది హతులైరి. అటువంటి తీవ్రబాధలను పెట్టుచున్నప్పటికిని, మొత్తముమీద సత్యాగ్రహులు చాలకట్టుదిట్టముగా తమ నిగ్రహసామర్థ్యమును శమదమాదులను చూపగల్గిరి. కాంగ్రెసుసభలో కొంత చేవ యున్నదనియు, అది వీర్యవంతమైనదనియు, సమయోచితముగా ప్రవర్తింపగలదనియు, లోకమునకు వెల్లడియైనది. గవర్నమెంటువారి ఢాకకు ఎదురొడ్డి నిలువగలిగినది. ప్రజలు ఈఅగ్నిపరీక్షయందు సమర్థు లనిపించుకొనిరి. కాని తమ మనోరథమైన సంపూర్ణస్వరాజ్యమును సాధింపజాలకపోయిరి.

కరాచీలో జరిగిన కాంగ్రెసుసభయందు భారతీయుల కందరికిని ప్రాతిపదికమైన హక్కులకు భంగము కలుగజాలదని అభయ హస్తమొకటి నిర్వచింపబడెను. సాంఘికోద్ధరణముకొరకును, ఆర్థికాభ్యుదయముకొరకును, ఒక కార్యవిధానమును ఆసభలో తీర్మాన రూపమున నిర్ణయించిరి. జనసామాన్యము తదితరులచే పీడింపబడకుండునిమిత్తమై దేశమందుండవలసిన రాజకీయస్వాతంత్ర్యము వల్ల నిజమైన ఆర్థికస్వాతంత్ర్యము కోట్లకొలదిగా నున్న గర్భదరిద్రు లందరికిని చేకూరవలెను. అందుకొరకై పౌరు లందరికిని సరిసమాన మైన కొన్ని సార్వజనికహక్కులుండవలెను. అనగా, వాక్స్వాతంత్ర్యము, సమావేశస్వాతంత్ర్యము, ప్రాణధనసంరక్షణా స్వాతంత్ర్యము, ఆత్మవిశ్వాస స్వాతంత్ర్యము ప్రతివారికిని ఉండితీరవలెనని స్పష్టముగా తీర్మానింపబడెను.

యంత్రాగారములు మున్నగు కార్ఖానాలయందు పనిచేయు కార్మిక జనులందరియొక్క యోగక్షేమములును కాపాడబడుననియు, వారి పనిపాటులకుగల పరతునియమములను సక్రమమొనర్చుటవల్లను, వారుపనిచేయదగు గంటల పరిమితిని నిర్ణయించుటవల్లను, వారికి కలిగెడితగాదాలను పరిష్కరించుటకై తగిన వ్యవహారతంత్రము నేర్పరుచుటవల్లను, వార్ధక్యము, వ్యాధిగ్రస్తత, నిరుద్యోగము మున్నగు హేతువులవల్ల వారికి కలిగెడి ఆర్థికబాధలనుండి వారిని కాపాడుకు ఏర్పాట్లు చేయుటవల్లను, వారు సంఘములుగా ఏర్పడుటకై హక్కు నొసంగుట వల్లను, కార్మికజనుల యోగక్షేమములు కనిపెట్టబడునని ఆ సభలో తీర్మానింపబడెను. ఇక కర్షకజనుల విషయములో, భూమిశిస్తులను తీర్వలను తగ్గించుటవల్లను, ఫలసాయములేని ఆస్తివసతుల విషయములో పన్నులు శిస్తులు లేకుండా చేయుటవల్లను, శిస్తురేట్లను తగ్గించుటచే చిన్నచిన్న భూస్వాములకుగాని జమీందారులకుగాని కలిగెడి

నష్టమునకు న్యాయమైన ఆవశ్యకమైన పరిహారములను కలుగ జేయుటవల్లను వ్యవసాయభూముల పన్నులభారమును తగ్గించుటకు పూనుకొనబడునని తీర్మానింపబడెను. భూములవల్ల వచ్చెడి నికరాదాయములలో ఒక కనిష్ఠప్రమాణమునకు మించిన ఆదాయములకు మాత్రమే ఆదాయ ప్రమాణమునుబట్టి ఆరోహణ క్రమముగా పన్నులను నిర్ణయింపవలెనని తీర్మానింపబడెను. ఒక నిర్ణీతప్రమాణమునకు మించిన ఆస్తిగలవారికే ఆరోహణ క్రమముగా ఆస్తివిలువనుబట్టి మరణసుంకము విధింపబడదగుననియు, సైనిక పటాలములకును సివిలుఉద్యోగియబృందమునకు అగుచున్న ఖర్చును తగ్గించుటకు పూనుకొనబడుననియు, సర్కారు ఉద్యోగియులలో ఎవరికిని మాసమునకు రు. ౫౦౦ లకు మించిన జీత ముండరాదనియు తీర్మానింపబడెను. ఇదిగాక దేశములో జరుగవలసిన సాంఘికోద్ధరణమును గూర్చియు, ఆర్థికాభ్యుదయమును గూర్చియు, కాంగ్రెసు సభవారు పూనుకొనవలసిన కార్యవిధానముకూడ నిర్ణయింపబడెను. విదేశవస్త్రములను బహిష్కరించుటయును, స్వదేశీపరిశ్రమలకు భంగము రాకుండ వానిని కాపాడి వృద్ధిచేయుటయును, మత్తుపదార్థములైన పానీయములను, మూలికలను పూర్తిగా నిషేధించుటయును, యంత్రాగారపరిశ్రమల కన్నింటికిని మూలకందమైన యంత్రసామగ్రి వగైరా సప్లయిచేసెడి ప్రాతిపదిక పరిశ్రమలన్నియు ప్రభుత్వాధీనమై నిర్వహింపబడుటయును, వ్యవసాయదారులకు ఋణభారము నుండి విమోచన కల్పించుటయును, దేశలాభము ననుసరించి ద్రవ్యచలామణీమారకములను నిర్ణయించుటయును, సాధారణపౌరులైన వారు దేశసంరక్షణాదక్షులైన యోధులుగా నుండుటకై వారికి సైనిక శిక్షణము నేర్పాటుచేయుటయును కరాచీ సభలో తీర్మానింపబడిన కర్తవ్యప్రణాళికలో కలవు.

౧౯౩౪ సం॥ అక్టోబరుమాసములో బొంబాయినగరమందు జరిగిన కాంగ్రెసుసభయందు శాసనసభాప్రవేశము ఆమోదింపబడెను. రాట్నముపై నూలువడకుట చేమగ్గములపై బట్టలునేయుట మున్నగులాభకరమైన చిన్నచిన్న గృహపరిశ్రమలను ఉద్ధరించి ప్రోత్సహింపవలెననియు, అస్పృశ్యతను తొలగింపవలెననియు, భిన్న మత సంఘముల సామరస్యమును వృద్ధిచేయవలెననియు, పూర్తిగా మద్య నిషేధమును అమలు జరిపింపవలెననియు, జాతీయవిద్యను ప్రోత్సహింపవలెననియు, ప్రౌఢవయస్కులగువారికి ప్రయోజనకరమైన విషయములను బోధించి వారికి లోకజ్ఞానమును విస్తరింపజేయవలెననియు, కార్మిక, కర్షకసంఘముల నేర్పాటుచేయవలెననియు, కాంగ్రెసు సంస్థనుమరింత బలిష్ఠమైనదిగా చేయవలెననియు బొంబాయిసభలో తీర్మానింపబడెను. కాంగ్రెసుసభానిర్వహణవిధానములో కొన్ని మార్పులు యీ సమావేశమందు చేయబడెను. కాంగ్రెసుసభాప్రతినిధుల సంఖ్య తగ్గింపబడెను. కాంగ్రెసు మెంబర్లుగా పట్టికయందు ఎందరు చేరియున్నారో ఆసంఖ్యా ప్రమాణమును బట్టి ప్రతినిధులు ఎన్నుకోబడవలెను. కాయ కష్టము చేయునట్టివారును నిత్యవిధిగా ఖద్దరువస్త్రములను ధరించునట్టివారును మాత్రమే కాంగ్రెసుకమిటీలో మెంబర్లుగా ఎన్నుకోబడుటకు అర్హులని తీర్మానింపబడెను.

ఈవిధముగా కాంగ్రెసుసభ ఒక్కొక్క మెట్టువరుసను పైకెక్కుచు భారతజాతీయవ్యవహారము లన్నింటియందును కూలంకషముగా ప్రసక్తిప్రమేయములను కలిగినదై సర్వతోముఖముగా విజృంభించినది. ప్రస్తుతము, ఈకాంగ్రెసుసభ నిర్మాణకార్యక్రమములో లీనమై యున్నది. ప్రజల సిరిసంపదలను వృద్ధిచేయుటకుమాత్రమే గాక, పూర్ణస్వరాజ్యసంపాదనార్థము ప్రజలకు స్వయంసహాయ ధురంధరత్వపూర్వకమైన ఆత్మవిశ్వాస మేర్పడుటకుకూడ యీ

నిర్మాణకార్యక్రమ ముద్దేశింపబడినది. స్వల్పసంస్థగా బయలుదేరిన కాంగ్రెసుసభ నేడు దేశమంతటను మహోన్నతవటవృక్షమువలె శాఖోపశాఖలతో విస్తరించి యున్నది. దేశములోని జనబాహుళ్య మంతయును దానిని ఆశ్రయించియున్నది. స్వరాజ్యసంపాదనకై ప్రజలను త్యాగశీలురనుగా నొనర్చినది. వివిధసంఘములలోనివారును, అన్నితరగతులవారును కాంగ్రెసు సభాజ్ఞానుసారముగా మహాత్యాగమును చేసిరి. ఈసభ మహోత్కృష్టమైన కృషిచేసి ప్రతిభావంతమై యున్నది. ఇటువంటి దేశీయసంస్థను మనయొక్క మహాద్భాగ్యముగా పరిగణించి, దానిని వృద్ధిచేసి కాపాడుట ప్రతిభారతీయుని విధ్యుక్తధర్మమై యున్నది. మన దేశస్వాతంత్ర్యోద్యమమునందు ఈ కాంగ్రెసు సభ యింకను మున్ముందు మహోన్నతకార్యములను సాధింపవలసి యున్నది. కనుక, తెడ్డుక్రిందబెట్టి తెప్పను నిలిపివేయుట కిది సమయముకాదు. అస్త్రసన్యాసమున కిది యదను కాదు. చేయవలసిన కృషి మున్ముందు చాలగా కలదు. కష్టమును కోర్చి అనంతమైన త్యాగమొనర్చి, చెక్కుచెదరని స్థిరసంకల్పముతో, ఇంతకంటె ఎక్కువగా మనము పాటుపడవలసి యున్నది. మనము సాధించవలసినది పూర్ణస్వరాజ్యము. సంపూర్ణ స్వాతంత్ర్యము. అంతకంటె తక్కువైన దేదియునుకాదు. మాతృదేశారాధకులగుటయే మహాపరాధముగా నేటికిని శిక్షననుభవించుచున్నవారికిని, ఎడతెగని యిడుముల బడిన వారికిని, తమ ప్రాణములను సమర్పించిన స్త్రీ పురుషులలో పెద్దల యందును పిన్నలయందును మనకు తెలిసినవారికిని మనకు తెలియని వారికినిగూడ మనము ప్రణమిల్లి గౌరవ పురస్సరముగా తలలువంచి కేలుమోడ్చెదము గాక.

ఈమహాసంస్థకు ఆదిబీజమునునాటి, తమ నిరంతరకృషివల్లను త్యాగమువల్లను దానిని పోషించిన మహామహుల సేవాసహాయ

ములను మనమందర మొకమారు కృతజ్ఞతాకలితగౌరవభావముతో సంస్మరించెదముగాక! ఏబది సంవత్సరముల క్రిందట నాటబడిన యీ చిన్న లేత మొక్క నేడు మహామహీరుహమై తన దిగంతవిశ్రాంత శాఖావళితో దేశమంతట విస్తరించి అసంఖ్యాక స్త్రీపురుషవరేణ్యుల త్యాగశీలరూపమున దివ్యపరిమళకుసుమవిలసితమైనది. ఇట్టికల్పతరువును ఇతోధికముగా దేశసేవాత్యాగప్రభావములవల్ల పెంపొందించవలసినభారము, యీతరమువారియందును రాబోవుతరములవారియందును నిలిచియున్నది. ప్రకృతిమాత యీ దేశమును రత్నగర్భగా సకల సౌభాగ్యములతో విలసిల్లజేసినది. ఇట్టి భారతదేశము సుభిక్షమై స్వేచ్ఛతో వర్థిల్లునట్లుగా, కాంగ్రెసు మహావృక్షమిక ఫలభరిత మగునట్లుగా కృషి చేయవలసిన హాళికులము మనమే.

ముందున్న గ్రంథ మంతయును కాంగ్రెసు మహాసభయొక్క పెంపు సొంపుల వివరించు కథయై యున్నది. కాంగ్రెసుసభావ్యవహారములనుగూర్చియు, కాంగ్రెసు సభానుచరుల యనుభవ విశేషములనుగూర్చియు ఈ గ్రంథకర్తకు గల విషయపరిజ్ఞానము అపారము. ఈసభయొక్క యిటీవలి కథాకలాపమునందు ఈ గ్రంథకర్తకూడ ముఖ్య పాత్రధారిగా నుండెను. కనుక నిస్సారమైన గ్రంథస్థపూర్వ చరిత్రాంశములనుండి తన సారాంశములను క్రోడీకరించెడి రసావేశ రహితుడైన చరిత్రకారుడు డీ గ్రంథకర్త కాడు. తాను స్వయముగా కనులార అనేక విషయములను చూచి యుండెను. ఆవిషయములలో తాను ప్రసక్తిప్రమేయములు కలవాడై ప్రవేశించి, ఒకప్పుడు సుముఖుడై మరొకప్పుడు విముఖుడై పలుమార్లు వ్యవహరించి యుండెను. ఇతడు నిజతత్వమును గ్రహించుటయేగాక, గాఢమైనభక్తివిశ్వాసములతో ఈ గ్రంథమును రచించెను. కనుక, ఈ గ్రంథములో విశదీకరింపబడిన అభిప్రాయములును సారాంశములును గ్రంథకర్తయొక్క స్వకీ

యాభిప్రాయసారాంశములేగాని, ఈ గ్రంథమును లోకప్రకాశముగా ప్రకటించెడి కాంగ్రెసు మహాసభా కార్యనిర్వాహకవర్గము యొక్క అధికారప్రమాణమైన అభిప్రాయసారాంశములుగా పరిగణింప వలనుపడదు. వర్తమానకాలచరిత్రాధ్యయనపారీణుల కీగ్రంథముపకరింపగలదనియు, ఇందలి విషయములు సత్యసమన్వితములనియు మాత్ర మూహింపజెల్లును.

1935 డిసెంబరు 12 తేదీ.

రాజేంద్రప్రసాద్.

# తొలి పలుకు

ఈ గ్రంథమును ఈ రూపమున తయారుచేయవలెనను ఉద్దేశ ముతో గ్రంథకర్త దీనిని ఉపక్రమించియుండలేదు. ఈ సంవత్స రము మండువేసంగిదినములలో ప్రొద్దుపోవని సమయములందు యథా లాభముగా మనస్సుకుతోచిన కొన్ని విషయములను వ్రాయుచుండుట వల్ల యీ గ్రంథము తలవనితలంపుగా తయారగుటకు కారణమైనది. అఖిలభారత కాంగ్రెసుకమిటీకార్యదర్శి అలహాబాదునుండి ఒకానొక విషయమునుగూర్చి గ్రంథకర్తను ప్రశ్నించుచు ఒకలేఖను సందర్భ వశాత్తు వ్రాసియుండెను. ఆలేఖమూలమున ఆకార్యదర్శిద్వారా యీ గ్రంథరచనాప్రయత్నము కాంగ్రెసు అధ్యక్షున కెరింగింపబడిన దయ్యెను. అతడు ఈ విషయమును కాంగ్రెసుకార్యనిర్వాహకవర్గము వారికి నివేదించెను. భారతజాతీయమహాసభయొక్క ఏబదవ వార్షి కోత్సవ సందర్భమున ఈ గ్రంథమును ముద్రించి ప్రకటించుట కాంగ్రెసుకార్యనిర్వాహకవర్గమువారు పూనుకొనినందులకై గ్రంథ కర్త తనమేరమీరిన కృతజ్ఞత నెరింగించుచున్నాడు.

ఈ గ్రంథములోని ఆయాభాగములకు ప్రారంభమున వ్రాయ బడిన విషయసంగ్రహముల నొకమారు దిఙ్మాత్రముగా చూచిన యెడల, ఈ గ్రంథరచనావిధానము తేటతెల్లము కాగలదు. మొదటి 30 సం॥ ల చరిత్రభాగములో కాంగ్రెసు కథాకలాపమునందు వ్యవ హారతంత్రములతోకూడిన ఇతివృత్తము విశేషించి ఏమియునులేదు. అందువల్ల, ఈ చరిత్రభాగము విషయానుక్రమణికగా, పాత్రాను క్రమణికగా, పూసగ్రుచ్చినట్లు వ్రాయబడినది. గత ౨౦ సం॥ ల చరి త్రభాగములోమాత్రము, జరిగినకథ సంవత్సరవారీగా వ్రాయబడినది.

వేర్వేరు కాంగ్రెసుసభలయందు చేయబడిన తీర్మానములు యథావిధిగా సమూలముగా సమగ్రముగా ఈ గ్రంథమందు ముద్రించ లేదు. ఆయాసభలతీర్మానములనుమాత్రమే ప్రత్యేకించి ముద్రించిన

యెడల యీ సంపుటములోని సగభాగము వానికే సరిపోవును. ఇప్పటికే యీ గ్రంథము అనుకొనినదానికంటె అమితముగా పెరిగినది. ఈ గ్రంథమందు లోపములు సమృద్ధిగానున్నవి. ఇది గ్రంథకర్త బాగుగా గ్రహించియుండిన విషయము. పాఠకులు ఓర్పుతో సహింపవలసినవిషయము. ప్రథమ సంకల్పలోపమువల్లను, గ్రంథరచనా ప్రమాదములవల్లను యీ యవఃక్షణములు సంభవించియుండగలవు. ఎక్కువశ్రద్ధతో ఎక్కువ వ్యవధితో పనిచేసినయెడల కొంతవరకైనను ఈ లోపములు తొలగియుండవచ్చును. కాని, కాలవేగముతో పందెమువేసి ఉరుకుపరుగులతో గ్రంథమును వ్రాసి ముగింపవలసివచ్చెను. సావధానముగా చేయనిపని సమగ్రముగా నుండజాలదు. అయినప్పటికిని, లభించిన ఈ స్వల్పవ్యవధిలోనే సమాప్తమైన యీ గ్రంథము కాంగ్రెసు సభాధ్యక్షునిచే రెండుమార్లు పరిశీలింపబడెను. ఇట్టి గ్రంథపరిశీలనాపరిష్కారము ప్రయాసతోకూడిన బండపని. అట్టి శ్రమకోర్చిన కాంగ్రెసు సభాధ్యక్షునకు గ్రంథకర్తమాత్రమేగాక, జనులందరును కృతజ్ఞతాబద్ధులై వందన మాచరింపవలసియున్నది. కాంగ్రెసుసభా ప్రధానకార్యదర్శిరాలగు శ్రీయుత కృపాళినీగారును, కార్యదర్శియగు కృష్ణదాసుగారును యీ గ్రంథమూలమునంతను ముద్రణాకాలమందు సరిచూడవలసిన కార్యభారమును వహించియుండిరి. వారు కూడ ఆయాసక్లేశములకోర్చి కష్టించిపనిచేసిరి. భారతీయులందరును వారికి కృతజ్ఞులై నమస్కరింపవలసియున్నది. కెయిరాలో జరిగిన సత్యాగ్రహమునుగూర్చియు, అహమ్మదాబాదు మిల్లుల సమ్మెనుగూర్చియు వ్రాయబడిన విషయసంగ్రహములు శ్రీయుత మహాదేవదేశాయిగారిచే రచింపబడెను. గుజరాతులోని వరదలనుగూర్చి వ్రాయబడినవిషయములు స్వామి ఆనందుగారిచేతను, చాంపరానునుగూర్చియు, బీహారుభూకంపమునుగూర్చియు వ్రాయబడిన విషయములు బాబు రాజేంద్రప్రసాదుగారిచేతను రచింపబడెను. వారికి మనము కృతజ్ఞులము.

భో. పట్టాభిసీతారామయ్య.



డా. భోగరాజు పట్టాభిసీతారామయ్య
కాంగ్రెసు చరిత్ర కర్త

# 1. కాంగ్రెసు పుట్టుక

[ (౧) భారతదేశ పరాధీనత - ఈస్టిండియా కంపెనీ - దానిపైన తనిఖీ - దాని రాజ్య విస్తీర్ణము - పార్లమెంటువారి అధికారము - ౧౮౩౩ చార్టరు - ఇంగ్లీషు విద్యావ్యాపనము - ముద్రణాశాసనపరివర్తనములు - పాంచాల సింధురాష్ట్రముల ఆక్రమణ - ౧౮౫౭ తిరుగుబాటు - రాణీగారి ప్రకటనము - ఆయుధచట్టము - యుద్ధము; కరవు - గొప్ప రాజకీయకష్టములు - హ్యూమ్ వెడ్డర్‌బరన్‌ల జోక్యము - విప్లవోద్యమసూచన-హ్యూమ్ జాతీయమహాసభను భావించుట - కలకత్తా విశ్వవిద్యాలయ విద్యార్థులకు హ్యూమ్‌ఉత్తరము - కాంగ్రెసుకు ముందున్న పెద్దలు - వంగరాష్ట్రములోని బ్రిటిష్ ఇండియన్‌సంఘము (౧౮౫౧) - బొంబాయిసంఘము - దక్షిణఇండియాలో మహాజనసభ - పూనా సార్వజనికసభ - వంగరాష్ట్ర భారతీయ సంఘము (౧౮౭౬) - లిట్టను ప్రభువు ప్రతికూల ప్రభుత్వము - కలకత్తా ఆల్బర్టుహాలులోని రాజకీయమహాసభ (౧౮౮౩) - అఖిలభారత సంస్థయొక్క అవసరము - హ్యూమ్ మొట్టమొదట కార్యాచరణకు దిగుట (౧౮౮౫).

(౨) కాంగ్రెసు - జాతీయ వికాసమునకు సంబంధించిన ఉద్యమము; రామమోహనరాయలు, ఆయనకాలము - ఆయన ఇండియా ఇంగ్లాండుదేశములలో చేసిన మహత్కార్యము - పాశ్చాత్య నాగరికతా ప్రభావము - బ్రహ్మసమాజము - దానిలో కలిగిన కక్షలు - ఆర్యసమాజదివ్యజ్ఞానసమాజములు నాటి విజాతీయ వ్యామోహము నరికట్టుట - రామకృష్ణ మఠము - కాంగ్రెస్, ఈ అన్ని యుద్యమముల సమన్వయము.

(౩) రాజకీయములను మినహాయింపవలెననెడి హ్యూము మొదటి అభిప్రాయము - రాజకీయ నిర్మాణముగా నుండవలెనని డఫరిన్ ప్రభువు

సలహా - మొదటి ప్రకటన - ఇంగ్లాండులో హ్యూమ్ ఇండియన్ పార్ల మెంటరీ కమిటీని నిర్మించుట - కాంగ్రెసు మొదటి సమావేశము.

(౪) కాంగ్రెసుయొక్క నిజమైన స్వరూపము - రెండవ రౌండు టేబిలుసభలో కాంగ్రెసునుగూర్చి గాంధీవర్ణనము.]

## ౧

కాంగ్రెసుచరిత్ర అనగా భారతస్వాతంత్ర్య సంగ్రామచరిత్ర మన్నమాట.

అనేకశతాబ్దములనుండి భారతదేశము విదేశీయపరిపాలనముక్రింద వివిధనిర్బంధ విధానములకు పాల్పడుతూవచ్చినది. ఈపారతంత్ర్యమునుండి భారతభూమిని విముక్తి నొందించుటకునకే కాంగ్రెసు కడచిన యేబదిసంవత్సరములనుండీ కృషిచేస్తున్నది. భారతప్రజల అస్వతంత్రత విదేశవాణిజ్యసంఘమువారి రిండీయాలో అడుగుపెట్టినది మొదలు నూతనరూపమును తాల్చినది.

ఈస్టిండియా కంపెనీవారు దాదాపు నూరేండ్లు తమ రాజకీయ వాణిజ్య వ్యవహారములను చక్కబెట్టుకొంటూ, ఆకాలములోనే భారతదేశములో పెద్దరాజ్యమును సంపాదించి రాజ్యాధికారములను చెలాయించ మొదలుపెట్టిరి. ౧౭౭౩ అనంతరము బ్రిటిష్‌పార్లమెంటువారు రప్పుడప్పుడును కంపెనీవారి చర్యలను పరీక్షించ ప్రారంభించిరి. అంతేకాక వారిశాసనములలో కలిగే ప్రతిమార్పు బ్రిటిష్‌ప్రభుత్వమువారు పరిశీలిస్తేనేగాని అమలులోనికి వచ్చేదికాదు. కంపెనీవారి వాణిజ్యవ్యవహారము లంతకంతకు వెనుకపట్టి, రాజకీయవ్యవహారములు ముందుకు విజృంభించినకొలదీ ప్రభుత్వమువారి ఈపరిశీలనము మరింత ఎక్కువైనది. ఆకాలములో కంపెనీవారి నిత్యవ్యవహారములపైన తనిఖీ యుండెనని ఊహించ వీలులేదు కాని, వారి చర్యలను, కార్యక్రమమును జాగరూకతతో గమనిస్తూ, భారతీయసమస్యలను పరిశీలించి, పరిష్కరించుటకు బ్రిటిష్‌మిత్రు లనేకులు పార్లమెంటుసభలో నుండిరి. ౧౮వ శతాబ్దము చివరభాగములో ఎడ్మండ్‌బ్రూక్, షెరిడాన్, ఫాక్సులు తీసికొనిన అత్యంతశ్రద్ధవలననే కంపెనీయేజంట్ల దుశ్చేష్టితములు ప్రజలదృష్టి నాకర్షించినవి. వారన్‌హేస్టింగ్సు విచారణయొక్క ప్రధానోద్దేశము నెరవేరకపోయినప్పటికీ ఆరోజులలో జరిగిన దురాగతములుమాత్ర మందుమూలమున బయటపడినవి. కంపెనీవారి సన్నదుల మార్పులకు ముందుజరిగే విచారణలఫలితముగా విశేషప్రయోజనకరములైన అనేక

సిద్ధాంతములు నిర్వచింపబడినవి. కాని యేవియును ఆచరణలోనికి రాలేదు. కంపెనీ ఏజంట్లు వారి రాజ్యమును విస్తరింప జేయకూడదని అనేకపర్యాయములు ఉద్ఘోషింపబడెను. కాని అవకాశము చిక్కినప్పుడెల్ల వారి రాజ్యము విస్తరించనే విస్తరించినది. ఈస్టిండియా కంపెనీవారు హిందూదేశ మాక్రమించుకొనినవిధాన మనేక విశ్వాసఘాతకకృత్యములతో, ననేకవాగ్దానభంగములతో, అనేకదురాశాపరత్వహేయకార్యములతో, అనేక వంచనలతో నిండియున్నది. ఆ కళంకితచరిత్రముతో మన కిప్పుడు ప్రసక్తిలేదు. ఆనాటి భారతీయుల పరస్పరావిశ్వాసవిద్రోహములనుగూర్చి గాని, కంపెనీయేజంట్లు తమకోసము, తమ కంపెనీకోసము, తమ కంపెనీ డైరెక్టర్లకోసము విశేషద్రవ్యమును సేకరించుకొనే నిమిత్త మవలంబించిన సాధనవిధానములగూర్చి గాని మన కిప్పు డనవసరము. ౧౮ వ శతాబ్దములో స్టీమ్ఇంజన్, మెషీనులు కనుపెట్టబడినప్పుడు ఇండియానుండి తీసికొనిపోబడిన ధనరాసులే, ఇంగ్లాండుదేశము ప్రపంచకములో పారిశ్రామికాధిక్యతను సంపాదించుటకు మూలధనములుగా నుపయోగపడిన వనిమాత్ర మిచ్చట చెప్పిన చాలును. ౧౭౭౩ లో అంగీకరింపబడిన రెగ్యులేటింగ్ చట్టముతో కంపెనీపరిపాలకవర్గముపైన తనిఖీనిమిత్త మొక బోర్డు నియమింపబడినది (Board of Control); కార్యనిర్వాహకవర్గముతో కూడిన గవర్నరుజెనరల్ పదవి సృష్టించబడినది. నాటినుండి, అంతకుపూర్వ మాక్రమించుకొనబడిన రాజ్యముపైన బ్రిటిష్ పార్లమెంటువారు కొంత పరిపాలనాబాధ్యత వహించినారు. తరువాత కొంతకాలమునకు ౧౭౮౪ లో మరియొక చట్టము చేయబడినది. ౧౭౯౩, ౧౮౧౩, ౧౮౩౩, ౧౮౫౩ సంవత్సరములలో విచారణలు జరిగి సనదులు పునరుద్ధరింపబడినవి. ౧౮౩౩ సనదులో "పైన నుదాహరింపబడిన రాజ్యములలో నివసించుచున్నట్టిగాని, లేక ఘనత చెందిన చక్రవర్తిగారి పౌరుడుగా జన్మించినట్టిగాని యేమనిషీ ఆయన మతమువలన, జన్మస్థానమువలన, పుట్టుకవలన, రంగువలన, ఇటువంటి యే యితరకారణమువలనను కూడా కంపెనీలో నౌకరీనిగాని, ఉద్యోగమునుగాని, పదవినిగాని పొందుట కనర్హుడు కాకూడదు." అని శాసింపబడినది. కంపెనీ పరిపాలకవర్గమువా రీవాక్యముల క్రింది విధముగా వ్యాఖ్యానము చేసిరి:

"బ్రిటిష్ఇండియాలో పరిపాలించేవారలమంటూ ఒకటి ప్రత్యేకముగా నుండకూడదని మాఅభిప్రాయము. ఇతరఅర్హతలను నిర్ణయించవచ్చును గాని ఎవరును జాతిమతవిచక్షణమాత్రము చేయరాదు. రాజుగారిపౌరుడు భారతీయుడుగాని, బ్రిటిష్వాడుగాని, లేక మిశ్రమజాతివాడుగాని, అతనికి ఇతరవిధముగా నుండవలసిన అర్హతయున్నయెడల, అతడు ఇండియాలో నెట్టియుద్యోగమును పొందుటకును అనర్హుడు కాడు."

ఆచట్టమువలననే కంపెనీవారిండియాలో వ్యాపారము చేసుకొను హక్కులు కూడ రద్దుచేయబడినవి. అప్పటినుండి ఈస్టిండియాకంపెనీ వ్యాపారసంస్థ గాక పరిపాలనాసంస్థ యైనది.

దాదాపుగా ఈకాలములోనే ఇండియాలో ఇంగ్లీషువిద్యను ప్రవేశపెట్టుటను గూర్చి వాదప్రతివాదములు చెలరేగినవి. అప్పుడు భారతదేశములో రాజా రామమోహనరాయలు, సీమలో మెకాలే ఇంగ్లీషువిద్య కనుకూలముగాను, దేశభాషలకు, దేశసాహిత్యమునకు విరుద్ధముగాను వాదించ మొదలుపెట్టిరి. నాడు ప్రవేశపెట్టబడిన ఆ విద్యావిధానమే నేటికిని ఆచరణలో నున్నది.

ఆకాలములో ఇంగ్లీషువారు నడిపేపత్రికలే తప్ప ఇంకేయితరపత్రికలును లేవు. వారిలో కొంద రిండియానుండి ప్రవాసమునకుకూడ పంపివేయబడిరి. విలియం బెంటికుప్రభువు భారతదేశమున కనుకూలమైన సంస్కరణములను చేయుటయేకాక, పత్రికలవిషయములో ఔదార్యముగాకూడ ప్రవర్తించినాడు. ఆయనతరువాత పరిపాలమునకు వచ్చిన సర్ చార్లస్ మెట్‌కాఫ్ పత్రికల నిర్బంధములను తొలగించెను. పిదప నవి ౧౮౫౭ లో జరిగిన తిరుగుబాటుసందర్భమున నేదో కొంతకాలము తప్ప, లిట్టనుప్రభువు వైస్రాయిగా వచ్చేటంతవరకును స్వేచ్ఛగానే యున్నవి.

౧౮౩౩, ౧౮౫౩ సంవత్సరములమధ్య పంజాబు, సింధురాష్ట్రములు జయింపబడినవి. సంతతి లేనిసంస్థానాధిపతుల రాజ్యములను డల్‌హౌసీప్రభువు కలుపుకొనెను. అయోధ్యరాజు దుష్పరిపాలనము చేస్తున్నాడనే కారణముతో తొలగింపబడినాడు. ఈరాజ్యము లన్నియును అప్పటి కంపెనీవారి రాజ్యములతో కలిసి నేటి బ్రిటిష్ ఇండియాయైనది. ప్రజలను దరిద్రులనుగా చేసి ఇంగ్లాండునకు తీసికొనిపోబడుతూన్న ధనప్రవాహము, స్వతంత్రరాజ్యవినాశనము, విదేశప్రభుత్వనిర్మాణము- ఇవన్నీ ప్రజలలో అసంతృప్తినీ, ఆగ్రహమునూ కలిగించినవి. ఆకారణమున ౧౮౫౭ లో జరిగిన తిరుగుబాటు విదేశాధికారమును త్రోసివేయుటకు చేయబడిన చిట్టచివరి సాయుధప్రయత్నమని చెప్పవచ్చును. ఆతిరుగుబాటున కొక మతోద్దేశ మాపాదింపబడినమాట వాస్తవమే. కాని అది అక్బరు, ఔరంగజేబుచక్రవర్తుల వంశీకుడయి నామమాత్రము ఢిల్లీచక్రవర్తిగా నున్నవానినిగాని, పూనాలోని పేష్వాల సంతతివానినిగాని ఇండియాకు రాజుగా చేయవలెననే ప్రయత్నముతో జరిగినదని తెలుసుకొనగలిగినయెడల, ౧౭౫౭ లో ప్లాసీయుద్ధమైనతరువాత నూరుసంవత్సరములలోను భారతదేశమున కలిగిన రాజకీయ పరిణామఫలితమే ఆతిరుగుబాటని చెప్పకతప్పదు. దానివలన ప్రతిదేశములోని ప్రజలకు తమదేశమును తమవాడే పరిపాలింపవలెననే ప్రకృతి సిద్ధమైన

వాంఛ యుండకతప్ప దనికూడ ఋజువైనది. అయితే నేమి? అతిరుసబా టపజయము పొందినది. కాని ఈస్టిండియాకంపెనీవారి పరిపాలనము పోయినది. ఇండియాప్రభుత్వము బ్రిటిష్ కిరీటాధిపతిచేతులలో, అనగా బ్రిటిష్‌పార్లమెంటువారిచేతులలో పడినది. ఆసందర్భమున విక్టోరియామహారాణిగారు చేసినప్రకటనము భారతదేశమున విశ్వాసమును, శాంతివాతావరణమును సమకూర్చినది. ప్రజలలో అదివరకుగల అసంతృప్తికి తగినంత దోహదము లేకపోయినది. రాజవంశము, ముఖ్యముగా మహమ్మదీయ రాజవంశము పూర్తిగా రూపుమాసిపోయినది. ౧౮౫౮ లాటి భవిష్యద్విప్లవములకు లక్ష్యముగా నుండదగిన నామమాత్రపు రాజవంశీకుడుగూడ అపరూప మైపోయినాడు. భారతదేశమునకు బ్రిటిష్‌పరిపాలనము దైవయోగమున తటస్థించిన దనే భావముతో ప్రజలు సంతృప్తిపడి యూరకుండిరి.

ఇండియాప్రభుత్వము బ్రిటిష్ కిరీటాధిపతుల అధీన మైనప్పటికీ, చాలవరకు యథాప్రకారముగానే జరుగుతూ వచ్చినది. కాని ౨౦ సంవత్సరములపాటు యుద్ధములుమాత్రము జరుగక పరిపాలనము శాంతముగా నున్నది.

ఈమాత్రముచేత ప్రజలకు కష్టములు లేవనిగాని, వారిలో అసంతృప్తి లేదని కాని భావించకూడదు. బ్రిటిష్‌పరిపాలనమున అనేకము గొప్పలోపములు జరిగినవి. హ్యూమ్‌గారివంటి బ్రిటిష్ ఉద్యోగులు నాటి కెప్పటికప్పుడు పార్లమెంటువారికి చూపి సవరణచేయింప ప్రయత్నించిరి.

వెనుక చెప్పబడినప్రకారము ౧౮౩౩ వ సంవత్సరపు చట్టమునుబట్టి, భారతీయులు వారి అర్హతల ననుసరించి అన్నియుద్యోగములను చేయవచ్చును. ౧౮౫౩ వ సంవత్సరపు నూతనరాజ్యాంగచట్టము (Charter) పార్లమెంటులో చర్చకు వచ్చినప్పుడు, భారతీయు లన్నియుద్యోగములకును అర్హులే యనుసిద్ధాంతము ౧౮౩౩ చట్టములో నంగీకరింపబడినప్పటికిని, ఆచరణలోమాత్రము తద్భిన్నముగా జరుగుతూన్న దని అనేకమందిసభ్యులు చెప్పియున్నారు. ౧౮౫౩ లో సివిల్ సర్వీసు పోటీపరీక్షలు ప్రవేశపెట్టబడినప్పుడు భారతీయవిద్యార్థు లింగ్లాండునకు బోయి ఇంగ్లీషు విద్యార్థులతో ఇంగ్లీషుభాషలోను, ఇంగ్లీషుసాహిత్యములోను పోటీచేయుట దాదాపు అసంభవమని పార్లమెంటులో వాదన జరిగినది. ఇన్నికష్టము లున్నప్పటికిని కొంతమంది విద్యార్థులు సముద్రయానము చేసి సీమకు పోయి ఐ. సి. యస్. పరీక్షలలో నుత్తీర్ణులై వచ్చినారు. అప్పుడు కొంతమంది భారతీయు లాంగ్లమిత్రుల సహాయముతో ఇండియన్ సివిల్‌సర్విసు పరీక్షలు సీమలోను, ఇండియాలోనుకూడ ఏకకాలమున జరిగేయేర్పా టుండవలెనని ఆందోళనచేయ మొదలుపెట్టిరి. కాని శాలిస్‌బరీప్రభువు

ఈ ఆందోళనమును పెడచెవినిబెట్టి పైపెచ్చు సివిల్ సర్వీసు విద్యార్థుల వయఃపరిమితిని తగ్గించెను. దీనితో భారతీయవిద్యార్థులకు మరింతచిక్కు కలిగినది. మెట్కాఫ్ కాలము నాటినుండి ఇంగ్లీషుపత్రికలతోపాటు స్వేచ్ఛ ననుభవిస్తూవచ్చిన దేశభాషాపత్రికలకు లిట్టనుప్రభువు వాగ్బంధనము చేసినాడు. అది చాలక ఆయన దేశములో ఆయుధశాసన మునుకూడ ప్రవేశపెట్టినాడు. అందువలన భారతీయుల కాయుధములు ధరించే హక్కు పోవడమేకాక యూరపియనులకును వారికిని మధ్య మరియొక అవమానకర మైన విభేద మేర్పడినది.

తరువాత దేశములో కరవులు వచ్చినవి. అవి ఆహారధాన్యములు పండని కారణముచేతకన్న వాటిని కొనుక్కొనేటందుకు తగిన ధనము లభింపమిచేత లక్షలకొలది ప్రజలమరణములకు కారణభూతములైనవి. ఇందుకుతోడు విశేషధనవ్యయకారణమైన ఆఫ్ఘనుయుద్ధము జరిగినది. క్షామదేవత, మృత్యుదేవత లిద్దరును దేశములో తాండ విస్తూండగానే ఢిల్లీలో ఏర్పాటు జరిపి ఇంగ్లాండురాణీగారు "ఇండియా చక్రవర్తిని" అనే బిరుదమును తాల్చిరి. "దేశమంతటను రాజకీయకష్టములకు తోడు ఆర్థికకష్టములు కూడ వ్యాపించియుండెను. కొద్దిమంది స్వార్థపరత్వ, నిర్లక్ష్యభావములవలన అనేక మంది అనుభవిస్తూన్న శారీరకబాధ ప్రజల అశాంతిని అతివేగముగా అపాయకరపరిస్థితు లలోకి తీసికొనివస్తూఉండెను."

సర్ ఆక్లండు కాల్విన్‌కు హ్యూమ్‌గారు వ్రాసినట్లుగా రైతులు చాలా "చెడ్డ కష్టములతో" క్రుంగిపోతూండిరి. వారు పైకేమీ చెప్పలేకపోయిండిరిగాని లోపల కుమిలి పోతూన్న మాట వాస్తవము. వారికష్టము లివి: (౧) వ్యయప్రయాసలకు కారణము లైన సివిల్ కోర్టులు, (౨) పోలీసుల లంచగొండితనము, దౌర్జన్యము, (౩) కఠినమైన రెవిన్యూపరిపాలనము, (౪) అవమానకరమైన ఆయుధచట్టము, బాధాకరమైన అడవుల చట్టము. ప్రజలు (౧) వ్యయములేని, ఆలస్యముకాని, నిజమైన న్యాయ్యపరిపాలనము, (౨) రక్షకులుగాను, స్నేహితులుగాను ఉండే పోలీసు, (౩) ఎక్కువసౌకర్యము, ఔదార్యముగల రెవిన్యూపద్ధతి, (౪) అటవీ, ఆయుధశాసనముల సౌమ్యపరిపాలనమును కావలెనని బతిమాలుకొనిరి. కాని ప్రయోజనములేక నిరాశచెందిరి. ఇది గ్రామం ప్రారంభములోని నిజమైనస్థితి. ఆరోజులలోని నిరంకుశప్రభుత్వము కొత్తసౌక ర్యములను కలిగించకపోగా, పూర్వపు సంస్కర్తలద్వారా సంక్రమించిన పాత అధి కారములనుకూడా అవకాశము కలిగినప్పుడెల్ల ఊడబెరుకుతూవచ్చినదని సర్ డబ్లియు. వెడ్డర్‌బరన్‌గారు చెప్పియుండిరి. అందుకు నిదర్శనముగా పత్రికాస్వాతంత్ర్య మరి కట్టబడెను. బహిరంగసభల హక్కు తొలగింపబడెను. స్థానికపరిపాలనా, విశ్వవిద్యా లయస్వాతంత్ర్యములు రద్దుచేయబడెను. "దేశాభ్యుదయ భంగకరములైన ఈ దుగదృష్ట

కార్యములు పోలీసునిర్బంధవిధానముతో కలసి బ్రిటిషుప్రభుత్వపరిపాలనముక్రింది భారతదేశమునందొక విప్లవోద్యమమును కనుచూపుమేరలోనికి తెచ్చినవి. కాని హ్యూమ్సుగారు సకాలములో జోక్యము కలిగించుకొని తలపెట్టెను" అని సర్ విలియమ్ వెడర్‌బర్న్ గారు వ్రాసియుండిరి. భారతప్రజాహృదయములో రాజకీయక్రోధానలము క్రమక్రమముగా ప్రజ్వరిల్లుచున్నట్లు హ్యూముకు నిదర్శనపూర్వకముగా తెలియ వచ్చినది. భారతదేశములోని వివిధమతప్రచారకులును తమతమ మతాధిపతులతో జరిపిన యుత్తరప్రత్యుత్తరములనుబట్టి ఇండియాలోని వివిధమండలములలో నొక భయంకరమైన విప్లవోద్యమము బయలుదేరనున్నట్లు తెలియజేసే ఏడుసంపుటముల నివేదిక ఆయన కందినది. ఇది బ్రిటిషుప్రభుత్వ పరిపాలనావసానకాలమున, అనగా ౧౮౭౦ ప్రాంతములలో జరిగినసంగతి. ఆనివేదిక జిల్లాలు, డివిజనులు, సబ్‌డివి జనులు, నగరములు, పట్టణములు, గ్రామములవారిగా విభజింపబడియుండెను. అందులో దేశ మంతటను ఒక్కసారిగా విప్లవోద్యమము బయలుదేరునని సూచింపబడలేదు. కాని నిరాశాపూరితులైన జను లాకస్మికముగా దౌర్జన్యమునకు దిగి తమ కయిష్టులయిన వారిని హత్యచేసి బ్యాంకర్లను బందిపోటుకొట్టి, దుకాణములను దోచుకొని, అరాచక కృత్యములకు పాల్పడగలరనియు, అక్కడక్కడ జరిగే ఈ సన్నాహముల కలయికయే యెప్పుడో ఒకప్పుడు జాతీయవిప్లవరూపమును పొందవచ్చుననియును మాత్ర ముదాహరింపబడియుండెను. దక్కనులో జరిగిన భూసంబంధమైన కొట్లాట లిట్టివే. ప్రజలలో పొంగి పొరలిపోతూన్న ఈవిప్లవ తరంగములకొక్క అవధిని సృష్టింప వలయు నని హ్యూమ్ తలచెను. ఆయన కాతలపు పుట్టినది తడవుగా భారతీయుల జాతీయసమావేశమొకటి జరిపిన బాగుండునని తోచి ౧౮౮౩ మార్చి ఒకటవ తేదీని కలకత్తా విశ్వవిద్యాలయ పట్టభద్రుల కాయన యుత్తేజకరమైన ఉత్తర మొకటి వ్రాసెను. అందులో ఆయన పూనుకొనిన పనినిమిత్తము స్వార్థరహితులును, నైతిక బలసంపన్నులును, ఆత్మనిగ్రహపరులును, పరోపకారపారీణులును అయిన నిజమైన మనుష్యులు ౫౦ మంది కావలెనని వ్రాసినాడు. ఉద్యమమూలపురుషులలో ఈ పై సుగుణములు కల నిజమైనమనుష్యు లొక్క యాభైమంది యున్నయెడల తక్కిననిర్మాణ మంత కష్టసాధ్యము కాదని ఆయన విశ్వాసము. ఆయన తాను కావలెననికోరిన మనుష్యులకు చూపిన ఆదర్శము లేమి? స్వార్థత్యాగము, ప్రజాపాలితసంస్థ, "మీలో అందరికంటెను గొప్పవాడైన మనిషి అందరకును సేవకుడుగా నుండ నంగీకరించ వలయును" అనే సుభాషితము. హ్యూము వారికి విషయములను దాచక, "వారు స్వీయసుఖములను, భోగములను విడువలేకున్నయెడల అధమము, ప్రస్తుతము దేశాభ్యుదయకరమగు అన్ని ఆశలును నశించినట్లే. నిజముగా భారతదేశ మింతకన్న మంచి పరి

పాలనమునుపొందుటకు తగదుసరిగదా కోరుటకుకూడ తగదు." అని నిష్కపటముగా వ్రాసెను. చిరస్మరణీయమైన ఆయుత్తరములోని చివరిభాగ మిది: "బుద్ధిమంతులైన నాయకు లందరునుకూడ తమ దేశక్షేమముకొరకు గట్టిగాపోరాడ ధైర్యములేని అల సులుగను, స్వార్థపరులుగను ఉండేయెడల వారు నిజముగా, న్యాయ్యముగా పదదలి తులయి నేలమట్టము కాదగినవారే. వారి కంతకంటె మంచిఅర్హతలేదు. సరిగా ఏజా తికి తగినప్రభుత్వ మాజాతికి తటస్థించక తీరదు. జాతి అంతటిలోను అత్యధికవిద్యా వంతు లని యెన్నికకెక్కిన మీరు స్వీయసౌఖ్యములను, స్వార్థభావములను నిరసించ లేకున్నయెడలను, మీ కెక్కువ స్వేచ్ఛ, మీదేశమునకెక్కువ నిష్పాక్షికప్రభుత్వము, మీస్వీయ వ్యవహారనిర్వహణమునం దెక్కువభాగము సంపాదించుకొనుటకు మీరు గట్టిగా పోరాడలేనియెడలను, మీస్నేహితులమైన మే మంతరమును తప్పే చేసితిమి. మన ప్రతిపక్షులే సరిగా ప్రవర్తించిరి. రిప్పనుప్రభువు మీక్షేమముకోస ముద్దేశించిన ఆదర్శములు నిష్ఫలములు; స్వప్నతుల్యములు ; అగుట మిప్పటికి మీదేశాభ్యుదయ సూచకములైన ఆశలన్నీ అడుగంటినట్లే. భారతదేశ మింతకంటె మంచిపరిపాలనమును పొందుటమునకు కాదు సరికదా కోరడమునకుకూడ తగదు. ఇది ఇంతే అయినయెడల, ఇకమాత్రము మాకు మీకక్షలమాట వినపడకూడదు. మిమ్ములను ప్రభుత్వమువారు బడిపిల్లలవలె చూస్తున్నారని ఇకముందు మీరు నిందారోపణము చేయరాదు. మీ అంతట మీరే ఆవిషయమును ఋజువుచేసికొన బోవుచున్నారు. ఏమి చేయవలయునో పురుషులైనవారికి తెలియనేతెలుసును. అన్ని గొప్ప ఉద్యోగములకును, భారతీయుల కంటె ఇంగ్లీషువారికే ఎక్కువ అవకాశ మీయబడుతూన్నదని ఇకముం దెప్పుడును మీరు ఫిర్యాదు చేయకూడదు. ప్రజాక్షేమముకోసము స్వీయసౌఖ్యములను త్యజించ గలిగిన ఆపరోపకారబుద్ధిగాని, ఆంగ్లేయుల నింతవారినిగాచేసిన ఆదేశశ్రేయోభి లాషగాని మీలో కొరవడినప్పుడు పెద్దయుద్యోగములకు మీకంటె వారి కెక్కువ అవకాశ మీయడము న్యాయ్యమే. వారు తప్పక మీకు ప్రభువులుగా నుండతగినవారే. స్వార్థత్యాగ పరశ్రేయోభిలాషలే స్వాతంత్ర్యసౌఖ్యములకు మార్గదర్శకములనెడి దివ్యసత్యమును మీరు తెలుసుకొని ప్రవర్తించేటంతవరకును వారు మీకు ప్రభువులు గాను, పనిచేయించే యజమానులుగాను ఉన్నందువలన కలిగేబాధను మీరు సహింప గలుగుదురుగాక."

కాంగ్రెసుపుట్టుకనుగూర్చిన వివరములు తెలుసుకొనేముందు, అంతకుపూర్వము నుండీ మనదేశములో ప్రజాజీవితమునకు మూలపురుషులైన కొందరు పెద్దలపేర్లను సంస్మరించవలసియున్నది. ౧౮౫౧ వ సంవత్సరమునందు వంగరాష్ట్రములో స్థాపింప బడిన బ్రిటిష్ఇండియన్ సంఘముద్వారా కొన్ని దశాబ్దముల పాటు డాక్టర్ రాజేంద్ర

లాల్ మైత్రా, రామగోపాల్ ఘోష్‌గార్లు ప్రజాసేవ చేసియుండిరి. దాదాపు అర్ధ శతాబ్దమువరకును ఆసంఘము దేశములో బాగుగా పని చేసినది. బొంబాయిలో బొంబాయిసంఘమనే మరియొక సంస్థ పనిచేసినది. అది బెంగాల్‌సంఘముకన్న తక్కువకాలము పనిచేసినప్పటికీ నిర్వర్తించిన కార్యక్రమములో మాత్రము బెంగాల్ సంఘమున కేమీ తీసిపోలేదు. ఆ సంఘ మింత జయప్రదముగా పనిచేయుటకు మంగల్‌దాసు నాథూభాయి, నౌరోజీ ఫర్దుంజీవంటి నాయకుల పరిశ్రమయే కారణము. దానికి మూలపురుషులు దాదాభాయి నౌరోజీ, జగన్నాథ శంకర సేఠులు. తరువాత ౧౮౭౦ ప్రాంతములలో ఈస్టిండియా అసోసియేషన్ పుట్టినది. అప్పటితో బొంబాయిసంఘ మంతరించినది. దక్షిణాదిని "హిందూ" పత్రికతో ప్రజా జీవితము ప్రారంభమైనది. ఆపత్రికా సంస్థాపకులలో యం. వీరరాఘవాచారి యార్, గౌ. రంగయ్యనాయుడు, జి. సుబ్రహ్మణ్యఅయ్యార్, న్యా. సుబ్బారావు పంతులుగార్లవంటి పెద్దలు గలరు. ఈ రోజులలోనే మహారాష్ట్రదేశములో "పూనా సార్వజనికసభ" పుట్టినది. దీనిద్వారా రావుబహదూర్ కె. యల్. నూల్‌కార్, ఎస్. హెచ్. చిప్లోణ్‌కారులవంటివారు కొందరు ప్రజాసేవ చేయ మొదలుపెట్టిరి. ౧౮౭౬ లో వంగరాష్ట్రమునందు "ఇండియన్ అసోసియేషన్" అనే సంఘము స్థాపించబడినది. ఈ నూతన సంస్థకు సారథి సురేంద్రనాథ్ బెనర్జీ; ఆనందమోహన బోసు మొదటి కార్యదర్శి. అప్పటికి మంచి నిర్మాణబలము లేకపోయినప్పటికినీ ఆరోజులలోనే, ౧౮౭౦ ప్రాంతములకే ప్రజాజీవిత మంటే యేమిటో ప్రభుత్వమునకు తెలిసివస్తూన్న సంగతి పాఠకులు గ్రహింతురుగాక! ఆనాటికే పత్రికాప్రచార మెక్కువగా నుండెను. ౧౮౭౫ లో ౪౭౫ పత్రికలు ప్రకటింపబడుచుండెను. వాటిలో చాలాభాగము దేశభాషాపత్రికలే. అదృష్టవశాత్తు ఇండియన్ సివిల్ సర్వీసులోనుండి విడుదలైన సురేంద్రనాథ్ బెనర్జీ ఉత్తరహిందూస్థాన మంతటను పంజాబు పశ్చిమోత్తర రాష్ట్రములతోసహా మొదటి రాజకీయసంచారము బయలు దేరెను. అతడు ౧౮౭౭ లో జరిగిన ఢిల్లీదర్బారుకు హాజరై ఆమహాసభలో ప్రముఖులైన మహారాజులను, ప్రజలను దర్శించెను. ఆమహాసభను చూచినతరువాతనే సురేంద్రనాథునకు అటువంటి గొప్ప రాజకీయ మహాసభ నొకదానిని స్థాపించవలెననే ఊహ మొట్టమొదట కలిగినదని కొందరి నమ్మకము. ౧౮౭౮ లో సాలిస్‌బరీప్రభువు సివిల్ సర్వీసు పరీక్షకు పోవలసిన వయస్సు ౧౯ కి తగ్గించినప్పుడు ప్రజాభిప్రాయమును తద్వ్యతిరేకముగా ప్రకటింప చేసేటందుకున్నూ, దేశీయు లందరును కలసి ఒక మహాజరు అర్జీని తయారుచేసి కామన్సు సభవారికి పంపించేయేర్పాటు చేసేటందుకున్నూ సురేంద్రనాథ్ బెనర్జీ మద్రాసు, బొంబాయి రాష్ట్రములలో సంచారముచేసెను.

ఈకాలములోనే లిట్టను ప్రభుని అనర్థదాయకమైన పరిపాలన సాగించినది. ౧౮౭౮ లో జారీచేయబడిన దేశభాషాపత్రికాశాసనము, ఆఫ్ఘను యుద్ధము, ఇంపీరియల్ దర్బారుఖర్చులు, ౧౮౭౭ లోని ప్రత్తిదిగుమతి పన్నుల తగ్గింపు. ఇవన్నీ ఆపరిపాలనా ఫలితములు. లిట్టనుతరువాత రిప్పనుప్రభువు పరిపాలనకు వచ్చెను. ఆయన ఆఫ్ఘను అమీరుతో రాజీ చేసికొని, దేశభాషాపత్రికాశాసనమును రద్దుచేసి, స్థానిక స్వపరిపాలనమును స్థాపించి, స్వాతంత్ర్యచట్టమును ప్రవేశపెట్టి, భారతరాజకీయములలో నూతన శకారంభము నొనర్చెను. ఇండియన్ మేజస్ట్రేట్లు యూరపియనులు మొదలగు తెల్లనేరస్థులను విచారించకూడ దను నిషేధమును తొలగిస్తూ, ౧౮౮౩ లో ఇండియా గవర్నమెంటు లామెంబరు ఇల్బర్టుగారొక బిల్లును ప్రవేశపెట్టిరి. రిప్పనుప్రభువు పరిపాలనములో తలపెట్టబడిన తుది సంస్కరణ మిది. ఇదే ఆంగ్లోఇండియనులకు కోపకారణమైనది. వారిలో కొందరు ప్రభుత్వమందిరములో చొరబడి, రక్షకభటుల నోరునొక్కి, వైస్రాయిని చాంద్‌పాల్ ఘాటువద్దగల స్టీమరెక్కించి కేపు గుండా సీమకు పంపివేయవలెనని కుట్రపన్నినారు. ప్రభుత్వమువారీ పై బిల్లును చట్టము చేయవలెనని గట్టిగా పట్టుపట్టియెడల ఈపని సాధించపూనుకొనిన కుట్రదారులు కలకత్తావారు. ఇంత జరిగిన తరువాత ౧౮౮౩ లో బిల్లుయొక్క స్వస్వరూపము మారిపోయినది. జిల్లా మేజస్ట్రేట్లు, సెషన్సుజడ్జీల సందర్భములోమాత్రము నిషేధము తొలగింపబడి బిల్లులోని సిద్ధాంతముమాత్ర మంగీకరింపబడినది. రిప్పను ప్రభువు ఉద్యోగమును విరమించినప్పుడు భారతదేశములో ఆసేతు హిమాచలపర్యంతము వీడ్కోలు సభలు చేయబడినవి. అవి చాలామంది ఆంగ్లేయుల కసూయాజనకములైనవి. కొంతమంది మాత్రము కనులుతెరచి నిజపరిస్థితులను చూడగలిగిరి. సర్ సురేంద్రనాథ బెనర్జీగారు "తయారవుతూన్న జాతి" (A Nation in the making) అనే తనగ్రంధములో "అదే నిజమైతే దాని అర్థ మేమిటి?" అని సర్ ఆక్లండు కాల్విన్ ఆశ్చర్యముతో అడిగెనని వ్రాసినాడు.

ఆబిల్లున కాంగ్లో ఇండియనులు వ్యతిరేకముగా నుండుట వారి జాతీయాధిక్యమును శాశ్వతముగా నిలబెట్టుకొనుటకొరకే నని వారి పోరాటమువలన వివేకముగల భారతీయు లందరకును తేటతెల్ల మయినది.

ఆంగ్లో ఇండియనుల ఈవిజయకారణమున భారతనాయకుల కేయితర ప్రయోజనమును కలుగకపోయినప్పటికిని, తమలో సంఘీభావ ముండవలెననే విషయము మాత్రము తెలిసివచ్చినది. తత్ఫలం ౧౮౮౩ లో కలకత్తాలోని ఆల్బర్టుహాలులో ఒక రాజకీయమహాసభ జరిగినది. ఆసభలో సురేంద్రనాథబెనర్జీ ఆనందబోసులు పాల్గొనిరి. అందులోనే తన ప్రారంభోపన్యాసమునందు సురేంద్రనాథబెనర్జీ ఢిల్లీదర్బారును

ఉదాహరిస్తూ, దేశాభ్యుదయమునకట్టి గొప్పరాజకీయమహాసభ లవసరమని ప్రత్యేకముగా చెప్పియున్నారు. అంబికాచరణముజుందారు తన "భారతజాతీయ పరివర్తనము" (The Indian National Evolution) అనే గ్రంథములో ఆమహాసభ చూపదగిన వ్యక్తిమనీ, సభ జరిగిన మూడునాలుగు రోజులు అందులో కనబడిన యుత్సాహ కార్యదీక్ష లిప్పటికిని కళ్లకు కట్టినట్లు ప్రత్యక్షమవుతూన్నవనీ, సభానంతరము సభకు హాజరయిన ప్రతినిధులలోను ఒక విశ్వాసము, ఒక నూతన తేజస్సు, ఒక నవీనభావోదయము కనుపించెననీ వ్రాసియుండెను. మరుసంవత్సరమే కలకత్తాలో అంతర్జాతీయ ప్రదర్శనము జరిగినది. దీనిమూలముననే భారతజాతీయ మహాసభానిర్మాణమునుగూర్చిన మొదటి ఊహ కలిగిన దని బాన్ మున్ రాఖుగారి అభిప్రాయము. ౧౮౮౧ లో మద్రాసుమహాజనసభ స్థాపింపబడినపిదప మద్రాసు రాష్ట్రీయమహాసభకూడ జరిగినది. ౧౮౮౫ జనవరి ౩౧ వ తేదీని సుప్రసిద్ధులగు మెహతా, తెలాంగ్, తయాబ్జీలు బొంబాయిరాష్ట్రీయసంఘమును స్థాపించిరి.

వీటన్నిటినిబట్టి భారతదేశమునం దొకవిధమయిన అఖిలభారతసంస్థకూడ అవసరమయిన దన్నమాట స్పష్టము. ఈఅఖిలభారతమహాసభఅనేమాట ముం దెవరికితోచినదో మాత్రము తెలియరావడములేదు. పైన నుదాహరింపబడినప్రకారము ౧౮౭౭ లో జరిగిన ఢిల్లీదర్బారు, కలకత్తాలోజరిగిన అంతర్జాతీయప్రదర్శనములమూలముననేగాక ౧౮౮౪ డిసెంబరులో మద్రాసులో జరిగిన దివ్యజ్ఞానమహాసభానంతరము సమావేశమైన ౧౭ మంది ఇష్టాగోష్ఠిసభలో ఈ "అఖిలభారతమహాసభ" భావనచేయబడినట్లు తెలుస్తూన్నది. డేవిడ్ హ్యూమ్‌గారు ఇండియన్ సివిల్ సర్వీసునుండి విరమించినపిమ్మట స్థాపించిన "ఇండియన్ యూనియనే" కాంగ్రెసుకు కారణభూతమైనదనికూడ కొందరితలంపు. ఈ అభిప్రాయమునకు మూల మేమైనప్పటికి, మూలపురుషు డెవరైనప్పటికీ అభిప్రాయముమాత్రము ప్రచారములో నున్నదనీ, అఖిలభారతసంస్థ యుండవలసిన అవసరము దేశము గుర్తించినదనీ, దానినిగూర్చి మొదట కార్యాచరణకు దిగిన మనిషి అలన్ ఆక్టేవియన్ హ్యూమ్అనీ, ౧౮౮౫ మార్చినెలలో, ఆయేటి డిసెంబరు మాసమునందు ప్రథమభారతజాతీయసభ పూనాలో జరుగునని మొట్టమొదటి ప్రకటనము చేయబడినదనీ, అంతవరకును గాలిలో ఊహామాత్రముగా నుండి దేశములోని బుద్ధిమంతులనందరినీ కలవరపరుస్తూన్న ఈవిషయ మప్పుడొక స్పష్టమైన రూపమును పొంది ఆచరణయోగ్యమైన కార్యక్రమ మైనదనీ మాత్రము మావిశ్వాసము.

౨

దేశముయొక్క రాజకీయపారతంత్ర్యమును నిర్మూలింపవలె ననేయుద్దేశము కాంగ్రెసున కున్నప్పటికీ కేవలము ఆయుద్దేశమే దానిపుట్టుకకు కారణము కాదు.

కాంగ్రెసుసంస్థ మూలముననే జాతీయవికాసమునకు సంబంధించిన అనేకోద్యమములు వ్యాప్తిలోనికి వచ్చినవి. కాంగ్రెసు పుట్టకపూర్వము యాభైసంవత్సరముల పైనుండి కూడా జాతీయనిర్మాణము ప్రారంభమైనది. నిజమునకు రామమోహనరాయలవారి కాలమునాటికే జాతీయజీవనము సర్వతోముఖముగా విజృంభించినది. రామమోహన రాయల నేకవిధముగా భారతజాతీయప్రవక్త అనీ, ఆధునిక భారతవర్షమునకు మూల పురుషుడనీకూడ చెప్పవచ్చును. ఆయనభావాలు ఉన్నతములు; దృష్టి విశాలము. ఆ రోజులలోని మతసాంఘిక విషయములే ఆయన సంస్కరణ ప్రయత్నములకు మూల కందములు. కాని ఆనాడు భారతదేశమునకు జరుగుతూన్న రాజకీయాపరాధను లాయనదృష్టి నాకర్షించకపోలేదు. వాటిని సాధ్యమైనంత తొందరలో నిర్మూలించుటకుకూడ ఆయన అనేక ప్రబల ప్రయత్నములు చేసియుండెను. రామమోహనరాయలు ౧౭౭౨ లో జన్మించి ౧౮౩౩ లో బ్రిష్టల్‌నందు మరణించెను. హిందూదేశములో సహగమనమును (సతి) మాన్పించుటకును, పాశ్చాత్యవిద్యను ప్రవేశపెట్టుటకును ఆయన చేసినకృషి చిరస్మరణీయము. ౧౮౩౦ ప్రాంతములో పాశ్చాత్యవిద్యనుగూర్చి రేగిన వాదప్రతివాదములలో రామమోహనరాయలు చేసిన కృషివలననే లండనులోని కోర్టు ఆఫ్ డైరెక్టర్ల సిఫారసులకు వ్యతిరేకముగాకూడ విలియం బెంటింకు ప్రభువు అనుకూలమైన నిర్ణయమునకు రాగలిగినాడు. చరిత్ర ప్రసిద్ధమైన ఈ విషయము రామ మోహనరాయలకు పాశ్చాత్య విజ్ఞానమునందుగల పక్షపాతమును, ఆకాలపు ప్రజలపైన ఆయనకుగల అమోఘమైన పలుకుబడినీ తెలియజేస్తూన్నది. రామమోహనరాయలు తన అంత్యదశలో ఇంగ్లండునకు ప్రయాణముకట్టినాడు. ఆప్రయాణములో జరిగిన ఈక్రింది సంఘటనమువలన ఆయనకు గల స్వాతంత్ర్యేచ్ఛ బోధపడగలదు. "కేప్ ఆఫ్ గుడ్ హోప్" దగ్గర స్వాతంత్ర్యపతాక మెగురుతూన్న ఒక ఫ్రెంచినౌక రామ మోహనరాయలదృష్టి నాకర్షించినది. వెంటనే ఆయన తనను తననౌకలోనుండి ఫ్రెంచి నౌకకు కొంపోవలసిందని నావికులను తొందరపెట్టినాడు. ఆయన ఫ్రెంచినౌకను ఎక్కి స్వాతంత్ర్యపతాకను చూచి ముగ్ధుడై "స్వాతంత్ర్య పతాకకీ జయ్, జయ్, జయ్" అని బిగ్గరగా మూడుసార్లు జయధ్వానములు చేసెను. రామమోహనరాయలు ముఖ్యముగా లండనులో మొగల్ చక్రవర్తి పక్షమున పనిచేసేటందుకు రాయబారిగా ఇంగ్లండు వెళ్ళినాడు. కాని అప్పుడు భారతీయులను బాధిస్తూన్న కొన్ని కష్టములను గూర్చి పార్లమెంటు కమిటీయెదుట మనవిచేయుట కాయనకు మంచి అవకాశము కలిగినది. ఆయన భారతదేశపు రెవిన్యూ పరిపాలనము, న్యాయపరిపాలనము, భౌతిక స్థితిగతులనుగూర్చిన మూడు నివేదికలనూ పార్లమెంటువారి కందించెను. ఆయనకు ఈస్టిండియాకంపెనీవారు గొప్పవిందుచేసి గౌరవించినారు. ౧౮౩౨-వ సంవత్సర

ములో ఛార్టరు చట్టము పార్లమెంటులో చర్చకు వచ్చినప్పుడు, ఆచట్ట మంగీకరింపబడనియెడల తాను ఇంగ్లండుపౌరుడుగా నుండుట విరమించుకొని, అమెరికాలో నివాసస్థాన మేర్పరచుకొందుననని ఆయన ప్రతినపట్టెను. ఆయనకాలములో ముద్రణాలయములపైన నిర్బంధవిధానము చాలాఎక్కువయినది. హేస్టింగ్సుప్రభువు గవర్నరు జనరలుగా వచ్చి ముద్రణానిరోధక శాసనములను కొంతవరకు సడలించి భారతపత్రికాప్రపంచమునకు మహోపకారము చేసినాడని సంతోషిస్తూండగనే, ౧౮౨3 లో సివిల్ సర్వీసుఉద్యోగి జాన్ ఆడమ్‌గారు తాత్కాలిక గవర్నరు జెనరలై తిరిగీ యెప్పటి నిర్బంధవిధానమును సాగించినాడు. దీనిఫలితముగా "కలకత్తా జర్నల్" పత్రికాసంపాదకుడుబక్కింగ్ హామ్ గారు రెండునెలల నోటీసుతో ఇండియా నుండి ప్రవాసమునకు పంపివేయబడెను. ఆయనసహచరుడు సాన్‌ఫర్డు ఆర్నాట్ గారిని పత్రికాకార్యాలయములోనే అరెస్టుచేసి సీమకుపోయే పడవలో ప్రభుత్వమువారు వెంటనే పంపివేసినారు. పరిపాలనావిధానమునుగూర్చి యేవో కొన్ని విమర్శనములు చేసినంతమాత్రమున వా రిరువురకును కలిగిన ఆపద ఇది.

౧౮౨3 వ సంవత్సరము మార్చి ౧౪ వ తేదీని జారీచేయబడిన అత్యవసర ముద్రణాశాసనము (Press Ordinance) ప్రకారము ఆంగ్లో ఇండియన్ పత్రికలు, ఇండియన్ పత్రికలు అనే భేదములేకుండ భారతదేశములోని అందరు పత్రికాధిపతులును, అందరు ప్రకాశకులును లైసెన్సులు తీసుకోవలసిన నిర్బంధ మేర్పడినది. అప్పటినుండి పత్రికలపైన 'నిగా' కూడా చాలా యెక్కువైనది. ఈ అత్యవసరశాసనము అప్పటి 'లా' ప్రకారము సుప్రీమ్‌కోర్టులో ప్రకటింపబడిన ౨౦ రోజులలోనే తొందరగా వెలువరింపబడినది.

రామమోహనరాయలు ఈశాసనమును రద్దుచేయించుట కిద్దరు వకీళ్లనుపెట్టి వాదింపచేసెను. కాని ఆప్రయత్నము వ్యర్థమైనది. అందుపై ఇంగ్లాండురాజుగారికొక మహాజరు అర్జీని దాఖలుచేయించెను. అదికూడ ప్రయోజనకరము కాలేదు. కాని ఆ ప్రయత్నబీజము ౧౮3౫ లో సర్ చార్లెస్ మెట్‌కాఫ్‌గారు పత్రికల కిచ్చిన స్వాతంత్ర్యమూలకముగా ఫలప్రదమైనది. రామమోహనరాయ లింగ్లాండులో నుండగనే సహగమన నిషేధమునుగూర్చి ఆయనప్రతిపక్షులు చేసిన అప్పీలు పార్లమెంటులో త్రోసివేయబడుటయు, ఛార్టరుచట్ట మంగీకరింపబడుటయు జరిగినవి.

డల్‌హౌసీప్రభువు కొందరు సంస్థానాధిపతులు సంతతి లేక మరణించగా వారిభార్యలకు దత్తతాధికారములేదని ప్రకటించి వారి రాజ్యములను ప్రభుత్వములో చేవారసుఆస్తి క్రింద కలుపుకోవడమే రాజ్యాంగతంత్రముగా నవలంబించినప్పుడు

వచ్చిన తిరుగుబాటు "సిపాయిపితూరి" అని కొందరిచే వ్యవహరింపబడుచున్నది. ఆకథ అంతయును అందరికిని బాగుగా తెలిసినవిషయమే. ఆతిరుగుబాటు అణచివేయబడిన వెంటనే ౧౮౫౭ లో విశ్వవిద్యాలయములును, ౧౮౬౧, ౧౮౬౩ సంవత్సరముల మధ్య హైకోర్టులును, శాసనసభలును ఇండియాలో నిర్మింపబడినవి. పితూరికిముందు కొద్దికాలముక్రిందనే సంఘసంస్కరణసంబంధమైన వితంతువివాహ చట్టమంగీకరింపబడినది. ౧౮౬౦ ప్రాంతములలో పాశ్చాత్యభావములతోను, పాశ్చాత్యవిజ్ఞానముతోను భారతదేశమునకు సన్నిహిత సంబంధ మేర్పడినది. న్యాయవిచారణ, చట్టనిర్మాణములందు నూతన శకప్రారంభ చిహ్నములుగా పాశ్చాత్యన్యాయసంస్థలును, పార్లమెంటరీ పద్ధతులును ఏర్పాటుచేయబడినవి. పాశ్చాత్యసభ్యతతో కలిగిన సంఘట్టనము వలనను, సంసర్గమువలనను భారతీయుల విశ్వాసములలోను, మానసికప్రవృత్తులలోను తీవ్రమైన పరివర్తనము కలుగక తప్పినదికాదు. రామమోహనరాయలచే చల్లబడిన మత సంస్కారబీజములు కొద్దికాలములోనే దేశమంతటను వ్యాపించినవి. రామమోహన రాయల అనంతరం ఆయన అనుయాయులలో కేశవచంద్రసేనుడు బ్రహ్మసమాజధర్మ ప్రచారము సాగించి, ఆసిద్ధాంతముల కొక నూతనసాంఘికవికాసము కల్పించినాడు. ఆయన మద్యపానము చేయవలదని బోధిస్తూ, ఇంగ్లాండులోని మద్యనిషేధసంస్కర్తలతో సానుభూతికలిగి పనిచేసెను. "బ్రహ్మసమాజ వివాహచట్టము" అని పిలువబడు ౧౮౭౨-వ సంవత్సరపు ౩-వ చట్ట మంగీకరింపబడుటకు చాలవరకాయనయే బాధ్యుడు. ఆచట్టముక్రింద క్రిస్టియనులు కానివారి కొకవిధమైన సివిలువివాహపద్ధతి యేర్పాటు చేయబడెను. ఎవరయినను సరే, హిందూ, మహమ్మదీయ, క్రైస్తవ, పార్సీ, జ్యూసంఘములలో నేసంఘమునకును తాము చెందమని ప్రకటించుకొనిన చాలును, వారీచట్టము క్రింద వివాహము చేసికొనవచ్చును. ఈ చట్టమువలన బాల్యవివాహము నిషేధింపబడినది; బహుభార్యాత్వము శిక్షార్హము చేయబడినది. వితంతువివాహములు, వర్ణాంతర వివాహములు అంగీకరింపబడినవి. బాలికల వివాహవయస్సు ఎక్కువచేయవలెనని కేశవచంద్రసేనుని కోరిక. అందుకోసమాయన ౧౮౭౨ లో, బాలికల వివాహ వయస్సు ౧౪ ఉండవలయునని నిర్ణయిస్తూ ఒక బిల్లుమూసా తయారుచేసియున్నాడు.

కొద్దికాలములోనే బ్రహ్మసమాజములో చీలికలు ప్రారంభమైనవి. కూచిబిహారుమహారాజునకు ఈడురాని కేశవచంద్రసేనుకొమార్తె నిచ్చి వివాహముచేయడమే ఈ చీలికకు మూలకారణము. ఇందువలన కేశవచంద్రసేనుని అనుచరులలో పెద్ద తిరుగుబాటు బయలుదేరినది. వారందరును కలసి ఆనందమోహనబోసు నాయకత్వమున "సాధారణబ్రహ్మసమాజ" మనే పేరుతో బ్రహ్మసమాజమతమునందు వేరొక కక్షను లేవదీసిరి. ఈ ఆనందమోహన్‌బోసే తరువాత ౧౮౯౮ లో జాతీయమహాసభ కధ్యక్షు లగుట

సంతోషకరమైన విషయము. వంగదేశ బ్రహ్మసమాజము దేశమంతటను ఏదోయొక రూపములో ప్రతిబింబించినది. అది పూనాలో యమ్. జి. రనెడేగారి నాయకత్వమున "ప్రార్థనసమాజ" రూపమును పొందినది ఈ రనెడేగారు ప్రారంభించిన సంఘ సంస్కరణోద్యమము చాలాకాలమువరకు కాంగ్రెసు కనుబంధముగా పనిచేసినది. కాని ఇది దేశీయుల పూర్వాచారములపైనను, సంప్రదాయవిశ్వాసములపైనను కొంత నిరసనభావము, తిరుగుబాటు కలిగించినది. ఇది పాశ్చాత్య సంస్థలమీది వ్యామోహమున జన్మించి దీనితో సన్నిహితసంబంధము గల రాజకీయ ప్రతిష్ఠవలన వర్ధిల్లినది జాతీయ సంప్రదాయవిరుద్ధములైన ఇట్టి సంస్కరణోద్యమములు పెడదారులు త్రొక్కకుండ చూచుటకు దేశములో కొంత ప్రతిరోధము కలుగుట సహజము. కాబట్టి పాశ్చాత్యవిద్యతో వచ్చిన ఈ అనార్య సంప్రదాయములను, విపరీత సిద్ధాంతములను నిరోధించి అవసరమైనంతవరకు సవరించుటకు పశ్చిమోత్తరదెసను ఆర్యసమాజమును, దక్షిణాదిని దివ్యజ్ఞానసమాజమును బయలుదేరినవి. ఈ రెండును గొప్ప జాతీయోద్యమములే. అందులో ఆర్యసమాజము మరీ ఎక్కువగా దేశాభిమానమును పురస్కరించుకొని పనిచేసినది. అది వేదాల ఆధిక్యతను ఒప్పుకొన్నది. అవి ప్రమాదరహితము లనికూడ అంగీకరించినది. కాని అంతమాత్రాన సంఘసంస్కరణమునకు ఆర్యసమాజమతము అడ్డుతగులలేదు. కాబట్టి అది మన పూర్వసంప్రదాయములలోని మంచిని గ్రహించి, కాలానుగుణమైన మార్పులతో భారతజాతిని వీర్యవంతముగా చేసినదని చెప్పవచ్చును. బ్రహ్మసమాజము విగ్రహారాధనము, బహుభార్యాత్వము, బహు దేవతారాధనము మొదలగు దురాచారములపైన కత్తిగట్టినట్లే ఈ ఆర్యసమాజమతముకూడ అనేక మూఢవిశ్వాసములను, దుష్టాచారములను పోగొట్ట కంకణము కట్టుకొనెను. తరువాత ఆర్యసమాజములోకూడ రెండుతెగ లేర్పడినవి. అందులో ఒక తెగవారు గురుకులమువారు. వారి ఆదర్శము వేదకాలపు బ్రహ్మచర్య సిద్ధాంతము ననుసరించిన మతప్రచారము. రెండవవారు సంఘసంస్కర్తలు. వీరి ఆదర్శము ఆధునిక పాశ్చాత్య విజ్ఞానమూలకమైన సంఘోద్ధరణము. ఈ యుభయాదర్శముల పక్షమునను వీరస్వర్గము నలంకరించిన శ్రద్ధానందస్వాములును, మహాపురుషుడు లాలా లజపతిరాయలును పనిచేసి ఆర్యమత నభోమండలమున రెండు నక్షత్రములవలె ప్రకాశించిరి.

దివ్యజ్ఞానోద్యమము విశ్వమానవ కల్యాణమునకును, విశ్వవిజ్ఞానమునకును సంబంధించినదైనను, ముఖ్యముగా ప్రాచ్యవిజ్ఞాన పునఃప్రతిష్ఠాపనమున కెక్కువ పనిచేసినది. అఖిలభారత పుణ్యక్షేత్రమైన వారణాసీనగరమున కళాశాలను స్థాపించుటకు బిసెంటుగారి ఈకార్యోత్సాహమే కారణము. దివ్యజ్ఞానమతము అంతర్జాతీయ సోదరభావమును

పెంపొందించినది. హేతువాదమునందు పాశ్చాత్యులు తదితరులకంటె అధికులనుభావమును నిరోధించినది. పాశ్చాత్యవిజ్ఞానవేత్తలను, పండితులను ఆకర్షించగలిగిన ఒక నూతన విశ్వకళాకేంద్రమును భారతపుణ్యభూమిలో సంస్థాపించుకొనగలిగినది.

వంగదేశ మహర్షి రామకృష్ణపరమహంస స్థాపించిన రామకృష్ణమఠము కాంగ్రెసునిర్మాణమునకు పూర్వము భారతజాతీయ వికాసమునకు మరొక నూతనశోభ కలిగించినది. ఆయనప్రధానశిష్యుడు వివేకానందస్వామి మతప్రవక్తయై ప్రాచ్యప్రతీచీ దేశములలో ఆదివ్యసందేశమును ప్రతిధ్వనింపచేసెను. రామకృష్ణమఠము కేవలము అణిమాదిసిద్ధులకుగాని (Occultism), లేక కేవలము జగత్సత్యవాదము (Realism) నకు గాని సంబంధించక అంతర్వాణీప్రబోధితమైన ఒక మహత్తరవాదము (Trancendentalism)నకు సంబంధించినది. కాని ఆ సంస్థ లోకసంగ్రహార్థము పనిచేయవలసిన ఉత్కృష్టకర్మమును మాత్రము గమనించకపోలేదు. ఈ ధర్మమువలననే ఎన్నడో పరాజితమైన భారతదేశము విజయవంతమైన నేటి పాశ్చాత్య భూమినాకర్షించగలిగినది! ఆధ్యాత్మిక జీవితవిషయమున ప్రాచ్యదేశీయభావముల ఆధిక్యతను నిరూపించగలిగినది! నేడు ప్రపంచకములోని అన్ని జాతులను ఎదుర్కొనుచున్న అనేక సాంఘిక రాజకీయ సమస్యల పరిష్కారణమునకు మార్గము చూపించగలిగినది. భారత జాతీయతాహారమున కీ యుద్యమములన్నీ అన్ని ముత్యాలు. వీటన్నిటి సంప్రదాయ సిద్ధాంతములను సమన్వయము చేసుకొని, మూఢ విశ్వాసములను, ద్వేషభావములను వదలి, సనాతనధర్మము నాధునికజాతీయజీవనమునకు విరోధము గాకుండ రక్షించుకొంటూ, వేదఋషుల ఆదర్శములను, నేటి లోకవ్యవహారములను గమనించి మెలగుటయే భారతజాతికి పరమధర్మము. ఈ పవిత్రధర్మమును నిర్వర్తించుటమే భారత జాతీయమహాసభోద్దేశము. గడచిన అర్ధశతాబ్దములో నెంతవరకీపని అది చేయగలిగినదో మనము విచారింతుముగాక.

## 3

ఈపరిస్థితులలోనే జాతీయమహాసభా నిర్మాణమునుగూర్చి భావనచేయబడినది. కలకత్తాలోని ఇండియన్ అసోసియేషన్, బొంబాయిలోని రాష్ట్రీయసభ, మదరాసులోని మహాజనసభ వంటి రాష్ట్రీయసంస్థలు రాజకీయసమస్యలనుగూర్చి యోజించవలెననీ, అఖిలభారతజాతీయసంఘము (All-India National Union) మాత్రము మించుమించుగా సాంఘికసమస్యలపైన దృష్టినిలుపవలెననీ హ్యూముగారి మొదటి అభిప్రాయము. ఆయన అప్పుడే ఇండియాకు వైస్రాయిగావచ్చిన డఫరిన్ప్రభువుగారితో సంప్రతించెను. డఫరిన్ గారిచ్చిన సలహానుగూర్చి ౧౮౯౫ వ సంవత్సర

మున ప్రకటింపబడిన "ఇండియా రాచకీయములు" అనే గ్రంథమునకు పీఠిక వ్రాసిన డబ్లియూ. సి. బెనర్జీగారి ఈక్రింది వాక్యములద్వారా పాఠకులు తెలుసుకొనగలరు:

" భారత జాతీయమహాసభా నిర్మాణమునకు నిజముగా నాటి గవర్నర్ జనరల్ మార్క్వెస్ ఆఫ్ డఫరిన్ కారణభూతు డయినాడని చెప్పినయెడల బహుశా చాల మందికి క్రొత్తగా తోచవచ్చును. ౧౮౮౪ వ సంవత్సరములో ఎ. ఒ. హ్యూమ్ (సి. బి.) భారతదేశములోని ప్రధానరాజకీయవేత్తలందరును సంవత్సరమున కొకసారి సాంఘికవిషయములను చర్చించుట కొకచోట సమావేశమయి పరస్పర స్నేహభావ మును పెంపొందించుకొనేయెడల అది చాలా ప్రయోజనకరము కాగలదని భావించెను. ఈ మహాసభలో రాజకీయవిషయములు చర్చింపబడరా దని ఆయన అభిప్రాయము. కలకత్తా, బొంబాయి, మద్రాసు రాష్ట్రములలోను, ఇండియాలోని తదితర ప్రాంతములయందునుకూడ రాజకీయ విషయచర్చలకు తగిన సంస్థ లుండగా, ఈ అఖిలభారతసంస్థగూడ ఆ పనిచేయ పూనినయెడల వాటి ప్రాముఖ్యము పోవునని ఆయనవూహ. అదీగాక ఈరాజకీయ వేత్తలందరును సమావేశమయిన రాష్ట్రములోని గవర్నరు ఆ సభకు అధ్యక్షుడుగా కోరబడవలెననీ, అందువలన అధికారవర్గమువారికిని, జాతీయనాయకులకును పరస్పరమిత్రభావము లేర్పడగలవనీకూడ ఆయన తలంపు. ఇన్నిభావములతో ఆయన ౧౮౮౫ ప్రారంభదశలో సిమ్లాలో డఫరిన్ ప్రభువును సందర్శించెను. డఫరిన్ ఆ జరిగిన డిసెంబరునెలలో వైస్రాయిపదవిని స్వీకరించియుండెను. హ్యూముగారు మాట్లాడిన విషయమునుగూర్చి డఫరిన్ ప్రభువు జాగ్రత్తగా ఆలోచించి, అది అంత ప్రయోజనకారిగా తనకు కనుపించలేదని ఆయనతో చెప్పెను. " ఇంగ్లాండులో రాణీగారి వ్యతిరేక కక్షివారు చేసేపని ఇండియాలో నెవ్వరును చేసేవారులేరు పత్రికలు నిజముగా ప్రజాభిప్రాయమునే ప్రకటించినప్పటికీ వాటిని విశ్వసింపవీలులేదు. అందువలన ఇంగ్లీషువారు తమనుగూర్చి, తమ పరిపాలనమునుగూర్చి దేశీయు లేమనుకొంటూండిరో తెలుసుకొనజాలకుండిరి. కాబట్టి పాలకుల శ్రేయస్సుకోసము, పాలితుల క్షేమముకోసముకూడ భారత రాజకీయ వేత్తలు సంవత్సరమున కొకసారి సమావేశమయి పరిపాలనములోని లోపములను చర్చించి వాటిని సవరించుటకు తగిన మార్గములనుకూడ సూచించుచుండు టవసరము. అంతేకాక అటువంటిసభలకు స్థానికగవర్నరు అధ్యక్షుడుగా నుండకూడదు. ఆయన యెదుట ప్రజలు తమ అభిప్రాయములను ప్రకటింప నిష్టపడరు". అనికూడ డఫరిన్ ప్రభువు హ్యూమ్‌కు చెప్పియుండెను. హ్యూమ్ డఫరిన్ ప్రభువువాదమున కంగీకరించి, తమ యిరువురి ప్రణాళికలనుగూర్చి మద్రాసు బొంబాయి కలకత్తా తదితర ప్రాంతములలోని ప్రముఖులయిన రాజకీయనాయకులతో సంప్రతించెను.

నారంభించుటను ఏకగ్రీవముగా డఫరిన్‌గారి సిద్ధాంతమే బాగున్నదని కార్యాచరణ కాచరించిరి. డఫరిన్ ప్రభువు, తా నిండియాలో నున్నంతకాలము, కాంగ్రెసు ప్రణాళికకు సంబంధించి, తన పేరును బయటపెట్టకుండునట్లు హ్యూముగారిచే వాగ్దానము చేయించుకొనెను. ఆవాగ్దానముప్రకారమే హ్యూముగారు సంప్రతించినవారికి తప్ప తదితరుల కీరహస్యము తెలియదు."

ఈ భారతజాతీయ ప్రతినిధులసభ అప్పటికి రాబోయే క్రిస్టమస్ నెలలో జరిగేటట్లు ౧౮౮౫ మార్చి నెలలోనే నిర్ణయింపబడినది. అందుకు పూనా చాల అర్హమైన స్థలమని తలంపబడినది. ఆసమావేశమునుండియే ఈక్రింది ప్రకటనము వెలువడినది:

"౧౮౮౫ డిసెంబరు ౨౫ మొదలు ౩౧ వరకును భారతజాతీయసంఘ మహాసభ పూనాలో జరుగును.

"ఆమహాసభకు బొంబాయి మద్రాసు వంగరాష్ట్రములనుండి ఇంగ్లీషు బాగుగా తెలిసిన రాజకీయమహానాయకులు ప్రతినిధులుగా వచ్చెదరు.

"మహాసభోద్దేశములు—(౧) జాతీయాభ్యుదయముకోసము హృదయపూర్వకముగా పనిచేసేవారందరిని ఒకరి నొకరికి ప్రత్యక్షముగా నెరుకపరచుట, (౨) రాబోవు సంవత్సరములో నిర్వర్తించవలసిన రాజకీయవిధానమును యోజించి నిర్ణయించుట.

"పరోక్షముగా ఈమహాసభయే దేశీయపార్లమెంటున కంకురము కాగలదు. అంతేకాక ఈసభను జయప్రదముగా జరుపగలిగినయెడల కొద్దిసంవత్సరములలోనే భారతదేశము ప్రాతినిధ్యసంస్థల కెంతమాత్రమును పనికిరాదనే అభిప్రాయము తొలగిపోగలదు. రెండవసభకూడా పూనాలోనే జరుపబడవలెనా, లేక బ్రిటిష్ అసోసియేషన్ సంప్రదాయము ననుసరించి యేసంవత్సరమున కాసంవత్సరము అక్కడక్కడ కొన్ని ముఖ్యకేంద్రములలో జరుపబడవలెనా అనే విషయముకూడ ఈ మొదటిసభలోనే నిర్ణయింపబడును.

"ఈ సంవత్సరము ఈసభ పూనాలో జరుగుతూన్నది కాబట్టి, సార్వజనికసభకు సంబంధించిన చిప్లోన్‌కారు మొదలగువారు ఆహ్వానసంఘముగా యేర్పడి స్థానికమైన యేర్పాట్లన్నీ చేయుట కంగీకరించినారు. పార్వతీగుట్టకు దగ్గరగానున్న పీష్వాతోట సభాసమావేశమునకు, ప్రతినిధుల బసలకుకూడా ఉపయోగపడగలదు. ప్రతినిధులందరును వారంరోజులపాటు ఒకచోటనే బసచేయుటమూలమున వారిలో వారు కలసి మాట్లాడుకొంటూ స్నేహము కలుపుకోవచ్చుననే ఊహతో ఈ యేర్పాటు

చేయబడినది. ఇంతకుపూర్వము జరిగిన బొంబాయిసభలలో ప్రతినిధు లందరును నగరములో తలొకచోటను బసచేయుటవలన వారిలో వారికి పరిచయం కలుగుటకే అవకాశ ముండేదికాదు. కాబట్టి ఈసభలో ఈయేర్పాటొక గొప్పవిషయము.

“ప్రతినిధు లందరును పూనాకు వచ్చిపోవుట కయ్యే ఖర్చులు ఎవరివి వారే భరించవలెను. కాని వారు పూనా రైలుస్టేషనులో దిగినప్పటినుండీ తిరిగి పూనావిడిచి వెళ్లేవరకును వారికి కావలసిన బండీ, బస, భోజనము వగైరాలు ఉచితముగా సప్లయి చేయబడును.

“ఈవిధముగా అయిన సొమ్ము ఆహ్వానసంఘమువారి నిధినుండియే వెచ్చించబడును. ఇందుకు పూనావారు మొట్టమొదటిసారియే చాలా ఔదార్యబుద్ధితో ఒప్పుకొనిరి. కాని పూనాలోకూడా తమ ఖర్చులు తాము భరించుకోగలిగిన ప్రతినిధులందరును వారికి తోచినది ఆహ్వానసంఘమువారికి చందాగా నీయవచ్చును. ప్రతినిధుల చందాలలో ఖర్చుకాగా మిగిలిపోయిన సొమ్ము మరుసంవత్సరపు ఆహ్వాన సంఘనిధికి చేర్చబడును.

“పూనావారుగాక సింధు, బీరారు రాష్ట్రములతోసహా బొంబాయిరాజధాని నుండి ౨౦ మందీ, మద్రాసు, దిగువబెంగాల్ రాష్ట్రములనుండి చెరి ౨౦ మందీ, పశ్చిమోత్తరరాష్ట్రములు, అయోధ్య, పంజాబులనుండి మొత్తము ౧౦ మందీ ప్రతినిధులుగా వచ్చెదరని నమ్మకము.”

ఇండియాలోని వైస్రాయి ఆశీర్వాదమును పొందిన హ్యూము సీమకు వెళ్లి, కాంగ్రెసుసంస్థాపనమునుగూర్చి రిప్పనుడఫ్రిన్ప్రభువులను, సర్ జేమ్సుకేర్డు, జాన్ బ్రైటు, స్లాగ్, రీడ్ మొదలగు పెద్దలను సంప్రతించెను. వారి సలహాతో సీమలోనే ఇండియా పక్షమున పనిచేయుట కొక సంఘమును నియమించెను. అదే తరువాత ఇండియన్ పార్లమెంటరీకమిటీ యైనది. ఆకమిటీసభ్యులు పార్లమెంటు అభ్యర్థులనుండి ఇండియా విషయములలో శ్రద్ధతీసికొందుమని వాగ్దానములు తీసికొనవలసియుండెను. తరువాత ఇండియను టెలిగ్రాఫుసంఘము నొకదానిని స్థాపించెను. వారు ఇంగ్లండులోని ముఖ్యమయిన రాష్ట్రీయపత్రికలకు ఇండియాకు సంబంధించిన విషయములను తంతిద్వారా సంపుటకు కావలసిన సొమ్మును సేకరించవలసియుండెను.

ప్రథమ కాంగ్రెసు మహాసభనుగూర్చి బీసెంటుగారు తన “భారతదేశము స్వాతంత్ర్యముకోసము పోరాడిన విధము” **(How India wrought for fredom)** అనే గ్రంథములో వివరముగా వ్రాసియున్నది. అందులోని కొన్నివిషయము లీక్రింద నుదాహరింపబడినవి :

"ఇంతా అయితే మొదటిసభ పూనాలో జరుగనేలేదు. క్రిస్టమస్ కుముందే కొద్దిరోజుల క్రిందట ఆ నగరములో అక్కడక్కడా కలరా కనుపించడంచేత, అదే పెద్దది కావచ్చుననే భయముతో, ఇప్పుడు కాంగ్రెసు అని పిలువబడుతూన్న మహాసభ బొంబాయిలో జరిగే యేర్పాటు చేయబడినది. గోకుల్ దాసు తేజపాల్ సంస్కృత కళాశాలా పరిపాలకులు వారి సుందర భవనములను కాంగ్రెసువశము చేసిరి. డిసెంబరు ౨౭ వ తేదీ యుదయమునకు భారతజాతీయ ప్రతినిధుల ఆహ్వానమునకు కావలసిన తతంగమంతా చేయబడినది. ఆ సభకు హాజరైన ప్రతినిధుల జాబితాలను చూచినయెడల అందులో ఎంతమందో, భారత స్వాతంత్ర్య సంగ్రామములో ప్రసిద్ధిగడించినవా రుండిరి. ప్రతినిధులుగా పనిచేయ వీలుకానివారిలో దివాన్ బహదూరు ఆర్. రఘునాధరావు (డిప్యూటీ కలెక్టరు, మద్రాసు), శ్రీ. మహాదేవ్ జి. రెనడే (అప్పటికి శాసనసభాసభ్యుడు, పూనా స్మాల్ కాజ్ కోర్టు జడ్జి, తరువాత బొంబాయి హైకోర్టుజడ్జి, విశ్వాసపాత్రుడు, పూజనీయుడు అయిన నాయకుడు), లాలాబాజీనాథ్ (ఆగ్రా నివాసి. కొంతకాలమైననునుక పండితుడుగాను, గ్రంథకర్తగాను పేరుపడ్డవాడు.), కె. సుందరరామన్, ఆర్. జి. భండార్కర్ పండితులును ఉండిరి. ప్రతినిధులలో పూనా సార్వజనికసభకు చెందిన త్రైమాసికపత్రిక 'ధ్యానప్రకాశ్', మహారాష్ట్రకేసరీ, నవాబీభాకార్, ఇండియన్ మిరర్, నాసీమ్, హిందూస్థానీ, ట్రిబ్యూన్, ఇండియన్ యూనియన్, స్పెక్టేటర్, ఇందూప్రకాశ్, హిందూ, క్రెసెంటు మొదలగు సుప్రసిద్ధ పత్రికాధిపతులు గలరు. ఇంకా ఎందరో వినికిడిగల పూజనీయులాసభలో ప్రతినిధులుగానుండిరి. సింధునుండి ఎ. ఒ. హ్యూమ్, కలకత్తానుండి నరేంద్రనాథసేన్, డబ్లియు. సి. బెనర్జీ, పూనానుండి డబ్లియు. యస్. ఆప్టే, జి. జి. అగర్ కార్, లక్నోనుండి గంగాప్రసాదవర్మ, బొంబాయినుండి దాదాభాయినౌరోజీ, కె. టి. తెలాంగ్, ఫిరోజిషామెహతా (నేటి బొంబాయి కార్పొరేషన్ నాయకుడు), డి. ఇ. వాచా, బి. యమ్. మలబారీ, యన్. జి. చందావర్కారు, మద్రాసునుండి మద్రాసు మహాజనసభాధ్యక్షుడు పి. రంగయ్యనాయుడు, యస్. సుబ్రహ్మణ్యఅయ్యర్, పి. ఆనందాచార్యులు, జి. సుబ్రహ్మణ్యఅయ్యర్, యమ్. వీరరాఘవాచార్యులు, అనంతపురంనుండి పి. కేశవపిళ్లెగార్లును గలరు. వీరందరునుభారత స్వాతంత్ర్యముకోసము ప్రప్రథమములో పనిచేసినవారు. వీరిలో ఇంకను జీవించియున్నవారు నేటికిని అందుకొరకు పనిచేయుచునే ఉన్నారు.

" ౧౮౮౫ వ సంవత్సరం డిసెంబరు ౨౮ వ తేదీని మధ్యాహ్నం ౧౨ గంటలకు గోకుల్ దాసు తేజపాల్ సంస్కృతకళాశాలా భవనమునందు మొదటి జాతీయమహాసభ ((**National Congress**) సమావేశమైనది. మొదటి అధ్యక్షుడుగా

డబ్ల్యు. సి. బెనర్జీగారి పేరును ప్రతిపాదించి అనువదించి ఆమోదించిన ఏ. ఓ. హ్యూమ్, గా. యస్. సుబ్రహ్మణ్య అయ్యర్, గా. కె. టి. తెలాంగ్ గార్ల కంఠధ్వను లా సభలో మొట్టమొదట వినిపించినవి. మాతృభూమిచే మొదటి జాతీయ ప్రతినిధులుగా గౌరవింపబడిన అనేకమంది పెద్దలలో మొదటి పేరుగల డబ్ల్యు. సి. బెనర్జీగారే ప్రథమ జాతీయమహాసభ కధ్యక్షపీఠ మలంకరించిన చరిత్రప్రసిద్ధమైన శుభముహూర్త మది.

"కాంగ్రెసు మహాసభా గౌరవ ప్రాతినిధ్యములనుగూర్చి కొంత ముచ్చటించిన పిదప కాంగ్రెస్ ఉద్దేశములు నాలుగని ఆయన సెలవిచ్చినాడు:

(అ) సామ్రాజ్యములోని వివిధ భాగములలో మన దేశసౌభాగ్యమునుగూర్చి శ్రద్ధవహించి పాటుపడేవారందరికిని పరస్పర పరిచయము కలిగించి మిత్రభావమును పెంపొందించుట.

(ఆ) దేశాభిమానులందరిలోను ప్రత్యక్ష స్నేహసంభాషణముల మూలకముగా జాతిమతరాష్ట్రదురభిమానములను తొలగించి, చిరస్మరణీయమైన రిప్పనుప్రభువుపరిపాలనములో ప్రారంభమైన జాతీయైక్యతాభిప్రాయములను కేంద్రీకరించి ఇంకను పెంపొందించుట.

(ఇ) నేటి ప్రధాన సాంఘిక సమస్యలపైన విద్యావంతులైన ప్రముఖులగు భారతీయులు సంపూర్ణముగా చర్చించి వారి పరిణతాభిప్రాయముల నధికారరీత్యా ప్రకటించుట.

(ఈ) దేశీయరాజకార్యధురంధరులు రాబోవు పండ్రెండు నెలలలో ప్రజాశ్రేయస్సుకోసము చేయవగిన కార్యక్రమవిధానమును నిర్ణయించుట.

"మొదటి జాతీయ మహాసభ చేసిన తొమ్మిది తీర్మానములును భారతదేశము తన కోరికలను ప్రకటించిన ప్రారంభపద్ధతిని తెలియజేస్తున్నవి:

భారతపరిపాలనా విధానమును గూర్చి విచారించవలసినదని మొదటితీర్మానము.

ఇండియా కౌన్సిలును రద్దు చేయవలెనని రెండవతీర్మానము.

మూడవది ప్రభుత్వ నియోజితసభ్యులు మాత్రమేగల అప్పటి శాసనసభల లోపములను గూర్చినది. ఆతీర్మానమునందు, కౌన్సిళ్లలో ఎన్నికసభ్యులు కావలెననీ, ప్రశ్నలు వేయుట కధికారముండవలెననీ, పంజాబు, అయోధ్య, పశ్చిమోత్తరరాష్ట్రములలో శాసనసభల నేర్పాటు చేయవలెననీ, శాసనసభలలోని అధికసంఖ్యాకుల వ్యతిరేకాభిప్రాయములను విచారించుటకు కామన్సుసభలో స్టాండింగు కమిటీ యొకటి యుండవలెననీ కోరబడినది.

నాలుగవది ఐ. సి. యస్. పరీక్ష లేకకాలమున జరుపునట్లును, అభ్యర్థుల వయస్సు హెచ్చించునట్లును కోరుతూ చేయబడినది.

అయిదు, ఆరు తీర్మానములు సైనికవ్యయమునకు సంబంధించినవి.

ఏడవది ఎగువ బర్మారాష్ట్రమును కలుపుకొన్నవిధమును, దానిని ఇండియాతో చేర్చబోవు విధానమును నిరసిస్తూ చేయబడినది.

ఎనిమిదవ తీర్మానము, కాంగ్రెసు తీర్మానముల నన్నిటిని రాజకీయ సంఘములకు పంపించవలసినదని ఆజ్ఞాపించినది. అంతట నవి అన్నిరాజకీయసంస్థలలోను, బహిరంగసభలలోను చర్చించబడి, అంగీకరింపబడినవి. ఈపద్ధతి దేశములో సంచలనము కలిగించుటకు చాలా శ్లాఘాపాత్రముగా పనిచేసినది. ఆతీర్మానములలో అక్కడక్కడ చిన్నచిన్నమార్పులు చేయబడినప్పటికీ దేశమునం దధికోత్సాహముతో అంగీకరింపబడినవి.

చివరతీర్మానము, ౧౮౮౬ డిసెంబరు ౨౮ వ తేదీని మరు కాంగ్రెసు కలకత్తాలో జరుపవలె నని నిర్ణయించినది. ”

## ౪

ప్రపంచకములోని మహానదులన్నీ చిన్నచిన్న సెలయేళ్లుగా బయలుదేరినట్లే గొప్పసంస్థలుకూడా ప్రారంభములో చిన్నవిగానే బయలుదేరుతవి. మహానదులు పుట్టిన చోట బహువేగముగా పరుగెత్తుతవి. అవి విశాలము లయినకొలదీ నెమ్మదిగాను, నిశ్చలముగాను ప్రవహిస్తవి. స్రోవలో ననేక ఉపనదులు కలియుటచేత పోయినకొద్దీ అవి అంతకంతకు పెద్దవై ఎక్కువనీరములను భరించగలిగి యుండును. భారతజాతీయ మహాసభాపరిణామము సరిగా ఈసాదృశ్యమునే నిరూపిస్తున్నది. అది అనేక మహాకష్టపరంపరలను తరించవలసియుండుటచే మొట్టమొదట చిన్న ఆదర్శములతో బయలుదేరినది. పిదప ప్రజానురాగమును పొందినకొలదీ అది సాంఘిక నైతికార్థిక సమస్యలకు సంబంధించిన అన్ని యుద్యమములను తన విశాలప్రవాహగర్భమున లీనము చేసికొనినది. బాల్యదశలోని దానివ్యవహారములను గమనించినయెడల కొంతబలహీనత, కొంత అనుమానము గోచరించును. యౌవనదశ వచ్చినతరువాత దానిశక్తిసామర్థ్యముల నది మరింత ఎక్కువగా తెలుసుకొనగలిగినది. తత్క్షణము దానివృష్టి విశాల మయినది. అంతట కాంగ్రెసు ప్రార్థనలు, కోరికలు మాని ఆత్మచైతన్యమును, ఆత్మస్వామ్యప్రతిష్ఠాపన శక్తిని పెంపొందించుకొనినది. దీని ఫలితముగా దేశములో తీవ్ర రాజకీయ బోధనా ప్రచారములు జరిగినవి. కాంగ్రెసుసంస్థలు యావద్భారతదేశమునందును శాఖోపశాఖలుగా నిర్మింపబడినవి. వాటిద్వారా ప్రభుత్వచర్యల కెదురెత్తుగా గొప్పగొప్పయుద్యమములు నడుపబడినవి. ప్రథమములో విద్యాధికుల కొక కాలక్షేపముగాను, తమాషా

గాను నడచిన కాంగ్రెసు వెంటనే భారతజాతి కాశ్రయస్థాన మైనది; వారి మహోద్యమములకు కేంద్రస్థల మైనది; వారి వాంఛావాహినులకు సంగమక్షేత్ర మైనది. మొట్ట మొదట చిన్న చిన్న కష్టనివారణోపాయముల నాలోచించుకొనేనిమిత్తము మాత్రమే బయలుదేరిన కాంగ్రెసు కొలదికాలములోనే జాతీయ స్వాతంత్ర్యములను సగర్వముగా ప్రకటించగల అధికారసంస్థయైనది. బాల్యావస్థలో పరిపాలనావ్యవహారములను విమర్శించడముతో సంతృప్తిపడిన కాంగ్రెసు త్వరలోనే భారతీయుల రాజకీయ వాంఛలను దృఢముగా వెలిబుచ్చగల జాతీయప్రతినిధి యైనది. అది భారతదేశములోని అన్ని జాతులవారిని, అన్ని మతములవారిని, అన్ని తరగతులపౌరులను తన ఆశ్రయమున కాహ్వానించినది. కాంగ్రెసు, మొట్టమొదట కొన్నాళ్లు సాంఘికసమస్యలను విచారించుటకు మొగమోటపడినప్పటికిని, తరువాత కాలము గడచినకొలదీ జీవితములో నట్టి అంతశ్శాఖలను గమనించక, సంప్రదాయసిద్ధముగా, చిరకాలమునుండీ వస్తూన్న సాంఘిక రాజకీయమర్యాదలను సమన్వయము చేసుకొంటూ, మానవజీవితమంతా ఒకటేగాను, అవిభాజ్యముగాను భావించే ఒక పరిపూర్ణత్వమును పెంపొందించుకొనినది. ఇక కాంగ్రెసు బ్రిటిషుఇండియాకు స్వదేశసంస్థానములకు, ఒక రాష్ట్రమునకు మరియొక రాష్ట్రమునకు, పెద్దతరగతులవారికి చిన్నతరగతులవారికి, పట్టణములకు పల్లెలకు, ధనవంతులకు దరిద్రులకు, వ్యవసాయకులకు పారిశ్రామికులకు, కులములకు సంఘములకు మతములకు భేదము గమనించని ఒక జాతీయప్రతిష్ఠాపనము. గాంధీ రెండవ రౌండు టేబిల్ సభలో, ఫెడరల్ నిర్మాణసంఘమునం దిచ్చిన ఉపన్యాససారాంశ మిదే. ఆ యుత్తేజకరమైన యుపన్యాసమునుండి మన కవసరమని తోచినభాగము క్రింద నుదాహరింపబడినవి:

"నేను భారతజాతీయమహాసభాపక్షమున వ్యవహరిస్తూన్న ఒక సర్వసామాన్య ప్రతినిధిని. జాతీయమహాసభ అనగా ఏమిటో, దానిసిద్ధాంతము లేవో ఒక్కసారి మనము జ్ఞాపకముచేసుకోవడము మంచిది. అప్పుడు మీరు నాయందు సానుభూతి చూపగలరు. ఎందువల్లననగా, నేను నిజముగా నాభుజములపై మహాభార ముంచబడినదని నాకు తెలుసును. నేను పొరపాటు పడనియెడల, కాంగ్రెసు హిందూదేశములో అత్యంతపురాతన సంస్థ. అది దాదాపు ౫౦ యేండ్లు జీవితము గడపినది. ఈ యాభై యేండ్లజీవితకాలములోను దాని వార్షికసమావేశములు నిరంతరాయముగా జరిగినవి. జాతీయసంస్థ అనగా అదీ అర్థము. అది ఒకప్రత్యేకకులమునకు గాని, ఒక ప్రత్యేకతరగతికిగాని, ఒక ప్రత్యేకప్రయోజనమునకుగాని ప్రతినిధిగాదు. అది భారతదేశములోని అన్ని ప్రయోజనములకును, అన్ని తరగతులకును చెందినది. అది మొట్టమొదట ఇంగ్లీషు మేదస్సులోనుండియే భావనచేయబడినదని చెప్పుట నాకు చాలా సంతోషదాయకమయిన

విషయము. అల్లాన్ ఆక్టవియన్ హ్యూమ్ కాంగ్రెసుకు మూలపురుషుడని మనకు తెలుసును. ఎవనిని భారతపితామహుడని అఖిలహిందూదేశము పిలిచి ఆనందించినదో ఆ దాదాభాయినౌరోజీ, ఫిరోజిషా మెహతాలు దానికి బాల్యోపచారములు చేసిరి. వా రిరువురును పార్సీలు. కాంగ్రెసు ప్రారంభదశనుండికూడ ముసల్మానులు, క్రిస్టియనులు, అంగ్లో ఇండియనులు, వారు వీరేమిటి అన్నిమతములు, అన్ని సంఘములు, అన్ని సిద్ధాంతములు, దాదాపు పూర్తిగానే అందులో ప్రాతినిధ్యము వహించినవని చెప్పవచ్చును. కీ. శే. బదురుద్దీన్ తయాబ్జీ కాంగ్రెసుతో ఐక్యమైపోయెను. కాంగ్రెసు కధ్యక్షులైనవారిలో ముసల్మానులు, పార్సీలుకూడ ఉన్నారు. ప్రస్తుతము నేను కాంగ్రెసుతో సన్నిహితసంబంధముగల ఒక్క భారత క్రైస్తవుని పేరును నిస్సందేహముగా జ్ఞాపకముచేసుకొని చెప్పగలను. ఆయన కాళీచరణబెనర్జీ. ఆయనకన్న పవిత్రుడైన భారతీయుని నే నెరుగను. ఆయనకూడ కాంగ్రెసుతో అవినాభావసంబంధమును కలిగియుండెను. నేడు మనలో కె. టి. పాల్ లేకపోవుట నాకే గాక మీకందరికిని విచారకరమైన సంగతియే. ఆయనను నే నంత బాగుగా ఎరుగకపోయినప్పటికిని నే నెరిగియున్నంతవర కాయన, అధికారరీత్యా యెన్నడును కాంగ్రెసుమనిషి కాడు; కాని పూర్ణమైన జాతీయవాది.

“ నేడు మనము కోల్పోయిన కీ. శే. హకీముఅజ్మల్ ఖాన్ ఒకప్పుడు కాంగ్రెసు అధ్యక్షు డని మీకు తెలిసియేయున్నది. ప్రస్తుతము ౧౫ మంది సభ్యులుగల మా కార్యసంఘములో నలుగురు ముసల్మానుసభ్యు లున్నారు. మాకు స్త్రీలుగూడ అధ్యక్షులైనారు. డాక్టర్ అనీబిసెంటు మొట్టమొదటి అధ్యక్షురాలు. తరువాత సరోజినీదేవి. ఆమె ఇప్పుడు కార్యసంఘములో సభ్యురాలుగా నున్నది. కాబట్టి మాకు జాతిమతభేదములు లేనట్లే స్త్రీపురుషభేదములుకూడా లేవు.

“ మొదటినుండీ కాంగ్రెసు అస్పృశ్యులని పిలువబడేవారికోసము పని చేస్తూనే యున్నది. ప్రతిసంవత్సరము కాంగ్రెసుమహాసభ కనుబంధముగా సాంఘిక మహాసభలు జరుపబడిన రోజులు కూడా ఉండెను. ఇందుకు కీ. శే. రెనెడే తన యావచ్ఛక్తిని ధారబోసెను. ఆయననాయకత్వముక్రింద జరిగిన సాంఘికసభా కార్యక్రమములో అస్పృశ్యతకు సంబంధించిన సంస్కరణము ప్రాముఖ్యస్థానము వహించేది. కాని ౧౯౨౦ లో కాంగ్రెసొక మహాత్కార్యము చేసినది. రాజకీయ కార్యక్రమములో అస్పృశ్యతానివారణము నొక్కముఖ్యవిషయముగా చేర్చినది. కాంగ్రెస్ స్వరాజ్యమును సంపాదించుటకు హిందూమహమ్మదీయైక్యత, అనగా జాతీయైక్యత అవసర మని తలంచినట్లుగానే పూర్ణస్వాతంత్ర్యసంపాదనమునకు అస్పృశ్యతాకళంకమును నిర్మూలించడముకూడా అవసర మని తలంచినది.

"౧౮౭౦ లో కాంగ్రెసు అవలంబించిన ఈపద్ధతి నేటికిని జరుగుతూనే యున్నది. కాబట్టి "జాతీయమహాసభ" అని పిలువబడుతూన్న కాంగ్రెసు దాని పేరుకు తగినట్లుగానే పుట్టుమొదటినుండీ నేటివరకు "తూ" "చా" తప్పకుండా ప్రవర్తిస్తూన్నదని మీరు తెలుసుకొందురుగాక. మీవంటి గొప్పవారి అనుజ్ఞ అయితే, కాంగ్రెసు బాల్యదశలోనే మీకుకూడా సేవచేసినదని చెప్పగలను. కాశ్మీరము మైసూరు రాజ్యములపక్షమునను, ఈరెండు పార్లమెంటుసభలపక్షమునను భారతపితామహుడు పనిచేసియుండెననీ, మీరందరును కాంగ్రెసుకు, దాదాభాయినౌరోజీకి చాలా ఋణపడియుండి రనీ నేను సవినయముగా మనవిచేసుకొంటున్నాను.

"ఇప్పటివరకును కూడ కాంగ్రెసు సంస్థానాధిపతుల ఆంతరంగిక వ్యవహారములలోను, కుటుంబ వ్యవహారములలోను ఎట్టిజోక్యమును కల్పించుకొనక వారికి సేవచేస్తూనేయున్నది. కాబట్టి ఈ సబ్ కమిటీవారున్ను, కాంగ్రెసువారు కోరే హక్కులతో సంబంధముగల తగాదారు లెవరైనను ఉంటే వారున్నూ, ఈనాచిన్న ఉపోద్ఘాతముతో కాంగ్రెసు కోరుతూన్న హక్కులను తెగినట్లుగా అది కృషిచేసినదని తెలుసుకొందురుగాక ! అనేకసార్లు తానుకోరే హక్కులకు తగిన ట్లది ప్రవర్తించియుండలేదనికూడ నే నెరుగుదును. కాని మీరు కాంగ్రెసుచరిత్రమును పరీక్షించినయెడల అది అపజయముకన్న ఎక్కువ పర్యాయములు జయమునే పొందినదనీ, దానికి కలిగిన విజయపరంపరలలో ఒకదానికంటె నొకటి ఎక్కువైనదనీ మీరు గ్రహించగలరు.

"కాంగ్రెసు,ఇంతకంటెను ఎక్కువప్రధానముగాభారతదేశములోని ౭౦౦౦౦౦ గ్రామములలో అర్ధోపవాసములతో కాలముగడుపుతూన్న నోరులేని జనమునకు, బ్రిటిష్ ఇండియాప్రజా, సంస్థానప్రజా అనేభేదమును గమనించక ప్రాతినిధ్యము వహిస్తూన్నది. కాంగ్రెసు సంరక్షణమున కర్హతగల యెవ్వరి ప్రయోజనమైనను ఈ ప్రజల ప్రయోజనమునకు లోబడితీరవలసినదే. నిజముగా న్యాయ్యమైన విరోధభావమున్నప్పుడుగూడ, ఈ నోరులేని ప్రజాసమూహముకొరకు కాంగ్రెసు తదితర ప్రయోజనముల నన్నిటిని ఆహుతిచేయడమునకు సంసిద్ధముగా నున్నదని కాంగ్రెసుపక్షమున మనవిచేయుటకు నే నెంతమాత్రమును జంకవలసినపని లేదు. కాబట్టి కాంగ్రెసు ముఖ్యముగా రైతులసంస్థ. అది ఆవిధముగానే దినదినాభివృద్ధి నొందుచున్నది. నేడు కాంగ్రెసు అఖిలభారతచర్ఖాసంఘముద్వారా సుమారురెండువేలగ్రామములలో ౫౦ వేల మంది స్త్రీలకు పని చూపిస్తూన్నదనీ, వీరిలో సగముమంది మహమ్మదీయస్త్రీలే యనీ తెలుసుకొన్నయెడల ఈసబ్ కమిటీ సభ్యులు భారతీయ సభ్యులతో సహా బహుశా ఆశ్చర్యనిమగ్నులు కాగలరు. వారిలో వేలకొలదీ అంటరానివారుగా వ్యవహరింపబడే

కులములవారే. ఈ విధముగా నిర్మాణపద్ధతి నవలంబించి గ్రామములలోకి చొరబడి నాము. ఒక్కటైనను విడువకుండ ౭,౦౦,౦౦౦ గ్రామములలోను ఈపనిచేయవలెనని ప్రయత్నిస్తున్నాము. అది మానవాతీతమైనపని. కాని మానవ ప్రయత్నమే సఫలమయ్యే యెడల కాంగ్రెసే అన్నిగ్రామములలోను ప్రవేశించి గ్రామస్థులకు చర్ఖాసందేశమును తీసికొనిపోవుటను మీరందరును సంతోషముతో చూడగలరు.

"కాంగ్రెసుప్రాతినిధ్యస్వరూప మిట్టిదని తెలుసుకొన్నతరువాత, కాంగ్రెసు ఆజ్ఞాపత్రమును (Mandate) నేను మీకు చదివి వినిపించేయెడల మీకేమీ ఆశ్చర్యము కలుగదు."

బ్రహ్మాండమైన జాతీయోద్యమమును గాంధీ ఈగీతిగా వర్ణించినాడు:

"కాంగ్రెసు మరేమి చేయకపోయినప్పటికిని ఒక్కపనిమాత్రము చేసినది. దాని పరమావధి నది తెలుసుకొన్నది. దేశీయులభావములను, కార్యములను, ఒక్క చోట కేంద్రీకరించినది; భారతదేశమునందలి లక్షలకొలది ప్రజలలో ఒక విధమైన ఆత్మచైతన్యమును పెంపొందించినది. వారి కాత్మవిశ్వాసము, ఆశ, సంఘీభావము కలిగించినది. అదీకాక, కాంగ్రెసు భారతీయుల భావములకు, కోరికలకు స్పష్టమైన జాతీయస్వరూప మిచ్చి, వారి సమష్టిభాషా సాహిత్యములను, సమష్టి శిల్ప పరిశ్రమలను, సమష్టి వాంఛాదర్శములను అన్నిటినీ తిరిగీ తెలుసుకొనుట కవకాశము కలిగించినది. కడచిన యేబదిసంవత్సరములలోను అది కేవలము సుకరమైన మార్గమునసే అభ్యుదయ మొందిన దన వీలులేదు. ప్రజల ఉత్సాహనిరుత్సాహములనుబట్టి, వారి జయాపజయములనుబట్టి దానిచరిత్రలో ననేక వృద్ధిక్షయాలు కలిగినవి. అటువంటి కాంగ్రెసుసంస్థయొక్క కడచిన యేభైసంవత్సరములచరిత్రను పూసగ్రుచ్చినట్లుగా చెప్పవలెనన్నయెడల ఆ వీరసంస్థయొక్క పుట్టుకను వర్ణించవలయును; దానిపుట్టుకకు సహాయముచేసిన అనేకమంది జాతీయవృద్ధులను మూలపురుషుల సేవలను గణించవలయును; శైశవదశలో దానిని పెంచిన పోషకుల మహత్కార్యములను పరిశోధించవలయును; బాల్యదశలో నది పొందిన వృద్ధిక్షయములను చిత్రించవలయును; దానికి యౌవనములో కలిగిన విజయగౌరవములను, కౌమారములో తటస్థించిన లజ్జావిషాదములను లెక్కించవలయును; కాంగ్రెసు స్వరాజ్యసంపాదననిమిత్తము శాంతధర్మపద్ధతి నవలంబించేముందు దాని మతనిశ్వాసములలో కలిగిన పరివర్తనములను విమర్శింపవలయును; సత్యాహింసలు శాశ్వతసిద్ధాంతముగా దానిచే అంగీకరింపబడునాటి దాని జీవితపరమావధినిగూర్చి భావన చేయవలయును."

# 2. కాంగ్రెసు తీర్మానముల సింహావలోకనము

## ౧౮౮౫–౧౯౧౪

[౧. ఇండియా కౌన్సిలు, ౨. రాజ్యాంగసంస్కరణములు, ౩. ప్రభుత్వోద్యోగములు, ౪. సైన్యము, ౫. న్యాయశాఖ-న్యాయస్థాన సమస్యలు, ౬. పర్మనెంటు సెటిల్‌మెంటు - పటితీరువ - దారిద్ర్యము - కరవులు, ౭. అటవీశాసనములు, ౮. వాణిజ్యము - పరిశ్రమలు, ౯. స్వదేశీ - బహిష్కరణము - స్వరాజ్యము, ౧౦. సాంఘికప్రాతినిధ్యము, ౧౧. విదేశములలోని భారతీయులు, ౧౨. ఉప్పు, ౧౩. త్రాగుడు - వ్యభిచారము, ౧౪. స్త్రీలు - నిమ్నజాతులు, ౧౫. చిల్లర విషయములు, ౧౬. కాంగ్రెసు నిర్మాణవిధానము.]

### ౧. ఇండియా కౌన్సిలు

కాంగ్రెసు మొట్టమొదటి సమావేశములోనే ఇండియాకౌన్సిలును రద్దుచేయవలసినదని తీర్మానించినది. ఈతీర్మానము తరువాతి రెండుసమావేశములలోను, బలపరుపబడినది. ౧౦ వ కాంగ్రెసులో ఇండియాకౌన్సిలుస్వరూపమును మార్చి భారతరాజ్యాంగకార్యదర్శికి సలహాయీయుటకును కామన్సుసభనుండి యొక స్థాయిసంఘమేర్పాటుచేయబడవలెనని తీర్మానించినది. కాని ఈ తీర్మానమును ప్రతిపాదించిన అర్డ్లీనార్టన్ ఈసూచనను గూర్చి నిస్సందేహమయిన అభిప్రాయము గలిగియున్నట్లు కనుపించదు.

ఆయన " భారతరాజ్యాంగ కార్యదర్శి కౌన్సిలుకు బదులుగా పార్లమెంటు స్థాయిసంఘ మేర్పాటుచేయబడవలెననే సూచన నామట్టుకు నాకేమీ అంతఉత్సాహజనకముగా లేదు. ఎందువల్లననగా, ఆస్థాయిసంఘము కొన్ని సంవత్సరములు గడచేసరికి ఉద్యోగమును విరమించి యెలాగో పార్లమెంటుసభ్యత్వమును సంపాదించుకోగలిగిన ఆంగ్లోఇండియన్ చేతులలో పడవచ్చునని నా యూహ. కాని యే నూతన ప్రయత్నమునకైనను నేను ధైర్యము చేయగలను. ఏక్రొత్తసంఘము నైనను నేను విశ్వసించగలను. ఏక్రొత్తసూచన నయినను నే నంగీకరించగలను. కాని నాకు సంబం

ధముగల యేవిషయమును ఇండియాకౌన్సిలువారి చేతులలో పెట్టి నిర్లక్ష్యముగా నూర కుండజాలను. కామన్సుస్థాయిసంఘమువలన కొన్ని ప్రయోజనములు లేకపోలేదు. ఒకటి, దానికి వ్యయము చాలాతక్కువ. ఇండియాకౌన్సిలువారు ఏటేటా తీసు కొంటూన్న ౧౨౦౦ ల పౌనులు ముందు మన కాదాగా భావించవచ్చును. రెండవది, స్థాయిసంఘసభ్యు లెప్పుడును రహస్యముగాగాక బహిరంగముగానే చర్చించు కొంటూండుటవలన ప్రజల విమర్శనమునకు, చర్చకు, అభిప్రాయ ప్రకట నమునకు కావలసినంత అవకాశము కలుగగలదు. నాకు సంబంధించినంత వర కీతీర్మానము తాత్కాలికము మాత్రమే. కౌన్సిలుకు బదులుగా అంతకంటె మంచి సూచన మరొకటి యేది వచ్చినను, దానిని చర్చించుటకు నేను సిద్ధముగా నున్నాను."

౧౯౧౩ లో జరిగిన కరాచీ కాంగ్రెసులో కౌన్సిలుసంస్కరణమును గూర్చి స్పష్టమైనసూచనలు చేయబడినవి. ఆతీర్మాన మిది:

"నేటిభారతరాజ్యాంగకార్యదర్శికౌన్సిలు రద్దు చేయబడవలె ననీ, అది ఈ క్రిందివిధముగా పునర్నిర్మాణము చేయబడవలెననీ ఈకాంగ్రెసు అభిప్రాయము.

(ఎ) భారతరాజ్యాంగ కార్యదర్శిజీతము ఇంగ్లీషుఅంచనాలనుబట్టి నిర్ణ యింపబడవలెను.

(బి) కౌన్సిలు స్వతంత్రముగాను, చాకచక్యముగాను పనిచేయవలె నన్నచో కొంతమందిసభ్యు లెన్నుకొనబడవలెను; మరికొంతమంది నియమింపబడవలెను.

(సి) కౌన్సిలుసభ్యుల మొత్తము తొమ్మిదికి తక్కువ యుండరాదు.

(డి) మొత్తము సభ్యులలో మూడవవంతుకు తక్కువ కాకుండ ఎన్నికసభ్యు లుండవలయును. వారు సామ్రాజ్య (Imperial) రాష్ట్రీయ శాసనసభల ఎన్నిక సభ్యులలోనుండి ఎన్నుకోబడిన అధికారేతరభారతీయు లయియుండవలయును.

(ఇ) మిగిలిన నామినేటెడ్ సభ్యులు, ఇండియాలో ౧౦ సంవత్సరములకు తక్కువకాకుండ పనిచేసి, ఇండియాను విడిచి రెండుసంవత్సరముల కెక్కువకాలము కాని యుద్యోగస్థులుగా నుండవలయును.

(ఎఫ్) కౌన్సిలు సలహాసంఘముగా నుండవలెనేగాని పరిపాలనాసంఘముగా నుండకూడదు.

(జి) ప్రతిసభ్యుడును అయిదుసంవత్సరములకాల మధికారములో నుండవలెను."

తరువాతి కాంగ్రెసులలో ఈవిషయమునుగూర్చిన తీర్మానము లనేకవిధముల మార్పుచేయబడినవి. దానికి కారణము కౌన్సిలు రద్దుచేయబడవలెననే విశ్వాసము

కాంగ్రెసువాదులలో నశించినంసుకలనకాదు. దానిని రద్దుచేయుటకంటె మార్పుచేయుట తొందరగా సాధ్యము కాగలదని వారియూహ. కాన్సిలు నిష్ప్రయోజన మనే విశ్వాసము వారికి మారనట్లు ౧౯౧౭ లో చేయబడిన కాంగ్రెసు తీర్మానములనుబట్టియే స్పష్టము కాగలదు.

## ౨. రాజ్యాంగసంస్కరణములు

కాంగ్రెసు ప్రారంభదశలో కాని, తరువాత కొన్ని సంవత్సరములవరకును కాని అతివాదత్వము నవలంబించిన దని యెవరును చెప్పజాలరు. మొట్టమొదటికాంగ్రెసులో "సామ్రాజ్యశాసనసభా, రాష్ట్రీయశాసనసభలు కొంతమంది ఎన్నికసభ్యులతో ఇంకను పెద్దవిగా చేయబడవలెను. పశ్చిమోత్తరపరగణాలు, అయోధ్య, పంజాబు రాష్ట్రములకు కూడా శాసనసభలు నిర్మింపబడవలెను. ఆదాయవ్యయపట్టికలు శాసనసభలలో చర్చింపబడవలెను. శాసనసభలకు ప్రశ్నలువేసే అధికార ముండవలయును. శాసనసభలలోని అధికసంఖ్యాకుల యిష్టమునకు వ్యతిరేకముగా, కార్యనిర్వాహక సభ్యులు తమ అధికారమును చెలాయించినప్పుడా అధికసంఖ్యాకసభ్యులు లాంఛనముగాచేసే ప్రతిఘటనములను విచారించేనిమిత్తము కామన్సుసభవారి స్థాయిసంఘ మొకటి యుండవలెను." అని మాత్రమే తీర్మానింపబడినది. అనగా నేడు మన భారతశాసనసభలో అధికసంఖ్యాకుల తీర్మానములకును, కోరికలకును వ్యతిరేకముగా జరుగుతూన్న "వీటో", "సర్టిఫికేషన్" ల వంటి నిరంకుశచర్యలకు ౧౮౮౫ లో శాసనబద్ధమైన సంరక్షణ కోరబడెను.

రెండవ కాంగ్రెస్ కౌన్సిల్‌సంస్కరణమునుగూర్చి యొక ప్రణాళికనే తయారుచేసినది. అది కౌన్సిలుసభ్యులలో నూటికి ౫౦ మంది ఎన్నుకొనబడినవారుండవలెనని నిర్ణయించినది. రాష్ట్రీయశాసనసభలకు మున్సిపాలిటీలు, స్థానికసంఘములు, వాణిజ్యసంఘములు, విశ్వవిద్యాలయములు నియోజకవర్గములుగాను, సామ్రాజ్యశాసనసభకు రాష్ట్రీయశాసనసభలు నియోజకవర్గములుగాను ఆకాంగ్రెస్ నిర్ణయించినది. రెండవకాంగ్రెస్ ఈవిధముగా పరోక్షపుటెన్నికల సిద్ధాంతము నంగీకరించినది. అంతేకాక శాసనసభల నిర్ణయమును అవసరమైనచో తిరస్కరించే అధికారము ప్రభుత్వమువారి కుండవలెననికూడా అది ఒప్పుకొన్నది. కాని రాష్ట్రీయప్రభుత్వముల కార్యనిర్వహణాధికారముపైన ఇండియా ప్రభుత్వమునకును, ఇండియా ప్రభుత్వ కార్యనిర్వహణాధికారముపైన పార్లమెంటుసభాస్థాయిసంఘమునకును అప్పీళ్లను విచారించే అధికార ముండవలెననీ, శాసనసభానిర్ణయములను త్రోసిపుచ్చిన ప్రభుత్వ కార్యవర్గము ఒకనెలరోజులలో తమ సంజాయిషీని తమకు సంబంధించిన పైసంస్థకు

పంపించితీరవలెననికూడా ఆకాంగ్రెసు నిర్ణయించినది. ఈతీర్మానమే ౧౮౯౨ లోని భారతశాసనసభాచట్టము(Indian Councils' Act) అంగీకరింపబడేవరకును ప్రతి కాంగ్రెసులోను పునరుద్ఘోషింపబడినది. తరువాత ఇండియా ప్రభుత్వనిబంధనలను గూర్చి, రాష్ట్రీయప్రభుత్వముల కార్యక్రమమునుగూర్చి కాంగ్రెసు తీవ్రవిమర్శన ములను ప్రారంభించినది.

౧౮౯౨ వ సంవత్సరపు రాజకీయ సంస్కరణములలో శాసనసభా సభ్యుల నెన్నుకొనే అధికారము ప్రజలకు లేదనేసంగతి మొట్టమొదట మేము చెప్పవలసి యున్నది. స్థానికసంస్థలుగాని, తదితర నియోజకవర్గములుగాని శాసనసభ్యుల పేర్లను సూచించవచ్చును. ఈపేర్లను ప్రభుత్వమువా రంగీకరించవచ్చును, లేదా త్రోసివేయ వచ్చును. దీనినే ఎన్నిక అని వాడేవారు. ప్రభుత్వమువారు సాధారణముగా ఆయా నియోజకవర్గముల సూచనలను అంగీకరిస్తానే యుండేవారు. ల్యాన్సుడౌన్ ప్రభువు ప్రభుత్వము పరోక్షముగా జరిగే యెన్నికసిద్ధాంతమునకుగూడ పూర్తిగా వ్యతిరేక ముగా నుండెను. సామ్రాజ్యశాసనసభ (Supreme Council) లో భారతీయులకు నాలుగుస్థానములు ప్రత్యేకింపబడినవి. ఆనాలుగుస్థానములకును బొంబాయి, మద్రాసు, కలకత్తా, పశ్చిమోత్తరరాష్ట్రముల * శాసనసభలలోనున్న అధికారేతరసభ్యుల సిఫా రసు ననుసరించి సభ్యులు నియోగింపబడేవారు.

౧౮౯౨ లో కాంగ్రెసు రాజభక్తిపూర్వకముగా భారతశాసనసభల చట్టము నంగీకరించినది. కాని శాసనసభలకు ప్రతినిధుల నెన్నుకొనే అధికారము ప్రజలకు లేనందుకు చింతించినది. ౧౮౯౩ లో ఆచట్టము నాచరణలోనికి తెచ్చినందుకు ప్రభుత్వమువారి నభినందించి, దానిలో చేయవలసినమార్పులను సూచించినది. పాంచాల మునకు శాసనసభను ప్రసాదించవలసిన దని తీర్మానించినది. ఈ తీర్మానములు తిరిగి ౧౮౯౮, ౧౮౯౭ కాంగ్రెసులలో చేయబడినవి. ౧౮౯౨ సంస్కరణములవలన శాసన సభ్యులకు ప్రశ్నలువేసే అధికారము కలిగినది. ౧౮౯౪ లో ఆప్రశ్నలకుముందు కొంత ఉపోద్ఘాతమును వ్రాయుటకుకూడా సభ్యుల కధికార ముండవలె నని కాంగ్రె సులో కోరబడినది. కాని అది ఇంతవరకును లభించలేదు.

## మార్లే - మింటో సంస్కరణములు

కాంగ్రెస్ ౧౯౦౮ వ సంవత్సరమువరకును తిరిగి సంస్కరణములనుగూర్చిన చర్చ తలపెట్టలేదు. మద్రాసుశాసనసభకును, బీహార్ ఒరిస్సాలతో కూడిన వంగ

---

* ఇప్పటి సంయుక్తరాష్ట్రము లప్పటి ఆగ్రాఅయోధ్యల పశ్చిమోత్తర రాష్ట్రములు.

రాష్ట్రశాసనసభకును ఒక్కొక్కదానికి ౭ ఎన్నికస్థానము లుండగా, బొంబాయికి ౯ మాత్రమే యుండుట చాలా అసంతృప్తికరముగా భావింపబడినది. వి. కృష్ణస్వామి అయ్యర్ ౧౯౦౮ లోని రాజ్యాంగమును తీవ్రముగా విమర్శించినాడు. మాలవ్యాపండితుడు "సంస్కరణాలు బాగుగానే ఉన్నవి గాని శాసనసభ లింకను పెద్దవిగా నుండవలసినది. వాటి కింకను కొన్ని ఎక్కువ అధికారము లుండవలసినది" అన్నాడు. కాని బొంబాయిప్రాతినిధ్యము మాత్రము పైకి కనిపించేదానికన్న కూడా చెడ్డది. ఆరుగురు ఎన్నికసభ్యులలోను ఇద్దరు బొంబాయికరాచీనగరముల యూరపియన్ వాణిజ్యసంఘములనుండీ, మరియిద్దరు డెక్కన్ సర్దారులనుండీ, సింధు జమీందారులనుండీ ఎన్నుకొనబడవలసియుండెను. ౧౯౦౮ లో ప్రతిరాష్ట్రమునుండీ ఇరువురు సభ్యులను కామన్సుసభకు సరాసరి ఎన్నుకొని పంపే అధికారము ప్రజల కుండవలెననీ, దేశములోని శాసనసభ లింకను పెద్దవి చేయబడవలెననీ, శాసనసభాసభ్యుల కార్థిక విషయములలో వోటిచ్చే అధికార ముండవలెననీ, గవర్నమెంటుకు శాసనసభతీర్మానమును రద్దుచేయుట కధికార ముండవచ్చుననీ తీర్మానింపబడినది. ఇండియాలోని ప్రభుత్వ కార్యనిర్వాహకసభలకును, భారత రాజ్యాంగ కార్యదర్శి కౌన్సిలునును భారతీయులు నియమింపబడవలె నని కోరబడినది. ౧౯౦౬ కాంగ్రెసులో కూడ ఈ కోరికలే కోరబడినవి. కాని "బ్రిటిష్ అధినివేశ రాజ్యములలో గల స్వపరిపాలనమువంటి పరిపాలనాపద్ధతి భారతదేశములో కూడ ప్రవేశపెట్టబడవలె నని ఈ కాంగ్రెస్ అభిప్రాయము" అనే కోరిక మాత్రము క్రొత్తగా చేర్చబడినది. ౧౯౦౭ లో అప్పటికి రానున్న సంస్కరణములను గూర్చి కాంగ్రెస్ సంతోషమును వెల్లడించినది. రాబోయే సంస్కరణము లుదారాశయములతో నిండియుంట వని అది ఆశించినది. కాని ఆశాభంగము కలిగినది. ౧౯౦౯ లోని రాజ్యాంగ చట్టము క్రింద చేయబడిన నిబంధనలు అంతకుపూర్వము మార్లేసూచించిన నిబంధనలకంటెకూడా సంకుచితములుగా కనుపడినవి. ఈ సందర్భములో మన కిటీవల జరిగిన సంఘటనలు కొన్ని జ్ఞాపకము రాకతప్పవు. మొట్టమొదట ఇండియాలో ఇర్విను ప్రభువు చేసిన ప్రకటనలు ఔదార్యముగా కనుపడినవి. తరువాత ౧౯౩౦-౩౩ సంవత్సరముల రౌండుటేబిలు సభలలో ఆ ధోరణి కొంత తగ్గినది. రౌండుటేబిలు సభల నిర్ణయములు వైట్ పేపరులోనికి వచ్చేసరికి ఇంకా కొంత సంకుచితమైనవి. వైట్ పేపరు ఇండియాబిల్లయ్యేసరికి మరికొంత కుంచింపబడినది. ఇండియాబిల్లు చట్టమయ్యేసరికి ఇంకను సంగ్రహపరుపబడినది.

మొదటినుండి చివరవరకును ఇంతేకథ. వాగ్దానములు మధురమైన భాషలో వేలికగా చేయబడుతవి. వాటిని చెలించేటందుకు చాలాకాలము పడుతుంది. ఈకాల

పరిణామములో వాటిస్వరూపమే పూర్తిగా మారిపోయెను. ౧౯౦౯ కాంగ్రెసులో ఇండియాప్రభుత్వమువారినిబంధనలును, స్థానిక ప్రభుత్వములవారి చర్యలును సంకుచితములుగా నున్నవని సూచింపబడినది. పాంచాలరాష్ట్రమునకు సొంతశాసనసభ లేకపోవడమేగాక, ఆరాష్ట్రప్రజలకు వైస్రాయికౌన్సిలులోగాని, మరియేయితర రాష్ట్రీయశాసనసభలలోగాని ప్రాతినిధ్యము లేకపోవుట నాకాంగ్రెసు విమర్శించినది. ౧౯౧౦ లో పంజాబుశాసనసభలోని సభ్యులసంఖ్య చాలినంత లేదనీ, అందులో ఎన్నికసభ్యులసంఖ్య మరీతక్కువనీ, మహమ్మదీయేతరులు లేనేలేరనీ కాంగ్రెస్ పంజాబుశాసనసభానిబంధనలను నిరసించెను. ఈకాంగ్రెస్లోనే బీరారు, మధ్యరాష్ట్రముల కొకశాసనసభ నిర్మింపబడవలెననీ, బీరారు ప్రత్యేకరాష్ట్రముగా చేయుబడవలెననీ కోరబడినది. ఈసందర్భములో ౧౦ సంవత్సరములు దేశములో పనిచేసిన మింటోమార్లేసంస్కరణములను గూర్చి సంగ్రహముగా తెలుసుకోవడము మంచిది. భారతశాసనసభలో ౬౦ మంది సభ్యులుండిరి. అందులో ౨౭ మంది ఎన్నికసభ్యులు. తక్కిన 33 మందిలో ౨౮ కి మించకుండ అధికారసభ్యులుండిరి. కొన్ని ప్రత్యేకసంఘములకు ప్రతినిధులుగా ముగ్గురధికారేతరులను వైస్రాయి నియమించెను. ప్రదేశములకుగాక ప్రయోజనములకు ప్రతినిధులుగా మరియిద్దరను నియమించుటకు వైస్రాయి అధికార ముంచుకొనెను. ఎన్నికస్థానములుగూడ కొన్ని ప్రత్యేకనియోజకవర్గములమధ్య విభజింపబడినవి. ౭ రాష్ట్రములలో భూస్వాములును, ౫ రాష్ట్రములలో మహమ్మదీయులును, ఒకరాష్ట్రములో మహమ్మదీయభూస్వాములును, (ఎన్నిక విడిచి ఎన్నికలోమాత్రమే) రెండు వాణిజ్యసంఘములును ఎన్నికస్థానములకు నియోజకవర్గములు. ఇక మిగిలిన ఎన్నికస్థానములు తొమ్మిది రాష్ట్రీయశాసనసభలలోని అధికారేతరసభ్యుల ఎన్నికవలన పూర్తిచేయబడినవి. " గవర్నరుజనరల్ సభ దాని శాసనాధికారములోగాని, కార్యనిర్వహణాధికారములోగాని నిరంతరమును, యేవిధమైన అభ్యంతరమును లేకుండ మహాఘనతవహించిన రాజుగారి ప్రభుత్వమునెడలను, పార్లమెంటునెడలను అది నిర్వర్తించవలసిన రాజ్యాంగధర్మమును నిర్వర్తించ శక్తిగలిగినదిగానే నిర్మింపబడవలెను. " అని మార్లే ప్రభువు నిష్కపటముగానే చెప్పినాడు. సంస్కరణములనుగూర్చికూడ మార్లే " ఈ సంస్కరణములే ఇండియాలో పార్లమెంటరీపద్ధతి స్థాపింపబడుటమునకు కారణభూతము లని చెప్పబడేయెడల నేనుమాత్రమందుకు బాధ్యత వహించజాలను. " అని చెప్పెను. మాంట్ఫర్డునివేదికలో మాంటేగ్, చెమ్సుఫర్డు లీసంస్కరణములనుగూర్చి చెప్పిన ఈదిగువమాట లింతకంటెకూడ ఎక్కువ విలువగలవి. " అవి భారతీయులకు నేడు సంతృప్తికరముగా లేవు. ఇంకను అవి అట్లే యున్నయెడల భారతీయసభ్యులకును, గవర్నమెంటునకును మనస్పర్ధలు గలుగును. బాధ్యతచే నిరోధింపబడని విశృంఖలవిమర్శనముల కవి కారణము లగును. "

పార్లమెంటు సంస్కరణములతో మరియొకరంగము ప్రారంభమైనది. ౧౯౦౮ లో ఇండియాకౌన్సిలు కిద్దరు భారతీయులు నియమింపబడిరి. తరువాత ముగ్గురుకూడ నియమింపబడిరి. ౧౯౦౯ లో గవర్నరు జనరల్ కార్యనిర్వాహకసంఘమున కొక భారతీయసభ్యుడు నియమింపబడెను. ౧౯౧౦ లో మద్రాసు, బొంబాయి ప్రభుత్వ కార్యసంఘములకు చెరియొక భారతీయసభ్యుడు నియమింపబడెను. వంగరాష్ట్రములో నా సంవత్సరముననే ఒక కార్యనిర్వాహకసంఘ మేర్పాటుచేయబడి, అందులో నొక భారతీయసభ్యుడు నియమింపబడెను. తరువాత ఆరాష్ట్రము కార్యనిర్వాహకవర్గముతో కూడిన గవర్నరు క్రింద ఒకరాజధానిగా చేయబడినది. ౧౯౧౨ లో బీహారు, ఒరిస్సాలు ప్రత్యేక రాష్ట్రముగా చేయబడి, దాని పరిపాలనము నిమిత్తమొక లెఫ్టినెంటుగవర్న రేర్పాటు చేయబడెను. ఆగవర్నరుకౌన్సిలులో ఒక భారతీయసభ్యుడు నియమింపబడెను. సంయుక్తరాష్ట్రములలో కార్యనిర్వాహకసంఘము నియమింపబడుటకు చేయబడిన ప్రయత్నము లప్పటి కింకను ఫలప్రదములు కాలేదు.

తరువాతి సంస్కరణములు మొదటిసంస్కరణములకంటె యెక్కువ సందిగ్ధ పరిస్థితులలో ప్రవేశపెట్టబడినవి. ౧౯౧౪ జూలైలో యుద్ధము ప్రారంభమైనదిమొదలు ౧౯౧౯ డిసెంబరు ౨౪ తేదీని రాజకీయఖైదీ లందరును విడుదలచేయబడేటంతవరకును జరిగిన సంఘటనలు చాలా ప్రాముఖ్యమైనవి. అవి వేరొక అధ్యాయములో నుదాహరింపబడినవి. కడచినకాలములోవలెనే ఈకాలములోకూడ కాంగ్రెసు రాజ్యాంగసంస్కరణములనుగూర్చి తీర్మానములు చేసినది. ఆతీర్మానములును, ప్రభుత్వమువారొసంగిన సంస్కరణములును ఇచ్చట సంగ్రహముగా నుదాహరింపబడినవి. ౧౯౧౪ కాంగ్రెస్ సంస్కరణప్రణాళికను తయారుచేసినవిషయమును, వలసరాష్ట్రములలోని స్వతంత్ర పరిపాలనమువంటి పరిపాలనమును భారతదేశమున కాదర్శముగా గ్రహించిన విషయమును మనకు తెలుసును. అదే అప్పటి కాంగ్రెసుకు ప్రధానసూత్రము (౧ వ నిబంధన).

ఇండియా గవర్నమెంటుకు మొదటి లామెంబరయిన సర్ యస్. పి. సిన్హా అధ్యక్షతక్రింద ౧౯౧౫ లో బొంబాయిలో కాంగ్రెస్ జరిగినది. ఆకాంగ్రెస్ తీర్మానానుసారముగా అఖిలభారతకాంగ్రెస్‌సంఘమువారు అఖిలభారత ముస్లింలీగు వారితో సంప్రతించి ఒక రాజ్యాంగప్రణాళికను తయారుచేసిరి. ౧౯౧౬ లో జరిగిన లక్నోకాంగ్రెసు ఆప్రణాళికను అంగీకరించినది. ఆకాంగ్రెస్‌లో "భారతదేశము పరాధీనదేశముగా గాక, స్వపరిపాలన మనుభవిస్తూన్న అధినివేశరాజ్యములతో పాటు సామ్రాజ్యములో సమానభాగస్వామిగా చేయబడవలె" నని స్పష్టముగా కాంగ్రెస్ యొక్క స్వపరిపాలనాదర్శము నిర్వచింపబడినది. అప్పటి ప్రణాళికప్రకారము

రాష్ట్రీయశాసనసభలలో ౪/౫ వంతు ఎన్నికసభ్యులును, ౧/౫ వంతు నియోజితసభ్యు లును ఉండేటట్లు నిర్ణయింపబడినది. ఎన్నికలు సరాసరి జరుపబడవలెనదే. నియోజక వర్గములు సాధ్యమైనంతవిశాలములుగా చేయబడినవి. ఎన్నికలలో రాదగిన అల్ప సంఖ్యాకులనిమిత్తము ప్రత్యేకసదుపాయము లేర్పాటు చేయబడినవి. మహమ్మదీయుల క్రిందివిధముగా స్థానములు ప్రత్యేకింపబడినవి. పంచాలము - ఎన్నికసభ్యులలో ౫౦%, సంయుక్తరాష్ట్రములు ౩౦%, వంగరాష్ట్రము ౪౦%, బీహారు ౨౫%, మధ్య రాష్ట్రములు ౧౫%, మద్రాసు ౧౫%, బొంబాయి ౧/౩. ఇవిగాక వారు ప్రత్యేక ప్రయోజనములకు సంబంధించిన స్థానములకు తప్ప తదితర స్థానములకు ఇంపీరియల్ శాసనసభలోగాని, తదితరశాసనసభలలోగాని పోటీ చేయరాదు. మతసంబంధమైన చట్టముకాని, చట్టములో శెక్షనుకాని, తీర్మానముకాని యేశాసనసభలో నైనను, ఆసభలో ఆతీర్మానమునకుగాని, ఆచట్టమునకుగాని, చట్టములోని శెక్షనుకుగాని సంబంధించిన మతస్థులగు సభ్యులలో ౩/౪ వంతు సభ్యులు ముందు అంగీకరిస్తేనే గాని చర్చకు రాకూడదనీ, చర్చకు వచ్చినతరువాత ఆమతస్థులలో అధికసంఖ్యాకులగు సభ్యుల వోట్లవలననే ఫలితము నిర్ణయింప బడవలె ననీకూడ ఆప్రణాళికలో నొక నిబంధన కలదు. ఇంపీరియల్ కౌన్సి లులో ౪/౫ వంతు ఎన్నికసభ్యు లుండవలెననీ, భారతీయులైన ఎన్నిక సభ్యులలో ౧/౩ వంతు మహమ్మదీయసభ్యు లుండవలెననీ, ఈమహమ్మదీయసభ్యులు ప్రత్యేక మహమ్మదీయ నియోజకవర్గములనుండి, రాష్ట్రములవారీగా, రాష్ట్రశాసన సభలలో ప్రత్యేక మహమ్మదీయ నియోజకవర్గములనుండి ప్రతినిధులయిన సభ్యుల దామాషానుబట్టి ఎన్నుకొనబడవలె ననీకూడ లక్నోకాంగ్రెసులో నంగీకరింపబడినది. లక్నోలో అంగీకరింపబడిన ఈహిందూమహమ్మదీయసమాఖ్యయే పూర్తిగా మాంటు ఫర్డుసంస్కరణములలో చేర్చబడినది.

లక్నోప్రణాళికలో ఇంకను అనేకసంగతులు కలవు. వాటితో మన కిప్పుడు ప్రసక్తి లేదు. లక్నోకాంగ్రెసు ప్రణాళికను తయారుచేసి అంతటితో ఊరకొనక, దేశములో దీనినిగూర్చి ప్రచారముచేసే నిమిత్త మొక కార్యనిర్వాహకవర్గము నేర్పాటు చేసినది. కాంగ్రెస్‌కార్యదర్శు లీప్రణాళికనుబట్టి ఇండియాప్రభుత్వ చట్టములో తగినమార్పులను సూచించేటందు కిటీవల హైకోర్టుజడ్జీపదవి నధిష్ఠించిన యస్. వరదా చారిగారివంటి గొప్పలాయరును నియమించిరి. తరువాత బెసెంటుగారిచే నడుపబడిన హోమురూలాందోళనము, ఆమెప్రవాసశిక్ష, కాంగ్రెస్ మస్లిములీగులు రెండును తల పెట్టిన సాత్వికనిరోధము, మెసొపొటేమియాదిక్కునుగూర్చి మాంటేగ్ ఉపన్యా సము, అప్పటి భారతరాజ్యాంగకార్యదర్శి సర్ ఆస్టెన్ ఛాంబర్లేన్ రాజీనామా,

ఆపదవికి మాంటేగ్ నియామకము, ౧౯౧౭ ఆగస్టు ౨౦ వ తేదీని భారత భావి రాజ్యాంగమునుగూర్చి చేయబడిన ప్రకటనము, ఇండియాకు మాంటేగ్ రాక, బెసెంటు విడుదల, కాంగ్రెస్ అధ్యక్షపదవి కామె యెన్నిక - ఈ అన్నీ ౧౯౧౭ లో జరిగిన కలకత్తా కాంగ్రెసుకు మూలవిషయములు కాబట్టి యిక్కడ వరుసగా నుదాహరింపబడినవి; రెండవభాగములో వివరములు వ్రాయబడినవి.

ఇండియాకు బాధ్యతాయుతపరిపాలనమును ప్రసాదించడమే ప్రభుత్వోద్దేశమని చేయబడిన ప్రకటనమునకు ౧౯౧౭ లో జరిగిన కలకత్తా కాంగ్రెస్ కృతజ్ఞతతో సంతృప్తిని వెల్లడించినది. ఈ యుద్దేశము పూర్తిగా నిర్వర్తింపబడుటకు తగిన కాలపరిమితి రాజ్యాంగచట్టములోనే నిర్ణయింపబడవలెనని ఆకాంగ్రెస్ కోరినది. ఈ యుద్దేశనిర్వహణమునకు మొట్టమొదటిసూచనగా కాంగ్రెసులీగుప్రణాళిక వచ్చే రాజ్యాంగచట్టములో ముందు ప్రవేశపెట్టబడవలె నని కలకత్తా కాంగ్రెస్ నిర్ణయించినది. ఈసందర్భమున స్వయంవిస్తీర్ణత కనుగుణముగ ఈ రాజ్యాంగప్రణాళికను తయారుచేసిన కాంగ్రెస్ మేధాశక్తిని పాఠకమహాశయులు గమనింతురుగాక.

మాంటేగ్ ౧౯౧౭ నవంబరునెలలో ఇండియాను దర్శించెను. మాంట్ ఫర్డు నివేదిక ౧౯౧౮ జూలైలోనే ప్రచురించబడెను. అది ౧౯౧౮ సెప్టెంబరు నెలలో, బొంబాయి ప్రత్యేకకాంగ్రెసులో హసన్ ఇమామ్ అధ్యక్షతక్రింద చర్చించబడెను. మాంటుఫర్డునివేదికలోని పొడుగైన ప్రణాళికమూలమున కాంగ్రెస్‌లీగుప్రణాళిక అస్పృశ్యమయ్యెను. మాంట్ ఫర్డుస్కీముకు మూలసూత్రము ద్వంద్వపరిపాలనము. కేంద్రములో స్టేట్ కౌన్సిలు అనేపేరుతో ఒక పైసభ నిర్మింపబడుటకును, రాష్ట్రములలో పెద్దపెద్ద కమిటీలు నియమింపబడుటకును ఆస్కీములో నుద్దేశింపబడినది. ఇవి ప్రజాప్రతినిధిసభ లంగీకరించనివిషయములలో గవర్నరుజెనరలుకును, గవర్నరులకును సహాయము చేసేనిమిత్త మేర్పాటుచేయబడినవి. బొంబాయి ప్రత్యేకకాంగ్రెసు "కౌన్సిలు ఆఫ్ స్టేటు ఉండకూడదు. ఒకవేళ స్టేటుకౌన్సి లుండకతప్పనిసరియే యైనయెడల రాష్ట్రములలోవలెనే కేంద్రములోకూడ ప్రభుత్వవిషయములు (Reserved Subjects), ప్రజాయత్తవిషయములు (Transferred Subjects) అనేపద్ధతి యేర్పాటుచేయబడవలెను. స్టేటుకౌన్సిలులో అర్ధము సగముమందిసభ్యు లెన్నికసభ్యులుగా నుండవలయును. సర్టిఫికేషన్ పద్ధతి ప్రభుత్వవిషయములకే (Reserved Subjects) వర్తించవలెను." అని తీర్మానించినది. అనగా కేంద్రములోకూడ ద్వంద్వపరిపాలనము పెట్టేమరతుతో ద్వంద్వపరిపాలనాసిద్ధాంతమును, స్టేటుకౌన్సిలునిర్మాణమును బొం

బొంబాయి ప్రత్యేకకాంగ్రె సంగీకరించినది. ఈరెండు శాసనసభల ప్రణాళికకంటె కాంగ్రెస్‌లీగ్ ప్రణాళికయే స్వపరిపాలనాదర్శమునకు దగ్గరగా నున్నది. రాష్ట్రములలోను, కేంద్రములోనుకూడ పైశాసనసభలు సృష్టింపబడేయెడల ప్రజా ప్రతినిధిసభలు త్రోసివేసినతీర్మానములను గవర్నరుజనరలుగాని, గవర్నరులుగాని పునఃద్ధరించి ప్రజల అయిష్టతకు పాల్పడవలసిన అవసరము లేకుండ, పైసభలలోనే ఆపని తేలికగా నెరవేర్చగలదు. అందువలన పైసభ లుండుట నిరంకుశప్రభుత్వము వారి కెక్కువ అనుకూలము.

ప్రభుత్వమువారు మాంటుఫర్డుస్కీములో ఈయబడినది లాగివేసినారే కాని, కాంగ్రెసు కోరినదానిని ఈయలేదు. బొంబాయి ప్రత్యేక కాంగ్రెసు మాంటేగుకు సంపూర్ణవిజయసూచకము. అది మాంటుఫర్డుప్రణాళిక మొత్తముమీద "అసంతృప్తి కరము", "ఆశాభంగకరము" అని తీర్మానించియుండవచ్చును; క్రిందటి రెండుకాంగ్రెసుల తీర్మానములను తిరిగీ అది బలపరచియుండవచ్చును; వాక్స్వాతంత్ర్య, పత్రికా స్వాతంత్ర్య, సంఘస్వాతంత్ర్యములవంటి ప్రజల ప్రధానహక్కులు సంరక్షింపబడవలె నని అది నిర్ణయించియుండవచ్చును; ఇన్నిపనులు చేసినప్పటికిని ఆకాంగ్రెస్ మాంటేగుకు విజయసూచక మయినదనే విషయ మంగీకరించక తప్పదు. ఎందువల్ల ననగా ౧౯౧౮ లో మాలవ్యాపండితుని అధ్యక్షతక్రింద జరిగిన ఢిల్లీకాంగ్రెస్ రాష్ట్రములలో సంపూర్ణ స్వపరిపాలనము కోరినది కాని ద్వంద్వపరిపాలనము కాదు. ఢిల్లీలో విదేశవ్యవహారములు, సైన్యము, నౌకాదళములును ప్రభుత్వవిషయములుగా నంగీకరింపబడుటచే, కేంద్రప్రభుత్వములోమాత్రము ద్వంద్వపరిపాలనమునకు కాంగ్రె సొప్పుకొనక తప్పినదికాదు. ఇక స్టేటుకౌన్సిలు సభ్యుల మొత్తములో సగముమంది ఎన్నికసభ్యులుండవలయు నని బొంబాయిప్రత్యేకకాంగ్రెస్ చేసినతీర్మానమును తిరిగీ ఢిల్లీకాంగ్రె సంగీకరించినది. ౧౧-౧౧ ౧౯౧౮ తేదీని శాంతిప్రకటనమువలన యుద్ధము ముగిసినది. ప్రెసిడెంటు విల్సను, లాయడుజార్జి మొదలగు బ్రిటిష్‌రాజకీయధురంధరులు చేసిన ప్రకటనలనుబట్టి స్వయంనిర్ణయసూత్రము భారతదేశమునకు వర్తింపచేయబడవలెననీ, నిర్బంధశాసనములు రద్దుచేయబడవలెననీ కాంగ్రెస్ కోర ప్రారంభించినది. కాని కాంగ్రెసుకు కష్టదినములు ప్రారంభమైనవి. తరువాతి కాంగ్రెస్ అమృతసరములో సమావేశమయ్యేలోపల రౌలట్ చట్టము, సత్యాగ్రహోద్యమము, వీరంగమ్, ఢిల్లీ కాల్పులు, జలియన్‌వాలాబాగ్ దుఃంతము, పంజాబుసైనికప్రభుత్వము, ఇండియా గవర్నమెంటునుండి సర్ శంకరనాయర్ రాజీనామా, హంటరుకమిటీ నియామకము, దాని అపజయము మొదలగు ఈచరిత్రాంశములు కాంగ్రెస్ దృష్టి నాకర్షించి, భారతీయుల హృదయములను వికలపరచినవి.

## 3. ప్రభుత్వోద్యోగములు

సర్వీస్ పరీక్షలిండియాలోను, ఇంగ్లాండులోనుకూడ యేకకాలమున జరుప బడవలెనను తీర్మానము ౧౮౮౫ లో మొదటి కాంగ్రెసులోనే చేయబడినది. కాని ఈ అభిప్రాయము మాత్ర మంతకుపూర్వము పదునెనిమిదేండ్లనుండీ భారతనాయకు లలో వ్యాపించియేయున్నది. ఇండియా దేశమునకు న్యాయము కలుగచేయవలె నన్నచో, పార్లమెంటువారిండియా దేశమునకు చేసిన వాగ్దానములు చెల్లించుకొనవలె నన్నచో సర్వీస్ పరీక్షలిండియాలోను, ఇంగ్లాండులోను ఏకకాలమున జరుపబడ వలెనని ఇండియా కౌన్సిలు ఉపసంఘమువారు ౧౮౬౧ లోనే సిఫారసు చేసియుం డిరి. వారేసందర్భములో నీసిఫారసునుచేసి రనేవిషయము మన కిక్కడ అవసరము లేదు. ౧౮౯౩ జూన్ నెలలో ఆపరీక్ష లేకకాలమున జరుపబడవలెనని కామన్సుసభ వారు చేసినతీర్మానమునకు హిందూదేశము పొంగి బోర్లపడ్డది. మరుసంవత్సరము ప్రభుత్వమువారాతీర్మానము నాచరణలో పెట్టరాదని చేసిన నిర్ణయమున కిండియా క్రుంగిపోయినది. ఇండియాలోని పబ్లిక్ సర్వీసెస్ (ప్రభుత్వోద్యోగముల) నుగూర్చి విచారించుట కేర్పాటుచేయబడిన రాయల్ కమిషన్ వారియెదుట భారతీయులు చెప్పిన సాక్ష్యములనుబట్టి ఏకకాలపుపరీక్షలపద్ధతి అంగీకరింపబడనియెడల ఇండియా కన్యాయము జరుగు ననేవిషయము స్పష్టముగా ఋజువైనది. ఆ రాయల్ కమిషన్ వారీసిద్ధాంతము నంగీకరింపకపోవుటచేతనే వారి అధికసంఖ్యాకుల నివేదికను భార తీయులు నిరాకరించిరి.

ఈ విషయమునుగూర్చి ఇంకను వివరముగా తెలుసుకొన ప్రయత్నింతుము గాక. రెండవకాంగ్రెసులో దీని విచారణకొరకొకయుపసంఘ మేర్పాటుచేయ బడెను. ఆ యుపసంఘమువారు, ఇండియాలో పరీక్ష లేర్పాటు చేయబడవలెననీ, సివిల్ సర్వీసుపరీక్షలలో నుత్తీర్ణులు కాని మొట్టమొదటి యుద్యోగస్థులు సమర్థు లని పేరుబడితేనేతప్ప సివిల్ సర్వీసులో నుండరాదనీ సిఫారసుచేసిరి. ఆకాలములో కొం దరు యువకులు సరాసరి డిప్యూటీకలెక్టరులుగా తీసికొనబడే ఆచార ముండెను. ఆకాలపు రాజకీయవేత్తలదృష్టి నాకర్షించగలిగినవి శాసనసభల తరువాత ప్రభుత్వో ద్యోగములే. కాబట్టి కాంగ్రెసు పుట్టినప్పటినుండీ ఈవిషయము చర్చింపబడుతూనే యున్నది. నాలుగవ కాంగ్రెసునాటి కిది కొంత ఫలప్రదమైనది. పబ్లిక్ సర్వీస్ కమి షనువారు చూపిన కొన్ని సౌకర్యములకు నాలుగవ కాంగ్రెసు సంతోషించినది. కాని ఇంకను చాలవని తీర్మానించినది. కాంగ్రెసువారు కోరినట్లు ఐ. సి. యస్. విద్యార్థుల వయఃపరిమితి ౧౯ నుండి ౨౩ కు హెచ్చింపబడినది. “ కాని, ఇదివరకు

పరీక్షలలో నుత్తీర్ణులుకాక కేవలము చట్టమునుబట్టి సివిల్ సర్వీసులో నున్నయుద్యో గస్థు లందులో నుండనైనను ఉండవలెను; లేదా రాష్ట్రీయోద్యోగములకైనను పోవలెను. " అని ప్రభుత్వమువారు చేసిన ఉత్తరువులు కాంగ్రెసువాదుల కెక్కువ అసంతృప్తిని గలిగించినవి. రాష్ట్రీయోద్యోగులలో నున్నవారందరును ఉన్నత కార్య నిర్వహణాధికారములనుండి నిషేధింపబడుటయే ఈ అసంతృప్తికి కారణము. ౫వ కాంగ్రెసులో ఈ ప్రభుత్వమువారి యుత్తరువులు ౧౮౩౩ శాసనమునకును, ౧౮౫౮ లోని రాణీగారి ప్రకటనమునకును విరుద్ధములుగా నున్నవని గోఖ్లే తీవ్రముగా విమర్శించెను. అప్పటికి ప్రభుత్వోద్యోగములు మూడుతరగతులుగా నున్నవి. అఖిల భారతోద్యోగములు మొదటితరగతికి చెందినవి. ఇందుకు పోటీపరీక్ష లేర్పాటు చేయబడినవి. అందులో నుత్తీర్ణులైనవారే ఆ యుద్యోగముల కర్హులు. రెండవ తరగతి ౧౮౬౧ లో చేయబడిన చట్టముప్రకారము లభించేయుద్యోగములు. ఈ యుద్యోగములలో ౬ వ వంతు భారతీయులకు లభించితీరవలె నని ఒడంబడిక. మూడవతరగతి కిట్టి ఒడంబడిక యేమీ లేదు. కాని అవి అన్నీ భారతీయులవే. కాని ఒక అన్యాయము జరిగినది. రెండవతరగతియుద్యోగముల మొత్తము ౯౮౧ లోను భారతీయులకు న్యాయముగా ఆరవవంతు ౧౫౮ రావలసియుండగా మూడవతరగతికి చెందిన ఉద్యోగములు ౧౦౫ మాత్రమే వారి కీయబడినవి. ఈ మూడవతరగతికి చెందిన యుద్యోగములకే తరువాత రాష్ట్రీయోద్యోగము లని పేరుపెట్టబడినది. కమిషనరులు ౧౦౮ ఉద్యోగములు భారతీయుల కిచ్చితీరవలెనని వ్రాయగా భారతరాజ్యాంగకార్యదర్శి ఈయవచ్చు నని వ్రాసినాడు. ౧౮౭౦ లో ఈమార్పులు చట్టబద్ధము చేయబడినవి. భారతీయులకు న్యాయ్యముగా రావలసిన ౧౫౮ యుద్యోగముల బదులు ౧౦౮ ఉద్యోగములుమాత్రమే ప్రభుత్వమువారీయ నిశ్చయించుకొనిరి. కాని ౧౮౯౨ లో ౯౩ ఉద్యోగములుమాత్రమే నిజముగా భారతీయుల కీయబడినవి.

తరువాత వ్యవహారములు మరీ చిక్కులలో పడినవి. ౧౮౯౮ సంవత్సరములో రెండవ తరగతికి చెందిన ఒడంబడిక యుద్యోగములందు ఒక కనీస సంఖ్యగల యూరోపియను లుండితీరవలె నని ఇండియా గవర్నమెంటువారు తీర్మానించిరి. భారతరాజ్యాంగ కార్యదర్శి దాని నంగీకరించెను. అంతేకాక కామన్సుసభవారు ౨-౬-౧౮౯౩ తేదీని సర్వీసుపరీక్ష లేకకాలమున ఇండియాలో జరిపే యేర్పాటు త్వరలో చేయబడవలె నని అంగీకరించిన తీర్మానమును భారతరాజ్యాంగ కార్యదర్శి త్రోసిపుచ్చెను. ఒకప్రక్క భారతీయులు సివిల్, మెడికల్, పోలీసు, ఇంజనీరింగ్, టెలిగ్రాఫ్, ఫారెస్టు, అక్కౌంట్సు ఉద్యోగములకు సంబంధించిన పరీక్ష లేక కాలమున ఇండియాలో జరుపబడవలె నని ఆందోళన చేయుచుండగా, రెండవప్రక్క

౧౮౯౫ సంవత్సరములో, విద్యాశాఖయందు వారికి యూరపియనులతో సమాన ప్రతిపత్తిలో సమాన జీతములు పుచ్చుకొనే అంతకుపూర్వమున్న అధికారము తీసివేయబడినది. ప్రభుత్వమువారు "ఇకముందు విద్యాశాఖలో ప్రవేశించే భారతీయు లిండియాలో రాష్ట్రీయోద్యోగములందే నియమింపబడెదరు" అని యొక తీర్మానమును ప్రకటించిరి. ఇందువలన విద్యాశాఖలోగూడ భారతీయుల కొక క్రొత్త అన్యాయము జరిగినది. విద్యాశాఖాపునర్నిర్మాణప్రణాళిక అనే పేరుతో ప్రభుత్వమువారు భారతీయులను ఉన్నతోద్యోగములనుండి తొలగించిరి. ఆ ప్రణాళిక ప్రకారము విద్యాశాఖలో రెండుతరగతుల యుద్యోగములు కలవు. ఉన్నతతరగతియుద్యోగములు ఐ. ఇ. యస్. యుద్యోగములు. తక్కువ తరగతి యుద్యోగములు పి. ఇ. యస్. యుద్యోగములు. ఐ. ఇ. యస్. యుద్యోగుల నియామక మింగ్లండులో జరుగును. పి. ఇ. యస్. యుద్యోగుల నియామక మిండియాలోనే జరుగును. ౧౮౮౦ కి ముందున్న ఉన్నతోద్యోగులు యూరపియనులు కానీ, భారతీయులుకానీ సమాన జీతములనే పుచ్చుకొనిరి. యూరపియనులును, భారతీయులునుకూడ రు. ౫౦౦ ల జీతముతో ప్రారంభించిరి. ౧౮౮౦ లో భారతీయుల జీతము రు. ౩౩౩ లకును, ౧౮౯౮ లో రు. ౨౫౦ లకును తగ్గించబడినది. ఇంగ్లీషు విశ్వవిద్యాలయములలో పట్టభద్రులైన భారతీయులవిషయములోకూడ ఇంతే జరిగినది. భారతీయు డెంతకాల ముద్యోగముచేసినప్పటికీ ఆయన ౧౮౯౬ లో పుచ్చుకోగలిగిన అత్యధికజీతము రు. ౭౦౦ మాత్రమే. ఆంగ్లేయుడో ౧౦ సంవత్సరములలో రు. ౧౦౦౦ లు పుచ్చుకొనగలడు. ఈ క్రొత్తప్రణాళిక ప్రకారము ఇంగ్లీషువారికోసము ప్రత్యేకింపబడిన కొన్నికళాశాలల ప్రధానాచార్యపదవులకు భారతీయులు నిషేధింపబడిరి. ఈమార్పు లన్నీ కేవలము రాణీగారి షష్టిపూర్త్యుత్సవసందర్భముననే (౧౮౯౭) ఆచరణలోకి రావడము మరీ విచారకరమైన విషయ మని ఆనందమోహనబో సాకప్పుడు తన అభిప్రాయమును వెల్లడించెను. ఈవిధముగా కాంగ్రెస్ ఉద్యమము బలమైనకొలదీ ప్రభుత్వనిరంకుశత్వము వెల్లడియైనది.

౧౮౯౬, ౧౮౯౭ సంవత్సరములలో బొంబాయి, మద్రాసు రాష్ట్రప్రభుత్వముల కార్యనిర్వాహకవర్గములలో భారతీయులు నియమింపబడవలెనని కాంగ్రెస్ కోరినది. ఈ కాంగ్రెసులలోను, తరువాతి కాంగ్రెసులలోనుకూడ సివిల్ మెడికల్ సర్వీసులను గూర్చి కొంతచర్చ జరిగినది. ౧౯౦౦ లో పి. డబ్ల్యు. డి., రైల్వే, నల్లమందు కస్టమ్సు, టెలిగ్రాఫ్ శాఖలలోని ఉన్నతోద్యోగములు భారతీయుల కీయకపోవుటను గూర్చి కాంగ్రెస్ విచారమును వెల్లడించినది. తరువాత ఇండియన్ సివిల్ మెడికల్

ఉద్యోగములు మిలిటరీ మొదలైనట్టి ఉద్యోగములయందు వివక్షతాగానుండుటనుగూర్చి కొంత ఆందోళనము చేసినది. తరువాతి కాంగ్రెసులలో ఈపాతవిషయములను గూర్చియే పదేపదే తీర్మానములు చేయబడినవి.

## ౭. సైన్యము

౧౮౮౫ నుండి ౧౯౧౪ వరకును, కడచిన 30 సంవత్సరములలో కాంగ్రెస్ దాదాపు రెండువందల విషయములనుగూర్చి చర్చించినది. ఈ విషయము లన్నిటిలోకీ కాంగ్రెసువారుల కెక్కువ అభిరుచిగల సైనికవిషయ మనేకసార్లు కాంగ్రెసులో చర్చింపబడినది. కాంగ్రెసు ప్రతిఘటనములవలనకాని, ప్రార్థనములవలనకాని యింత వరకును భారతీయులకు సైనికవిషయమునకల అసంతృప్తి తొలగింపబడలేదు. మొట్ట మొదటి కాంగ్రెసే సైనికవ్యయ మెక్కువ చేయబడవలెననే సూచనను ప్రతిఘటించినది. ఒకవేళ నది ఎక్కువచేయబడినయెడల తప్పనిసరి యైనయెడల, ఇతరఖర్చులను తగ్గించి, దిగుమతిపన్నులను తిరిగీ విధించి, ఇదివరకు వృత్తిపన్నునుండి మినహాయింపబడిన ఉద్యోగులకును, అనుద్యోగులకును వృత్తిపన్నును విధించి, ఆ అధికవ్యయమును పూరించవలసిన దనికూడా ఆ మొదటి కాంగ్రెసే సూచించినది. హిందూదేశఋణమునకు సామ్రాజ్యముపక్షమున గ్రేట్‌బ్రిటన్ బాధ్యత వహించవలె నని సందర్భానుసారముగా కాంగ్రెస్ కోరినది. మరుసంవత్సరము కాంగ్రెసులో యూరపుఖండపరిస్థితుల ననుసరించి భారతీయులను స్వచ్ఛందసైనికదళములో చేర్చుకొనుట ప్రభుత్వమునకు శ్రేయస్కర మని వాదించబడినది. మూడవసంవత్సరము కాంగ్రెస్‌లో భారతీయుల రాజభక్తిపరాయణత్వమును స్మరించి, రాణీగారి వాగ్దానములను మన్నించి వారిని సైనికోన్నతోద్యోగములలో చేర్చుకోవలసినదని కోరబడినది. ఇందుకోస మీదేశములో సైనికకళాశాలలను సంస్థాపించవలసిన దని కాంగ్రెస్ ప్రార్థించినది. నాలుగు, అయిదు కాంగ్రెస్‌లు సైనిక చేయబడిన తీర్మానములను పునరుద్ఘోషించినవి. ఆరవకాంగ్రెసీమాట తలపెట్టనేలేదు. ఏడవ కాంగ్రెస్ తిరిగీ ఈవిషయకమైన చర్చను లేవదీసి భారతీయుల అభిప్రాయములను ప్రభుత్వమువారు మన్నించి, వారిగృహములను, వారి ప్రభుత్వమును సంరక్షించుకోవడమునకు తగిన సమర్థులనుగా వారిని చేయవలసిన దని కోరెను; సామ్రాజ్యములోనున్న వీరజాతుల సందర్భములో ఆయుధశాసన నిబంధన యొక్కయు, సంఘనిర్మాణనిబంధనల యొక్కయు కాఠిన్యము తగ్గింపబడవలె నని ప్రార్థించెను. ఇవిగాక మిలిటరీకళాశాలలు, స్వచ్ఛందసైనికదళములను గూర్చిన తీర్మానములుకూడ చేయబడెను. ఇన్ని ప్రతిఘటనలు, ఇన్ని ప్రార్థనలు జరిగినప్పటికిని, అత్యధికముగా పెరిగిపోయిన సైనికవ్యయమును చూచి, ఎనిమిదవకాంగ్రెస్ సైనిక

వ్యయములో కొంతభాగమును ఇంగ్లాండుకూడా భరించవలె నని తీర్మానించినది. ౯ వ కాంగ్రెస్ సైనికుల వ్యభిచారపద్ధతులనుగూర్చి, ఇండియన్ కంటోన్మెంటులలో వ్యాపించిన సుఖవ్యాధులనుగూర్చి చర్చించి, అవి నిర్మూలింపబడవలె నని తీర్మానించినది. ౧౦ వ కాంగ్రెస్ ఈ తీర్మానములను బలపరచినది. ౧౮౯౪ లో ఇండియా, ఇంగ్లండుదేశములమధ్య పంచవలసిన సైనికవ్యయమునుగూర్చి విచారించ డమునకు వెల్బీకమిషన్ నియమింపబడినది. ౧౧, ౧౨ కాంగ్రెసు లీవిషయమునుగూర్చి చర్చించలేదు. ప్రభుత్వమువారు పరిహద్దురాష్ట్రముల సందర్భమున చేసే వ్యయమును ఇంగ్లండుకూడా భరించవలెనని ౧౩ వ కాంగ్రెస్‌లో తీర్మానింపబడినది. ౧౪ వ కాంగ్రెసాతీర్మానమును బలపరచినది. ౧౫ వ కాంగ్రెసొక కొత్తపంథా తొక్కినది. ఇండియాకుభయటనే ఎక్కువసైన్యము నిలువచేయబడుట ప్రమాదములేని మంచి పద్ధతిగా భావింపబడుతూన్నది కాబట్టి, ౨౦,౦౦౦ బ్రిటిష్ సైనికుల వ్యయమును బ్రిటిష్‌ప్రభుత్వమువారే భరించవలె నని ఆ కాంగ్రెస్ తీర్మానించినది. పరిహద్దురాష్ట్రముల తొందర అణగినతరువాత ౧౬ వ కాంగ్రెస్‌లో తిరిగీ సైనికకళాశాల విషయము ప్రస్తావింపబడినది. ఇప్పటితో ౧౯ వ శతాబ్దము ముగిసినది. ౧౯౦౧ లో విక్టోరియా రాణీ స్వర్గస్థురాలయినది. కొత్తచక్రవర్తి ఎడ్వర్డుప్రభువు సింహాసన మధిష్ఠించెను. కాని భారతదేశపు సైనికవ్యవహారములలోమాత్రము మార్పు కలుగలేదు. ౧౯౦౩ లో జరిగిన ౧౬ వ కాంగ్రెస్‌లో, ౧౫ వ జాతీయమహాసభలో సూచించబడిన కారణముల ననుసరించియే సైనికవ్యయ మింగ్లాండుఇండియా దేశములమధ్య విభజింపబడవలె నని తీర్మానింపబడినది. తరువాత వ్యవహారము లంతకంతకు ముదిరినవి. ౧౮౯౪ లో నియమింపబడిన వెల్బీకమిషనునివేదిక బయటపడ్డది. ఇండియాకు కొద్దిసౌకర్యము చేయబడినట్లు చూపించబడినది. కాని బ్రిటిష్‌సైనికులజీతములు హెచ్చించబడుటచే క్రొత్తగా సంవత్సరమునకు సొ. ౭౮౬,౦౦౦ ల వంతున ఇండియా ఇంగ్లండుకు పంపవలసివచ్చినది కాబట్టి ఇండియాకు లాభించినదానికంటె నష్ట మెక్కువైనది. ౧౮-వ కాంగ్రెస్‌లో ఈవిషయము ప్రతిఘటింపబడినది.

ఇది చాలక ఆరోజులలో ఇంకను ఎక్కువమంది బ్రిటిష్‌సైనికుల నిండియా నెత్తి నెక్కించేటట్లు కనిపించినది. బోయరు యుద్ధములోను, చైనాసందర్భములోను ఇండియానుండి చాలాసైన్యములు తీసికొనిపోబడుటనుబట్టి బ్రిటిష్ ఇండియా సరిహద్దుల వెలుపల సైన్యము లుంచబడుట ప్రమాదములేనిపనీ, వివేకమైనపనీ అని ఋజువైనది. ౧౯ వ కాంగ్రెసు ఈపరిస్థితు లన్నిటినీ సమగ్రముగా చర్చించినది. ౧౮౫౯ లో జరిగిన సైనికసమ్మేళనపద్ధతివలన ఇండియాకు కలిగిన కష్టములను వివరించి ఇండియాలో బ్రిటిష్‌ప్రభుత్వమువా రవలంబించే సైనికపద్ధతి సామ్రాజ్యతత్వమునకు సంబంధించినదనీ, మొత్తము బ్రిటిష్‌సైన్యములో మూడవభాగము బ్రిటిష్‌సైనికులు ఇండి

యాలో నిలువచేయబడుటయే ఇందుకు తార్కాణమనీ, ఇంగ్లండు దేశ మీ సైనికవ్యయ ములో కొంతభాగము భరించితీరవలెననీ ఆ కాంగ్రెసు నిర్ణయించినది. కర్జనుప్రభు వీరోజులలోనే టిబెట్ దేశపు ఆక్రమణమునకు ప్రయత్నములు చేయ ప్రారంభించెను. ఇది రాజకీయోద్దేశములతో ప్రారంభింపబడిన దని చెప్పి ఈవ్యయమునంతను ఇండియా ధనమునుండి వెచ్చించెను. ౧౮౫౮ వ సంవత్సరపు శాసనముప్రకారము ఇండియాకు వెలుపల కేవలము విదేశీయులదాడిని నిరోధించే సందర్భములలో తప్ప తదితరసందర్భ ములలో పార్లమెంటు అంగీకారములేనిదే యేవిధమైన సైనికవ్యయమును చేయబడ రాదు. కాని కర్జనుప్రభు వీచట్టమును తృణీకరించెను. ౧౯౩౫ లోని నేటి భారత సంస్కరణచట్టము ౧౮౫౮ చట్టములో, పైనిబంధనను రద్దుచేసినసంగతి పాఠకులు గమనింతురుగాక. ఇక ౨౦ వ కాంగ్రెస్ కర్జనుప్రభువు చేసినపనిని నిరసించినది. కిచెనరుప్రభు వవలంబించిన సైనిక పునర్నిర్మాణపద్ధతివలన సైనికవ్యయ మింకను రూ. ౧౦,౦౦౦౦౦ లకు పెరిగినదనీ, ఇండియా ఈమహాభారమును భరించజాలదనీ ఆ కాంగ్రెస్ తీర్మానించినది. ౧౯౦౫ లో లార్డు కర్జనుకు, లార్డు కిచెనరుకు సైన్యము పైన సివిల్ అధికారము ఉండుటనుగూర్చి భేదాభిప్రాయములు కలిగెనవి. కర్జను ప్రభువు సివిల్ అధకార ముండవలెననీ, కిచెనరు ప్రభువు వుండకూడదనీ తగాదాపడిరి. ౧౯౦౬ లో జరిగిన కలకత్తా కాంగ్రెస్‌లో, ఇండియాలో అయ్యే సైనికవ్యయము ౯౦ కోట్లలోను ౪౦ కోట్లు ఇండియాకు వెలుపలి వ్యవహారములకే వెచ్చింపబడు తూన్నవని జి. యస్. నటేశన్ వివరించియుండెను. (ఇండియా వెలుపల జరిగే సైనిక వ్యవహారముల వివరములకు, ౧౯౧౭ కలకత్తా కాంగ్రెస్‌లో బెసెంట్ ఉప న్యాసము చూడవలెను.)

౧౯౦౫ లో కాశీలో జరిగిన ౨౦ వ కాంగ్రెసులో, సైనికదళముపైన ఇదివరకు నుండీ యున్న సివిల్ అధికారము పోకూడదనీ, ఆ సివిల్ అధికారముకూడ పన్నులు చెల్లించే ప్రజల ప్రతినిధులకే యుండవలెననీ నిర్ణయించబడినది. ఇండియాలోని సైనిక వ్యవహారములు ప్రాచ్యదేశములలో బ్రిటిష్‌వా రవలంబింపబోయే రాజకీయతంత్రమును బట్టి నడిపింపబడుతూండడము న్యాయ్యముకాదనికూడా ఆకాంగ్రెస్ ప్రతిఘటించినది. ౧౯౦౬ లో నూతనజాతీయాందోళనము తలయెత్తుటచేత ౨౨ వ కాంగ్రెసును, దీనిప్రసక్తియే లేకపోయినది. ౧౯౦౭ లో సూరతుతగాదా అడ్డమువచ్చినది. ౧౯౦౮ లో కాంగ్రెసు సంస్కరణకార్యక్రమము నవలంబించి ఈసైనికసమస్యను విడిచిపెట్టి నది. తరువాత ౧౯౧౨, ౧౯౧౩ సంవత్సరములలోని ౨౭, ౨౮ కాంగ్రెసులలో సైన్యములోని ఉన్నతోద్యోగములనుండి భారతీయులను మినహాయించడ మన్యాయ మని నెమ్మదిగా సూచించబడినది. ౧౯౧౪ కాంగ్రెసులో, సైన్యములోని ఉన్నత

తరగతులలో ప్రవేశించడమునకు భారతీయులకుగూడ హక్కుండవలెననీ, సైనిక కళాశాలలు, పాఠశాలలు స్థాపింపబడవలెననీ, భారతీయులు స్వచ్ఛందసైనికులు (వలంటీర్లు) గా అంగీకరింపబడవలెననీ తీర్మానములు చేయబడ్డవి. మొదటి రెండువిషయములును కానాటుప్రభు వంగీకరించెను. కిచెనర్ ప్రభువు "మేజరు" దర్జాలకును భారతీయులను చేర్చుకోవచ్చు నని చెప్పినట్లు తెలిసినది. రాజుగారీవిషయములో ప్రకటన చేయగలరని ప్రజ లాశపడిరి. పూర్వపుగోజులలో భారతీయులు స్వచ్ఛంద సైనికులుగా నుండకూడదని నిషేధము లేదు. కాంగ్రెసు మొదటి సంవత్సరములలో ఈసమస్య చర్చకు వచ్చినప్పుడు యస్. బి. శంకరన్ తాను స్వచ్ఛందసైనికుడనే నని ప్రకటించుకొనెను. ౧౮౫౦ లో స్ట్రాయి కార్యనిర్వాహక సంఘములో సభ్యుడైన బి. యన్. శర్మకూడా ఒకప్పుడు స్వచ్ఛందసైనికుడే నని తెలుసుకొందురుగాక. కాని ౧౮౮౭ లో భారతీయ స్వచ్ఛందసైనికులపేర్లు తొలగింపబడినవి. ౧౮౧౪ లో భారతీయ క్రైస్తవులుమాత్రమే స్వచ్ఛందసైనికులుగా నంగీకరింపబడిరి. భారతీయులు సైన్యములోని పెద్దదర్జాలలోనికి (Commissioned ranks) పోవుట కభ్యంతరమును ౧౮౧౭ లో తొలగించి సైనికరంగములో భారతీయప్రతిష్ఠకు చేయబడిన అపరాధమునకు ప్రభుత్వమువారు కొంతవరకు పరిహారము కావించిరి. తొమ్మిదిమంది భారతీయు లున్నతదర్జాలలో నియమింపబడిరి. ౧౮౧౭ లో జరిగిన కలకత్తాకాంగ్రెసు ఇందుకు సంతృప్తిని వెలిబుచ్చినది.

## ౫. న్యాయశాఖ - న్యాయస్థాన సమస్యలు

కాంగ్రెస్ ప్రారంభదశనుండి దేశములో పేరుప్రతిష్ఠలు గలిగిన గొప్ప న్యాయవాదులచే ఆక్రమింపబడియుండడముచేత ప్రజల న్యాయాధికారములను సంరక్షించేనిమిత్త మది కంకణము కట్టుకొని యున్నదన్నచో అతిశయోక్తి లేదు. అప్పటి కింకను ప్రజల అనుభవముగాని, ప్రభుత్వమువారి నిర్బంధవిధానముగాని, న్యాయశాస్త్రపద్ధతులు కేవలము ప్రశాంతదినములలో, వినయవిధేయులై ప్రవర్తించే పౌరులనిమిత్తమే నని తెలిసేటంతగా అభివృద్ధి పొందియుండలేదు. ప్రజలలో జాతీయచైతన్యము గలిగి, న్యాయశాస్త్రపద్ధతులప్రకారము వారికి లభించిన హక్కులనుగూర్చి వారు తెలుసుకొనగలిగిన వెంటనే ఆ పద్ధతులలోని శూన్యత్వము వారికి విశదము కాగలదు. ప్రభుత్వమువారు జూరీవిచారణపద్ధతిని మొట్టమొదట పూర్తిగా ప్రవేశపెట్టి, ౧౮౭౨ లో జూరీలు నిందారోపితులను విడుదలచేసినసందర్భములో, వారి తీర్పును సెషన్సుజడ్జీలును, హైకోర్టుజడ్జీలును త్రోసివేయవచ్చునని చేసినమార్పు ఈపై విషయమును ప్రజలకు చక్కగా బోధపరచినది. కలకత్తాలో ౧౮౮౬ లో జరిగిన

రెండవ కాంగ్రెస్సే జూరీఅధికారములలో చేయబడిన ఈమార్పు హానికరమనీ, తక్షణము రద్దుచేయబడవలెననీ తీర్మానించినది. తరువాతి కాంగ్రెసులు జూరీవిచారణపద్ధతిలో సూచింపబడిన మరికొన్ని చెడ్డమార్పులను గూర్చి ప్రతిఘటించినవి. పిమ్మట జరిగిన కాంగ్రెసులు కేవలము క్రిందటి తీర్మానములనే బలపరచినవి. కాని ఇంతవరకును ఏమీ ప్రయోజనము కలుగలేదు.

జూరీల అధికారములను తగ్గించుటకంటెను కూడ న్యాయాధికారములను కార్యనిర్వహణాధికారములతో జోడించుట యెక్కువ భయంకరమైన విషయము. ఇందువలన ఫిర్యాది, సాక్షీ, జడ్జి, జూరీ- వీరందరును ఒక్క అధికారిలోనే ఇమిడియుందురు.

ఇండియాలోని ఈ సంస్కరణోద్యమము ౮౦ సంవత్సరములనాడింగ్లండులో స్వర్గస్థుడయిన రాజా రామమోహనరాయల జీవితకాలమునుండే ప్రారంభమయినది. ఆయన తన మరణమునకు ముందు పార్లమెంటు కమిటీకీవిషయమును గూర్చియు, మరికొన్ని యితరవిషయములను గూర్చియు ఒక విజ్ఞాపనపత్రమును సమర్పించుకొనెను. పార్లమెంటరీ సంఘమునెదుట ఆయన ఈ విషయమునుగూర్చి సాక్ష్య మిచ్చెను. న్యాయ-కార్యనిర్వహణశాఖలు రెండును ప్రత్యేకముగా నుంచవలయునని ఆయన వాదించెను. ఇందుకోసమే కాంగ్రెస్, అఖిలభారత ముస్లిమ్‌లీగులు చాలకాలమునుండి ప్రభుత్వమువారితో నిరర్థకముగా పోరాడుతూన్నవి. ఈ అత్యావసరసంస్కరణము ప్రవేశపెట్టబడుటకుకూడ నేటిపరిస్థితు లెంత ప్రతికూలముగా నున్నవో ఈ చరిత్రను బట్టి పాఠకులు తెలుసుకొందురుగాక! డఫరిన్ ప్రభువు గవర్నరు జనరలుగా నున్నప్పుడును, వైకౌంటుక్రాస్, కింబర్లీలు భారతరాజ్యాంగకార్యదర్శులుగా నున్నప్పుడును, సర్ హాబ్‌హౌస్ ఇండియాప్రభుత్వములో హోమ్ మెంబరుగా నున్నప్పుడును అనేకపర్యాయములు కాంగ్రెస్‌వారు సూచించే ఈసంస్కరణము మంచిదేనని వారందరును అంగీకరించిరి. సర్ హార్వే ఆడమ్సన్ దీనిని ప్రవేశపెట్టి, ఒకసారి ప్రయత్నించి చూచెదమని ౧౯౦౮లో ఇండియాప్రభుత్వమువారిపక్షమున వాగ్దానము చేసెను. కాని నేటికిని న్యాయ-కార్యనిర్వహణాధికారములు రెండును ఒక్క యుద్యోగస్థునిలోనే ఇమిడియున్నవి. రామమోహనరాయల తర్వాత దాదాభాయి నౌరోజీ నాయకత్వమున కొంతమంది ఈ ఆందోళనమును సాగించిరి. బొంబాయి, మద్రాసు, వంగరాష్ట్రములలో ఈ పనిని సాధించే నిమిత్తము సంఘములు నిర్మింపబడినవి. వీటిలో ముఖ్యముగా వంగరాష్ట్ర జాతీయసంఘమును మనము పేర్కొనవచ్చును. వారు చేసిన ప్రచారమువలననే ఈయుద్యమమునకు బలము చేకూరినది. తరువాత ౧౮౮౫ నుండి జాతీయమహాసభ ఈ విషయమును గూర్చి పనిచేయ ప్రారంభించినది.

న్యాయ-కార్యనిర్వహణశాఖలు తక్షణము ప్రత్యేకింపబడవలెనని రెండవకాంగ్రెసు తీర్మానించినది. కొంతవ్యయ మెక్కుడయినప్పటికినీ ఈరెండు అధికారములను ప్రత్యేకించబడకతప్ప దని మూడవకాంగ్రెసు తీర్మానించినది. మరుసంవత్సరపుకాంగ్రెసీవిషయమును, జూరీవిషయమును కలిపి చర్చించినది. తరువాత ౧౮౯౩ వరకును జరిగిన ప్రతికాంగ్రెసు ఈ విషయమును పునశ్చరణ చేస్తూవచ్చినది. ౧౮౯౩ లోని కాంగ్రెస్ "న్యాయకార్యనిర్వహణాధికారములు రెండును కలసియుండుట ఇండియాలోని బ్రిటిష్‌ప్రభుత్వమునకు తీరనికళంకము. అది యావద్భారతదేశములోని ప్రజాసముదాయమునకు గణింపరాని నిర్బంధము." అని ప్రకటించినది. "ఇందుకు వేరొక నివారణోపాయము కనిపించలేదు గనుక వెంటనే ప్రతిరాష్ట్రములోను దీనినిగూర్చి విచారించి తగిన ప్రణాళికలను తయారుచేసేనిమిత్తము కమిటీలను నియమించవలసిన" దని హిందూదేశరాజ్యాంగకార్యదర్శిని ఆ కాంగ్రెస్ ప్రార్థించినది. సంవత్సరముల తరబడి కోరబడుతూన్న సంస్కరణమును ప్రవేశపెట్టుట కిష్టపడని ప్రభుత్వమునే, ఆ సంస్కరణముకోసము కావలసినవివరములను విచారించేనిమిత్తము కమిటీలను నియమింపవలసిన దని కోరిన కాంగ్రెసుయొక్క అమాయికత్వమును, నిస్సహాయత్వమును ఏమనవలసియున్నదో తెలియకున్నది. ఇది నాటి కాంగ్రెసువాదులలో ప్రారంభమైన శూన్యదృష్టికి నిదర్శనము. మరుసంవత్సరము (౧౮౯౪)లో కొంతకాలము హిందూదేశ రాజ్యాంగకార్యదర్శులుగా పనిచేసి విరమించిన కింబర్లీ, క్రాస్‌ప్రభువుల అభిప్రాయములను కాంగ్రెస్ ఉదాహరించినది. కాని అధికారములో నున్నవారి అభిప్రాయములకు విలువగలదు గాని అధికారమునుండి విరమించినవారి అభిప్రాయముల కేమివిలువ? అయినప్పటికీ ఈవిషయమునుగూర్చి ఆందోళనముమాత్రము సాగుతూనేయున్నది. కీ. శే. మన్‌మోహనఘోషున కిది అభిమానవిషయమైనది. ౧౮౯౮ లోని ౧౪ వ కాంగ్రెస్, ఆయన కృషివలన ఇంగ్లాండు, ఇండియా దేశములలోని ప్రజాభిప్రాయ మీ సంస్కరణమున కనుకూలముగా నున్నదని సంతృప్తిని వెల్లడించి, ఆయనమరణమునకు చింతించినది. ౧౮౯౯ లో హాబ్‌హౌస్ ప్రభువు, సర్ రిచర్డు గార్తు, సర్ రిఛార్డుకౌచ్, సర్ ఛార్లెస్‌సార్జెంటు, సర్ డబ్ల్యు. మార్కుబే, సర్ జాన్ బడ్‌ఫీర్, సర్ జాన్ స్కాటు, సర్ రోలాండు కె. విల్సన్ మొదలగు ప్రఖ్యాతులయిన జడ్జీలును, హర్బర్టు జె. రేనాల్డ్సు, సర్ విలియం వెడ్డర్‌బరన్‌గార్లును ఈ న్యాయ-కార్యనిర్వహణశాఖావిభజనమునుగూర్చి భారత రాజ్యాంగకార్యదర్శికి మహజరు అర్జీని పంపిరి. ౧౯౦౧ లో ఈవిషయ మిండియా ప్రభుత్వమువారి ఆలోచనలో నున్నదని కాంగ్రెసుకు తెలియవచ్చినది. కాని ౧౯౦౮ వ సంవత్సరమువరకును నిజమైన అభివృద్ధి కలుగలేదు. ౧౯౦౮ లో వంగరాష్ట్రప్రభుత్వ

మీ సంస్కరణమును కొద్దిమార్పుతో అంగీకరించినదనీ, అవి రాష్ట్రములలో ఆచరణలోకి రాగలదనీ కాంగ్రెస్ సంతృప్తిని వెల్లడించినది. కాని సంవత్సరము లోపలనే అది అబద్ధమని బుజువైనది. తరువాతి రెండు కాంగ్రెసులలోను అందు కాశాభంగము వెల్లడింపబడినది.

జూరీఅధికారములు తగ్గించబడినందుకు, న్యాయకార్యనిర్వహణాధికారము లొక్క మనిషిలోనే ఇమిడియున్నందుకు ఆందోళనము జరుగుతూండగానే, పులిమీద పుట్రవలె, ౧౮౧౮ వ సంవత్సరపు వంగరాష్ట్రపు మూడవ రెగ్యులేషను, ౧౮౧౯ వ సంవత్సరపు మద్రాస్‌రాష్ట్రపు రెండవ రెగ్యులేషను, ౧౮౨౭ వ సంవత్సరపు బొంబాయిరాష్ట్రపు ఇరువదియైదవ రెగ్యులేషనులలోని అసాధారణాధికారము ౧౮౯౭ వ సంవత్సరములోని రాజకీయపరిస్థితులవలన బయటపడ్డది. ఈచట్టముల ప్రకార మెవరైనప్పటికీ విచారణ లేకుండ ప్రవాసమునకు పంపబడవచ్చును. ఈ అధికారముక్రిందనే "సర్దారునాటు" జైలుకు పంపబడెను. ౧౮౯౭ వ సంవత్సరపు కాంగ్రెస్ సమావేశ మగునప్పటి కాయన జైలుకుపంపబడి అయిదుమాసములపై చిలుకు గడచినది. ఈచట్టములక్రింద చేయబడవలసిన ప్రకటనమునుకూడ చేయకుండనే ప్రభుత్వమువా రాయనను జైలుకు పంపినందుకు కాంగ్రెస్ నిర్విణ్ణత్వమును వెల్లడించినది.

౧౮౯౭ వ సంవత్సరములో అన్నీ అశుభసంఘటనములే జరిగినవి. తాను రచించనివిషయములను ప్రకటించినందుకు లోకమాన్యతిలకు శిక్షింపబడెను. పూనాలో అదనపుపోలీసు ఉంచబడెను. రాజద్రోహము (౧౨౪ a), భయంకరమైన ప్రవాదములను వ్యాపింపచేయు (౫౦౫) నేరములకు సంబంధించిన నిబంధన లెక్కువ కఠినముగా చేయబడినవి. ప్రజలహక్కులకు భంగము కలిగించిన ఈ ప్రభుత్వచర్యలను కాంగ్రెస్ ఖండించినది. సురేంద్రనాథ్ బెనర్జీ ఆసందర్భములో చేసిన మహోపన్యాసములో కొంతభాగమును ఆయనవాగ్ధోరణి కొకచిహ్నముగా నిట నుదాహరింతుము :

"పూనాలో అదనపుపోలీసును పెట్టుటొక ప్రమాదముగా మనము భావింతుము. తిలకును, తదితరపూనాసంపాదకులను నిర్బంధించుట మంతకంటెను గొప్పప్రమాద ముగా తలంతుము. తిలకుకోసము నాహృదయము పరితపిస్తూన్నది. నాభావము లాయన జైల్‌ఖానాకు పరుగెత్తుతూన్నవి. భారతజాతి దుఃఖనిమగ్నమైనది. ఇంగ్లీషువా రాత్మస్వాతంత్ర్య, వాక్స్వాతంత్ర్య, పత్రికాస్వాతంత్ర్య, సమావేశ స్వాతంత్ర్యములను కలిగియున్నారు. వారి రాజ్యాంగప్రణాళిక ఈసిద్ధాంతముల కనుగుణముగా నున్నది. మనము బ్రిటిష్‌పౌరులముగా జన్మించినహేతువున బ్రిటిష్‌రాజ్యాంగములో నున్న అన్నిహక్కులును మనకును జన్మతోనే స్వతస్సిద్ధముగా సంక్రమించినవి.

ఈహక్కులను మనదగ్గరనుండి యెవరు తీసివేయగలరు? మన మందరమును ఐక్యభావముతో నుండ నిర్ణయించుకొంటిమి. ఈకాంగ్రెస్‌యెదుట మన మీప్రకారము ప్రమాణము చేయగలము. మన మందరమును ఈకాంగ్రెస్ వెలుపలకు పోయి, ప్రజాహృదయముల నుత్సాహపూరితములుగా చేయుముగాక. బ్రిటిష్‌పౌరులముగా మనకుగల అన్నిహక్కులను,ముఖ్యముగా ఆత్మస్వాతంత్ర్యమనే మహత్తరమైనహక్కును న్యాయపద్ధతితో ప్రతిష్ఠించుకొనుటకు మనము బద్ధకంకణుల మయితిమి."

## ౬. పర్మనెంటుసెటిల్‌మెంటు - నీటితీరువ - దారిద్ర్యము - కరవులు

భారతదేశము ముఖ్యముగా వ్యావసాయికదేశము కాబట్టి, రీసెటిల్‌మెంటుల వలన రైతులకు కలుగుతూన్న పన్నులబాధనుగూర్చి కాంగ్రెస్ మొదటినుండి పనిచేసియుండవలసిన దని చాలామంది తలచెదరు. అందు కనుగుణముగా అలహాబాదులో జరిగిన నాల్గవకాంగ్రెస్‌లోనే (౧౮౮౮లో) ఈ విషయమును స్థాయిసంఘమువారు విచారించి ౧౮౯౧ కాంగ్రెసుకు నివేదించవలసినదిగా యేర్పాటు చేయబడినది. ౧౮౮౦ లో వచ్చిన కరవువిచారణసంఘమువారి సిఫారసుమీద పర్మనెంటు సెటిల్‌మెంటు భారతరాజ్యాంగకార్యదర్శిచే ౧౮౬౨ లో నంగీకరించబడిన దని ౧౮౯౧ కాంగ్రెస్‌లో వైకుంఠనాథసేన్ వివరించినాడు. కొన్ని సందర్భములలో నీపన్నుల పెంపుదల గ్రామములోని కొత్తపంటల మొత్తమును మించియున్నదని సర్ ఆక్లండ్ కాల్విన్ ఒకప్పు డభిప్రాయ మిచ్చియుండెను. ఈ విషయములనుగూర్చి డాక్టర్ బెసెంటు తనగ్రంథములో నుదాహరించిన కొన్ని వాక్యముల నీక్రింద చూపింతుము :

"కుండలోనున్న నీరు పూర్వ మెంతో, ఇప్పుడును అంతే. పూర్వ మొక చిల్లిమాత్రమే ఉండెను. ఇప్పుడో ఆరుచిల్లు లున్నవి."

"మాకు కావలసినన్ని పశువు లుండేవి. కావలసినన్ని పచ్చికబీళ్లుండేవి. పశువుల ఆరోగ్యమును కాపాడడమునకు కావలసినంత ఉప్పుండేది. ఇప్పుడు మాపచ్చికబయళ్లు అటవీశాఖవారిచేతులలో నున్నవి. మాపశువులకు బీళ్లులేవు. ఆకలితో మాపశువు లెక్కడ కైనను మేయబోయేయెడల బందెలిదొడ్లలో పెట్టబడును. మేము జరిమానా లిచ్చుకొనవలసివచ్చును."

"మాపశువుల చావిళ్లకు, నాగళ్లకు, తదితర వ్యవసాయపుపనిముట్లకు కావలసినంత కొయ్య మాకున్నది. కాని అది అంతా అటవీశాఖవారి స్వాధీనములో నున్నది. సెలవులేకుండ దానిని స్పృశించినయెడల కష్టములపాలు కావలసివచ్చును. మా కా

అడవిలో ఒకకఱ్ఱ కావలసినయెడల ఒకయుద్యోగస్థునిదగ్గఱనుండి మరియొక యుద్యోగస్థునియొద్దకు వారములో జులపాటు తిరుగ త్తవలెను. అంతకాలమును, ఎవరికో ఒకరికి, ఏదో కొంత సొమ్ము ముట్టచెప్పుతూనేయుండవలెను. మాపంటలను పాడుచేసే అడవిమృగములను కాల్చి నాశనము చేయుటకు తగిన ఆయుధములు మాకున్నవి. కాని మాకొక ఆయుధచట్టమున్నది. అందువలన మీ మాయుధములను పూని అడవిమృగములను సంహరించరాదు. అప్పుడు పదవదిగిన నీగ్రోవాడుకూడ ఆయుధములు పట్టుకొని మొనగాడులాగున దేశములో తిరుగవచ్చును. మేము మాత్రము మాపంటలను రక్షించుకొనుటకు ఆయుధములను చేపట్టరాదు."

౧౮౯౨ లో కాంగ్రెస్ ల్యాండురెవిన్యూకు శాశ్వతమైన పరిమితి యేర్పాటు చేయబడవలె నని తీర్మానించినది. అందువలన పెట్టుబడిదారులును, వ్యవసాయకార్మికులును గలసి భూమి నభివృద్ధి చేయగల రని కాంగ్రెస్ అభిప్రాయము. వ్యవసాయపు బ్యాంకులు స్థాపింపబడవలె ననికూడా ఆ కాంగ్రెసులోనే తీర్మానింపబడినది. మరుసంవత్సరపుకాంగ్రెస్ ౧౮౬౨,౬౫ సంవత్సరములలో భారతరాజ్యాంగ కార్యదర్శి వాగ్దానము చేసిన పర్మనెంటు సెటిల్‌మెంటు ఆచరణలోకి తేబడవలె నని తీర్మానించినది. ౧౮౯౬ లో కాంగ్రెసు మామూలుమితవాదపద్ధతి నవలంబించి, ప్రతి సెటిల్మెంటుకు మధ్య ౬౦ సంవత్సరముల గడువయినను ఉండేటట్లు చూడవలసిన దని ప్రభుత్వమును ప్రార్థించినది. ౧౯౦౦ డిసెంబరు ౨౨-వ తేదీన ఇండియాప్రభుత్వము ఈ విషయమునుగూర్చి రెవిన్యూశాఖద్వారా ఒక తీర్మానమును ప్రకటించినది. కాంగ్రెస్ రాష్ట్రీయప్రభుత్వముల అభిప్రాయములను కూడ ప్రకటించవలసిన దని కోరినది. ౧౯౦౩ లో అధిక శిస్తులను విరోధించుటకు కోర్టులకును, శాసనసభలకును అధికార ముండవలెనని తీర్మానించినది. ౧౯౦౬ లో, రిప్పనుప్రభువు ౧౮౮౨ లోను, క్యానింగ్ ప్రభువు ౧౮౬౨ లోను భూమిశిస్తుకు పరిమితి నిర్ణయింపబడవలె నని చేసిన ప్రకటనలను ౧౯౦౨లోని కర్జనుప్రభువుతీర్మానముతో పోల్చి కాంగ్రెస్ చర్చించినది. భూమిశిస్తు పన్ను కాదనీ, అద్దెమాత్రమే ననీ ప్రకటింపబడిన అభిప్రాయమును కూడ అది తీవ్రముగా ఖండించినది. ౧౯౦౭లో కూడ ఇటువంటి తీర్మానము చేయబడినది. ౨౫ సంవత్సరములు అత్యంతప్రాముఖ్యముగా పరిగణింపబడిన ఈ విషయము తరువాత కాంగ్రెసువేదికనుండి విరమించినది.

ఇందుకు సంబంధించిన విషయములే అయిన "నీటితీరువ", "కరవులు", "పాటిపదిసారములు"ను గూర్చి ఇక చర్చించెదము. కాంగ్రెసు నీటితీరువనుగూర్చి ౧౮౯౮ లో ఒక్కపర్యాయము మాత్రమే మద్రాసులో చర్చించినది. అప్పుడు నీటి

తీరువ యొకరమునకు నాలుగురూపాయిలనుండి ఆయిదురూపాయిలకు హెచ్చింప బడినది. నిరంతరమును హెచ్చింపబడుతూన్న శిస్తులును, పన్నులును అప్పటికాలములో మాటిమాటికి వస్తూన్న కరవులకు కొంతవరకు కారణములు. ౧౮౯౬ లో కలిగిన క్షామపరిస్థితులవలననే భారతదేశపు ఆర్థికవిషయములను గూర్చి కాంగ్రెసు విచారణ ప్రారంభించినది. అప్పుడు కాంగ్రెస్, ప్రభుత్వమువారి సైనికదుబారా ఖర్చును వివరించినది; భూమిపన్నులు, శిస్తులు అత్యధికముగా విధింపబడుట కరవులకొక కారణముగా నిరూపించినది; స్థానికపరిశ్రమలు, దేశీయశిల్పములు నాశనము చేయబడుట మరియొక కారణముగా సూచించినది. ప్రభుత్వమువారు వాగ్దానము చేసిన క్షామభీమానిధి వెంటనే నిర్మింపబడవలె నని కాంగ్రెసు కోరినది. పర్మనెంటు సెటిల్ మెంటు, వ్యవసాయబ్యాంకులు, పారిశ్రామిక పాఠశాలలు నిజమైన క్షామ నివారణోపాయములుగా సూచింపబడినవి. వెంటనే ఒక కరవుకమిటీ నియమింప బడినది. ఈలోపుగా బ్రిటనునుండీ, అమెరికాసంయుక్తరాష్ట్రములనుండీ క్షామసహాయార్థము ధనము వచ్చినది. లండన్ మేయరు కష్టకాలములో భారతదేశమునకు చేసిన మేలునకాయనకొక కృతజ్ఞతాస్మారకచిహ్నమును నెలకొల్పుట కిండియానుండి ౧౦౦౦ పౌనులు పంపవలె నని కాంగ్రెస్ తీర్మానించినది. ఇది ౧౮౯౮ లో జరిగిన విషయము. కాని కాంగ్రెస్, క్షామనివారణోపాయములుగా సూచించిన విషయములను మాత్రము మరచిపోవలేదు. ౧౮౯౯ లో, ప్రభుత్వమువారు హిందూదేశమునుండి విదేశములకు పోతూన్న ధనప్రవాహము నరికట్టవలె ననీ, ప్రభుత్వవ్యయమును, పన్నులను తగ్గించవలె ననీ, స్థానికపరిశ్రమల నభివృద్ధి చేయవలెననీ కాంగ్రెస్ తీర్మానించినది. మరుసంవత్సరము, భారతప్రజల ఆర్థికవిషయములను గూర్చి ప్రభుత్వము వారు విచారణ చేయవలెనని తీర్మానించినది. తరువాత కాంగ్రెస్‌దృష్టిలో కలిగిన పరివర్తనమునుబట్టి, ఈ విషయమునుగూర్చి అది చర్చించడమే మానివేసినది.

## 2. అటవీశాసనములు

అటవీశాసనములవలన కలిగిన ఆలజడి తెలియ[illegible]మందికి తెలియదు. భూమిశిస్తులవలెను, ఉప్పుపన్నువలెను [illegible] ప్రజలకు [illegible] బాధాకరములుగా నున్నవనిమాత్రమే చాలా[illegible]రుగుదురు. ౧౮౯౧ లో [illegible] పురములో పాల్ పీటరుపిళ్లై "ఒక్కకలముగ[illegible] ప్రభుత్వము[illegible] రైతులకు [illegible] సిద్ధముగా వస్తూన్న సమష్టిహక్కులను నిర్మూలము చే[illegible] అప్పటినుండి [illegible] గ్రామస్థుల సాంఘికజీవితములో అపూర్వ[illegible]వర్తనము క[illegible] అని [illegible] లనుగూర్చి చెప్పెను. "బ్రిటిష్‌ప్రభుత్వము[illegible] రైతులకు [illegible] తక్కిన అన్నింటికంటెను ఎక్కువబాగుగా [illegible]గపడ్డ" వని [illegible] సెం[illegible]

చెప్పినమాటలు సత్యవిరుద్ధములు కావు. ౧౮౯౧ లో ఒక్క ఉత్తరార్కాడు జిల్లాలోనే ౯ నెలలలో 300,000 పశువులు మృతినొందినవి. రైతుకు ప్రకృతి అనుగ్రహించిన ప్రసాదములైనను సరిగా ముట్టడము లేదు. "నీపొల మాగుట్టలమీద నున్నవి. కాని నీ వా అడవిచెట్లును, పొదలును ముట్టుకొనరాదు. నీవు వేసి పెంచినచెట్లు అయితే నీవి కావు" అంటారు ప్రభుత్వమువారు.

౧౮౯౨-౯౩ సంవత్సరములలో ఇండియాలో ముఖ్యముగా పెనిన్సులర్ ఇండియా, పంజాబురాష్ట్రములలో అటవీశాసనములవలన ప్రజలకు కలుగుతూన్న ఇబ్బందులనుగూర్చి విచారించవలసిన దని ప్రభుత్వమువారికి విజ్ఞాపింపబడినది. పంజాబు ప్రభుత్వమువారి అటవీనిబంధనలు చాలా అన్యాయ్యముగాను, క్రూరముగాను ఉండినవి. ౯ వ కాంగ్రెసులో పండిత మేఘరాక్స్, అవి "నాగరకప్రభుత్వమునకు తగనంత అన్యాయ్యముగా నున్న"వని చెప్పినాడు. ఒకపొలముయజమాని తనపొలములోకలిగిన అగ్నిప్రమాదములకు బాధ్యుడు. అది యెవరివలన కలిగినను సరే, అతడే నిబంధనలకు వ్యతిరేకముగా నడచుకొన్నట్లు భావించబడును. గడ్డి, కట్టెలు అమ్ముకొని జీవించే కొండవాళ్లు అలా జీవించుటకు వీలు లేకుండ చేయబడినది. వారిపశువు లడవులలో మేయరాదు. వా రడవిఆకులతో చలిమంట వేసుకోకూడదు. ఈ ఆందోళనాఫలితముగా ఇండియాప్రభుత్వమువారు, " అటవీపరిపాలనసందర్భములో తమ ఆర్థికప్రయోజనములకంటె రైతుల అవసరములు, వ్యవసాయప్రయోజనములే ఎక్కువగా గమనింపబడు"నని ఉదారాశయములతో, ౨౦ అక్టోబరు ౧౮౯౪ తేదీగల ౨ (ఎఫ్)ఉత్తరువును జారీచేసిరి.

మూడు, నాలుగు తరగతులక్రిందకు వచ్చే అడవులలో, వంటచెరకు, పశువులను మేపుకొనేసౌకర్యము, పచ్చిగడ్డి, చిన్నచిన్న ఇళ్లకును, వ్యవసాయపుపనిముట్లకును కావలసిన కలపసామగ్రి రైతుల కుచితముగా నీయబడవలెననీ, తదితర సందర్భములలోకూడ అటవీనిబంధనలు రైతుల నవమానపరచడమునకును, నిర్బంధపరచడమునకును-ఉపయోగపడరాదనీ కాంగ్రెస్ తీర్మానించినది. ౧౧, ౧౮ కాంగ్రెస్‌లు, అటవీనిబంధనలు ప్రభుత్వమునకు ద్రవ్యమును సంపాదించిపెట్టుటకుగాక కేవలము అడవులసంరక్షణకోస మేర్పడినవనే అభిప్రాయమును వ్యక్తపరచి, ప్రజల కష్టములనుగురించి వివరించినవి. ౧౮౯౯ వ సంవత్సరముతరువాతి కాంగ్రెసులలో సమగ్రతీర్మానములలో నేదో యొకభాగముగా తప్ప ప్రత్యేకతీర్మానములలో నడవులనుగురించి యేమీ వివరింపబడలేదు.

సాధారణముగా జనులు క్రొత్తకష్టము వచ్చేసరికి అలవాటైన పాతకష్టమును [illegible] ఆందోళన చేయ మరచిపోయెదరు. అదేవిధముగా ౨౦ వ శతాబ్దప్రారంభము

కాగానే కాంగ్రెస్ రాజకీయములలో నూతనసమస్య యుదయించినది. బోయర్ యుద్ధము, రష్యా జపాను యుద్ధములు కాంగ్రెసువాదుల దృక్పథమును అడవులు, నీటిపన్నులు, సాల్టు, అబ్కారీలు మొదలగు చిన్నవిషయములనుండి జాతీయత, స్వపరిపాలనములవంటి గొప్పవిషయములవంకకు త్రిప్పినవి.

## ౮. వాణిజ్యము - పరిశ్రమలు

మన పూర్వరాజకీయవేత్తల హృదయములలో అప్పుడప్పుడు భారతదేశపు ముఖ్యసమస్యలు మెరుపుతీగలవలె మెరిసిపోయినవేకాని నిలకడగా నుండి ఉత్తమాదర్శములకు మార్గదర్శకములు కాలేదు. లాంకుషైరుప్రయోజనములకొరకు భారత ప్రయోజనములు త్యజించబడిన వన్నసంగతి వారు గ్రహించిరి. భారతశిల్పము, గ్రామ పరిశ్రమలు వినాశనము చేయబడకపోయినను, నిర్లక్ష్యము చేయబడినవనియైనను వారు తెలుసుకొనిరి, కేల్కార్, కపర్దిలతో గలసి, తిలకు మహాశయుని ప్రధాన శిష్యత్రయములో నొకరుగా పరిగణింపబడిన ఆర్. పి. కరండికారు, ౧౯౦౪ లో బొంబాయిలో జరిగిన ౨౦-వ కాంగ్రెసులో ప్రాథమికవిద్యనుగూర్చి మాట్లాడుతూ, అయిర్లండువిషయములో ఆర్థర్ బెల్ఫూర్ గారు చెప్పిన

"ఇంగ్లండుదేశపు ప్రయోజనములకోసము అయిర్లండుయొక్క ప్రతిపరిశ్రమ బాల్యావస్థలోనే నిర్మూలింపబడినది. అయిర్లండుఐశ్వర్యమునకు కారణ భూతమైన ప్రతిమార్గమును ఇంగ్లండుయొక్క దురాశాపరత్వమున కనుకూలముగా నుండేటట్లు మూసివేయబడినది."

అనేవాక్యములను జ్ఞాపకము చేసినాడు. ఇంగ్లీషుప్రభుత్వమును మహమ్మదీయ ప్రభుత్వముతో పోల్చి యొక రాజకీయవిషయపరిజ్ఞాత "ఇంగ్లీషుప్రభుత్వములో విద్యాభివృద్ధి జరిగినమాట వాస్తవమే. రైల్వేలు వచ్చినమాట వాస్తవమే. దేశములో సుస్థిరత్వము కలిగినమాట వాస్తవమే. కాని హిందూదేశసౌభాగ్యమునకు మహమ్మదీయప్రభుత్వ మింతకంటె చాలా యోగ్యమైనది. మహమ్మదీయులు భారతదేశములోనే నివాస మేర్పరచుకొన్నారు. వారి ఐశ్వర్యము భారతదేశపు సౌభాగ్యమైనది. ఇంగ్లీషువారో, భారతదేశపుభాగ్యమును సీమకు తీసికొనిపోయిరి." అని చెప్పెను. ఈ విషయమే రాజా రాంపాల్ సింగ్ ఇంతకంటె కఠినమైనభాషలో, ౧౮౯౩ కాంగ్రెసులో చెప్పినాడు. "ఇంగ్లీషుసివిల్ ఉద్యోగస్థులకు భారతదేశము చక్కని షికారీభూమి (Hunting ground) యైనది.

౧౮౯౪ కాంగ్రెసులో, బ్రిటిష్ ఇండియా పత్తిపరిశ్రమల పన్నునుగూర్చి "ఈపన్నువలన లాంకుషైరుకోస మిండియాప్రయోజనములు నాశనము చేయబడినవి."

చెప్పినమాటలు సత్యవిరుద్ధములు కావు. ౧౯౧౧ లో ఒక్క ఉత్తరార్కాడు జిల్లాలోనే ౯ నెలలలో 300,000 పశువులు మృతినొందినవి. రైతుకు ప్రకృతి అనుగ్రహించిన ప్రసాదములైనను సరిగా ముట్టడము లేదు. "నీపొలమాగట్లమీద నున్నది. కాని నీ వా అడవిచెట్లును, పొదలును ముట్టుకొనరాదు. నీవు వేసి పెంచినచెట్ల ఆకులే నీవి కావు" అంటారు ప్రభుత్వమువారు.

౧౯౧౨-౧౩ సంవత్సరములలో ఇండియాలో ముఖ్యముగా పెనిన్సులర్ ఇండియా, పంజాబురాష్ట్రములలో అటవీశాసనములవలన ప్రజలకు కలుగుతూన్న ఇబ్బందులనుగూర్చి విచారించవలసిన దని ప్రభుత్వమువారికి విజ్ఞాపింపబడినది. పంజాబు ప్రభుత్వమువారి అటవీనిబంధనలు చాలా అన్యాయ్యముగాను, క్రూరముగాను ఉండినవి. ౯ వ కాంగ్రెసులో పండిత మేఘశ్‌రామ్, అవి "నాగరకప్రభుత్వమునకు తగనంత అన్యాయ్యముగా నున్న"వని చెప్పినాడు. ఒకపొలముయజమాని తనపొలములోకలిగిన అగ్నిప్రమాదములకు బాధ్యుడు. అది యేవరివలన కలిగిననుసరే, అతడే నిబంధనలకు వ్యతిరేకముగా నడచుకొన్నట్లు భావించబడును. గడ్డి, కట్టెలు అమ్ముకొని జీవించే కొండవాళ్లు అలా జీవించుటకు వీలు లేకుండ చేయబడినది. వారిపశువు లడవులలో మేయరాదు. వా రడవిఆకులతో చలిమంట వేసుకోకూడదు. ఈ ఆందోళనాఫలితముగా ఇండియాప్రభుత్వమువారు, "అటవీపరిపాలనసందర్భములో తమ ఆర్థికప్రయోజనములకంటె రైతుల అవసరములు, వ్యవసాయప్రయోజనములే ఎక్కువగా గమనింపబడు"నని ఉదారాశయములతో, ౨౦ అక్టోబరు ౧౯౧౪ తేదీగల ౨ (ఎఫ్) ఉత్తరువును జారీచేసిరి.

మూడు, నాలుగు తరగతులక్రిందకు వచ్చే అడవులలో, వంటచెరకు, పశువులను మేపుకొనేసౌకర్యము, పచ్చిగడ్డి, చిన్నచిన్న ఇళ్లకును, వ్యవసాయపుపనిముట్లకును కావలసిన కలపసామగ్రి రైతుల కుచితముగా నీయబడవలెననీ, తదితర సందర్భములలో కూడ అటవీనిబంధనలు రైతుల నవమానపరచడమునకును, నిర్బంధపరచడమునకును ఉపయోగపడరాదనీ కాంగ్రెస్ తీర్మానించినది. ౧౧, ౧౪ కాంగ్రెస్‌లు, అటవీనిబంధనలు ప్రభుత్వమునకు ద్రవ్యమును సంపాదించిపెట్టుటకుగాక కేవలము అడవులసంరక్షణకోస మేర్పడినవనే అభిప్రాయమును వ్యక్తపరచి, ప్రజల కష్టములనుగురించి వివరించినవి. ౧౯౧౯ వ సంవత్సరముతరువాతి కాంగ్రెసులలో సమగ్రతీర్మానములలో నేదో యొకభాగముగా తప్ప ప్రత్యేకతీర్మానములలో నడవులనుగురించి యేమీ వివరింపబడ లేదు.

సాధారణముగా జనులు క్రొత్తకష్టము వచ్చేసరికి అలవాటైన పాతకష్టమును గూర్చి ఆందోళన చేయ మరచిపోయెదరు. అదేవిధముగా ౨౦ వ శతాబ్దప్రారంభము

కాగానే కాంగ్రెస్ రాజకీయములలో నూతనసమస్య యుదయించినది. బోయర్ యుద్ధము, రష్యా జపాను యుద్ధములు కాంగ్రెసువాదుల దృక్పథమును అడవులు, నీటి పన్నులు, సాల్టు, అబ్కారీలు మొదలగు చిన్నవిషయములనుండి జాతీయత, స్వపరి పాలనములవంటి గొప్పవిషయములవంకకు త్రిప్పినవి.

## ౮. వాణిజ్యము - పరిశ్రమలు

మన పూర్వరాజకీయవేత్తల హృదయములలో అప్పుడప్పుడు భారతదేశపు ముఖ్యసమస్యలు మెరుపుతీగలవలె మెరిసిపోయినవేకాని నిలకడగా నుండి ఉత్తమా చరణములకు మార్గదర్శకములు కాలేదు. లాంకుషైరుప్రయోజనములకొరకు భారత ప్రయోజనములు త్యజించబడిన వన్నసంగతి వారు గ్రహించిరి. భారతశిల్పము, గ్రామ పరిశ్రమలు వినాశనము చేయబడకపోయినను, నిర్లక్ష్యము చేయబడినవనియైనను వారు తెలుసుకొనిరి, కేల్కార్, కపర్దీలతో గలసి, తిలకు మహాశయుని ప్రధాన శిష్యత్రయములో నొకరుగా పరిగణింపబడిన ఆర్. పి. కరండికారు, ౧౯౦౪ లో బొంబాయిలో జరిగిన ౨౦-వ కాంగ్రెసులో ప్రాథమికవిద్యనుగూర్చి మాట్లాడుతూ, అయిర్లండువిషయములో ఆర్థర్ బెల్ఫూర్ గారు చెప్పిన

"ఇంగ్లండు దేశపు ప్రయోజనములకోసము అయిర్లండుయొక్క ప్రతిపరిశ్రమ బాల్యావస్థలోనే నిర్మూలింపబడినది. అయిర్లండుఐశ్వర్యమునకు కారణ భూతమైన ప్రతిమార్గమును ఇంగ్లండుయొక్క దురాశాపరత్వమున కనుకూలముగా నుండేటట్లు మూసివేయబడినది."

అనేవాక్యములను జ్ఞాపకము చేసినాడు. ఇంగ్లీషుప్రభుత్వమును మహమ్మదీయ ప్రభుత్వముతో పోల్చి యొక రాజకీయవిషయపరిజ్ఞాత "ఇంగ్లీషుప్రభుత్వములో విద్యాభివృద్ధి జరిగినమాట వాస్తవమే. రైల్వేలు వచ్చినమాట వాస్తవమే. దేశ ములో సుస్థిరత్వము కలిగినమాట వాస్తవమే. కాని హిందూదేశసౌభాగ్యమునకు మహమ్మదీయప్రభుత్వ మింతకంటె చాలా యోగ్యమైనది. మహమ్మదీయులు భారత దేశములోనే నివాస మేర్పరచుకొన్నారు. వారి ఐశ్వర్యము భారతదేశపు సౌభాగ్య మైనది. ఇంగ్లీషువారో, భారతదేశపుభాగ్యమును సీమకు తీసికొనిపోయిరి." అని చెప్పెను. ఈ విషయమే రాజా రాంపాల్ సింగ్ ఇంతకంటె కఠినమైనభాషలో, ౧౮౯౩ కాంగ్రెసులో చెప్పినాడు. "ఇంగ్లీషుసివిల్ ఉద్యోగస్థులకు భారతదేశము చక్కని షికారీభూమి (Hunting ground) రైనది.

౧౮౯౪ కాంగ్రెసులో, బ్రిటిష్ ఇండియా పత్తిపరిశ్రమల పన్నుగూర్చి " ఈపన్నువలన లాంకుషైరుకోస మిండియాప్రయోజనములు నాశనము చేయబడినవి."

అని ప్రతిఘటనతీర్మానము చేయబడినది. కాని రాబోయే ప్రతినిర్బంధశాసనమునకును తలయొగ్గి, దానికాఠిన్యమును తగ్గించుకొనేనిమిత్తము మార్గాంతరములను సూచించుట మప్పటికాంగ్రెసుల సంప్రదాయము. ఈ సందర్భములో,

“ఈ పత్తిపరిశ్రమబిల్లు చట్టమే అయ్యేయెడల, ౩౦ మొదలు ౪౮ నెంబరు వరకునుగలపరిశ్రమల కీచట్టము వర్తించకుండాఉండేటట్లు ఇండియాప్రభుత్వము వారి అధికారమును వినియోగించుటకు, భారతరాజ్యాంగ కార్యదర్శి అంగీకారమును వారు వెంటనే పొందవలె నని ఈకాంగ్రెసు సవినయముగా ప్రార్థిస్తున్నది.”

అనిమాడా తీర్మానింపబడినది. ౧౧ వ కాంగ్రెసులో, ౨౦ నెంబరుకు తక్కువైన పత్తిపరిశ్రమలు పన్నునుండి మినహాయింపబడుటకు లాంకుషైరు పెట్టిన అభ్యంతరము సరియైనది కాదని తీర్మానింపబడినది. ౧౯౦౬లో దాదాభాయిఅధ్యక్షతక్రింద జరిగిన కాంగ్రెసులో మాలవ్యాపండితుడు,

“మనదేశమునుండి పోయిన ముడిసరుకే తయారయిన వస్తువులుగా తిరిగీ మనదేశమునకు వస్తూన్నది. మనము స్వతంత్రులమే అయినట్లయితే, రక్షణపన్నులు వేసి బాల్యావస్థలోనున్న మనపరిశ్రమలను కాపాడుకొనియుండేవారము.”

అని మన పరిశ్రమాభివృద్ధికిగల ఆటంకమును వ్యక్తీకరించినాడు. విదేశవస్తువుల నెక్కువగా కొంటూన్న మధ్యతరగతులవారికి, వాటిని బహిష్కరించవలెనంటే “స్వయంసహాయము, మనోనిశ్చయము, త్యాగము” అవసర మని తిలకుమహాశయుడు చెప్పినాడు. ౧౯౦౬ లోని స్వదేశీ, బహిష్కరణోద్యమములవలన భారతీయులదృష్టి భారతపరిశ్రమల పునరుద్ధరణముపై పునకు మరలినది. ౧౯౧౦ లో “స్వదేశీ” తీర్మానమును అప్పటి కింకను యువకుడుగానున్న సి. వై. చింతామణి ప్రతిపాదించి తన భవిష్యత్ప్రాముఖ్యమును ఋజువుచేసికొనగలిగెను. ఆయన,

“ఇండియా ఇంగ్లీషువారికి ముడిసరుకులను పండించియిచ్చేపొలముగా నుపయోగపడుతూన్నది. ఇక్కడి ముడిసరుకులు బ్రిటిష్‌యేజెంట్లద్వారా బ్రిటిష్ ఓడలలో సీమకు పోయి, అక్కడ బ్రిటిష్‌పెట్టుబడితో, బ్రిటిష్‌కార్మికుల పనితనముతో వస్తువులుగా తయారయి, బ్రిటిష్‌యేజెంట్లద్వారా, బ్రిటిష్‌వర్తకుల వలన ఇండియాకు తిరిగీ దిగుమతిచేయబడుతూన్నవి.”

అని రెనడే చెప్పినమాటలను జ్ఞాపకముచేసినాడు. ఈరెనడే బొంబాయి హైకోర్టు జడ్జి, గొప్ప అర్థికశాస్త్రజ్ఞుడు, సుప్రసిద్ధసంఘసంస్కర్త. ఈయన అనేక సంవత్సర

ములవరకును కాంగ్రెసుకు వెనుకబలముగా నుండెను. పారిశ్రామి కార్థికవిషయము లలో అప్పటి కాంగ్రెసువాదుల కీయనసలహాయే ఆధారము.

భారతరాజకీయజ్ఞులు వ్యవసాయమునుగూర్చిగాని, జీర్ణించిపోతూన్న గ్రామ పరిశ్రమలనుగూర్చి గాని నిర్లక్ష్యము చేయలేదు. ౧౯౨౮ లోనే మదనమోహన మాలవ్యా, "ప్రభుత్వమువారు భారతీయ శిల్పపరిశ్రమలను పోషించవలె" నని చెప్పినారు. ౧౯౨౧ లోనే అటవీశాసనములు ప్రజలకు బాధలు కలిగిస్తూన్నవనీ, గ్రామ సాంఘికవ్యవస్థలలో సంపూర్ణమైన పరివర్తనము కలిగించినవనీ, గ్రామపరిశ్రమల వినాశనమునకును, పశువులమరణములకును కారణభూతము లయినవనీ ప్రజలు తెలుసుకొనగలిగిరి. ౧౯౨౧ సెప్టెంబరునెలలోనే మూడులక్షల పశువులు నశించినవి. ౧౯౨౧ లోని నాగపురపు కాంగ్రెసులో లాలా మురలీధరుడు ఉద్రేకభావంతో "మీరుకూడ ఈనిందితులైన రాక్షసులతోపాటు, మీసోదరుల హృదయశోణితముతో పుష్టి చెందవలెనని కోరుతూన్నట్లు కనపడుతూన్నది. (లేదు లేదు అని కేకలు) నేను అవు నని చెపుతున్నాను. మీచుట్టును చూచుకోండి. ఈచాందినీదీపా లేమిటి? ఈవిదేశీ కుర్చీలు, మేజాలు నేమిటి? ఈసన్నబట్టలు, ఈహ్యాట్లు, ఈ ఇంగ్లీషుకోట్లు, ఫ్రాక్సు లేమిటి? ఈవెండిపొన్నుకర్రలేమిటి? మీయిండ్లలోని భోగపదార్థములన్నీ యేమిటి? భారతదారిద్ర్యచిహ్నములు, భారతీయ క్షుధామూర్తులు. విదేశీవస్తువులపైన మీరు వ్యయముచేసిన ప్రతిరూపాయీ, నేడు బ్రతుకుతెరువులేని పనివాండ్ల చేతులలో నుండి యూడబెరుకబడిన దన్నమాట. ఈ ఇంగ్లీషువస్తువులు మనదేశమును ముంచివేసినత్తడము కేవలము ఔదార్యమువలననే నని నాకు తెలుసును. ఆ ఔదార్యమే మనదేశీయపరిశ్రమలను క్రమక్రమముగా నాశనము చేసినది. ఆ ఔదార్యమువలననే దిగుమతిపన్నులు రద్దుచేయబడి, ధనవంతులు చెల్లిస్తూన్న మూడులక్షల రూపాయీల ప్రభుత్వాదాయము త్యజించబడినది. ఈ భయంకరత్యాగమువలన గలిగిన లోటును భర్తీచేయుటకే పేదలు చెల్లించవలసిన ఉప్పుపన్ను విధింపబడవలసివచ్చినది. నేడు ఫ్యాక్టరీనిబంధనలు చేయబడుటకుకూడ ఔదార్యమే మూలము. మనము గర్వించవలసిన ఈపరిశ్రమకూడ ఆనిబంధనలమూలమున నాశనమైతే అవుగాక; అదికూడా ఔదార్యమే. కాని ఈ ఔదార్యఫలిత మేమి? మీసోదరు లుపవాసములు చేస్తున్నారు. మనధాన్యము విదేశముల కెగుమతి చేయబడకపోవుటచే ౩౦ సంవత్సరములక్రిందట ఒక మణుగున్నర గోధుమలుగాని, రెండుమణుగుల పప్పుగింజలుగాని ఒకరూపాయికైనను అమ్ముడుపోయేవి కావు. ఇప్పుడో ఆరురెట్లు ధర పెరిగినది. అనగా పేదవాండ్లు తమపొట్టలను నింపుకొనుట కారురెట్లెక్కువ కష్టపడవలసివచ్చినది. దీనికి కారణము మనధాన్యపు గిడ్డంగులను దోచివేయుటకు మన ఔదార్యవంతులు పన్నినపన్నుగడ. స్వేచ్ఛావాణిజ్య

మట! జాతికీ జాతికీ మధ్య నుండవలసిన న్యాయమట! ఈనాటకము నా కసహ్యము! ఏమిటా వర్తకన్యాయము? దరిద్రభూయిష్ఠమైన భారతదేశమునకును, ధనముతో మూలుగుతూన్న ఇంగ్లడునకును వర్తకసాపత్న్యమా? ఇది పసిబిడ్డకును, ఫైల్ మార్షలుకును జరిగే పోరాటమువలె కనపడుతూన్నది. ఈ స్వేచ్ఛావాణిజ్యపద్ధతి ఆర్థికశాస్త్రసమ్మతము కావచ్చును. కాని ఇది మనదేశీయులనుమాత్రము క్షుధార్తులనుగా చేయకతప్పదు" అని చెప్పి సభాసదులను హెచ్చరించినాడు.

మాలవ్యాపండితుడు ౧౮౯౩ లోని ౯ వ కాంగ్రెసులో "నేను మీనేతవాం డ్లెక్కడ? అనేకములైన చేతిపనుల మూలమున, పరిశ్రమలమూలమున జీవించిన ఆ పని వాండ్లందరును నే డెక్కడున్నారు? ఇంగ్లాండునకును, తదితర యిరోపా దేశములకును యేటేటా యెగుమతిచేయబడిన మీదేశీయపరిశ్రమలు నే డేమైనవి? అవి అన్నీ కాల గర్భములో కలసిపోయినవి. ఇక్కడ కూరుచుండిన ప్రతిమనిషీ ఇంగ్లీషుదుస్తులలో కనబడుతున్నాడు. మీ రెక్కడకు వెళ్లినను ఇంగ్లీషుపరిశ్రమలు, ఇంగ్లీషువస్తువులు మీరాక కెదురుచూచుచుండును. ఇక మనప్రజలకు మిగిలియున్న దేమి? పండిన పంటతో సగము భోజనము చేసి, వర్తకములో యేదో కొద్దిగా లాభము సంపాదించుకొనుట. ఉద్యోగములలో గాని, వ్యాపారములోగాని ౫౦ సంవత్సరములక్రిందట మనదేశీయులు పొందినలాభములలో నేను నూరవవంతుకూడా వారు పొందుటలేదు. అటువంటి సందర్భములో దేశము సౌఖ్యవంతముగా నెట్లుండును? " అని యుత్తేజ కరముగా పలికినాడు.

౧౮౯౮ లో సర్ సుబ్రహ్మణ్య అయ్యర్ గ్రామపునర్నిర్మాణమును గూర్చియు, పరపతిసంఘములనుగూర్చియు ఎక్కువ శ్రద్ధ తీసికొనవలెనని చెప్పినాడు. ౧౮౯౯ లో లాలా లజపతిరాయల ప్రయత్నమువలన కాంగ్రెస్ విద్యా, పారిశ్రామికవిషయములనుగూర్చి చర్చించుట కొకపూట ప్రత్యేకించినది. ఆకాంగ్రెసుచే నియమింపబడిన కమిటీవారి సూచనల ఫలితముగా ౧౯౦౧ లో మొదటి పారిశ్రామిక ప్రదర్శన యేర్పాటుచేయబడినది. ఇదే క్రమపరిణామమును పొంది నేటి ఖద్దరు, స్వదేశీప్రదర్శనముల రూపమును తాల్చినది. ౧౮౯౪ లో బ్రిటిష్ ఇండియా ప్రత్తిపరిశ్రమల పన్ను మూలముననే కాంగ్రెసు కన్నులు తెరచి దేశీయపరిశ్రమాభివృద్ధికై తనదృష్టిని మరల్చినది. కాంగ్రెసాపన్నును వెంటనే ప్రతిఘటించినది. తరువాత ఈ విషయములో గవర్నరుజెనరలు చేసిన ప్రతిఘటనముకూడ నిష్ప్రయోజన మయ్యెనని మాకు తెలియవచ్చినది. దీనికి పరిహారము చేయబడకపోగా పైపెచ్చు శాలిస్‌బరీ ప్రభువు "భారత పరిశ్రమలపోటీనుండి బ్రిటిష్‌పరిశ్రమలు సంరక్షింపబడుటకు తగిన చర్యలను తీసికొనవలె" నని ఉత్తరువులు జారీచేయించినట్లుకూడా తెలుస్తున్నది. భారతదేశములో ర

కోట్లమంది జనులు ఒంటిపూట భోజనముతో జీవిస్తున్నా రని మాటిమాటికీ చెప్పబడే మాట కేవలము ఊహాజనితమైన విషయము కాదు. నాచా, మఫోల్కారులు ఆంగ్లో ఇండియన్ ప్రభువులు చెప్పినమాటల నుదాహరించి ఈవిషయమును ఋజువుచేసిరి. "రైతుజనములో సగముమందికి సంవత్సరము చివరభాగములో కడుపునిండా భుజించుట యనగా యేమిటో తెలియదు." అని సర్ ఛార్లెస్ ఇలియటు కాదా చెప్పినది? ఒక సబ్ డివిజనులో ౧౮౯౧ లో భూమిశిస్తు ౬౬% పెరిగినది. మరొకదానిలో ౯౯% పెరిగినది. ఇంకొకచోట ౧౧౬% పెరిగినది. కొన్ని గ్రామములలో నూటికి ౩౦౦ మొదలు ౧౪౦౦ వరకును పెరిగినది. సైనికవ్యయముకూడా అంతులేకుండా పెరిగిపోయినది.

జర్మను సైనికున కయ్యేఖర్చు యేడాదికి రు. ౧౨౫—ఫ్రెంచి ౧౮౫. ఇంగ్లీషుసైనికున కింగ్లండులో అయ్యేఖర్చు రు. ౨౮౫. ఇండియాలోని ఇంగ్లీషు సైనికునకు రు ౬౬౫. ఈవ్యయము నాయాదేశీయుల ఆదాయములతో పోల్చిచూచు కొన్నయెడల మనస్థితి మరింత చక్కగా బోధపడగలదు. ఇంగ్లండులో ౪౨ పౌనులు ఒక్కొక్కమనిషి ఆదాయము. ఫ్రాన్సులో ౨౩ పౌనులు. జర్మనీలో ౧౮ పౌనులు. ఇండియాలో ౧ పౌ. ఈ అంకెలు ౧౮౯౧ లోనివి. క్షామములనుగూర్చి అనేకతీర్మానములు చేయబడినవి. ౧౮౮౬ లోనే, బలవంతపు కూలిచట్టమును (Penal Labour Law) రద్దుచేయించు ప్రయత్నములు జరిగినవి.

## ౯. స్వదేశీ - బహిష్కరణము - స్వరాజ్యము

కర్జను ప్రభువుపరిపాలనావిధానమువలన చాలకాలమునుండీ అంతర్గర్భితముగా వికసిస్తూన్న నూతనజాతీయోత్సాహము వంగరాష్ట్రవిభజనముతో ప్రకటితమైనది. ౧౯౦౫ లో భారత పుణ్యక్షేత్రమగు కాశీనగరమున జరిగిన ఇరువది యొకటవ కాంగ్రెస్ వంగరాష్ట్రవిభజనమును లాంఛనముగా ప్రతిఘటించి దానిని పూర్తిగా రద్దుచేసిగాని, లేక మార్పుచేసిగాని వంగీయుల నందరను ఒక్కపరిపాలనముక్రిందకు తీసికొనిరావలసిన దని తీర్మానించినది. కాని ఆనాడు వంగదేశములో అవలంబింపబడిన నిర్బంధవిధానమునుగూర్చి ఆకాంగ్రెసుచేసిన ప్రతిఘటనతీర్మానము కొంత డొంక తిరుగుడుగాను, కొంత అనాలోచితముగాను ఉన్నది. ఎందువల్ల ననగా ఆ తీర్మానములో "ప్రజ లేకగ్రీవముగా చేసిన ప్రార్థనములకుగాని, ప్రతిఘటనములకుగాని లెక్కపెట్టక, వంగరాష్ట్రవిభజనమునుగూర్చి తమ నిర్ణయమును కొనసాగించుకొనుటకే ఇండియాప్రభుత్వమువారు నడపిన చర్యను బ్రిటిష్ప్రజల దృష్టికి తీసికొనివచ్చే నిమిత్తము ప్రజల న్యాయబద్ధమైనట్టీ, ప్రబలమైనట్టి యేకైకప్రతిఘటనమార్గ మగు విదేశవస్తుబహిష్కరణమునకు పూనకొనవలసిన అవసరము కలుగగా" అని కొంత

ఉపోద్ఘాతము వ్రాయబడినతరువాత నిర్బంధవిధానము తీవ్రముగా ప్రతిఘటింపబడినది. అయితే ఈ తీర్మానములో కాంగ్రెస్ విదేశవస్తుబహిష్కారపద్ధతిని అంగీకరించినదో, లేదో సరిగా వ్యక్తము కావడములేదు. బహుశా వ్యక్తము చేయవలెనని తీర్మానము వ్రాసినవారి యుద్దేశమైనట్లుకూడా కనుపించదు. "ప్రజల న్యాయబద్ధమైనట్టి ప్రబలమైనట్టి యేకైక ప్రతిఘటనమార్గమను" అని వ్రాయబడినమూలమున ఒకసిద్ధాంతమునుగూర్చి మాత్రము కాంగ్రెస్ తనఅభిప్రాయమును వెల్లడించినట్లు కనపడుతూన్నది. జాతీయవాదుల కింతకంటె నిస్సందేహమైన తీర్మానమును చేయడమునకు కొంత చిక్కు కలిగినట్లు తోస్తూన్నది. కాని లాలా లజపతిరాయి ఈ తీర్మానమును బలపరుస్తూ "మన మిక బిచ్చగాండ్లము కాదు. మన మొక సామ్రాజ్యములోని ప్రజలము. మనహక్కులకోసము మనము పోరాడుతున్నాము." అనిచెప్పిన మాటలుమాత్రము ముత్సాహజనకములు. ౧౯౦౫ లో కనపడని ధైర్యము ౧౯౦౬ లో విజృంభించినది. వంగరాష్ట్రవిభజనమును గూర్చిన క్రిందటితీర్మానమును పునశ్చరణచేస్తూ ౧౯౦౬ కాంగ్రెస్ "ఈ దేశప్రజలకు పరిపాలనావ్యవహారములో అధికారము లేదనేమాట తెలుసుకొని ప్రభుత్వమువారికి వారు చేసుకొనే విజ్ఞాపనలు విచారణకు రావని గమనించి వంగరాష్ట్రవిభజనమునుగూర్చి ప్రతిఘటనగా అక్కడిప్రజలు ప్రారంభించిన బహిష్కరణోద్యమము న్యాయబద్ధముగా నుండెననీ, ఉంటూన్నదనీ ఈకాంగ్రెస్ అభిప్రాయపడుతూన్నది." అని తీర్మానించినది. తరువాత కొంత త్యాగము చేసియైనను దేశీయపరిశ్రమలనే ప్రోత్సహించవలసిన దని ఆకాంగ్రెస్ ప్రజలను కోరినది. అంతటితో ఆగిపోయినది. సర్వీసుపరీక్ష లేకకాలమున జరుపబడుట, ఎన్నికసభ్యులతో శాసనసభలు పెద్దవి చేయబడుట, భారతరాజ్యాంగకార్యదర్శికౌన్సిలులోను, ఇండియాలోని కార్యనిర్వాహకసంఘములలోను భారతీయసభ్యులు నియమింపబడుట – వీటి నతిక్రమించి వాటి స్వపరిపాలనాదర్శము పెరుగలేదు. ఇదే ౧౯౦౬ లోని జాతీయాశయము. తరువాతిసంవత్సరము సూరతుతగాదా వచ్చినది. తరువాత మితవాదకాంగ్రెసులు బహిష్కరణమును తొలగించి, స్వదేశీనిమాత్రము మంటిపట్టుకొనియుండినవి. వాటిలో స్వపరిపాలనమునుగూర్చిన తీర్మానము మింటోమార్లే సంస్కరణములను విచారించుటగా పరిణమించినది. ౧౯౧౦ లో పాతవైస్రాయి మారి కొత్తవైస్రాయి వచ్చినప్పుడు రాజకీయ ఖయిదీలను విడిచిపెట్టవలసిన దని కొత్తవైస్రాయియగు హార్డింజిప్రభువును ప్రార్థిస్తూ తీర్మానింపబడినది. తరువాతిసంవత్సరము ఈతీర్మానమే బలపరుపబడినది. కాని మద్రాసులో ౧౯౧౪ లో జరిగినకాంగ్రెస్, "౧౯౧౧ లో ప్రభుత్వమువారుచేసిన రాష్ట్రీయ స్వాతంత్ర్యవాగ్దానమును చెల్లించుకోవలసినదనీ, ఇండియాను సామ్రాజ్యసమ్మేళనములో నొక సంయుక్తభాగముగా అంగీకరించి, అదర్జాకు తగిన హక్కులను

సంపూర్ణముగాను, స్వేచ్ఛగాను అనుభవించనీయవలసిన" దనీ తీర్మానించి తన ధైర్యమును ప్రపంచకమునకు వెల్లడించినది.

## ౧౧. సాంఘిక ప్రాతినిధ్యము

ఈ సాంఘిక ప్రాతినిధ్యసమస్య క్రొత్తగా బయలుదేరిన దని చాలామంది అభిప్రాయము. ౧౮౮౮ లో పశ్చిమోత్తర రాష్ట్రములకు సర్ ఆక్లండ్ కాల్విన్ లెఫ్టినెంటు గవర్నరుగా నున్నప్పటినుండి మహమ్మదీయులు కాంగ్రెసుకు వ్యతిరేకముగా నుండి రనేభావమును వ్యాపింపచేయుటకు కొంతప్రయత్నము జరిగినది. అందువలన కలిగిన పరిస్థితులనుగూర్చి హ్యూమ్ సర్ ఆక్లండుకు వ్రాసినయుత్తరములో విపులముగా చర్చించెను. కాని మొదటి రెండుమూడు కాంగ్రెసులు జరిగిన వెంటనే సర్ ఆక్లండు చెప్పినవిషయము సరియైనది కాదని తేలినది. తరువాత ప్రభుత్వమువారు మహమ్మదీయులకు సంరక్షకులవలె నటిస్తూండడముకూడా వారికి గిట్టలేదు. అలహాబాదులో జరిగిన నాలుగవకాంగ్రెసులో, ఐరోపియ ప్రతిఘటనములను లెక్కపెట్టక అధ్యక్షత వహింప నంగీకరించిన యూల్ గారి ఎన్నికను బలపరుస్తూ, షేక్ రజా హుస్సేన్ ఖాన్, లక్నోలోని సున్నీమహమ్మదీయనాయకుడు కాంగ్రెసు ఉద్యమమునకు సహాయము చేయవలసినదని పంపిన "ఫత్వా"ను ప్రచురించి "కాంగ్రెస్‌కు వ్యతిరేకముగా నున్నది మహమ్మదీయులు కారు; ఉద్యోగస్థులైన వారి యజమానులు" అని ప్రకటించెను. ౧౮౯౧ లోను, తరువాతను జారీచేయబడిన ఫత్వాలనుగూర్చి తెలిసినవారీవిషయమును నిస్సందేహముగా విశ్వసింతురు.

నిజముగా మింటోప్రభుకాలములో సాంఘికప్రాతినిధ్య సిద్ధాంతమున కొక స్వరూపము వచ్చినది. అంతకుపూర్వమే కర్జనుప్రభువు వంగరాష్ట్రమును విభజించి, అధికసంఖ్యాకులగు మహమ్మదీయులతో, తూర్పుబంగాళము అస్సాములను ప్రత్యేకరాష్ట్రముగా చేయవలెనని సంకల్పించుటలోనే ఈ దురదృష్టపు సాంఘిక చైతన్యము రేకెత్తినది. కర్జనుప్రభువు వంగరాష్ట్ర మనే గుఱ్ఱముపైన, సాంఘికవిభేద మనే జీను వేసికొని ౭ సంవత్సరములు ఆ గుఱ్ఱము దాదాపు ప్రాణావశిష్ట మయ్యేవరకును స్వారీ చేసినాడు. తరువాత ఆ గుఱ్ఱమునకు విశ్రాంతి ఇచ్చేటందుకు మింటోప్రభువు వచ్చినాడు. కాని ఆ గుఱ్ఱముపైన జీనుమాత్ర మాలాగే అంటిపట్టుకొనియున్నది. మింటో సంస్కరణములలో మహమ్మదీయులకు ప్రత్యేక ప్రాతినిధ్యము ఏర్పాటు చేయబడినవి. కాని వారికి సమష్టినియోజకవర్గములలో పోటీచేసే అధికారముమాత్రము పోలేదు. సంకుచితబుద్ధు లయిన రాజకీయవేత్తలు కొందరు, తూర్పు బంగాళము, అస్సాము, పాంచాల రాష్ట్రములలో అల్పసంఖ్యాకులయిన హిందువుల కట్టి సాక

ర్యము కలిగింపబడలేదని దుఃఖింపసాగిరి. కాని ఇది నిజముగా తప్పుత్రోవను పడ డము కాదా? అందులో వివిధ సంఘములకు వివిధ పద్ధతుల నియోజకాధికారము లేర్పాటుచేయబడుట మరీ విచిత్రమైన విషయము. మహమ్మదీయుడు వోటరు కావలె నంటే: సంవత్సరమునకు రు. 3000 ల పైన ఆదాయపు పన్ను చెల్లించిన చాలును. మహమ్మదీయేతరుడు వోటరు కావలె నన్నచో సంవత్సరమునకు మూడు లక్షల రూపాయిలపైన ఆదాయపు పన్ను చెల్లించవలసియుండెను. మహమ్మదీయ పట్టభద్రుడు మూడేండ్ల అనుభవముతో వోటరు కాగలడు. మహమ్మదీయేతర పట్ట భద్రునకో 30 యేండ్ల అనుభవము కావలసియుండెను. ఎక్కడ మూడువేల ఆదా యము? ఎక్కడ మూడులక్షల ఆదాయము? మూడేండ్ల అనుభవ మెక్కడ? ముప్పై యేండ్ల అనుభవ మెక్కడ? వయసువచ్చినవా రందరకును ఎన్నిక అధికార మియ్య బడనియెడల మహమ్మదీయులకును, మహమ్మదీయేతరులకును ఎన్నికహక్కులు వేరు వేరుగా నుండవలెననీ, అందువలన వోటర్లలో హిందూమహమ్మదీయులు సరియైన దామాషాలో నుండగలరనీ చేయబడేవాదన లిప్పటికిని మనముకూడా అప్పుడప్పుడు వింటూనేయున్నాము.

ఇక ౧౯౧౦ లో రాజకీయ వ్యవహారములు సందిగ్ధస్థితిలో పడినవి. సర్ వడ్డియం. వెడ్డర్‌బరన్ కాంగ్రెసు అధ్యక్షత వహించెను. ఆయన హిందూ మహమ్మదీయులకు సఖ్యము కుదర్చవలెనని యొకసభ నేర్పాటుచేయ తలపెట్టెను. ఆ రోజులలోనే మున్సిపాలిటీలు, లోకల్‌బోర్డులలో ప్రత్యేక నియోజకవర్గ పద్ధతి నూతనముగా ప్రవేశపెట్టబడినది. ఈపద్ధతిలేని సంయుక్తరాష్ట్రములలో షుమా రేడవవంతు మహమ్మదీయులు గల సమష్టినియోజకవర్గములనుండి ౧౮౯ మంది మహమ్మదీయులు, ౪౪౫ మంది హిందువులు జిల్లాబోర్డులకును, 310 మంది మహమ్మ దీయులు, ౫౬౭ మంది హిందువులు మున్సిపాలిటీలకును ఎన్నుకొనబడిరి. ఆనాడు భారతీయాభ్యుదయమునకు విరోధిగా పరిగణింపబడిన సంయుక్తరాష్ట్రముల లెఫ్టినెంటు గవర్నరు సర్ జాన్ హ్యూవెట్‌కూడ నాటి హిందూమహమ్మదీయ సఖ్యమునకు భంగము కలిగించుట కిష్టపడలేదు. స్థానికసంస్థలకు ప్రత్యేక నియోజక వర్గములను జిన్నాకూడా అంగీకరించలేదు. స్థానికసంస్థలలో సాంఘిక ప్రాతినిధ్య మున కనుకూలించిన 'బరన్' సర్క్యులరు మహమ్మదీయులకు ప్రత్యేక నియోజక వర్గము లుండవలెననీ, హిందూమహమ్మదీయ సఖ్యము నిరంతరాయముగా నుండడ మునకు వారికి మిశ్రమనియోజకవర్గములలో వోటుచేసే అధికారముకూడా యుండ వలెననీ శాసించినది. ౧౯౧౧ లో కలకత్తాలో జరిగిన ౨౬-వ కాంగ్రెసున కధ్యక్షత వహించి బిషన్ నారాయణధా రీ పద్ధతిని నిరసించెను. సర్ వెడ్డర్‌బరన్, ఆగా

ఖానుల సలహా ననుసరించి హిందూమహమ్మదీయ ప్రతినిధులు రెండు సంఘములకును ఐక్యమును చేకూర్చునిమిత్తము సమావేశము కావడమునకు సిద్ధముగా నుండగా, సివిల్ సర్వీసువారి పత్రికగా పరిగణింపబడుతూన్న ఒక ఆంగ్లో ఇండియన్ పత్రిక "ఎందుకీ మనుష్యు లీరెండు సంఘములకును సంఘీభావము చేకూర్చవలెనని కోరుట? వారిని ప్రభుత్వమునకు వ్యతిరేకముగా ప్రోత్సహించేటందుకు కాకపోతే!" అని వ్రాసిన వ్రాతలను బిషన్ నారాయణధా రాతరుణమున ఆయనయుపన్యాసములో నుదాహరించినాడు. ఈ ఒక్క విషయము భారత రాజకీయ రహస్యమును పూర్తిగా వెల్లడించినది.

తరువాత కొద్దికాలములోనే ప్రపంచపరిస్థితులు మారినవి. ఒకటి రెండు శతాబ్దములవరకును, యూరపుఖండమునకు రణరంగములుగా మారిన బాల్కన్ రాష్ట్రములు తిరిగీ నూతనసంగ్రామభూము లైనవి. ౧౯౧౩ లో కరాచీకాంగ్రెసున కధ్యక్షత వహించిన నవాబు సయ్యద్ మహమ్మద్ బహదూర్ "యూరపులో అటోమాన్ రాజ్యపతనమునుగూర్చి, పారసీకదేశపు క్లిష్టపరిస్థితులనుగూర్చి" వివరించెను. టర్కీ సామ్రాజ్యమునకు కలిగిన ఆపత్తునుగూర్చి ఆయన తనవిచారమును వెలిబుచ్చెను. హిందూమహమ్మదీయసోదరులు చేతులుకలిపి తమ మాతృదేశముకొరకు పనిచేయవలెనని చెప్పి ఆయన ముగించెను. ఈసందర్భము మనకు ౧౯౨౧ లోని ఖిలాపతుద్యమమును, దానివలన ఇండియాలోని హిందూ మహమ్మదీయసంబంధములలో కలిగిన పరివర్తనములును జ్ఞాపకము వస్తూన్నవి. ౧౯ వ శతాబ్దములో 'యూరోపురోగి' అని పిలువబడిన టర్కీ హిందూదేశ రాజకీయములలో నీవిధముగా ప్రాముఖ్యస్థానము వహించినది. ఈపరిస్థితులలోనే కరాచీకాంగ్రెసులో హిందూమహమ్మదీయు లేకీభావమును పొందిరి. బ్రిటిష్‌సామ్రాజ్యాంతరస్థ స్వరాజ్య మిండియాయొక్క ఆదర్శముగా మస్లిమ్‌లీగువా రంగీకరించినందు కాకాంగ్రెస్ సంతోషమును వెలిబుచ్చినది. హిందూమహమ్మదీయసంఘములు రెండును పరస్పరసహాయ సానుభూతులు కలిగియుండవలె నను మస్లిములీగువారి సూచన నాకాంగ్రెస్ అంగీకరించినది. భారతదేశమునందలి అన్ని సంఘముల నాయకులును, జాతీయాభ్యుదయమునకు సంబంధించిన అన్ని విషయములలోను కలసి పనిచేయతగిన యొడంబడికకొరకు ప్రయత్నించవలసిన దని కోరిన మస్లిమ్‌లీగువారి అభిప్రాయము నా కాంగ్రెసు మన్నించినది.

౧౯౧౩ కరాచీ కాంగ్రెస్‌లో, ఆనాడు కాంగ్రెస్‌వాదులు వెల్లడించిన సంతోషము వా రీముఖ్య తీర్మానములపైన యిచ్చిన మహోపన్యాసములనుబట్టి తెలియగలదు. భూపేంద్రనాథ్ బాస్ ఉపన్యాసమునుండి ఈక్రిందిభాగము నుదాహరింతుము.

“హిందూమహమ్మదీయులు వారిదృష్టిని ఈసమష్టి ఆదర్శముపైన కేంద్రీకరింప వలయును. నేటి భారతదేశ మొక్క హిందువులది కానీ, యొక్క ముసల్మానులదికానీ కాదు. యూరోపియనులది కానీ, ఆంగ్లో-ఇండియనులది కానీ అంతకంటెను కాదు. నేటి హిందూదేశములో మీ రందరును సమానభాగస్వాములు. ఇదివరకు మన కేమైనను అపోహ లున్నయెడల నేటితో వాటిని విస్మరింతముగాక! భావిభారతదేశము, అశోక చక్రవర్తికాలమునాటికంటె ఎక్కువ బలిష్ఠముగాను, ఎక్కువ గౌరవముగాను, ఎక్కువ యుదారముగాను, ఎక్కువ వికాసవంతముగాను ఉండగలదు. అక్బరు చక్రవర్తి తన విశాలభావప్రపంచకములో చిత్రించుకొనగలిగినదానికంటెను ఎక్కువ ఉత్తమముగా నవతరించగల దది.”

“కాంగ్రెస్ నూతనరంగములో ప్రవేశించినది. నూతనశక్తిబలమువలన నూతన జయమును పొందవచ్చును” అని వాచా చెప్పెను. కాని సాంఘికప్రాతినిధ్యవిషయము మాత్ర మాలాగే నిలిచిపోయినది. ఒక్కసారి గాయముపడినట్టయిన ఎప్పుడును కలక వేస్తూనే యుండును. ముసల్మానులు కోరినది హిందువులు వెంటనే అంగీకరించి యుండి నట్లయితే, ఈసమస్య యెప్పుడో పరిష్కరింపబడియుండేది. సాంఘికప్రాతినిధ్యము నకు సంబంధించిన మింటో-మార్లే ప్రణాళిక దేశముపైన రుద్దబడినది. ప్రజలతో ఆవిష యమునుగూర్చి యెవ్వరును సంప్రతించలేదు. కాబట్టి ౧౯౧౮ వ సంవత్సరములో క్రొత్తసంస్కరణములు ప్రసాదింపబడినప్పుడు, భారతదేశములోని ముఖ్యసంఘముల వారు కలసి యొకయేకగ్రీవమైన ఒడంబడికకు రావలెనని తలంపబడినది. అందుకొరకు కాంగ్రెస్ప్రతినిధులును, మస్లిమ్‌లీగు ప్రతినిధులును, ౧౯౧౮ నవంబరులో కలకత్తా ఇండియన్‌అసోసియేషన్‌భవనములలో సమావేశమైరి. వారు ౧౯౧౬ కాంగ్రెసు చేసిన తీర్మానముల నాచరణలో పెట్టుటనుగూర్చియు, పరస్పరాంగీకారముతో నొక ప్రాతినిధ్యప్రణాళికను తయారుచేయుటనుగూర్చియు యోజించిరి. సరిగా అప్పుడే మస్లిమ్‌లీగు స్వపరిపాలనమును తనయుద్దేశముగా నంగీకరించెను. స్వయంనిర్ణయ సిద్ధాంతము ప్రచారములో నుండెను. వెనుకబడియున్న చిన్నజాతుల కీ సిద్ధాంతము నను వర్తింపచేయడమునకే యుద్ధము ప్రారంభింపబడెను. ఇట్టి అనుకూలవాతావరణము లోనే కలకత్తాసమావేశముకూడా జరిగెను. కాని కాంగ్రెస్‌పెద్దలు మొదటిసూచనలు చేయుటకు కొంత వెనుకంజవేసిరి. కాబట్టి ఆసభలో యువకులే యెక్కువ జోక్యము కలిపించుకొనవలసివచ్చెను. సర్ సయ్యద్ అహమ్మద్ చెప్పినట్లు హిందూమహమ్మ దీయులు భారతమాతకు రెండుకళ్లు. ఈరెంటిలో యేది లోపించినను మాతృముఖము వికల మగును. కాబట్టి ఈరెండుసంఘములలోను వెంటనే యిచ్చిపుచ్చికొనే సామ రస్యభావము కుదిరినది. కనీసపు జనసంఖ్య లేని రాష్ట్రములలోని శాసనసభలయందు

౧౫% కు తక్కువకాని ప్రాతినిధ్య ముండవలెనని అంగీకరింపబడినది. ఇక పంజాబు వంగరాష్ట్రము లుండెను. ఈ రెండురాష్ట్రములనుగూర్చిన సమస్య యొప్పుడును కష్ట మైనదే. కాని అది ౧౯౧౬ లోని లక్నో కాంగ్రెసులో పరిష్కరింపబడినది. ఆపరి ష్కారమే మాంటుఫర్డు ప్రణాళికలో పూర్తిగా చేర్చబడినది. ఒకసంఘమునకు మరి యొక సోదరసంఘము స్నేహవాత్సల్యములతో చూపినసౌకర్యములవలన కలిగే సామ రస్యము వారిరక్షణనిమిత్తము ప్రభుత్వమువారు చేసే యేర్పాటులవలన కలుగదు. సాంఘికనియోజకవర్గములును, సాధారణనియోజకవర్గములును ప్రత్యేకింపబడినవి. ఏ నియోజకవర్గమునకు సంబంధించినవా రా నియోజకవర్గములోమాత్రమే అభ్యర్థులుగా నిలబడవలసియుండెను. కాని ప్రత్యేకసాంఘికనియోజక వర్గములుమాత్రము దేశములో నిలిచిపోయిన వని పాఠకులు జ్ఞాపక ముంచుకొందురుగాక.

## ౧౧. విదేశములలో భారతీయులు

హిందూదేశములోని భారతీయులస్థితి బాగుండలేదు. విదేశములలోనున్న భారతీయులస్థితి మరింత దుర్భరమయ్యెను. "నేటాల్‌లోని కంట్రాక్టుకూలీలు వారి కంట్రాక్టుకాలము పూర్తియైనతరువాత వెంటనే కొత్తకంట్రాక్టులను తీసికొనవలెను. లేదా, వారి సంవత్సరాదాయములో సగము భాగము పోల్‌టాక్సుక్రింద ప్రభుత్వమునకు చెల్లించవలెను." అని ౧౮౯౫లో ఒక చట్టము చేయబడెను. డాక్టరు మూంజీ ౧౯౧౩ లో బోయరుయుద్ధసందర్భమున గాయపడినసైనికులకు పరిచర్యలు చేసేనిమిత్తము దక్షిణాఫ్రికాకు వెళ్లెను. ఆయన తిరిగీ దక్షిణాఫ్రికానుండి రాగానే "మన పాలకులు మనలను మనుష్యులుగా పరిగణించరు" అని అభిప్రాయ మిచ్చెను. ఈసందర్భమున ఆమాట జ్ఞాపకము వస్తూన్నది. ఈవిషయ మునుగూర్చియే జి. యస్. శర్మ ఒకప్పుడు, "సామ్రాజ్యములో ఒకజాతి మరియొక జాతిపైన అధికారము చేసేపద్ధతి చిరకాలము నిలువజాలదు" అని ఇంగ్లాండును మందలించెను. ఆయనే ౧౯౦౫ లో కాశీలో జరిగిన ౨౧వ కాంగ్రెస్‌లో "మన గౌరవమునకు తగినట్లుగా మనము ప్రవర్తించవలె నన్నాడు. గొప్ప మతప్రవక్తలను, గొప్ప రాజకీయధురంధరులను, గొప్ప వీరాధివీరులను సృష్టించుకొనగలిగిన మనజాతి ఇతరజాతులను చిన్నచిన్న ఉపకారములకోసము యాచించకూడదు" అని గర్జించియుండెను.

దక్షిణాఫ్రికాకు చాలమంది భారతీయులు వెళ్లి, అక్కడి సంగతిసందర్భములను ప్రత్యక్షముగా తెలిసికొనిరావడము గలదు. అందులో ముఖ్యుడు మదనజిత్. ఆయన ప్రతిసంవత్సరమును అచటివిషయముల నెట్లో తెలిసికొనివచ్చేవాడు. చాలా సంవత్సములవరకును ఆయనయే కాంగ్రెసులో దక్షిణాఫ్రికాసమస్యనుగూర్చిన తీర్మానములు

తెచ్చినది. ఆయన వయోవృద్ధుడై ఇటీవల మరణించెను. కాని కాషాయాంబరములలో పొడుగాటికఱ్ఱ పుచ్చుకొని వచ్చే ఆపొట్టిమనిషిని కాంగ్రెసువాదులు నేటికిని విస్మరింపజాలరు. దక్షిణాఫ్రికాలో భారతీయులకు చేయబడుతూన్న అన్యాయములను గూర్చిన ప్రతిఘటనము ౧౮౯౪ లో "వలసరాజ్య ప్రభుత్వమువారు భారతీయులకు వోటింగు అధికారమును తీసివేసినబిల్లును రద్దుచేయవలసిన" దనిన కాంగ్రెస్ అధ్యక్షుడు ప్రతిపాదించిన తీర్మానముతోనే ప్రారంభమైనది. తరువాత ప్రతికాంగ్రెసులోను దక్షిణాఫ్రికా సమస్యప్రాముఖ్యస్థానము వహించినది. మన మాదేశములో ఉత్తరువులు లేనిదే ప్రయాణము చేయకూడదనీ, రాత్రి ౯ గంట లయినతరువాత ఇండ్లవెలుపలకుపోకూడదనీ, ట్రాన్సువాలులో పెంటకుప్పలువేసేచోట మనవాండ్లనివేశస్థలము లేర్పాటు చేయబడినవనీ, రైళ్లలో మొదటి రెండుతరగతులలో మనలను ప్రవేశింపనీయరనీ, ట్రామ్ కారులలో మనవాళ్లను కూర్చోనీయరనీ, కాలిదారిని సరిగా నడవనీయరనీ, హోటుళ్లలో నుండనీయరనీ, పబ్లిక్ పార్కులు మనవా ళ్లుపయోగించుకోరాదనీ, మనవాళ్లను తిట్టి, తన్ని, ఉమ్మివేసీ, అనేకవిధాల మానవమాత్రులు భరించరానంతగా అక్కడివారు హింసిస్తారనీ ప్రతికాంగ్రెసులోను, ప్రతిసంవత్సరము దక్షిణాఫ్రికావిషయములు చర్చకు వస్తూనేయుండెను.

౧౮౯౭ లో భారతీయులకు నష్టదాయకములైన మరి మూడుచట్టములు చేయబడెను. అప్పుడు గాంధీ తన ఆందోళనమును ప్రారంభించెను. అప్పటికి వైస్రాయిగానున్న ఎల్జిన్ ప్రభువు నేటాల్ చట్ట మంగీకరింపబడుట కనుకూలించెను. హిందూదేశ రాజ్యాంగకార్యదర్శిగానున్న జార్జి హామిల్టన్ ప్రభువు మనలను "అడవిజాతి" అని నిందించెను. ౧౯౦౦ కాంగ్రెస్, నేటాల్ వలస నిర్బంధములును, నేటాల్ వర్తకలైసెన్సుచట్టములును (Dealers' Licence Acts) తొలగింపబడవలె నని తీర్మానించినది. ౧౯౦౧ లో కలకత్తాలో జరిగిన ౧౭ వ కాంగ్రెస్‌లో గాంధీ "దక్షిణాఫ్రికాలోని లక్షలమంది బ్రిటిష్ఇండియనులపక్షమున ఒక అర్జీదారుడ" నని దక్షిణాఫ్రికాను గూర్చిన తీర్మానము నుపపాదించెను. ౧౯౦౨ లో ఆవిషయమునుగూర్చి భారత రాజ్యాంగకార్యదర్శికి రాయబారము పంపబడెను. కాని ప్రయోజనము లేకపోయినది. ౧౯౦౩, ౧౯౦౪ సంవత్సరములలోని కాంగ్రెసులు పూర్వపుతీర్మానములను పునశ్చరణ చేసినవి. "బోయరుయుద్ధమున కొక కారణము, బోయరు రిపబ్లిక్ ప్రభుత్వమువారు బ్రిటిష్‌పౌరులయిన భారతీయులయెడల ప్రవర్తించిన ప్రవర్తనమే" నని బాధ్యతగల అధికారులు చెప్పినమాటలను కాంగ్రె సుదాహరించి, భారతీయులకు సమానప్రతిపత్తిని, న్యాయమును ప్రసాదించవలసిన దని కోరినది. ౧౯౦౫ లో ఇంకను వ్యవహారములు ముదిరినవి. బోయరుప్రభుత్వములో లేనినిర్బంధములు, బ్రిటిష్‌ప్రభుత్వములో

ప్రవేశపెట్టబడుటను కాంగ్రెసు ప్రతిఘటించినది. కంట్రాక్టుకూలీపద్ధతి, తదితరనిర్బంధ శాసనములు తొలగింపబడవలె నని కాంగ్రెస్ కోరినది. ట్రాన్సువాల్ ఆర్డినెన్సు ప్రభుత్వమువారు తాత్కాలికముగా ఆపివేసిరి. కాని ౧౯౦౬ లో దక్షిణాఫ్రికాకు క్రొత్తరాజ్యాంగచట్టము వచ్చినప్పుడు మరల ఆ ఆర్డినెన్సు అమలులోనికి రావచ్చుననే భీతిని ఆనాటి కాంగ్రెస్‌తీర్మానము వెల్లడించినది. ౧౯౦౮ లో దక్షిణాఫ్రికా రాజ్యాంగచట్టము క్రొత్తగా అమలులోనికి వచ్చే సందర్భమున భారతీయప్రయోజనములుకూడా సంరక్షింపబడవలె నని కాంగ్రెస్ తీర్మానించినది. ౧౯౦౮ లో మద్రాసులో జరిగిన ౨౩ వ కాంగ్రెసుకు, జోహాన్సుబర్గు, బ్రిటిష్ ఇండియన్ సంఘమునుండి పంపబడిన ప్రతినిధి మషీర్ హసన్ కిద్వాయ్ దక్షిణాఫ్రికా సమస్యనుగూర్చి అద్భుతముగా మాట్లాడెను.

౧౯౦౯ నాటి కా విషయమునుగూర్చి అంతవరకును చేయబడిన విజ్ఞాపనలుగాని, పంపబడిన రాయబారములుగాని నిరర్థకము లని తోచి గోఖ్లే మహాశయుడు అధికారుల విశ్వాసద్రోహకృత్యములనుగూర్చి గాంధీనాయకత్వమున నడుపబడుతూన్న భారతీయుల నిరంతర పోరాటమునుగూర్చి వివరించెను. తరువాత సాత్వికనిరోధయుద్ధము ప్రారంభింపబడెను. గోఖ్లే సాత్వికనిరోధమునుగూర్చి " ఆత్మసంరక్షణ దాని ప్రధానస్వభావము. దాని ఆయుధములు నైతికబలము, ఆత్మబలము. సాత్వికనిరోధకుడు దుర్మార్గమును స్వశరీరబాధవలన నిరోధించును. ఆయన ఆత్మబలముతో పశుబలమును జయించును. ఆయన మనుష్యునిలోగల దైవత్వముతో మనిషిలోని పశుత్వమును తొలగించును; త్యాగముతో నిర్బంధవిధానమును ప్రతిఘటించును ; అంతరాత్మతో అధికారబలము నోడించును. అన్యాయమును విశ్వాసముతోను, అసత్యమును సత్యముతోను నిర్మూలింపగలవా డొక్క సాత్వికనిరోధకుడే " అని వ్యాఖ్యానము చేసెను. సాత్వికనిరోధనిధికి తక్షణము రు. ౧౮౦౦౦ లు వసూలయ్యెను. ఇదిగాక సర్ జమ్‌షెడ్జీ టాటాగారి రెండవకుమారుడు రతన్ జె. టాటా దక్షిణాఫ్రికాభారతీయుల కష్టనివారణార్థము రు. ౨౫౦౦౦ ల నిచ్చెను. ౧౯౦౯ లో జరిగిన ౨౪ వ కాంగ్రెసు, లాహోరులో ఆయన నిందుకు కృతజ్ఞతతో అభినందించినది. అలహాబాదులో జరిగిన ౧౯౧౦ కాంగ్రెసునాటికి సాత్వికనిరోధోద్యమము తీవ్రముగా సాగుతూ ఉండెను. "ట్రాన్సువాలులోని భారతీయులు, తమ సోదరుల క్షేమమును స్మరించి, అనేక కష్టపరంపరలమధ్య వారి ప్రాథమికహక్కుల సంరక్షణార్థము చేస్తూన్న స్వార్థరహిత శాంతియుద్ధములో చూపిన త్యాగ, ధైర్య, దేశాభిమానముల కీకాంగ్రెసువారు వారిని శ్లాఘిస్తున్నారు" అనే తీర్మానము ౧౯౧౦

కాంగ్రెసులో నంగీకరింపబడినది. ౧౯౧౧ లో ౨౬ వ కాంగ్రెస్ సమావేశమయ్యే సరికి శుభదినములు వచ్చినవి. యాంటీ ఏషియాటిక్కు శాసనము రద్దుచేయబడినందుకు గాంధీని, ట్రాన్సువాల్ భారతీయులను ఆ కాంగ్రెస్ అభినందించినది. కాని దక్షిణాఫ్రికా యూనియనువారు చేసిన వాగ్దానములు వలసచట్టము (Immigration Act) లో భంగము చేయబడినందున, ౧౯౧౩ కాంగ్రెస్ తిరిగీ ప్రతిఘటిస్తూ ఆచట్టమును రద్దుచేయవలసిన దని రాజుగారిని సవినయముగా ప్రార్థించినది. అప్పటినైప్రాయి హార్డింజిప్రభు ఈవిషయములలో పట్టుదలగా పనిచేసెను. ఆయనకు చేదోడుగా నుండుటకై ౧౯౧౩ లోని కరాచీకాంగ్రెసు కంట్రాక్టు కూలీపద్ధతిని రద్దుచేయవలసిన దని తిరిగీ తీర్మానించినది. తరువాత నది రద్దుచేయబడినది. దక్షిణాఫ్రికాసమస్య సగము పరిష్కార మైనందుకు హార్డింజిప్రభువునకు కాంగ్రెసు కృతజ్ఞతను ప్రకటించెను. గాంధీని, ఆయనఅనుచరులను, భారత దేశపు గౌరవమును నిలబెట్టుటకు వారు చేసిన త్యాగములను కరాచీకాంగ్రెసు కొనియాడినది.

గాంధీ దక్షిణాఫ్రికానుండి ఇండియాకు ప్రవేశించడమున కిదే ప్రారంభ మని చెప్పవచ్చును. ఎందువల్ల ననగా ౧౯౧౪ జులైలో యుద్ధము ప్రారంభమైన వెంటనే ఆయన దక్షిణాఫ్రికాను విడిచివచ్చెను. ౧౯౦౫ నుండీ, ఆయనచేసిన సత్యనిర్ధారణా ప్రయత్నములను గూర్చి, ఆయన చాంపరాన్‌లో, కైరాలో, బోర్సాద్‌లో, బార్డోలీలో, చిట్టచివర కఖిలభారతదేశములో నడపిన సత్యాగ్రహోద్యమ ఫలితములను గూర్చి తెలియనివా రుండరు. వీటినిగూర్చి ఇందుకు సంబంధించిన ఆయా అధ్యాయములలో వివరింతుము.

ఈలోగా మన మందరమును తెలుసుకొనవలెనని కుతూహలపడదగిన కథ యొకటి జరిగినది. కనడా ప్రీవీకౌన్సిలువారు " నిరంతరప్రయాణ నిబంధనము " (Continuous journey clause) అనే ఒక ఆర్డరును జారీచేసిరి. ఆ ఆర్డరును గూర్చి కరాచీలో, ౧౯౧౩ లో జరిగిన ౨౮-వ కాంగ్రెసు చేసినతీర్మానమును చూచిన యెడల దానిస్వరూపము పాఠకులకు బోధపడగలదు. ఆతీర్మాన మిది :

"ఈరెండుదేశములమధ్య సరాసరి పోయే పొగయోడలు లేవు కాబట్టిన్నీ, ఇప్పుడున్న పొగయోడకంపెనీలు సరాసరి ప్రయాణమునకు టిక్కెట్లీయవు కాబట్టిన్నీ, ఈ ఆర్డరిదివరకు కాదేశములో (కనడాలో) నివసించియుండని భారతీయుల నాదేశమునకు పోనీయకుండా నిరోధము కల్పిస్తున్నది. అంతేకాక, ఇదివరకే ఆదేశములో నివాస మేర్పరచుకొనిన భారతీయులకు వారికుటుంబముల నాదేశమునకు తీసుకొని

పోకుండ నిషేధిస్తున్నది. కాబట్టి ఈనిరంతర ప్రయాణశాసనము (continuous journey regulation) రద్దుచేయించవలసిన అవసరమునుగూర్చి సామ్రాజ్యప్రభుత్వమున కీకాంగ్రెసు నివేదిస్తున్నది."

ఇక పైన సూచించబడినకథ ఈసంవత్సరములోనే ౧౯౧౪ జులైలో యుద్ధము ప్రారంభ మైనతరువాత జరిగినది. అది ఆధునిక భారతచరిత్రములో నొక అద్భుత సంఘటన మని చెప్పవచ్చును. భారతభావిసంతతి దానిని గూర్చి తెలుసుకొని తీర వలెను. ఈకనడాయుత్తరువులను నిర్మూలించవలె ననేయుద్దేశముతో బాబా గురుదత్తుసింగు అనే సిక్కుమతస్థుడు "కోమగాటమారు" అనే పేరుగల స్టీమరును బాడుగకు తీసికొని, ౬౦౦ మంది సిక్కుఅనుచరులతో, మామూలుమజిలీరేవులైన టోకియో లోగాని, హాంగ్‌కాంగ్‌లోగాని ఆగకుండానే సరాసరి కనడాకు ప్రయాణమయ్యెను.

"కోమగాటమారు" లోని ప్రయాణీకులను కనడాలోని అధికారులు వారిరేవులో దిగనీయలేదు. అందువలన ఆపడవ సరాసరి ఇండియాకు తిరిగిరావలసివచ్చినది. పడవలోని ప్రయాణీకులు బజ్‌బజ్‌లో దిగినారు. అచటి అధికారులు వారిని పంజాబుకు పోవలసినదనీ, అంతకుతప్ప వారియిష్టమువచ్చిన ప్రదేశములకు పోరాదనీ యుత్తరువులు చేసిరి. ప్రయాణీకులు తమను కనడాప్రభుత్వమచ్చట దిగనీయకపోవడ మన్యాయమనీ, అందువలన తమకు చాలా నష్టము కలిగినదనీ, ఈకష్ట పూర్తిగా ప్రభుత్వమువారికి ముందు విన్నవించుకొంటేనేగాని పంజాబుకై లెక్కచేయలేదనీ పట్టుపట్టినారు. అవసరమైనయెడల వారంతాపైన అరెస్టు చేయబడుటకుకూడ వారంగీకరించిరి. బాబా గురుదత్తసింగరెస్టుచేయబడెను అప్పుడు గురుదత్ సింగ్ అనుచరులలో కొందరు తుపాకులను కాల్చినారని ప్రభుత్వమువారి వాదము. తుపాకులుగాని, మరేవిధమైన కాలుపు ఆయుధములుగాని యుపయోగింపబడనేలేదనీ, పోలీసువారు సిక్కులను లాఠీలతో కొట్టినప్పుడు వారు పోలీసులచేతులనుండీ లాఠీలను లాక్కొన్నమాట వాస్తవమనీ గురుదత్తుసింగువాదము. ఆగంద్రగోళములో ఒక పోలీసు ఉద్యోగస్థుడు మరణించినాడని ప్రభుత్వమువారివాదము. ఆపోలీసు ఉద్యోగస్థుడు రంగమునుండి పారిపోయినాడనీ, యెందువలన మరణించినాడో తెలియదనీ గురుదత్తుసింగు వాదన. ఈసందర్భమున ఆ అరెస్టుచేయబడిన ౬౦౦ లో స్వామి గోవిందానంద్ కూడ ఒకడని చెప్పవలసియున్నది. గురుదత్ సింగు తప్పించుకొని నాటినుండి ఏడెనిమిది సంవత్సరములు ప్రవాసిగా నుండెను. కాని ఆయన ఇండియాను విడిచిపోలేదు. బజ్‌బజ్‌నుండి పూరీవెళ్లి, అక్కడ రెండుమూడునెలలుండెను. అక్కడనుండి వక్కడు వెళ్లి ఒక్కసంవత్సరముండెను. అక్కడనుండి గ్వాలియర్ సంస్థానమునకు పోయి అక్కడ ౧౯౧౫ మార్చివరకును ఉండెను. తరువాత రాజపుటానాకు పోయి రాజపుటానా

కతియవారు సంస్థానములలో, ఒకచోటనుండి మరియొకచోటకు తిరుగుతూ ౧౯౧౫ వరకును కాలము గడపెను. ౧౯౧౫ తరువాత బొంబాయికి పోయి నగరమునకు వెలుపల మహల్‌బందరులో షిప్‌బిల్డింగ్ కంపెనీలో (నౌకలను తయారుచేసే కంపెనీ) మానేజరుగా నుండెను. ఆయన "వాల్డురాజ్" అనే పేరుతో వ్యవహరింపబడుతూండెను. ఈకథ అంతా ఇటీవల ౧౯౩౫ జనవరి ౧౬-వ తేదీని బాబా గురుదత్ సింగ్ స్వయముగా కోర్టులో చెప్పినసాక్ష్యమునుబట్టి తెలిసినది.

బాబా గురుదత్ సింగు కనడానుండి వెనుకచెప్పబడిన పరిస్థితులలో ఇండియాకు తిరిగీ రాగా వంగరాష్ట్ర ప్రభుత్వమువారు "కోమగాటమారు" స్టీమరులోని వస్తువులనన్నిటిని పోలీసువారిద్వారా స్వాధీనపరచుకొనిరి. ఆవస్తువులను తిరిగీ తన స్వాధీనము చేయించవలసిన దని భారత రాజ్యాంగకార్యదర్శిపైన దావా తెచ్చెను. కాని ఆదావాయున్ను, అందుపైన చేయబడిన అప్పీలున్ను కూడా త్రోసివేయబడినవి. కలకత్తాలోని "స్టేట్సుమన్" పత్రిక రెండుకోర్టులలోను జరిగిన విచారణల నన్నిటిని ప్రచురించి పైపెచ్చు "గాంధీపక్షము" అనే శీర్షిక క్రింద ఒక వ్యాసముకూడా ప్రకటించినది. ఆవ్యాసములో గురుదత్ సింగు ఒక నేరస్థుడనీ, ఆయుధములు, మందుగుండు సామానులు రహస్యముగా తెప్పిస్తాడనీ, రాజుగారి శత్రువులకు [illegible]లో చేసినవాడనీ, ఆయన కనడాకు వలసపోవడము తిరుగుబాటు సంబంధమనీ, ఆయన విప్లవకారుల కుట్రలలో చేరినవాడనీ, ఇదివర కనేకదురాగతములు చేసినవాడనీ సూచింపబడెను. ఈ వ్యాసమే గురుదత్ సింగ్ స్టేట్సుమన్ లిమిటెడ్, స్టేట్సుమన్ సంపాదకుడు, స్టేట్సుమన్ ప్రకటనకర్తలపైన రు. ౫౦౦౦౦ ల నష్టపరిహారమునకు వేసిన దావాకు కారణమైనది. ఈదావాలోనే జస్టిస్ కల్కిఫీయెదుట ఇంతకుపూర్వ ముదాహరింపబడిన ఆయనప్రవాసకథ ఆయనచే స్వయముగా నుదాహరింపబడినది. ఆయన ప్రవాసములో ౧౯౨౧ నవంబరులో ఒకసారి గాంధీని దర్శించెను. గాంధీ ఆయనను స్వయముగా ప్రభుత్వమునకు స్వాధీనము కావలసిన దని సలహాయిచ్చెను. ఆయన ఆప్రకారము చేసెను. గవర్నమెంటువా రాయనను ఖైదుచేసిరి. ౧౯౨౨ ఫిబ్రవరి ౨౫ వ తేదీని ఆయన లాహోరుజైలునుండి విడుదల చేయబడెను. అప్పటి కాయన ఖైదుచేయబడిన ఆర్డినెన్సుకాలము పరిసమాప్తి మైనది. తరువాత ఆయన యిచ్చిన ఒక యుపన్యాసమున కాయనకు ౫ సంవత్సరములు కఠినశిక్ష విధింపబడెను. గురుదత్ సింగ్ మాతృదేశముకోస మఖండత్యాగము చేసి, నిరంతరకష్టపరంపరలను తరించిన ప్రజాసేవకుడు. నేటికిని ఆయన తనసేవాప్రవృత్తులచే దేశమాతను పూజిస్తూనేయున్నాడు.

## ౧౨. ఉప్పుపన్ను

౧౯౩౦ లోని ఉప్పుసత్యాగ్రహమూలమున ఉప్పుపన్నునుగూర్చిన విషయము భారతరాజకీయములలో ప్రాముఖ్యస్థానము వహించినది. ౧౮౩౬ లో సాల్టుకమిషన్ వారు చేసిన సిఫారసులనుగూర్చి, ఉప్పుపన్ను పుట్టుకనుగూర్చి తెలిసియున్న మనకు ౧౮౮౮ లో కాంగ్రెసువారు ఉప్పుపన్ను నెదిరించిన కారణములను గమనించినయెడల ఆశ్చర్యము కలుగకమానదు. వారు, ఉప్పుపైన పన్ను విధింపబడుటయే అన్యాయమని గాని, అది కేవలము బ్రిటిష్‌వారి నౌకావ్యాపారసహాయమునిమిత్తమును, ఎగుమతి వ్యాపారసహాయమునిమిత్తమును వేయబడినదని గాని దాని నెదిరించలేదు. ఉప్పుపన్ను ఇటీవల ఎక్కువ చేయబడినదనీ, అందువల్ల పేదవాండ్లకు మరింత భారముగా నున్నదనీ చెప్పి దాని నెదిరించినారు. ౧౮౯౦ కాంగ్రెస్‌కూడా "ఇటీవల ఎక్కువ చేయబడిన ఉప్పుపన్నును తగ్గించవలసిన" దని తీర్మానించినదేగాని, పూర్తిగా రద్దు చేయవలసినదని నిర్ణయించలేదు. తరువాత ఎనిమిది కాంగ్రెసులలో దాదాపుగా నట్టితీర్మానమే చేయబడినది. ఒక కాంగ్రెసులో ఉప్పుపన్ను ౧౮౭౮ రేటు ప్రకారముండవలెననీ, మరియొక కాంగ్రెసులో ౧౮౮౮ రేటుప్రకారముండవలెననీ తీర్మానింపబడినది. చిట్టచివరిపర్యాయము ౧౯౦౨ లో మాత్రము, ఉప్పుపన్నెక్కువయినకారణమున ప్రజలు తక్కువయుప్పు భుజిస్తున్నారనీ, అందువలన రోగములు ప్రబలిపోవుచున్నవనీ ఒక క్రొత్తకారణము సూచింపబడినది. తరువాత ఉప్పునుగూర్చినవిషయము కాంగ్రెసురంగమునుండి కౌన్సిలురంగమునకు మారినది. గోఖ్లేగారి కది అభిమానవిషయమైనది.

## ౧౩. త్రాగుడు-వ్యభిచారము

ప్రజల నందరను నీతిమంతులనుగా చేయవలె ననువిషయము కాంగ్రెసుదృష్టి నాకర్షించినది. దేశములో పెరిగిపోతూన్న త్రాగుబోతుతనమును రూపుమాపి, జనులలో మర్యాద, ఆత్మగౌరవము పెంపొందింపచేయవలెనని కాంగ్రెస్ అభిప్రాయము. ౧౮౮౯వ సంవత్సరములో ఈవిషయమునుగూర్చి కేన్, స్మిత్తుగార్లు తెచ్చిన తీర్మానము పార్లమెంటులో నెగ్గినది. కాంగ్రెసువారాతీర్మానము నమలుపరచవలసినదని కోరిరి. విదేశపుసారాయిలపైన వేయబడిన ధనమతిపన్నునుగూర్చి, నాటుసారాయిలపైన వేయబడిన నిషేధపుపన్నునుగూర్చి, ౧౮౮౯-౯౦ సంవత్సరములలో మద్రాసుప్రభుత్వమువారు ౪౦౦౦ సారాయిదుకాణములను మూసివేయుటనుగూర్చి ౧౮౯౦ కాంగ్రెస్ సంతోషమును వెల్లడించినది. కాని ఇండియాప్రభుత్వమువారీవిషయములో ప్రజాభిప్రాయమును తెలుసుకొని, సాధ్యమైనంతవరకందు కనుగుణముగా

ఆచరించవలసిన దని రాష్ట్రప్రభుత్వములవారికి పంపినసలహా సరిగా గౌరవింపబడ లేదు. తరువాత ౧౦ సంవత్సరములవరకును కాంగ్రెసీవిషయమునుగూర్చి చర్చించ లేదు. ౧౮౯౦ సంవత్సరములో సారాయి చౌకగా సప్లయిచేయబడుటయే త్రాగు బోతుతన మంతకంతకు పెరిగిపోవుటకును కారణ మని కాంగ్రెస్ సూచించినది. త్రాగుబోతుతనమును నిర్మూలించుటకును అమెరికాలో చేయబడిన చట్టములవంటి చట్టము లిండియాలోకూడా చేయబడవలెనని కాంగ్రెస్ కోరినది. మందుల కుపయో గపడని మత్తుపదార్థములపైన ఎక్సైజుపన్నులను విధించవలెనని కాంగ్రెస్ సలహా యిచ్చినది. ఈకాంగ్రెసులోనే బ్రిటిష్‌పరిపాలనము మనకు షేక్స్పియర్, మిల్టన్లనే గాక బ్రాందీబుడ్లనుకూడ అనుగ్రహించిన దని ఎప్పుడో కేశవచంద్రసేను చెప్పినమాటలను కుమార యమ్. యన్. చౌదరీ జ్ఞాపకముచేసినారు.

౧౮౮౭ లోని ఎక్సైజుకమిషనువారు పాశ్చాత్యకవిద్యవలనే త్రాగుబోతుతనము జాస్తీ అయిన దని చెప్పినమాటను పురస్కరించుకొని, దానివలన దేశీయశిల్పపరిశ్రమలు నానాటికి క్షీణించి, ప్రభుత్వమువారి ఉదారాశయములకు భంగము కలుగుతూన్న దని కాంగ్రెసు సూచించినది.

కాంగ్రెసు తలపెట్టిన మరియొక సంఘసంస్కరణము ప్రభుత్వమువారిచే యేర్పాటుచేయబడిన వ్యభిచారనిర్మూలనము. సిపాయీలు క్యాంపులో నున్నప్పుడును, ప్రయాణము చేస్తూన్నప్పుడునుకూడ వారికొరకు ప్రభుత్వమువారు వ్యభిచారస్త్రీలను సమకూర్చియుంచి రన్నవిషయము చాలామందికి తెలుసును. ఈసంగతి మొట్టమొదట విన్నప్పుడు సున్నితమైన మనస్సులకు కష్టముగా తోచినది. కాని ఇట్టి విషయము లతో నిరంతరము సంబంధముగలవారి బుద్ధులు మొద్దుబారుతవి. ౧౮౮౮ లో అలహా బాదులో యూల్‌గారి అధ్యక్షత క్రింద జరిగిన నాలుగవ కాంగ్రెసు ఇండియా ప్రభుత్వముచే యేర్పాటు చేయబడిన వ్యభిచారనిర్మూలనముకోసము ప్రయత్నము చేసే బ్రిటిష్‌ప్రజలకు సంపూర్ణ సహాయమును వాగ్దానము చేసినది. ౨౦౦౦ మందిపైచిలుకు వ్యభిచారస్త్రీలు యువకసైనికుల నైతికజీవితములను నాశనముచేసేనిమిత్తము ప్రభు త్వమువారిచే యేర్పాటుచేయబడినా రని కెప్టెన్ బానర్ కఠినముగా విమర్శించినారు. ౧౮౯౨ లో అలహాబాదులో జరిగిన ౮ వ కాంగ్రెసు, ఇండియా ప్రభుత్వమువారి నాటి నైతికశాసనమును జాగ్రత్తగా గమనిస్తూన్న కామన్సుసభ నభినందించి మన దేశములో నిలిచియున్న అన్ని అవినీతికరచట్టములకును ప్రభుత్వమువారిని నిందించినవి.

మరుసంవత్సర మిండియాఆఫీసుకమిటీకి సంబంధించిన పార్లమెంటుసభ్యులు, భారతదేశపు సైనికకేంద్రములలో వ్యాపించియున్న వ్యభిచారమును, అంటువ్యాధులను

గూర్చి యొకనివేదికను పార్లమెంటుకు పంపిరి. అందులో వారు ప్రభుత్వనిబంధనలను, ఉత్తరువులనుగూర్చి, అవి అమలు జరుపబడే విధానమునుగూర్చి విపులముగా చర్చించిరి. ౧౮౮౮ జూన్ ౫ వ తేదీని కామన్సుసభవారు చేసిన తీర్మానముయొక్క మహదాశయముల కనుగుణముగా ప్రభుత్వమువారి నియమావళికాని, కార్యవిధానముగాని లేదు. కాబట్టి ఈ దుష్టాచారము సమూలముగా నిర్మూలింపబడవలెనన్న యెడల స్పష్టమైన శాసనమే చేయబడవలె నని కాంగ్రెసు ప్రకటించినది.

## ౧౮. స్త్రీలు-నిమ్నజాతులు

ఇండియాకు మాంటేగురాకతో స్త్రీల పౌరసత్వపుహక్కులనుగూర్చిన విషయము ప్రధానస్థాన మాక్రమించినది. పురుషులతో స్త్రీలకు సమానహక్కు లీదేశములో నెంత తొందరగా అంగీకరింపబడినవో తెలుసుకొన్నయెడల చాలా ఆశ్చర్యము కలుగగలదు. ౧౯౧౭లో జరిగిన కలకత్తా కాంగ్రెస్ "ఎన్నుకొనడమునకును, ఎన్నుకోబడడమునకును పురుషులతోపాటు స్త్రీలును సమానాధికారములనే కలిగి యుండవలెను" అని తీర్మానించినది. జాతీయపునర్నిర్మాణములో ముఖ్యాంగముగా పరిగణింపబడుతూన్న నిమ్నజాత్యుద్ధరణవిషయములోకూడ కాంగ్రెస్ తన విశాలదృష్టి కనుగుణముగా "నిమ్నజాతులవిషయములో ఆచారపరంపరగా కల్పింపబడిన ప్రతిబంధనములు మిక్కిలి అసహ్యాకరములుగాను, బాధాకరములుగాను ఉన్నందున, వాటిని న్యాయముకోసము, ధర్మముకోసము, అవసరముకోసము తొలగించవలెనని భారతప్రజల నీకాంగ్రెస్‌వారు ప్రార్థిస్తున్నారు"
అనే తీర్మానము నంగీకరించినది.

## ౧౯. చిల్లరవిషయములు

ఈకాలములో కాంగ్రెసు అనేకచిల్లరవిషయములను చర్చించినది. ముఖ్యముగా విద్యావిధానమునుగూర్చి, అనగా ప్రైమరీ, విశ్వవిద్యాలయ, పరిశోధక, పారిశ్రామిక విద్యాపద్ధతులనుగూర్చి చర్చించినది. కేంద్రరాష్ట్రీ యార్థికవిషయములు, అనగా వెండి పన్నులు, ఇన్‌కంటాక్సు, మారకము మొదలగునవి తరుచాతిముఖ్యవిషయములుగా చర్చింపబడినవి. స్థానికస్వపరిపాలనాసంస్థలనుగూర్చి, ముఖ్యముగా కలకత్తా మద్రాసు నగరములలోని కార్పొరేషనుల విషయములో ప్రభుత్వమువా రప్పుడప్పుడు అవలంబిస్తూవచ్చిన నిరంకుశవిధానమును నిరసిస్తూ కొన్ని తీర్మానములు చేయబడినవి. ప్లేగు రోజులలో పారిశుద్ధ్యమునుగూర్చి, బలవంతపుకూలిపనిని గూర్చి ఒకటిరెండుసారులు

కాంగ్రెసులో చర్చింపబడినది. రాజభక్తి కాంగ్రెసువేదికపైన అనేకసారులు ప్రకటింపబడినది. ౧౯౦౧ లోని విక్టోరియారాణి యొక్కయు, ౧౯౧౦ లోని ఎడ్వర్డు చక్రవర్తియొక్కయు మరణములు కాంగ్రెసుకు తనరాజభక్తిని ప్రకటించుకొనడమునకు నూతనావకాశములను కల్పించినవి. ఎడ్వర్డుచక్రవర్తికిని, జార్జి చక్రవర్తికిని ఆహ్వానప్రతీర్మానములు చేయబడినవి. కాంగ్రెసు ౧౯౦౫ లో వేల్సు యువరాజును, ౧౯౧౧ లో చక్రవర్తిగను జార్జిసార్వభౌముని ఆహ్వానించినది.

## బర్మా

నేను బర్మాను భారతదేశమునుండి విడదీయుటను గూర్చి కావలసినంత గ్రంథము వ్రాయుచున్నాను. మన మొక్కసారి కాంగ్రెసు పుట్టిన సంవత్సరమునకు మన దృష్టిని మరల్చి, ఆనాడు బర్మాను భారతదేశములో చేర్చుటనుగూర్చి కాంగ్రెసేమిచెప్పినదో చూతము. ౧౮౮౫లో జరిగిన మొదటికాంగ్రెస్ ఎగువబర్మాను భారతదేశములో చేర్చుడమును నిరసించినది: ఒకవేళ చేర్చుటయే అవసరమైనయెడల ఇండియానుండి పూర్తిగా బర్మా అంతయును విడదీయబడి సింహళమువలెనే బ్రిటిష్వలసరాజ్యముగా అన్నివిషయములలోను భారతదేశమునకు సంబంధము లేకుండ నుండవలయు నని తీర్మానించినది.

## ౧౬. కాంగ్రెసు నిర్మాణవిధానము

కాంగ్రెసుపుట్టిన ౫౦-వయేట దాని నిర్మాణవిధానములో గలిగిన సంపూర్ణపరివర్తనమునుబట్టి కాంగ్రెసు నిర్మాణవిషయము నేడు మరింత ప్రాముఖ్యమునకు వచ్చినది. కాంగ్రెసు ఒక జాయింటుస్టాకుకంపెనీవలెగాని, లేక ౧౮౬౦వ సంవత్సరపు ౨౧వ చట్టముక్రింద రిజిస్టరయిన సంఘమువలెగాని ప్రారంభింపబడలేదు. దాని స్థాపనమునకు ముందు నిబంధనలుగాని, నియమావళిగాని వ్రాయబడియుండలేదు. అది మొట్టమొదట కొందరు సుప్రసిద్ధపురుషుల సామాన్య సమావేశము. ఆమహాపురుషుల నైతికబలమువలన నది కాలక్రమాభివృద్ధిని పొంది పుష్టివహించినది. ౧౮౯౯ వ సంవత్సరములోనే కాంగ్రెసున కొక నిర్మాణవిధానము (constitution) తయారు చేయబడవలె నని సూచింపబడినది. కాని కాంగ్రెసింకను తదితరరాష్ట్రములలో కూడ జరుపబడి మరికొంత అనుభవమును గడించేవంతవరకును, దాని కార్యవిధానమునకు సంబంధించిన నియమావళిమాత్రము చేయబడిన చాలు నని తీర్మానింపబడినది. అందుకొరకు ఒక కమిటీ యేర్పాటు చేయబడినది. ఆకాలములో నొక కాంగ్రెసుతరువాత మరుకాంగ్రెస్వరకును పని చాలా తక్కువ జరుగుతూండేది. అందువలన సంవ

త్సరముపొడుగునను కాంగ్రెస్‌పని జరిగే యేర్పాటవసరమని గ్రహింపబడినది. ౧౮౯౯ నాటికి కాంగ్రెసుకు ప్రతినిధులు శరపరంపరలుగా రావడము మొదలుపెట్టిరి. కాబట్టి ఆసంవత్సరపు కాంగ్రెసులోనే ప్రతి ౧౦ లక్షల జనసంఖ్యకు అయిదుగురు ప్రతినిధులవంతున రావచ్చునని పరిమితి యేర్పాటుచేయబడినది. ఇండియాలో కాంగ్రెసుకొక అసిస్టెంటుకార్యదర్శి నియమింపబడెను. డిగ్బీ (సి. ఐ. ఇ.) గారు జీతముమీద సీమలోని కాంగ్రెసుకమిటీకి కార్యదర్శిగా నియమింపబడిరి. రాజకీయసంస్కరణములవిషయములో కాంగ్రెస్‌అభిప్రాయమును సీమలో ప్రచారము చేసేనిమిత్త మొక రాయబారవర్గము నియమింపబడినది.

౧౮౮౮ లోని నాలుగవ కాంగ్రెస్‌లో, హిందూప్రతినిధులుగాని, మహమ్మదీయ ప్రతినిధులుగాని ఏకగ్రీవముగాగాని, లేక దాదాపు ఆవిధముగాగాని అభ్యంతర పెట్టే యేతీర్మానమును విషయనిర్ధారణసభవారు చర్చకు పెట్టరాదని నిర్ణయింపబడినది. ఈ నిబంధనయే ౧౯౦౮ లో నంగీకరింపబడిన కాంగ్రెసు నియమావళిప్రకారము ఆయాసంఘముల ప్రతినిధులలో ముప్పాతికవంతు వ్యతిరేకు లున్నయెడల చర్చకు పెట్టబడరా దని మార్చబడినది.

౧౮౯౯ లో కాంగ్రెసుప్రతినిధులు వేయిమందికన్న యెక్కువ యుండరాదని నిర్ణయింపబడినది. ౧౮౯౫ లో సీమలోని కాంగ్రెసుకమిటీ ఖర్చులనిమిత్తమున్ను, "ఇండియా" అనబడు కాంగ్రెసుపత్రిక నక్కడ ప్రచురించే నిమిత్తమున్ను రు.౬౦,౦౦౦ లు శాంక్షన్ చేయబడినవి. దీనినిబట్టియే సీమలో కాంగ్రెసుప్రచార మెంత ప్రాముఖ్యముగా తలపబడినదో మన మూహించుకొనవచ్చును. ౧౨ వ కాంగ్రెసులో (౧౮౯౬) కూడా అంతసొమ్ము సీమకు పంపవలెనని అంగీకరింపబడినది. ౧౮౯౭ లో కాంగ్రెసుకు నిర్మాణనియమావళి యేర్పాటుచేయబడవలె నని తిరిగీ ప్రయత్నము జరిగినది. ౧౮౯౮ మద్రాసుకాంగ్రెసొక చిత్తునిర్మాణ విధానమును తయారుచేసి ప్రతినిధులందరకును అందించినది. దానిని విచారించి మరుకాంగ్రెసు కొక సరియైన ప్రణాళికను తయారుచేసి పంపేనిమిత్త మొక కమిటీ నియమింపబడినది. ౧౮౯౯ లోని లక్నో కాంగ్రెసు ఒక సంపూర్ణ నిర్మాణవిధానము నంగీకరించినది. ఆనాటి కాంగ్రెసు ఆదర్శమును ౧౯౦౮, ౧౯౨౦, ౧౯౩౪ సంవత్సరముల కాంగ్రెసుఆదర్శములతో పోల్చి చూతుము గాక. లక్నోలో, ౧౮౯౯ కాంగ్రెసులో, "భారతదేశపుప్రజల ప్రయోజనములను, పురోభివృద్ధిని చట్టసమ్మతమైన విధానముల నవలంబించి ప్రోత్సహించుటయే భారతజాతీయమహాసభోద్దేశము" అని నిర్ణయింపబడినది.

౧౯౦౮ కాంగ్రెసులో వలసరాష్ట్రీ స్వపరిపాలనాపద్ధతియే ఆదర్శమని ప్రకటింపబడినది. ౧౯౨౦ లో శాంతము, ధర్మసమ్మతము అయిన సకలపద్ధతులచేతను స్వరాజ్యమును సంపాదించడమే కాంగ్రెసుఉద్దేశముగా అంగీకరింపబడినది. ౧౯౨౯ లాహోరుకాంగ్రెసులో "పూర్ణస్వరాజ్యము" లక్ష్యముగా పరిగణింపబడినది. కాంగ్రెసుఆదర్శములలో కాలవశమున గలిగిన ఈమార్పులనుబట్టియే భారతజాతీయోద్యమ పరిణామస్వరూపము పాఠకులకు బోధపడగలదు. ఇక లక్నో కాంగ్రెసు నిర్మాణ విధానమునుబట్టి అఖిలభారత కాంగ్రెసు సంఘమునకు మొత్తము ౪౫ మంది సభ్యులుండిరి. అందులో ౪౦ మంది ఆయా రాష్ట్రీయకాంగ్రెసుసంఘముల సిఫారసుల ననుసరించి కాంగ్రెసుచే నెన్నుకొనబడినవారు. తక్కినవా రధికారరీత్యా సభ్యులుగా నుండిరి. ఆసంఘమున కొక కార్యదర్శి, జీతము పుచ్చుకొని పనిచేసే ఒక అసిస్టెంటు కార్యదర్శి యుండిరి. ఆ సంఘవ్యయమునిమిత్తము రు. ౫౦౦౦ లు శాంక్షన్ చేయబడెను. అందులో సగము మొత్తము జరిగిన కాంగ్రెసు ఆహ్వాన సంఘమువారును, తక్కిన సగముమొత్తమును జరుగబోయే కాంగ్రెసుఆహ్వానసంఘమువారును చెల్లించవలసియుండెను. సంవత్సరముపొడుగునను కాంగ్రెసుస్థాయిసంఘముల నిర్మాణనిమిత్తమును, రాష్ట్రీయమహాసభలను జరిపేనిమిత్తమును తగినయేర్పాట్లు చేయబడినవి. భారత కాంగ్రెసుకమిటీయే కాంగ్రెసుచిత్తుతీర్మానములను తయారుచేయవలసియుండెను. అధ్యక్షునిపేరు సూచించడమునకు కూడా ఆ కమిటీకే అధికారముండెను.

కాంగ్రెసుకు శాశ్వతనిధి నేర్పాటుచేసి ఏడుగురు ట్రస్టీల పేరుమీద దానిని వడ్డీకి వేయవలెనని ఆలోచించబడినది. ఈట్రస్టీలు రాష్ట్రమున కొకరువంతున ఎన్నుకొనబడవలె నని సూచింపబడినది. ౧౯౦౦ లో భారతకాంగ్రెసుకమిటీలో గల ౪౫ మందికి తోడు మరికొంతమంది అధికారసభ్యులుకూడా చేర్చబడిరి. ౪౦ మంది సభ్యు లీదిగువరాష్ట్రములనుండి పంపబడవలసి యుండెను: (౧) అస్సాము, వంగ రాష్ట్రములు (౨) బొంబాయి, సింధురాష్ట్రములు (౩) మద్రాసు (౪) అయోధ్య-పశ్చిమోత్తరరాష్ట్రములు (సం. రా.) (౫) పాంచాలము (౬) బీరారు (౭) మధ్య రాష్ట్రములు. అధికారసభ్యులు కాంగ్రెసు అధ్యక్షుడు (అధ్యక్షనియామకము జరిగిన తేదీ మొదలు), కాంగ్రెసుపూర్వాధ్యక్షులు, కాంగ్రెసు కార్యదర్శి సహాయకార్యదర్శులు, ఆహ్వానసంఘకార్యదర్శి, ఆహ్వానసంఘాధ్యక్షుడు.

౧౯౦౧ లో లండనులో నియమబద్ధముగా పని సాగింపబడినది. "ఇండియా" పత్రికకు చందాదారులసంఖ్య రాష్ట్రములనుబట్టి నిర్ణయింపబడినది. మొత్తము ౪ వేల మంది చందాదారులు చేర్చబడిరి. ౧౯౦౨ నుండి ప్రతినిధు లదివరకిచ్చే చందాలుగాక ప్రత్యేకప్రతినిధిరుసుముక్రింద రు. ౧౦ లేర్పాటు చేయబడినది. ఇంగ్లండులో

కాని, ఇండియాలో కాని కాంగ్రెసుపనినిమిత్తము కావలసిన సొమ్మును వెచ్చించుట ములో కాంగ్రెసుసంస్థ యెన్నడును సంకుచితముగా ప్రవర్తించలేదు. ౧౯౦౪ లో జరిగిన ౨౦ వ కాంగ్రెసు(బొంబాయి)లో పార్లమెంటు ఎన్నికలసందర్భమున సీమకు రాయబారవర్గ మొకటి యేర్పాటుచేయబడినది. అందుకోసము రు. ౩౦ వేలను సేకరించవలెనని నిర్ణయింపబడినది. ౧౯౦౫ లో కాశీలో ౧౫ మంది సభ్యులతో ఒక కాంగ్రెసుస్థాయిసంఘము స్థాపింపబడినది. వారు, కాంగ్రెసులో జరిగిన తీర్మానముల నాచరణలోనికి తెచ్చి, కాంగ్రెసుఉద్దేశములను నిర్వర్తించవలసి యుండెను. ౧౯౦౬ లో దాదాభాయి "యావత్తువిషయమును ఒక్కమాటలో చెప్పవచ్చును. వలసరాజ్యముల ప్రభుత్వమునుగాని, యునైటెడ్ కింగ్డమ్ ప్రభుత్వమునుగాని పోలిన స్వపరిపాలనము, లేక స్వరాజ్యము" అని కాంగ్రెసుఆదర్శమును సంగ్రహపరచెను. కాని ఈభావము తీర్మానరూపములో మృదుత్వమును తాల్చినది.

"స్వపరిపాలన మనుభవిస్తూన్న బ్రిటిషు వలసరాజ్యముల ప్రభుత్వ విధానము భారతదేశమునకుకూడ ప్రసాదింపబడవలెను."

ఇది ఆకాంగ్రెసుతీర్మానము. ఇందుకు కావలసిన కొన్ని సంస్కరణము లా కాంగ్రెసులో సూచించబడినవి. కలకత్తాకాంగ్రెసు ప్రతి రాజధాని ముఖ్యపట్టణము నందును ఆరాష్ట్రీయమహాసభానిర్ణయము ననుసరించి ఒక రాష్ట్రీకాంగ్రెసుసంఘము నిర్మింపబడవలెనని తీర్మానించినది. ఆయారాష్ట్రములలోని కాంగ్రెసువ్యవహారములు రాష్ట్రీకాంగ్రెసుసంఘ యాజమాన్యముననే జరుపబడవలెను. రాష్ట్రీకాంగ్రెసు సంఘములే తమ రాజధానులలో నిరంతర రాజకీయకార్యక్రమమును జరిపేటందుకు జిల్లా సంఘముల నేర్పాటుచేయవలెను. కాంగ్రెసుఅధ్యక్షుని యెన్నుకొనే విధానము ఆ కాంగ్రెసులో మార్పుచేయబడినది. రాష్ట్రీయకాంగ్రెసుసంఘములు సూచించినవారిలో నుండి ఒక రాహ్వానసంఘమువారి ముప్పాతికవంతు వోట్లతో అధ్యక్షపదవి కెన్నుకొన బడవలసియుండెను. అది జరుగనియెడల క్రొత్తగా నిర్మింపబడిన ౧౯ మంది సభ్యులు గల కేంద్రస్థాయిసంఘ మంత్యనిర్ణయమును చేయవలసియుండెను.

విషయనిర్ధారణసభానిర్మాణమువిషయములో నొక నూతనపద్ధతి అవలంబింప బడెను. ఆసభకు ౨౫ మంది ప్రతినిధిసభ్యు లుండవలెననీ, వారందరును రాష్ట్రముల వారీగా నెన్నుకొనబడవలెననీ, కాంగ్రెసు జరుగుతూన్న రాష్ట్రములో మాత్రము ౧౦ మంది యెక్కువ సభ్యు లుండవలెననీ నిర్ణయింపబడినది. అధ్యక్షుడు, పూర్వాధ్యక్షుడు (Ex-President), పూర్వ ఆహ్వానసంఘాధ్యక్షుడు,జనరల్ కార్య

దర్శులు, ఆసంవత్సరపు స్థానికకార్యదర్శులు వీరందరును ఆసభ కధికారరీత్యా అయ్యే సభ్యులు.

కాంగ్రెసు నిర్మాణవిధానములో గలిగిన తరువాతి పరిణామము చరిత్రప్రసిద్ధము. సూరతుతగాదామూలమున మితవాదులు కాంగ్రెసులో కఠినవిబంధనలను చేయ తల పెట్టిరి. కాంగ్రెసు అధ్యక్షుని యెన్నిక జరిగినతరువాత దానినిగూర్చి యెవరును ప్రశ్నింపరాదని మొదటినియమ మేర్పరుపబడెను. తరువాత కాంగ్రెసుఆదర్శములో మార్పు చేయబడినది. సూరతుకాంగ్రెసు భగ్నమైనమరునాడే, అనగా ౨౮-౧౨-౧౯౦౭ న కొంతమంది పెద్దమనుష్యులు గలసి సూరతులోనే ఒకసమావేశము నేర్పాటుచేసి కొనిరి. వారి అప్పటియుద్దేశమే కాంగ్రెసునిర్మాణవిధానమునకు ప్రథమసూత్రముగా నిబంధింపబడినది. కాంగ్రెసులో అంగీకరింపబడినప్రకార మాసూత్రము నీక్రింద నుదాహరింతును:

“బ్రిటిషుసామ్రాజ్యములోని స్వపరిపాలితదేశముల ప్రభుత్వమువంటి ప్రభుత్వమును భారతప్రజలు పొందుటయు, సామ్రాజ్యముయొక్క హక్కులలోను, బాధ్యతలలోను వా రాదేశములతో సమాన భాగస్వాములుగా నుండుటయు భారత జాతీయమహాసభోద్దేశములు”

౧౯౦౮ నిర్మాణవిధానముప్రకారము అఖిలభారత కాంగ్రెసుసంఘ మీక్రింది విధముగా నుండవలసియుండెను:

మద్రాసు - ౧౫ మంది ప్రతినిధులు, బొంబాయి ౧౫, సంయుక్తవంగ రాష్ట్రము ౨౧, సంయుక్తరాష్ట్రములు ౧౫, పశ్చిమోత్తరరాష్ట్రము ౧౩, మధ్య రాష్ట్రములు ౭, బీహారు ౧౬, బీరారు ౫, బర్మా ౨.

సాధ్యమైనంతవరకు మొత్తముసంఖ్యలో ౫ వ వంతు మహమ్మదీయులుగా నుండవలెను.

వీరుగాక ఇండియాలో నివసిస్తూన్న కాని, హాజరైయున్న కాని కాంగ్రెసు అధ్యక్షులు, కాంగ్రెసు జనరలు కార్యదర్శులు అధికారరీత్యా అఖిలభారతకాంగ్రెసు సంఘమునకు సభ్యు లయ్యేవారు. కాంగ్రెసుజనరలుకార్యదర్శు లధికారరీత్యా అఖిల భారతకాంగ్రెసుసంఘమునకు జనరలు కార్యదర్శులుకూడా అగుదురు. అ. భా. కాం. సం. సభ్యు లందరును విషయనిర్ధారణసభాసభ్యు లగుదురు. వారికితోడు ప్రతిరాష్ట్రము నుండీ వచ్చిన ప్రతినిధులలోనుండి ఎన్నుకొనబడిన కొంతమంది కూడా విషయ నిర్ధారణసభాసభ్యు లయ్యేవారు.

ఈ నిర్మాణవిధానము క్రిందనే అప్పటికి పశ్చిమబంగాళరాష్ట్రములో కలసి యున్న బీహారురాష్ట్రము ప్రత్యేక కాంగ్రెసు రాష్ట్రముగా చేయబడినది. ౧౯౦౮ లోనే బీహారురాష్ట్రీయమహాసభ (సర్) సయ్యద్ ఆలీ ఇమామ్ అధ్యక్షత క్రింద జరిగినది.

౧౯౧౪ లో అ. భా. కాం. సం. సభ్యులసంఖ్య హెచ్చు చేయబడినది. ఆ ప్రకారము మద్రాసుకు ౧౮, ఆంధ్రులకు ౧౧, బొంబాయికి ౨౦, సింధుకు ౫, వంగరాష్ట్రమునకు (అస్సాముతోసహా), సంయుక్తరాష్ట్రములకు చెరి ౨౪, ఢిల్లీ, అజ్మీరు, మేర్వార్, బ్రిటిషురాజపుటానాలకు ౫, పాంచాలమునకు ౨౦, మధ్యరాష్ట్రములకు ౧౨, బీహారుకు ౨౦, ఒరిస్సాకు ౮, బీరార్‌కు ౬, బర్మాకు ౫ స్థానము లేర్పాటు చేయబడినవి. అ. భా. కాం. సం. సభ్యులును, కాంగ్రెసుకు హాజరయిన ప్రతినిధులలోనుండి ఎన్నుకొనబడిన మరి అంతమంది ప్రతినిధులును కలసి విషయనిర్ధారణ సభగా నేర్పాటుకావలసియుండెను.

౧౯౦౮ లో నిర్ణయింపబడిన కాంగ్రెసుఉద్దేశముల ప్రకారము న్యాయశాస్త్ర సమ్మతమైన మార్గములద్వారా ప్రభుత్వవిధానమును క్రమక్రమముగా మార్పింపవలసి యుండెను.

౧౯౦౮ కాంగ్రెసునిర్మాణవిధానములోనే, హిందూప్రతినిధులలో గాని, మహమ్మదీయప్రతినిధులలోగాని ముప్పాతికవంతుమంది కయిష్టమైన తీర్మానము చర్చకు రాకూడదని నియమ మేర్పాటుచేయబడినది. ఈనియమప్రాశస్త్యమునుగూర్చి కాంగ్రెసు పాతరికార్డులలో ఒకచిత్రమైనవిషయము కనిపిస్తున్నది. ౧౮౯౯ లో జరిగిన ౧౫-వ కాంగ్రెసు (లక్నో) అప్పటికి సామ్రాజ్యశాసనసభ (Supreme Legislative Council) లో చర్చింపబడుచున్న పాంచాలరాష్ట్రపు భూమి మారకపుచట్టము (Land Alienation Act) ను నిరసిస్తూ తీర్మానము చేసినది. (ఆ చట్టము క్రింద భూవిక్రయమునుగూర్చి, భూమితనఖానుగూర్చి కొన్ని నిర్బంధము లేర్పాటుచేయబడినవి.) కాని ౧౯౦౦ లో జరిగిన మరుకాంగ్రెసులో భూమిమారకపు చట్టమునుగూర్చి హిందూమహమ్మదీయ ప్రతినిధులు భేదాభిప్రాయములు కలిగి యుండుటచే ఆవిషయనిర్ధారణసభవారు దానినిగూర్చినచర్చ ఒకసంవత్సరమువరకును ఆపివేసిరి. ఆసంవత్సరకాలములో ఆచట్టముయొక్క కార్యవిధానమునుచూచి పరీక్షించవచ్చునని వారి అభిప్రాయము. (దీనినిబట్టి ౧౯౦౦ నాటికి బిల్లు చట్టమైనట్లు కనిపిస్తుంది)

సంయుక్త వంగరాష్ట్ర కాంగ్రెసు కమిటీవారు కాంగ్రెసునిర్మాణవిధానములో మరికొన్ని మార్పులను సూచించిరి. అవి ౧౯౧౦ లో నొక యుపసంఘమునకు

విచారణనిమిత్తము పంపబడినవి. ఆ యుపసంఘమువారి సిఫారసులు ౧౯౧౧ కలకత్తా కాంగ్రెసులో నంగీకరించబడినవి. అఖిలభారత కాంగ్రెసుసంఘమువారుకూడ మరికొన్నిమార్పులను సూచించవలసియుండెను. కాని కొంతకాలమువరకును ఎక్కువ మార్పులు కలుగలేదు. ౧౯౧౦ మొదలు ౧౯౧౫ వరకును కాంగ్రెసు కేవలము లాంఛనముగా జరిగినదని చెప్పవచ్చును. ౧౯౧౪ లో యుద్ధము ప్రారంభమైనప్పుడు డాక్టర్ బెసెంటు అఖిలభారత హోమ్‌రూలు లీగ్ రాజమాన్యముక్రింద నొక గొప్పరాజకీయోద్యమమును ప్రారంభించినది. ౧౯౧౬ లో లోకమాన్యతిలకు మహారాష్ట్రములో ప్రత్యేక హోమ్‌రూల్ లీగును స్థాపించెను. ౧౯౨౦ సెప్టెంబరులో జరిగిన కలకత్తా ప్రత్యేకకాంగ్రెసు నాన్-కో-ఆపరేషన్ సిద్ధాంతము నంగీకరించినది. ౧౯౨౦ నాగపురపు కాంగ్రెసులో కాంగ్రెసు నిర్మాణవిధానము మార్పుచేయబడినది. ౧౯౦౮ లోని పాతుబడిన కాంగ్రెసుప్రథమసూత్రము ౧౯౨౦ లో చక్కగా సంగ్రహపరుపబడినది. కాంగ్రెసుకార్యవిధానము పూర్తిగా మార్పుచేయబడినది. కాంగ్రెసులో భాషాప్రయుక్తరాష్ట్రము లేర్పాటు చేయబడినవి. ప్రత్యేకాంధ్రకాంగ్రెసురాష్ట్రవిషయము ౧౯౧౫, ౧౯౧౬ సంవత్సరములలోనే చర్చకు వచ్చినప్పటికిని ౧౯౧౭ వరకును అంగీకరించబడలేదు. ౧౯౧౭ కలకత్తా కాంగ్రెసులో ఆవిషయము చర్చకు వచ్చినప్పుడు అధ్యక్షురాలు డాక్టరు బెసెంటును, దక్షిణాదిలోని సుప్రసిద్ధనాయకులును గూడ దాని నెదిరించిరి. గాంధీమహాత్ముడుకూడ ఈవిషయమును రాజ్యాంగసంస్కరణము లమలులోనికి వచ్చేటంతవరకును ఆపివేయవచ్చునని అభిప్రాయపడెను. కాని తిలకుమహాశయుని దూరదృష్టివలన ఆంధ్రులకు ప్రత్యేకరాష్ట్రము లభించినది. దీని ఫలితముగా అ. భా. కాం. సంఘమున కాంగ్రెసురాష్ట్రములనుండి రావలసిన ప్రతినిధుల పరిమితినిగూర్చి విచారించుటకొక యుపసంఘ మేర్పాటుచేయబడినది. ౧౯౧౮ లో సింధీయుల కోరికమీద సింధురాష్ట్రము ప్రత్యేకింపబడినది. ౧౯౨౦ లో జరిగిన నాగపురపు కాంగ్రెసు తీర్మానము ననుసరించి కాంగ్రెసు రాష్ట్రములు ౨౧ గా విభజింపబడినప్పుడు మలయాళీలును, కర్ణాటకులును ప్రత్యేక రాష్ట్రములను సంపాదించు కొనగలిగిరి.

## ౧౯౧౮ వరకును ఫలప్రదములు కాని కోరికలు

భారతదేశముకోరే స్వరాజ్యవిధానము కేవలము ప్రజల మానసిక సంతృప్తికి సంబంధించినది కాదు. భారతీయుల ఆ కోరికకనేక బలవత్తరకారణములు కలవు. ప్రస్తుతపరిస్థితులలో చిన్న చిన్న రాజకీయసంస్కరణములవలన వారికోరికలు ఫలింపనేరవని వారికి తెలిసివచ్చినది. ఇందుకు నిదర్శనముగా కడచిన ౩౨ సంవత్సరము

లోను కాంగ్రెసుకోరిన పరిపాలనములోని మార్పులు ఇండియా ప్రభుత్వమువారి యొక్కయు, స్థానికప్రభుత్వములయొక్కయు వ్యతిరేకభావములవలన ఆచరణలోకి రానివిషయమును గమనించినచో. ౧౯౧౮ వరకును ఫలప్రదములు కాక నిలిచియున్న కాంగ్రెసుసూచనలు ఈక్రింద పొందుపరుపబడినవి.

(౧) ఇండియా కౌన్సిలును రద్దుచేయుట (౧౮౮౫)

(౨) ఏకకాలపు పరీక్షలు (౧౮౮౫)

(౩) ఇండియా - ఇంగ్లాండు దేశములమధ్య సైనికవ్యయ న్యాయవిభాగము (౧౮౮౫)

(౪) జూరీవిచారణను విస్తరింపచేయుట (౧౮౮౬)

(౫) జూరీల తీర్పులే ఆఖరుతీర్పులుగా నిర్ణయింపబడుట (౧౮౮౬)

(౬) వారంటుకేసులలోని ముద్దాయీలకు, మేజిస్ట్రేటు విచారణకు బదులుగా, సెషన్సుకోర్టువిచారణను కోరుటయందు అధికార మొసగుట (౧౮౮౬)

(౭) న్యాయ-కార్యనిర్వాహణాధికారములను విభజించుట (౧౮౮౬)

(౮) భారతీయులలో స్వచ్ఛంద సైనికుల నేర్పాటు (౧౮౮౭)

(౯) భారతీయులకు సైనికోద్యోగముల నిప్పించేనిమిత్తము సైనిక కళాశాలల నిర్మాణము (౧౮౮౭)

(౧౦) ఆయుధశాసనమును, నిబంధనలను మార్పుచేయుట (౧౮౮౭)

(౧౧) సాంకేతికవిద్య, పారిశ్రామికాభివృద్ధి (౧౮౮౮)

(౧౨) ప్రభుత్వమువారి భూమిపన్నులవిధానమును సంస్కరించుట (౧౮౮౯)

(౧౩) కరెన్సీపద్ధతిలో మార్పు (౧౮౯౨)

(౧౪) ఇండియాలో స్వతంత్రసివిల్ మెడికల్ సర్వీసు నేర్పాటుచేయుట (౧౮౯౩)

(౧౫) మారకపు కాంపెన్సేషన్ అలవెన్సు రద్దుచేయబడుట

(Abolition of Exchange Compensation allowance) (౧౮౯౩)

(౧౬) నిర్బంధచాకిరీవిధానము (బేగార్) రద్దుచేయబడుట, నిర్బంధముగా వస్తువులను సప్లయిచేయవలసినపద్ధతి (రసద్) రద్దుచేయబడుట (౧౮౯౩)

(౧౭) సీమఖర్చుల తగ్గింపు (౧౮౯౩)

(౧౮) దేశీయ పత్తిపరిశ్రమపైన పన్నును తీసివేయుట (౧౮౯౩)

(౧౯) న్యాయవాదిసంఘమునుండి యున్నత న్యాయమూర్తి పదవులకు తగినవారిని నియమించుట (౧౮౯౪)

(౨౦) వలసరాష్ట్రములలో భారతీయులస్థితి (౧౮౯౪)

(౨౧) భారతసంస్థానములలోని ముద్రణాలయములను సంబంధించి ౧౮౯౧ లో చేయబడిన ఇండియా ప్రభుత్వమువారి యుత్తరువులను రద్దుచేయుట (౧౮౯౪)

(౨౨) వ్యవసాయఋణవిముక్తిమార్గములు (౧౮౯౫)

(౨౩) మూడవతరగతి రైల్వే ప్రయాణములోని యిబ్బందులను తొలగించుట (౧౮౯౫)

(౨౪) రాష్ట్రముల ఆర్థికస్వతంత్రత (౧౮౯౬)

(౨౫) భారతీయులకు న్యాయముకలిగేటట్లు విద్యాశాఖోద్యోగ పద్ధతులలో మార్పుచేయుట. (౧౮౯౬)

(౨౬) బెంగాల్, మద్రాసు, బొంబాయిరాష్ట్రములలో క్రమముగా నిర్మింపబడిన ౧౮౧౮, ౧౮౧౯, ౧౮౨౭ చట్టములను రద్దు చేయుట (౧౮౯౭)

(౨౭) ౧౮౯౮ లోని రాజద్రోహచట్టమునుగూర్చి (౧౮౯౭)

(౨౮) ౧౮౯౮ లోని క్రిమినల్ ప్రొసీజరుకోడ్ అమెండ్‌మెంటు చట్టమునుగూర్చి (౧౮౯౭)

(౨౯) ౧౮౯౯ కలకత్తా మున్సిపల్ చట్టమునుగూర్చి (౧౮౯౮)

(౩౦) ౧౯౦౦ పాంచాలరాష్ట్రపు భూమిమారకపు చట్టమునుగూర్చి (౧౮౯౮)

(౩౧) భారతప్రజల ఆర్థికస్థితుల విచారణ. (౧౯౦౦)

(౩౨) ఉన్న సివిల్ ఉద్యోగములలో ఎక్కువమంది భారతీయులను నియమించుట (౧౯౦౦)

(౩౩) పి. డబ్ల్యు. డి. ఉన్నతోద్యోగములలో భారతీయుల నెక్కువమందిని నియమించుట (౧౯౦౦)

(౩౪) పోలీసుపోటేపరీక్షలకు భారతీయులను రానిచ్చి, వారికి పోలీసు ఉన్నతోద్యోగముల నెక్కువగా యిచ్చుట (౧౯౦౧)

(౩౫) బ్రిటిష్‌సైన్యమిండియాలో నిలువచేయబడుట మూలమున భారతదేశము ప్రతిసంవత్సరమును చెల్లింపవలసిన సైనికఖర్చులు పౌ. ౭,౮౬౦౦౦ లకు పెరిగిపోవుటనుగూర్చి (౧౯౦౨)

(౩౬) భారత విశ్వవిద్యాలయముల యుపసంఘమువారు చేసిన సిఫారసులనుగూర్చి (౧౯౦౨)

(౩౭) ౧౯౦౪ లోని భారతవిశ్వవిద్యాలయచట్టమునుగూర్చి (౧౯౦౩)

(౩౮) ౧౯౦౪ లోని ఉద్యోగరహస్యచట్టమునుగూర్చి (౧౯౦౩)

(౩౯) ఇండియాఆఫీసు వ్యయము, భారతరాజ్యాంగకార్యదర్శిజీతము (౧౯౦౪)

(౪౦) భారతీయవ్యవహారములనుగూర్చి అప్పుడప్పుడును జరిగే పార్లమెంటరీ విచారణలను తిరిగీ అమలులోకి తీసికొనివచ్చుట (౧౯౦౫)

(౪౧) స్థానికస్వపరిపాలనాభివృద్ధి (౧౯౦౫)

(౪౨) ౧౯౦౮ లోని పత్రికాశాసనమునుగూర్చి (౧౯౦౮)

(౪౩) ౧౯౦౮ లోని క్రిమినల్ లా అమెండుమెంటు చట్టమునుగూర్చి (౧౯౦౮)

(౪౪) ఉచితనిర్బంధ ప్రాథమికవిద్య (౧౯౦౮)

(౪౫) శాసనసభానిబంధనల సంస్కరణము (౧౯౦౯)

(౪౬) పశ్చిమోత్తర సరిహద్దురాష్ట్రముల పరిపాలనా పద్ధతిని గూర్చి విచారణ (౧౯౦౯)

(౪౭) అడ్వొకేట్లు, వకీళ్లు, అటర్నీలకుకూడ లామెంబరుపదవినిచ్చుట (౧౯౧౦)

(౪౮) రాజద్రోహసభలచట్టమును గూర్చి (౧౯౧౦)

(౪౯) ఇండియన్ ప్రెస్సుశాసనమునుగూర్చి (౧౯౧౦)

(౫౦) ప్రభుత్వవ్యయాభివృద్ధినిగూర్చిన విచారణ (౧౯౧౦)

(౫౧) రాజకీయఖైదీల విడుదల (౧౯౧౦)

(౫౨) గోఖ్లేగారి ప్రాథమికవిద్యనుగూర్చిన చిత్తుచట్టము (౧౯౧౦)

(౫౩) సంయుక్తరాష్ట్రములకు గవర్నరు, కార్యనిర్వాహక సభ్యుల నియామకము (౧౯౧౧)

(౫౪) పాంచాలములో కార్యనిర్వాహకసభ నిర్మింపబడుట (౧౯౧౧)

(౫౫) ఇండియాకౌన్సిలు పునర్నిర్మాణము (౧౯౧౩)

(౫౬) సీమలోని భారతీయవిద్యార్థులనుగూర్చి (౧౯౧౫)

# 3. కాంగ్రెసు ప్రథమపర్వ

[పూర్వపు కాంగ్రెసువారి రాజకీయమితవాదత - రాజభక్తి, ప్రధాన విషయము-బ్రిటిష్‌జాతియందు విశ్వాసము-నాయకుల సేవలను ప్రభుత్వమువారు గుర్తించుట.]

భారత జాతీయ మహాసభ సంస్థాపింపబడి యేబది సంవత్సరములు గడచినవి. ఈ వ్యవధిలో భారతదేశమునందలి రాజకీయోద్యమమునందెన్నో పరివర్తనములు కలిగినవి. 1885 మొదలు 1905 లేక 1920 వరకును గల మధ్యకాలములో వివిధ రాజకీయాభిప్రాయములు గలవారికిని దాదాపు ఒకేపద్ధతికార్యక్రమము నిర్ణయింపబడియుండెను. నిజముగా అప్పటివారికి గల రాజకీయాభిప్రాయభేదములు కూడ బహుస్వల్పములని చెప్పవచ్చును. భారతదేశమునందు రాజకీయోద్దేశములు క్రమాభివృద్ధిని పొందుతూ వచ్చినవి.

యుద్ధమును ప్రారంభించవలెనన్నచో యుద్ధవ్యవహారములు జరుగవలసిన రంగస్థలమును నిర్ణయించుకొనుటలోను, వాటిని సరిగా నడపగలచాతుర్యము నవలంబించుటలోనే యెక్కువ కష్టమున్నది. పోరున కాయత్తులైన ఇరుపక్షములవారును ఆత్మసంరక్షణ చేసుకొనవలెనో, శత్రువును కవ్వించి మీద దుముకవలెనో, ప్రతిఘటించవలెనో, లొంగిపోవలెనో, శత్రువును సంధికి పిలువవలెనో, లేక వేచియుండవలెనో, ఇవేవీకాక అవకాశము చూచుకొని శత్రువుమీద ఆకస్మికముగా పడి చుట్టుముట్టవలెనో తెలియక సందిగ్ధావస్థలో నుండెదరు. సంగ్రామస్థలములోని సేనానాయకుల హృదయముల నీసమస్యలే యెక్కువగా కల్లోలపెట్టును. రాజకీయవిషయములలో కూడ ఇటువంటి చిక్కులే కలవు. ఆందోళన మాటలలో చాలునా, లేక కార్యరూపమును దాల్చవలయునా అనేవిషయమును నాయకులు నిర్ణయించవలసియున్నది. వారు కార్యరూపమున నుండవలెనని నిర్ణయించేయెడల ప్రత్యక్షముగానో, పరోక్షముగానో ప్రభుత్వముతో పోరు తెచ్చుకొనక తప్పదు. నేడీ విషయములను మనము తొందరలో చూడగలుగుతున్నాము. అంతకంటెను తొందరలో ఆలోచించగలుగుతున్నాము. ఒక రాజకీయోద్యమము వివిధ పరిణామదశల నతిక్రమించి క్రమాభివృద్ధిని పొందుటకు కొన్ని దశాబ్దములు కావలసియున్నది.

యాభైసంవత్సరముల నిరంతరపరిశ్రమకు ఫలితముగా నేడు మనకు చాలా తేలికగాను,
సామాన్యవిషయముగాను కనుపడేసంగతి కాంగ్రెసుకు శంకుస్థాపకులయిన మన మూల
పురుషులకు ఊహాతీతమైన విషయముగా తోచియుంటుంది. విదేశవస్తుబహిష్కరణ
మునుగూర్చియో, లేక కోర్టులు, శాసనసభలు, కళాశాలలు బహిష్కరింపబడవలె
ననియో, లేక కొన్ని శాసనములను ధిక్కరించవలెననియో ఒక తీర్మానము
డబ్లియు. సి. బెనర్జీ, సురేంద్రనాథబెనర్జీల యొద్దకో, సర్ ఫిరోజిషా మెహతా, అయో
ధ్యానాథులయొద్దకో, లాల్ మోహన్ మనోమోహన్ ఘోషులయొద్దకో, సుబ్రహ్మణ్యయ్యర్
ఆనందాచార్యులయొద్దకో, హ్యూమ్ వెడ్డర్ బర్న్ లయొద్దకో చర్చకుపంపబడిన దనుకొ
నుడు. ఏమి జరిగియుండేది? అటువంటి అభిప్రాయములను వెలిబుచ్చినవారు నిందా
పాత్రులయియుండేవారు. వంగరాష్ట్రవిభజనము, కర్జన్ మింటోప్రభువుల ప్రతి
కూల పరిపాలనము, దక్షిణాఫ్రికాలో గాంధీజీకి కలిగిన అనుభవములు, జలియన్ వాలా
బాగ్ దురంతములును తటస్థించియుండనియెడల అతీవ్రరాజకీయ కార్యక్రమములు
క్రమపరిణామమును పొందగలిగియుండేవి కావు. క్రిందటి శతాబ్దములోని ౧౫ సంవ
త్సరముల కాంగ్రెస్ ఉద్యమములోను, రాజకీయమార్గదర్శకులుగా పరిగణింపబడినవా
రిలో ఎక్కువమంది న్యాయవాదులును, కొద్దిమంది వర్తకులును, డాక్టరులును గలరు.
వారందరును పార్లమెంటుకును, బ్రిటిష్ప్రజలకును భారతదేశవిషయములనుగూర్చి
సకారణముగాను, ఉద్రేకరహితముగాను విజ్ఞాపించుకొనిన చాలు నని హృదయపూర్వక
ముగా విశ్వసించియుండిరి. ఇందుకొరకే వారొక రాజకీయసంస్థను నిర్మించుకొన
బూనిరి. జాతీయమహాసభ భారతీయుల ఆశయములను, కష్టములను సరిగా ప్రతి
బింబింపజేయగల సంస్థ అని వారు తలచిరి.

భారతరాజకీయమార్గమును చిత్రించి, నిర్ణయించిన మహాపురుషులనుగూర్చి,
వారివిశ్వాసమునుగూర్చి స్మరించేముందు, జరిగిన అర్ధశతాబ్దములోను హిందూదేశ
రాజకీయాందోళనములో గలిగిన వివిధదశలను వివరింప వలసియున్నది. ఇంతకుపూర్వము
భారతప్రజల ఆశయములను, దుఃఖములను ప్రకటించుకొనవలసిన అవసరము కలు
గుటయు, అది కాంగ్రెసుకు మూలకారణ మగుటయు కొంతవరకు తెలియపరచియుం
టిమి. పూర్వపురోజులలో ప్రజలకష్టముల నధికారులకు విన్నవించి వాటి నివారణో
పాయముల నాలోచించవలసిన దని సవినయముగా ప్రార్థించుటకంటె గత్యంతరము
లేదు. నూతనావకాశములను, నూతనసౌకర్యములను కల్పించవలసిన దని ప్రభుత్వము
వారిని ప్రజలు సౌమ్యముగా కోరవచ్చును. అంతకు మించిన యోచనకిని పరిస్థితు లను
కూలించిలేవు. ఇట్టి మానసికప్రవృత్తి త్వరలోనే ఒక శిల్పముగా అభివృద్ధిపొందినది.
అప్పటి భారతరాజకీయనాయకుల న్యాయశాస్త్ర పరిజ్ఞానమును, భావగర్భితములును,

ఉద్రేకపూరితములైనను అయిన వారియుపన్యాసధోరణులను ఇందుకు చక్కగా అక్కరకువచ్చినవి. కాంగ్రెసు తీర్మానముల ప్రతిపాదకులు గాని, కాంగ్రెసు అధ్యక్షులుగాని తమ యుపన్యాసములలో ప్రజల అభీష్టములలోని న్యాయమునుగూర్చి నిరోధించడమునకును, తృణీకరించడమునకును వీలులేని వాదములను నిదర్శనములతో ప్రదర్శిస్తూ ఉండేవారు. ఈ అన్ని యుపన్యాసములధోరణి ఒక్కటే. "ఇంగ్లీషువారు చాలా న్యాయస్థులు, సత్యసంధులు; సంగతిసందర్భములు సరిగా తెలుసుకొనగలిగినయెడల వా రెప్పుడును సత్యమును, ధర్మమును తప్పి నడవరు; ఈచిక్కు మన కాంగ్లో-ఇండియనులవలన కలుగుతూన్నది కాని ఇంగ్లీషువారివలన కాదు; ప్రభుత్వ పద్ధతిలో పొరపాటున్నది కాని వ్యక్తిలో యేమీ లేదు; కాంగ్రెసుకు బ్రిటిషుసింహాసన మంటే అతీతమైనభక్తి. భారతీయ నిరంకుశోద్యోగుల మీాదనే దానికి కోపము. ఇంగ్లీషు పార్లమెంటు ప్రపంచకమునందలి ప్రజాప్రభుత్వములకు తల్లి. ఇంగ్లీషు రాజ్యాంగ నిర్మాణము లోకములోని ప్రజాస్వాతంత్ర్యములకు పట్టుకొమ్మ; బ్రిటిష్ రాజ్యాంగవిధాన మన్ని రాజ్యాంగ విధానములలోకి అత్యుత్తమమైనది; కాంగ్రెసు రాజద్రోహసంస్థ కాదు; భారతరాజకీయవేత్తలు ప్రభుత్వమునకును, ప్రజలకును మధ్య స్వతస్సిద్ధమైన దుబాషీలు (Translators). భారతీయులు ప్రభుత్వోద్యోగములలో నెక్కువగా చేర్చుకొనబడవలెను; వారు విద్యావంతులై యున్నతోద్యోగములు కర్హులయ్యేటట్లు చేయబడవలెను. విశ్వవిద్యాలయములు, స్థానికసంస్థలు, ప్రభుత్వోద్యోగములు భారతీయులకు శిక్షణస్థలములుగా నుండవలెను. ప్రభుత్వమువారు శాసనసభల నెన్నికలకు వదలివేయవలెను; వాటిలో ప్రశ్నలువేసే అధికారము, ఆదాయవ్యయ పట్టికలనుగూర్చి చర్చించే అధికారము ప్రజల కుండవలెను; ముద్రణాశాసనమును, అటవీచట్టములను కొంచెము మార్దవములుగా చేయబడవలెను; పోలీసువారు ప్రజలతో స్నేహముగా మెలగవలెను; పన్నులు సరసముగా నుండవలెను! సైనికవ్యయములో కొంతభాగ మిండియాతో పాటు ఇంగ్లండుకూడ పంచుకొనవలెను; న్యాయ, కార్యనిర్వహణాధికారములు ప్రత్యేకింపబడవలెను; కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వములలోని కార్యనిర్వాహక సభలలోను, భారతరాజ్యాంగ కార్యదర్శిసభలోను భారతీయులకు స్థాన ముండవలెను; రాష్ట్రమున కిరువురు ప్రతినిధులవంతున బ్రిటిషుపార్లమెంటు కిండియానుండి సరాసరి ఎన్నుకొనబడవలెను; అన్ని రాష్ట్రములును సమాన ప్రతిపత్తిలో చూడబడవలెను; సివిల్ సర్వీసుఉద్యోగస్థులకు బదులు సుప్రసిద్ధ బ్రిటిష్ రాజకీయధురంధరు లిండియాకు గవర్నరులుగా రావలెను; ప్రభుత్వోద్యోగముల కోసము జరుపబడే పోటీపరీక్ష లిండియాలోను, ఇంగ్లాండులోను ఏకకాలమున జరుపబడవలెను; ఇండియానుండి ఇంగ్లాండుకు పోయే ధనప్రవాహ మరికట్టబడవలెను; దేశీయ

పరిశ్రమలు పోషింపబడవలెను; ల్యాండురెవిన్యూ తగ్గింపబడవలెను; పర్మనెంటు సెటిల్‌మెంటుపద్ధతి అమలులోనికి రావలెను." ఇది ఆనాటి వక్తృత్వసారాంశము. ఉప్పుపన్ను అన్యాయమనీ, దేశీయపత్తిపరిశ్రమలపైన వేయబడినపన్ను అధర్మమనీ, సివిలియను ఉద్యోగస్థుల జీతములలో మారకమువలన కలిగెనష్టమునకు పరిహారముగా ఇయ్యబడేమొత్తము లంచమనీ నిరసించేటంతమారకమువరకును కాంగ్రెసు పోయినది. ౧౮౯౩ వ సంవత్సరములోనే వాంఛ్యాపండితు ఉప్పురాణ్ణపామిలోని గ్రామపరిశ్రమల పునరుద్ధారణమునుగూర్చి తీర్మానమును ప్రతిపాదించేటంత దూరదృష్టి గలిగియుండెను.

భారతరాజకీయక్షేత్రసృష్టి నాకర్షించిన ఈవిషయముల సింహావలోకనమును ఇట్టి వారిని త్రివ్యత్తి తేలికగా అర్థము కాగలదు. భారతరాజకీయసంస్కరణమునకు మార్గదర్శకులుగా వారవలంబించిన ఈవిధానమునకు వారిని మనము నేడు నిందింపరాదు. వారిని నిందించుట మహాప్రాసాదమున కష్టమునన ఆరనుసులలోతున నిలిచియున్న పునాదిరాళ్ళను నిందించుటవంటిది. నాడే వలసరాజ్యస్వపరిపాలనము, సామ్రాజ్యాంతర్గతస్వపరిపాలనము, స్వరాజ్యము, పూర్ణస్వరాజ్యము అని అంతస్తుపై అంతస్తులుగా నిర్మింపబడిన ఈ అద్భుతసౌధమునకు మూలస్తంభములు. మన పూర్వతరములలో ప్రజాజీవితమున కభ్యుదయమార్గమును చేకూర్చిన ఈ మహాపురుషులకు మనము శాశ్వత కృతజ్ఞులముగా నుండవలయును. వారి తీర్మానములకు బలముగా వారనేక ఇంగ్లీషు ప్రమాణములను దాహరించిరి. వారి సామర్థ్యములవలను, దృష్టికిని అనుగుణముగా వారు విశేషపరిశ్రమ చేసిరి; గొప్పత్యాగములను కావించిరి. ఈనాడున మనమార్గము స్పష్టముగాను, మన ఆదర్శము సత్యముగాను కనిపిస్తున్న రోజులు, అదన్యామును కొట్టి నిష్కంటకముగా చేసిన మనపూర్వపురుషులకే ఆ యశస్సంతయును పోవలెను.

పూర్వకాంగ్రెసునాయకులలో అప్పుడప్పుడు తాత్కాలికముగా ఉద్రేకములును, క్రోధభావములును కలిగియుండవచ్చును గాని, మొత్తముమీద ౧౮౮౫ మొదలు ౧౯౦౫ వరకును గల ఈయిరువదిసంవత్సరములో కాంగ్రెసు సక్రమాందోళనమునందలి దృఢవిశ్వాసముతోను, ఇంగ్లీషువారి న్యాయబుద్ధియందు దెడతెగని నమ్మకముతోను ఒక్కటే విధముగా నడచిన దని చెప్పవచ్చును. ఈ అభిప్రాయముతోనే ౧౮౯౩ కాంగ్రెసు కాహ్వానసంఘాధ్యక్షుడైన సర్దార్ దయాల్‌సింగ్ మజీథియా కాంగ్రెసునుగూర్చి "ఈ దేశములోని బ్రిటిష్‌ప్రభుత్వమున కొక విజయచిహ్నము" గా వర్ణించినాడు. ఆయన "యేరాజ్యాంగమునకు ప్రధానసూత్రము స్వాతంత్ర్యమో, యేరాజ్యాంగమునకు మూలస్తంభము సహనమో మన నారాజ్యాంగనిర్మాణముక్రింద పౌరులము" అని చెప్పి

తనభావమును పరమావధికి తీసికొనివెళ్లెను. ౧౮౮౭ లో జరిగిన కాంగ్రెస్ ఉద్యోగులలో నొకరు "రాణీగారి ప్రకటన యొకసంధిపత్రము కాదు. అది అంతర్జాతీయవ్యవహారసంబంధమైన దస్తావేజు కాదు. ప్రభుత్వసిద్ధాంతములనుగూర్చిన ప్రకటన మది" అని రిప్పను ప్రభువు చెప్పిన అభిప్రాయము నుదాహరించెను. "ప్రాతినిధ్యప్రభుత్వము ప్రాచ్యసంప్రదాయములకు తగదు" అన్న శాలిస్‌బారి ప్రభువు సిద్ధాంతము తీవ్రముగా నిరసింపబడినది. ౧౮౯౦ లో ఫిరోజిషా మెహతా "బ్రిటిష్‌రాజకీయచాతుర్య మవసరమున కక్కరకు వచ్చుననియే నావిశ్వాసము." అని ప్రకటించెను. ౧౮౯౬ లోని ౧౨-వ కాంగ్రెసు అధ్యక్షుడైన మహమ్మద్ రహీంతుల్లా సయానీ "ఈఆంగ్లజాతికన్న న్యాయమైనజాతిగాని, బలిష్ఠమైనజాతి గాని ప్రపంచకములో మరొకటి లేదు" అని సందిగ్ధరహితమైనభావముతో చెప్పెను. భారతదేశపురాయబారములకును, ప్రార్థనలకును ప్రతిఫలముగా నిర్బంధవిధాన మవలంబింపబడినప్పుడు కూడ ఆనందమోహనబోసు ౧౮౯౮ లో మద్రాసుకాంగ్రెసు అధ్యక్షుడై "భారతీయవిద్యావంతు లింగ్లండునకు మిత్రులుగాని శత్రులు గారు. అది చేయబోయే ఘనకార్యమునకు స్వతస్సిద్ధముగా సహాయము చేయవలసిన అవసరమున్న మిత్రులు వారే" అని యుపన్యసించెను. మనవెనుకతరములవారు ఆంగ్లేయులవారిలోను, ఇంగ్లండులోను ఉంచిన విశ్వాసమునుగూర్చి యోచించినయెడల ఒకప్పుడు జాలిపడవలసివచ్చును; కాని వారి అవకాశములను గుర్తింపవలెను. డాక్టరు రసబిహారీఘోష్ ౧౯౦౮ లో మద్రాసులో చెప్పినట్లు "మంచికాలములోను, చెడుకాలములోనుకూడా, ఎవరు వారిరోజులలో వారికర్మము నిర్వర్తించుటకు గట్టిగా ప్రయత్నించిరో వారికి మన సహాయభావములను సమర్పింతుము. ఇదయొక నాగరికప్రవృత్తి కావచ్చును. కాని దీనివలన యువకహృదయములకుత్సాహమును, ఉత్తేజమును కలుగుననుమాట సత్యము." కాంగ్రెసుచరిత్రలో మొట్టమొదటి తీవ్రాందోళనము ౧౯౦౬-౧౯౧౧ సంవత్సరములమధ్య జరిగినది. ఈ అయిదేండ్లలో నవలంబింపబడిన ప్రభుత్వ నిర్బంధవిధాన మప్పటికాలమునకు క్రూరముగా వర్ణింపబడినది. అక్కడక్కడ ప్రజలు దౌర్జన్యములకు కడంగుట కది కారణమైనది. వంగరాష్ట్రవిభజనము రద్దుచేయబడినదని చక్రవర్తిగా రొనర్చిన ప్రకటనముతో ఆ ఆందోళనమునకు విజయము చేకూరినది. తిరిగి బ్రిటిష్‌రాజకీయన్యాయమునం దెక్కడలేని విశ్వాసము కుదిరినది. బ్రిటిష్ ప్రభుత్వమును గూర్చిన స్తోత్రపాఠములు ప్రారంభమైనవి. వారికి కృతజ్ఞతాభివందనముల కంతులే కుండెను. "బ్రిటిష్ సింహాసనమునెడల గౌరవ భక్తులతో ప్రతివాని హృదయమును స్పందిస్తూన్నది. బ్రిటిష్ రాజకీయ ధౌరంధర్యమునెడల కృతజ్ఞతతోను, నూతన విశ్వాసముతోను ప్రతివాని హృదయమును పొంగి పొరలి పోతున్నది. మావంటి

వాంఛ్ల మెప్పుకును తొట్రుపాటు పడలేదు. బ్రిటిష్‌న్యాయప్రకటనమునందలి మా విశ్వాసముగాని, మా ఆశగాని యెన్నడును, ఎట్టి కష్టపరంపరలలోను చలించలేదు.” అని అంబికాచరణమజుమ్‌దారు చెప్పెను. కాని ౧౯౧౧ నాటికిని, తరువాతనుకూడా అమలులోనున్న నిర్బంధశాసనములు కాంగ్రెస్‌వారిదృష్టి నాకర్షించకపోలేదు. కాంగ్రెస్ మూలపురుషులు ముఖ్యముగా పరిపాలనావిధానమును సంస్కరించుటకును, నిర్బంధ శాసనములను రద్దుచేయించుటకును వారిదృష్టిని కేంద్రీకరించినమాట నిజమేగాని, అంతమాత్రముతో వారు భారతదేశపు సంపూర్ణసమస్యనుగూర్చి యోచించలే దని మాత్రము చెప్పవీలులేదు. ౧౮౮౬ లో జరిగిన కలకత్తాకాంగ్రెస్‌లోనే “స్వపరిపాలనము ప్రకృతిసిద్ధాంతము. అది దేవుని అభీష్టము” అని సురేంద్రనాథబెనర్జీ చెప్పెను. సర్ హెన్రీకాటన్ ౨౦ వ కాంగ్రెసు కధ్యక్షత వహించి, ఈనాడు మన మను కొంటున్న ఫెడరేషన్‌నుగూర్చి ఆనాడే భావనచేయగలిగినాడు. దాదాభాయి మనకు వలసరాష్ట్రప్రభుత్వమువంటి స్వపరిపాలనమో, యునైటెడ్‌కింగ్‌డమ్‌వంటి స్వరాజ్యమో లభింపవలె నని చెప్పినాడు.

కాంగ్రెసు పుట్టినరోజుల మొదటిసగముకాలములో పనిచేసిన రాజకీయనాయకులు ప్రభుత్వమువారికి శత్రువులుకారు. ఈ విషయము వారు తప్పనప్పుడు ప్రకటించిన అసంఖ్య ప్రకటనములవలననేగాక, ప్రభుత్వమువారు వారియెడల చూపిన అనురాగాభిమానములనుబట్టికూడ తెలియగలదు. ప్రభుత్వమువారి నాటి అభిమానప్రకటనమునకు తగిన స్థలములు న్యాయస్థానములు. సర్ సుబ్రహ్మణ్యఅయ్యర్‌గారు మొదటికాంగ్రెసులోనే హాజరైనవారు. ౧౮౮౭ లో మద్రాసులో జరిగిన మొదటి మితవాదికాంగ్రెసు కార్యాధ్యక్షులైనవారు వి. కృష్ణస్వామిఅయ్యరుగారు. ఆ కాంగ్రెసు కప్పటి మద్రాసుగవర్నరు సర్ ఆర్థర్‌లాలీ తన డేరాలనుకూడ ఉపయోగించుకొననిచ్చెను. ఆ కృష్ణస్వామిఅయ్యరుగారే “కాంగ్రెసుకు దుష్టాంగముగానున్న జాతీయవాదిసంఘము ఖండింపబడవలె” నని చెప్పినవారు. ౧౮౯౭ లో అమరావతిలో జరిగిన కాంగ్రెసు కధ్యక్షత వహించినవారు సర్ శంకరనాయర్. వేపా రామేశంగారు ౧౮౯౭ నుం కాంగ్రెసువాది. ఆయన ఆకాంగ్రెసులో దక్షిణాఫ్రికా భారతీయులనుగూర్చిన తీర్మానమును బలపరచెను. (పిమ్మట ఆయన సర్ బిరుదాంకితు డయ్యెను.) తరువాత టి. వి. శేషగిరి అయ్యరుగా రున్నారు. ఆయన ౧౮౯౦ కాంగ్రెసులో కనిపించెను. శి ఆర్. సుందరం అయ్యరుగారు ౧౮౮౭ లో కృష్ణస్వామి అయ్యరుగారికి ప్రధానసహాయకులుగా నుండిరి. ఈ ఆరుగురును మద్రాసుహైకోర్టుకు జడ్జీ లయిరి. ఇందులో ఒకరు మద్రాసుప్రభుత్వ కార్యనిర్వాహకసభకును, మరొకరు ఢిల్లీ ప్రభుత్వ కార్యనిర్వాహకసభకును సభ్యులుకూడా అయిరి. పూర్వపు రోజులలోని

కాంగ్రెసువారలకు రాజభక్తిప్రదర్శనములు చేయవలెనని కోరికయుండెను. ౧౯౧౮ లో వెల్లింగ్టను ప్రభువు మద్రాసుగవర్నరుగా నున్నప్పు డాయన కాంగ్రెసుపందిలిని దర్శింపరాగా సభవారు కరతాళధ్వనులతో ఆయన నాహ్వానించిరి. సరిగా ఆసమయమున భారతసైన్యములు విదేశములకు పంపబడుటను గూర్చి ఏ. పి. పాత్రోగా రుపన్యసించుచుండిరి. వెంటనే ఆయన ఆపివేయబడెను. రాజభక్తితీర్మానమును ప్రతిపాదింప సురేంద్రనాథ బెనర్జీ ఆహ్వానింపబడెను. ఆయన సహజవాగ్ధోరణిలో ఆకర్తవ్యమును నిర్వర్తించెను.

౧౯౧౬ లో లక్నో కాంగ్రెసుకు సర్ జేమ్సుమెస్టన్ దయచేసినప్పుడు గూడ ఇట్లే సభవా రందరును లేచి ఆయన నాహ్వానించిరి.

౧౯౧౯ కాంగ్రెసుకు అధ్యక్షత వహింపవలసియుండినవా రొక రప్పుడు మద్రాసు హైకోర్టుజడ్జి చేయబడినందున ఆ అధ్యక్షపదవి నంగీకరింప వీలులేకపోయినది. తరువాత వారు ౧౯౧౮లో కాంగ్రెసులో తిరిగి చేరిరి. బెసెంటు హోంరూల్ ఆందోళనలో ఆయన తన "సర్" బిరుదమును త్యజించి, మాంటేగ్ చెమ్సుఫర్డు ప్రభువుల ఆగ్రహమునకు గురియయ్యెను. అప్పు డాయన తన పెన్షనునుకూడా త్యజించవలెనని యూహించి నట్లును, తరువాత ఆలోచనమీద ఆపనిని విరమించుకొనినట్లునుగూడ నొక ప్రవాదముండెను. ఇక సర్ పి. యస్. శివస్వామిఅయ్యరు, సర్ సి. పి. రామస్వామిఅయ్యరులు గలరు. వీరిరువురును కాంగ్రెస్వాదులే. మొదటివారు ౧౯౧౪ లోనే కాంగ్రెస్వాదిగా ప్రత్యక్షమైరి. రెండవవారు కొంత ఇటీవలనే కాంగ్రెస్వాది యయ్యెను కాని మొదటివారికంటె యెక్కువ పట్టుదల కలవారు. కనుకనే డాక్టర్ బెసెంటును, ఆమె సహాయకులును నిర్బంధింపబడినప్పుడు ఈయన సాత్వికనిరోధ ప్రమాణపత్రముపైన సంతకము పెట్టెను. ౧౯౧౭, ౧౯౧౯ సంవత్సరముల మధ్య జాతీయమహాసభా సమావేశములమున నిలిచి భారత రాజకీయ ప్రపంచమును ప్రకాశింపజేసిన తారామనోహరు డీ సర్ సి. పి. రామస్వామిఅయ్యరే. శివస్వామి, రామస్వామయ్యరు లిరువురును తరువాత ప్రభుత్వకార్యనిర్వాహకసభ్యులైరి. సర్ మహమ్మద్ హబీబుల్లా ౧౯౧౫లో కాంగ్రెస్ వేదికపైన నుపన్యసించి తన వక్తృత్వసామర్థ్యమును వెల్లడించెను. ఆయన మద్రాసు ప్రభుత్వములోను, ఢిల్లీప్రభుత్వములోనుగూడ కార్యనిర్వాహక సభ్యత్వపదవినిపొందెను. ఇటీవల మద్రాసులో లామెంబరుగానున్న సర్ యస్. కృష్ణన్ నాయర్ ౧౯౦౮ కాంగ్రెసులో నుపన్యసించియుండెను. ఆయనతరువాత మద్రాసులామెంబరైన సర్ కె. వి. రెడ్డి ౧౯౧౭ లో జస్టిసుపక్షము పుట్టేటంతవరకును గూడ మంచి కాంగ్రెస్వాది. సర్ యమ్. రామచంద్రరావు చాలాకాలమువరకును కాంగ్రెసుభక్తుడుగా నుండెను. ౧౯౨౧ లో ఆయన మద్రాసుప్రభుత్వకార్యనిర్వాహకసభ్యుడుగా నియమింప

బడెను. కాని ఎందువలననో ఆనియామకము తిరిగీ తప్పిపోయినది. ఒక్క మద్రాసు లోనే ఆగురురు జడ్జీలును, ఆగురురు కార్యనిర్వాహక సభ్యులును కాంగ్రెస్‌వాదుల నుండి తీసికొనబడిరి. ఇటీవల టారిఫ్‌బోర్డుకు వశేశన్‌గారు, కొచ్చిన్ దివానుగా సర్ షణ్ముఖమ్‌చెట్టి నియమింపబడుటవలన ప్రభుత్వమువా రుద్యోగనియామకవిధానమునం దవలంబించిన నూతనపంథా వ్యక్త మవుతూన్నది. కాంగ్రెస్‌వారిలో మొట్టమొదటి బహుమానము పొందినవారు బహుశా జంబులింగం మొదలియారుగారు. ఈయన ౧౮౮౬లో మద్రాసుశాసనసభ కెన్నికసభ్యుడు. తరువాత సివిల్‌కోర్టుజడ్జీ అయ్యెను. బొంబాయిరాష్ట్రమునందలి తయ్యాబ్జీ, చందావర్కారులు ౧౮౮౭, ౧౯౦౦ సంవత్సరములలో జరిగిన మద్రాసు, లాహోరుకాంగ్రెసులకు క్రమముగా అధ్యక్షులయిరి. వారును, కె. టి. తెలాంగ్‌నుకూడ బొంబాయిహైకోర్టు న్యాయమూర్తులైరి. యన్. యమ్. సమర్థ్, బి. యన్. బాసులు భారతరాజ్యాంగ కార్యవర్గసభకు సభ్యు లయిరి. సర్ చిమన్‌లాల్ సెతల్వాడ్ తరువాత బొంబాయిప్రభుత్వ కార్యనిర్వాహకసభకు సభ్యు డయ్యెను.

వంగరాష్ట్రవిభజనసందర్భమున నాయకత్వము వహించి పనిచేసిన ఏ. చౌదరి దానాపు అప్పటికప్పుడే హైకోర్టుజడ్జీపదవిని పొందెను. ౧౯౦౮లో మార్లేప్రభువు ఇండియా "లా" మెంబరును నిర్ణయించుకొనవలసియుండెను. అప్పుడు సర్ అసు తోష్ ముఖర్జీ, యస్. పి. సిన్హాలకు పోటీవచ్చెను. "అసుతోష్‌ముఖర్జీ భారతదేశమునందు ప్రముఖుడైన న్యాయశాస్త్రపరిజ్ఞాత అనీ, మంచి ప్రాచ్యాచారపరాయణుడనీ" ఆయన పక్షమున అప్పుడు ప్రచారముచేయబడెను. "సిన్హా మితవాది అయినప్పటికీ, కాంగ్రెసు మనిషి" అని మింటోప్రభు వభిప్రాయమిచ్చెను. ఈసంగతులు మనకు మింటోప్రభ్వి వ్రాసిన మింటోప్రభువుచరిత్రనుండి తెలుస్తూన్నవి. సిన్హా ౧౮౯౬లో జరిగిన ౧౨వ కాంగ్రెసులో (కలకత్తా) ఒక సామంతరాజు విచారణ లేకుండ సింహాసనమునుండి తొలగింపబడుటను గూర్చి మాట్లాడెను. కాని చిట్టచివర కాకాంగ్రెస్ సిన్హాకే "లా మెంబరు"పని అయినది. ఇదేవిధముగా ౧౯౨౦ లో గవర్నరు జెనరల్ కార్యసంఘములో నొక ఖాళీ రాగా షెమ్సుఫర్డుప్రభువు బరద్వాన్ మహారాజు పేరు సూచించెను. కాని హోం మేంబర్ ఇంపీరియల్ శాసనసభలో ఎన్నికసభ్యులైనవారు కావలె నని శ్రీనివాస శాస్త్రి పేరుకు మొగ్గ చూపెను. శాస్త్రి సందిగ్ధసమయములో షెమ్సుఫర్డుప్రభువున కక్కరకు రాలేదనే కారణముతో ఆయనపేరు వైస్రాయి కిష్టములేకపోయెను. కాని చిట్టచివర కాపదవి బి. యన్. శర్మను వరించెను. ఈశర్మగారు రమ్మృతసరముసందర్భములో షెమ్సుఫర్డుప్రభువున కనుకూలించె నను విషయము ముస్ముందు తెలగలము. వంగ రాష్ట్రములో నొకప్పుడు కాంగ్రెస్‌వాదులుగా నుండి తరువాత ప్రభుత్వములో

ఉన్నతోద్యోగములు పొందినవారు యస్. ఆర్. దాసు, సర్ ప్రభాస్‌చంద్ర మిత్త రులు. ఇందులో మొదటివారు ౧౯౦౫ కాంగ్రెసులో ప్రభుత్వ కార్యనిర్వాహక సభ లందు భారతీయులు నియమింపబడుటనుగూర్చి ముచ్చటించిరి. తరువాత ఆయన ఇండియా ప్రభుత్వములో కార్యనిర్వాహకసభ్యుడుగా పనిచేసెను. రెండవవారు వంగరాష్ట్రకార్యనిర్వాహక సభ్యు డయ్యెను. సంయుక్తరాష్ట్ర సుప్రసిద్ధులనుండి సర్ తేజబహాదూర్ సప్రూ ఇండియా ప్రభుత్వములో "లా" మెంబరుగా తీసికొన బడెను. ౧౯౧౨ లో పాట్నా కాంగ్రెసు నాహ్వానించిన సయ్యాద్ హసన్ ఇమామ్ హైకోర్టుజడ్జీపదవి నలంకరించెను. సచ్చిదానందసిన్హా బీహారు కార్యనిర్వా హకసభ్యుడుగా చేయబడెను.

ఈపైన చెప్పబడిన విషయములనుబట్టి, ప్రభుత్వమువా రిచ్చిన యుద్యోగముల వలననే మన రాజకీయవేత్తల సేవ వారిచే సత్కరింపబడిన దని భావించవలెను. ప్రభు త్వమువారికి వారియందు గల అభిమానము తదితరవిధములలో కూడ ప్రకటింప బడెను. ౧౯౦౫ లో కర్జను ప్రభువువంటి ప్రతికూలుడైన వైస్రాయిచే ఫిరోజిషా మెహతా "సర్" బిరుదాంకితుడు చేయబడెను. గోపాలకృష్ణగోఖేలకు సర్ బిరుదము గాని, ఇండియా కార్యనిర్వాహకసభలో సభ్యత్వముగాని వాగ్దానము చేయబడినప్పటి కిని, ఆయన అంగీకరించియుండేవాడు కాడు. ఆయన నిష్కళంకమైన, నిరాడంబర మైన భారతదేశసేవకుడుగా నుండవలె ననియే కోరెను. అట్లే ఆయన జీవితమును గడ పెను. ఆయన సి. ఐ. ఇ. కాకుండినట్లయితే యెక్కువ ఆనందముగా జీవించియుండే వాడు. మహాసంగ్రామకాలములో పెంట్లండ్ ప్రభువుచే వి. యస్. శ్రీనివాసశాస్త్రి మద్రాసుశాసనసభకు సభ్యుడుగా నియమింపబడెను. తరువాత ఆయన మాంటుఫర్డు సంస్కరణములలో భారతశాసనసభకు సభ్యుడుగా నామినేటు చేయబడెను. ౧౯౨౧ లో సామ్రాజ్యమహాసభకు ఇండియాపక్షమున ప్రతినిధిగా నియమింపబడెను. పిమ్మట ఆయన ప్రీవీకౌన్సిలర్ చేయబడెను. తరువాత ఆయన అమెరికాకు పోయి, ఇండియా సామ్రాజ్యము అనే విషయమును గూర్చి యుపన్యసించెను. ఒక్క దక్షిణాఫ్రికా తప్ప తక్కిన అధినివేశరాజ్యము లన్నియు ఆయన నాహ్వానించినవి. దక్షిణాఫ్రికా ఆయన నాహ్వానించ నిరాకరించినది. ఇండియాప్రభుత్వమువా రాయనఖర్చులనిమిత్తము రూ. ౬౦,౦౦౦ లు శాంక్షన్ చేసిరి. కాని దక్షిణాఫ్రికాలో నివాసస్థాన మేర్పరచుకొనిన భారతీయుల క్షేమమును విచారించేనిమిత్త మాయనను ౧౯౨౭ లో మొదటి యేజెంటు జెనరలునుగా చేసి ప్రభుత్వమువా రాయనకు తగిన పరిహారమును కావించిరి. ఒకప్పుడు పనికిరాదని పారవేయబడిన రాతిముక్కయే పిదప సామ్రాజ్యమహాసౌధమునకు పునాది రాయి యైనది.

సుప్రసిద్ధకాంగ్రెసువాదులయెడ చూపబడిన ప్రభుత్వాభిమానమునుగూర్చి ఇంత వరకు కొన్ని తార్కాణములను చూపితిమి. దీనినిబట్టి యెవ్వరును, ఆయుద్యోగము లీయ బడినవారు, వారి విద్యావిశేషములనుబట్టిగాని, విజ్ఞానసంపత్తినిబట్టిగాని, సత్ప్రవర్తన మునుబట్టిగాని ఆయున్నతాధికారములను పొందుట కర్హులు కారని భావింపకూడదు. ప్రభుత్వమువారుకూడ వారియుద్యోగములకు సమర్థులయినవారు కావలసివచ్చినచో కాంగ్రెసువాదులనుండియే అట్టివారిని తీసుకొనవలసియుండె ననియు, వారి రాజకీయభావ ములవలన వా రాయున్నతాధికారములను పొందుట కనర్హులుగా తలపబడలేదనియును మాత్రమే ఈ నిదర్శనములు ఋజువుచేయగలవు.

# 4. కాంగ్రెస్ ఉద్యమమునెడల బ్రిటను ప్రతికూలభావము

## నూతనకక్షలు – పక్షములు

[డఫరిన్ ప్రభువు వ్యతిరేకభావము – కాల్విన్, హ్యూములు—పరిపాలనానిరోధములు—౧౨౪ (ఏ) ఐ. పి. సి. ౧౫౩ (ఏ) ఐ. పి. సి.—కర్జన్ ప్రభువు కఠినపరిపాలనము — ప్రభుత్వోద్యోగములలో వెనుకంజ—వంగరాష్ట్ర విభజనము, ఫుల్లర్ బెదరింపులు – వంగరాష్ట్రసమస్య భారతదేశసమస్య యగుట – జాతీయవిద్య – బహిష్కరణము – బిపినబాబు – అరవిందుడు – ౯ మంది ప్రవాసులు–మొదటిబాంబు – యుగాంతర్-లండనులో దౌర్జన్యము–వంగరాష్ట్రవిభజనబాధ్యత త్యజింపబడుట – విభజనము రద్దుచేయబడుట – కాని నిర్బంధము సాగుచునేయుండుట – ప్రతికూల ముద్రణాశాసనములు – మహమ్మదాలీకేసు – ముద్రణాశాసనమునుగూర్చి సర్ లారెన్సు జెంకిన్సు నిరసనము – 'న్యూఇండియా' కేసు – మహాసంగ్రామ ప్రారంభము– బెశాంటు సంఘమున చేరుట.]

ఇండియాలో బ్రిటిష్ప్రభుత్వమునుగూర్చినచరిత్ర ఒక చిత్రమైనకథ. మొదట నిర్బంధవిధానము, పిదప సంస్కరణప్రవేశము; ఇది బ్రిటిష్ రాజకీయతత్వజ్ఞుల సిద్ధాంతము. ప్రజాందోళనము పూర్తిగా సమసిపోయిననేగాని ప్రజలకేవిధమైన సౌకర్యములును చూపబడరాదనే సూత్రముపైన నిర్బంధవిధానమవలంబింపబడును. ౧౮౭౮ లో లిట్టనుప్రభువు చేసిన ముద్రణాశాసనము త్వరలో నుపసంహరించుకొనబడినప్పటికి, అదియే ఈప్రభుత్వవిధానమున కుపోద్ఘాతమయ్యెను. తరువాత ప్రజలలో అభివృద్ధిపొందుచున్న ఆత్మచైతన్యమునకు చిహ్నముగా ఆయుధచట్టము వచ్చినది. పిమ్మట ౧౮౮౬ లో యెవరి అభ్యంతరములను లెక్కపెట్టక, ఆదాయపు పన్నుచట్టము వచ్చినది. కాంగ్రెసు క్రమవికాసమును పొందినకొలదీ అధికారులు దానిని అనుమానదృష్టితో చూడ మొదలుపెట్టిరి. కాంగ్రెసును కేవలము సంఘసంస్కారసంస్థగా గాక రాజకీయనిర్మాణముగా చేయవలసిన పని మొట్టమొదట హ్యూముకు సలహాయిచ్చిన డఫరిన్ప్రభువే దానికి ప్రబలశత్రువై, దాని నొక రాజద్రోహసంఘముగా భావించ ప్రారంభించెను.

౧౮౮౬ లో కలకత్తాలో ప్రాయిగానున్న డఫరిన్ప్రభువు, ౧౮౮౭ లో మద్రాసులో గవర్నరుగానున్న కన్నెమెరాప్రభువు కాంగ్రెసును చక్కగా ఆదరించిరని హ్యూముకు సంతృప్తి కలిగినది. కాని తరువాతిసంవత్సరములలో పశ్చిమోత్తరరాష్ట్రము (సం. రా.)నకు గవర్నరుగా నుండిన సర్ ఆక్లండు కాల్విన్ వంటివారు కొందరు దాని శత్రుభావముతో చూడ మొదలుపెట్టిరి. చాప మీదపెద్దమనిషి, కాంగ్రెసును సంఘసంస్కరణసంస్థగా మార్చవలసిన దని సలహా యిచ్చెను. హ్యూముకు మొట్టమొదటి యుద్దేశ మదేనను, కాని డఫరిన్ప్రభు విచ్చిన సలహావలన కాంగ్రెసు రాజకీయసంస్థగా చేయబడినదనీ ఈయన కప్పటికి తెలిసియుండదు. అప్పటికి కాంగ్రెసుఉద్యమము బాల్యావస్థలో నున్నప్పటికి, ముందు నపాయకరము కాగలదని ఆయన ఊహించెను. ౧౮౮౭ లో మద్రాసులో ప్రారంభమయిన ప్రభుత్వవిధాన నిరసనపద్ధతి జాతీయవాదులకును, రాజభక్తులకును ద్వేషకారణము కాగలదని ఆయన భావించెను. కాంగ్రెసు భారతప్రజలకు ప్రతినిధిగా నటించుట మన్యాయ మని కూడా కాల్విన్ అభిప్రాయమును వెలిపుచ్చెను. హ్యూమ్ ద్వేషభావ మిదివరకే ఉన్నదనీ, దానిని నిర్మూలించుటయే ఇప్పుడు చేయవలసినపని అనీ, ప్రతిఘటనాందోళనమును కేవలము కాలము గడుపుకొనిపోయే అజ్ఞానులు ఆంగ్లో ఇండియనులు తప్ప ఇక నెవ్వరును ప్రారంభించరనీ ప్రత్యుత్తర మిచ్చెను. "మహమ్మదీయులుకూడా హిందువులంత వివేకవంతులు. ప్రజాపరిపాలనాపద్ధతిని ప్రేమించు

టలో వా రెవరికిని తీసిపోరు. వారు స్వతస్సిద్ధముగా కాంగ్రెసుకు వ్యతిరేకులుగా నున్న అవకాశమును తీసికొని స్వార్థపరులైన అధికారులు "చీలదీసి పాలింపుము" అన్న సూత్రము ననుసరించి వారి నుపయోగించుకొంటున్నారు. వారు హిందువులకన్న తక్కువవా రని చెప్పేవిషయము నీచము, భయంకరము." అని చెప్పి హ్యూమ్ మహమ్మదీన్ సర్ సాలార్‌జంగ్, జస్టిస్ బద్రుద్దీన్ తయ్యబ్జీ, జస్టిస్ సయ్యద్‌మహమ్మదుల పేర్ల నుదాహరించెను. కాంగ్రెస్ ప్రజాప్రాతినిధ్యమునుగూర్చి వ్రాసినసందర్భములో ఇంగ్లీషుపార్లమెంటుఎన్నికలందు ఆబెర్‌డీన్‌వంటి నియోజకవర్గములలో నూటికి ౧౦ మందిమాత్రమే వోట్లిచ్చుచుండిరనీ, వేమౌత్‌లోని రెండుస్థానములును అమ్ముడు పోవుచుండెననీ, అందులో ఒకటి ఆయనతండ్రిచే కొనబడినదనీ హ్యూమ్ వ్రాసెను.

కాంగ్రెస్ సంఘసంస్కరణవిధానమునుమాత్రమే అవలంబించవలె నన్నసూచనకు ప్రత్యుత్తరముగా మత, సాంఘిక, నైతిక, రాజకీయవిషయము లన్నిటిలో నది భారతదేశమునకు నూతనవికాసమును కలిగించుటకు పనిచేస్తున్నదని ఆయన వ్రాసెను. కాంగ్రెస్‌ప్రచారమున కింకను తరుణము రాలేదనీ, అది అపోహలు కల్పిస్తున్న దనీ ఆపాదించిన నేరమునకు జవాబుగా అధికారులచుట్టును ఎల్లప్పుడును స్వప్రయోజనములకోసము యాచించే స్తోత్రపాఠకులుతప్ప తదితరు లుండరనీ, అందువలన వారికి నిజమైన ప్రజాభిప్రాయము తెలియదనీ మందలించెను. "మంచిప్రవర్తనము, ప్రజాసేవాభిలాష గల భారతీయ ఉద్యోగులకసలు బుద్ధిపూర్వకముగా రా నివ్వగించరు. ఉద్యోగులు వారి ననుమానదృక్కులతో చూడవచ్చుననీ, సామాన్యనౌకరులు వారి నవమానపరచెదరనీ వారు తలంచెదరు." అనికూడా హ్యూమ్ తెలియచెప్పెను. కాంగ్రెస్ ప్రచారమునకు తరుణము రాలేదని సూచించేబదులు తరుణము మించిపోయిన దని సూచించియుండవలసిన దని హ్యూమ్ కాల్విను నెత్తిపొడిచెను. "వారికి విన చెవులు, చూడ కన్నులు లేవు. వివేకవంతులు ద్వేషభావము నోరులేని కైవుజనసమూహము యొక్క నిస్పృహను శక్తిమంతముగా చేసి వారి నకస్మాత్తుగా నిర్మూలించినది." అని ౧౮వ శతాబ్దాంతములోని బూర్బాన్సు చరిత్రమును వ్రాసి హ్యూమ్‌ప్రత్యుత్తరమునకు సంబంధించినకథను వెడ్డర్‌బరన్ ముగించెను.

నాలుగవకాంగ్రెసునాటికి చెప్పరానిచిక్కులు వచ్చినవి. కాంగ్రెస్‌కు తగిన స్థలము అలహాబాదులో లభింపలేదు. "ఆము జిల్లాఅధికారి అభిప్రాయమునకు వ్యతిరేకముగా నొకపెద్దమనిషి మద్రాసుకాంగ్రెసుకు ౧౮౮౭ లో హాజరైనందుకు రు. ౨౦,౦౦౦ లు ధరావతు కోరబడె" నని బెసెంటు తనగ్రంథములో నుదాహరించియుండెను. ౧౮౯౦ నాటికి వ్యవహారము లింకను చెడుగా పరిణమించినవి. వంగరాష్ట్రప్రభుత్వమువారు "ఇండియాప్రభుత్వమువారి యుత్తరువులప్రకారము ప్రభుత్వ

ద్యోగులు కేవలము ప్రేక్షకులుగాకూడ అటువంటి సమావేశములకు పోరాదు. అట్టి సమావేశవ్యవహారములలో వారు జోక్యము కల్పించుకొనరాదు" అని ఒక్కసర్క్యులరును తమకార్యదర్శులకును, తమక్రిందనున్న తదితరశాఖల ఉన్నతాధికారులకును పంపిరి. కాంగ్రెస్ అధికారులు గవర్నరుగారి అంతరంగికకార్యదర్శికి పంపిన ఏడు కార్డులును త్రిప్పివేయబడినవి. ఇండియా ప్రభుత్వమువారు స్వదేశసంస్థానములలోని ముద్రణాధికారములను నిరోధిస్తూ ౧౯౨౧ జూన్ ౨౫ వ తేదీగల యొకయుత్తరువును వారి విదేశరాజ్యాంగశాఖనుండి జారీచేయించిరి. కాంగ్రెస్‌వారాయుత్తరువును ౧౯౨౧ లోనే ప్రతిఘటించిరి.

౧౯౨౩ నాటికి శాసనసభలు పెద్దవి చేయబడినవి. ప్రజాప్రతినిధులు మద్రాసుకు ఏడుగురు, బొంబాయికి ఆరుగురు, వంగరాష్ట్రమున ఏడుగురుమాత్రమేయుండిరి. ఈ కొద్దిమందిప్రజాప్రతినిధులే శాసనసభలలో గట్టిగా మాట్లాడ ప్రారంభించిరి. ప్రభుత్వమువారీసంగతిని గమనించి ప్రభుత్వోద్యోగములలో భారతీయుల కింతకు పూర్వము గల సౌకర్యములను తగ్గించిరి. (వివరములకు "తీర్మానముల సింహావలోకనము" అనే అధ్యాయములో "ప్రభుత్వోద్యోగములు" అనేభాగమును చూడవచ్చును.) మొట్టమొదట విద్యాశాఖలో ఐరోపీయులకును, భారతీయులకును గూడ అన్ని యుద్యోగములను సమానముగా పొందే అధికార ముండెను. తరువాత కూడ ఆ అధికారమట్లే యుంచబడినది కాని గ్రేడ్లలోమాత్రము భేదము కల్పింపబడినది. తరువాత భారతీయులు కొన్నియుద్యోగములనుండి నిషేధింపబడిరి. వారిజీతముకూడ కొంత తగ్గించబడినది. అందువలన వారిజీత మింకను తగ్గిపోయినది. అదే సమయములో ఐరోపీయ ఉద్యోగస్థులకు వారిజీతములలో మారకమువలన కలిగే నష్టములకు బదులుగా కొంత పరిహారము ఏర్పాటుచేయబడినది. దానిని లోకమాన్యతిలకు గొప్ప నేరముగా భావించెను. ఆవుత్తరువు ౨౬-౬-౧౯౨౩ న పుట్టినది. ముప్పదిసంవత్సరములలో సైను ఖర్చులు రూ. ౭౦ లక్షలనుండి ౧౬౦ లక్షలకు పెరిగిపోయినది. ౧౨౪ (ఎ), ౧౫౩ (ఎ). సెక్షనులు ౧౮౭౦ లో సృష్టింపబడినవి. అవి నిజముగానే ప్రభుత్వమునెడ ద్వేషభావము పుట్టించినవి. ౧౦౮, ౧౪౪ సెక్షనులు రాజకీయ నేరస్థుల విషయములో మొట్టమొదట క్రిందటిశతాబ్దముననే అనువర్తింపచేయబడినవి. ౧౯౨౫ లో రహస్య ముద్రణాసంఘములు (Secret Press Committees) స్థాపింపబడినవి. ౧౯౨౫ మద్రాసుకాంగ్రెసులో డబ్ల్యు. ఎ. చేంబర్సు వాటినిగూర్చి తీవ్రముగా ప్రతిఘటించెను. ఆ ప్రతిఘటనతీర్మానమును లోకమాన్యునకు ముఖ్యసహచరుడైయున యన్. సి. కేల్కారు ఆమోదించెను. "ఈ ముద్రణాసంఘములు మారురూపములలో ముద్రణాస్వాతంత్ర్యమును అరికట్టడమునకు బయలుదేరిన అసహ్యకరమైన సంస్థలు.

అందువల్ల ఇవి బ్రిటిషుఇండియాకు అవమానకరములు" అని ఆయన చెప్పెను. మధోల్కారు ౧౮౯౭ లో, సర్ జేమ్సు ఫిట్జుజేమ్సు స్టీఫెన్‌గారు రాజభక్తినిగూర్చిఇచ్చిన అభిప్రాయమును యీవిధముగా ఉదాహరించెను. "బ్రిటిషుపత్రికలు ప్రచురించిన విషయములు మీరు ప్రచురించవచ్చును. వాటిని మించి ఎవరును తీవ్రముగా వ్రాయవలెనని కోరకూడదు." ౧౮౯౭ లో పూనా ప్లేగు కొట్లాటలసందర్భమున విచారణ లేకుండ ఖయిదుచేయబడిన నాతుసోదరులు విడుదలచేయబడిరి. ఆసంవత్సరమే వంగరాష్ట్రము రెక్కలుతీసివేసిన పక్షివలె చేయబడెను. ౨౦ వ శతాబ్దములోని మొదటి ౫ సంవత్సరములును కర్జన్ ప్రభునికఠినపరిపాలనావిధానము అవిచ్ఛిన్నముగా సాగినది. ఆయన, కలకత్తాకార్పొరేషను అధికారములను తగ్గించుట, అధికార రహస్యచట్టమును నిర్మించుట, విశ్వవిద్యాలయములను అధికారులపరము చేసి విద్యావిధానమును ఎక్కువ వ్యయకారణముగా నొనరించుట, భారతీయు లసత్యవంతు లని ప్రచారము చేయుట, టిబెట్టుదండయాత్ర, చిట్టచివరకాయన చేసిన వంగరాష్ట్రవిభజనము, ఇవన్నీ భారతదేశములోని రాజభక్తిని నిర్మూలించి జాతీయభావములను రేకెత్తించినవి. కలకత్తాలో కర్జనుప్రభువు మన మసత్యవంతుల మని చేసిన యుపన్యాసముకంటెను మన ఆత్మగౌరవమున కెక్కువ బాధాకరమైన విషయము మరియొకటికలదు. అది "మన పరసరములవలన, మన సంప్రదాయములవలన, మనము పెరిగిన విధానమువలన బ్రిటిష్‌ప్రభుత్వములోని ఉన్నతోద్యోగబాధ్యతలను వహించుటకు మన మర్హులము కాము" అని ఆయన మనలను గూర్చి వెలిబుచ్చిన అభిప్రాయమే. ఇందు కనుగుణముగా ౨౪-౫-౧౯౦౪ తీర్మానమువలన ఆయన సమర్థతనుబట్టి కాక జాతినిబట్టియే ఉద్యోగము లీయబడవలె నని నిర్ణయించెను. ఇది చూచియే భారతరాజ్యాంగ కార్యదర్శి మార్లేప్రభువు, "భారతదేశము రాజకీయనిరంకుశాధికారమునుండికంటె ముందుగా అన్యజాతీయ దురహంకారమునుండి విడుదల కావలెనని కోరుచున్నది." అని చెప్పవలసివచ్చినది. కర్జనుప్రభువు వైస్రాయిగా నున్నంతకాలమును ఆయన ఊపిరాడకుండ పనిచేసెను. ఆయన పండ్రెండు సంస్కరణములను చేయవలె నని తలపెట్టెను. అందుకనేక ఉపసంఘములను నియమించెను. "కొందరు పనులను జాగుచేయుట కుపసంఘములను నియమింతురు. నేనో పనులను నిర్వర్తించుట కుపసంఘములను నియమింతును" అని ఆయన ఒకప్పుడు చెప్పెను. ఆయన భారతదేశమునకు కొన్ని శాశ్వతోపకారములనుకూడ చేసినమాట వాస్తవము. ఆయన చేసిన "పురాతన నిర్మాణసంరక్షణచట్టము" (Ancient Monument Preservation Act) నకు భారతజాతి కృతజ్ఞత చూప

వలసియున్నది. ఆయన రంగూన్, ఓహారా కేసులలోని ముద్దాయీలను రక్షించినవిధాన మాయన ధైర్యసాహసములను, న్యాయబుద్ధిని వెల్లడిస్తున్నది*

౧౯౦౦-౧౯౦౬ ల మధ్యకాలమునందు హిందూదేశములో నానా విప్లవములు తటస్థించినవి. ప్రజలలో రాజకీయ చైతన్య మభివృద్ధినొందకొలదీ ప్రభుత్వప్రతినిధుల విధానము బట్టబయలైనది. ౧౯౧౩ నాటికి ఐ. సీ. యస్. ఉద్యోగములలో ౧౨౦౦ మంది ఐరోపియనులును, ౬౦ మంది భారతీయులును నున్నారు. అప్పటికి ఐ. సి. యస్. పద్ధతి ప్రవేశపెట్టబడి ౩౫ సంవత్సరము లైనది. ౧౯౧౩ ప్రాంతములలో కామన్సుసభవారు ఏకకాలమున ఇండియాలోకూడా ఐ. సి. యస్. పరీక్షలు జరుపబడ వలెనని తీర్మానించిరి. కాని తరువాత ౧౦ సంవత్సరములకు కర్జన్ ప్రభువు భారతీయుల అసమర్థతనుగూర్చి చెప్పిన మాటలు మన మందరమును ఎరిగియున్నదే. ప్రభుత్వము వారు ఐ. సి. యస్. ఉద్యోగములలో నవలంబించినపద్ధతి సురేంద్రనాథబెనర్జీ అంతటి రాజభక్తునకుకూడా కోపము కలిగించెను. ఆయన "సివిల్ సర్వీసులచరిత్ర నిరంతర వాగ్దానభంగముల చరిత్ర" అని చెప్పెను. కర్జన్ ప్రభువును ముద్దాయిగా విచారించు టకు బదులు, షేరీదారులు లేనందుకు యస్. యస్. సమర్థ చింతిల్లెను. ౧౯౦౫ కాశీకాంగ్రెసులో అంబాలాల్ దేశాయి ఐ. సి. యస్. ఉద్యోగనియామకవిధానమును గూర్చి పార్లమెంటువారు కమీషనుద్వారా విచారణ జరిపింపవలసినదని తీర్మానము ప్రతి పాదింపగా నది అంగీకరింపబడెను. కర్జనుప్రభువు నియమించిన విశ్వవిద్యాలయకమీష సంఘమువారి నివేదికఫలితముగా విశ్వవిద్యాలయచట్ట మొకటి చేయబడెను. దానిని గూర్చి డాక్టర్ ఘోష్ "విజ్ఞానద్వారములకు బంగారుతాళములు వేయబడి సీళ్లువేయ బడినవి. అవి బంగారు తాళపుచెవులతో కాని తెరవబడవు" అని చెప్పెను.

కర్జన్ ప్రభువు పోలీసుకమీషనును నియమించి భారతీయులను స్పెషల్ పోలీసు ఉద్యోగములనుండి నిషేధించెను. ఇదే కాలమున భారతవర్తకసంఘములో "ప్రభుత్వము-ధనార్జనము" ఈ రెండును ఏకకాలమున జరుగునని ఆయన యుపన్యసించెను. ఈపరి స్థితు లన్నియును కలిసి వంగరాష్ట్రవిభజనసందర్భమున నొక తీవ్రజాతీయాందోళన రూపమును పొందినవి. వంగరాష్ట్రవిభజనమువలన వంగభాషను మాట్లాడే ప్రజ లంద

---

* రంగూన్‌లోని బ్రిటిష్‌పటాలమునందలి కొంతమంది సిపాయిలు ఒకస్త్రీని అవమానపరచగా ఆమె మరణించినదని ఒక ప్రతీతి యున్నది. కాని సిపాయిలలోని సంఘీభావమువలన నేరముచేసినవారు బయటపడలేదు. ఈవిషయము ౧౮౯౯లో జరిగి నది. ౧౯౦౦లో ఇద్దరుసైనికులు, వారికి కావలసిన స్త్రీని తీసుకొనిరానందుకు ఒకవంట వానినిచావగొట్టిరి. ఈఖూనీనేరమును చేసినముద్దాయీలుకూడ దొరకలేదు. ఇదిసయాల్ కోటలో జరిగినది. సయాల్‌కోట ౯వ గుఱ్ఱపుపటాలమంతయువలన శిక్షింపబడినది.

యును రెండు రాష్ట్రముల క్రిందకు వచ్చిరి. అది వంగీయులకు గిట్టలేదు. అందువలన వారు చాలా కష్టనష్టముల కోర్చి తీవ్రమైన ఆందోళనమును ప్రారంభించిరి. ప్రభుత్వమువారు అంతకంటెను తీవ్రనిర్బంధవిధానమునకు కడంగిరి. ప్రజలు ప్రదర్శనములు, సమావేశములు, ఉత్సవములు చేయ మొదలుపెట్టిరి. ప్రభుత్వమువారిచే సభలన్నియు సంఘములు నిషేధింపబడెను. హర్తాళములు ప్రారంభమైనవి. విద్యార్థులును, పౌరులును కూడ శిక్షింపబడిరి. పాఠశాలలకు బంధనలు కఠినములు చేయబడినవి. విద్యార్థులు సమావేశములకు పోజగూడదని నిషేధింపబడిరి. పూర్వబంగాళాదేశపు లెఫ్టినెంటు గవర్నరు బెదిరింపులను సాగించెను. ఆయన మర్యాదస్థుల నవమానపరచెను. రక్తపాతము రావచ్చునని వారిని భయపెట్టెను. అందుకు తగినట్లుగా గూర్ఖాపటాలములు వచ్చి తూర్పుబంగాళములో దిగినవి. ఇవంతయు ప్రజ లెంతమాత్రమును దౌర్జన్యమునకు దిగనప్పుడే జరిగెనని మాలవ్యాపండితులు చెప్పినారు. ప్రభుత్వమువా రవలంబించిన నిర్బంధవిధానము ౧౯౦౫-౧౯౦౬ లోని జాతీయోద్యమము నణచివేయుటకు బదులుగా "నగారాను జోకొట్టిన" ట్లయినది. అనా డెక్కడో ఒకమూల జరిగిన సంగతులు సమస్తభారతదేశమునకును వ్యాపించినవి. ప్రభుత్వమువారు వంగరాష్ట్రములో నవలంబించిన నిర్బంధవిధానఫలితములు దేశమంతటను ప్రకోపకమైనవి. వంగరాష్ట్రసమస్య అఖిలభారత సమస్యయైనది. ప్రతిరాష్ట్రమునందలి ప్రజలును, ఎన్నాళ్లనుండియో నానావ్యాపారములలో పాలయున్న అసంతృప్తిని వెల్లడించి, జాతీయాందోళనము నింకను బలవత్తరముగా చేయ ప్రారంభించిరి. కెనాల్ కాలనైజేషన్ బిల్లు పంజాబులోని రైతుజాతుల ఆందోళనమునకు కారణమైనది. ఈ ఆందోళనములోనే లాలా లజపతిరాయులును, సర్దార్ అజితసింగును ప్రవాసమునకు పంపబడిరి. ఇట్టితరుణములో కలకత్తాకాంగ్రెసునకు భారతపితామహుడు దాదాభాయినౌరోజీ అధ్యక్షుడుగా నెన్నుకొనబడుట చాలా సమంజసము. ఆయన "స్వరాజ్యము భారతదేశరాజకీయోద్యమమునకు పరమావధి" అని చెప్పినమాట ఆంగ్లో ఇండియనుల క్రోధాగ్నిని మరింత ప్రజ్వలింపచేసినది.

విద్యార్థులు రాజకీయములలో పాల్గొనరా దని చేయబడిన నిషేధపుటుత్తరువులు పాఠశాలాబహిష్కరణోద్యమమునకు కారణభూతము లైనవి. ప్రభుత్వపాఠశాలాబహిష్కరణముతోపాటు జాతీయవిద్యావ్యాపక మవసర మైనది. అందుమూలమున ఒక్క తూర్పుబంగాళములోనే ౨౪ జాతీయవిద్యాలయములు స్థాపింపబడినవి. వంగరాష్ట్రములో జాతీయవిద్యావ్యాపనముకొరకు సర్ గురుదాస్ బెనర్జీ (జడ్జీ పదవినుండి విరమించినవారు) యాజమాన్యమున వంగజాతీయవిద్యాపరిషత్తు స్థాపింపబడినది. ఈ సంస్థ ౧౯౦౬ కలకత్తాకాంగ్రెసుతీర్మానము ప్రకారము జాతీయపద్ధతులతో జాతీ

యాధికారముక్రింద జాతీయాదర్శములకు మార్గదర్శకముగా నుండుటకు నిర్మింపబడినది. దీని ప్రధానాచార్యులు బాబు సతీశచంద్ర ముఖర్జీ. బాబు బిపినచంద్రపాల్ "న్యూ ఇండియా" అనే వారపత్రికకు సంపాదకుడు. ఆయన ఆపత్రికద్వారా ౧౯౦౩, ౧౯౦౪ సంవత్సరములనుండీ భారతజాతీయ వికాసమునకై పనిచేస్తూండెను. ఆకాలములో జాతీయతానిరూపణమునకును, జాతీయవిద్యావిధాన నిర్ణయమునకును, నూతన భావప్రకటనమునకును ఆయన అధికారి. ౧౯౦౭ వసంతకాలములో ఆయన ఆంధ్రదేశమును దర్శించెను. ఆయన రాజమహేంద్రవరము వచ్చినప్పు డాపట్టణస్థు లక్కడ జాతీయవిద్యాలయమును స్థాపింప నిర్ణయించిరి. ఆయనకు సన్మానపత్ర మర్పించిన హేతువున ట్రెయినింగు కాలేజీవిద్యార్థులు కొంతమంది సస్పెండు చేయబడిరి. వారందరును జాతీయసైనికు లైరి. ప్రభుత్వమువారి అంతులేని నిర్బంధవిధాన మీవిధముగనే మనకు జాతీయసేవకులను, వీరులను సృష్టించిపెట్టినది. ౧౯౦౭ లో బిపినబాబు నాటిన మచిలీపట్టణములోని జాతీయవిద్యాబీజము తక్షణమే మొలకెత్తి ౧౯౧౭, ౧౯౨౧ల లోని జాతీయోద్యమములవలన దోహదము చేయబడి, వృక్షమై, ప్రభుత్వ ప్రాతికూల్యభావము లను మండుటెండలకును, వడగాడ్పులకును తాళి నేటికిని తను మాత్రము పూలుపూచి, కాయలుకాయుచునే ఉన్నది. ౧౯౦౭ వ సంవత్సరములో బహిష్కారణము, జాతీయవిద్య, స్వదేశీసిద్ధాంతము లాచరణలోకి వచ్చినవి. జాతీయ విద్యాలయములును, కళాశాలలును వంగ, మహారాష్ట్ర, పాంచాలాంధ్ర మధ్యరాష్ట్రములలో నక్కడక్కడ స్థాపింపబడినవి. కాని స్వదేశీయోద్యమము యావద్భారతదేశములోను వ్యాపించినది. చేతిమగ్గము పునరుద్ధరింపబడినది. చిన్నచిన్న మరమగ్గములు ప్రవేశపెట్టబడినవి. ౧౯౦౫ ఆగస్టు ౭ వ తేదీ బహిష్కారణోద్యమ ప్రారంభదినము. చేతిమగ్గముల ప్రోత్సాహమునిమిత్త మీయుద్యమము లేవదీయబడినది. బహిష్కారణోద్యమ ప్రారంభదినమైన ౧౯౦౫ ఆగస్టు ౭ వ తేదీ వంగరాష్ట్రవిభజనదిన మైన ౧౬ వ అక్టోబరుతోపాటు తరువాత చాలా సంవత్సరములవరకును పుణ్యదినముగా పరిగణింపబడుతూండేది. ఆరోజులలోని రాజకీయవాతావరణము నూతనోత్సాహపూరితమై యుండెను. జాతీయోద్యమముతో పాటు ప్రభుత్వనిర్బంధవిధానము కూడా దినదినాభివృద్ధిని పొందుతూండెను. ప్రభుత్వ నిర్బంధముక్రిందనే జాతీయవికాసము దినదినప్రవర్ధమాన మగుచుండెను. ౧౯౦౭లో పరిస్థితులు మరింత తీవ్రరూపమును తాల్చినవి. అందువలననే మింటోప్రభువు గోఖ్లేనుగూర్చి "ఆయనహృదయము మంచి దని నా అభిప్రాయము. కాని ఇటీవల ఆయనచేసే పనులు చూస్తే నా కసహ్యము వేస్తూన్నది." అని విసుగుదలతో నిందించెను. దీనినిబట్టి మన జాతీయనాయకులలో

కొంతమంది ప్రభుత్వము - ప్రజలమధ్య యేవిధముగా చిక్కునపడెదరో మన మూహించికొనవలసియున్నది.

ఆరోజులలో భారతదేశచరిత్రకు కారకులైన ఇద్దరు మహాపురుషులు వంగ రాష్ట్రమునుండి బయలు దేరిరి. బిపిన్‌బాబునుగూర్చి, ఆయనమహాత్కార్యమును గూర్చి ఇదివరకే ఉదాహరించియుంటిమి. అరవిందుడు చాలాసంవత్సరములవరకును భారతాకాశమున గొప్పనక్షత్రమువలె ప్రకాశించెను. జాతీయవిద్యాప్రచారమున కర విందునితోగల సన్నిహితసంబంధమువలన దానిప్రతిష్ఠ హెచ్చి, అది మిక్కిలి ఆకర్ష వంతమైనది. ఆయన ఆంగ్లదేశములో పుట్టి, ఆంగ్లదేశములో పెరిగి, ఆంగ్లదేశవాతా వరణములో ఆంగ్లవిశ్వవిద్యాలయములలోనే విద్యాభ్యాసము చేసెను. ఆయన తదితర ఐ.సి.యస్.ఉద్యోగులవలెనే బరోడారాజ్యములోని విద్యాశాఖలో ఉద్యోగమును సంపా దించుకొనేనిమిత్తమిండియాకు వచ్చెను. అరవిందుడు ఐ. సి. యస్. పరీక్షకు పోయి గుఱ్ఱపుస్వారిలో తప్పిపోవుటవలన ఆయన కీస్థితి పట్టినది. కాని అరవిందుని అపూర్వ మేధావిశేష మొక్కసారి జగద్వ్యాప్తమైనది. హిమాలయపర్వతములు మొదలుకొని కన్యాకుమారి అగ్రమువరకును ఆయనవిజ్ఞానతేజస్సు వెలుగొందినది. కాని ఆయన కొంతకాలమువరకే ఉన్నతాకాశపథముల విహరించెను.

వంగరాష్ట్రములో తొమ్మిదిమందికి ప్రవాసశిక్ష విధింపబడినది. శిక్షితులు కృష్ణకుమారమిత్ర, పులిన్‌బిహారీదాసు, శ్యామసుందరచక్రవర్తి, అశ్వినీకుమార దత్తు, మనోరంజనగుహాఠాకూర్తా, సుబోధచంద్రమల్లిక్, సచ్చిదానందప్రసాదవసు, సతీశచంద్రచటర్జీ, భూపేశచంద్రనాగులు. ఈనాయకులు వంగరాష్ట్రమును, ముఖ్యముగా వంగరాష్ట్రయువకులను ఏకోన్ముఖమునకు తీసుకొనిరా పనిచేసియుండిరి. ఆరోజులలో ఒకవంక స్థైర్యము, శరీరబలము కలిగియుండవలెనని వంగయువకుల ఆదర్శము. రెండవ పక్క "గూర్ఖాసిపాయీలు-అవసరమునుబట్టి రక్తపాతము" సర్ బామ్‌ఫీల్డు ఫుల్లర్ ఆదర్శము. ౧౯౦౭ లో రాజకీయవ్యవహారములు పరిపక్వమయి పరమావధికి వచ్చినవి. ఎక్కడ చూచినను పత్రికానిర్బంధములు చెలరేగినవి. యుగాంతర్, సంధ్యా, వందే మాతరమ్ పత్రికలు నూతనజాతీయభావములకు పుట్టిల్లు. అవన్నియును ఆపివేయబడి నవి. "సంధ్యా"సంపాదకుడు బ్రహ్మబాంధవోపాధ్యాయులు గొప్పదేశాభిమాని. ఆయన ఆసుపత్రిలో మరణించెను. అరవిందుడు చాలాకష్టములకు లోనయి, మూడుకేసులలో చిక్కుకొని, చిట్టచివర కెట్లో బ్రిటిష్‌రాజ్యమును విడిచిపెట్టి, పుదుచ్చేరిపోయి, అచ్చట ఆశ్రమమును స్థాపించుకొనెను.

౧౯౦౮ ఏప్రిల్ ౩౦ వ తేదీని ముజఫర్ పురములో ఇద్దరు స్త్రీలపైన (కెన్నెడీలు) రెండుబాంబులు పడినవి. అవి ఆ స్థానికజిల్లా మేజస్ట్రేటు కింగ్సుఫర్డుగారి నుద్దేశించి వేయబడినవి. ఆనేరమునకు ఖుదీరామ్‌బోస్ అను ౧౮ యేండ్లయువకు డురితీయబడెను. ఆయనబొమ్మలు దేశమంతటను పంచిపెట్టబడినవి. యుగాంతర్ పత్రికలో బహిరంగముగా దౌర్జన్యపద్ధతులు బోధింపబడెను. ఆపత్రికాసంపాదకుడు భూపేంద్రనాథదత్తా అనుయువకుడు. ఆయన వివేకానందస్వామిసోదరుడు. ఆ యువకునకు దీర్ఘ శిక్ష విధింపబడినది. ఆయనతల్లి కుమారునిసేవకు సంతోషించి ఆశీర్వదించినది. ౫౦౦ ల మంది వంగనారీమణులామెయొద్దకు బోయి యామె నభినందించిరి. తనపత్రికను నడుపుటకు వెనుక ౩౦ కోట్లమంది యున్నారని కోర్టులో కుమారుడు వాఙ్మూలమిచ్చెను. ఆవిశ్వాసమే ఉద్యమమును సజీవముగా చేయగలిగినది. రాజద్రోహముగాని, అందువలనవచ్చే శిక్షగాని ప్రజలకు భీతి గలిగించుటలేదు. రాజద్రోహ ప్రచారము పూర్తిగా సాగినది. కాని కేసులు పెట్టబడినయెడల, ముద్దాయిలు కోర్టులో వాదించుకొని తప్పించుకొనవలెనను కన్నిమార్గములను ఉపయోగించుకొన ప్రారంభించిరి. అరవిందునిపైన తేబడిన 'వందేమాతరమ్' రాజద్రోహపుకేసుకూడ ఈ వర్గమునకు చెందిననదే. మహారాష్ట్రదేశములో ౧౯౦౮ జులై ౧౩ వ తేదీని బాలగంగాధరతిలక్ అరెస్టు చేయబడెను. ఆనాడే ఆంధ్రదేశములో హరిసర్వోత్తమరావు, మరియిద్దరు అరెస్టుచేయబడిరి. అయిదురోజులు విచారించి తిలకుకు ౬ సంవత్సరముల ద్వీపాంతరవాసశిక్ష విధింపబడెను. ఆశిక్షకు ౧౮౯౭ లో ముజరా ఈయబడిన ఆరుమాసములశిక్షకూడ చేర్చబడెను. హరిసర్వోత్తమరావుకు వేయబడిన ౯ మాసములశిక్షను ప్రభుత్వమువారెక్కువచేయించవలెనని ప్రయత్నించిరి. హైకోర్టువారు దానిని మూడుసంవత్సరములకు పెంచిరి. రాజద్రోహమునకు ౫ సంవత్సరము లప్పుడు సామాన్యశిక్షగా పరిగణింపబడెను. తరువాత ఎట్లో రాజద్రోహము దేశములో అదృశ్యమైనది. నిజమునకప్పటికప్పుడే అది రహస్యమార్గములను పట్టి బాంబులు, రివాల్వరులరూపమును తాల్చినది. ౧౯౦౮ లో రాజద్రోహసభాశాసనము, ముద్రణాశాసనములు నూతనముగాచేయబడినవి. ప్రజలప్రతిఘటనములు తృణీకరింపబడినవి. రెండుసంవత్సరములపిమ్మట క్రిమినల్ లా అమెండ్‌మెంట్ ఆక్టు చేయబడినది. రాజద్రోహసభాశాసనము చర్చకు వచ్చినప్పుడు యువకులు చెయిజారిపోవుచున్నారనీ, వారిని అదుపాజ్ఞలలో నుంచజాలనందుకు పెద్దవాండ్లను నిందించి ప్రయోజనము లేదనీ గోఖ్లే ప్రభుత్వమును మందలించెను.

అక్కడక్కడ, అప్పుడప్పుడు రాజకీయహత్యలు జరుగుతూవచ్చినవి. అన్నిటికన్నను అద్భుతసాహసకృత్యము సీమలో జరిగిన సర్ కర్జన్‌వైలీహత్య. ౧౯౦౯ లో నొకబహిరంగసభలో మదన్‌లాల్‌ఢింగ్రీ అనునొక యువకు డీహత్య

కావించెను. ఆయన తరువాత ఉరితీయబడెను. హత్యకావింపబడిన వైలీని రక్షించబోయిన పార్శీపెద్దమనిషి డాక్టర్ లాల్‌కాకాకూడ మృతినొందెను. ౧౯౦౯ లో ౨౪వ కాంగ్రెసుకు (లాహోరు) అధ్యక్షుడైన మాలవ్యాపండితు డీసంఘటనలకును, నాసిక్ కలెక్టర్ జాక్సన్‌హత్యకును చింతిల్లెను. ఒక రాష్ట్రమునుండి మరియొకరాష్ట్రమునకే దౌర్జన్యపద్ధతి అతివేగముగా వ్యాపిస్తూఉండెను. సీమలోని కొంతమంది విద్యార్థులుకూడ దీనికి ప్రోత్సాహకులుగా నుండిరి. మింటో మార్లే సంస్కరణములుగాని, బొంబాయి, మద్రాసు, ఇండియా ప్రభుత్వకార్యనిర్వాహక సభలలో భారతీయుల ప్రవేశము కాని ఈచిత్తవృత్తిని మార్చజాలకపోయెను. ఆలస్యముగా ప్రవేశపెట్టబడిన సంస్కరణముల విలువను, సౌమ్యతను కూడ పోగొట్టుకొంటు వని గోఖ్లే పదేపదే చెప్పినమాట సత్యమైనది. కర్జనుప్రభు వలంబించిన రాజకీయవిధానమువలన కలిగినఫలితము మార్లేప్రభువున కిప్పటికి తెలిసివచ్చినది. ౧౮౫౮ లో రాణీగారు చేసినప్రకటనమునకు కర్జనుప్రభువు చేసిన అపార్థమును మార్లే ప్రభువు సవరించి ప్రభుత్వవిధానములో జాతిభేదములు గమనింపబడ రాదనెను. కాని వంగరాష్ట్రవిభజనము రద్దయ్యేటంతవరకును దేశములో శాంతి కవకాశములేకుండెను. ప్రభుత్వప్రతిష్ఠ కది పరీక్షాసమయము. ప్రభుత్వ మెప్పుడును ప్రజాందోళనమునకు లోబడజాలదు. ఒక్కసారి లోబడినయెడల అంతటితో దాని పరిపాలన మంతమొందినట్లే. "ప్రభుత్వము క్రిందనున్న ప్రజల ఆందోళనమునకు లోబడిగానీ, పైనున్న అధికారులకు విధేయత చూపించిగానీ యేపనినీ చేయదు. అది స్వేచ్ఛగా తనకు తోచినట్లు ప్రవర్తించును." అని మింటోప్రభు వొకప్పుడు పరిపాలకుల చిత్తవృత్తినిగూర్చి సంగ్రహముగా చెప్పియుండెను. కాబట్టి ఇప్పుడు వంగరాష్ట్రవిభజనపుచిక్కులోనుండి తప్పించుకొని బయటపడుట కొక మార్గము కనిపెట్టబడినది. ఆ విభజనమును తలపెట్టిన కర్జనుప్రభువుగానీ, సంతకముపెట్టిన ఆక్టింగ్ వైస్రాయి యాంప్థిల్ ప్రభువుగానీ దానికి బాధ్యత వహింప నంగీకరించ లేదు. అదేవిధముగా అప్పటి భారత రాజ్యాంగకార్యదర్శులు మార్లేప్రభువు, వైకౌంటుమిడిల్‌టన్‌లు (బ్రాడ్రిక్కు) కూడ బాధ్యతవహింప నిరాకరించిరి. ఎట్లైననేమి, మింటోప్రభువుతరువాత హార్డింజిప్రభువు వైస్రాయిగను, వైకౌంటు మిడిల్‌టన్ తరువాత క్రూప్రభువు హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శిగను వచ్చి రాజుగారి పట్టాభిషేకసందర్భమును పురస్కరించుకొని వంగ రాష్ట్రవిభజనమును రద్దుచేయించగలిగిరి. ఆసమయములోనే కలకత్తానుండి ఢిల్లీకి రాజధాని మార్పుచేయబడినది. ఢిల్లీలో పట్టాభిషేకమహోత్సవానంతరము సభామంటపమును విడిచివెళ్లునప్పుడు రాజుగారు ౧౨-౧౨-౧౯౧౧న సింహాసనమునుండి లేచి,

"మా మంత్రులసలహాతో, మాగవర్నరుజనరల్ ఇక్ కౌన్సిలును ఆలోచించి, ఇండియాప్రభుత్వమువారి రాజధానిని కలకత్తానుండి పురాతన ముఖ్యపట్టణమైన ఢిల్లీ నగరమునకు మార్చవలెనని నిర్ణయించినాము. వెంటనే ఈమార్పున కనుగుణముగా ఏక కాలమున అమలులోకి వచ్చేటట్లు వంగరాష్ట్రమునకు గవర్నర్ ఇక్ కౌన్సిలును, బీహార్ ఛోటానాగపూరు ఒరిస్సాలకు లెఫ్టినెంటు గవర్నరును, అస్సాముకు ఛీఫ్ కమిషనరును నియమించినాము. ఇందుకు తగినట్లుగా సరిహద్దులును, పరిపాలనా సందర్భములును కౌన్సిల్లతో గూడిన మాగవర్నరు జెనరలు, భారతరాజ్యాంగకార్యదర్శుల నిర్ణయముప్రకారము మార్పుచేయబడును. ఈమార్పులు మాకు ప్రేమాస్పదులైన ప్రజల ఉన్నతాభివృద్ధులకు తోడ్పడవలె నని మా నిజమైనకోరిక. ఈప్రకటనము మాకు చాలా సంతోషమును కలిగిస్తూన్నది."

అని చెప్పెను. వంగరాష్ట్రవిభజనము రద్దుచేయబడిన దన్నంతనే విభజనమునకు పూర్వ మది యెలా ఉండెనో, అలాగే తిరిగి యేర్పాటుచేయబడిన దని ఊహించవలసి దు. వంగరాష్ట్రము పశ్చిమబంగాళము, అస్సాము,తూర్పుబంగాళములుగా విభజింపబడి నప్పుడు కేవలము రూపములోమాత్రమే భేదము కలిగినది. విభజనకాలములో పశ్చిమబంగా ళమున చేర్చబడిన బీహారు తరువాత ఛోటానాగపురము, ఒరిస్సాలతో కలసి ఒకరాష్ట్ర ముగా ప్రత్యేకించబడినది. కాబట్టి అస్సాములోకూడిన తూర్పుబంగాళము, పశ్చిమ బంగాళములకు బదులు, ఇప్పుడు బంగాళదేశ మంతయును కలసి ఒకరాష్ట్రముగను, బీహారు, ఛోటానాగపురము, ఒరిస్సా రెండవరాష్ట్రముగను, అస్సాము మూడవ రాష్ట్రముగను చేయబడినవి. నేడు ఒరిస్సా ప్రత్యేకరాష్ట్రముగా చేయబడుటచే పట్టాభిషేకసందర్భమున నివారింపబడని అన్యాయమునకు తగిన పరిహారము జరిగినది. వంగరాష్ట్రవిభజనము రద్దుచేయబడుటమూలముననను, దక్షిణాఫ్రికాలో కంట్రాక్టు కూలీపద్ధతి నిర్మూలించబడుటమూలమునను హార్డింజిప్రభువుపరిపాలనము చిరస్మర ణీయముగా భావింపబడుతూన్నది. కాని నిజమునకు రెంటింటికన్నను, ఆయన భారత రాజ్యాంగ సంస్కరణములనుగూర్చి ౧౯౧౧ ఆగస్టు ౨౫ న సీమకు పంపిన సూచన లనుబట్టి ఆయనపరిపాలనము చిరస్మరణీయము కావలసియుండెను. ఆసూచనలే భారత భావిరాజ్యాంగసంస్కరణము లన్నిటికిని పునాదు లైనవి. అందులో హార్డింజి ప్రభువు జాతీయపునర్నిర్మాణమునకు రాష్ట్రీయస్వాతంత్ర్య మవసరమని విస్పష్టముగా నంగీకరించెను.

ఈవిజయపరంపరలతో కాంగ్రెస్ ౧౯౧౧ లో కలకత్తాలో జరుగబోయేట ప్పుడు ప్రజలుత్సాహమును వెలిబుచ్చెదరని భావించుట సహజమే. వంగరాష్ట్రమునకు

కష్టకాలములో అఖిలభారతదేశము తోడ్పడినందుకు సురేంద్రనాథబెనర్జీ అభినందించెను. ఆయన భారతదేశము బ్రిటిష్‌సామ్రాజ్యములో స్వతంత్ర భాగస్వామిగా నుండగల దని తన ఆశను ప్రకటించెను. కాని ఇంత సంతోషసమయములో కూడ ప్రజల ప్రాథమిక హక్కులకు భంగకరములైన ౧౯౦౮ రాజద్రోహసభాశాసనమును, ముద్రణాశాసనమును, ౧౯౧౦ క్రిమినల్ లా అమెండుమెంటుచట్టమును దేశము విస్మరింప జాలకపోయినది. ఇవిగాక వీ టన్నిటినీ తలదన్నిన నూరేండ్లనాటి ౧౮౧౮ సంవత్సరపు మూడవ రెస్యులేషన్, దానికి సంబంధించిన వివిధరాష్ట్రములలోని తదితర రెస్యులేషన్లు ౧౯౦౬-౧౯౦౮ సంవత్సరములలో అనేక ప్రవాసశిక్షలకు కారణభూతములైన విషయమునుగూడ ప్రజలు మరచిపోలేదు. భారతదేశములో తయారయిన ప్రత్తి పరిశ్రమలపైన వేయబడిన పన్నులుకూడ వీటికి తోడయినవి. ఇవన్నీ ప్రజాక్షేమమునకు భంగము కలిగించినవి. ఇక రాజకీయఖయిదీలు జైళ్ళలో ఉక్కిపోతూండిరి. ముఖ్యముగా బాలగంగాధరతిలక్ మాండలేకోటలో ఏకాంతముగా, అతిమాత్రవ్యాధితో కాలము వెళ్లబుచ్చుచుండెను. ఆయనను బంధించిన రాతిగోడలు తప్ప ఆయన కక్కడ యెవ్వరును స్నేహితులు లేరు. ఈతరుణమున గోఖ్లే ప్రాథమిక విద్యాచట్టము చర్చకు వచ్చెను. కాని అంగీకరింపబడేసూచనలు కనబడలేదు. దక్షిణాఫ్రికాసమస్యనుగూర్చి యావద్భారతదేశములో నాందోళనము జరిగించవలసియుండెను.

ఇవి ౧౯౧౧ నాటి రాజకీయపరిస్థితులు. ౧౯౧౨ నాటికి కొంత రాజకీయతీవ్రత తగ్గినది. కాని ఆకాలములోని వైస్రాయి లంపరికంటెను యెక్కువ ప్రజానురంజకుడైన వైస్రాయి హార్డింజిప్రభుని ప్రాణముదీయు ప్రయత్నము జరుగుట విషాదకరవిషయము. హార్డింజిప్రభువు ఢిల్లీనగరములో నూతనరాజధానీప్రవేశసందర్భమున ఉత్సవములో గజారూఢుడై ఊరేగుతూండగా, ఆ జనసమూహములోనుండి ఒక బాంబు ఆయనపైన విసరబడెను. ఆయన యెట్లో మృత్యుముఖమునుండి తప్పించుకొనగలిగెను. ౧౯౧౨లోని బంకీపురము కాంగ్రెస్ ఈ దురంతమునుగూర్చి విచారమును, కోపమును వెలిబుచ్చుతూ హార్డింజిప్రభున కొక తంతిని పంప తీర్మానించినది. కాని అప్పటినుండీ తిరిగీ ముద్రాలయములపైన 'నిగా' యెక్కువైనది. ఆకారణమున ౧౯౧౩లో ముద్రాణాశాసనము రద్దు కావలె నని కాంగ్రెస్ పట్టుపట్టినది. భూపేంద్రనాథబాసు భారతదేశములో ముద్రణాలయములు పొందిన వివిధదశలను వివరించెను: "౧౮౩౫ లో సర్ చార్లెస్ మెట్కాఫ్ భారత ముద్రాలయములకు స్వాతంత్ర్య మిప్పించెను. పిదప ౧౮౭౮-౭౯లో దేశభాషాముద్రణాశాసనమును చేసి లిట్టన్‌ప్రభువు తిరిగీ వాటినోరు నొక్కెను. గ్లాడ్‌స్టన్ జోక్యము కల్పించుకొన్నందువల్ల తరువాత ఆశాసనము రద్దు గావింపబడినది. ౧౮౮౧ లో ఇండియాప్రభుత్వము

వారు తమ ౨౫-౬-౧౮౯౧ తేదీగల ప్రకటనము మూలకముగా, స్వదేశసంస్థానము లలో బ్రిటిష్‌పరిపాలనముక్రిందనున్న ప్రదేశములలోనిముద్రాలయముల స్వాతంత్ర్యము నరికట్టిరి. దీనిని కాంగ్రెసు తరువాతి సంవత్సరములలో ప్రతిఘటిస్తూనే వచ్చినది. చిట్టచివరి ప్రతికూలశాసనము ౧౯౦౮ లో చేయబడిన ముద్రాణాశాసనము. ఇది ౧౯౧౦ లో శాశ్వతముగా గ్రంథస్థము చేయబడిన దీనిప్రకారము కొత్తపత్రికలనుండిగాని, ముద్రాలయములనుండిగాని రు. ౨౦౦౦ ల వరకును, పాతవాటినుండి రు. ౫౦౦౦ ల వరకును ధరావతు కోరడమునకు ప్రభుత్వమువారి కధికార ముండెను. ఆకాలములో హోమ్‌మెంబరుగా నున్న సర్ హార్‌బర్టు రైస్లీ ఆశాసన మప్పటికి పనిచేస్తూన్న పత్రికలకుగాని, ముద్రా శాలలకు గాని వర్తించదనీ, ఆ చట్టపరిపాలనము పోలీసువారిచేతులలో నుండదనీ నమ్మకముగా చెప్పెను. కాని ఈరెండువిషయములును గూడ సత్యదూరములైనవి. ౧౮౩౫ వ సంవత్సరపుచట్టముప్రకారము ముద్రాశాల నొకచోటనుండి మరియొక చోటకు మార్చినప్పుడు తాత్కాలికముగా ముద్రాపకుడుగాని, ప్రకాశకుడుగాని గైర్ హాజ రయినప్పుడును, ముద్రాశాలాయాజమాన్య మొకరిచేతులలోనుండి మరియొకరి చేతులలోకి మారినప్పుడును కొత్తగా ప్రభుత్వమువారి అనుజ్ఞ తీసికొనబడవలసియుం డెను. ఈసంగతి ప్రజలు చాలామంది గమనించలేదు. బిల్లుయొక్క చిట్టచివరిస్వరూ పమునకు కారణభూతుడైన అప్పటి "లా" మెంబరు సర్ యస్. పి. సిన్హాగూడా ఈ విషయమును గమనించలేదు. ఈకొత్త అనుజ్ఞలను తీసికొనవలసివచ్చినప్పుడు పాత పత్రికలును, పాతముద్రాశాలలును కూడ నూతనముగా స్థాపింపబడినట్లుగానే భావించి ప్రభుత్వమువారు ధరావతులను కోరవచ్చును. సాధారణముగా ఈ ధరావతులు పోలీసు వారి రహస్యనివేదకలపైననే ఆధారపడియుండెడివి. ౧౯౧౪ లో యుద్ధము ప్రారంభ మైనప్పుడు ముద్రణాశాసనము పూర్తిగా దుర్వినియోగము చేయబడినదనుటకు నిదర్శన మొకటి కలదు. మహమ్మదాలీ "మాసిడోనియాకు వచ్చి మాకు సహాయపడండి" అనేశీర్షికతో కొన్ని కరపత్రములను ప్రకటించెను. అవి ప్రభుత్వమువారిచే స్వాధీనపరచుకొనబడి నవి. ౧౯౧౦ శాసనముప్రకారము ప్రభుత్వమువారు ప్రకటింపవలసిన కారణములుకూడ ఆసందర్భములో ప్రకటింపబడలేదు. తరువాత ఆకరపత్రములు రాజద్రోహపూరిత ములుకావనీ, ఇండియన్ పీనల్‌కోడులోని అధికారములు వాటికి వర్తించవనీ కలకత్తా హైకోర్టులో తీర్పుచెప్పబడెను. (ఇం. లా. రి. ౪౧ కలకత్తా ౪౬౬). హైకోర్టు ప్రధానన్యాయమూర్తి సర్ లారెన్సు జెన్‌కిన్సు ముద్రణాశాసనమునుగూర్చి ఆసందర్భ ములో వ్రాసిన అభిప్రాయములను కొన్నిటి నీక్రింద నుదాహరింతుము:

"౧౨ వ సెక్షను ప్రకారము తప్ప తదితరవిధముగా ఈకరపత్రములను స్వాధీన పరచుకొన వీలులేదని మేము చెప్పకతీరదు. ౪ వ సెక్షనులో చేయబడిన నిబంధన లతివిస్తీర్ణముగా నున్నవి. మానవుని బుద్ధిబలమునుబట్టి వాటి కెంత విశాలార్థమునైనను చెప్పవచ్చును. అంపరకును అంగీకారములైన వ్రాతలకుకూడా, ఆ సెక్షనులోని నిబంధనలనువర్తింపచేయవచ్చును. ప్రజలదారిద్ర్యముపైనను, అవినీతిపైనను ఆధారపడి జీవించే నీచజాతులను నిందిస్తూ వ్రాయబడిన వ్రాతలుకూడా ఈవలలో పడకతప్పదు. ప్రజలలో నొకతరగతివారిని శ్లాఘించినను ఈసెక్షనుక్రింద నేరము కాదని చెప్పడమునకు వీలులేదు. ప్రమాణముగా గ్రహింపబడెడిన ఉత్తమసాహిత్యముకూడా నిస్సందేహముగా ఈసెక్షనుక్రిందకు రాగలదు. క్రిమినల్ లా క్రిందకు రానివిషయము లనేకములు ముద్రణాశాసనముక్రిందకు రాగలవనీ, ఋజువుభారము దరఖాస్తుదారునిపైన వేయున్నదనీ అడ్వొకేటు జెనరల్ వాదన. ఆవాదనతో నే నేకీభవిస్తున్నాను. కాబట్టి ఈకరపత్రము లెంత సదుద్దేశముతో ప్రకటింపబడినను అవి ముద్రణాశాసనముక్రిందకు రావని దరఖాస్తుదారు ఋజువుచేయగలిగిననే తప్ప ఆయనదరఖాస్తు నిలువదు. అయితే ఈ విషయ మెట్లు ఋజువుచేయబడగలదు? "ఆకరపత్రములు బ్రిటిష్ ఇండియాలోని చక్రవర్తిగారి పౌరులలో నేతరగతివారిపైనను ద్వేషభావముగాని, అసూయాభావముగాని పుట్టింపవలెనని ఉద్దేశింపబడలేదు. అవిధమైన భావములను కలిగించే స్వభావము వాటిలో లేదు." అని దరఖాస్తుదారు ఋజువుచేసినంతమాత్రమున చాలదు. అవి (ఆకరపత్రములు) ప్రత్యక్షముగాగాని, పరోక్షముగాగాని, భావగర్భితముగా గాని, ఊహావలనగాని, సూచనవలనగాని, సామెతవలనగాని, ఉపమానమువలనగాని పైనచెప్పబడిన అసూయాద్వేషభావములను గలిగించ సమర్థములు కావనికూడా దరఖాస్తుదారు ఋజువుచేయవలెను. అంతేకాదు. "లేక ఇంకేవిధముగా గాని" అని కూడా ఆ సెక్షనులో ఒకమాట యున్నది. ఈమాటలో విశ్వ మిమిడియున్నది. దరఖాస్తుదారు వీటిని ఋజువుచేయజాలడు. కాబట్టి మహమ్మదాలీపుస్తకము పోయినది. కాని ఇందువలన ఆయనప్రవర్తనమునకు కళంకము లేదు. ఆయన ప్రస్తుతపుదరఖాస్తును మేము చట్టముప్రకారము త్రోసివేసినప్పటికినీ ఆయనకళంకరహిత ప్రవర్తనమువలననే ఆయనకు సంతృప్తి కలుగగలదు." ప్రధానన్యాయమూర్తి జెంకిన్సుగారి ఈఅభిప్రాయమునకు తోడు, సహాయన్యాయమూర్తి జస్టిస్ స్టీఫెన్ "ఈశాసనమువలన ప్రభుత్వమువారికంతులేనిఅధికారము కలిగినది. బందిపోట్లు, హత్యలుచేసి ప్రభుత్వమును బాధింపతలచుకొనినతరగతివారలైనను దురదృష్టవశమున ఈదేశములో నుండేయెడల వారిపైన ద్వేషభావము కలిగిస్తూ వ్రాసిన వ్రాతలకుకూడ ప్రభుత్వమువారా పత్రికను స్వాధీనపరచుకొనవచ్చును." అని అభిప్రాయ మిచ్చెను.

బెసెంటుసంపాదకత్వమున నడుపబడిన 'న్యూ ఇండియా' పత్రిక కేసులో మద్రాసు ప్రధానన్యాయమూర్తిగా పని చేస్తున్నవారు "సెక్షన్ ౩ (౧) ముద్రణా యంత్రములను స్థాపించుకొనదలచినవారికి చాలా కష్టములను కలుగచేస్తున్నది" అని అభిప్రాయ మిచ్చెను. ౧౯౧౬ లో ముద్రణాశాసనముక్రింద బెసెంటు ముద్రము మీద రు.౨౦,౦౦౦ ల ధరావతులను పోగొట్టుకొనినది. పత్రికా సంఘము పక్షమున బి. జి. హార్నిమన్ నాయకత్వమున మాలవ్యా, చింతామణి, సచ్చిదానంద సిన్హాలును, ఇంకను మరికొందరును ౫-౩-౧౯౧౬ తేదీన షెమ్స్‌ఫర్డుప్రభువు వద్దకు రాయబారము వెళ్లిరి. వైస్రాయి వారిని తీవ్రముగా మందలించి పంపివేసెను. వారినే కాదు, హైకోర్టు తీర్పులను వ్రాసిన జడ్జీలనుకూడా అతడు నిరసించెను. "న్యాయమూర్తి చెప్ప వలసినది న్యాయశాస్త్ర మెలా గ్రహింపవలెననే విషయము కాదు. అది ఎలాయున్న దనే విషయమే ఆయన ఆలోచింపవలసినది. విషయజ్ఞానముపైన, అనుభవముపైన, ప్రభుత్వవిధానముపైన ఆధారపడియుంటుంది ప్రభుత్వ కార్యనిర్వాహకుల చర్య. న్యాయస్థానములలో వీటికి స్థానము లేదు. సర్ లారెన్సు జెంకిన్సు తీర్పులో స్వవచోవిఘాతము లున్నవి. ఇప్పుడు నేను మీకిచ్చిన లెక్కలనుగూర్చి కొంచెమైనను ఆయనకు తెలిసియున్నట్లయితే, ముద్రణాలయములను, పత్రికలను స్థాపించుట చాలా అపాయకరమైనపని అని ఆయన వ్రాసియుండేవాడు కాడు." ఇవి వైస్రాయి రాయ బారవర్గముతో చెప్పిన మాటలు.

మాంటుఫర్డు సంస్కరణములు దేశములో ప్రవేశపెట్టబడినపిమ్మట నే ౧౯౧౯ ప్రాంతములలో, ఒక్క క్రిమినల్ లా అమెండుమెంటు చట్టము తప్ప తక్కిన నిర్బంధశాసనములు రద్దుచేయబడినవి. వంగరాష్ట్రవిభజనము రద్దుచేయబడిన పిమ్మటను, దేశములో దౌర్జన్యప్రచార మదృశ్యమయినప్పుడునుకూడ ౧౯౧౩ లో ముద్రణాశాసనమువలన ప్రజలకు కలిగిన కష్టములనుగూర్చి వివరించుటలో మేము ముద్రణాచట్టముయొక్క సంపూర్ణకథనే వర్ణించియుంటిమి. ఇక ౧౯౧౯ నుండి రాజకీయవాతావరణములో కలిగిన ప్రశాంతి ౧౯౧౪-౧౮ సంవత్సరములలోని యుద్ధకారణముగా ఆందోళితమైనది. ప్రపంచశాంతికి భంగకరమైన ఈమహాసం గ్రామము భారతదేశమున కొకవిధముగా మేలుచేకూర్చినది. వంగరాష్ట్రవిభజన సందర్భమున జాతీయోద్యమమునకు దూరముగానుండి, ప్రభుత్వమును విశ్వసించిన మహమ్మదీయులు యుద్ధము రానున్నతరుణములో కాంగ్రెసుతో చేతులు కలుప తలపెట్టిరి. అఖిల భారత మస్లిమ్ లీగువారు బ్రిటిష్ సామ్రాజ్యాంతరస్థ స్వరా జ్యము భారతదేశముయొక్క ఆదర్శముగా నంగీకరించిరి. భారతదేశపు రాజకీయజీవి

వ్యక్తు హిందూమహమ్మదీయుల సంఘీభావముపైన ఆధారపడియున్న దని వారు ప్రకటించిరి. ఈ రెండుతీర్మానములను ౧౯౧౩ కాంగ్రెసు హృదయపూర్వకముగా శ్లాఘించినది.

౧౯౧౪ జూలైనెలలో యుద్ధము ప్రారంభమయ్యెను. నవంబరులో జర్మనులు ఫ్రాన్సును ముట్టడించనుండిరి. హార్డింజిప్రభువు ధైర్యముచేసి ఇండియాలోని సైన్యమునంతను యుద్ధభూమికి పంపివేసెను. ఇండియాలోనిసైన్యము ఇంగ్లాండు క్షేమముకొరకు మిండియాను సంరక్షించవలసియుండగా ఇంగ్లాండే సముద్రములో మునిగిపోవునెడల ఇక ఇండియాలో నీసైన్య మెందుకు అని యోజించి ఆయన ఒక్కరోజు విశ్రాంతికూడ లేకుండ మార్సెలీసునుండి ఫ్లాండర్సుయుద్ధభూమికి తక్షణము సైన్యమును నడిపించెను. ఆ పంపబడిన భారతసైన్యమే మిత్రమండలివారిని వినాశము కాకుండ సంరక్షించినది. కాబట్టి ౧౯౧౪ కాంగ్రెసులో "భారతదేశప్రజలు ప్రస్తుత సంధిగ్ధతరుణములో ప్రకటించిన రాజభక్తిని గమనించి ప్రభుత్వమువా రిండియాలోను, విదేశములలోను చక్రవర్తిగారి పౌరులయిన భారతీయులమధ్యను, తదితరజాతులమధ్యను చూపబడుచున్న అసహ్యాకరమైన భేదభావములను తొలగించి ౧౯౧౧ ఆగస్టు ౨౫ వ తేదీని ఇండియా ప్రభుత్వమువారు సీమకు పంపిన సూచనలలోగల రాష్ట్రీయస్వాతంత్ర్యవాగ్దానములను చెల్లించుకొనుటవలనను, భారతదేశమును సంయుక్తసామ్రాజ్యములో స్వతంత్ర భాగస్వామిగా నొనర్చుటవలనను భారతప్రజల రాజభక్తిని సామ్రాజ్యక్షేమము కొరకు శాశ్వతముగా వర్ధిల్లునట్లు చేయవలెనని ఈకాంగ్రెసు వారిని ప్రార్థిస్తున్నది" అనుతీర్మానము చేయబడినది. ఆనాటి జాతీయాశయము పూర్తిగా తెలియగలందులకు మే మీతీర్మానమును సంపూర్ణముగా నుదాహరించితిమి. బెసెంటుమాత్రము భారత స్వపరిపాలనసమస్య బహుమానరూపకముగా నుండరాదనీ, హక్కురూపకముగానుండ వలెననీ అభిప్రాయపడినది. ౧౯౧౪ లో జరిగిన మద్రాసుకాంగ్రెసులో నామె భారతీయుల ప్రవేశమును నిషేధించిన విదేశముల దిగుమతులను భారతదేశము నిషేధించ వలయునను తీర్మానమును ప్రతిపాదించినది. పెంట్లండుప్రభుని హయాములో బెసెంటు తన హోమురూల్ ఉద్యమమును సాగించినది. స్వదేశీ, బహిష్కరణము, జాతీయ విద్య, హోమ్‌రూల్ ఈ నాలుగువిషయములును గల పాతకార్యక్రమమే మరల ప్రచారములోనికివచ్చినది. ఆమె మదనపల్లిదివ్యజ్ఞానవిద్యాసంస్థలను మదరాసు విశ్వవిద్యాలయమునుండి చీలదీసినది; అడయారులోను, సింధులోను, మరికొన్నిచోట్లను జాతీయ పాఠశాలలను స్థాపించినది; డాక్టర్ అరండేల్ నాయకత్వమున జాతీయవిద్యాభివృద్ధి కొరకొకసంఘమును స్థాపించినది. హోమ్‌రూల్‌సంఘములు బి. పి. వాడియా

సి. పి. రామస్వామయ్యరుగార్లచే స్థాపింపబడుతూవుండెను. సి. పి. రామస్వామయ్యరుగారదివరకే కాంగ్రెసులో పనిచేస్తున్నందువలన హోమ్‌రూల్ ఉద్యమములో మరింత శ్రద్ధగా పనిచేయనారంభించెను. న్యూఇండియాదినపత్రికద్వారా హోమ్‌రూల్ ప్రచారము తీవ్రముగా జరిగినది. ఈ యుద్యమమునందు విద్యార్థు లెక్కువగా జోక్యము కల్పించుకొన్నందువల్ల పెంట్లండుప్రభువు విద్యార్థులను రాజకీయములలో పాల్గొనరాదని నిషేధిస్తూ ౫౫ ప్రభుత్వ ఉత్తరువును జారీచేయించెను. ఈ ఆందోళనాఫలితముగా, ౧౬-౬-౧౯౧౭ న బెసెంట్, వాడియా, అరండేలుగార్లు ఉదకమండలములో నిర్బంధింపబడిరి. ౧౯౧౫ మొదలు ౧౯౨౦ సెప్టెంబరు వరకును గల ఈకాలమును హోమ్‌రూల్ శక మని చెప్పవచ్చును. ఈశకములో ననేకసంఘటనలు జరిగినవి. వాటినిగూర్చి ఈ పుస్తకము రెండవభాగములో నొక ప్రత్యేకాధ్యాయమునందు చర్చింతుము.

---

# 5. మన బ్రిటిషు మిత్రులు

[(౧) జాన్‌బ్రైట్ (౨) హెన్రీఫాసెట్టు (౩) ఎ. ఓ. హ్యూమ్ (౪) సర్ విలియమ్ వెడ్డర్ బర్న్ (౫) చార్లెస్ బ్రాడ్లా (౬) విల్లియం. ఇ. గ్లాడ్‌స్టన్ (౭) నార్తుబ్రూక్ ప్రభువు (౮) డ్యూక్ ఆఫ్ . ఆర్గిల్ (౯) లార్డ్ రేనీ ఆఫ్ ఆల్డర్లీ (౧౦) అర్డ్లీ నార్టన్ (౧౧) జనరల్ బూత్.]

కొంతమంది పార్లమెంటుసభ్యులును, మరికొంతమంది సుప్రసిద్ధులయిన ఆంగ్లమిత్రులును, భారత రాజ్యాంగ పరిణామమున కెన్నదగిన కృషి చేసిరి.

ఎ. ఓ. హ్యూమ్‌గారి కాంగ్రెసునిర్మాణమునకు పూర్వము చాలాకాలమునుండి హిందూదేశసమస్యలలో అభిమానము కలిగి, పార్లమెంటుచర్చలలో భారతీయులకు బ్రిటిషువారు నిర్వర్తించవలసిన ధర్మములను గూర్చి ముచ్చటిస్తూ వచ్చిన మనమిత్రు లనేకమంది పార్లమెంటులో సభ్యులుగా నుండిరి. ఇందులో ప్రప్రథముడు జాన్‌బ్రైటు. ఈయన ౧౮౫౦-౬౦ ప్రాంతములనుండి ఇండియాపక్షమున కృషి చేసినట్లు కనబడుతూన్నది. ఈయన ౧౮౪౭ లో పార్లమెంటులో ప్రవేశించి ౧౮౮౯ వరకును భారతదేశమునందుకలిగినపరివర్తనము లన్నిటినిగూర్చి శ్రద్ధగా పనిచేసెను.

తరువాత భారతీయుల మిత్రునుగా పరిగణించబడవలసినమనిషి ఫాసెట్ గారు. ఈయన ౧౮౬౫ లో పార్లమెంటులో ప్రవేశించి ౧౮౬౮ లో "ఐ. సి. యస్. పరీక్షలు ఇంగ్లండు-ఇండియాలలో ఒక్కసారే జరుగవలె" నను తీర్మానమును ప్రతిపాదించెను. ఈయనయే ౧౮౭౫ లో శాలిస్‌బరీప్రభువుగారు సీమలో ఇండియాఖర్చులతో టర్కీ సుల్తానున కిచ్చిన విందునుగూర్చి ఖండించెను. అప్పటినుండి ఈయన ఇండియా కొఱకు నిరంతరాయముగా పనిచేస్తూ నేవచ్చినాడు. ఈయనప్రతిఘటనము వలననే అబిసీనియా యుద్ధపుఖర్చులు ఇండియా-ఇంగ్లాండు దేశములు రెండును పంచుకొనవలసివచ్చినది. ఎడింబరో ప్రభువు భారతసంస్థానాధిపతులకిచ్చినకానుకలఖర్చులు ఇండియా భరించరాదని ఈయన పట్టుపట్టెను. అదేవిధముగా వేల్సుయువరాజు భారతదేశమునకు వచ్చినప్పుడయిన పౌ. ౩౦ వేల ద్రవ్యమును ఇండియాఖర్చులకాతానుండి తీసివేయించెను. లిట్టను ప్రభువుగారి పత్తిదిగుమతిపన్నుల తగ్గింపు, ఢిల్లీ దర్బారు ఖర్చులు, అఫ్గను యుద్ధము వీటి నన్నిటిని ఈయన ప్రతిఘటించెను. ౧౮౭౨ లోనే కలకత్తాలో ఫాసెటుగారికి కృతజ్ఞతాభివందనము లర్పిస్తూ చేయబడిన తీర్మానమును, ౧౮౭౪ నాటి కాయన పార్లమెంటుఎన్నికలలో ఓడిపోయినవిధానమును జ్ఞాపకము చేసుకొన్నయెడల చాలా ఆశ్చర్యకరముగా నుండును. ఫాసెట్టుగారి ఎన్నిక ఖర్చుల నిమిత్తము పౌ. ౭౫౦ ల మొత్తము మీదేశమునుండి పంపబడినది.

ఇండియన్ పార్లమెంటరీకమిటీ నిర్మాణమునకును, కాంగ్రెసు నిర్మాణమునకును ఎ. ఓ. హ్యూమ్ చేసిన పరిశ్రమనుగూర్చియు, ఆయన అకమిటీసభ్యులనుండి ఇండియాకు సేవచేసెద మని ప్రమాణములు తీసికొనినవిధానమునుగూర్చియు ఇదివరకే వేరొకచో వ్రాసియున్నాము. అధికారిగను, అధికారేతరుడుగనుగూడ భారతదేశమున కరువదిసంవత్సరములు సేవచేసిన ఈస్కాట్లాండు దేశీయునిగూర్చి మన మింకను ఎక్కువ తెలిసికొనవలసి యున్నది. ఆయన ఐ. సి. యస్. ఉద్యోగి. అనేకహోదాలలో ఆయన ఇండియాను సేవించెను. ఆయన జిల్లా అధికారిగా "గ్రామస్థుల విద్యాభివృద్ధి, పోలీసు సంస్కరణము, సారావ్యాపారము, దేశభాషాపత్రికాశాసనము, బాలశిక్షితుల సంస్కరణము మొదలగు అనేక ముఖ్యవిషయములలో" పనిచేసెను. ఆయనకు వ్యవసాయము, గ్రామాభివృద్ధులు అభిమానవిషయములు. ఆయనదృష్టి ఎప్పుడును ప్రజల శ్రేయస్సు మీదనే. ఆయన పితూరీలో ఎటావాజిల్లాయందు ఇంగ్లీషువారిపక్షమున పోరాడి, ఇండియాను వారికి దక్కించినమాట వాస్తవమే. కాని పితూరీ శాంతించిన వెంటనే ప్రజలను విజ్ఞానవంతులుగా జేయవలెనని ఆయన పట్టుపట్టెను. "ఒక ప్రభుత్వము

కత్తి చేతపుచ్చుకొని దేశమును జయింపవచ్చును. కాని ఆరాజ్యమును శాశ్వతముగా నిలుపుకొనవలయు నన్నచో అది ప్రజల నైతికవిజ్ఞానములపైన ఆధారపడియుండవలయును. ఇది నాగరికతగల స్వతంత్రప్రభుత్వ లక్షణము." అని ఆయనఅభిప్రాయము. అందువల్లనే ప్రభుత్వమువారు ౨౫-౧-౧౮౫౪ తేదీని ప్రజలవిద్యాభివృద్ధికొరకు అధికారేతరసంస్థల నేర్పాటుచేయుట తగదనియు, పిల్లలను పాఠశాలలకు పంపవలసినదని జిల్లా కలెక్టరు ప్రజలను ప్రోత్సాహపరచగూడదనియు, ఆవిద్యాసంస్థల పోషణకు సహాయపడరాదనియును మంజూరిస్తూ ఒక ఉత్తరువును జారీచేసిరి. దానిని ప్రతిఘటిస్తూ హ్యూమ్ వ్రాసిన ఉత్తరము చరిత్రప్రసిద్ధము. "ఈవిషయంలో నేను సంవత్సరముల కొలది అత్యుత్సాహముగా తీసికొనుచున్న శ్రద్ధ ఇంతవరకును ఫలప్రదము కాలేదు. కాని నాకోరికప్రకారము శతాబ్దములనుండియు పేరుకొనియున్న ఈప్రజల అజ్ఞానమను మంచుకొండ విద్య అను సూర్యరశ్మిచే ఒక్కొక్క బిందువుగా కరగి, క్రమక్రమముగా సెలయేళ్లుగా ప్రవహించి, తుట్టతుదకు మహానదిరూపమును బొంది, ఆ ప్రవాహవేగమున అన్ని అభ్యంతరములను తరించి సామ్రాజ్యమును ఫలవంతముగా చేయగలిగినయెడల నా ఆదర్శము సిద్ధించినట్లు భావింతును." అనుభావ మా యుత్తరములో నుండెను. హ్యూమ్‌కు తరువాతి అభిమానవిషయము పోలీసుసంస్కరణము. పోలీసు, న్యాయనిర్వహణశాఖలు రెండును ప్రత్యేకించబడవలె నని ఆయనతలంపు. ఆయన "మనము మనప్రజలను అవినీతిపరులనుగా జేసినందువల్ల మనకు వచ్చే అధికలాభము లేదు. ఈ అబ్కారీరెవిన్యూ మనకు పాపపుడబ్బు. పెద్దలు చెప్పినట్లు అన్యాయముగా లభించిన ఐశ్వర్యము అభివృద్ధి పొందదు. అబ్కారీవలన ఒక్కరూపాయి మనము సంపాదించగలిగినయెడల అందువలనగలిగే నేరముల నణచివేయుటకు ప్రజలసొమ్ములో నుండి రెండురూపాయిలు మనము వెచ్చించవలసియున్నది. నే నింకను కొన్ని సంవత్సరములు జీవించియున్నయెడల ఇండియాప్రభుత్వమునకు గొప్పకళంకముగా భావింపబడుతూన్న ఈఅబ్కారీని నిర్మూలించగలను" అని చెప్పెను.

౧౮౬౫ వ సంవత్సరాంతమున 'ప్రజామిత్ర' అని పిలవబడు ఒక దేశభాషా పత్రికను స్థాపించుట కీయన సాయముచేసెను. ఆపత్రికయొక్క ౫౦౦ ల ప్రతులను పశ్చిమోత్తర రాష్ట్రముల (సం.రా) గవర్నరు తీసుకొనెను. రాజప్రతినిధి ఆపత్రికను శ్లాఘించెను. కొన్ని ప్రతులు విక్టోరియారాణీగారికి పంపించెనిమిత్తము భారత రాజ్యాంగకార్యదర్శికి పంపబడినవి. ౧౮౬౩ వ సంవత్సరములోనే బాలశిక్షితుల సంస్కారశాలలు నిర్మింపబడవలె నని ఆయన పట్టుపట్టెను. అందువలన శిక్షితులైన బాలురు పాతనేరస్థులతో కలసి చెడిపోకుండ రక్షింపబడుటకు తగినవీలు కలదని ఆయన అభిప్రాయమును, బాలురకు తగిన శిక్షణమును, విద్యావిధానమును, పరిశ్రమ

లను యేర్పాటుచేసి వారిని మంచిమార్గమున పెట్టవచ్చునని ఆయన తలంచెను. రాజపుత్ర సంస్థానములలో పండింపబడుతూన్న ఉప్పును నిరుత్సాహపరచి ప్రభుత్వమువారి సర్వాధికారములోనున్న ఉప్పును ప్రోత్సహించే నిమిత్తము దేశములోని ఉప్పుపరిశ్రమలమీద వేయబడిన పన్నును ఆయన సాల్టుకమీషనరుగా నుండి క్రమక్రమముగా నిర్మూలించగలిగెను. ఇందుకు హిందూదేశరాజ్యాంగకార్యదర్శికూడ హ్యూమును శ్లాఘించెను. రాజపుత్రసంస్థానములలో తయారయిన ఉప్పుమీద వేయబడినపన్ను "తరింపరానికోటవలె సింధునదిమీద అటక్ నుండి బంగాళాఖాతపుతీరమున నున్న పశ్చిమకటకమువరకును, అనగా భారతదేశము పశ్చిమకొననుండి తూర్పు కొనవరకును ౨౧౦౦ ల మైళ్లదూరము వ్యాపించియుండె"నని ప్రతీతి.

౧౮౭౮లో హ్యూమ్ ఒక వ్యవసాయప్రణాళికను తయారుచేసెను. మేయో ప్రభువుకూడ దాని నంగీకరించెను. కాని అది ఆచరణలోనికి రాలేదు. "షాహుకారుకు రైతులను బానిసలుగా జేయుటకు సివిలుకోర్టులే ముఖ్యకారణము" లని ఆయన అభిప్రాయము. "గ్రామస్థుల ఋణములకు సంబంధించినదావాలు కోర్టులలోకాక పెద్దమనుష్యులద్వారా పరిష్కరింపబడవలెను. అందునిమిత్తము సుప్రసిద్ధులయిన మర్యాదస్థులను, తెలివిగలవారిని కొందరను ఏరి గ్రామములవెంట పంపి, అచ్చటి గ్రామపెత్తనదార్ల సహాయముతో ఉభయవాదులను విచారించి కేసులను పరిష్కరింపచేయవలెను. వీరిని చట్టములవల్లగాని నిబంధనలవల్లగాని బంధించ గూడదు. కేసులు ఋణస్థుల గ్రామమంటపముననే విచారింపబడవలెను. గ్రామస్థుడు కోర్టుకు వచ్చినతోడనే నిజము చెప్పకాలనట్లు కనిపించును. అతడే స్వగ్రామములో స్వవిషయమునుగూర్చి యెరిగియున్నచోట్ల అబద్ధము చెప్పుటకు జంకును. గ్రామములలో ప్రతివానికిని పొరుగువారివిషయములు తెలిసియుండును. సాక్షి అబద్ధము చెప్ప ప్రారంభించినతోడనే చుట్టుపట్లనున్న గ్రామస్థులు 'ఇది కోర్టుగాదు. కోర్టులో వ్యవహారములు మన గ్రామములో సాగవు' అని వారిలోవారు గుసగుసలాడి కొందురు." అని హ్యూమ్ పల్లెటూళ్ల వ్యాజ్యెములగూర్చి చెప్పెను. ౧౮౭౯ లో ఈపద్ధతుల ననుసరించియే ఋణపీడితులయిన దక్కనురైతుల శ్రేయస్సుకొరకు ఒక ప్రణాళిక తయారుచేయబడినది. కాని బొంబాయిగవర్నమెంటు దాని కంగీకరించలేదు. హ్యూమ్ ౧౮౭౦ మొదలు ౧౮౭౯ వరకును ఇండియాప్రభుత్వ కార్యదర్శిగా పనిచేసెను. కాని ఆయన చాలాస్వతంత్రాభిప్రాయములు కలవాడును, నిక్కచ్చి అయిన మనిషియు అగుటచేత ఆయుద్యోగమునుండి తొలగింపబడెను. భారతీయపత్రిక లన్నియు నిందు కేకగ్రీవముగా ప్రభుత్వమును నిరసించినవి. కాని ప్రయోజనము లేకపోయెను. లిట్టన్ ప్రభువు ఆయనకు లెఫ్టినెంటుగవర్నరుపనిని

ఈయ తలపెట్టెను. కాని హ్యూమ్ నిరాకరించెను. తరువాత హ్యూమ్‌ను హోమ్ మెంబరుగా చేయవలె నని మరియొకసూచన వచ్చినది. హ్యూమ్ బట్టల దిగుమతి పన్నును రద్దుచేయవలదని నార్త్‌బ్రూక్ ప్రభువును ప్రోత్సహించుచుండె ననేకారణము చేత శాలిస్‌బరీప్రభువు ఆసూచనను తోసిపుచ్చెను. పక్షి ప్రదర్శనశాలకు ౨౦౦౦౦ ల పౌనులును, "భారతదేశపు పెంపుడుపక్షులు" (Home Birds of India) అనే గ్రంథమును తయారుచేయునిమిత్తము ౪౦౦౦ ల పౌనులును వచ్చించి ౧౮౮౨ వ సంవత్సరమున ఆయన ఉద్యోగమును విరమించెను.

'జగమెరిగిన బ్రాహ్మణునకు జందె మేల' నన్నట్లు వెడ్డర్‌బరన్‌గారు చేసిన సేవనుగూర్చి ఇచట వేరుగా వ్రాయనక్కరలేదు. చాలాసంవత్సరముల వరకును బ్రిటిష్ కాంగ్రెసు కమిటీని నడపిన ప్రధానపాత్ర ఆయనయే. అందు కర్యే ఖర్చుల నిమిత్తము సంవత్సరమునకు రు. ౧౦,౦౦౦ మొదలు రు. ౫౦,౦౦౦ లవరకు కాంగ్రెసు ఇన్తూండేది. ౧౮౯౪ లో మద్రాసు కాంగ్రెసుఅధ్యక్షుడు వెబ్‌గారి ఉపన్యాసానంతరము రామనాథపురం రాజాగారొక్కసారిగా రు. ౧౦,౦౦౦ లు సమర్పించినారు. ౧౮౮౯ లో జరిగిన బొంబాయి కాంగ్రెసుకును, ౧౯౧౦ లో జరిగిన అలహాబాదు కాంగ్రెసుకును, సర్ విలియమ్ వెడ్డర్‌బరన్‌గా రధ్యక్షత వహించిరి. ౧౮౮౮ లో అలహాబాదునగరమున జరిగిన నాలుగవ కాంగ్రెసుకు డేవిడ్ యూల్‌గా రధ్యక్షత వహించిరి. "జ్ఞానమయుడును, ప్రమాదరహితుడును అయిన దైవమువలన భారతదేశము తమ కొక గొప్ప పవిత్రధర్మనిధిగా ఒప్పగించబడినట్లు కామన్సుసభవారు భావిస్తూ ఈ ౬౫౦ మంది సభ్యులును తిరిగీ ఆధర్మనిధిని దైవేచ్ఛకు విడిచిపెట్టినారు" అని చెప్పిన సుప్రసిద్ధవాక్యము లీయనవే. తరువాతి పార్లమెంటు సభ్యులు ప్రతిసంవత్సరమును ఇండియాకు వచ్చి కాంగ్రెసుమహాసభను దర్శించుట సంప్రదాయమైనది. ఈసందర్భములో మద్యపాననిషేధప్రచారకులలో నగ్రగణ్యుడగు డబ్లియు. యస్. కేన్, చార్లస్ బ్రాడ్లా, శామ్యుయల్ స్మిత్, డాక్టర్ హెచ్. వి. రూథర్‌ఫోర్డు, డాక్టర్ క్లార్కుగార్ల నామములను స్మరింపవచ్చును. తరువాతి సంవత్సరములలో తదితర పార్లమెంటుసభ్యు లనేకు లిండియాను దర్శించిరి. ౧౯౧౧ సంవత్సరములో, ఆయనభార్య మరణించియుండకపోయినయెడల రామ్సేమాక్డొనాల్డు కాంగ్రెసుఅధ్యక్షు డైయుండేవారు. ఇండియా వ్యవహారములలో విషాదాంతముగా పరిణమించిన ఈకార్మికనాయకుని రాజకీయజీవితములో ఈసంఘటనముకూడ జరిగియుండినట్లయితే యెంతో తమాషాగానే యుండియుండేది. కెయిర్‌హార్డీ, హోల్‌ఫర్డునైట్, మాక్నీల్, కల్నల్ వెడ్జివుడ్, బెన్‌స్పూర్, ఛార్లెస్ రాబర్ట్సు, పెథిక్‌లారెన్సు మొదలగు కొందరుమంది కామన్సు సభ్యులుకూడ ఇండియాసమస్యలను తెలుసు

త్సోవడమున కనేక కాంగ్రెసుమహాసభలకు హాజరైయుండిరి. కాని ౧౮౮౯ వ సంవత్సరములో బ్రాడ్లాగారుమాత్రము ఇండియాలో రాజమర్యాదలతో సన్మానింపబడిరి. నా రాసందర్భమున చేసిన ప్రసంగములో చాలా ఉదారమనోభావము లున్నవి. ఆయన రాజభక్తినిగూర్చి అప్పుడు మాట్లాడినమాటలు చిరకాలము జ్ఞాపక ముంచుకోతగినవి. "కేవలము గుడ్డివిధేయత నిజమైన రాజభక్తి కాదు. పాలకులు చేసేపని అంతా పాలితులే చేసి వారికి సహాయము చేయడమే నిజమైన రాజభక్తి" అని ఆయనవ్యాఖ్యానము. నిరంకుశప్రభుత్వమువారు కేవలము దీనికి వ్యతిరేక మయిన వ్యాఖ్యానము చేసెదరు. 'ప్రజ లేమీ చేయక ప్రతిదీ ప్రభుత్వమువారికే విడిచివేయవలె' నని వారివాదన.

బ్రాడ్లా ౧౮౮౯ వ సంవత్సరములో శాసనసభాసంస్కరణమునుగూర్చి ఒక చిత్తుచట్టమును తయారుచేసెను. అది ఆనాటి కాంగ్రెసువారి అభిప్రాయముల కనుగుణముగా నుండెను. ఎందువలననో తరువాత ఆచట్టు మాగిపోయినది. కాని పార్లమెంటులో బ్రాడ్లాకు మంచిబలమే యుండెను. లార్డుక్రాసు తెచ్చిన మొదటి బిల్లు ౧౮౯౧లో బ్రాడ్లా వ్యతిరేకముగా నుండడముచేతనే ఆగిపోయినది. కాని ఆయన రెండవబిల్లు శాసనసభలకు పరోక్షపు యెన్నికల సిద్ధాంతము నంగీకరిస్తూ ప్రవేశపెట్టబడినది. అది పార్లమెంటులో గెలిచినది. దానిద్వారానే ఇండియాకు మొట్టమొదటి రాజకీయసంస్కరణములు లభించినవి.

మన ప్రేమకు పాత్రులైనవారు మరొకరు విలియం ఇవర్టు గ్లాడ్‌స్టన్‌గారు. ౧౮౮౭ లో మద్రాస్ నగరమున జరిగిన మూడవ కాంగ్రెస్‌లో ఈ ఆంగ్లదేశ పితామహుడు చేసిన ఈక్రింది ప్రకటనను పండిత బిషన్ నారాయణధా రుదాహరించియుండెను. "ఇండియాదేశములో మన పరిపాలన ముండవలెనో, పోవలెనో నిర్ణయించవలసినవారు ఆదేశములో నివసిస్తూన్న అర కోట్లమంది ప్రజలుకాని మరెవరును కారు. ఇండియాలో ఎవరు పరిపూర్ణాధికారమును చలాయించవలయుననే విషయము ధర్మసిద్ధాంతప్రకారము భారతీయులకు సంబంధించిన విషయము. ఇప్పుడీ ధర్మసిద్ధాంతములు నానాటికి ప్రకృతిసిద్ధాంతములుగా మారిపోతూన్నవి. మన మా దేశములో రెండు షరతులతో నివసించవచ్చును. మొదటిది, అక్కడి మన నివాసము భారతీయులకు లాభదాయకముగా నుండవలయును. రెండవది, మన మా దేశములో నున్నందువలన ఆదేశపుప్రజలకు లాభదాయకముగానున్న దని వారు గ్రహించేటట్లు మనము చేయవలయును. ఇవి రెండును లేకపోయినయెడల మన కాదేశములో నివసించే హక్కు లేదు" అట్టను ప్రభువుకాలమునాటి దేశభాషామున్యాశాసనము గ్లాడ్‌స్టన్

నిరాదరణముమూలముననే నిర్మూలింపబడినది. గ్లాడ్‌స్టన్ ప్రత్యక్షముగా కాంగ్రెసు ఉద్యమమున కనుకూలముగా నుండుటయే భారతదేశమునం దాయనపైగల ఆదరణ మునకు కారణము.

"భారత మహాజనుల మహదాశయములను నిరాదరణగాను, నిర్లక్ష్యముగాను చూచుట మనకు తగినపని గాదు." అని ఆయన ౧౮౮౮ లో చెప్పియుండెను. కాంగ్రెసులో చాలా సంవత్సరములవరకును ఆయన జన్మదినోత్సవసందర్భమున అభినందన తీర్మానములు చేయబడుతూండేవి. ఆయన ౮౨ వ పుట్టినరోజుపండుగ ౨౯-౧౨-౧౮౯౧ అయినది. ఆరోజు కాంగ్రెసు ఉత్సవము జరిపినది. గ్లాడ్‌స్టన్ ఇండియా, ఐర్లండు దేశముల హక్కులనుగూర్చి పోరాడినపోరాటమే ఎంతో దూరమునందుండిన ఆరాజకార్యధురంధరునియందు భారతీయులఅపారభక్తికికారణము. ముద్రణాశాసనమునుగూర్చి భారతమిత్రుడైన గ్లాడ్‌స్టన్ చెప్పిన విషయములు ౧౮౯౪ లో జరిగిన ౧౦ వ కాంగ్రెసులో అర్డ్లీ నార్టన్ (Eardly Norton)గా రిట్లుదాహరించియుండిరి:

"ఆకస్మికముగా ఒకరాత్రి కౌన్సిల్‌భవనములో రహస్యముగా, పార్లమెంటుకు తెలియకుండా, దేశములో ఎవరికీ తెలియకుండా దేశీయపత్రికల స్వరూపనాశనమునకై ఒక చట్టము చేయబడినది. అటువంటి చట్టము చేయబడుటము బ్రిటిష్ సామ్రాజ్యమునకు లజ్జాకర మని నా అభిప్రాయము"

గ్లాడ్‌స్టన్ మరణించినాడని విని ౧౮౯౮ లో కాంగ్రెసు చాలా దుఃఖించినది.

నార్త్‌బ్రూకు పార్లమెంటుసభలో "సీమఖర్చుల"ను తగ్గించవలసినదని వాదించినందుకు ౧౮౯౩ లో జరిగిన ౯ వ కాంగ్రెసులో ఆయననుగూర్చి కృతజ్ఞతాతీర్మానము చేయబడినది. ఈ తీర్మానము నుపపాదించిన గోఖ్లే మహాశయుడు "ఇండియాకు తెలిసే పూర్వమే ఈతప్పు మనము సవరించుకోవలె'' నని ఆర్గయిల్ ప్రభువు చెప్పిన మాటల నుదాహరించెను. ఆర్గయిల్ ప్రజాసమస్యలనుగూర్చి చాలా తెలిసినవాడు. నాచా ౧౪ వ కాంగ్రెసులో ఆయనమాటల నీవిధముగా నుదాహరించెను: "ఇండియా గ్రామ ప్రజలలో విశేషముగా వ్యాపించిన నిత్యదారిద్ర్యమును, దాని కనుగుణమైన వారి కనీస జీవితవ్యయమును పాశ్చాత్యప్రపంచకములో నెచ్చటను కానరావు." ఈ ఆర్గయిల్ ప్రభువే ౧౮౮౮ లో "ఇంగ్లీషువారు చేసిన వాగ్దానములను గాని, ఒడంబడికలను గాని వా రెప్పుడును చెల్లించుకొనలేదు." అని చెప్పియుండెను. ఆంగ్లమిత్రులు చేసిన

యుపకారములకు, వారు మరణించినతరువాతనుకూడ భారతీయులు వారి పేరులను స్మరించుకొంటూనేయున్నారు. భారతజాతికి మరొక మిత్రుడు లార్డ్ స్టాన్లీ ఆఫ్ ఆల్డర్లీ. ఆయన ౧౯౦౩ లో మరణించగా మద్రాసుకాంగ్రెసు ఆయనమరణమునకును, అకాలముననే స్వర్గస్థుడైన డబ్లియు. యస్. కేన్ మరణమునకును విచారమును వెలిబుచ్చినది. భారతదేశాభ్యుదయముకొరకు సంవత్సరములతరబడి పనిచేస్తూ ఇండియాలోనే నివాసస్థాన మేర్పరచుకొనిన అనేకమంది ఆంగ్లేయులును, ఆంగ్లోఇండియనులును ఉండిరి. వారిసేవకూడ విస్మరింపదగినదికాదు. మొట్టమొదటి కాంగ్రెసులోనే డి. యస్. వైట్ అనే ఆయన "సీమనుండి చాలా వ్యయము చేసి ఈ బాలురను ఇక్కడకు దిగుమతి చేయుటము మాని, సివిల్ సర్వీసును తీసివేసి, అనుభవ ప్రసిద్ధులు గల ఆంగ్లేయులను, భారతీయులను ఉపయోగించుకొనవలసిన" దని కోరియుండెను.

ఆర్డ్లీ నార్టన్ దక్షిణభారతదేశములో సుప్రసిద్ధప్రజాసేవకుడుగా పరిగణింపబడిన జాన్ బ్రూస్ నార్టన్ కుమారుడు. జాన్ బ్రూస్ నార్టన్‌గారి ఛాయాచిత్రము మద్రాసు పచ్చయప్పభవనమున నున్నది. చిన్న నార్టన్‌గూడ తండ్రివలెనే ఇండియా అభివృద్ధికొరకు పాటుపడుతూ, తన జీవితములో నుత్తమభాగము నిచ్చుటనే గడపినాడు. ౧౮౯౮ లో ఇండియాకౌన్సిలు నెత్తివేయవలెనని ఈయన తీర్మానమును తెచ్చినాడు. "హిందూదేశరాజ్యాంగకార్యదర్శి కౌన్సిలుకు లోబడవలసియున్నయెడల హిందూదేశరాజ్యాంగకార్యదర్శిని తీసివేయవలెను. కౌన్సిలు హిందూదేశరాజ్యాంగకార్యదర్శికి లోబడవలసినయెడల కౌన్సిలునే తీసివేయవలెను. ఈ ఇద్దరును ఉండడముమాత్రము నిరుపయోగము, అపాయకరము, వ్యయకారణము, ప్రతిరోధము" అని చెప్పి ఆయన అంతటితో ఆగక, కౌన్సిల్‌వారి తెలివితక్కువ వ్యాపారములకు కొన్ని సాపృశ్యములుగా "కానింగ్ ప్రభువు ప్రతిఘటనమును లెక్కపెట్టక కలకత్తా సౌదీస్టరన్ రైల్వేవారికి ౫% వడ్డీ గ్యారంటీచేసి, ఆ కంపెనీ దివాలా అయినప్పుడు ౫ లక్షల పౌనులకు దానిని కొనివేయుట, మద్రాస్ ఇరిగేషన్ కంపెనీ వారికి ౧౦ లక్షల పౌనులపై ౫% వడ్డీ గ్యారంటీచేసి వారికి ఖర్చులుకూడా పూడనప్పుడు దాని నసలుఖరీదుకు కొనివేయుట, ఎలిఫెంస్టన్ ల్యాండ్ అండ్ ప్రెస్ కో. వారినుండి రు. ౧,౦౦౦ ల షేరులు కొని వాటిని బజారులో రు. ౩౩౯ ల కమ్మివేయుట, ఇండియా కౌన్సిలు ఖర్చులలో ౨౮ మంది దాసీల, ఒక ఇంటి కాపరి ముగ్గురు ఆడమాలీల జీతములుకూడ చేర్చబడుట" లనుగూర్చి వివరించెను. ఇండియాపత్రికమున పనిచేసిన తదితరాంగ్లమిత్రులలో హెచ్. మార్టిన్ బ్రౌన్‌గా రొకరు. ఈయన ౧౦ వ కాంగ్రెసులో భారతదేశపుటార్థిక వ్యవహారములను కామన్సుసభవారు విచారణ

## దాదాభాయినౌరోజీ

భారతీయ కాంగ్రెసు మూలపురుషులలో ముందు దాదాభాయినౌరోజీ పేరు చెప్పవలసియున్నది. ఆయన కాంగ్రెసు పుట్టినరోజు మొదలు తనజీవితములో చివరరోజువరకును దానిని సేవిస్తూనేయుండెను. పరిపాలనాలోపములను సవరింపజేసేనిమిత్తమేర్పడిన చిన్నప్రజాసంస్థ స్వరాజ్యమాదర్శముగాగల జాతీయమహాసభ (కలకత్తా ౧౯౦౬) అయ్యేయంతవరకును గలిగిన అన్నిపరిణామదశలలోను ఆయన దానితోనే యుండెను. ఆయన ౧౮౮౬, ౧౮౯౩, ౧౯౦౬ లలో మూడుపర్యాయములు కాంగ్రెసున కధ్యక్షత వహించెను. ఆయనసంబంధమువలన కాంగ్రెసుబావుటా ఆంగ్లభారతదేశములలో మరింత ఎత్తుగా ఎగిరినది. దాదాభాయి, సెంట్రల్ఫిన్సుబరీ నుండి కామన్సుసభకు సభ్యుడుగా ఎన్నుకొనబడుటను జ్ఞాపకిస్తూ, రెండవసారి కాంగ్రెసు అధ్యక్షుడుగా చేయబడెను. ఆకాలములో భారతదేశపు కష్టములనుగూర్చి ఇంగ్లండులో ప్రచారము చేయువిషయము దేశములో తీవ్రముగా చర్చింపబడుచుండెను. ౧౮౯౧ లో లండనుసభ జరిగేవరకును కాంగ్రెసును ఆపియుంచవలసిన దని కూడా యొకసూచన చేయబడినది. కాని అది త్రోసివేయబడినది. సరిగా ఆతరుణములో ఎ. ఓ. హ్యూము సీమప్రయాణముమీద నుండెను. అప్పుడే, కామన్సుసభకు సరాసరి భారతీయప్రాతినిధ్య ముండవలెననే ఆందోళనము దేశములో బయలుదేరినది. దాదాభాయి రెండవసారి కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నుకొనబడిన దీసమయములోనే. ఆ అవకాశము తీసికొని ఆయన "ఈబలమును (భారత విద్యావంతులను) వ్యతిరేకము చేసుకోక మీప్రక్కకు త్రిప్పుకొండు" అని హితబోధచేసెను. "ఈ కాంగ్రెస్ భారతవిజ్ఞానసర్వస్వమునకు ప్రాతినిధ్యము వహిస్తున్నది. యునైటెడ్ కింగ్డమ్వారి న్యాయస్వభావమునందును, ధర్మబుద్ధియందును మావిశ్వాసము కొరవడ లేదు. బ్రిటిష్జాతివంటి ఒకగొప్పజాతి న్యాయముకోసము, నిజమైన పౌరసత్వపు హక్కులకోసము తనసామ్రాజ్యప్రజలకు సహాయకారిగా నుండు అద్భుతదృశ్యమును ప్రపంచకము వీక్షింపగలదు దినము సమీపములోనే యున్నదని నా ఆశ" అనిచెప్పెను. చిట్టచివరివరకును బ్రిటిష్వారిలో దాదాభాయివిశ్వాసము నిశ్చలముగానే యుండెను. భారతీయులు బ్రిటిష్పౌరులు. బ్రిటిష్పౌరుల కున్న అన్నిహక్కులును వారి కుండవలసినదే. వారు వాటిని అధికారరూపకముగా కోరుతున్నారు" అని ఆయన ౧౯౦౬ లో చెప్పియుండెను. ౧౯౦౬ లో దాదాబాయి కలకత్తాకాంగ్రెసున కధ్యక్షత వహించి నప్పుడు భారతదేశ మట్టుడికిన ట్లుడికిపోతూండెను. ౧౯౦౫ వ సంవత్సరము ౧౬ వ అక్టోబరున అమలులోనికి తేబడిన వంగరాష్ట్రవిభజనఫలితముగా ప్రజలలో నూతనభావ

ములు కలిగినవి. పూర్వబంగాళా దేశము అసంతృప్తితో కల్లోలముగా నుండెను. హిందూ మహమ్మదీయకలహములు పెచ్చుపెరిగిపోవుచుండెను. ఆర్డినెన్సు ప్రభుత్వ మమలు లోకి వచ్చెను. లా ఆర్డరుల సంరక్షణనిమిత్తము సైనికదళము, వదనపు పోలీసుల మంచు పద్ధతి నూతనముగా ఆచరణములోనికి వచ్చెను. ఆరోజులలో "శాంతిని కాపాడునిమిత్తము బారిసాల్ రాష్ట్రీయమహాసభ బుద్ధిపూర్వకముగా పోలీసులచే బలవంతముగా చెదరగొట్టబడెను" అని డాక్టరు పట్టాభిసీతారామయ్యగారు రోకప్పు డనిరి. దాదాభాయి "౧౮౯౩ - ౯౪ సంవత్సరములనుండి జనసంఖ్య నూటికి ౧౪ వంతున పెరిగినది కాని ప్రభుత్వపరిపాలనావ్యయము నూటికి ౧౬ వంతున పెరిగినది. ౧౮౭౪ - ౭౫ నుండి జనసంఖ్య నూటికి ౧౫ వంతున పెరిగినది; ప్రభుత్వవ్యయము నూటికి ౪౦ వంతున పెరిగినది. ఒక్క సైనికవ్యయమే ౧౭ మొదలు ౩౨ కోట్లవరకును పెరిగినది. ఒక్క ఇంగ్లండులోనే ఏడుకోట్లు ఖర్చవుతూన్నది. సైనికవ్యయ మింగ్లండు, ఇండియాలకు న్యాయముగ విభజింపబడవలసినదని వెల్బికమిషనువారు చేసినసిఫారసు అక్షరాలలో తప్ప సిద్ధాంతములో అమలుజరుగుటలేదు. ఎందువల్ల ననగా ఇంగ్లండు సైనికవ్యయము క్రింద కొంతసొమ్ము నిచ్చించినట్లుగా కనపడుతూ ఇంగ్లీషుసైనికుల జీతములను హెచ్చించి, తద్వారా తాను నిచ్చుచున్నసొమ్మునకు మూడురెట్లెక్కువసొమ్ము ఇండియానుండి గుంజుకొంటూన్నది." అని తెలియపరచియుండెను. దాదాభాయి కలకత్తా కాంగ్రెసు కధ్యక్షుడైన సంవత్సరము (౧౯౦౬) నైక్యారు కాంగ్రెసును దర్శించెను. బహిష్కరణతత్త్వము కాంగ్రెసువాతావరణము నాశ్రయించియుండెను. బాబు బిపినచంద్రపాల్ "బహిష్కరణము" అనేపదమునకు విశాలార్థము చెప్పి, ప్రభుత్వముతో సంబంధమును పూర్తిగా వదలుకొనవలె నని చెప్పెను. వంగరాష్ట్రముతప్ప తక్కినరాష్ట్రములు బహిష్కరణతీర్మానమునుండి మినహాయింపబడుటకు ప్రయత్నించినవి. బహిష్కరణమునకు ప్రధానభాగమైన స్వదేశీ కర్మము ననేకమంది అనేకవిధములుగా చెప్పియుండిరి. మాలవ్యాజీ "స్వదేశి" అంటే దేశీయపరిశ్రమల రక్షణ మని చెప్పెను. తిలకుమహాశయుడు, మన్యతరగతులవారు విదేశవస్తువుల నుపయోగించి విపారసంఘటనమును నిర్మూలించుటకు భారతజాతి కది ఆత్మసహాయము, ఆత్మనిశ్చయము, ఆత్మత్యాగముగల ఒకవిధమైనసాధన అని చెప్పెను. లాలాజీ కది ధనమును కూడబెట్టుకొనుటగా తోచెను. దాదాభాయిమాత్రము కాలపరిణామమునుబట్టి, ప్రజల మనోభావము లార్థికవిద్యాసంస్కరణములవైపునకు మరలినవనీ, విద్యావ్యాపకము వలననే వారిలో స్వరాజ్యవాంఛ ప్రబలమయినదనీ అభిప్రాయ మిచ్చెను. ఇదివరకే దేశములో స్వదేశీ, బహిష్కరణము, జాతీయవిద్య అనే పేరులతో ఆందోళన జరుగుతూండగా, వానికితోడు 'స్వరాజ్యము' అనే నూతనాందోళనము బయలుదేర

దీయుటకు ౬,౦౦౦ ల మైళ్లదూరమునుండి వచ్చిన ౮౦ యేండ్ల వృద్ధునిపైన 'ఇంగ్లీషు మన్' పత్రిక మండిపడ్డది. కాని భారతస్వరాజ్యసంపాదనామార్గ మంతకంతకు తనంతట తానే వ్యక్తమవుచూ వచ్చినది. ౧౯౦౫ లో గోఖ్లేగారు సూచించిన స్వరాజ్య సంపాదనామార్గములు నాల్గును, ౧౯౦౬ లో కలకత్తాకాంగ్రెసులో దాదాభాయి అధ్యక్షతక్రింద చేయబడిన నాలుగు ప్రధాన తీర్మానములలోను స్పష్టీకరింపబడినవి. ఆ తీర్మానము లివి:

## స్వయంపరిపాలనము

"(1) బ్రిటిష్ వలసరాష్ట్రము లనుభవిస్తున్న స్వయంపరిపాలనమువంటి పరిపాలనాపద్ధతి భారతదేశమునకుకూడా వర్తింపచేయవలె నని ఈ మహాసభవారి అభిప్రాయము. తదనుగుణమైన ఈక్రిందిసంస్కరణములు వెంటనే చేయబడవలెనని ఈ సభవారు తీర్మానిస్తున్నారు:

(ఎ) ఇంతవరకును ఇంగ్లండులోమాత్రమే జరుపబడుచున్న అన్నిపరీక్షలను ఇండియా, ఇంగ్లాండు దేశములలో నేకకాలమున జరుపవలెను. ఇండియాలోని అన్ని యున్నతోద్యోగములను పోటీపరీక్షలలో నుత్తీర్ణులైనవారికిమాత్రమే ఈయవలెను.

(బి) హిందూదేశరాజ్యాంగ కార్యదర్శిగారి కౌన్సిలులోను, మద్రాసు, బొంబాయి గవర్నరులయొక్కయు, వైస్రాయియొక్కయు కార్యనిర్వాహకవర్గములలోను తగినంత భారతీయప్రాతినిధ్య ముండవలెను.

(సి) అఖిలభారత శాసనసభ, రాష్ట్రీయశాసనసభలు నిజమైన ప్రయోజనము గల ఎక్కువ ప్రజాప్రాతినిధ్యమును వహించేంత పెద్దవిగా చేయబడవలెను. దేశముయొక్క ఆర్థిక, కార్యనిర్వాహకపరిపాలనములందు ప్రజల కిప్పటికంటె ఎక్కువ అధికార ముండవలయును.

(డి) లోకల్ బోర్డులు, మున్సిపాలిటీల అధికారము ఎక్కువ చేయబడవలెను. ఇటువంటిసంస్థలపైన సీమలో లోకల్ గవర్నమెంటుబోర్డు కున్న అధికారముకంటె ఎక్కువ అధికార మిక్కడి ప్రభుత్వోద్యోగుల కుండరాదు.

## బహిష్కరణోద్యమము

(2) ఈ దేశపరిపాలనావిషయములో ప్రజలకు మాటాడేహక్కు లేకపోవడము చేతను, గవర్నమెంటువారిలో వారు మనవిచేసుకొనేవిషయములు సరిగా ఆలోచించబడకపోవుటచేతను వంగరాష్ట్రవిభజనమును ప్రతిఘటిస్తూ ఆరాష్ట్రప్రజ లవలంబించిన

బహిష్కరణోద్యమము న్యాయబద్ధమైనదేనని ఈ మహాసభవారభిప్రాయపడు తున్నారు.

## స్వ దే శీ

(3) ఈకాంగ్రెసు స్వదేశీయోద్యమమును హృదయపూర్వకముగా నామోదిస్తూ, అది జయప్రదముగా కొనసాగుటకు దేశీయు లెల్లరును, కొంత త్యాగమునకైనను సహించి, దిగుమతిసరకులకు బదులుగా దేశీయవస్తువుల యుత్పత్తికొరకును, దేశీయ పరిశ్రమల అభివృద్ధికొరకును శ్రద్ధగా, గట్టిప్రయత్నములు చేయవలెనని కోరుతూ తీర్మానిస్తూన్నది.

## జా తీ య వి ద్య

(4) దేశీయు లెల్లరును, తమ బాలబాలికల జాతీయవిద్యాసమస్యనుగూర్చి యోచించుటకును, జాతీయాధికారముక్రింద జాతీయపద్ధతులపైన దేశపరిస్థితుల కనుగుణమైన పారిశ్రామిక, విజ్ఞాన, సాహిత్యవిషయక విద్యావిధానమును ఏర్పాటుచేయుట కును తగిన తరుణము వచ్చినదని ఈమహాసభవారు తీర్మానిస్తూన్నారు."

### ఆనందాచార్యులు

బొంబాయిలో ౧౮౮౫ వ సంవత్సరమున మొట్టమొదటి కాంగ్రెసు జరుపబడినప్పుడు జి. సుబ్రహ్మణ్యయ్యరు (పత్రికాసంపాదకుడు), ఆనందాచార్యులు, తెలాంగ్, దాదాభాయినౌరోజీ, నరేంద్రనాథసేన్, వెడ్డర్బర్న్. జి. జెన్సి, ఫిరోజిషామెహతా, డి. యస్. వైట్ మొదలగు ఈభారతకాంగ్రెసు మూలపురుషులగు మహనీయు లందరి యుపన్యాసములందును హిందూదేశ రాజకీయములలో ఆనాడు కలుగుతూన్న బల వత్తరపరిణామములు వ్యక్తమయినవి. ఇంతకాలము గడచినతరువాత వారు మితవాదులుగా కనపడవచ్చునుగాని, వారిభావమాత్రము మితవాదిత్వమును వ్యక్తముచేయుట లేదు. ౧౮౯౧ వ సంవత్సరములో నాగపురము కాంగ్రెసున కధ్యక్షుడైన ఆనందాచార్యులు తన అధ్యక్షోపన్యాసములో ఇండియనుకౌన్సిలును "ఇండియాలో ఉద్యోగము చేయుటకును పనికిరాని భారతీయపురాణ వృద్ధులతోగూడిన గూడుపుఠాణీపరిపాలక సంఘము " అని వర్ణించెను.

ఆయన ౧౮౯౧ లో నాగపూరుకాంగ్రెసున కధ్యక్షతవహించి ఉద్రేకపూరితమైన ఉపన్యాసమునిచ్చెను. "స్వచ్ఛందసైనికులవిషయము మాలోచించండి. ఆస్ట్రేలియనులు, నీగ్రోలు, పశ్చిమాఫ్రికాలోని ములాటోలు, ఫలానా అని వర్ణించవలసినవసరము లేని తదితరజాతులవారును కూడా స్వచ్ఛందసైనికులుగా అంగీకరింపబడుతూండగా

భారతీయకష్టజీవులకు గాని, ఆ ఐశ్వర్యోత్పత్తికి మూలమైన భారతభూమికిగాని యే రూపములోను అది తిరిగి రావడము లేదు." అని ఆయన వివరించెను. బొంబాయిలో ౧౮౮౯ లో జరిగిన ౫వ కాంగ్రెసులో నీయన, ప్రభుత్వమువారు దేశీయపరిశ్రమల పైన పన్నులను విధించువిధానమును విమర్శించెను. కామన్సుసభవారు ఇండియా దేశపు ప్రజల ఇష్టానుసార మాపద్ధతి మార్చవలసిన దని తీర్మానరూపకముగా సలహా యిచ్చి ౯ నెలలు గడచినను, ఇండియాగవర్నమెంటువారే విధమైన చర్యను తీసుకొనక పోవడము విచారకరమని ఆయన చెప్పెను. ఆ కాంగ్రెసులో తిరిగి ఈవిషయమును గూర్చి, ఉప్పుపన్నును గూర్చి ఆయన మాట్లాడెను. ౧౮౯౨లో జరిగిన అలహాబాదు కాంగ్రెసు కరెన్సీసమస్యనుగూర్చి ఎక్కువ ఆందోళన చూపెను. అప్పుడు దాదా ౧౮౭౩ లో జర్మనీలో వెండినాణెములు రద్దుచేయబడుటవలన కలిగిన ఫలితమును, ఇండియా చెల్లించవలసిన "హోంఛార్జీల" (Home Charges) విషయములో నాటి మారకవిధానమువలన కలిగే ఫలితమును విపులముగా విమర్శించి చెప్పెను. బంగారు ప్రమాణమువలన ఇండియాప్రజలకు కలిగే నష్టమునుగూర్చి, ౧౮౯౦లోని షేర్మాన్ చట్టమునుగూర్చి ఆయన విశదముగా మాట్లాడెను. ౯వ కాంగ్రెసులో ప్రభుత్వమువారి "న్యాయబద్ధమైన అవినీతి"ని గూర్చి తీవ్రముగా విమర్శించెను. ఆ కాంగ్రెస్‌లోనే దాదా వెండినాణెముల ముద్రణమును నిలిపివేయవలెనని తీర్మానమును ప్రతిపాదిస్తూ, "ప్రభుత్వోద్యోగులయొక్కయు, పెట్టుబడిదారులయొక్కయు విశేషలాభమునిమిత్తము కష్టపడి పనిచేసే కూలిజనము, పన్నులలో క్రుంగిపోతూన్న రైతుజనము నానాటికి నిరుపేదలుగా చేయబడుచున్నారు. ఆ విధానము రైతులను నాశనముచేయగలదు. ఇదివరకే యేనాగరికదేశమునందును లేని అత్యధిక జీతములను తీసుకొంటూన్న అత్యల్పసంఖ్యాకులైన ప్రభుత్వోద్యోగుల ప్రయోజనమునిమిత్తమిప్పుడు రైతులపైన మరింతఎక్కువ భారము పడగలదు." అని ఆయన చెప్పెను.

ఎప్పుడో ౧౮౭౧ లోనే లాంకషైరునుగూర్చి దాదాగారు మాట్లాడినారు. అది ఆయనతీక్ష్ణబుద్ధికి నిదర్శనము. ౧౮౭౧ లో ఆయన "సైనికవ్యయము తగ్గించబడని యెడల దిగుమతిపన్నులు తిరిగి పునరుద్ధరింపబడవలెను. ఎగుమతిసుంకములు తీసివేయబడుటవలననే దారిద్ర్యవంతమైన భారతదేశమును ధనవంతమైన లాంకుషైరు దోచుకొని మరింత ఐశ్వర్యవంతము కాగలుగుతూన్నది." అని చెప్పెను.

౧౮౯౪ లో మరల దాదా "ప్రభుత్వమువారు పత్తిపరిశ్రమలపైన పన్నులువేసిన బాల్యదశలోనున్న ఇండియాదేశపు మిల్లుపరిశ్రమలను లాంకుషైర్ మిల్లుల ప్రయోజనముకోసము నాశనముచేయ ప్రయత్నించడము శోచనీయ" మని చెప్పెను. ఆయన,

ఇండియా ప్రభుత్వమువారు పన్నులవిధానమును ప్రతిఘటించినందుకు శ్లాఘించి, అట్టి అన్యాయకార్యమొనరించినందుకు భారతరాజ్యాంగకార్యదర్శిని నిందించెను. వెస్టుమినిస్టరునుండి భారతరాజ్యాంగ కార్యదర్శి పంపే నిరంకుశమైన ఉత్తరువులకు విధేయత చూపవలసినస్థితిలో ఇండియా ప్రభుత్వమున్నందుకు చింతించెను. వాచా సైనిక సమస్యనుగూర్చి, ప్రజల పేదరికమునుగూర్చి అనేకపర్యాయములు చర్చించియుండెను. ఆర్థికవిషయములుకూడ ఆయనదృష్టి నాకర్షించకపోలేదు. ౧౮౯౫ లో పూనాలో జరిగిన ౧౧ వ కాంగ్రెసులో ఆయన ఆవిషయములనుగూర్చి చర్చించెను. మారకము వలన సివిల్ సైనిక పరిపాలనములో వ్యయము హెచ్చినది అని చెప్పిన సర్ జేమ్సు వెస్టులాండు మాటలు యథార్థములు కావని ప్రభుత్వమువారి అంకెలనుబట్టియే ఆయన ఋజువుచేసెను. ౧౧ వ కాంగ్రెసులో ప్రత్తిమిలునుతిపన్నులను సమర్థిస్తూ విజ్ఞానప్రదమైన తీవ్రోపన్యాసము చేసి "బొంబాయి తీవ్రవాది" అనే బిరుదమును సంపాదించగలిగెను. ఈయన వెల్బీకమిషను (ప్రభుత్వవ్యయమునుగూర్చి విచారించిన కమిషన్) యెదుట సాక్ష్యమిచ్చి తన అపూర్వ సామర్థ్యమును వెల్లడించెను. ఆ సాక్ష్యమునకు కాంగ్రెసువంటి మహాసంస్థయు, గోఖ్లేవంటి పండితులును నీయనను చాలా శ్లాఘించిరి. ౧౮౯౭ లో జరిగిన ౧౩ వ కాంగ్రెసులో నీయన సరిహద్దురాష్ట్రముకెడ ప్రభుత్వము వారిచే నవలంబింపబడు రాజకీయ తంత్రమును విమర్శించెను. సామ్రాజ్యమునకే సరిహద్దు రాష్ట్రముల ఆక్రమణ మవసరమే అగునెడల అవ్యయమును బ్రిటిష్ ప్రభుత్వము వారే భరింపవలెనని వాచా ఖండితముగా చెప్పెను. ౧౮౯౩ లో హర్షెల్ కమిషన్ వారి నివేదిక ప్రకటనమునకును, ఫౌలర్ కమిటీ నియోజనమునకును మధ్యకాలములో మరల ఒకసారి కరెన్సీసమస్య తలయెత్తినది. అప్పుడు వాచా వెండినాణెముల ముద్రణమున కవకాశము లేకుండ ౧౮౯౩ లో టంకసాలలను మూసివేయుటనుగూర్చి విమర్శించెను. ౧౮౯౩ లో చేయబడిన నూతననాణెముల చట్టము శిమ్లా శాసనసభలో భారతీయప్రతినిధి ఒక్కడైనను లేని సమయములో అరగంటసేపులో అంగీకరించబడినదని చెప్పి వాచా సభాసదుల వాశ్చర్యనిమగ్నులను చేసెను. "మన కేదిక్కుకు మూలము 'సీమఖర్చులు' గాని కరెన్సీగాదు" అని ఆయన చెప్పెను. తరువాత మారకపు విలువను నిర్ణయించడమునకును, అందు కనుకూలముగా బంగారుచట్టమును ప్రవేశపెట్టడమునకును ప్రయత్నములు జరిగినవి. సరిహద్దు రాష్ట్రాక్రమణములతో, కరవులతో, ప్లేగులతో మన ధనము పూర్తిగా వ్యయమైనది. ౧౮౯౯ లో జరిగిన ౧౫ వ కాంగ్రెస్ లో భారతదేశమునకు బంగారుప్రమాణమును వర్తింపచేయడమునుగూర్చి "కాంగ్రెసింతవరకు మూడుపర్యాయములు కరెన్సీసమస్యనుగూర్చి విమర్శించినది. బంగారు

ఉత్పత్తి అయ్యే అన్ని దేశములనుండి భారతదేశమునకు బంగారము వస్తూన్న దని కర్జను ప్రభువు చెప్పినమాట యథార్థముకాదు. ప్రతిసంవత్సరము ఇండియానుండి విదేశములకు పోతూన్న ధనప్రవాహమే ఇండియా దారిద్ర్యమునకు కారణము. భారతీయుల పెట్టుబడి ద్రవ్యమే ఇండియాకు నిజమైనభాగము. రూపాయిలోని వెండివిలువ తక్కువై నాణెమువిలువ యెక్కువైనది. ఒకప్పుడు తులమువెండి రూపాయిఖరీదు ఉండేది. ఇప్పుడు ౧౦ అణాలు ౧౧ అణాలకంటె ఎక్కువ విలువ దానికి లేదు. కాబట్టి పేదవాండ్ల క్షేమనిధియైన వెండినగలకు బజారులో ధర పడిపోయినది.” అని ఆయన చెప్పెను. ౧౯౦౧ లో కలకత్తాలో జరిగిన ౧౭ వ కాంగ్రెసుకు వాచా అధ్యక్షుడుగా నెన్నుకొనబడెను. అప్పు డాయన చేసిన మహోపన్యాసమును స్వయముగా చదివి ఆనందించవలసినదే కాని ఇక్కడ ఉదాహరించడమునకు వీలులేదు. కాని సందర్భము నుబట్టి ఆ యుపన్యాసములోని కొన్ని భాగము లాయా అధ్యాయములలో నుదాహరింపబడినవి. వాచా ౧౮౯౬ మొదలు ౧౯౧౩ వరకును కాంగ్రెసుకు సంయుక్త కార్యదర్శిగాపనిచేసెను. ఆయన అధ్యక్షు డయ్యేటంతవరకును కాంగ్రెసులోని ప్రతివిషయము లోను జోక్యము కలిగించుకొనెను; కాని తరువాత సామాన్యసంబంధము కలిగియుండెను. ఆయన ౧౯౧౫ లోని బొంబాయి కాంగ్రెస్‌కు ఆహ్వానసంఘాధ్యక్షుడు. దాదాపు కాంగ్రెసుతో ఆయనకు కలిగిన చిట్టచివరి సంబంధ మదే. వాచా ౩౫ సంవత్సరములకుపైగా కాంగ్రెసులో ప్రాముఖ్యస్థాన మాక్రమించుకొనియుండెను. సర్వతోముఖ పాండిత్యములోగాని, విషయపరిజ్ఞానములోగాని సందర్భ విమర్శనములో గాని ఆయనతో సరివచ్చువారు బహు కొద్దిమంది; ఆయనను మించినవారు లేనేలేరు. ౧౯౦౧ లో కలకత్తాలో ౧౭ వ కాంగ్రెసు కధ్యక్షత వహించి వాచా నిష్పృహతో “ఇంగ్లీషువారికి నష్టదాయకముగా హిందూదేశీయులు పెద్దయుద్యోగములలో నున్నప్పుడు ఇంగ్లండు చేతులు ముడుచుకొని కూర్చున్నదా? పోపుఅధికారములో ఇంగ్లండు లక్షలకొలది పోగొట్టుకొని దివాలాతీసినదని చరిత్ర చెప్పడములేదా? ఇప్పు డిండియా యున్నస్థితిలో ఇంగ్లండే యున్నయెడల అది నోరు మూసికొని యూరుకొనేదా?” అని ఇంగ్లీషురాజ్యతంత్రమును తీవ్రముగా నిరసించెను. ఈసందర్భము లన్నిటిని గమనించేయెడల వాచా కాంగ్రెసులోనున్న తీవ్రవాదులలో తీవ్రవాది అని చెప్పవచ్చును. కాని ఒకకాలమునాటి తీవ్రవాది తరువాతికాలమునాటికి మితవాది కాగలడు. అదే విధముగా వాచా పిదప కొంతకాలమునకు “సర్” బిరుదాంకితుడై, కేంద్రశాసనసభకు నామినేటెడ్ సభ్యుడై, ఇండియాలోని బ్రిటిష్‌ప్రభుత్వమునకు పూజనీయుడయిన అంతరంగికమిత్రు డయ్యెను.

## గోఖ్లే

గోఖ్లే ఇంతకన్నను కఠినముగాను, స్పష్టముగాను తన అభిప్రాయములను వెలి బుచ్చేవాడు. ఈయన తిలకుమహాశయునితో కలసి మొట్టమొదట ౧౮౮౯ లో కాంగ్రెసువేదికపైన కనిపించెను. కర్జనుప్రభువుకాలమునందు, మారకపుతికమకల ఫలిత ముగా చూపబడిన కృత్రిమపు టధికాదాయములపైన ఈయన వాసనసభలలో తిరుగు బాటు చేసెను. ఈయన ప్రభుత్వమువారితో "కరెన్సీయైనను కళంకరహితముగా నుండవలయును." అని నొగమోటమును విడిచి చెప్పినాడు. ఈయన ఉప్పుపన్నును గూర్చి చేసిన విమర్శనలు, పూసగ్రుచ్చినట్లు దృష్టాంతరూపకముగా చేయబడినవి. ఈయన యుపన్యాసములలో మాకుపైసలకుకొనగల బస్తా ఉప్పు అయిదణాల ఖరీ దెట్లయినదో వివరింపబడినది. ఆయన పబ్లిక్ సర్వీసెస్ కమిషనునుగూర్చి, నాగరికపౌర సులపైన చేయబడే హిందూదేశరాజ్యాంగ కార్యదర్శి ఉత్తరువులనుగూర్చి మాట్లాడిన సందర్భములో, భారతీయులకు న్యాయముగా రావలసిన ౧౨౪౪ ఉద్యోగములలోను ౧౦౮ మాత్రమే వచ్చుచున్నవనీ, అందులో ౬౩ హిందూదేశరాజ్యాంగ కార్యదర్శి నిర్ణ యముప్రకారము లభిస్తూన్నవనీ వివరించియుండెను. కాని గోఖ్లే యెంతకఠినమైన మాటనైనను అత్యంత మార్దవమైనభాషలో చెప్పగలసమర్థుడు. ౧౮౯౮ లో "అత్యం తోన్నతోద్యోగము లన్నీ శాశ్వతముగా యూరోపియనులకే యుండవలెను" అని ప్రభుత్వమువారు చేసిన బహిరంగప్రకటనమును నిరసిస్తూ గోఖ్లేమహాశయుడు "ఇం గ్లీషువారు మనకు చేసినవాగ్దానములు మాజాతికొక మహామూల్యమైన ఉన్నతాదర్శమును ప్రసాదించినవి. ఆ వాగ్దానములను భంగపరచినచో మన బ్రిటిష్ ప్రభుత్వముపైన మా కనురాగ ముండవలసిన ముఖ్యకారణములలో నొకటి అదృశ్యము కాగలదు." అని చెప్పినాడు. గోఖ్లే విమర్శన మానందముగాను ఉండేది, నిష్కపటముగాను ఉండేది. ఆయన సర్ జేమ్సు ఫిట్జు జేమ్సుస్టీఫెనునుగూర్చి "కీర్తిమంతుడేగాని అపకీర్తిమంతుడే గాని ఒక ఇంగ్లీషుజడ్జి (సర్ జేమ్సుఫిట్జు జేమ్సుస్టీఫెన్) ఇంగ్లండు నేను మనవారిపట్ల విశ్వాసభంగముగా ప్రవర్తించ సిద్ధముగా నున్నదని అంగీకరింపవలెనుననుగాని, ౧౮౫౮ లో చేయబడిన ప్రకటనములోని అర్థము నుద్దేశించి అది చేయబడలేదని ఒక అసంభవ మైన సిద్ధాంతమును బయలుదేరదీయవలెననుగాని పనుదీయలేదు. మేమీ వాగ్దాన పత్రముల నన్నిటిని ఇక చిత్తుకాగితములక్రింద నిప్పులలో వేయవలసినదేనా?" అని నిస్పృహుడై చేసిన తీవ్రవిమర్శనమే ఇందుకు నిదర్శనము. ప్రభుత్వమువారినిగూర్చిన కఠినవిషయములను మార్దవముగా చెప్పడము గోఖ్లేయొక్క ప్రత్యేకత. ౧౮౩౩ సం స్కరణచట్టములో కౌన్సిలుసభ్యులకు ఎన్నికొనేహక్కు లేదని కనిపెట్టబడినది.

వై స్రాయికిమాత్రము, హిందూదేశరాజ్యాంగ కార్యదర్శి అంగీకారమునకు లోబడి నిబంధనలను చేసేహక్కు కల్పింపబడినది. గోఖ్లే ఆనిబంధనలనుగూర్చి "౧౮౯౮ చట్టములోని ప్రధానోద్దేశమునకే భంగకరముగా నుండవలెనని బుద్ధిపూర్వకముగా ఈ నిబంధనలు చేయబడిన వని నే ననను. కాని ఈచట్టముయొక్క యుద్దేశమునకు పూర్తిగా భంగము కలిగించేటట్లు ఈనిబంధన లుండవలయునని ఒకప్రత్యేకోద్యోగిని నియమించేయెడల ఆయన ఇంతకన్న జయప్రదముగా ఆపనిని నిర్వర్తించియుండజాలడనిమాత్రము నే ననగలను." అని చెప్పెను. గోఖ్లే "ఎండకెండి, వానకు తడిసి, ఉదయమునుండి సాయంకాలమువరకును గుప్పెడుమెతుకులకోసము చెమటపోడ్చి పని చేస్తూ, అంతులేని పేదరికంతో మానవుడు పెట్టేకష్టాలను, దేవుడు పెట్టేకష్టాలను భరిస్తూ, చెప్పుకునేదిక్కులేక కిక్కురు మనకుండా ప్రభువులకు పన్నులిచ్చుకొనే రైతు"ను చూచి చాలా జాలిపడేవాడు. కేవలము ఆరైతులక్షేమముకోసమే ఆయన "ప్రభుత్వవ్యయము", "పన్నుల"ను గూర్చి అంతగా పనిచేసినది. కర్జనుప్రభువుయొక్క అనర్థపరిపాలనమువలన మితవాదిత్వమునకు పేరుపడ్డ గోఖ్లేకూడ ఒక్కొక్కప్పుడు నిగ్రహించుకోలేకపోయేవాడు. కర్జనుకాలములోని వంగరాష్ట్రవిభజనము, కలకత్తా కార్పొరేషన్ అధికారములను తగ్గించుట, విశ్వవిద్యాలయపరిషత్తు (Senates)లను ప్రభుత్వోద్యోగులవశము చేసి, విద్యావిధానము నెక్కువ వ్యయకారణముగా నొనర్చుట, అధికారరహస్యముల చట్టము (Official Secrets Act) ఇవన్నీ ఆయన కాలములోనే జరిగెను "పురాతన స్మారకనిర్మాణరక్షణచట్టము" (Ancient Monuments' Preservation Act), సైనికనివారణావిధానము, సైనికులషికారు(Shooting)ను గూర్చిన నిబంధనలు, రంగూన్, సియాల్ కోటలలో శిక్షలు మొదలగు పరిత్యాగ్యములను మరపించి గోఖ్లేఅంతవానికి కోపము తెప్పించి "ప్రజల శ్రేయస్సుకోసము ప్రభుత్వముతో సహాయపడేపని కిక తప్పక స్వస్తి చెప్పవలసినదే." అనే కఠినమైన మాట లాయననోట పలికించుటకు కారణభూతములైనవి. వంగరాష్ట్రవిభజనసందర్భములో జరిగిన కొన్ని విషయములనుగూర్చి ఆయన "వంగదేశములో ఇటీవల అతితీవ్రముగా పొంగి పొరలెత్తిన జలప్రవాహము, అక్కడక్కడ గట్లు నతిక్రమించిపోవడ మసంభవవిషయము కాదు. పెద్దజనసమూహములో ఒక్కసారి ఆకస్మికసంచలనము కలిగినప్పుడిట్టి చిన్నచిన్న మర్యాదాతిక్రమణములు తప్పవు. ముఖ్యముగా ఆసంచలనము, చీకటిలోనుండి వెలుతురులోకి, నిర్బంధములోనుండి స్వాతంత్ర్యములోకి అయినట్లయితే మరీ తప్పవు." అని అభిప్రాయమిచ్చినాడు. గోఖ్లే ౧౯౦౫ లో కాశీ కాంగ్రెసు అధ్యక్షుడై ప్రజాభిప్రాయ మనుకూలముగా నున్నయెడల బహిష్కరణమును చిట్టచివరి రాజకీయాయుధముగా ప్రయోగించవచ్చునని సమర్థించినాడు. ఆయన

ప్రతికక్షులయెడ చూపే దాక్షిణ్యమువలన ఆయనవిమర్శనము లెప్పుడును అస్పష్టము గాను, బలహీనముగాను లేవు. ఆయన "ప్రతి ౫ గ్రామములలో నాలుగుగ్రామములు పాఠశాలలు లేకుండనున్నవి. ౮ మంది పిల్లలలో ౭ మంది అజ్ఞానములో వర్ధిల్లుచున్నారు." అని చెప్పినప్పుడు 'నూటికి ౧౨ మందిమాత్రమే చదువుకొన్నవారున్నారు' అని చెప్పడముకంటె ఎక్కువస్పష్టముగా అర్థమవుచున్నది. గోఖ్లే కాశీ అధ్యక్షోపన్యాసమూలముగా లిట్టన్‌ప్రభువు రహస్యలేఖ కెక్కువప్రచారము కలిగినది. అందులో "ఈకోరికలు, ఈ ఆశలు ఎప్పటికీ సఫలము కావనేసంగతి మన కందరికీ తెలుసును. మనము వారిని (భారతీయులను) నిరోధించనైనను నిరోధించవలెను. లేదా మోసగించనైనను మోసగించవలెను. మన మీ అన్యాయమార్గమునే అవలంబించినాము. ఇండియా, ఇంగ్లండుప్రభుత్వములవారిరువురును మనస్సులో లేనిమాట లనేకము చెవిలో చెప్పి, వాటిని చేతితో చేయకుండా తప్పించుకోవడమునకు తమ కూరవచ్చుశక్తిని వినియోగిస్తున్నారనే నిందారోపణమునకు సరియైనసమాధాన మీయలేదనియే ఇప్పటికిని నా అభిప్రాయము. ఇది రహస్యలేఖ కాబట్టి ఈసంగతి నిర్భయముగా వ్రాస్తున్నాను." అని యుండెను.

౧౯౦౫, ౧౯౦౬ సంవత్సరములలో వరుసగా గోఖ్లే ఇండియా ప్రతినిధిగా ఇంగ్లండుకు పంపబడెను. ఆయన ౧౮౯౭ లోనే ఇంగ్లండుకు మొట్టమొదట వెళ్లి యుండెను. గోఖ్లే అంటే ప్రభుత్వ మంత ప్రేమించేదీ కాదు: ప్రజలంత ఇష్టపడే వారునూ కాదు. ప్రభుత్వమువారి కాయనమితవాదిత్వము సరిపడేదీకాదు. వీరిరువురికిని మధ్యవర్తిగా ప్రవర్తించవలెనని ఆయనకోరిక. ౧౯౦౦ లో లాహోరు కాంగ్రెసు కధ్యక్షుడైన చందావర్కరు అభిప్రాయముకూడా యిదే. గోఖ్లే, వైస్రాయికి ప్రజాభీష్టములను మనవిచేసేవాడు. గవర్నమెంటువారి కష్టములను కాంగ్రెసుకు తెలియచెప్పేవాడు. ఇందుమూలముననే ఆయన కొంతమంది కయిష్టుడయ్యెను. ౧౯౦౭ లో సూరతుకాంగ్రెసు సందర్భమున మింటోప్రభువుకూడ గోఖ్లేనుగూర్చి "పార్టీ నాయకుడుగా ఆయన పట్టి పసిగాయి" అని వ్రాసియుండెను. గోఖ్లేనుగూర్చి వైస్రాయిఅభిప్రాయమును తెలియచేయగల మరియొకసంఘటనముకూడా జరిగినది. అది మింటోప్రభ్వి వ్రాసిన మింటోప్రభువు జీవితచరిత్రములో నుదాహరింపబడినది. గోఖ్లే ఇంగ్లండులోని యొకమిత్రునికి వ్రాసిన యుత్తరమును మార్లే చూచి, దాని నకలును మింటోకు ఇండియాకు పంపించెను. అప్పుడు మింటో "ఈవ్రాత కేవలము దురభిప్రాయములు కలిగించే యుద్దేశముతో వ్రాయబడినది. గోఖ్లే ఈ ధోరణిలో నాతో మాట్లాడియుండేవాడు కాడు. నే నాయనను బాగుగా ఎరిగియుండి, ఆయనతో మంచిస్నేహముగా నుండి, ఆయనను మెచ్చుకొనేవాడ నైనప్పటికీ, ఇందువల్లనే

కేవల మాయన సెవరును విశ్వసించియుండరాదని నా అభిప్రాయము." అని తన మనస్సును పైకుబికెను.

గోఖ్లే పెద్దతనముచ్చినకాలదీ "ప్రభుత్వమువా రంతకంత కెక్కువ స్వార్థపరులౌతున్నారు. జాతీయాశయములకు నానాటి కెక్కువ విరోధు లవుతున్నారు. పూర్వ మింతలేదు" అంటూండేవాడు. ఆయనకు పాశ్చాత్య జాతీయాధిక్యముతో గూడిన ధనస్వామిక (Capitalism) మంటే బొత్తిగా పడేదికాదు. నైతికముగాను, ఆర్థికముగానుకూడా ఇండియాప్రజలు నానాటికి పతితు లయి పోతూన్నారనీ, ఇండియాలో మరణములసంఖ్య పెరిగిపోతూన్నదనీ ఆయన చాలా విచారపడేవాడు. అందువల్ల ఆయన ప్రజలస్థితిగతుల నభివృద్ధి చేయుటకును, ఆర్థికవ్యవహారములను చక్క చేయుటకును, పరిపాలనాపద్ధతులను బాగుచేయుటకును యూరపియనులకు బదులుగా భారతీయులనే పరిపాలకవర్గములో చేర్చి పరిపాలనావ్యవహారములలో దేశీయుల కెక్కువ అధికారమును సంపాదించుటకు తగిన ఒక కార్యక్రమమును తయారుచేసినాడు.

సూరత్ తగాదానంతరము గోఖ్లే కాంగ్రెసులో ప్రధానస్థాన మాక్రమించెను. ఆయన దక్షిణాఫ్రికాకు పోయి, అక్కడ సాత్త్వికనిరోధములో గాంధీకి అద్భుతమైన సహాయముచేసెను. ౧౯౦౯ కాంగ్రెసులో ఆయన సాత్త్వికనిరోధ సిద్ధాంతమునుగూర్చి యుపన్యసించగా సభ్యు లందరును ముగ్ధులైరి. ఆయుపన్యాసభాగములు "విదేశములలోని భారతీయులు" అనేశీర్షిక క్రింద మరొకచో నుదాహరింపబడినవి. తరువాత ఆయనచేసినపని అంతా ముఖ్యముగా భారతశాసనసభలోనే. ౧౯౧౪ లో కాంగ్రెసులోని రెండుపక్షములును తిరిగి యేకము కావలెననే ప్రయత్నము జరిగినప్పుడు మొట్టమొదట అందు కాయన అంగీకరించెనుగాని, తరువాతమాత్రము తన అభిప్రాయమును మార్చుకొనెను. ఈవిధముగా మాతృదేశారాధనముకొరకు మిత్యంతత్యాగముచేసి కఠినమైన ప్రజాజీవితమును గడపిన గోఖ్లేమహాశయుడు ౧౯౧౫ ఫిబ్రవరి ౧౯ వ తేదీని స్వర్గస్థుడయ్యెను.

## జి. సుబ్రహ్మణ్యఅయ్యర్

మొట్టమొదటి కాంగ్రెసులో మొట్టమొదటి తీర్మానము ప్రతిపాదించినవా రెవరో తెలుసుకొనవలెనని చాలామందికి కుతూహల ముండవచ్చును. ఆయన మద్రాసునుండి వెళ్లిన జి. సుబ్రహ్మణ్యయ్యరు, హిందూపత్రికాసంపాదకుడు. ఆయనను ఎడిటర్ సుబ్రహ్మణ్యయ్య రని పిలిచేవారు. "ఇండియాపరిపాలనమునుగూర్చిన విచారణ తగినంత భారతీయ ప్రాతినిధ్యముగల రాయల్ కమిషనువారిచే జరుపబడవలె నని ఆమొట్ట

మొదటితీర్మానసారాంశము. ఆయన "పార్లమెంటువారు సిద్ధాంతములలోమాత్రము పరిపాలనమును స్వాధీనపరచుకొనిరికాని, ఆచరణములో తమపార్టీప్రయోజనములకు సంబంధించినంతవరకు తప్ప తక్కినసందర్భములలో త్యజించిరి. నద్దయిన కంపెనీ వారి అధికారమును ఇండియాకౌన్సిలువారు తీసుకొనిరి గాని పరిపాలనమునుగూర్చి విచారణమాత్రము చేయలేదు." అని సంగ్రహముగా చెప్పెను. తరువాత ౧౮౯౪ లో మద్రాసులో జరిగిన ౧౦ వ కాంగ్రెసువరకును సుబ్రహ్మణ్యయ్యరునుగూర్చి మనకేమీ ఎక్కువగా తెలియదు. ఆకాంగ్రెసులో ఆయన భారతదేశార్థిక విషయము లనుగూర్చి విచారణ జరుగవలెనని యుపన్యసించెను. ఆయన ఇండియాప్రభుత్వము వారి న్యాయప్రవర్తనమునుగూర్చి సర్ విలియంహంటరుగారు చేసినవిమర్శనముల నుదాహరిస్తూ, అట్టినిందారోపణములు చేయబడినప్పుడు ప్రభుత్వమువారు విచారణ జరిపితీరవలెనని చెప్పెను. తరువాత భారత సంస్థానములలో ముద్రణాస్వాతంత్ర్య మరికట్టబడినందుకు సుబ్రహ్మణ్యయ్యరు తీవ్రముగా ప్రతిఘటించెను. కలకత్తాలో ౧౮౯౬ లో జరిగిన ౧౨ వ కాంగ్రెసులో, సివిల్ సర్వీసుపరీక్ష లేకకాలమున జరుపబడ డమునుగూర్చి, స్టాండింగుకమిటీలు వేసి ఆయన వివ రించెను. మరుసంవత్సరము జరిగిన అమరావతీకాంగ్రెసులో పరిపాలనాధికారములయందు అవలంబింపబడే ప్రభుత్వతంత్రమునుగూర్చి ఆయన విమర్శించెను. ౧౮౯౮ లో మూడవ సారి మద్రాసులో కాంగ్రెసు జరుపబడినప్పుడు మరల ఆయన పరిపాలనాధికారములయం దవలంబింపబడుతూన్న ప్రభుత్వతంత్రమును ప్రతిఘటిస్తూ "ఈ ప్రభుత్వతంత్రము దురుద్దేశపూర్వకము. పైపెచ్చు అపాయకరము.........ఇది దేశములోపల నిర్బంధో ద్దేశమును, దేశముబయట ఆక్రమణోద్దేశమును తెలియపరుస్తూన్నది" అని చెప్పెను. ఆయన మారకపుసమస్యనుగూర్చి "ప్రభుత్వమువారు రాంగ్లో ఇండియను వర్తకుల వ్యాపా రమును ప్రోత్సహించుటకుమాత్రమే పూనుకొనిరి. వారు ప్రజలసంగతి ఆలోచించుట లేదు. పన్నులు వెండిలో చెల్లించవలసియుండుటచేతను, వెండిధర పెరిగిపోవుట చేతను రైతులు నాటికి ౬౦ వంతున ఎక్కువధాన్యమును అమ్మవలసివస్తూన్నది. దేశములోనికి ఇంగ్లీషువారిచేపెట్టబడి వచ్చినందువలన మనకు ప్రయోజనము లేకపోగా పైపెచ్చు మనదేశమునుండి ధనము విదేశములకు ప్రవహించును. స్వదేశములో స్వదేశ ధనమే పెట్టుబడి పెట్టబడినయెడల వచ్చేలాభము మనది కాగలదు." అని ఆయన చెప్పెను. సుబ్రహ్మణ్యయ్యరుకు ప్రేమాస్పదమైన విషయము మంచియూ ఆర్థికస్థితి. ౧౯౦౦ లో లాహోరులో జరిగిన ౧౬ వ కాంగ్రెసులో, భారతదేశములో తరచుగా క్షామములు వస్తూన్న కారణములను, తన్నివారణోపాయములను యోజించుటకును విచారణ జరిపించవలసిన దని కోరినాడు. అప్పుడే ప్రభుత్వోన్నతోద్యోగములను

గూర్చియూ, వాటినుండి భారతీయులు మినహాయింపబడుటనుగూర్చియూ వివరించెను. ౧౭ వ కాంగ్రెసులో కలకత్తాలో రైతుల దారిద్ర్య మాయనదృష్టి నాకర్షించెను. రైతుల దుస్థితినిగూర్చి రైతులకు పరిజ్ఞానము లేకపోయినప్పటికీ భారతదేశపు కష్టస్థితివలన వారు నశిస్తున్నారు. అయితే భారతరైతు పశువువలె జీవించి మరణించవలసినదేనా? ఆయనకు మనుష్యుల కుండవలసిన మానసికప్రవృత్తులుకాని, శక్తిసామర్థ్యములుగాని లేవా? అజ్ఞానాంధకారములో మునిగి, నిరంతర దారిద్ర్యములో ౨౦౦,౦౦౦౦౦౦ మందిరైతులు భారతదేశములో జీవిస్తున్నారు. వారు తమకష్టములు నితరులకు చెప్పుకొనరు. వారికి జీవితములో సుఖము గాని, భోగముగాని, ఆశగాని, ఆనందముగాని, ఉత్సాహముగాని లేవు. వారికి జీవితముపై ప్రత్యేకాభినివేశము లేదు. వారు ప్రపంచకములో జన్మించబట్టి జీవిస్తున్నారు. శరీరములో ప్రాణము నిలుపుకొనుటకు వీలులేకపోయినప్పుడు మరణిస్తున్నారు." అని హృదయవిదారకముగా వర్ణించెను. ఈ కాంగ్రెసులోనే క్షామములనుగూర్చి [illegible] పారిశ్రామికస్వాతంత్ర్యము కావలెనని వాదించెను. దేశీయపరిశ్రమలను, వృత్తివిద్యాసంస్థలను, విదేశములకు విద్యార్థులను పంపే నిమిత్తము ఉపకారవేతన పద్ధతులను స్థాపించవలయు నని ఆయన చెప్పెను. సుబ్రహ్మణ్యయ్యగారివిజ్ఞాన మెంత అగాధమో ఆయనదృష్టి యంత విశాలము. ౧౯౦౩ లో అహమ్మదాబాదులో జరిగిన ౧౯ వ కాంగ్రెసులో సుబ్రహ్మణ్యయ్యగారు మన భారతప్రజల దారిద్ర్యమునుగూర్చి "భారతదేశ ప్రజలదౌర్బల్యమును, భారతశిల్పపరిశ్రమల అధ్వాన్నస్థితిని చూచి విదేశీయు లపహాసమును సల్పించినవారు కలరు. ఈస్టిండియాకంపెనీవారు ఇంగ్లండుదేశపు వాణిజ్యలాభములకోసము ముఖ్యప్రాధాన్యకముగా హిందూదేశమును ధ్వంసముచేసిరి. ఇంగ్లండుదేశపు కర్మాగారములలో ఉత్పత్తిచేయబడే సామగ్రికి కావలసినముడిసరుకును తయారుచేసేనిమిత్తము హిందూదేశవ్యవసాయమును ప్రోత్సహించి పరిశ్రమలను నిరుత్సాహపరచిరి. కంపెనీవారి ఆ తంత్రమువలననే భారతపరిశ్రమలు నాశనమైనవి. ఇప్పటిప్రభుత్వమువారు ఆపద్ధతిని మార్చవలయును. అయితే ఇప్పుడేమి జరుగుతూన్నది? కోలారు బంగారుగనులు యూరోపియనుల పెట్టుబడిక్రింద పనిచేస్తున్నవి. ఆ గనులలో ప్రతిసంవత్సరము ౨౦ కోట్లరూపాయిలబంగారు ఉత్పత్తి అయి విదేశములకు పోతూన్నది. ఒక ౨౦, ౩౦ సంవత్సరములలో బంగారమంతయు విదేశములవారిచే తీసికొనిపోబడినట్లయితే మైసూరుప్రజల కేమవుతుంది; పట్టి గాలేగాక! విదేశీయులు భారతీయైశ్వర్యమును తీసికొనిపోకుండ ప్రభుత్వమువారు కాపాడవలసియున్నది" అని చెప్పి విరమించెను. సుబ్రహ్మణ్యయ్య రొక్కఆర్థికవిషయములనేగాక విజ్ఞానపరిపాలనా విషయములనుకూడ ప్రతిసంవత్సరము తీవ్రముగా విమర్శిస్తూండేవాడు. తాతాపరిశోధ

నాలయమునుకానీ, విశ్వవిద్యాలయచట్టముకానీ, శాసనసభాసంస్కరణముకానీ ఇవన్నీ ఆయనదృష్టికి సమానములే! అన్నీ ఆయనకు ప్రేమపాత్రములే. గోఖ్లేగారు వివరించిన కృత్రిమపుటధికాదాయముల వినియోగమును, రూపాయివిలువతోపాటు వ్యవసాయకుల పన్నును పరోక్షముగా పెంచిన కరెన్సీసమస్యయూ ఆయనకు ప్రీతికరములైన ముఖ్య విషయములు. సుబ్రహ్మణ్యయ్యరు తాను వ్రాసినవ్రాతల కొకప్పుడు జైలుకు పంపబడి, కొంతకాలమున కనారోగ్యకారణములచే విడుదలచేయబడెను. ఆకాలపు రాజకీయ నాయకు లందరిలోను ఆయన చాలా దూరదృష్టికలవాడు, ధైర్యశాలి. ఆయన సేవకు భారతసంతానము కృతజ్ఞత చూపవలసియున్నది.

## బద్రుద్దీన్ తయాబ్జీ

బద్రుద్దీన్ తయాబ్జీ గొప్ప కాంగ్రెసువాది. ఈయన ౧౮౮౭ లో (మద్రాసు) మూడవకాంగ్రెసుకు అధ్యక్షుడయ్యెను. తయాబ్జీ కాంగ్రెసు ప్రాతినిధ్యసంస్థ అనీ, రాజభక్తికలదనీ తనయుపన్యాసములో చెప్పెను. ఆయనసూచనమీదనే కాంగ్రెసులో చర్చించవలసిన విషయనిర్ణయమునకును, కాంగ్రెసుకార్యక్రమమును తయారుచేయుట కొరకును ఒకకమిటీ యేర్పాటుచేయబడినది. అదే తరువాత సంవత్సరములలో విషయనిర్ధారణసభకు కారణభూతమైనది. తరువాత ౧౯౦౪ లో ౨౦ వ కాంగ్రెస్ జరిగేటంతవరకును ఈయనకు కాంగ్రెసుతోగల సంబంధమునుగూర్చి మన కేమీ తెలియదు. అందులకు కారణ మాకాలములో ఆయన బొంబాయిహైకోర్టుజడ్జీపదవిలో నుండుటయే. ౧౮౮౯ లో జరిగిన బొంబాయికాంగ్రెసులో పబ్లికు సర్వీసులనుగూర్చిన తీర్మానచర్చలో ఈయన పాల్గొనెను. ఈయన ౧౯౦౬ లో స్వర్గస్థుడయ్యెను. ఆ సంవత్సరము కాంగ్రెసు పూర్వపుటధ్యక్షులు ముగ్గురు-డబ్ల్యు. సి. బెనర్జీ, తయాబ్జీ, ఎ. యమ్. బోసులు మరణించిరి. అది కాంగ్రెసువాదుల కెక్కువ దుఃఖకారణ మయ్యెను. మొదటికాంగ్రెసుకు డబ్ల్యు. సి. బెనర్జీ (హిందు), రెండవకాంగ్రెసుకు దాదాభాయినౌరోజీ (పార్సీ) అధ్యక్షులైనపిదప మూడవకాంగ్రెస్‌కు తయాబ్జీ (ముసల్మాన్) అధ్యక్షపదవములో నుండుట విశేషమే యున్నది.

## జస్టిస్ కాశీనాథ త్ర్యంబక తెలాంగ్

జస్టిస్ కాశీనాథత్ర్యంబక తెలాంగ్ కాంగ్రెస్ సంస్థాపకులలో నొకరు. ఆయన బొంబాయిలో మొట్టమొదటి కార్యదర్శిగా చాలాకష్టపడి పనిచేసేవాడు. మొట్టమొదటి మహాసభలోనే ఆయన కేంద్రరాష్ట్రీయశాసనసభ్యులనుగూర్చి తీర్మానమును ప్రతిపాదించెను. అందులో సభ్యుల నియోజకవర్గములనుగూర్చికూడ వివరించెను. నాలుగవ

కాంగ్రెసులో సర్. ఆక్లండ్ కాల్విన్, ఫషరిన్ ప్రభువుల వ్యతిరేకవిమర్శనములకుగట్టిగా ఆయన ప్రత్యుత్తరమిచ్చెను. ఆసభలోనే పర్మనెంటు సెటిల్ మెంటునుగూర్చి తీవ్రమైన చర్చ జరుగుచున్న సందిగ్ధసమయములో ఆయన ఐక్యము కలిగించుకొనవలసివచ్చెను. ప్రభుత్వమువారి కనేకపనులుచేయుటకు సొమ్ముకనపడుచున్నది కాని విద్యావ్యాపనమునకుమాత్రము తమ ఆదాయములో నూటికి ఒకటికన్న ఎక్కువ కనిపించడము లేదని ఆసభలోనే ఆయన ఒకసందర్భములో చెప్పెను. ఆయనఅకాలమరణమును గూర్చి ౧౮౮౫ కాంగ్రెసులో దాదాభాయినౌరోజీ ప్రస్తావించెను.

## డబ్లియు. సి. బెనర్జీ

కాంగ్రెసు ఉద్దేశములను సరిగా తెలుసుకొనవలె నని కోరేవారు మొదటి కాంగ్రెస్ కధ్యక్షతవహించిన డబ్లియు. సి. బెనర్జీగారి యుపన్యాసమును చూడదగును. అది మరియొకచోట నుదాహరింపబడినది (భాగము ౧, అధ్యాయము ౨, ప్రకరణము ౪). ఈయన నూతన కాంగ్రెసు, అయిదవకాంగ్రెసు అధ్యక్షులను ప్రతిపాదించెను. ౮ వ కాంగ్రెసు కధ్యక్షత వహించవలసిన గౌరవము తిరిగీ ఈయనకే దక్కెను. అది ౧౮౯౨ లో అలహాబాదులో జరిగినది. ఈసందర్భములో ౧౮౯౧లో గర్భాధాన వయోనిర్ణయ చట్టము (Age of Consent Bill) నుగూర్చి వాదోపవాదములు జరిగిన సంగతి మనము జ్ఞాపకము చేసికొనవలయును. అప్పుడు తిలక్ ఆబిల్లుకు వ్యతిరేకముగా నుండి విచిత్రపురుషుడుగా కనిపించెను. డబ్లియు. సి. బెనర్జీ అలహాబాదులో కాంగ్రెస్ సాంఘికవిషయములలో ఐక్యముకలిగించుకొనకపోవడమునకు కారణములను వివరించెను. ఆయనయుపన్యాసములో రాజకీయాందోళనమునుగూర్చిన ఆకర్షవంతమైన భాగము నీక్రింద వివరిస్తున్నాము:

"మా మాటలను లెక్కచేయకపోవడమునకు కారణము మాలో యూరపియను సోదరబృందము కలియకపోవడమేనా? మాయూరపియనుమిత్రులను మేము హృదయపూర్వకముగా ఆహ్వానిస్తున్నాము. కాని ఆకారణముతో మా వాక్యము లెందుకు తృణీకరింపబడవలెను? కష్టము లనుభవిస్తున్నది మేము. బాధపడుతున్నది మేము. కాని మేము బిగ్గరగా మాట్లాడితే "మేము మీమాటలు వినము. మీఆందోళన మసహ్యకరము, నిరర్థకము, పట్టించుకొనము" అందురు. ఒకప్పుడు అధికారేతరయూరపియనులతో కలసి భారతీయు లాందోళనచేసినరోజు లున్నవి. అప్పుడు ప్రభుత్వపక్షమువారు ఈఆందోళన భారతీయులది కాదు. ఎవరో కొంతమంది అసంతృప్తులయిన యూరపియనులది. వారిమాటలు వినవద్దు. ఇవి నిజముగా ప్రజలమాటలు కావు." అని చెప్పె

వారు. ఇప్పుడో వాండ్లమాటలు వినవద్దు. అవి వారి సొంతమాటలే. యూరోపియనుల మాటలు కావు" అంటున్నారు."

౧౮౯౦లో ఇంగ్లండుకు పోయిన రాయబారవర్గములో డబ్ల్యు. సి. బెనర్జి ఒకసభ్యుడు. ఈయన అనేక తీర్మానముల చర్చలలో పాల్గొనెను. ౧౮౮౮ లో పార్లమెంటరీకమిటీ నియోజకమునుగూర్చి, ౧౮౯౧లో జూరీపద్ధతినిగూర్చి వచ్చిన చర్చలలో ఈయన పాల్గొనెను. జూరీపద్ధతినిగూర్చి మాట్లాడుచూ ఈయన "పల్లెటూరివారు తమసొంతభాషలో చెప్పేసాక్ష్యములను మనస్సులో తర్జుమాచేసుకొంటూ సాక్షి చెప్పేమాటలను జాగ్రత్తగా వినుటకు దేశభాష సరిగా తెలియనిజడ్జికి చాలాకష్టము. భారతీయులయిన జూరీలు దేశభాష తెలిసినవారు కాబట్టి కోర్టులో సాక్షిప్రవర్తనమును గమనిస్తూ, వారు చెప్పేమాటలలోని సత్యాసత్యములను తెలుసుకొనగలరు" అని చెప్పి తనవాదమును చక్కగా సమర్థించెను. ఈయన ౧౯౦౨లో సీమలోనున్న కాంగ్రెసుకమిటీని పోషించవలసిన పని పట్టుపట్టెను. దేశమున నిరంతరముగా మహత్తర సేవ చేసిన డబ్ల్యు. సి. బెనర్జీ ౧౯౦౬లో కాలగతుడయ్యెను.

## లోకమాన్యతిలక్

తిలక్ గోఖ్లేమహాశయులు ఇరువురును సమకాలికులు. వారిలో స్పష్టమైన భేదములు గోచరమవుతూన్నప్పటికీ వారి కొకవిధమైన పరస్పరసన్నిహితత్వ ముండితీరినది. లోకమాన్యుని యుపన్యాసములలోను, వ్రాతలలోను, ఆయన చెప్పినదానికంటె ఎక్కువ చెప్పవలసినదే యున్నట్లుగా కనపడేది. వాటిలో నొకవిధమైన ప్రత్యేకసుగుణము కనపడుతూంటుంది. లోకమాన్యుడు తనవిమర్శనములలో సరసమైన హాస్యరసము నుపయోగించెను. ఆయన "మీరు దేశములోని సంపదలను తీసుకొనిపోయి, దేనినో యొకవిధముగా, అనగా మీసలహారూపకముగాను, మీప్రతినిధిరూపకముగాను కాక వట్టి వస్తురూపకముగా తిరిగి యివ్వాయకపోయినట్లయితే, దేశ మంతకంతకు దారిద్ర్యవంతము కాకతప్పదు." అని ఒకప్పుడు చెప్పెను. ౧౮౯౬ కలకత్తా కాంగ్రెసులో రాష్ట్రీయ రుసుములను (Provincial contributions) గూర్చి మాట్లాడుచూ తిలక్ మహాశయుడు "ఇండియా ప్రభుత్వ రాష్ట్రీయప్రభుత్వములమధ్య జరిగిన యేర్పాటు కేవలము దుబారాఖర్చుచేసే భర్తమధ్యను, ఆయనభార్యమధ్యను జరిగే యేర్పాటువలె నున్నది. భర్త తన దంతయూ ముందు ఖర్చుచేసుకొని తరువాత భార్యసొమ్మును కూడా తన పరము చేయవలసిన దని బాధించును" అని చెప్పెను.

లోకమాన్య తిలక్ మొట్టమొదట టూకా మహారాష్ట్రదేశమునకు కిరీటములేని రాజు. తరువాత హోంరూల్ రోజులలో యావద్భారతభూమి ఆయన నదేవిధముగా

పూరించినది. ఈగౌరవ మాయనకు దేశాపరాయణత్వమువలనను, కష్టసహిష్ణుతవలనను కలిగినది. ౧౮౯౭ లో ఆయన అన్యాయముగా జైలుకు పంపబడెను. అప్పు డాయనకు విధింపబడిన శిక్ష ౧౮ సంవత్సరములు. కాని ౧౨ నెలల తరువాత మాక్సుముల్లర్ పండితుడును, మరికొందరు సుప్రసిద్ధులును ప్రభుత్వమునకు విన్నపములు చేసుకొనగా ఆయన విడిచిపెట్టబడెను. ౧౯౦౮లో ఆయనకు ౬ సంవత్సరముల ద్వీపాంతరవాసశిక్ష విధించబడెను. దానికితోడు తొల్లిటిశిక్షలో కొంతభాగముకూడ తిరిగీ ఆయన అనుభవించవలసివచ్చినది. ౧౮౯౭ లో ప్రబలిన ప్లేగువ్యాధిసందర్భమున పూనాలోను, బొంబాయిలోను కొంద రుద్యోగస్థులు చేసిన దుండగములు ప్రజలలో గొప్ప అసంతృప్తికి కారణభూతిములైనవి. ఆ అసంతృప్తియే తీవ్రవాదిత్వమునకు మూలమైన దని బెకాంటుగారి అభిప్రాయము. రాణీగారి సువర్ణోత్సవ సందర్భమున ర్యాండు, ఆయర్స్టు అను ఉద్యోగస్థులు బండిలో ఊరేగుచుండగా వెనుకనుండి తుపాకులతో కాల్చబడినారు. దానిఫలితముగా దామోదర హరిచాపేకారును, ఆయన సోదరుడును ఉరితీయబడిరి. విచారణ లేకుండా నద్దారు నాటు నిర్బంధించబడెను.

భారతదేశములో శివాజీసాంవత్సరికోత్సవములకు తిలకుమహాశయుడు మూలపురుషుడు. ఈసందర్భమున మహారాష్ట్రదేశమంతటను బహిరంగసభలు, ఉత్సవములు యేర్పాటుచేయబడినవి. అలా యేర్పాటుచేయబడిన మొట్టమొదటి బహిరంగసభకు మహారాష్ట్రసంస్థానాధిపతులలో ముఖ్యులును, దక్కనులోని ముఖ్యులైన ఈనాము దార్లును, జాగీరుదార్లును వచ్చిరి. ఇంతకుపూర్వము లోకమాన్య తిలకుకు ౧౮ మాసముల కఠినశిక్ష విధింపబడిన దని యుదాహరించియుంటిమి. ఆశిక్ష శివాజీయుత్సవము నాడున బహిరంగసందేశముగా నూహించి వ్రాయబడిన కొన్నిపద్యములను ప్రచురించినందుకు ౧౮౯౭ వ సంవత్సరం ౧౪ సెప్టెంబరున విధింపబడినది. తరువాత మాక్సుముల్లర్ పండితుడు, సర్ విలియమ్ హంటర్, సర్ రిచార్డుగార్త్, విల్లియం కేన్, దాదాభాయి నౌరోజీ, మొదలైన ప్రముఖుల విజ్ఞాపనాఫలితముగా ౧౮౯౮ సెప్టెంబరు ౬ వ తేదీని ఆయన విడుదలచేయబడినారు. తిరిగీ ఆయన రాజద్రోహముక్రింద శిక్షింపబడేయెడల ఈ మొదటిశిక్షలో తగ్గించబడిన ఆరునెలలను క్రొత్తశిక్షలో చేర్చబడవచ్చుననే షరతుకు తిలకుమహాశయుడే యొప్పుకొనినాడు. తిలక్ జైలులో నున్నప్పుడే ఇండియన్ పినల్ కోడులోని ౧౨౪, ౧౫౩ సెక్షనులకు విశేషవ్యాప్తికలిగించే నిమిత్తము ౧౨౪ ఎ, ౧౫౩ ఎ సెక్షనులు చేర్చబడినవి.

౧౮౯౭లో జరిగిన అమరావతీకాంగ్రెసులో తిలకువిడుదలనుగూర్చి చేయ ప్రయత్నించిన ప్రత్యేకతీర్మానము నెగ్గలేదు. ఇందువలన కలిగినకష్టము అధ్యక్షుడు సర్ శంకరన్ నాయర్, సర్ సురేంద్రనాథ్ బెనర్జీల యుపన్యాసములలో సూచితీయబడినది.

ఆయన వర్ణింపబడెను. ఇరుకక్షులవారును రెండువిధముల వాదములను బయలుదేరదీసిరి. కలకత్తా కాంగ్రెస్‌లో మితవాదనాయకులకును, జాతీయవాదినాయకులకును వచ్చిన భేదాభిప్రాయములు దాదాభాయినౌరోజీయందుగల భక్తివిశ్వాసములచే తాత్కాలికముగా సమసిపోయినప్పటికిని అదియే ౧౯౦౭ నాటికి తీవ్రరూపమును దాల్చినది. కాంగ్రెస్‌ను నాగపురమునుండి సూరత్‌నకు మార్చుటకు ఈభేదభావమే కారణము. మితవాదులు స్థానిక ప్రతినిధులతో కలసి తమ ఇష్టమువచ్చినట్లు ప్రవర్తించుటకు వీలుగానుండుటకై కాంగ్రెస్ సూరతుకు మార్చబడినదని జాతీయవాదులు బహిరంగముగనే చెప్ప ప్రారంభించిరి. జాతీయవాదులు లోకమాన్యతిలకును అధ్యక్షత వహింపకోరిరి. కాని మితవాదు లందుకు వ్యతిరేకించి, నాటినియమావళిప్రకారము డాక్టర్ రసవిహారీఘోషును అధ్యక్షునిగా నెన్నుకొనిరి. జాతీయవాదులు అప్పుడే ప్రవాసమునుండి తిరిగివచ్చిన లాలా లజపతిరాయలను అధ్యక్షునిగా సూచించినయెడల ఎవరికిని ప్రతికూలభావన ముండదని తలచి ఆయన పేరు బయటపెట్టిరి. కాని ప్రకృతిసిద్ధముగా స్వార్థత్యాగియగు ఆమహనీయుడు ఈగౌరవమును నిరాకరించెను. ప్రతినిధు లందరును సూరతు చేరగానే లోకమాన్యుడు తనపక్షమువారి నందరను ప్రత్యేకశిబిరమునం దేర్పాటుచేసెను. భేదభావములు తొలగింపబడుటకు ప్రయత్నములు జరిగినవికాని అవి అంతకంతకు ఎక్కువైనవి. జాతీయవాదులు స్వపరిపాలనము, బహిష్కరణము జాతీయవిద్యలనుగూర్చి కలకత్తాలో అంగీకరింపబడిన తీర్మానములు అచ్చట బలపరుపబడవలెనని కోరికతోనుండిరి. కాని మితవాదినాయకులు ఆతీర్మానములను అంగీకరించుట కిష్టపడ రని వారిభీతి. ఆహ్వానసంఘమువారిచే తయారుచేయబడిన చిత్తుతీర్మానములు దురదృష్టవశమున సరిగా కాంగ్రెస్ సమావేశ మయ్యేవరకుకూడ ప్రతినిధులకు చేరలేదు. కలకత్తాతీర్మానములు ఆహ్వానసంఘమువారి పట్టికలో చేర్చబడిన వనువిషయమును జాతీయవాదులు విశ్వసించలేదు. లోకమాన్యుడు మధ్యవర్తులద్వారా రాజీ చేసుకొనుటకు ప్రయత్నించెను. కాని ఫలితము లేకపోయినది. ఆయన ఆహ్వానసంఘాధ్యక్షుడైన త్రిభువనదాసుమాల్వీతో కలసి మాట్లాడవలెనని ప్రయత్నించెను. కాని ప్రయోజనము లేకపోయినది. కాంగ్రెస్ మొదటినాడు ౨౬ వ డిసెంబరు ౨॥ గంటలకు సరిగా సమావేశమైనది. ౧౬౦౦ మంది ప్రతినిధులు హాజరైరి. ఆహ్వానసంఘాధ్యక్షుడు తన ఉపన్యాసమును ముగించినపిదప ఆహ్వానసంఘమువారిచే సూచింపబడిన రసవిహారీఘోషు నియమావళిననుసరించి అధ్యక్షుడుగా ప్రతిపాదింపబడెను. వెంటనే చప్పట్లును, అల్లరియు బయలుదేరినవి. సురేంద్రనాథబెనర్జి ఆతీర్మానము నామోదించ లేచునప్పటికి ఆ అల్లరి మరింత హెచ్చైనది. మరుగోజుకు సమావేశ మాపివేయబడినది. రాజీకొరకు మరల ప్రయత్నములు జరిగి నిష్ఫలమైనట్లు తెలియుచున్నది.

౨౭ వ తేదీ తిరిగీ కాంగ్రెస్ సమావేశమైనది. ఆనాడు అధ్యక్షుడు సభామంటపమునకు వచ్చుచుండగానే మాల్వీకి లోకమాన్యుని సంతకముతో ఒకచీటి అందించబడినది. అందులో "అధ్యక్షుని ఎన్నిక ఆమోదింపబడినపిమ్మటనే నాయెన్నికనుగూర్చి ఉపన్యసింతును. మరియొకసూచనతో సభను ఆపివేయవలసినదని తీర్మానమును ప్రతిపాదింతును. దయచేసి నాపేరు పిలవండి" అని ఉన్నది. పిమ్మట క్రిందటినాడు విడిచిపెట్టినచోటునుండి నాటి సభాకార్యక్రమము ప్రారంభమైనది. డాక్టర్ ఘోషుగారి అధ్యక్షతను ఆమోదిస్తూ సురేంద్రనాథ బెనర్జీ ఉపన్యాసమును పూర్తిచేసెను. లోకమాన్య తిలక్ తనచీటినిగూర్చి జ్ఞాపకముచేసినప్పటికిని ప్రయోజనము లేకపోవుటచే వెంటనే ఆయన తన కాసమయములో ప్రతినిధులనుద్దేశించి ఉపన్యసించుటకుగల హక్కును ప్రతిష్ఠించుకొనవలెనని వేదికవంకకు బయలుదేరెను. ఆహ్వానసంఘాధ్యక్షుడును, ఘోషుగారునుకూడ ఘోషుయెన్నిక పరిపూర్తియైనదని తలచి లోకమాన్యుని మాటలాడ నియ్యలేదు. ఇక నేమున్నది? సభలో కావలసినంత గందరగోళము బయలుదేరినది. ఇంతలో ఒకచెప్పు బాబుసురేంద్రనాథబెనర్జీని రాచుకొని సర్ ఫిరోజిషా మెహతాకు తగిలినది. ఇంక కల్లోలమునకు మేరలేదు. సభలో కుర్చీలును, కర్రలును విరిగినవి. కాంగ్రెస్ ఆనాటికి చాలింపబడినది. మితవాదులు సమావేశమై ఒకసమ్మేళనము నేర్పాటుచేసుకొనిరి. వారు జాతీయవాదులను దూరముగా నుంచుటకు తగిన ప్రణాళిక నొకదానిని తయారుచేసుకొనిరి. ఆసంఘటనము జరిగి ఇప్పటికి చాలాకాలము గడుచుటచే మనము నిష్పాక్షికముగా ఉభయకక్షుల అభిప్రాయములనుగూర్చియు ఒకనిర్ణయమునకు రావీలు కలదు. ఉభయులకును ఆశయములోనే భేదము కలదు. ఉభయులును తమతమ ఆశయములను కాంగ్రెస్‌చే నంగీకరింపచేయవలెనని ఆతురపడిరి. ఈవిషయములనుబట్టి లోకమాన్యుడుపన్యసించ లేచినప్పటి సమస్య చాలా చిన్నదని తెలియగలదు. కలకత్తాలో అంగీకరింపబడిన నియమావళినిబట్టి ఆహ్వానసంఘమువారు అధ్యక్షుని పేరు సూచించగా, కాంగ్రెస్‌లో సమావేశమైన ప్రతినిధులు ఆయన నెన్నుకొనవలసియుండెనని తిలక్ మహాశయుడు పట్టుపట్టెను. కాబట్టి ఆయనకు సభను ఆపుదలచేయవలసినదనిగాని, లేక ప్రతితీర్మానమును ప్రతిపాదించుటకుగాని హక్కు గలదు. ఆయన కాహక్కు నిరాకరింపబడినది. ఈ అన్యాయమునుగూర్చి ప్రతినిధుల కాయన చెప్పదలచుకొనెను. ఇందులో శాస్త్రప్రకారము లోకమాన్యుడు తప్పులేదని చెప్పుటకు వీలుండెను. ఆహ్వానసంఘమువారిచిత్తుప్రతిలో కలకత్తాతీర్మానములు చేర్చబడలేదనే వట్టిఅపోహతో ఈతగాదాలు ప్రారంభమైనవని చెప్పకతప్పదు. ఒకవేళ అవి చేర్చబడకపోయినను కూడ విషయనిర్ధారణసభవారు వాటిని చేర్చుటకు హక్కుగలదు. లేక అవి జాతీయవాదులకు సంతృప్తికరముగా నుండనియెడల విషయనిర్ధారణసభలో వారి కనుకూలు

పైనవారు ఎక్కువమంది ఉన్నచో తగువిధమున వాటిని మార్పుచేయించవచ్చును. నిజముగ ఆతీర్మానములు చిత్తుప్రతిలో ఉన్నంతమాత్రమునకూడ పరిస్థితు లీవిధముగా తీవ్రరూపమును తాల్చవలసిన అవసరము లేదు.

ఉభయపక్షముల నాయకులును ఒకచోట చేరి నిష్కపటముగా చర్చించుకొని యుండినచో పై విషయములింతకంటె తేలికగా పరిష్కరింపబడియుండెడివి. కాని మితవాదుల నాయకుల మొగమాటతనమువలన అట్లు జరిగియుండలేదు. ఏదయినప్పటికిని కావలసిన దానికంటె అంచెలను పెద్ద పెద్దవిగా చెప్పవచ్చును. కాని యుద్రేకములు పెరిగినప్పుడు మాత్రము పెద్దలుకూడ చిత్తశాంతిని కోల్పోయెదరు. లోకమాన్యతిలకు గోఖలేల వంటి మహాపురుషులలో ఎవరు తప్పుచేసిరని నిర్ణయింపబూనుట నా అవివేకమును వ్యక్త పరచును. కాబట్టి వారియెడ నాకుగల భక్తి కించెమైనను కళంకితము గాకుండ ఈ దుష్టసంఘటనమునుండి ఇక విరమింతును.

లోకమాన్యతిలకు తీవ్రమైన జాతీయవాది. కాని ఆయన కాలపరిస్థితులను గమనించి ప్రవర్తించెను. "౩౦ సంవత్సరముల కొకసారి ఇండియాపరిస్థితులనుగూర్చి పార్లమెంటువారు విచారణచేసెట్టు మనము వారిని కోరవలసియున్నది. కాబట్టి ఒక రాయబారివర్గమును సీమకు పంపవలె" నని ౧౯౧౮ లో వచ్చినతీర్మానమును తిలకు మహాశయుడు నామోదించియుండెను. ఆసందర్భమున ఆయన "ఇండియాప్రభుత్వము వారు నిరంకుశులు. ఇంగ్లండులో మనకేసును విచారించి న్యాయము చెప్పగల న్యాయమూర్తులున్నారు. కాబట్టి సీమలో మన మాందోళనము చేయవలెను. ఇంగ్లండులో నొక శాశ్వతమైన రాజకీయసంస్థను నెలకొల్పి, అక్కడి విద్యావంతులకు మనసంగతు లెప్పటికప్పుడు తెలియజేస్తూండవలెను" అని మాట్లాడినాడు. పిమ్మట ౧౯౧౯ లో సర్ వాలంటైను షిరాల్ ఆయనను "రాజద్రోహి" అన్నందుకు సీమలో ఆయనపైన నొకకేసు పరువునష్టపుదావా తెచ్చినాడు. ఈ దావా సందర్భమున ఆయన సీమకు పోయినప్పుడు, అక్కడి కార్మికపక్షమువారు ఇండియాకు స్వాతంత్ర్య మిప్పించగల రనే నమ్మకముతో వారి పార్టీనిధికి రూ. ౩౦౦౦లను సమర్పించెను. ఇంతకు పూర్వపు రాజకీయవేత్తలు కన్సర్వేటివులకన్న లిబరల్ పక్షమువారియందు ఎక్కువ విశ్వాసము కలిగియుండిరి. తరువాత వచ్చిన జాతీయవాదులు లిబరల్ కన్సర్వేటివ్ పక్షములవా రిరువురను త్రోసివేసి కార్మికపక్షమువారినే విశ్వసింప మొదలుపెట్టిరి. షిరాలుపై దావా తిలకునకు వ్యతిరేకమైనది. ఈ దావాఫలితమువలననైనను ఇండియాలోని బ్రిటిష్ ప్రభుత్వస్వరూప మాయనకు గోచరమయియుండవలెను. కాని ౧౯౧౯ చట్ట మంగీకరింపబడినప్పుడే తిలక్ "అనుకూల సహకారవాది" (Responsive

ప్రాయ మొకసారి జ్ఞాపకము చేసుకొనవలసినదే. గాంధీకి తిలకు మహావిశాలోన్నతమైన హిమాలయపర్వతపంక్తివలె దరిజేర వీలులేనట్లు కనిపించెను; గోఖ్లేయో ఒక్కసారి మునిగి తేలుటకు వీలైన పవిత్రభాగీరథివలె కనిపించెను. తిలకుగోఖ్లే లిద్దరును మహారాష్ట్రులే. ఇరువురును చిత్పావనబ్రాహ్మణులే. ఇరువురును గొప్పమాతృదేశారాధకులే. ఇరువురును మహాత్యాగమును చేసినవారే. కాని వారి మనఃప్రవృత్తులు మాత్రము వేరువేరు. గోఖ్లే మితవాది, తిలక్ తీవ్రవాది. గోఖ్లే రాజ్యాంగచట్టము నభివృద్ధి చేయవలెనంటే, తిలక్ పునర్నిర్మాణమే చేయవలెనను. కాబట్టి గోఖ్లేకు ప్రభుత్వముతో కలసి పనిచేయుట యవసరము. తిలకుకు దానితో పోరాడుట యవసరము. గోఖ్లే అవకాశమున్నప్పుడు ప్రభుత్వమునకు సహాయపడుతూ అవసరమైనప్పుడు ప్రతిఘటించవలెనను. తిలకు నిరంతరము ప్రభుత్వము నాటంకపరచవలెనను. 'పరిపాలనాపద్ధతి-దాని అభివృద్ధి' గోఖ్లేకు ప్రధానవిషయము. 'జాతి-దానిపునర్వృద్ధి' తిలకుకు పరమలక్ష్యము. ప్రేమారాధనము గోఖ్లే ఆదర్శము. త్యాగారాధనము తిలక్ ఆదర్శము. గోఖ్లే విదేశీప్రభుత్వమును బాగుచేసుకోవలెనంటే, తిలక్ తొలగించవలెననును. గోఖ్లే పరసహాయముపైన ఆధారపడియుండెను. తిలక్ స్వయంసహాయముమీదనే ఆధారపడెను. గోఖ్లేదృష్టి చదువుకొన్నవాళ్ళపైన, ధనవంతులపైన. తిలకుదృష్టి లక్షలకొలదియున్న సాధారణజనముపైన. గోఖ్లేకు శాసనసభ కార్యరంగము. తిలకుకర్మక్షేత్రము గ్రామమండపము. గోఖ్లే తనమనోభావముల నింగ్లీషులో వెల్లడించియుండెను. తిలక్ మహారాష్ట్రభాషలో వెల్లడించెను. ఇంగ్లీషువారి పరీక్షలలో నుత్తీర్ణులై ప్రజలు "స్వయంపరిపాలనము"నకు అర్హులు కావలెనని గోఖ్లేసంకల్పము. భారతీయుల జన్మహక్కయిన "స్వరాజ్యము"ను విదేశీయులప్రసక్తిలేకుండ పొందవలెనని తిలక్ ఆశయము. గోఖ్లే కాలమునకు తగినట్లుండెను. తిలక్ భావికాలమునకు దారి చూపెను.

## సురేంద్రనాథ బెనర్జి

స్వర్గస్థులైన భారతరాజకీయ మహాపురుషులలో సురేంద్రనాథ్ బెనర్జీ ఒకడు. ఆయనఆత్మ ఆ యున్నతాకాశపథములనుండి భారతభావిభాగ్యోదయముకొరకు మెరుగుచూస్తూ ఉంటుంది. సురేంద్రనాథుడు ౪౦ యేండ్లకుపైగా కాంగ్రెసుతో సంబంధము కలిగియుండెను. ఆయన యుపన్యాసదుందుభులు భారత కాంగ్రెసువేదికనుండి నాగరక ప్రపంచపు కొట్టకొనవరకును మారుమ్రోగినవి. భాషాప్రభుత్వములో గాని, శబ్దమాధుర్యములో గాని, భావౌన్నత్యములో గాని, రసౌచిత్యములో గాని ఆ యుపన్యాసములకు సాటిలేదు. ఆయనరాజభక్తిపరాయణతయే ఆ యుపన్యాసముల సారాంశము. కాని ఆయన ఒక చిత్ర

కళగా తయారుచేసెను. ఆయన ౧౮౯౫, ౧౯౦౨ సంవత్సరములలో జరిగిన పూనా, అహమ్మదాబాదుకాంగ్రెసుల కధ్యక్షు డయ్యెను. కాంగ్రెసులోనికి యేటేటా వచ్చే వివిధవిషయములకు సంబంధించిన తీర్మానములలో ఆయనకు సమగ్రముగా తెలియని దేదీలేదని చెప్పవచ్చును. ౧౯ వ శతాబ్దాంతమువరకును సైనికసమస్య చర్చకు వచ్చి నప్పుడెల్ల ఇంగ్లీషువారు రష్యా దండెత్తివచ్చునని భయపెట్టేవారు. ౧౮ వ శతాబ్దములో ఫ్రాన్సుపేరు చెప్పుతూండేవారు. ఈ ౨౦ వ శతాబ్దములో జర్మనీపేరు చెప్పుతున్నారు. దీనికి జవాబుగా "రష్యావారిదాడిని నిరోధించే నిజమైనశక్తి భావి కాలములో మనము కట్టబోయే దీర్ఘోన్నతములైన పర్వతపంక్తులలో గాని, కొంచరమునకోనేటట్లుగా భారతసేనానాయకుని చేతులలోగాని లేదు. అది బ్రిటిష్‌ప్రభుత్వమునందు సానుభూతిగల రాజభక్తిపరాయణుల హృదయములలో దాగియున్నది" అని సురేంద్రనాథుడు చెప్పెను. ఈ వాక్యములను "ఇంగ్లండుదేశపు నిజమైన రక్షణలు-ఆర్థికరక్షణలుగాని, వాణిజ్యరక్షణలుగాని-భారతప్రజల సానుభూతియందు కలవు. మీరు కత్తి ఝుళిపించి మీ వస్తువుల నిండియాలో కొనిపించలేరు" అని నేటి మన ప్రజానాయకులు చెప్పే మాటలతో పోల్చిచూచుకొనవచ్చును. ఇండియారాజకీయము లింగ్లండుపార్లమెంటులో పార్టీసమస్యలుగా చేయబడరాదని కూడ సురేంద్రనాథుడు చెప్పియుండెను. ఇది నేటికిని ఆచరణయోగ్యముగాని యొక రాజకీయాదర్శముగనే యున్నది. "ఇంగ్లండు మారాజకీయగురువు-రాజకీయధర్మనిర్వహణమునందు మా కది నైతికాదర్శము." అన్నాడాయ నొకప్పుడు. "బ్రిటిష్‌సంబంధమునందు చలించనివిశ్వాసముతో పనిచేయుట ఆయనఆదర్శము. కనుకనే "ఇండియాలో బ్రిటిష్‌ప్రభుత్వమును తొలగించుట మాయుద్దేశము కాదు. దాని నాచార్యవంతముగాచేసి జాతీయానురాగమనే గట్టి పునాదిపైన నిలిపియుంచుటయే మాయుద్దేశము" అని ఆయన ప్రకటించెను. "కాలము పరిపక్వమయ్యేసరికి ఇంగ్లీషుపుట్టుక, ఇంగ్లీషు సంస్థలు, ఇంగ్లీషుస్వరూపమునుగల స్వతంత్రరాష్ట్రసమ్మేళనములో ఇండియా స్థానము సంపాదించుకోగల" దని ఆయన ఆశించియుండెను. దీనికిని మనసంస్థలలో స్వయంసంపూర్ణమైన నేటి పూర్ణస్వరాజ్యాదర్శమునకును ఎంతభేదము! ౧౯౦౪ లో కర్జను ప్రభువు మన పరిసరములనుబట్టి, మనపుట్టుకనుబట్టి, మనము పెరిగినవిధానమునుబట్టి బ్రిటిష్‌ప్రభుత్వముక్రింద ఉన్నతాధికారములు వహించుటకు మనము తగినవారము కామని చేసిన ప్రకటనమును ప్రతిఘటిస్తూ సురేంద్రనాథబెనర్జీ "ఎన్నడూ ఏరాజప్రతినిధీ భారతీయుల నింతగా అవమానపరచియుండలేదు. రాణీగారివాగ్దానములను భంగపరచుటయే చాలాచెడ్డపని. అందులో భారతజాతికి కళంక మాపాదించుటము గాయముపైన కారము చల్లినట్లయినది" అనెను. ఈ సందర్భములోనే రు. ౧౦౦౦౦లును, అంతకుపైనను

శీతము తెచ్చుకొనే యుద్యోగస్థులలో నూటికి ౧౮ మంది, రు. ౫౦౦ లు జీతము తెచ్చు కొనేవారిలో నూటికి ౧౬ మంది మాత్రమే భారతీయు లున్నారనీ, దేశము మనదై, సొమ్ము మనదై, దేశములోని ప్రజలు మనవారైనప్పు డిది శుద్ధ అన్యాయమనీ ఆయన సూచించెను. ౧౮౯౫ కాంగ్రెసులో ఇండియాలో బ్రిటిష్‌ప్రభుత్వము శాశ్వతముగా నుండవలెనని వాదించెను. మరొకసందర్భములో "ఇంగ్లీషు నాగరికత ప్రపంచకములో కెల్ల ఉత్తమ నాగరికత. అది ఇండియా ఇంగ్లండు దేశముల నిరంతర సంఘీభావమునకు చిహ్నము. అది ఇండియా ప్రజల కపూర్వ సౌభాగ్యమును, ఇంగ్లీషు పేరున కళలంక కీర్తిని చేకూర్చినది." అని ఆయన యుపన్యసించెను. ౧౯౦౨ నాటికే "మన మొక స్వాతంత్ర్యమహాసామ్రాజ్యములోని పౌరులము. ప్రపంచమంతటిలో అత్యుత్తమమైన యొక రాజ్యాంగసంరక్షణలో మన మున్నాము. ఇంగ్లీషువారి హక్కులు మనవి, వారి అధికారములు మనవి. వారి రాజ్యాంగము మనది. కాని మనము నాటికి పాలి చేయబడితిమి" అని ఆయన సగర్వముగా ప్రకటించెను. ఈనాడా సురేంద్రనాథుని ఆత్మ వాణిజ్యసంరక్షణలనుగూర్చి అర్థముచేసుకొని గలిగినట్లయితే, యేటువంటి కసితో పరస్పర వాణిజ్యపద్ధతి నేర్పాటుచేయబడినదో, ఇంకను మనహక్కులు, అధికారములు, రాజ్యాంగ పట్టములనుగూర్చి మాట్లాడెడి యెంత హాస్యాస్పదమైన విషయమో గ్రహించియుండెడి. సురేంద్రుని కిన్ని నమ్మకములు, ఇంతవిశ్వాసము ఉన్నప్పటికిని మింటో ప్రభువు వైస్రాయిగా నున్నకాలమున బారిసాలులో ఆయనకుకూడ లాఠీ దెబ్బలు తప్పలేదు. ఆయన తరువాత మంత్రికూడా ఆయెను.

## పండిత మదనమోహనమాలవ్యా

మనము న్యాయముగా కాంగ్రెసుమూలపురుషులలో నొకరుగా అభివర్ణించదగిన మరియొక మహాపురుషుడు పండిత మదనమోహనమాలవ్యా. ఈయన ౧౮౮౬ కలకత్తా కాంగ్రెస్‌లో మొట్టమొదటి యుపన్యాస మిచ్చినది మొదలు నేటివరకును నిరంతరోత్సాహముతోను, ఎడతెగని కార్యాసక్తితోను మనజాతీయసంస్థకు పరిచర్యచేస్తూనే యున్నారు. ఒకప్పు డొకచిన్న ప్రచారకుడుగాను, మరొకప్పు డొకనాయకుడుగాను, వేరొకప్పుడు తానే కాంగ్రెసుగాను, ఇంకొకప్పుడు కొంత వ్యతిరేకిగాను, కొంతకాలము నాన్ కోఆపరేషన్ శాసనోల్లంఘనములకు తీవ్రమైన ప్రతికక్షిగాను, మరికొన్నాళ్లు బ్రిటిష్‌కారాగారములలో సాత్త్వికనిరోధకుడుగాను, నిజమైన సత్యాగ్రహిగాను ఆ మహాసంస్థ నాయన సేవిస్తున్నాడు.

౧౯౧౮ యేప్రిల్ ౨౭, ౨౮, ౨౯ తేదీలలో వైస్రాయిగారిచే భారతనాయకుల సంగ్రామ మహాసభ యొకటాహ్వానింపబడెను. ఆ సభకు గవర్నరులు,

లెఫ్టినెంటు గవర్నరులు, ఛీఫ్‌కమిషనరులు, ఇంపీరియల్ కౌన్సిలులోని భారతీయ యురోపియ కార్యనిర్వాహక సభ్యులు, రాష్ట్రీయశాసనసభల కార్యవర్గసభ్యులు, సంస్థానాధిపతులు, తదితర భారతీయ, యూరోపియఉన్నతోద్యోగులు, మరికొందరు సుప్రసిద్ధ ప్రజానాయకులును హాజరయిరి. శాస్త్రి, మహమ్మదాబాదురాజా, సయ్యద్ హసన్ ఇమామ్, సర్దార్ బహదూర్ సుందరసింగ్ మజీథియా, గాంధీలు "ఇండియా యొక్క అవకాశములోనే సామ్రాజ్యముయొక్క అవసరమున్నది" అని చక్రవర్తిగారు పంపిన సందేశమును పురస్కరించుకొని, బరోడాగైక్వారు ప్రతిపాదించిన రాజభక్తి తీర్మానమును బలపరుస్తూ ఉపన్యసించిరి. తరువాత పండిత మాలవ్యా లేచి వైస్రాయి గారితో "ఇటీవలి భారతదేశచరిత్రమునుండి మీ రొకపాఠము నేర్చుకొనవలసియున్నది. ఔరంగజేబుకాలములో సిక్కు గురువు లాయనఅధికారమును ప్రతిఘటించిరి. గురుగోవిందసింగు గురుశిష్యుల పరస్పర భేదభావమును పూర్తిగా నిర్మూలించుట మూలమున సామాన్యప్రజాహృదయముల నాయన ఆకర్షించి వారిని పోరాటమునకు పురికొల్పగలిగెను. నేను మేము సమకూర్పబోయే సైనికులను, వారితో కలసి పోరాడు తదితరసైనికులవలె సమానప్రతిపత్తితో చూడవలెనని మిమ్ములను కోరుచున్నాము. ఈ సందర్భములో గురుగోవిందసింగును మీ రుదాహరణముగా తీసికొందురుగాక." అని చెప్పెను.

అసహాయోద్యమ ప్రారంభదినములలో ఆయుద్యమమున కాయన దూరముగా నుండెను. కాని కాంగ్రెసునుండిమాత్ర మెప్పుడును దూరముగాలేడు. మితవాదులు వారి అధికారము సాగినంతకాలము దానిలోనుండి తరువాత దానిని త్యజించిరి. బెసెంటు కాంగ్రెసును స్వాధీనపరచుకొని తరువాత వదలుకొనినది. సుఖదుఃఖములలోను, కీర్త్యపకీర్తులలోను దాని నంటిపట్టుకొనియున్నాడు మాలవ్యామహాశయుడు.

తాను సత్యమని నమ్మినవిషయములో నసహాయశూరునివలె పోరాడగలిగినవాడొక్క మాలవ్యాజీయే. కాంగ్రెసువేదికపై ఆయనను అత్యంతాదరముతో చూచిన రోజు లున్నవి; నిర్లక్ష్యముగా చూచినరోజు లున్నవి. కేవలము అశ్రద్ధవలనగాని, లేక ప్రజలలో తనగౌరవము తగ్గిపోతుందేమోననే భయమువలనగాని ఆయన యెన్నడును తాత్కాలికోద్రేకములకు లొంగిపోలేదు. ౧౯౨౯ లో భారతశాసనసభనుండి కాంగ్రెసుసభ్యు లందరును రాజీనామా యిచ్చినప్పటికిని ఆయన అక్కడి కాంగ్రెసు పక్షసభ్యుడు కాకపోవుటచే రాజీనామా యియ్యలేదు. కాని నాలుగునెలలలోనే ౧౯౩౦లో సందర్భావసరములనుబట్టి తక్షణము రాజీనామా యిచ్చెను. ౧౯౨౧లో ఆయన అసహాయోద్యమమును ప్రతిఘటించెను. ౧౯౩౦లో సంపూర్ణమైన సాత్విక

నిరోధకుడుగా తయారయ్యెను. మొత్తముమీద ఆయనస్థితి అసమానము. హిందూ సంఘములో ఆయన యుదారాభిప్రాయములు కలవాడు. కాబట్టి సంఘమును నడిపింపగలడు. కాంగ్రెసులో ఆయన పూర్వాచారపరాయణుడు. కాబట్టి అనేకసారులు దానిని వెనుకకు లాగ ప్రయత్నించును. అయినప్పటికీ కాంగ్రెసాయన సలహాసంప్రతింపుల నమూల్యముగా భావించును. గాంధీగారివిషయములోవలెనే ఈయన విషయములో కూడ కొంతకాల మీయన సామ్రాజ్యమునకు పరమమిత్రుడుగా నుండి తరువాత దాని నిరంకుశత్వమును నిరోధించుటకు తనయావచ్ఛక్తిని వినియోగించవలసినవాడయ్యెనని చెప్పవచ్చును. ఆయనసుభాషితము లసంఖ్యాకములు. జరిగిన ముప్పైసంవత్సరముల కాంగ్రెసుచరిత్రలోను అవి పర్యాప్తమై యున్నవి. ఆయన యుపన్యాసవేదిక యెక్కినయెడల గంటకు పైన రెండు గంటలకు తక్కువ కాలములోగాని ముగించడు. కాశీవిశ్వవిద్యాలయ మాయనసృష్టి. ఆయనే ఒక సంస్థ. ఆయన భారతమాతసంగ్రహస్వరూపము. ఆమెజయాపజయము, లామెఆశానిరాశ, లామె సుఖదుఃఖము లన్నీ మాలవ్యాజీవే. ఆయన ౧౯౦౯ లో లాహోరునగరమున జరిగిన ౨౪ వ కాంగ్రెసుకు మొట్టమొదటిసారి అధ్యక్షు డయ్యెను. ఆ కాంగ్రెసుకు నిజముగా సర్ ఫిరోజిషా మెహతా అధ్యక్షుడు కావలసియుండెను. కాని ఎందువల్లనో, కాంగ్రెసు జరుగవలసిన తేదీ కారురోజులు ముందుగా, మెహతా, తా నధ్యక్షత వహింపజాలనని చెప్పినందున ఆకస్మికముగా మాలవ్యాజీ అందుకు నియోగింపబడెను. తరువాత ౧౦ సంవత్సరములకు ౧౯౧౮ సంవత్సరములో ఢిల్లీనగరమున జరిగిన 33 వ కాంగ్రెసు కధ్యక్షుడుగా మాలవ్యాజీ తిరిగి యెన్నుకొనబడెను.

## లా లా ల జ ప తి రా య లు

పూర్వవంశానుక్రమణికకు సంబంధించిన కాంగ్రెసుమహాపురుషులలో లాలాలజపతిరాయ లొకరు. ఆయన దాత, సంఘసంస్కర్త, కాంగ్రెస్ వాది. ఆయన ౧౮౮౮ లో అలహాబాదులో జరిగిన నాలుగవ కాంగ్రెసుకు హాజరై, శాసనసభల విస్తీర్ణతనుకూర్చిన ఆనాటి ప్రధానతీర్మానము నామోదిస్తూ, కాంగ్రెసుకు ప్రతికక్షియయిన సయ్యద్ మహమ్మదు "హిందూదేశ విప్లవకారణములు" (Causes of the Indian Revolt) అనే గ్రంథమున ౧౮౫౮ లో వ్రాసిన విషయముల నీక్రింది విధముగా నుదాహరించెను:

"ప్రజలు శాసనసభలలో మాట్లాడే అధికార ముండవలయును. అందువలన వా రాకస్మికముగా తిరుగుబాటుచేసి, మమ్ములను నాశనముచేసేముందు మే మా అపాయమును గుర్తించడమునకు వీలు కలుగును. అప్పుడు ప్రభుత్వము సుస్థిర మగును".

# భారతజాతీయమహాసభ అధ్యక్షులు (1885-1894)



డబ్ల్యు. సి. బెనర్జీ

బొంబాయి : 1885—అలహాబాదు : 1892



దాదాభాయి నౌరోజీ

కలకత్తా : 1886, 1906—లాహోరు : 189



బద్రుద్దీన్ తయ్యాబ్జీ

మద్రాసు : 1887



జార్జి యూల్

అలహాబాదు : 1888



సర్ విలియం వెడ్డర్‌బరన్

బొంబాయి : 1889—అలహాబాదు : 1910



సర్ పి. మెహతా

కలకతా : 1890



పి. ఆనందాచార్యులు

నాగపూరు : 1891



ఆల్‌ఫ్రెడ్ వెబ్

మద్రాసు : 1894

తీర్మాన మంగీకరింపబడినది. ఆనాడు నియమింపబడిన కమిటీవారి సిఫారసుల ఫలితము గానే అప్పటినుండీ పారిశ్రామిక ప్రదర్శనము లేర్పాటుచేయబడుతూన్నవి.

## సర్ ఫిరోజిషా మెహతా

కాంగ్రెసు పుట్టినప్పటినుండియు దానితో సంబంధమును కలిగి దానిసిద్ధాంత మును, కార్యక్రమమును నిర్ణయించిన ప్రముఖులలో నొకరు సర్ ఫిరోజిషా మెహతా. కలకత్తాలో ౧౮౯౦ లో జరిగిన ఆరవకాంగ్రెసుకు ఫిరోజిషా మెహతా అధ్యక్షు డయ్యెను. ఆయన తన యుపన్యాసములో "ప్రాచ్యవిజ్ఞానమునకుగాని, ప్రాచ్యసంప్ర దాయములకుగాని ప్రాతినిధ్యప్రభుత్వము సరిపడదు." అని సాలిస్‌బరీప్రభువు చెప్పిన మాటలను విమర్శించెను; "మున్సిపాలిటీలు ప్రాచ్యదేశములో పుట్టినవి. స్థానికస్వపరి పాలనమనే మాటలోని సంపూర్ణార్థమును ప్రాగ్దిశ పుట్టిననాటినుండీ ప్రాచ్యదేశీయు లెరుగుదురు." అని చిషోలమ్ ఆన్‌స్టీ చెప్పిన మాటల నాయన ఉదాహరించెను. "కాం గ్రెసు నిజముగా సామాన్య ప్రజాహ్వానము కాదు. కాబట్టి విద్యావంతులైన వారి మిత్రు లందరును వారి కష్టములను ప్రకటించి, వాటి నివారణోపాయములను సూచించ వలెను. ఇదే అభివృద్ధిహేతువని అన్నికాలములలోను, అన్నిదేశములలోను, ముఖ్య ముగా ఇంగ్లండుదేశములోకూడ ఋజువైనది. ఆధర్మమును మనము ఉద్రేకపూరిత సమయములలోగాక ప్రశాంతసమయములలోనే ఎక్కువబాగుగా నిర్వర్తించగలము. ఇంగ్లీషువారికి సకాలములో మంచిరాజకీయచతురత చూపవలెనని నెమ్మదిగా నచ్చచెప్పడమే మనము వారినుండి పొందిన విద్యాప్రదానమునకు వారికి చూపదగిన కృతజ్ఞత. ఇదే కాంగ్రెసుకు కీర్తిప్రదమని గట్టిగా చెప్పగలను. ఇంగ్లీషురాజకీయ ధురంధరు లవసరమునకు తగినట్లు ప్రవర్తించెదరు. ఇంగ్లీషువిజ్ఞానములోను, ఇంగ్లీషు విద్యావిధానములోను నాకున్న విశ్వాస మనంతము.

"ఇంగ్లీషు జీవితములోని నైతిక, సాంఘిక, విజ్ఞాన, రాజకీయశక్తు లన్నీ, ఇంగ్లండుభారతదేశముల సంబంధము తమయుభయుల శ్రేయస్సునకేగాక లోక కల్యాణమున కుపయోగపడవలెనని వాంఛిస్తూన్నవి......ఈ నాప్రార్థనమును వ్యర్థము కానీయవలదని నిజమైన ఇంగ్లీషువా రందరికిని విన్నవించుకొంటున్నాను."

౧౮౮౬ కాంగ్రెసులో పబ్లికుసర్వీస్ కమిషనునుగూర్చి, వారిసిఫారసులనుబట్టి ప్రభుత్వమువారు జారీచేసిన ఉత్తరువులనుగూర్చి పార్లమెంటువారి కొక మహజరు అర్జీని తయారుచేయుట కేర్పడిన కమిటీలో ఈయన సభ్యుడుగా నుండెను. ౧౮౯౮ లో మద్రాసుకాంగ్రెసువారు కొన్ని కాంగ్రెసు తీర్మానముల నప్పుడు వైస్రాయి గానున్న ఎల్జిన్ప్రభువుకు పంపుట కేర్పాటుచేసిన రాయబారవర్గములోకూడ ఈయన

సభ్యుడుగా నుండెను. ౧౯౦౦ లో జరిగిన లాహోరుకాంగ్రెసులోకూడ ఈయన కిటువంటిగౌరవము మరొకసారి కలిగినది. ౧౯౧౧ లో కలకత్తాలో జరిగిన ౨౭ వ కాంగ్రెసులో ఈయన భారతకాంగ్రెస్ సంఘములో సభ్యుడుగా నియోజింపబడెను. ఫిరోజిషామెహతా కాంగ్రెసు కొక నిజమైనబలము. చాలాసంవత్సరములవరకును పైన చెప్పబడినరీతిని ఆయన రాయబారవర్గములలోను, కమిటీలలోను సభ్యుడుగా పని చేసెను. ౧౯౦౭ సూరతు కాంగ్రెసులో ఆయన మితవాదపక్షమున గట్టిగా పని చేసెను. తరువాత ఆయన వాదావు బయటికి రాలేదు. ౧౯౦౯ లో లాహోరులో జరిగిన ౨౫ వ కాంగ్రెసు కాయన అధ్యక్షుడుగా ఎన్నుకొనబడెను. కాని ఆకస్మికముగా కాంగ్రెసుతేదీ కారుణోజులకుముందు వాయన రాజీనామా యిచ్చెను. అప్పుడు మదనమోహనమాలవ్యా ఆయనస్థానే కాంగ్రెసుఅధ్యక్షుడుగా నెన్నుకొనబడెను.

## ఆనందమోహన్‌బోస్

ఆనందమోహన్‌బోస్ బ్రహ్మసమాజమతములో నొక ప్రత్యేకశక్తును లేవదీసి దానికి నాయకత్వమును వహించినసంగతి నిదివరకే నేనొకచో వివరించియుంటిమి. సంఘసంస్కరణోద్యమములోనే పాతపద్ధతులను సహించలేక తిరుగుబాటు చేసిన ఆయనతత్వము రాజకీయములలో అనుచితము ప్రజల సామాన్యహక్కులకు భంగము కలుగుచూండగా సహించి యూరుకొనుట మసంభవము. అందువలననే ఆనందబోసు "తూర్పుబంగాళదేశపు నక్షత్ర" మని అభివర్ణింపబడెను. ఆయన ౧౮౭౬ లో కలకత్తాలో స్థాపింపబడిన ఇండియన్ అసోసియేషన్ (భారతీయ సంఘము) కు మొదటికార్యదర్శిగా పనిచేసెను. సురేంద్రనాథబెనర్జీ కీయన ముఖ్యసహాయకుడు. ౧౮౮౬ లో జరిగిన ౨ వ కాంగ్రెసువరకును ఆయనకు కాంగ్రెసులో సన్నిహిత సంబంధ మున్నట్లు మనకు తెలియదు. కాని ఆకాంగ్రెసులో విద్యాశాఖకు సంబంధించిన యుద్యోగములను పునర్నిర్మాణము చేయవలెననే ప్రభుత్వనిదానమును ప్రతిఘటించెను. అందువలన ఆశాఖలోకూడ భారతీయు లున్నతోద్యోగములనుండి అరికట్టబడుదురని ఆయన వాదించెను. "ప్రభుత్వమునాకి యుద్దేశ మిండిసూను ముందుకు సాగనియ్యకపోవడమే కాదు; వెనుకకు త్రోయడముకూడాను" అని ఆయన క్రోధమును వెల్లడించెను. పట్టికపసర్వీసులను గూర్చిన తీర్మానముల విమర్శనములో బోసుగారి ఈపైవాక్యములు వివరముగా ఋజువుచేయబడినవి. తరువాత ౧౮౯౮ లో మద్రాసులో జరిగిన ౧౪ వ కాంగ్రెసు కానందమోహనబోస అధ్యక్షుడయ్యెను. ఈసందర్భమున ఆయన చూపిన వక్తృత్వ మద్భుతము. ఆయన ప్రకటించిన వాదనాశక్తి అమోఘము. ఆయన తన అంత్యోపన్యాసములో భారతజాతిని ప్రేమించి, సేవించవలసిన

దని కాంగ్రెసుకు దివ్యసందేశ మిచ్చెను. ఆయన పార్లమెంటు కిండియానుండి ప్రత్యక్షప్రాతినిధ్య ముండవలయు నని సూచించెను. ఆయనసేవ దేశమున కెక్కువ అవసరమైనప్పుడు ౧౯౦౬ లోనే ఆయన మరణించడము మన దురదృష్టము.

## మన్‌మోహన్‌ఘోష్

౧౮౮౮ లో అలహాబాదులో జరిగిన నాలుగవ కాంగ్రెసులో ప్రభుత్వోద్యోగములను (Public Services) గూర్చి మన్‌మోహన్‌ఘోష్ తీర్మానమును ప్రతిపాదించెను. ఆయనపేరు కాంగ్రెసులో వినపడుట కదే మొదటిసారి. ౧౮౯౦ లో కలకత్తాలో జరిగిన ఆరవకాంగ్రెసు కాయన అధ్యక్షుడు. అదివరకు కాంగ్రెసుకు వ్యతిరేకముగా చేయబడిన విమర్శనము లన్నిటికీ ఆయన ప్రత్యుత్తరములు చెప్పి కాంగ్రెసు సత్యస్వరూపమును వివరించెను. న్యాయశాఖ, కార్యనిర్వాహకశాఖలనుగూర్చి ఘోష్ ప్రత్యేకముగా చదివి అనేకవిషయములను తెలుసుకొనెను. ౧౮౯౫ లో పూనాలో జరిగిన ౧౧ వ కాంగ్రెసులో ఈ రెండుశాఖలును వేరుచేయబడవలెనని తీర్మానమును ప్రతిపాదించి "ఈ రెండుశాఖల కలయికపైననే ఇండియాలో బ్రిటిష్‌ప్రభుత్వము నిలిచియున్నది" అని జేమ్సు అనే ఒకకమిషనరు చెప్పినమాట నుదాహరించెను. ౧౮౯౬ కలకత్తా కాంగ్రెసులో ఈయనమరణమునకు విచారము తెలుపబడినది.

## లాల్‌మోహన్‌ఘోష్

౧౮౯౦ లో కలకత్తాలో ౬వ కాంగ్రెసు జరిగినప్పుడు లాల్‌మోహన్‌ఘోష్ మొట్టమొదటిసారి కాంగ్రెసువేదికపైన కనుపించి బ్రాడ్లాగారి ఇండియాగవర్నమెంటు బిల్లునుగూర్చి తీర్మానమును ప్రతిపాదించెను. ఈయన ౧౯౦౩ లో మద్రాసులో జరిగిన ౧౯-వ కాంగ్రెసు కధ్యక్షుడయ్యెను. ఈయనఅధ్యక్షోపన్యాసము కాంగ్రెసువేదికలనుండి ఇంతవరకును మనము విన్న గొప్ప ఉపన్యాసములలో నొకటి. ఈయన ఈయున్నతపదవి కాహ్వానింపబడుటకుముందు కొన్ని సంవత్సరములు రాజకీయములలో విశేషముగా జోక్యము కలిపించుకొనక దూరముగా తొలగియుండెను. ఆయనయుపన్యాసములో కొన్ని భాగముల నీక్రింద నుదాహరింతుము. "ఇక మన దేశమునుగూర్చి యాలోచింతము. ఇక్కడ మనలో రాజభక్తి లేనివా రొక్కరును లేక పోయినప్పటికీ, బ్రిటిష్‌ప్రజలుగా ప్రభుత్వమువారి పనులను విమర్శించుటకు మన కందరికిని హక్కున్నది. నేను ప్రభుత్వమువారని చెప్పినప్పుడు బ్రిటిష్‌రాజకీయకక్షు లన్నిటికినీ సమముగానే వర్తించును. అంతేకాని వారిలో నే నేమీ భేదమును గమనించుట లేదు. వారి రాజకీయతంత్రమునుగూర్చి కొంచెము చెప్పవలసియున్నది. అనేక సంవత్సరముల క్రిందటనే మన దేశీయపరిశ్రమలు నాశనముచేయబడినవి. నిన్నగాక

మొన్న లిబరల్ ప్రభుత్వముక్రింద, మనపత్రికలపైన లజ్జావిహీనముగా పన్నులు విధింపబడినవి. సంవత్సరమునకు షుమారు ౩౦ కోట్ల రూపాయీల జాతీయ ద్రవ్యము మనదేశమునుండి విదేశములకు ప్రవహిస్తున్నది. మన వ్యవసాయకులపైన వేయబడిన పన్నులభారమువలన మన మింతకుపూర్వ మెన్నడును ఎరుగనంతటి పెద్ద కరవులు తరచు వస్తున్నవి. వీటన్నిటికిని కారణభూతమైన బ్రిటిషు రాజకీయతంత్రము దయామయుడైన ఈశ్వరసంకల్ప ప్రతిబింబమని నమ్మవలసినదేనా?

“మనది స్వపరిపాలన కాదు. ఇంగ్లీషువారివలె మనవోట్లతో మన యొక్క ప్రభుత్వమును లాగివేసి మరియొక ప్రభుత్వమును స్థాపించలేము. మనము కేవలము బ్రిటిష్ పార్లమెంటువారి న్యాయబుద్ధిపైన ఆధారపడవలసియున్నది. భారతీయ సాంఘికోద్యోగులు కాలము గడచినకొలదీ ప్రజాభిప్రాయములను మన్నించుటకు బదులు మరింత కరకుమీరి తృణీకరింతురనేమాట కేవలము సత్యము. దేశములో మహామారీ క్షామదేవతలు కాపురముపెట్టుకొని యుండగా, మృత్యుదేవత రెక్కలచప్పుళ్లవలె మారమున వినబడుతూండగా, ఢిల్లీ దర్బారువంటి వ్యర్థమహోత్సవముకొరకు లక్షల కొలదీ ప్రజలద్రవ్యమును ఇంగ్లండు, ఫ్రాన్సు, యునైటెడ్ స్టేట్సులలోని యే ప్రభుత్వ మయినను దుబారాఖర్చు చేయుటకు ధైర్యము చేసియుండేనా?

“మహాశయులారా! పత్రికలలోను, బహిరంగసభలలోను చేయబడిన నేరముల ప్రతిఘటనములు తృణీకరింపబడి ఢిల్లీపట్టాభిషేకమహోత్సవము జరిగి యిప్పటి కేడాది గడచినది. నా యేకారణముతో ఈదర్బారును ప్రతిఘటించినాను? రాజభక్తి లేకనా? కాదు. ఎవరి పట్టాభిషేకసందర్భమున ఈ మహోత్సవము జరుపబడుతూన్నదో ఆ చక్రవర్తిగారికి వారి మంత్రివర్గము భారతదేశములో వ్యాపించియున్న క్షామపరిస్థితు లనుగూర్చి యున్న దున్నట్లు మనవిచేసియుండినయెడల వారే ప్రజలద్రవ్యము నిట్టి వ్యర్థాడంబరముకొరకు వెచ్చించనిచ్చియుండేవారు కారనీ, తక్షణ మిండియాలోని తమ ప్రతినిధి కావిషయము తెలియపరచియుండేవారనీ భావిస్తూ, మంత్రివర్గమువారు తమధర్మమును సరిగా నిర్వర్తించనందుకు ప్రతిఘటించినాను. ఇంత జరిగిన తరువాత కూడ లక్షలకొలది ప్రజలద్రవ్యము గవ్వలు గచ్చకాయలుగా ఖర్చు పెట్టబడిన దీపెద్ద తమాషాకొరకు. అవును! ఎంత ఉన్నతపదవులలోనున్నవారైనప్పటికీ వారితరులసొమ్ము ఖర్చుపెట్టవలసివచ్చినప్పుడును, ఇక నెవరికీ వారు లెక్కచెప్పవలసిన అవసరము లేనప్పుడును ఇంతకంటె మరొకవిధముగా జరుగదు.

"ఈదర్బారు కెంతఖర్చయిన దనేవిషయమును తెలుసుకోవడముకూడా సామాన్యులకు కష్టము. ఈద్రవ్య మనేక ఖాతాలక్రింద, మన మూహించుటకువీలులేని ఖాతాల క్రింద ఖర్చుపడినట్లు చూపబడవచ్చును. ఇది యొక గారడీ. ఈ గారడీ మనకు తెలియనిది కాదు. మీ రావ్యయమును కొన్నిలక్షలు తక్కువగానో, ఎక్కువగానో అంచనావేసికొన్నప్పటికీ అందులో సగముమొత్తము వెచ్చించబడినయెడల, ఆకలితో మరణించిన అనేకలక్షలమంది పురుషులు, స్త్రీలు, బిడ్డలు సంరక్షింపబడియుండే వాళ్లనేమాటమాత్రము నిజము."

## సి. విజయరాఘవాచార్యులు

సి. విజయరాఘవాచార్యులవారు కాంగ్రెసుఆదిపురుషులలో నొకరు. కాంగ్రెసు నిబంధనావళి వ్రాయుటకు ౧౮౯౮ మద్రాసు కాంగ్రెసులో (౩ వ కాంగ్రెసు) నియమింపబడిన యుపసంఘములో నీయన సభ్యుడు. ౧౮౯౯ లో లక్నోలో జరిగిన ౧౫ వ కాంగ్రెసులోను, మరుసంవత్సరము లాహోరులో జరిగిన ౧౬ వ కాంగ్రెసులోను ఈయన భారతకాంగ్రెస్ స్థాయిసంఘసభ్యుడుగా నియమింపబడెను. ఈయన ౧౯౦౦ లాహోరు కాంగ్రెసులో గొ. యన్. జి. చందావర్కార్ అధ్యక్షుడుగా నుండవలెననే తీర్మానమును బలపరచెను. ౧౯౦౧, ౧౯౦౨ సంవత్సరములలో మద్రాసు సర్కిల్ వారు "ఇండియా" ప్రతుల కీయవలసిన సొమ్మును వసూలు చేయుట కీయన మరియిరువురతో కలసి బాధ్యత వహించెను. ౧౯౦౫ లో కాశీ కాంగ్రెసులో, కాంగ్రెసుతీర్మానములను ప్రభుత్వమువారికి విజ్ఞాపించేనిమిత్తి మింగ్లండుకు గోఖ్లేగారిని పంప నుద్దేశించిన తీర్మానమును బలపరుస్తూ ఈయన చక్కనియుపన్యాస మిచ్చెను. కలకత్తాలో ౧౯౦౬ లో జరిగిన ౨౨ వ కాంగ్రెసులో పర్మనెంటు సెటిల్‌మెంటు తీర్మానమును ప్రతిపాదిస్తూ ఈయన భూమిపన్ను అద్దె అనే అభిప్రాయమును ప్రతిఘటించెను. "ఇండియాలోని భూమి యెప్పుడును రాజుగారిది కాదు. ప్రపంచకములో పుట్టినవాండ్లదే ప్రపంచకమని ఋషులసూక్తి. కృషిచేసిన వాండ్లది భూమి. రాజు సంరక్షకుడు. రాజు తాను ప్రజలకు చేసిన యుపకారమునకు ప్రతిఫలముగా పంటలో కొంతభాగము పుచ్చుకొనేవాడు. భూమి రాజుదనేభావము కేవలము పాశ్చాత్యభావము. కాని భారతీయభావముకాదు" అని ఆయనఅభిప్రాయము.

సూరతుతగాదా తరువాత ఈయన దాదాపు కాంగ్రెసుకు దూరముగానే తొలగియుండెను. మితవాదికాంగ్రెసు ఈయనన్యాయబుద్ధి కనుగుణముగా లేదు. ౧౯౧౬ లోని లక్నో మార్పులప్రకారము జాతీయవాదులు కాంగ్రెసులో చేర్చుకొనబడిన తరువాత ౧౯౧౮ లోని బొంబాయి స్పెషల్ కాంగ్రెసులోను, ౧౯౧౯ లోని

అమృతసరము కాంగ్రెసులోను ఈయన కనిపించెను. అమృతసరములో నీయన ప్రజల ప్రధానహక్కులనుగూర్చి యెక్కువగా మాట్లాడెను. తరువాత ఈయన నాగపురము కాంగ్రెసు కధ్యక్షుడై సమర్థతగాను, చాకచక్యముగాను తనధర్మములను నిర్వర్తించెను.

## పండిత అయోధ్యానాధుడు

మా కింకను అనేకమంది కాంగ్రెసుపెద్దలపేర్లు స్మరణకు వచ్చుచున్నవి. పండిత అయోధ్యానాధుడు కాంగ్రెసుపుట్టిన క్రొత్తలో చాలా పూజనీయుడుగా పరిగణింపబడుచూ ఉండెను. జార్జి యూలే అధ్యక్షుడయిన ౧౮౮౮ లో అలహాబాదులో జరిగిన నాలుగవ కాంగ్రెసుకు ఈయన ఆహ్వానసంఘాధ్యక్షుడు. అప్పటినుండియే ఈయనకు కాంగ్రెసుతో సంబంధము. ౧౮౯౨ లో ౮ వ కాంగ్రెసు తిరిగీ ఆ అలహాబాదులోనే సమావేశమయి, ఈ యిరువురు కాంగ్రెసువాదుల మరణములకును దుఃఖిస్తూ తీర్మానము చేయవలసిన దురదృష్టము పట్టినది. అయోధ్యానాథపండితున కొకస్మారక చిహ్నమును నెలకొల్పవలెననే ప్రయత్నములు జరుగుతూండగా హ్యూము యొక చిన్న సలహా నిచ్చెను. దాని నిక్కడ నుదాహరింతుము. "స్మారకచిహ్నములకోసము గాని, ఇతర అల్పవిషయములకోసముగాని మీధనమును వ్యర్థముచేయవలదు. మీ దగ్గరగల ప్రతి పైసా అసలుఉద్యమముకోసమే ఈయండి" అని హ్యూముసలహా. నేడయోధ్యానాధుని ఉత్తమస్మారకచిహ్నముగానీ, ఆయన భారతజాతికి సమర్పించిన కానుకగానీ ఆయనకుమారుడు పండితహృదయనాథకుంజ్రూయే.

## రాజా రామ్‌పాల్‌సింగ్

సుప్రసిద్ధులయిన కాంగ్రెసువాదులలో రాజా రామ్‌పాల్‌సింగొకరు. [illegible] వ కాంగ్రెసులో రాజా రామ్‌పాల్‌సింగు స్వచ్ఛందసైనికదళమును సమకూర్చుటనుగూర్చి యొక తీర్మానమును ప్రతిపాదిస్తూ, ముందు రాబోయే ఆపత్తును భారతదేశమున కీక్రింది విధముగా సూచించియుండెను:

"బ్రిటిషుసామ్రాజ్యము శాంతిసంరక్షణకోస మెంత కంకణము కట్టుకొన్నప్పటికీ, గ్రేట్‌బ్రిటను ఎన్ని ఉదారాశయములతో ప్రవర్తించినప్పటికీ, ఇంగ్లీషువారు మన కెంత ఉపకారము చేసినప్పటికినీ భారతదేశపు మనోభావము ఇంగ్లండుకు వ్యతిరేకముగానే యుండును. ఇంగ్లండుతో కలిగిన బాంధవ్యమున కిండియా యెప్పటికైనను దుఃఖించునేకాని సంతోషించదు. ఈమాటలు కఠినముగా నుండవచ్చును. కాని ఇది సంపూర్ణసత్యము. జాతీయాత్మను, స్వసంరక్షణాశక్తిని పోగొట్టుకొనిన దేశమునకు ఇంగ్లండేమిపరిహారము చేయగలదు? మీచుట్టును ఎక్కడ చూచినను సైన్యములకును

ఆయుధాగారములకును మేరలేదు. నాగరిక ప్రపంచకమున కంతకును కొద్దికాలము లోనే ఆపత్తు రానున్నది. తొందరగానో, ఆలస్యముగానో ఒక భయంకర యుద్ధము రానున్నది. అది అంతమగులోపల ఇంగ్లండు దానిలో చిక్కుకొనకతప్పదు. ఖండాంతర ప్రభుత్వములవారు యుద్ధభూమికి పంపగలిగిన సైన్యములలో వేయింటొక వంతు మంది వంతునైనను ఇంగ్లండు పంపజాలదు. ఇంగ్లండుధన మప్పుడెందు కుపయోగించును? ధైర్యసాహసోపేతులగు లక్షలకొలది భారతీయులకు సైనికశిక్షణ మిచ్చి శత్రువును పారద్రోలుటకు బదులుగా ఇంగ్లండు తన చిన్న చిన్న పటాలములను పెట్టుకొని నిస్సహాయురాలై పశ్చాత్తాపపడునా?"

అని యుపన్యసించినపిదప అడవి మృగములు పంటలను పాడుచేయుచున్న విధమునుకూడ చెప్పెను. రాజారామ్‌పాల్ సింగు మనుమడు కాలాకంకాద్. ఈయన ఆ కాలమరణమును పొందుటకుముం దాయనకూడ తాతగారి అపరావతార మనువట్లు దేశమాతకు సేవ యొనర్చెను.

## కాళీచరణబెనర్జి

కాంగ్రెస్ పనిచేయుటను ప్రారంభించిన మొదటి ౨౫ సంవత్సరములలోను, ఒక సంవత్సరముకంటె యెక్కువసంవత్సరములలో నున్న తీర్మానముల నన్నిటినీ కలిపి, ఒక సమగ్రతీర్మానముగా అంగీకరించే ఆచార ముండేది. ఇటువంటి తీర్మానములలో సూచింపబడిన సర్వవిషయములను సమగ్రముగా చర్చించగల సర్వతోముఖ పాండిత్యము గలవారుమాత్రమే ప్రతిసంవత్సరమును ఈతీర్మాన ప్రతిపాదకులుగా నియోగింపబడేవారు. ౧౮౮౯లో ఈపని కాళీచరణబెనర్జీవంతుకు వచ్చినది. కాళీచరణ బెనర్జి భారతీయ క్రైస్తవుడు. ఈయన సంవత్సరములకొలది కాంగ్రెసు వ్యవహారములలో శ్రద్ధగా పనిచేసెను. ౧౮౯౦ లో బ్రిటిష్ ప్రజలకు కాంగ్రెస్ అభిప్రాయములను తెలిపే నిమిత్తము ఇంగ్లండుకు పంపబడిన భారతీయరాయబారవర్గములో నీయన సభ్యుడు. ౧౮౯౩ లో లాహోరు కాంగ్రెసులో (౯ వ కాంగ్రెసు) న్యాయశాఖ, కార్యనిర్వాహకశాఖలు ప్రత్యేకింపబడవలెనని ఈయన తీర్మానమును ప్రతిపాదించి తన వాదమునకు బలముగా ఆరోజులలోనే జరిగిన ఒకకేసునుగూర్చి వివరించెను. "ఆకేసులో ఒక మేజస్ట్రేటు తానే ఫిర్యాదిగను, తానే జడ్జిగను ఉండి న్యాయనిబంధనలను గమనించక విచారణజరిపి నలుగుర కురిశిక్ష, ముగ్గురకు యావజ్జీవ ద్వీపాంతరవాస శిక్ష విధించె" నని ఆయన చెప్పెను. ౧౮౯౫ లో పూనాలో జరిగిన ౧౧ వ కాంగ్రెస్‌లో ఈయన ఏకకాలమున ఐ. సి. యస్. పరీక్షలు జరుపబడవలెననీ, విశ్వవిద్యాలయము లభివృద్ధిచేయబడవలెననీ మాట్లాడెను. గవర్నమెంటువా రందుకు తొందరలేదని చెప్పుట విని, వారికి తొందర కలుగచేయవలసినదని ఆయన కాంగ్రెసును ప్రార్థించెను.

కాలము గడచినకొలదీ ప్రజలలో రాజకీయ చైతన్య మెక్కువైనకొలదీ వారి స్వాతంత్ర్యము లరికట్టబడుతూవచ్చినవి. ప్రభుత్వమువారి గ్రాంటులను పొందుతూన్న పాఠశాలల పరిపాలకులుగాని, ఉపాధ్యాయులుగాని డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ వారి అనుమతిలేనిదే రాజకీయములలో జోక్యము కలిగించుకొనరాదని గవర్నమెంటువారు చేసిన ప్రజల ప్రాథమికహక్కులకు భంగము కలిగించే ఉత్తరువులను లక్నోలో జరిగిన ౧౫ వ కాంగ్రెస్‌లో ఈయన ప్రతిఘటించెను. తరువాత రెండుసంవత్సరములకు ౧౯౦౧ లో, ఇండియన్ అప్పీళ్లను విచారించుటకు ప్రీవీకౌన్సిలులోనున్న న్యాయమూర్తుల సంఘములో ఇద్దరిండియన్ లాయర్లనుగూడా నియమించవలసినదని ఆయన కోరెను. కాలము పరిణతమైనప్పుడు బాబూ కాళీచరణబెనర్జీ కాంగ్రెసుకు తప్పక అధ్యక్షుడైయుండేవారు. మొదటిసారి హిందువును, రెండవసారి పార్శీని, మూడవసారి ముసల్మానును అధ్యక్షులనుగా నియమించుకొనిన కాంగ్రెస్ ఒక ఇండియన్ క్రైస్తవునికూడ జాతీయప్రతినిధిగా నియమించుకొని యుండేది. కాని ౧౯౦౭లో దురదృష్టవశమున ఆయన మరణించెను.

## నవాబ్ సయ్యద్ మహమ్మద్ బహదూర్

హిందూకార్యదర్శితో మహమ్మదీయ కార్యదర్శిని జోడించే ఆచారము ౧౯౧౪ లో శ్రీ యన్. సుబ్బారావుపంతులు, నవాబ్ సయ్యద్ మహమ్మద్ బహదూరులు మద్రాసు కాంగ్రెసులో కార్యదర్శులుగా యెన్నుకొనబడినప్పటినుండి ప్రారంభమైనది. కాని ఈనవాబ్ ౧౯౧౩ లోనే కరాచీకాంగ్రెస్ కధ్యక్షుడైనారు. ఈయన మొదట కాంగ్రెసువాది. తరువాత ముసల్మాన్. ఈయన ౧౯౦౧ నాటికే భారత కాంగ్రెసుకమిటీకి సభ్యుడుగా నెన్నుకొనబడెను. ౧౮౯౪ లోనే మద్రాసు కాంగ్రెసు చర్చలలో నాల్గాని కర్జనుప్రభువు నాహ్వానించే తీర్మానము నామోదించెను. ౧౯౦౩ లో మద్రాసులో ౧౯ వ కాంగ్రెసు సమావేశమయినప్పుడీయన ఆహ్వాన సంఘాధ్యక్షుడు. ౧౯౦౪ లో బొంబాయిలో జరిగిన ౨౦ వ కాంగ్రెసులో, కాంగ్రెసునిబంధనావళిని తయారుచేసేటందుకు ఏర్పాటుచేయబడిన కమిటీలో నీయన సభ్యుడు. ౧౯౦౬ లో ఈయన కాంగ్రెస్ స్థాయిసంఘసభ్యుడుగా నెన్నుకొనబడెను. ౧౯౦౮ లో మద్రాసులో జరిగిన కన్వెన్షన్ కాంగ్రెసుకు రాసవిహారీఘోషును అధ్యక్షునిగా ప్రతిపాదించిన దీయనయే. కరాచీలో ౨౮ వ కాంగ్రెసుకు ౧౯౧౩ లో ఈయన అధ్యక్షుడై భారతజాతి కత్యంతమైనసేవ చేసెను. మతదురభిమాన దూషితుడుకాని దేశాభిమాని గనుక ఈయన, భారతదేశములోని సంఘములు వేరువేరుగా గాక ఏకముగానే అభ్యుదయము పొందేటట్లు ప్రయత్నించవలసినదని చెప్పెను.

అఖిలభారత ముస్లిమ్ లీగువారు "ప్రజాశ్రేయస్సుకోసము సమష్టిగా చేయవలసిన కార్యప్రణాళికనుగూర్చి యోజించుటకు హిందూమహమ్మదీయనాయకు లప్పుడప్పుడు సమావేశము కావలసిన" దని చేసిన సూచనను ఈయన ఆయుభయసంఘముల భవిష్యదైక్యమునకును చిహ్నముగా గమనించెను. హిందూమహమ్మదీయ సమాఖ్యగాని, లక్నోలోని కాంగ్రెస్‌లీగు ప్రణాళికగాని నవాబ్ సయ్యద్ మహమ్మద్ నిష్కళంకజాతీయ భావముతోను, ఉత్తమదేశాభిమానదృష్టితోను కరాచీలో నాటిన బీజముయొక్క ఫలితము లేనని చెప్పినయెడల అందులో యేమీ అతిశయోక్తి లేదు.

## దాజీ అబాజీ ఖేర్

పర్మనెంటు సెటిల్ మెంటు, భూమికవుల్లకాలనిర్ణయము–ఈరెండును కాంగ్రెస్ మొదటి సంవత్సరాలలో ప్రధానవిషయములు. ౧౮౯౩లో లాహోరులో జరిగిన ౯వ కాంగ్రెస్‌లో వీటినిగూర్చి ఈయన తీర్మానమును ప్రతిపాదించెను. ఈయన ౧౮౯౦లోనే ఇంగ్లండుకు పంపబడిన కాంగ్రెసు రాయబారవర్గములో సభ్యుడుగా నుండెను. ఈయన కాంగ్రెస్‌నిబంధనావళిని తయారుచేయుటలో యెక్కువశ్రద్ధ తీసికొనెను. ౧౯౦౮ లో ఈయన తీర్మానమువలననే ఆనిబంధనావళి అంగీకరింపబడినది. ౧౯౨౦లో తయారుచేయబడిన నిబంధనావళిలో చాలవరకు ఆదియే చేర్చబడినది. ఖేర్ ౧౯౦౯ మొదలు ౧౯౧౩ వరకును డి. ఇ. వాచాతో కలసి కాంగ్రెస్ కార్యదర్శిగా పనిచేసెను. ౧౯౧౧లో హిందూదేశపు పత్రికలపైన వేయబడిన పన్నులు రద్దు చేయబడవలెనని ఈయన తీర్మానముతెచ్చెను. ౧౯౧౩లో ముస్లిమ్‌లీగు వారు భారతదేశస్వరాజ్యాదర్శము నంగీకరించిన తీర్మానమును బలపరుస్తూ ఈయన స్వరాజ్యము హిందూమహమ్మదీయ సోదరభావమువలననే లభించగలదని చెప్పెను.

## మున్షీ గంగాప్రసాదవర్మ

మొట్టమొదటికాంగ్రెసు నలంకరించిన దేశాభిమానులలో మున్షీ గంగాప్రసాద వర్మ ఒకరు. ఈయనది లక్నో. రెండవకాంగ్రెసులో పబ్లిక్ సర్వీసునుగూర్చి విచారించి కాంగ్రెసుకు నివేదించేనిమిత్తము ఈయన ఒక ఉపసంఘసభ్యుడుగా ఎన్నుకొనబడెను. ౧౯౦౮లో ఈయన కాంగ్రెస్‌స్థాయిసంఘసభ్యుడుగా ఎన్నుకొనబడెను. ఈలాగా ఈయన కాంగ్రెస్‌సంఘములలో ననేకస్థానముల నాక్రమించి పనిచేసెను.

## ఆర్. యన్. మథోల్కర్

కష్టపడి పనిచేసిన పురాతన కాంగ్రెసు వాదులలో ఆర్. యన్. మథోల్కర్ మొట్టమొదటివాడు. ఈయన ౧౮౮౮ లో అలహాబాదులో జరిగిన ౪వ కాంగ్రెసులో,

మొట్టమొదట సంబంధము కలిగించుకొనెను. ఈయన అప్పుడు పోలీసును గూర్చిన తీర్మానమును బలపరస్తూ, పోలీసువారు ప్రేమించబడుటకు బదులుగా ఎందువల్ల ద్వేషింపబడుతున్నారో వివరించెను. తరువాత ౨౮ సంవత్సరముల కాయన బంకీపూర్ కాంగ్రెస్ కధ్యక్షుడయ్యెను. ఇంతకాలమును ఆయన భారతరాజకీయములనుగూర్చిన వివిధసమస్యలను శ్రద్ధగా చదివి అర్థముచేసుకొనెను. వ్యవసాయఋణము, దారిద్ర్యము, ఆర్థికాభ్యుదయము, వృత్తివిద్య - ఇవి ఆయనముఖ్యవిషయములు. ఈయనకృషి ఫలితమునే సి. వై. చింతామణి రాజకీయవిషయములను సమగ్రముగా గ్రహించి, తన అపూర్వమేధాసంపత్తిచే భారత రాజకీయములలో నొక్కసారిగా ప్రాముఖ్య స్థానము వహించగలిగినాడు.

## సర్ సి. శంకరన్ నాయర్

శంకరన్ నాయర్ కాలములో, ఆయన కాంగ్రెసు కొక గొప్పబలమే. ఆయన ఆకార మెంత ఉన్నతమో, మేధకూడ అంత ఉన్నతము. ఆయన చాలా ఘనకార్యములను చేసియుండెను. ఆయన కాంగ్రెసునకు చేసిన సేవాఫలితముగా ౧౮౯౭ లోనే అమరావతీకాంగ్రెసున కధ్యక్షుడుగా ఎన్నుకొనబడినాడు. బొంబాయిలో చందావర్కరు, త్యాబ్జీలవలెనే శంకరన్ నాయరు కూడా కొంత కాలమునకు మద్రాసు హైకోర్టు జడ్జి పదవిని పొందెను. తరువాత ౧౯౧౫ లో ఆయన ఇండియా ప్రభుత్వ కార్యనిర్వాహకసభ్యుడుగా నియమింపబడెను. ౧౯౧౯ లో పంజాబులో సైనిక ప్రభుత్వమును ప్రతిఘటిస్తూ ఆయన తన సభ్యత్వమునకు ఇచ్చిన రాజీనామా వలన ఆయన గొప్ప ప్రజానురంజకు డయ్యెను. కాని ఈయన ప్రయోగించే అస్త్రము లోకప్రియమయినవి యెన్నటికిని కావు. "గాంధీ-అరాజకము" అనే గ్రంథములో సర్ శంకరన్ నాయరు గాంధీని విమర్శిస్తూ వ్రాసినవ్రాత సందర్భము లెఫ్టినెంటు గవర్నరుగానుండిన సర్ మైకేలు ఒడ్వయరుచేసిన మానవష్టపు దావాకు మూలమై, గ్రంథకర్త సకలపరిహారములక్రింద సుమారు మూడులక్షలరూపాయలు ఇచ్చుకొనవలసి వచ్చినది.

## దివాన్ బహదూర్ కేశవపిళ్లై

దివాన్ బహదూర్ పి. కేశవపిళ్లైకు కాంగ్రెసుతో మొట్టమొదటినుండి సంబంధమున్నది. ఆయన ౧౯౧౭ వరకు కాంగ్రెసువాదిగా నుండి తరువాత రాజీనామా నిచ్చెను. ఆయన సంబంధము వదలుకొనబోయేముందు కాంగ్రెసు కొక కార్యదర్శియై బెసెంటుగారికి ప్రధానసహకారిగా నుండెను.

## బిపినచంద్రపాల్

వంగరాష్ట్రములో మనము స్మరించతగినపేర్లు చాలా ఉన్నవి. బిపినచంద్రపాల్, అంబికాచరణమజుందార్, సైకుంఠనాధసేన్, ఆనందమోహన్‌బోసు-వీరం దరును మొదటితరగతికి చెందిన సమర్థులు; వారికాలములో ప్రజానురంజకులైన యుపన్యాసకులు. కాంగ్రెసుతో బిపినబాబుసంబంధము కొంతముందే ప్రారంభమైనది. ఈయన సుప్రసిద్ధవక్త. బహిష్కరణము, స్వదేశీ, జాతీయవిద్యలనుగూర్చి ఈయన తన యుపన్యాసప్రవాహముతో ఆసేతుహిమాచలపర్యంతముగల భారతదేశమును ముంచి వేసెను. ౧౯౦౭ లో ఆయన మద్రాసులోనిచ్చిన యుపన్యాసములనుగూర్చి అప్పటి అడ్వొకేటుజనరల్‌గానున్న వి. భాష్యమయ్యంగారు "అవి యుద్రేకపూరితములే గాని రాజద్రోహకరములుగా" వని అభిప్రాయ మిచ్చెను. కాని బిపినపాల్‌మాత్రము మద్రాసును విడిచివెళ్లిపోవలసి వచ్చినది. మింటో ప్రభువుహయాములో నొకసారి యీయన ప్రవాసమునకు పంపబడెను. మరియొకసారి "వందేమాతరమ్" పత్రికాసంపాదకుడుగా అరవిందఘోషుపైన కేసు పెట్టబడినప్పు డీయన సాక్షిగా వెళ్లవలసివచ్చెను. తనసాక్ష్యమువలన అరవిందఘోషుకు కేసు ప్రతికూలము కావచ్చునని ఈయన కోర్టులో సాక్ష్యమీయ నిరాకరించి, సంతోషముగా ౬ మాసముల కఠిన శిక్షను పొందెను. ఈయన ఇంగ్లండులో నుండగా "హిందూరివ్యూ"ను ప్రచురించి అందులో బాంబు చేయువిధానమును చర్చించెను. తరువాత ఆదేశమునుండి రాగానే ఈయనమీద కేసు పెట్టబడెను. కాని క్షమాపణ చెప్పెను. తరువాతవచ్చిన ఈయనకు జాతీయోద్యమమునందలి యుత్సాహము కొంత సన్నగిల్లినది. అంత్యదశలో బ్రాహ్మమతమునకును, ఆంగ్లో ఇండియనుల పోషణక్రిందనున్న పత్రికలకును ఈయన పనిచేసెను. ౧౯౧౬ లో లక్నోలో జరిగిన అఖిలపక్షసమావేశములోనే ఈయన చివరపర్యాయము బహిరంగసభలో కనిపించినది. బిపినబాబు తన యుత్తేజకరములైన యుపన్యాసముల మూలముగాని, "న్యూఇండియా", "వందేమాతరమ్" పత్రికలలోని తన వ్రాతలమూలముగాని ఆనాటి యువకబృందము నుద్రేకపూరితులనుగా చేసి వశము చేసికొనగలిగిన మాటమాత్రము వాస్తవము.

## అంబికాచరణమజుందారు

అంబికాచరణమజుందా రొకలాయరు. ఈయన క్రమముగా పనిచేసి ౧౯౧౬ లో లక్నోకాంగ్రెస్‌అధ్యక్షపదవికి ప్రాకగలిగెను. ఈయన ౧౯౧౧ లో కలకత్తా కాంగ్రెసులో నిచ్చినయుపన్యాసమును వేరొకచోట నుదాహరించితిమి. ఈయన "భారత

జాతీయ పరిణామము" (Indian National Evolution) అనే సుప్రసిద్ధగ్రంథమును కాంగ్రెసునుగూర్చి రచించెను.

### భూపేంద్రనాథబాసు

౧౯౧౪ లో మద్రాసుకాంగ్రెసు కధ్యక్షత వహించిన భూపేంద్రనాథబాసు కూడా సుప్రసిద్ధవక్త. హిందూదేశ స్వరాజ్యార్హతనుగూర్చిన కారణములను వివరిస్తూ భూపేంద్రనాథుడు "అధికారము, ధనము గల సోమరుల కాలము పోయినది. కాలమనే సూత్రధారుడు ప్రపంచక్రమము నుచ్ఛ్రితికి నడుపుతున్నాడు. యూరపులో నిప్పుడు జరుగుతూన్న యుద్ధము మధ్యయుగము నాటి అధికారవ్యాపారమును పూర్తిగా నిర్మూలించగలదు. ఇక మనిషిపైన మనిషికీ, జాతిపైన జాతికీ అధికార ముండబోదు. పాశ్చాత్యజీవితసముద్రములనుండి ప్రాచ్యజీవిత ప్రశాంతజలములకు ప్రవహిస్తూన్న విశాలప్రవాహము నెవరును వెనుకకు త్రిప్పజాలరు. భారతవిశ్వవిద్యాలయములను మీ యిష్టమువచ్చినట్లు లొంగదీయవచ్చును. వాటి పాఠములకు నిర్బంధశాసనముల నే నిగళములను తగిలించవచ్చును. కాని ఈ విశాలప్రపంచకమున జరిగే సంఘటనలనుబట్టి పరిణామము పొందుతూన్న మానసిక ప్రవృత్తులనుమాత్రము మీ రరికట్టజాలరు. భారతదేశములో నింగ్లీషుప్రభుత్వ మనగా భారతీయు లధికారులను దేవతలవలె పూజించవలెనే అయితే, భారతజాతి శాశ్వతముగా బ్రిటిషునిరంకుశత్వమునకు, సంకుచితత్వమునకు లోబడియుండవలెనే అయితే, భారతహృదయము బానిసత్వమహాభారమును ధరించవలెనే అయితే ఆప్రభుత్వము నాగరికతకు పరమశత్రువు. మానవజాతికి కళంకము" అని యుపన్యసించెను.

భూపేంద్రనాథబాసు కలకత్తాలో గొప్ప సొలిసిటరు; చాలా సంపాదనాపరుడు. రాజకీయములలో సంతోషముగా కాలమును వినియోగించేవాడు. ఆయన వక్తృత్వము విజ్ఞానదాయకము. ఆయన ఉపన్యాసములలో అభినయించి చక్కగా భావప్రకటనము చేయగలవాడు. కనుకనే ఒకపెద్దనాయకు డీయనముఖము నాటకపాత్రధారుని ముఖమనీ, ఈయనకన్నీళ్లు రసాయనశాస్త్రప్రకారము తయారైన కన్నీళ్లనీ పరసముగా అభివర్ణించియున్నాడు. మేమో ఆయనకన్నీరు మానసికమనీ, శారీరకమనీ కూడ చెప్పగలము. ఆయన 'కాంగ్రెసు ప్రభుత్వమునకు వ్యతిరేకపక్షమున పనిచేయరా' దని చెప్పెను.

### పండిత బిషన్‌నారాయణధారు

జాతీయమహాసభయందు భక్తితో పనిచేసి కాంగ్రెసుచరిత్రలో పేరుపడిన పూర్వరాజకీయనాయకులలో పండిత బిషన్‌నారాయణధా రొకడు. ౧౯౧౧ కలకత్తా

కాంగ్రెసుకు మొట్టమొదట రామ్సేమాక్డొనాల్డు అధ్యక్షుడుగా నియమింపబడెను. కాని ఆయనభార్యమరణమువలన ఆయన ఇండియానుండి వెళ్లిపోవలసివచ్చెను. అప్పు డాకస్మికముగా బిషన్‌నారాయణధా రా అధ్యక్షస్థానము వహించవలసివచ్చెను. వంగరాష్ట్రవిభజనము రద్దుచేయబడి ప్రభుత్వమువా రపజయము పొందినరోజులలో నీతఁడు కాంగ్రెసు కధ్యక్షత వహించుట తటస్థించినది. కాని అంతకుపూర్వము చాలాకాలము క్రిందటనే ఆయనవక్తృత్వమువలనను, శక్తిసామర్థ్యములవలనను ఆ ఉన్నతజాతీయ గౌరవమున కర్హు డని బుజువయ్యెను. పండిత బిషన్‌నారాయణధారు మొట్టమొదటి కాంగ్రెసునుండి కాంగ్రెసులో ప్రధానపురుషుడుగానే ప్రవర్తించెను. ఆయన ౧౮౮౭ లో మద్రాసులో జరిగిన మూడవకాంగ్రెసులో "ఇంగ్లండు మమ్ములను మా పూర్వపు లంగరురేవునుండి కదిలించి మాయిష్టమునకు వ్యతిరేకముగా ఆందోళిత జనసమూహమనేమహాసముద్రములో పారవైచినది. ఇంగ్లండునకు కొన్నిశుపాసులలో దారి చూపి, రాజకీయస్వాతంత్ర్యమనే నౌకాశ్రయము (Harbour) నకు సురక్షితముగా తీసికొనిపోగలిగిన ఆ ప్రాతినిధ్యసంస్థ లనే దిక్సూచిని మాకును ప్రసాదించవలసినదిగా మేము నేడింగ్లండును వేడుకొంటున్నాము." అని బిషన్‌నారాయణధారు చెప్పియుండెను.

ప్రభుత్వమునుగూర్చిన బిషన్ నారాయణధారువర్ణనము వివరముగాను, కఠినముగాను కూడా ఉన్నది. దాని నీక్రింద నుదాహరింతుము:

"భారతీయుల నూతనాశయములు, నూతనావసరములపట్ల ప్రభుత్వమువారు సంకుచితభావములోను, అనురాగరహితముగాను ప్రవర్తించుటయే మనకష్టము లన్నిటికిని మూలము. ఈ ప్రవర్తనమును ప్రభుత్వమువారు మార్చుకొనియెడల భావికాలమున గొప్ప ప్రమాదము తటస్థించగలదు. భారతయువకులు పెద్దవా రవుతూన్నకొలదీ వారి ఆశయములు పెరుగుతూన్నవి. అందువలన క్లిష్టదశ వచ్చినది. ఒకప్రక్క నూతనవిజ్ఞానమువలన అపూర్వరాజకీయచైతన్యము కలిగి కాలానుగుణముకాని ప్రభుత్వమువారి పురాతన నిర్బంధవిధానముచే అణచివేయబడుతూన్న భారతీయవిద్యాధికు లున్నారు. రెండవప్రక్కను తన స్వప్రయోజనములతో, తన అహంకార స్వభావములతో, తన పురాతన నిరంకుశాధికారపద్ధతితో విజ్ఞానము ననుమానిస్తూ, నూతనత్వమును ద్వేషిస్తూ, విజాతీయతమూలమున ప్రజలకు దూరముగానుండి, అధికారైశ్వర్యముల ననుభవిస్తూ, నేటి యుదారనైతికాశయములకు చోటీయని ప్రభుత్వ మున్నది." అని ఆయన చెప్పెను.

౧౯౦౩ వ సంవత్సరములో పండిత బిషన్ నారాయణధారు "అధికారరహస్య చట్టము" (Official Secret Bill) ను గూర్చి తీర్మానమును ప్రతిపాదిస్తూ "ఈ బిల్లు రష్యాను పరిపాలనాపద్ధతిని అనుకరిస్తూ ఉందని అన్నందుకు లార్డ్ కర్జన్ ఆశ్చర్య నిమగ్నుడైనాడు. నేనో రష్యను సివిల్ చట్టములలో ప్రజల ప్రాథమిక హక్కులకు భంగము కలిగించే కర్జను ప్రభువుబిల్లులోని నిబంధనలవంటి నిబంధనలు కలవని నమ్మేటంతగా రష్యన్ గవర్నమెంటును గూర్చి తెలియనివారున్నారా అని ఆశ్చర్య పడ్డాను" అని చెప్పినాడు.

## రమేశచంద్రదత్తు

౧౯ వ శతాబ్దాంతములో కాంగ్రెసు రాజకీయములలో ప్రతిభగడించినవారిలో రమేశచంద్రదత్తొకరు. కాంగ్రెసువాదులను దేశములో యేవిధమైన స్థానమును లేని గడ్డిపోచలుగాను, ఉద్యోగప్రియులుగాను వర్ణించిన "లండన్ టైమ్సు" (౧౮౮౬) అర్థములోకూడ ఈయన కేవలము రాజకీయాందోళకుడు కాడు. ఈయన కమిషనరు పదవినుండి మానుకొని కాంగ్రెసులో కలిసిపోయెను. ఐ. సి. యస్. ఉద్యోగిగా ఈయన గడించిన విశాలానుభవమును, విజ్ఞానమును నాటి ప్రజాసమస్యలను కాంగ్రెసు ద్వారా పరిష్కరించుటకుపయోగించెను. భూమిపైన వేయబడిన ఎక్కువపన్నులను, ఇంగ్లీషు యంత్రముల మూలమున జరిగిన గ్రామపరిశ్రమల వినాశనమును భారతదేశములోని క్షామములకు కారణములని ఆయన అభిప్రాయము. ౩౦౦౦ ల సంవత్సరముల క్రిందట గ్రామస్వపరిపాలనమును స్థాపించుకొనిన దేశము నేడు దాదాపు "జిల్లా అధికారులకును, ప్రజలకును అసహ్యకరమైన మధ్యవర్తులుగా" పరిగణింపబడుచున్న పోలీసుశాఖద్వారా పరిపాలింపబడుట చూచి చింతించెను. ల్యాండురెవిన్యూ, కరవులు, ఆర్థికవిషయములను గూర్చి ఆయనకు పరిపూర్ణముగా తెలుసును. ఆయన ౧౮౯౯ లో లక్నోకాంగ్రెసు కధ్యక్షత వహించెను. "సభలలోను, పత్రికలలోను స్వేచ్ఛావిమర్శనమును నిరోధించడముకంటె రాజద్రోహము నభివృద్ధిచేయుటకు మంచిమార్గము లేదు" అన్న సుభాషితమువలన ఆయన చిరస్మరణీయుడయ్యెను.

## యన్. సుబ్బారావుపంతులు

పూజనీయులగు కాంగ్రెసు మూలపురుషులలో మరియొకరు ఆం[illegible] వయోవృద్ధుడు శ్రీ న్యాపతి సుబ్బారావుపంతులు. ఈయన నేటి కాంగ్రెసు కార్యక్రమమును పూర్తిగా నవలంబించలేకపోయినప్పటికిని జాతీయవాదిగా ఈనాఁటివరకును చురుకుగా పనిచేస్తూన్న ప్రజాసేవకుడు. కాంగ్రెసుతో నీయనకు ప్రథమమునుండి సంబంధమున్నదని చెప్పవచ్చును. ౧౮౮౮ లో అలహాబాదులో జరిగిన నాలుగవకాంగ్రెసులో

ఈయన యుపన్యసించెను. అప్పటినుండి కాంగ్రెసువేదికపైన ఉపన్యాసమున్ను, న్యాయ-కార్యనిర్వాహకశాఖలు, కార్యనిర్వాహక సంఘములలో భారతీయుల ప్రవేశము, జూరీవిచారణ, న్యాయవాదులస్థానము మొదలగువిషయములను గూర్చి తీర్మానములను ప్రతిపాదిస్తూగాని, ఆమోదిస్తూగాని, బలపరస్తూగాని ఈయన అనేకపర్యాయములు మాట్లాడెను. సామ్రాజ్యశాసనసభలో (Imperial Legislative Council) సభ్యుడుగానున్నప్పుడీయన, పబ్లిక్‌సర్వీస్‌కమిషన్‌ను నియమింపవలసినదని తీర్మానముపెట్టి అంగీకరింపచేసెను. ౧౯౧౨ లో బంకీపురంకాంగ్రెసులో పబ్లిక్‌సర్వీసులనుగూర్చి విచారించుటకుగాను రాయల్‌కమిషన్ నియమింపబడినందు కీయన కృతజ్ఞతాతీర్మానమును ప్రతిపాదించెను. ఈయనసమకాలికులు చాలామంది ప్రభుత్వోద్యోగములను, బిరుదులను సంపాదించుకొన్నప్పటికీ ఈయనమాత్రము వాటికోస మెన్నడును ఆశించలేదు. ౧౯౧౪ లో ఈయనను మద్రాసురాష్ట్రీయమహా రాహ్వానసంఘాధ్యక్షుడుగా నెన్నుకొనిరి. ఈయన ౧౯౧౪,౧౯౧౫, ౧౯౧౬, ౧౯౧౭ సంవత్సరములలో కాంగ్రెసుకు జనరల్ శెక్రటరీగా నెన్నుకొనబడెను. కాని ౧౯౧౭ సంవత్సరములో బెసెంటు సి. పి. రామస్వామయ్యరును మూడవకార్యదర్శిగా తీసికొని, ఆయననే నిజమైన కార్యనిర్వాహకకార్యదర్శిగా చేసినప్పుడీయన తన జెనరల్‌శెక్రటరీపదవిని కృతజ్ఞతాభివందనములలో నిరాకరించెను. ఈయనహయాములో సొంతఖర్చుతో దేశములో సంచారముచేసి కాంగ్రెసుప్రబోధమును కావించెను.

## లాలా మురలీధరలాల్

పాంచాలదేశీయులు లాలా మురలీధరలాల్ నామమును విస్మరింపజాలము. ఈయన సాక్ష్యములేకుండ శిక్షింపబడి, జైలునుండి జామీనుమీద విడుదలయి, సరాసరి ౧౮౮౬ లో కలకత్తాలో జరిగిన రెండవకాంగ్రెసుకు హాజరైనాడు. "నేను నాకు తోచిన అభిప్రాయములను నిర్భీతిగా ప్రకటించగలను కాబట్టి నేను రాజకీయాందోళకుడనుగా పరిగణింపబడి శిక్షింపబడితిని" అని ఆయన చెప్పెను. ఈకలకత్తా సభకు దేరాయిస్మాయిల్‌ఖానునుండి వచ్చిన లాలా ముల్లిక్‌ధరవాన్‌దాసే కాంగ్రెసు చరిత్రలో మొట్టమొదట ఉర్దూలో మాట్లాడిన ప్రతినిధి. ౧౮౯౦లో కలకత్తాలో జరిగిన ౬వ కాంగ్రెసులో మాట్లాడిన మొట్టమొదటిస్త్రీ శ్రీమతి కాదంబినీగంగూలీ. ఈమె అధ్యక్షులకు కృతజ్ఞతాభివందనము లర్పిస్తూ మాట్లాడినది.

## మజ్రుల్‌హక్

మౌల్వీ మజ్రుల్‌హక్ బీహారురాష్ట్రీయవాసి. ఈయనస్వరూప మెంత ఉన్నతమో బుద్ధికూడా అంత ఉన్నతము. ఈయనలో జాతీయత మూర్తీభవించినది. ఈయన

భారతజాతీయమహాసభకు సంపూర్ణసహాయ మొసర్చెను. ఈయనకు సాంఘిక దురభిమాన మంటే అసహ్యము. ౧౯౧౦ లో జరిగిన ౨౫ వ కాంగ్రెసులో హెచ్. జిన్నా సాంఘిక ప్రాతినిధ్యమును నిరసిస్తూ ప్రతిపాదించిన తీర్మానము నీయన ఆమోదించి మహమ్మదీయులను హిందువులతో కలసి మెలసి యుండకోరెను. అవి మింటోమార్లే సంస్కరణములు ప్రవేశపెట్టబడినరోజులు. అప్పుడే శాసనసభలలో మొదటిపర్యాయము సాంఘికప్రాతినిధ్యపద్ధతి ఆచరణలోకి వచ్చినది. మహమ్మదీయులు కొందరు వారికి జయము చేకూరినట్లుగా సంతోషిస్తూండిరి. అటువంటిసమయములో వారికి చేకూరిన జయము ఉభయసంఘముల శ్రేయస్సునకును భంగకరమనీ, ఉభయసంఘముల సంఘీభావములోనే దేశక్షేమము కలదుగాని వారిప్రత్యేకతలో నెంతమాత్రమును లేదనీ చెప్పగలిగిన ధైర్యశాలి ఈ మజ్రుల్‌హక్కు.

౧౯౧౭ లో కాంగ్రెసువారు సీమ కొకరాయబారమును పంపిరి. ఆరాయబారవర్గములో భూపేంద్రనాథబోసు, జిన్నా, యన్. యమ్. సమర్థ్, యస్. సిన్హా, బి. యన్. శర్మ, లాలా లజపతిరాయలతోపాటు మజ్రుల్‌హక్కుకూడ నొకసభ్యుడుగా నెన్నుకొనబడెను. తరువాత ఆయన కాంగ్రెసువ్యవహారములలో నంతగా జోక్యము కలిగించుకొనలేదు గాని చిట్టచివరవరకును మంచి జాతీయవాదిగా నుండెను. ఋషితుల్యమైన ఆయనజీవితము ఆయనజాతీయతకు మరింత వన్నె తెచ్చినది. ఆయన భారతీయులకు, ముఖ్యముగా బీహార్‌రాష్ట్రవాసులకు మిక్కిలి ప్రేమాస్పదుడయ్యెను. చివరరోజులలో ఆయన రాజకీయములనుండి విరమించుటయేగాక ప్రాపంచికసౌఖ్యముల నన్నిటినీ విడిచి నిజమైన ఫకీరువలె జీవితమును గడపెను.

## యస్. సిన్హా

యస్. సిన్హా ౧౮౯౯ లో లక్నోలో జరిగిన ౧౫ వ కాంగ్రెసులో మొట్టమొదటిపర్యాయము కనిపించెను. న్యాయ కార్యనిర్వాహకశాఖలు విడదీయబడవలెనని ఆయన చెప్పెను. డాక్టరు బెసెంటు చెప్పినట్లు "ఈపాతవిషయ మెన్నిసార్లో చర్చకు వచ్చినది. ౧౫ వ పర్యాయముకూడా రావలసిన అవసరము కలిగినది." మరుసంవత్సరం ౧౯౦౦లో జరిగిన లాహోర్‌కాంగ్రెసులోకూడ ఈవిషయమునుగురించి సిన్హా "ప్రభుత్వమువా రెప్పుడును ప్రజలవిశ్వాసముపైన ఆధారపడి యుండవలెను. వారు ప్రజలకు న్యాయము కలుగజేస్తేనేగాని ప్రజలు వారిపై విశ్వాసముగా నుండరు. న్యాయ మనగా నేడు మన మనుభవిస్తూన్న న్యాయము కాదు. కల్తీ లేనిన్యాయము. నిజమైన, స్వచ్ఛమైన బ్రిటిష్‌న్యాయము." అని చెప్పెను. ౧౬వ కాంగ్రెసులో న్యాయశాఖకు సంబంధించిన పోలీసుసంస్కరణముపైన ఆయన మాట్లాడెను. మరుకాంగ్రెసులో కూడ ఆయన

అవిమయమునుగూర్చియే మాట్లాడుతూ పోలీసుకమిషనులో అనుభవముగల భారతీయ ప్రాతినిధ్యము తగినంత లేదని ఆయన సూచించెను. "కమిషనులో నున్న ఇద్దరు అధికారేతరసభ్యులలోను ఒకరు సి. ఐ. ఇ. బిరుదాంకితులు గనుక ఇంగ్లీషువారిని సంతోషపెట్టడమే ఆయనపని. రెండవఆయన మహారాజా! ఆయనను గురించి ఇంకా నేమీ తెలియదు "అని ఆయన చేసినవిమర్శనము సమంజసముగానేయున్నది. ఎందువల్ల ననగా సిన్హా తరువాత బీహారుప్రభుత్వకార్యనిర్వాహకసభలో సభ్యుడైనప్పటికీ బిరుదాంకితుడు కాలేదు. ౧౯౦౫లో జరుగనున్న పార్లమెంటు ఎన్నికల సందర్భమున ఇండియానుండి సీమకు రాయబారము పోవలెననే తీర్మానమును సిన్హా ౨౦ వ కాంగ్రెసులో బలపరచెను. దాదాభాయినౌరోజీ, సర్ హెన్రీకాటన్, జాన్‌జార్డిన్ లను పార్లమెంటుసభ్యులుగా ఎన్నుకోవలసిన పని బ్రిటిష్‌ప్రజలకు సలహాయిస్తూ ఆకాంగ్రెసులోనే ఒక తీర్మానము నాయన ప్రతిపాదించెను. కాశీలో జరిగిన ౨౧ వ కాంగ్రెస్‌లో ౧౯౦౫లో పోలీసుసంస్కరణమునుగూర్చి తిరిగీ ఈయనయే తీర్మానము ప్రతిపాదిస్తూ పోలీసుకమిషన్, ప్రత్యేకపోలీసుశాఖను సృష్టించి అందులో భారతీయులకు ప్రవేశములేకుండచేయుటను తీవ్రముగా విమర్శించెను. ౧౯౦౭లో జరిగిన మొదటి మితవాదికాంగ్రెసుకు హాజరై ఈయన చురుకుగా పనిచేసెను. ౧౯౧౦లో జరిగిన అలహాబాదు కాంగ్రెసువాటికి వైస్రాయి కార్యనిర్వాహక సభలోని మెంబరుపదవికి భారతీయుడు నియమింపబడుటచేత భారతరాజకీయవేత్తలదృష్టి విశాలమైనది. కాని ఆపదవి బారిస్టర్లకుమాత్రమే ప్రత్యేకింపబడుట మంచిది కాదనీ, అడ్వొకేట్లు, లాయర్లుకూడ అందుకు తగినవారేననీ సిన్హా నచ్చజెప్పెను. మరుసంవత్సరము కలకత్తాకాంగ్రెసులో సంయుక్తరాష్ట్రములకు గవర్నరు, కార్యనిర్వాహకసభ కావలెనని సిన్హా వాదించెను. ౧౯౧౪ లో సిన్హా మద్రాసుకాంగ్రెస్‌కు హాజరై భూపేంద్రనాథబాస్, జిన్నా, సమర్థ్, మజ్రుల్‌హక్కు, గొ. శర్మ, లాలా లజపతిరాయలును, తానును సీమకు రాయబారము పోయి చేసినసేవకు కృతజ్ఞతాభివందనములను స్వీకరించెను.

## మహాదేవ్ గోవిందరనెడే

మహాదేవ గోవిందరనెడేను ప్రజలు జస్టిస్‌రనెడే అని పిలిచేవారు. ఈయన కాంగ్రెసులో సుప్రసిద్ధుడు. ఈయనను కేవలము కాంగ్రెస్‌వాది అని చెప్ప వీలులేదు. ఈయన బొంబాయి ప్రభుత్వ న్యాయశాఖలో ఉన్నతోద్యోగమునందుండి కాంగ్రెసుకు చాలా యేండ్లవరకును వెనుకబలముగా నుండెను. కాంగ్రెస్ ఉద్యమమున కీయన యిచ్చిన సలహాలాధారభూతములు. ఈయన ఉన్నతమైన ఆకారమును, తీర్చినట్లుండే

ముఖమును, చక్కని వేషమును చూచి, ప్రతి కాంగ్రెసు సభలోను, తేలికగా ఈయనను ఆనవాలు పట్టుటకు వీలుగానుండేది. ఈయన పెద్దపండితుడు. శాస్త్రవేత్త. ఈయన "మహారాష్ట్ర ప్రభుత్వవిజృంభణము", "భారత దేశార్థికవిషయములు" అను గ్రంథములను వ్రాసి చరిత్రకారుడుగను, ఆర్థికశాస్త్రవేత్తగాను దేశమునకు చిరస్మరణీయు డయ్యెను. సాంఘికసంస్కరణ మీయన అభిమానవిషయము. చాలాసంవత్సరములవరకును కాంగ్రెసుతో కలిపి జరుపబడిన సాంఘికమహాసభ ఈయనకు పెంపుడుబిడ్డ. ౧౮౯౫లో జరిగిన పూనాసభలో, కాంగ్రెసు సాంఘికసంస్కరణముతోను, సాంఘికసభలతోను ఐక్యము కలిగించుకొనవచ్చునా, కూడదా అనిచెలరేగిన వాద ప్రతివాదములు జస్టిస్ రనెడేగారి సహనబుద్ధివలనను వివేకమువలనను సమసిపోయిన వని బాబూ సురేంద్రనాథ్ బెనర్జీ అభిప్రాయ మిచ్చెను. బొంబాయిలో ౧౮౯౭లో ప్లేగు వచ్చినప్పుడు జస్టిస్ రనెడే చేసిన సేవ వర్ణనాతీతము. సంఘసంస్కరణోద్యమములోను, కాంగ్రెస్‌లోను ౧౫ సంవత్సరములు నిరంతరసేవ నొనర్చి ౧౯౦౧లో ఆయన స్వర్గస్థు డయ్యెను. ఆయన భారతదేశమునకు చేసిన మహత్తరసేవయే నే డాయనకు స్మారకచిహ్నము.

ఇంకను అనేకమంది గొప్ప ప్రజాసేవకులు కలరు. వారిలో కొందరు స్వర్గస్థులైరి. మరికొందరు జీవించియేయున్నారు. వా రందరును జాతీయోద్యమముకొరకు త్యాగము చేసి హృదయపూర్వకముగ సేవ చేసినవారే. వారికి భారత భావిసంతతి కృతజ్ఞత చూపవలసియున్నది. వారి నందరను ఇక్కడ నుదాహరింప బూనుకొనిన యెడల మే ముద్దేశించని అనవసరభేదభావములు కలుగ వచ్చును. వారిని కృతజ్ఞతతో సంస్మరించడమే మాకును, పాఠకులకును సంతృప్తి.

# 1. కాంగ్రెసులో రాజీప్రయత్నములు

## ౧౯౧౫

[ భారతదేశపు హక్కులనుగూర్చి బెసెంటు ప్రచారము-౧౯౧౪ లోని స్థితి - తిలక్ తిరిగీ రంగమునకు వచ్చుట - కాంగ్రెసుకక్షుల రాజీప్రయత్నములు భగ్నమగుట - గోఖ్లేమరణము-తిలక్ నిర్మాణకార్యము - బొంబాయి కాంగ్రెస్.]

భారతదేశపు రాజకీయచరిత్రలో ౧౯౧౪వ సంవత్సరముతో నూతనశక మారంభమైనది. "భారతదేశము స్వాతంత్ర్యముకొరకు పోరాడినవిధము" అను బెసెంటు వ్రాసిన గ్రంథము, కాంగ్రెసు పుట్టిన ౧౮౮౫ వ సంవత్సరము మొదలుకొని మహాసంగ్రామము ప్రారంభమైన ౧౯౧౪ వ సంవత్సరమువరకును గల మధ్యకాలమునకు సంబంధించిన చరిత్రము. ౨౦ వ శతాబ్దప్రారంభమున జరిగిన రష్యా జపాను యుద్ధములో జపాను పొందిన విజయమువలన ఆశియాఖండజాతులకు తమ శక్తిసామర్థ్యములయందును, తమ వీరత్వమునందు ఆత్మవిశ్వాసము కుదిరినది. అదేవిధమున ఐరోపామహాసంగ్రామమున ౧౯౧౪ లోని శీతకాలమునందు ఫ్రాన్సు, ఫ్లాండర్సు యుద్ధభూములలో భారతసైన్యము కనుపరచిన సహసధైర్యములుకూడ ఆశియాఖండవాసులను నూత్నవిశ్వాసపూరితులనుగా నొనర్చెను. జర్మనీసైనికుల తీవ్రపరాక్రమమునకు భారతసైనికులు జయప్రదముగా తాళిన విధానమును చూచి ఐరోపాఖండవాసు లాశ్చర్యచకితులైరి. భారతీయులనుగూర్చి వారి దృక్పథము మారిపోయినది. వారికి పూర్వముకంటె భారతీయులయెడ యెన్నోరెట్లు గౌరవము హెచ్చినది.

పార్లమెంటువారి అంగీకారమునకు లోబడి రణరంగమున కురికింపబడిన భారతసైన్యమునుగూర్చి పాశ్చాత్యజాతులు శ్లాఘించినవిధానము భారతీయహృదయములలో పరివర్తనము కలిగించినది. సురేంద్రనాథ బెనర్జీవంటి కొందరికి భారతీయులు సామ్రాజ్యరక్షణకొరకు చేసిన సహాయమునకు బహుమానము పొందవలెనని బుద్ధిపుట్టినది. బెసెంటువంటివారికి ఆత్మస్వామ్య ప్రతిష్ఠాపనముకొరకు భారతీయులు పోరాడవలెననుకోరిక కలిగినది. బాల్యకాలమునుండియు బెసెంటు నిరుపేదలకొరకును, భారతదేశముకొరకును పనిచేయుచునే జీవితమును గడపెను. కాని ఆమె ౧౯౧౪ లో కాంగ్రెసులో చేరినది. ఆమె పరస్పర వాణిజ్యపద్ధతినిగూర్చి మాట్లాడుతూ "భారతమాత

చూపిన రాజభక్తి కామెకు బహుమానము కావలెనని కొందరందురు. ఈచిన్న చిన్న హక్కులకోసము, ఈ కొద్దిస్వాతంత్ర్యముకోసము ఆమె తనకుమాళ్ళరక్తముతోను, కుమార్తెల కన్నీటిధారలతోడను బేరమాడదలచుకొనలేదు. సామ్రాజ్యములో తదితర జాతులతోపాటు న్యాయమును పొందవలెనని ఆమె కోరుచున్నది. యుద్ధమునకు ముందు భారతదేశము కోరిన దిదే! యుద్ధములో కోరుచున్నదీ ఇదే! యుద్ధముతరు వాత కోరబోయేదీ ఇదే! కాని ఈన్యాయము బహుమానరూపకములో నుండవలె నని భారతభూమి కోరుటలేదు. హక్కుగా నుండవలెనని కోరుచున్నది. దానిని గూర్చి మాత్ర మెవరును పొరపాటు పడకూడదు." అని చెప్పినది. జిడ్డు కృష్ణమూర్తిసోదరుల దావాలో చిక్కుకొనియున్న బెసెంటు హైకోర్టు దివ్యజ్ఞానసమాజము"నుండి కాంగ్రెసు రాజకీయములలోకి ఒక్కసారి దుమికినంతనే జాతీయక్షేత్రమున నూతనభావములును, నూతనశక్తులును విజృంభించినవి; ప్రజలలో నూతనదృక్పథము కలిగినది. నూతన నిర్మాణపద్ధతి కామె మార్గదర్శిని యైనది. ఆమె లోకోత్తర స్త్రీ. పూర్వపశ్చిమార్ధ గోళములలోను, ప్రాక్ప్రతీచీదేశములలోను ఈమెకు లక్షలకొలది శిష్యబృందముగలదు. ఇంతగొప్ప అనుచరవర్గముతో కొనవచ్చిన శక్తిగలిగిన ఆమె భారతరాజకీయములకు నూతనజీవమును కల్పించుట వింతకాదు.

అయితే ౧౯౧౫ లోని పరిస్థితు లెట్లున్న వనగా—ఆయేటి ఫిబ్రవరి ౧౯ వ తేదీని గోఖ్లే మరణించెను. ౧౯౦౯ లో నిక కాంగ్రెసు ఆరురోజు లున్న దనగా అధ్యక్ష పదవిని నిరాకరించిన సర్ ఫిరోజిషా మెహతా రాజకీయప్రపంచకమున నిష్క్రమ్యుడై, ౧౯౧౫ నవంబరు నెలలో గోఖ్లేను స్వర్గమున కనుగమించెను. వాచా జరాభారమువలన క్రుంగిపోయెను. ౧౯౧౫ బొంబాయి కాంగ్రెసులో ఆయన వృద్ధత్వమువలన తనదృష్టి మందగించిన దని చెప్పెను. అదీగాక వాచా పండితుడు కావచ్చును; మంచి కార్యదర్శి గావచ్చును; కాని యొన్నడును విజయపరంపరలతో సైన్యమును నడపిన సేనానాయ కుడు మాత్రము కాడాయన. సర్ నారాయణచందావర్కరు న్యాయమూర్తిపని నుండి విరమించెను. రాజకీయములలో ఆయనశక్తి ఉడిగిపోయినది. హేరంబచంద్ర మైత్ర, వాధోల్కార్, సుబ్బారావుపంతులు కాంగ్రెసుసైన్యములో అర్ధరథసమరథులే. కాని అంతకంటె ఎక్కువవారు కారు. సురేంద్రనాథబెనర్జీ గొప్పవాడే; కాని నవీనాభి ప్రాయములతో ఆయనకు శ్రుతికలువదు. ఒక అతిరథుడు కాని, ఒక మహారథుడుకాని సైన్యములను నడపించుటకు తగిన సర్వసైన్యాధిపతి గాలేదు. తిలకు దాదాపు శిక్షాకాలము పూర్తి చేసికొని మాండలేనుండి ౧౯౧౪ జూనులో విడుదల చేయబడెను. శ్రీనివాస శాస్త్రి భారతసేవకసంఘము (Servants of India Society) లో గోఖ్లేగారి స్థానమున మొదటిపత్తుదైనమాట నిజమే; కాని ఆయన దొక చిత్రమైనప్రకృతి. ఆయన

మనస్సొక యుద్ధరంగము. ఆయనవిశ్వాసము మితవాదమునందు; పక్షపాతము తీవ్ర
వాదమునందు. ఆయన సిద్ధాంతమును విడిచిపెట్టలేదు; కాని కాలానుగుణముగా ప్రవ
ర్తించవలెననే కోరిక లేకపోదు. ఆయన లక్ష్యమును మరచిపోనూలేదు; తాత్కాలిక
ప్రయోజనమును త్యజించనూ లేదు. కాబట్టి ఆయన కెప్పుడును వెనుక నుండుటయే
సంతృప్తి. కాని ముందువెనుక లాలోచించే స్వభావ మాయన కిష్టము. ఏమైతే నేమి?
ఆయన యెప్పుడును ముందుకు రాలేదు. ప్రకటనకోస మాశించలేదు. పండిత మదన
మోహనమాలవ్యా కాంగ్రెసును మితవాదపద్ధతులమీద నడిపించే స్థితిలో లేదు. ముం
దుకు త్రోసుకొనివచ్చే ధోరణి ఆయనకు తక్కువ. ఇక గాంధీ ఆసమయములోనే
భారతదేశమునకు వచ్చెను. భారతదేశములోని ఆయన ప్రజాజీవితపద్ధతి అప్పటి
కింకను ఇదమిత్థమని తేలలేదు. ఆయన భారతదేశమును విడిచివెళ్లి చాలాకాల మైనది.
వెళ్లినపిమ్మట యేరెండు మూడు పర్యాయములో మాత్రము తిరిగీ భారతభూమిని
దర్శించెను. కాబట్టి ఆయన తన రాజకీయగురువైన గోఖ్లేగారి శుశ్రూషా సహాయమున
నెమ్మదిగా దేశములోని పరిస్థితులను గమనిస్తూఉండెను. లాలా లజపతిరాయికి దేశము
లోని పరిస్థితులు, ముఖ్యముగా పాంచాలరాష్ట్రపరిస్థితులు విసుగును పుట్టించెను. యుద్ధ
సమయములో ఆయన కేవలము అమెరికాఖండమున ప్రవాసిగా నుండెను. (కొంతకాల
మునకు ప్రభుబిరుదమును పొందిన) సర్ సత్యేంద్రప్రసిన్హా ౧౯౧౫ లో బొంబాయి కాం
గ్రెసున కధ్యక్షు డయ్యెను. కాని నూతనాభిప్రాయములతో ఆయనకు పరిచయము
తక్కువ. బొంబాయిసభ జరిగిన తరువాత ఆయన కాంగ్రెసురాజకీయములలో
జోక్యము కల్గించుకొన మానివేసెను. నాయకత్వము ప్రజలచేతులలోనుండి పోయి
దాదాపు ప్రభుత్వమువారి చేతులలో పడేటట్లు కనిపించినది. మితవాదుల చేతులలో
నుండి అధికారము పోయినది. కాని జాతీయవాదులకు మాత్ర మది ఇంకను
ఎక్కలేదు. కాంగ్రెసులోని రెండుపక్షములకును సంఘీభావము చేకూర్చవలె నని
౧౯౧౪-౧౫ సంవత్సరములలో బెసెంటుచేసిన కృషి ఫలించలేదు. ఈ అపజయకథను
సంగ్రహముగా వివరింతుము.

౧౯౧౪ లో కొన్ని దురదృష్టపుసంఘటనలు జరిగి యుండకపోయినట్లయితే,
న్యాయముగా, లోకమాన్యతిల కొక్క మహారాష్ట్రదేశమునకేగాక యావద్భారత
దేశమునకును మకుటములేని మహారా జయియుండేవాడు. ఆయన ౧౯౧౪ జూన్
నెలలో విడుదలైనప్పటినుండీ గొప్ప "హోమ్ రూలు"ద్యమమును సాగించవలె నని
యెంతో ప్రయత్నించెను. సద్భావముగల ఆయనమిత్రు లనేకమంది కాంగ్రెసులోని
ఇరుకక్షులవారికిని మైత్రి చేకూర్చవలెనని గట్టిపట్టుపట్టిరి. లోకమాన్యుడు మితవాదుల
మనస్సులకు నొప్పి కలుగకుండ ప్రవర్తించవలెనని బుద్ధిపూర్వకముగా ఎంతో ప్రయ

త్నము చేసెను. కాని వారుమాత్ర మందు కనుగుణముగా నడచుకొనలేదు. (౧) కాం గ్రెసురాజీ, (౨) జాతీయపక్షపునర్నిర్మాణము, (౩) హోంరూలాందోళనా ప్రారంభము—ఇదీ తిలకు త్రివిధకార్యక్రమము. వీటిలో మొదటి విషయమునకు సంబంధించి తిలకును, ఆయనమిత్రులును కాంగ్రెసుప్రతినిధుల నెన్నుకొనే నిర్వాచకవర్గములు పెద్దవి చేయబడవలెనని కోరిరి. అప్పటి నిబంధనావళినిబట్టి ఎన్నిక కొన్ని సంస్థలకును, కొన్ని సంఘములకునుమాత్రమే వర్తింపచేయబడుతూ ఉండెను. అప్పటి కాంగ్రెసు నియమావళిలోని ప్రథమసూత్రమును సాధారణసమావేశములో నంగీకరించిన రాజకీయసంఘములు గాని, లేక ప్రజాసంస్థలు గాని కాంగ్రెసుప్రతినిధుల నెన్నుకొనవచ్చును. అంతేకాక అదనముగా కాంగ్రెసుప్రథమసూత్రము నంగీకరించిన సంస్థలలో ముందు చేరబోవు సభ్యులకుగూడ ఆనియమము వర్తించును. మితవాద సిద్ధాంతముతో కూడిన వలసరాష్ట్రస్వపరిపాలన మాసూత్రములో నుదాహరింపబడిన ఆదర్శము. కాబట్టి కాంగ్రెసుప్రతినిధుల యెన్నిక కేవలము మితవాదిసంఘముల చేతులలో నుండెను. జాతీయవాదులు కాంగ్రెసుకు ప్రతినిధులు కావలెనన్నచో, వారి ప్రతికక్షులైన మితవాదుల దాక్షిణ్యముపైన ఆధారపడవలసియుండెను. కాబట్టి కాంగ్రెసునియమావళిలోని ౨౦ వ నిబంధన విస్తరింపచేయబడవలసియుండెను. ఇందుకోసము బెసెంటును, జెనరల్ కార్యదర్శి సుబ్బారావుపంతులును ౧౯౧౪ డిసెంబరు మొదటి వారములో పూనాకు పోయి తిలకు, గోఖ్లే మొదలగువారితో సంప్రతించిరి. వారందరును గలసి ఆ నిబంధన కొక మార్పు చేయతలపెట్టిరి. తరువాత సుబ్బారావుపంతులు బొంబాయి పోయి సర్ ఫిరోజిషాతో సంప్రతించెను. కాని ఆయన కాశాభంగము కలిగినది. మరల ఆయన గోఖ్లే, తిలకులను కలుసుకొనెను. తిలకు తిరిగీ కాంగ్రెసులో చేరినయెడల పాత తగాదా మరల తలయెత్తునని గోఖ్లేఅభిప్రాయము. ఆయన ఆవిషయమును బెసెంటుకు మాటలలో చెప్పి తా నిదివరకు ౨౦ వ నిబంధనను మార్చుట కిచ్చిన అంగీకారము నుపసంహరించుకొనెను. ౧౯౧౫ లోని ౧౯ వ కాంగ్రెసున కెన్నుకొనబడిన అధ్యక్షుడు వ్రాసిన ఉత్తరమునకు జవాబుగా గోఖ్లే ఒకరహస్యలేఖను పంపెను. అందులో ఆయన తా నెందుకు నిబంధనావళిని మార్చుట కంగీకరించుటలేదో కారణములను వివరించెను. కాని ఆయుత్తరము త్వరలోనే రచ్చ కెక్కినది. తిలకు బహిరంగముగా ప్రభుత్వ బహిష్కరణపద్ధతిని ప్రబోధింప తలపెట్టెననీ, ఆయన కాంగ్రెసులో చేరినయెడల ఐర్లండు దేశపుపద్ధతిప్రకారము ప్రతిరోధము ప్రారంభించునని ఆ యుత్తరములో నుదాహరింపబడియుండెను. బెసెంటు దీనిలోని నిజమును కనుగొనవలెనని తిలకును విచారించగా అది సత్యదూరమని ఆయన చెప్పెను. తరువాత తిలకుకు క్షమాపణ చెప్పబడినది. కా రాజీప్రయత్నము లంతటితో ఆగిపోయినవి. బెసెంటు కాంగ్రెసునియమావళిలో

చేయదలచుకొనిన మార్పునకు బొంబాయి సమ్మేళన (Conventionist) నాయకులు కేవలము వ్యతిరేకులుగా నుండిరని యన్. సుబ్బారావుపంతులు ౧౮-౨-౧౫ తేదీ న్యూఇండియాపత్రికలో ప్రకటించెను.

మితవాదులను, జాతీయవాదులను కాంగ్రెసుయొక్క ఏకచ్ఛత్రాధిపత్యము క్రిందకు తీసికొనిరావలె నని బెసెంటుచేసిన ప్రయత్నములు భగ్నములైన విధానమును గూర్చి ఇంతవరకును చెప్పియుంటిమి. పిమ్మట ౧౯౧౫ ఫిబ్రవరి ౧౯ వ తేదీని భారతదేశమును దుఃఖసముద్రమున ముంచి గోఖ్లే అకాలమరణమును పొందెను. తిలకు మహాశయునకు తన రాజకీయప్రతికక్షియైన గోఖ్లేయెడల అపూర్వగౌరవము కలదు. లోకమాన్యుడు గోఖ్లేమరణమునుగూర్చి అనాడు శ్మశానవాటికలో చేసిన యుపన్యాసము శ్రోతలను పులకాంకితులను చేసెను.

"ఇవి కరతాళధ్వనులకు సమయము కాదు. ఇది బాష్పాంజలులను విడువవలసిన తరుణము. ఈ భారతభాగ్యరత్నము, ఈ మహారాష్ట్రదేశపు మణిపూస, ఈ ప్రజాసేవకాగ్రగణ్యుడు, నేడీ శ్మశానవాటిలో నిరంతరవిశ్రాంతిని పొందెను. మీ రాయనను చూచి అనుకరింప ప్రయత్నింపుడు. ఆయనజీవితము మీ కందరకును అనుసరింపదగిన ఆదర్శము. ఆయనమృత్యువువలన కలిగిన ఈలోపమును మీ అనుకరణమున పూరింపుడు. ఈ విధముగా మీ రాయనఅడుగుజాడల ననుసరింపగలిగినయెడల పరలోకములోనైనను ఆయన కానందము కలుగగలదు." అని ఆయన ఉపన్యసించెను.

౧౯౧౫ మే ౮ వ తేదీని రాష్ట్రీయమహాసభలో గోఖ్లేకుటుంబమునకు సానుభూతితీర్మానమును ప్రతిపాదిస్తూ గోఖ్లే ప్రజాజీవితము నారంభించుటకు తానుకూడ కొంత బాధ్యుడనని లోకమాన్యుడు చెప్పెను.

౧౯౧౫ లోను, ౧౯౧౬ లోనుకూడ తిలకు తన పక్షనిర్మాణమున కత్యంత శ్రద్ధతో పనిచేసెను. బలవత్తరమైన రాజకీయపక్షమునకు (౧) ఆకర్షణీయమైన ఒక నాయకత్వము, (౨) ప్రధానమైన ఒక లక్ష్యము, (౩) ఒక సంగ్రామసంకీర్తనము ముఖ్యాంగము లని ఆయనఅభిప్రాయము. తిలకు బాప్టిస్టాను తనకు ముఖ్యసహాయకునిగా చేసికొనెను. బాప్టిస్టా అధ్యక్షతక్రింద పూనానగరములో నొక వేయిమంది జాతీయవాదులు సమావేశమైరి. తరువాత కొలదికాలములోనే మితవాదిసమావేశము జరిగెను. ఆసభకు చాలా తక్కువ మంది హాజరైరి. కాని విల్లింగ్డన్ ప్రభువు దయచేసి ఆసభ నలంకరించెను. పూనా జాతీయవాదులసభలో "హోమ్‌రూల్" అనే సంగ్రామ గర్జనము బయలుదేరినది. భారతదేశము నీలక్ష్యమునకు తీసికొని పోవుటయే తిలకు

ఆదర్శము. సీమలోని కార్మికనాయకులద్వారా "హోమ్‌రూల్" బిల్లును పార్లమెంటులో ప్రవేశపెట్టించి తాను తీవ్రమైన ప్రచారము ప్రారంభించవలెనని తిలకుతలంపు.

౧౯౧౫ కాంగ్రెసు బొంబాయిలో సమావేశము కావలసియుండెను. రాజీ సూచన లన్నియు భగ్నము లగుటచే అది కేవలము మితవాదికాంగ్రెసుగానే ఉండెను. కాంగ్రెస్ ముందు జరుగనున్న దినగా సర్ ఫిరోజిషా మెహతా స్వర్గస్థు డయ్యెను. సర్ సత్యేంద్రప్రసిన్హా ఆకాంగ్రెసు అధ్యక్షుడుగా ఎన్నుకొనబడెను. ఆయనపాండిత్య ప్రాముఖ్యము లపూర్వములు. ఆయనకు కాంగ్రెస్‌ఉద్యమముతోగల సంబంధము బహుస్వల్పము. కాని ఆయన భారతప్రభుత్వములో, పూర్వము లా మెంబరుపదవిలో నుండి సగముకాలమైనను పని చేయక దానిని తృణీకరించినకారణమున ఆయనకు కలిగినయశస్సు బొంబాయి కాంగ్రెస్‌కు ప్రతిష్ఠ తెచ్చినది. కాని, ఆయన ఈసనాతన ధర్మమును నిర్వర్తించుట కది క్రొత్త. ఆయనచుట్టు నున్న వయోవృద్ధులగు కాంగ్రెసువాదుల సలహాలు కాయన యెక్కువగా లోబడెను.

జాతీయవాదులదృష్టిప్రకారము సిన్హా అధ్యక్షోపన్యాసము కేవలము ప్రతికూలముగా నుండెను. ఆయన భారతదేశమును అంగవైకల్యమునుపొందిన రోగిగా వర్ణించెను. ఆయనభావము ననుసరించి "భారతదేశపు భవిష్యదాదర్శము భారతసంతానముయొక్క వాంఛాదర్శములను సహేతుకముగా సంతృప్తిపరచగలిగినదిగను, భారతప్రభువుల కంగీకారమైనదిగను" ఉండవలె నని ఆయన ప్రకటించెను. ఆయనపూర్వాచారపరాయణత్వమునకు మేర లేదు.

కాని సూరతుకాంగ్రెసుభంగానంతరము తిరిగీ కాంగ్రెసువ్యవహారములలో నూతనోత్సాహము బొంబాయి కాంగ్రెసులోనే కలుగ ప్రారంభించిన ట్లనేకసూచనలు కనబడినవి. తరువాత జరిగిన లక్నో కాంగ్రెసులో కాంగ్రెస్ పలుకుబడి మరింత తెలిసివచ్చినది. బొంబాయిమహాసభకు ౨౨౫౯ మంది ప్రతినిధులు సమావేశమైరి. అక్కడ వివిధవిషయములకు సంబంధించిన తీర్మానములు చేయబడినవి. మొదటి నాలుగు తీర్మానములును గోపాలకృష్ణగోఖ్లే, ఫిరోజిషా మెహతా, సర్ హెన్రీకాటన్, కేర్ హార్డీల మరణములకు చింతిల్లుచూ చేయబడినవి. కేర్ హార్డీ భారతజాతికి మిత్రుడు. ఆయన పార్లమెంటుబయటను, లోపలనుకూడ భారతదేశక్షేమమునుగూర్చి పోరాడిన ఉదారాశయుడు. తక్కినవారు ముగ్గురును కాంగ్రెస్‌పూర్వాధ్యక్షులు. అయిదవతీర్మానము ప్రజల రాజభక్తిని వెల్లడించెను. ఆరవతీర్మానములో ఇంగ్లీషువారును తక్కిన మిత్రమండలివారును ధర్మసంస్థాపనార్థము పూనుకొనిన కార్యమునకు కాంగ్రెసు తన అంగీకారమును తెలుపుచూ, బ్రిటిషునావికాదళము చేసిన ఘనకార్యములకు సంతోష

మును వెల్లడించినది. ఏడవ తీర్మానములో హార్డింజిప్రభుని అధికారకాలపరిమితిని హెచ్చించవలసినదిగా ప్రార్థింపబడెను. ఇక ఎనిమిదవతీర్మానములో భారతీయులను సైనికవాలంటరీదళములలో చేర్చుకొనుటయు, వారికి ప్రస్తుతమున్న నావికాసైనికకళాశాలలలో శిక్షణ మిప్పించుటయు, భారతదేశములో నూతనముగా కొన్ని సైనికశిక్షణాలయములను నిర్మించుటయు అవసరమును, న్యాయమును అని వెనుకటికాంగ్రెసు తీర్మానముల అభిప్రాయము పునశ్చరణముచేయబడినది. జాతి మత కులవిచక్షణ లేక భారతీయులందరును పౌరసైనికులుగా చేర్చుటకు హక్కుండునట్లు స్వచ్ఛందసైనిక నిర్మాణపద్ధతి మార్పుచేయబడవలె నని కూడ ౮ వ తీర్మానములో కోరబడినది. ఆయుధచట్టము (౧౮౭౮ వ సంవత్సరపు ౯ వ చట్టము) ప్రజల కపకీర్తికరముగా నున్నదని ౯ వ తీర్మానములో నిరసనభావము వెల్లడింపబడినది. ౧౦ వతీర్మానములో దక్షిణాఫ్రికాదేశములలో నివసించే భారతీయులకు ప్రతికూలముగా చేయబడిన చట్టములనుగూర్చి విచారము తెలుపబడినది. సామ్రాజ్యమహాసభ (Imperial Couference)కు భారతదేశముపక్షమున ప్రతినిధులను పంపుటకు సామ్రాజ్యశాసనసభలో చేయబడిన తీర్మానమునకు ప్రాయి రాజకీయమారదృష్టితో సహాయపడినందున అయనకు ౧౧ వ తీర్మానములో కృతజ్ఞతాభివందనము లర్పింపబడినవి. సామ్రాజ్యశాసనసభలోని ఎన్నికసభ్యులలోనుండి ఎన్నుకొనబడిన ఇరువురు ప్రతినిధులను సామ్రాజ్యమహాసభ కిండియాపక్షమున ప్రాతినిధ్యము వహింపనీయవలెననికూడ ౧౧ వ తీర్మానములో ప్రభుత్వమువారు ప్రార్థించబడిరి. ౧౨ వ తీర్మానములో సంయుక్తరాష్ట్రప్రభుత్వమునకు కార్యనిర్వాహకసంఘము కోరబడెను. ౧౩ వ తీర్మానములో కంట్రాక్టు కూలీ (Indentured Labour) పద్ధతి రద్దుచేయబడవలెనని ప్రార్థింపబడెను. ౧౪ వ తీర్మానము నిరంతరాయముగా వస్తూన్న న్యాయ, కార్యనిర్వాహకశాఖల విభజనమునుగూర్చినది. ౧౫ వ తీర్మానము బర్మా, పంజాబు, మధ్యరాష్ట్రములలో హైకోర్టులసంస్థాపనమునుగూర్చి చేయబడెను. ౧౬ వ తీర్మానము స్వదేశీయోద్యమమును ప్రోత్సహించినది. ౧౭ వ తీర్మానము ముద్రణాశాసనమును కొనసాగించుటనుగూర్చి ప్రతిఘటించినది. ౧౮ వ తీర్మానములో భారతప్రజల క్షేమమునిమిత్తము ఎగుమతిదిగుమతులపైనను, దేశీయపరిశ్రమలపైనను వేయబడుపన్నుల విషయములోను, ఇతరసందర్భములలోను భారతప్రభుత్వమున కార్థికస్వాతంత్ర్యముండవలయునని తీర్మానింపబడినది. ౧౯ వ తీర్మానము చాలా ప్రాముఖ్యమైనది. స్వపరిపాలనమునకు కావలసిన సంస్కరణవిధానమందులో సూచించబడినది; రాష్ట్రీయస్వాతంత్ర్యమును ప్రవేశపెట్టుటమూలకముగా ప్రజలకు తగిన అధికారము లభింపజేయవలెనని కోరబడినది; శాసనసభ లిదివరకే ఉన్నచోట్ల వాటి నింకను పెద్దవిగా జేసి

సంస్కరించుటకును, శాసనసభలు లేని రాష్ట్రములలో వాటిని నిర్మించుటకును, ప్రస్తుతము ఉన్న కార్యనిర్వాహకసంఘములను సంస్కరించుటకును, అవి లేని రాష్ట్రములలో వాటిని నిర్మించుటకును ప్రభుత్వమువా రాతీర్మానమునందు కోరబడిరి. ఇండియాకౌన్సిలు రద్దుచేయబడుటో, లేక సంస్కరింపబడుటో జరుగవలెననీ, స్థానిక స్వపరిపాలన మింకను వృద్ధిపొందవలెననీకూడ ఆతీర్మానములో సూచింపబడెను. అఖిల భారత కాంగ్రెస్ సంఘమువా రొక సంస్కరణప్రణాళికను తయారుచేసి ప్రజలలో నిరంతర ప్రచారప్రబోధములకు వలయు ఏర్పాట్లు నొనరించుటకు కోరబడిరి. ఈ విషయమునుగూర్చి అఖిలభారత మహమ్మదీయమహాసభాస్థాయిసంఘముతో ఆలోచించి అవసరమైనచర్య నడిపించుటకుకూడ వారి కధికార మియ్యబడినది.

౨౦ వ తీర్మానములో ప్రభుత్వమువారి భూమిశిస్తుకు న్యాయ్యమైన పరిమితి నిర్ణయింపబడవలయుననీ, రైతువారీప్రదేశములలోను, జమీందారీప్రదేశములలోను కూడ పర్మనెంటు సెటిల్‌మెంటుపద్ధతి ప్రవేశపెట్టబడవలె ననీ, ఒకవేళ అది వీలులేనియెడల ౬౦ సంవత్సరముల కొకపర్యాయము భూమిశిస్తులు నిర్ణయింపబడవలెననీ కోరబడెను. ౨౧ తీర్మానము దేశీయపరిశ్రమాభివృద్ధికి సంబంధించినది. అందులో పారిశ్రామిక వృత్తివిద్యల కవకాశము కల్పింపబడవలెననీ, ఎగుమతి దిగుమతులపైనను, దేశీయపరిశ్రమలపైనను వేయబడుపన్నుల విషయములో ఆర్థికస్వాతంత్ర్య ముండవలయుననీ, దేశీయపారిశ్రామికుని ప్రయోజనములకు భంగకరముగా విదేశీయునిప్రోత్సహించుటకు కల్పింపబడిన రైల్వేరేట్లవ్యత్యాసము తొలగింపబడవలెనని నిర్ణయింపబడెను. ౨౨ వ తీర్మానము ఇంగ్లండులోని భారతీయవిద్యార్థిశాఖ కనంగీకారము సూచిస్తూ యునైటెడ్‌కింగ్‌డమ్‌లోని విద్యాసంస్థలు భారతీయవిద్యార్థుల ప్రవేశమును నిరోధించడమును గూర్చి, ప్రవేశపెట్టుకొనబడిన విద్యార్థుల విషయములోకూడ అన్యాయమైన భేదభావములను కనబరచుటను గూర్చి అసంతృప్తిని వెల్లడించినది. తక్కిన నాలుగు తీర్మానములును సామాన్యవిషయములకు సంబంధించినవి. అవి కార్యదర్శుల ఎన్నిక, సీమలో వెడ్డర్‌బర్న్ మొదలగు బ్రిటిషుమిత్రులు చేసినసేవలకు కృతజ్ఞతాభివందనసమర్పణము, ఇండియాపత్రికపోషణము, కాంగ్రెసు నిర్మాణసంస్కరణములను గూర్చి చేయబడినవి. తరువాతి కాంగ్రెస్ లక్నోలో జరుగవలెనని నిర్ణయించబడినది.

౧౯౧౫ లో చేయబడిన ఈతీర్మానములు, కాంగ్రెసుపుట్టిన ౧౮౮౫ మొదలు ఆనాటివరకును సమావేశమైన అన్నికాంగ్రెసులలోను చేయబడిన అన్నితీర్మానముల యొక్కయీ సంగ్రహస్వరూప మని పాఠకు లిప్పటికి తెలిసికొనియుందురు.

౧౯౧౫ లో బొంబాయి కాంగ్రెసులో చేయబడిన ౧౯ వ తీర్మానము అఖిల భారత మహమ్మదీయమహాసభా కార్యనిర్వాహకులతో సంప్రతించి భారతస్వపరిపాలనప్రణాళికను తయారుచేయుటకు అఖిలభారత కాంగ్రెసుసంఘమువారి కధికార మిచ్చినదనిమాట మన మిప్పుడు తెలుసుకొనియుంటిమి. నిజముగా ౧౯౧౩ కరాచీకాంగ్రెసులో ప్రదర్శింపబడిన హిందూమహమ్మదీయ సుహృద్భావమున కీ తీర్మానము పరిపక్వదశ.

౧౯౧౫ కాంగ్రెసులో గాంధీ విషయనిర్ధారణసభ కెన్నుకొనబడకపోవుటవలన అధ్యక్షుడు తన అధికారమును వినియోగించి ఆయన నాసభకు సభ్యునిగా నియమించెను. ఇది ఆనాడు జరిగిన యొక విచిత్రసంఘటనము.

బొంబాయికాంగ్రెసులో ఒక ముఖ్యవిషయముమాత్రము జరిగినది. జాతీయ ప్రతినిధుల ప్రవేశమునకు వీలగునట్లుగా కాంగ్రెసునియమావళిలో మార్పుచేయబడినది. అందువలన ౧౯౧౫ డిసెంబరు ౩౧ వ తేదీకి వెనుక రెండేండ్లనుండి పనిచేస్తూన్న యే సంఘపు యాజమాన్యముక్రింద జరుపబడిన బహిరంగసభయైనను దేశీయమహాజనసభకు ప్రతినిధుల నెన్నుకొని పంపవచ్చును. కాని సక్రమమార్గములతో బ్రిటిష్‌సామ్రాజ్యాంతరస్థస్వపరిపాలనమును భారతదేశమునకు సంపాదించుట ఆసంఘోద్దేశములలోనొకటై యుండవలెను. ఇది జరిగిన వెంటనే "ఈసగము తెరువబడిన ద్వారమునుండి వెంటనే తినపక్షమువారు కాంగ్రెసులో ప్రవేశింప నిచ్ఛగించి"రని తిలకు బహిరంగప్రకటనము చేసెను.

# 2· ఏకోన్ముఖమైన కాంగ్రెస్

## ౧౯౧౬

[తిలకు హోమురూలుసభ - తిలకు జయాపజయములు, హిందూమహమ్మదీయ సమాఖ్య - ౧౯ మంది భారతశాసనసభ్యుల విజ్ఞప్తి - బెసెంటుగారి అఖిలభారత 'హోమ్ రూలు' సభ - లక్నోసభలో తిలకు - కాంగ్రెసు తీర్మానములు.]

క్రిందటి సంవత్సరముకంటె ఈసంవత్సరము కాంగ్రెసుకార్యక్రమ మెక్కువగా జరుగుటకు తగిన శుభపరిస్థితు లేర్పడినవి. కాని నిజము ౧౯౧౫లో గోఖ్లే, మెహతాల నిరువుర మహాపురుషులను కోల్పోవుటమాత్రము భారతదేశమునకు తీరనికొరత. తిలకు కప్పటి కింకను కాంగ్రెసులో స్థానములేదు. క్రిందటి సంవత్సరము బొంబాయిమహాసభలో జరిగిన గాడీపరతుల ప్రకార మాయన కాంగ్రెసును తనయాజమాన్యముక్రిందకు తీసికొనిరాగలుగుటకు మరియొక సంవత్సరము వేచియుండవలసియుండెను. కాబట్టి వెంటనే ఆయన "హోమ్‌రూలు" సభపైపునకు తనదృష్టి మరల్చెను. ఆయనవిజ్ఞానము, ఆయన సమర్థత, ఆయన సేవాపరత్వము, ఆయన త్యాగబుద్ధి-ఈ అన్నీ ఆసమయమున కాయన నాయకత్వము వహించుటకు తగియుండెను. సీమకు రాయబారము పంపించే యేర్పాటు చేయవలసినదని కాంగ్రెసును ఆయన పదేపదే కోరెను. కాని ప్రయోజనము లేకపోయినది. కాబట్టి ఆయన ౨౩-౪-౧౯౧౬ న మొట్టమొదటి హోమ్‌రూలుసభను స్థాపించెను. తరువాత ఆరునెలలకు బెసెంటు అఖిల భారత హోమ్‌రూలుసభను స్థాపించెను.

కాని ప్రభుత్వ మాయనకు ప్రబలశత్రువు. తిలకు విద్యార్థులను రక్షణసైన్యములో చేరవలసిన దని ప్రబోధించినందుకు పంజాబుప్రభుత్వమువా రాయనపైన ఢిల్లీ పాంచాలరాష్ట్రములలో ప్రవేశించరా దని నిషేధపుటుత్తరువులను జారీచేసిరి.

కాంగ్రెస్ప్రధానసూత్రమునే ఆయన హోమ్‌రూలులీగుకుకూడ అంగీకరించెను. ఇది శాస్త్రికి చాలా సంతోషదాయక మైనదట. ౧౯౧౬ లో ఆయన కరువది సంవత్సరములు నిండినవి. ఆయన షష్టిపూర్త్యుత్సవసందర్భమున లక్షరూపాయి

లాయనకు బహుమతి చేయబడినవి. ఆ మొత్తమును ఆయన జాతీయోద్యమమునకు సమర్పించెను. ప్రభుత్వమువా రాయనను నిర్బంధించినకొలది ఆయన తీవ్రరూపమును తాల్చెను. "ఆయనను ఖైదుచేయుటకంటె నోటికి తాళమువేయుట మంచి"దని యోచించి, ఆయన సొంతముగా రు. ౨౦, ౦౦౦ లకును, మరియిద్దరు చెరి రు. ౧౦, ౦౦౦ లకును ఆయన సత్ప్రవర్తనముకొరకు పూచీపడవలె నని మేజస్ట్రేటు కోరెను. కాని హైకోర్టువా రాయుత్తరువును ౯-౧౧-౧౯౧౬ న రద్దుచేసిరి. ఇది కూడ ఆయనప్రజానురంజకత్వమును పెంపొందించుటకే ఉపయోగపడినది. తిలకు గౌరవార్థము సభలు జరుపబడినవి; ఉత్సవములు చేయబడినవి; బహుమానములు సమర్పింపబడినవి. కాని ఆయన శారీరకముగా దుర్బలుడు. ఆదుర్బలత్వమే ఆయన యావద్భారతదేశములో వాయువేగమనోవేగములతో సంచారము చేసి ప్రజల నుద్రేకపూరితులనుగా నొనర్చుటకు తీరని అభ్యంతరము కల్పించినది. ఈపని ఆయనకన్న వయోవృద్ధురాలును, సుప్రసిద్ధురాలును నగు మరియొకరికి వదలివేయబడెను. ఆమె శ్రమ యెరుగదు. విశ్రాంతి కోరదు. ఆమెకార్యరంగ మెన్నడును మేఘావృతము కాలేదు.

౧౯౧౬ లోని భారతదేశము నాయకుడులేని పడవవలెను, దారములేని గాలిపటమువలెను ఉండెను.

సరిగా ఈసందిగ్ధసమయముననే బెసెంటు కార్యరంగమున దుమికినది. ఆమె మతమునుండి రాజకీయములలోకీ, దివ్యజ్ఞానమునుండి 'హోమ్‌రూలు' లోకీ ఒక్కసారిగా దుమికినది. ఆమె 'న్యూఇండియా' యను దినపత్రికను, 'కామన్‌వీల్' అను వారపత్రికను ప్రారంభించినది. 'హోమ్‌రూల్' అనే కేక యామెనోటినుండియే మొట్టమొదట యావద్భారతదేశమునందును ప్రతిధ్వనించినది. ౧౯౧౫ లోనే 'అఖిల భారత హోమ్‌రూలులీగు' సంస్థాపనమును గూర్చిన చర్చ వచ్చినది. కాని ఆసంవత్సరపు కాంగ్రెసే స్వపరిపాలనాప్రయత్నమునకు ప్రత్యక్షముగా పూనుకొనునేమో చూడవలెనని అప్పటి కావిషయము ఆపివేయబడినది.

బొంబాయికాంగ్రెసువారు నిర్ణయించిన కాంగ్రెసు ముస్లిమ్ సభా ప్రతినిధుల సమావేశము తరువాత జరిగినది. ఉభయ సంఘముల నాయకులకును సంతృప్తికరమైన సమాఖ్య కుదిరినది. ఒక రాజ్యాంగ ప్రణాళికను తయారు చేయుటకు ఉభయ సంఘ ప్రతినిధులును గల ఒక కమిటీ నియమింపబడినది. సామ్రాజ్యాంతరస్థ స్వపరిపాలనా నిర్మాణ ప్రోత్సాహమునకు వలయు అన్ని యేర్పాట్లును చేయుటకు వారి కధికార మీయబడినది. ఈ కమిటీచే సిద్ధము చేయబడిన చిత్తుప్రణాళిక ౧౯౧౬ సంవత్సరము లక్నోలో కాంగ్రెస్‌ముస్లిమ్ లీగులచే నంగీకరింపబడవలసి యుండెను.

అలహాబాదులో పండిత మోతీలాల్ ఇంట్లో ౧౯౧౬ ఏప్రిల్ ౨౩, ౨౪, ౨౫ తేదీలలో జరిగిన అఖిలభారత కాంగ్రెస్ సంఘ సమావేశములో హిందూ మహమ్మదీయ సఖ్యమును గూర్చి చర్చించబడినది. పండిత మోతీలాల్ ఆ అఖిలభారత కాంగ్రెసు సంఘములో సభ్యుడు. ౧౯౦౭ సూరతు కాంగ్రెసులో రసవిహారీఘోషు అధ్యక్షతను ఆమోదించిన యీ పండిత మోతీలాల్ నెహ్రూ పేరు తిరిగి ౧౯౧౫ వరకును ఎక్కడను వినపడలేదు. అఖిలభారత కాంగ్రెస్ సంఘమువారిచే అలహాబాదులో తాత్కాలికముగా నామోదింపబడిన సూచనలు అఖిలభారత కాంగ్రెస్ సంఘము, మస్లిమ్ లీగ్ కార్య సంఘములలో కలకత్తా నగరమున ౧౯౧౬ అక్టోబరులో ఆలోచించబడినవి. పూర్తిగా తర్జన భర్జనలు జరిగిన పిమ్మట రెండు సంఘములవారును సమాఖ్య కుదుర్చుకొనగలిగిరి. వంగ పాంచాల రాష్ట్రముల విషయము మాత్రము లక్నో కాంగ్రెసుకు వదిలివేయబడెను. కలకత్తాలో జాయింటు కమిటీవా రంగీకరించిన ప్రణాళిక లక్నో కాంగ్రెసులో నంగీకరింపబడినది. ౧౯ మంది అఖిలభారత శాసనసభా ప్రతినిధులు సంతకములు చేసి భారత స్వపరిపాలనా రాజ్యాంగ ప్రణాళికతో గూడిన ఒక విజ్ఞాపనమును ౧౯౧౬ నవంబరులో వైస్రాయికి పంపిరి. ఆ విషయము కాంగ్రెసు జరిగేనాటికే రాజకీయ నాయకులలోని అంతరంగికవర్గమునకు తెలుసును. ఈ విజ్ఞాపనమే తరువాత '౧౯ మంది విజ్ఞాపన' మని ప్రసిద్ధికెక్కినది (అనుబంధము ౧). ఆ విజ్ఞాపనముపైన ఇద్దరాంగ్లో ఇండియనులును, మద్రాసు నగరములో లేనివారును, ఇద్దరు మహమ్మదీయులును, ఒక సిక్కు మతస్థుడును తప్ప భారత శాసనసభలోని తక్కిన యెన్నిక సభ్యులందరును సంతకములు చేసిరి. భారత ప్రభుత్వమునా రదికరకు కొన్ని ప్రతికూల సూచనలను సీమకు పంపినట్లుగా ఈ సంతకములు చేసినవారికి తెలియవచ్చుటచే వా రావిజ్ఞప్తిని పంపవలసివచ్చె నని కొందరి విశ్వాసము.

కాంగ్రెసు వ్యవహారములు మందముగా జరుగుచుండుట బెసెంటుకు సంతృప్తికరముగా లేదు. జాతీయ మహాసభా బ్రిటిష్ సంఘము ఇంగ్లండులో కాంగ్రెసు పని చూచ్చూనేయున్నది. కాని అది అంత శ్రద్ధగా పనిచేయుటలేదు. బెసెంటు అచటి కాంగ్రెసు సంఘమునకు సహాయకారిగా నుండుటకై ఒక బలవత్తరమైన హోంరూలు సభను కూడ ౧౯౧౫ కాంగ్రెసులోని స్వపరిపాలనా తీర్మానము ననుసరించి లండనులో ౧౨-౬-౧౯౧౬ న స్థాపించెను. ౧౯౧౬ వ సంవత్సరం సెప్టెంబరు ౧ వ తేదీని ఆమె ఇండియాలో నొక హోంరూలు సంఘమును స్థాపించెను. అది మద్రాసులో గోఖ్లేహాలులో స్థాపింపబడినది. హిందుదేశ మంతటను దానికి శాఖలు కూడ యేర్పాటు చేయబడినవి. ఈ అన్ని సభల వలనను బెసెంటు మూడు సంవత్సర

ములవరకును అధ్యక్షురాలుగా నెన్నుకొనబడెను. ౧౯౧౭ వ సంవత్సరము చివరవరకును బెసెంటుచే సూచింపబడిన మార్గముల ననుసరించి ఆ సభ యేమీ తగాదా లేకుండ చక్కగా నడచినది. భారత దేశములో మొట్టమొదటి హోమ్‌రూలు సంఘము తిలకుచే పూనానగరమున ౨౩-౪-౧౯౧౬న స్థాపింపబడిన దని ఇదివరకే చెప్పియుంటిమి. తిలకు హోమ్‌రూలు సంఘమునకును, తన హోమ్‌రూలు సంఘమునకును భేదము తెలియుటకై బెసెంటు తన సంఘమునకు అఖిలభారత హోమ్‌రూలు సభ అని ౧౯౧౭లో నామకరణ మొనర్చెను.

౧౯౧౬ జనవరినెలలో తాను ప్రకటించిన ప్రకారము తిలకు లక్నో కాంగ్రెసులో చేరెను. ఆయన బొంబాయి రాజధానినుండి అధిక సంఖ్యాకులగు జాతీయవాదులను లక్నో కాంగ్రెసుకు రప్పించగలిగెను. అప్పటి నియమావళిని బట్టి విషయనిర్ధారణసభలో అఖిలభారత కాంగ్రెస్ సంఘ సభ్యులును వారి సంఖ్యకు సమాన సంఖ్యగా రాష్ట్రీయుల వారీగా కాంగ్రెసుకు హాజరైన ప్రతినిధులలోనుండి యెన్నుకొనబడినవారును సభ్యులుగా ఉండవలయు నని నిబంధన కలదు. ౧౯౧౬ లోని కాంగ్రెసు విషయ నిర్ధారణ సభలో గాంధికి స్థానము లభించుటను గూర్చి యొక చిత్రమైన కథ జరిగినది. సూరతు తగాదా తరువాత తిలకు తిరిగి కాంగ్రెసులో చేరినది ౧౯౧౬లోనే నని జ్ఞాపక ముంచుకొనవలసి యున్నది. విషయ నిర్ధారణ సభలో ఎన్నిక సభ్యులుగా నుండవలసిన మనుష్యులను గూర్చి తిలకు మితవాదులకు చేసిన సూచనలను వా రంగీకరించలేదు. ఆకారణమున బొంబాయినుండి దిగిన జాతీయ వాద ప్రతినిధు లందరును గలసి వారిలో వారిని మాత్రమే ప్రతినిధులుగా నెన్నుకొన నిర్ణయించిరి. అంతట మితవాదులు, జాతీయవాదుల మధ్య ఎన్నిక జరిగినది. ప్రతి సందర్భములోను జాతీయ వాదులే యెన్నుకొనబడెను. గాంధీకి వ్యతిరేకముగా కూడ నొక జాతీయవాది పేరు సూచింపబడినది. గాంధీ ఓడిపోయెను. కాని గాంధీ గెలిచె నని తిలకు ప్రకటించెను.

లక్నో కాంగ్రెస్‌కు అధ్యక్షత వహించినది బాబూ అంబికాచరణమజుందారు. ఆయన పుటము పెట్టిన బంగారువంటి జాతీయ సేవకుడు. ఆయన భారత దేశమునకు చేసినసేవకు లక్నోలో ఆయనకు చూపబడిన మహత్తరగౌరవము తగియున్నది. గంగాప్రవాహమువంటి ఆయన అధ్యక్షోపన్యాసము పరంపరాగతమైన కాంగ్రెసు సంప్రదాయమునకు వన్నె తెచ్చినది. లక్నో కాంగ్రెసులో హిందూమహమ్మదీయసమాఖ్య పరిపూర్ణ స్వరూపమును తాల్చినది. కాంగ్రెస్ లీగు సంస్కరణ ప్రణాళిక లక్నోలో పూర్తిచేయబడినది (అనుబంధము ౨). ఇది లక్నో కాంగ్రెస్‌కు సంపూర్ణవిజయము.

హిందూ మహమ్మదీయసమాఖ్యకు కావలసిన ప్రారంభవిషయము లన్నియును అలహాబాదులో ౧౯౧౬ ఏప్రిలు మాసమున ముస్లింసభా కాంగ్రెసుకార్యవర్గసభల సమష్టిసమావేశములోను, తరువాత ఏప్రిల్ నెలలో కలకత్తానగరమునను చర్చించబడి యుండెనని మనము జ్ఞాపక ముంచుకొనవలసియున్నది. ఆ రెండు సభలలోను, వంగ పాంచాల రాష్ట్రముల సంబన్ధమున శాసనసభలలో నుండవలసిన మహమ్మదీయ ప్రాతినిధ్యమునుగూర్చి స్థిరపడలేదు. కాని ఆవిషయము లక్నో కాంగ్రెసులో స్థిర పరుపబడినది. ఆ సమాఖ్యకు సంబంధించిన వివరము లన్నియును ఈ పుస్తకముయొక్క మొదటిభాగములోని రెండవఅధ్యాయములో సాంఘికప్రాతినిధ్యసందర్భమున వ్రాయబడినవి. కాంగ్రెస్‌లీగ్ ప్రణాళికలోని ముఖ్యసిద్ధాంతముల ప్రకారము కార్యనిర్వాహకవర్గమువారు శాసనసభకు లోబడియుండవలెను. కాని శాసనసభలో ౧/౫ వంతు ప్రభుత్వనియోజితసభ్యు లుండవలసియేయుండెను. భారత రాజ్యాంగ కార్యవర్గ సభ రద్దుచేయబడవలెను. ఇటీవల కాంగ్రెసు పరుగెత్తుచున్న వేగమునుబట్టి ఇవన్నియును తప్పటడుగులుగా తోచవచ్చును. కాని ఈసంస్కరణముల నంగీకరించుటకే ప్రభుత్వమువారికి ధైర్యము చాలక, వారు మరియొక ప్రణాళికను సిద్ధము చేసిరి. ౧౯౧౭లోని రాజకీయపరిస్థితులనుగూర్చి వ్రాసేసందర్భమున దానిని వివరింతుము.

హిందూమహమ్మదీయసఖ్యమును పెంపొందించి స్వరాజ్యప్రణాళికను తయారు చేయగలిగిన లక్నో కాంగ్రెసు చరిత్రలో ప్రాముఖ్యస్థానము నాక్రమించిన దనుటకు సందేహము లేదు. ౧౯౦౭ నుండియును చీలిపోయిన కాంగ్రెసుపక్షములు రెంటికిని మరల సంఘీభావమును చేకూర్చిన విషయముకూడ తక్కువగా పరిగణింపబడినది కాదు. తిలకుకపర్దీలు రసవిహారిఘోష్, సురేంద్రనాథ బెనర్జీలతో కాంగ్రెసు వేదికపైన పరిసమానముగా ఒకరి ప్రక్క నొకరు కూర్చుండియుండుట నిజముగా చూడ ముచ్చటైనవిషయము. బెసెంటు హోమ్‌రూల్ పతాకలను చేతులలో పట్టుకొనిన తన ప్రధానసహాయకులను వాడియా, అరండేలుగార్లతో లక్నోకాంగ్రెసుకు ప్రత్యక్షమగుట మరువరాని సంగతి. మహమ్మదాబాదురాజా, మజ్హరుల్‌హక్కు, రసూల్ జిన్నావంటి సుప్రసిద్ధ మహమ్మదీయ నాయకు లాసభలో నుండిరి. గాంధీ, పోలకులు కూడ అచ్చట నుండిరి. లక్నో కాంగ్రెసువా రామోదించిన కాంగ్రెసులీగుప్రణాళికను తరువాత వెంటనే మహమ్మదీయసభవా రామోదించిరి.

బొంబాయికాంగ్రెసుకువలెనే లక్నో కాంగ్రెసుకుకూడ చాలమంది ప్రతినిధులు వచ్చిరి; ౨౩౦౧ మంది ప్రతినిధులు వచ్చిరి. విశాలమైన సభాభవనము పట్టినంత మంది ప్రేక్షకులుకూడ వచ్చిరి. కాంగ్రెసు నాలుగురోజులు జరిగినది. తీర్మానములు

మాత్రము సరిగా బొంబాయితీర్మానములవంటివే జరిగినవి. ఆయుధశాసనము, స్వచ్ఛందసైనికదళము, సైనికోన్నతోద్యోగములు, ముద్రణాశాసనము, కంట్రాక్టు కూలీపద్ధతి, వలసరాష్ట్రములలోని భారతీయులు, సంయుక్త రాష్ట్రములలో ప్రభుత్వ కార్యనిర్వాహకసభ, సామ్రాజ్యమహాసభలో భారతప్రాతినిధ్యము, పాంచాలము మొదలగు రాష్ట్రములలో హైకోర్టులనిర్మాణము, స్వదేశీయుద్యమము, జూరీవిచారణలకు సంబంధించిన తీర్మానము లన్నియును పూర్వపుకాంగ్రెసులలోవలెనే లక్నో కాంగ్రెసులోకూడ నంగీకరింపబడినవి. ౧౯౧౧ లో లక్నో కాంగ్రెసు కధ్యక్షత వహించిన బిషన్ నారాయణధారు, చాలాసంవత్సరములవరకును కాంగ్రెసుకు సాధారణ కార్యదర్శిగా పనిచేసిన డి. ఏ. ఖేర్, జి సుబ్రహ్మణ్యఅయ్యరుగార్ల మరణముల కా కాంగ్రెసు దుఃఖమును వెల్లడించినది. బీహారురాష్ట్రమునకు సంబంధించిన రెండు తీర్మానములు లక్నోకాంగ్రెసులో అంగీకరింపబడినవి. ఉత్తరబీహారురాష్ట్రము నందలి రైతులకును, ఐరోపీయతోటయజమానులకును గల పరస్పరసంబంధమును గూర్చి, అక్కడ కలిగిన భూసంబంధమైన తగాదాలను గూర్చి విచారణ చేయుటకు అధికారులును, అధికారేతరులునుగల మిశ్రమసంఘ మేర్పాటు చేయబడవలె నని ఒక తీర్మానమును, అప్పటికి సామ్రాజ్యశాసనసభలో చర్చకు వచ్చియున్న విశ్వవిద్యాలయచట్టమునకు సంబంధించిన మరియొకతీర్మానమును ఆమోదింపబడినవి.

ఉత్తర బీహారురాష్ట్రములోని రైతులకును, తోటయజమానులకును సంబంధించిన తీర్మానము చాలా ముఖ్యమైనది. మరుసంవత్సరమే గాంధీ బీహారురైతుల అసంతృప్తికిగల కారణములనుగూర్చి విచారించుట కారాష్ట్రమును దర్శించెను. ఆవిషయమునుగూర్చిన వివరములు తరువాత ఉదాహరింపబడును.

భారతస్వపరిపాలనమునుగూర్చిన తీర్మానములో "(ఎ) భారతదేశపు పురాతన నాగరికతను, విద్యావిషయములోను, ప్రజాసేవసంబంధమునను ఆదేశము పొందిన అభివృద్ధినీ గమనించి, ఘనతవహించిన చక్రవర్తిగారు త్వరలోనే భారతదేశమునకు స్వపరిపాలనమును ప్రసాదించుట బ్రిటిష్‌ప్రభుత్వమువారి ఉద్దేశమును, ఆదర్శమును అని ప్రకటింపవలెను. (బి) ఇందు కనుగుణముగా కాంగ్రెసులీగుప్రణాళికలోని హక్కులు ముందు ప్రసాదింపబడవలెను. (సి) సామ్రాజ్య పునర్నిర్మాణసమయమున భారతదేశమును పరాధీనరాజ్యముగా గాక, స్వపరిపాలితాధినివేశ రాజ్యములతోపాటు సామ్రాజ్యములో సమానభాగస్వామిగా నుండునట్లు చేయవలెను." అని కోరబడినది.

భారతరక్షణచట్టము (Defence of India Act) ౧౯౧౫ వ సంవత్సరము నాటి వంగరాష్ట్రపు మూడవరెగ్యులేషనులలోని అధికారము లతివిస్తారముగా నుప

యోగింపబడుతూన్న వని లక్నోకాంగ్రెసు భయమును వెల్లడించినది. భారతరక్షణ చట్టము నుపయోగింపవలసివచ్చినప్పు డెల్ల యునైటెడ్‌కింగ్‌డములోని రాష్ట్రరక్షణచట్టము (Defence of Realm Act) నం దుదాహరింపబడిన కార్యక్రమ మవలంబింపబడవలె నని ఆకాంగ్రెస్ వాదించినది. అనగా రాష్ట్రరక్షణచట్టము ప్రకారము ప్రభుత్వమువారు చేసిన నిందారోపణమును, దానికి నిర్బంధితుడు చెప్పిన సంజాయిషీయును హైకోర్టులోని ఒకలాయరు న్యాయమూర్తి, న్యాయవాదవృత్తి నవలంబించిన ఒక అనధికారసభ్యుడు, ఒక ఐ. సి. యస్. జడ్జిలతో గూడిన కమిటీచే ముందుగా విచారింపబడవలయును. వారివిచారణ పూర్తికానిదే నిర్బంధనివాసశిక్ష (Internment order) విధింపబడకూడదు. నిర్బంధితులకు న్యాయవాదుల ద్వారా వాదించుకొనుటకు తగిన అన్ని సౌకర్యములును కల్పింపబడవలెను. ౧౯౧౬ వ సంవత్సరపు వంగరాష్ట్రరెగ్యులేషను, తదితర రెగ్యులేషనుల సందర్భములలో కూడ ఇట్టి పద్ధతియే అవలంబింపబడవలె నని కోరబడినది. ఈ తీర్మానప్రతిపాదకులును, ఆమోదకులును అసాధారణాధికారశాసనము లతివిస్తారముగా నుపయోగింపబడుతూన్న వనీ, ఈ అధికారములక్రింద, భావికాలమున మంచి అభివృద్ధికి రాగలిగిన అనేకమంది నిరపరాధులగు యువకుల జీవితములు నాశనముచేయబడుతూన్న వనీ వివరించిరి. ౧౯౧౬ వ సంవత్సరపు మూడవరెగ్యులేషనుక్రింద నొక్క వంగరాష్ట్రములోనే ౮౭౯ మంది నిర్బంధింపబడిరనీ (Interned) ౬౦ మంది విచారణ లేకుండ జైళ్లలో నుంచబడిరనీ వివరింపబడినది. భారతరక్షణచట్టముక్రిందను, పాతరెగ్యులేషనులక్రిందను ప్రభుత్వమువా రవలంబించిన నిర్బంధవిధానము నీవిధముగా ప్రజలు ప్రతిఘటింప ప్రారంభించిరి.

కాంగ్రెస్ - ముస్లిమ్‌లీగుసభలు రెండును ఒక్కనగరముననే జరుపబడుపద్ధతి బొంబాయిలో ప్రారంభమై లక్నోలోకూడ కొనసాగినది. లక్నోకాంగ్రెసులో స్వపరిపాలన ప్రణాళిక ఆమోదింపబడిన వెంటనే దేశములో నున్న కాంగ్రెసుసంఘములును, తదితర ప్రజాసంస్థలును, సమ్మేళనములును దానినిగూర్చి ప్రచారము చేయవలసిన పని కూడ తీర్మానింపబడెను. ఈతీర్మానమున కనుగుణముగా నాలా ఆశ్చర్యకరమైనపని జరిగినది. ఒకరాష్ట్రమును మించి మరియొకరాష్ట్రము పనిచేయ తలపెట్టినది. ముఖ్యముగా మద్రాసులో దీనిని ప్రత్యక్షవాయుకత్వముక్రింద అద్భుతమైన ప్రచారము జరిగినది. మొదట లక్నోకాంగ్రెసు నాలా కష్టపరిస్థితులకు లోనైనది. ౧౯౧౬ వ సంవత్సరమున లక్నోలో కాంగ్రెసు జరుగవలసివచ్చిన సందర్భములో కూడ చెప్పవీలులేని కష్టములు తటస్థించినవి. కాని అవన్నియును ఆనాటి లెఫ్టినెంటు గవర్నరు సర్ ఆంథొనీమాక్డొనాల్డు వివేకమువలన తొలగిపోయినవి. ౧౯౧౭ లో

కూడ అటువంటి ఎక్కువ తటస్థించినది. సంయుక్తరాష్ట్రప్రభుత్వ కార్యదర్శులనుండి కాంగ్రెసు ఉపన్యాసములలో రాజద్రోహభావములు స్ఫురించకుండ చూడవలెనని ఆహ్వానసంఘమునకు మందలింపుటుత్తరము వచ్చినది. దానినకళ్లు వంగరాష్ట్రగవర్నరునకును, ఎన్నికొనబడిన అధ్యక్షునకును కూడ పంపబడినవి. ఆహ్వానసంఘమువారిట్టి అవసరావమానమునకు తగిన ప్రత్యుత్తరమును పంపిరి. అధ్యక్షుడా యుత్తరపుధోరణి ప్రత్యుత్తరమునకు కూడ తగ దని మిన్నకుండెను. ఆరోజులలోనే బీరారు బొంబాయి రాష్ట్రములనుండి బెసెంటు వెళ్లగొట్టబడెను. లక్నో కాంగ్రెసువేళకూడ ఆమె రాకతో కొంత ఆపత్తు రావచ్చునని అపోహ కలిగినది. అప్పుడుకూడ లెప్టినెంటుగవర్నరు సర్ జేమ్సు మెస్టన్ వివేకమువలన అన్నిచిక్కులును తప్పిపోయినవి. సర్ జేమ్సు, ఆయనభార్యా, వారిసిబ్బంది కాంగ్రెసుసభకు హాజరైరి. అధ్యక్షుడు వారి నాహ్వానిస్తూ యిచ్చిన యుపన్యాసమునకు సగౌరవముగా సర్ జేమ్సు ప్రత్యుత్తరమిచ్చెను.

# 3 బాధ్యతాయుత ప్రభుత్వము

## ౧౯౧౭

[ఆందోళనము ; నిర్బంధవిధానము - బెసెంటునిర్బంధము - అరండేల్ వాడియాలు - సామ్రాజ్యసంగ్రామమహాసభ - సాత్వికనిరోధము - అఖిలభారత కాంగ్రెస్ సంఘప్రకటనము - సాత్వికనిరోధమునుగూర్చి రాష్ట్రీయసంఘముల అభిప్రాయము - మాంటేగుప్రభుని ఆగస్టు ౨౦ వ తేదీ ప్రకటనము - భారతదేశమునకు అధినివేశరాష్ట్రప్రతిపత్తిని కోరిన కాంగ్రెసు - లీగు విజ్ఞప్తి - బిసెంటుతో కలిగినమార్పు - గాంధీ సత్యాగ్రహవిజయపరంపరలు - చాంపరాన్, కెయిరా, అహమ్మదాబాదు మిల్లుకూలీలు - కాంగ్రెసులీగుప్రణాళికకు సంతకములు - కాంగ్రెసుకు శాశ్వతనిధి - బిసెంటు అధ్యక్షురాలుగా నెన్నికొనబడుట - ఆమె అధ్యక్షోపన్యాసము, కాంగ్రెస్‌తీర్మానములు - రౌలట్ కమిటీ నియామకము - ఆంధ్రుల కాంగ్రెస్‌రాష్ట్రము - జాతీయపతాకము.]

భారతదేశములోని సాంఘిక భేదాభిప్రాయములు భారతరాజకీయాభివృద్ధికి నిరంతరమును ఆటంకముగా నున్నవి. ఇవి మున్ముందుగా మింటో ప్రభువు హయాములో తలయెత్తినవి. ౧౯౦౯ లో స్వపరిపాలనా ప్రణాళిక నిర్మింపబడినప్పు సమయమునాటి కీభేదములు ప్రభుత్వమువారి అధికారబలముచేగాక, హిందూమహమ్మదీయసంఘముల పరస్పరామోదమువలన సమసిపోవుట యెంతో అభీష్టము. ఇది రాబోవు రాజకీయపోరాటమునకు శుభశకునముగా పరిణమించినది. కాబట్టి ౧౯౧౬లో పరిశుద్ధహృదయములతోను, నిష్కళంకభావములతోను రాజకీయాందోళనము ప్రారంభింపబడినది. ౧౯౧౬ వ సంవత్సరములో "హోమ్‌రూల్" ఉద్యమసందర్భమున ప్రారంభమైన తీవ్రరాజకీయాందోళనమునమూలమున యావద్భారతదేశమునందును విద్యుద్వేగముతో జాతీయచైతన్యము కలిగినది. దీనితోపాటు పోలీసువారి కఠిననిర్బంధవిధానము కూడ నానాటికి పెరిగిపోయినది.

"హోమ్‌రూల్" అనే మంత్రము దేశములోని మారుమూలలకు కూడ పాకినది. దేశమంతటను హోమ్‌రూలుసభలు స్థాపింపబడినవి. బెసెంటుచేతులలోని పత్రికల మహాశక్తిముందు ముద్రణాశాసననిర్బంధములు దిగదుడుపు లైనవి. విద్యార్థులు రాజకీయాందోళనములో జోక్యము కలిగించుకొనరాదని పెంట్లండుప్రభువు ౫౪౯ జి.ఓ.ను జారీచేయించెను. హిందూపత్రికాసంపాదకు లయిన కస్తూరిరంగయ్యంగారికి పెంట్లండుప్రభువు కబురుపంపి అరగంటసేపు రాజకీయవిషయములనుగూర్చి చర్చించెను. రంగయ్యంగారు పూసగ్రుచ్చినట్లు నిష్కపటముగ అన్ని పరిస్థితులను గవర్నరుకు చెప్పివేసెను.

కాని 'న్యూ ఇండియా' దినపత్రికను, 'కామన్‌వీల్' వారపత్రికను నడుపుతూన్న బెసెంటు ముద్రణాశాసనముక్రింద రు. ౨౦,౦౦౦ ల ధరావతు నీయవలసివచ్చెను. ఆమె తరువాత ఆ ధరావతును పోగొట్టుకొనినది.

ఇంతలో 'హోమ్‌రూల్' భావము దేశములోని నాల్గుమూలలందును కారుచిచ్చువలె వ్యాపించుచుండెను. ౧౯౧౬ కాంగ్రెసులో "అనేకమంది స్త్రీలు తమ స్వభావానుగుణములగు త్యాగసహనములతోను, ధైర్యసాహసములతోను చేసిన సహాయమువలన 'హోమ్‌రూలు' ఉద్యమము పదిరెట్లు తీవ్రరూపమును తాల్చినది. మన ఉద్యమమునకు ఉత్తమసైనికులు భారతనారీమణులు. మద్రాసులో పురుషుల ఉత్సవము లాపివేయబడినప్పుడు స్త్రీలే ఉత్సవములముందు నడచిరి. అందుకు మద్రాసు మహిళామండలి గర్వించవలసియున్నది. వారిప్రార్థనలే నిర్బంధితుల స్వేచ్ఛకు కారణ

భూయిష్ఠములైనవి. దక్షిణభాగతదేశములోని పెద్దపెద్దదేవాలయములలో జరిగిన ప్రార్థనల వలన 'హోంరూల్' ఉద్యమము మతముతో లీనమైపోయినది. అందువలన ఆతత్త్వము సాధులు, సన్యాసుల ద్వారా గ్రామగ్రామములకును పాకిపోయినది' అని బెసెంటు చెప్పెను. ఇదిగాక ఆయుద్యమము మంత జయప్రదముగా వ్యాపించుటకు మరియొక కారణము కలదు. ఆ ఉద్యమప్రారంభమునాటినుండియు భాషాప్రయుక్త రాష్ట్ర సిద్ధాంత మంగీకరింపబడినది. అందువలన దేశములో ప్రచార మెక్కువగా జరుగుటకు వీలు కలిగినది. ఈవిషయములో సహజముగా కాంగ్రెసుకు అఖిలభారత హోమ్‌రూల్ లీగు మార్గదర్శకమైనది.

౧౯౧౭ జూన్ ౧౫ వ తేదీని బెసెంటు, జి. ఎస్. అరండేల్, బి.పి. వాడియా గార్లకు ప్రభుత్వమువారి శ్రీముఖము లందజేయబడినవి. వాటిలో సూచింపబడిన స్థలములలోను ఎక్కడైన వారు నిర్బంధముగా నివసించుట కిష్టపడెదరో తెలియ పరచవలసిన దని కోరబడిరి. కోయంబత్తూరు, ఉదకమండలములలో వా రుండుటకు నిశ్చయించుకొనిరి. ఈముగ్గురినిర్బంధములవలనను 'హోమ్‌రూలు' సభ యింకను ప్రజానురంజకసంస్థ యైనది. తక్షణము జిన్నాకూడ హోమురూలుసభలో చేరెను. ప్రభుత్వపు ఉత్తరువులను, 'నిగా'ను లక్ష్యపెట్టక బెసెంటు తన 'న్యూఇండియా' పత్రికకు స్వేచ్ఛగా వ్యాసములు వ్రాస్తూనేయుండె ననునది బహిరంగరహస్యము. 'కామన్‌వీల్' అనువారపత్రికకూడ నూతనముగా ప్రారంభింపబడినది. పి. కె. తెలాంగ్ న్యూయిండియాపత్రికా సంపాదకత్వమును వహించుటకు మద్రాసు వచ్చెను. తరువాత హిందూపత్రికకు సంపాదకత్వము వహించిన ఏ. రంగస్వామయ్యంగా రారోజులలో న్యూఇండియా సంపాదకునకు సహాయముచేసిరి. సి. పి. రామస్వామి అయ్యరుగారు తన శక్తిసామర్థ్యములను, కాలమునుకూడ హోమ్‌రూల్ సభలను స్థాపించుటకును, పత్రికా నిర్వహణకును వినియోగిస్తూఉండిరి. నాయకులు నిర్బంధనివాసమున రోజులు గడుపుచున్నకొలది రాజకీయాందోళన మంతకుపదిరెట్లెక్కువగా పెరిగిపోతూఉండెను. భారతదేశపరిస్థితులు తీవ్రరూపమును దాల్చినవి. కాని సీమలోని అధికారులు మాత్రము చలించలేదు.

భారతదేశములో నింత రాజకీయాందోళనము జరుగుచుండగానే సీమలో అధినివేశరాజ్య ప్రతినిధుల సహాయముతో సామ్రాజ్యసంగ్రామమహాసభ జరుపబడినది. ఆసభకు బికనీరుమహారాజా, సర్ యస్. పి. సిన్హాలు భారతదేశ ప్రతినిధులుగా పంపబడిరి. అచట వారి మర్యాద, వారి సంభాషణాసామర్థ్యము యీదేశపు ప్రజల నాకర్షించగలిగినవి. వారికి సన్మానములు చేయబడినవి. ప్రజాసంస్థలు వారిని గౌరవిం

చినవి. పత్రికలలో వారిపేరులు మారుమ్రోగెనవి. అంతకు పూర్వము రాజకీయసంస్క-
రణములనుగూర్చి బ్రిటిషు పార్లమెంటుకు నివేదించుకొనుటకు క్రిందివారినుండి రాయబారి-
వర్గమును పంపవలసిన దని కోరిన బ్రిటిషుకమిటీ సరిగా అప్పటికప్పుడే ఇంగ్లండులో
సమరసన్నాహములను సాగించవలె నని సూచించెను. ఇంగ్లండునకు రాయబారమును
పంపుటకును, లండనులో కాంగ్రెసు జరుపుటకును ఏర్పాట్లు చేసే నిమిత్తము
౩-౮-౧౮ న అఖిలభారత కాంగ్రెసుసంఘసమావేశ మొకటి జరిగెను. ఆ సమావేశము
రాయబారవర్గములో సురేంద్రనాథబెనర్జీ, డాక్టర్ రసవిహారీఘోష్, భూపేంద్రనాథ
బాసు, మదనమోహన మాలవ్యా, సర్ కె. జి. గుప్త, మహమ్మదాబాదు రాజా, తేజ
బహదూర్ సప్రూ, వి. యస్. శాస్త్రి, సి. పి. రామస్వామి అయ్యరులు సభ్యులుగా
నుండ కోరబడిరి. భారతరాజ్యాంగకార్యదర్శి సర్ ఆస్టెన్ ఛేంబర్లేనుచే స్వపరిపాలన
ప్రకటనము చేయించవలెననీ, సైనికశాఖలో భారతీయుల కున్న నిషేధము
తప్పించవలెనని బ్రిటిషుకమిటీ ప్రయత్నించినది. కాని ప్రయోజనము లేకపోయినది.
౮-౫-౧౮ న సర్ యస్. పి. సిన్హాసమ్ముఖమున ఒక సభ జరిగినది. ఆసభలో
జరిగిన చర్చలనుబట్టియే బ్రిటిషుకమిటీవారు క్రిందినుండి రాయబారవర్గము రావలెనను
అభిప్రాయమును మార్చుకొనిరి.

హోంరూల్ నిర్బంధితులను విడిపించవలె నని భారతదేశము సాత్వికనిరోధ-
మును సాగించ ప్రయత్నించుచుండెను. ౧౯౧౭ జూలై నెల ఆఖరున [illegible] అఖిలభారత
కాంగ్రెసుసంఘముయొక్కయు, ముస్లింలీగు యొక్కయు సమష్టిసమావేశము జరిగి-
నది. అందులో దాదాభాయినౌరోజీ (భారతపితామహుడు) మరణించినందుకు విచా-
రము మొదటితీర్మానముననే వెలిబుచ్చబడెను. సర్ [illegible] సలహానిచ్చెను. భారత
దేశములోని రాజకీయస్థితిని తెలియజెప్పుటకును, కాంగ్రెసులీగువారిచే అంగీకరింప
బడిన ప్రణాళికననుసరించి ప్రచారము చేయుటకును సెప్టెంబరు మధ్యలో ఇంగ్లండు-
కుపోయేనిమిత్తము జిన్నా శాస్త్రి సప్రూ వజీరుహస్సేనులతో కూడిన ఒకకమిటీ ఏర్పాటు
చేయబడినది. ఆరాయబారివర్గమునందు శాస్త్రి యుండజాలనిచో ఆయనకు బదు-
లుగా సి. పి. రామస్వామి అయ్యరు పేరు సూచింపబడినది. సాత్వికనిరో-
ధము రాజకీయకార్యక్రమమునకు సిద్ధాంతములోగాని, ఆచరణలోగాని ఎంతవర-
కుపయోగకరమో ఆలోచించి ఆరువారములలో కాంగ్రెసుసాధారణకార్యదర్శులకు
తెలియపరచవలసిన దని రాష్ట్రీయ కాంగ్రెసు సంఘములును, మహమ్మదీయసభా కార్య-
నిర్వాహకులును కోరబడిరి. బెసెంటు వాడియా అరండేలులను నిర్బంధించినందుకు
కలకత్తాలో రసవిహారీఘోష అధ్యక్షతక్రింద జరుపదలచిన ప్రతిఘటనసభను వంగ-
రాష్ట్రప్రభుత్వమువారు నిషేధించుటచే, వారి చర్యను కాంగ్రెసులీగుసమష్టిసమా-

వేళను తీవ్రముగా నిరసించి వంగరాష్ట్రప్రజలు వారిహక్కులను కాపాడుకొను టకు న్యాయబద్ధమైన అన్ని మార్గములను అవలంబించెద రనునమ్మకమును వెల్లడించెను. అప్పటి రాజకీయపరిస్థితులనుగూర్చి తయారు చేయబడిన ప్రకటన నేడు చదువుట కుత్సాహకరముగా నుండును. అందులో ఇక్కడ ఇండియాలోని షెమ్స్‌ఫర్డుప్రభువు "౧౯ మంది శాసనసభ్యులు పంపిన విజ్ఞప్తిలో సూచింపబడిన రాజకీయ సంస్కరణము లాపత్కరములుగా నున్న" వనుటయూ, అక్కడ ఇంగ్లండులో సిడెన్‌హామ్ ప్రభువు భారతదేశములో రానున్న అపాయకరపరిస్థితులనుగూర్చి యుపన్యసిస్తూ "౧౯ మంది విజ్ఞప్తిలో విప్లవకరసూచనలు చేయబడుటకు కారణము జర్మనీవారి కుట్ర కాబట్టి వెంటనే నిర్బంధవిధాన మవలంబించవలయు" ననుటయూ వివరింపబడినవి. తరువాత ఇండియా ప్రభుత్వమువారు స్వపరిపాలనాందోళనమును నిరోధించుటను గూర్చి తమ అభిప్రాయములను వివిధరాష్ట్రప్రభుత్వములకును పంపిరి. వెంటనే పాంచాలరాష్ట్రములోని సర్ మైకేల్ ఓడయ్యర్, మద్రాసులోని పెంట్లండు ప్రభువు తమ యజమానుల ఆజ్ఞలను శిరసావహించి ప్రజలు అంతులేని కోరికలు కోర రాదనియూ, అవసరమైనయెడల నిర్బంధపద్ధతు లవలంబింపబడు ననియూ ప్రకటించిరి. సర్ మైకేల్ ఓడయ్యరు ౧౯ మంది విజ్ఞప్తిలో సూచించబడిన సంస్కరణములు కేవలము విప్లవసూచకము లనిరెను. ఢిల్లీ, సిమ్లా అధికారులు భారతదేశ సంస్కరణములనుగూర్చి సీమకు ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుతూండగా వారికన్న ముందు ౧౯ మంది భారత శాసనసభ్యులు బహిరంగముగా నొక విజ్ఞప్తిని పంపుటయు, కాంగ్రెసులీగువారు స్వపరిపాలనాప్రణాళిక నంతను తయారు చేయుటయూ ప్రభుత్వమువారికి మిక్కిలి కోపకారణము లైనవి. ఈపై రాష్ట్రీయగవర్నరులు రాబోవు సంస్కరణములు చాలా స్వల్పములుగా నుండగలవని ప్రకటించిరి. అది వారి రాజకీయచతురతను చూపకపో యినను, నిష్కాపట్యమునుమాత్రము వెల్లడించినది. ఇక కాంగ్రెసులీగువారి ప్రకటన ములో హోమ్‌రూలునాయకులకు నిర్బంధనివాసము విధింపబడినందుకు ప్రతిఘటిం పబడినది. అందుకు పరిహారములుగా (౧) భారతదేశము బ్రిటిష్‌సామ్రాజ్యమునం దొక స్వపరిపాలిత దేశముగా నొనరింపబడు నని సామ్రాజ్య ప్రభుత్వమువారు నిస్సందేహమైన భాషలో నొక ప్రకటనమును చేయుట, (౨) దానికనుగుణముగా కాంగ్రెసులీగువారిచే సూచింపబడిన సంస్కరణము లిండియాలో వెంటనే ప్రవేశపెట్టుట, (3) ప్రభుత్వము వారు చేసిన సంస్కరణసూచనలను ప్రకటించుట, (౪) నిర్బంధవిధానమును తొలగించుట జరుగవలె నని కోరబడెను.

ఈ దీర్ఘ ప్రకటనములోని ముఖ్యభాగములు భారతరాజ్యాంగ కార్యదర్శికిని, బ్రిటిష్ ప్రధానమంత్రికిని, సర్ విలియం వెడ్డర్‌బరన్‌కును 30 వ జూలై తేదీని

తంతిద్వారా పంపబడినవి. సర్ విలియమ్ అందుకు ప్రత్యుత్తరముగా "భారతరాజ్యాంగ కార్యదర్శిని దర్శించినాను. మీరు సహనము కలిగియుండవలెనని నా అభిప్రాయము. ఇక్కడి పరిస్థితులనుబట్టి మరియొకతంతిని పంపెదను" అని తంతినిచ్చెను.

ఇక మన మండలములోని పరిస్థితులను గూర్చి ఆలోచింతుముగాక! ౧౯౧౭ ఆగష్టు, సెప్టెంబరు నెలలలో సాత్త్వికనిరోధము నవలంబించుటను గూర్చిన సూచనను వివిధరాష్ట్ర కాంగ్రెసుసంఘములును తీవ్రముగా నాలోచించినవి. బీహారురాష్ట్ర మందు కనుకూలముగా సూచించిరి. బొంబాయి, బరార్, పంజాబు రాష్ట్రములు మాంటేగు భారతదేశమునకు వచ్చి పోవునంతవరకును సాత్త్వికనిరోధమును ప్రవేశపెట్టకుండుట మంచిదని సలహా యిచ్చినవి. ఆనాటిపరిస్థితుల కవి అనుగుణముగా లేవని సంయుక్తరాష్ట్రముల కాంగ్రెసుసంఘమువా రభిప్రాయపడిరి. బీహారురాష్ట్రమువారు "హోమురూలు నిర్బంధితులను, అలీసోదరులు అబుల్ కలాము అజాదులను విడిచిపెట్టుటకు కొంతకాలమును నిర్ణయించవలె" ననియు, "ఆ కాలపరిమితిలో ప్రభుత్వమువారు వారిని విడిచిపెట్టనియెడల సాత్త్వికనిరోధమునుగూర్చి ప్రజలకు బోధించవలయు" ననియు సూచించిరి. ఆప్రకార మా రాష్ట్రమువారు ప్రచారముకూడ ఆరంభించిరి. ఈఅభిప్రాయమును మద్రాసురాష్ట్రీయకాంగ్రెసుసంఘమువా రామోదించి,

"శాస్త్రసమ్మతమైన ఆందోళనమునకు వ్యతిరేకముగా ప్రభుత్వమువారు పంపే అన్యాయమైనట్టియు, అశాస్త్రీయమైనట్టియు ఉత్తరువులకు ప్రతికూలముగాను, ప్రభుత్వనిర్బంధవిధానమునుగూర్చి, అన్యాయము, అశాస్త్రీయము అయిన నిర్బంధనివాసశిక్షలనుగూర్చి ప్రతిఘటన రూపకముగా శాంతముగను, న్యాయశాస్త్రానుగుణముగను జరుపబడే బహిరంగసభలను ప్రభుత్వమువారు నిషేధించేయెడలను సాత్త్వికనిరోధపద్ధతి నవలంబించుట సమంజసమే నని మద్రాసు రాష్ట్రీయకాంగ్రెసుసంఘమువారి అభిప్రాయము."

"ఈలోగాన అంగీకరింపబడిన ఈ సాత్త్వికనిరోధతీర్మానము నాచరణలో పెట్టుటకు వలయుమార్గముల నాలోచించి ఒక పక్షముదినములలో నివేదికను పంపుటకొరకు ఉపసంఘము నియమింపబడవలెను."

అను తీర్మానముల నంగీకరించిరి. ఈ తీర్మానముల ననుసరించి మద్రాసునగరములో సాత్త్వికనిరోధప్రమాణపత్రమొకటి తయారుచేయబడినది. పూర్వము కాంగ్రెసువాదిగా నుండి తరువాత మద్రాసహైకోర్టుజడ్జీపదవిని పొంది, దానినుండి విరమించినపిమ్మట అఖిలభారత హోమ్‌రూలుసంఘమునకు గౌరవాధ్యక్షుడయిన సర్ యస్.

సుబ్రహ్మణ్యయ్యరు ఆ ప్రమాణపత్రమున మొట్టమొదటిసంతకము పెట్టెను. బెసెంటును, ఆమెఅనుచరులను నిర్బంధించినందుకు ప్రతిఘటనముగా ఆయన తన సర్ బిరుదమును వదలివేసెను. కిచెనరుదంపతులద్వారా ఆయన ప్రెసిడెంటు విల్సనుకొక ఉత్తరమును వ్రాసి పంపెను. తరువాత సంతకము చేసినవారు హిందూ పత్రికా సంపాదకులు కస్తూరిరంగయ్యంగారు. ఆయన సుప్రసిద్ధప్రజాసేవకుడు. ఆయన ఆదినపత్రిక ద్వారా తన యావచ్ఛక్తి సామర్థ్యములను వినియోగించి, దాని ద్వారా నిష్కళంక జాతీయతత్వమును ప్రచారము చేయుచుండెను. ఆయనవలన ఆ పత్రికకు మరింత గౌరవము హెచ్చినది. తరువాత కొంతమంది యువకు లా ప్రమాణపత్రముపైన సంతకము చేసిరి. సి. పి. రామస్వామయ్యరుగారు మద్రాసులో నుండగా సంతకములు చేయుటకు కొంత వెనుకముందాడెను. కాని తరువాత బొంబాయిలో సంతకము పెట్టెను. రాజకీయపరిస్థితు లీవిధముగా దినదినాభివృద్ధిని పొందుచుండ గానే మాంటేగుమంత్రి ఒక ప్రకటనమును చేసెను. దానితో మద్రాసురాజకీయము లందు మార్పు కలిగెను. ౨౮ వ సెప్టెంబరు ౧౯౧౭ న మద్రాసు రాష్ట్రీయ కాంగ్రెసు సంఘ మీక్రిందితీర్మానమును చేసినది:

"రాజకీయవాతావరణములో కలిగిన మార్పువలన సాత్విక నిరోధ ప్రయత్నములు ప్రస్తుత మాపివేయబడవలెను. ఈ విషయ మఖిల భారత కాంగ్రెసు సంఘమునకు తెలియచేయబడవలెను. సబ్ కమిటీ నివేదిక రికార్డు చేయుటమైనది."

మాటిమాటికి ఉద్ఘాటింపబడుచూ వచ్చిన ఈ మార్పు లేమిటి? మహా సంగ్రామసందర్భమున భారతదేశమునుండి తగినంతమంది మనుష్యులును, యుద్ధ సామగ్రియును పంపబడనందున మెసొపొటేమియాదండయాత్ర సరిగా నడువలేదు. చాలా చిక్కులు తటస్థించినవి. దానిపై కామన్సుసభలో మాంటేగ్ అప్పటి భారతరాజ్యాంగకార్యదర్శిని తీవ్రముగా విమర్శించెను. ఆ విమర్శనాసందర్భము లోనే భారతప్రభుత్వమునుగూర్చి మాంటేగ్ "అది కొయ్యకంటెను, ఇనుము కంటెను కూడ కఠినమైనది. దానిని వంచుటకు వీలు లేదు. ఆధునికకాలమునకు పనికి రాని పాతసంప్రదాయములు దానివి" అని నిందించెను. ఈ విమర్శనాఫలితముగా ఛేంబర్లేన్ రాజీనామా యీయవలసివచ్చినది. మాంటేగ్ భారతరాజ్యాంగ కార్యదర్శిగా నియమింపబడెను. మాంటేగ్ అప్పటి కింకను ౩౮ సంవత్సరముల యువకుడు. కాని అప్పటికప్పుడే నాలుగు సంవత్సరములనుండి భారత రాజ్యాంగ సహాయ కార్యదర్శిగా నుండి ఆదాయవ్యయపట్టికలచర్చలలో పాల్గొనియుండెను; ౧౯౧౨ లో యావద్భారతదేశమును సందర్శించెను. ఆయన ఆ ఫిబ్రవరి ౧౮ వ తేదీని

కేంబ్రిడ్జి గిల్డుహాలులో ప్రభుత్వప్రతిష్ఠనుగూర్చి యిచ్చిన సుప్రసిద్ధోపన్యాసము చాల శ్లాఘింపబడినది.

"ప్రతిష్ఠ అట!—ఓ భారతదేశమా! భావంలో ఈ ప్రతిష్ఠ అనేమాట లేకుండా ఉన్నట్లయితే నీ చరిత్ర ఇంతకంటె ఎక్కువ సంతోషదాయకముగా మారి యుండేది. కాని దానిమూలమున నీచాతినీచమైన గడ్డకట్టిన సామ్రాజ్యతత్త్వము ననుభవిస్తూ ఉన్నావు. మేము భారతీయుల కష్టములను తొలగించుటకు గాని, వారి అన్యాయములను నిర్మూలించుటకుగాని, వారి అనుభవములను ఉపయోగించుకొనుటకు గాని ఆ దేశములో లేము. మా పట్టినకుందేటికి మూడేకాళ్లు అనే పట్టుదలమీద ప్రజాభిప్రాయమును తృణీకరించి, మా తప్పులను మేము నెగ్గించుకొన ప్రయత్నింతుము. ఇటువంటి ప్రతిష్ఠను గూర్చినే ననేక సమయములలో అనేకసార్లు చెప్పితిని (కామన్సుసభలో ౧౯౧౧ వ సంవత్సరమున ఆదాయ వ్యయపట్టికపై చేయబడిన ఉపన్యాసమును గూర్చి ఈ సూచన.) మన మీ 'ప్రతిష్ఠ' అనే పెద్దమాటతో భారతదేశమును నిలుపుకొనలేము. దానిని మనము న్యాయపరిపాలనమువలనను, ప్రజల అంగీకారమువలనను మాత్రమే నిలుపుకొనగలము." అని ఆయన యుపన్యసించెను. భారతరాజధాని ఢిల్లీనగరమునకు మార్చబడుట వ్యయకారణము మనీ, వంగరాష్ట్రవిభజనమును రద్దుపరచుట ప్రభుత్వప్రతిష్ఠకు భంగకరమనీ బోనర్లా చేసిన విమర్శనమునకే యీయుపన్యాసము ప్రత్యుత్తరము. ఇందువలన భారతదేశమునకు గొప్పవిజయము చేకూరినది. మాంటేగు భారతదేశమునెడల సద్భావముకలిగిన రాజకీయధురంధరు డని పేరు వచ్చినది. అతని సమర్థతాసాహసములు కొనియాడబడినవి. మాంటేగుకు భారతదేశమునుగూర్చి ప్రత్యక్షముగా చాలా విషయములు తెలుసునని భావింపబడినది. అందరును అనుకొన్నట్లుగానే మాంటేగు హిందూదేశరాజ్యాంగకార్యదర్శి అయినతరువాతనే బ్రిటిష్‌ప్రభుత్వమువారి ఆదర్శము బాధ్యతాయుతపరిపాలన మని మంత్రివర్గపక్షమున ఈ క్రిందిప్రకటనము చేసెను:

"బ్రిటిషుసామ్రాజ్యములో ప్రధానభాగముగా భారతదేశమునందు బాధ్యతాయుతప్రభుత్వమును క్రమక్రమముగా ఏర్పాటుచేసేనిమిత్తము స్వపరిపాలితసంస్థలను నెమ్మదినెమ్మదిగా యెక్కువచేసి, పరిపాలనవ్యవహారములలో భారతీయులసంబంధమును పెంపొందించుట బ్రిటిషు ప్రభుత్వమువా రవలంబించదలచుకొనిన రాజకీయపద్ధతి. దీనిని భారతప్రభుత్వమువారుకూడ అంగీకరించిరి. సాధ్యమైనంత త్వరలో ఇందుకు తగినచర్యలను నడిపించుటకు వారు నిర్ణయించుకొనిరి. ఈ అభివృద్ధి క్రమానుగతముగామాత్రమే జరుగును. భారత ప్రజల క్షేమాభివృద్ధులకు బాధ్యులైన

బ్రిటిష్‌ప్రభుత్వమువారును, ఇండియా ప్రభుత్వమువారునుమాత్రమే నూతనసంస్కరణము లీయవలసినకాలమును, వాటిపరిమితిని నిర్ణయించుట కర్తలు. నూతనావకాశములు కల్పింపబడుచున్న ప్రజల బాధ్యతా జ్ఞానమునం దీ రెండు ప్రభుత్వములకును గల విశ్వాసమునుబట్టి, వారు చేసే సహాయము ననుసరించి రాబోవు రాజకీయాభివృద్ధి ఆధారపడియుండును. ఈ సందర్భమున కొంతకాలములో పార్లమెంటుకు పంపబడేసూచనలను ప్రజలు చర్చించుటకు తగిన వీలు కల్పింపబడును." అను నీ ప్రకటనమునుబట్టి బ్రిటిష్‌ప్రభుత్వమునకు ప్రజలలో గల విశ్వాస చిహ్నముగా, సైన్యములోని రాజుగారి పటాలమునందలి ఉన్నతోద్యోగములలో చూపబడుచున్న జాతిభేదములు తొలగింపబడినవి. తరువాత మాంటేగు ప్రభువు "వైస్రాయితో సంప్రతించుటకును, భారతస్వపరిపాలనాభివృద్ధితో సంబంధముగల నానావర్గముల అభిప్రాయములను వినుటకును హిందూదేశమునకు వచ్చెద" అని కూడ వాగ్దానము.

భారతదేశమునందు జరుగుచున్న ఆందోళనమునుగూర్చియు, ౨౮ వ జూలై తేదీని బొంబాయిలో సమావేశమైన అ. భా. కాం. సం. వారి సూచన ప్రకారము వారు వారములలో సాత్వికనిరోధ ప్రచారవిషయమున వివిధ రాష్ట్రీయ కాంగ్రెసు సంఘములును, ముస్లింసభాకార్యవర్గమువారును ఇచ్చిన అభిప్రాయములను [illegible] ఇదివరకే వివరించియుంటిమి. ఈ ఆగుదారములలోను ఢిల్లీ లండను నగరములయందు కావలసినంత గ్రంథము నడిచినది. ఆగష్టు ౨౦ వ తేదీని మాంటేగ్ ప్రకటనము చేయబడినది. న్యాయవిధానము ననుసరించి ౧౬ వ సెప్టెంబరు తేదీని బెసెంటమ్మ, ఆమెఅనుచరులున్నూ వదలివేయబడిరి.

పిమ్మట ౯ వ అక్టోబరున అలహాబాదులో అఖిలభారత కాంగ్రెసుసంఘముయొక్కయు, ముస్లిమ్ మహాసభాకార్యవర్గముయొక్కయు సమష్టిసమావేశము జరిగినది. ఆసమావేశమునందు సాత్విక నిరోధ ప్రయత్నము ఆపివేయబడవలెనని యేకగ్రీవముగా తీర్మానింపబడినది. బెసెంటు సాత్వికనిరోధాభిప్రాయమునకు వ్యతిరేకించినది. ఆకస్మికముగా తటస్థించిన ఈ మార్పువలన యువకులు ఆశాభంగము చెందిరి. కాంగ్రెస్‌లీగ్ సమష్టిసమావేశము సాత్వికనిరోధ ప్రయత్నములను సాగించుటకు బదులుగా వైస్రాయియొద్దకును, హిందూదేశరాజ్యాంగ కార్యదర్శియొద్దకును తాము వ్రాసిన ప్రణాళికను వారిచే అంగీకరింపజేయుటకొరకు అఖిలభారత రాయబార వర్గమును పంప నిర్ణయించిరి. ఇందుకొరకు సి. వై. చింతామణి కార్యదర్శిగా, పంద్రెండుమందితో ఒక యుపసంఘము నియమింపబడినది. వారు విజ్ఞాపనాపత్రి

మును తయారుచేయవలసియుండెను. మాంటేగ్ చెమ్సుఫర్డు ప్రభువులకు ౧౯౧౭ నవంబరులో ఆ రాయబారవర్గమువారు విజ్ఞాపనాపత్రమును సమర్పించి సందర్శించిరి. అందులో కొన్ని భాగముల నీక్రింద నుదాహరించుచున్నాము:

“ఇండియా ప్రభుత్వమువారి అంగీకారముతో బ్రిటిష్ ప్రభుత్వమువారు చేసిన అధికారపూర్వకమైన ప్రకటనమునకు భారతీయులు కృతజ్ఞులు. ఈ క్రింద సూచింపబడిన ప్రకారము ప్రభుత్వమువారు కార్యాచరణమునకు దిగినయెడల భారతప్రజలకు మరింత సంతృప్తి కలుగగలదు.

“భారతీయులు పురాతన నాగరికతకు మూలపురుషులు. వారు ప్రభుత్వనిర్మాణమునందును, పరిపాలనావిధానములోను విశేష సమర్థతను చూపిరి. సర్వకాల సర్వావస్థలయందును పరాధీనత వారి ఆత్మగౌరవమును బాధించుచున్నది. ఇది ఇట్లుండగా గడచిన రెండు సంవత్సరములలో హిందూదేశము సామ్రాజ్యాంతర్గత విషయములన్నిటియందును, అధినివేశరాజ్యములతో పాటు సమానాధికారములను కలిగియుండవలెనని భారతీయులు పట్టుపట్టుటకు తగిన అవసరమును, అవకాశములును కలిగినవి. సామ్రాజ్యసమస్యల పరిష్కారమునందికముందు అధినివేశరాజ్యములకు ఎక్కువ జోక్యముండగలదనుమాట నిర్వివాదాంశము. అవి ఇప్పుడు బ్రిటిష్ సామ్రాజ్యసంరక్షిత రాజ్యములుగా గాక, సామ్రాజ్యములో సమానభాగస్వాములుగానే భావింపబడుచున్నవి. బ్రిటనుతో కూడిన అయిదు స్వతంత్ర అధినివేశరాజ్యములును ఒక సామ్రాజ్య కూటముగా (Commonwealth) భావింపబడుచున్నది. కొందరు వ్యాసకర్తలు సూచిస్తున్నట్లుగా యునైటెడ్ కింగ్‌డమ్ ప్రతినిధులును, ఈ అధినివేశరాజ్యముల ప్రతినిధులును కలసి పార్లమెంటుగను, సామ్రాజ్యసభగను ఏర్పడి, సామ్రాజ్యవ్యవహారములన్నియును ఈ రెండు సభలకును వదిలివేయబడి, ప్రస్తుతమున్న కామన్సుసభయు, ప్రభువులసభయు ప్రత్యేకము బ్రిటనువ్యవహారములనే చూడవలసినయెడల ఇండియా ప్రభుత్వము బ్రిటనుతో కలసిన అధినివేశరాజ్యములచేతులలో పడునను ప్రస్తావము. ఇటువంటి సామ్రాజ్యతత్త్వమును భారతీయులు సూచనచ్ఛప్తిని విని సహించి ప్రతిఘటింపకతీరదు. హిందూదేశమునెడల అధినివేశరాజ్యముల ప్రవర్తన మెంత మంచిగా నున్నను కూడ ఈమార్పునకు భారతీయు లంగీకరింపజాలరు. అందువలన వారి పరాధీనత మరింత విశాలము కాగలదని వారిభావము. ఒకవేళ సామ్రాజ్యనిర్మాణ విధానమునందట్టిమార్పునకు భారతీయు లంగీకరింపవలసివచ్చినయెడల భారతదేశ మహాసామ్రాజ్య సభలో (Imperial Council) కాని, సామ్రాజ్యపు పార్లమెంటులోగాని తగినంతమంది ఎన్నికసభ్యుల ప్రాతినిధ్యమును కలిగియుండవలయును. అధినివేశరాజ్యముల

ప్రాతినిధ్యసిద్ధాంతము ననుసరించియే భారతప్రాతినిధ్య పైశాల్యముకూడ నిర్ణయింపబడవలయును.

"ఇక సామ్రాజ్యసభ (Imperial Council) కాని, సామ్రాజ్యపుపార్లమెంటు కాని యేర్పాటు చేయబడక, యేటేట సామ్రాజ్యమహాసభ మాత్రము జరుపబడి, ఆ మహాసభాసభ్యులు బ్రిటిష్‌మంత్రివర్గమువారి ప్రత్యేకసమావేశముల కాహ్వానింపబడేయెడల అందులోకూడ ఎన్నుకొనబడిన భారతీయప్రతినిధు లుండవలయును. ఈ సంవత్సరారంభములో సామ్రాజ్యసంగ్రామమహాసభకును, సామ్రాజ్యసంగ్రామమంత్రివర్గమునకును ఇండియాప్రభుత్వప్రతినిధులుగా బికనీర్ మహారాజు, సర్ జేమ్సు మెస్టన్, సర్ సత్యేంద్రప్రసన్న సింహాలు పంపబడినందుకు భారతీయులు తమ సంతోషమును తెలిబుచ్చుచున్నారు. సామ్రాజ్యసంగ్రామమహాసభవారికముందు జరుగబోయే మహాసభలలో భారతప్రాతినిధ్యమును గూర్చి చేసిన తీర్మానప్రాముఖ్యమునుగూడ భారతీయులు గమనించకపోలేరు. భారతప్రభుత్వము భారతీయులకు బాధ్యతగలది గాక, భారతీయప్రాతినిధ్యముగలది గాక పరాధీనప్రభుత్వముగా పరిగణింపబడుచున్నంతవరకును దానికి అధినివేశరాజ్యముల సామ్యము వర్తించదు. ఇక భారతప్రభుత్వమునకు సామ్రాజ్యములో కలిగే గౌరవము నిజముగా భారతప్రజలకు కాదు. అది ప్రత్యేకము భారతప్రభుత్వమునకే. అయినప్పటికీ ప్రజలు తమకే ఆగౌరవము కలిగినట్లుగా సంతృప్తిపడుటకంటె గత్యంతరము లేదు. సామ్రాజ్యమహాసభకు భారతప్రభుత్వమువారిచే పంపబడినవారెవరైనను భారతదేశక్షేమమున కనుకూలముగానే ప్రవర్తించెదరనుట కెంతమాత్రమును సందేహములేదు. కాని వారు భారతప్రజలకు బాధ్యులు కారనువిషయముమాత్రము వారి తెల్లప్పుడును బాధిస్తూనే ఉండును. అది నిజముగా గొప్పలోపము.

"జరిగిన సామ్రాజ్యమహాసభలో బికనీర్ మహారాజు, సర్ జేమ్సు మెస్టన్, సర్ యస్. పి. సిన్హాలు భేదాభిప్రా[illegible] లేక చాలా సంతృప్తికరముగా పని చేసిరి. కాని వారు భారతీయులు వలసపోవుటనుగూర్చి ఆసభవారి కందించిన విజ్ఞాపనాపత్రము భారతీయుల దృష్టికి కనుకూలముగా లేదు. అందులో భారతీయులు కోరేహక్కులు కొన్నిమాత్రమే వివరింపబడినవి. ఏ ఎన్నికప్రతినిధీ ఆవిజ్ఞాపనాపత్రమునకు బాధ్యత వహించి సమర్థించుకొనజాలడు.

"ఈయెన్నిక సరాసరి ప్రజలలోనుండియే జరుగవలెననిగాని, లేక పెద్ద నియోజకవర్గములోనుండి జరుగవలెననిగాని మేము కోరుటలేదు. భారతశాసనసభయందును

రాష్ట్రీయశాసనసభలయందునుగల ఎన్నికసభ్యులకీసామ్రాజ్యమహాసభాప్రతినిధినిగాని, ప్రతినిధులనుగాని ఎన్నుకొనే అధికారమున్నయెడల చాలును.”

రాయబారవర్గమునా కీ విజ్ఞాపనాపత్రమును సమర్పించి వైస్రాయినీ, భారత రాజ్యాంగకార్యదర్శినీ సందర్శించుప్రయత్నములో నుండగా తక్కిన కాంగ్రెసువారు లందరును కాంగ్రెసులీగుప్రణాళికపైన ప్రజల సంతకములు తీసికొన ప్రారంభించిరి. బిసెంటు విడుదల కాగానే ఆమె వైస్రాయి ననేకమారులు దర్శింప ప్రయత్నించెను. కాని ఆయన ఎర్మవమాయ నిరాకరించెను. పైపెచ్చు ఆమెకు నోటిదురుసుతన మెక్కువగా నుండెననే నెపముతో ఆమెను వైస్రాయి నిర్బంధించెనని తెలిసినట్లుకూడ మాంటేగు డయరీవలన తెలియవచ్చుచున్నది. ఈవిషయములో చెమ్సుఫర్డుప్రభువుపక్షముననే తా నుండదలచినప్పటికిని, తాను స్వయముగా నేవిధమైన సలహాను ఈయజాలననీ, బెసెంటుయొక్క రాజకీయప్రచారము నణచివేయుటకు వైస్రాయి తీసుకొనబోవు చర్యను తాను సమర్థింతుననీ చెమ్సుఫర్డుప్రభువునకు మాంటేగ్ బదులు వ్రాసెను. బెసెంటు విడుదలకాగానే ఆమెరాజకీయప్రవర్తనమునం దేదో మార్పు కలిగినది.

చెమ్సుఫర్డుప్రభు వామెను త్రోసిరాజనెను. మాంటేగ్ ఆమెనాయకత్వమును లక్ష్యపెట్టలేదు. ఆమె విడుదలకాగానే సాత్వికనిరోధసిద్ధాంతము నామె నిరాకరించెను. అప్పుడుకూడా వైస్రాయి ఆమెకు దర్శన మీయకుండుట న్యాయమా? మాంటేగ్ తన డయరీలోని ౧౯౧౭ డిసెంబరులో యీక్రిందివాక్యముల నుదాహరించుకొనెను. అవి చదువుటకు మంచి కుతూహలముగా నున్నవి.

“బెసెంటు ఉపన్యాసములనుగూర్చి చర్యగొనదలచుకొంటిననీ, దానినిగూర్చి ముందు తెలియపరతుననీ చెమ్సుఫర్డుప్రభువు నాతో చెప్పినారు. బహుశా అదేదో నాకు తెలియకుండా ఉండుటయే మంచిది. ఆమె ఉపయోగించే కఠినమైన భాషకు నావిచారమును వెలిబుచ్చుతూ వ్రాయవలెననికూడ నాకున్నది. కాని దానివలన ప్రయోజనము లేదని నాభయము. ఆమెవిడుదలవలన చాలా ఆగ్రహముకలిగి యుండవచ్చును. నేను భారతదేశమును దర్శించినందుమూలమున అక్కడ శాంతివాతావరణము కలుగలేదనీ, బెసెంటు తన వాగ్దానముల కనుగుణముగా ప్రవర్తించలేదనీ కూడ నాకు అక్షింతలు తప్పవు.”

ఈవాక్యములలో నుదాహరింపబడిన వాగ్దానము లేవో, అవి యెవరికి చేయబడినవో మనకు తెలియదు.

౧౯౧౭ సంవత్సరపు చివరిమాసములలో రాజకీయవాతావరణము మాంటుఫర్డు విద్యుత్ప్రవాహముతో నిండిపోయినది. మాంటేగ్, చెమ్సుఫర్డుప్రభువు లిరువురును

దేశమంతటను సంచారము చేసిరి. వారియొద్దకు అనేక రాయబారవర్గములు వచ్చినవి. అనేక మంది వారిని దర్శించిరి. బెసెంటుకూడ ౧౯౧౭ చివరలో మాంటేగును దర్శించి “మన నాయకను బలపరచవలె” నని కొందరు స్నేహితులకు సలహా యిచ్చినది. ఇంగ్లాండులోని డైహార్డులును, ఇండియాలోని తీవ్రవాదులునుకూడ మాంటేగును నిరసించినయెడల ఆయన నిస్సహాయుడై యేమీ చేయజాలకపోవును కాబట్టి ఆయనను బలపరచవలయు నని మితవాదులు ఘోషపెట్టసాగిరి. భారతదేశములోని వ్యతిరేకప్రయోజనములుకలవారి సంపదను విచారించి, సీమలోని పార్లమెంటుకు చిత్తుప్రణాళికను తయారుచేసి సంపదనునకే మాంటే గిండియాకు యాత్ర చేసినట్లు పైకి కనిపించును. కాని యొకటివిషయము ౧౯౧౬ లో లక్నోలో జరిగిన హిందూమహమ్మదీయసమాఖ్యవలననే స్థిరపరుపబడినది. ఆ సమాఖ్యను మాంటేగ్ ధైర్యము వహించి పూర్తిగా నంగీకరించెను. ఇక రెండవది రాజ్యాంగప్రణాళికను గూర్చిన విషయము. అది ౧౯౧౬ మార్చినాటికే వివరముగా తయారయ్యె నని మేము చెప్పినయెడల చాలామందికి క్రొత్తగా కనబడును. చెమ్స్‌ఫర్డు ప్రభువు వైస్రాయిగా నియమింపబడిన ఉత్తరువులు చేరినప్పు డాయన భారతదేశసైన్యములో టెరిటోరియల్ పటాలమునం దొక మేజరుగా పనిచేస్తూండెను. ౧౯౧౬ మార్చి నెలలో ఆయన ఇంగ్లండునకు పోగా పూర్తిగా తయారైన భారతరాజ్యాంగప్రణాళిక ఆయనకు చూపబడెను. ఈ విషయము మాకు ౧౯౩౪లో తెలియవచ్చినది. మాంటేగ్ మాత్రము బెసెంటు తిలక్ గాంధీలవంటివారు చెప్పినమాటలనుకూడ సావకాశముగా వినెను. చెమ్స్‌ఫర్డుప్రణాళిక నిచ్చిన బ్రిటిషుదేశమువరకుగాని, పుచ్చుకొనిన భారతదేశమువరకుగాని అది గౌరవప్రదముగా లేదని బెసెంటు అన్నమాటలనుకూడ ఆయన వినియుండవచ్చును.

మాంటే గిండియాలో సంచారము చేసినప్పుడు మాంటుఫర్డు ప్రణాళిక ప్రకారము పనిచేయ సంసిద్ధముగా నున్న మంత్రులను, కార్యనిర్వాహకసభ్యులను, అడ్వైజరు కౌన్సిలరులను ఏర్పాటు చేసికొనెను. ౧౯౧౮ ప్రారంభదశలో “మనము మాంటేగుకు సహాయము చేయవలెను” అని మితవాదుల వ్రాసిన వ్రాతలోని అంతరార్థమిది. బెసెంటు విడుదలైనప్పటినుండి ఆమె మాంటేగుకు సహాయపడవలె నని చెప్పుచున్నప్పటికినీ, మాంటేగ్ ఇండియాను దర్శించినప్పుడు బెసెంటుయెడల ప్రవర్తించిన ప్రవర్తనము మాత్రము విచారకరమైన విషయము.

౧౯౧౭ సంవత్సరములో బెసెంటుచే ప్రారంభింపబడిన హోమ్‌రూలుఉద్యమము తీవ్రముగా సాగుతూన్నప్పుడు గాంధీ బీహారునుండి రాజేంద్రబాబు బ్రజకిశోర

బాబు గోరక్‌బాబు అనుగ్రహబాబులను, భారతసేవకసంఘమునుండి కృపలానీ డాక్టర్ హెచ్. యస్. దేవ్ లను తీసికొని నీలిమందుతోటయజమానుల మూలకముగా చాంపరాన్ రైతులకు కలుగుచున్న కష్టములనుగూర్చి విచారింప బయలుదేరెను. ఆయన, ఆయనఅనుచరులును ఆ విచారణను పూర్తిచేసుకొని, సత్యాగ్రహోద్యమముయొక్క అపూర్వబలమును లోకమునకు వెల్లడించేయంతవరకును, ఆరునెలలపాటు హోమ్ రూలుద్యమములో నెంతమాత్రమును జోక్యము కలిగించుకొనలేరు. ఆనాడు పాటింపబడిన సత్యాగ్రహతత్వము భారతదేశచరిత్రమున నూతనశకప్రారంభమునకు కారణమైనది.

చాంపరాన్ బీహారురాష్ట్రములో పశ్చిమోత్తరదిశ నున్న ఒకజిల్లా. ౧౯-వ శతాబ్దప్రారంభములో కొంతమంది ఐరోపియ తోటయజమాను లాజిల్లాలోని జమీన్దారులనుండి కొన్ని భూములను కొంతకాలమువరకును, మరికొన్నిభూములను శాశ్వతముగాను కవుళ్లకు తీసుకొని నీలిమందు పండింప ప్రారంభించిరి. ముఖ్యముగా అదివరకే ఋణములో మునిగిపోయిన బెట్టియామహారాజునుండి చాల అతివిస్తీర్ణములైన భూములు వారిచే కవులుకు తీసుకొనబడినవి. ఈవిధముగా ఆ తోటయజమానులు సంపాదించుకొనిన పలుకుబడివలనను, భారతదేశమును పరిపాలించే రాచజాతికి సంబంధించినవారగుటచే స్వతస్సిద్ధముగా వారికి కలిగిన పలుకుబడివలనను వారు తమపక్కనున్న రైతులభూములలో నూ. 3/౨౦ మొదలు ౫/౨౦ వంతు బీగావరకును నీలిమందు పండించేయేర్పాటు చేసిరి. ఈయేర్పాటే తరువాత వంగరాష్ట్రీయకౌలు చట్టము (Bengal Tenancy Act) క్రింద ఐరోపియ తోటయజమానుల కొక హక్కుగా అంగీకరింపచేయబడినది. ఈనీలిమందు పండించే పద్ధతికి "తీన్‌కేతియా" అని గాని, లేక మూడు 'కొట్టాల' పద్ధతి అనిగాని పేరు. మూడుకొట్టాలనగా 3/౨౦ వంతుబీగా అన్నమాట. నీలిమందు పండించుట రైతుల కెంతమాత్రమును లాభదాయకము కావనీ, ఇతరవ్యవసాయమునకు నష్టదాయకముగా వారది పండించి తీరవలెనని నిర్బంధింపబడుతూ వ్నారనీ, వారికీయబడే హాలిహూస కూలియు నామమాత్రమేననీ రైతులఘోష. అనేకపర్యాయము లీరైతుల గంద్రగోళములు తిరుగుబాటురూపమును దాల్చి, బలవంతముగా అణచివేయబడినవి. కాని అప్పుడెప్పుడును తోటయజమానులు నీలిమందు పండించినరైతుల కెక్కువధర నీయకతప్పినది కాదు. ౨౦ వ శతాబ్దప్రారంభమున కృత్రిమపురంగులు ప్రచారములోనికి వచ్చినందున, చాంపరాన్‌లోని పరిస్థితులలో కూడ నీలిమందుపంట తోటయజమానులకు లాభదాయకముగా కనుపించక, వారు తమ ఫ్యాక్టరీలను మూసివేయ ప్రారంభించిరి. కాని అందువలన కలిగే నష్టమును పూర్తిగా తాము భరించుటకు బదులుగా నిరుపేదలగు రైతులనెత్తిమీద

కూడ అనష్టమును కొంత చేయుటకు మార్గాంతరముల నాలోచించిరి. అందుకు నా రవలంబించినపద్ధతులు రెండు. తోటయజమానులు శాశ్వతకౌలుకు తీసికొనిన గ్రామములలోని రైతుల శిస్తులను హెచ్చించినయెడల, అసలుభూఖామందులకంటె కూడ మధ్యనున్న తోటయజమానుల కెక్కువలాభదాయకముగా నుండును. ఆకారణముచేత వారు రైతులతో నొక ఒడంబడికను చేసుకొనిరి. రైతులు నీలిమందు పండించవలసిన నిర్బంధమును తోటయజమానులు తొలగించేటట్లున్నూ, అందుకుబదులుగా వారు (తోటయజమానులు) శిస్తులను (Rents) హెచ్చించుటకు రైతు లంగీకరించేటట్లున్నూ ఒడంబడిక చేసుకొనబడినది.

అటువంటి ఒడంబడికపత్రములు వేలకొలదీ బలవంతముగా వ్రాయించుకొనబడినవని రైతులు చెప్పెదరు. సాధారణపరిస్థితులలో తోటయజమానులకు శిస్తు లెక్కువచేసే అధికారము లేదు. కాని వారిప్రోత్సాహముచే జిరాయితీచట్టముక్రింద అటువంటి నిబంధనము చేయబడినది. ప్రభుత్వమువారీ విషయములో శాసనసభలలోపలను, వెలుపలను జరిగే ఆందోళన నెంతమాత్రము లెక్కపెట్టక, ఆ ఒడంబడికపత్రములను రిజిస్ట్రరుచేయించుటకు ప్రత్యేక రిజిస్ట్రారులను నియమించి తోటయజమానులకు తోడ్పడిరి. తోటయజమానులు కొంతకాలమువరకుమాత్రమే కవులుకు తీసికొనిన గ్రామములలో శిస్తు లెక్కువచేయబడినయెడల కవులుకాలము పూర్తికాగానే అసలుభూఖామందుకే ఆలాభములన్నియును పోవును. ఆకారణముచేత వా రాసందర్భములో ఎక్కువచేసిన శిస్తు మొత్తము నొక్కసారిగానే అన్నికవులు సంవత్సరములకును కలిపి రొక్కరూపకముగా పుచ్చుకొని రైతులను నీలిమందు పండించవలసిన నిర్బంధమునుండి తొలగించితి మని చెప్పుచూవచ్చిరి. నిజమునకు శాశ్వతకౌలుకు సంబంధించని గ్రామముల కా జిరాయితీ చట్టపుప్రత్యేకనిబంధనను, అనగా నిర్బంధముగా నీలిమందు పండించియిచ్చేషరతులు వర్తించనేవర్తించవు. కాని ఈ నోటీసుకాయింపుతో వారు ౧౨ లక్షలరూపాయిలను వసూలు చేసుకొనగలిగిరి. జిల్లా అంతయును నీలిమందుతోటయజమానుల చేతులలో చిక్కుకొనెను. వారిలోవారు జిల్లాను కొన్నిభాగములుగా విభజించుకొని రాజ్యముచేయ ప్రారంభించిరి. తోటయజమానుల కధికారులపైన గల వశీకరణ శక్తివలన రైతులు వారికి వ్యతిరేకముగా న్యాయస్థానములకు గాని, కార్యనిర్వాహకోద్యోగుల యొద్దకు గాని పో సాహసించలేకుండిరి. పోయినచో వా రనేకకష్టనష్టములకు పాల్పడవలసియుండెను. పెద్దకులములకు చెందిన హిందువులను కొట్టి మగ్గిఖానాలలో బంధించుట, వారిపశువులను బందిలిదొడ్లో పెట్టుట, ఇండ్లను దోపించుట, మంగలి, చాకలి మొదలగు పనిబాగులవాండ్లను రానీకుండుట, వారిని ఇండ్లలోనుండి లోపలకును, వెలుపలకును పోనీకుండుట,

అంటరానివాండ్లను తెచ్చి వారి సమక్షములలో కూర్చుండబెట్టుట ఇట్టి వెన్నో లెక్క లేనన్ని కష్టములను తోటయజమానులు రైతులకు కలిగిస్తూవచ్చిరి. వారు రైతుల నుండి న్యాయవిరుద్ధములైన, అధికారములేని మామూళ్లను కూడ పన్నుల రూపకములో వసూలుచేసుకొంటూవచ్చిరి. అట్టి పన్నులమొత్తము గూర్చికి మించి యుండెడ నని విచారణలో తేలినది. కొన్నిటినిమాత్ర మిచ్చట ఉదాహరింతుము. పెండ్లికి పన్ను వేయ బడెను. పొయ్యికి పన్ను వేయబడినది. గానుగకు పన్ను విధింపబడెను. దొరగారికి జబ్బుచేసి కొండలమీదికి ప్రయాణము కట్టవలెనంటే రైతులు పన్ను చెల్లించవలసి యుండెను. ఆయన కొక గుఱ్ఱమో, ఏనుగో, మోటారుకారో కావలసియున్న యెడల రైతాంగమే భరించుటకు పన్ను చెల్లించవలసియుండెను. ఇదిగాక రైతు తోట యజమానులనుగాని, లేక గ్రామములోని తదితరులనుగాని యెవరినైనను యెదిరించే యెడల వెంటనే అతనికి జరిమానా విధింపబడుతూ ఉండేది. ఈ విధముగా జిల్లాలోని సివిల్ క్రిమినల్ అధికారములు తోటయజమానులకే సంక్రమించినవి.

రాష్ట్రములోని ప్రజానాయకు లందరును రైతుల నీ కష్టములనుండి తప్పింప ప్రయత్నించిరి. కాని ప్రయోజనము లేకపోయినది. స్థానికప్రభుత్వములకు రైతుల ఈ ఇక్కట్లు పూర్తిగా తెలియవచ్చెను. తెలుసు నని వా రొప్పుకొనిరి. పై పెచ్చు రైతులకోసము జాలిపడిరి. కాని వా రేమీ సహాయము చేయలేకపోయిరి. కొందరు బహుశా సహాయము చేయ నిచ్చగించి ఉండకపోవచ్చును.

ఇటువంటి పరిస్థితులలో లక్నో కాంగ్రెసుసమయమున బీహారుకాంగ్రెసు ప్రతినిధులును, కొంతమంది రైతుప్రతినిధులును మహాత్మ గాంధీకి ఈ విషయము లన్నిటినీ సాకల్యముగా మనవిచేసిరి. గాంధీ తాను స్వయముగా చాంపరాన్‌కు పోయి అచటి పరిస్థితులను తెలుసుకొందు నని వాగ్దానము చేసెను.

౧౯౧౭ ఏప్రిల్ నెలలో చాంపరాన్‌జిల్లాకు ముఖ్యపట్టణమైన మోతీహారీ గ్రామమున కాయన పోయెను. తరువాత అచ్చటనుండి మరియొక గ్రామమున కాయన పోతూండగానే, వెంటనే జిల్లాను వదలివెళ్లిపోవలసినదని ఆయనపైన ౧౪౪ సి. పి. సి. క్రింద నోటీసు జారీచేయబడెను. ఆయుత్తరువును ఆయన ఉల్లంఘించెను. ఇదివర కాయనచేసిన ప్రజాసేవ కాయనకొసంగబడిన కెయిజరీహిందీ సువర్ణపతకమును ప్రభుత్వమువారికి త్రిప్పివేసెను; మేజస్ట్రేటుముందు ముద్దాయిగా నిలబడెను. కోర్టులో తాను నేరముచేసినమాట నిజమేనని పెద్దవాఙ్మూలము నిచ్చెను. ఇటీవల ఇట్టివాఙ్మూలములు దేశములో పరిపాటైపోయినప్పటికినీ అవామమాత్ర మది చాలా క్రొత్తగానే తోచినది. ప్రభుత్వమువారు తమ కేసును ఉపసంహరించుకొని గాంధీవిచారణను కొన

సాగనిచ్చిరి. అయిన సుమారు ౨౦, ౦౦౦ మంది రైతులదగ్గరనుండి వాఙ్మూలములు తీసుకొనగలిగెను. ఈ ప్రయత్నములో ఆయన అనేకమంది స్నేహితులసహాయమును పొందెను; వాఙ్మూలముల నాధారముగా చేసుకొని ప్రభుత్వమువారికి రైతుల పక్షమున విజ్ఞాపనమును తయారుచేసెను. ప్రభుత్వమువారు తమ కొక విచారణసంఘమును నియమించిరి. అందులో భూస్వాములును, తోటయజమానులును, ప్రభుత్వ ప్రతినిధులును, రైతులపక్షమున మహాత్మాగాంధీయును కలరు. విచారణ పూర్తిగా జరిగినతరువాత కమిటీవారు రైతులు చెప్పుకొనేకష్టము లన్నీ నిజమేననీ, కాబట్టి వారి నఫాలు (Rents) తగ్గింపబడవలెననీ, ఇదివరకు రైతుల దగ్గరనుండి అన్యాయముగా వసూలుచేయబడిన సొమ్ములో కొంతభాగమును తోటయజమానులు తిరిగీ వారికి యిచ్చివేయవలయుననీ ఏకగ్రీవముగా నొకనివేదికను తయారుచేసి ప్రభుత్వమువారికి పంపిరి. ఆనివేదికలోని సిఫారసులు తరువాత చట్టములో నిబంధింపబడినవి. అందువలన రైతులు నిర్బంధముగా నీలిమందు పండించవలసిన పద్ధతి నిర్మూలింపబడినది. మరికొన్ని యితరకష్టములుకూడ తొలగింపబడినవి. ఇది జరిగిన కొన్ని సంవత్సరములకే తోటయజమానులలోని అత్యధికసంఖ్యాకులు తమ పొలములను, ఫ్యాక్టరీలను అమ్మకొని ఆజిల్లానుండి వెళ్లిపోయిరి. ఒకప్పుడు తోటయజమానుల సౌధములున్న ప్రదేశములలో నేడు శిథిలములుమాత్రమే కనపడుచున్నవి. ఇంకను కౌలుదార్లుగా నున్న తోటయజమానులు నీలిమందుపంటపైన ఆధారపడక తదితరరైతులవలెనే తాముకూడ ఇతరపంటలమీదనే ఆధారపడుచున్నారు. వారు పూర్వపురీతిగా అక్రమలాభములను పొందుట కిప్పుడు వీలులేదు. వారికి పూర్వపుప్రతిష్ఠకూడ పోయినది.

నూరు సంవత్సరములనుండి ప్రభుత్వమువారు గాని, ప్రజానాయకులు గాని తొలగించలేని రైతులకష్టములు కొన్ని మాసములలో ఈవిధముగా నిర్మూలింపబడినవి. నేడు చాంపరాన్ గాంధీఅనుచరులకు మడుగులొత్తుచున్నచో ఎవరును ఆశ్చర్యపడనక్కరలేదు.

చాంపరాన్ సత్యాగ్రహముతో సమాన ప్రాముఖ్యము వహించినది ౧౯౧౮లోని ఖేడా సత్యాగ్రహము. ఈ రెండు సత్యాగ్రహములకును ఫలితములో కొంత భేదమున్నప్పటికిని సిద్ధాంతములోమాత్రమేమీ భేదము లేదు. గాంధీ ప్రజాజీవితమును ప్రారంభించకముందు, ప్రభుత్వమువారు పన్నులను వసూలుచేసుకొనే అధికారమును గూర్చి రైతు లెన్నడును ప్రశ్నించినవారు కారు. కటికి కరవులలోకూడ ప్రభుత్వము వారికి కీయవలసిన పన్నులు దేవుడిముడుపులవలె రైతులు చెల్లించుకోవలసినదే. శాసనసభాసభ్యులు రైతులపక్షమున ప్రభుత్వమువారికి అర్జీలను, విన్నపములను

పంపుకొని తీర్మానములను ప్రతిపాదించేవారు. అంతటితో వారి ప్రతిఘటనము సమాప్త మయ్యెది. ౧౯౧౮లో గాంధీ నూతనశకమును స్థాపించెను. బొంబాయిరాజధానిలోని కెయిరాజిల్లాలో నాలావరకు పంటలు పాడైపోయినవి. అచట దాదాపు క్షామపరిస్థితు లేర్పడినవి. రైతులు భూమిశిస్తుల వసూలు తాత్కాలికముగా ఆపివేయబడుట న్యాయ మని తలంచిరి; అర్జీలు మొదలగు మామూలు కార్యకలాప మంతయును నడపించిరి. కాని ప్రయోజనము లేకపోయినది. నాలుగవ వంతుకంటె తక్కువపంట పండినది కాబట్టి భూమిశిస్తు లాసంవత్సరమునకు ముజరా యిప్పించవలెనని రైతులు ప్రార్థించిరి. నాలుగవవంతు పంటకంటె ఎక్కువ పండినది కాబట్టి లాండు రెవిన్యూచట్టము ప్రకారము భూమిశిస్తులు ముదరా యిప్పింపబడ వని అధికారు లుత్తరువులు జారీచేసిరి. ప్రార్థనలును, విజ్ఞాపనలును పూర్తిగా నిరర్థకములైనవని నిశ్చయించుకొనినపిమ్మట గాంధీ గత్యంతరము లేక సత్యాగ్రహమును ప్రారంభింపవలసినదని రైతులకు సలహాయిచ్చెను. రైతులలో ప్రబోధమును కలిగించుటకు గౌరవ ప్రచారకులకొరకు గాంధీ విజ్ఞాపనమును ప్రకటించెను. తక్షణ మనేకమంది అందుకు సంసిద్ధులైరి. వారిలో ప్రముఖుడు సర్దార్ వల్లభభాయి పటేల్. ఆయన దినదిన ప్రవర్ధమాన మవుతూన్న తన వకీలువ్యాపారమును కట్టిపెట్టి గాంధీతో సేవారంగమున కురికెను. గాంధీ, వల్లభభాయిపటేల్లాంటి మహాపురుషుల నిరువురను ఒక్కచోట మొట్టమొదట చేర్చగలిగిన దీ ఖేడాసత్యాగ్రహమే. సర్దార్ వల్లభభాయి ప్రజాజీవితమున కదే ప్రారంభదశ. ఆనాటినుండియే ఆయన తన వృత్తిని పరిత్యజించి గాంధీఅనుగుజాడలలో నడువసాగెను. రైతులు, తమవాదన అసత్యమని త్రోసివేయబడుటకంటెను, ప్రభుత్వమువారి ఒత్తిడివలన శిస్తులను చెల్లించి ఆత్మగౌరవమును పోగొట్టుకొనుటకంటెను భూములనే విడిచిపెట్టుకొనుట కంగీకరించి ప్రమాణపత్రములపైన సంతకములు పెట్టిరి. నిరుపేద రైతులకు భూమిశిస్తులు ముజరాయియ్యబడినయెడల భాగ్యవంతులు పేచీ లేకుండ తమ శిస్తులను చెల్లింప నంగీకరించిరి.

ఇక రైతులలో అద్భుతమైన ప్రబోధము కలిగించవలసియుండెను. వారిదివర కెన్నడును కనీ వినీ యెరుగని సిద్ధాంతములు వారికి తెలుపబడినవి. ప్రభుత్వమువారు పన్నులను విధించేఅధికారమును వారు ప్రశ్నించ వచ్చుననే సంగతి వారి కిప్పుడే తెలియ చెప్పబడెను. ప్రభుత్వోద్యోగులు వారిపై అధికారులు కారనీ, వారి సేవకులు మాత్రమే నని మొదటిపర్యాయము వారికి హృద్గోచరము చేయబడినది. అధికారుల బెదిరింపులకు గాని, నిర్బంధములకుగాని లొంగవలసిన పని లేదని వారికి ధైర్యము చెప్పబడెను. పౌరుల ప్రధానహక్కులను గూర్చిన ప్రథమపాఠములు వారికి బోధింపబడినవి. అవి నేర్చుకొనని మొదట వారిధైర్యమంతయును నిమిషములో పటాపంచలు కాగలదు. గాంధీ, వల్లభ

భూయిపటేలు, వారి అనుచరవర్గమును గ్రామగ్రామమునకును పోయి ఈ సిద్ధాంతములను ప్రచారముచేయ సాగించిరి. పశువులు, పాత్రసామగ్రి మొదలగు చరాస్తులు జప్తుచేయ బడినప్పటికినీ, అపరాధపుశిస్తులు వసూలుచేయబడుననిగాను, భూములు ప్రభుత్వము వారిచే శాశ్వతముగా స్వాధీనపరచుకొనబడుననియును అధికారులు భయ పెట్టినప్పటికినీ నిశ్చలముగా నిలబడవలెనని ఆ ప్రజాసేవకులు రైతులకు ధైర్యము చెప్పిరి. గాంధీయొక్క ఈ దండయాత్రకు నిజముగా నన మవసరమే లేకపోయినది. కాని బొంబాయివర్తకు లీ యుద్యమనిర్మాతలు వ్యయముచేయలేనంత ద్రవ్యమును విచ్చలవిడిగా వారికి సమర్పించిరి.

గుజరాతులోని సత్యాగ్రహసందర్భమునసే శాసనోల్లంఘనమునకు కూడ ఒక అవకాశము కలిగినది. న్యాయవిరుద్ధముగా జప్తుచేయబడిన ఒక పొలములోని ఉల్లిమడిని తీసివేయించవలసిన దని మోహనలాల్ పాండ్యాకు గాంధీ సలహా యిచ్చెను. మోహనలాల్ పాండ్యా నాయకత్వము వహించి ఆపని చేయించెను. ప్రభుత్వము వా రా రైతులకును, మోహనలాలుకును చిన్నచిన్న ఖైదుశిక్షలను విధించిరి. దీనితో గాంధీ ప్రజలహృదయములను హరించగలిగెను. వారికి ఖైదుభయము పోయినది. శాసనోల్లంఘనమున కిది వారికి ప్రథమపాఠమైనది. వారినాయకులు విముక్తులయిరాగానే ప్రజలు వారి నూరేగించిరి. ఇది అప్పటి ప్రజాసముదాయములో కలిగిన ఒక నూతనానుభవము.

తరువాత ఆకస్మికముగా ఈయుద్యమము సమాప్తిపొందినది. ప్రభుత్వమువారు ప్రజలవాదము నంగీకరించి పేదరైతులందరకును శిస్తులు ముజరాయిచ్చిరి. కాని వా రీ విషయములో నేవిధమైన బహిరంగప్రకటనమును చేయలేదు. ప్రజల ఆందోళన మునకు లొంగి వారితో ప్రభుత్వము రాజీచేసుకొన్నదనే అభిప్రాయము రైతులకు కలుగకుండునట్లు ప్రభుత్వమువారు ప్రవర్తించిరి. ఎంతో ఆలస్యముగా ప్రభుత్వము వారు చేసిన ఈసౌకర్యముకూడా యే కొద్దిమందిరైతులకో లభించినది. ఈసందర్భమున సత్యాగ్రహము సిద్ధాంతములో జయముపొందినప్పటికినీ, ఫలితములోమాత్రము సంపూర్ణవిజయమును పొందగలిగిన దని చెప్పవీలులేదు. కాని దీనివలన పరోక్షముగా చాలా ఫలితములు కలిగినవి. ఇది గుజరాతురైతుల రాజకీయవిజ్ఞానమునకును, ఆత్మచైతన్యమునకును ఆధారభూతమైనది. "ప్రజలమోతుమెప్పటికైనను వారిత్యాగబుద్ధిపైనను, వారిబాధాసహిష్ణుతపైనను మాత్రమే ఆధారపడియున్నదను గుణపాఠ మీ కెయిరా సత్యాగ్రహోద్యమమువలన ప్రజల హృదయఫలకములందు చిత్రింపబడినది. కెయిరా దండయాత్రమూలకముగా సత్యాగ్రహము గుజరాతుభూములలో వేరునాటు కొన్నది" అని తన 'ఆత్మకథ' లో గాంధీ ఉదాహరించెను.

ఇక అహమ్మదాబాదు కార్మికోద్యమములో కాంగ్రెసువారు చేసిన పనిని గూర్చి, గాంధీయును, ఆయనఅనుచరులును దానిద్వారా మనకు నేర్పిన సత్యాగ్రహ పాఠమునుగూర్చి వివరింతుము.

గాంధీ కాంగ్రెసునాయకత్వమును వహించకమునుపే ఆయన అహమ్మదాబాదులోని యంత్రాలయ కార్మికనిర్మాణమునకు పనిచేసిన విధానము జాతీయస్వాతంత్ర్య చరిత్రమున కలంకారభూతముగా నుండగలదు. సత్యాహింసాపద్ధతులమీద పారిశ్రామికవాదములు పరిష్కరింపబడుట కదే ప్రథమపర్యాయము. అహమ్మదాబాదులో నాడు గాంధీచే సృష్టింపబడిన కార్మికనిర్మాణ మెన్నో పారిశ్రామికమహా వాయుపరంపరలకు తాళి శాశ్వతఫలితములను పొంది నేటికిని పాశ్చాత్యప్రేక్షకుల కాశ్చర్యజనకమై శ్లాఘాపాత్రముగా నిలిచియున్నది. ఆకథను సంగ్రహముగా జ్ఞాపకముచేయ పూనుకొనినను హెచ్చు ఈగ్రంథములో ననేకపుటలు దానికోసము ప్రత్యేకింపబడవలసియుండును. కాబట్టి ఆ సంస్థకు గాంధీచేసిన పనినిగూర్చియు, భారతదేశములోను, ప్రపంచకములోనుగల తదితర కార్మిక సంస్థలకును, దానికిని గల ముఖ్యభేదములనుగురించియు తెలుసుకొని సంతృప్తిపడుటయే ఇప్పటి మన కర్తవ్యము.

౧౯౧౭ వ సంవత్సరమునుండి శ్రీమతి అనసూయా బేన్ శరభాయి కార్మికప్రదేశములలో విద్యాప్రచారము చేస్తూవచ్చినకారణమున ఆమెకు యంత్రాలయములలోని కూలీలకష్టములను తెలుసుకొనుట కవకాశము కలిగినది. ఆమెనాయకత్వము వలన మొట్టమొదట ప్రయోజనము పొందినవారు పడుగుచేసేకూలీలు. కాని ఈ విధముగానే అందరు కూలీలకును సంఘీభావము కుదిర్చి ప్రయోజనకరముగా సహాయము చేయవలెనన్నచో ఆమె కొక విశ్వాసపాత్రుడైన నాయకునిసలహా కావలసియుండెను. ౧౯౧౮లో యంత్రాలయాధికారులకును, నేతగాండ్లకును వచ్చిన వివాదములో ఆమె గాంధీసలహాను కోరెను. కాని ఆయన మిల్లుయజమానులను నిర్బంధించుటకు బదులుగా వారిచే పంచాయతీసిద్ధాంతము నంగీకరింపచేసెను. నిజముగా నిది కార్మికోద్యమమునందతిప్రాముఖ్యమైన సంఘటనము. కార్మికులపక్షమున గాంధీ వల్లభభాయిపటేల్లు మధ్యవర్తులుగా నుండుట కంగీకరించిరి. కాని కొన్నిమైళ్ళదూరములోనున్న కొంతమంది కార్మికులు సమ్మెకు దిగుటచే మధ్యవర్తిత్వము జయప్రదము కాలేదు. గాంధీ విచారమును సూచించి కూలీల నందుకు తగిన పరిహారము చేయవలసిన దని కోరెను. రెండువైపులను లోపములుకలవు గాని యంత్రాలయాధికారులు గాంధీమాట వినక నిరాకరించిరి. కూలీల భావికర్తవ్యమును నిర్ణయించేముందు గాంధీ వివాదవిషయములను జాగ్రత్తగా పరిశీలించెను. ఆయన వర్తకస్థితినిగూర్చి, మిల్లుయజమానుల లాభములను గూర్చి, ఒకప్రక్క జీవితవ్యయమును, మరియొకప్రక్క ఉత్పత్తిఖర్చులను ఎక్కువ

గుటను గురించి జాగరూకతతో పరీక్షించెను. పిమ్మట ఆయన కార్మికులకూలి నూటికి ౩౫ వంతున పెంపుచేయబడుట న్యాయ్యమని నిర్ణయించెను. ఇంతకంటె చాలా ఎక్కువ పెంపుచేయబడవలె నని పట్టుపట్టిన కూలీల నిందుకు సమ్మతింపచేయు ప్రయత్నము జరిగినది. న్యాయ్యముగా వారికనీసవ్యయమునకు కావలసినసొమ్ము మాత్రమే వారు మిల్లుయజమానులనుండి వేతనములక్రింద పుచ్చుకొనవలయు నని కూలీలకు బోధింపబడినది. ఆ కూలీలు నేటివరకును ఈ సంప్రదాయమునే భక్తిపూర్వకముగా అనుసరిస్తూవున్నారు.

ఈ విధముగా నిర్ణయింపబడిన కూలీల కోరికలు మిల్లుయజమానులకు తెలుపబడెను. వారు నూటికి ౨౦ కన్న జీతములను పెంపు చేయజాల మని ప్రకటించి, ౧౯౧౮ ఫిబ్రవరి ౨౨ వ తేదీని కూలీలను వెలుపలకు నెట్టివేసిరి. అంతట గాంధీ కార్మికుల నందరిని ఒకచెట్టుక్రింద సమావేశపరచి, వారికోరికలు సిద్ధించేటంతవరకును వారు పనిలోనికి పోకుండునట్లును, వారు పనికి పోనంతకాలమును ప్రజాశాంతికి భంగముకాని పద్ధతిని ప్రవర్తించేటట్లున్నూ ప్రమాణములను తీసుకొనెను. అనసూయాబేన్, శంకరలాల్ బాంకర్, చగన్‌లాల్ గాంధీ లీ విషయములో ప్రతిగృహమునకును పోయి తీవ్రముగా ప్రచారము చేయసాగిరి. చిన్నచిన్న కరపత్రములు పంచిపెట్టబడినవి. పెద్దపెద్ద సమావేశములు చేయబడి ఉపన్యాసము లీయబడినవి. ఈ కరపత్రములను గాంధీ వాడుకభాషలో కూలీలకు తెలిసేట్లు తేలికగా వ్రాసెను. వాటిలో ఈ యుద్యమము కేవలము పారిశ్రామికవివాదమునకు సంబంధించినది కాదనీ, కార్మికుల నైతికాధ్యాత్మికవిషయములకు సంబంధించి వారి జీతములతోపాటు జీవితౌన్నత్యమునకుకూడ తోడ్పడగలదనీ ఆయన ఉదాహరించెను. ఈ విధముగా నొక పక్షముదినములు పోరాటము జరిగినతరువాత ఇదివర కున్నను జీతములు పోగొట్టుకొనవలెనని కూలీలు కష్టమును సల్లడింపసాగిరి. వారిలో కొందరు 'గాంధీ తేలికగా ప్రతిజ్ఞ చెల్లించుకోవలసిన దని చెప్పవచ్చును గాని మాకు మాత్రము ఆలుబిడ్డలతో ఉపవాసములుచేయుట చాలాకష్టముగా నున్న'దనిగొణుగుకొనప్రారంభించిరి. అది గాంధీకి దైవప్రేరితమైన దివ్యవాణివలె పరిణమించినది. ఆసాయంకాలపుసభలోనే ఆయన కార్మికులు తమప్రతిజ్ఞలను చెల్లించుకొనగలిగేటంతవరకును భోజనము చేయుటకుగాని, యానము నుపయోగించుటకుగాని నిరాకరించెను. ఈ వార్త యావద్భారతదేశమందును కారుచిచ్చువలె వ్యాపించెను. భాషాభేదము తప్ప ఇదికూడ జీవితపర్యంతనిరాహారదీక్షయే. వేలకొలది కూలీలు తమలోతాము చేసుకొనిన ప్రతిజ్ఞలకు భంగకరముగా ప్రవర్తింపకుండ చేయవలెననే నైతికోద్దేశముతో ఈ ఉపవాస వ్రతమును ప్రారంభించి గాంధీ తనప్రాణము లొడ్డెనుకాని, విమర్శకులును, రంధ్రాన్వేషణ

తత్పరులును కొంతమంది దీనిని యంత్రాలయాధికారులపైన అన్యాయమైన ఒత్తిడిని కలిగించుటగా భావించిరి. మిల్లుయజమానులు తమ స్వీయాభిప్రాయములకు వ్యతిరేకముగా నిందమూలమున లొంగిపోయినయెడల ఈ విమర్శనములో కొంత న్యాయము కలదని గాంధీ అంగీకరించెను. కాని అది పరోక్షఫలితమనీ, తాను ప్రత్యక్షముగా మిల్లుకూలీలు చేసిన ప్రతిజ్ఞలకు వారు భంగకరముగా ప్రవర్తింపకుండ చేయవలె నని మాత్రమే ఉపవాసవ్రతమును పూనితిననీ ఆయన ప్రకటించెను. గాంధీదృష్టిలో ప్రతిజ్ఞ మహా పవిత్రమైన విషయము. అది యెంత చిన్నదైనప్పటికినీ దానినుల్లంఘించుట ఆయనకు చాలా బాధాకరము. కార్మికు లాయన నుపవాసదీక్ష విరమింప ప్రార్థించిరి. గాంధీ వినలేదు. ఆయనప్రతిజ్ఞ అమోఘము. ఆయన పైపెచ్చు మిల్లుకూలీల కేదో ఒక పని చేసుకొని దినభత్యము సంపాదించుకొనవలసిన పని సలహాయిచ్చెను. కాలము వ్యర్థముచేయవలదని వారిని కోరెను. పనిమానివేసిన కూలీల పోషణ కాయన తేలికగా ధనము వసూలు చేయగలడు. కాని ఆ సూచనయే గాంధీకి గిట్టలేదు. ఇతరుల ధనసహాయముపైన కూలీ లాధారపడవలసివచ్చేయెడల వారిత్యాగమునకు విలువ పోవునని ఆయన ఉద్దేశము. సబర్మతీసత్యాగ్రహాశ్రమములోని భవనముల నిర్మాణమునకు వందల కొలదీ మిల్లుకూలీలు నియమింపబడిరి. వా రందరును అనసూయాబేను నాయకత్వమున మట్టితట్టలు, రాళ్లు, సున్నము మోస్తూన్న ఆశ్రమవాసులతో కలసి ఆనందకరముగా పనిచేసిరి. ఇందువలన కలిగిన నైతికప్రయోజన మమోఘము. కార్మికుల నిశ్చయ మంతకంతకు దృఢతరమైనది. మిల్లుయజమానుల హృదయములు కూడ ద్రవించినవి. భారతదేశములోని వివిధరాష్ట్రములనుండియు నాయకులు వారికి తంతివార్తలను కురిపించిరి. కెంటు "భారతదేశముకొరకు లొంగిపోయి గాంధీప్రాణములను సంరక్షించండి" అని యంత్రాలయాధికారులను ప్రార్థిస్తూ తంతిపంపెను. అంబాలాల్ శరభాయి అర్ధాంగి సరళాదేవి కార్మికులకష్టములను చూచి భరించలేకపోయినది. పూజనీయుడైన గాంధీప్రాణములకు అపాయము కలుగవచ్చుననికూడ ఆమె భీతిల్లినది. కాబట్టి మిల్లుయజమానుల కేదోవిధముగా రాజీచేసుకొనవలసిన దని ఆమె పట్టుపట్టెను. గాంధీ ఉపవాసవ్రతము ప్రారంభమైన నాలుగవరోజున కార్మికుల ప్రతిజ్ఞకును, మిల్లుయజమానుల గౌరవమునకును భంగముకానివిధమున ఒకరాజీ కుదిరినది. ఉభయులును కూలి పెంపుదలనుగూర్చి మధ్యవర్తిపరిష్కారమునకు బద్ధులయ్యే యేర్పాటున కంగీకరించిరి. మధ్యవర్తి కార్మికులకూలి నూటికి 35 వంతున హెచ్చించవచ్చు నని నిర్ణయించెను. ఆ ప్రకారమే జరిగినది.

శాంతియుతముగా జరిగిన ఈ వివాదపరిష్కారమూలమున కాంగ్రెసు నాయకులకును, కార్మికులకును నిరంతరప్రేమానుబంధ మేర్పడినది. 'బట్టలకూలీల

సంఘము' (Textile Labour Association) అనే పేరుతో శాశ్వతమైన ఒక కార్మికసంస్థ నిర్మింపబడినది. కడచిన ౧౭ సంవత్సరములనుండియును అది కాంగ్రెసుప్రముఖులగు శంకరలాల్ బ్యాంకర్, అనసూయాబేన్‌ల సంరక్షకత్వమున దినదినాభివృద్ధిని పొందుతూన్నది. ఇంతవరకును కార్మికులు దానిని తెప్పగా చేసుకొని అనేక కష్టపరంపరలను తరింపగలిగిరి. అహమ్మదాబాదునగరము పారిశ్రామికసంగ్రామమునకు రంగభూమి కాకుండ ఆసంస్థయే సంరక్షించ గలుగుతూన్నది. కార్మికులలో మంచి సంఘీభావము కుదిరినది. సుజాకీలాల్ నందా యాజమాన్యమున వారిలో గొప్పవిద్యాప్రబోధనము కలిగింపబడినది. దాని ఫలితముగా కార్మికులు ప్రజాక్షేమకరములైనయుద్యమములలో జోక్యము కలిగించుకొన ప్రారంభించిరి. ౧౯౨౮లో అతివర్షములవలనను, వరదలవలనను బాధితులైనవారి సహాయార్థము గాంధీజీసలహా ననుసరించి కార్మికసంఘమువారు పనిచేసిరి. ౧౯౩౦లోని శాసనోల్లంఘనోద్యమ సందర్భమున మిల్లుకూలీలు తీవ్రముగా మద్యపాననిషేధప్రచారమును చేసిరి. దాదాపు ౨౦౦ మంది కాంగ్రెసుఆదేశానుసారముగా పికెటింగ్ చేసిరి. అందులో ౧౬౨ మందికి జైలుశిక్షలు విధింపబడినవి. ఇటీవల యంత్రాలయాధికారులకును, వారికిని తీవ్రవివాదములు తటస్థించినవి. కాని గాంధీయే వారిపక్షమున శాశ్వతమధ్యవర్తిగా పనిచేసెను. ఆ వివాదపరిష్కారమునకు ౧౬ నెలలు పట్టినది. ఇంతదీర్ఘకాలము లోగూడ శాంతికి భంగము కలుగకుండునట్లు ప్రవర్తింపగలిగిన ఆ కూలీల క్రమశిక్షణము నభినందించవలసియున్నది. సత్యాహింసలను ప్రధానసూత్రములుగా ననుసరిస్తూ వస్త్రపరిశ్రమను జాతీయప్రభుత్వాధీనము చేయవలెననే లక్ష్యము గలిగిన కార్మికసంస్థ బహుశా ప్రపంచకములోకెల్ల ఈ అహమ్మదాబాదుకార్మికసంఘ మొక్కటేనని ఆసంఘనిబంధనావళినిబట్టి మాకు తెలియవస్తూన్నది. అహమ్మదాబాదుసంఘములో ఇప్పుడు చందాలిస్తూన్న సభ్యులు ౩౦,౦౦౦ మంది ఉన్నారు. ఒక్క ౧౯౩౫లోనే అది ౫,౦౦౦ వివాదములను పరిష్కరింప ప్రయత్నించెను. అందులో దాదాపు నాటికి ౫౦ గంటలు జయప్రదముగానే నెరవేరినవి. ౩౯ సమ్మెలలో ఆ సంఘము పనిచేసినది. అందులో ౨౩ కార్మికుల కనుకూలముగా పరిష్కరింపబడినవి. ఆసంఘమునుకూలమున ౧౧౯౭ మంది స్త్రీలు పిల్లలనుకన్న కాలములో రు. ౨౯,౦౦౦ మొత్తము మనువృత్తులను పొందగలిగిరి; ఆకస్మికనష్టములకు గురియైనవారు రు. ౧౯,౦౮౫ లను పరిహారముగా పొందగలిగిరి; ౧౬౫ మంది కూలీలు అంగవైకల్యమును పొందగా, రు. ౯,౬౭౬ లు వారి కీయబడినవి. ఈసంఘము వైద్యసహాయము, విద్యా ప్రచారము, శరీరవ్యాయామము, మున్సిపల్ సౌకర్యములు, మద్యనిషేధము, సంఘసంస్కరణము మొదలగు నన్ని దేశాభివృద్ధిదాయకములగు కార్యములందును జోక్యము కలిగించుకొనును.

చాంపరాన్‌లో అద్భుతశక్తి సామర్థ్యములను చూపిన గాంధియే కాంగ్రెసులీగ్ ప్రణాళికను దేశభాషలలోకి తర్జుమాచేసి, అందులోని విషయములను ప్రజలకు బోధపరచి, ఆరాజకీయసంస్కరణములను బలపరచేవారిసంతకములు తీసుకొనవలసిన దని సూచించెను. ఆసూచనను దేశములో నందరును అంగీకరించిరి. ౧౯౧౬ సంవత్సరాంతమునకు ౧౦౦౦౦౦౦ మంది సంతకములు చేసిరి. ఇదే మొట్టమొదటిసారి కాంగ్రెసుచే ప్రయత్నింపబడిన, యావద్భారతదేశమునకును సంబంధించిన యత్నము. ఇంతకుపూర్వ మొకసారి స్వపరిపాలనముకొరకు దేశమును సంసిద్ధముచేయ కాంగ్రెసు వారు తలపెట్టిరి. ఇంగ్లండు ఇండియా దేశములలో నిరంతరమును పనిసాగించుటకు ధనమును సేకరించపూనుకొనిరి. ౧౯౧౫ సం.లో జరిగిన బొంబాయికాంగ్రెసులో అ. భా. కా. సం. వారు ౩౦వ డిశంబరుతేదీని కాంగ్రెసు కొక శాశ్వతనిధిని యేర్పాటుచేయవలె నని సురేంద్రనాథ్ బెనర్జీ, భూపేంద్రనాథ్ బాసు, యస్. శ్రీనివాసయ్యంగారు, సమర్థ్, వాచా, మాలవ్యాలతోగూడిన ఒక ఉపసంఘమును నియమించిరి. ఈ ఉపసంఘసభ్యు లందరును ఇంగ్లండులోని బ్రిటిషుకాంగ్రెసు సంఘమును, దానిచే ప్రచురింపబడు ఇండియాపత్రికను పోషించుటకున్ను, భారత దేశములో కాంగ్రెసుపని సాగించుటకున్ను కావలసిన శాశ్వతనిధిని సేకరించేనిమిత్తము మార్గముల నన్వేషించుటకు కోరబడిరి. ౧౯౧౫ బొంబాయికాంగ్రెసు కధ్యక్షుడయిన సర్ యస్. పి. సిన్హాయే ఒక లక్షరూపాయ లిచ్చుటకు వాగ్దానముచేసి నట్లు పెద్ద ప్రతీతి కలదు. ఆ ఉపసంఘము ౧౯౧౬ నవంబరు ౧౭వ తేదీని కలకత్తాలో సమావేశమయి మూడున్నర లక్షలరూపాయిలు వసూలుచేయబడవలె ననీ, అలా వసూల యిన మొత్తము శాశ్వతనిధిక్రింద నిలువచేయబడవలెననీ సిఫారసు చేసెను. డాక్టరు రసవిహారీఘోష్ అధ్యక్షతక్రింద ఆ సొమ్మును సరిగా వినియోగించుటకు ౧౯౧౬ సం. డిశంబరు ౩౦ తేదీని లక్నోలో ఒక ట్రస్టీలబోర్డు యేర్పాటు చేయబడినది. తరువాత ౧౯౧౭ సం. ఏప్రెల్‌లో కలకత్తానగరమున ఆబోర్డు సమావేశమయి శ్రీనివాస శాస్త్రిని కార్యదర్శిగా నియమించుకొన్నది. ఈ నిధిని రాష్ట్రములవారీగా నిలువచేసే విషయ మానాడే నిర్ణయింపబడినది. కాని తరువాత దీనినిగూర్చి యేమీ పని జరగలేదు.

ఈ సందర్భములో కాంగ్రెసు పుట్టిన మొదటి సంవత్సరములలోనే ఇటువంటి ప్రయత్న మొకటి జరిగిన విషయము మనము జ్ఞాపకముచేసికొనవలసియున్నది. ౧౮౯౯లోనే కాంగ్రెసుకు శాశ్వతనిధి ఏర్పాటుచేయబడవలె నని సూచన వచ్చినది. అందుకు మూడు రు ౫౯,౦౦౦ లు వసూలుచేయవలెనని తీర్మానింపబడినది. కాని ౫ వేల రూపాయిలుమాత్రమే సేకరింపబడి ఓరియంటల్ బ్యాంకులో నిలువచేయబడెను. ఓరియంటల్ బ్యాంకు భారతదేశములో నెల్ల బలవత్తరమయిన మారకపు బ్యాంకుగా

అప్పటికి పరిగణింపబడుతూ వుండెను. కాని ౧౯౧౦ సం. లో బొంబాయి ఆర్థిక వ్యవహారములలో తటస్థించిన చిక్కులవలన ఆ బ్యాంకు దివాలా అయి అందులో నిలువచేయబడిన ఆ కొంచెముసొమ్ము పోయినది.

౧౯౧౭ కాంగ్రెసు మహాసభను గూర్చి ప్రానేమున్నను మరియొక విషయము మనము తెలుసుకొనవలసియున్నది. ఆ సంవత్సరపు కాంగ్రెసు కలకత్తాలో జరుప నిశ్చయింపబడెను. ఆ నగరములోని పాత మితవాదులకును, క్రొత్త హోమురూలర్లు, జాతీయవాదులకును తీవ్రమయిన భేదాభిప్రాయములు కలిగెను. కలకత్తాలో కొంత కాలమువరకును మితవాదులకు స్థానబలము గలదు. కాని తరువాతవచ్చిన జాతీయ వాదులును, హోమురూలర్లును అక్కడ అంతకంటెను ఎక్కువ బలము చేకూర్చుకొన గలిగిరి. మితవాదబలమునకు రాయి సాహెబ్ వైకుంఠనాథ్ సేన్, అంబికా చరణ ముజుందార్, సురేంద్రనాథ్ బెనర్జీ, భూపేంద్రనాథ్ వసులు ప్రాతినిధ్యము వహించిరి. చిత్తరంజనదాసు కాంగ్రెసుపనిలో ప్రవేశించి బి. కె. లాహిరి, ఐ. బి. సేన్, జితేంద్రలాల్ బెనర్జీలవంటి యువకులను వద్దకు చేర్చెను.

ఆ ౧౯౧౭ కాంగ్రెసుకు బెసెంటు అధ్యక్షురాలుగా నుండవలెనని రాష్ట్రీయ కాంగ్రెసుసంఘములలో అధికసంఖ్యాకములు సిఫారసుచేసినప్పటికినీ ఆహ్వాన సంఘసభ్యులలో ఆ విషయమును గూర్చి తీవ్రమయిన భేదాభిప్రాయము కలిగినది. ఆరోజులలోని కాంగ్రెసునియమావళినిబట్టి ఆహ్వానసంఘమువారు అధికసంఖ్యాక రాష్ట్రీయకాంగ్రెసుసంఘముల సిఫారసును అంగీకరింపవలసియుండెను. కాని ౧౯౧౭ ఆగస్టు ౩౦ తేదీని సమావేశమయిన ఆహ్వానసంఘసభ తీవ్రవాద ప్రతివాద ములకు రంగస్థల మయినది. జాయింటు గౌరవ కార్యదర్శులయిన ఫజ్ లల్ హక్, లాహిరి, జితేంద్రనాథ్ బెనర్జీలు, అధిక సంఖ్యాక రాష్ట్రీయ సంఘముల సిఫారసు ఆహ్వానసంఘములోని ఎక్కువమంది సభ్యులచే అంగీకరింపబడినదని ప్రకటించిరి. ఏదో ఒక విపరీతసంఘటనమువలన కోపగించుకొని రాయబహదూరు వైకుంఠనాథ్ సేను అంతకు ముందే ముప్పదిమంది అనుచరులతో సభను విడిచిపోయెను. ఆహ్వాన సంఘ కార్యదర్శులు అ. భా. కా. సం. నకు బెసెంటు కాంగ్రెసుఅధ్యక్షురాలుగా ఎన్నికొనబడిన ట్లొక ప్రకటనమును పంపిరి. దీనికి వ్యతిరేకముగా రాయబహదూరు వైకుంఠనాథ్ సేను "ఆహ్వానసంఘమువారు ఆగస్టునెలలోగా కాంగ్రెసు అధ్యక్షుని యెన్నుకొనలేకపోయిరి. ఆహ్వానసంఘాధ్యక్షుని హోదాలో నేనీ విషయమును అ. భా. కా. సం. నకు పరిష్కారమునిమిత్తము పంపుకొనుచున్నాను" అని ఒక తంతివార్త నంపెను. మధ్యలో యేమి జరిగినప్పటికీ సంగ్రహముగా చెప్పవలెనంటే ప్రభుత్వమువారి ఆగ్రహమునకు గురిఅయిన బెసెంటే అ. భా. కాం. సం. చేత

కరతాళధ్వనిపూర్వకముగా అధ్యక్షురాలుగా ఎన్నుకొనబడెను. ఇక ౧౯౧౭ కాంగ్రెసువిషయము క్లుప్తముగా చెప్పబూనుకొందుము.

బెసెంటు అధ్యక్షోపన్యాసములో భారతదేశస్వపరిపాలనమును గూర్చి వివరించినది. ఆమె సైనికవాణిజ్యవ్యవహారములనుగూర్చి చెప్పినవిషయములు చాలా సమగ్రములుగా నున్నవి. రాజకీయ విద్యార్థులకవి యెంతో మహోపకారములుగా నుండగలవు. "సామ్రాజ్యకూటము (Commonwealth) లోని రాజ్యముల ప్రభుత్వపద్ధతుల కనుగుణముగా భారతదేశస్వపరిపాలనాచట్టము ౧౯౨౫ లోనే నిర్మింపబడవలెను. అది ౧౯౨౭ లో గాని, లేక తప్పకుండా ౧౯౩౦ లోగాని పూర్తిగా ఆచరణలోకి రావలెను. ఈ అయిదు, లేక పదిసంవత్సరముల వ్యవధిలో భారత ప్రభుత్వము బ్రిటిష్‌వారిచేతులలోనుండి భారతీయుల చేతులలోకి బదిలీచేయబడవలెను. అధినివేశరాజ్యములకువలెనే భారతదేశమునకును బ్రిటిష్ సంబంధ ముండవలెను." ఇది ఆమెయుపన్యాసములోని సారాంశము. ఆమె యుపన్యాసాంతమున బర్నాడ్ షా చే నుదాహరింపబడిన నిరంకుశప్రభుత్వమునుగూర్చి, గ్రామపరిపాలనాచట్టమును గూర్చి వివరముగా ముచ్చటించెను. బెసెంటు కేవలము కాంగ్రెసు జరిగిన మూడు రోజులుమాత్రమే అధ్యక్షపీఠమును వహించలేదు. మరు కాంగ్రెసు జరిగేవరకును ఆ సంవత్సరమంతయును ఆమె అధ్యక్షురాలుగానే కాంగ్రెసుకార్యక్రమమును నడిపించినది. ఈసిద్ధాంతము నూతనముగా బెసెంటు తెచ్చిపెట్టినది కాదు. కాని ఇది ఆచరణలోకి రావడముమాత్రము బెసెంటుఅధ్యక్షతతోనే ప్రారంభ మైనది. ఈకలకత్తాకాంగ్రెసుకు ౪౯౬౭ మంది ప్రతినిధులును, ౫౦౦౦ మంది ప్రేక్షకులును హాజరైరి.

కలకత్తా కాంగ్రెసులో జరిగిన తీర్మానములుకూడ యేవో కొన్నితప్ప తక్కినవన్నీ మామూలువే. భారతపితామహుడు దాదాభాయినౌరోజీ, రసెలు (కలకత్తా) గార్ల మరణముల కాసభవారు చింతిల్లిరి; మాంటేగ్ ప్రభువు నాహ్వానించిరి; బ్రిటిష్ సింహాసనముయెడల భక్తిని వెల్లడించిరి; ౧౯౧౫ నుండి నిర్బంధశిక్ష ననుభవిస్తున్న మహమ్మదాలీ షౌకతాలీలను విడుదలచేయించవలసిన దని ఆకాంగ్రెసు కోరినది. భారతీయులకు సైనికశిక్షణ నివ్వించవలెనని ఆకాంగ్రెస్ తీర్మానించినది. సైనికదళములో జాతిభేదములు తొలగింపబడి తొమ్మిదిమంది భారతీయుల కున్నతోద్యోగము లొసగబడినందుకు సంతృప్తిని వెల్లడిస్తూ, ఇంకను భారతసైనికుల కున్నతాధికారము లీయబడవలెననీ, వారికి వేతనాభివృద్ధితోపాటు తదితర సౌకర్యములుకూడ చేయబడవలెననీ కలకత్తాజాతీయమహాసభ కోరినది. (౧) ౧౯౧౦ లోని ముద్రణాశాసనము ప్రకారము ప్రభుత్వాధికారుల కీయబడిన విశాలాధికారములను, (౨) ఆయుధచట్టమును, (౩) వలసరాష్ట్రములలోని భారతీయుల విషయమున జరుగుతూన్న అన్యాయములను

ఆ కాంగ్రెసు ప్రతిఘటించినది. కంట్రాక్టుకూలీపద్ధతి సంపూర్ణముగా నిర్మూలింపబడవలెనని కాంగ్రెస్ నిర్ణయించినది. వాక్స్వాతంత్ర్య, పత్రికాస్వాతంత్ర్య, సంఘస్వాతంత్ర్య, సమావేశస్వాతంత్ర్యములకు భంగము కలిగించే ప్రత్యేక నిర్బంధశాసనములనుగూర్చియు, భారతదేశసంరక్షణచట్టము నుపయోగించే విధానమునుగూర్చియు విచారించుటకొరకు పార్లమెంటరీసంఘము నియమింపబడవలెనని ఆకాంగ్రెస్ కోరినది. ఆడిసెంబరు ౧౦ వ తారీఖునసే గవర్న మెంటువారిచే రౌలట్ సంఘము నియమింపబడుటను గమనించి "ప్రభుత్వమువారు నిర్బంధశాసనములను సడలించుటకు బదులుగా, వంగరాష్ట్రములోని విప్లవోద్యమమునకు సంబంధించిన కుట్రల నణచివేయవలెనను నెపముతో, ప్రభుత్వకార్యనిర్వాహకుల కింకను ఎక్కువ అధికారములను ప్రసాదించు నూతనశాసనముల నన్వేషించుటకే ఆసంఘము నియోగింపబడినది" దని కాంగ్రెస్ తన అభిప్రాయమును వెల్లడించినది. ౧౮౧౮ వ సంవత్సరపు 3 వ రెగ్యులేషన్, భారతదేశ సంరక్షణచట్టములు (Defence of India Act) విశేషముగా నుపయోగింపబడుతూన్నందువలన దేశములో అసంతృప్తికి కారణమైనది కాబట్టి, అందరు రాజకీయఖైదీలను విడుదలచేయబడవలె నని ఆ కాంగ్రెసు కోరినది.

కొన్ని మతసిద్ధాంతముల మూలమున వెల్లూరుజైలులో ఉపవాసదీక్ష నవలంబించి మరణావస్థలోనున్న లాలా అర్జున్ లాల్ సేత్ ప్రాణరక్షణార్థము భారతప్రభుత్వమువారు జోక్యము కల్పించుకొనవలెనని కూడ ఆకాంగ్రెస్ మరియొక తీర్మానము చేసినది. దేశమంతటను బాలభటసంఘములు భారతీయుల యాజమాన్యము క్రింద స్థాపింపబడవలెనని ఆకాంగ్రెస్ ఆదేశించినది. ఇక స్వపరిపాలనమును గూర్చిన ముఖ్య తీర్మాన మిాక్రింద నుదాహరింపబడినది:

"భారతదేశములో బాధ్యతాయుతప్రభుత్వము సంస్థాపింపబడుటయే బ్రిటిష్ ప్రభుత్వమువారి ఉద్దేశమని భారతరాజ్యాంగకార్యదర్శి వారిపక్షమునచేసిన ప్రకటనమున కాంగ్రెస్ కృతజ్ఞతాపూర్వకసంతృప్తిని వెల్లడిస్తూన్నది.

"భారతదేశ బాధ్యతాయుత ప్రభుత్వస్థాపనమునకు వలయు పార్లమెంటరీచట్టము నిర్మింపబడుట అవసరమనీ, ఆచట్టముప్రకారము భారతదేశము పొందవలసిన పూర్ణాధికారమును పొందుటకు కాలనిర్ణయ మాచట్టములోనే చేయబడవలెననీ ఈ కాంగ్రెస్ స్థిరాభిప్రాయము.

" భారతరాజకీయాభివృద్ధికి మొదటిమెట్టుగా, కాంగ్రెసు లీగుప్రణాళిక శాసనరూపములో తక్షణము ప్రవేశపెట్టబడవలెనని ఈ కాంగ్రెస్నిశ్చితోద్దేశము."

ఇంతకు పూర్వమే కాంగ్రెసులోను చర్చకురాని క్రొత్తతీర్మాన మొకటి కల కత్తా కాంగ్రెసులో అంగీకరింపబడినది. అది ఆంధ్రదేశము ప్రత్యేక కాంగ్రెస్ రాష్ట్రముగా నంగీకరింపబడిన తీర్మానము. ఈ ప్రత్యేకరాష్ట్రాందోళనము ౧౯౧౩ లోనే ఆంధ్రదేశమున ప్రారంభింపబడి ౧౯౧౫ నాటికి కాంగ్రెసులో ప్రవేశించినది. భాషలను బట్టి రాష్ట్రములు విభజింపబడవలెనని ఈ ఉద్యమోద్దేశము. ఇది మొట్టమొదట ౧౯౦౬ లో మహేశనారాయణ్ వంగరాష్ట్రమునుండి బీహారును విడదీయించవలెనని చేసిన ప్రయత్నముతో ప్రారంభమైనది. ౧౯౦౮ లో బీహారు ప్రత్యేక కాంగ్రెస్ రాష్ట్రముగా చేయబడినది. భారతప్రభుత్వమువారు ౨౫-౮-౧౯౧౧ న బ్రిటిష్‌మంత్రివర్గమువారికి పంపిన ప్రత్యుత్తరములో రాష్ట్రీయస్వాతంత్ర్యసిద్ధాంత మంగీకరింపబడినది. దానినిబట్టి బీహారు వంగరాష్ట్రమునుండి ప్రత్యేకింపబడినది. రాష్ట్రీయస్వాతంత్ర్యము జయప్రదముగా పనిచేయవలెనన్నచో పరిపాలనావ్యవహారములును, విద్యావిధానమును స్థానికభాషలలోనే యుండవలెనని అనేకమంది ప్రజల విశ్వాసము. భారతదేశములో బ్రిటిష్‌పరిపాలనము జయప్రదముగా నుండకపోవుటకు కారణము వారి రాష్ట్రవిభజన పద్ధతియేనని చాలమంది నమ్మకము. వారు రాష్ట్రములను భాషలనుబట్టి కాక, పైనుంచి క్రిందకు వరుసగా నేర్పాటుచేసిరి. అందువలన ఒక్కొక్క రాష్ట్రములో వివిధ భాషలుగల జనులుండిరి. అందువలన ముఖ్యముగా స్థానికస్వపరిపాలనావిషయములలో చాలా యిబ్బంది కలుగుచున్నది. ౧౯౧౫ కాంగ్రెసీ రాష్ట్రవిభజనమాటనను విచారించ తలపెట్టలేదు. ౧౯౧౬ లోని ఆంధ్రరాష్ట్రీయమహాసభ ఈసమస్యకు ప్రాముఖ్యము నీయవలయునని కాంగ్రెసును ఒత్తిడిచేసినది. ౧౯౧౬ లోని లక్నోకాంగ్రెసీవిషయమును అ. భా. కా. సం. నకు విచారణకొరకు పంపినది. ౧౯౧౮ ఏప్రిల్ ౨౨ వ తేదీని అ. భా. కాం. సం. మద్రాసు బొంబాయి రాష్ట్రకాంగ్రెసు సంఘములను విచారించి "మదరాసురాజధానిలోని తెలుగుమాట్లాడే జిల్లాలు ప్రత్యేకకాంగ్రెసు రాష్ట్రముగా నిర్మింపబడవలెను." అని తీర్మానించినది. తరువాత సింధురాష్ట్రమును, మరి కొంత కాలమునకు కన్నడరాష్ట్రముగూడ విభజింపబడినవి. ౧౯౧౮ విషయనిర్ధారణ సభలో ఈతీర్మానమును గూర్చి తీవ్రమైన చర్చ జరిగినది. గాంధీగారు రాజకీయ సంస్కరణములు దేశములో ప్రవేశపెట్టబడేవరకును ఈతీర్మాన మాపివేయబడవలెనని అభిప్రాయపడెను. కాని లోకమాన్యుడుమాత్రము నిజమైన రాష్ట్రీయ స్వాతంత్ర్యమునకు ముందుగా భాషాప్రయుక్తరాష్ట్రములు నిర్మింపబడవలయునను సిద్ధాంతమును గ్రహించెను. ౧౯౧౮ కాంగ్రెసు కధ్యక్షతవహించిన బెసెంటునున్ను, తదితర దాక్షిణాత్య రాజకీయవేత్తలున్ను ఈ అభిప్రాయమును తీవ్రముగా ప్రతిఘటించిరి. రెండుగంటల సేపు చర్చజరిగినతరువాత రాత్రి పదిగంటలు పదిహేనునిమిషములకు తీర్మానము కల

కత్తా విషయనిర్ధారణసభలో అంగీకరింపబడినది. ౬-౧౦-౧౭ న సింధుదేశము ప్రత్యేక కాంగ్రెసు రాష్ట్రముగా అ. భా. కాం. సం. లో అంగీకరింపబడినది. అనా డంగీకరింపబడిన ఈ సిద్ధాంతముప్రకారమే నాగపురపు కాంగ్రెస్ తరువాత ౯ బ్రిటిష్‌రాష్ట్రములును ౨౧ కాంగ్రెసురాష్ట్రములుగా పునర్విభజనము చేయబడినవి.

సి. పి. రామస్వామిఅయ్యరుగారిని కాంగ్రెసుకార్యదర్శిగ చేయవలెననే కోరికతో బెసెంటు ముగ్గురు కార్యదర్శులు కావలెనని కోరెను. ఆకోరిక అంగీకరించబడినది. శ్రీ సుబ్బారావుపంతులు తిరిగీ కార్యదర్శిగా ఎన్నుకొనబడినను కూడ ఆయన ఈసంగతి గమనించి వెంటనే రాజీనామా యిచ్చెను. బెసెంటు కలకత్తాకాంగ్రెసుకు అధ్యక్షత వహించుటవలన కాంగ్రెసు, హోమ్‌రూలు సభలు రెండింటికిని సన్నిహిత సంబంధ మేర్పడినది. కలకత్తాలో మార్పుచేయబడిన హోమ్‌రూలుసభానిర్మాణవిధాన (Constitution)మతికఠినముగా నుండుటచే, అది తరువాత అసంస్థకే ముప్పుతెచ్చినది. జాతీయపతాకమును గూర్చిన చర్చ మొట్టమొదట కలకత్తాకాంగ్రెసులోనే ప్రారంభమైనది. కాని అదివరకే త్రివర్ణపతాకము హోమ్‌రూలుసభవారిచే అవలంబింపబడి, ప్రచారముకూడ చేయబడినది. తరువాత పతాకస్వరూప నిర్ణయము కొరకొక యుపసంఘ మేర్పాటుచేయబడినది. అందులో అవనీంద్రనాథ్ ఠాకూరులాటి సుప్రసిద్ధ చిత్రకారుడు సభ్యుడుగా నుండెను. కాని యెన్నడును ఆ ఉపసంఘమువారు సమావేశము కానేలేదు. హోమ్‌రూలు జెండాయే కొంతకాలమువరకు రాటముకూడా ముద్రింపబడి కాంగ్రెస్ జెండా యైనది. ౧౯౩౧ లో నియమింపబడిన జెండా ఉపసంఘమువారు ఎరుపురంగుకు బదులుగా కుంకుమపూవురంగును చేర్చిరి.

# 4. మాంటేగ్-షెమ్సుఫర్డు సంస్కరణములు

[అ. భా. కాం. సం. సమావేశములు-బెసెంటుయొక్క నిరంతర కార్య క్రమము-పాలు, తిలకులపైన నిషేధపుటుత్తరువులు - ఢిల్లీలో సంగ్రామ మహాసభ - తిలకుపందెము-మాంటేగు, షెమ్సుఫర్డు నివేదిక ప్రకటింపబడుట-దానిపై భారతీయుల భేదాభిప్రాయములు-కర్టిస్ ఇతిహాసము-బొంబాయి ప్రత్యేక కాంగ్రెస్-వోటింగుహక్కులను నిర్ణయించు సంఘముల కార్యప్రణాళిక-భారత సంరక్షకచట్టము-రౌలట్ కమిటి నివేదిక - ఢిల్లీ కాంగ్రెస్.]

జాతీయ మహాసభ కన్యాకుతవహించిన మనిషి తరువాత సంవత్సరము వరకును అధ్యక్షస్థానములోనే యుండి వ్యవహరింపవలెనని బెసెంటుఅభిప్రాయమైన ట్లిదివరకే వ్రాసియుంటిమి. ఇది నూతనాభిప్రాయము కాదు. కాని ఈ సూత్రమును మొట్టమొదట ఆచరణలో పెట్టినదిమాత్ర మామెయే.

కాంగ్రెసు పూర్తియైనవెంటనే, ౩౦-౧౨-౧౯౧౮ న ఒక అ. భా. కాం. సం. సమావేశము జరిగినది. అందులో కాంగ్రెసుకు శాశ్వతనిధిని సమకూర్చుటను గురించి విచారించబడినది. భారతదేశమునందును, ఇంగ్లండుదేశమునందును కాంగ్రెసు కార్యక్రమమును గురించి ప్రబోధ ప్రచారములు చేయుటకొరకు కార్యనిర్వాహక సంఘమును నిర్మింపవలెనని రాష్ట్రీయ కాంగ్రెసుసంఘము లాదేశింపబడినవి. తరువాత నెలలలోపల కాంగ్రెసుకార్యక్రమ మత్యంతశ్రద్ధతో నెరవేర్పబడెను. ముఖ్యముగా మద్రాసులో జరిగినపని శ్లాఘింపదగియుండెను. కాంగ్రెసులీగు ప్రణాళికలోని విషయములను ప్రజలకు బోధిస్తూ లక్షలకొలది కరపత్రములు పంచిపెట్టబడినవి. ఆప్రణాళిక కనుకూలురైన ౯ లక్షలపైచిలుకుజనులు సంతకములు చేసిన పత్రము మాంటేగుగారికి గిండీలో దర్శించినప్పు డాయనకు సమర్పింపబడెను.

౧౯౧౯ ఫిబ్రవరి ౨౩ వ తేదీని మరియొకసారి అఖిల భారత కాంగ్రెసు సంఘము సమావేశమయినది. సర్ విల్లియంవెడ్డర్బర్ణ్ మరణమున కాసభ విచారమును ప్రకటించినది. ఢిల్లీ పాంచాలరాష్ట్రములకు బాబూ విపినచంద్రపాల్, లోకమాన్యతిలకులు పోకూడదను ప్రభుత్వమువారి నిషేధపుటుత్తరువులను రద్దుపరిపించ సాగించుటకు పె.సాయికడ కొక రాయబారము నియమింపబడినది.

రాయబారవర్గమువారు పై ప్రాయిశద కరిగిరి. కాని ప్రయోజనము కలుగలేదు. మాంటేగ్ చెమ్స్‌ఫర్డుప్రభువులు భారత రాజ్యాంగ సంస్కరణముల నివేదికను త్వరలోనే పంప నుద్దేశించినట్లు తెలియవచ్చుటచే, అది ప్రకటింపబడిన వెంటనే ప్రత్యేకకాంగ్రెసు అలహాబాదులోనో, లక్నోలోనో యేర్పాటు చేయబడవలెననీ, తదనంతరము సీమకు రాయబారము పంపబడవలెననీ కూడ ఆ అ. భా. కాం. సం. సంఘే తీర్మానింపబడెను.

౧౯౧౮ మే మూడవ తేదీని మూడవ అ. భా. కాం. సం. సభ జరిగినది. హోమ్‌రూలు సభలు రెండును పంపిన రాయబారవర్గములను, సీమకుపోయే త్రోవలోనే, జిబ్రాల్టరు, సింహళద్వీపములనుండియే త్రిప్పి పంపివేసిన ప్రభుత్వమువారి చర్యను ఆసభ ఖండించినది. భారతదేశము బాధ్యతాయుత ప్రభుత్వమును పొందుట అవసర మని ప్రభుత్వమువారు ప్రకటన చేయవలసినదిగా ఆసభలో తీర్మానింపబడెను.

౧౯౧౮ మొదటి అయిదుమాసములును బెసెంటు విసుగు, విరామము లేకుండ పనిచేసినది. ఆమెసంచారకార్యక్రమమునుగూర్చి పాఠకులు కొద్దిగానైనను తెలుసు కొనవలెనన్న హోంరూలుసభవారి కరపత్రమును చూడ ప్రార్థితులు (అనుబంధము 3). కాంగ్రెసులీగుప్రణాళిక క్రింద స్త్రీలకు ఎన్నికవాక్కు ఇయబడినందుకు మిసెస్ మార్గరెట్టు కజిన్సు, మిసెస్ డొరోతీ జినరాజదాసులు బెసెంటుకు ఉత్తరములు వ్రాసిరి. ౧౯౧౮ భారత జాతీయమహాసభకు ఆయేటి జూన్‌లో జరుపబడే కార్మిక మహాసభనుండి ఒక ప్రతినిధిని ఆహ్వానించవలసినదిగా జార్జ్‌స్కర్ ఇంగ్లండునుండి బెసెంటుకు వ్రాసెను. అఖిలభారత కాంగ్రెసుసంఘము వెంటనే ఆప్రకారము తీర్మానించినది. ఆరోజులలో ఒకటే ఆదర్శముగల ప్రజాసంస్థలు పరస్పరానురాగచిహ్నముగా ప్రతినిధులను పంపుకొనే ఆచారము వ్యాప్తిలో నుండెను. హోమ్‌రూలుసభవారు బాప్టిస్టాను ఇంగ్లండులోని కార్మిక మహాసభ కావిధముగానే పంపిరి. మేజర్ గ్రాహంపోల్ సీమలోని కార్మికసభనుండి హోమ్‌రూలుసభల కవేవిధమున ప్రతినిధిగా పంపబడెను. బెసెంటుకు ఆంగ్లోఇండియన్ సంబంధమునందు విశ్వాస మెక్కువ. ఆమెస్ఫూర్తి ఆరోజులలో హోమ్‌రూల్ నతిక్రమించి పోలేదు. ఆకాలపువారనుకొనే హోమ్‌రూలు చాలా సంకుచితమైనది. ఆనాటి అధినివేశ రాజ్యము కూడ ౧౯౨౬ నాటి అధినివేశ రాజ్యముల ప్రతిపత్తికంటె చాలా తక్కువ. ఇక వెస్టుమినిస్టరుచట్టము ననుసరించి ఉన్న ఈనాటి అధినివేశ రాజ్యముతో దానిని పోల్చుటకే వీలులేదు. ఏది ఎలా ఉన్నప్పటికీ బెసెంటుకుమాత్రము ప్రజలతోను, ప్రభుత్వముతోను కూడ త్రుటి కలియడములేదు. ప్రభుత్వము

వా రామె ముందుకు పరుగెత్తుతూన్నదని నిరసింప మొదలుపెట్టిరి. ప్రజ లామె వెనుకకు లాగుతూన్నదని నిందించ ప్రారంభించిరి. ౧౯౧౮ సెప్టెంబరునెలలో బొంబాయినగరమున జరిగిన ప్రత్యేకకాంగ్రెసులో బెసెంటుకు ఎక్కువమంది అనుచరులు, మంచి పలుకుబడీ ఉన్నట్లు తోచినది. కాని ౧౯౧౮ డిసెంబరునాటి ఢిల్లీ కాంగ్రెసులో ఆమె వెనుకబడిపోయినట్లు స్పష్టపడినది. ఈ ఇద్దరి మధ్యను ఆమె అతివేగముగా తన స్థానమును పోగొట్టుకొంటూ ఉండెను.

భారత సంరక్షణ చట్టము దేశములో అన్ని మూలల తీవ్రముగా అమలుజరుప బడుతూ ఉండెను. బిపిన చంద్రపాల్, బాలగంగాధరతిలకులు ఢిల్లీ, పాంచాల రాష్ట్రములలో ప్రవేశించరాదని ౧౯౧౭లోనే ప్రభుత్వమువా రుత్తరువులు జారీచేయించిరి. కాని ఈ నిర్బంధవిధానమువలన ప్రజాందోళనము సమసిపోలేదు. బొంబాయి గవర్నరు యుద్ధసమయమున నాయకుల సమావేశము జరిపినప్పుడు తిలకు స్వపరిపాలనమును గూర్చి ముచ్చటించపోయెను. కాని ఆయనను రెండు నిమిషములకంటె ఎక్కువ కాలము మాట్లాడనియ్యలేదు. వైస్రాయి ఢిల్లీలో సభ జరిపినప్పుడు బెసెంటు, తిలక్కు లాహ్వానింపబడలేదను కారణమునను, బ్రిటిష్‌వారు కాన్‌స్టాంటి నోపిలును రష్యా వారికి ధారాదత్తముచేయ రహస్యసంధి చేసుకొన్నట్లుగా తెలియవచ్చుటచేతను గాంధీ మొట్టమొదట ఆ సమావేశమునకు పోవ నిరాకరించెను. తరువాత ఆయన షెమ్స్‌ఫర్డు ప్రభువును దర్శించెను. షెమ్స్‌ఫర్డుప్రభువు రహస్యసంధిమాట నిజము కాదనీ, స్వార్థపరుల కల్పిత వార్త అనీ గాంధీని నమ్మించెను. కాబట్టి సంగ్రామసభకు గాంధీ పోవ నంగీకరించెను. లోకమాన్యున కాహ్వానము లేకపోయినప్పటికిని ఆయనను ఢిల్లి రావలసినదని గాంధీ తంతిపంపెను. కాని లోకమాన్యుడు తాను ఢిల్లీ రాకూడదను ఉత్తరువులు స్పష్టముగా రద్దు చేయబడితేనే గాని రాజాల నని ప్రత్యుత్తరమిచ్చెను. అయినే నేమి, ప్రభుత్వమువారి గర్వము వారి నాపని చేయనిచ్చినది కాదు.

జిల్లా మేజస్ట్రేటుఅనుజ్ఞ ముందుగా పుచ్చుకొననిదే తిలకు ఉపన్యసింపరాదని ౧౯౧౮ అగస్టునెలలో ఆయనపైన ఉత్తరువులు జారీచేయబడినవి. అంతకు పూర్వము వారములో జులక్రిందట ఆయన యుద్ధమునకు సైనికులను సమకూరుస్తూ ఉండెను. సైన్యములో ఉన్నతోద్యోగములు భారతీయుల కియబడు నని ముందుగా ప్రభుత్వమువారి దగ్గరనుండి గాంధీ వాగ్దానము తీసుకోగలిగినయెడల తాను మహారాష్ట్రదేశమునుండి ౫౦౦౦ ల మంది సైనికులను సమకూర్చగలననీ, తా నావిధముగా సమకూర్చలేకపోయినచో. రు. ౫౦,౦౦౦ లు అపరాధముక్రింద చెల్లించగల ననీ తెలియపరుస్తూ లోకమాన్యు డందుకు హామీగా గాంధీపేర రు. ౫౦,౦౦౦ ల కొక

చెక్కి పంపెను. భారతీయులు చేయబోయే సహాయము చేరమరూపములో సుండరా దని గాంధీ అభిప్రాయపడి లోకమాన్యునకు చెక్కు త్రిప్పి పంపివేసెను. ౧౯౧౭-౧౮ సంవత్సరములలో కాంగ్రెసు తిలకుకు సమమానదృష్టితో చూచినది. ప్రభుత్వమువా రాయనపైన కేసునే పెట్టతలపెట్టిరి. కాని బెసెంటుమాత్ర మాయనతో కలసి మెలసియుండెను.

౧౯౧౮ జూలై నెలలో మాంటుఫర్డునివేదిక ప్రకటింపబడినది. అది యొక గొప్ప సాహిత్య గ్రంథమని చెప్పవచ్చును. బ్రిటిష్ రాజకీయ ధురంధరులు వ్రాసిన తదితర రాజకీయ ప్రణాళికలవలెనే దానిలో కూడ భారతదేశ స్వపరిపాలనా వాదమును గూర్చి నిష్పాక్షికముగా చర్చింపబడినది. భారతదేశములో రాజకీయ సంస్కరణములను ప్రవేశపెట్టుటకు గల యిబ్బందులు గూడ అందులో సాకల్యముగా వివరింపబడినవి. కుదికు సంస్కరణావశ్యకత నిరూపింపబడినది. మాంటుఫర్డునివేదిక కొందరి ఆమోదమును పొందుటకు మరొక్క విషయము కారణభూతమైనది. భారతదేశమునందలి సుప్రసిద్ధ సంస్థలగు కాంగ్రెస్ ముస్లిమ్ లీగులు రెండును కలసి తయారుచేసిన ప్రణాళికలో, కార్యనిర్వాహకవర్గములు శాశ్వతముగా నుండి శాసనసభలకు బాధ్యత వహించవలెనని సూచించబడినది. మాంటుఫర్డునివేదికలో మంత్రివర్గమువారు శాసనసభల అంగీకారముపైన ఆధారపడియుందురనీ, వారు శాసనసభ్యుల సమ్మతితో మారుతూ ఉంటారనీ, వారికి సమష్టిబాధ్యత ఉన్నదనీ సూచింపబడినది. ఈ సిద్ధాంతము కేవలము బ్రిటిష్ స్వపరిపాలనా పద్ధతికి నకలు. ఇంతకన్న భారతదేశమున కింకేమి కావలయును? ఇక శాసనసభలు భారతీయులకు శిక్షణాలయములు కావు. అక్కడి మంత్రులు తమ నియోజకవర్గముల యెదుట తమ చర్యలను సమర్థించుకొనగలిగిననే తప్ప ఉద్యోగములలో నుండజాలరు. కాబట్టి ఈ ప్రణాళిక చాలా బాగున్నదని భారతదేశములోని అనేకమంది రాజకీయవేత్తలు శ్లాఘింపసాగిరి. అంతటితో కాంగ్రెస్ లీగ్ ప్రణాళిక మరుగుపడినది. మాంటుఫర్డు ప్రణాళిక పైకి వచ్చినది. సర్ శంకరన్ నాయరు అంగీకరించిన యే రాజ్యాంగప్రణాళిక యైనను తన కిష్టమే నని బెసెంటు చెప్పినదట. ఆసంగతి మాంటేగ్ మంత్రి డయరీవలన తెలుస్తూన్నది. సర్ శంకరన్ నాయరు మాంటుఫర్డునివేదిక నామోదించెను. ప్రభుత్వమువారి కయిష్టులయిన తీవ్రవాదులనుండి ఇష్టులయిన మితవాదులను చీలదీయవలెనని మాంటేగ్ ప్రయత్నించెను. ఆయన దేశమునందలి వివిధపక్ష నాయకులకును దర్శనమిచ్చి ప్రసంగించెను. వా రాయా సందర్భములలో వెలువరించిన అభిప్రాయములను తన డయరీలో మదాహరించుకొనెను. ఆయన సి. పి. రామస్వామి అయ్యరుగారి అభిప్రాయము నడిగెను. శ్రీనివాసశాస్త్రిసిద్ధాంతములు నాలుగును తన కిష్టమే నని రామస్వామయ్యరు

బదులుచెప్పెను. రాజకీయసంస్కరణములనుగూర్చి అప్పుడప్పుడు పార్లమెంటువారి విచారణ జరుగవలె ననేవిషయమునకు రామస్వామయ్యరు అంగీకరింపజాల డని మాంటేగ్ భయపడెను. భారతస్వపరిపాలనమునకు కాలపరిమితి నిర్ణయింపబడవలె ననీ, దానివలన ప్రజ లమకొనేదానికంటె కూడ ఎక్కువ ప్రయోజన మున్నదనీ, భారతీయులు మాంటేగును నమ్మినందుకు వారిని విడనాడవలదనీ రామస్వామయ్యరాయన (మాంటేగు) హృదయమునకు జాలిపుట్టునట్లుగా ప్రార్థించెను. తరువాత శ్రీనివాసయ్యంగారినిగూర్చి మాంటేగుమంత్రి "నేను పెంట్లండుప్రభువుతో మాట్లాడిన పిమ్మట మద్రాసు రాజధాని అడ్వొకేటుజనరలు శ్రీనివాసయ్యంగారు నన్ను చూడ వచ్చెను. కాంగ్రెసులీగుప్రణాళిక పూర్తిగా అంగీకరింపబడు నని ప్రజ లెవ్వరును అనుకోవడము లేదనీ, అది ముందుముం దభివృద్ధి కాగలదనే ధైర్యము వారికి కలిగించినచో వారు సంతృప్తి పడగలరనీ ఆయన నాతో చెప్పెను. కర్టిస్ప్రణాళిక అత్యుత్తమమైనదని ఆయన అభిప్రాయము. ప్రభుత్వమువారిపైన ప్రజలకు తీవ్రమైన అయిష్టత ఉన్నదని ఆయన నాతో చెప్పెను. కాని దానినిగూర్చి వివరముగా ఏమీ చెప్పలేక పోయెను." అని తన డయరీలో వ్రాసుకొనెను. ఈ సందర్భములో శ్రీనివాసయ్యంగా రప్పటికి కాంగ్రెసువాది కాడని చెప్పనియెడల ఆయన కన్యాయము చేసినవార మగుదుము. ఈ పైఉదాహరణములను బట్టి సెతల్వాడు, చంద్రావర్కర్ రహీంతుల్లాలుకూడ మాంటుఫర్డు స్కీము కనుకూలురుగా నుండి రనుటకు ప్రత్యేక నిదర్శనములు మన కనవసరము. మాంటేగ్ మంత్రిరాజకీయపు యెత్తులనుగూర్చి యిదివరకే చెప్పియుంటిమి. ప్రభుత్వమువారు మితవాదులను చేరదీసి వారిని బలపరచ తలపెట్టిరి. మితవాదిసంఘమువారిచే ఇండియాలో మాంటుఫర్డుప్రణాళిక కనుకూలముగా ప్రచారముచేయించుటకును, సీమకు రాయబారము పంపించుటకునుకూడ ప్రభుత్వమువా రుద్దేశించిరి. సర్ యస్. పి. సిన్హాను భారతరాజ్యాంగ కార్యదర్శిగా చేసి, ఆయనక్రింద సహాయకార్యదర్శిగా మాంటేగును నియమింపవలె నని ప్రభుత్వమువారభిప్రాయపడిరి. "అందుమూలమున ఒకప్పుడు మంత్రిపదవి నధిష్ఠించిన బ్రిటిష్ రాజకీయధురంధరుడుకూడ ఇండియాకు అధికారిగా గాక సహాయకారిగా నుండుట అవమానకరముగా భావించలే దని ఐ. సి. యస్. ఉద్యోగులకు గుణపాఠముగా నుండగలదు. భారతీయులకు బ్రిటిష్వారి సుహృద్భావమునుగూర్చి విశ్వాసము కుదరగలదు" అని మాంటేగ్ మంత్రి చెప్పినమాట లతని రాజకీయదృష్టిని వెల్లడించగలవు. ఇక జాతీయవాదులుకూడ తమ మనోభావములను మాంటేగుకు వ్యక్తపరచిరి. "ఇరువది సంవత్సరములలో బాధ్యతాయుతప్రభుత్వము లభించేయెడల సంతుష్టి పడగల" నని మోతీలాల్ నెహ్రూ చెప్పెను. చిత్తరంజనదాసు ద్వంద్వపరిపాలన మపజయముపొంది

తీరునని జోస్యము చెప్పెను. అయిదుసంవత్సరములలో నిజమైన బాధ్యతాయుత ప్రభుత్వ మొసగబడునని వెంటనే ప్రకటనము చేయవలసినదిగా మాంటేగును ఆయన కోరెను. సురేంద్రనాథబెనర్జీ మాంటేగుకు సహాయముచేయ తలపెట్టెను. భూపేంద్ర నాథబాసు మాంటెగ్‌మంత్రిసవరణలనుమాత్రము ఆలోచనలో ఉంచి, మాంటు ఫర్డుప్రణాళికను మొత్తముమీద కాంగ్రెసు ఆమోదించగలదనీ, అందువలన ప్రతిపక్షులు కాంగ్రెసువాదులను కేవలము వాగ్వాదప్రియులుగా నిందించ వీలుండదనీ చెప్పెను.

మాంటుఫర్డునివేదికలో చాలాభాగము లయొనెల్ కర్టిస్‌గారి సహాయముతో సర్ జేమ్సు మెస్టన్, సర్ మారిస్‌గార్లు తయారుచేసినట్లు పెద్దప్రతీతి ఉన్నది. కర్టిస్ గారు సామ్రాజ్యశ్రేయోభిలాషి. ఆయన భారతరాజకీయ సంస్కరణములను గూర్చి వ్రాసిన యుత్తరము పొరపాటున ఎట్లో బొంబాయి క్రానికల్, ఈవరుపత్రికాధిపతుల చేతులలో పడినది. దానిని వారు ప్రకటించిరి. దానిమూలమున ప్రభుత్వమువారి కుట్రలు వెల్లడియైనవి. అధికారులకు భారతజాతీయవాదులపైన కోపము కలిగినది.

అసలా యుత్తరము కర్టిస్‌గారిచే అప్పటి 'రౌండుటేబిల్' కార్యదర్శి ఫిలిప్ కెర్‌గారికి ప్రైవేటుగా వ్రాయబడినది. దానిలో స్వపరిపాలితాధినివేశరాజ్య ముల ప్రాతినిధ్యము గలిగి భారతదేశప్రతినిధులు లేని సామ్రాజ్యసభకు (Imperial Council) హిందూదేశపు విదేశవ్యవహారములను, అంతరంగికవ్యవహారములను కూడ స్వాధీనపరచుటనుగూర్చి చర్చించబడినది. అదే జరిగినయెడల రక్తపాతము రావచ్చు ననీ, సామ్రాజ్యక్షేమముకొరకు మది అవసరమే అయినయెడల దాని నెదుర్కొనవలసి వచ్చేననీ కర్టిస్ తనయుత్తరములో వ్రాసెను. దానిలో వ్రాయబడిన విషయములు మొత్తముమీద మెస్టన్, మారిస్, షిరాలు లామోదించిరనికూడ ఆయన ఉదాహరిం చెను. 'రౌండుటేబిలు' సభ్యులకు పంచిపెట్టించేనిమిత్త మీయుత్తరము అలహాబాదు లోని గవర్నమెంటుముద్రాలయములో ముద్రింపబడెను. దానినకలొకటి లభించగా వెంటనే ౧౯౧౭ లక్నోకాంగ్రెసునాటి కది ప్రకటింపబడెను. తరువాత తా నెందు కాయుత్తరమును వ్రాయవలసివచ్చినదో భారతప్రజలకు తెలియపరుస్తూ కర్టిస్‌గారు మరి యొక యుత్తరమును ప్రకటించిరి. కర్టిస్ మొట్టమొదట దక్షిణాఫ్రికాలో ఉద్యో గిగా నుండెను. బోయరు యుద్ధానంతరము దక్షిణాఫ్రికాలో సివిల్ సర్వీసును నిర్మించుటకు బ్రిటిష్ ప్రభుత్వమువారు సర్ జేమ్సు మెస్టను, మారిస్‌గార్లను పంపి నప్పుడు వారితో ఆయనకు ప్రథమపరిచయమైనది. అప్పటినుండి వారు బ్రిటిష్‌సామ్రా జ్యకూటము (Commonwealth) లో నున్న దక్షిణాఫ్రికా, కనడా, ఇండియా దేశములలోని సామ్రాజ్యసమస్యలను గూర్చి తెలుసుకొన ప్రారంభించిరి. ౧౯౧౬ లో

కర్జీకుమారిని ఇండియాకు సంబంధించిన సామ్రాజ్యసమస్యలను గూర్చి తెలుసుకొనే టందుకు సర్ జేమ్సు మెస్టన్ ఆహ్వానించెను. అవిధముగా వారు తెలుసుకొనిన విషయములను అప్పుడప్పుడు ఇంగ్లండులో మూడుమాసముల కొకతూరి ప్రకటింప బడుతూ ఉన్న 'రౌండ్ టేబిలు' పత్రికలో ప్రచురించుట కేర్పాట్లు చేయబడినవి. పైన ఉదాహరింపబడిన ఉత్తరము 'రౌండ్ టేబిల్' పత్రికలో ప్రచురణార్థము పంప బడెను. కాని అది పొరపాటున తప్పుడిరునామాకు చేరినది. దానినిబట్టి సంగ్రామా నంతర సామ్రాజ్య పునర్నిర్మాణ సందర్భమున భారతదేశమును ఒక్క ఇంగ్లండు దేశముక్రిందనేకాక అధినివేశరాజ్యములక్రిందకూడ అణచిపెట్టి ఉంచవలెనని కర్టిస్ భారతప్రభుత్వాధికారులతో కుట్రచేస్తూన్నట్లు గగ్గోలుపుట్టినది. అందుకు ప్రత్యు త్తరముగా తాను ప్రస్తుత మిండియాదేశముయొక్క విదేశవ్యవహారములను, ఆంత రంగిక వ్యవహారములను విడదీయ వీలులేదని గట్టిగా చెప్పినందుకు కొంతమంది, అధి నివేశరాజ్యములు భారతదేశ పరిపాలనమునం దధికారము వహించ కోరుచున్నవని అపార్థములను కల్పించిరేకాని అది నిజము కాదని కర్టిస్ స్పష్టపరచెను. అంతటితో ఊరకుండక తా నంతకుపూర్వము "సాధ్యమైనంతత్వరలో భారతదేశప్రజలను తమంతట తాము పరిపాలించుకొనే శక్తివంతులుగా చేయుట బ్రిటిష్‌సామ్రాజ్యప్రభుత్వమువారి ధర్మమనీ, భారతీయులుకూడ బ్రిటిష్‌సామ్రాజ్యములో భాగస్వాములుగా నుండుట కంగీకరించవలెననీ" వ్రాసిన విషయమునుకూడ ఉదాహరించి భారతీయులను సంతృప్తి పరచ ప్రయత్నించెను. అసలు నిజ మేమి టనగా మాంటేగుమంత్రి సీమనుండి తనసహా యముకొరకు ఆరుగురు సహోద్యోగులను తీసికొనివచ్చెను. వారు చాలక ఇండియా లోని ఐ. సి. యస్. ఉద్యోగులలో గట్టివాండ్లను కొంతమందినికూడ చేరదీసెను. వారిలో ముఖ్యులు సర్ మాల్కమ్ హెయిలీ, సర్ జేమ్సు మెస్టన్, మారిస్ గారులు. ఆకాలములో మారిస్ సంయుక్తరాష్ట్రములలో పోలీసు ఇన్స్పెక్టరు జెనరలుగా పని చేస్తూఉండెను.

కాబట్టి మాంటుఫర్డునివేదిక ప్రకటింపబడినవెంటనే దేశములో నున్న వివిధ నాయకులును వివిధ విధములగు అభిప్రాయములను ప్రకటించుటలో వింత లేదు. ఇక అ. భా. కాం. సం. నిర్ణయముప్రకారము ప్రత్యేకకాంగ్రెస్ జరుగవలసియుండెను. బొంబాయినగరమువారు చాలాతక్కువకాలములోనే ప్రత్యేకకాంగ్రెసును జరుపుటకు కావలసిన బ్రహ్మాండమైన ప్రయత్నములను చేయగలిగిరి. కాంగ్రెసువాదులలో తీవ్ర మైన భేదాభిప్రాయములు కలిగినవి. మాంటుఫర్డుప్రణాళిక ఉన్నదున్నట్లుగా ఏపక్షము వారికిని సంతృప్తికరముగాలేదు. కాని ఒకపక్షమువారు దానిని పూర్తిగా నిరాక రింపకోరిరి. రెండవపక్షమువారు దానిలో సవరణలు చేయవలెనని తలపెట్టిరి. ప్రత్యేక

కాంగ్రెసుకు కొన్నిరోజులు ముందుగా ఈరెండుపక్షములవారికిని ఏకీభావము కుదుర్చుటకు ఒకసభ జరుపబడినది. కాని ఆప్రయత్నము భగ్నమైనది. ౧౯౧౮ ఆగస్టు ౨౯ తేదీన హస్సన్ ఇమామ్ అధ్యక్షతక్రింద ప్రత్యేక కాంగ్రెసు జరిగినది. ఆసభకు ౩౮౪౫ మంది ప్రతినిధులు వచ్చిరి. ఆహ్వానసంఘాధ్యక్షుడు విఠల్‌భాయిపటేలు. దిన్షా వాచా, సురేంద్రనాథ బెనర్జీ, భూపేంద్రనాథబాసు, అంబికాచరణ మజుందారు లాసభకు రాలేదు. నాలుగురోజులు చర్చ జరిగినతరువాత కాంగ్రెసులీగుప్రణాళికలోని సిద్ధాంతమునే ఆ స్పెషల్ కాంగ్రెసుకూడ బలపరచినది. సామ్రాజ్యాంతరస్థస్వపరిపాలనమునకు తక్కువైన దేదైనను భారతీయుల న్యాయ్యమైన ఆశయములను సంతృప్తిపరచజాలదనికూడ ఆకాంగ్రెసు ప్రకటించెను. అది మాంటేగు సూచనలనుగూర్చి చాలావరకు చర్చించెను. ఆనివేదికలో భారతీయులు స్వపరిపాలనమున కర్హులుకారని చేయబడిన సూచనను తీవ్రముగా ప్రతిఘటించెను. భారతీయుల స్వపరిపాలనార్హతను ఉద్ఘోషించెను. రాష్ట్రములందును, కేంద్రములందును కూడ రాజకీయాభివృద్ధి ఏకకాలమున జరుగవలెనని ఆ కాంగ్రెసు అభిప్రాయమును వెల్లడించెను. రాష్ట్రప్రభుత్వములలో భారతీయులనుభవము సంపాదించేటంతవరకును కేంద్రములోని ముఖ్యాధికారములన్నీ బ్రిటిషుప్రభుత్వమువారి చేతులలోనే ఉండవలెననే సూచన నది యెంతమాత్రమును ఆమోదించలేదు.

(౧) సాధారణన్యాయస్థానములలో విచారణజరిగి నిర్ణయింపబడిననేతప్ప ప్రజల స్వేచ్ఛకును, ఆస్తులకును భంగము కలుగకుండునట్లున్నూ, వాక్స్వాతంత్ర్య లేఖనాస్వాతంత్ర్య సమావేశ స్వాతంత్ర్యము లరికట్టబడకుండునట్లున్నూ హామీ నొసంగవలెననీ, (౨) లైసెన్సులు తీసుకొన్నయెడల గ్రేటుబ్రిటనులోవలెనే ఆయుధములు ధరించేహక్కుండవలెననీ, (౩) పత్రికలకును, ముద్రణాయంత్రములకును లైసెన్సులు, ధరావతుల పద్ధతి తొలగింపబడి స్వాతంత్ర్య మీయబడవలెననీ, (౪) న్యాయసంబంధమున భారతీయులందరకును సమానప్రతిపత్తి ఉండవలెననీ, దేశసంరక్షణ, శాంతిభద్రతల విషయములో ఇండియా ప్రభుత్వముయొక్క పరిపాలనాధికార మవిభాజ్యముగా నుండవలెననీ ఆకాంగ్రెసులో తీర్మానింపబడినది. సామ్రాజ్యములోని స్వపరిపాలితాధినివేశరాజ్యములకు గల ఆర్థిక స్వాతంత్ర్యమువంటి స్వాతంత్ర్యమే భారతశాసనసభకు కూడ ఉండవలెనని మరియొక తీర్మానము చేయబడినది. రాజప్రతినిధి, భారతరాజ్యాంగకార్యదర్శులు భారతదేశపు బాధ్యతాయుతప్రభుత్వముకొరకు హృదయపూర్వకముగా పనిచేసినందు కాకాంగ్రెసువారు శ్లాఘిస్తూ, కొన్ని సందర్భములలో రాజకీయసంస్కరణము లభివృద్ధిసూచకములుగా నున్నప్పటికినీ మరికొన్ని సందర్భములలోమాత్రం ఆశాభంగకరములుగాన్నూ,

అసంతృప్తికరములుగాను ఉన్నవని అభిప్రాయపడి, వారు నిజమైన బాధ్యతాయుత ప్రభుత్వనిర్మాణమునకు కావలసిన సవరణ లనేకములు ప్రతిపాదించిరి. రాష్ట్రముల విషయములో సూచించినవిధమున కేంద్రములోకూడ ప్రభుత్వ విషయములు (Reserved), ప్రజాపాలిత విషయములు (Transferred) అనేపద్ధతి ఉండవలెననీ, విదేశ వ్యవహారములు, సైన్యము, నౌకాదళము, భారత సంస్థానాధిపతుల సంబంధము- ఇవి మాత్రము ప్రభుత్వవిషయములుగా నుండవలెననీ కలసరాష్ట్రములను తదితరవిషయములో ప్రజాపాలితములుగా నుండవలెననీ ఆకాంగ్రెసు కోరినది. నూతనరాజ్యాంగప్రణాళికలోని భారతశాసనసభకు మొదటిగడువు జరిగినపిమ్మట, ప్రజాపాలితవిషయములకు సంబంధించినంతవరకు భారతరాజప్రతినిధిస్థితి స్వపరిపాలితాధినివేశరాజ్యములలోని రాజప్రతినిధిస్థితికి సమానముగా నుండవలయునని తీర్మానింపబడినది. "భారతశాసనసభలో ప్రవేశపెట్టబడిన చిత్తుచట్టముల(Bills) మూలమున శాసనములు చేయబడవలెను. ప్రభుత్వ విషయములకు సంబంధించిన అవసరమైన తీర్మానములను శాసనసభ అంగీకరించనియెడల గవర్నరు జెనరల్‌కు గల అత్యధికారములను వినియోగించి వాటిని శాసనములుగా చేయవలెను. అవి ఒక సంవత్సరముమాత్రమే అమలులో నుండవలెను. తరువాత వాటిని పునరుద్ధరింపవలెనన్న యెడల భారతశాసనసభకు హాజరైన సభ్యులలో నూటికి ౪౦ మంది అంగీకరిస్తేనే గాని వీలుండకూడదు. స్టేట్ కౌన్సిలు (సామ్రాజ్య శాసనసభ) ఉండనే కూడదు. ఒకవేళ ఉండడమే అవసరమైనయెడల దానిలో సగమువంతు సభ్యు లెన్నికసభ్యులుగా నుండవలయును. సర్టిఫికేషన్ అధికార మొక్క ప్రభుత్వవిషయములకు సంబంధించిమాత్రమే ఉండవలయును. ప్రభుత్వవిషయములకు సంబంధించిన కార్యనిర్వాహకసభ్యు లొకరికంటె యెక్కువమంది ఉండేయెడల అందులో సగముమంది భారతీయులుగా నుండవలెను. భారత శాసనసభలో ౧౫౦ మంది సభ్యు లుండవలయును. అందులో ౪/౫ వంతు ఎన్నిక సభ్యులుగా నుండవలయును. అధ్యక్షునీ, ఉపాధ్యక్షునీ ఎన్నుకొనుటకును, దాని వ్యవహారముల నది నిర్వర్తించుకొనేటందుకు కావలసిన నిబంధనలు చేసుకొనుటకును ఆసభ కధికార ముండవలయును. ౧౫ సంవత్సరములకు మించని వ్యవధిలో యావద్భారతదేశమునందును సంపూర్ణబాధ్యతాయుత ప్రభుత్వము స్థాపింపబడు నని శాసనరూపకమైన హామీ యుండవలెను." అనికూడా తీర్మానింపబడెను.

ఇక రాష్ట్రముల విషయములో (ఎ) "కార్యనిర్వాహకవర్గమునందు పనిలేని నామకార్థపు సభ్యు లుండకూడదు. (బి) నూతనశాసనసభల మొదటిగడువు దాటిన పిమ్మట, ప్రజాపాలిత విషయములలో మంత్రులకును, గవర్నరుకును గల సంబంధము స్వపరిపాలితాధినివేశరాజ్యములలోని సంబంధమువంటిదిగానే యుండవలెను. (సి

మంత్రుల జీతములు కార్యనిర్వాహకసభ్యుల జీతములతో సమానముగా నుండవలెను. మంత్రులును, కార్యనిర్వాహకసభ్యులును సమానప్రతిపత్తిలో నుండవలెను. (ఆ) కార్యనిర్వాహకసభ్యులలో సగముమంది భారతీయులుగా నుండవలెను. (ఇ) ప్రభుత్వ విషయములకు కొంత నిర్ణీతమైన సొమ్ము ప్రత్యేకింపబడినపిమ్మట ఆదాయవ్యయ పట్టిక శాసనసభాధికారములో నుండవలెను. కొత్త పన్నులు విధింపబడుట అవసరమే అయినయెడల వాటిని రాష్ట్రీయప్రభుత్వసభ్యు లందరును కలసి నిర్ణయించవలెను. సంపూర్ణ రాష్ట్రీయస్వాతంత్ర్యమునకు దేశము సంసిద్ధముగా నున్నదని కాంగ్రెసు భావిస్తూన్నప్పటికినీ సంస్కరణములు తేలికగా కొనసాగించేనిమిత్తము అన్నిరాష్ట్రములలోను పోలీసుశాఖ, న్యాయశాఖ, న్యాయస్థానశాఖలను (జైళ్లుతప్ప) కార్యనిర్వాహకవర్గమువారి అధికారములో ఆరు సంవత్సరములవరకును ఉంచుట కంగీకరింతుము. న్యాయ, కార్యనిర్వాహకశాఖలు వెంటనే ప్రత్యేకింపబడవలెను. కేంద్రశాసనసభలవలెనే రాష్ట్రసభలుకూడ అధ్యక్ష, ఉపాధ్యక్షులను ఎన్నుకొనవలెను. పెద్ద కమిటీలను (Grand Committees) నియమించే సూచన విరమింపబడవలెను. ఒకవేళ అవి నియమింపబడవలసివచ్చేయెడల వాటిలో సగముమంది ఎన్నికసభ్యులుగా నుండవలెను. రాష్ట్రీయశాసనసభలలో ౪/౫ వంతు ఎన్నికసభ్యు లుండవలెను.

న్యాయశాఖ, పోలీసు, న్యాయస్థానసమస్య లన్నిటికి సంబంధించి రాష్ట్రీయ శాసనసభలు చట్టములు చేయవచ్చును. రాష్ట్రప్రభుత్వములవారి కవి సంతృప్తికరముగా లేనియెడల వారు కేంద్రప్రభుత్వమునకు వాటిని విచారణకొరకు పంపవచ్చును. కేంద్రప్రభుత్వమువారా శాసనములను భారత శాసనసభలో చర్చకు పెట్టవలెను. అక్కడ మామూలు గ్రంథ మంతయును నడవవలెను.

ఇండియాప్రభుత్వముపైన పార్లమెంటుకును, భారతరాజ్యాంగకార్యదర్శికిని కల అధికారము తగ్గింపబడవలెను. ఇండియాకౌన్సిలు రద్దుచేయబడవలెను. భారత రాజ్యాంగకార్యదర్శికి ఇద్దరు సహాయకార్యదర్శు లుండవలెను. అందులో ఒకడు భారతీయుడుగా నుండవలెను." అని తీర్మానింపబడెను.

సాంఘికప్రాతినిధ్యవిషయములో, "కాంగ్రెసులీగుప్రణాళికలో నిర్ణయింపబడినవిధమున కేంద్ర రాష్ట్ర శాసనసభలలో మహమ్మదీయప్రాతినిధ్య ముండవలె" నని ఆ కాంగ్రెసు తీర్మానించినది. "స్త్రీలు కేవలము వారి స్త్రీత్వమువలన శాసనసభ్యులుగా నుండుట కనర్హలుగా చేయబడకూడదు. ఆర్థికవ్యవహారములలో భారత ప్రభుత్వమునకు సర్వాధికారము లుండవలెను." అని తీర్మానింపబడెను.

సైనికదళములో భారతీయుల కున్నతోద్యోగము లిచ్చుటనుగూర్చి ప్రభుత్వమువారు సంతృప్తికరముగా పనిచేయనందు కాశాభంగమును ప్రకటిస్తూ, వెంటనే సైనికోన్నతోద్యోగములు నూటికి ౨౫ వంతున భారతీయులు పొందేటందుకు తగిన ఏర్పాట్లు చేయబడవలెననీ, ౧౫ సంవత్సరములలో నూటికి ౫౦ వంతు వరకును పెంపు కావలెననీ ఆకాంగ్రెసు అభిప్రాయమును వెల్లడించినది. ఈవిషయములో ఇంగ్లండుకు రాయబారము పంపుటకుకూడ ఆకాంగ్రెసు నిర్ణయించినది.

రాజకీయ సంస్కరణములనుగూర్చి కాంగ్రెసువాదులలో కక్షలు రాకుండ ఈవిధముగా ప్రత్యేక కాంగ్రెసు సౌమ్యముగా నడచిపోయినది. ఇదివరకు వారిలో గల భేదాభిప్రాయములు సమన్వయింపబడినవి. ప్రత్యేక కాంగ్రెసులో చేయబడిన తీర్మానములు దేశములోని అనేకసంఖ్యాకులగు కాంగ్రెసువాదుల ఆమోదమును బడసినవి. ఆ సమయములోనే మహమ్మదాబాద్ రాజా అగ్రాసనాధిపత్యము క్రింద ముస్లిమ్ మహాసభకూడ జరిగినది. ఆసభవారుకూడ రాజకీయ సంస్కరణములను గూర్చి కాంగ్రెసు అంగీకరించిన తీర్మానమువంటి తీర్మానమునే అంగీకరించిరి.

రాజకీయ సంస్కరణములు దేశములో ప్రవేశపెట్టబడుటకు పూర్వ మింకను కొన్నిపనులు జరుగవలసియుండెను. కేంద్ర రాష్ట్రీయప్రభుత్వముల అధికారములు నిర్ణయింపబడవలసియుండెను. నియోజితప్రదేశములును, ఎన్నిక హక్కులును కూడ నిశ్చయింపబడవలసియుండెను. కాబట్టి సౌతుబరోకమిటీవారు ఎన్నికహక్కులను నిర్ణయించుటకును, ఫీతమ్ కమిటీవారు ప్రభుత్వాధికారములను నిర్ణయించుటకును ఇంగ్లండునుండి ఇండియాకు వచ్చిరి. దక్షిణాదిని ౧౯౧౬ ఫిబ్రవరిలో ప్రారంభింపబడిన బ్రాహ్మణేతరోద్యమము ౧౯౧౮ నవంబరునాటికి చాలా బలవత్తరమై అప్రతిహతముగా నడుస్తూ ఉండెను. అప్పటికి శ్రీనివాసశాస్త్రి సౌత్‌బరో కమిటీలో సభ్యుడుగా నుండెను. ఆయన సౌత్‌బరోను లోబరచుకొని బ్రాహ్మణేతరులకు ప్రత్యేకప్రాతినిధ్యము లేకుండ చేయ ప్రయత్నిస్తూ ఉండెనని బ్రాహ్మణేతరనాయకు లనుమానపడిరి. శాస్త్రి ఆకమిటీలో నున్నందుకు ప్రతిఘటన పూర్వకముగా వారా కమిటీని బహిష్కరించిరి. ఈవిషయమును సీమకు తెలియపరచుటకూడ ముందు ఏర్పరించిరి. తరువాత తెలియపరచనే తెలియపరచిరి. వారికోరిక సిద్ధించినది కూడాను. కాని అంతటితో భారతదేశపు కష్టము లీడేవలేదు. బ్రిటిష్‌రాష్ట్ర సంరక్షణ చట్టము (British Defence of the Realm Act) నకు మరియొక అంగముగా పరిగణింపబడదగిన భారత సంరక్షణచట్టము (Defence of India Act) దేశములో తీవ్రముగా అమలుజరుపబడుతూ ఉండెను. ఆచట్టముప్రకార మెవరినైనను ఏపనినైనను చేయ

నిర్బంధించనూవచ్చును, శిక్షా చేయనూవచ్చును. మౌలానా అబుల్ కలామ్ అజదు, ఆలీసోదరుల నిర్బంధమునుగూర్చి యిదివరకే ముచ్చటించియుంటిమి. ౧౯౧౯ లో విడుదలచేయబడి అమృతసరముకాంగ్రెసుకు వచ్చేటంతవరకును ఆలీ సోదరులు కాంగ్రెసువాదులు కానేకారు. మహమ్మదాలీ 'కామ్రేడు' అను తీవ్రమైన వారపత్రికను, ఆయన అన్న షౌకతాలీ 'హమ్‌దాదు' అను ఉర్దూపత్రికను నడుపుతూ ఉండిరి. చిన్నజాతుల స్వాతంత్ర్య రక్షణార్థమే మహాసంగ్రామమునకు దిగవలసి వచ్చినదని చేయబడిన మహోదారప్రకటనమును గమనించి, యుద్ధప్రారంభవేళలో మౌలానా మహమ్మదాలీ 'ఈజిప్టును విడిచిపోండు' అను శీర్షిక క్రింద నొకవ్యాసమును ప్రకటించెను. అప్పుడు ఆలీసోదరులును, అబుల్‌కలామ్ అజన్‌ను నిర్బంధింపబడిరి. వారు చక్రవర్తిగారిప్రకటనముప్రకారము రాజకీయఖైదీ లందరును విడిచిపెట్టబడే వరకును నిర్బంధముననే యుండిరి. ౧౯౧౯ డిసెంబరు ౨౮ వ తేదీన విడుదలయిరి.

మహాసంగ్రామమునకు సైనికులను సనుకూర్చుటయందు గాని, ధనమును సేకరించుటయందు గాని అవలంబింపబడిన పద్ధతులు శ్లాఘనీయములుగా లేవు. అట్టిపద్ధతుల మూలముననే పాంచాలరాష్ట్రమునందును, తదితరప్రదేశములయందును చాలా ప్రమాదములు కూడ తటస్థించినవి. ఆకాలమున ప్రభుత్వోద్యోగు లొనర్చిన దుష్కృత్యములనుగూర్చి విల్లింగ్‌డన్ ప్రభుత్వమువారు 'బలవంతపెట్టుట, ప్రోత్సాహపరచుట' అని మార్దవమైన భాష నుపయోగించిరి. పల్లెటూళ్లలో ప్రభుత్వమువారికి అప్పీయవగిన రైతుల పేర్లును, వారీయగలిగిన మొత్తములును జాబితాల రూపములో తయారు చేయబడినవి. ఆ జాబితాల ప్రకారము క్రింది ఉద్యోగస్థు లందరును రైతులను 'బలవంతపెట్టి, ప్రోత్సాహపరచి' యుద్ధఋణములను వసూలుచేసి, వారి ప్రతిష్ఠను కాపాడుకొనిరి. ఇది యచ్చటనో అవలంబింపబడిన ధనసేకరణవిధానము. దీనికే 'ఇండెంటు' పద్ధతి అని పేరుపెట్టబడినది. ఇందుమూలమున సామాన్యజనములో ఆగ్రహము హెచ్చుపెరిగినది. ఒకచోట మమ్లత్‌దారుబంగాళా తగులపెట్టబడినది. ఆగ్రహావేశపరవశులైన ఆజనులు ఆయనకుటుంబమును బయటికి పోనిచ్చిరి గాని, ఆయననుమాత్రము మంటలోనే దగ్ధము కానిచ్చిరి.

ఇక రాజకీయములలో, చెమ్సుఫర్డుప్రభువు ముద్రణాశాసనరూపమున తీవ్ర నిర్బంధవిధానము నవలంబించెను. విల్లింగ్డన్ ప్రభువు భారతసంస్కరణచట్టముక్రింద బెసెంటును బొంబాయి పోరా దని నిషేధించెను. వంగరాష్ట్రమున దాదాపు ౩౦౦౦ ల మంది యువకులు నిర్బంధనివాసములకు గురియైరి. తరువాత బెసెంటుకు నిర్బంధనివాసము విధింపబడెను. మరుసంవత్సరము రౌలటుబిల్లులు వచ్చినవి. వాటినిగూర్చి తీవ్రాందోళనము బయలుదేరినది.

ఆ క్రిందటి సంవత్సరమే సర్ సిడ్నీ రౌలట్ అధ్యక్షుడుగను, కుమారస్వామి శాస్త్రి, ప్రవేశచంద్ర మిత్తరులు సభ్యులుగను ప్రభుత్వమువారిచే ఒక ఉపసంఘము నియమింపబడినదని పాఠకులు జ్ఞాపక ముంచుకొనవలసియున్నది. దానికే రౌలటుకమిటీ అని పేరు. "విప్లవోద్యమములో సంబంధముగల కుట్రల స్వభావవ్యాప్తులనుగూర్చి, వాటిని అణచివేయు ప్రయత్నములలో ప్రభుత్వమువారికి కలుగుచున్న ఇబ్బందులను గూర్చి విచారించి, వాటిని నిర్మూలించుటకు ప్రత్యేకశాసన మవసరమైనయెడల అందుకు తగిన సలహాయిచ్చుట "కా కమిటీ యేర్పాటు చేయబడినది. తరువాత ఆకమిటీ వారు విచారించి తమనివేదికను పంపిరి. దానికి రౌలటునివేదిక అని పేరు. ఈరౌలటు నివేదికలో విప్లవోద్యమనిర్మూలనముకొరకు కొక ప్రత్యేకశాసనము సూచింపబడినది. అది సామ్రాజ్యశాసనసభ (Imperial Council) లో చర్చకు వచ్చినది. యావద్భారత దేశమునందును అది ప్రతిఘటింపబడినది. ప్రత్యేకకాంగ్రెసు జరిగేనాటికి రౌలట్ కమిటీనివేదికమాత్రము వెలువడినది. కాబట్టి ఆకాంగ్రెసు "రౌలట్ కమిటీనివేదిక ఆచరణలోకి వచ్చేయెడల ప్రజలప్రధానహక్కులకే భంగము కలిగించి, ప్రజాభిప్రాయ ప్రకటనమున కాటంకముగా నుండగల "దని తీర్మానించినది.

ప్రత్యేకకాంగ్రెసు ౧౯౧౮ అగస్టునెలలో జరిగినది. మామూలు కాంగ్రెసు డిసెంబరు నెలలో ఢిల్లీలో జరుగవలసియుండెను. ఢిల్లీరాష్ట్రీయ కాంగ్రెసుసంఘము వారును, ఆహ్వానసంఘమువారును లోకమాన్యతిలకును ఆ కాంగ్రెసు కధ్యక్షునిగా నెన్నుకొనిరి. కాని ఆయన సర్ వాలంటైను షిరాలుపైన దాఖలుచేసిన దావా సందర్భమున ఇంగ్లండుకు పోవలసియుండుటచే ఆ అధ్యక్షపదవి నంగీకరింపచాలకపోయెను. ఆయనకు బదులుగా పండిత మదనమోహనమాలవ్యా అధ్యక్షుడుగా నెన్నుకొనబడెను.

పండిత మాలవ్యా అధ్యక్షుడుగను, హాకీమ్ అజ్మల్ ఖాను ఆహ్వానసంఘాధ్యక్షుడుగను ౧౯౧౮ డిసెంబరు ౨౬ తేదీని ఢిల్లీనగరములో 33 వ కాంగ్రెసు జరిగినది. ౧౯౧౮ నవంబరు ౧౧ తేదీ శాంతి ప్రకటనముతో యుద్ధము పరిసమాప్తి పొందినది. మిత్రమండలికి సంపూర్ణవిజయము కలిగినది. ప్రెసిడెంటు విల్సన్, లాయడ్ జార్జి మొదలగు రాజకీయధురంధరులు స్వయంనిర్ణయసూత్రమును ప్రకటించిరి. ఈ ప్రకటనమునుబట్టియు, బొంబాయి ప్రత్యేక కాంగ్రెసు జరిగినప్పటినుండీ మాంటుఫర్డుసంస్కరణములను గూర్చి చేయబడుచున్న విమర్శనములను బట్టియు ఢిల్లీ కాంగ్రెసుకూడ మరియొకసారి భారతరాజకీయసంస్కరణములను విచారించుట సమంజసముగా భావింపబడినది. ఢిల్లీసభకూడ చిన్నసభ కాదు. ౪౯౭౫ మంది ప్రతినిధులు హాజరయిరి.

ఆ కాంగ్రెసు ముందు రాజభక్తిని ప్రకటించినది. తరువాత ప్రపంచకము లోని —— వన్నందిప్రజల స్వాతంత్ర్యముకొరకును చేయబడిన యుద్ధము జయప్రద ముగా పరిసమాప్తి పొందినందుకు సంతోషమును వెల్లడించినది. మిత్రమండలి సైని కులు చూపిన శౌర్యోత్సాహములను "న్యాయము, స్వాతంత్ర్యము, స్వయం నిర్ణయ సూత్రములకొరకు ముఖ్యముగా భారతీయసైనికులు కావించిన వీరపురుషోచిత ఘన కార్యములను" శ్లాఘిస్తూ తీర్మానించినది. భారతదేశమును స్వయంనిర్ణయసూత్ర మను వర్తింపచేయతగిన దేశముగా పరిగణించవలసిన దని బ్రిటిష్ పార్లమెంటువారినీ, శాంతిసభవారినీ కోరినది. అందుకు మొదటిమెట్టుగా రాజకీయసమస్యల స్వేచ్ఛా ప్రచారము నరికట్టే నిర్బంధశాసనము లన్నీ రద్దుచేయబడవలెనని తీర్మానించినది. మా మూలు సివిల్ క్రిమినల్ చట్టముల నతిక్రమించి భారతదేశములోని యే బ్రిటిష్ పౌరు నయినను అరెస్టు చేయుటకును, ఒకప్రదేశమునకు పోకూడదని కాని, మరియొక ప్రదే శమునుండి కదలకూడదని కాని నిర్బంధించుటకును, విచారణ లేకుండ జైలులో నుంచు టకును, శిక్షలు విధించుటకును కల ప్రభుత్వకార్యనిర్వాహకుల అసాధారణాధి కారములు కూడ తొలగింపబడవలె ననీ, భారతదేశపు రాజద్రోహశాసనము కేవలము ఇంగ్లండుదేశపు రాజద్రోహశాసనమున కనుకరణముగామాత్రమే ఉండవలె ననీ ఆ కాంగ్రెస్ తీర్మానించినది. త్వరలోనే భారతదేశములో సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వమును స్థాపించే నిమిత్తమున్నూ, సామ్రాజ్యపునర్నిర్మాణమునందు స్వపరిపాలి తాధినివేశరాజ్యములతోపాటు భారతభూమికి కూడ సమానప్రతిపత్తిని చేకూ ర్చేటందుకున్నూ పార్లమెంటరీచట్టము నిర్మింపబడవలె నని కూడ ఆ కాంగ్రెసు కోరి నది. శాంతిసభ (Peace Conference) లో భారతీయప్రాతినిధ్య ముండవలె నని కోరుతూ ఆ కాంగ్రెసు లోకమాన్యతిలక్, మహాత్మాగాంధీ, హస్సన్ ఇమాములను అందుకొరకు నియోగించినది.

ఇక సంస్కరణప్రణాళికవిషయములో బొంబాయి ప్రత్యేక కాంగ్రెసును ఈకాంగ్రెసు అనుకరించినది. కాంగ్రెసులీగుప్రణాళికనుగూర్చీ, బాధ్యతాయుత ప్రభుత్వనిర్మాణకార్యాతమనుగూర్చీ, భారతదేశసంరక్షణ శాంతిభద్రతల విషయములో భారతప్రభుత్వమునకుగల అవిభాజ్యాధికారమునుగూర్చి ఢిల్లీకాంగ్రెస్‌లో చేయ బడిన తీర్మానములు బొంబాయిప్రత్యేకకాంగ్రెసులోని తీర్మానముల కనువాద ములే. ఇక రాష్ట్రములలో తక్షణము సంపూర్ణ బాధ్యతాయుతప్రభుత్వము ప్రవేశపెట్ట బడవలె ననీ, రాబోయే రాజకీయసంస్కరణములు బ్రిటిష్‌ఇండియాలోని అన్నిభాగ ములకును వర్తింపచేయబడవలెననీ మాత్రము ఢిల్లీకాంగ్రెసులో ఎక్కువగా తీర్మా నింపబడినది. తదితరవిషయములలో బొంబాయికాంగ్రెసుతీర్మానములే ఢిల్లీ

కాంగ్రెసులో కూడ బలపరుపబడినవి. కాలటుకమిటీనివేదిక చర్చింపబడినది. దానిని గూర్చి బొంబాయికాంగ్రెసులో తీర్మానింపబడినదానికితోడు, దానిమూలమున సంస్కరణములు జయప్రదముగా కొనసాగుటకు వీలులేదనికూడ తీర్మానము చేయబడినది. భారతసంరక్షణచట్టము, ముద్రణాశాసనము, రాజద్రోహసభాశాసనము, క్రిమినల్ లాసవరణచట్టము, పాతరెగ్యులేషనులు మొదలగు నిర్బంధశాసనము లన్నీ వెంటనే రద్దుచేయబడవలె ననీ, అందరు అవిచారితనిర్బంధితులును (Detenues), అందరు రాజకీయఖైదీలును తక్షణము విడుదలచేయబడవలె ననీ తీర్మానింపబడినది.

తరువాత ఆ కాంగ్రెసులో మదనమోహనమాలవ్యా సభ్యుడుగానున్న పారిశ్రామికసంఘనివేదిక చర్చింపబడినది. దేశములోని పారిశ్రామికాభివృద్ధి కనుగుణముగా ప్రభుత్వపద్ధతి ఉండవలె నని ఆకమిటీవారు చేసిన సిఫారసునకు కాంగ్రెసు సంతోషమును వెలిబుచ్చినది. దేశీయుల పెట్టుబడినీ, దేశీయసంస్థలనూ ప్రోత్సహించి విదేశీయుల ధనాకర్షణమును అరికట్టవలెనని ఆకాంగ్రెసు ప్రభుత్వమువారిని కోరినది. పారిశ్రామికకమిటీవారికి దిగుమతిపన్నులనుగూర్చి విచారించుట కధికారము లేకుండచేయబడినందుకు ఢిల్లీకాంగ్రెసు విచారమును వెలిబుచ్చినది. భారతప్రభుత్వకార్యనిర్వాహకవర్గములో పారిశ్రామికప్రాతినిధ్యము ప్రత్యేకముగానుండవలెననీ, రాష్ట్రీయపారిశ్రామికశాఖలు నిర్మింపబడవలెననీ చేయబడిన కమిటీవారి తీర్మానమును ఢిల్లీ కాంగ్రెసామోదించినది. భారతీయపారిశ్రామికవాణిజ్యసంఘములచేత ఎన్నుకొనబడిన సభ్యులుగల రాష్ట్రీయసలహాసంఘములును, సామ్రాజ్యసలహాసంఘములును నిర్మింపబడవలెననికూడ కాంగ్రెసు సూచించినది. కమిటీవారిచే సూచింపబడిన సామ్రాజ్యపారిశ్రామికోద్యోగములకు తగిన జీతములు నిర్ణయింపబడవలె ననీ, యూనివర్సిటీలు ప్రభుత్వసహాయముతో వాణిజ్యకళాశాలలను స్థాపించవలెననీ కాంగ్రెసు అభిప్రాయమును వెల్లడించినది. కమిటీనివేదికలో పారిశ్రామికబ్యాంకింగు నిర్మాణమునుగూర్చి ఉదాహరింపబడనందుకు చింతిస్తూ, అట్టిబ్యాంకులు నిర్మింపబడవలె నని ఆకాంగ్రెసు కోరినది.

ప్రభుత్వమువా రాలీసోదరులను విడుదలచేయవలెనని మరియొకతీర్మానము చేయబడినది. ప్రజల కపూర్వమైన ఆర్థికకష్టము తటస్థించుటవలనను, యుద్ధ మంత మొందుటవలనను భారతదేశ మీయవలసిన ౕ౧౦౦ లక్షలరూపాయీల యుద్ధపు చందాను రద్దుచేసి, ఆమహాభారమునుండి ఈదేశమును విముక్తి చేయవలసినదని తీర్మానింపబడినది. పాశ్చాత్యవైద్యపద్ధతికి ప్రభుత్వమువారు చేసే అన్నిసహాయములును ఆయుర్వేద యూనానీవైద్యములకుకూడ చేయబడవలెనని మరియొక చిత్రమైన తీర్మాన మంగీకరింపబడినది.

బొంబాయి ప్రత్యేక కాంగ్రెసులో చేయబడిన తీర్మానము ఢిల్లీకాంగ్రెసులో ఆమోదింపబడుటయే గాక, ఇంకను మరికొన్ని విషయములు చేర్చబడినవి. అందువలన ౧౯౧౮ సెప్టెంబరులో బొంబాయియందు కనబడిన సామరస్యభావ మీ కాంగ్రెసులో మృగ్యమైనది. రాష్ట్రీయస్వాతంత్ర్యము తక్షణము పూర్తిగా అమలులోనికి రావలెనా, లేక బొంబాయికాంగ్రెసులోని మినహాయింపు ఢిల్లీకాంగ్రెసులో కూడ అంగీకరింపవలెనా అనేవిషయముపైన రెండుకక్షలేర్పడినవి. బెసెంటు కిది చాలా చిన్నవిషయముగా తోచెను. మద్రాసు ప్రతినిధులును, మితవాదులును బొంబాయితీర్మానమును సమర్థించిరి. అధికసంఖ్యాకులు బొంబాయిరాజీని తిరస్కరించిరి. సీమకు పోవలసిన రాయబారవర్గమునందు బొంబాయితీర్మానమున కనుకూలురుగా నున్నవారు మినహాయింపబడిరి. తక్కినవారు ఢిల్లీతీర్మానము ప్రకారము ప్రవర్తించవలసిన దని కోరబడిరి. శ్రీనివాసశాస్త్రి, సంస్కరణముల తీర్మానములో 'ఆశాభంగకరములు, అసంతృప్తికరములు' అనుమాటలను తొలగించవలసినదనీ, ౧౫ సంవత్సరముల కాలవ్యవధిని తీసివేయవలసినదనీ సవరణను ప్రతిపాదించెను. కాని సవరణ వీగిపోయినది. యువరాజును ఆహ్వానిస్తూ ప్రతిపాదింపబడిన తీర్మానముకూడ చివరకు విరమింపబడినది

# 5. అహింస నిజము

## ౧౯౧౯

[రౌలట్ చట్టములు - గాంధీ రంగప్రవేశము - సత్యాగ్రహప్రమాణము - క్రొత్తవిలువలు - హిందూమహమ్మదీయసఖ్యము - పాంచాలదేశపు సంఘటనములు - గాంధీ నిర్బంధము - అమృతసరము - డయ్యారుసేనాని, హంటరు సంఘము - లాహోరులో కల్నల్ జాన్సన్ - గుజరన్‌వాలాలో కల్నల్ ఓబ్రియన్ - ఓబ్రియన్, [illegible]టన్, బాస్వర్తుస్మిత్, కసూరు సత్యాగ్రహోపసంహారము - న్యాయ, క్రమములు - ఇండెమ్నిటీబిల్లు - అ. భా. కాం. సం. సమావేశము, కమిటీనియామకము - సత్యాగ్రహమును విరమిస్తూ గాంధీచేసిన ప్రకటనము - ఇంగ్లాండుకు రాయబారములు - బ్రిటిష్‌కాంగ్రెస్ కమిటీతో భేదాభిప్రాయములు - రెండువైపుల పోరాటము - ఆల్బర్టుహాలుసమావేశము - లాన్స్

బహిష్కరణకార్యములు - నాలుగుప్రణాళికలకును గల పోలిక - పంజాబువిచారణ- సంఘటరుకమిటీ - దిక్కుపరిస్థితి - సంస్కరణముల బిల్లు - తిలకుయొక్క అనుకూలసహకారవాదము - అమృతసరపుకాంగ్రెస్ - ప్రధానతీర్మానము- రాజీ - ప్రజల దౌర్జన్యము నిరసింపబడుట - దానిపైన గాంధీఉపన్యాసము- ఇతరతీర్మానములు - షెమ్సుఫర్డుప్రభువును ఇంగ్లాండుకు త్రిప్పిపంపివేయుట- తీర్మప్రతికూలము - రాజకీయఖైదీలవిడుదలనుగూర్చి రాజుగారిప్రకటనము- సెవిలీ ఎదిరింపబడుట.]

ఢిల్లీ కాంగ్రెసు దేశమునకు శాంతి చేకూర్చలేదు. ౧౯౧౯ ఫిబ్రవరి నెలలో రెండు రౌలట్ బిల్లులు ప్రత్యక్షమైనవి. అందులో ఒకటి ఆ వసంతకాలములోనే ప్రవేశపెట్ట నుద్దేశింపబడినది. శాంతిప్రకటనము చేయబడిన ఆరుమాసములకు భారత సంరక్షణచట్టముయొక్క గడువు పూర్తియైనందువలన కలిగిన పరిస్థితుల కనుగుణముగా అది తాత్కాలిక శాసనముగా ప్రయోగింప నుద్దేశింపబడినది. దాని ప్రకారము ముగ్గురు హైకోర్టుజడ్జీలు అరాచకనేరములను తక్షణము విచారించి తీర్పుచెప్ప వచ్చును. విప్లవసంబంధములయిన నేరములు జరుగుచున్న ప్రదేశములలో ఆ జడ్జీలు ముగ్గురును యిచ్చిన తీర్పునకు పైన అప్పీలు చేసుకొనుటకు కూడ ముద్దాయీల కధికారము లేదు. ప్రభుత్వమునకు ప్రతికూలముగా నుండదగిన నేరమును చేయగల డని అనుమానింపబడిన యేమనిషికైనను పూచీకత్తియవలసిన దని కోరుటకును, ఫలానా చోట నివసింపవలసిన దనిగానీ, ఫలానాపని చేయకూడదనిగానీ ఆజ్ఞాపించుటకునుకూడ దానిమూలమున ప్రభుత్వమువారి కధికారము కలిగినది. అటువంటి ఉత్తరువులు జారీ చేయబడేముందు ఒక న్యాయమూర్తి, ప్రభుత్వోద్యోగి కాని మరియొక పెద్దమనిషీ కలసి ఆయాకేసులకు సంబంధించిన సాక్ష్యసాధనములను విచారించవలసియుండెను. ప్రజాక్షేమమునకు భంగకరముగా నుండే నేరములతో సంబంధముకలవా రని సకారణముగా విశ్వసింపబడతగిన మనుష్యులను అరెస్టుచేయుటకును, ఫలానావిధముగా ఫలానా చోట నివసింపవలె నని వారిని నిర్బంధించుటకునుకూడ స్థానికప్రభుత్వముల కధికార మీయబడెను. ఇక ఇదివరకే నిర్బంధింపబడియున్న అపాయకరులైన మనుష్యులను ఆ బిల్లుప్రకారము శాశ్వతముగా నిర్బంధింపవచ్చును. రెండవబిల్లు దేశమునందలి సాధారణ 'క్రిమినల్ లా' లో శాశ్వతమైన మార్పు చేయుట కుద్దేశింపబడినది. ప్రచారము చేయవలెననే ఉద్దేశముతో గాని, ప్రకటించవలెననే ఉద్దేశముతో గాని యేదైనా ఒక రాజద్రోహపూరితమైన కాగితమును దగ్గర ఉంచుకొనడమే ఆబిల్లు ప్రకారము ఖైదుశిక్షకు పాత్రమైన నేరముగా పరిగణింపబడినది.

'రాజుగారి పక్షమున సాక్షి' గా తిరిగిపోవుట కిష్టపడే ముద్దాయిల ప్రాణరక్షణార్థము ప్రభుత్వమువా రాచట్టముప్రకారము హామీ ఈయవచ్చును. స్థానిక ప్రభుత్వముల అంగీకారములేనిదే నేరారోపణము చేయబడుటకు వీలులేని సందర్భములలో పోలీసువారిచేత ప్రథమవిచారణను చేయించుటకు జిల్లామేజస్ట్రేటుల కధికారము కలదు. ప్రభుత్వమునకు ప్రతికూలములైన నేరములక్రింద శిక్షింపబడినవారు విడుదల కాగానే, మరి రెండుసంవత్సరములవరకును సత్ప్రవర్తనకొరకు పూచీకత్తు లీయవలసినదని కూడ వారికి కోర్టువా రుత్తరువు చేయవచ్చును.

రౌలట్ నివేదిక ౧౯-౧-౧౯౧౯ న ప్రకటింపబడినది. భారతశాసన సభ (Supreme Legislative Council) లో ౬-౨-౧౯౧౯న సర్ విలియమ్ విన్సెంటు రౌలట్ బిల్లులను ప్రవేశపెట్టెను. రెండవబిల్లు విరమింపబడినది. మొదటిబిల్లు మాత్రము ౧౯౧౯ మార్చి మూడవవారములో అంగీకరింపబడినది. 'రౌలటునివేదిక బిల్లులరూపము లోకి వచ్చేయెడల సత్యాగ్రహోద్యమముతో దాని నెదుర్కొందు' నని గాంధీ ప్రకటించియుండెను. ఇందుకొరకాయన దేశమంతటా సంచారముచేసెను. ప్రతిచోటను ఆయనను గౌరవపూర్వకముగా ఆహ్వానించిరి. అన్నిరాష్ట్రములలోని ప్రజలు తక్కిన భారతనాయకులకంటె దేశమునకు క్రొత్తవాడైన గాంధీని ప్రేమించుటకును, ఆయన నూతనకార్యక్రమమును ఆదరించుటకును గల కారణమునుగూర్చి ప్రభుత్వమువారీ దిగువరీతిని వ్రాసిరి (ఇండియా, ౧౯౧౯):

" గాంధీ ఉన్నతాదర్శములు గలిగి టాల్స్టాయి సిద్ధాంతములకు చెందిన సర్వసంగపరిత్యాగి అని ప్రజల అభిప్రాయము. దక్షిణ ఆఫ్రికా భారతీయుల పక్షమున ఆయన పనిచేసినప్పటినుండి ఆత్మనిగ్రహముగల మతప్రవక్తలకు అపూర్వగౌరవము చూపే ప్రాచ్యదేశసంప్రదాయానుసారముగా ఆయన భారతీయులచే పూజింపబడుతూ ఉండెను. ఈ సందర్భములో గాంధీగారి శిష్యులు కేవలము ఒక్కమతమునకు చెందినవారుమాత్రమే కాకపోవుటచేత ఆయనబలము మరింత హెచ్చినది. అహమ్మదాబాదులో నివాస మేర్పరచుకొనినది మొదలు ఆయన ప్రారంభించిన సాంఘికసేవ సర్వతోముఖముగా వ్యాపించినది. అణగద్రొక్కబడుతూన్న జాతికొరకుగాని, వ్యక్తికొరకుగాని వెంటనే కత్తిదూసే స్వభావ మాయనది. అందువల్లనే ఆయన సామాన్యజనమున కంత ప్రేమాస్పదు డైనవాడు. బొంబాయిరాజధానిలోని నగరవాసులలోను, పల్లెటూరిజనములోనుకూడ ఆయనకున్న పలుకుబడి అమోఘము. అక్కడిజను లాయనను దేవునివలె పూజింతు రని అంటే అందులో ఏమీ అతిశయోక్తి లేదు. భౌతికబలముకంటె ఆత్మశక్తి అధికతరమైన దని ఆయనవిశ్వాసము. కాబట్టి ఆయన దక్షిణాఫ్రికాలో జయప్రదముగా ఉపయోగించిన సాత్త్వికనిరోధ బాణమునే ఇక్కడ

కాలటుచట్టములకు ప్రతిఘాతముగా సంధించుట తన ధర్మమని భావించెను. కాలటు బిల్లులు శాసనసభలో అంగీకరింపబడినయెడల తాను సాత్వికనిరోధమునుగాని, సత్యాగ్రహమునుగాని ప్రారంభింతునని ఆయన ౨౪-౨ ౧౯౧౯న ప్రకటించెను. ఈ ప్రకటనము భారతరాజకీయజ్ఞులలోను, భారతప్రభుత్వములోనుకూడ చాలా కల్లోలము కలిగించినది. భారతశాసనసభలోని కొందరు మితవాదసభ్యు లాయుద్యమమువలన అపాయము కలుగు నని సూచించిరి. భారతీయచిత్తవృత్తిని చక్కగా ఎరిగిన బెసెంటు గాంధీ తలపెట్టిన ఆ కార్యక్రమముమూలమున అంతులేని అపచారములు తటస్థించవచ్చు నని ఆయనను సవినయముగా మందలించినది. గాంధీప్రకటనముగాని, ప్రవర్తనము గాని ఆయుద్యమము ప్రారంభింపబడకపూర్వమే ఆయనపైన ప్రభుత్వమువారు చర్య తీసి కొనుటకు తగినవిగా లేవు. సాత్వికనిరోధ మనగా ఒకపనిని చేయకుండ నిరోధించుట; అంతేకాని చేయవలసిన దని నిర్బంధించుట కాదు. గాంధీ భౌతికబలము నుపయోగించు పద్ధతిని బహిరంగముగా నిరసించెను. సివిల్ చట్టములను దౌర్జన్యరహితముగా ఉల్లంఘించుట మూలమున ప్రభుత్వమువారిని లొంగదీసుకొని కాలటుశాసనమును రద్దు చేయించవచ్చు నని ఆయనధైర్యము. మార్చి ౧౮ వ తేదీని కాలట్ బిల్లులనుగూర్చి ఆయన ఒక ప్రమాణపత్రమును తయారుచేసెను :

“భారతక్రిమినల్ లా సవరణబిల్లు (౧ వ బిల్లు ౧౯౧౯) (Indian Criminal Law Amendment Bill No 1 of 1919), క్రిమినల్ లా అవసరాధికారముల బిల్లు (Criminal Law Emergency Powers Bill No. 2 of 1919) ఈ రెండును న్యాయ, స్వాతంత్ర్యసిద్ధాంతములకు విరుద్ధములుగా నున్నవనీ, భారతదేశక్షేమమునకును, భారతప్రభుత్వక్షేమమునకును ఆధారభూతము లైన ప్రజల ప్రాథమిక హక్కులకే భంగకరములుగా ఉన్నవనీ హృదయపూర్వకముగా విశ్వసిస్తూ, ఈబిల్లులు చట్టరూపములోకి వచ్చేయెడల ఇవి ఉపసంహరింపబడేవరకును ఈ చట్టములను, ఇటుపిమ్మట నియమింపబడే కమిటీవారు సూచించబోవు తదితరచట్టములను శాంతముగా ఉల్లంఘించగల మనీ ప్రమాణము చేస్తూన్నాము. ఈ ఉద్యమసందర్భమున సత్యమార్గమునే అనుసరింతుమనీ, యేవిధమైన దౌర్జన్యమును చేయమనీగూడ ప్రమాణము చేస్తూ ఉన్నాము.”

స్వపరిపాలనమువంటి ఉత్కృష్టసమస్య ఉండగా కాలట్ బిల్లులవంటి ఈస్వల్ప సమస్యపైన గాంధీ యెందుకు సత్యాగ్రహము ప్రారంభించినాడనువిషయము చాలా మంది కర్థము కాలేదు. ౧౯౨౦ లో ప్రారంభింపబడిన అసహాయోద్యమమునకు స్వరాజ్యమును ప్రధానకారణముగా చేయక ఆయన పంజాబుదురంతములను, ఖిలాఫతు అన్యాయమును కారణములుగా చేసినప్పుడుగూడ ఇటువంటి సందేహమే వెల్లడింప

బడినది. ఈవిషయమును ముందువివరింతుము. ఒక్క వంగరాష్ట్రమునుండి తప్ప భారత దేశములోని తదితరభాగములనుండి ఈ ఉద్యమమునకు తగినబలము చేకూరినది. దక్షిణ దేశములో యీ ఉద్యమ మనుకున్నదానికన్న ఎక్కువగా సాగినది. సత్యాగ్రహులు తమ ఆస్తులను జప్తులు, వేలములు కాకుండ రక్షించుకొనవచ్చునా యని కొంత సందేహము కలిగినది. ప్రజలు చేయగలిగిన త్యాగమునకు పరిమితిని వారే నిర్ణయించుకొన వలసియుండుటచే ఆ అభిప్రాయమునకు గాంధీ అభ్యంతరపెట్టలేదు. గాంధీ ఆ ఉద్యమమును ఉపవాసవ్రతముతో ప్రారంభించెను. నవీనసంఘసంస్కర్తలందు కపహాస్యము చేసిరి. కాని ఈదేశములోని సంప్రదాయవిశ్వాసములకు మాత్ర మది అనుగుణమైన పని.

ఆత్మపరిశుద్ధత అనే మాటయే చాలమంది రాజకీయజ్ఞులకు కర్ణకఠోరముగా నుండెను. "రాజకీయములకును, ఆత్మ పరిశుద్ధతకును సంబంధ మేమి" టని వారు వెక్కిరించిరి. ౧౯౧౯ మార్చి ౩౦ వ తేదీని దేశమంతటను హర్తాళమును, మీటింగులును, ప్రార్థనలును, ఉపవాసవ్రతములును జరుగవలె నని నిర్ణయింపబడెను. కాని తరువాత అది ఆరవ ఏప్రిల్‌కు మార్పుచేయబడినది. ఢిల్లీలో ఈమార్పు సకాలములో ప్రకటింపబడకపోవుటమూలమున మొదట నిర్ణయింపబడిన మార్చి ౩౦ వ తేదీనే ఉత్సవములును, హర్తాళములును జరిగినవి. పోలీసువారు తుపాకులను కాల్చిరి. ఆనాటి ఉత్సవమును నడిపిన శ్రద్ధానందస్వామిని కొందరు యూరోపియసిపాయిలు కాల్చెదమని బెదరించిరి. ఆయన తన అంగరఖాను పైకి దీసి కాల్చవలసిన దని రొమ్ముచూపెను. వెంటనే ఆబెదరింపులు గాలి కెగిరిపోయినవి. కాని ఢిల్లీరైల్వేస్టేషనులో చిన్న గల్లంతు జరిగినది. అందువలన ప్రజలపై తుపాకులు కాల్చబడెను. అయిదుగురు మరణించిరి. ఇరువదిమంది గాయపడిరి. ఏప్రిల్ ౬ వ తేదీని దేశమంతటను ఉత్సవములు జరిగినవి. 'ఆ నాటి ఉత్సాహ పరంపరలలో ప్రదర్శితమైన ముఖ్యవిషయము అంతకుపూర్వ మెన్నడును కనీ, వినీ యెరుంగని హిందూ మహమ్మదీయసోదరభావము' అని '౧౯౧౯ లోని భారతవర్షము'న (India, 1919) వ్రాయబడినది. ఆనాడీ రెండుసంఘముల నాయకులకును కలిగిన ఐకమత్యభావమే నేటికిని జాతీయ మహాసభా మంటపమునకు మూలస్తంభముగా నున్నది. ఈ అధికోత్సాహసమయమున సామాన్యప్రజలుగూడ తమ మతభేదములను మరచిపోవ నంగీకరించిరి. హిందూమహమ్మదీయసౌభ్రాత్ర చిహ్నములుగా అపూర్వవిషయములు జరిగినవి. హిందువులు మహమ్మదీయు లిచ్చినజలమును బహిరంగముగా త్రాగెను. ఉత్సవములలో, జాతీయసంకీర్తనములలో, పతాకములలో నెచ్చట చూచినను హిందూమహమ్మదీయసఖ్యమే ప్రదర్శిత మయ్యెను. ఒక మశీదులోని

వేదికనుండి హిందూనాయకులు చేసినబోధలు మహమ్మదీయులచే స్వీకరింపబడినవి. సంగ్రామానంతరము టర్కీకి పట్టిన స్థితినిగూర్చి మహమ్మదీయులకు కలిగిన అసహ్య భావమును, ఖిలాఫతుకు తటస్థించిన అపాయమును హిందూ ముసల్మానుల అపూర్వ సఖ్యమునకు తాత్కాలికకారణము లైనవి. మహమ్మదీయుల ఈ మనోభావములకు హిందువులు పూర్తిగా సానుభూతి చూపిరి.

దేశ మీ నూతనాభిప్రాయమును వెంటనే హృదయపూర్వకముగా స్వీకరించి నది. కాంగ్రెసులోను, దేశములోను కూడ అప్పటికప్పుడే గాంధీ పూజనీయు డయ్యెను. శాంతిసభకు పోవలసిన భారతీయప్రతినిధులలో గాంధీపేరు లేనందున అయనపేరు వేయవలసిన దని బి. చక్రవర్తి సూచించిన వెంటనే ౧౯౧౯ ఢిల్లీకాంగ్రెసులో ఆ తీర్మానప్రతిపాదకు డైన మన చిత్తరంజనదాసు గౌరవపూర్వకముగాను, క్షమాపణ పూర్వకముగాను ఆ సవరణ నంగీకరించెను. ఇంగ్లండుకు పోవలసిన రాయబారవర్గ ములోకూడ ఆయన సభ్యుడుగా నెన్నుకొనబడెను. ౧౯౧౯ ఏప్రిల్ నెలలో భారతదేశ చరిత్రమునందు నూతనాధ్యాయము ప్రారంభ మైనది.

ఇక భారతీయుల పోరాటమునకును, వారి త్యాగములకును పాంచాలరాష్ట్రము రంగభూమి యైనది. పాంచాలము విదేశ వాణిజ్య పారిశ్రామిక దండయాత్రలకు గురి యైన భారతదేశపు సింహద్వారము. అది హిందూదేశములోని సిక్కులు మొదలగు వీరపురుషులకు జన్మభూమి. అటువంటి పాంచాలరాష్ట్రమున కాంగ్రెసువాదులు స్వపరి పాలనోద్దేశములను వ్యాపింపచేసి, ఆ రాష్ట్రప్రజలను తమ ఉద్యమమున కుపయోగ పరచుకొనవడమున కెట్లు ప్రభుత్వమువారు సహించి యూరకుండగలరు? ఇదివరకే భార తీయ విద్యాధికులు సైనికోద్యోగములలోకి రావడము, సైనికకళాశాలలు స్థాపింపబడ వలెనని కోరడము ప్రభుత్వమువారికి కష్టముగా నుండెను. ఈ వీరజాతులకు రాజకీయ విజ్ఞానము కలిగి, రాజకీయాదర్శములపైన మోజు పుట్టేయెడల భారతదేశములో బ్రిటిష్ ప్రభుత్వ మంతమొందినట్లే కదా! భారతసైన్యములు ఐరోపామహాసంగ్రామమున వివిధ యుద్ధభూములలోని జర్మనీ, ఆస్ట్రియా, రష్యా, టర్కీ దేశముల సైన్యముల నోడించుటకు తమ స్వార్థత్యాగమువలనను, వీరత్వమువలనను బ్రిటిషుసేనలకు తోడ్పడి, అప్పుడేకదా తిరిగి స్వదేశమునకు వచ్చినవి. ఆశియాఖండవాసులకంటె ఐరోపా దేశీయు లెక్కువ యుద్ధనైపుణ్యము కలవారను అపోహ రష్యా జపాను సంగ్రామ ముతోనే అంత మొందినది. ఐరోపామహాయుద్ధముతో అది పూర్తిగా నశించినది. కాబట్టి కాంగ్రెసుఉద్యమమును పాంచాలరాష్ట్రములో పాకకుండ చేయుటకు సర్ మైకల్ ఒడయరు గట్టిపట్టు పట్టెను. ౧౯౧౯ లో అమృతసరమున కావ్హానింపబడిన

కాంగ్రెస్ పాంచాలరాష్ట్రమున జరుపబడవలెనా, లేదా అని కాంగ్రెసుకును, ఆయనకును పట్టుదల వచ్చినది. డాక్టరు కిచ్లూ (లాయరు), డాక్టరు సత్యపాల్ (వైద్యుడు) గా ర్లిరువురును కాంగ్రెసు జరిపే ప్రయత్నములు చేస్తూన్నందుకు ౧౦-౪-౧౯౧౯ ఉదయము అమృతసరముజిల్లామేజస్ట్రేటుచే ఇంటికి పిలువనంపబడి ఎక్కడికో తీసుకొనిపోబడిరి. ఈవార్త తక్షణము నగరములో వ్యాపించినది. వేలకొలది ప్రజలు మూగిరి. వారినిగురించి జిల్లామేజస్ట్రేటు నడిగి తెలుసుకొన నిశ్చయించిరి. సివిలు లైనులకును, నగరమునకును మధ్యనున్న వంతెనపైన కావలిసైనికులచే వా రాపివేయబడిరి. ఇక్కడ ప్రజలు రాళ్లు రువ్విరనే మామూలుకథ పుట్టినది. వెంటనే తుపాకులు పేల్చబడినవి. చాలామంది గాయపడిరి. ఒకరిద్దరు మరణించిరి. శవములను మోసుకొని ప్రజాసమూహము తిరిగి నగరమునకు ఉత్సవముతో బయలుదేరినది. ప్రజలు త్రోవలో నేషనల్ బ్యాంకుభవనమునకు నిప్పు ముట్టించి, దాని యూరపియన్ మేనేజరును తుదముట్టించిరి. ఈ ప్రజల దుండగములవలన మొత్తముపైన అయిదుగురు ఆంగ్లేయులు మరణించిరి. ఒక బ్యాంకు, ఒక రైల్వే గుడ్సుషెడ్, మరికొన్ని ప్రభుత్వమందిరములును నాశనము చేయబడినవి. కాబట్టి అచ్చటి అధికారులీ దురంతములకు కసితీర్చుకొన తలపెట్టిరి. నగరము సివిల్ ప్రభుత్వమునుండి పదవ ఏప్రిల్ తేదీని సైనికప్రభుత్వముక్రిందికి మార్చబడినది. ఈఉత్తరవు ఉన్నతాధికారుల అంగీకారమునకు లోబడి స్థానికోద్యోగుల సొంతబాధ్యతమీద చేయబడెను. కసూరు, గుజరన్‌వాలాపట్టణములలోని ప్రజలప్రవర్తనముకూడ తక్కువనిందార్హము గాలేదు.

గుజరన్‌వాలా, కసూరులలో గొప్పదౌర్జన్యములు జరిగినవి. ౧౩ వ ఏప్రిల్ తేదీని కసూరులోని జనులగుంపులు రైల్వేస్టేషను నష్టపరిచిరి. టెలిగ్రాఫ్ తీగెలను తెంపివేసిరి. చిన్న నూనెషెడ్డును తగులబెట్టిరి. యూరోపియనులున్న రైలుబండిని ముట్టడించిరి. ఇరువురు సిపాయీలను చావగొట్టిరి. ఒక బ్రాంచిపోస్టాఫీసును దోచుకొనిరి. పెద్దపోస్టాఫీసును, మునసబుకోర్టును తగులబెట్టిరి. ఇంకను కొన్ని దురాగతములు చేసిరి. ఇది ప్రభుత్వమువారు చెప్పేవిషయమునకు సంగ్రహస్వరూపము. ఇవి జరుగకపూర్వము ప్రజల కాగ్రహకారణము కల్పింపబడినదని అచ్చటి పౌరుల వాదము.

గుజరన్‌వాలాలో ఏప్రిల్ ౧౪ వ జనులు మూగి, రైలుపై రాళ్లు విసరిరి. ఒక చిన్న రైలువంతెనను తగులబెట్టిరి. పోలీసువారు హిందువుల కవమానకరముగా ఒక ఆవుదూడను చంపి రైలువంతెనమీద వ్రేలాడకట్టగా ఆవంతెన తగులబెట్టబడిన దని కూడ ఒకవాదుక బయలుదేరినది. టెలిగ్రాఫ్ ఆఫీసు, పోస్టాఫీసు, రైలుస్టేషను, కలెక్టరాఫీసు, ఒక చర్చి, ఒక పాఠశాల, ఒక రైలుషెడ్డు ఇవి తరువాత తగులబెట్టబడినవి.

ఇవి ప్రాముఖ్యమైన సంగతులు. ఇంకను చిన్న చిన్న స్థలములలో రైళ్లమీద రాళ్లు విసరుట, టెలిగ్రాఫ్ తీగలను నరకుట, రైలుస్టేషనులకు నిప్పంటించుట మొదలగు కొన్ని చిన్న విషయములు జరిగినవి.

ఈలోగా దేశములోని వివిధభాగములలో అక్కడక్కడ కొన్ని దౌర్జన్యములు జరిగినవి. లాహోరులో తుపాకులు కాల్చబడినవి. అందుకు ప్రతిగా మరికొన్ని దుండగములు చేయబడినవి. కలకత్తానుండికూడ అనేక చెడ్డవార్తలు వచ్చినవి. పాంచాలములోని కష్టపరిస్థితులనుగూర్చి వినియుండుటచేతను, శ్రద్ధానందస్వామి, డాక్టరు సత్యపాలు లాహ్వానించుటచేతను ౮-వ ఏప్రిల్‌న గాంధీ ఢిల్లీనగరమునకు ప్రయాణ మయ్యెను. కాని త్రోవలో ఢిల్లీనగరమునకు కాని, పాంచాలమునకుకాని ఆయన పోరాదని ఉత్తరువులు జారీచేయబడెను. గాంధీ వాటికి విధేయత చూప నిరాకరించెను. వెంటనే ఆయన అరెస్టు చేయబడి ప్రత్యేకరైలుబండిలో పాల్వేలు అనే చిన్నరైలుస్టేషనునుండి ౧౦-వ ఏప్రిలు తేదీని బొంబాయికి పంపివేయబడెను.

గాంధీ అరెస్టువార్త తెలియగానే అహమ్మదాబాదులో కొంత అల్లరి జరిగినది. కొందరు భారతీయోద్యోగులును, ఆంగ్లేయోద్యోగులునుకూడ చంపబడిరి. ౧౨-వ ఏప్రిల్ తేదీని వీరంగమ్, నడయాడులలోకూడ కొంత గంద్రగోళము జరిగినది. కలకత్తా అల్లరులలో అయిదారుగురు మరణించిరి. కాల్పులమూలమున పండ్రెండుగురు గాయపడిరి. గాంధీ బొంబాయి వచ్చి ప్రజలను శాంతపరచెను. ఆయన అహమ్మదాబాదు పోయినందున అక్కడ ప్రశాంతపరిస్థితు లేర్పడినవి. దేశములో కలిగిన ఈ అల్లరులను గమనించి ఆయన సత్యాగ్రహమును విరమిస్తూ ఒక ప్రకటనమును చేసెను.

పరిస్థితు లీ విధముగా నుండగనే అమృతసరములో విషాదకరసంఘటనములు జరుగ ప్రారంభించినవి. పదవ ఏప్రిల్‌నుండి నిజమునకు సైనిక ప్రభుత్వ మమలులో నున్నప్పటికినీ ౧౩వ ఏప్రిల్ తేదీనకూడ దానినిగూర్చి సరియైన ప్రభుత్వప్రకటనము చేయబడలేదని గవర్నమెంటువారి నివేదికనుబట్టియే తెలుస్తూన్నది. ౧౫ ఏప్రిల్‌న అమృతసరము, లాహోరునగరములలో కేవలము లాంఛనముగా సైనికప్రభుత్వము ప్రకటింపబడినది. కాని ఆచరణలోమాత్ర మంతకు పూర్వమునుండి సైనికప్రభుత్వమే నడుస్తూన్నది. తరువాత కొద్దిరోజులకే ఇంకను రెండుమూడుజిల్లాలలో సైనిక ప్రభుత్వము ప్రకటింపబడినది. ౧౩ - వ ఏప్రిల్ హిందూసంవత్సరాది పండుగ. ఆనాడు జలియన్‌వాలాబాగులో పెద్దబహిరంగసభ సమావేశమైనది. జలియన్‌వాలాబాగు అమృతసరనగరమధ్యమున నున్న ఒక విశాలమైన మైదానము. దాని చుట్టూ ఒకజరిహద్దుగోడ ఉన్నది. ఆగోడ కెదురుగా ఇం డ్లున్నవి. జలియన్‌వాలాబాగును

కొక్క టే త్రోవ. అది సీసామూతివలె సన్నగా నుండును. దానిలోనుండి ఒకబండి యైనను పోవుటకు వీలులేదు. ౩౦ వేల మంది జనులు - పురుషులు, స్త్రీలు, పిల్లలు- ఆమహాసభలో నుండిరి. హంసరాజు అనే ఒకరు ఆసభలో నుపన్యసిస్తూ ఉండెను. సరిగా ఆసమయములో డయ్యరుసేనాని ౫౦ మంది బ్రిటిష్ సైనికులతోను, నూరుగురు భారతీయసైనికులతోను ఆబాగులో ప్రవేశించి తక్షణము కాల్చవలసిన దని ఆజ్ఞా పించెను. హంటరుకమిటీయెదుట, ముందుగా తాను ప్రజలను చెదరిపొమ్మని ఉత్తరువు లిచ్చినట్లును, కాని తరువాత రెండు మూడు నిమిషములలోనే కాల్చినట్లును డయ్యరుసేనానియే స్వయముగా అంగీకరించెను. ఆ చిన్నసందులోనుండి ౨౦,౦౦౦ మంది ప్రజలు రెండు మూడు నిమిషములలో చెదరిపో వీలులేదనేవిషయము మాత్ర మందరును అంగీకరించవలసినదే. ఆసమయములో ౧౬౦౦ గుండ్లు పేల్చబడినవి. మందుగుండుసామాను అయిపోయేటంతవరకును కాల్పులు జరిగినవి. ప్రభుత్వమువారి వాదమునుబట్టియే ౪౦౦మంది మరణించినట్లును, ఒకవేయిమందికి పైనను, ౨౦౦౦మందికి లోపుగను గాయములు తగిలినట్లును అంగీకరింపబడుతూన్నది. కాల్పులు జరిగేటప్పుడు బ్రిటిష్ సైనికులు బాగులోని ఎత్తయిన ప్రదేశమునందు భారతీయసైనికులకు వెనుక గా నిలపెట్టబడిరి. కాల్పు లన్నియును భారతీయసైనికుల చేతులమీదుగానే జరుపబడి నవి. ఆసందర్భమున మరణించినవారును, మరణావస్థలో నున్నవారునుకూడ ఆరాత్రి అంతయూను ఏవిధమయిన వైద్యసహాయమును లేక అచట వదలివేయబడిరి. చావసిద్ధ ముగా నున్నవారికి త్రాగ నీరయినను లేదు. వారు కేవలము నిస్సహాయులుగా విడిచి వేయబడిరి. ఇది కాల్పులకంటెను ఘోరాతిఘోరమైన విషయము. పైపెచ్చు "నగర ములో మిలిటరీప్రభుత్వముక్రింద సమావేశములు జరుపబడరా దని చాటింపు చేయించి నప్పటికినీ ప్రజ లీవిధముగా గుమిగూడినందుకు తాను నగుబాట్లపాలు కాకుండుటకై ఈరీతిగా కాల్చి నగరవాసులకు గుణపాఠము చెప్పవలసి వచ్చిన" దని డయ్యరు సేనాని తరువాత వాదింప మొదలుపెట్టెను. తనదగ్గర ఇంకను మందుగుండుసామాను ఉండి ఉన్నట్లయితే ఇంకను కాల్పించిఉండేవాడ ననీ, అది అయిపోవడముమూలమున ౧౬౦౦ గుండ్ల కాల్పులతోనే ఆపివేయవలసివచ్చిన దనీ కూడ ఆయన చెప్పెను. నిజ ముగా తానొక ఫిరంగులకారు తీసుకొనిపోతిననీ, కాని అది ఆసన్నని బాగ్ గొందిలో పట్టకపోవడముచేత వెనుకనే దానిని నిలిపివేయవలసివచ్చిన దనీకూడ ఆయన అంగీ కరించెను.

డయ్యరుసేనానిహయాములో ప్రజలకు ఊహింపరానిశిక్షలు విధింపబడినవి. నీటిసప్లయి, ఎలక్ట్రిక్కుసప్లయి లాపివేయబడెను. ప్రజలు ముక్కోణములపైన కొర డాలతో కొట్టబడుట సర్వసామాన్యవిషయ మైనది. ఇక ప్రజలను భూమిపైన పాకిం

చుట వీటన్నిటినీ తలదన్నినది. మిస్ షేర్‌వుడ్ అనే ఒక మిషనరీ వైద్యురాలు ఒక సందుగుండా సైకిలుమీద పోతూన్నప్పుడామెను ప్రజలు ముట్టడించినకారణమున 'ఇక ఆసందున పోయే ప్రతిమనిషీ పొట్ట భూమి కానించి పాకిపోవలె' నని ఉత్తరువులు జారీచేయబడినవి. ఆసందులో కాపురమున్న యావన్మంది జనులును ఆ ఉత్తరువులకు విధేయత చూపవలసియుండెను. ఆసందులోని పెద్దమనుష్యులే కొందరా మిస్ షేరువుడును సంరక్షించిన పుణ్యముకూడ వారికి సమయమున కక్కరకు రాకపోయెను. ఈసంఘటనము సామ్రాజ్యశాసనసభలో హడ్సన్ సేవానికి సంతోషమునకును, హాస్యమునకును కారణభూత మైనది.

రైళ్లలో మూడవతరగతిటిక్కట్లు అమ్మకుండ ఆపివేయబడినవి. అందుమూలమున భారతీయులు ప్రయాణము చేయుటయే కట్టిపెట్టవలసివచ్చినది. రోడ్డుప్రక్కల 'గిలాబా'మీద ఇద్దరు మనుష్యులకంటె ఎక్కువ నడువకూడదని నిషేధపుటుత్తరువులు జారీచేయబడినవి. యూరోపియనులవి తప్ప తదితరుల బైసికిళ్లన్నీ సైనికుల ఉపయోగమునిమిత్తము స్వాధీనము చేసుకొనబడినవి. అంగళ్లు మూసివేసినవర్తకులు కఠినముగా శిక్షింపబడి బలవంతముగా వాటిని తెరవవలసివచ్చెను. సైనికాధికారులే సరకులధరలను నిర్ణయించిరి. బళ్లు సైనికప్రభుత్వమువారిచే స్వాధీనపరచుకొనబడినవి. కోటకు దగ్గరగా కొరడాశిక్షలనిమిత్తమొక బహిరంగమంటపము నిర్మింపబడినది. నగరములోని పలుప్రాంతములలో కొరడాలతో గాని, పేముబెత్తములతో గాని కొట్టించుటకు ముక్కోణము లేర్పాటు చేయబడినవి.

అమృతసరములోని సైనికన్యాయస్థానములచే విచారింపబడిన కేసుల కొన్నిఅంకెల నిచ్చట ఉదాహరింతుము. పెద్దనేరములక్రింద ౨౯౮ మంది విచారింపబడిరి. సైనికశాసనముక్రింద నియమింపబడిన కమిటీలు వీరిని విచారించుటలో మామూలు నియమములను గాని, న్యాయశాస్త్రమును గాని పాటించలేదు. అందులో ౨౧౮ మంది శిక్షింపబడిరి. ౫౧ మందికి మరణదండనము విధింపబడెను. ౪౬ గురు యావజ్జీవ ద్వీపాంతరవాసశిక్షకు గురియైరి. ఇద్దరకు చెరి ౧౦ సంవత్సరముల శిక్ష విధింపబడెను. ౭౯ మందికి ఏడుసంవత్సరములును, ౧౦ మందికి ౫ సంవత్సరములును, ౧౩ మందికి మూడుసంవత్సరములును, ౧౧ మంది కింకను తక్కువకాలమును ఖైదుశిక్షలు విధింపబడినవి. ఇవిగాక మిలిటరీఉద్యోగస్థులు ౬౦ మందిని విచారించి అందులో ౫౦ మంది కప్పటికప్పుడే శిక్షలు విధించిరి. సివిల్ మేజస్ట్రేట్లుకూడ ౧౦౫ మందిని సైనికశాసనముక్రింద విచారించి ఖైదుకు పంపిరి.

హంటరుకమిటీలో సభ్యుడుగానున్న న్యాయమూర్తి రంకిన్ జలియన్‌వాలాబాగు సంఘటనమునుగూర్చి "అది ఒకవిధమైన భయంకరత్వము కాదా ? ఇలా అడిగి

నందుకు సేనాని క్షమింపవలయును." అని ప్రశ్నింపగా డయ్యరుసేనాని "కాదు. కానేకాదు. నే నొక భయంకరధర్మమును నిర్వర్తింపవలసి వచ్చినది. అది చాలా దయాపూర్ణమైనపని అని నా అభిప్రాయము. నాకుగానీ, మరొకరికిగానీ ప్రజలను మళ్లీ కాల్చవలసిన అవసరము రాకుండా ఉండేటంతగట్టిగాను, బాగుగాను కాల్చవలె నని నేను తలంచితిని. నేను కాల్చకుండానే ప్రజలను చెదరగొట్టి యుండగలవాడను. కాని వారు మళ్లీ తిరిగివచ్చి నన్నుపహాస్యము చేసిఉండేవారు. నేను తెలివితక్కువ పని చేసినట్టుగా భావించవలసి వచ్చేది." అని ప్రత్యుత్తరముచెప్పెను.

డెయ్యరుసేనాని చేసిన ఈఘనకార్యమునకు అప్పటి లెఫ్టినెంటు గవర్నరు అంగీకారముతో "నీచర్య సరియైనది. లెఫ్టినెంటుగవర్నరు ఆమోదిస్తున్నారు" అను తంతివార్త పాంచాలప్రభుత్వమునుండి పంపబడెను.

ఈవిషయము లన్నీ ౧౯౨౦ ప్రారంభదశలో హంటర్ కమిషన్ సమక్షమున డయ్యరుసేనాని అంగీకరించినవే. ఇవి జరిగిన సంవత్సరముపైచిలుకువరకును వివరములు బయటకు తెలియనేలేదు. జరిగినరోజులలోగానీ, తరువాత కొన్ని మాసములవరకును గానీ అసలు వార్తలే తెలియలేదు. పత్రికలకు పంపబడేవార్తలు బహు జాగ్రత్తగా పరీక్షింపబడి, మరీ పంపబడినవి. పాంచాలరాష్ట్రమునకు ప్రజల రాకపోకలనుగూర్చి కఠినవిర్బంధము ఏర్పాటుచేయబడినవి. ౧౯౧౯ జులై నెలలో కలకత్తానగరమున లా అసోసియేషన్ భవనమునందు జరిగిన అఖిలభారత కాంగ్రెసు సంఘసమావేశములో మాత్రము అమృతసరఘోరకృత్యము కొంత వివరముగా తెలిసినది. అప్పుడుకూడ ఆవిషయములనుగూర్చి అతిగాఢముగా ఊపిరి బిగబట్టి 'చాలా రహస్యమునుమండీ' అని సభ్యులు గుసగుసలాడుకొనిరి. పాంచాలరాష్ట్రమునం దొక అమృతసరములోనే గాక లాహోరు, గుజరన్‌వాలా, కసూరు మొదలగు తదితరప్రాంతములలోకూడ అటువంటి ఘోరకృత్యములు జరిగినవి. కల్నల్ జాన్సన్, బాస్వర్తుస్మిత్, కల్నల్ ఓబ్రియాన్ మొదలగు సివిల్, మిలిటరీ అధికారులు కావించిన అమానుష కార్యములకు, పశుకృత్యములకు, దురాగతములకు నిజముగా మానవహృదయములు జలదరించును.

పార్లమెంటువారికి పంపబడిన నైటుపేపరులో ప్రభుత్వమువారు వ్రాసిన విషయములనుబట్టి పంజాబురాష్ట్రములోని తదితరప్రదేశములలోకంటె లాహోరులో సైనికశాసన మెక్కువ కఠినముగా అమలుజరుపబడిన దని తెలియగలదు.* అక్కడ తక్షణము కర్ఫ్యూఉత్తరువు లాచరణలోనికి తేబడినవి. ఆ ఉత్తరువుల ప్రకారము

---

* ఈవిషయమున్నూ దీనితరువాతి మరికొన్ని విషయములును అమృతసరమునుండి బి. జి. హార్నిమన్ సంపాదించెను.

రాత్రి ఎనిమిదిగంటలతరువాత బయటకు వచ్చినమనుష్యులు కాల్చివేయబడవచ్చును, ముక్కోణముపైన కొరడాలతో కొట్టబడవచ్చును, జరిమానా విధింపబడవచ్చును, ఖైదుశిక్ష విధింపబడవచ్చును, లేక ఇతరవిధములగు శిక్షలకుకూడ పాత్రులుకావచ్చును. అచట అంగళ్లు మూసినవర్తకులు తిరిగీ వాటిని తెరవవలసినదనికూడ బలవంతపెట్టబడిరి. ఆవిధముగా తెరవనివారు కొందరు కాల్చివేయబడిరి. లేదా, వారిఅంగళ్లను బహిరంగముగా తెరపించి అధికారులు వాటిలోని వస్తువులను ప్రజల కుచితముగా పంచిపెట్టించిరి.

లాయర్లు ఏజెంట్లు, బొట్లు, వీ రందరును వారి పేరులను రిజిస్టరుచేయించుకో వలసినదనీ, ఉత్తరువు లేనిదే నగరమును విడిచి వెళ్లకూడదనీ ఆర్డర్లు జారీచేయబడినవి. సైనికశాసనప్రకటనము లంటించబడిన గోడలయజమాను లాప్రకటనములను జాగ్రత్తగా కాపాడవలసియుండెను. కాని వారుకూడ రాత్రి ౮ గంటలతరువాత బయటికి రాకూడదు. గోడ్డుప్రక్కనున్న కాలిదారులను వరుసగా ఇద్దరు మనుష్యులకంటె ఎక్కువ నడువరాదు. కళాశాలావిద్యార్థులు రోజుకు నాలుగు పర్యాయములు సైనికాధికారులకు వివిధస్థలములలో కనిపించవలసియుండెను. కూడులేని పేదవాళ్లకొరకు కట్టింపబడిన ధర్మశాలలు, భోజనసత్రములు మూసివేయబడినవి. భారతీయుల మోటారు కారులు, మోటారుసైకిళ్లు సైనికాధికారుల ఉపయోగమునిమిత్తము బలవంతముగా లాగికొనబడినవి. యెలక్ట్రిక్ పంకాలు మొదలగునవి భారతీయుల ఇండ్లనుండి బ్రిటిష్ సైనికుల ఉపయోగమునిమిత్తము బలవంతముగా తీసుకొనబడినవి. అద్దెయానములను ప్రతిరోజును నగరమునకు వెలుపలనున్న దూరప్రదేశములలోని సైనికాధికారులకు వాటియజమానులు కనపరచవలసియుండెను. రాత్రి ౮ గంటలతరువాత ఒకవృద్ధుడు తన అంగడిప్రక్కనున్న సందులో తన అవు కేదో పరిచర్య చేయుచుండగా అధికారు లతనిని పట్టుకొని కర్ఫ్యూఉత్తరువులను ఉల్లంఘించినందుకు ముక్కోణముపైన కొరడాలతో కొట్టిరి. బాడుగబండ్లు తోలే మనుష్యులు హరతాళములో పాల్గొనిరి. ఆకారణమున వారికి బుద్ధిచెప్పేనిమిత్తము ౩౦౦ టాంగాబండ్లు సైనికాధికార్ల స్వాధీనము చేసుకోబడినవి. మిగతా బాడుగబండ్లు నగరమునకు బహిఃప్రదేశమున ప్రతిరోజును మిలిటరీ అధికారులకు కనుపించవలసియుండెను. వారు తమ ఇష్టము వచ్చినంతసేపు వాటిని నిలిపియుంచడముచేత పాప మాబండ్లయజమానుల కానాటిబాడుగ నష్ట మయిపోయేది. కల్నల్ జాన్సన్ తన ఉత్తరువులలో అనేకము విద్యావంతులగు మధ్యతరగతులవారికి, అనగా లాయరులు మొదలుగువారికి ప్రతికూలముగా జారీచేయబడిన వని ఒప్పుకొనెను. వారిలోనే ఎక్కువమంది రాజకీయాందోళకు లుండి రని ఆయనఅభిప్రాయము. ప్లీడర్లు మొదలగు మధ్యతరగతులవారి ఆవరణగోడలపైన అంటించబడిన

సైనికశాసనప్రకటనపత్రములను ఇతరులు పాడుచేయకుండా కావలిమనుష్యులను పెట్టవలసివచ్చెను. పోలీసువారితాలూకుమనిషి ప్రకటనపత్రమును పాడుచేసినకేసుకూడ ఒకపర్యాయము పట్టుబడెను. ప్రకటనపత్రముల కావలివాండ్లు రాత్రి ౮ గంటలతరువాత బయట ఉండవలెననుటకు ఉత్తరు విప్పించవలసిన దని కోరగా అట్టి ఉత్తరువులు యజమానులకే తప్ప నౌకర్ల కియ్యబడ వని అధికారులనుండి ప్రత్యుత్తరము వచ్చినది. విద్యార్థులును, ౧౬ మొదలు ౨౦ కి లోబడినవయస్సుగల యువకులును సైనికప్రభుత్వమువారి ప్రత్యేకదృష్టికి గురియైరి. లాహోరునగరములో పెద్ద విశ్వవిద్యాలయమున్నది. అక్కడివిద్యార్థులు రోజుకు నాలుగుపర్యాయములు మిలిటరీఅధికారులసమక్షమున హాజరుకావలె నని ఉత్తరువులు జారీచేయబడెను. ఒకొక్కసందర్భమున వారికళాశాలనుండి విద్యార్థులు నాలుగుమైళ్లవరకు నడువవలసియుండెను. ఏప్రిల్ నెలవంటి మండువేసంగిలో, లాహోరులో నీడను ౧౦౮ డిగ్రీలవేడిమి ఉన్నప్పుడు, ఈకళాశాలావిద్యార్థులు దినమునకు ౧౬ మైళ్లుకూడ నడువవలసివచ్చెను. కొందరు మార్గమధ్యమున మూర్ఛపొందిరి. ఈనడక వారిని అల్లరిచేయకుండ మంచిమార్గమున పట్టించిన దని కల్నల్ జాన్సన్ అభిప్రాయము. ఒకకళాశాల గోడలమీదనున్న ఒక సైనికశాసన ప్రకటనము చింపబడినందున ఆకళాశాలోపాధ్యాయు లందరును ప్రధానాచార్యులతో సహా అరెస్టుచేయబడి సైనికసంరక్షణక్రింద కోటవరకును నడిపింపబడిరి. అక్కడ వారు సైనికాధికారనులో 3 రోజు లుంచబడిరి. వారికి కోటలో ఒకమూల కాళీ చేయబడెను. కోటకప్పుపైన వారు పరుండుటకు సెలవీయబడెను. ధర్మశాలలును, అన్నసత్రములును రాజద్రోహప్రచారమున కుపయోగపడుతూన్నందువలన మూసివేయబడిన వని కల్నల్ జాన్సన్ సాక్ష్య మిచ్చెను. కాని, క్రాసుపరీక్షలో తనవాదమును సమర్థించుకొనలేకపోయెను. తా నావిషయమును ఋజువుచేయుటకు తగిన సాక్ష్యము లేకపోయెను. తన కావిషయమును తెలియపరచినవాని పేరు చెప్పలేకపోయెను.

ఒక గ్రామపెత్తందారును చెట్టుకు కట్టి సైనికాధికారులు కొరడాలతో కొట్టిరి. అది ఆయనకును, గ్రామస్థులకునుగూడ గుణపాఠముగా ఉండగల దని వారి అభిప్రాయము. ఒకకోర్టుగాని, ఒకవిచారణగాని ఉన్నట్లు కనిపించదు. కొరడాదెబ్బలశిక్షయే వెంటవెంటనే అమలుజరుపబడుతూఉండెను.

తాను చేసిన ఈఘనకార్యమునకు కల్నల్ జాన్సన్ సంతుష్టాంతరంగు డయ్యెను. లాహోరు యూరపియను లాయనకు పెద్దవిందు చేసిరి. "పేదలపాలిటి పెన్నిధి" అని పొగడిరి. కాని అతని ౬ వారముల పరిపాలనములోనూ పేదల దురవస్థ వర్ణనాతీతము. ఇక గుజరాన్వాలాలో సైనికశాసనము నమలుపరచిన కల్నల్ ఓబ్రియాన్,

కసూరులో అధికారము వహించిన కెప్టెన్ డవుటన్, షేక్‌పూరాలో పరిపాలనము పూనిన సివిలియన్ ఉద్యోగి బాస్వర్తుస్మిత్తులుకూడ ఈవిషయములో తక్కువపేరు సంపాదించుకొనలేదు.

గుజరన్‌వాలాలో విడువబడిన బాంబులవర్షమువలనను, ౨౫౫ మరఫిరంగీ గుండ్ల బారులవలనను గుమిగూడిన ప్రజలలో తొమ్మిదిమందిమాత్రము మరణించిరనీ, ౧౬ మంది మాత్రము గాయపడిరనీ అధికారులు ప్రజలను నమ్మించ ప్రయత్నించిరి.

గుంపు "కనపడినచోటెల్ల" కాల్చబడిన దని హంటరుకమిటీయెదుట కల్నల్ ఓబ్రియాన్ సాక్ష్యమిచ్చెను. ఈవాక్యము వాయువిమానములకు సంబంధించి చెప్పబడినది. లెఫ్టినెంటు డాడ్కిన్సు వాయువిమానములోపోతూ పొలములో పనిచేసుకొంటూన్న ౨౦ మంది వ్యవసాయకులపైన వారు పారిపోయేటంతవరకును మరఫిరంగిగుండ్లను విడిచెను. తరువాత కొంతదూరములో ఒకయింటిముంగిట ఆయనకు ఒకమనిషి కొందర కుపన్యసిస్తూన్నట్లు కనిపించినది. అక్కడ చేరినవారు "పెళ్లివారు కానీ, శ్మశానమునకు శవమును తీసుకొనిపోయేవారుకానీ కారని తోచినందున" ఆయన వారి పైన బాంబును విడిచెను. మేజరు కర్బీ కొందరుమనుష్యులపైన విమానమునుండి బాంబు విసరెను. "వారు నగరముపలుపలకో, గ్రామములకో దొమ్మీచేయపోతూ ఉండి" రని ఆయన తలచినందున అవిధముగా చేసెను. కర్బీయిచ్చిన సాక్ష్యమువలననే ఆయనచిత్తవృత్తి తెలియగలదు.

"గుంపు పరుగెత్తుతూఉండెను. ఆయన వారిని చెదరగొట్టేనిమిత్తము తుపాకు లను కాల్చెను. గుంపు చెదరిపోగానే ఆయన మరఫిరంగిని గ్రామములోకి బారుచేసెను. కొన్ని గుండ్లు ఇళ్లకు తగిలిఉండవచ్చునని ఆయన తలంచెను. అపరాధులను, నిరపరాధు లను విడదీయుట కాయనకు శక్తి చాలకుండెను. ఆయన ౨౦౦ అడుగుల ఎత్తునుండి మాత్రమే కాల్చెను. ఏమి జరుగుతూన్నదీ ఆయనకు స్పష్టముగా దృగ్గోచరము కాగలదు. బాంబులు వేసినంతమాత్రముననే ఆయన అనుకొన్నపని జరుగలేదు."

"కాల్పులు కేవలము ప్రజలకు నష్టముచేయవలెననే ఉద్దేశముతో జరుగలేదు; ప్రజల ప్రయోజనముకొరకే జరిగినవి. కొంతమందిని అవిధముగా చంపినందువలన తక్కినవారు ప్రజలను గుమిగూడకుండ చూతురని ఆయన తలచెను. దీనివలన ప్రయో జనము కలిగినది."

"తరువాత ఆయన నగరముపైకి పోయి బాంబులను విడువ ప్రారంభించెను. పారిపో ప్రయత్నించినజనులను కాల్చెను."

## ఓబ్రియాన్, డౌటన్, బాస్వర్తు స్మిత్తులు

అమృతసరస్సు, లాహోరు నగరములలోవలెనే గుజరన్‌వాలా, కసూరు షేకుపూరాపట్టణములలోకూడా కర్ఫ్యూ ఉత్తరువు లీయబడినవి. భారతీయుల ప్రయాణములు నిషేధింపబడినవి. బహిరంగముగాను, రహస్యముగాను కూడ ప్రజలకు కొరడాశిక్షలు విధింపబడినవి. గుంపులుగుంపులుగా ప్రజ లరెస్టుచేయబడిరి. ప్రత్యేక కోర్టులలో తక్షణము విచారింపబడి ప్రజలు శిక్షింపబడిరి.

భారతీయు లెవరైనను బ్రిటిష్ ఉద్యోగస్థులను కలుసుకొన్నప్పుడు వారికి నమస్కరింపవలెననీ; బండ్లు దిగవలెననీ, గుఱ్ఱపుస్వారీ చేస్తూన్నను, మోటారు తోలుతూన్నను వెంటనే దిగవలెననీ, గొడుగు లున్నయెడల తక్షణము వాటిని ముడిచివేయవలెననీ కల్నల్ ఓబ్రియాన్ ఉత్తరువులు జారీచేయించెను. "ఈ ఉత్తరువులవలన ప్రజలకు క్రొత్త అధికారులు వచ్చినసంగతి తెలిసినది." అని కల్నల్ ఓబ్రియాన్ కమిటీయెదుట చెప్పెను. ఈ భయంకరమైనఉత్తరువులను ఉల్లంఘించినందువలన అనేకమంది ప్రజలు కొరడాలతో కొట్టబడిరి. వారికి జరీమానాలు విధింపబడెను. వారు ఇదితరవిధములుగా కూడ శిక్షింపబడిరి. అనేకమంది ప్రజ లరెస్టుచేయబడిన ఆరువారములవరకును విచారణ కాకుండ జైలులో నుంచబడుట కీమహనీయుడే బాధ్యుడు. ఒక సందర్భములో ప్రముఖులైన పౌరు లనేకమంది అరెస్టుచేయబడి సామానులరైలుబండిలో లాహోరుకు పంపబడిరి. అందులో కొందరికి సరిపడు దుస్తులుకూడా లేవు. సైనికాధికారులు వారిని రైలులో కుక్కుటకు ముందుగా మండుటెండలో కొన్నిమైళ్లు నడిపించిరి. వారికి కాలకృత్యములు తీర్చుకొనుటకుకూడ అవకాశ మీయబడలేదు. ఈ విధముగా వారు ౪౪ గంటలకాలము సామానులరైలుపెట్టెలో నుంచబడిరి. ఇక వారి దురవస్థనుగూర్చి వేరుగా వర్ణింప నవసరము లేదు. వారు వీథులలో నడిపింపబడినప్పుడు కల్నల్ ఓబ్రియాన్ త్రోవలో కనపడినవారి నెల్ల విచక్షణ లేకుండ అరెస్టుచేసినందువలన నిర్బంధితులసంఖ్య అంతకంతకు పెరిగిపోతూఉండెను. వారందరికినీ చేతులకు సంకెళ్లు వేయబడెను. అందరునూ గొలుసులతో వరుసగా లంకెలు వేయబడిరి. హిందువులకును, మహమ్మదీయులకును లంకె వేయబడెను. ఇది హిందూమహమ్మదీయ సఖ్యమును గూర్చిన హేళనగా ప్రజలకు తోచెను. అది ఉద్దేశపూర్వకముగా జరుగలేదని కల్నల్ ఓబ్రియాన్ చెప్పెను. ఈదురాగతములకు గురియైనవారిలో ఆపట్టణమునకు మహోపకారముచేసిన ఒక సుప్రసిద్ధ వయోవృద్ధుడుకూడ గలడు. ఆయన రాజుగారి రాకకు జ్ఞాపకార్థకముగా ఒకలక్షరూపాయి (పౌ. ౧౦, ౦౦౦) లిచ్చి కింగ్‌జార్జి పాఠశాలను నిర్మించెను. యుద్ధఋణములక్రిందను, యుద్ధములో మరణించిన సైనికుల కుటుంబముల

సహాయార్థమును ఆయన పెద్దపెద్దమొత్తములను సమర్పించెను. ఈ ఒక్క ఉదాహరణము వలన ఆనాడు జరిగిన నిర్బంధవిధానస్వరూపము బోధపడగలదు.

కల్నల్ ఓబ్రియాన్ అవలంబించిన పద్ధతులకు మరియొక ఉదాహరణముకూడ కలదు. ఆయనఉత్తరువులప్రకార మొకముసలిరైతు తన ఇరువురికొడుకులను సైనికాధికారులకు సమర్పింపజాలకపోయినందు కరెస్టుచేయబడెను. ఆయనఆస్తి స్వాధీనపరచుకొనబడెను. ఎవరైనను తమపంటతో ఆముసలిరైతుకు సహాయము చేసేయెడల వారుకూడ కాల్చివేయబడుదు రని కల్నల్ ఓబ్రియాన్ భయపెట్టెను. ఆ ముసలిరైతు స్వయముగా ఏమీ అపరాధము చేయలేదు కాని "ఆయన తనకొడుకులున్న చోటు చెప్పకపోయెను." అని కల్నల్ అంగీకరించెను.

కల్నల్ ఓబ్రియాన్ నడపిన మహాగ్రంథములో ఇవి కొన్నిఘట్టములు. ఆయన హయాములో సమ్మరీకోర్టులద్వారా ౨౦౦ మంది శిక్షింపబడిరి. వారందరికినీ కొరడా దెబ్బల శిక్షగాని, లేక ఒకనెలమొదలు రెండుసంవత్సరములవరకునుగల ఖైదుశిక్షలు గాని విధింపబడినవి. సైనిక న్యాయస్థానమునందు ౧౪౯ మంది శిక్షింపబడిరి. అందులో ౨౨ మందికి మరణదండనము విధింపబడెను. ౧౦౮ మందికి యావజ్జీవద్వీపాంతరవాసశిక్ష విధింపబడెను. తక్కినవారికి ౧౦ సంవత్సరములవరకును, అంతకులోపుగాను కూడ ఖైదుశిక్ష విధింపబడెను. సైనికప్రభుత్వము మరునా డంతరించు నని తెలిసిన వెంటనే కల్నల్ ఓబ్రియాన్ ౨౪ గంటలలో అనేకకేసులను విచారణకు పెట్టెను. ముద్దాయీలకు నేరము చేయలేదని ఋజువు చేసుకొనవడమునకు తగిన అవకాశ మీయలేదు. ఎప్పటికో కొన్నిరోజులకు తరువాత వాయిదాలువేయబడిన కేసులుకూడ ఏదో పడిపోయిన ట్లతితొందరగా విచారించబడినవి. సైనికశాసనము తీసివేయబడినందువలన ఎవరును తన చేతిలోనుండి తప్పించుకొని పోరా దని ఆయన ఎంతో ఆత్రపడెను.

డవుటన్ సేనాని కసూరు సబ్ డివిజనులో ఒకవిధమైన స్వతంత్రాధికారిగా నుండెను. ఆ సబ్ డివిజనుకు ముఖ్యపట్టణము కసూరు. అది కొంచెము పెద్దపట్టణమే. ఆపట్టణములో ప్రజలను ఉరితీయుటకు బహిరంగప్రదేశములలో ఉరికంబములు నెలకొల్పబడినవి. కాని ఇవి యెన్నడును ఉపయోగింపబడలేదు. పై అధికారుల ఉత్తరువులవలన అవి కొంతకాలమునకు తీసివేయబడినవి. కాని, కొన్నాళ్లవరకును అక్కడిప్రజలను భయపెట్టుట కుపయోగపడినవి. రైలుస్టేషనుదగ్గర బహిరంగప్రదేశములో ౧౫౦ మంది మనుష్యులు పట్టేటంతవీలుగా ఒక పెద్ద బోనుకూడా నిర్మింపబడినది. ఇక్కడ గుమానీమనుష్యు లందరును ప్రజలదృష్టి నాకర్షించునట్లుగా

బంధింపబడిరి. మనుష్యులను ఆనవాలుపట్టుటకొనేనిమిత్తము పట్టణములోని మగ వాండ్లందరును ఒక్కచోట వరుసగా నిలపెట్టబడిరి.

బహిరంగముగా వీధులలో ముక్కోణములపైన ప్రజలు కొరడాలతో కొట్టబడిరి. అసహ్యాకరమైన ఈసంఘటనములసందర్భమున తీయబడిన ఛాయాపటములు కూడ కలవు. వానిలో ఆ విధముగా శిక్షింపబడిన దిగంబరులైన దురదృష్టవంతులు టెలిగ్రాఫ్ స్తంభములకును, ముక్కోణములకును కట్టబడియుండుట కనిపించును. ఇట్టి బహిరంగశిక్షాపద్ధతులు తాత్కాలికముగా అవలంబింపబడినవి గాక కేవలము ఉద్దేశపూర్వకముగా అమలులోకి తేబడినవి. డొటన్ నేవాని ఉత్తరువులవలన కొరడాశిక్షలను చూచేనిమిత్తము వ్యభిచారిణులు తీసుకొనిరాబడిరి. ఆయన హంటరుకమిటీయెదుట సాక్ష్యమిచ్చునపుడు "తాను పట్టణములోనున్న చెడుప్రవర్తనకలవారి నందరినీ కొరడా శిక్షలను చూచేనిమిత్తము తీసుకొనిరావలసిన దని చెప్పగా పోలీసుసబ్ఇనస్పెక్టరు ఈ వ్యభిచారిణులనుకూడ తీసుకొనివచ్చినందుకు తనకు చాల భయంకరముగా తోచినదనీ, కాని వారిని పంపివేయుటకు తగినతోడు కనబడనందున వారి నక్కడే నిలిపివేయవలసి వచ్చినదనీ" చెప్పెను.

కొప్టెన్ డొటన్ అనేకములైన చిన్నచిన్నశిక్షలను స్వయముగా కనిపెట్టెను. వ్యవహారములను సాధ్యమైనంత మార్దవముగా నడుపవలెననే యుద్దేశముతో అవి కని పెట్టబడిన వని ఆయన హంటరుకమిటీయెదుట చెప్పినసాక్ష్యములో వివరించెను. సైనిక శాసనముక్రింద తప్పుచేసిననేరస్థు లందరును రైలుపెట్టెలలోనున్న సామానులు క్రిందకు దించుటకును, క్రిందిసామానులు రైలువేగనులలో వేయుటకును నియమింపబడిరి. నేరస్థులు తమనుదుళ్లతో భూమిని తాకవలసిన శిక్షాపద్ధతి ఒకటి ఆయనచే యేర్పాటుచేయబడెను. ఇది జనరల్ డయ్యారు పొట్టతో నేలపైన పాకించిన ఉత్తరువువంటిదే.

బాస్వర్తుస్మిత్తు ఒక సివిలియన్ ఉద్యోగి. ఆయన షేక్పూరాసబ్ డివిజనులో సైనికశాసనము నమలుజరిపెను. సైనికశాసనము ముఖ్యావసరము కాకపోయినను వాంఛనీయముగా కనుపడినదనీ, అది కొనసాగింపబడుట ప్రయోజనకరముగానే పరిణమించినదనీ ఆయన సాక్ష్యమిచ్చెను. తన అధికారములోనున్న ప్రదేశమునందలి కేసు లన్నిటినీ ఆయన విచారించెను. తక్కినచోటులలో వలెనే అక్కడకూడ కొరడా శిక్షలు విధింపబడినవి. కోర్టువారు లేవడములోనే ఆశిక్షలములు జరుపబడినవి. మే ౬, మే ౨౦ తేదీలమధ్య ౪౭౭ మంది విచారింపబడిరి.

యూనియన్ జాకుకు రోజుకు మూడుపర్యాయములు వందన మొనర్పవలె నని విద్యార్థులు నిర్బంధింపబడిరి. ఈ ఉత్తరువయిదారుసంవత్సరముల ఈడుగల అతురాల

తరగతిలోనున్న బడిపిల్లవాండ్లకుకూడ వర్తింపచేయబడెను. నారంపరును పతాక వందనమునిమిత్తము మండుటెండలలో నిలబెట్టబడిరి. ఆసందర్భమున కొందరు పిల్లవాండ్లు వడదెగిలి మరణించినట్లుకూడా ప్రతీతి కలదు. ఎండవేడిమికి కొందరు పిల్లలు మూర్ఛపోయినమాట నిజమే నని సైనికులే అంగీకరించిరి. కొన్నిసందర్భములలో పిల్లకాయలచేత 'నేను నేరము చేయలేదు. నేనికముందు నేరము చేయను. నాకు బుద్ధి వచ్చినది, బుద్ధి వచ్చినది, బుద్ధి వచ్చినది.' అని అనిపించిన ఉదాహరణములు కూడ కల వని తెలియవచ్చినది.

గుజరన్‌వాలా, గుజరత్, లయాల్పురములలో సైనికశాసనము నమలుపరిచిన మేజరుస్మిత్తును "విద్యార్థులకు సంబంధించిన ఈపై ఉత్తరువులు అతిచిన్న వయస్సుగల తరగతిలోని పిల్లకాయలతోసహా అందరకును వర్తింపచేయబడినవా?" అని సర్ చమన్‌లాలు సెతల్వాడు ప్రశ్నించెను. "సైనికులున్న అన్నిప్రదేశములలోను అయిదారు సంవత్సరముల ఈడుగల పిల్లకాయలకుకూడ వర్తింపచేయబడిన"వనీ, "కాని ఈచిన్నపిల్లలుమాత్రము హాజరుకావలసిన అవసరము లేకుండ చేయబడిన" దనీ మేజరు స్మిత్తు ప్రత్యుత్తర మిచ్చెను.

కల్నల్ ఓబ్రియాన్ "తాను ఒకరోజున వజీరాబాదులో నుండగా పతాకవందనముకొరకు నడిపింపబడుతున్న పిల్లవాండ్లలోనొకడు మూర్ఛపోవుట తానుస్వయముగా చూచి సైనికాధికారులకు వ్రాసితి" నని తనసాక్ష్యములో చెప్పెను. "అంతకుపూర్వము రెండుసార్లుమాత్రమే నడిపింపబడుతూన్న పిల్లలు ఆ మరునాటినుండి మూడుసార్లు నడిపింపబడి రన్న సంగతి తెలుసునా?" అని కమిటీవారాయనను ప్రశ్నింపగా "తనకు తెలియ"దని ప్రత్యుత్తరమిచ్చెను. "ఒకవేళ ఆవిధముగా మూడుపర్యాయములు నడిపింపబడినయెడల బాలుర కది కష్టముగా నుండదా?" అని ప్రశ్నింపగా "ఉండదు" అని కల్నల్ ఓబ్రియాన్ జవాబు చెప్పెను.

కాని బాస్వర్తుస్మిత్తుకుమాత్ర మీవిషయములో కొంతపశ్చాత్తాపము కలిగినట్లు తెలిసినది. సాంగ్లాలో "పశ్చాత్తాపసూచక మందిర" మొకటి నిర్మింపబడవలె నని తాను సూచించినట్లుగా ఆయన అంగీకరించెను. కాని దానిఖరీదు రు. ౧౦,౦౦౦ లుండవలె ననిమాత్రము తాను సూచించలే దని స్మిత్తు జవాబు చెప్పెను. ఇంతకంటెను వివరములు తెలుసుకొనదలచినవారు ఈ విషయమునుగూర్చి కాంగ్రెసు కమిటీవారు సంపాదించిన సాక్ష్యమును, మరికొన్నినివేదికలును చదవవలెను. సైనికశాసనసందర్భమున కష్టనష్టము లనుభవించిన ౧౫౦౦ ల మందినుండి తీసుకొనబడిన ప్రమాణవాఙ్మూలములు కాంగ్రెసుకమిటీవారి సాక్ష్యములో లభింపగలవు.

తాను అనుకోని దుష్ఫలితములు కలిగినందుకు గాంధీ దిగ్భ్రమచెందెను. సాత్విక నిరోధ మవలంబింప నర్హతలేని జనసమూహము దురాగతము లొనర్ప పాల్పడుట కవకాశము కలిగినందుకు పశ్చాత్తాపపడెను. తాను "హిమాలయపర్వతమంత తప్పు చేసినట్లుగా" ఆయన భావించెను. తిరిగీ దేశములో శాంతివాతావరణమును చేకూర్చు నిమిత్తమాయన తన సంసిద్ధతను ప్రకటించెను. సాత్వికనిరోధమును తాత్కాలికముగా నిలిపివేసెను. ఇక ప్రభుత్వమువారందు కనుగుణముగా ప్రశాంతపరిస్థితు లేర్పాటు చేయవలసియుండెను. చెమ్సుఫర్డుప్రభువు ౧౪-౪ ౧౯౧౯ తేదీగల ఒకతీర్మానమును ప్రకటించెను. వెంటనే ఆనాటి దురదృష్టకార్యములు తుదముట్టింపబడుట కన్నిసాధనములును వినియోగింపబడు నని అందులో స్పష్టముగా ప్రకటింపబడెను. ఇంతలో మూడవ ఆఫ్ఘనుయుద్ధము తటస్థించుట మూలమున చిక్కుపరిస్థితు లేర్పడినవి. మే ౪వ తేదీని అందుకొరకు సైన్యములు కేంద్రీకరింపబడినవి. సైనికశాసనము ౧౧వ జూన్ వరకును కొనసాగింపబడినది. రైల్వేస్థలములలో ఇంకా మరికొంతకాలమువరకును అమలుజరుపబడినది. ఇంత ఎక్కువకాలము సైనికశాసనము నమలులో నుంచినందుకు ప్రతిఘటిస్తూ సర్ శంకరన్‌నాయర్ జూలై ౧౯వ తేదీని వైస్రాయికార్యనిర్వాహకసభలోని తన సభ్యత్వమునకు రాజీనామా యిచ్చెను. ఇంతకాలమూ పాంచాలరాష్ట్రమునుండి సరియైన వార్తలుగాని, మనుష్యులుగాని బయటకు రావీలుకలుగలేదు. వార్తల విషయమునను, ప్రయాణముల విషయమునను అనేక కఠిననిర్బంధము లేర్పాటుచేయబడినవి. ఆకాలములో పాంచాలరాష్ట్రము తక్కినభారతదేశమునుండి వెలిగానుంచబడినదని చెప్పవచ్చును. రివరెండు ఆండ్రూస్‌వంటి సజ్జనుడు పాంచాలరాష్ట్రమునం దడుగు పెట్ట వీలులేదని నిషేధింపబడెను. ఆయన ఒకరోజు రిమాండులోకూడ నుంచబడెను. తరువాత త్రిప్పిపంపివేయబడెను. మే నెల మొదటివారములో ఆయన అమృతసరమునం దరెస్టు చేయబడెను. కొందరు ముద్దాయీలపక్షమున పనిచేసేనిమిత్తము పంజాబునకు పోవ తలపెట్టిన అర్డ్లీనార్టన్(బారెస్టర్) పైన అక్కడకు పోరాదని ఉత్తరువులు జారీచేయబడెను. పంజాబులో జరిగిన దుష్కార్యములనుగూర్చి విచారించవలసిన దనీ, సైనిక విచారణాధికారులచే వేయబడిన భయంకరశిక్షలను తగ్గించవలసిన దనీ భారతీయులందరును గగ్గోలుపెట్టిరి. సుప్రసిద్ధ కాంగ్రెసునాయకుడును, అర్థికశాస్త్రవేత్తయునగు లాలా హరికిషన్‌లాలునకు యావజ్జీవద్వీపాంతరవాసశిక్ష విధింపబడెను. ౪౦ లక్షల రూపాయలవిలువగల ఆయన యావత్తు ఆస్తినీ ప్రభుత్వమువారు స్వాధీనపరుచుకొనిరి. ౧౯౧౯ సెప్టెంబరులో పంజాబు అల్లరులనుగూర్చి విచారణచేసేనిమిత్తము హంటరు కమిటీ నియమింపబడిన దని వైస్రాయి ప్రకటించెను. కాని ౧౮వ సెప్టెంబరున ఇండెమ్నిటీబిల్లు (అధికారరక్షణచట్టము) చర్చకు వచ్చెను. మాలవ్యాపండితు డా

బిల్లును కొంతకాలము నిలిపివేయవలయును నని నాలుసుంబావుగంగులనేపు గంభీరోపన్యాసము చేసెను. కాని "శాంతిభద్రతలను కాపాడేనిమిత్త మవసరమని తోచిన చర్యలను సదుద్దేశముతో నడపినందుకు" డిపార్టుమెంటుద్వారా గాక న్యాయస్థానములద్వారా శిక్షింపబడకుండ అధికారులకు రక్షణ యుండవలె నని ప్రభుత్వపక్షమున వాదింపబడెను. పైపరతులు సరిగా సైనికాధికారులచే గమనింపబడినవా, లేదా అనేవిషయమును మామూలున్యాయశాస్త్రప్రకారము విచారించుటకు సాధారణ న్యాయస్థానములకా ఇండెమ్నిటీబిల్లుప్రకారమే హక్కు కలదు.

ఇండెమ్నిటీ బిల్లునుగూర్చిన ప్రభుత్వదృక్పథము సరియైనదే నని సర్ దిన్షావాచా ప్రకటించెను. ఇంతవరకును గాంధీతో పోరాడుతూన్న బెసెంటు రౌలట్ బిల్లుకెవరును న్యాయముగా అభ్యంతరపెట్టవలసిన అవసరము లేదనెను. జనులగుంపులు సిపాయీలపైన రాళ్లు విసరినప్పుడు వారు కొన్ని తుపాకిగవ్వలను పేల్చుట అంతకంటె ఎక్కువ దయగలపనియే అని ౧౫వ ఏప్రిలు తేదీని ఆమె వ్రాసెను. అప్పటినుండి 'రాళ్ళకు రవ్వలబారులు' (Bullets for Brick bats) అనేసామెత ఆమెపేరుతో విఖ్యాతమందినది; ఆనాటినుండీ ఆమెప్రజానురంజకత్వము సన్నగిల్లినది. ఢిల్లీకాంగ్రెసులో ప్రదర్శితములైన భేదాభిప్రాయములు ౧౯౧౯ ఏప్రిల్ నాటికింకను ఘనీభవించి, కాంగ్రెసును రెండు ప్రత్యేకకక్షులుగా చీల్చివైచినవి.

ఏప్రిల్ ౨౦, ౨౧వ తేదీలలో సమావేశమయిన అ. భా. కా. సం. గాంధీని ఢిల్లీ, పాంచాలరాష్ట్రములలో ప్రవేశింపరాదని నిషేధించిన ఉత్తరువులను ప్రతిఘటిస్తూ పంజాబుదురంతములను విచారించవలసిన దని తీర్మానించినది. రాజకీయములలో కలిగిన ఇచ్చటి తీవ్రపరిస్థితులను గమనించి విఠల్ భాయిపటేల్, యన్. సి. కేల్కారు లింగ్లాండుకు రాయబారము పోవ నియమింపబడిరి. వారు ౨౯-౪-౧౯౧౯ న సీమకు ప్రయాణమై పోయిరి. ౯-వ జూన్న అలహాబాదులో మరొక అఖిలభారత కాంగ్రెసు సంఘసభ జరిగినది. ఏప్రిల్ ౨౧వ తేదీని గవర్నరుజెనరల్ ఒక ఆర్డినెన్సును ప్రకటించెను. దానిప్రకారము మార్చి ౩౦వ తేదీని గాని, తరువాతగాని చేయబడిన నేరములను సైనిక న్యాయస్థానములకు విచారణకొరకు పంపవచ్చునని పంజాబుప్రభుత్వమున కధికార మీయబడినది. నిజమున కాతారీఖుననే హర్తాళములు ప్రారంభమైనవి కాబట్టి ప్రభుత్వమువా రాతేదీని నిర్ణయించియుందురు. ఈవిషయమును విచారించుటకే అలహాబాదులో అ. భా. కాం. సం. సభ జరిగినది. సైనికశాసనముక్రింద అరెస్టుచేయబడిన ఖైదీలు వారియిష్టమువచ్చిన ప్లీడరును పెట్టుకొనుట కధికారము లేకుండెను. భారతదేశములోని ప్రముఖులయిన పత్రికాధిపతు లందరును బెసెంటు, సురేంద్రనాథ బెనర్జీలతో సహా పాంచా

లములోని విషయములను స్వయముగా విచారించి రావలసినదని సి. యఫ్. ఆండ్రూసును పదేపదే కోరిరి. ఆయన పాంచాలరాష్ట్రములోనికి పోవ ప్రయత్నించగా అరెస్టు చేయబడె నని మే మిదివరకే చెప్పియుంటిమి. సైనికశాసనముకూడ కొనసాగింపబడినది. ఈ విషయముతోపాటు తదితరవిషయములుకూడ ౩౪ వ జాతీసభలో చర్చింపబడినవి. ప్రభుత్వమువారు నియమింపబోవు విచారణసంఘమువారికి, సర్ మైకేల్ ఒడయారుహయాములో, యుద్ధసమయమున సైనికులను, కార్మికపటాలములను సమకూర్చుటయందును, యుద్ధఋణములను సేకరించుటయందును అవలంబింపబడిన పద్ధతులనుగూర్చి, సైనికశాసన మమలుజరుపబడిన విధానమునుగూర్చికూడ విచారించుట కధికార ముండవలె నని ఆసభలో సూచింపబడినది. బొంబాయి క్రానికల్ పత్రికలో గవర్నమెంటువారి పరిపాలనాపద్ధతిని తీవ్రముగా నిరసిస్తూ వ్రాసినందున బి. జి. హార్నిమన్ ప్రవాసమున కంపబడెను. అఖిలభారతకాంగ్రెస్‌సంఘము ఆయన ఇండియాకు రాకూడ దని నిషేధించిన ఉత్తరువులను రద్దుచేయకోరెను.

హార్నిమన్ ఇండియానుండి వెళ్లిపోవుటచే ఇక ప్రజాభిప్రాయమును సరిగా ప్రకటించుటకు తగినపత్రిక యంగ్ యిండియా ఒక్కటే. యంగిండియా మొట్టమొదట జమ్నాదాసు ద్వారకాదాసుచే హోమ్‌రూల్ రోజులలో ప్రారంభింపబడెను. తరువాత శంకరలాల్ బ్యాంకరు సభ్యులుగానున్న ఒకపరిమితయాజమాన్యమున అది నడుపబడుతూవచ్చెను. హార్నిమన్ ప్రవాసమునకు పంపబడి, బొంబాయిక్రానికల్‌పైన ప్రభుత్వమువారినిగా ఎక్కువగా నున్నప్పుడు గాంధీ యంగిండియాపత్రికను స్వాధీనపరచుకొనెను.

ఇక అసలుకథకు వచ్చెదముగాక! పంజాబులో జరిగిన విషయములను విచారించి, ఇండియాలోనూ, ఇంగ్లండులోనూకూడ న్యాయచర్యలను జరిగించేనిమిత్తము సొమ్ము వసూలుచేయుటకు అ. భా. కాం. సం. వారొకకమిటీని నియమించిరి. తరువాత ౧౬ వ అక్టోబరున గాంధీ, ఆండ్రూస్, శ్రద్ధానందస్వాములుకూడ ఆకమిటీలో చేర్చుకొనబడిరి. నవంబరుప్రారంభదశలో సరియైన సంసిద్ధసమయమున ఆండ్రూసు దక్షిణాఫ్రికాకు పోవలసివచ్చెను. అంతవరకును ఆయన సేకరించినసాక్ష్యము అ. భా. కాం. సం. పరము చేయబడెను. ఉపసంఘమువారి సహాయార్థము బొంబాయి, లండను నగరములలోని సొలిసిటరులు నెవిల్, క్యాప్టెన్‌గార్లు కోరబడిరి. విచారణ పూర్తిఅయ్యేవరకును సైనికశాసనముక్రింద విధింపబడిన శిక్షలను అమలు జరుపకుండ నిలిపియుంచవలె నని గా. పండితమాలవ్యా అ. భా. కాం. సం. పక్షమున బ్రిటిష్‌ప్రధానికిని, భారతరాజ్యాంగ కార్యదర్శికిని తంతులను పంపెను. అప్పటికప్పుడే సర్ సత్యేంద్ర

ప్రసన్నసిన్హా ప్రీవీకౌన్సిలులో సభ్యుడై, కే. సి. అయి, లార్డ్ అనేబిరుదును పొంది 'లార్డ్‌సిన్హా ఆఫ్ రాయపూరు' అని పిలువబడుతూఉండెను. ఆయన హిందూదేశ రాజ్యాంగకార్యదర్శికి సహాయకార్యదర్శిగాకూడ నియమింపబడెను. తరువాత ఆయనయే ప్రభువులసభలో భారతరాజ్యాంగచట్టమును మొట్టమొదట ప్రవేశపెట్టినది. జూలై ౧౯, ౨౦ తేదులలో మరియొక అ. భా. కాం. సం. సభ జరిగినది. అందులో కాంగ్రెస్ జరుగవలసిన చోటునుగూర్చి చర్చింపబడెను. అమృతసరములో కాంగ్రెస్ జరుగవలె నని నిశ్చయింపబడినది పంజాబువిషయములనుగూర్చి సరాసరి బ్రిటిషు ప్రభుత్వమువారే కమిషని నియమించి విచారణ చేయించవలె నని తీర్మానించబడినది. సైనికశాసనముక్రింద విధింపబడినశిక్షలను మార్పుచేయుటకును, రద్దుచేయుటకును, తాత్కాలికముగా నిలిపియుంచుటకును ఆకమిటీకి శాస్త్రసమ్మతమైన అధికార ముండవలెననికూడ నిర్ణయింపబడినది. ౧౯ వ జూలైని సర్ శంకరన్‌నాయర్ భారత ప్రభుత్వ కార్యనిర్వాహక వర్గమునందలి సభ్యత్వమున కిచ్చిన రాజీనామకు, ఆయనను కృతజ్ఞతాపూర్వకముగా అభినందిస్తూ వెంటనే సీమకు పోయి పంజాబురాష్ట్రమునకు జరిగిన అన్యాయములకు పరిహారము పొందే ప్రయత్నములు చేయవలసిన దని అ. భా. కాం. సం. వా రాయనను కోరిరి. పంజాబుకమిటీ ఖర్చులనిమిత్తం ౧౦, ౦౦౦ రూపాయలు వసూలుచేయబడినవి. ౨౧ వ జూలై తేదీని గాంధీ సాత్త్వికనిరోధమును తిరిగీ ప్రారంభించే ప్రయత్నము విరమించినట్లుగా ప్రకటించెను.

"శాసనోల్లంఘనము తిరిగీ ప్రారంభింపబడేయెడల ప్రజాక్షేమమునకు భంగకర మైన భయంకరఫలితములు కలుగవచ్చు నని బొంబాయిగవర్నరుద్వారా ఇండియా ప్రభుత్వమువారు నన్ను మందలించిరి. బొంబాయిగవర్నరు స్వయముగాకూడ నే నాయనను దర్శించినప్పుడు నా కావిషయమునే చెప్పెను. దివాన్‌బహదూరు యల్. ఏ. గోవిందరాఘవయ్యార్, సర్ నారాయణచందావర్కారు మొద లగు మరికొంతమంది పత్రికాసంపాదకులుకూడ శాసననిరోధమును ప్రారంభింప వలదనే అభిప్రాయమునే బహిరంగముగా వెలిపుచ్చిరి. ఈవిషయము లన్నిటినీ జాగ్రత్తగా ఆలోచించి ప్రస్తుతము శాసననిరోధమును తిరిగీ ప్రారంభింప కుండుటకు నిర్ణయించుకొంటిని. తీవ్రవాదులుగా పరిగణింపబడుతూన్న కొందరు సుప్రసిద్ధమిత్రులుకూడ, సాత్త్వికనిరోధసిద్ధాంతమును సరిగా అర్థముచేసుకోలేనివారు తిరిగీ దౌర్జన్యమునకు దిగవచ్చునసే భయకారణముతో న న్నాపనికి పూనుకొనవల దని సలహాయిచ్చిరి. నేనున్ను, నాసత్యాగ్రహమిత్రులు మరికొందరున్ను సాత్త్వికనిరోధ మును తిరిగీ ప్రారంభించుటకు తగిన కాలము వచ్చినదని తలచినప్పుడు వైస్రాయికి ఈవిషయముగా నేనొక ఉత్తరమును పంపియుంటిని. అందులో రౌలట్ శాసన ముపసంహ

రింపబడవలెననీ, పంజాబుగంద్రగోళములను విచారించుటకొరకు నిష్పాక్షికసంఘము వెంటనే నియమింపబడవలెననీ, ఆ సంఘమువారికి సైనికప్రభుత్వముక్రింద విధింపబడిన శిక్షలను పునర్విచారణ చేయుట కధికారముండవలెననీ, రికార్డులనుబట్టి అన్యాయముగా శిక్షింపబడినట్లు కనపడుచున్న బాబూ కాలీనాధరాయి తక్షణము విడుదలచేయబడవలెననీ వ్రాసి సాత్వికనిరోధమును తిరిగీ ప్రారంభించు ననుగూర్చిన నాయుద్దేశమునుకూడ వెలిపుచ్చితిని. రాయికేసులో ఇండియా ప్రభుత్వమువారు చేసిన నిర్ణయమునకు మనము వారి నభినందించవలసియున్నది. (రాయి "ట్రిబ్యూన్" పత్రికాసంపాదకుడు) వారాయనకు పూర్తిగా న్యాయము చేయకపోయినను ఆయన శిక్షాకాలమును చాలావరకు తగ్గించిరి. కాబట్టి చాలావరకు న్యాయము జరిగినట్లుగానే భావించవలసియున్నది. నేను కోరిన విచారణసంఘము నియమింపబడ సిద్ధముగానున్నదనికూడ నాకు వాగ్దానము చేయబడినది. ఇట్టిసుహృద్భావమును చూపిన ప్రభుత్వమువారి మంచితలంపును నేను పెడచెవిని బెట్టినయెడల అది అవివేక మనిపించుకొనును. గవర్నమెంటువారి ఈ సలహాను నే నంగీకరించటమే నిజముగా సాత్వికనిరోధస్వభావమునకు మరియొకనిదర్శనము. సాత్వికనిరోధకుడెప్పుడును ప్రభుత్వమువారిని చిక్కులలోకి దింపప్రయత్నించడు. ఇప్పుడు నేను సాత్వికనిరోధప్రయత్నమును విరమించుటమూలమున నాదేశమును, ప్రభుత్వమును, నాఅభిప్రాయముప్రకారమన్యాయముగాను, క్రూరముగాను శిక్షింపబడిన పంజాబునాయకులను ఎక్కువగా సేవించినవాడనగుదునని నా విశ్వాసము. నేను నిప్పుపుల్ల వెలిగించి పారవేసితి నని నిం దారోపణము చేయబడినది. నా తాత్కాలికనిరోధమే వెలిగించిన నిప్పుపుల్లగా ఉపమింపబడేయెడల, రౌలటు చట్టమును నిర్మించి దానిని శాశ్వతముగా గ్రంథస్థము చేయు నిరంతరప్రయత్నములను భారతదేశమునందంతటను వెదజల్లబడిన వేయినిప్పుపుల్లలుగా ఉపమింపవచ్చును. పూర్తిగా సాత్వికనిరోధము విరమింపబడవలెనన్నయెడల ఆ శాసన ముపసంహరింపబడవలెను. ఆబిల్లును సమర్థిస్తూ ప్రభుత్వమువారు ప్రకటించినవిషయములు భారతప్రజలకు సంతృప్తికరములుగా లేవు." అని గాంధీ ప్రకటించి, శుద్ధస్వదేశీవిషయములోను, హిందూమహమ్మదీయసఖ్యమువిషయములోను దేశీయులందరి సహాయమును పొందవలసిన దని తోడిసత్యాగ్రహులకు సలహానిచ్చెను.

ఇంగ్లండులో ఈసమయముననే సెల్‌బార్న్ ప్రభుని అధ్యక్షతక్రింద జాయింటుపార్లమెంటరీ కమిటీవిచారణ జరుగుతూవుండెను. ఆసమయమున భారతదేశమునుంచి అనేకరాజకీయవర్గము లింగ్లండుకు పోయినవి. మాకు కాంగ్రెసు రాజకీయవర్గముతోనే ముఖ్యసంబంధ మున్నప్పటికినీ, ఇతరరాజకీయవర్గములనుగూర్చికూడ ఇచ్చట ముచ్చటించుట అప్రస్తుతము కాదు. కాంగ్రెసుపక్షమున విఠల్‌భాయి జె.

పటేల్, వి. పి. మాధవరావులు బహు సమర్థతతో పనిచేసిరి. వీరున్ను, వీరితోపాటు లోకమాన్యతిలకు, బి. సి. పాల్, జి. యస్. కపర్దే, డాక్టరు పి. జె. మెహాతా, ఎ. రంగస్వామయ్యంగార్, యన్. సి. కేల్కార్, సయ్యద్ హస్సన్ ఇమామ్, బి. జి. హార్నిమాన్, చెంచయ్యలును కాంగ్రెసురాయబారవర్గము గా ఏకీభవించి పనిచేసిరి.

వి. పి. మాధవరావు మైసూరురాజ్యమునకు పూర్వపుదివాను. ఆయన మంచి హుందాకల మనిషి, స్వతంత్రుడు, న్యాయమార్గమును తప్పి నడువడు. ఆయన మూల మున కాంగ్రెసుప్రతిష్ఠ బ్రిటిష్ప్రజలదృష్టిలో మరింత ఇనుమడించినది. ఆకాలమున బ్రిటిష్ కాంగ్రెసుకమిటీకి కార్యదర్శిగా నుండి, లేబరుపార్టీపక్షమున కాంగ్రెసు ప్రయోజనములను కాపాడుతూఉన్న పార్లమెంటుసభ్యుడగు బెన్స్పూరును మాధవ రావుమీద అత్యంతగౌరవము కుదిరినది. ఇక మితవాదులరాయబార మొకటి, జస్టిస్ పక్షపు రాయబార మొకటి, హోమురూలురాయబారములు రెండు ఇంగ్లండునకు పోయినవి. ఢిల్లీకాంగ్రెసునుండి అఖిలభారతహోమ్రూలుసభ రెండుగా చీలిపోయి నది. అధికసంఖ్యాకులు ఢిల్లీతీర్మానము ననుసరింతుమనిరి. అల్పసంఖ్యాకులు కొంచె రిం కను బొంబాయిప్రత్యేక కాంగ్రెసుతీర్మానములనే పట్టుకొని వ్రేలాడుతూఉండిరి. సి.పి. రామస్వామిఅయ్యరు అల్పసంఖ్యాకులపక్షమున ప్రాతినిధ్యము వహించెను. బెసెంటు నేషనల్ హోమ్రూలుసభ అనేపేరుతో క్రొత్తసంస్థను సృష్టించి దానికి ప్రతినిధిగా వెళ్లెను. ఈసందర్భమున మహారాష్ట్రహోమురూలుసభా ప్రతినిధులు కొలంబోనుండియే ఇండియాకు త్రిప్పి పంపివేయబడినసంగతి పాఠకులు జ్ఞాపకము చేసుకొందురుగాక. కాని తరువాత కొద్దికాలమునకే లోకమాన్యునకుమాత్రము సర్ వాలంటైనుషిరాలుగారా సందర్భమున సీమకు పోవ ప్యాస్పోర్టీయబడెను. సీమలోని కాంగ్రెసుకమిటీ సభ్యు లకు ఢిల్లీకాంగ్రెసునాయకు లంటే యేమీ గిట్టలేదు. వారు బొంబాయి కాంగ్రె సులో జరిగిన రాజీకి యెక్కువ అనుకూలురుగా నుండిరి. ఆ కమిటీకిని, విఠల్భాయి జే. పటేలుకును తీవ్రమైన ఉత్తరప్రత్యుత్తరములు జరిగినవి. ఇంగ్లండులోనున్న అయిదు రాయబార వర్గములనుండి ఒక్కొక్క ప్రతినిధివంతున బ్రిటిష్కమిటీ సమావేశమునకు ప్రేక్షకులుగా హాజరై అక్కడ వారికర్తవ్యమును నిర్ణయించు కొనుట మంచిదని మొట్టమొదట బ్రిటిష్కాంగ్రెస్కమిటీవా రభిప్రాయపడిరి. కాంగ్రెస్ రాయబారవర్గముతోపాటు కడితర రాయబారవర్గములకు గుర్తింప తలపెట్టిన బ్రిటిష్కాంగ్రెసుకమిటీవారిచర్యకు విఠల్భాయి కాశ్చర్యము కలిగినది. వెంటనే ఆయన వారికి తీవ్రమైన ఉత్తరము వ్రాసెను. కాంగ్రెసుఆజ్ఞను శిరసావహింప నిష్టము లేని కమిటీసభ్యులను తక్షణము రాజీనామా యీయవలసిన దని విఠల్భాయి స్పష్టముగా తన అభిప్రాయమును వెల్లడించెను. తరువాత బ్రిటిష్కాంగ్రెసుకమిటీ

కొరకు నియమావళిని వ్రాసుకొని భారతకాంగ్రెసు సంఘమునకు పంపవలసిన దని ఆయన ఆకమిటీవారిని కోరెను. వారా ప్రకారము వ్రాసి పంపిరి. భారతీయప్రతినిధులు సీమలో నున్నందువలన భారతదేశవిషయముల ప్రచారము నిమిత్త మింగ్లాండులో అనేకచోట్ల బహిరంగసభ లేర్పాటుచేయబడినవి. బ్రిటిష్‌కార్మికపక్షమువారు భారతీయప్రతినిధులకు కార్మికసభామందిరములో వీడ్కోలువిం దొసగిరి. గ్లాస్గోలో జరిగిన స్వతంత్రకార్మికమహాసభవారు ఐర్లండు, ఈజిప్టుదేశములతోపాటు భారతదేశమునకుకూడ స్వయంనిర్ణయసూత్ర మనువర్తింపచేయవలె నని తీర్మానించిరి. జాతీయశాంతిసభ (National Peace Council) కూడ ఆ విధముగానే తీర్మానించినది. స్కార్‌బోరోలో జరిగిన కార్మికపక్షవార్షికమహాసభలో అల్పసంఖ్యాకులకు తగినరక్షణతో భారతప్రభుత్వపునర్నిర్మాణమునకు స్వయంనిర్ణయసూత్ర మనువర్తింప చేయబడవలె నని తీర్మానింపబడినది. అన్నిసంస్థలును పంజాబుదురంతములను తీవ్రముగా నిరసించినవి.

విఠల్‌భాయిపటేలును, తదితరకాంగ్రెసురాయబారులును సీమలో నుండగా, రెండువైపుల పోరాడవలసివచ్చినది. ఒకపక్షమున బ్రిటిష్‌కాంగ్రెసుకమిటీతో వచ్చిన భేదాభిప్రాయములను సరిచేసుకొనవలసియుండెను. రెండవపక్షమున విసుగువిరామములు లేకుండ కాంగ్రెసును దుమ్మెత్తిపోయుచున్న బెసెంటుతో పోరాడవలసి యుండెను.

ఇంగ్లండులో కాంగ్రెసురాయబారమునకును, బెసెంటుకును తీవ్రవాదప్రతివాదములు చెలరేగినవి. ఉభయులును పరస్పరనిందారోపణములకు కడంగిరి. ఒకరి నొకరు అసత్యశీలు రని వాదించుకొనిరి. ఉభయులును తమతమ అభిప్రాయములను కామన్సుసభలో ప్రకటించేనిమిత్తము కార్మికపక్షమువారి అండ కాంక్షించిరి. బెసెంటు కొన్ని మార్పులతో మాంటేగుప్రణాళికను బలపరచ నిశ్చయించుకొనెను. కాంగ్రెసురాయబారము ఢిల్లీతీర్మానమును, ముఖ్యముగా స్వయంనిర్ణయసూత్రము ననుసరించిన సంపూర్ణబాధ్యతాయుతప్రభుత్వమును బలపరచ నిర్ణయించుకొనెను. స్త్రీల వోటింగు హక్కునుగూర్చి రాష్ట్రీయశాసనసభల నిర్ణయమునకు మాంటేగు వదలివేసెను. కాంగ్రెసురాయబారులావిషయము చట్టములోనే చేర్చబడవలెనని పట్టుపట్టిరి. తరువాత ౨౫-౧౦-౧౯౧౯ ఆల్బర్టుహాలులో జరిగిన సమావేశమునందు రెండుపక్షులవారును బహిరంగముగా వాదప్రతివాదములకు దిగిరి. అత్యక్షుడుగు లాన్సుబరీస్థితి అక్కడ హాస్యాస్పదమైనది. ఆసభ, బెసెంటుచే లండనులో స్థాపింపబడిన హోమ్‌రూలులీగుఆధ్వర్యముక్రింద జరిగినది. చిట్టచివరకు "అన్నిజాతులును తమతమ పరిహద్దులలో స్వపరిపాలనాధికారమును పొందవలెనని పట్టుపట్టు ఈబ్రిటిష్ సామ్రాజ్యప్రజల సమావేశము

భారతప్రజలు సాధ్యమైనంతత్వరలో సంపూర్ణస్వయంనిర్ణయాధికారమును పొందుట కర్హులని ఇందుమూలముగా ప్రకటిస్తున్నది" అనేతీర్మానము నిరభ్యంతరముగా అంగీకరింపబడినది.

అధ్యక్షుడయిన లాన్సుబరీ జోక్యము కలిగించుకొన్నందువలన ఆతీర్మానమున కారూపము వచ్చినది. కాని మొట్టమొదటిరూపముప్రకారము ౧౯౧౭ ఆగస్టు ౨౦ వ తేదీప్రకటనము ననుసరించి మాంటేగ్ ప్రణాళిక మొదటిమెట్టుగా అంగీకరింపబడవలెనని ఉండెను. బెసెంటు మాంటేగుప్రణాళికను స్పష్టముగా సమర్థిస్తూ మాట్లాడెను. విఠల్ భాయిపటేలు వెంటనే ప్రతిఘటించెను. ఆ వాదప్రతివాదముల సందర్భమున జి. యస్. కపర్ది ఆమెను కొంచెము తూలనాడెను. బెసెంటందు కాగ్రహమును ప్రకటించెను. విఠల్ భాయిపటేలు కపర్దిని సమర్థించెను. కాని ౧౯౧౯ లో లండను నగరమున కాంగ్రెసును, దానికార్యక్రమమును బెసెంటు బహిరంగముగా ఎదిరించినప్పటికినీ ఆమె అంతకుపూర్వము భారతదేశమునకు చేసినసేవను గమనించిన యెడల కపర్ది ఆమె నావిధముగా తూలనాడుట న్యాయ్యము కాదని నే డా అభిప్రాయము. మాంటేగును తూ చా తప్పకుండ సమర్థింపదలచుకొనిన బెసెంటుకింకేవో ఇతరకారణములుకూడ కల వని భయపడవలసియున్నది. గాంధీకి ఆమె అంటే అపారమైన గౌరవము. ఆమె నెప్పుడును ఆయన లేచి ఆహ్వానించేవాడు. గాంధీకి, కాంగ్రెసుకు బెసెంటు అంటే అంతమర్యాద. కాని ఆమెమాత్రము వారిని చాలా హేయముగా చూచేది (౧౯౩౦ లోని సంఘటనములను పరికింపదగును). అప్పటికికూడా కపర్ది ఆమెనుగూర్చి వర్ణించినవర్ణనము ఎంతమాత్రము బాగున్నదనుటకు వీలులేదు. ఎంతో కాలముక్రిందట జరిగిన ఆ దురదృష్టవిషయమునుగూర్చి ఈమాత్రము చెప్పుటకు మా కవకాశ మొసంగబడుగాక.

## పంజాబువిచారణ.

ఇక భారతదేశముపై పునఃకు మనదృష్టిని మరలించవలసియున్నది. అ. భా. కాం. సం. తీర్మానానుసారముగా పంజాబులో జరిగిన సంగతులను విచారించుటకు శ్రద్ధానందస్వామి, పండిత మోతీలాలు నెహ్రూ, పండిత మదనమోహనమాలవ్యాలు జూన్ చివరివారములో పాంచాలరాష్ట్రమునకు పోయిరి. తరువాత కొద్దికాలమునకే సి. యఫ్. ఆండ్రూస్ వారిని కలుసుకొనెను. తరువాత పండితు లిద్దరును తిరిగి వచ్చిరి. మరికొంతకాలమునకు మోతీలాల్ తిరిగీ పంజాబును దర్శించెను. జవహరలాల్, పురుషోత్తమదాసుటాండనులు తరువాత సి. యఫ్. ఆండ్రూసును కలుసుకొనిరి. గాంధీపైన నిషేధపుటుత్తరువులు తొలగింపబడినవెంటనే ౧౭ వ అక్టోబరున ఆయన

కూడ పాంచాలమునకు వెళ్లి కాంగ్రెసువిచారణసంఘమువారిని కలుసుకొనెను. పంజాబుప్రజలు భయభ్రాంతులై ఉండిరి. కాని గాంధీ కనుపించినవెంటనే వారికి ధైర్యము వచ్చినది. లాహోరు, అమృతసరనగరములలో ఆయనరాక మహావిజయముగా భావింపబడినది. ఈలోపుగా ప్రభుత్వవిచారణసంఘ నియామకమునుగూర్చి ప్రకటింపబడినది. వారి విచారణాంశము కాంగ్రెసువారి కోరికకు తక్కువదిగా నుండెను. అయినప్పటికీ, ప్రభుత్వవిచారణ సంఘమునకు సహాయమొనర్చుటయే మంచిదిగా తలంపబడెను. చిత్తరంజనదాసు కలకత్తానుండి వచ్చి కాంగ్రెసుపక్షమున పనిచేయుటకు హంటర్ కమిటీసమక్షమున హాజరయ్యెను. కాని కాంగ్రెస్ ఉపసంఘమునకు కొన్ని అనుకోనిచిక్కులు తటస్థించినవి. దానికి ప్రభుత్వవిచారణసంఘకార్యక్రమమునందు జోక్యము కల్గించుకొనక తొలగిపోవలసిన పరిస్థితు లేర్పడినవి. ఆచరిత్ర అంతయును ఒక మెమోరాండములో వివరముగా వ్రాయబడినది. సైనికశాసనముక్రింద శిక్షింపబడినఖైదీలను కొందరిని ప్రభుత్వవిచారణసంఘముయెదుటకు పిలిపించి విచారించవలసిన దని కాంగ్రెస్ఉపసంఘమువారు కోరిరి. కాని ఆకోరిక నిరాకరింపబడినది. కాబట్టి కాంగ్రెసు ఉపసంఘమువారు పంజాబు ప్రభుత్వనిర్ణయముపైన భారతప్రభుత్వమువారికిని, భారతరాజ్యాంగ కార్యదర్శికిని అప్పీలుచేసిరి. కాని వారీవిషయములో జోక్యము కల్పించుకొనజాల మనిరి. కాంగ్రెసు ఉపసంఘమువారు తరువాత ప్రభుత్వవిచారణలో జోక్యము కల్గించుకొనకుండుటకు నిర్ణయించుకొనిరి. ఈనిర్ణయమును జైలులోని ఖయిదీలుకూడ ఆమోదించిరి. తరువాత కలిగిన అనుభవమువలనకూడ ఆనిర్ణయము సరియైనదే అని తేలినది. ౧౯౧౯ ఏప్రిల్ నెలలో పాంచాలరాష్ట్రమున జరిగిన సంఘటనములలో న్యాయముగా హంటరు కమిటీవారి విచారణక్రిందకు రాదగిన అంశములుకూడ వారు విచారించుటకు వీలు లేకుండచేయబడినవి. కాబట్టి కాంగ్రెసువారు వేరొకకమిటీని నియమించి ప్రత్యేక విచారణను ప్రారంభించిరి. గాంధీ, మోతీలాలునెహరూ, దాస్, ఫజ్లుల్ హక్కు, అబ్బాస్ తయ్యాబ్జీలు కమిటీసభ్యులు. కె. సంతానమ్ ఆకమిటీకార్యదర్శి. కాని అమృతసరముకాంగ్రెసుకు మోతీలాలు అధ్యక్షుడుగా నెన్నుకొనబడిన వెంటనే ఆయన ఆ కమిటీలోని తనసభ్యత్వమునకు రాజీనామా యిచ్చెను. జయకర్ ఆయనస్థానమున నియమింపబడెను. ప్రీవీకౌన్సిలు అప్పీళ్లలో పనిచేస్తున్న లండన్ సొలిసిటరు నెవిలీకూడ కమిటీతో కలసి పనిచేస్తూ ఉండెను. జలియన్ వాలాబాగును కాంగ్రెసు సంపాదించి అక్కడొక స్మారకచిహ్నమును నెలకొల్పవలసినదనికూడ తీర్మానింపబడెను. అందుకు పండిత మాలవ్యాఅధ్యక్షతక్రింద మరియొక ఉపసంఘ మేర్పాటుచేయబడెను. ఆ ప్రకారము జాతీయమహాసభ ఆబాగును సంపాదించగలిగినది. దానినిగూర్చి వివర

ములు ముందు వ్రాయగలము. అమృతసరము కాంగ్రెసునాటికి కాంగ్రెసు ఉపసంఘమువారి విచారణ పూర్తికాలేదు. వారివిచారణ అయి నివేదిక వచ్చినతరువాత ప్రత్యేక కాంగ్రెస్ యేర్పాటుచేయబడి సావకాశముగా అవిషయము చర్చించబడవలె నని కూడా అప్పుడు భావింపబడినది. కాని, ఆ ఉపసంఘమువారు "డయ్యారుసేనాని హంటరుకమిటీయెదుట ఒప్పుకొన్న విషయములనుబట్టి ఆయన ౧౩ వ ఏప్రిల్ తేదీని జరిపిన చర్య నిరపరాధులు, నిరాయుధులు, నిరుద్దేశులు అయిన ప్రజలను, పిల్లలను బుద్ధిపూర్వకముగా చేసినహత్య అనీ, ఆధునికకాలములో అంత నిర్దాక్షిణ్యమైన, పిరికితనముతో కూడిన పశుకృత్యము మరియొకటి ఉండబోదనీ నిర్వివాదాంశముగా ఋజువైన" దని మాత్రము అభిప్రాయ మిచ్చిరి. పంజాబురాష్ట్రమునందు ఏప్రిల్, మే మాసములలో జరిగినవిషయములనుబట్టి విచారించేయెడల ౧౦ వ ఏప్రిల్ తేదీని అమృతసరపుమూకలు కావించిన ఘోరకృత్యములకు ప్రతిక్రియగా డయ్యారుసేనాని అమృతసరనగరమును నేలమట్టము చేయతలపెట్టె నని పుట్టినవాదనకు కారణము మనము తేలికగా గ్రహించవచ్చును. ౧౯౧౯ వ సంవత్సరమునందలి రెండవభాగములో భారతరాజకీయాకాశ మంధకారబంధురముగా నుండెను. ప్రభుత్వమువారు హంటరుకమిటీని నియమించి ఉండవచ్చును. కాని ఆకమిటీలో కాంగ్రెసు ప్రతినిధి లేనికారణమున అది వ్యర్థము. ప్రభుత్వమువారు సంస్కరణచట్టమును తయారుచేసియుండవచ్చును. కాని, అది వారంతకుముందు చేసిన వాగ్దానముల కెంతమాత్రమును అనుగుణముగా లేదు. ఈ విషయములు ముందుజరుగబోయే సంఘటనములకు సూచనలుగా కనబడినవి. హంటరుకమిటీనియామకము చేయబడి, పార్లమెంటులో భారతరాజ్యాంగచట్టము చర్చకు వచ్చినవెంటనే, సీమకు రాయబారముపోయిన కాంగ్రెసుప్రతినిధులున్ను, సీమలోని బ్రిటిష్‌కాంగ్రెసుకమిటీవారున్ను అప్పటి భారతరాజకీయపరిస్థితులనుగూర్చి ఏకాభిప్రాయముతో ౧౯౧౯ శరత్కాలములో చేసిన ప్రకటన మీక్రింద ఉదాహరింపబడినది :

## భారతరాజకీయములను గూర్చిన ప్రకటనము

"ఇది సీమకు రాయబారముపోయిన భారతజాతీయమహాసభా ప్రతినిధులవలనను, బ్రిటిష్ కాంగ్రెసుకమిటీవలనను ఏకగ్రీవముగా ఆమోదింపబడినది.

### సాధారణ స్థితి

" భారతదేశమునుగురించి బ్రిటిష్‌ప్రజలు వివరముగా తెలుసుకొనవలసిన తరుణము వచ్చినది. ప్రభుత్వమువారు కావించిన ప్రమాదమువలన ఇప్పటికే భారతరాజ

క్రియాశాలిము మానవశక్తి నతిక్రమించి మేఘావృత మైయున్నది. ఎప్పుడో అది తుపానుగా మారవచ్చును. దాని భయంకరత్వమునుగూర్చి యెవరును ముందుగా ఊహింపచాలరు.

## వాగ్దానము-క్రియ

"మహాసంగ్రామములో సహాయపడిన సైనికులకు పార్లమెంటులో అభివందన తీర్మానమును ప్రతిపాదిస్తూ లాయడ్ జార్జి "మనకు కలిగిన ఈమహావిజయమునకు సంపూర్ణముగా తోడ్పడిన భారతదేశమునుగూర్చి మన మాలోచింపవలసియున్నది. యుద్ధములో చేసినసేవకు నేడాదేశమున కొక కొత్తహక్కు వచ్చినది. ఆహక్కు నెవ్వరును నిరోధింపచాలరు. ఆదేశపు అభివృద్ధికి అభ్యంతరముగానుండే అసూయాభావమునుగాని, పిరికితనమునుగాని, అణచివేయగల బలవత్తరమైన దాహక్కు" అని చెప్పెను. ఇక ఈ "కొత్తహక్కు"ను గూర్చి ముచ్చటించెదము. భారతదేశము సంగ్రామసమయములో చేసిన మహత్తరసేవకు ప్రతిఫలముగా శాంతిప్రకటనము చేయబడిననాటి నుండీ ప్రభుత్వమువారు శాసననిర్మాపకములోను, పరిపాలనాపద్ధతిలోనుకూడ తీవ్ర నిర్బంధవిధానమును సాగించిరి. ఇండియాలో ముద్రణాస్వాతంత్ర్య మరికట్టబడినది; పౌరస్వాతంత్ర్య, వాక్స్వాతంత్ర్యములు నిర్మూలింపబడినవి. ప్రభుత్వమువారి విధానము ముఖ్యముగా పాంచాలరాష్ట్రములో ప్రజాప్రతిఘటనములకును, కొల్లాటలకును కారణభూతమైనది. అక్కడ సైనిక ప్రభుత్వ మేర్పాటుచేయబడినది. ప్రజానురంజకులైన నాయకులకు ప్రవాసశిక్షలు విధింపబడినవి. ఆస్తులు వశపరచుకొనబడినవి. పత్రికలణచివేయబడినవి. ఉరిశిక్షలు విధింపబడినవి. బహిరంగముగా కొరడాశిక్షలమలుజరుపబడినవి. కల్పితనేరములపైన సుప్రసిద్ధదేశాభిమానులకు ఖైదుశిక్ష విధింపబడినది. సైనికన్యాయస్థానములలో విచారింపబడిన ముద్దాయిలకు వారియిష్టము వచ్చినవ్లీడరును పెట్టుకొనేస్వాతంత్ర్యముకూడ లేకుండచేయబడినది. ఆత్మసంరక్షణ చేసుకొనజాలని పురుషులపైనను, స్త్రీలపైనను మరఫిరంగులు పేల్చబడినవి; సైనిక విమానములచే పైనుండి బాంబులు విడువబడినవి. ఇంత రక్తపాతము, ఇన్ని ఘోరకృత్యములు జర్మనీవారే చేసిఉన్నట్లయితే ఆంగ్లేయుల కెంతో ఆగ్రహము కలిగి, ఇంకెంతో భయంకరముగా కనపడిఉండేది.

"ఇంత జరిగినతరువాత, గాయముపైన కారముచల్లినట్లు భారతీయుల కళ్లనీళ్లు తుడుచుట కొక విచారణసంఘ మేర్పాటుచేయబడినది. అందులో భారతజాతీయ మహాసభాప్రతినిధి గానీ, భారతముస్లిమ్ సభాప్రతినిధికానీ లేడు. పైపెచ్చు అపరాధులైన అధికారులు న్యాయముగా శిక్షింపబడుటకు వీలులేకుండ ఇండియాప్రభుత్వము

వారు ఇండెమ్నిటీచట్టమును చేసిరి. ఏనిరంకుశప్రభుత్వమయినను దీని నతిక్రమించి ఇంకేమిచేయగలదు?"

సీమలోనున్న బ్రిటిష్‌కాంగ్రెస్ కమిటీయే భారతదేశపుస్థితిగతు లింతహృదయవిదారకముగా నున్నవని తలంచినప్పుడు, కళ్లయెదుట నిరంతరము చూస్తూన్న విషయములనుగూర్చి భారతీయు లెట్లు భావింతురో పాఠకు లూహించుకొనవచ్చును. ఇక మాంటుఫర్డుప్రణాళికలో సూచింపబడిన రాజ్యాంగచట్టమువలన భారతీయుల విషాదము మరింత హెచ్చయ్యెను. అందులో మొట్టమొదట సూచింపబడిన పెద్ద పెద్ద సంఘములు (Grand Committees) మాత్రము తీసివేయబడినవి. కాని ద్వంద్వపరిపాలనము, ప్రభుత్వనియోజిత సభ్యత్వములు, స్టేట్ కౌన్సిలు, సర్టిఫికేషన్ వీటో అధికారములు, ఆర్డినెన్సు అధికారములు మొదలగు తక్కినఅన్ని ప్రతికూలవిషయములును అలాగే ఉన్నవి. ఆప్రతిబంధకములను రాజ్యాంగచట్టమునుండి నిర్మూలించుటకే అమృతసరపు కాంగ్రెసు పిలువబడినది. కాని భారతరాజకీయములలో నిరంతరము ప్రత్యక్షమవుతూ ఉండే కక్షలు తీవ్రముగా పనిచేస్తూనేఉన్న వనువిషయము పాఠకులు జ్ఞాపక ముంచుకొనవలసియున్నది. విదేశీయప్రభుత్వముక్రింద అటువంటి చీలికలు తప్పనిసరి. అవి హోంరూలుసభలోనే ముందు ప్రవర్తితములైనవి. అమృతసరములో వాటి సంపూర్ణస్వరూపము గోచరమైనది. అప్పటికి సీమలో సర్ వాలంటైన్ షిరోలుపైన తెచ్చిన దావాలో బాలగంగాధరతిలకు ఓడిపోయి భారతదేశమునకు తిరిగివచ్చెను. ఆయన సీమలో నున్నప్పుడు "వచ్చిన రాజ్యాంగసంస్కరణములను పుచ్చుకొని, తక్కిన అధికారములకొరకు పోరాడుదు" నని అభిప్రాయమిచ్చెను. కాని భారతదేశమునకు వచ్చినపిమ్మట ఆయన ఇచ్చిన అభిప్రాయములనుబట్టి రాజ్యాంగచట్టము ఆయన సీమలో ఎక్కువ ప్రతికూలముగా నున్నట్లు కనుపించలేదు. రాజ్యాంగప్రణాళిక భారతీయాశయములకు తగినట్లు లేదనిమాత్ర మాయనఅభిప్రాయమైనట్లు నిశ్చయముగా చెప్పవచ్చును. కాని అమృతసరముకాంగ్రెసుకు పోయేత్రోవలో గంగాపురప్టేషను నుండి ఆయన భారతదేశమునకు రాజ్యాంగసంస్కరణములు దయచేయించినందుకు భారతప్రజలపక్షమున రాజుగారికి అభినందనరూపకమైన తంతివార్తను పంపెను. సంస్కరణములను ఆచరణలోకి తెచ్చేవిషయమున నేను అనుకూలసహకారవాదము (Responsive Co-operation) నవలంబింతు నని కూడ లోకమాన్యు డాతంతిలో వివరించెను. ఈ 'అనుకూలసహకారవాదము' అనే సమాసమును ఇంగ్లీషుభాషలో సృష్టించినది బాప్టిస్టా. తంతివార్త వ్రాసినది కేల్కారు. కాంగ్రెసువారు లెవరికినీ ఈపరివర్తనము తెలిసేనే తెలియదు. ఇక అమృతసరముకాంగ్రెసు అన్నికక్షులవారికి బహిరంగమయిన యుద్ధభూమి అయినది.

అమృతసరము కాంగ్రెస్ నాటికి చిత్తరంజనదాసు కాంగ్రెసులో కూడ సుప్రసిద్ధ పురుషు డయ్యెను. ౧౯౧౭ లో కలకత్తాకాంగ్రెసుకు బెసెంటు అధ్యక్షురాలు కావలెనని వాదించినప్పుడే ఆయన ఆకస్మికముగా ప్రసిద్ధత గడించెను. ౧౯౧౮ లోని ఢిల్లీకాంగ్రెసులో బొంబాయి ప్రత్యేక కాంగ్రెసురాజీనామాను నిర్మూలించుట యం దాయన ప్రధాననాయకుడుగా వ్యవహరించెను. అమృతసరములో పాత మితవాదులును, క్రొత్తజాతీయవాదులును తమతమ బలాబలములను చూచుకొనిరి. అతివేగముగా క్షీణించిపోతూన్న మితవాదులబలమునకు బెసెంటు చేరినందువలన నూతనోత్సాహము కలిగినది. జాతీయవాదుల శక్తి అప్రతిహతముగా నుండెను. దాసు తన తీర్మానములను సిద్ధముచేసుకొని కాంగ్రెసుకు వచ్చెను. కాంగ్రెసుఅధికారుల తీర్మానములకంటె కూడ తన తీర్మానములను ముందు ప్రతిపాదించే చమత్కారమున కాయన పూనుకొనెను. అమృతసరముకాంగ్రెసులో చర్చకు వచ్చిన రాజ్యాంగసంస్కరణముల తీర్మానమును దాసు వ్రాయగా విషయనిర్ధారణసభ అంగీకరించినది. మహాసభలో దానిచిట్టచివర క్రొత్తగా నొకపేరా చేర్చబడుటమూలమున అసలుతీర్మానస్వరూపమే మారిపోయినది. "సంపూర్ణబాధ్యతాయుతప్రభుత్వము త్వరలో ప్రవేశపెట్టబడుట కనుకూలముగా, ముందు, ప్రజ లీసంస్కరణములను ఆచరణలో పెట్టవలెను" అనే వాక్యము దాసుతీర్మానమునకు చివర చేర్చబడినది.

ప్రభుత్వమువారు ప్రజలకు తోడ్పడినంతవరకు ప్రజలు ప్రభుత్వమువారికి తోడ్పడుదు రనే పరస్పరసహకారసిద్ధాంతభావ మీవాక్యములో ఇమిడియున్నది. ౧౯౧౭ ఆగస్టు ౨౦ వ తేదీని మాంటేగు చేసినప్రకటనములో ఈ పరస్పర సహకారసూచన ఉన్నదని పాఠకులు జ్ఞాపకము చేసుకొనవలసి యున్నది. దాసు దానినిగూర్చి ఉదాహరించనేలేదు. కాని ప్రత్యేక మింకొకపేరాలో గాంధీ దానినిగూర్చి విపులముగా ఉదాహరించెను.

౧౯౧౯ లోని అమృతసరపుకాంగ్రెసు జాతీయగౌరవమునకు విజయగీతములు పాడినది. ఆకాంగ్రెసులో భారతరాజకీయవేత్తలకు తీవ్రమైన అభిప్రాయభేదములు కలిగినవి. ప్రభుత్వమువారు ప్రజలకు తోడ్పడినంతవరకు ప్రజలు ప్రభుత్వమువారికి సహాయమొనర్పవలె నని మాలవ్యా, గాంధీలు వాదించిరి. చిత్తరంజనదాసు రాజ్యాంగప్రణాళికను త్రోసిపుచ్చవలె నని పట్టుపట్టెను. ఆనాటి ప్రధానతీర్మానమును చిత్తరంజను డీక్రిందివిధముగా ప్రతిపాదించెను:

౧. "భారతదేశము సంపూర్ణబాధ్యతాయుతప్రభుత్వమునకు తగియున్న దని నిరుడు చేసిన ప్రకటనమును నేటికాంగ్రెసు తిరిగీ ప్రతిపాదిస్తూన్నది. అందుకు విరుద్ధములైన అభిప్రాయములను, వ్రాతలను ఈకాంగ్రెసు నిరాకరిస్తూన్నది.

౨. "రాజ్యాంగసంస్కరణములను గూర్చి ఢిల్లీ కాంగ్రెసులో చేయబడిన తీర్మానమున కీ కాంగ్రెసుకూడ అంగీకరిస్తున్నది. సంస్కరణశాసనము అసంపూర్ణము, అసంతృప్తికరము, ఆశాభంగకరము అని ఈ కాంగ్రెస్ అభిప్రాయము.

౩. "స్వయంనిర్ణయసూత్రము ననుసరించి, భారతదేశములో సంపూర్ణ బాధ్యతాయుతప్రభుత్వమును స్థాపించుటకు వలయు చర్యలను త్వరలో జరుపవలె నని పార్లమెంటువారిని ఈకాంగ్రెసు ప్రార్థిస్తూన్నది."

ఈ తీర్మానమునకు గాంధీ 'ఆశాభంగకరము' అనేమాట తీసివేసి ఈక్రింది నాల్గవపేరాను చేర్చి సవరణను ప్రతిపాదించెను:

౪. "అట్టి పరిపాలనము ప్రవేశపెట్టబడేలోపల 'నా ప్రజలును, నా ఉద్యోగస్థులును కలసి ఏకఫలాపేక్షతో ఏకాభిప్రాయము కలిగి పనిచేసే నూతనయుగ ప్రారంభ మగుగాక' అని చేయబడిన రాజుగారి ప్రకటనములోని భావమున కనుగుణముగా ఈ కాంగ్రెసు భక్తితో ప్రవర్తింప కోరుతూన్నది. సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వము వెంటనే ప్రవేశపెట్టబడుటకు వీలగునట్లు ప్రభుత్వాధికారులును, ప్రజలును సంస్కరణకార్యక్రమమునందు సహాయపడగల రనికూడ ఈ కాంగ్రెసు విశ్వసిస్తూన్నది.

"ఈసంస్కరణములనుగూర్చి రైటుఆనరబుల్ ఇ. యస్. మాంటేగ్ చేసిన శ్రమకు ఈ కాంగ్రెస్ ఆయనకు కృతజ్ఞతాభివందనము లర్పిస్తూన్నది."

ఈ తీర్మానమునుగూర్చి చిట్టచివర కొంకరాజీనామా జరిగినది. దానిప్రకారము దాసుచే మొట్టమొదట ప్రతిపాదింపబడిన తీర్మాన మాలాగే ఉండేటట్టున్నూ, గాంధీచేర్చిన నాల్గవపేరా యీక్రింది విధముగా మార్చబడేటట్టున్నూ యేర్పాటుచేయబడినది:

"అట్టిపరిపాలనము ప్రవేశపెట్టబడేలోపల, ప్రజలు సంపూర్ణబాధ్యతాయుతప్రభుత్వమును త్వరలో పొందుటకు వీలగునట్లుగా సాధ్యమైనంతవరకు సహాయపడెద రని యీకాంగ్రెస్‌వారు విశ్వసిస్తున్నారు. ఈ సంస్కరణముల సందర్భములో చేసిన శ్రమకు ఈ కాంగ్రెస్‌వారు రైట్‌ఆనరబుల్ మాంటేగ్‌కు కృతజ్ఞతాపూర్వకనమస్కారము లర్పిస్తూన్నారు."

బెసెంటు ప్రతిపాదించిన మరియొకతీర్మాన మోడిపోయినది. దాసుచే ప్రతిపాదింపబడి, చిట్టచివరకు నాయకు లందరిచేతనూ అంగీకరింపబడిన పై తీర్మాన మామోదింపబడినది.

కాని ఆవిధముగా చేసికొనబడిన రాజీనామా కేవల మసందిగ్ధముగా నున్నదని చెప్పుటకు వీలులేదు. దాసు ఉపన్యాసములో తన తీర్మానముప్రకారము అవసరమైనయెడల సంస్కరణముల కడ్డంకులు కల్పించుటకును, సాధ్యమైనయెడల సహాయము చేయుటకును భారతజాతికి హక్కుగల దని వ్యక్తీకరించెను. ఈ తీర్మానమునుబట్టి ఒక్క దాసుకే జయము కలిగిన దనిగానీ, ఒక్క గాంధీకే జయముకల్గినదనిగానీ చెప్పుటకు వీలులేదు. అది ఉభయులకును జయమే. గాంధీ చేర్చినసవరణనుబట్టి ఆయనకును, అందులో చేయబడిన మార్పునుబట్టి దాసుకును సమానవిజయము కలిగిన దని చెప్పవచ్చును. అప్పటికప్పుడే జాతీయమహాసభలోని మహానాయకులలో ఒకరి కొకరు తీసిపోరన్న సంగతి స్పష్టమయినది. ఆవిషయము మందరును ముందుగా ఊహించతగినదే. అమృతసరపుకాంగ్రెస్‌లో జరిగినచిత్ర మేమనగా, సంస్కరణములను త్రోసిపుచ్చవలెననీ, వాటి కభ్యంతరములు కల్పించవలెననీ దాసు కోరగా గాంధీ సహాయపడవలెనని వాదించెను. సంస్కరణముల తీర్మానముపైన జరిగినచర్చనుగూర్చి భారతభావిసంతతి యేమి అభిప్రాయపడినప్పటికిన్నీ అమృతసరంకాంగ్రెస్‌లో గాంధీకి సంపూర్ణవిజయం చేకూరిందనేమాట నిస్సందేహము. గాంధీ తనసిద్ధాంతములతో, తన వేదాంతదృక్పథముతో, తన నీతిశాస్త్రముతో, తన సత్యశీలతతో, తన అహింసాతత్వముతో, తనస్వీయప్రతిష్ఠతో తనఅభిప్రాయమును ప్రతిపాదించి అమృతసరం కాంగ్రెసులోని ప్రతినిధులను ముగ్ధులనుగా నొనర్చెను. అది యెట్లో యిప్పుడే చూడవచ్చును. అమృతసరంకాంగ్రెసులో వివిధవిషయములనుగూర్చి యాభై తీర్మానములు చేయబడినవి. షెమ్స్‌ఫర్డుప్రభువును సీమకు తిరిగీ పిలిపించవలసిన దనే తీర్మానము మొదలుకొని ల్యాండురివిన్యూ పద్ధతినిగూర్చి విచారించవలసినదనే తీర్మానమువరకునుగల వివిధతరగతుల తీర్మానము లచ్చట ఆమోదింపబడినవి. కార్మికపరిస్థితులు, మూడవక్లాసురైలు ప్రయాణికుల కష్టములనుగూర్చికూడ ఆకాంగ్రెసునందు చర్చింపబడినది. ఆ కాంగ్రెసుకు ౩౬,౦౦౦ మంది ప్రజలు హాజరైరి. అందులో ౬,౦౦౦లు మామూలు ప్రతినిధులు. ౧౨౦౦ మంది రైతుప్రతినిధులు. తక్కినవారు ప్రేక్షకులు. అక్కడి కార్యక్రమము విద్యుద్వేగముతో జరిగినది. పాంచాలదురంతము లాకాంగ్రెస్‌దృష్టిని యెక్కువగా ఆకర్షించినవి- గుజరాతు, పాంచాలరాష్ట్రములలో జరిగిన ప్రజలదౌర్జన్యము నిరసింపబడవలెనని గాంధీ ఆత్రపడెను. విషయనిర్ధారణసభ ఆ తీర్మానమును త్రోసిపుచ్చెను. గాంధీ ఆశాభంగమును పొందెను. అప్పటికి రాత్రి ప్రొద్దుపోయినది. తన ఉద్దేశమును అంగీకరించుటకు తగినమార్గము కాంగ్రెస్ చూడజాలనియెడల తాను కాంగ్రెస్‌లో నుండజాలనని గాంధీ సగౌరవముగాను, సవినయముగాను, స్ఫుటముగాను వ్యక్తపరచెను. మరునాడుదయమున చాలామంది ప్రతినిధుల

అయిష్టసూచకములయిన గుసగుసలమధ్య యీక్రింది తీర్మాన మంగీకరింపబడి నది: "జరిగిన ఏప్రిల్ నెలలో ప్రజ లాగ్రహావేశపూరితులు కావడమునకు తగిన కారణములు కల్పింపబడినప్పటికినీ పాంచాల గుజరాతురాష్ట్రములలోని కొన్ని భాగముల యందలి జనులు కొందరి ధనమానప్రాణములకు భంగముకలిగించే అత్యాచార ములు చేసినందుకై యీకాంగ్రెస్ హృదయపూర్వకముగా విచారమును వెలిబుచ్చు తూన్నది." ఈ విషయమునుగూర్చిన గాంధీఉపన్యాసము పరమావధిని పొందినది. అందులో ఆయనభవిష్యదుద్యమముయొక్క సంపూర్ణస్వరూపము సంగ్రహముగా వ్యక్తీకరింపబడినది. అది యిది:

"ఈ తీర్మానముకంటె ఉత్కృష్టమైనతీర్మానము నేడీకాంగ్రెస్‌లో లేదు. ఈ తీర్మానములో అంతర్వాహినిగా ప్రవహిస్తూన్న సత్యస్వరూపమును హృదయపూర్వక ముగా స్మరించి, దాని కనుగుణముగా ప్రవర్తించుటలోనే మన భవిష్యద్విజయ మిమిడి యున్నది. ఎంతవరకు మన మానిత్యసత్యస్వరూపమును గ్రహింపజాలమో అంతవర కును మన కపజయము తప్పదు. వీరంగం, అహమ్మదాబాద్, బొంబాయిలలో జరిగిన విషయములను పూసగ్రుచ్చినట్లుగా నేను మీకు వివరింపగలను. వాటినిబట్టి మనపక్ష మునకూడ దౌర్జన్య ముద్దేశింపబడిన దని, ఆచరింపబడిన దని బాగా ఋజువుకాగలదు. డాక్టరుకిచ్లు, డాక్టరు సత్యపాలులను నిర్బంధించినందువల్లనూ, శ్రద్ధానందస్వామి, సత్య పాలుల పిలుపుపైన శాంతిప్రబోధముకొరకు పోతూన్న నన్ను బంధించినందువల్లనూ ప్రభుత్వమువారు ప్రజలను రెచ్చగొట్టినారన్నమాట నేనుకూడా అంగీకరింతును. ప్రభు త్వమువా రావిధముగా ప్రవర్తించిఉండకపోయినయెడల నాటి దురదృష్టసంఘటనములు జరిగిఉండేవి కావనికూడ నే నేకీభవింతును. కాని ప్రభుత్వమున కప్పుడు పిచ్చియెత్తి నది. ప్రజలును పిచ్చివారైరి. పిచ్చికి పిచ్చి ప్రతిక్రియ కాదు. పిచ్చికి విరుగుడు వివేకము. ఇది తెలుసుకొన్నయెడల విశ్వము మీకు స్వాధీనము కాగలదు" హృదయ మును కలచివేసే ఈ మాటలు నేటికిని చెవులలో గింగురుమని మ్రోగుతున్నవి. కాని ఆనా డాసభ్యులు ఆమాటల సంపూర్ణభావమును గ్రహించిరో లేదో చెప్పజాలము. ఈతీర్మానమే అమృతసరపుకాంగ్రెస్ యొక్క నిజమైనస్వరూపమును వెల్లడిస్తూన్నది. గాంధీ అప్పటి కింకను ప్రభుత్వమువారితో చీలిపోవడమున కిష్టముగాగాని, సంసిద్ధము గాగాని లేడు. అందువల్లనే ఢిల్లీకాంగ్రెసులో వదలివేయబడిన వేల్సుయువరాజు ఆహ్వానతీర్మానము తిరిగీ యీకాంగ్రెస్‌లో అంగీకరింపబడినది. సంస్కరణములకు ప్రజలు సహాయపడవలె నని గాంధీ తెచ్చిన సవరణకూడా రాజీనామాప్రకారము కొంత మార్పుచేయబడినప్పటికినీ అందువల్లనే అంగీకరింపబడినది. గాంధీయొక్క యీసత్యాహింసలకుతోడు (౧) స్వదేశీనిగూర్చి-అనగా "చేతితో వడుకుట, చేతితో

చేయుట మొదలగు పురాతనపరిశ్రమలను పునరుద్ధరించుట."—('చేతితో వడకుట' అనే మాటను చాలామంది అపార్థము చేసుకొనియుండరు. (౨) పాడి ఆవులను, ఆబోతులను విదేశముల కెగుమతిచేయకుండుటనుగూర్చి, (౩) రాష్ట్రములలోని ఆబ్కారీపరిపాలనమునుగూర్చి, (౪) మాడవతరగతి, ఇంటర్మీడియేటు తరగతుల రైల్వేప్రయాణికుల కష్టములను నివారించుటనుగూర్చి తీర్మానములు చేయబడినవి. తరువాత బక్రీదు పండుగ సందర్భమున మహమ్మదీయులు గోహత్యను మాన్పింప తీర్మానించుకొన్నందుకు వారికి కృతజ్ఞతాభివందనము లర్పింపబడినవి. టర్కీ, ఖిలాఫత్ సమస్యలలో కొంతమంది బ్రిటిషుమంత్రులు ప్రతికూలభావము చూపుతూన్నందుకు ప్రతిఘటనతీర్మానము చేయబడినది. చాలాసంవత్సరములకు, తిరిగీ, అమృతసరములోని కాంగ్రెస్ కైతులవైపుకు తనదృష్టిని మరల్చినది. కార్మికులుగూడ దానిదృక్పథము నుండి మరుగుపడలేదు. యూనానీ, ఆయుర్వేదవైద్యపద్ధతులకు ప్రభుత్వమువారు తోడ్పడవలె నని కోరబడినది. బ్రిటిషుకమిటీవారును, సీమలోని కార్మికపక్షమువారును, అందులో ముఖ్యముగా బెన్‌స్పూర్ న్నూ కాంగ్రెస్‌కు చేసినసేవల కభినందింపబడిరి. కార్మికపక్షముతో మొట్టమొదట మిత్రభావమును కల్గించుకొనివచ్చినవి లోకమాన్యుడు. ఆయన వారికి ౩,౦౦౦ ల పౌనులు చందా యిచ్చెను. ఇంగ్లండుమొదలగు విదేశములలో కాంగ్రెసుప్రచారమునిమిత్తము శాశ్వతసంస్థలు నెలకొల్పబడవలె నని పట్టుపట్టుటకు లోకమాన్యుడే చాలావరకు బాధ్యుడు. భారతదేశమునుగూర్చి అమెరికాలో లాలా లజపతిరాయి చేసిన ప్రచారమునకును, సీమలో కాంగ్రెస్‌రాయబారవర్గమువారు చేసిన సేవకును వారికి కృతజ్ఞతాభివందనము లర్పింపబడెను. ఇక విదేశములలోని భారతీయులనుగూర్చినవిషయము మరచిపోదగినది కాదు. ట్రాన్స్‌వాల్‌లో నివసిస్తూన్న భారతీయులకు పూర్వమునుండీ వారనుభవిస్తూన్న వాణిజ్యహక్కులునూ, ఆస్తులపైగల అధికారములునూ యింకనూ తగ్గింపబడుతూనేయున్నవి. తూర్పుఆఫ్రికాలో భారతీయుల ఆందోళనము తలయెత్తినది. ఆసందర్భమున వలసరాజ్యములలో భారతీయులకు చేసినసేవకునూ, పాంచాలరాష్ట్రమునం దొనర్చినసేవకునూ ఆండ్రూసుకు కృతజ్ఞతాభివందనము లర్పింపబడెను. హంటర్‌కమిటీని కాంగ్రెసువారు బహిష్కరించినకారణము మొదటిసారి అమృతసరములో బహిరంగముగా వ్యక్తీకరింపబడినది. ఖైదుశిక్ష లనుభవిస్తూన్న కొంతమందిపంజాబునాయకులు పోలీసువారిఅధీనములోనుండి ఖైదీలుగానే హంటరుకమిటీ యెదుటకు హాజరై విచారణగదిలో కూరుచుండి కాంగ్రెస్ ప్లీడరుకు విషయములను అవగాహనపరచేటందుకు లెఫ్టినెంట్‌గవర్నరు అంగీకరించలేదు. గవర్నమెంటుప్లీడరుకుమాత్రము కమిటీవారు విషయముల నెరుకపరుస్తూనే యుండిరి. అదేపద్ధతి పంజాబునాయకుల విషయములో తిరస్కరింపబడినది. కాబట్టి

అబహిష్కరణపద్ధతి తగిన, గౌరవప్రదమైన చర్యగా అమృతసరపుకాంగ్రెస్‌వారిచే ఆమోదింపబడినది. కాంగ్రెసుఉపసంఘమువారు విచారించి ప్రత్యేక నివేదికను తయారుచేయవలెనని కూడా తీర్మానింపబడినది. సర్ శంకర్ నాయర్ తనపదవికి రాజీనామాయిచ్చినందుకు అభినందింపబడెను. షెమ్స్‌ఫర్డ్ ప్రభువును తిరిగి సీమకు పిలిపించవలెననీ, డయ్యర్ సేనానిని సైన్యాధిపత్యమునుండి తొలగించవలెననీ, సర్ మైకేల్ ఒడయర్‌కు సేనాసమితి (Army Committee) సభ్యత్వము తీసివేయవలెననీ ఆకాంగ్రెస్‌లో తీర్మానముచేయబడినది. షెమ్స్‌ఫర్డుప్రభువును సీమకు పిలిపించే తీర్మానసందర్భములో ఒకకథ జరిగింది. అది యిక్కడ అప్రస్తుతముకాదు. కాంగ్రెసులో అటువంటి తీర్మానము ప్రతిపాదింపబడేయెడల శాస్త్రివంటి మితవాది శిఖామణు లెవరో ఒకరు దాని నెదిరించగల రని షెమ్స్‌ఫర్డుప్రభువు గంపెడాసతో నుండెను. కాని కాంగ్రెసు జరిగే రెండవరోజున శాస్త్రి, సి. పి. రామస్వామయ్యర్లిద్దరునూకూడా కలకత్తాలో జరుగుతూన్న మొదటి మితవాదిసభకు వెళ్లిరి. కాబట్టి షెమ్స్‌ఫర్డుతీర్మానము చర్చకు వచ్చినప్పుడు సభలో శాస్త్రి లేడు. వెంటనే వి. యస్. శర్మ ఆస్థానమున కురికెను. ఆయన మితవాదులకన్న ముందడుగు వేసేవాడగుటచే కలకత్తాకు పోలేదు. కాని జాతీయవాదులకన్న వెనుకడుగు వేసేవాడగుటచే వైస్రాయిని సీమకు తిరిగి పిలిపించవలెననే తీర్మానమును ఆమోదించలేకపోయెను. సభలోని ప్రతికూలవాతావరణమును లెక్కచేయక తీర్మానము నెదిరించి మాట్లాడెను. తనకు ధర్మమని తోచినదే ఆయన ఆపని చేసెను. అప్పటికి కొద్దికాలముక్రిందటనే భారతశాసనసభలో (Supreme Council) రెంపెవకాల్ట్ బిల్ ప్రవేశపెట్టబడినపుడు ఆయన తనసభ్యత్వమునకు రాజీనామా యిచ్చెను. కాని ఆ రాయంత్రమే వైస్రాయితో విందుకుడిచి తనరాజీనామా నుపసంహరించుకొనెను. తరువాత యిప్పుడమృతసరములో వైస్రాయికి సంబంధించినతీర్మానము నెదిరించెను. మొత్తముమీద ఆయన షెమ్స్‌ఫర్డ్‌ప్రభువుకు మహోపకారము చేసెను. తరువాత ౬ మాసములకే ౧౯౨౦ జూన్ నెలలో శర్మను తన కార్యనిర్వాహకసభలో సభ్యునిగా చేసి వైస్రాయి ఆయనను తగినరీతిని బహూకరించెను. * పంజాబుదురంతములసందర్భమున కొన్ని స్థలములలోని ప్రజలకును, ఆస్తులకును జరిగిన నష్టములకు కొందరిపై విధింపబడిన అపరాధపు

---

* షెమ్స్‌ఫర్డుప్రభువు ఆ ఖాళీలో మొట్టమొదట బరద్వాన్ మహారాజును సిఫార్సుచేసెను. కాని మాంటేగ్ శాసనసభానుభవము కలిగినమనిషి కావలె ననిశాస్త్రిని పేర్కొనెను.

పన్నులను రద్దుచేయించవలెననీ, సైనికశాసనముక్రింద కళాశాలవిద్యార్థులకునూ, పాఠశాలలలోని బాలురకునూ విధింపబడిన శిక్షలు తొలగింపబడవలె ననీ అమృతసరము కాంగ్రెసులో కోరబడెను. రాత్రి పదిగంటలవేళ అవయోవృద్ధుడు సి. విజయరాఘవాచారి తెచ్చిన పౌరుల ప్రధానహక్కులనుగూర్చిన తీర్మానమువలన సంస్కరణ తీర్మానమునకు మరింతబలము చేకూర్చబడినది. తరువాత ముద్రణాశాసనము, రౌలట్‌చట్టములు రద్దుచేయబడవలె ననీ, రాజప్రకటనము జరిగినపిమ్మటగూడ జైలులో నుంచబడిన ఖైదీ లందరును విడుదలచేయబడవలె ననీ కాంగ్రెస్ సిద్ధాంతీకరించినది.

హార్నిమన్ ప్రవాసమునకు పంపబడినందుకు ప్రతిఘటిస్తూ ఆ ఉత్తరువును రద్దుచేయవలె నని కాంగ్రెసు కోరినది. రాజ్యాంగసంస్కరణములు బర్మాకుకూడ వర్తింపచేయబడవలెననీ, ఢిల్లీ అజ్మీరు మేర్‌వార్లు సంపూర్ణరాష్ట్రముగా చేయబడవలెననీ కూడా ఆకాంగ్రెస్ తీర్మానించినది. పిమ్మట కాంగ్రెసుమామూలువ్యవహారములకు సంబంధించిన కొన్ని తీర్మానములు చేయబడినవి. అంతటితో సభ ముగిసినది. కాంగ్రెస్‌జరిగిన వారంరోజులూ, రాత్రింబవళ్లు విశ్రాంతియెరుగని అధ్యక్షుడు పండిత మోతీలాల్‌నెహ్రూకు చాలా శ్రమ కలిగినది. ఆయనగొంతుకకూడా బొంగురుపోయినది. విషయనిర్ధారణసభలు రాత్రి ప్రారంభించి ఉదయమువరకూ జరుగుతూనే ఉండినవి. పంజాబురాష్ట్రములోని ఆ సహింపరానిచలికి ప్రతినిధుల కష్టము లినుమడించినవి.

ఇక్కడ మన కుత్సాహకరములుగా నుండే రెండుసంఘటనములనుగూర్చి చెప్పవలసియున్నది. కాంగ్రెస్ జరుగుట కొకరోజు ముందుగా రాజకీయఖైదీలవిడుదలనుగూర్చి ఊహించుటకువీలులేనంత తియ్యనిమాటలలో రాజుగారిప్రకటనము వెలువడినది. దానితోపాటుగానే ప్రజల ఉత్సాహతరంగములలో ఈదులాడుకొంటూ ఆలీసోదరులు నగరమునకు వచ్చిరి. వారికి పెద్ద ఉత్సవము జరుపబడెను. మహమ్మదాలీ కాంగ్రెసువేదికపై కెక్కి 'తాను చింద్వారాజైలునుండి తిరుగుటిక్కెట్టుతో వస్తి' నని ప్రకటించెను. అప్పటినుండి యీ'తిరుగుటిక్కెట్టు'పదము దేశములో ప్రచారములోకి వచ్చినది. ఇక రెండవసంఘటనము రెజినాల్డునెవిలీకి సంబంధించినది. ఈయన లండన్ సొలిసిటర్. కొంతకాలమునుండి ఇండియాలోనే ఉంటూవచ్చెను. కాంగ్రెసురోజులలో అమృతసరములోనే మకాముపెట్టెను. ౧౯౧౯ డిశంబరు ౨౫ తేదీని అర్ధరాత్రివేళ ఇరవై మందిసిపాయీలు ఆయనపరుండిఉన్న హోటల్‌గదితలుపు పగులగొట్టి లోపల ప్రవేశించిరి. ఆ సైనికు లందరును జలందర్‌పటాలములోనివారు. నెవిలీని వా రవమానపరచిరి. "తెల్లవాడనైయుండి దయ్యరుకు వ్యతిరేకముగా ఏమొగముపెట్టుకొని పని

చేయవచ్చినారు?" అని వా రాయనను అడిగెను. అందులో ఒకడు "మేము నల్లవాళ్ల గుంపుల నెన్నిటినో కాల్చివేసితిమి." అని చెప్పెను. డయ్యర్ ఆజ్ఞ ననుసరించి యిటు వంటిపనులు చేసినవారిలో తా నొకడనికూడ వాడు గర్వముతో ప్రకటించుకొనెను. తరువాత ప్రభుత్వమువా రాసిపాయీలచేత నెవిలీకి క్షమాపణ చెప్పించినట్లు మాకు తెలియవచ్చినది.

# 1. అసహాయోద్యమ జననము

## ౧౯౨౦

[ఖిలాఫత్ అన్యాయము-గాంధీ ప్రకటనము, తిలకు అభిప్రాయములు- అసహాయోద్యమము, తిలకు; గాంధీభావము - గాంధీవిజయపరంపరలు- ఇండెంచర్డు కూలీపద్ధతి రద్దుచేయబడుట-హంటరునివేదిక-అ. భా. కాం. సం. సమావేశము- నాయకులు, నాన్‌కోఆపరేషన్- తిలకు మరణము-మహమ్మదీయుల హిజ్రత్- అసహాయోద్యమ ప్రారంభము-రాష్ట్రీయ కాంగ్రెసు సంఘములు, అసహాయోద్యమము - కలకత్తా ప్రత్యేకకాంగ్రెసు - అసహాయోద్యమ తీర్మానము - ప్రభుత్వ ప్రతికూలభావము - కపర్దే అసహాయోద్యమ ప్రతిఘటనము, అసహాయోద్యమమునకు వంగరాష్ట్ర నిరోధము - దాసు మతము మార్చుకొనుట - నాగపురములో గాంధీబల మెక్కువగుట-కల్నల్ వెడ్జివుడ్ మండలింపు - కల్నల్ వెడ్జివుడ్డుకు కాంగ్రెసువాదుల ప్రత్యుత్తరములు - తదితరతీర్మానములు- కాంగ్రెసు నిర్మాణవిధానములో మార్పు]

౧౯౨౦ ప్రారంభమునాటికే భారతరాజకీయములలో విస్పష్టములయిన కక్షలేర్పడినవి. మితవాదులు ప్రత్యక్షముగా కాంగ్రెసునుండి చీలిపోయి ౧౯౧౯ డిసెంబరులో ప్రత్యేకముగా కలకత్తాలో సమావేశమయిరి. కాంగ్రెసులో అతివేగముగా పరిణామము పొందుతూన్న పరిస్థితులు మిగిలిఉన్న కాంగ్రెసువాదులలో కూడ చీలికలు కలిగించేటట్లు కనపడినవి. అమృతసరములో చర్చించబడిన ముఖ్యవిషయము రాజ్యాంగచట్టమున కనుకూలముగా పనిచేయడమా, లేక అటంకపరచడమా అనియే. నూతనసంవత్సరము ప్రారంభమైన కొన్ని నెలలకే అమృతసరపు పక్షములు తారుమారైనవి. గాంధీ నాన్‌కోఆపరేషన్ కనుకూలముగా నిలబడెను. అమృతసరములో గాంధీ కోఆపరేషన్ అంటే ఎదిరించినవారందరు నేడు తిరిగీ ఆయన నాన్‌కోఆపరేషన్ అంటే ఎదిరింప ప్రారంభించిరి. అకస్మికముగా కలిగిన ఈమార్పుకేమికారణము? పంజాబుదురంతములనుగూర్చి, ఖిలాఫత్ అన్యాయమునుగూర్చి ప్రజలహృదయము లంతకంత కాందోళితములు కాదొడగినవి.

శాశ్వతముగా ఒక్కసారి పరిష్కరింపబడవలె నని తీవ్రముగా వ్రాసేవ్రాతల నుబట్టికూడ మహమ్మదీయుల అనుమానము లంతకంతకు బలమయినవి. అమె రికా, ఇంగ్లండు దేశములలో పలుకుబడిగలవారు కాన్స్టాంటినోపిల్ నుండి తుర కలు వెళ్లగొట్టబడవలె ననీ, టర్కీ నాల్గవతరగతిప్రభుత్వముగా చేయబడవలె ననీ ప్రచారము చేయసాగిరి. ౧౯౨౦ ఫిబ్రవరి, మార్చి నెలలలో భారతరాజకీయములందు ఖిలాఫత్ సమస్య ప్రధానస్థాన మాక్రమించినది. ౧౯౨౦ మార్చి ప్రారంభములో మహమ్మదాలీనాయకత్వమున కొంతమంది మహమ్మదీయరాయబారులు సీమకు వెళ్లిరి. భారతరాజ్యాంగకార్యదర్శిపక్షమున ఫిషర్ ఆరాయబారులతో ప్రసంగిం చెను. తరువాత వారు ప్రధానమంత్రినికూడ దర్శించిరి. వారు శాంతిసభాప్రధానకార్య వర్గము (Supreme Council of the Peace Conference) నకు కూడా తమ అభి ప్రాయములను మనవిచేసుకొననీయవలె నని కోరిరి. కాని వారి కనుజ్ఞ ఈయబడలేదు.

౧౭ వ మార్చిని లాయడ్ జార్జి ఇంగ్లండులో మహమ్మదీయరాయబారులతో ప్రసంగించెను. ఆయన "క్రైస్తవదేశముల కనువర్తింపచేయబడిన సిద్ధాంతములకు భిన్న ముగాన టర్కీని పరామర్శింప వీలులేదు టర్కీకి చెందిన భూములపైన టర్కీప్రభు త్వము ఐహికాధికారము కలిగియుండును. టర్కీకి చెందనిభూములు టర్కీరాజ్యాధి కారములో నుండుటకు వీలులేదు" అని స్పష్టముగా రాయబారులకు ప్రత్యుత్తర మిచ్చెను. దానితో భారతదేశప్రజలకు ఖిలాఫత్ మతవిశ్వాసమునకే భంగము చేయబడి నట్లు తోచినది. దానిపైన, భారతజాతీయవిచారమును ప్రకటించుటకు మార్చి ౧౯ వ తేదీ నిర్ణయింపబడినది. ఆనాడు ఉపవాసములును, ప్రార్థనలును, హరతాళములును జరిగినవి. గాంధీ మరల రంగమున కురికెను. టర్కీనిగూర్చిన సంధిషరతులు భారత దేశములోని మహమ్మదీయుల మనోభావములకు సంతృప్తికరముగా నుండనియెడల తాను వారితో అపరేషన్ ఉద్యమమును నడిపింతు నని గాంధీ ప్రకటించెను. సంధి షరతులు మహమ్మదీయుల కంగీకారముగా నుండనియెడల వారు రాజభక్తిపరులుగా నుండ వీలులేదని షౌకతాలీ ౧౯ వ తేదీ శోకతీర్మానమును ప్రతిపాదింప నిశ్చయించు కొనెను. ఇందుమూలమున ప్రభుత్వోద్యోగు లెవరును ౧౯ వ తేదీ సమావేశములో పాల్గొన వీలులేదని భారతప్రభుత్వమువా రుత్తరువులు జారీచేసిరి. గాంధీ మార్చి ౧౦వ తేదీని చేసిన ప్రకటనములో అసహాయోద్యమమునుగూర్చిన ఆయనకార్యక్రమ మం తయు మొదటిసారి వివరింపబడినది. అది ఈక్రిందివిధముగా నున్నది:

"మన కోరికలను వా రంగీకరించనియెడల మనము చేయవలసినపనినిగూర్చి ఒక్కమాట చెప్పవలసియున్నది. బహిరంగయుద్ధముగానీ, రహస్యయుద్ధముగానీ అది

పశుకృత్యము. అది ఆచరణయోగ్యము కాదని తెలుసుకొనగలిగినయెడలను, యుద్ధము చాలా చెడ్డపని అని నేనందరినీ ఒప్పించగలిగినయెడలను మనము న్యాయముగా పొందదగిన ఫలితములను ఇంకను తొందరగా పొందగలము. ఒక జాతిగానీ, ఒక వ్యక్తిగానీ దౌర్జన్యమును పూర్తిగా త్యజించగలిగినయెడల ఆ జాతికిగానీ, ఆ వ్యక్తికిగానీ కలిగే శక్తి అప్రతిహతము. నేను దౌర్జన్యమునకు వ్యతిరేకముగా నేను చెప్పబోయే దానికి, కేవలము అది నిరర్థకమనే విశ్వాసముపైన ఆధారపడి ఉన్నది. కాబట్టి యిక మనకు మిగిలియున్న ఉపాయము అసహాయోద్యమ మొక్కటే. అది సంపూర్ణముగా దౌర్జన్యరహితముగా నుండేయెడల దానికంటె తిన్ననైన ఉపాయము, బలవత్తరమైన ఉపాయము మరొకటి ఉండబోదు. ఒకని మతవిశ్వాసమునకు అవమానముకానీ, అపాయముకానీ, చిన్నతనముకానీ కలిగినప్పుడు అందుకు ప్రతిక్రియగా నాన్‌కో ఆపరేషన్ అవలంబించుట ఆయనకు పరమధర్మమగును. మహమ్మదీయులకు ప్రాణసమానమైన హక్కు లన్యాయముగా అపహరింపబడినప్పుడుకూడా మన మందరమును బ్రిటిషు ప్రభుత్వమువారికి లొంగియుండగలమని వారు తలంచకూడదు. కాబట్టి మనము పైనుండి క్రిందవరకును ఒక్కసారే అసహాయోద్యమ సిద్ధాంతము నవలంబింపవలెను. గౌరవాధికారులును, పెద్ద పెద్ద జీతములను పొందే ఉద్యోగస్థులును వారి పదవులను వెంటనే విడిచిపెట్టవలయును. ప్రభుత్వమువారిక్రింద నీచసేవకులుగా నున్నవారు కూడ వారి సేవకవృత్తిని వదలివేయవలయును. ప్రత్యేకవ్యక్తులదగ్గర నౌకరీ చేసుకొనేవారికి ఈ నాన్‌కో ఆపరేషన్ వర్తించదు. నాన్‌కో ఆపరేషన్ ప్రతిక్రియను చేపట్టినవారికి వ్యతిరేకముగా సంఘబహిష్కారపద్ధతిని ప్రయోగించుటకు నే నిష్టపడను. నాన్‌కో ఆపరేషన్ స్వచ్ఛందముగా ఎవరి బలవంతమును లేక ఆచరింపబడవలెను. సైనికులను సేనలోనుండి మానుకొనవలసిన దని చెప్పుటకిది తరుణము కాదు. అది మొదటి మెట్టు కాదు; చిట్టచివరిమెట్టు. వైస్రాయి, హిందూదేశరాజ్యాంగకార్యదర్శి, బ్రిటిష్‌ప్రధానమంత్రులు మన మాటలను పూర్తిగా పెడచెవిని పెట్టినప్పు డవలంబించవలసిన చర్య అది. మన మసహాయోద్యమమును నవలంబించే ప్రతిచర్య మిక్కిలి జాగ్రత్తగా ఆలోచించి మాత్రమే అవలంబించవలెను. ఎట్టి ఆగ్రహకారణములు గలిగినప్పటికినీ మన మాత్మనిగ్రహమును కలిగియుండేటంత జాగ్రత్తగాను, నెమ్మదిగాను నడువవలయును"

దీనినిగూర్చి ప్రభుత్వమువారిచే "ఇండియా, ౧౯-౨౦"లో వ్రాయబడినవిషయము లీక్రింద నుదాహరింపబడినవి:

"గాంధీ ఆత్మబలమునుగూర్చి చెప్పేమాటలు, ఆయనవలె మతవిశ్వాసముకలవారికినీ, ఆత్మనిగ్రహ స్వార్థత్యాగములందు విశ్వాసముకలవారికినీ బాగా వచ్చినవి. జాతీయ

గౌరవమునకు భంగము కలిగినదని దుఃఖాక్రాంతులైన భారతీయులముందు ఆయన కైలాసశిఖరమువలె నిలబడెను. ఆయన ఆదేశములు దైవాజ్ఞలవలె ఆచరింపబడుతూ ఉండెను." లోకమాన్యతిలక్ మొట్టమొదట గాంధీఅభిప్రాయముతో ఏకీభవించలేదు. ఆయనతీక్ష్ణబుద్ధిగానీ, ప్రపంచమును జయింపగలిగిన దృఢవిశ్వాసముగానీ గాంధీ వేదాంతతత్వమునకును, పారలౌకికేచ్ఛకును సరిపడలేదు. ఇట్టి అశాంతవాతావరణము నందు పంజాబు ఘోరంతములనుగూర్చిన అనధికారుల నివేదిక మార్చి ౨౫ వ తేదీని ప్రకటింపబడినది. కాంగ్రెసుసబ్ కమిటీవారి సాక్ష్యమును హంటర్ కమిటీవారు విచారింపజాలనందున అధికారేతరులొక ప్రత్యేకనివేదికను ప్రకటింపనవసరము కలిగినది. అందుమూలమున ప్రజాబాహుళ్యమునకు హంటర్‌కమిటీవారిపైనను, వారు ప్రచురింపబోయే నివేదికపైనను కూడా అయిష్టత యేర్పడినది. సర్ మైకేల్ ఒడయర్ కాంగ్రెస్ నివేదికనుగూర్చి నిప్పులు కక్కుతూఉండెను. ఆయనకు విద్యావంతులపైన గల ద్వేషభావమును, ఆయన సైనికులను సమకూర్చుటలోనూ, యుద్ధనిధులను వసూలు చేయుటలోనూ అవలంబించిన నిరంకుశపద్ధతులును ఆయనపైన ప్రజలుచేసే నిందాఘోషణములకు కారణములైనవి. ౧౯౧౯ లో జరిగిన చరిత్రాంశములు ఏప్రిల్ ౬ వ తేదీని ప్రారంభమై ౧౩ వ తేదీ జలియన్‌వాలాబాగ్ దురాగతములతో పరమావధిని పొందినవని జ్ఞాపకముంచుకొనవలసియున్నది. ౧౯౨౦ సం.నుండీ ఆవారము జాతీయవారముగా పరిగణింపబడినది. నాటినుండి నేటివరకును ఏప్రిల్ ౬ నుండి ౧౩ వరకును జాతీయవారముగా భావింపబడుతూనేయున్నది. మేనెలలో టర్కీసంధిషరతులు ప్రకటింపబడినవి. కాని అవి ఖిలాఫత్ ఆందోళనము నభివృద్ధిచేయుటకే తోడ్పడినవి. వెంటనే ఆషరతులను మార్పించుటకు గాంధీ కంకణము కట్టుకొని, నాన్‌కోఆపరేషన్ ఉద్యమమునకు ప్రారంభింప నిర్ణయించుకొన్నట్లుగా ఆయన ప్రకటించెను. లోకమాన్యుడీ ఉద్యమమునకు హృదయపూర్వకసానుభూతిని చూపలేదు. కాని దానిని మాత్ర మెదిరించలేదు.

ఈ యిద్దరు మహానాయకుల రాజకీయపద్ధతులను మన మొకదానితో నొకటి పోల్చుకొని చూచుకొనవలసియున్నది. ఏప్రిల్ ౩ వ వారములో వీ రిరువురును తమ తమ పద్ధతులనుగూర్చి అమూల్యములైన ప్రకటనములను చేసియుండిరి. ఆసమయములోనే బెసెంటు అఖిలభారత హోమ్‌రూల్ సభాధిపత్యమును విడిచిపెట్టెను. గాంధీ ఆ అధ్యక్షపదవిని స్వీకరించి, ఒక ప్రకటనమును చేసెను. క్రొత్త సంస్కరణములను గూర్చి తా నవలంబింపబోయే పద్ధతిని వ్యక్తీకరిస్తూ లోకమాన్యతిలక్ మరియొక ప్రకటనమును చేసెను.

## మహాత్మాగాంధీ-అఖిలభారత హోమ్‌రూల్ సభాధ్యక్షుడు

"కేవలమూ ఒక్క రాజకీయములకుమాత్రమే సంబంధించిన సంస్థతో జోక్యము కల్గిఉండుట నా మామూలుజీవితపద్ధతికి విరుద్ధము. కాని నేను నాస్నేహితులతో జాగ్రత్తగా విచారించి అఖిలభారత హోమ్‌రూల్‌సభలో సభ్యుడనై దాని అధ్యక్షపద వినిగూడ అంగీకరించితిని. నే నాలోచించిన కొందరు స్నేహితులు నే నేరాజకీయసంస్థ లోనూ జోక్యము కలిగించుకొనుట మంచిదికా దని సలహాయిచ్చిరి. అందువలన నే నిం తవరకునూ అనుభవిస్తూన్న నా ప్రత్యేకవ్యక్తిస్వాతంత్ర్యమును పోగొట్టుకొందు నని వారి అభిప్రాయము. స్నేహితులు చేసిన ఈ మందలింపునుగూర్చి నేను పునర్విచా రణ చేసితిని. హోమ్‌రూలుసభవారు నా కిచ్చినస్థానమునుబట్టి నే నాసంస్థయొక్క అభి వృద్ధికి నా అనుభవమువలన గ్రహించిన ప్రత్యేకపద్ధతులద్వారా తోడ్పడగల నని నా విశ్వాసము. ఈ నా పద్ధతులమూలమున తదితరపద్ధతులమూలమునకంటె ఎక్కువ తొందరలో ఉత్తమఫలితములు కలుగగల వని నా అభిప్రాయము. ఆకారణమున నేను హోమ్‌రూల్‌సభలో చేరకపోవుట తప్పుగా భావించితిని. అయినప్పటికిని నే నాసభలో చేరేముందు బొంబాయిరాజధానికి వెలుపలనున్న ప్రజల అభిప్రాయములను తెలిసి కొనుటకు ప్రయత్నించితిని. బొంబాయిరాజధానిలోని ప్రజలతోవలె తదితర రాజ ధానుల ప్రజలతో నా కంత సన్నిహితసంబంధము లేదు. నేను వారితో స్వదేశీ, హిందూమహమ్మదీయసంఘీభావము, భాషాప్రయుక్తరాష్ట్రవిభజనము, హిందూ స్థానీని జాతీయభాషగా అంగీకరించుట, ఖిలాఫత్ ఉద్యమము మొదలగు విషయము లనుగూర్చి సంప్రతించియుంటిని. హోమ్‌రూల్‌సభలోని సభ్యులను నాతో యేకీ భవించేటట్టుగా నేను చేయగలిగేయెడల యీ పైన చెప్పబడిన కార్యక్రమమును ఆసభ ద్వారా నేను సాగింతును. భారతజాతియొక్క కాలములో చాలాభాగ మందుకే విని యోగింపచేయ ప్రయత్నింతును.

## హోమ్‌రూల్‌సభ ఒక పక్షమునకు సంబంధించిన సంస్థ గాదు

"జాతీయ పునర్నిర్మాణ ప్రయత్నమునందు రాజ్యాంగసంస్కరణములు రెండవ స్థానము నాక్రమించునేగాని ప్రధానస్థాన మాక్రమించ వని నా అభిప్రాయము. ఎందు వల్ల ననగా, ఇప్పుడు నేను సూచించిన కార్యక్రమమును కొనసాగించుటకు భారతజాతి యావచ్ఛక్తినీ వినియోగించేయెడల అదే తీవ్రవాదులుకోరే అన్ని సంస్కరణములను తీసికొని రాగలవని నా అభిప్రాయము. ఆ కార్యప్రణాళికలోని అంశములను వ్యాప్తి చేయుటమూలముననే సంపూర్ణస్వపరిపాలనము చేయవకాగలదు. అఖిలభారత హోమ్‌రూల్‌సభను ఏ సందర్భములోనూ ఒక ప్రత్యేకకక్షకు సంబంధించిన సంస్థగా

నేను భావింపను. నామట్టుకు నేను ఏపక్షమునకును సంబంధించను. ఇకముందుకూడ ఏదో ఒక పక్షమునకు చేరవలయునని నేను కోరను. హోమ్‌రూల్‌లీగ్ నిర్మాణవిధానము లీగ్‌ను కాంగ్రెస్‌కు సహాయపడవలెనని కోరుతూన్నదనికూడా నే నెరుగుదును. కాని నేను కాంగ్రెస్ ఒకపార్టీసంస్థ అని అనుకోను. చిట్టచివరకు బ్రిటిష్ పార్లమెంటు కూడా నా ఉద్దేశములో పార్టీసంస్థగాదు. భారతదేశములోని అన్ని రాజకీయకక్షుల వారును కాంగ్రెస్‌ను జాతీయసంస్థగా భావించి కాంగ్రెస్ వేదికద్వారా జాతీయకార్యక్రమమును నిర్ణయించవలెనని నా కోరిక. కాంగ్రెస్‌పార్టీకక్షులకు చెందక తన జాతీయ స్వరూపమును నిలుపుకొనుటకు వీలుగా నేను హోమ్‌రూల్‌లీగ్ కార్యవిధానమును నిర్ణయింతును.

*పద్ధతులు:—ఇందువలన నాపద్ధతులను నే నవలంబించుటకు వీలు కల్గును. భారత రాజకీయ జీవితమునందు నిష్కళంకమైన సత్యమును, నిర్దుష్టమైన ధర్మమును అవలంబించుట ప్రతివానికినీ సాధ్యమనియే నా విశ్వాసము. నా శాసనోల్లంఘనపద్ధతులను లీగ్ అనుసరించవలెనని నేను కోరను కాని, జాతీయవ్యవహారము లన్నిటియందునూ సత్యాహింసల నవలంబింపచేయుటకు నా యావచ్ఛక్తినీ వినియోగింతును. అప్పుడు గవర్నమెంటువారినీ, వారిపద్ధతులనూ చూచి భయపడవలసిన అవసరము కాని, అనుమానించవలసిన అవసరముకాని మన కుండదు. ఈ విషయమునుగూర్చి యింకనూ విస్తరించి వ్రాయుట నా కిష్టము లేదు. నే నిక్కడ నిష్కపటముగా చేసిన నాప్రకటనమును బట్టి ఉదయించే సమస్యలను కాలమే పరిష్కరించును గాక! నా చర్యను సమర్థించుకొనవలెనని కాని, నా కార్యవిధానములోని సత్యమును ప్రదర్శింపవలెననికాని నే నీ ప్రకటనము చేయలేదు. నా కార్యక్రమమునుగూర్చి లీగ్ సభ్యుల సూచనలను, విమర్శనములను తెలిసికొనవలెననిమాత్రమే నే నీప్రకటనమును చేసితిని."

## లోకమాన్యుని కార్యక్రమము

"ఈ పక్షమునకు కాంగ్రెస్‌ప్రజాపరిపాలనపక్ష మని పేరు. ఈ పేరును బట్టియే ఈ పక్షము కాంగ్రెసుసంస్థయందు భక్తి, ప్రజాపాలనమునందు విశ్వాసమూ కలిగిఉంటుందనేమాట స్పష్టము. భారత సమస్యలను పరిష్కరింపదగిన ప్రజాపాలన సిద్ధాంతములలో ఈ పక్షమునకు విశ్వాసము కలదు. రాజకీయ విద్యావ్యాప్తివలననూ, వోటింగు హక్కువలననూ యీపక్షము తన ఆదర్శములను పొందకోరుతూన్నది. కులమువలన గాని, ఆచారమువలనగాని కొందరికి కల్గుతూన్న సాంఘికములైన అన్యాయములను ఈ పక్షము నిర్మూలింప ప్రయత్నించును. మతసహన ముండవలెననీ, ఏమతమువారి మతమును పవిత్రముగా భావించుట తప్పుకాదనీ యీపక్షము

విశ్వసిస్తున్నది. పౌరుల మతస్వాతంత్ర్యములకు భంగము కలుగకుండునట్లు మత సంబంధములయిన తగాదాలలో జోక్యము కల్పించుకొనేహక్కు ప్రభుత్వమువారికి ఉన్నదని యీ పక్షమువారి అభిప్రాయము. ఖిలాఫత్ సమస్యాపరిష్కారము కొరకు మహమ్మదీయులు కోరేహక్కులు వారి మతసిద్ధాంతములకునూ, విశ్వాసముల కునూ ఖురాన్ ధర్మసూత్రములకునూ అనుగుణముగానే ఉన్నవని యీ పక్షమువారు వారికోర్కెలను బలపరుస్తున్నారు.

విశ్వమానవ సౌభ్రాత్రముకొరకును, మానవజాతియొక్క పురోభివృద్ధికొర కును బ్రిటిషుసామ్రాజ్యకూటములో 'ఇండియా ఫెడరేషను' భాగస్వామిగా నుండు టవసరమని ఈ పక్షము విశ్వసిస్తున్నది. భారతదేశమునకు సంపూర్ణ స్వాతంత్ర్యమును, బ్రిటిషుసామ్రాజ్యములోని అన్నిరాజ్యములతోపాటు గ్రేటుబ్రిటన్ తోసహా సమాన ప్రతిపత్తి కావలెనని యీ పక్షము కోరుతూన్నది. బ్రిటిషుసామ్రాజ్యములోని అన్ని దేశములలోను భారతీయులకు సమానపౌరస్వత్వము లుండవలెనని ఈపక్షమువారి పట్టుదల. అవి తిరస్కరింపబడినయెడల గట్టి ప్రతిక్రియ చేయవలె ననికూడా వీరితలంపు. ప్రపంచశాంతికొరకును, దేశముల పరస్పరస్నేహముకొర కును, దేశములయొక్కయు, జాతులయొక్కయు గౌరవస్వాతంత్ర్యముల రక్షణకొర కును, ఒకదేశము మరియొకదేశమును దోచుకొనే పద్ధతిని నిరోధించుటకొరకును జాతి సమితి (League of Nations) అవసరమని ఈ పక్షమువారి అభిప్రాయము. భారతదేశము బాధ్యతాయుత ప్రాతినిధ్య ప్రభుత్వమునకు తగియున్నదని యీపక్ష మువారు నొక్కి వక్కాణిస్తున్నారు. భారతప్రజలకు స్వయంనిర్ణయసిద్ధాంతము పైన ప్రభుత్వపద్ధతిని నిర్ణయించుకొనే అధికారమున్నదనికూడ ఈపక్షమువారి అభి ప్రాయము. భారతీయులే భారతదేశమునకు తగిన రాజ్యాంగవిధానము నిర్ణయింప నర్హులని యీ పక్షమువారి విశ్వాసము. మాంటేగు సంస్కరణచట్టము అసంతృప్తి కరముగాను, ఆశాభంగకరముగాను, అసమగ్రముగాను ఉన్నదని యీ పక్షమువారి అభిప్రాయము. బ్రిటిషు పార్లమెంటులోనున్న కార్మికపక్షమువారియొక్కయూ, తదితర భారతమిత్రులయొక్కయు సహాయమువలన మాంటేగు ప్రణాళికలోని లోపములను సవరింపచేసి భారతదేశములో సంపూర్ణబాధ్యతాయుత ప్రభుత్వమును నెలకొల్పుటకు క్రొత్తరాజ్యాంగచట్టమును సాధ్యమైనంత తొందరలో నిర్మింపవేయవలె నని యీ పక్షమువారి అభిప్రాయము. భారతస్వపరిపాలనములో సంపూర్ణ సైనికాధికా రమును, సంపూర్ణమైన ఆర్థికస్వాతంత్ర్యమును, పౌరుల సంపూర్ణహక్కులను నిర్వచింప బడవలెనని యీ పక్షమువారి కోరిక. వారి ఆదర్శమును పొందుటకు భారతదేశ మునందును, జాతిసమితి (League of Nations) లో ప్రాతినిధ్యము వహించిన

తదితర దేశములందును తీవ్రమైన ప్రచారము చేయవలెనని యీపక్షమువారి తలంపు. ఈసందర్భమున "ప్రబోధము, ఆందోళనము, నిర్మాణము" ఈమూడును ఈపక్షము వారి ప్రధానసూత్రములు. మాంటేగు సంస్కరణచట్టమును వీలయినంతవరకుపయోగించుకొనవలెనని యీపక్షమువారు నూచిస్తున్నారు సంపూర్ణ స్వాతంత్ర్యయుత ప్రభుత్వసంపాదనముకొరకు శాసన సభలలో ప్రభుత్వమువారితో సహకార మొనర్చుటకుగాని, లేక వారి కార్యక్రమమును నిరోధించుటకుగాని వీలుమబట్టి యీపక్షము వారు పనిచేయ ప్రయత్నింతురు. ఈపైని చెప్పబడిన సిద్ధాంతములకొరకును, ఆద ర్శములకొరకును మాత్రమేగాక, యీపక్షమువారీ దిగువ చెప్పబోవు కార్యక్రమమును కూడ అవలంబించగలరు. కాని యీకార్యక్రమము సమగ్రముగా నున్నదని మాత్ర మెవరును భావించగూడదు.

## భారతసమస్యలు

౧. రౌలట్ చట్టము, ముద్రణాశాసనము, ఆయుధచట్టము మున్నగు అన్ని నిర్బంధ శాసనములను రద్దుచేయించుట, జ్యూరీవిచారణమును ప్రవేశపెట్టించుట, ప్రభుత్వము నకు ప్రతికూలములైన నేరముల సందర్భములో ముఖ్యముగా దేశీయులనే జూరీలుగా నియమించుట, రాజకీయ నేరములకు కఠినశిక్షను రద్దు చేయుట. ఇంగ్లండులోని ఖైదీలకువలెనే అన్నితరగతుల ఖైదీలకును సమానప్రతిపత్తిలో చూచుటకు తగినట్లుగా జైలునిబంధనలను సంస్కరించుట.

౨. పారిశ్రామిక వ్యవసాయ కార్మికులకు వారికష్టమునకు తగిన ప్రతిఫలము ముట్టచెప్పుట, వారి కనీసపు కూలీని నిర్ణయించుట, పెట్టుబడిదారులు - కార్మికుల సం బంధబాంధవ్యములను న్యాయపద్ధతిని నిర్ణయించుట, యీ కార్యము లన్నిటికిని తగిన సంస్థలను నిర్మించుట.

3. ఆహారపదార్థములయొక్కయు, తదితర జీవితావసరములయొక్కయు ఖరీదులను తగ్గించేనిమిత్తమున్ను, దేశీయుల కవి సరిపోవునట్లుగా సప్లయి (Supply) చేయబడేటందుకున్ను ఎగుమతిపన్నుల మూలముననుు, లేక తదితర పద్ధతులవలనను వాటి ఎగుమతిని నిరోధించుట.

౪. స్వదేశీపరిశ్రమలను ప్రభుత్వ ధనసహాయముమూలముననుు, రక్షణపన్నుల వలనను అభివృద్ధిపరచుట

౫. రైల్వేలను ప్రభుత్వాధీనముచేయుట, రైల్వేరేట్లను శాసనరూపకముగా నిబంధించుట (అందువలన భారత పరిశ్రమాభివృద్ధికి సహాయకారి కాగలదు. విదేశీ పరిశ్రమలయెడ యిదివరకు చూపబడుచున్న పక్షపాతము నిర్మూలింపబడగలదు).

౬. అన్ని డిపార్టుమెంటులలోను ఖర్చులను తగ్గించుట, ముఖ్యముగా సైనిక శాఖలోని ఖర్చులను తగ్గించుట. పన్నులు వ్యక్తులయొక్కగాని, సంస్థలయొక్కగాని శక్తిసామర్థ్యములనుబట్టియే విధింపబడును. అనగా పన్నులను చెల్లించేవారి సంపాదననుబట్టి వారిపన్నులు దామాషాగా ఉండును.

౭. భారతీయోద్యోగులుకల పౌరసైన్యమును నిర్మించుట. సైనిక, నావిక, వాయువిమాన శాఖములలో పనిచేయుటకు తగిన విద్యావిధానమును భారతీయులలో వ్యాప్తిచేయుట, సైనికోన్నతోద్యోగములలో జాతిభేదములను గమనింపకుండుట.

౮. అన్ని ఉద్యోగములకును భారతదేశములో ఏర్పాటుచేయబడిన బహిరంగమైన పోటీపరీక్షమూలమున అభ్యర్థులను చేర్చుకొనుట.

౯. భారతదేశమంతటికీ ఒకటేభాషను నిర్ణయించి జాతీయసంఘీభావము నభివృద్ధిపరచుట, వివిధమతస్థులకును స్నేహభావము కుదుర్చుట, ముఖ్యముగా హిందూమహమ్మదీయులకు సమాఖ్య కుదుర్చుట.

౧౦. భాషలనుబట్టి రాష్ట్రములను నిర్మించుట.

## రాష్ట్రీయసమస్యలు

౧. రాష్ట్రములలో తక్షణము సంపూర్ణ ప్రజాస్వాతంత్ర్యమును ప్రవేశపెట్టించుట.

౨. న్యాయమైన పన్నులను నిర్ణయించి పర్మనెంటురైతువారీసెటిల్మెంటు పద్ధతి నేర్పాటుచేయుట.

౩. రిజర్వుఫారెస్టులపైనను, ప్రభుత్వమువారిచే సంరక్షింపబడుతూన్న అడవులపైనను పశుగ్రాసము, వంటచెరకు మొదలగు చిన్నచిన్న ఉత్పత్తి ద్రవ్యోపయోగముల విషయమున గ్రామస్థుల చేతులలోనే అధికార ముంచుట.

౪. త్రాగుబోతుతనమును పూర్తిగా మాన్పించుట.

౫. దేశభాషలలోనే సాధ్యమైనంత ఉన్నత విద్యావిధానము నేర్పాటుచేయుట.

౬. స్త్రీ పురుష భేదము లేకుండ ఉచితనిర్బంధవిద్యావిధానము నేర్పాటుచేయుట. ఈ విషయములో మునిసిపాల్టీలకును, లోకల్ బోర్డులకును సాధ్యమైనంత విరివిగా ప్రభుత్వధనమునుండి సహాయము చేయించుట.

౭. న్యాయ, పరిపాలనాధికారములతో గ్రామపంచాయితీలను పునరుద్ధరించుట.

౮. నల్లమందు, గంజాయి మొదలగు మత్తుపదార్థములను బహిష్కరించుట.

౯. స్త్రీ పురుష భేదము లేకుండ వోటింగు హక్కును విస్తరింపచేయుట.

౧౦. పురపారిశుద్ధ్య పరిపాలనమును ఆరోగ్యశాఖామంత్రి స్వాధీనము చేయుట.

౧౧. వ్యవసాయము, సహకారోద్యమము, పారిశ్రామిక వృత్తి విద్యలను ప్రజల అవసరములకు దగినట్లుగా సంస్కరించుట, ప్రజలకు తగిన వైద్యసహాయము చేయుట, దేశీయ వైద్యపద్ధతిని ప్రోత్సాహపరచుట.

ఈ కార్యక్రమము ననుసరించి యీ పక్షమువారి సిద్ధాంతముల నంగీకరించిన అభ్యర్థుల సహాయమునిమిత్తము యావన్మంది ప్రజలను వోటర్లుగా చేయవలెనని, అందువలన మున రాబోయే ఎన్నికల యుద్ధములో యీ పక్షమువారు విజయులై అధికసంఖ్యాకులు శాసనసభ్యులుగా రాగలరని విశ్వసిస్తున్నాము."

రాయబారవర్గమువా రింకను అయిర్లాండ్ పాఖండములో నుండగానే ౧౯౨౦ మే ౧౪ వ తేదీని టర్కీ సంధిషరతులు ప్రకటింపబడినవి. భారతదేశములో ఆ సంధి షరతులతోడు వైస్రాయిసందేశముకూడ ప్రకటింపబడినది. భారతమహమ్మదీయుల కాషరతులు బాధాకరములుగా నుండగల వని వైస్రాయిసందేశమునం దంగీకరింపబడెను. కాని మహమ్మదీయులు టర్కీలో వారి స్వమతస్థులకు కలిగిన దురదృష్టములకు సహనముతో ఓపికపట్టవలె నని కోరబడిరి. ఈవిధముగా టర్కీసంధి షరతులే భారతీయుల కాగ్రహజనకములైయుండ, అప్పుడే ప్రకటింపబడిన హంటర్ కమిటీనివేదిక వారికి మరింతకోపకారణమైనది. ఖిలాఫత్ కమిటీవారు ౧౯౨౦ మే ౨౮ వ తేదీని బొంబాయిలో సమావేశమై గాంధీ నాన్ కోఆపరేషన్ కార్యక్రమమునుగూర్చి చర్చించి మహమ్మదీయు లవలంబింపదగిన కార్యవిధాన మదొక్కటే యని నిర్ణయించిరి. అ. భా. కాం. సం. మే 30 వ తేదీని కాశీనగరములో సమావేశమై హంటర్ నివేదికను, టర్కీ సంధిషరతులను దీర్ఘముగా చర్చించి, నాన్ కోఆపరేషన్ ఉద్యమమును దేశములో ప్రవేశపెట్టుటనుగూర్చి నిర్ణయించుటకు ప్రత్యేకకాంగ్రెసుసభను జరుప తలపెట్టిరి.

నాన్ కోఆపరేషన్ ఉద్యమమునుగూర్చి తిలక్ చెప్పిన అభిప్రాయము గాంధీ రచించిన "తిలక్ స్మారకవిషయములు" (**Reminiscenses**) అనే గ్రంథములో ఈ క్రిందివిధముగా వ్రాయబడెను: "నా కీ కార్యక్రమమం టే చాలాయిష్టము. కాని, యీ అసహాయోద్యమము సూచిస్తున్న స్వార్థత్యాగమునకు ప్రజలు సంసిద్ధముగా లేరేమోనని నాకు సందేహము. ఈ ఉద్యమాభివృద్ధికి నే నెంతమాత్రమూ అడ్డంకులు కల్పించను. మీకు జయమగుగాక! సామాన్యప్రజలు మీ సందేశమును విశే

కొండల నే నత్యుత్సాహముగా మీకు సహాయము చేయగలను." ఈ మాటలను లోకమాన్యుడు గాంధీతో పదేపదే చెప్పినట్లుగా ఆయన వ్రాసెను.

భారతరాజకీయములలో ౧౯౨౦ సం.న జరిగిన సంఘటనములను వివరించే ముందు ౧౯౨౦ జనవరి ౧ వ తేదీని వలసరాష్ట్రములలో కంట్రాక్టుకూలీ పద్ధతి (ఇండెంచర్డు కూలి) నిర్మూలింపబడినందుకు జరుపబడిన ఉత్సవములను గూర్చి కొంత చెప్పవలసియున్నది. వలసరాష్ట్రములలో యీ కూలీపద్ధతి ఒక శతాబ్దమునకు పైనుండి ఆచరణలో నున్నది. అందువలన భారతదేశమునకు ప్రత్యక్షముగా కొంత నష్టము కల్గినది. భారతప్రభుత్వమువారు కొత్తకూలీలు సమకూర్చబడుట కంగీకరించనందున నేటాలులో కాంట్రాక్టు కూలీపద్ధతి అంతరించినది. మారిషస్‌లో కూలీల అవసరము తగ్గిపోయినందువలన ౧౯౧౧ లో ఆ కంట్రాక్టుకూలీపద్ధతి రూపుమాసినది. కాని, ప్రపంచకములోని వివిధభాగములలో గల తదితర వలసరాష్ట్రములయందలి కూలీపద్ధతి అప్పటికింకను ఆచరణలోనే యుండెను. ౧౯౧౪-౧౫ సం. లో భారతప్రభుత్వమువారు కాంట్రాక్టుకూలీలు తీసుకొనబడుచున్న రాష్ట్రములలోని ప్రభుత్వములను విచారించి, గ్రామప్రజలు కంట్రాక్టుకూలీ పద్ధతికి ప్రతికూలురుగా నుండిరన్న సంగతి గ్రహించిరి. ౧౯౧౫ లో సి. యఫ్. ఆండ్రూస్, డబ్లియు. డబ్లియు. పియర్సనులు ఫిజీకి పోయి అక్కడి పరిస్థితులను తెలుసుకొని వచ్చిరి. తరువాత వారొక నివేదికను ప్రకటించిరి. అందులోని విషయములు చాలా భయంకరములుగా నున్నవి.

ఆ నివేదిక మూలమున పండిత మదనమోహనమాలవ్యా సామ్రాజ్యశాసనసభలో కంట్రాక్టుకూలీపద్ధతి రద్దుపరిపింపబడవలెనని తెచ్చిన తీర్మానమును హార్డింజిప్రభు వంగీకరించెను. కాని దానికి బదులుగా కొన్ని యితర ఏర్పాటులు చేయబడేటంతవరకును కొంత ఆలస్యము కావచ్చునని ఆయన అభిప్రాయమిచ్చెను.

తరువాత ఆమేడే ఆయన మరి ౫ సం.ల వరకును ఇండియాలో కంట్రాక్టుకూలీలను సమకూర్చుపద్ధతి అమలులో నుంచవలసినదే నని వలసరాష్ట్రప్రభుత్వమువారితో రహస్యముగా ఒప్పుకొన్నట్లు తెలియవచ్చినది. రిక్రూటింగు (కూలీలను సమకూర్చు పద్ధతి) వలన కూలీ లవినీతిపరులుగా చేయబడుచూ ఉన్నారనీ, కొన్నిచోట్ల ఆత్మహత్యలుకూడా జరుగుచున్నవనీ ఆండ్రూస్ ప్రకటించి భారతప్రభుత్వమువారు వలసరాష్ట్రప్రభుత్వములతో రిక్రూటింగుపద్ధతి యింకను కొనసాగింపబడు నని రహస్యముగా అంగీకరించినమాట నిజమేనా అని ప్రశ్నించెను. సీమలో భారత, వలస రాష్ట్రములకు సంబంధించిన డిపార్టుమెంటుల కిటువంటి రహస్యసంధి జరిగినమాట

నిజమే నని తెలియుటతోడనే భారతదేశములో క్రోధాగ్ని ప్రజ్వరిల్లినది. గాంధీ వెంటనే కత్తిదూసెను. భారతదేశములోని పశ్చిమోత్తరభాగములలో కంట్రాక్టు కూలీపద్ధతికి వ్యతిరేకముగా తీవ్రమయిన ప్రచారము సాగించెను. బెసెంటు మద్రాసులో ప్రచారమును సాగించెను. ౧౯౧౭ మార్చి, ఏప్రిల్ నెలలలో యీ ఉద్యమము పరమావధికి పోయినది. బెసెంటు ఈ విషయములో చేసినప్రచారమునుకూడా ౧౯౧౭ జూన్ ౧౫ వ తేదీని ఆమె నిర్బంధింపబడిన కారణములలో ఒకటైనది. చెమ్సుఫర్డు ప్రభువు గాంధీని పిలిపించి ఈ విషయమునుగూర్చి తెలుసుకొనెను. ప్రతిరాష్ట్రము నుండీ తమసోదరీమణుల పక్షమున కొంతమంది భారతమహిళామణులు చెమ్సుఫర్డు ప్రభువునొద్దకు రాయబారము పోయిరి. గాంధీ ౧౯౧౭ వ మే ౩౧ వ తేదీలోపుగా కంట్రాక్టుకూలీపద్ధతి నిర్మూలింపబడవలెనని దానిని తుదముట్టించుటకు సత్యాగ్రహోద్యమము నడిపించెద నని ప్రతిజ్ఞపూనెను. ౧౯౧౭ సంవత్సరము ౧౧ వ ఏప్రిల్ తేదీని భారత సంరక్షణ చట్టముక్రింద అవలంబింప బడిన ప్రత్యేక యుద్ధకార్యక్రమము ప్రకారము ముందునుండీ కూలీల రిక్రూటింగు నిలిపివేయబడు నని ప్రకటించెను. దీనినిబట్టి యుద్ధము ముగిసిన వెంటనే వలసరాష్ట్రములు వారి ఆర్థికప్రయోజనమును సంరక్షించుకొనేనిమిత్తము తిరిగీ రిక్రూటింగుపద్ధతిని ప్రారంభింపగల వని స్పష్టమైనది. కాబట్టి యుద్ధానంతరము తిరిగీ యీ సమస్య ఉదయించినప్పుడు ప్రతిపక్షులను నిరుత్తరులనుగా చేసేనిమిత్తము ఆండ్రూస్ మహాశయుడు గాంధీ సలహాతోను, మహాకవి రవీంద్రనాథుని అంగీకారముతోను మరికొన్ని విషయములను సేకరించుటకు మరొకసారి ఫిజీకి వెళ్లెను. ఆయన అక్కడ ఒక యేడాది ఉండి క్రిందటిసారికంటెను ఎక్కువ హృదయవిదారకములైన సంగతులను గ్రహించివచ్చెను. ఆయన యీ సమస్యలోని నైతికవిషయములనుగూర్చి ఆస్ట్రేలియాస్త్రీలకు నచ్చచెప్పి ఈ కంట్రాక్టు కూలీపద్ధతిని నిర్మూలించేవిషయమున వారి సహాయ సానుభూతులను కూడ సంపాదించగలిగెను. ౧౯౧౮ మార్చిలో ఆయన ఢిల్లీనగరమున మాంటేగ్ మంత్రిని దర్శించి తాను ఫిజీలో తెలుసుకొన్న విషయముల నన్నింటినీ ఆయనకు నచ్చచెప్పి ఆ పద్ధతివలన దుర్నీతి వ్యాపిస్తూన్న దని ఆయనను ఒప్పించెను. ౧౯౧౯ లో భారత ప్రభుత్వమువారు కంట్రాక్టుకూలీలను సేకరించేపద్ధతి రద్దుచేయబడిన దని ప్రకటించిరి. మొదట నిర్ణయించుకొనబడిన గడువు అయిదుసంవత్సరములకాలము పూర్తికాని కూలీలు కూడ వెంటనే విడుదల చేయబడవలె నని వా రాజ్ఞాపించిరి. ఆప్రకారము ౧౯౨౦ జనవరి ఒకటవ తేదీని వలసరాష్ట్రములలోని భారతకూలీ లందరును విడుదలచేయబడిరి. ఫిజీ, బ్రిటిష్ గియానా, ట్రినిడాడ్, సురినామ్, జమైకాలలోని భారతీయకూలీ లానాడు వారి బానిసత్వమునుండి విముక్తిపొందుటచే అది వారికి పండుగదినమైనది. ఈ

కంట్రాక్టుకూలీపద్ధతి (ఇండెంచర్డులేబరు) పూర్వము చెరకుతోటలను వేసేటందుకు ౧౯౩౫ ప్రాంతములలోనే వలసరాష్ట్రములందు ప్రారంభించబడినది. అంతకు పూర్వము చెరకుతోటలలో ఆఫ్రికాఖండపు బానిసలు పనిచేసేవారు. కాని ౧౯౩౩ లో ఆ బానిసత్వపద్ధతి నిర్మూలింపబడినది. కాబట్టి బానిసత్వమునకు దాదాపు దగ్గరగానుండే ఈ ఇండెంచర్డులేబరుపద్ధతి (కంట్రాక్టుకూలీపద్ధతి) ఆదేశములలో చెరకుసాగు కొనసాగేటందుకు కనిపెట్టబడినది. సర్ డబ్లియు. విల్సన్ హంటరు అనే చరిత్రకారుడు దీనిలో సగపాలు బానిసత్వమూ, సగపాలు కూలిపనీ ఉన్నవని వ్రాసెను. ఆయనవర్ణనము సరిగా నున్నదని మా అభిప్రాయము.

హంటరుకమిటీనివేదిక ౧౯౨౦ మే ౨౮వ తేదీని ప్రకటింపబడినది. కమిటీవారు చేసిన నిర్ణయములు దేశీయులకసహ్యాకరములుగానూ, ఆశాభంగకరములుగానూ తోచినవి. ఆ నివేదికనుగూర్చి కమిటీలోని భారతీయ సభ్యులకును, ఆంగ్లేయ సభ్యులకును ఏకీభావము కుదురలేదు. పాంచాలములో జరిగిన దౌర్జన్య మదివరకునుండీ ఆలోచించుకొని ప్రజలు గావించిన తిరుగుబాటా, లేక తాత్కాలిక క్రోధావేశము వలన తటస్థించిన ప్రమాదమా అనేవిషయములో ఉభయులకును భేదాభిప్రాయములు కలిగినవి. ఆంగ్లేయసభ్యులు ఆలోచనతో జరిగిన తిరుగుబాటని భావించిరి. భారతీయసభ్యులు తాత్కాలికక్రోధావేశమువలన జరిగిన ప్రమాదమని భావించిరి. కాబట్టి సైనికశాసనము పాంచాలములో అమలు జరుపబడవలసిన అవసరమేలేదని భారతీయ సభ్యులు నిర్ణయించిరి. యుద్ధసైనికులను సమకూర్చుటలోనూ, యుద్ధనిధులను సేకరించుటలోనూ సర్ మైకేల్ ఓడయరు కావించిన "జులుమే" ఆరాష్ట్రములో జరిగిన దౌర్జన్యములకు కారణమని వారు సూచించిరి. ప్రభుత్వము వారు నిజమైనవార్తలను సరిగా ప్రచారము కానీక అనవసరముగా అపోహలు కలిగించిరని వారు నిందారోపణము చేసిరి.

"కొన్ని సందర్భములలో అధికారులన్యాయముగాను, ఔన్నత్యరహితముగాను, అక్రమముగాను ప్రవర్తించుటవలన సైనికశాసనము దుర్వినియోగము చేయబడినదనీ, డయ్యరుసేనాని అవసరమైనదానికంటె ఎక్కువనౌష్ఠ్యముగా ప్రవర్తించినాడనీ, ఆయన అంతకంటె ఎక్కువమానవత్వమును చూపించియుండవలసినదనీ" వ్రాయబడిన విషయములను ప్రభుత్వమునా రంగీకరించిరి. సైనికప్రభుత్వములోని కొన్ని అన్యాయమైనశిక్షలను, అతికఠినమైన ఉత్తరువులను, అవమానములనుగూర్చి బ్రిటిష్‌ప్రభుత్వము వారుకూడ తమ అసమ్మతిని గట్టిగా వెల్లడించిరి. కొన్ని ప్రత్యేకసందర్భములలో అధికారదుర్వినియోగము కావించిన ఉద్యోగస్థులపైన సరి అయిన చర్య నడిపించవలసి

నడుమకూడ భారతప్రభుత్వమువారికి బ్రిటిష్ ప్రభుత్వమువా రుత్తరువులు కావించిరి. కాని "తమ్మ్యారుసేనాని అప్పటి కుచిత మని తోచినరీతిని సదుద్దేశముతో ప్రవర్తించె ను. అతనినిర్ణయము తప్పుగా పరిణమించినది." అని మాంటేగుమంత్రి అభిప్రాయ మిచ్చెను. ఈసందర్భములో భవిష్యదుపయోగమునిమిత్తము సైనికశాసననిబంధనా వళి తయారుచేయబడవలె నని భారతప్రభుత్వమునకు ఉత్తరువులు జారీచేయబడినవి. సైనికాధికారములను దుర్వినియోగము చేసిన "ఆయాఉద్యోగస్థులకేసులు జాగ్రత్తగా విచారింపబడినవి." హంటర్ కమిటీవారిచే నిందారోపణము చేయబడిన అనేకమంది ఉద్యోగస్థులు భారతదేశమును విడిచిపెట్టి వెళ్లిరి. వారిలో కొంతమంది ప్రభుత్వో ద్యోగములను మానివేసిరి. కాని యివి యేవియును పాంచాలరాష్ట్రములోని ప్రజలకు గాని, భారతప్రజలకుగాని సంతోషకరములు కావు.

హంటర్ కమిటీనివేదిక ప్రచురింపబడినవెంటనే మే ౩౦ వ తేదీని అ. భా. కాం. సం. సమావేశము కాశీనగరములో జరిగినది. వారానివేదికనుగూర్చి దేశీయుల ప్రతిఘటనమును వెల్లడించిరి. ప్రత్యేకకాంగ్రెసులో ఆవిషయము చర్చింపబడవలె నని నిర్ణయించిరి. ఆసమయములో లోకమాన్యుడు రైలులో ప్రయాణముచేస్తూ కాశీ నగరముమీదుగానే పోయెను. కాని ఆయన ఆసభకు హాజరుకాలేదు. ఖిలాఫత్ ఆందోళనమునం దాయనకు హృదయపూర్వకమైన విశ్వాసము లేకపోవడమే దానికి కారణము. కాని అ. భా. కాం. సం. వారి ఆజ్ఞలను తాను శిరసావహింతు నని చెప్పిన సద్బుద్ధిగల దేశాభిమాని ఆయన. ఆరోజులలోనే ఖిలాఫత్ సందర్భమున తాను సాగించ దలచుకొన్న అసహాయోద్యమమునుగూర్చి విచారించుటకు గాంధీ ఒక అఖిలపక్షనాయకుల సమావేశమును పిలువ నిర్ణయించుకొనెను. ఆసమావేశము ౧౯౨౦ జూన్ ౨వ తేదీని ప్రయాగలో జరిగినది. అందులో అసహాయోద్యమసిద్ధాంత మంగీకరింపబడినది. అందు కొకకార్యక్రమమును తయారుచేయుటకు గాంధీయున్ను, మరి కొంతమందిమహమ్మదీయనాయకులున్ను కలసి ఒక కమిటీగా నియమింపబడిరి. ఆకమిటీవారు పాఠశాలల, కళాశాలల, న్యాయస్థానముల బహిష్కరణముతో కూడిన ఒక కార్యక్రమమును తయారుచేసి ప్రకటించిరి. నిజమునకు ౧౯౧౯ నవంబరు నెలలో ఢిల్లీనగరమున జరిగిన అ. భా. ఖిలాఫత్ మహాసభవారే గాంధీసలహా ననుసరించి గవర్నమెంటువారికి సహాయము చేయరాదని నిర్ణయించిరి. ఆనిర్ణయము కలకత్తాలోను, తదితరనగరములలోను జరిగిన మహమ్మదీయ సమావేశములలో బలపరుపబడినది. ౧౯౨౦ ఏప్రిల్ ౧౭ వ తేదీని జరిగిన మద్రాసు ఖిలాఫత్ సభలో అసహాయోద్యమముయొక్క కార్యప్రణాళిక యింకను విస్తరింపచేయబడినది. దానిప్రకారము ప్రభుత్వబిరుదములను, పదవులను, గౌరవోద్యోగములను, పోలీసుమిలిటరీ సేవలను, శాసనసభలలోని సభ్యత్వములను, పన్నులను నిరాకరింప

ఫలయు నని నిర్వచనము చేయబడినది. ౧౯౨౦ వసంతకాలమునాటికి పరిస్థితు లింకను తీవ్రరూపమును దాల్చినవి. ఖిలాఫత్ అన్యాయము, పాంచాలదురంతములు, రాజ్యాంగసంస్కరణముల అసమగ్రత యీమూడును అంతకంతకు భారతజాతియొక్క అసంతృప్తి కెక్కువగా కారణభూతములైనవి. అసహాయోద్యమప్రారంభమునకు పరిస్థితు లనుకూలముగా నున్నవి. లోకమాన్యుడుకూడ అ. భా. కాం. సం. వారి నిర్ణయమునకు కట్టుబడి యుండుదునని వాగ్దానముచేసెను. కాని ఆయన ౧౯౨౦ జులయి అర్ధరాత్రమున స్వర్గస్థుడయ్యెను. గాంధీప్రక్కను లోకమాన్యుడే ఉండియున్నయెడల ఆయన కింకను ఎంతో బలము చేకూరి ఉండేది. ఈలోగా భారతమహమ్మదీయు లాఫ్ఘనిస్థానమునకు తరలిపోయి నివసింప సమకట్టిరి. టర్కీసంధిపరతులలో బ్రిటిష్వా రవలంబించిన రాజనీతివలన వారు ఇండియాలో కాపురముండుట అవమానముగా తలంచిరి. మహమ్మదీయు లవలంబించిన యీపద్ధతికి హిజరత్ అని పేరు. ఈ ఉద్యమము సింధులో ప్రారంభమై, పశ్చిమోత్తరసరిహద్దురాష్ట్రములకు ప్రాకినది. ఈవిధముగా వలసపోవు మహమ్మదీయులకును, కాచాగ్రీలోని సైనికదళమునకును భయంకరమైన సంఘట్టనము జరిగినది. అందువల్ల ప్రజ లుద్రేకపూరితులైరి. ఆగష్టునెలలో ౧౮౦౦౦ ల మంది మహమ్మదీయు లాఫ్ఘనిస్థానమునకు పోయేత్రోవలో నుండిరని అంచనా వేయబడినది.

కాని, త్వరలోనే ఆఫ్ఘన్ ప్రభుత్వమువారు వారిప్రవేశమును నిషేధించిరి. అంతటితో ఆయుద్దేశము విరమింపబడినది. కాని ఆప్రయత్నములో చాలామందికి ప్రాణాపాయమును, బాధలును కలిగినవి. ఆగస్టునెలలో భారతశాసనసభ సమావేశమయినది. నాన్కోఆపరేషన్ ఉద్యమ మంతకుపూర్వమే ప్రారంభింపబడినది. కొంతమంది కౌన్సిలుసభ్యులు తమసభ్యత్వములకు రాజీనామాల నిచ్చిరి. అసహాయోద్యమమువలన తప్పక అల్లరులు జరుగునని వైస్రాయి ప్రకటించెను. ఆఉద్యమముకంటె నిరర్థకమయినదీ, అనాలోచితమయినదీ మరొకటి కలదా అని ఆయన ప్రశ్నించెను. ఆఉద్యమము ప్రారంభింపబడుట "తెలివితక్కువలోకి తెలివితక్కువ" అని ఆయన వక్కాణించెను. కాని నూతన భారతశాసనసభను ప్రారంభించుట కిండియాకు రానున్న వేల్సుయువరాజురాకకు బొంబాయిమితవాదిమహాసభలో శ్రీనివాసశాస్త్రివంటి మితవాదిశిఖామణికూడ ప్రతికూలభావమును వెల్లడించెను. తరువాత ఆగస్టునెలలో వేల్సు యువరాజురాక విరమింపబడినది. కానాటుప్రభువు వాయునస్థానము నాక్రమించెను. ఆ ఆగస్టునెలలోనే డాక్టరు సప్రూ వైస్రాయికార్యనిర్వాహకసభలో సభ్యుడుగా నియమింపబడెను. ఆగస్టు ౧వ తేదీని అసహాయోద్యమము లాంఛనముగా ప్రారంభింపబడినది. అలీసోదరులున్ను, గాంధీయున్ను దేశమంతటా సంచారము చేసిరి. తమ అవ

చరులను నియమబద్ధులనుగా చేసి, వారి ఉద్రేకము నవధిలో నుంచుట గాంధీప్రకృతి. గాంధీ ఆయనఅనుచరులను మందలించిన అవకాశమును తీసుకొని ప్రభుత్వమువారు ప్రజలు అక్రమముల కుదాహరణములుగా ఆయనమాటలనే ఉదాహరించుట ఆచార మయిపోయినది. ఇంతకుపూర్వ మెప్పుడును శాసనబద్ధములైన మార్గములద్వారా నడి పింపబడుతూన్న కాంగ్రెసుఉద్యమము సంప్రదాయవిరుద్ధముగా నేడు క్రొత్తత్రోవ పట్టుటవలన ఆకార్యక్రమము ప్రత్యేకకాంగ్రెసులో నిర్ణయింపబడతగినంత పెద్దదిగా తలంపబడినది. ఇదివరకే మేనెలలో నిర్ణయింపబడిన ప్రత్యేకకాంగ్రెసు ౧౯౨౦ సెప్టెంబరునెలలో ౪ వ తేదీనుండి ౯ వరకును కలకత్తానగరమున జరిగినది.

ఈలోపుగా అసహాయోద్యమముసుగూర్చి వివిధ రాష్ట్రీయసంఘములును తమ తమ అభిప్రాయములను ప్రకటించినవి.

ఆంధ్రపాంచాలకాంగ్రెస్‌సంఘములు అసహాయోద్యమ తీర్మానము నంగీకరించ వలసిన దని ప్రత్యేకకాంగ్రెసుకు సిఫార్సు చేసినవి. కాని ప్రత్యేకకాంగ్రెసు జరిగు టంతవరకును ఆకార్యక్రమ మాపివేయబడవలెనని తీర్మానించినవి. వంగరాష్ట్ర మానాటి పరిస్థితులలో అసహాయోద్యమమే ప్రజ లవలంబింపవలసిన ఆయుధ మని అభిప్రాయ మును వెల్లడించినది. కాని మధ్యరాష్ట్రముల కాంగ్రెసుసంఘములతోపాటు వంగ కాంగ్రెసుసంఘముకూడ నూతనశాసనసభల బహిష్కరణ ముచితము కా దని ప్రక టించినది. పైగా శాసనసభలలో నాన్‌కోఆపరేషన్ చేయుటకు సంసిద్ధులయిన ఎక్కువ మంది సభ్యు లుండుట అవసర మని కూడ తీర్మానించినది. బీహారు ఒరిస్సారాష్ట్రీయు లసహాయోద్యమసిద్ధాంతము నంగీకరించి వాటికి తగినట్లుగా కార్యక్రమమును తయారు చేయుటకు కమిటీలను నియమించుకొనినవి. బీరారు, బొంబాయిరాష్ట్రములు హృదయ పూర్వకముగా ఆసిద్ధాంతమునంగీకరించినవి. ప్రత్యేకకాంగ్రెసుచే నియమింపబడిన కమి టీవారా ఉద్యమకార్యక్రమమును వివరముగా వ్రాయవలె నని తీర్మానించిరి. బర్మా కూడ సిద్ధాంత మామోదించినది. కాని ఆరాష్ట్రములోమాత్ర మాఉద్యమము సాధ్యము కా దని భావించినది. మద్రాసురాష్ట్ర కాంగ్రెసుసంఘమువా రసహాయోద్యమ తత్త్వము నంగీకరించిరి గాని, గాంధీకార్యక్రమమునకు ప్రతికూలభావమును వెల్లడించిరి. సింధురాష్ట్రములోకూడ అది అంగీకరింపబడినది. వారు నాలుగంతరములుగల ఒక వివరమైన కార్యక్రమమును తయారుచేసిరి. కాని, వారు సైనికులు పనిచేయ నిరాక రించుట నామోదించలేదు. సంయుక్తరాష్ట్రములవారు సహాయనిరాకరణ తత్త్వము నామోదించి ఒక కార్యక్రమమునుకూడ తయారుచేసిరి. అందులో కానాటుప్రభువు సన్మానమును బహిష్కరించవలసిన దని చేర్చబడినది.

అన్నిరాష్ట్రములనుండీ వచ్చిన యీ అభిప్రాయముల నన్నింటినీ గమనించి కలకత్తాలో ప్రత్యేకకాంగ్రెసు సమావేశమయినది. ఆసభ చరిత్రప్రసిద్ధము. వంగ రాష్ట్రప్రతినిధులకు గాంధీ అంటే బొత్తిగా గిట్టలేదు. చిత్తరంజనదాసు గాంధీ నాన్‌కోఆపరేషన్ కార్యక్రమమునకు కొండవలె ఎదురుగా నిలిచెను. ఆయన కోర్టుల బహిష్కారమునకును, శాసనసభల బహిష్కారమునకును ప్రతికూలముగా నుండెను. వంగరాష్ట్రప్రతినిధులలో అధికసంఖ్యాకు లలాగే ఉండిరి. అయినప్పటికీ విషయ నిర్ధారణసభలో ఏడువోట్ల అధికముతో క్రమానుగతముగా ఏర్పాటుచేయబడిన గాంధీ బహిష్కారప్రణాళిక అంగీకరింపబడినది.

అప్పటి వాతావరణమునుబట్టి అసహాయోద్యమప్రారంభము తప్పనిసరి అని భావింపబడినది. భారతప్రభుత్వమువారు హంటరుకమిటీనివేదికలోని అధికసంఖ్యాకుల నిర్ణయములను సర్వాంగా నంగీకరించి అధికారుల దురాగతములను కప్పిపుచ్చ నుద్దేశించిరి. వారు డయ్యరుసేనానినిగూర్చి "అవసరమయినదానికంటె యెక్కువబల ముపయో గించినా డనీ, సదుద్దేశముతోనే తనధర్మమును నిర్వర్తించ తలచినాడు కాని, పాపము, పొరపాటుపడినా డనీ" మాత్రము వ్రాసిరి. మాంటేగుకూడ ప్రభుత్వమువారి అభిప్రాయములను నెమ్మదిగా అంగీకరించెను. ఆయన పాంచాలసైనికాధికారుల దుండగము లను ఖండించెను. కాని "డయ్యరుసేనాని సద్బుద్ధితో ధర్మనిర్వహణముకోస మాపని చేయవలసివచ్చిన" దని చెప్పి పరిస్థితులను మరింత తీవ్రరూపమునకు తీసుకొనివచ్చెను. కామన్సుసభలో డయ్యరుసేనాని అన్యాయముగా శిక్షింపబడినా డనే ఊహతో పెద్ద చర్చ జరిగినది. ప్రభువులసభలో అంగీకరింపబడిన ఫిన్‌లేప్రభుని తీర్మానము పక్షపా తముగాను, అసంగతముగాను, అసత్యపూరితముగాను ఉండెను. మొత్తముపైన పార్ల మెంటుసభలలో జరిగినచర్చలు భారతప్రజలస్వాతంత్ర్యమునకును, హక్కులకును భం గము కలిగించునట్టివిగా నుండెను. ఈ అన్నివిషయములును చాలీచాలని రాజ్యాంగ సంస్కరణములతోను, ఖిలాఫత్ అన్యాయములతోను కలసి కలకత్తాప్రత్యేకకాంగ్రె సులో తీవ్రవాక్యసమన్వితమైన తీర్మానరూపమును తాల్చినవి.

౧౯౨౦ సెప్టెంబరు ౪ వ తేదీ మొదలు ౯ వ తేదీవరకును కలకత్తాలో ప్ర త్యేకకాంగ్రెసుమహాసభ అత్యుత్సాహముగా జరిగినది. ఆమహాసభకు బి. చక్రవర్తి సన్మానసంఘాధ్యక్షుడు. అప్పటికి కొద్దికాలముక్రిందటనే అమెరికానుండి తిరిగివచ్చిన లాలాలజపతిరాయి అగ్రాసనాధిపతి. బాలగంగాధరతిలక్ మరణమునకు కాంగ్రెసుయొక్క దుఃఖమును వెల్లడిస్తూ మొట్టమొదటితీర్మానము చేయబడినది. అందులో ఆయననిష్క ళంకజీవితమునుగూర్చీ, ఆయన దేశముకొరకు పడిన కష్టములనుగూర్చీ, ఆయన ప్రజల సౌభాగ్యముకొరకు చేసిన త్యాగములనుగూర్చీ, జాతీయస్వాతంత్ర్యముకొర కాయన

పోరాడినవిధానమునుగూర్చి శ్లాఘింపబడినది. భారతభావిసంతతి ఆయనజీవితచరిత్రమును కృతజ్ఞతాపూర్వకముగా స్మరించి జాతీయసేవయందు బలవిశ్వాసములను కలిగియుండగల రని ఆశింపబడినది.

డాక్టరు మహేంద్రనాథసర్కారుమరణమువలన దేశమునకు కలిగిన నష్టమును ప్రకటిస్తూమూడవ తీర్మానింపబడినది. రెండవతీర్మానమును .కలకత్తాహైకోర్టుజడ్జిగానుండి అప్పుడే పింఛనుపుచ్చుకొన్న సర్. ఆశుతోషచౌదరీ ప్రతిపాదించెను. ఆతీర్మానమిది:

“పంజాబువిచారణోపసంఘసభ్యులును, వారిచే నియమింపబడిన ప్రతినిధులును (Commissioners) చాలాశ్రమపడి, న్యాయమార్గ మవలంబింపదగిన జాగ్రత్తతో సాక్ష్యమును సేకరించి, వారు స్వయముగా సంపాదించిన సాక్ష్యసాధనములనుబట్టియే కాక హంటరుకమిటీవారియెదుట యీయబడిన సాక్ష్యమునుబట్టికూడా సమన్వయింపదగిన నివేదికను తయారుచేసినందుకు ఈకాంగ్రెసువారు వారికి కృతజ్ఞతాపూర్వకాభివందనము లర్పిస్తూ వారినిర్ణయములతో ఏకీభవిస్తున్నారు.

(ఎ) హంటరుకమిటీనివేదికలోని అధికసంఖ్యాకుల నిర్ణయములకును, వా రవలంబించిన భావమును, వారు చూపిన చిత్తవృత్తికిని యీకాంగ్రెసువారు పూర్తిగా ఆశాభంగమును పొంది, ఆనిర్ణయములకు సంపూర్ణప్రతికూలభావమును వెల్లడిస్తున్నారు.

(బి) (౧) “హంటరుకమిటీలోని అధికసంఖ్యాకులచే తయారుచేయబడిన నివేదిక, స్పష్టముగా ప్రదర్శితములైన ఆయాప్రభుత్వాధికారుల అన్యాయములను కప్పిపుచ్చవలెననే కోరికతోనూ, పాంచాలప్రభుత్వ భారతప్రభుత్వముల ప్రవర్తనను సమర్థించవలెననే దృష్టితోనూ సంపాదింపబడిన అసమగ్రమయిన సాక్ష్యమువలనను, జాతిద్వేషమూ, పక్షపాతములవలనను కలంకీభూత మయినది.

(౨) స్వార్థపరత్వ పక్షపాతములతో ఒకవైపునుండియే తీసుకొనబడిన అసంపూర్ణసాక్ష్యముపైన ఆనివేదిక ఆధారపడియుండుటచే అది నమ్మతగినది కానీ, అంగీకరింపతగినదికానీ కాదు.

(3) హంటరుకమిటీవారి రికార్డులోనున్న సాక్ష్యమునుబట్టియే వారినిర్ణయములు సరియయినవి కావు. వారిసిఫార్సులాయాకేసులలో అవసరమయిన కనీసన్యాయముకూడా సూచించలేదు.” అని యీకాంగ్రెసు తన నిశ్చితాభిప్రాయమును వెల్లడిస్తున్నది.

(సి) హంటరుకమిటీవారు వ్రాసిన రెండు నివేదికలపైనను ప్రభుత్వమువా రిచ్చిన అభిప్రాయమునుగూర్చి:

(౧) "ప్రభుత్వమువా రధికసంఖ్యాకుల నిర్ణయములను విచక్షణ లేకుండా అంగీకరించిరి.

(౨) అల్పసంఖ్యాకుల నిర్ణయములునూ, వాదములునూ వారి రికార్డులోని సాక్ష్యముల ననుసరించియున్నప్పటికినీకూడా ప్రభుత్వమువారు వాటిని సమగ్రముగా ఆలోచించ లేరు.

(౩) ప్రభుత్వమువారు తమనిర్ణయములో అవలంబించిన దృక్పథము నిష్పాక్షికమైన న్యాయనిర్ణయమునకు తావలేననికాక అసలుసంగతిని కప్పిపుచ్చి అధికారుల దురంతములను పూర్తిగా మరుగుపరచవలెననిమాత్రమే అవలంబింపబడినది.

(౪) నిందారోపితులయిన అధికారుల ప్రవర్తనమునుగూర్చిన ప్రభుత్వమువారి నిర్ణయము జరిగినదుష్కృత్యముల యంతమాత్రమును తగియుండలేదు. అందువలనన బ్రిటిషున్యాయమునందు భారతీయులు పూర్తిగా విశ్వాసమును కోల్పోయిరి." అని కాంగ్రెసువారు తమనిశ్చితాభిప్రాయమును ప్రకటించిరి.

మూడవతీర్మానముకూడ పాంచాలరాష్ట్రమునకు సంబంధించినదే. అందులో "పంజాబుదురంతములనుగూర్చి బ్రిటిషుప్రభుత్వమువారు తగినచర్య జరుపకపోగా, ఇండియాప్రభుత్వమువారి సిఫార్సులను అంగీకరించినందుకున్నూ, పంజాబుఅధికారుల దుష్కార్యములను కేవలము కప్పిపుచ్చినందుకున్నూ, కాంగ్రెసువారు ఆశాభంగమును పొందినారు." అని ఉదాహరింపబడినది. "బ్రిటిషుమంత్రివర్గమువా రెన్ని ఉదారాశయములను ప్రకటించినప్పటికినీ పాంచాలవిషయములలో తగినచర్య జరుపనందుకు వారు భారతప్రజల విశ్వాసమును కోల్పోయిరి." అనికూడ తీర్మానింపబడినది.

కాని అసలుతీర్మానము గాంధీచే ప్రతిపాదింపబడిన అసహాయోద్యమ తీర్మానము. దానికి చాలా మంది అనుకూలురుగాను, చాలా మంది ప్రతికూలురుగాను ఉండిరి. ఆతీర్మాన మిది:

"ఖిలాఫత్ సందర్భమున భారతమహమ్మదీయులయెడల భారతప్రభుత్వమువారునూ, సామ్రాజ్యప్రభుత్వమువారునూ వారివారి ధర్మములను సరిగా నిర్వర్తించక పోవుటవలనను, బ్రిటిష్ ప్రధానమంత్రి మహమ్మదీయులకుచేసిన వాగ్దానమును బుద్ధిపూర్వకముగా భంగము చేసినందువలనను భారతదేశములోని ప్రతి మహమ్మదీయేతరునకును

తనసోదరుల హతమునకు కలిగినకష్టమును తొలగింప న్యాయముగా ప్రయత్నించుట ధర్మముకాబట్టిన్నీ, ౧౯౧౯ ఏప్రిల్‌లో జరిగిన దురంతములసందర్భమున ఆరెండుప్రభుత్వములవారునూ పాంచాలములోని నిరపరాధులగు ప్రజలను సంరక్షింప నిర్లక్ష్యము చేసినందువలనను, భయంకర ప్రవర్తనలకు కారణభూతులైన సైనికోద్యోగులను వారు శిక్షింపకపోగా ప్రజల దుఃఖములకును, అధికారుల అపరాధములకును బాధ్యత వహింపదగిన సర్ మైకేల్ ఒడయరును సమర్థించినందువలనను, పార్లమెంటులో జరిగినచర్చలనుబట్టి బ్రిటిష్‌వారికి భారతదేశప్రజలయందు సానుభూతిలేదని స్పష్టముగా తెలియవచ్చినందువలనను, పాంచాలరాష్ట్రములో ప్రభుత్వమువారవలంబించిన నిరంతరభయంకరపద్ధతులవలనను, యిటీవల వైస్రాయిచేసిన ప్రకటనము వలనను ఖిలాఫత్ పంజాబుసమస్యలలో ప్రభుత్వమువారెంతమాత్రమూ పశ్చాత్తాపము చూపించనట్లు కనబడుచున్నది కాబట్టిన్నీ,

ఈ పైనచెప్పబడిన రెండుసందర్భములలోను సరియయిన పరిహారముకలిగితేనేకాని భారతప్రజలకు సంతృప్తి కలుగదని యీకాంగ్రెసువారభిప్రాయపడుచున్నారు. భావికాలములో ఇటువంటి అన్యాయములు తిరిగి జరుగకుండా జాతీయ గౌరవమును దృఢముగా నిలబెట్టుకోవలెనన్నయెడల స్వరాజ్యసంస్థాపన మత్యావశ్యకము. ఆ అన్యాయములను నివారించుటకున్నూ, స్వరాజ్యమును సంస్థాపించుటకున్నూ గాంధీగారిచే ప్రారంభింపబడిన దౌర్జన్యరహిత సహాయనిరాకరణ సిద్ధాంతమును అంగీకరించి క్రమక్రమముగా ఆచరణలో పెట్టుటకంటె భారతప్రజలకు గత్యంతరము లేదు.

అందుకొరకు ఇంతకుపూర్వమునుండి ప్రజాభిప్రాయమునకు ప్రాతినిధ్యము వహిస్తూన్న పెద్దతరగతులవారీపనిని ప్రారంభింపవలసియున్నది.

ప్రభుత్వమువారు తమ గౌరవబిరుదములమూలమునను, పాఠశాలలు శాసనసభలు న్యాయస్థానముల మూలమునను తమ అధికారమును బలపరచుకొని ఉండిరి. ఇప్పుడు ప్రజలు సాధ్యమైనంత తక్కువ త్యాగముతోనూ, తక్కువప్రమాదముతోనూ ఉద్యమమును నడిపి తమకోరికలను సిద్ధింప చేసుకొనవలసియున్నది కాబట్టి యీకాంగ్రెసు

(ఎ) గౌరవోద్యోగములను, బిరుదులను త్యజించుట; స్థానిక సంస్థలయందు ప్రభుత్వ నియామిత (Nominated) సభ్యత్వములకు రాజీనామా యిచ్చుట;

(బి) ప్రభుత్వాధికారులవల్లగాని, వారిగౌరవముకొరకుగాని ఏర్పాటుచేయబడిన దర్బారులకును, సన్మానములకును హాజరుకా నిరాకరించుట;

(బి) ప్రభుత్వమువారి స్వాధీనములోనున్నట్టిగాని, లేక వారి సహాయమును పొందుచున్నట్టిగాని పాఠశాలలనుండి, కళాశాలలనుండి పిల్లలను క్రమక్రమముగా మాన్పించుట; వాటిస్థానమున జాతీయపాఠశాలలను, కళాశాలలను అన్నిరాష్ట్రములలోను నిర్మించుట;

(డి) లాయర్లున్నూ, వాదప్రతివాదులున్నూ, బ్రిటీషు న్యాయస్థానములను క్రమక్రమముగా బహిష్కరించుట; వాటిస్థానే వారిసహాయముతో ప్రజల తగాదాలను పరిష్కరించేనిమిత్తము గ్రామపంచాయితీలను స్థాపించుట;

(ఇ) మెసపొటోమియాలో పనిచేయుటకు సైనికులుగా గాని, గుమాస్తాలుగా గాని ఎవరున్నూ పోకుండుట;

(ఎఫ్) నూతనశాసనసభల యెన్నికల కెవరును అభ్యర్థులుగా నిలబడకుండుట; నిలబడినవారు ఉపసంహరించుకొనుట; కాంగ్రెసు తీర్మానమునకు వ్యతిరేకముగా ఎవరైనను అభ్యర్థిగా నిలిచినప్పటికి వోటరు లాయనకు వోట్లీయ నిరాకరించుట;

(జి) విదేశవస్తువులను బహిష్కరించుట.

ఈ కార్యములను అమలులో పెట్టవలసినదని ప్రజలకు సలహా ఇస్తూన్నది.

ఈ అసహాయోద్యమము స్వార్థత్యాగ, స్వయంనిగ్రహములతో కూడుకొని యున్నది. ఈ రెంటిను లేనియెడల ఏజాతీ అభివృద్ధిపొందజాలదు. భారతదేశములోని ప్రతిస్త్రీకి, ప్రతిపురుషునకు, ప్రతిబాలునకు స్వార్థత్యాగ స్వయంనిగ్రహముల కొరకు అసహాయోద్యమప్రథమదశలో శిక్షణ నీయవలసియున్నది. కాబట్టి యీకాంగ్రెసు ప్రజలందరును విరివిగా స్వదేశీవస్త్రములనే ఉపయోగించవలెనని సలహాయిస్తూన్నది. భారతదేశములో భారతీయుల అధికారముక్రిందనూ, భారతీయుల పెట్టుబడివలననూ నేడు నడుపబడుతూన్న వస్త్రయంత్రాలయములు భారతజాతికి కావలసినంత బట్టను సప్లయిచేయలేకపోవుటచేతను, కొద్దికాలములోనైననూ అవి సప్లయిచేయగలిగే స్థితిలోకి రాగలవనే విశ్వాసము లేకపోవుటచేతనూ యీ కాంగ్రెసు ఎన్నడో నశించిన నూలువడుకుపరిశ్రమను ప్రతిగృహములోనూ పునరుద్ధరించవలసినదనీ, లక్షలకొలదీ నేతగాండ్రకు జీవనాధారమయిన నేతపరిశ్రమకూడ తక్షణము తిరిగీ ప్రారంభింపబడవలెననీ తీర్మానిస్తూన్నది.”

ఈ తీర్మానముపైన తీవ్రమైన చర్చ జరిగినది. బాబూ బిపినచంద్రపాలు లోకసవరణను ప్రతిపాదించెను. దేశబంధు చిత్తరంజనదాసు దానిని బలపరచెను. “భారతదేశముయొక్క కష్టములను బ్రిటిషుప్రధానమంత్రికి నివేదించుటకునూ, తక్షణము స్వపరిపాలనము కావలెనని ఆయనకు నచ్చచెప్పుటకునూ ఒక రాయబారము పంప

బడెవలెను. ఆరాయశారవర్గమువారి సూచనల నంగీకరించి ౧౯౧౯ నాటి రాజ్యాంగచట్టమునకు బదులుగా భారతదేశమునకు సంపూర్ణస్వాతంత్ర్యమిచ్చే మరియొక ప్రణాళికను తయారుచేయుట కాయన అంగీకరింపనియెడల తీవ్రమైన అసహాయోద్యమము ప్రారంభింపబడును. అందుమూలమున బ్రిటిషుప్రజలకు భారతదేశమును తమ అధీన రాజ్యముగా పరిపాలించుట అసంభవమని తోచగలదు. ఈలోగా యీ కాంగ్రెసువారొక కమిటీని నియమించి గాంధీమహాత్ముని కార్యక్రమమును పరిశీలిస్తూ భవిష్యదుద్యమమునకు కావలసిన ప్రచారముగూడ చేయుచుండెను." అని ఆ సవరణ.

ఇందుమీద చాలా తర్జనభర్జనలు జరిగినపిమ్మట చివరకు గాంధీమహాత్ముని తీర్మాన మంగీకరింపబడెను.

ఈసందర్భములో మరియొకమాట చెప్పవలసియున్నది. గాంధీమహాత్ముడు మొట్టమొదట స్థానికసంస్థల బహిష్కరణముగూడ యీకార్యక్రమములో చేర్చెను. కాని, పిమ్మట కొందరు మిత్రులసలహామీద తాను దాని నుపసంహరించుకొనెను. ఈ కార్యక్రమముతో శ్రేయాభిప్రాయము లున్నప్పటికినీ జాతీయవాదులుమాత్రము కాంగ్రెసుకు భక్తిపూర్వకముగానే ఉండిరి. అమృతసరముకాంగ్రెసు తీర్మానానుసారముగా నూతనశాసనసభలకు చాలామంది జాతీయవాదులు తాము అభ్యర్థులుగా నుందుమని ప్రకటించిరి. వారు తమ ఎన్నికప్రచారములో చాలాశ్రమపడి కాలమును, ధనమునుగూడ వెచ్చించియుండిరి. అయినప్పటికి దాదాపుగా వారందరునూ కలకత్తా ప్రత్యేకకాంగ్రెసు తీర్మాన ప్రకారము తమ అభ్యర్థిత్వము నుపసంహరించుకొనిరి. వోటర్లలో నూటికి ౮౦ మంది కాంగ్రెసునిర్ణయముల నంగీకరించి వోటుచేయుట మానివేసిరి. చాలాచోట్లనుండి వోలింగుపెట్టెలు ఖాళీగా పంపబడినవి. "గాంధీ అవలంబించిన అసహాయోద్యమమునందు నూతనశాసనసభల బహిష్కరణమువలన మరికొన్ని సంవత్సరములవరకునూ భారతదేశచరిత్రలో గొప్ప పరిణామములు కలుగగలవు. ప్రజలలో సుప్రసిద్ధులుగా పరిగణింపబడుతూన్న అనేకమంది ఉదారాభిప్రాయములుకలవారు నేటి శాసనసభలలోకి రాకుండ నిరోధింపబడిరి. మితవాదుల త్రోవ అందుమూలమున నిష్కంటకమైనది." అని ప్రభుత్వమువారే అంగీకరించిరి.

నవంబరు ప్రారంభములో యీ అసహాయోద్యమమునుగూర్చి ప్రభుత్వమువా రవలంబింప దలచుకొన్న పద్ధతిని వారు స్పష్టపరచిరి. "ఉద్యమప్రారంభకుల నిర్ణయముల నతిక్రమించి, ఉద్యమవ్యాపనమునకు ప్రచారముచేస్తూఉన్నవారి విషయములోను, ప్రాతమూలకముగా గాని, ఉపన్యాసముల మూలకముగాగాని పోలీసువారియొక్కయూ, సైన్యములయొక్కయూ రాజభక్తిని నిర్మూలించుటకును, ప్రజలను

బహిరంగముగా దౌర్జన్యమునకు పురికొల్పుటకును ప్రయత్నించినవారిపైనను మాత్రమే చర్యనుపవలసిన"దని వారు స్థానిక ప్రభుత్వముల కాజ్ఞాపించిరి. ఈ అసహాయోద్యమమును కేవలము స్వప్నతుల్యమైన అసంభవ ప్రణాళికగా పెద్దతరగతులవారును, సామాజనమునుకూడా నిరాకరింతురని ప్రభుత్వమువారు తమ అభిప్రాయమును వెల్లడించిరి. ఒకవేళ యిది జయప్రదముగా కొనసాగినయెడల భారతదేశములో గొప్ప అల్లర్లున్నూ, రాజకీయ కల్లోలమున్నూ కలిగి దేశములోని స్థితిపరుల వినాశమునకుమాత్రమే తోడ్పడగలదని వారు బహిరంగముగా చాటించిరి. అసహాయోద్యమము "అజ్ఞానముపైనను, ద్వేషభావముపైనను" ఆధారపడియున్నదనీ, "దానిసిద్ధాంతములో ఏవిధమైన నిర్మాణబీజములును లేవనీ" కూడ ప్రభుత్వమువా రభిప్రాయమిచ్చిరి.

వెంటనే దేశములో నూతనవాతావరణము ప్రారంభమైనది. రాజకీయాందోళనములో నూతనపరిణామము కలిగినది. ౧౯౨౦ మే నెలలో జరిగిన అ. భా. కాం. సం. వారు పంజాబు దురంతములనుగూర్చి పార్లమెంటు లోక అర్జీని సమర్పించేనిమిత్త మొక ఉపసంఘమును నియమించిరి.

తరువాత ఆఉపసంఘమువా రేమీ ఆవిషయములో పనిచేయలేదు. భారతజాతీయమహాసభకున్నూ, బ్రిటిషుకాంగ్రెసు కమిటీవారికిన్నీ రాజ్యాంగసంస్కరణ విషయములలో కలిగిన భేదాభిప్రాయములవలన ౧౯౧౯ నుండి భారతకాంగ్రెసువారు బ్రిటిషుకమిటీకి విరాళము నిచ్చుట మానివేసిరి. ఆ భేదాభిప్రాయములే ౧౯౧౯లో ఇంగ్లండులో కాంగ్రెసు రాయబారవర్గమువారికినీ, బెసెంటుకునూ కలిగిన వాదప్రతివాదములకు కారణభూతములయినవి. ఆంగ్లమిత్రులును, కార్మిక పక్షమువారును ఈ ఉభయవాదముల మధ్యను చిక్కుకొనిరి. బ్రిటిషుకాంగ్రెసు కమిటీవారు చిట్టచివరకు భారతజాతీయ మహాసభకు లోబడినవారితో కొన్ని షరతులను చేసుకొనిరి. వా రా ఒడంబడిక ప్రకారము తమ సిబ్బందీలో అ. భా. కాం. సం. వారిచే సూచింపబడిన ఒక భారతీయున కుద్యోగ మీయవలసియుండెను. వా రా షరతును నిరాకరించి తమ యిష్టప్రకారము మరి ఒక భారతీయున కుద్యోగమిచ్చిరి. కాంగ్రెసు ప్రతిఘటించినది. కాని వారు లొంగలేదు. అందువలన యిదివరకు వారిచే నడుపబడుతూన్న "ఇండియా" అను పత్రిక ఆపివేయబడవలె నని తీర్మానింపబడినది.

ఇవి సీమలోని విషయములు. ఇక భారతవిషయములనుగూర్చి ఆలోచింతము. ౧౯౨౦ అక్టోబరు ౨ వ తేదీని అ. భా. కాం. సం. సమావేశమై (౧) అఖిల భారత తిలక్‌స్మారకనిధిని, (౨) స్వరాజ్యనిధిని సేకరించవలెనని తీర్మానించిరి. కాని ౧౯౨౦ డిశంబరువరకును ఆ తీర్మాన మమలుజరుపబడనేలేదు. అసహాయోద్య

మమునకు సంబంధించిన నూతన తీర్మానములు వంగ మహారాష్ట్రదేశములవారిచే సరిగా ఆదరింపబడలేదు. లోకమాన్యుని సహాధ్యాయుడు జి. యస్. కపర్దే కలకత్తా ప్రత్యేకకాంగ్రెసు తీర్మానమునుగూర్చి ఒక ప్రకటనముచేసెను. అందులో "కాంగ్రెసు రాజకీయవిషయములను మరచిపోయి ప్రజలదృష్టిని ఆత్మబలము, నైతికజీవితములవంకకు మరల్ప ప్రయత్నిస్తూన్నది. నూతన శాసనసభలతో సంబంధమును విడనాడినందువలన ప్రజలకు రాజకీయశిక్షణమును పొందుటకుకానీ, న్యాయమార్గముల రాజకీయ పోరాటమును జరిపించుటకుకానీ తగిన అవకాశము పోయినది. ఇప్పుడు బోధింపబడే అసహాయోద్యమమూలకముగా సహనశక్తి అభివృద్ధి పొందవచ్చును. కాని రాజకీయ సంగ్రామమును నడపుటకు తగిన వివేకముగాని, శక్తిసామర్థ్యములుగాని ప్రజలకు కలుగవు. నేను సిఫారసుచేయబడిన మూడు బహిష్కారములును నిరర్థకములు. వాటిలో రాజకీయప్రయోజన మేమియు లేదు. అఖిలభారతహోమురూలు లీగుయొక్క సిద్ధాంతమును మార్చే ప్రయత్నములను పట్టిచూడగా, నాయకులు నిరంకుశప్రభుత్వమువంకకు ప్రజలదృష్టిని మార్చబోతూన్నట్లు కనిపించును. ప్రస్తుతము "స్వరాజ్యసభ" అని పిలువబడే అఖిలభారత హోముమూలులీగు గాంధీవంటి ఉదారనైతికాశయములుగల మహాపురుషుని స్వాధీనములోనే ఉండవచ్చుగాక. అది కూడా నేటి ప్రజాప్రభుత్వ సిద్ధాంతమునకు విరుద్ధమయినదనీ, అభ్యంతరమయినదీ" అని వ్రాయబడెను.

ఈ ప్రకటనము ౧౯౨౦ డిశంబరు ౧౯ వ తేదీనాటిది. సరిగా నాగపురము కాంగ్రెసుసమయమున కది ప్రచురింపబడినది. అందులో గాంధీచే హోమురూలు సభాసూత్రము మార్పు చేయబడుటయు, స్వరాజ్యసభ స్థాపింపబడుటయు ప్రజలు గమనింపవలెనని కోరబడినది. అసలు నిజమేమిటనగా, కలకత్తా ప్రత్యేకకాంగ్రెసులో అసహాయోద్యమతీర్మాన మంగీకరింపబడునో, లేదో అని సందిగ్ధస్థితిలో నున్న సమయమున గాంధీ హోమురూలుసభ్యులందరినీ ఒకచోటుకు చేర్చి, హోమురూలు సభాసూత్రమును మార్పించి, దానికి "స్వరాజ్యసభ" అని నామకరణము నొసగెను. కాని కలకత్తాలో నాన్‌కోఆపరేషన్ తీర్మాన మంగీకరింపబడి, నాగపురములో బలపరుపబడుటవలన యీసభ పనిచేయవలసిన అగత్యమే లేకపోయినది. క్రొత్తగా ప్రచారములోకి వచ్చిన అసహాయోద్యమమును తీవ్రముగా ఎదిరించిన వంగ, మహారాష్ట్ర దేశములలోని ప్రధాననగరములలో వరుసగా జరిగిన రెండుకాంగ్రెసులలోను ఆతీర్మాన మామోదింపబడుట చాలా విచిత్రమైన సంగతి.

## నాగపురపు కాంగ్రెసు, ౧౯౨౦

అసహాయోద్యమకార్యక్రమము పూర్తిగా చర్చింపబడి విస్పష్టవివర నిర్ణయము చేయబడవలసినచోటు నాగపురపుకాంగ్రెసు. ఆ కాంగ్రెసుకు వచ్చినంతమంది ప్రతినిధులు అంతకు పూర్వము జరిగిన కాంగ్రెసులకుగాని, తరువాత జరిగిన కాంగ్రెసులకు గాని రాలేదు. వారి సంఖ్య ౧౪౫౮౨. అందులో ౧౦౫౦ మంది మహమ్మదీయులు, ౧౬౯ మంది స్త్రీలు. దక్షిణాదిని సుప్రసిద్ధ కాంగ్రెసువాదియై సేలమునగరమున నివసిస్తూవున్న సి. విజయరాఘవాచారి ఆ కాంగ్రెసు కధ్యక్షుడు. హోల్ ఫోర్డునైటు వెడ్జివుడ్ గారులు ఇంగ్లండులోని కార్మికపక్షమునుండి ఆ కాంగ్రెసుకు సోదర ప్రతినిధులుగా దయచేసి లేబరుపక్షమువారి ఆశీర్వాద, సానుభూతులను జాతీయమహాసభవారి కందచేసిరి.

కలకత్తా ప్రత్యేకకాంగ్రెసు కధ్యక్షత వహించినవారు నాన్‌కోఆపరేషనుకు ప్రబలశత్రువైన లాలా లజపతిరాయలు. ఆయన గొప్పసంఘసంస్కర్త. విద్యాసంస్కరణవాది. దయానంద ఆంగ్లో వేదకళాశాల ఆయనసృష్టి. కాని గురుకులముకాదు. ఆయన జీవితకాలమంతయు ప్రభుత్వమువా రాయనను అనుమానించిరి. ఆయనపైన నిగాయుంచిరి. యుద్ధసమయములో ఆయనను విదేశమునుండి స్వదేశమునకు ప్రభుత్వమువారు రానీయలేదు. కాని ఆయనకుమాత్రము మెప్పటను ప్రభుత్వసంబంధమును వీడుటయందు విశ్వాసములేదు. కాని శ్రద్ధానందస్వామిమాత్రము కొత్త ఉద్యమములోకి హృదయపూర్వకముగా దూరికెను.

నాగపురపు కాంగ్రెసున కధ్యక్షులయిన సి. విజయరాఘవాచార్యులవారే అసహాయోద్యమము కేవలము పంజాబు ఖిలాఫత్ అన్యాయముల నివారణకొరకేగాక స్వరాజ్యసంపాదనముకొరకుకూడ ప్రయోగింపబడవలెనని సూచించిరి. గాంధీ వెంటనే అంగీకరించెను. నైతికముగా ఏసందర్భములోనైనను రౌలటుచట్టము విషయములో కాని, ఖిలాఫత్ అన్యాయమువిషయములో కాని, పంజాబు దురంతముల విషయములో కాని- సత్యాగ్రహము, సాత్వికనిరోధము, అసహాయోద్యమములలో దేనిమూలమునైనను మన కొకసారి జయము చేకూరినయెడల ఆ జయమువలన భారతజాతి కాత్మవిశ్వాసము కలుగగలదు. ట్రాన్సువాల్, చాంపరాములలో నడుపబడిన ఉద్యమములకు కలిగిన ఫలిత మదియే. విజ్ఞానవంతులైన భారతీయులు హేతువాదము ననుసరించి ప్రవర్తింతురు. కాబట్టి విజయరాఘవాచార్యులవంటి విజ్ఞానమూర్తి తన సూచన కనుగుణముగా చక్కని హేతువాదమును ప్రకటించెను. కలకత్తాలోకంటె నాగపురములో గాంధీకి ఒక్క ప్రయోజనముమాత్రము కలిగినది. ఇక్కడ అధ్యక్షుడయిన

విజయరాఘవాచారికి అసహాయోద్యమమునందు సరతిల్లిప్రేమ యున్నప్పటికినీ ఆయన గాంధీకి ఆటంకములు కలిగింపలేదు. అంతేకాక, తన కనుకూలముగా లేని తీర్మానము బహిరంగసభలో నెగ్గుకు వచ్చినప్పుడెల్ల తన అగ్రాసనస్థానమును ఖాళీ చేస్తూవచ్చెను.

చిత్తరంజనదాసు అస్సాము, తూర్పు బంగాళములనుండి ౨౫౦ మంది ప్రతినిధులను తీసుకొనివచ్చెను. వారి రాకపోకలఖర్చు తానే భరించెను. కలకత్తాలో జరిగిన తీర్మానమును నాగపురములో రద్దుచేయించుటకు ఆయన తనచేతి సొమ్ము రు. ౩౬౦౦౦ లు వెచ్చించెను. ఆయన తెచ్చిన ప్రతినిధులకును, ఆయన ప్రతికక్షి జితేంద్రలాలుబెనర్జీ తెచ్చిన ప్రతినిధులకును చిన్న యుద్ధముకూడ జరిగినది. మహారాష్ట్ర ప్రతిఘటనముకూడా యింత బలవత్తరముగానూ యుండెను. కల్నల్ వెడ్జివుడ్డు, పెన్నూర్. హోలఫోర్డునైటులు విషయనిర్ధారణసభకు హాజరైరి. వెడ్జివుడ్డు అసహాయోద్యమమునకు వ్యతిరేకముగా తన వాచబలమునంతయు వినియోగించెను. కాని ప్రయోజనము లేకపోయినది. ఖద్దరునిబంధనము మరింత బిగింపబడినది. నాన్‌కోఆపరేషన్‌తీర్మానము తిరిగీ బలపరుపబడినది. కాంగ్రెసు ప్రధానసూత్రము "బ్రిటిషు సంబంధమును విడనాడునట్టిదిగాను, శాసనబద్ధమయిన ఆందోళనాపద్ధతిని విరమించునట్టిదిగాను" మార్పుచేయబడినదని ప్రభుత్వమువారు తలంచిరి. నాగపురముకాంగ్రెసు గాంధీకి స్వీయవిజయము. కాంగ్రెసుపెద్దలందరును మహానాయకులును, కాంగ్రెసు మూలపురుషులునుకూడా ఆశ్చర్యచకితులై ఒకరితో నొకరు "ఇంత అధికారములో మాట్లాడగలిగిన ఈయన ఎవరు? ఎక్కడనుండి వచ్చినాడు?" అని గాంధినిగూర్చి చెప్పుకొనసాగిరి. పాల్, మాలవ్యాలవంటి ఉత్తమదేశభక్తులు, జిన్నా, కపర్దేలవంటి నిష్కళంక జాతీయవాదులు, దాసు, లాలాజీలవంటి మహానాయకులు, అందరును గాంధీశక్తికి దిగ్భ్రమచెందిరి. అటువంటిసందర్భములో గాంధీపైన మన రాజకీయ నాయకుల కసూయాభావము కలుగలేదన్నచో అది వారి ఉత్తమదేశభక్తికిచిహ్నము.

నాగపురపు కాంగ్రెసుకు సంబంధించిన ఫలితములను ఆ కాంగ్రెసు తీర్మానముల మూలకముగా జాతీయమహాసభయొక్క పృథక్పూర్వములలో కలిగిన మార్పులను ఇక్కడ వివరింతుము. అప్పుడనే కాంగ్రెసునిర్మాణవిధానమున్ను, ప్రధానసూత్రమున్ను కూడ మార్పుచేయబడినవి. నాన్‌కోఆపరేషన్ తీర్మాన మామోదింపబడుటయే నాగపురములో కలిగిన గొప్ప ఫలితము. అందులో ఆతీర్మానము చిత్తరంజనదాసుచే ప్రతిపాదింపబడి, లాలాలజపతిరాయిచే ఆమోదింపబడినదన్నచో దానిగొప్పతనము ద్విగుణీకృతమైనది.

కలకత్తాలోకంటె గాంధీకి నాగపురములో బల మెక్కువయినది. కలకత్తాలో గాంధీకి సహాయముచేసిన ప్రధానరాజకీయవేత్త పండిత మోతీలాల్ నెహ్రూ. ఆయన కూడ కాంగ్రెసుచివరభాగములో "కళాశాలలు, న్యాయస్థానముల బహిష్కరణము క్రమక్రమముగా ఆచరణలోకి రావలయు"నని తెచ్చిన తన సవరణము గాంధీ అంగీకరించినతరువాత అసహాయోద్యమతీర్మానమును బలపరచెను. కాబట్టి అప్పటికా ఉద్యమము ఒంటికాలిమీద నిలిచియుండెను. నేడు నాగపురములో దానికన్ని వైపులనుండీ సహాయము వచ్చినది. గాంధీ నెహ్రూలు, దాసు లాలాజీలుకూడ దానికనుకూలముగా నుండిరి. ఆ తీర్మానము దీర్ఘముగాను, సమగ్రముగా నుండెను. గాంధీచే ప్రతిపాదింపబడిన నాన్‌కోఆపరేషన్ తీర్మానముల కన్నింటికిని అదే స్వభావము. ఆయన సాధారణముగా తన తీర్మానములకు సవరణల నంగీకరించడు. ఆరోజులలో ప్రతి తీర్మానమునకును సవరణను ప్రతిపాదించే పద్ధతి విద్యాధికుల కాచారముగా నుండెను. గాంధితీర్మానములకుకూడ మొట్టమొదట సవరణలు ప్రతిపాదింపబడినవి. కాని ఏసవరణయైనను ఆయనతీర్మానములకు మెరుగుపెట్టజాల దని కాంగ్రెసువాదులు చాలామంది కొద్దికాలములోనే తెలుసుకొనిరి. ఎవరైనను న్యాయమయిన సవరణను సూచించినప్పు డాయన తత్క్షణము దానిని గ్రహించును. నాగపురములో అంగీకరింపబడిన నాన్‌కోఆపరేషన్ తీర్మానము దాదాపు కలకత్తాలో అంగీకరింపబడినదానికి నకలే. బిరుదులను విడచిపెట్టుట మొదలుకొని పన్నులను నిరాకరించుటవరకును ఆ తీర్మానములో ఉదాహరింపబడెను. దానిప్రకారము వర్తకులు క్రమక్రమముగా విదేశవ్యాపారమును బహిష్కరింపవలసియుండెను. నూలు వడుకుట, బట్టలనేతలు ప్రోత్సహింపబడవలసియుండెను. ప్రజలందరును జాతీయోద్యమముకొరకు సాధ్యమయినంత స్వార్థత్యాగము చూపవలసియుండెను. భారతజాతీయసేవకులను సమకూర్చవలసినదనీ, అఖిలభారత తిలక్ స్మారకనిధిని వసూలుచేయవలసినదనీ తీర్మానింపబడెను. శాసనసభల కెన్నుకొనబడిన సభ్యులను రాజీనామా యియ్యవలసినదనీ, ప్రజలు శాసనసభ్యులనుండి ఎట్టి సహాయమును కోరరాదనీ సూచింపబడెను. ప్రజలును, పోలీసువారును, సైనికులును పరస్పర స్నేహభావమును కలిగియుండుట ఆ కాంగ్రెసు గుర్తించినదనీ, ప్రభుత్వోద్యోగులు ప్రజలలో వ్యవహరించేటప్పుడు ఎక్కువదయగాను, న్యాయముగాను ప్రవర్తింపవలసినదనీ తీర్మానింపబడినది. అసహాయోద్యమసమావేశములకు ప్రభుత్వాధికారులింకను బహిరంగముగాను, నిర్భయముగాను హాజరుకావలె నని కోరబడిరి. నాన్‌కోఆపరేషన్ ఉద్యమమునకు అహింస ఆయువుపట్టని నొక్కివక్కాణింపబడినది. మాటలోను, క్రియలోనుకూడ అహింసాతత్వము ప్రధానాంశ మని సూచింపబడినది. హింస ప్రజాపాలనపద్ధతికి విరుద్ధముగుటయేకాక తక్కిన అసహాయోద్యమరంగములకు అత్యం

తరముగాకూడా ఉండగలదని నిర్ణయింపబడినది. అన్ని ప్రజాసంస్థలును సాధ్యమయినంతవరకు ప్రభుత్వముతో అహింసాపూర్వకమయిన అసహాయతత్వమును పెంపొందింపవలెననీ, ప్రజలుమాత్రము తమలో తాము పరస్పరసహకారము నభివృద్ధిపరచుకొనవలెననీ ఆ తీర్మానములో ప్రబోధింపబడినది. ఈ విధముగా మార్పుచెందిన వాతావరణములో ఇండియాలోను, విదేశములలోనుకూడ భారతదేశ రాజకీయపరిస్థితులను గూర్చిన నిజమైనవార్తలు ప్రచారముచేయబడవలసిన అవసర మున్నప్పటికిని సీమలో ప్రచురింపబడుతూన్న "ఇండియా" అనే వారపత్రికను ఆపివేయవలసివచ్చినది. ఐర్లెండుదేశవిముక్తికొరకు ౭౫ రోజులు ఉపవాసముచేసి స్వర్గస్థుడయిన దేశభక్తుడు మాక్స్వినీని స్మరిస్తూ మరియొకతీర్మానము చేయబడినది.

ఈ సందర్భములో ఐర్లెండుదేశస్వాతంత్ర్యముకొరకు దేశీయులు పోరాడిన విధానమువలననూ, ఈజిప్టులో మిల్నర్ కమిటీవారికి జరిగిన సంపూర్ణ బహిష్కారము వలననూకూడ భారతదేశమునకు బ్రిటిషుప్రభుత్వముతో గట్టి పోరాటము పెట్టుకొనవలెననే ధైర్యము కలిగినదని చెప్పినయెడల అప్రస్తుతము కాదు. కాని ఐర్లెండులో హింసాపద్ధతు లవలంబింపబడగా భారతదేశములో అహింసా మార్గములు చేపట్టబడినవి. కల్నల్ వెడ్జివుడ్డు నాగపురమువిషయనిర్ధారణసభలో అధ్యక్షుని అనుమతిమీద ఉపన్యసించుటకు లేచి అసహాయోద్యమతత్వమువలన కలిగే దుష్ఫలితములను వెల్లడించెను. "సీమలోని మీస్నేహితులు మీకొరకు చేయదలచుకొన్న పనిని మీరు కఠినతర మొనరించుచున్నారు. మీపనికి అనేక ఆటంకములు కల్పింప బడగలవు. పోలీసువారు మిమ్ములను వెంటాడుదురు. ప్లీడర్లు రాజభక్తులుగా నుందుమని ప్రభుత్వమువారికి ప్రమాణపత్రములను వ్రాసియిత్తురు. కాబట్టి వారు నాన్ కోఆపరేషన్ లో పనిచేయ వీలులేదు. మీ రగాధములో ఉరుకుతూన్నారు. మీ రింతకంటె నిర్మాణకార్యక్రమమును కొనసాగించుట మంచిది" అని యీవిధముగా ఆయన పావుగంటసేపు నిష్కళంకమయిన సద్భావముతోను, నిర్నిద్రమయిన మిత్రభావముతోను కఠినముగా మందలించెను. ఆయన ఉపన్యాసవేదికనుండి దిగెనో లేదో తక్షణ మాయనఅభ్యంతరములకు ప్రత్యుత్తరముగా ఒక కంఠధ్వని వినబడినది. అది ఈక్రిందివిధముగానుండెను: "మాకు భారతదేశమువెలుపల స్నేహితులు లేరు. దానినిగూర్చి ఎవరును పొరపాటు పడవలదు. మామోక్షము మాచేతులలోనే ఉన్నది. మాభవిష్యత్తును బాగుచేసుకొనుటకుగానీ, చెడగొట్టుకొనుటకుగానీ మాకే అధికార మున్నది. అది మేముగ్రహించిరయే యీ కార్యక్రమము నవలంబించినాము. భారతరాజకీయములలో పోలీసువారు మాకు క్రొత్తగాదు. మేము చిన్న పాఠశాలను స్థాపించేసందర్భములోకూడా వసూలుచేసిన ప్రతిరూపాయి పోలీసులపోగావారి నీడక్రిందనే వసూలుచేసినాము. ఇది మా జరిగిన ౧౫ సంవత్సర

ముల అనుభవము. నిజమే, లాయర్లు రాజభక్తులుగా ఉందుమని ప్రమాణముచేయవలసి ఉన్నది. కాబట్టే వారి పట్టాలను చించివేయవలసినదని మేము కోరినాము. మే మగాధ ములోకి ఉరుకుతూన్నమాట నిజమే. మా కా సంగతి తెలుసును. బానిసదేశమునుండి స్వర్గతుల్యమయిన స్వతంత్రభూమికి పోయే మార్గ మెప్పుడును అగాధముగాను, కంటక భూయిష్ఠముగానే ఉండును. మనుష్యులను అసత్యపథమునుండి సత్యమార్గమునకును అంధకారమునుండి వెలుతురుకును, మృత్యుదశనుండి జీవితావస్థకును తీసుకొనిరాగలిగిన ఆ మహానాయకునిలో నాకు సంపూర్ణవిశ్వాస మున్నది."

మారకపు తికమకలమూలమున భారతదేశమునకు కలుగుతూన్న ఆర్థికనష్ట ములను గురించికూడ నాగపురములో తీవ్రమయిన చర్చజరిగినది. బ్రిటిషు ప్రభుత్వ మువారా నష్టమును పూరింపవలె నని తీర్మానింపబడినది. ఆ కాంగ్రెసులో జరిగిన అయిదవ తీర్మానములో "ప్రస్తుతపు మారకపురేట్ల ప్రకారము బ్రిటిషువస్తువుల వ్యా పారముచేసే భారతీయవర్తకులు తమకాంట్రాక్టులను రద్దుచేసుకొనినను నీమాడ పాప ముకే" దని సూచింపబడినది. కొనాటు ప్రభుని గౌరవార్థము చేయబడే ఉత్సవములలో గాని, తదితర సమావేశములలోగాని ప్రజ లెవ్వరును పాల్గొనరాదని తీర్మానింపబడినది. కార్మికులు తమఉద్యమమును ట్రేడుయూనియనుల ద్వారా వ్యాప్తికావించుకొనుటకు ప్రోత్సహింపబడిరి. ఆహారపదార్థముల ఎగుమతి నిరసింపబడినది. న్యాయమయిన విచారణ జరిగిగాని, జరుగకగాని శిక్షింపబడినట్టి, అరెస్టుచేయబడినట్టి రాజకీయ ప్రచారకులకు సానుభూతి చూపబడినది. ఢిల్లీ పాంచాలరాష్ట్రములలోను, తదితర ప్రాంతములలోను నిర్బంధవిధానము తిరిగీ ప్రారంభింపబడుట గమనింపబడినది. ప్రజలు దానిని ధైర్యముతో భరింపవలెనని కోరబడిరి. సంస్థానాధిపతులు వారి రాజ్యములలో వెంటనే సంపూర్ణబాధ్యతాయుతప్రభుత్వమును స్థాపించుటకు ప్రార్థిం పబడిరి. ప్రభుత్వమువారు బి. జి. హార్నిమన్‌ను ఇంకా భారతప్రజలకు దూరముగా నుంచుట నిరసింపబడినది. ఆయనకు భారతదేశపుకృతజ్ఞత ప్రకటింపబడినది. ఇషర్ కమిటీవారి సిఫార్సులు భారతదేశముయొక్క బానిసత్వమును, అశక్తతను ఎక్కువచేయుటకే ఉద్దేశింపబడినట్లుగా తలంపబడి నిరసింపబడినది. గోహత్యమాన్పింప తీర్మానించినందుకు ముసల్మానులకు కృతజ్ఞతాభివందనము లర్పింపబడినవి. పశువు లను, తోళ్లను విదేశముల కెగుమతి చేయకూడ దని ప్రజలు కోరబడిరి. ఉచితవిద్యా విధానమును, దేశీయవైద్యమును ప్రోత్సహింప తీర్మానింపబడినది.

చిట్టచివరకు కాంగ్రెసునిర్మాణవిధానమునుగూర్చి తీర్మానింపబడినది. అందు లో కాంగ్రెసు ప్రథమసూత్రము మార్పుచేయబడినది. శాంతమును, న్యాయసమ్మతము

అయినను పద్ధతులమూలమున స్వరాజ్యమును సంపాదించుటయే భారతజాతీయ మహా సభోద్దేశముగా ప్రకటింపబడినది. కాంగ్రెసులో భాషాప్రయుక్తరాష్ట్రములు నిర్మింపబడినవి. మహాసభజరుగుటకు ముందుగా రెండుమూడురోజులు విషయనిర్ధారణసభ సమావేశము కావలెనని నిర్ణయింపబడినది. అందులో అ. భా. కా. సం. వారుమాత్రమే సభ్యులుగా నుండవలెనని పరిమితి యేర్పాటుచేయబడినది. అ. భా. కాం. సం. సభ్యత్వము ౩౫౦కి హెచ్చింపబడినది. అ. భా. కాం. సం. నుండి ఒక కార్యనిర్వాహకసంఘమేర్పాటుచేయబడినది. వారు ౧౫ మంది సభ్యులు. అందులోనే అధ్యక్షుడు, కార్యదర్శులు, కోశాధిపతులు కూడా ఉండిరి. కాంగ్రెసులో చేయబడిన తీర్మానముల కనుగుణముగా వీరే సంవత్సరముపొడుగునను కాంగ్రెసువ్యవహారములను నడిపింతురు. ఈ పద్ధతి కాంగ్రెసునిర్మాణమునందు తీవ్రమయిన మార్పును కలిగించి కాంగ్రెసును సజీవసంస్థగా నొనర్చినది. తరువాత తూర్పుదక్షిణ ఆఫ్రికాలలోని భారతీయులు తమహక్కులను సంరక్షించుకొనే నిమిత్తము పోరాడినవిధానమునకు వారు శ్లాఘింపబడిరి. తూర్పు ఆఫ్రికా భారతీయులు దౌర్జన్యరహితమయిన అసహాయపద్ధతిని అవలంబించినందుకు వారిచర్య ఆమోదింపబడినది. ఫిజీభారతీయు లిండియాకు త్రిప్పి పంపివేయబడినప్పుడు వారికి సహాయము చేయజాలనందుకు విచారము సూచింపబడినది. విదేశములలోని భారతీయులకు చేసిన సేవకు సి. యఫ్. ఆండ్రూసుకు కృతజ్ఞత ప్రకటింపబడినది.

# 2. అసహాయోద్యమ మహాప్రవాహము

## ౧౯౨౧

[నూతనయుగము-పాంచాలదురంతములనుగూర్చి కానాటుప్రభుని పశ్చాత్తాపము - భారతప్రభుత్వమువారి ,పశ్చాత్తాపము - అసహాయోద్యమమునకు ప్రజల సానుభూతి-(౧) లాయర్లు, (౨) విద్యార్థులు - అసహాయవాదులభృతి - బెజవాడ కార్యక్రమము - నిరోధపుటుత్తరువులు - నాన్‌కానాదురంతము - ఆదాయవ్యయపట్టిక - గాంధీ కీడింగు సంభావణములు - అలీసోదరుల క్షమాపణ - బెజవాడ కార్యక్రమ విజయము-విదేశవస్త్ర బహిష్కారము-పికెటింగు-క్రోధకారణము కలిగినప్పుడుకూడ అహింసావలంబనము - ధార్వారుకాల్పులు మాప్లా తిరుగుబాటు-కరాచీ ఖిలాఫత్ మహాసభ - కార్యసంఘ తీర్మానములను కాంగ్రెసుకమిటీలనువదించుట - యువరాజ బహిష్కారము - విదేశరాజ్యాంగతంత్రము - అలీసోదరుల నిర్బంధము - గాంధీ ఆ ఉపన్యాసమును పునశ్చరణ చేయుట-శాసనోల్లంఘన మంగీకరింపబడుట - అందుకు కావలసిన షరతులు నిర్ణయింపబడుట - చీరాల పేరాల - మాప్లా తిరుగుబాటులోని కొన్ని వివరములు - యువరాజు భారతదేశమును దర్శించుట - విదేశవస్త్రదహనము - స్వచ్ఛందసైనికోద్యమము - ౧౯౨౧ డిశంబరులోని రాజీరాయబారములు - మాలవ్యాపండితుడు దాసును ఖైదులో చూచుట - దాసుషరతులు - గాంధీ షరతులు - రాయబారములు భగ్నములగుట - రాజుగారి సందేశము - అహమ్మదాబాదు కాంగ్రెసు అధ్యక్షుడు జైలుకు పంపబడుట - హకీము అజ్మల్ ఖాన్ అధ్యక్షుడగుట - వ్యక్తి శాసనోల్లంఘనముక్రింద ౩౦౦౦౦ మంది జైలుకు పంపబడుట - సమష్టి శాసనతిరస్కారములనుగూర్చి యోజింపబడుట- భారతజాతి భయమును వీడుట - అహమ్మదాబాదుసభలోని ప్రధానవిషయములు - విదేశవస్త్ర దహనమునకు ప్రతికూలముగా సి. యఫ్. ఆండ్రూసు సందేశము - మహాసభ - దాసుఉపన్యాసము సరోజినీదేవి చదువుట-ప్రధాన తీర్మానము - అసహాయోద్యమ నిర్వచనము - అసలు తీర్మానము-దానికి సంపూర్ణ స్వాతంత్ర్యమునుగూర్చిన హజరత్ మోహానీ సవరణ - గాంధీప్రతికూలత - తదితర తీర్మానములు - కాంగ్రెసు ఉలేమా సభలు.]

నాగపురపు కాంగ్రెసు నిజముగా భారతదేశచరిత్రలో నూతనయుగ ప్రారంభిక మయినది. నాటితో కార్యరూపము తాల్చని క్రోధభావములును, గౌరవప్రద ములుకాని ప్రార్థనలును రూపుమాసినవి. ప్రజలలో నూతనబాధ్యత, ఆత్మవిశ్వాసములు విజృంభించినవి. ప్రజలు స్వాతంత్ర్యమును సంపాదింపవలెనన్నచో వారే నిరంకుశ ప్రభుత్వముతో పోరాడుటకు సంసిద్ధులుగా నుండవలెనని తెలిసివచ్చినది. వారు స్వార్థ త్యాగ మొనరింపవలెనని కోరబడిరి. దానికి వారు సంతోషముగా అంగీకరించి ముం దడుగువేయ ప్రారంభించిరి. నాగపురము కాంగ్రెసు భారతజాతిపైన మహాభార ముంచినది. కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమువారి సలహాతో అ. భా. కాం. సం. తనధర్మనిర్వహణమునకు పూనుకొన్నది. ౧౯౨౦ చివరలోను, ౧౯౨౧ ప్రారంభము నను కల భారతదేశ పరిస్థితులనుగూర్చి కొంచెముసేపు యోజింతము. ౧౯౨౦ చివ రలో మితవాదులు కాంగ్రెసుతో పూర్తిగా సంబంధమును వినర్జించుకొనిరి. రెండవ మితవాది మహాసభలో చింతామణి మహోపన్యాసముచేసెను. సురేంద్రనాథ బెనర్జి 'సర్' బిరుదాంకితు డయ్యెను.

సిన్హాప్రభువు బీహారు, ఒరిస్సాలకు ప్రథమభారతీయగవర్న రయ్యెను. పాంచాలరాష్ట్రములో కొన్ని మాసములక్రిందటనే యావజ్జీవద్వీపాంతరవాసశిక్ష విధింపబడి, యావదాస్తి స్వాధీనపరచుకొనబడిన లాలా హరికిషన్ లాలువంటి మనిషి ౧౯౨౧ ప్రారంభదశలో నూతనమంత్రివర్గమునందు సభ్యుడయ్యెను. జార్జిచక్రవర్తి యొక్క పినతండ్రి కానాటుప్రభువు భారతీయులను ఓదార్చి నూతనయుగమును ప్రా రంభింపవలసినదిగా సీమనుండి ఇండియాకు పంపబడెను. ఆయన,

"క్షతగాత్రమయిన భారతదేశమునకు పరిచర్య చేయుటకును, ఆంగ్లేయు లకును, భారతీయులకును కలిగిన మనస్పర్థలను నిర్మూలించి సంఘీభావము కుదుర్చుట కును నాజీవితములో నా కొక అవకాశము లభించినది. భారతీయులకు పురాతన మిత్రుడనైన నేను బ్రిటిషువారును, భారతదేశప్రజలును తమతమ అపోహలను, ప్రమా దములను మరచిపోవలెననీ, క్షమింపవలసిన సందర్భములలో క్షమింపవలసిన దనీ సవినయముగా కోరుచున్నాను. మీ రుభయులును కలసి పనిచేసేయెడల యీనా ముద యించే మీ ఆసలు సఫలీకృతములు కాగలవు." అని చక్కని ఉపన్యాసము చేసెను.

తరువాత పంజాబుదురంతములనుగూర్చి భారతశాసనసభలో చర్చకు వచ్చెను. ప్రభుత్వపక్షమున సర్ విలియమ్ విన్సెంటు పంజాబులో జరిగిన దురంత ములకు తన పశ్చాత్తాపమును వెల్లడించెను. ఇంక నెప్పటికిని అటువంటి దురాగత

ములు జరుగకుండునట్లు ప్రభుత్వమువారు యావచ్ఛక్తినీ వినియోగింతురని హామీ యీయబడెను. ఇది జరిగినతరువాత తీర్మాన ప్రతిపాదకుడు తన తీర్మానములో అధికారదుర్వినియోగము చేసిన ఉద్యోగస్థులను శిక్షింపవలసినదని వ్రాసినభాగము నుప సంహరించుకొనెను. డయ్యార్ సేనాని సేనానాయకత్వమునుండి తొలగింపబడెను. అందువలన అతని పింఛను పోయినమాట నిజమే. కాని భారతదేశములోనున్న ఆంగ్ల స్త్రీలాయనకు ౨౦౦౦౦ పౌనులు బహుమతిచేసిరి. ఆయనను ఆంగ్లేయుల రక్షకుడని శ్లాఘించిరి. ఆయనకొక ఖడ్గము నిచ్చి వారు బహూకరించిరి. ఇందుమూలమున ఆయన పోగొట్టుకొనిన పింఛనుకంటెను, సేనానాయకత్వముకంటెనూ కూడ ఎక్కువ విలువగల గౌరవము లభించిన దనేమాట నిస్సంశయము. కల్నల్ జాన్సన్‌కు కలిగిన నష్టములకుకూడ తగిన పరిహారము కలిగినది. డయ్యారుతరువాత అతి క్రూరముగా ప్రవర్తించిన దీయనే. ఈయన కిండికూలోనున్న ఒక వాణిజ్య సంస్థలో ఉద్యోగ మీయబడెను. అందుమూలమున ఆయనకు తగిన ప్రతిఫలము ముట్టినది. కానాటుప్రభుని ఉపన్యాసముగాని, ప్రభుత్వపక్షమున హోమ్‌మెంబర్ సర్ విలియమ్ విన్సెంటు చూపిన పశ్చాత్తాపముగాని భారతీయుల గాయములను మాన్ప సమర్థములు కాలేదు. నాగ్‌కో ఆపరేషన్ దేశమునందు ప్రచారములోకి వచ్చినది. కాని ఒక సంగతిమాత్రము జరిగినది. ౧౯౨౧ ప్రారంభదశలో నిర్బంధశాసనములనుగూర్చి విచారించవలసిన దని కేంద్రశాసనసభవారొకకమిటీని నియమించిరి. వారు ౧౯౨౨ ప్రారంభమునాటికి ఒక్క క్రిమినల్‌లా సవరణచట్టమునుతప్ప తక్కిన అన్ని చట్టములను రద్దుచేసిరి. కాని యీ పైపై శైత్యోపచారము లన్నియును భారతీయుల హృదయక్షతములను స్పృశింపనయినను లేకపోయినవి. వాటికి తగిన నివారణోపాయములను కాంగ్రెసే ఆలోచింపవలసి ఉండెను. అంతేకాని పూర్వమువలె రాజప్రకటనల మూలముగాగాని, నిర్బంధశాసనములు రద్దుచేయబడుట మూలమునగాని వారికి మనశ్శాంతి కుదురదు.

నాగపురపు కాంగ్రెసుకు ప్రజలు విశేషముగా సహాయ మొనర్చిరి. వోట్ల నిరాకరణములో సంపూర్ణవిజయము కలిగినది. కళాశాలల, న్యాయస్థానముల విషయములో అంత జయప్రదముగాలేదు. కాని వాటి ప్రతిష్ఠమాత్రము చాలా తగ్గిపోయినది. అనేకమంది వకీళ్లు తమవృత్తిని పరిత్యజించి హృదయపూర్వకముగా అసహాయోద్యమములోకి దుమికిరి. జాతీయవిద్యావిషయములో అనుకొన్నదానికంటెకూడ యెక్కువ విజయము చేకూరినది. ప్రభుత్వ పాఠశాలలను బహిష్కరించిన విద్యార్థు లెక్కువమంది లేనప్పటికినీ జాతీయ విద్యాప్రచారముమాత్రము శ్రద్ధగా జరిగినది. గాంధీమహాత్ముడు యువకులలోని దేశాభిమానమును, పౌరుషమును చంపివేస్తూన్న ప్రభుత్వ పాఠశాల

అను చితపాడి మాతృదేశ సేవకొరకు నడుములు కట్టవలసినదని ఉత్తేజకరముగా పంపిన సందేశము భారతీయయువజనుల హృదయముల నాకర్షించినది. ఈ సందర్భమున కేవలము పాఠశాలాబహిష్కార విధానమే అవలంబింప బడలేదు. దేశములోని వివిధ భాగములయందును జాతీయ విశ్వవిద్యాలయములు, జాతీయకళాశాలలు, జాతీయ పాఠశాలలు నిర్మింపబడినవి. పాంచాలము, బొంబాయి, సంయుక్తరాష్ట్రములలో విద్యార్థుల ఉద్యమము తీవ్రముగా సాగినది. వంగరాష్ట్రమంతకంటె ముందుకువేసినది. ఆసంవత్సరమున్నరలోను కలకత్తానగరము విస్మరింపరాని అద్భుతవిషయములను ప్రదర్శించినది. జనవరిమధ్యలో దేశబంధు చిత్తరంజనదాసుఆదేశము ననుసరించి వేలకొలది విద్యార్థులు కళాశాలలను, పరీక్షలను విడిచిపెట్టిరి. గాంధీ ఫిబ్రవరి నాల్గవ తేదీని కలకత్తానగరమును దర్శించి జాతీయకళాశాలకు శంకుస్థాపనముచేసెను. పాటలీపుత్రమునకు గాంధీ రెండవసారి.పోయినప్పుడు, అదివఱకునుండీ సాగుచున్న జాతీయ కళాశాల ఆయనచే లాంఛనముగా ప్రారంభింపబడెను. బీహారు విద్యాపీఠమును కూడా మహాత్ముడే ప్రారంభించెను. జాతీయ విద్యావిధానమున కీయబడిన ప్రోత్సాహము మూలమున నాలుగునెలలకంటె తక్కువకాలములో అలిఘర్‌లోని మహమ్మదీయ జాతీయ విద్యాపరిషత్తు, గుజరాతు విద్యాపీఠము, వంగజాతీయ విశ్వవిద్యాలయము, తిలక్ మహారాష్ట్ర విద్యాపీఠములు స్థాపింపబడుటయేకాక దేశములో అనేకచోట్ల అనేకతరగతుల జాతీయపాఠశాలలు వేలకొలది విద్యార్థులతో ప్రారంభింపబడినవి. ఆంధ్రదేశమునందు ౧౯౦౬ లోనే వెలిగింపబడిన జాతీయవిజ్ఞానదీపము మరొక్కసారి ప్రకాశవంతమై తేజోరాసులను వెదజల్ల ప్రారంభించినది. అసహాయోద్యమమున ప్రభుత్వ సంస్థలనుండి సంబంధమును తెంచుకొనిన విద్యార్థు లెందరో కలరు. ఆనాడు (౧౯౨౦-౨౧) విద్యార్థిదశను, ప్లీడరీవృత్తిని త్యజించినవా రెందరో నేడు రాష్ట్రీయ నాయకులుగను, మండలనాయకులుగను కాంగ్రెసు ఉద్యమమున పనిచేస్తూ ఉన్నారు. నాగపురపు తీర్మానము ననుసరించి, అ. భా. కాం. సం.కార్యనిర్వాహకవర్గమువారు ౧౯౨౧లో నెలనెలకు వివిధప్రదేశములలో సమావేశమయిరి. మొదటి అ. భా. కాం. సం. సమావేశము నాగపురములోనే జరిగినది. అందులో కార్యనిర్వాహకుల యెన్నిక చేయబడినది. కాంగ్రెసులోని ఇరవై ఒక్కరాష్ట్రములకును అ. భా. కాం. సం. లోని సభ్యులసంఖ్య నిర్ణయింపబడినది. బొంబాయిలో హోమురూల్ ఉద్యమమునకు సహాయపడిన "యంగ్ ఇండియా" అనే ఇంగ్లీషువారపత్రిక హోమురూలు సభ్యులచే గాంధీ వశము చేయబడినది. అది యిప్పుడు నాన్‌కోఆపరేషన్ ప్రచారము నిమిత్తముపయోగపడుచుండెను. హోమ్‌రూలు సభ విచ్ఛిన్నమయిపోయినది. నాగపురపు కాంగ్రెసుకు ఆహ్వానసంఘాధ్యక్షుడయిన సేట్ జమ్నాలాల్ బజాజు తిలక్ స్వరాజ్యనిధి నిమిత

మొక లక్షరూపాయలను సమర్పించెను. అది అసహాయోద్యమ మవలంబించిన ప్లీడరుల కొరకు వినియోగింపబడవలెనని ఆయన నిర్ణయించెను. జమ్నాలాలుబజాజు తన రావు బహదూరుబిరుదము నింతకుపూర్వమే త్యజించెను. ౧౯౨౧ జనవరి ౩౧ వ తేదీని కలకత్తాలో కాంగ్రెసుకార్యవర్గమువారు సమావేశమై తిలక్ స్వరాజ్యనిధి వినియోగమును గూర్చి నిబంధనలను తయారుచేసిరి. అందులో రాష్ట్రములనుండి వసూలుచేయబడిన విరాళములలో నాల్గవభాగము కాంగ్రెసుకార్యవర్గమువారికి ప్రత్యేకింపబడవలె నని తీర్మానింపబడెను. ఏప్లీడరును నెలకు నూరురూపాయలనుమించి పుచ్చుకొనకూడదనీ, ఏజాతీయసేవకుడును నెలకు యాభయిరూపాయలకంటె యెక్కువ తీసుకొన కూడదనీ నిర్ణయింపబడెను.

ఋణస్థులయినవా రెవరును జాతీయోద్యమమునందు వేతనము పుచ్చుకొని పని చేయువారుగా నుండకూడదని నిర్ణయింపబడెను. జాతీయ విద్యాప్రణాళిక వివరముగా తయారుచేయబడేలోపల బాలురకు హిందుస్థానీ భాషను, నూలువడుకుటను నేర్పింపవలెనని తీర్మానింపబడినది. గ్రామప్రచారకులకు తగినశిక్షణ మిప్పింపవలెనని నిర్ణయింపబడినది. చిత్తరంజనదాసు కార్మిక సంస్థలనుగూర్చి పనిచేయ కోరబడెను. యల్. ఆర్. లైర్ సీ ఆర్థిక బహిష్కార సంఘమునకు సమావేశకర్తగా నియోగింపబడెను. తరువాత ౧౯౨౧ మార్చి ౩౧, ఏప్రిల్ ౧ వ తేదీలలో బెజవాడపట్టణమందు అ. భా. కాం. సం. సభా, కార్యనిర్వాహకసభలు సమావేశమైనవి. కాంగ్రెసుకార్యవర్గమువారు పన్నుల నిరాకరణమున కింకను తరుణము రాలేదని నిర్ణయించిరి. ఈ బెజవాడలో సమావేశమయిన అ. భా. కాం. సం. సభలోనే స్వరాజ్యనిధికి కోటి రూపాయలు వసూలుచేయబడవలెననీ, కాంగ్రెసులో కోటిమంది సభ్యులుచేరవలెననీ, యిరువదిలక్షల రాటములచే పనిచేయించవలె ననీ నిర్ణయింపబడినది. ఇవి ఆయారాష్ట్రముల జనసంఖ్యనుబట్టి దామాషాగా సమకూర్పబడవలె నని ఏర్పాటు చేయబడినది. పంచాయితీలు నిర్మింపబడవలెననీ, త్రాగుబోతుతనము మాన్పింపబడవలెననీ ప్రత్యేకముగా తీర్మానింపబడినది. ఇటువంటి నిరపాయకరములైన సంస్కరణములు ప్రబోధింపబడినను ప్రభుత్వమువారు నాయకులపైన ౧౪౪, ౧౦౮ శెక్షనులక్రింద ఉత్తరువులను జారీచేయించిరి. అప్పటికి దేశీయు లింకను సరియైన ఆత్మనిగ్రహమునకును, కట్టుబాటులకును అలవాటుపడలేదనే హేతువుతో అ. భా. కాం. సం. వారు ప్రభుత్వమువారి ఉత్తరువులకు కాంగ్రెసువాదులు విధేయులుగా నుండవలసినదే కాని తిరస్కారము చూపరాదని శాసించిరి. నాన్ కానాహత్యలను అ. భా. కాం. సం. వారు ఘోరకృత్యముగా భావిస్తూ అందుమూలమున అత్యంత నష్టములనుపొందిన సిక్కులకు తమ సానుభూతిని వెల్లడించిరి. నిజమునకు మార్చి ౨ వ తేదీనాటికి దేశ ముద్రేక

పూరితమై ఉండెను. చిత్తరంజనదాసును మైమెన్‌సింగుకు పోకూడదనీ, మౌలానామ జాల్‌హాక్, రాజేంద్రబాబులను ఆరాకువెళ్ల కూడదనీ, యాకూబుహుస్సేనును కలకత్తాలో ప్రవేశింపరాదనీ, లజపతిరాయిని పేషావరు చేరరాదనీ నిషేధపు టుత్తరువులు జారీ చేయబడినవి. ఇంకా అనేకమందికి అనేక ఉత్తరువులు జారీచేయబడినవి. రాజద్రోహ సభాచట్టముక్రింద లాహోరునగరము శాసింపబడినది. కానీ యివన్ని నాన్‌కానా దురంతముముందు నేరములుగా పరిగణింపదగినవి కావు. మార్చి మొదటివారములో నాన్‌కానా గురుద్వారమున సమావేశమయిన నిరుద్రేకులను యాత్రికులపైన తుపాకులు పేల్చబడెను. ప్రజల అంచనాప్రకారము వారిలో మరణించినవారి సంఖ్య ౧౯౫. కాని ప్రభుత్వమువారి అంచనాప్రకారము ౭౦. రాజభక్తిపరుడైన మహంతు గృహమున ౪౦౦౦ తుపాకితోటాలును, ౬౫ రివాల్వరులును నిలువచేయబడినవి. ఒక పెద్ద గోతిలో గొప్పమంట వేయబడెను. ౫ వ మార్చి తేదీని ప్రజలకు సంబంధించిన వ్యవహారములను కొన్నింటిని పరిష్కరించుట కక్కడ ఒక సమావేశము జరిగెను. కొంత మంది బద్మాషు లీ ఘోరకృత్యమును కావించిరి. ఈ సందర్భమున మేజరు కర్రీ, కింగు అనే ఉద్యోగస్థు లిద్దర క్కడనుండి బదిలీచేయబడిరి. మహంతు ఎవరిమీద కసి తీర్చుకొనుట కీ భయంకరప్రయోగమును చేసెనో మనకు తెలియదు. అక్కడి పరిస్థితులు తెలుసుకొనతగినట్టివిగా లేవు. సామ్రాజ్యశాసనసభలో యీ సంఘటనమును గూర్చి తీర్మానము వచ్చినది. ప్రభుత్వమువారు దానిని సిక్కులలోని రెండు పక్షములకుచెందిన పోరాటమని చెప్పి సమర్థించిరి. ఈ సందర్భములో బక్షీ సోహన్ లాలుని సవరణపైన మాన్‌సింగు మాట్లాడుతూ యీ ఘోరకృత్యమును గూర్చి స్థానికాధికారులకు ముందే తెలిసి ఉండవచ్చునని సూచించెను. వెంటనే సర్ విలియమ్ విన్‌సెంటు హెయిలీదగ్గరకు పోయి ఆయనచెవిలో ఏదో ఊదెను. హెయిలీ అప్పు డెక్కడలేని ఆగ్రహము తెచ్చుకొని, ఆ ఘోరకృత్యములో ప్రభుత్వాధికారులకు జోక్యమున్నట్లు సూచించిన ఉపన్యాసకుని తీవ్రముగా నిరసించెను. మొత్తముమీద నాన్‌కానా ఘోరకృత్యమువంటి దురాగత మంతకుపూర్వ మెన్నడును జరిగిఉండలేదు. శాంతముగా నున్న యాత్రికులు కాల్చబడుటయేకాక కొనఊపిరితో నున్నవారు మండుతూన్న గోతిలోకి త్రోయబడిరి.

కాంగ్రెసుపుట్టిన మొదటి సంవత్సరములలో బ్రిటిష్‌కమిటీయే కాంగ్రెసుపనికి కేంద్రముగానున్న విషయమును, దాని సిబ్బందికొరకును, తదితరావసరములకొరకును చాలా సొమ్ము ఇచ్చింపబడిన విషయమును పాఠకులకు తెలుసును. చాలా సంవత్సరములవరకు సంవత్సరమునకు రు. ౬౦,౦౦౦ వరకూ కూడా బ్రిటిషు కాంగ్రెసు కమిటీ కాంక్షన్ చేయబడినది. నేను ఇంగ్లాండునుండి హిందూదేశమునకు కార్యరంగము

మారినది. బెజవాడలో "జరుగుచున్న సంవత్సరము"లోని మిగతా మాసములకు కావలసిన అధ్యక్షుడు, కార్యదర్శి, కోశాధిపతుల ఖర్చులనిమిత్తము రు. ౧౬,౦౦౦ లు శాంక్షన్ చేయబడినవి. అమెరికాలో భారత హోమురూలు లీగు పక్షములకు చెందిన డి. వి. యస్. రావుగారికి లజపతిరాయి, కేల్కారుల సిఫార్సుపైన వెయ్యి డాలర్లు పంపబడినవి. ఏప్రిల్ ౬-వ తేదీయున్నూ, ౧౩-వ తేదీయున్ను ప్రార్థనోపవాసములు చేయవలసిన రోజులుగా నిర్ణయింపబడినవి. అ. భా. కాం. సం. లో పూర్వాధ్యక్షులు కాక ౩౫౦ మందిసభ్యు లుండవలెనని అంగీకరింపబడినది. మే ౧౦-వ తేదీని కాంగ్రెసు కార్యసభ అలహాబాదులో తిరిగీ సమావేశమయినది. ఆసభలో అంత ముఖ్యవిషయము లేవీ జరుగలేదు. తరువాత జూన్ ౧౫-వ తేదీని బొంబాయిలో మళ్లీ ఆ సభ సమావేశమయినది. అందులో గాంధీ తనకును, వైస్రాయికిని జరిగిన సంభాషణమును గూర్చి ప్రసంగించెను.

వైస్రాయినీ, గాంధీనీ సమావేశపరచినది మాలవ్యాపండితుడు. రీడింగు ప్రభువు ౧౯౨౧ ఏప్రిల్ న వైస్రాయిగా వచ్చెను. ఆయన గాంధీతో సంభాషించినపిదప గాంధీ యొక్క సద్భావమును గ్రహించి అసహాయోద్యమమునకు ప్రతికూలముగ చర్య దీసుకొనుట వివేకము కాదని తెలుసుకొనెను. కాని ఆయుఃమాటల సందర్భములో గాంధీచే ప్రతిపాదింపబడిన అసహాయోద్యమ సిద్ధాంతమునకు విరుద్ధములుగా ఆలీ సోదరుల ఉపన్యాసములు కనపడుచున్నవని సూచించెను. ఆ ఉపన్యాసములలో దౌర్జన్యప్రోత్సాహము అంతర్గర్భితముగా నున్నదని వైస్రాయిభావము. గాంధీ మూర్తీభవించిన సత్యస్వరూప మగుటచే రీడింగుప్రభువు చెప్పిన విషయములను విచారించి, ఆలీసోదరుల ఉపన్యాసములలో హింసాపూర్వకమైన అర్థ మున్నట్లుగా అపోహకలుగుటకు వీలు కలదని అంగీకరించెను. వెంటనే ఆయన ఆలీ సోదరులకు వ్రాసి వారి కట్టి ఉద్దేశము లేదని ప్రకటింపించెను.

అసహాయోద్యమచరిత్రలో యీ క్షమాపణము నూతనశకప్రారంభక మయినది. భారతదేశములోని ఆంగ్లేయులు ప్రభుత్వమువారి విజయమునకు సంతుష్టాంతరంగులైరి. రీడింగుప్రభువు ఆ క్షమాపణకు సంతృప్తిచెంది వారిపై కేసు పెట్ట మానుకొనెను.

బొంబాయిలో జరిగిన కాంగ్రెసు కార్యవర్గసభలో రాజకీయ నేరములలో వాదించుకొనుటను గూర్చి స్పష్టీకరింపబడినది. నాన్ కో ఆపరేటర్లకు వ్యతిరేకముగా సివిల్ దావాగాని, క్రిమినల్ కేసుగాని దాఖలుచేయబడినప్పుడు వారు ప్రజలకు తమ నిరపరాధత తెలియపరచేటందుకు కోర్టు ఎదుట వాఙ్మూలము లిచ్చుటకన్న మరొకవిధముగా ప్రతివాదము పెట్టుకొనకూడదని నిర్ణయింపబడినది. క్రిమినల్ ప్రాసీజరుకోడు

క్రింద పూచీకత్తు కోరబడినసందర్భములలో ముద్దాయిలు పూచీక త్తీయ నిరాకరించి జైలుకు పోవలెనని నిర్ణయింపబడినది. అసహాయవాదమును అవలంబించిన ప్లీడర్లు కేసును పుచ్చుకొనిగాని, పుచ్చుకొనకగాని కోర్టులో వాదింపకూడ దని నిషేధింపబడిరి. ఆసమయములోనే అంగోరాలోని టర్కీ ప్రభుత్వముతో బ్రిటిష్ గవర్నమెంటు వారికి తగాదా వచ్చేటట్లు కనిపించినది. భారతదేశములోని ముసల్మానుల అభిప్రాయములను తృణీకరించి బ్రిటిష్‌ప్రభుత్వమువారు అంగోరా ప్రభుత్వముపైన దండెత్తే యెడల భారతసైన్యములోని ప్రతి సైనికుడును ప్రభుత్వమువారికి సహాయముచేయ నిరాకరించుట ధర్మమని కాంగ్రెసుకార్యవర్గమువారిచే తీర్మానింపబడెను.

౧౯౨౧ జూలై ౨౮, ౨౯, ౩౦ తేదీలలో బొంబాయినగరమున ఒక ముఖ్యమైన అ. భా. కాం. సం. సభ జరిగినది. బెజవాడ కార్యక్రమము సంపూర్ణ విజయము పొందుటచే దేశము సంతోషతరంగములలో ఊగులాడుతూ ఉండెను. తిలక్ స్వరాజ్యనిధి నిర్ణయింపబడినదానికంటె ౧౫ లక్షల రూపాయ లెక్కువ వసూలైనది. కాంగ్రెసుసభ్యత్వము నిర్ణీతసంఖ్యలో సగముపైగా అయినది. ౨౦ లక్షల రాటములవరకును దేశమంతటా పనిచేయదొడగినవి. తరువాత కాంగ్రెసు దృష్టి ఏకుట, వడుకుట, నేయుట మొదలగు పరిశ్రమల వైపునకు మరలినది. అందుకొరకు విదేశవస్త్ర సంపూర్ణ బహిష్కారమూ, ఖద్దరు ఉత్పత్తీ కాంగ్రెసు కార్యక్రమములైనవి. అ. భా. కాం. సం. "కాంగ్రెసుపక్షమునకు చెందినవా రందరు వచ్చే ఆగష్టు మొదటి తేదీనుండి విదేశవస్త్రముల నుపయోగింపరా" దని సలహాయిచ్చెను. బొంబాయి, అహమ్మదాబాదు నగరములలోని యంత్రాలయాధికారులు తమతమ మిల్లులలో తయారయ్యే బట్టల ధరలను కార్మికుల జీతములనుబట్టి నిర్ణయింపవలెనని కోరబడిరి. అప్పటికున్న ధరలకు మించి వస్త్రములను విక్రయించకుండునట్లును, వీలైనంతవరకు పేదల కందుబాటుగా నుండునట్టి ధరలే ఏర్పాటుచేయుటకును కూడా వారు ప్రార్థింపబడిరి. విదేశీబట్టల దిగుమతిదారు లందరును క్రొత్తఆర్డరు లీయకుండుటకును, నిలవయున్న సరుకును ఇండియాకు వెలుపల విక్రయించుటకును కోరబడిరి.

ప్రభుత్వోద్యోగుల లెవ్వరైనప్పటికీ, వారు సివిల్ ఉద్యోగస్థులుగానీ, సైనికోద్యోగులుగానీ, వారి ఉద్యోగములకు రాజీనామా ఈయవలసినదని చెప్పుటకు ప్రతి పౌరునకును హక్కుగలదని అ. భా. కాం. సం. వారు నిర్ణయించిరి. భారతదేశములోని అధికసంఖ్యాకుల విశ్వాసమును కోల్పోయిన బ్రిటిష్ ప్రభుత్వముతో సంబంధమును వదలుకొనవలసినదని సివిల్, సైనికోద్యోగు లందరికీ ప్రతిపౌరుడూ బోధింపవచ్చునని అ. భా. కాం. సం. వారు శాసించిరి.

మద్యనిషేధప్రచారసందర్భమున ధార్వార్, మాటియాన్ మొదలగు ప్రదేశములలో అప్పటికప్పుడే అధికారులు జోక్యము కల్పించుకొనసాగిరి. కొన్నిచోట్ల కొంత మందిని కల్లుదుకాణములకు పోవ ప్రోత్సహించిరి. అ. భా. కాం. సం. వారు అవసర మైనయెడల ప్రభుత్వాధికారుల జోక్యమును నిరోధించుటకు పికెటింగుకూడా ప్రారంభింపజేతుమని ముందుగా తెలియపరచిరి. థానా జిల్లాబోర్డువారు కల్లుదుకాణముల పికెటింగును గూర్చి చేసిన తీర్మానమునకు అ. భా. కాం. సం. వారు వారి నభినందించిరి. ఇతర స్థానికసంస్థలను, మునిసిపాలిటీలను కూడా థానా జిల్లాబోర్డు పెట్టిన వరవడిని అనుసరింపవలసినదని ఆ సంఘమువారు ప్రోత్సహించిరి. కాంగ్రెసు ఇంతవరకునూ పికెటింగును గూర్చిన తీర్మానము చేయలేదనీ, యిప్పుడు చేయబడిన తీర్మానము కూడా కేవలము ప్రజాసంస్థలకు సంబంధించినదే అనీ తెలుసుకొందురుగాక. వర్తకులు మత్తుపదార్థముల వ్యాపారము మానివేయవలె నని తీర్మానింపబడినది. విదేశరాజ్యాంగ వ్యవహారములను గూర్చి కార్యవర్గమువారు చేసిన తీర్మానమును అ. భా. కాం. సం. వా రంగీకరించిరి. భారతజాతిని సంపూర్ణముగా అహింసాతత్వము నవలంబింప జేయుటకు కాంగ్రెసు అత్యంతశ్రద్ధతో పనిచేసినది. అయినప్పటికీ అలీఘర్ నగరములోని ప్రజలు రెచ్చగొట్టబడుటచే కొంతమంది దౌర్జన్యము కావించిరి. అ. భా. కాం. సం. సంపూర్ణ దౌర్జన్యరాహిత్యసిద్ధాంతమును ప్రజలలో వ్యాపింపచేయవలసిన దని తదితర కాంగ్రెసుసంస్థలకు సలహా యిచ్చినది. గొప్ప ఆగ్రహకారణము లున్నప్పటికినీ ధార్వార్, మాటియాన్, గుంటూరు, చీరాల, పేరాల, కేరల, పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రములు మొదలగు ప్రదేశములలోని ప్రజ లాత్మనిగ్రహమును చూపినందు కభినందింపబడిరి. ముఖ్యముగా సంయుక్తరాష్ట్రములలో నిర్బంధవిధానము తీవ్రరూపమున వ్యాపించెను. అనేకచోట్ల ప్రజలపై తుపాకులు కాల్చబడినవి. ప్రతివాదము పెట్టుకొనకయే అనేకమంది ఖైదులకు పోయిరి. వా రందరికిని అభినందనము లర్పింపబడెను. నిరపరాధులగు ప్రజలు బుద్ధిపూర్వకముగా అనుభవించిన ఖైదులు మొదలగు కష్టపరంపరలవల్లనే స్వాతంత్ర్యసిద్ధి కలుగగల దని హెచ్చరింపబడినది. దేశములోని అనేకభాగములనుండి స్థానిక ప్రభుత్వములవారి నిర్బంధవిధానములకు ప్రత్యుత్తరముగా శాసనతిరస్కార మవలంబింపబడవలె నని ప్రజలు కోరసాగిరి. జానులోని స్థానికాధికారులచే చేయబడినవనే వాడుకగల దురంతములనుగూర్చి విచారింపబోవు కమిటీవారినే పశ్చిమోత్తరసరిహద్దురాష్ట్రముల అధికారులు వారి రాష్ట్రములో ప్రవేశింపరా దని నిషేధించిరి. కాని ఈ భారతదేశమునం దంతటను అహింసావాతావరణము నింకను అస్థిర మొనర్చుటకును, కాంగ్రెసువారికి ప్రజలపైన కలిగిన పలుకుబడిని తెలుసుకొనుటకును. స్వదేశీఉద్యమమును కొనసాగించేనిమిత్తము శాంతివాతావరణము భంగము

కాకుండ చూచుటకును స్వదేశీకార్యక్రమము పూర్తి అయ్యేటంతవరకును శాసనోల్లంఘనము ప్రారంభింపబడకూడ" దని అ. భా. కాం. సం. వారు తీర్మానించిరి.

అదీగాక వేల్సుయువరాజు భారతదేశమును సందర్శించే సందర్భములో ఒక మహత్తరవిషయము జరుగవలసిఉండెను. అ భా. కాం. సం. వారు "యువరాజు సందర్శనసందర్భమున ప్రభుత్వమువారిచే గాని, తదితరులచే గాని ఏర్పాటుచేయబడిన సమావేశములకునూ, ఉత్సవములకునూ -వరునూ పోయి సహాయము చేయకుండుట ప్రతిభారతీయునికిని ధర్మము." అని తీర్మానించిరి. ముందు రానున్న అనేక అవకాశములను గమనించియే శాసనతిరస్కార సందర్భమున ప్రజలు వేచియుండవలె నని అ. భా. కాం. సం. వివేకముతో నిర్ణయించినది. ౧౯౨౧ జూలై ౧ వ తేదీని ధార్వారుజనసమూహముపైన అధికారులు తుపాకులుపేల్చిన విషయమును విచారించి నివేదించుటకు కాంగ్రెసు కార్యవర్గమువారు నాగపురములో అసహాయవాదము నవలంబించిన లాయరు భవానీశంకరనియోగి (యిప్పుడు మధ్యరాష్ట్రముల హైకోర్టుజడ్జి), అబ్బాసుతయ్యబ్జీ (పింఛనుతీసుకొన్న బరోడాజడ్జి), సెట్లూరు (కొంతకాలము మైసూరు జడ్జి) గార్లను విచారణసంఘముగా నియమించిరి. క్రొత్తనిర్మాణవిధానముక్రింద భాషాప్రయుక్తరాష్ట్రములు నిర్మింపబడవలసిఉండుటచే రెండుభాషలుగల సరిహద్దు జిల్లాలలో వాదప్రతివాదములు చెలరేగినవి. బళ్లారిజిల్లావిషయములో ఆంధ్రకర్ణాటరాష్ట్రములవారికి తగాదా వచ్చినది. తరువాత గంజాముజిల్లావిషయములో ఆంధ్రోత్కలరాష్ట్రములకు తగాదా వచ్చినది. ఈ రెండు సందర్భములను విచారించుట కొక మధ్యవర్తిసంఘ మేర్పాటుచేయబడినది. కాంగ్రెసువిరాళముల నిమిత్తము వచ్చిన అర్జీలను పరిష్కరించుటకు గాంధీ, మోతీలాల్, జమ్నాలాల్ బజాజుల కధికార మీయబడినది. అగస్టు ౧౬ వ తేదీని పాటలీపుత్రములో మరియొక కార్యవర్గసభ జరిగినది. అప్పుడు సంయుక్తరాష్ట్రములలోని హార్డాయిజిల్లాలో ౧౪౪ శెక్షనును తిరస్కరించుటకు అనుజ్ఞ యిప్పించవలసిన దని వచ్చిన ఉత్తరమును కార్యసంఘమువారు విచారించి దానిని తరువాతసమావేశమునకు నిలిపివేసిరి.

సెప్టెంబరు ౩౦ తేదీలోగా విదేశవస్త్రబహిష్కారము సంపూర్ణముగా కొనసాగుటకు వలంటీరు లింటింటికిని పోయి విదేశవస్త్రములను పోగుచేయవలె నని తీర్మానింపబడెను. ప్రతిరాష్ట్రములోను వసూలైన తిలక్ స్వరాజ్యనిధినుండి నాల్గవభాగము ప్రత్యేకింపబడి ఖద్దరుఉత్పత్తిసందర్భమున వ్యయము చేయబడవలెనని తీర్మానింపబడినది. కొన్నిరాష్ట్రములవారు వసూలైన తిలక్ స్వరాజ్యనిధిలో నాల్గవభాగమును కాంగ్రెస్ కార్యసంఘమునకు పంపనందున అట్టిరాష్ట్రములకు వారు విరాళము లీయ

మానివేసిరి. సెప్టెంబరు ౬, ౭, ౮, ౧౧వ తేదీలలో కలకత్తానగరమునందు మరియొక సారి కాంగ్రెస్‌కార్యవర్గమువారు సమావేశమైరి. ఆసభ చాలా ప్రాముఖ్యమైనది. మాప్లా తిరుగుబాటు, ధార్వారుకాల్పులనుగూర్చిన నివేదిక లాసమావేశములో చర్చకు వచ్చినవి. అంతలో మొదటిదానినిగూర్చి "మలబారులోని కొన్ని ప్రాంతములలో జరిగిన మాప్లాల దౌర్జన్యకార్యముల కీసభవారు చింతిల్లుతూన్నారు. భారతదేశప్రజ లింకను కాంగ్రెసు, కేంద్రఖిలాఫత్ సంఘముల సందేశమును సరిగా అర్థముచేసుకొనవట్లు ఋజువు అవుతూన్నది. కాబట్టి కాంగ్రెస్, ఖిలాఫత్ ప్రచారకు లందరును ఆసేతు హిమాచలపర్యంతమును గల భారతదేశములో ఎట్టి ఆగ్రహకారణము లున్నప్పటికి ప్రజల హింసాసిద్ధాంతమునే అవలంబించేటట్లుగా ప్రచారము చేయవలయు" నని కాంగ్రెస్ కార్యవర్గమువారు తీర్మానించిరి.

కార్యవర్గమువారి దగ్గరనున్న సాక్ష్యసాధనములనుబట్టి మాప్లాలకు సహింపరానంత కోపకారణము కల్పింపబడినదనీ, ప్రభుత్వమువారిపక్షమున తయారుచేయబడి వారిచే ప్రకటింపబడిన నివేదికలు పక్షపాతభూయిష్ఠములుగానూ, మాప్లాల తప్పిదములనుగూర్చి అతిశయోక్తులతో నిండినవిగానూ ఉన్నవనీ, ప్రభుత్వమువారు శాంతిభద్రతలనే నెపముతో అనవసరముగా ప్రజలను సంహరించిన విషయము వాటిలో తగ్గించి వ్రాయబడినదనీ యీ సభవా రభిప్రాయపడుతూ మాప్లాలపక్షమున జరిగిన దౌర్జన్యమును నిరసిస్తున్నారు.

మాప్లాలలోని కొందరు మతావేశపరులచే బలవంతముగా కొందరు మహమ్మదీయమతములో కల్పుకొనబడి రని వినుటకు కాంగ్రెసుకార్యవర్గమువారు చింతిస్తున్నారు. కాని ప్రభుత్వమువారును, తదితర స్వార్థపరులును చెప్పే మాటలను విశ్వసింపకూడదని వారు సలహా యిస్తున్నారు. కాంగ్రెసుకార్యవర్గమువారి దగ్గర నున్న నివేదికలలో "మంజేరీసమీపమున నున్న గ్రామములలో నివసించే కొన్ని కుటుంబములు బలవంతముగా మహమ్మదీయమతములో కలుపుకొనబడినవి. ఖిలాఫత్ సహాయనిరాకరణోద్యమములకు ప్రతికూలముగానున్న మతావేశపరులయిన కొందరు మహమ్మదీయులు హిందువులను బలవంతపెట్టి కలుపుకొని రనుమాట వాస్తవము. మాకు తెలిసినంతవరకు మూడు కేసులుమాత్రమే అట్టివి కలవు." అని ఉన్నది.

"కాంగ్రెసు ఖిలాఫత్ ఉద్యమములు నిషేధింపబడిన చోటులలో మాత్రమే యీ అల్లరులు జరిగినవనీ, కాంగ్రెసు ఖిలాఫత్ ప్రచారకులు మూకల ఆగ్రహావేశములను శాంతపరచి దౌర్జన్యమును నిరోధించుటకు కొన్ని అపాయములకుకూడా గురియై

ప్రయత్నించి రనీ యీ కార్యసంఘమువారికి నివేదింపబడినది." అని తీర్మానములు చేయబడినవి.

తరువాత అలీసోదరులు, డాక్టరు కిచ్లూ, జగద్గురు శ్రీ శంకరాచార్యులవారు (శారదాపీఠము), మౌలానా నజీర్ అహమద్, పీర్‌గులామ్, ముజదీద్, హుస్సేన్ అహమ్మదులపైన కేసు పెట్టబడినది. ఆ కేసు ఖిలాఫత్ మహాసభలో జరిగిన వ్యవహారములకు సంబంధించినది. అందులో "మహమ్మదీయమతమునందు విశ్వాసముగల ముసల్మాను ఎవ్వడునూ ఆరోజునుండి సైన్యములో పనిచేయుటగాని, సహాయము చేయుటగాని, చేరనుద్దేశించుటగాని అన్యాయ" మని తీర్మానింపబడినది. బ్రిటిష్ ప్రభుత్వమువారు అంగోరాప్రభుత్వముతో పోరాడేయెడ భారతమహమ్మదీయులు శాసనతిరస్కారమును ప్రారంభించి, సంపూర్ణస్వాతంత్ర్యమును ప్రకటించి, భారత ప్రజాపరిపాలనాపతాకమును అహమ్మదాబాదు భారతజాతీయమహాసభలో నెలకొల్ప గల రని కూడా ఆమహాసభలో ప్రకటింపబడినది.

వెంటవెంటనే క్రొత్తక్రొత్త చారిత్రకవిషయములు జరుగ ప్రారంభించినవి. ౧౯౨౧ జూలై ౮వ తేదీని అఖిలభారతఖిలాఫత్ మహాసభ జరిగినది. దాని కధ్యక్షుడైన మహమ్మదాలీ చాలాసాహసమైన ఉపన్యాస మిచ్చెను. అప్పటినుండి అది కరాచీ ఉపన్యాస మని ప్రసిద్ధివహించెను. ఆ ఉపన్యాసమునకే మహమ్మదాలీపైన కేసుపెట్టబడిన దని యిదివరకే సూచించియుంటిమి. అందుమూలమున ప్రభుత్వమువారిని సవాలుచేస్తూ ప్రతిచోటను ఆ ఉపన్యాసమును పునశ్చరణచేయవలసిన దని కాంగ్రెసు ఆజ్ఞాపించినది. ఆ ప్రకారము ౧౯౨౧ అక్టోబరు ౧౬వ తేదీని వేలకొలది సభలలో మహమ్మదాలీ ఉపన్యాస మనువదింపబడినది. నాగపురము, కలకత్తా కాంగ్రెసులలో ప్రభుత్వమువారి క్రింద సైనికోద్యోగములను చేయుటనుగూర్చి అంగీకరింపబడిన తీర్మానములోని సిద్ధాంతము ఖిలాఫత్ మహాసభలో కూడ మరియొక తీర్మానరూపకముగా వ్రాయబడినది. దానిసందర్భముననే మహమ్మదాలీ ఉపన్యసించెను. అక్టోబరు ౫వ తేదీని బొంబాయిలో కాంగ్రెసుకార్యసంఘసభ సమావేశమై ఒక ప్రకటనమును కావించినది. అందులో "ఖాలటుశాసనాందోళనసందర్భములోవలె భారతప్రజల న్యాయ్యమైన ఆశయములను నిర్మూలించేటందుకు తమ పోలీసుసిబ్బందీని, సైనికదళములను వినియోగించి నట్టిన్నీ, అరబ్బులు, తురుష్కులు, ఈజిప్టుదేశీయులు మొదలుగుజాతుల జాతీయోత్సాహమును వినాశనము చేసేటందుకు సిపాయీలను ప్రయోగించినట్టిన్నీ ప్రభుత్వమువారి ఉద్యోగములో నుండుట జాతీయగౌరవమునకునూ, జాతీయప్రయోజనములకునూ విరుద్ధమని ప్రతిభారతీయుడును భావింపవలెను" అని ఉదాహరింపబడినది. అలీసోదరుల



ఆర్. సి. దత్తు

లక్నో : 1899



ఎన్. జి. చందావార్కర్

లాహోరు : 1900



డి. ఇ. వాచా

కలకత్తా : 1901



లాల మోహన్ ఘోష్

మద్రాసు : 1903

పైనను, ఆయనమిత్రులపైనను నేరారోపణము చేయబడినది. ఆకేసుసందర్భమున కాంగ్రెసుకార్యసంఘము వారి నభినందించి, ప్రభుత్వమువా రనవసరముగా మతసంబంధమున జోక్యము కలిగించుకొంటూండిరని ప్రకటించిరి. తరువాత "ప్రభుత్వము వారిక్రింద పనిచేస్తూన్న సివిలియన్ ఉద్యోగస్థులను గాని, సిపాయీలను గాని వారి ఉద్యోగములను వదలిపెట్టి బయటకు రావలసినదని కాంగ్రెస్ ఇదివరకే కోరియుండెను. కాని ప్రభుత్వోద్యోగములు మానివచ్చినవారిని పోషించేస్థితిలో కాంగ్రెస్ లేకపోవుట చేత యింతవరకును ఆవిధముగా కోరలేదు. కాంగ్రెసు సహాయము లేకుండానే తమను తాము పోషించుకొనగలవారు వెంటనే అసహాయోద్యమ తీర్మానములోని భావము ననుసరించి వారి ఉద్యోగములకు రాజీనామా యిచ్చుట ధర్మమని కాంగ్రెసుకార్య నిర్వాహకసభ అభిప్రాయపడుతూన్నది." అనికూడ ఒక ఉత్తరువు జారీచేయబడినది. ఆవిధముగా రాజీనామాయిచ్చిన సైనికులకును, పోలీసు ఉద్యోగులకును నేతలుచేయుట, నేతనేయుట, నూలువడుకుట- యీమొదలుపనులును స్వతంత్రజీవనమునకు మార్గములుగా సూచింపబడినవి దేశములోని అన్ని కాంగ్రెసుసంఘములును యీతీర్మానములను ఆమోదింపవలసినదని కోరబడినవి. విదేశవస్త్రబహిష్కార మింకను అసంపూర్ణముగా నుండుటచే అది పూర్తి అయ్యేటంతవరకునూ సమష్టిశాసనోల్లంఘనము జరుపబడరాదని కార్యసంఘమువారు నిర్ణయించిరి. సమష్టిశాసనోల్లంఘనమును జరుప నిశ్చయించుకొన్న ప్రదేశములలోని జనులకు చాలినంత ఖద్దరు ఆప్రదేశములలో ఉత్పత్తిచేయబడిననేగాని శాసనోల్లంఘనమున కధికారము లేదనికూడ కార్యసంఘమువారిచే నిర్ణయింపబడినది. కాని రాష్ట్రీయకాంగ్రెసుసంఘముల ఆజ్ఞానుసారముగా స్వదేశీప్రచారముచేస్తూన్న ఖద్దరుప్రచారకులపైన జారీచేయబడే ఉత్తరువులను ఉల్లంఘించవచ్చునని కాంగ్రెసు కార్యవర్గమువారు తీర్మానించిరి. వేల్సుయువరాజు భారతదేశమునకు వచ్చినప్పుడు ఆయనను బహిష్కరించుటనుగూర్చి వివరముగా ఒక కార్యక్రమము తయారుచేయబడినది. దానిప్రకారము యువరాజు భారతదేశములో అడుగుపెట్టినరోజున దేశమంతటను హరతాళములు జరుగవలెనని నిర్ణయింపబడినది. భారతదేశములోని ఆయానగరములకు యువరాజు పోయినప్పుడు సంపూర్ణబహిష్కారము జరిపించుటకు కాంగ్రెసుకార్యవర్గమువారు వివిధరాష్ట్రకాంగ్రెసుసంఘముల కధికారమిచ్చిరి. ఇండియాప్రభుత్వమువారు భారతదేశీయుల అభిప్రాయానుగుణముగా ప్రవర్తించుటలేదనీ, భారతదేశమునకు స్వపరిపాలనమువచ్చేయెడల కాంగ్రెసువారువిదేశ రాజ్యములకు విరోధముగానుండే వాణిజ్యపద్ధతు లవలంబింపవలచుకొనలేదనీ, అందువలన భారతదేశమునుగూర్చి యిరుగుపొరుగు రాజ్యములవా రెవరును భయపడనవసరము లేదనీ కూడా ఒక ప్రకటనము చేయబడినది. తరువాత భారతదేశమునకు శత్రువులు

కాని యిరుగుపొరుగురాజ్యములవా రెవరును బ్రిటిష్‌సామ్రాజ్యముతో సంధిచేసుకొన రాదనికూడా ప్రకటింపబడినది. హిందూదేశమునకు స్వపరిపాలనము లభించేయెడల, యిస్లాము మత ప్రకారము మహమ్మదీయులు నిర్వర్తింపవలసిన ధర్మముల కనుగుణముగా భారతదేశము ప్రవర్తింపగలదని మహమ్మదీయరాజ్యములకు హామీ యీయబడినది. ఇవి కాంగ్రెసుకార్యవర్గమువారి అభిప్రాయములు. వీటినిగూర్చి ప్రజలు చక్కగా చర్చించి నిర్ణయించేటంతవరకునూ కార్యనిర్వాహకసభలో ఆమోదించి అ. భా. కాం. సం. పేరట ప్రచారము చేయుటకు వారిష్టపడలేదు.

ఈ సమయములో ఆలీసోదరు లరెష్టులో నుంచబడిరి. మౌలానా మహమ్మదాలీ అస్సామునుండి మద్రాసుకు పోయే ట్రైనులో వాల్తేరుస్టేషనులో ౧౪ సెప్టెంబరున అరెష్టు చేయబడెను. ఆయన కొన్నిరోజు లాసబ్‌జైలులో నుంచబడినపిమ్మట ఒక విడుదలఉత్తరు వాయనకు చదువబడెను. కాని వెంటనే తిరిగీ అరెష్టుచేయబడి కరాచీకి తీసుకొనిపోబడెను. షౌకతాలీకూడ తరువాత వెంటనే అరెష్టుచేయబడెను. వారి నిర్బంధములకు కారణము కరాచీ ఉపన్యాసమని తెలిసినప్పుడు గాంధీ తిరుచినాపల్లిలో నుండెను. ఆయన ఆ ఉపన్యాసమును బహిరంగముగా తాను తిరిగీ ఉపన్యసించెను. భారతదేశమంతటా ఆ ఉపన్యాససారాంశమును కాంగ్రెసు కార్యకర్తలు తీర్మాన రూపకములో గాంధీ పునరుద్ఘాటింపచేసెను. స్వరాజ్య సంస్థాపనకు భారతజాతి కిక ఒక మాసముమాత్రమే గడువుండుటచేతను, ఆలీసోదరులు మొదలగు నాయకులు నిర్బంధింపబడినప్పుడు ప్రజలాదర్శపూర్వకమైన ఆత్మనిగ్రహము చూపియుండుటచేతను ౧౯౨౧ నవంబరు ౪-వ తేదిని ఢిల్లీలో సమావేశమైన అ. భా. కాం. సంఘ కార్యనిర్వాహకవర్గములు రాష్ట్రీయకాంగ్రెసుసంఘములకు వాటి సొంత జవాబుదారీమీద పన్నుల నిరాకరణముతో సహా శాసనోల్లంఘనమును తమతమ పరిస్థితుల కనుగుణముగా ప్రారంభింపవచ్చునని అధికార మిచ్చినవి. కాని రాష్ట్రసంఘము లీ క్రింది షరతులకు లోబడిమాత్రమే శాసనోల్లంఘనమును ప్రారంభింపవలెను. ప్రతివ్యక్తి శాసననిరోధకుడును తనకు సంబంధించినంతవరకు అసహాయోద్యమ కార్యక్రమమును నిర్వర్తించి ఉండవలెను. వారికి నూలువడుకుట తెలిసిఉండవలెను. అతడు పూర్తిగా విదేశీవస్త్రములను త్యజించి ఖద్దరుధారణ చేసిఉండవలెను. హిందూ మహమ్మదీయ సఖ్యతలో అతనికి విశ్వాస ముండవలెను. స్వరాజ్యసంపాదనమునకును, ఖిలాఫత్ పంజాబు అన్యాయముల నివారణముకొరకును అహింస ముఖ్యావసరమని అతడు నమ్మిఉండవలెను. అతడు హిందువయినయెడల అస్పృశ్యత జాతీయతకు కళంకమని అతని ప్రవర్తనవలన ప్రదర్శింపవలెను. ఇక సమష్టి శాసనోల్లంఘన విషయములో ఒక జిల్లాగాని, ఒక తాలూకాగాని ఒక కేంద్రముగా భావింపబడవలెను. అందులోని

అధికసంఖ్యాకు లయిన జనులు పూర్ణస్వదేశీ వ్రతమును పూని, చేతితో వడికి, చేతితో నేసిన బట్టలనుమాత్రమే ధరించువారుగా నుండవలెను. వారందరు అసహాయోద్యమములోని తదితర విషయములను నమ్మి ఆచరించేవారుగాకూడ నుండవలయును. ఎవ్వరును ప్రజల ధనముపైన ఆధారపడియుండకూడదు. ఇందులో ఏ షరతునైనను రాష్ట్రీయకాంగ్రెసుసంఘమువారి కోరికపైన కాంగ్రెసుకార్యవర్గమువారు తొలగింపవచ్చును.

తిరువాత మలబారులోని హిందూదేవాలయములు భగ్నములు చేయబడుటను గూర్చి, హిందువులు బలవంతముగా మహమ్మదీయ మతములో చేర్చుకొనబడుటను గూర్చి ఒక తీర్మానము చేయబడినది.

ఈ సందర్భములో అహింసాపూర్వకమైన అసహాయోద్యమమునందు జరిగిన రెండు ముఖ్య సంఘటనలనుగూర్చి సంగ్రహముగా చెప్పవలసియున్నది. ౧౯౨౧ లో ప్రభుత్వాధికారమును నిరోధించుట ప్రజాజీవితములో ఒక ప్రధానాంశముగానుండెను. దేశమునందలి వివిధ భాగములలోని ప్రజలు వారివారి పరిస్థితుల ననుసరించి వారి నెదుర్కొనుచున్న స్థానికసమస్యల పరిష్కారమునిమిత్తి మధికారనిరోధమునకు పూనుకొనిరి. బెజవాడలో మార్చి ౩౧-వ తేదీని జరిగిన అ. భా. కాం. సం. సమావేశమువలన తెలుగు జిల్లాలలో విద్యుద్వేగముతో అసహాయతత్వము వ్యాపించినది. కొద్దికాలమునకే చీరాలగ్రామము మునిసిపాలిటీగా మార్చబడునని చీరాలప్రజలకు తెలియవచ్చినది. కాంగ్రెసుపక్షమునకు ప్రతికూలుడైన పానుగల్లురాజు స్థానికస్వపరిపాలనమంత్రిగానుండెను. కాంగ్రెసుపక్షమువా రాయనఅధికారమునకు ప్రత్యధికారము వహింప కోరికతో నుండిరి. చీరాలప్రజలకు మునిసిపాలిటీ కావలెనని కోరిక లేదు. ఈ విషయములో గాంధీగారిని సలహా అడుగగా ఆయన ప్రజలకు మునిసిపాలిటీ యిష్టములేని యెడల మునిసిపల్ పరిహద్దులవెలుపలికి పోయి నివసింపవచ్చునని సలహాయిచ్చెను. కాని యీపని కాంగ్రెసుయాజమాన్యముక్రింద జరుపబడకూడదని కూడా ఆయన కాంగ్రెసువాదులను మందలించెను. ఈ ఉద్యమము విజయముపొందెనేయెడల కీర్తిలో కొంతభాగము కాంగ్రెసు పంచుకొనగలదు; అపజయము పొందెనేయెడల కలిగే అపకీర్తి కాంగ్రెసు కంటకూడదు అని కూడా గాంధీ చెప్పెను. మొత్తముమీద గాంధీ చెప్పిన అభిప్రాయముమాత్రము చాలా ఆకర్షవంతముగా నుండెను. ఈ మహాకార్యమును నడపుటకు తగిన నాయకుడు ఆంధ్రరత్న గోపాలకృష్ణయ్య. ఆయన హృదయ మా అభిప్రాయమునందు లగ్నమయినది. ఆయన చీరాలప్రజలను గ్రామమువెలుపలికి తీసుకొనిపోవు ప్రయత్నమును పూనెను. అది వెనుక సింధు మహమ్మదీయులు అఫ్ఘని

స్థానమునకు కుటుంబముతో లేచిపోవచేసిన ప్రయత్నములను మనకు జ్ఞాపకముచేసినది. చీరాలప్రజలు దీర్ఘకాల మతికష్టముల ననుభవించిరి. వారు పదినెలలకాలము మునిసిపల్ సరిహద్దుల బయట గుడిసెలలో నివసించిరి. ఈలోపుగా నాయకు లేదో ఒక నెపముతో అరెస్టుచేయబడిరి. ప్రభుత్వమువారు సహాయనిరాకరణోద్యమమునకు చెందని కొందరిని బుజ్జగించి, కొందరిని భయపెట్టి లోబరచుకొనిరి. తమ గృహములను విడిచిపెట్టుకొని దాదాపు ఒక ఏడాది గ్రామమువెలుపల, దూరముగా మైదానమునందు నివసించిన చీరాలప్రజలు చిట్టచివరకు తమ గ్రామమునకు చేరి మునిసిపాలిటీకి లోబడవలసివచ్చినది. రెండవ మహోత్కృష్టకార్యము చిట్టగాంగు సమ్మె. చిట్టగాంగు తూర్పుబంగాళములో ఒక రేవుస్థలము. అక్కడ సేనుగుప్తచే ఏర్పాటుచేయబడిన కూలీలసమ్మెకొరకు కాంగ్రెసు ఒక లక్షరూపాయలపైచిలుకు వెచ్చించినది. అటువంటి ఉద్యమములలో ముఖ్యకష్ట మేమనగా, అధికారమునం దున్నవారు సమ్మెకట్టిన వారిని తేలికగా ఓడిపోయేటట్లు చేయగలరు. పైగా కాంగ్రెసు ఇట్టి సమ్మెలకు నిరంతరసహాయమును చేయజాలదు. దాని ధనసంపత్తి చాలా తక్కువ. కాని దానికి గల ప్రజాశక్తి అతీతము. అయినప్పటికీ కాంగ్రెసుఉద్యమములను నడిపే ప్రజలపైన ప్రభుత్వమువారికి సంపూర్ణాధికారముకలదు. ఒక్కసారి ఉద్యమమును నడుపుతూన్న మహానాయకులను ఏదో వంకపెట్టి ప్రభుత్వమువారు జైలులోకి త్రోసివేసినయెడల సాధారణముగా వాటినుండి అనుచరులలో కల్లోలములును, అవిశ్వాసములును ప్రారంభమై ఉద్యమములు నశించును.

ఇక మలబారులో జరిగిన మాప్లా తిరుగుబాటుకు మూలకారణమును విచారింతము. అరేబియానుండి మలబారుకు వలసవచ్చిన అరబ్బుల సంతతివారే మాప్లాలు. వీరు మహమ్మదీయులు. అరబ్బులీసుందరభూమికి వచ్చినప్పటినుండి స్థానికముగా వివాహసంబంధముల నేర్పరచుకొనిరి. మాప్లాలు మలబారులో వ్యవసాయకులుగాను, చిన్న చిన్న వర్తకులుగాను ఉందురు. వారికి మతోద్రేకము కలిగినప్పుడుమాత్రము ప్రాణములను, సౌఖ్యములను లెక్కపెట్టక కొంత అవేశముగా ప్రవర్తింతురు. అప్పుడప్పుడు కలుగుతూన్న మాప్లాకొట్లాటల మూలముననే ప్రభుత్వమువారు "మాప్లా దురంతముల చట్టము"ను చేయవలసి వచ్చినది. ప్రాణములను తృణప్రాయముగా చూచే ఉద్రేకపూరితులైన మాప్లాలలో అసహాయోద్యమమనే అగ్నికణము పడకూడదని మొదటినుండి ప్రభుత్వమువారెంతో ఆతురతతో నుండిరి. కాని తక్కినరాష్ట్రములలోవలెనే కేరళరాష్ట్రములోకి కూడా అసహాయోద్యమము పాకినది. కేరళకు అప్పుడే నూతనముగా కాంగ్రెసురాష్ట్రము లభించుటచేత ఆ రాష్ట్రవాసులు మరింత ఉత్సాహముతో ఉద్యమమునందు పనిచేసిరి. ఫిబ్రవరి నెలలో సి. రాజగోపాలాచారి, యమ్.

డి. యాకూబుహుస్సేనులవంటి సుప్రసిద్ధనాయకు లారాష్ట్రములో అహింసాసందేశ మును వ్యాపింపచేయవలె నని అక్కడకుపోయిరి. యాకూబుహుస్సేన్ తా నారాష్ట్ర ములో నున్నంతకాలము అసహాయోద్యమమునుగూర్చి మాట్లాడనని స్పష్టముగా ప్రక టించెను. అయినప్పటికీ నిషేధపుటుత్తరువులు జారీచేయబడినవి. ౧౯౨౧ ఫిబ్రవరి ౧౮-వ తేదీని యాకూబుహుస్సేన్, మాధవనాయర్, గోపాలమీనన్, మొయిదీన్ కోయా లరెస్టుచేయబడిరి. వారి ఈ నిర్బంధము మలబారులో అసహాయోద్యమము బలమగుటకే ఉపయోగపడినది. ఒట్టపాలెము అనే చిన్న పట్టణములో కేరళరాష్ట్ర మహాసభ ఏర్పాటుచేయబడినది. దానితోపాటు దానికి సంబంధించిన మరికొన్ని సభలు కూడా జరుపబడినవి. రాష్ట్రీయసభ ముగింపబడినతరువాత విద్యార్థుల సభ జరు గుతూండగా రిజర్వుపోలీసువారు కొందరు కాంగ్రెసు నాయకులపైనను, ఖిలాఫత్ నాయకులపైనను, వీధిలోని ప్రజలపైనను చెయిచేసుకొనిరి. కాని ప్రజలుమాత్ర మాశ్చ ర్యకరముగా ఏమాత్రము దౌర్జన్యమును కావింపలేదు. తరువాత బెజవాడ తీర్మానము ననుసరించి మలబారులో పూర్తిగా కాంగ్రెసుప్రచారము జరిగినది.

మాప్లాలు ముఖ్యముగా వలవనాడు, ఎర్నాడు తాలూకాలలో ఉండిరి. ప్రభు త్వమువారు ౧౪౪-వ సెక్షను ఆ తాలూకాలలో ప్రకటించిరి. ఆగస్టునెలనాటికి మలబారుపరిస్థితులు మారినవి. మాప్లాలు వారి మతగురువులకు చేయబడిన అవమాన ములను సహింపలేక దౌర్జన్యమునకు దిగిరి. వెంటనే ఆ విరోధములు చిన్న యుద్ధరూప మును దాల్చినవి. మాప్లాలకు ఖడ్గములు విశేషముగా కలవు. కాని తుపాకులు మాత్రము తక్కువ. ఆ దేశమునకు చుట్టుపట్లనున్న పరిసరప్రకృతి వారికి గొరిల్లాయుద్ధమున కనుకూలించినది. అక్టోబరు మధ్యకాలమునాటికి యింకను తీవ్రరూపమైన సైనిక శాసన మాదేశములో ప్రవేశపెట్టబడినది. మాప్లాలు కొంతమంది హిందువులను మహమ్మ దీయమతములోకి కల్పుకొనిరి. హిందూగృహములను దోచుకొనిరి. గవర్నమెంటు కచేరీలను నాశనముచేసిరి. కొన్నిచోట్ల హత్యలను కావించిరి. ఆంగ్లేయుల ప్రాణములు నిలిచేటట్లు కనబడలేదు. యమ్. పి. నారాయణమీనన్ మంచి కాంగ్రెసువాది. మల బారుఅంతటా ఆయనే కాంగ్రెసుసంఘములను స్థాపించెను. మాప్లాలపైన ఆయనకు గల పలుకుబడిని వినియోగించి ఇంగ్లీషువారి ప్రాణములను రక్షించెను. కాని తరువాత ౧౯౨౧ నవంబరులో ఆయననే ప్రభుత్వమువారు స్టేటుఖైదీగా నిర్బంధించిరి. పిమ్మట ౧౯౨౨ లో ఆయనను రాజద్రోహనేరమక్రింద విచారించి ప్రభుత్వమువా రాయనకు యావజ్జీవద్వీపాంతరవాసశిక్ష విధించిరి. ఆయన తన శిక్షను పూర్తిగా అనుభవించి యిటీవల ౧౯౩౪ సెప్టెంబరులో విడుదలచేయబడెను. ఆయన వలవనాడు తాలూ కాను మూడు సంవత్సరములవరకునూ పోనని ప్రభుత్వమువారికి మాటమాత్రము వాగ్దా

నము చేసియున్నయెడల ఇంతకుపూర్వ మెన్నడో వదిలిపెట్టబడి ఉండేవాడు. కాని ఆయన ఆమాట అనలేదు. కాబట్టి స్వచ్ఛందముగా ధీరునివలె తన పూర్ణశిక్షను అనుభవింపవలసివచ్చినది. తరువాతజరిగిన మాప్లాతిరుగుబాటువిషయములు మనకు సంబంధించవు. మాప్లాల మర్యాదాతిక్రమణములనుగూర్చి మనకు సంబంధించినంతవరకు నవంబరులో జరిగిన అ. భా. కాం. సం. తీర్మానములలో ఉదాహరింపబడినది. వాటిని మే ఇదివరకే వేరొకచో వ్రాసియుంటిమి.

వేల్సుయువరాజు నవంబరు ౧౭ వ తేదీని భారతదేశమునకు వచ్చెను. నూతన భారతశాసనసభను యువరాజే ప్రారంభింపవలసియుండెను. కాని ౧౯౨౦ ఆగస్టులోని భారతదేశ వాతావరణమునుబట్టి ఆయనకు బదులుగా కానాట్ ప్రభువు నియమింపబడెను. కాబట్టి ఆయన ౧౯౨౧ నవంబరునెలలో బ్రిటిషు గవర్నమెంటువారి ప్రతిష్ఠను నిలబెట్టుటకొరకు భారతదేశమునకు పంపబడెను. కాంగ్రెసు అంతకుపూర్వమే యువరాజుసందర్శనమును బహిష్కరించవలసినదని తీర్మానము కావించినది. విదేశవస్త్రదహనములతోసహా ఆతీర్మానము ప్రజలచే ఆచరణలో పెట్టబడెను. యువరాజు బొంబాయిలో అడుగుపెట్టినరోజుననే అక్కడ కత్తులు, తగాదాలు, కొట్లాటలు ప్రారంభమై తుట్టతుదకు రక్తపాతములోనికి దిగినవి. ౩, ౪ రోజులవరకును పరిస్థితులావిధముగా తీవ్రముగానే ఉండెను. ఆసందర్భమున ౫౩ గురు మరణించిరి. దాదాపు ౪౦౦ మందికి గాయములు తగిలినవి. గాంధీ, సరోజినీదేవివంటి నాయకశిఖామణులు జనసమూహములోనికి ప్రవేశించి వారిని చెదరిపోవలసినదని ప్రార్థించినప్పటికినీ యీఫలితములు తప్పలేదు. అనేకమందిజనులకు యీగంద్రగోళములో గాయములు తగిలినవి. తిరిగీ ప్రశాంతపరిస్థితు లేర్పాటుచేయబడుటకు ముందు ప్రజల మర్యాదాతిక్రమణములకు ప్రాయశ్చిత్తముగా గాంధీ ౫ రోజు లుపవసించెను. అప్పుడే గాంధీ స్వరాజ్యము తనను విసిగించుచున్నదని ప్రకటించెను. యువరాజురాకతో భారతదేశమం దంతటను స్వచ్ఛందసైనికదళములు కేంద్రీకరింపబడుటకు అవకాశము కలిగినది. అంతవరకును కాంగ్రెస్వలంటీర్లు యాత్రికులకు సహాయ మొనర్చుటకును, అంటుజాడ్యముల సందర్భమున రోగుల కుపచార మొనర్చుటకును, స్థానికముగా కలిగిన ఆపత్తులలో కష్టములపాలైనవారికి చేయూత యిచ్చుటకును మాత్రమే ఉపయోగపడుచుండిరి. కొద్దికాలము జాతీయమహాసభలలోను, యితర ప్రజాసమావేశములలోను పని చేస్తూ ఉండిరి. ఖిలాఫత్ వలంటీర్లకుమాత్రము కొన్ని సైనికలాంఛనములు కలవు. ప్రభుత్వమువారు వారికడ కొన్ని "కరవాలములు" కలవని చెప్పిరి. కాంగ్రెస్ ఖిలాఫత్ వలంటీర్లందరును ఏకమై యువరాజురాకసందర్భమున దేశములో హరతాళమును, విదేశవస్త్రబహిష్కారమును కొనసాగించిరి. ఈ రెండుపక్షములవారును అఖిల

భారతకాంగ్రెస్‌సంఘమువారి వెనుకచెప్పబడిన షరతులకు లోబడి సాత్వికనిరోధముసు ప్రారంభించిరి. వేలకొలది అరెస్టులు చేయబడినవి. యువరాజు డిసెంబరు ౨౪ వ తేదీని కలకత్తానుదర్శించవలసియుండెను. వంగరాష్ట్రప్రభుత్వమువారు బొంబాయిప్రభుత్వమువారివలెగాక స్వచ్ఛందసైనికులను సమకూర్చుట క్రిమినల్‌లా సవరణ చట్టముక్రింద శాసనవిరుద్ధమని ప్రకటించిరి. చిత్తరంజనదాసుదంపతులను వారి కుమారునితో సహా నిర్బంధించిరి. వెంటనే పాంచాలసంయుక్తరాష్ట్రప్రభుత్వములవారు వంగరాష్ట్రప్రభుత్వమువారిని అనుగమించిరి. అహమ్మదాబాద్‌కాంగ్రెస్‌నాటికి లాలాలజపతిరాయి, పండిత మోతీలాల్‌నెహ్రూ, జవహరలాల్‌నెహ్రూ, చిత్తరంజనదాసు, ఆయన కుటుంబము — ఈఅందరు ౧౮౧౮, ౧౯౦౮ సెక్షన్లక్రిందగాని, లేక క్రిమినల్ లా సవరణ చట్టముక్రిందగాని కారాగృహములకు పంపబడిరి. ౧౮౧౮, ౧౯౦౮ సెక్షన్లు రాజకీయప్రచారకుల కనువర్తింపచేయవచ్చునని ౧౯౨౦ ఆగష్టు నెలలో గవర్నరుజనరల్ సభలో లా మెంబరైన సర్ తేజబహదూర్ సప్రూ క్రొత్తగా కనిపెట్టి సలహాయిచ్చెనని ప్రతీతిగలదు. బొంబాయిరాష్ట్రము మామూలుచట్టముక్రిందనే పనిచేయగా వంగ పాంచాల సంయుక్తరాష్ట్రములు నూతన నిర్బంధచట్టములను కనిపెట్టినవి.

సరిగా యీసమయముననే కాంగ్రెస్‌వారికిని ప్రభుత్వమువారికిని మధ్య రాయబారములు సాగినవి. వైస్రాయి కలకత్తానుండి ఢిల్లీనగరమునకు రాజధానిని మార్చినప్పుడేర్పాటుచేయబడిన పద్ధతుల ననుసరించి ఆయన క్రిస్టమస్ సమయములో సంవత్సరమునకు ౩, ౪ వారములు కలకత్తాలో నివసించువాడుక గలదు. ఆయనతోపాటు వేల్సు యువరాజు కలకత్తాలో క్రిస్టమస్ గడపవలసియుండెను. రీడింగుప్రభు వారి సంసర్గములో కలకత్తాలోనుండే అవకాశములను గమనించి పండిత మదనమోహనమాలవ్యావంటి మధ్యవర్తులు కొందరు ప్రజలకును, ప్రభుత్వమునకును రాజీకుదర్చవలయునని ప్రయత్నించిరి. కలకత్తాలో డిసెంబరు ౨౪ వ తేదీని జరుగవలసిన యువరాజ బహిష్కరణమును మాన్పించుటకుమాత్రమే రీడింగుప్రభు వారు రాజీనామా రాయబారముల కంగీకరించెను. డిసెంబరు ౨౧ వ తేదీన పండిత మాలవ్యానాయకత్వముక్రింద వైస్రాయిదగ్గరకొక రాయబారము వెళ్లెను. కలకత్తా నగరమునందలి అలిపురము జైలులోనే చిత్తరంజనదాసు నిర్బంధింపబడియుండెను. ఆయనకును ఆమధ్యవర్తులకును టెలిఫోన్ ద్వారా ఉత్తరప్రత్యుత్తరములు జరిగినవి. వెంటనే గాంధీతోకూడా ఆలోచన జరిగినది. గాంధీ అహమ్మదాబాదులో నుండెను. తంతిద్వారా శాసనోల్లంఘనఖైదీలను విడుదల చేయుటకును, మార్చిలో కాంగ్రెసుపక్షమున ౨౨ మంది ప్రతినిధులతో రౌండు టేబిలుసభను జరిపి రాజ్యాంగ ప్రణాళికను చర్చించుటకును ప్రభుత్వమువా రంగీకరించిరి.

దాసు నూతన క్రిమినల్ లా సవరణచట్టముక్రింద నిర్బంధింపబడిన ఖైదీల నంద రను విడుదలచేయవలెనని కోరెను. ఇందుమూలమున లాలాజీవంటి నాయకుడును, కరాచీ ఖైదీలును, ఫత్వాఖైదీలును, అనగా మౌలానా మహమ్మదాలీ, షౌకతాలీ, డాక్టర్ కిచ్లూ మొదలగు అనేకులును జైలులోనే ఉండిపోయిరి. కరాచీ ఖైదీ లనగా ౧౯౨౧ జులై నెలలో జరిగిన అఖిలభారత ఖిలాఫత్ మహాసభలో పాల్గొనందుకు ౧౯౨౧ నవంబరు ౧ వ తేదీని శిక్షింపబడిన ఖైదీలు. ఆ మహాసభలో బ్రిటిషుప్రభు త్వముక్రింద భారతీయసైనికులు పనిచేయరాదనే తీర్మానము నంగీకరింపజేసిరి. కొం దరు ఉలేమాలీ తీర్మానమును ఫత్వాగా మహమ్మదీయమతస్థులకు జారీచేసిరి. ఫత్వా అనగా విద్వాంసులైన మహమ్మదీయ పీఠాధిపతులు ఒక కార్యమును చేయవచ్చునని గాని, చేయకూడదనిగాని వారి మతస్థులకు పంపే శ్రీముఖము. ౧౯౨౧ డిశెంబరునాటి శాంతి రాయబారములనుగూర్చి వివరముగా తెలుసుకొనదలచుకొన్నవారు కృష్ణదాసుచే వ్రాయబడిన "గాంధిమహాత్మునితో ఏడుమాసాలు" (Seven months with Mahatma Gandhi) అనే గ్రంథమును చదువవలెను. అది చదువదగిన గ్రంథము.

గాంధీ కరాచీఖైదీలనుగూడ విడిచిపెట్టవలె నని కోరెను. అది కొంతవర కంగీక రింపబడినది. కాని, ఆయన ఫత్వాఖైదీలను విడిచిపెట్టవలెననీ, పికెటింగును కొనసాగిం చుటకు హక్కుండవలెననీ కోరినకోరికలు నిరాకరింపబడినవి. దురదృష్టవశమున గాంధీ యొక్క యీ తంతి జవాబు త్రోవలో ఆలస్యమగుటచే రీడింగుప్రభువు కలకత్తాలో ఉండగా ఆయన కందలేదు. రీడింగుప్రభుని సహోద్యోగులు డిశెంబరు ౨౩ తేదీని కలకత్తాను విడిచి వెళ్లిపోయిరి. ఆ రాయబారము లంతటితో ముగింపబడినవి. అసలు మధ్యవర్తులు జిన్నా, పండిత మదనమోహనమాలవ్యాలు. రాయబారములు కొనసాగక పోవుటచే యువరాజరాకకు సంబంధించిన బహిష్కరణకార్యక్రమము దేశ మంతటా పూర్తిగా అవలంబింపబడినది. కలకత్తాలో సంపూర్ణమైన హరతాళము జరిగినది. కచే రీలుకూడ మూసివేయబడినవి. ఐరోపీయుల కిది ఎంతో ఆగ్రహకారణమైనది. సాత్విక నిరోధకులు వారి శిక్షాకాలము పూర్తి అయ్యేటంతవరకును కారాగారములం దుంచ బడిరి. ౧౯౨౧ డిశెంబరు చివరివారమున అహమ్మదాబాదుజాతీయమహాసభ జరిగినది. అందులో అసహాయోద్యమము పరమావధికి పోయినది. నాగపురపు మహాసభ జరిగిన తర్వాత రాజకీయపరిస్థితులలో ఎంతమాత్రము మార్పు జరుగలేదు. కానాట్ప్రభువు మాంటెఫర్డు సంస్కరణములను ప్రవేశపెట్టేనాడు రాజుగారు సందేశమును బంపిరి.

"కొన్ని సంవత్సరములనుండియో, లేక కొన్నితరములనుండియో రాజభక్తి పూరితులైన భారతదేశభక్తులు వారి మాతృభూమికొరకు స్వరాజ్యమును సంపాదింప

వలెననే కోరికతో నుండిరి. ఈరోజున మీరు నాసామ్రాజ్యములో స్వరాజ్యమును ప్రారంభించుచున్నారు. నా సామ్రాజ్యములోని ఇతరరాధినివేశ రాజ్యము లనుభవిస్తున్న స్వాతంత్ర్యాభివృద్ధిని పొందుటకు మీకు కావలసినంత అవకాశము కలదు."

కానాటు ప్రభువు అర్ధాంగీకారముతో ఉపయోగించిన యీ స్వరాజ్యమనే పదముగాని, "పూర్వము జరిగిన విషయములనుగూర్చి మరచిపోవలసినది, క్షమించవలసినది" అని ఆయన చెప్పిన మాటలుగాని, భారతశాసనసభలో పంజాబుదురంతములను గూర్చి "కొంతమంది ఉద్యోగులుచేసిన దురాగతములకు ప్రభుత్వమువారు విచారపడుతూ ఉన్నా"రని సర్ విలియం విన్సెంటుచేసిన ప్రకటనముగాని భారతీయులను సంతృప్తిపరచలేదు. వారి హృదయములలో ప్రభుత్వమునందు విశ్వాసము కుదరలేదు. అందువలననే అసహాయోద్యమప్రణాళిక ప్రకటింపబడినది. అహమ్మదాబాదుసభలో దాని వివరము లింకను స్పష్టీకరింపబడినవి. ఆ మహాసభకు చిత్తరంజనదాసు అధ్యక్షుడుగా ఎన్నుకొనబడెను. అప్పటికప్పుడే ఆయన దేశబంధుదాసుగా పేరుపొందెను. ఆయన కాంగ్రెసునాటికి జయిలులో నుంపబడుటచేత ఆయనస్థానమున హకీమ్అజ్మల్ ఖాన్ ఎన్నుకొనబడెను.

రాజకీయ వాతావరణ మతితీవ్రముగా నుండెను. "సంవత్సరములో స్వరాజ్యము" అనే భావము ప్రతివానిహృదయములోను పొంగిపొరలెత్తుచుండెను. గాంధీ తన కార్యక్రమము సరిగా నిర్వర్తింపబడేయెడల సంవత్సరములో స్వరాజ్యమును తెప్పింతునని వాగ్దానము చేసియుండెను. సంవత్సరము పూర్తికావచ్చినది. ప్రతివాడునూ ఏదో ఒక వింతజరిగి స్వరాజ్యము తన పాదములదగ్గర వచ్చి పడు నని రాజకీయాకాశమువంక ఆర్తితో చూడసాగినాడు. అయితే ప్రతిమనిషికూడా "ఆ స్వప్న ఫలితమును తొందరగా పొందుటకు" తనకు సాధ్యమైనంత త్యాగమును చేయ పూనుకొనెను. ప్రజలు తమ త్యాగశీలతను ప్రదర్శింప నుత్సాహముతో నుండిరి. ప్రతి మనిషీ సమష్టి శాసనోల్లంఘనకార్యక్రమమున కెదురుచూస్తూ ఉండెను. అప్పటికే ౨౦ వేల మంది శాసననిరోధకులు కారాగృహములలో నుండిరి. ఆ సంఖ్య ౩౦ వేలవరకును పెరుగ సిద్ధముగా నుండెను. సమష్టిశాసనోల్లంఘన మనగా ఏమిటో, ఏవిధముగా నుండునో అని ప్రజ లువ్విళ్లూరుతూండిరి. [illegible] దానినిగూర్చి విపులముగా తన మనస్సులోకూడ నిర్ణయించుకొనిఉండలేదు. అరణ్యమున్నట్టుమన [illegible] సారికి క్రమక్రమముగా త్రోవ తనంతటతానేకనిపించునట్లు, [illegible] శాసననిరోధకులకుకూడా సమష్టిశాసనోల్లంఘనమార్గము [illegible] ద్యానంత టదియే ప్రత్యక్షము కావలసి ఉండెను. ఇదివరకు సమష్టి [illegible] కేర్పాటుచేయబడిన

వరకుల నమస్కరించి తగినచోట తగిన మనుష్యులతో అది ప్రారంభింపవలసి యుండెను. కాబట్టి గాంధీ గుజరాతులో పన్నుల నిరాకరణ దండయాత్రను ప్రారంభింపవలయు కొనెను. గుంటూరులోని స్నేహితులుగూడా అంత ఉత్సాహముతోనూ, అంత త్యాగ సాహసములతోనూ తమ జిల్లాలో పన్నుల నిరాకరణ ప్రయత్నములను కొనసాగింప దలచుకొనిరి. ఆసమయములోని దేశస్థితినిగూర్చి, కాంగ్రెసువా రాచరింపవలసిన ధర్మమునుగూర్చి అహమ్మదాబాదుకాంగ్రెసులో అంగీకరింపబడిన ప్రధానతీర్మానము నందలి మొదటి భాగములో చక్కగా వర్ణింపబడినది.

“ప్రజలకు భయము పోయినది. భారతజాతి ఆత్మగౌరవము పెంపొందినది. ప్రజావిశ్వాసమును చూరగొనుటకు స్వార్థత్యాగప్రజాసేవలే ప్రధానమార్గము లని కాంగ్రెసువారలు తెలుసుకొనగలిగిరి. ప్రభుత్వమువారి ప్రతిష్ఠకూడా చాలావరకు తగ్గిపోయినది. ప్రజలు స్వరాజ్యాదర్శమునుగూర్చి చక్కగా తెలుసుకొనిరి.”

అహమ్మదాబాదుసభలో అనేకసంస్కరణములు జరిగినవి. నాగపురము కాంగ్రెసు జరిగినప్పుడు ప్రతినిధులకు బల్లలున్ను, కుర్చీలున్ను ఏర్పాటుచేయబడినవి. అందుకు ౭౦ వేలరూపాయలు ఖర్చయినవి. అహమ్మదాబాదుకాంగ్రెసులో ఆపద్ధతి తీసివేయబడినది. సన్మానసంఘాధ్యక్షుడు వల్లభాయిపటేలు అతిసంగ్రహముగా తన ఉపన్యాసమును ముగించెను. ఆ సభలో అంగీకరింపబడిన తీర్మానములుకూడా చాలా తక్కువ. మొత్తమన్ని తొమ్మిది తీర్మానములుమాత్రమే అంగీకరింపబడినవి. ఆకాంగ్రెసులో వ్యవహరింపబడినభాష “ హిందీ ”. కాంగ్రెసుకోసము నిర్మింపబడిన డేరాలకు రెండులక్షలరూపాయలు విలువగల ఖద్దరుపయోగింపబడినది.

గాంధీ అహమ్మదాబాదుకాంగ్రెసులో మతసందేశము నిచ్చెనిమిత్తము రివరెండు సి. యఫ్. ఆండ్రూసును ఆహ్వానించెను. ఆయన అందు కంగీకరించెను. కాని విదేశవస్త్రదహనమువలన దౌర్జన్యము కలుగు నని భయపడి అందుకు తన ప్రతికూల భావమును ముందుగా గాంధీకి తెలియజేసెను. ఆయన మా యుపద్ధతికి భిన్నముగా, విదేశవస్త్రదహనమునకు తాను ప్రతికూలుడ నని స్పష్టీకరించేనిమిత్త మానాడు అయిరోపీయదుస్తులలో ప్రత్యక్షమయ్యెను. తన ఉపన్యాసములో తా నానాడెందుకు ఖద్దరుదుస్తులలో లేడో ఆయన వివరించెను. ఆయన చెప్పిన అభిప్రాయములో నప్పటి సభాసదు లేకీభవింపజాలకపోయినప్పటికిని ఆయననుమాత్ర మత్యంతగౌరవ ప్రేమలతో నా రాదరించిరి. తన ఉపన్యాసానంతరమున తాను గాంధీ అజ్ఞానుసారముగా మాతృదేశమునకు శాంతిదూతగా పోవుచుంటి నని ప్రకటించెను.

ఇక అహమ్మదాబాదుకాంగ్రెసుసంఘటనములనుగూర్చి సంగ్రహముగా వివరింతుము. దేశబంధు దాసుపసోర్కములో ఆయనకు బదులుగా హకీమ్ అజ్మల్ ఖాన్ అధ్యక్షత వహించెను. ఆయన మూర్తీభవించిన హిందూమహమ్మదీయ సఖ్యత. ఒకప్పుడు ఢిల్లీలో జరిగిన హిందూమహాసభ కాయన అధ్యక్షుడుగా కూడ ఎన్నుకొనబడెను. ఆయనవి పాదుషాలగౌరవమర్యాదలు. ఆయన మంచి విజ్ఞానమూర్తి. ఆవిజ్ఞానమునకు తగిన సత్ప్రవర్తనము కల దాయనకు. అందువలనన వైజ్ఞానిక, సాంఘిక, నైతిక జీవితములలో ఆయన సుప్రసిద్ధత గడించెను. దేశబంధుని ప్రతినిధిగా ఆయన అహమ్మదాబాదులో ఉత్తేజకరమైన ఉపన్యాసము నిచ్చెను. దేశబంధుని ఉపన్యాసమును సరోజినీదేవి ఆ ఉపన్యాసధోరణికి తగినట్లుగా తన మధురవాక్కులలో చక్కగా చదివెను. దేశబంధు భారతజాతీయతనుగూర్చి తన ఉపన్యాసములో సంపూర్ణముగా వివరించెను. ఆయన భారతజాతీయతకు మూలము భారతవిజ్ఞానమని నచ్చచెప్పెను. ఆవిజ్ఞానమును పునరుద్ధరించుకొనుటనుగూర్చి "మన మొక అతిథిని సన్మానింపవలెనన్న రెయెషల నుండు మనకొక సొంతయిల్లుండవలెను. ఆ విధముగానే పాశ్చాత్యవిజ్ఞానమును గ్రహించేముందు మన భారతవిజ్ఞానమును మనము పునరుద్ధరించుకొనవలెను." అని ఆయన చెప్పెను. తరువాత భారతప్రభుత్వచట్టము విమర్శింపబడినది. దానినిగూర్చి "భారతదేశమును బ్రిటిషుసామ్రాజ్యములో సమానమైన స్వతంత్రభాగస్వామిగా అంగీకరింపవలసినదని బ్రిటిష్ పార్లమెంటువారిని నిర్బంధించుటకీ పీఠికలో ఏమైన ఆధార మున్నదా" అని ఆయన నిరాశాపూర్వకముగా ప్రశ్నించుకొని "లేదనుకొందును" అని సంగ్రహముగా తనకు తానే జవాబుచెప్పుకొనెను. ఆయన "హిందూదేశమునకు స్వాతంత్ర్యము జన్మహక్కనేసంగతి ఇంగ్లీషువా రంగీకరించేవరకు తాను వారితో సహకార మొనర్చుట కంగీకరింతు" నని స్పష్టపరచెను. తరువాత "ఈచట్టమునుబట్టి మీరు ప్రభుత్వమువారికి సహాయము చేయుదురా యని నేను సిఫారసు చేయజాలను. అగౌరవపూర్వకమైన శాంతి నాకక్కరలేదు. ఈ చట్టమునకు పీఠిక యీ విధముగా నున్నంతవరకును, మన వ్యక్తిత్వమువలన. మన వ్యవహారములను మనమే, స్వయముగా చూచుకొనే జన్మహక్కు మనకు కలదని ప్రభుత్వమువా రంగీకరించేటంతవరకును మనము వారితో సంధిమరతుల నాలోచింపజాలము." అనికూడా ఆయనఉపన్యాసములో వ్రాయబడెను. అటుపిమ్మట అసహాయవాదుల పద్ధతివలన తాను "కంగారు" పడుతూంటినని రీడింగుప్రభువు పదేపదేచేస్తూన్న ప్రకటనలకు ప్రత్యుత్తరముగా కొంత మాట్లాడెను. సప్రూకమిటీవారి ఆలోచనప్రకారము మామూలుచట్టముక్రిందనే అసహాయవాదులు విచారింపబడుతూన్నందువలన అది అసహాయవాదము నణచివేయుట కవ

లంబింపబడిన నిర్బంధవిధానముక్రిందకు రాదని రీడింగుప్రభువు చెప్పినమాటలను కూడా ఆయన ఖండించెను.

అహమ్మదాబాదుకాంగ్రెసులో చేయబడిన తీర్మానములు దేశబంధుని ఉపన్యాసధోరణికనుగుణములుగా నున్నవి. అందులో చేయబడిన ప్రధానతీర్మానమునందు అసహాయోద్యమతత్వమునుగూర్చి, కార్యక్రమమునుగూర్చి విపులముగా వివరింపబడినది. అందువల్లనే గాంధీ ఆ తీర్మానమును ప్రతిపాదిస్తూ దానిని ఆంగ్లభాషలోను, హిందూస్థానీభాషలోను చదువుటకు తనకు ౩౫ నిముషములకాలము పట్టినదనీ, అన్ని వివరములును ఆ తీర్మానములోనే ఉదాహరింపబడినవనీ స్పష్టపరచెను. "ఈ తీర్మానము జరిగిన ౧౫ నెలలలో అవలంబింపబడిన రాజకీయవ్యవహారముల ప్రత్యక్షఫలితమే. ఈ తీర్మానమువలన వైస్రాయి సద్భావములో నున్నయెడల రాజీ రాయబారములకు మార్గము మూయబడలేదు. కాని ఆయన దురుద్దేశముతో నున్నయెడల ఆయనయొగముముందరనే రాజీమార్గము మూసివేయబడును. నిర్బంధవిధానము మరింత తీవ్రరూపమును తాల్చుగాక, ఎంతమంది మరణింతురుగాక. మనము లెక్కపెట్టవలసిన అవసరములేదు. రౌండుటేబిలుసభ జరిపించుటకు మనకు కావలసినంత అవకాశమున్నది. కాని అది నిజమైన రౌండుటేబిలుసభగా నుండవలెను. అనగా ఆసభలో సమానప్రతిపత్తిగలవారుమాత్రమే చేరి విషయములను చర్చించికొనవలసి యుండును. అందులో ఒకరు దాతలుగను, రెండవవారు ప్రతిగ్రహీతలుగను ఉండరాదు. వైస్రాయిఅభిప్రాయములో ఈ విధమైన రౌండుటేబిలుసభయే యున్నయెడల మన రాజీరాయబారములను కొనసాగించుకొనుట కెప్పుడూ అవకాశమున్నది. ఈతీర్మానములో వినయసంపన్నులు లజ్జింపవలసినవిషయ మేమీలేదు. ఈ తీర్మాన మెవరిమీదను అహంకారపూరితముగా చేయబడిన ప్రతిజ్ఞకాదు. అహంకారముపైన ఆధారపడి రాజ్యముచేస్తూన్న అధికారివర్గమువారిపై చేయబడిన ప్రతిజ్ఞ ఇది. స్వాతంత్ర్యప్రాణవాయువును తీసుకొనుట కవసరమైన రెండు ఊపిరితిత్తులవంటి వాక్స్వాతంత్ర్య సమావేశస్వాతంత్ర్యములను స్వసంరక్షణార్థము రూపుమాప పనుకట్టిన అధికారివర్గము వారిపై వినయపూర్వకముగా చేయబడిన, త్రిణీకరింపరాని ప్రతిజ్ఞ ఇది." అని గాంధీ ఆ తీర్మాన ప్రతిపాదనసందర్భమున ఉపన్యసించెను. అసహాయోద్యమప్రధాన తీర్మానము నీ క్రింద నుదాహరింతుము:

## ప్రధానతీర్మానము

"నిరుడు జాతీయమహాసభ జరిగినప్పటినుండి భారతప్రజలు దౌర్జన్యరహిత సహాయనిరాకరణోద్యమము నవలంబించుటవలన కలిగిన అనుభవముచేత తమదేశమునందాత్మగౌరవస్వార్థత్యాగములును, ధైర్యసాహసములును పెంపొందినవని వారు తెలుసు

కొనిరి. ఆ ఉద్యమఫలితముగా ప్రభుత్వమువారి ప్రతిష్ఠ చాలావరకు పడిపోయినది. మొత్తముమీద దేశము స్వరాజ్యార్జనముకొరకు ముందంజవేస్తున్నది. ఈవిషయముల నన్నిటినీ గమనించి యీకాంగ్రెసు కలకత్తా, నాగపురముకాంగ్రెసులలో అంగీకరి పబడిన అసహాయోద్యమతీర్మానమును తిరిగీ బలపరుస్తూ, పంజాబు ఖిలాఫతు అన్యాయములు నివారింపబడి స్వరాజ్యము స్థాపింపబడేటంతవరకునూ యిప్పటికంటెను తీవ్రముగా దౌర్జన్యరహిత సహాయనిరాకరణకార్యక్రమమును కొనసాగింపవలెనని తన నిశ్చితాభిప్రాయమును ప్రకటిస్తున్నది.

"ఇటీవల వైస్రాయి తన ఉపన్యాసములలో భయపెట్టిన ప్రకారము ఇండియా ప్రభుత్వమువారు వాలంటేరుదళములను విచ్ఛిన్నముచేసీ, బహిరంగసభలను, కమిటీ సమావేశములనుకూడా న్యాయశాస్త్రవిరుద్ధముగాను, నిరంకుశముగాను నిషేధించీ, వివిధరాష్ట్రములలోని అనేకమంది కాంగ్రెసుప్రచారకులను నిర్బంధించీ కాంగ్రెసు ఖిలాఫతు ఉద్యమములకు ప్రజలుచేస్తున్న సహాయమును తొలగింప సమకట్టినట్లు కనబడుచున్నది. కాబట్టి సాధ్యమైనంతవరకు కాంగ్రెసువారందరు తదితర వ్యవహారములను తాత్కాలికముగా కట్టిపెట్టి, నవంబరు ౨౩ వ తేదీన బొంబాయిలో జరిగిన కాంగ్రెసుకార్యవర్గమువారి తీర్మానము ప్రకారము, అందరును వాలంటేరుదళములలో బహిరంగప్రదర్శనములు లేకుండా శాంతముగా చేరి, అరెస్టుకు సిద్ధపడవలెనని ఈ కాంగ్రెసువారు తీర్మానిస్తున్నారు. కాని యీక్రింది ప్రమాణపత్రమును సంతకము చేయనిదే ఎవరును వాలంటేరులుగా అంగీకరింపబడకూడదు:—

'దేవుని సాక్షిగా

(౧) నేను జాతీయస్వచ్ఛందసైనికదళములో సభ్యుడుగా నుండగోరుచున్నాను.

(౨) నేనీదళములో సభ్యుడుగా నున్నంతవరకును వాక్కునందును, క్రియయందును అహింస నవలంబింతును. భారతదేశమునకు స్వరాజ్యమును సంపాదించుటకును, ఖిలాఫతు పంజాబు అన్యాయములను నివారించుటకును హిందూదేశపరిస్థితులనుబట్టి అహింసయే సహాయకారి గాగలదని నమ్మినవాడ నగుటచేత మనస్సులో కూడ దౌర్జన్యరాహిత్యమునే అవలంబించుటకు గట్టిగా ప్రయత్నింతును. భారతదేశములోని అన్ని సంఘములయొక్కయు, అన్ని జాతులయొక్కయు. అనగా హిందూ, ముసల్మాను, సిక్కు, పార్సీ, క్రైస్తవ, యూదుల ఐకమత్యమునందుకూడా నాకు విశ్వాసము కలదు.

(౩) ఐకమత్యముకొరకు నేను నిరంతరప్రయత్నములు కావింతును.

(౪) భారతదేశముయొక్క ఆర్థిక, రాజకీయ, నైతిక మోక్షములు ముఖ్యముగా స్వదేశీయుద్యమమునందు కలవని నావిశ్వాసము. నేను చేతితో వడికి, చేతితో నేయబడిన ఖద్దరు వస్త్రములనుమాత్రమే ధరింతును.

(౫) అంటరానితనము దోషమనీ, అన్యాయమనీ నాకు తెలుసును. అది తొలగింపబడవలెనని హిందువుడనైన నాఅభిప్రాయము. అవకాశము కలిగినప్పుడెల్ల నిమ్నజాతులతో కలిసిమెలసి పనిచేసి వారికి సహాయ మొనర్చుటకు నే నిష్టపడుదును.

(౬) నా పైఅధికారుల ఉత్తరువులకు విధేయుడనై యీ ప్రమాణ పత్రముయొక్క అభిప్రాయముతో ప్రతికూలముకాని వాలంటీరుబోర్డు, కాంగ్రెసు కార్యవర్గముల నియమావళిని నేను పాటింతును.

(౭) నామతముకొరకుగాని, నా దేశముకొరకుగాని ఏవిధమైన ప్రతిరోధ ముగాని చూపక జైలును, దెబ్బలను, అవసరమైనయెడల మృత్యువునుగూడా భరింప సిద్ధముగా నున్నాను.

(౮) నేను నిర్బంధింపబడినయెడల నాకుటుంబసంరక్షణ నిమిత్తముకాని, నాపైన ఆధారపడియున్న తదితరుల సంరక్షణనిమిత్తము గాని కాంగ్రెసునుండి ఏవిధ సహాయము నాశించను."

"ఈకాంగ్రెసు ౧౮ సంవత్సరముల వయస్సు గలిగినట్టిగాని, అంతకు పైబడిన వయస్సు గలిగినట్టిగాని ప్రతియువకుడు తక్షణము వాలంటీరుదళములో చేరగలడని విశ్వ సిస్తున్నది.

"బహిరంగసభలను నిషేధిస్తూ ప్రకటనము చేయుచు అనేకకాంగ్రెసు కమిటీ ఆఫీసులను కూడ బహిరంగసభలుగా భావింప ప్రయత్నించు ప్రభుత్వమువారి చర్యలను లెక్క గొనక, బహిరంగసభలను, కమిటీసమావేశములనుగూడ జరుపవలెనని యీ సభవారు సలహాయిస్తున్నారు. బహిరంగసభల సమావేశమునుగూర్చి ముందుగా ప్రకటింపబడ వలెను. అవి ఆవరణగల ప్రదేశములలో జరుపబడవలెను. ముందుగా ప్రకటింపబడిన పేరులుగలవారుమాత్రమే ఆసభలో ఉపన్యసింపవలెను. వారుకూడా ఉపన్యాసము లను వ్రాసుకొనివచ్చి చదువవలెను. సాధ్యమైనంతవరకు ప్రతిసందర్భములోను ఆగ్రహ కారణము కలుగకుండునట్లును, ప్రజలు అహింసామార్గమును విడకుండునట్లును ప్రయత్నింపవలెను.

"వ్యక్తులయొక్కగాని, సంస్థలయొక్కగాని నిరంకుశాధికారమును విరోధింప వలెనన్నయెడల తక్కిన అన్ని ఉపాయములకంటెను, సాయుధవిప్లవముకంటెనుకూడ శాసనోల్లంఘనోపాయమే నాగరికమైన దనీ, బలవత్తరమైనదనీ ఈ కాంగ్రెసువారి

అభిప్రాయము. కాబట్టి యీకాంగ్రెసు దేశములోని కాంగ్రెసు ప్రచారకులును, శాంతిపద్ధతులయందు నమ్మకముగల తదితరులును వ్యక్తి, సమష్టిశాసనోల్లంఘనము లను ప్రారంభింపవలెనని సలహాయిస్తున్నది. శాసనోల్లంఘనము చేయుతలపెట్టినవ్యక్తులు నేటి భారతప్రభుత్వమును సంపూర్ణ బాధ్యతారాహిత్యమునుండి తొలగించుటకు కొంత త్యాగముచేయు టవసరమని విశ్వసించినవారుగా నుండవలెను. సమష్టిశాసనోల్లంఘన సందర్భమున ప్రజలు దౌర్జన్యరాహిత్యమునందు తగిన శిక్షణమును పొంది, ఢిల్లీలోని అ. భా. కాం. సం. సమావేశమునందు చేయబడిన తీర్మానములోని షరతులను పూర్తి చేసినవారుగా నుండవలెను.

"వ్యక్తిశాసనోల్లంఘనము గాని, సమష్టిశాసనోల్లంఘనము గాని స్వసంరక్షణార్థమో, లేక ప్రభుత్వము కవ్వించుటకో ప్రారంభింపబడినప్పుడు దానిని సరియైన హద్దులలో నిబంధనానుసారముగా నడుపుటకు రాష్ట్రీయకాంగ్రెసుసంఘములును, అ. భా. కాం. కార్యసంఘమును అవసరమైన సలహాల నిచ్చుచుండవలెను. ఆసందర్భమున అవసరమైనంతవరకు కాగ్రెసు ప్రదేశములలో తదితరకాంగ్రెసువ్యవహారము లాపి వేయబడవలెనని ఈకాంగ్రెసువా రభిప్రాయపడుచున్నారు.

"పదునెనిమిదేండ్లవయస్సుగాని, అంతకుమించిగాని ఉన్న విద్యార్థులందరును, ముఖ్యముగా జాతీయసంస్థలలో చదువుచున్న విద్యార్థులును, ఆసంస్థలలోని ఉద్యోగస్థులును పైనుకచెప్పబడిన ప్రమాణపత్రమును వెంటనే సంతకముచేసి జాతీయ సైనిక దళములలో సభ్యులు కావలెనని ఈకాంగ్రెసువారు వారిని కోరుచున్నారు.

"ఇంకా చాలామంది కాంగ్రెసుప్రచారకులు నిర్బంధింపబడగలరనే ఉద్దేశముతో ఈకాంగ్రెసు మామూలుకాంగ్రెసువ్యవహారములకు భంగము రాకుండునట్లు మహాత్మాగాంధీని కాంగ్రెసుయొక్క సంపూర్ణ కార్యనిర్వహణాధికారిగా నియమించినది. ఆయనకు అ. భా. కాం. సం. యొక్క అధికారములన్నిటినీ యీయడ మైనది. అవసరమైనయెడల ఆయనే ప్రత్యేకకాంగ్రెసునుగాని, అ. భా. కాం. సం. సమావేశమునుగాని, కాంగ్రెసుకార్యవర్గసభనుగాని పిలువవచ్చును. అత్యవసరసందర్భములలో ఆయనతరువాత ఆయనఅధికారమును పొందతగినవారినికూడ ఆయనే నియమింపవచ్చును.

"గాంధీచే నియమింపబడినవానికిగానీ, వానితరువాత వచ్చినవారికిగానీ ఈ పైఅధికారము లన్నీ సంక్రమింపగలవు.

"ఇందుమూలమున, గాంధీమహాత్మునకుగాని, ఆయనతరువాత అధికారమునకు వచ్చినవారికిగాని ముందుగా అ. భా. కాం. సం. వారి అనుజ్ఞపొందనిదే భారత

ప్రభుత్వముతోగాని, లేక బ్రిటిష్‌ప్రభుత్వముతోగాని రాజీచేసుకొనుట కధికార మియ్యబడినట్లుగా భావింపగూడదు. ఒకవేళ అ. భా. కాం. సం. వారి అనుమతితో అట్టిరాజీ జరిగినప్పటికిని అది ప్రత్యేకకాంగ్రెసులో ఆమోదింపబడితేనేగాని ఆరాజీ చెల్లనేరదు. ప్రస్తుతకాంగ్రెసుప్రధానమాత్రము గాంధీమహాత్మునిచేతగాని, ఆయన తరువాత అధికారమునకు వచ్చినవారిచేతగాని ముందుగా కాంగ్రెసుఅనుమతిని పొందనిది మార్చబడకూడదు.

" తమదేశముకొరకుగాని, అంతరాత్మకొరకుగాని ఖైదుశిక్ష ననుభవిస్తూ, తమత్యాగమువలన స్వరాజ్యము తొందరగా రాగలదని తెలుసుకొనగలిగిన దేశభక్తుల నందరిని ఈకాంగ్రెసు అభినందిస్తూన్నది. "

తీర్మానము ౨

" సంపూర్ణసహాయనిరాకరణోద్యమమునందుగాని, అసహాయ తత్వమునందుగాని విశ్వాసములేక జాతీయగౌరవముకొరకు ఖిలాఫత్ పంజాబు అన్యాయములకు పరిహారము కలుగవలెననీ జాతీయవాక్స్వాతంత్ర్యముకొరకు స్వరాజ్యము సంస్థాపింపబడవలెననీ కోరేవారందరును ఈక్రింది విధముగా దేశమునకు తోడ్పడవలెను. వారు వివిధమతములవారికిని, స్నేహభావము పెంపొందింపవలెను. దారిద్ర్యోపవాసములతో బ్రతుకుతూన్న లక్షలకొలదీ వ్యవసాయికుల కుపశమనోపాధిగా నుండగలదనే ఆర్థికదృష్టితోనైనను వారు రాట్నమునకుటు, బట్టలునేయుట, ఏకులుచేయుటవంటి గృహపరిశ్రమను ప్రోత్సహించవలెను. అందుకొరకు చేతితో వడికి, చేతితో నేయబడిన దుస్తులనే ధరించవలెనని ప్రజలకు వారు ప్రబోధించవలెను. సంపూర్ణమద్యనిషేధమునకు వారు తోడ్పడవలెను. వారు హిందువులైనయెడల అంటరానితనమును రూపుమాపుటకు ప్రయత్నించి నిమ్నజాతుల అభివృద్ధికి తోడ్పడవలెను."

ఇక మౌలానాహజరత్ మోహనీప్రతిపాదించిన తీర్మానముమగూర్చి చెప్పవలెను. ఆయన స్వరాజ్యమనగా " విదేశీయ రాజమాన్యములేని సంపూర్ణస్వాతంత్ర్యము " అని నిర్వచించెను. ఆప్రకారము కాంగ్రెసుప్రధమసూత్రములో మార్పుచేయ ప్రతిపాదించెను. ఇంతకాలము గడచిన పిమ్మట, ఇన్నివ్యవహారములు జరిగినతరువాత ఆయనచే ప్రతిపాదింపబడిన ఈతీర్మానము చాలాన్యాయమైనదిగా తలంపబడును. అది గాంధీచే ఆనాడు విరోధింపబడినందుకుకూడా చాలామంది కాశ్చర్యముగా నుండగలదు. ఆనాడు గాంధీ తన అభిప్రాయమును స్పష్టముగా వెల్లడించెను :

"మీలో కొందరీతీర్మానమునుగూర్చి తేలికగా యోచించుట నాకు విచారముగా నున్నది. అది మీబాధ్యతారాహిత్యమును వెల్లడిస్తూన్నది. బాధ్యతగల మన

మందరమును నాగపురము, కలకత్తా కాంగ్రెసుల రోజులను జ్ఞాపకము చేసుకొనవలెను."

గాంధీచేత ప్రయోగింపబడినయీ భావన నేడు పాఠకులకు కఠినముగానో చమత్కారముగానో అయినచో అది అంగీకరించముగా నుండకపోవనియే గాంధీ ఉద్దేశించెను. కాని ఉండెక్కి సినంత కఠినముగానున్నదా అని మా ప్రశ్న. క్రొత్త సిద్ధాంతమునకు రూపమిచ్చి, క్రొత్త ఉద్యమమును సృష్టించి క్రొత్త సంగ్రామమును నడుపుతూన్నది గాంధీ. ఆయన కొన్ని బలాలు దేగదీసిన దండయాత్రయొక్క ఉద్దేశ్యమును, అందుకొరకు కవలంబింపదగిన ఉపాయమును స్పష్టముగా వ్యక్తపరచెను. సైనికులు యుద్ధరంగములో సంచరిరి. అక్కడక్కడ చిన్న చిన్న పోరాటములు జరుగుతూండెను. మహాసంగ్రామము ముందు జరుగ నుండెను. సరిగా ఆ సమయములో ఒక సైనికుడు వచ్చి సర్వసైన్యాధిపతినీ, సైన్యమునూ సంగ్రామోద్దేశ్యమును తిరిగీ నిర్వచింపవలసినదని కోరుట యుద్ధమునకు తయారైన సైనికులను కలతపరచుట అగును. హజరత్ మోహానీ అప్పుడాపనికి పూనుకొనుట యెంతమాత్రమును సమయానుకూలముగా లేదు. దానివలన ఉద్యమమునకు సహాయము చేయరాదు. అట్టి సందర్భములో సర్వసైన్యాధిపతికి విచారము కలిగినదన్నగా, కోపము వచ్చినదన్ననూ కూడా ఆశ్చర్యము కాదు. ఆనాడు గాంధీ చెప్పిన వాదనలు దాదాపు నాగపూరు కాంగ్రెసువారి దాయన ప్రతిపక్షులు చెప్పిన వాదనలను పోలియున్నవి. "ప్రపంచకములోని మేధావంతులు అందరును మనలను ఆత్మశక్తి నెరుగనివారనుగా నిందింతురు. మనహృద్యమును మన మెరిగి ఉండవలయును, హిందూ మహమ్మదీయులకు నిరంతరాయమైన సఖ్యత కుదరవలెను. నేడు హిందూమహమ్మదీయులకు సంపూర్ణ సఖ్యత కలదని విశ్వాసముతో చెప్పగలిగినవారీసభలో ఎవ్వరు? పార్సీలుకాని, సిక్కులు కాని, క్రైస్తవులుకాని, యూదులుగాని, అస్పృశ్యులుకాని నేటి ఈమార్పున కంగీకరింతురని నమ్మకముగా చెప్పగలవారెవరైనా ఈ సభలో ఉన్నారా? నేటిమధ్యాహ్నమే కదా అస్పృశ్యులనుగురించి మీరు విన్నది. ముందు మనబలములను మనము కూడదీసు కొనవలెను. మన మనస్సులలోని అభిప్రాయములను మనము తెలుసుకొనవలెను. లోతు తెలియని నీళ్లలోకి మన మురకరాదు. హజరత్ మోహానీయొక్క ఈ తీర్మానము మనలను పాతాళమునకు తీసుకొనిపోగలదు." అని గాంధీ ప్రతినిధుల హృదయముల కెక్కునట్లుపన్యసించెను. సైన్యాధిపతి తానెరుగని అజ్ఞాతభూములకు సైనికులను తీసుకొని పోజాలడు. కాబట్టి ఆ తీర్మాన మంతటితో వీగిపోయినది. తరువాత ప్రతి కాంగ్రెసులోను ఈ తీర్మానము చర్చకు వస్తూనేయుండెను. ౧౯౨౭ లో జరిగిన మద్రాసుకాంగ్రెసులో యీమార్పు తీర్మానరూపకములో అంగీకరింపబడినది. తరువాత ౧౯౨౯ లో లాహోరునగరమున జరిగిన కాంగ్రెసులో ఇది కాంగ్రెసు ఆదర్శముగా అవలంబింపబడినది.

తక్కిన తీర్మానములలో ఒకటి కాంగ్రెసునిర్మాణవిధానముగూర్చినది. రెండు కాంగ్రెసు అధికారుల ఎన్నికనుగూర్చినది. మరియొకటి మాప్లాతిరుగుబాటును గూర్చినది. అందులో మాప్లా తిరుగుబాటుకు ఖిలాఫతు, అసహాయోద్యమము లేమాత్రము కారణభూతములు కావని స్పష్టీకరింపబడినది. "మాప్లా తిరుగుబాటు ప్రారంభింపబడుట కారణములనుండి అహింసాప్రచారకు లెవరును మలబారు పోవ నిషేధింపబడిరి. గాంధీ, యాకూబు హాస్సేనులవంటి అసహాయోద్యమనాయకులు మలబారు పోవుట కంగీకరింపబడినయెడల అనుకొనలవరకును మాప్లాతిరుగుబాటు కొనసాగి యుండేది కాదు. ౧౯౨౧ నవంబరు ౧౯ వ తేదీని సుమారు నూరుమంది మాప్లా ఖైదీలు రైలులోని గుడ్సుపెట్టెలో బంధింపబడి బళ్లారికి బదిలీచేయబడిన సందర్భమున ఊపిరాడక దారిలో డెబ్బదిమంది మరణించుటకు కారణభూతులైన అధికారుల అమానుషచర్యకు అహమ్మదాబాదుకాంగ్రెసువారు కోపమును ప్రకటించిరి. నవంబరు ౧౭ వ తేదీని బొంబాయిలో జరిగిన సంఘటనమునకు ఆకాంగ్రెసు విచారమును వెలిబుచ్చుతూ అన్ని పక్షములవారికిని, అన్ని సంఘములవారికిని కల హక్కులను సంపూర్ణముగా సంరక్షించుటయే కాంగ్రెసుయొక్క నిశ్చితాభిప్రాయమనికూడా ప్రకటించినది. సెవర్సుసంధిని మార్పుచేయుటకు కారణభూతమైన విజయమును కెమల్ పాషా గ్రీకులమీద పొందినందుకాయన అభినందింపబడెను. కోమగాటమారు సంఘటనము తరువాత ౭ సంవత్సరము లజ్ఞాతవాసములో నుండి, పిమ్మట పోలీసువారికి తనకు తాను వశమైనందుకు అహమ్మదాబాదుకాంగ్రెసువారిచే బాబా గురుదత్ సింగున కభినందనములు సమర్పింపబడెను. ఆసందర్భములోనూ, తదితర సందర్భములలోనూ పోలీసువారున్నూ, సైనికులున్నూ రెచ్చగొట్టినప్పటికిని దౌర్జన్యరహితులుగానున్న సిక్కులను కాంగ్రెసువారు కొనియాడిరి.

అహమ్మదాబాదుకాంగ్రెసులో జరిగిన ముఖ్యవిషయ మేమనగా, అక్కడ చర్చింపబడిన రాజకీయవిషయములలో మహమ్మదీయ మతాధిపతులు కాంగ్రెసుకు సలహాయిచ్చుటయందు ఎక్కువ ఐక్యము కలిగించుకొనిరి. వ్యక్తిసమష్టిశాసనోల్లంఘనముల సందర్భములో "మనసా, వాచా, కర్మణా" దౌర్జన్యరాహిత్యము నవలంబించుటనుగూర్చి కొంతచర్చ జరిగినది. కలకత్తా తీర్మానములో "వాచా, కర్మణా" అనిమాత్రమే ఉన్నది. 'మనసా' అనేమాటకు మహమ్మదీయులు అభ్యంతరపెట్టిరి కాబట్టి అందుకుబదులు 'ఉద్దేశపూర్వకముగా' అని చేర్చబడినది. ఈ అన్ని సందర్భములలోను ఉలేమాలు మహమ్మదీయ శాస్త్రానుగుణముగా కాంగ్రెసుకు సలహాయిచ్చుటకు తోడ్పడిరి. శాసనసభాప్రవేశమునుగూర్చి, తదితర విషయములనుగూర్చి కూడా వారిచ్చిన సలహాలను ముందుముందు వివరింతుము. కాంగ్రెసుయొక్క సాధారణ

నిర్మాణమునకు భంగముకలిగే సందర్భములో గాంధీని సంపూర్ణ కార్యనిర్వాహణాధికారిగా నియమించినతీర్మానమునుగూర్చి చిట్టచివర కొకమాట చెప్పవలసియున్నది. ఆతీర్మానములో రెండునిబంధనలుమాత్ర మేర్పాటుచేయబడినవి. (౧) ఆయనగానీ, ఆయనతరువాత అధికారమునకు వచ్చినవారుగానీ కాంగ్రెసుయొక్క అనుమతి లేనిదే ప్రభుత్వమువారితో రాజీచేసుకొనగూడదు. (౨) కాంగ్రెసు ప్రథమ సూత్రమును కాంగ్రెసుఅంగీకారముతో తప్ప నా రెవరును మార్చగూడదు.

అహమ్మదాబాదుకాంగ్రెసులో మరొక నూతనవిషయము జరిగినది. మహాసభ పూర్తియైనవెంటనే ప్రతినిధు లెక్కడివా రక్కడ వారివారిదేశములకు పోలేదు. గాంధీ కాంగ్రెసు గాని ప్రతినిధుల బసలకు పోయి శాసనోల్లంఘనతత్వమునుగూర్చి వారికి వివరముగా తెలియచెప్పెను. ఆంధ్రులబసలో ఆయన పన్నులనిరాకరణమును సాగించవలసిన ప్రదేశములందు కాంగ్రెసువాలంటీర్లు గ్రామగ్రామమునకును పోయి అందు కంగీకరించిన రైతుల సంతకములను తీసుకొనవలసియుండు నని చెప్పెను. ఢిల్లీ తీర్మానము ప్రకారము వ్యష్టి, సమష్టి శాసనోల్లంఘనములకు తయారైన ప్రదేశములలోమాత్రమే యీపని జరుగవలసియుండె నను మాట వేరుగా చెప్పవలసినపని లేదు.

టనము కావించెను. ఆసభాకార్యదర్శులు [illegible], [illegible], [illegible] తమ పేరులతో అప్రకటనమును ఖండిస్తూ ప్రత్యుత్తరములను వ్రాసిరి.

అఖిలపక్షసమావేశమువారి తీర్మానములో అసహాయవాదులకు సంబంధించిన భాగము జనవరి ౧౭ వ తేదీని జరిగిన కాంగ్రెసు కార్యవర్గసమావేశములో పూర్తిగా ఆమోదింపబడినది. ఆ నెలాఖరువరకును శాసనోల్లంఘనము మాపివేయబడినది. ఆ సందర్భములో మహాసభవారికిని, రీడింగుప్రభువునకును జరిగిన ఉత్తర ప్రత్యుత్తరములను బట్టి చూచినయెడల రీడింగుప్రభుని నిర్లక్ష్యభావము వెల్లడికాగలదు. కాని అందు మూలమున మేలే కలిగినది. కలకత్తా రాయబారముల సందర్భమున ఉభయులును తమ తమ కార్యక్రమములను తాత్కాలికముగా కట్టిపెట్టినయెడల, కాంగ్రెసుపక్షమువారు గాని, ప్రభుత్వమువారుగాని జయముపొందినట్లుగా భావించగూడదని రీడింగుప్రభువు చెప్పిన తియ్యనిమాటలు ఆనాటి మధ్యవర్తులనుకొన్నంత నిష్కపటములు కావని దీనినిబట్టే బోధపడగలదు. యువరాజు కలకత్తాను దర్శించినప్పుడు అసహాయవాదుల బహిష్కారప్రదర్శనములు జరుగకుండుటకై రీడింగుప్రభు చెప్పుదాపున నాగమును పన్నెను. అందుమూలమున సద్భావముకల ఆ మధ్యవర్తుల ప్రయత్నములు భగ్నములైనవి. అఖిల పక్ష సమావేశమువారి షరతులను వైస్రాయి తక్షణము నిరాకరించెను. అటు పిమ్మటనే గాంధీ ౧-౨-౨౨ వ తేదీని తాను బార్డోలీలో శాసనోల్లంఘనము ప్రారంభింప నుద్దేశించితినని వైస్రాయి కొకయుత్తరము వ్రాసెను. ప్రభుత్వమువారు తమశక్తి కొలదీ నిర్బంధవిధానమును ప్రయోగించిరనీ, ప్రజలు సాత్వికోద్యమమునకు కావలసినంత త్యాగము చేయలేకపోయిరనీ గాంధివిశ్వాసము. అందువలన అప్పుడు కాంగ్రెసు ప్రభుత్వముతో రాజీచేసుకొనుటకు తగినతరుణము రాలేదని గాంధీ అభిప్రాయపడెను. ఆ అభిప్రాయముతో కాంగ్రెసువారు లందరును ఏకీభవింతురు. కాబట్టి ఆనాడు రాజీ భగ్నమైనందున కెవ్వరును చింతిల్లవలసినపని లేదు.

ఈ రాయబారము విఫలముగా [illegible] దేశముయొక్క దృష్టి [illegible] బార్డోలీతాలూకాయందు గాంధి సాగింపనున్న శాసనోల్లంఘనము [illegible] కేంద్రీకరింపబడినది. గాంధి సామూహికశాసనోల్లంఘనము [illegible] [illegible] బార్డోలీతాలూకాలో, గాంధితో కష్టసుఖములనుభవించుటకు [illegible] గాంధీవద్దకు [illegible]. [illegible] తాను బార్డోలీలో ప్రారంభింపబోయే సామూహికశాసనోల్లంఘనకార్యక్రమము [illegible]
[illegible]

పరచబడిన యుద్ధరంగవ్యూహము లేని యెక్కడను జరుపబడరాదని ఆయనతలంపు.
ఆ విషయమై ౧౯౨౨ జనవరి ౩౧ వ తేదీ కార్యవర్గము వారి తీర్మానమునందు వివ
రింపబడెను. కాని అహమ్మదాబాదుసభ జరిగినవెంటనే జనవరి ౭ వ తేదీని ఆంధ్ర
రాష్ట్రీ కాంగ్రెసుసభవారు బెజవాడలో సమావేశమై పన్నుల నిరాకరణమును
ప్రారంభించుటకు తగిన ప్రదేశములను అన్వేషించు నిమిత్తము జిల్లా కాంగ్రెసు
సంఘముల కధికార మొసగ నిర్ణయించిరి. కృష్ణా, గోదావరి, గుంటూరు, కడపజిల్లాలలో
పన్నుల నిరాకరణమున కనుజ్ఞ పొందినవి. అహమ్మదాబాదుకాంగ్రెసుకు పూర్వము
౧౫ రోజులు ముందుగనే ౧౫ - ౧౨ - ౨౧ వ తేదీని ఆంధ్రరాష్ట్రీకాంగ్రెసుకార్య
నిర్వాహక సంఘము గుంటూరులో సమావేశమై ఆంధ్రదేశమునందు పన్నుల చెల్లిం
చుట ఆపివేయబడవలెనని నిర్ణయించిరి. ఇది కాంగ్రెసునిర్ణయమునకు పూర్వమే
జరిగినది. కాని అహమ్మదాబాదుకాంగ్రెసువారి ప్రకారము నిర్ణయింప గల రని
మాత్రము ఆంధ్రరాష్ట్రీ కార్యనిర్వాహక వర్గమువారు విశ్వసించిరి. ఇతరజిల్లాలవారు
అహమ్మదాబాదులో గాంధీ చెప్పినప్రకారము రైతులసంతకములను తీసుకొన ప్రారం
భించిరి. కాని గుంటూరుజిల్లావారుమాత్రము ౧౯౨౨ జనవరి ౧౨ వ తేదీని పన్నుల
నిరాకరణదండయాత్రను ప్రకటించిరి. బొంబాయిలో అఖిలపక్ష సమావేశము జరుగు
చున్న సమయములో ఆంధ్రదేశమునుండి వెళ్ళిన ఇద్దరు ప్రతినిధులతో గాంధీ మాట్లా
డెను. ఆసందర్భములో ఆయన గుంటూరుజిల్లా పన్నుల నిరాకరణమును గూర్చిన
నిజమైన పరిస్థితులను తెలుసుకొనగలిగెను. తరువాత జనవరి ౧౭ వ తేదీని ఆంధ్ర
రాష్ట్రీకాంగ్రెసుసంఘాధ్యక్షునకు ఆయన ఒక ఉత్తరము వ్రాసెను. ఆంధ్రదేశము
లోని పన్నులన్నీ జనవరి ౨౫ వ తేదీకి చెల్లింపబడినయెడల తాను సంతోషింతునని
కూడా ఒక సందేశమును పత్రికలకు పంపెను. ఎందువలననో పత్రికలలో ఆవిషయము
ప్రకటింపబడలేదు. ఆంధ్రకాంగ్రెసు అధ్యక్షులకు వ్రాసిన ఉత్తరమునకున్నూ గాంధీ
కిని, గుంటూరుమిత్రులకున్నూ ఉత్తరప్రత్యుత్తరములు జరిగినవి. ఆంధ్రదేశములోని
పన్నుల నిరాకరణమునుగూర్చి గాంధీఅభిప్రాయము తెలిసినవెంటనే తక్కిన జిల్లాలవా
రందరును తమ పన్నులను చెల్లించిరి. గుంటూరులోమాత్రమే యీ ఉద్యమము కొన
సాగింపబడినది. గుంటూరువారు గాంధీ అనుమతికోసము పదేపదే ప్రార్థించిరి. అం
దుకు ప్రత్యుత్తరముగా ఆయన యీక్రింది తంతివార్తను పంపెను:

"సమస్త శాసనోల్లంఘనమునకు సంబంధించిన షరతులు సంతృప్తికరముగా
పూర్తి చేయబడినయెడలను, గుంటూరు జిల్లా ఉద్యమములో జయముపొందదగిన అవకాశము
[illegible]
[illegible]"

ఇది పొరపాటున అంగీకారముగా పరిగణింపబడినది. కాని గుంటూరుజిల్లాలో సంచారము చేసి, ఢిల్లీషరతు లక్కడ ఎంతవరకు నిర్వర్తింపబడినవో తెలుసుకొని, అప్పుడు పన్నులనిరాకరణమును కెంతవరకు కొనసాగించవలెనో నిర్ణయించి నివేదించుటకొక కమిటీ ఏర్పాటుచేయబడినది. అటవీప్రదేశములలో పుల్లరిని చెల్లించకుండునట్లును, తదితర ప్రదేశములలో రెవిన్యూ పన్నులను చెల్లించకుండునట్లును ఏర్పాటు చేయబడినది. ఈ పన్నుల నిరాకరణము ప్రారంభింపబడిన ఒకగ్రామములోని పశువులను బందిలిదొడ్డిలో పెట్టుటకై సబ్ఇన్స్పెక్టరు పోయి, దూడను కట్టివేసి ఆవును తోలుకొనిపోవును అంతట గ్రామస్థులు కొందరు ప్రతిఘటించిరి. అసందర్భముగా ఒక గ్రామపెత్తందారు కాల్చబడెను. గుంటూరుపట్టణములో మిలిటరీ మకాము చేసిరి. గవర్నరుగారి ప్రత్యేకసైనికులు గ్రామములలో సంచారము చేసి పన్నులను బలవంతముగా వసూలుచేయ ప్రయత్నించిరి. గ్రామస్థులను అరెస్టు చేసెదమనీ, వారి ఆస్తులను వారంట్లమీద కొల్లగొట్టెదమనీ సైనికులు బెదిరించిరి. అప్పటిపరిస్థితుల నిచ్చట వర్ణించుటకంటె పాఠకు లూహించుకొనుట మంచిది.

౧౯౨౨ జనవరి ౩౧ వ తేదీనాడు సమావేశమైన కాంగ్రెసు కార్యనిర్వాహక సభలో, బార్డోలీ తాలూకా మహాసభవారు సమిష్టి శాసనోల్లంఘనము ప్రారంభింప నిశ్చయించిన తీర్మానము చర్చకు వచ్చినది. స్వార్థత్యాగముతో ఆతాలూకా ప్రజలు సమిష్టి శాసనోల్లంఘనము ప్రారంభింపబూనినందుకు కార్యవర్గమువారు వారి నభినందించిరి. భారతదేశములోని తదితర ప్రాంతములవారు సమిష్టిశాసనోల్లంఘనమును గాని, వ్యక్తిశాసనోల్లంఘనమును గాని, ముందుగా గాంధీమహాత్ముని అంగీకారము పొందనిదే ప్రారంభింపరాదనీ, వారందరును బార్డోలీ ప్రజలకు తోడ్పడవలెననీ కాంగ్రెసు కార్యవర్గమువారు కోరిరి. గాంధీమహాత్ముని అనుజ్ఞపొంది, సమిష్టి శాసనోల్లంఘన ప్రారంభమున కనుగుణముగా ప్రభుత్వమువారికి ప్రత్యక్షముగా చెల్లించవలసిన పన్నులను నిలిపివేసినసందర్భములలో తప్ప తక్కిన అన్ని సందర్భములలోను, అన్నిరాష్ట్రములలోని ప్రజలును ప్రభుత్వమువారికి ప్రత్యక్షముగాగాని, లేక పరోక్షముగా-జమీందారులు, తాలూకాదారుల ద్వారాగాని చెల్లించవలసిన అన్నిపన్నులను వెంటనే చెల్లించవలెననికూడా కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమువారు సలహా యిచ్చిరి.

ఇక గుజరాతు మొదలగు రాష్ట్రములను గూర్చి ఒక్కసారి యాలోచింతము. గాంధీ గుజరాతురాష్ట్రములో పన్నులనిరాకరణమును ప్రారంభింపనిశ్చయించుకొనెను. బొంబాయిలో అఖిలపక్షసమావేశము జరిగినతరువాత జనవరి ౩౧ వ తేదీవరకును యుద్ధము నిలిపివేయబడెను. తరువాత ఆయన ఫిబ్రవరి ౧వ తేదీని వైస్రాయిగారికి

ముఖ్య విషయాదికములలో, లేక స్పష్టముగా వ్యక్తీకరింపబడిన అధికసంఖ్యాకులగు భారతప్రజల యిష్టమునకు వ్యతిరేకముగా ప్రవర్తించినయెడలను మాత్రమే తీవ్రశాసనోల్లంఘనము ప్రారంభింపబడును.

చిత్తగించవలెను.

మీ మిత్రుడును, సేవకుడును

(సం.) యం. కె. గాంధి."

భారతప్రభుత్వమువారు గాంధీజీప్రకటనమునకు వెంటనే ప్రత్యుత్తరమును ప్రచురించిరి. చౌరీచౌరాలో జరిగిన కొట్లాటలవలనను, కాంగ్రెసువాలంటీరుసంఘములు ప్రజల నుద్రేకపరచుట, భయపెట్టుట, వారి సాధారణకార్యక్రమమున కడ్డుతగులుట మొదలగు న్యాయవిరుద్ధకార్యము లొనర్చుచున్నందువలనను నిర్బంధవిధాన మవలంబింపక తప్పినదికాదని ప్రభుత్వమువారి ప్రత్యుత్తరములో వ్యక్తీకరింపబడెను. అలీ సోదరుల క్షమాపణసమయమున వైస్రాయిచే సూచింపబడిన పద్ధతి కించిన్మాత్రమును ప్రభుత్వవిధానము భిన్నముగా లేదనికూడ అందులో సూచింపబడెను. ప్రభుత్వమువారు "గవర్న్మెంటుకు ప్రతికూలముగా చేయబడే నేరముల సందర్భములో అవసరమనితోచినప్పుడు, తగినరీతిని చట్టమును అనుసరించెద" రని వైస్రాయి చెప్పినమాటల కనుగుణముగానే ప్రభుత్వాధికారుల చర్య ఉన్నదని స్పష్టీకరింపబడెను. "అఖిలపక్షముల సభవారి సూచనలను ప్రభుత్వమువారు వెంటనే తృణీకరించి రన్నమాటకూడ సరియైనదికాదు. ఎందుకనగా అసహాయవాదులు న్యాయశాస్త్రవిరుద్ధమైన చర్యలను కట్టిపెట్టవలెనను ప్రధానమైనషరతు అఖిలపక్షసమావేశమువారి సూచనలలో లేదు. హర్తాళములు, పికెటింగు, శాసనోల్లంఘనములుమాత్రమే ఆపివేయబడును అనీ, తదితరన్యాయశాస్త్రవిరుద్ధమైన కార్యములన్నీ మామూలుగానే కొనసాగింపబడు ననీ వారిసూచనలలో ఉదాహరింపబడినవి. అంతేకాక ఆ సభలో సూచింపబడిన రౌండుటేబిలుసమావేశము కేవలము గాంధీనిర్ణయములను అంగీకరించుటకు మాత్రమే పిలువబడవలెనని ఆయన అభిప్రాయమైనట్లుగా కూడ మాకు కనపడినది. ఆయన (౧) అహింసాకార్యక్రమమునందు పాల్గొనినందుకు శిక్షింపబడినట్టియు, విచారణలో నున్నట్టియు అందరుఖయిదీలను విడుదలచేయవలెననీ, (౨) అసహాయవాదు లవలంబించు దౌర్జన్యరహితకార్యక్రమమునందు ఇండియన్ పీనల్కోడు క్రింద నేరముగా పరిగణింపబడవగిన సందర్భములలో కూడ ప్రభుత్వమువారు జోక్యము కల్పించుకొనకుండుటకు హామీ ఉండవలెననీ కోరెను. వీటితో ప్రభుత్వమువారు ఏకీభవింప జాలనందున అఖిలపక్షసమావేశమువారి సూచనలు తిరస్కరింపబడినవి" అని ప్రభుత్వప్రత్యుత్తరమందు కలదు.

కాని, త్వరలోనే కాంగ్రెసు కొక గొప్పదురదృష్టము సట్టసుండెను. సంయుక్త రాష్ట్రములలోని గోరఖ్‌పురమునకు దగ్గరగా చౌరీచౌరాలో ఫిబ్రవరి ౪ వ తేదీని ఒక కాంగ్రెసుఉత్సవము జరిగినది. ఆ ఉత్సవములోని జనసమూహము ఒక పోలీసుసబ్ ఇన్‌స్పెక్టరును, ౨౧ మంది పోలీసుజవానులను చెండాడి, పోలీసుస్టేషనులోకి చొరబడి దానికి నిప్పంటించిరి. వారందరును అమంటలలో భస్మీభూతులైరి.

బొంబాయిలో నవంబరు ౧౭వ తేదీని జరిగిన కొట్లాటల సందర్భమున ౫౩ మంది మరణించిరనీ, ౭౦౦ మందికి గాయములు తగిలినవనీ ఇదివరకే చెప్పియుంటిమి. రాజకుమారుని సందర్శన సందర్భమున జనవరి ౧౩ వ తేదీని మద్రాసులోకూడ అట్టిదిగా నంతకన్న తక్కువ తీవ్రరూపములో కొట్లాటలు జరిగినవి. ఈ రెండు సంఘటనములను గమనించి ౧౯౨౨ ఫిబ్రవరి ౧౨ వ తేదీని బార్డోలీలో సమావేశమైన కాంగ్రెసు సంఘమువారు సమష్టికాసనోల్లంఘనమును తాత్కాలికముగా విరమించిరి. కాంగ్రెసువా రెందరును కేవలము ప్రభుత్వమువారి ఉత్తరువుల నుల్లంఘించి కారాగృహము లకు పోవుప్రయత్నములను విరమింపవలెనని కోరబడిరి. బహిరంగ సభలను, స్వచ్ఛంద సైనికుల ఉత్సవములను జరుపకూడ దని కాంగ్రెసుప్రచారకులు కార్యవర్గము వారిచే హెచ్చరింపబడిరి. కాంగ్రెసుప్రచారకుల కొక నిర్మాణకార్యక్రమ మేర్పాటుచేయబడెను. దానిప్రకారము వారు కోటిమంది కాంగ్రెసుసభ్యులను చేర్పించవలసియుండెను. జాతీయపాఠశాలలను స్థాపించుటకును, ఖద్దరుప్రచారము చేయుటకును, పంచాయితీలను నిర్మించుటకును, మద్యపాననిషేధమును ప్రబోధించుట కును కాంగ్రెసువాదులు పనిచేయవలెనని నిర్ణయింపబడినది. సరిగా ఆసమయము నందే గుంటూరుజిల్లాలో సంచారముచేసి, అక్కడిపరిస్థితులను విచారించి నిశదించుట కేర్పాటుచేయబడిన కమిటీవారు ఆ జిల్లాప్రజలను పన్నులు చెల్లించవలసినదిగా కోరు చూ ఒక నివేదికను ప్రకటించిరి. ఆ ప్రకారము ఫిబ్రవరి ౧౦ వ తేదీలోగా పన్నులన్నీ చెల్లింపబడినవి. ఆంధ్రదేశములో పన్నులనిరాకరణదండయాత్ర కొనసాగింపబడినంత వరకును సంపూర్ణవిజయము కలిగినదనే చెప్పవచ్చును. ఎందువల్లననగా, కాంగ్రెసువారి నిషేధ మమలులో నున్నంతవరకును నూటికి అయిదురూపాయలవంతునైనను పన్నులు చెల్లింపబడలేదు.

బార్డోలీ తీర్మానములనుగూర్చి దేశములో అనేక భేదాభిప్రాయములు కలిగినవి. గాంధీలో సంపూర్ణ విశ్వాసము కలిగి, ఆయననిర్ణయములు ప్రమాదరహితము లని నమ్ము వారు చాలామంది కలరు. ఎప్పటికప్పు డానిర్ణయములలోని వివేకమునుగూర్చి ప్రశ్నించే వారుకూడా కొంతమంది లేకపోలేదు. ఢిల్లీనగరమున ఫిబ్రవరి ౨౪, ౨౫ తేదీలలో అ. భా. కాం. సం. సమావేశమై బార్డోలీతీర్మానములను దాదాపు పూర్తిగా ఆమోదిం

ఉంచినది. కాని కొన్ని ప్రత్యేక ప్రదేశములలో, కొన్ని ప్రత్యేక చట్టములను కాంగ్రెసువారే నిర్ణయింపబడిన వరకుల్లక్రమముగా రాష్ట్రీయ కాంగ్రెసు సంఘముల అనుమతి ప్రకారము కొందరు వ్యక్తులు శాసనోల్లంఘనము కావింపవచ్చునని కూడ ఆసభలో అంగీకరింపబడినది. కార్యనిర్వాహకములో ఉదాహరింపబడిన కల్లు, సారాయి దుకాణములు పికెటింగు, పరదేశి విదేశీ బట్టల పికెటింగుకు కూడ కల్పింపచేయబడినవి. శాసనోల్లంఘనమునందు సంపూర్ణనిర్వచనము అ. భా. కాం. సం. వారు ప్రకటించిరి. అందు గు తెలిపిన అహింసా వాతావరణము కాంగ్రెస్సు సభ్యులు నిర్వర్తించే నిర్మాణకార్యక్రమమువలన చేకూరగలదని కూడ వారు నిర్ణయించిరి.

"ఒక వ్యక్తిగాని, లేక కొందరువ్యక్తులుగాని ప్రభుత్వశాసనములనుగాని, అధికారుల ఉత్తరువులనుగాని ఉల్లంఘించుట వ్యక్తిశాసనతిరస్కార మగు"నని వారు నిర్వచించిరి. "కాబట్టి, ప్రభుత్వమువారిచే నిషేధింపబడిన బహిరంగసభకు టిక్కెట్లద్వారా మనుష్యులను రానిచ్చి టిక్కెట్లు లేనివారిని రానీయనిపక్షమున ఆసభ వ్యక్తిశాసనోల్లంఘనమున కేర్పాటుచేయబడిన సమావేశముగా భావింపబడును. ప్రభుత్వనిషేధితమైన సమావేశమునకు ఏవిధమైన నియమమును లేకుండ ప్రజలను రానిచ్చిన యెడల అది సమష్టిశాసనోల్లంఘన సమావేశముగా భావింపబడును. మామూలు కార్యక్రమమును కొనసాగించుటకు మాత్రమే ప్రభుత్వనిషేధిత సభను సమావేశపరచేయెడల అందులో అరెస్టులు జరిగినప్పటికిని అది ఆత్మరక్షణకు సంబంధించిన శాసనోల్లంఘన మగును. సాధారణకార్యక్రమమునకు కాక కేవలము జైలుకు పోవుటకుమాత్రమే సమావేశపరుపబడిన సభ ప్రభుత్వమువారిని కవ్వించే తీవ్రశాసనోల్లంఘనముక్రిందకు వచ్చును."

అ. భా. కాం. సం. వా రీవిధముగా వ్యక్తిశాసనోల్లంఘనతీర్మానము నంగీకరించినప్పుడు ప్రభుత్వమువారికిని, కాంగ్రెసునకు రాజీవారా కుదర్చ ప్రయత్నించిన మధ్యవర్తుల హృదయములు కల్లోలపూరితము లైనవి. వారు తిరిగి ఈ ఉభయపక్షములవారికిని రాజీ కుదరగలదని ఆశించలేదు. కాని, త్వరలో గాంధీ నిర్బంధింపబడునని వారు భయపడిరి. ఢిల్లీలో సమావేశమైన అ. భా. కాం. సం వారు ఇంకను శాసనోల్లంఘనమును గూర్చి చర్చింపకుండినయెడలను, వ్యక్తిశాసనోల్లంఘనమును అప్పటి కాచరణయోగ్యమైన కార్యక్రమముగా నిర్ణయింపకుండినయెడలను బహుశా ప్రభుత్వమువారేమి చర్య తీసుకొని ఉండేవారుకారు. ఇక రెండవపక్షమున, ఆపత్కాలోద్యమము కొక్కసారిగా విలిపివేసినందుకు గాంధీకి ప్రతికూలముగా పెద్ద గగ్గోలుపుట్టినది. పండితమోతీలాల్, లాలాలజపతిరాయలు కారాగృహ

మునుండి గాంధీకి పెద్దపెద్ద ఉత్తరములను వ్రాసిరి. ఎచ్చటనో ఒకచోట జరిగిన నేరము లకుగాను సమస్త భారతదేశమును శిక్షించినందుకు వారు గాంధీని నిందించిరి: “కన్యా కుమారీఅగ్రముకొట్టకొననున్న గ్రామములో అహింస అవలంబింపబడనందుకు హిమాలయపర్వతశిఖరమునకు దగ్గరగానున్న పట్టణము ఏల శిక్షింపబడవలయును?” అని పండితుడు ప్రశ్నించెను. అవసరమైనచో బార్డోలీతాలూకాను, గోరఖ్‌పూర్ జిల్లానుకూడ మినహా యించి వ్యక్తిసమష్టిశాసనోల్లంఘనములను కొనసాగింపవలసినదే అని మోతీలాల్, లాలాజీ, మరియిద్దరు మిత్రులును గాంధీకి వ్రాసిరి. వారందరును అకస్మాత్తుగా ఆ మహోద్యమము మాపివేయబడుటవలన తమకు కలిగిన ఆశాభంగమును, అసంతృప్తిని, విసుగును తమ ఉత్తరములలో స్పష్టముగా ప్రకటించిరి. ఈ ఉత్తరములు ఫిబ్రవరి ౨౪ వ తేదీని ఢిల్లీలో డాక్టరు అన్సారి ఇంటియందు జరిగిన అ. భా. కాం. సం. సభ్యుల ప్రత్యేకసభలో చదువబడెను. ఆ సభాసదుల్లో సి. ఐ. డి. ఉద్యోగస్థులుగూడ కలిసియుండిరి. ఆవిషయము తరువాత తెలియవచ్చినది. వారు రహస్య విషయములను జాగ్రత్తగా గమనిస్తూనే ఉండిరి. ఈఉత్తరములకు ప్రతిగా గాంధీ ఒక మాట చెప్పెను. “జైలులో నున్నవారు పౌరులుగా మృతినొందినట్లే. వారికి జైలువెలు పల నున్నవారికి సలహాయిచ్చే అధికారము లేదు.” అని ఆయన విస్పష్టముగా నుడివెను. కాని తరువాతి అ. భా. కాం. సం. నిజముగా సమావేశమైనప్పుడు సభ్యులలో క్రోధాగ్ని ప్రజ్వలితమైనది. అన్నివైపులనుండి గాంధీపైన తిరుగుబాటు బయలుదేరినది. ఉద్యమము మాపివేయబడినందుకు గాంధీ తీవ్రముగా విమర్శింపబడెను. ముఖ్యముగా బార్డోలీ తీర్మానమున కాయన నిందింపబడెను. వంగ మహారాష్ట్ర ప్రతినిధులాయనను నుస్తుతి యాలు చేసిరి. వ్యక్తిశాసనోల్లంఘనమైనా ఎందుకు కొనసాగింపబడరాదు? “ఖా రమైనా చేయండి, వంగరాష్ట్రముమాత్రము చౌకీదారుపన్ను చెల్లింప నిశ్చయించు కొనలేదు.” అని బాబూ హార్దయాల్ నాగువంటి భక్తుడుకూడ తిరుగుబాటు చేసెను. “శాసన నిరోధకు లెందుకు ఖద్దరు ధరింపవలెను?” అని డాక్టరుమూంజీ ప్రశ్నించెను. అస్పృశ్యత, స్వదేశీ విషయములలో మినహాయింపు కావలెనని అంతకు పూర్వమే నాగపురము జిల్లాకాంగ్రెసు కమిటీవారు చేసిన తీర్మానమును జనవరి ౧౧ వ తేదీని జరిగిన కార్యవర్గసభకు పంపి, మూంజీ సభ్యులను ఆశ్చర్యచకితులుగా చేసియుండెను. ఆవిధముగా బార్డోలీతీర్మానములలోని ప్రతిపంక్తి తీవ్రమైన తిరుగుబాటునకు కారణ భూతమైనది. ఆసభ వంగ మహారాష్ట్రప్రతినిధుల యుద్ధభూమిగా మారినన్నయెడల అతిశయోక్తికాదు. అ. అ. భా. కాం. సం. సమావేశములోనే గాంధీపైన విశ్వాస రాహిత్య తీర్మానమును కూడా మూంజీ ప్రతిపాదించెను. కొంతమందిసభ్యు లాతీర్మా నమును ఆమోదిస్తూ ఉపన్యసించిరి. కాని వోటునకు పెట్టబడినప్పు డాసభలో ఆతీర్మా

సమును గూర్చి మాట్లాడినవారు తప్ప తక్కినవా రందరు వ్యతిరేకముగా వోటిచ్చిరి. విశ్వాసరాహిత్యతీర్మానమునకు ప్రతికూలముగా మాట్లాడదలచుకొన్న వారిని గాంధీ మాట్లాడ నివ్వలేదు. ఇంత భయంకరమైన తుపాను వీచినప్పటికిని గాంధీమాత్రము హిమాలయపర్వతశృంగమువలె చలింపనేలేదు.

## గాంధీ నిర్బంధము

ఇక గాంధీపై దుముకుటకు ప్రభుత్వమువారు వేచియున్న సమయము వచ్చినది. నాయకులు గొప్ప ప్రజానురంజకులుగానున్న సమయములో ఏప్రభుత్వమూ వారిపైన చేయిచేసుకొనుటకు సాహసించదు. అది కేవలము సమయముకొరకు సహనముతో వేచియుండును. సైనికులు వెనుకకు మరలి నిరుత్సాహముతో నున్నప్పుడు మాత్రమే "మంచుపై కురుకు తోడేలువలె" శత్రువు సైన్యముపై కురుకును. మార్చి ౧౦వ గాంధీ నిర్బంధింపబడెను కాని ఫిబ్రవరి ఓవరవారములోనే ఆయననిర్బంధము నిశ్చయింపబడినది. ఇప్పు డాయన రాజద్రోహనేరము క్రింద విచారింపబడుటకు జిల్లాకోర్టుకు పంపబడెను.

మార్చి ౧౮వ తేదీని అహమ్మదాబాదునగరములో "గొప్ప విచారణ" (The Great Trial) జరిగినది. ఆ విచారణనుగూర్చి సరోజినీదేవి చిన్నగ్రంథము వ్రాసినది. అందులో "బ్రిటిష్ న్యాయశాస్త్రముయొక్క దృష్టిలో అపరాధిగాను, శిక్షితుడుగాను పరిగణింపబడుచున్న గాంధీమహాత్ముడు దుర్బలశరీరముతోను, గంభీరదృష్టితోను, ముక్కవోని ఆకారముతోను చిన్న ముతక అంగవస్త్రమును ధరించి తనతోడి ఖైదీయు, భక్తుడును అగు శంకర్‌లాల్ బ్యాంకర్ వెంటరా, న్యాయస్థానములో ప్రవేశించినప్పు డక్కడ ఆసీనులై ఉన్న అందరును ఒక్కసారి తలవని తలంపుగా లేచి ఆయనను గౌరవించిరి." అని ఆమె వ్రాసెను.

మనము సాధారణముగా ట్టి అంగడికిగాని, సరకుకొనుటకుగాని పోయి నప్పుడు మన దగ్గరనున్న సొమ్ములో మనకు కావలసినవాటిని నిర్ణయించుకొనుట చాలా కష్టమైనపని. గాంధీపైన రాజద్రోహనేరమును మోపదలచిన న్యాయశాస్త్రవేత్తలకు కూడా అట్టిచిక్కు వచ్చినది. గాంధీ ప్రతివారము తన 'యంగిండియా' పత్రికలో వ్రాయుచున్న వ్యాసములలో ఏదిరాజద్రోహపూరితముకాదో నిశ్చయించుట వారికి కష్టతరమైనది. రాజద్రోహప్రచారమును చేయుట తనకర్తవ్యమని గాంధీ నిరంతరమూ చెప్పుచూనే యుండెను. ఆయనవ్యాసములు తగినంత రాజద్రోహకరములుగా నుండనియెడల అది తన కలముయొక్క దుర్బలత్వమని ఆయన వెల్లడించెను. చివర కట్లో ప్రభుత్వము వారు గాంధీవ్యాసములనుండి మూడింటిని సంగ్రహించి, రాజద్రోహకరములుగా

ర్ణయించిరి. అవి 'రాజభక్తిని భగ్నమొనరించుట' (Tampering with Loyalty), 'సమస్య, దానిపరిష్కారము' (The puzzle and its Solution), 'సింహపు జూలునుబట్టి కుదుపుట' (Shaking the manes) అనే శీర్షికలు కలవి. గాంధీపైన మోపబడిన నేర మాయనకు చదువబడినతోడనే, ఆయన లేచి "ఇందులో రాజుగారిపేరు మినహాయింపబడినట్లు నేను గమనించినాను. అది న్యాయమే" అనిచెప్పి నేరము నంగీకరించెను. బ్యాంకర్ కూడ నేరస్థుడనని ఒప్పుకొనెను. జంటలేని విచారణ పూర్తియై తీర్పుచెప్పబడవలసినది. కాని అడ్వొకేటు జనరల్ పూర్తిగా విచారణ కావలెనని ప్రార్థించెను జడ్జి అంగీకరించలేదు. తీర్పుచెప్ప నిర్ణయించెను. తనకు యంగ్ఇండియాతో సంబంధము కలుగుటకుముందు చాలాకాలమునుండీ తాను రాజద్రోహమును బోధించుచుంటినని ఉపోద్ఘాతముతో గాంధీ తన వాఙ్మూలమును ప్రారంభించెను. మద్రాసు, బొంబాయి, చౌరీచౌరాలలో జరిగిన విషాదకరసంఘటనములకు ఆయనే పూర్తిగా బాధ్యతను వహించెను. "నేను నిప్పుతో చెలగాటలాడుచుంటినని నాకు తెలియును. కాని నేను బుద్ధిపూర్వకముగానే అందు జొచ్చుకొంటిని. నేను నేను విడుదల చేయబడినయెడల తిరిగి అదేపని చేయగలను. నే నావిధముగా చేయనియెడల నా కర్తవ్యమును నేను సరిగా నిర్వర్తించనివాడ నగుదును. ఇది నామతవిశ్వాసము. నాకర్తవ్యమునుగూర్చి నేనే నిర్ణయించుకొనవలసియుండెను. నా దేశమునకు పరిహారములేని కీడుకలిగించిన ఈ ప్రభుత్వపద్ధతికి లొంగినవాడనై యుండవలెను, లేదా నానోటినుండి వచ్చిన సత్యమును గ్రహించి, నాప్రజలు క్రోధపూరితులై ప్రకటించే ప్రమాదమునైనా సహించవలెను. నా ప్రజలు కొన్ని సమయములు పిచ్చిగా ప్రవర్తించిరని నేనెరుగుదును. అందుకు నేను దుఃఖపడుచున్నాను. దానికి తగిన ప్రతిఫలముగా నేను సాధ్యమైనంత యొక్కువశిక్ష ననుభవింప సిద్ధముగా నున్నాను. నన్ను క్షమింపవలసిన దని మిమ్ములను కోరను. కనికరించి తక్కువశిక్ష వేయవలసిన దని ప్రార్థింపను. బ్రిటిష్ న్యాయశాస్త్రప్రకారము బుద్ధిపూర్వకమైన మహాపరాధముగా కనపడుచూ, నాదృష్టిలో పౌరుని ఉత్తమకర్తవ్యముగా పరిగణింపబడుచున్న ఈ నేరమునకు నాకు సాధ్యమైనంత యొక్కువశిక్ష విధింపవలెననియే నేను మిమ్ములను కోరుకొనుచున్నాను. ఓ న్యాయమూర్తీ, నీకురెండుమార్గములు కలవు. నీవు సహాయముచేస్తున్న బ్రిటిష్ న్యాయశాస్త్రము, బ్రిటిష్ రాజకీయపద్ధతులు ప్రజలకేడుపునకే ఉపయోగింపబడినవని నీవు నమ్మినయెడల నాకు సాధ్యమైనంత శిక్షను విధింపవలెను. లేదా నీవీ ఉద్యోగమునకు రాజీనామా యివ్వవలెను. కావున నేను నా వాఙ్మూలములో చెప్పబోతూన్నాను. కాని నీ వావిధముగా మామతములో కలసెదవని నేను విశ్వసింపజాలను. కాని వాఙ్మూలము పూర్తిఅయ్యేలోపల నీవీ అగాధములో ఎందు పడి

తినో, నా హృదయములో నెట్టిభావములు చెలరేగుచున్నవో మీకు బోధపడగలదు. నేను నేను కోరి తెచ్చుకొన్న అపాయము అందరు బుద్ధిమంతులునూ కోరి తెచ్చుకొనతగినదే.

## వ్రాత వాఙ్మూలము

“ఈ కేసుసంబంధములో నేను భారతప్రజలకును, ఆంగ్లమిత్రులకును కూడ సంతృప్తికరముగా నుండునట్టి సంజాయిషీ యియ్యవలసియున్నది. ఒకప్పుడు రాజభక్తుడుగాను, ప్రభుత్వసహాయకుడుగాను ఉన్న నేను నేడు కేవలము రాజద్రోహప్రచారకుడుగను, అసహాయవాదిగను తిరిగిపోవుటకు గల కారణమేమో వారికి నివేదించవలసియున్నది. న్యాయశాస్త్రప్రకారము భారతదేశములో సంస్థాపింపబడిన ప్రభుత్వము నెడల ద్వేషమును పురికొల్పుచుంటినన్న నేరమునకు నే నేల అంగీకరింపవలసివచ్చినదో కూడ కోర్టువారికి నేను విన్నవించుకొనవలసియున్నది.

“నేను ౧౮౯౩ దక్షిణాఫ్రికాలో గొప్ప క్లిష్టసమయమున నా ప్రజాజీవితమును ప్రారంభించితిని. అక్కడి బ్రిటిష్‌ప్రభుత్వమువారితో కలిగిన నా ప్రథమ పరిచయ మంత సంతోషదాయకముగా లేదు. నేను భారతీయునిగా పుట్టినంత మాత్రమున నా కాదేశములో మానవహక్కులు లేవని గ్రహించితిని”

“కాని అంతమాత్రమున నేను కలవరపడలేదు. నిజముగా మంచి పరిపాలనా పద్ధతి ఉన్నచోట్లకూడా భారతీయులయెడల ఇట్టిప్రవర్తనము సర్వసాధారణమైపోయినదని నేను భావించితిని. నే నా ప్రభుత్వమునకు స్వచ్ఛందముగాను, హృదయపూర్వకముగాను సహాయపడ నెంచితిని. దానిలోని తప్పులను విమర్శింప తలపెట్టితినే కాని దానిని వినాశనము చేయకోరలేదు.

“తరువాత ౧౮౯౦ లో జరిగిన బోయరుయుద్ధములో సామ్రాజ్యక్షేమమునకే భంగము గలుగనున్నప్పుడు నేను ప్రభుత్వమునకు సహాయముచేయ తలపెట్టితిని. సైన్యములో గాయములు పడినవారికి సహాయము చేసేనిమిత్తము స్వచ్ఛందసైనికులను సమకూర్చితిని. అదేవిధముగా ౧౯౦౬ లో జూలూ తిరుగుబాటు జరిగినప్పుడుకూడా గాయపడినవారిని ఆసుపత్రులకు గొనిపోవుట కొక స్వచ్ఛందసైనికదళమును సమకూర్చితిని. ఈ రెండు సందర్భములలోను నాకు ప్రభుత్వమువారు పతకములను సమర్పించిరి. ఈవిషయము పార్లమెంటువారి ఉత్తరములలో కూడ ఉదాహరింపబడెను. నేను దక్షిణాఫ్రికాలో చేసిన సేవకు హార్డింజ్‌ప్రభువు నాకు కయిజరే హింద్ బంగారుపతకమును సమర్పించెను. ౧౯౧౪ లో ఇంగ్లాండు జర్మనీదేశములమధ్య యుద్ధము పొసగినప్పుడు

కూడా యుద్ధములో గాయపడినవారికి సహాయము చేసేనిమిత్తము లండనులోని భారతీయ విద్యార్థులనుండి ఒక స్వచ్ఛంద సైనికదళమును సమకూర్చితిని. వారిసేవను గూర్చి అధికారులు స్తుతించిరి. చిట్టచివరకు ౧౯౧౮ లో ఢిల్లీనగరమున జరిగిన సంగ్రామ మహాసభయందు చెమ్స్‌ఫర్డు ప్రభువు సైనికులను సమకూర్చవలెనని కోరినప్పుడు నా ఆరోగ్యమును సహితము లెక్కపెట్టక ఖేడాలో పనిచేసితిని. ఇంతలోనే యుద్ధము పరిసమాప్తి నొందెను. ప్రభుత్వమువారికి సైనికులను సమకూర్చ నవసరములేదని ఉత్తరువులను పంపిరి. భారతదేశమునకు సామ్రాజ్యములో సంపూర్ణసమాన ప్రతిపత్తి లభించగలదనే విశ్వాసముతోనే నేను అన్ని సందర్భములలోను ప్రభుత్వమువారికి సంపూర్ణ సహాయము చేసితిని.

“ప్రజల నిజమైన స్వాతంత్ర్యమునకు భంగము కలిగించుటకు సృష్టింపబడిన రౌలటు చట్టముతో నాకు మొట్టమొదటి ఆశాభంగము కలిగినది. దానికి ప్రతికూలముగా తీవ్రమైన ఆందోళనము చేయవలెనని నేను తలపెట్టితిని. తరువాత జలియన్‌వాలాబాగ్ హత్యలతో ప్రారంభమైన పంజాబుదురంతములు సంభవించినవి. అనేకులలో ప్రజలు పొట్టమీద ప్రాకునట్లుగా ఉత్తరువులు జారీచేయబడినవి. ముక్కుపచ్చలారని బహిరంగముగా వారులు కొరడాలతో కొట్టబడిరి. ఇంకను అనేక వర్ణింపరాని అవమానములు పాంచాలదేశీయులకు జరిగినవి. భారతీయ మహమ్మదీయులకు టర్కీవిషయములోను, ఇతర మహమ్మదీయ పుణ్యక్షేత్రముల విషయములోను బ్రిటిష్ ప్రధానమంత్రిచే చేయబడిన వాగ్దానములు సరిగా నిర్వర్తింపబడలేదని కూడా నేను తెలుసుకొనగలిగితిని. కాని, ఇన్ని వ్యవహారములు జరిగి నామిత్రులు నన్ను గట్టిగా మందలించి నప్పటికిని గూడ ౧౯౧౯ లో జరిగిన అమృతసర కాంగ్రెసులో నాంటేగు, చెమ్స్‌ఫర్డు సంస్కరణముల విషయమున ప్రభుత్వమునకు భారతీయులు సహాయపడవలెనని నేను వాదించితిని. అప్పుడు నేను బ్రిటిష్ ప్రధానమంత్రి భారత మహమ్మదీయులకు చేసిన వాగ్దానము చెల్లించుకొనగలడనీ, పంజాబు దురంతములకు తగిన పరిహారము చేయబడునని భావించితిని. సంస్కరణములు అసంతృప్తికరములు, అసమగ్రములు అయినప్పటికిని భారత రాజకీయ జీవనమందొక నూతనయుగము ప్రారంభమైనదని భావించితిని.

“కాని నా ఆశలన్నీ నిరాశలైనవి. ఖిలాఫత్ వాగ్దానము చెల్లింపబడలేదు. పంజాబు దురంతముల విషయములో ప్రభుత్వమువారు భారతీయులకళ్ళ నీళ్లు తుడిచిరి. అర్థోపవాసములతో పీడింపబడుచున్న భారతీయ సామాన్యప్రజలు నానాటికి నిర్జీవప్రతిములై కుంగిపోతున్నారు. వారు కేవలము విదేశపు పెట్టుబడిదారులకు ధనమును పోగుచేసి పెట్టుటకు మాత్రమే ఉపయోగింపబడుతున్నారు. ఆసంగతి వారికి తెలి

యము. ఇండియాలో న్యాయశాస్త్రప్రకారము స్థాపింపబడిన బ్రిటిష్ ప్రభుత్వము కూడ విదేశీ పెట్టుబడిదారుల ఈ ధనసంపాదనప్రయత్నములకే తోడ్పడుతున్న దనే విషయము నా కెరుగరు. అనేక గ్రామములలో ఆహారములేక కృశించిపోయిన, అస్థిపంజరములవంటి మనుష్యులు కలరు. వారు మాకండ్లకు ప్రత్యక్షముగా కనబడు తూండగా ప్రభుత్వమువారి అంకెలతో గాని, వాదనైపుణ్యముతో గాని మాకు పనిలేదు. చరిత్రలో ఎక్కడా పోలికలేక మానవ ప్రపంచమునకు జరుగుతూన్న ఈ అన్యాయమునకు ఇంగ్లండుదేశస్థులును, భారత దేశములోని పట్టణస్థులును దేవుని యొద్ద జవాబు చెప్పుకొనవలసియున్నది. ఈదేశములో చేయబడిన ప్రతిశాసనము విదేశీ పెట్టుబడిదారుని కుపయోగపడునట్టిదిగా నున్నది. పాంచాల దేశములో సైనిక శాసనానుగుణముగా విచారింపబడిన నేరములను నేను నిష్పక్షపాతముగా పరీక్షించితిని. వాటిలో నూటికి తొంబదియైదు శిక్షలు అన్యాయముగా విధింపబడినవి. భారత దేశమునందు శిక్షింపబడిన రాజకీయనేరస్థులలో పదింటికి తొమ్మిదిమంది కేవలము నిరపరాధులని నా అనుభవమువలన నే నెరుగుదును. వారు మాతృదేశమును ప్రేమించుటయే ఒకనేరము. ఐరోపీయులకును, భారతీయులకును తటస్థించిన వివాదములలో భారతదేశపు న్యాయస్థానములందు నూటికి తొంబదితొమ్మిది కేసులలో భారతీయుల కన్యాయమే జరుగును. ఇందులో ఏమీ అతిశయోక్తి లేదు. ఇది నా ఒక్కని అనుభవమే కాదు. అటువంటి కేసులతో సంబంధముగల ప్రతి భారతీయుని అనుభవము ఇదే. బుద్ధిపూర్వకముగా గాని, అబుద్ధిపూర్వకముగా గాని విదేశీయుల ప్రయోజనము నిమిత్తము భారత దేశములోని న్యాయ పరిపాలనము కళంకీభూతముగా చేయబడుతూన్న దని నా అభిప్రాయము.

“నేను వివరింప ప్రయత్నించిన ఈ పై నేరమునకు తాము కారణభూతుల మనే సంగతి భారతదేశపరిపాలనముతో సంబంధముగల ఆంగ్లేయులకుగాని, భారతీయులకుగాని తెలియకపోవుట చాలా దురదృష్టము. ఆంగ్లేయాధికారులును, భారతీయాధికారులునుకూడ ప్రపంచకములోని ఉత్తమప్రభుత్వములలో నొకటైన బ్రిటిష్‌పరిపాలనమునకు తాము సహాయపడుతూన్నట్లుగా విశ్వసిస్తున్నారని నే నెరుగుదును. హిందూదేశము క్రమక్రమముగా అభివృద్ధిపొందుతూన్న దనికూడ వారి ఉద్దేశము. ఒకప్రక్క నిర్దాక్షిణ్యముగా ప్రయోగింపబడు ప్రజలను భయపెట్టుటయు, రెండవ ప్రక్క ప్రతీకారమునకుగాని, ఆత్మరక్షణమునకుగాని వీలులేకుండ వారిని నిరాయుధులనుగా నొనర్చుటయు ఈ ప్రభుత్వపద్ధతి. అందువలన ప్రజలు నోరెత్తక పోవుటచే పరిపాలకుల అజ్ఞానమును, ఆత్మవంచనమును మరింత పెచ్చుపెరిగినవి. అదృష్టవశాత్తు ఇండియన్‌పీనల్‌కోడ్‌లో అగ్రగణ్యముగా పరిగణింప

బడసిన ౧౨౪ ఎ సెక్షను క్రింద నాపైన నేరము మోపబడినది. అది భారతీయుల జన్మ స్వాతంత్ర్యమును నిరోధింప నుద్దేశింపబడినది. శాసనమువలన ప్రేమ కలుగదు. ప్రేమ మనుష్యులచేత నిర్మింపబడునది కాదు. ఎవనికైనను ఒక మనిషియెడ ప్రేమలేనియెడల అతడు దౌర్జన్యమును పురికొల్పనంతవరకు తన అయిష్టమును బహిరంగముగా చెప్ప దగిన స్వాతంత్ర్య ముండవలెను. నామీదను, బ్యాంకరుగారిపైనను ప్రేమరాహిత్యమును పురికొల్పితిమని నేరము మోపబడినది. ఈసెక్షను క్రింద విచారింపబడిన కొన్ని కేసులను నేను పరిశీలించితిని. భారతదేశభక్తులలో ఉత్తమోత్తములు ఈసెక్షను క్రింద శిక్షింపబడి రను సంగతి నాకు తెలుసును. కావున ఈ నేరము నాపై మోపబడుట నేనొక గౌరవ ముగా భావింతును. ప్రభుత్వమువారియెడల నాకు ప్రేమలేకపోవుటకుగల కారణ ములను ఇంతవరకు సంగ్రహముగా వివరింప ప్రయత్నించితిని. ఏప్రభుత్వాధికారియైనను నాకు వ్యక్తిపరమైన ద్వేషభావము లేదు. ముఖ్యముగా రాజుగారియెడల నాకెట్టి ద్వేష భావమును ఉంచుకొనవలసిన అవసరము లేదు. భారతదేశము నింతకుపూర్వము పరిపాలించిన ఏ ప్రభుత్వమును చేయని మహాపకారమును కావించిన పరిపాలనమునెడల ప్రేమ లేకుండుట సుగుణముగా నేను భావింతును. గతపరిపాలనములలోకంటె బ్రిటిష్ పరిపాలనమునందు భారతీయుల మానవత్వ మెక్కువగా కోల్పోవడినది. ఇట్టి విశ్వాసము గల నేను ఈపరిపాలనాపద్ధతియందు ప్రేమకలిగియుండుట పాపముగా భావింతును. నా పైన సాక్ష్యముగా ప్రవేశింపబడిన వ్యాసములను నేను వ్రాయగలుగుట ఒక అదృష్టము.

నా అసహాయోద్యమమూలకముగా ఇంగ్లాండు భారతదేశముల అస్వాభా వికసంబంధమును వ్యక్తపరచి, ఈ రెండు దేశములకును మహోపకారము చేసితినని నా విశ్వాసము. మంచికి సహాయము చేయుటవలెనే చెడుకు సహాయము చేయకుండుటయు ముఖ్యకర్తవ్యము. ఇంతకుపూర్వము గట్టిగనే దౌర్జన్యకారికి సహాయనిరాకరణము ప్రబోధింపబడినది. దౌర్జన్యరహితమైన సహాయనిరాకరణము దుర్మార్గము నశింపజేయ టకే ఉపయోగపడునని నాదేశీయులకు నేను నిరూపింప ప్రయత్నించు చుంటిని. దుష్టత్వమునకు పోషకము దౌర్జన్యమే ఆధారము. కావున దుర్మార్గమునకు సహాయము చేయ నిరాకరించువారు దౌర్జన్యమును పూర్తిగా విడనాడవలెను. దుష్కార్యమునకు సహాయము చేయ నిరాకరించుటవలన కలిగే శిక్షను స్వచ్ఛంద ముగా అనుభవించుటకూడా అహింసాసిద్ధాంతమునం దిమిడియున్నది. కావున బ్రిటిష్ న్యాయశాస్త్రప్రకారము ఉద్దేశ్యపూర్వకమైన మహాపరాధముగా గణింపబడుచూ, నాదృష్టి లో పౌరుని ఉత్తమకర్తవ్యముగా పరిగణింపబడుచున్న ఈ నేరమునకు నాకు సాధ్యమై నంతయెక్కువశిక్ష విధింపవలెనని నేను మిమ్ములను కోరుకొనుచున్నాను. నేను

కాంగ్రెసుప్రచారకు లందరును ప్రభుత్వమువారి ఈభయమునకు కారణము లేదని ఋజువు చేయవలెను. ఆనాడు హరతాళములు, ప్రదర్శనములు, ఉత్సవములు జరుపకూడదు. బార్డోలీ కార్యక్రమము సరిగా నిర్వర్తింపబడినయెడల ఆయన జైలులోనుండి విడుదల అగుటయేకాక స్వరాజ్యముకూడ లభించగలదు." ఈ మాటలతో ఆయన అరెస్టుకు సంసిద్ధముగానుండెను. దేశీయు లందరును ఆయన నిర్బంధింపబడినప్పుడు ఆయన కోరినప్రకారము ప్రజలు ప్రశాంతముగా నుండిరి. గాంధీ అరెస్టుచేయబడినకాలములోనే ఆంధ్రదేశములోకూడ పన్నుల నిరాకరణసందర్భమున చాలా అరెస్టులు జరిగినవి. కాంగ్రెసువారు శాసనోల్లంఘన విషయములో తీవ్రతను తగ్గించినకొలదీ ప్రభుత్వమువారు నిర్బంధవిధానమును హెచ్చించిన విషయముమాత్రము ముఖ్యముగా మనము గమనింపదగియున్నది. దానికి మన మాశ్చర్యపడ నవసరములేదు. ప్రభుత్వమువా రసహాయోద్యమ సర్వసైన్యాధిపతిని నిర్బంధించినతరువాత సైన్యమును చెదరగొట్టుటకు ప్రయత్నించుట అస్వాభావికమైన విషయము కాదు. సైనికులుకూడ పట్టుబడిన సైన్యాధిపతిస్థానమున మరియొకరి నేర్పాటు చేసుకొని, యుద్ధమును కొనసాగింపబూనుటకూడ ప్రకృతిసిద్ధమే. ఇది ఒకపక్షము. మరియొకపక్ష మేమనగా, గాంధీ నిర్బంధింపబడినతరువాత భారతదేశరాజకీయజీవితములో పెద్దమార్పు యేర్పడినది. నవంబరు ౨౩ వ తేదీని ప్రారంభింపబడవలసిన బార్డోలీదండయాత్ర బొంబాయికొట్లాటలమూలకముగా నూతనసంవత్సరమువరకును ఆపివేయబడినది; తరువాత ౧౯౩౧ జనవరి ౧౪, ౧౫ తేదీలలో జరిగిన అఖిల పక్షమహాసభమూలకముగా అది జనవరి ౩౧ వ తేదీవరకును ఆపివేయబడినది. పిదప కాలపరిమితి లేకుండా నిలిపివేయబడినది. గాంధీ నిర్బంధింపబడిన ఈ ఆరుసంవత్సరముల కాలములో ఆ అపూర్వమైన మహత్తరప్రయత్నమును కొనసాగింప సాహసించువారెవరు ?

గాంధీ శిక్షింపబడినతర్వాత వ్యవహారములను చక్కపరచుకొనుటకు కాంగ్రెసు కార్యనిర్వాహకసభకు మూడునెలలు పట్టినది. కోశాధికారి జమ్నాలాల్ బజాజ్ స్వాధీనము చేయబడినది. అందుకొరకై గుండ్లక్ష రూపాయలు ప్రత్యేకింపబడినవి. ముల్తాను ప్రజలకు కలిగిన నష్టపరిహారములకు ౧౦౦ వేలరూపాయలు శాంక్షన్ చేయబడినవి. వృత్తిమానిన ప్లీడరుల భృతికొరకు మరియొక లక్షరూపాయలను జమ్నాలాల్ బజాజ్ విరాళ మిచ్చెను. కాంగ్రెసువాదులు నిర్బంధముగా ఖద్దరునే ఉపయోగించవలెనను సూత్రమునకు నిర్బంధఖద్దరుధారణ మని వ్యాఖ్యానము చేయబడినది. అసహాయవాదము నవలంబించిన ప్లీడరులు కోర్టులలో వాదించకూడదనీ, అసహాయవాదులు ప్రతివాదము పెట్టుకొనకూడదనీ మరియొకసారి హెచ్చరింపబడెను. మాప్లా

విప్లవమునుగూర్చి విచారించుట కొక కమిటీ ఏర్పాటు చేయబడినది. వారీ క్రిందివిష యములనుగూర్చి విచారించి నివేదిక పంపవలెనని తీర్మానింపబడినది: (౧) మాప్లా విప్లవకారణములు, (౨) విప్లవముయొక్క విస్తీర్ణము, (3) ప్రభుత్వమువారు దాని నణచివేయుటకు చేసిన ప్రయత్నములు (సైనిక శాసనప్రకటనముతో సహా), (౪) మాప్లాలు తదితరమతములవారిని నిర్బంధముగా తమ మతములో కలుపుకున్న విధానము, (౫) ఆస్తులకు కలిగిన నష్టము, (౬) హిందూమహమ్మదీయ సఖ్యమును పున రుద్ధరించుటకును, బలపరచుటకును అవసరమైన చర్యలు.

మద్యరాష్ట్రములలోని మరాటీరాష్ట్రీయకాంగ్రెసుసంఘము ఇదివరకే అసహా యోద్యమకార్యక్రమమునందు జరుగవలసిన కొన్ని సంస్కరణలనుగూర్చి సూచించి నది. అస్పృశ్యతానివారణమునుగూర్చి తగిన కార్యక్రమమును సిద్ధపరచుట కొక కమిటీ నియమింపబడినది. కాంగ్రెసుకార్యవర్గమువారు చేసిన ఈ సిఫారసులను, తదితరకార్య క్రమమును చర్చించుటకు ౧౯౨౨ జూన్ ౭, ౮, ౯ తేదీలలో లక్నోనగరమున అ. భా. కాం. సం. సమావేశము జరిగినది. సాధారణముగా ఒకవ్యాపారములో నష్టము కలిగినప్పుడుకాని, ఒక కుటుంబయజమాని మరణించినప్పుడుకాని కలిగే విచారము మూలమున పూర్వవ్యవహారములను చక్కపరచుకొనుటలో కొంత కల్లోలమును, ఉద్రేకమును కలుగుట ప్రపంచస్వభావము. అప్పు డెవ్వరికిని ఏమిచేయుటకును తోచదు. అనేకమంది అనేకవిధములైన సలహా లిస్తురు. ఒకదాని కొకటి పొసగదు. గాంధీ నిర్బంధింపబడిన సందర్భములోకూడా సరిగా అట్లే జరిగినది. కాంగ్రెసుకార్య నిర్వాహకవర్గమువారు పూర్వవ్యవహారములను చక్కచేసికొనుటకు మూడుమాసములు పట్టినది. ఈకాలములో వారు తా మీయవలసిన సొమ్మును చెల్లించుటకును, తమకు రావలసిన బాకీలను వసూలు చేసుకొనుటకును, తా మిదివరకు చేసిన తీర్మానములకు వ్యాఖ్యానము చేయుటకును, కమిటీలను నియమించుటకును, సిద్ధాంతములను తిరిగీ నిర్వ చించుటకును, కాంగ్రెస్ కార్యక్రమమును ప్రకటించుటకును, తాత్కాలికముగా వచ్చిన ఖాళీలను భర్తీ చేయుటకును మొదలగు విషయములకు తమ శక్తిసామర్థ్యములను విని యోగింపవలసివచ్చినది. తరువాత జూన్ నెలలో కాంగ్రెసుప్రధానకార్యక్రమము గూర్చియే వారు పునర్విచారణకు పూనుకొనిరి.

నిజమునకు అ. భా. కాం. సం. వారికి అసహాయోద్యమము, సాత్వికనిరో ధము, శాసనోల్లంఘనములలోని సిద్ధాంతమునుగూర్చి, నాటి ఆచరణ విధానమునుగూర్చి పునర్విచారణ చేయుటకు మాత్రమే అధికార మున్నది. కాని నాటి ప్రధానరాజకీయ నేతలలో ముఖ్యులైన దేశబంధుదాసు, విఠల్ భాయి పటేలులకు అసలా సహాయ నిరాకరణమతమునందే మార్పు కలిగింపవలెనని కోరిక కలిగినది. దానిని పురాతన పద్ధ

తులనుండి నూతన మార్గములను పట్టింపవలెనని వారూహించిరి. మొట్టమొదట ఈరాజకీయధురంధరు లిద్దరును అసహాయోద్యమమున కనుకూలురుగానే లేరు. కాని కొంత అయిష్టముతోనే వారా అసహాయమతమును స్వీకరించిరి. తరువాతమాత్రము వారు హృదయపూర్వకముగా సహాయనిరాకరణోద్యమును ప్రచారముచేసి, గొప్పఅసహాయమత ప్రచారకులైరి. ఇప్పుడు వారు అసహాయోద్యమమునందొక నూతన సిద్ధాంతమును లేవదీసి, ప్రచారము చేయ పూనుకొనిరి. వారు సింహమును గుహలోనుండగానే కవ్వించి పోరాటము పెట్టుకొనవలెనని కోరిరి. సహాయ నిరాకరణతత్వమును రాష్ట్రీయ ప్రభుత్వమందిరములలోనికి చొప్పించవలెనని వారు తలంచిరి. ముందుగా అ. భా. కాం. సం. వారు అహింసా సత్యములను ప్రబోధించి మానవ ప్రపంచకమునకు మహోత్కృష్ట సేవచేసిన గాంధీ నభినందించిరి; దౌర్జన్యరహిత సహాయనిరాకరణ సిద్ధాంతములయందు తమ విశ్వాసమును మరొకసారి ప్రకటించిరి; మోతీలాల్ నెహ్రూచే ప్రతిపాదింపబడి, పండిత మాలవ్యాచే సమర్థింపబడిన ప్రకారము కాంగ్రెసు కార్యవర్గము వారి తీర్మానము అ. భా. కాం. సం. వారిచే అంగీకరింపబడెను. ప్రభుత్వమువారి నిరంతర నిర్బంధవిధానమును వారు నిరసించిరి. ప్రభుత్వ నిర్బంధవిధానమునకు ప్రతీకారముగా ఏదో ఒక విధమైన శాసనోల్లంఘనము నవలంబించుట అవసరమని వారు గుర్తించిరి. సమష్టి శాసనోల్లంఘనమునకు ప్రజలను సంసిద్ధపరచుటకు నిర్మాణకార్యక్రమమును ఉత్తమమార్గముగా వారు తలంచిరి. "ఏదో ఒక విధమైన శాసనోల్లంఘనము ప్రారంభించుటనుగూర్చి యోచించుటకు" ఆగష్టునెలవరకును వారు వాయిదా వేసిరి. ఈలోగా ఒక కమిటీని నియమించి, ఆవిషయమునుగూర్చి విచారింపచేయుటకు అధ్యక్షున కధికార మీయబడినది. ఆ ప్రకార మధ్యక్షుడు పండిత మోతీలాల్, డాక్టరు అన్సారీ, విఠల్ భాయి పటేల్, జమ్నాలాల్ బజాజ్, సి. రాజగోపాలాచారి, సేట్ ఛోటానీలను కమిటీగా నియమించి హకీము అజ్మల్ ఖానును ఆకమిటీ కధ్యక్షునిగా నియమించెను.

జమ్నాలాల్ బజాజు అందులో సభ్యునిగా నుండ నంగీకరింపలేదు. ఆస్థానమున యస్. కస్తూరి రంగ అయ్యంగారు నియమింపబడిరి. సేట్ ఛోటానీ అసలా కమిటీలో పని చేయనేలేదు.

శాసనోల్లంఘన సంఘమువారి విచారణలను గూర్చి, వారి నివేదికను గూర్చి వ్రాసేముందు కడచిన మార్చి నెలలో జరిగిన కొన్ని సంగతులను గూర్చి యోచింతము. ౧౯౨౨ మార్చి ౨౩ వ తేదీని మాంటేగు తనమంత్రిపదవికి బలవంతముగా రాజీనామా యీయవలసి వచ్చినది. సరిగా ఆసమయములోనే టర్కీవారు గ్రీకులపైన గొప్పజయమును పొందిరి. అప్పుడు టర్కీతో జరిగిన సవర్సుసంధిలో కొన్నిమార్పులు జరిగినవి.

ఆసంధిపత్రములోని వివరములు కొన్ని బయటకు పొక్కినందున మాంటేగు కాగతి పట్టినది. హిందూదేశములో ఎచ్చట చూచినను కేసులును, శిక్షలును చెలరేగినవి. పాంచాలమునందు లారెన్సు విగ్రహముపైన తిరుగుబాటు బయలుదేరినది. ఆంధ్రదేశములో గోదావరీమండలమునందు జాతీయ పతాకస్థాపనమునుగూర్చి ప్రభుత్వమువారు నిర్బంధ విధానమును సాగించిరి. కాంగ్రెసు జెండానుచూచి నిరంకుశ ప్రభుత్వమువారు ఎఱ్ఱబట్టను చూచిన ఆంబోతు ఎద్దువలె ప్రవర్తించెను. పన్నులనిరాకరణ దండయాత్రకూడా సాగుతూనే ఉండెను. బ్రిటిష్ న్యాయపరిపాలనమునందు ౧౦౮, ౧౪౪ సెక్షనులు తప్ప మరేమీ గోచరమగుటలేదు. ప్రభుత్వములోని భారతీయ కార్యనిర్వాహక సభ్యులు చేయునదిలేక నిస్సహాయులుగా నుండిరి. కలెక్టరులకును, డిప్యూటీకమీషనరులకును సర్వాధికారము లీయబడినవి. న్యాయస్థానములలో అపీలు చేసుకొన్న యెడల క్రిమినల్ కోర్టులలో జరిగిన అన్యాయములకు పరిహారము పొందవీలుండెను. కాని అసహాయవాదులందు కంగీకరింపలేదు. అప్పటి ప్రధానమంత్రి లాయడ్ జార్జి చేసిన “ఉక్కుచట్రపు” (Steel frame) ఉపన్యాసముకూడా ప్రజల ఆగ్రహమునకు కారణమైనది. లాయడ్ జార్జి ప్రభుత్వోద్యోగములలో భారతీయులను నియమించుటనుగూర్చి ఆ ఉపన్యాసము చేయవలసివచ్చెను. ఆవిషయములో రాష్ట్రీయ ప్రభుత్వముల అభిప్రాయములను కోరుతూ ఒక సర్క్యులర్ జారీ చేయబడెను. ఆ సర్క్యులర్ పైన ఇండియా, ఇంగ్లాండు దేశములలోని ఇంగ్లీషు అధికారులలో పెద్ద కల్లోలము కలిగినది. వారిని సంతృప్తిపరచుటకు లాయడ్ జార్జి “భారతపరిపాలనా నిర్మాణమునకు సివిల్ సర్వీసు ఉక్కుచట్రము వంటి” దని ప్రకటించెను. అంతటితో ఊరుకొనక “భారత దేశములో బ్రిటిష్‌వారి ధర్మము సరిగా నిర్వర్తింపబడవలెనన్నచో ఆదేశపరిపాలనమునం దెప్పటికినీ ఐ. సి. యస్. ఉద్యోగస్థులను తొలగింప వీలులేదు. నూతన సంస్కరణములు బ్రిటిష్‌వారి ఆబాధ్యతయందు భారతీయులను భాగస్వాములుగా చేయుట కుద్దేశింపబడినవేకాని, ఆంగ్లేయుల నాబాధ్యత నుండి తొలగించుట కుద్దేశింపబడలేదు” అనికూడా ఆయన స్పష్టీకరించెను. ఇందు మూలమున భారతీయులలో కలిగిన అపోహలను తొలగింప నుద్దేశించి, లాయడ్ జార్జి చేసిన ఉపన్యాసము బ్రిటిష్‌వారి పూర్వపు వాగ్దానములకును, ప్రకటనములకును భిన్నముగా వ్యాఖ్యానము చేయబడరాదని బ్రిటిష్ ప్రధాన మంత్రినుండియే మరియొక అధికారపత్రమును తెప్పించెను. కాని ఒకదానితరువాత నొకటి ప్రజల ఉద్రేకమును నశింపకుండా చేయుటకే ఉపయోగపడినవి.

ఇక్కడ మరియొక సత్యాగ్రహమునుగూర్చి వివరింపవలసియున్నది. దానిపేరు బోర్సాద్ సత్యాగ్రహము. అది ౧౯౨౨ లో జరిగినది. అది జరుపబడిన పరిస్థితు లంత

కీర్తిప్రదములు కావని మా అభిప్రాయము. దేవార్ బాబా అనే పేరుగల ఒకగొప్ప బందిపోటుదొంగ. బోర్సాద్ తాలూకాలో దోపిడీలు సాగిస్తూండెను. వాడు తన సాదానుస్తులలోనే పగటిపూటల పాఠశాలలకువచ్చి," పిల్లలకు మిఠాయిలు పంచిపెట్టి వారిద్వారా ఆ యా గ్రామములలోని ధనవంతులెవరో తెలుసుకొని, రాత్రులయందు తనసహచరులతో ఆయాధనవంతుల గృహములపైబడి, ఇంటి యజమానులను పట్టుకొనిపోయి, వారి దగ్గరనుండి కొంతధనమును ప్రతిఫలముగా పుచ్చుకొని, తరువాత వారిని విడిచిపెడుతూండెను. ఈవిధముగా ఒకనెలగో జులవరకునూ జరిగినది. ప్రజల కెవ్వరును సహాయముచేసినవారు లేకపోయిరి. ఈదోపిడిగాండ్రు ఈవిధముగా తమ వ్యాపారమును సాగిస్తూండగానే వారికి పోటీగా మరియొక మహమ్మదీయుడు తయారయ్యెను. ఆ తురకవాని కొక స్లీడరుతో తగాదా రాగా ఆ స్లీడరును వాడు ఖూనీచేసి ఎక్కడకో పారిపోయి అరాచకుడయ్యెను. తరువాత వాడుకూడా కొంత మంది మనుష్యులను పోగుచేసుకొని, బోర్సాద్ తాలూకాలోనే దేవార్ బాబాకు పోటీగా బందిపోటులను సాగించెను. పోలీసువారు నిస్సహాయులైరి. గవర్నమెంటు వారు వారి నణచివేయుట కొక గట్టి అధికారిని పంపిరి. కాని ఆయన ప్రయత్నములు సఫలీకృతములు కాలేదు. బోర్సాద్ తాలూకా సరిహద్దులలోనున్న బరోడారాజ్యభాగములలోకూడ ఇటువంటి నేరములే జరుగుచుండుటచే బరోడా పోలీసువారుకూడా ఈ బందిపోటు దొంగలను పట్టుకొనుటకు ప్రయత్నిస్తూండిరి. ఈ ఉభయరాజ్యముల పోలీసు, రివిన్యూ ఉద్యోగస్థులును ఆలోచించి ఆలోచించి ఆబందిపోటుదొంగలను పట్టుకొనుటకు చివర కొక మంచిపన్నుగడపన్నిరి. వారు దేవార్ బాబాను పట్టియిచ్చుటకు తురకబందిపోటుదొంగతో సంధిచేసుకొనిరి. తనకు తగిన ఆయుధములను, పిస్తోళ్లను, తోటాలను ఇచ్చి, నలుగురైదుగురు పోలీసుజవానులను సహాయము పంపేయెడల తాను దేవార్ బాబాను పట్టి ఇచ్చెదనని ఆ ముసల్మానుదొంగ అధికారులకు హామీ ఇచ్చెను. అధికారు లిందు కంగీకరించిరి. దొంగను పట్టుకొనడమునకు దొంగే నియమింపబడెను. కాని పోలీసువారి ఈ క్రొత్తస్నేహితుడు తాను సంపాదించిన మనుష్యులను, ఆయుధములను తన బందిపోటుపని కుపయోగించుకొనెను.

నేరము లంతకంతకు హెచ్చయినవి. ప్రభుత్వమువారు విసిగివేసారి తుట్టతుదకు గ్రామస్థుల పెకీకునోనే ఈ బందిపోటులు జరగుతూన్నవని నిర్ణయించి, ఆ తాలూకాలో అదనపు పోలీసుదళము నేర్పాటుచేసిరి. ప్రజలనుండి యెక్కువగా అపరాధపు పన్నులు వసూలుచేయబడినవి. ఈలోగా గుజరాతులోని ప్రజానాయకుల కీవిషయము తెలియవచ్చెను. పోలీసువారు ముసల్మాన్ బందిపోటు దొంగతో రాజీచేసుకొనిన విషయమునుగూర్చి వల్లభాయిపటేలు ప్రభుత్వమువారిని సవాలుచేసెను. ఆయన బోర్సాద్

తాలూకాకు పోయి అపరాధపు పన్నులను చెల్లించవలదని ప్రజలకు బోధించెను. బందిపోట్లలో గాయపడిన ప్రజల శరీరములనుండి వెలికి తీయబడిన తోటాలు పోలీసువారి తోటాలుగా గుర్తింపబడినవి. పోలీసువారి తుపాకులును, తోటాలును బందిపోటు దొంగలచే ఉపయోగింపబడినవనే మాట నిశ్చయమైనది. వల్లభాయిపటేలు 200 మంది వాలంటీర్లను బోర్సాద్ తాలూకాలో రాత్రి బవల్లు కావలిపెట్టెను. అంతకు పూర్వము చాలా రోజులనుండి గ్రామస్థులు సాయంకాలమయ్యేసరికి తమ తలుపులకు తాళములువేసుకొనే అలవాటుకలదు. కాని వల్లభాయిపటేలు వారిని తలుపులకుతాళములువేయక తెరచి ఉంచవలసినదని ప్రబోధించెను. ఆతాలూకాలో నియోగింపబడిన అదనపు పోలీసువారే తమ ఇళ్లకు లోపల తాళములు వేసుకుని, పైన తాళములు వేయించుకుని, ఇళ్లు పాడుపెట్టబడినట్లుగా బందిపోటుదొంగలకు తోచేటట్లు ప్రవర్తిస్తూండిరి. బయట ఎక్కడైనా కొంచెము చప్పుడైనయెడల పోలీసువారు తమమంచములక్రిందనక్కేవారు. ఆ తాలూకాలోని గ్రామస్థులు ఛాయాపటములు తీసుకుని పోలీసువారి ఈచర్యలను ఋజువుచేసిరి. పోలీసుఅధికారులకు ప్రతికూలముగా చేయబడిన ఈ నిందారోపణములకు ప్రభుత్వమువా రవలంబించవలసిన పద్ధతులు రెండేకలవు. వారీనేరారోపణములుచేసినవారిపైన కేసు పెట్టడమో, లేక నోరుమూసుకొని నేరము నొప్పుకోవడమో తప్ప వేరు గత్యంతరము లేదు. ఈవిషయములు బయటకు పొక్కినవెంటనే బరోడా ప్రభుత్వమువారు తమ పోలీసువారిని గ్రామములనుండి తిరిగి పిలిపించిరి. బ్రిటిష్ పోలీసువారు మాత్రము తాలూకాలో పీఠముపెట్టుకొని, ఆస్తులను జప్తుచేసి అదనపుపన్నులను సంతోషముతో వసూలు చేయనుండిరి.

ఈలోగా లాయడ్ ప్రభువు బొంబాయిగవర్నరుపదవినుండి విరమించి ఇండియానుండి ఇంగ్లాండుకు పోయెను. ఆయనతరువాత సర్ లెస్లీవిల్సన్ ఆరాష్ట్రమునకు గవర్నరుగా నియమింపబడెను. ఆయన ఉద్యోగమును స్వీకరించినతోడనే బోర్సాదువిషయమును తెలుసుకొని హోమ్‌మెంబరును విచారణకు పంపించెను. హోమ్‌మెంబరు ప్రజలుచేసిన నేరారోపణలను విచారించి సత్యమును తెలుసుకొనెను. వెంటనే పోలీసువారా తాలూకానుండి ఉపసంహరింపబడిరి. వల్లభాయిపటేలును, ఆయనవాలంటీరుదళములును బోర్సాదుతాలూకాలో పనిచేయ ప్రారంభించినవెంటనే దేవార్ బాబా అదృశ్యుడయ్యెను.

ఆ సంవత్సరములో జరిగిన మరిరెండు విషయములనుగూర్చి మనము విచారించవలసియున్నది. అందులో మొదటిది శాసనోల్లంఘన విచారణసంఘమువారి పర్యటనము, వారావసంతకాలములోనే దేశమంతటా సంచారము చేసిరి. రెండవది గురుకా

బాగ్ విషయము. ఇది చాలా గొప్ప సంఘటనము. ఇది ఆగష్టునెలలో ప్రారంభ మైనది. దీనినిగూర్చియే మొదట వివరింతుము. సిక్కుమతస్థులలో రెండు పక్షములు కలవు. వారు అకాలీలు, ఉదాసీలు. రెండవవారు పూర్వాచారపరాయణులు. మొదటి తెగవారు సంఘసంస్కర్తలు. వారిసంఘముపేరు శిరోమణిగురుద్వారాప్రబంధక సంఘము. సిక్కుదేవాలయములలో అధికారమువహించిన మహంతులు పూర్వాచార పరాయణులైన ఉదాసీలకే అనుకూలముగా నుండిరి. సంఘసంస్కర్తలు సిక్కుదేవా లయములను సత్యాగ్రహమూలకముగా స్వాధీనపరచుకొనగోరిరి. గురుకాబాగ్ దేవాలయభూములలోని ఒకచెట్టును ఆ దేవాలయములోనే పనిచేయుచున్న కొంద రకాలీలు కొట్టిరి. మహంతు పోలీసువారికి రక్షణనిమిత్తము రిపోర్టుచేసెను. కాని, అకా లీలు దళములుగా బయలుదేరి చెట్లను కొట్ట ప్రయత్నించిరి. వారు దౌర్జన్యరాహిత్యము నవలంబింతుమని ప్రమాణములు చేసుకొనిరి. కాని అహింసావలంబకులైన అకాలీదళ ములను పోలీసువారు క్రమశఃఘనులుగా ప్రకటించి చావమోదిరి. పోలీసువారి యీ దౌర్జన్యమునకు అకాలీ లేమీ ప్రతీకారము చేయలేదు. ఆదృశ్యము దేశములో ఉద్రేకమును కలిగించినది. యూరప్ ఖండ యుద్ధభూములలో బ్రిటిష్ వారిపక్షమున జర్మనులకు వ్యతిరేకముగా విజయలక్ష్మినిచేపట్టిన భారతదేశపువీరజాతి దౌర్జన్యరాహిత్య సిద్ధాంతము నావిధముగా ఆచరణలో పెట్టుట అద్భుతదృశ్యము.

అకాలీలు చూపిన ఆత్మనిగ్రహమునుగూర్చి ప్రభుత్వమువారుగూడ శ్లాఘించిరి. "గురుకాబాగ్ విషయములో అకాలీలు చూపిన ఆత్మనిగ్రహమువలన గాంధీయొక్క అహింసాసిద్ధాంతమునకు సంపూర్ణవిజయము కలిగినట్లుగా భారతదేశములో అనేక పత్రికలు వ్రాసినవి. కాని పోలీసువారాసందర్భములో తమవిషాదకరమైన ధర్మమును నిర్వర్తించుటయందు కనపరచిన క్రమశిక్షణమునుగూర్చి ఎవ్వరును ఒక మంచిమాట చెప్పకపోవుట" ప్రభుత్వమువారికి చాలా విచారకరముగా నుండెను. పోలీసువారు లాతీఛార్జిశిల్పమునందు ప్రవీణులైనది ఆ గురుకాబాగ్ సందర్భముననే ననికూడా ఒక ప్రతీతి కలదు. తరువాత పదిసంవత్సరములకు పోలీసువారి ఆ లాతీశిక్షణమే భారత రాజకీయములలో ప్రాముఖ్యస్థానము వహించినది. పోలీసువారుకూడ కృతజ్ఞత చూపబడని తమసేవకు విసుగుచెందిరి. కొద్దికాలములోనే ప్రభుత్వమువారీఅకాలీ ఉద్యమము నణచివేయ ప్రయత్నించిరి. కాని అకాలీలను నిర్బంధించుటకు బదులుగా మరియొక ఉపాయమును పన్నిరి. ఈలోగా సర్ గంగారామ్ అనే పేరుగల ఒకసెరదాత గురుకాబాగుసత్యాగ్రహమునకు సంబంధించిన భూములను మహంతు నుండి కౌలుకు తీసుకొని అకాలీలను చెట్లు కొట్టుకొనవిచ్చెను.

శాసనోల్లంఘనసంఘమువారు భారతదేశ మంతటా సంచారముచేసిరి. ప్రజలలో ఉత్సాహముమాత్రము నశించిపోలేదు. ఎక్కడకు పోయినను వారిని హృదయపూర్వకముగా ప్రజలు సన్మానించిరి. గుంటూరు మునిసిపాలిటీవారు వారికి స్వాగతపత్రమును సమర్పించి 'విజయముగలుగుగాక' అని కోరిరి. శాసనోల్లంఘనసంఘమువారు గుంటూరురైలుస్టేషనులో అడుగుపెట్టినతోడనే రెండువందలమంది స్వచ్ఛందసైనికులరెస్టుచేయబడిరి. దేశము శాసనోల్లంఘనమునకు తయారుగా నున్నదా, లేదా అను విషయమును వాదరూపముగాకంటె క్రియారూపకముగా ప్రదర్శింపగలిగినది గుంటూరు పట్టణము. శాసనోల్లంఘనసంఘమువారు తమ విచారణను ముగించి అ. భా. కా. సం. నకు నివేదికను సమర్పించిరి. మొట్టమొదట ఆగస్టు ౧౫ తేదీని జరుపబడే అ. భా. కాం. సం.సభలోనే యీనివేదిక చర్చింపబడవలెనని ఉద్దేశింపబడినది. కాని ఆసమావేశ మప్పటికి జరుగలేదు. కలకత్తాలో దేశబంధుదాసు రెండవకుమారైవివాహసందర్భమున భారతదేశములోని సుప్రసిద్ధులు కొందరు సమావేశ మైనప్పుడు ఆ నివేదికనుగూర్చి యిష్టాగోష్ఠిచర్చలు జరిగినవి. ఆ సమయమునందే మోతీలాల్ నెహ్రూ శాసనోల్లంఘన ప్రయత్నమునుండి చీలిపోయి శాసనసభాప్రవేశమున కనుకూలుడుగా తిరిగిపోయినట్లు మాకు తెలియవచ్చినది. తరువాత ఆనివేదిక ప్రచురింపబడినప్పుడు శాసనసభల ఎన్నికలలో ఆ సంఘసభ్యులు జోక్యము కల్పించుకొనవచ్చునా, లేదా అని చర్చింపబడినది. తరువాత కొద్దికాలమునకే ఖిలాఫత్ సంఘమువారు మరియొక ఉపసంఘమును నియమించి విచారణ చేయించిరి. ఆ ఉపసంఘమువారు శాసనసభాబహిష్కారమును కొనసాగింపవలసినదని గట్టిగా సిఫార్సుచేసిరి. శాసనోల్లంఘనసంఘమువారి నివేదికకు కారణభూతములైన విషయములనుగూర్చి ఇక్కడ మేము చర్చించదలచుకొనలేదు. వారి సిఫార్సులనుమాత్రము ఈదిగువ నుదాహరింతుము:

### శాసనోల్లంఘనసంఘమువారి సిఫార్సులు

### ౧. శాసనోల్లంఘనము

(ఎ) ఒక పరిమితమైన సాధారణ సమష్టిశాసనోల్లంఘనము నవలంబించుటకు దేశము సంసిద్ధముగాలేదు. ఒక ప్రత్యేకచట్టమును తిరస్కరించుటకుగాని, ఒకప్రత్యేక పన్నును చెల్లించకుండుటకుగాని ప్రజలు తయారుగానున్నచోట్ల రాష్ట్రీయకాంగ్రెసు సంఘములు వారి స్వంత బాధ్యతమీద సమష్టిశాసనోల్లంఘనము ప్రారంభింపవచ్చును. కాని ఆ ప్రదేశములో అ. భా. కాం. సం. వారి షరతులు సరిగా నిర్వర్తింపబడినవో, లేదో వారు చూచుకొనవలసియున్నది.

(బి) ఢిల్లీలో ౧౪, ౧౫ తేదీలలో అ. భా. కాం. సం. వారిచే అంగీకరింపబడిన రెండవ తీర్మానమును పునరుద్ధరించుటమూలకముగా ఎట్టి శాసనోల్లంఘనము

నైనను ప్రారంభించుటకు అవసరమైన అధికారములను రాష్ట్రీయ కాంగ్రెసుసంఘములకు కలిగింపవలెనని సిఫార్సు చేస్తున్నాము. ఫిబ్రవరి ౨౪, ౨౫ తేదీలలో అ. భా. కాం. సం. వారు చేసిన ౧ వ తీర్మానములోని (౧) వ భాగము పై నిర్ణయమునకు వ్యతిరేకముగా నున్నంతవరకు రద్దు చేయబడవలెననికూడా సిఫార్సు చేస్తున్నాము. సాధారణ సమష్టిశాసనోల్లంఘనమునుమాత్రము మే మంగీకరింపము.

## ౨. శాసనసభాప్రవేశము

(౧) నూతన శాసనసభలు ప్రారంభింపబడిన మొదటి గడువులో అవి అవలంబించిన కార్యవిధానము ఖిలాఫత్ పంజాబు అన్యాయముల నివారణమునకును, సత్వర స్వరాజ్యసిద్ధికిని అభ్యంతరముగా నుండుటయేగాక, ప్రజలకు క్రొత్తకష్టములను కూడా కల్గించి ఉండుటచే, గయలో జరుగబోవు కాంగ్రెసు ఖిలాఫత్ మహాసభలు తిరిగీ అట్టి చెడుగు కలుగకుండుటకై దౌర్జన్యరహితసహాయనిరాకరణ సిద్ధాంతమున కనుగుణముగా ఈ క్రింది కార్యక్రమమును కొనసాగింపవలెను.

(౧) ఖిలాఫత్ పంజాబు అన్యాయములను తొలగించుటకొరకున్ను, సత్వర స్వరాజ్యసిద్ధికొరకున్ను అసహాయవాదులు ఎన్నికలలో పోటిచేయవలెను. వారధికసంఖ్యాకులుగా జయము పొందుట కన్నిప్రయత్నములను చేయవలెను.

౨. శాసనసభాసమావేశములకు కావలసిన కనీస సంఖ్యకూడా లేకుండ చేయుటకు తగిన అధికసంఖ్యాకులైన అసహాయవాదులు జయము పొందెరయెడల వారు కౌన్సిలులో తమ స్థానముల నాక్రమించుకొని, అందరును ఏకముగా శాసనసభామందిరమును విడిచి వెళ్లిపోవలెను; తక్కిన కార్యక్రమములో మిగతా గడువు పూర్తి అయ్యేటంతవరకునుకూడ పాల్గొనకూడదు. హాజరు కానందువలన తమ స్థానములు ఖాళీకాకుండునట్లు అప్పుడప్పుడు వారు సభాసమావేశములకు హాజరు కావలెను.

౩. శాసనసభాసమావేశములకు కావలసిన కనీససంఖ్య పూర్తికాకుండచేయుటకు తగిన అధికసంఖ్యాకులుగా అసహాయవాదులు జయము పొందినయెడల వారు ప్రభుత్వమువారు తెచ్చిన ప్రతితీర్మానమును బడ్జెటుతోసహా ఎదిరిస్తూండవలెను; పంజాబు ఖిలాఫత్ అన్యాయముల నివారణముగూర్చి, సత్వరస్వరాజ్యసిద్ధినిగూర్చి తీర్మానములను ప్రతిపాదింపవలెను.

౪. అసహాయవాదు లల్పసంఖ్యాకులుగా జయముపొందినయెడల వారు రెండవ సిఫార్సు ననుసరించి, శాసనసభాసభ్యుల సంఖ్యను వీలయినంతవరకు తగ్గింపవలెను.

నూతనశాసనసభలు ౧౯౨౪ జనవరిలోగా సమావేశము కావు కాబట్టి, కాంగ్రెసు మహాసభ ౧౯౨౩ డిశంబరు చివరవారమునకు బదులు మొదటివారములోనే జరుపబడవలెననీ, ఎన్నికలనుగూర్చిన ఈ విషయ మక్కడ నిర్ధారణచేయబడవలెననీ మేము సిఫార్సుచేస్తున్నాము.

(హకీమ్ అజ్మల్ ఖాన్; పండిత మోతీలాల్ నెహ్రూ; వి. జె. పటేల్)

(బి) శాసనసభల బహిష్కారమునకు సంబంధించిన కాంగ్రెసు కార్యక్రమములో ఏమీ మార్పుండకూడదు.

(డాక్టరు యమ్. ఎ. అన్సారి; సి. రాజగోపాలాచారి; యస్. కస్తూరి రంగయ్యంగారు)

## ౩. స్థానిక సంస్థలు

నిర్మాణ కార్యక్రమమునకు సహాయకారులుగా నుండుటకు అసహాయవాదులు మునిసిపాలిటీలకును, జిల్లాబోర్డులు స్థానికసంస్థలకున్ను ఎన్నికలలో నిలువవచ్చునని ఈసంఘమువారు సిఫార్సు చేస్తున్నారు. కాని ఆసంస్థలలోని అసహాయవాద సభ్యులవలంబించవలసినరీతినిగూర్చి ఇదమిత్థమని నిర్ణయింప వీలులేదు. వారు స్థానిక కాంగ్రెసు సంస్థలకును, రాష్ట్రీయ కాంగ్రెసుసంస్థలకును అనుకూలముగా మాత్రము ప్రవర్తింపవలెనని మేము సలహా ఇస్తున్నాము. (ఏకగ్రీవము)

## ౪. ప్రభుత్వవిద్యాసంస్థల బహిష్కారము

విద్యార్థులు పాఠశాలలను, కళాశాలలను విడివిరావలసినదిగా కోరుతూ చేయబడే తీవ్రప్రచారము ప్రస్తుత మాపివేయబడవలెనని సలహాయిచ్చిన బార్డోలీతీర్మానముతో మే మేకీభవిస్తున్నాము. ప్రభుత్వసంస్థలలోకంటె జాతీయ పాఠశాలలలో ఉత్తమవిద్యావిధాన మవలంబించుట మూలకముగా విద్యార్థుల నాకర్షింపవలెనే కాని, పికెటింగు తీవ్రప్రచారములపైన జాతీయ విద్యాసంస్థ లాధారపడియుండకూడదని బార్డోలీతీర్మానానుసారముగా మేమును అంగీకరిస్తున్నాము. (ఏకగ్రీవము)

## ౫. లాయర్లును, కక్షిదారులును న్యాయస్థానములను బహిష్కరించుట

పంచాయితీల స్థాపనముకొరకు ప్రయత్నములు చేయబడవలెను. ప్రజాభిప్రాయము వాటి కనుకూలముగా నుండునట్లు ప్రచారము జరుగవలెను. వృత్తిలోనున్న ప్లీడర్లపైనగల నిర్బంధములన్నీ తొలగింపబడవలెనని మేము సిఫార్సు చేస్తున్నాము. (ఏకగ్రీవము)

## ౬. కార్మిక నిర్మాణము

నాగపురము కాంగ్రెసులో అంగీకరింపబడిన ౮ వ తీర్మానము వెంటనే ఆచరణలోనికి తేబడవలెను. (ఏకగ్రీవము)

## ౭. ప్రయివేటు వ్యవహారములలో ఆత్మసంరక్షణకు హక్కు

(ఎ) కాంగ్రెసు వ్యవహారములలోను, లేక కాంగ్రెసు ప్రచారమునకు సంబంధించి బయలుదేరిన తగాదాలలోను తప్ప వ్యక్తులు న్యాయశాస్త్ర పరిమితిలో ఆత్మరక్షణచేసుకొనే హక్కుయబడవలెనని మేము సిఫార్సుచేస్తున్నాము. కాని అందువలన ముగా జనసమూహమునకు సంబంధించిన దౌర్జన్యములు రాకూడదు. మతమునకుగాని, స్త్రీలకుగాని అవమానము కలిగినప్పుడును, బాలురపైన నీచమైన దెబ్బలాటలు జరిగినప్పుడును బలము నుపయోగించి సంరక్షణచేసుకొనుట ఏపరిస్థితులలోను నిషిద్ధముకాదు.
(విఠల్ భాయిపటేలు తప్ప తక్కిన సభ్యులు)

(బి) చట్టముయొక్క హద్దులకు లోబడి సంరక్షించుకొనే సంపూర్ణ స్వాతంత్ర్యము అసహాయవాదుల కుండవలెను. అప్పుడుకూడా వారి కార్యవిధానము జనసమూహములో దౌర్జన్యమును పుట్టించునట్టిదిగా నుండకూడదు. దానినిగూర్చి ఇక తదితర మరతు లేవీ ఉండకూడదు. (వి. జె. పటేల్)

## ౮. బ్రిటిష్ వస్తువుల బహిష్కారము

(ఎ) ఈ సిద్ధాంతమును మే మంగీకరింతుము. అ. భా. కాం. సం అనుభవజ్ఞులతో కూడిన ఒక ఉపసంఘము నియమించి కాంగ్రెసు జరిగేలోపుగా విచారణచేయించి నివేదిక తెప్పించవలెనని సిఫారసు చేస్తున్నాము.
(సి. రాజగోపాలాచారితప్ప అందరు సభ్యులును)

(బి). అనుభవజ్ఞులావిషయములను విచారణచేసి నివేదించవచ్చును. కాని అ. భా. కాం. సం. వారిచే ఈ సిద్ధాంత మంగీకరింపబడుట అపోహకు కారణమై ఉద్యమమునకు హాని కలిగించును. (సి. రాజగోపాలాచారి)

కాంగ్రెసువాదులలో పూర్వాచారపరాయణులకును, సంస్కరణప్రియులకును భేదాభిప్రాయములు కలిగిన వని ఈ పై సిఫార్సులనుబట్టి పాఠకులకు బోధపడగలదు. కాని ఉభయకక్షులవారును ప్రభుత్వముతో అసహాయవాదము నవలంబింపవలెననే కోరిరి. ఎవరును ప్రభుత్వమునకు సహాయము చేయవలెనని కోరలేదు. సంస్కరణప్రియులైన అసహాయవాదుల ధనువునకు కూర్పబడిన రెండవనారినుండి శాసనసభా

మందిరములలోని నిరంకుశాధికారివర్గముపైన ఇంకను తీవ్రముగా బాణపరంపరలను కురిపింపవచ్చునని యోజింపబడినది. స్థానికసంస్థలనుగూర్చిన సిఫార్సు అందరును అనుకొన్నట్లుగానే జరిగినది. ఇదివరకే కాంగ్రెసువాదులును, అసహాయవాదులును మునిసిపాలిటీల, స్థానికసంస్థల ఎన్నికలలో పాల్గొన ప్రారంభించిరి. వారు ఆసుపత్రులలో ఖద్దరు ప్రవేశపెట్టించి, తమనవుకరులకు ఖద్దరు దుస్తులను సప్లయిచేయించి, తమ కచేరీలమీద జాతీయపతాకలను స్థాపించి, తమ పాఠశాలలలో రాటమును, హిందీని ప్రవేశపెట్టించి, అప్పుడప్పుడు గవర్నరులను, మంత్రులను బహిష్కరించి జాతీయతత్వమును ప్రదర్శింపబూనిరి. కాని వాటివలన కేవలము అభిప్రాయప్రకటనము కంటె వేరు ఫలితము లేదు.

జాతీయసైన్యములో కొంతభాగము శాసన తిరస్కార బహిష్కార విధానములనే తీవ్రసంగ్రామ కార్యక్రమమునుండి తొలగి స్థానికసంఘ శాసనసభాప్రవేశములవంటి క్రీడాకార్యకలాపమునకు పూనుకొనుట వారు యుద్ధభూమిలోని చతురంగబలమునుండి అంతఃపురములోని చదరంగపుబల్లకడకు చేరినట్లుతోచినది. ౧౯౨౨ శీతకాలమునాటికి ఈరెండు అభిప్రాయములు కల కాంగ్రెసువాదులును రెండుశాఖలుగా చీలిపోయిరి. గయాకాంగ్రెసులో ఆకక్షలు ప్రదర్శితములైనవి. అగష్టు ౧౫ న జరుగవలసిన అ. భా. కాం. సం. సభ నవంబరునెలవరకు ఆపివేయబడవలసి వచ్చినది. ౧౯౨౨ నవంబరు ౨౦, ౨౧, ౨౨, ౨౩, ౨౪ తేదీలలో చరిత్ర ప్రసిద్ధమైన ఆ అ. భా. కాం. సం. సభ కలకత్తాలో సమావేశమైనది. ఆసభలో శాసన సభలయందు ఆదాయవ్యయపట్టికల సందర్భమున సభ్యులు చేసే దీర్ఘోపన్యాసములవంటి ఉపన్యాసములు జరిగినవి. ఉభయపక్షములవారును పోటీపడి ఒకరితరువాత నొకరు వారిసిద్ధాంతముల కనుగుణముగా వాదింప మొదలుపెట్టిరి. మొదటిరోజున ఇండియన్ అసోసియేషన్ భవనములలో ఆసభ జరిగినది. తరువాత నాలుగురోజులును చిత్తరంజనదాసు సుందరమందిరావరణమునందు ప్రత్యేకముగా నిర్మింపబడిన చలువరాళ్లభవనములో ఆసభ జరిగినది. ఆసభలోజరిగిన వాదప్రతివాదములు కేవల మక్కడి సభ్యుల బుద్ధివిశేషములను మాత్రమే ప్రదర్శింప గలిగినవని చెప్ప వీలులేదు. మోతీలాల్ నెహ్రూ, చిత్తరంజనదాసులవంటి ప్రధాననాయకులు శాసన సభా కార్యక్రమమున కనుకూలముగా వాదించిరి. వారితో వారి పూర్వస్నేహితులు మహారాష్ట్రులు చేతులు కలిపిరి. కాని గాంధీ ఇటీవలనే నిర్బంధింపబడుటవలనను, ఆయన అనుచరుల కాయనయందుగల భక్తివిశ్వాసములవలనను, ఆయనతీవ్రకార్యక్రమమునందలి ఆకర్షణశక్తివలనను, దానితో సమానమైన మరియొక కార్యవిధానము లేకపోవుటవలనను, గాంధీకార్యక్రమమువలన స్వరాజ్యాదర్శము దృగ్గోచరమైనట్లుగా నుండుట

తలనను, అనేకమంది అసహాయవాదులు తమ పూర్వవృత్తులను మాని, ఆస్తులను విడి, దాదాపు సర్వసంగపరిత్యాగులై ఉద్యమములో నుమికియుండుటవల నను మోతీలాల్ నెహ్రూ మేధాసంపత్తిగాని, చిత్తరంజనదాసు బ్రహ్మాండ వాయు కత్వము గాని అ. భా. కాం. సం. సభ్యులను లోబరచుకొనజాలక పోయినది. అయిదురోజులు వాదప్రతివాదములు, విమర్శన ప్రతివిమర్శనములు జరిగినపిమ్మట చిట్టచివరకు దేశము సమష్టిశాసనోల్లంఘనమునకు తయారు కాలేదని తీర్మానింపబడి నది. కాని రాష్ట్రీయ కాంగ్రెసుసంఘములు ఆయా రాష్ట్రములలోని పరిస్థితుల కను గుణముగా ఢిల్లీ షరతులకు లోబడి, పరిమిత శాసనోల్లంఘనమును తమ స్వంత జవాబుదారీమీద జరుపవచ్చునని వాటి కధికార మీయబడినది. శాసనసభా ప్రవేశ మును గూర్చిన కఠినసమస్య గయాకాంగ్రెసుకు విడిచివేయబడినది. బ్రిటిష్ వస్తు వుల బహిష్కారము, స్థానికసంస్థల ప్రవేశము, పాఠశాలల, కళాశాలల, న్యాయస్థాన ముల బహిష్కరణము, వ్యక్తి సంరక్షణహక్కులు మొదలగు అన్ని సమస్యలూ కూడా అట్లే నిలిపివేయబడినవి. కాంగ్రెసుకు ౧౬ వేల రూపాయలు ఖర్చైన శాస నోల్లంఘనకమిటీవారి విచారణాఫలితము ఈవిధముగా ముగిసినవి.

మనము గయాకాంగ్రెసునుగూర్చి విచారించేముందు కాంగ్రెసు కార్యవర్గము వారు నాటివరకును జరిపిన వ్యవహారములను గూర్చి ఆలోచింతము. ౧౯౨౨ జన వరిలో కాంగ్రెసుకార్యవర్గము మూడుసారులు సమావేశమైనది. తరువాత ఫిబ్రవరిలో రెండుసారులును, మార్చిలో ఒకపర్యాయము, ఏప్రిల్‌లో ఒకసారి, మేలో వరుసగా నాలుగురోజులు, జూన్‌లో రెండు పర్యాయములు, జూలైలో ఒక పర్యాయము, సెప్టెంబరులో ఒకసారి, నవంబరులో ఒకసారి, డిశంబరులో ఒకపర్యాయము సమా వేశమైనది. ఆయా సభలలో గురుకాబాగ్ వ్యవహారములను గూర్చి విచారించుటకు మంచి పలుకుబడిగల ఉపసంఘమొకటి ఏర్పాటుచేయబడినది. అమృతబజార్ పత్రికా సంపాదకుడును, సుప్రసిద్ధ దేశభక్తుడును అయిన మోతీలాల్ ఘోష్ మరణమునకు విచారము వెల్లడింపబడినది. ముల్తాన్‌లోని హిందూ మహమ్మదీయ సఖ్యమును పున రుద్ధరించుట కొక ఉపసంఘము నియమింపబడినది.

కడచిన రెండుసంవత్సరములలో నిర్మింపబడిన హిందూ మహమ్మదీయ సంఘీ భావము భారత దేశచరిత్రకు గౌరవము తెచ్చినది. కాని దురదృష్టవశమున ౧౯౨౨ మొహరమ్ పండుగలలో ముల్తాన్‌లో సాంఘీక విభేదములు చెలరేగి ప్రజల ఆస్తు లకును, ప్రాణములకును చాలా నష్టము కలిగినది. సాంఘిక మిత్రభావములను పునరుద్ధ రించుట కనేకప్రయత్నములు జరిగినవి. కాని "గాంధీ యెంతో శ్రమపడి నిర్మించిన

భవనము నేలమట్టముగా కూలిపోయినది." అని ౧౯౨౨-౨౩ "ఇండియా" ప్రకటించినది.

గాంధీ శిక్షింపబడిన ఏప్రిల్ ౧౮ వ తేదీ మొదలు ప్రతినెల ౧౮ వ తేదీ గాంధీ జయంతిగా భావింపబడుతూండెను. ౧౯౧౭ లో బెసెంటు నిర్బంధింపబడిన ౧౬ వ తేదీ కూడా ఆమె విడుదలయ్యేటంతవరకు కూడా అట్లే భావింపబడుతూవచ్చినది. తరువాత జరిగిన ముఖ్యసంఘటనము ౧౯౨౨ మేలో జవహర్‌లాల్ శిక్షింపబడుట. ఆయన అంతకుపూర్వము యువరాజురాకసందర్భమున ఆరుమాసములశిక్ష ననుభవించి విడుదలయ్యెను. తరువాత కొంతకాలమునకే ౧౨౪-ఎ సెక్షను క్రింద వారంటు పంపబడినది. కాని ఆనేరముక్రింద ఆయన విచారింపబడలేదు. ఆయన "ప్రజలను భయపెట్టుట, భయపెట్టి పనిచేయించుటకు ప్రోత్సహించుట" అను నేరముల క్రింద విచారింపబడెను. ఆయన ఒకబహిరంగసభలో విదేశీబట్టలదుకాణములను పికెట్ చేయుదునని ప్రకటించినమాట నిజమే. బట్టలవర్తకులసంఘమువారు తమవర్తకులపైన విధించిన జరిమానాలను చెల్లించవలసినదని ఉత్తరములను పంపుటకు నిర్ణయించిన ఉపసంఘమున కాయన అధ్యక్షత వహించినమాటకూడా వాస్తవమే. ఆయనకు ఇం. పీ. కో. ౩౮౫ సెక్షను క్రింద శిక్షవిధింపబడినది. ఆయన విదేశీబట్టలదుకాణములవద్ద పికెటింగుచేసినట్లు విచారింపబడెను. ౧౯౨౨ మే ౧౬ వ తేదీని ఆయన న్యాయస్థానమునందొక విపులమైన వాఙ్మూల మిచ్చెను. అందులో తన కిదివరకు బ్రిటిష్‌వస్తువుల యందున్న అసాధారణపక్షపాతము పోయి, పదిసంవత్సరముల కాలములో తాను "ప్రస్తుత భారతప్రభుత్వపద్ధతికి ప్రతికూలుడైన తిరుగుబాటుదారుడు"గామారిన విషయమును విపులముగా వర్ణించెను. "నేను భారతస్వాతంత్ర్యసంగ్రామమునందు పనిచేయగలుగుట నా అదృష్టము. అందులో మహాత్ముని సేనానాయకత్వముక్రింద సైనికుడుగా నుండుట మరీ అదృష్టము. నా మాతృదేశముకొరకు నేను కష్టము లనుభవింపవలసివచ్చుట అంతకంటెనూ పుణ్యము. మేము కనెడి బంగారుకలలలోని ఆదర్శమును పొందుటకంటె స్వాతంత్ర్యరణరంగములో మరణించుట తప్ప భారతీయునకు వేరొక మహాభాగ్యములేదు." అని ఆయనచెప్పెను.

౧౯౨౨ లో జరిగిన గయాకాంగ్రెసు అన్ని విధములా సుప్రసిద్ధమైనది. దేశబంధుదాసువంటి మహారథు డాకాంగ్రెసు కధ్యక్షతవహించుటయే చాలా గొప్పవిషయము. ఆ కాంగ్రెసులో పాల్గొనిన మనుష్యుల ప్రాధాన్యమును బట్టియేకాక అక్కడ జరిగినవిషయములను బట్టికూడా అది ప్రసిద్ధి వహించినది. ఆ కాంగ్రెసులో రెండు కక్షలేర్పడినవి. రాజకీయములను ఆదర్శప్రాయములైన మతవిషయకములుగా భావించేవా రొకతెగగా ఏర్పడిరి. అవి కేవలము భౌతికవిషయములుగాను, లౌకికవ్యవహారములు

గాను ఉండవలెనని తలంచేవారు మరొకతెగగా ఏర్పడిరి. మొదటిపక్షమువారి నాయకు డక్కడ శరీరముతో ప్రత్యక్షముగా లేడు. కాని సత్యాహింసలనుగూర్చిన ఆయన ఆదర్శములు, స్వార్థత్యాగ స్వయంనిగ్రహములను గూర్చిన ఆయనవేదాంత తత్వము ఆయనఅనుచరులచే అస్పష్టముగా వ్యక్తీకరింపబడినప్పటికినీ సభావేదిక యందున్న ఆయనచిత్రపటమునందలి తేజస్సునుండేమాత్ర మవి సంపూర్ణముగా ప్రకాశమానము లైనవి.

శాసన సభా ప్రవేశమునుగూర్చి ప్రతినిధులలో ఉద్రేకములును, భేదభావము లును ప్రబలినవి. కలకత్తాలో జరిగిన అ. భా. కాం. సం. శాసనసభాప్రవేశసమస్య గయాకాంగ్రెసుచే నిర్ణయింపబడవలెనని తీర్మానించినసంగతి మన మెరుగుదుము. ఈ విషయమునుగూర్చి, తదితర విషయములనుగూర్చి ఆలోచించుటకు గయలో కాంగ్రెసు అయిదురోజులు జరిగెనవి. శాసనసభా తీర్మాన మంగీకరింపబడినయెడల అసహాయోద్యమప్రణాళిక అంతరించునని కొందరు గట్టిగా నమ్మిరి. శాసనసభలలో ప్రవేశించి, రాజభక్తిప్రమాణములను తీసుకొనక ప్రభుత్వమువారిని వారి మొగము ముందర శతించవలెనని కొంతమంది మేధావంతులు పట్టుపట్టిరి. ఎన్నికలలో సంపూర్ణ విజయము పొంది మంత్రిపదవులను స్వీకరించక, ఆదాయవ్యయ పట్టికలను తిరస్కరించి, విశ్వాసరాహిత్యతీర్మానములను ప్రతిపాదించి ప్రభుత్వకార్యక్రమమునకు నిరోధమును కల్పించి ప్రభుత్వయంత్రమును మృతతుల్యముగా చేయవలెనని మరి కొంతమంది సాహసులు తలపెట్టిరి.

దేశబంధుదాసు తన వ్యవహారదక్షతకును, తర్కనైపుణ్యమునకును అనుగుణమైన మహోపన్యాసమును కావించెను. కాని దానికితోడు పండిత మోతీలాల్ నెహ్రూ, యస్. శ్రీనివాసఅయ్యంగార్ల మేధావిశేషము కూడ అసహాయోద్యమ నాశను నూతనమార్గమునకు పట్టింపలేకపోయినది. శ్రీనివాసఅయ్యంగారు కాంగ్రెసు వాదులు శాసనసభలకు పోటీచేసి సభ్యత్వస్థానముల నాక్రమించుకొని నిరాకరింపవలె నని సవరణను ప్రతిపాదించెను. పండిత మోతీలాలు దాని కంగీకరించెను. శ్రీనివాసయ్యంగారంతకుపూర్వ మొక సంవత్సరము ముందుగా మద్రాసుశాసనసభాసభ్యత్వమునకు రాజీనామాయిచ్చి, అడ్వకేట్ జనరల్ పదవిని విడిచిపెట్టి, సి. ఐ. ఇ. బిరుదమును తృణీకరించి అభినందనపరంపరలమధ్య అసహాయోద్యమములోనికి దుమికెను. జమియత్-ఉల్-ఉలేమాలు శాసనసభాప్రవేశము నిషేధముకాదనీ, 'మామ్మాన్' అనీ ఒక ఫత్వాను ప్రకటించిరి. ఖిలాఫత్ సభ్యులు దాని కనుకూలముగానుండిరి. కాని ఇవేమీ గయలో పనిచేయలేదు. గాంధీతత్వము విశ్వవ్యాప్తమైనది. కాంగ్రెసులో ఆయన మొగము కనపడనంతమాత్రమున ఆయనసిద్ధాంతమునకు వ్యతిరేకముగా ప్రవర్తిం

చుట చాలామంది కృతఘ్నతగా భావించిరి. మోతీలాల్ ఘోష్, ఏ. సి. మజుమ్‌దారుల సేవలను స్మరించినపిమ్మట గాంధీనీ, ఆయనసిద్ధాంతములున్నూ శ్లాఘింపబడినవి. అకాలీవీరుల అసమానధైర్యమున్నూ, వారు ప్రదర్శించిన ద్వేషరహిత కార్య విధానమున్నూ కొనియాడబడినవి. రాజకీయఖైదీలు స్తుతింపబడిరి. కెమల్ పాషావిజయమున కాయన అభినందింపబడెను. శాసనసభల బహిష్కార మంగీకరింప బడినది. ప్రభుత్వమువారికముందు జాతీయఋణము చేయరాదనీ, జనులు నిరంకుశ ప్రభుత్వమునకు జాతీయఋణము లీయరాదనీ హెచ్చరిక చేయబడెను. నవంబరులో జరిగిన అ. భా. కా. స. శాసనోల్లంఘనతీర్మానము దాదాపుగా గయాకాంగ్రె సులో అంగీకరింపబడినదని చెప్పవచ్చును. శాసనోల్లంఘనమునకు కావలసిన మనుష్యు లను, ధనమును సంపాదింపవలె నని ఆ కాంగ్రెసులో కోరబడినది. కళాశాలల, న్యాయస్థానముల బహిష్కరణము కొనసాగింపబడినది. నవంబరులో నిర్వచింపబడి నట్లుగా వ్యక్తిసంరక్షణ కధికార మీయబడినది. కార్మికనిర్మాణములకొరకు అండ్రూస్, సేన్‌గుప్త, మరి నలుగురుసభ్యులతో ఒక ఉపసంఘ మేర్పాటుచేయబడినది. మరికొంత మంది సభ్యులను చేర్చుకొనుటకుకూడ వారి కధికార మీయబడినది. కాబూలు, దక్షి ణాఫ్రికా కాంగ్రెసుసంఘములు కాంగ్రెసులో చేర్చుకొనబడినవి. వారు క్రమముగా ఇద్దరను, పదిమందిని ప్రతినిధులుగా పంపుట కధికార మీయబడినది.

దేశబంధుదాసు గయాకాంగ్రెసు కధ్యక్షుడయినప్పుడు తన అధ్యక్షోపన్యాస ముతోపాటు స్వరాజ్యపార్టీనిర్మాణవిధానమును, తన రాజీనామానుకూడా తయారు చేసుకొనివచ్చెను.

౧౯౨౦ లోనే వంగరాష్ట్ర కాంగ్రెసుసంఘమునా రట్టిప్రణాళిక నొకదానిని తయారుచేసుకొనిరి. కలకత్తాలో జరిగిన ప్రత్యేకకాంగ్రెసులో వంగ, మహారాష్ట్ర నాయకులు శాసనసభాబహిష్కారము నెదిరించిరి. కలకత్తాతీర్మానము రద్దుచేయుటకు దాసు నాగపురు కాంగ్రెసునాడు ౩౬ వేల రూపాయల సొంతసొమ్ము వెచ్చిం చెను. కాని ఆయన ఓడిపోవగానే చాలా ఔదార్యముతో అసహాయోద్యమ తీర్మాన మును ప్రతిపాదించెను. అహమ్మదాబాదులో ఆయన ప్రత్యక్షముగా హాజరై ఉన్న ట్లయితే ఏమిజరిగియుండేదో మనకు తెలియదు. గయాకాంగ్రెసు ఉభయవాదులకును యుద్ధరంగ మైనది. దాసువంటి మహానాయకుడు, మోతీలాల్, విఠల్‌భాయిలవంటి మేధావంతుల సహాయముతో సాధాజనము చేసిన తీర్మానములకు లొంగిపోయి శాసన సభాబహిష్కారమున కంగీకరించునని నమ్మవీలులేకుండెను. అనుకొన్నట్లే ఒకప్రత్యేక కక్ష ఏర్పడినది దాని కొక కార్యక్రమము నిర్ణయింపబడినది. దాసు వంగరాష్ట్ర శాసనసభను స్వాధీనపరచుకొనవలెననీ, మోతీలాల్ ఢిల్లీ, సిమ్లా సభలో నాయక

ర్యము వహింపవలెనని నిశ్చయింపబడెను. మహారాష్ట్రులు నాగపురముపైపురు తమ దృష్టిని కేంద్రీకరించిరి. బార్డోలీపన్నుల నిరాకరణసంరంభయాత్ర తక్కిన దేశమును కష్టనష్టములనుండి సంరక్షింపగలిగినయెడల కలకత్తా, నాగపురములలో శాసనసభలు ధ్వంసముచేయబడుటచే భారతదేశములోని తక్కిన రాష్ట్రవాసుల ఇక్కట్లెందుకు తొలగింపబడకూడదు? దాసుకు తన రాష్ట్రమునందు సంపూర్ణ విశ్వాసము కలదు. నిజముగా ఆయనకు సర్వాధికార మిచ్చి, అవకాశములు కల్పింపబడినయెడల ఆయన సంతోషపూర్వకముగా గ్రామనిర్మాణ కార్యక్రమమును కొనసాగించియుండేవాడు. ఆయన ఒక చిన్న ప్రదేశములో సంపూర్ణముగా తన కార్యక్రమమును నడిపించుటయం దెక్కువ అభిరుచి కలిగియుండెను. విశాలమైన ప్రదేశములో తన శక్తులను విజృంభింప చేయవలెనని ఆయనకు కోరిక లేదు. ఈ శాసనసభాకార్యక్రమమూలమున అసహాయోద్యమము కొద్దికాలములోనే మారుమూలకు త్రోయబడెను.

౧౯౨౨ వ సంవత్సర చరిత్రను పూర్తిచేయులోపల మనకు ప్రత్యక్ష సంబంధము లేకపోయినప్పటికిని మరి రెండువిషయములనుగూర్చి చెప్పవలసియున్నది. భారతీయ యువకులకు వాలంటీర్లుగా చేరవలె ననేకోరిక దినదినప్రవర్ధమాన మవుచున్న విషయము ప్రభుత్వమువారు కనిపెట్టిరి. వాలంటీరుసంఘములలో సభ్యుల సంఖ్యాబలములు అంతకంతకు హెచ్చుకాదొడగినవి. కాంగ్రెసు పక్షమువారి సంచారసందర్భమున జబ్బల్‌పురము మొదలగు ప్రదేశములలో ప్రభుత్వమువారు వాలంటీరుదళములకు ప్రతికూలముగా ఉత్తరువులను జారీచేసిరి. సైనికవస్తువులలో కొన్ని సైనికోపకరణములతో కనపడే ఖిలాఫత్ వాలంటీర్లు భారత యువకబృందము నాకర్షింపగలిగిరి. జాతీయోద్యమ మూలకముగా ఈ యువకులకు కలిగిన ఉత్సాహమును పెడమార్గముల పట్టించుటలో అనునట్లు ప్రభుత్వమువారు భారతదేశములోనూ, బర్మాలోనూ అనేక భాగములయందు సైనికసంస్థలను స్థాపించిరి. భారత సైనికకళాశాలలో భారతీయ యువకులకు సైనికశిక్షణ మిప్పించుటకు కూడ ఒకప్రణాళిక తయారుచేయబడెను. రెండవది "రాజకీయఖైదీల" సందర్భములో జైలునిబంధనలను తయారుచేయుట. ఆరోజులలో ఈ "రాజకీయఖైదీలు" అనేమాటను ప్రభుత్వమువారు ఉపయోగిస్తూనే ఉండేవారు. తరువాతిరోజులలో మాత్రము ఆమాట నుపయోగించుట కిష్టపడకుండిరి. జైళ్లలో రాజకీయఖైదీలకు కొన్ని యెక్కువసౌకర్యములు చేయబడేనిమిత్త మాలోచింపబడినది. దౌర్జన్యము చేసినందుకును, ఇతరులఆస్తిని నష్టపరచినందుకును, పోలీసువారికిని, సైనికులకును రాజద్రోహము పురికొల్పినందుకును, దురుద్దేశముతో ప్రజలను భయపెట్టినందుకును శిక్షింపబడినవారు రాజకీయఖైదీల తరగతిక్రిందకు రారని మేము వేరుగా చెప్పనవసరములేదు.

అయా కేసుల స్వభావమునుబట్టి, ఖైదీలస్థితి, ప్రవర్తనము, విద్య మొదలగువిషయము లనుబట్టి వారికి ప్రత్యేకనిబంధన లేర్పాటు చేయబడెను. ఆ విధముగా ప్రత్యేకింపబడిన ఖైదీలు సాధారణ ఖైదీలలో చేర్చబడరు. వారు స్వంతముగా ఆహారమును, పరుపును తెచ్చుకొనవచ్చును. వారు స్వంత దుస్తులను ధరింపవచ్చును; పుస్తకములను, సంచికలను తెప్పించుకొన వచ్చును; నిర్ణీతకాలములలో వారు స్నేహితులను పిలిపించుకొనవచ్చును; ఉత్తరములను తెప్పించుకొనవచ్చును; పనిచేయకుండ వారు మినహాయింపబడవచ్చును. ఇవన్నీ ప్రభుత్వమువారి ఉత్తరువులలోనున్న విషయములే. కాని ఈ నియమములను అప్పుడుగాని, తరువాతగాని జైలధికారులు చాలామంది రాజకీయఖైదీలవిషయములో అమలులో పెట్టలేదు. తరువాత ప్రభుత్వమువారు "ఖైదీ" అనేమాటకు ముందు "రాజకీయ" అనే విశేషణమును చేర్చుటకుకూడ నిరాకరించిరి.

# 4. శాసనసభలలో సహాయనిరాకరణము

## ౧౯౨౩

[ఆకస్మికముగా ఖిలాఫత్ ఉద్యమము ముగియుట - గయాకార్యక్రమము - అ. భా. కాం. సం. ఫిబ్రవరి సమావేశము - రాజీ - జవహరులాలువిడుదల - శాసనోల్లంఘనమునుగూర్చి అశ్రద్ధ-జాతీయసమితి-కాంగ్రెసుఉపసంఘమువారి పర్యటనము - అ. భా. కాం. సం. శాసనసభా ప్రవేశమునుగూర్చి ప్రతికూల ప్రచారమును నిషేధించుట - ప్రత్యేక కాంగ్రెసు జరుపబడవలెనని తీర్మానింపబడుట - తమిళనాడు తిరుగుబాటు-నాగపురములో అ. భా. కాం. సం. సమావేశము- ప్రత్యేకకాంగ్రెసుకు ప్రతికూలభావము- అ. భా. కాం. సం. ప్రత్యేక సమావేశము పిలువబడుట - ప్రత్యేకకాంగ్రెసు స్థిరపడినది - అందుకు ఢిల్లీ నిర్ణయింపబడుట - నాగపురపుసత్యాగ్రహము - విదేశములలోని భారతీయులు - ఢిల్లీప్రత్యేకకాంగ్రెసు - ఢిల్లీతీర్మానము - స్వరాజ్యపార్టీ ప్రకటనము - కాకినాడ కాంగ్రెసుకుముందు - గాంధీసందేశము - ప్రధాన తీర్మానము - కాకినాడ కాంగ్రెసు-ఇతర తీర్మానములు - కాంగ్రెసు డిపార్టుమెంటులు, అకాలీ ఉద్యమము-గురుద్వారా దేవాలయముల తగాదా - గురుకాబాగ్ వ్యవహారము- మాక్ ఫర్ సన్ పొగడ్త-అఖండపాంతు చదువుట నేరము ]

౧౯౨౩ ప్రారంభమున సాంఘికవిభేదములలో తిరిగి మరియొకసారి భారతరాజకీయ వాతావరణము కలుషీభూతమైనది. ఇదివరకే ౧౯౨౨లో ముల్తాన్ కొట్లాటలు జరిగినవి. ౧౯౨౩ మొహరంపండుగలలో వంగ, పాంచాలరాష్ట్రములందు గొప్పదెబ్బలాటలు జరిగినవి. ౧౯౨౨లో ఖిలాఫత్ సమస్య ఆకస్మికముగా ముగిసినది. ౧౯౨౨ అక్టోబరు నెలలో ఐరోపాసంగ్రామ సంధిపత్రము సంతకముచేయబడినది. పిమ్మట నవంబరు ౨౦వ తేదీని లాసేనులో మిత్రమండలివారందరూ కలిసి సభచేసుకొనిరి. అది రెండునెలలు జరిగినది. అప్పుడు అంగోరా ప్రభుత్వప్రతినిధులు సివిల్ పరిపాలనమును స్వాధీనము చేసుకొనిరి. వెంటనే టర్కీసుల్తాను ప్రాణభీతిచే రహస్యముగా బ్రిటిష్ యుద్ధనౌకలో మాల్టాకు పారిపోయెను. తక్షణమాయన సుల్తానుగానేగాక ఖలీఫాగాకూడా తొలగింపబడెను. ఆయన మేనల్లుడు అబ్దుల్ మజీద్ ఎఫెండీ అనేఆయన క్రొత్తఖలీఫాగా ఎన్నుకొనబడెను. టర్కీలో ప్రజాప్రభుత్వము స్థాపింపబడినది. అంతటితో సుల్తానుపదము రూపుమాసినది. ఈవిధముగా ఖిలాఫత్ ప్రమాదరహితముగా చేయబడినది.

గయాకాంగ్రెసులో నోఛేంజర్లు (శాసనసభా బహిష్కారవాదులు) పొందిన విజయము చాలాకాలము నిలువలేదు. ౧౯౨౩ జనవరి ౧ వ తేదీని అ. భా. కాం. సం. సమావేశమై ౧౯౨౩ ఏప్రిల్ ౩౦ వ తేదీలోగా ౨౫ లక్షలరూపాయలను వసూలు చేయవలెననీ, ౫౦ వేలమంది వాలంటీర్లను సమకూర్చవలెననీ తీర్మానించినది. అందుకవసరమైన కార్యక్రమమును నడపుటకు కార్యనిర్వాహకవర్గమువారికధికారమీయబడినది. టర్కీ పరిస్థితులను బట్టి ఆకస్మికముగా శాసనోల్లంఘనము ప్రారంభింపబడవలసివచ్చేయెడల ఖిలాఫతులను కొన్నిటిని తొలగించుటకుకూడా వారికధికారమీయబడినది. మరుసమావేశమునకు జాతీయసమాఖ్యను తయారుచేసేనిమిత్తము డాక్టరు అన్సారీ కోరబడెను. వీటన్నిటికంటెనూ ఆసభలో ప్రాముఖ్యత వహింపదగినది అధ్యక్షుడిచ్చిన రాజీనామా. అధ్యక్షుడైన చిత్తరంజనదాసు ఇదివరకే తన స్వరాజ్యపక్షకార్యక్రమమును గూర్చి విషయనిర్ధారణసభలో వివరించియుండెను. కాబట్టి రాజీనామా తప్పనిసరి అని అందరూ అనుకొన్నదే. ఆరాజీనామావిషయము ౧౯౨౩ ఫిబ్రవరి ౨౭-వ తేదీని అలహాబాదులో జరుగినన్న అ. భా. కాం. సం. సమావేశమునకు నిలిపివేయబడెను. ఆసమావేశములో శాసనసభాప్రవేశమును గురించి ఏప్రిల్ ౩౦-వ తేదీవరకును ఉభయపక్షములవారును ప్రచారము నాపివేయవలెననీ, ఈ గా ఉభయపక్షములకును సంబంధించిన తదితర విషయములను ఒకరితో ఒకరు జోక్యము కల్పించుకొనకుండా జరుపుకొనవలెననీ ఒకరాజీ కుదిరినది. ఈ ఫిబ్రవరిసభనాటికి మౌలానా అబుల్ కలామ్ అజాద్, పండిత జవహర్ లాల్ నెహ్రూలు విడుదల చేయ

బడిరి. వారిద్దరూ ఈరాజీనిగూర్చి చేసిన శ్రమకు వారిని అ. భా. కాం. సం వా రభి నందించిరి.

శాసనోల్లంఘనమునుగూర్చి శ్రద్ధగా విచారింపబడినట్లు కనిపించలేదు. దానిని కాంగ్రెసువారులు తిరిగీ ప్రారంభించకపోవుటకు ముఖ్యకారణము వారిలో కలిగిన చీలికయే. ఇండియాగవర్నమెంటువారి ఆ సంవత్సరపు ఆదాయవ్యయపట్టికవలన శాసనోల్లంఘనమున కొక గొప్పఅవకాశము కలిగినది. ౧౯౨౩ లోని భారతశాసన సభబడ్జెటుసమావేశమునందు ఉప్పుపన్ను హెచ్చింపబడవలెనని సూచింపబడినది. కాని సభ్యులా సూచనను త్రోసిపుచ్చిరి. వైస్రాయి ఉప్పుపన్ను ఎక్కువ చేయబడవలసినదేనని తన అసాధారణాధికారమును చలాయించెను. సభ్యులలో చాలామంది ఉప్పుపన్నెక్కువచేయబడుటవలన ప్రభుత్వమువారు సహాయనిరాకరణోద్యమమునకు చేయూత నొసగినవారగుదురని వాదించిరి. మాంటేగ్, వెబ్, ఇ. డి. సామ్యూలువంటివారుకూడా ఉప్పుపన్ను హెచ్చించుటను నిరసించిరి. ఈ పరిస్థితులలో అసెంబ్లీసభ్యులచే త్రోసిపుచ్చబడిన పన్నును వైస్రాయి పునరుద్ధరించుట కొంతమందికి క్రోధమును, మరికొంతమందికి భయమును కలిగించినది. "అసహాయోద్యమపక్షము వారికి పూర్వమున్న శక్తిసామర్థ్యములున్నయెడల వైస్రాయిచేసిన ఈ పనిని అవకాశముగా తీసుకొని ఉద్యమమును పునర్జీవింప చేయవచ్చు" నని చాలామంది తలంచిరి. కాని కాంగ్రెసువారి మనస్సులకావిషయము పట్టనేలేదు. తరువాతి ఏడుసంవత్సరములకు సత్యాగ్రహప్రారంభమునకు ఉప్పును నిజమైన ఆయుధముగా తీసుకొనవచ్చునని వారి గురువుకు తట్టినది. ప్రభుత్వోద్యోగియైన "ఇండియా" గ్రంథకర్త వైస్రాయి నిరంకుశాధికారముతో ఉప్పుపన్ను హెచ్చించిన అవకాశము తీసుకొని కాంగ్రెసువారు శాసనోల్లంఘనమును పునరుద్ధరింపలేకపోయిరని ఆక్షేపించెను. కాని రీడింగు ప్రభువుయొక్క నిరంకుశ చర్య మరియొక ఉపకారము చేసినది. అంతకుపూర్వము కొంతకాలముక్రిందటనుండీ బెసెంటు న్యాయశాస్త్రనిపుణముగా ప్రచారముచేసే రాజకీయాందోళకులనందరినీ ఒక గొడుసుక్రిందకు తీసుకొనివచ్చి, జాతీయసమితి (National Convention) నేర్పాటు చేయవలెనని తలపెట్టినది. అప్పుడే డాక్టరు సప్రూ భారతప్రభుత్వములోని తన లా మెంబరుపదవికి రాజీనామా యిచ్చెను. ఆయన అధ్యక్షతక్రింద, భారతదేశమునకు సామ్రాజ్యములో స్వతంత్రపరిపాలనాప్రతిపత్తిని సంపాదించే నిమిత్తము ఆచరణయోగ్యమగు కార్యవిధానము నాలోచించుట కొక మహాసభ జరిగినది. ఆ మహాసభవారు వివరములను తయారుచేయుట కనేక ఉపసంఘములను నియమించిరి.

బాబూ రాజేంద్రప్రసాదు, సి. రాజగోపాలాచారి, సేఠ్ జమ్నాలాల్ బజాజ్, దేవదాసు గాంధీలు నిర్మాణకార్యక్రమమునుగూర్చి దేశములో ప్రచారముచేస్తూ పర్య టన మొనర్చిరి. వారు తిలక్ స్వరాజ్యనిధికి విశేషధనమును సేకరించిరి. ౧౯౨౩ మేలో బొంబాయిలో జరిగిన కాంగ్రెసు కార్యనిర్వాహకసభకు వారి నివేదిక పంపబడినది. ౧౯౨౩ మే ౨౫, ౨౬, ౨౭ తేదీలలో ముఖ్యమైన అ. భా. కాం. సం. సమావేశ ముకూడా అక్కడనే జరిగినది. ఆసమావేశమునందు గయాకాంగ్రెసులో అంగీకరింపబడిన శాసనసభాబహిష్కారమునుగూర్చి ఓటర్లలో ప్రచారముచేయబడరాదని నిర్ణయింప బడినది. ఇంతకుపూర్వము కలకత్తాలో జులైకిందటనే కాంగ్రెస్ కార్యక్రమము శాసనసభా ప్రవేశముతోసహా వివిధభాగములుగా విభజింపబడి, ఆయా భాగములలో ఉత్సాహము గలవారి కవి స్వాధీనముచేయబడవలెననీ, అందుకొరకు అయిదారుకోట్ల రూపాయలు వసూలుచేయబడవలెననీ చిత్తరంజనదాసు సూచించెను. ఈ సూచన రాజగోపాలాచారి, బాబూ రాజేంద్రప్రసాదులు కార్యవర్గమునకు విపులముగా నివేదించిరి. కాని అది అసాధ్యమైన విషయముగా భావింపబడి విరమింపబడినది. శాసనసభలకు సంబంధించి నంతవరకు కానూచన గయాకాంగ్రెసుతీర్మానమునకు విరుద్ధముగా నున్నట్లు భావింపబడి నది. ఈ పైతీర్మానము అ. భా. కాం. సం. లో అంగీకరింపబడిన కారణమున వెంటనే ఆరుగురు కార్యవర్గసభ్యులు రాజీనామాలను పంపిరి. వారు రాజగోపాలాచారి, వల్లభాయిపటేలు, రాజేంద్రప్రసాద్, బ్రజకిశోర ప్రసాద్, ఎ. బి. దేశపాండే, జమ్నాలాల్ బజాజులు. అప్పుడు జవహర్ లాల్ నెహ్రూ జోక్యము కల్పించుకొని పున ర్విచారణచేయవలసినదని వారిని కోరెను. కాని తరువాత ఆ రాజీనామాలున్ను, చిత్త రంజనదాసు రాజీనామాయున్ను అంగీకరింపబడినవి. తిరిగీ అన్సారీ అధ్యక్షతక్రింద కార్యనిర్వాహకవర్గము స్థాపింపబడినది. ఇంతకంటె ఈ సమావేశములో విశేష మే మీ లేదు. కాని ఒక విషయముమాత్రము జరిగినది. నాగపురములో జెండాసత్యా గ్రహము సాగించిన వాలంటీర్లభినందింపబడిరి. అవసరమైనప్పుడు యావద్భారతదేశము నుండీ స్వచ్ఛందసైనికు లాసత్యాగ్రహమునకు తోడ్పడ సంసిద్ధముగా నుండవలెనని కోరబడిరి.

బొంబాయి రాజీనామాకు రాష్ట్రీయ కాంగ్రెసు సంఘములు తిరుగుబాటు చేసి నవి. అందువలన తరువాత నాగపురములో జరిగిన అ. భా. కాం. సం. సభ "మే ౨౬ తేదీని ఈసభవారిచే చేయబడిన రాజీనామాతీర్మానము న్యాయమైనదనీ, శాస్త్ర సమ్మతమైనదనీ అభిప్రాయపడుతూ దానిని గట్టిగా ఆచరణలోనికి తీసుకొని రావలెనని ప్రకటిస్తూన్నది." అని తీర్మానించినది. "కొన్ని రాష్ట్రీయసంఘము లిందుకు వ్యతిరేక ముగా ప్రవర్తింపబూనుట విచారకరము. ఇకముందటువంటిపనిజరుగకుండుటకు కోరుచు

న్నాము." అని కూడా ఆసభలో తీర్మానింపబడినది. క్రమవిరుద్ధముగా ప్రవర్తించి నందుకు తమిళనాడు కాంగ్రెసుసంఘముపైన చర్య తీసుకొనవలెనని కూడా సూచింపబడినది. కాని తగిన సాక్ష్యసాధనములు లేనందున అలా చేయకూడదని కొంతమంది సభ్యు లభ్యంతర పెట్టిరి. ఈ అభ్యంతరమునకు సభవా రంగీకరించిరి. దానిపైన అసలా తీర్మానము తెచ్చిన జవహర్‌లాల్ పండితుడున్ను, ఆయనను ప్రోత్సహించిన డాక్టరు అన్సారీయున్ను కార్యనిర్వాహకసభనుండి రాజీనామాల నిచ్చిరి. వెంటనే అ. భా. కాం. సం. వా రా రాజీనామా లంగీకరించి, తక్షణము నూతన కార్యనిర్వాహక సభ నెన్నుకొనిరి.

నాగపురములో జరిగిన అ. భా. కాం. సం. సమావేశములో తలవని తలంపుగా నోటీసు లేకుండానే ఒకతీర్మానము ప్రవేశపెట్టబడినది. అది "శాసన సభా బహిష్కారమునుగూర్చి పునర్విచారణ చేసి నిర్ణయించుటకు ప్రత్యేక కాంగ్రెసు పిలువబడవలె"ననే తీర్మానము. ఆ ప్రత్యేకకాంగ్రెసు ఆగస్టునెలలో మౌలానా అబుల్‌కలామ్ అజాద్ అధ్యక్షతక్రింద బొంబాయిలో జరుపబడవలెనని నిర్ణయింపబడినది. అందుకు తగినచర్య నడపుటకు కార్యనిర్వాహకసభ కధికార మీయబడినది.

అనుకొన్నట్లుగానే నాగపురములో తలవనితలంపుగా ప్రత్యేక కాంగ్రెసును గూర్చి చేయబడినతీర్మానము కాంగ్రెసువాదులలో ప్రతికూలభావమును పురికొల్పినది. ఆ తీర్మానము కొద్దివోట్ల ఎక్కువతో అంగీకరింపబడుటవలన ఆ ప్రాతికూల్యము మరింత బలవత్తరమైనది. వెంటనే విశాఖపట్టణములో అ. భా. కాం. సం. ప్రత్యేకసమావేశము జరుపబడవలెనని సభ్యులు విజ్ఞాపనమును పంపిరి. ఆ ప్రత్యేకసభ ఆగస్టు 3 వ తేదీని జరిగినది. "ఆవిజ్ఞాపనమున కనుకూలముగా ఎవరైనా తీర్మానమును ప్రతిపాదిస్తారా అని అధ్యక్షు డడిగినప్పటికీ ఎవరూ మాట్లాడకపోవుటచేత రాజగోపాలాచారి ఈ క్రిందితీర్మానమును ప్రతిపాదించునట్లున్ను, అది అంగీకరించబడినట్లున్ను" కాంగ్రెసు అధికారులచే ప్రకటింపబడిన నివేదికవలన తెలుస్తూన్నది.

ఆగస్టుకు బదులుగా సెప్టెంబరులో ప్రత్యేకసభ జరుపబడవలెనని తీర్మానింపబడినది. స్థలమువిషయములో ఏదైనా చిక్కున్నయెడల మరేచోటనైననూ సభను జరిపించుట కధ్యక్షున కధికార మీయబడినది. ఈ తీర్మానమును ప్రతిపాదించినది రాజగోపాలాచారి అగుట కొంత ఆశ్చర్యకరము. అప్పటి అ. భా. కాం. సంఘాధ్యక్షుడు "ఆచ్చనోఛేంజరు" శ్రీ దేశభక్తకొండ వెంకటప్పయ్యపంతులు. ప్రత్యేక కాంగ్రెసులో శాసనసభాసమస్య పూర్తిగా చర్చింపబడవలెనని ఆ తీర్మానములోని అభిప్రాయమా, లేక కాంగ్రెసుకార్యక్రమమును క్రొత్తమార్గముల పట్టించుట కది ఉద్దేశింపబడినదా ?

మొదట నిర్ణయింపబడినట్లు ప్రత్యేకకాంగ్రెసు బొంబాయిలో జరుపబడలేదు; ఢిల్లీలో జరుపబడినది. ఆ కాంగ్రెసునుగూర్చి వ్రాసేముందు ఆనాటి కొన్ని చరిత్రాంశములను వివరింపవలసియున్నది. వాటిలో నాగపురపుసత్యాగ్రహము ప్రధానమైనది. నాగపురములో జాతీయపతాకోత్సవము జరుపబడుతూండగా పోలీసువారా నగరములోని సివిల్ లైనులలోకి పోకూడదని ౧౯౨౩ మే ౧వ తేదీని ౧౪౪ వ సెక్షను ప్రకారము ఉత్తరువులను జారీచేసిరి.

కాంగ్రెసువాలంటీర్లు తమ యిష్టమువచ్చిన వీథికి కాంగ్రెసు పతాకమును తీసికొనిపోవుటకు హక్కు కలదని పట్టుపట్టిరి. అందుకు వారరెస్టుచేయబడి శిక్షింపబడిరి. క్రమానుగతముగా అది యొక ఉద్యమముగా అభివృద్ధి పొందినది. కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమువారు నాగపురపు వలంటీర్ల నభినందించిరి. తరువాత ౧౯౨౩ జూలై ౮, ౯, ౧౦ తేదీలలో నాగపురములో జరుపబడిన అ. భా. కాం. సం. వారు కూడ ఆ ఉద్యమము నభినందించిన విషయ మిదివరకే తెలుసుకొనియుంటిమి. వారీ పతాకసత్యాగ్రహోద్యమమును జయప్రదముగా కొనసాగించుటకు నాగపురసత్యాగ్రహోద్యమసంఘమువారికి సహాయముచేయ తీర్మానించిరి. ప్రతినెలా గాంధిజయంతిగా వ్యవహరింపబడుతూన్న ౧౮ వ తేదీ పతాకోత్సవదినముగా కూడ వ్యవహరింపబడవలెనని తీర్మానింపబడినది. రాష్ట్రీయ కాంగ్రెసుసంఘములు పతాకోత్సవములను జరిపింపవలెననీ, ప్రజలు పతాకములను ప్రదర్శింపవలెననీ కోరబడిరి. ఈ ఉద్యమసందర్భమున సేఠ్ జమ్నాలాల్ బజాజ్ కూడ అరెస్టుచేయబడెను. అందువల్లనే నాగపురములో అ. భా. కాం. సం. సమావేశము కావలసివచ్చినది. ఆయన నిర్బంధింపబడినందు కా సభలో అభినందింపబడెను. "పతాకోద్యమమునకు అ. భా. కాం. సం. వారు హృదయపూర్వకసహాయము చేయ బజాజ్ కు వాగ్దానముచేసిరి. బజాజ్ కు విధింపబడిన రు. ౩౦౦౦ జరిమానాకోస మాయనమోటారుకారు జప్తుచేయబడెను. కాని నాగపురములో దానిని కొనువారు లేకపోయిరి. గవర్నమెంటువారు దానిని విక్రయించుటకు కథియవారుకు తీసుకొనిపోయిరి. నాగపురపు సత్యాగ్రహమునందు పాల్గొనుటకు వివిధప్రాంతములనుండి వచ్చిన వాలంటీర్లు ఖైదులలో అంతులేని బాధలు పడిరి. అ. భా. కాం. సం. వారా సత్యాగ్రహమునకు సంపూర్ణసహాయముచేసిరి.

చిట్టచివరకు నాగపురసత్యాగ్రహము యావద్భారతోద్యమముగా పరిణమించినది. జూలై ౧౨ వ తేదీనుండి ఆ ఉద్యమమునకు వల్లభాయిపటేలు యాజమాన్యము వహింప కోరబడెను. భారతదేశములోని వివిధప్రాంతములనుండీ వాలంటీర్లక్కడకు పోయిరి. కొన్ని కాంగ్రెసుకమిటీ లందుకు ధనసహాయము చేయవలసినదనికూడా ప్రజలను కోరినవి. కాంగ్రెసు కార్యవర్గము ఆగష్టునెలలో విశాఖపట్టణమునందు సమావేశమై

ఆ సత్యాగ్రహమునకు విఠలుభాయిపటేలు చేసిన సహాయమునకు కాయన నభినందించినది. ఆ ఉద్యమము పూర్తియగునంతవరకును ఆయనను అక్కడి సత్యాగ్రహ సభ్యులకు సలహాయియ్యవలసిన దనికూడా కార్యవర్గమువారు కోరిరి. పటేలుసోదరులే ముఖ్యముగా ఆ ఉద్యమవిజయమునకు కారకులు. ప్రభుత్వమువారు ఉత్సవము నడుపు వాలంటీర్లు ముందుగా దరఖాస్తును పంపవలెనని వాదించిరి. బహిరంగవీథులవెంట ఏ విధమైన అభ్యంతరమునులేక ఉత్సవమును నడిపించుటకు తమకు హక్కుగలదని కాంగ్రెసువారు పట్టుపట్టిరి. తీవ్రమైన దండయాత్ర సాగునని ఊహింపబడినది. వల్లభాయి పటేలు ప్రజల కేమీ అపాయము కలుగకుండుటకై ముందుగా మార్చి ౧౮ వ తేదీని ఫలానామార్గమున పతాకోత్సవము నడుపబడునని ప్రకటించెను. ప్రభుత్వమువారి ౧౪౪ వ సెక్షను క్రింద నిషేధపుటుత్తరువులు రద్దుచేయబడలేదు సరిగదా, అప్పటికి కొద్ది కాలముక్రిందనే పునరుద్ధరింపబడినవి. కాని ౧౮ వ తేదీని పతాకోత్సవమున కేమీఆటంకము కలుగలేదు. మొదట నిర్ణయింపబడిన త్రోవను పోవుటకు ప్రభుత్వమువా రభ్యంతరపెట్టలేదు. తరువాత ఆంగ్లోయిండియన్‌పత్రికలు ప్రభుత్వమువారికి విజయము కలిగినట్లు ప్రకటించినవి. కాంగ్రెసువారు గవర్నమెంటువారి ఉత్తరువులను పొంది ఉత్సవమును నడిపించిరని వారివాదన. నిజముగా కాంగ్రెసట్టిఉత్తరువులకొరకు ప్రభుత్వమువారిని కోరనేలేదు. కాంగ్రెసుప్రతిపక్షులు కాంగ్రెసువిజయమునుగూర్చి ఇట్టివ్రాతలను వ్రాయుట కిది ప్రథమపర్యాయము కాదు. ఢిల్లీకాంగ్రెసువారీ సత్యాగ్రహమును జయప్రదముగా నడిపి నాయకులును, వాలంటీర్లును చేసిన అపూర్వత్యాగమునకు వారి నభినందించిరని చెప్పినచో యీకథ పూర్తి అయినట్లే.

జులై, ఆగష్టు, సెప్టెంబరు మాసములలో విదేశములలోని భారతీయుల స్థితి కాంగ్రెసుదృష్టి నాకర్షించినది. కెన్యావ్యవహారము లంతకంతకు చెడిపోదొడగినవి. వాటినిగూర్చి ఆగష్టునెలలో విశాఖపట్టణమునందు జరిగిన అ. భా. కాం. సం. వారిచే ఒకప్రకటనముకూడా చేయబడినది. ౧౯౨౨-౨౩ సంవత్సరములలోని స్థితిగతుల నిచ్చట సంగ్రహముగా వివరింతుము. న్యూజీలాండు, న్యూఫౌండులాండులలో తప్ప బ్రిటిష్‌సామ్రాజ్యములలోని ఇతరభాగములలో నివసిస్తూన్న భారతీయులపైన చాలకాలమునుండీ కొన్ని అవమానకరములగు విషయములు జరుపబడుతూండెను. ౧౯౨౧ లోజరిగిన సామ్రాజ్యమహాసభ (యింపీరియల్ కాన్ఫరెన్సు) లో అధినివేశప్రతినిధులు సమావేశమైరి. వారు "బ్రిటిష్‌సామ్రాజ్యముయొక్క ఐక్యముకొరకు సామ్రాజ్యములోని తదితరభాగములలో న్యాయముగా వలసపోయి నివసిస్తూన్న భారతీయుల హక్కులు సంరక్షింపబడవలెను" అని తీర్మానించిరి. ఒక్కదక్షిణాఫ్రికామాత్ర మందుకు వ్యతిరేకించెను. అప్పటినుండీ దక్షిణాఫ్రికాలోని భారతీయులకు

సంబంధించినంతవరకు హిందూదేశ మాదేశముతో ప్రత్యక్షముగా రాయబారము జరుపు కొనవలెనని అంగీకరింపబడినది. ౧౯౧౪ లోని గాంధీస్మట్సుఒడంబడిక ప్రకారము దక్షిణాఫ్రికాభారతీయుల హక్కులు స్థిరపరుపబడినవి. కాని ౧౯౨౦ సంవత్సరములో ట్రాన్సువాలురాష్ట్రీయ న్యాయస్థాన (ట్రాన్స్‌వాల్ ప్రావిన్షియల్ కోర్టు) నిర్ణయప్రకారము వాటికి ముప్పుకలిగినది. ట్రాన్సువాలులోని భారతీయులు రాజకీయముగా నిస్సహాయు లయిపోయిరి. నేటాలులోమాత్రము వారికి మునిసిపల్ వోటింగుహక్కు లుండెను. ఇటీవల వారికికూడా కొన్నిచిక్కులు తటస్థించినవి. సెసిల్ రోడ్సు (Cecil rhodes) లో ప్రతినాగరికునకును సమానహక్కు లుండగా ఆరంజిరివరు ఫ్రీస్టేటులోనికి భారతీయుల ప్రవేశము నిషేధింపబడినది. ౧౯౨౦ లో దక్షిణాఫ్రికాలోని వివిధరాష్ట్రములయందును ఆసియాఖండవాసులు వ్యాపారము చేసుకొనుటకును, భూములు సంపాదించుకొనుటకును గల హక్కులనుగూర్చి విచారించే నిమిత్తము దక్షిణాఫ్రికాగవర్నమెంటువా రొక కమిటీని నియమించిరి. ఆ కమిటీ యెదుట భారతప్రభుత్వప్రతినిధిగా సర్ బెంజమిన్ రాబర్ట్సన్ సాక్ష్యమిచ్చెను. ఆయన ఆసియాఖండవాసుల కా దేశములో భూము లుండకూడ దనేశాసన ముండవలసినదే ననెను. కాని వారిని నిర్బంధముగా వెలిబెట్టుటకుమాత్ర మాయన అంగీకరించలేదు. ఇక నేటాలులో సముద్రతీరములకు దగ్గరగా మాత్రము భారతీయులు భూములను సంపాదించుటకు హక్కుకలదని నిర్ణయింపబడినది. కాని ఇండియా ప్రభుత్వము వారాసూచనను ప్రతిఘటించుటచే యూనియన్‌గవర్నమెంటువారు దానిని రద్దుచేసిరి. అంతటితో ఊరుకొనక నేటాలు ప్రభుత్వమువారు రెండు ఆర్డినెన్సులను జారీచేసిరి. దానివలన భారతీయులస్థితికి మరింత అపాయము కలిగినది. కాని దక్షిణాఫ్రికాలోని గవర్నరుజనరల్ వాటిని రద్దుచేసెను. ౧౯౨౨-౨౩ సంవత్సరములలో పైనిచెప్పబడిన రెండు ఆర్డినెన్సులున్ను, మరియొక ఆర్డినెన్సున్నుకూడా ప్రవేశపెట్టబడెను. యూనియన్ ప్రభుత్వమువారు మొదటి రెండుఆర్డినెన్సులను రద్దుచేసి మూడవ ఆర్డినెన్సులో కొన్నిమార్పులను గావించిరి. ఈమూడవది నేటాలులోని చిల్లరవర్తకులు పొందవలసిన లైసెన్సుకు సంబంధించినది (Natal Retail Dealers Licencing Ordinance). ఈఅన్నిసందర్భములలోనూ రీడింగుప్రభుత్వమువారు న్యాయముగానే అర్థముచేసుకొని ప్రవర్తించిరి. రీడింగుప్రభువును దర్శించిన భారతశాసనసభ రాయబారవర్గమువారికి కూడా ఆయన న్యాయమైన ప్రత్యుత్తరము నిచ్చెను. ౧౯౨౧ లో జరిగిన సామ్రాజ్య మహాసభ (Imperial Conference) లో వలసరాష్ట్రములందలి భారతీయులహక్కులను గుర్తిస్తూ చేయబడిన తీర్మానమున కనుకూలముగా ఆ యా ప్రభుత్వములకు సహాయము చేయుటకొరకు భారతదేశమునుండి ఒకరాయబారవర్గమువారు కనడా, న్యూజీ

లాండు, ఆస్ట్రేలియా దేశములకు పోవలెనని సూచింపబడినది. ఈసూచన అధినివేశ ప్రభుత్వములుకూడా అంగీకరించినవి. ౧౯౨౨ మే నెలలో పైనిచెప్పబడిన మూడు అధినివేశరాజ్యములకును ఇండియానుండి గౌ. వి. యస్. శాస్త్రి, జి. యస్. వాజిపాయిగార్లు వెళ్లిరి.

అప్పటికి భారతీయు లనుభవిస్తూన్న చిన్న చిన్న కష్టములు కొన్ని శ్రీనివాస శాస్త్రి తోడ్పాటువలన తొలగింపబడినవి. వాటివివరములతో మన కిప్పుడు ప్రసక్తి లేదు. మన మిప్పు డొక కెన్యానుగూర్చియే ఆలోచింపవలసియున్నది. కెన్యాలోని భారతీయులస్థితి చాలాకాలమునుండి అసంతృప్తికరముగా నుండెను. ఈరాష్ట్రము భారతీయుల పెట్టుబడివలన, వారి శ్రమఫలితముగా చాలా అభివృద్ధిపొందినది. చాలా సందర్భములలో భారతీయులే ఇక్కడ ముందంజ వేసినవారు. వారి జనసంఖ్య యూరోపియనుల జనసంఖ్యకంటె ఎక్కువ.

అక్కడి సిక్కుసిపాయిలనుగూర్చి, భారతీయ వర్తకులను, బ్యాంకర్లనుగూర్చి విన్‌స్టన్‌చర్చిల్ కూడా శ్లాఘించియుండెను. అక్కడిభారతీయులు తెల్లవాళ్లకు పెట్టుబడి పెడుతూండిరి. వారక్కడ మతములనుకూడా స్థాపించుకొనిరి. వారు సంపాదించుకొనిన హక్కులనుండి,వారిని తొలగింపచూచుట కేవలమూ అన్యాయమని చర్చిల్ ప్రతిఘటించిన విషయములను కేంద్రశాసనసభలోని మితవాదిరాజకీయవేత్త లనేకసార్లు ఉదాహరించిరి. ఉగాండారోడ్డుప్రక్కను భారతీయులకు చాలాపొలము లున్నవి. వారక్కడ ప్రత్తి పండించేవారు. కాని తరువాత ఆప్రాంతములలోని మెరకప్రదేశముల యందు భారతీయులు పొలములను సంపాదింపరాదని నిషేధపుటుత్తరువులు జారీ చేయబడినవి. అంకుమూలమున అక్కడిహిందూదేశస్థు లందరును ఆఉత్తరువులను ప్రతిఘటించిరి. యూరప్‌ఖండవాసులకు భారతీయులపైన గల అసహనమునుబట్టి కెన్యాలో భారతీయులను వెలిగా నుంచుటకును, వారికి వోటింగుహక్కులు లేకుండా చేయుటకును, భారతీయు లింకా ఆ దేశమునకువచ్చి ఆక్రమించుకొనకుండా నిషేధించుటకును శాసనములు చేయబడునని వారు భయపడిరి. "భారతదేశమున కధినివేశరాజ్యములతోపాటు సమానప్రతిపత్తి ఉండవలెనని సామ్రాజ్యసభవారు చేసిన తీర్మానము నంగీకరించినట్టి" విన్‌స్టన్ చర్చిలే ౧౯౨౧ లో వలసరాష్ట్రకార్యదర్శిగా వచ్చెను. ౧౯౨౩ ప్రారంభదశలో కెన్యాగవర్నరును సీమకు రావలసినదని వలసరాష్ట్రకార్యాలయమువా రాజ్ఞాపించిరి. ఆప్రకార మాయన కొంతమంది యూరోపియన్ ప్రతినిధులతోను, భారతీయ ప్రతినిధులతోను కెన్యాభారతీయ సమస్యను చర్చించి పరిష్కరించేనిమిత్తము లండనుకు పోయెను. భారతశాసనసభవారుకూడ శ్రీనివాసశాస్త్రి నాయకత్వముక్రింద లండను కొక రాయబారమును బంపిరి. కెన్యాభారతీయ రాయ

భారవర్గమువారు తమకు సలహానిమిత్తము సి. యఫ్. ఆండ్రూస్‌గారిని పిలిపించు కొనిరి. ఈసందర్భములో ఆయన కెన్యాభారతీయులకు చేసిన సహాయమునుగూర్చి ౧౯౨౩ ఏప్రిల్‌లో జరిగిన కాంగ్రెసుకార్యవర్గమువా రాయనకు కృతజ్ఞతను ప్రక టించిరి.

ఈలోగా రోడేషియా, టాంగనాయికా, న్యాసాలాండు, ఉగాండా, కెన్యా రాష్ట్రము లన్నీ కలసి ఒకయూనియన్‌గా చేయబడునని వాడుక పుట్టినది. అందుమూల మున ఆసమస్యను గూర్చి మరింత తొందరగా ఆలోచింపవలసివచ్చినది. ఉగాండా లోని భారతీయుల స్థితి కెన్యా భారతీయ సమస్యా పరిష్కారముపైన ఆధారపడి యుండెను. ఈవలసరాష్ట్రములో కూడ భారతీయులను వెలిగా ఉంచే దురాచారము వ్యాపించుచుండెను. ఉగాండాలోని కంపాలాపట్టణములో యూరోపియనుల నివేశన స్థలములకుమారముగా ఆసియాఖండవాసులనివేశనస్థలము లేర్పాటుచేయబడినవి. ఇండియా ప్రభుత్వమువా రీవిషయములో జేసిన విజ్ఞాపనములు ఫలప్రదములు కాలేదు. ౧౯౨౧లో మిల్నర్ ప్రభువుచేసిన వాగ్దానములనునమ్మి టాంగనాయికాలో భారతీయులు యూరోపి యనుల ఆస్తులను కొనిరి. కాని ఆయనచే వాగ్దానముచేయబడిన సమాన హక్కులను తొలగించుటకు ప్రభుత్వమువారు మూడు ఆర్డినెన్సులను ప్రవేశపెట్టిరి. అవి "ఆర్థికకార ణములవలన" ప్రవేశపెట్టబడిన వని వారి వాదము. అందుకొరకు కొక హరతాళ మే ర్పాటు చేయబడినది. అది ౧౯౨౨ ఏప్రిల్ మధ్యభాగమువరకును కొనసాగింపబడినది. మొదటి తరగతి రైలుబళ్ళలో భారతీయులప్రయాణములనుగూర్చి కొన్ని కఠిన నిబంధన లేర్పాటుచేయబడినవి. కాని తరువాత ప్రభుత్వమువారు వాటి నుపసంహరించు కొనిరి. ౧౯౨౩ ఆగస్టులో కాంగ్రెసువా రీ అన్నివిషయములనుగూర్చి చర్య తీసు కొనిరి. వారి తీర్మాన మీక్రిందనుదాహరింపబడినది. "కెన్యాసమస్యను గూర్చి బ్రిటిష్ ప్రభుత్వమువారు చేసిన నిర్ణయమువలన భారతదేశము సామ్రాజ్యములో సమాన గౌరవస్థానమును పొందుటకు అవకాశము లేదని ధ్రువపడినది. కాబట్టి యీవిషయము భారతప్రజలకు తెలియజేసేనిమిత్తము దేశ మంతటా ఒక ప్రకటనము జరిపింపవలె నని అ. భా. కాం. సం. వారి అభిప్రాయము." తరువాత ఆగస్టు ౨౬ వ తేదీని శాంత మైన హరతాళము జరుగవలెననీ, దేశమంతటా సభలు జరుపబడవలెననీ అ. భా. కాం. సం. వారు నిర్ణయించిరి. బ్రిటిష్ సామ్రాజ్యప్రదర్శనము (British Empire Exhibition) లోనూ, సామ్రాజ్యమహాసభలోనూ, సామ్రాజ్యజయంత్యుత్సవము. (Empire day celebrations) లోనూ, తదితర సామ్రాజ్యోత్సవములలోనూ కూడా భార తీయు లెవరున్నూ జోక్యము కలిగించుకొనకూడ దని అ. భా. కాం. సం. వారు నిర్ణయించిరి.

## ఢిల్లీ ప్రత్యేకకాంగ్రెసు

౧౯౨౩ సెప్టెంబరు మూడవవారములో ఢిల్లీనగరమున ప్రత్యేకకాంగ్రెసు జరిగినది. ఆ కాంగ్రెసు కధ్యక్షత వహించిన మౌలానా అబుల్ కలామ్ అజదు గొప్ప మహమ్మదీయుపదేష్టుడు. ఆయన ఢిల్లీవంగరాష్ట్రములలోని ప్రజలకు చాలా యిష్టుడు, గౌరవనీయుడు. కాంగ్రెసులోని ఇరుకక్షులవారికీకూడ ఆయన నిష్పక్షపాతబుద్ధియందును, మేధావిశేషమునందును సంపూర్ణవిశ్వాసము కలదు. ఆ కాంగ్రెసులో శాసనసభాప్రవేశవాదులు తేలికగా తమ పక్షమును నెగ్గించుకొనిరి. "శాసనసభాప్రవేశమునకు మతసంబంధమైన అభ్యంతరములుగాని, అంతరాత్మ సంబంధమైన అభ్యంతరములుగాని లేనివారందరును శాసనసభల కభ్యర్థులుగా నిలవవచ్చును. వారు రాబోయే ఎన్నికలలో వోటింగుహక్కునుకూడా చలాయించవచ్చును. కాబట్టి శాసనసభాప్రవేశమునకు ప్రతికూలప్రచారమును వెంటనే ఈకాంగ్రెస్ ఆపివేయకోరుతున్నది." అనేతీర్మానము ఢిల్లీప్రత్యేకకాంగ్రెసులో అంగీకరింపబడినది. దీనితోపాటు కాంగ్రెస్ నిర్మాణకార్యక్రమము ద్విగుణీకృతోత్సాహముతో నిర్వర్తింపబడవలెనని కూడా తీర్మానింపబడినది. పండిత రాంభుజదత్తుమరణమునకును, జపానుభూకంపమునకును, నాభామహారాజు రాజ్యభ్రష్టునుగా చేయబడినందుకును, బీహారు, బర్మా, కనడా రాష్ట్రములలో వరదలు వచ్చినందుకును విచారము వెల్లడింపబడినది. శాసనోల్లంఘనమును ప్రారంభించుటకు తగినయేర్పాట్లొనరించుటకొరకు ఒక కమిటీ నియమింపబడినది. జాతీయపమాశ్యాను తయారు చేయుటకును, కాంగ్రెసు నిర్మాణవిధానమును సవరించుటకును కమిటీలేర్పాటుచేయబడినవి. దేశములోని సాంఘికకలహములనుగూర్చి వ్రాయుటలో నిగ్రహము చూపవలెనని పత్రికలు హెచ్చరింపబడినవి. ప్రతి జిల్లాలోనూ వివిధసంఘములలో తటస్థించిన కలహములను రాజీచేయుటకు జిల్లా సంఘములను నియమింపవలెనని ఆకాంగ్రెసు సలహాయిచ్చినది. శిరోమణిగురుద్వారా ప్రబంధకకమిటీవారిచే పంపబడిన విచారణసంఘమువా రరెస్టు చేయబడినప్పటికీ అకాలీలు ధైర్యముగా దౌర్జన్యరాహిత్యమునవలంబించినందులకు వారభినందింపబడిరి. ఖద్దరునే ఉపయోగించి విదేశీబట్టలను బహిష్కరింపవలెనని తీర్మానింపబడినది. భారత పరిశ్రమల నభివృద్ధిపరచి, ముఖ్యముగా బ్రిటిషువస్తువుల బహిష్కరించుటకు తగిన సదుపాయముల నాలోచించేనిమిత్త మొకకమిటీ ఏర్పాటుచేయబడినది. జెండాసత్యాగ్రహమును జయప్రదముగా కొనసాగించినందుకు నాయకులును, వాలంటీర్లును అభినందింపబడిరి. **మౌలానా మహమ్మదాలీ, లాలా లజపతిరాయలు ఖైదునుండి వచ్చినందు కభినందింపబడిరి.**

కెన్యాభారతీయులకు జరిగిన అన్యాయములకు కోపము వెల్లడింపబడినది; హిందూమహమ్మదీయకలహములను నిరోధించుటకున్నూ, శుద్ధి ఉద్యమమునందును, దానికి ప్రతికూలోద్యమమునందును హైర్థన్య ముపయోగింపబడుతూన్న దని తెలియ వచ్చినందున ఆవిషయములనుగూర్చి విచారించుటకున్నూ కమిటీ లేర్పాటుచేయబడి నవి; శాంతిభద్రతలను కాపాడేనిమిత్తము పౌరరక్షకులు నియమింపబడవలెననీ, యువకుల శరీరపరిశ్రమ కవకాశములు కల్పింపబడవలెననీ నిర్ణయింపబడినది.

ఢిల్లీలో కాంగ్రెసు నూతనపంథా తొక్కినది. గయలోవచ్చిన తిరుగుబాటు ఢిల్లీలో ఫలప్రదమైనది. ఢిల్లీతీర్మానములనుబట్టి కాంగ్రెసునాయకుల వ్యక్తిత్వమే మారి పోయినట్లు స్పష్టపడగలదు. ఆకాంగ్రెసులో 26 కమిటీలు నియమింపబడుటనుబట్టియే కాంగ్రెసునాయకులు విశ్రాంతికోరుతూండి రనేవిషయము బోధపడగలదు. శాసనసభా ప్రవేశతీర్మానముతో ప్రారంభమైన ఢిల్లీకాంగ్రెసు పౌరరక్షకశరీరపరిశ్రమలకు సంబం ధించిన తీర్మానముతో అంత మొందినది. శాసనసభాతీర్మానములో ఇష్ట మైన వారు శాసనసభలో ప్రవేశింపవచ్చునని ఉన్నప్పటికీ అందుకు ప్రతికూలముగా నున్న వారి అభిప్రాయముకూడా మన్నింపబడవలెననే సూచన ఆతీర్మానములో లేకపో లేదు. కాని రాబోయే యెన్నికలలో జోక్యము కల్పించుకొనగోరేవారి మార్గము మాత్రము స్పష్టముగానే గోచర మవుతూన్నది. కాంగ్రెసుకార్యక్రమమునుగూర్చి మొదటిపర్యాయము కాంగ్రెసువాదులలో భేదాభిప్రాయము లేర్పడినవి. ఆకార్య క్రమముయొక్క ఆచరణవిధానములోకూడా అనేకభేదములు కలవు. స్వరాజ్యపక్షము వారి సిద్ధాంతములును, కార్యవిధానమును వారిప్రకటనలో వ్యక్తీకరింపబడినది. ఆప్రక టనము IV ఎ. అనుబంధములో నుదాహరింపబడినది.

ప్రతిసంవత్సరమూ జరిగే మామూలుకాంగ్రెసు తరువాత కాకినాడలో జరుపబడవలసియున్నది. అప్పటికి శాసనసభల ఎన్నికలు పూర్తికావలసి యుండెను. అయినప్పటికీ ఢిల్లీలో అంగీకరింపబడిన తీర్మానమును కాకినాడలో రద్దుచేయించి, పూర్వపు సహాయనిరాకరణసిద్ధాంతమును నిలబెట్టవలె నని కొంతమంది నోఛేంజ ర్లింకనూ ఆశపెట్టుకొని యుండిరి. కాకినాడకాంగ్రెసుకు మౌలానామహమ్మదాలీ అధ్య క్షుడుగా ఎన్నుకొనబడెను. మహాత్మాగాంధీకూడ శాసనసభాప్రవేశమున కభ్యంతర పెట్టడని ఒకపక్షీ తనచెవిలో చెప్పుతూన్నట్లు ఢిల్లీలోనే ఆయన సరసముగా చెప్పెను. దానిని నిజమని నమ్మినవారుకూడా కొంద రుండిరి. ఖయిదులోనుండి విడుదలచేయ బడిన మహమ్మదాలీకి గాంధీమహాత్ముడు దేవదాసుగాంధీద్వారా పంపినసందేశ మీ వాదుకకు మూలము. "నేను ఖయిదులోనున్నాను కాబట్టి నీకు సందేశమును పంపజాలను. ఖయిదునుండి సందేశములను పంపుపద్ధతిని నే నంగీకరింపను. నీకు నాయందుగల

విశ్వాసముచే నాహృదయము ద్రవీభూతమవుతూన్నది. కాని నీకు నాయందుగల ప్రేమ వలన నీదేశభక్తి కొరవడకూడదు. నా అభిప్రాయము లందరికీ తెలిసినవే. నేను జైలుకు పోయేముందు వాటిని వివరించియేయున్నాను. అప్పటినుండీ నా అభిప్రాయములేమీ మారలేదు. నీవు నాతో ఏకీభవించకపోయినప్పటికీ నీయందు నాకుగల ప్రేమ కించి త్తయినను కొరవడదు." అని పంపబడిన ఈసందేశములో శాసనసభాప్రవేశమును గాంధీ అంగీకరించిన క్లిష్టపదమైనా స్ఫురిస్తూన్నదా? అయినప్పటికీ మహమ్మదాలీ కాంగ్రెసు లోని ఉభయకక్షులకును రాజీకుదర్చవలెనని ఆత్రపడినాడు. ఖిలాఫత్ సభ కధ్యక్షత వహించిన షౌకతాలీకూడా అలాగే ఉన్నాడు. వయోవృద్ధురాలైన వారితల్లి కూడ కాంగ్రెసుమహాసభలో ఐకమత్యముగా నుండవలెనని ప్రబోధించెను. కాని కాకినాడలో ఉభయకక్షులవారికిని మంచి పోరాటము జరిగినది. కొంతమంది సుప్రసిద్ధనోఛేంజర్లు కాంగ్రెసుకు రాలేదు. రాజేంద్రబాబు అనారోగ్యముగా నుండుటచే కాకినాడ రాలేదు. రాజగోపాలాచారి ఢిల్లీ తీర్మానమున కనుకూలముగా నుండెను. వల్లభాయిపటేలు కాకినాడసభకు హాజరయ్యెను. కాని ఆయన ఢిల్లీతీర్మానమున కిచ్చిన అంగీకారము హృదయపూర్వకమైనది కాదు. ఆయన ఢిల్లీలో బలవంతముగా అంగీకరించెను. శ్యామ సుందరచక్రవర్తి సంవత్సరములతరబడి ప్రవాసమున్నూ, కారాగృహవాసమున్నూ అనుభవించెను. రాజకీయోద్యమఫలితముగా ఆయన ఏండ్లకాలదీ పేదరికమునకును, దుఃఖమునకును పాల్పడెను. ఆ దేశభక్తుడు శాసనసభాప్రవేశమునకు ప్రతికూలముగా మాట్లాడి, కాకినాడకాంగ్రెసులోని సభాసదులకు కళ్లనీళ్లు తెప్పించెను. కాని ఏమి ప్రయోజనము? శాసనసభాబహిష్కారమున కింక తావులేదు. ఆనాటి ప్రధానతీర్మాన మీక్రింద నుదాహరింపబడినది.

" కలకత్తా, నాగపురము, అహమ్మదాబాదు, గయా, ఢిల్లీకాంగ్రెసులలో అంగీకరింపబడిన అసహాయోద్యమతీర్మానము నీకాంగ్రెసుకూడా ఆమోదిస్తూన్నది.

" శాసనసభాప్రవేశముతో జోడించి చేయబడిన ఢిల్లీకాంగ్రెసులోని అసహా యోద్యమతీర్మానమునుగూర్చి కాంగ్రెసుకార్యక్రమములో మార్పుకలిగినట్లుగా కొం దరికి సందేహము కలుగుతూన్నది. కాబట్టి ఈ కాంగ్రెసు బహిష్కారసిద్ధాంతములో మార్పేమీ లేదని తిరిగీ ప్రకటిస్తూన్నది.

" నిర్మాణకార్యక్రమమున కీపైనచెప్పబడిన సిద్ధాంతములే మూలాధారము లని భావిస్తూ, బార్డోలీలో అంగీకరింపబడిన నిర్మాణకార్యక్రమమును కొనసాగించి, దేశ మును శాసనోల్లంఘనమునకు సంసిద్ధపరచవలె నని భారతజాతిని ఈ కాంగ్రెసు కోరు తూన్నది. ప్రతిరాష్ట్రకాంగ్రెసుసంఘమును ఇందుకు తగిన చర్యల నవలంబించి మన

ఆదర్శమును త్వరగా పొందుటకు వీలు కలుగచేయవలెననికూడా ఈకాంగ్రెసు ఆజ్ఞాపిస్తున్నది.

కాకినాడకాంగ్రెసు అనేక కారణములచే సుప్రసిద్ధమైనదిగా పరిగణింపబడవలసియున్నది. అంతకుపూర్వము జరిగిన కాంగ్రెసులన్నిటిలోకి అది ఎక్కువ శోభాయమానముగా జరిగినది. మంచిగోష్ఠులు వేయుబడినవి. కాంగ్రెసుకు శాశ్వతసాస్తిగా నుండతగిన డేరా తయారుచేయబడినది. అధ్యక్షునకును, ప్రధాననాయకులకును ప్రత్యేకమందిరములు సుందరముగా నిర్మింపబడినవి. ప్రతినిధుల సౌకర్యముకొరకన్ని యేర్పాట్లును చక్కగా చేయబడినవి. వీటన్నిటికి తగినట్లుగా ప్రకృతికూడ శీతోష్ణస్థితి బాగున్నది. శాసనసభలబయటనే గాక లోపలకూడా అసహాయవాదము నవలంబింపవచ్చునని సహాయనిరాకరణసిద్ధాంతమునకు వ్యాఖ్యానముచేయబడెను. ఎందువల్ల కాకపోయినను ఇందువల్లనైనా కాకినాడకాంగ్రెసు స్మరణీయముగా నుండతగినదని చెప్పవచ్చును. దాదాభాయివలె వయోవృద్ధుడై, స్వర్గస్థుడైన జాతీయవిజ్ఞానమూర్తి యస్. కస్తూరి రంగయ్యంగారిమరణమునకు, భారతదేశమునకు, ముఖ్యముగా వంగరాష్ట్రమునకు ప్రేమాస్పదుడున్ను, గౌరవపాత్రుడున్ను అయిన అశ్వినీకుమారదత్తుమృతికిని కాకినాడకాంగ్రెసు దుఃఖమును ప్రకటించి, విషాదకరమైన ధర్మమును నిర్వర్తించినది. దామోదరవినాయకసావర్కారునిరంతరనిర్బంధ మాకాంగ్రెసుచే నిరసింపబడినది. దేశబంధుదాసు తయారుచేసిన "వంగరాష్ట్రసమాఖ్య" తోపాటు జాతీయసమాఖ్యకూడా విమర్శనార్థము ప్రచురింపబడినది. అఖిలభారత స్వచ్ఛందసైనికదళము నిర్మింపబడుటకు కాంగ్రె సంగీకరించినది. పౌరరక్షకసైన్యము తరువాత అఖిలభారతవాలంటీరుదళములో లీనమైపోయినది.

కాంగ్రెసులో ప్రత్యేకడిపార్టుమెంటుల నిర్మాణమునుగూర్చి, వాటిలో వేతనముపైన పనిచేయుటకు జాతీయసేవకులను నియమించుటనుగూర్చి ప్రణాళికలను తయారుచేయ తీర్మానింపబడెను. కెన్యావ్యవహారములు భారతజాతీయమహాసభయొక్క సంపూర్ణసానుభూతిని పొందగలిగినవి. సరోజినీదేవి, జార్జిజోసెఫులు కెన్యాభారతీయకాంగ్రెసుకు ప్రతినిధులుగా పంపబడిరి.

ఢిల్లీలో నియమింపబడిన శాసనోల్లంఘనకమిటీవారున్ను, సత్యాగ్రహకమిటీవారున్ను కార్యవర్గసభ్యులుగా నెన్నుకొనబడిరి. ఖద్దరుకార్యక్రమమును నడిపించుట కొరకు అ. భా. ఖద్దరుబోర్డు నియమింపబడినది. భారతదేశమునుండి విదేశములకు వలసపోవుపద్ధతి ఆపివేయబడవలెనని సలహా యీయబడినది. సింహళమునకు వలసపోయిన భారతీయకూలీలస్థితిని పరీక్షించుట కొరకు కమిటీ యేర్పాటు చేయబడినది.

కాంగ్రెసునిర్మాణవిధానమునం దనేకసవరణలు చేయబడినవి. శిరోమణిగురుద్వారా ప్రబంధకకమిటీవారి అకాలీదళముపై ప్రభుత్వమువారు దౌర్జన్యము చేసినందుకు కాంగ్రెసు సిక్కులకు కావలసిన ధనమును, మనుష్యులను సమకూర్చి సహాయముచేయ తీర్మానించినది.

ఈసందర్భములో సిక్కు మతసంస్కరణోద్యమమునుగూర్చి కొంతవివరించుట న్యాయము. నల్లతలపాగాలతోను, 'సత్ శ్రీఅకాల్' అనే సంకీర్తనములతోను, లంగర్ ఖానాల (అన్నసత్రముల)తోను ప్రతికాంగ్రెసుకును తయారవుతూన్న అకాలీ సిక్కులను కాంగ్రెసుప్రతినిధు లందరును చూచియే ఉందురు. దేశము విదేశీయుల హస్తగతమైనప్పుడు వారు దేశములోని అన్ని సంస్థలపైనను అధికారము చలాయించ పూనుకొనుట సత్యము. ఆర్థిక, విద్యా, మతసంస్థలుకూడా వారి అధికారమునకు వెలిగానుండజాలవు బ్రిటిష్‌వారు ౧౮౪౯ లో పాంచాలరాష్ట్రమును కలుపుకొనిరి. పాతప్రభుత్వము పోయి నూతనప్రభుత్వము స్థాపింపబడే మధ్యకాలములో సిక్కుమతమునకు కేంద్రమయిన అమృతసరపు సువర్ణదేవాలయవ్యవహారములు చిక్కులలోకి వచ్చినవి. సిక్కుమతములో కొత్తగా లిసిన కొంతమంది ఆదేవాలయమున కప్పుడు ట్రస్టీలుగా నియమింపబడిరి. గవర్నమెంటుఉద్యోగస్థు డొకడు పైన తనిఖీచేయుట కేర్పాటుచేయబడెను. ఆదేవాలయమున కేటేటా వస్తూన్న లక్షలకొలదీ ఆదాయమును సరిగా వ్యయముచేయుటకొక మానేజరుండెను కొంతకాలమున కాయనే సర్వాధికారి యయ్యెను. అందువలన ౧౮౮౧ లో దేవాలయకమిటీనియామకము విరమింపబడినది. పైతనిఖీ లేకపోవుటవలన మానేజరు బాధ్యతారహితముగా ప్రవర్తింప ప్రారంభించెను. దేవాలయద్రవ్యములు దుర్వ్యయము చేయబడినవి. ఒకప్రక్క సిక్కు పీఠాధిపతులును మానేజరున్నూ, మరొకప్రక్క సిక్కుప్రజలున్నూ తగాదాపడ ప్రారంభించిరి. మధ్య ప్రభుత్వమువారి కేమిచేయుటకును తోచక తెల్లపోదొడగిరి. చిట్టచివరకు ౧౯౨౦ లో సర్దారు సుందరసింగు మజీదియా అధ్యక్షతక్రింద ఒకకమిటీ యేర్పాటు చేయబడినది. అదే శిరోమణిగురుద్వారా ప్రబంధకకమిటీగా పరిణమించినది. సర్దారు సుందరసింగు తరువాత కొద్దికాలమునకే పాంచాలప్రభుత్వములో కార్యనిర్వాహకసభ్యు డయ్యెను. సిక్కులలోని సంఘసంస్కర్తలకు అకాలీ లని పేరు. వా రనేక చరిత్ర ప్రసిద్ధములయిన గురుద్వారములను స్వాధీనముచేసుకొనగలిగిరి. తారాతరన్ గురుద్వారములో కొట్లాటలు జరుగగా అనేకమందిసిక్కులకు గాయములుతగిలి యిద్దరు మరణించిరి. ౧౯౨౧ లో జరిగిన నాన్కానా గురుద్వారా దురంతమునుగూర్చి యిదివరకే వివరించియుంటిమి. సిక్కుసంస్కరణవాదులు గురుద్వారాల ఐశ్వర్యమును, అధికారమును స్వాధీనపరచుకొనవలె నని ప్రయత్నిస్తూన్నట్లుగా ఈ ఉద్యమమును

గూర్చి పోలీసువారు వ్యాఖ్యానముచేసిరి. అందుమూలమున గురుద్వారా మహంతులకు మరింతప్రోత్సాహము కలిగినది. అంతకుపూర్వము అకాలీలతో రాజీనామాచేసుకొన్న వారుకూడా దానిని తృణీకరించి నిరంకుశముగా ప్రవర్తింపసాగిరి. ప్రభుత్వమువారు సైతము సంస్కరణవాదులగు సిక్కులపైన ధ్వజమెత్తి తీవ్రనిర్బంధవిధానమునకు కడంగిరి. ౧౯౨౧ మే నెలలో వందలకొలదీసిక్కులు ఖయిదులకు పంపబడిరి. ప్రజలచే నిరసింపబడిన మహంతుల అధికారము పునరుద్ధరింపబడినది. కాబట్టి శిరోమణిగురుద్వారా ప్రబంధకకమిటీవారు సిక్కుదేవాలయ సంస్కరణకు సంబంధించినంతవరకు ప్రభుత్వమువారితో సహాయనిరాకరణ మవలంబించుటకు నిర్ణయించుకొనిరి.

ప్రభుత్వమువారు తలపెట్టిన గురుద్వారాబిల్లునకు మితవాదులును, ప్రభుత్వ సహాయకులునుకూడా ప్రతికూలముగా నుండుటచే అది విరమింపబడినది. పొడుగైన కృపాణములను ధరించినందుకు సిక్కులపై కేసులుపెట్టబడెను. ౧౯౨౧ జులై ౧౦ వ తేదీని ప్రభుత్వమువారి ఈనిర్బంధవిధానమును ప్రతిఘటిస్తూ పాంచాలరాష్ట్రీయ కాంగ్రెసుసంఘము తీర్మానించినది. ఆ నెలాఖరుకు ఖయిదుచేయబడిన సిక్కులు విడుదలచేయబడిరి. భాయీకర్తారుసింగుకు ౧౫ ఏండ్లును, భాయీరాజాసింగుకు ౭ ఏండ్లును కఠినశిక్షలు విధింపబడినవి. ౧౯౨౧ ఆగస్టు ౨౫ వ తేదీని శాసనసభలలోని సిక్కుసభ్యులు రాజీనామా యీయవలెనని కోరబడిరి. గురుద్వారాఉద్యమమునెడల ప్రభుత్వమువా రవలంబించిన విధానమును ప్రతిఘటిస్తూ పాంచాలశాసనసభ ఉపాధ్యక్షుడున్నూ, ప్రభుత్వమువారి అడ్వొకేటున్నూ అయిన సర్దార్ బహదూర్ సర్దారు మెహతబ్ సింగు తన రెండుపదవులకును రాజీనామా యిచ్చెను.

పైనచెప్పబడిన ఇద్దరు దీర్ఘకాలపుఖైదీలున్నూ, ఇంకా అనేకమందిన్నీ ౧౯౨౧ సెప్టెంబరు ప్రారంభములో విడుదలచేయబడిరి. కాని ౧౯౨౧ జూన్ నెలలో ౧౨౪ ఎ.-ఎ. పి. సి. క్రింద ౫ సంవత్సరములు కఠినఖైదు విధింపబడిన పాంచాలరాష్ట్రీయ కాంగ్రెసు జనరల్ కార్యదర్శికి సర్దార్ శార్దూల్ సింగ్ కావీషారున్నూ, ఇంకా కొంత మంది గురుద్వారా ప్రచారకులున్నూ విడుదలచేయబడలేదు. ౧౯౨౧ నవంబరు ౭ వ తేదీని సువర్ణదేవాలయముయొక్క తోషేఖానాతాళపుచెవు లాకస్మికముగా ప్రభుత్వమువారు లాగుకొనిపోయిరి. ఇందుమూలమున శ్రీ గురునానక్ దేవుని జన్మదినోత్సవ సందర్భమున అలంకారముచేయుటకు వీలైనదికాదు. ప్రభుత్వమువారు తాత్కాలికముగా ఒక మేనేజరును నియమించిరి. కాని శిరోమణిగురుద్వారాప్రబంధకకమిటీ (శి. గు. ప్ర. క.) వారిమూలమున ఆయన గురుద్వారమును స్వాధీనపరచుకొనవీలులేక పోయినది. అంతట ఆయన రాజీనామానిచ్చెను. అప్పటినుండీ ప్రభుత్వమువారు తీసుకొనిపోయిన తాళపుచెవులనుగూర్చి తీవ్రాందోళనము చెలరేగినది. బహిరంగసభలలో

గవర్నమెంటువారిచర్య ప్రతిఘటింపబడినది. ప్రభుత్వమువారు రాజద్రోహసభాశాసనము నములులోపెట్టిరి. ౧౯౨౧ నవంబరు ౨౬ వ తేదీని సర్దార్ ఖారకసింగ్, మెహాతబ్‌సింగులకు కఠినశిక్షలు విధింపబడెను. ౧౯౨౨ జనవరి ౫ వ తేదీ గురుగోవిందసింగు పుట్టినరోజు. ప్రభుత్వమువారు తాము సివిల్‌కోర్టులో దాఖలుచేసిన దావాను గూర్చి చెప్పబడేతీర్పునకు లోబడి శి. గు. ప్ర. క. వారికి తాళపుచెవు లీయ వాగ్దానము చేసిరి. కాని వారు తీసుకొన నిరాకరించిరి. రెండువందలమంది సిక్కు ప్రచారకుల నరెస్టుచేసినపిమ్మట ప్రభుత్వమువారు తమపద్ధతిని మార్చుకొని అందరినీ ఏవిధమైనషరతులూ లేకుండా విడిచిపెట్టిరి. తాళపుచెవులు ౧౭-౧-౨౨ న తిరిగీ ఇచ్చివేయబడెను. పండిత దిననాధుని నిరంతరనిర్బంధము నూతనాందోళనకు కారణభూతమైనది. రాజద్రోహసభాశాసనముక్రింద శాసనోల్లంఘనము ప్రారంభింపబడినది. ౧౯౨౨ ఫిబ్రవరి ౯ వ తేదీని శి. గు. ప్ర. క. యొక్క కార్యనిర్వాహకసభ్యులందరును రాజద్రోహసభాశాసనముక్రింద ఉపన్యసించి శాసనోల్లంఘనము కావించిరి. అప్పుడు దిననాధుడున్నూ, కోమగాటమారు సందర్భమున ప్రసిద్ధివహించిన బాబా గురుదత్ సింగున్నూ విడుదలచేయబడిరి. శి. గు. ప్ర. క. రాజకీయసంస్థ కాదు. కాని సిక్కుసంఘమువంటి చిన్నసంఘములో రాజకీయవేత్తలు, సంఘసంస్కర్తలు, మతసంస్కరణాదులు ఈ అందరూ కలసిపోవుట ప్రకృతిసిద్ధము. ప్రభుత్వమువారుకూడా యీవిభేదమును పాటించుటకు వీలులేనట్లు ప్రవర్తింతురు. జనరల్ డయ్యరుచేసిన హత్యలను కప్పిపుచ్చుటకు దర్బారుసాహేబ్‌యొక్క మతప్రతిష్ఠ ప్రభుత్వమువారిచే ఉపయోగించుకొనబడెను. దర్బారుసాహేబు సువర్ణదేవాలయముయొక్క పాలనాధికారిచేత డయ్యరు సేనానికి రాజలాంఛనము లగు దుస్తులు బహుమతిచేయబడినవి. ఫిన్‌లే ప్రభువు పార్లమెంటులో పంజాబుదురంతములనుగూర్చి ప్రసంగిస్తూ డయ్యరును సిక్కుగా చేసి, సిక్కులు డయ్యర్ సేనానిచర్య నామోదించి రని ఉపన్యసించెను. తరువాత ఆసువర్ణదేవాలయములోని ఆపరిపాలనాధికారియే బజ్‌బజ్‌లో ప్రాణము లర్పించినవారు సిక్కులు కారని ప్రకటించెను. మహాసంగ్రామసమయములో ప్రభుత్వమువారు సువర్ణదేవాలయనిధులనుండి రు. ౫౦,౦౦౦ ల యుద్ధఋణము గ్రహించిరి.

అకాలీలు నల్లతలపాగాలను ధరింతురు. ౧౯౨౨ మార్చి రెండవవారముమొదలుకొని అకాలీలు అధికసంఖ్యాకులుగా అరెస్టుచేయబడిరి. పాంచాలరాష్ట్రములోని పదమూడు జిల్లాలలోనూ, సిక్కురాష్ట్రములైన పాటియాలా, కపుర్‌తలారాజ్యములలోనూ ఒకపక్షముదినములలో ౧౭౦౦ మంది నల్లపాగాసిక్కు లరెస్టుచేయబడిరి. శి. గు. ప్ర. కమిటీకిన్నీ, పాంచాలరాష్ట్రకాంగ్రెసు సంఘమునకున్నూ అధ్యక్షుడైన సర్దార్ ఖారక్‌సింగుకు ౪ సంవత్సరములు కఠినశిక్ష విధింపబడినది. ౧౯౨౨ మార్చి ప్రథమ

శాలలో కృపాణము లనగా కత్తులు కాబట్టి వాటిని తయారుచేయుటకు లైసెన్సులు కావలెనని ప్రభుత్వమువారు ఉత్తరువులు జారీచేసిరి. కృపాణములను ధరించేపద్ధతి ప్రభుత్వమువారిచే నిర్ణయింపబడెను. సైనికోద్యోగములలోనున్న సిక్కులు వాటిని ధరించినందుకు నాలుగు మొదలు పదునెనిమిది సంవత్సరములవరకును వారికి కఠినశిక్షలు విధింపబడినవి. కోమగాటుమారుసందర్భమున శిక్షింపబడిన బాబాగురుదత్తసింగు తిరిగీ అరెస్టుచేయబడి ౧౯౨౨ జూలైలో ఐదుసంవత్సరములు ద్వీపాంతరవాసశిక్షకు పాత్రుడయ్యెను. రౌలట్ చట్టమునకు వ్యతిరేకముగా ఆందోళనచేసిన మాస్టరు మోతాసింగు కెనిమిదిసంవత్సరములు కఠినశిక్ష విధింపబడెను.

ఆరోజులలో క్రిమినల్ లా సవరణచట్టము రాజ్యముచేసినది. జామీను సెక్షను లా చట్టమునకు సహాయపడినవి. ఒక నాయకుడు నాటి నిర్బంధములనుగూర్చి "పోలీసు వారు ప్రభువులు. వారి దయవచ్చినట్లు వారు ప్రవర్తించిరి" అని వ్రాసెను. మాళవ్యా పండితుడు పాంచాలమును దర్శించి, దివాన్ బహదూర్ రాజా నరేంద్రనాధుని అధ్యక్షత క్రింద ఒకవిచారణసంఘమును నియమింపజేసెను. వారు "అధికారుల దురాగతములను, అన్యాయములను, ఘోరకృత్యములను విచారించుటకొరకు" నియమింపబడిరి. ౧౯౨౨ మే ౧౮ వ తేదీని పాంచాలప్రభుత్వమువారు సంఘసంస్కర్తలను హెచ్చరిస్తూ ఒకప్రకటనమును గావించిరి. అందులో "మతసంస్కరణముతో సంబంధములేని చెడ్డప్రవర్తన గలవారితో సంస్కరణవాదు లెవ్వరును జోక్యము కల్పించుకొనరా"దని హెచ్చరికచేయబడినది. ఈవ్రాత కాంగ్రెసువాదులను గురించియే అని వేరుగా చెప్పనవసరము లేదు. మొత్తముమీద ౧౯౨౨ జూన్ ౧౫ వ తేదీ నాటికి ౧౯౦౦ మంది మొదలు ౨౦౦౦ సిక్కులవరకును అరెస్టుచేయబడిరి.

తరువాత ౧౯౨౨ వ సం. లో గురుకాబాగు సంఘటనము జరిగినది. ఈ సందర్భములో "తుపాకిగుండ్లకెదురుగా నిలచుటకంటె లాఠీదెబ్బలు తినుట కష్టతరమనీ, వాటిని దౌర్జన్యరహితముగా భరించినవారు సిక్కుల గౌరవమునకు పాత్రులు కాగలరనీ" గాంధీజీ చెప్పినమాటలను సిక్కులు ఋజువు చేయగలిగిరి. గురుకాబాగు సందర్భమున పోలీసువారు చేసిన దుండగములనుగూర్చి పాంచాలప్రభుత్వములోని యూరపియను సభ్యుడు విచారించెను. ఆసత్యాగ్రహితీవ్రతనుగూర్చి రివరెండు ఆండ్రూసు "ఇటువంటి జాలికరమైన దృశ్యమును నే నిదివర కెన్నడును చూడలేదు. ఈ సందర్భమున అహింస సంపూర్ణవిజయమును పొందినది. గురుకాబాగుచుట్టూను ఇనపతీగెల కంచె వేయబడినది. కంచెలోపలి కేవిధమైన ఆహారపదార్థములునూ పోవీలులేదు. ఎవరైనా అట్టివి తీసుకొనిపోయెడల వారిని పోలీసువారు చావబాదిరి. నేను నా

మోటారుకారును గురుద్వారా గేటుకడకు పోనిచ్చేసరికి నా కారు పరిశోధింపబడినది" అని చెప్పెను.

దెబ్బలుతిన్న సిక్కుల కుపచారముచేసినందు కొక స్త్రీ గాయము పొందవలసి వచ్చెను; మరియొకరికి గుఱ్ఱపుడెక్కలమచ్చబడ్డది; ఇద్దరు చచ్చిపోయిరి. ఈనేరములకు కారణభూతులని చెప్పబడినవారిపైన ప్రభుత్వమువారు కేసుపెట్టగా కోర్టులో వారు విడుదలచేయబడిరి. గురుకాబాగును చూడవచ్చినవారుకూడ పోలీసువారి నిర్బంధములకు పాల్పడిరి. పోలీసువారు దొంగతనములు, బందిపోట్లు, దారిదోపిడీలు జరిగించినట్లుగా పత్రికలలో నిందారోపణము చేయబడినది. పోలీసుసూపరింటెండెంటు మాక్‌ఫర్‌సన్ లాఠీఛార్జినిగూర్చి ఒక పుస్తకము వ్రాసెను. "కొంతమందికి బొమికలు విరుగుటాదిగాగల ప్రమాదములు జరిగియుండవచ్చును. అకాలీదళములు కేవలము దౌర్జన్యరాహిత్యము నవలంబించుటచే వారు పోలీసువారి నెదిరించలేదు. కొంతమంది స్మృతితప్పి పడిపోయికూడా ఉండవచ్చును" అని వ్రాయబడిన ఆపుస్తకములోని మాటలనుబట్టియే అక్కడి లాఠీ ప్రయోగముయొక్క తీవ్రత బోధపడగలదు. గాయములు తగిలిన కేసుల జాబితా ఆపుస్తకములో నుదాహరింపబడెను. అందులో ౯౫౩ మందికి తీవ్రమయిన గాయములు తగిలినట్లుగా లెక్కవేయబడినది. ఈసందర్భములో ౨౧౦ మంది అరెస్టు చేయబడిరి. ఒక్క ఆనరరీమేజిస్ట్రేటు నాలుగు వాయిదాలలో ౧,౨౬,౦౦౦ రూపాయల జరిమానాలను విధించెను. శ్రద్ధానందస్వామికి ౧౮ నెలల శిక్ష విధింపబడెను. అక్టోబరు ౨౨ వ తేదీని పింఛను తీసికొన్న ౧౦౧ మంది సిపాయీలొకదళముగా నేర్పడి మిలిటరీబ్యాండుతో అమృతసరమునుండి గురుకాబాగుకు పోయిరి. వారిలో ౫౫ మంది సైనికోన్నతోద్యోగులుగానుండి పింఛను తీసుకొన్నవారుకూడా కలరు. వారివెంట ౫౦ వేలమంది ప్రజలు గురుకాబాగు సత్యాగ్రహప్రదేశమునకు నడచిరి. ఈ సైనికదళమువారిని శిక్షించి ప్రభుత్వమువారు రైలులో తీసికొనిపోతూండగా పంజాసాహెబు గురుకులము దగ్గర చాలామంది ప్రజలు వారికొరకు కాహారపదార్థములను తెచ్చి సిద్ధముగా నిలిచియుండిరి. రైలాగదని వారికి తెలియవచ్చినంతనే వారు రైలుపట్టాల కడ్డముగా పరుండిరి. రైలాగలేదు. ఇద్దరు చనిపోయిరి; ౧౦ మందికి గాయములు తగిలినవి. కొంతకాలమయినతరువాత పోలీసువారు ప్రజలను కొట్టుట మానివేసి అరెస్టులను ప్రారంభించిరి. ముఖ్యనాయకులు కఠినముగా శిక్షింపబడిరి. కాని జరుగవలసిన దింకను పూర్తికాలేదు. ప్రజాందోళన మెక్కుడై, పంజాబుశాసనసభలో ౧౯౨౩ మార్చి ౭ వ తేదీని తీర్మానము ప్రవేశపెట్టబడగా అకాలీదళము లొకటివెంట నొకటి విడిచిపెట్టబడెను. రావల్పిండినుండి ౧౬౦ మంది అకాలీలుగల ఒకదళము విడుదల చేయబడినది. వారు రైల్వేస్టేషనునుండి ప్రభుత్వమువారిచే నియమింపబడినత్రోవను-

పోలేదనే కారణముతో సిపాయిలు, పోలీసువారు, అశ్వికులును కలసి వారిని చెదర గొట్టుటకు చావమోదిరి. ౧౨౭ మందికి తీవ్రమయిన గాయములు తగిలినవి. రావల్పిండి పట్టణము వారికి సానుభూతి చూపిస్తూ సంపూర్ణహరతాళము కావించినది. ఈవిషయమునుగూర్చి పంజాబుశాసనసభలో విచారణ చేయించవలెనదని ప్రభుత్వమువారిని కోరగా పాంచాలప్రభుత్వప్రధాన కార్యదర్శి "జరిగిన దేదో జరిగినది. గురుకాబాగు విషాదసంఘటనములను సాధ్యమైనంత తొందరలో మనము విస్మరింతుముకాక. హంటరు కమిటీవారు పాతగాయములను రేపినట్లుగా మరొకకమిటీని నియమించి గురుకాబాగుగాయమును మేము రేపతలపెట్టము" అని ప్రత్యుత్తరమిచ్చెను. ఒకనిని తన్ని సాధ్యమయినంత తొందరలో ఆతన్నను మరచిపోవలెనదని చెప్పుట రాజకీయచాతుర్యమూ కాదు; ఔదార్యమూ కాదు. అయినప్పటికీ పాంచాలశాసనసభలోని అధికసంఖ్యాకసభ్యులు ప్రభుత్వకార్యదర్శియిచ్చిన యీ ప్రత్యుత్తరమునకు సంతృప్తిపడి కే. రల్లియారామ్‌చే ప్రతిపాదింపబడిన తీర్మానమును చర్చింపక విరమించిరి. ఇంతటితో అకాలీల కష్టములు గట్టెక్కలేదు. ౧౯౨౨ లో కూడ వారికి కొన్ని చిక్కులు తటస్థించినవి. మనమిప్పుడు ౧౯౨౩ లోనే ఉన్నప్పటికీ కథాసందర్భమునుబట్టి అవికూడ యిక్కడనే ఉదాహరింపబడుతూన్నవి. ౧౯౨౩ మధ్యభాగమున నాభామహారాజు 'సింహాసనమును విడిచిపెట్టెను' కాని ఆయన సింహాసనమునుండి తొలగింపబడెనని శి. గు. ప్ర. కమిటీవారిచే వ్యాఖ్యానము చేయబడినది. వారాయనను తిరిగీ సింహాసనమెక్కించుట కాందోళన ప్రారంభించిరి. నాభారాజ్యములోని జైటోయందును, తదితర ప్రదేశములయందును అందుకొరకు సభ లేర్పాటుచేయబడినవి. వాటిలో చేయబడిన ఉపన్యాసములు రాజద్రోహకరములుగా భావింపబడి ఉపన్యాసకులు 'అఖండపాంతు' చదువుతూండగా అరెస్టు చేయబడిరి.

తరువాత నాభారాజ్యములోని జైటోలో 'అఖండపాంతు' సత్యాగ్రహము ప్రారంభింపబడినది. కొంతికాలమువరకును ప్రతిరోజు ౨౫ మందితోగూడిన ముఠాలు 'అఖండపాంతు' చదువుటకు పంపించబడినవి. తరువాత ఫిబ్రవరి నెలలో ౫౦౦ మందితో గూడిన 'షాహిదీ'దళము పంపబడినది. డాక్టరు కిచ్లూ, ఆచార్య గిద్వానీలు ఈ దళముతో ప్రేక్షకులుగా వెళ్లిరి. జైటోకడ ఆదళముపైన తుపాకులు కాల్చబడెను. కొందరు మరణించిరి. గాయపడినవారి కుపచారములుచేయ ప్రయత్నించిన కిచ్లూ గిద్వానీలను నాభాప్రభుత్వాధికారు లరెస్టు చేసిరి. కొద్దిరోజులలో కిచ్లూను వదలిపెట్టిరి. కాని గిద్వానీనిమాత్ర మాసంవత్సరాంతము వరకునూ జైలునం దుంచిరి. షాహిదీ దళములు పోతూనేఉండెను; అరెస్టుచేయబడుతూనూ ఉండెను. వేలకొలది అకాలీలు జైళ్లలో పెట్టబడిరి. జైలధికారులు వారియెడ చెడుగా ప్రవర్తించిరనికూడ తెలియ

వచ్చెను. అకాలీ సహాయక సంఘమునం దాచార్య గిద్వానీ స్థానమున కె. యమ్. పానికరు పనిచేయ ప్రారంభించెను. అకాలీఖయిదీల జైలుకష్టములనుగూర్చి విచారించుటకు కాంగ్రెసుకార్యసంఘమువా రొక ఉపసంఘమును నియమించిరి. అకాలీఖయిదీల కుటుంబములకు వారు తగిన ధనసహాయమునుకూడా చేసిరి. తరువాత గురుద్వారాలయాజమాన్యమునుగూర్చి ఒక చట్టము చేయబడెను. అంతటితో అకాలీల ఆందోళనముముగిసినది.

# 5. కాంగ్రెసులో ప్రతికూల కక్షలు

## ౧౯౨౪

[గాంధీ అనారోగ్యము-జూహూసంభాషణలు-స్వరాజ్యపక్షవిజయములు-అధినివేశప్రతిపత్తినిగూర్చి హైలీవ్యాఖ్యానము - గాంధీ, దాసు, నెహ్రూల ప్రకటనలు-అ. భా. కాం. సం. సమావేశము-కాంగ్రెసులోని ఎన్నిక సభ్యుల నూలుచందా - అహమ్మదాబాదులో జరిగిన అ. భా. కాం. సం. యొక్క తదితరతీర్మానములు - సాంఘికవివాదములు - అఖిలపక్షసమావేశము (౧౯౨౪, నవంబరు) బెల్గామ్‌కాంగ్రెసు-గాంధిపై నతిరుగుబాటు-అన్నిబహిష్కారములును తొలగింపబడినవి-విదేశవస్త్ర బహిష్కారము నిలిచియున్నది - అహింస ఆమోదింపబడినది - నడుకు చందా - స్వరాజ్య ప్రణాళికలోని ముఖ్యాంశములు - స్వాతంత్ర్యము-బెల్గామ్‌తీర్మానము-విదేశముల భారతీయులు.]

౧౯౨౪ ప్రారంభదశలో భారతరాజకీయాకాశ మంధకారబంధురముగా కనపడినది. జైలులోనున్న గాంధీకి అకస్మికముగా ప్రమాదకరమైన జబ్బుచేయుటచే భారతజాతి విచారసాగరమున మునిగినది. ఆయాసంవత్సరములలో జరిగిన చరిత్రాంశములను బట్టి నాటిప్రాముఖ్యము గణింపబడును. అలాగే ౧౯౨౪ వ సంవత్సరమును తలచుకొన్నంతనే అవేటి చారిత్రకవిషయములు మాకు స్మరణకు వస్తున్నవి. ఆరోజులలో గాంధీకి జైలులో జబ్బుచేసినవిషయము, డాక్టరులు శస్త్రముచేసినసంగతి

ఇంకను నాలుగేండ్ల శిక్ష అనుభవింపవలసియుండగానే ఆయన విడుదలచేయబడుట, శాసనసభలలో స్వరాజ్యపక్షమువారి విజయము, క్రిందటి అధ్యాయములో ఉదాహరింపబడిన అకాలీల కష్టములు, కలకత్తావీధులలో అర్నెస్టుడే అనేఆయన హత్యచేయబడుట, గోపీనాథ్ సహాను గూర్చి దినాజుపూర్‌లో చేయబడిన తీర్మానము, జూహూ సంభాషణలు, వాటిఅపజయము, అహమ్మదాబాదులో సమావేశమైన అ. భా. కాం. సం. సమావేశము, అక్కడికక్షుల వాదప్రతివాదములు, వంగరాష్ట్రమునందలి నిర్బంధవిధానము, సుభాష్‌చంద్రబోస్‌వంటి సుప్రసిద్ధకాంగ్రెసువాదుల అరెస్టు, మతకలహములు, గాంధీయొక్క మూడువారముల ఉపవాసదీక్ష, ఢిల్లీలో జరిగిన ఐకమత్య మహాసభ, చిత్తరంజనదాసు అరెస్టునుగూర్చిన బెదరింపు, బొంబాయిలో కూడిన అఖిలపక్ష సమావేశము, దానిఅపజయము, అలీసోదరులతల్లి బీయమ్మమరణము, గాంధీ అధ్యక్షత క్రింద జరిగిన బెల్గాముకాంగ్రెసు, కాంగ్రెసుకార్యక్రమములో చీలికలు, నిర్మాణకార్యక్రమము, శాసనసభాకార్యక్రమము ఇవన్నీ మాకళ్లఎదుట కట్టినట్లు ప్రత్యక్షమవుతూన్నవి.

౧౯౨౪ జనవరి ౧౨ వ తేదీని గాంధీకి జైలులో ఆకస్మికముగా గర్భకోశమునందు (Appendicitis) జబ్బుకలిగినది. కల్నల్ మేడక్ ఆయనకు అర్ధరాత్రివేళ శస్త్రచికిత్స కావించెను. తక్షణమాయన కారోగ్యము కలిగి ఇంకా శిక్ష అనుభవింపవలసియుండగానే ఫిబ్రవరి ౫ వ తేదీని ఏవిధమైన షరతులూ లేకుండ ఆయన విడిచివేయబడెను. అందువలన అంధకారబంధురముగా నున్న భారతరాజకీయాకాశమునకు చంద్రోదయ మైనది.

గాంధీ విడుదలచేయబడినప్పటికి ఆయనకు శాంతిగాని, విశ్రాంతిగాని లేదు. కాకినాడలో ప్రారంభమైన కక్షలు అంతకంతకు విశాలత్వమును పొందినవి. ఒకవంక గాంధీరాకతో నూతనోత్సాహమును పొందిన నోఛేంజర్లు కాంగ్రెసురథమును తిరిగీ వెనుకకు, శాసనసభాప్రవేశవాదులు తాము ఢిల్లీ, కాకినాడ కాంగ్రెసులలో పొందిన విజయములను ఇంకనూ బలవత్తరముగా చేసుకొని, తమకడ్డముగానున్న నిరోధములను పూర్తిగా తొలగించుకొని, తమబాటను రాచబాటగా చేసుకొనవలెనని కుతూహలముతో నుండిరి. ఈ ఉభయకక్షులవారికినీ రాజీచేసేనిమిత్తము ప్రబలప్రయత్నములు జరిగినవి. అప్పుడు గాంధీ బొంబాయికి దగ్గరగానున్న సముద్రతీరమున జూహూలో విశ్రాంతినిమిత్తము మకాముపెట్టెను. స్వరాజ్యదాసులు ఆయన నక్కడ కలుసుకొని రాజకీయవిషయములను గూర్చి సంభాషించిరి. అవే తరువాత జూహూ సంభాషణలుగా ప్రసిద్ధివహించినవి. ఆ సంభాషణలు జరిగేటప్పుడు ఉభయపక్షముల వారికినీ రాజీ కుదరవచ్చునని ఆశకలిగినది. తరువాత ౧౯౨౪ మేనెలలో గాంధీ ఒక

ప్రకటనచేసెను. ఈ అధ్యాయములో దానిని సంపూర్ణముగా ఉదాహరింతుము. ఆప్రకటనతోపాటుగానే శశిబంధుదాసు, మోతీలాలుల ప్రకటనలుకూడ ప్రచురింపబడినవి.

ఆ చారిత్రక ప్రకటనముల నిక్కడ ఉదాహరించేము. ఇందు భారతశాసనసభలో స్వరాజ్యపక్షమువారు చేసిన కొన్ని ఘనకార్యములనుగూర్చి వివరించుట మా ధర్మము.

స్వరాజ్యపక్షమువారు దేశములోనున్న వివిధశాసనసభల ఎన్నికలలో పాల్గొనిరి. భారతశాసనసభకు ౪౫ మంది స్వరాజ్యసభ్యులు విజయముపొందిరి. వారందరూ స్వరాజ్య కార్యక్రమమును కొనసాగించుటకు ప్రమాణము చేసుకొనిరి. ఆ సభలో వారందరిదీ ఒక్కటేమాట, ఒక్కటేనడక. భారతశాసనసభలోని జాతీయపక్షము వారు స్వరాజ్యపక్షమువారియందు సానుభూతికలిగి వారికి చేదోడువాదోడుగా నుండిరి జాతీయవాదు లసహాయవాదసిద్ధాంతము నవలంబింపక పోయినప్పటికీ దేశభక్తి విషయములో మాత్రము మన స్వరాజ్యపక్షమువారికి తీసిపోరు. వారి బలముతో స్వరాజ్యపక్షమువా రనేక విజయపరంపరలను పొందిరి. అందులో మొదటిది రాజ్యాంగ చట్టము సంస్కరింపబడవలెనని టి. రంగాచారి పెట్టిన తీర్మానముపైన "భారతదేశములో సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వప్రణాళికను సిఫార్సు చేసేనిమిత్తము రౌండుటేబిలుసభ పిలువబడవలె"నని మోతీలాలు పండితుడు తెచ్చిన సవరణ. ఆసందర్భములో పండితుడు ౧౯౧౯ లో తయారుచేయబడిన భారతసంస్కరణచట్టమునకు ప్రభుత్వమువారిచే వ్రాయబడిన పీఠిక న్యాయముగా లేదని వాదించెను. అంతటితో ఊరుకోక "మాపక్షమువారిని ప్రభుత్వవిధ్వంసకులుగా మీరు పరిగణింపకూడదు. మేము నేడే బాధ్యతాయుత ప్రభుత్వమును మూటగట్టి మాచేతులలో పెట్టవలసినదని మిమ్ములను కోరుటలేదు. మేము ప్రభుత్వమునకు తోడ్పడవలెననే ఇక్కడకువచ్చినాము. ప్రభుత్వమువారు మా ఈ సహాయమును అంగీకరించేయెడల మేము వారిమనుష్యులమే. లేనట్లయితే మా స్వరాజ్యపక్షమువా రందరము అసహాయవాదులముగానే ఉండి, మాహక్కులను మేము సంరక్షించుకొనగలము." అని మోతీలాలు పండితుడు ప్రభుత్వమును సవాలుచేసెను.

అప్పటి హోముమెంబరు సర్ హెయిలీ భారతదేశపు అధినివేశప్రతిపత్తినిగూర్చి విపరీతవ్యాఖ్యానముచేసెను. ఆవిషయ మాయనకు చాలా కొత్తగా తోచెను. అది ఇండియా ప్రభుత్వచట్టములోని ప్రధానసూత్రములకే విరుద్ధముగానున్నదని వాదించెను. భారతదేశము క్రమానుగతముగా స్వపరిపాలనాభివృద్ధిని పొందవలెనని ఆచట్టములో నున్నదికాని అధినివేశప్రతిపత్తిమాట లేనేలేదని ఆయన విప్ప

ష్టము చేసెను. ఆరోజులలో స్వరాజ్యపక్షమువారి చేతులలో భారతప్రభుత్వమువారనేక అపజయములను పొందిరి. కొంతమంది రాజకీయఖయిదీల విడుదలనుగూర్చి, ౧౮౧౮ నాటి మూడవరెగ్యులేషన్‌ను రద్దుచేయుటనుగూర్చి, ఇండియాకు దిగుమతిచేయబడే దక్షిణాఫ్రికా రాక్షసిబొగ్గుపైన పన్ను విధించుటనుగూర్చి, సిక్కు సంస్కారణోద్యమవిచారణనుగూర్చి భారతశాసనసభలో వచ్చిన చర్చలన్నిటిలోనూ ప్రభుత్వమువారోడిపోయిరి. ప్రభుత్వమువారి ఓటమి అనగా, స్వరాజ్యపక్షమువారి విజయము. స్వరాజ్యపక్షముతో భారతశాసనసభయందున్న జాతీయవాదులూ, స్వతంత్రపక్షమువారూ, చిట్టచివరకు మితవాదప్రముఖులుకూడా చేతులు కలిపిరి. "రాజకీయఖయిదీలవిడుదల, నిర్బంధశాసనముల నిర్మూలనము, భారతభావిరాజ్యాంగచట్ట నిర్మాణమునకు జాతీయసమితి (National Convention) ఏర్పాటుచేయుట" ఇవి స్వరాజ్యపక్షమువారి కార్యక్రమమునందు మొదటనే ప్రకటింపబడినవి.

ప్రభుత్వమువారి ఆదాయవ్యయపట్టికలో ప్రధానభాగమును త్రోసివేయుట స్వరాజ్యపక్షమువారికి కలిగిన రెండవ విజయము. ఈ పద్ధతి ఆదాయవ్యయపట్టిక సమూలముగా త్రోసివేయబడినట్లే భావింపవలసియుండెను ఈ సందర్భములో "మా ఈతీర్మానము విధ్వంసకారకమైన సహాయనిరాకరణ సిద్ధాంతమునకు సంబంధించినదికాదు. ప్రజలకష్టములను ప్రభుత్వమువారి దివ్యచిత్తమునకు తెచ్చేనిమిత్తము న్యాయశాస్త్రానుగుణముగా రాజ్యాంగధర్మము ననుసరించి ప్రవేశపెట్టబడినది" అని మోతీలాలు పండితుడు స్పష్టీకరించెను.

౧౯౨౪ వసంతకాలమునాటికి భారత రాజకీయ వాతావరణములో కలిగిన పరివర్తనములనుగూర్చి పాఠకులు తెలుసుకొనగలందులకు జుహూసంభాషణముల సందర్భమున గాంధీ, దాసు, నెహ్రూలు చేసిన ప్రకటనల నీక్రింద ఉదాహరింతుము.

## గాంధీ ప్రకటన

అసలు సిద్ధాంతములోనే భేదము—

"భారతశాసనసభలలోను, రాష్ట్రీయశాసనసభలలోను కాంగ్రెసువాదులు ప్రవేశించుటనుగూర్చి స్వరాజ్యమిత్రులతో సంభాషించినాము. కాని ఆ విషయములో మే ముభయులమున్నూ ఏకాభిప్రాయమునకు రాలేకపోయినామని చెప్పవలసివచ్చినందుకు మేము చాలా విచారపడుతున్నాము. స్వరాజ్యవాదుల సిద్ధాంతము నంగీకరింపవలెనని నేను చాలా ప్రయత్నించినాను. నేను స్వరాజ్యపక్షములో ఐక్యమైపోయినట్లయితే నాపని ఇంకా తేలికఅయ్యేది. మాతృదేశ స్వాతంత్ర్యముకోసము అపూర్వత్యాగములు కావించిన పూజ్యులగు నాయకులతో ప్రతికూలభావమును పూనుట నా మన

స్సున కంత సంతోషకరమైన విషయముకాదు; కాని నేనెంత ప్రయత్నించినప్పటికీ, వారితో ఏకీభవింపవలెనని నే నెంత ఇష్టపడుతున్నప్పటికీ వారి వాదములు మాత్రము నా హృదయమున కాకర్షవంతములుగా లేవు. నాకును, వారికినీ గల భేదము కేవలము స్వల్పముకాదు. నిజముగా అసలుసిద్ధాంతములోనే మా ఉభయులకును న్యాయమైన భేదభావము కలిగినది. నేనుద్దేశించిన అసహాయోద్యమమునకు శాసనసభా ప్రవేశ మను గుణముగా లేదని ఇప్పటికీ నా అభిప్రాయము. "నాన్ కో ఆపరేషన్" అనేమాటలో గానీ, దాని వ్యాఖ్యానములోగానీ వచ్చిన తేడాగా దిది. ఆయా ముఖ్యసమస్యలను పరిష్కరించుట కవలంబింపబడే పద్ధతులలోనే మార్పుగలిగినది. అవి కేవలము మానసిక ప్రవృత్తులకు సంబంధించినవి. త్రివిధబహిష్కారము జయముపొందినదా, లేక అపజయము పొందినదా అనే విషయము మానసికపరివర్తనమునుబట్టి తెలుసుకొనవలసినదే కాని కలిగిన ఫలితములనుబట్టి మాత్రమే తెలుసుకొనవలసినదికాదు. ఆయుద్దేశముతోనే శాసనసభలలోపల నుండుటకంటె వెలుపలనుండుటయే మన కెక్కువ ప్రయోజనకరమని నా వాదము. నేను నాస్వరాజ్యమిత్రులను నా అభిప్రాయముతో ఏకీభవించేటట్లు చేయలేకపోయినాను. కాని వా రన్యథా భావిస్తున్నంతవరకును వారు తప్పక శాసనసభలలోనే పనిచేయవలసియుండునని నేమ తెలుసుకొంటిని. అది అందరికీ మంచిది.

"నా వాదముమూలకముగా స్వరాజ్యపక్షమువారు నాతో ఏకీభవింతురని ఎవరూ భావించియుండరు. వారిలో గొప్ప అనుభవము, గొప్ప సమర్థత గల ఉత్తమదేశాభిమాను లనేకులు కలరు. వారు దీర్ఘముగా ఆలోచించనిదే శాసనసభలకు పోలేదు. వారి పద్ధతి నిష్ప్రయోజనకరమని అనుభవమువలన వారుతెలుసుకొనే టంతవరకునూ వా రా స్థానములనుండి రావలెనని మనము వారిని కోరకూడదు.

"కాబట్టి నా అభిప్రాయమునకును, స్వరాజ్య పక్షాభిప్రాయమునకును గలభేదాభేదములను గూర్చి విచారించుట కాదిప్పుడు దేశీయులు చేయవలసిన పని. శాసనసభా ప్రవేశము స్థిరపడదని భావించి ఇకముం దేమిచేయవలెనో వారు నిర్ణయింపవలసియున్నది. సహాయనిరాకరణవాదులు స్వరాజ్యపక్షమువారికి ప్రతికూలురుగానే ఉండవలెనా, లేక వారు తటస్థులుగానుండి అవసరమైనప్పుడు వారి సిద్ధాంతములకు భిన్నము కానిపద్ధతిని వారికి (స్వరాజ్యపక్షమువారికి) సహాయపడవలెనా అనే విషయమును గూర్చి భారతప్రజ లిప్పు డాలోచించవలెను.

స్వరాజ్యపక్షమునకు ప్రతికూలప్రచారము వద్దు—

"కాంగ్రెసువాదులలో అంతరాత్మసంబంధమైన అభ్యంతరములు లేనివారందరు వారికి కోరికకలిగేయెడల శాసనసభలకు పోవచ్చునని ఢిల్లీ, కాకినాడ కాంగ్రెసులు

తీర్మానించినవి. కాబట్టి స్వరాజ్యవాదులు శాసనసభలలో ప్రవేశించుటకు సంపూర్ణాధికారము కలదు. "నోఛేంజర్లు" సంపూర్ణ తటస్థభావము వహింపవలెననికూడా వారు కోరడమున్యాయమే. శాసనసభలలో వారు ప్రభుత్వవిధానమున కాటంకము కలిగింప ప్రయత్నించుటకూడా వారిసిద్ధాంతమునకు విరుద్ధము కాదు. పై పెచ్చు కాంగ్రెసువారు స్వరాజ్యపక్షమువారి శాసనసభాప్రవేశమునుగూర్చి ఏవిధమైన షరతులూ పెట్టలేదు. స్వరాజ్యవాదుల కార్యక్రమము విజయముపొంది దేశమునకు ప్రయోజనమే కలిగేయెడల ఆ అపూర్వ దృశ్యము నా వంటి పట్టుదలకలవాండ్లను కూడా వారి సిద్ధాంతమున కంగీకరించేటట్లు చేసి మన మిదివరకు కావించిన ప్రమాదమును గుర్తించేట ట్లొనరించగలదు. స్వరాజ్యవాదుల అనుభవమువలన వారి విధానము నిష్ఫలమైనదని తెలుసుకొన గలిగేయెడల వారు తిరిగీ వెనుకకు మరలుటకు కూడా జంకరు. నాకు విశ్వాసములేనివారి కార్యక్రమమునకు నేను సహాయపడజాలకపోయినప్పటికీ స్వరాజ్యవాదుల శాసనసభాప్రవేశమునకు ప్రతికూల ప్రచారము చేసి వారి మార్గమున కడ్డంకులు కల్పించుట నామతము కాదు. స్వరాజ్యపక్షమువారి శాసనసభాప్రవేశమున కవకాశము కల్పించి దాని ఫలితమున కెదురుచూస్తూండడమే ఢిల్లీ, కాకినాడ తీర్మానములలోని ఉద్దేశము. "నోఛేంజర్లు" హృదయపూర్వకముగా తటస్థభావము పూని స్వరాజ్యవాదుల శాసనసభాకార్యక్రమమున కేవిధమైన అభ్యంతరములనూ కల్పింపక సంపూర్ణస్వాతంత్ర్య మిస్తేనే తప్ప ఆయుద్దేశము నెరవేరదు.

శాసనసభలలో అవలంబింపవలసిన పద్ధతి—

"శాసనసభలను మనకు ప్రయోజనకరముగా నుపయోగించగలిగితేనేగాని నేను వాటిలో ప్రవేశింప తలపెట్టను. కాబట్టి నేను శాసనసభలలో ప్రవేశించినట్లయితే సభా కార్యక్రమమున కడ్డంకులు కల్పించేపని నేను చేయను. కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమమును బలపరచుటకు నే నాసభలలోనుండి ప్రయత్నింతును. ఆయా సందర్భములను బట్టి భారతప్రభుత్వమునుగాని, రాష్ట్రప్రభుత్వములనుగాని (౧) వారికి కావలసిన బట్టల విషయములో ఖద్దరుబట్టలనుమాత్రమే కొనవలెననీ, (౨) విదేశీబట్టలపైన నిషేధపు పన్నులను విధింపవలెననీ, (3) కల్లు సారాయిదుకాణములనుండీ, నల్లమందు గంజాయి షాపులనుండీ ప్రభుత్వాదాయమును సంపాదించే పద్ధతిని నిర్మూలింపవలెననీ, సైన్య వ్యయమును తగ్గించవలెననీ కోరుతూ తీర్మానములను ప్రతిపాదింతును.

"శాసనసభలలో ఆ తీర్మానము లంగీకరింపబడిన పిదప ప్రభుత్వమువారు వాటి నాచరణలో పెట్ట నిరాకరించేయెడల నే నా ప్రత్యేకవిషయములపైన వోటర్ల అభిప్రాయమును తెలిసికొనుటకు వీలుగా శాసనసభలను రద్దుచేసి కొత్తయెన్నికలు జరి

పింపవలసినదని ప్రభుత్వమువారిని కోరెదను. ప్రభుత్వమువా రావిధముగా చేయనియెడల నాసభ్యత్వమునకు రాజీనామాయిచ్చి దేశమును శాసనోల్లంఘనమునకు సంసిద్ధపరచెదను. ఆ తరుణమువచ్చినప్పుడు స్వరాజ్యవాదుల నాయకత్వముక్రింద నేను వారితో కలిసి పనిచేయుదును. శాసనోల్లంఘనము చేయుటకు నే నిదివరకు నిర్ణయించిన అర్హతలలో ఏమీ మార్పులేదు

నోఛేంజర్లకుసలహా—

"ఈసందర్భములో నేను నోఛేంజర్లకొకసలహా ఈయవలసియున్నది. స్వరాజ్యవాదులు చేస్తూన్న పనినిగూర్చిగాని, వారు చెప్పుతూన్న మాటలనుగూర్చిగాని నోఛేంజర్లేమీ ఆందోళనపడనక్కరలేదు. వారు నిర్మాణకార్యక్రమమును ద్విగుణీకృతోత్సాహముతో కొనసాగించి అందులో వారికి గల విశ్వాసమును రుజువుచేయవలెను. ఆడంబరములేకుండ ప్రశాంతముగ పనిచేసికోవలెనని కోరిన ప్రతివానికి ఖద్దరు పనీ, జాతీయపాఠశాలలపనులూ ఉండనే ఉన్నవి. హిందూమహమ్మదీయ సమస్య విషయములో నోఛేంజర్లు తమ యావచ్ఛక్తినీ వినియోగింపవలసియున్నది. శాసనసభాప్రవేశవాదులు తాము సభలలో ప్రవేశించినందువల్ల కలిగే ఫలితములబట్టియే తమ కార్యవిధానమును సమర్థించుకొనవలసియున్నది. అదేవిధముగా నోఛేంజర్లుకూడా నిర్మాణకార్యక్రమమును కొనసాగించుటమూలమున కలిగిన ఫలితములనుబట్టే వారవలంబించిన శాసనసభాప్రవేశ ప్రతికూలభావమును సమర్థించుకొనవలసియున్నది. నోఛేంజర్లపని ఒక విషయములో ప్రోఛేంజర్ల (శాసనసభా ప్రవేశవాదుల)కంటె మెరుగుగానున్నది. ఎందువల్లననగా నోఛేంజర్లు ప్రోఛేంజర్ల సహాయమును పొందవచ్చును. నిర్మాణ కార్యక్రమమునందు ప్రోఛేంజర్లుకూడా తమకు విశ్వాసముకలదని ప్రకటించిరి. కాని ఒక్క నిర్మాణకార్యక్రమమే దేశమునకు స్వరాజ్యమును సంపాదించిపెట్టదని వారి వాదన. అయితే శాసనసభలవెలుపల నిర్మాణ కార్యక్రమమునకు నోఛేంజర్లు, ప్రోఛేంజర్లు అందరూకూడ కలసి వారివారిసంస్థలద్వారా సహాయపడవచ్చును.

"కాంగ్రెసుసంస్థ చేస్తూన్నపనిని పరిశీలించనియెడల ఈ ప్రకటన మసంపూర్ణము కాగలదు. ఈవిషయములో నాకు స్పష్టమైన అభిప్రాయము లున్నవి. వాటిని గూర్చి అవసరమైనప్పుడు ముందు వివరింపగలను."

## స్వరాజ్యపక్షమువారి ప్రకటన

చిత్తరంజనదాసు, మోతీలాలునెహ్రూల ప్రకటన మీక్రిందఉదాహరింపబడినది:

"శాసనసభాప్రవేశమునకు సంబంధించిన అనేకవిషయములను శ్రమకోర్చి గాంధీమహాత్ముడు మాతో చర్చించినందుకు మే మాయనకు కృతజ్ఞులము. ఆయన పత్రికలకు

తీర్మానించినవి. కాబట్టి స్వరాజ్యవాదులు శాసనసభలలో ప్రవేశించుటకు సంపూర్ణాధికారము కలదు. "నోఛేంజర్లు" సంపూర్ణ తటస్థభావము వహింపవలెననికూడా ఐ రను కోవడమున్యాయమే. శాసనసభలలో వారు ప్రభుత్వవిధానమున కాటంకము కలిగింప ప్రయత్నించుటకూడా వారిసిద్ధాంతమునకు విరుద్ధము కాదు. పై పెచ్చు కాంగ్రెసు వారు స్వరాజ్యపక్షమువారి శాసనసభాప్రవేశమునుగూర్చి ఏవిధమైన షరతులూ పెట్టలేదు. స్వరాజ్యవాదుల కార్యక్రమము విజయముపొంది దేశమునకు ప్రయోజనమే కలిగేయెడల ఆ అపూర్వ దృశ్యము నా వంటి పట్టుదలకలవాండ్లను కూడా వారి సిద్ధాంతమున కంగీకరించేటట్లు చేసి మన మిదివరకు కావించిన ప్రమాదమును గుర్తించేట ట్లొనరించగలదు. స్వరాజ్యవాదుల అనుభవమువలన వారి విధానము నిష్ఫలమైనదని తెలుసుకొన గలిగేయెడల వారు తిరిగీ వెనుకకు మరలుటకు కూడా జంకరు. నాకు విశ్వాసములేనివారి కార్యక్రమమునకు నేను సహాయపడజాలక పోయినప్పటికీ స్వరాజ్యవాదుల శాసనసభాప్రవేశమునకు ప్రతికూల ప్రచారము చేసి వారి మార్గమున కడ్డంకులు కల్పించుట నామతము కాదు. స్వరాజ్యపక్షమువారి శాసనసభాప్రవేశమున కవకాశము కల్పించి దాని ఫలితమున కెదురుచూస్తూండడమే ఢిల్లీ, కాకినాడ తీర్మానములలోని ఉద్దేశము. "నోఛేంజర్లు" హృదయపూర్వకముగా తటస్థభావము పూని స్వరాజ్యవాదుల శాసనసభాకార్యక్రమమున కేవిధమైన అభ్యంతరములనూ కల్పింపక సంపూర్ణస్వాతంత్ర్య మిస్తేనే తప్ప ఆయుద్దేశము నెరవేరదు.

శాసనసభలలో అవలంబింపవలసిన పద్ధతి—

"శాసనసభలను మనకు ప్రయోజనకరముగా నుపయోగించగలిగితేనేగాని నేను వాటిలో ప్రవేశింప తలపెట్టను. కాబట్టి నేను శాసనసభలలో ప్రవేశించినట్లయితే సభా కార్యక్రమమున కడ్డంకులు కల్పించేపని నేను చేయను. కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమమును బలపరచుటకు నే నాసభలలోనుండి ప్రయత్నింతును. ఆయా సందర్భములను బట్టి భారతప్రభుత్వమునుగాని, రాష్ట్రప్రభుత్వములనుగాని (౧) వారికి కావలసిన బట్టల విషయములో ఖద్దరుబట్టలనుమాత్రమే కొనవలె ననీ, (౨) విదేశీబట్టలపైన నిషేధపు పన్నులను విధింపవలెననీ, (౩) కల్లు సారాయిదుకాణములనుండీ, నల్లమందు గంజాయి షాపులనుండీ ప్రభుత్వాదాయమును సంపాదించే పద్ధతిని నిర్మూలింపవలెననీ, సైన్య వ్యయమును తగ్గించవలెననీ కోరుతూ తీర్మానములను ప్రతిపాదింతును.

"శాసనసభలలో ఆ తీర్మానము లంగీకరింపబడిన పిదప ప్రభుత్వమువారు వాటి నాచరణలో పెట్ట నిరాకరించేయెడల నే నా ప్రత్యేకవిషయములపైన వోటర్ల అభిప్రాయమును తెలిసికొనుటకు వీలుగా శాసనసభలను రద్దుచేసి కొత్తయెన్నికలు జరి

పింపవలసినదని ప్రభుత్వమువారిని కోరెదను. ప్రభుత్వమువా రావిధముగా చేయనియెడల సహాయనిరాకరణమునకు రాజీనామాయిచ్చి దేశమును శాసనోల్లంఘనమునకు సంసిద్ధపరచెదను. ఆ తరుణమువచ్చినప్పుడు స్వరాజ్యవాదుల నాయకత్వముక్రింద నేను వారితో కలిసి పనిచేయుదును. శాసనోల్లంఘనము చేయుటకు నేనిదివరకు నిర్ణయించిన అర్హతలలో ఏమీ మార్పులేదు

నోఛేంజర్లకుసలహా:—

"ఈసందర్భములో నేను నోఛేంజర్లకొకసలహా ఈయవలసియున్నది. స్వరాజ్యవాదులు చేస్తూన్న పనినిగూర్చిగాని, వారు చెపుతూన్న మాటలనుగూర్చిగాని నోఛేంజర్లేమీ ఆందోళనపడనక్కరలేదు. వారు నిర్మాణకార్యక్రమమును ద్విగుణీకృతోత్సాహముతో కొనసాగించి అందులో వారికి గల విశ్వాసమును రుజువుచేయవలెను. ఆడంబరములేకుండ ప్రశాంతముగ పనిచేసికోవలెనని కోరిన ప్రతివానికి ఖద్దరు పనీ, జాతీయపాఠశాలలపనులూ ఉండనే ఉన్నవి. హిందూమహమ్మదీయ సమస్య విషయములో నోఛేంజర్లు తమ యావచ్ఛక్తినీ వినియోగింపవలసియున్నది. శాసనసభాప్రవేశవాదులు తాము సభలలో ప్రవేశించినందువల్ల కలిగే ఫలితములబట్టియే తమ కార్యవిధానమును సమర్థించుకొనవలసియున్నది. అదేవిధముగా నోఛేంజర్లుకూడా నిర్మాణకార్యక్రమమును కొనసాగించుటమూలమున కలిగిన ఫలితములనుబట్టే వారవలంబించిన శాసనసభాప్రవేశ ప్రతికూలభావమును సమర్థించుకొనవలసియున్నది. నోఛేంజర్లపని ఒక విషయములో ప్రోఛేంజర్ల (శాసనసభాప్రవేశవాదుల)కంటె మెరుగుగానున్నది. ఎందువల్లననగా నోఛేంజర్లు ప్రోఛేంజర్ల సహాయమును పొందవచ్చును. నిర్మాణకార్యక్రమమునందు ప్రోఛేంజర్లుకూడా తమకు విశ్వాసముకలదని ప్రకటించిరి. కాని ఒక్క నిర్మాణకార్యక్రమమే దేశమునకు స్వరాజ్యమును సంపాదించిపెట్టదని వారి వాదన. అయితే శాసనసభలవెలుపల నిర్మాణ కార్యక్రమమునకు నోఛేంజర్లు, ప్రోఛేంజర్లు అందరూకూడ కలసి వారివారిసంస్థలద్వారా సహాయపడవచ్చును.

"కాంగ్రెసుసంస్థ చేస్తూన్నపనిని పరిశీలించినియెడల ఈ ప్రకటన సమగ్రపూర్ణము కాగలదు. ఈవిషయములో నాకు స్పష్టమైన అభిప్రాయము లున్నవి. వాటిని గూర్చి అవసరమైనప్పుడు ముందు వివరింపగలను."

## స్వరాజ్యపక్షమువారి ప్రకటన

చిత్తరంజనదాసు, మోతీలాలునెహ్రూల ప్రకటన మీక్రిందఉదాహరింపబడినది:

"శాసనసభాప్రవేశమునకు సంబంధించిన అనేకవిషయములను శ్రమకోర్చి గాంధీమహాత్ముడు మాతో చర్చించినందుకు మేమాయనకు కృతజ్ఞులము. ఆయన పత్రికలకు

పంపబోయే ప్రకటనను ముందుగా మాకు చూపిపంపినందుకు కూడా ఆయనదాక్షిణ్యమును మేము విస్మరింపజాలము. మా సంభాషణలలో ఆయన ప్రకటించిన అభిప్రాయములను, ఇప్పుడాయన పత్రికలకు పంపిన అభిప్రాయములను తగు జాగ్రత్తతో మేము మరల మరల చర్చించినాము. ఆయనయందును, ఆయన అభిప్రాయములయందును మా కెంత గౌరవ మున్నప్పటికీ ఆయనచెప్పే కారణములు మాకు సంతృప్తికరములుగా లేవు.

శాసనసభా ప్రవేశము, సహాయనిరాకరణము—

"శాసనసభా ప్రవేశవిషయములో స్వరాజ్యవాదుల వాదములుచెప్పి గాంధీమహాత్ముని ఒప్పింపలేనందుకు మేము చింతిస్తున్నాము. నాగపురముకాంగ్రెసులో చేయబడిన అసహాయోద్యమతీర్మానమునకు శాసనసభా ప్రవేశ మేవిధముగా ప్రతికూలమో మాకు బోధపడుటలేదు. కాని సహాయనిరాకరణము జాతీయజీవితములోని భౌతిక విషయములకు సంబంధించక, అది ఒక మానసిక ప్రవృత్తి మాత్రమే అయ్యేయెడల, నిజమైన జాతీయ ప్రయోజనములను సంరక్షించుటకొరకు సహాయోద్యమమునైనను త్యజించుట మా పరమధర్మముగా మేము భావింతుము. ఈసిద్ధాంతమును మేము జాతీయ సమస్య లన్నిటికీ అనువర్తింపజేతుము. స్వరాజ్యసంపాదనమున కభ్యంతరములను కల్పిస్తూన్న నిరంకుశ ప్రభుత్వమువారిని నిరోధించుటలోకూడ ఈసిద్ధాంతమునే మే మాచరణలో పెట్ట నూహించితిమి. మే మర్థముచేసికొనిన సహాయనిరాకరణతత్వమునకు శాసనసభా ప్రవేశము పూర్తిగా అనుగుణముగా నున్నదని విశదీకరిస్తూ నిరర్థకమైన ఈ వాగ్వాదమును తుదముట్టింపకోరుతున్నాము.

శాసనసభలలోని ఆటంకము—

"ఈ 'ఆటంక'మనే మాటను ఇంగ్లీషు పార్లమెంటులో వాడబడే అర్థములో మేము వాడలేదు. ప్రస్తుత సంస్కరణచట్టముక్రిందనున్న రాష్ట్రీయ శాసనసభలలోగాని, భారతశాసనసభలలోగాని పార్లమెంటరీ అర్థములో "ఆటంక"మును కల్పించుట అసంభవము. మా అర్థమును వ్యక్తీకరించుటకు నిజముగా మరియొక మాటను మే ముపయోగించవలసిఉన్నది. నిరంకుశప్రభుత్వమువారిచే స్వరాజ్యప్రయత్నములకు కల్పింపబడుతూన్న అభ్యంతరములను నిరోధించుటయే చాలావరకు మా 'ఆటంక'మున కర్థము. ఈవిరోధమునే మేము 'ఆటంక'మని వాడినాము. స్వరాజ్యపక్షనిర్మాణవిధానమునకు వ్రాయబడిన పీఠికలో సహాయ నిరాకరణమునుగూర్చి వర్ణిస్తూ మే మీసంగతి స్పష్టముగా వివరించియుంటిమి. నిరంకుశప్రభుత్వమువారి అడ్డంకులను తొలగించడమే మా ముఖ్యాభిప్రాయము. ఇంతవరకును మేము శాసనసభలలో

అవలంబించినపద్ధతి ఇదే. ఇకముందుకూడ జాతీయజీవితమునకు సంబంధించిన వివిధ విషయములలో ఈపద్ధతినే ఇంకా బలవత్తరముగానుండున ట్లవలంబింపగలము.

"ఈ పద్ధతి "నిరంతరాభ్యంతరవిధాన" మవునా, కాదా అనే వాగ్వివాదములలో కూడ ఇంతటినుండీ మేము జోక్యము కలిపించుకొన దలచుకొనలేదు. అవసరమైనవా రెవరైనా మా పద్ధతికి తగినపేరు పెట్టుకోవచ్చును. మేముమాత్రము మా కార్యక్రమము నిక్కడ వివరింతుము.

మా కార్యక్రమము—

"పైన నుదాహరింపబడిన మాసిద్ధాంతమననుసరించి శాసనసభలలోపలనూ, వెలుపలనూకూడ మే మవలంబింపబోయే కార్యక్రమము నిక్కడ వివరిస్తున్నాము:

"౧. ప్రజలహక్కుల ననుసరించి ప్రభుత్వపద్ధతి మారేటంతవరకు గాని, లేక భారతప్రజకున్నూ, పార్లమెంటుకున్నూ రాజీ కుదిరేటంతవరకుగాని ప్రభుత్వా దాయవ్యయపట్టికలను త్రోసివేయుట. కేంద్రప్రభుత్వములో మే మవలంబింపదలచు కొన్న ఈచర్య కనుగుణములైన కారణముల నిచ్చట వివరింతుము. దాదాపుగా ఆ కారణములే రాష్ట్రప్రభుత్వములకుకూడా వర్తించును. కేంద్రప్రభుత్వములో ౧౩౧ కోట్ల మొత్తములోను (రైల్వేలు మినహాయింపబడినవి) ౧౭ కోట్లుమాత్రమే శాసనసభ్యులు వోటుచేయతగినవి. సభ్యులు వోటుచేయతగని తక్కిన మొత్తములో ౬౪ కోట్లు, అనగా అసలు బడ్జెటు మొత్తములో సగముకంటె ఎక్కువ సొమ్ము సైనిక వ్యయమునకు ప్రత్యేకింపబడును. దీనినిబట్టి ప్రభుత్వమువారి బడ్జెటు (ఆదాయవ్యయ పట్టిక)లో ౧/౪ వంతు సొమ్మునుగూర్చిమాత్రమే శాసనసభ్యులకు వోటిచ్చే అధికార మున్నది. ఆ అధికారముకూడ గవర్నరుజనరలుగారి సర్టిఫికేషన్ (పునరుద్ధారణాధి కారమునకు లోబడియున్నది. దీనినిబట్టి ప్రజలకు బడ్జెటును తయారుచేయుటలోగాని, తయారుచేసి వారిపైనగాని ఏమీ అధికారములేదని స్పష్టపడగలదు. అంతేకాక కొత్త ఆదాయములను సృష్టించుటకుగాని, కొత్తవ్యయమును చేయుటకుగాని కూడ వారికి హక్కులేదు. అటువంటిసందర్భములో ప్రభుత్వమువారి బడ్జెటు నంగీకరించి దానికి బాధ్యతవహించుట ఏసిద్ధాంతమననుసరించీ మాకు కర్తవ్యము కాదు. ఈవిషయములో ఆత్మగౌరవముకల భారతీయు లనేకమంది మాతో ఏకీభవించగల రనేమాట నిస్సంశ యము. కాబట్టి దుష్టమైన ఈ ప్రభుత్వపద్ధతి మారేటంతవరకునూ, అన్నిశాసనసభల లోనూ బడ్జెటులను త్రోసివేయుట మావిధ్యుక్తధర్మము.

ప్రభుత్వమువారిబిల్లులను త్రోసివేయుట—

"౨. నిరంకుశప్రభుత్వమువారు తమ అధికారమును బలపరచుకొనేటందుకు ప్రతి పాదించే అన్నిశాసనములను త్రోసివేయుట. కొన్నిసందర్భములలో అటువంటిశాసన

ములవలన కొంతమేలుకూడ కలుగవచ్చునని మనము భావించుటకు వీలుకలదు. కాని దేశముయొక్క విశాలప్రయోజనములకొరకటువంటి చిన్న చిన్న లాభములను తాత్కాలికముగా త్యజించడమే మంచిదని మా అభిప్రాయము. అంతేకాని ఇదివరకే అప్రతిహతముగానున్న ప్రభుత్వాధికారమునకు కించిత్తుకూడా బలముచేకూర్చుట మాకిష్టములేదు.

నిర్మాణకార్యక్రమము—

"3. జాతీయాభ్యుదయమున కవసరములగు బిల్లులను, తీర్మానములను, కార్యక్రమమును ప్రవేశపెట్టి అందుమూలముగా నిరంకుశాధికారమును నిర్మూలించుట. ఈవిషయములో గాంధీమహాత్ముని ప్రకటనలో చేయబడిన సూచనలను మేము హృదయపూర్వకముగా అంగీకరిస్తూన్నాము. నిర్మాణకార్యక్రమ సందర్భమున ఆయనచే పేర్కొనబడిన తీర్మానములు స్వరాజ్యపక్షమువారిచే అంగీకరింపబడి తీరవలెననియే మాకోరిక. ప్రభుత్వమువారి నిరంకుశచర్యలను నిరోధించి స్వయంశక్తిపైన ఆధారపడియుండవలెననే మాసిద్ధాంతముప్రకారమే మేము మహాత్మునిచే పేర్కొనబడిన తీర్మానముల నామోదించవలసియున్నది. కాంగ్రెసునిర్మాణకార్యక్రమము సహాయనిరాకరణ సిద్ధాంతముక్రిందకు వచ్చేయెడల శాసనసభలలో ప్రతిపాదింపబడే నిర్మాణకార్యక్రమమునకు సంబంధించిన ఈతీర్మానములుకూడ సహాయనిరాకరణసిద్ధాంతముక్రిందకు వచ్చితీరవలెను.

"4. భారతజాతీయైశ్వర్యమును విదేశములకు ప్రవహింపకుండ అరికట్టుటకు తగినసిద్ధాంతముల ననుసరించి ఆర్థికవ్యవహారములను నడుపుట.

ఈ పద్ధతిని సరిగా సాగించేటందుకు కేంద్ర రాష్ట్రీయశాసనసభలలోని ఎన్నిక సభ్యులకు వీలైనప్రతిష్ఠానమును మే మాక్రమించుకొందుము. ఈసందర్భములో కేవల మెన్నికస్థానములలోనేకాక సాధ్యమైనంతవరకు ప్రతికమిటీలోనుకూడ మాపక్షసభ్యులుండవలెనని మా సోదరసభ్యులందరికీ విజ్ఞాపించుకొంటూన్నాము. ఈవిషయమును గూర్చి సాధ్యమైనంతత్వరలో నిర్ణయింపవలెనని వారిని కోరుతూన్నాము.

శాసనసభలబయట మాపని—

"శాసనసభల వెలుపల మాకార్యక్రమ మీక్రిందివిధముగా నుండును:

"గాంధీమహాత్మునిచే నిర్ణయింపబడిన నిర్మాణకార్యక్రమమునకు మేముహృదయపూర్వకముగా సహాయము చేయవలసియున్నది. ఆ విషయములో కాంగ్రెసుసంస్థలతో కలిసి మే మా కార్యక్రమమును నిర్వర్తింపబూనుదుము. శాసనసభలకు వెలుపల నిర్మాణకార్యక్రమముయొక్క సహాయము లేనియెడల మా శాసనసభా కార్యవిధానమునకు బలము పోవునని మా దృఢాభిప్రాయము. మేము శాసనసభలలోని నిర్ణయములకంటె

వాపరినిర్ణయములకే ఎక్కువ తలయొగ్గవలసియున్నది. ఆ సంగతిని మేము గ్రహించనియెడల మా శాసనసభావ్యవహారములను సరిగా నిర్వర్తించనేరేము. ముఖ్యముగా నిర్మాణకార్యక్రమము విషయములో శాసనసభలవెలుపలా, బయటకూడ పరస్పర సహాయము ముండవలయునని మా విశ్వాసము. మాకు బలము చేకూర్పగల నిర్మాణకార్యవిధానముపైననే మే మాధారపడియున్నాము. ఈ సందర్భములలో శాసనోల్లంఘన మునుగూర్చి మహాత్మాగాంధీ చేసిన సూచనను మేము నిస్సందేహముగా అంగీకరింతుము. నిరంకుశప్రభుత్వమువారి స్వార్థపరత్వ మూర్ఖతను నిర్మూలించుటకు శాసనోల్లంఘనము తప్ప గత్యంతరము లేదని తోచినవెంటనే మేము శాసనసభలనుండి వెలుపలకు వచ్చి దేశమును శాసనతిరస్కారమునకు తయారుచేయువిషయములో గాంధీమహాత్మునకు తోడ్పడుదు మని వాగ్దానము చేస్తున్నాము. ఆయన నాయకత్వముక్రింద ఆయన పతాకచ్ఛాయను కాంగ్రెసుసంస్థలద్వారా శాసనోల్లంఘనముయొక్క సంపూర్ణ కార్యక్రమమును నడిపింపగలమని విన్నవిస్తున్నాము.

కాంగ్రెసు - కార్మికులు—

"ఇక దేశమంతటా కార్మిక కర్షకసంస్థలకు సహాయముచేయుటమూలకముగా కాంగ్రెసును బలపరచవలసియున్నది. ప్రతిదేశములోను కార్మికసమస్య చిక్కుసమస్య. హిందూదేశమునం దావిషయములో మరీ చిక్కులున్నవి. ఒకపక్షమున పెట్టుబడిదారులున్నూ, భూస్వాములున్నూ, కార్మికకర్షకుల పేదరికము నాధారముగా జేసికొని, వారి శరీరకష్టమువలన మితిలేని లాభములను పొందేపద్ధతి నరికట్టవలసియున్నది. రెండవపక్షమున ఈకార్మికకర్షక సంస్థలే కోరరాని కోరికలను కోరి పెట్టుబడిదారులయెడలను, భూస్వాముల యెడలను హింసాకరములుగా ప్రవర్తింపకుండ చూడవలసియున్నది. కార్మికులకు సంరక్షణ యుండవలెననుమాట వాస్తవమే. కాని పారిశ్రామికులకుకూడ సమానమైన సంరక్షణ యుండవలెను. మనసంస్థ లొకరి నొకరు పీడించుకొని తినునట్టివిగా నుండగూడదు. ఉభయుల ప్రయోజనములను కాపాడునట్టి ట్రేడుయూనియను కాంగ్రెసును మనము సృష్టించవలెను. కొంతకాలములో అది ఈ ఉభయులకేకాక మొత్తముపైన దేశమంతటికీ శ్రేయస్కరముగా నుండగలదు.

ముగింపు—

"గాంధీమహాత్ముని అభిప్రాయముతో పాటు ఒకేసారి మా యీ ప్రకటనకూడ ప్రకటింపబడుట సంతోషదాయకము. ఇందువలన కాంగ్రెసులోని రెండు పక్షములవారికిని ఎట్టి భేదాభిప్రాయము లున్నను ప్రధానకార్యక్రమమునందు మాత్రము వారి కైకమత్యము కలదని బోధపడగలదు. ఇరుకక్షులవారును శాసనసభల వెలుపల

గాని, లోపలగాని నిర్మాణకార్యక్రమమును కొనసాగింపవలయు ననియే కోరుచున్నారు. ఈ సందర్భములో స్వరాజ్యపక్షమునకును, గాంధీమహాత్మునకును గల ఏకీభావము ఫలప్రదము కాగలదని మా విశ్వాసము. భారతప్రజల జన్మస్వాతంత్ర్య హక్కులను తృణీకరింపబూనిన నిరంకుశప్రభుత్వమునకు మే ముభయులమూ ఏకీభవించి చేసే యీ ప్రయత్నము తగిన ప్రత్యుత్తరము కాగలదు. భారతజాతీయ మహాసభలోని యిరుపక్షులవారును ఒక టే ఆదర్శముతో ఏకమార్గమునగాని, లేక వివిధమార్గముల ద్వారా గాని నిర్మాణకార్యక్రమమును నిర్వర్తింపదలచుకొనిన దృఢనిశ్చయమువలననే భారత స్వరాజ్యప్రయత్నము జయప్రదముగా ముగియగలదని మా ఆశయము."

జూహూసంభాషణలే అహమదాబాదునగరమున జూన్ ౨౭, ౨౮, ౨౯ తేదీలలో జరిగిన అఖిలభారతకాంగ్రెసుసంఘనిర్ణయముల కాధారభూతము లయినవి. అన్ని కాంగ్రెసుసంస్థలలోని ఎన్నికసభ్యులును, ప్రతినెలా తిన్నని మంచిపురిగల ౨౦౦౦ గజములనూలును స్వయముగా వడికి పంపవలెనని నిర్ణయింపబడినది. ఎవరైనా ఆప్రకారము పంపనియెడల వెంటనే వారిస్థానము ఖాళీ యగుననికూడా ఆ సభలో తీర్మానింపబడినది. సరిగా యీశిక్షానిబంధన చర్చింపబడుతూవుండగా కొంతమంది సభ్యులు వారి అసమ్మతిని ప్రకటిస్తూ సభనుండి లేచిపోయిరి. అప్పుడు ౬౭ వోట్లు యిందు కనుకూలముగాను, ౩౭ వోట్లు ప్రతికూలముగాను వచ్చినవి. కాని లేచి పోయినవారుకూడ ఈ తీర్మానమునకు వ్యతిరేకముగా వోటుచేసినట్లు భావించి గాంధీ యీ శిక్షానూత్రము నుపసంహరించుకొనెను. పిమ్మట కమిటీవా రా తీర్మానము ప్రకారము ప్రవర్తింపనివారిపైన మరొకవిధముగా చర్యదీసుకొన నిశ్చయించిరి.

తరువాత విదేశవస్తుబహిష్కారము, న్యాయస్థానబహిష్కారము, పాఠశాలల, కళాశాలల బహిష్కారము, బిరుదముల, శాసనసభల బహిష్కారములు గట్టిగా కొనసాగింపబడవలెనని తీర్మానింపబడినది. శాసనసభాబహిష్కారమునుమాత్రము కాకినాడ కాంగ్రెస్‌తీర్మానమునకు లోబడి జరుపవలెనని నిశ్చయింపబడినది. ఈ పంచబహిష్కారములను స్వయముగా నిర్వర్తింపనివారినిగాని, బహిష్కారసిద్ధాంతము నసలే విశ్వసింపని వారినిగాని కాంగ్రెసువోటరు లెవరునూ కాంగ్రెసుసంస్థల కెన్నుకొనకూడదని తీర్మానింపబడినది. ప్రభుత్వమువారి నల్లమందువ్యాపారపద్ధతి నిరసింపబడినది. అస్సాము ప్రజల నల్లమందుఅభ్యాసమునుగూర్చి విచారణచేయుటకు రివరెండు అండ్రూసు నియమింపబడెను. జైటోలో అనవసరముగాను, క్రూరముగాను సిక్కులపైన తుపాకులు కాల్చబడినపుడు వారు చూపిన ధైర్యసాహసములకు వా రభినందింపబడిరి.

గోపీనాథసాహా అర్నెస్టుడేను హత్య కావించినందుకు అహమ్మదాబాదులో జరిగిన అ. భా. కాం. సం. సమావేశములో నిరసనతీర్మానము చేయబడినది. ఆ తీర్మానము చర్చకువచ్చినప్పుడు సభ్యులలో గొప్ప ఉద్రేకము వ్యక్తమైనది. ఆతీర్మానమందు అర్నెస్టుడేకుటుంబమునకు సానుభూతి చూపబడినది. ఆయనను హత్యకావించిన యువకుని దేశాభిమానము పెడదారులపట్టినందుకు విచారము వెల్లడింపబడినది. గోపీనాథసాహాచర్య కఠినముగా ఖండింపబడినది. అటువంటిరాజకీయహత్యలు కాంగ్రెసుయొక్క అహింసాసిద్ధాంతమునకు ప్రతికూలములనీ, వాటివలన స్వరాజ్యాభ్యుదయమున కాటంకములు కలుగుననీ, శాసనోల్లంఘనపన్నాహమున కవి అంతరాయములు కల్పించుననీ ఆతీర్మానములో స్పష్టముగా నుదాహరింపబడినది. అందుమీద తీవ్రమైన వాదోపవాదములు జరిగినవి. ఆ తీర్మానము దేశబంధుదాసుకు రుచింపలేదు. అందువలన అయన అహింసాసిద్ధాంతమునకు వ్యతిరేకి అని భావించకూడదు. ఆ తీర్మానములోని ఆయాభాగములయందలి ధ్వనిని కొంత మార్పుచేయవలెనని ఆయన ప్రయత్నించెను. అది వోటుకుపెట్టబడినప్పుడు గాంధీకి ప్రాణసమానులైన అనుచరులుకూడ ఆ సందర్భములో ఆయనకు వ్యతిరేకముగా వోటుచేసిరి. అందుకు గాంధీ పట్టలేక బహిరంగముగా దుఃఖించెను. ఈసందర్భములో ఈ తీవ్రపరిస్థితు లేర్పడుటకు కారణము మరియొకటి కలదు. దినాజ్‌పూరులో జరిగిన వంగరాష్ట్రమహాసభలో గోపీనాథుసాహాయొక్క స్వార్థత్యాగము కొనియాడబడినది. అతని దేశభక్తి కాయనయెడల ఆమహాసభవారు పూజ్యభావమును ప్రకటించిరి. గాంధీకి అంత మనోవ్యథకలుగుట కిది కొంత కారణ మైయుండవచ్చును.

స్వరాజ్యవాదులు కోరినదంతా వారి కీసమావేశములో లభింపలేదు. వారికి సంపూర్ణవిజయము నవంబరునెలలో కలిగినది. నోఛేంజర్లకు సంబంధించినంతవరకాశ్చర్యకరమైన విజయము కలిగినదని చెప్పవచ్చును. ఆగష్టునెలలో ౨౭౬౦ మంది నూలుచందా ఇచ్చిరి. సెప్టెంబరులో ౬౩౦౧ మంది యిచ్చిరి. అక్టోబరులో ౭౭౮౧ మంది యిచ్చిరి. నవంబరులో నూలుచందా సభ్యులు ౭౯౦౫ వరకును పెరిగిరి.

కాని ఆ సంవత్సర మనేకచోట్ల మతకలహములు చెలరేగినవి. ముఖ్యముగా ఢిల్లీ, గుల్‌బర్గా, నాగపురము,లక్నో, షహజాన్‌పూర్, అలహాబాద్, కోహట్‌నగరములలో పెద్ద కొట్లాటలు జరిగినవి. ముఖ్యముగా కోహట్‌లో జరిగిన కలహములతో భారతదేశపునడుము విరిగినది. ఆకలహముల కారణములను విచారించుటకు గాంధీ, షౌకతాలీ లొక ఉపసంఘముగా నియమింపబడిరి. వా రిద్దరూ ఒకనివేదికను తయారుచేసిరి. కాని ఆ కల్లోలములకు కారకులైన పక్షములనుగూర్చి వారు భేదాభిప్రాయము

లను ప్రకటించిరి. గాంధీ ఒక పక్షముపై నిందారోపణము చేసెను. షౌకతాలీ మరి యొకపక్షమువారిది తప్పనెను. అసలీ కోహాటుకొట్లాటలు ౧౯౨౪ సెప్టెంబరు ౧౦ వ తేదీన జరిగినవి. వెంటనే కోహాటులోని ఖాత్రీపాఠశాలా ప్రధానోపాధ్యాయుడు లాలానందలాల్ కోహాటుఘోరంతములనుగూర్చి కోహాటుశరణాగతుల కార్యసంఘము వారి ఉపయోగము నిమిత్త మొక నివేదికను ప్రకటించెను. అది చూచినయెడల ఆనాటి భయంకరవిషయములు నేడు స్మరణకు రాగలవు. సెప్టెంబరు ౯, ౧౦ తేదీలలో కోహాటునగరమున కాల్పులును, హత్యలును జరిగినవి. తరువాత ౪ వేలమంది హిందువులు ప్రత్యేకరైలులో మరియొకచోటకు తీసుకొనిపోబడిరి. వారిలో ౨౬౦౦ మంది రావల్ పిండిలోనూ, ౧౪౦౦ మంది తదితర ప్రదేశములలోనూ రెండు నెలలవరకును భిక్షాటనముపైన జీవింపవలసివచ్చినది. ఇంతకంటె అధికముగా మే మిక్కడ చెప్ప వలసిన అవసరము లేదు.

గాంధీ తరువాత ౨౧ రోజు లుపవాసదీక్షను పూనెను. కోహాటునగరములో ప్రజ్వరిల్లిన క్రోధాగ్నికిని, జరిగిన హత్యాకాండకును తానే బాధ్యతవహించెను. ఆ అపరాధమునకు ప్రాయశ్చిత్తముగా తా నీనిరశనవ్రతమును పూనెను. ఈవ్రతము ఢిల్లీలో మహమ్మదాలీఇంటియందు ప్రారంభింపబడినది. కాని తరువాత నగరము వెలుపల నున్న మరియొక ఇంటి కాయన తీసుకొనిపోబడెను. గాంధీ ప్రారంభించిన ఈ ఉపవాస వ్రతము నవకాశముగా తీసుకొని భారతదేశములోని అన్నిపక్షములనాయకులును కలసి ఒక ఐకమత్యమహాసభను సమావేశపరచిరి. ఆసభ ౧౯౨౪ సం॥ ౨౬ సెప్టెంబరు మొదలు కొని ౨ వ అక్టోబరువరకును జరిగినది. ఆసభాప్రతినిధులు పరుల మతస్వాతంత్ర్యము నకుగాని, ఇతరుల అంతరాత్మకుగాని నొప్పికలిగించకుండా ప్రవర్తించేటట్లు ప్రమాణ ములు చేసుకొనిరి. ఎట్టి ఆగ్రహకారణ మున్నప్పటికీ ఈ రెండుసిద్ధాంతములకును ప్రతి కూలముగా ప్రవర్తించేపద్ధతిని వారు గట్టిగా నిరసించిరి. ఒక యావద్భారతజాతీయ పంచాయతీసంఘము నియమింపబడినది. గాంధీ ఆసంఘమునకు సమావేశకర్తగాను, అధ్యక్షుడుగాను నియమింపబడెను. హకీమ్అజ్మల్ ఖాన్, లాలాజీ, జి. కె. నారిమన్, డాక్టరు యస్. కె. దత్తా, మాస్టరు సుందరసింగులు సభ్యులుగా నియమింపబడిరి. భారత ప్రజలు మతవిశ్వాసములను ప్రకటించుటలోను, మతాచారములను నిర్వర్తించుటలోను, పూజాస్థలములపవిత్రతను కాపాడుటలోను, గోహత్యవిషయములోను, మసీదులముందు మేళతాళములు జరిగించుటలోను వారు కొన్నినియమముల నేర్పాటుచేసిరి. మతకలహ ములనుగూర్చి వ్రాయుటలో పత్రికలు జాగ్రత్తగా ప్రవర్తించవలెనని వారు హెచ్చ రించిరి. గాంధీ ఉపవాసదీక్ష నవలంబించిన చివరవారములో ప్రార్థనలు జరుపబడవలె

నని ఆమహాసభవారు నిర్ణయించిరి. గాంధీ సురక్షితముగా ఉపవాసదీక్షను నిర్వర్తింపగలిగినందుకు అక్టోబరు ౮ వ తేదీని పరమేశ్వరునకు బహిరంగసభలలో వందనము లర్పింపబడివి.

గాంధీ ఉపవాసవ్రతమును ముగించినతరువాత నవంబరు ౨౧, ౨౨ తేదీలలో బొంబాయినగరమున అఖిలపక్షమహాసభ జరిగినది. ౨౩, ౨౪ తేదీలలో (నవంబరు ౧౯౨౪) అ. భా. కాం. సం. సమావేశము జరిగినది. వంగరాష్ట్రములోని స్వరాజ్యపక్షవాదులపైనను, తారకేశ్వరములోని సత్యాగ్రహులపైనను ప్రభుత్వమువారు నానాటి కెక్కువగా సాగిస్తూన్న తీవ్రనిర్బంధవిధానమునకు ప్రతికూలముగా భారతదేశములోని వివిధపక్షములవారి అభిప్రాయములను కేంద్రీకరింపజేయుట కీఅఖిలపక్షసమావేశ మాహ్వానింపబడినది. వంగరాష్ట్రప్రభుత్వమువారిచే ప్రయోగింపబడిన క్రిమినల్ లాసవరణచట్టమును ఆమహాసభవారు నిరసించిరి. దానినీ౧౯౨౫ నాటి మూడవరెగ్యులేషనును ఉపసంహరించుకొనవలసిన దని కూడ వారు ప్రభుత్వమువారిని కోరిరి. స్వరాజ్యసంస్థాపన మాలస్యమగుటయే ఈ అశాంతికి కారణ మని వారు నిర్ణయించిరి. సాంఘికపరిష్కారముతో కూడిన స్వరాజ్యప్రణాళికను తయారుచేయుట కన్ని రాజకీయపక్షములనుండి కొంద రుపసంఘసభ్యు లెన్నుకొనబడిరి. వారి నివేదిక ౧౯౨౫ మార్చి ౩౧ వ తేదీనాటికి తయారు కావలెనని నిర్ణయింపబడినది. ఈ మహాసభవలన మహోపకారము కలుగగలదని కాంగ్రెసువారెవరూ అనుకొనలేదు. కాని దానిమూలమున దేశబంధుదాసు నిర్బంధముమాత్రము తప్పిపోయినది. శాసనసభాప్రవేశసందర్భములోను, బహిష్కారపద్ధతిని తీసివేయుటలోను దేశబంధుదాసు మోతీలాలుపండితులకు గాంధీ లొంగిపోవుట ఈ సంవత్సరములో జరిగిన ముఖ్యఫలితము. ఈ ముగ్గురు మహామహులును నిర్ణయించిన ఏర్పాటుకు అ. భా. కాం. సం. వా రంగీకరించిరి. ఇప్పు డీముగ్గురును చేసిన సమష్టిప్రకటనమునకును, మే నెలలో చేయబడిన ప్రత్యేకప్రకటనములకును భేదమును పాఠకులు గమనింతురు గాక. "అన్నిపక్షములవారి సహాయమును పొందుటందుకు వీలుగా అసహాయోద్యమకార్యక్రమము జాతీయకార్యవిధానముగా విరమింపబడినది. ఒక్క విదేశవస్త్రబహిష్కారవిషయములోమాత్ర మది నిలిచి యున్నది. స్వరాజ్యపక్షమువారు శాసనసభలలో పనిచేయవలెను. తదితరులు తదితర నిర్మాణకార్యక్రమమును కొనసాగించుటకు తమ శక్తిసామర్థ్యములను వినియోగించవలెను." అని ఆసమష్టిప్రకటనముయొక్క సారాంశము. ఇందుకు బదులుగా గాంధీ మంచిప్రయోజనమును సంపాదించెను. ఇదివరకు కాంగ్రెసుసభ్యులు సంవత్సరచందాక్రింద ౨౦౦౦ గజముల స్వయముగావడికినసూలు నీయవలసియుండెను. ఇప్పుడు ప్రతినెలా ౨౦౦౦ గజము లీయవలెనని నిర్ణయింపబడినది. ఇది కేవలము కమిటీలలోని ఎన్నికసభ్యులకే వర్తించదు.

నాలుగణాల చందా నిచ్చిన ప్రతి కాంగ్రెసుసభ్యునకును ఈ నూలుచందా వర్తింపజేయబడినది. ఇక సంవత్సరము పూర్తికానుండెను. బెల్గాములో గాంధీ అధ్యక్షత క్రింద కాంగ్రెసు జరుగున ట్లేర్పాటు చేయబడినది.

## బెల్గాము కాంగ్రెసు, ౧౯౨౪

అసహాయోద్యమచరిత్రలో బెల్గాముకాంగ్రెసు నూతనయుగ ప్రారంభకమైనది. అప్పటికి గాంధీమతముపైన తిరుగుబాటు దాదాపు పరిపక్వస్థితికి వచ్చినది. కాంగ్రెసులోని రెండుకక్షులును స్పష్టముగా చీలిపోయేటట్లు కనబడెను. నోఛేంజర్లున్ను, స్వరాజ్యపక్షమువారున్ను చీలిపోయి ప్రతికక్షులుగా ప్రచారము సాగించడమా, లేక వారిలో వారేదో ఒడంబడిక చేసికొని భేదాభిప్రాయములను సమన్వయించుకోవడమా అనే ప్రశ్న ఉదయించినది. వారిరువురకు సంఘీభావమే కుదురవలెనన్న యెడల ఆ మహత్కార్యమును జయప్రదముగా నిర్వర్తింపగలవాడు గాంధీజీతప్ప మరియెవరు? ఆయన శాసనోల్లంఘనమును విరమించి నోఛేంజర్లను సంతృప్తిపరచగలడు; శాసనసభాప్రవేశమును నిరోధించి స్వరాజ్యవాదులను సమాధానపరచనూగలడు. నిజముగా మహాపురుషులే మహోద్యమములను నడుపగలిగేయెడల వారే తిరిగీ ఆ ఉద్యమములను ఆపివేయుటకుకూడా అర్హులు. కాబట్టి సరిగా సమయమునకు తగినట్లుగానే గాంధీ ౧౯౨౪ లో బెల్గాముకాంగ్రెసు కధ్యక్షత వహించెను. బెల్గాములోని ఆయన అధ్యక్షోపన్యాసము ఉదారాశయపూరితముగా నుండెనని మే మిక్కడ వ్రాయనవసరములేదు. కాంగ్రెసులో అది సంగ్రహముగామాత్రమే చదువబడినది. ఆయన ౧౯౨౦ సెప్టెంబరునుండీ కాంగ్రెసువ్యవహారము లేవిధముగా పరిణామము పొందినవో వివరించి కాంగ్రెసుసంస్థ ముఖ్యముగా జాతీయబలమునకు కారణభూతిమైన దని ప్రకటించెను. "ప్రజ లెవరికి సంబంధించినంతవరకు వారు బహిష్కారముల నాచరణలో పెట్టిరి. ఏ బహిష్కారమూ ఎంతమాత్రమూ పరిపూర్ణత్వమును పొందనప్పటికీ వాటిలో ప్రతిదీకూడ బహిష్కృతసంస్థయొక్క ప్రతిష్ఠనుమాత్రము తగ్గించినది. అన్ని బహిష్కారములలోకీ హింసాబహిష్కారము మహోత్కృష్టమైనది. కాని అహింస ఇంకా నిస్సహాయుల పద్ధతిగానే ఉపయోగపడుతూన్నది కాని ప్రవీణుల ప్రబలమైన ఆయుధముగా ప్రయోగింపబడుట లేదు. అసహాయవాదులు కానివారిపైన చూపబడే అసహనము దౌర్జన్యమునకు మరియొక సున్నితరూపము. ఏమైనప్పటికీ అహింసాతత్వము దౌర్జన్యమును నిరోధిస్తూన్నమాట నిజము. ఒక సత్కార్యముకొరకు త్యాగము చేయగలిగిన శక్తి అధికమైనకొలదీ అహింసాతత్వ మభివృద్ధికాగలదు. ఈఉద్యమ మింతటితో ఆపివేయవలసినకాలము వచ్చినది. చాలాసందర్భములలో అసహాయవాదము నవలంబించినవారు

పశ్చాత్తాపపడ ప్రారంభించిరి. అందుమూలమున వారిపైన కలిగిన ప్రతికూలఫలితము వారసహాయవాదులు కానప్పటికంటె ఎక్కువచేసును కలిగించినది. కాబట్టి అన్ని బహిష్కారములును ఇంతటితో విరమింపబడవలెను. విదేశవస్త్రబహిష్కారముమాత్రము నిలిచియున్నది. ఈబహిష్కారము భారతీయులహక్కుకాక వారి విధ్యుక్తధర్మము కూడాను. విదేశీజలమును, విదేశీబియ్యమును, విదేశీగోధుమలను బహిష్కరించుట భారతీయుల కెంత అవసరమో విదేశీవస్త్రములను బహిష్కరించుటకూడా అంతేఅవసరము. నిజానికి బహిష్కారములో నిర్బంధ మున్నది. కాని ఆనిర్బంధము సద్భావమువల్లనూ, సజ్జనత్వమువల్లనూ కలిగినదేకాని ద్వేషమువల్లనూ, క్రోధమువల్లనూ కలిగినదికాదు. లాంకుషైర్ వర్తక మవినీతికరమైనది. అది లక్షలకొలది భారతకర్షకుల వినాశముపైన ఆధారపడి కొనసాగింపబడుతూన్నది. ఈ అవినీతి ఇంకా అనేక అవినీతులకు మార్గదర్శకమైనది. ఇంగ్లాండు ప్రదర్శించే అన్ని అవినీతికరచర్యలను ఈ ఒక్కదుర్నీతి వ్యాపారములో ముడిపెట్టవచ్చును. కాబట్టి మన మందరము నూలువడికి బట్టలునేయు వృత్తిని ప్రోత్సహించవలసివచ్చినది. అందుమూలమున మనకు గ్రామస్థులతో ప్రత్యక్ష సంబంధము కల్గినది." అని గాంధీ ప్రసంగించెను. గాంధీ ఈమాటలుచెప్పేటప్పుడు బ్రిటిషు వస్తువులన్నీ మనకు హాని కలిగిస్తున్న వని ఆయనఉద్దేశము కాదు. ఒకవస్త్రములే-అవి బ్రిటిష్ దేశములో తయారుచేయబడినవి కానీ, తదితర దేశములలో తయారుచేయబడినవి కానీ- మనదేశమునకు హానికలిగిస్తూన్నవని ఆయన ఉద్దేశించెను. ఆయన యంత్రములకు కూడా ప్రతికూలముగా పోరాడదలచుకొనలేదు. కాని భారత దేశపుకుటీరపరిశ్రమ బుద్ధిపూర్వకముగాను, క్రూరముగాను నిర్మూలింపబడినందు కాయన ప్రతిఘటించెను.

స్వరాజ్యవాదులకును, ఆయనకును రాజీ కుదిరినది. వారు నూలుచందా కంగీకరించిరి. ఆయన వారు శాసనసభలలో పనిచేయుట కంగీకరించెను. తరువాత కోహాటు కొట్లాటలనుగూర్చి ఆయన విచారమును ప్రకటించెను. అకాలీలకు సానుభూతి చూపెను. అస్పృశ్యతనుగూర్చి మాట్లాడెను. స్వరాజ్యప్రణాళికను వివరించెను. రాట్నము, హిందూమహమ్మదీయసఖ్యత, అస్పృశ్యతానివారణములు స్వరాజ్యాదర్శమును పొందుటకు రాజమార్గములని ఆయన ప్రకటించెను. "ఆమార్గములను తెలుసుకొన్నచో నాకుచాలును. నాజీవితతత్వములో మార్గములున్నూ, ఆదర్శమున్నూ కూడా ఒక్కటే." అని ఆయన వెల్లడించెను. గాంధీయొక్క ఈ సిద్ధాంతమే ఇతర రాజకీయమతస్థులకు పడనిది. ఈ ఉపోద్ఘాతముతో ఆయన స్వరాజ్యప్రణాళికకు సంబంధించిన కొన్ని విషయములను సూచించెను.

శరీరకష్టము వోటింగుహక్కుగా నుండవలెననెను. సైనికవ్యయము తగ్గింపబడవలెననీ, న్యాయపరిపాలనము తక్కువవ్యయములో జరుగవలెననీ, వస్తుపదార్థములు నిర్మూలింపబడవలెననీ, వాటిపైన ప్రభుత్వమువా రాదాయము పొందకూడదనీ, సివిల్, మిలిటరీ జీతములు తగ్గింపబడవలెననీ, దేశము భాషాప్రయుక్తరాష్ట్రములుగా విభజింపబడవలెననీ, విదేశీయుల సర్వాధికారవాణిజ్యపద్ధతులు (Monopolies) పరిత్యజింపబడవలెననీ, సంస్థానవ్యవహారములతో కేంద్రప్రభుత్వమువారు జోక్యము కల్పించుకొనకూడదనీ, నిరంకుశాధికారములు రద్దుచేయబడవలెననీ, ప్రభుత్వోద్యోగములలో జాతివిచక్షణ చూపబడరాదనీ, అందరికీ మతస్వాతంత్ర్య ముండవలెననీ, దేశభాషలలో పరిపాలనము జరుగవలెననీ, హిందీ జాతీయభాషగా నుండవలెనని ఆయన అభిప్రాయ మిచ్చెను.

సంపూర్ణస్వాతంత్ర్యవిషయముకూడ ఆయన నాకర్షించకపోలేదు అహమ్మదాబాదుకాంగ్రెసు తరువాత ఆయన అభిప్రాయము లీవిషయములో కొంత మార్దవములైనవి. ప్రభుత్వమువారికి సంబంధించినంతవర కాయనఆశలు నిరాశలైనవి. "నేను సామ్రాజ్యాంతర్గత స్వరాజ్యమునే సంపాదింప ప్రయత్నింతును. కాని ఇంగ్లీషువారి తప్పిదమువలన బ్రిటిష్‌సంబంధమును వదులుకోవడమే అవసరమైనయెడల నేనట్టి సంబంధమును పూర్తిగా త్యజించుట కెంతమాత్రమును జంకను." అని ఆయన చెప్పెను. తరువాత ఆయన స్వరాజ్యపక్షమునుగూర్చి, నిర్మాణకార్యక్రమమును గూర్చి, వంగరాష్ట్రపరిస్థితులను గూర్చి, దౌర్జన్యరాహిత్యమునందాయనకు గల విశ్వాసమునుగూర్చి ఉదాహరిస్తూ ముచ్చటించెను. వంగరాష్ట్రమునందు రీడింగుప్రభువు ౧౯౨౪ సంవత్సరపు ౧వ ఆర్డినెన్సును ప్రయోగించెను. అందువల్ల స్థానికప్రభుత్వమువారు విప్లవసభ్యులని నమ్మి యెవ్వరినైనను వెంటనే అరెస్టుచేసి స్పెషల్ కమీషనర్ల యొద్దకు విచారణకు పంపవచ్చును. ఈ దండయాత్ర స్వరాజ్యవాదులకు ప్రతికూలముగా సాగింపబడినదనే అభిప్రాయముతో గాంధీకూడా ఏకీభవించెను.

బీయమ్మా, సర్ ఎ. చౌధరి, సర్ ఎ. ముఖర్జీ, భూపేంద్రనాధబాసు, డాక్టరు సుబ్రహ్మణ్య అయ్యర్, జి. యమ్. భూర్జీ మొదలగు అనేకమంది కాంగ్రెసువాదులు మరణించినందుకు బెల్గాముకాంగ్రెసు విచారమును ప్రకటించినది. గాంధీ, నెహ్రూ, దాసులమధ్య నవంబరులో జరిగిన అ. భా. కాం. సం. లో అంగీకరింపబడిన ఒడంబడిక ఈ కాంగ్రెసులో ఆమోదింపబడినది. ఆ ఒడంబడిక ననుసరించియే కాంగ్రెసు సభ్యుల వోటింగుహక్కులుకూడా మార్పుచేయబడినవి. హిందువులు కోహాటునుండివెళ్లి పోయినందుకు విచారము ప్రకటింపబడినది. కోహాటు మహమ్మదీయులు వారి హిందూ

సోదరులకు ధనప్రాణరక్షణకొరకు ఏమీ ఈయవలెనని హెచ్చరింపబడిరి. కోహాటు మహమ్మదీయులు గౌరవముగా ఆహ్వానిస్తేనేగాని కోహాటునుండి వెళ్లిపోయిన హిందువులు తిరిగీ రాకూడదని సలహా ఈయబడినది. నైజాము రాజ్యములోని గుల్బర్గా బాధితులకుకూడా ఈ విధముగానే సానుభూతి చూపబడినది. అస్పృశ్యత, వైకమ్ సత్యాగ్రహములనుగూర్చి చర్చింపబడినది. అకాలీ ఉద్యమము, సారాయివల్లమందుల వ్యాపారము—ఈ అన్నీ చర్చింపబడి తనరీతిగా తీర్మానింపబడినవి. కాంగ్రెసు నిర్మాణవిధానమున దు కొన్ని మార్పులు చేయబడినవి.

విదేశములలోని భారతీయులకు సేవచేసినందుకు సరోజినీదేవి, బెనారసీదాసు చతుర్వేదులు శ్లాఘింపబడిరి. ఈవిషయములో ప్రభుత్వమువారుకూడా ఊరకుండలేదు. ఇండియాప్రభుత్వమువారు కెన్యావిషయములో గట్టిగా పోరాడిరి. "కెన్యాలోని భారతీయుల కన్యాయము జరిగెయెడల భారతదేశము బ్రిటిష్ సామ్రాజ్యముతో సంబంధమును విడగొట్టుకొనవలెనని తీవ్రమైన ఆందోళనము బయలుదేరగలదు. వలసరాష్ట్రములకు ప్రతికూలముగా ప్రతిక్రియవిధానములుకూడా భారతీయులచే అవలంబింపబడవచ్చును." అని వారు భారతరాజ్యాంగకార్యదర్శిని మందలించిరి. ౧౯౨౩ లో జరిగిన సామ్రాజ్యసభకు భారతదేశముపక్షమున డాక్టరు తేజబహాదూరు సప్రూ, అల్వారు మహారాజులు ప్రతినిధులుగా వెళ్ళిరి. అందులో భారతీయులకు సమానహక్కు లుండవలె నని ౧౯౨౧ లో వలెనే తిరిగీ అంగీకరింపబడినది. అంతేకాక ఇండియాప్రభుత్వమువారు వలసరాష్ట్రభారతీయుల సహాయార్థమొకకమిటీని నియమింపవలెనని కూడ నిర్ణయింపబడినది. ఆ కమిటీవారితో ఒక్క దక్షిణాఫ్రికాప్రభుత్వమువారు తప్ప తక్కిన వలసరాష్ట్రప్రభుత్వములవా రందరును సంప్రతించుట కంగీకరించిరి. ఆ నిర్ణయముప్రకారము హోప్‌సింప్సన్, అగాఖాన్, సర్ బెంజిమన్, రాబర్ట్సన్, దివానుబహదూరు రంగాచారి, కె. సి. రాయి వలసరాష్ట్రకమిటీసభ్యులుగా నియమింపబడిరి. వారు ౧౯౨౪ ప్రథమదశలో లండనులో సమావేశమై కెన్యా, ఫిజీ, టాంగనాయికాలలోని భారతీయులకు చిరకాలమునుండీ ఉన్న కష్టములనుగూర్చి విచారించిరి. ౧౯౨౪ జూలై అంతమునకు వారిసమావేశము ముగిసినది. వలసపోవుటనుగూర్చి నిర్బంధముల నేర్పాటుచేసిన ఆర్డినెన్సు అమలు జరుపబడరాదని ౧౯౨౪ ఆగష్టులో వలసరాష్ట్రములకార్యదర్శి థామసు నిర్ణయించెను. భారతీయుల వోటింగుహక్కులవిషయములోను, వారు మెరకభూములను సంపాదించుకొనువిషయములోను ఇదివరకున్నస్థితి కేమీ భంగముకలుగలేదు. భారతీయవ్యవసాయకుల ఉపయోగమునిమిత్తము పల్లపుప్రదేశములు ప్రత్యేకింపబడవలెనని సూచింపబడి

నది. ౧౯౨౪ జూనులో బ్రిటిష్ ప్రభుత్వమువారిచే సౌత్ బరో ప్రభుని అధ్యక్షతక్రింద తూర్పుఆఫ్రికాకమిటీ ఒకటి నియమింపబడినది. భారతీయుల అభిప్రాయముల నా కమిటీవారు వినుట కంగీకరించిరి. దక్షిణాఫ్రికా ప్రభుత్వము మారుటమూలమున "క్లాసు ఏరియాబిల్లు" రద్దయినది. నేటాలులో ప్రత్యేకాధికారముక్రింద భారతీయులు ముందు ముందు స్వతంత్రపౌరులుగా చేర్చుకొనబడుటకు వీలుకలిగినటుల ఉత్తరువులు జారీ చేయబడినవి.

## 6. భాగలబ్ధమా, భాగస్వామ్యమా ?

### ౧౯౨౫

[స్వరాజ్యపక్షమువారి విజయపరంపరలు - గాంధీపర్యటనము - దాసు చిత్తవృత్తి - ఫరీదుపూర్‌లో దాసు చేసిన ఉపన్యాసము - దాసుకు బర్కెన్ హెడ్డునందలి విశ్వాసము - దాసుతరువాత వంగరాష్ట్రనాయకుడు - గాంధీ తన అధ్యక్షతపదవికి రాజీనామా యిత్తుననుట - మడ్డిమన్ సంఘము - స్వరాజ్య పక్షమును ప్రభుత్వమువారు సంతోషపెట్టుటకు చేసిన ప్రయత్నములు - గాంధీ చేసిన రాజీనామాసూచనకు మోతీలాలు స్తుతించుట - మధ్యమార్గము - పాటలీ పుత్రమునందలి అ. భా. కాం. సం. సమావేశము విభాజ్యము - చర్చ - మోతీ లాలుఆగ్రహము - మోతీలాలుచేసిన పరిహారము - గౌరవవిషయము - భాగ లబ్ధమా, భాగస్వామ్యమా - దాసునిర్బంధమునుగూర్చి బెదరింపు - రానున్న కాన్పూరు కాంగ్రెసు - భారత నారీమణి ధర్మము - కాంగ్రెసు రథ మాగిపోయినది - స్థానికసంస్థలయందలి ఉత్సాహము - స్వరాజ్యపక్షము లోని ఆంతరంగికకల్లోలము - కేల్కారువిమర్శనము - మూడురాజీనామాలు - ఏజెన్సీ తెలుగుజిల్లాలలో తిరుగుబాటు - కాన్పూరుమహాసభ - సరోజినీదేవికి గాంధీ అధికారమును ఒప్పగించుట - సరోజినీదేవి అధికారము వహించినది - స్వాతంత్ర్యయుద్ధము - మహాసభావ్యవహారములు - ప్రధానతీర్మానము - మాలవ్యాపండితుని సవరణ - ఇతరతీర్మానములు - రివరెండుహోమ్సు కాంగ్రెసుకు హాజరగుట - హిందూమహమ్మదీయకొట్లాటలు - సుకుద్వారాసమస్య.]

౧౯౨౫లోని కాంగ్రెసురాజకీయములు చాలావరకు శాసనసభాకార్యక్రమమునకు సంబంధించియున్నవి. స్వరాజ్యవాదులకు నోఛేంజర్ల అభ్యంతరము తీరినది. ఉభయపక్షములను సమన్వయించుటకు మధ్య గాంధి కలడు. దాసు, నెహ్రూ, పటేలు, లాలాజీలవంటి మహాపురుషు లితరులకు ఛాయాగ్రహములుగా నుండదలచుకొనలేదు. వంగమధ్యరాష్ట్రములలో ద్వంద్వపరిపాలన కుంటిరించినది. లిట్టన్ ప్రభువు కోరినప్పటికీ దాసు మంత్రివర్గము నేర్పాటుచేయ నిరాకరించెను. ఇతరు లెవరున్నా మంత్రివర్గమును స్థాపించుటకు వీలులేకుండాకూడా ఆయన చేసెను. అవిఘ్నమైన విధ్వంసకార్యవిధానమునే ఇంతకాలమునుండీ దాసు భావిస్తూన్నది. ౧౯౨౪ లో రీడింగు ప్రభువు చేసిన బెంగాలు ఆర్డినెన్సు పరిసమాప్తి నొందినది. కాబట్టి అది తిరిగీ ఒక బిల్లు రూపములో వంగరాష్ట్రశాసనసభయందు ప్రవేశపెట్టబడినది. ౧౯౨౫ జనవరి నెలలో స్వరాజ్యవాదుల బలమువలన ఆ బిల్లు నిరాకరింపబడినది. లిట్టను ప్రభువు దానిని పునరుద్ధరించి బ్రిటిష్ ప్రభుత్వమువారి అంగీకారముకోసము లండను పంపించెను. ౧౭ వ ఫిబ్రవరి తేదీని వంగరాష్ట్రశాసనసభలో మంత్రులజీతములకొరకు బడ్జెటులో అవకాశము కల్పింపబడవలెనని ప్రభుత్వమువారికి సిఫారసుచేస్తూ తీర్మానము జరిగినది. ఇది స్వరాజ్యవాదుల కపజయము. కాని ఈ నష్టమునకు తగిన పరిహారము వెంటనే వారికి కలిగినది. మార్చి ౨౩ వ తేదీని బడ్జెటుచర్చ వచ్చినప్పుడు, అంతకుపూర్వము నియమింపబడిన ఇద్దరు మంత్రుల జీతములూ నిరాకరింపబడినవి. ఆ తీర్మానమునకు స్వరాజ్యపక్షమువారికి ౬౯ వోట్లును, ప్రభుత్వపక్షమువారికి ౬౩ వోట్లును వచ్చినవి. స్వరాజ్యపక్షమువారి ప్రకటన కనుగుణముగా వంగరాష్ట్రములో ఈ విధముగా సహాయనిరాకరణోద్యమము నడుపబడుతూన్నప్పుడే మధ్యరాష్ట్రములందు, స్వరాజ్యపక్షమువారు మంత్రిపదవులనుకూడా స్వీకరించి ఏల లోపలనుండి ప్రభుత్వమును విధ్వంసము చేయగూడదని బహిరంగముగా వాదోపవాదములు బయలుదేరినవి. కేంద్రశాసనసభలో స్వరాజ్యపక్షమువారు ౧౯౨౪-౨౫ సంవత్సరములలో కేవలము రాజ్యాంగశాస్త్రానుకూలమైన ప్రభుత్వప్రతికూలపక్షముగా నుండి పనిచేసిరి. వారుప సంఘసభ్యులుగానుండి, ఉపయోగకరములైన శాసనముల సందర్భములో ప్రభుత్వమునకు సహాయముకూడా చేసిరి. వారు కొన్ని సమయములయం దొకపక్షముతోను, మరి కొన్నివేళల వేరొకపక్షముతోను, అప్పుడప్పుడు ప్రభుత్వమువారితోను కలసి వోటు చేసిరి.

బెంగాలు ఆర్డినెన్సును శాసనాధికారముద్వారా రద్దుచేయవలెనని సీ. దొరస్వామి అయ్యంగారు ప్రతిపాదించిన తీర్మానము ౫౮ వోట్లతో అంగీకరింపబడినది.

అందుకు వ్యతిరేకముగా ౪౫ మాత్రమే వచ్చినవి. ౧౯౨౫ ఫిబ్రవరి 3 వ తేదీని విఠల్‌భాయిపటేల్ ౧౮౫౦ నాటి స్టేటుప్రిజనర్ల చట్టమును, ౧౮౬౭ నాటి సరిహద్దురాష్ట్రముల దురాగతనిరోధకచట్టమును (Frontier outrages Act 1867), ౧౯౨౧ నాటి రాజద్రోహసభానిరోధకచట్టమును రద్దు చేయించుట కొక బిల్లును ప్రవేశపెట్టెను. ఆ బిల్లు సరిహద్దురాష్ట్రములచట్టమువిషయములో తప్ప తక్కిన విషయములలో అంగీకరింపబడినది.

రైల్వే కంపార్టుమెంటులు కొన్ని ప్రత్యేకసంఘములకు ప్రత్యేకించి ఉంచబడే పద్ధతిని నిర్మూలింప నుద్దేశించి నియోగి రైల్వేచట్టమునకు సవరణను ప్రతిపాదింపకోరెను. కాని అది నిరాకరింపబడినది. డాక్టరు గౌరు ప్రీవీకౌన్సిల్ అప్పీలుపద్ధతిని తీసివేయవలెనని తీర్మానమును ప్రతిపాదించెను. కాని స్వరాజ్యవాదులు ప్రభుత్వమువారితో కలిసి వోటుచేయుటచేత అది నిరాకరింపబడినది. ఆ సందర్భములోనే పండితమోతీలాలు నెహ్రూ లండనులో నున్న ప్రీవీకౌన్సిలుకు మనము కొంతకాలమువరకూ అప్పీళ్లను చేసుకొనవలసియేయున్నదని ప్రసంగించెను. ఇండియాలో వెంటనే సైనికకళాశాలను స్థాపింపవలెనని వెంకటపతిరాజు తీర్మానము నుపపాదించెను. ఆ సందర్భములో గవర్నమెంటువా రోడిపోయిరి. ౨౫-౨-౨౫ తేదీని రైల్వే బడ్జెటునుగూర్చి చర్చవచ్చినప్పుడు, ఆర్థికసభ్యులను విడిచిపెట్టి స్వరాజ్యవాదులును, స్వతంత్రపక్షమువారును వారిలోవారు హోరాహోరి పోట్లాడుకొనిరి. అందుమూలమున రైల్వేబడ్జెటును నిరాకరించవలెనని మోతీలాలుపండితుడు తెచ్చినతీర్మానము ౬౩ వోట్లతో వీగిపోయినది. అందు కనుకూలముగా ౪౧ వోట్లుమాత్రమే వచ్చినవి. దీనినిబట్టి బడ్జెటుచర్చ కేవల మాయావిషయముల గుణాగుణములనుబట్టి మాత్రమే జరిగినదన్నమాట వాస్తవము. అంతేకాని స్వరాజ్యపక్షమువారిచే సూచింపబడినట్లుగా నిరంతరమూ ప్రభుత్వ వ్యవహారముల కాటంకము కలిగించేపద్ధతిమీద జరుగలేదు. ప్రభుత్వకార్యనిర్వాహకసభ్యుల ప్రయాణపుఖర్చులు నిరాకరింపబడవలె నని మోతీలాలుపండితుడు తెచ్చిన తీర్మానము ౬౫ వోట్లతో గెలిచినది. అందుకు ప్రతికూలముగా ౪౮ వోట్లు వచ్చినవి. ఈతీర్మానమున కనుకూలముగా వోటుచేసినవారంతా ఒకటేఅభిప్రాయముతో వోటు చేసినవారు కారు. అన్నిపక్షములవారికీ అన్నికారణము లున్నవి. కోహాటు దురాగతములు, సైనికోద్యోగములు భారతీయులపరముచేయబడుట, ముడ్డిమన్ నివేదిక, రెండుటేబిలుసభ, నిర్బంధవిధానము—ఈ అన్నీ స్వరాజ్యపక్షమువారిచే చర్చింపబడినవి. వంగరాష్ట్ర క్రిమినల్‌లా సవరణచట్టముక్రిందికేసులు హైకోర్టు కపీలుచేయబడుటకు వీలుగా భారతశాసనసభలో ఒకబిల్లు ప్రవేశపెట్టబడినది. అప్పు డొక చిత్రమైన పరిస్థితి యేర్పడినది. ఆబిల్లులో నిర్బంధితులు తమ నిర్బంధ కారణమునుగూర్చి ప్రశ్నించే అధికారము

తీసివేయబడినది. ఆకేసులకు సంబంధించిన ముద్దాయీలను వంగరాష్ట్రమునకు వెలుపలి జైళ్లలో నుంచుటకు కూడా అధికార మీయబడినది. ఈ పైరెండు విషయముల కోసమున్నూ ఆ బిల్లులో మూడు నియమము లేర్పాటుచేయబడినవి. స్వరాజ్య వాదులును, స్వతంత్రపక్షమువారును ఈ మూడునియమములను నిరాకరించి మొదటి నియమమునకు మాత్రము వోటుచేయ తలపెట్టిరి. అందుమూలమున ప్రభుత్వమువారు తలపెట్టినబిల్లులోని ఉద్దేశము రూపుమాసినది. రీడింగుప్రభువు దానిని స్టేటు కౌన్సిలుకు పంపి అది అక్కడ అంగీకరింపబడినపిమ్మట దానిని తాను పునరుద్ధరించెను.

ఇప్పటికే చిత్తరంజనదాసు కాంగ్రెసులో ప్రాముఖ్యస్థానమువహించెనన్నమాట స్పష్టము. పైగా బెల్గాముకాంగ్రెసు జరిగేముందు దాసు తన యావదాస్తినీ ఒకధర్మ కార్యముకొరకు దానముచేయ నిశ్చయించుకొనెనని ప్రకటింపబడినది. దానితో ఆయ నను ప్రజలు మహాపురుషునిగా చూచిరి. అంతలో బెసెంటుచే స్థాపింపబడిన జాతీయ సమితివారు కామనువెల్తు ఆఫ్ ఇండియాబిల్లును ప్రకటించిరి. ఐకమత్యమహాసభ నియ మించిన కమిటీవారు మతకలహములను తుదముట్టించుటకు తీవ్రముగా నాలోచింప ప్రారంభించిరి. ఫిబ్రవరి ౨౫ వ తేదీని హిందూమహాసభపక్షమున లాలాలజపతిరాయి ఆవిషయములో కొన్నిప్రశ్నలను ప్రకటించెను. బొంబాయిలో క్రిందటి నవంబరులో జరిగిన అఖిలపక్షమహాసభవారిచే నియమింపబడిన ఉపసంఘమువారు ప్రకృతమున కనుకూలమైన స్వరాజ్యప్రణాళికను తయారుచేయలేకపోయిరి. అందువలన వారు మార్చినెలలో కాలనిర్ణయములేకుండా సమావేశము నాపివేసిరి. గాంధీ ౧౯౨౫ మార్చి, ఏప్రిల్ నెలలలో కేరళరాష్ట్రమునందును, దక్షిణభారతదేశమునందును సంచారము చేసెను. తీవ్రముగా సాగుతూన్న వైకాము సత్యాగ్రహమునందు గాంధీ జోక్యము కలిగించుకొని రాజీచేసెను. వైకాములో అంటరానివాండ్లని పిలువబడే కొందరిని కొన్నివీథులలోనుండి నడువనీయని దురాచార మున్నది. దానిని నిర్మూలించుటకు సత్యాగ్రహము ప్రారంభింపబడినది. సత్యాగ్రహుల నావీథులలో ప్రవేశింపకుండా చేయుటకు తిరువాన్కూరుప్రభుత్వమువారు కొంతమందిని కావలిపెట్టిరి. కొన్నిచోట్ల కొన్ని ఆటంకములను కల్పించిరి. తిరువాన్కూరుప్రభుత్వమువారు హిందూ పూర్వా చారపరాయణుల కనుకూలముగా తమ అధికారబలమును వినియోగించి వైకాముసత్యా గ్రహులను నిర్బంధములపాలు చేయుట ఆ ప్రభుత్వవిధానమునకు శ్రేయస్కరము కాదని వారికి తెలియచేయబడినది. తరువాత వారు సత్యాగ్రహుల కిదివరలో కల్పింప బడిన అడ్డంకులను తొలగించిరి. ఆసత్యాగ్రహ మంతటితో ప్రజాభిప్రాయమును పరి పక్వ మొనరించేనిమిత్త మాపివేయబడెను. గాంధీ దక్షిణాదినుండి వంగరాష్ట్రమున కేగెను. దానుకు శరీరములో జబ్బేర్పడినది. ఆయనకు సాయంకాలములందు కొద్దిగా

జ్వరము తీసుకొనుచున్నట్లు కన్పించెను. శరీరారోగ్యముకొరకు ఆయన యూరపుఖండ మునకు పోవుట కేర్పాటు చేయబడినది.

ఆరోజులలో ఆయన బ్రిటిష్ ప్రభుత్వమువారితో సంధిచేసుకొనవచ్చునని గంపె డాశతో నుండెను. అంతకుపూర్వ మొకసంవత్సరముక్రిందటనే ఆయన మద్రాసువచ్చి ఉపన్యసించినప్పుడు అహమ్మదాబాదుకాంగ్రెసుకుముందుజరిగిన గాంధీ, రీడింగురాయ బారములగూర్చి ఉదాహరిస్తూ గాంధీ వ్యవహారములను చెడగొట్టెనని ప్రసంగించెను. అంతేగాక ఆలీపురము జైలులో తా నున్నప్పుడు తన కీరాజీనామాషరతులు పంప బడినవనికూడ ఆయన ప్రకటించెను. పెద్దపెద్దఉద్యమములను నడిపిన ప్రజాసేవకులలో ఇటువంటి 'జయము' లను గూర్చిన చిత్తవృత్తి సర్వసాధారణ మైపోయినది. ౧౯౧౭ లో మాంటేగు భారతదేశమును సందర్శించినప్పుడు బెసెంటుకూడ ఈవిధము గానే ఉప్పొంగిపోయెను. ఆమె అంతకుపూర్వము భారతదేశములోని ఆందోళనము వలన బ్రిటిష్‌సామ్రాజ్యమును చలింపజేసినది. వంగరాష్ట్రములో చిత్తరంజనదాసు అనేకమహత్కార్యములను చేసెను. ౧౯౨౧ లో మహత్తరమైనచిటగాంగుసమ్మేళను ఆయన నడపెను. ఆయనరాజధాని కనీవినీ ఎరుంగనిరీతినియువరాజును సంపూర్ణముగా బహిష్కరింపగలిగినది. ఆయన వంగరాష్ట్రశాసనసభను స్వాధీనపరచుకొని మంత్రి వర్గనిర్మాణ మసంభవముచేసిద్వంద్వపరిపాలనమును విధ్వంసమొనర్చెను. ఇన్ని దెబ్బలు కొట్టిన దాసుతో ప్రభుత్వమువారికి రాజీ ఎందుకు కుదరదు ?

ఈచిత్తవృత్తితోనే ఫరీదుపూరులో జరిగిన వంగరాష్ట్రమహాసభలో దాసుకొన్ని షరతులను ప్రతిపాదించి వాటిని గవర్నమెంటువా రంగీకరించేయెడల తాను వారికి సహాయముచేయ సిద్ధముగా నున్నానని ప్రకటించెను. గాంధీ మనము రాజీచేసుకోతగి నట్లుగా ప్రభుత్వమువారికి హృదయపరివర్తనము కలుగలేదని తలంచెను; దాసు కలిగిన దని విశ్వసించెను. "నా కన్నిచోట్లా హృదయపరివర్తనము కనబడుతూన్నది. ఎక్కడ చూచినా సంధిసూచనలు గోచరమవుతూన్నవి. ప్రపంచకము పోరాటములతో విసుగు చెందినది. కాబట్టి మనశక్తులను కేంద్రీకరించుకొని నిర్మాణవిధానమునకు పూనుకొన వలెనని అందరికీ నిజమైనకోరిక కలుగుతూన్నట్లు నా విశ్వాసము." అని చిత్తరంజన దాసు ౧౯౨౫ మే మొదటివారమున ఫరీదుపూరునందు స్టేట్సుమన్ పత్రికాప్రతినిధికి తనఅభిప్రాయమును వెల్లడించెను. అదేసమయములో "దాసుచెప్పినట్లుగా నాకు సహాయ నిరాకరణము మానసిక ప్రవృత్తికి సంబంధించినది. నే నా మానసికవృత్తికే యెక్కువ విలువనిత్తును. బ్రిటిష్‌వారికి స్నేహితుడుగా వారిలో హృదయపరివర్తన మెంతమాత్రమూ కనపడుటలేదని నేనువారికి చెప్పదలచుకొన్నాను"అని ఆస్టేట్సుమన్ ప్రతినిధితో నేగాంధీ చెప్పెను. దాసుఫరీదుపూరుఉపన్యాసములో విశ్లేషకును,మాకునుగౌరవప్రదములైనషరతు

లతో మీరీనాడు సంధిచేసుకొనవచ్చును "అనికూడ బ్రిటిష్‌వారినుద్దేశించి ప్రకటించెను. ఈ సమయములో చిత్తరంజనదాసు తన 'అటర్నీ' అనీ, స్వరాజ్యపక్షము కాంగ్రెసుకు ప్రాతినిధ్యము వహిస్తున్నదనీ గాంధీ ప్రకటించెను. గాంధీ స్వీయప్రతిష్ఠను త్యజించేపద్ధతిని చూచినయెడల ప్రతివారికీ ఆశ్చర్యకరముగానుండును. కొన్ని సందర్భములలో ఆయనపద్ధతి పూర్వకాలపు నోఛేంజర్ల కెంతో కష్టముగా ఉండేది. ఫరీదుపూరులో దాసు తనరాజీషరతులను ప్రకటించెను. హింస అవినీతికరమేకాక అనాచరణయోగ్యమనికూడ ప్రకటించెను. "ప్రజలకు నిజమైనబాధ్యత కొంత ఈయబడినయెడల మనము ప్రభుత్వముతో సహాయపడవలసినదే కాని రెండువిషయములుమాత్రము జరుగవలెను. మొదటిది, ప్రభుత్వమువారికి హృదయపరివర్తనము కలుగవలెను. రెండవది, తక్షణము సంపూర్ణస్వరాజ్యసిద్ధికి హామీ ఈయబడవలెను. ఈసత్వర స్వరాజ్యసిద్ధికి తగినయేర్పాటులు, తిరిగీ పార్లమెంటువారి విచారణతో నిమిత్తములేకుండా రాజ్యాంగప్రణాళికలోనే చేర్చబడవలెను. మనము మననిర్మాణకార్యక్రమమును ప్రారంభించుటకవకాశము కలిగించుకొనవలె నన్నచో గొప్పత్యాగము చేయవలసియున్నదని నాకు తెలుసును. నేడు స్వరాజ్యమునకు శంకుస్థాపనము చేయబడినయెడలనూ, పరిపాలకులకున్నూ, ప్రజలకున్నూ నిజమైన హృదయపరివర్తనము కలిగినయెడలనూ స్వరాజ్యభవననిర్మాణమునకు కావలసిన కొద్దిసంవత్సరములు జాతీయచరిత్రలో పెద్దకాలముగా భావింపబడదని నాకు తెలుసును. ఈ "హృదయపరివర్తన" మనేమాట చాలా ఇంపుగానే ఉన్నదిగాని ఇది కార్యరూపములో ప్రదర్శింపబడవలెనని మీరందురు. దానికి నే నంగీకరింతును. కాని ఆప్రదర్శనము ముఖ్యముగా సంధిరాయబారములవలన కలిగిన వాతావరణముపైన ఆధారపడియుండును. ఏరాజీఅయినను ఆరాజీయందలి షరతులలో కంటె ఆషరతులకు వెనుకనున్న మనోభావములపైన ఆధారపడియుండును. వాటినిబట్టి ప్రతిపక్షులను విశ్వసింపవచ్చునో, కూడదో తేలికగా గ్రహింపవచ్చును.

"వంగరాష్ట్రప్రజలకు సంతోషదాయకములైన కొన్ని సూచనలను నేను చేయగలను. (౧) అందరు రాజకీయఖైదీలను విడిచిపెట్టుట, (౨) బ్రిటిష్‌సామ్రాజ్యాంతర్గత సత్వరస్వరాజ్యసంస్థాపనకు మనహక్కు గమనింపబడి, అందుకు తగిన హామీ ఈయబడుట. ఈలోగా ఆస్వరాజ్యసంస్థాపనమునకు తగినట్లుగా రాజ్యాంగనిర్మాణమునందు పునాది నిర్మింపబడుట. (3) ఇక మనము మనపక్షమున వాక్యరూపకములోగాని, కార్యరూపకములోగాని, సంజ్ఞారూపకములోగాని విప్లవప్రచారమును ప్రోత్సహింపమనీ, ఆఉద్యమమును నిర్మూలింతుమనీ ప్రభుత్వమువారి కేదో ఒకవిధముగా విశ్వాసము కలిగింపవలెను." అని దాసు తనషరతులను వెలడించెను.

దీనినిబట్టి పైన సూచింపబడిన రాజీకిన్నీ, అరాజకోద్యమమును రూపుమాపు జాతీయప్రయత్నములకున్నూ సంబంధము కలుపబడినట్లు తోచును. అందుమూలమున ఫరీదుపూరురాష్ట్రీయసభకు విప్లవప్రచారముతో సంబంధ మున్నట్లుగా భావింప కూడదు. ప్రభుత్వమువారిలో కలిగిన హృదయపరివర్తనమువలన విప్లవకారులు ప్రజాసేవకులుగా మారిపోదు రని దాసుఉపన్యాసములోనిభావము. ఈసమయములో రీడింగుప్రభువు కొద్దికాలము సెలవుతీసుకొని భారతదేశమునుండి సీమకు పోయియుండుటచేతనూ, బర్కెన్ హెడ్డుప్రభువు శాసనసభలను విధ్వంసముచేయక ప్రభుత్వమునకు సహాయపడవలెనని స్వరాజ్యవాదులను కోరియుండుటచేతనూ చిత్తరంజనదా సీవిధముగా నుపన్యసించెను. అదీగాక కల్నల్ వెడ్జివుడ్డు, రామ్సేమాక్డనాల్డులుకూడా ఆరోజులలో ఇంగ్లాండు, ఇండియాదేశములకు రాజీకుదర్చవలెనని శ్రద్ధతీసికొన దొడగిరి. గాంధీ చిత్తరంజనదాసుకు అవసరమైనప్పుడు సలహాదారుగామాత్ర ముండెను. కాని దాసు మరణించినపిమ్మట కొన్నివిషయములు తెలిసినవి. వాటినిబట్టి ఆయనకు బర్కెన్ హెడ్డుప్రభువునందు విశేషవిశ్వాస మున్నట్లున్నూ, బర్కెన్ హెడ్డు ఇండియాకు మహోపకారముచేయగలడని ఆయన నమ్మినట్లున్నూ తెలియవచ్చినది. బర్కెన్ హెడ్డు ప్రభువుగా చేయబడకమునుపు ఆయన ఎఫ్. ఇ. స్మిత్ అనేపేరుతో వ్యవహరింపబడుతూండెను. ఆయన చాలా గొప్పలాయరు. చిత్తరంజనదాసుకూడా గొప్పలాయరే. ఎఫ్. ఇ. స్మిత్ ఐర్లండు, ఇంగ్లాండుదేశములకు కలహమువచ్చినప్పుడు ఐర్లండుస్వాతంత్ర్యమున కనుకూలముగా పనిచేసెను. కర్జన్ప్రభు వారోజులలో సర్ ఎడ్వర్డు .కర్జన్ గా వ్యవహరింపబడుతూండెను. కాని ఆయన ఐర్లండుస్వాతంత్ర్యమునకు కేవలము ప్రతికూలుడు. ఎఫ్. ఇ. స్మిత్ ఇంగ్లాండు, ఐర్లండు దేశముల రాజీప్రయత్నములలో ఐర్లండుపక్షమున గట్టిగాపనిచేసి కర్జన్ను తనపక్షమునకు త్రిప్పుకొనకలిగెను. ఐర్లండుకు సహాయముచేయకలిగిన ఆ స్మిత్ ఇండియా కెందుకు సహాయపడ డని దాసుఅభిప్రాయ మైనట్లు తెలియవచ్చినది.

దాసు తన అంత్యదశలో మోతీలాల్ పండితున కొక ఉత్తరము వ్రాసెను. అందులో " మన చరిత్రలో సందిగ్ధస్థితి రానున్నది. ఈ సంవత్సరము చివరలోను, ముందుసంవత్సరము ప్రారంభములోను మన యావచ్ఛక్తినీ వినియోగించి మనము పనిచేయవలసియున్నది. కాని మన ఇద్దరి ఆరోగ్యముకూడ సరిగాలేదు. ఏమిజరుగనున్నదో దేవుడికే ఎరుక. " అని యుండెను. దానిని మోతీలాలుపండితుడు దాసు వ్రాసిన రాజకీయమరణశాసన మని వర్ణించెను. తరువాత కొద్దికాలమునకే ౧౯౨౫ జూన్ ౧౬ వ తేదీని మనలను, వంగరాష్ట్రమును విడిచి దాసు మరణించెను. దాసుజీవితము భారతదేశచరిత్రలో ఒక అధ్యాయము. దాసుమరణమునుగూర్చి "దాసుకు సా

చిహ్నముగా మన మేమి చేయగలము! కళ్లనీళ్లు పెట్టుకొనుట తేలికైనపని. కాని మన కన్నీటిధారలు మనకుగాని, ఆయనతో సన్నిహితసంబంధముగల ప్రేమాస్పదులకుగాని ఏమీ ఉపకారము చేయజాలవు. మన మందరము హిందువులు, మహమ్మదీయులు, పార్సీలు, క్రైస్తవులు అనే భేదము లేకుండా, భారతీయుల మనుకొనేవార మందరము ఆయన చేసినపనిని కొనసాగించేయెడల కొంతమంచిపని చేసినట్లుగా భావించుకొనవచ్చును. మన కందరికీ దేవునిలో నమ్మిక మున్నది. ఈ శరీరము శాశ్వతముకాదనే సంగతి మన మెరిగియుండవలెను. ఆత్మమాత్రము శాశ్వతమైనది. దాసుయొక్క భౌతికశరీరము నశించినది. ఆయన ఆత్మ నశించదు. ఆయన ఆత్మే కాదు; భారతదేశముకొరకు సర్వసంగపరిత్యాగముచేసిన ఆయనపేరుకూడా ఆచంద్రార్కము నిలువగలదు. కొద్దిదూరమైనా ఆయనఅడుగుజాడల నడువగలిగిన యువకులున్నూ, వృద్ధులున్నూ ఆయనపేరు చిరస్మరణీయ మొనర్చుటకు సహాయపడినవా రగుదురు. ఆయనబుద్ధిసంపద మన కెవరికినీ లేదు. కాని ఆయన మాతృదేశమును ప్రేమించిన విధానమును మన మనుకరింపవచ్చును." అని ఖుల్నాలో గాంధీ ఉపన్యసించెను. ఇక దాసునుగూర్చి ప్రభుత్వమువా రిచ్చిన అభిప్రాయము — "శత్రుపక్షములోని దుర్బలత్వమును తెలుసుకొనుటలో దాసుకు స్వతస్సిద్ధమైన చాకచక్య మున్నది. తా నుద్దేశించిన కార్యక్రమమును ఆచరణలో పెట్టేవిషయములో కూడా ఆయనకు గొప్పపట్టుదల ఉన్నది. అందువలననే ఆయనసహచరులలో ఆయన కంత ఉన్నతస్థానము లభించినది." గాంధీవలెనే ఆయనకూడ ప్రతిపక్షులచేత అనేకపర్యాయములు కొనియాడబడెను. ఆయనమరణానంతర మనేకమంది యూరోపియనులు చివరకు ప్రభుత్వోన్నతోద్యోగులు కూడా హృదయపూర్వకముగా ఆయన ననేకపర్యాయములు శ్లాఘించియుండిరి. హిందూదేశ రాజ్యాంగకార్యదర్శి, రాజప్రతినిధులు దాసుమరణమువలన భారతీయులకు కలిగిన కొరతకు చింతిల్లుతూ సందేశములను పంపిరి. భారతశాసనసభ ఆగస్టునెలలో సమావేశము కాగానే దాసుమరణముమూలమునను, ౧౯౨౫ ఆగస్టు ౬ వ తేదీని స్వర్గస్థుడైన సర్ సురేంద్రనాథబెనర్జీమరణమువలనను భారతజాతికి కలిగిన నష్టమునకు దుఃఖము ప్రకటింపబడినది.

గాంధీ దాసును ప్రేమించెను. దాసుచేసిన ఘనకార్యముల కాయనను సన్మానించెను. ఆయనయెడల గాంధీ చాలా ఔదార్యముగా ప్రవర్తించెను. ఆయన వంగరాష్ట్రములో మకాముపెట్టి దాసుగౌరవార్థము స్మారకచిహ్నము నిర్మించెను. ఆయన ౧౦ లక్షలరూపాయలను వసూలుచేసెను. దాసుగృహము (౧౪౮రసారోడ్డు, కలకత్తా) భారతజాతికి కానుకగా సమర్పింపబడినది. బెంగాలు కాంగ్రెసుకు ముందు దాసు ప్రకటించిన ట్రస్టుసెక్కుప్రకార మది స్త్రీలకొరకును, పిల్లలకొరకును అను

పత్రికా మార్పించబడినది. గాంధీ తరువాతకూడ వంగరాష్ట్రములోని స్వరాజ్యపక్షము వారిని బలపరచుట కనేక ప్రయత్నములు చేసెను. వంగరాష్ట్రశాసనసభలో స్వరాజ్య పార్టీనాయకుడైన జె. యమ్. సేనుగుప్తను కలకత్తా కార్పొరేషను మేయరుగా చేయుటకును, వంగరాష్ట్రకాంగ్రెసుసంఘమున కధ్యక్షునిగా చేయుటకును గాంధీ కృషిచేసెను. చిత్తరంజనదాసు తరువాత సేనుగుప్త వంగరాష్ట్ర కిరీటాధిపతిగా చేయబడెను.

గాంధీ తన శక్తివంచనలేకుండా స్వరాజ్యపక్షమునకు సహాయముచేయ తల పెట్టెను. ఎవరైనా కొంతమంది స్వరాజ్యపక్షములో చేరుటకు సందేహిస్తున్నయెడల వారివికూడా తక్షణము స్వరాజ్యపక్షమునందు చేరవలసినదని ప్రోత్సహించెను. గాంధీ యొక్క ఈచిత్తవృత్తి కనుగుణముగా స్వరాజ్యపక్షమువారి ప్రవర్తనము లేదు. బెల్గాము కాంగ్రెసులో అంగీకరింపబడిన నూలుచందాకు నానాటికి స్వరాజ్యపక్షమువారు ప్రతికూలభావమును ప్రకటింపసాగిరి. అ. భా. కాం. సం. లో స్వరాజ్యవాదులే అధికసంఖ్యాకులుగా నుండుట మూలమున వారి కిష్టమైనచో ఎప్పుడైనను దానిని రద్దుచేయుటకు వీలు కలదు. కలకత్తాలో జూలై ౧౫ వ తేదీని జరిగిన కాంగ్రెసుకార్యనిర్వాహకసభ ముగియనున్నప్పుడు గాంధీ మోతీలాల్ నెహ్రూకు ఒక చీటీపంపినట్లు తెలియవచ్చినది. అందులో కాంగ్రెసులో స్వరాజ్యపక్షమువారధిక సంఖ్యాకులుగా నున్నారు కాబట్టిన్ని, మోతీలాల్ నెహ్రూ స్వరాజ్యపక్షాధ్యక్షుడు కాబట్టిన్ని కాంగ్రెసుఅధ్యక్షపదవినికూడా ఆయనసే స్వీకరించవలసినదని గాంధీ కోరెను. తానా కాంగ్రెసుకార్యనిర్వాహకసభ కింక అధ్యక్షుడుగా నుండజాలననికూడా గాంధీ స్పష్టపరచెను. ఈ చీటీ స్వరాజ్యవాదులలో గొప్పకల్లోలము కలిగించినది. చిట్టచివర కాసంవత్సరాంతమువరకును గాంధీ అ. భా. కాం. సం. సభ్యుడుగా నుండేటట్లు నిర్ణయింపబడినది. కాని మరుసమావేశములో నూలుచందా రద్దుచేయబడిన యెడల గాంధీ రాజీనామా యిచ్చి ప్రత్యేకముగా వడుకునూలుసంఘము నేర్పాటుచేసు కొనేటట్లుగాకూడ అంగీకరింపబడినది. కాంగ్రెసుకార్యవర్గమువారే నూలుచందాను మార్పుచేయవలెనని చాలావరకాలోచించిరి; కాని చిట్టచివరకు అ. భా. కాం. సం. వారి నిర్ణయమునకు వదలివేసిరి. అక్టోబరు ౨ వ తేదీని ఈవిషయమును విచారించుటకు అ. భా. కాం. సం. సమావేశమయినది. గాంధీ ఈలోగా స్వరాజ్యపక్షమువారి కన్ని విధములా సహాయము చేసెను. ప్రభుత్వమువారు స్వరాజ్యపక్షమువారిచే సూచింపబడిన కొన్నిషరతులను నిర్వర్తింపనియెడల శాసనసభాకార్యక్రమమున కడ్డంకులు కల్పించెదమని బెదరిస్తూ స్వరాజ్యవాదులు కొన్ని తీర్మానములను చేసిరి. చిట్టచివరకు గాంధీ ఆ తీర్మానములపైకూడా మోతీలాల్ నెహ్రూతో కలసి తనసంతకము పెట్టి

స్వరాజ్యపక్షములో విశ్వమయినట్లు కనిపించెను. ఇందుకు గాంధీపైన కోపగించు కొన్నవారందరూ గాంధీ రాజీనామా నిచ్చెదనని చెప్పినమాట తెలుసుకొన్న తరువాత అసలుసంగతి నర్థముచేసుకొనగలిగిరి. రాజకీయవాతావరణ మతివేగముగా మార్పు చెందినది. బెల్గాముకాంగ్రెసులో నో ఛేంజర్లకును, స్వరాజ్యపక్షమువారికిని జరిగిన రాజీ కనుగుణముగా చేయబడిన తీర్మానము గాంధీచెప్పిన ఒక్కమాటతో దాదాపు రద్దుచేయబడినది. బర్కెన్ హెడ్డుప్రభువు ఇటీవల చేసిన ఉపన్యాసము నకు ప్రత్యుత్తరముగా నూలుచందా రద్దు చేయబడి కాంగ్రెసు రాజకీయ సంస్థగా పనిచేయవలె నని నిర్ణయింపబడినది. అప్పటినుండి గాంధీమాటలధోరణి స్వరాజ్యవాదులు తనకు అబర్బ్ని లని, రాజకీయప్రతినిధు లని చెపుతూ వచ్చెను. దాసుమరణానంతరమున్ను, బర్కెన్ హెడ్డుప్రభువు తృణీకారముతో చేసిన ఉప న్యాసముతరువాతనున్ను గాంధీ స్వరాజ్యపక్షమువారికి క్రమక్రమముగా లొంగి పోయి చిట్టచివరకు తన వ్యక్తిత్వమునుకూడ వారిలో లీనముచేసుకొనెను. గాంధీ ఆగష్టు నెలలో "కాంగ్రెసు విద్యార్థికుల నాయకత్వముక్రింద అభివృద్ధి నొందుట కంతమాత్ర మును నే నాటంకముగా నుండజాలను. నేను పూర్తిగా నాదాజనముతో కలసియుందును. నాకున్ను, భారతదేశములోని విద్యార్థికుల చిత్తవృత్తికిన్ని చాలాముఖ్యవిషయములలో భేదాభిప్రాయము లున్నవి. ఇప్పటికినీ నేను కాంగ్రెసును విడువకుండానే ఉండి, వారికి సహాయము చేయవలెనననియే ఉద్దేశిస్తున్నాను. అందుమూలమున వారి కార్యక్రమ మునకు నే నాటంకములను కల్పింపక, నిర్మాణకార్యక్రమమునకు నాసర్వశక్తులను కేంద్రీకరింపవలె నని నా అభిప్రాయము. అదికూడా కాంగ్రెసుపేరుమీదుగా దాని సహాయముతో విద్యార్థికులకు భారతీయులు నా కిచ్చిన అవకాశమునుబట్టి నిర్వర్తింప దలచుకొన్నాను." అని వ్రాసెను. స్వరాజ్యవాదు లొకవంక గాంధీసిద్ధాంతమును తృణీకరిస్తూ వేరొకవైపున ఆయన నాయకత్వమును కోరుతూండిరి. స్వరాజ్యవాదులు తాము సూచించిన షరతులపైన గాంధీ తమకు సహాయముచేయవలెనని వాంఛించిరి. గాంధీ ఎప్పుడిచ్చినా ఒకటేసందేశము. ఆకోజులలో సరోజినీదేవి చెప్పిన ట్లది పాత సందేశము. దాదాపు ఈ సమయములోనే మోతీలాల్ పండితుడు స్కీను కమిటీలో సభ్యత్వము నంగీకరించెను. అది ఆయనఅనుచరులైన స్వరాజ్యవాదుల కాగ్రహ కారణ మైనది. స్వరాజ్యపక్షనిబంధనలప్రకారము భారతశాసనసభలోని స్వరాజ్య పక్షమునకు చెందిన సభ్యులలో ౩ మంది ఆమోదించిననే కాని ఆసభ్యత్వ మాయన అంగీకరించియుండవలసినది కాదు. ఇందుకు చాలామంది తీవ్రముగా ప్రతిఘటించిరి. ఇది కేవల మొక చిన్న నిబంధనకు వ్యతిరేకముగా జరిగిన తప్పిదముగా పరిగణింపబడ లేదు. అంతకంటె ఎక్కువ ప్రాముఖ్యమైన విషయముగా పరిగణింపబడినది. స్వరాజ్య

పక్షమువారి విధానమే మార్పుచేయబడి ప్రభుత్వమువారికి సహాయముచేయ నంగీకరించి నట్లుగా స్వరాజ్యపక్షానుచరులచే భావింపబడినది. ఆయన స్కీన్ కమిటిలో అంగీకరించిన సభ్యత్వమువలన సైనికసమస్యల నవగాహనచేసికొనుటకు వీలు కలుగగల దని మోతీలాల్ పక్షమున ప్రత్యుత్తరము చెప్పబడినది. కాని విమర్శకుల కది సంతృప్తికరముగా లేదు.

౧౯౨౫ - ౨౬ సంవత్సరములలో భారతశాసనసభ సిమ్లాలో సమావేశమైనప్పుడే పండిత మోతీలాల్ నెహ్రూ సాండర్హ్స్ట్ కమిటీలో సభ్యత్వము నంగీకరించెను. ఆ కమిటీ స్కీన్ కమిటీ అని కూడా వాడుక. ఈ స్కీన్ కమిటీచరిత్రనుగూర్చి కొంత సంగ్రహముగా చెప్పవలసియున్నది. ౧౯౨౫ కు కొన్ని సంవత్సరముల ముందు నుండీ కొంతమంది భారతీయులు సాండర్హ్స్ట్ కళాశాలతో సమానమైన ఒక సైనికకళాశాల భారతదేశములో కూడా స్థాపింపబడవలె నని కోరుతూండిరి. ౧౯౨౫ బడ్జెటులో ౯ లక్షలరూపాయలు సైనికవిద్యకోసము ప్రత్యేకింపబడెను. ఆ సొమ్ము ముఖ్యముగా డేరాడూన్‌లోని వేల్సుయువరాజ కళాశాలకును, అప్పటికి కొద్దికాలముక్రిందటనే పాంచాలరాష్ట్రములోని జలందర్, ఝీలమ్ పట్టణములలో స్థాపింపబడిన సైనికపాఠశాలలకును వెచ్చింప నిర్ణయింపబడినది. ౧౯౨౫ లో ఢిల్లీనగరమున సమావేశమైన భారతశాసనసభలో పైనచెప్పబడిన సాండర్హ్స్ట్ కళాశాలవంటి కళాశాలను వెంటనే స్థాపించవలెనని ప్రభుత్వమువారిని కోరుతూ ఒకతీర్మానము చేయబడినది. ఇండియా ప్రభుత్వమువా రందుకొర కొకకమిటీని నియమించిరి. అందులో యెక్కువమంది భారతీయులే కలరు. మోతీలాల్, జిన్నాలుకూడా అందులో సభ్యులుగా నుండిరి. లెఫ్టినెంటు జనరల్ సర్ ఆండ్రూస్కీన్ ఆకమిటీ కధ్యక్షుడు. రాజుగారి పటాలములలో పనిచేయుటకు తగిన భారతీయుల నెక్కువమందిని సంపాదించేటందుకున్నూ, వారికి మంచిశిక్షణ మిచ్చేటందుకున్నూ తగినఉపాయముల నన్వేషించుట ఆకమిటీవారి కర్తవ్యముగా నిర్ణయింపబడినది అనగా భారతదేశములో సైనికకళాశాల తక్షణముగాని, లేక తరువాత కొంతకాలమునకుగాని స్థాపింపబడుట అవసరమేనా అనీ, ఒకవేళ అవసరమైనయెడల అది ఆచరణయోగ్యమా అనీ, అవసరమునూ, ఆచరణయోగ్యమునూ కూడా అయినయెడల భారతీయవిద్యార్థుల కా కళాశాలలో ఈయబడే సైనికశిక్షణము చాలునా, లేక సీమలోకూడా భారతవిద్యార్థులు మరికొంతశిక్షణము పొందవలసియున్నదా అనీ కమిటీవారు విచారించుటకు కోరబడిరన్నమాట. భారతదేశములో ఆయుపసంఘమువా రనేకపర్యాయములు సమావేశమైరి. ౧౯౨౬ వసంతకాలములో ఆకమిటీలో కొంతమందిసభ్యులు ఇంగ్లండు, ఫ్రాన్సు, కెనడా, అమెరికాదేశములలోని

ప్రస్తుత సైనికోన్నతోద్యోగుల కీయబడు శిక్షణమునుగూర్చి విచారించుట కై రోపా ఖండమునకు పోయిరి.

ఆకమిటీనివేదికసందర్భములో జరిగిన ముఖ్యమైన చర్చనుగూర్చి పాఠకులు కొంత తెలుసుకొనవలసియున్నది. మాంటుఫర్డు సంస్కరణలు పనిచేస్తూన్న విధానమునుగూర్చి విచారించుటకు ౧౯౨౪లో మడ్డిమన్ కమిటీ నియమింపబడినది. ఆకమిటీలోని అధికసంఖ్యాకు లొకనివేదికను, అల్పసంఖ్యాకులు మరియొకనివేదికను తయారుచేసిరి. మొదటినివేదిక ప్రభుత్వపక్షమునకు సంబంధించినది. గవర్నమెంటువారు దానిలోని సిఫార్సులనుకూడా అంగీకరించలేదు. ౧౯౨౫ సెప్టెంబరునెలలో ఆ నివేదికయొక్క ముఖ్యసిద్ధాంతమును ప్రభుత్వము వా రంగీకరింపవలెనని భారతశాసనసభలో ఒక తీర్మానము ప్రతిపాదింపబడినది. ఏమి టాముఖ్యసిద్ధాంతము ? అది ఇది—ప్రభుత్వయంత్రమునకు తుప్పపట్టినచోట నూనెవేసి దానిని సరిగా నడిచేటట్లు చేయవలెనని. ఆ సిద్ధాంతము ననుసరించియే ప్రభుత్వోద్యోగవ్యయపట్టికలయందలి మంత్రులజీతము లంగీకరింపబడక పరిపాలనాయంత్రముల కాటంకము కల్పింపబడినప్పుడుకూడా ప్రభుత్వయంత్రము నడుస్తూనే ఉండెను. మాంటుఫర్డుసంస్కరణములలో అటువంటివిషయము లెన్నడోగాని జరుగవని ఊహింపబడినది.అయితే కొద్దికాలము క్రిందటనే ఆవిషయములన్నీ జరుగనే జరిగినవి. స్వరాజ్యపక్షమువారు అసెంబ్లీలో ప్రవేశించినవెంటనే మాంటుఫర్డు ప్రణాళికలోని ప్రతికూలశక్తులను సంపూర్ణముగా తెలుసుకొనగలిగిరి. అందువల్లనే వారు ౧౯౨౪ సెప్టెంబరునెలలో ఈక్రింది తీర్మానమును ప్రదిపాదించిరి:

“ భారతదేశములో సంపూర్ణబాధ్యతాయుతప్రభుత్వమును స్థాపించే ఉద్దేశముతో భారతప్రభుత్వచట్టమును మార్పించుటకు తగిన ప్రయత్నములను చేయవలసినదని భారతశాసనసభవారు గవర్నర్ జనరల్ ఇన్ కవున్సిలుకు సిఫార్సుచేస్తూన్నారు. అందుకొరకై (ఎ) భారతదేశములోని ముఖ్యమైన అల్పసంఖ్యాక సంఘముల హక్కులను గమనిస్తూ భారతదేశమున కొక రాజ్యాంగప్రణాళికను తయారుచేసేనిమిత్తము త్వరలోనే ఒక రౌండుటేబిలు ప్రతినిధుల మహాసభ పిలుచుటకున్నూ, (బి) రౌండుటేబిలువారు తయారుచేసిన ప్రణాళికను విచారించేనిమిత్తము ప్రస్తుతకేంద్రశాసనసభను రద్దుచేసి తిరిగీ ఎన్నికలు జరిపించి, కొత్తగా ఎన్నుకొనబడిన సభ్యుల నిర్ణయముప్రకారము రౌండుటేబిలుసభవారిచే తయారుచేయబడిన రాజ్యాంగప్రణాళికను బ్రిటిష్‌పార్లమెంటువారికి పంపి దానిని చట్టములో చేర్పించుటకున్నూ ఈ సభవారు కోరుతున్నారు.”

ఈ తీర్మానమునను సరించియే మడ్డిమన్‌కమిటీ నిర్మింపబడినది. ఆ కమిటీలోని అధికసంఖ్యాకు లొక నివేదికను, అల్పసంఖ్యాకులు మరియొక నివేదికను తయారు

చేసిరి. ఆ నివేదికలు ౧౯౨౪ సెప్టెంబరు ౭ వ తేదీని సర్ అలెగ్జాండరు మడ్డిమన్ ప్రతిపాదించిన తీర్మానరూపకములో ఢిల్లీ శాసనసభయందు చర్చకువచ్చినవి. ఆ తీర్మానమునకు పండితమోతీలాల్ నెహ్రూ ఒక దీర్ఘమైనసవరణను ప్రతిపాదించెను. దాని సారాంశ మేమనగా—“(౧) భారతదేశప్రభుత్వమును సంపూర్ణబాధ్యతాయుతముగా చేయుటకు తగినట్లుగా, భారతదేశపరిపాలనాపద్ధతియందును, భారతరాజ్యాంగయంత్రమునందును ముఖ్యమైనమార్పులను సూచిస్తూ, బ్రిటిష్ప్రభుత్వమువారు పార్లమెంటులో ఒకప్రకటన చేయబడేటట్లు చూడవలెననీ, (౨) యీ సిద్ధాంతమున కనుగుణముగా భారతదేశములోని అల్పసంఖ్యాకుల ప్రయోజనములను గమనిస్తూ, ఒక ప్రణాళికను తయారుచేసేనిమిత్తము హిందూదేశములోని ఆంగ్లోఇండియన్లయొక్కయు, యూరపియనులయొక్కయు, అందరుభారతీయులయొక్కయు ప్రతినిధులుగల ఒకరౌండు టేబిలుమహాసభనుగాని, లేక అటువంటిసభను మరియొకదానినిగాని సమావేశపరచి ఆ సమావేశమువారు తయారుచేసిన ప్రణాళిక భారతశాసనసభవారిచే అంగీకరింపబడిన పిమ్మట బ్రిటిష్పార్లమెంటువారికి దానిని రాజ్యాంగచట్టములో చేర్చుటకొరకు పంపవలెననీ. ఈ సవరణమీద రెండురోజులు దీర్ఘమైన చర్చ జరిగినతరువాత ప్రభుత్వమువారికి ప్రతికూలముగా ౭౨ వోట్లతో సవరణ నెగ్గినది. ప్రభుత్వమువారిపక్షమున ౪౫ వోట్లే వచ్చినవి. దీనినిబట్టి ౧౯౨౪ ఫిబ్రవరినాటికంటె ౧౯౨౫ సెప్టెంబరునాటికి స్వరాజ్యపక్షమువారికిని, ప్రభుత్వమువారికిని కొంత మిత్రభావము కలిగినట్లు బోధపడగలదు. ౧౯౨౪ ఫిబ్రవరినెలలో ప్రత్యేకము రౌండుటేబిలుమహాసభయే కోరబడినది. ౧౯౨౫ సెప్టెంబరునెలలో రౌండుటేబిలుమహాసభగాని, లేక తగిన మరియొకసభగాని కోరబడినది.

బర్కెన్ హెడ్ ప్రభువు “స్వరాజ్యపక్షము భారతదేశమునందు గట్టి పునాదులపైని స్థాపింపబడిన రాజకీయపక్ష” మని ఉదాహరించెను. ఇది కొంతవరకు సంతోషదాయకమైన విషయమే. కాని తన రాజ్యాంగయంత్రమును, దాని నిర్మాణమును అంగీకరించిన పక్షమునుమాత్రమే బర్కెన్ హెడ్ ప్రభువు గుర్తించెనని తెలుసుకొనవలసియున్నది. స్వరాజ్యపక్షమువారు శాసనసభలో ప్రవేశించుటయే కాక సభ్యత్వస్థానములనుకూడా ఆక్రమించిరి; బడ్జెట్ల నంగీకరించిరి; ఉపసంఘములలో పనిచేసిరి. ఆపక్షము మడ్డిమన్ కమిటీలో స్థానమును నిరాకరించినది. కాని స్కీన్ కమిటీలో అంగీకరించినది. బర్కెన్ హెడ్ ప్రభువు స్వరాజ్యపక్షమువారితో రాజీకుదురునని భావించెను. దాసు, నెహ్రూలుకూడా ప్రభుత్వమువారితో రాజీకుదురునని భావించిరి. మోతీలాల్ పండితుని సహకారమునుగూర్చి భారతశాసనసభలో సర్ బాసిల్ బ్లాకెట్టు స్పష్టముగా ప్రతిపాదించెను.

“ఉప్పు సంరక్షణచట్టము నంగీకరించుటకంటె, నిరుటి ఆదాయవ్యయపట్టిక నామోదించుటకంటె, రైల్వేద్రవ్యమును ప్రత్యేకించుటకంటె పండిత మోతీలాల్ నెహ్రూ ఇంకా ఏమిచేయవలెను ? విఠల్ భాయిపటేల్ భారతశాసనసభాధ్యక్షత నంగీకరించుటకంటె ఇంకేమిసహకారము చేయవలెను ? ” అని ప్రసంగించుటయేకాక, ఏ. రంగస్వామిఅయ్యంగారు పబ్లిక్ అక్కౌంట్ల కమిటీలో సభ్యుడుగా నుండి చేసిన అమూల్యసహాయమునకు సర్ బాసిల్ బ్లాకెట్ ఆయనను హృదయపూర్వకముగా అభినందించెను. ప్రభుత్వమువారు స్వరాజ్యపక్షమువారిని సహకారములోకి దింపుట కనేకపర్యాయములు వారి నుత్సాహపరచిరి.

౧౯౨౫ సెప్టెంబరులో పాట్నాలో జరిగిన సంఘములనుగూర్చి పాఠకులకు తెలియపరచేముందు స్వరాజ్యపక్షమువారి కార్యక్రమములలోనూ, ఊహాలలోనూ కలుగుతూన్న కొన్ని పరివర్తనములను ముచ్చటింపవలసియున్నది. కాంగ్రెసునిర్మాణ మును పూర్తిగా స్వరాజ్యపక్షనాయకుడుడైన మోతీలాల్ చేతులలో పెట్టుటకు గాంధీ ఇష్టపడెను. మోతీలాలందుకు సంతోషిస్తూ “బర్కెన్ హెడ్ ప్రభువు దేశబంధుచే వాగ్దానముచేయబడిన, గౌరవప్రదమైన సహకారమును తృణీకరించెను. స్వాతంత్ర్య పోరాటమునందింకను మన మనేకఅభ్యంతరములను తరింపవలసియున్నది; అనేక మంది అజ్ఞానులగు ప్రతిపక్షులనుకూడా మన మెదుర్కొనవలసియున్నది. కాబట్టి బాధ్యతారహితమైన యీనిరంకుశప్రభుత్వమునకు తగిన గుణపాఠము చెప్పవలెనన్న యెడల మే మిదివరకు నిర్ణయించుకొన్న పద్ధతులప్రకారము ప్రవర్తించుటయే మన ప్రధానకర్తవ్యము” అని గాంధీకి వ్రాసెను. జూలై ౨౫ వ తేదీని లాలాజీ “మనమిప్పుడు ప్రభుత్వముతో సహకార మొనర్చుటకు తయారుగా లేము. కాబట్టి మన మొక మధ్య మార్గము నాలోచించుకొనవలయును. ఈ పరిస్థితులలో ఏపద్ధతి మనకు వీలో, ఏది ఆచరణయోగ్యమో, ఏది ఉత్తమోత్తమమో మనమే ఆలోచించుకొనవలసియున్నది. అందుకొరకన్నిపక్షములవారును కలసి చర్చించుకొని ఆపద్ధతిని నిర్ణయించవలెను.” అని పత్రికలకు వ్రాసెను. మంత్రివర్గనిర్మాణ మసాధ్యముచేయబడిన వంగరాష్ట్రము లోనే స్వరాజ్యపక్షమువారి బల మంతకంతకు తగ్గప్రారంభించినది. వంగరాష్ట్రశాసన సభాధ్యక్షపదవికి పోటీచేసిన స్వరాజ్యవాది ఇండిపెండెంటుసభ్యునిచే ఆరువోట్ల ఎక్కువతో ఓడించబడెను. ఒక సందర్భములో జబ్బుగానున్న దాసు శాసనసభకు మోసుకొని రాబడెను. అప్పుడు కూడా స్వరాజ్యపక్షము వారి గెలుపు సందేహాస్పద మయ్యెను. డాక్టరు ఎ. సుహ్రావర్ది (Subrawardy) స్వరాజ్యపక్షమునుండి రాజీనామానిచ్చెను. ఆయన వంగరాష్ట్రగవర్నరును సందర్శించి నప్పుడు గాంధీ ఆయననుగూర్చి కఠినముగా మాట్లాడెను. ఆయన చాలా అక్రమమైనపని

చేసినాడనీ, అందుమూలమున తనదేశమునే అమ్మివేసినాడనీ గాంధీ అభిప్రాయమిచ్చెను. తరువాత ఆయన "యీకొత్తనిరంకుశత్వముక్రింద జీవించుటకంటె రాజకీయముగా మరణించుటయే ఎక్కువగౌరవప్రదముగా భావింతును" అని చెప్పి రాజీనామా యిచ్చెను. సుహ్రావర్ది గవర్నరును చూచినమరునాడే గాంధీ కలకత్తాలోని ఆంగ్లోఇండియన్ పత్రికాప్రతినిధికి తన అభిప్రాయము నీవిధముగా వెల్లడించెను: "స్వరాజ్యపక్షసభ్యు లెవరును తమపక్షమువారి అంగీకారము లేనిదే గవర్నరును కలసికొనుటగాని, ఆయనను చూచుటగాని నిషేధింపబడవలెను. ఆనిబంధన చాలామంచిదని నే నీసందర్భమున చెప్పకతప్పినదికాదు." తరువాత ఆగష్టు ౨౨ వ తేదీని విఠల్ భాయిపటేల్ భారత శాసనసభకు మొదటి అధికారేతరాధ్యక్షుడుగా నెన్నుకొనబడెను. సరిగా యీసమయములోనే ౧౯౨౫ సెప్టెంబరు ౨౧ వ తేదీని పాట్నాలో అ. భా. కాం. సం. సమావేశ మైనది. ఈసందర్భములో మన మొకసంగతి జ్ఞాపకము చేసుకొనవలసియున్నది. ఇటీవలి శాసనోల్లంఘనము ౧౯౩౪ మే నెలలో పాట్నాయందే విరమింపబడినది. ౧౯౨౫ లోకూడా ఆ పాట్నాసమావేశమునందు కాంగ్రెసువ్యవహారములలో మూడు ముఖ్యమైనమార్పులు చేయబడినవి. ఖద్దరుకు రాజకీయప్రాముఖ్యతలేదని నిర్ణయింపబడినది. నూలుచందా చందాకుబదులుగా ఏర్పాటుచేయబడినది. స్వరాజ్యపక్షమువారికి రాజకీయకార్యక్రమము పూర్తిగా వశముచేయబడినది. ఇక స్వరాజ్యపక్షము కాంగ్రెసులో ఒక అంతశ్శాఖ కాదు; అదే ఇప్పుడు కాంగ్రెసు. కాంగ్రెసును సంపూర్ణముగా అది స్వైవసముచేసుకొన్నది. ఇప్పటినుండీ ఎన్నికలు కాంగ్రెసుద్వారానే జరుగవలసి యుండెను. కాని స్వరాజ్యపక్షముద్వారా కాదు. ఈవిధముగా ఎన్నుకొనబడిన సభ్యులు భారతశాసనసభలోని స్వరాజ్యపక్షసభ్యులుగా గాక కాంగ్రెసుశాసనసభాసభ్యులుగా భావింపబడిరి. నూలుచందామాత్రమే కాంగ్రెసుసభ్యత్వమున కర్హతగా భావింపబడలేదు. నూలుచందాకు బదులు నాలుగణాల చందాకూడ కాంగ్రెసు సభ్యత్వమున కొక అర్హతగా చేయబడినది. ఈ మార్పు నూలుచందాసభ్యులు తక్కువైన కారణమువలన చేయబడలేదు. అప్పటికే ౧౦ వేలమంది నూలుచందా సభ్యులుండిరి. కాని స్వరాజ్యపక్షమువారు నూలుచందాకు వ్యతిరేకముగా నుండుటచే ఆ మార్పు చేయవలసివచ్చినది. బర్కెన్ హెడ్, రీడింగుప్రభువులకు ప్రత్యుత్తరముగా గాంధీ స్వరాజ్యపక్షమువారికి న్యాయముగా చూపవలసిన సౌకర్యములకంటె ఇంకా ఎక్కువసౌకర్యములను చూపెను. ౧౯౨౪ లో గోపీనాథ్ సహాను గూర్చి చేయబడిన సేరజ్ గంజి తీర్మానముతో ప్రభుత్వమువారు సి. ఆర్. దాసును బెంగాల్ ఆర్డినెన్సు చట్టముతో వెంటాడిరి. గాంధీ దాసుకు సంపూర్ణసహాయము చేయ తలపెట్టెను. దాసీ సంవత్సరములోనే మరణించెను. బర్కెన్ హెడ్ యొక్క అహంకారము

కాంగ్రెసువాదులకు కోపము గలిగించెను. గాంధీ సహాయనిరాకరణమును పూర్తిగా కట్టిపెట్టి శాసనసభాప్రవేశవాదులకు సంపూర్ణసహాయము చేయ నిర్ణయించుకొనెను. భారత రాజ్యాంగకార్యదర్శికి తగిన ప్రత్యుత్తర మీయదగినస్థితిలో గాంధీ శేక పోబట్టి స్వరాజ్యపక్షమువారిని కాంగ్రెసుకు పట్టాభిషేకము కావించెను. వెంటనే రాజకీయవాతావరణమునం దనుకోని మార్పులు గలిగినవి. సెప్టెంబరు ౨౧ వ తేదీని జరిగిన అ. భా. కాం. సం. వారి ఇష్టాగోష్ఠిసభలో స్వరాజ్యపక్షమువారికి రాజకీయాధికారమును సంపూర్ణముగా స్వాధీనముచేసిన పాట్నాతీర్మానములోని రెండవభాగము చర్చకు రానేలేదు. కాని సెప్టెంబరు ౨౨ వ తేదీ ఉదయమున కాంగ్రెసుకార్యనిర్వాహకసభలో అది ఆకస్మికముగా ప్రవేశపెట్టబడినది; ౫ నిమిషములలో అంగీకారము పొందినది. పాట్నాలో అంగీకరింపబడిన ఆ రెండవభాగ మిది:

“ ౧. బెల్గామ్‌లో జరిగిన ౩౯ వ భారతజాతీయమహాసభ గాంధీమహాత్మునకును, స్వరాజపక్షప్రతినిధు లైన దేశబంధు చిత్తరంజనదాస్, పండితమోతీలాల్ నెహ్రూలకును జరిగిన ఒడంబడిక నామోదించినది. దానిప్రకారము నిర్మాణకార్యక్రమము కాంగ్రెసుచే జరుపబడుటకున్నూ, కేంద్రరాష్ట్రీయశాసనసభలలోని యావత్తు వ్యవహారములును కాంగ్రెసుపక్షమున స్వరాజ్యవాదులచే నిర్వర్తింపబడుటకున్నూ నిర్ణయింపబడినది. స్వరాజ్యపక్షమువారి కార్యవిధానమునకు తగిన నియమములను తయారు చేసికొనుటకును, అందుకు కావలసిన ఆర్థికవ్యవహారములను వారే స్వయముగా పరిశీలించుకొనుటకును వారికికూడా సంపూర్ణాధికారము లీయబడినవి.

“ ౨. ఇటీవల దేశములో కలిగిన మార్పులనుబట్టి ప్రస్తుతపరిస్థితులలో ఈ నియమము కొనసాగింపబడుటకు వీలులేనికారణమున ఇప్పటినుండీ కాంగ్రెసు పూర్తిగా రాజకీయసంస్థగానే ఉండవలెను.

“ ౩. దేశశ్రేయస్సుకోస మవసరమైన యావత్తు రాజకీయ కార్యక్రమమును కాంగ్రెసు నడిపించవలెననీ, అందుకోసము పూర్తిగా కాంగ్రెస్‌నిర్మాణమును, దాని విధులనుకూడా అది ఉపయోగించుకొనవచ్చుననీ తీర్మానింపబడినది. కాని అఖిల భారత ఖద్దరు సంఘముకొరకునూ, రాష్ట్రీయఖద్దరుసంఘములకొరకునూ ప్రత్యేకింపబడిన సొమ్ముమాత్రము కాంగ్రెసుసంస్థలో స్వతంత్రమైన అంతశ్శాఖగా గాంధీమహాత్మునిచే స్థాపింపబడిన అఖిలభారత చర్ఖాసంఘమువారికి బాకీబాధ్యతలతోసహా వశము చేయబడవలెననికూడా నిర్ణయింపబడినది. ఈ సొమ్మును చర్ఖాసంఘమువారు తమ కార్యక్రమము కొనసాగించుటకు సర్వాధికారములతో వినియోగించుకొనవచ్చును.

"కేంద్ర రాష్ట్రీయ శాసనసభలలోని వ్యవహారములు (స్వరాజ్యపక్షమువారిచే నిర్ణయింపబడిన నియమముల క్రింద) అప్పుడప్పుడు అవసరమునుబట్టి కాంగ్రెసుచే సూచింపబడిన కార్యవిధానమున కనుకూలముగా నిర్వర్తింపబడవలెను."

ఈ తీర్మానములోని చివరభాగమును, అనగా "అప్పుడప్పుడు అవసరమునుబట్టి కాంగ్రెసువారిచేనిర్ణయింపబడిన కార్యవిధానమునకనుకూలముగా కేంద్ర,రాష్ట్రీయశాసన సభలలోని వ్యవహారములు నిర్వర్తింపబడవలె" నను సవరణను ప్రతిపాదిస్తూ కాంగ్రెసు సంస్థ స్వరాజ్యపక్షమువారియం దుంచిన విశ్వాసమున కనుగుణముగా ప్రవర్తింపలేదని ప్రతిపాదకుడు చేసిన నిందారోపణమునకు మోతీలాల్ పండితు డాగ్రహావేశపరవశు డయ్యెను. అసలు తీర్మానమునకు సవరణ తెచ్చుటయే ఆయనకు కష్టముగానుండెను. అందులో ప్రతిపాదకుడు చేసిన నిందారోపణ మాయనకు మరింత కోపకారణమైనది. దానిమూలమున సభలో కొంత కల్లోలము కలిగినది. గాంధీ ఆ తరుణములో స్వరాజ్య పక్షమువారిపైన నేరముల నాపాదింపవల దని ప్రతిపాదకుని సమాధానపరచెను.

ఆ సమయములో మోతీలాల్ పండితుడు కోరినకోరికలను వెంటనే పూర్తిగా నిర్వర్తించుటకు గాంధీ సంసిద్ధముగా నుండెను. అ. భా. కాం. సం.న కధ్యక్షుడుగా నున్న గాంధీ స్వరాజ్యపక్షమువారు భారతశాసనసభలో చేసిన కార్యక్రమమునుపట్ల పరిశీలించుటకుకూడా అంగీకరించలేదు. అది నోఖేంజర్లకును, స్వరాజ్యపక్షమువారి కినీ గల పరస్పరమిత్రభావమునకు భంగముకలిగించునని ఆయన అభిప్రాయము. అటు వంటి పరీక్షలవలన స్వరాజ్యపక్షమువారి కీయబడిన దానముయొక్క విలువ తగ్గిపోవు నని ఆయనవిశ్వాసము. నెహ్రూదాసులకును, గాంధీమహాత్మునకును ఏదైన ఒడంబడిక జరిగినదా అని రాజేంద్రబాబు గాంధీని ప్రశ్నించెను. లేదని ఆయన ప్రత్యుత్తర మిచ్చెను. కాని అవలిపక్షమువారు కోరిన దంతా అంగీకరించుటయే గాంధీ గౌరవప్రదముగా భావించెను. గాంధీఆజ్ఞలను శిరసావహించడమే ఆయన అనుచరులుకూడా గౌరవప్రదముగా భావించిరి. సంగ్రహవిషయములలో సత్పురుషుల అంతఃకరణప్రవృత్తులు ప్రమాణములుగా గ్రహింపబడవలె నను సుభాషితము ననుసరించి గాంధీనిర్ణయములయం దాయనఅనుచరులు సంపూర్ణవిశ్వాస ముంచిరి.

పాట్నానిర్ణయములవలన జరిగినది భాగలబ్ధమా, లేక భాగస్వామ్యమా అని విచారింపవలసియున్నది. ఈజరిగిన రెండుసంవత్సరములలో కాంగ్రెసులో వెంట వెంటనే క్రొత్తక్రొత్త పరిణామములు కలిగినవి. జ్యాహూనాటికి కాంగ్రెసువ్యవహారముల కొకరూప మేర్పడలేదు. ౧౯౨౪ జూన్‌లో జరిగిన అహమ్మదాబాద్ సమావేశమునాటికింకా గాంధీ తన ముఖ్యసిద్ధాంతముల నంటిపట్టుకొనవలెననియే ప్రయత్ని

స్తూండెను; తనఅభిప్రాయములను కాంగ్రెసువారిచే ఆమోదింపచేయవలెననియే తలం చెను; ఖద్దరుమాత్రము నింకనూ కఠినముచేసి ప్రతిచోట కాంగ్రెసుకార్యనిర్వాహకులు నూలు వడుకవలెనని నిర్బంధించెను. సిరాజ్‌గంజి తీర్మానముల తరువాత ప్రభుత్వము వారు దాసునకు ప్రతికూలముగా ప్రకటించిన బెదరింపులనుబట్టి, గాంధీ కాంగ్రెసులోని ఉభయపక్షములకును ఐక్యభావము సమకూర్పవలెనని తలపెట్టెను. ఈ అవకాశమును తీసుకొని స్వరాజ్యపక్షమువారు కాంగ్రెసునే ఆక్రమించిరి. బెల్గామ్‌లో జరిగిన రాజీనామా పాట్నాలో నిర్మూలింపబడినది. స్వరాజ్యపక్షమువారు నూలుచందాను తీసివేయింప గల్గిరి; కాంగ్రెసుప్రతిష్ఠను పూర్తిగా నుపయోగించుకొనగలిగిరి. కాబట్టి కాంగ్రెసులోని ఖద్దరుపక్షమువారును, కౌన్సిల్ పక్షమువారును చీలిపోయిరి. ఉభయులకును పైకి సంఘీభావము కుదిరినట్లు కనబడుతూన్నప్పటికీ ఆంతరంగికముగా ఖద్దరుపక్షము వారికి కలిగిన అసంతృప్తిని ప్రజలు గ్రహింపకపోలేదు. స్వరాజ్యపార్టీవారు భారత శాసనసభలో "రౌండుటేబిలుసభగాని, లేక అందుకుతగిన మరియొకసంస్థగాని" కావలెనని కోరినకోరిక అసమగ్రముగా నుండెను. గాంధీకి "అటర్నీ"గా వ్యవహరింపబడుతూన్న స్వరాజ్యపక్షము అసలుసిద్ధాంతము నతిక్రమించి ప్రవర్తించినట్లుగా భావింపబడెను. కాని గాంధీమాత్ర మీ విషయములను లెక్కపెట్టలేదు. ఆయన చేసినత్యాగము భీష్మునిత్యాగమువంటిది. అందు కాయన యెంతమాత్రమును చింతించడు. ఆ త్యాగముయొక్క ఫలితమును పొందినవారికికూడా కించకలిగేట ట్లాయన ప్రవర్తింపడు. కాబట్టి పాట్నాలో గాంధీచే నిర్ణయింపబడినవాటి నన్నిటినీ కాన్పూరులోనే మామోదించితీరవలసినదే.

కాన్పూర్ కాంగ్రెసు (౧౯౨౫) సమీపించినది. అక్టోబరునెలలో సరోజినీదేవి అధ్యక్షురాలుగా నెన్నుకొనబడెను. సరోజినీదేవిస్థానమునకు తాను ప్రవేశిస్తానంటి నని గాంధీ బెల్గాములోనే చెప్పియుండెను. నూతనసంవత్సరమున కధ్యక్షురాలుగా నెన్నుకొనబడిన సరోజినీదేవి అక్టోబరునెల మొదటివారములో ఒక సందేశమును ప్రకటించెను. "నేను స్త్రీని. నాకార్యక్రమము కూడా గృహకృత్యములకు సంబంధించి, వినమ్రభావపూరితముగా నుండును. భారతమాతను తన స్వగృహమునందు తిరిగీ గృహదేవతాస్థానము నలంకరింపజేయుటకే అకార్యవిధాన ముద్దేశింపబడినది. ఆమె గృహయజమానురాలుగానుండి అతిథులను, అభ్యాగతులను పూజించుటకు సర్వాధికారములుగలిగి యుండవలెను. కాబట్టి భారతమాతకు ప్రేమాస్పదురాలనైనపుత్రికనుగా ఆమెగృహపరిపాలనమును రాబోయేసంవత్సరము సరిగా నిర్వర్తింపవలెనని నాకోరిక. అది కష్టతరము కావచ్చును. వివిధమతములవారునూ, వివిధతత్వములవారునూ కల ఆమెసమష్టికుటుంబములో కలిగే కలహములను పరిష్కరించి ఆమెబిడ్డలలో ధనికుడు, దరిద్రుడు అనే

భేదము లేకుండా ఎవరికితగిన స్థానమును వారికి చూపించి ఆమెగృహావరణములోని పిల్ల లను గాని, అతిథులనుగాని, పరదేశీయులనుగాని కాపాడుటయే మనకర్తవ్యముగా భావింతును." ఈ ఆదర్శము ముఖ్యముగా స్త్రీస్వభావానుగుణముగా నున్నది. ఇందులో సూచింపబడిన మిత్రభావమును కల్పించుటకు నోఛేంజ ర్లేమిచేయవలెను ? గాంధీ వారిని పాట్నాతీర్మానమునకు కట్టుబడియుండవలె నని కోరెను ; లేదా, వారి స్థానము లకు రాజీనామా ఈయవలెనని ఆజ్ఞాపించెను. కాబట్టి వారు కాంగ్రెసులో స్వరాజ్యవా దులు చెప్పినట్లెల్ల తల లూపవలసియుండెను; లేదా కాంగ్రెసునుండి అదృశ్యులుకావలసి యుండెను. గాంధీ అప్పటికి తన కార్యక్రమము నుపసంహరించుకొనెను కాని సిద్ధాంతములను ప్రకటించుటమాత్రము విడువలేదు.

ఎట్టి ఉద్యమమును సాగించుటకైనను ప్రజ లిదివరకువలెనే ఎప్పుడును సంసిద్ధ ముగా నుండిరి. కాని ఆ ఉద్యమమునకు తగిన ఆదర్శమును, కార్యక్రమమును, విద్యా వంతులు చూపవలసియుండెను. వా రేమీ అటువంటివి చూపలేకపోయిరి. కాబట్టి ఉద్యమమును కొనసాగింపదగిన ప్రజాసామాన్య ముండిరి గాని, వారిలోని శక్తులను విజృంభింపచేయగల కార్యక్రమమున్నూ, ఆదర్శములున్నూ మృగ్యములైనవి.

మోటారుఇంజన్ మామూలుపద్ధతిప్రకారము నడువకపోయినప్పుడు వెనుక పట్టి త్రోయవలసివచ్చును. అది కొన్నిగజములు నడచి, మరల ఆగిపోవును. తిరిగీ త్రోయవలసివచ్చును. అదే విధముగా శాసనతిరస్కార మనే విద్యుచ్ఛక్తి తాత్కా లికముగా ఆపివేయబడినప్పుడు, ప్రజాసామాన్య మనే మోటారును పరుగెత్తించుట కనేక విధములగు పన్నాగములు పన్నబడినవి. కాంగ్రెసుపెద్దలకు న్యాయముగా నిర్వర్తించ వలసిన అనేకపను లుండవచ్చును. కాని కాంగ్రెసులోని యువకుల శక్త్యుత్సాహము లకు తగిన కార్యక్రమమును వారికి చూపవలసి వచ్చినది. స్థానికసంస్థలను స్వాధీనము చేసికొనుట వారి కాకర్షవంతముగా కనబడినది. ఆ ఎన్నికలలో వారికి విజయము లభింపగలదనే విశ్వాసము వారి హృదయములందు పొంగిపొరలెత్తినది. వారిని ఈ ఎన్నికలనిపానుండి నిరోధించుట తేలికగా కనిపించలేదు. అందులో కలకత్తా మేయర్ పదవికి మొదట దాసున్నూ, తరువాత సేనుగుప్తాయున్నూ కల్పించిన తేజస్సు కొంత వరకు భారతయువకుల దృష్టిపథము నాకర్షించినది. అప్పటికప్పుడే కాంగ్రెసువాదులం వాల్గొ కార్పొరేషనులను వశపరచుకొనిరి. వల్లభాయిపటేలు కొంతకాలము అహ మ్మదాబాదు మునిసిపాలిటీ కధ్యక్షుడుగా నుండెను. ౧౯౨౮ వరకునూ ఆపదవి నలంకరించినవా రాయన ఒక్కరే. విఠల్ భాయి బొంబాయిమేయర్ పదవి నలంక రించెను. ఆయన భారతశాసనసభ కధ్యక్షు డయినయెడల ఏవిధముగా తనకర్తవ్యమును

నిర్వర్తింపగల డని ప్రశ్నింపబడినప్పుడు "బొంబాయికార్పొరేషన్ అధ్యక్షుడనుగా నిర్వర్తించినట్లే" అని సరసముగా జవాబు చెప్పెను. జవహరలాల్ పండితుడు అలహాబాదుకార్పొరేషన్‌కు అధ్యక్షు డయ్యెను. కాని కొద్దికాలములోనే ఆయన కా పదవి సరిపడదని తెలిసికొనెను. స్థానికసంస్థలు కాంగ్రెసువాదులకు పనికిరావని ఆయన అభిప్రాయపడెను. బాబూ రాజేంద్రప్రసాదు పాట్నా మునిసిపాలిటీ కధ్యక్షుడాయెను. అప్పు డాయనకు కలిగిన అనుభవములు ఆయన కానందజనకములుగా లేవు. కాని ౧౫ నెల లయినతరువాత ఆయన ఆస్థానమునుండి బయటపడెను. కాని ప్రతివారును జీవితములో సొంతఅనుభవమును సంపాదించుకొనవలసినదే. ఇతరుల అనుభవముమీద ఆధారపడి ఉండేవారు చాల తక్కువ. కాబట్టి మద్రాసులో కూడ ఈస్థానికసంఘముల పాఠము నేర్చుకొనవలసియేయున్నది. ౧౯౩౫ మే ప్రాంతములలో మద్రాసుకాంగ్రెసు కమిటీ మద్రాసుకార్పొరేషన్ సభ్యత్వముల నాక్రమించుకొన బూనినది. చాలా వ్యయప్రయాసలకు లోబడి పదిస్థానములలో ఏడు స్థానములను మద్రాసుకాంగ్రెసు సంఘమువారు సంపాదింపగలిగిరి. స్థానికసంస్థలను వశముచేసికొని, వాటిద్వారా నిర్మాణకార్యక్రమమును కొనసాగింపవలె ననియే కాంగ్రెసువాదుల అభిప్రాయము. నిజముగా ఇది శ్లాఘాపాత్రమైన ఉద్దేశము. ప్రభుత్వమువారు మన ఉద్దేశములను నిరోధించి భగ్నము చేయబూనుటకు ముందుగానే మనము కార్యక్రమము నాలోచించుకొని కార్యాచరణకు కడంగుదుము. కాని ప్రభుత్వమువా రాలస్యముగానైనా మన ప్రయత్నములకు ప్రతిరోధములను కల్పింతురన్నమాట నిశ్చయము. కొద్దికాలములోనే ప్రభుత్వమువారు జైలుకు పోయివచ్చిన కాంగ్రెసుప్రచారకులకు స్థానికసంస్థలలో ఉద్యోగముల నిచ్చుటకు వీలులేకుండా చేసిరి. పాఠశాలలలో హిందీబోధించుటకుగానీ, రాటములను ప్రవేశపెట్టుటకుగానీ కల అవకాశములను తగ్గించిరి. జాతీయనాయకులకు స్థానికసంస్థలు సన్మానపత్రముల నర్పించుటకుగాని, కార్పొరేషను పాఠశాలలపైనను, కచేరీలపైనను జాతీయపతాకలను కట్టుటకుగాని అధికారము లేకుండా చేయబడినది. ఏవిధముగా నైతేనేమి స్థానికసంస్థలలో ఉత్సాహము లేకపోలేదు. ఆ ఉత్సాహమువలననే శ్రీనివాసయ్యంగారుకూడా ఈ రాజకీయపు సుడిగుండములో వచ్చిపడెను; మద్రాసునగరమునకు నాయకత్వమును పూనెను. వెనుకముందులు చూడక సొంతసొమ్ము వెచ్చించెను. ఆయన బహిరంగవ్యవహారములలో గాని, గృహజీవితములో గాని లుబ్ధత్వమన్నది ఎరుగడు. ఒక్కక్షణములో కాంగ్రెసునాయకుడై పోయెను. నూతన కార్యక్రమము లెప్పుడును కొత్తనాయకుని సృష్టించును. పాతనాయకులు నూతనవాతావరణమునకు తగినట్లుగా ప్రవర్తింపలేనప్పుడు కొత్తనాయకుడు వచ్చితీరవలసినదే.

మొత్తముపైన ౧౯౨౫ సంవత్సరము ప్రశాంతమైన సంవత్సరము కాదు. ఆ సంవత్సరములో చాలా తుపానులు వీచినవి. ఇంతకాలము జరిగినతరువాత అప్పటి సంగతులను జ్ఞాపకముచేసికొని, ఆ చరిత్రను సంగ్రహముగా వ్రాయబూనిన మాకు ఆనాడు కాంగ్రెసులో ఒకపక్షమునకూ, మరియొకపక్షమునకూ కలిగిన తగాదాలును, ఒక పక్షములోనే ఒకశాఖకూ, మరియొకశాఖకూ కలిగిన కక్షలునూ కనులకు కట్టినట్లు ప్రత్యక్షమవుతూన్నవి. నోఛేంజర్లు ఖద్దరు, అస్పృశ్యతానివారణము, సాంఘికసమాఖ్యలే చిన్నచిన్న తగాదాలకు కారణమైనప్పుడు స్వరాజ్యవాదుల క్రొత్తకార్యక్రమము నందు వారిలోవారికి భేదాభిప్రాయములు కలుగుట వింతకాదు. స్వరాజ్యపక్షసిద్ధాంతములపైన మొట్టమొదట మహారాష్ట్రములోనూ, మధ్యరాష్ట్రములలోనూ తిరుగుబాటు ప్రారంభమైనది. ఈరెండు రాష్ట్రములును దేశబంధుదాసు జీవించియున్నంతవరకునూ వంగరాష్ట్రమునకు చేదోడువాదోడుగా నుండి ఆ అడుగుజాడలనే నడచినవి. దేశబంధుది అకార్యములను సహించేప్రకృతి కాదు. ఆయన ఎట్టితిరుగుబాటునైనను నిమిషములో తుదముట్టింపగలడు. గాంధీనుండి అధికారము లాక్కొగలిగిన దేశబంధు తనపక్షములోనున్న తిరుగుబాటుదారులకు లొంగిపోవునన్నమాట కల్ల. కాని ఆయన మరణించినవెంటనే మహారాష్ట్రమునందనుకోని విషయములనేకములు జరిగినవి. మధ్యరాష్ట్రశాసనసభకు స్వరాజ్యపక్షాధ్యక్షు డయిన తాంబీ మధ్యరాష్ట్రప్రభుత్వముక్రింద కార్యనిర్వాహకసభ్యత్వము నంగీకరించెను. ఇది బీరార్, మహారాష్ట్ర, మధ్యరాష్ట్రముల నాయకులకు భయంకరసంగ్రామకారణమైనది. తాంబీప్రవర్తనమును మోతీలాల్ పండితుడు నిరసించెను. కేల్కారు, జయకరు లాయనను కొంత కప్పిపుచ్చిరి. అందుమూలమున మోతీలాలీయిద్దరిపైనను క్రమశిక్షణచర్య తీసికొనెద నని బెదరించెను. దానికి ప్రతిగా వారు బొంబాయిరాజధానిలోని స్వరాజ్యపక్షమువారందరిచేతను ఏకగ్రీవముగా అధికారస్వీకరణమున కనుకూలాభిప్రాయములను ప్రకటించేటట్లు చేయవలెనని ప్రయత్నించిరి. కేల్కారు అమృతసరముకాంగ్రెసు వెనుకకు పోయి లోకమాన్యుని అనుసరించవలసిన దని పాట పాడసాగెను. మోతీలాల్ నెహ్రూకూడ వారికి లొంగదలచుకొనలేదు. ఆయన ౧౯౨౫ నవంబరులో నాగపురమునందుపన్యసిస్తూ, తాంబీ ఉద్యోగమును స్వీకరించినందుకాతడొక్కడే నిందార్హుడు కాడని చెప్పెను. అంతకుపూర్వ మనేకసార్లు మంత్రివర్గమును నిర్మించుటకు ప్రయత్నములు జరిగినవనీ, ఆప్రయత్నముల ఫలితమే తాంబీ ఉద్యోగస్వీకరణగా పరిణమించినదనీ ఆయన వెల్లడిచేసెను. వెంటనే అవతలిపక్షమువారు మోతీలాల్ పండితుడు స్కీన్ కమిటీలో సభ్యత్వము నంగీకరించి మాకు త్రోవచూపినాడని ఎత్తిపొడిచిరి. న్యాయాని కీరెండువిషయములలోను చాలాభేదమున్నది.

మధ్యరాష్ట్రములలో జరిగిన స్వరాజ్యవాదుల మహాసభలో అభయంకర్, కేళ్ లోక పక్షమున్ను, డాక్టరు మూంజీ మరియొక పక్షమున్ను తీవ్రవాదోపవాదములకు దిగిరి. మూంజీ మంత్రిపదవుల నంగీకరింపవలసిన దని ప్రోత్సహిస్తూన్న ట్లనుమానింపబడెను. ఈ. రాఘవేంద్రరావు, కపర్దిలు మంత్రిపదవీ స్వీకరణమున కనుకూలురుగా నుండిరి. డాక్టరు మూంజీ తనపై ఆరోపింపబడిన నింద నిజము కాదని ఎదురుతిరిగెను. పాపమాయన అదివరలో వ్రాసిన ఉత్తరమొకటి సభలో బయటపెట్టబడినది. అప్పు డాయన వ్యక్తిగా తనకు మంత్రిపదస్వీకరణ మిష్టమైనప్పటికీ తనపక్షమునకును, పక్షనాయకు డైన మోతీలాల్ పండితునకును ఎప్పుడూ ప్రతికూలముగా ప్రవర్తించ దలచుకొన లేదని ప్రకటించెను.

యన్. సి. కేల్కార్ స్వరాజ్యపక్షమువారి కఠిననిర్బంధములమూలమున ఆపక్షములోని అంతశ్శాఖలవారి అభిప్రాయములకు తావు లేకుండా పోతూన్న దని స్వరాజ్యపక్షవిధానమును విమర్శిస్తూ వ్రాసెను. స్వరాజ్యపక్షమువారు కేంద్రశాసనసభలో నిరంతరాయముగా ఆటంకములను కల్పింతు మని ప్రకటించిన మొదటికార్యక్రమ మేవిధముగా అంతకంతకు పెడమార్గముల బట్టినదో పూసగ్రుచ్చినట్లు వివరించెను. కాబట్టి ప్రస్తుతసమయములో అధికారస్వీకరణము తప్పుకాదని సమర్థించెను. "మొట్టమొదట కేంద్రశాసనసభలో మన మేవిధమైన నిర్మాణవిధానసూచనను చేయుటకూ వీలులేని రోజు లుండెను. ఆరోజులలో మన మొకబిల్లును ఉపసంఘమునకు పంపవలసిన దని మాటమాత్రము చెప్పుటకైనా నోచుకొనలేదు. తరువాత మనము తీర్మానములను ప్రతిపాదింపవచ్చు నని భావించితిమి. కాని ఉపసంఘములలో సభ్యత్వములను స్వీకరించకూడ దనుకొంటిమి. పిమ్మట ఉపసంఘములలోని ఎన్నికస్థానముల నంగీకరింపవచ్చు నని తలంచితిమి. ఆపిమ్మట స్వరాజ్యపక్షకార్యనిర్వాహకుల అంగీకారముతో ఉపసంఘములలోని ప్రభుత్వనియోజితసభ్యత్వములను కూడా అంగీకరింపవచ్చు నని తీర్మానించుకొంటిమి. ఈ పరిణామము లన్నీ ప్రకృతిసిద్ధముగా రాదగినవే అని నా అభిప్రాయము. ఇవి స్వరాజ్యపక్షకార్యవిధానమునందు కలిగే నూతనపరివర్తనమునకు చిహ్నములు. సంకుచితముగా శాసనసభలలో ఆటంకములను కల్పించేపద్ధతి కిది తిరుగుబాటు." అని కేల్కారు విపులముగా స్వరాజ్యపక్షమువారి శాసనసభా కార్యక్రమములో కలిగిన ఆయామార్పులను వ్యక్తీకరించెను. అఖిలభారత స్వరాజ్యపక్షకార్యనిర్వాహకవర్గము నాగపురములో సమావేశమై శ్రీపాదబలవంతతాంబే స్వరాజ్యపక్షసిద్ధాంతమునకు వ్యతిరేకముగా ప్రవర్తించి, పక్షమునకు ద్రోహము కావించె నని ఆయనపైన కఠినమైన నిరసనతీర్మానము చేయబడెను. మోతీలాల్ పండితుడు నాగపురమునుండి కేల్కారు, జయకరుల తిరుగుబాటును రూపుమాపుటకు సరాసరి బొం

బాయికి పరుగెత్తెను. అంతకుపూర్వమే వా రనుకూలసహకార (Responsive Co-operation) మనేపాట పాడదొడగిరి. ఈ ఇద్దరు రాజకీయవేత్తలునూ మంచి పండితులు. వీరి రాజకీయవిజ్ఞాన మెంత సున్నితమో భావప్రకటన మంత మొరటుగా నుండును. వా రఖిలభారతస్వరాజ్యపక్షములోని తమ కార్యనిర్వాహకసభ్యత్వములకు రాజీనామా ఇచ్చి ఈక్రిందిప్రకటన గావించిరి:

"మోతీలాల్ పండితుడు నాగపురములో మాతో అంగీకరించినప్రకారము నిలబడక అనుకూలసహకారవాదమునకు ప్రతికూలముగా బహిరంగప్రచారము సాగించినాడు. మేము మూకీభావము వహింపవలెననికూడా ఆయనఅభిప్రాయము. ఆయన విమర్శనలమూలమున ప్రజలలో అపోహ, ద్వేషము కలుగుతూన్నవి. కాబట్టి వాటికి ప్రత్యుత్తర మిచ్చేహక్కు మాకు కలదు. కాని పండితుని విమర్శలకు జవాబు చెప్పేముందు స్వరాజ్యపక్షమునందలి మాకార్యనిర్వాహకసభ్యత్వములకు రాజీనామా లిచ్చు టవసర మని మేము తలచితిమి. కాబట్టి పండితునకు స్వతంత్రముగాను, నిష్కపటముగాను ప్రత్యుత్తర మిచ్చేటందుకున్నూ, స్వరాజ్యపక్షకార్యనిర్వాహకవర్గమునందున్న మాసహోద్యోగులకు కష్టము కలిగింపకుండుటకున్నూ మాసభ్యత్వములకు మేము రాజీనామా లిస్తున్నాము."

ఈరాజీనామాలేకాక తరువాత డాక్టరు మూంజీ, జయకర్, కేల్కారులు స్వరాజ్యపక్షసిద్ధాంతముప్రకార మాక్రమించిన తమ శాసనసభాసభ్యత్వములకుకూడా రాజీనామా లిచ్చిరి.

వారు నాటితో స్వరాజ్యపక్షపంకమునుండి విముక్తి నొందిరి. మోతీలాల్ పండితుడు నవంబరు ౯వ తేదీని కేల్కారు, జయకరులకు ప్రత్యుత్తరముగా "స్వరాజ్యపక్ష కార్యక్రమమునందు సహకారము, అసహాకారము, నిర్మాణము, నిర్మూలము— ఈ అన్నీ ఇమిడిఉన్నవి. జాతీయశ్రేయస్సుకోస మవసరమైనప్పు డివి ప్రయోగింపబడుతూవచ్చినవి. కాబట్టి స్వరాజ్యపక్ష మెప్పుడూ తన కార్యవిధానమునుండి పెడదారులు పట్టలేదు" అని ప్రకటించెను. పండితుని ఈధోరణికి జయక రయిష్టత చూపెను. చిట్టచివరకు కాంగ్రెసు జరిగేటంతవరకును స్వరాజ్యపక్షమును గూర్చిన బహిరంగవాదప్రతివాదములు నిలిపివేయబడవలె నని డిసంబరు ౪-వ తేదీని ఒడంబడిక కుదిరినది.

౧౯౨౬ లో జరిగిన మరియొక ప్రాముఖ్యమైన చరిత్రాంశము నుదాహరింపవలసియున్నది. అది ప్రత్యక్షముగా కాంగ్రెసుకు సంబంధించినది కాదు. కాని ప్రభుత్వమువారుమాత్ర మాంధ్రరాష్ట్రములోని గోదావరి, విశాఖపట్నంజిల్లాలలో చేరిన గూడెం

ఏజెన్సీలో సీతారామరాజు నాయకత్వముక్రింద జరిగిన తిరుగుబాటుకు శాసనోల్లంఘనోద్యమము కారణమని ముడిపెట్టిరి. మాప్లా తిరుగుబాటువిషయములోకూడా ప్రభుత్వమువా రటువంటి ప్రమాదమునే కావించిరి. గూడెంతిరుగుబాటుకూడా ౧౯౨౨లో ప్రారంభమైనది. కాని మాప్లాతిరుగుబాటు సాగిన కొంతకాలమున కది ప్రారంభమైనది. కాని మాప్లాతిరుగుబాటులోని మతకలహబీజము లేవీ ఇందులో లేవు. ఇక్కడకూడ కొంత యుద్ధకాండ జరుగవలసివచ్చినది. కాని ౧౯౨౩ చివరవరకుకూడ సైనికసన్నాహము లంత ప్రబలముగా జరుగలేదు. ౧౯౨౪లో అస్సామునుండి ౨౫౦ మంది ఉద్యోగస్థులతో ఒక రైఫుల్ పటాలము పిలిపింపబడినది. సీతారామరాజు ౨౦౦ మంది అనుచరులతో బ్రిటిష్‌ప్రభుత్వమువారి బలవత్తరమైన సైనికదళమునకు ప్రతికూలముగా మూడేండ్లు అడవులలోను, కొండలలోను దాగి యుద్ధముచేసెను. తరువాత తిరుగుబాటణచివేయబడినది. ఇందులో అత్యంత విషాదకరమైన విషయ మేమిటనగా, సీతారామరాజు అరెస్టులోనుండి పారిపోవ ప్రయత్నించె నని చెప్పబడి తుపాకితో కాల్పబడుట. ఈ విషయములో వివరములను ప్రకటించవలసినదనీ, పంచాయితీరిపోర్టును దాఖలుచేయవలసినదనీ ప్రభుత్వమువా రనేకపర్యాయములు సవాలుచేయబడిరి. కాని ప్రయోజనము లేకపోయినది.

ఇక కాన్పూర్ కాంగ్రెసుకు పోవము. అక్కడకూడ మనకు కొన్ని చిక్కులు కలవు. పాట్నాలో చేయబడినతీర్మానము కాన్పూరులో ఆమోదింపబడవలసియున్నది. బెల్గామ్ కాంగ్రెసు నిర్ణయమునకు వ్యతిరేకముగా పాట్నాలో అ. భా. కాం. సం. వారు నూలుచందా విషయములోను, ఆస్తులను, అధికారములను పంచుకొనుటవిషయములోను తీవ్రమైన మార్పులను చేయుటకు వీలుకలదా అని పాట్నాలోనే చర్చ వచ్చినది. అదిగాక ఈకాంగ్రెసులో చర్చింపవలసిన మరియొక ముఖ్యవిషయము కలదు. స్వరాజ్యపక్షమువారుమడ్డిమన్ నివేదికనుగూర్చిన తీర్మానమునకుసవరణగా భారతశాసనసభలో కోరినకోరికను కాంగ్రెసు ఆమోదించవలసినదేనా అని మరియొకసమస్య ఉదయించినది. భారతకవయిత్రి అధ్యక్షతవహింపనున్న కాన్పూరు మహాసభలో ఈచిక్కుసమస్య లెదుర్కొనినవి. గాంధీ తన అధ్యక్షాధికారమును సరోజినీదేవిచేతులలో పెట్టినసందర్భమిూ కాంగ్రెసు కొక నూతనశోభ తెచ్చినది. గాంధీ తన అయిదుసంవత్సరముల కార్యక్రమమును సింహావలోకనము చేసి సంగ్రహముగా అయిదు నిమిషములు మాట్లాడెను. ఆప్రసంగములో, ఆయన తానిదివరలో చెప్పిన యేమాటా, వేసిన యేఅడుగూ వెనుకకు తీసుకోవలసిన అవసరము లేదని ప్రకటించెను. రోజులు గడచినకొలదీ తాను చేసిన ప్రతిపనీ సరిఅయినదగానే తనకు తోస్తూన్నదని ఆయన చెప్పెను. "ప్రజలలో ఉద్రేకాగ్నికణము లింకను మిగిలియున్నవని వాకు తోచినయెడల నే నీరోజున శాసనోల్లంఘ

బాయికి పరుగెత్తెను. అంతకుపూర్వమే వా రనుకూలసహకార (Responsive Co-operation) మనేపాట పాడదొడగిరి. ఈ ఇద్దరు రాజకీయవేత్తలునూ మంచి పండితులు. వీరి రాజకీయవిజ్ఞాన మెంత సున్నితమో భావప్రకటన మంత మొరటుగా నుం డును. వా రఖిలభారతస్వరాజ్యపక్షములోని తమ కార్యనిర్వాహకసభ్యత్వములకు రాజీనామా ఇచ్చి ఈక్రిందిప్రకటన గావించిరి:

"మోతీలాల్ పండితుడు నాగపురములో మాతో అంగీకరించినప్రకారము నిల బడక అనుకూలసహకారవాదమునకు ప్రతికూలముగా బహిరంగప్రచారము సాగించి నాడు. మేము మూకీభావము వహింపవలెననికూడా ఆయనఅభిప్రాయము. ఆయన విమర్శనలమూలమున ప్రజలలో అపోహ, ద్వేషము కలుగుతూన్నవి. కాబట్టి వాటికి ప్రత్యుత్తర మిచ్చేహక్కు మాకు కలదు. కాని పండితుని విమర్శలకు జవాబు చెప్పేముందు స్వరాజ్యపక్షమునందలి మాకార్యనిర్వాహకసభ్యత్వములకు రాజీనామా లిచ్చు టవసర మని మేము తలచితిమి. కాబట్టి పండితునకు స్వతంత్రముగాను, నిష్క పటముగాను ప్రత్యుత్తర మిచ్చేటందుకున్నూ, స్వరాజ్యపక్షకార్యనిర్వాహకవర్గమునం దున్న మాసహోద్యోగులకు కష్టము కలిగింపకుండుటకున్నూ మాసభ్యత్వములకు మేము రాజీనామా లిస్తున్నాము."

ఈరాజీనామాలేకాక తరువాత డాక్టరు మూంజీ, జయకర్, కేల్కారులు స్వరాజ్యపక్షసిద్ధాంతముప్రకార మాక్రమించిన తమ శాసనసభాసభ్యత్వములకుకూడా రాజీనామా లిచ్చిరి.

వారు నాటితో స్వరాజ్యపక్షపంకమునుండి విముక్తి నొందిరి. మోతీలాల్ పండితుడు నవంబరు ౯వ తేదీని కేల్కారు, జయకరులకు ప్రత్యుత్తరముగా "స్వరాజ్య పక్ష కార్యక్రమమునందు సహకారము, అసహాకారము, నిర్మాణము, నిర్మూలము— ఈ అన్నీ ఇమిడిఉన్నవి. జాతీయశ్రేయస్సుకొరకు మవసరమైనప్పు డివి ప్రయోగింప బడుతూవచ్చినవి. కాబట్టి స్వరాజ్యపక్ష మెప్పుడూ తన కార్యవిధానమునుండి పెడ దారులు పట్టలేదు" అని ప్రకటించెను. పండితుని ఈధోరణికి జయక రయిష్టత చూపెను. చిట్టచివరకు కాంగ్రెసు జరిగేటంతవరకును స్వరాజ్యపక్షమును గూర్చిన బహిరంగవాదప్రతివాదములు నిలిపివేయబడవలె నని డిసంబరు ౪-వ తేదీని ఒడంబడిక కుదిరినది.

౧౯౨౬ లో జరిగిన మరియొక ప్రాముఖ్యమైన చరిత్రాంశము నుదాహరింపవల సియున్నది. అది ప్రత్యక్షముగా కాంగ్రెసుకు సంబంధించినది కాదు. కాని ప్రభుత్వము వారుమాత్ర మాంధ్రరాష్ట్రములోని గోదావరి, విశాఖపట్నంజిల్లాలలో చేరిన గూడెం

ఏ.జెన్సీలో సీతారామరాజు నాయకత్వముక్రింద జరిగిన తిరుగుబాటుకు శాసనోల్లంఘ నోద్యమము కారణమని ముడిపెట్టిరి. మాప్లా తిరుగుబాటువిషయములోకూడా ప్రభు త్వమువా రటువంటి ప్రమాదమునే కావించిరి. గూడెంతిరుగుబాటుకూడా ౧౯౨౨లో ప్రారంభమైనది. కాని మాప్లాతిరుగుబాటు సాగిన కొంతకాలమున కది ప్రారంభమైనది. కాని మాప్లాతిరుగుబాటులోని మతకలహబీజము లేవీ ఇందులో లేవు. ఇక్కడకూడ కొంత యుద్ధకాండ జరుగవలసివచ్చినది. కాని ౧౯౨౩ చివరవరకుకూడ సైనిక సన్నాహము లంత ప్రబలముగా జరుగలేదు. ౧౯౨౪లో అస్సామునుండి ౨౫౦ మంది ఉద్యోగస్థులతో ఒక రైఫుల్ పటాలము పిలిపింపబడినది. సీతారామరాజు ౨౦౦ మంది అనుచరులతో బ్రిటిష్ప్రభుత్వమువారి బలవత్తరమైన సైనికదళమునకు ప్రతికూలముగా మూడేండ్లు అడవులలోను, కొండలలోను దాగి యుద్ధముచేసెను. తరువాత తిరుగు బా టణచివేయబడినది. ఇందులో అత్యంత విషాదకరమైన విషయ మేమిటనగా, సీతా రామరాజు అరెస్టులోనుండి పారిపోవ ప్రయత్నించె నని చెప్పబడి తుపాకితో కాల్చ బడుట. ఈ విషయములో వివరములను ప్రకటించవలసినదనీ, పంచాయితీరిపోర్టును దాఖలుచేయవలసినదనీ ప్రభుత్వమువా రనేకపర్యాయములు సవాలుచేయబడిరి. కాని ప్రయోజనము లేకపోయినది.

ఇక కాన్పూర్ కాంగ్రెసుకు పోవము. అక్కడకూడ మనకు కొన్ని చిక్కులు కలవు. పాట్నాలో చేయబడినతీర్మానము కాన్పూరులో ఆమోదింపబడవలసియున్నది. బెల్గామ్ కాంగ్రెసు నిర్ణయమునకు వ్యతిరేకముగా పాట్నాలో అ. భా. కాం. సం. వారు నూలుచందా విషయములోను, ఆస్తులను, అధికారములను పంచుకొనుటవిషయ ములోను తీవ్రమైన మార్పులను చేయుటకు వీలుకలదా అని పాట్నాలోనే చర్చ వచ్చినది. అదిగాక ఈకాంగ్రెసులో చర్చింపవలసిన మరియొక ముఖ్యవిషయము కలదు. స్వరాజ్యపక్షమువారుమడ్డిమన్ నివేదికనుగూర్చిన తీర్మానమునకుసవరణగా భారతశాసన సభలో కోరినకోరికను కాంగ్రెసు ఆమోదించవలసినదేనా అని మరియొకసమస్య ఉద యించినది. భారతకవయిత్రి అధ్యక్షతవహింపనున్న కాన్పూరు మహాసభలో ఈచిక్కు సమస్య లెదుర్కొనినవి. గాంధీ తన అధ్యక్షాధికారమును సరోజినీదేవిచేతులలో పెట్టిన సందర్భ మీ కాంగ్రెసు కొక నూతనశోభ తెచ్చినది. గాంధీ తన అయిదుసంవత్సరముల కార్యక్రమమును సింహావలోకనము చేసి సంగ్రహముగా అయిదు నిమిషములు మాట్లా డెను. ఆప్రసంగములో, ఆయన తానిదివరలో చెప్పిన యేమాటా, వేసిన యే అడుగూ వెను కకు తీసుకోవలసిన అవసరము లేదని ప్రకటించెను. రోజులు గడచినకొలదీ తాను చేసిన ప్రతిపనీ సరిఅయినదిగానే తనకు తోస్తూన్నదని ఆయన చెప్పెను. "ప్రజలలో ఉద్రే కాగ్నికణము లింకను మిగిలియున్నవని నాకు తోచినయెడల నే నీరోజున శాసనోల్లంఘ

నమును ప్రారంభించును. దురదృష్టవశమున అది పమసిపోయినది. దక్షిణాఫ్రికా సమస్య అందుకు తగిన దని కొందరి అభిప్రాయము. కాని అనేకమంది నన్నావిషయములో ప్రతిఘటింపగలరు.'' అని ఆయన ప్రసంగించెను. సరోజినీదేవి తగినట్లుగా ప్రత్యుత్తర మిచ్చి అధ్యక్షపదము నలంకరించెను. ఆమెఅధ్యక్షోపన్యాసము కాంగ్రెసువేదికపైన ఇదివర కీయబడిన అధ్యక్షోపన్యాసము లన్నింటిలోకి చిన్నది. కాని అత్యంత మధురమైనది. ఆమె సంఘీభావము కావలె ననెను. భారతశాసనసభలో చర్చింపబడిన జాతీయవాంఛనుగూర్చి ఆమె కొంతతడ వుదాహరించెను. భారతజాతికి భయము పోవలెనని ప్రబోధించెను. ఆమె స్వాతంత్ర్యయుద్ధములో భయము క్షమార్హముకానిద్రోహమనెను. నిరాశ క్షమింపరాని పాపమనెను. ఆమెఉపన్యాస మీవిధముగా భారతజాతికి నూతనవిశ్వాసమును, నూతనసాహసమును కల్పించెను. ఆమెమాతృశిక్షణముక్రింద కాన్పూరుకాంగ్రెసు తేలికగా గడచిపోయినది. కార్మికప్రదర్శనములును, డెలిగేటులలో కలిగిన కొన్ని చిన్ని చిన్ని తగాదాలును జవహరలాలుపండితుని మందలింపులతో సమసిపోయినవి. కాన్పూరుకాంగ్రెసులో సర్ సురేంద్రనాథ్ బెనర్జీ, చిత్తరంజనదాసు, డాక్టరు సర్ రామకృష్ణ గోపాల్‌భండార్‌కార్ మొదలగు నాయకుల మరణములకు విచారము ప్రకటింపబడినది. ఆ సమయములోనే భారతదేశమునకు దక్షిణాఫ్రికారాయబారవర్గమువారు వచ్చిరి. వారి సన్మానమునుగూర్చి కాంగ్రెసులో ఒక తీర్మానము చేయబడినది. ఏరియా రిజర్వేషన్ అండు ఇమ్మిగ్రేషన్ రిజస్ట్రేషన్ బిల్లు సాగరలో జరిగిన స్మట్సుగాంధి ఒడంబడికకు ప్రతికూలముగా నున్నదని ప్రకటింపబడినది. ఆవిషయములో గాంధిచేసిన వ్యాఖ్యానమును పరిష్కరించేనిమిత్తము మధ్యవర్తికి పంపించవలసినదని కోరబడిరి. ఈ విషయములో రౌండుటేబిలుసభ జరుపబడవలెననే సూచనను కాంగ్రెసామోదించినది. ఒకవేళ ఆ బిల్లంగీకరింపబడినయెడల సామ్రాజ్య ప్రభుత్వమువారు దాని నామోదింపకూడ దని తీర్మానింపబడినది. బెంగాలార్డినెన్సు చట్టమునుగూర్చి, గురుద్వారాఖైదీలనుగూర్చి తగినట్లుగా తీర్మానములు చేయబడినవి.

బర్మేతర నేరస్థుల నిరాకరణచట్టము (**Expulsion of non-Burman offenders Bill**), బర్మా సముద్రప్రయాణికుల పన్నుల చట్టము—ఈరెండును పౌరస్వాతంత్ర్యమునకు భంగకరములుగా నున్నవని తీర్మానింపబడినది. తరువాత నూలుచందానుగూర్చి పాట్నాలో ౨౨-౯-౨౫ న అ. భా. కాం. సం వారిచే చేయబడిన తీర్మానము లక్నోకాంగ్రెసులో అంగీకరింపబడినది. రాజకీయకార్యక్రమమును స్వరాజ్యపక్షమువారు నడుపవలెననీ, అందుకు కావలసిన కాంగ్రెసునిధులను వారుపయోగించుకొనవచ్చుననీ అఖిలభారతచర్ఖాసంఘమునకు ప్రత్యేకింపబడిన నిధులు గాంధీస్వాధీనములో నుండవలెననీ పాట్నాలోచేయబడిన తీర్మానము లిక్కడ ఆమోదింపబడినవి. కావనోల్లం

ఘనమునందు విశ్వాసముకలదని ప్రకటింపబడినది. రాజకీయ కార్యక్రమమును నిర్వర్తించుటలో స్వయంశక్తిపైన ఆధారపడియుండుట ఆవశ్యముగా నుండవలెనని కోరబడినది. తరువాత జరుగవలసిన కార్యక్రమమునుగూర్చి యీ క్రిందివిధముగా ఉండవలెనని తీర్మానింపబడినది.

"(౧) ప్రజలకు వారిరాజకీయహక్కులనుగూర్చి బోధింపవలెను. ఆహక్కులను వారు సంపాదించుకొనుటకు తగిన బలమును, నిగ్రహమును కలిగియుండేటట్లు వారికి శిక్షణ మీయవలెను. ఆ శిక్షణము నిర్మాణకార్యక్రమరూపములో నుండవలెను. ముఖ్యముగా ఖద్దరు, రాటములను ప్రచారములోనికి తీసుకొనిరావలెను. వివిధమతస్థులలో పంఘీభావమును పెంపొందింపవలెను. అస్పృశ్యతను నిర్మూలింప ప్రయత్నింపవలెను. నిమ్నజాతుల స్థితిగతులను బాగుచేయవలెను. ప్రజలు కల్లుసారాయిలను, మత్తు పదార్థములను ఉపయోగించుట మాన్పింపవలెను. శాసనసభల నాక్రమింపవలెను. గ్రామములోని కట్టుబాట్లను పునరుద్ధరించవలెను. జాతీయవిద్యను ప్రోత్సహించవలెను. కార్మికనిర్మాణములను స్థాపింపవలెను. యజమానులకును, కార్మికులకును గల భేదభావములను సమన్వయము చేయవలెను. జమీందారులకు, రైతులకును తగాదాలు రాకుండ చూడవలెను భారతదేశముయొక్క జాతీ, యార్థిక, పారిశ్రామిక, వాణిజ్య ప్రయోజనములను ప్రోత్సహించవలెను.

(౨) భారతదేశమునకు వెలుపల మనదేశములోని నిజమైన పరిస్థితులను గూర్చి ప్రచారము జరుగవలెను.

(3) భారతశాసనసభలోని స్వతంత్రపక్షమువారును, స్వరాజ్యవాదులును ౧౯౨౪ ఫిబ్రవరి ౧౮ తేదీని ప్రభుత్వమువారికి సూచించిన రాజీషరతులను భారతదేశపక్షమున ఈ కాంగ్రెసువా రంగీకరిస్తూ, ఆ సూచనలనుగూర్చి ప్రభుత్వమువారింతవర కేమీ చర్య తీసుకొనకపోవుటవలన కాంగ్రె స్క్రింది కార్యక్రమమును నడిపింపవలె నని తీర్మానిస్తున్నారు.

(i) ఆ షరతులనుగూర్చి ప్రత్యుత్తర మీయవలసినదిగా భారత శాసనసభలోని స్వరాజ్యపక్షమువారు సాధ్యమైనంత త్వరలో ప్రభుత్వమువారిని కోరవలెను. ఒకవేళ ఫిబ్రవరిచివరవారములోగా ప్రభుత్వమువారు తమ నిర్ణయమును ప్రకటించనియెడలను, లేక ప్రభుత్వమువారిచే ప్రకటింపబడిన నిర్ణయము కాంగ్రెసుకార్యవర్గము వారున్నూ, అ. భా. కాం. సం. వారిచే నియమింపబడిన తదితరసభ్యులున్నూ గల ఉపసంఘమునకు సంతృప్తికరముగా నుండనియెడలను స్వరాజ్యపక్షమువారు శాసనసభాభవనమునందు ప్రస్తుతశాసనసభలలో నా రుండి ఇక పనిచేయజాల రని ప్రభుత్వమువారికి

తెలియపరచవలెను. భారతశాసనసభయందునూ, స్టేటుకౌన్సిల్ లోనూ గల స్వరాజ్య సభ్యులందరు ప్రభుత్వమువారి ఆర్థికచట్టము (Finance Bill) ను త్రోసివేసి వెంటనే తమ స్థానములను వదలివేయవలెను. ఇక రాష్ట్రీయశాసనసభలలోని స్వరాజ్యసభ్యులు అప్పుడు సభలు జరుగుతూఉన్నయెడల వారుకూడా తమ స్థానములను విడిచివేయ వలెను. ఆనాటికి సభలు జరుగుతూఉండని శాసనసభలలోని స్వరాజ్యసభ్యులు రాబోయే శాసనసభాసమావేశములకు వేటికీ హాజరు కాకూడదు. ఉపసంఘముల విషయములో కూడా యింతే.

(ii) స్టేట్ కౌన్సిల్ లోని స్వరాజ్యసభ్యులుగాని, భారతశాసనసభా రాష్ట్రీయ శాసనసభలలోని స్వరాజ్యసభ్యులుగాని, తమ స్థానములు ఖాళీ కాకుండుటకును, బడ్జెటులను త్రోసివేయుటకును, క్రొత్తపన్నులను నిరాకరించే విషయమునను మాత్రమే శాసనసభలకును, ఉపసంఘములకును హాజరుకావలెను.

స్వరాజ్యపక్షసభ్యులు తమ స్థానములను ఖాళీచేయవలసిన దని కోరబడేముందు వారు వారిపక్షనియమములను బట్టి శాసనసభలలో వారి కార్యవిధానమును కొనసాగింపవచ్చును.

ఏ శాసనసభలోని స్వరాజ్యసభ్యులనైనను శాసనసభలకు పోయి ఫలానా పని చేయవలసిన దని నియమించుటకు పైన చెప్పబడిన ఉపసంఘమువారికి హక్కు కలదు. వారికి ముఖ్యమని తోచిన ఆప్రత్యేకకార్యమును నిర్వర్తించుటకే స్వరాజ్య పక్షమువారు పంపబడవలెను.

(iii) సబ్ క్లాజు (i) లో సూచింపబడిన ప్రత్యేకకమిటీవారు అ. భా. కాం. సం. వాహ్వానించి ఒక కార్యక్రమమును తయారు చేయించవలెను. దానిని కాంగ్రెసు, స్వరాజ్యపక్షములవా రిద్దరూ కలిసి నిర్వర్తింపవలెను.

(iv) ఆకార్యక్రమములో (i), (ii) క్లాజులలో నుదాహరింపబడిన కార్యవిధానములోని ముఖ్యాంశము లిమిడియుండవలెను. వోటర్లలో కాంగ్రెసుకార్య విధానమునుగూర్చి ప్రచారము జరుగవలెను. రాబోయే ఎన్నికలు కాంగ్రెసుపేరుతో ఏవిధముగా నడుపబడవలెనో నిర్ణయింపబడవలెను. కాంగ్రెసువారు ఏ అంశములపైన ఎన్నికలకు నిలువవలెనో స్పష్టీకరింపబడవలెను.

ప్రభుత్వమువారు రాజీపరతులకు సంతృప్తికరముగా ప్రత్యుత్తర మిచ్చినా రని కాంగ్రెసుకు తోచేటంతవరకునూ గవర్నమెంటువా రిచ్చే ఉద్యోగములను కాంగ్రెసు వారు నిరాకరించేపద్ధతి కొనసాగింపబడవలెను.

(v.) వివిధరాష్ట్రీయ కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గములవారును ఆయా రాజధానులలోని రాష్ట్రీయశాసనసభలకున్నూ, కేంద్రశాసనసభలకున్నూ ముందుసంవత్సరము రాబోయే ఎన్నికలలో కాంగ్రెసుపక్షమున పోటీచేయతగిన అభ్యర్థులను సాధ్యమైనంత తొందరలో నిర్ణయించవలెను.

(vi.) పైన చెప్పబడిన అసెంబ్లీతీర్మానానుగుణ మైన రాజీషరతులనుగూర్చి ప్రభుత్వమువారి అంత్యనిర్ణయము పైన నుదాహరింపబడిన ప్రత్యేక కమిటీవారికి సంతృప్తికరముగానూ, అంగీకారముగానూ తోచినయెడల వెంటనే అ. భా. కాం. సం. సమావేశము జరుపబడవలెను. ఆ అ. భా. కాం. సం. వారికి ప్రత్యేకకమిటీవారి నిర్ణయము లంగీకరించుటకు గానీ, లేక నిరాకరించుటకుగానీ హక్కుగలదు. వారే భవిష్యత్కార్యక్రమమునుకూడా నిర్ణయించవలెను.

(vii.) ఇక్కడ చెప్పబడిన ప్రకారము స్వరాజ్యవాదులు శాసనసభలను విడచిపెట్టేవరకునూ స్వరాజ్యపక్షమువారి నిర్మాణవిధానమునందలి నియమములను శాసనసభలలో వా రనుసరింపవచ్చును. కాని భారతజాతీయమహాసభగాని, అ. భా. కాం. సంఘముగాని అప్పుడప్పుడూ చేసే మార్పులకు వారినిబంధనలు లోబడియుండవలెను.

(viii.) పైన సూచింపబడిన iii, iv క్లాజుల ప్రకారము పనిని ప్రారంభించుటకు కావలసిన ధనమును అ. భా. కాం. సం. వారు ప్రత్యేకింపవలెను. ఆ ప్రచారములో ఇంకనూ ధనము కావలసియున్నయెడల అ. భా. కాం. కార్యవర్గము వారిచేగాని, లేక వారి తనిఖీక్రిందగాని విరాళముల రూపకములో ధనము సేకరింపబడవలెను."

కాన్పూరులో ప్రధాన తీర్మాన మంగీకరింపబడుటకు ముందు కొన్ని వాదప్రతివాదములు జరుగకపోలేదు. కాంగ్రెసులోనుండియే అసహాయోద్యమమునకు ప్రతికూలముగా పోరాడుతూన్న మాలవ్యాపండితుడు అనుకూలురకు, ప్రతికూలురకు కూడ ప్రేమాస్పదుడు. ఆయన ఆనాటి ప్రధానతీర్మానమున కొకసవరణను ప్రతిపాదించెను. దానిని జయకరు ఆమోదించెను. ఆ సవరణ ఇది: "సంపూర్ణబాధ్యతాయుత ప్రభుత్వమును తొందరలో స్థాపించుటకు శాసనసభా కార్యక్రమము సాధ్యమైనంత ప్రయోజనకరముగా సాగింపవలెను. జాతీయాభ్యుదయమున కనుగుణముగా శాసనసభాసభ్యులు ప్రభుత్వమునకు సహాయపడుటగాని, లేక ప్రభుత్వము నాటంకపరచుటగాని జరుగవలెను." ఈ సవరణ నామోదిస్తూనే జయకర్ తానున్నూ, కేల్కారు మూంజీలున్నూ శాసనసభ్యత్వములకు రాజీనామాల నిచ్చినవిషయమును ప్రకటించెను. ఈసవరణనుగూర్చిన చర్చలోనే స్కీన్ కమిటీలో మోతీలాలుపండితుడు సభ్యత్వము నంగీకరించినందుకు తీవ్రముగా విమర్శింపబడెను. "భారతశాసనసభయందు హిందూదేశ

ములో సైనికకళాశాలలను నిర్మించుటనుగూర్చి మార్గము చూపింపవలసిన దని కోరబడి నది. భారతీయులకోరికలను సఫల మొనరించుటకు మార్గము నాలోచింపవలసిన దని మాత్రమే ప్రభుత్వమువారు కోరిరి. ఆదేవిధముగా ప్రభుత్వమువారు రాజ్యాంగ సంస్కరణలకుకూడా మార్గ మాలోచింపవలసిన దని కోరేయెడల స్వరాజ్యపక్షము వారు తప్పక ప్రభుత్వముతో సహాయపడెదరు." అని జయకరు స్పష్టపరచెను.

జాతీయమహాసభావ్యవహారములు గాని, అ. భా. కాం. సం. వ్యవహారములు గాని హిందూస్థానీభాషలో జరుపబడవలె నని తీర్మానింపబడినది. విదేశములలో ప్రచారముచేసేనిమిత్త మొకకాంగ్రెసుశాఖను నిర్మించుటకు అ. భా. కాం. సం. వారి కధికార మీయబడినది. మరుకాంగ్రెసు అస్సాములో జరుపుట కేర్పాటుచేయబడినది. అన్సారీ, ఎ. రంగస్వామి అయ్యంగార్, క. సంతానములు కార్యదర్శులుగా నియమింపబడిరి. కాన్పూరుకాంగ్రెసు జరిగినతరువాత కొద్దికాలమునకే ౧౯౨౬ జనవరి రెండవవారములో హార్నిమన్ ఇండియాకు తిరిగివచ్చెను.

ఈకాంగ్రెసులో జరిగిన ఒకసంతోషకరమైన విషయము రెవరెండుహోమ్సు అమెరికానుండి ఈకాంగ్రెసుకు హాజరగుట. ఆయన గాంధీకోపేధరించి అమెరికన్ దుస్తులలో కాంగ్రెసువేదికపైన నిలిచి "నన్ను గాంధీజీ దక్షిణాఫ్రికాకు చెందునని డాక్టరు అబ్దుల్‌రహిమాన్ చెప్పగా నేను విన్నాను. నే డాయనను ప్రపంచకమునకు చెందిన మనిషిగా నేను చెప్పుచున్నాను. నేను ప్రాతినిధ్యము వహిస్తున్న "మిత్రసంఘము" వారు మీ రాయన నేవిధముగా గౌరవిస్తూన్నారో ఆవిధముగానే గౌరవించి ఆయనకార్యక్రమమునందు విశ్వాసముకలిగియున్నారు. మా పాశ్చాత్యనాగరకతమూల మున మేము చాలాప్రమాదావస్థలో నున్నామని చెప్పవలసియున్నది. మేము ధనాధికారములకొరకు పరుగెత్తుతున్నాము. మా పాశ్చాత్యనాగరకతలో ఆచెడుగు పాతుకొనిపోయినది. మా ఐశ్వర్యవాంఛ, మా అధికారప్రేమ - ఇవి రెండును అనేక యుద్ధములకు కారణభూతములైనవి. మా నాగరకత నిర్మూలమయ్యేటంతవరకునూ యుద్ధములు వచ్చుట కవకాశములు కలవు. కాబట్టి అంతకన్న మంచిమార్గమును జూపుతూన్న మిమ్ములను మేము సంతోషముగా అనుసరింతుము. నేడు మీలోని ఈమత ప్రవక్త ప్రబోధిస్తూన్న సోదరవాత్సల్యమును మే మనుసరింప తలంతుము" అని కరతాళధ్వనులు చెలరేగ నుపన్యసించెను.

౧౯౨౫ నాటి చరిత్రను ముగించేలోపల ఆసంవత్సర మంతా అప్పుడప్పుడూ జరుగుతూవచ్చిన దురదృష్టకరములైన హిందూమహమ్మదీయ మతకలహములను వివరింపవలసియున్నది. ౧౯౨౬ లో కూడ ఇట్టి మతకలహములు జరిగినవి. వాటిని

గూర్చి ముందు తెలియజేయగలము హిందూమహమ్మదీయ సంఘీభావమునుగూర్చి మే ౧ వ తేదీని కలకత్తా మీర్జాపూర్ పార్కులో జరిగిన బహిరంగసభయం దుపన్యా-సిస్తూ గాంధీ “ నా అసమర్థతను నే నంగీకరింతును. ఈరోగమునకు తగినచికిత్స చేయలేకపోయినా నని నే నొప్పుకొందును. హిందువులుగాని, మహమ్మదీయులుగాని, నా సూచన నంగీకరించేటట్లు కనిపించదు. కాబట్టి నే నీసమస్యనుగూర్చి ఉదాహరించి మాత్ర మూరుకొందును. మన దేశపరిపాలనము మన హస్తగతము కావలె నన్నయెడల ఎప్పుడో ఒకప్పుడు హిందూమహమ్మదీయ సంఘీభావము కలిగితీరవలె నని చెప్పి నేను సంతృప్తిపడుదును. మన కైకమత్యము కలిగేలోపుగా మనలో ఒకరినొకరు మరియొకరు కనులజూడవలసియే యున్నయెడల ఆపని ఎంత తొందరగా జరిగితే అంత మంచిదని నా అభిప్రాయము. మనలో మనము తలలు పగలగొట్టుకోవడమే నిశ్చయమైన యెడల మనము నిజమైన పురుషులవలెనే ఆపని చేసికొనవచ్చును. దొంగకన్నీళ్లు కార్చినందువల్ల ప్రయోజనము లేదు. మనకు సానుభూతి లేనిచోటినుండి మనము సానుభూతి కావలె నని కోరవద్దు ” అని ఉపన్యసించెను. ౧౯౨౬ జులై నెల అంతా మతకలహములు పెచ్చుపెరిగినవి. ఢిల్లీ, కలకత్తా, అలహాబాదునగరము లందుకు కేంద్రము లైనవి. నిజామురాష్ట్రములో నిరుడు మతకలహములు జరిగిన గుల్బర్గాపట్టణమునకు ౭౦ మైళ్ల దూరములోనున్న హుమ్నాబాదులో బక్రీదుపండుగల సందర్భమున ఒక కొట్లాట జరిగినది. ఇక సిక్కుసమస్యనుగూర్చి విచారింతము. ఈవిషయములో గురుద్వారాబిల్లు శాసనసభలో ప్రవేశపెట్టబడి అంగీకరింపబడినది. సిక్కుఖైదీ లాగురుద్వారాచట్టము నంగీకరింతుమనీ, పూర్వమువలె సత్యాగ్రహదండయాత్రలో పాల్గొనమనీ షరతువ్రాసి ఇచ్చినయెడల వారు విడుదలచేయబడుదు రని సర్ మాల్కొమ్ హెయిలీ ప్రకటించెను. ఇది చాలామంది కిష్టముగా లేదు. కాని కాలము గడచినకొలదీ కొంతమంది మనస్సు కుదుర్చుకొనిరి. అనేకమందిఖైదీలు చట్టమున కనుగుణముగా ప్రవర్తింతు మని వ్రాసియిచ్చిరి. ఈ విషయములో శి. గు. ప్ర. క. లోనే భేదాభిప్రాయములు కలిగినవి. కొంతమంది ముందుగా విడుదలచేయబడిరి. మరి-కొందరు జైళ్లలో వారిశిక్షాకాలము పూర్తి అయ్యేటంతవరకునూ ఉండిరి.

# 7. శాసనసభా రంగము

## ౧౯౨౬

[అనుకూల సహకారము (Responsive Co-operation) - స్వరాజ్య సభ్యులు భారతశాసనసభనుండి లేచి వచ్చుట - ప్రెసిడెంటు పటేలు - ఉద్యోగ స్వీకరణమునకు షరతులు - సబర్మతీసంధి - నెహ్రూపండితుడు విషయములను స్పష్టీకరించుట - అనుకూలసహకారవాదులకును, స్వరాజ్యపక్షమువారికిని కలిగిన మనస్పర్థలు - రాయబారములు భగ్నము లగుట - మోతీలాల్ పండితుని ఇంగ్లండు ప్రయాణము - వంగరాష్ట్రస్వరాజ్యవాదులు - కలకత్తాకలహములు - మారికపురేటు - లాలాజీ, మోతీలాల్‌జీలు - భారతప్రభుత్వకార్యవర్గమునందు మహామ్మదీయుని నియామకమునుగూర్చి ఇర్విన్ ప్రభువు సర్ అబ్దుల్‌రహీమ్‌కు వ్రాసినఉత్తరము - శాసనసభల ఎన్నికలు - గౌహతీకాంగ్రెసు - శ్రద్ధానంద స్వామి పిస్తోలుతో కాల్చబడుట - అధ్యక్షోపన్యాసము - తీర్మానములు - శ్రద్ధానందుని హత్యనుగూర్చి గాంధీ ప్రధానతీర్మానము - సుప్రసిద్ధ ప్రేక్షకులు - నాభానుగూర్చి మోతీలాల్ - ౧౯౨౬ ఎన్నికల కార్యక్రమము - ఖాదీ అభివృద్ధి.]

ఈ సంవత్సరము శాసనసభా కార్యక్రమమునకు తగినంత ఉత్సాహకరముగా లేదు. ౧౯౨౩ నాటి శోభ ఈనాటికి పాతబడిపోయినది. కేవలము పోరాటము కోసమే పోరాడుట విసుగు పుట్టించును. ఈ సంవత్సర ప్రారంభమున ప్రచారకులలో ఆయాసము కనిపించుటయే కాక పనులలో ప్రతికూలభావముకూడా బయలుదేరినది.

౧౯౨౫ అంతమునకే అనుకూల సహకారప్రచారము ప్రారంభ మైనది. ౧౯౨౬ జనవరి ౨౦ వ తేదీని భారతశాసనసభ ప్రారంభింపబడకమునుపే బొంబాయిలోని స్వరాజ్యపక్షకార్యవర్గమువారు అనుకూల సహకారవాదమునకు సంపూర్ణసహాయము చేయ నిశ్చయించిరి.

ఈ సందర్భములో స్వరాజ్యపక్షవ్యవహారములను గూర్చి మనము మరియొకసారి ఆలోచించవలసియున్నది. మోతీలాల్ పండితుడు ౧౯౨౬ జనవరి రెండవవార

మున వైస్రాయిమందిరములోని అడుగుపెట్టెను. స్వరాజ్యపక్ష కార్యవర్గమువారి అంగీకారముతోనే ఈ పని ఆయన చేసె ననుమాట స్పష్టము. ఆయన లాలాజీ మొదలగు అయిదుగురు నాయకులతో కలసి, దక్షిణాఫ్రికావిషయమునుగూర్చి వైస్రాయితో ప్రసంగించుటకు వెళ్లెను. కొంతకాలమువరకును ఈ వార్త ఉత్సాహకరముగానే కనపడినది. కాని తరువాత మేఘావృతమైన భారతరాజకీయాకాశమును తేజోవంతముగా చేయగలిగిన ఆశాకిరణము దూరముగానైననూ గోచరము కాలేదు. ౧౯౨౬ జనవరి ౨౦ వ తేదీని భారతశాసనసభను ప్రారంభిస్తూ రీడింగు ప్రభువు చేసిన ఉపన్యాసమే మొట్ట మొదట ప్రజలహృదయములలో వెలుగొందిన ఆశాజ్యోతికి కారణము. రీడింగుప్రభువు తన ఉపన్యాసమునందు ౧౯౨౫ జూలై ౭ వ తేదీని బర్కెన్ హెడుప్రభుని ప్రసంగములోని కొన్ని వాక్యముల నుదాహరించెను. అవి ఇవి: "మేము సద్భావమును కోరుతున్నాము. మా హృదయములకు సన్నిహిత ప్రేమాస్పదమైన ఆ ఉదార మిత్రభావము చూపబడెనేయెడల లోభులవలె మేము బేరములు చేయము." ఢిల్లీనగరమునందు మార్చి ౬, ౭ తేదీలలో అ. భా. కాం. సం. వారు సమావేశమై కాన్పూరు నిర్ణయము నామోదించిరి. తరువాత "స్వరాజ్యాభ్యుదయమున కవసరమైన జాతీయకార్యక్రమమున కాటంకములను కలిగించే ప్రభుత్వముయొక్కగాని, తదితరులయొక్కగాని ప్రతిచర్యనూ నిరోధించుటకున్నూ, అభ్యంతరపెట్టుటకున్నూ" నిర్ణయింపబడినది. కాంగ్రెసుకు సంతృప్తికరమైన ప్రత్యుత్తరమును ప్రభుత్వమువారు పంపేటంతవరకూ ముఖ్యముగా శాసనసభలలోని కాంగ్రెసువాదులు ప్రభుత్వమువారిచే ఈయబడిన ఉద్యోగములను నిరాకరింపవలెను." అనీ కూడా ఢిల్లీలో మరియొకసారి తీర్మానింపబడినది. మార్చి ౫ వ తేదీని సమావేశమైన కాంగ్రెసుకార్యనిర్వాహకవర్గమువారు హిందూస్థానీసేవాదళమునకు రు. ౨౦౦౦ లను విదేశములలో ప్రచారమునిమిత్తము ౫౦౦౦ రూపాయలను శాంక్షన్ చేసిరి. కాకినాడ కాంగ్రెసుతీర్మానము ప్రకారము హిందూస్థానీసేవాదళము పేరిట స్వచ్ఛందసైనికసంఘ మేర్పాటు చేయబడినది. అదళ మప్పటికి రెండువార్షిక సమావేశములను జరిపినది. ఒకటి బెల్గాములో మౌలానా షౌకతాలీ అధ్యక్షతక్రిందను, రెండవది గోస్వామి అధ్యక్షతక్రిందను జరిగెను. ఇంతవరకునూ విదేశప్రచారమును గూర్చి మాటలతోనే కాలము గడచిపోయినది. కాని ఇప్పు డది ఆచరింపవలసిన ముఖ్య కార్యక్రమమైనది. హిందూస్థానీసేవాదళముయొక్కయూ, విదేశప్రచారముయొక్కయు అభివృద్ధులనుగూర్చి ముందు రాబోయే సంవత్సరముల చరిత్రలో వివరింతుము. కమలా నెహ్రూచికిత్సనిమిత్త మామెను పండిత జవహరలాలునెహ్రూ స్విట్జర్ లాండు తీసుకొనిపోవలసియుండుటచేతను, స్కీన్ కమిటీసభ్యుడుగా పండిత మోతీలాల్ నెహ్రూ సీమకు వెళ్ల వలసియుండుటచేతను అంతవరకూ నిద్రపోతూన్న విదేశప్రచారవిషయము

మేల్కాంచినది. భారతశాసనసభలో బడ్జెటుచర్చ వచ్చినప్పుడు మోతీలాలు తానున్నూ, తన మిత్రులున్నూ వోటింగులో పాల్గొనజాల మని ప్రకటించెను. అంతకు పూర్వమే స్వరాజ్యపక్షమువారు కేంద్రశాసనసభనుండి స్థానములను ఖాళీచేసి లేచిపోరాదరని తెలియరావడముచేత ప్రేక్షకులు గ్యాలరీలలోనుండి అత్యాతురతతో చూచుచుండిరి. గౌరవప్రదమైన సహకార మొనరించుటకు దేశబంధుదాసు సూచించిన షరతులను ప్రభుత్వమువా రేవిధముగా నిరాకరించిరో మోతీలాల్ పండితుడు వివరించెను. ప్రభుత్వము వారు తగిన జాగ్రత్తతీసుకోనియెడల దేశమంతటా రహస్యసంఘము లల్లుకొనిపోవునని ఆయన హెచ్చరించెను. ఈ మాటలతో ఆయన శాసనసభను విడిచిపెట్టి తన పక్ష సభ్యు లందరితోను, బయటకు వెళ్లి పోయెను.

స్వరాజ్యపక్షమువా రీవిధముగా బయటకు పోవుటవలన ఒక చిన్న సంఘటనము జరిగినది. ప్రెసిడెంటు పటేలు భారత శాసనసభలోని రాజకీయపక్షము లన్నిటిలోకీ పెద్దపక్షమైన స్వరాజ్యపక్ష సభ్యులు లేచిపోవుటచే భారతప్రభుత్వచట్టము ప్రకార మాసభ ప్రాతినిధ్యస్వరూపమును కోల్పోయిన దని ప్రకటించెను. కాబట్టి భారతశాసనసభ కొనసాగవలెనా లేదా అనేవిషయము ప్రభుత్వమువారిచే నిర్ణయింపబడవలసియున్నది. ప్రభుత్వమువారు వివాదవిషయము లైన శాసనములు వేటినీ ప్రవేశపెట్టకూడ దని ఆయన వివరించెను. ఒకవేళ అట్టి శాసనములను ప్రభుత్వమువారు ప్రవేశపెట్టదమే తటస్థించినయెడల తాను తన అసాధారణాధికారములను ప్రయోగించి శాసనసభను కాలపరిమితిలేకుండా వాయిదా వేయవలసివచ్చునని పటేలు బెదరించెను. కాని మరునా డాయన నెమ్మదిగా ఆ ధోరణిని తగ్గించుకొని "నేను పునరాలోచించినపిదప అధ్యక్షుడు తన అధికారములను గూర్చి ఉదాహరించకూడదనీ, ప్రభుత్వమువారికి బెదిరింపుగా కనపడేభావ మువయోగింపరాదనీ, భావి కార్యక్రమమును ముందుగా నిర్ణయించక వేచియుండవలెననీ నాకు తోచినది." అని ఆయన ప్రకటించెను. ఇది ప్రభుత్వమువారికి కొంత మనశ్శాంతిని చేకూర్చినది.

గయలో ప్రారంభమైన సహాయనిరాకరణపతనము ౧౯౨౬ ప్రారంభదశలోని సబర్మతీ సమావేశముతో పూర్తి అయినది. అనుకూల సహకారవాదులు దాదాపు స్వతంత్ర, జాతీయపక్షములవారితో లీనమైరి. కనుక వా రితరపక్షముల నాయకులతో కలిసి బొంబాయిలో ఏప్రిల్ మూడవ తేదీని సభ జరుపుకొనిరి. అప్పుడే భారత జాతీయపక్షము నిర్మింపబడినది. శాంతమును, న్యాయసమ్మతమును అయిన పద్ధతులతో అధినివేశములను పోలిన స్వరాజ్యసంపాదనమునకు ప్రయత్నించుట వారి ఆదర్శము. శాసనోల్లంఘనమున్నూ, పన్నుల నిరాకరణమున్నూ వారి కార్యక్రమమునుండి మినహాయింపబడినవి. శాసనసభలలో అనుకూల సహకారము నవలంబించుట కధికార మీయ

బడినది. స్వరాజ్యపక్షమును సాధించుటకే జాతీయపక్షము నిర్మింపబడ్డదని మోతీలాలు భావించెను. కొన్ని రాయబారములు జరిగినపిమ్మట స్వరాజ్యపక్షములోని రెండు శాఖలవారును సంఘీభావమును కుదుర్చుకొనుటకు ఏప్రిల్ ౨౧ వ తేదీని సబర్మతిలో సమావేశమైరి. ఆసభకు సరోజినీనాయుడు, లాలా లజపతిరాయి, కేల్కారు, జయకర్, అనీ, డాక్టరు మూంజీలుకూడ హాజరైరి. ఆ సమావేశములో రాష్ట్రములలోని మంత్రులకు వారి ధర్మములను సరిగా నిర్వర్తించుటకు తగిన అధికారమున్నూ, బాధ్యతయున్నూ, స్వతంత్రమున్నూ ఈయబడినయెడల ౧౯౨౭ ఫిబ్రవరిలో భారత శాసనసభలోని స్వరాజ్యసభ్యులు కోరిన కోరికలనుగూర్చి ప్రభుత్వమువారు సంతృప్తికరముగానే ప్రవర్తించినట్లు భావింపవలెనని స్వరాజ్యపక్షములోని ఆ ఉభయశాఖల వారును సమాధానపడిరి. అయితే ఈ సమాధానము అ. భా. కాం. సం. వారి ఆమోదమునకు లోబడియే ఆచరణలోకి రావలె నని వారు నిర్ణయించుకొనిరి. ప్రభుత్వము వారు మంత్రుల కిచ్చిన ఆ అధికారము సంతృప్తికరముగా ఉన్నదా, లేదా అనేవిషయము రాష్ట్రీయశాసనసభలలోని కాంగ్రెసుసభ్యులు నిర్ణయించవలసి యున్నది. ఆ నిర్ణయము మోతీలాలుజీ, జయకర్లచే ఆమోదింపబడవలెను. దీనినిగూర్చి ౧౯౨౬-౨౬ 'ఇండియా' "ఈరాజీనామాకాగితముపై సిరా ఆరకమునుపే ఆంధ్ర రాష్ట్రీయ కాంగ్రెసు సంఘాధ్యక్షుడు ప్రకాశంగారు కాన్పూరులో కంటె కూడా సబర్మతిలో కాంగ్రెసుస్థితి ఇంకనూ అధోగతికి వచ్చిన దని తన అసమ్మతిని ప్రకటించెను." అని వ్రాసినది. ఇంకా అనేకమంది సుప్రసిద్ధకాంగ్రెసువాదులు తమ అసంతృప్తి నీవిధముగానే వెల్లడించిరి. స్వరాజ్యవాదులు త్వరలోనే కౌన్సిలులో ప్రవేశించి మంత్రివర్గమునుకూడా నిర్మింతు రని ఆరోజులలో చాలామంది భావించిరి. కాని పండితుడు ఉద్యోగస్వీకరణమునుగూర్చి ఈ క్రింది మూడుషరతులను ప్రకటించి స్వరాజ్యపక్షమువారి భావములను వ్యక్తపరచెను.

(౧) మంత్రులపైన ప్రభుత్వమువారి అధికార మేమీ ఉండకూడదు. వారు శాసనసభలకు సంపూర్ణబాధ్యత కలిగియుండవలెను.

(౨) జాతీయనిర్మాణాభివృద్ధికి కావలసినద్రవ్యము ప్రత్యేకింపబడవలెను.

(3) ప్రజాయత్త శాఖలలోని ఉద్యోగములపైన మంత్రులకు సంపూర్ణాధికార ముండవలెను.

ఈ షరతులు ప్రకటింపబడేసరికి తిరిగీ కల్లోలము ప్రారంభ మైనది. ఈ షరతులు సబర్మతిలో కుదిరిన సమాధానమునకు ప్రతికూలముగా నున్నవనీ, సందేహ నివారణ మనేపేరుతో అసలురాజీకి విపరీతమైన వ్యాఖ్యానముచేయుట న్యాయము కాదనీ జయకరు ప్రకటించెను. అక్షణమునుండీ స్వరాజ్యపక్షమువారికిని, అనుకూల

సహకారవాదుల (Responsivists)కును మనస్పర్ధలు ప్రబలినవి. అయినప్పటికీ, వారి సబర్మతీసమాధానమునుగూర్చి అహమ్మదాబాదులో మే ౫ వ తేదీని సమావేశమైన అ. భా. కాం. సం. వారు పరిష్కరించవలసియుండెను. ఆ సమావేశములో ఆ సంధి పత్రముపైన సంతకములుచేసిన అనుకూలసహకారవాదులకును, తినకును మరతులను వ్యాఖ్యానముచేయుటలో తీవ్రమైన భేదభావము లేర్పడినందున సంధి భగ్నమైన దని మోతీలాలు ప్రకటించెను. మోతీలాల్ చేసిన ప్రకటనమున కినుగుణముగా అనుకూల సహకారవాదులచే వ్రాయబడిన ఒక ఉత్తరమును ఆయన చదివెను. అందుకు యస్. శ్రీనివాస అయ్యంగారు పండితునకు కృతజ్ఞతాభివందనములను సమర్పించెను. సబర్మతీసంధికి దక్షిణభారతదేశము ప్రతికూలముగానుండెనన్న మాట వాస్తవము. మోతీలాల్ ప్రథమమునుండీ వారితో ఆలోచించియుండవలసినది. సాధారణముగా మన మిత్రులయందు చూపే విశ్వాసమునుబట్టి ఇతరుల విశ్వాసమును మనము చూరగొందుము. మన మిత్రులను విశ్వసించనియెడల వారు మనల నంతకుముందే విశ్వసింపరు. ఈసమావేశములో మోతీలాల్ పండితుడు డాక్టరు బెసెంటుచే తయారుచేయబడిన కామన్ వెల్తు ఆఫ్ ఇండియాబిల్లునుగూర్చి విచారించుట కొక ఉపసంఘమును నియమింపవలసిన దని ఉపపాదించెను. కాని అది నిరాకరింపబడినది. అనుకూలసహకారవాదుల పక్షమున ఆసభ కాహ్వానింపబడినందుకు సర్ మోరోపంతుజోషీ సభాధ్యక్షు నభినందించి సబర్మతీసంధినిగూర్చి విచారింపవలసిన దని కోరెను. మోతీలాల్ పండితుడు ఉభయవాదములలో గల భేదములను వ్యక్తీకరించెను. అనుకూలసహకారవాదులు సంస్కరణలను వీలయినంతవర కుపయోగించుకొన గోరిరి. దేశబంధు దాసు ఫరీదుపూరులో ప్రకటించిన షరతులకు ప్రభుత్వమువారు సంతృప్తికరమైన ప్రత్యుత్తర మీయనియెడల ప్రభుత్వముతో సహకారము చేసేవిషయ మాలోచింప వీలు లే దని స్వరాజ్యపక్షమువారి వాదము. ఈ వాదప్రతివాదములలో మోతీలాల్ పండితుడు నిరపాయముగా బయటపడెనని చెప్ప వీలులేదు. ఆయన తరువాత రెండుమాసముల సెలవుమీద సీమకు ప్రయాణమై పోదలచెను. ఆయనస్థానమును యస్. శ్రీనివాస అయ్యంగారు ఆక్రమించిరి. ఆనాటినుండి శ్రీనివాస అయ్యంగారి జాతకమున కున్నత దశ వచ్చినది.

నాయకత్వవిషయ మిట్లుండగా, దేశములోని వివిధభాగములయందు కక్షలు ప్రారంభమైనవి. ౧౯౨౬ మధ్యకాలమునందు వంగరాష్ట్రమునందలి కృష్ణనగర్ లో ఒక తిరుగుబాటు బయలుదేరినది. దానిలో కొంతవరకు వేనుగుప్తా జయము పొందగలిగెను గాని, తిరుగుబాటునూచనలు మాత్రము పూర్తిగా రూపుమాయలేదు. ఆరోజులలో వంగరాష్ట్రి స్వరాజ్యవాదులలో నాలుగుకక్ష లేర్పడినవి. హిందూస్వరాజ్య

వాదులు, స్వరాజ్యపక్షహిందువులు, మహమ్మదీయస్వరాజ్యవాదులు, స్వరాజ్యపక్ష మహమ్మదీయులు. ఈనాల్గు కక్షలలోని భేదములు కేవలము నామవాచకములపైననూ, విశేషణములపైననూ ఆధారపడియున్నవి. వంగరాష్ట్రకాంగ్రెసుసంఘమునుండి బాబూ అమరేంద్రనాథ చటర్జీ, నిర్మలచంద్రచందర్ లాటి మనుష్యులు రాజీనామా లిచ్చిరి. కొంతకాలమునుండీ హిందూ మహమ్మదీయు లనుసరిస్తూన్న సమాఖ్యనుగూర్చి వారికి భేదాభిప్రాయము లేర్పడినవి. సేనగుప్త (౧) హిందూమహమ్మదీయసమాఖ్య ననుసరింపవలెననీ, (౨) కృష్ణనగర్ మహాసభను లెక్క పెట్టవలదనీ, (3) ఉద్యోగస్వీకరణము కూడ దనీ ప్రకటించెను. ఈతగాదా ఉభయపక్షములలోనూ అంతకంతకు వ్యాప్తి పొందినది. సేనగుప్త కొన్ని అక్రమములకు లోనయినా డని నిందారోపణము చేయబడెను. ఆయన గ్రామపునర్నిర్మాణమును గూర్చి శ్రద్ధతీసుకొనుట లేదనీ, అందుకొరకు వసూలు చేయబడిన సొమ్ము నిర్లక్ష్యముగా వ్యయము చేయబడుతూన్నదనీ, ఆయన పూర్వము శ్లాఘించిన మనుష్యులతోనే ఆయన కిప్పుడు విరోధము వచ్చినదనీ, కార్యనిర్వాహకసభలో 30 మంది ఎన్నికసభ్యులుండగా మరి 30 మందిని నామినేటు చేయుట కాయన అధికారము వహించెననీ ఆయనపైన నేరము లాపాదింపబడినవి. ఆతగాదా వంగరాష్ట్రములో ఈరోజువరకునూ నడుస్తూనే ఉన్నది. కనుకనే దానిని గూర్చి ఇంతదూరము చెప్పవలసివచ్చినది.

౧౯౨౬ మధ్యకాలమువరకునూ జరిగిన రాజకీయవిషయములను గూర్చి కొంచెమునే పాలోచింతము. ౧౯౨౬ ఏప్రిల్ ౬ వ తేదీని ఇర్విన్ప్రభు విండియాలో ప్రవేశించెను. దాదాపదేసమయములో కలకత్తావీథులలో ఇదివర కెన్నడూ కనీవినీ యెరుగని మతకలహములు జరిగినవి. అక్రిందటిసంవత్సరము బొంబాయిలో జరిగిన కలహములతో వాటిని సరిపోల్చవచ్చును. కలకత్తావీథు లారువారముల వరకునూ కల్లోలభూయిష్ఠము లైనవి. ౧౯౨౬ మేలో గాంధీ మీర్జాపూర్ పార్కులో "రక్తపాతమే తప్పనిసరియైనయెడల ధైర్యముగానే ఆ నెత్తురు చిందించబడుగాక! అంతేకాని దొంగసానుభూతులు చూపబడకూడదు." అని ఆయన ప్రసంగించియుండెను. ఆ జోస్యము నిజముచేయుటకో అన్నట్లు ఒకమసీదువెలుపల ఆర్యసమాజమతస్థులకున్నూ, మహమ్మదీయులకున్నూ పెద్దపోరాటము ప్రారంభమైనది. వీథులలో అనేకచోట్ల కొట్లాటలు జరిగినవి. కొంపలు తగులపెట్టబడినవి. ఆవిధముగా నూటపది అగ్నిప్రమాదములు కలిగినవి. దేవాలయములున్నూ, మసీదులున్నూ ముట్టడింపబడినవి. ఇవన్నీ కలకత్తానగరముయొక్క యశస్సునకు భంగము కలిగించినవి. ప్రభుత్వమువారి లెక్కలప్రకారము మొదటి కొట్లాటలో ౫౮౮ మందికి గాయములు తగిలినవి; ౮౮ మంది మరణించిరి. రెండవ కొట్లాటలో ౩౯౧ మందికి గాయములు

తగిలినవి; ౬౬ గురు మరణించిరి. ఈవిధముగా ఆరువారములు హత్యలును, దురాగత ములును జరిగినపిమ్మట ఆకొట్లాటలు సమసిపోయినవి. ఈ దురదృష్టపుసంఘటనము లకు ఇర్విన్ ప్రభువు తలక్రిందులై పోయెను. ఆయన తన ఉపన్యాసములలో విశ్వ మానవకల్యాణమును, సర్వమానవభ్రాతృత్వమును ప్రబోధిస్తూ ప్రసంగించెను. భారత దేశముయొక్క కీర్తిని, భారతజాతీయజీవనమును, భారతమతమును సంరక్షించుటకొర కట్టి కొరగానిపనులు తుదముట్టింపబడవలె నని ఆయన కోరెను.

ఆగస్టునెలలో హిల్టన్ యంగుకమిటీవారు కరెన్సీనిగురించీ, మారకమును గురించీ ఒకనివేదికను ప్రకటించిరి. దాని ననుసరించి ప్రభుత్వమువారు రూపాయికి ౧౮ పెన్నీల మారకపువిలువ యుండవలె నని తొందరగా నొకశాసనమును ప్రవేశ పెట్టిరి. గవర్నమెంటువారి ఆ తొందరనుగూర్చి చాలాప్రతికూలవిమర్శనములు చేయ బడినవి. అందువల్ల వా రాశాసనమును ౧౯౨౭ ఫిబ్రవరివరకును నిలిపివేయ నంగీ కరించిరి. ఈలోగా ౧౮ పెన్నీల మారకమునకు తగినట్లుగా ధరలు నిలకడగా నుం డునా అనేవిషయమునుగూర్చి పత్రికాధిపతులున్నూ, ప్రజలున్నూ ఆలోచించు కొనుట కీవ్యవధి ఈయబడినది.

సెప్టెంబరులో మోతీలాల్ నెహ్రూగారున్నూ, లజపతిరాయికిన్నీ అసెంబ్లీలో అవలంబింపదగిన కార్యవిధానమునుగూర్చి భేదాభిప్రాయములు ప్రారంభమైనవి. స్వరాజ్యవాదులు భారతశాసనసభనుండి లేచిపోవుట హిందువుల ప్రయోజనములకు హానికర మని లాలాజీ భావించెను. ఉద్యోగస్వీకరణమునుగూర్చి సబర్మతీసంధి అంగీ కరింపబడవలె ననికూడా ఆయనఅభిప్రాయము. ఈసందర్భములో ఆయనకున్నూ, పండితమోతీలాలుకున్నూ జరిగిన వాదప్రతివాదములు చాలా తీవ్రములై వ్యక్తిగత ములుగాకూడా పరిణమించినవి. లాలాజీ భారతశాసనసభలోని కాంగ్రెసుపక్షము నుండి రాజీనామా నిచ్చెను. భారతశాసనసభగడు విక కొద్దికాలమే ఉండెను. కొత్త ఎన్నికలు రానుండెను. ప్రెసిడెంటు పటేలును, దివాన్‌బహదూర్ టి. రంగాచారి, సర్ పి. యస్. శివస్వామి అయ్యర్, బాప్టిస్టా, నియోగి, మహమ్మదుయాకూబ్, మాలవ్యా, మడ్డిమనులవంటివారు హృదయపూర్వకముగా అభినందించిరి. అందరూ ఆయనచాకచక్యమునకు శ్లాఘించిరి. ఆయన కభ్యుదయపరంపరాభివృద్ధి కావలె నని కోరిరి. రాబోయే ఎన్నికలలో తప్పక విజయము పొందగలడని జోస్యమును చెప్పిరి. అధ్యక్షునిఎన్నికస్థానమున కెవరూ పోటీచేయకూడ దని అంతమందీ కోరిరి. ప్రభుత్వము వారుకూడ కొత్తఎన్నికలలో స్వరాజ్యవాదు లధికసంఖ్యాకులుగా రాకూడ దని కోరిరి. కల్నల్ వెడ్జ్‌ఉడ్డు లాలాజీతో ఉత్తరప్రత్యుత్తరములను జరిపెను. లాలాజీ అనుకూలసహకారవాదములోనికి దిగుట కదేకారణము కావచ్చును.

ఈ సమయములోనే సర్ అబ్దుర్‌రహీమ్ భారతప్రభుత్వ కార్యవర్గములం దొక మహమ్మదీయుని నియమించుటనుగూర్చి తనపలుకుబడిని వినియోగింప ప్రారంభించెను. ఇర్విన్ ప్రభు వందు కీక్రిందివిధముగా ప్రత్యుత్తర మిచ్చెను :

"ప్రజాశ్రేయస్సు నాలోచించి ఉద్యోగనియామకము చేయుటకు గవర్నరు జనరల్‌కు స్వాతంత్ర్య ముండవలెను."

ఈ ప్రత్యుత్తరమున కనుగుణముగా ఇర్విన్ ప్రభు వార్తాజాలలో వివిధసంఘములకును ఐకమత్య ముండవలెనని ప్రబోధింపసాగెను. మద్రాసులో పానగల్ రాజాకూడా ఆ అభిప్రాయములనే ప్రకటించెను. సరిగా ఈసమయములోనే లండనులో సామ్రాజ్య మహాసభ (Imperial Conference) జరిగినది. అందులో అధినివేశములకు నేటి సుప్రసిద్ధవ్యాఖ్యానము చేయబడినది. అక్టోబరు మూడవవారములో ఇండియా ప్రభుత్వమువారిచే ఆహ్వానింపబడిన దక్షిణాఫ్రికా రాయబారమువారు బేయర్సునాయకత్వముక్రింద భారతదేశ పరిస్థితులనుగూర్చీ, భారతీయుల విజ్ఞానమునుగూర్చీ స్వయముగా తెలుసుకొనుటకు మద్రాసునుండి పెషావరువరకును మూడువారములు పర్యటనము కావించిరి.

౧౯౨౬ నవంబరులో శాసనసభల ఎన్నికలు జరిగినవి. అప్పటి శాసనసభాభ్యర్థులు స్వరాజ్యవాదులు కారు; కాంగ్రెసువారే. మద్రాసులోని కాంగ్రెసువాదు లంతా సంపూర్ణవిజయమును పొందిరి. బర్కెన్‌హెడ్డుప్రభువు గౌహతీ కాంగ్రెసులోనైనను కాంగ్రెసుపక్షమువారు ప్రభుత్వసహకారమున కనుకూలముగా నుండగలరేమో అని వేచియుండెను. శ్రీనివాస అయ్యంగారు గౌహతీకాంగ్రెసున కధ్యక్షుడుగా నెన్నుకొనబడిరి. ఆయన సంపూర్ణవ్యక్తిత్వము కలవాడు. ఆ వ్యక్తిత్వముమూలముననే తరువాత కొంతకాలమునకు మోతీలాల్ పండితునకున్ను, ఆయనకున్ను తీవ్రమైన తగాదా వచ్చినది. నిజముగా ఈ కలహబీజములు ఢిల్లీలోని అ. భా. కాం. సం. జరుగక మునుపునుండే వ్యక్తమవుతూనే ఉన్నవి. వారిద్దరూ సుప్రసిద్ధన్యాయవాదులు. అందులో ఇద్దరూ సుప్రసిద్ధరాజకీయధురంధరులే. ఇక కలహము రాక పోసగు టెట్లు? జయకర్ మోతీలాలులమధ్య, మోతీలాల్ లాలాజీలమధ్య, అయ్యంగార్ మోతీలాలుల మధ్య అన్నీ తగాదాలే. మోతీలాల్ పండితునకు బొంబాయి, పాంచాల, మద్రాసు రాష్ట్రములు శత్రుకోటిలో చేరినవి. మోతీలాల్‌పండితునివంటి మహానాయకుడు అందరు మనుష్యులకూ అన్ని విషయములలోనూ తోడ్పడజాలడు. తన విషయములో తానే మొదటినుండి చివరవరకును ఒకటేవిధముగా ప్రవర్తించుట ఆయనకు సాధ్యమైన పని కాదు. పెద్దల ఈ పోరాటము చిన్నలకు కొంత తమాషాగా నుండవచ్చును.

## గౌహతీ కాంగ్రెసు

తరువాత గౌహతీకాంగ్రెసు తీవ్రపరిస్థితులలో సమావేశ మైనది. ఇందుకు కారణము సహాయనిరాకరణమునుగూర్చి, సహకారవాదమునుగూర్చి ప్రబలిన వాదోపవాదములు. మొట్టమొదట శాసనసభాకార్యక్రమమునకు నిరంతరమూ ఆటంకములను కలిగించవలెననే సహాయనిరాకరణతత్వమున కనుకూలముగా స్వరాజ్యవాదులు శాసనసభలలో ప్రవేశించి రనుసంగతి జ్ఞాపకముంచుకొనవలెను. పిమ్మట స్వరాజ్యవాదు లధికసంఖ్యాకులుగా వచ్చినయెడల జరుగవలసిన కార్యక్రమముగా వారి మొదటిప్రకటనమునకువ్యాఖ్యానముచేయబడినది. క్రమక్రమముగా నదిసహకారమునకు దగ్గరదగ్గరగా పరివర్తనము చెందినది. శాసనసభలలోని ఉపసంఘములలో స్వరాజ్యవాదులు మొట్టమొదట ఎన్నిక స్థానముల నంగీకరించిరి. తెరువాత భారతప్రభుత్వమువారిచే నియమింపబడిన కమిటీలలో వారు నామినేటెడ్ సభ్యత్వములనుకూడా అంగీకరించిరి. చిట్టచివరకు సబర్మతీలో సహకారమునకు దగ్గరగానుండే సిద్ధాంతమును వా రామోదించిరి. స్వరాజ్యపక్షములో సహకారతత్వము పూర్తిగా వ్యక్త మవుతూన్నప్పటికీ వారు జాతీయవాదులవలె గాని, స్వతంత్రపక్షమువలె గాని, మితవాదులవలెగాని భిన్నగా ఆమార్గ మవలంబించేస్థితిలో లేరు. అనుకూలసహకార మనీ, గౌరవసహకార మనీ, వీలుగా నున్నంతవరకు సహకారమూ, లేనియెడల ఆటంకమూ అనీ, సంస్కరణములు మన కుపయోగించినంతవరకు సహకారమనీ ఏవేవో అభిప్రాయములను వారు ప్రకటింపసాగిరి. ఈ సున్నితములైన భేదములే ప్రాగ్జ్యోతిషపురములో తీవ్రభేదాభిప్రాయములకు కారణభూతము లైనవి. దీనికితోడు ప్రభుత్వమువారి స్తోత్రపాఠములు, ఆహ్వానములు, ఆశలు – యీ అన్నీ కొంతమంది నిశ్చలచిత్తులు కానివారినీ, హృదయ దౌర్బల్యము గలవారినీ లోబరచుకొన్నవి.

ఈ పరిస్థితు లిట్లుండగా ఇందుకుతోడు మరియొక విషాదకర సంఘటనము జరిగినది. శ్రద్ధానందస్వామి జబ్బులోనుండగా ఆయనను చూడవచ్చిన ఒకమహమ్మదీయునిచే ఆయన పిస్తోలుతో కాల్చబడినట్లు వార్తవచ్చినది. గౌహతీలో అధ్యక్షున కేనుగంబారీఉత్సవము జరుగనుండగా ఈఘోరవార్త తెలిసెను. ఏనుగుల జన్మభూమియైన అస్సాము అధ్యక్షుని గజారూఢునిగా జేసి పెద్ద ఉత్సవమును నడిపింపనుండెను. కాని శ్రద్ధానందుని మరణవార్తవలన అది ఆపివేయబడవలసి వచ్చినది. కాంగ్రెసుమహాసభ చింతాసముద్రములో మునిగిపోయినది. ఈదురదృష్ట విషయమునుగూర్చి హిందువులును, మహమ్మదీయులును దుఃఖనిమగ్నులైరి. కాంగ్రెసుమహాసభ మామూలు లాంఛనములతోనే ప్రారంభింపబడినది. అస్సాములోని అడవిజాతులవారి సంగీతము మన ఇతిహాస

ములలో కామరూపదేశముగా వర్ణింపబడిన అసీమయొక్క ప్రకృతిసౌందర్యమునకు నూతనశోభ తెచ్చినది. బ్రహ్మపుత్రానదియొడ్డున గాంధీనాక షటీరము నిర్మింపబడెను. సభామండపమును, సభ్యుల బసలును గాంధీ నివాసప్రదేశమునకు దూరముగానుండెను.

శ్రీనివాసయ్యంగారి ఉపన్యాసములో క్రొత్త ఏమీలేదు. ఆయన అందులో ప్రకటించిన అభిప్రాయములన్నీ ఇదివరకు ప్రకటింపబడినవే. శ్రద్ధానందస్వామిని స్మరించి, కొంతకాలము కాంగ్రెసుకోశాధిపతిగా నున్న ఓమర్ సోభానీ మరణించిన విధానమునకు చింతించి ఆయన తన ఉపన్యాసమును ప్రారంభించెను. అందులో శాసనసభల ఎన్నికలలో స్వరాజ్యపక్షమువారు పొందిన విజయమునుబట్టియే వారి విధానము న్యాయమైనదిగా ఋజువవుతూన్నదని ఆయన వివరించెను. మద్రాస్, వంగ రాష్ట్రిము, బీహారు, ఒరిస్సాలు కాంగ్రెసు ఆజ్ఞలను శిరసావహించి ఆశ్చర్యకరముగా పనిచేసిన వని ఆయన వాటిని శ్లాఘించెను. పాంచాలముకూడా కొంతవరకు బాగుగా పనిచేసి కాంగ్రెసుప్రతిష్ఠను కాపాడెనని సంతోషమును వెలిపుచ్చెను. ద్వంద్వపరిపాలనము పూర్తిగానిర్మూలమై, ప్రభుత్వనిరంకుశత్వము వెల్లడిఅయిన దని ఆయన విశదీకరించెను. దేశబంధుదాసు ప్రభుత్వమువారికి సూచించిన షరతులనుగూర్చి జ్ఞాపకము చేసెను. భారతదేశముయొక్క ప్రతిపత్తిని ఆయన స్పష్టపరచెను. సైనికసమస్య,నౌకా సమస్యలనుగూర్చి కొంతమూరము చర్చించెను. తరువాత శాసనసభాకార్యక్రమవిషయములో "స్వరాజ్యాభ్యుదయమునకు ప్రతికూలముగానుండే ప్రభుత్వమువారియొక్క గాని, తదితరులయొక్కగాని చర్యల కాటంకము కల్పించుట" ప్రధానసిద్ధాంత మని కాన్పూరుతీర్మానమును ఆయన ఉదాహరించెను. అధికారస్వీకారమును నిరసించెను. అందు కాయన చెప్పిన తర్క మనుల్లంఘనీయము. స్వరాజ్యవాదులు శాసనసభలలో అధికసంఖ్యాకులుగా ప్రభుత్వప్రతికూలపక్షమున నుండేయెడల వారు మంత్రులకంటె ఎక్కువపనిని తేలికగా చేయగలరని ఆయనవాదించెను. నేడు రాష్ట్రిములలో మంత్రులకు గల అధికారమునుగూర్చి ఆయన భావగర్భితముగా అపహాస్యము చేసెను. తరువాత కరెన్సీ, మతకలహములు మొదలగు నాటి ముఖ్యవిషయములనుగూర్చి ఉపన్యసించెను. ఇక ఖద్దరు, అస్పృశ్యత, మద్యపాననిషేధము మొదలగు విషయములనుగూర్చికూడా ఆయన వివరించెను. ప్రజలలో ఐకమత్యమున్నూ, సహనమున్నూ ఉండవలెనని ఆయన ప్రబోధించెను. చిట్టచివర కాయన "స్వరాజ్యము కేవలము బుద్ధివిశేషమునకు సంబంధించినదికాదు.అదియొక ఉత్తేజకరమైనవిషయము.నిరంతరవిశ్వాసపూరితహృదయములతో మనము దానికి దోహదము చేయవలెను. ప్రజల నవ్వులాటలు కాని, అపహాస్యములుగాని, స్నేహితుల ప్రోత్సాహ నిరుత్సాహములుగాని, శత్రువుల ఆగ్రహముగాని, ప్రభుత్వమువారి దూషణభూషణములుగాని మన మాతృదేశారాధనము

నకు కొరత కల్పించకూడదు. మన ఆదర్శమును మరపించకూడదు." అని తన ఉపన్యాసమును ముగించెను.

గౌహతీతీర్మానము లన్నీ మామూలు తీర్మానములే. అందరూ అనుకొన్నట్లుగానే శ్రద్ధానందస్వామిమరణమునుగూర్చి గాంధీ తీర్మానమును ప్రతిపాదింపగా మహమ్మదాలీ ఆమోదించెను. గాంధీ తన ఉపన్యాసములో నిజమైనమత మనగానేమో తెలియజెప్పెను; స్వామీజీహత్యకు కారణములను వివరించెను. "నే నిప్పుడు అబ్దుల్ రషీదును సోదరుడని ఎందుకు పిలుచుచుంటినో మీకర్థమైయుండును. ఆయనను నేను తిరిగీ సోదరుడే యందును. ఆయన స్వామిని హత్యగావించిన అపరాధిగాకూడ నేను భావింపను. ఎవ్వరు నిజముగా ఇతరులయెడల ద్వేషామూయలను కల్పించిరో వారే అపరాధులు" అని గాంధీ ప్రసంగించెను. తరువాత కెన్యానుగూర్చినతీర్మానము వచ్చినది. కెన్యాభారతీయులకు ప్రతికూలముగా జేయబడిన నిరోధకశాసన మంతకంతకు తీవ్రముగా పరిణమించినది. మొట్టమొదట వేయబడిన ౨౦ షిల్లింగుల పోల్‌టాక్సు (Poll tax) మారకపు తికమకలమూలమున ౩౦ షిల్లింగులకు పెరిగినది. తరువాత శాసనరూపముగా ౫౦ షిల్లింగులకు హెచ్చినది. ఈ విధముగా యూరోపియనుల ప్రయోజనములకొరకు భారతీయప్రయోజనములు, స్వాతంత్ర్యము, ఆశయములు-అన్నీ అణగత్రొక్కబడినవి. ఇక కౌన్సిల్ కార్యక్రమమునుగూర్చి—

"(ఎ) కాంగ్రెసువాదులు మంత్రిపదవులనుగాని, ప్రభుత్వమువారిచే వాగ్దానము చేయబడిన తదితరోద్యోగములనుగాని నిరాకరింపవలెను. జాతీయవాంఛ కనుగుణముగా ప్రభుత్వమువారు కాంగ్రెసుకు సంతృప్తికరమైన ప్రత్యుత్తర మిచ్చేటంతవరకును ఇతర కక్షులవారుకూడ మంత్రివర్గమునునిర్మింపకుండునట్లు కాంగ్రెసువాదులు పోరాడవలెను.

(బి) క్రింది (డి)నిబంధనకు లోబడి గవర్నమెంటువారు పైన చెప్పబడిన విధముగా ప్రత్యుత్తర మిచ్చేటంతవరకుగాని, అ. భా. కాం. సం. వారు మరొకవిధముగా ఆజ్ఞాపించేటంతవరకుగాని కాంగ్రెసువాదులు బడ్జెటులను త్రోసివేయవలెను.

(సి) నిరంకుశప్రభుత్వమువారు తమ అధికారమును బలవత్తరముగా చేసికొనేటందుకు ప్రవేశపెట్టే అన్నిశాసనములను, బిల్లులను, సూచనలను కాంగ్రెసువాదులు నిరాకరించవలెను.

(డి) జాతీయజీవనమున కవసరములైన బిల్లులను, ప్రతిపాదనలను ప్రవేశపెట్టవలెను. తీర్మానముల నుపపాదింపవలెను. ఆర్థిక, వ్యవసాయిక, పారిశ్రామిక, వాణిజ్యాభివృద్ధుల కనుకూలములైన తీర్మానములను ప్రతిపాదింపవలెను. వాక్స్వాతంత్ర్య, సమావేశస్వాతంత్ర్య, ముద్రణ స్వాతంత్ర్యముల రక్షణనుగూర్చి, నిరంకుశాధికారనిర్మూలనమునుగూర్చి తీర్మానముల నుపపాదింపవలెను.

(ఇ) వ్యవసాయకుల స్థితిగతుల నభివృద్ధిచేయుటకు తగిన అన్ని చర్యలను తీసి కొనవలెను.

(ఎఫ్) వ్యవసాయిక కార్మికులయొక్కయు, పారిశ్రామిక కార్మికులయొక్కయు హక్కులను సంరక్షింపవలయును. భూస్వాములకును, రైతులకును, పెట్టుబడిదారులకును, కార్మికులకును తగాదాలు లేకుండ న్యాయపద్ధతిని వ్యవహారములను పరిష్కరింపవలెను." అని తీర్మానింపబడినది.

వంగరాష్ట్ర నిర్బంధితులకు ప్రతికూలముగా చేయబడిన శాసనము నిరసింపబడినది. హిందూమహమ్మదీయ సఖ్యమునుగూర్చి, గురుద్వారాభూయిదీలనుగూర్చి, కరెన్సీనిగూర్చి, విదేశములలో కాంగ్రెసుప్రచారమునుగూర్చి తగినరీతిని తీర్మానింపబడెను.

గౌహతీకాంగ్రెసులో జరిగిన కొన్ని చిత్రమైన విషయములు చెప్పవలసియున్నది. వస్తుప్రదర్శనశాలలో ప్రదర్శింపబడిన ఒకపాతకవచమును ఇద్దరు జారిచ్చి పండితులు విచిత్రముగా చూస్తూండిరి. వారికి కొద్దిగా ఇంగ్లీషు తెలుసును. వారు దాని నేవిధముగా అక్కడ వెదకి పట్టుకొనగల రని అడుగగా మేము "తెలుసుకొంటున్నాము. మీవలెనే మేమును తెలుసుకోతగినవి చాలా కలవు." అని ప్రత్యుత్తర మిచ్చిరి. వారికి భారతదేశము రాజకీయముగానే గాక ఆర్థికముగాను వర్తకవిషయములోనుకూడ పరాధీనదేశమని తెలుసుకొనుట కది కొత్త. ఈసంభాషణలు జరిగినప్పుడు గాంధీకూడ వాటిలో జోక్యము కలిగించుకొనెను. మరునాడు విషయనిర్ధారణసభలో అదివర కంగీకరింపబడిన రెండు తీర్మానములు తిరిగీ మార్పు చేయబడినవి. అందులో ఒకటి నాభామహారాజును గూర్చినది, రెండవది కరెన్సీని గూర్చినది. నాభావిషయమును కాంగ్రెసుతో ముడిపెట్టుట గాంధీ కిష్టములేదు. 3 వ తీర్మానము సంపూర్ణ స్వాతంత్ర్యమునుగూర్చినది. అది గాంధీప్రతికూలతక్రింద మగ్గిపోయెను.

నాభానుగూర్చి మోతీలాల్ ఒకప్రకటన గావించెను. ఆసమయములో తాను నాభాపక్షమున వకీలుగా పనిచేస్తూండుటచేత బహిరంగసభలో నాభానుగూర్చి ప్రసంగించరాదని ఆయన వ్యక్తపరచెను. నరోత్తమమురార్జీయున్ను, ఇంకా మరి కొంత మంది ఆర్థికశాస్త్రవేత్తలున్ను కరెన్సీమారకవిషయములను గూర్చి చర్చించుటకు గౌహతిలో నుండిరి. కేల్కారుగాని, జయకరుగాని గౌహతికి హాజరుకాలేదు. అందు కొక కారణము, వా రుభయులును ఒక్కసారే జబ్బుపడిరి. రెండవకారణము, అనుకూలసహకారపక్షమువా రదివరకే కాంగ్రెసునుండి చీలిపోయిరి. గౌహతిలో నిర్మాణ కార్యక్రమము గ్రామములలో కొనసాగింప తీర్మానింపబడినది. నిరంతరఖద్దరుధారణము నిర్బంధము చేయబడినది. ఖద్దరు ధరించనిదే కాంగ్రెసువాదు లెట్టి కాంగ్రెసు ఎన్నికలలోను జోక్యము కలిగించుకొనకూడదు; ఏ కాంగ్రెసు సమావేశములోను పాల్గొన

కూడను. ఇక గౌహాతీకాంగ్రెసును విడిచిపెట్టి ఇతిహాసములలో కామరూపదేశ మని ప్రశంసింపబడిన అస్సాముగాష్ట్రమునుగూర్చి కొంత చెప్పవలసియున్నది. అక్కడి జనులు మంగోలియనుల ముఖవర్చస్సును గలిగియుండిరి. కాని వారిమతము హిందూ మతమే. హిందువులు పూజించే దేవతలనే వారును పూజింతురు. వారి ఆచారవ్యవహార ములు హిందువుల ఆచారవ్యవహారముల వంటివే. వారి విజ్ఞానముకూడా హిందువుల విజ్ఞానమే. గౌహాతికి పదునూడుమైళ్ల దూరములోనున్న వసిష్ఠాశ్రమమును, బ్రహ్మ పుత్రానదీమధ్యముననున్న కామాఖ్యాదేవాలయమును, ఉమానందదేవాలయమునుకూడా గౌహాతీకాంగ్రెసుప్రతినిధులు దర్శించి పునీతులయిరి.

ఇక ఈదేవుళ్లను, దేవతలను విడిచిపెట్టి ప్రపంచకవిషయములకు వత్తము. గౌహాతీకాంగ్రెసధ్యక్షుడు ౧౯౨౬ లోని స్వరాజ్యవాదుల ఎన్నికలనుగూర్చి కొద్దిగా ప్రస్తావించెను. మద్రాసులో ఎన్నికలకార్యక్రమము జాగ్రత్తగా నడుపబడినదనీ, అందువలన సంపూర్ణవిజయము కలిగినదనీ, ప్రభుత్వమువారుకూడ ఆవిషయ మంగీకరించి రనీ అక్కడ ప్రస్తావింపబడినది. సంయుక్తరాష్ట్రములలో సంపూర్ణమైన అప జయము కలిగినదని మోతీలాల్ పండితుడు చెప్పెను. ఆయన చెప్పినమాటలనే ఈదిగువ నుదాహరింతును:

"స్వరాజ్యవాదులకు తగిన అపజయము కలిగినది. దానిని అపజయ మనుటకు వీలులేదు. వారు నిజముగా స్వరాజ్యవాదు లైనందుకు కాదు ఓడిపోయినది. వారం దరూ జాతీయవాదు లైనపాపమున ఓడిపోయిరి. ఎన్నికలలో రాజకీయకార్యక్రమ ములుకాని, రాజకీయకక్షలుగాని ఏమీ పనిచేయలేదు. నిజముగా అజరిగిన ఎన్నికలు జాతీయతత్వమునకూ, సాంఘికపక్షపాతమునకూ జరిగిన పోరాట మని చెప్పవచ్చును. సాంఘీకవాదులు ధనవంతులై యుండుటచేత పూర్తిగా సొమ్ముఖర్చుపెట్టి, అబద్ధము లాడి, ప్రజలను భయపెట్టి, విజయము పొందిరి. కాంగ్రెసుకు ప్రతికూలు రైనవారంద రును "మతము భ్రష్టమైపోతూన్నది." అని గోలపెట్టసాగిరి. ఆవిషయములో హిందువులనీ, మహమ్మదీయులనీ వ్యత్యాసము లేదు. కాంగ్రెసుప్రతికూలు రందరూ అదేపాట పాడసాగిరి. నేను గోమాంసభక్షకుడననీ, గోహత్యచేసేవాడననీ దుష్టమైన ప్రచారము చేయబడినది. మసీదులముందు మేళతాళములు మోగకుండా చేయుట కున్నూ, అలహాబాదులో రామలీలాఉత్సవము లాపబడుటకున్నూ నేనే కారణమని కాంగ్రెసుప్రతిపక్షులు ప్రచారముచేసిరి. నేను బహిరంగసభలలో ఇవన్నీ అబద్ధము లని చెప్పగలను. కాని నేను వెళ్లుటకు వీలులేని పల్లెటిగ్రామముల కీవాదుకలు ప్రాకి పోయినవి. నేను దొరల బంగాళాలలో యూరపియనుల పద్ధతిప్రకారము తయారు చేయబడిన ఆహారమును భుజించుటమూలమున ఈ ప్రచారమునకు మరింతబలము చేకూరి నది." ఇవి మోతీలాల్ పండితుని మాటలు.

ఇప్పటినుండి ఇక కొంతకాలమువరకును కాంగ్రెసుచరిత్ర ఉత్సాహకరముగా ముండదు. శాసనసభలలోని పోరాటములనుగూర్చి, కాంగ్రెసువార్షికసమావేశములలో చేయబడిన తీర్మానములనుగూర్చి మాత్రము వివరింపబడుతూండును. ఒక ఉత్సాహకర మైన విషయముమాత్రము చెప్పవలసి యున్నది. అఖిలభారత చర్ఖాసంఘము స్థాపింపబడినపిమ్మట గ్రామముల ఆర్థికవిషయములనుగూర్చి కొంత శ్రద్ధతీసికొన బడినది. ఖద్దరువిషయములో పనిచేయబూనుకొన్న స్త్రీపురుషులు వోట్ల ఉద్రేకములకును, శాసనసభల గంద్రగోళమునకును లోనుగాక ప్రశాంతముగా తమ కార్యక్రమమును నిర్వర్తింప ప్రారంభించిరి. కాంగ్రెసుసమావేశములలోని ఖద్దరు ప్రదర్శనములను చూచినప్పుడు ఆపరిశ్రమ ఎంతమనోహరముగా అభివృద్ధిపొందుతూన్నదో తెలియగలదు. ఆరేడుసంవత్సరములలో ఖద్దరువిషయమున బీహారుపొందిన అభివృద్ధి గౌహతీలో ప్రదర్శింపబడినది. బీహారురాష్ట్ర మావిషయములో యావద్భారతదేశమునకును మార్గదర్శక మైనదని చెప్పవచ్చును. బీహారురాష్ట్రపు కోష్టి యున్ను, ఆంధ్రదేశములోని శ్రీకాకుళపు ఖద్దరున్ను గౌహతీవస్తుప్రదర్శనశాలకు నూతనశోభను కల్పించినవి. కాని ఆశోభ ఈనాటిది కాదు. పురాతనకాలమునుండీ ఆశిల్ప మక్కడ్లే నిల్చియున్నది. అస్సాములోని 'ఎండి' 'మూగ'పట్టువస్త్రములుకూడా సుప్రసిద్ధములు. అవి అస్సాము ప్రభుత్వమువారి సహాయమున వర్ధిల్లుతూన్నవి. ఈ పరిశ్రమాభివృద్ధి కేవలము దారము యొక్క సన్నదనముపైనేకాక దానిపురిపైనను, గట్టితనముపైనకూడా ఆధారపడి యున్నది. ఆదారముతో నేయబడిన బట్టలే చాలాకాలము మనగలవు. అనేకరాష్ట్రములలో నిట్టిపరిశ్రమల కాధారభూతులైన పనివాళ్లలో నిదివరకు నిద్రాణములై యున్న శక్తిసామర్థ్యములు తిరిగీ అఖిలభారతచరఖాసంఘముమూలమున ఒక్కసారి మేల్కొంచినవి. ఇట్టిసున్నితములైన వృత్తులను పోగొట్టుకొని ఇళ్లనూ,వాకిళ్లనూ విడిచి యంత్రాలయములలో మామూలు కూలివాళ్లవలె ప్రవర్తిస్తూన్న అనేకమంది తిరిగీ తమకుల సంప్రదాయానుగుణములగు వృత్తుల నవలంబించిరి. వారు ఖద్దరుకు నూతన కళాసౌందర్యములను చేకూర్చిరి.ఖద్దరుతోపాటు రంగుల అద్దకపువృత్తికూడా పునరుద్ధరింపబడినది. ఒక్క ఖద్దరుపరిశ్రమను పునరుజ్జీవింపజేయుటచే రంగులుకలిపేవారికి, అద్దకము లద్దేవారికి, చాకళ్లకు, ముచ్చివాండ్లకు, చిన్నిచిన్ని వర్తకులకు, ఎందరికో వృత్తి ఏర్పడినది. కాంగ్రెసు కనుబంధములుగా ఏర్పాటుచేయబడిన ఖద్దరుప్రదర్శనశాలలవలన ప్రజల ఆర్థికవిషయములలో చాలామంది కుత్సాహము కలిగినది. స్వరాజ్య మనగా పేదవాండ్లకు అన్నవస్త్రములు లభింపచేయుటే నని చాలమందిప్రజలకు తెలిసివచ్చినది.

# 8. కాంగ్రెసు - కౌన్సిలు రంగము - ఆటుతట్టు

## ౧౯౨౮

[భారతశాసనసభలోని కాంగ్రెసు పోరాటము - యస్. సి. మైత్రాను గురించి సభ ఆపివేయబడవలెనని తీర్మానము - అనేకపోరాటములు - మారకపు సమస్య - సక్లత్‌వాలారాక - ప్రెసిడెంటుపటేలు ధర్మనిధి - మోతీలాల్ పండితునికీ, అయ్యంగారికీ తగాదా-స్కీన్‌కమిటీనుండి పండితుని రాజీనామా-దక్షిణాఫ్రికా- నూతనవాతావరణము-లాలాజీయూరపుప్రయాణము - బొంబాయిలోని అ. భా. కాం. సం. సమావేశము - రాజ్యాంగనిర్మాణవిధానమును తయారుచేయుటకు నిర్ణయించుట - అ. భా. కాం. సం. వారి తీర్మానములు-మద్రాసుశాసనసభాపక్షమువా రాక్షేపింపబడుట - సుభాసుచంద్రబోస్ విడుదల - మతకలహములు - మతాభిప్రాయమునకు హానికలిగించిన నేరస్థులను శిక్షించుట కొక నూతనచట్టము - అక్టోబరులో జరిగిన ఐకమత్యమహాసభ - అదిచేసిన తీర్మానము - అక్టోబరులో అ. భా. కాం. సం వారు సమావేశమగుట - ఐకమత్యమహాసభవారి తీర్మానము లామోదింపబడుట - ఇతరతీర్మానములు - సైమన్‌కమీషన్‌వారి ప్రకటన - సైమన్ కమీషనునుగూర్చి బెసెంటు అభిప్రాయము - పండితమోతీలాల్ అభిప్రాయము- సైమన్‌కమిటీవారి కర్తవ్యము-మద్రాసుకాంగ్రెసు - డాక్టరు అన్సారీ అధ్యక్షోపన్యాసము - ప్రధానతీర్మానము - సైమన్‌కమిటీ బహిష్కారము - కాకోరీకేసు - స్వాతంత్ర్యసిద్ధాంతము-గుజరాతువరదలు- కాంగ్రెసుచేసినసేవ - ప్రభుత్వమువా రభినందించుట.]

ఇక మనము వివిధశాసనసభలలో కాంగ్రెసుపక్షమువారు చేసిన పనినిగూర్చి విచారించవలసియున్నది. జరిగిన 3 సంవత్సరములలో వంగ, మధ్యరాష్ట్రముల యందు ద్వంద్వపరిపాలనము నిర్మూలింపబడినదని జ్ఞాపకముంచుకోవలెను. ౧౯౨౪ లో అది పునరుద్ధరింపబడినది. వంగరాష్ట్రములో మంత్రులజీతములు ౯౪ వోట్లతో అంగీకరింపబడినవి. అందుకు ప్రతికూలముగా ౮౭ వోట్లు వచ్చినవి. మధ్యరాష్ట్రములలో కూడ అటువంటి తీర్మానము ౫౫ వోట్లతో అంగీకరింపబడినవి. వ్యతిరేకముగా ౧౭ వోట్లు వచ్చినవి. ఇక ౧౯౨౭ లోని అసెంబ్లీకార్యక్రమములో కొన్నివిషయములను

జ్ఞాపకము చేసికొందుముగాక. ౧౯౨౬ మార్చిలో స్వరాజ్యపక్షమువారు భారత శాసనసభనుండి వారిస్థానములను ఖాళీచేసి లేచిపోయిరి. వారి కప్పుడు తిరిగీ ఎన్నికలు జరిగేటంతవరకూ ఆసభలో పునఃప్రవేశము చేయవలెనని కోరిక లేదు. కాని ప్రభుత్వము వారు రూపాయికి ౧౬ పెన్నీలకు బదులుగా ౧౮ పెన్నీలచొప్పున మారకమును నిర్ణయిస్తూ శాసనమును ప్రవేశపెట్టిరి. అది చూచి స్వరాజ్యపక్షమువా రాశాసనమును మరుసమావేశమువరకును (అనగా క్రొత్త ఎన్నికలు జరుపబడేటంతవరకును) నిలిపివేయు తీర్మానమును ప్రతిపాదింపదలచి, ఒక్కక్షణమాత్రము భారతశాసనసభా భవనమునందు ప్రవేశించిరి. కాబట్టి క్రొత్తభారతశాసనసభ సమావేశమైనప్పుడు ప్రతి వారిహృదయమును ౧౮ పెన్నీల మారకపుధరనుగూర్చియే ఆందోళితమై యుండెను. దానికితోడు సభాప్రారంభదశలో ఇంకా అనేక తీవ్రసమస్య లెదుర్కొనినవి. సత్యేంద్రచంద్రమిత్రా ఖైదులో నుండగానే భారతశాసనసభ కెన్నుకొనబడెను. ఆయన శాసనసభకు హాజరుకాకుండా ప్రభుత్వమువారిచే జైలులో నుంచబడుటమూలమున మోతీలాల్ పండితుడు ప్రథమములోనే సభను నిలిపివేయవలసినదని తీర్మానమును పతిపాదించెను. దేశములో పార్లమెంటరీపద్ధతియొక్క అభివృద్ధి కాచర్చ దోహదమొనర్చినది. ఈ సందర్భములో ౧౯౩౫ లోని భారతశాసనసభలో శరచ్చంద్రబోసునుగూర్చికూడా ఇటువంటి తీర్మానమే ప్రతిపాదింపబడినదని మాటవరసకు జ్ఞాపకము చేయుచుంటిమి. దానినిగూర్చి ఆ సంవత్సరపు చరిత్రలో వ్రాయగలము. ఇక ప్రకృతమునకు వత్తము. మైత్రా నిర్బంధింపబడుటమూలమున ఆయన నెన్నుకొనిన నియోజకవర్గమువారి హక్కులు భంగపరుపబడినవనీ, భారతశాసనసభయొక్క అధికారములు తృణీకరింపబడినవనీ పండిత మోతీలాల్ వాదించెను. ఇందులకు ప్రత్యుత్తరముగా సర్ అలెగ్జాండరు మడ్డిమన్ బ్రిటిష్‌సామ్రాజ్యములోని తదితరభాగములయందలి శాసనసభలకువలె భారతశాసనసభకు రాజ్యాంగశాసనమునం దెక్కడను సభ్యుల అధికారములను, హక్కులనుగూర్చి నిర్వచింపబడిన ప్రత్యేకస్మృతి లేదని నిరూపించెను. చిట్టచివరకు వోటుకు పెట్టగా ప్రభుత్వమువారు ౧౬ వోట్లు తక్కువతో ఓడిపోయిరి. అయితే మిత్రామాత్రము అసెంబ్లీసభకు హాజరవుటకు విడుదలచేయబడలేదు. తరువాత వంగరాష్ట్రనిర్బంధితులనుగూర్చి చర్చ జరిగినది. మోతీలాల్ పండితుడా విషయములో వచ్చిన తీర్మానముపైన "వారిని విచారణకు పెట్టవలెను. లేదా, వారు విడుదల చేయబడవలెను." అని ఒక సవరణను ప్రతిపాదించెను.

అప్పుడు జాతీయపక్షప్రతినిధిగా వచ్చిన లాలాలజపతిరాయి ప్రభుత్వమువారు న్యాయశాస్త్రప్రకారముగాక వారి అవసరమునుబట్టిమాత్రమే వంగీయులను నిర్బంధించితి మని సమర్థించుకొనపూనేయెడల తా నెక్కువ సంతోషింతు నని చెప్పెను. మోతీ

లాల్ పండితుని సవరణ ౧౩ వోట్ల యెక్కువతో గెల్చినది. యస్. సి. మిత్రాను గురించిన తీర్మానముతరువాత శాసనసభను వాయిదా వేయవలసినదని ఇంకా అనేక తీర్మానములు వచ్చినవి. చీనాకు సైనికులను పంపుటనుగూర్చి, ఫిజీకి పంపబడిన భారత రాయబారవర్గమువారి నివేదిక ప్రచురింపబడకుండుటనుగూర్చి, రైల్వేబడ్జెటు సాధారణబడ్జెటు పరిష్కరింపబడేటంతవరకునూ కరెన్సీశాసనముపైన చర్చను నిలిపివేయుటనుగూర్చి అడ్జెరన్‌మెంటు (సభను వాయిదా వేయవలసినదని) తీర్మానములు ప్రతిపాదింపబడినవి. ఇందులో చివరతీర్మానము ౭ వోట్ల అధికముతో అంగీకరింపబడినది. తరువాత ఖరగ్‌పూర్‌లోనూ, బెంగాలు నాగపూరురైల్వేలోని తదితర ప్రదేశములయందునూ కలిగిన సమ్మెపరిస్థితులనుగూర్చికూడా తీర్మానము ప్రతిపాదింపబడినది. పిమ్మట ప్రభుత్వమువారికినీ, అధికారేతరులకునూ చాలా కయ్యాములు జరిగినవి. మొదటిది ఉక్కుసంరక్షణచట్టమును గూర్చినది. ఈ విషయమునుగూర్చి కొద్దిగా వ్రాయవలసియున్నది. ౧౯౨౩ ప్రాంతములలో ఇనుముపరిశ్రమ, ఉక్కుచట్టములను గూర్చి మొట్టమొదట చర్చింపబడినది. టారిఫ్‌బోర్డువారు (పరిశ్రమలను రక్షించుటకు దిగుమతిపన్నులను సూచించే సంఘమువారు) కొన్ని ప్రభుత్వవిరాళములను సూచించిరి. మూడుసంవత్సరములతరువాత తిరిగీ ఆ సమస్య విచారింపబడవలె నని నిర్ణయించిరి. ఆ గడువు గడచినది. టారిఫ్‌బోర్డువారు మరల ఆ విషయమునుగూర్చి విచారించి, దిగుమతిపన్ను లెక్కువ చేయబడ వలెనని సిఫార్సు చేసిరి. అందులో బ్రిటిష్‌వస్తువుల కొకవిధముగాను, తదితరదేశముల వస్తువులకు మరియొకవిధముగాను దిగుమతిపన్నులు విధింపబడినవి. దీనిమూలమున సామ్రాజ్యములోని వస్తువుల విక్రయమున కెక్కువ అవకాశములు కల్పింపబడవలెనని ప్రభుత్వమువా రూహించినట్లు స్పష్టమైనది. చాలామంది ప్రభుత్వమువారి కావిషయములో ఎదురుతిరిగిరి. కాని తీవ్రమైన చర్చజరిగినపిమ్మట ప్రభుత్వమువారి సూచనలే గెలుపొందినవి. జాతీయపక్షమున కుపనాయకుడైన జయకర్ బడ్జెటును పూర్తిగా నిరాకరింపవలసిన దని తీర్మానమును ప్రతిపాదించెను. ఆ విషయములో ౮, ౯ వోట్లయెక్కువతో జయకర్ తీర్మానము నెగ్గినది. తరువాత అన్నిటికంటెను ముఖ్యమైన ౧౮ పెన్నీల మారకపుసమస్య చర్చకు వచ్చినది. ఇది ఒక్క మిల్లుయజమానులకును, వర్తకులకునుమాత్రమే నష్టదాయకమైనది. దీనిమూలమున భారతప్రజాసామాన్యమునకే - ముఖ్యముగా ముడివస్తువులను, ఆహారపదార్థములను ఎగుమతిచేసేవారికి చాలానష్టము. యుద్ధమునకు పూర్వమున్ను, యుద్ధపురోజులలోనున్ను పౌనువిలువ ౧౫ రూపాయ లుండేది. ఇప్పు డది రు ౧౩-౫-౪ లై నది. అనగా భారతదేశమునకు విదేశవస్తువులు దిగుమతి చేయబడుట కెక్కువ ప్రోత్సాహము కలిగింపబడినది. ఆ వస్తువులు రూపాయకు రెండుపెన్నీల

వంతున చౌక అయినవి. అనగా నూటికి ౧౨/౧/౨ వంతున చౌకచేయబడినది. ఇక రైతులు పండించినముడివస్తువుల ఎగుమతినిగూర్చి విచారింతము. ఒక పౌనువిలువగల ధాన్య మెగుమతిచేయబడినయెడల ఇంతకుపూర్వము వ్యవసాయకునకు ౧౫ రూపాయలు వస్తూండెను. ఇప్పుడీకొత్తమారకమువూలమున రు. ౧౩-౫-౮ వస్తూన్నవి. ౧౯౨౫ లో ౩౧౬ కోట్లరూపాయల విలువగల ముడివస్తువులు భారతదేశమునుండి విదేశముల కెగుమతి చేయబడిన వనుకొన్నచో, అందులో ఎనిమిదవవంతు ౮౦ కోట్ల రూపాయలు నష్టము వచ్చినదన్నమాట. ఈమారకపుధర ఈవిధముగానే ఉన్నయెడల ప్రతిసంవత్సరము భారతదేశపు రైతులకీ ౮౦ కోట్లరూపాయలును నష్టముకావలసినదే. విదేశములనుండి భారతదేశమున కదేసంవత్సరము ౨౮౯ కోట్లరూపాయల విలువగల వస్తువులు దిగుమతి చేయబడినయెడల, ౩౧ కోట్లరూపాయలు భారతీయులకు లాభము వచ్చినదని చెప్పినంతమాత్రమున భారతవ్యవసాయకునకు సంతృప్తి కాజాలదు. ఒక వేళ వాదముకొరకు మది అంగీకరింపబడినప్పటికి భారతదేశమునుండి ఆ లెక్కప్రకార మేటేట ౯ కోట్లరూపాయలు విదేశములకు పోతూన్నవి. భారతదేశముయొక్క దిగుమతులకంటె ఎగుమతు లెప్పుడునూ ఎక్కువగా నుండుటచే ఈనష్టమును హిందూదేశము శాశ్వతముగా భరింపవలసినదే. ఈకారణముతోనే ఈ విషయములో హోరాహోరి పోరాటములు జరిగినవి. కాని ప్రజాపక్షమువా రోడిపోయిరి. ప్రభుత్వమువారికి ౬౮ వోట్లును, ప్రజాపక్షమునకు ౬౫ వోట్లును వచ్చినవి. ఉక్కుసంరక్షణచట్టముయొక్కయు, ఆర్థికకరెన్సీసమస్యలయొక్కయు పరిష్కారముతో కాంగ్రెసువారి ౧౯౨౭ లోని ఢిల్లీశాసనసభాకార్యక్రమమునందలి ముఖ్యభాగము ముగిసినది.

విసుగుపుట్టించే ఈ అసెంబ్లీవ్యవహారములను కొంతసేపు విడిచి, కొన్ని ఉత్సాహజనకములైన విషయములను తెలియజేతును. నూతన భారతశాసనసభకు విఠల్ భాయిపటేల్ తిరిగీ అధ్యక్షుడుగా సెన్నుకొనబడెనన్నసంగతి మే మిక్కడ వేరుగా వివరింపపనిలేదు. కాని ఈసందర్భములో మన కుత్సాహజనకమైన విషయ మొకటి కలదు. ఆయన తనకువచ్చే నెలజీతమునుండి తనహోదాకు తగినట్లుగా వ్యయముచేసికొనుటకుగాను ౨౦౦౦ రూపాయలనుమాత్ర ముంచుకొని తక్కిన ౧౬౫౬ రూపాయలను గాంధీ కీయ వాగ్దానముచేసెను. ఈధనమును ధర్మకార్యములక్రింద వినియోగించుటకు గాంధీ ఒక్కడే సంపూర్ణబాధ్యతను వహింపలేదు. ఆయన మరికొందరిని ట్రస్టీలుగా తనతో కలుపుకొని, ఆ ధనమును వినియోగించుటకు తగినసూచనలను చేయకోరెను. ౧౯౩౫ మే ౩౧ వ తేదీని గుజరాతురాష్ట్రములోని రాసుగ్రామములో గాంధీ ఒక బాలికాపాఠశాలకు ప్రారంభోత్సవము జరిపెను. ఆసందర్భములో పటేలు

ధర్మనిధిక్రింద ఇంకా ౪౦ వేలరూపాయిలు తన దగ్గరున్నవనీ, అందులో ఒకవెయ్యి రూపాయల వడ్డీమాత్రమే ఖర్చుయినదనీ ఆయన ప్రకటించెను.

కాన్పూరులో గాంధీచేసిన ప్రతిజ్ఞప్రకార మాయన ఒక సంవత్సరకాలము రాజకీయవిషయములలో జోక్యము కల్పించుకొనక దూరముగా నుండెను. ఇప్పటి కా సంవత్సరము గడచినది. ఆయన ఇటీవల రాజకీయములకు వైదొలగియున్న విషయము కొందరికి పిచ్చిగా కనపడవచ్చును. కాని ౧౯౨౫ డిశంబరులో కాన్పూరులో ఆయన అవిధమైన ప్రతిజ్ఞనేచేసి రాజకీయములకు దూరముగానున్న విషయమును గమనించిన యెడల ఆయనజీవితరహస్యము బోధపడగలదు. కాంగ్రెసు తన సలహాలను తృణీకరించి నప్పుడెల్ల ఆయన కాంగ్రెసువ్యవహారముల కడ్డముగా నిలువక వాటికి తోవ ఇచ్చెను. ఆయన ఆకాలములో బీహారురాష్ట్రమునందు పర్యటనముచేసి దేశబంధుదాసు స్మారక నిధికి ధనమును సేకరించెను. ఆ ధనము ఖద్దరు ప్రచారము నిమిత్తము వినియోగింప బడునని ఆయన ప్రకటించెను. శాసనసభాకార్యక్రమమునం దాయన కుత్సాహము లేదు. ఆయనకేకాదు,లాలాలజపతిరాయివంటివారికికూడా లేదు. లజపతిరాయి"భారత శాసనసభలో పనిచేయుట భారతజాతీయశక్తులను వ్యర్థపరచుట" అని అభిప్రాయ మిచ్చెను. ఆయనతరువాత యస్. శ్రీనివాస అయ్యంగారు "భారతశాసనసభగాని, రాష్ట్రీయశాసనసభలుగాని ప్రభుత్వమునకు నిరోధములను కల్పించుటకు తగిన తావులు కావు." అని అభిప్రాయమిచ్చెను.

సరోజినీదేవి దక్షిణాఫ్రికాను దర్శించినవిషయ మిదివరకే చెప్పియుంటిమి. ౧౯౨౪ లో దక్షిణాఫ్రికావ్యవహారములు తీవ్రరూపమును దాల్చినవి. జనరల్ స్మట్సు వెలిచట్టము (Segregation Bill) నంగీకరింపజేయుటకు పట్టుదలగానుండెను. భారత జాతీయమహాసభవారి కోరికపైన సరోజినీదేవి తూర్పు ఆఫ్రికానుండి దక్షిణాఫ్రికా కప్పుడు పోయెను. ఇంతలో ఇతరకారణములవలన జనరల్ స్మట్సుయొక్క ప్రభుత్వము పడిపోయినది. అందుమూలమున దాదాపుగా అంగీకరింపబడుటకు సిద్ధముగానున్న ఆబిల్లు నిలిపివేయబడినది. జనరల్ హర్ట్జుగాగ్ ౧౯౨౫లో అధికారమునకు వచ్చెను. ఈ వెలిచట్టముకంటెను తీవ్రమైన క్లాసు ఏరియాస్ బిల్లు తయారుచేయబడినది. అది యూనియన్ పార్లమెంటుముందుకు వచ్చియుండినయెడల తక్షణ మేకగ్రీవముగా అంగీకరింపబడిఉండేది. అప్పుడు గాంధీయున్ను, తదితర కాంగ్రెసునాయకులున్ను దక్షిణాఫ్రికాకు ఆండ్రూసును పంపిరి. ఆయన ఆచట్ట మామోదింపబడినయెడల గాంధీ-స్మట్సుఒడంబడికకు భంగముకలిగినట్లు భావించబడునని గోలచేసెను. తరువాత భారత ప్రభుత్వమువారు పాడిసన్ రాయబారవర్గమును పంపిరి. యూనియనుప్రభుత్వమువారు వారిని సరిగా ఆదరించలేదు. కాని ఇండియాప్రభుత్వమువారు యూనియన్ గవర్న

మెంటువారితో ఒడంబడిక చేసికొనుటకుకూడా అధికారములుగల ఒక రాయబార వర్గమును పంపి దక్షిణాఫ్రికాలోని భారతీయుల స్థితిగతులను పూర్తిగా చర్చింపచేసేటంతవరకునూ ఆ బిల్లాపివేయబడవలెనని సూచించిరి. అందుమూలముననే మొట్టమొదటి కేపుటవున్ మహాసభ జరిగినది. ఆండ్రూసు దక్షిణాఫ్రికా భారతకాంగ్రెసు ప్రతినిధులకు సలహాదారుగా పనిచేసేనిమిత్తము అక్కడకుకూడా పంపబడెను. ఈ సభవలన అప్పటికి విశేషఫలితములు కలుగలేదు. కాని భారతీయులను దూరముగా నుంచవలెననే శాసనముమాత్ర మీసభవలన కొంతకాల మాపివేయబడినది. ఈసభమూలముననే దక్షిణాఫ్రికాలోని భారతీయుల ప్రయోజనములను కాపాడుటకొరకు ఏజంటు జనరల్ నియమింపబడెను.

ఇక దక్షిణాఫ్రికాఒడంబడికనుగూర్చి ఒకమాట చెప్పవలసియున్నది. ౧౯౨౫-౨౬ లో దక్షిణాఫ్రికాకాంగ్రెసుప్రతినిధు లిండియాలో సంచారము చేసిరి. ౧౯౨౬ అక్టోబరు ౧౬ వ తేదీని దక్షిణాఫ్రికాకు సర్ మహమ్మదు హబీబుల్లానాయకత్వము క్రింద ఒక భారతరాయబారవర్గము పోవునని ప్రకటింపబడినది. దక్షిణాఫ్రికాలో ఒక మహాసభ ఏర్పాటుచేయబడినది. ఆసభకు ౧౯౨౬ సం. డిసెంబరు ౧౭ వ తేదీని దక్షిణాఫ్రికాప్రధానమంత్రి జనరల్ హెర్జాగ్ ప్రారంభోత్సవము జరిపెను. అది ౧౯౨౭ జనవరి ౧౩ వరకును జరిగినది. అందులో ఆ రెండు దేశముల ప్రతినిధులకును ఈ క్రింది తాత్కాలికరాజీనామా కుదిరినది:

"దక్షిణాఫ్రికాలో పాశ్చాత్యజీవితపద్ధతి న్యాయమార్గములద్వారా నడపబడుటకు ఇరు ప్రభుత్వములవారును అంగీకరించిరి.

"యూనియన్‌లో నివాసము చేస్తూన్న భారతీయులు పాశ్చాత్యజీవితపద్ధతి ప్రకారము జీవింప సంసిద్ధముగా నున్నయెడల వారి కందుకు తగినసౌకర్యములు చేయబడవలెను.

"యూనియన్‌లో నివసించుభారతీయులలో నెవరైననూ పాశ్చాత్యజీవితపద్ధతు లవసరములేని భారతదేశమునకుగాని, లేక మరియే యితరదేశమునకుగాని పోదలచుకొన్నయెడల యూనియన్ గవర్నమెంటువారు వారి కావిషయములో సహాయము చేయుదురు. యూనియన్‌లోకి వలసవచ్చినవా రెవరైనా, ఏకారణమువల్లనైనా తరుసగా మూడుసంవత్సరములు యూనియన్‌లో కాపురము మానివేసినయెడల వారి కిక అక్కడ నివసించేహక్కు పోవును. యూనియన్‌నుండి ప్రభుత్వసహాయముతో పాశ్చాత్యజీవితపద్ధతులులేని దేశములకు పోయినవా రెవరైననూ ౩ సంవత్సరములలో తిరిగి యూనియన్‌కు రావచ్చును. కాని వారు యూనియన్‌ప్రభుత్వమువారి విధిపరకు

తమకు సహాయముచేసినందు కయిన ఖర్చును తిరిగి చెల్లించిననేతప్ప మరల వా రాదేశములో చేర్చుకొనబడరు. కాని అటువంటివారు భారతదేశమునకు వచ్చినప్పుడు భారత ప్రభుత్వమువారు వారిని సంరక్షింతురు. బ్రిటిష్‌వారి యాజమాన్యముక్రింద నున్న ఇతరదేశములలోకి అదివరకే వలసవచ్చి కాపురమున్న వా రీ యూనియన్‌లోకి రావలె నన్న యెడల (ఎ) ఒక్కొక్క భారతీయుడు ఒకభార్యను, పిల్లలనుమాత్రమే తీసికొని రావలెను (బి) అలావచ్చిన భారతీయుని భార్యాబిడ్డలు న్యాయశాస్త్రప్రకార మావ్యక్తియొక్క భార్యాబిడ్డలే నని ఇండియా ప్రభుత్వమువారు సర్టిఫై చేయవలెను.

“ఈ ఒడంబడికవలన యూనియన్‌గవర్నమెంటువారికి గల చిక్కులు చాలా వరకు తగ్గిపోవు నని భావింపబడినది. దీని నాచరణలోకి తేవలెననే అభిప్రాయముతో దక్షిణాఫ్రికా యూనియన్‌గవర్నమెంటువా రప్పటి కాలోచనలోనున్న నిరోధక చట్టములను నిలిపివేసిరి.

“ఈ రెండుప్రభుత్వములవారును ఈ ఒడంబడికవలన కలిగిన అనుభవములనుబట్టి అప్పుడప్పుడూ కలసి సంప్రతించుకొనుచున్నయెడల ఉభయులకును శ్రేయస్కరముగా నుండగల దని భావింపబడినది.

“రెండుప్రభుత్వములకును పరస్పరసహకారము కలిగించేటందు కొక ఏజెంటును నియమింపవలసినదనియూనియన్‌గవర్నమెంటువా రిండియాప్రభుత్వమువారిని కోరిరి.”

మొట్టమొదటి కేపుటవున్‌రౌండుటేబిలుకాన్ఫరెన్సు జరిగినతరువాత గాంధీ శ్రీనివాసశాస్త్రిని దక్షిణాఫ్రికాకు ఏజెంటుగా పంపవలసినదని పత్రికలలో సూచించెను. ఇందుకు ప్రభుత్వమువారున్నూ, భారతీయులున్నూ కూడాఅంగీకరించిరి- ఆయనఅక్కడ జయప్రదముగా నిర్వర్తించిన పనినిగూర్చి ముందు వివరింతుము.

ఆ మహాసభాఫలితములు దేశమంతటా సంతోషముతో స్వీకరింపబడినవి. గాంధీ ఇది చాలాగౌరవప్రదమైనరాజీఅనెను. కాని ఆయన దక్షిణాఫ్రికాయూనియన్ లోకి వలసపోయి నివసిస్తూన్న భారతీయులు ప్రభుత్వసహాయముతో తిరిగి భారత దేశమునకుతప్ప తదితరదేశములకు పోయేయెడల కొన్ని చిక్కు లున్నవని తలచెను.

గౌహతీకాంగ్రెసులో శాసనోల్లంఘనతీర్మానమునుగూర్చిన సూచన యేమీ లేకపోవుటవలన ౧౯౨౭ రాజకీయములలో నూతనవాతావరణము కలిగినది. ప్రభుత్వము వారు తలచినట్లుగా కాంగ్రెసు సహకారములోనికి దిగకపోవడముచేత వారికి కొంత ఆశాభంగము కల్గినమాట నిజమే. కాని నిజమున కన్నిరాష్ట్రములలోనూ మంత్రివర్గము లేర్పాటుచేయబడినవి. అన్నిచోట్లా ద్వంద్వపరిపాలన మవిచ్ఛిన్నముగా సాగుతూన్నది. గాంధీ పర్యటనము సాగించెను. శాసనోల్లంఘనముమాట లేదుగనుక మహా

రాజు లాయనను చూచి భయపడుట మానివేసిరి. కొంతమంది ఆయన నాహ్వానించిరి. నా రిదివరకువలె ఖద్దరును కాంగ్రెసువలంటీర్ల యూనిఫారముగా చూచుటలేదు, దానిని భారతదేశముయొక్క ఆర్థికపునరుద్ధారణమున కొక ముఖ్యాంగముగా చూడ ప్రారంభించిరి గాంధీ సత్యసంధు డని, పెద్దమనిషి అని వారియభిప్రాయము. కాని, ఆయనరాజకీయపద్ధతులును, రాజకీయవిశ్వాసములును పెడమార్గములను పట్టిపోతూన్న వని వారిలో కొందరినమ్మకము. కొంతకాలము పర్యటనము చేసినపిమ్మట గాంధీ జబ్బుపడెను. మే ౧౫, ౧౬ తేదీలలో సమావేశమైన అ. భా. కాం. సం. వారు వెంటనే ఆయన కారోగ్యము కలుగవలె నని కోరుతూ తీర్మానించిరి. ఈ సమయము లోనే లాలాజీ యూరపునకు ప్రయాణమునకట్టెను. ఆయన ఇండియాను విడిచినవెంటనే ఆయనపైన ప్రతికూలవిమర్శనములు చేయబడినవి. ఆ క్రిందటిసంవత్సరముకూడా ఆయన ఇండియాను విడిచి వెళ్లినప్పు డట్లే జరిగినది. ఈ సందర్భములో ఆయన కనుకూలమైన ఒకమాట చెప్పవలసియున్నది. ఆయన గౌహతీకాంగ్రెసుకు వస్తూండగా మధ్య కల కత్తాలో శ్రద్ధానందుడు హత్యచేయబడినా డని వినెను. అంతటితో ఆయన కాంగ్రెసుకు హాజరుకాకుండానే పాంచాలమునకు తిరిగి వెళ్లిపోయెను. అప్పటి రాజకీయ వాతావరణము తగాదాలతో నిండుకొనియున్న దని చెప్పుటకే మే మింతదూరము చెప్ప వలసివచ్చినది. మే ౧౫, ౧౬ తేదీలలో అ. భా. కాం. సం. సమావేశ మైనప్పుడు హిందూ మహమ్మదీయసమస్యనుగూర్చి కాంగ్రెసుకార్యనిర్వాహకవర్గమువారు తయారు చేసిన ప్రణాళిక చర్చకు వచ్చినది. శ్రీనివాసఅయ్యంగారు ఆ సమస్య పరిష్కరింప బడవలెనని చాలా ఆతురతచూపెను. కాని అది యెంతకఠినమైన విషయమో ఆయన గమనించినట్లు లేదు. హిందూ మహమ్మదీయసమస్యవిషయములో తరువాత అనేక మార్పులు కలిగినందువలన ఆ ప్రణాళికలోని వివరములనుగూర్చి మనమిప్పు డంత తెలుసు కొనవలసిన పనిలేదు కాని, ఆనా డారెండుమహాసంఘములును సంఘీభావముకోసము తహతహలాడిన విషయముమాత్ర మాప్రణాళికనుబట్టి బోధపడగలదు. ఆప్రణాళికలో సమష్టినియోజకవర్గము లంగీకరింపబడినవి. రాష్ట్రీయశాసనసభలలోను, కేంద్రశాసన సభలలోనుకూడా జన సంఖ్యనుబట్టే స్థానములు నిర్ణయింపబడినవి. సమష్టి నియోజక వర్గములలో అల్పసంఖ్యాకులకు స్థానములు ప్రత్యేకింపబడినవి.

తరువాత ఆసభలో సామ్రాజ్యతత్త్వమునకు ప్రతికూలముగా జరుపబడిన అంత ర్జాతీయమహాసభనుగూర్చి, వలసరాష్ట్రములలోని నిరంకుశత్వమునుగూర్చి, జాతీయ స్వాతంత్ర్యమునుగూర్చి తీర్మానములు చేయబడినవి. అంతర్జాతీయమహాసభ బ్రస్సె ల్సులో జరిగినది. దానికి ఇండియాపక్షమున జవహరలాల్ ప్రతినిధిగా వెళ్లెను. ఆయన అక్కడనుండి ఒకనివేదికను అ. భా. కాం. సం. వారికి పంపెను. ఆయనచేసిన సేవ

కఖిలభారత కాంగ్రెసుసంఘమువారు శ్లాఘించిరి. సామ్రాజ్యతత్వమునకు వ్యతిరేకముగానూ, జాతీయస్వాతంత్ర్యమున కనుకూలముగానూ అంతర్జాతీయసభ చేస్తూన్న సేవను అ. భా. కాం. సం. వారు కొనియాడిరి. ఆ అంతర్జాతీయమహాసభకు సహాయము చేయవలసిన దని అ. భా. కాం. సం. వారు భారతజాతీయమహాసభకు సిఫారసు చేసిరి.

ఈ విషయము విదేశప్రచారమునకు సంబంధించి చాలా ప్రాముఖ్యమువహించినది. దీనినిగూర్చి ముందు వివరింతుము. చీనాదేశీయుల స్వాతంత్ర్యసంగ్రామమునందు భారతీయుల సానుభూతిని తెలియచేస్తూ మరియొకతీర్మానము చేయబడినది. భారత ప్రభుత్వమువారిండియానుండి చీనాకు సైన్యమును పంపించినందుకు నిరసింపబడిరి. ఆసైన్యములు తిరిగీ ఇండియాకు పిలిపింపబడవలెనని తీర్మానింపబడినది. హిందూస్థానీ సేవాదళమువారు చీనాలో గాయపడినవారికి సహాయముచేసేనిమిత్తము వాలంటీర్లను పంపనిర్ణయించినందుకు అ. భా. కాం. సం. వారు వారిని స్తుతించిరి. బ్రిటిష్ ట్రేడు యూనియన్ బిల్లునుగురించీ, వంగరాష్ట్ర కాంగ్రెసుతగాదాలనుగూర్చీ, కార్మిక నిర్మాణమునుగూర్చీ, నాగపురపు సత్యాగ్రహమునుగూర్చీ, బ్రిటిష్‌వస్తువుల బహిష్కారమునుగూర్చీ తగినట్లుగా తీర్మానములు చేయబడినవి. ఈచివరతీర్మానము తీవ్రచర్చకు కారణమైనది. తరువాత మద్రాసుశాసనసభలోని కాంగ్రెసుపక్షమునుగూర్చి తీవ్రవిమర్శనములు జరిగినవి. దాదాపు విశ్వాసరాహిత్య తీర్మానమువరకునూ వచ్చినది. మద్రాసులో ౧౦౪ మంది ఎన్నికసభ్యులలోనూ ౪౫ మంది కాంగ్రెసువాదులు జయము పొందిరి. గవర్నరు మంత్రివర్గమును నిర్మించవలసిన దని కాంగ్రెసుపక్షనాయకుని కోరెను కాని ఆయన నిరాకరించెను. తరువాత ఆయనే అధ్యక్షు డయ్యెను. కాంగ్రెసుపక్షమువారి సహాయముతో స్వతంత్రవాదులు మంత్రివర్గమును నిర్మించిరి. అది ఆరోజులలో అందరికీ తెలిసిన బహిరంగరహస్యమే. ఇది సిద్ధాంతమునకు ప్రతికూల మని అభ్యంతరపెట్టబడినది. శాసనోల్లంఘన కార్యక్రమము లేకపోయినప్పటికీ అ. భా. కాం. సం. లోని చాలామందికి అసహాయతత్వము రక్తములో జీర్ణించినది. మద్రాసు కాంగ్రెసుసంఘసభ్యులపైన గోపాలమీనన్ విశ్వాసరాహిత్యతీర్మానము నుపపాదించెను. ఆతీర్మానమున కనుకూలముగా తీవ్రమైన ప్రచారము జరిగినది. కేల్కారుతీర్మానము నెదిరించు నని చాలామంది భావించిరి. కాని ఆయన మోతీలాల్ పండితుడు హోదా కోసము, అధికారముకోసము అనేక తప్పిదములు కావించెనని తాను వ్రాసికొనివచ్చిన ఉపన్యాసమును చదివి, ఈ అవకాశమును మోతీలాలుపైన తనకసితీర్చుకొనుట కుపయోగించుకొనెను. ఈసందు చూచుకొని దక్షిణభారతీయ లోకసవరణను ప్రతిపాదింప జేసిరి. దానిమూలమున మద్రాసులోని కాంగ్రెసుపక్షమువారు మంత్రుల జీతము: కును,

బడ్జెటుకును ఏలప్రతికూలముగా వోటుచేయలేదో విచారించి రిపోర్టుచేయుటకు కార్య నిర్వాహకవర్గమువారికి తీర్మానము పంపబడినది. మద్రాసుశాసనసభలోని స్వతంత్ర పక్షవాదులకు శ్రీనివాసయ్యంగారు ప్రతికూలుడు కాదు. కాబట్టి ఆయన తా నెవరి సహాయముతో రాజకీయోద్యమమునకు నాయకుడైనాడో ఆ పూర్వాచారకాంగ్రెసు కౌన్సిలు పక్షమువారిని యెదిరింపవలసివచ్చినది. అప్పటికప్పుడే రాయల్ కమీషనును గూర్చి, రాజ్యాంగసంస్కరణముల విచారణనుగూర్చి, ఇంగ్లండుకు రాయబారములు పంపుటనుగూర్చి అనేకసంగతులు బయలుదేరినవి. అందువలన కాంగ్రెసుకార్యనిర్వా హకవర్గమువా రావిషయములనుగూర్చి ఆలోచించుటతోనే విసుగుచెందిరి. కాబట్టి వారుగాని, మోతీలాల్ పండితుడుగాని, మద్రాసుకౌన్సిలుపక్షమువారి చర్య నెదిరించ లేదు. బొంబాయిలో రాయల్ కమీషనునుగూర్చి చర్చజరిగినది.

ఆసమయములోనే నాల్గుసంవత్సరము కారాగృహవాసశిక్ష ననుభవించిన సుభాసుచంద్రబోస్ మే ౪ వ తేదీని విడుదలచేయబడినాడు. కాని ఆనిర్బంధనివా సమునూలమున సుభాసుచంద్రుని ఆరోగ్యము పూర్తిగా చెడిపోయినది. అది గొప్ప ఆందోళనకు కారణమైనది.

౧౯౨౭ వేసవికాలములో తిరిగీ హిందూమహమ్మదీయకొట్లాటలు జరిగినవి. లాహోరులో ౧౯౨౭ మే ౩ వ తేదీ ౭ వ తేదీలలోపల చాలా గొప్ప కల్లోలము జరిగినది. ౨౭ మంది చనిపోయిరి. ౨౭౨ మందికి గాయములు తగిలినవి. బీహారులోను, ముల్తాన్‌లోను (పంజాబు), బారిలీలోను (సం. రా.), నాగపురములోను (మ. రా.) అటువంటి కొట్లాటలే జరిగినవి. లాహోరుతరువాత నాగపూరు కొట్లాటలే తీవ్ర మైనవి. వాటిలో ౧౯ మంది మరణించిరి. ౧౨౩ మందికి గాయములు తగిలినవి. ఈతగా దాలకు మూలకారణము నిక్కడ కొంత వివరించవలసియున్నది. మూడు సంవత్సరము లకు పూర్వము రంగీలారసూల్ అనే ఒక కరపత్రము పంచిపెట్టబడినది. ఈ పేరును బట్టియే కరపత్రములోని విషయము లెంత చెడ్డవో యోచించుకొనవచ్చును. దీనిపైన క్రిమినల్ కేసు పెట్టబడినది. రెండేండ్లు విచారణ జరిగినపిమ్మట దీనికి కారణభూతు లైనవారు శిక్షింపబడిరి. తరువాత అపీలుచేయబడెను. అందులో శిక్ష ఖాయమైనది. చిట్టచివరకు హైకోర్టులో ముద్దాయీల విడుదల జరిగినది. ఇటువంటిదే రిసాలావర్తమాన్ అనే కేసు మరియొకటి జరిగినది. అందులో శిక్షవిధింపబడెను. ప్రస్తుతన్యాయ శాస్త్రమువలన ఇట్టి నేరములను చేసినవారు నిశ్చయముగా శిక్షింపబడుదురనే హామీ లేకపోవుటచే ఇందుకొరకు ప్రత్యేకముగా భారతశాసనసభలో ౧౯౨౭ అగస్టునెలలో ఒక బిల్లు ప్రవేశపెట్టబడినది. అందులోని ముఖ్యాంశ మీ క్రింద ఉదాహరింపబడినది:

"ఎవరైనా రాజుగారి ప్రజలలోని ఏ తరగతివారి మతమునకైననూ దురుద్దేశముతో అవమానము కలిగించవలెనని మాటలవలనగానీ, వ్రాతలవలనగానీ, లేక తదితర విధముగాగానీ ప్రయత్నించేయెడల ఆయనకు రెండు సంవత్సరములు శిక్షగాని, లేక జరిమానాగాని, లేక రెండునుగాని విధింపబడును."

ఈబిల్లు రెండురోజులు చర్చజరిగినతరువాత ఆమోదింపబడినది. ఆసంవత్సరములో మొత్తము ౩౧ కొట్లాటలు జరిగినవి. అందులో ౧౦ సంయుక్తరాష్ట్రములలోను, ౬ బొంబాయిలోను, ౨ పాంచాలములోను, ౨ మధ్యరాష్ట్రములలోను, ౨ వంగరాష్ట్రములోను, ౨ బీహారురాష్ట్రములోను, ౨ ఢిల్లీలోను జరిగినవి. ఈవిధముగా ౧౫ మాసములు జరిగిన దని ౧౯౨౭ ఆగస్టు ౨౯ వ తేదీని భారతశాసనసభలో ఇర్విన్ ప్రభువు ప్రకటించెను. ఈకొట్లాటలలో మొత్తము ౨౫౦ మంది మరణించిరి. ౨౫౦౦ మందికి గాయములు తగిలినవి. వైస్రాయి సంఘీభావమునుగూర్చి అనేకసారు లుపన్యసించెను. అందుమూలమున ఐకమత్యమహాసభ ఒకటి జరిగినది. కాని ప్రయోజనము లేకపోయినది. అ. భా. కాం. సం. వారుకూడా ఒక ఐకమత్యమహాసభను ౧౯౨౭ అక్టోబరు ౨౭ న జరిపిరి. అది శ్రీనివాస అయ్యంగారిచే ప్రారంభింపబడినది. హిందూమహమ్మదీయ సంఘీభావమున కొక ప్రణాళికను తయారుచేసి, ఆరెండుసంఘములకును శాశ్వతమైన ఐకమత్యము చేకూర్చుట తన జీవితాదర్శ మని అనేకసార్లాయన ప్రకటించెను. దీర్ఘమైనచర్చ జరిగినపిమ్మట ఆ మహాసభవారీ క్రిందివ తీర్మానము నంగీకరించిరి:

" భారతదేశములోని ఒకమతమువారు మరియొక మతమువారిని తమ మతాభిప్రాయములనుగాని, తమ మతవిధులనుగాని అంగీకరించవలసినదని నిర్బంధించకూడదు. మతస్వాతంత్ర్యము ప్రజలస్వేచ్ఛకును, నీతికిని, శ్రేయస్సునకును, ఆరోగ్యమునకును, నెమ్మదికిని లోబడియుండవలెను. హిందువులు వారి మతవిధులను నిర్వర్తించేసమయములలోకాని, లేక ఇతరకార్యకరామతుల సందర్భములోకాని మసీదుల ముందుగా మేళతాళములను తీసికొనిపోవచ్చును. కాని ప్రత్యేకముగా మసీదులదగ్గర ఆగి, ప్రార్థనలు చేసేవారికి కష్టముకలిగేటట్టుగా ప్రయత్నించకూడదు. మహమ్మదీయులు వారిమతమునకు సంబంధించినవిషయములలో గోవులను హత్యచేయవచ్చును. కాని బహిరంగవీథులలోగాని, హిందువుల కనులయెదుటగాని, దేవాలయముల ఆవరణలోగాని వారు గోహత్య చేయకూడదు. హత్యచేయబడే ఆవులను ఉత్సవములతో బజారులవెంట తీసికొనిపోకూడదు. గోహత్యనుగూర్చి హిందువుల మనోభావములను గమనించి వారియెదుట గోహత్య చేయకూడ దని మహమ్మదీయులు హృదయపూర్వకముగా ప్రార్థింపబడుతూన్నారు."

అప్పటికి కొలదికాలముక్రిందటనే జరిగిన కొన్నిహత్యలనుగూర్చి కూడా ఆ మహాసభలో నిరసింపబడెను. హిందూ, మహమ్మదీయనాయకు లీ దేశములో శాంతి వాతావరణమును చేకూర్చుటకు కోరబడిరి. హిందూ మహమ్మదీయ సఖ్యమునుగూర్చి ప్రతిరాష్ట్రమునందును ప్రచారము సాగించుటకొరకొక కమిటీని నియమించుటకు ఆ మహాసభవా రఖిలభారతకాంగ్రెసుసంఘమువారి కధికార మిచ్చిరి.

ఐకమత్యమహాసభ జరిగినవెంటనే, అనగా ౧౯౨౫ అక్టోబరు ౨౮, ౨౯, 30 తేదీలలో అ. భా. కాం. సం. సభ కలకత్తానగరమున సమావేశమైనది. సాంఘికసమస్యనుగూర్చి ఐకమత్యమహాసభవారు చేసిన తీర్మానములను తూచా తప్పకుండా ఆసభవా రంగీకరించిరి. తరువాత వంగరాష్ట్రనిర్బంధితులను గూర్చి విచారింపబడినది. వారిలో కొందరు నాలుగేండ్లపైనుండికూడా ఖైదులలోనున్నవారుకలరు. వారిని విడిచిపెట్టించుమార్గము నన్వేషించుటకు ఒక కమిటీ నియమింపబడినది. ఈరెండువిషయములు పూర్తియైనవెంటనే సభ పలచబడినది. అధ్యక్షుడే అనారోగ్యమువలన సభకు హాజరు కాలేకపోయెను. ఆంధ్రదేశమునుండి వచ్చిన ప్రతినిధి టి. విశ్వనాధముగారు "గౌహాతీతీర్మానము ననుసరించి కాంగ్రెసువాదు లెవ్వరును ప్రభుత్వమువారిచ్చే ఉద్యోగములను స్వీకరించకూడదు. పైగా మంత్రివర్గనిర్మాణముకూడా నిరోధింపబడవలెను" అని ఒక తీర్మానమును తెచ్చెను. కాని ఆతీర్మానము త్రోసివేయబడినది. "ఈ విషయమునుగూర్చిన చర్చ మద్రాసుకాంగ్రెసువరకు నిలిపివేయబడవలె నని ఇదివరకే నిర్ణయింపబడినందున ఇప్పు డీతీర్మానముకు తావులే"దని అధ్యక్షుని పక్షమున కార్యదర్శి ప్రకటించెను. దీనికి ప్రతిఘటనముగా కొంతమంది వంగరాష్ట్రసభ్యులు కాలపరిమితిలేకుండా సభ నాపివేయవలెనని తీర్మానమును ప్రతిపాదించిరి. అది నెగ్గినది.

అమెరికాలోని భారతీయులనుగూర్చి, భారతీయులకొరకు సెనేటరు కోప్లాండ్ చేసిన సేవలనుగూర్చి, సకలత్వాలాపాస్‌పోర్టు నిరాకరింపబడుటను గూర్చి, నాభామహారాజు రాజ్యపరిత్యాగమునుగూర్చి తీర్మానములు ప్రతిపాదింపబడినవి. ఈ చివర తీర్మానము వెనుక గౌహతీలో వదలివేయబడినది. కాని కలకత్తాలో బి. జి. హార్నిమన్ దీనిని ప్రతిపాదించెను. కమిటీవారు మహారాజుకు న్యాయము కలిగించవలెనని తీర్మానించిరి.

నవంబరు మొదటివారములో చాలాఉద్రేకోత్సాహములు కలిగినవి. వైస్రాయి తన పర్యటనకార్యక్రమమును నిలిపివేసి ఢిల్లీకి తిరిగిపోయెను. నవంబరు ౫ వ తేదీనిగాని, తరువాత కొన్నిరోజులలోగాని వారివారి వీలునుబట్టి వైస్రాయిని దర్శింపవలసినదిగా భారతదేశములోని వివిధరాజకీయపక్షనాయకులకును ఆహ్వానములు పంపబడినవి.

అత్యావసరవిషయము కాకపోయినప్పటికి ఏదో ఒక ముఖ్యవిషయమునుగూర్చి మాత్ర మాయన నాయకులతో సంప్రతించకోరె ననుమాట స్పష్టము. గాంధీ ఆసమయములో ఢిల్లీకి వెయ్యిమైళ్లదూరమున నున్న మంగళూరులో నుండెను. ఆయనకుకూడా ఆహ్వా నము పంపబడినది. ఆయన తన పర్యటనకార్యక్రమమును ముగించి ఢిల్లీకి ప్రయాణ మయ్యెను. ఆయన వైస్రాయిదర్శనమునకు పోయినప్పుడు, సైమన్‌కమీషను నియామక మునుగూర్చి భారతరాజ్యాంగ కార్యదర్శిచేసిన ప్రకటనమును ఇర్విన్‌ప్రభువు గాంధి చేతికిచ్చెను. 'ఇంతేనా పని' యని గాంధీ ప్రశ్నింపగా వైస్రాయి ఔనసెను. ఒక అణాకవరుతో యీకాగిత మాయనకు చేరియుండే దని గాంధీ తలచెను. పాపము! ఇర్విన్‌ప్రభువు భారతరాజ్యాంగకార్యదర్శిచేసిన ఉత్తరువులను భయభక్తులతో అను సరించెను. కాబట్టి రాజకీయవేత్త లందరును సైమనుకమిటీకి సానుభూతి చూపవలసి నదని ఆయన ప్రచారము చేయసాగెను. ౧౯౨౭ నవంబరు ౮ వ తేదీని భారతదేశ మంతటా ఆప్రకటనము వెల్లడిచేయబడినది. వైస్రాయి నాయకులసహాయమును పొందు టకుప్రయత్నింపసాగెను. "ఎందు కొతొందరబహుశా గ్రేట్‌బ్రిటన్‌లో ౧౯౨౯లో జరుగబోయే ఎన్నికల భయ మాతొందరకు కారణమై యుండవచ్చును" అని బెసెం టూహించ్చర్యపోయెను. ఆకాలములో సైమన్‌కమిషను కావలయునని ఎవ్వరూ కోరి యుండలేదు. బ్రిటిషుప్రభుత్వమువారి కారణము లేవో మనకు తెలియవు. ఆకమిటీలో భారతీయు లెవరును లేనందున కాంగ్రెసుతప్ప భారతదేశములోని తక్కిన అన్ని రాజకీయకక్షలు అయిష్టతను వెల్లడించినవి. కాంగ్రెసువారు మాత్రము తమ ఆదర్శమున కేమీ అది సరిపో దని ప్రకటనమును చూచీచూడడముతోనే గ్రహింపగలిగిరి. బెసెంటు "సైమనుకమిటీ నియామకము గాయముపైన కారముచల్లినట్లున్న"దని భావిం చెను. ఒకప్పుడు బర్కెన్‌హెడ్‌ప్రభువు బరద్వాన్‌మహారాజాకు ప్రత్యుత్తరముగా "మే మిచ్చినది మీరు పుచ్చుకొనితీరవలసినదే. మీరు నిరాకరించినయెడల మే మాలో చింతుము" అని చెప్పినమాటల నామె ఉదాహరించెను. "ఈ బర్కెన్‌హెడ్‌ప్రభువే బ్రిటిష్‌ప్రభుత్వమువారి సైన్యములకు వ్యతిరేకముగా ఉత్తరఐర్లండుదేశములో పనిచేసిన సంగతి మాకు జ్ఞాపకము లేకపోలేదు. ఇప్పుడీయనే భారతీయులనందరినీ బహిష్క రించి భారతదేశమునకు రాజ్యాంగసంస్కరణములను తయారుచేయుట కొక కమిటీని నియమించెను. మే మాకమిటీని బహిష్కరించి, ఆయన చెప్పిన పాఠమును ఆయనకే ఒప్పగింతుము. అనుకరణమే నిజమైన స్తుతి" అని బెసెంటు తనకోపమును వెల్లడించెను.

అప్పుడింగ్లండులోనున్న మోతీలాల్‌నెహ్రూ సైమన్‌కమీషను భారతీయుల కనులనీళ్లు తుడుచుట కేర్పాటుచేయబడిన దని భావించెను. ఈ సైమనుకమిటీకి వ్యతిరేక ముగా డి. ఇ. వాచా మొదలగు అఖిలభారతనాయకుల సంతకములతో ఒకప్రకటనము

చేయబడినది. అందులో సంతకములు చేసినవారిలో కాంగ్రెసువాదులు తప్ప తక్కిన అన్ని రాజకీయపక్షములవారును కలరు. "అమృతసర మారణకాండను గూర్చి భారతీయు లందరును ఏకగ్రీవముగా నిరసించినట్లే యీ సైమన్ కమిషనుగూర్చి నేడందరు భారతీయులును నిరసిస్తూండి"రని మిస్ విల్కిన్సన్ ప్రకటించెను. కార్మికపక్షమువారీ విషయములో బర్కెన్ హెడ్డును దర్శించుటకు లాన్స్బరీ, మేక్డొనాల్డు, స్నోడెనులను నియమించిరి. క్రిందటి కార్మిక ప్రభుత్వములో భారతరాజ్యాంగ కార్యదర్శిగా నున్న ఆలివర్ ప్రభువు బెంగాలార్డినెన్సుకు సంతకముచేసినందున కార్మికపక్షమువారినిగూర్చి భారతదేశములో ఒక అనుమానము కలదు. భారతజాతీయమహాసభాధ్యక్షుడు సైమన్ కమిషన్ నియామకమును నిరసించెను. దానిని బహిష్కరించినందువలన భారతదేశమునకు నష్టము కలుగదని కల్నల్ వెడ్జివుడ్ చెప్పినమాట నుదాహరించెను.

అయితే ఇంతమంది నిరసిస్తున్న యీ కమిషను ఎందుకు భారతదేశమునకు వస్తున్నది? "భారతదేశములో ప్రభుత్వపద్ధతి ఏవిధముగా నడుస్తున్నదో విచారించుటకును, భారతీయవిద్యాభివృద్ధినిగూర్చి తెలిసికొనుటకును, బ్రిటిష్ ఇండియాలోని ప్రాతినిధ్యసంస్థ లేవిధముగా పెంపొందుతూన్నవో గ్రహించుటకును, భారతదేశమునకు బాధ్యతాయుత ప్రభుత్వసిద్ధాంతము ననువర్తింపజేయుట కెంతవరకు సాధ్యమో ఆలోచించుటకును, ఇప్పుడున్న బాధ్యతాయుత ప్రభుత్వము నెంతవరకు విస్తరింపచేయవచ్చునో, ఎంతవరకు మార్చవచ్చునో యోచించుటకును, రాష్ట్రములలో రెండవ శాసనసభ అవసరమో లేదో నిర్ణయించుటకును ఆ కమిటీ ఏర్పాటుచేయబడినది. కమిటీవారు వీటినన్నిటినిగూర్చి నివేదికను తయారుచేసి భారతప్రభుత్వమునకును, బ్రిటిష్ ప్రభుత్వమునకును పంపిన పిమ్మట దానిని వారు పరిశీలింతురు. తరువాత బ్రిటిషుప్రభుత్వమువారు పార్లమెంటుకు తమ సూచనలను పంపెదరు. కాని భారతదేశములోని వివిధ రాజకీయపక్షములవారును ఆ సూచనలనుగూర్చి అభిప్రాయములను ప్రకటించనిదే అవి పార్లమెంటులో అంగీకరింపబడవలెనని బ్రిటిష్ ప్రభుత్వమువారి ఉద్దేశముకాదు. భారతీయుల అభిప్రాయములను వినుటకొరకు రెండు పార్లమెంటు సభలలోనుండి జాయింటుకమిటీ ఒకటి ఏర్పాటుచేయబడెను. ఆ కమిటీయెదుట సాక్ష్య మిచ్చుటకు భారతకేంద్రశాసనసభలనుండి ప్రతినిధు లాహ్వానింపబడుదురు. అంతేకాక జాయింటు పార్లమెంటరీకమిటీవారు విచారింపదలచిన తదితరసంఘములవారినికూడ వారాహ్వానింపవచ్చును.

"ఈ పైన చెప్పబడిన విషయము లన్నిటిలోను భారతీయులు పాల్గొనుటకు వీలుగా ఈపద్ధతి బ్రిటిష్ ప్రభుత్వమువారిచే ఏర్పాటు చేయబడినది. అందుమూలమున వారు తమ శాసనసభాప్రతినిధులద్వారా తమ అభిప్రాయములను ప్రకటించడమే

కాక బ్రిటిష్‌ప్రభుత్వమువారిచే సూచింపబడిన సిద్ధాంతములో గాని, వివరములలో గాని ఏమైనా లోప మున్నయెడల వాటిని విమర్శించి తగిన పరిహారములను తెలియ చేయుటకుకూడ అవకాశము కలదు.

"ఇదంతా ఒక సమగ్రమైన ప్రణాళికగా భావింపబడవలెను. స్నేహితు లందరూ ఈవిషయములో వా రంగీకరించినంతవరకు తక్కినవారికికూడా నచ్చచెప్పి భేదాభిప్రాయములను సవరింపవలెను. అంతేకాని వివాదగ్రస్తములగు అభిప్రాయములనుగూర్చి పట్టుపట్టి తేలికగా మిత్రభావమునకు భంగము రానీయకూడదు" అని ప్రకటింపబడినది.

ఇక ౧౯౨౭ లో జరిగిన కాంగ్రెసునుగూర్చి విచారింతము. అది మద్రాసులో జరుగవలసియుండెను. ౧౯౨౭ లో రాయల్‌కమీషన్ రానుండుటచే కాంగ్రెసు సభను చిన్నపట్టణములో జరుపుటకంటె మద్రాసువంటి నగరములో జరుపుట భావ్య మని గౌహతీలోనే తలంపబడినది. రాయల్‌కమీషనుసందర్భమున కాంగ్రెసేమి చేయు తలపెట్టునో యెవరికీ తెలియదు. కాంగ్రెసు జరుగవలసిన చోటును గూర్చి అ. భా. కాం. సం. వారి నిర్ణయమునకు వదలివేయబడెను. హిందూ, మహమ్మదీయకొట్లాటలు విశేషముగా జరుగుచుండుటచే ౧౯౨౭ లో హిందూ మహమ్మదీయ సంఘీభావమునుగూర్చి తీవ్రముగా ప్రయత్నములు నడుచుచుండెను. అంతకుపూర్వము రెండైకమత్యమహాసభలు జరిగినవి. అందులో ఒకమహాసభ యొక్క తీర్మానములను అ. భా. కాం. సం వా రంగీకరించిరి. అటువంటిపరిస్థితులలో ఆసంవత్సరపు భారతజాతీయమహాసభ కధ్యక్షత వహింపతగినది మహమ్మదీయప్రముఖుడుతప్ప మరెవ్వరు? మహమ్మదీయులలో ఆపదవికి డాక్టరు అన్సారీ పేరు సూచింపబడినది. అన్సారి ౧౮౯౬-౧౮౯౯ సంవత్సరములలో మద్రాసు వైద్యకళాశాలలో విద్యార్థిగా నుండెను. ఆయన ౧౯౧౨ లో బాల్కన్‌రాష్ట్రమునకు రెడ్‌క్రాసుసంఘమువారితో కలిసి వెళ్లెను. ఆయనకు వైద్యవృత్తిలో మంచి పేరు ప్రతిష్ఠ లున్నవి. గొప్ప విజ్ఞానమూర్తి, విశాలహృదయుడు. అన్సారీ మద్రాసుకాంగ్రెసు కధ్యక్షుడై తన ఉపన్యాసములో చాలాభాగము హిందూమహమ్మదీయ సఖ్యమునుగూర్చియే ముచ్చటించెను. "కాంగ్రెసు ౩౬ సంవత్సరములు సహకారతత్వము నవలంబించినది. సంవత్సరన్నరకాలము సహాయనిరాకరణకార్యక్రమము ననుసరించినది. నాల్గుసంవత్సరములు శాసనసభలలో నిరోధపద్ధతులకు పూనుకొనినది." అని కాంగ్రెసుచరిత్రను ఆయన సంగ్రహముగా వివరించెను. "అసహాయోద్యమము వలన మన మోడిపోలేదు. మనమూలమున అసహాయోద్యమ మోడిపోయినది." అని మన వోటమియొక్క సత్యస్వరూపమును ఆయన చక్కగా చిత్రించెను. తరువాత

రాయల్ కమీషన్‌నుగూర్చి, వంగరాష్ట్ర నిర్బంధితులనుగూర్చి, ఆసియాఖండములో భారతదేశస్థితినిగూర్చి, జాతీయారోగ్యమునుగూర్చి వివరింపబడినది. ఆకాంగ్రెసుకు పార్లమెంటులోని కార్మికపక్షసభ్యుడు మార్డిజోన్సుగారున్ను, పర్సెల్ స్ప్రాటు గారున్ను హాజరైరి. రాయల్ కమీషన్‌ను గూర్చి చేసిన తీర్మానముకంటె ఎక్కువ ముఖ్యమైన తీర్మానము లేవీ ఆకాంగ్రెసులో లేవు. యుద్ధము రానుండెనని ఒక తీర్మానములో సూచింపబడినది. భారతీయులా యుద్ధములో బ్రిటిష్ ప్రభుత్వమువారికి కేవలముగానూ సహాయము చేయకూడదని తీర్మానింపబడినది. ఆవారీసేనాని నిరశనవ్రత మావాటికి ౭౫ వ రోజు. ఆయన ప్రభుత్వమువారిచే నిషేధింపబడిన ఆయుధములను తీసుకొని ఉత్సవములలో నాయకత్వము వహించి ఆయుధశాసన సత్యాగ్రహమును నడపెను. ఆయనకు అభినందనము లర్పింపబడినవి; సానుభూతి చూపబడినది; ఇండియానుండి బర్మాను విడదీయు సూచన నిరసింపబడినది. ౧౮౮౫ లో జరిగిన మొదటికాంగ్రెసులో ఇండియాతో బర్మాను చేర్చుట ఖండింపబడినది. ఒకవేళ బర్మా నిండియాతో చేర్చవలసియున్న యెడల అది క్రొనుకాలనీగా భావింపబడవలె నని తీర్మానింపబడినది. స్టేటుప్రిజనర్లు వెంటనే విడుదలచేయబడవలె నని తీర్మానింపబడినది. తూర్పాఫ్రికా, దక్షిణాఫ్రికాలను గూర్చి రెండుతీర్మానములు చేయబడినవి. వాటినిగూర్చి క్రిందటిఅధ్యాయములో వివరించియుంటిమి. అ. భా. కాం. సం. వా రంగీకరించిన తీర్మానానుగుణముగా హిందూ, మహమ్మదీయసఖ్యమునుగూర్చి వారి రాజకీయహక్కులను వివరిస్తూ ఒకతీర్మానము చేయబడినది. బ్రిటిష్‌వస్తువుల బహిష్కారవిషయముకూడా చర్చింపబడినది. స్వరాజ్యవిధాన మొకటి తయారుచేయబడవలెనని తీర్మానింపబడినది. వెంటనే అనేక ప్రణాళికలు మహాసభాసమ్ముఖమునకు వచ్చినవి. వాటినన్నిటిని ఆలోచించుటకు కార్యనిర్వాహకసభ్యుల కధికార మీయబడినది. వా రితరులనుకూడా కలుపుకొని పనిచేయుట కంగీకరింపబడినది. కార్యనిర్వాహకసభ్యు లంగీకరించిన చిట్టచివరి స్వరాజ్యవిధానము ప్రత్యేకముగా సమావేశముచేయబడిన అఖిలపక్షమహాసభవారియెదుట ఆమోదమునకు పెట్టబడవలె నని తీర్మానింపబడినది. కాంగ్రెసునిర్మాణవిధానమునం దొకమార్పుచేయబడినది. ఆ కాంగ్రెసులోని ప్రధానతీర్మాన మీ క్రింద పూర్ణముగా నుదాహరింపబడినది:

## రాయల్ కమీషన్ బహిష్కారము

"బ్రిటిష్‌ప్రభుత్వమువారు భారతదేశముయొక్క స్వయంనిర్ణయాధికారమును సంపూర్ణముగా తృణీకరించి, రాజ్యాంగసంస్కరణములనుగూర్చి విచారించుట కొక కమిటీని నియమించినారు. కాబట్టి ఆకమిటీవారిని అన్నిపద్ధతులా, అన్నిసందర్భముల

లోను బహిష్కరించడమే భారతదేశమున కాత్మగౌరవకరమైన మార్గముగా ఈ కాంగ్రెసు తీర్మానిస్తున్నది. ముఖ్యముగా

(ఎ) భారతదేశములోని అన్ని కాంగ్రెసుసంస్థలును, అందరు ప్రజలును

i. భారతదేశమున కా కమిటీ చేరినరోజున ప్రతికూలప్రదర్శనములను దేశమంతటా జరిపింపవలెననీ, ఆకమిటీవారు పోవబోయే పట్నములన్నిటిలోనూ అటువంటి ప్రదర్శనములనే తప్పక చేయించవలెననీ,

ii. అన్ని రాజకీయపక్షములవారునూ ఆకమిటీవారిని బహిష్కరించేటట్లుగా ప్రచారముచేసి ప్రోత్సాహపరచవలెననీ ఈ కాంగ్రెసుమహాసభవారిచే కోరబడుతున్నారు.

(బి) భారతదేశములోని అందరు శాసనసభాసభ్యులును, రాజకీయనాయకులును, సంఘముల పెద్దలును, తదితరులును ఆకమిటీవారియెదుట సాక్ష్యమీయకూడదనీ, వారికి రహస్యముగాగాని, బహిరంగముగాగాని యేవిధమైన సహాయమును చేయకూడదనీ, వారి గౌరవార్థము జరిగే సమావేశములలో పాల్గొనకూడదనీ ఈకాంగ్రెసువారిచే కోరబడుతున్నారు.

(సి) హిందూదేశ శాసనసభలలోని అధికారేతరసభ్యులెవ్వరును

i. ఆకమిటీవారి రాకసందర్భమున నిర్మింపబడే ఉపసంఘములకు వోటుచేయరాదనీ, వాటిలో పనిచేయకూడదనీ,

ii. ఆకమీషన్‌వారి కార్యక్రమమునకు సంబంధించిన వ్యయముకొరకు ప్రతిపాదింపబడే ఏతీర్మానమును అంగీకరించక త్రోసివేయవలసిన దనీ ఈకాంగ్రెసుచే కోరబడుతున్నారు.

(డి) శాసనసభలోని అధికారేతరసభ్యులందరును, భారతదేశప్రయోజనములకు భంగకరముగానున్న దని కాంగ్రెసుకార్యనిర్వాహకసభ్యు లభిప్రాయపడే ఏదైనా ముఖ్యతీర్మానము నెదిరించుటకును, మంత్రివర్గమును పడగొట్టుటకును, రాయల్‌కమీషన్‌వారి బహిష్కారమును జయప్రదముగా కొనసాగించుటకును, శాసనసభలలోని తమ స్థానములను ఖాళీకాకుండా రక్షించుకొనుటకునుమాత్రమే శాసనసభలకు హాజరుకావలెనని ఈ కాంగ్రెసు కోరుతూన్నది.

(ఇ) ఆ కమిటీవారి బహిష్కరణమును సంపూర్ణముగా కొనసాగించుటకు వీలైనచోట్లలో ఇతరసంస్థలయొక్కయు, పక్షములయొక్కయు సహాయమునుకూడా పొందుట కీకాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమువారి కధికార మిస్తూన్నది.”

ఇక ఈ తీర్మానమునుగూర్చి మేము వేరుగా విమర్శింప నవసరములేదు. అన్నివిషయములును తీర్మానములోనే వివరింపబడినవి. ప్రజాభిప్రాయమునకు విరుద్ధముగా ప్రభుత్వమువారు కాకోరీకేసులో విధింపబడిన దీర్ఘశిక్షలను తగ్గించనందుకు ఈ కాంగ్రెసువారు విచారమును వెల్లడించిరి. ఆ కేసులో శిక్షింపబడిన ముద్దాయీల కుటుంబమునకు ఈ కాంగ్రెసు మహాసభవారు హృదయపూర్వకమైన సానుభూతిని ప్రకటించిరి.

తరువాత మరియొక ప్రత్యేక తీర్మానములో "భారతప్రజల ఆదర్శము సంపూర్ణ జాతీయస్వాతంత్ర్య మని ఈ కాంగ్రెసు ప్రకటిస్తూన్నది." అని కాంగ్రెసు సిద్ధాంతము మార్పుచేయబడినది. ఈ తీర్మానమునుగూర్చి ప్రతిసంవత్సరము తీవ్రమైన చర్చ జరుగుతూండేది. ఈ సంవత్సరము యూరపునుండి జవహరలాలునెహ్రూ వచ్చి ఈ తీర్మానమును బలపరచుటచే ఇది నెగ్గినది. బెసెంటుకూడ దీని కేమీ అభ్యంతరపెట్ట లేదు. భారతదేశముయొక్క ఆదర్శమునుగూర్చి స్పష్టీకరించిన ఈ ప్రకటనము గౌరవ ప్రదముగానున్నదని ఆమె విషయనిర్ధారణసభలో అభిప్రాయ మిచ్చెను. ఆ తీర్మాన మంగీకరింపబడినప్పుడు గాంధీ విషయనిర్ధారణసభలో లేడు. ఆసంగతి తరువాత ఆయనకు తెలియవచ్చినది.

౧౯౨౭ లోని చరిత్రను ముగించేలోపుగా గుజరాతువరదల సందర్భములో అక్కడి కాంగ్రెసువాదులు చేసిన అద్భుతసేవనుగూర్చి సంగ్రహముగా వ్రాయుట మావిధి. ౧౯౨౦ జూలైమాసాంతమున గుజరాతురాష్ట్రమునకు పెద్ద వరదలు వచ్చినవి. ఆకస్మికముగా ౪,౫ రోజులలో గుజరాతులోని చాలా ప్రదేశములలో ౫౦ దుక్కుల వర్షము కురిసినది. గ్రామములు కొట్టుకొని పోయినవి. ప్రజల పశువులు, ఇండ్లు, గుడిసెలు, ఆస్తులు అన్నీ తుడిచిపెట్టుకొనిపోయినవి. వేలకొలదీ ప్రజలు కట్టుకొనుటకు బట్ట, తినుటకు కూడు లేక అల్లాడసాగిరి. ఫలవంతమైన భూములన్నీ పంటలతోసహా కొన్ని అడుగుల ఎత్తున ఇసుకదిబ్బలు వేసిపోయినవి. జిల్లా ముఖ్యపట్టణములు మునిగిపోయినవి. రైలుమార్గములు, టెలిగ్రాఫు తంతులు తెగిపోయినవి. అహమ్మదాబాదు నగరమే నీటిలో మునిగిపోవ సిద్ధమైనది. ముఖ్యముగా ఇండ్లు చాలా కూలిపోయినవి. బరోడా రాష్ట్రము మొదలుకొని గుజరాతురాష్ట్రములోని అన్ని జిల్లాలలోను పడిపోయిన ఇండ్లకు మితిలేదు. కనీసము నాలుగువేల గ్రామములకైనా వరదలవలన నష్టముకల్గినదని అంచనావేయబడినది. కొన్ని గ్రామములలో నూటికి ౫౦, ౬౦, ౯౦ శాతమువరకూడా ఇండ్లు కూలినట్లు లెక్కవేయబడినది.

సాధారణముగా ఆపద లైకమత్యములకు కారణము లగును. అదేవిధముగా ప్రజలలో అదివరకు వ్యాపించియున్న సంఘద్వేషములును, గృహకల్లోలములును ఆ కష్టముతో రూపుమాసినవి. ఆ రోజులలో సర్దారు వల్లభాయిపటేలు గుజరాతురాష్ట్రీయ కాంగ్రెసుకమిటీ కధ్యక్షుడు; అహమ్మదాబాదుమునిసిపాలిటీకి మేయరు. గుజరాతు ప్రజ లాయననాయకత్వముక్రింద పరస్పరసహాయపద్ధతి నవలంబించి, ఆ మహాకష్టము నుండి తరింపఘగానుకొనిరి. తక్షణ మొక గుజరాతువరదల సహాయసంఘ మేర్పాటు చేయబడినది. ఒక్కరాత్రిలో దాదాపు ౨ వేలమంది ప్రజాసేవకులు తమసోదరులను కష్టములనుండి గట్టెక్కింప నడుముకట్టిరి. ప్రభుత్వాధికారుల కప్పటికింకా గుజరాతు వరదల స్వభావముగాని, దానివలన కలిగిన వినాశముగాని పూర్తిగా తెలియనే తెలియదు. వారు చేయవలసిన కార్యవిధానమునుగూర్చి పైనుండి వారి కేమీ ఉత్తరువులు రాలేదు. కాని అప్పటికప్పుడే కాంగ్రెసుయంత్రము పూర్తిగా పని ప్రారంభించెను.

గాంధీ అప్పుడు మైసూరురాజ్యములో ఆరోగ్యముకొరకు నిలిచిపోయెను. ఈ మాట ఆయన కాకస్మికముగా తెలియవచ్చినది. ఆయన గుజరాతు పోవ ప్రయాణమయ్యెను. కాని సర్దారు వల్లభాయిపటేలు గాంధీ రాకుండానే, ఆయనరాష్ట్ర మేవిధముగా ఆయనబోధల ననుసరించి సాంఘికసేవ చేస్తున్నదో ప్రపంచమునకు ప్రదర్శింపవలెనని పట్టుపట్టి గాంధీని రావలదని కోరెను. గుజరాతులోని కాంగ్రెసువాదు లందరికీ ఆయన సేవాతత్పరత్వమును ప్రబోధించెను.

కాంగ్రెసువాదులును, ప్రచారకులును ఆ నీటిమయములైన ప్రదేశముల దాటి మునిగిపోయిన గ్రామముల కాహారపదార్థముల నీయదొడగిరి. ప్రభుత్వాధికారులు కూడా చాలామంది ఈ దుస్థితిలోనే ఉండిరి. వారికికూడా కాంగ్రెసు వలంటీర్లు సంపూర్ణ సహాయము చేసిరి. ఆ రక్షణసందర్భమున వారు రాజకీయభేదములను గమనింపలేదు. ఖైరాజిల్లా మేజస్ట్రేటుకు కొన్నిరోజులవరకూ ప్రపంచకముతో సంబంధము లేదు. సర్దార్ పటేలు కాంగ్రెసువలంటీర్ల ద్వారా పంపిన ఆహారపదార్థములను ఆయన కృతజ్ఞతాపూర్వకముగా అందుకొనెను. కొన్నివారముల వరకును ప్రభుత్వయంత్రము కూలపడినది. జిల్లాఅధికారులు తమక్రింది ఉద్యోగుల దిగ్గరనుండి నివేదికల కెదురుచూస్తూ కూర్చొనిరి. కొన్ని ప్రదేశములకు పోవుటకే నీలులేవని ప్రభుత్వాధికారులచే భావింపబడినది. కాని మారుమూలగ్రామములలోని ప్రజలకుకూడా కాంగ్రెసు వాలంటీర్లాహారపదార్థము లిచ్చి సహాయము చేయగలిగిరి. సేవాతత్వ మలవడిన తెలివితేటలుగల ప్రజలు స్వయంసహాయ పరస్పరసహాయములను ప్రకటించిన అద్భుత దృశ్య మది.

కాని అప్పుడు జరిగిన నష్టమును పూరించుట ఏ ప్రజాసంస్థకును సాధ్యమైనపనిగా తోచలేదు. ఆహారపదార్థములు సప్లయిచేయుటవంటి తాత్కాలికపరిహారములు జరిగి నవి. కాని నాశమైపోయిన పైరులను తిరిగీ నాటుటకును, ఇసుకదిబ్బలు వేసిపోయిన భూములను మరామతు చేయించుటకును, పడిపోయినయిండ్లను తిరిగీ కట్టించుటకును మార్గము లన్వేషింపబడవలసివచ్చెను. ఈసమస్య ప్రజలకూ, ప్రభుత్వమునకూ కూడ కష్ట తరమైనది. తిరిగీ నాట్లతరుణము గడచిపోతూండెను. ప్రభుత్వమువారేమేమో ఆలో చిస్తూండిరి. ఏవో అభ్యంతరములు పెడుతూండిరి. కాని సర్దారుపటేలునాయకత్వము క్రింద గుజరాతురాష్ట్రములోని మేధావంతు లాందోళనచేసి రు. ౧,౫౮,౦౦,౦౦౦ లను ప్రభుత్వమువారిచే గుజరాతు వరదలసహాయనిధికి ప్రత్యేకింపచేసిరి. ఈసొమ్మును వ్యవసాయకులకు సహాయముగా పంచిపెట్టుటకును, వ్యవసాయపరికరములను, ఎడ్లను, గృహసామగ్రిని కొనుక్కొనుటకు ఋణములకింను వ్యయముచేయ నిర్ణయింపబడి నది. గుజరాతువరదలసందర్భమున సహాయముచేయనేర్పడిన బొంబాయికేంద్రసహాయ సంఘమువారితో కలసి గుజరాతురాష్ట్రీయ కాంగ్రెసుసంఘమువారు తరువాత కొన్ని మాసములవరకును నష్టపడినప్రజలకు సహాయముచేయ ప్రారంభించిరి. ఆవిషయములో గుజరాతుకాంగ్రెసునిర్మాణము చాలా బాగా పనిచేసినది. అన్ని సహాయకసంఘ ములును కాంగ్రెసుసంస్థద్వారానే తమ సహాయములను ప్రజల కందించిరి. చిట్టచివరకు ప్రభుత్వమువారుకూడ కాంగ్రెసునిర్మాణము నుపయోగించుకొనిరి. ఆనందులోను, నడి యాడులోను బొంబాయిప్రభుత్వమువారు వరదలసహాయమునిమిత్తము సభలు జరిపిరి. ఆసభలకు సర్దారుపటేలును, తదితర కాంగ్రెసుప్రచారకులును ఆహ్వానింపబడిరి. అప్పటి ఆర్థికసభ్యుడు సర్ సి. వి. మెహతాపట్టుదలవలన ప్రభుత్వమువారు కూడా కాంగ్రెసుద్వారానే తమసహాయమును ప్రజలకు చేకూర్చుట కంగీకరించిరి. గవర్నమెం టువా రిచ్చినసొమ్ముగాక కాంగ్రెసువారును, తదితర అధికారేతర సంఘములును దాదాపు ౩౦ లక్షలరూపాయలను వసూలుచేసిరి. బొంబాయి ప్రభుత్వమువారు, కాంగ్రెసువారు, బరోడాసంస్థానమువారు ఈ అందరూకూడ దాదాపు ఒకసంవత్సర కాలమువరకు కాంగ్రెసునాయకత్వమున గుజరాతురాష్ట్ర పునర్నిర్మాణకార్యములో నిమగ్నులయిరి. ఆనాడుచేసిన పనివలన గుజరాతుయువకులకు మంచిశిక్షణము కలిగినది. గుజరాతుప్రజలహృదయములలో ఆత్మవిశ్వాసమును, ఆశాకిరణమును ప్రజ్వరిల్లినవి. తరువాత సమావేశమైన బొంబాయిశాసనసభలో బడ్జెటును ప్రవేశపెట్టి, ఆర్థికసభ్యుడు కాంగ్రెసును, ఆ సంస్థకు మహానాయకుడైన మహాత్మాగాంధీని శ్లాఘించినవిధానము మనకు చాలా సంతోషదాయకముగా నుండగలదు: "ఆతక్షణము చేయవలసినపనికి ధైర్యము, చురుకుదనము, వివేకము కావలసియుండెను. అనేకమంది ఉత్సాహవంతులైన

వాలంటీర్లు బాధితులయిన, దిక్కులేని ప్రజలకు సంతోషముతో అన్నవస్త్రములను మోసుకొనిపోయి పంచిపెట్టిరి. అనేకసందర్భములలో వా రెంతమంది ప్రాణములనో సంరక్షించిరి. ఆవిషయమునుగూర్చి మనము శ్లాఘించవలసియున్నది.

"వ్యాపారములో మునిగిపోయిన గుజరాతు రాష్ట్రమునకు మొన్న మొన్నటివరకు స్వార్థత్యాగమును గూర్చిగాని, ప్రజాసేవనుగూర్చిగాని తెలియనే తెలియదు. ముఖ్యముగా గ్రామములలో అనేకమంది స్వార్థత్యాగులయిన వాలంటీర్లు సాంఘిక సేవ చేయుటకు బయలుదేరిరి. చాలామంది గుజరాతువిద్యాపీఠమునుండి వచ్చిరి. తలవనితలంపుగా వచ్చిన ఈ ఆపత్తువిషయములో వారి ప్రేమాస్పదుడైన నాయకుడు దగ్గరలేనప్పటికూడా ఆవలంటీర్లందరును ఇంతశ్రద్ధగా పనిచేసినందుకు గాంధీమహాత్ముడు మిక్కిలి సంతోషకరముగా నుండగలడు. ఆయనశ్రమఫలితముగానే ఇంతమంది సేవాతత్పరులు గుజరాతులో సృష్టింపబడిరి. వల్లభాయిపటేలు ఆయనఅనుగుణాలనే నడచి, ఈ కార్యక్రమము నత్యుత్సాహముతో జరిపించెను. ఇది అందరికీ తెలిసిన విషయమే. ఈ కాంగ్రెసుప్రచారకు లందరును పూర్వకాలపు నోచేంజర్ల తరగతికి చెందినవారు. అయినప్పటికీ వా రీసమయములో ప్రభుత్వమునకు వైరులగయుండుట గాని, ప్రభుత్వమువారి నెదిరించుటగాని తగనిపని అని తలచినందుకు నాకు సంతోషముగా నున్నది.

"గాంధీమహాత్మునిచేసృష్టింపబడిన ఈ సాంఘికసేవాతత్పరత్వము గుజరాతులో శాశ్వతముగా నుండగలదనని ఆశిస్తున్నాము." అని బొంబాయి ఆర్థికసభ్యు డుపన్యసించెను.

ఈ విధముగా గుజరాతు వరదలకథ సంతోషాంతముగా పరిణమించినది. ఈ ఆపద గుజరాతుకు మారురూపములో వచ్చిన అదృష్ట మని భావింపబడినది.



ఆర్. ఎన్. మధోల్కార్

బంకిపూరు : 1912



భూపేంద్రనాథ్ బాసు

మద్రాసు: 1914

# 9. కాంగ్రెస ప్రతిసమర్పణము

## ౧౯౨౮

[సైమన్ కమీషన్ బహిష్కారము-సైమన్ బహిష్కార ఫలితములు-లాహోరు - లక్నో- పాట్నా - బహిష్కారపద్ధతి - అఖిలపక్షసమావేశము-మూడు తీవ్రసమస్యలు- (౧) పండితుడు కలకత్తా కాంగ్రెసు కధ్యక్షుడగుట - (౨) కలకత్తా వస్తుప్రదర్శనరూపము మాటట, (3) బార్డోలీరైతులు-బార్డోలీపోరాటము - కాంగ్రెసు నాయకత్వము కోరబడుట - శరపరంపరలుగా జప్తులు - ప్రెసిడెంటు పటేలు బెదరి పు-ప్రభుత్వమువారి ఆడంబరము-రాజీ - సప్రహానివేదిక - తిరిగి కౌన్సిలు [illegible]గము - రిజర్వుబ్యాంకుబిల్లు - పబ్లిక్ సేఫ్టీబిల్లు - కలకత్తాకాంగ్రెసు - అధ్యక్షోపన్యాసము - పండితుని ఉపన్యాసము - తీర్మానములు - స్వదేశిసంస్థాపనములనుగూర్చిన తీర్మానము-ప్రభుత్వమువారికి హెచ్చరిక - జాన్సన్ ప్రవాసమునుగూర్చి నిరసనము-నవయౌవనోద్యమము - ప్రధానతీర్మానము - గాంధీని ఆహ్వానించుట - గాంధీ ఉపన్యాసము - అఖిలపక్షసమావేశము - విషాదకరమైన అపజయము - అ. భా. కాం. సం. కౌన్సిలుపక్షమును మందలించుట - గాంధీకి విసుగుపుట్టినది కాని యూరపుప్రయాణము మానివేసెను - ఆయన కనుచరులలో నమ్మకము పోలేదు.]

సైమన్ కమీషన్ నియామకమూలమున ప్రభుత్వమువారిపైన ప్రజలకు కలిగిన అసంతృప్తితో ౧౯౨౮ సంవత్సరపు ప్రారంభదశలోని రాజకీయవాతావరణము నిండియున్నది. దేశమంతటా సైమన్ బహిష్కారమునుగూర్చియే ఆలోచనలు జరుగుచుండెను. సైమన్ కమీషన్‌నుగూర్చి ఇర్విన్ప్రభు వీక్రిందివిధముగా ప్రకటించెను: "బ్రిటిష్ప్రభుత్వమువారు కమీషన్‌వారనుసరింపవలసిన కార్యవిధానమునుగూర్చి యేమియు నిర్ణయించలేదు. కాని కేంద్రశాసన సభలోని అధికారేతర సభ్యులనుండి ఒక ఉపసంఘు (Joint Select Committee) ఎన్నుకొనబడి, సైమన్ కమీషన్‌వారికి సాక్ష్యములను పుచ్చుకొనుటలో సహాయము చేసేయెడల వారి

పని చాలా తేలికకాగలదని బ్రిటిష్‌ప్రభుత్వమువారి అభిప్రాయము. కేంద్రశాసనసభ నుండి యెన్నుకొనబడిన జాయింటు సెలెక్టుకమిటీవారు వారి ఇష్టమువచ్చినరీతిని తమ అభిప్రాయములను సైమన్‌కమిటీవారికి తెలియపరచవచ్చును." ఈపద్ధతివలన ఇండియన్ కమిటీవారికి (కేంద్రశాసనసభనుండి ఎన్నుకొనబడిన ఉపసంఘసభ్యులు) సాక్ష్యములను వినే అధికార మున్నదేగాని తీర్పుచెప్పే అధికారము లేదు. వారు అసెసర్లుగా నుండిరేగాని జూరర్లుకారు.అది భారతదేశమున కవమానకరముగా భావింపబడినది.కాని బ్రిటిష్‌ప్రభుత్వమువారు భారతదేశముయొక్క గౌరవమునకు భంగము కలిగించవలెనని గాని, బుద్ధిపూర్వకముగా భారతదేశమున కవమానము కలిగించవలె ననిగాని ఉద్దేశించలేదని ఇర్విన్‌ప్రభు వెంతోదూరము చెప్పెను. అంతటితో ఊరుకోక భారతీయులు సహాయము చేసినప్పటికీ, చేయకపోయినప్పటికీ సైమనుకమిటీవిచారణ జరిగితీరుననీ, వారు పంపిన నివేదికపైన పార్లమెంటువారు వారికి తోచినవిధముగా చర్య తీసుకొనితీరెదరనీ ఫిబ్రవరి ౨ వ తేదీని వైస్రాయి ప్రతిజ్ఞచేసెను. ౩ వ ఫిబ్రవరిని సైమన్‌కమీషన్ బొంబాయి చేరినది. వారు వచ్చినరోజున యావద్భారతదేశమునందును హరతాళము జరిగినది. అంతకన్న విశేషమేమియు లేదు. కానిమద్రాసులోని జనసమూహము హైకోర్టుకడ ఏదో అపాయము కలిగింతురని భావింపబడినది. దురదృష్టవశమున అంతగా అవసరము లేకపోయినప్పటికీ పోలీసులు తుపాకులను కాల్చిరి. తత్క్షణ మక్కడనే ఒకడు మరణించెను. తరువాత మరిఇద్దరు మరణించిరి. కలకత్తాలో విద్యార్థులకును, పోలీసువారికిని కయ్యము జరిగినది. సైమన్‌కమిటీవారు మొట్టమొదట ఢిల్లీని దర్శించవలసియుండెను. సైమన్ కమీషన్ దేశములో అడుగుపెట్టినరోజున, ఢిల్లీలో "సైమన్, తిరిగిపో!" అనేమాటలుగల అట్టలతో పెద్ద పెద్ద ప్రతికూలప్రదర్శనములును, ఉత్సవములును జరుపబడినవి. దక్షిణ భారతదేశములో జస్టిస్‌పక్ష మనేపేరుతో వ్యవహరింపబడుతూన్న 'సౌతుఇండియన్ లిబరల్ ఫెడరేషన్' వారున్ను, కొన్ని మహమ్మదీయసంఘములవారున్ను తప్ప తక్కినవారంతా సైమన్‌కమీషన్‌ను పూర్తిగా బహిష్కరించిరి.

సైమన్ బహిష్కారమునందు కాంగ్రెసుకు కలిగిన మహోవిజయమునకు ఉడికిల్లి, ప్రభుత్వమువారు ప్రజలను భయభ్రాంతులుగా చేయుటకును, నిర్బంధించుటకును పూనిరి. లాహోరులో సైమన్ కమీషనుకు ప్రతికూలముగా లాలాలజపతిరాయి నాయకత్వముక్రింద వేలకొలదిజనులు బహిష్కారోత్సవమునందు పాల్గొనిరి. అప్పుడు పోలీసువారు కొందరిని చేయిచేసికొనిరి. అనేకమంది గౌరవనీయులైన నాయకు లావిధముగా లాఠీదెబ్బలతో అవమానింపబడిరి. ఆసందర్భములో లాలాజీకికూడ పోలీసు లాఠీదెబ్బలు తప్పలేదు. ఆయన త్వరగా మరణించుటకు పోలీసువారి లాఠీదె

కారణ మని కొందరివిశ్వాసము. బహిరంగముగా నిట్టి నిందారోపణము చేయబడుచుండినా న్నప్పటికీ ప్రభుత్వము వారు నిష్పాక్షికమైన విచారణచేయ నిరాకరించిరి.

లక్నోలోకూడ సైమన్ కమీషన్ సందర్శనసందర్భమున నిరాయుధు లైన శాంతియుత ప్రజాసమూహములపైన అనవసరముగా పోలీసువారి లాఠీచార్జీలు చేయబడినవి. సంయుక్తరాష్ట్రముల పోలీసువారి చేతులలోనుండి జవహరలాల్ కూడా తప్పించుకొని పోలేకపోయెను. పోలీసుకాల్బలములును, అశ్వికదళములును కూడా తమ బెత్తములను, లాఠీలను నుపయోగించుటలో తమ తెలివితేటలను ప్రదర్శించిరి. అన్ని రాజకీయపక్షములలోని సుప్రసిద్ధ ప్రజాసేవకుల వీపులపైనను, తలల పైనను పోలీసులాఠీలున్నూ, బెత్తములున్నూ నృత్యముచేసినవి. అనేకమందికి గాయములు పడినవి.

లక్నోనగరము కేవలము పోలీసువారి సాయుధ శిబిరముగా చేయబడినది. వేల కొలది అశ్వికులును, పోలీసు కాల్బలములును వాల్గురోజులవరకును ప్రజలయెడ మొరటుగా ప్రవర్తించిరి. అనేకమంది వ్యక్తుల ఇండ్లు పోలీసువారిచే ముట్టడి వేయబడినవి. గౌరవనీయులైన జాతీయప్రచారకు లనేకులు పోలీసువారిచే కొట్టబడిరి. "సైమన్, తిరిగిపో" అని అరచినందు కనేకమంది అరెస్టు చేయబడిరి. లక్నో ప్రజలు పోలీసువారి ఈపసుకృత్యములకు లొంగిపోలేదు. వారి ప్రతికూలప్రదర్శనము లంతకంతకు హెచ్చయినవి. అధికారులు ఈపిచ్చిధోరణివలన నగరప్రజల నవ్వుబాటులకు గురియైరి. కొందరు తాలూకాదారులు సైమన్‌కమీషన్‌కు కెయిజర్‌బాగ్‌లో అల్పాహారవిందుచేసిరి. ఆసందర్భమున వేలకొలది పోలీసువారు కెయిజర్‌బాగ్ చుట్టును కాపలా కాచిరి. ఆబాగ్‌కు దగ్గరగానున్న పట్లకుర్రోడ్లచెంత జేరుటకు కూడ బహిష్కారవాదిగా అనుమానింపబడినవానికి వీలు లేకుండెను. ఇన్ని జాగ్రత్తలు తీసికొన్నప్పటికీ 'సైమన్, తిరిగిపో', 'భారతదేశము భారతీయులదే' అనేమాటలుగల నల్లని గాలిపటములును, గాలిబుంగలును ఆకాశముపై నెగిరి, అవిందుయొక్క శోభకు భంగము కలిగించినవి.

పాట్నాలో సైమన్ ప్రతికూలోత్సవసందర్భమున ౨౦ వేలమంది జనులు మూగిరి. కాని వారు నగరమునకు చేరినప్పుడు వందమందిలోపుగా వారి నాహ్వానించిరి. అందులో చాలామంది ప్రభుత్వోద్యోగులు, చప్రాసీలే. ప్రభుత్వమువారు ప్రక్కనున్న పల్లెటూర్లలోనుండి రైతులను లారీలమీద తీసికొనివచ్చిరి. వా రందరు పరాసరి పోయి బహిష్కారోత్సవములో పాల్గొనిరి. పస్వాగతోత్సవమునకుపోయినవారెక్కడ లేదు. రైలుస్టేషన్‌దగ్గర అతిప్రశాంతముగా [illegible]

సమూహామునకున్నూ, సన్మానసంఘమునకున్నూ కనిపించినభేదమే ప్రభుత్వమువారి కనులను తెరిపించెను.

మద్రాస్ కాంగ్రెసు సైమన్‌బహిష్కార సందర్భమున శాసనసభలలో చేయవలసిన పనినిగూర్చి చాలా తక్కువగానే నిర్ణయించినది. అయినప్పటికీ ఈపని జరిగించుటలోకూడా చాలా చిక్కులు తటస్థించినవి. మద్రాసు కాంగ్రెసు తీర్మాన మీవిషయములో ఆచరణలోకి రాలేదనియే చెప్పవచ్చును. చిట్టచివరకు భారతశాసన సభలోను, రాష్ట్రీయశాసనసభలలోను గల కాంగ్రెసుసభ్యుల కింకా యెక్కువ స్వేచ్ఛ ఈయబడవలెనని కాంగ్రెసుకార్యవర్గమువారు అ. భా. కాం. సం. వారికి సిఫారసు చేసిరి. అ. భా. కాం. సం. వా రా సిఫారసు నంగీకరించిరి.

సర్ జాన్ సైమన్ మార్చి ౩౧ వ తేదీని తిరిగీ బొంబాయిరేవు విడిచెను. ఆయన భారతదేశములో పర్యటనము చేసినంతకాలము "వివిధ సంఘములతోను, వివిధ తరగతులవారితోను పరిచయము చేసికొంటి" నని చెప్పెను. ఈమాట ప్రభుత్వమువారి నివేదికకే విరుద్ధముగా నున్నది. ప్రభుత్వమువారి నివేదికలో "భారతశాసన సభలోని నాయకులు అధికారరీత్యానే కాకుండా సాంఘికముగాకూడ సైమన్ కమీషన్‌ను బహిష్కరింప ప్రతిజ్ఞపట్టిరి." అని వ్రాయబడెను. కాబట్టి సర్ జాన్‌గాని, ఆయన సహోద్యోగులుగాని వారితో పరిచయము కలుగచేసికొనిరనుట అసంభవము.

సైమన్‌కమీషన్ ఇండియాకు చేరినవెంటనే, ఫిబ్రవరి ౬ వ తేదీని, వైస్రాయికి సర్ జాన్ ఒక ఉత్తరము వ్రాసెను. అది ౭ వ తేదీని ప్రచురింపబడినది. అందులో కేంద్రశాసనసభలోనుండి ఎన్నుకొనబడిన ౭ గురు సభ్యులును, సైమన్ కమిటీసభ్యులు ౭ గురును కలసి సమష్టిసభగా వ్యవహరింపబడుననీ, అన్ని సాక్ష్య సాధనములును అందరు సభ్యులకును అందుబాటులో నుండుననీ, భారతసభ్యులు సీమనుండి వచ్చిన సభ్యులతో సమానప్రతిపత్తి కలిగియుందురనీ ఉదాహరింపబడెను.

రాష్ట్రీయశాసనసభలుకూడా అటువంటి ఉపసంఘముల నెన్నుకొనవలె నని కోరబడెను. కేంద్రవిషయములు చర్చింపబడినప్పుడు కేంద్రశాసనసభనుండి యెన్నుకొనబడిన ఉపసంఘమువారు పాల్గొనుటకును, రాష్ట్రీయవిషయములు చర్చింపబడినప్పుడు ఆ యా రాష్ట్రీయ శాసనసభల ప్రతినిధులు పాల్గొనుటకును ఏర్పాటు చేయబడెను. కాని బ్రిటిష్‌కమీషనరులు వారినివేదికలను ప్రత్యేకముగా బ్రిటిష్ ప్రభుత్వమునకు పంపుటకును, ఇండియన్ జాయింటుకమిటీవారు కేంద్రశాసనసభకు పంపుటకును నిర్ణయింపబడెను. ఈ ప్రకటనమువలన కూడా ప్రయోజనములేక పోయెను. ఎవరున్ను దీనికి తగిన సానుభూతి చూపినవారు కనపడలేదు. ఇది ప్రక

టింపబడిన ౨, 3 గంటలలోనే భారత రాజకీయనాయకులు ఢిల్లీలో సమావేశమై తాము కమీషన్‌నుగూర్చి పెట్టిన అభ్యంతర మాలాగేఉన్నదనీ, కాబట్టి యేసందర్భము లోనూ, ఏ విధముగానూ సైమనుకమిటీతో తమకు సంబంధము లేదనీ ప్రకటించిరి. భారతశాసనసభవారు సెంట్రల్ కమిటీప్రతినిధుల నెన్నుకోవలెననే విషయమునే మరచిపోయిరి. పైగా ఫిబ్రవరి ౧౬ వ తేదీని లాలాలజపతిరాయి సైమన్ కమిటీవారి నిర్మాణమున్ను, కార్యవిధానమున్ను భారతశాసనసభ కనంగీకారముగా నున్నదికాబట్టి వారితో ఎప్పుడూ ఏవిధమైన సంబంధమూ పెట్టుకొనకూడదని తీర్మానమును ప్రతి పాదించెను. దీనికి పండితమోతీలాల్ నెహ్రూ ఒక చక్కనివ్యాఖ్యానము చేసెను. ఈ తీర్మానములో బ్రిటిష్ కమిటీని నియమించినట్లే భారతీయులనుకూడా రాజుగారు నియ మింపవలసినదే నను భావము కలదని ఆయన యభిప్రాయ మిచ్చెను. ఆ తీర్మానము ౬౮ ఓట్లతో నెగ్గినది. దానికి ప్రతికూలముగా ౬౨ ఓట్లువచ్చినవి. కాబట్టి ప్రభుత్వము వారు సెంట్రల్ కమిటీకి భారతశాసనసభనుండి సభ్యులను నియమించిరి. సైమన్ కమిటీ వారు బొంబాయిని దర్శించినప్పుడు బొంబాయినగరములోనున్న ౨౨ మంది సర్ బిరుదాంకితులలో ఒక్కరుకూడా వారివంక కన్నెత్తి చూడలేదు.

శాసనసభల వోట్లుకంటెను, కొన్ని సంఘములు వారికి చూపిన సానుభూతికం టెను ఈ పైవిషయ మొక్కటే సైమన్ కమిటీవారికి జరిగిన బహిష్కార స్వరూప మును కనులకు కట్టినట్లు చూపగలదు. మాటవరస కింకొకసంగతి చెప్పవలసియున్నది. సైమన్ కమిటీవారిలో బ్రతుకుతెరు వెరిగిన కొంతమంది సభ్యులకు ఈ రాజకీయముల గోలే పట్టలేదు. వారు భారతదేశ వర్తకవ్యవహారములనుగూర్చి, బజారుధరలనుగూర్చి తెలిసికొన ప్రారంభించిరి. బరన్ హామ్ ప్రభువు ఇండియా బ్రిటిష్ దేశములమధ్య వర్తకవ్యవహారములు సాగుటకు మంచి అవకాశములు కల్పింప వాగ్దానము చేసినట్లుగా పాంచాలరాష్ట్రవాసులు భావించిరి. బరన్ హామ్ ప్రభువు బ్రిటిష్ మోటారుకారులను లారీలను ఇండియాకు ఎగుమతిచేయుటకు చాల అవకాశముకలదని అభిప్రాయమిచ్చెను. "ఇండియాలోని వ్యాపారపద్ధతులను తెలుసుకొనవలెనన్నయెడల కేవలము ఏజెంట్లు పనికిరారు. భారతజాతి మనోభావములను సరిగా గ్రహించగలిగినవారుమాత్రమే అందుకు పనికివత్తురు" అని కూడా ఆయన చెప్పెను.

౧౯౨౮ నాటి ముఖ్యవిషయములు సైమనుకమీషన్‌వారి సంచారము, అఖిల పక్షసమావేశము, బార్డోలీ ఉద్యమములు. కాంగ్రెసు తీర్మానానుసారముగా ౧౯౨౮ ఫిబ్రవరినెలలోను, మార్చినెలలోను అఖిలపక్షసమావేశము జరుపబడెను. ఆసభకు హాజరైన అన్నిపక్షములవారును "సంపూర్ణబాధ్యతాయుతప్రభుత్వ" సిద్ధాంతముపైననే భారతరాజ్యాంగచట్టము నిర్మింపబడవలెనని ఏకగ్రీవముగా నంగీ

కరించిరి. ఇక రెండవవిషయము వివిధసంఘముల ఐకమత్యమునుగూర్చి, వారికి శాసనసభలలో రావలసిన స్థానములనుగూర్చి. ఆ రెండునెలలలోను అఖిలపక్షసభవారు ౨౫ పర్యాయములు సమావేశమైరి. అక్కడ చర్చింపబడిన అంశములలో ముప్పాతికభాగము అందరి సమ్మతిమీదనే నిర్ణయింపబడినవి. మూడవసభ డాక్టరు అన్సారీ అధ్యక్షతక్రింద మే ౧౯ వ తేదీని జరిగినది. ఆసభలో ౧౯౨౮ జులై ౧ వ తేదీవాటికి రాజ్యాంగనిర్మాణమునకు కావలసిన సిద్ధాంతములను తయారుచేసేనిమిత్తము పండిత మోతీలాల్ అధ్యక్షతక్రింద ఒక ఉపసంఘము నియమింపబడినది. ఆ ఉపసంఘమువారు తయారుచేసిన చిత్తుచట్టమును వారు దేశములోని వివిధసంఘములకును పంపవలెననికూడా తీర్మానింపబడినది. ఆ తీర్మానమున కనుకూలముగా ౭౯ రాజకీయ సంస్థలు వోటుచేసినవి. దానినిగూర్చి తరువాతి వ్రాసెదము.

జూన్ మధ్యలో మనము తెలిసికొనవలసిన విషయములు మూడుజరిగినవి. అప్పటికి రాబోయే కాంగ్రెసు కలకత్తాలో జరుగవలసి యుండెను. పండితమోతీలాలు నెహ్రూ దాని కధ్యక్షత వహించునని అందరూ చెప్పుకొనసాగిరి. ఆ వాడుకనుబట్టి ఆయన యెంపైర్ పార్లమెంటరీ ప్రాతినిధ్యమునకు రాజీనామానిచ్చెను. క్రిందటి మార్చి, నెలలో ఆయన ఆపదవికి భారతశాసనసభచే నెన్నుకొనబడెను. పండితుడు తన రాజీనామాకు రాజకీయకారణములు గలవని సూచించెను. "వంగరాష్ట్రము పెద్దనెహ్రూ ప్రెసిడెంటుకావలెనని కోరుతూన్నది. ఆయన గౌరవప్రదమైన రాజీకి మంచిమనిషి. దేశ మందు కెదురుచూస్తూన్నది. దేశ మదేచిత్తవృత్తిలోనున్నది. కాబట్టి ఆయనే అధ్యక్షుడుగా నుండుట మంచిది." అని గాంధీకూడ చెప్పెను. రెండవది కలకత్తాకాంగ్రెసు సందర్భమున ఏర్పాటుచేయబడే వస్తుప్రదర్శనమును గూర్చినది. ఆవిషయములో కలకత్తాలో వాదప్రతివాదములు చెలరేగినవి. వస్తుప్రదర్శనసంఘ (Exhibition) కార్యదర్శి ఎస్. ఆర్. సర్కారు ఇండియాలో తయారుచేయబడిన అన్నివస్తువులును ప్రదర్శింపబడవలెనని చెప్పెను. ఖద్దరుకు ప్రాముఖ్య మీయబడుననికూడా ఆయనతెల్పెను. భారతదేశపు మిల్లుబట్టల విషయముకాని, మిల్లునూలుబట్టల విషయముగాని ప్రదర్శింపబడవలెనా, లేదా అను చర్చవచ్చినది. మన జాతీయైశ్వర్యమునకు తోడ్పడదగిన విదేశీ పరికరములును, యంత్రములును తప్ప తక్కిన విదేశీవస్తువు లేవీ ప్రదర్శింపబడవనికూడ ఆయన ప్రకటించెను. రాష్ట్రీయ పారిశ్రామికాధికారులచే తయారుచేయబడిన స్వదేశీ స్తువు లంగీకరింపబడునని ఆయనచెప్పెను. ప్రభుత్వమువారినుండి యేవిధమైన ధనసహాయమును గ్రహింపబడదనికూడా ఆయన వ్యక్తపరచెను. ఈ ప్రకటనముచూచి పూర్వాచారపరాయణులైన సహాయనిరాకరణవాదులు గగ్గోలుపెట్టిరి. సోదేపూర్లోని ఖద్దరు ప్రతిష్ఠాననిర్మాత బాబూ సతీశ చంద్రదాసుగుప్తాయున్ను, ఆయన

సోదరుడున్ను తీవ్రమైన ప్రతిఘటనములను గావించిరి. సకాలములో వారు ప్రతిఘటించి నందువలన అన్నివ్యవహారములును సరిగా జరిగినవి.

మూడవ విషయము చాలా ఉత్సాహకరమైన విషయము. అది బార్డోలీరైతులకు సంబంధించిన విషయము. బార్డోలీరైతులు మంచిపోరులు. గాంధీ సమష్టిశాసనోల్లంఘనమును ప్రారంభింపదలచుకొన్న దీబార్డోలీతాలూకాలోనే. రెండుమూడుసార్లు లా పన్నుల నిరాకరణప్రయత్నము వాయిదావేయబడి చిట్టచివరకు ౧౯౨౨ ఫిబ్రవరిలో పూర్తిగా మానివేయబడినది. శాసనోల్లంఘనమునాపివేస్తూ ౧౯౨౨ ఫిబ్రవరి ౧౧,౧౨ తేదీలలో చేయబడిన కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమువారి తీర్మానము లీ బార్డోలీకి సంబంధించినవే. బార్డోలీ కప్పుడు దక్కవలసిన ప్రతిష్ఠ దక్కకపోవుట మూలమున కొంత కళంకమువచ్చినది. అకళంకము నిర్మూలింపబడవలెనని దైవేచ్ఛయైయుండును. బార్డోలీతాలూకాలో ప్రతి ౨౦ సంవత్సరములకో, లేక 3౦ సంవత్సరములకో రీసెటిల్‌మెంట్లు జరుగుతూండేవి. అవి జరిగిన ప్రతిసారీ నూటికి ౨౫ వంతున భూమిశిస్తు పెంపుకావడ మలవాటు. ఆ పన్నులు న్యాయముగా హెచ్చింపబడరాదని బార్డోలీ రైతుల తలంపు. ఎందువల్లననగా వారు కష్టపడి సొంతసొమ్ము వెచ్చించి భూములను బాగుచేసుకొన్నందువలన పంట అభివృద్ధి అయినదేకాని ప్రభుత్వ ప్రయత్నములవలన కాలేదని వారి వాదము. కాని వారు పన్నులు హెచ్చింపబడరాదని చెప్పలేదు. ప్రభుత్వమువా రొక నిష్పాక్షికమైన కమిటీని నియమించి, ఆతాలూకాలోని కార్మికపరిస్థితులను, రోడ్ల సౌకర్యములను, ధరల హెచ్చుతగ్గులను, ఆర్థికవిషయములను, పన్నులపద్ధతి వీటన్నిటినీ విచారణ చేయించవలసినదని వారు కోరిరి. రీసెటిల్‌మెంట్ల విషయములో ప్రభుత్వమువారు మామూలుగా నిరంకుశపద్ధతిని వారి పక్షమునుండి రహస్యముగా లెక్కలను తయారుచేయింతురు. వారార్థికవిచారణలుచేసేటప్పుడు ప్రజలకేమీ తెలియనీయరు. సెటిల్‌మెంటు ఉద్యోగస్థులు రెవిన్యూబోర్డువారికి వ్రాసిన నివేదికలను గాని, రెవిన్యూబోర్డువారు ప్రభుత్వమునకు చేసిన సిఫార్సులనుగాని వారెన్నడూ ప్రకటించరు. ఒకవేళ ప్రకటించడమే తటస్థించేయెడల ఇంగ్లీషుభాషలో ప్రకటింతురే గాని ఆయాప్రదేశములకు సంబంధించిన రాష్ట్రభాషలలో ప్రకటింపనే ప్రకటింపరు. బార్డోలీ రైతులు నూటికి ౨౫ రూపాయీల చొప్పున యెక్కువ భూమిశిస్తు ఇచ్చుకొనవలసివచ్చినది. మామూలుగా రైతులు నడిపే అర్జీలు, రాయబారాలు మొదలగు కర్మకాండంతా బార్డోలీ రైతులునూ నడిపిరి. కాని ప్రయోజనము లేకపోయినది. పన్నులను నిరాకరించెదమని వారు చిట్టచివరకు ప్రభుత్వమువారికి కబురుపంపిరి. పన్నులనిరాకరణదండయాత్ర సాగింపబడినది. ఆ దండయాత్ర స్వరాజ్యముకొరకూ కాదు; అది శాసనోల్లంఘనకార్యక్రమములో ఒక భాగమూ కాదు. కేవలము రైతుల

కష్టనివారణోపాయమునిమిత్తమది ప్రారంభింపబడినది. ప్రభుత్వమువారు మూర్ఖపు పట్టుపట్టిరి. ప్రజలుకూడా పట్టుపట్టక తప్పనిసరియైనది.

ప్రారంభదశలో కాంగ్రెసు ఏమీ జోక్యము కల్పించుకొనలేదు. బార్డోలీ తాలూకామహాసభలో పన్నులను చెల్లించకూడదని ప్రజలు తీర్మానించుకొనిరి. వారి సహాయార్థము వల్లభాయిపటేలు ఆహ్వానింపబడెను. సహాయమునకే కాదు, కేవలము నాయకత్వము వహించుట కాయన ఆహ్వానింపబడెను. ఆయన ఆ దండయాత్రను ప్రారంభించెను. అది ఒక క్రోధోద్రేకములోగాని, తాత్కాలికోద్వేగమువలన గాని ప్రారంభింపబడినది కాదు. పూర్వాపరసందర్భము లన్నిటినీ గమనించినపిమ్మట దూరాలోచనతో మంచితెగువగా ప్రారంభింపబడినది. గవర్నమెంటువారు పశువులను జప్తుచేయ ప్రారంభించిరి. అధికారులు ముందొక కోమటిని పట్టుకొనిరి. ఆయన భయపడి తప్పక పన్నులు చెల్లించివేయగలడని వారి అభిప్రాయము. కాని ఆకోమటి కూడా లొంగలేదు. తరువాత ప్రభుత్వమువారొకమహమ్మదీయుని పట్టుకొనిరి. ఆయన అంతకంటెను లొంగలేదు. వారు ప్రజలను భయపెట్టిరి. ఒక సంఘమునకును, మరియొకసంఘమునకును పోటీపెట్టిరి. కాని ప్రయోజనము లేకపోయినది. తరువాత బార్డోలీతాలూకాలోకి పఠానులను దిగుమతిచేసిరి. వారిసహాయముతో జప్తులను ప్రారంభించిరి. రైతుల ఆస్తుల నన్నిటినీ ఏవిధమైన వ్యత్యాసమును గమనించక జప్తులను ప్రారంభించిరి. అక్కడ పఠానుల ఉపయోగము నిజముగా అనవసరము. రైతులు జప్తులను నిరోధించలేదు. ప్రభుత్వమువారికి కావలసినంతసిబ్బందీ ఉన్నది. అటువంటి సందర్భములో కోపోద్రేకపరులైన పఠానులను దిగుమతిచేయవలసిన అవసరము లేదు. పఠాను లొక్కసారి దౌర్జన్యముచేయ నియోగింపబడినయెడల వారిని తిరిగీ నిరోధించుట చాలాకష్టము. ౪౦ మంది పఠానులు నియోగింపబడిరని ప్రజలవాదన. బొంబాయిగవర్నరు సర్ లెస్లీ విల్సన్ ౨౫మందియే నియోగింపబడిరని ప్రకటించెను. ఇక్కడ మనకు సంఖ్యతో నిమిత్తములేదు. పఠానుల దృశ్యమే చాలును. చుట్టూ పఠానులను పెట్టుకొని పోలీసువారు వెనుకనుండి జప్తుచేయబడిన గేదెలను, దున్నపోతులను పటాలములనునడిపించినట్లుగా నడపించుకొనిపోవసాగిరి. ఆరోజులలో పిల్లలీవిషయమును పాటలుగా కట్టి బహిరంగసమావేశములలో పాడ ప్రారంభించిరి. వెంటనే బొంబాయిరాజధానిలో ఎన్నుకొనబడిన కొంతమంది శాసనసభాసభ్యులు బార్డోలీవ్యవహారములను ప్రతిఘటిస్తూ తమస్థానములకు రాజీనామాలనిచ్చిరి. వారందరును ఆ పన్నులనిరాకరణదండయాత్రను గూర్చి ఏమిజరుగునో అని వేచియుండిరి.

భారతశాసనసభాధ్యక్షుడు విఠల్‌భాయిపటేలు ప్రభుత్వమువారు బార్డోలీ విషయమునుగూర్చి జాగ్రత్తతీసుకొననియెడల తాను రాజీనామా నిచ్చి ఆ ఉద్యమ

ములో పాల్గొందునని బెదరించెను. ఈచిక్కునుండి తప్పించుకొనుట కొక ఉపాయము కనిపెట్టబడెను. చిట్టచివర కెక్కువచేయబడిన పన్ను మొత్తము మొకమధ్యవర్తి దగ్గిర నిలువచేయబడెను. తరువాత ఖైదీలందరును విడిచివేయబడిరి. ఆస్తులు తిరిగీ ఇచ్చివేయ బడెను. ఉద్యమ మాపివేయబడినది. ౧౯౨౨ సంవత్సరములో గాంధిని శిక్షించిన బ్రూమ్‌ఫీల్డున్నూ, ప్రభుత్వకార్యనిర్వాహకోద్యోగి మాక్స్‌వెల్‌న్నూ కోర్టుగా నియ మింపబడిరి. వారు విచారించి నూటికి ౬-౪-౦ కన్న ఎక్కువశిస్తులను వేయరాదని నిర్ణయించిరి. ఈతీర్పు ఆగష్టునెలలో చెప్పబడెను. ఈతీర్పు చోరాసాయ్(chorasai) తాలూకాకుకూడా వర్తింపచేయబడెను. ఈ తాలూకా పన్నులనిరాకరణోద్యమములో పాల్గొనలేదు. అందుకు యీతాలూకాను ప్రభుత్వమువారు శ్లాఘించిరి. చోరాసాయ్ తాలూకారైతులు పన్నులను చెల్లించగలిగియుండగా బార్డోలీరైతు లేల చెల్లించ లేరు అని ప్రభుత్వమువా రనేకసారులు ప్రశ్నించిరి. చోరాసాయ్ తాలూకావారు పన్నులను చెల్లించిరి. బార్డోలీతాలూకావారు చెల్లించలేదు. కాని బార్డోలీతాలూ కాకు కలిగిన విజయఫలితము చోరాసాయ్‌తాలూకాకు కూడా వర్తింపచేయబడెను. బొంబాయిగవర్నరు మాట్లాడుతూ పూనాశాసనసభలో బార్డోలీపన్నుల నిరా కరణమును నిర్మూలించుటకు బ్రిటిషుసామ్రాజ్యములోని యావచ్ఛక్తులను వినియో గింతుమని బెదరించెను. తరువాత కొద్దికాలమునకే యీరాజీ కుదిరినది. న్యాయశాస్త్ర ములోగాని, ల్యాండురివిన్యూకోడులోగాని బార్డోలీలో నియోగింపబడిన కోర్టువంటి కోర్టును నియమించుట కెవరికినీ అధికారములేదు; కాని నియమింపబడినది. ఈవిధ ముగా నూటికి ౬-౪-౦ పన్ను హెచ్చించుటకు సిఫార్సుచేయబడినప్పటికీ బార్డోలీ తాలూకాలో రాజీనామా కుదిరినతరువాత ఆ యెక్కువపన్ను వసూలుచేయబడనే లేదు. అంతేకాక విచారణకాలమున రయితు లింకా అనేకవిషయములను కోర్టువారిని విచారించవలసినదని కోరిరి. తమ కా విషయములను విచారించుట కప్పటి కధికారము లేదని వారుచెప్పిరి. కాని తరువాత ప్రభుత్వమువారే ఆవిషయములన్నిటినిగూర్చి రైతు లకు తగిన పరిహారముచేసిరి. ఈ రాజీలో గౌరవప్రదమైన అంశ మేమి టనగా శిస్తుల కింద వేలములు వేయబడిన పొలములుకూడ రైతులకు తిరిగీ యిచ్చివేయబడెను. ఉద్యమ ములో పాల్గొన్నందువలన నౌకరీలను పోగొట్టుకొన్న గ్రామోద్యోగస్థులకు తిరిగీఉద్యో గము లీయబడినవి.

ఇక అఖిలపక్షసమావేశమునుగూర్చి తిరిగి యోజింతము. నెహ్రూ కమిటీవారి నివేదికనుగూర్చి విచారించుటకు ౧౯౨౮ ఆగష్టు ౨౮, ౨౯, 30 తేదీలలో లక్నో నగరమున అఖిలపక్షమహాసభ తిరిగీ సమావేశమయ్యెను. నెహ్రూకమిటీవారి శ్రమకు వారికి కృతజ్ఞతాభివందనము లర్పింపబడెను. సంపూర్ణస్వాతంత్ర్య మాదర్శముగా గల

రాజకీయపక్షముల కార్యవిధానమున కేమీ అభ్యంతరము కలుగకుండాఉండే పద్ధతిని అమహాసభవా రధినివేశస్వపరిపాలనము నాదర్శముగా ప్రకటించిరి. సంపూర్ణ స్వాతంత్ర్యమున కనుకూలముగా నుండి, అధినివేశ ప్రతిపత్తికి ప్రతికూలముగా నున్నవారు ప్రత్యేక మొకప్రకటనము వ్రాసి వారిఆదర్శమును తెలియజేస్తూ సభవారికి దానిని చదివి వినిపించిరి. వారు దానిలో భారతరాజ్యాంగనిర్మాణము సంపూర్ణస్వాతంత్ర్య సిద్ధాంతముపైనే ఆధారపడియుండవలెనని స్పష్టీకరించిరి. సంపూర్ణస్వాతంత్ర్యవాదుల కార్యవిధానమున కభ్యంతరములేదని సూచింపబడిన ఉపోద్ఘాతము నాధారముగా జేసుకొని చాలామంది సంపూర్ణ స్వాతంత్ర్యవాదులుకూడ ఆమహాసభాతీర్మానములపైన సంతకములను పెట్టిరి. వా రాతీర్మానమును బలపరచనూ తలచుకొనలేదు; సభా కార్యక్రమమున కడ్డుతగలనూ తలచుకొనలేదు. వా రాతీర్మానమునకు సవరణలను ప్రతిపాదింప దలచుకొనలేదు. ఆతీర్మానచర్చలలో జోక్యము కల్పించుకొన తలచుకొనలేదు. తరువాత సింధురాష్ట్రమునుగూర్చి, రాష్ట్రముల విభజననుగూర్చి, సమష్టి నియోజకవర్గములను గూర్చి చర్చింపబడినది. జవహర్‌లాల్ పండితుడు "వేదికపైన గూర్చొనియున్న యీ పెద్దమనుష్యులు సంఘమునకునిష్ప్రయోజకు"లనిమహమ్మదాబాద్ మహారాజానుగూర్చీ, రాజారాంపాల్ సింగునుగూర్చీ ఒకమాట విసరెను. దానితో సభలో గగ్గోలు పుట్టెను. ఎవరినిగూర్చి ఆయన యీమా టనెనో వారు జవహర్‌లాలును నిరసించిరి. ఈ మాటకు ఫలితముగా మరునాటిసభలో ఒకతీర్మానము చేయబడినది: "సామ్రాజ్యకూట సంస్థాపనము (Commonwealth) నాటికి న్యాయముగా సంపాదించుకొని అనుభవిస్తూన్న వ్యక్తుల ప్రయివేటు ఆస్తులన్నీ సంరక్షింపబడు నని యిందుమూలముగా గ్యారంటీచేయబడుతూన్నది."

లక్నోలో హాజరైన ప్రముఖులలో జవహర్‌లాల్‌చే ఉదాహరింపబడిన ఇద్దరు జమీందారులేకాక డాక్టరు సప్రూ, సర్ ఆలీమామ్, సర్ శంకర్‌నాయర్, సచ్చిదానందసిన్హా, సర్ సి. పి. రామస్వామి-వీరంతా ఉన్నారు. వీరందరున్నూ ఎప్పుడో ఒకప్పుడు కేంద్రప్రభుత్వములోగాని, రాష్ట్రీయప్రభుత్వములోగాని కార్యనిర్వాహక పదవిని పొందినవారే. లక్నోప్రణాళికయందు సైనికవిషయములలో ద్వంద్వపరిపాలనాపద్ధతి సూచింపబడెను. దానిప్రకారము "కార్యనిర్వాహక సభ్యులతోగూడిన గవర్నర్ జనరలు ప్రధానమంత్రిని, సేనానాయకుని, వాయువిమానదళాధిపతిని, నౌకాదళాధిపతిని, మరి ఇద్దరు ముఖ్యసైనికోద్యోగులను, ఇంకా ఇద్దరు సైనికశాస్త్రజ్ఞులను డిఫెన్సుకమిటీగా నియమింపవలెను. ఈకమిటీవారు ప్రభుత్వమువారికిని, దేశసంరక్షణకు సంబంధించిన వివిధ ప్రభుత్వశాఖలకును సలహా యిస్తూఉండవలెను. ఈకమిటీవారి సిఫార్సులనుబట్టియే సైనికవ్యయమున కంచనా వేయబడవలెను."

" ఆరోజ్యాంగవిధానముక్రింద నియమింపబడిన సంరక్షకసంఘము (Defence Committee) వారి సిఫార్సుమీదతప్ప కామన్ వెల్తులోని సైనిక నావిక వైమానిక దళముల క్రమశిక్షణములకు సంబంధించిన బిల్లు లేవియు పార్లమెంటులో ప్రవేశ పెట్ట బడకూడదు." అనికూడ ఆ ప్రణాళికలో నుదాహరింపబడినది. ఆసంరక్షకసంఘములో ఎక్కువమంది అధికారులే ఉందురు. వారికే సైనికవ్యయమునుగూర్చిన అంచనాలను తయారుచేయుటకును, బిల్లులను సిఫార్సుచేయుటకును అధికారముకలదు. ఇది కేంద్ర ప్రభుత్వములోని ద్వంద్వపరిపాలనముగాక మరియేమిటి? ఇక అఖిలపక్ష సమావేశము వారిచే తయారుచేయబడిన నివేదిక అ. భా. కాం. సం. వారిచే నవంబరు ౪, ౫ తేదీలలో చర్చింపబడెను. వారు భారతదేశముయొక్క ఆదర్శము సంపూర్ణ స్వాతంత్ర్య ముగా మరియొకసారి ప్రకటించిరి; నెహ్రూకమిటీలో సూచింపబడిన సాంఘిక సమస్యాపరిష్కారమున కంగీకరించిరి; రాజకీయాభివృద్ధికి నెహ్రూనివేదిక ముందంజ వేసినదని అభిప్రాయమిచ్చిరి. ఆనివేదికలోని వివరములతో నిమిత్తములేకుండ మొత్త మువైన నివేదికను వా రంగీకరించిరి.

ఇక కౌన్సిలువ్యవహారములనుగూర్చి తిరిగి ఆలోచింతము. కౌన్సిల్ నిరోధపద్ధ తులు క్రమక్రమముగా క్షీణించుచుండెను. సైమన్ బహిష్కారమునుగూర్చి ప్రజాభి ప్రాయము నానాటికి బలవత్తర మగుచుండెను. భారతశాసనసభలో ఒక వివాదగ్రస్త మైనవిషయము వచ్చెను. ప్రెసిడెంటుకార్యాలయము శాసనసభా డిపార్టుమెంటునుండి ప్రత్యేకింపబడవలెనని ఆవివాదమునకు మూలము. కొందరు బాధ్యతగల శాసనసభా సభ్యులు ప్రెసిడెంటునుగూర్చి వారిలోవారే నిందాపూర్వకముగా మాట్లాడుకొన ప్రారంభించిరి. సిమ్లాప్రభుత్వములోని హోముడిపార్టుమెంటువారు అధ్యక్షుని నిర్ణయ ములనుగూర్చి, ఆయనపనినిగూర్చి చులకనచేయుటకు బహిరంగముగా ప్రయత్నిస్తున్నా రని 'పైనీర్' పత్రిక నిందారోపణముచేసెను. భారతశాసనసభలోని రాజకీయపక్షముల నాయకులు ప్రెసిడెంటు పటేలునుగూర్చి కొంతమంది సభ్యులు లాబీలలో చుల కనగా మాట్లాడగా తాము వింటిమని అంగీకరించిరి. సంప్రదాయానుసారముగా, అధ్య క్షునకగౌరవము చూపబడేయెడల అది పార్లమెంటుకు చూపబడినట్లే. కాబట్టి ఈ విషయ మిర్విన్ ప్రభువునకు తెలిసినవెంటనే ఇండియాప్రభుత్వమువారిచేత భారత ప్రజలకు క్షమాపణ చెప్పించెను. హోముమెంబరు క్షమాపణచెప్పెను. పండిత మోతీ లాల్ నెహ్రూ అంగీకరించెను.

భారతశాసనసభా కార్యక్రమములోని ముఖ్యాంశములు రిజర్వుబ్యాంకుబిల్లు: పబ్లికుసేఫ్టీ బిల్లు. బంగారుప్రమాణము విషయములోను, రిజర్వుబ్యాంకుబిల్లు విషయము లోను ప్రభుత్వమువారికి ప్రతికూలముగా కాంగ్రెసుసభ్యులు చాలాగట్టిగా పోరాడిరి.

కాని నిరుపయోగమైనది. భారతదేశ స్వాతంత్ర్యాభివృద్ధికి రిజర్వుబ్యాంకుబిల్లు బాగా తోడ్పడగలదని ప్రభుత్వమువారి వాదన. కరెన్సీఅధికారమును భారతదేశ రాజ్యాంగ కార్యదర్శినుండి తొలగించి, హిందూదేశములోని దేశీయుబ్యాంకింగు సంస్థ పరముచేయుట భారతప్రజలకు చాలా ఉపకారమైన విషయమని అధికారులు ప్రకటించిరి. ౧౯౧౯ లోని ఇండియా ప్రభుత్వచట్టమున కీబిల్లు నిజముగా కరెన్సీ, ఆర్థిక వ్యవహారములకు సంబంధించిన అనుబంధముగా నుండగలదని ప్రభుత్వమువారు ప్రచారముచేయసాగిరి. భారతరాజ్యాంగ చరిత్రమునుబట్టి యోచించినయెడల ఈవిషయములో ప్రభుత్వమువారి సద్భావమునుగూర్చి విశ్వసించుట చాలాకష్టము. ద్వంద్వపరిపాలనాయంత్రమును తయారుచేయుటలో యెన్నో మెలికలు పెట్టిన ఇండియా ప్రభుత్వమువారు తేలికగా కరెన్సీపైననూ, బ్యాంకింగుపైననూ సదుద్దేశముతో అధికారమును వీడెదరని నమ్ముటకు వీలులేదు. కాబట్టి ఆబిల్లులో యేదో ప్రజాప్రయోజనములకు భంగకరమైన విషయ ముండితీరవలెనని ప్రజాప్రతినిధులు పడికట్టిరి. ఆవిషయము చర్చకువచ్చినప్పు డందులోనుండి అనేకసమస్యలు బయలుదేరెను. రిజర్వుబ్యాంకు ప్రభుత్వమువారిచే సూచింపబడినట్లుగా భాగస్వాముల బ్యాంకుగా నుండవలెనా, లేక ప్రజలుకోరినట్లుగా స్టేటుబ్యాంకుగా నుండవలెనా అనే ముఖ్యసమస్య ఉదయించెను. రెండవది, డైరెక్టర్ల నెన్నుకొనుటకు నియోజకవర్గములేవి? ఎంతమంది డైరెక్టర్లు నామినేటు చేయబడుదురు? ఎంతమంది ఎన్నుకొనబడుదురు? వా రేవిధముగా ఎన్నుకొనబడుదురు? అని అనేకప్రశ్నలు పుట్టినవి. బ్యాంకునిర్మాణ మొక్కసారి స్థిరపడినయెడల తక్కినవిషయములు వాటంత టవే తేలగలవు. అది భాగస్వాముల బ్యాంకే అయినయెడల వారే డైరెక్టర్ల నెన్నుకొందురు. లేక అది స్టేటుబ్యాంకే అయినయెడల ప్రభుత్వముతోను, ప్రజలతోనుకూడ సంబంధముగల ఫెడరేటెడ్ ఛేంబర్సు, అసోసియేటెడ్ ఛేంబర్, రాష్ట్రీయ కో ఆపరేటివ్ బ్యాంకులు, కేంద్రరాష్ట్రీయశాసనసభలు— ఈ సంస్థలన్నీ ఆబ్యాంకుకు నియోజకవర్గములుగా నుండును. ఏసంస్థ కెంతమంది ప్రతినిధు లుండవలెననేవిషయము మన మిప్పుడు విచారింపనక్కరలేదు. కాని ప్రభుత్వమువారు మొట్టమొదట బ్యాంకులోని ౧౬ మంది డైరెక్టర్లలో ౯ మందిమాత్ర మెన్నిక డైరెక్టర్లుగా నుందురనిమాత్రము చెప్పిరి. నేడు రిజర్వుబ్యాంకు చట్టముప్రకారము ౧౬ మంది డైరెక్టర్లలోను ౮ మందిమాత్రమే ఎన్నుకొనబడవలసియుండెను. ఈ ౮ మంది ౪ సంవత్సరములలో ఎన్నుకొనబడవలసి యున్నది. ఇంకా బిల్లులో క్రమక్రమముగా అనేకమార్పులు కల్గినవి. చిట్టచివరకు శ్రీనివాసయ్యంగారి తీర్మానముపైన ప్రభుత్వమువారు స్టాకుహోల్డర్లబ్యాంకును స్థాపించుట కంగీకరించిరి. అందులో యే ఒక్కనికీ ౧౦ వేల రూపాయలకు మించిన స్టాకు ఉండకూడదని నిర్ణయించిరి. ఎన్ని

స్టాకు లున్నప్పటికీ ఒక్కొక్క స్టాకుహోల్డరు ఒకొక్క వోటుకన్న యెక్కువ ఉండ కూడదనికూడ నిర్ణయింపబడెను. ఈసూచన చాలా బాగున్నట్లుగానే కనపడెను. అందరూ సంతృప్తిపడిరి. గవర్నమెంటువారు దీనిఫలితమును గ్రహించి ఈ విషయ ములో తరువాత ఏమీ చర్య తీసుకొనతలంపలేదు. కొత్తబిల్లును ప్రవేశపెట్టతలచిరి. అసెంబ్లీ అధ్యక్షుడూ కొత్తబిల్లు ప్రవేశపెట్టబడకూడదని నిర్ణయించెను. ఒకపర్యాయ మంగీకరింపబడిన ఏబిల్లులోనైననూ ముఖ్యమార్పులు చేయబడినప్పుడు మొదటిబిల్లు నుపసంహరించుకొనుటకును, రెండవబిల్లును ప్రవేశపెట్టుటకును సభవారి అనుజ్ఞ ముందుగా పొందవలెనని కామన్సుసభాధ్యక్షుడు చేసిన సిద్ధాంతమును ఆయనఉదాహ రించెను. ఈపరిస్థితులలో ప్రభుత్వమువారు పాతబిల్లునే ప్రవేశపెట్టనిర్ణయించిరి. కాని ఆకస్మికముగా జరిగిన ఒకవోటింగులో ఆబిల్లులోని ముఖ్యనియమ మొకటి ఓడిపోయి నందున అసలుబిల్లునే కాలపరిమితి లేకుండా వాయిదావేయవలసి వచ్చెను.

తరువాతది ప్రజాసంరక్షక చట్టము (Public Safety Bill). దీనిపైన తీవ్ర వాదోపవాదములు జరిగెను. కాంగ్రెసుపక్షమువారి విరోధభావము రేకెత్తెను. ఆబిల్లు న్యాయముగా విదేశీయులకే ప్రతికూలముగా ఉద్దేశింపబడినప్పటికీ, అది భారతీయులకు కూడా వ్యతిరేకముగా నుపయోగింపబడునని ప్రజల విశ్వాసము. ఆ బిల్లునుగూర్చి భారతశాసనసభలో లాలా లజపతిరాయి "ఈబిల్లు నిజముగా విదేశీయ సామ్యవాదు లకు (కమ్యూనలిస్టు) ప్రతికూలముగా మాత్రమే ఉద్దేశింపబడినదని చెప్ప వీలులేదు. అది కేవలము వంక. అది భారతీయులకు వ్యతిరేకముగా ఉద్దేశింపబడినది. భారతీయు లనగా ఒక కార్మికులకు వ్యతిరేకముగానే అని తలంపవలదు. జాతీయవాదులకు కూడ వ్యతిరేకముగానే అది ఉపయోగింపబడును. విదేశీయ సాంఘీకవాదులు వారి దేశము లకే వెళ్లిపోదురు. లేనియెడల ప్రభుత్వమువారు భారతీయుల ఖర్చుమీద సుఖముగా పీ. వో. స్టీమరులో సీమకో, మరియొక దేశమునకో వారిని తీసుకొనిపోయి విడిచిపెట్టె దరు. ఈ బిల్లుయొక్క సిద్ధాంతమును, అందులో ముఖ్యముగా రెండవ సూత్రమును మన మంగీకరించినయెడల అది జాతీయవాదులనుగాని, లేక భారతదేశముయొక్క ఆర్థికరాజ కీయ స్వాతంత్ర్యములను కోరే తదితరులను గాని నిర్బంధించుట కుపయోగపడును. ఈ శాసనములోని నిజమైన ఉద్దేశ మంతికంటె మరేమీ లేదు. ఈ సూత్రము చాలా విశాలముగా నున్నది. కేవలము సామ్యవాదుల చర్యల నరికట్టుటకే ఇది ఉద్దేశింపబడ లేదు. ఈసూత్రములో చెప్పబడిన సిద్ధాంతమును ప్రత్యక్షముగాగాని, పరోక్షముగా గాని ప్రచారము చేయకూడదని ఉదాహరింపబడినది. ఇందులోని మాట లివి: "బ్రిటిష్ ఇండియాలో న్యాయశాస్త్రప్రకారము స్థాపింపబడిన ప్రభుత్వమును బలవంతముగా గాని, దౌర్జన్యముగాగాని పడగొట్టుటకు ప్రత్యక్షముగానో, పరోక్షముగానో ప్రచా

రము చేసే అనియున్న ఈ చట్టముక్రిందను సంపూర్ణస్వాతంత్ర్యమును ప్రబోధించే శ్రీనివాసయ్యంగారు, జవహరలాలులుకూడ రాకతప్పదు" అని చెప్పెను. బిల్లు వోటుకు పెట్టబడగా రెండుపక్షములకును సమానముగా వోట్లు వచ్చెను. ప్రెసిడెంటు ప్రతికూలముగా వోటుచేయుటచే బిల్లోడిపోయెను.

కలకత్తాకాంగ్రెసు భావికార్యక్రమమున కొకమార్గము చూపవలసియుండెను. ఇందుకొరకే పండితమోతీలాల్ నెహ్రూ అధ్యక్షుడుగా నెన్నుకొనబడెను. ఆ కాంగ్రెసులో అఖిలపక్షసభనుకూడ చేర్చుకొనవలెననే సూచన ఉండెను. అందువలన కూడా కలకత్తాకాంగ్రెసు ప్రాముఖ్యమువహించెను. సైమన్‌కమీషన్‌వారు రెండవసారి ఇండియాను దర్శించిరి. సరిగా కాంగ్రెసుజరుగుతూండగనే సైమన్‌కమిటీవారు దేశములో పర్యటనము చేయసాగిరి. మోతీలాల్ నెహ్రూ ఆ కమిటీవారికి జరిగిన బహిష్కారవివరములనుగూర్చి కొన్ని వివరములను చెప్పెను. ముఖ్యముగా కాన్పూర్, లాహోరునగరములలో జరిగిన ఉదంతములను ఆయన వివరించెను. అందువలన ఆంగ్లోఇండియనులలో గల్గిన భావపరివర్తనములను గూర్చి ముచ్చటించెను. కలకత్తాలో ఇంగ్లీషువారిచే నడుపబడు పత్రికలు భారతస్వాతంత్ర్యమునకు విరుద్ధముగా "తుపాకిమందు పూర్తిగా అయిపోయేటంతవరకు" ఇరువదిసంవత్సరములపాటు ప్రభుత్వమువారు గట్టిగా రాజ్యముచేయవలసినదని సూచించెను. ఇటువంటి అపఖ్యాతికరములైన పనులను నిరోధించుటకవసరములైన అన్ని చర్యలను నడపుట ప్రభుత్వమువారి కర్తవ్యమని ఇర్విన్‌ప్రభువు ప్రకటన చేసెను. కాని ప్రభుత్వమువారు మాత్ర మేమి చేసిరి? "తమ మేడలపైనుండి ప్రశాంతముగా ప్రతికూల ప్రదర్శనములను చేసినందుకు ఇంగ్లీషువారి తలుపులనే పగలగొట్టి, వారి అతిథులనే తన్ని, అరెస్టుచేసి వారిని తెల్లవారువరకు ఖయిదుజేసినయెడల వారి కేవిధముగా నుండునో వారే యోచించుకొనవలసియున్నది. మహమ్మదాబాదు మహారాజాయొక్క సౌధమునకు దగ్గరగానున్న ఒకతోటలో సైమన్‌సంఘమువారికి విందుజరిగినప్పుడు మహారాజాగారి ఆవరణము పోలీసులచే చుట్టుముట్టడింపబడెను. కమిటీవారు లాహోరుచేరినప్పుడు వారికి ప్రతికూలముగా లాలాలజపతిరాయి నాయకత్వముక్రింద డాక్టరు ఆలమ్, డాక్టరు సత్యపాలులవంటి సుప్రసిద్ధులు ఉత్సవములను నడిపిరి. లజపతిరాయి రొమ్ముమీద కొట్టబడెను. ఆగాయము లాయనకు మాననేలేదు. కొద్దికాలములోనే ఆయన మరణించెను. మన ఆదర్శము స్వాతంత్ర్యము. దానిరూపముగాని, వైశాల్యముగాని కాలపరిస్థితులపైన ఆధారపడినది." అని కొంతతడ వుపన్యసించినపిదప మోతీలాల్‌పండితుడు అఖిలపక్షమహాసభనుగూర్చి మాట్లాడెను. "అఖిలపక్షమహాసభవారి నిర్ణయములనుబట్టి ప్రభుత్వమువారు చేయగలిగినంత

పనిచేయవలె" నని చెప్పెను. మన శక్తిసామర్థ్యములనుబట్టి మన ఆదర్శమును పొందుటకు తగిన మహత్తరప్రయత్న మిప్పుడు చేయవలసియున్నదని ఆయన హెచ్చరించెను. ఈకలకత్తా కాంగ్రెసులో జరిగిన ప్రత్యేకవిషయ మేమనగా, విదేశములనుండి కూడ అనేకమందివ్యక్తులనుండి, సంస్థలనుండి అభినందనములు పంపబడినవి. న్యూయార్కులో నున్న సరోజినీదేవినుండి, యల్. రొమేన్ రోలాండు, సన్యట్ సేన్ పతులనుండి, పర్షియన్ సోషలిష్టుపత్రికనుండి, న్యూజీలాండు కమ్యూనిష్టుపత్రికనుండి, మానవహక్కులసమితి (League of the Rights of Man) నుండి కాంగ్రెసుకు అభినందనలేఖలు వచ్చెను.

ఈ కాంగ్రెసులో ముఖ్యముగా భారతదేశముయొక్క ఆదర్శమునుగూర్చి ప్రభుత్వమువారికి చిట్టచివరిసారి హెచ్చరికచేయబడెను. విదేశములలోని స్నేహితులు పంపిన అభినందనలేఖలకు తగిన ప్రత్యుత్తరములు పంపబడెను. విదేశమిత్రులతో సన్నిహిత సంబంధమును కలుపుకొనుట కొక విదేశీ డిపార్టుమెంటును స్థాపింపవలసిన దని అ. భా. కాం. సం. కోరబడెను. ఆసియాఖండసమ్మేళన మొకటి స్థాపింప నుద్దేశింపబడెను. సంపూర్ణస్వాతంత్ర్యమును పొందినందుకు చీనాదేశమున కభినందనములు పంపబడెను. ఇరాక్, ఈజిప్టు, పేలస్టయిన్, సిరియా దేశములకు కూడ అభినందనములు పంపబడెను. సామ్రాజ్యతత్వ ప్రతికూలసమితియొక్క రెండవప్రపంచకమహాసభ జరుపబడుట కా కాంగ్రెసు సంతోషమును వెల్లడించెను. మద్రాసులో యుద్ధమునుగూర్చి చేయబడిన తీర్మానము కలకత్తాలో తిరిగి అనుమతింపబడెను. బ్రిటిష్‌వస్తువుల బహిష్కార మంగీకరింపబడెను.

బార్డోలీవిజయమునకు వల్లభాయిపటేలు అభినందింపబడెను. కాంగ్రెసువాదులు ప్రభుత్వమువారి విందులకుగాని, దర్బారులకుగాని, ప్రభుత్వోద్యోగుల గౌరవార్థము చేయబడే సమావేశములకుగాని హాజరుకాకూడదని కోరబడిరి. స్వదేశసంస్థానములలో బాధ్యతాయుతప్రభుత్వము నిర్మింపబడవలెనని వాంఛింపబడెను. కలకత్తాలో భారతసంస్థానములనుగూర్చి చేయబడిన తీర్మానము ఇటీవల దేశములో చాలా ఆందోళనమునకు కారణభూత మాయెను. అది ఈ క్రింద నుదాహరింపబడినది:

"XVII. స్వదేశ సంస్థానములలో ప్రాతినిధ్యపద్ధతిమీద బాధ్యతాయుత ప్రభుత్వము ప్రవేశపెట్టబడవలెనని ఈ కాంగ్రెసువారు భారతసంస్థానాధిపతులను కోరుచున్నారు. అందు కనుగుణముగా వారు వాక్స్వాతంత్ర్య, ముద్రణస్వాతంత్ర్య, సమావేశ స్వాతంత్ర్యములవంటి పౌరుల ప్రధానహక్కులకు హామీయిస్తూ చట్టములను చేయవలెను. లేదా, తక్షణ మొక రాజకీయప్రకటనమునైననూ చేయవలెను."

దీని తరువాత రాజ్యభ్రష్టుడైన నాభామహారాజుకు సానుభూతి చూపింపబడెను. నిర్బంధనివాసములో మరణించిన అయిదుగురు బెంగాలీల కుటుంబములకు సానుభూతితీర్మానములు పంపబడెను. లాహోరులో పోలీసువారు గృహములను ముట్టడించి సోదాచేసినవిషయము నిరసింపబడెను. లాలా లజపతిరాయి, హకీము అజ్మల్ ఖాన్, ఆంధ్రరత్న గోపాలకృష్ణయ్య, మగన్‌లాల్ గాంధీ, గోపబంధుదాసు, సిన్హా ప్రభువులు స్మరింపబడిరి. ఈ కాంగ్రెసు ప్రభుత్వమువారికి చేసిన చిట్టచివరి హెచ్చరికను చేసిన తీర్మాన మీక్రింద ఉదాహరింపబడినది:

"అఖిలపక్షకమిటీవారి నివేదికలో సూచింపబడిన రాజ్యాంగనిర్మాణము భారతదేశముయొక్క సాంఘిక రాజకీయసమస్యలను పరిష్కరించుటకు గొప్ప ఉపకారి కాగలదని ఈకాంగ్రెసు సిఫార్సుచేయుచున్నది. ఆకమిటీసభ్యు లందరును ఏకాభిప్రాయమునకు వచ్చినందుకు వారి నీకాంగ్రెసు అభినందించుచున్నది. మద్రాసు కాంగ్రెసులో అంగీకరింపబడిన సంపూర్ణస్వాతంత్ర్య తీర్మానమునకు భిన్నముకాని పద్ధతిని భారతదేశములోని ముఖ్యరాజకీయకక్షుల అంగీకారమునకు పాత్రమైన అఖిలపక్షకమిటీవారి రాజ్యాంగవిధానము రాజకీయాభివృద్ధికి గొప్ప సోపానము కాగలదని ఈకాంగ్రెసు అంగీకరించుచున్నది.

"రాజకీయావసరములనుబట్టి ౧౯౨౯ డిసెంబరు ౩౧ వ తేదీనాడు గాని, లేక అంతకులోపుగాగాని బ్రిటిషుపార్లమెంటు పూర్తిగా ఈరాజ్యాంగవిధానము నంగీకరించేయెడల రాజకీయపరిణామములకు లోబడి ఈకాంగ్రెసు ఈ రాజ్యాంగవిధానము నామోదింపగలదు. కాని, పైన చెప్పబడిన తేదీనాడుగాని, లేక ఆలోగానే గాని ప్రభుత్వమువా రీరాజ్యాంగవిధానమును తృణీకరించేయెడల ఈకాంగ్రెసు ప్రజలలో పన్నుల నిరాకరణమును బోధించిగాని, లేక మరొకవిధముగా గాని దౌర్జన్య రహిత సహాయ నిరాకరణ దండయాత్రను సాగించగలదు."

ఈ తీర్మానమున కనుగుణముగా కాంగ్రెసు పేరుతో సంపూర్ణస్వాతంత్ర్య ప్రచారముచేయుట కేమీ అభ్యంతర ముండకూడదు.

ఈ తీర్మాన మీపద్ధతిలోనే కాంగ్రెసుమహాసభలో అంగీకరింపబడినది. కాని దీనికి వెనుక ఒక విషాదకరమైన వివాదచరిత్ర కలదు. గాంధీచే మొట్టమొదట విషయనిర్ధారణసభలో ప్రవేశపెట్టబడిన తీర్మానముయొక్క ప్రథమస్వరూప మిది:

"అఖిలపక్షకమిటీవారి నివేదికలో సూచింపబడిన రాజ్యాంగనిర్మాణము భారతదేశముయొక్క సాంఘిక రాజకీయసమస్యలను పరిష్కరించుటకు గొప్ప ఉపకారికాగలదని ఈకాంగ్రెసు సిఫార్సుచేస్తూన్నది. ఆకమిటీసభ్యు లందరునూ ఏకాభిప్రాయమునకు

వచ్చినందుకు వారి నీ కాంగ్రెసు అభినందిస్తున్నది. మద్రాసు కాంగ్రెసులో అంగీకరింపబడిన సంపూర్ణస్వాతంత్ర్యతీర్మానమునకు భిన్నము కాని పద్ధతిని భారతదేశములోని ముఖ్యరాజకీయకక్షుల అంగీకారమునకు పాత్రమైన అఖిలపక్ష కమిటీవారి రాజ్యాంగవిధానము రాజకీయాభివృద్ధికి గొప్పసోపానము కాగల దని ఈ కాంగ్రెసు అంగీకరిస్తున్నది.

" కాని ౧౯౩౦ డిశెంబరునాటికి ఈ రాజ్యాంగవిధాన మంగీకరింపకపోయిన యెడలను, బ్రిటిషుపార్లమెంటువారు దీని నా తేదీనాటికి ఆమోదింపనియెడలను ఈ కాంగ్రెసు ఈ నిర్మాణవిధానమునకు కట్టుబడియుండజాలదు. అప్పుడీ కాంగ్రెసు ప్రభుత్వమునకు పన్నులను చెల్లించకూడదనీ, ఏ విధమైన సహాయమును చేయకూడదనీ సలహాయిస్తూ దౌర్జన్యరహితసహాయనిరాకరణమును తిరిగి ప్రారంభించగలదు.

" ఈ తీర్మానముయొక్క నకలునూ, నెహ్రూరిపోర్టు నకలునూ అవసరమైన చర్య తీసుకొనేనిమిత్తము వైస్రాయికి పంపవలెనని అధ్యక్షున కిందుమూలముగా అధికార మీయబడుచున్నది.

" ఈ నివేదికను అంగీకరించేటట్టు చేయుటకు సాగింపబడే ప్రచారమున కభ్యంతరము కానంతవరకు సంపూర్ణస్వాతంత్ర్యాదర్శమునుగూర్చి ప్రజలలో ప్రబోధ మొనరించుటకుకూడ ఈ తీర్మాన మభ్యంతరము కాకూడదు. "

దీనికి సుభాష్‌చంద్రబోసు, జవహరలాల్ నెహ్రూలుం దాదాపు ఒక్కటే స్వభావముగల సవరణలను ప్రతిపాదించిరి. కాలనిర్ణయము చేయబడకూడదనీ, అఖిల పక్ష సమావేశమువారిచే తయారుచేయబడిన రాజ్యాంగవిధానములోని అధినివేశ ప్రతిపత్తి కాంగ్రెసుచే అంగీకరింపబడినసూచనగా ఉండకూడదనీ వారి ఉద్దేశము. పండిత జవహరలాల్ నెహ్రూ సవరణ యిది:

" I. మద్రాసు కాంగ్రెసులో నిర్ణయింపబడిన భారతప్రజల సంపూర్ణ స్వాతంత్ర్యాదర్శమును ఈ కాంగ్రెసువా రామోదిస్తూ, బ్రిటిషు సంబంధము పోతేనేగాని నిజమైన స్వేచ్ఛ ఉండదని అభిప్రాయపడుచున్నారు.

" II. లక్నోలోని అఖిలపక్షసభవారిచే అంగీకరింపబడిన నెహ్రూనివేదిక లోని సిఫార్సులను సాంఘికవిభేదసమన్వయమునకు సంబంధించినంతవర కీకాంగ్రెసు వా రామోదిస్తున్నారు.

" III. నెహ్రూ కమిటీవారి పరిశ్రమకును, దేశాభిమానమునకును, దూర దృష్టికిని ఈ కాంగ్రెసు అభినందిస్తున్నది. సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మాన[illegible] భిన్నము కానిపద్ధతిని ఈ నెహ్రూ కమిటీలోని సిఫార్సులు రాజ[illegible]

గొప్పసోపానములు కాగలవని ఈ సభవారి అభిప్రాయము. దీనిలోని వివరములను అలా వుంచి మొత్తముమీద దీనిని కాంగ్రెసువా రంగీకరిస్తున్నారు. ”

ఈ తీర్మానమునుగూర్చి మాట్లాడుతూ గాంధీ “ యీ తీర్మానపు నకలును, నెహ్రూకమిటీ నకలును ప్రెసిడెంటుచే వైస్రాయికి పంపబడవలె ” నను భాగము తీసివేయబడినందుకు చింతించెను. నిజముగా ఆ తీర్మానము అవసరమైన దాక్షిణ్యము కొరకైనా వైస్రాయికి పంపియుండవలసినదని గాంధీ అభిప్రాయము. “ మన కనవసరమైన అహంకారగమే లేనియెడల మన మీ భాగమును తీసివేయవలసిన అవసరమే లేదు. ” అని ఆయన చెప్పెను. ఇక తక్కిన తీర్మానముపైన చాలా చర్చజరిగెను. చిట్టచివరకు విషయనిర్ధారణసభలోని సంపూర్ణ స్వతంత్ర పక్షమువారికినీ, తదితరులకును ఒక రాజీ కుదిరెను. ఈ రాజీకి సుభాష్ చంద్రబోసు, జవహరలాల్ లు కూడా విషయనిర్ధారణసభలో అంగీకరించిరి. కాని బహిరంగసభలో ఆ రాజీని తృణీకరించి పైన చెప్పబడిన సవరణను సుభాష్‌చంద్రబోసు ప్రతిపాదించగా జవహరలాల్ పండితు డామోదించెను. ఈ విధముగా వాగ్దానభంగ మొనరించినందుకు గాంధీకినీ, తదితరులకును మనసు నొచ్చినది. రాజీతీర్మానమును బహిరంగ సభలో ప్రతిపాదిస్తూ ఈ క్రింది విధముగా గాంధీ తన మనోభావములను వెల్లడించెను:

“ కొంతమంది ముసల్మానులు అల్లానుగూర్చి జపముచేసేటట్లును, కొంతమంది హిందూభక్తులు ‘ కృష్ణా, ’ ‘ రామా ’ అని జపించేటట్లును మీరుకూడా స్వతంత్రమనే మాటను జపిస్తూ ఉండవచ్చును. ఆ జపమువలన ప్రయోజనము లేదు. మీ మాటలను మీరే నిలుపుకొనలేకపోయినయెడల స్వతంత్ర మెక్కడనుండి వచ్చును ? స్వతంత్రము చాలా కఠినమైనది. అది కేవలము మాటల గారడీలో లేదు. ”

౧౯౨౮ నాటి కలకత్తా కాంగ్రెసు భావికర్తవ్యమును గూర్చి యీ క్రింది తీర్మానము చేసెను:

## భావి కార్యక్రమము

“ ౧. తాగుబోతుతనము నిర్మూలించుటకును, మత్తుపదార్థములను పూర్తిగా నిషేధించుటకును శాసనసభలలోనూ, బైటనుకూడ భారతప్రజలు ప్రయత్నములను చేయవలెను. వీలునుబట్టి అవసరమైన చోటులలో సారాయి కల్లు దుకాణములను, మత్తుపదార్థముల దుకాణములను పికెటింగు చేయవలెను.

“ ౨. విదేశవస్త్ర బహిష్కారమునకు కావలసిన వాతావరణములను సృష్టించుటకు శాసనసభల బైటా, లోపలా కూడా తగినపద్ధతు లవలంబింపవలెను.

“ ౩. [illegible] ఉపయోగముకొరకును ప్రచారము కావింపవలెను.

" ౩. ప్రత్యేకకష్టముల నివారణముకొరకు బార్డోలీలోవలెనే అహింసా పూర్వకమైన చర్య నడుపబడవలెను.

" ౪. కాంగ్రెసభ్యర్థులుగా గెలుపొందిన శాసనసభ్యులు వారి కాలములో ఎక్కువభాగమును కాంగ్రెసుకమిటీవారిచే నిర్ణయింపబడిన నిర్మాణకార్యక్రమము నకు వినియోగింపవలెను.

" ౫. కాంగ్రెసులో ఎక్కువమంది సభ్యులను చేర్పవలెను. ఇంకా ఎక్కువ క్రమశిక్షణ నేర్పాటుచేయువలెను.

" ౬. స్త్రీల అంకులను తొలగించి, వారిని జాతీయాభివృద్ధికొరకు పనిచేసే టట్లుగా ప్రోత్సహించవలెను.

" ౭. సాంఘికదురాచారములను దేశమునుండి తొలగించే ప్రయత్నములు జరుపవలెను.

" ౮. అంటరానితనమును పోగొట్టుట హిందువులధర్మముగా భావించవలెను. అంటరానివారుగా తలపబడుతూన్నవా రందరికిని వారిపైనగల అంకులను తొలగించి, వారి ఆర్థికాభివృద్ధికి సహాయము చేయవలెను.

" ౯. నగరములలో నున్న కార్మికుల విషయములోను, గ్రామపునర్నిర్మాణ విషయములోను పనిచేయుటకు వాలంటీర్లను సమకూర్పవలెను.

" ౧౦. జాతీయనిర్మాణమున కవసరమైన యితర కార్యక్రమమును కూడ నడుపవలెను. జాతీయాభ్యుదయమున కనుగుణముగా దేశములోని అన్ని వృత్తులవారి సహాయమును యీ కాంగ్రెసు పొందవలెను.

" ౧౧. ఈ కాంగ్రెసు కార్యక్రమమును నడిపించుటకు సొమ్ము కావలసి యున్నది. కాబట్టి ప్రతికాంగ్రెసువాదియు తన శక్తిసామర్థ్యములనుబట్టి తన ఆదాయములో కొంతభాగమును విరాళముగ నీయవలసినదిగా ఈ కాంగ్రెసు కోరు తూన్నది. "

కలకత్తా కాంగ్రెసులో అంగీకరింపబడిన యెక్కువ ముఖ్యమైన తీర్మానము లలో డబ్లియు. జె. జాన్‌స్టన్‌ను గూర్చిన తీర్మాన మొకటి. ఈయన సామ్రాజ్య ప్రతికూల సమితి (League against Imperialism) నుంచి కాంగ్రెసుకు ప్రతినిధి గా వచ్చెను. ఆయనను ప్రభుత్వమువారు విచారణలేకుండగనే అరెస్టుచేసి నిర్బంధిం చిరి. అందు కే కాంగ్రెసువారు ప్రభుత్వమువారి చర్యను నిరసించిరి. ప్రభుత్వమువారి ఈ ప్రయత్నము కాంగ్రెసుకు అంతర్జాతీయసంబంధము పెంపొందింపకుండా నిరో ధింపవలెనని తలంపుతో చేయబడినట్లుగాకూడ కాంగ్రెసు భావించెను.

కలకత్తా కాంగ్రెసులో జరిగిన కార్మిక ప్రదర్శనము మరచిపోదగినది కాదు. చుట్టుపట్ల నున్న ౫౦ వేలమంది కార్మికులు ప్రశాంతముగా కాంగ్రెసు శిబిరమునకు నడచివచ్చి జాతీయపతాకమునకు వందనముచేసి రెండుగంటలు కాంగ్రెసుపందిలి నాక్ర మించి భారతస్వాతంత్ర్యతీర్మానము నంగీకరించి తిరిగి ప్రశాంతముగా వెళ్లిపోయిరి.

ఈసంవత్సరములో దేశములో నవయౌవనోద్యమము బయలుదేరినది. దేశమంతటా యువకసంఘములునూ, విద్యార్థిసంస్థలునూ స్థాపింపబడెను. బొంబాయి, వంగరాష్ట్రములలో అవి మరీ బలవత్తరములుగా చేయబడెను. ఇందులో కొన్నిసంస్థలు ఆగష్టునెలలో హాలెండుదేశమున జరిగిన ప్రపంచక యువకమహాసభకు ప్రతినిధులనుకూడా పంపెను. సైమన్ బహిష్కారోత్సవసందర్భములలో యువకులు బాగా పనిచేసిరి. అందులో లాఠీదెబ్బలును, బెత్తముల దెబ్బలును తిన్న యువకు లెందరో కలరు.

ఈసంవత్సరపు ప్రారంభదశలో కాంగ్రెసుపక్షమున పరిశోధనలను జరిపించుటకు కొంతమంది శాస్త్రజ్ఞులను నియమింపవలెనని కాంగ్రెసుకార్యవర్గమువారు నిర్ణయించిరి. ఇది చాలా ముఖ్యమైన నిర్ణయము. దీనిమూలమున అనేక ముఖ్యసమస్యలకు సంబంధించిన విషయపరిజ్ఞానము కలుగగలదు. జాతీయసేవకొరకు సమర్థులైన యువకులకు శిక్షణ లిచ్చుటకుకూడా ఇందువల్ల వీలు కలుగును. కాని ఈ పరిశోధనకార్యమునకు శాశ్వతమైన కార్యాలయ ముండవలెను. దానికి మంచిగ్రంథాలయ ముండవలెను. రాజకీయోద్రేకము లేనివాతావరణ ముండవలెను.

కర్ణాటకములోని బాగల్‌కోటయందు హిందూస్థానీసేవాదళమువారు దేహశరీర పరిశ్రమాలయమును స్థాపించిరి. వారు దేశములో అనేకచోట్ల అనేక శిక్షణశిబిరములను స్థాపించిరి. హిందూస్థానీసేవాదళములోని సభ్యులు పోటుపనులనుసైతము చేయగలరని కీర్తి సంపాదించిరి.

గాంధీ మరల రాజకీయములలో పాల్గొనుటకువచ్చిన విధానములనుగూర్చి పాఠకులు తెలుసుకొనవలసియున్నది. ఆయన అహమ్మదాబాదుకాంగ్రెసు జరిగినతరువాత ౧౯౨౨ మార్చిలో ఖైదుకు పంపబడెను. ౧౯౨౨ గయాకాంగ్రెసులో లేడు. ౧౯౨౩ ఢిల్లీ స్పెషల్‌కాంగ్రెసులోను, ౧౯౨౩ కాకినాడకాంగ్రెసులోను కూడ లేడు. ౧౯౨౪ ఫిబ్రవరి ౫ వ తేదీని ఆయన విడుదలచేయబడెను. తరువాత బెల్గాము కాంగ్రెసుకు అధ్యక్షత్వవహించెను. పిమ్మట పాట్నాలో అ. భా. కాం. సం. వారిచే చేయబడిన స్వరాజ్యపక్ష. భాగలబ్ధపు తీర్మానమును కాన్పూరుకాంగ్రెసులో ఆమోదింపజేయుట కాయన హాజరయ్యెను. తరువాత ఒక్క సంవత్సరముపాటు రాజకీయ మౌనవ్రతమును పూనెను. గౌహతిలో ఆవ్రతమును చాటించి కాంగ్రెసుకార్యక్రమ

ములో చురుకుగా జోక్యము కల్గించుకొనెను. కాని మద్రాసులో యేమీ జోక్యము కల్గించుకొనలేదు. విషయనిర్ధారణసభాసమావేశములకుకూడ హాజరుకాలేదు. కలకత్తా కాంగ్రెసులో ఆయన జోక్యము కల్పించుకొని ఉండేవారో లేదో సందేహాస్పదమైన విషయము. అంతకుపూర్వము కొన్ని సంవత్సరములనుండి కాంగ్రెసుకు నెలరోజుల ముందుగా ఆయన వార్ధా ఆశ్రమములో కాలక్షేపము చేసే ఆచారము కలదు. ౧౯౨౮ డిశెంబరులో జరిగిన కలకత్తా కాంగ్రెసుకు ముందుకూడా ఆయన వార్ధాలోనే ఉండెను. కలకత్తా అధ్యక్షుడు మోతీలాల్ పండితునకు ౩౬ గుఱ్ఱములబండిలో గొప్ప సన్మానోత్సవము జరిగెను. కాని ఆయన కొన్ని చిక్కులలో పడెను. అదేమనగా, లక్నోలో జరిగిన అఖిలపక్షసమావేశములో అంగీకరింపబడిన అధినివేశ ప్రతిపత్తికి ప్రతికూలముగా సంపూర్ణస్వాతంత్ర్యమును సూచిస్తూ ప్రకటనము చేసిన సంపూర్ణ స్వాతంత్ర్యవాదులు స్వతంత్రసమితిని నిర్మించుకొని కలకత్తా సభకు హాజరైరి. స్వతంత్రవాదులలో పండిత జవహర్‌లాల్ కూడా ఉండెను. వంగమిత్రులు లోక సమితిని స్థాపించుకొనిరి. సుభాష్‌చంద్రబోస్ దానికి నాయకుడు.

ఈసందర్భములో అఖిలపక్షసభనుగూర్చి ఒకమాట చెప్పవలసియున్నది. అది పూర్తిగా అపజయముపొందెను. ఒక్క మహమ్మదీయులుతప్ప తక్కిన అన్ని అల్పసంఖ్యాకసంఘములును సాంఘికప్రాతినిధ్యమును నిరసించినవి. పైగా అప్పుడే ఇంగ్లండునుండి ఇండియాకువచ్చిన జిన్నాకు నెహ్రూనివేదిక బొత్తిగా సరిపడలేదు. అంతకు పూర్వమే కొందరు మహమ్మదీయులు దానినిగూర్చి ప్రతికూలభావము వెల్లడించిరి.

అఖిలపక్షసంఘమువారు ప్రకటించిన అనుబంధమునుబట్టియే ఆనివేదిక చాలా విమర్శనకు తలయొగ్గవలసివచ్చినదని తెలియగలదు. ఆ అనుబంధములో ఈవిధముగా ఉదాహరింపబడెను :

“మావిమర్శకులలో ఇటీవల ఆగాఖాన్ కూడా చేరినందుకు విచారముగానున్నది. ఆయన “బ్రిటిషువారు సామాన్యసైనికులను గాని, సివిల్‌పరిపాలకులను గాని భారతదేశములో విడిచిపెట్టరాదు. ఎందువలన ననగా వారు తరువాత భారతదేశములోని స్వపరిపాలనమునకు శాశ్వతహానిచేసేస్థితిలో నుందురు. ఒకవేళ వారు రేపిచ్చుపని చేసేయెడల ప్రపంచకములో వారికి కీడు చిక్కైనముప్పు పుట్టును. వారి యధికారములేని ప్రభుత్వమునకు సాయుధసైన్యములనన్నిటినీ వదలివచ్చినందున శాశ్వతముగా వారిని ప్రపంచకమంతా నిందించును.”

ఆగాఖాను రాష్ట్రీయస్వాతంత్ర్యము కావాలని ప్రతిపాదించెను. రాష్ట్రముల స్థితి పూర్వపుజర్మనీరాజ్యములోని (German Confederation) బవేరియా స్థితి

దగ్గర గానుండవలెనని కూడా ఆయన చెప్పెను. అఖిలపక్షసంఘము నా రీవిషయములను
గూర్చి తమ అనుబంధనివేదికయందు విమర్శించిరి. కలకత్తా కన్వెన్షన్‌లో మహ
మ్మదాలీ అనేకసవరణలను ప్రతిపాదించెను. కాని అవన్నియు నిరాకరింపబడినవి.

జిన్నా కోరము (కనీసపసంఖ్య) లేదనే కారణముతో అఖిలపక్షసమ్మేళనమును
వాయిదావేసెను. కలకత్తాలో అఖిలపక్షసమావేశమునకు క్లిష్టపరిస్థితులు వచ్చినవి.
దాని కవసానకాలము తటస్థించెను. ధనవంతుడైన రోగినొక్కనిని పేదచుట్టాలు చేరి
వేధించినట్లుగా ఆసభ జీవించుకొలది అల్పసంఖ్యాకులు దానిచుట్టును మూగి మితిలేని
కోరికలు కోరసాగిరి. అందువలన ఆసభ చావనూచాకలేదు. బ్రతుకనూ బ్రతుకలేదు.
దానిస్థితి సరిగా సబర్మతిలోని ఆవుదూడస్థితివలె నుండెను. అందువలననే గాంధీ ఈ
బాధ సహింపలేక ఈసభను కూడా స్వర్గమునకు పంపదలచుకొనెను. అవసానకాలమున
మరణబాధ ననుభవిస్తూన్న సమితులకు అంత్యక్రియలు నిర్వర్తింపగల ధైర్యశాలి
గాంధీయే. కాబట్టి ఆసభను కాలనిర్ణయములేకుండా నిలిపివేయవలెనని గాంధీ ప్రతి
పాదించెను. ఆతీర్మానమంగీకరింపబడెను. ఈసమయములో కాంగ్రెసు తిరిగి గాంధీ
చేతులలోనికి వచ్చెను. కాని ఇంకొన్ని నూతనభారములతో వచ్చెను. శాసనసభల
లోని కాంగ్రెసుపక్షమువారు శాసనసభలమోహమునుండి బయటపడుటకేమి చేసెదరో
అని గాంధీ నిరీక్షించసాగెను. ౧౯౨౯ అక్టోబరులో ఢిల్లీలో జరిగిన అ. భా. కాం.
సం. సభలో శాసనసభలనుగూర్చి ఈక్రిందితీర్మానము చేయబడెను:

"శాసనసభాకార్యక్రమమునుగూర్చి మద్రాసు కాంగ్రెసు తీర్మానము ప్రకార
మీయబడిన ఉత్తరువులను కాంగ్రెసుశాసనసభాసభ్యులవారు సరిగా అనుసరింప
నందుకు ఈకమిటీవారు చింతిల్లుచున్నారు. కాబట్టి నాటికి తటస్థించిన చిక్కులను
గమనించి కాంగ్రెసుతీర్మానముయొక్క సిద్ధాంతముకైనా అనుగుణముగా వారు
ప్రవర్తింపవలసిన దని ఈసభవారు కోరుతున్నారు."

గాంధీ కలకత్తాకు పోయి కాంగ్రెసువ్యవహారములలో పాల్గొని ప్రధాన
తీర్మానమునకు రూపమిచ్చి దానిని నెగ్గించెను. ఆనాటి రాజకీయ పరిస్థితు
లాశాజనకములుగా లేవు. సంపూర్ణస్వాతంత్ర్యవాదులు నిర్బంధింపబడుదురని
ప్రవాదము పుట్టెను. కలకత్తాలో సైప్రాయి కయ్యమునకు కాలు దువ్వుతూ
ఉపన్యాస మిచ్చెను. "ఫార్వర్డు" పత్రికా సంపాదకుడు శిక్షింపబడెను.
మద్రాసులోకూడ కేసులు పెట్టబడును అని తెలియవచ్చెను. ఇవన్నీ గాంధీమనస్సును
కలచివేయదొడగినవి. కలకత్తాలోని విషయనిర్ధారణసభలో బుద్ధిపూర్వకముగా రాజీ
చేసుకొని తరువాత దానికి విరుద్ధముగా బెంగాలు, మద్రాసు, సంయుక్తరాష్ట్రముల

వారు ప్రవర్తించినందుకు ఆయనకు మరింత విచారము కలిగెను. ఈపరిస్థితు లిట్లుండగా ఆయనకు యూరపుఖండమునకు రావలసిన దని ఆహ్వానము వచ్చెను. వీలున్నయెడల ౧౯౨౯ ప్రారంభదశలోనే ఆయన యూరపుఖండపర్యటనమునకు పోదలచెను. అందుకు మోతీలాల్ పండితుడుకూడా అంగీకరించెను. కాని స్నేహితులతో జాగ్రత్తగా ఆలోచించుకొనినపిమ్మట ఆయన యూరపుప్రయాణమును విరమింప నిర్ణయించుకొనెను. "మరుసంవత్సరపుసంగతి నేను చెప్పజాలను. అమెరికానుండి ఒకమిత్రుడు నేను స్వతంత్రభారతవర్షమునుండి ప్రతినిధిగా వచ్చినయెడల యూరపుఖండమున కెక్కువ ప్రయోజనకారిని కాగలనని వ్రాసెను. అనాటిలోనిసత్యము నా కర్థమైనది. నా అంతర్వాణి, నన్ను యూరపుఖండమునకు పొమ్మని ప్రబోధించుట లేదు. అంతేకాక ఒకకార్యక్రమమును నిర్వర్తించుట కొకతీర్మానమును కాంగ్రెసులో ప్రతిపాదించి, అది ఏకగ్రీవముగా అంగీకరింపబడినపిమ్మట నేను కాంగ్రెసును వదలి యూరపుఖండమునకు వెళ్లిపోయినయెడల మహాపరాధము చేసినవాడ నగుదును. ఆతీర్మానమునకు వోటుచేసినవారికి దానిని నిర్వర్తింపవలెననేభావము లేకపోవచ్చును. ఆకార్యక్రమమునుగూర్చి నేనేమియు చేయలేకపోవచ్చును. కాని అవిధముగా నేను వాదింపకూడదు. కాంగ్రెసుప్రచారకులలో నాకు విశ్వాసము పోరాదుగు. నాదృష్టిలో ముఖ్యతరకార్యక్రమముగా పరిగణింపబడుచున్న ఈపనిని నిర్వర్తించుటకు నేను సంసిద్ధముగా నుండుటయేకాక దీని నితరులచేత నిర్వర్తింపజేయుటకుకూడ మార్గముల నన్వేషింపవలసిన దని నా అంతర్వాణి నన్ను ప్రబోధించుచున్నది. అంతేకాక రాబోయే పోరాట మేరూపములో వచ్చినప్పటికి నేనుమాత్రము అందుకు సంసిద్ధముగా నుండవలెను" అని గాంధీ ౧౯౨౯ ఫిబ్రవరి మొదటివారములో వ్రాసెను. ౧౯౩౦ ఫిబ్రవరిలో దేశమున కేమి రానున్నదో మనము ముందు చూడవలసియున్నది.

౧౯౨౯ ప్రారంభదశలో భారతదేశపరిస్థితులు గాఢాక్లిష్టదశలో నుండెను. ౧౯౨౮ సెప్టెంబరు నెలలో భారతశాసనసభయందు ప్రవేశపెట్టబడిన పబ్లిక్ సేఫ్టీబిల్లు అధ్యక్షుని అదనపువోటుతో నిరాకరింపబడిన విషయమును పాఠకులు జ్ఞాపక ముంచుకొనియుందురు. ౧౯౨౯ జనవరిలో తిరిగి ఆబిల్లు ప్రవేశపెట్టబడినది. అప్పుడు భారతశాసనసభయందు చిన్నకుపాటు గానెను. స్టేటుకౌన్సిలునుండి సెంట్రల్ కమిటీకి నలుగురు సభ్యులెన్నుకొనబడిరి. భారతశాసనసభనుండి నల్గురు సభ్యులు ప్రభుత్వమువారిచే నామినేటు చేయబడిరి. వీరందరును సైమన్ కమీషన్ తోపాటు దేశములో సంచారము చేయనారంభిరి. వారికితోడు కొన్ని అనుబంధ సంఘములుకూడ పనిచేయదొడగినవి. సర్ హారీ కోడ్ బట్లరు అధ్యక్షతక్రింద భారత సంస్థానముల కమిటీవారిచే తయారు చేయబడిన నివేదిక ౧౯౨౯ ఏప్రిల్ లో పార్లమెంటుకు దాఖలుచేయబడెను. సర్ ఫిలిప్ హార్టాగ్ అధ్యక్షతక్రింద పనిచేస్తూన్న విద్యావిచారణసంఘము బ్రిటిషు ఇండియాలోని విద్యాభివృద్ధిని గూర్చి పరిశీలించుటకు దేశమంతటా సంచారము చేయనారంభెను. వారినివేదిక ౧౯౨౯ సెప్టెంబరులో ప్రచురింపబడనుండెను. ౧౯౨౯ ఏప్రిల్ ౧౩ వ తేదీనాటికి సైమన్ కమీషన్ వారు భారతదేశములోని తమ విచారణ ముగించిరి. వారింగ్లండుకు చేరిరో లేదో ౧౯౨౯ మే నెలలోని ఎన్నికలలో కన్సర్వేటివు ప్రభుత్వమువారు ఓడిపోయిరి. కార్మిక మంత్రివర్గమువారధికారమునకు వచ్చిరి. మాక్డొనాల్డు ప్రధానమంత్రిగను, వెడ్జివుడ్ బెన్ భారతరాజ్యాంగకార్యదర్శిగను నియమింపబడిరి. ఇర్విన్ ప్రభువు నాల్గునెలల సెలవు తీసుకొని "సైమన్ కమిషన్ వారి విచారణ ఫలితముగా పార్లమెంటులో రాజ్యాంగప్రణాళిక చర్చకు వచ్చేలోపల భారత రాజకీయనాయకుల సహాయమును పొందుటకు మార్గముల నన్వేషించేనిమిత్తము" సీమకు పోయెను.

ఆయన సీమనుండి తిరిగివచ్చి చేసినప్రకటనమునుగూర్చి ముందుముందుచర్చింపగలము. ఈలోగా శాసనసభారంగములో కలిగిన పరివర్తనములనుగూర్చి కొంత చెప్పవలసియున్నది.

౧౯౨౯ జనవరిలో తిరిగి ప్రవేశపెట్టబడిన పబ్లికు సేఫ్టీబిల్లు ఏప్రిల్ నెలలో చర్చకు వచ్చెను. ప్రెసిడెంటు దానిని ౧౧ వ ఏప్రిల్ న త్రోసివేసెను. ౨ వ ఏప్రిల్ తేదీని ఈక్రింది ప్రకటనమును చేసెను:

"ఉపసంఘమువారిచే నివేదింపబడినరీతిని పబ్లికుసేఫ్టీబిల్లు తిరిగి చర్చింపబడవలెనని వచ్చిన తీర్మానముపైన చర్చ ప్రారంభింపవలెనని సభ్యులను నేను కోరకముందు ఒకకొన్ని మాటలు చెప్పవలసియున్నవి. క్రిందటిసారి మన సమావేశము జరిగి

నప్పటినుండి అప్పుడప్పుడు సభానాయకునిచే పబ్లికు సేఫ్టీ బిల్లునుగూర్చి చేయబడిన ప్రసంగములను జాగ్రత్తగా పరీక్షించుచుంటిని. ప్రభుత్వమువారు మీరటుకోర్టులో ౩౧ మందిపైన కేసు పెట్టిన సంగతి మీకూ నాకూ తెలుసును. ఇప్పుడిక్కడ చర్చింపబడనున్న పబ్లికు సేఫ్టీ బిల్లుయొక్క ప్రధాన సిద్ధాంతము ఆ ౩౧ మంది ముద్దాయీలకు ప్రతికూలముగా తేబడిన కేసునకు సంపూర్ణముగా అనువర్తింపగలదని నా పరిశ్రమఫలితముగా నేను తెలుసుకొనగలిగితిని. బ్రిటిష్ ప్రభుత్వమువారి రాజ్యములో ఏభాగమునందలి న్యాయస్థానములయందైననూ 'విచారింపబడుచున్న విషయమునుగూర్చి తీర్మానము చేయుటకుగాని, ప్రతిపాదించుటకుగాని, ప్రశ్నవేయుటకు గాని అధికారము లేదనేసంగతి ఈసభానిబంధనలను బట్టి గౌరవనీయసభ్యు లందరికిని తెలిసిన విషయమే. కాబట్టి పబ్లికు సేఫ్టీ బిల్లును విచారించుటను గూర్చిన తీర్మానము మీరటు విచారణలోని విషయము లుదాహరింపకుండా చర్చింపబడుటకు వీలు కలదా అని మున్ముందాలోచింపవలసియున్నది. ఈ సందర్భములో ఈ బిల్లుపైన నిజమైన చర్చ జరుగుట అసంభవమని అందరూ అంగీకరింతురని నా అభిప్రాయము. అదీగాక, ఈబిల్లు నంగీకరించుట అనగా, ఆ కేసుకు సంబంధించిన ప్రధానసిద్ధాంతము నామోదించినట్లే. ఈబిల్లును నిరాకరించినయెడల ఆ సిద్ధాంతమును నిరాకరించినట్లే. ఈ రెండుసందర్భములలో ఏసందర్భములోనైననూ కూడ మీరటు కేసునందలి ఫిర్యాదీ, ముద్దాయీలలో యెవరికో ఒకరికి ఇక్కడి చర్చ ప్రతికూల పరిణామమును కలిగింపకమానదు. ఇటువంటి సమయములో ఈ బిల్లును గూర్చిన ప్రభుత్వమువారిచర్చ యేవిధముగా సాగనిచ్చుటకు నాకు వీలుగలదో తోచుటలేదు. నేను నా నిర్ణయమును ప్రకటించకముందు, ఇప్పుడు నేను చెప్పిన మాటలను ప్రభుత్వమువారు గమనించి, మీరటువిచారణ పూర్తి అయ్యేటంతవరకును బిల్లు నాపివేయుటకు తగిన మార్గముల నాలోచింపవలెననీ, లేక వారిప్పుడే బిల్లంగీకరింపబడవలెనని పట్టుదలగా నున్నయెడల మీరటుకేసు నుపసంహరించుకొనవలెననీ నేను వారికి సలహా నిచ్చినాను. గవర్నమెంటువారీ రెండుసూచనలలో దేనికినీ అంగీకరింపజాలమని ప్రత్యుత్తరమిచ్చిరి. కాబట్టి అధ్యక్షుడు ఇప్పుడీబిల్లును చర్చించేయెడల యీసభాకార్యవిధానమును, నిర్ణయములును దుర్వినియోగము చేసినట్లగును." మరునాడు వైస్రాయి భారతసామ్రాజ్యసభ (State Council) ను, కేంద్రశాసనసభను సమావేశపరిచి, పబ్లిక్ సేఫ్టీ బిల్లులో సూచింపబడిన అధికారములను ప్రభుత్వమువారు పొందవలసియున్నదని ప్రకటించెను. కాబట్టి ప్రభుత్వకార్యనిర్వాహకులకు కావలసిన అధికారములను ఆర్డినెన్సుమూలమున ఆయన ప్రసాదించెను. వైస్రాయి ఉపన్యాసములో తన రూలింగుపైన విమర్శనములు చేయబడిన వని తలంచి పటేలు వైస్రాయిచర్యను

ప్రతిఘటిస్తూ ఆయన ఒక ఉత్తరమును వ్రాసెను. వైస్రాయిపక్షమున ఆయన కార్యదర్శి "మీరుచేసిన నిర్ణయమును విమర్శించుటగాని, లేక మిమ్ములను నిందార్హులనుగా చేయుటగాని వైస్రాయి ఉద్దేశము గాదు. శాసనసభయొక్క గౌరవమును, అధ్యక్షునియొక్క అధికారమును కాపాడుటకు మీవలెనే ఆయనకును సంపూర్ణ బాధ్యతలు కలవు. ఈ విషయములను మీకు వ్రాయవలసినదిగా వైస్రాయి నన్ను కోరెను." అని బదులు వ్రాసెను.

ఇంతకు పూర్వమే వాణిజ్య వివాదచట్టము (Trade Disputes' Bill) ను గూర్చి ఉదాహరించియుంటిమి. ఆ బిల్లు యేప్రిలెనిమిదవ తేదీని అంగీకరింపబడెను. అది అంగీకరింపబడినసంగతి మరచిపోవడమునకు వీలు లేదు. సరిగా ఆసమయములో వోట్లు తీసుకొనబడినపిమ్మట తిరిగీ సభసమావేశమైనప్పుడు అధ్యక్షుడు పనిప్రారంభింతు నని ప్రకటించెను. తక్షణము ప్రేక్షకుల గాలరీలోనుండి రెండు బాంబులు అసెంబ్లీలోని అధికారసభ్యుల బెంచీలమధ్య పడెను. కొందరకు చిన్న చిన్న గాయములు తగిలెను.

కలకత్తా కాంగ్రెసు జరిగిన వెంటనే కాంగ్రెసుకార్యక్రమమును నిర్వర్తించుటకు కార్యనిర్వాహకసంఘమువారు కొన్ని ఉపసంఘములను నియమించిరి. విదేశవస్త్ర బహిష్కారవిషయములోను, మద్యపాననిషేధ విషయములోను, అంటరానితనమువిషయములోను, కాంగ్రెసు నిర్మాణవిషయములోను, వాలంటీర్ల విషయములోను, స్త్రీల అంతులను (Disabilities) తొలగించుటలోను ఉపసంఘములు నియమింపబడెను. చిట్టచివర పేర్కొనబడిన ఉపసంఘమువారేమీ పనిచేసినట్లు కనిపించదు. వారు నివేదిక పంపించలేదు.

వాలంటీర్ల ఉపసంఘమువారు చాలా సిఫార్సులను చేసిరి. ముఖ్యముగా హిందూస్థానీసేవాదళమును బలపరుపవలెననీ, జాతీయకార్యక్రమమును కొనసాగించుటకు వాలంటీర్లకు శిక్షణము నీయవలెననీ వారు సిఫార్సుచేసిరి.

విదేశవస్త్రబహిష్కార సంఘమునకు గాంధీ అధ్యక్షుడు. జయరాందాస్ దౌలత్‌రాము కార్యదర్శి. వారు సంవత్సర మంతా విదేశవస్త్రబహిష్కారమును గూర్చి ప్రచారముచేసిరి. జయరాందాసు బొంబాయిశాసనసభనుండి రాజీనామా యిచ్చి, పూర్తిగా విదేశవస్త్రబహిష్కారముకొరకే తన యావచ్ఛక్తిని వినియోగించెను. బొంబాయిలోనే ఆయన తన కమిటీకార్యస్థానము నేర్పాటుచేసుకొనెను. ఈకమిటీ వారు రాష్ట్రీయ కాంగ్రెసు సంఘములతోను, జిల్లాకాంగ్రెసు సంఘములతోను ప్రత్యక్షసంబంధము కలిగియుండిరి. వీరావిషయములో అనేక కరపత్రములను పంచి పెట్టిరి. మరుసంవత్సరప్రారంభదశలో విదేశవస్త్రదహనము లనేకచోట్ల జరిగినవి.

కలకత్తాలో జరిగిన విదేశవస్త్రదహనము మూలమున ప్రభుత్వమువారు గాంధీపైన కేసు పెట్టిరి.

మద్యపాననిషేధసంఘము సి. రాజగోపాలాచారిపరము చేయబడెను. ఆయన ఈ ఉద్యమము కేవలము తనదిగానే భావించి తన యావచ్ఛక్తిని వినియోగించి పని చేసెను. ఈపని దక్షిణఇండియాలోను, గుజరాతులోను బాగా జరిగెను. ఈ ఉద్యమ మంతర్జాతీయదృష్టి నాకర్షింపగలిగెను. మద్రాసుప్రభుత్వమువారు త్రాగుబోతుతనము వలనను, మత్తుపదార్థముల ఉపయోగమువలనను గలుగు చెడుగులనుగురించి అధికార రీత్యా ప్రచారము చేయించుటకు ౪ లక్షల రూపాయలను ప్రత్యేకించిరి. సంయుక్త రాష్ట్రప్రభుత్వమువారుకూడ ఆదేవిధముగా చేసినట్లున్నారు. రాజగోపాలాచారి భారతమద్యపాననిషేధసంఘములకు కార్యదర్శియై 'ప్రొహిబిషన్' (మద్యపాన నిషేధము) అనే త్రైమాసిక పత్రికకు సంపాదకు డయ్యెను.

అంటరానితనమును నిర్మూలించుపని జమ్నాలాలుబజాజునకు వప్పగింపబడెను. ఆయన ఆవిషయములో కష్టపడి పనిచేసెను. చాలాకాలమునుండి అణగద్రొక్క బడుతూన్న జాతులపైనగల ఆంక్షలను తొలగించుట కాయన అనుకూలప్రజాభిప్రాయ మును కలిగించెను. అనేక సుప్రసిద్ధ దేవాలయములు అంటరానివారి ప్రవేశమున కంగీకరించేటట్లు చేయబడినవి. ఈనిమ్నజాతులకోస మనేకపాఠశాలలును, నూతులును నిర్మింపబడినవి. ఈ అస్పృశ్యతా నివారణకమిటీవారికి దేశములోని అనేక మునిసి పాలిటీలు తోడ్పడినవి. ఈకమిటీకి కార్యదర్శియైన జమ్నాలాలుబజాజు మధ్యరాష్ట్ర ములు, మదరాసు, రాజపుటానా, సింధు, కాశ్మీరము, పాంచాలము, పశ్చిమోత్తర సరిహద్దురాష్ట్రములలో విశేషముగా సంచారము చేసెను.

అస్పృశ్యతానివారణప్రచారమువలన రెండు ఫలితములు కలిగినవి. ఉన్నత జాతుల మని చెప్పుకునేవారు కొంతవరకు నిమ్నజాతులయెడ తమకుగల అన్యాయా ద్వేషభావములను తగ్గించుకొని వారిని దూరముగా నుంచుపద్ధతి తప్పని గ్రహింప గలిగిరి. ఇక నిమ్నజాతుల కాత్మచైతన్యము కలిగి తమ హక్కులను సంరక్షించుకొన వలెననే ధైర్య ముత్పన్నమైనది. కొన్నిస్థలములలో నిమ్నజాతులవారు తమపైన గల ఆంక్షలు తొలగింపబడవలెనని కోరినప్పుడు ఉన్నతజాతులవారు కోరికకు తగినట్లుగా ప్రవర్తించనియెడల సత్యాగ్రహముగాని, సాత్వికనిరోధముగాని ప్రారంభింపబడ వచ్చుననే భీతి కలిగినది. ఆ సంవత్సరములో కలిగిన తీవ్రపరిస్థితులు కాలము గడచిన కొలది మార్పు చెందినవి. అంటరానితనముగాని, మరేయితర ఆంక్షలుగాని కొద్ది కాలములో పోయితీరవలసినదే ననుమాట స్పష్టమైనది.

కాంగ్రెసుపునర్నిర్మాణసంఘమువారు ఆ సంవత్సరప్రారంభదశలోనే తమ నివేదికను పంపిరి. మరుసంవత్సరము జరుగవలసిన కార్యక్రమమున కనుకూలముగా కాంగ్రెసునిర్మాణమును బలవత్తరముగా చేయవలె నని ఆ కమిటీవారు తలంచిరి. కాంగ్రెసుకార్యనిర్వాహకసభ్యులును, అ. భా. కాం. సం. వారును ఆ విషయమును గూర్చి పూర్తిగా విచారించిరి.

సెప్టెంబరుసమావేశములో జరిగిన శాసనసభా వ్యవహారములనుగూర్చి తెలియ చేసేముందు గాంధీకి సంబంధించిన రెండువిషయములను చెప్పవలసియున్నది. గాంధీ భారతదేశమంతటా సంచారముచేస్తూ కలకత్తానుండి బర్మాకు పోయెను. కలకత్తాలో విదేశవస్త్రదహనము జరుపబడెను. అందుకొరకు ౧౯౨౯ మార్చి రెండవవారములో ఆయనపైన న్యాయశాస్త్రనేరముక్రింద కేసు పెట్టబడెను. బహిరంగవీథులలో గడ్డినిగాని, తదితర వస్తువులనుగాని తగులపెట్టకూడ దని జారీచేయబడిన ఉత్తరువులను ఆయన ఉల్లంఘించెనని, లేక ఉల్లంఘించుటకు ప్రోత్సహించెనని కేసు పెట్టబడెను. పోలీసు కమీషనర్ సర్ చార్లసు టెగార్టు కలకత్తా పోలీసుచట్టముక్రింద ౬౬ సెక్షన్ (౨) సబుక్లాజును ఎక్కడనుండియో త్రవ్వి పైకెత్తెను. చచ్చిపోయే మనిషి గడ్డిపోచను పట్టుకొని దేవులాడునని ఒక ప్రతీతి ఉన్నది. కాని సజీవముగానున్న ఈ నిరంకుశ ప్రభుత్వము సిటీపోలీసుచట్టమునుండి ఈ 'గడ్డిపోచ' సెక్షనును పట్టుకొని ఎందుకు దేవులాడవలసివచ్చినదో తెలియకున్నది. బహుశా విదేశవస్త్ర బహిష్కారము వైపు వడి నడుస్తూన్న బండిని శాసనోల్లంఘనమువైపునకు త్రిప్పవలె నని పోలీసువారు ప్రయత్నించి ఉండవచ్చును. కాని వారి ఈప్రయత్నము అపజయము పొందినది. గాంధీ బర్మాకు పోయి కొద్దికాలములోనే తిరిగి వచ్చెను. ఆ తరువాత ఆయనను విచారించి మేజస్ట్రేటు ఒక్క రూపాయ జరిమానావేసెను. పిమ్మట ఆయన ఆంధ్రదేశములో సంచారముకావించి ఆరువారములలో ఖద్దరునిధికొరకు ౨,౬౦,౦౦౦ రూపాయిలను వసూలుచేసెను. వెంటనే ౧౯౨౯ మే నెలలో బొంబాయినగరమున అ.భా.కాం.సం. సమావేశమైనది.

బొంబాయిసమావేశము చాలా ప్రాముఖ్యమైనది. ప్రభుత్వమువారు అసెంబ్లీ గడువు పొడిగింపబడు నని ప్రకటించిరి. దీనిపైన కాంగ్రెసు చర్య తీసుకొనవలసి యున్నది. ఇది యిలా వుండగా భారతదేశ మంతటా నిర్బంధములు సాగినవి. అ. భా. కాం. సం. కార్యనిర్వాహకసభ్యుడు సాంబమూర్తికూడ అరెస్టుచేయబడెను. పాంచాలరాష్ట్రములో నిర్బంధవిధానము మరీ విపరీతముగా నుండెను. అప్పటికే రాబోయే లాహోరుకాంగ్రెసుప్రయత్నముల కత్యంతరములను కల్పించుట కిపన్నా

గము పన్నబడెనేమో అనికూడా అనుమానము కలిగెను. అందుమూలమున ప్రతిరాష్ట్రములోని కాంగ్రెసుసంస్థలును ముందుకార్యక్రమమునుగూర్చి తీవ్రముగా నాలోచింప దొడగెను. బొంబాయిరాష్ట్ర కాంగ్రెసుసంఘమువారు ఆరాష్ట్ర జనసంఖ్యలో ౧/౪% కాంగ్రెసుసభ్యులనుగా చేయవలెనని నిర్ణయింపబడెను. జిల్లాలలో ౩/౪% న్యూన, తాలూకాలలో ౩/౪% న్యూన, గ్రామములలో ౧% న్యూన కాంగ్రెసుసభ్యులుగా నుండవలెనని నిర్ణయింపబడెను. కాంగ్రెసు ఉత్తరువులను సరిగా నిర్వర్తించని ఏ కాంగ్రెసుసంస్థనైననూ కాంగ్రెసునిర్మాణమునుండి తొలగించుటకు అఖిలభారత కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమువారి కధికారము కలదు. భారతశాసనసభలోను, రాష్ట్రీయశాసనసభలలోను కల కాంగ్రెసుసభ్యులు నిర్వర్తింపవలసిన కార్యక్రమమునుగూర్చి నిర్ణయించుటకు అ. భా. కాం. కార్యనిర్వాహకవర్గమువారి కధికార మీయబడెను. తూర్పుఆఫ్రికాలోని భారతీయులు ఆర్థిక రాజకీయసమానత్వమునకు పోరాడే పోరాటమునకు సంపూర్ణసహాయము చేయబడునని అ. భా. కాం. సం. లో తీర్మానింపబడెను. స్వరాజ్యోద్యమమునకు సంబంధించిన రాజకీయ ఆర్థిక వైజ్ఞానిక పరిపాలనా విషయములుకల ఒక కాంగ్రెసుమాన్యుయల్ తయారుచేయబడవలెననీ, అందుకు కావలసిన వ్యయము అ. భా. కాం. సం. భరించవలెననీ తీర్మానింపబడెను.

డాక్టర్ సన్‌యట్‌సేన్ అంత్యక్రియల సందర్భమున కాంగ్రెసుపక్షమున రెవరెండు ఉత్తమ కాంగ్రెసుఅధ్యక్షునిచే పంపబడినందుకు కాంగ్రెసుకార్యనిర్వాహక వర్గమువారు అంగీకరించిరి. సామ్రాజ్య ప్రతికూల సమితివారిచే ఏర్పాటుచేయబడిన మహాసభలో భారతదేశముపక్షమున ప్రాతినిధ్యము వహించుటకు శివప్రసాద గుప్తా యెన్నుకొనబడెను. "బెంగాలు, అస్సాం రాష్ట్రములలోనివారుతప్పతక్కిన రాష్ట్రములలోని కాంగ్రెసుపక్షమున ప్రాతినిధ్యము వహిస్తూన్న రాష్ట్రీయశాసనసభా సభ్యులును, కేంద్రశాసనసభాసభ్యులును ఆయాశాసనసభలకుగాని, ఆయాశాసనసభలచే నియమింపబడిన ఉపసంఘములకుగాని తిరిగి అ. భా. కాం. సం. లో మరియొక విధముగా తీర్మానింపబడేటంతవరకునూ జోక్యము కల్పించుకొనకూడదని నిర్ణయింపబడెను. ఆవిధముగా శాసనసభలకు హాజరుకాని కాంగ్రెసుసభ్యు లందరును వారికాలమును కాంగ్రెసు కార్యక్రమమున కుపయోగింపవలెనని తీర్మానింపబడెను. బెంగాలు అస్సాం శాసనసభలలోనికి కాంగ్రెసుసభ్యులు ఎన్నుకొనబడినపిమ్మట కేవలము తమ పేర్లను రిజష్టరు చేసుకోవడమునకుమాత్రమే వారు హాజరు కావలెను." అని తీర్మానింపబడెను. ఈ మేనెలలో జరిగిన అ. భా. కాం. సం. సభలోనే భారతజాతీయ సాంఘికజీవితమునందు ఆర్థికముగా సంపూర్ణ పరివర్తనము కలుగవలెనని తీర్మానింపబడెను. భారతప్రజలలో వ్యాపించియున్న దారిద్ర్యదుఃఖమును నిర్మూలించి, వారి

స్థితిగతులను బాగుచేయవలెనని కూడా ఆసభలో తీర్మానింపబడెను. మీరటు ఖైదీల సహాయార్థము ౧౫౦౦ రూపాయలు శాంక్షన్ చేయబడెను.

౧౯౨౯ మార్చి ౨౦ వ తేదీని బొంబాయి, పాంచాల, సంయుక్తరాష్ట్రము లలో ఇండియన్ పీనల్ కోడు ౧౨౧ (ఎ) సెక్షన్ క్రింద వందలకొలది ఇళ్లు సోదా చేయబడెను. కొంతమంది అరెస్టు చేయబడిరి. వారిలో ౮ మంది అ. భా. కాం. సం. సభ్యులు కలరు. వా రందరును మీరటుకు విచారణనిమిత్తము పంపబడిరి. ఆకేసే మీరటుకుట్రకేసుగా సుప్రసిద్ధత గడించినది. వారు దేశములో సామ్యవాదప్రచార మును సాగిస్తూండిరని కేసుపెట్టబడెను. వారికితోడు తరువాత 'న్యూస్పార్కు' పత్రి కాధిపతి హెచ్. యల్. హచ్చిన్సన్ కూడ అరెస్టుచేయబడెను. ముద్దాయీల సహా యార్థ మొక కేంద్రసంరక్షకసంఘ (Central Defence Committee) మేర్పాటు చేయబడెను. అందులో ఎక్కువమంది సుప్రసిద్ధ కాంగ్రెసువాదులు కలరు. ఆకేసును గూర్చిన ప్రారంభవిచారణ కొన్నినెలలు పట్టెను. సంవత్సరాంతములో కేసు పూర్తి అయ్యెను. ఈవిచారణ ఇంగ్లాండు, ఇండియాల దృష్టిని ఆకర్షింపగలిగెను. ఈకేసులో ప్రచారముకొరకున్ను, ప్రకటనముకొరకున్ను చేయబడిన ఏర్పాటులను స్వయ ముగా తనిఖీచేయుటకు గవర్నమెంటు పబ్లిసిటి డైరెక్టరు ప్రత్యక్షముగా కోర్టుకు హాజరయ్యెను.

తరువాత కొంతకాలమునకే జులై ౧౫ వ తేదీని ఢిల్లీనగరములో కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గము సమావేశమైనది. స్వరాజ్యోద్యమముయొక్క శ్రేయస్సు కొరకు వివిధ శాసనసభలలోని సభ్యులను రాజీనామా ఈయవలెనని ఆసభవా రభి ప్రాయపడిరి. ఈవిషయము చాలా ముఖ్యమైనదగుటచే అ. భా. కాం. సం. వారి చివరి నిర్ణయమునకు వదలివేయబడెను. కాబట్టి ౧౯౨౯ జులై ౨౬ వ తేదీని అలహాబాదులో అ. భా. కాం. సం. జరుపబడవలెనని నిర్ణయింపబడెను. కలకత్తా కాంగ్రెసులో అంగీకరింపబడిన ప్రధానతీర్మానములోని చివరభాగమునుబట్టి కాంగ్రెసు సభ్యుల ఆదాయములో కొంతభాగమును వారు కాంగ్రెసునిధులకు జమకట్టించవలసియున్న దని పాఠకులు జ్ఞాపకముంచుకొనియుందురు. మొట్టమొదట ౫% చొ. చెల్లింపబడ వలెనని సూచింపబడినది. తరువాత ౨½% చొ. న అని కొందరు సూచించిరి. కాని ఆ సభలోని కొందరు ధనవంతులు ప్రకటించిన భయమును గమనించి, ఆవిషయము వ్యక్తుల నిర్ణయమునకు వదలివేయబడెను. ఆవిధముగా వసూలయిన మొత్తములు జులై నెల బుల్లెటిన్లో ప్రకటింపబడెను. దానినిబట్టి చాలా తక్కువసొమ్ము మాత్రమే వసూలైనదని తెలియగలదు.

ఈ కాలములో నిర్బంధవిధాన మెక్కువగా సాగింపబడుతూండెను. సండర్ ల్యాండుచే రచింపబడిన "అస్వతంత్ర భారతదేశము" (India in Bondage) అనే పుస్తకము ప్రభుత్వమువారిచే నిషేధింపబడెను. ఆపుస్తకమును ప్రకటించినందుకు మాడరన్ రివ్యూపత్రికా సంపాదకుడు బాబూ రామానంద ఛటర్జీ అరెస్టుచేయబడెను.

అసెంబ్లీ బాంబు కేసు సందర్భమున అరెస్టుచేయబడిన భగత్‌సింగు, దత్తులకు యావజ్జీవ ద్వీపాంతరవాసము విధింపబడెను. వారు కేవలము ప్రదర్శనము నిమిత్తమే బాంబువేయబడినదని ప్రకటించిరి.

లాహోరు కుట్రకేసు సందర్భమున జరిగిన నిరశనవ్రతముసంగతి చాలామందికి తెలిసియేయుండును.

కలకత్తాలో మరికొంతమందిమీద కేసు పెట్టబడెను. అందులో కాంగ్రెసు కార్యనిర్వాహకసభ్యుడు సుభాస్‌చంద్రబోసున్ను, ఇంకా అనేక సుప్రసిద్ధ కాంగ్రెసు వాదులున్ను విచారింపబడిరి.

షాంగుహాయి, మలయారాజ్యములనుండికూడ కొంతమంది భారతీయులు రాజకీయకార్యములవలన అరెస్టుచేయబడినట్లు వార్తలువచ్చెను.

రాజకీయ ప్రచారకులపైననూ, కార్మికనాయకులపైననూ పెట్టబడిన ఈకేసులకు తోడు పోలీసువారు ఇంకా అనేకవిధములగు క్రూరనిర్బంధములను సాగించిరి. లాహోరు ఖైదీల ప్రతివాదమునిమిత్తము సొమ్మును వసూలుచేస్తూన్న ఏడుమందియువకులు జిల్లా మేజస్ట్రేటు కట్టెదుట పోలీసువారిచే క్రూరముగా కొట్టబడిరి. వారందరికి తీవ్రమైన గాయములు తగిలినవి. కొందరు స్మృతితప్పి పడిపోయిరి. "సామ్రాజ్యతత్వము నశించుగాక, విప్లవము చిరస్థాయి అగుగాక" అని వారు కేకలువేసినందు కాప్రాయశ్చిత్తము చేయబడెను. లాహోరు కుట్రకేసులోని విచారణఖైదీల సందర్భములో పోలీసువారింతకంటెనూ మొరటుతనముగా ప్రవర్తించిరి. విచారణమేజస్ట్రేటుయెదుట బహిరంగమైన న్యాయస్థానములో వారు కొట్టబడిరి. కోర్టుకు వెలుపలివారి కింతకంటెను ఎక్కువ అవమానములు కలిగినవని తెలియవచ్చెను.

ఇటీవల జరిగిన విచారణల, శిక్షల మాట అలా ఉండగా అనేకమంది దీర్ఘకాలపు రాజకీయఖయిదీలు అండమానుదీవులలోనూ, భారతదేశమునందు కల వివిధ కారాగృహములలోనూ నిర్బంధింపబడిరన్న సంగతి జ్ఞాపకముంచుకొనవలెను. వారిలో పాంచాలమునందు ౧౯౧౫ లో సైనిక శాసన సందర్భమున ప్రత్యేకన్యాయస్థానములచే శిక్షింపబడిన ఖయిదీలున్ను, ౧౮౧౮ నాటి మూడవ రెగ్యులేషన్ క్రింద నిర్బంధింప

బడిన డిటెన్యూలున్ను కూడా కలరు. వీరికి తోడు ౧౯౧౪-౧౫ లో యుద్ధ సమయ మున యావజ్జీవ ద్వీపాంతరవాసము విధింపబడిన ౨౭ గురు రాజకీయ ఖయిదీలు జైళ్లలో నుండిరి. వారందరునూ మామూలున్యాయస్థానములలో విచారింపబడలేదు. ప్రత్యేక కమీషనర్లచే విచారింపబడి శిక్షింపబడిరి.

ఈ సంవత్సరములో కార్మికసమస్యలుకూడ తలయెత్తి సమ్మెలు కొనసాగింప బడినవి. బొంబాయి బట్టలయంత్రములలోని లక్ష యాభై వేలమందికూలీలు సమ్మె కట్టిరి. ఆసమ్మెమూలమున భారతీయకార్మికుల నూతన దృక్పథము ప్రదర్శింపబడెను. ఆ సమ్మె మొదట జయప్రదముగా కనపడెను. ఆ సమ్మెకు వెనుక నున్న నిర్మాణ సామర్థ్యము దానిమూలమున ప్రదర్శింపబడెను. కాని ఆరునెలల పిమ్మట అది అప జయము పొందెను. వంగరాష్ట్రపు జనపనారమిల్లులలో ౨౫ వేల మంది కూలీలు సమ్మెకట్టిరి. కాని వారిలో నిర్మాణచాకచక్య మేమీ కన్పించలేదు. అక్కడక్కడ కొన్నికొన్ని చిన్నచిన్న సమ్మెలు జరిగినవి. కాని వారు పెద్ద సమ్మెచేసిన పనికి కూడ హానికలిగించిరి.

జమ్షెడ్పూరుకు దగ్గరగానున్న గోల్మూరిలోని తగరపుపనివాండ్ర సమ్మెకట్టు కూడా భారతీయులదృష్టి నెక్కువగా ఆకర్షించెను. ఇందులో 3 వేలమంది నిపుణు లైన పనివాండ్రు కలరు. ఆసమ్మె ౮ నెలల ౧౫ రోజుల వరకును సాగెను. సమ్మె దారులు చాలా స్వల్పవిషయములనే కోరిరి. కాని మిల్లుయజమానులును, బీహారు ప్రభు త్వమువారును విచారణచేయుటకుకూడ నిరాకరించిరి. భారతశాసనసభవారు ప్రభు త్వమువారి ఈచర్యను గర్హిస్తూ తగరపుపరిశ్రమకు ప్రభుత్వమువారుచేసే సహాయమును ఉపసంహరించుకోవలెనని తీర్మానించిరి. సాధారణముగా భారతశాసనసభా తీర్మాన ములకు పట్టెడి గతివలెనే ఈతీర్మానమునకుకూడ పట్టి అది బుట్టదాఖలయ్యెను. విచారణ జరుగనేలేదు. సమ్మె కొనసాగింపబడెను. ఈసమ్మెదారుల సానుభూతికొరకు బజ్జిబజ్జి లోను, తదితరప్రదేశములలోను మరికొన్ని సమ్మెలు జరిగినవి.

౧౯౨౮ లో దక్షిణఇండియారైల్వే సమ్మెజరిగెను. ఆసమ్మెలో అనేకమంది కుట్రకేసుక్రింద శిక్షింపబడిరి. ఏప్రిల్ నెలలో తిరుచినాపల్లి జడ్జి అందులో ౧౫ గురు ముద్దాయిలకు ౧౦ సంవత్సరముల కఠినశిక్ష విధించెను.

కాంగ్రెసు కార్యనిర్వాహకసభ్యులలో నిద్దరీ సంవత్సరము చాలాకాలమువర కును విదేశసంచారము గావించిరి. సరోజినీదేవి అమెరికాలో జయప్రదముగా సంచా రముచేసి ఆగస్టునెలలో తిరిగి ఇండియాకు వచ్చెను. నవంబరులో ఆమె తూర్పు ఆఫ్రికాభారతీయ మహాసభ కధ్యక్షత వహించుట కక్కడికి పోయెను. కాంగ్రెసు

కోశాధిపతులలో ఒకరగు శివప్రసాదగుప్త చాలా నెలలవరకును యూరపులోనే సంచారముచేసెను.

శివప్రసాదగుప్త భారతజాతీయ మహాసభపక్షమున జూలై నెలలో రెండవ "సామ్రాజ్యప్రతికూల ప్రపంచకమహాసభ"కు హాజరయ్యెను. ఆ సభనుగూర్చిన నివేదిక వర్కింగుకమిటీముందు చర్చకు పెట్టబడెను.

కలకత్తా కాంగ్రెసు జరిగిన వెంటనే కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గము వారు బర్లిన్‌లో విద్యార్థి ప్రచురణ సంఘ (Students' Information Bureau) నిర్మాణముకొరకు నెలకు 30 పౌనుల చొప్పున ఇచ్చుటకు మంజూరుచేసిరి. తరువాత కొద్దికాలమునకే ఎ. సి. యన్. నంబియార్ తనిఖీక్రింద ఆ సంఘము స్థాపింపబడెను. అది బర్లిన్ నగరమునందలి అనేకమంది భారతీయ విద్యార్థులకును, ప్రేక్షకులకును సహాయము కావించి, తన ధర్మమును నిర్వర్తించెను. శివప్రసాదగుప్త ఐరోపాఖండ సంచారము చేసినప్పుడు ఆసంస్థను దర్శించి చాలా శ్లాఘించెను. ఆయన చేసిన సిఫార్సుపైన కాంగ్రెసు కార్యవర్గమువారు నెలకు మరిరెండు పౌనులు పఠనాలయమునిమిత్తము మంజూరు చేసిరి. ఆ సంఘకార్యక్రమము చాలా సమర్థతతో నిర్వర్తింపబడెను. నెలసరి లెక్కలున్ను, నివేదికలున్ను క్రమముగా కాంగ్రెసు కార్యాలయమునకు చేరుతూండేవి. నంబియార్ చేసిన గౌరవసేవయే దాని జయమునకు ముఖ్య కారణము.

విదేశములలో పనిచేసేనిమిత్త మొకశాఖ అ. భా. కాం. సం. వారిచే స్థాపింపబడవలె నని కలకత్తాకాంగ్రెసు ఆజ్ఞాపించెను. కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమువారీ విషయములో తగుచర్య నడిపింపవలెనని కాంగ్రెసు కార్యదర్శి కధికార మిచ్చిరి. కాంగ్రెసు కార్యదర్శి విదేశశాఖకు సంబంధించిన పనిని తాను స్వయముగా చూడదొడగెను. విదేశములలోని వ్యక్తులతోను, సంస్థలతోను సన్నిహిత సంబంధములు కల్పించుకొనుట కాయన ప్రయత్నించెను. ఇది చాలా కష్టతరమైన పని. విదేశములనుండి వచ్చే ఉత్తరప్రత్యుత్తరములపైన ప్రభుత్వమువారి 'నిగా' ఎక్కువగా నుండుటచే త్రోవలో అనేకచిక్కులు తటస్థించుటకు వీలుకలదు.

అ. భా. కాం. సం. వారి నిర్ణయముల కనుగుణముగా ఒక కార్మిక పరిశోధన శాఖ (Labour Research Department) స్థాపింపబడెను. అది అ. భా. కాం. సం. కార్యాలయమునకు శాఖగా పనిచేయదొడగెను.

హిందూస్థానీ సేవాదళమునందలి వివిధభాగములలోని వాలంటీర్లకు శిక్షణ మిచ్చిరి. ముఖ్యముగా కర్ణాటరాష్ట్రములో ఈ పని ఎక్కువగా జరిగెను. ఆరాష్ట్రము

లోనే సేవాదళమువారి ప్రధానకార్యాలయము మున్నది. అక్కడే వారి సాధనాలయము కూడా కలదు. దేశములో ఇంకా అనేకచోట్ల అనేక శిబిరములు స్థాపింపబడినవి. స్వచ్ఛందసైనికశిక్షణ మీయగలవారు కావలసినంతమంది లభించను కూడ లభించలేదు. కాంగ్రెసుసభ్యులను చేర్చుటకును, విదేశవస్త్ర బహిష్కారమునకును సేవాదళము బాగా పని చేసినది. లాహోరుకాంగ్రెసుకు కావలసిన సమర్థులైన వాలంటీరుపటాలములను తయారుచేయుటకు సేవాదళము చాలా సహాయము చేసెను.

హిందూస్థానీ సేవాదళము ఆసేతు హిమాచల పర్యంతము ప్రతినెల జాతీయ పతాకోత్సవములను జయప్రదముగా జరిపించెను. ప్రతినెల చివర ఆదివారమురోజున ఉదయము ౮ గంటలకు జాతీయపతాకము ప్రతిష్ఠింపవలె నని వారు కలకత్తాలో తీర్మానించిరి. ఇందుమూలమున జాతీయపతాకము ప్రజానురంజకత్వమును గడించినది. వ్యక్తులు తమ గృహములపైన జాతీయ పతాకములను ప్రతిష్ఠించుకొనిరి. అనేక మునిసిపాలిటీలపైన కూడ కాంగ్రెసుజెండాలు నిలుపబడెను. హిందూస్థానీ సేవాదళము పునర్నిర్మింపబడెను. దాని నిర్మాణవిధానము అనుబంధములో చూపబడినది.

నిర్బంధ విధానమునకు సంబంధించినంతవరకు ఆగస్టునెల క్రిందటి నెలలకు తీసిపోలేదు. ప్రతిచోటా నాయకు లరెస్టుచేయబడిరి. సర్దార్ మంగల్‌సింగ్, మౌలానా జాఫరాలీఖాన్, మాస్టరు మోతాసింగు, డాక్టరు సత్యపాలులు పాంచాలరాష్ట్రములో అరెస్టుచేయబడిరి. మోతాసింగు ౭ సం. శిక్షను పూర్తిగా అనుభవించెను. ఆంధ్రదేశములో అన్నపూర్ణయ్య అరెస్టుచేయబడెను. డాక్టరు సత్యపాలుకు 3 సం. కఠినశిక్ష విధింపబడెను. పాంచాలరాష్ట్రములోని నిర్బంధము చెప్పతరము కాకుండెను. బైటనున్నవా రీ విధముగా నిర్బంధింప బడుతూండగా జైళ్లలో నున్నవారు మిక్కిలి బాధింపబడిరి. దత్తు, భగత్ సింగులున్ను, ఇంకా తదితర ఖైదీలున్ను అప్పటికి ౬ వారములనుండీ నిరాహారదీక్ష నవలంబించిరి. అసెంబ్లీ బాంబుకేసు సందర్భమున దత్తు, భగత్‌సింగులకు యావజ్జీవద్వీపాంతరవాసశిక్ష విధింపబడెను. వారు లాహోరు కుట్రకేసులోకూడ ముద్దాయీలే. కాని ఆ కేసులో దత్తు విడుదల చేయబడెను. లాహోరు కుట్రకేసుకు మూలము సాండర్సుహత్య. ఆయన పోలీసు ఉద్యోగి. ౧౯౨౮ సెప్టెంబరు ౧౭ వ తేదీ సాయంకాలము నాల్గు గంటలకు ఆయన హత్యచేయబడెను. లాహోరుశిక్షితులు జైళ్లలోని ఖైదీలు మానవులుగా చూడబడవలె నని నిరాహారదీక్ష బూనిరి. అందులో యతీంద్రనాథదాస్ సుప్రసిద్ధుడు. యతీంద్రుడు జైళ్లలో ఐరోపా ఖండవాసుల నొక విధముగాను, భారతీయులను మరొకవిధముగాను చూచేపద్ధతి బాగుండలే దని ఈ కఠిన నియమమునకు

పూనెను. అంతేకాని యూరపియనులకు చేయబడుతూన్న ప్రత్యేకసౌకర్యములను గూర్చి ఆయన కేమీ జోక్యము లేదు. ఆయన మాక్స్వినీవలె జీవితాంతమువరకును నిరశనవ్రతమును కొనసాగించిన ఏకైకవ్యక్తి.

ఈ సంవత్సరములో భారతజాతీయమహాసభకు ఇంగ్లండు దేశములోను, ఐరోపాఖండములోను గల అనేకజాతీయసంస్థలతోను, అంతర్జాతీయ సంస్థలతోను సంబంధము కుదిరెను. బొంబాయిలో ఒక కాంగ్రెసుమహమ్మదీయపక్ష మేర్పాటు చేయబడెను. అలహాబాదులో అ. భా. కాం. సం. సమావేశ సందర్భమున ఒక అఖిల భారతజాతీయ మహమ్మదీయపక్షము నిర్మింపబడెను. అలహాబాదు సమావేశములో కాంగ్రెసు శాసనసభ్యులు తమస్థానములకు రాజీనామా లీయవలసిన దని కాం గ్రెసు కార్య వర్గమువారు వెల్లడించిన అభిప్రాయము ఆమోదింపబడెను. కాని ఆ విషయములో వచ్చిన ఉత్తరము లన్నింటిని గమనించి లాహోరు కాంగ్రెసువరకును వారి తీర్మానము నమలుజరుపక నిలిపివేయ తలపెట్టిరి.

లాహోరు ఖైదీల నిరశన వ్రతమును గూర్చి ఇంతకుపూర్వ ముదాహరించి యుంటిమి. గవర్నమెంటువారి కానిరశనవ్రతముమూలమున కష్టము కలిగెను. వారు లాహోరు కుట్రకేసు పెట్టిన పోలీసువారిని బాధించుటకే నిరశనవ్రతము లుద్దేశింప బడిన వని తలచిరి. కాబట్టి ౧౯౨౯ సెప్టెంబరు ౧౨ వ తేదీని ప్రభుత్వమువారు భారత శాసన సభలో ఒక బిల్లును ప్రవేశపెట్టిరి. ఎవరైన ముద్దాయీలు తమంతట తాము కోర్టుకు హాజరు కాకుండా ఉండేటట్టు తమ చర్యలవలన అశక్తులనుగా చేసుకొనిన యెడల వారు లేకపోయినప్పటికీ కేసును కొనసాగించుటకు మేజస్ట్రేటు కధికార మీయ బడెను. ఇది వివాదగ్రస్తమైన బిల్లు కావటముచేత సెప్టెంబరు ౨౬ వ తేదీని దీనిని సభ్యుల అభిప్రాయముకొరకు పంపుట కంగీకరించిరి. కాని అవసరసందర్భములో వారి అధికారములను వినియోగించుకొనే హక్కుమాత్రము వారి కిందుమూలమున పోలేదని ప్రకటించిరి. తరువాత కొద్దికాలమునకే వైస్రాయి ఈసందర్భములో 'లాహోరు కుట్ర విచారణ ఆర్డినెన్సు' అనే పేరుతో ఒక ఆర్డినెన్సును జారీచేసెను.

ముందెన్నో మహత్కార్యములు జరుగ నుండెను. చరిత్ర ప్రసిద్ధమైన లాహోరుకాంగ్రెసుకు సుప్రసిద్ధుడైన అధ్యక్షుడు కావలసి ఉండెను. ౧౦ రాష్ట్రములు గాంధీకి వోటుచేసినవి. ౫ వల్లభాయి పటేలుకు వోటు చేసినవి. 3 జవహర లాల్‌కు వోటు చేసినవి. గాంధీ ఎన్నుకొన బడినట్లు ప్రకటింపబడెను. కాని ఆయన రాజీనామా ఇచ్చెను. కాంగ్రెసునిబంధనావళిప్రకార మాయనకు బదులుగా మరి యొక రెన్నుకొనబడవలసిఉండెను. ౧౯౨౯ సెప్టెంబరు ౨౯ తేదీని లక్నోలో అ.

భా. కాం. సం. సమావేశ మందుకు జరుపబడెను. కాంగ్రెసు అధ్యక్ష పదవినిగూర్చిన విషయము యావద్భారతజాతికీ సంబంధించినది.

దేశీయులదృష్టి ఒక్కసారిగా గాంధీవైపునకు మరలెను. ఆయన ఒక్కడే కాంగ్రెసు రథమును విజయమార్గమున పట్టింప గల డని దేశీయులు తలచిరి. అప్పటి కప్పుడే మోతీలాల్ జీవంటి నాయకులు శాసన సభలతో విసిగి వేసారిపోయి రన్న మాట బహిరంగ మయ్యెను. శాసన సభ్యులు రాజీనామాల నీయవలెననియే ప్రజల అభిప్రాయ మైనట్లు స్పష్టమయ్యెను. అయితే తరువాత జరుగవలసినదేమి? శాసనోల్లంఘనముతప్ప గత్యంతరము లేదు. ఈ శాసనోల్లంఘన దుర్గమ మార్గమునుండి భారత జాతిని విజయపథమునకు నడిపింపగలవారు గాంధీ తప్ప మరి ఎవ్వరు? అందువల్లనే ఎక్కువ రాష్ట్రీయ కాంగ్రెసుసంఘములు గాంధీపేరు సూచించెను.

లక్నోలో గాంధీ తన రాజీనామానుగూర్చి పునర్విచారణ చేయుటకు కోరబడెను. కాని ఆయన భారతీయ యువకులలో నూతనోత్సాహమును పురికొల్పగల ఒక కాంగ్రెసు యువకునకు పట్టాభిషేకముచేయుటలో విశేష మున్నదని తలచెను. ఈ భారతజాతీయమహారథము ఒకచోటనుంచి మరి యొకచోటకు కదులుతూ వచ్చినది. అది అహమ్మదాబాదు, గయా, ఢిల్లీ, కాకినాడ, బెల్గాము, కాన్పూరు, గౌహతి, మద్రాసు, కలకత్తా నగరములను తన నడకతో పునీతము కావించినది. ఇప్పు డది లాహోరుకు పోనుండెను. ఇందులో యువకులు, మధ్య వయస్కులు, వృద్ధులునూకూడాకలరు. వృద్ధులు పతాకమును సగర్వముగా చేపూనిరి. మధ్యవయస్కు లాపతాకచ్ఛాయలయం దుండుటయే గౌరవముగా భావించిరి. యువకులీవృద్ధమూర్తుల పాతపద్ధతులను నిరసించిరి; కాని నూతనమార్గముల నన్వేషింప లేకపోయిరి. రథము సకాలములో యాత్రికులనందరనూ తీసుకొని పోవలెనన్నయెడల దానికి యువకులలో నూతనోత్సాహమును, ఉత్తేజమును కల్పింపగల సారథులుండ వలెను. అనుభవముగల మేధాశాలియగు వయోవృద్ధుడు రథికుడుగా నున్నయెడల రథము పెడమార్గమును బట్టుటకు వీలులేదు. ఈవాదము గాంధీకి నచ్చినది. వల్లభాయి గాంధీ, జవహరలాలులమధ్య జోక్యము కల్పించుకొనలేదు. లక్నోలో జరిగిన అ. భా. కాం. సం. సమావేశమునకు ఎక్కువమంది సభ్యులు హాజరుకాలేదు. అక్కడకువచ్చిన స్నేహితులలో ఎక్కువమంది జవహరలాల్ పండితునకు వోటుచేసిరి. ఆయన ఇంతవరకైన కాంగ్రెసుప్రెసిడెం ట్లందరిలోకి పిన్నవయస్కుడు. వంగ రాష్ట్రము గాంధీ అధ్యక్షుడుకావలెనని తపించుట విచిత్రముగాకనబడినది. వారు గాంధీకొరకితర రాష్ట్రములకు సర్క్యులర్లనుకూడా పంపిరి.

లక్నోలోని అ. భా. కాం. సం. వారి దృష్టిని మరియొక ముఖ్యవిషయ మాకర్షించెను. పంజాబు జెలులలో ౬౪ దినము లుపవాసముచేసి మరణించిన యతీంద్రనాథ దాసునుగురించీ, బర్మాలో ౧౬౪ రోజు లాకలితో మరణించిన రెవరెండు విజయాను గురించీ వారు విచారసాగరమున మునిగిరి. వీ రిరువురును మాతృపాదములకడ ప్రాణములను త్యజించిరి. రెండవవారికంటె మొదటివారు భారతదేశపుదృష్టి నెక్కువగా ఆకర్షించగలిగిరి. ఫూంజీ విజయామరణమునుగూర్చి ఒక్కమాట చెప్పవలసియున్నది. ఈయన బౌద్ధసన్న్యాసి. రాజద్రోహనేరముక్రింద శిక్షింపబడి, ౨౧ మాసముల కఠినశిక్షననుభవించి, ౧౯౨౯ ఫిబ్రవరి ౨౫ తేదీని జైలునుండి విడుదలచేయబడెను. తరువాత సరిగా ౫ వారములకే, ఏప్రిల్ ౪ వ తేదీని రాజద్రోహనేరముక్రింద ఆయన తిరిగీ అరెస్టుచేయబడెను. ఆయన కాకేసులో మొట్టమొదట ౬ సం.ల ద్వీపాంతరవాసశిక్ష విధింపబడెను. తరువాత అది 3 సం. లకు తగ్గింపబడెను. ఆయన అరెస్టు చేయబడిన వెంటనే జైలధికారులు తనయెడల సరిగా ప్రవర్తింపవలెననీ, పరవడిరోజులలో బౌద్ధసన్న్యాసులు ధరించే కాషాయవస్త్రములను తనకుకూడా ధరింపనీయవలసినదనీ కోరుతూ నిరాహారదీక్షను ప్రారంభించెను. ఆ విధముగా ఆయన ౧౬౪ రోజు లుపవాసముచేసి ౧౯-౯ ౧౯౨౯ న మరణించెను.

దీని కారురోజులుముందుగా ౧౯౨౯ సెప్టెంబరు ౧3 వ తేదీని యతీంద్రనాథ దాసు స్వర్గస్థుడయ్యెను. ఈవిధముగా వరుసగా రెండువారములలో జాతీయాత్మ గౌరవమును ప్రతిష్ఠించుటకొరకు హృదయపూర్వకముగాను, స్వచ్ఛందముగాను ఈ యిద్దరు దేశభక్తులూ ప్రాణములను సమర్పించిరి. యతీంద్రుని మరణమువలన భారతీయులకు కలిగిన దుఃఖమున్నూ, వారి కా దేశభక్తునియందు గల గౌరవమున్నూ కలకత్తాలో జరిగిన మహోత్సవములమూలముననూ, ప్రదర్శనముల మూలముననూ వ్యక్తమయ్యెను. ఆయనవిషయములో విదేశములనుండికూడ సానుభూతిసందేశములు పంపబడెను. ఐర్లెండుదేశభక్తుడు మాక్స్వినీకుటుంబమునుండికూడ ఒకసానుభూతిసందేశము వచ్చెను.

ఈవిషయమును విడిచి మరియొకవిషయమునకు పోయేలోగా లక్నోలో సెప్టెంబరు ౨౫ తేదీని సమావేశమైన అ. భా. కాం సం. వారు ఈ విషయములో చేసిన తీర్మానమునుగూర్చి చెప్పవలసియున్నది. వారు నిరాహారవ్రతమును పూనిన ఖైదీల సద్భావమును శ్లాఘించిరి. కాని అత్యవసరసందర్భములలో తప్ప అట్టి దుర్ఘటకార్యములకు పోకూడదని అభిప్రాయమిచ్చిరి. విజయా, దాసుల ఆత్మసమర్పణమును గమనించిన్నీ, ప్రభుత్వమువారు చిట్టచివరకు నిరాహారదీక్ష నవలంబించినవారి కోరికల నంగీకరింపబూనిరి కాబట్టిన్నీ తదితర నిరశనవ్రతులను ఉపవాసము మానివేయవలసినదిగా కూడా అ. భా. కాం. సం. సలహాయిచ్చెను.

సోపానపరంపరగా నభివృద్ధిపొందించుటయే ౧౯౧౭ ఆగస్టులో చేయబడిన ప్రకటన యొక్క ఉద్దేశము. బ్రిటిషుతంత్రముయొక్క ఆదర్శము ప్రకటింపబడుట కదియే మొదటిసారి. బ్రిటిషిండియా అధినివేశరాజ్యములలో తగిన స్థానమును పొందుటకు ౧౯౧౯ వ సం. పార్లమెంటు ప్రణాళికయే ఆధారముగా నుండవలెనని చక్రవర్తిగారి ఉద్దేశమైనట్లు వారివద్దనుంచి వచ్చిన నాసలహాపత్రములో స్పష్టీకరింపబడినది. ఈవిషయము నే నిటీవల చెప్పియేయుంటిని. అంతేకాక కాలము పరిపక్వమైనవెంటనే భారతదేశ మధినివేశరాజ్యములతో బాటు సామ్రాజ్యములో సమానభాగస్వామిగా నుండవలెనని బ్రిటిష్ప్రభుత్వమువారి ఉద్దేశమైనట్లు బ్రిటిష్మంత్రు లనేకమార్లు బహిరంగముగా చాటించిరి. కాని ౧౯౧౯ నాటి రాజ్యాంగప్రణాళిక నమలుజరుపుటయందు బ్రిటిష్ప్రభుత్వమువారి ఉద్దేశములనుగూర్చి వ్యాఖ్యానము చేయుటలో ఇంగ్లండులోనూ, ఇండియాలోనూ కూడా కొన్ని సందేహములు కలిగినందున ౧౯౧౭ నాటి ప్రకటనలో ఉద్దేశింపబడిన భారతరాజ్యాంగ నిర్మాణముయొక్క సహజపరిణామము అధినివేశప్రతిపత్తియే యని స్పష్టముగా ప్రకటించుటకు బ్రిటిష్వారి పక్షమున నా కధికార మీయబడినది. "

ఈప్రకటనము చేయబడినరోజున ౨౪ గంటలలో మాలవ్యా, సర్ తేజ బహద్దరు సప్రూ, డాక్టరు బెసెంటు మొదలైన భారతదేశపు ప్రముఖులు ఢిల్లీ వెళ్లిరి. కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమువా రక్కడనే యుండిరి. వీరందరునూ కలసి చర్చించుకొని కొన్ని నిర్ణయములను చేసిరి. అవి ఒక ప్రకటనరూపములో ప్రచురింపబడినవి. ఆ ప్రకటనమునందు సంతకములు చేసినవారు దానిలోని సద్భావమును, భారతప్రజాభిప్రాయమును సంతృప్తిపరచవలెననే కోరికను శ్లాఘించిరి.

పైన ఉదాహరింపబడిన రాజకీయనాయకుల ప్రకటనయందు "భారతీయుల కనుకూలమైన అధినివేశరాజ్యాంగ ప్రణాళికను తయారుచేయు ప్రయత్నమునందు బ్రిటిష్ప్రభుత్వమువారికి మేము సహాయముచేయుటకు వీలుకలుగగలదని మా ఆశ. కాని దేశములోని ముఖ్యరాజకీయసంస్థలయొక్క సహాయమును పొందుటకున్నూ, విశ్వాసమును చూరగొనుటకున్నూ ముందుగా కొన్ని విషయములు స్పష్టీకరింపబడవలసియున్నవి; మరికొన్ని కార్యములు నిర్వర్తింపబడవలసియున్నవి.

"వైస్రాయిప్రకటనములో సూచింపబడిన మహాసభ విజయము పొందవలెనన్నయెడల ముఖ్యముగా,

"(ఎ) శాంతివాతావరణమును సమకూర్చునిమిత్తము సమాధానపద్ధతు లవలంబింపబడవలెను.

" (బి) రాజకీయఖైదీలు విడుదలచేయబడవలెను.

" (సి) ఉదారరాజకీయసంస్థలకు తగిన ప్రాతినిధ్య ముండవలెను. వాటిలో అత్యంత విశాలమైన భారతజాతీయమహాసభ కత్యధికప్రాతినిధ్య ముండవలెను.

" (డి) బ్రిటిష్‌ప్రభుత్వపక్షమున వైస్రాయి చేసిన ప్రకటనలోని అధినివేశప్రతిపత్తినిగూర్చిన వ్యాఖ్యానమునందు కొంత సందేహము వెల్లడింపబడినది. ఆ మహాసభ భారతదేశమునం దెప్పుడు అధినివేశప్రతిపత్తి స్థాపింపబడవలెనో విచారించుటకుకాక, కేవలము అధినివేశరాజ్యాంగప్రణాళికను తయారుచేయుటకే సమావేశము కానున్నదని మాకు తెలియవచ్చినది. వైస్రాయియొక్క మహత్తరమైన ఆ ప్రకటనములోని భావములను,తత్త్వమును ఈవిధముగా వ్యాఖ్యానముచేయుటలో మేము పొరబడలేదని మా అభిప్రాయము. క్రొత్తరాజ్యాంగప్రణాళిక అమలులోనికి వచ్చేలోగా దేశపరిపాలనలో ఔదార్యము చూపబడవలెననీ, శాసనసభలకునూ, కార్యనిర్వాహకులకునూ సన్నిహిత సంబంధ ముండవలెననీ, రాజ్యాంగపద్ధతులయందునూ, వాటి ఆచరణయందునూ ఇంకా యెక్కువ గౌరవము చూపబడవలెననీ మా అభిప్రాయము. ఈ రోజునుండి నూతన యుగము ప్రారంభమైనదనే నమ్మకము ప్రజలకు కలిగించుట ముఖ్యావసరమనీ, నూతన రాజ్యాంగచట్ట మా నూతనయుగప్రతిబింబముగా నుండవలెననీ మా ఆశయము.

" మహాసభ జయప్రదముగా కొనసాగింపబడవలెనన్నచో సాధ్యమైనంత తొందరలో అది సమావేశపరుపబడవలెనని మా చిట్టచివరి మనవి."

కార్మికపక్షమువారి విశాలదృష్టియే ఈనూతనపంథాకు కారణము. సర్ జాన్ సైమన్ ప్రధానమంత్రికి వ్రాసిన ఉత్తరములో ఒకవిధమైన మహాసభాసమావేశమును గూర్చి ఉదాహరింపబడెనని వైస్రాయిప్రకటనమునుబట్టి తెలిసియుండును. అందులో " సాధ్యమైనంత ఏకీభావముగల చిట్టచివరి నిర్ణయములు చేయబడినపిమ్మట అవి బ్రిటిషుప్రభుత్వమువారిచే పార్లమెంటుకు పంపించబడేనిమిత్త మామహాసభ జరుపబడు" నని ఆయన వ్రాసెను. ఈవాక్యములు ౧౯౨౯ అక్టోబరు ౧౬ వ తేదీని వ్రాయబడెను. వీటిని వైస్రాయి తనప్రకటనలోనేగాక తర్వాత అనేకసార్లు తన ముఖ్యోపన్యాసములలోగూడ పదేపదే చెప్పియుండుటనుబట్టి చూడ భారతీయులుకోరిన కోరికలలోని అత్యధికభాగముగాక బ్రిటిషుమంత్రివర్గమువారు పార్లమెంటువారికి సూచించిన సూచనలలోని అత్యల్పభాగముమాత్రమే అంగీకరింపబడకున్నదని స్పష్టముకాగలదు. "కాబట్టి ఆనాటినుండీ నూతనయుగము ప్రారంభమైనదనే నమ్మకము ప్రజలకు కలిగించుట ముఖ్యావసర" మనీ, "నూతనరాజ్యాంగచట్ట మా నూతనయుగప్రతిబింబముగా నుండు విషయమును కేవలము ఆమోదించవలసినదే" ననీ రాజకీయనాయకులు కోరుట వారి

అంతరంగికస్థితిని తెలియజేయుచుండెను. కేవల మాసమావేశముమూలమున కనీసభాగము కూడా లభింపదని ఢిల్లీ నాయకులసభకు హాజరయిన కాంగ్రెసుసభ్యుల అభిప్రాయము.

ఖైదీలవిడుదలనుగూర్చి నిజముగా ఏమీ జరుగలేదు. పంజాబుజైళ్లకమిటీవారు ౧౯౧౯ లోని మార్షలులా ఖైదీలనూ, ౧౯౧౫ నాటి లాహోరు కుట్రఖైదీలనూ విడుదలచేయవలెనని ప్రతిపాదించెను. కాని యేమీ జరుగలేదు. ఈలోగా కొంతమంది ఇంగ్లీషుస్నేహితులు ఇండియాకు సహాయముచేయుటకు కార్మికప్రభుత్వమువారు చేసే ప్రయత్నములకు ప్రతిసహాయము చేయవలెనని గాంధీకి తంతివార్తలను పంపుతూండిరి. అందుకు ప్రత్యుత్తరముగా గాంధీ సహకారముకొరకు తపించుచుంటినని ప్రకటించెను.

"కాబట్టి నా కవకాశము కలిగినవెంటనే నేను సహాయముచేయుటకు పూనుకొంటిని. కలకత్తాతీర్మానమునందు నా కెట్టి విశ్వాస మున్నదో జాయింటుప్రకటనమునందుకూడ అట్టి విశ్వాసమే ఉన్నది. అవి రెండూ ఏవిధముగానూ పరస్పర విరుద్ధములు గావు. వ్రాత కక్షరములకంటె ఆత్మ ప్రధానము. నిజమైన అధినివేశప్రతిపత్తి ఆచరణలో చూపబడేయెడల, అధినివేశముల రాజ్యాంగప్రణాళికకొరకు నేను వేచియుండగలను. అనగా బ్రిటిషువారికి హృదయపరివర్తనము కలిగి వారికి నిజముగా భారతదేశమును ఆత్మగౌరవముగల స్వతంత్రదేశముగా చేయవలయుననే కోరిక ఉన్నయెడలను, ఇండియాలోని ప్రభుత్వాధికారులకు నిజమైన సేవాతత్పరత్వ మున్నయెడలను అధినివేశరాజ్యాంగప్రణాళికకొరకు కింకా కొంతకాలము వేచియుండగలనని నా అభిప్రాయము. భారతప్రభుత్వము కత్తిపైన ఆధారపడియుండుటకంటె భారతీయుల సద్భావముపైన విశ్వాసముకలిగియుండవలెనని దీని కర్థము. ఆంగ్లేయులు తమ ధనప్రాణసంరక్షణకొరకు ఫిరంగీ, కోటబురుజులపైన ఆధారపడియుండుటకంటె భారతీయుల సద్భావముపైన విశ్వాసముంచ సిద్ధముగా నుండిరా? అట్లు వా రింకనూ సంసిద్ధులుగా లేనియెడల నన్ను సంతృప్తిపరచదగిన అధినివేశప్రతిపత్తి లేదు. కోరికపుట్టినప్పుడు బ్రిటిషుసంబంధమును వదలుకొనగలిగిన సమర్థత కలిగిఉండడమే అధినివేశప్రతిపత్తి యని నాభావము. కాబట్టి బ్రిటిషు, భారతదేశముల సంబంధములనుగూర్చిన నిర్బంధనిబంధనలతో నాకు నిమిత్తములేదు. నేను సామ్రాజ్యములో నుండ నిశ్చయించుకొన్నయెడల ప్రపంచములో సద్భావమును, శాంతివాతావరణమును పెంపొందించుటకే నాభాగస్వామ్యముయొక్క హక్కును వినియోగింతును. అంతేకాని బ్రిటిషుసామ్రాజ్య తత్త్వమునుగాని, లేక పరధనాకర్షణమును గాని పెంపొందించుటకు గాదు.

"నా భావముల నన్నిటినీ కార్మికప్రభుత్వమువా రర్థముచేసికొనియుండరు. నా భావములను నేను ప్రకటనలో విస్తరించి యుండలేదని నాకు తెలుసును. కాని నా అభిప్రాయములలోని ఈసారాంశ మాప్రకటనలో ఉన్నప్పటికీ, లేకపోయినప్పటికీ నా ప్రధానసిద్ధాంతములను స్పష్టముగా నర్థము చేసుకొనవలసిన బాధ్యత ఇంగ్లండు, ఇండియా దేశములలోని మిత్రులది.

"ఇక్కడ సూచింపబడినస్థితిని ప్రతిష్ఠించుకొనుటకు తగినబలము భారతదేశమున కింతవరకు కలుగలేదని నాకు బాగా తెలుసును. కాబట్టి మాదేశము బ్రిటిషుప్రజల యొక్క సద్భావమువలననే చాలవర కిప్పుడాస్థితిని పొందదగియున్నది. వా రీసమయములో అసద్భావమును ప్రదర్శించినయెడల అదొక వింతకాదు. భారతదేశమునకు వా రిదివరకు చేసిన అపరాధముల కది పరిహారముగా నుండగలదు.

"అయితే భారతదేశము తన పరమావధిని పొందుటకు కాల మాసన్నము కానియెడల నే నింకా కొంతకాలము వేచియుండగలను. నా కింతకంటె వేరొక ఆదర్శములేదు. ఈనామాట ఒకవ్యక్తిదేనని నాకు తెలుసును. ఇది భారతదేశములోని కోట్లకొలదిప్రజల కింతవరకు ప్రాతినిధ్యము వహించకలదో ఎవరునూ చెప్పజాలరు. నే నంతకంటెను చెప్పజాలను.

"వైస్రాయి ప్రకటనముప్రకారము భారతీయులకు వాగ్దానము చేయబడిన హక్కులు చాలా తక్కువైనప్పటికీ పార్లమెంటులో మాత్రము పెద్ద గగ్గోలు పుట్టెను. కామన్సుసభవారు తమచర్యను సమర్థించుకొన పూనిరి. ఇర్విన్ప్రభువున్ను, బెన్నున్ను చేసిన సూచనలను అంగీకరించినందుకు బాల్డ్విన్ బాధ్యతవహించెను. సర్ జాన్ సైమన్ తనను, తనకమిటీని సమర్థించుకొన ప్రారంభించెను. క్లైప్టెన్ బెన్ తనను, తన ప్రభుత్వమును సమర్థించుకొనుటకు చాలా శ్రమపడెను. ప్రధానమంత్రి భారతదేశమునుసమాధానపరచే ప్రయత్నములను పూర్తిగా సమర్థించు బాధ్యత వహించెను. ఆయన ఇదివరకుతప్పుమార్గములనుబట్టిన భారతీయులనుగూడ సమాధానపరచుటకు పూనుకొనెను. ప్రభువులందరు ప్రతికూల విమర్శనలకు కడంగిరి. బర్కెన్హెడ్డు ప్రభువు తన నిరంకుశ పంచాంగమును విప్పెను. ఆయనకు ప్రతిగా క్ప్టెన్ బెన్ బర్కెన్హెడ్డు ప్రభువునకు సామ్రాజ్యములో నేమీ అధికారస్థానము లేనికారణమున రాజకీయములనుండి ఆయన విరమింప తలచుచున్నట్లు ప్రకటించెను. "నాకు సొంతముగా తెలియకపోయినప్పటికీ ఆయన వాణిజ్యవ్యవహారములలో మునిగియున్నట్లు నాకు తెలియవచ్చినది." అనికూడా క్ప్టెన్ బెన్ బర్కెన్హెడ్డుప్రభునిగూర్చి ముచ్చటించెను. బ్రిటిష్ప్రభుత్వము కార్మికపక్షమువారి చేతులలో పడినవెంటనే బర్కెన్హెడ్డుప్రభుని భారతరాజ్యాంగకార్య

దర్శి పదవి పోయినందువలన ఆయన "గ్రేటర్ లండన్ అండ్ ట్రస్టు లిమిటెడ్" కు సంవత్సరమునకు ౧౫ వేల పౌనుల గౌరవవేతనముపైన మేనేజింగు డైరెక్టరు పదవిని సంపాదించెను. క్టైన్ బెన్ ఎత్తిపొడుపు దీనికి సంబంధించినదే. రీడింగు ప్రభువు దక్షిణాఫ్రికా గనుల కంపెనీ (South African Mining Syndicate) కి అధ్యక్షుడుగానుండి సం.కు ౧౫ వేల పౌనుల గౌరవవేతనమును పొందెను. ఈయన ఇండియాలోని గనులనుగూర్చి పరిశోధనలుచేసేనిమిత్తము ఇంగ్లండులో రహస్యముగా స్థాపింపబడిన ఇంపీరియల్ కెమికల్ కంపెనీ కధ్యక్షుడుగాకూడ పనిచేసినట్లు ౧౯౩౪-౩౫ సంవత్సరములలో తెలియవచ్చినది. ఈ విషయ మిండియాలో ఎవ్వరికీ తెలియదు. ఇక్కడ మాట వరస కీ విషయము చెప్పవలసివచ్చినది. క్టైన్ బెన్ రాజ్యాంగతంత్రమునందు పరివర్తనము కలిగినదని ప్రకటించెను. అనగా భావపరివర్తనము కలిగినదన్నమాట. ఇక వైస్రాయి ప్రకటనములోని మహాసభ సమావేశము కావలసియుండెను. లాయిడ్ జార్జి నాయకుల సమష్టి ప్రకటనములోని వ్యాఖ్యానమును క్పెన్ బెన్ అంగీకరించెనా అని ప్రశ్నించెను. లాన్సుబరీ వైస్రాయిప్రకటనమును ఉన్నదున్నట్లుగా విలువకట్టి అంగీకరించవలెనని భారతప్రజలను ప్రబోధించెను. కాని భారతీయులుమాత్రము దాని చలామణిని గుర్తించి వట్టములేని చేరముకాదని గ్రహించిరి. భారతదేశములోని మితవాదులు ప్రభుత్వమువారి ప్రకటనములోని సభనుగూర్చి ఉత్సాహముగా నుండిరి. ఆ సభకు వారు రౌండుటేబిలుసభ అని పేరుపెట్టుకొనిరి. ఇర్విన్ ప్రభువుమాత్రము దాని నెప్పుడూ లండనుసభ అనిమాత్రమే పిలుస్తూవచ్చెను. క్టైన్ బెన్ భారతీయులకు రాజ్యాంగతంత్రములో మార్పుకల్గినదని చెప్ప ప్రారంభించెను. పార్లమెంటుసభ్యులకు దానిలో ఏమీ మార్పు కలగలేదని ధైర్యము చెప్పదొడగెను. ౧౯౧౯ చట్టముయొక్క ఉపోద్ఘాతమునుబట్టి రాజ్యాంగతంత్రము వెంటనే మార్పుచెందుటకు వీలులేదు. కాబట్టి భయము లేదని ఆయన వారికి సూచించెను. "ఆ ఉపోద్ఘాతమే చట్టములో చేర్చబడినది. ఆ చట్ట మింగ్లాండుశాసనములలోని ఒకభాగముగా నున్నది. కాబట్టి ఏమీ ప్రమాదములే"దని పార్లమెంటులోని ఆయనవాదము. ఇట్టి వాదముల మూలమున కాంగ్రెసులోని యువకులకు కొంత నిరుత్సాహము కలిగెను. నవంబరు ౧౮ వ తేదీని అలహాబాదునందు మరియొకసారి కొత్తగా అఖిలపక్షమహాసభ సమావేశమైనది. సరిగా ఆ సమయములోనే కాంగ్రెసుకార్యవర్గసభ కూడా సమావేశ మయ్యెను. అందరును ఏకాభిప్రాయమునకు వచ్చి శత్రువులను కంగారుపెట్టవలెనని అఖిలపక్షసభలో ప్రయత్నములు చేయబడెను. అనికక్షలవారినీ ఏకోన్ముఖమునకు తీసుకొనిరావలెనని భగీరథప్రయత్నములు జరుపబడెను. అందుకొరకు మితవాదులను వదలి, అతివాదులను సమాధానపరచుటకు కొందరు తలచిరి. కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమువారు తమ నిర్ణయములను ప్రకటించక

మునుపే జవహరలాల్, సుభాసులు తమ కార్యవర్గ సభ్యత్వములకు రాజీనామాలిచ్చిరి. మోతీలాల్ పండితుడీ యువక కాంగ్రెసువాదులకన్న కూడా యెక్కువ పట్టుదలగా నుండెను. ఆయనను అఖిలపక్షసమావేశమువారి మార్గమున నడిపించుటకెన్నో మంచి మాటలాడవలసివచ్చెను. కామన్సుసభలో ప్రదర్శింపబడుతూన్న మాయల కాయన కాగ్రహము కలిగెను. వెడ్జివుడ్ బెన్ ఇండియావంకకు తిరిగి స్వరాజ్యమనీ, పార్లమెంటువంకకు తిరిగి బ్రిటిష్‌రాజ్యమనీ చెప్పేమాటలు పండితునకసహ్యాకరములయ్యెను. కాని వెంటనే అఖిలపక్షసమావేశమును తృణీకరించుటకు వీలు లేకుండెను. కాబట్టి ఓర్పుపట్టవలసి వచ్చెను.

ఈలోగా 'పైనీరు' సంపాదకుడు విల్సన్, లాహోరుకాంగ్రెసు జరిగే లోపుగా ఇర్విన్‌ప్రభువు భారతదేశ రాజ్యాంగప్రణాళికను గూర్చి సుముఖముగానున్నట్లు కొన్ని పనులు చేయవలెననీ, అందువలన భారతరాజకీయనాయకులు లాహోరుకు సంతృప్తికరముగా పోగలరనీ పత్రికలకు కొన్ని వ్యాసములు వ్రాస్తూవచ్చెను. ఇర్విన్ ప్రభువు "౧౫ వ తేదీని" తన్ను కలుసుకొనవలసినదిగా పండిత మోతీలాల్ నెహ్రూకు సప్రూద్వారా కబురుపంపెను. కాని పండితుడు కార్యాంతరనిమగ్నుడైనందున ౧౫ వ తేదీని వైస్రాయిని కలుసుకొనలేకపోయెను. వైస్రాయి కొద్దికాలములోనే పండితనెహ్రూ, పండితమాలవ్యా, గాంధీలను కలుసుకొనదలంచెనని విల్సన్ పత్రికలకు వ్రాసెను. వైస్రాయి ౧౫ వ తేదీని దక్షిణ ఇండియాదేశములో సంచారమునకు బయలుదేరి గాంధీ, నెహ్రూలను ఢిల్లీలో డిసెంబరు ౨౩ వ తేదీని కలుసుకొనెదనని సప్రూకు వ్రాసెను. అందులో వీలగునెడల అంతకుముందే హైదరాబాదులోనే కలువవచ్చుననీ, ఎట్టిసందర్భములోను క్రిస్టమస్‌కు ముందుగా కలియవలసియున్నదనీ కూడా ఆయన వ్రాసెను. వైస్రాయి డిసెంబరు ౨౩ వ తేదీని సకాలములో ఢిల్లీకి వచ్చెను. ఢిల్లీకి మైలుదూరమున పాతకోటకుదగ్గరగా వైస్రాయిరైలుకు బాంబు ప్రమాదముకలిగెను. సరిగా వైస్రాయిరైలాప్రదేశమునకు వచ్చినప్పుడు బాంబు ప్రేలునట్లుగా ఏర్పాటుచేయబడెను. వైస్రాయి కొంచెములో తప్పించుకొనెను. రైలులోని ఆయన భోజనపుపెట్టె దెబ్బతినెను. ఆయననౌకరులలో ఒకనికి గాయముతగిలెను. ఈప్రమాదము వలన ఇర్విన్‌ప్రభువుమనస్సు వికలమై యుండవలసినది. ౧౯౨౯ డిసెంబరు ౨౩ వ తేదీని వైస్రాయి తనమందిరమునకు చేరెను ఆరోజుననే గాంధీ, మోతీలాల్‌జీలు కాంగ్రెసుపక్షమున వైస్రాయిని చూడదలచిరి. తదితరాభిప్రాయములను కూడ వ్యక్తీకరించుటకు జిన్నా, సప్రూ, విఠల్‌భాయిపటేలులు వెళ్లిరి. మొట్టమొదట మిత్రసంభాషణములుగా భావింపబడిన వ్యవహారములు చిట్టచివరకు రాయబారములుగా పరిణమించినవి. ఉదయమున జరిగినప్రమాదమున కెంతమాత్రమును కంగారుపడక ఇర్విన్‌ప్రభువు

సంతోషముగానే యుండెను. ఆయన అతిథులకు చూపిన ఆదరణమునుబట్టి ఆయనస్థిర చిత్తము మరింత ప్రకటితమయ్యెను. సైమన్ కమీషన్ ప్రకటనసందర్భములో గాంధీ ౧౯౨౭ నవంబరునెలలో కలుసుకొన్ననాటి స్తబ్ధభావము వైస్రాయిలో నేడు కన్పించలేదు. ౪౫ నిమిషములవరకును శాంతినిగూర్చియే వారు మాట్లాడిరి. తరువాత ఇర్విన్ ప్రభు అసలువిషయమునకు వచ్చెను. "ఎక్కడినుండి ప్రారంభింపవలెను? ఇదిగో ఈనాయకుల ప్రకటనము. రాజకీయఖైదీలనుండి ప్రారంభింతమా" అని ఆయన అడిగెను. ఆయన తన సద్భావమును ప్రకటించుటకు మంచి అవకాశమును కల్పించుకొన దలచి, రాజకీయఖైదీల సంగతి ముందెత్తెను. కాని గాంధీమాత్ర మధినివేశ ప్రతిపత్తిని గూర్చినవిషయము ముందు విచారింపవలె ననెను. సంపూర్ణాధినివేశప్రతిపత్తి నాధారముగా చేసుకొనియే రౌండుటేబిలుసభ ప్రారంభింపబడుననే విషయమును ముందాయన నిశ్చయముగా తెలుసుకొనగోరెను. అందుకు ప్రత్యుత్తరముగా వైస్రాయి ఆవిషయము ప్రభుత్వమువారి ప్రకటనములోనే విశదీకరింపబడి యుండుటచే దానిని మించి తానేమీ వాగ్దానము చేయజాలనని చెప్పెను; స్పష్టముగా అధినివేశప్రతిపత్తిని వాగ్దానముచేస్తూ, రౌండుటేబిలుమహాసభకొరకు ఆహ్వానములు పంపేస్థితిలో తాను లేనని ఆయన ప్రత్యుత్తరమిచ్చెను.

మేము లాహోరుప్రయాణములో వైస్రాయి రైలుక్రింద బాంబుపేలిన విషయమును, వైస్రాయిసభలో భారతీయుల ఆశలు భగ్నములైన విషయమును తెలుసుకొంటిమి. లాహోరుకు పోయేవారంతా జీవితసమర్పణమునకు సిద్ధముగా నుండవలెనని మేము భావించితిమి. రాబోయే తీవ్రయుద్ధమునకే విధముగా సంసిద్ధులమైతిమి. లాహోరుకాంగ్రెసు శీతకాలమునందంతులేని చలిలో ప్రారంభమయ్యెను. ఉత్తర భారతదేశపుచలి కలవాటుపడనివారికి తగిన గృహవసతులు లాహోరులో ఏర్పాటు చేయబడలేదు. ఆ డేరాలలో నివసించుట కష్టసాధ్యమైనపని. కార్యనిర్వాహకసభలో మేము మాటిమాటికి చలి కాగవలసివచ్చినది. కాంగ్రెసుసభాభవనమునకు బైట సహింపరాని చలి. కాని రాయబారము లపజయము పొందుటచే కలిగిన భావతీవ్రత కతన, హృదయములలోని ఉద్రేకాగ్నికణములవలన, సంగ్రామభేరీనినాదముల కుప్పొంగిన శరీరములమూలమున మాకా చలిగాడ్పులు తగిలినట్లేలేవు. ఆనాడు నిజముగా పండిత జవహరలాలొక్కడే ప్రజానురంజకు డయిన నాయకుడు. ప్రజానురంజకుడే కాదు, అందరిలోకి పిన్నవయస్కుడైన రాజకీయ ధురంధరుడు కూడాను. ఆయన ఉపన్యాసములో ఆయనహృదయము పూర్తిగా ప్రతిబింబించెను. భారతదేశముపైన కుమ్మరింపబడిన అవమానముల కాయన ఆగ్రహమును వెలిబుచ్చెను. భారతీయులకు విముక్తికలిగించుట కాయన మార్గములను సూచించెను. సామ్యవాద సిద్ధాంతములను

స్పష్టముగా ప్రకటించెను. విజయము కలుగగలదనే మనోనిశ్చయమును ఆయన ప్రదర్శించెను.

లాహోరుకాంగ్రెసు అట్టుడికినట్లుడికిపోయెను నానాటికి పెరిగిపోతూన్న నిర్బంధవిధానముమూలమున జాతీయభావాగ్నికణములు ప్రజ్వరిల్లినవి. డిసెంబరు 3 వ తేదీని బెన్ను "ఈనాడు భారతదేశమునం దభిప్రాయ ప్రకటనస్వాతంత్ర్య ముండుట వాంఛనీయమే కాదు. సహాయకారికూడా" అని ప్రకటించెను. అటువంటి బెన్ను ప్రజాభిప్రాయమును సమాధానపరచుటకుగాని, నిర్బంధవిధానమును తగ్గించుటకుగాని ఏమీ ప్రయత్నించలేదు. పైగా భారతదేశములో అధినివేశ ప్రతిపత్తి ఒకదశాబ్దమునుండీ ఆచరణలో నుండెనని ప్రపంచమును నమ్మింపసాగెను. వర్సెలీస్ సంధిపత్రములో ఇండియా సంతకము, విదేశములలో భారతీయ హైకమీషనరుని యామకము, అంతర్జాతీయమహాసభా రాయబారమునకు భారతీయ నాయకత్వము, అంతర్జాతీయనావికసంఘమునకు హిందూదేశపుకోటా, అధినివేశశాసనసభ్యుల సమావేశములోను, పంచప్రభుత్వ నౌకామహాసభలోను భారతదేశము పాల్గొనిన విధానము, అంతర్జాతీయ కార్మికమహాసభా పాలకవర్గమునం దిండియాకు కల స్థానము - ఇవన్నీ అందు కుదాహరణములుగా బెన్ను సూచించెను.

ప్రజలుమాత్ర మీ బొమ్మలాటకు మోసపోలేదు. వారు నిజపరిస్థితులను గమనించి నాటికి తగినట్లుగా వ్యవహారములను పరిష్కరింప నిశ్చయించిరి.

లాహోరులో ఈక్రిందివిషయములనుగూర్చి వాదప్రతివాదములు జరిగెను. ఢిల్లీ రాజకీయనాయకుల ప్రకటనమును మన మంగీకరింపవలెనా, వైస్రాయియొక్క సద్భావములను విశ్వసింపవచ్చునా, ప్రధానతీర్మానములోని "ప్రస్తుతపరిస్థితులలో" అనే మాటలను ఉంచవలెనా, మన ప్రధాన సూత్రములోని "స్వరాజ్య" మనగా అదీ, ఇదీ అని చెప్పేబదులు మన మా ప్రధానసూత్రమునే మార్చకూడదా, శాసనసభలను బహిష్కరింపవలెనా, అయినయెడల యూనివర్సిటీసంస్థలను, పోర్టుట్రస్టులను, పాఠశాలలను, కళాశాలలను, కోర్టులనుకూడా అందులో చేర్చవలెనా, స్థానికసంస్థలను అసలీ జాబితాలో చేర్చవలెనా, మనము ప్రజాప్రభుత్వ రాజ్యాంగమును (Republican constitution) తయారుచేయవలెనా, ఇప్పుడు మనకు తెలిసిన సంగతులనుబట్టి రౌండుటేబిలు సమావేశమునకు మనము పోవుట అవసరమా, సంపూర్ణస్వాతంత్ర్యము కాంగ్రెసు ఆదర్శమని ప్రకటించుటకు రెండునెల లాగకూడదా అనే ఈప్రశ్నలన్నీ తీవ్రముగా చర్చింపబడెను.

జవహరలాలుపండితుడు తన అధ్యక్షోపన్యాసమును ప్రారంభించెను. ఆయన తన కీర్తిబ్రహ్మాండమైన వారసత్వమును లభింపచేసినందుకు భారతదేశమునకు కృతజ్ఞతాభివందనములను సమర్పించెను. ప్రపంచకములోని తీవ్రపరిణామములను ఆయన వివరించెను. ప్రపంచకము నూతనపరివర్తనముకొరకు ప్రసవవేదన ననుభవించుచున్నదని ఆయన ప్రసంగించెను. హిందూదేశ మీనాడు తదితర ప్రాచ్యదేశములతోపాటు ప్రపంచకోద్యమములో పాల్గొనుచున్నదనెను. కాని సాంఘికస్థిరత్వమునకు కావలసిన సమానప్రతిపత్తిపైన భారతసాంఘిక వ్యవహారము లాధారపడియుండకపోవుటచే ప్రజలు బాధల ననుభవిస్తూండిరని ఆయన వ్యక్తపరచెను. భారతదేశములో గల మతస్వాతంత్ర్యమే ప్రధానసుగుణమనీ, నేఁడది పరస్పరావిశ్వాసములకును, భయములకును కారణ మగుట దురదృష్టమనీ ఆయన స్పష్టపరచెను.

"హిందూమహమ్మదీయ సిక్కుల రాజకీయ సాంఘికవ్యవహారములను సమన్వయము చేయుటకు ప్రయత్నములు జరిగినవి. కాని అఖిలపక్షసమావేశములో తయారు చేయబడిన ప్రణాళిక ఆయాపక్షములను సంతృప్తిపరచలేదు. నైసాయిమ్ప్రకటనము శాంతిసందేశమువలెనే తోచుచున్నది. నైసాయి సదుద్దేశముతోనే యుండెను. ఆయన ఉపయోగించిన భాష, రాజీభాషయే. కాని ఈ దాక్షిణ్యపూర్వకములైన వాక్కులసలువిషయములను మరపింపజాలవు. మే మింకా భయంకరజాతీయసంగ్రామమును కల్పింపలేదు. ఇప్పటికినీ రాజీచేసుకొనుటకు వీలు కలదు. కెప్టెన్ వెడ్జివుడ్ బెన్ను చెప్పిన అధినివేశప్రతిపత్తి మనచుట్టూ పన్నబడిన వల. మన కిప్పు డాకలకత్తాతీర్మానమములులోనే ఉన్నది. మన ఆదర్శము నేడు స్వతంత్రము తప్ప మరియొకటి కాదు." అని ఆయన కొంతవడి చెప్పి తరువాత బ్రిటిష్ సామ్రాజ్యతత్వమునుగూర్చి ముచ్చటించెను.

తాను సామ్యవాదిననీ, ప్రజాపరిపాలనవాదిననీ, రాజులలోను,యువరాజులలోను తనకు నమ్మకములేదనీ ఆయన స్పష్టీకరించెను. తరువాత భారతసంస్థానములు, రైతులు, కూలీలు, అల్పసంఖ్యాకులు—ఈ అందరికి సంబంధించిన ముఖ్యసమస్యలనుగూర్చి వివరించెను. దౌర్జన్యరాహిత్యమునుగూర్చి కొంతతడవు చర్చించెను. దౌర్జన్యము తరచుగా ప్రతికూలత్వమును, అవినీతిని పురికొల్పుటయేకాక ముఖ్యముగా మనదేశములో కల్లోలమును కల్గించునని కూడా ఆయన వెల్లడించెను. "నేను ఆరితేరిన దౌర్జన్యము ప్రపంచకములో రాజ్యముచేస్తూన్నమాట వాస్తవమే. దానిమూలమున మనకు ప్రయోజనము కలిగినను కలుగవచ్చును. కాని అట్టి దౌర్జన్యమునకు తగిన సాధనసంపత్తిగాని, శిక్షణముగాని మనకు లేదు. మనలో అధికసంఖ్యాకులు దౌర్జన్యమును త్యజించుట దానివలన మనకు ప్రయోజనకరములైన ఫలితములు కలుగజాలవను నమ్మకముమూలముననే.

ఈ విషయమును నేను నైతికదృష్టితో చర్చించుటలేదు; కార్యసాధకదృష్టితో చర్చించుచుంటిని. ప్రతిస్వాతంత్ర్య మహోద్యమము సామాన్యజనులకు సంబంధించినదిగా నుండవలెను. జనసమూహములకు సంబంధించిన ఉద్యమము ముందుగా తయారుచేయబడిన విప్లవసందర్భములలో తప్ప తక్కిన అన్ని సందర్భములలోను ముఖ్యముగా శాంతిదాయకముగా నుండవలెను." అని ఆయన దౌర్జన్యరాహిత్య సిద్ధాంతమును మతవిశ్వాసముగాగాక రాజకీయపద్ధతిగా విశదీకరించెను. శాసనసభాబహిష్కారమునుగూర్చి, భారతదేశ ఋణములనుగూర్చి, కాంగ్రెసును సుశిక్షితమైన సంస్థగా చేయుటనుగూర్చి ఆయన ఉపన్యసించెను. చిట్టచివర కాయన "మన మే విధముగా జయముపొందెదమో చెప్పజాలను. జయము మన చేతులలో లేదు. కాని అది ధైర్యముగల కార్యశూరులకు మాత్రమే లభించును. భవిష్యత్తునుగూర్చి భయపడేవారి కది లభించదు. మనము గొప్ప ఆపత్తుల నెదుర్కొనవలసి యున్నది. నిజముగా మనము మహత్తర కార్యములను సాధింపవలె నన్నచో గొప్ప అపాయముల నెదుర్కొనక తప్పదు." అని ఆయన ముగించెను.

౧౯౨౭ మద్రాసుకాంగ్రెసులో అంగీకరింపబడిన స్వాతంత్ర్యతీర్మానము కాంగ్రెసునిర్మాణవిధానమునందలి ఒకటవసూత్రములోని కాంగ్రెసుఆదర్శముగా అంగీకరింపబడవలెనా, లేక ఆసూత్రమున కది వ్యాఖ్యానముగా నుండిన చాలునా అని లాహోరుకాంగ్రెసులో చర్చవచ్చినది. దీనిపైన అధ్యక్షుడు కొన్ని చక్కని భావములను ప్రకటించెను. "స్వాతంత్ర్య మనగా బ్రిటిష్ సామ్రాజ్యతత్వమునుండి, బ్రిటిష్ నిరంకుశాధికారమునుండి మనకు సంపూర్ణస్వేచ్ఛ లభించుట అన్నమాట. మనము స్వాతంత్ర్యమును పొందినపిమ్మట భారతదేశము ప్రపంచక సహాయమునిమిత్తమున్నూ, అంతర్జాతీయ సమ్మేళనము నిమిత్తమున్నూ చేయబడే అన్ని ప్రయత్నములను ఆమోదించగలదు. అవసర మైనయెడల 'తాను సమానభాగస్వామిగానున్న' సమ్మేళనముయొక్క ప్రయోజనములకొరకు తన స్వాతంత్ర్యమునుకూడా కొంతవరకు త్యాగముచేయుట కంగీకరింపగలదు. అంతేకాక సామ్రాజ్యతత్వము పూర్తిగా నిర్మూలింపబడిననే తప్ప భారతదేశ మే సమ్మేళనము (Commonwealth) నందును సమానభాగస్వామిగా నుండజాలదు." అని ఆయన ఉపన్యసించెను. అధ్యక్షుని ఉపన్యాసములోని కొన్ని భాగముల నిక్కడ ఉదాహరించి నాటి నిజమైనస్థితిని కనుగొనుటకు పాఠకుల కవకాశము కలిగింతుము.

"ఏపేరుతోనైనను మనము ముం దధికారమును సంపాదించుట అవసరము. హిందూదేశమున కనువర్తింపజేయబడే అధినివేశప్రతిపత్తి మనకు నిజమైన అధికారము నీయగలదని నేను నమ్మను. నిజమైన అధికార మనగా పూర్తిగా విదేశసైన్య మీదేశము

నుండి పోవలెను. ఆర్థికాధికారము విదేశీయులచేతులలో నుండకూడదు. ఈవిషయ ములనుగూర్చి మన మాలోచించినయెడల తక్కినవిషయములు తేలగలవు."

ఈ అభిప్రాయములతో భారతదేశనాయకుడు గాంధీమహాత్మునును, కాంగ్రెసు అధ్యక్షుడు జవహరలాల్ పండితుడును ఏకీభవించినందువలన లాహోరు కాంగ్రెసు లోని కార్యక్రమము తేలికగా నడచిపోయెను. జతీంద్రదాసు, ఫోంగీ విజయాలు కావిం చిన ఆత్మసమర్పణమునకు కాంగ్రెసువారు స్తుతించిరి. పండిత గోకర్ణనాథమిశ్రా, పరంజి పాయి, భక్తవత్సలనాయుడు, ఆర్. కె. లాహిరీ, వ్యోమకేశచక్రవర్తి - వీరి మరణ ములకు కాంగ్రెసు దుఃఖమును ప్రకటించినది. తరువాత వైస్రాయిరైలుమీద పడిన బాంబును గూర్చి ఈ క్రిందితీర్మానము చేయబడినది:

"వైస్రాయిరైలుమీద బాంబు వేయబడిన దురాగతమునకు కాంగ్రెసు విచార పడుతూన్నది. అటువంటిపని కాంగ్రెసుసిద్ధాంతమునకు ప్రతికూల మగుటయేకాక జాతీయోద్యమమునకు భంగకరముగా నుండునని కూడా కాంగ్రెసు తన అభిప్రాయ మను తిరిగీ ప్రకటించుచున్నది. ఇర్విన్ ప్రభువు, ఇర్విన్ ప్రభ్వి, వారిసిబ్బంది, వారి పేదనౌకర్లు - వీ రందరును కొంచెములో తప్పించుకొని బయటపడినందుకు వారి నీకాంగ్రెసు అభినందిస్తూన్నది."

స్వాతంత్ర్యమునుగూర్చిన ప్రధానతీర్మాన మీక్రింద ఉదాహరింపబడినది:

## సంపూర్ణ స్వాతంత్ర్యము

"అధినివేశప్రతిపత్తినిగూర్చి అక్టోబరు ౩౧ వ తేదీని చేయబడిన వైస్రాయి ప్రకటనము నుద్దేశించి, రాజకీయపక్ష నాయకులు కాంగ్రెసువాదులతో సహా సంతక ములు చేసి ప్రచురించిన ప్రకటనసందర్భమున వర్కింగుకమిటీవా రవలంబించిన చర్యను ఈకాంగ్రెసు ఆమోదిస్తూన్నది; స్వరాజ్యోద్యమ పరిష్కారము నిమిత్తము వైస్రాయి చేసిన ప్రయత్నముల నీ కాంగ్రెసు శ్లాఘిస్తూన్నది; కాని తరువాత జరిగిన కొన్నివిష యములనుబట్టీ, మహాత్మాగాంధి, పండిత మోతీలాల్ నెహ్రూ మొదలగు నాయ కులు వైస్రాయితో సమావేశమైనప్పుడు కలిగిన ఫలితములనుబట్టీ ఈకాంగ్రెసు రౌండు టేబిలుమహాసభలో ప్రస్తుతసమయమున ప్రాతినిధ్యము వహించినందువల్ల ఏమీ లాభము లేదని అభిప్రాయపడుతూన్నది. కాబట్టి నిరుడు కలకత్తామహాసభలో అంగీకరింప బడిన తీర్మానముప్రకారము కాంగ్రెసునిర్మాణవిధానములోని ౧ వ సూత్రములో గల "స్వరాజ్యము" అనేపదమున కర్థము సంపూర్ణస్వాతంత్ర్య మని ప్రకటిస్తూన్నది. అంతేకాక నెహ్రూకమిటీరిపోర్టులోని ప్రణాళిక అంతా కాలదోషముపట్టినట్లు కూడా

ఈ కాంగ్రెసు ప్రకటిస్తూన్నది. కనుక ఇప్పటినుండీ అందరు కాంగ్రెసువాదులూ ఇండియాకు సంపూర్ణస్వాతంత్ర్యమును సంపాదించేనిమిత్తము వారి దృష్టిని కేంద్రీకరింపవలెనని ఈ కాంగ్రెసు ఆశిస్తూన్నది. కాబట్టి స్వాతంత్ర్యోద్యమనిర్మాణమునకు ప్రథమసోపానముగానూ, కాంగ్రెసువిధానమును కాంగ్రెసుసిద్ధాంతమున కనుగుణముగా మార్పుచేసేటందుకున్నూ జాతీయోద్యమమునందు పాల్గొను కాంగ్రెసువాదులు ప్రత్యక్షముగా గాని, పరోక్షముగాగాని రాబోయే ఎన్నికలలో జోక్యము కలిగించుకోవకూడదనీ, శాసనసభలలోగాని, కమిటీలలోగాని ప్రస్తుతమున్న కాంగ్రెసుసభ్యులు వారి స్థానములకు రాజీనామాల నీయవలెననీ ఈకాంగ్రెసు తీర్మానిస్తూన్నది. కాంగ్రెసునిర్మాణ కార్యక్రమమును ఉత్సాహకరముగా కొనసాగింపవలెనని ప్రజలను ఈ కాంగ్రెసు కోరుతూన్నది కొన్ని ప్రత్యేకస్థలములలో కాని, లేక అన్నిచోట్లాకాని పన్నుల నిరాకరణముతో కూడిన శాసనోల్లంఘన కార్యక్రమమును తగిన సమయములో నడిపించుటకు ఈ కాంగ్రెసు అ. భా. కాం. సం. వారి కధికార మిస్తూన్నది. ఆవిషయములో అ. భా. కాం. సం. వారు తమకు తోచిన అన్నిజాగ్రత్తలను పుచ్చుకోవచ్చును."

తరువాత కాంగ్రెసు జరుపవలసిన ఋతువు మార్పు చేయబడినది. "కాంగ్రెసు నిరుపేదలకు ప్రజాసామాన్యమునకు ప్రాతినిధ్యము వహిస్తూన్నది కాబట్టిన్నీ, డిసెంబరులో కాంగ్రెసు జరుపబడుటమూలమున వారికి కావలసిన అదనపుదుస్తులకోసమెక్కువసొమ్ము వెచ్చించవలసిఉండుటచే అది వారికి కష్టముగా నుండును కాబట్టిన్నీ కాంగ్రెసుమహాసభ ఫిబ్రవరి మార్చినెలలలో కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గము వారిచే నిర్ణయింపబడిన తేదీలలో జరుపబడవలెను. ఈ తేదీలను నిర్ణయించుటలో కాంగ్రెసుకార్యనిర్వాహకవర్గమువారు కాంగ్రెసు జరిగే రాష్ట్రములోని రాష్ట్రీయ కాంగ్రెసుసంఘముతో ఆలోచింపవలెను."

ఈ తీర్మానముల కనుగుణముగా కాంగ్రెసునిర్మాణవిధానమునం దవసర మైన అన్నిమార్పులను చేయుటకు కాంగ్రెసుకార్యనిర్వాహకవర్గమువారికి ఈ కాంగ్రెసు అధికార మిచ్చినది.

తూర్పు ఆఫ్రికానుగురించికూడా ఒక తీర్మానము చేయబడినది. శ్రీమతి సరోజినీనాయుడు చాలా శ్రమకోర్చి తూర్పు ఆఫ్రికాకు పోయినందు కామె అభినందింపబడెను. తూర్పు ఆఫ్రికా భారతీయు లాదేశములోని భారతీయసమస్యలనుగూర్చి ధైర్యముగా పోరాడుతూన్నందుకు వా రభినందింపబడిరి!

భారతసంస్థానములను గూర్చిన ముఖ్య తీర్మానము తరువాత చర్చింపబడినది. భారతసంస్థానాధిపతులు తమ ప్రజలకు బాధ్యతాయుతప్రభుత్వమును ప్రసాదించుట కును, వాక్స్వాతంత్ర్య, సమావేశ స్వాతంత్ర్యములవంటి పౌరుల ప్రధానహక్కులను రక్షిస్తూ ప్రకటనములనుగాని, చట్టములనుగాని చేయుటకును తరుణము సమీపించిన దని తీర్మానింపబడెను.

నెహ్రూరిపోర్టు రద్దయినకారణమున సాంఘికసమస్యను గూర్చి క్రొత్తగా యోజింపవలసివచ్చెను. సాంఘికసమస్యలవిషయములో కాంగ్రెసు తన విధానమును ప్రకటింపవలసియుండెను. స్వతంత్రభారతదేశములో జాతీయపద్ధతులపైనమాత్రమే సాంఘికసమస్యలు పరిష్కరింపబడునని కాంగ్రెసు విశ్వసించినది. కాని "ముఖ్యముగా సిక్కులున్నూ, తరువాత మహమ్మదీయులు మొదలగు తదితర అల్పసంఖ్యాక సంఘములున్నూ నెహ్రూనివేదికలో సూచింపబడిన సాంఘికసమస్యా పరిష్కార మునుగూర్చి అసంతృప్తిని వెల్లడించినందున భారతభావిరాజ్యాంగమునందు సిక్కు లను, మహమ్మదీయులను, తదితర అల్పసంఖ్యాకసంఘములను పూర్తిగా సంతృప్తి పరచని ఏపరిష్కారమున్నూ కాంగ్రెసుకు అంగీకారము కాదని భారతజాతీయమహా సభ ఇందుమూలముగా ప్రకటిస్తున్నది." విదేశములలో నివసిస్తున్న భారతీయులగు హాఫూరుజీ, సకలత్ వాలాలకు ఇండియాకు తిరిగివచ్చుటకు పాసుపోర్టులు నిరాక రించినందున ఆ లాహోరుకాంగ్రెసు భారతప్రభుత్వచర్యను ఖండించెను.

౧౯౨౨ గయాకాంగ్రెసు జరిగినతరువాత తిరిగీ చాలాకాలమునకు భారత జాతీయఋణమునుగూర్చి చర్చింపబడెను. "విదేశపరిపాలనము మూలమున భారత దేశముపైన ప్రత్యక్షముగా గాని, పరోక్షముగాగాని వేయబడిన ఆర్థికభారములు స్వతంత్రభారతదేశము భరింపతగినవిగానీ, భరింపకలిగినవిగానీ కావని ఈ కాంగ్రెసువారి అభిప్రాయము. కాబట్టి ౧౯౨౨ గయలో అంగీకరింపబడిన కాం గ్రెసుతీర్మానమును ఈ మహాసభ తిరిగీ అంగీకరిస్తూ, స్వతంత్ర భారతదేశమునకు సంక్ర మించే ఋణములనుగూర్చి ప్రత్యేకముగా ఒక స్వతంత్రకమిటీచే విచారణచేయించి, ఆ కమిటీవారు న్యాయమైనది కాదని చెప్పిన ఏ ఋణమునైనను నిరాకరించుమని ఈ కాంగ్రెసు ఇందుకు సంబంధించినవా రందరికి తెలియచేస్తున్నది.

బాంబుదురాగతమునుగూర్చిన తీర్మానము తేలికగా అంగీకరింపబడలేదు. ఆ తీర్మానమును కొంతమంది ప్రతినిధులు తీవ్రముగా ఎదిరించిరి. కొద్దివోట్ల ఎక్కు వతో ఆతీర్మాన మంగీకరింపబడినది. ప్రధానతీర్మానములో "స్వరాజ్యసమస్యా పరి ష్కారమునకు వైస్రాయి చేసిన ప్రయత్నములను శ్లాఘిస్తూ" అనే భాగమునకుకూడా

కొంతమంది ప్రతినిఘు లభ్యంతరపెట్టిరి. తరువాత "ప్రస్తుతపరిస్థితులలో రౌండు టేబిల్‌మహాసభలో కాంగ్రెసు ప్రాతినిధ్యము వహించినందువలన ఏమీ ప్రయోజనములేదు" అనే భాగమునకు కూడా అనేకమంది ప్రతిఘాలభావములను వెల్లడించిరి. ముఖ్యముగా "ప్రస్తుతపరిస్థితులలో" అనే మాటలనుగూర్చియే తీవ్రమైన చర్చ జరిగినది. ప్రస్తుతపరిస్థితులలో అన్నందువలన చాలామందికి ఎప్పుడో ఒకప్పుడు పరిస్థితులు మారినవనే కారణముతో తిరిగి యీరౌండు టేబిల్‌మహాసభ ప్రత్యక్షము కావచ్చునని భయము తోచినది. కాని గాంధీ అనేకసారులు తన సహాయనిరాకరణము సహాయము కొరకేనని, తన యుద్ధము రాజీకొరకేనని ప్రకటించినమాట విస్మరింపరాదు. చిట్టచివరకు గాంధీ కాంగ్రెసులో వివిధశాఖలను నిర్మించి కాంగ్రెసుకార్యక్రమమును విభజింపవలెనని తెచ్చిన తీర్మానము వీగిపోయినది. ఆయన విదేశవస్త్రబహిష్కారసంఘము, మద్యపాననిషేధసంఘము, అస్పృశ్యతానివారణసంఘము ఇవి అన్నీ స్వతంత్రసంఘ[illegible]లుగా నుండవలెనని తీర్మానము తెచ్చెను. కాని అది నెగ్గినదికాదు. ఆయన కాంగ్రెసు ప్రతినిధులసంఖ్య తగ్గింపవలెననికూడా ప్రయత్నించెను. అదీ విఫలమయ్యెను.

ఈ వివిధసంఘములు కలకత్తా కాంగ్రెసుతర్వాత ౧౯౨౯ ఫిబ్రవరి నెలనుండీ స్థాపింపబడినవి. ఈ ఉపసంఘముల కార్యవిధానము అనుభవజ్ఞులపరము చేయబడెను. వాలంటీర్లసంస్థ జవహరలాల్, సుభాస్‌చంద్రబోసులపరము చేయబడెను. కాంగ్రెసు కార్యక్రమము మొదటిసారి వివిధశాఖలుగా విభజింపబడి కార్యనిర్వాహకసంఘములోని ప్రత్యేకసభ్యులకు స్వాధీనము చేయబడెను. కాని గాంధీ ఈ ఉపసంఘముల నన్నిటిని అఖిలభారతకాంగ్రెసుసంఘమువలె స్వతంత్రసంస్థలనుగా చేయదలచెను. కాని ఆయన సూచన లనుమానముతో చూడబడెను. నాయకు దెప్పుడును అనుచరులకు ముందుండును. నాయకులు నిన్న సూచించిన విషయములను అనుచరు లీనాటికాని అంగీకరించరు. సరిగా అంతే జరిగెను. నేడు (౧౯౩౪) అస్పృశ్యతాకార్యక్రమము రాజకీయపరివర్తనములతో నిమిత్తములేకుండా ప్రత్యేకముగా ఒకస్వతంత్ర సంస్థక్రింద నడుపబడుతూన్నది. కాంగ్రెసుప్రతినిధులు బొంబాయిలో మూడవవంతు తగ్గింపబడిరి. గాంధీ లాహోరులో పొందలేని విజయము ఆయన జైలులో నుండగా కొంతభాగమును, విడుదలయినతర్వాత కొంతభాగమును పొందగలిగెను.

భారతజాతి కోరిన హక్కుల నంగీకరించుటకు కలకత్తాకాంగ్రెసులో ప్రభుత్వమువారి కొక్కసంవత్సరము గడు వీయబడెను. ౧౯౨౯ డిసెంబరు ౧౩ వ తేదీ అర్ధరాత్రి ౧౨ గంటలతో ఆగడువు పూర్తియయ్యెను. ఎంతకాలమునుండియో వాదప్రతివాదములు జరుగుతూన్న కాంగ్రెసుసిద్ధాంతమును మార్పుచేయుటనుగూర్చిన

తీర్మానమున కానాటితో అంతు తీరినది. సరిగా ఆగంటలో సంపూర్ణస్వాతంత్ర్య పతాకమును స్థాపించుటకు కాంగ్రె సంతా ఏకీభవించినది.

మొత్తముపైన లాహోరుకాంగ్రెసు సందిగ్ధపరిస్థితులలో జరిగెను. గాంధీకి ప్రతికూలముగా తేబడిన తీర్మానములు కేవలము చర్చకోసమైనా వచ్చియుండవలెను, లేదా కార్యక్రమమును విచ్ఛిన్నముచేయుటకైనా వచ్చియుండవలెను. స్వాతంత్ర్యము తప్ప ఇంకే పిచ్చిపిచ్చి రాజ్యాంగములను కోరని పెద్దమనుష్యులు శాసనసభలనుండి రాజీనామాల నిచ్చుట కంగీకరించలేదు. వారు ప్రధానతీర్మానమును అంగవైకల్య ముగా నొనర్చుటకో, లేక హత్యకావించుటకో ప్రయత్నించిరి. ప్రతికూలపక్షము వారిలో కొందరు స్వతంత్రవాదమునకే వ్యతిరేకముగా నుండి రౌండుటేబిలుసభకోస మంగలార్చనొడగిరి. మరికొందరు స్వాతంత్ర్యమును కోరిరి. కాని కార్యనిర్వాహక సభ్యులు వైస్రాయియెడ చూపిన మామూలుదాక్షిణ్యములు వారికి గిట్టలేదు. కాబట్టి ప్రధానతీర్మానమునుగూర్చి జరిగిన చర్చలు వివిధవిధములుగా నుండెను. ఆతీర్మానమును అనేకు లనేకాభిప్రాయములతో నెదిరించిరి. కాని బహిరంగసభలో ఆ తీర్మానమునకు ప్రతికూలముగా ౧౫ మందిమాత్రమే చేతు లెత్తిరి. వైస్రాయిప్రయత్నములను శ్లాఘించినవిషయములో రెండుపక్షములా వోట్లు చాలా దగ్గిరదగ్గిరగా వచ్చినవి. ఈ అంశము పైన ౧౮౦ వోట్లభేదము వచ్చినది. బాంబునిరసనసందర్భమున ౮౮ వోట్లుమాత్రమే ఎక్కువ వచ్చినవి.

వంగరాష్ట్రములోని ఆంతరంగిక కలహముల మూలమున వచ్చిన ఎన్నిక తగాదాలు చాలకాలమునుండి నిలిచియుండెను. ఆ సందర్భములో మోతీలాలుకును, సుభాస్‌బాబుకును మాటామాటా వచ్చెను. వంగరాష్ట్ర నాయకత్వమునుగూర్చి జె. యమ్. సేనగుప్తకును, సుభాస్‌చంద్రబోసుకును వివాదము వచ్చెను. శాసనసభా ప్రవేశసందర్భమున వీరిద్దరికిని తీవ్రమైన భేదభావములు కలిగినవి. తరువాత జాతీయ ఋణములనుగూర్చిన చర్చ వచ్చెను. ఆ ఋణములు స్వతంత్రన్యాయవిచారణసంఘము వారిచే ఆలోచింపబడవలెనని తీర్మానమువచ్చినప్పుడు తీవ్రవాదు లట్టిఆలోచన అవసరములేదనీ, అఋణములు సంపూర్ణముగా నిరాకరింపబడవలసినదేననీ వాదించిరి. గాంధీ కాంగ్రెసుసిద్ధాంతములోని "శాంతియుతములును, న్యాయసమ్మతములును అగు పద్ధతులతో" అనే మాటలను "సత్యయుతములును, అహింసాయుతములును అగు పద్ధతులతో" అని మార్పింపవలెనని ప్రయత్నించెను. కాని నెగ్గలేకపోయెను.

అప్పటి ఆ విషయము నిరుడు (౧౯౩౪ అక్టోబరు) జరిగిన బొంబాయికాంగ్రెసులోకూడా చర్చింపబడెను. లాహోరుకాంగ్రెసులో జవహరలాల్, గాంధీలు విజ

యము పొందిరన్నమాట స్పష్టము. మహాసభ పూర్తిఅయిన వెంటనే శ్రీనివాసయ్యంగారు, సుభాస్‌చంద్రబోసులు కాంగ్రెసుప్రజాపక్షమనే నూతనపక్షమును స్థాపించినట్లు ప్రకటించిరి అది చూచి ప్రభుత్వమువారుకూడా కాంగ్రెసులోని అల్పసంఖ్యాకపక్షమును కాంగ్రెసు సమాధానపర్చుకోలేకపోయినదనీ, ఆ చీలిక తప్పనిసరే అనీ తలచిరి. వీరిరువురును కార్యవర్గసభ. కెన్నికలు జరగవలెనని అభిప్రాయపడిరి. ఆ తీర్మాన మోడి పోయినప్పుడు మరికొందరు దక్షిణఇండియా స్నేహితులతో కలసి వారు సభాభవనము నుండి వెళ్ళిపోయిరి. పాతకార్యనిర్వాహకసభ్యులలో ఎవరు తమ సభ్యత్వములను విడువ సిద్ధముగా నుండిరని గాంధీ ప్రశ్నించుట అలవాటు.

లాహోరులో ఆ మరుసంవత్సరము పనిచేయవలసిన కార్యనిర్వాహకసభ్యుల జాబితాలు రెండు స్వతంత్రముగా తయారుచేయబడినవి. ఒకటి గాంధీతో సంప్రదించి పండిత మోతీలాల్ నెహ్రూ తయారుచేసెను. రెండవది జమ్నాలాల్ బజాజ్ తయారుచేసెను. ఆరెండు జాబితాలలో కలియనిపే రొక్కటే యుండెను. ఆభేదము సవరింపబడెను. కార్యనిర్వాహకవర్గ మేర్పడెను. కాని శ్రీనివాసఅయ్యంగారు, సుభాస్‌బోసు లెన్నిక కావలెననిరి. అదే వీరు బయటకు లేచిపోవుటకు కారణము. ఒక్క పది నిముసములలో ఈవార్త ఆసేతుహిమాచలపర్యంతము వ్యాపించినది. క్రొత్తపక్షము సృష్టింపబడినది. లాహోరులో కాంగ్రెసుప్రజాపక్షమనే పేరుగల ఈ నూతనపక్షము స్థాపింపబడినవెంటనే సుభాస్‌చంద్రబోసు చిత్తరంజనదాసుసతికి ఈక్రింది తంతి వార్త నిచ్చెను: "అధికసంఖ్యాకుల నిరంకుశత్వపరిస్థితులు మమ్ములను గయలోవలెనే కాంగ్రెసుప్రజాపక్షమనే పేరుగల క్రొత్తపక్షమును సృష్టింప బలవంతపెట్టినవి. దేశబంధుయొక్క ఆత్మ మమ్ములను సన్మార్గమున పట్టించునుగాక. మీ ఆశీర్వాదములు మమ్ములను ఉత్సాహవంతులనుగా చేయునుగాక."

ఆ నూతనపక్షమునుగూర్చి పక్షకార్యదర్శు లీవిధముగా ప్రకటించిరి: "భారతదేశముయొక్క సంపూర్ణస్వాతంత్ర్యాదర్శమునకు భిన్నముకాని పద్ధతిని ఈక్రొత్తపక్షము శక్తివంచనలేకుండా దేశములోని తదితరపక్షములతో సాధ్యమైనంతవరకు వారి కార్యక్రమములయందును, వ్యవహారములయందును తమ ఆదర్శమును పొందుటకు తోడ్పడుదురు."

ప్రధానతీర్మానమునకు ప్రతికూలురుగా నున్నవారు కౌన్సిల్ రాజీనామావిషయము నామోదించిరి. కాని కౌన్సిళ్లకు పోటీచేసి తిరిగి ప్రవేశింపవలెనని వారు వాదించిరి లాహోరులో గాంధీతీర్మానాలకు ప్రతికూలముగా అనేకమంది అనేకకారణములతో చేతులు కలిపిరి. గాంధీయొక్క కట్టితనమును గూర్చి కొంతమందికి భయము

కలిగెను. ఇక మేము తుపానులో సముద్రముపైన ప్రయాణము చేయవలసియుండెను. సముద్ర మల్లకల్లోలముగా నుండెను. మేఘములు దట్టము లయ్యెను. నావికులకు క్రమ శిక్షణము లేదు. చుట్టూ మంచు పట్టినది. కాని మా క్షేమముమాత్రము తనమార్గమును సరిగా ఎరిగిన నావికునిచేతులలో నుండెను. ఆయనకు తక్కిన అనుచరులు సరిగా విధేయులుగా నుండినయెడల విజయము నిశ్చయమే.

## 2. చివరి పోరాటము

### ౧౯౩౦

[కార్యప్రారంభము - అసలుకీలకము - స్వాతంత్ర్య ప్రకటనము - పూర్ణస్వరాజ్యజయంతి - ఉత్సవములు - లండన్ సభోద్దేశము - అసెంబ్లీలో వైస్రాయి ఉపన్యాసము - గాంధీప్రత్యుత్తరము - ఆయన ౧౧ విషయ ములు - వస్త్రపరిశ్రమబిల్లు - శాసనోల్లంఘనము - రాజీనామాలు - సబర్మ తీలో కార్యసంఘసమావేశము - శాసనోల్లంఘనమునుగూర్చి కార్యసంఘము వారి తీర్మానము - శాసనోల్లంఘనము ప్రారంభింపబడినవిధానము - శాసనో ల్లంఘనమునుగూర్చిన భీతి - ఉప్పుకథ - ఉప్పుపన్నుల చరిత్రము - సత్యా గ్రహోద్యమతత్వము - థియోడోర్‌పార్కరు ఉదాహరణము - గాంధీ అంతర్వాణీప్రబోధము - గాంధీ వైస్రాయికి వ్రాసిన ఉత్తరము - వైస్రాయి ప్రత్యుత్తరము - గాంధీఖండనము - గాంధీ యాత్రాసన్నాహము - వల్ల భాయినిర్బంధము - సబర్మతీ సమావేశము - శపథము - వల్లభాయి ఉప న్యాసములు కొన్ని - దండీదండయాత్ర ప్రారంభము - నూతనభావ ప్రకటనములు సత్యాగ్రహుల ప్రమాణపత్రము - "నేనరెస్టుచేయబడినప్పుడు"- స్వరాజ్యభవనము - నిజముగా మహారాజదాతృత్వము - ఉద్యమాభి వృద్ధి - పూర్ణ స్వరాజ్యజననము - భారతదేశమున జరిగిన అద్భుతవిషయములు - దండయాత్ర ప్రారంభమగుట - అ. భా. కాం. సం. సత్యాగ్రహోద్యమము నంగీకరించుట - గాంధీ దండీ చేరుట - గాంధీప్రకటనము - స్త్రీ లేమిచేయ వలెను? - ఉప్పుసత్యాగ్రహము ఏప్రిల్ ౬ న ప్రారంభమగుట - కరాచీ

కాల్పులు - బెంగాల్ ఆర్డినెన్సు - ప్రెస్సు ఆర్డినెన్సు - నవజీవన్ ముద్రాలయము స్వాధీనపరచుకొనబడుచుండెను - గాంధీ వైస్రాయికి వ్రాసిన రెండవ ఉత్తరము - కొన్ని క్రూరచర్యలు - గాంధీ అరెస్టు - గాంధీసందేశము - సరోజినీదేవి ప్రకటనము - సంపూర్ణమైన హరతాళము దానంతటది జరుగుట- గాంధీనిర్బంధమునుగూర్చి ప్రపంచమున కనుపరచిన ఆందోళన - మొదటి రౌండుటేబిలుసభకు వైస్రాయి సన్నాహము - కార్యసంఘ తీర్మానములు - తయ్యాబ్జీ అరెస్టు - సరోజినీదేవినాయకత్వము - బహిష్కారఫలితము - ఉప్పుముట్టడులు - వాడాలాదండయాత్రలు - కొన్నివివరములు - లాఠీచార్జి - ఒక యూరోపియన్ సాక్షి - స్లోకోంబో వ్రాతలు - అహింసాతత్వము - కటకటాల వెనుకనున్నశక్తి - వైస్రాయి సీల బిగించుట - ఖైదీల స్థితి - గాంధీనిగూర్చి జెసెంటు - ఉద్యమవిమర్శనము - విదేశవస్త్ర బహిష్కారము జూన్ లో కార్యసభసమావేశము - బ్రిటిష్‌వస్తు, విదేశవస్త్ర బహిష్కారములు ప్రోత్సహింపబడుట - మిల్లులపైన యజమాన్యము - బ్రెయిల్సుఫోర్డు స్తోత్రము - అసెంబ్లీలో ప్రశ్నలు - షోలాపురము - పెషావరులో ఏప్రిల్ ౨౩వ తేదీ - గంగాసింగుకుటుంబము - బొంబాయినగరమున జూలై నెలలో కాంగ్రెసుకార్యవర్గసభ - కొంతమంది కార్యసంఘసభ్యు లరెస్టుచేయబడుట - లోకమాన్య తిలకు వార్షికోత్సవము - ౧౦౦ మంది స్త్రీ లరెస్టుచేయబడుట - ఇంకా తీవ్రమైన లాఠీఛార్జి - చిత్రమైన అక్రమసంఘము - వల్లభాయి, గుజరాతు - గుజరాతులో పన్నులనిరాకరణము - దేశమంతటా లాఠీఛార్జీలు బ్రెయిల్సుఫోర్డు మరియొకసారి స్తుతించుట - విచిత్రమైనవలస - ఘరివాలాసిపాయిలు-బోర్సాదు స్త్రీల వీరత్వము - మొదటి సంధిరాయబారములు - ఎరవాడాజైలులో సభ - మొదటి రౌండుటేబిలుసభ - ప్రధానమంత్రి ప్రకటనము - కార్యవర్గమువారి తీర్మానము - శాస్త్రిసప్రూల తంతివార్త - కార్యసంఘసభ్యులను వదలవలెనని వైస్రాయిచేసిన ఉత్తరువులు. ]

కాంగ్రెసు వాదలకు వేచియుండవలసిన సంవత్సరము గడచెను. కార్యము సాధింపవలసిన తరుణమువచ్చెను. కాని కాంగ్రెసుజరిగిన మూడువారములలోనే మహారాష్ట్రదేశములో తిరుగుబాటు కనిపించెను. సహాయ నిరాకరణోద్యమ ప్రారంభదశలో మహారాష్ట్రులు వంగరాష్ట్రవాసులతో కలిసి అసహాయోద్యమము నేవిధముగా నిరోధించినదీ మనకు తెలిసియేయున్నది. ఇప్పుడు మహారాష్ట్రకాంగ్రెసుకమిటీవారు శాసనసభా బహిష్కారమును ప్రవేశపెట్టవలదని కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమువారిని

కోరిరి. అంతేగాక స్వాతంత్ర్యసిద్ధాంతముపైన, ఢిల్లీమరతుల కనుగుణముగా రౌండు టేబిలుమహాసభకు పోవలసినదనికూడా దేశమువారు హెచ్చరించిరి. కాని ఈ సమస్య లిదివరకే పూర్తిగా పరిష్కరింపబడియుండెను. ఢిల్లీమరతుల ప్రకారము ప్రభుత్వమువారు ఖయిదీలను విడుదలచేసి, హృదయ పరివర్తనము కనుపరచవలసి యుండెను. ఆరోజునుండి అధినివేశ ప్రతిపత్తి అమలుజరుపబడవలసియుండెను. ఈ రెండునూ జరుగనిది ఢిల్లీమరతుల ప్రకారము రౌండు టేబిలుసభకు పోవలెననుట కర్థ మేమో తెలియదు. ౧౯౨౯ డిసెంబరు ౨౩ వ తేదీని గాంధీ వైస్రాయిని దర్శించి నపుడు రాజకీయఖైదీల విడుదలనుగూర్చి చర్చించుటకు గాంధీ ఇష్టపడలేదు. ఖయిదీలు కొంతకాలము జైళ్లలో నుండగలరని ఆయనచెప్పెను. అధినివేశప్రతిపత్తిపైన ఆయన చర్చను కేంద్రీకరించెను. వైస్రాయి దానినిగూర్చి వాగ్దానములను చేయ నిరాకరించెను. గాంధీ వైస్రాయినుండి అటువంటి వాగ్దానముల నెందుకు కోరెనో తెలుసుకొనుట మంచిది. (౧౯౨౫లో లాన్సుబరీ భారతరాజ్యాంగ సహాయకార్యదర్శి అయిన అరల్ వింటర్టనును "బర్కెన్‌హెడ్ ప్రభువు (భారతరాజ్యాంగ కార్యదర్శి) దాసు, గాంధీలను సహకారమరతుల విషయములో రాయబారము జరుపుటకు లండను పిలువ నిశ్చయించుకొనెనా?" అని ప్రశ్నించెను. అందు కాయన పిలువ నిశ్చయించు కొనలేదని జవాబుచెపుతూ కారణముల నీ క్రింది విధముగా ప్రకటించెను:

"భారతదేశపు పరిపాలనమున్నూ, దానిని ప్రత్యక్షముగా అమలుపరిచే పద్ధతిన్నీ భారతప్రభుత్వమువారికిని, స్థానికప్రభుత్వములవారికిని వదలివేయబడెను. కాబట్టి అటు వంటి చర్చలు వారితోనే జరుపబడవలెను. ఈ సమయములో ఆ విషయములనుగూర్చి బ్రిటిష్‌ప్రభుత్వమువారు జోక్యము కల్పించుకొనుటవలన ప్రయోజనములేదు. అవి వారి చేతనే చివరనిర్ణయము చేయబడవలెను. వారి ఆ నిర్ణయమునుగూర్చి పార్లమెంటుకు వారు బాధ్యతవహింపవలెను. ఇది మొదటివిషయము. ఇక రెండవవిషయ మేమనగా, భారతదేశపు రాజకీయపరిస్థితులనుగూర్చి ఈలోగా వైస్రాయి ఈదేశమును దర్శింపనుం డగా, ఆయన వచ్చినప్పుడు మనము భారతదేశపు రాజకీయపక్షములవారితో రాయ బారములు నడుప ప్రారంభించినయెడల ఆయననూ, ఆయనప్రభుత్వమునూ, చిక్కు లలో పెట్టినవార మగుదుము." కాబట్టి భారతరాజ్యాంగతంత్రమును పరిష్కరింపతగిన కీలకము వైస్రాయిలోనే కలదని గాంధీ గ్రహించెను. అందువలన ౧౯౨౯ డిసెంబరు ౨౩ వ తేదీని గాంధీ వైస్రాయిచేత ఆ కీలకమును బయటపెట్టించుటకు ప్రయ త్నించెను.

౧౯౩౦ జనవరి ౨ వ తేదీని నూతన కార్యవర్గము సమావేశమైనది. పాత కార్య నిర్వాహకవర్గమువారు ముఖ్యసమస్యల నన్నిటినీ అదివరకే పరిష్కరించిరి. కాంగ్రెసుకు

శాశ్వత కార్యదర్శినికూడా వారే నియమించిరి. క్రొత్త కార్యవర్గమువారు సమావేశమై శాసనసభా బహిష్కరమునుగూర్చిన మొదటి తీర్మానమును అమలులోకి తీసుకొని వచ్చుటకు తగిన చర్యలను జరిపిరి. శాసనసభలలో రాజీనామాలీయకగాని, శాసనసభల ఎన్నికలలో జోక్యము కల్పించుకొన మానకగాని ఎదుకుతిరిగే శాసనసభ్యులను బలవంతపెట్టుటకు వోటర్లందరూ ప్రయత్నింపవలసినదని కార్యవర్గములో తీర్మానింపబడెను. దీని ఫలితముగా భారతశాసనసభనుండి ౨౭ మంది సభ్యులు రాజీనామాల నిచ్చిరి. ౧౯౩౦ జనవరి ౨౬వ తేదీ పూర్ణస్వరాజ్యజయంతిగా నిర్ణయింపబడినది.

ఆ రోజున కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమువారు తయారుచేసిన ప్రకటనము యావద్భారతదేశమునందును పట్టణములలోను, పల్లెలలోనుకూడా చదువబడవలెనని తీర్మానింపబడెను. ఆయాసభలలోని ప్రజల అంగీకారమును చేతు లెత్తించుట మూలముగా తెలుసుకొనవలెననికూడా నిర్ణయింపబడినది. తరువాత పశ్చిమోత్తర సరిహద్దురాష్ట్రములలో అమలులోనున్న కొన్ని నిర్బంధశాసనములను గూర్చి విచారించుట కొకకమిటీ నియమింపబడెను. ఇంతకుపూర్వము నియమింపబడిన ప్రత్యేకోపసంఘములవారు తమ కార్యక్రమమును తీవ్రముగా కొనసాగింపవలెనని కోరబడిరి. కాంగ్రెసుసభ్యులు నురుకుగా చేర్పింపబడవలెననికూడా తీర్మానింపబడెను.

జనవరి ౨౬వ తేదీని చదువబడిన పూర్ణస్వరాజ్యప్రకటన యీ విధముగా నుండెను:

పూర్ణస్వరాజ్యజయంతినాడు, అనగా ౧౯౩౦ జనవరి ౨౬ తేది ఆదివారమునాడు దేశమంతటా బహిరంగసభలలో అంగీకరింపబడవలసిన ఈ క్రింది తీర్మానము కాంగ్రెసు కార్యనిర్వాహకసభనుండి జారీచేయబడెను:

"తమ కష్టార్జితఫలముల ననుభవించి, తమ జీవితావసరములను పొందుటకు ప్రతిజాతికీ హక్కున్నట్లుగానే భారతజాతికికూడా శాశ్వతమైన హక్కు కలదని మావిశ్వాసము. అందుమూలముననే వారి అభివృద్ధికి సంపూర్ణావకాశములు కలుగగలవు. ఏప్రభుత్వమైననూ ప్రజల ఈ హక్కులను తృణీకరించి, వారి ననగద్రొక్క పూనేయెడల ప్రజల కాప్రభుత్వమును మార్చుటకుగాని, లేక నిర్మూలించుటకుగాని హక్కు కలదని కూడా మావిశ్వాసము. భారతదేశములోని బ్రిటిష్ప్రభుత్వము భారతప్రజల స్వాతంత్ర్యమును తృణీకరించుటయేకాక, పైగా సామాన్యప్రజల ధనములను దోచుకొనుటపైన నాధారపడియున్నది. ఆప్రభుత్వము మూలమున భారతదేశముయొక్క మత, రాజకీయ, ఆర్థికవిజ్ఞానములు నాశనము చేయబడినవి. కాబట్టి భారతదేశము బ్రిటిష్ సంబంధమును వదలుకొని, పూర్ణస్వరాజ్యమును పొందవలెనని మా విశ్వాసము.

"ఆర్థికముగా భారతదేశము నాశనముచేయబడినది. మా దేశప్రజలనుండి తీసుకొనబడే పన్నులు మాప్రజల ఆదాయమున కెంతమాత్రము అనుగుణములుగా లేవు. మా సగటాదాయము రోజుకు ఏడుకానులు (అనగా ౨ పెన్నీలకు తక్కువ). మేము చెల్లించే పన్నులభారములో నూటికి ౨౦ వంతున హెచ్చింపబడిన భూమిశిస్తులు రైతులు చెల్లించుకొనవలసియున్నది. నూటికి 3 వంతున హెచ్చింపబడిన ఉప్పుపన్ను పేదలకు భరింప శక్యముకాకున్నది.

"చేతితో నూలు వడకుటవంటి గ్రామపరిశ్రమలు నిర్మూలింపబడినవి. రైతులు కనీసము సంవత్సరములో ౪ నెలలు ఇతరవృత్తులు లేక సోమరులుగా నుండవలసియున్నది. సున్నితములైన చేతిపనులు లేకపోవుటమూలమున వారి బుద్ధి మొద్దుబారినది. ఇతరదేశములలోవలె నిర్మూలింపబడిన చేతిపనులకు బదులుగా ఈ దేశములో క్రొత్తవృత్తులు కల్పింపబడలేదు.

"దిగుమతిపన్నులమూలకమునను, కరెన్సీతికమకలమూలమునను రైతులపైన క్రొత్త బరువులు వేయబడినవి. బ్రిటిష్ దేశములో తయారుచేయబడిన వస్తువులే ఎక్కువగా మాకు దిగుమతి చేయబడుతున్నవి. దిగుమతిపన్నులలో స్పష్టముగా ఇంగ్లండులో తయారుచేయబడిన వస్తువులకు పక్షపాతము చూపబడుతున్నది. అందుమూలముగా వచ్చిన ప్రభుత్వాదాయము ప్రజల పన్నులభారమును తగ్గించుటకుగాక ప్రభుత్వము వారి దుబారాఖర్చుకు వినియోగింపబడుతున్నది. మారకపురేటువిషయములో చేయబడే కృత్రిమము అన్నిటికంటెను నిరంకుశముగా నున్నది. అందుమూలమున ఈదేశమునుండి లక్షలకొలది ద్రవ్యము పరదేశములకు ప్రవహిస్తున్నది.

"రాజకీయముగా బ్రిటిష్వారి హయాములోవలె అంతకుపూర్వ మెన్నడును భారతదేశపుస్థితి అధోగతికి రాలేదు. సంస్కరణలు ప్రజలకు నిజమైన రాజకీయాధికారము నీయలేదు. మాలోని ఉత్తమోత్తములు విదేశీయుల అధికారమునకు తలలొగ్గవలసియున్నది. అభిప్రాయప్రకటనమునకుగాని, సభాసమావేశములకుగాని మాకు స్వాతంత్ర్యము నిరాకరింపబడినది. మా దేశీయులలో అనేకమంది విదేశములయందజ్ఞాతవాసము చేయవలసివచ్చినది. వారు తమ గృహములకు తిరిగి రా వీలులేకున్నది. మా పరిపాలనసామర్థ్యము పూర్తిగా నిర్మూలింపబడినది. సామాన్యప్రజలు చిన్న చిన్న గ్రామనౌకరీలతోను, గుమస్తాగిరీలతోను సంతృప్తిపడవలసివచ్చినది.

"నేటి విద్యాపద్ధతి మమ్ములను మా విజ్ఞానమార్గమునుండి పెడమార్గములను పట్టించినది. మా కీయబడు శిక్షణము మమ్ములను బంధించు గొలుసులనే మేమంటిపెట్టుకొనియుండునట్లు చేసినది.

"నిర్బంధముగా మేము నిరాయుధు లొనర్పబడితిమి. అందుమూలమున మాపౌరుషము నశించినది. మాలోని నిరోధశక్తి నణగద్రొక్కుటకు భయంకరాయుధములతో విదేశసైన్యము దేశములో నిలుపబడినది. మేము స్వసంరక్షణమును చేసుకొనగలిగిన స్థితిలో లేము. విదేశదండయాత్రవిషయములోగాని, లేక దొంగలు, బందిపోటు దారులు మొదలగు దుర్మార్గులనుండి మాగృహములను, కుటుంబములను రక్షించుకొనే విషయములోకాని మాకు శక్తిలేదని తలపవలసివచ్చినది.

"ఇటువంటి ఆపత్తులను కలిగించిన పరిపాలనమునకు మాదేశము నింకను సరి చేయుట దేవునికీ, మానవునికీకూడ ప్రతికూలముగా అపరాధముచేసినట్లు మేము భావింతుము. కాని మాస్వాతంత్ర్యమును సంపాదించుకొనుటకు ప్రయోజనకరమైన మార్గము దౌర్జన్యపద్ధతి కాదని మాకు తెలుసును. కాబట్టి మాకు సాధ్యమైనంతవరకు బ్రిటిష్‌పరిపాలనమునుండి పూర్తిగా సంబంధమును వదులుకొని పన్నుల నిరాకరణముతో కూడిన శాసనోల్లంఘనమునకు ప్రారంభించుటకు మేము సంసిద్ధము కాగలము. మేము ప్రభుత్వమువారికి చేసే మాస్వచ్ఛందసహాయము నుపసంహరించుకొని, ఎట్టి ఆగ్రహకారణములు కలిగినప్పటికీ దౌర్జన్యముచేయక పన్నులను చెల్లించుట ఆపివేసినయెడల ఈ అమానుషప్రభుత్వ మంతరించునని మావిశ్వాసము. కాబట్టి పూర్ణస్వరాజ్య సంపాదనార్థ మప్పుడప్పుడూ కాంగ్రెసునుండి పంపబడే ఉత్తరువులను శిరసావహించుటకు మే మిందుమూలముగా ప్రమాణము చేసుకొనుచున్నాము."

పూర్ణస్వరాజ్యజయంతి (Independence Day) నాటి మహోత్సవములను బట్టియే నివురుగప్పిన నిప్పులవలె నున్న ప్రజల ఉత్సాహపరంపరలు వ్యక్తములయ్యెను. వారి హృదయములలో దాగియున్న త్యాగసంసిద్ధత ప్రత్యక్షమయ్యెను. ప్రజల ఉత్సాహాగ్నిని ఉద్రేకవాయువులతో ప్రజ్వలింపచేయుటయే నాడు చేయవలసినపని. పూర్ణస్వరాజోత్సవములు పూర్తిగాకమునుపే జనవరి ౨౫ వ తేదీని భారతశాసనసభలో వైస్రాయి ఇచ్చిన ఉపన్యాసము ప్రకటింపబడెను. దానితో కొందరు భారతరాజకీయవేత్తల హృదయములలోగల ఆశ పూర్తిగా భగ్నమయ్యెను. సర్ జాన్ సైమన్ తన ఉత్తరములోను, రామ్సే మెగ్డనాల్డు తన జబాబులోను, ఇర్విన్ ప్రభువు తన ప్రకటనములోను, వెడ్జివుడ్ బెన్ పార్లమెంటులోని తన ఉపన్యాసములోను లండను సభోద్దేశమును గూర్చి వర్ణించుటలో ఒకటేభాష నుపయోగించిరన్న సంగతి పాఠకులు గమనించియుందురు. "భారతదేశములోని అన్నిజాతులవారికినీ, అన్నికక్షులవారికినీ సాధ్యమైనంత యెక్కువ అంగీకారములుగానున్న సూచనలను తయారుచేసేపద్ధతుల నన్వేషింపవలెననీ, అలా తయారుచేయబడిన సూచనలను బ్రిటిష్ మంత్రివర్గమువారు పార్ల

మెంటులో ప్రవేశపెట్టుట వారి విధి" అనీ వారు ప్రయోగించిన వాగ్జాలములోని భావము. సైమన్‌సాయి "భారతదేశపు ఆదర్శమునుగూర్చి నిర్వచించుటకే తాను స్పష్టముగా చేసిన ఉపన్యాసములో ఒకసమాసము నుపయోగించుట మూలమున భారత సమస్య పరిష్కరింపబడినట్లుగానే ప్రజలను నమ్మించి మోసపుచ్చదలచుకొనలే" దని ప్రకటించెను. సైమన్‌సాయి ప్రకటనము జరిగినతరువాత ౨౪ గంటలలో నాయకులు చేసిన ప్రకటనమునకు సైమన్‌సాయి ఇచ్చిన ప్రత్యుత్తరమునకున్నూ, లాయిడ్ జార్జి కామన్సుసభలో భారతరాజ్యాంగకార్యదర్శి బెన్నును ప్రశ్నించినప్పు డాయన ఇచ్చిన ప్రత్యుత్తరమునకున్నూ భారతీయులు కృతజ్ఞులైయుండవలెను. వా రిద్దరును "రౌండు టేబిలుసభ డొమినియన్ ప్రతిపత్తినిగూర్చి నిర్వచించుటకే గాని భారతదేశము దానిని పొందుటకు గల మార్గములలోని కఠినసమస్యలను పరిష్కరించుటకు కాదు." అని స్పష్టీకరించిరి. "ఎంత సుస్పష్టమైన భావలో ఉదాహరింపబడినప్పటికీ ఒక ఆదర్శము ప్రకటింపబడినమాత్రమున అది చేకూరినట్లుగానే భావింపబడకూడదు." అని సైమన్‌సాయి ఒక్కమాటలో అసలురహస్యమును చెప్పివేసెను. "చేరవలసిన లక్ష్యమునుగూర్చి స్పష్టముగా వివరింపబడినంతమాత్రమున ప్రయాణము పూర్తి అయినట్లుగానే బుద్ధిమంతుడైన ప్రయాణికు డెవడును తలచడు. లక్ష్యము మార్గమునుమాత్రమే చూపించగలదు." అనికూడా సైమన్‌సాయి బోధచేసెను. ఈ విధముగా ఆయన నిర్వచనమునకును, పరిష్కారమునకును గల భేదమును, లక్ష్యమునకును, మార్గమునకును గల భేదమును, ప్రకటించుటకును, పొందుటకును గల భేదమును వివరించెను. తరువాత భారతదేశము పదిసంవత్సరములనుండి అధినివేశప్రతిపత్తి ననుభవించుచున్న దని బెన్ చేసిన ప్రకటనములోని అంతరార్థమును ఆయన విశదీకరించెను:

"భారతదేశము సామ్రాజ్యములోని తదితరభాగములలో గల విదేశరాజ్యాంగవ్యవహారములందు స్వపరిపాలితాధినివేశముల చిహ్నముల నిదివరకే కలిగియున్నమాట వాస్తవము. కాని ప్రస్తుత భారతరాజకీయవేత్తలు భారతదేశ మనుభవిస్తున్న ఈ అధినివేశరాజ్యలాంఛనములకు సంతోషించుటలేదు. అవి బ్రిటిష్‌ప్రభుత్వమువారి అధికారమునకును, అంగీకారమునకును అనుగుణములుగా చాలావరకు జరుగవలసియుండుటయే భారతీయుల అసంతృప్తికి కారణము.

* * * * *

"కొందరు రౌండుటేబిలు మహాసభను పిలచి, అందులోని అధికసంఖ్యాకుల అంగీకారముతో భారతరాజ్యాంగనిర్మాణమును తయారుచేయవలెననీ, తరువాత దానిలో ఏమీ మార్పులులేకుండా దానిని పార్లమెంటుచే అంగీకరింపచేయవలెననీ

కోరియుండిరి. ఇప్పుడు బ్రిటిష్ ప్రభుత్వమువారు పిలిచినమహాసభ నిజముగా వారిచే కోరబడిన మహాసభ కాదు.

"ఆ మహాసభ అభిప్రాయములను తెలుసుకొనుటకునూ, అభిప్రాయభేదములను సమన్వయించుకొనుటకునూమాత్రమే పిలువబడుచున్నది. అది పార్లమెంటువారి విచారణకొరకు చిత్తుసూచనలను తయారుచేసేనిమిత్తము బాధ్యత వహింపవలసిన బ్రిటిష్ ప్రభుత్వమునకు సహాయకారిగా నుండగలదు."

ఈవిధముగా స్వయంనిర్ణయపద్ధతిమాట తలపెట్టబడనేలేదని వైస్రాయి స్పష్టీకరించెను. సమష్టివిచారణముగాని, సమష్టినిర్ణయముగాని బ్రిటిష్ ప్రభుత్వమువారి ధర్మనిర్వహణమునకు తోడ్పడునిమిత్తమేననికూడా ఆయన వ్యక్తముకావించెను. కాబట్టి స్వయంనిర్ణయమునుగూర్చిగాని, సమష్టినిర్ణయమునుగూర్చిగాని భారతదేశము తలపెట్ట కూడదనీ, అది తలపెట్టవలసినది "మరియొక నిర్ణయ" మనీ తేలిపోయెను.

వైస్రాయిచేసిన పై ఉపన్యాసమునకు ప్రత్యుత్తరముగా గాంధీ ఈ దిగువరీతిని "యంగు ఇండియా" పత్రికలో వ్రాసెను:

"ఘనతవహించిన వైస్రాయి అసలుసంగతిని చెప్పి మనస్థితినీ, ఆయనస్థితినీ సరిగా తెలియపరచినందు కాయనకు కాంగ్రెసువాదులు కృతజ్ఞత చూపవలెను.

"భారతదేశమందలి ప్రతికోటీశ్వరుడు దినమున కేడుకానులుసంపాదించే కూలివాడుగా మారిపోయేటంతవరకు అధినివేశప్రతిపత్తిని ప్రసాదించుటకు వైస్రాయి వేచియుండగలడు. కాంగ్రెసు కీరోజున శక్తియున్నయెడల, ఉపవాసములుచేసే ప్రతి రయితును కోటీశ్వరునితో సమానముగా జీవించే స్థితికి తీసికొనిరాగలదు. రయితు తన దుస్థితినిగూర్చి పూర్తిగాతెలిసికొని తన నిస్సహాయతకు కారణము 'కిస్మత్' కాక ప్రస్తుతప్రభుత్వమేనని గ్రహించినయెడల ఆయన సహనమును వీడి, న్యాయశాస్త్రపద్ధతులకును న్యాయవిరుద్ధమార్గములకును, హింసాపద్ధతులకును అహింసాపద్ధతులకును కూడ భేదములను గమనింప తలపెట్టడు. కాంగ్రెసు రయితులను ఉత్తమమార్గమున నడిపింప కోరుతూన్నది."

అని వ్రాసి గాంధీ ఇర్విన్ ప్రభువు నీక్రింది షరతులను కోరెను:

"(౧) సంపూర్ణ మద్యపాననిషేధము.

(౨) మారకపురేటు ౧౬ పెన్నీలకు తగ్గించుట.

(౩) భూమిశిస్తును అధమము నూటికి ౫౦ వరకును తగ్గించుట. దానిని విధించుటకు శాసనసభ కధికార మొసగుట.

(౪) ఉప్పుపన్నును తీసివేయుట.

(౫) సైనికవ్యయమును మొట్టమొదట కనీసము సగమువరకు తగ్గించుట.

(౬) ప్రభుత్వోద్యోగుల అత్యధికజీతములను తగ్గింపబడిన భూమిశిస్తుల కనుగుణముగా సగమునకుగానీ, లేక అంతకు తక్కువకుగానీ తగ్గించుట.

(౭) విదేశీబట్టల దిగుమతిపైన సంరక్షణపన్నును విధించుట.

(౮) కోస్తాప్రయాణనియామక చట్టము (Coastal Traftic Reservation Bill) ను అంగీకరించుట.

(౯) హత్యకావించినందుకును, హత్య కావింప ప్రోత్సాహపరచినందుకును సామాన్యకోర్టులచే విచారింపబడినవారు తప్ప తక్కిన రాజకీయ ఖైదీలందరును విడుదల చేయబడుట. రాజకీయపుకేసుల నుపసంహరించుకొనుట. ౧౨౪ ఏ సెక్షనును, ౧౮౧౮ మూడవ రెగ్యులేషనును రద్దుచేయబడుట. భారతీయప్రవాసులను తిరిగీ ఇంటికి రానిచ్చుట.

(౧౦) సి. ఐ. డి. శాఖ రద్దుచేయబడవలెను; లేదా అది ప్రజాయత్తము చేయబడవలెను.

(౧౧) ఆత్మసంరక్షణకొరకు తుపాకులకు లైసెన్సుల నిచ్చుట. ఈ పనికూడా ప్రజాధికారముక్రిందనే జరుగవలెను."

౧౯౩౦ జనవరిసెలలో బ్రిటిష్ ప్రధానమంత్రి రామ్సే మాక్డొనాల్డుతో రాయబారములు నడుపదలచుకొనిన బొమన్జీకి గాంధీపంపినషరతులుకూడా ఇవేనని మాకు తెలియవచ్చినది.

"ఇంతమాత్రముతో ప్రజల ముఖ్యావసరము లింకా పూర్తి కాలేదు. కాని ఈ చిన్న చిన్న ముఖ్యావసరముల విషయములో మమ్ములను వైస్రాయి సంతృప్తిపరచునుగాక. అప్పుడాయనకు శాసనోల్లంఘనమనే మాటకూడా వినపడదు. అభిప్రాయప్రకటనమునకును, వాంఛాప్రకటనమునకును సంపూర్ణ స్వాతంత్ర్యముగల యే మహాసభలోనైనను కాంగ్రెసు హృదయపూర్వకముగా పాల్గొనగలదు." అనగా ఈ చిన్న చిన్న ప్రధానవాంఛలను వైస్రాయి సంతృప్తిపరచజాలనియెడల శాసనోల్లంఘనము ప్రారంభింపబడునని భావము.

"ఇతరదేశముల స్వాతంత్ర్య సంపాదనార్థ మాయాదేశప్రజలు వారి కనుగుణములైన అనేక ఇతరపద్ధతుల నవలంబింపవచ్చును. కాని భారతదేశమునకు దౌర్జన్యరహిత

సహాయనిరాకరణమార్గము తప్ప గత్యంతరము లేదు. మీరందరును ఈ స్వరాజ్యమంత్రోపాసకు లయ్యెదరుగాక! అంతకంతకు సమీపిస్తున్న భారతస్వాతంత్ర్యసంగ్రామము నకు మీ సర్వస్వమును అర్పింపగల ధైర్యసాహసములను భగవంతుడు మీకు ప్రసాదించుగాక."

భారతశాసనసభలో పై గ్రాయి వసంతకాలమునం దుపన్యసించెను. ఆయన ఉపన్యసించినముహూర్త మంత శుభమైనది కాదు. అంతకుపూర్వమే వస్త్రపరిశ్రమ సంరక్షణచట్టము (Textile Industry Protection Bill) ఆసభలో అంగీకరింపబడెను. దానికి ప్రతికూలురు చాలామంది ఆర్థికసంప్రదాయములకు విరుద్ధముగా సామ్రాజ్యక్షేమముకొరకాబిల్లుఇండియాపైన రుద్దబడినదని భావించిరి. ఇందుమూలమున పండిత మదనమోహనమాలవ్యాయున్ను, తదితరజాతీయవాదసభ్యులలో కొంతమందిన్ని రాజీనామాల నిచ్చిరి. నిజముగా కాంగ్రెసు ఉద్యమమునకు తలవనితలంపుగా అనుకోని చోటునుండి దైవానుకూలమువలన సహాయము వచ్చెను. తరచుగా ఇటువంటి సహాయము గవర్నమెంటువారి అనాలోచితపద్ధతులవలన లభించును. మాలవ్యాజీ సహాయనిరాకరణవాది కారు. ఆయన శాసనోల్లంఘనమున కంత ప్రతికూలముగా లేడు. కాని ఆయన సంపూర్ణస్వాతంత్ర్యము నంగీకరించలేదు. సరిగా ఇటువంటితరుణములో అసెంబ్లీగడువు పెంపుచేయబడి, ఆయన సభ్యుడుగా నుండగానే వస్త్రపరిశ్రమచట్ట మంగీకరింపబడెను. దానితో ఆయన రాజీనామా నిచ్చెను.

ఈ సందర్భములో ఈబిల్లునుగూర్చి కొంత చెప్పవలసియున్నది. అందుకొరకు వస్త్రపరిశ్రమలపైన వేయబడే ఎగుమతి దిగుమతి పన్నుల విషయమును గూర్చి కొంత తెలుసుకొనవలసియున్నది. యుద్ధము ముగిసేనాటికి ఇండియన్ మిల్లులలో తయారుచేయబడిన ౧౯ నెంబరుపైదాటిన నూలుపైనగాని, బట్టపైనగాని ౩ ౧/౨ వంతున పన్ను వేయబడెను. ఈపన్ను తయారైనబట్టపైననే వేయబడెను. అంతేకాని లాభములనుబట్టిగాని, విక్రయమునుబట్టిగాని కాదు. దిగుమతిపన్నులు కేవలము ప్రభుత్వాదాయములకోసము వేయబడెను. అది నూటికి ౫ వంతున నిర్ణయింపబడెను. మిల్లుయజమానులు, వర్తకులు, మితవాదులు - వీరంతా ప్రభుత్వమువారికి యుద్ధములో సంపూర్ణసహాయముచేసిరి. తరువాత వారు విదేశీబట్టలదిగుమతిమూలమున ఇండియన్ మిల్లులకు పెద్దదెబ్బ తగులుతూన్నదని ప్రభుత్వమువారికి విజ్ఞాపించుకొనిరి. గవర్నమెంటువారు ౧౯౨౪ లో దిగుమతిపన్నులను నూటికి ౫ నుండి ౧౧ వరకు హెచ్చించుట కంగీకరించిరి. అందుమూలమున నూటికి ౮ వంతున విదేశీబట్టలు ప్రియమైనవి. ఇండియన్ మిల్లుబట్టలపైన వేయబడిన నూటికి ౩ ౧/౨ పన్ను తీసివేయబడెను. అందుమూలమున అది ౩ ౧/౨ చౌక అయ్యెను. భారతప్రజలు భారతీయమిల్లుబట్ట

చౌకయినందు కేగిరి గంతులు వేస్తుండగానే ౧౯౨౭ లో ప్రభుత్వమువారు మారకపు చట్టమును (Ratio Bill) ప్రవేశపెట్టిరి. విదేశీబట్టలవ్యాపార మెప్పుడును ఇండియాలో పౌనుల షిల్లింగులలెక్కలలోనే జరుగును. ప్రభుత్వమువా రిప్పుడు రూపాయి యొక్క మారకపుధరను ౧౬ పెన్నీలనుండి (యుద్ధమునకు పూర్వపురేటు) ౧౮ పెన్నీలకు హెచ్చించుటచే నూటికి ౧౨ ౧/౨ వంతున విదేశీబట్టలు చౌకఅయ్యెను. అనగా ఒకపౌను విలువగల లాంకషైర్ బట్ట రూపాయికి ౧౬ పెన్నీల రేటుప్రకారము యుద్ధమునకుపూర్వము ౧౫ రూపాయల ఖరీదయ్యేది నేటి ౧౮ పెన్నీలధరప్రకారము రు. ౧౩-౫-౪ లు అవుతూన్నది. కాబట్టి ౧౯౨౫ లో భారతీయమిల్లు యజమానికి నూటికి ౭ ౧/౨ వంతు లాభము చూపబడగా, రెండుసంవత్సరముల తదనంతరము విదేశీయునికి ౧౨ ౧/౨ వంతున లాభము చూపింపబడినందువలన దేశమునకు వచ్చే లాభముకంటె పోయేనష్ట మెక్కువయ్యెను. ఇది భారతీయుల ఆందోళనమునకు కారణమయ్యెను. ఈ పన్నులను గూర్చి పునర్విచారణ చేయవలెనని వారు కోరిరి. ప్రభుత్వమువా రొక్క ఇంగ్లండుదేశమునుండి తప్ప తదితర దేశములనుండి ఇండియాకు దిగుమతి అయ్యే బట్ట పైన నూటికి ౨౦ వంతున దిగుమతి సంరక్షణ పన్నులను వేయుట కంగీకరించిరి. ఇంగ్లండుబట్టలపైన మాత్రము నూటికి ౧౫ వంతుననే వేయ నిశ్చయించిరి. ఇది ఆర్థికసంప్రదాయవిరుద్ధ మని మాలవ్యాజీ శ[illegible]ంచెను. ప్రభుత్వమువారి ఈపన్నుగడ లాంకషైరుకు పోటీగానున్న జపానుబట్టలను హిందూదేశములోనికి దిగుమతికాకుండా ఆపివేయుటకు పన్నబడెను. కాని వారు ఇండియాకు దిగుమతి చేయబడే అన్నిబట్టలపైననూ నూటికి ౫ వంతున ఓడకిరాయి తగ్గించి తమబట్టలను ఇండియాకు దిగుమతి చేయగలిగిరి. ఈవిధముగా వారు భారతదేశపు దిగుమతిపన్నులతో జయప్రదముగా పోరాడగలిగిరి. అంతేకాక జపానుప్రభుత్వమువారు ఆ ఓడయజమానులకు నూటికి ౫ వంతున విరాళములను మంజూరుచేసిరి. తరువాత నూటికి ౫ వంతున, ఈ రేట్లపైన ఇండియాప్రభుత్వమువారిచే అదనముగా వసూలుచేయబడెను. లాంకషైరుసరుకులపైన వేయబడిన నూటికి ౫ రూపాయల అదనపుపన్ను, భారతదేశములోకి దిగుమతిచేయబడిన ప్రత్తిపైన పౌను ౧ కి అర అణా పన్ను వేయుటమూలమున నిజముగా రద్దుచేయబడినట్లే భావింపవలసియున్నది. ఎందువలన ననగా, సాధారణముగా ఈజిప్టు, అమెరికాదేశములనుండియే భారతదేశములో సన్నబట్టలు తయారుచేయబడుటకు ప్రత్తి దిగుమతి అగును. ఆబట్టలు లాంకషైరుబట్టలతో పోటీచేయగలవు. లాంకషైరుబట్టలతో పోటీ చేయగలిగిన హిందూదేశపు సన్నబట్టలకు పనికివచ్చుప్రత్తిపైన పౌనుకు అర్ధణాపన్ను వేయుటమూలకముగా ఇండియాప్రభుత్వమువా రా ఇండియన్ మిల్లుబట్టలను నూటికి ౫ వంతున ప్రియముచేసి, లాంక

పైరు అదనపు దిగుమతిపన్నుల మూలకముగా పోగొట్టుకొనిన ౨౫% న్నూ ముజరా యిప్పించగలిగిరి. ఇది మాటవరుసను చెప్పబడినది. ఇక బట్టలరక్షణబిల్లు అసెంబ్లీలో చర్చకు వచ్చినప్పుడు రెండుసవరణలు ప్రతిపాదింపబడెను. మాలవ్యా, ఇంగ్లండుకు ప్రత్యేకసదుపాయము చూపింపబడక అన్నిదేశములతోపాటుగానే పన్ను విధింప బడవలెనని సూచించెను. మార్చి ౩౧ వ తేదీని శాసనసభ ముగింపబడేకొంగున ప్రెసి డెంటు పటేలు "ప్రభుత్వమువారి సూచనలకు సభలో సవరణలు ప్రతిపాదింపబడే సందర్భమున వారీబిల్లు నెప్పటికీ ఉపసంహరించుకొనుటనుగూర్చి పునర్విచారణ చేసె దరా" అని ప్రశ్నించెను. కాని ప్రభుత్వమువారు తమ రా బిల్లు నుపసంహరించుకొను ట తమ బాధ్యతలను త్యజించుటగా భావించిరి. చిట్టచివరకు వోటుకు పెట్టబడగా మాలవ్యాజీసవరణ వీగిపోయెను. చెట్టిసవరణ నెగ్గినది. కాని బిల్లుపైన పెట్టబడిన సవర ణకు వోట్లు తీసుకొనబడకమునుపే మాలవ్యాపండితుడున్నూ, ఆయన అనుచరులున్నూ దివాను చమల్‌లాలున్నూ, నూతన స్వరాజ్యపక్షు సభ్యులున్నూ శాసనసభను విడచి లేచిపోయిరి. ఆసాయంకాలము భారతశాసనసభను ముగించేలోపల అధ్యక్షుడు "ఇక ముందు మనలో ఎంతమంది ఈసభలో నుందుమో తెలియదు." అని సభ్యులందరికి కర స్పర్శనము కావించెను. నిజముగా ౧౯౩౦ ఫిబ్రవరితరువాత జరిగిన ఈ అసెంబ్లీవిష యములు మన పోరాటమునకు సంబంధించినవి కావు. కాని ఆనాటి చరిత్రాంశము లను సంపూర్ణమొనరించుటకును, మాలవ్యాపండితుడున్నూ, తదితరులున్నూ కాంగ్రెసు పక్షము ననుసరించి ఏవిధముగా వారి స్థానములకు రాజీనామాల నిచ్చిరో తెలియ పరచుటకునుమాత్రమే ఈ ఇతిహాసము చెప్పబడినది.

౧౯౩౦ లో ప్రారంభింపబడిన మహోద్యమమునుగూర్చి ఇకముందు తెలుసు కొనవలసియున్నది. దేశమంతటా పూర్ణస్వరాజ్యోత్సవములు జయప్రదముగా జరుప బడెనన్న సంగతి ఇదివరకే చెప్పితిమి. అప్పటికప్పుడే భారతదేశములో ఏదో ఒకకారణ ముతో తీవ్రముగా అరెస్టులు చేయబడుచునే ఉండెను. మీరట్ కేసులోని ౩౨ ముద్దాయి లలో ఒక్కరుతప్ప తక్కినవారందరు సెషన్సుకోర్టుకు విచారణనిమిత్తము పంపబడిరి. కలకత్తాలో సుభాసుచంద్రబోసున్నూ, మరి ౧౧ రున్నూ శిక్షింపబడిరి. వారి కొక సంవత్సరము కఠినఖయిదు విధింపబడెను. కాంగ్రెసు ఆజ్ఞానుసారముగా ౧౯౩౦ ఫిబ్ర వరి నాటికి ౧౭౨ మంది శాసనసభ్యులు రాజీనామాల నిచ్చిరి. అసెంబ్లీనుండి ౨౧ మంది, స్టేటుకౌన్సిలునుండి ౯ మంది రాజీనామాల నిచ్చిరి. రాష్ట్రీయశాసనసభలలో వంగరాష్ట్రమునుండి ౩౪ మంది, బీహారు, ఒరిస్సాలనుండి ౩౧ మంది, మధ్యరాష్ట్ర ములనుండి ౨౦ మంది, మద్రాసునుండి ౨౦ మంది, సంయుక్తరాష్ట్రములనుండి ౧౬

మంది, అస్సామునుండి ౧౨ మంది, బొంబాయినుండి ౬ మంది, పంజాబునుండి ఇద్దరు, బర్మానుండి ఒక్కరు రాజీనామాల నిచ్చిరి.

ఫిబ్రవరి ౧౪, ౧౫, ౧౬, తేదీలలో సబర్మతియందు కార్యసంఘసభ సమావేశ మయ్యెను. అంతవరకునూ రాజీనామా ఈయని శాసనసభ్యులున్నూ, రాజీనామా ఇచ్చి తిరిగీ ఎన్నికకు నిలిచినవారున్నూ ఏ కాంగ్రెసుసంఘములోను ఎన్నికసభ్యులుగా నుండకూడదనీ, ఉన్నయెడల వారు సభ్యత్వమునకు రాజీనామాల నీయవలెననీ, లేనియెడల వారిపైన క్రమచర్య తీసుకొనబడుననీ తీర్మానింపబడెను. రాజకీయఖయిదీల విషయములో సౌకర్యములు చూపబడునని ప్రభుత్వమువారు చేసిన వాగ్దానముల మూలకముగా లక్నోలో సెప్టెంబరు ౨౫ వ తేదీని అ. భా. కాం. సం. వారు నిరాహారదీక్షను బూనిన ఖయిదీలను ఆ దీక్షనుండి విరమింపవలెనని సలహానిచ్చిరి. కాని ప్రభుత్వమువారా వాగ్దానమును నిర్వర్తింపకపోవుటచే సబర్మతీలోని కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమువారు విచారమును వెల్లడించిరి. తరువాత ప్రభుత్వమువారి చర్యకు ప్రతిఘటనముగా లాహోరుఖయిదీలు తిరిగీ నిరాహారదీక్షను బూనిరి. ఆకార్య నిర్వాహకసభలోని ముఖ్యతీర్మానము శాసనోల్లంఘనమునకు సంబంధించి ఉండెను. అది ఈ దిగువ నుదాహరింపబడినది:

"పూర్ణస్వరాజ్యమును సంపాదించుటకు అహింసను మతసిద్ధాంతముగా నమ్మే వారుమాత్రమే శాసనోల్లంఘనమును ప్రారంభించుటకుగాని, నడిపించుటకుగాని హక్కుగలదని కాంగ్రెసుకార్యవర్గమువారి అభిప్రాయము. ఇప్పటికి కాంగ్రెసు నిర్మాణ మునందు కేవల మటువంటివారేగాక, దేశములోని ప్రస్తుత పరిస్థితులలో అహింసను రాజకీయవిధానముగా నమ్మేవారుకూడా కొంతమంది కలరు. కాబట్టి కాంగ్రెసుకార్య వర్గమువారు గాంధీమహాత్మునిసూచన ననుసరించి అహింసను మతవిశ్వాసముగా నమ్మే గాంధీమహాత్మునీ, ఆయనఅనుచరులనూ వారి ఇష్టము వచ్చినప్పుడు వారి అనుకూల మైన పద్ధతిని వారు నిర్ణయించుకొన్నంతవరకు శాసనోల్లంఘనము జరుపుట కంగీకరి స్తున్నారు. శాసనోల్లంఘనదండయాత్ర నడుపబడేటప్పుడు కాంగ్రెసువాదులున్నూ, తదితరులున్నూ సాత్వికనిరోధకుల కన్నివిధములా సంపూర్ణసహాయము చేసెదరనీ ఎట్టి ఆగ్రహకారణము కలిగింపబడినప్పటికీ సంపూర్ణముగా అహింసావ్రతము నవ లంబింతురనీ ఈ కార్యవర్గసభవారు విశ్వసిస్తున్నారు. సామాన్యప్రజాసమూహము శాసనోల్లంఘనములో పాల్గొనునప్పుడు ప్రభుత్వమువారికి స్వచ్ఛందసహాయ మొన రించుచున్నవారందరును, అనగా ప్రభుత్వసహాయముమూలమున ఏవో ప్రయోజనములను పొందుతూన్న లాయర్లున్నూ, విద్యార్థులున్నూ వాటినన్నిటినీ తృణీకరించి ప్రభుత్వము

వారికి తాము చేసే సహాయము నుపసంహరించుకొని స్వాతంత్ర్యముకొరకు జరుగుతూన్న ఈ చివరిపోరాటమునందు దుముకగలరని ఈ కాంగ్రెసుకార్యవర్గసభవారి ఆశ.

"నాయకులరెస్టుచేయబడి ఖైదుచేయబడినప్పుడు సేవాతత్పరత్వమున్నూ, త్యాగబుద్ధిన్నీగల అనుచరులు కాంగ్రెసుసంస్థను నడిపి వారి శక్తికొలది ఉద్యమమునకు మార్గదర్శకులయ్యెదరని ఈ కార్యసంఘసభవారి నమ్మకము."

ఈ తీర్మానమువలన గాంధీకిన్నీ, ఆయనవలెనే అహింసాతత్వమునందు మత విశ్వాసముగలవారికిన్నీ శాసనోల్లంఘనము ప్రారంభించుట కధికార మీయబడెను. తరువాత కొద్దికాలములోనే అహమ్మదాబాదులో సమావేశమైన అ. భా. కాం. సం. వారు శాసనోల్లంఘనమును దేశమంతటికీ వర్తింపజేసిరి. ౧౯౩౪ మేనెలలో శాసనోల్లంఘనోద్యమ ముపసంహరించుకోబడినప్పుడు గాంధీ ఆఉపసంహారమునుండి మినహాయింపబడెను. మొట్టమొదట శాసనోల్లంఘనమును ప్రారంభించుటకు గాంధీకే అనుజ్ఞ ఈయబడెను. శాసనోల్లంఘన ముపసంహరించుకోబడినప్పుడుకూడా గాంధీ కీయబడిన అనుజ్ఞ నిలచియేయున్నదని తెలుసుకొందురు గాక. ఈ కార్యనిర్వాహకసభ తీర్మానము కంటెకూడా సబర్మతీలో ప్రత్యేకముగా ఆహ్వానింపబడిన కొందరు మిత్రులతో గాంధీచేసిన ఇష్టాగోష్ఠిసంభాషణములు మిక్కిలి ముఖ్యమైనవి. అవి కేవలము ఉప్పుసత్యాగ్రహముపైన కేంద్రీకరింపబడినవి. ఉప్పును తయారుచేయుటమూలమునను, ఉప్పుమళ్లనుండి వాటిని తీసుకొనివచ్చుటమూలమునను, ఉప్పుకొటారులపైన దండయాత్రచేయుటమూలమునను ఉప్పుచట్టములను తృణీకరింపవచ్చునని ఆలోచింపబడెను.

ఈ సభలో కొంతమంది దేశము సమష్టిశాసనోల్లంఘనమునకు సంసిద్ధముగా లేదని భయమును వెల్లడించిరి. సంసిద్ధముగా నుండుటగాని, సంసిద్ధముగా చేయుటగాని ప్రజల నైతికప్రవర్తనమునుబట్టి ఉండును. వారు శాసనోల్లంఘనసందర్భములో శాంతముగా నుండగలరా, ఇతరులకు హాని కలిగించకుండా తాము బాధలను సహించగలరా, విచారములను, కష్టములను కల్లోలపడకుండా సంతోషముతో ఓర్చుకొనగలరా అనే ప్రశ్నల ప్రత్యుత్తరములపైన సంసిద్ధత ఆధారపడియున్నది. ఈభయములను వెల్లడించినవారు ముఖ్యమిత్రులు. సమష్టిశాసనోల్లంఘనమునందు ౧౦ సం. ల అనుభవముకలవారు. వారు కేవలము విమర్శకులే అయినయెడల వారికి ప్రత్యుత్తర మీయవలసిన అవసరము లేదు. ప్రస్తుతము సమష్టిశాసనోల్లంఘనమును వాయిదావేసినయెడల నిర్ణయింపబడిన తేదీనాటికా ప్రజలు సంసిద్ధముగా నుందురా? ఈతకు సంసిద్ధము కావలెనన్నచో నిజముగా ఈత ప్రారంభించుటయే. దేశము స్వపరిపాలనకు సంసిద్ధముగా నున్నదా అని పరీక్షింపదలచినయెడల దానికి స్వపరిపాలన మీయడమే మంచిదని రిప్పనుప్రభువు

చెప్పియుండెను. పనిచేస్తూ నేర్చుకొనుటవలన చేతికినీ కంటికినీ శిక్షణము కలుగును. ఆ పద్ధతి ఈ నైతికశిక్షణమునకుకూడా సమానముగా వర్తించగలదు.

శాసనోల్లంఘనము ప్రారంభింపబడినయెడల మన మేమి చేయవలెను? గాంధీ ఏమి చేయదలచెనో తా నిదివరకే సూచించెను. సబర్మతీలో కాంగ్రెసుకార్యనిర్వాహకసభ ప్రారంభింపబడకముందే గాంధీ ఉప్పుకొటారులపైన దండయాత్ర వెడలు ననేవార్త బొంబాయికి పాకెను. ఫిబ్రవరి ౧౪ కు ముందే బొంబాయిలో వెంటనే ప్రచారము సాగింపబడెను. ఉప్పుపన్నుల పుట్టుపూర్వోత్తరములు విమర్శింపబడెను. ౧౮౩౬ లో సాల్టుకమీషన్‌వారు సమావేశమై ఇంగ్లండునుండి వచ్చిన ఉప్పు ఇండియాలో అమ్మబడుటకు వీలుగా ఇండియాఉప్పుపైన పన్ను వేయబడవలెనని సిఫారసు చేసిరి. లివర్‌పూలులోని ఓడలు పడికట్టుబరువుకూడా (Keel Ballast) లేక ఊరికే హార్బరులో పడియుండెను. పెద్ద పెద్ద సముద్రములపైన ఓడలు ప్రయాణము చేసేటప్పుడు వాటికి తగిన బరువులేనిదే అవి సురక్షితముగా ప్రయాణము చేయజాలవు. కాబట్టి అవి ఏదో ఒక బరువు మోసుకొని రావలసియుండెను. కొంతకాలమువరకును ఇంగ్లండునుండి ఇండియా కవి మన్ను తీసుకొనివచ్చెను. ఆమన్నుతోనే కలకత్తాలోని చౌరంగీరోడ్డు ఏర్పడినది. అది అంతకుపూర్వము హుగ్లీనుండి కాళీఘట్టపుదేవాలయమునకు పోయేకాలువ. భారతదేశపు ఎగుమతులు దిగుమతులకంటె ఎప్పుడునూ ఎక్కువ. ౧౯౨౫ లో ఎగుమతులు ౩౧౬ కోట్లు; దిగుమతులు ౨౪౯ కోట్లు. అంతేకాదు. ఎగుమతులు ముడివస్తువుల రూపములోను, ఆహారపదార్థముల రూపములోను ఉండుటమూలమున అవి ఓడలలో నెక్కువస్థలము నాక్రమింపగలవు. కాబట్టి ఇండియాకు దిగుమతులను తీసుకొనివచ్చే పడవలకంటె ఎగుమతులను తీసుకొని పోయే పడవలు మొత్తముపైన నాలుగైదురెట్లెక్కువ వైశాల్యము కలవిగా నుండవలెను. కనుక ఇండియాకువచ్చే పడవలు ఎగుమతులనుకూడా తీసుకొనిపోవలసియుండుటచే న్యాయముగా ఇండియాకు తీసికొనిరాదగిన దిగుమతులకు సరిపోవు పడవలకంటె ఎక్కువ ఉండవలయును. అనగా కొన్ని ఖాళీపడవ లిండియాకు రావలెను. ఇండియాతో కోస్తావ్యాపారము సాగించేపడవలలో నూటికి ౭౫ ఇంగ్లండుదేశపు పడవలే. అనగా దాదాపు ఇండియావ్యాపారమునం దుపయోగింబడే పడవల మొత్తములో ముప్పాతికభాగము బ్రిటిష్‌పడవలే నన్నమాట. కాబట్టి హిందూదేశమునకు ఇంగ్లండుదేశమునుండి ఖాళీపడవలు వచ్చేటప్పుడు ఆదేశమునుండి పడికట్టుకోస మేదైనా (Keel ballast) సామగ్రి వేసుకొని రావలసిఉండెను. షెషైరులోని ఉప్పుకంటె ఇందుకు తగినవస్తు వేమీ కనబడలేదు. అదిగాక పాతపత్రికలు, పగిలిపోయిన పింగాణీపెంకులుకూడా ఇండియాకు పడవలలో పడికట్టుగా (Keel ballat) తీసు

కొనిరాబడును. ఇటలీదేశపుపడవలీసందర్భములో ఆదేశపు చలువరాళ్లను, బంగాళా దుంపలను తీసుకొనివచ్చును. అందువల్లనే ఈ వస్తువులిండియాదేశపు వస్తువుల కంటె చౌక.

సబర్మతీసమావేశము పూర్తి అయినవెంటనే రాజకీయ వాతావరణము ఉప్పుతో నిండిపోయినది. ఉప్పు తయారుచేయుటవలనలాభ ముందునా అని ప్రజలు ప్రశ్నింపసాగిరి. ప్రభుత్వాధికారులు ఉప్పును తయారుచేసి దాని ఖరీదుతో ప్రభుత్వమువారిచే పన్నువేయబడిన ఉప్పుఖరీదును పోల్చిచూచి, దానికంటె తయారుచేయబడిన ఉప్పు మూడురెట్లెక్కువ ఖరీదగునని లెక్కవేసిరి. వీరీపోరాటము భౌతికపోరాటముకాదనీ, నైతికపోరాటమనీ తెలుసుకొనకుండుట విచారకరము.

సబర్మతీలో సమావేశమైనవారు గాంధీ చేయదలచుకొన్న కార్యక్రమమును గూర్చి ప్రశ్నించిరి. కిచెనర్ ప్రభువుగాని, మార్షల్ ఫోకెను గాని, వాన్ హిండెన్ బర్గును గాని మహాసంగ్రామమున కాయత్తులైయున్నప్పు డెవ్వరును ఈవిధముగా ప్రశ్నించియుండరు. అయినప్పటికి యీసందర్భములోమాత్రము వారావిధముగా ప్రశ్నించుట న్యాయమే. ఆసేనానుల కితరులకు తెలియపర్చకూడని కార్యక్రమ ముండవచ్చును. కాని సత్యాగ్రహోద్యమ మటువంటిది గాదు. మా కార్యక్రమమునకు రహస్యములేదు. దాని కొక నిర్ణయింపబడిన తిన్ననిపంథాకూడా లేదు. ఉదయమున దట్టమైనమంచులో తొందరగా పోయే మోటారుకారుకు క్రమక్రమముగా ఏవిధముగా దారి కనబడునో, అదేవిధముగా సత్యాగ్రహోద్యమమునకుకూడా దారి ప్రత్యక్షమగును. సత్యాగ్రహికి లలాటమునందు విద్యుద్దీప మున్నది. అదే తరువాతిఅడుగుకు దారి చూపును.

నాటి ఉప్పుసత్యాగ్రహ మీవిధముగా పరిణామము పొందెను. గాంధీ ఏదో ఒక ఉప్పున్నచోటుకు పోయి ఉప్పును సేకరింపతలపెట్టెను. ఇతరు లాపని చేయకూడదని ఆయన ఆజ్ఞ. ఆయన చేయకూడదని చెప్పినప్పుడు మనము సరేనందుము. " కాని ఆయన చేయకూడదని చెప్పినది చేయుటకొరకే." ఆయన తక్షణము ప్రభుత్వమునుండి ప్రతికూలభావము బయలుదేరు నని తలచెను ; వల్లభాయికూడ ఆయనతో బయలుదేరకూడ దనెను. గాంధీ తన ఆశ్రమసభ్యులతోను, సహచరులతోను ఈ ఉద్యమమును ప్రారంభింపబూనెను. వార్ధాఆశ్రమవాసులుకూడ సన్నాహములు చేసుకొనవచ్చును గాని ఆయన అరెస్టుచేయబడేటంతవరకును వేచియుండవలె ననెను. అప్పుడు దేశమంతటా ఒక్కసారి ఉద్యమము తీవ్రరూపమును తాల్చగలదు. ఆయనతరువాత ఉద్యమము దేశమంతటా అన్నిస్థలములలోను, అన్నివిధములా తీవ్రరూపమును తాల్చునని ఆయన భావించెను. మన మప్పుడు జయమైనా పొందవలెను, లేదా తుడిచిపెట్టు

కొనియైనా పోవలెను. ఇంగ్లీషువారి కిస్టున్ను పోని తలపెట్టని జాతిని తుడిచివేయుట ప్రతిపక్షుల కసంభవము. ఒకవేళ మన మావిధముగా నిర్మూలింపబడినయెడల ఆ ఒక్క చర్యయే సామ్రాజ్యమును చలింపజేయగలదు. అదే అహింసాసిద్ధాంతముయొక్క అంత్యపరిణామము. ప్రభుత్వమువారు పైనుండి బాంబులను వర్షింపజేసినయెడల ప్రజ లేమిచేయగలరని కొందరు ప్రశ్నించిరి. నిరపరాధులగు స్త్రీలును, పురుషులును, పిల్లలును ఆ విధముగా భస్మీభూతులుగా చేయబడినయెడల ఆ బూడిదనుండియే సామ్రాజ్యమును వణికింపగల అగ్ని ప్రజ్వలింపగలదు.

దక్షిణాఫ్రికాలో భారతీయులు శాసనోల్లంఘన మొనరించినపు డరెస్టుచేయబడిరి. అన్నిపైపులనుండీ ఆహారపదార్థములు వారికి చేరెను. దక్షిణాఫ్రికాలోని కూలీలందరును సమ్మెకట్టిరి. ఫ్యాక్టరీలు పనిచేయలేదు. బజారులు మూసివేయబడెను.

దక్షిణాఫ్రికాలో వారు పొందినసహాయ మది. దక్షిణాఫ్రికా ఒక చిన్న పరిమితమైన ప్రదేశము. మన విశాలభారతదేశములో అది ఎంతో కష్టతరమైన పని.

ప్రతిచోటా ఉప్పు తయారుచేయుటకు వీలు లేకపోవచ్చును. కాని ఉప్పుకొటారులు లేవా? ఆ ఉప్పుకొటారులను స్వాధీనపరచుకొనవచ్చును. "అది దోపిడీ కాదా?" అని ప్రజ లడుగవచ్చును. కానేకాదు. అందులో మీకొక్క ఉప్పురాయైనను కావలసిలేదు. ఉప్పు జీవితావసరములలో ముఖ్యమైనది. కేవలము మనము సమష్టిశాసనోల్లంఘనముకొరకు దోహదముచేయ నక్కరలేదు. అది వచ్చేయెడల దానిని సరిగా అదుపులో నుంచవలెను; దానికి తగిన నియమములను చేయవలెను. సామాన్యప్రజాసమూహము కార్యరంగమున కురికినప్పుడు లాయర్లు న్యాయస్థానములను బహిష్కరింపవలెను. విద్యార్థులు కళాశాలలను వీడవలెను. గాంధీ నిరుకుతలచినట్లుగా ఆయనలోనిశక్తి యింకా నశించలేదు.

"మనచుట్టును దౌర్జన్యము పెరిగిపోవదొడగెను" అని గాంధీ అభిప్రాయపడెను. నిరోధములేక అది పెరుగుతూండెను. కాబట్టి అహింస నాచరణలోకి తెచ్చుటమూలకముగా దౌర్జన్యమును నిరోధించుట మన కర్తవ్యము. ఈ ఊహాపరంపరలతో ఏప్రిల్ 30 నాటి కాంగ్రెసు సత్యాగ్రహమును ప్రారంభించినది.

చరిత్ర అనేకవీరపురుషుల కథలతో నిండియుండును. థియోడోర్ పార్కర్ అమెరికాదేశపువేదాంతి. ఆయన అమెరికాలోని బానిసత్వమును నిర్మూలించి ప్రపంచకవిఖ్యాతపురుషు డయ్యెను. ఆనాటి కొందరు మతావేశపరులు పార్కరును వాగ్వివాదమునకు పిలచిరి. ఆయనస్నేహితు లాసమావేశమునకు పోవలదని ఆయనకు సలహా

నిచ్చిరి. ఆయన నోకచోట తాళమువేసిరి. ఆయనశత్రువు లాయనను అక్కడకు వచ్చిన యెడల చంపెదమని భయపెట్టిరి; ఆయనను పిరికివాడని నిందారోపణచేసిరి. అకస్మిక ముగా పార్కర్ సభలో ప్రత్యక్షమై సభావేదికపైకి దుమికి "మీచేతనైతే నన్ను చంపుడు. నాశరీరమునుండి రాలిన ప్రతిరక్తబిందువునుండి బానిసలకు మోక్షమిప్పించు టకు వెయ్యిమంది పార్కర్లు పుట్టగలరు." అని గర్జించెను. అంతతో ప్రతిపక్షులకు వాగ్బంధ నమయ్యెను. సమావేశము చాలింపబడెను.

గాంధీకార్యక్రమ మాయన కంతర్వాణి బోధించును. ఎన్నడును ఆయన నెమ్మ దిగా లాభనష్టములను లెక్కవేసి యోచించడు. ఆయనఅంతర్వాణియే ఆయనకుగురువు; ఆయనకు మంత్రి; ఆయనకు మిత్రము; ఆయనకు తత్వోపదేశకుడు; ఆయనకు మార్గదర్శ కుడు. ఇందుమూలముననే గాంధీనిగూర్చి "ఆయన శతాబ్దములలో జరుగవలసిన అభి వృద్ధిని ఒక్కదశాబ్దములో ఇమడ్చగలిగెను"అని లాయడుజార్జి చెప్పెను. కాని వెయ్యి సంవత్సరములలో కలుగవలసిన ఫలితము లొక్కసంవత్సరములో కలిగినవని భారతీ యుల అభిప్రాయము. గాంధీదృక్పథముగాని, ఆయన అభిప్రాయములుగాని పవిత్ర ములని అందరును అంగీకరింతురు. ఉప్పుసత్యాగ్రహ మపాయకరమయినదనీ, ఊహామా త్రమైనదనీ విమర్శించిన మితవాదులుకూడా ఆ మహాపురుషుని ఉద్దేశములను శంకించ లేదు. గాంధీ వెంటనే తన కార్యప్రణాళికనుగూర్చి వైస్రాయికి తెలియపరచెను. ఆయన ఇర్విన్‌ప్రభువుకు ఉత్తరము వ్రాసెను. అది ఆయనసంప్రదాయము. మహాత్మ గాంధీ యీక్రిందివిధముగా వైస్రాయికి ఉత్తరము పంపెను:

"సత్యాగ్రహాశ్రమము, సబర్మతి.
౨ వ మార్చి ౧౯౩౦.

"ప్రియమిత్రమా,

"ఈ అన్ని సంవత్సరములనుండి నేను ప్రారంభించుటకు భయపడుతూన్న శాస నోల్లంఘనోద్యమమును మొదలుపెట్టేముందు మీ కీ ఉత్తరము వ్రాసి యీచిక్కులో నుండి బయటబడ నూహించితిని.

"నామతవిశ్వాస మిదివరకే అందరికీ తెలిసియుండెను. జీవముగల జంతువులకు వేటికీ నేను బుద్ధిపూర్వకముగా బాధ కలిగించను. అందులో తోడిమనుష్యుల కసలే కలిగించలేను. వారు నాకును,నావారికిని మహాపరాధమును కావించినప్పటికీకూడా నేను వారి కపాయము కలిగించజాలను. కాబట్టి ఇండియాలో బ్రిటిష్‌ప్రభుత్వము పాపభూ యిష్ఠమైన దని నేను తలచినప్పటికీ భారతదేశములోని ఒక్క ఆంగ్లేయునికిగాని, లేక వారి కీదేశమునందుగల న్యాయమైనప్రయోజనములకుగాని అపకారముచేయ తలపెట్టను,

"నన్ను గూర్చి మీ రవోహపడగూడదు. ఇండియాలోని బ్రిటిష్ప్రభుత్వము పాపభూయిష్ఠమైనదని నానమ్మకము. అయినప్పటికీ మొత్తముపైన ఇంగ్లీషువారందరు ప్రపంచకములోని తదితరజనులకంటె దుర్మార్గులని నే ననుకోను. ఇంగ్లీషువారిలో చాలామంది నా కత్యంతప్రియులైన స్నేహితులు కలరని చెప్పుటకు నేను గర్వపడుతున్నాను. నిజముగా ఒక ఆంగ్లేయుడు ధైర్యముగాను, నిష్కపటముగాను వ్రాసిన వ్రాతలనుబట్టియే ఇండియాలోని బ్రిటిష్ ప్రభుత్వముయొక్క చెడ్డతనమును నేను గ్రహింపగలిగితిని. ఆ గ్రంథకర్త ఈ ప్రభుత్వమునుగూర్చి కఠినమైన సత్యమును చెప్పుటకు జంకలేదు.

"నేను బ్రిటిష్ప్రభుత్వము నెందుకు పాపభూయిష్ఠముగా తలంపవలెను?

"అది క్రమానుగతమైన ధనాకర్షణపద్ధతివలనను, దేశము భరింపలేనంత వినాశనకరమైన సివిల్, సైనిక పరిపాలనావ్యయమువలనను నోరులేని సాదాజనమును నిరుపేదలుగా చేసినది.

"అది రాజకీయముగా మమ్ములను బానిసలను జేసినది. మా విజ్ఞానసర్వస్వమును అది హరించినది. మమ్ములను నిరాయుధులనుగా జేయుటమూలముగ అది ఆత్మలను నాశనమొనరించినది. ఆత్మబలములేని మేము మా ఆయుధ నిర్మూలనమువలన దాదాపు పిరికివాండ్లముగాను, నిస్సహాయులముగాను చేయబడితిమి.

"ఇంకా అనేకమంది దేశీయులతో పాటు నేనుకూడా ప్రభుత్వమువారిచే సూచింపబడిన రౌండుటేబిలుసభ మాసమస్యల నొకవిధముగా పరిష్కరింపగలదని ఆశించితిని. కాని మీరుగాని, బ్రిటిషు ప్రభుత్వమువారుగాని అధినివేశ ప్రతిపత్తియొక్క పూర్ణప్రణాళికను బలపరచుటకు వాగ్దానము చేయజాలమని మీరు నాతో చెప్పినప్పుడు, నోరుగల భారతీయులు బుద్ధిపూర్వకముగాను, నోరులేని లక్షలకొలదీ సామాన్యజనులు అబుద్ధిపూర్వకముగాను అంగలార్చుచున్న రౌండుటేబిలు మహాసభ సరియైన పరిష్కారము చేయజాలదు. ఇక పార్లమెంటువారి నిర్ణయముకోసము వేచియుండవలసిన అవసరములేదని వేరుగా చెప్పనక్కరలేదు. పార్లమెంటువారి తీర్మానమునకు ముందుగా బ్రిటిషుప్రభుత్వమువారు తామవలంబింపబోవు విధానమునుగూర్చి ప్రకటించిన ఉదాహరణము లనేకము గలవు.

"నాటి ఢిల్లీ సందర్శనము నిరుపయోగమైనందున పండిత మోతీలాలుకును, నాకును ౧౯౨౮ లో కలకత్తాయందు చేయబడినతీర్మానమును ఆచరణలోకి తెచ్చుటకు తగిన చర్యలను తీసుకొనక తప్పినదికాదు.

"కాని మీ ప్రకటనములో మీరుపయోగించిన అధినివేశప్రతిపత్తి సామాన్యార్థములోనే ప్రయోగింపబడినయెడల స్వాతంత్ర్యతీర్మానమును జూచి మీరు భయపడనక్కర లేదు. ఎందువల్ల ననగా బాధ్యతగల రాజకీయధురంధరు లనేకులు అధినివేశప్రతిపత్తి నిజముగా స్వాతంత్ర్యమని ప్రకటించిరి. కాని ఇప్పట్లో అటువంటి అధినివేశ ప్రతిపత్తిని భారతదేశమునకు ప్రసాదించుటకు మీ రుద్దేశించుట లేదని నాభయము.

"కాని ఇదంతా పూర్వచరిత్ర. ప్రభుత్వ ప్రకటనము జరిగిన తరువాత బ్రిటిషు భావిరాజకీయ తంత్రమును నిస్సందేహముగా ప్రదర్శింపగల అనేక సంఘటనలు జరిగినవి.

"బాధ్యతగల అనేకరాజకీయ ధురంధరులు బ్రిటిషు రాజ్యాంగతంత్రములో ఏవిధమైన మార్పునూ తలపెట్టలేదు. అట్టి మార్పువలన ఇండియాతో జరుపుకొనే బ్రిటిషువర్తకమునకు నష్టము రాగలదనీ, ఇండియా, బ్రిటిషుదేశముల వాణిజ్యవ్యవహారములు నిష్పాక్షపాతముగా పరీక్షింప బడుననీ వారి భయము. ఈ ధనాకర్షణపద్ధతిని నిర్మూలించుటకు తగిన ప్రయత్నము జరుగనియెడల అంతకంత కెక్కువ తొందరగా భారతదేశపురక్తము పిండివేయబడును. ఆర్థికసభ్యు డొక్క కలముగీటుతో కొన్ని కోట్లరూపాయీలను ఇండియానుండి విదేశములకు పంపించ తలచుకొనెను. ఈవిషయమును రద్దుచేయించుటకు శాంతమైన చర్య నడపబడనుండగా అనేకమంది దానికి ప్రతికూలించిరి. మీరుకూడా దేశములోని ధనవంతులైన భూస్వాములను, ఆ ప్రయత్నమును భగ్నముకావించుటకు సహాయపడవలెనని లాఆర్డరుల పేరుతో కోరియుండిరి. ఆ ఒక్కప్రయత్నము భారతదేశమును చూర్ణీభూతి మొనర్పగలదు.

"భారతదేశస్వాతంత్ర్యముకోసము పనిచేస్తూన్నవా రందరు ముం దాస్వాతంత్ర్యోద్దేశమును సరిగా గ్రహింపవలెను. లేనియెడల కష్టజీవులకు, నోరులేని ఏప్రజాసమూహముకొర కీ మహత్తరప్రయత్నము జరిగింపబడుతూన్నదో వారి కది ఉపయోగకారి కానిరూపకములో పరివర్తనము పొంది లభింపవచ్చును. కాబట్టి ఇటీవల నేను స్వతంత్ర మనగా నిజముగా నేమో ప్రజలకు తెలియజెప్పబూనితిని. కొన్ని ముఖ్యవిషయములను మీకు తెలియపరతును.

"భయంకరమైన భూమిశిస్తుల భారము స్వతంత్ర భారతదేశములో తగ్గింపబడవలెను. ఇప్పు డది ప్రభుత్వమువారి ఆదాయపు మొత్తములో ఎక్కువ భాగముగా నున్నది. చాలామంది కోరుతూన్న పర్మనెంటు సెటిల్‌మెంటు పద్ధతి కూడా భాగ్యవంతులైన కొంతమంది జమీందారులకేకాని రైతులకు ప్రయోజనము

లేదు. రైతు పూర్వమువలెనే నిస్సహాయుడుగా నున్నాడు. అతిడు మామూలుకవులం దారే. భూస్వామికి దయతప్పినచో పొలము విడిచిపెట్టవలయును.

"భూమిశిస్తు తగ్గింపబడుటయే కాక రైతు ప్రయోజనముకొరకే ప్రభుత్వాదాయపద్ధతి పూర్తిగా మార్పుచేయబడవలెను. కాని బ్రిటిష్ పరిపాలనము రైతుజీవములను తీసివేయునట్టిదిగా కన్పించుచున్నది. చిట్టచివరకు ఉప్పుపన్ను విషయములో కూడా అతడే యెక్కువ భారమును భరింపవలసియున్నది. ఇది ప్రభుత్వమువారి నిర్దయాత్మకమైన నిష్పక్షపాతబుద్ధిని తెలియచేయుచున్నది. ధనవంతులకంటె నిరుపేద లెక్కువ ఉప్పు తిని జీవించవలసియున్నదని తెలుసుకొన్నచో ఉప్పుపన్ను వారికెంత మహాభారముగా నుండునో బోధపడగలదు. తాగుడుమూలమునను, మత్తుపదార్థముల మూలమునను వచ్చే ప్రభుత్వాదాయముకూడా నిరుపేదలనుండియే వసూలుచేయబడు తూన్నది. ఇందుమూలమునవారి ఆరోగ్యమున్ను, నీతిన్నీకూడా నాశనమైపోతూన్నవి. వ్యక్తిస్వాతంత్ర్యమనే పేరుతో తాగుబోతుతనము ప్రోత్సహింపబడుతూన్నది. కాని నిజముగా అది రెవిన్యూకొరకే యేర్పాటుచేయబడినది. ౧౯౧౯ నాటి రాజ్యాంగవిధానమును తయారుచేసిన గ్రంథకర్తలు ఈ ఆబ్కారీరెవిన్యూను ద్వంద్వపరిపాలనములో ప్రజాయత్తశాఖకు ఒప్పగించి మద్యపాననిషేధబాధ్యతను మెల్లగా వారిపైన తోసిరి. కాని ఏమంచిపని చేయుటకునూ మొదటనుండీ వారికధికారము లేకుండా చేయబడినది. ఈ ప్రభుత్వాదాయమును నిర్మూలింప దలచుకొన్న మంత్రి విద్యాలయములను మూసివేయవలసియున్నది. ప్రస్తుతపరిస్థితులలో ఆబ్కారీ ఆదాయమునకు బదులుగా మరియొక ఆదాయ మతనికి వచ్చేవీలులేదు. ఈ విధముగా పైనుండి పన్నులభారము నిరుపేదలను కుంగదీసినది. తరువాత నూలువడకుటవంటి ముఖ్యమైన ఉపవృత్తి నిర్మూలింపబడుటమూలమున అతనికి అదనముగా కొంత సొమ్ము సంపాదించుకొనుటకు వీలు లేకపోయినది.

"భారతదేశపుపేరుమీదుగా చేయబడిన జాతీయఋణములను గూర్చి ముచ్చటించనిదే భారత వినాశనచరిత్రము పూర్తి కాదు. ఇటీవల ఈవిషయమును గూర్చి పత్రికలలో చాలవరకు చెప్పబడినది. ఈఋణము లన్నిటినిగూర్చి స్వతంత్ర భారత దేశములో నిష్పాక్షికమైన న్యాయమూర్తిసంఘముచే విచారింపబడును. వారన్యాయమని చెప్పిన ఋణములను భారతదేశ మచ్చుకొనజాలదు.

"ప్రపంచములోని అన్ని పరిపాలనములలోకీ ఎక్కువవ్యయకారణమైనవిదేశపరిపాలనమును సాగించుటకే ఈపైన ఉదాహరింపబడిన అన్యాయములు జరుపబడుతూన్నవి. మీ జీతముసంగతి చూడండి! అది నెలకు ౨౧ వెయ్యిరూపాయల పైచిలుకు.

ద్దానికి తోడింకా ఎన్నో ఇతర ఖర్చులు కలవు. బ్రిటిష్ప్రధానమంత్రికి సంవత్సరమునకు ౫ వేల పౌనులు మాత్రమే. అనగా నేటి మారకపుధరనుబట్టి ఆయనవేతనము నెలకు ౫౮౦౦ రూపాయల పైచిల్లర గాగలదు. భారతీయుడు దినమునకు ౨ అణాలకంటె తక్కువ సంపాదింపగలిగియుండగా మీరు దినమున కేడువందల రూపాయలను పుచ్చుకొనుచున్నారు. ఆంగ్లేయుడు బ్రిటన్ దేశములో దాదాపు ౨ రూపాయలు సంపాదించుకొనుచున్నప్పుడు ప్రధానమంత్రి రోజుకు ౧౮౦ రూపాయల జీతమును పుచ్చుకొనుచున్నాడు. భారతీయుని సగటాదాయముకంటె మీరు ౫ వేలరెట్లకింకా పైచిలుకు జీతమును పుచ్చుకొనుచున్నారు. బ్రిటిష్ప్రధానమంత్రి బ్రిటనులోని సగటాదాయమునకు ౯౦ రెట్లుమాత్రమే పుచ్చుకొనుచున్నాడు. ఈ ఆశ్చర్యకరమైన విషయమునుగూర్చి ఆలోచించవలసినదని నా ప్రార్థన. నేనొక బాధాకరమైన సత్యమును తెలియపరచుటకు వ్యక్తిపరమగు ఉదాహరణము తీసుకొంటిని. వ్యక్తిగా మీయందు నాకు చాలా గౌరవము. నేను మీ మనస్సుకు నొప్పి కల్పింపకోరను. మీరు పుచ్చుకొనే జీతమంతా మీ కవసరములేదని నాకు తెలుసును. మీ జీతమును పూర్తిగా మీరు దానధర్మములకే వినియోగింపవచ్చును. కాని ఇట్టి అధికజీతములపద్ధతిమాత్రము తక్షణము నిర్మూలింపబడవలెను. వైస్రాయిజీతమును గూర్చిన ఈ విమర్శనము మొత్తముపైన పరిపాలనాపద్ధతి కంతటికీ వర్తించును.

“కాబట్టి ప్రభుత్వాదాయమును తగ్గించువిషయము పరిపాలనావ్యయమును తగ్గించుటపైన ఆధారపడియున్నది. అనగా ప్రభుత్వపద్ధతియే మార్పుచేయబడవలెను. స్వాతంత్ర్యములేనియెడల ఈ మార్పు అసంభవమగును. కనుకనే జనవరి ౨౬ తేదీని వేలకొలది గ్రామస్థులు ఆకస్మికముగా నేర్పాటు చేయబడిన ఆ స్వాతంత్ర్యమహోత్సవములందు హృదయపూర్వకముగా పాల్గొనిరని నా అభిప్రాయము. వారికీ పన్నుల బాధనుండి తప్పించుకొనుటయే స్వాతంత్ర్యము.

“ఏకగ్రీవమైన భారతప్రజాభిప్రాయమునకు వ్యతిరేకముగా బ్రిటన్ దేశపు సహాయముకొరకు నిరంతరమూ భారతీయద్రవ్యములను కొల్లగొట్టేపద్ధతిని రూపుమాపుటకు బ్రిటిష్రాజకీయకక్షులలో ఒకటికూడా సంసిద్ధముగా లేదని నా అభిప్రాయము.

“హిందూదేశపుజాతి జీవింపవలెనన్నయెడలను, వారుపవాసములతో క్రమక్రముగా మరణము నొందకుండవలెనన్నను తక్షణమేదో ఒక ఉపాయము కనిపెట్టబడవలెను. ప్రభుత్వమువారి ప్రకటనలో సూచింపబడిన మహాసభ అందుకుతగిన నివారణోపాయముకాదు. కేవలము వాదబలమువలన ఒప్పించవలసినవిషయముకాదది. ఈవిషయ

ములో ఇంగ్లాండు, భారతదేశములకు ప్రతికూలప్రయోజనములు కలవు. న్యాయము కానీ, అన్యాయముకానీ ఇంగ్లాండుదేశము భారతదేశములోని తన వాణిజ్యమును, తదితరప్రయోజనములను సంరక్షించుకొనుటకు తన యావచ్ఛక్తినీ వినియోగించితీరును' కాబట్టి భారతదేశ మా మృత్యుముఖమునుండి తప్పించుకొనుటకు తగిన శక్తిసామర్థ్యము అను సంపాదించుకొనితీరవలసియున్నది.

"దేశములో దౌర్జన్యపక్షముకూడా అంతకంతకు విస్తరించుచున్నది. ఆ పక్షము దౌర్జన్యమునం దారితేరకపోవచ్చును. నేటికి సూక్ష్మాతిసూక్ష్మముగానే ఉండవచ్చును. కాని దానిని నిర్లక్ష్యముచేయుటకుమాత్రము వీలులేదు. దౌర్జన్యపక్షమువారి ఆదర్శ ముకూడా నా ఆదర్శమువంటిదే. నోరులేని ప్రజాసమూహమునకు తగిన పరిహారము ఆ పక్షముమూలమున కలుగదని నావిశ్వాసము. బ్రిటిష్‌ప్రభుత్వమువారి ఆరితేరిన దౌర్జన్యమును నిరోధించుటకు నిష్కళంకమైన అహింసాతత్వముతప్ప మరియొకటి లేదని నావిశ్వాస మంతకంతకు బలమవుతూన్నది. నాకు గల కొద్దిఅనుభవమే అహింసా తత్వమునందు గొప్పశక్తిసామర్థ్యములు కలవని నా అంతరాత్మను ప్రబోధించు చున్నది. బ్రిటిష్‌ప్రభుత్వమువారి ఆరితేరిన దౌర్జన్యముతోపాటు దౌర్జన్యపక్షమువారి అశిక్షితదౌర్జన్యమునుకూడా నిరోధించుటకు నా అహింసాసిద్ధాంతమును ప్రయోగిం చుట నా కర్తవ్యము. నేను సాక్షీభావము వహించికూర్చొనుట పైచెప్పబడిన రెండు విధములగు దౌర్జన్యములకును దేశము నొప్పగించుట అగును. దౌర్జన్యరాహిత్యము యొక్క శక్తిసామర్థ్యములయందు నిశ్చలవిశ్వాసముగల నేను వేచియుండుట పాప కార్యమని నా అభిప్రాయము.

"దౌర్జన్యరహిత సిద్ధాంతము శాసనోల్లంఘనముద్వారా ప్రదర్శింపబడును. ప్రస్తు త మది సత్యాగ్రహాశ్రమమువారికే వర్తింపచేయబడినది. కాని పర్యవసానమునకు ఉద్య మములో జోక్యముకల్పించుకొనదలచిన ప్రతివారును అందులో లీనమగుటకు వీలు గలదు.

"నే నీ ఉద్యమమును ప్రారంభించుటలో ఉన్మాదప్రమాదావస్థలోకి దిగుతున్నా నని నాకు తెలుసును. కాని ప్రమాదములకు గురిగాక యెన్నడును సత్యమునకు విజ యముకలుగలేదు. బుద్ధిపూర్వకముగానో, అబుద్ధిపూర్వకముగానో ఒకజాతిని పీల్చి పిప్పి చేసే మరియొక జాతికి హృదయపరివర్తనము కావింపవలెనన్నయెడల ఎట్టి అపాయ ములకైననూ గురికావలసియున్నది.

"నే నీహృదయపరివర్తన మనేమాటను బుద్ధిపూర్వకముగా నుపయోగించితిని. నా అహింసా పద్ధతిమూలమున బ్రిటిష్‌ప్రజలకు హృదయపరివర్తనము కలిగించి వారు

భారతదేశమునకు కావించిన అపరాధమును వారికి చూపింపవలెనని నాయభిలాషయము. మీ ప్రజలకు నేను హానిచేయదలచుకొనలేదు. నా ప్రజలకు నేను సేవచేయదలచి నట్లే వారికినీ సేవచేయుకోరుదును. వారి సౌఖ్యమునూ సేవించుచుంటిననియే నా విశ్వాసము. ౧౯౧౯ వరకును నేను వారిని గుడ్డిగాసేవించితిని. కాని నాకు కన్నులు వచ్చిన వెంటనే అసహాయోద్యమమును భావనచేసితిని. ఇప్పుడుకూడా వారిని సేవింపవలెననియే నా ఉద్దేశము. నా కుటుంబములో నాకు ప్రేమాస్పదులైనవారికి ప్రతికూలముగా ప్రయోగించిన ఆయుధమునే బ్రిటిష్ ప్రజలకుకూడా వ్యతిరేకముగా ప్రయోగించితిని. నా ప్రజలపైన కలిగిన ప్రేమవంటి ప్రేమ మీ ప్రజలపైనకూడా నాకున్నయెడల అది ప్రదర్శితముగాక తప్పదు. వారు తప్పక దాని నంగీకరింతురు. నాకుటుంబములోని వారుకూడా అనేక సంవత్సరములు నన్ను పరీక్షించినతరువాతనే ఆ ప్రేమ నంగీకరించిరి. నే ననుకొన్నట్లుగా మా ప్రజలు న న్ననుగమించేయెడల వారు పొందేబాధలు రాతిగుండెలను కూడా కరిగించగలవు.

*శాసనోల్లంఘనము పైన ఉగ్గాహరింపబడిన చెడుకార్యములను నిర్మూలించుట కుద్దేశింపబడినది. మేము బ్రిటిష్ సంబంధమును విడచిపెట్టుకొనకోరుట ఆ చెడుకార్యముల మూలముననే. ఆ దుష్కార్యములు నిర్మూలింపబడినయెడల దారి సుకరమగును. అంతట స్నేహపూర్వకములైన రాయబారములు ప్రారంభమగుటకు వీలుకలుగును. ఇండియాలోని బ్రిటిష్‌వ్యాపారము దురాశను త్యజింపగలిగినయెడల మాస్వాతంత్ర్యము నంగీకరించుట మీకు కష్టముకాదు. కాబట్టి ఈ దుష్కార్యములను తక్షణము తొలగించి ఆ మహాసభను మన ఉభయదేశముల పరస్పరవాణిజ్య పద్ధతుల కనుకూలముగా నుండునట్లు సమాన ప్రతిపత్తిగల రెండు జాతులమధ్య జరిగే మహాసభవలె ఏర్పాటుచేయించవలెనని నేను వినయపూర్వకముగా కోరుచున్నాము. అంతేగాక అది భ్రాతృభావముతో మానవకల్యాణమునకు తోడ్పడునట్టిదిగాకూడ ఉండవలెనని నాకోరిక. మా దేశమునకు దురదృష్టముగా పరిణమించిన సాంఘిక సమస్యలనుగూర్చి మీ రనవసరముగా కొంతపట్టుపట్టిరి. ప్రభుత్వవిధానమును నిర్ణయించేటప్పుడు సాంఘికసమస్యలకు కొంత ప్రాముఖ్యత ఉన్నమాటనిజమే. కాని అన్నిసంఘములకును సమానముగా వర్తించే పెద్ద విషయములను గూర్చి విచారించేటప్పుడు సాంఘికసమస్యలు చర్చకు రాకూడదు. ఈ పైనచెప్పబడిన చెడుగులు తొలగింపబడనియెడలనూ, ఈనెల ౧౧ వ తేదీలోగా నాఉత్తరము మీమనస్సును కరగించనియెడలనూ నేను నాఆశ్రమములోని కొంతమంది సహచరులను తీసుకొని ఉప్పునిబంధనలను ఉల్లంఘింపబయలుదేరుదును. నిరుపేదలదృష్టితో విచారించినయెడల ఈ ఉప్పుపన్నుకంటె అన్యాయమైనపన్ను మరియొక్కటి లేదు. పూర్ణస్వరాజ్యోద్యమము కేవలము నిరుపేదలగు భారతప్రజలకోసమే ఉద్దేశింపబడినది. గనుక

ఆ ప్రయత్నమును నిరుపేదలకు సంబంధించిన ఈ ఉప్పుచట్టముతోనే ప్రారంభింతుము. ఇంతకాలమునుండీ మేము క్రూరమైన ఈ ఉప్పుపన్నుకు లోబడియుండుట ఆశ్చర్యకరము. నన్ను మీ రరెస్టుచేసి నా ఉద్యమమునకు భంగము కలిగించుటకు మీకు స్వతంత్ర మున్నదని నాకు తెలుసును. నా తరువాత ఈ ఉద్యమమును సుశిక్షితపద్ధతిని నడిపించుటకు వేలకొలదీ సంసిద్ధులుగా నుందురని నా ఆశ. శాసనగ్రంథమునకు కళంకముగానున్న ఈ ఉప్పుచట్టమును తిరస్కరించి దానికి తగిన శిక్ష ననుభవించుట నా విధి అని నా అభిప్రాయము.

"సాధ్యమైనంతవరకు మీమనస్సుకు కష్టముకలిగింపకుండవలెనని నాఅభిప్రాయము. నా ఉత్తరములో మీరు గ్రహింపదగిన విషయ మున్నదని తలచినయెడలను, మీరు నాతో చర్చింపదలచుకొన్నయెడలను, అందుకోస మీ ఉత్తరమును ప్రచురింపకూడదని మీఅభిప్రాయమైనయెడలను ఈ ఉత్తరము మీకు చేరిన వెంటనే మీ రీ ఉత్తరమును ప్రచురింపవల దని నాకు తంతి పంపినయెడల నేను వెంటనే ప్రచురించుట ఆపివేయుదును. కాని ఈ ఉత్తరములోని ప్రధానాంశమును ఆచరణలోకి తెచ్చుటకు మీకు వీలుకానియెడల మాత్రము నన్ను నా మార్గమునుండి తొలగింప ప్రయత్నింపవలదని కోరిక.

"ఈ ఉత్తరము మిమ్ములను బెదరించుటకు నేను వ్రాయలేదు. సాత్వికనిరోధకుని ప్రధానమైన పవిత్రధర్మ మిది. కాబట్టి ఈ ఉత్తరమును భారతీయోద్యమమునందును, అహింసాతత్వమునందును విశ్వాసముకలిగి దైవానుగ్రహముచలన ఇందుకొరకు నాకు తోడ్పడనున్న ఒక ఆంగ్లేయ మిత్రునిద్వారా మీసన్నిధికి పంపుకొనుచున్నాను.

ఇట్లు మీవిశ్వాసపాత్రుడైన మిత్రుడు
యం. కె. గాంధీ.

ఘనతవహించిన ఇర్విన్ ప్రభువుకు, వైస్రాయిమందిరము, కొత్తఢిల్లీ."

ఈఉత్తరము కొంతకాలమునుండీ సబర్మతీ ఆశ్రమములో నివసిస్తున్న రెజినాల్డు రెయినాల్డు అనే ఆంగ్లయువకునిచేత ఢిల్లీకి కొనిపోబడినది. ఇర్విన్ ప్రభువు ప్రత్యుత్తరము వెంటనే వచ్చినది. "ప్రజాశాంతికి భంగకరమున్నూ, న్యాయశాస్త్రమునకు విరుద్ధమున్నూ అయిన ఇటువంటి చర్యను గాంధీ తలపెట్టినందుకు" వైస్రాయి విచారమును వెల్లడించెను. గాంధీ ఇందుపైన వ్రాసిన ఖండనము ఆయనస్వభావానుగుణములైన వినయధైర్యములను ప్రతిబింబింపజేసెను.

"నేను వినయపూర్వకముగా రొట్టెకోసము వేడుకొంటిని. నా కొకరాయి లభించినది. ఆంగ్లజాతి బలప్రయోగమునకు మాత్రమే లొంగును. వైస్రాయిజవాబు నాకు

చింతగొలుపలేదు. భారతజాతికి తెలిసిన ప్రజాశాంతి ఒక్కటే. అది పెద్దఖైదు. భారతదేశ మొక పెద్దకారాగృహము. నేనీబ్రిటిష్ శాసనమును ధిక్కరింతును. వైస్రాయి కోరే శాంతి విసుగుపుట్టించే దుఃఖకరమైన శాంతి. అనిర్బంధశాంతిమూలమున భారతజాతి కూపిరాడుటలేదు." అని గాంధీ వ్రాసెను.

ఇక గాంధీదండయాత్ర తప్పనిసరి యయ్యెను. అన్ని సన్నాహములును అదివరకే పూర్తి అయ్యెను. వాటినిగూర్చి ఇక్కడ విస్తరింపపనిలేదు. ఆయనవెంట ౭౮ మంది అనుచరులు గలరు. వారిలో కొందరు సత్యాగ్రహాశ్రమ సభ్యులు. మరికొందరు గుజరాతువిద్యాపీఠ విద్యార్థులు. వీరందరును మంచి క్రమశిక్షణము పొందిన స్వచ్ఛంద సైనికులు. కష్టముల కోర్చగలవారు. వారు ౨౦౦ మైళ్లు నడువవలసియుండెను. దండీ సముద్రతీరమున నున్న ఒక గ్రామము. వీరందరునూ దండీగ్రామమునకు పోయేటప్పుడు మధ్యగ్రామములవారు యాత్రికులకు విశేషవ్యయముతో భోజనసదుపాయములను చేయవలదని ముందే ఆయాగ్రామస్థులు హెచ్చరిక చేయబడిరి. గాంధీ ఈ సన్నాహములను జరుపుతూండగానే వల్లభాయి ముందుగా గ్రామములకుపోయి, రాబోయే మహాయజ్ఞమునకు సంసిద్ధులు కండని గ్రామస్థులను ప్రబోధింపప్రారంభించెను. ప్రభుత్వమువారు వెంటనే మొదటిదెబ్బ కొట్టిరి. గాంధీకి ముందుగా బయలుదేరిన వల్లభాయి పటేలును మార్చి మొదటివారములో రాసుగ్రామమునందు ప్రభుత్వమువారరెస్టు చేసి, మూడునెలలశిక్ష విధించిరి. ఈ ఒక్క శిక్షతో గుజరాతురాష్ట్రమంతా ఒక్కసారిగా ప్రభుత్వమున కెదురుతిరిగెను. సబర్మతీనదీతీరమున ౭౫ వేలమంది జను లీక్రింది తీర్మానమును అంగీకరించిరి:

"అహమ్మదాబాదునగరవాసులమైన మేమందరమూ వల్లభాయిఅడుగుజాడల నడువపిలచితిమి. ఆయన ననుసరించి పూర్ణస్వరాజ్యమును పొందుదుము. మేము మాదేశ స్వాతంత్ర్యమును పొందనిదే శాంతముగా నుండజాలము. ప్రభుత్వమువారికి శాంతి నీయజాలము. భారతదేశపుమోక్షము సత్యాహింసలలో కలదని మేము ప్రమాణము చేయుచున్నాము."

తరువాత గాంధీ ఈ ప్రమాణము చేయదలచినవారు చేతులెత్తవలసినదని కోరెను. ఆ జనసమూహమంతా ఒక్కసారిగా చేతులెత్తిరి. గుజరాతుప్రజలకు వల్లభాయి ఇచ్చిన ఉపన్యాసములు ఉత్తేజకరములుగా నుండెను. ఆయన రైతులపశువులు వారికళ్ల ఎదుటే జప్తుచేయబడునని హెచ్చరించెను. "బలవత్తరమైన ప్రభుత్వముతో పోరాడదలచుకొన్నవారు భోగలాలసులుగా నుండకూడదు. ఈ యుద్ధకాలములో మీరు వివాహోత్సవములను నిలిపివేయుడు. రేపటినుండి మీతలుపులకు తాళములు

వేసుకొని, పొలములకుపోయి సాయంకాలముమాత్రమే మీరు తిరిగిరావలసియుండును. మీ రిదివరకు కొంత కీర్తి సంపాదించుకొనిరి. దానిని నిలుపుకొనుటకు మీ రింకా ఎంతో చేయవలసియున్నది. నేడు పరీక్షాసమయము వచ్చినది. వెనుకకు తిరుగకూడదు. గాంధీ సమష్టి శాసనోల్లంఘనమును ప్రారంభించుటకు మొదటిసారి మీ తాలూ కాను వరించెను. మీ రాగౌరవమునకు తగినట్లుగా ప్రవర్తింపవలెను............... మీలో కొందరు మీ పొలములు ప్రభుత్వమువారిచే స్వాధీనపరచుకొనబడు నని భయపడుదురు. ప్రభుత్వమువారు స్వాధీనపరచుకొనుట అనగా ఏమిటి? వారు మీ పొలములను సీమకు తీసుకొనిపోయెదరా? మీ పొలము లన్నిటినీ ప్రభుత్వమువారిని స్వాధీనపరచుకో నిచ్చేయెడల గుజరాతురాష్ట్రమంతా మీపక్షముననే ఉండగలదు.

"మీ గ్రామములను మీరు సరియైన కట్టుబాటులలో నుంచుకొని ఇతరుల కుదాహరణపూర్వకముగా నుంచవలెను. నేడు ప్రతి గ్రామము యుద్ధశిబిరము కావలెను. క్రమశిక్షణము, కట్టుబాటులు ఉన్నయెడల సగముయుద్ధము గెలిచినట్లే గవర్నమెంటు వారికి ప్రతి గ్రామములోను ఒక పటేలు, ఒక తలాటీ ఉన్నాడు. గ్రామములోని ప్రతి యువకుడును మనకు వాలంటీరు కావలెను.

"ఈ ౧౫ రోజులలోని అనుభవమువలన మీకు భయము పోయియుండును. రూపాయికి రెండణాలభయ మింకా అట్లే నిలిచియున్నది. దానిని కూడా త్యజించుడు. నిజముగా ప్రభుత్వమువారు భయపడవలెను. ఇది శాంతిపరిపాలనము కాదు. భయ పరిపాలనము. నేను నిర్భయత్వమును మీరక్తములో ప్రవేశపెట్టుదును. మీకళ్లలో అన్యాయమునకు ప్రతికూలముగా కోపారుణత్వము కనబడుటలేదు. దౌర్జన్యరాహిత్యము కోపమును వెలిబెట్టును. ఇద్దరు దురదృష్టవంతులైన సోదరులు అధికారుల కుట్రకు లోబడి లొంగిపోయినంతమాత్రమున మీరు వారిపైన కోపపడరాదు. ప్రమాణపత్ర ములపైన సంతకములుచేసి వాటిని నిరాకరించినచో ఎవరుమాత్ర మేమిచేయగలరు?"

గాంధీ ౧౨-3-౧౯30 తేదీని ౭౮ మంది పాదచారులతో దండీదండయాత్రకు బయలుదేరెను. అది చరిత్రప్రసిద్ధమైన దృశ్యము. ఆ అద్భుతదృశ్యమువలన పౌరాణిక యుగమునాటి రంగములు కొన్ని జ్ఞాపకము వచ్చెను. ఈదండయాత్ర జరుగుతూండ గానే 300 మంది గ్రామోద్యోగులు వారి రాజీనామాలను పంపిరి. గాంధీ అహమ్మ దాబాదులో మాట్లాడినప్పుడు, "నేను ప్రారంభించేటంతవరకునూ వేచియుండుడు. ఒక్కసారి నేను నిర్ణీతప్రదేశమునకు చేరేసరికి ఏమిచేయవలెనో మీకే తెలియగలదు." గాంధీకి ప్రధానశిష్యకోటిలో చేరినవారే ఏమిచేయవలెనో తెలియక అడిగినప్పుడు గాంధీచెప్పిన జవాబది. ఏమి జరుగగలదో బహుశా గాంధీకూడా పూర్తిగా భావన

చేసియుండడు. ఆయన తన హృదయమునందు మెరుపుతీగవలె మెరసిన ఒక కార్య క్రమమును ప్రారంభించెను. సత్పురుషులకు అంతఃకరణప్రవృత్తులే ప్రమాణములు. అంతేకాని తర్కము కాదు. ఆయన దండయాత్ర ప్రారంభించినవెంటనే ప్రజ లాయనబోధనలలోని తత్వములను గ్రహించిరి. ఆయన ఉద్యమస్వరూపము నర్థము చేసుకొనిరి. ఆయన జెండాచుట్టును మూగిరి. అప్పు డొక అభిప్రాయము వెలువడినది. ఆ అభిప్రాయమే శాఖోపశాఖలుగా వివిధరూపములతో దేశమంతటా వ్యాపించెను. ప్రజలు వెంటనే అసహాయోద్యమముగాని, అహింసగాని కేవలము ప్రభుత్వమువారి కార్యములకు తలయొగ్గుటకు కాక, నిరోధించుటకు ప్రయోగింపబడగలవని తెలుసు కొనిరి. ఆయనదండయాత్రతో ప్రారంభమైన ఉద్రేకాభిప్రాయముల మూలమున ప్రజలశక్తులు కూడా విజృంభించినవి. మొట్టమొదట ఆయనదండయాత్రను అనేకమంది వెక్కిరించిరి. తరువాత జాగ్రత్తగా పరిశీలించిరి. చిట్టచివరకు శ్లాఘించిరి. పట్టణములు భయపడెను. గ్రామము లాయన ననుసరించెను. కుతర్కము నెరుగనివా రందరును ప్రమాదరహితమైన ఆయననిర్ణయమునందు సంపూర్ణవిశ్వాసము కలిగియుండిరి. ఆయన అంతులేని సముద్రముపైనగాని, లేక పోలీసువారిచే కాపలాకాయబడుతూన్న ఒకచిన్న డిపోపైనగాని ఈ దండయాత్రను ప్రారంభించలేదు. బ్రిటిష్ అధికారముపైనను, బ్రిటిష్‌చట్టములపైనను ౩౧ కోట్ల మంది భారతప్రజల తిరుగుబాటుకు చిహ్నముగా ఆయనదండయాత్ర బయలుదేరెను. బ్రిటిష్‌చట్టములు భారతప్రజల అంగీకారము ననుస రించిగాని, లేక తృణీకరింపరాని నైతిక సిద్ధాంతములపైన ఆధారపడిగాని లేవని ఆయన అభిప్రాయము. గాంధీ ప్రభుత్వమువారిని తీవ్రమైన దెబ్బకొట్టగలడని ప్రజ లెదురుచూచుచుండిరి. జర్మనులు రైనుల్యాండునుండి అతివేగముగా ప్యారిసునగరమున కొక ఫిరంగిదెబ్బ తగిలేటంతదూరములోకి పోయినప్పుడు ప్రపంచకమంతా విస్మయ చిత్తముతో చూచినట్లే గాంధినికూడా లోకు లాశ్చర్యచకితులై చూడ ప్రారం భించిరి. సత్యాగ్రహములో నిజముగా చూడదగిన సాధనసామగ్రి లేదు. కాని తలవని తలంపుగా ప్రపంచక మీ అద్భుతదృశ్యమును నివ్వెరపోయి చూడసాగెను.

మొదటిదెబ్బ ఫిరంగిగుండ్లతోకాని, బాంబులతోగాని కొట్టబడలేదు. కేవల మది ఉప్పుతో కొట్టబడెను. దానిలో ఏవిధమైన తీవ్రత లేదు. కాని ఈ ప్రాథమిక జీవి తావసరమైన వస్తువునకు కలిగినప్రాముఖ్యము ఆశ్చర్యకరము. ఈసమయములో ప్రభుత్వము వారి ప్రతికూలభావమును, వా రవలంబించిన కొన్ని హాస్యాస్పదములైన చర్యలును వింతగా కనిపించెను. నాగరికప్రపంచము చూపిన సానుభూతిని వర్ణించుటకు మాకు మాటలు చాలవు. గాంధీదండయాత్రవలన భారతదేశము బ్రిటిష్‌రాజ్యముపైన రక్త పాతముతో నిమిత్తములేని ఒక తిరుగుబాటును ప్రారంభించె నని నాగరికప్రపంచకము

నకు తెలియవచ్చెను. సత్య మసత్యముపైననూ, తేజస్సు అంధకారముపైననూ, ప్రాణము మృత్యువుపైననూ జయము పొందుటయే నిజమైనయెడల భారతదేశము తప్పక జయము పొందగలదు.

భారతజాతీయస్వాతంత్ర్యనాటకమున ఈ మహారంగము ప్రదర్శింపబడుచూం డగా కొన్ని నూతనభావప్రకటనలు బయలుదేరెను. "దేశమును బార్డోలీవలె తయారుచేయవలెను." అని ఇదివరకు చెప్పుచుండేవారు. ఇప్పుడు దానికితోడు "బోర్సాదు" ఒకటి తయారయ్యెను. నేడు 'బోర్సాదువలె' దేశము తయారుకావలె ననుచున్నారు. అ. భా. కాం. సం. ౨౧ మార్చి ౧౯౩౫ న అహమ్మదాబాదులో సమావేశమయ్యెను. వారు కార్యనిర్వాహకసభవారి తీర్మానము నామోదించిరి. అది ఇదివరకే ఉదాహరింపబడినది: ఉప్పుశాసనములనుగూర్చి విచారించిరి. గాంధీ నిర్ణీత ప్రదేశమునకు పోయి, ఉప్పుచట్టమును తిరస్కరించేటంతవరకును ఎవరును ఏవిధమైన శాసనోల్లంఘనమును చేయకూడదని హెచ్చరిక చేయబడెను. తరువాత ఉప్పుచట్టము లను తిరస్కరించుటకే శాసనోల్లంఘనము కేంద్రీకరింపవలయునని కూడా తీర్మానింప బడెను. వల్లభాయిపటేలు సేనుగుప్త లరెస్టుచేయబడినందుకు వా రభినందింపబడిరి. ప్రభుత్వోద్యోగములకు రాజీనామాల నిచ్చిన గుజరాతు గ్రామోద్యోగస్థుల కభినందన ములు సమర్పింపబడెను. సత్యాగ్రహప్రమాణపత్ర మొకటి గాంధీఆమోదముతో తయారుచేయబడెను. అది ఇది:

"౧. జాతీయమహాసభవారిచే భారతస్వాతంత్ర్యముకొరకు ప్రారంభింపబడిన శాసననిరోధకోద్యమములో నేను పాల్గొనకోరుచున్నాను.

౨. జాతీయమహాసభా ప్రధానసిద్ధాంతము నే నంగీకరింతును. అనగా "భారత ప్రజలు శాంతియుతములునూ, ధర్మసమ్మతములును అగు అన్ని పద్ధతులమూలమునను పూర్ణస్వరాజ్యమును సంపాదించుట."

౩. నేను జైలుకు పోవుటకు సిద్ధముగా నున్నాను. ఈ ఉద్యమములో నాకు తటస్థించే బాధలనుగాని, శిక్షలనుగాని నే ననుభవించుటకు సిద్ధముగా నున్నాను.

౪. నేను జైలుకు పంపబడినయెడల కాంగ్రెసునిధులనుండి నా కుటుంబసహా యార్థ మేమీ ధనము కోరను.

౫. ఉద్యమాధికారుల ఉత్తరువులకు వెంటనే విధేయత చూపింతును."

గాంధీ తా నరెస్టుచేయబడేయెడల ప్రజ లేవిధముగా ప్రవర్తింపవలెనో సూచిం చుట ఆచారము. మార్చినెల ప్రారంభములో తన కరెస్టు తటస్థించవచ్చునని తలచి ఫిబ్రవరి ౧౭ వ తేదీని గాంధీ ఈ క్రిందివ్యాసమును వ్రాసెను.

" నే నరెస్టు చేయబడినప్పుడు "

" శాసనోల్లంఘనము ప్రారంభింపబడినప్పుడు నే నరెస్టుచేయబడుదు ననుమాట నిశ్చయ మని ప్రజలు తెలుసుకొనవలెను. కాబట్టి నా అరెస్టు జరిగినయెడల ఏమిజరుగ వలెనో ఆలోచించుట మంచిది.

"౧౯౨౨లో, నే నరెస్టుచేయబడినయెడల ప్రజ లేవిధమైన ప్రదర్శనములను చేయ కూడదనీ, వా రందరును సంపూర్ణముగా అహింసావ్రతము నవలంబించి నిర్మాణకార్య క్రమమును కొనసాగింపవలె ననీ కోరియుంటిని. అప్పుడు ప్రజ లుపవాసము తీయకూడ దనీ, దేవునికి వందనములను సమర్పింపవలెననీ చెప్పియుంటిని. ఈభాగమును తూచా తప్పకుండ ప్రజలు కొనసాగించిరి. అందుమూలమున ఒక ఆంగ్లప్రభువు నిరసనముగా నా అరెస్టుమూలమున "ఒకకుక్క కూడా మొరగలేదు" అని అనగలిగెను. నేను జైలులో నుండగా దేశము పూర్తిగా అహింసావ్రతము నవలంబించెనని విని సంతో షించితిని. నా అహింసాబోధనఫలితముగా ప్రజ లిట్టిశాంతిప్రదర్శనమును కావింప గలిగిరి. బార్డోలీనిర్ణయ మానాడు నేను చేయదగిన ఉత్తమకార్యము. నా అరెస్టు వలన "కుక్కలు" మొరుగ ప్రారంభించి దౌర్జన్యము వ్యాపించియుండినయెడల ఏమి జరిగియుండేదో ఇప్పు డూహించుట అవివేకము. కాని ఒక్కమాటమాత్రము నేను చెప్పగలను. ఆసందర్భములో లాహోరులో మున్ను అంగీకరింపబడిన పూర్ణస్వరా జ్య తీర్మాన మంగీకరింపబడియుండేది కాదు. అహింసాశక్తియందు నమ్మకము కలిగి గాంధీ ఇంతమహాధైర్యముగల కార్యక్రమము నడిపించుట కింకా మిగిలియుండే వాడు కాడు.

"ఇక ప్రకృత మాలోచింతుమగాక. ఈ పర్యాయము నే నరెస్టుచేయబడిన యెడల పూర్వమువలె ప్రజలు సాత్వికదౌర్జన్యరాహిత్యము (passive Non-violen-ce) నవలంబించకూడదు. తీవ్రాతితీవ్రమైన దౌర్జన్యరాహిత్యపద్ధతి (Non-violence of the activest type) నవలంబింపవలెను. కాబట్టి భారతదేశమునకు పూర్ణస్వరా జ్యమును సంపాదించుటలో అహింసాపద్ధతిని విశ్వసించే వారందరును ఇకముందిబానిసత్వ మునకు స్వేచ్ఛగా నున్నంతకాలముగాని, జీవించియున్నంతకాలముగాని లొంగకూడదు. ఇకముందు నా తరువాతివారు సలహా ఇచ్చినప్రకారము వారి నాయకత్వముక్రింద శాసనోల్లంఘనమును ప్రారంభించుట ప్రతి మనిషికీ కర్తవ్యము. ప్రస్తుతస్థితిలో నా తరువాత శాసనోల్లంఘనోద్యమమునకు అఖిలభారతనాయకుడు నా దృష్టిలో లే డని నే నొప్పుకొనవలసియున్నది. కాబట్టి ఈ ఉద్యమమును కాంగ్రెసే నడుపగలదు. నా ఉద్యమమునందును, నా సహచరులయందును నాకు పూర్ణవిశ్వాసము కలదు. అందుమూల

మున పరిస్థితులనుబట్టి నా తరువాత ఉద్యమమును నడిపేవారుకూడ బయలుదేరవచ్చునని నా నమ్మకము. ఈ ఉద్యమమునకు నాయకత్వము వహించిన ప్రతిమనిషి పూర్ణస్వరాజ్యమును పొందుటకు దౌర్జన్యరాహిత్యమునందు సంపూర్ణవిశ్వాసమును కలిగియుండవలెను. వాని కట్టి విశ్వాసమే లేనియెడల సందిగ్ధస్థితి వచ్చినప్పుడు దానినుండి తప్పించుకొనుట కతఁడొక అహింసాపద్ధతిని కనిపెట్టజాలడు.

"నేనిక్కడ చెప్పినవిషయము లేవీ కాంగ్రెసుయొక్క సంపూర్ణాధికారములను గాని, నిర్ణయములను గాని యే విధముగాను బధింపజాలవు. సాధారణముగా కాంగ్రెసువాదుల కనుకూలించిన విషయములనుమాత్రమే కాంగ్రెసు ఆమోదించగలదు. అహింస ఎట్టి నిర్బంధములకును లోనుకాదు. అది ఇతరులకుకూడా ఎట్టి నిర్బంధములను విధింపదు. దౌర్జన్యరాహిత్య సిద్ధాంతము నవలంబించినవారు తమంతట తామే కొన్ని నిర్బంధములను విధించుకొనవలెను. కొన్ని నియమములను పాటించవలెను. ప్రస్తుతపరిస్థితులలో అహింస ఒక్కటే రాజకీయసాధన మని యెంతవఱకు కాంగ్రెసువాదులు నమ్ముతూన్నంతవరకునూ నా తరువాత నా ఉద్యమమును నడిపేవారు నావలెనే అహింసను మతవిశ్వాసముగా నమ్మినంతవరకునూ, నా తరువాతివారి నాయకత్వమునందును, సమర్థతయందును కాంగ్రెసువాదులకు విశ్వాస మున్నంతవరకును కాంగ్రెసు సంస్థ వారి నాశీర్వదించి నాసూచనలను, వారి సూచనలనుకూడ ఆచరణలో పెట్టగలదు.

"నాకు సంబంధించినంతవర కీ ఉద్యమము దానితత్వమును బాగుగా ఎరిగియున్నట్టియు, దానికి తగిన శిక్షణమును పొందినట్టియు మా ఆశ్రమవాసుల ద్వారా గాని, తదితరుల ద్వారాగాని నడుపబడవలెనని నా ఆశయము. కాబట్టి ఎవరు ముందీసంగ్రామమునకు ప్రారంభదశలో బయలుదేర వాఙ్మానముచేతురో వారికీ ఖ్యాతి కలుగదు. చాలాకాలమునుండి ఇంతవరకును మాఆశ్రమవాసులు ఆశ్రమమునకు స్థాయికుదిరే నిమిత్తము మంచి శిక్షణలో నుంచబడిరి. ఈ సత్యాగ్రహాశ్రమమునందు దేశీయు లుంచిన విశ్వాసమునకును, దానిని మిత్రులు ప్రేమించిన ప్రేమకును అనుగుణముగా సత్యాగ్రహమనేమాటయం దిమిడియున్న సుగుణముల నది ప్రదర్శింపవలసియున్నది. మా ఆశ్రమములో మా అంతట మేము విధించుకొన్న నిర్బంధములు కొన్ని సూక్ష్మరూపములో అలసత్వముకిందకు వచ్చినవనీ, మా ఆశ్రమప్రతిష్ఠవలన మా కర్హతలేని కొన్ని సౌకర్యములును, కొన్ని అధికారములును కలిగినవనీ నా అభిప్రాయము. ఎప్పుడో ఒకప్పుడు సత్యాగ్రహరూపములో దేశీయులకు మా ప్రయోజనమును చూపవచ్చు ననే విశ్వాసముతో మేము మా సౌకర్యములను కృతజ్ఞతాపూర్వకముగా గ్రహించితిమి. ఆశ్రమము పుట్టి ౧౫ సంవత్సరములు గడచినతరువాత ఒక్కసారి మాశక్తిని ప్రదర్శింప

జాలనియెడల ఆశ్రమమున్నూ, నేనున్నూ అదృశ్యుల మగుటయే మంచిది. అందు మూలమున నాకు, మా ఆశ్రమమునకు, భారతజాతికీ కూడా శ్రేయస్సు.

" ఉద్యమము బాగుగా ప్రారంభింపబడినయెడల దేశమంతటా దానికి మంచి పలుకుబడి కలుగునని నా నమ్మకము. కాబట్టి ఉద్యమము జయము పొందవలెనని కోరే వారందరు క్రమశిక్షకు లోబడి దౌర్జన్యరహితులుగా నుండుట వారి ధర్మము. ప్రతి మనిషీ నాయకుడు చెప్పినచోటనే నిలువవలయును. ఆయనఆనుజ్ఞ లేనిదే కదలకూడదు. ఆకస్మికముగా ప్రజాసమూహమునందే చైతన్యము కలిగినయెడల పూర్వానుభవమును బట్టి అది చాలావరకు ఆత్మనిగ్రహము కలిగియుండునని నా అభిప్రాయము. కాని అహింసను మతవిశ్వాసముగా నమ్మినవారుగాని, లేక రాజకీయవిధానముగా నమ్మిన వారుగాని సామాన్యప్రజల ఉద్యమమునకు తోడ్పడవలెను. సామాన్య ప్రజల ఉద్యమములలో ప్రపంచమునందెప్పుడును తలవని తలంపుగా క్రొత్తనాయకులు ప్రత్యక్షము కాగలరు. భారతదేశమువిషయములో కూడ ఆ సూత్రమునకు భిన్నముగా జరుగదు. కాబట్టి దౌర్జన్యమును నిరోధించుటకు సాధ్యమైనన్ని ప్రయత్నములు చేయబడవలెను. ఈ పర్యాయము ప్రారంభమైన శాసనోల్లంఘనము చిట్టచివర కొక్క శాసన నిరోధకుడు జీవించిగాని, స్వేచ్ఛగాగాని ఉన్నప్పటికీ ఆపబడదు; ఆపబడకూడదు కూడా. సత్యాగ్రహమునందిష్టముకలవారి క్రిందరీతులలో ఏదో ఒకరీతిగా నుండవలయును.

(౧) జైలులోగాని, లేక దానితో సమానమైనస్థితిలోగాని ఉండవలెను

(౨) శాసనోల్లంఘనములో లీనమై యుండవలెను.

(౩) రాటము పనిలోగాని, లేక స్వరాజ్యోద్యమమును ప్రోత్సహించే ఇతర నిర్మాణ కార్యక్రమమునందుగాని నిమగ్నుడై యుండవలెను."

సరిగా ఈసమయములోనే మోతీలాల్ నెహ్రూ ఆనందభవనమును కాంగ్రెసు సంస్థకు దాన మొసగెను.

౧౯౩౦ లో లక్నోలో జరిగిన అఖిలపక్షమహాసభలో సామ్యవాదమును గూర్చి పండిత జవహరలాలునెహ్రూ ఉత్తేజకరముగా నుపన్యసిస్తూండగా సంయుక్తరాష్ట్రములలోని ఒక జమీందారు లేచి "మీ ఆనందభవనముమాట ఏమిటి? అది ఇంకా నిర్మూలింపబడలేదే?" అని హేళనచేసెను. ఆనందభవనమువంటి శిల్పకళాసౌందర్యమును ప్రదర్శించుమందిరము నిర్మూలింపబడజాలదు. అది మరియొక కార్యముకొరకు, మరియొకరిచేతులలోకి పోవచ్చును. జారుచక్రవర్తికి నివాసస్థానమైన క్రిమిలిన్ ప్రాసాదమును సోవియట్టులుకూడా నేలమట్టము చేయలేదు. ఇప్పుడది మ్యూజియముగా

మార్పుచేయబడినది. అది సాంఘిక విజ్ఞానకేంద్రముగా నున్నది. ఆదేవిధముగా ఆనంద భవనమువిషయములో చేతులు మారినవి. దాని పేరులును, నిమిత్తములును మారినవి. ఇప్పుడు దానిపేరు స్వరాజ్యభవనము. భారతస్వాతంత్ర్యచిహ్నముగానూ, భారతజాతి కేంద్రముగానూ అది హిందువుల పుణ్యక్షేత్రమైన ప్రయాగనగరములో నున్నది. చరిత్ర ఎంతవేగముగా పరుగెత్తుతూన్నది? పండిత మోతీలాల్ నెహ్రూ భారతజాతీయ మహాసభాధ్యక్షుడై జవహరలాల్ నెహ్రూకు బహుమానముచేసిన ఆప్రాసాదము కొన్ని లక్షల రూపాయల విలువకలది. దానిని సరియైన స్థితిలో నుంచుటకు కొన్ని వేలు కావలసియున్నది. కాని మేమందులో తోటలు వేయించి ఫౌంటెనులను నిర్మించి దానిని భోగభూమిగా చేయుటకు మాకు కాలము చాలదు. స్వరాజ్యభవనము కాంగ్రెసువాదుల.వాంఛాపర్ణములకు కేంద్రభూమి అగుగాక. ఆ మహారాజదానమును చేసిన తండ్రినీ, దానిని భారతజాతిపక్షమున ప్రతిగ్రహించిన కుమారునీ భగవంతు డాశీర్వదించుగాక. ఆదాత ఈ ప్రతిగ్రహీతకు భారతజాతిపేర దానపత్రమును వ్రాసి ఇచ్చెను. తరువాత భారతజాతి వారి నభినందించినది.

గాంధీ ఉండిప్రయాణము సాగుతూండగా భారతదేశ మా కార్యకృత్యములతో నిరీక్షింపదొడగెను. నిశ్చేష్టతను నిర్మూలించు టెంతకష్టమో ఉద్రేకమును నిరోధించుటకూడా అంతకష్టము. కాని ఆత్మనిగ్రహము సంస్థకు ముఖ్యాంగము. భారతదేశము పరీక్షాసమయములో గొప్ప ఆత్మనిగ్రహమును చూపగలిగినది. గాంధీచే ప్రారంభింపబడిన ఉద్యమ మంతకంతకు ప్రజానురంజకత్వమును పొందెను. మనుష్యులు కాంగ్రెసుజెండా మట్టును మూగిరి. ఇక ధనమునకు లెక్కలేదు. గాంధీ ఒక్కమాత్రములో ఒక్కసిద్ధాంతమును ప్రకటించేసరికి ఆయన ప్రధానశిష్యులు ప్రజలకు బోధపరచిరి. ప్రచారకులు ఆసేతుహిమాచలపర్యంత మాసందేశమును తీసికొనిపోయిరి. అహింసామతసంస్థాపకు డొకగాంధీయే. అనుత్ప్రవక్తలు కొద్దిమంది. ప్రచారకులో వేనవేలు. ఈవిధముగా భారతదేశములోని ఇంటింటికినీ నూతనసిద్ధాంతము పాకిపోయెను. డాక్టరు బెసెంటుమాత్రము ఈపోరాటము నవ్వులాటపోరాటమని వర్ణింపదొడగెను. సాత్వికనిరోధమూలకముగా జైలునుండి విడుదలచేయబడిన నాయకమణి ఇట్టి విమర్శనముచేయుట న్యాయముగాలేదు. సాత్వికనిరోధనమునుగూర్చి చర్చింపబడి భారతజాతీయ జీవితములో చాలాయేండ్లు గడచినవి. సాత్వికనిరోధము అసహాయోద్యమముగా పరివర్తనము పొందెను. తరువాత అసహాయోద్యమము శాసనోల్లంఘనముగాను, శాసనోల్లంఘనము సత్యాగ్రహముగాను పరిణమించినవి. ఆ ఉద్యమము భౌతికప్రపంచకమునుండి విజ్ఞానప్రపంచకమునకును, విజ్ఞానప్రపంచకమునుండి నైతికప్రపంచకమునకును అభివృద్ధిపొందినది. గాంధీ తన దండయాత్రను ప్రారంభించి వారము

దినము లైనదో లేదో అంతవరకు కొంతమాత్రమును చలించనట్లు కనపడిన భారత ప్రభుత్వమునకు ఒక్కసారిగా మతిపోయినది. గాంధీ తన మహాప్రస్థానమును ప్రారంభించకమునుపే మార్చి మొదటివారములో వల్లభాయి అన్యాయముగా అరెస్టుచేయబడెను. ఆయనకు విధింపబడిన నాల్గుమాసములశిక్ష అంతకంటెనూ అన్యాయము. గాంధీప్రయాణము పూర్తి అయినది. గాంధీ అంగవస్త్రమును ధరించి చేతితో కదుకున్నూ, ఏకున్నూ పుచ్చుకొని దండీకి ప్రయాణమవుతూవున్నట్లుగా ప్రదర్శించిన సినీమాకంపెనీపైన దండీదండయాత్ర ప్రదర్శింపబడరాదని నిషేధపుటుత్తరువులు జారీచేయబడెను. తరువాత మద్రాసు, పాంచాలము, బొంబాయి, సంయుక్తరాష్ట్రములలోకూడా అట్టి ఉత్తరువులు జారీచేయబడెను. పోలీసువారు తమ మామూలు కార్యక్రమములనుండి విడుదలచేయబడిరి. పోలీసువారి దృష్టి పూర్తిగా అసహాయవాదులపైననే కేంద్రీకరింపబడెను. సత్యాహింసలపైన ఆధారపడని ప్రభుత్వము ధర్మముపైనా, న్యాయముపైనా నమ్మకము గలవారిని వెంటనే విశ్వసింపజాలదు.

ఈ కష్టపరంపరల మూలమున మనము పూర్ణస్వరాజ్యోదయమును కన్నులార చూడగలము. భారతమాత నేడు పడే ప్రసవవేదనమూలమున ఇప్పటికంటె ఎక్కువ పవిత్రమైన, బలిష్ఠమైన, సుందరమైన మూర్తిలో ఆమె తిరిగీ ప్రత్యక్షము కాగలదు. మనము ప్రభుత్వమునకు కష్టములు కలిగింపవలెనని బయలుదేరలేదు. కాని దానికి రెండుకష్టములుమాత్రము కలుగగలవు. ప్రతిష్ఠపోవుటమూలమున నైతికకష్టమును, నిరంకుశాధికారములు పోవుటమూలమున రాజకీయకష్టములును కలుగగలవు. ప్రభుత్వమునకును ప్రజలకును జరిగే ఈ యుద్ధము నిష్కళంకమైనది. సత్యాగ్రహులకు సహాయము చేసినయెడల ప్రభుత్వమువారి ఆగ్రహమునకు గురికావలసివచ్చునని వర్తకులకు, షావుకారులకు, గృహ యజమానులకు, భూఖామందులకు అందరికీ కబురుపంపి ప్రభుత్వమువారే ఈ పోరాటమును కళంకీభూతముగా చేయదొడగిరి. ఎంతవరకీ బెదరింపులకు ప్రజలు లొంగెదరో అంత తొందరగా వారవినీతిపరులగుదురు. ఎంతవరకు వారీ భయములను నిరోధించగలరో అంత తొందరగా వారు స్వరాజ్యమును పొందుదురు. ఇంగ్లీషువిద్యతోను, నగరజీవితముతోను సంబంధముగలవారు ప్రభుత్వమువారి యీ బెదరింపులకు మరీ లొంగిపోదురు. కుతర్కములు చేతకాని దేశాభిమానులుమాత్రము వీటికి లొంగలేదు. గ్రామములు దేశాభిమానమును ప్రదర్శించి దేశభక్తులను సృష్టించుటయే కాక ఈ ఉద్యమమునందు నాయకత్వమునుకూడా వహించినవని చెప్పవలసివచ్చుట సంతోషదాయకము. ఒక్కసారి గ్రామములు నాయకత్వమును వహించినయెడల ఈ ఉద్యమమునకు విజయము నిశ్చయము.

ప్రతియుగమునందును, ప్రతి దేశములోను కొన్ని అద్భుతవిషయములు జరుగును. ఈ ౨౦ వ శతాబ్దమునందు తమ మాతృదేశమున జరిగిన ఈ అద్భుతవిషయమును చూచుటకే ౧౯౩౦ మార్చి ౬ వ తేదీని సబర్మతీ ఆశ్రమమునొద్ద గాంధీపతాకము చుట్టును వేలకొలది జనులు మూగిరి. వారు తమ శక్త్యుత్సాహము లుడిగేటంతవరకును గాంధీని, ఆయన సంగ్రామ యాత్రికులను అనుగమించిరి. వారిలో విదేశములనుండి, భారతదేశములోని అనేక భాగములనుండి వచ్చిన పత్రికావిలేఖకులును, ఫోటోగ్రాఫరు లును, సినీమాలవారును కలరు. ఆ జనసమూహములో ఎక్కువభాగము అనేకరాష్ట్రము లనుండి వచ్చిన పెద్దలును, చుట్టుపట్ల గ్రామములనుండి వచ్చినరైతులును కలరు. గాంధీ చాలాకాలమునుండి భారతదేశ మోక్షమునకు గుజరాతు రణరంగముకాగలదని చెప్పుతూ వచ్చెను. గుజరాతురాష్ట్రమును తదితరరాష్ట్రవాసులు ప్రభుత్వముతో పోరాడనిచ్చె యెడల ఆ ఒక్క రాజధానియే భారతదేశమునకు స్వరాజ్యమును సంపాదించిపెట్టగల దని గాంధీ అనేకసార్లు చెప్పెను. గాంధీ నెరిగియున్న వారందరికీ ఆయన యెంత తొం దరగా నడుచునో తెలుసును. గాంధీతో ప్రయాణముచేసిన ఒక పత్రికావిలేఖకుడు వ్రాసిన ఈక్రింది విషయము నుదాహరింతుము:

"మార్చి ౧౨ వ తేదీ ప్రాతఃకాలమున గాంధీ తన ఇష్టమువచ్చిన ౭౯ మంది స్వచ్ఛందసైనికులతో ఉప్పును తయారుచేసేనిమిత్తము ౨౦౦ మైళ్ళదూరములోనున్న దండీ అనే సముద్రతీర గ్రామమునకు సత్యాగ్రహాశ్రమమునుండి బయలుదేరెను."

ఈ మహాప్రస్థానసందర్భమున ప్రదర్శితములైన దృశ్యము లుద్రేకకరములుగా, అద్భుతములుగా, ఉత్తేజకరములుగా తోచెను. ఈ మహత్తరసముద్రమునందు మానవ హృదయములలో దేశభక్తి పొంగి పొరలెత్తినట్లుగా ఇంతకుపూర్వ మెన్నడూ జరుగ లేదు. ఇది భారతజాతీయ స్వాతంత్ర్యచరిత్రయందు నవయుగ ప్రారంభకముగా వర్ణింపబడును.

ఆయన చేతిలో కఱ్ఱపట్టుకొని నడువ ప్రారంభించెను. సుశిక్షితమైన ఆయన సైన్యము నిశ్శబ్దముగా ఆయనవెంట నడచెను. సేనాముఖమున నున్న గాంధీ తక్కిన వారికి ఉత్సాహము కలిగించెను. ఆ సైన్యము నడువదొడగెను. మార్గమువెంట ప్రజలు బారులుతీర్చి, భారతదేశపు సర్వసైన్యాధిపతిదర్శనముకొరకు గంటలకొలది నిరీ క్షిస్తూండిరి. సైనికులు ౧౦ మైళ్లు దాటిరి. అస్లాలీగ్రామము చేరిరి. ఆనాడు జరిగిన మహోత్సవమువంటి మహోత్సవమును అహమ్మదాబాదు జీవితచరిత్రలో అక్కడిప్రజ లెరిగియుండరు. పసిబిడ్డలును, వికలాంగులును తప్ప నగరమునందలి అఖిలజనులును ఈ దండయాత్రను రెండు మైళ్లపొడుగున నిలబడి చూడ దొడగిరి. వీధులలో

నిలుచుటకు తావు దొరకనివారు ఇళ్లకప్పులపైనను, గోడలపైనను, చెట్లపైనను, వారికి తోచిన ఇతర ఎత్తయిన ప్రదేశములపైనను నిలబడి చూడసాగిరి. ఈ చారిత్రకసందర్భమున అహమ్మదాబాదునగరము సమ్మోహిత మైనట్లు కనిపించెను. అడుగడుగునకు "గాంధీకి జై" అను కేకలు మిన్నుముట్టెను.

ఈ ప్రయాణమును చూచి ఆ మోక్షప్రదాతకు వినమ్రులగుటకు ప్రతిచోటా జనసమూహములు మూగినవి. నా డొక కొత్తస్వరాజ్యస్వరూపము ప్రత్యక్షమయ్యెను. కాని అపూర్వసందేశములే ప్రబోధింపబడెను. ఖద్దరు, మద్యపాననిషేధము, అస్పృశ్యతానివారణము ఈమంత్రములే పునరుపాసింపబడెను. కానిసత్యాగ్రహములో పాల్గొనుడనే నూతనవాణి బయలుదేరెను. దండయాత్రలో ఆయన తోవలో మరణింపనైనా మరణించవలెను, లేదా స్వరాజ్యము వచ్చేవరకును ఆశ్రమమునకు దూరముగా నుండవలెను అని శపథముపట్టెను. ఉప్పుపన్ను రద్దుచేయించేటంతవరకును సత్యాగ్రహాశ్రమమునకు తిరిగి పోకూడదని ఆయనఉద్దేశము. నూలువడుకుట, గ్రామ పరిశుద్ధతలను గూర్చి ఆయన గట్టిగా చెప్పెను. వందలకొలది స్వచ్ఛందసైనికు లుద్యమములో పాల్గొనిరి. గాంధీనిర్బంధము తప్పనిసరి అయ్యెను. ఆయనతరువాత అబ్బాసు తయాబ్జీ నాయకత్వము వహింపవలసియుండెను. "గాంధిమహాత్ముని ఈచారిత్రకప్రస్థానము మోజెసునాయకత్వముక్రింద ఇజ్రేలైట్లు (Israelites) ఈజిప్టునువిడిచిన విషయము స్ఫురణకు వచ్చుచున్నది. అమతప్రవక్త తన గమ్యస్థానమును చేరేటంతవరకును వెనుకకు తిరుగడు." అని ప్రఫుల్లచంద్రరే చెప్పెను.

గాంధి "బ్రిటిష్‌ప్రభుత్వ మీదేశములోని నైతిక, భౌతిక, వైజ్ఞానికాధ్యాత్మిక విషయములకు వినాశనమును కల్పించినది. ఈ ప్రభుత్వము పాపభూయిష్ఠమైన దని నా విశ్వాసము. కాని నే నీ ప్రభుత్వపద్ధతినిమాత్రమే నిర్మూలింతును.

"'దేవుడురాజునురక్షించుగాక' అనేపాటను నేను పాడి ఇతరులచేత పాడించితిని. అర్జీలు, రాయబారములు, రాజీనామాలలో నా కెక్కువ నమ్మక ముండెను. కాని అవన్నీ ఇప్పుడు వ్యర్థములయ్యెను. ప్రభుత్వమును లొంగదీయుటకు సాధనము లవి కావని నాకు తెలిసినది. రాజద్రోహము నాకు మతమైనది. మనది దౌర్జన్యరహిత యుద్ధము. మన మెవరినీ చంపకూడదు. కాని ఈ ప్రభుత్వమును పాపపంకిలమునుండి తొలగించుట మన ధర్మము."

జంబుసారులో గాంధీ మాట్లాడెను. సబు ఇన్‌స్పెక్టర్లపైన సాంఘిక బహిష్కారము ప్రయోగింపబడినందు కాయన నిరసించెను. "ప్రభుత్వోద్యోగులను లంకణములు చేయించుట మతముకాదు." అని ఆయన అనెను. తన శత్రువు పాముకరచి

షేక్షమునకు మనము పనిచేయుచుంటిమని చెప్పుచుంటిమి. మహమ్మాలమున ప్రజల పసుటాదాయముకంటె, అనగా ౪ కానులకు ౫౦ రెట్లు దేశమునకు వ్యయమవుచున్న యెడల మనకు వైస్రాయి జీతమును విమర్శించతగిన అధికారములేదు. నేను ప్రచారకులను వారి ఖర్చుల లెక్కయిమ్మని అడిగితిని. వా రేవిధముగా వ్యయపరచుచుండిరో తెలుసుకొనగోరితిని. మాలో ఒక్కొక్కరు దగ్గిరదగ్గిరగా ౪ కానులకు ౫౦ రెట్లు వ్యయము చేయుచుండిరన్నచో నా కాశ్చర్యము కలుగుట లేదు. ఏదో ఒక తీరుగా నాకు మంచి నారింజకాయలను, పచ్చిద్రాక్షపండ్లను తెచ్చి ఇచ్చుచున్నయెడల ఫలిత మేమగును? నాకు ౧౨ నారింజకాయలు కావలసియున్నచో ౧౨౦ నారింజకాయలను, ఒక షాను పాలుకావలసియున్నచో 3 షానులను తెచ్చిఇచ్చినయెడల ఏమి జరుగును? నేను పుచ్చుకొనియెడల మీమనస్సుకు నొప్పి కలిగించినవార మగుదుమునే స్నేహముతో మీరు వడ్డించిన పిండివంటలన్నిటినీ భుజించినయెడల నేమగును! మీరు పచ్చిద్రాక్షపండ్లను, జామపండ్లను మా కిచ్చినప్పుడు మేము పుచ్చుకొందుము. అవి ఒక ధనవంతుడయిన రయితులోపగిన నజరానా అని మాకు తెలుసును. అయితే ఒక స్నేహితుని దగ్గరనుండి బహుమానముపొందిన చక్కని ఫౌంటెన్ కలముతో నున్నని కాగితముపైన వైస్రాయికి నేను ఖులాసాగా ఉత్తరము వ్రాసినచో ఏగునో ఊహింపుకొనుడు. ఆ విధముగా వ్రాయబడిన ఉత్తరమువలన ఏమీ ప్రయోజన ముండదని నా అభిప్రాయము.

“‘దొంగతనముగా సంపాదించిన అన్నము శుద్ధికాని పాదరసమువంటిది’ అని ఒక కవి చెప్పియుండెను. చిరస్మరణీయమైన ఆ పద్య మిప్పుడు స్మృతికి వచ్చుచున్నది. దరిద్రవంతమైన దేశముయొక్క శక్తిని మించి జీవించుట దొంగతనముచేసిన ఆహారముపైన జీవించుటవంటిది. అట్టి ఆహారముపైన జీవించుటవలన మనయుద్ధము నెగ్గదు. మన శక్తికి మించి జీవించుటకొరకై నేనీయాత్ర ప్రారంభించలేదు. వేలకొలది స్వచ్ఛంద సైనికులు మన ఉద్యమములో పాల్గొందురని నా ఆశ.

“వారందరిని అధికవ్యయముతో మనము భరింపజాలము. నాతోవచ్చిన ౮౦ మంది అనుచరులనుకూడ స్వయముగా చూచి పరామర్శించుటకు తగిన తీరిక నాకు లేదు. వారిలో ఒక్కొక్కరిని గుర్తుపట్టుటకుకూడ నా కవకాశము లేకున్నది. కాబట్టి ప్రజలకు నా హృదయమును విప్పిచెప్పుటకంటె వేరొకమార్గములేదు. నా సందేశములోని ప్రధానాంశమును మీరు గ్రహింతురుగాక. మీరు గ్రహింపలేనియెడల నేటియత్నముతో స్వరాజ్యము రాగలదనే ఆశ లేదు. నోరులేని లక్షలాదిగాగల ప్రజాసమూహమునకు మనము నిజమైన సంరక్షకులము కావలెను.”

ఈ ఉపన్యాసము సభాసదులను సమోత్సాహితులనుగా నొనర్చినదని వేరుగా చెప్పనవసరములేదు. ౨౦౦ మంది పటేళ్లు రాజీనామాల నిచ్చిరి. నవసారీలో గాంధీ

పౌరసేవకు సారాయిఅవర్తకమును మానవలసినదని, గ్రామములోతుతనమును కట్టిపెట్టవల సినదని ప్రబోధించెను. "వారు ఉప్పుపన్నును తీసివేయించగలిగినయెడలను, భారత దేశమునుండి మదిరావ్యాపారమును నిర్మూలింపగలిగినయెడలను అహింసకు జయము కలిగినట్లే. అప్పుడు భారతీయులకు స్వరాజ్యమును గాకుండా ఏకిరీటాధిపతు లడ్డుపడగలరు ? ఆవిధముగా అడ్డుపడగలవా రున్నయెడల నేను వారిని చూడ నిచ్ఛ గింతును. నాకు కావలసినది నేను తీసికొనిపోవలెను. లేదా, నాశవము పశ్చిమసముద్ర మున తేలవలెను."

గాంధీ ఏప్రిల్ ౫వ తేదీ ఉదయమునకు దండీ చేరెను. శ్రీమతి సరోజినీదేవి కూడా ఆయనను చూడపోయెను. అప్పుడు గాంధీ అసోసియేటెడ్ ప్రెస్సు ప్రతినిధితో ఈవిధముగా చెప్పెను:

"దేవునిదయవలన మొదటిరంగము సంతోషకరముగా ముగిసినది. నామట్టుకు నా కిది చిట్టచివరి స్వాతంత్ర్యయుద్ధము. నాయాత్రపొడుగునను ప్రభుత్వమువా రేమీ జోక్యము కల్పించుకొననందుకు నేను వారి నభినందింపక తప్పదు. వల్ల భాయిని నిర్బంధించుటలోను, శిక్షించుటలోను ప్రభుత్వమువారు నిర్దాక్షిణ్యము గాను, చిన్నతనముగాను ప్రవర్తించిరి. సేనుగుప్తను నిష్కారణముగా అరెస్టుచేసిరి. ఈరెండువిషయములును జరిగినపిమ్మట ప్రభుత్వమువా రీవిధముగా నావిషయములో జోక్యము కల్పించుకొనకుందురని నేను తలంచలేదు. ప్రభుత్వమువారు ప్రజలకు తేలి కగా ఆగ్రహమును తెప్పించి, తరువాత వారిని భయభ్రాంతులనుగా చేసి, శిక్షించుటలో ఆరితేరినవారని నాకు తెలుసును. వారి శక్తిసామర్థ్యముల నిపుడు వారు కోల్పోయి రని ఊహించునంతటి అవివేకిని గాను నేను. ప్రభుత్వమువారి రాజకీయపద్ధతిలోనూ, వారిహృదయములోనూ కలిగిన పరివర్తనమువలన వా రీవిధముగా జోక్యము కల్పించు కొన నెంచలేదని విశ్వసించుట నాకోరిక. భారతశాసనసభలో ప్రకటింపబడిన ప్రజాభిప్రాయమునకు ప్రభుత్వమువారు చూపిన బుద్ధిపూర్వక తృణీకార భావమునూ, వారి నిరంకుశచర్యనూ చూచినయెడల భారతదేశమునుండి ధనాకర్షణ ప్రయత్నములు నిర్దాక్షిణ్యముగా కొనసాగింపబడవలెననియే వారు పట్టుపట్టినట్లు స్పష్టము కాగలదు. కాబట్టి, ఇప్పుడు వా రీవిధముగా జోక్యము కల్పించుకొనకుండుటవలన శాసనోల్లంఘ నమువంటి అహింసాపూర్వక తీవ్రరాజకీయాందోళనము నణగద్రొక్కుటకు ప్రపం చకము సహింపదని అత్యధికశక్తివంతమగు బ్రిటిష్‌ప్రభుత్వముకూడా తెలుసుకొనిన దన్నమాట నిశ్చయము.

"ఈనాయాత్రను వారు సహించి ఉపేక్షించినట్లుగానే రేపటినుండీ అసంఖ్యా కములైన జనసమూహములు ఉప్పుచట్టములను నిరాకరించుటను సహించి ఊరుకొనగల

కూడా చూడవలసియున్నది. కాంగ్రెసుకార్య నిర్వాహకసభ్యుల తీర్మానమునకు ప్రజలు విశేషముగా విధేయత చూపింతురని నావిశ్వాసము. భారతదేశములో ఆసేతుహిమాచల పర్యంతమును వ్యాపించియున్న అన్ని కాంగ్రెసుసంస్థలును రేపటినుండి ఉప్పు చట్టములకు సంబంధించినంతవరకు శాసనోల్లంఘనమును ప్రారంభింపవచ్చునని నే నింతకుపూర్వము చేసిన ప్రకటనమును రద్దుచేసికొనుటకు నా కిప్పుడేమీ కారణము కనిపించుటలేదు. దైవానుగ్రహమువలన నాతోవచ్చిన స్వచ్ఛందసైనికులతోసహా రేపుదయము సరిగా ౬-౩౦ గంటలకు శాసనోల్లంఘనమును ప్రారంభింతుమని ఆశించుచున్నాను. జలియన్‌వాలాబాగు హత్యల నాటినుండీ ఏప్రిల్ ౬ వ తేదీ మాకు పుణ్యదినమును, ప్రాయశ్చిత్తదినమును అయినది. కాబట్టి రేపు ఉపవాసములతోను, ప్రార్థనలతోను శాసనోల్లంఘనమును ప్రారంభింతుము. యావద్భారతదేశమును రేపటిసుముహూర్తమున జాతీయకార్యక్రమమును నేను భావనచేసిన పవిత్రహృదయములతో ప్రారంభింతురుగాక. దేశముకొరకాత్మసమర్పణము చేయదలచుకొన్న పవిత్రతనుబట్టి బుద్ధిపూర్వకముగాగాని, అబుద్ధిపూర్వకముగాగాని లక్షలకొలదీ భారతప్రజలు పోరాడుతూన్న ఆ మహదాశయము తొందరగా లభింపగలదు."

ఉదయము ప్రార్థనలు జరిగినతోడనే గాంధీయున్ను, ఆయనస్వచ్ఛందసైనికులున్ను సముద్రతీరముననున్న ఉప్పును పోగుచేసి ఉప్పుచట్టమును నిరాకరింపకడంగిరి. ఉప్పుచట్టమును నిరాకరించిన తక్షణము గాంధి పత్రికలలో ఈ ప్రకటనము చేసెను:

"ఇదిగో ఇప్పుడు లాంఛనముగా ఈ ఉప్పుచట్ట ముల్లంఘింపబడినది. ఇక ఎవరైననూ ఉప్పుచట్టముక్రింద శిక్షింపబడుటకు సిద్ధముగా నున్నవారు వారికి వీలైన చోట, ఇష్టమువచ్చిన స్థలములో ఉప్పును తయారుచేయవచ్చును. కాంగ్రెసుప్రచారకులందరును ప్రతిచోటా ఉప్పును తయారుచేయవలెనని నాసలహా. స్వచ్ఛమైన ఉప్పును తయారు చేయగలిగినచోట్ల అక్కడి కాంగ్రెసువాదులు దానిని తయారుచేయు విధమును గ్రామస్థులకు బోధింపవలెను. అందువలన వారు శిక్షింపబడుదురనికూడా తెలియచెప్పవలెను. ఉప్పుపన్నుగూర్చిన చరిత్ర వారికి పూర్తిగా బోధింపబడవలెను. ఏవిధముగా ఉప్పుచట్టములను, నిబంధనలను తృణీకరింపవలయునో వారికిచెప్పి, వారిద్వారా ఉప్పుపన్నును రద్దుచేయించునట్లు చేయవలయును.

"గ్రామస్థుల కిది దొంగతనముకాదనీ, బుద్ధిపూర్వకముగానే ఈచట్టము నిరాకరింపబడుతూన్నదనీ తెలియజెప్పవలెను. ఈ ఉప్పు ప్రకృతిసిద్ధముగా సముద్రతీరమున నున్న గుంటలలో తయారగుతూన్నదనీ, దానిని ప్రజలు తమకొరకునూ, తమ పశువులకొరకునూ ఉపయోగించుకొన వచ్చుననీ, కొనేవారి కమ్ముకొనవచ్చుననీ

ప్రజలకు తెలియజెప్పవలెను. ఆవిధముగా వారు ఉప్పుచట్టమును తృణీకరించినయెడల శిక్షాపాత్రు లగుదురనీ, లేదా సాల్టుఉద్యోగస్థులు వారి ననేకవిధముల బాధింతురనీ ప్రజలకు తెలియజేయవలెను.

"ఉప్పుపన్నుపైన సాగింపబడిన ఈ దండయాత్ర జాతీయవారములో కూడ సాగవలెను. అనగా ఏప్రిల్ ౧౩ వరకును సాగవలెను. ఈ పవిత్ర కార్యమునందు లీనముకానివారు ఖద్దరు ఉపయోగమునుగూర్చి, విదేశవస్త్రబహిష్కారమునుగూర్చి ప్రచారముచేయవలెను. సాధ్యమైనంత యెక్కువ ఖద్దరును వారు తయారుచేయుటకు ప్రయత్నించవలెను. ఇందుకొరకును, మద్యపాననిషేధముకొరకును నేను భారత స్త్రీల కొక సందేశమును పంపనుంటిని. భారత నారీమణులు పూర్ణస్వరాజ్య ప్రయత్నమునందు పురుషులకంటె ఎక్కువగా తోడ్పడగలరని నా విశ్వాసము. పురుషుల కంటె అహింసాతత్త్వము స్త్రీల కెక్కువగా ఆచరణయోగ్యమని నా యభిప్రాయము. వారు దుర్బలలైన కారణమున అహింసాతత్త్వమున కుపయోగపడుదురని నేను చెప్పుట లేదు. పురుషులు, వారి అహంకారములో వారి నబలలుగా భావింతురు. నిజముగా స్త్రీల కెక్కువ ధైర్యమున్నది. వారి స్వార్థత్యాగబుద్ధి వర్ణనాతీతము."

మరియొక ప్రకటనములో గాంధీ ఈవిధముగా చెప్పెను:

"ఇప్పటికి వచ్చిన వార్తలనుబట్టి గుజరాతులో సమష్టిశాసనోల్లంఘన మద్భుతముగా జరుపబడిన దని నా అభిప్రాయము. దాని ఫలితముకూడా కలుగనేకలిగినది. ప్రభుత్వమువారు ముఖ్యులను వెంటనే నిర్బంధించిరి. ఇతర రాష్ట్రములలోని ప్రచారకులపైన కూడ ప్రభుత్వమువా రటువంటి కటాక్షములనే ప్రసరింపవేసియుందు రని నే నెరుగుదును. ఇది అభినందించవలసిన విషయము.

"సాత్త్వికనిరోధకులను ప్రభుత్వమువారు వారి ఇష్టమువచ్చినట్లుగా ప్రవర్తింప నిచ్చినయెడల అది చాలా ఆశ్చర్యకరముగా నుండును. న్యాయవిచారణలేకుండా సాత్త్విక నిరోధకుల ఆస్తులకుగాని, శరీరములకుగాని వారు హానికలిగించినయెడల చాలా క్రూరముగా నుండును.

"క్రమముగా విచారణలుచేసి శిక్షలు విధించినందువలన ప్రభుత్వమువారిని తప్పుపట్టుటకు వీలులేదు. నిజముగా సాత్త్వికనిరోధముయొక్క పరిణామ మదే.

"సాత్త్వికనిరోధకుడు ఖయిదులు మొదలగు నిర్బంధముల ననుభవింపవలసి యున్నది. అదియే అతనికి శిక్షణము. ఆయన వీటికి చలించనప్పుడే తన ఆదర్శమును పొందగలడు. నాయకుడు తొలగింపబడినప్పుడు ఆయన ప్రాతినిధ్యము వహిస్తున్న

ప్రజలు భయమును ప్రకటించకూడదు. ఇప్పుడు ప్రతివాడును నాయకుడును, అనుచరుడును కూడ కావలయును.

"ఈ ఖైదులు జరిగినతరువాతకూడ ప్రభుత్వపాఠశాలలలోను, కళాశాలలలోనుగల విద్యార్థులు వారి కళాశాలలను, పాఠశాలలను విడచిపెట్టి ప్రభుత్వమువారికి సరియైన ప్రత్యుత్తర మీయనియెడల నాకు బాధ కలుగును."

ఒక వాలంటీరుకు మణికట్టుపైన పోలీసువారి దెబ్బ కొద్దిగా తగిలినప్పుడు గాంధీ ఈ క్రిందివిధముగా వ్రాసెను:

"ప్రజ ఉప్పుతీసుకొని పోతూండగా దానిని లాక్కొనే నిమిత్తము పోలీసువారీవిధముగా చెయిచేసుకొనుట నైతికముగా తప్పు. ఇంగ్లీషు చట్టము ప్రకారము మరీతప్పని నా అభిప్రాయము. న్యాయశాస్త్రములో ఎట్టి అధికారము లీయబడినవో నాకు తెలియదు. న్యాయశాస్త్రప్రకారము ప్రవర్తించుట ప్రభుత్వమువారికి చాలా చిక్కుగా నుండవచ్చును. కాని వారు మొదట సరిగా ప్రారంభించిరి. చివరకు చెడుగా ప్రవర్తించకుందురుగాక. వారు ప్రజలను భయపెట్టులకే పూనుకొనినయెడల ప్రజ లందుకు సంసిద్ధులు కావలెను. వారొక్క కోపపు మాట అయినా అడకుండా ప్రవర్తించవలెను. ప్రజల చేతులలో నున్న ఉప్పును తీసుకొనుటకు ప్రభుత్వమువారికి తేలికైన మార్గము కలదు. వారు సాత్వికనిరోధకులను అరెస్టుచేయవచ్చును. సాత్వికనిరోధకుల శరీరములనే ప్రభుత్వమువారు స్వాధీనపరచుకొనిరి. కాబట్టి వారి దగ్గరనున్న ఉప్పును తీసుకొనుటలో తప్పులేదు. కాని వారిని శిక్షించితేనేకాని ప్రభుత్వమువా రా ఉప్పును స్వాధీనపరచుకొన వీలులేదు."

స్త్రీలనుగూర్చి నవసారిలో గాంధీ ఈక్రిందివిధముగా చెప్పెను:

"ఉప్పుపెనములను సంరక్షించుటలో స్త్రీలు పురుషులతో కలసి పాల్గొనరాదు. ప్రభుత్వమువారు మన స్త్రీలపైన ఇంతవరకు యుద్ధము చేయ తలపెట్టలేదని నేను వారిని స్తుతింతును. ప్రభుత్వమువా రా విధముగా చేసేటంతవరకును మనము వారిని కవ్వించుట తప్పని నా అభిప్రాయము. ప్రభుత్వమువారు స్త్రీలను జాగ్రత్తగాచూస్తున్నంతవరకును ఇది పురుషులపోరాటమే. ప్రభుత్వమువారు హద్దులను దాటి ప్రవర్తించినప్పుడు స్త్రీలు దెబ్బలుతినుటకు సంసిద్ధముగా నుండవలసినతరుణము వచ్చును. స్త్రీల చాటున మనము జీవింప చూచుచుంటిమని ప్రభుత్వమువా రనేటట్లుగా మనము ప్రవర్తించకూడదు. నాకార్యక్రమములో స్త్రీలకు మంచిస్థానము కలదు. కాబట్టి వారెదుర్కొనగలిగిన అపాయములకు తమశక్తి నిప్పుడు వినియోగింపవలదని నాకోరిక."

ఏప్రిల్ ౬ వ తేదీనుండి ఉప్పుసత్యాగ్రహమును ప్రారంభింపవచ్చునని గాంధీ చేసిన ప్రకటనము కారుచిచ్చువలె దేశమంతటా పాకినది. ప్రధాననగరములలో లక్షల

కొలది ప్రజలతో బహిరంగసభలు జరుపబడెను. కరాచీ, షికోడా, రత్నగిరి, పాట్నా, పెషావర్, కలకత్తా, మద్రాసు, షోలాపూరు నగరములలో జరిగిన సంఘటనములనుబట్టి ఈ నాగరిక ప్రభుత్వము వెనుకనున్న దౌర్జన్యమునుగూర్చి ప్రజలకు సాక్షాత్కారము కలిగెను. పెషావరులో సైనికు లనేకమందిని కాల్చిరి. అనేకమంది మరణించిరి. మద్రాసులోకూడా కాల్పులు జరిగినవి.

కరాచీవిషాదసంఘటనమును గూర్చి గాంధీ ఈక్రిందివిధముగా వ్రాసెను:

“ధైర్యవంతుడైన ఆయువకుడు, దత్తాత్రేయుడు, సత్యాగ్రహమునుగూర్చి ఏమీ రెరుగడు. అత డొక వస్తాదు. ప్రజలను శాంతపరచుట కాయన ప్రయత్నించెను. ఆయన కొక తుపాకిగుండు తగిలి మరణించెను. మేఘరాజు రేవాచంద్ వయస్సు ౧౮ ఏండ్లు. ఈయనకూడ తుపాకిగుండువల్ల మరణించెను. ఈవిధముగా ఏడుగురు మరణించిరి. జయరామదాసకుకూడా తుపాకిగుండ్లు తగిలెను.”

‘దుష్టపరిపాలన’ మనే శీర్షికతో గాంధీ కొన్ని సంఘటనములను విమర్శించి “ప్రభుత్వమువారు ఉప్పు ఉచితముగా ఈయబడునని ప్రకటింపజాలనియెడలను, శాసన నిరోధకులను అరెస్టుచేయజాలనియెడలను ఉప్పుకొటారులపైకి దాడిపోయే ప్రజలను హింసించుటకంటె కాల్చుట ఉత్తమము.” *

ఏప్రిల్ ౨౩ వ తారీఖున బెంగాలు ఆర్డినెన్సు పునరుద్ధరింపబడెను. ఏప్రిల్ ౨౭ వ తేదీని గవర్నరుజనరలు మరియొక ఆర్డినెన్సును ప్రకటించెను. దానిద్వారా ౧౯౧౦ నాటి ముద్రణాశాసనము కొన్ని సవరణలతో పునరుజ్జీవింపచేయబడెను.

గాంధీ యంగిండియాపత్రిక సైక్లోస్టయిల్ లో వెలువడ ప్రారంభించెను. గాంధీ ఒక ప్రకటనములో ఈవిధముగా చెప్పెను:

---

* ఉద్యమ ప్రారంభదశలో కరాచీలో జరిగిన కాల్పులకు సంబంధించిన విషయ మిది. సింధురాష్ట్రనాయకుడైన జయరామదాసు దౌలత్ రామ్ బొంబాయిశాసన సభాసభ్యత్వమునకు రాజీనామా నిచ్చినపిమ్మట ఆసంవత్సర ప్రారంభమునందే కాంగ్రెసుకార్యనిర్వాహకసభ్యుడుగా నెన్నుకొనబడెను. మేజస్ట్రేటు కోర్టులో విచారింపబడుచున్న కొంతమంది శాసనోల్లంఘన ఖయిదీలను చూడవచ్చిన జనసమూహమును జయరామదాసుదౌలతురామ్ సర్దుబాటుచేయ ప్రయత్నిస్తూండగా పోలీసువా రాయనను, మరికొంతమందినీ తుపాకులతో కాల్చిరి. ఒక తుపాకిగుండాయన తొడలోనుండి దూరిపోయెను. జయరామదాసుకు గాయము తగిలెను. తరువాత కొంత కాలమున కాయన తేరుకొని, కాంగ్రెసు కార్యనిర్వాహకసభ్యుడుగా పనిచేసెను.

"ఎన్నడో మృతమైన ముద్రణాశాసనము తిరిగి ఆర్డినెన్సురూపములో ప్రత్యక్షమగుట తలవనితలంపుగా జరిగినపని గాదు. ఈ నూతనరూపములో మరికొన్ని నిబంధనలుకూడా కలవు. అందుమూలమున ముద్రణాశాసనము పూర్వముకంటెను భయంకరముగా చేయబడినది.

"మనకు తెలిసినప్పటికీ తెలియకపోయినప్పటికీ కొంతకాలమునుండి మనము సైనికశాసనముయొక్క ప్రచ్ఛన్నరూపముక్రింద నివసించుచున్నమాట వాస్తవము. సైనికశాసన మనగా నేమిటి? కేవలము సైన్యాధిపతియొక్క ఇష్టముప్రకారము రాజ్యము నడచుట. ఇప్పుడా సైన్యాధిపతి రాజప్రతినిధి. అతని కవసరమైనప్పుడు శాసనముల నన్నిటినీ అతిక్రమింపగలడు; మామూలు నిబంధనలను తృణీకరింపగలడు; నిరోధించుటకును, ప్రతిఘటించుటకును శక్తిలేని వినమ్రులైన ప్రజలమీద నిరంకుశాధికారములను చలాయించగలడు. బ్రిటిష్ ప్రభుత్వమువారి నిరంకుశాజ్ఞలకు కేవలము లొంగిపోవుకాల మెప్పటికీ పోయినదని నా ఆశ.

"ఈ కొత్త ఆర్డినెన్సుతో ప్రజలు భయపడరని నా నమ్మకము. పత్రికాధిపతులు ప్రజాభిప్రాయమునకు నిజమైన ప్రతినిధులైనట్లైతే ఈ ఆర్డినెన్సును చూచి భయపడకూడదు. థోరో చెప్పిన సుభాషితముప్రకారము నిరంకుశప్రభుత్వముక్రింద మర్యాదస్థు లైశ్వర్యవంతు లగుట కష్టమే. మన మెంతమాత్రమును చింతపడక మన శరీరములను అధికారులకు స్వాధీనముచేయ నిర్ణయించుకొనినప్పుడు మన ఆస్తులను కూడా వారి స్వాధీనము చేయ జంకకూడదు.

"కాబట్టి నేను ముద్రాలయాధిపతులను, పత్రికాసంపాదకులను ధరావతులు కట్ట నిరాకరింపవలసినదిగ కోరుచున్నాను. వారిని ధరావతులు కట్టవలసినదని ప్రభుత్వమువారు కోరినయెడల వెంటనే పత్రికాప్రచారము మాని ప్రభుత్వమువారి ఇష్టము వచ్చిన ఆస్తులను వశపరచుకొనవలసినదని వారిని సవాలుచేయ కోరుచున్నాను. స్వాతంత్ర్యదేవత మన గుమ్మములకడ వేచియుండగా కేవల మామెను సంతోషపెట్టునిమిత్తము వేలకొలది ప్రజలు హింసలకు గురియగుచుండ, పత్రికాప్రతినిధులు తా మందుకు పనికిరా మని చెప్పగూడదు. ప్రభుత్వమువారు ముద్రాయంత్రములను స్వాధీనపరచుకొందురుగాక. వారు మన కలములనుగాని, మన మాటలనుగాని వశపరచుకొనజాలరు. కాని వారు జాతీయాభిప్రాయములను జయప్రదముగా తృణీకరించగలరని మాత్రము నే నెరుగుదును."

తరువాత గాంధీ నవజీవన్ ముద్రాలయ వ్యవస్థాపకునకు ప్రభుత్వమువారిచే ప్రెస్ ఆర్డినెన్సుక్రింద కోరబడిన ధరావతును కట్టవలదని ఆజ్ఞాపించెను. దానితో నవ

జీవన్ పడిపోయినది. ఆ ముద్రాలయమునుండి వచ్చే పత్రిక లాగిపోయినవి. అనేక మంది పత్రికాధిపతులు ప్రభుత్వమువారిచే కోరబడిన ధరావతులను కట్టిరి.

ఈ సమయములో గాంధీ గ్రామములలోని తాటిచెట్లను నరికివేయవలసిన దని కోరెను; ముందుగా తానా విలయోత్సవమును జరిపెను. మే ౮ తేదీని స్త్రీల సమావేశములో మాట్లాడుతూ తక్లీలులేకుండా స్త్రీలు తన సభలకు హాజరుకాకూడదని గాంధీ వారిని మందలించెను. స్త్రీలు తక్లీలపైన సున్నితమైననూలు వడకగలరు. భారత్ రేవులగుండా విదేశవస్త్రములు వస్తూన్నందుకు భారత్ స్త్రీలు ప్రాయశ్చిత్తము చేసుకొనవలసియుండెనని ఆయన అనెను. ఆచోటనే కులపంచాయితీ లేర్పరిచి త్రాగుబోతుతనమును మానుటకు గాంధీ ప్రమాణములను చేయించెను. ప్రభుత్వాధికారులను వెలిపెట్టినందుకు నవసారీప్రజలను ఆయన మందలించెను. కైరాజిల్లా గుజరాతురాష్ట్రమునకు రణరంగ మయ్యెను. గాంధీ నవజీవన్ పత్రికలో ఈ విధముగా వ్రాసెను:

“ప్రజలు శాంతముగానే యుండిరి. కాని వారిలో క్రోధద్వేషములు లేకపోలేదు. అందువల్లనే సంఘబహిష్కారరూపములో హింస ప్రత్యక్షమైనది. వారు చాలా చిన్న విషయములలో ప్రభుత్వోద్యోగులను నిందించి చిక్కులలో పెట్టుదురు. ఈ విధముగా ప్రవర్తించినయెడల వారికి జయము గలుగదు. మమ్లత్‌దార్, ఫోజ్‌దారుల చెడుగులను మనము బహిరంగపరచవచ్చును. మన బహిష్కారములో గౌరవమును, మాధుర్యమునుగూడా యుండవలెను. లేనియెడల ఎప్పుడో ఒకప్పుడు కొట్లాటలు జరుగక తప్పదు. మమ్లత్‌దార్, ఫోజ్‌దార్ మొదలగు ఉద్యోగస్థులు హద్దుమీరి ప్రవర్తింపగలరు. ఫోజ్‌దారు చాలావరకు ఇదివరకే హద్దుమీరినట్లు తెలియుచున్నది. ప్రజలు హద్దుమీరుటలో ఆశ్చర్య మేమి? అదేవిధముగా ఒకడు తిట్టినయెడల రెండవవాడు కొట్టును. దాని కెవరిని నిందింతుము?

“కైరాజిల్లాప్రజ లీహెచ్చరికను గమనించి, బహిష్కారమును మర్యాదలలో ఆచరింపవలెను. గ్రామోద్యోగుల బహిష్కారము వారి ఉద్యోగములకు సంబంధించినంతవరకే యుండవలెనని నేనుదాహరించితిని. వారి ఆజ్ఞలకు విధేయత చూపనక్కరలేదు. వారి ఆహారపదార్థముల సరఫరా ఆపివేయనక్కరలేదు. వారిని ఇండ్లనుండి వెళ్లగొట్ట నక్కరలేదు. మన మీమాత్రము సహనము చూపలేనియెడల బహిష్కారము మానివేయుట మంచిది.”

గాంధీ వైస్రాయికి రెండవ ఉత్తరము వ్రాసెను. తాను దర్శనా, చెరసాద ఉప్పుకొటారులపైకి దాడిపోవ నుద్దేశించితినని ప్రకటించెను. తరువాత గాంధీ అరెస్టు

వచ్చినది. గాంధి ౫వ తేదీని అరెస్టుచేయబడి ఎరవాడజైలుకు తీసుకొనిపోబడేటంత వరకును ఆయన నిర్బంధింపబడినట్లు తెలియలేదు.

సూరత్ జిల్లాలో నున్న దర్శనాలో మొట్టమొదటి ముట్టడి జరిగినది. ప్రజలకు నీరు, గాలి ఏవిధముగా స్వభావములైన హక్కులో అదేవిధముగా ఉప్పుకూడా ప్రజల హక్కు అని వాదింపబడెను. ప్రభుత్వమువారు ప్రజల ప్రయోజనములకు వ్యతిరేకముగా ఉప్పుకొటారులను అరికట్టుటకు వారి కధికారములేదు. ప్రభుత్వమువా రీ కొటారుల నుండి ప్రజలను వెనుకకు మరలింపవలెనన్న యెడల బయోనెట్లు ఉపయోగింపబడవలసి యుండెను. ఈ విధముగా గాంధీ దర్శనాఉప్పుకొటారును ముట్టడివేసి పట్టుకొన నిర్ణయించి వైస్రాయికి క్రింది ఉత్తరమును వ్రాసెను:

"ప్రియమిత్రమా,

"దర్శనకు నా అనుచరవర్గముతో బయలుదేరిపోయి అక్కడ ఉప్పుకొటారు అను దా స్వాధీనము చేసుకొనవలెనని మా ఉద్దేశము. దర్శనకొటారులు వ్యక్తుల ఆస్తియని ప్రచారము చేయబడుతూన్నది. ఇది ఉత్తబూటకము. వైస్రాయిమందిరము ప్రభుత్వమువారి స్వాధీనములో ఏ విధముగా నున్నదో ఆ విధముగానే యీ ఉప్పు కొటారుకూడా ప్రభుత్వాధీనములో నున్నది. అధికారుల ఉత్తరువులను ముందుగా తీసుకొననిదే ఎవరును ఒకచిటికెడు ఉప్పునుకూడా తీసుకొని పోవుటకు వీలులేదు.

"ఈ దండయాత్రను మీరు మూడువిధముల ఆపివేయవచ్చును:

(౧) ఉప్పుపన్నును తొలగించుటమూలమున;

(౨) నన్నును, నా అనుచరులను అరెస్టుచేయుట మూలమున; మే మరెస్టుచేయ బడినయెడల మరికొందరు మాస్థానముల నాక్రమింపగలరని మా విశ్వాసము. వారు రాకున్నయెడల మీ రీ దండయాత్ర నాపివేయగలరు.

(౩) కేవలము గూండాతనమువలన; పోలీసువారిచే తలలు పగులగొట్టబడినవారి స్థానే కొత్తవారు రానియెడల; వచ్చెదరనియే నా విశ్వాసము.

"నేను కొంతసందేహముతోనే ఈ పనికి పూనుకొంటిని. ప్రభుత్వమువారు నాగ రకపద్ధతిప్రకారము శాసననిరోధకులతో వ్యవహరింతురని నే నాశించితిని. శాసన నిరోధకులతో వ్యవహరించేటప్పుడు సాధారణ శాసనపద్ధతులను ప్రభుత్వమువా రవ లంబించియున్నయెడల నేను వారి నేమీ అనవలసిన పని యుండేదికాదు. సుప్రసిద్ధ నాయకులవిషయములో న్యాయశాస్త్ర లాంఛనములు కొన్ని జరిగించబడుతూన్నవి. కాని తక్కినవారు క్రూరముగాను, మోటతనముగాను కొట్టబడుతూండిరి. ఇవి ఎక్క డనో ఒకచోట జరిగియున్న యెడల అంతగా లెక్కపెట్ట నక్కరలేదు. కాని వంగ

బీహారు, ఢిల్లీ, ఉత్కళ, సంయుక్తరాష్ట్రములనుండి, బొంబాయినుండికూడ గుజరాతు రాష్ట్రములలో జరిగిన చర్యలవంటిచర్యలు జరుపబడినట్లు నాకు తెలియవచ్చినది. గుజరాతులో జరిగిన చర్యలనుగూర్చి నాదగ్గిర సంపూర్ణమైన సాక్ష్యమేగలదు. కరాచీ, మద్రాసు, పెషావరులలో జరిగిన కాల్పులు అనవసరముగాను, ఆగ్రహకారణములేకుండాను జరిగించబడినట్లు కనిపిస్తూన్నవి. వాలంటీర్ల దృష్టిలో అమూల్యమై, ప్రభుత్వము వారిదృష్టిలో విలువలేని ఉప్పును వాలంటీర్ల చేతులలోనుండి లాక్కొనుటకు బొమికెలు విరుగగొట్టబడుచున్నవి. గుహ్యాంగములు నలుపబడుచున్నవి. మధురలో ౧౦ ఏండ్ల పిల్లవానిదగ్గరనుండి అసిస్టెంటు మ్యాజిస్ట్రేటు జాతీయపతాకమును బలవంతముగా లాక్కొనినట్లు తెలియవచ్చినది. అలా అన్యాయముగా తీసుకొనబడిన పతాకమును తిరిగీ యిప్పించవలసినదని కోరిన జనసమూహమును పోలీసువారు నిర్దయగా కొట్టిరి. పతాకము తరువాత జనుల కిచ్చివేయబడెను. దానిమూలమున పోలీసువారంతకుముందు తప్పిదము చేసినట్లు స్పష్టమయ్యెను. ఉప్పుసత్యాగ్రహము సందర్భములో వంగరాష్ట్రమందు కొందరుమాత్రమే శిక్షింపబడినట్లును, మరికొందరు దెబ్బలు కొట్టబడినట్లును తెలియవచ్చినది. కాని వాలంటీర్ల చేతులనుండి జెండాలను లాక్కొనే సందర్భములో ఊహింపరాని క్రూరకార్యములు జరుపబడినట్లు వినవచ్చినది. వరిపైర్లు తగుల పెట్టబడినట్లును, ఆహారపదార్థములు బలవంతముగా స్వాధీనపరచుకొనబడినట్లును తెలియవచ్చినది. గుజరాతులో అధికారులకు కూరలు విక్రయించనికారణమున ఒక కూరలదుకాణము ముట్టడింపబడినది. ఈ చర్యలన్నీ ప్రజాసమూహముల కండ్లయెదుట జరిగినవి. కాని వారు కాంగ్రెసు ఆజ్ఞానుసారము ప్రతిక్రియ చేయక లొంగిపోయిరి. సత్యమును మాత్రమే చెప్పెదమని ప్రమాణముచేసినవారు చెప్పేమాటలను నమ్మవలెనని మిమ్ములను నేను కోరుతున్నాను. బార్డోలీసందర్భములో ఇట్టివిషయము లనేకములు జరిగినవి. ఉన్నతోద్యోగు లవి జరుగనేలేదని ప్రకటించిరి. కాని ఆవిషయము లబద్ధములని రుజువైనది. అధికారు లీజరిగిన ఐదువారములలో అబద్ధముల ప్రచురించుట కొంతమాత్రమును జంకుటలేదని చెప్పవలసివచ్చినందుకు నేను విచారపడుతున్నాను. గుజరాతురాష్ట్రములోని కలెక్టరు కచ్చేరీనుండి జారీచేయబడిన కొన్ని నోటీసులను క్రింద ఉదాహరించుచున్నాను:

(౧) 'వయస్సువచ్చిన మనుష్యులు సంవత్సరమున కయిదుపౌనుల ఉప్పును పయోగింతురు. అందువల్ల వారు మూడణాల పన్నును చెల్లింతురు. ప్రభుత్వమువారీ ఉప్పుపైన గలిగిన సర్వాధికారము (Monopoly) ను తొలగించినయెడల వారింకా ఎక్కువపన్నును చెల్లించవలసియుండును. అంతేకాక ప్రభుత్వమువారు విడచుకొన్న ఉప్పుపన్నువలన కలిగేనష్టమును సరిపుచ్చుటకు ప్రజలు మరికొంతపన్నును చెల్లించ

తెలసివచ్చును. సముద్రతీరమునుండి మీరు తెచ్చే ఉప్పు తినతగినదికాదు. అందువలన ప్రభుత్వమువారు దానిని నిర్మూలింపతలచుకొనిరి.'

(౨) 'ప్రభుత్వమువారు వడకునూలుపరిశ్రమను నాశనముచేసినారని గాంధీ అనును. కాని యిది నిజము కాదు. ఈ దేశములో వడుకునూలుపరిశ్రమ లేని గ్రామము లేనేలేదు. పైపెచ్చు వడుకునూలుపరిశ్రమకొరకు పూర్వముకంటె మంచిమార్గములు కనిపెట్టబడినవి. నూలువడికేవారికి తక్కువ ఖరీదుతో యెక్కువ మంచిసామానులు సప్లయిచేయబడినవి. ఈవిధముగా వడుకునూలుపరిశ్రమకు ప్రభుత్వమువారు సహాయము చేయదొడగిరి.'

(౩) 'ప్రభుత్వమువారు చేసిన ప్రతి ఐదురూపాయల ఋణములో నాల్గురూపాయలు ప్రజలక్షేమముకొరకే వ్యయపరుపబడుతూన్నవి.'

"మూడురకముల ప్రకటనపత్రములనుండి యీ మూడువిషయములను సంగ్రహించితిని. ఈ ప్రకటనములోని ప్రతివిషయమును సంపూర్ణముగా అసత్యమని నేను రుజావుచేయగలను. వయస్సువచ్చిన మనిషి ఉపయోగించే ఉప్పుపై ప్రకటనలో సూచింపబడినదానికి మూడు రెట్లుండును. కాబట్టి ప్రతిమనిషీ కనీసము ౯ అణాల ఉప్పుపన్నును చెల్లించవలసియున్నది. ఈ పన్ను వృద్ధులు, మధ్యవయస్కులు, యౌవనులు, స్త్రీలు, పిల్లలు, పశువులు ఈ అందరిమీదా విధింపబడుతూన్నది. ఒకరివయస్సుతోగాని, ఆరోగ్యముతోగాని నిమిత్తములేకుండా విధింపబడుతూన్నది.

"ప్రతిగ్రామములోనూ రాటము పనిచేస్తూన్నదనీ, వడుకునూలుపరిశ్రమ ప్రభుత్వమువారి ప్రోత్సాహము పొందుతూన్నదనీ చెప్పబడేమాటలు కేవలము సత్యదూరములు. ప్రభుత్వమువారు చేసిన ప్రతిఐదురూపాయల ఋణములో నాల్గురూపాయలు ప్రజలశ్రేయస్సుకొరకే వినియోగింపబడుతూన్నవని చెప్పబడిన విషయము సత్యము కాదని అర్థశాస్త్రజ్ఞులు రుజావుచేయగలరు. కాని ఈ అసత్యములు ప్రజలకు క్రొత్త కాదు. ఇవి వారి నిత్యజీవితములో ప్రభుత్వమువారితో గల సంబంధమువలన అనేక పర్యాయములు వారికి వ్యక్తమవుతూనే ఉన్నవి. కొద్దికాలముక్రిందటనే ఒకగుజరాతు కవి ప్రభుత్వాధికారుల దొంగసాక్ష్యముల మూలమున శిక్షింపబడెను. ఆయన చాలా ధైర్యశాలి. ఆయన నేరముచేసెనని చెప్పబడిన సమయములో మరియొకచోట ఆయన గాఢనిద్రలో నుండినట్లు స్పష్టముగా ప్రకటించెను. కాని ఆయనకు శిక్ష తప్పలేదు.

"ఇక అధికారుల ఉదాసీనభావములనుగూర్చి కొన్ని ఉదాహరణముల నిచ్చెదను. సారాయిదుకాణదారులు ప్రశాంతముగా పికెటింగు చేస్తూన్న వాలంటీర్లను కొట్టి

నీమములకు వ్యతిరేకముగా సారాయిని విక్రయించిరి. వాలంటీర్లు ప్రశాంతముగా నున్నట్లధికారులు కూడా అంగీకరించిరి. కాని వాలంటీర్ల పైన దుకాణదార్లు చేసిన దౌర్జన్యమునకుగాని, నీమములకు విరుద్ధముగా జరిగిన సారాయివిక్రయములకుగాని ప్రభుత్వాధికారు లేమీ చర్య తీసుకొనలేదు. సారాయిదుకాణములయొద్ద జరిగిన దౌర్జన్యమును గూర్చి అందరికీ తెలిసియున్నప్పటికీ ఉద్యోగస్థులు మాత్రము తమ కెవ్వరును ఆ విషయమును గూర్చి రిపోర్టు చేయలేదని తప్పుకొందురు.

"ఇప్పుడు మీరు దేశముపైన ఇదివర కెన్నడును కని విని యెరుగని నిరంకుశ ముద్రణాశాసనమును (Press Ordinance) ప్రయోగించిరి. మామూలు న్యాయశాస్త్రముతో సంబంధములేకుండ భగత్సింగు మొదలగువారి విచారణాసందర్భమున మీరు అడ్డ త్రోవ త్రొక్కిరి. ప్రభుత్వాధికారుల ఈచర్యలనుగాని, కొన్ని సందర్భములలో వారి ఉదాసీన భావములనుగాని నేను ప్రచ్ఛన్నవేషములోనున్న సైనికశాసనములని పిలచినచో తప్పులేదని నా అభిప్రాయము. ఇప్పటి కింకా ఉద్యమము ప్రారంభించి ౫ వారములు కాలేదు.

"ఇప్పుడిప్పుడే ప్రారంభమయిన భయంకరపరిపాలనము భారతదేశమును ముంచివేయకమునుపే నే నింతటికంటెను ధైర్యముగల చర్యను తీసుకొన దలచితిని. అందు మూలమున మీ ఆగ్రహము మరింత తీవ్రము కావచ్చును. కాని యింతకంటె భిన్నని దారులను పట్టునని నా ఊహ. నే నిక్కడ వర్ణించిన విషయములు మీకు తెలియకపోవచ్చును. మీరు వాటిని నమ్మనుకూడా నమ్మకపోవచ్చును. కాని వాటి నన్నిటిని మీ దివ్యచిత్తమునకు తీసుకొనివచ్చుటే నా యభిప్రాయము.

"ప్రభుత్వాధికారుల హింసాపద్ధతుల మూలమున ప్రభుత్వస్వరూపము ప్రజలకు సరిగా గోచరించినది. వారు తమ పరిస్థితుల కనుగుణముగా సత్యాగ్రహ కార్యక్రమమును కొనసాగించుటకు శక్తివంచన లేకుండా ప్రయత్నిస్తూ ఉండిరి. ఈ సందర్భములో నేను ప్రభుత్వనిరంకుశాధికారముయొక్క పూర్ణస్వరూపమును ప్రదర్శించుటకు మిమ్ముల నాహ్వానింపనియెడల నా పిరికితనము వ్యక్తమగును.

"సత్యాగ్రహసిద్ధాంతముప్రకారము ప్రభుత్వాధికారుల అరాచకచర్యలును, నిర్బంధవిధానమును ఎక్కువైనకొలదీ సత్యాగ్రహుల బాధాసహిష్ణుతకూడ యెక్కువ కావలసియున్నది. స్వచ్ఛందముగా తీవ్ర నిర్బంధవిధానములకు గురియైననే తప్ప సత్యాగ్రహమునకు విజయము కలుగనేరదు. నే నవలంబించిన యీ పద్ధతులవల్ల కలుగు అపాయము నాకు తెలుసును. కాని యీదేశము నా మాటలను తప్పుగా అర్థము చేసుకొనే స్థితిలో లేదు. నే నుద్దేశించిన విషయమునే పైకి చెప్పుదును. ౧౫ సంవత్సరములనుండి

భారతదేశములోను, ౨౦ సంవత్సరములకు పైనుండి భారతదేశమునకు వెలుపలను అహింసాసిద్ధాంతమునుగూర్చి నేను ప్రబోధించుచుంటిని. దౌర్జన్యమును జయించుట నిష్కళంకమైన అహింసమూలముననే సాధ్యమవునని మరియొకతూరి చెప్పుచున్నాను. దౌర్జన్యక్రియగాని, మాటగాని, భావముగాని అహింసాకార్యక్రమాభివృద్ధికి భంగము కలిగించునని నే ననేకపర్యాయములు చెప్పితిని. ఇన్నిసారులు హెచ్చరింపబడినప్పటికీ కూడ ప్రజలు దౌర్జన్యమునకు దిగేయెడల నేను బాధ్యత వహింపజాలను. కాని ఒక మానవుడు చేసిన కార్యములకు మరియొకమానవు డెంతవరకు బాధ్యతవహింపవలసి యున్నదో ఆబాధ్యతనుమాత్రము నేను వహింపకతప్పదు. జవాబుదారీమాట అట్లుండగా, అహింస అన్యాయములను నిర్మూలించుటకు ప్రబలమైన ఆయుధమని ప్రపంచములోని లోకోత్తరపురుషు లంగీకరించినప్పుడును, నావిశాలానుభవమువలన నే నావిషయమును స్వయముగా తెలుసుకొనినప్పుడును నేను నాకార్యవిధానమును నిల్పివేయ సాహసింపజాలను.

"కాని తరువాతిచర్యను నడపకుండానే తప్పించుకొనవలె నని నాకును కోరిక యున్నది. ఉప్పుపన్ను న్యాయమైనది కాదని సుప్రసిద్ధులగు మీదేశీయు లనేకులు ఖండించియున్న సంగతి మీకు తెలుసును. యావద్భారతదేశమును ఆపన్నును ప్రతిఘటిస్తూన్న సంగతి నేటి శాసనోల్లంఘనోద్యమమువూలకముగా మీకు తెలిసియుండకపోదు. కాబట్టి ఆ పన్నును తీసివేయించవలసినదని నేను మిమ్ములను కోరుతూన్నాను. మీరు శాసనతిరస్కారమునుగూర్చి మీ యిష్టమువచ్చిన భావలో ఖండింపవచ్చును. శాసనోల్లంఘనముకంటె దౌర్జన్యయుత విప్లవమునకు మీ రెక్కువ యిష్టపడుదురా ? శాసనతిరస్కారోద్యమము దౌర్జన్యముతో అంతమొందునని మీ రిదివరకు చెప్పినట్లుగానే ఇప్పుడుకూడా చెప్పవచ్చును. కాని బ్రిటిషుప్రభుత్వమువారు అహింసాసిద్ధాంతమును గురించి వినీ, కనీ యుండక పోవుటచే దాని తత్వమును తెలుసుకొనలేక, మానవస్వభావమును దౌర్జన్యకార్యములకు పురికొల్పిరని చరిత్రకారులు మిమ్ములనుగూర్చి వ్రాయగలరు. కాన మీ రెంత బలవంతపెట్టినప్పటికీ, యెన్ని ఆగ్రహకారణములు కలిగించినప్పటికీ ప్రజలు దౌర్జన్యమునకు దిగకుండుటకు తగిన సద్బుద్ధిని దేవుడు వారికి ప్రసాదింపగలడని నా విశ్వాసము. కాబట్టి ఉప్పుపన్నును మీరు తీసివేయని యెడలను, ప్రజలు సొంతముగా ఉప్పు తయారుచేసుకొనుటకు గల నిషేధమును తొలగించనియెడలను నే నీ ఉత్తరమునందలి మొదటిపేరాలో వ్రాసిన దండయాత్రను నిర్విచారముగా సాగించితీరెదను.

చిత్తగించవలెను, మీ విశ్వాసపాత్రుడగు మిత్రుడు,

యం. కె. గాంధీ."

రాత్రి ౧ గంట ౧౦ నిమిషములకు గాంధీని పోలీసువారు మోటారులారీలో నుంచుకొనిపోయిరి. తరువాత బొంబాయికి దగ్గరగానున్న బొరివిలికి వారు రైలులో ఆయనను తీసుకొనిపోయిరి. అక్కడనుండి ఎరవాడజైలుకు మోటారులో తీసుకొని పోయిరి. ఆవిషయమునుగూర్చి లండను టెలిగ్రాఫు పత్రికకు సంబంధించిన అష్మీడుబార్ట్లెట్టు ఈ విధముగా వ్రాసెను: "మేము రైలుకోసము వేచియుండగానే అక్కడి వాతావరణ మాకస్మికముగా నొక అద్భుతపరిణామమును పొందినది. చరిత్రప్రసిద్ధమైన ఒక మహాపురుషుని నిర్బంధమునకు సంబంధించిన అద్భుతదృశ్యమును మేము కన్నులార గాంచినట్లు భావించితిమి. భారతదేశములోని కోట్లకొలది జనులు గాంధీని ఋషిగా భావింతురు. నిజముగా ఆయన కావచ్చును, కాకపోవచ్చును. నేటినుండి ౧౦౦ సంవత్సరములు గడచినతరువాత 30 కోట్ల భారతీయులు ఆయనను భగవంతుడుగా పూజించే రోజులు రావచ్చును. ఈ అభిప్రాయములు మా మనస్సులనుండి పోవు."

గాంధీ తన అరెస్టుకు పూర్వము దండీనుండి తన అంత్యసందేశమును ప్రకటించెను. అది ఈక్రింద నుదాహరింపబడినది:

"అటువంటి శుభప్రారంభము చివరవరకును కొనసాగింపబడినయెడల సంపూర్ణ స్వరాజ్యము నిశ్చయముగా లభించును. భారతదేశము తన గొప్పదనమున కనుగుణమైన ఉదాహరణమును ప్రపంచకమునకు చూపగలదు. త్యాగములేని స్వరాజ్యము చాలాకాలము నిలువదు. కాబట్టి ప్రజ లంతులేని త్యాగమును చేయవలసియున్నది. నిజమైన త్యాగము ఇతరులను చంపకుండా మనము మరణించుటలోనే కలదు. భారతదేశ మీ ఆదర్శమును జీర్ణముచేసుకొనునుగాక. ప్రస్తుతము భారతదేశము యొక్క ఆత్మగౌరవము, ఒక్క ఆత్మగౌరవమే యననేల, సర్వస్వమును పిడికెడు ఉప్పులో నిమిడియున్నది. మణికట్లు విరుగగొట్టబడుగాక, దానినిమాత్రము మనము తెరువకూడదు.

"నేనరెస్టుచేయబడినతరువాత ప్రజలుగాని, నాసహచరులుగాని భీతిల్లకూడదు. ఈయుద్ధమును నడుపుతూన్నది నేనుకాదు, దేవుడు. ఆయన అందరి హృదయములలో కలడు. మనలో మనకు విశ్వాస మున్నయెడల దేవుడు మనకు మార్గదర్శి కాగలడు. మనత్రోవ నిర్ణీతమైనది. గ్రామస్థు లందరును ఉప్పును తయారుచేయుటకు బయలుదేరి రావలయును. స్త్రీలు సారాయిదుకాణములను, విదేశీవస్త్రముల అంగళ్లను, నల్లమందు కొట్టులను పికెటుచేయవలయును. ప్రతిగృహమునందును తకిలీలపైన పిన్నలు, పెద్దలు నూలు వడకవలయును. ఆవిధముగా ప్రతిరోజు కుప్పలకొలది నూలు తయారుచేయబడవలయును. విదేశవస్త్రముల దహనము జరుగవలయును. హిందువు లెవ్వరివీ అంటరా

వారినిగా పరిగణింపకూడదు. హిందూ, మహమ్మదీయ, క్రైస్తవ, పారశీ తైకమత్యము కలిగియుండవలయును. అల్పసంఖ్యాకులు సంతృప్తిపడినపిమ్మటనే అధికసంఖ్యాకులు సంతృప్తిపడవలయును. విద్యార్థులు ప్రభుత్వపాఠశాలలను విడచివేయవలయును. ప్రభుత్వోద్యోగస్థులు రాజీనామాల నిచ్చి ప్రజాసేవలో నిమగ్నులు కావలయును. గుజరాతులోని పటేల్లును, తలాటీలును అట్లే కావించిరి. అప్పుడు మనకు పూర్ణ స్వరాజ్యము లభింపగలదు."

గాంధీమహాత్ముని అరెస్టునుగురించి సరోజినీదేవి పత్రికలలో ఈ విధముగా ప్రకటించెను:

"ప్రభుత్వమువారి న్యాయశాస్త్ర గ్రంథములనుండి ఒక నిరంకుశచట్టమును పైకి తీసి విచారణ లేకుండ గాంధీని నిర్బంధించిన విధానమునుబట్టియే గాంధీయొక్క శక్తి సామర్థ్యములకు ప్రభుత్వమువారు చూపిన గౌరవభావము బోధపడగలదు. మహాత్ముని దుర్బలశరీరము రాతిగోడలమధ్యను, యినుపకటకటాలవెనుకను నిర్బంధింపబడినంత మాత్రమున మనకు పోయినది లేదు. అది యేమీ ప్రాముఖ్యమైనది కానేకాదు. గాంధీసందేశమునకును, గాంధీమనిషికిని భేదము లేదు. ఆయనసందేశము నేడు భారత జాతిహృదయములో ప్రతిధ్వనించుచున్నది. ప్రపంచకములోని యేనిరంకుశకిరీటాధి పతులును ఆసందేశవ్యాప్తిని నిరోధింపలేరు. దానిని నిగళములతో బంధించజాలరు, అది ప్రపంచకముయొక్క కార్యకలాపములను, ఊహాపరంపరలను దిద్ది తిన్ననిదారికి తీసుకొనిరాగలదు."

గాంధీ నిర్బంధింపబడినవిషయము తెలియవచ్చినంతనే హిమాలయపర్వతము మొదలుకొని కన్యాకుమారి అగ్రమువరకును గల యావద్భారతదేశమునందును విద్యు ద్వేగముతో ప్రదర్శనములు జరుపబడెను. బొంబాయి, కలకత్తాలలోను, తదితర ప్రదేశ ములలోను స్వచ్ఛందముగా సంపూర్ణహరతాళములు జరుపబడెను.

ఒకరోజు గడచిన తరువాత హరతాళము లింకా విస్తారముగా జరుపబడినవి. బొంబాయిలో పెద్ద ఉత్సవములు జరుపబడెను. అక్కడ బ్రహ్మాండమైనసభలో వివిధ వేదికలనుండి అనేకమంది ఉపన్యసించిరి. ౪౦ మొదలు ౬౦ వరకును మిల్లులు మూసి వేయబడెను. ౫౦ వేలమంది కూలీలు ప్రతిఘటనరూపకముగా మిల్లులనుండి వచ్చివేసిరి. రైల్వే పరిశ్రమాలయములలోని కూలీలుకూడ హరతాళములలో పాల్గొనిరి. గాంధీ నిర్బంధమునకు తమ అనంగీకారమును సూచిస్తూ బట్టలవర్తకులు ౬ రోజులు హరతా ళము జరుప నిశ్చయించిరి. గాంధీ నిర్బంధింపబడిన పూనాలో హరతాళము పూర్తిగా కొనసాగెను. అనేకచోట్లనుండి అనేకమంది తమ గౌరవోద్యోగములకును, ప్రభుత్వాధి

కారములకును రాజీనామాల నిచ్చినట్లుగా తెలియవచ్చెను. ఒకటి రెండుచోట్ల కొన్ని చిక్కులు కలిగెను. కాని తక్కిన దేశమంతా మహాత్ముని బోధనల కనుగుణముగా ఆశ్చర్యకరముగా ప్రవర్తించెను. షోలాపూరులో ౬ పోలీసుచౌకీలు తగులబెట్టబడుటచే పోలీసువారు తుపాకులను కాల్చవలసివచ్చెను. అందులో ౨౫ మంది మరణించిరి. ౧౦౦ మందికి గాయములు తగిలెను. కలకత్తాలో హరతాళము నెమ్మదిగానే జరిగెను. కాని హౌరాలోని పోలీసులు గుంపులను చెదరగొట్టుటకు తుపాకులను కాల్చిరి.

గాంధీనిర్బంధమునుగూర్చి ప్రపంచకమంతా సానుభూతిని చూపినది. పెనాంలోని భారతీయవర్తకులు ౨౪ గంటలు హరతాళము జరిపిరి. సుమిత్రాకు తూర్పు సముద్రతీరమందున్న భారతీయులుకూడ హరతాళములు గావించిరి. వారు గాంధీ నిర్బంధమునుగూర్చి విచారపడుచూ వైస్రాయికిని, కాంగ్రెసుకును తంతివార్తలను పంపిరి. ఫ్రెంచిపత్రిక లన్నీ గాంధీపేరుతోను, ఆయనకార్యపరంపరలతోను నిండిపోయెను. విదేశవస్త్రబహిష్కారము జర్మనువర్తకముపైన తీవ్రపరిణామములను కలిగించెను. ఇండియాలోనున్న జర్మనువర్తకప్రతినిధులు జర్మనీనుండి బట్టలను పంపవలదని వారి యజమానులకు వ్రాసిరి. చౌకగా తయారైన ఇంగ్లండుదేశపు బట్టలకెక్కువ నష్టము కలుగుచున్నదని రూటరు వార్తలను ప్రకటించెను. గాంధీ అరెస్టునుగూర్చి నారోబీలోని భారతీయులు హరతాళముల గావించిరి.

ఈలోగా ౧౦౨ మంది అమెరికను క్రైస్తవ మతస్థులు సంతకములు చేసి గాంధీతోను, భారతీయ ప్రజలతోను రాజీచేసుకొనుట మంచిదని కోరుచూ బ్రిటిష్ప్రధానమంత్రి రామ్సే మాక్డోనాల్డుకు తంతివార్త నంపిరి. న్యూయార్కులోనున్న డాక్టరు జాన్ హేన్సు హోమ్సు (Dr. John Haynes Holmes) ఈ మతస్థుల నందరినీ సమావేశపరిచెను. ఇంగ్లాండు భారతదేశముల యొక్కయు, తదితరప్రపంచకముయొక్కయు క్షేమముకొరకు, మానవజాతికి వినాశకరముగా పరిగణింపదగిన విషాదకరసంఘటనమును జరుగకుండ చేయుటకు గాంధీని నిర్బంధించకూడదని వారు ప్రధానమంత్రికి పంపిన సందేశములో ఉదాహరింపబడెను.

ప్రజాప్రభుత్వసిద్ధాంతమునకును, స్వాతంత్ర్యసూత్రమునకును ప్రాతినిధ్యమును వహిస్తున్న మాక్డోనాల్డు గాంధీతోను, గాంధీయొక్క ఆధ్యాత్మిక ఆదర్శములతోను సమన్వయము చేసుకొనగలడని ఆ సంతకములుచేసినవారు విశ్వసించిరి.

భారతప్రభుత్వమువారుకూడ యీసందిగ్ధస్థితిని గమనించక పోలేదు. వైస్రాయి సర్ తేజబహదూరు సప్రూ, సర్ చిమన్‌లాలు సెతలువాడులను పిలిపించి చాలసేపు మాటలాడెను. మితవాదసమ్మేళన కార్యవర్గమువారు బొంబాయిలో సమా

వేశమై రెండు టేబిలుమహాసభయొక్క తేదీని నిర్ణయిస్తూ శీఘ్రముగ వైస్రాయి మరి యొక ప్రకటనము చేయవలెనని అభిప్రాయ మిచ్చిరి. కాని అఖిలపక్షమహాసభాసమా వేశమునకును, మితవాదసమ్మేళనకార్యసంఘసమావేశమునకును ఒకరోజుముందుగా రాజప్రతినిధి మరియొక ముఖ్యప్రకటనమును చేసి తనకును, ప్రధానమంత్రికిని జరిగిన ఉత్తరప్రత్యుత్తరములను ప్రచురించెను. అప్పటి రాజకీయ పరిస్థితులను గూర్చి మిత వాద కార్యసంఘమువారుకూడా ఒకప్రకటనమును గావించిరి. వారు శాసనోల్లంఘన మును తీవ్రముగా నిరసించిరి. అధినివేశ ప్రతిపత్తినిగూర్చి చర్చించుటకు రౌండు టేబిలుమహాసభను వెంటనే జరుపవలె నని వైస్రాయిని తొందరపెట్టిరి.

రౌండుటేబిలుమహాసభవారు నిర్ణయింపవలసిన విషయములనుగూర్చి వెంటనే ప్రభుత్వమువా రొక ప్రకటన చేయవలెనని వారుకోరిరి. అందుమూలమున ఇంతవరకును దూరముగానున్న యితరపక్షములవారు ఇపుడు తమతో చేతులుకలిపి సహాయ పడుదు రని వారి ఆశ.

శాసనోల్లంఘనము విరమింపబడుటయు, రాజకీయకారణములతో నిర్బంధింప బడినవారు విడుదల చేయబడుటయు ఒక్కసారిగా జరుగవలె ననీ, అన్ని రాజకీయ పక్షములవారిని ప్రభుత్వమువారు దగ్గరకు చేరదీసి సమాధానపద్ధతుల నవలంబింపవలెననీ మితవాదకార్యవర్గమువారిచే తీర్మానింపబడెను.

ఉప్పుసత్యాగ్రహనాయకుడుగా మహాత్మజీస్థానము నాక్రమించిన అబ్బాస్ తయాబ్జీ ఏప్రిల్ ౧౨ వ తేదీని అరెస్టుచేయబడెను. అరెస్టులు, లాఠీచార్జీలు, యితర నిర్బంధపద్ధతులు అన్నీ కొనసాగుతూనేయుండెను. వాలంటీర్ల దళములు ఉప్పుకొటా రులను ముట్టడివేయసాగెను. అనేకులకు తీవ్రమైన గాయములుకూడ తగిలెను.

గాంధీ అరెస్టుచేయబడినపిమ్మట కాంగ్రెసుకార్యవర్గమువారు మేనెలలో అలహాబాదులో సమావేశమై శాసనోల్లంఘనమును వైశాల్యము కావించిరి. వారి తీర్మా నము లీక్రింద నుదాహరింపబడినవి:

"(౧) గాంధీమహాత్మునితో కరాది (Karadi) కనుగమించిన సత్యాగ్రహులను ఈకార్యవర్గమువా రభినందిస్తున్నారు; నూతనదళము లీ దండయాత్రలను కొనసాగింప గలవని భావిస్తున్నారు. ఇంతటినుండీ దర్శన భారతదేశపు ఉప్పుదండయాత్రలకు కేంద్రముగా నుండగల దని యీసభవారు నిర్ణయిస్తున్నారు.

"(3) ఈ మహోద్యమమును ప్రారంభించిన గాంధీజీని యీ కార్యసంఘము వారు శ్లాఘిస్తున్నారు. శాసనోల్లంఘనములో యీకమిటీవారు తమ విశ్వాసమును

నెల్లడిస్తున్నారు. మహాత్ముని నిర్బంధకాలములో యీ శాసనతిరస్కారసంగ్రామమును ద్విగుణీకృతోత్సాహముతో కొనసాగించుటకు తీర్మానిస్తున్నారు.

"(౩) భారతదేశముయొక్క ఆదర్శమును పొందుటకు యావద్భారతజాతికిని సంపూర్ణప్రయత్నములు చేయవలసిన తరుణము వచ్చినదని ఈ కమిటీవారి అభిప్రాయము. కాబట్టి విద్యార్థులు, న్యాయవాదులు, తదితర వృత్తులవారు, కూలీలు, రైతులు, వర్తకులు, పారిశ్రామికులు, ప్రభుత్వోద్యోగులు—వీరంతా భారతస్వాతంత్ర్య విజయముకొరకు వారి సర్వస్వమును త్యాగము చేయవలెనని కోరబడుతూన్నారు.

"(౪) భారతదేశమంతటా విదేశవస్త్రబహిష్కారము దేశక్షేమముకొరకు సంపూర్ణముగా జరుపబడుట ముఖ్యమని ఈ కమిటీవారి అభిప్రాయము. అందుకొరకే స్వాధీనమున్న విదేశీవస్త్రములను విక్రయింపకుండా చేయుటకును, ఇదివరకు విదేశములకు పంపబడిన విదేశీబట్టల ఆర్డరులను రద్దుచేయించుటకును, ఇకముందు ఆర్డరులను పంపకుండా నిరోధించుటకును యీకమిటీవారు తగినచర్య తీసుకొన నిశ్చయించుచున్నారు. విదేశీవస్త్రముల అంగళ్లను పికెటు చేయించుటకున్నూ, విదేశీవస్త్రబహిష్కారమునుగూర్చి తీవ్రముగా ప్రచారము చేయించుటకున్నూ అన్ని కాంగ్రెసు సంస్థలను శ్రద్ధతీసుకొనవలె నని యీకాంగ్రెసుకార్యసభవారాజ్ఞాపిస్తూన్నారు.

"(౫) బహిష్కారోద్యమమునకు పండిత మదనమోహనమాలవ్యా చేస్తూన్న ప్రయత్నముల కీసభవారు శ్లాఘిస్తూన్నారు. బట్టలవర్తకులు కాంగ్రెసువారిచే నిర్ణయింపబడిన కాలములో విదేశీబట్టలను తెప్పించకుండుటకు వాగ్దానముచేసి, అందుకు బదులుగా ప్రస్తుతము నిల్వయున్న విదేశీబట్టలను అమ్ముకోనీయవలసినదని కోరిన కోరిక కీకమిటీవా రంగీకరింపజాలనందుకు విచారపడుతున్నారు. అంతేగాక విదేశీబట్టలదిగుమతిదారులతో దేశములోని ఏకాంగ్రెసుసంస్థలును అటువంటిరాజీ చేసుకొనకూడ దని కూడా యీకమిటీ సలహాయిస్తూన్నది.

"(౬) ప్రజల అవసరముల కనుగుణముగా చేతితో వడికి, చేతితో నేసినబట్టలను మరింత యెక్కువగా ఉత్పత్తిచేయించుటకు ఈ కమిటీ నిర్ణయిస్తూన్నది. ఖద్దరుబట్టలను పైకమునకు విక్రయించుటయేగాక వడికిన నూలుకు మారకముగా యిచ్చేపద్ధతి కూడా కల ఒక సంస్థను స్థాపించుట కీకమిటీవారు నిర్ణయిస్తున్నారు. కాంగ్రెసు సంస్థలు వడుకునూలుపరిశ్రమను ప్రోత్సాహపరచవలె నని యీసభవారు కోరుతూన్నారు. ప్రతివ్యక్తి కొంతకాలమును నూలువడుకుటకు వినియోగింపవలె నని ఈ సభవారు కోరుతూన్నారు

"(౭) పన్నులనిరాకరణమును సాగించుటకు తగిన తరుణము వచ్చినదనీ, గుజరాతు, మహారాష్ట్ర, కర్ణాటక, ఆంధ్ర, తమిళనాడు, పాంచాల రాష్ట్రములలో రైతువారీపద్ధతి అమలులో నున్నచోట్ల భూమిశిస్తును నిరాకరించుటతోను, బెంగాలు, బీహారు, ఒరిస్సారాష్ట్రములలో చౌకీదారీపన్ను నిరాకరించుటతోను పన్నుల నిరాకరణోద్యమము ప్రారంభము కావలెననీ ఈ కమిటీవారి అభిప్రాయము. ఈ పైన నుదాహరింపబడిన రాష్ట్రములలో రాష్ట్రీయ కాంగ్రెసు కమిటీలవారు నిర్ణయించిన ప్రదేశములలో మాత్రమే భూమిపన్నుగాని, చౌకీదారుపన్నుగాని నిరాకరింపబడవలెనని ఈ కమిటీవా రాజ్ఞాపిస్తూన్నారు.

"(౮) ఉప్పును తయారుచేయించుట, ఉప్పువిషయములో శాసనమును తృణీకరింపచేయుట ప్రభుత్వమువారు నిర్బంధపద్ధతుల నవలంబించినచోట్ల తీవ్రముగా జరిపించబడవలెను. ఉప్పుచట్టమునకు భారతదేశము ప్రతికూలముగా నున్నదని సూచించే నిమిత్తము ప్రతిఆదివారము ఆ చట్టములను బహిరంగముగా నిరాకరింపచేయుటకు కాంగ్రెసు సంస్థలు ప్రజలను ప్రోత్సాహపరచవలెను.

"(౯) కాంగ్రెసు తాత్కాలికాధ్యక్షుడు మధ్యరాష్ట్రములలో అటవీశాసనములు ధిక్కరింపబడవలె నని యిచ్చిన ఉత్తరువులను ఈ కమిటీవారంగీకరిస్తూన్నారు. ఇతర రాష్ట్రములలోకూడా రాష్ట్రకాంగ్రెసుసంఘములవారి అంగీకారముతో అటువంటి చట్టముల నాయా రాష్ట్రవాసులు నిరాకరింపవలె నని ఈ సంఘమువారు కోరుతూన్నారు.

"(౧౦) స్వదేశీమిల్లుబట్టల ధరలను అన్యాయముగా హెచ్చింపకుండుటకున్నూ, కలితీఖద్దరును తయారుచేయించకుండుటకున్నూ, మొత్తముపైన విదేశీవస్త్రబహిష్కారమునకు తోడ్పడుటకున్నూ యీ కమిటీవారు భారతీయ మిల్లుయజమానులతో రాయబారములు నడపుటకు తాత్కాలికాధ్యక్షున కధికార మిస్తూన్నారు.

"(౧౧) సాధ్యమైనంత త్వరలో బ్రిటిషువస్తువులను పూర్తిగా బహిష్కరించుటకు ప్రయత్నములను చేయవలెనని యీకమిటీవారు ప్రజలను కోరుచున్నారు.

"(౧౨) బ్రిటిష్ బ్యాంకింగుసంస్థలను, భీమాసంస్థలను, నౌకాకంపెనీలను, తదితర బ్రిటిష్‌సంస్థలను ప్రజలు బహిష్కరింపవలె నని కార్యసంఘమువారు ప్రజలను దృఢముగా కోరుతూన్నారు.

"(౧౩) సంపూర్ణ మద్యనిషేధప్రచారము తీవ్రముగా జరుపబడవలె నని ఈ కమిటీవారు మరియొకసారి కోరుతూన్నారు. రాష్ట్రీయ కాంగ్రెసుసంఘములు కల్లు, సారాయిదుకాణములను పికెటు చేయించవలె నని ఈ కమిటీవా రాజ్ఞాపిస్తూన్నారు.

"(౧౪) కొన్ని స్థలములలో ప్రజలు దౌర్జన్యము చేసినందు కీకమిటీవారు విచారపడుతున్నారు. అట్టి దౌర్జన్యమును పూర్తిగా ఖండిస్తున్నారు. అహింసను పూర్తిగా అవలంబింపవలె నని ఈ కమిటీవారు ప్రజలను కోరుతూన్నారు.

"(౧౫) ముద్రణానిరంకుశాధికారమును (Press Ordinance) ఈ సభవారు తీవ్రముగా నిరసిస్తూన్నారు. కొన్నిపత్రికలు దానికి విధేయత చూపక నిరాకరించినందు కీసభవారు శ్లాఘిస్తూన్నారు. ఇంకను ప్రకటింపబడుతూన్న పత్రికలు వెంటనే ఆపివేయబడ వలెనని ఈ సభవారు తీర్మానిస్తూన్నారు. ఇంకా ప్రచురింపబడుతూన్న ఆంగ్లో ఇండియను పత్రికలుగాని, భారతీయపత్రికలుగాని వెంటనే బహిష్కరింపబడవలె నని యీసభవారు తీర్మానిస్తూన్నారు."

సరోజినీదేవి కాంగ్రెసుకార్యనిర్వాహకసభకు హాజరయ్యెను. తయ్యాబ్జీ నిర్బంధింపబడినవెంటనే ఆమె గాంధీకి లోగడచేసిన వాగ్దానము ననుసరించి దర్శనకు పరుగెత్తెను. ౧౬ వ తేదీ ఉదయమున ఆమెయు, ఆమెస్వచ్ఛందసైనికులును పోలీసుబందోబస్తులో నుంచబడి, కొంతసేపటికి వదలివేయబడిరి. వాలంటీరుదళము లా ఉప్పుకొటారు కొకటివెంట నొకటి ఉరికెను. వారిని పోలీసువారు కొట్టి తోలిరి. ఆ సాయంకాలమే ౨౨౦ మంది వాలంటీరు లరెస్టుచేయబడిరి. అక్రమసంఘనేరముక్రింద వారందరును దర్శనయందలి ప్రత్యేకశిబిరమునం దుంచబడిరి.

౧౯ ఉదయము వాడాలా ఉప్పుకొటారులపైన వాలంటీరులు దండెత్తిరి. కాని పోలీసువారు రివాల్వరులతో వచ్చి వెంటనే చర్య తీసుకొని ౪౦౦ మంది సత్యాగ్రహుల నరెస్టుచేసిరి.

బహిష్కారోద్యమఫలితమునుగూర్చి ఫ్రీప్రెస్సుపత్రికాప్రతినిధి ఈ క్రిందివిధముగా వ్రాసెను. "వస్త్రములపైన నీయుద్యమము కేంద్రీకరింపబడుటచేత దాని ఫలితము తీవ్రముగా దృశ్యమవుతూన్నది. కాని ముఖ్యముగా మిల్లుయజమానులు ప్రస్తుతమున్న ఆర్డరులు రద్దుచేయబడునని భయపడుతున్నారేగాని, వారు పూర్తిగా భారతదేశములో తమ బట్టలు విక్రయింపబడవని భయపడుటలేదు. ప్రస్తుతపు ఆర్డరులను రద్దుచేయించుకొనేపద్ధతి నానాటికి పెరిగిపోతూన్నది.

"దీనినిగూర్చియే మాంచెస్టరులోని డెయిలీమెయిలు పత్రికాప్రతినిధి ఈ విధముగా వ్రాసెను.

'నేటివార్తలనుబట్టి చూచినయెడల ఇండియాలో లాంకషైరువర్తకము సాగేటట్లు కనుపించలేదు. ఇప్పటికే వడుకుయంత్రములును, నేతయంత్రములును కూడ

కాలపరిమితి లేకుండా మూసివేయబడినవి. వేలకొలది కూలీలకు పని లేక అల్లాడు తూన్నారు.""

తరువాత మరికొన్ని ఉప్పుదాడులు జరిగినవి. ఆదండయాత్రలను గూర్చిన విషయము నీక్రింద నుదాహరించుచుంటిమి:*

"ఈలోగా కాంగ్రెసుకార్యనిర్వాహకవర్గమువారు సమావేశమై ఉప్పుదండు యాత్రలను, తదితర కాంగ్రెసుకార్యక్రమమును కొనసాగింప నిర్ణయించిరి. మే ౨౧ తేదీని దర్శనా ఉప్పుకొటారులపైన ప్రజాసమూహములు దండెత్తెను. అందులో గుజరాతురాష్ట్రములోని వివిధభాగములనుండి బయలుదేరిన ౨౫౦౦ మంది స్వచ్ఛంద సైనికులు పాల్గొనిరి. దక్షిణ ఆఫ్రికాలో గాంధీకి సహచరుడుగా నున్న ౭౨ ఏండ్ల వయోవృద్ధుడు ఇమాంసాహెబు ఆ దండయాత్రకు నాయకత్వమును వహించెను. అక్కడి ఉప్పుకుప్పలపైన వివిధప్రదేశములలో వాలంటీరులు ఉదయముననే తమ దండయాత్రను ప్రారంభించిరి. పోలీసువారు వారిని లాఠీలతోను, వెదురుకర్రల తోను మోది వెనుకకు తరిమిరి.

"ఈదృశ్యములను వేలకొలది ప్రజలు వీక్షించిరి. ఈ విధముగా రెండు గంటలు జరిగెను. ఇమాంసాహెబు, ప్యారేలాలు, మణిలాలుగాంధీ, సరోజినీనాయుడు లరెస్టు చేయబడిరి. ఆరోజున ౨౯౦ మంది వాలంటీరులకు గాయములు తగిలెను. ఆదెబ్బలకు భాయీలాలుభాయి దాజాభాయి అనే వాలంటీరున్ను, మహారాష్ట్రదేశమునుండి వచ్చిన బాబూ హులీ (Babu Hule) అనే వాలంటీరున్ను మరణించిరి. పోలీసువారు సైనికుల సహాయముతో దర్శన, ఉంటాడీలకు పోయే రోడ్డును మూసివేసిరి. ఆరోడ్డునుండి మోటారుకారులను గాని, మరియేయితర యానములనుగాని పోనీయక నిల్పివేసిరి. ఉంటాడీలో మకాముచేసిన వాలంటీరు లందరును ఎక్కడకో తీసుకొని పోబడి, తరువాత వదలివేయబడిరి.

"జూన్ 3 వ తేదీని సుమారు ౨౦౦ మంది వాలంటీరులు గల రెండుదళములు ఉంటాడీశిబిరమునుండి దర్శన ఉప్పుకొటారులకు దాడివెడలినవి. వా రందరును పోలీసువారిచే ఆపివేయబడిరి. జనులగుంపులు నిషిద్ధప్రదేశమును దాటినందుకు వారు లాఠీచార్జి చేయబడిరి. గాయములు తగిలిన మనుష్యులు శిబిరపు ఆసుపత్రికి కొనిపోబడిరి.

---

* ఈ విషయము మద్రాసులోని నటేశన్‌కంపెనీ వారిచే ప్రకటింపబడిన "Gandhi The Man and his Mission" అనే గ్రంథమునుండి గ్రహింపబడినది.

"వాడాలాదండయాత్రలు:—వాడాలా ఉప్పుకొటారులపైన అనేక దండయాత్రలు జరిగెను. ౨౨ వ తేదీ ౧౮౮ వాలంటీరు లరెస్టు చేయబడి వార్లకు తీసుకొనిపోబడిరి. ౨౫ వ తేదీని ౧౨౦ మంది వాలంటీరులు దాడివెడలిరి. ౨౦౦౦ ల మంది ప్రేక్షకులు వారివెంట నుండిరి. పోలీసువారు వారి నందరిని లాతీలతో బాదిరి. ౧౬ మందికి గాయములు తగిలెను. ౧౧౫ మంది అరెస్టుచేయబడిరి. ఆ దండయాత్ర రెండు గంటలు జరిగెను. సాయంకాలము తిరిగీ దండయాత్ర ప్రారంభింపబడెను. ౧౮ మంది గాయపడిరి. ౨౫, ౨౬ తేదీలలో ౬౫ మంది వాలంటీరులు వెళ్లిరి. ౮౩ మంది అరెస్టు చేయబడిరి. తక్కినవారు ఉప్పు తీసుకొని గుంపుతో వెళ్లిపోయిరి. వాలంటీరులవలె క్రమశిక్షణములేక చూడవచ్చిన గుంపుల మూలమున కొన్ని గంద్రగోళములు జరిగిన వని ప్రభుత్వమువారు ప్రకటించిరి. దండయాత్రలు కొనసాగుతూ ఉన్నప్పుడు ప్రజలు వాడాలాకు దూరముగా నుండవలె నని కూడ వారు మందలించిరి.

"కాంగ్రెసు యుద్ధమంత్రులు (War Council) జూను ౧ వ తేదీని గొప్ప దండయాత్రను సాగించుటకు నిర్ణయించిరి. ఆ ౧ వ తేదీ ఉదయమున వాలంటీరులయినవారును, కానివారును కూడా ౧౫౦౦౦ మంది వాడాలా దండయాత్రయందు పాల్గొనిరి.

"పోర్టుట్రస్టు లెవెల్ క్రాసింగువరకును అనేకదళములు ఒకటివెంట నొకటి వెళ్లినవి. నేల ఈనినట్లు పొంగిపోయిన ఆజనసమూహము పోలీసువారిచే ఆలెవెల్ క్రాసింగు దగ్గర ఆపివేయబడుచుండెను. ఆ యాత్రికులలో స్త్రీలును, పురుషులును కూడ కలరు. వారందరిని పోలీసువారు చుట్టూ ముట్టడించిరి. కొందరు స్త్రీలును, పురుషులును ఆపోలీసుకడియము (Police Cordon)లో నుండి బయటకు తోసుకొనివచ్చిఆబురదలోనూ, నీటిలోనూ ఉప్పుపెనములకడకు పరుగెత్తిరి. కాంగ్రెసుసైనికులలో ౧౫౦ మందికి గాయములు తగిలెను. హోముమెంబరుయొక్క ప్రత్యక్షాధికారముక్రింద పనిచేస్తూన్న పోలీసువారిచే వాలంటీరులు వెనుకకు తోలబడిరి.

"జూను ౩వ తేదీని వాడాలానిర్బంధశిబిరమందు విచారణలోనున్న ౮౦౦౦ మంది వాడాలా "దండయాత్రికులకు" (Raiders) పోలీసువారితో కలహమువచ్చినది. ప్రభుత్వమువారు సైనికులను రప్పించిరి. పోలీసువారు రెండుసారులు లాతీఛార్జి చేసిరి. ౯౦ మందికి గాయములు తగిలెను. అందులో ౨౫ మందికి ప్రమాదకరములగు గాయములు తగిలెను."

పోలీసువారి ఈచర్యకు ప్రజలు ప్రతిఘటించిరి. ఈభయంకరదృశ్యమును చూచి ప్రేక్షకులు నివ్వెరపోయిరి. బొంబాయి స్మాలుకాజుకోర్టు పూర్వపుజడ్జి హుస్సేను,

భారతసేవాసంఘాధ్యక్షుడు (President, Servants of India Society) జి. కే. దేవధారు, నటరాజన్‌గార్లు దర్శనదాడిని స్వయముగా చూచి పత్రికలో నీక్రిందివిధముగా ప్రకటించిరి: "సత్యాగ్రహులు ఉప్పుసరిహద్దులనుండి వెడలగొట్టబడినపిమ్మట యూరోపియనుఆఫీసరులు చేతులలో లాఠీలను పుచ్చుకొని వేగముగా స్వారిచేస్తూ, సత్యాగ్రహులు దాడివచ్చినచోటుకును గ్రామమునకును మధ్యనున్న ప్రదేశములోని ప్రజలను కొట్టుట మేము ప్రత్యక్షముగా చూచితిమి. గ్రామవీథులలోని పురుషులను, స్త్రీలను, పిల్లలను చెదరగొడుతూ వా రతివేగముగా స్వారిచేసిరి. గ్రామస్థులు పక్కసందులలోకి పారిపోయి, యిండ్లలో దూరి తలుపులు వేసుకొనిరి. కాని వారు తప్పించుకొనుటకు వీలు లేక చిక్కుపడినయెడల లాఠీలతో కొట్టబడిరి."

దర్శనా భయంకరదృశ్యములనుగూర్చి వెబ్‌మిల్లరుగారు "న్యూ ఫ్రీమన్" పత్రిక కీ క్రిందివిధముగా వ్రాసెను:

"౧౮ సంవత్సరములనుండి పత్రికావిలేఖకుడుగా నేను ౨౨ దేశములను చూచినాను. లెక్కలేని అంతరంగికకల్లోలములను, దొమ్మీలను వీథిపోరాటములను, తిరుగుబాటులను నేను కండ్లార చూచితిని. కాని దర్శనలో చూచిన భయంకరదృశ్యములను నే నెక్కడనూ చూడలేదు. కొన్నిసమయములలో నేను ఆఘోరములను చూడలేక తాత్కాలికముగా తిరిగి వెళ్లిపోయిన సందర్భములుకూడా కలవు. ఆ వాలంటీరుల క్రమశిక్షణ మొక్కటియే నా కాశ్చర్యమును కలిగించెను. గాంధీఅహింసాసిద్ధాంతము వారి రక్తములో జీర్ణించినట్లు నాకు తోచెను."

౧౯౩౦-౩౨ సంవత్సరములలో కర్ణాటకరాష్ట్రములోని సానికట్ట(Sanikatta) ఉప్పుకొటారులు ప్రభుత్వసంరక్షణక్రింద నుండగానే ౧౦,౦౦౦ మొదలు ౧౫,౦౦౦ల వరకును గల ప్రజలు వాటిపై దాడివెడలిరి. ఒక్కొక్కపర్యాయము వేలకొలది మణుగుల ఉప్పు సంగ్రహింపబడెను.

లండనులోని డెయిలీహెరాల్డుపత్రికాప్రతినిధి జార్జి స్లోకోంబు కొన్నిఉప్పుదండయాత్రలను స్వయముగా దర్శించెను. ఆయన "నేను వాడాలాలోని గుట్టలపైన యెక్కి అక్కడి దృశ్యములను చూచితిని. మిత్రులవలె మెలగు పట్టుదలగల దేశభక్తులైన ఆ వాలంటీరులమధ్యను, వారియందు సానుభూతిగల ప్రజలమధ్యను నిలబడి ప్రభుత్వప్రతినిధులు కావించుచున్న అసహ్యాకరమైన ఆ దురదృష్టకార్యమును చూచుట ఆంగ్లేయుని కవమానకరముగా తోచెను" అని వ్రాసెను.

ఆదృశ్యము లాయనహృదయమును దహించివేసినవి. ఆయన ఈ ఘోరకృత్యమును జరుగకుండచేయ ప్రయత్నించెను. మే ౨౬ తారీఖున స్లోకోంబు ఎరవాడ

జైలులో గాంధీని దర్శించెను. తరువాత ఆయన పార్లమెంటులో ఉత్తర ప్రత్యుత్తరములను జరిపెను. ఆయన ఉత్తర ప్రత్యుత్తరములు కామన్సుసభ్యులను నిద్రమేల్కొలిపెను. టోరీపత్రికలు నిప్పులు గ్రక్కినవి. అప్పుడు జరిపిన ఉత్తర ప్రత్యుత్తరములలోనే స్లోకోంబు "యీ సందిగ్ధతరుణములోకూడ రాజీకుదురుట కవకాశముకలదు. ఈక్రింది షరతులు ప్రభుత్వమువారిచే నిర్వర్తింపబడినయెడల గాంధీ శాసనోల్లంఘనము నాపివేసి రౌండుటేబిలు మహాసభలో పాల్గొన సంసిద్ధముగా నున్నాడు.

(౧) స్వాతంత్ర్య సారముగల రాజ్యాంగప్రణాళికను తయారుచేయు హక్కు రౌండుటేబిలుమహాసభ కుండవలెను.

(౨) ఉప్పుపన్ను రద్దుచేయబడుట, మద్యము నిషేధింపబడుట, విదేశవస్త్రములపైన నిషేధపుటుత్తరువులను జారీచేయించుట—యివి జరిపి ప్రభుత్వమువారు గాంధీకి సంతృప్తి కలిగించవలెను.

(3) రాజకీయఖైదీల విడుదల శాసనతిరస్కార విరామముతోపాటు జరుగవలెను.

(౪) వైస్రాయికి గాంధీవ్రాసిన ఉత్తరములోని తక్కిన ౭ విషయములును తరువాత చర్చింపబడవలెను." అని వ్రాసెను.

ప్రభుత్వమువారు గాంధీతో గౌరవప్రదమైన సంధిచేసుకొనుటకు సంసిద్ధముగా నున్నారా అని స్లోకోంబు ప్రశ్నించెను. "ఇప్పటికిని గాంధీతో సంధిచేసుకొనుటకు వీలు కలదు. నే నాయనను రెండుపర్యాయములు జైలులో చూచితిని. ఉభయులును సమాధానపడదలచుకొన్నయెడల రాజీ కవకాశము గల దని నా అభిప్రాయము. ఎవరి పక్షమున దౌర్జన్యమున్నను రెండవపక్షమువారు లొంగరు. కారాగారములో కృశించి పోతూన్న మహాత్ముడు భారతదేశముయొక్క ఆత్మ అనే సంగతిని ప్రభుత్వమువారు తెలుసుకొన్నయెడల అపాయకరమైన గొప్పప్రమాదము తప్పిపోగలదు."

దౌర్జన్యరాహిత్య యుద్ధమునకు ప్రత్యేకశాస్త్ర మున్నది. దానిని బట్టియే అది జరుగవలసిన పరిస్థితులు, చోటు, కాలము, నిబంధనలు, నియమావళి-అన్నీ నిర్ణయింపబడును. ఇవి ఆయుద్ధములో పనిచేసే ప్రతిసైనికుడును తెలుసుకొనవలెను. దౌర్జన్యము వలనను, మోసమువల్లను సంస్థాపింపబడిన ప్రభుత్వముకంటె సత్యాహింసలమూలమున నిర్మింపబడిన ప్రజాప్రభుత్వమే తన ఆదర్శమని గాంధీ అనేకసారులు చెప్పెను. దౌర్జన్యము మోసముతో కూడుకొని యుండుననీ, అహింస దానికి వెలిగానుండుననీ కూడ ఆయన చెప్పెను. అహింస కేవలము క్రియలోనేగాక మనస్సులోకూడ నుండవలెను. హృదయములో దుష్టత్వమును మరుగుపరుచుకొన్న యెడల అది దౌర్జన్యమే యగును.

అందువల్లనే పైకి శాంతమూర్తులుగా కనపడేవా రనేకమంది మోసగాండ్రుగా నుందురు. అహింసాద్వేషములు పరస్పరవిరుద్ధములు. కొంతమంది శాసనోల్లంఘనము కంటె విదేశవస్త్ర బహిష్కారమును తీవ్రముగా సాగించినయెడల స్వరాజ్యోద్యమ మెక్కువ బలవత్తరముగానుండునని చెప్పుదురు. కాని విదేశవస్త్ర బహిష్కారమునకు ౩౦ కోట్లమంది జనుల సహాయ ముండవలయును. శాసనోల్లంఘనమునకు ౧౦౦,౦౦ మంది త్యాగమూర్తులున్న చాలును. ప్రభుత్వమువా రీశాసననిరోధకులను మరణిపోవలెనని నచో ఈ ౧౦,౦౦౦ మందిని వారురిదీయవలెను. ఈ మనుష్యులు సత్యసంధులుగను, విశ్వాసపాత్రులుగను ఉన్నయెడల ప్రభుత్వమువా రా ఆందోళనముతో మరణింతురు. కొంతమంది శాసనోల్లంఘనోద్యమమువలన దౌర్జన్యము రావచ్చు నందురు. నిజముగా ఈ ఉద్యమము దౌర్జన్యము నణగద్రొక్కుటకే ప్రారంభింపబడెను. ఆరోజులలో దేశ ములో దౌర్జన్యము వ్యాపించుట కెక్కువ అవకాశము లుండెను. ఆ దౌర్జన్యమును నిరోధించుటకే అహింసాపూర్వకమైన సత్యాగ్రహోద్యమరూపములో అవధి కల్పింప బడెను. నిజమునకు దౌర్జన్యరహితపక్షమువారు గాంధీ తన ఉద్యమమును సాగించే యెడల తాము సంపూర్ణ సహాయము చేసెదమని వాగ్దానముచేసిరి. ౧౯౩౧ మధ్యకాలము వరకును వారు గాంధీకి వాయిదా నిచ్చిరి. అప్పటి కింకా కొందరు గాంధీ తన ఉద్య మమును సాగించుట కది సమయము కాదనిరి. వా రనేక అభ్యంతరములను, చిక్కులను గలవని సూచించిరి. బయటికి కనిపించే చిక్కులన్నీ అహింసాతత్వము సరిగా ప్రయో గింపబడుటమూలమున భగ్నము కాగలవు. కాని మోసము, ద్వేషము, దుర్బుద్ధి మొదలగు అంతరంగిక శత్రువుల మూలమున ఉద్యమమే నిర్మూలముకాగలదు. "దౌర్జన్యశక్తులను నన్ను స్వాధీనము చేసుకొననిండు." అని గాంధీ అనేకసారు లనెను. నానాటికి విజృం భిస్తూన్న దౌర్జన్యశక్తులను నిరోధించుటకు గాంధీ విశ్వప్రయత్నములు చేయదొడగెను. గాంధీ అరెస్టుచేయబడినవెంటనే ఉద్యమము దౌర్జన్యమార్గముల పట్టునని కొందరు భయమును వెల్లడించిరి. కాని దాని కాధారములేదు. దక్షిణాఫ్రికాలో ఆయన అరెస్టు చేయబడినప్పుడు ఆయన లేకుండనే ఉద్యమము నడచినది. ఆయన జెయిలులో నుండెను. అదియే చాలును ఉద్యమ వ్యాపకమునకు.

స్వేచ్ఛగానున్న మనిషికంటె కటకటాలలోనున్న మనిషి యెక్కువశక్తి గలిగి యుండును. దక్షిణాఫ్రికా ఉద్యమములో వేలకొలదిజనులు పాల్గొనిరి. ఆ ఉద్యమము తమ స్వాతంత్ర్యముకొరకని వారికి రెప్పపాటులో తెలిసెను. వారిపైన వేయబడిన ౩ పౌనులపన్నును తీసివేయించుటకు పోరాడసిద్ధముగా నున్న మనిషిని వా రెరుగుదురు. వారందరు ఆ అఖాతములో ఎరిగియే ఉరికిరి. కనుకనే వారు చలించలేదు. అప్పు డది చాలా అద్భుతవిషయముగానుండెను. అసహాయోద్యమసందర్భములో కూడా అది

# 2. చివరిపోరాటము

తగినసమయము కాదని కొంతమందికి సందేహముతోచెను. దానికి గాంధీయిచ్చిన జవాబిది: "కలకత్తాకాంగ్రెసు జరిగినతరువాత బయటేమీ జరుగలేదు. కాని నామనస్సులో నున్న ఆటంకములు తీరిపోయినవి. ఈ ఉద్యమ మింతకుపూర్వమే ప్రారంభించి యుండవలసినదని నా అభిప్రాయము." గాంధీ యెన్నడును ఉప్పుదండయాత్రమూలమున తాను జైలుకు పంపబడుదు నని తలంచలేదు. "నేను వెంటనే ఒకమహాసభ జరుపబడు నని ఊహించితిని. అది రౌండుటేబిలుసభకాదు. ఆసభకు వెళ్లేవారందరికినీ వారి ధర్మములనుగూర్చి బాగుగా తెలిసియుండును. ఆసభనుగూర్చిన వివరములను నేనిపుడు చెప్పలేకపోయినప్పటికినీ అదిమాత్రము సమానప్రతిపత్తిగల జనులమధ్య జరుగగలదు. వారుభయులును గలసి భారతస్వాతంత్ర్యరాజ్యాంగ నిర్మాణమునుగూర్చి ఆలోచించగలరు."అని ఆయన చెప్పెను.

ఇక ఉద్యమాభివృద్ధినిగూర్చి వివరముగా చెప్పుటకు తరుణము మించినది. ఉద్యమ మతితీవ్రరూపమును పొందెను. ఇర్విన్‌ప్రభు వంతకంతకు సీలబిగింప ప్రారంభించెను. మొట్టమొదట ఆయన గాంధీని అరెస్టుచేయనీయలేదు. గాంధీదండయాత్ర మూలమున ఆయనఉద్యమము భారతదేశమంతటా అంటుకొనెను. ఎక్కడచూచినా దండయాత్రలు సాగెను. ఆయన పిలచినంతమాత్రమున వేలకొలది స్త్రీలు సంగ్రామరంగమున దుమికిరి. ప్రభుత్వమువారికి గొప్ప కంగారు పుట్టెను. సారాయిదుకాణములను, విదేశీబట్టల అంగళ్లను స్త్రీలు పికెటింగుచేయ ప్రారంభించిరి. పోలీసువారు నిస్సహాయు లయిరి. స్త్రీలయెడ వా రిదివరకు చూపిన ఔదార్యము నిరంకుశత్వము క్రిందకు దిగెను. గాంధీని అరెస్టుచేయకుండుటవలన నూతనమార్గము లన్వేషింపబడునని ప్రభుత్వమువా రూహించిరి. ఆయనదగ్గర మోహనయంత్ర ముండెను. అందువలన ఆయన కోరినవెంటనే ధనమును, మనుష్యులును కొదువలేకుండ వచ్చిరి. ఆయన అరెస్టుచేయబడవలసియుండెను. కాని కాల మింకను పరిపక్వముకాలేదు. గాంధీ నిర్బంధింపబడినయెడల భారతజాతి నిర్బంధింపబడినట్లే. ఏప్రిల్ ౧౪ వ తేదీని జవహారలాలు* అరెస్టుచేయబడి నిర్బంధింపబడెను. అనగా కాంగ్రెసు అరెస్టుచేయ

---

* ౧౯౩౦ అక్టోబరు ౧౧ వ తేదీని ఆయన విడుదలచేయబడి అక్టోబరు ౧౯ వ తేదీని తిరిగి అరెస్టుచేయబడెను. ౨౦ వ తేదీని ఆయనకు ౨౩ మాసములశిక్ష విధింపబడెను. ఆయనభార్య కమలానెహ్రూ ౧౯౩౧ వ జనవరి ౧ తేదీన అరెస్టుచేయబడెను. జవహారలాలు నిర్బంధింపబడిన కొద్దిదినములకే నవంబరు ౧౪ న ఆయన ౪౧ వ జన్మదినోత్సవము దేశమంతటా జరుపబడెను. ముఖ్యముగా సంయుక్తరాష్ట్రములలో జరుపబడెను.

బడినట్లే. జవహరలాలు పెద్దజైలులోనుండి చిన్నజైలులోకి పంపబడెనని దీని అర్థము. పికెటింగు చేయకూడదనీ, పన్నులనిరాకరణప్రచారము చేయకూడదనీ, సాంఘికబహిష్కరణ మాచరణలోనికి తేకూడదనీ ఆర్డినెన్సులు జారీచేయబడెను. జాతీయపతాక ప్రతిష్ఠాపనమునుగూర్చి అనేక చిన్నచిన్న పోరాటములు జరిగెను. శిక్షలు తీవ్రరూపము దాల్చెను. ఖైదులకు తోడు జరిమానాలు విధింపబడెను. తరువాత లాఠీఛార్జీలు తీవ్రముగా జరిగెను. పోలీసువారు లాఠీలతో డ్రిల్లుచేయుచుండుట సత్యాగ్రహుల పైన లాఠీప్రయోగము చేయుటకేయని ప్రజలు మొట్టమొదట నమ్మలేకపోయిరి. కాని తరువాత అది బెదరింపు కాదని తెలిసెను. అది పోలీసులకు దినచర్య అయిపోయెను. సమావేశములు లాఠీదెబ్బలతోనే చెదరగొట్టబడెను. ఉప్పుసెక్షనులు పేనలుకోడుసెక్షనులతో జోడింపబడి శిక్షలు . సాధ్యమైనంత పాశిగింపబడెను. ౧౯౩౦ ఫిబ్రవరి మధ్యలో "రాజకీయ" ఖైదీల విభజనమునుగూర్చి ప్రభుత్వమువా రొక ఉత్తరువును ప్రకటించిరి. అయితే అందులో "రాజకీయ" అనేమాటను ప్రభుత్వమువారు జాగ్రత్తగా మినహాయించిరి. ౧౦ సంవత్సరములక్రిందట రాజకీయఖైదీ లనేమాటను ప్రభుత్వమువారు స్వేచ్ఛగానే ఉపయోగించియుండిరి కాని ఇప్పుడుమాత్ర మావిధముగా నుపయోగించుట మానివేసిరి. ఖైదీలనుగూర్చిన ప్రభుత్వమువారి ఉత్తరు వనుబంధము ౪ లో ప్రకటింపబడెను.

ఖైదీలకు 'ఏ' తరగతి నామమాత్రముగామాత్ర మీయబడెను. 'బి' తరగతిని యిచ్చుటలో ప్రభుత్వమువా రెంతో లుబ్ధత్వమును ప్రకటించిరి. మంచి ఆస్తులు గలిగి నాగరికజీవితపద్ధతులలో పెరిగి ప్రభుత్వమువారి మరతులప్రకారమే 'ఏ' 'బి' తరగతులలో నుండతగినవా రనేకమంది 'సి' తరగతిలో వేయబడిరి. వారికి రాళ్లు కొట్టుట, నూనెగానుగలను లాగుట, పంపులలోనుండి నీళ్లను తోడుట మొదలగుపనులు ఒప్పగింపబడెను. సత్యాగ్రహులను జైలుఅధికారులు చూచిన విధానమునుబట్టి ౧౯౩౦ ఫిబ్రవరిలో పంపబడిన జి. ఒ. కేవలము నిరుపయోగమని తేలెను. కాని వాలంటీరులు ప్రభుత్వమువారి చర్య కెప్పుడును చింతపడలేదు. వా రుద్యమములోనికి అసంఖ్యాకులుగా దుమికిరి. అనేకమంది వాలంటీరు లరెస్టుచేయబడనేలేదు. వా రెట్లో జైళ్లలోనికి పోయినయెడల మరియొక లాఠీప్రయోగము వారికొరకు వేచియుండెను. ఉద్యమప్రారంభదశలో కలకత్తాపార్కులో సమావేశమయిన జనులు క్రూరముగా కొట్టబడిరి. వారు బయటికి పోవుటకు వీలులేకుండ గేట్లు మూయబడెను. పోలీసువారా గేట్లను కాపలాకాచిరి. మొట్టమొదట వంగ, సంయుక్తరాష్ట్రములలో క్రూరకర్మములు చేయబడెను. తరువాత ఆరంగము దక్షిణఇండియాకు మార్పుచేయబడెను.

౧౯౩౦ రెండవభాగములో దక్షిణ భారతదేశమందు నిర్బంధవిధాన మత్యంత క్రూర రూపమును దాల్చెను.

మొట్టమొదట తీవ్రమైన ఖైదుశిక్షలును, పెద్దపెద్ద జరిమానాలును విధింపబడినవి. కాని తరువాత వెంటనే దెబ్బలలోనికి దిగినది. ఖద్దరుటోపీలనుధరించి కాని, ఖద్దరుబట్టలనుకట్టి గాని బజారులో కనపడినవారు తీవ్రముగా కొట్టబడిరి. ఆంధ్రదేశమునకు మలబారునుండి మిలిటరీపోలీసువారు పంపబడిరి. వారాంధ్రదేశములోని అనేకచోట్లకు వచ్చిరి. ఏలూరు, బరంపురం, కాకినాడ, రాజమహేంద్రవరము మొదలగు పట్టణములలో బజారులలో తిరిగి ఖద్దరు కట్టుకొన్నవారి నందరిని వారు కొట్టి తమ ఉత్సాహమును తీర్చుకొనిరి. వారు వేలూరులో నిరోధింపబడుటమూలమున పోలీసులు తుపాకులను కాల్చవలసివచ్చెను. అపుడచట ఇద్దరు మరణించిరి. ౫, ౬ గురకు గాయములు తగిలెను. అంతటితో వారి దౌర్జన్య మాగిపోయెను.

నిర్బంధవిధానము దాల్చిన వివిధరూపములను వర్ణించుట కష్టసాధ్యము. శాసనోల్లంఘనమువలెనే నిర్బంధవిధానముకూడా సర్వతోముఖముగా వ్యాపించెను. ౧౯౩౦-౩౧ లో జరిగిన ప్రబల నిర్బంధవిధానమునుగూర్చి కొన్నిమాటలను చెప్పవలసియున్నది. బొంబాయి సత్యాగ్రహోద్యమసంగ్రామమునకు ముఖ్యకేంద్రమయ్యెను. విదేశవస్త్రబహిష్కారము ప్రజలదృష్టి నాకర్షించెను. మిల్లు యజమానులకుద్యమమందెంతో ఉత్సాహము కలదు. అది అప్రత్యక్షముగా ప్రదర్శింపబడెను.

అదృష్టవశమున అపుడు మోతీలాలునెహ్రూ స్వేచ్ఛగా నుండెను. ఆయన బొంబాయికి పోయి బొంబాయి, అహమ్మదాబాదుమిల్లుయజమానులతో రాయబారములు నడిపెను. బొంబాయిలోని మిల్లుయజమాను లనేకమంది యూరోపియనులగుటచే వారితో రాయబారములు నడపుట కష్టతరమయ్యెను. అహమ్మదాబాదుమిల్లు యజమానులతో తేలికగానే రాజీ కుదిరెను. బొంబాయి యూరోపియనుయజమానులు కాంగ్రెసువారి షరతులకు లోబడచేయుటకు మోతీలాలుపండితుడు భగీరథప్రయత్నములు చేయవలసివచ్చెను. కాని చివర కాయన జయప్రదముగానే ఆపనిని నిర్వర్తింపగలిగెను. బహిష్కారతత్వము దేశములో బాగుగా వ్యాపించియుండుటచే మోతీలాలు కాపని సాధ్యమయ్యెను. వందలకొలది కోట్ల విదేశీబట్టలు విక్రయింపబడక బొంబాయి రేవులో మూలుగుతూ ఉండెను. దిగుమతివర్తకులు సమావేశమై ఆబట్టలను తీసుకొనకుండుటకు తీర్మానించుకొనిరి. కాబట్టి దేశములో బట్ట తక్కువయ్యెను.

ఈ సమయములో కాంగ్రెసుకార్యనిర్వాహక సభ్యులు జూను ౨౭ వ తేదీన అలహాబాదులో సమావేశమై యీక్రింది తీర్మానములను చేసిరి:

"(౧) విదేశవస్త్ర బహిష్కారసంవత్సరములో అనేకనగరములయందును, పట్టణములయందును, గ్రామములయందును కలిగిన అభివృద్ధికి కాంగ్రెసుకార్యవర్గమువారు సంతృప్తిపడుతూన్నారు. ఈకమిటీవారి తీర్మానముల ననుసరించి విదేశీబట్టల వర్తకులు బట్టలవిక్రయము నాపివేయుటయేగాక అంతకుపూర్వ మీయబడిన ఆర్డరులనుగూడ రద్దుచేసుకొని, క్రొత్తఆర్డరుల నీయకుండుటకు నిశ్చయించుకొని విదేశీబట్టల దిగుమతిని చాలావరకు తగ్గించినందుకు వారి దేశభక్తిని ఈసభవారు కొనియాడుతూన్నారు. ఇంతవరకును విదేశీవస్త్రవిక్రయమును కట్టిపెట్టనివర్తకులు వెంటనే దాని నాపివేయవలెనని యీకమిటీవారు కోరుతూన్నారు. వారలా ఆపివేయనియెడల స్థానిక కాంగ్రెసుసంఘములవారు ఆయావర్తకుల దుకాణములయొద్ద తీవ్రముగా పికెటింగును సాగింపవలెనని కోరబడుతూన్నారు. ౧౯౩౦ జూలై ౧౫వ తేదీలోపుగా విదేశవస్త్రవిక్రయము భారతదేశమంతటా పూర్తిగా ఆపివేయబడవలెనని యీకమిటీవారి ఆశ. ఆరోజున రాష్ట్రీయ కాంగ్రెసుసంఘములవారు పూర్ణమైన నివేదికను పంపవలెనని ఈ సభవారు కోరుతూన్నారు.

"(౨) బ్రిటిషువస్తువుల సంపూర్ణబహిష్కారమునకు తీవ్రమైన చర్య తీసుకొనవలెనని యీకమిటీవారు దేశములోని అన్ని కాంగ్రెసు సంస్థలను కోరుతూన్నారు.

"(౩) జాతీయోద్యమమును నిర్మూలింపవలెననే ఉద్దేశముతో ప్రజలపైన ప్రత్యక్షముగా దుండగములను కావించినట్లు తెలియవచ్చిన ప్రభుత్వోద్యోగులమీద సంఘబహిష్కారమును తీవ్రముగా ఆచరణలోనికి తేవలెనని యీకమిటీవారు ప్రజలను కోరుతూన్నారు.

"(౪) స్వతంత్రులయిన న్యాయమూర్తుల సంఘమువారిచే న్యాయముగా భారతదేశము భరింపవలసినదే యని నిర్ణయింపబడిన సందర్భములలో తప్ప తక్కిన అన్ని సందర్భములలోను విదేశపరిపాలనమువలన భారతదేశముపైన ప్రత్యక్షముగాగాని, పరోక్షముగాగాని వేయబడిన ఆర్థికభారములను భరింపవీలులేదని ౧౯౨౨ లోను, ౨౯ లోను కాంగ్రెసుతీర్మానములను గమనించవలసినదని ఈ కమిటీవారు ప్రజలను కోరుతూన్నారు. అంతేగాక ఇండియాప్రభుత్వమువారి క్రొత్తబాండులను కొనకుండుటకు కూడ ప్రజలకీ కమిటీవారు సలహాయిస్తూన్నారు.

"(౫) రూపాయలోని వెండికరీదు ప్రభుత్వమువారిచే నిర్ణయింపబడిన రూపాయమారకపుధరలో మూడవవంతుకూడ లేదు. ప్రజల ఆందోళనమును లెక్కపెట్టక ప్రభుత్వమువారు నిరంకుశముగా వెండిరూపాయయొక్క మారకపుధర నావిధముగా నిర్ణయించిరి. అంతేగాక రూపాయయొక్క విలువ యింకా పడిపోవుట కవకాశము

కలదు. కాబట్టి ప్రజలకు ప్రభుత్వమునుండి సొమ్ము రావలసిన సందర్భములలో వారు కరెన్సీనోట్ల రూపకముగాగాని, వెండిరూపాయల రూపములోగాని దానిని పుచ్చుకొన వలదనీ, వీలైనచోట్ల నెల్ల బంగారమురూపములోనే సొమ్ము రావలసినదని కోరవలెననీ యీ సభవారు ప్రజలకు సలహాయిస్తున్నారు. మరియు ప్రజలదగ్గరనున్న కరెన్సీ నోట్లనుగాని, రూపాయలనుగాని సాధ్యమైనంత తొందరలో బంగారములోనికి మార్చుకొనవలెననీ, భారతీయుల యెగుమతులకు బంగారములోనే సొమ్ము తీసుకొనవలెననీ ప్రజలకీ కమిటీవారు సలహాయిస్తున్నారు.

“(౬) కళాశాలావిద్యార్థులు జాతీయస్వాతంత్ర్యోద్యమములో సంపూర్ణముగా పాల్గొనుటకు తరుణము వచ్చినదని తలచి, రాష్ట్రీయకాంగ్రెసు సంఘములు ఆయా రాష్ట్రములలోని విద్యార్థులను అవసరమైనయెడల పూర్తిగా చదువుకూడ మాన్పించి కాంగ్రెసు కార్యమునందు పాల్గొనేటట్లు చేయవలెనని ఈ కమిటీవారు కోరుతూన్నారు. కమిటీవారి ఈ కోరికను విద్యార్థులు తక్షణ మనుసరింతురని యీ కమిటీవారి విశ్వాసము.

“(౭) ప్రభుత్వమువారి నిర్బంధవిధానమున కనుగుణముగా కొన్ని రాష్ట్రీయ కాంగ్రెసుసంఘములను, జిల్లాకాంగ్రెసుసంఘములును, తదితరకాంగ్రెసుసంఘములను అక్రమసంఘములుగా ప్రకటింపబడినందువల్లను, ఇంకా మిగిలియున్న కాంగ్రెసు సంఘములుకూడ కొద్దికాలములో అక్రమసంఘములుగా ప్రకటింపబడుట కవకాశము కలదుకాబట్టిన్నీ ఈ కమిటీవారు అక్రమసంఘములుగా ప్రకటింపబడిన కాంగ్రెసు సంస్థలను, ఇకముందు ప్రకటింపబడబోవు కాంగ్రెసుసంస్థలను యథావిధిగా పూర్వము వలెనే పనిసాగింపవలెనని కోరుతూన్నారు.

“(౮) జూను ౭ వ తేదీని ఈ సమావేశమువారిచే అంగీకరింపబడిన పోలీసు సైనికోద్యోగుల ధర్మమునుగూర్చిన తీర్మానముయొక్క నకళ్లను సంయుక్తరాష్ట్రముల ప్రభుత్వమువారు స్వాధీనపరచుకొనుటకు చేసిన ప్రకటనమునుగూర్చి ఈసభవా రాశ్చర్యమును ప్రకటించుచున్నారు. ప్రభుత్వమువారు పోలీసుసైనికాధికారులను ప్రజలపైన దురాగతములకు కావించుటకు కీలుబొమ్మలుగా ఉపయోగించుచున్న విధానమునుబట్టి ఈ కమిటీవా రంతకంటెను ఎక్కువ కఠినమైన తీర్మానములను చేయవలసి యుండెను. కాని ఆ విషయములో ప్రభుత్వమువారు ప్రస్తుతము న్యాయపరిపాలనమునకు తగినట్లుగా మాత్ర మా తీర్మానము చేయబడెను. ఆ తీర్మానమునుగూర్చి ప్రభుత్వమువారు చేసిన ప్రకటనను లెక్కపెట్టక అన్ని కాంగ్రెసుసంస్థలు దానిని విశేషముగా ప్రచారము చేయవలెనని ఈ కమిటీవారు కోరుతూన్నారు.

"(౯) క్రిందటి పర్యాయము జరిగిన ఈ కమిటీ మీటింగుకు పిమ్మట ప్రభుత్వము వారు సత్యాగ్రహోద్యమము నణచివేయుటకు ముందువెనుకలు చూడకుండ నిరంకుశ నిర్బంధవిధానమునకు గడంగిరి. అంతేకాక వారి ప్రతినిధులవల్లను, వారి నౌకరుల వల్లను ప్రజలపైన అంతకంతకు క్రూరమైన చర్యలను జరిపించుచుండిరి. అధికారుల అదుంపగములకు ప్రజలు ధైర్యముగా నిలబడినందుకు దేశము నీకమిటీవా రభినందిస్తూన్నారు. ప్రజ లెంత హింసింపబడినప్పటికీ వారు తాము స్వాతంత్ర్యయుద్ధమును చిట్టచివరవరకును కొనసాగించుటకొరకే ప్రూనుకొనిరని ఈకమిటీవారు ప్రభుత్వమువారిని హెచ్చరించుచున్నారు.

"(౧౦) భారతనారీమణులు జాతీయోద్యమములో అంతకంత కెక్కువగా పాల్గొని, ధైర్యముగా లాఠీదెబ్బలను, అవమానములను, శైగులను భరించినందు కీకమిటీ వారు వారిని శ్లాఘిస్తూన్నారు"

విదేశవస్త్రబహిష్కార మంతకంతకు తీవ్రరూపమును దాల్చెను. ప్రజలకు కావలసినంత ఖద్దరు సప్లయికాలేదు. అందువలన మిల్లునూలుతో చేతితో నేసిన బట్టలను దేశాభిమానులగు నగరవాసులు ధరింపవలసివచ్చెను. ఆకారణమున మిల్లులు రెండు విధములుగా విభజింపబడెను. జాతీయోద్యమమును ప్రోత్సాహపరచు మిల్లు లొకతెగ; దానిని నిరోధించు మిల్లులు రెండవతెగ. కాంగ్రెసుషరతుల కంగీకరించిన మిల్లులను కాంగ్రెసువారు సర్టిఫైచేయ తలపెట్టిరి. అందులో ముఖ్యమైన షరతు లివి: వారు బ్రిటిషుకంపెనీలనుండి తమ యంత్రసామగ్రిని తెప్పించుకొనగూడదు; వారి సిబ్బందిలో జాతీయోద్యమమునకు తోడ్పడువారికి వారు నిరోధములను కల్పించకూడదు; కాంగ్రెసువారి సర్టిఫికేటును ఆధారముగా చేసుకొని మిల్లుబట్టలను కొనేవారికి నష్టదాయకముగా వారు బట్టల ధరలను పెంచకూడదు ఈషరతుల కంగీకరించి అనేక మిల్లులు కాంగ్రెసుకు ప్రమాణపత్రములపైన సంతకములు చేసియిచ్చెను. కొన్ని మాత్రము కాంగ్రెసుకు లొంగలేదు. కాని కొద్దికాలములోనే కాంగ్రెసుయొక్క మహాశక్తి నవి గ్రహింపగలిగినవి.

ఈసమయములో అఖిలభారత కాంగ్రెసు కార్యనిర్వాహకసభ అక్రమసంఘమని ప్రభుత్వమువారిచే ప్రకటింపబడెను. పండితమోతీలాలునెహ్రూ ౧౯౩౦ జూను ౩౦ వ తేదీన అరెస్టుచేయబడెను. ఆయన కారునెలల శైగుశిక్ష విధింపబడెను. బహిష్కారోద్యమ తీవ్రతనుబట్టియే నిర్బంధవిధానతీవ్రతకూడ నానాటికి పెరిగిపోయెను, బొంబాయి వాలంటీరునిర్మాణ మత్యద్భుతముగా పనిచేయసాగెను. స్త్రీలు కుంకుమపువ్వుచీరలను ధరించి విదేశీబట్టల దుకాణములను పికెటింగుచేయసాగిరి. ప్రజల హృద

యములు స్త్రీల పికెటింగువలన పరివర్తనము చెందెను. ఎవ్వరైన వర్తకుడు విదేశీబట్ట లను సీలుచేయుట కంగీకరించనియెడల వెంటనే ఆయనభార్య పికెటింగుచేయుటకు వచ్చుచుండెను. అన్నిరాష్ట్రములలోవలెనే బొంబాయిలోకూడ బహిరంగసమావేశ ములు నిషేధింపబడెను. బొంబాయిప్రజ లానిషేధపుటుత్తరువులను నిరాకరించిరి.

ఆరోజులలో భారతదేశమందు సంచారముచేసిన బ్రెయిల్సుఫోర్డు (Brails-ford) ప్రజలపైన చేయబడిన దురాగతములను గూర్చి వివరించెను. ౧౯౩౧ జనవరి ౧౭ వ తేదీన ఆయన మాంఛెస్టరు గార్డియనులో నీక్రిందివిధముగా వ్రాసెను:

"బాధ్యతగల భారతనాయకు లనేకులు పోలీసువారిపైన అనేక నిందారోపణ ములను చేయుచున్నారు. పోలీసువా రనేకచోట్ల అనేక సమయములలో చేసిన దుష్కార్యములనుగూర్చి వారు వర్ణింతురు. వాటినిగూర్చి విచారించుటకు వీలులేనంత విస్తారముగా నున్నవవి. ప్రతిచోట నిషిద్ధసమావేశములను చెదరగొట్టుటలో పోలీసు వా రవలంబించిన క్రూరకృత్యములు వివరింపబడినవి. ఈవిషయములను కండ్లతో చూ చిన అనేకమంది ఆంగ్లేయులు నాకు చెప్పిరి. గాయములు తగిలినవారికి చికిత్సచేసిన భారతీయ డాక్టరులుకూడ నా కీసంగతి చెప్పిరి. నేను పోలీసువారిని ప్రశ్నించితిని. చాలా సందర్భములలో ఆ సమావేశములను నిషేధించిన ఉన్నతాధికారులదే తప్పని నాయభిప్రాయము. నేను నిషేధింపబడని రెండుసభలకు పోతిని. అక్కడి ఉపన్యాస ములు శాంతముగానే ఉన్నవి. కాని రాజద్రోహకరములు కాకపోలేదు. వారు దౌర్జన్యమును నిరంతరము ఖండించిరి. ప్రజలు భూమిపైన శాంతముగా కూరుచుండి నూలువడుకుచూ ఉపన్యాసములను వినిరి. అనేకమంది స్త్రీలుకూడా ఆసమావేశములో నుండిరి. వారు నెమ్మదిగా, శాంతముగా కనపడిరి. ఆవిధముగా సమావేశములను సాగ నిచ్చినయెడల కల్లోలమే ఉండేదికాదు. సభాసదులకు కొంతకాలమునకు విసుగుపుట్టి ఉండేది. ముఖ్యముగా బొంబాయిలో పోలీసులు మొరటుతనముగా సమావేశములను చెదరగొట్టుటమూలమున నగరమంతటా కోపము ప్రజ్వరిల్లెను; లాఠీఛార్జి నెదురుకొనుట గౌరవప్రదముగా భావింపబడెను. వాలంటీరులు వందలకొలది ప్రాణముల నర్పించు టకు సంసిద్ధులయిరి. వారు సుశిక్షితమైన సాత్వికధైర్యమును ప్రకటించిరి. శాంతముగా నున్న అనేకమందియువకులను బలిష్ఠులైన పోలీసు లనేకులు కొట్టగా యీగోష్ఠి యను లనేకమంది చూచిరి. వారు నా కావిషయమును వర్ణించి చెప్పిరి. ఇటువంటి ఒక దృశ్యమును చూచిన ఒకఫ్రెంచిస్త్రీ విమర్శించిన విమర్శనల నిచ్చట నే నుదా హరింప దలచుకొనలేదు.

"ఇంగ్లీషు ఉద్యోగస్థుల తనిఖీక్రింద కూడా పోలీసువారు వాలంటీరులను కొట్టిరన్నమాట నేను సందేహింపను. కలకత్తాలో కొంతమంది విద్యార్థులు పోలీసువారొక ఉత్సవమును చెదరగొట్టుచూ ఉండగా తమ విశ్వవిద్యాలయపు మేడనుండి 'పిరికివాండ్లు' అని కేకలువేసిరనేకారణముతో, తరువాత రెండుగంటల కొక ఇంగ్లీషు ఉద్యోగి కొంతమంది పోలీసులతో యూనివర్సిటిలో ప్రవేశించి క్లాసుగదులలో చొరబడి విద్యార్థులను విచక్షణలేకుండా గోడలపైన నెత్తురు చిందిపడేటట్లు కొట్టించెను. విశ్వవిద్యాలయాధికారు లీ విషయమునుగూర్చి ప్రతిఘటించిరి. కాని పోలీసువారికేమీ శిక్ష జరుగలేదు. ఈ సంగతి నేను విశ్వవిద్యాలయాచార్యులనుండి వింటిని. వారికి యూరోపియను వైజ్ఞానికశాస్త్రవేత్తలలో మంచి పేరుప్రతిష్ఠలు గలవు. ఒక హైకోర్టు జడ్జీకొడుకు ఆవిశ్వవిద్యాలయములో విద్యార్థి. ఆయనను పోలీసువారు కొట్టినందుకాజడ్జీ మాట్లాడినమాటలు ప్రభుత్వసభ్యులు వినివుండవలసినదని నాకోరిక. లాహోరులోకూడా యిట్టిసంగతియే మరియొకటి జరిగినది. అక్కడ ఒక ఆంగ్లఉద్యోగి పోలీసువారిని తీసుకొనిపోయి ఒక కళాశాలను ముట్టడించి విద్యార్థులనే గాక ప్రొఫెసరులనుకూడ కొట్టెను. మరియొక కాలేజిలోని విద్యార్థులు వీధులలో శాంతియుతముగా పికెటింగుచేస్తూన్నందుకు వీరు కొట్టబడిరని నాకు తెలియవచ్చినది. వంగరాష్ట్రములోని కొంటాయిలో నిరపాయకరమైన గుంపులోనుండి ౫మంది గ్రామస్థులు చెరువులోనికి త్రోయబడిరి. మీరటులో చెదరగొట్టబడిన ఒక సమావేశమందు ప్రధానోపన్యాసకుడుగా నున్న ఒక లాయరును నేను కలుసుకొంటిని. ఆయన అరెస్టులోనుండగా కొట్టబడెను. ఇటువంటి స్థితిలో దగ్గరనుండి ఒకపోలీసు ఆయనను తుపాకితో కాల్చినందున ఆయనచెయ్యి వికల మయ్యెను. అట్టివిషయములవలన ప్రభుత్వము మరింత అపఖ్యాతిపాలు కాజొచ్చెను. ఆసందిగ్ధతరుణములో కొందరుప్రజలు కాంగ్రెసుకు సహాయపడవలెనా, లేదా అని సందేహిస్తూండగా ప్రభుత్వప్రతినిధుల ఈచర్యలు కాంగ్రెసు ఉద్యమమును బలపరచినవి. 'సి' క్లాసు రాజకీయఖైదీలు జైళ్లలో అనుభవించిన కష్టములుకూడా ఇందుకే తోడ్పడినవి.

"గుజరాతుగ్రామములలో పోలీసువారుచేసిన దుష్కార్యములనుగూర్చి నాదగ్గర కావలసినంత సాక్ష్య మున్నది. ఆ గ్రామములలో నేను ౫ రోజులు పర్యటనము గావించితిని. న్యాయనిర్బంధమే చాలవరకు కఠినముగా నుండెను. కైయిరాజిల్లా బార్డోలీ తాలూకాలలోని రైతు లనేకకారణములతో భూమిశిస్తులను నిరాకరించిరి. కొందరు గాంధీయందు గల భక్తివలన, కొందరు స్వరాజ్యమందు గల కోరికవలన, కొందరు పంటలధరలు పడిపోవుటమూలమున కలిగిన ఆర్థికదుస్థితివలన - యీ అన్నికారణములవలనను వారు పన్నులను నిరాకరించిరి. ప్రభుత్వమువా రందుకు వారి పొలములను,

పశువులను, నీటిపంపులను, అన్నిటినీ జప్తుచేసి నామమాత్రపు ఖరీదులకు విక్రయించిరి. అనగా ౪౦ రూపాయల శిస్తు బాకీఉన్న ఒకరైతు తన యావదాస్తిని పోగొట్టుకొనవచ్చును. అంతేగాక మామూలుగా ౧౯౩౧ జనవరిలో వసూలుచేయదగిన శిస్తు ౧౯౩౦ అక్టోబరులోనే వసూలుచేయబడు నని ప్రభుత్వమువారు ప్రకటించిరి. ఇది శాస్త్రప్రకారము న్యాయమైతే కావచ్చును. కాని ప్రజల కాగ్రహము కలిగేటంత కఠినముగా నుండెను. దీనిని మించి పోలీసువారి దారుణకృత్యములు ప్రారంభము లయ్యెను. పోలీసువారు లాతీలను, తుపాకులను పుచ్చుకొని ప్రభుత్వమువారికి ప్రతికూలముగానున్న గ్రామములలో ప్రవేశించి వారిని విచక్షణలేకుండ లాతీలతోను, తుపాకులతోను కొట్టిరి. ఇలా జరిగిన ౪౫ కడలను నేను విన్నాను. రెండు కేసులలో తప్ప తక్కిన అన్నిసందర్భములలోను వారి గాయములను, వాపులను నేను చూచినాను. ఒకబాలిక తన గాయములను నాకు చూపించుటకు మొగమోటపడెను. కొన్ని గాయములు చాలా తీవ్రమైనవి. ఒక మనిషికి చెయ్యి విరిగెను. ఇంకొకనికి వ్రేలికణుపు విరిగెను. తడితరునకు శరీరమంతా దెబ్బలే. ఇంకా కొంతమందిని నేను స్వయముగా చూడలేకపోయినాను. వారు దూరముగానున్న ఆసుపత్రిలో నుండిరి. ఇదంతా పన్నులు వసూలుచేయుట కవలంబింపబడిన విధానము. చాల కొద్దిసందర్భములలో పోలీసువారు రైతులను కొట్టి, పశువులను జప్తుచేసి, పన్నులను వసూలుచేయగలిగిరి. పన్నులు చెల్లింపవలసిన మనిషి గ్రామములో లేనపుడు ఆయనపన్నులను చెల్లించుట కిరుగుపొరుగువారు బాధింపబడినట్లుగా నే ననేకసాక్ష్యములను వింటిని. కొన్ని గ్రామములలో పన్నులను వసూలుచేయుటకుగాక కేవలము ప్రజలను భయపెట్టుటకే ఈ కార్యవిధానము నడుపబడెను. ఒక గ్రామములో చెట్లపైనను, ఇండ్లపైనను ఉన్న జాతీయ పతాకములును, కాంగ్రెసు ప్రకటనలును చించివేయబడినవి. వాటికి దగ్గరగానున్న ఇండ్ల యజమానులగు రైతులు ౮ మంది పోలీసువారిచే కొట్టబడిరి. రెండు సందర్భములలో గాంధీటోపీని తీసివేసేటంతవరకును మనుష్యులను కొట్టిరి. మరియొకచోట పోలీసువారికి ౭ సారులు సలాములు చేసేటంతవరకును ఒక మనిషిని పోలీసువారు ౧౨ లాతీదెబ్బలను కొట్టిరి. తరుచుగా పోలీసువారు "మీకు స్వరాజ్యము కావలెనా? అయితే యిదిగో లాతీ వచ్చుచున్నది." అని ప్రజలతో హాస్యమాడ నారంభించిరి. భారతీయ ఉద్యోగులును, సివిలు పోలీసు ఆఫీసరులునుకూడా బరియాలు అనే ఒక దొంగజాతివారిని పత్తేదారుల (రైతులు) పైన ప్రయోగించుటకు ప్రయత్నించిరి. బరియాలు రైతులను కొట్టుటకు, ఋణముల నెగవేయుటకు, రైతుల ఇండ్లను తగుల పెట్టుటకు ప్రోత్సహింపబడిరి. ఈ విషయమునుగూర్చి నేను వివిధగ్రామములలోని ౫ గురు బరియాలను విచారించితిని. ఈ బరియాలకు రైతుల పొలము లెకర మొకటింటికి

ఒకటి రెండురూపాయల ఖరీదులో ఈయబడునని అధికారులచే వాగ్దానములు చేయబడెను. రష్యాదేశములోని కమ్యూనిస్టుపార్టీవారు (సామ్యవాదపక్షమువారు) గ్రామములలో ధనవంతులపైన ద్వేషములను పుట్టింప నూహించినప్పుడు వారి ఉద్యోగస్థులు చెప్పిన మాటలు వీటికి తీసిపోవు.

“ ఇదంతా రెండవపక్షమువారు లేనిసమయములో ఒకపక్షమునుండి తీసుకొనబడిన సాక్ష్యమని మీరనవచ్చును. కాని నేనందుకు తగిన జాగ్రత్తల నిదివరకే తీసుకొంటిని. నా సాక్ష్యమును ఉన్నతోద్యోగులకడ రుజువుచేసితిని. నేను కమీషనరును వెంటబెట్టుకొని ఒక గ్రామమునకు పోతిని. ఆయన రైతులకు తగిలిన గాయములను చూచెను; వారిని ప్రశ్నించెను. ఆయన యేమినిర్ణయించుకొనెనో నేను చెప్పజాలను కాని అప్పుడాయన చూచిన ౯ సందర్భములలోను ఒక సందర్భములో మాత్రమాయన సందేహమును ప్రకటించెను. అంతేగాక నేనిద్దరు స్థానికభారతీయోద్యోగులను కలుసుకొంటిని; వారి చర్యలను పరీక్షించితిని. ఆయన నా సమక్షముననే ఒక క్రూరకృత్యమును చేసెను. బోర్సాదులో ఆయన కొంతమంది విచారణకాని ఖైదీల నొకబోనులో నుంచుట నేను చూచితిని. అది మృగములను పెట్టెబోనువలె నున్నది. దాని వైశాల్యము ౩౦ చదరపు అడుగులు. దానికి ఇనుపచువ్వ లున్నవి. దానిలో ౧౫ మంది రాజకీయ ఖైదీలు రాత్రింబవళ్లు నివసించిరి. వారిలో ఒకడు ౬ వారములు పుస్తకములుగాని, పనిగాని లేకుండ అందులో నుండెను. ఈ బోనునుండి వారు రోజు కొకపర్యాయము ౪౫ నిమిషములు మాత్రము మరుగుదొడ్డికి పోవుటకుగాని, స్నానముచేయుటకుగాని విడుదలచేయబడుచుండిరి. అందులో ఒకడు తానును, మరిద్దరును జైలులో కొట్టబడితిమని నాకు చెప్పెను. ఈఖైదెంత అనాగరికముగా నున్నదో ఆ దెబ్బలు కొట్టుటకూడా అంత అనాగరికముగా నున్నదనక తప్పదు.

“ ఇంత చెప్పిన పిమ్మట నేనిక ఈసందర్భములో రౌండుటేబిలుమహాసభ చేయదగిన మంచిపనినిగూర్చికూడా చెప్పవలసి ఉన్నది. హిందూదేశములో జరుగుతూ ఉన్న విషయములు వార్తలపైనను, వార్తాపత్రికలపైనను ప్రభుత్వమువారి “నిగా” మూలమున ఆంగ్లప్రజలకు సరిగా తెలియవు. భారతదేశప్రజలకు చిత్తశాంతి లేదనే విషయముకూడ వారికి తెలియదు. భారత ప్రజాహృదయము మహదాశయములకొరకు ఉద్రేకపూరితముగా చేయబడెను. భారతప్రజలకు ప్రభుత్వపద్ధతిపైన కోపము తెప్పింపబడెను. వారు మన న్యాయబుద్ధిని సంశయింతురు. వారి చిత్తములు నిర్బంధితులైన నాయకులపై లగ్నము చేయబడినవి. కాబట్టి ఈ తరుణములో ప్రభుత్వమువారిచే సూచింపబడిన రాజ్యాంగ

చట్టమును వారు సరిగా విచారింపగలరని నమ్మకము నాకు లేదు. గాంధీ జైలులో నున్నంతకాలమును ఆయనఉద్యమము పూర్తిగా విడిచిపెట్టబడుననిగాని, లేక దానంతటది తగ్గిపోవుననిగాని నేను నమ్మజాలను. ప్రభుత్వమువారు కొంచె ముదారముగా ప్రవర్తింపగలిగినయెడల నూతనయుగప్రారంభము కాగలదని నాఆశ. చిత్తురాజ్యాంగ ప్రణాళిక తయారుచేయబడి వెస్టుమినిస్టరులో అది అంగీకరింపబడుటకు ముందుగా రాజకీయఖైదీలు విడుదలచేయబడవలె నని నాకోరిక. ఈరాబోవు ఆరునెలలలోను ప్రభుత్వమువారు చాకచక్యముగా ప్రవర్తింపనియెడల భారతీయులే భారతీయులను హింసించుటతో భారతస్వాతంత్ర్యయుద్ధము ప్రారంభము కావచ్చును. ఈ దురదృష్ట సంవత్సరములో జరిగిన ఈ చరిత్రనుగూర్చి యింకా మన మెక్కువ తెలుసుకోవలసి యున్నది. భారతదేశ మీవిషయములను మరచిపోవుటకు మనము సహాయపడవలెను."

తుపాకులు కాల్చబడినవిషయములనుగూర్చి, ముఖ్యముగా పెషావరులో తుపాకులు కాల్చబడినవిషయమునుగూర్చి అసెంబ్లీలో ౧౯౩౦ జూలై ౧౪ వ తేదీని ఈ క్రిందిప్రశ్నలు వేయబడెను. జవాబులుకూడ నీక్రింద ఉదాహరింపబడినవి :

యస్. సి. మిత్రపక్షమున మౌల్వీ అబ్దుల్ మతీన్ చౌధరి వేసినప్రశ్నలు :

(ఎ) పెషావరులోని మిలిటరీ డయిరీఫారము సూపరువైజరు సర్దారు గంగాసింగు ఒక పండుగరోజున గురుద్వారాకు తన కుటుంబముతోసహా ఒక టాంగాలో పోతూ ఉండగా ఒక ఆంగ్లసైనికుడు పెషావరునగరమందలి కాబూలీగేటువద్ద ఆయనపైన తుపాకిని కాల్చి ౧౪ నెలల వయస్సుగల ఆయనకుమారుని, ౯ ఏండ్ల ఆయనకుమార్తెను చంపి, ఆయనభార్యను తీవ్రముగా గాయపరచినమాట నిజమేనా?

(బి) పోలీసువారుగాని, సైనికులుగాని గాయపడిన ఆస్త్రీని ఆసుపత్రికి తీసుకొనిపోవుట కేమీ చర్య జరిగించనిమాటయు, ప్రజలే ఆ దురదృష్టకుటుంబమునకు ప్రథమచికిత్స చేసి, ఆసుపత్రికి తీసుకొని పోవలసివచ్చుటయు నిజమేనా?

(సి) ఆ మరణించిన పిల్లల మృతకళేబరములు డిప్యూటీ కమీషనరు అనుజ్ఞతో వీథిగుండా శ్మశానవాటికకు ఉత్సవముతో తీసుకొనిపోబడుతూండగా కొంతమంది బ్రిటిషుసైనికు లేమీ హెచ్చరిక చేయకుండానే తుపాకులను కాల్చి, అనేకమందిని గాయపరచి చంపినమాట నిజమేనా? ఆసందర్భములో చచ్చినవా రెందరో, గాయపడినవా రెందరో దయచేసి ప్రభుత్వమువారు చెప్పగలరా?

(డి) ఈవిషయమునుగూర్చి ప్రభుత్వమువా రొక సెషన్సుజడ్జిచేత విచారణ చేయించవలెనని తలపెట్టి, సైనికాధికారుల ప్రతికూలభావములవలన ఆ అభిప్రాయమును విరమించవలసివచ్చినమాట నిజమేనా?

# ప్రజలకు కలిగిన అపాయములు

| రాష్ట్రము | తేదీ | మరణములు పొందిన వారు | గాయములు తగిలిన వారు | విశేషములు |
|---|---|---|---|---|
| మద్రాసు నగరము | ౨౭-౪-౩౦ | ౨ | ౬ | ౧ తిరువాతి చచ్చిపోయెను |
| కరాచి | ఏప్రిల్ ౧౬ | ౧ | ౬ | ,, |
| బెంగాలు, కలకత్తా | ,, ౧ | ౭ | ౫౯ | ,, |
| | ,, ౧౫ | — | ౩ | |
| ౨౪ పరగణాలు | ,, ౨౪ | ౧ | ౩ | |
| చిట్టగాంగు | ,, ౧౮, ౧౯, ౨౦ | ౧౦ | ౨ | ౨ తరువాత మరణించిరి. |
| పశ్చిమోత్తర సరిహద్దురాష్ట్ర [ములు-పెషావరు | ,, ౨౩ | ౩౦ | ౩౩ | |
| చిట్టగాంగు | ,, ౨౪ | ౧ | — | |
| మద్రాసు | మే ౩౦ | — | ౨ | |
| బొంబాయి షోలాపురం | ,, ౮ | ౧౨ | ౨౮ | |
| వాడాలాఉప్పు కొటారులు | ,, ౨౪ | — | ౧ | |
| భెండీబజారు | ,, ౨౬, ౨౭ | ౫ | ౬౭ | |
| బెంగాలు హౌరా | మే ౬ | — | ౫ | |
| చిట్టగాంగు | ,, ౭ | ౪ | ౬ | ౩ తరువాత మరణించిరి. |
| మైమెన్సింగు | ,, ౧౪ | ౧ | ౩౦ మొదలు ౪౦ | |
| మిడ్నాపూరు (ప్రతాపదిగి) | ,, ౩౧ | ౨ | ౨ | |
| సంయుక్తరాష్ట్రములు లక్నో | ,, ౨౬ | ౧ | ౪౨ | ౨ తరువాత మరణించిరి |
| పంజాబు కాలూ—జీలముజిల్లాలు | ,, ౧౮ | — | ౧ | |
| బర్మా - రంగూను | ,, చివర వారము | ౫<br>౧౭ | ౩౭<br>౩౭ | |
| ప. స. హ. రాష్ట్రములు ఢిల్లీ | ,, ౬ | ౪ | ౪౦ | |

గా. హెచ్. జి. హేగ్ — (ఎ) ౧౯౩౦ జూను 3 వ తేదీని పెషావరు అడిషనలుజిల్లా మ్యాజిస్ట్రేటుతీర్పులో ఆవిషయము లుదాహరింపబడినవి. దాని నకలు లైబ్రరీలో నుంచబడినది. ఈ అత్యంతవిషాదకరమైన విషయము కేవలము ప్రమాదము వలన తటస్థించినది.

(బి) మినహాయింపబడెను.

(సి) వారు తెలిసిన సంగతులనుబట్టి, ఆ ఉత్సవములో కొంతమంది బ్రిటిష్ సైనికులు వచ్చికలిసిరి. అపుడు ఆ ఉత్సవములోని జను లుద్రేకములో నుండిరి. వారు సైనికుల తుపాకులను లాక్కొనుట ప్రయత్నించిరి. వారు చెదరిపోవుట కంగీకరించ లేదు. అప్పుడు తుపాకులను కాల్చుట కనుజ్ఞ నీయవలసివచ్చెను. ఆసందర్భములో ౯ మంది మరణించిరి. ౧౮ మందికి గాయములు తగిలెను.

(డి) లేదు.

తుపాకులు కాల్చబడినసందర్భముల సంఖ్యనుగూర్చి యస్. సి. మిత్ర ప్రశ్నింపగా గా. హెచ్. జి. హేగ్ యీ మందటిపుటలోని జాబితాను తయారుచేసెను. (భారతశాసన సభాచర్చలు—౧౪-౭-౩౦ సోమవారము. వాల్యూము ౪, నెం. ౬—పేజి. ౨౩౦.)

బొంబాయిప్రభుత్వమువారిచే మే ౧౯వ తేదీని ప్రకటింపబడిన ప్రకటనలోని కారణములవలన మే ౧౨ వ తేదీని రాత్రి ౮-౪ గంటలకు షోలాపూరుజిల్లా మేజస్ట్రీటు పట్టణమును మిలిటరీఅధికారులకు వశముచేసెను. బొంబాయిప్రభుత్వమువారి కాసాయంకాలమే ఈ విషయమునుగూర్చి షోలాపూరుజిల్లా మేజస్ట్రీటు తెలియపరచెను. ప్రభుత్వమువా రాయనచర్య నంగీకరించిరి. ఇండియాప్రభుత్వమువారు మరునాడుదయమున ఈ సంగతి తెలుసుకొనిరి. షోలాపూరుమార్షలులా ఆర్డినెన్సు మే ౧౫ వ తేదీని ప్రకటింపబడెను. మే ౮ వ తేదీని షోలాపూరులో ౧౨ మంది మరణించిరి. ౨౮ మందికి గాయములు తగిలినవి. ఆరు ప్రత్యేకసందర్భములలో కాల్పులు జరిగెను; (భారతశాసనసభాచర్చలు, ౧౯౩౦ జూలై ౧౪-౨౭౨, ౨౩౮ పేజీలు, ౪వాల్యూము ౬ వ నెంబరు.)

ఈ పైవిషయములనుగూర్చిన వివరము క్రింద ఉదాహరింపబడినవి:

షోలాపూరులో కొన్ని విచారకరము లైన విషయములు జరిగెను. స్వచ్ఛంద సైనికులు ప్రజలను సర్దుబాటుచేయుచు వీధులలో యానములకు త్రోవచూపసాగిరి. ఈ విధముగా ప్రతిరోజున జరుగుతూండెను. అందువలన వీధులలో పోలీసువారి

అవసరమే లేకపోయెను. ఇందు కధికారుల కనుమాయ కలుగవలసిన అవసరములేదు. కాని, ఇటువంటి సందర్భములలో పోలీసువారికినీ, వాలంటీర్లకునూ సంబంధము కలుగుటకును, తగాదా కలుగుటకునుకూడా వీలు కలదు. తగాదా వచ్చెను. నలుగురైదుగురు పోలీసులు చంపబడిరి. ఇందుమూలమున ౧౯౧౯ లో, పాంచాలరాష్ట్రములోవలె, ఇక్కడకూడ సైనికశాసనము ప్రకటింపబడెను. ఆనాటి దుష్టచర్య లిక్కడకూడ జరిగినవి. నలుగు రురితీయబడిరి. వారిలో ఒక ధనవంతుడైన వర్తకుడుకూడ కలడు. ఇంకా అనేకమంది ఖైదీలు సైనికశాసనముక్రింద దీర్ఘ శిక్షలు విధింపబడిరి. జూలై, ఆగస్టునెలలలోజరిగిన సంధిరాయబారసందర్భములలో వారి విడుదలనుగూర్చికూడా చర్చకు వచ్చెను. కాని ఆరాజీ కుదరలేదు. దానినిగూర్చి ముందు వివరింతము

౧౯౩౦ ఏప్రిల్ ౨౩ వ తేదీని పెషావరులో జరిగినవిషయములను వివరింపవలసియున్నది. తక్కిన భారతదేశములోవలెనే శాసనోల్లంఘనోద్యమము పశ్చిమోత్తర సరిహద్దుపరగణాలలోకూడ ప్రచారములో నుండెను. ఏప్రిల్ ౨౩వ తేదీని సారాయి పికెటింగు ప్రారంభింపబడునని పెషావరునగరమున కాంగ్రెసు ప్రకటనచేసెను. కాని అది దుర్ముహూర్తమున ప్రారంభింపబడెనేమో అన్నట్లు జరిగినది. ఏప్రిలు ౨౨ న అ. భా. కాం. సం. వారి రాయబారము పెషావరుకు బయలుదేరెను. వారు పశ్చిమోత్తర సరిహద్దురాష్ట్ర నిబంధనలనుగూర్చి విచారించుటకు వెళ్లిరి. కాని అటక్ కడ వా రాపివేయబడిరి. ఈ వార్త పెషావరుకు తెలిసెను. ఆనగరములో ఒక బహిరంగ సభ సమావేశపరుపబడెను. షాహిబాగులో ఒక పబ్లికుమీటింగు జరుపబడెను. మరునాడుదయమున ౯ మంది నాయకు లరెస్టుచేయబడిరి. మరి ఇద్దరు నాయకులు ఉదయము ౯ గంటల కరెస్టుచేయబడిరి. కాని వారిని తీసుకొనిపోయే మోటారులారీ ఆగిపోవుట మూలమున నాయకులు తమంతటతాము ఠానాఆఫీసులో హాజరగుదు మని చెప్పిరి. ఆప్రకారము వారు పంపివేయబడిరి. ఆ ఏర్పాటుప్రకారము కాబూలీగేటు ఠాణాదగ్గరకు నాయకు లుత్సవముతో బయలుదేరి వచ్చిరి. కాని ఠానా మూసివేయబడియుండెను. ఒక పోలీసుఉద్యోగి గుర్రముపై నెక్కి ఆస్థలమునకు వచ్చెను. ప్రజలు జాతీయగీతములను పాడి జయధ్వనులను చేయసాగిరి. అతడు వెళ్లిపోయెను. కాని ఆకస్మికముగా రెండు మూడు మరఫిరంగులు వచ్చెను. అవి గుంపుపైకి తోలబడెను. ఈ సమయములో ఒక ఆంగ్లేయుడు మోటారుసైకిలుమీద తీవ్రముగా పరుగెత్తుకొనివచ్చి ఆ మరఫిరంగీ కారుపైన పడి మరణించెను. కారులోనున్న ఒకరు గుండ్లు కాల్చప్రారంభించిరి. ప్రమాదవశమున కారుకుకూడ నిప్పంటుకొనెను. డిప్యూటీకమీషనరు ఫిరంగికారులోనుండి బయటకువచ్చి ఠాణాకు పోతూండగా మెట్లపైనుండి పడి స్మృతితప్పిపోయెను. కాని కొంతసేపటి కాయన తేరుకొనెను. ఫిరంగులు తరువాత కాల్చబడెను. శవములను

లాగివేయుటకు ప్రజలు ప్రయత్నించిరి. సైన్యములును, కారులును అక్కడనుండి తీసు కొనిపోబడెను. రెండవసారి మరల తుపాకులు కాల్చబడినవి. ప్రభుత్వమువారు ప్రచు రించిన జాబితాప్రకారము 30 మంది మరణించినట్లు, 30 మందికి గాయములు తగిలినట్లు తెలియుగలదు. ప్రజలు దానికి ౬ రెట్లు మొదలు ౧౦ రెట్లవరకును లెక్కవేసి చెప్పెదరు. సాయంకాలము సైనికులు కాంగ్రెసు ఆఫీసుపైన దాడిపెడలిరి. వారు కాంగ్రెసుజెండాలను, వాలంటీర్ల బ్యాడ్జీలను లాక్కొనిపోయిరి. ఆకస్మికముగా ౨౫ వ తేదీని సైనికులను, మామూలుపోలీసువారునుకూడ తీసివేయబడిరి. ౨౭ వ తేదీని పోలీసు వారు తిరిగి ప్రత్యక్షమై పట్టణమును ఖిలాఫతు కాంగ్రెసువాలంటీర్లనుండి స్వాధీనపరచు కొనిరి. ఆవాలంటీర్లే మధ్యకాలములో నగరమును కాపలా కాయుచుండిరి. మే ౪ వ తేదీని నగరము సైనికులచే ఆక్రమింపబడెను.

మే ౬ వ తేదీన ప్రభుత్వమువారక్కడి విషయములనుగూర్చి ఒక ప్రకటన చేసిరి. దాని ప్రకారము ఠానాకు వచ్చెదమని అంగీకరించిన ఆ యిద్దరు నాయకులును ప్రజాసమూహముచే పోలీసుబందోబస్తునుండి బలవంతముగా తీసుకొనిపోబడిరని ప్రభు త్వమువారి వాదన. జాతీయకీర్తనలను, జయధ్వనులను విని పోలీసుఠానానుండి వెళ్లిన పోలీసుఉద్యోగి డిప్యూటీకమీషనరుతో తనను ప్రజలు రాతితో కొట్టిరనీ, పోలీసు స్టేషనుకడ దౌర్జన్యయుతమైన జనసమూహము చేరెననీ, పోలీసువారక్కడ సర్దుబాటు చేయుట కష్టముగా నున్నదనీ చెప్పినట్లు తెలియవచ్చెను. తరువాత పోలీసుకమీషనరు గేటుదాటగానే అతని కారుపైన గడ్డలు పడెను. అతడు వెనుకకు తిరిగిచూచి గుంపును సమాధానపరుప ప్రయత్నింపగా అతనిపైన తిరిగీ రాళ్లుపడెను. ఫిరంగికారులోనున్న మిలిటరీఉద్యోగిపైన కూడ తిరుగుబాటు జరిగెను. అతని రివాల్వరును ప్రజలు లాక్కొన ప్రయత్నించిరి. డిప్యూటీకమీషనరు పడద్రోయబడుటచే ఆయనకు స్మృతితప్పెను. ఫిరంగీకారుకు గుంపులు నిప్పుముట్టించిరి.

అంతట డిప్యూటీకమీషనరు తుపాకులను పేల్చుట కనుజ్ఞనిచ్చెను. ఏప్రిల్ ౨౭ వ తేదీని ౨౦ మంది మరణించిరి; 30 మందికి గాయములు తగిలెను. పెషావరు కాంగ్రెసుకమిటీవారు తురంగ్‌జాయి హాజీతో ఉత్తరప్రత్యుత్తరములను జరుపుచున్న ట్లును, ఆయన పెషావరుజిల్లాలో ప్రవేశించుట కొక లష్కరును సమకూర్చుకొని రా నున్నట్లును ప్రకటనచేసిరి. కాంగ్రెసు, నౌజవాన్ భారతసభలవారు తిరుగుబాటును పురి కొల్పనారంభించిరి.

శాసనోల్లంఘనోద్యమదినములలో ౧౯౩౦ మే ౩౧ వ తేదీని మిలిటరీ ఫ్యాక్టరీ లో పనిచేస్తూన్న గంగాసింగు కాంభోజి అనే ఒకరు పెషావరు నగరమునందు బం

డీలో తన పిల్లలతో సహా కాబూలీగేటుగుండా పోవుచుండగా ఒక బ్రిటిష్ సైనికుడా బండిపైన తుపాకి కాల్చెను. అప్పుడు ౯ సం॥ వయస్సు కలిగిన బీబీ హర్ప్రీల్ కార్ అను ఆయనకుమార్తెయున్నూ, ౧౬ నెలల వయస్సుగల కాకా బచ్చితార్ సింగు అనే ఆయన కుమారుడున్నూ చెట్టుమీదనుండి పక్షులు పడిపోయినట్లుగా చచ్చి క్రిందపడి పోయిరి. గంగాసింగుభార్య తేజ్ కౌరుకు హృదయముపైనను, చేతులపైనను తీవ్రమైన గాయములు తగిలినవి. ఆమెరొమ్ము పూర్తిగా ఎగిరిపోయినది. చనిపోయిన శవములు డిప్యూటీకమీషనరుఅనుజ్ఞతో ఉత్సవముతో శ్మశానవాటికకు కొనిపోబడెను. ఆ ఉత్సవములో వేలకొలది జనులు పాల్గొనిరి. ఆ శవములను శ్మశానవాటికకు తీసుకొనిపో తూన్న వాహకులపైనను, ఆ ఉత్సవములో పాల్గొన్న తక్కినవారిపైనను సైనికులు తుపాకులను కాల్చిరి. సైనికులు ప్రజలను చెదరిపొమ్మని హెచ్చరికైనను చేయలేదు; ౨ గజముల దూరమునుండి తుపాకులను కాల్చిరి. వాహకులు దెబ్బలుతగిలి పడిపోవుచుం డగా తిరిగీ కొత్తవారు శవములను మోసుకొనిపోతూవచ్చిరి. ఈ విధముగా ౯ మంది మరణించిరి. ౧౫ మందికి గాయములు తగిలెను. ప్రభుత్వమువారు ౧౮ సార్లు తుపాకు లను కాల్చినట్లుగా భారతశాసనసభలో సమాధాన మీయబడినది.

౧౯౩౦ జూలై నెలలో ప్రభుత్వమువారు మరియొక ప్రకటన గావించిరి. దానిని బట్టి ౧౧ వ నెంబరు ప్రెస్సు ఆర్డినెన్సుక్రింద రెండులక్షుల నలభై వేలరూపాయలవర కును పత్రికలనుండి ధరావతులు పుచ్చుకొనబడెనని, ౯ పత్రికలు ధరావతులు చెల్లింప నిరాకరించినందువలన ఆగిపోయెనని తెలియగలదు.

౧౯౩౦ జూలై ౩౧ వ తేదీని బొంబాయిలో లోకమాన్యతిలకుజయంతి జరుప బడెను. శ్రీమతి హంసామెహతా ఒక ఉత్సవమును బయలుదేరదీసెను. ఆమె అపుడు బొంబాయినగరపు కాంగ్రెసుకు సర్వాధికారి. అక్కడ వరుసగా 3 రోజులు అఖిల భారత కాంగ్రెసు కార్యసంఘసభ జరిగెను. ప్రభుత్వమువా రప్పటి కొకార్యసం ఘముపైన నిషేధపుటుత్తరువులను జారీచేయించలేదు. కొంతమంది కమిటీసభ్యులు సాయంత్రమా ఉత్సవములో పాల్గొనిరి. ఆ ఉత్సవము జరుగుతూండగా దానిని నిషే ధించినట్లు ౧౪౪ క్రిమినలు ప్రొసీజరుకోడుక్రింద ఉత్తరువులు జారీచేయబడెను. అప్పటికప్పుడే ఆ ఉత్సవమందు వేలతరబడిజను లుండిరి. ఆ నిషేధపు టుత్తరువులు జారీచేయబడిన తరువాత ప్రజలు రోడ్డుమీద కూర్చుండిరి. ఒక్కరుకూడా కదలలేదు. రాత్రిఅంతా కుంభవర్షము కురిసెను. జను లానీటికాలువలలోనే కూర్చుండిరి. అంతకుపూర్వ మట్టి నిషేధపుటుత్తరువు లొకసారి జారీచేయబడినపుడు అర్ధరాత్రమగు నప్పటికి మరల ఆ ఉత్సవము నధికారులు సాగనిచ్చిరి. కాని అనా డట్లు జరుగలేదు.

అప్పటి పోలీసుకమీషనరు హీలీ. ఆయన ప్రభుత్వమువారి పద్ధతి కనుగుణముగా వ్యవహారములు నిర్వర్తింపగలిగిన చతురతలేనివాడని తరువాత ప్రభుత్వమువారు గ్రహించిరి. ఛీఫ్ ప్రెసిడెన్సీ మేజస్ట్రీటు అప్పటి పరిస్థితులనుగూర్చి పూనాలోనున్న హోము మెంబరుకు తంతినిచ్చెను. ఆయన వచ్చేటంతవరకును ఏమీ జరుగకూడదని హోము మెంబరు హోస్సను ప్రత్యుత్తరమిచ్చెను. తరువాత ఆయన ఉదయమున వచ్చి విక్టోరియా టెర్మినస్ భవనముల పైనుండి గుంపులను చూచెను. ఉదయమున ముఖ్యులయిన వారు కొంతమంది అరెస్టుచేయబడిరి. వారితోబాటు ౧౦౦ గురు స్త్రీలుకూడా అరెస్టు చేయబడిరి. అరెస్టుచేయబడినవారిలో పండిత మదనమోహనమాలవ్యా, వల్లభాయి పటేలు, జయరాందాసుదౌలత్ రాం, కమలా నెహ్రూలు కలరు. వీరందరు అఖిలభారత కాంగ్రెసు కార్యసంఘసభ్యులు. గుజరాతు ఉప్పుసత్యాగ్రహమునందును, బోర్సాదు పన్నుల నిరాకరణోద్యమమునందును ప్రఖ్యాతిగాంచిన వల్లభాయిపటేలు కుమార్తె శ్రీమతి మణిబేన్ కూడ అరెస్టుచేయబడెను. పాంచాలరాష్ట్ర నివాసినియగు శ్రీమతి అమృతకార్ మొదలగు ౧౦౦ మంది స్త్రీలును, బొంబాయినగర కాంగ్రెసు సర్వాధికారిణియగు శ్రీమతి హంసమెహతాయు అరెస్టుచేయబడిరి.

నిషేధపుటుత్తరువులకు ప్రతికూలముగ సభలు సమావేశపరుపబడినపుడెల్ల బొంబాయిదృశ్యములు భయంకరముగానుండెను. పాతపోలీసుకమీషనరు బహుళా తగినంత కఠినముగా లేడనేకారణముచేత మరియొకచోటికి బదిలీచేయబడి, ఆయనస్థానమున మరియొక క్రొత్తవారు పిలిపింపబడిరి. ఆయనపేరు విల్సను. ఆయన గుంపులను తేలికగా చెదరగొట్టుటలో బహునేర్పరని ప్రభుత్వమువారి విశ్వాసము. ఆయన అధికారములోనికి వచ్చినవెంటనే అదివరకు శరీరముపై ఉపయోగింపబడే లాఠీ తలలపై నుపయోగింపబడసాగెను. తలలనుండి నెత్తురు ప్రవహింపసాగినవెంటనే వాలంటీర్లు గిరగిర తిరిగి నేలపై కూలిరి. ఆ భయంకరదృశ్యము బాధాకరముగానే యుండెనుగాని ఇరుగుపొరుగులనున్న గుంపులు విశేషముగా అట్టిదృశ్యములను చూచుట కాకర్షింపబడుచూవచ్చిరి. ఒకొక్కప్పుడు సభలలో ౫ వేలమొదలు ౨౫ వేలవరకును సభ్యులు చేరెడివారు. అంతకంత కాపోలీసుదౌర్జన్యము లెక్కువయ్యెను. చిట్టచివరి పెద్దపోరాటము పూర్ణస్వరాజ్యజయంతిరోజున జరిగెను. ఆనాడు అర్ధరాత్రివేళ ఉత్సవము జరుప నిశ్చయింపబడెను. ఆ ఉత్సవమున కొక లక్షమంది జనులు మూగిరి. పోలీసువారు తుపాకులను కాల్చుటమూలమున అది చిరస్మరణీయ మయ్యెను.

బొంబాయిలోని ఆజాదుమైదాన మాయుద్ధమునకు రంగభూమి. సత్యాగ్రహోద్యమము జరిగినన్నాళ్లను ప్రతినెల గాంధీజయంతి జరుపబడెను. గాంధీజయంతి

అనగా ఆయన ౧౯౩౦ మేనెలలో అరెస్టుఅయిన రోజు. ప్రతినెల చివరి ఆదివార మందును పతాకవందనము జరుపబడుతూ వచ్చెను. ఈ ప్రదర్శనములన్నీ పోలీసువారి తీవ్రములైన లాఠీదెబ్బలకు గురియైనవే. ఈసమావేశములకు వేలకొలది ప్రజలు హాజ రయ్యేవారు. ఒకచోట వారు చెదరగొట్టబడినయెడల అజదుమైదానములోని మరొక చోట వారు సమావేశమయ్యేవారు. ఆగోజులలో అజదుమైదానములోని ప్రజలను చెదరగొట్టుటే పోలీసువారి ఉద్యోగము. బొంబాయిలో వాలంటీరులను పోలీసువారు కొట్టేటప్పు డొక సంస్థానాధిపతి ఆదృశ్యమును చూచెను. అపు డాయన లాఠీచార్జీల కంటె సైనికశాసన మనేకరెట్లు మెరుగని అభిప్రాయమిచ్చెను. లాఠీచార్జీలను భరించ గల జాతి సైనికశాసనమును భరించగలుగు టొక లెక్కకాదని ఆయన చెప్పెను. ఆ సంస్థానాధిపతి బికనీరుమహారాజు. ఆయన బొంబాయిలో జరుగుచున్న ఒక ఉత్స వమును దర్శింపపోయెను. ఈ ఉత్సవము ౧౯౩౦ జూను ౨౦ వ తేదీనుండు కొంత కాలము క్రిందట జరిగెను. అపుడు పండిత మోతీలాలునెహ్రూగారా బొంబాయిలోనే యుండెను. ఉద్యమసందర్భములో అన్నిటికంటెను విచిత్రమైన విషయ మొక్కటి జరిగెను. చంద్రులును, మామగార్లును రౌండుటేబిలు మహాసభకొరకు లండనులో నుండగా వారికుమార్తెలును, కోడండ్రును భారతదేశ స్వాతంత్ర్యముకొరకు తమనెత్తురు ధారపోయదొడగిరి.

మద్రాసులోని లాఠీచార్జీలు విచక్షణలేకుండా జరిగినవి. ఒక క్రైస్తవప్రచా రకుడు రివరెండు పాటన్ (Rev. Paton) ఒక పోలీసుస్టేషను సమీపమున తీవ్ర ముగా లాఠీచార్జీచేయబడెను. ఆయన ఖద్దరుదుస్తులను ధరించి నెత్తిని హ్యాటుపెట్టు కొని దగ్గరనుండి పికెటింగును, లాఠీచార్జీలను చూస్తూఉండగా పోలీసువా రాయనను కొట్టిరి. దీనిపైన పోలీసువారి చర్యలనుగూర్చి తీవ్రమైన విమర్శనలు జరిగెను. కాని పోలీసువారుగాని, ప్రభుత్వమువారుగాని అందుకు తగిన పరిహారములు చేయకపోగా అంత విచక్షణలేకుండా పని జరిగినందుకు విచారమునైనను వెల్లడింపలేదు. దక్షిణ దేశములో షైతాను అనే ఒక క్రైస్తవ ప్రచారకునిపైన నిషేధపుటుత్తరువులు జారీ చేయబడెను. అందువలన ఆయన భారతదేశమును వెంటనే విడిచిపెట్టి వెళ్లిపోవలసి వచ్చెను.

ఆక్రమసంఘములను శిక్షించుటలో పోలీసువా రొక కొత్త ఉపాయమును కని పెట్టిరి. వా రాయాచోట్లనుండి కొంతమంది పికెటరుల నొకచోటికి చేర్చి వారందరినీ లారీలో ఎక్కించుకొని నగరమునకు వెలుపల చాలదూరముతీసుకొనిపోయి వారియొద్ద పైకములేకుండాచేసి వారిని అక్కడ వదిలిపెట్టేవారు. బొంబాయిలో విదేశీబట్టల పికెటింగున్నూ, అంగళ్లలోని విదేశీబట్టలను సీల్లుచేయించుటయున్నూ చాలా పట్టు

దలతో జరుపబడెను. విదేశీబట్టలు లారీలలో దొంగతనముగా తీసుకొనిపోబడుతూండగా బాబూగన్నూ అనే ఒక బాలుడు కాల్బదేవిరోడ్డుమీద ఆలారీ కడ్డముగా నిలబడి దాని నాపివేయదలపెట్టెను. లారీ ఆపిల్లవానిమీదుగా తోలబడెను. అతడు మరణించెను. ఇది జరిగిన నాటినుండీ కాంగ్రెసున కది పుణ్యదినమయ్యెను. తరువాత ప్రతినెలా బాబూగన్నూ మరణదినమున ఉత్సవము జరుపబడుతూవచ్చెను.

వల్లభాయి పటేలు తన మొదటి మూడునెలల శిక్షను అనుభవించిన పిమ్మట విడుదల చేయబడెను. ఆయన పండిత మోతీలాల్ నెహ్రూచే కాంగ్రెసుకు తాత్కాలికాధ్యక్షుడుగా నియమింపబడెను. బొంబాయి, గుజరాతు రాష్ట్రములలో ఆయన పని ప్రారంభించెను. ఉద్యమముయొక్క తీవ్రతను హెచ్చుచేసెను. ప్రచారకుల కాయన ఉపన్యాసములు నూతనోత్తేజము కల్పించెను. అప్పటికి దాదాపు కాంగ్రెసు సంస్థలన్నీ అక్రమపుసంఘములుగా ప్రకటింపబడుతూ ఒక ఆర్డినెన్సు జారీచేయబడెను. దానిమూలమున దేశములోని అన్ని కాంగ్రెసు కార్యాలయములను ప్రభుత్వమువారు స్వాధీనపరచుకొనసాగిరి. అప్పుడు జూలై ౧౩ వ తేదీని వల్లభాయిపటేలు భారతదేశములోని ప్రతిగృహము కాంగ్రెసుకార్యాలయ మనీ, ప్రతి ఆత్మ కాంగ్రెసు సంస్థ అనీ ప్రకటించెను. జూలై ౯ వ తేదీని భారతశాసనసభలో ఇర్వినుప్రభువు శాసనోల్లంఘనోద్యమమునకు ప్రతికూలముగా కత్తి ఝుళిపిస్తూ యిచ్చిన ఉపన్యాసమున కది తగిన ప్రత్యుత్తరము. ఈ శాసనతిరస్కారోద్యమమునకు గుజరాతురాష్ట్రమునందలి బార్డోలీ, బోర్సాదుతాలూకాలలో జరిగిన పన్నుల నిరాకరణ దండయాత్ర మకుటమువలె నుండదగినది. ఆసందర్భములో అధికారుల నిర్బంధవిధానమునకు తాళలేక ౮౦ వేల మంది రైతులు బ్రిటిషు హిందూదేశమునుండి దగ్గరగానున్న బరోడా సంస్థానములోని గ్రామములకు వలసపోయిరి.

వల్లభాయితల్లి ౮౦ ఏండ్ల వృద్ధురాలు. ఆమె వంటచేసుకొనుచుండగా పోలీసువారు ఆ అన్నపుకుండను పడగొట్టి, అన్నములో రాళ్లు, ఇసుక, కిరసనాయిలు కలిపి పోయిరి; ఇవిగాక గ్రామస్థులపై ఎన్నో అత్యాచారములను గావించిరి. కాని ఆ గ్రామస్థుల నిర్మాణబల మత్యద్భుతము. వారు అహింసను తూ, చా తప్పకుండా ఆచరించిన విధానము మరీ ఆశ్చర్యకరము. *

---

* ఉద్యమప్రారంభదశలో చిట్టగాంగుసైనికశిబిరముపైన ఒక దండయాత్ర జరిగెను. అందులో కొంతమంది భారతీయయువకులు సైనికదుస్తులలో పోయి చిట్టగాంగుసైనికులను కొందరిని కాల్చివేసిరి. ఇందుకు భయంకరములైన ప్రతిక్రియలు చేయబడెను. ౧౯౨౧-౨౧ లలో ఐర్లాండుదేశమునందలి బ్లాకు అండు టాన్సు (Black and Tans) కార్యక్రమముల నవి జ్ఞాపకముచేసెను.

భారతదేశములోని ప్రతిరాష్ట్రమూ జాతీయ సంగ్రామమునందు తన వంతు త్యాగమును తాను చేయగలిగెనని చెప్పినచో విశేషముగా వివరములను వ్రాయ నవసరములేదు.

ఆయా రాష్ట్రములలోని పరిస్థితులనుబట్టి ఉద్యమస్వరూపములో కొన్నిమార్పులు లేకపోలేదు. దక్షిణభారతదేశ మొకవిధముగా అత్యధికకష్టములను భరించెను. లాఠీచార్జీలు, పెద్దపెద్ద జరిమానాలు, దీర్ఘకాలపు శిక్షలు—ఇవి ఉద్యమముయొక్క ప్రధానదశలో ప్రభుత్వమువారిచే అవలంబింపబడిన ఆయుధములు. దేశములోని అన్ని రాష్ట్రములకంటె వంగరాష్ట్రమునం దెక్కువమంది ఖయిదులకు పోయిరి. బ్రిటిష్ వస్త్ర బహిష్కారము బెంగాలు, బీహారు, ఒరిస్సా రాష్ట్రములలో అతితీవ్రముగా కొనసాగింపబడెను. దిగుమతుల అంకెలనుబట్టి ౧౯౨౯ నవంబరులో ౯౦ నుం ౧౯౩౦ నవంబరులో ౧౦౦ కి ౧౫ వంతున బ్రిటిష్‌వస్త్రముల దిగుమతి పడిపోయినట్లు తెలియగలదు. భారతజాతీయ విముక్తికొరకు గుజరాతురాష్ట్రము పోరాడిన విధాన మిదివరకే చెప్పియుంటిమి. సంయుక్తరాష్ట్రములలో అక్టోబరు ౩౦ వ తేదీనుండి పన్నుల నిరాకరణము ప్రారంభమయ్యెను. జమీందార్లున్ను, రైతులున్ను కూడా పన్నులను నిరాకరింపవలెనని కోరబడిరి. పాంచాలముకూడా తక్కినరాష్ట్రములతో కలసినది. పశ్చిమోత్తర సరిహద్దురాష్ట్రములు దౌర్జన్యరాహిత్యసిద్ధాంతము నంగీకరించుటలో రాజకీయ ప్రయోజనముకంటె కూడా నైతికప్రయోజన మెక్కువ కలిగెను. బీహారులోని చాలాభాగములలో చౌకీదారు పన్ను చెల్లింపబడలేదు. ఆరాష్ట్రములో అదనపు పోలీసుదళము లేర్పాటు చేయబడెను. చిన్నచిన్న శిస్తులక్రింద పెద్దపెద్ద ఆస్తులను ప్రభుత్వమువారు స్వాధీనము చేసుకొనిరి. మధ్యరాష్ట్రములలో అటవీసత్యాగ్రహము జయప్రదముగా సాగెను. అక్కడివారు పోలీసువారి అత్యాచారములకుగాని, పెద్దపెద్ద జరిమానాలకుగాని లక్ష్యపెట్టలేదు. కర్ణాటకరాష్ట్రము ఖ్యాతికరముగ పన్నులనిరాకరణదండయాత్రను సాగించెను. ఈతచెట్లుగాని, తాటిచెట్లుగాని ఆరాష్ట్రములో ౩ లక్షలు కొట్టివేయబడెను. సిరిసీ తాలూకాలోని ౧౩౦ మంది పటేళ్లలోను ౯౬ మంది రాజీనామాల నిచ్చిరి. సిద్ధాపూరు తాలూకాలో ౭౫ మందీ, ఉత్తర కెనరాలోని అంకోలా తాలూకాలో కల ౬౩ మందిలోను ౪౩ మందీ రాజీనామాల నిచ్చిరి.

కర్ణాటకపన్నుల నిరాకరణమునందు "కెనరాజిల్లాలోని ౮ వందల పైచిలుకు కుటుంబములు పాల్గొనెను. సిద్ధాపూరు, అంకోలాతాలూకాలు చాల కష్టములకు గురియయ్యెను. అక్కడ ౮౦౦ మందికి ఖయిదుశిక్షలు విధింపబడెను. వారిలో ౧౦౦

మంది స్త్రీలుకూడ గలరు. ప్రభుత్వమువారు రయితుల ఆస్తులను, ఇండ్లను స్వాధీనపరచుకొనుటమూలముగగాని, వారి చరాస్తులను జప్తుచేయుటమూలముగగాని వారికి కలిగిన నష్టము మొత్తము ౧౫ లక్షలరూపాయిలు. ఈ క్రింద నుదాహరింపబడిన అంకెలనుబట్టి పోగొట్టుకొనబడిన పొలములును, ఇండ్లును తేలగలవు. ఇందులో చరాస్తులనష్టములు వివరింపబడలేదు."

అంకోలా, సిద్ధాపూరు తాలూకాలలో ౩౩౦ కుటుంబముల పొలములు స్వాధీనము చేసుకొనబడెను. ఆ కుటుంబములలోని జనసంఖ్య దాదాపు ౨ వేలు. ప్రభుత్వమువారిచే వశపరచుకొనబడిన పొలముల విస్తీర్ణము ౨ వేల యెకరములు; ఖరీదు ౮ లక్షల రూపాయలు. ౧ లక్ష ౫౦ వేల రూపాయల విలువగల ౧౬౬ ఇండ్లుకూడ స్వాధీనము చేసుకొనబడెను. ౨౧౮ మందికి శిక్ష విధింపబడెను. జప్తులు చేయబడిన చరాస్తులు ౨౦ వేల రూపాయల ఖరీదుండునని అంచనా వేయబడెను.

అనేకమంది రైతులు గృహములనుండి వెడలగొట్టబడిరి. కొన్ని ఇండ్లు పోలీసు శిబిరములుగా మార్చబడెను. ప్రభుత్వమువారిచే వశపరచుకొనబడిన భూములలోని పైరులను కోయుటకు యితర తాలూకాలనుండి కూలీలను తీసుకొనిరావలసివచ్చెను. పన్నులను నిరాకరించినవారి ఆస్తులను కొనిన గృహస్థుల సమ్ముఖములకడ ఉపవాసవ్రత మవలంబించిన స్త్రీ సత్యాగ్రహులు సిద్ధాపూరులో ౩౭ మంది యుండిరి. మావినగుండిలో ౩౧ రోజులు ఉపవాసవ్రత మవలంబింపబడెను. సిద్ధాపురములో ౧౧౦ మంది స్పెషలు పోలీసులును, వారికి తోడు అదనపు పోలీసులును ఉంచబడిరి.

అంకోలాలో అదనపు పోలీసులకొరకు ౩౭ వేల రూపాయలు వసూలు చేయబడెను. ౧౯౩౨ జనవరినుండి ఉద్యమము చిట్టచివరకు పన్నుల నిరాకరణమునుగూర్చిన ప్రత్యేకపు ఆర్డినెన్సు కెనరాలో అమలులోనే యుండెను. గుజరాతులోకూడ చివరభాగములో అమలులో లేదు. గుజరాతురైతులకు సందేశమును పంపుతూ సర్దారు వల్లభాయి కెనరాకర్షకులనుగూర్చి ఈ విధముగా చెప్పెను:

"కర్ణాటకములోని ధైర్యశాలు లయిన రైతులుకూడ మీవలెనే భూములను కోలుపోయి, ఆస్తులను త్యజించి, అనేకబాధలకు లోనగుతూండిరి. వారు జప్తులు, ఖయిదులు, ఆస్తులను కోలుపోవుట మొదలగు కష్టములను కోరి తెచ్చుకొనిరి. స్త్రీలును, పురుషులును కూడ వారి ఈకష్టములను లెక్కపెట్టలేదు. వారినా డనేకవిధముల నాశనమైపోయిరి. వారి త్యాగధైర్యములను గూర్చిన కథలు నాహృదయమును వారిలో లీనము చేసుకొనినవి. వారి కష్టసహిష్ణుత కొన్నిసమయములలో నన్నాశ్చర్యచకితుని చేసినది."

అంకోలాలోని పన్నులనిరాకరణ దండయాత్రకు రాజకీయోద్దేశ్యమే మూలము. సిరిసీ, సిద్ధాపురంతాలూకాలలో ఆర్థికకారణములుకూడ కొన్ని కలవు. కేరళరాష్ట్ర మన్ని రాష్ట్రములలోకీ చిన్నది. అందులో శాసనోల్లంఘనోద్యమము చిట్టచివరి రోజు వరకును కొనసాగుతూనేయుండెను. సిల్హెటుతో కూడిన అస్సామురాష్ట్రములో కూడ కాంగ్రెసుఆదేశము సరిగానే నిర్వర్తింపబడెను.

ఆయారాష్ట్రములలోని కొన్ని ముఖ్యవిషయములనుగూర్చి కొంతవడి చెప్ప వలసియున్నది. కాంగ్రెసుకార్యాలయములను మూసివేయుట, కాంగ్రెసు రికార్డులను, జెండాలను పోలీసువారు తీసికొనిపోవుట, లాఠీచార్జీలు, బహిరంగసభలు చెదరగొట్ట బడుట, కొన్ని ప్రదేశములపైనను, కొందరు ప్రజలపైనను ౧౪౪ వ సెక్షను జారీచేయ బడుట, వ్యక్తులపైన ౧౦౮ వ సెక్షను ప్రయోగింపబడుట, ఇండ్లపైన పోలీసువారి దండయాత్రలు, సోదాలు, ముద్రణాయంత్రములను స్వాధీనపరచుకొనుట, పత్రికలను, ముద్రణాలయములను ధరావతులు కోరుట—ఇవన్నీ అన్ని రాష్ట్రములలోను సమానము గానే జరిగెను. కాని భారతప్రభుత్వము సారాయి దుకాణముల ప్రయోజనముకొరకును, విదేశీబట్టల లాభముకొరకును నడుపబడెనని తెలుసుకొన్నప్పు డాశ్చర్యము కలుగక మానదు. వంగరాష్ట్రమందలి మిడ్నపూరుజిల్లా ఆ రాష్ట్రములోని నిర్బంధ విధానము నకు కేంద్రమయ్యెను. దెబ్బలు తిని నిస్సహాయులై పడియున్న వాలంటీరులకుగాని, లేక తదితర స్వచ్ఛందసైనికులకుగాని నిలువ నీడయిచ్చినందుకో, అన్నము పెట్టి నందుకో, మంచినీళ్లిచ్చినందుకో, ఆంధ్ర, వంగరాష్ట్రములలోని గృహస్థులు ఖైదు చేయబడిరి. వంగరాష్ట్రములోని కేర్సాయిలో చిన్నసెపముపైన తుపాకులు కాల్చ బడెను. కేర్సాయిలో ఒకమిల్లు జప్తుచేయబడినపుడు చుట్టును ప్రజలు మూగినందున తుపాకులు కాల్చబడెను. ఆ సందర్భములో ఒకడు మరణించెను. అనేకులకు గాయ ములు తగిలెను. చేచనాలో గుంపులు పరుగెత్తుతూన్నప్పుడు తుపాకులు కాల్చబడెను. ౬ గురు మరణించిరి. ౧౮ మందికి గాయములు తగిలెను. ఉప్పు తయారు చేయబడు తూండగా చూచుచున్న ఒకగుంపుపైన కాంటాయిలో ౧౯౩౦ జూను నెలలో తుపా కులు కాల్చబడెను. ౨౫ మందికి గాయములు తగిలెను. ఒకమనిషి అరెస్టు చేయబడి నందుకు కేర్సాయిలో గుంపు చేరెను. హెచ్చరిక చేయబడినప్పటికిని వారు చెదరిపోలేదు. వారిపైన తుపాకులు కాల్చబడెను. ౧౧ మంది మరణించిరి. జూను ౨౨ వ తేదీని జరుగవలసిన దేశబంధుదాసువార్షికోత్సవమును కలకత్తాపోలీసువారు నిషేధించిరి. ఆ ఉత్సవములో పాల్గొనిన పురుషులు నిర్దాక్షిణ్యముగా కొట్టబడిరి. స్త్రీలు ఘోషాను వీడి ముందు కురికి గాయపడినవారు గుర్రపుడెక్కలక్రింద నలిగిపోకుండా కాపాడ గలిగిరి.

పోలీసువారు కళాశాలాభవనములకు పోయి అక్కడ క్లాసుగదులలో కూర్చొన్న విద్యార్థులను కొట్టిరి. బారిసాల్ లాఠీఛార్జిలో ౫౦౦ మంది గాయపడిరి. తమలుకు (Tamluk) గ్రామములో పోలీసువారిచే సత్యాగ్రహులయొక్కయు, వారియందు సానుభూతి గలవారియొక్కయు ఆస్తులకు నిప్పంటించబడె నని వాడుక పుట్టెను. అనేకచోట్ల అవమానకరములైన దౌర్జన్యములు జరిగినట్లు తెలియవచ్చెను. గోపీనాధపురములో కాంగ్రెసువాలంటీరులు నిర్దాక్షిణ్యముగా కొట్టబడిరి. ఆ కొట్టబడిన వారిలో ఒక మహమ్మదీయబాలుడు కలడు. గ్రామస్థు లందుమూలమున ఆగ్రహావేశపరవశులయి పోలీసువారిని ఒక స్థానికపాఠశాలలో పెట్టి తాళమువేసి పాఠశాలకు నిప్పుముట్టించిరి. కాంగ్రెసువాలంటీరు లా పాఠశాల తలుపులను పగులగొట్టి, పోలీసువారి ప్రాణములను ఆమంటలనుండి సంరక్షించిరి. ౧౯౩౦ డిసెంబరు ౩౧ తేదీని పూర్ణస్వరాజ్యోత్సవసందర్భమున సుభాస్‌బాబు తీవ్రముగా కొట్టబడెను. ఆయన అంతకుపూర్వమే రాజద్రోహముక్రింద ఒక సంవత్సరము శిక్ష ననుభవించి విడుదలయి వచ్చెను. లాహోరులోని ప్రభుత్వాధికారులు అసహాయోద్యమముపేరుకే బెదరిపోయిరి. వా రసహాయోద్యమ వృక్షముయొక్క చిత్రపటమును నిషేధించిరి. ఒక ఘోషామహమ్మదీయస్త్రీ విదేశవస్త్రములను విక్రయించే ఇండ్లకడ పికెటింగు చేస్తున్నందుకు లూధియానాలో అరెస్టుచేయబడెను. ఆహారము బాగుండలేదనే కారణముతో భుజింప నిరాకరించినందుకు రావల్‌పిండిఖయిదీలపైన కేసు పెట్టబడెను. మాంటుగోమరీలో లాలా లక్ష్మీరాం అనేకరోజులు నిరాహారదీక్షపూని తుదకు మరణించెను. టాంటాంలో పోలీసువా రొక స్త్రీయెడ మొరటుగా ప్రవర్తించిరి. పంజాబు సెనేటుహాలులో పంజాబు గవర్నరుపైన తుపాకీ కాల్చబడెను. దాని నవకాశముగా తీసుకొని పోలీసువారు విచక్షణలేకుండా సోదాలుచేసిరి. బీహారులో ఉద్యమము ప్రశాంతముగా వృద్ధిబొందెను. సమస్తిపూరు సబుడివిజనులో సహాపూరు పటోరియా అనే పేరుగల యొక చిన్నబజారు ఉన్నది. జవహరుసప్తాహము జరుపబడిన నాల్గురోజులతరువాత ఒక పోలీసుసూపరింటెండెంటు ౧౨౫ మంది పోలీసువారితో పోయి ఆ బజారును ముట్టడించి ౪౬ మందిని అరెస్టుచేసెను. అందులో కొంతమంది ఆస్తులనుకూడా తీసుకొనెను. వాటిని ౧౨ ఎడ్లబండ్లపైన కట్టుకొని పోయెను. ఇతర జిల్లాలనుండికూడా అటువంటి రిపోర్టులు చాలావచ్చినవి. మాంఘీరు భాగల్‌పూరులు ఉద్యమమునకు ముందంజవేసెను. సారాయిదుకాణముల పికెటింగుమూలమున ౪౦ లక్షల రూపాయలు ప్రభుత్వమునకు నష్టమయ్యెను. మోతీహారులోని వరిచేలలోనికి సైనిక పోలీసులును, గూర్ఖాలును ప్రవేశించి పైరును పాడుచేసిరి. గ్రామప్రజలను భయపెట్టిరి. అనేకమంది గ్రామస్థులను అరెస్టుచేసిరి. చాంపరాన్, సారన్, ముజఫరుపూరు, మాం

ఖేరు, పాట్నా, షాహాబాదు జిల్లాలలో చౌకీదారీపన్నుల నిరాకరణ మేర్పాటుచేయ బడెను. అమరావతిలో ఖుర్వాలీ ఉత్సవమును జరిపినందుకు లాఠీఛార్జి జరిగెను ౧౯౩౦ డిసెంబరు ౨౧ వ తేదీని పెద్దాపురములో అల్పాహారవిందుకు సమావేశమయిన ౮౦ మంది మిత్రులను పోలీసువారు కొట్టుట ఆంధ్రదేశములో జరిగిన ముఖ్యమైన విషాద కరసంఘటనము. ఆసందర్భములో అక్కడందరికీ తీవ్రమైన గాయములు తగిలెను.అం దులో ముగ్గురు స్త్రీలుకూడా గలరు. ఆ విషయ మిప్పు డొక సివిల్ దావాకు కారణ భూతమైనది. కేరళరాష్ట్రములో ౧౦౦ కి ౭౦ చొప్పున కల్లుపాటలు పడిపోయినవి. తమిళనాడులో కల్లుపాట లాపివేయబడినందున తుపాకులు కాల్చబడెను. అనేక లాఠీఛార్జిలు చేయబడెను. ఢిల్లీలో సారాయివర్తకు డొక రావుబహద్దరు బిరు దాంకితుడు గలడు. ఆయన వందలకొలది వాలంటీరులను, ౮౦ మంది స్త్రీలను అరెస్టు చేయించుటకు కారణభూతుడై ప్రసిద్ధివహించెను. గుజరాతులోని రైతు లితరప్రాంత ములకు లేచిపోయినవిషయము చరిత్రప్రసిద్ధము. దానినిగూర్చి బ్రెయిల్సుఫోర్డు ఈక్రింది విధముగా వర్ణించెను:

"చరిత్రలో ఇదివర కెప్పుడూ కనీ, వినీ యెరుగని కొత్తపద్ధతి-వలసపోవుట- ప్రారంభమయ్యెను. ఒకరితరువాత ఒకరు కలిసి ఈ గ్రామస్థులు వారి చరాస్తులను ఎడ్ల బండ్లలో వేసుకొని బరోడాసంస్థానపు పరిహద్దులను దాటి తోలుకొనిపోయిరి. కొంతమంది పంటలను కోసుకొనుటకు తగిన వ్యవధి లేక పైరులను తగులబెట్టిరి. నే నొకసారి వారి శిబిరములను చూచితిని. గోడలకుమారుగా చాపల వడ్డము కట్టుకొనిరి. నీడకొరకు పైన తాటాకులు కప్పబడినవి. అప్పటికి వర్షములు పోయినవి కాబట్టి వారికి మేసెలవరకును భయము లేదు. వారికి చుట్టును వారిప్రేమాస్పదములయిన పశువు లున్నవి. ఆయిరుకులోనే వారిఇంటిసామానులన్నీ యున్నవి. అక్కడనే నాగళ్లు పరుపులు బిందెలు చెంబులు అన్నీ ఉన్నవి. మహాత్మా గాంధీబొమ్మకూడా ఉన్నది. వారిలో కొందరిని వా రిండ్లు విడిచిపెట్టినకారణ మడిగితిని. ఆయింటి యజ మానురాలు "మహాత్ముడు జెయిలులోనున్నాడు కాబట్టి" అని వెంటనే ప్రత్యుత్త రము చెప్పెను. కొందరు రయితులు "వ్యవసాయము లాభములేదు. పన్నులన్యాయ ముగా వేయబడినవి." అని జవాబుచెప్పిరి. ఒకరిద్దరు "స్వరాజ్యసంపాదనముకొరకు" కని చెప్పిరి.

"భారత్ కాంగ్రెసు అధ్యక్షునితో కలసి నేను ౨ రోజులు పాడుపడినగ్రామ ములలో సంచారము చేసితిని. తాళములు వేయబడిన ఆ కుటీరపంక్తులను వీధులవెంట చూస్తూపోతిమి. కిటికీచువ్వలలోనుండి ఖాలీగదులు తప్ప మా కేమీ కనుపించలేదు.

వీధులు ప్రశాంతములైన ఎండకాలపులవలె కనబడెను. అంతా చలనరహితముగా నుండెను. ఒకకోతి ఒక ఇంటిపైకప్పునుండి యెగురుటమాత్రము చూచితిని.

"కాని కొంతమంది గ్రామస్థులు కుటుంబములను, తమ వస్తువులను బరోడా గ్రామములో నుంచి తాముమాత్రము పొలములలో పనిచేసుకొనుటకు తమ గ్రామములకు తిరిగివచ్చిరి. వారిలో కొందరు పోలీసువారి దౌర్జన్యమును వివరించిరి.

"నేను కండ్లార కొన్ని విషయములను చూచియుండుటచే వారు చెప్పిన మాటలను నమ్ముట నా కంత కష్టముగా కనిపించలేదు. నా మోటారుకారు ఈ పాడుపడిన గ్రామములలోనుండి వస్తూండగా ఒక పోలీసుమనిషి ఒయొనెటు గ్రుచ్చిన తుపాకిని చేత పుచ్చుకొని మమ్ములను ఆగవలసిన దని ఉత్తరువుచేసెను. పోలీసువారి వ్రాత పూర్వకమైన ఉత్తర్వులేనిదే ఆ గ్రామమునుండి కదలకూడ దని మ మ్మాజ్ఞాపించెను. కాని, వాడు నాయూరోపియనుదుస్తులను చూచి, వెంటనే కంగారుపడి వచ్చీరాని ఇంగ్లీషుభాషలో "నేను మంచి పోలీసుమనిషిని" అని యేమేమో గొణిగెను. అతని దుస్తులపైన యెక్కడా అతని నెంబరు లేదు. అది నా కాశ్చర్యము కలిగించెను. నేను నెంబరు నడుగగా అతడు ప్రతిపోలీసువానికి రహస్యపు నెంబ రుండు నని నన్ను నమ్మించెను. అత ఁత్యవసరసందర్భములలో సమకూర్చబడిన పోలీసుదళమునకు సంబంధించినవాడు. ఐర్లండులోని బ్లాకు అండు టాన్సు (Black and Tans) ను పోలినవాడు. ఈ పోలీసువారి యూనిఫారములపైన నెంబరు కనిపించినయెడల అది వీరిని నిర్మించినవారి పొరపా టని చెప్పవచ్చును.

"ప్రభుత్వమువారిపైన బహిరంగముగా తిరుగుబాటువచ్చినపుడు వారు శాసనానుకూలముగా దానికి తగిన ప్రతిక్రియ చేసినయెడల ఎవ్వరును వారిని నిందింప వీలులేదు. ప్రభుత్వము కాంగ్రెసును అక్రమసంస్థగా ప్రకటించినది. బార్డోలీజిల్లాలోని చక్కని ఆశ్రమమును ప్రభుత్వమువారు స్వాధీనపరచుకొనిరి. నా కింతవరకును ఆతిథ్య మిచ్చిన సూరత్ కాంగ్రెసు అధ్యక్షుడు ఆయన నన్ను విడిచిన మరునాడే ప్రభుత్వమువారిచే అరెస్టుచేయబడెను. బార్డోలీనుండి లేచిపోయిన రయితుల ఆస్తులను ప్రభుత్వము ముట్టడించినది; వారి పొలములను విక్రయింపనున్నది. ఆ రయితులపన్నులను వసూలుచేసుకొనుటకు 'డబ్బిచ్చి తద్దినము కొనుక్కొన్నట్లు' బార్డోలీపొలములను కొనదలచుకొనినవారికై ప్రభుత్వమువారు వెతక ప్రారంభించిరి.

"ఇదంతా న్యాయశాస్త్రప్రకార మాడిన ఆటే. ఇక ప్రజలను భయభ్రాంతులనుగా చేయుపద్ధతికూడా ఉపయోగింపబడుతూం డెను. నా నోటుబుక్కులో రయితులు ప్రభుత్వోద్యోగులపైన చేసిన నిందారోపణములనేకము లుదాహరింపబడినవి.

ఆకథల యథార్థమును నేను తెలుసుకొనలేకపోతిని. వారిని జాగ్రత్తగా ప్రశ్నించితిని నాకు సందేహము కలుగలేదు. ఈ నోటుబుక్కులోని విషయములు పేరులతో, తేదీలతో సహా ఉన్నతోద్యోగులకు చేరగలవు. ఒకగ్రామము ప్రతిరాత్రి కొందరు దుండగీండ్రచే ముట్టడింపబడుతూ వచ్చెను. వారు ప్రచ్ఛన్నవేషములతో తుపాకులను పేల్చిరి. ఒక సందర్భములో ఒకముసలిరైతు గొడ్డలితో హత్య గావింపబడెను. గ్రామస్థులు సహాయము కోరగా ఒకపోలీసు ఉన్నతోద్యోగి "నీవు పన్ను చెల్లించిన యెడల నీకు సహాయము వచ్చును" అని ప్రత్యుత్తరము చెప్పెను. పోలీసువారు లాఠీలతో అకారణముగా కొట్టిరన్న నేరములు చాలచోట్ల మోపబడెను.

"నేను జాగ్రత్తగా గుచ్చిగుచ్చి అడిగి మరొకవిషయమును తెలుసుకొనగలిగితిని. అది పాడుపెట్టబడిన అఫ్వా (Afwa) గ్రామములో జరిగినది. ఈగ్రామములో కొంతమంది పొలములేనివారు నిలిచిపోయిరి. మరికొంతమంది బరోడాసంస్థానమునుండి తమ పొలములను వ్యవసాయము చేసికొనుటకు తిరిగివచ్చిరి. అక్టోబరు ౨౧ వ తేదీన తెల్లవారుజామున 3 గంటలకు ఒక సబ్‌యిన్‌స్పెక్టరు కొంతమంది పోలీసులను మోటారు కారులో తీసుకొని ఆగ్రామముచేరెను. పోలీసువారు పొలములలో నిద్రించుచున్న ఈ రైతులను చూచి వారిని కొట్టి పన్ను చెల్లించవలసినదని కోరిరి. తరువాత ఆ రయితులు సబ్‌యిన్‌స్పెక్టరు దగ్గరకు తీసుకొనిపోబడిరి. ఆయన కొందరిని చేతులతో కొట్టెను; కొందరిని కాళ్లతో తన్నెను; ఇద్దరు సోదరులను పట్టుకొని వారితలలను డీడిక్కి కొట్టించెను. ఒకడు కుంట నారంభించెను. మరియొకనికి దెబ్బలు తగిలి వాపులు కనిపించినవి. తరువాత వారు మోటారులారీలో బాగ్దోలీలాకప్‌కు తీసుకొనిపోబడిరి. అక్కడ సబ్ యిన్‌స్పెక్టరు వారిని వ్రాయుటకు వీలులేని బెదరింపులు బెదరించెను. వారిభార్యలకు వారిని నిష్ప్రయోజకులుగా నొనర్తు ననెను. ఆ బెదరింపు పనిచేసినది. తమ్ముడు తాను భూమిఖామందు కాకపోయినప్పటికి తనతండ్రిపొలమునకు పన్ను చెల్లించెను. మరియొకసందర్భములో త్రోవను పోతూన్న ఒకగ్రామస్థుని పట్టుకొని పోలీసువారు కొట్టిరి; అతనిజేబులోనున్న సొమ్మును తీసుకొనిరి; అక్కడ పన్ను చెల్లించవలసిన ఒకరయితుపేరుమీద అతనికి రశీదిచ్చి ఆసొమ్మును ఆరయితునుండి రాబట్టుకొనమని ఆకొత్తవానికి సబ్‌ఇన్స్పెక్టరు సలహా యిచ్చెను. ఈ సబ్ యిన్‌స్పెక్టరుకు క్రూరత్వమునకుతోడు తెలివితేటలుకూడా ఉన్నవి. ఆ గ్రామమునకు వచ్చిన మరియొక కొత్తవానిని పట్టుకొని అతనిబంగారునగలను సబ్‌ఇన్‌స్పెక్టరు స్వాధీనపరచుకొనెను. వేలం వేయబడే చరాస్తులను కొనుడని ఆయన కొందరు గ్రామస్థులను బలవంతపెట్టెను. ఈ రకముగా నే నెంతపొడుగునకైనా యీకథ చెప్పవచ్చును. ఇది అంతా ఆ అధికారి

ఉదయించేసిన పని. నేను నిజముగా ఇతనినీ, యితని అవకతవకలనూ చూచియుండని యెడల రయితులు చెప్పినమాటలను నమ్మియుండేవాడను కాను. అటువంటి ఉద్యోగస్థులమూలమున "నోరులేని ప్రజాసమూహములకు" న్యాయము తిరస్కరింపబడెను."

ఈవిషాదకరసంఘటనమునుగూర్చి పూర్తిచేసేముందు పెషావరువిషయమును, అక్కడి పఠానులవిషయమును కొంత చెప్పవలసియున్నది. వీరు క్రూరత్వమునకును, దౌర్జన్యమునకును పేరు గడించినవారు. కాని నేను గోవులవలె అహింసాసిద్ధాంతమును స్వీకరించిరి. ఖాన్ అబ్దుల్ గఫర్ ఖాన్ తన ఖుదైఖిద్‌మత్‌గారులను స్థాపించెను. వారికి క్రమశిక్షణముల నిచ్చెను. వారు నేను అహింసావ్రతము నవలంబించిరి. భారతదేశములో భయంకరసీమగా భావింపబడిన ఆదేశము నేను దౌర్జన్యరహితసహాయనిరాకరణోద్యమమునకు సురక్షితమైన కేంద్రమైనది. సరిహద్దురాష్ట్రములలో జరిగిన ఘోరకృత్యములు బయటపెట్ట వీలులేకుండ చేయబడెను. వాటినిగూర్చి విఠల్ భాయి వ్రాసిన నివేదిక ప్రభుత్వమువారిచే నిషేధింపబడెను. కాని కొన్ని విషయములుమాత్ర మందరికీ తెలుసును. వాటి నెవ్వరూ కాదనలేరు. కొన్ని ఇదివరకే ఉదాహరింపబడినవి.

సరిహద్దురాష్ట్రములలో జరిగిన ఒకవిషయ మిక్కడ చెప్పవలసియున్నది. ఆ రాష్ట్రములో అవలంబింపబడిన నిర్బంధవిధానసందర్భమున కొంతమంది ఘూరివాలా సిపాయి లొకసమావేశముపైన తుపాకులను కాల్చ నాజ్ఞాపింపబడిరి. ప్రశాంతముగానున్న నిరాయుధులగు జనులపైన తుపాకులను కాల్చుటకు వారికొరకు తేబడిన లారీపైన వా రెక్క నిరాకరించిరి. అందుకొరకా సిపాయిలు సైనికన్యాయస్థానమునందు విచారింపబడి శిక్షింపబడిరి. వారికి ౧౦ సంవత్సరములు మొదలు ౧౪ సంవత్సరముల వరకునూ గల దీర్ఘశిక్షలు విధింపబడెను. ౧౯౩౧ మార్చినెలలో ప్రభుత్వమువారికిని, కాంగ్రెసుకును జరిగిన చిట్టచివరి రాజీరాయబారములలో ఈ ఖయిదీల విడుదలను గూర్చి చర్చ వచ్చినది.

ఇందునుగూర్చిన వివరములు తెలుసుకొనేముందు గాంధీ ఇర్విన్ ఒడంబడిక ఫలితముగా వీరు విడిచిపెట్టబడలేదనీ, కాని కొన్ని సంవత్సరములు గడచినతరువాత వారిశిక్షలు తగ్గింపబడినవనీ, అందులో కొంతమంది తరువాత విడిచిపెట్టబడిరనీ, మరి కొంతమంది యింకా ఖయిదులోనే ఉంచబడిరనీ చెప్పిన చాలును.

ఇక ఈ విచారచరిత్రను ముగించేముందు బోర్సాదుస్త్రీల శౌర్యమునుగూర్చి చెప్పవలసియున్నది. ఆస్త్రీలు ౧౯౩౧ జనవరి ౧వ తేదీని ఒక ఉత్సవమును జరుప

నప్పుడు త్రాగుట కక్కుడక్కుడ మంచినీళ్లకుండ లుంచుకొనిరి. పోలీసువారు ముం దాకుండలను పగులకొట్టిరి. స్త్రీలను బలవంతముగా చెదరగొట్టిరి. స్త్రీలు కింద పడి పోయినప్పుడు పోలీసువారు వారి రొమ్ములపైన బూట్లతో నెక్కితొక్కి రని స్పష్ట ముగా నిందారోపణ చేయబడెను. ఇది పోలీసువారు చేసిన చిట్టచివరి క్రూర కృత్యము.

జనవరి ౨౬ వ తేదీని గాంధీ, ఆయనసహచరులూ ఏవిధమైన షరతులునూ లేకుండా విడుదలచేయబడినట్లు ప్రకటింపబడెను.

రాజీరాయబారముల కవకాశము కల్పింపబడుటకై వారు విడుదల చేయ బడిరి. నిజమున కిట్టి రాయబారములు ౧౯౩౦ జులై, ఆగష్టు నెలలలోనే జరిగెను. కాని అవి నిష్ఫలములైనవి. వీటినిగూర్చి కొన్ని వివరములను వ్రాసెదము. అవి అకాల ములో ప్రారంభింపబడుటచేత నిష్ఫలము లైనవి. భారతదేశమున ఉద్యమనిర్మాణ మప్పటి కింకను పూర్తికాలేదు. వాలంటీరులు బహిరంగముగా పోరాటముల కింకను సిద్ధము కాలేదు. ప్రభాతఫేరీలును, బొంబాయినగరములోని వానర సైన్యములును ఇంకా చరిత్రప్రసిద్ధములు కాలేదు. లక్షలాదిగా వేయబడే కాంగ్రెసు బులెటిన్లు ప్రచారములోనికి రాలేదు. అవి ముద్రింపబడిన విధానమునుగూర్చి, వాటికి వెనుకనున్న మానవశక్తినిగూర్చి ప్రజల కింకా ఆశ్చర్యము కలుగలేదు. బొంబాయి, అహమ్మదా బాదువర్తకుల స్వార్థత్యాగ దేశాభిమానములు తరువాత ప్రదర్శితము లైనట్లుగా అప్పటి కింకా ప్రదర్శితములు కాలేదు.

తిరిగీ మనము జూను, జులై, ఆగష్టు నెలలకు పోదముగాక. ౧౯౩౦ జూను ౨౦ వ తేదీని పండిత మోతీలాలు నెహ్రూ జైలుబైట నుండెను. ఆయన డెయిలీ హెరాల్డు పత్రికా ప్రతినిధి స్లోకోంబుతో కొన్నివిషయములు చెప్పెను. తరువాత కొద్దికాలమునకే స్లోకోంబు బొంబాయిలో తిరిగీ పండితునితో మాటలాడెను. అపుడు రౌండుటేబిలుమహాసభలో కాంగ్రెసు పాల్గొనుటకు తగిన షరతులనుగూర్చి ముచ్చ టింపబడెను. స్లోకోంబు తాను వ్రాసిన కొన్నిషరతులను పండితునిముందు పెట్టెను. మోతీలాలుపండితుడు, జయకర్లు ఆషరతులను చర్చించిరి. తరువాత స్లోకోంబు సప్రూ కొక ఉత్తరము వ్రాసెను. చిట్టచివరకు సప్రూ, జయకర్లు ఈ షరతుల నాధా రముగా చేసుకొని వైస్రాయిదగ్గరకు మధ్యవర్తులుగా పోయిరి. పండిత మోతీలాలు నెహ్రూ కాంగ్రెసు అధ్యక్షుడైన పండిత జవహరలాలునెహ్రూదగ్గరకును, గాంధీ దగ్గరకును రాయబారము పోవుట కంగీకరించెను. కాని "అంతకుముందు బ్రిటిష్‌గవర్న

యుత ప్రభుత్వమును ప్రోత్సహింతు మని ప్రయివేటుగా వాగ్దానములను చేయవలెను. రౌండుటేబిలు కాన్ఫరెన్సువారు చేసే సిఫార్సులకుగాని, తరువాత పార్లమెంటువారా సిఫార్సులయొక్క అవలంబించే విధానమునకు గాని ప్రస్తుతము సంబంధము లేదు. ఇండియా ప్రభుత్వమువారును, బ్రిటిష్ ప్రభుత్వమువారును ప్రయివేటుగా చేసే వాగ్దానము రౌండుటేబిలు కాన్ఫరెన్సువారి మరతులకును, కొన్ని మార్పులకును లోబడియుండవచ్చును." అని మోతీలాలు చెప్పెను. ఈ సిద్ధాంతముపైన ఆ మధ్యవర్తులు జెయిలులోనున్న మోతీలాలు, జవహరలాలు, గాంధీలను దర్శించుటకు రాజప్రతినిధికి వ్రాసి,అనుజ్ఞను పొందకోరిరి. ఇది జూలై ౧౩ వ తారీఖున జరిగినవిషయము. అప్పటికి మోతీలాలు శిక్షింపబడెను. వైస్రాయి తన జవాబులో స్వపరిపాలనమునుగూర్చి ఆదివరకు ధోరణిని మరికొంచెము తగ్గించెను. ఆయన "వారి సొంతవ్యవహారములనుచాలా వరకు పరిపాలించుకొనేటట్లు భారతప్రజలకు సహాయము చేయుటకు" వాగ్దానము చేసెను. ఈరెండు కాగితములను పుచ్చుకొని సప్రూ, జయకర్లు ౨౩, ౨౪ తేదీలలో ఎరవాడజైలునందు గాంధీని దర్శించిరి. దానిపైన గాంధీ ఒకఉత్తరమును, ఒకచీటిని వ్రాసి అలహాబాదు నైనీజైలులో ఉన్న నెహ్రూల కియ్యవలెనని వారిచేతి కిచ్చెను. గాంధీ రౌండుటేబిలుసభలో కేవలము సంరక్షణలను (Safe gaurds) గూర్చి మాత్రమే చర్చింపబడవలె నని కోరెను. ప్రభుత్వపద్ధతిలో సంపూర్ణమైన మార్పు కలిగే మధ్యకాలమందు సంపూర్ణస్వాతంత్ర్యమును గూర్చిన విషయము విరమింపబడరా దని ఆయన అనెను. రౌండుటేబిలుమహాసభా నిర్మాణము సంతృప్తికరముగా నుండవలె ననెను. శాసనోల్లంఘన మాపివేయబడినప్పటికీ ప్రభుత్వమువారు వారంతట వారే విదేశవస్త్రములను, సారాయి దుకాణములను నిషేధించిననేతప్ప తక్కిన సందర్భములలో సారాయిదుకాణములవద్దను, విదేశిబట్టల అంగళ్లవద్దను పికెటింగు కొనసాగుతూనేఉండవలెనని ఆయన కోరెను. ఉప్పుతయారుచేయబడుటకుకూడా అభ్యంతర ముండకూడదని ఆయన అభిప్రాయమిచ్చెను.

తరువాత ఆయన ఖయిదీల విడుదలనుగూర్చి, ఆస్తులను, జరిమానాలను, ధరావతులను తిరిగీ ఇచ్చుటనుగూర్చి, రాజీనామా ఇచ్చిన ఉద్యోగస్థులకు తిరిగీ ఉద్యోగము లిచ్చుటనుగూర్చి, ఆర్డినెన్సులను రద్దుచేయుటనుగూర్చి ఉదాహరించెను. తాను ఖయిదీననీ, అందువలన రాజకీయవ్యవహారములపైన తన కిప్పు డభిప్రాయమిచ్చుటకు అధికారము లేదనీ, ఈ సూచనలు ముఖ్యముగా తనవేననీ, ప్రతిస్వరాజ్య ప్రణాళికను తా నిదివరకు వ్రాసిన పదకొండువిషయములతో పోల్చి చూచుకొనుటకు తనకు హక్కు కలదనీ వివరించెను. నెహ్రూలకు వ్రాసిన ఉత్తరములో రాయబారములకు

ఆ రాయబారులు నెహ్రూలను జూన్ ౨౭, ౨౮ తేదీలలో సందర్శించి వారితో పూర్తిగా చర్చించిరి. ౧౯౩౦ జూలై ౨౮ వ తేదీని నెహ్రూలు ముఖ్యమైన విషయములలో ఒక ఒడంబడిక కుదిరితేనే తప్ప ఏసభవలనను ప్రయోజనములేదని అభిప్రాయమిచ్చిరి. రాజ్యాంగ నిర్మాణవిషయమును గూర్చి గాంధీ వ్రాసిన విషయము తనకు గాని, తనతండ్రిగారికిగాని సంతృప్తికరముగా లేదని జవహరలాలు ప్రత్యేకముగా ఉదాహరించెను. గాంధీగారి సూచనలు నేటికాలమునకు తగినట్లుగాగాని, లేక కాంగ్రెసు సిద్ధాంతమునకు తగినట్లుగాగాని లేవని ఆయన అభిప్రాయము. జూలై ౩౧,ఆగష్టు౧,౨ తేదీలలో జయకరు గాంధీని సందర్శించెను. ఇష్టమైనప్పుడు సామ్రాజ్యమునుండి విడిపోవుటకు భారతదేశమునకు హక్కు లేకపోయినయెడలను, తా నిదివరకు చెప్పిన ౧౧ విషయముల సందర్భములోను భారతదేశము సంతృప్తికరముగా పరిష్కరించుకొనుటకధికారము లేనియెడలను తన కారాజ్యాంగ నిర్మాణవిధాన మక్కరలే దని గాంధీ చెప్పెను. బ్రిటిష్ హక్కులను బ్రిటిష్‌వారి కిదివర కీయబడిన అధికారములను విచారించుట కొక స్వతంత్రమైన కమిటీ ఉండవలెననికూడ ఆయన కోరెను. వైస్రాయి తన అభిప్రాయములను స్పష్టముగా తెలుసుకొనవలెనని కూడా గాంధీ చెప్పెను. లేని యెడల గాంధీమాటలు తన కాశ్చర్యము కలిగించిన వని ఆయన తరువాత నిష్ఠురములాడవచ్చునని కూడ చెప్పెను. కొద్దికాలమునకే డాక్టరు సయ్యదు మహమ్మదున్ను, ఇద్దరు నెహ్రూలున్ను గాంధీతోను, తదితర మిత్రులతోను కలసి మాట్లాడుట కవకాశముగా నుండునట్లు ఎరవాడజైలుకు పంపబడిరి.

ఆగస్టు ౧౨వ తేదీని గాంధీ, నెహ్రూ, వల్లభాయిపటేలు, డాక్టరు సయ్యదు మహమ్మద్, జయరామదాసు దౌలత్‌రామ్, సరోజినీనాయుడు ఒకపక్షమునను, సంధి రాయబారులు మరియొక పక్షమునను కలసి మాట్లాడుకొనిరి. దాని ఫలితముగా ఆగస్టు ౧౫ వ తేదీని అక్కడ హాజరుగానున్న కాంగ్రెసువారు అందరును ఒక ఉత్తరము వ్రాసి, దానిపైన సంతకములనుచేసిరి. అందులో ఇదివరకు వారు రాజీకొరకు సూచించే షరతు లన్నీ ఉదాహరింపబడెను. ఇండియాదేశమునకు బ్రిటిష్‌సంబంధమును వదలుకొనుటకు హక్కుండవలెననీ, బ్రిటిష్‌హక్కులను వారి పాకర్యములను విచారించుటకు స్వతంత్రమైన కమిటీ ఒకటి ఉండవలెననీ కూడా ఉదాహరింపబడెను. ఈ రాయబారముల సందర్భములో గాంధీ, సరోజినీనాయుడు, వల్లభాయిపటేలు, జయరామదాసు-వీరందరును శాంతి సమకూర్చుటకు ప్రయత్నించిన ఆరాయబారులకు కృతజ్ఞత చూపిరి. "కాంగ్రెసుసంస్థల అధిపతు లెవరయినను మాలో యెవరి

కోరయెడల వారు జయము పొందుట కేమీ కష్టము లేదు." అని ఎరవాడజైలులోని కాంగ్రెసునాయకులు సూచించిరి.

రాజప్రతినిధి ఆగస్టు ౨౮ వ తేదీని ఒక ఉత్తరము వ్రాసెను. అందులో ఖయిదీలను ఔదార్యముగా విడిచిపెట్టేవిషయమును యోచించవలసిన దని తాను స్థానికప్రభుత్వములకు సూచించెదననీ, ఆయాకేసుల గుణాగుణములనుబట్టి వారు విచారింతురనీ ఆయన వ్రాసెను. నెహ్రూలు తిరిగి నైనీజైలుకు తీసుకొనిపోబడిరి. తరువాత ఇర్విన్ ప్రభువు రాయబారముల ప్రారంభవిషయములనుకూడ చర్చించుటకు వీలులేదని చెప్పినట్లుగా 30 వ తేదీని నెహ్రూలు గాంధీపేర వ్రాసిరి. వైస్రాయి వ్రాసిన ఉత్తరమును బట్టి ఇండియాప్రభుత్వమువారికి రాజీపైన ఇష్టములేదనికూడా వారికి తోచినట్లు నెహ్రూలు వ్రాసిరి. తరువాత కొంతకాలమువరకును ఉత్తర ప్రత్యుత్తరములు జరిగినవి. కాని రాయబారము లపజయము పొందినవి.

ఈ రాయబారములనుగూర్చీ, అవి అపజయముపొందినవిధానమునుగూర్చీ౹౮ (ఎ) అనుబంధములో ముద్రింపబడినవి. జయకరు సప్రూరాయబారములు భగ్నమైనంత మాత్రమున భారతదేశశ్రేయోభిలాషులకు నిరాశకలుగలేదు. హారేస్ జి. అలెగ్జాండరు ఒక అంతర్జాతీయపండితుడు గాంధీకినీ, వైస్రాయికినీ రాజీ కుదుర్చవలె నని ఇద్దరిని దర్శించెను. ఆయన గాంధీతో మాట్లాడినప్పుడు గాంధీకోరికలయొక్క స్పష్టతను చూచి ముగ్ధుడయ్యెను. గాంధీ పెద్దపెద్దపేర్లతో కంగారు పెట్టక భారతదేశ దారిద్ర్యమును గూర్చిన సమస్యలను స్పష్టముగా వివరించినందు కాయన సంతోషించెను. అప్పటికప్పుడే ఇర్విన్ప్రభువు సుమారు ౧౨ ఆర్డినెన్సులను ప్రకటించెను. వాటిలో అన్‌లాఫుల్ ఇన్‌స్టిగేషన్ ఆర్డినెన్సు, ప్రెస్సుఆర్డినెన్సు, అక్రమసంఘపు ఆర్డినెన్సుకూడా ఉన్నవి. ఇర్విన్ప్రభువు ఒక ప్రక్క ఆర్డినెన్సులను ప్రయోగిస్తూ మరియొక ప్రక్క భారతజాతీయతనుగూర్చి కొద్దిగా శ్లాఘింప ప్రారంభించెను. ఆయన కలకత్తా యూరోపియన్‌సంఘసమక్షమున ఉపన్యసిస్తూ, "మనము శాసనోల్లంఘనము నెంత నిరసించినప్పటికీ భారతీయభావములను వికసింపచేస్తూన్న భారతజాతీయశక్తిని మాత్రము తక్కువగా తలంపకూడదు" అని చెప్పెను. ఈ ద్వంద్వవిధానము బ్రిటిష్‌రాజకీయతంత్రములోనే ఉన్నది. సీమలో భారతరాజ్యాంగకార్యదర్శి రౌండుటేబిలు మహాసభ కేర్పాటులు చేయుచుండగా భారతదేశములో రాజప్రతినిధి కత్తి ఝుళిపించుట ద్వంద్వవిధానము కాక మరి యేమి? రౌండుటేబిలుమహాసభ ౧౯౩౦ నవంబరు ౧౨ వ తేదీని సమావేశమయ్యెను. దానికి ౮౯ మంది ప్రతినిధులు హాజరైరి. ౫౭

గురు ఇంగ్లాండులోని వివిధరాజకీయకక్షులకు చెందినవారు. ఆ సభలో అందరును అధినివేశ ప్రతిపత్తినిగూర్చి మాట్లాడిరి. పాటియాలా, శికందర్, ఆళ్వార్, భోపాల్ మహారాజులు ఫెడరేషనుకు అనుకూలముగా నుండిరి. భారతస్వాతంత్ర్యమునుగూర్చి మహోపన్యాసము చేసిన శాస్త్రిగారు మొట్టమొదట ఫెడరేషన్ అంటే ఇష్టపడలేదు గాని తిరువాతమాత్రము ఫెడరేషను కనుకూలుడుగా మారిపోయెను. ప్రధానమంత్రి రాజ్యాంగనిర్మాణవిధానములకు కావలసిన రెండు ముఖ్యాంశములను సూచించెను. "(౧) అది పనిచేయవలెను. (౨) అది క్రమపరిణామమును పొందవలెను." అని ఆయన చెప్పెను. అనేక ఉపసంఘములు నియమింపబడెను. ఆకమిటీలన్నీ వోటింగు హక్కునుగూర్చి, దేశసంరక్షణమునుగూర్చి, సరిహద్దురాష్ట్రములనుగూర్చి, బర్మానుగూర్చి, ప్రభుత్వోద్యోగములనుగూర్చి, ఫెడరల్ నిర్మాణమునుగూర్చి నివేదికలు పంపినవి. మహాసభ తొందరగా పూర్తికావలెనని జరుపబడెను. అది జనవరి ౧౯ లో జరిగినది. అందులో ఈ సబ్‌కమిటీలకు పంపిన నివేదికలు చాలా విలువగలవనీ, భారత రాజ్యాంగవిధానమును నిర్మించుట కవి సహాయము చేయగలవనీ తీర్మానింపబడెను.

ఫెడరల్ పద్ధతిమీద సంస్థానములకును, రాష్ట్రములకును ప్రాతినిధ్య ముండునట్లుగా నిర్మింపబడిన శాసనసభకు కార్యనిర్వాహకసభ్యులు జవాబుదారీ వహింపవలెననే సిద్ధాంతమును తా నంగీకరింతు నని బ్రిటిష్‌ప్రధానమంత్రి స్పష్టముగా చెప్పెను. సైన్యవ్యవహారములును, విదేశరాజ్యాంగములును ప్రభుత్వవిషయములుగా నుండునని. ప్రభుత్వముయొక్క భద్రతను, దానియొక్క ఆర్థిక స్థిరత్వమును కాపాడుటకు గవర్నరు జనరలుకు ప్రత్యేకాధికారము లుండవలెనని ఆయన చెప్పెను. తిరువాత ఇంకా కొన్ని ఇతరవిషయములు వివరింపబడినవి. భావిభారతరాజ్యాంగ విధానమునుగూర్చి బ్రిటిష్ ప్రభుత్వమువారి ఉద్దేశములను ప్రధానమంత్రి ప్రకటించెను :

"భారతప్రభుత్వబాధ్యత కేంద్రరాష్ట్రీయశాసనసభలపైన ఉండవలె నని బ్రిటిష్‌ప్రభుత్వమువారి అభిప్రాయము. ఈప్రభుత్వ మీవిధముగా క్రమపరిణామమును పొందేలోగా కొన్నిధర్మములు నిర్వర్తింపబడుటకును, అల్పసంఖ్యాకుల రాజకీయ స్వాతంత్ర్యములును, హక్కులును సంరక్షింపబడుటకును తగిన నిబంధనకూడా ఉండవలెను.

"పరిణామదశలో అవసరమైన సంరక్షణ లేర్పాటుచేయబడునపుడు భారతదేశము సంపూర్ణ బాధ్యతాయుతప్రభుత్వమును పొందుటకు ఏవిధమైన ఆభ్యంతరములును లేకుండునట్లు ప్రభుత్వాధికారములు నిర్ణయింపబడవలె నని బ్రిటిష్ ప్రభుత్వ

"ఈలోగా శాసనోల్లంఘనములో పనిచేయువారు వైస్రాయికోరికకు సుముఖముగా నున్నయెడల వారి సహాయమును పొందుటకు గల చర్య లవలంబింపబడును."

మొదటి రౌండుటేబిలుసభ కాంగ్రెసున కెంతమాత్రమును సంబంధించక పోయినప్పటికిని ఈ చరిత్రలో నుదాహరింపబడవలసి వచ్చిన కారణము బ్రిటిష్ ప్రధానమంత్రి చెప్పిన చిట్టచివరిమాటలను బట్టి చదువరులకు బోధపడగలదు. రౌండు టేబిలుమహాసభ జరిగిన ఒక్కవారములోనే హిందూదేశములో ప్రాముఖ్యమైన పరివర్తనము కలిగెను. గాంధీయున్నూ, ఆయనసహచరులు ౧౯ మందిన్నీ యేవిధమైన షరతులును లేకుండ విడుదలచేయుబడిరి. తరువాత మరి ౭ గురు కూడా విడుదల చేయబడిరి. ఈ సందర్భములో వైస్రాయిచేసిన ప్రకటనము సుస్పష్టముగా నున్నది. ఆయనమనోభావములు కూడా అందులో మనోహరముగా ప్రతిబింబించినవి. కాని, ఆ ఉపన్యాసముల నిచ్చట ఉదాహరించేముందు అఖిలభారత కాంగ్రెసు కార్య నిర్వాహకసంఘమువారు చేసిన తీర్మాన మొక టిక్రింద వివరింపబడినది.

౧౯౩౧ జనవరి ౨౧ వ తేదీ సాయంకాలము ౪ గంటలకు అలహాబాదులోని స్వరాజ్యభవనమునందు కాంగ్రెసుకార్యసభవారు చేసిన తీర్మానము:

"బ్రిటిషు పార్లమెంటులోని కొందరు సభ్యులును, భారత సంస్థానాధిపతులును, తమ సహాయకులలోనుండి ప్రభుత్వమువారు నామినేటుచేసిన కొందరు భారతీయవ్యక్తులును (వీరు భారతప్రజలనుండి యెన్నుకొనబడినవారు కారు) రౌండుటేబిల్ కాన్ఫరెన్సు అని పిలువబడుసభలో జరిపిన కార్యక్రమమునకు ఈ అఖిలభారత కాంగ్రెసుకార్యనిర్వాహకసంఘమువా రెంతమాత్రమును తమ అంగీకారమును తెలుపుటకు సంసిద్ధముగా లేరు. భారతదేశముయొక్క నిజమైన నాయకులగు పండిత జవహరలాలునెహ్రూ, మహాత్మ గాంధీలను నిర్బంధించి, పరాధీనజాతు లన్నిటికిని న్యాయమైన ఆయుధముగా పరిగణింపబడుచున్న శాసనోల్లంఘనమును భారత స్వాతంత్ర్యసంపాదనమునిమిత్తము ప్రారంభించిన నిరాయుధులును, నిరుపద్రవకరులును అయిన వేలకొలది భారతదేశభక్తులపైన తుపాకులు పేల్చి, లాఠీచార్జీలు చేసి, ఆర్డినెన్సులను, ఖయిదుశిక్షలను ప్రయోగించి, భారతజాతీయాభిప్రాయము నణచివేయ తలపెట్టిన బ్రిటిషుప్రభుత్వమువారు భారతప్రతినిధులను సంప్రదించుచున్నట్లుగా నటిన్తూ ఈ రౌండుటేబిలుమహాసభాపద్ధతుల నవలంబించుట ఆత్మవిరుద్ధముగా నున్న దని ఈ కార్యనిర్వాహకసభవారి అభిప్రాయము.

"౧౯౩౧ జనవరి ౧౯ వ తేదీని బ్రిటిషుమంత్రివర్గమువారిపక్షమున ప్రధాన

చించి, అది సందిగ్ధముగా నున్నదని, విస్పష్టముగా లేదని భావిస్తూ కాంగ్రెసుకార్య విధానమునందు మార్పు కావించుట అవసరము లేదని అభిప్రాయపడిరి.

“లాహోరుకాంగ్రెసులో అంగీకరింపబడిన పూర్ణస్వరాజ్యతీర్మానమునకు విరుద్ధము కానిపద్ధతిని ఎరవాడ సెంట్రల్ జెయిలునుండి ౧౯౩౦ ఆగస్టు ౧౫ వ తేదీని గాంధీమహాత్ముడు, మోతీలాలు, జవహరలాలునెహ్రూలు, తదితరులును వ్రాసిన ఉత్తరములోని అభిప్రాయమును ఈసభవారు ఆమోదించుచున్నారు. ప్రధానమంత్రి చేసినప్రకటనము ఆ ఉత్తరమున కనుగుణముగా లేదని ఈ కమిటీవారి అభిప్రాయము. ప్రభుత్వమువారియొద్దనుండి నాయకుల ఉత్తరమున కనుగుణమైన ప్రత్యుత్తరము లేనపుడును, అఖిలభారతకాంగ్రెసుసంఘసభ్యులును, కాంగ్రెసు కార్యనిర్వాహకసభ్యులతో సహా వేలకొలది పురుషులును, స్త్రీలును జెయిళ్లలో ఉన్నపుడును, ప్రభుత్వనిర్బంధవిధానము సంపూర్ణముగా కొనసాగుచున్నపుడును ప్రభుత్వమువారు సాధారణరాజకీయవిధానమునుగూర్చి చేసిన ప్రకటనమువలన శాసనోల్లంఘనము విరమింపబడజాలదు. కాబట్టి స్వాతంత్ర్యసంగ్రామమును కొరవడనిశక్తితో ఇదివర కేర్పాటుచేయుబడినపద్ధతులతోనే నడుపవలెనని ఈ కమిటీవారు సలహా యిచ్చుచున్నారు.

“సుమారు ౭౫ వేల మంది నిరపరాధులగు పురుషులను, స్త్రీలను ఖయిదులో నుంచుట, విచక్షణలేకుండా క్రూరముగా లాఠీచార్జీలు చేయించుట, ఖయిదీలను జెయిళ్లలో హింసించుట, వందలకొలది ప్రజలను తుపాకులతో కాల్చిచంపుట, ఆస్తులను దోయించుట, ఇండ్లను తగులబెట్టుట, సాయుధపోలీసులను, అశ్వికదళములను, బ్రిటిషు సైనికులను గ్రామవీథులలో త్రిప్పించుట, ప్రజల వాక్స్వాతంత్ర్య, సమావేశస్వాతంత్ర్యముల నరికట్టుట, సమావేశములను, ఉత్సవములను నిషేధించుట, కాంగ్రెసును, కాంగ్రెసుకు సంబంధించిన సంస్థలను అక్రమసంఘము లని ప్రకటించుట, ఆయా సంస్థల చరాస్తులను స్వాధీనపరచుకొని, వారిఇండ్లను, కార్యాలయములను ఆక్రమించుట—ఈ మొదలగు ప్రభుత్వనిర్బంధవిధానమును దేశమునందలి ఆబాలగోపాలము ధైర్యముగా ఎదుర్కొన్నందుకు ఈ సభవారు వారిని స్తుతించుచున్నారు.

“జనవరి ౨౬ వ తేదీని దేశములో ఇదివర కీయబడిన కార్యక్రమము ననుసరించి భారతపూర్ణస్వరాజ్యోత్సవమును జరుపవలెనని ఈ కమిటీవారు దేశీయులను కోరుచున్నారు.”

ఈ తీర్మానమును వర్కింగుకమిటీవారు విచారించినప్పుడు రాజేంద్రబాబు అధ్యక్షుడుగా నుండెను. అసలుఅధ్యక్షుడు వల్లభాయి ౧౧ నెలలలో మూడుపర్యా

యములు శిక్షింపబడెను. ఆయన జైలుకు పోయినపుడు తనకు ప్రతినిధిగా రాజేంద్ర బాబును నియమించెను. మోతీలాలుపండితు డప్పటికి విడుదలచేయబడెను. ఆయన యనుభవించవలసిన శిక్ష ఇంకా పూర్తి గాకమునుపే జైలులో వ్యాధిగ్రస్తు డగుటచే వదలివేయబడెను. ఈ కార్యసంఘమువారి సమావేశమునుగూర్చి పత్రికలలో బహిరంగముగా ప్రకటనము చేయబడెను. వారు అలహాబాదులో సమావేశమైరి ఈ పైన చెప్పబడిన తీర్మానము కొంత చర్చజరిగినపిమ్మటనే అంగీకరింపబడెను. మాలవ్యాకు అప్పటికి జబ్బుగా ఉన్నప్పటికీ ఆయన ఆసమావేశమునకు హాజరయ్యెను. ఈతీర్మానము ప్రకటింపనచ్చునా, లేదా యని చర్చ వచ్చినది. దానినిగూర్చి భిన్నాభిప్రాయములు వెల్లడింపబడినవి. చిట్టచివరకు మరునాటివరకును ఆతీర్మానము ప్రకటింపబడకూడదని నిర్ణయింపబడెను. ఆ నిర్ణయమునకు తగినట్లు తలవనితలంపుగా మరునా డొక సంగతి జరిగినది. లండనులో రౌండుటేబిలుసభాకార్యక్రమమును ముగించుకొని భారతదేశమునకు ప్రయాణమైన శ్రీనివాసశాస్త్రి, సప్రూలనుండి కాంగ్రెసుకార్య నిర్వాహకసంఘమువారి కొకతంతి వచ్చెను. అందులో వా రిద్దరును వచ్చేటంతవరకును, వారు చెప్పేమాటలను వినేటంతవరకును ప్రధానమంత్రిఉపన్యాసముపైన ఏవిధమైన అభిప్రాయమునకును రావల దని కోరబడెను. ఆతీర్మానము ప్రకటింపబడలేదు. కాని అది ఆమోదింపబడినవెంటనే సరిగ ప్రభుత్వమువారికి దానిలోని విషయము తెలిసెను. సాధారణముగా అటువంటిసందర్భము లన్నిటిలోను అలాగే జరుగును.

౧౯౩౧ జనవరి ౨౫ వ తేదీని గవర్నరుజనరలుగారు ఈ క్రింది ప్రకటనము గావించిరి:

"నా ప్రభుత్వమువారు స్థానికప్రభుత్వములతో సంప్రతించి నేటి అఖిలభారత కాంగ్రెసుకార్యనిర్వాహకసభ్యులు ౧౯౩౦ జనవరి ౧ వ తేదీనుండి ఆ కమిటీలో సభ్యులుగా నున్నవారితో కలసి, జనవరి ౧౯ వ తేదీని ప్రధానమంత్రి చేసినప్రకటనమునుగూర్చి ఆలోచించుకొనేనిమిత్తము సంపూర్ణస్వాతంత్ర్యము కలిగియుండుట భావ్య మని తలచిరి.

"ఈ నిర్ణయమునకును, ఈ ఉద్దేశ్యమునకును అనుగుణముగా వారు (అఖిల భారతకాంగ్రెసు కార్యవర్గమువారు) సమావేశ మగుటకు న్యాయసంబంధమైన అభ్యంతరములు లేకుండాచేయుటకు ఆ కమిటీని అక్రమసంఘముగా ప్రకటించిన ఉత్తరువును అన్ని రాష్ట్రీయ ప్రభుత్వములును ఉపసంహరించుకొనగలవు. గాంధీయున్ను, తదితర కార్యనిర్వాహకసభ్యులును, ౧౯౩౦ జనవరి ౧ వ తేదీనుండి పనిచేసినవారందరూ విడుదలచేయబడుటకు తగిన చర్య తీసుకొనబడును.

"నా ప్రభుత్వమువారు ఈ విడుదలనుగూర్చి ఏ విధమైన షరతులను నిర్ణయింపదలచుకో లేదు. ఎందువలన నగా ఏ విధమైన షరతులును లేక వారు విడుదలచేయబడిననే తప్ప వారి నిర్ణయములు శాంతిపరిస్థితులను పునరుద్ధరించుట కనుకూలముగా నుండ వని మా అభిప్రాయము. ప్రధానమంత్రి చేసిన ప్రకటనమున కనుకూలముగు శాంతివాతావరణమును చేకూర్చవలెననే నిజమైనకోరికతో మే మీచర్య తీసుకొంటిమి. ప్రజాశాంతి యేర్పడినయెడల ప్రభుత్వమువారు అందు కనుగుణముగా ప్రవర్తించుటకు వెనుదీయరు.

"మా ఈ నిర్ణయము వర్తింపచేయబడినవారు మే మవలంబించిన విధానములోని ఉద్దేశ్యము ననుసరించి చర్య తీసుకొందురని నా విశ్వాసము. ఆముఖ్య సమస్యలను గూర్చి వారు ప్రశాంతముగాను, ఉద్రేకరహితముగాను విచారింతు రనియే నా నమ్మకము."



డా. అనిబిసెంటు

కలకత్తా : 1917



సయ్యద్ హాసన్ ఇమాం

బొంబాయి (ప్రత్యేక): 1918

అమృతసరము : 1919—కలకత్తా : 1928



సి. విజయరాఘవాచారి

నాగపూరు: 1920

కలకత్తా (ప్రత్యేక) : 1920



హకీమ్ అజ్మల్ ఖాన్

అహమ్మదాబాదు : 1921

# 1. గాంధి – ఇర్విను ఒడంబడిక

## ౧౯౩౧

[గాంధీ సందేశము – పండిత మోతీలాలు వ్యాధి – పండిత మోతీలాలు మృతి – పండితుని మృతినిగురించి గాంధీ చెప్పిన వాక్యములు – వైస్రాయితో సంభాషించుట కేర్పాటు – గాంధీ వైస్రాయిల సంభాషణము – ఉభయులకు విజయము – ఆంగ్లేయుల ఉద్బోధము – కరాచీ కాంగ్రెసు – అధ్యక్షుని యుపన్యాసము–భగత్సింగు తీర్మానము – గాంధీకి నల్లజెండాలు – కరాచీలో విషాదమేఘము – గణేశశంకర విద్యార్థి హత్య – ప్రధాన తీర్మానము – విదేశములందలి భారతీయులు – శ్రీనివాసశాస్త్రిగారి విజయములు – తూర్పు ఆఫ్రికా ప్రధానహక్కులను మార్చుటకు ఆల్ యిండియా కాంగ్రెసు కమిటీ వారి యధికారము – జెండా కమిటీ – భగత్సింగుదహనసంఘము – ప్రధాన హక్కుల సంఘము – దేశఋణములసంఘము – సాంఘికసామరస్యమును గూర్చిన రాయబారము – రౌండుటేబిలుసమావేశమునకు గాంధీ యొక్కడే ప్రతినిధి యగుట.]

౨౬-వ తేదీ యర్ధరాత్రమునకు ముందే విడుదలలు కావలసియుండెను. వర్కింగు కమిటీసభ్యుల భార్యలు జైళ్లలో నున్నచో వారినిగూడ వదలివేయవలసిన దని ఆర్డరులు జారీచేయబడెను. ఆర్డరులను బట్టి బదిలీసభ్యులనుగూడ వదలివేయవలసి వచ్చెను. అందుచేత మొత్తమిరువదియారుగురు విముక్తులు కావలసియుండిరి. గాంధీ విడుదల కాగానే ఆయన యొక సందేశమునిచ్చెను. గాంధీ జయాపజయములయందు పొంగి క్రుంగువాడు కాడు. ఆయన యిచ్చిన సందేశ మంత నిర్వికారముగ నుండెను.

“నేను జైలునుండి స్వచ్ఛమైన హృదయముతో వెలికి వచ్చితిని. నా కెవ్వరి యెడలను శత్రుత్వము లేదు. ఏ వాదమునందును పక్షపాతము లేదు. ఇప్పటి పరిస్థితులను సర్వముఖములనుండి చర్చించి చూడ సంసిద్ధుడనై యున్నాను. సర్ తేజ్ బహద్దరు సప్రూగారును, తదితరులును తిరిగివచ్చిన తరువాత వారితో ప్రధానమంత్రి స్టేటుమెంటునుగూర్చి చర్చించెదను. లండనునుండి కొందరు ప్రతినిధులు వచ్చి [illegible] టచే ఆ స్టేటుమెంటు నింత [illegible] కొందర నా చేయుచున్నాను.”

ఇందు నిజ మేమనగా, లండనులోని ప్రతినిధులు రౌండు టేబిలుసభ పూర్తి కావచ్చుచుండగా అటు గవర్నమెంటువారితోను, ఇటు కాంగ్రెసుప్రతినిధులతోను గూడ వ్యవహారము జరిపిరి. పండిత మోతీలాలునెహ్రూ పెద్ద జబ్బుచేయుటవలన ఆయననింతకుముందే విడుదలచేసియుండిరి. అప్పుడు వర్కింగుకమిటీలో ఎక్కువమంది బదిలీసభ్యులేరై యుండిరి. వారు ౧౯౩౧ జనవరి ౨౧ తేదీ అలహాబాదులో సమావేశమై పూర్వపు వర్కింగుకమిటీసమావేశము గాకుండ తా మేమియు చేయజాలమని తీర్మానించిరి. వారి తీర్మానము రహస్యముగా నుంచిరని మన మిదివరకే తెలిసికొనియుంటిమి. అది ప్రకటించుటకు వీలులేదు. కాని యిట్టి తీర్మానములు బయటికి పొక్కుటయు, నందును అవి ముఖ్యముగా ఎవరికి దెలియగూడదో వారికే ముమ్మందుగా తెలియుటయు లోకాచారమే కావున నది వెంటనే ఢిల్లీకి తంతిపంపబడెను. వైస్రాయి సరిగా దీనినిబట్టియే ప్రవర్తింతురని యందరు ననుకొనిరి. కాని గాంధీమాత్రము వర్కింగు కమిటీసభ్యులనుమాత్రమే విడుదల చేయుటవలన పరిస్థితులు మరింత క్లిష్ట మయ్యెననియు, ఇప్పట్టున వర్కింగుకమిటీసభ్యు లెంతమాత్రమును కాలుచేయి యాడించుటకు వీలులేదనియు తలచెను. అసహాయోద్యమము ప్రజాహృదయమున పూర్తిగా వ్యాపించిపోయినది. ఎంత ప్రముఖులైన నాయకులయినను ఇప్పుడు ప్రజలను తమ యిష్టము వచ్చినట్లు నియమించుటకు వీలులేదు. ఈ సంగతి గవర్నమెంటువారు గమనించినట్లు కనబడదని గాంధీ చెప్పెను. ఆయన తన సంధిషరతులనుగూర్చి పత్రికాప్రతినిధులకు చెప్పెను. కాని యీ విషయములనుమాత్రము ముఖ్యముగ వెల్లడించెను. "పికెటింగు చేయు హక్కును వదలుకొనజాలము. అన్నాతురులై యున్న సామాన్యప్రజ లుప్పును దయారుచేయుహక్కును విడువజాలరు. ఉప్పు తయారుచేయుటయు, విదేశవస్త్ర మద్యపాన బహిష్కరణమును ఇప్పటి దుష్పరిపాలనమును ధిక్కరించుట కుద్దిష్టములైనవి కావు. ఆర్డినెన్సులలో చాలభాగము వీని మూలముననే నిర్మింపబడినవి. ఇవి సార్వకాలికముగ నీ దురాచారములను మాన్పుటకే ప్రారంభింపబడినవి. కాని యిప్పటి దుష్పరిపాలనముచెడల ప్రజల నిరోధమును దెలుపుట కుద్దేశింపబడినవి కావు." సంధి కొరకు తాను తహతహపడుచుంటి నని గాంధీ చెప్పెను. కాని అది గౌరవపూర్వకమైనది కావలయు ననెను. కాని తుదకు తాను నిస్సహాయుడై ఒంటరిగా నిలిచిపోయినను పూర్వోక్తములైన మూడుషరతులును లేని యొడంబడికను దేనిని తా నంగీకరింపజాలనని చెప్పెను. "కావున రౌండుటేబిలు వృక్షస్వభావమును దాని ఫలమును బట్టి నిర్ణయింపగలను."

అంతట గాంధీ అలహాబాదులో వ్యాధిగ్రస్తుడైయున్న పండిత మోతీలాలుని చూచుటకు బయలుదేరెను. వర్కింగుకమిటీలో విడుదలైన సభ్యు లెల్లరును ఆహ్వానింప

బడిరి. వా రెల్లరును స్వరాజ్యభవనమునందు సమావేశమై ౧౯౩౧ ఫిబ్రవరి ౧ తేదిని ఈతీర్మానము కావించిరి:

"శాస్త్రి, సప్రూ, జయకరుల కోరికప్రకార మా వర్కింగుకమిటీవారు ౨౧-౧-౩౧ తేదీని కావించిన తీర్మానమును ప్రచురింపకుండ నిలుపుచున్నారు. కాని దీనివలన అసహాయోద్యమ ముపసంహరింపబడినదను నొక యభిప్రాయము దేశములో ప్రాకినది. కాని యీయుద్యమమును పూర్తిగా నాపివేయవలసినదని పరియైన యాజ్ఞను జారీచేయువరకును ఇది నిశ్శంకముగ జరిగిపోవుచుండవలయు ననియే యీ కమిటీవారు తెలియజేయుచున్నారు. విదేశవస్త్రములను, కల్లుదుకాణములను పికెటింగుచేయుట అసహాయోద్యమములోనిభాగము కాదని ప్రజ లెరుగుదురుగాక. ఈ పికెటింగు శాంతమై ప్రజల కవ్విధముగను నిరోధము గలుగజేయనంతవరకు నిది ప్రజలయొక్క సామాన్యమగు హక్కని తెలిసికొనవలయును.

"విదేశవస్త్రములను,విదేశీనూలును అమ్మువారి నీకమిటీవా రింకొకవిషయమును గూర్చి హెచ్చరించుచున్నారు. విదేశవస్త్రబహిష్కరణము ప్రజలకు జీవగఱ్ఱ. కావున నది జాతీయోద్యమమున కొక శాశ్వతలక్షణమై యుండవలయును. దేశమంతయు గూడి విదేశవస్త్రములను, విదేశి నూలును సంపూర్ణ బహిష్కారమువలన గాని, నిషేధపుపన్నులవలనగాని పూర్తిగా నిషేధింపగలుగునంతవరకును ఈ బహిష్కారము పోజాల దని కాంగ్రెసుప్రచారకులుగూడ గమనింపవలయును.

"విదేశవస్త్రములను, నూలును బహిష్కరింపవలయునని కాంగ్రెసువారు చేసిన ప్రార్థనమును మన్నించినందులకు విదేశవస్త్రవ్యాపారుల నభినందించుచున్నాము. కాని యీ వ్యాపారులు తమ యొద్ద నిలువయున్న విదేశీసరకులను విడుదల చేసికొన వచ్చునని ఆశపెట్టుటకే కాంగ్రెసుసంఘమునకును అధికారములే దని వారు తెలిసికొనవలసియున్నది."

వర్కింగుకమిటీసభ్యులును, వారి బదిలీ సభ్యులునుగూడ అలహాబాదులో ఫిబ్రవరి 3 వ తేదీవరకు నుండిరి. పండిత మోతీలాలు నానాటికి క్రుంగిపోవుచుండెను. ఆయనకు ఎక్సురేపరీక్ష చేయించుటకై లక్నోనగరమునకు దీసికొనిపోదలచిరి. వచ్చినవా రెల్లరును దిరిగి వెల్లిరి గాని గాంధీయు, మరికొందరునుమాత్ర మక్కడనే యుండిరి. గాంధీ మోతీలాలుగారితో లక్నోకు వెళ్లెను. మోతీలాలు,లక్నోనగరమున పరమపదించెను. ఆయన యీ యంత్యవాక్యములతో ప్రాణములు విడిచెను: "భారత దేశ భవితవ్యమును స్వరాజ్యభవనములో నిర్ణయింపుడు. దానిని నాయెదటనే నిర్ణయింపుడు. నా మాతృదేశభవితవ్యమును నిర్ణయించునొడంబడికలో నన్నుగూడ భాగ

స్వామిని గానిండు. నేను మృతినొందవలయునేని స్వతంత్రమైన నా దేశమాత యొడిలో మృతినొందనిండు! నేను దాసదేశమునగాక స్వతంత్రదేశమున దీర్ఘనిద్ర చెందుదును గాక” ఆ మహాపురుషు డిట్లు నుడువుచు ప్రాణములను విడిచెను. ఆయన సర్వవిధముల మహారాజువంటివాడు. ఒక మేధాశక్తియందే కాదు, ఒక సంపదయందు, ఒక విజ్ఞానమునందు, ఒక శీలమునందే కాదు; ఆయన సర్వవిధములను మహారాజుగనే బ్రదికినాడు. ఆయన దూరదృష్టియు, కుశాగ్రబుద్ధియు ఇట్టి క్లిష్టపరిస్థితులలో సరియైన నిర్ణయము చేయుటకై మిక్కిలిగా తోడ్పడియుండును. ఇట్టిచో నాయనమృతివలన గలిగిననష్టము తీర్పరానిదియై యుండెను. ఏల యన మోతీలా లుదారపథముల నాలోచింపగలుగుటయే గాక రాజకీయ సమస్యలయందలి నిగూఢాంశములను సుకరముగ భేదించి నిర్దుష్టముగను, సత్వరముగను నిర్ణయముల జేయగలిగియుండువాడు.

ఆయన మహాసంపన్నుడైయుండియు గాంధీయుద్బోధమువలన దారిద్ర్య వైరాగ్య సాధనలచే శీలమును సుపరిష్కృతము చేయ నేర్పు నలవరచుకొనియుండెను. తన సంపదనైనను ఆయన యొంటికట్టుగా ననుభవించియుండలేదు. తమ మహాధనములను జాతికి పంచి యిచ్చిన మహాపురుషులలో ఆయన యొకడు. కాంగ్రెసు కాయన ఆనందభవనము దానముచేయుట యెంతయు మహోదార మగుటయే గాక, దేశభక్తిపూరిత మైయుండెను. ఇట్టి జడస్వరూపమగు నీదానముకంటె ప్రేమ స్వరూపుడగు పుత్రుని దానముచేయుట దానికంటె మహోన్నతమై యుండెను. తమ కొడుకులు జడ్జీలుగను, మంత్రులుగను, రాయబారులుగను నుండగోరని తండ్రులు చాల తక్కువగనేయుందురు. కాని మోతీలాలు వేరువిధముగ తలచెను. ఆ మహాపురుషుడు గతించినను ఆయనయాత్మ కాంగ్రెసు నావేశించి, దాని సమాలోచనముల ద్రిప్పుచు, దానిభవితవ్యమును శ్రోత్రరూ పొందించుచున్నది.

పండిత మోతీలాలుమృతినిగూర్చి గాంధీ ఫిబ్రవరి ౭ తేదీన అలహాబాదునుండి యీ లేఖను బంపెను: “మోతీలాలుని పరమపదప్రాప్తి దేశభక్తుల కెల్లరకును గను గుట్టునదియై యున్నది. ఆయన తన సర్వస్వమును దేశమున కర్పించి పరమపదించినాడు. ఆయన యంతిమక్షణమువరకును దేశమునుగూర్చియే తలపోయుచుండెను. ఆయన యిన్నాళ్లను మహార్తి నొందుచుండిన స్వాతంత్ర్యమునకై మన మెల్లరమును మన సర్వస్వమును సమర్పించి, యాయనత్యాగమహిమ కర్హులమయ్యెదముగాక.”

గాంధీజీ లిబర్టీపత్రికకు బంపిన సందేశ మింతకంటెను విషాదపూరిత మైయుండెను: “నా స్థితి వితంతువుకంటెను అధమముగానున్నది. వితంతువు నిష్కలుషమైన శీలమునుజేసి తన వాని సౌమనస్యము నొందగలదు. కాని నేను పొందగలుగునది

యేదియు లేదు. మోతీలాలుమృతివలన నేను పొందిన నష్టము తీరునది కాదు. వివృతమైయున్న కాలగర్భము నన్నుగూడ దనలో దాచుకొన్న నెంత బాగుండును!"

ఇంతవరకు నప్పటి రాజకీయపరిస్థితులయందు విషాదపూరితమై గాంధీమనస్సును గలవరపెట్టుచున్న విషయ మొక్కటి యున్నది. భారతదేశమున కింగ్లాండు స్వాతంత్ర్య మియ్యనున్న దని దేశములో మోగిపోవుచుండెను. కాని యీ లక్షణము భారతదేశాధికారులయం దేమాత్రమును గానరాకుండెను. అప్పుడు గాంధీ న్యూసు క్రానికలుపత్రిక కిట్లు వార్త నంపెను: "నిర్బంధవిధానము నలుపై పులకు గార్యగమ్మి చుట్టుకొని నిశ్శంకముగ సాగిపోవుచున్నది. నిరపరాధులైన పురుషు లింకను నకారణ తాడనముల కగ్గమగుచున్నారు. గౌరవనీయులైన వారి స్థిరచరాస్తు లూరక లాగివేయబడుచున్నవి. స్త్రీలయుత్సవ మొక్కటి చెల్లాచెదరుచేయబడినది. అబలాజనమును జుట్టుపట్టుకొని యీడ్చి బూటుకాళ్లతో తన్నిరి. ఇట్టి నిర్బంధము లింకను జరుగుచున్నచో తక్కినవిషయము లెట్లు నిర్వర్తింపబడినను కాంగ్రెసువారు సహకారము చేయజాలరు."

ఉద్యమము జరుగుచున్నను కొత్తదాడులను గాని, కొత్త సందర్భములనుగాని రేప వద్దని రహస్యముగ సలహాలను పంపిరి. ఈ రోజులలోనే, అనగా ౧౯౩౧ ఫిబ్రవరి ౬ వ తేదీని యిరువదియారుగురు రౌండుటేబిలుప్రతినిధు లిండియాకు వచ్చి రావడముతోనే కాంగ్రెసువారి నిట్లు ప్రార్థించిరి:

"ఈ ప్రణాళిక వట్టి చిత్తు నమూనా వంటిది. దీనిలోని ముఖ్యములైన యవయవాంశము లన్నియు నింకను నిర్మింపబడవలసియున్నవి. కావున నీప్రణాళికను బూర్తిచేయుటకై కాంగ్రెసువారును, తక్కిన పార్టీలనాయకులును సుస్థిరములైన సూచనలు గావింపవలయునని కోరుచున్నాము. ఈ సమస్యలు చాల ముఖ్యములైనవి. వీనినిగూర్చి చర్చించుటకు తగిన ప్రశాంతి యేర్పడుననియే తలచుచున్నాము. తరువాత రాజకీయబంధితులు విడుదల చేయబడుదురు."

చివరకు ౧౯౩౧ ఫిబ్రవరిలోగూడ కొన్నూరువందు పికెటింగునేరముక్రింద ౧౩౬ గురు అరెస్టుచేయబడిరి. జైళ్లలో రాజకీయబంధితులకు పెట్టు అన్నము, వస్త్రములు, వైద్యసౌకర్యములు, శిక్షలు మున్నగు విషయము లన్నియు నధ్వాన్నముగనే యుండెను. వర్కింగుకమిటీవారు ఫిబ్రవరి ౧౩ తేదీన అలహాబాదులో సమావేశమైరి. ఇప్పటికి శాస్త్రి,సప్రూగార్లు భారతదేశమునకు దిరిగివచ్చి, వెంటనే గాంధీని, వర్కింగు కమిటీవారిని గలసికొనుట కలహాబాదుకు పోయిరి. పెద్ద చర్చలు జరిగెను. వర్కింగు కమిటీసభ్యు ల్యాపసిద్ధపురుషుల నిద్దరిని ప్రశ్న పరంపరలతో ముంచియెత్తిరి. అందు

కొన్ని మర్యాదలగూడ లేకపోవచ్చును. కాని ఇప్పుడు ప్రజలహృదయములు సంక్షుభితము లైయుండెను. దానిపై శాస్త్రిగారు లండనులో జారవిడిచిన రెండుమూడు మాటలకు వారు కోపమునుగూడ చెందియుండిరి. గాంధీ దేశములో పోలీసువారు చేయుచున్న అత్యాచారములనుగూర్చియు, బోర్సాదులో స్త్రీలపై కావించిన దుండగమునుగూర్చియు ఇర్విన్ప్రభువు కొక లేఖ వ్రాసెను. పోలీసువారి అత్యాచారములను విచారింపవలయునని కోరెను. ఇది జనవరి ౨౧ తేదీని. కాని యీలేఖను వారు వెంటనే త్రోసిపుచ్చిరి. ఆ క్షణములో సంధిరాయబారములు సమసినట్లే యెల్లరికిని తోచెను. కాని కాంగ్రెసువారును గవర్నమెంటును కలియవలయునన్నచో ముందుగా నెవరో యొకరు సౌమనస్యము చూపినగాని కలయిక సమకూడదని యెరుగనయ్యెను. గవర్నమెంటువారిమట్టుకు వారు వర్కింగుకమిటీ సభ్యులను షరతులేమియు లేకుండ వదలివేసిరి. ఇక కాంగ్రెసుపక్షములో వర్కింగుకమిటీవారుగాని, లేక వారిపక్షమున గాంధీగాని మామూలు పిలుపులకోసము నిరీక్షింపక తమంతట తామే వైస్రాయికి లేఖ వ్రాసి సంభాషణకొరకేల యత్నింపగూడదు? సత్యాగ్రహి యైనవాని కట్టి శాంతిమార్గము నన్వేషించుట కట్టి సంకోచమును లేదు. అట్లే గాంధీ ఇర్విను ప్రభువు కొక చిన్న యుత్తరము వ్రాసి అందు "మన మిర్వురమును వ్యక్తిపద ప్రపత్తితో మాటలాడుకొన ననుజ్ఞ యి"మ్మని కోరెను. ఆ లేఖ ౧౪ తేదీని పంపబడెను. ౧౬ తేదీ తెల్లవారుజామున దానికి సమాధానము వచ్చెను. ఫిబ్రవరి ౧౬ తేదీని గాంధీ ఢిల్లీకి పయనమయ్యెను. అప్పటికి బూర్వపువర్కింగుకమిటీసభ్యు లెల్లరును ఢిల్లీలో నుండిరి. వర్కింగుకమిటీవారు గాంధీ తమ రాయబారియై కాంగ్రెసుతరఫున వ్యవహారము నిర్వర్తించుట కధికారము నిచ్చుచు నొక తీర్మానము కావించిరి. గాంధీ ఇర్విన్ప్రభువును మొదటిసారి ఫిబ్రవరి ౧౭ తేదీనాడు చూచెను. ఆరోజున వారిర్వురును నాలుగుగంటలసేపు సంభాషించిరి. తరువాత మూడుదినములవరకు ఆ సంభాషణము సాగెను.

ఈ సంభాషణములలో గాంధీ పోలీసువారి అత్యాచారములనుగూర్చి విచారణచేయుట అవసర మనెను. పికెటింగు చేయుటకు ప్రజలకు హక్కుండవలయు ననెను. రాజకీయబంధితుల నెల్లరిని విడుదలచేయవలయు ననెను. అర్డినెన్సులు రద్దు కావలెననెను. ప్రభుత్వమువారు కైవసముచేసికొన్న ఆస్తులను మరల నీయవలెననెను. రాజీనామాలు పెట్టిన యుద్యోగులను, తొలగింపబడిన యుద్యోగులను మరల జేర్చుకొనవలయు ననెను. ఈ విషయములలో ముఖ్యముగ మొదటి రెండును చాల దీర్ఘచర్చల కాస్పదము లైనవి. వీనినిగూర్చి వెంటనే ఒడంబడిక కుదురుట కష్టము. కావున గవర్నమెంటువారు ఫిబ్రవరి ౧౯ తేదీ నొకప్రకటనము కావించిరి. ఈసంభా

మణలలో అనేకవిషయములు చర్చింపబడుచున్న వనియు, వీని నొకత్రోవలోనికి తెచ్చుటకు కొన్నిరోజులైనను పట్టు ననియు అందుండెను.

మొదటిరోజున గాంధీ డాక్టరు అన్సారీగారియింటిలోని తనబసకు చాల నుత్సాహముతో తిరిగివచ్చెను. మొదటిరోజు సంభాషణములు మిక్కిలి యాశాజనకము లైయుండెను. రెండవరోజు వైస్రాయి గాంధీవాదము నర్థముచేసికొనుచున్నాడుగాని యంగీకరించుట లేదని తెలియవచ్చెను. కొన్నాళ్లు సంభాషణలు మానుకొందు రనిరి. ఇంగ్లాండునుండి యొక తంతివార్త వచ్చెను. అప్పుడు వైస్రాయి మరల గాంధీని ౨౧ తేదీని సంభాషణచేయ పిలుచు ననుకొనిరి. కాని యింతలో హఠాత్తుగా, ౧౯ తేదీ గురువారమునాడు పిలుపు వచ్చెను. గవర్నమెంటువారికిని కాంగ్రెసువారికిని మధ్యనున్న వ్యవహారములనుగూర్చి చర్చించుటకు పండ్రెండుగురు సభ్యులతో నొకసభ నేర్పాటుచేసిరి. కాని సభ్యులసంఖ్య యిరువదివరకును పెరిగెను. వైస్రాయి లండనునుండి యొకతంతివార్త వచ్చునని యెదురుచూచుచుండెను. ఈ సమావేశమును ౨౫ తేదీవరకు నాపియుంచ నెంచిరి.

వర్కింగుకమిటీసభ్యులు ౨౦, ౨౧, ౨౨, ౨౩, ౨౪ తేదీలవరకు నిరీక్షించుచుండిరి. సమావేశము ౨౪ తేదీ మంగళవారమునాడు జరుగు ననియు, ఆనాటికి పిలుపు వచ్చు ననియు వారియాశ. గాంధిజీ తన మౌనవ్రతమును ౨౩ తేదీ సోమవారమునాడు ౩ గంటలకే చాలించి, పిలుపు వచ్చునని కనిపెట్టుకొనియుండెను. కాని పిలుపు రాకపోవుటచే కొందరు సభ్యులు విసుగుకొనసాగిరి. కాని గాంధీ వారి నోర్పుతో నుండు డని బోధించెను. ౨౫, ౨౬ తేదీలయందుగూడ మరల నిరీక్షించుచు కూరుచుండిరి. ఈమధ్య గడచిన పదినెలలనుండియు కాంగ్రెసుసంఘములు విటతాటములైయుండుటచే, రాబోవు కాంగ్రెసుసమావేశమునకు ప్రతినిధుల నెన్నుకొనుటకు గొన్ని యిబ్బందు లుండును గావున, దానినిగూర్చి కొన్నియేర్పాటులను గావించుటతో గడపిరి. చివరకు ౨౬ తేదీన ఇన్నాళ్లను నిరీక్షించిన పిలుపువచ్చెను. ౨౭ తేదీని గాంధీ వైస్రాయిని దర్శించెను. వా రిరువురును మూడున్నర గంటలసేపు సంభాషించిరి. ఆసంభాషణము నిష్కల్మషమై, స్నేహపూరిత మైయుండెను. ఒక్క కఠినపు పలుకైనను సంభాషణమునందు దొరలేదు. గాంధీ ఈ రాయబారములను మాని వేయరా దని వైస్రాయి యాతురు డైయుండెను.

వైస్రాయి కోరికమీద గాంధీ ౨౫ తేదీని పికెటింగునుగూర్చి యొకనోటు పంపెను. వైస్రాయి రాబోవు ఒడంబడికనుగూర్చి కొన్నినోటులు పంపెను.

వైస్రాయి ఈ వాదములో నుదయించిన యంశము లన్నిటిమీదను గాంధీగారి నిశ్చయములను దెలుపగోరెను. తరువాత నిదివర కేర్పాటుచేసినప్రకారము మార్చి ౧వ తేదీని ౨౩ గంటలకు వైస్రాయి భవనమునందు సమావేశము కాగోరెను. మార్చి ౧వ తేదీని పరిస్థితు లన్నియు మూసికొని వచ్చుచున్నటుల తోచెను. మరల విరోధములు ప్రారంభము కాకతప్పదన్నట్లుండెను. రాయబారములు మానివేయుదు మని ప్రతిపక్షులు గర్జించుచుండెను. ఒక్కరైనను జెనుదీయువారు లేకుండిరి. ఈవార్త అప్పుడే దేశముమీద పడెను. దేశ మంతయును సంక్షోభించిపోయెను.

పండిత మాలవ్యా ఒక్కరుమాత్రము నిరాశ జెందలేదు. ఇది యంతయు మంచికే వచ్చినదని ఆయన చెప్పుచుండెను. కాని గవర్నమెంటువారు పలువిధము లైన యెత్తులు వేయుచున్నారని పత్రికలు మోగిపోవుచుండెను. వర్కింగుకమిటీ సభ్యు లెల్లరను కట్టకట్టి అరేబియా సముద్రమున నేకాంతముగా నున్న 'కురియా మరియా' ద్వీపమునకు తోసివేయుదురట. పరిస్థితులు చాల నిస్సారముగా నుండెను. గాంధీ నిర్ణీతకాలమునకు వైస్రాయిని దర్శించి సాయంకాల మారుగంటలకు బసకు తిరిగివచ్చెను. ఆయన యింత త్వరలో తిరిగివచ్చుటవలన సర్వము ముగిసినదన్న యూహ తోచెను. కాని ఒకంబడిక కుదురునాశాంకురములు మరల నుదయించినవని తెలిసికొనుట కంతోసేపు పట్టలేదు. మార్చి ౧ తేదీ సాయంకాలము గాంధీ వైస్రాయిని గలసికొనినప్పు డాయన చాల స్నేహభావముతో నుండెను. హోము సెక్రటరీ ఎమర్సనుగూడ మిక్కిలి స్నేహభావముతో నుండెను. గాంధీ ఎమర్సనుతో నాలోచించి పికెటింగునుగూర్చి యొక సూత్రమును నిర్మింపవలయునని వైస్రాయి గోరెను. కాని పికెటింగునుగూర్చి యిట్టి సూత్రమును బంపవలయునని వైస్రాయి గాంధీ నిదివరకే కోరియుండెను. గాంధీజీ దాని నా క్రిందటిదినమే పంపించియుండెను. ఇంతకు జరిగిన దేమన, వైస్రాయి నోటు గాంధీ బసకు వచ్చినప్పుడే గాంధీయుత్తరము వైస్రాయికి జేరినది.

ఈ విధముగా మార్చి ౧ తేదీని పరిస్థితులు మారిపోయెను. వ్యవహార మంతయు స్నేహపూరితమై యుండెను. అప్పు డుభయులును తమహక్కులకొరకు బెనగులాడుటకంటె తమ విధులను నిర్వర్తింప నుద్యుక్తులైయుండిరి. ఈ భావము లేకున్నచో నొడంబడికయే సమకూడియుండెడిది కాదు. పికెటింగువ్యవహారములో నొక సారాంశము పికెటింగు విదేశీసరకులమీదనా, లేక బ్రిటిషు సరకులమీదనా యనునది వివాదగ్రస్తమైనది. ఇంకొక యంశము పికెటింగు కవలంబించు పద్ధతులనుగూర్చి. బ్రిటిషువస్తుబహిష్కారము కాంగ్రెసుప్రణాళికలో మొదటినుండియు లేదు. అది

యుద్ధకాలములో వచ్చి అందు జొచ్చినది. కావున నది నిరోధ కార్య మగుటయేగాక రాజకీయలాభములకొరకు ప్రయోగింపబడు నొక నిర్బంధవిశేషముగా పరిగణింప దగియుండుటవిశదమగుచున్నది. కావున పికెటింగు విదేశీసరకులను బహిష్కరించుటకై చేయబడవలయును. ఈ విధముగా నొడంబడికలోని భాషను అసందిగ్ధము కావించి రని మనము తరువాత తెలిసికొనగలము. వైస్రాయి బహిష్కారశబ్దమున కభ్యంతర పెట్టెను. బహిష్కారశబ్దమునకు బదులు పికెటింగుశబ్దమును బెట్టదగు నని యాయన తలంపు. సంధికాలములో విదేశీసరకులను, బ్రిటిషుసరకులను వేరుచేయుట యెట్లును తప్పదు. కొంత వాదము జరిగినతరువాత పికెటింగునుగూర్చి యొక సూత్ర మును నిర్మింపు డని వైస్రాయి గాంధీ, ఎమర్సనులను కోరెను. అట్లే యొక సూత్రము నిర్మింపబడెను.

తరువాత అదనపుపోలీసువారిని గురించి సంభాషణలు జరిగెను. అవియును సంతృప్తికరములుగానే ఉండెను. ఇకమీదట ఎట్టి వసూళ్లును చేయబడవు. కాని వసూళ్లు చేసిన సొమ్ము మరల యీయబడదు.

ఇక రాజకీయ బంధితుల విడుదలవిషయములో వైస్రాయి చాల సరళమైనపద్ధతి నవలంబింతు నని చెప్పెను. జైలు నేరములు, దొమ్మీ, అల్లరి, దొంగతనము-ఇవి యన్నియు మార్చి ౧ తేదీ రాత్రి చర్చకువచ్చెను. సంభాషణ లారాత్రిగూడ సాగింపబడెను. గాంధీ సాయంకాలభోజనము చేసి, మరల వైస్రాయిభవనము నకు పోయి సంభాషణలు ప్రారంభించెను. గాంధీ 'ఇంటర్నీల'విషయమును తెచ్చెను. వైస్రాయి వారొక్కొక్కరినిగూర్చి ప్రత్యేకముగా విచారింతు నని చెప్పెను.

ప్రభుత్వమువారు వశముచేసికొన్న యాస్తులగూర్చి- యిదివర కమ్మివేయబడిన ఆస్తు లీయబడజాలవు. గాంధీని రాష్ట్రీయప్రభుత్వములను జూడు మనిరి. ఇండియా గవర్నమెంటువారు వారితో నీవిషయమై రాయబారములు జరుప నిరాకరించిరి. కాని యిట్లు కైవసముచేసికొన్న ఆస్తులనుగురించి బొంబాయిగవర్నమెంటువారి కొక నోటు వ్రాసి యిచ్చెదనని గాంధీతో వైస్రాయి చెప్పెను.

ఈ సంభాషణక్రమము గాంధీ చెప్పగా విని, వల్లభాయిపటేలు, గుజ రాతులో రాజీనామా పెట్టిన డిప్యూటీకలెక్టర్లిరువురివిషయమును చర్చకు తేవలయు నని కోరెను.

ఉప్పువిషయములో ప్రజాభిప్రాయమునకు చాల ననుకూలమైన పద్ధతిని నిర్ణ యించిరి. ఉప్పుమడుగులలో నెల్లరు నుచితముగా ఉప్పుతీసికొని పోవచ్చు నని వై స్రాయి ఒప్పుకొనెను. ఇది గాంధీకి చాల సంతృప్తికరముగా నుండెను.

పోలీసువారి యత్యాచారములనుగూర్చి యిరుపక్షములవారు నొకవిధమైన వాల మిని ప్రకటించిరి. ఈ విషయములో గాంధీ కేవలము వర్కింగుకమిటీవారి యేజెం టుగా వ్యవహరింతు ననెను. వర్కింగుకమిటీవారి యిష్టము నుల్లాసముతో ననుసరింతు ననెను. "మీరు భగ్నము చేసినచో నేను వైస్రాయియింటికి భగ్నము చేయుటకే పోయెద" నని యాయన వర్కింగుకమిటీవారితో చెప్పెను. ఆయన వైస్రాయిభవ నమునకు వెళ్లి తెల్లవారుజాము ౧ గంటకువచ్చి వర్కింగుకమిటీవారికిని, స్నేహితులకును ౨-౧౫ గంటలవరకు నుపన్యాస మిచ్చెను. వైస్రాయియు, ఎమర్సనుగారును మిక్కిలి సద్భావమును చూపిరి. ఆ రాత్రి పికెటింగునుగూర్చి యొకసూత్రము నేర్పాటు చేసిరి. దానినిగూర్చిన విచారణ మార్చి 3 వ తేదీ మంగళవారమునకు వాయిదావేసిరి. మధ్యగా రెండవతేదీ సోమవారము గాంధీ మౌనవ్రతదినము. ఉప్పునుగురించి గాంధీ కిని, సర్ జార్జిసూస్టరుకును ఒక సమ్మతి కుదురవలసియుండెను. ఆ రాత్రి చాలసేపు దానికొరకు వినియోగించిరి గాని, నిశ్చయమైన యొకసూత్రము కుదుర లేదు. కొన్ని యభిప్రాయభేదములుమాత్రము తీర్పబడెను.

ఆస్తులు:-ప్రభుత్వమువారు కైవసముచేసికొన్న ఆస్తులనుగురించి రాయబార ములు సాగించుట కొకమధ్యవర్తి యవసర మయ్యెను. సర్ ఇబ్రహీంరహీంతుల్లా గారును, సర్ పురుషోత్తమదాసుఠాగూరుదాసుగారును ఇందులకై పనిచేయ నంగీ కరించిరి.

గుజరాతుడిప్యూటీకలెక్టర్లిరువురివిషయములో వైస్రాయి వారికి మరల నుద్యోగము లిప్పింతు నని వాగ్దానము చేయజాలకపోయెను. కాని వారికి పింఛనుగాని, బహుమానముగాని యిప్పింతు మనెను. ఆ రాత్రి జరిగిన సంభాషణమునంతయు గాంధి చెప్పునప్పటికి ౨-౧౫ గంట లయ్యెను. మార్చి 3 తేదీని గాంధీగారికిని సూస్టరుగారికిని ఉప్పునుగూర్చిన చర్చ మధ్యాహ్నము ౧౧ గంటలకు జరుగనుండెను. ఆ నాడు రెండుగంటలకు వైస్రాయితో సంభాషణము జరుగును. కోశాధికార సభ్యునితో జరుగనున్న యీ సంభాషణమునుగూర్చి కొంచెము కల్లోలము కలిగెను. చికాగోట్రిబ్యూనలు పత్రికాప్రతినిధి షిరారు అనువాయన యొక వర్కింగుకమిటీ సభ్యునితో 'గాంధిగారు కోశాధికారసభ్యునితో మాట్లాడుటకు తగినంత లెక్కగా డేనా?' యని ప్రశ్నించెను. అప్పుడు గాంధిగారు సర్ జార్జిసూస్టరుగారితో దేశ ఋణములనుగూర్చి చర్చింపనుండె ననుకొనిరి. గాంధీగారు నోటిమాటలతో ఉప్పును గూర్చిన సూత్రమును నిర్మింపజేయబోవుచున్నాడని వారెరుగరు. కాక, దేశఋణముల విషయమే వచ్చి, లెక్కలు పత్రములు చూపవలసివచ్చినను గాంధీగారి కదియొక పెద్ద

కష్టము కాదనియు వారెరుగరు. ఆయన విజ్ఞాన మనంత మైనది. కాని సత్యమే యాయనకు జీవగఱ్ఱ. ఆయన యేదైన విషయమును జరుపకున్నను, నేదైన తనకు తెలియకపోయినను నది నాకు తెలియదని వెంటనే యంగీకరించును. ఇదియే యాయన ప్రతిపక్షు లొక దౌర్బల్య లక్షణముగా నెన్నుచుందురు. మార్చి 3 తేదీని రాబోవునొడంబడిక కొక తీరనియభ్యంతరము తటస్థించెను. బార్డోలీరయితుల భూములను తిరిగి యిచ్చువిషయ మిదివరకు చర్చింపబడెను. దానిని మరల చర్చింప సాగిరి. ఈ విషయములో నెట్టిసూత్రమును పన్నినను, దానిని ముందుగా వల్లభాయిపటేలుగా రంగీకరింపవలయును. కావున నానాడు పగటి సంభాషణములో గాంధీజీ తాను రాత్రికి వల్లభాయిగారి కంగీకారమైన యొకసూత్రము వ్రాసి తెత్తుననియు, వైస్రాయిగారు దానినిగూర్చి చర్చ చేయరాదనియు కోరెను. నిజమునకు వైస్రాయిగారికిని కొంత యిబ్బంది కలదు. బార్డోలి పన్నుల నిరాకరణోద్యమము మంచి ముమ్మరముగా నున్నరోజులలో వైస్రాయిగారు తా నెట్టి సందర్భములందును మరల రయితులభూము లిచ్చివేయగోర నని బొంబాయి గవర్నమెంటువారికి వ్రాసియుండెను. కావున నిప్పుడు దానికి వ్యతిరేకముగా వారి కుత్తరువు పంపుట కాయన కిష్ట ముండదు. అందుచేత ఆయన యీవిషయములో సర్ పురుషోత్తమదాసు ఠాకూరుదాసుగారిని, సర్ ఇబ్రహీమురహీముతుల్లాగారిని రాయబారము నడుప నియోగింపు మనిగాంధీకి చెప్పెను. అంతటితో నీవ్యవహారము చక్కనగు నని యాయనతలంపు. గాంధీగా రీపని మీరే చేయుడని వైస్రాయిగారిని గోరెను. తుద కీ మధ్యవర్తులిర్వురకు బార్డోలీరయితులభూములను మరల నిప్పించువిషయములో సహాయము చేయవలసిన దని బొంబాయిగవర్నమెంటువారికి లేఖ వ్రాయుటకు వైస్రాయిగారొప్పుకొనిరి. నిజమున కీ చర్చలు జరుగుచుండగా బొంబాయి గవర్నమెంటు రివిన్యూ మెంబ రీవిషయమునుగూర్చి మాట్లాడుటకే ఢిల్లీకి వచ్చెను. ఇట్టి చిక్కు వచ్చినప్పు డెల్ల దానిని విడదీయుటకు సప్రూ, జయకరులును, శాస్త్రిగారును తోడ్పడుచుండిరి. గాంధీ ఇర్విను ఒడంబడికయందు ౧౭ (సి) సూత్రము గవర్నమెంటు వారికిని, కాంగ్రెసుకును తీవ్రమయిన వివాదము జరుగుట కాస్పద మయ్యెను.

ఆ సూత్ర మిది:

"స్థిరాస్థిని పరాయివారి కమ్మినచోట్ల, గవర్నమెంటువారికి సంబంధించినంత వర కా వ్యవహారము ముగిసిన ట్లెంచవలయును."

"షరా:—గాంధీగారు తనకు వచ్చిన సంజాయిషీనిబట్టి యీవేలములలో గొన్ని టైనను అక్రమముగను, న్యాయవిరుద్ధముగను జరిగిన వని చెప్పియున్నారు. గవర్నమెంటువారు తమయొద్ద నున్న సంజాయిషీనిబట్టి యీవాదము నంగీకరింపజాలరు."

౩ వ తేదీ సాయంకాలము మరల రాయబారము భగ్నమగునన్నంత తీవ్రమైన వాదము జరిగినతరువాత పై నుదాహరించిన మరాలోని సూత్రము నిర్మింపబడెను. ఇది యును, (సి) సూత్రమునందలి "గవర్నమెంటువారికి సంబంధించియున్నంత వర" కను మాటలును సర్ పురుషోత్తమదాసు ఠాకూరుదాసు, సర్ ఇబ్రహీం రహింతుల్లావంటి వారు కలుగజేసికొని, సాధ్యమైనచో బార్డోలీరయితులభూముల నిప్పించుట కవకాశ ముండుటకై వ్రాయబడెను. ౩ వ తేదీ రాత్రి గాంధీగారు వైస్రాయిభవనమునుండి తెల్లవారుజామున ౨-౩౦ గంటలకు దిరిగివచ్చిరి. (౪. ౩. ౩౪) ఎల్లవారును గన్నులలో వత్తు లిడుకొని కూర్చుండిరి. గాంధీ చాల నుత్సాహముతో తిరిగివచ్చెను. వచ్చి యా రాత్రి జరిగినదెల్ల వర్కింగుకమిటీసభ్యులకు చెప్పెను. ఆ సాయంకాలముగూడ పికెటింగుసూత్రమునుగూర్చి వర్కింగుకమిటీ సభ్యులు తీవ్రమైనచర్చ జరిపిరి. పికెటింగు సూత్రమునందు, మొదట ముసల్మాను దుకాణదారులను వదలివేయవలయు నని యుండెను. గవర్నమెంటువారు దానిని కావలయునని కోరిరి. కాని తుద కది వదలుకొనబడెను. ఒడంబడికలోని ప్రత్యంశమందును నేదోయొకరంధ్రముండెను. (౧)బంధితుల విడుదలవిషయములో నొక్క సత్యాగ్రహులుమాత్రమే యుండిరి. ఇంటర్న్లకేసులు సాంగముగ బరిశీలింతు మనిరి. షోలాపూరు, గహర్వాలుఖైదీలు సోదిలోనికిగూడ రాలేదు. (౨) పికెటింగువిషయములో బ్రిటిషుసరకు లని పక్షపాత ముండరాదు. (౩) ప్రభుత్వమువారు కైవసముచేసికొనిన, లేక విక్రయించిన భూములవిషయము ప్రత్యేకముగ నొక సమస్యయయ్యెను. ఇక ౧౮ (సి) సూత్రము కాంగ్రెసువారిని బెదరించుచుండెను. తుదకు గాంధీజీ మిక్కిలిముఖ్యమైన యొకవిషయమును తనంతట తానే నిర్ణయించెను. అది రాజ్యాంగతంత్రవిషయము. రౌండుటేబిలు సభయందు నిర్మింపబడిన భారతరాజ్యాంగప్రణాళికను పునః చర్చించుటకై గాంధీజీ యొప్పుకొనెను. రౌండుటేబిలుసభయందు వ్రాయబడిన ప్రణాళికలో ఫెడరేషను ముఖ్యభాగము. అట్లే యందు భారతీయుల బాధ్యతయు, భారతదేశక్షేమార్థమై దేశసైన్యములు, విదేశవ్యవహారములు, మైనారిటీలస్థితిగతులు, భారతదేశపుపరపతి, ఋణముల తీర్మానము (గాంధీ ఇర్విను ఒడంబడిక రెండవసూత్రము) లను గూర్చిన రక్షణలు ప్రధానములుగా నుండెను. ఇక నీ చిత్తు ఒడంబడికను గాంధీఇర్వినులు గూడి నిర్మించి, యంగీకరించుటకు గాని, త్రోసివేయుటకుగాని వర్కింగుకమిటీవారి యెదుట బెట్టిరి. ఒడంబడికలోని యీ భాగములో "భారతక్షేమార్థ" మను మాట యొక్కటియే కాంగ్రెసునకు రక్షక మని యెంచిరి. అది రక్షణలకు విరుద్ధమందు. వర్కింగుకమిటీసభ్యులకు సంశయములు లేకపోలేదు. దీనికి తరువాత విపరీతవ్యాఖ్యానము చెప్పవచ్చును. అంతియగాక, అది సంపూర్ణముగ భారతక్షేమమునకు విపరీతముగ వర్తించునట్లు చేయవచ్చును. కాని వస్తువులకు

లోకసామాన్యమగు మూల్యమును గట్టుట గాంధీజీస్వభావము కాదు. ఆయన యెప్పు
డును మనుజులమాటలను యథాతథముగా విశ్వసించును. తన మాటలనుగూడ నితరు
లట్లే విశ్వసింపవలయు నని కోరును. ఇది కేవలము కోరలు తీసివేయుట యైనది. వల్ల
భాయి భూములవిషయమున సంతృప్తినొందలేదు. జవహరలాలునకు రాజ్యాంగ
తంత్రవిషయమున నిష్టము లేకుండెను. రాజకీయబంధితులవిషయ మెవ్వరికిని నచ్చ
లేదు. అందరకు నన్నివిషయములును నచ్చిన వకుచో నది కాంగ్రెసువిజయమగును గాని
యొడంబడిక కానేరదు. కాంగ్రెస్సొక యొడంబడిక చేసికొనుచున్నప్పు డంతయు
వారియిష్టము వచ్చిన ట్లుండదు. కాని యొడంబడికలోని కొన్నియంశములనుగాని,
లేక యన్నిటినిగాని వర్కింగుకమిటీవారు నిరాకరింపవచ్చును. గాంధీజీ ప్రతిసభ్యుని
ప్రశ్నించెను. మీకేయంశ మిష్టము లేదు? రాజకీయబంధితులా, లేక పికటింగా? లేక
భూములవిషయమా, లేక మరేమైననా? లేక ఒడంబడిక యంతయునా? ఇట్లాయన
వర్కింగుకమిటీలోని ప్రతిసభ్యుని నడిగెను. ఒడంబడికలోని చరమాంశమునుగూర్చి
కొంతవాదము పుట్టెను. "కాంగ్రెసువారీ యొడంబడికయంశములను బూర్తిగానమలు
లోనికి బెట్టనియెడల దానికి ఫలితముగ గవర్నమెంటువారు ప్రజలను సంరక్షించుట
కును, లా ఆర్డరులు చెడకుండ బట్టుటకును నవసరమైనచర్య జరుపుటకు హక్కు నట్టె
పెట్టుకొనుచున్నారు." ఈ హక్కు గవర్నమెంటువారి కొక్కరికే యుండనేల, కాం
గ్రెసువారికిమాత్ర మేల యుండరా దని కొందరు ప్రశ్నించిరి. అనగా నీ యొడంబడిక
లోని యంశములన్నిటిని గవర్నమెంటువారు పూర్తిగా నమలులో బెట్టనియెడల కాం
గ్రెసువారు మరల నసహాయోద్యమమును ప్రారంభించుహక్కు నట్టెపెట్టుకొనుచున్నా
రనుమాత్ర ముండవలయు ననిరి. కాని కాంగ్రెసువా రసహాయోద్యమము నిదివరకు
గవర్నమెంటువారి యనుమతితో బ్రారంభింపలేదు. ఇప్పుడు దానిని మరల ప్రారం
భించుటకు వారియవసరము లేదని తెలిసికొనుటకు బెద్దయాలోచనతో బని లేదు.

గవర్నమెంటువారికిని, కాంగ్రెసువారికిని పదునేనుదినములు మహావాదోపవాద
ములు జరిగినతరువాత నిర్ణయింపబడిన యొడంబడిక యిది. ఇది గాంధీ, ఇర్వినుల యు
దారసంకల్పముల ఫలము. ఈయొడంబడికమూలము నీక్రిందనుదాహరించుచున్నాము.

"ఎస్. ౪౮౧/౩౧ పొలిటికలు
గవర్నమెంటు ఆఫ్ ఇండియా
హోమ్ డిపార్టుమెంటు,
న్యూఢిల్లీ. ౫. ౩. ౧౯౩౧

ప్రకటనము

గవర్నరుజెనరల్ (ఇన్ కౌన్సిలు) వారు ప్రజల కెల్లరకును దెలియుటకై యీ ప్రకటనము కావించుచున్నారు.

(౧) వైస్రాయిగారికిని, గాంధీగారికిని జరిగిన సంభాషణములమూలమున కాంగ్రెసువా రసహాయోద్యమమును మానవలయు ననియు, ఇండియాప్రభుత్వమువారును, రాష్ట్రప్రభుత్వములును ఇంగ్లాండుప్రభుత్వమువారి యనుమతితో కొన్ని పనులు చేయవలయు ననియు నేర్పాటు చేయబడినది.

(౨) రాజ్యాంగతంత్రసమస్యల విషయములో మున్ముందు జరుగబోవుచర్చలు రౌండుటేబిలుసభలో తయారుచేయబడిన భారతరాజ్యాంగప్రణాళిక నింకను బరిశీలించునుద్దేశముతో గావింపవలయును. రౌండుటేబిలుసభయందు తయారుచేయబడిన ప్రణాళికయందు ఫెడరేషను ముఖ్యభాగము. దానితోపాటు భారతీయుల బాధ్యతయు, భారతదేశ క్షేమార్థము దేశసైన్యములు, విదేశవ్యవహారములు, మైనారిటీలస్థితిగతులు, భారతదేశపు పరపతి, ఋణములతీర్మానము మున్నగువిషయములనుగూర్చి కొన్ని రక్షణలు, లేక నిబంధనలునుగూడ ముఖ్యము లైయున్నవి.

(౩) ౧౯౩౧ జనవరి ౧౯ వ తేదీని ప్రధానామాత్యుడు కావించిన ప్రకటనమునుబట్టి రాజ్యాంగసంస్కరణమునుగూర్చి ముందు జరుగనున్న చర్చలలో కాంగ్రెసువారికి దగిన ప్రాతినిధ్యము గలుగజేయుటకు దగినయేర్పాటులు కావింపబడును.

(౪) ఈ యొడంబడిక యసహాయోద్యమమునకు ప్రత్యక్షముగ సంబంధించిన కార్యపరంపరకు జెందియున్నది.

౫. అసహాయోద్యమము పూర్తిగా నుపసంహరింపబడును. గవర్నమెంటువారు దానికి దగినట్లు చర్య దీసికొందురు. అసహాయోద్యమము పూర్తిగా నుపసంహరించుట యనగా తత్సంబంధములైన సర్వవిధముల కార్యతంత్ర మంతయును నుపసంహరింపబడుట యని యర్థము. అందు ముఖ్యముగా నివి యుపసంహరింపబడును:

(i) ఏ శాసనాంశములనైనను మొత్తముమీద నిరోధించుట,

(ii) భూమిశిస్తులను తక్కినరుసుములను నిరాకరించు నుద్యమము,

(iii) అసహాయోద్యమమునకు బ్రోద్బలకముగ వార్తాపత్రికలను బ్రచురించుట,

(iv) సివిలుమిలిటరీశాఖల యుద్యోగులను, గ్రామోద్యోగులను గవర్నమెంటువారియెడల వైరస్య మొందజేయు యత్నములు, లేక వారిపదవులకు రాజీనామాలు పెట్టించుటకై చేయుయత్నములు.

(౬) విదేశవస్త్రబహిష్కారవిషయములో రెండంశము లున్నవి. ఒకటి యీ బహిష్కారముయొక్క స్వభావము, రెండవది బహిష్కారము నమలులో బెట్టుట కవలంబించు పద్ధతులు. ఇందు గవర్నమెంటువారి యభిప్రాయ మిది. భారతదేశముయొక్క యార్థికస్థితిని జక్కజేయు నుద్దేశముతో భారతీయ పరిశ్రమలను బ్రోత్సహించి యార్థిక పారిశ్రామికోద్యమమును సాగించుట గవర్నమెంటు వారికిని యిష్టమే. ఈ యుద్దేశముతో ప్రజాశాంతికిని, లా ఆర్డరులకును భంగము లేకుండజేయు ప్రచారపద్ధతులకును, ప్రకటనపద్ధతులకును, గవర్నమెంటువా రభ్యంతర పెట్టరు. కాని యొక్క విదేశవస్త్ర బహిష్కార మన్ని దేశముల బట్టలమీదను ప్రయోగింపబడినను విదేశీ సరకుల బహిష్కారము మాత్రము ముఖ్యముగ బ్రిటిషు సరకులకే యుద్దిష్టమై రాజకీయలాభములకొరకై యొక నిర్బంధ విశేషముగ బ్రయోగింపబడుచున్నది.

ఇట్టి స్వభావము గలిగి, యిట్టి యుద్దేశములతో నడుపబడుచున్న యీ బహిష్కారమునకును, యీయొడంబడిక ననుసరించి భారతరాజ్యాంగసంస్కరణమునకై బ్రిటిషు ఇండియా ప్రతినిధులును, సంస్థానముల ప్రతినిధులును, ఇంగ్లాండు ప్రభుత్వము వారును, ఇంగ్లాండులోని రాజకీయపక్షమువారును సమావేశమై జరుపనున్న సభలో మైత్రిపూర్వకముగ దాపరికము లేకుండ చర్చలు జరుపుటకై కాంగ్రెసు ప్రతినిధులు పాల్గొనుటకు సామరస్యము పొసగ దని యంగీకరింపబడియున్నది. కావున నసహాయోద్యమము నుపసంహరించుటయందు బ్రిటిషుసరకుల బహిష్కారమును రాజకీయమైన యొకయాయుధముగా నుపయోగింప మానుకొనుట ప్రధాన మని యంగీకరింపబడినది. దీనికిఫలితముగా నుద్యమావేశమునందు విదేశీసరకుల క్రయవిక్రయములను మానుకొనినవారు తమనిశ్చయమును మార్చుకొనగోరినచో వారి కట్టి నిర్బంధమును జేయరాదని యంగీకరింపబడినది.

(౭) విదేశీసరకుల స్థానములో స్వదేశసరకులను స్థాపించుటకుగాని, కల్లు మొదలగు మత్తుపదార్థములను నిషేధింపజేయుటకు గాని యవలంబింపబడు పద్ధతులు సామాన్య రాజశాసనములకు లోబడి యుండినగాని పికెటింగను శీర్షిక క్రిందికి రాజాలవు. అట్టి పికెటింగు దౌర్జన్యరహితమై యుండవలయును. అందు నిర్బంధముగాని, నిరోధముగాని, బెదరింపుకాని, విరోధప్రదర్శనము గాని, ప్రజల కొటంకముగాని లేక సామాన్య రాజశాసనములకు సర్వవిధముల ననుకూలమై యుండవలయును. ఇట్టి పద్ధతు లెప్పు డెక్కడ నవలంబింపబడినను నక్కడి పికెటింగును వెంటనే మాన్పింపవలయును.

(౮) గాంధీ పోలీసువారి యత్యాచారముల గొన్నిటిని గవర్నమెంటువారికి ప్రత్యేకముగ దెలియజేసి వానిని గూర్చి బహిరంగముగ విచారణచేయింపదగు నని కోరెను. ఇప్పటి పరిస్థితులలో గవర్నమెంటువారికీ పద్ధతిలో కొంత కష్ట ముండ వచ్చునని తోచుచున్నది. దీనిమీద బరస్పర దోషారోపణములు ప్రబలి శాంతిస్థాపన మునకు భంగము కలుగవచ్చును. ఈ విషయమును గమనించి గాంధీ యీ విషయ మున పట్టు పట్టక వదలివేసెను.

(౯) అసహాయోద్యమము విరమించినతోడనే గవర్నమెంటువారు చేయు పను లీ క్రిందిపేరాలలో పేర్కొనబడినవి.

(౧౦) అసహాయోద్యమమునకు సంబంధించి జారిచేయబడిన యార్డినెన్సు లుపసంహారింపబడును.

అరాజకోద్యమమునకు జెందిన ౧౯౩౧ సం.పు మొదటి యార్డినెన్సు దీని క్రిందికి రాదు.

(౧౧) కొన్ని సంఘముల నక్రమసంఘములుగా ప్రకటించుచు, ౧౯౦౮ క్రిమినల్ లా అమెండుమెంటు అక్టుక్రింద గావింపబడిన ప్రకటనము లసహాయోద్యమ మునకు సంబంధించిన వైనచో నవి యుపసంహరింపబడును.

ఇటీవల బర్మాగవర్నమెంటువారు క్రిమినలులా అమెండుమెంటు చట్టము క్రింద గావించిన ప్రకటనము దీనిక్రిందకు రాదు.

(౧౨) (i) అసహాయోద్యమమునకు సంబంధించిన నేరములై, పెండింగులో నున్న కేసు లుపసంహరింపబడును. కాని యా నేరములు దౌర్జన్యయుతములు గాని, తత్ప్రేరకములు గాని కాగూడదు.

(ii) క్రిమినలు ప్రాసీజరుకోడ్డు ననుసరించిన జామీను కేసులకు గూడ బై నుదాహరింపబడిన సూత్రము చెల్లును.

(iii) అసహాయోద్యమమున బాల్గొన్నందులకు న్యాయవాదులపై రాష్ట్రప్రభు త్వములవారు హైకోర్టుకు దెలియజేసి గాని, లేక లీగల్ ప్రాక్టీషనర్సు చట్టముక్రింద కేసును బెట్టిగాని యున్నయెడల నా నేరము దౌర్జన్యపూరితము గాక, తత్ప్రేరక మును గాక యున్నచో నట్టికేసు నుపసంహరింపవలయు నని రాష్ట్రప్రభుత్వమువా రాకోర్టుకు వ్రాయవచ్చును.

(iv) సైనికులమీదగాని, పోలీసువారిమీదగాని యిట్టికేసు లున్నచో నవి యీ సూత్రముక్రిందికి రావు.

(౧౩) (i) అసహాయోద్యమమునందు నిర్బంధింపబడిన ఖైదీలు దౌర్జన్యమును చేయక దానిని ప్రేరేపింపక యున్న వారు వదలివేయబడుదురు.

(ii) మొదటియంశముక్రిందికి వచ్చువాడు జైలునేరముక్రింద శిక్షింపబడినను, నది దౌర్జన్యయుతముగాని, దౌర్జన్యప్రేరకముగాని కాకపోయినచో నాశిక్షకూడ తీసివేయబడును. లేక యట్టికేసు పెండింగులో నున్నచో నది యుపసంహరింపబడును.

(iii) ఆజ్ఞల నుల్లంఘించినందులకై శిక్షింపబడిన సైనికుల పోలీసుల విషయ మీసూత్రముక్రిందికి రాదు. (అట్టివి కొలదిగమాత్రమే యున్నవి.)

(౧౪) వసూలు చేయబడని జరిమానాలు తీసివేయబడును. క్రిమినలు ప్రొసీజరు కోడ్డులోని జామీను నిబంధనలక్రింద జామీనుసొమ్మును జప్తు చేసికొనవలయు నని యాజ్ఞ చేయబడి, యది వసూలు చేయబడకున్నచో దానినిగూడ వదలిపెట్టుదురు.

వసూలుచేయబడిన జరిమానాలు, జామీనుసొమ్ములును మరల నీయబడవు.

(౧౫) అసహాయోద్యమముకొరకు కొన్నిచోట్ల ప్రజలఖర్చుమీద నియమింపబడిన యదనపుపోలీసులు రాష్ట్రీయప్రభుత్వముల యిష్టానుసారముగ తొలగింపబడుదురు. అదనపుపోలీసువారికి సరిగా నైనఖర్చులకంటె మించినసొమ్మును దేనిని రాష్ట్రీయ ప్రభుత్వములు ముదరా యివ్వవు. కాని వసూలుగాని యే మొత్తమునైనను రెమిషను నిచ్చెదరు.

(౧౬) (ఎ) చరాస్తి, యన్యాయముగా సంగ్రహించినది గాక యసహాయోద్యమములో ఆర్డినెన్సులక్రిందగాని, క్రిమినలు లాప్రకారముగాని స్వాధీనము చేసికొనబడిన దింకను గవర్నమెంటువారి యధీనములో నున్నచో తిరిగి యీయబడును.

(బి) భూమిశిస్తును, తక్కినరుసుములను రాబట్టుకొనుటకుగాను స్వాధీనము చేసికొనబడిన చరాస్తి, ఆబాకీదారు సరియైన గడువులోపల బకాయిని మొండిగా చెల్లింపడని యాజిల్లాకలెక్టరు తలంపనిచో విడుదల చేయబడును. దీనికి సరియైన గడువును నిర్ణయించుటలో, బాకీదారులు బాకీ చెల్లించుట కిష్టపడుచు దానికొరకు కొంత గడువు కోరినచో నప్పుడు విచారింపబడును. లేదా, మామూలు రివిన్యూపద్ధతులప్రకారము బకాయి యా సంవత్సరమునకు వసూలుచేయకుండ నిలుపబడును.

(సి) చరాస్తి చెడిపోయినందులకు ముదరా యీయబడదు.

(డి) చరాస్తిని గవర్నమెంటువారమ్మినచో దానిమీద వచ్చినడబ్బు బకాయికంటె మించియుండనియెడల ముదరా యీయబడదు.

(ఇ) జప్తుగాని ఆస్తిస్వాధీనముగాని ఈప్రకారము జరుగకే యున్నచో నెవ్వరైనను ఎట్టి వ్యవహారమైనను జరుపుకొనవచ్చును.

(౧౬) (ఎ) ౧౯౩౦ సం. ౯-వ ఆర్డినెన్సుక్రింద స్వాధీనము చేసికొనబడిన స్థిరాస్తి యీ ఆర్డినెన్సు సూత్రముల ననుసరించి తిరిగి యిచ్చివేయబడును.

(బి) భూమిశిస్తు, రుసుముల బకాయిక్రింద జప్తుచేయబడిన, లేక స్వాధీనము చేసికొనబడిన భూమియు, తదితరమైన స్థిరాస్తియు గవర్నమెంటువారి స్వాధీనములో నున్నయెడలను, సాల్లాకలెక్టరు బాకీదారు పరిష్కారమైనగడువులోపల బకాయి చెల్లింపని మొండి యని తలంపకపోయినను తిరిగి యిచ్చివేయబడును. గడువు నిర్ణయించుటలో బాకీదారు బకాయి చెల్లింప నుద్యుక్తుడై న్యాయముగ గడువు కావలయునన్న సందర్భములుమాత్రమే విచారింపబడును; లేదా, మామూలు రివిన్యూపద్ధతుల ప్రకారము వసూలు నిలుపుదల చేయబడును.

(సి) స్థిరాస్తిని పరాయివారికి విక్రయించిన సందర్భములలో గవర్నమెంటు వారికి సంబంధించినంతవరకు ఆ వ్యవహారము ముగిసినట్లే యెంచవలయును.

వర:—గాంధీగారు తనకు వచ్చిన సంజాయిషీనిబట్టి ఈవేలములలో కొన్నియైనను నక్రమముగను, న్యాయవిరుద్ధముగను జరుపబడినవే యని గవర్నమెంటువారికి తెలియబరచినారు. గవర్నమెంటువారు తమ సంజాయిషీనిబట్టి యీ వాదమును పరిగ్రహించజాలరు.

(డి) ఇట్లు ఆస్తి జప్తుగాని, స్వాధీనము చేసుకొనుటగాని యక్రమమని, న్యాయవిరుద్ధమని తోచినచో నెవ్వరైనను, ఎట్టివ్యవహారమునైనను జరుపుకొనవచ్చును.

(౧౭) చట్టవిరుద్ధముగా శిస్తులను రాబట్టుకొన్న సందర్భములు చాల తక్కువయున్న వని గవర్నమెంటువారు విశ్వసించుచున్నారు. కాని యట్టి సందర్భము లున్నయెడల రాష్ట్రప్రభుత్వములవారు విచారణచేసి, యంతటి యన్యాయము నిర్ధారణయైనచో వెంటనే కల్లాకలెక్టర్లకు తాకీదులు వ్రాసి తగిన పరిహారము చేయింపవలయును.

(౧౮) గవర్నమెంటుద్యోగులు రాజీనామాలు పెట్టినయెడల వారిస్థానములలో శాశ్వతోద్యోగులను నియమించినచో బూర్వోద్యోగులను మరల జేర్చుకొన వలనుపడదు. ఇట్టి రాజీనామాలు తక్కినవి యున్నచో రాజీనామాలు పెట్టిన గవర్నమెంటు ఉద్యోగులును, గ్రామోద్యోగులును మరల పనులలో జేరెద మన్నయెడల రాష్ట్రప్రభుత్వములవారు విచారించి యీ విషయమున సరళముగా ప్రవర్తింపవలయును.

(౨౦) ఉప్పుపరిపాలనమునకు సంబంధించిన యత్యాచారములను గవర్నమెంటువారు క్షమింపజాలరు. ప్రస్తుతపు ఆర్థికపరిస్థితులయందు ఉప్పుశాసనములను మార్చుటకు వీలు లేదు.

కాని బీదవారికి కొంత సదుపాయము చేయుటకై, యిదివరకే కొన్నిచోట్ల మామూలు ఉన్నప్రకారము ఉప్పుపాలనసూత్రములను కొంచెము విశాలముచేసి, యుప్పుమడుగులకు సమీపమునందున్న యూళ్లజనులు వ్యాపారముకొరకుగాక తమయింటి వాడుకకొరకు మాత్రము ఉప్పును తీసికొనిపోవచ్చు నని యనుజ్ఞ నిచ్చుచున్నాము.

(౨౧) కాంగ్రెసువారీయొడంబడికషరతులను సరిగా నిర్వర్తింపకపోయినచో ప్రజాశాంతికొరకు, వ్యక్తిసంరక్షణకొరకు, శాంతిభద్రతల గాపాడుటకొరకు గవర్నమెంటువారు తగినచర్య తీసికొందురు.

(సం.) హెచ్. డబ్లియు. ఎమర్సను,

భారతగవర్నమెంటు కార్యదర్శి"

ఈ రాయబారములు జరుగుచుండగా గాంధీ, వైస్రాయిలు ౧౯౨౮ డిసెంబరు ౧౭ తేదీని సాండర్సుగారిని హత్యచేసిన (లాహోరుసక్రేసు) భగత్సింగునకును, వారి యనుచరులు రాజగురు, సుఖదేవులకును విధించిన మరణదండనను తొలగించుటను గూర్చి దీర్ఘములైన చర్చలు కావించుచుండిరి. ఈ మువ్వురిని కొలదిదినములలో నురి దీయనుండిరి. దేశమంతయు గగ్గోలుగా నుండెను. ఈ యురిశిక్ష నెటులైన మాన్పవలయు నని సర్వజనులసామనస్యమును బొందుటకై కాంగ్రెసువారే తహతహపడుచుండిరి. వైస్రాయిగారు చాల జాగ్రత్తతో మాటలాడిరి. పంజాబు గవర్నమెంటువారికి మంచిగా సలహా నిచ్చెద ననుటకు మించి యాయన యొప్పుకొనను నెక్కువ వాగ్దానము చేసియుండలేదు. ఆయురిశిక్షలను మార్చుటకు తనకే హక్కున్నది. కాని యది రాజకీయహేతువులమూలమున చేయదగిన యధికారము కాదు. పైగా నీవిషయములో పంజాబు గవర్నమెంటువారు లొంగుటకు రాజకీయహేతువులే యడ్డువచ్చును.

నిజమున కవి యడ్డు రానేవచ్చినవి. ఎట్లయినను ఇర్విన్‌ప్రభు నీవిషయమున సహాయము చేయజాలడయ్యెను. కాని కరాచీకాంగ్రెసు జరుగువరకును జైల్లో యీ యురిశిక్షల నాపియుంచెద నని వాగ్దాన మిచ్చెను. కరాచీకాంగ్రెసు మార్చి చివరివారములో జరుగనుండెను. ఆ కుట్రగాండ్ర నురిదీయవలసియున్నచో వారిని కాంగ్రెసు తరువాతకంటె ముందుగనే యురిదీయవలసిన దని గాంధియే చెప్పెను. దేశములోని వ్యవహారపరిస్థితులు చక్కగా తేటతెల్లమగును. ప్రజలహృదయములలో నిరర్థకము

లైన యాతలంకురింపవు. గాంధీ-ఇర్విను ఒడంబడిక యచ్చయుగ దాని షరతుల్ల క్షణములనుబట్టియు, నాకుజ్జివాంఛ యూరిమూలమునను బోయిన బోవును, లేదా నిలిచిన నిలుచును. ఒడంబడికపై ౧౯౩౧ మార్చి ౫ తేదీని సంతకములు చేయబడెను. ఇర్విను దానితోపాటు గాంధీకొక చక్కని యుత్తరము వ్రాసెను. ఈ పదినెలల నుండియు దేశపరిపాలనమునకు తానే బాధ్యుడ నని వర్ణించుకొనెను. స్వరాజ్యము వచ్చినతర్వాత గూడ నీదేశమును సేవింప నిచ్ఛ యున్న దని తెలియజేసెను. ఇర్విను గారు గాంధీజీకి చక్కని యుత్తరము వ్రాసిరి. త్వరలో యింగ్లాండులో గలసికొనగల మని యాయన వ్రాసెను.

ఈ రాయబారములలో నొక గొప్పలక్షణము రోజురోజుకు, గంటగంటకు జరుగు సంభాషణము లతిగుప్తముగా నుంచబడుట. ఈ రాయబారప్రక్రమ మంతయు నొక్క వర్కింగు కమిటీ సభ్యులకేగాక పదిపండ్రెండుగు రితరమిత్రులకుగూడ దెలియ జేయబడుచున్నను, ఇటులైనను నివి బయటికి పొక్కకుండుట మరింత గమనింపదగిన విషయము. పత్రికారచయితలు తాము ప్రత్యక్షముగ గన్నులతో జూచివచ్చినట్లుగా లేనిపోనివాత లన్నిటిని పూసగ్రుచ్చినట్లు వ్రాయుచుండుట యొకవంక వైచిత్ర్యమును, ఒకవంక విషాదమును గొల్పుచుండెను. ఈ వార్తలను జదివినవారికి పత్రికలలో వ్రాయుచుండున వెల్ల వేదవాక్యముగా నమ్మరా దనుసత్యమును బోధించినట్లయినది. కాని దీనివలన నింకొకవిషయముగూడ బోధించిన ట్లయినది. పత్రికలు దేశజీవనమునకు మహోపకారములు. వానికి ప్రసిద్ధసంస్థలవారెల్లరును సత్యోదంతములను వెంటనే తెలియబరచుచుండవలయు ననియు తెల్లమైనది. ఇంకొక విచిత్రవిషయము సంతృప్తికరమై యుండెను. గాంధీ వైస్రాయికి అల్టిమేటము నిచ్చిన తేదియు, నిప్పు డొడంబడికమీద సంతకము చేసిన తేదియు నొక్కటియేయై యుంతయు, నొకవిధమగు తృప్తిని గొలిపెను. ౧౯౩౦ మార్చి ౨ వ తేదీని గాంధీగారి లేఖ రెజినాల్డు రేనాల్డ్సుగారిచే వైస్రాయిగారి కందజేయబడెను. ఆయుత్తర మందించి, యుద్యమము ప్రారంభించిన దాదిసరిగ్గా నొక్కసంవత్సరమునకు ౧౯౩౧ మార్చి ౫ తేదీని గాంధీ-ఇర్విను ఒడంబడికమీద సంతకము చేయబడెను.

ఒడంబడిక పూర్తికాగానే గాంధీ చేసిన మొట్టమొదటిపని ఆంగ్లేయ భారతీయ అమెరికనుపత్రికాప్రతినిధుల కొక చరిత్రాత్మకమైన సందేశము నిచ్చుట. మార్చి ౫ తేదీ సాయంకాలమున గాంధీ యీస్టేటుమెంటును గంటన్నరలో జెప్పెను. అం దొక్కమాట కొట్టలేదు. ఒక్కమార్పు చేయలేదు. ఈ స్టేటుమెంటులో ఆయన ఇర్వినుప్రభువును హృదయపూర్వకముగా ప్రశంసించెను. పోలీసువారికిని, సివిలుసర్వీసువారికిని, అధికా

కులకును విజ్ఞాపనములు గావించెను. ఈ స్టేటుమెంటు భారతస్వరాజ్యచరిత్రలో శాశ్వతముగ నుండదగినది కావున దానిని సర్వాంగీణముగ నీక్రింద పొందుపరచుచున్నాము:

“తోలుదోలుత, నీయొడంబడిక యెట్లున్ననేమి, వైస్రాయిగారి యసాధారణమైన సహనభావము, అత్యంతమైన పరిశ్రమ, నిరంతరమైన మర్యాదయు గానిచో నీయొడంబడిక యగుట యసంభవ మని చెప్పగోరెదను. నేను తలవనితలంపుగా వారి కెంతయో విసుగుపుట్టించియుందు నని యెరుగుదును. వారి సహనభావమును బూర్తిగా పరీక్షించి యుందును. కాని యాయన యొక్కమారైనను విసుగువలగాని, కోపమునుగాని వెల్లడించి యుండలేదు. ఈ రాయబారములు కడుంగడు క్లేశకరములైనవి. ఇట్టివానియందాయన మొదటినుండియు దాపరికము లేకుండ వర్తించెను. ఎట్లయినను సాధ్యమగునంతవరకు నొడంబడికను గావింపవలయు నని యాయన పట్టుదలపట్టెను. నే నీ రాయబారములకు మిక్కిలి భయముతో వడకుచు నొగ్గితిని. నేను మొదట ననుమానములతో నిండియుంటిని. కాని యాయన తొలుదొలుతనే నాయనుమానము లన్నిటిని బాయద్రోచి నన్ను సుఖితుని జేసెను. ఇక నామట్టుకు నేను మొదట సంభాషణానుజ్ఞ గోరుచు నుత్తరము వ్రాసినప్పుడీయొడంబడికను సగౌరవముగ గావించు పందెమునం దెవ్వరికిని వెనుకబడకుండుటకు బ్రతిజ్ఞ చేసికొనియుంటిని. ఇప్పుడాయొడంబడిక నిర్విఘ్నముగ నెరవేరినందులకు పరమేశ్వరునకు బ్రణమిల్లుచున్నాను. ప్రస్తుతమునకు దేశమున కొకగండము తప్పినది. ఈరాయబారములు చెడిపోయినచో దేశీయు లింతకు నూరురెట్లు బాధ లనుభవింప వలసియుండును.

## ఉభయులకు విజయము

“ఇట్టిస్వభావముగల యొడంబడికలలో నేపక్షమువారు విజయులో నిర్ణయించుట శక్యము గాకపోవుటయే గాక యుచితముగూడ గాదు. విజయ మనునది యున్నచో నది యుభయులకు జెల్లునని చెప్పవలసియున్నది. కాంగ్రెసువారు జయమునొందవలయు నని యెన్నడును గోరలేదు.

“కాంగ్రెసుస్వభావమును బరిశీలించినచో దాని కొకనిశ్చితమైన లక్ష్య మున్నది. ఆలక్ష్యమును జేరునంతవరకును కాంగ్రెసునకు జయమనునది లేదు. కావున నీయొడంబడిక యంశములం దేదిదైన నుత్సాహప్రదమై యున్నను నా దేశీయులైన సోదరసోదరీమణులు దాని కానందము నొందక పరమేశ్వరునిగూర్చి వినయవినమితులై ప్రొక్కుచు తాము పూనుకొనిన మహోద్యమమును కొనసాగించుట కనువైన త్యాగపథమునగాని, రాయబారములు, చర్చలు, సమావేశములయందు గాని తమకుదగిన శక్తిజ్ఞానముల బ్రసాదింప నాపరమేశ్వరునికి గేలోడ్చవలయు నని కోరుచున్నాను.

## వీరయుగము

"కావున నీ పండ్రెండుమాసములును నీ మహాత్యాగపథమున బ్రవర్తించిన మహాజను లెల్లరును భారతీయాధునిక చరిత్రయందు వీరయుగముగా వర్ణింపదగియున్న యీ కాలములో దాము చూపిన సమ్మతియు, నంత సామరస్యము, నంతభక్తిశ్రద్ధలు, నంతవివేకమును నీ రాబోవు సమాలోచనములు, రాయబారములలో గూడ బ్రదర్శింపవలయు నని కోరుచున్నాను.

"కాని యీ యొడంబడికవు మహోత్సాహము నొందు స్త్రీ పురుషు లున్నను దీనివలన నాశాభంగము నొందినవారుగూడ నున్నారని నే నెరుగుదును.

"వీరిత్యాగవైభవము వారికి బ్రాణతుల్యము. వారు దానియం దానందమునొందినట్లు మరి దేనియందును నానందము నొందరు. అసహ్యములైన బాధల నెంత దీర్ఘకాలమైనను వారు సహింతురు. కాని వారు త్యాగపథము దూరమైనప్పుడు తమ వృత్తులు నశించిన ట్లెంచుకొందురు. అప్పుడు వారికి లక్ష్యభంగమైనట్లు తోచును. అట్టివారికి నే నొక్కమాట చెప్పెదను. వారు సహనము వహించి జాగరూకులై పరమేశ్వరుని బ్రార్థించుచు నిరాశ జెందక యుందురు గాక!

"త్యాగపథమునకు సునిశ్చితములైన మేర లున్నవి. అది వివేకమును గాగలదు. అవివేకమును గాగలదు. మేరదప్పి దానిని బ్రయోగించుట యవివేక మగుటయే గాక మహాదోషముగూడ నగును.

## సదవకాశము

"మీరు పొందనెంచిన లక్ష్యమునుగూర్చి ప్రతిపక్షమువారు సమ్మతితో సమాలోచనముచేయ నవకాశ మిచ్చినప్పు డింకను త్యాగపథము నవలంబించుట దోషమే యగును. సదవకాశము దొరకినప్పుడు దాని నుపయోగించుకొనుటయే బుద్ధిమంతుల లక్షణము. ఈయొడంబడిక యట్టి సదవకాశము నొసగిన దని విన్నవించుచున్నాను. ఇట్టి యొడంబడికలు తాత్కాలికము లగుట సహజము. ఇదియును నట్టిదే. దీనివలన బొందినశాంతి యితరవిషయములు పెక్కింటిపై నాధారపడియున్నది. ఈయభిప్రాయమును 'తాత్కాలికసంధిమరతులు' అను మాటయే వ్యక్తీకరించుచున్నది. అది సహజముగ నట్లే యుండవలయును. కాంగ్రెసువారు రెండు టేబిలు సభయందు బాల్గొనుటకు ముందు చాలకృత్యములు నిర్వర్తింపబడవలసి యున్నవి. వాని నేకరువుపెట్టుట మిక్కిలి యవసరము. కాని కాంగ్రెసుయొక్క లక్ష్యము పూర్వాపరాధముల బాయదోచుటకాదు. పూర్ణస్వరాజ్యమే కాంగ్రెసుయొక్క లక్ష్యము. అది సంపూర్ణస్వాతంత్ర్య మని యాంగ్లభాషా సంప్రదాయమును బట్టి యనువదింపబడుచున్నది.

"అది భారతజాతియొక్క జన్మహక్కు. ఒకభారతజాతికే కాదు; జాతిశబ్ద వాచ్యమైన యేజాతికైనను నది జన్మహక్కు యగును. మనోమోహనమైన యాశబ్దము మీయొడంబడికలో నెచ్చటను గానవచ్చుటలేదు. దానిని గుప్తముగా దాచియుంచిన సూత్రము ద్వంద్వార్థమున కవకాశ మీయగలిగి యున్నది.

"మూడు మూలములు:—ఫెడరేషను వట్టి మృగతృష్ణ కావచ్చును; లేదా యది రెండుసభలు గూడి ప్రధాన శరీరమున కుజ్జీవకము లగుచు కలసి పని చేయుదగియుండు జీవతంత్రము కావచ్చును.

"ప్రజల బాధ్యత యనునది రెండవమూలము. ఇదియును వట్టినీడ కావచ్చును; లేదా యది మహోత్తాలగంభీరమై, నిర్నిరోధమైన మహావృక్షము కావచ్చును. భారత దేశక్షేమార్థమై నెలకొల్పిన రక్షణలు భ్రాంతిప్రదములు కావచ్చును. అవి దేశమునకు గట్టుత్రాళ్లుగా నుండి దేశకంఠమున నురిపోయవచ్చును; లేదా యవి స్వరాజ్యాంకూరమును జాగ్రత్తతో పెరుచుట కక్కరకు వచ్చు పెంపులు కావచ్చును.

"ఈమూడు మూలములకు నొక పార్టీవా రొక యర్థమును జెప్పవచ్చును. ఇం కొకపక్షమువా రింకొకయర్థమును జెప్పవచ్చును. ఈసూత్రముక్రింద నే పక్షమువా రైనను తమ సంప్రదాయము ననుసరించి వర్తింపవచ్చును. ఇక కాంగ్రెసువా రీసమావేశమున బాల్గొనుటకేల యంగీకరించిరన నీ ఫెడరేషనుగాని, బాధ్యతగాని, రక్షణలు నిబంధనలుగాని, మరి యేపేరుతో బిలువబడుచుండిన యేవిధ్యైనగాని దేశముయొక్క రాజకీయార్థికనైతిక సాంఘికవ్యవహారములయందు నిజమైన యభివృద్ధి గలుగజేయున విగా జూచుటకే యిందు బాల్గొన నంగీకరించిరి.

"కాంగ్రెసువారు తమవాదమును రౌండుటేబిలు సభవారిచే నంగీకరింపజేయ గల్గినచో దానికి బూర్ణ స్వరాజ్యమే ఫలిత మగునని నేను చెప్పుచున్నాను. కాని యా త్రోవ కంటకితమై యున్నదని నే నెరుగుదును. దానిలో బలువిధములైన రాళ్లు రప్పలు, దొంగ గోతులు నున్నవి. కాని కాంగ్రెసువా రీనూతన విధిని విశ్వాసముతోడను, ధైర్యముతోడను నిర్వర్తించినచో ఫలితము విషయమున నాకు సంశయములేదు. కావున నీ సమకూడిన సదవకాశమువలన నుదారమై, సర్వజన గ్రాహ్యమైన యొక ఫలము నార్జించుటగాని, యవిశ్వాసపూరితప్పుదయులై యీ సదవకాశము నశింపజేసికొనుటగాని కాంగ్రెసువారి చేతులలో నున్నది.

## ఇతరుల సహాయము

"కాని యీ కార్యభారమున కాంగ్రెసువారి కితర పక్షముల సహాయము కావల యునని యెరుగుదును. ఇందు భారత సంస్థానాధిపతుల తోడ్పాటు కావలసియున్నది.

అందరికంటె ముఖ్యముగ నాంగ్లేయులసహాయము మిక్కిలి యవసరమై యుండును. ఈసందర్భముతో నితరపక్షములవారికి విజ్ఞాపనము చేయనవసరములేదు. వారు దేశ స్వాతంత్ర్యమునకై కాంగ్రెసువారికంటె తక్కువ యాతురపడు చున్నారను సంశయము నా కేమాత్రమును లేదు.

## ఫెడరేషను ఆదర్శము

"కాని సంస్థానాధిపతుల విషయము వేరు. వారు ఫెడరేషనులో జేర సంగీకరించుట నాకాశ్చర్యముగానే యున్నది. కాని వారు ఫెడరేషనులో సమానభాగస్వాములు కాగోరుదురేని వారు తమంతట తామే యిన్నాళ్లనుండియు బ్రిటిషు ఇండియా పొందగోరుచున్న లక్ష్యమున కున్ముఖులై ప్రవర్తింపవలయునని కోరుచున్నాను

"నిష్కల్మషమైన నిరంకుశప్రభుత్వ మెంత పరిశుద్ధమైన దైయున్నను దానికిని, నిష్కల్మషమైన ప్రజాస్వామికమునకును పొసగదు. ఆరెండును దారసిల్లినప్పు డగ్ని పుట్టక తప్పదు. కావున నా కేమాత్రమును చోటీయక మున్ముందు తమతో భాగస్వాములుగా నున్నవారి ప్రార్థనముల నంగీకరింపకుండుట భావ్యముకాదు. వారి ప్రార్థనము నంగీకరింపనిచో కాంగ్రెసువారి సహకారము నిష్ప్రయోజన మగుటయేగాక వారు వికృతపరిస్థితులయందు జిక్కుకొనవలసివచ్చును. కాంగ్రెసు సమస్త భారతీయుల తరపున ప్రాతినిధ్యము వహించుచున్నది, లేక వహింప బ్రయత్నముచేయుచున్నది. కాంగ్రెసువారు బ్రిటిషుఇండియావాసులు, సంస్థానప్రజలు నను భేదమును పాటించుటలేదు.

"కాంగ్రెసిన్నాళ్లును మిక్కిలి వివేకముతోడను, గొప్పనిగ్రహముతోడను ననవసరముగా సంస్థానాధిపతుల మనసు నొప్పించుట యేల యని సంస్థానముల వ్యవహారముల జోలికి పోలేదు. పైగా నెప్పుడో యవకాశము వచ్చినప్పుడు చూచుకొందుమనియు నీవిషయమున కాంగ్రెసు తూష్ణీంభావమును వహించినది. ఆ సమయ మిప్పుడు వచ్చినదని నేను తలచుచున్నాను. కావున సంస్థానప్రజల తరపున కాంగ్రెసు చేయుచున్న విజ్ఞాపనమున సంస్థానాధిపతులు పెడచెవుల బెట్టకుందురుగాక!

"ఇక్లే యాంగ్లేయులకుగూడ విజ్ఞాపనముచేయుచున్నాను. సమావేశసమాలోచనములవలన భారతదేశమునకు స్వాతంత్ర్యము కావలసియున్న దేని యాంగ్లేయులసద్భావమును, సహకారమును మిక్కిలి యవసరములు. వారిదివరకు రొండుటేబిలు సభలో త్యాగముచేసినది భారతదేశలక్ష్యమునందు సగముగూడ గాదేర దని యొప్పుకొనుచున్నాను. వారు భారతదేశమునకు నిజముగ సహాయము చేయదలచినచో తమంతట తామెట్టి స్వాతంత్ర్యము నొందుటకు ప్రాణములనైన నర్పింతురో యట్టి స్వాతంత్ర్య

తేజమును భారతదేశముగూడ ననుభవించునట్లు చేయవలయును. ఆంగ్లేయులైనవా రిప్పు
ట్టున సాహసించి భారతదేశము తప్పులొనర్చి యజ్ఞానారణ్యమున బడుటకైనను నంగీ-
కరింపవలయును. స్వాతంత్ర్యమనగా తప్పులు చేయుటకు, తుదకు పాపముల నాచరించు
టకు గూడ స్వాతంత్ర్యమే స్వాతంత్ర్యము. లేనిచో నట్టి స్వాతంత్ర్య మున్నను లేక
పోయినను నొక్కటియే. పరమేశ్వరుడు పరమక్షుద్ర కీటకములకుగూడ దప్పులొనర్చు
స్వాతంత్ర్యము నిచ్చియుండగా మానవులెంత యనుభవశాలులైనను, నెంత సమర్థులైనను
సాటిమానవుల కట్టి యమూల్యమైన హక్కు లేకుండ నెట్లు తొలగింపగలరో నే నెరుగ
జాలకున్నాను.

"అయినను రౌండుటేబిలుసభలో కాంగ్రెసు తన యశక్తతవలన మానుకొనవల
యుగాని, పూర్ణస్వరాజ్యము నర్థించుట కెట్టి యడ్డంకియు నుండరాదు. కాంగ్రెసువారిని
సభకు రమ్మనుటలో నున్న యర్థమే యిది. భారతదేశ మితరుల పెంపక మవసరమై
యున్న నాబాలికశిశు వని కాంగ్రెసువారు తలచుటలేదు.

"అమెరికా ప్రజాస్వామికరాజ్యజనులకును, తక్కిన ప్రపంచవాసులకును నొక
విజ్ఞాపనము చేయుచున్నాను. సత్యాహింసాత్మకమైన యీ యుద్యమము ప్రపంచజనుల
యుత్సాహమును ప్రేరేపించి, వారి కౌతూహలమునకు పాత్రమైనదని యెరుగుదును.
కాని విధివశమున తత్సేవకులమైన మేమే యిందు తప్పటడుగులు వేయుచున్నాము.
ప్రపంచవాసులు, నందు ముఖ్యముగ నమెరికావారు తొలుత కౌతూహలము పొంది,
క్రమముగా జక్కనిసహాయము నేయుటలోనికి దిగిరి. వీరియీసానుభూతికి మేమెల్ల
రము కృతజ్ఞులమైయుందు మని కాంగ్రెసుతరపునను, నాతరపునను గూడ విన్నవించు
చున్నాను. ఇప్పుడు కాంగ్రెసు మరింతక్లిష్టమైన కార్యభారమున కొగ్గుచున్నది. ఇందు
వారి సానుభూతి దినదినమును హెచ్చుచుండునని యాశించుచున్నాను. భారతదేశము
సత్యాహింసాత్మకమైన యీ యుద్యమమూలముగ దనలక్ష్యమును సాధింపగల్గెనేని
అది విశ్వమానవులు నింతకాలమునుండియు దహతహపడుచున్న ప్రపంచశాంతికి మహో
పకారక మగునని వినయముతో విజ్ఞాపించుచున్నాను. దానివలన నిన్నాళ్లును ప్రపంచ
వాసులు భారతదేశమునకు గావించుచున్న యుపకారమునకు కొలదియో గొప్పయో
ప్రత్యుపకారము చేసినట్లు భాసిల్లగలదు.

## పోలీసువారికి విజ్ఞాపనము

"పోలీసువారికిని, సివిలు సర్వీసుశాఖలవారికిని నా కడపటి విజ్ఞాపనము.
ఈయొడంబడికలో దేశమునం దంతటను జరిగినవన్ని పోలీసువారి యత్యాచారములను

గూర్చి విచారణచేయవలసినదని నేను గోరిన ట్లొక యంశ మున్నది. ఆవిచారణ నాపి వందులకు గారణముగూడ నక్కడనేయున్నది. పోలీసువారిచే భద్రపరుపబడుచున్న రాజ్యాంగయంత్రమునందు సివిలుసర్వీసుగూడ నొకయంగమే. భారతదేశము త్వరలో దనయింట దానధికారిణి కానున్నదని వారు తలచినచో, వారు దేశమునెడల భక్తి విశ్వాసములతో సేవింప దలపు గల్గెనేని, ప్రజల సేవకులవలె బ్రవర్తింపవలయునుగాని యధికారులవలె బ్రవర్తింపరా దని తెలియజేయుచున్నాను.

"నాతోబాటు కారాగృహమందున్న వందలకొలది, లేక వేలకొలది ఇతరఖైదీల కొకమాట చెప్పవలసియున్నది. ఈ పండ్రెండు మాసములనుండియు బంధింపబడు చుండిన సత్యాగ్రహిఖైదీలు విడుదల చేయబడుచుండగా వారింకను జైళ్లలో మురిగి పోవుచుండియుందురు. నామట్టుకు నేను దౌర్జన్యము చేసినవారినైనను శిక్షకొరకు జైళ్లలో నుంచుట కిచ్ఛగింపను. రాజకీయోద్దేశములతో దౌర్జన్యము గావించినవారు గూడ నాయంత వివేకమును, నాయంత ప్రేమత్యాగములను గలిగియున్నారనిదే యంగీకరింతును. అందుచేత నాబలములు, నాతోడి సత్యాగ్రహుల బలములను వారిని విడుదల చేయింప గలిగియుండినచో నేను నిజముగా వారిని విడుదలచేయించి యుందును.

"కాని నేను ధర్మము ననుసరించి వారి విడుదల నర్థింపజాల నని వారు తెలిసి కొందురనియే భావించుచున్నాను. కాని యంతమాత్రముచేత నేనును, వర్కింగు కమిటీవారును వారిని గురించి యాలోచించుట లేదని తలపవలదు.

"కాంగ్రె సింక దాత్కాలికముగనైనను బుద్ధిపూర్వకముగ సహాకారపథమును ద్రొక్కినది. కాంగ్రెసువారీ యొడంబడికలోని యంశముల నన్నిటిని సంపూర్ణముగ నిర్వర్తింప గలుగుదురేని కాంగ్రెసున కపారమైన ప్రతిష్ఠ సమకూడ గలదు. దానితో బాటు గవర్నమెంటువారికిగూడ శాంతి నెలకొల్పగలిగిరో యట్టే యంతసామర్థ్య ముతో శాంతిని సమకూర్చుటకు నుత్సాహము జనింపగలదు.

"ప్రజలెల్లరును కాంగ్రెసు కింత యధికారమును నింతప్రతిష్ఠను సమకూర్చుటకు దోడ్పడనిరొుడల నీ రాజకీయఖైదీ లెల్లగను, డిటిన్యూలు, మీరటుఖైదీలతో సహా వెంటనే విడుదల చేయబడుదురని నేను వాగ్దానము చేయుచున్నాను.

## దౌర్జన్య సంఘములు

"భారతస్వాతంత్ర్యమును దౌర్జన్యమువలన సంపాదించగోరు నొక సంఘ మున్నదనుట నిస్సందేహము. అది యల్ప సంఖ్యాకులైనను మహాశక్తిమంతమై

గయున్నది. ఆ సంఘమువారు తమ మనస్సును మార్చుకొనజాలకున్నను సహిత మునుబట్టియైనను తమ కార్యతంత్రమును మానుకొనవలయునని కోరుచున్నాను. అహింస యొట్టి మహాశక్తియో వారు కొలదిగనైన గ్రహించియుందురు. అహింసయొక్క దివ్య శక్తివలన గాకపోయినచో నింత పరమాద్భుతమైన ప్రజాప్రబోధము కలిగియుండదని వారు గ్రహించియుండవచ్చును. వారు కొంచె మోపికపట్టి, సత్యాహింసాత్మకమైన యీ కార్యతంత్రమును నడపుటకు కాంగ్రెసుకుగాని, లేక నాకుగాని యొక్కసారి యవ కాశ మిచ్చి చూడవలయునని కోరుచున్నాను. ఇంతకును దండిప్రస్థానము ప్రారంభించి యొక్క సంవత్సరమైన గాలేదు. ముప్పదికోట్ల మహాజనులకు సంబంధించిన మహా సాధనక్రమములో నొక్క సంవత్సర మనంతకాలగర్భమున నొక్క రెప్పపాటైన గా జాలదు. మాతృదేశసేవనమునకై వారి యమూల్యజీవితములను సంరక్షించుకొందురు గాక! త్వరలోనే యందరకును పిలుపు రాగలదు. ఈమధ్యగా రాజకీయబంధితుల నెల్లరను విముక్తులగావించి, తుదకు హత్యానేరమునకై మరణదండనము విధింపబడిన వారినిగూడ రక్షించుటకై కాంగ్రెసువారి కవకాశ మిచ్చెదరుగాక!

కాని నేను వృథాశలు రేకొల్పనిచ్చగించుటలేదు. కాంగ్రెసువారిలక్ష్యమును మాత్రమే నేను బహిరంగముగా జెప్పగలను. యత్నము మనది; ఫలము దైవమది.

ఇక నన్ను గురించి యొకమాట చెప్పి ముగించెదను. ఇట్లు సగౌరవమైనయొడం బడికను గావించుటకు నేను నా శక్తిసర్వస్వమును వినియోగించినాను. ఈ యొడం బడిక యంశములను కాంగ్రెసుచేత బూర్తిగా నిర్వర్తింపజేయుటకు నాశక్తివంచనము లేకుండ బ్రయత్నించెదనని ఇర్విన్‌ప్రభువునకు వాగ్దానము చేసియున్నాను. నే నీ యొడంబడికకై దానిని వీలైనప్పుడు భగ్నము చేయుటకై ప్రయత్నింపలేదు. ఇప్పుడు తాత్కాలికమైయున్న దీనినే చరమమైనదిగా జేసి, కాంగ్రెసు భావించుకొనుచున్న మహాలక్ష్యమును బొందుటకు దీని నొకమెట్టుగా జేయుటకే దీనికొరకు బ్రయత్నిం చితిని.

ఇక నీయొడంబడికను జేయుటకై తోడ్పడినవారి కెల్లరకును నా కృతజ్ఞతాభి వందనములను సమర్పించుచున్నాను."

ఆ మరునా డనగా ౧౯౩౧ మార్చి ౬ తేదీని గాంధిజీ ఢిల్లీలో సమావేశమైన పత్రికాప్రతినిధుల కొక సందేశము నిచ్చెను. అదియును జరిత్రాత్మకమై ప్రశ్నోత్తర రూపముగ నున్నది. అందు సమావిష్టులైనవారిలో అమెరికా అసోసియేటెడ్ ప్రెస్సు ప్రతినిధి జేమ్సుమిల్లుగారును, లండను టైమ్సుప్రతినిధి పీటర్సను గారును, చికా గో ట్రిబ్యూనుపత్రికాప్రతినిధి షిరరుగారును, బోస్టను ఈవినింగు ట్రాన్స్‌క్రిప్టు

పత్రికాప్రతినిధి హార్లను జేమ్సుగారును, క్రిస్టియను సైన్సు మానిటరు (అమెరికా) పత్రికాప్రతినిధి ఇంగిల్సుగారును, హిందూస్థాన్ టైమ్సు ప్రతినిధి జె. ఎస్. సహానీ గారును, పయనీరు, సివిల్ అండ్ మిలిటరీ గెజెట్టులకు ప్రతినిధియైన నీథాముగారును నుండిరి. ఆప్రశ్నోత్తరావళి నిక్కడ బొందుపరచుచున్నాము:

## పూర్ణ స్వరాజ్యము

ప్ర—నిన్న మీరు చేసిన స్టేటుమెంటులో పూర్ణస్వరాజ్య మను శబ్దమును వాడి రి. దాని కొకవిధముగా సంపూర్ణ స్వాతంత్ర్యమని యనువాదము చేయవచ్చు ననిరి. పూర్ణస్వరాజ్యమునకు మీరు చేయు సరియైన వ్యాఖ్యాన మేది?

ఉ—మీకు దీనికి నేను సరియైన సమాధానము చెప్పలేను. పూర్ణ స్వరాజ్యము నకు సరియైనమాట యాంగ్ల భాషలో లేదు. స్వరాజ్య మనగా స్వపరిపాలనమని యర్థము. ఇండిపెండెన్సు అనుమాట కట్టి యర్థము లేను. స్వరాజ్య మనగా నాంతరంగికశిక్ష ణము గలిగిన పాలనమని యర్థము. పూర్ణ మనగా సాంగమని యర్థము. దీనికి సరియైన మాట దొరకకపోవుటచే "కంప్లీట్ ఇండిపెండెన్సు" అను శబ్దమును బ్రయోగించితిమి. అది యెల్లరకును దెలియును. పూర్ణస్వరాజ్యమే దేశముతోడను, ముఖ్యముగా నింగ్లాండు తోడ గూడియుండుట కభ్యంతరపెట్టదు. కాని యాకలయిక పరస్పరసద్భావ ముతో, బరస్పర ప్రయోజనకారి యై యుండవలయును.

## ఇండిపెండెన్సు తీర్మానము

ప్ర—ఒడంబడికలోని రెండవయంశము ననుసరించి కాంగ్రెసువారు మద రాసు, కలకత్తా, లాహోరు సమావేశములందు గావించిన సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానమును పునఃస్థిరీకరింప వీలగునా?

ఉ—వీలగును. నిశ్చయముగా వీలగును. కరాచీ సమావేశములో కాంగ్రెసువా రట్టితీర్మానము గావించుట కభ్యంతర మేమియును లేదు. పైగా నదియే నేను రౌండు టేబిలుసభయందు ప్రతిపాదింపబోవుచున్నాను. ఈ యొడంబడిక కంగీకరింపక పూర్వ మా విషయమును స్పష్టముగా గనుగొని మరీ యొప్పుకొంటిని.

## ప్రస్తుతకార్యక్రమము

ప్ర—ఇప్పుడు మీరు చేయబోవు కార్యక్రమ మేమి?

ఉ—నే నాదివారమునాడు అహమ్మదాబాదు వెళ్లుదును. అక్కడ రెండురోజు లుందును. తరువాత రెండురోజులు కెయిరాయందును, మరిరెండురోజులు సూరతు లోను నుందును. ౧౨ తేదీకి బొంబాయికి వచ్చి, ౧౪ తేదీకి ఢిల్లీకి తిరిగి వత్తును.

## రెండవ రౌండుటేబిలు సభ

ప్ర—ఈ రెండవ రౌండుటేబిలుసభ ఇంగ్లాండులో జరిగిన బాగుగనుండునా? లేక భారతదేశమున జరుగవలయునా? మీ కేది యిష్టము?

ఉ—నాకు దానివిషయమై యిప్పటి కట్టి యభిప్రాయమును స్థిరపడలేదు. సమావేశము ప్రారంభదశలో భారతదేశమునందు జరిగి, చివరకు లండనులో ముగిసిన బాగుగనుండును.

ప్ర—మీరు రౌండుటేబిలుసభలో బాల్గొందురా?

ఉ—పాల్గొందుననియే యనుకొనుచున్నాను. బహుశః అది యట్లే జరుగు నట్లున్నది. (నవ్వు)

ప్ర—మీరు సభలో బూర్ణ స్వరాజ్యముకొరకు వాదింతురా?

ఉ—దానిని వాదింపనిచో మనము బ్రదుకనే యక్కరలేదు.

## కాంగ్రెసు - రక్షణలు

ప్ర—ఇప్పటి రక్షణలు, నిబంధనలను మీ రంగీకరింతురా?

ఉ—ఇప్పటి రక్షణలు, నిబంధనలను నేనంగీకరింపను. ఈ విషయములో కాంగ్రెసువారి యభిప్రాయము లోకమునకు వెల్లడియైనది. కాంగ్రెసును సభలో బాల్గొనుట కెవ్వరు పిలిచినను వారికి కాంగ్రెసువారి యభిప్రాయము తెలిసియుండవలయును.

సభలో బాల్గొనుటకై కాంగ్రెసువారి నాహ్వానింపకుండుటకు ప్రభుత్వము వారి కిప్పటికిని నవకాశ మున్నది. ఇది తెలిసియుండియు నేను కాంగ్రెసువారి యభిప్రాయమును బాగుగ వెల్లడిచేయుటకు నాశక్తివంతయు వినియోగించితిని. ఒడంబడికలో నా కర్థమైనంతవరకు కాంగ్రెసువారిని బలవంతముగ సభలో బాల్గొన జేయునది యేమియు లేదు.

ప్ర—కరాచీ కాంగ్రెసు కార్యప్రణాళిక యేమి?

ఉ—నేను చెప్పలేను. అది వర్కింగు కమిటీవారి యిష్టము. వారు కరాచీ కాంగ్రెసునకు ముందు సమావేశమగుదురు.

## భగత్సింగు శిక్ష

ప్ర—భగత్సింగు మున్నగువారి మరణదండనమును యావజ్జీవ ద్వీపాంతర వాసముగ మార్తురా?

ఉ—ఆ ప్రశ్న నన్నడుగకుండుట మంచిది. దీనినిగురించి పత్రికలలో గావలసినంత గ్రంథము ప్రచురింపబడుచున్నది. పత్రికాప్రతినిధులు దానినిబట్టి తమ సారాంశములను దీయవచ్చును. అంతకంటె జెప్పుటకు నా కిష్టములేదు.

## 'యంగిండియా'

ప్ర—మీరు "యంగిండియా" పత్రికను మరల ప్రచురింతురా?

ఉ—నాకు సాధ్యమైనంత త్వరలో ప్రచురించెదను. ఒడంబడిక నములులో పెట్టబడలయును. ప్రెస్సు ఆర్డినెన్సుక్రింద దఖలు చేసికొనబడిన యంత్ర సామగ్రిని గవర్నమెంటు వారు తిరిగి యీయవలయును. యంగిండియాను త్వరలో ప్రచురింపవలయు నని నేనాతురుడనై యున్నాను. ఇన్నాళ్లును సైక్లోస్టయిలు తీసి యంగిండియాను ప్రచురించుచునేయుంటిమి. ఒడంబడిక ప్రకారము ప్రభుత్వానుమతి లేని వార్తాపత్రికలు ప్రచురింపరాదనుచున నీవారము దానిని మానివేసితిమి.

## ఉభయులమంచితనము

ప్ర—శనివారమునాడు - యవహారములు భగ్నములైనట్లుండగా మరల దేని వలన నవి తిరిగినవి?

ఉ—(మహాత్ముడు చిరునవ్వుతో) ఇర్వినుప్రభువు మంచితనము. బహుశః (మరల చిరునవ్వు నవ్వుచు) నామంచితనముగూడ గావచ్చును. (నవ్వు)

ప్ర—ఈ యొడంబడిక మీ జీవితమునందన్నిటికంటె మహత్తరకార్యముగా బరిగణింతురా?

ఉ—(మహాత్ముడు నవ్వి యిటులనెను) ఇది మహత్తరకార్యమనుట కిదివరలో నే నేమహాకార్యములు చేసితినో నే నెరుగను.

ప్ర—పూర్ణ స్వరాజ్యము నొందినచో దానిని గొప్పవిజయముగా నెన్నెదరా?

ఉ—అది వచ్చినచో దాని నట్లే యెన్నవలయు నని నాతలంపు.

ప్ర—మీ జీవితములో పూర్ణస్వరాజ్యమును సంపాదింపగల మని తలతురా?

## ౬౨ యేండ్ల యువకుడు

ఉ—నేను నిశ్చయముగా దానికొరకు కనిపెట్టుచున్నాను. (తరువాత మహాత్ముడు నవ్వుచు నిట్లనెను.) పాశ్చాత్యుల యభిప్రాయానుసారముగ నే నరువది రెండేండ్ల యువకుడను.

## రక్షణలు

ప్ర—రాబోవు రాజ్యాంగతంత్రమున రక్షణలు నేమైన మీరు సమ్మతింతురా?

ఉ—సమ్మతింతును. వివేకపూరితములై, న్యాయసమ్మతములైనవానిని సమ్మతింతును. ఉదాహరణకు మైనారిటీలవిషయమును దీసికొనుడు. మైనారిటీహక్కులను మనము జాగ్రతపరుపజాలనిచో మనము మనలక్ష్యమును బొందజాలము. మన మొక్క మహాజాతి యనిపించుకొనజాలము. అదియొక్క న్యాయమైన రక్షణ యగును.

## సైన్యము - కోశము

ప్ర—సైన్యకోశముల మాట యేమి?

ఉ—కోశము-అనగా మనదేశఋణములో మనభాగమునకు బడినంతవరకు మనము బాధ్యత పడవలయును. దేశముయొక్క పరపతి చెడకుండుటకును, అది నిరంతరాభివృద్ధినొందుటకును అంతవరకు రక్షణ యుండుటకు నేను సమ్మతింతును. ఇక సైన్యమువిషయములో, వారి జీవితములకు మనము పూచీపడుటయు, భారతదేశమునకు గావలసినంతవరకు బ్రిటిషుసోల్జర్ల విషయమున గల షరతులను నెరవేర్చుటయు మించి యెట్టిరక్షణలు నవసరమని నేను దలంపను. అంతమట్టుకే నా కర్థమగుచున్నది.

## ఋణముల నిరాకరణము

ప్ర—ఇండియా ఋణములను మీరు నిరాకరింతురా?

ఉ—న్యాయముగా మనపాలికి వచ్చుఋణము నొక చిల్లిగవ్వయైనను నేను గాదనను. కాని యీ ఋణముల నిరాకరణమునుగూర్చి చాలా గల్లంతు జరిగినది. కాంగ్రెసు దేశఋణము నొక చిల్లిగవ్వయైనను నిరాకరింప దలపెట్టలేదు.

కాని కాంగ్రెసు కోరునది యేమనగా, ముందురాబోవు జాతీయప్రభుత్వము పాలికి వచ్చుఋణము న్యాయసమ్మతమేనా యని ప్రశ్నించుచున్నది. క్రయదారుడు క్రొత్తగా క్రయమునకు బుచ్చుకొనుచున్నప్పుడు దానిమీదనున్న ఋణములను పరిశీలించుకొనవలయును గదా! ఈసందర్భములో మధ్యవర్తులు లేకపోయినచో నావిషయమై విచారణ చేయింపవలయునని కాంగ్రెసు కోరుచున్నది.

## పంచాయతీ నిర్ణయము

ప్ర—ఈవిషయమున నానారాజ్యసమితి పంచాయతీచేయుటకు పనికివచ్చునా?

ఉ—నన్నిప్పుడు చెప్పమన్నచో నానారాజ్యసమితి పనికివచ్చునందును. కాని వారిబాధ్యత నంగీకరింపకపోవచ్చును. అదియునుగాక యింగ్లాండు జాతిసమితిపంచా

యతీ యగుట కిష్టపడక పోవచ్చును. కావున ఇంగ్లాండునకును, భారతదేశమునకునుగూడ సమ్మతమైన పంచాయతీ నెన్నుకొనవలయును.

ప్ర—ఈ విషయమును మీరు రౌండు టేబిలు సభలో ప్రతిపాదింతురా?

ఉ—జాతీయఋణములను పరిశీలించి యొప్పుకొనువిషయము వచ్చినప్పు డీ వ్యవహారము చర్చకు వచ్చును. అనగా దేశమునకు సంబంధించిన లెక్కలన్నిటిని తనిఖీ చేయునప్పు డీ వ్యవహారము వచ్చును.

## 'సర్వతోపదేశము'

ప్ర—ఈనాడు హిందూస్థాన్ పైన్ను వ్రాసినట్లే తాత్కాలికసంధి క్రీస్తుగావించిన సర్వతోపదేశము క్రియాస్వరూపము దాల్చినట్లున్నదా? (అని యొక విదేశపత్రికా ప్రతినిధి యడిగెను.)

ఉ—అది నేను చెప్పజాలను. అది యెంతవరకు నిర్వర్తింపబడినదో విమర్శకులు చెప్పవలయును.

## విదేశవస్త్ర బహిష్కారము

ప్ర—ఈ యొడంబడికవలన విదేశవస్త్రబహిష్కారము నాపవలయునని మీ యుద్దేశమా?

ఉ—కాదు. విదేశవస్త్రబహిష్కారము రాజకీయాయుధము కాదు. అది సర్వజనులకు ననుబంధపరిశ్రమగా నుండదగిన చరఖాపరిశ్రమ నుద్ధరించుటకై యుద్దేశింపబడినది. విదేశవస్త్రముల దిగుమతికి సంబంధించినంతవరకే యీబహిష్కారము. నాకు పరిపాలనాధికార మున్నచో నీదిగుమతులమీద పెద్ద నిషేధపుపన్నును వేసియుందును. అట్టిపన్నును విధించుట యిప్పటి ప్రభుత్వమువారికి గూడ సుకరమే. ప్రస్తుతము వేయబడుచున్న డ్యూటీలు రాబడి వచ్చుట కుద్దేశింపబడినవేగాని దిగుమతులను నిషేధింపదగినవి కావు.

## సంపూర్ణ సమత్వము

ప్ర—పూర్ణస్వరాజ్య మనగా మీ యుద్దేశ మేమి?

ఉ—నేను పట్టి భావనామయుడను. సత్యములుగానేరని యనేకవిషయములను మనస్సులో జిత్రించుకొనుచుందును. పూర్ణస్వరాజ్యము సంపూర్ణ సమత్వమునకు విరుద్ధము గాకుండుటయేగాక దానిపై నాధారపడియున్నది. సామాన్యప్రజ లాసంపూర్ణ సమత్వము నూహింపజాలరు. సమత్వమనగా సామ్రాజ్యకార్యములు డౌనింగు వీధిలో జరుగుటకు బదులు ఢిల్లీలో జరుగుటయే. ఆంగ్లేయు లీస్థితి కంగీకరింపక పోవచ్చునని కొందరు మిత్రులనుచున్నారు.

బ్రిటిషువారు మంచి కార్యచతురులు. వారు తమస్వాతంత్ర్యమును మిక్కిలిగా ప్రేమింతురు. ఇతరుల స్వాతంత్ర్యము నంగీకరించుట యిక దానికి రెండవమెట్టే. భారతదేశమునకు నేను గోరుచున్న సమత్వము నంగీకరింపవలసి వచ్చినప్పు డాంగ్లేయులు తా మిన్నాళ్లును దీనినే యూహించుచుంటి మనగలరు. ఆంగ్లేయులకున్న స్వసమ్మోహనశక్తి మరియెవ్వరికిని లేదు. అవును. సమత్వమనగా విడిపోవుటకు గూడ హక్కుండుటయే యని నా తలంపు.

## ఎవ్వరిని గోరను

ప్ర—ఇతరులకంటె నాంగ్లేయులే యధికారులుగా నుండుట కర్హులని మీ రెంతురా?

ఉ—నే నెవ్వరినీ గోరుకొనను. నన్ను నేనే పాలించుకొనగోరుదును గాని మరియెవ్వరినీ గోరుకొనను.

ప్ర—బ్రిటిషు జెండాక్రింద మీరు పూర్ణస్వరాజ్యమును బడయగోరుదురా?

ఉ—ఈ జెండాక్రింద గాదు. సాధ్యమైనచో నుభయులకును సరిపోవు జెండాక్రింద. లేదా యవసరమైనచో ప్రత్యేకముగ నొకజాతీయపతాకముక్రింద.

ప్ర—మీరు రెండవ రౌండుటేబిలుసభకు బోకముందు హిందూమహమ్మదీయ సమస్యను బరిష్కరింపగల మనుకొనుచున్నారా?

ఉ—అది నాకోరిక. కాని యది యెంతవరకు సాధ్యమగునో నాకు దెలియదు. ప్రస్తుతమున కీ సమస్యను బరిష్కరింపకుండ సభకు బోవుట ప్రయోజనకారి కాదని నాయభిప్రాయము. ఇక్కడ దీనిని బరిష్కరింపజాలనిచో సభయందు దీనిని బరిష్కరింపజాలము.

ప్ర—హిందూమహమ్మదీయైక్యమును సమకూర్చుటకు గొన్ని సంవత్సరములు పట్టునా?

ఉ—నేనట్లు తలంపను. హిందూమహమ్మదీయులకు విభేదము లేదు. ఈవిభేదము పైభాగమునమాత్రమే యున్నది. పైభాగముననున్న వారే రాజకీయవేత్త లగుటచే నిది యిట్లు విభేదమువలె గనబడుచున్నది.

## జాతీయసైన్యము

ప్ర—పూర్ణస్వరాజ్యము లభించిన తరువాత జాతీయసైన్యమును పూర్తిగా తొలగించుట సాధ్యమా?

ఉ—భారతనాయకుడ నగుటచే సాధ్యమనియే చెప్పుదును. కాని యది నా జీవితములో సాధ్య మగునని చెప్పజాలను. భారతజాతి సైన్య మేమాత్రమును లేకుండ వ్యవహరింప గలిగినస్థితి నొందుటకు గొన్నియుగములు పట్టవచ్చును. నాకు దగినంత యాత్మవిశ్వాసము లేకపోవుటవలన నిట్టి యసాధ్యత్వము తోచుచుండవచ్చును. కాని యట్టిది సాధ్యముకాదని త్రోసివేయను. ఇంత మహాజన మిట్లు ప్రబోధము నొంది యింతగా నహింసావ్రతమును సమాచరింతురని యెవ్వరును దలంపలేదు. దీనినిబట్టి చూచినచో మున్ముందు భారతనాయకులు మాకు సైన్యముతో బనిలేదని చెప్పగల ధైర్యశాలురయ్యెదరని యించుకంత యాశపడుచున్నాను. ఇక మామూలు సివిలుపనులకు పోలీసువారు చాలుదురు.

## బాల్షివిక్కు దండయాత్ర

ప్ర—కొద్దిలో బాల్షివిక్కులు దండెత్తి వత్తురని మీకు భయము లేదా?

ఉ—నా కట్టి భయము లేదు.

ప్ర—బాల్షివిక్కు ప్రచారము భారతదేశములో వ్యాపించునని మీకు భయము లేదా?

ఉ—భారతీయు లంత వివేకశూన్యులని తలంపను.

ప్ర—బాల్షివిజమునందలి సల్లక్షణ మేమి?

ఉ—(మహాత్ముడు నవ్వి యిట్లుచెప్పెను.) ఇంతవరకు నేను దానిని బరిశీలింపలేదు. కాని యందు సల్లక్షణము లున్నచో భారతీయులు దానిని స్వీకరించుటకే మాత్రమును సంశయింపరు.

## భారత ప్రధానామాత్యుడు

ప్ర—మీరు జాతీయ ప్రభుత్వములో ప్రధానామాత్యపదవి నంగీకరింతురా?

ఉ—అంగీకరింపను. అది నాకంటె యువకులు, బలిష్ఠులునైనవారి కీయబడును.

ప్ర—ప్రజలు మిమ్ము బలవంతపెట్టినచో మీరు యంత్రములన్నిటిని దీసివేయింతురా? (అని అమెరికను పత్రికాప్రతినిధి ప్రశ్నించెను.)

ఉ—అట్లెంతమాత్రమును గాదు. వానిని దొలగించుటకు బదులు మీ అమెరికా దేశమునుండి యింకను నెక్కువగా దెప్పింతును. (నవ్వు) లేదా యిప్పుడు నేను బ్రిటిషుయంత్రములనే యభిమానింతునేమో యెవ్వరు చెప్పగలరు? (నవ్వు)

## 1. గాంధి-ఇర్విను ఒడంబడిక

ప్ర—స్వరాజ్యము రాకముందు మీరు మరల నాశ్రమమునకు వత్తురా?

ఉ—రాను. ఆశ్రమమును చూడఁగోరుచున్నాను. కాని నా పూర్ణ స్వరాజ్య వ్రతము ఫలించువరకును నందు నివసింపను.

ప్ర—భారతదేశసైన్యమునుగూర్చి మీరు చెప్పిన సమాధానమునుబట్టి ప్రపంచ వ్యవహారములను బరిష్కారమొనర్చుట కహింస ప్రయోజనకరమైన సాధనము కాజాల దని మీ తలంపగునా?

ఉ—అహింస యట్టి సాధన మగుననియే నా తలంపు. ప్రపంచములో తక్కిన దేశములన్నిట సైన్యములున్నట్లే భారతదేశమునందును నుండుననుకొంచను. కార్య తంత్రము నెమ్మదిగా జరుగుచుండును. ప్రపంచజాతులు నెమ్మదినెమ్మదిగా సమావేశ సమాలోచనములమీద నాధారపడుచు, నెమ్మదిగా సైన్యముల యావశ్యకతను విడ నాడుచుందురు. ముందుముందు సైన్యములు దేశరక్షణమునకై గాక యొకానొక ప్రాచీనసంస్థకు స్మృతిచిహ్నములుగా మాత్రము నిలిచియుండును.

గాంధీజీ ఇర్వినుప్రభువునకు అభినందనము లొసగినట్లే ఇర్వినుప్రభువుగూడ గాంధిజి కభినందనము లొసగినాడు. ఒకవిందులో వైస్రాయిగారు గాంధీజీ నిష్క ల్మషతను, సత్యశీలమును, అపారదేశభక్తిని మిక్కిలిగా బొగడి యాయనతో గలసి పని చేయుట యొక మహాభాగ్యమని మెచ్చుకొనెను. గాంధీజీ తన దేశీయుల నొప్పించి, శాంతి కనుకూలమైన పరిస్థితుల గల్పించుటకు మహాప్రయత్నము చేయుచున్నాడని యిర్వినుప్రభువు చెప్పెను. తాను ఇంగ్లాండునకు బోయి యీ యుభయ దేశములకును శాంతిపూర్వకమైన యొడంబడిక కుదుర్చుటకు శక్తివంచనములేకుండ బ్రయత్నించెద నని చెప్పెను. లండనులో మే ౧౫ తేదీని హైడ్‌పార్కు హోటలులందు బ్రిటిషు ఇండియను యూనియనువారు విందుచేసినప్పుడు ఇర్వినుప్రభు విట్లుచెప్పెను: "గాంధీజీ లండను వచ్చినప్పు డిచ్చట చర్చలకు మూలకందములైన రక్షణలు మున్నగు విషయ ములను గురించి యొడంబడికను గుదుర్చుటకై తనశక్తినంతయు ధారపోయగలడని నేను చెప్పగలను."

ఇప్పటికి పరోధములు మాసినవి. కనుక కాంగ్రెసుసంఘములు పునరుద్ధరింప బడెను. వానిపైనుండిన నిషేధము తొలగింపబడెను. కాంగ్రెసుసంస్థ శీతకాలమున ముడుచుకొనియుండి,కాలము మారగానే యపారమైన శక్త్యుత్సాహములను బ్రదర్శించు మహాజంతువువలె నుండెను. ఒడంబడిక సంతకముకాగానే ఇండియాకాంగ్రెసుకార్య దర్శి రాబోవు కాంగ్రెసుప్రతినిధుల నెన్నుకొనవలసినదని కాంగ్రెసుసంఘము లన్ని

టికిని తాఖీదుల బంపెను. వర్కింగుకమిటీవారు కాంగ్రెసుప్రతినిధులను రెండుభాగ ములుగా జేసిరి. ఒక భాగమును కారాగృహమునుండి తిరిగివచ్చిన సత్యాగ్రహు లెన్నుకొనవలయును. రెండవభాగమును మామూలుగా నెన్నుకొనవలయును. ఈ క్రొత్తపద్ధతి నమలులో బెట్టుటకు అనేక నూతననిబంధనలను గావించిరి. సత్యాగ్రహు లొక సభలో నెన్నుకొనబడవలయును. బెంగాలుప్రతినిధుల నెన్నుకొనుటకు అనీ గారిని పంచాయతీదారుగా నియోగించిరి. ఆలోజుననే అసహాయోద్యమమును, పన్నులనిరాకరణమును, బ్రిటిషువస్తుబహిష్కారమును మానివేయవలసినదని తాఖీదులను బంపిరి. కాని విదేశవస్త్రబహిష్కారమును, మద్యపాననిషేధమును యథాప్రకార ముగ జరుగుచుండవలయును. పికెటింగు దౌర్జన్యరహితమై నిర్బంధము, బెదరింపు, నిరోధ ప్రదర్శనములు, ప్రజానిరోధములు లేక సామాన్యరాజశాసనములకు విరుద్ధము గాకుండ నుండవలయును. ప్రభుత్వమువారి యనుమతి లేని వార్తాపత్రికలను బ్రచురింపరాదు. ఇట్లు ఒడంబడికలోని ప్రత్యంశమునుగూర్చి తాఖీదు లంపబడెను. ఈ తాఖీదులకుతోడు కల్లుదుకాణములను, విదేశీగుడ్డల దుకాణములను పికెటింగు చేయుచున్న వలంటీరు లీ నియమముల నవలంబించవలయునని గాంధీజీ స్వయముగ వ్రాసెను:

౧. కొనువారిని, అమ్మువారిని నమర్యాదగా జూడగూడదు.

౨. దుకాణములముందుగాని, బండ్లముందుగాని వలంటీరులు సాష్టాంగపడరాదు.

౩. దుఃఖసమయములం దరచినట్లు హాయి హాయి యని యరవరాదు.

౪. బొమ్మలను తగులబెట్టరాదు, పూడ్చిపెట్టరాదు.

౫. దుకాణదారునిగాని, కొన్నవానినిగాని బహిష్కరించినను వాని తిండికి గావలసిన సరకుల నీయవలయును. కాని, వాని యింటికెవ్వరును విందుకుపోరాదు. వాని చేత నే పనియును జేయించుకొనరాదు.

౬. ఎట్టి సందర్భములయందు నుపవాసములు చేయరాదు. వాగ్దాన భంగము చేసినప్పు డుభయపక్షములవారును పరస్పరము ప్రేమించుకొనువారైనచో యుపవాస ములు చేయవచ్చును.

గాంధీజీ యింకను నిట్లు వ్రాసెను:

"ఇన్ని నిబంధనలలో విదేశవస్త్ర బహిష్కారముగాని, మద్యపాననిషేధము గాని కొనసాగదని యెవ్వరే నన్నచో నట్టిసందర్భములందు బహిష్కారమే యపజయ మొందునుగాక యని నేనందును. అట్టి యవిశ్వాసుల కహింసయందు విశ్వాసములేదని తెల్లమగును. ఇట్టి పనికి స్త్రీలను నియోగించుటలో నహింసను పూర్తిగా నవలంబించి యది సర్వత్ర వ్యాపించునట్లు చేయుటయే నా యుద్దేశము.

"అహింసావ్రతమును సర్వవిధముల ననుష్ఠింపగల్గినచో నీ యుభయబహిష్కారములును చక్కగా నెరవేరును. అట్లుగాక మనము మర్యాద నతిక్రమించితిమేని దానివలన తాత్కాలికముగ నెట్టి ప్రయోజనము కనబడినను నది విషపూరితమైపోయి పోరాటములు సంభవించును. మనము కుటుంబకలహముల కగ్గమైనచో బహిష్కారము చెడును. స్వరాజ్యము కలవోలె మాయమగును. కావున వృద్ధుడగు వైద్యుని సలహాను మన్నించినట్లు నా మాటలు విశ్వసింతురు గాక! నా యుపదేశములవలన బహిష్కారము చెడినచో అ భారము నాది. దానిని నేను భరింతును." (శ్రీప్రెస్సు)

ఇప్పటి లోకసంవత్సరమునుండియు పరిస్థితులు క్రమముగా నుండకపోవుట వలన కరాచీకాంగ్రెసుకు సక్రమమైన పద్ధతిగా నధ్యక్షు నెన్నుకొనుటకు వీలులేక పోయెను. అందుచేత వర్కింగుకమిటీవారే వల్లభాయిపటేలుగారిని కాంగ్రెసు మహాసభాధ్యక్షునిగా నెన్నుకొనిరి.

కరాచీకాంగ్రెసుకు గావలసిన యేర్పాటులను జేయుటకు పలువిధములైన కష్టములను బడవలసివచ్చెను. వర్కింగుకమిటీసభ్యులను విడుదలచేసినప్పటినుండియు కరాచీకాంగ్రెసు జరుపవలయునని యూహలుండినను నొడంబడిక యేమగునో యను నాతురతవలన కరాచీమిత్రు లెటూ తోచక చిక్కుపడిరి. కాని యిం దొక్క సదుపాయము మాత్రము కలిగినది. శీతకాలము దాటినతరువాత సమావేశ మగుటకు కరాచీకాంగ్రెసే మొదటిది. కాంగ్రెసుసమావేశమును డిసెంబరులోగాక ఫిబ్రవరి మాసాంతమున గాని మార్చినెల మొదటిరోజులలోగాని జరుపవలయునని లాహోరులో తీర్మానింపబడెను. అట్లే యదృష్టవశమున నారోజులకే యొడంబడిక జరుగుటవలన కరాచీకాంగ్రెసు మార్చినెలలో జరుపుటకు వీలయ్యెను. ఋతువు మారుటచే కాంగ్రెసు బహిరంగస్థలమున సమావేశము జరుపవచ్చునుగాన శిబిరమును నిర్మింప నవసరము లేకపోయెను. ఇక గావలసినదెల్ల సభావేదికయు, నుపన్యాసవేదికయు, చుట్టును నావరణ గట్టుటయు.

కరాచీకాంగ్రెసుసంభారములన్నియు చక్కగా సమకూరుటకు జమ్షేడ్ యన్. ఆర్. మెహతాగారి ప్రేరణమున కరాచీమునిసిపాలిటీవారు చాలసహాయము చేసిరి. కాంగ్రెసు ప్రధానసమావేశము జరుగకముందు మార్చి ౨౫ తేదీ నొక బహిరంగసభ యేర్పాటుచేయబడెను. అందు గాంధిజీ యుపన్యాసమును ప్రజ లెల్లరు పావలా టిక్కెట్టులు కొని వచ్చి వినిరి. ఆ విధముగా కరాచీలో పదివేల రూపాయలు వచ్చినవి. ఈ సభయందే 'గాంధీజీ చనిపోవచ్చును. కాని గాంధీమత మెన్నటికిని జావదను ప్రసిద్ధోక్తిని గాంధీజీ వెల్లడించెను.

సర్దారు వల్లభభాయిపటేలుగారు చిన్నయధ్యక్షోపన్యాసము నిచ్చిరి. తన కధ్యక్షపదవి నిచ్చినగౌరవము సామాన్యకృషీవలుడైన తనది గాదనిరి. జాతీయసమరమునం దెక్కువ పాలుగొన్న గుజరాతునకే యీగౌరవము చెందుననిరి. గాంధి-ఇర్విను ఒడంబడిక ఒప్పుకొనినచో కాంగ్రెసు తప్పుత్రోవను పడుననిరి. అంతట ఆయన ఆ యొడంబడికయొక్క ప్రాముఖ్యము నభివర్ణించి కాంగ్రెసుసభ్యుల విధినిగూర్చి హెచ్చరించెను.

కరాచీకాంగ్రెసునందు సర్వజనులును మహానందతరంగముల నోలలాడు చుండవలసినది. కాని భగత్సింగు, రాజగురు, సుఖదేవుల నురిదీసినవార్తచే నొకవిషాదమేఘము వచ్చి యలముకొనెను. పరలోకము నొందిన యీ మువ్వురుబాలుర ప్రేతాత్మలును కాంగ్రెసుసమావేశము నావరించి దుఃఖమయము కావించెను. ఆరోజులలో భగత్సింగునామము భారతదేశము నలుమూలల గాంధీజీ పేరువలె విఖ్యాతమై పోయె ననుట యతిశయోక్తి కాదు. గాంధీజీ యెంత ప్రయత్నించినను వీరి యురిశిక్షలను మార్పించలేడయ్యెను. అంతియేకాదు. వారిప్రాణములను రక్షించుటకు గాంధి పడిన పాట్లను ప్రశంసించినవారే యీమువ్వురు త్యాగమూర్తులను ప్రశంసించు తీర్మానములోని భావనుగూర్చి క్రోధజ్వాలలు గ్రక్క నారంభించిరి. ఇంతకాల మైనతరువాత నానాడు కరాచిలో భగత్సింగునుగూర్చియు, గాంధి-ఇర్విను ఒడంబడికను గూర్చియు బెట్టిన రెండు తీర్మానములలో నేది ప్రజాదృష్టి నెక్కువ లగ్నము చేసికొనియెనో చెప్పజాలము. పండిత మోతీలాలుగారిని గూర్చియు, లండనురౌండుటేబిలు సభాకాలమున మృతినొంది, జెరూసలెములో ఖననము చేయబడిన మౌలానా మహమ్మదాలీగారిని గూర్చియు మామూలుగా విషాదపు తీర్మానములు చేయబడినతరువాత తొలుదొలుత భగత్సింగు తీర్మానమే కైకొనిరి. మౌల్వీ మజ్రుల్ హక్, రేవాశంకర జె. ఝవేరి, షామహమ్మద్ జుబేరు, గురునాధమొదలియారు గార్లమృతిని గూర్చి విషాదము తెలుపుచు దీర్మానించిరి. భగత్సింగు తీర్మానములో కాంగ్రెసువా "రెవ్విధమైన రాజకీయ దౌర్జన్యముతోగాని తమకు సంబంధము లేదని తెలుపుచు, నద్దానిని నిషేధించుచు" ననువాక్యము నుంచవలయునా, లేదా యని చర్చ వచ్చెను. ఆ తీర్మానము నీ క్రింద పొందుపరచుచున్నాము :

## ii. సర్దారు భగత్సింగు, వాని సహచరులు

"కాంగ్రెసువారికి రాజకీయవిషయములందే విధమైన దౌర్జన్య మన్నను నభిమతము గాకపోయినను నద్దానిని నిరాకరించుచునే యీసభవారు పరలోకవాసులైయున్న సర్దారు భగత్సింగు యొక్కయు, వాని యనుచరులైన రాజగురు, సుఖదేవుల

యొక్క యీ శౌర్యమును, త్యాగవైభవమును సంపూర్ణముగ ప్రశంసించుచు యీమహాపురు నీ లోకమును వీడిపోయినందులకు వారికుటుంబములతో బాటు కాంగ్రెసువారు దుఃఖించుచున్నారు. ఈ యురిశిక్షలు మూడును కేవలము కసి తీర్చుకొనుటకు చేయబడిన వనియు, నీశిక్షలను మార్చవలయునని దేశమంతయు గగ్గోలుపెట్టినను వారి నురిదీయుట సంపూర్ణముగ ప్రజాభిమతధిక్కార మనియు కాంగ్రెసువారు తలచుచున్నారు. ఆంగ్లేయ, భారతీయజాతులు రెండిటికిని పరస్పర సౌహార్ద మత్యావశ్యకమై యున్న యిట్టి క్లిష్టసందర్భమున గవర్నమెంటువారీ యురిశిక్షల మూలముగా నాసౌహార్దమును బెంపొందించుకొను నవకాశమును జెడగొట్టుకొనుటయే గాక నిరాశులై దౌర్జన్యపథమునకు గడగినపక్షమువారిని శాంతిమార్గమునకు దెచ్చు నవకాశమును గూడ బోగొట్టుకొని రని యీసభవా రభిప్రాయపడుచున్నారు."

కాంగ్రెసు అహింసావ్రతబద్ధ మగుటచే నిందుజొప్పిన పరిహారవాక్యము తప్పనిసరి యగుచున్నది. కాని యీవాక్యమే గాంధీమతమును నిరాకరించుచున్న యువకులకు కోపకారణమై, వారు దీనిని తీసివేయవలయునని మార్పులు సూచించిరి. వాలంటీరుల సభలో నీవాక్యము తీసివైచి తీర్మానము నామోదించిరి. తరువాత రాష్ట్రసభలయందు గూడ నిది వివాదములకు మూలమైనది. సమావేశము జరుగుచుండగా, కాంగ్రెసు అవరణముబయట గల్లంతు సాగెను. ఆ క్రిందటిరోజున గాంధీజీయును, వల్లభాయియును కరాచీకి బండ్రెండు మైళ్లదూరమున రైలుదిగి వచ్చుచుండగా కొందరు యువకులు నల్ల జెండాలను ప్రదర్శించిరి. గాంధీజీ తనకు సహజమైన యుల్లాసముతో వారిచేతుల నుండి నల్లపూవులను గ్రహించెను. అట్లు మొదట 'కొట్టవచ్చిన' వారు 'పట్టుగొమ్మలై' నిలిచిరి. వారు గాంధిజీని, వారి యనుచరులను వెన్నంటి కొంతదూరము సాగనంపిరి.

తరువాత కాంగ్రెసువారు రాజకీయబంధితుల విడుదలనుగురించి తీర్మానమును జర్చించిరి. అప్పటికి గవర్నమెంటువారు చాల నీచమైనపద్ధతి నవలంబించుటయేగాక, వాగ్దానభంగమున కొగ్గి, బంధితుల విముక్తివిషయమున నొడంబడికకు విరుద్ధముగ వర్తించుచున్నారని తేటతెల్లమయ్యెను. అందుచేత గాంధీ-ఇర్విను ఒడంబడికయొక్క లక్ష్యము భారతీయాంగ్లేయజాతులమధ్య సౌహార్దమును బెంపొందించుటయే యగునేని, అది బ్రిటిషువారు తమ యధికారము వదలుకొన నంగీకారమును దెలుపునది యగునేని గవర్నమెంటువారు వెంటనే రాజకీయబంధితుల నెల్లరను ఒడంబడికలో లేని డిటిన్యూలను, విచారణలో నున్నవారితో సహా విడుదలచేసి, దేశమునందుగాని, విదేశములందుగాని యున్న భారతీయులపై గవర్నమెంటువారు చేసిన రాజకీయ నిషేధపు టుత్తరువు లన్నిటిని శీఘ్రముగ దొలగించివేయవలయు నని గట్టిగా వాక్రుచ్చి తీర్మా

నించిరి. 'ఈతీర్మానమునకు గవర్నమెంటువారు చెవియొగ్గి యాచరణలో బెట్టుకొనిన ఈయురిశిక్షలకాలమున దేశమున జనించిన వైరస్యమును గొంతతగ్గించినవా రగుదురని ఈ సభవారు గవర్నమెంటువారిని హెచ్చరించుచున్నారు."

కరాచీకాంగ్రెసుపై విషాదమేఘముల గప్పినది మరియొక హేతు వుండెను. కాంగ్రెసుసమావేశము జరుగుచుండగా గణేశశంకర విద్యార్థిమృతి వినవచ్చెను. కాన్పూరులో హిందూ మహమ్మదీయ కలహములయందు గణేశశంకర విద్యార్థి ఈయుభయ సంఘములకు సద్భావ సౌహార్దములను బెంపొందింప బ్రాకులాడుచు మహమ్మదీయులను హిందువులబారినుండి తప్పించు ప్రయత్నమున బ్రాణముల గోల్పడెను. ౧౯౨౬ సంవత్సరమున గౌహతీ కాంగ్రెసురోజులలో శ్రద్ధానందుని మృతివలన దేశము కాంగ్రెసుగూడ విషాదమయమై పోయెను. అట్లే కరాచీకాంగ్రెసునందు గూడ గణేశశంకరునిమృతి విషాదహేతు వయ్యెను. ఇక్కడ కాన్పూరు దొమ్మీనిగురించి యొకమాట చెప్పుట యుచితము. కాన్పూరు దొమ్మీలకు పేరుపడినయూరు కాదు. ౧౯౦౭ లో నొకకొట్లాట జరిగెను. తరువాత ౧౯౨౭ లోను, ౧౯౨౮ లోను కొట్లాటలు జరిగినవి. కాన్పూరు జనసంఖ్యలో నారువంతులయందు హిందువులే యైదు వంతులు. తక్కినవా రొకవంతు. భగత్సింగును, వానియనుచరు లిద్దరును లాహోరులో మార్చి ౨౩ వ తేదీ నురితీయబడిరి. దేశమంతటను హరతాళములు జరిగెను. బొంబాయి, కరాచీ, లాహోరు, కలకత్తా, మదరాసు, ఢిల్లీనగరములలో హరతాళములు శాంతముగ గడచిపోయెను. కాన్పూరులోగూడ హరతాళము చేసి, ఈమువ్వురు వీరుల పటములతో, నల్లజెండాలతో నొక పెద్దయూరేగింపును బయలుదేరదీసిరి. హిందువులు దుకాణములను మూసివైచిరిగాని మహమ్మదీయులు మూయలేదు. అంతకుముందు మహమ్మదాలీగారు మృతినొందినతరి మహమ్మదీయులు గావించిన హరతాళములో హిందువులు పాల్గొనియుండలేదు. ఇట్టి పరిస్థితుల నింకను వివరించి చెప్పనక్కరలేదు. నిప్పు ముట్టుకొనుటకు తగిన సామగ్రియంతయు సమకూడినది. మార్చి ౨౪ తేదిని హిందూదుకాణములు కొల్లగొట్ట సాగించిరి. ౨౫ తేదీ రాత్రియే యేబదిమందికి గాయములు తగిలెను. ౨౬ వ తేదీని భగ్గుమనెను. దుకాణములు, దేవాలయములు పరశురామ ప్రీతియయ్యెను. పోలీసువా రేవిధముగను సహాయముచేయలేదు. అల్లరి, దోపిడి, హత్యలు, దహనములు విరివిగా సాగిపోయెను. బీదవందలకుటుంబములు కొంపలు వీడి పల్లెటూళ్లకు బోయి తలదాచుకొనిరి. డాక్టరు రామచంద్రగారు మహాకష్టము పాలైరి. ఆయన కుటుంబ మంతను, నాయన భార్యను, వృద్ధులయిన తలిదండ్రులను చంపి ముక్కలుముక్కలుగా జేసిరి. గవర్నమెంటువారి లెక్కలప్రకారము ౧౬౬ గురు హత్య చేయబడిరి. ౪౮౦ గురికి గాయములు తగిలెను. సర్ పురుషోత్తమదాసు టాండనుగారును

మరికొందరు మిత్రులును వెంటనే కాన్పూరునకు పంపబడిరి. కాని శాంతిని సమకూర్చుట కేయుపాయమును గానరాదయ్యెను. గణేశశంకరుడు ౨౫ తేదీ నుండియు గానరాలేదు. చివరకు ౨౭ తేదీ ఆయన కళేబరము దొరకెను. అదియైనను ఆయన ధరించిన ఖద్దరువస్త్రములవలన గుర్తింపబడినది. ఖద్దరున్న శవ మది యొకటియే. ఇదిగాక ఆయనచేతిమీద 'గశేంద్ర' పచ్చ పొడిచియుండెను. ఆయనజేబులో కొన్ని కాగితములును, కరాచీకాంగ్రెసునుగురించి యొకవ్యాసమును నుండెను. ఆరోజున నాయన చాల మహమ్మదీయ కుటుంబములను రక్షించెను. ఆయనను మోసపెట్టి యొకచోటికి తీసికొనిపోయిరి. అక్కడ కాయన నిశ్శంకముగా నేగి క్రోధోద్రిక్తమైయున్న గుంపు నెదుట సత్యస్వరూపుడైన సత్యాగ్రహికి సహజమైనట్లు తలయొగ్గెను. ఆయనరక్తము హిందూమహమ్మదీయైక్యమునకు జాలియుండుగాని, దానితో వారి రక్తతృష్ణ తీరునేని వా రాయనను బొడిచి చంపుట సమ్మోదావహమే. ఈ విషాదవృత్తమును గూర్చి కాంగ్రెసువా రీతీర్మానము గావించిరి:

"సంయుక్తరాష్ట్ర కాంగ్రెసు సంఘాధ్యక్షుడై జాతీయ సేవకుల యందు త్యాగమహిమకు పేరంది సాంఘికవిభేదరహితమైన వృత్తివలన సర్వసంఘప్రియుడై వెలసిన గణేశశంకరవిద్యార్థిగారు హిందూమహమ్మదీయసంఘర్షణమున నసువుల బాసినందుల కీ సభవారు పరమవిషాదము నొందుచున్నారు. ఈ సభవా రాయనకుటుంబమునకు తమ సానుభూతిని తెలుపుచున్నారు. కాంగ్రెసునందు ప్రథమశ్రేణికి జెందిన ప్రజాసేవకు డాపన్నులై యున్నవారిని రక్షించుచో కలహోన్మాదముల మధ్య శాంతివివేకములను స్థాపింప యత్నించుచో నసువు లర్పింపగలిగెనని యీ సభవారు గర్వపడుచున్నారు. ఈ మహత్తరత్యాగము ప్రతిక్రియకు గాక శాంతిస్థాపనమునకు సాధనముగా గైకొనవలయునని కాన్పూరువాసుల నీ సభవారు ప్రార్థించుచు నీ సంఘర్షణమునకు గారణము లరసి యీ విభేదము నశించి యింతటితో నీ విషము వ్యాపింపకుండ జేయుటకై యీ సభవా రొక సంఘము నేర్పాటుచేయుచున్నారు."

ఇందులకై నియమింపబడిన సంఘమునం దారుగురుసభ్యు లుండిరి. డాక్టరు భగవాన్దాసుగా రధ్యక్షులైరి. వా రీవిషయమునుగూర్చి విచారించి పెద్ద గ్రంథము వ్రాసి కాంగ్రెసుకు సమర్పించిరి. అది చాలకాలమునకు ముద్రితమయ్యెను గాని గవర్నమెంటువారు దానిప్రచారమును నిషేధించిరి.

తరువాత నొడంబడికనుగూర్చిన తీర్మానము. కరాచీకాంగ్రెసు తీర్మానములందెల్ల ప్రధానమైన యీతీర్మానము గంభీరమై కాంగ్రెసులక్ష్యమును సువ్యక్తముచేయుచు గాంధీ - ఇర్వినుఒడంబడికయందు ద్వంద్వార్థసంకలితమై సంశయగ్రస్తమైయున్న

యర్థమును ప్రతిపాదించునదియై యుండెను. ఒడంబడికలోని 'రక్షణ' లనబడిన వీతీర్మానములో 'సదుపాయము' లయ్యెను. యొడంబడికయందు భారతదేశక్షేమార్థ మేర్పడిన రక్షణలు, తీర్మానము భారతదేశక్షేమమున కవసరములగు సదుపాయము లయ్యెను. తీర్మానములో "భారతదేశమునకు సైన్యములు, విదేశవ్యవహారములు, కోశార్థికవ్యవహారములపై నధికార ముండుట" కను వాక్యము చేర్పబడెను. ఇదియే కాంగ్రెసులక్ష్యముయొక్క సంక్షిప్తరూపము. తరువాత కాంగ్రెసువారు గడచిన సత్యాగ్రహోద్యమములో నానావిధములైన యిక్కట్టులపాలైనవారిని, ముఖ్యముగ స్త్రీలను అభినందించిరి. ఎన్నికల హక్కువిషయమున స్త్రీపురుషభేదమును కాంగ్రెసు గణింపదని తీర్మానించిరి. తక్కిన తీర్మానములనుగూర్చి చెప్పనక్కరలేదు. అవి నిర్మాణకార్యమునకు జెందినవి. వాని నిక్కడ నుదాహరింతుము:

గాంధీ-ఇర్విను ఒడంబడిక

"వర్కింగు కమిటీవారును, ఇండియా గవర్నమెంటువారును గావించుకొనిన యొడంబడిక నీకాంగ్రెసువారు పరిశీలించి యంగీకరించుచు, కాంగ్రెసు గమ్యమైన పూర్ణస్వరాజ్యలక్ష్యము మాత్రము భంగము నొందలే దని తెలియజేయగోరుచున్నారు. తక్కినవిషయము లన్నియు పరిగా నుండి, కాంగ్రెసు రౌండుటేబిలుసభలో బాల్గొను ట కవకాశము కల్గినచో కాంగ్రెసుప్రతినిధు లీలక్ష్యమును సాధించుటకే ప్రయత్నింపగలరు. అందును భారతజాతికి తన సైన్యములు, విదేశవ్యవహారములు కోశార్థిక పద్ధతులమీద సరియైన యధికార మేర్పడునట్లు చూచెదరు. ఇండియాకును, బ్రిటిషు గవర్నమెంటువారికిని ఉన్న లావాదేవీలను నిష్పక్షపాతమైన పంచాయతీచేత పరిశీలింప జేసెదరు. దేశఋణమునందు భారతదేశ మెంత భరించవలయునో యింగ్లాం డెంత భరింపవలయునో పరిశీలించి నిర్ణయించి, యీ యుభయదేశములలో నెవరైనను తమ భాగస్వామిత్వము నిష్టమువచ్చినప్పుడు వదలుకొనుటకు స్వాతంత్ర్య ముండ వలయు నని నిరూపించి భారతదేశక్షేమార్థమై కొన్ని దిద్దుబాటులకుమాత్ర మంగీకరింతురు.

"రౌండుటేబిలుసభలో కాంగ్రెసు ప్రతినిధియై వ్యవహరించుటకు గాంధిజీ కీసభవా రధికార మిచ్చుచున్నారు. ఆయననాయకత్వముక్రింద బనిచేయుటకు వర్కింగు కమిటీవారు మరికొందరు ప్రతినిధులను నియమింపవచ్చును."

# 1. గాంధి-ఇర్విను ఒడంబడిక

## ౧. సత్యాగ్రహులు

"కడచిన సత్యాగ్రహోద్యమములో కారాగృహములబడి తుపాకిదెబ్బలకు, బేనట్టు, లాఠీలపోటులకు గురియై యిండ్లు వాకిళ్లను విడిచి యాస్తులను గోల్పోయి పలుకష్టములు బడసిన సత్యాగ్రహుల నెల్లరను ఈసభవా రభినందించుచున్నారు. ఈ యుద్యమమునందు వేలకొలదిగా జేరి స్వాతంత్ర్యసంగ్రామమున బూర్ణముగ దోడ్పడిన నారీమణుల నీ సభవా రభినందించుచు నెన్నికలవిషయములో స్త్రీ పురుషులకు భేదమును జూపు నేరాజ్యాంగతంత్రమును కాంగ్రెసువా రంగీకరింపరని వాగ్దానము చేయుచున్నారు."

## ౨. సాంఘిక సంఘర్షణములు

"కాశీ, మీర్జాపూరు, ఆగ్రా, కాన్పూరునగరములందును, తదితరస్థలములందును సంభవించిన హిందూ మహమ్మదీయుల కొట్లాటలు భారత స్వాతంత్ర్యోద్యమమునకు మహాపకారము లని యీ సభవారు నిరూపించుచున్నారు. ఈ కొట్లాటలకు గారకులైనవారిని, వానిని బ్రోత్సహించినవారిని, కొట్లాటలు రేగునట్లు సత్యదూరములైన వార్తలను వ్యాపించినవారినీ యీ సభవారు ధిక్కరించుచు, శాంతిభంగకరములైన యిట్టి వారిచేతలు సర్వదా దూష్యములైయున్నవని ప్రకటించుచున్నారు. ఈ కొట్లాటలలో పౌరులును, ముఖ్యముగ స్త్రీలును, పిల్లలునుగూడ హత్యచేయబడినందులకు విచారమునొందుచు వీనివలన బాధల నొందినవారికిని, మృతిచెందినవారికుటుంబములకును నీ సభవారు తమ సానుభూతిని తెలియజేయుచున్నారు.

## ౩. మద్యపాన నిషేధము

"ఈ పండ్రెండుమాసములలో సంపూర్ణ మద్యపాన నిషేధవిషయమున జరిగిన యభివృద్ధి కీ సభవారు సమ్మోదించుచు, కాంగ్రెసుసంఘము లన్నియు నీ దురాచారమును మాన్పుటకు రెండింతలు ప్రయత్నము చేయవలయు నని హెచ్చరించుచున్నారు. త్రాగుబోతులశరీరమును, ఆత్మనుగూడ నశింపజేయుచు, సుఖముగా నున్న సంసారములను బాడుచేయుచున్న యీ పిశాచమును బోద్రోలుటకు స్త్రీలుగూడ నిదివరకుకంటె రెట్టింపుగా బ్రయత్నము చేయుదురని యీ సభవారు తలంచుచున్నారు."

## ౪. ఖద్దరు

"ఈ పదివత్సరములనుండియు వందలకొలది గ్రామములలో పనిజేసి గడించిన యనుభవమునుబట్టి చూడగ, సామాన్యజనులను బీడించుచున్న దారిద్ర్యమునకు మూలహేతువు వారికి విశ్రాంతిసమయములలో తగిన యనుబంధపరిశ్రమ లేకపోవుటయే యనియు, రాట మొక్కటియే సార్వజనీనమైన యనుబంధపరిశ్రమ కాగల దనియు

తేటతెల్లమైనది. ప్రజలు రాటమును, తన్మూలముగ కద్దరును వదలి, విదేశీగుడ్డను మిల్లు గుడ్డను గొనుచుండుటవలన, కష్టపడినదానికి ఫలము దక్కకపోవుటయు, గుడ్డఖరీదునను రెండువిధముల నష్టము పొందుచున్నారు. ఈనష్టమును తూడదీసికొనుటకు విదేశవస్త్రములను, విదేశీమిల్లులను బహిష్కరింపవలయును. కావున దేశీయులెల్లరును విదేశీగుడ్డను బహిష్కరింపవలయు ననియు, విదేశీనూలు గుడ్డవ్యాపారులను కోట్లకొలది గ్రామజనులకు నష్టదాయకమైన యీ వ్యాపారమును మానవలసినదనియు నీసభవారు ప్రార్థించుచున్నారు.

"కాంగ్రెసుసంఘములును, తత్సహాయక సంఘములునుగూడ కద్దరుద్యమమును విజృంభించుటద్వారా విదేశవస్త్ర బహిష్కారమును రెండింతలుగా జేయవలయునని యీ సభవారు ప్రార్థించుచున్నారు."

"సంస్థానాధీశ్వరులు గూడ నీ నిర్మాణకార్యక్రమము నామోదించి, తమరాజ్యములలోనికి విదేశీవస్త్రములను, విదేశీనూలును రానీయకుండజేయుదురు గాక యని యీ సభవారు ప్రార్థించుచున్నారు."

"స్వదేశీమిల్లులవారీ క్రిందివిధముగా నీనిర్మాణకార్యక్రమమునకు తోడ్పడవలెనని యీ కాంగ్రెసువారు కోరుచున్నారు."

(౧) మిల్లులవారు స్వయముగా వడుకునూలు నుపయోగించి యీ గ్రామపరిశ్రమను ప్రోత్సహింపవలయును.

(౨) కద్దరుతో పోటీచేయు మిల్లుగుడ్డను తయారుచేయుట మాని, యంతమట్టుకైన ఆల్ ఇండియాస్పిన్నర్సుసంఘముతో సహాకారముచేయుట.

(౩) మిల్లుగుడ్డల ధరలను సాధ్యమైనంత తక్కువగా నుంచుట.

(౪) మిల్లులలో విదేశీనూలును, సిల్కును, రేవనుపట్టును ఉపయోగింప మానుట.

(౫) విదేశవస్త్ర వ్యాపారులయొద్ద నున్న విదేశీసరకునకు బదులు స్వదేశీ మిల్లు సరకును సప్లయిచేసి వారి విదేశీసరకును మరల పరదేశముల కెగుమతి చేయుట కవకాశములు కలుగజేయుట.

(౬) మిల్లుకూలీల వృత్తులను బాగుచేసి కష్టమునందును, సుఖమునందునుగూడ వారు యజమానులతోబాటు సమాన భాగస్వాము లనుభావమును బెంపొందింపజేయుట.

విదేశవస్త్ర వ్యాపారు లెల్లరును భారతదేశముయొక్క విదేశవస్త్ర బహిష్కారముయొక్క యార్థిక స్వరూప యాథార్థ్యముల నెరిగి భారతీయుల యర్థసంపదను బూర్తిగా నశింపజేసిన యీ వ్యాపారలాభమును బొందమానుకొని, తమ స్వార్థమునే యెంచుకొనక, దేశక్షేమమును గుర్తించి తదనుగుణములైన వ్యాపారములను ప్రారంభించినయెడల వారంతర్జాతీయ మైత్రిని సంపాదించి, వాణిజ్యనీతిని వర్ధిల్లజేసినవారగుదురని యీ సభవారు హెచ్చరించుచున్నారు."

౧౦. పికెటింగు

"కాంగ్రెసువారు విదేశవస్త్ర బహిష్కారమునందును, మద్యపాననిషేధమునందును నింతవరకు బడసిన జయమునకు సమ్మోదించుచు, కాంగ్రెసుసంఘములు శాంతియుతమైన పికెటింగు చేయుటలో రెండింటలు శ్రద్ధవహింపవలయునని హెచ్చరించుచున్నారు. కాని యీ పికెటింగు గాంధీ-ఇర్విను ఒడంబడిక షరతులకు బూర్తిగా లోబడి యుండవలయు ననియు హెచ్చరించుచున్నారు."

౧౧. సరిహద్దురాష్ట్ర ప్రజలు

"భారతీయులకును, భారతదేశపు సరిహద్దుల నివసించు జనులకు నెంతమాత్రము విరోధము లేదనియు, వారితో భారతీయు లెల్లప్పుడును మైత్రి గలిగి మనగోరుచున్నారనియు నీ కాంగ్రెసువారు ప్రకటించుచున్నారు. బ్రిటిషుగవర్నమెంటువారు పశ్చిమోత్తరపు సరిహద్దు రాష్ట్రములలో నవలంబించుచున్న 'ఫార్వర్డు' పద్ధతిని ఖండించుచు, సరిహద్దురాష్ట్రములవారి స్వాతంత్ర్యము నపహరించుటకై చేయబడుచున్న సామ్రాజ్యభావరూపము లైన యత్నములను ఈసభవారు ఖండించుచున్నారు. భారతదేశపు సైన్యములను, ధనమును బ్రిటిషువారి సామ్రాజ్యమును సంపాదించుటకై వినియోగింపగూడదనియు, సరిహద్దుతెగలవారి ప్రాంతములయం దున్న సేనలను తిరిగి రప్పింప వలయుననియు నీ సభవా రభిప్రాయపడుచున్నారు."

౧౨. పశ్చిమోత్తర సరిహద్దురాష్ట్రము

"కాంగ్రెసువారికి పశ్చిమోత్తర పరిహద్దురాష్ట్రముపై సదభిప్రాయము లేదనియొక నింద ప్రబలుచున్నట్లు వినినందున నీసంశయమును బారదోలుటకై ఈకాంగ్రెసువారు ముందు రాబోవు రాజ్యాంగమునందు సరిహద్దు రాష్ట్రమునకుగూడ తక్కిన రాష్ట్రములతోబాటు సంస్కరణము లొసగవలయునని ప్రకటించుచున్నారు."

౧౩. బర్మా

"బర్మాదేశము ప్రత్యేకముగ స్వతంత్రరాష్ట్రమై యుండుటకుగాని, లేక భారతదేశ రాజ్యాంగమునందు సమానప్రతిపత్తితో నుండి యిష్టము వచ్చినప్పుడు విడిపోవు

నధికారము గలిగియుండుటకుగాని నిశ్చయించుకొను హక్కు బర్మాదేశీయులకే కలదు. బర్మాప్రజలకు దమ యభిప్రాయములను సువ్యక్తముగా బ్రకటించుటకై యవకాశ మీయక, వారి జాతీయసంఘముల యిష్టమునకు విరుద్ధమైనరీతిని బలవంతముగ బర్మాను భారతదేశమునుండి విడదీయు బ్రిటిషు గవర్నమెంటువారి ప్రయత్నముల నీసభ వారు ఖండించుచున్నారు. ఈప్రయత్నము బర్మాలోనున్న నూనెగనుల మూలమునను, బర్మాయునికిని బట్టియు, దానిని సింగపూరుతో గూడ గలిపి, తూర్పు ఆసియాలో బ్రిటిషు సామ్రాజ్యరక్షక దుర్గములుగా నొనరించుటకు వేయబడుచున్న యెత్తువలె గన బడుచున్నది. బర్మాను బ్రిటిషు సామంతదేశముగా నుంచి, బ్రిటిషు సామ్రాజ్యాభి వృద్ధికై దాని నుపయోగించుకొనుచు, స్వతంత్ర భారతదేశమునకే గాక తక్కిన ఆసియాఖండ రాజ్యములకుగూడ ప్రక్కలోబల్లెముగా జేయబూనిన బ్రిటిషువారి ప్రయత్నముల నీసభవారు గర్హించుచున్నారు. బర్మా గవర్నమెంటువారి కొసగిన ప్రత్యేకాధికారముల నుపసంహరించి, బర్మాజాతీయ సంస్థల నక్రమసంఘములుగా బ్రకటించిన యుత్తరువులనుగూడ నుపసంహరించి సహజపరిస్థితుల నేర్పరచి, బర్మాభవి తవ్యమును బర్మాప్రజల యభిప్రాయానుసారముగ నిర్ణయించుట యవసరమని యీ సభవారు గవర్నమెంటువారిని హెచ్చరించుచున్నారు."

### ౧౪. తూర్పుదక్షిణాఫ్రికాల భారతీయులు

"తూర్పు ఆఫ్రికా, దక్షిణాఫ్రికాలయందున్న భారతీయులస్థితి చాల నాతుర తను గలిగించుచున్నది. దక్షిణాఫ్రికాలో వీరివిషయమున గావింప బూనుకొన్న శాసనములు పూర్వము కావింపబడిన వాగ్దానములకు విరుద్ధము లగుటయేగాక కొన్ని యెడల న్యాయసిద్ధములైన హక్కులనుగూడ భంజించుచున్నవి. ఈప్రభుత్వములవారు తమదేశీయులు స్వతంత్రభారతదేశమునం దుండినచో వారి కెట్టిసదుపాయములను గోరు దురో యట్టిసదుపాయములనే తమదేశములందున్న భారతీయులకుగూడ గావింప వలయునని యీసభవారు కోరుచున్నారు. దేశాంతరములం దున్న భారతీయులకై శ్రమించుచున్న దీనబంధు ఆండ్రూసుగారిని, పండిత హృదయనాథకుంజ్రూగారిని నీ సభవా రభినందించుచున్నారు."

ఇక్కడ నొక్కవిషయము చెప్పవలయును. ప్రధానహక్కులు, ఆర్థికపరివర నమునుగురించిన తీర్మానము వర్కింగుకమిటీవారియెదుటికి హఠాత్తుగా వచ్చెను. ఇందు నిజ మేమన, కాంగ్రెసుతీర్మానము లప్పటి దేశపరిస్థితులనుబట్టి యుండును. ప్రధాన హక్కులవిషయమున మొదట నమృతసరముకాంగ్రెసులో నర్ధరాత్రివేళ చలితో వడకి పోవుచు సి. విజయరాఘవాచారిగారు ప్రతిపాదించిరి. తరువాత ఆయనయే యధ్య

క్షత వహించిన నాగపురపు కాంగ్రెసులో నది ప్రాముఖ్యము నొందెను. కరాచీలో యువకులకును, వృద్ధులకును నొకవిధమైన భేదము జనించినది. కాంగ్రెసు పూర్వపుడొమినియను స్టేటసునే కోరుచున్నదనియు, బ్రిటిషు సామ్రాజ్యమునందే యుండి తెల్లవారి నిరంకుశత్వమునకు బదులు నల్లవారి నిరంకుశత్వమును బెట్టి కార్మికసమస్యలను, రయితుల కూలీలసమస్యలను సాంఘికవాదాదర్శములను గుంటలో నడగద్రొక్కనని సంశయములు బయలుదేరినవి. ఈ విషయములో దేశీయులకు నమ్మకము చెప్పుట యవసరమయ్యెను. గాంధీజీ దీనికైనను సిద్ధమే. అది సత్యాహింసల కనుకూలమైనమాత్ర ముండవలయును. అందును నిది గ్రామస్థులకును పేదవారికిని జెందిన విషయము.

ఈ షరతులకు లోబడినచో ఆయన సాంఘికవాదాదర్శములవలనగాని, యార్థిక సంస్కరణమువలనగాని, ప్రధానహక్కులవలనగాని భయపడవలసిన పనిలేదు. జవహరలాలు నెహ్రూగారీవిషయములలో పట్టుదల వహించెను. ఈ పట్టుదల కాంగ్రెసు చర్యలను ఖండింపవలయునని కాదు. కాని యీ విషయములనుగూర్చి దేశీయులకు చక్కగా దెలిసియుండవలయుననియు, దానికి దగిన ప్రచారము కావింపవలయు ననియు వారి యభిప్రాయము. ఆ తీర్మానము పుట్టుక యిది. కాని యింత మహార్థవంతమైన తీర్మానమును తగినంత విశ్రాంతి తీసికొని వర్కింగుకమిటీవారును, ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటీవారును జాగ్రత్తతో విచారింపవలసియుండుననియు నూహించిరి. ఈవాదమును తత్ప్రతిపాదకు లంగీకరించి యీతీర్మానముయొక్క మూలసూత్రమును చెడగొట్టకుండ సంస్కరించు నధికారమును ఆల్ ఇండియా కాంగ్రెసుకమిటీవారి కిచ్చిరి. తరువాత ౧౯౩౧ ఆగస్టులో బొంబాయినగరమున ఆల్ ఇండియాకాంగ్రెసు కమిటీవారీతీర్మానమును సంస్కరించిరి. దాని సంస్కృతరూప మిది:

ప్రధానహక్కులు, ఆర్థిక కార్యక్రమములనుగూర్చిన కరాచీ కాంగ్రెసు తీర్మానమును ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటీవారీక్రిందివిధముగా మార్పునొందించిరి.

"స్వరాజ్యమనగా కాంగ్రెసువారి భావ మేమో సామాన్యప్రజలకు తెల్లముగా దెలియుటకై వారి కర్థమగురీతిని కాంగ్రెసువారియభిప్రాయమును బ్రకటించుట యవసరము. సామాన్యజనులను దోచుకొను నిప్పటిపద్ధతి పోవలయునన్నచో రాజకీయ స్వాతంత్ర్యమునందు సామాన్యజనుల యార్థికస్వాతంత్ర్యము గూడ జేరియుండవలెను. కావున కాంగ్రెసువా రంగీకరింపదగిన యేరాజ్యాంగమునందైనను నీక్రింది యంశము లుండవలయును. లేదా యీయంశములను రాజ్యాంగములో జేర్చుటకు స్వరాజ్యప్రభుత్వమువారి కధికార ముండవలయును.

## ప్రధాన హక్కులు-విధులు

(౧) భారతదేశములో ప్రతిపౌరుడును తనయభిప్రాయములను స్వేచ్ఛగా ప్రకటించుటకును, నిష్టమువచ్చినవారితో గూడి యిష్టమువచ్చిన సంఘమున జేరుటకును, న్యాయమునకు నీతికి విరుద్ధములుగాని పనులకొరకు నాయుధములు లేకుండ నిష్టము వచ్చినట్లు సమావేశమగుటకును హక్కుగలిగియున్నాడు.

(౨) ప్రతిపౌరుడును దన యంతరంగమునకు దానే యధికారియై తన మతమును తాను స్వేచ్ఛగా ప్రకటించి యాచరించుచు ప్రజానీతికిని, శాంతికిని భంగము లేనట్లు ప్రవర్తింప హక్కుగలిగియున్నాడు.

(౩) మైనారిటీ సంఘముల విజ్ఞానము, భాష, లిపులును, నాయాభాషారాష్ట్రవాసుల విజ్ఞానభాషాలిపులును సంరక్షింపబడవలయును.

(౪) పౌరులెల్లరును వర్ణ మత లింగభేదములు లేక న్యాయశాస్త్ర ముఖమున సమానులే.

(౫) ఏ పౌరుడెట్టి యుద్యోగమునకు సంపాదించుటకుగాని, యెట్టియధికారమును బొందుటకుగాని, యెట్టివ్యాపారమును, నెట్టివృత్తిని నవలంబించుటకుగాని వారి వర్ణ మతలింగములను బట్టి యెంతమాత్రమును నర్హతపొందజాలరు.

(౬) ప్రభుత్వమువారిచేతగాని, స్థానికప్రభుత్వముల చేతగాని, సర్వజనోపయోగార్థమై వ్యక్తులొసగిన ధనములచేతగాని నిర్మింపబడిన బావులు, చెరువులు, రోడ్లు, పాఠశాలలు, ప్రజావినోదస్థలములు మున్నగువానిపై పౌరులెల్లరకును సమానముగు హక్కులును, బాధ్యతలును కలవు.

(౭) ప్రతిపౌరుడును శాసనానుసారముగ నాయుధముల బట్టి తిరుగు హక్కు కలదు.

(౮) లాప్రకారము గాక యేపౌరుని స్వాతంత్ర్యమును గాని, వానిగృహమును గాని, వానిఆస్తినిగాని యెవ్వరును ప్రవేశింపగూడదు, లాగుకొనగూడదు, వశము చేసికొనగూడదు.

(౯) అన్ని మతములవిషయమునను ప్రభుత్వము తటస్థభావమును వహించును.

(౧౦) మైనారిటీ వెళ్లిన జనులెల్లరకును వోటింగు హక్కుండవలయును.

(౧౧) ప్రభుత్వమువారు దేశములో నంతటను నుచితముగ నిర్బంధప్రాథమిక

(౧౨) ప్రభుత్వమువా రెవ్వరికిని బిరుదము లీయగూడదు.

(౧౩) మరణదండన ముండరాదు.

(౧౪) ప్రతిపౌరుడును భారతదేశమునం దంతట నిష్టము వచ్చినట్లు ప్రయాణము చేయవచ్చును. ఇష్టమువచ్చినచోట ఆస్తిని సంపాదించుకొనవచ్చును. ఇష్టమువచ్చిన వ్యాపారమును, వృత్తిని నవలంబించవచ్చును. భారతదేశమం దన్ని ప్రాంతములందును నేరారోపణవిషయమున సమానమైన హక్కులు పొంది, సమానమైన రక్షణము నొంద వలయును.

## కూలీలు

2 (౧) ఆర్థికజీవననిర్మాణము, కూలీలకు సముచితమైన జీవనప్రమాణము గలుగ జేయునట్లు న్యాయధర్మానుకూలముగ నుండవలయును.

(౨) ప్రభుత్వమువారు పరిశ్రమలయందలి కూలీల యోగక్షేమము లరసికొనుచు, ప్రత్యేకముగ శాసనముల గావించియు, తదితరపద్ధతుల ననుసరించియు, వారికి తగిన జీవనభృతియు, నారోగ్యకరములైన పనిపాటులును, పనికి గొన్నిగంటల నియామకమును, యజమానులకును కూలీలకును వచ్చిన తగాదాలు తీర్చుటకు తగిన యేర్పాటులును, వార్ధకము, రోగము, నిరుద్యోగములును సంభవించినప్పుడు తగిన రక్షణమును గలుగునట్లుగా జూడవలయును.

(౩) కూలీలకు దాస్యము లేకుండజేయవలయును. దాస్యతుల్యములైన పరిస్థితులను తొలగింపవలెను.

(౪) ఆడుకూలీలకు రక్షణ ముండవలెను. అందు ముఖ్యముగ బాలెంతరాండ్రకు దగినసెలవు లుండునట్లు చూడవలెను.

(౫) పాఠశాలకు బోయి చదువుకొను నీడుగల బాలురను ఫ్యాక్టరీలయందును గనులయందును ప్రవేశపెట్టుకొనరాదు.

(౬) రయితులును, కూలీలును వారి హక్కులను సంరక్షించుకొనుటకు యూనియనుల నేర్పరచుకొనవచ్చును.

## పన్నులు-వాని ఖర్చు

(౭) భూమి కౌళ్ల పద్ధతిని, భూమిశిస్తు వసూలుపద్ధతులను సంస్కరించ వలయును. చినచిన్న రయితులిచ్చు భూమిశిస్తును, కౌలుమొత్తమును తగ్గించియు, నొకటి రెండెకరములుగలవారికి న్యాయముగ నుచితమైనంత కాల మసలు పన్నులే లేకుండజేసియు, నిట్టి తగ్గింపులవలనను, సదుపాయములవలనను నష్టపడిన చిన్న

యెస్టేటుదారుల భూములపై వచ్చు నికరాదాయములమీద హెచ్చులొచ్చుల ననుస రించి పన్నులు వ్రచ్చుకొనుటమూలనుగా సదుపాయములు చేసి కృషీవలుల భార మును తగ్గింపవలయును.

(౮) ఆస్తులపై నొక ప్రమాణమును విడిచి, క్రమవృద్ధిగా మరణపు పన్నులను విధింపవలయును.

(౯) సైన్యపుఖర్చును సగానికి సగము తగ్గింపవలెను.

(౧౦) సివిలుద్యోగుల శాఖల జీతములను చాలమట్టుకు తగ్గింపవలెను. ఎవరో కొందరు నిపుణులకు తక్క దక్కిన ప్రభుత్వోద్యోగుల కెవ్వరికీ ౫౦౦ రూపాయ లకు మించిన వేతన ముండగూడదు.

(౧౧) భారతదేశములో తయారైన యుప్పుమీద డ్యూటీ వేయరాదు.

## ఆర్థిక సాంఘిక కార్యక్రమము

(౧౨) ప్రభుత్వము స్వదేశీ వస్త్ర పరిశ్రమను రక్షింపవలెను. విదేశీ వస్త్ర ములను, నూలును దేశములోనికి రాకుండ నిషేధింపవలయును. అవసరమైనచో నితర స్వదేశ పరిశ్రమలనుగూడ విదేశముల పోటీనుండి ప్రభుత్వము రక్షింపవలయును.

(౧౩) మత్తును గలుగజేయు పానీయములు, మందులు వైద్యమునకు గావలసి నవి తక్క తక్కినవానిని నిషేధింపవలయును.

(౧౪) నాణెముల మారకపుపద్ధతి దేశక్షేమానుకూలముగ నేర్పాటుచేయ వలయును.

(౧౫) ప్రధాన పరిశ్రమ లన్నిటిని ప్రభుత్వమువశము చేసికొనవలయును. గనులు, రైల్వేలు, జలమార్గములు, నౌకలు మున్నగు ప్రయాణసౌకర్యము లన్నియు ప్రభుత్వమువారికి చెందియుండవలయును.

(౧౬) రయితుల ఋణములను దీర్చవలయును. అనుచితములైన వడ్డీలను రూపు మాపవలయును.

(౧౭) ప్రభుత్వము పౌరు లెల్లరకును సైనికశిక్షణము నొసగి ప్రభుత్వసేనల కంటె వేరుగా రక్షణసైన్యదళము లుండునట్లు చేయవలయును.

గాంధీ — ఇర్విను ఒడంబడిక జయమును, తరువాత కరాచీ తీర్మానముల జయ మును గాంధీజీకిని కాంగ్రెసునకును కార్యభారము నెక్కువచేసెను. కరాచీకాంగ్రె సులో నొకటి రెండు ముఖ్యాంశములు వర్కింగుకమిటీవారికిని ఆల్ ఇండియా కాం గ్రెసుకమిటీవారికిని వదలివేయబడెను. సిక్కులు జాతీయపతాకయందు తమ కిష్టమైన

వర్ణ ముండవలయు ననిరి. ఈవిషయము లాహోరుకాంగ్రెసునందే చర్చకువచ్చెను. తరువాత నిది కరాచీలో మఱికొంత ప్రాముఖ్యము నొంది, సిక్కుల తీర్మానములోని గూఢాంశము లన్నింటిని సమర్థించుకొనుటకు కాంగ్రెసువారికి వ్యవధి లేకపోవుటచే వర్కింగుకమిటీవారు దానివిషయమై జాగ్రత్తపుచ్చుకొనవలసివచ్చెను. పతాకలో నిప్పుడున్న 'వర్ణములు ప్రధానసంఘములను తెలియజేయుచున్నవని యభ్యంతరము చెప్పిరి. ఆవిషయమును బరిశీలించి, కాంగ్రెసువారి కొక పతాకాస్వరూపమును నివేదించుటకై వర్కింగుకమిటీవారు కరాచిలో హరిశ్చంద్రనగరునందు సమావేశమైయొక యుపసంఘము నేర్పాటుచేసిరి. ఆకమిటీవారు సంజాయిషీ పుచ్చుకొని ౧౯౩౧ జూలై ౩౧ తేదీలోపల నివేదిక నంపవలయును. ఇది యిట్లుండగా భగత్సింగు, రాజగురు, సుఖదేవుల కళేబరములు ముక్కలుముక్కలు క్రింద గొట్టబడి, సరిగా దహనముచేయబడక, యవమానింపబడెనని యొక వదంతి బయలుదేరి కరాచీ కాంగ్రెసును కలవరపరచెను. ఇందులకై వర్కింగుకమిటీవా రొక యుపసంఘము నేర్పరచి, యీ విషయమును వెంటనే విచారించి, ఏప్రిలు ౩౦ తేదీనాటికి నివేదికను సమర్పింపుడని నియోగించిరి. దీనికి మొదట కారకుడైన భగత్సింగు తండ్రి యీ వదంతిని నిరూపించు సాక్ష్యమును తేలేకపోగా, యీకమిటీయెదుట సాక్ష్యమిచ్చుటకైనను రాలేదు. అందుచేత దానివలన నేమియు ఫలము చేకూరలేదు. ఇక మూడవది ప్రధానహక్కులు, ఆర్థిక సంస్కరణములనుగూర్చిన తీర్మానము కాంగ్రెసుచే నెట్లామోదింపబడినదియు దెలిపియేయుంటిమి. దానికొరకొక యుపసంఘమును నియమించి, యా తీర్మానమును సంస్కరించుటకై రాష్ట్రసంఘములు, నితరసంస్థలు నితర వ్యక్తులయొద్దనుండి సంజాయిషీ పుచ్చుకొని, మేనెల ౩౧ తేదీలలోపల వర్కింగుకమిటీవారికి నివేదిక బంపుటకై యొక యుపసంఘమును నియమించిరి. నాల్గవది బ్రిటిషువారు భారతదేశములో గావించిన లావాదేవీలను నిష్పక్షపాతులైన పంచాయతీదారులచే పరిశీలింపజేయుటకై కాంగ్రెసు మొదటినుండియు పట్టుపట్టుచుండెనని మన మెరుగుదుము. ఆ విషయమునుగూర్చి ముందు వాదోపవాదములు జరుగవచ్చును. ఆయొద్దడి నాసుటకు తగిన సంజాయిషీ సామగ్రిని సమకూర్చుకొనవలసియుండెను. అందుచేత భారతదేశములో మొదట ఈస్టిండియాసంఘమును, తరువాత బ్రిటిషు గవర్నమెంటువారును గావించిన లావాదేవీలను, దేశఋణ మనబడుదానిని బరిశీలించి ముందుముం దిండియా కాని, యింగ్లాండు కాని భరింపవలసిన మొత్తములను నిర్ణయించుటకై యొక యుపసంఘమును నియమించిరి. ఈ కమిటీవారు మేనెల యాఖరులోపల నివేదికను బంపవలయుననిరి. తరువాత నింకొకకమిటీ యేర్పాటుచేయబడెను. కాని యది కమిటీకాదు. గాంధీ, వల్లభాయి, సేటు జమ్నాలాల్జీగార్లు మహమ్మదీయనాయకులను గలసికొని

హిందూ మహమ్మదీయ సమస్యను బరిష్కరించుటకు రాయబారము నెరప నియోగింపబడిరి. ఇక కాంగ్రెసువారి మూడవ తీర్మానముక్రింద విడుదలకావలసిన రాజకీయ బంధితు లుండిరి. ఇట్టివారి జాబితాను తయారుచేయుట కన్నిరాష్ట్రములనుండియు పంచాయిషీని సంపాదించుటకు నారిమనుగారు నియోగింపబడిరి. వర్కింగుకమిటీవారు కావించిన చివరి తీర్మానము, రౌండు టేబిలుసభకు బంపవలసిన కాంగ్రెసు ప్రతినిధులను గావించి రౌండుటేబిలుసభ కొక్క ప్రతినిధిగాక పదునేనుగురు ప్రతినిధులు వెళ్లవలయునని వర్కింగుకమిటీయందు పలువు రభిప్రాయపడిరి. గవర్నమెంటువా రిరువదిమంది ప్రతినిధులకైనను తగిన యేర్పాటులుచేయుటకు సంసిద్ధముగా నుండిరి. ఒక్కడుగాక పదునేనుగురో, యిరువదుగురో యుండుట గవర్నమెంటువారు వేయుచున్న యెత్తులకు వీలుగా నుండును. దీనిమీద జరిగిన చర్చలలో, గాంధీజీ లండను బోవుచున్నది, యొక సంధియొక్క ప్రధానాంశములను నిర్ణయించుటకు రాయబారియై వెళ్లుచున్నాడేగాని, యొక రాజ్యాంగతంత్రమునందలి హెచ్చు తగ్గులను సరిచూచుటకు బోవుటలేదని తెల్లమయ్యెను. ఈ విషయము తేలునప్పటి కెల్లరు నేకగ్రీవముగా గాంధీజీ యొక్కడే వెళ్లవలయునని తీర్మానించిరి. ఆ యంగీకారములో నేకగ్రీవతయేకాదు, నిష్కల్మషతయు నుండెను. పలువురికంటె నొక్కడే భారత దేశమునకు ప్రతినిధిత్వము వహింపగలడు. కాంగ్రెసు యుద్ధకాలమున నేక నాయక బద్ధమైయున్నట్లే శాంతికాలమునందుగూడ నేకనాయకనియమితమై యుండగలదను ప్రతిష్ఠయు నెంపొందగలదు. స్వలాభలేశమును లేక, శాంతి సద్భావములును, మానవ కల్యాణమును దక్క మరొక్క వాంఛయు లేని మహాపురుషు డేకముగ కాంగ్రెసు రాయబారియై పయనించెననుటయే నైతికప్రపంచమున కాంగ్రెసు పొందిన యొక మహావిజయము. దాని మహత్త్వ నర్థము చేసికొనుటయు దుస్తరము. ఇంతకును భారత దేశపు గోచిపాతరాయడు వైస్రాయిభవనపు మెట్లపై ఓరికాళ్లతో నడుసులిడుటయే గాక సెంటు జేమ్సు భవనమునందు సమాన ప్రతిపత్తితో సంధిజేయ రాయబారియై బ్రిటిషువారిప్రతిష్ఠను భంగ మొందింపవలసినవిధి యుండుటచే నిది యిట్లు సంభవ మయ్యెను.

# 2. సంధి భంగము

[ఆయుధవిసర్జనము-పికెటింగు సంఘము-ఒడంబడిక ఉన్నతాధికారుల కిష్టము లేకుండుట-రౌండు టేబిల్ సభలో పాల్గొనుటనుగూర్చి కాంగ్రెసు కార్యనిర్వాహక సభ్యుల నిర్ణయము - కాంగ్రెసు వర్కింగుకమిటీ (కార్యసంఘము) యొక్క ఇతర తీర్మానములు - కయ్యమునకు కాలుదువ్వవలదని గాంధీ మందలించుట - విల్లింగుడన్ ప్రభువు సానుభూతి - శాంతికాని రాజీకాదు - రాజీషరతులు భంగము చేయబడుట - గాంధీ ఎమర్సనుల ఉత్తర ప్రత్యుత్తరములు - ప్రభుత్వమువారు ఉత్తర ప్రత్యుత్తరములను ప్రచురించుట - గాంధీ రౌండు టేబిలుసభకు పోవ నిరాకరించుట - సాంఘిక సమస్యలను గూర్చి కాంగ్రెసు వర్కింగుకమిటీ - ఆ సమస్యల పరిష్కారమున కొక సూచన విదేశీబట్టల మినహాయింపు - మిగిలిన అధికారములు - వివరణము - అ. భా. కాం. సం. సమావేశము - జాతీయపతాకము మార్పుచేయబడెను - గాంధీ అహమ్మదాబాదు పోవలెనని బొంబాయినుండి బయలుదేరుట - సర్. పి. పట్టానీ మాత్రము తన ప్రయాణము మానుకొనుట - సర్. ఇ. హాట్సన్‌పైన రివాల్వరు కాల్చబడుట - ఎమర్సన్ ఉత్తరము - రెవిన్యూవసూలునుగూర్చి కాంగ్రెసు చెప్పినంతేనా -? అన్సారీ ప్రతినిధిగా నామినేటు చేయబడలేదు - తిరిగి విరోధము ప్రారంభము కావచ్చునని భయము - మాలవ్యా, సరోజినీదేవి, తమ ప్రయాణములను మానుకొనుట - సంధికి తోవలేకపోలేదు - గాంధీ వైస్రాయికి వ్రాసిన ఉత్తరము - సివిలియనులలో మార్పు కలిగేటంతవరకును సంధి కుదురదు - సిమ్లాసభ - గాంధీ లండను పోవలసివచ్చెను - ప్రభుత్వప్రకటనము - బార్డోలీపన్నుల వసూలుపద్ధతినిగూర్చి విచారణ యేర్పాటు చేయబడినది - ఆత్మసంరక్షణార్థము కాంగ్రెసు ప్రత్యక్ష కార్యక్రమమునకు దిగ వచ్చును - కాని గాంధీ ఇర్విసుసంధి అమలులోనే ఉన్నది - గాంధీ లండను బయలు దేరుట - కాంగ్రెసుకార్యసంఘ మంగీకరించుట - గాంధీప్రయాణము - ఏడెనులో సన్మానము - శాలువ విక్రయము - ఈజిప్టుసన్మానము - "ఇండియాతో మీసంబంధములను సమన్వయించుకొనుడు." - మార్సెలీసు సన్మానము - గాంధీ భాగ్యవంతుల మధ్యకంటె పేదలమధ్య నుండుటకే ఇష్టపడెను - రౌండు టేబిలు మహాసభలో గాంధీ- గాంధీ కాంగ్రెసునుగూర్చి చెప్పినమాటలు - మైనారిటీలసభలో గాంధీ - రౌండు టేబిలుసభ అంటే మంత్రివర్గమునకు విసుగుపుట్టెను - సైనిక సమస్యనుగూర్చి గాంధీ

కాంగ్రెసు అనేకపక్షములలో ఒకపక్షమా! - కాంగ్రెసుకు విశ్వమంతా వేదికయే - కాంగ్రెసుసిద్ధాంతము విశాలము - పరస్పర లాభములకొరకు భాగస్వామ్యము - భారతదేశమునకు స్వేచ్ఛ ఉండవలెను - వారు కొంచె మవకాశ మీయుడు - గాంధీ కృతజ్ఞతాభివందన సమర్పణము - భారతదేశపరిస్థితులు - ౧. గుజరాతు - ౨. సంయుక్తరాష్ట్రములు - ౩. వంగరాష్ట్రము.]

యుద్ధము ముగిసెను. ఆయుధములు విడువబడెను. సంధివిజయములు నిజముగా యుద్ధవిజయములకంటె గొప్పవి. కాంగ్రెసు ఈ విజయములను సంపాదింపగలిగెను. తరువాత నిలుపుకొనగలిగెను. కాని ఈ విజయమే తరువాత కాంగ్రెసుకు అపజయముగా పరిణమించెను. కాంగ్రెసు నైతికముగా బలము సంపాదించెను. కాలము గడచినకొలది కాంగ్రెసు సర్వతోముఖముగా సంపాదించిన నైతికవిజయము ప్రకటితము కాదొడగెను. నిన్నటివరకును ఊరూ, పేరూ లేకుండా పడియున్న కాంగ్రెసు సంఘములు వసంతకాలపు వృక్షములవలె చిగురింప ప్రారంభించెను. కాంగ్రెసువాదుల గృహములపైనను, కాంగ్రెసు కార్యాలయములపైనను మరొకసారి కాంగ్రెసుపతాక మెగుర నారంభించెను. కాంగ్రెసుకార్యాలయములనుండి పోలీసువారు పట్టుకొనిపోయిన ప్రతికాగితపుముక్కను, ప్రతిపుస్తకను కాంగ్రెసుద్యోగస్థులు తమకు తిరిగీ ఇయ్యవలసినదిగా పట్టుపట్టిరి. వాలంటీరులు వారిజాతీయ దుస్తులలో వాలంటీరుచిహ్నములు ధరించి, సైనికులవలె తిరిగి ఉత్సవముల నడుప ప్రారంభించిరి. క్రిందటిక్షణమువరకును నిషేధింపబడిన జాతీయకీర్తనలను పాడుకొనుచు, జాతీయపతాకములను ధరించినవారు నడువదొడగిరి.

బాలురును, బాలికలును, స్త్రీలును, పురుషులును విదేశీబట్టల దుకాణముల కడను, కల్లుదుకాణములకడను పికెటింగును ప్రారంభించిరి. కల్లుత్రాగకూడదని, విదేశీవస్త్రములను ధరించకూడదని ప్రబోధము చేయసాగిరి. ఇంతకుపూర్వమివన్నియు తప్పులుగా పరిగణింపబడెను. నిన్నటివరకును ఈపనులు చేసినవారిపైన పోలీసువారు గొఱ్ఱెలపై కురికే తోడేళ్లవలె దురికిరి. నేడు వారి కండ్లయెదుటనే ఈపనులు సురక్షితముగా జరుపబడుతూన్నవి. పోలీసునౌకరుల కివి గిట్టలేదు. చిన్నచిన్న మేజస్ట్రీట్లకు కూడా ఇది అనుకూలముగా కనపడలేదు. సివిలియనులు తమ దేమో పడిపోయినట్లను కొనిరి. నిరంకుశాధికారవర్గము తమరాజ్యమే పోయినదని భావించెను. లాఅర్డర్ల సంరక్షకులు తమ రపజయ మొందినట్లు ఆశాభంగము చెందిరి. ప్రతిరోజా ఖైదీలు విడు

దల చేయబడుచుండిరి. వారిగౌరవార్థము ఉత్సవములు జరుపబడుచూవచ్చెను. వారికి పువ్వులదండలు వేయబడెను. వా రుపన్యాసము లీయదొడగిరి. కొన్ని సందర్భములలో వినయముగాని, విచక్షణగాని కనపడకపోయెను. నానాటికి తృణీకారభావముకూడా వారి ఉపన్యాసములలో కనపడజొచ్చెను. కాంగ్రెసుద్యోగులు, విడుదలకాని ఖైదీలనుగూర్చి, తిరిగీ యీయబడని ఆస్తులనుగూర్చి ప్రభుత్వాధికారులను ప్రశ్నింప ప్రారంభించిరి. కాంగ్రెసుద్యమమూలమున ఉద్యోగములు పోయిన వారికి తిరిగీ ఉద్యోగము లిప్పించుటనుగూర్చి వారు ప్రభుత్వమువారితో ఉత్తరప్రత్యుత్తరముల నడపిరి. ఏప్రిలు ౧౮ వ తేదీని ఇర్విన్ప్రభు విండియాను విడిచిపెట్టెను. బొంబాయిలో గాంధీ ఆయనను కలుసుకొని సెలవుతీసుకొనెను. వైస్రాయి మారిపోయెను. కొత్తవైస్రాయి వచ్చెను. పాతస్నేహములు, పాతవాగ్దానములు కొత్తవైస్రాయికి తెలియవు. షోలాపూరుఖైదీలను విడుదలచేసెద నని ఇర్విన్ప్రభువు వాగ్దానము చేసినంతమాత్రమున నేమాయెను? విచారణలేకుండా నిర్బంధింపబడినవారి కేసులను ప్రత్యేకముగా పరీక్షింతునని, పూర్వపువైస్రాయి చెప్పినంతమాత్రమున ఇప్పు డేమి కాగలదు? గుజరాతులో రాజీనామాలిచ్చిన ఇద్దరు డిప్యూటీకలెక్టరుల పింఛనులను, ప్రావిడెంటుఫండ్లను ఇప్పించుట కేర్పాటుచేతునని పాతరాజప్రతినిధి చెప్పినతో ఇప్పు డెవరేమి చేయగలరు? బార్డోలీపన్నులనిరాకరణసందర్భమున విక్రయింపబడిన ఆస్తులను తిరిగీయిప్పించుటకు స్థానికప్రభుత్వమునకు వ్రాసెదనని ఆయన మాట ఇచ్చినంతమాత్రమున దాని కిపు డెవ్వరు బాధ్యత వహింపగలరు? మీరటుఖైదీలు విచారణలో నుండగా అనుభవించినఖైదును వారిశిక్షలలో ముదరా ఇప్పించెదనని ఇర్విను ప్రభువు జవాబుదారీ వహించినందు కిప్పు డెవ్వ రేమి చేయగలరు?

ఇర్విన్ప్రభువు ఏప్రిలు ౧౮ వ తేదీని భారతదేశమును విడిచి పెట్టెను. ఆ క్రిందటిరోజున విల్లింగుడన్ప్రభు వధికారము వహించెను. వైస్రాయిలు మారవచ్చును కాని వారి కార్యదర్శులుమాత్రము మారరు. జిల్లా అధికారులైన సివిలియను ఉద్యోగులే నిజముగ వైస్రాయిలు. ౧౯౨౯ నవంబరు ౨ వ తేదీని ఢిల్లీలో భారతనాయకులు కొందరు సంతకములు చేసి ప్రకటించిన ప్రకటనలో ఆనాటి నుండీ పరిపాలనాతత్వము మారవలెనని సూచింపబడెను. ఆ సూచన కర్థము సివిలియన్‌కలెక్టరుల నిరంకుశత్వము పోయి, భారతప్రభుత్వము ప్రజాపాలితముగా చేయబడవలెనని తప్ప మరొకటి కాదు. ఒక సంవత్సరము పోరాడిన పిమ్మటగాని, గాంధీ, ఇర్వినుల ఒడంబడిక ఫలితముగాగాని ఆ ప్రభుత్వపద్ధతిలో మార్పు కలుగలేదు. దేశమునందలి అధికారవర్గమువారు గాంధీ, ఇర్విను ఒడంబడిక తమ ప్రతిష్ఠకు భంగకరమని భావించిరి. ప్రతిరోజూ గాంధీ, ఇర్వినుల ఒడంబడికవరతులు సరిగా

నిర్వర్తింపబడుటలేదని కాంగ్రెసుకార్యాలయములకు ఉత్తరములు చేరుతూండెను. ఆ ఒడంబడిక ప్రకారము తమ షరతులను తూచా తప్పకుండా నిర్వర్తించుటకు కాంగ్రెసు ఎక్కువశ్రద్ధ తీసుకొనెను. ఆ షరతులు ముఖ్యముగా పికెటింగుకు సంబంధించినవి, బ్రిటిషువస్తువుల బహిష్కారమునకు సంబంధించినవి. పికెటింగు విషయములోని నియమములను వాలంటీరులు సరిగా పాటించునట్లు కాంగ్రెసు అధికారులు శ్రద్ధతీసుకొనిరి. బ్రిటిషువస్తువుల బహిష్కారప్రచార మాపివేయబడెను. వీటిలో నెక్కడైన లోపములు జరిగినప్పుడు ప్రభుత్వాధికారు లా విషయములను వెంటనే కాంగ్రెసువారులకు తెలియపరచుచుండిరి. కొన్ని చోట్ల లాఠీచార్జీలు జరిగినప్పటికికూడా కాంగ్రెసువారులు లెక్కపెట్టలేదు ఒడంబడిక జరిగిన పిమ్మట కూడా గుంటూరుపోలీసువారి ఆచారమును పోనీయలేదు. తూర్పుగోదావరి జిల్లాలో వాడపల్లి రథోత్సవసందర్భములో ప్రజలు గాంధీబొమ్మను రథముమీద పెట్టినంతమాత్రమున పోలీసువా రభ్యంతర పెట్టి తుపాకులనుకాల్చిరి. ర గురు మరణించిరి. అనేకమందికి గాయములు తగిలెను. తుపాకులను కాల్చుట, లాఠీలను ప్రయోగించుట పోలీసువారికి దినచర్య యైపోయినది. వా రాపనిచేయ కుపేక్షింపజాలకుండిరి. ప్రతిచోటా ఈవిధముగానే జరిగెనని మా అభిప్రాయముకాదు. కాని ఇవి జరిగినపుడుమాత్ర మెంతమాత్రమును క్షమార్హములుగాని పరిస్థితులలో జరిగెను.

కాంగ్రెసుప్రభుత్వముతో రాజీపడినపుడు భారతదేశములోని వివిధసంఘములలో కూడా ఒడంబడిక కుదురవచ్చునని ఆసంస్థ గంపెడాసతో నుండెను. ప్రభుత్వమువా రా సందర్భములో సహాయము చేతురని కూడా కాంగ్రెసు అభిప్రాయపడెను. కాని ఆఆశలు నిరాశలైనవి. హిందూమహమ్మదీయసఖ్యత కుదరనిదే లండనుకుపోయి నందువలన లాభములేదని గాంధీకి తెలుసును. ఆయన ఈ రెండుసంఘములకును ఒడంబడిక కుదరనిదే లండను పోవుటకంటె ఇంటిదగ్గర కూర్చుండుట మంచిదని తలచెను. కాని ౧౯౩౧ జూను ౯, ౧౦, ౧౧ తేదీలలో కాంగ్రెసు కార్యనిర్వాహకసభ బొంబాయిలో సమావేశమై మహమ్మదీయమిత్రులప్రోత్సాహముతో గాంధీమనోభావములకు వ్యతిరేకముగా కూడా ఈక్రింది తీర్మానము నంగీకరించెను: "దురదృష్టవశమున ఈప్రయత్నములు కొనసాగకపోయినప్పటికీ ఇతరషరతు లంగీకారముగానున్నయెడల కాంగ్రెసుఅభిప్రాయములను గూర్చి యేవిధముగాను అపోహలు కలుగకుండుటకుగాను కాంగ్రెసుప్రాతినిధ్యము కోరబడేయెడల గాంధీ రౌండుటేబిలు మహాసభకు పోయి కాంగ్రెసుపక్షమున ప్రాతినిధ్యము వహింపవలె ననియే ఈకమిటీవారి యభిప్రాయము."

కాంగ్రెసు కార్యనిర్వాహక సంఘమువారుకూడా ఇక్కడ గాకపోయినను ఇంగ్లాండులోనైనా వివిధసంఘములకును ఒడంబడిక కుదురవచ్చునని అభిప్రాయపడిరి.

మే మిప్పుడు సంధిమరతుల ననుసరించుటనుగూర్చి విచారించేముందు కాంగ్రెసు వర్కింగుకమిటీ (కాంగ్రెసు కార్యనిర్వాహక సంఘము) వారి జూన్ నెలలోని కార్యక్రమమును గూర్చి కొంత చెప్పవలసి యున్నది. జాతీయఋణమును గూర్చి, పౌరుల ప్రధానహక్కులనుగూర్చి ఆయాకమిటీలవారు నివేదికలను పంపుటకు వాయిదా హెచ్చుచేయబడెను. నడుకునూలు బట్టలకు కాక తదితరవస్త్రములకు కాంగ్రెసువారు సర్టిఫికెట్లు నిచ్చేపద్ధతి తీసివేయబడెను. కొన్ని కాంగ్రెసుసంఘములు నిలవ ఉన్న విదేశీబట్టలవిక్రయము నంగీకరించినవి, అది తప్పుగా భావింపబడెను. రాజీమరతుల ప్రకారము విడిచిపెట్ట వీలులేని కొందరు ఖైదీలజాబితా నారిమన్ చే తయారు చేయబడెను. అది గాంధీకి పంపుటకు నిర్ణయింపబడెను. బట్టలుకాక తదితర భారతీయ వస్తువులను పర్చిపెచేసేనిమిత్తము స్వదేశీబోర్డొకటి స్థాపింపబడెను. ఢిల్లీవంగరాష్ట్రముల ఎన్నికతగాదాలు విచారింపబడెను. ౧౯౨౫ నుండి కాంగ్రెసు తీర్మానములు హిందీభాషలోకి తర్జుమా చేయించుటకు రు. ౨౫౦ లు మంజూరుచేయబడెను.

ఇక సంధిమరతు లేవిధముగా అనుసరింపబడినవో ఆవిషయ మాలోచింతము. కాంగ్రెసు స్వసంరక్షణపద్ధతి నవలంబించెను. గాంధీ, ఎవ్వరును కయ్యమునకు కాలుదువ్వకూడదని గట్టిగా మందలించెను. కాని జాతీయాత్మగౌరవమునకు భంగము కలిగినప్పు డుపేక్షింపకూడదని కూడ ఆయనఅభిప్రాయము. భీతితో లొంగిపోవుట గాంధీకిష్టము లేదు. భీతిని, నిస్సహాయత్వమును జయింపవలెనని ఆయనకు పట్టుదల. ఆయన సలహా లీక్రింద సంగ్రహముగా నుదాహరింపబడినవి:

"ప్రభుత్వమువారు రాజీమరతులను గౌరవముగా కొనసాగించుటకు వీలులేకుండా చేసినయెడల మన మాత్మసంరక్షణ కవసరమైన చర్యలను తీసుకొనవలెను. అంత కెక్కువ పోకూడదు. మద్రాసులో ౫ గురు కంటె ఎక్కువమందిని పికెటింగుకు పెట్టకూడదని వా రనిరి. ఇంతకుపూర్వము నేను "సరే" నంటిని. ఇకను అలా అనవలసిన అవసరములేదు. ప్రతి గేటువద్దను ౫ గురు పికెటర్లను మనము పెట్టవలెను. ఇది ఒక ౯ రోజుల ప్రదర్శనము కావచ్చును. వారు లొంగనైనా లొంగవలెను, లేదా యెదిరించనైనా యెదిరించవలెను. మనంతట మన మేమీ కయ్యమునకు కాలు దువ్వవద్దు. కాని మన మెప్పుడును ఆత్మసంరక్షణలోనుండవలయును. ఒక జెండాఉత్సవము నిషేధింపబడిన దనుకొండి. మనము సహించి ఉండజాలము.

మన హక్కును ప్రతిష్ఠించుకొన ప్రయత్నించవలెను. ఒక ఉత్సవము నిషేధింపబడిన యెడల అవసరమైనచో మనము ప్రభుత్వమువారికి లైసెన్సుకొరకు కూడా దరఖాస్తు పెట్టవచ్చును. మనకు లైసెన్సు ఈయబడనియెడల ఆ నిషేధపు టుత్తరువుల నుల్లంఘింపవలెను. కాని నెలనెలకు మనము జరిపే పతాక వందనోత్సవములను గాని, లేక మామూలు బహిరంగసభలను గాని వారు నిషేధించేయెడల మన మెంత మాత్రము వారి అనుజ్ఞకోసము దరఖాస్తు పెట్టి వేచియుండవలసిన అవసరము లేదు. మనము నిస్సహాయులముగా నుండకూడదు. అందుమూలమున పికెటింగును కొనసాగును.

"ఇక పన్నుల నిరాకరణ విషయములో మీ రంగీకరింప వచ్చును. కాని దానిని మీరు కార్యక్రమముగా చేయరాదు. పన్నులు నిరాకరించదలచుకొన్నవారు వారి స్నేహితులను కూడగట్టుకొని అందుకు వారే బాధ్యత వహించవలెను. అలా జరిగిన యెడల అది ఆర్థికసమస్య అగును. అది ఆర్థికవిషయ మైనప్పుడు ఆ ఉద్యమములో సామాన్యప్రజాసమూహము చేరగలదు."

ఇక ప్రభుత్వమువారివిషయము. విల్లింగ్డన్ ప్రభు వరటిపండు వలిచి చేతిలో పెట్టినట్లు తియ్యని మాటలు చెప్పెను. ఆయనను సందేహించుట కేమీ కారణము కనపడలేదు. కాని వైస్రాయి యిచ్చిన ఉపన్యాసములు గాలిలో మేడలనే సంగతి తెలుసుకొనుట కెంతో కాలము పట్టలేదు. జూలై మొదటివారమునాటికి గాంధీకి సంధి భగ్నమగునని పూర్తిగా సందేహముతోచెను.

సుల్తానుపురములో ౯౦ మందిపైన క్రి. ప్రొ. కో. ౧౦౭ సెక్షన్ క్రింద కేసుపెట్టబడెను. మరియొకచోట భవానీమహాపూర్ లో జాతీయపతాకములను తీసివేయవలసినదని రైతులకు తాలూకాదా రాజ్ఞాపించెను. వారు నిరాకరించగానే అరెస్టు చేయబడిరి. ఆజిల్లాకాంగ్రెసుకమిటీలోని మెంబ ర్లందరిపైన క్రి. ప్రొ. ౧౪౪ సెక్షన్ క్రింద ఉత్తరువులు జారీచేయబడెను. ముత్రాలో ఒక సబుఇన్స్పెక్టరు ఒక బహిరంగసభను బలవంతముగా చెదరగొట్టెను. లక్నోనుండి ౨౦౦ మందిపైన కేసుపెట్టబడినట్లుగా ఒక పత్రికలో వార్త వచ్చెను. రాజకీయప్రచారము కొరకు ఉద్యోగములను మానిన ఉపాధ్యాయులకు గాని, తదితరులకు గాని ప్రయత్నించినప్పటికీ తిరిగీ ఉద్యోగము తీయబడలేదు. కళాశాలలో ప్రవేశింపదలచుకొన్న విద్యార్థులనుండి భవిష్యద్రాజకీయోద్యమములలో పాల్గొనకుండుటకు హామీ కోరబడెను. బయిచారీలో పోలీసువారు లారీలనిండా పోయి, కాంగ్రెసుప్రచారకులఇళ్లను ముట్టడించిరి, స్త్రీల నవమానపరచిరి. జాతీయపతాకములను తగులబెట్టిరి. బారాబంకీలో ౧౪౪ సెక్షన్ క్రింద కొన్నిస్థలములలో ఉత్తరువులు జారీచేయబడినవి. జిల్లా

మేజస్ట్రేటులు సంతకములుచేసి ఖాళీఆర్డరులను పోలీసుఇన్‌స్పెక్టర్ల చేతికిచ్చిరి. డిప్యూటీకమీషనరు గాంధీటోపీలను తీసివేయించెను. వాటిని ధరించకూడదని మందలించెను. కాంగ్రెసుకు పోకూడదనికూడ ఆయన హెచ్చరించెను. ఇదేవిధముగా సంయుక్తరాష్ట్రములోని వివిధజిల్లాలలో జరిగెను. కొంతమంది తాల్లూకాదారులు ప్రభుత్వమువారి సహాయముతో పూర్వపు క్రూరమార్గములకు దిగిరి. సాయుధులైన పోలీసులు గ్రామస్థులను భయపెట్టసాగిరి. ఎస్టేటుజిల్లాదారును, అతని మనుష్యులును కుట్రపన్ని కొట్టించగా ఒకడు చనిపోయెను. రైతులను నిలబెట్టించుట ఆచారములోకి వచ్చెను. సోపారా, చెవుటాలా, హిస్సారులలో అదనపు పోలీసుదళములు తీసివేయబడెను. ఉద్యోగమునుండి విరమించిన ఒక సిపాయికి పింఛను లాగివేయబడెను. తారుటన్ (Tarutan) ఉత్సవములలో లాఠీచార్జీ చేయబడెను. కంటోనుమెంటులలో రాజకీయ సమావేశములు నిషేధింపబడెను.

బొంబాయి:—లైసెన్సులేని స్థలములలోను, లైసెన్సులేని సమయములలోను సారాయివిక్రయములు జరుగుతూన్నప్పటికీ పికెటింగు చేయకూడదని నిషేధింపబడెను. అహమ్మదాబాదు, అంకాలేశ్వరము, రత్నగిరిజిల్లాలలో ఖైదీలు విడుదలచేయబడలేదు. బుల్సారులో వాలంటేరుశిబిరములకు స్థలమిచ్చినందుకు అయిదుసురకు జరిమానా విధింపబడెను. ఆ జరిమానా లీయనిదే భూములు వారి స్వాధీనముచేయ నిరాకరింపబడెను. సాల్టు కలెక్టరుచే పొరపాటున అమ్మివేయబడిన ఒక పడవ సంధిజరిగి చాలాకాలమైనప్పటికీ తిరిగీ ఈయబడలేదు. పడవయజమానికి తగిన పరిహారము చూపబడలేదు. నవజీవన్ ముద్రాలయము తిరిగీ ఈయబడలేదు. భవిష్యదుద్యమములో పాల్గొనమని హామీ ఇస్తేనేగాని కర్ణాటకములోని భూములు యజమానులకు తిరిగీ ఈయబడలేదు. అనేకమంది పటేలులకును, తలాటీలకును తిరిగీ వారి ఉద్యోగము లీయబడలేదు. రాజీనామా లిచ్చిన ఆ యిద్దరు డిప్యూటీ కలెక్టర్లకును ఇర్విన్‌ప్రభువు వాగ్దానముచేసినట్లుగా పింఛను లీయబడలేదు. ఉద్యోగములు మానిన ఇద్దరు డాక్టర్లున్ను, ఒక సూపరువైజరున్ను, తిరిగీ వారి ఉద్యోగములలో చేర్చుకొనబడలేదు. ౮ మంది బాలికలును, ౧౧ బాలురును శాశ్వతముగా పాఠశాలలనుండి డిస్మిసుచేయబడిరి. అదేవిధముగా నలుగురు రంకోలావిద్యార్థులకుకూడ జరిగెను. సిర్సీ, సిద్దాపూరు తాలూకాలలో రైతులకు ప్రతికూలముగా పన్నులు వసూలుచేయుటలో కఠినమార్గము లవలంబింపబడెను. పంటలు పండకపోయినందువలన వారికి కొంతవరకు మాత్రమే పరిహారము చూపబడెను.

వంగరాష్ట్రము:—వంగరాష్ట్రములో లాయర్లనుండి రాజకీయోద్యమములో పాల్గొనమని హామీ తీసుకొనుపద్ధతి అవలంబింపబడెను. ఇది యొక్క నూతనవిషయము. ౧౮ వ ఆర్డినెన్సుక్రింద స్వాధీనపరచుకొనబడిన ఆశ్రమము తిరిగీ ఇవ్వబడలేదు. విద్యార్థులు రు ౫౦ లు ధరావతు కోరబడిరి. జోర్హాత్‌లో ప్రభాతఫేరీ బాలురు ౧౫ వ జూన్న పోలీసు సూపరింటెండెంటు బార్న్లే ఉత్తరువులప్రకారము కొట్టబడిరి.

ఢిల్లీ:— విద్యార్థులనుండి హామీలు కోరబడెను.

అజ్మీరు మీర్వారా:—ప్రభుత్వమువారి సహాయమును పొందేపాఠశాలలలోని ఉపాధ్యాయులు కొందరుద్యోగములనుండి తొలగింపబడిరి.

మద్రాసు:—జూలై ౧౩ వ తేదీని ఒక ప్రభుత్వ ప్రకటనము చేయబడెను. అందులో రాజీప్రకార మంగీకరింపబడిన పికెటింగు "శాంతియుతమైనదై యుండవలెను" వర్తించదని ప్రభుత్వమువారు సర్క్యులర్లను పంపిరి. సారాయిదుకాణములను పికెటింగుచేసినందుకు తంజావూరు లాయర్లపైన ౧౮౮ సెక్షనుక్రింద ఉత్తరువులు జారీచేయబడెను. కల్లుదుకాణముల దగ్గర పికెటింగు చేసేవాలంటీర్లు ౧౦౦ గజములకు లోపల నిలుచుండరాదని ఉత్తరువులు చేయబడెను. వారిపైన కొన్ని కల్పితపుకేసులు తేబడెను. వారు కొన్ని చోట్ల కొట్టబడిరి. గొడుగులుగాని, జెండాలుగాని, పుచ్చుకొనకూడదని ఉత్తరువులు చేయబడెను. ప్రజలు వాలంటీర్లకు నీళ్లు పుట్టనీయకూడదని ఆజ్ఞాపించిరి. ఏలూరులోని అనేకమంది పికెటర్లకు అనేకనిర్బంధము లేర్పాటుచేయబడెను. ౫ మందిమాత్రమే పికెటింగు చేయవచ్చునని నిర్బంధమేర్పాటుచేయబడిన కోయల్ పట్టిలో పికెటర్లపైన మేనెలలో కేసుపెట్టబడెను. కోయంబత్తూరులో ఆరుమంది పికెటింగు చేయవచ్చునని నిర్ణయింపబడెను. అసలు కారణమేమిటనగా, అధికారులకు పికెటింగంటే ఇష్టములేదు. గుంటూరులో ఒక నేత్రవైద్యునకు తిరిగీ ఉద్యోగ మీయబడలేదు. ఆయన ప్రభుత్వమునకు వ్యతిరేకముగా ప్రచారము చేసినందుకు విచారమును వెల్లడించిననేగాని ఉద్యోగమీయబడదని అధికారులు పట్టుపట్టిరి. ఉద్యమములో పోగొట్టుకొనబడిన తుపాకులుగాని, తుపాకిలైసెన్సులుగాని తిరిగీ ఈయబడలేదు. ఒక కేసులో ఒకటేసాక్ష్యముతో శిక్షింపబడిన కొందరు ఖైదీలు విడుదల చేయబడిరి. మరికొందరు ఖైదీలు విడుదల చేయబడనే లేదు. ఇర్విన్‌ప్రభువు విడుదలచేతు నని స్పష్టముగా వాగ్దానముచేసిన షోలాపూరుసైనికఖైదీలు విడుదల కాలేదు.

బార్డోలీలో గవర్నమెంటువారు పూర్తిగా రాజీని భంగము కావించిరి. దానిముందిది లెక్కకాదు. ఈ తాలూకాలో పన్నుల నిరాకరణోద్యమము సాగింపబడినమాట చదువరు లెరిగియే యుందురు. ఈ తాలూకాలో చెల్లించవలసిన పన్నుల

మొత్తము ౨౨ లక్షల రూపాయలు. అందులో ౨౧ లక్షలు చెల్లించి వేయబడెను. ఈ దిసువ గాంధీ చేసిన నిందారోపణమున్ను, గవర్నమెంటువారి ప్రత్యుత్తరమున్ను ఉదాహరింపబడినవి :

## గాంధీ మోపిన నేరము

"(౧) బార్డోలీ తాలూకాలోని ౨౨ లక్షల రూపాయల మొత్తము శిస్తులోను ౨౧ లక్ష రూపాయలు చెల్లింపబడెను. ఈ శిస్తులు చెల్లింపబడుటకు చాలా వరకు కాంగ్రెసు ప్రచారకులే కారణ మని తెలియవస్తూన్నది. ప్రభుత్వమువారు సొమ్ము వసూలు చేయ ప్రారంభించినప్పుడు రైతు లీయవలసిన బకాయి మొత్తములను గాని, జరుగుతూన్న సంవత్సరపు సిస్తులను గాని వెంటనే ఇచ్చివేయవలెనని రైతులకు సలహా యీయబడెను. రైతులలో అధికసంఖ్యాకు లీ సంవత్సరపు శిస్తులను కూడా ఇచ్చుట కష్టమని ప్రకటించిరి. కొంతకాలమువరకునూ శిస్తులు చెల్లింపలేమని రైతులు కోరినమీదట జరుగుతూన్న సం.రపు శిస్తులు మాత్రము పుచ్చుకొని కొన్ని సందర్భములలో అధికారులు సంతృప్తిపడిరి. ఇప్పుడు పూర్వపు కురదలాలనుగాని, జరుగుతూన్న సంవత్సరపు శిస్తులనుగాని ఇవ్వజాలమని చెప్పినవారిని ప్రభుత్వమువారు బలవంతపెట్టుట, కాంగ్రెసు ప్రచారకుల యెడలను, ప్రజల యెడలను విశ్వాసద్రోహము కావించుట. ధరలు తగ్గినందువలన కొందఱి కురదలా శిస్తు బాకీలు ప్రస్తుత మాపివేయబడేయెడల తక్కినవారి కురదలా శిస్తు బాకీలు కూడా కొంతకాల మాపివేయబడుట అంతకంటెను న్యాయము. ఎందువలన ననగా, శాసన నిరోధకులైన రైతులు ధరలు తగ్గినందువల్ల నష్ట మనుభవించడమే కాక శాసన తిరస్కార మవలంబించినందువలన కూడా అనేక కష్టనష్టములకు పాల్పడిరి. వలసపోవుట మూలమునవారికి విశేషనష్టము కలిగెను. ఈనష్టములకు అంచనా వేయబడెను. అది అధికారులకు చూపించబడెను. అధికారులు పన్నులను వసూలు చేయుటకు, కఠినపద్ధతుల నవలంబించిరి. రైతులకు జరిమానాలు వేయబడెను. పోలీసువారు, ప్రజల ఇళ్లచుట్టును ముట్టడివేసిరి."

## స్థానిక ప్రభుత్వమువారి ప్రత్యుత్తరము

"జరుగుతూన్న సంవత్సరములో బాకీయున్న భూమిశిస్తులనుకోరుట కాంగ్రెసు ప్రచారకులయెడలగాని, ప్రజలయెడలగాని విశ్వాసద్రోహము కావించుట కాదు. చెల్లింప లేమని చెప్పేవారు తమ అశక్తతను రుజువు చేయవలెను. అంతేకాని మాటలతో ప్రయోజనము లేదు. ప్రభుత్వమువారు కొన్ని శిస్తుబాకీలను ఆపియుంచ నిర్ణయించిరి. కాబట్టి ఈసంవత్సరపు శిస్తుబాకీలను కూడ కొన్ని

శ్లాపియుంచవలెనని కోరినకోరికకు వాదబలములేదు. పంటలు కొంతగాని, పూర్తిగాగాని పోయి, రైతు పన్నులను చెల్లించలేకుండా ఉన్నప్పుడు అతని శిస్తుల బకాయి ప్రభుత్వమువారిచే అంగీకరింపబడును. పంటలు పోయినవారు సకాలములో పన్నులను చెల్లించ లేకపోయి రని ప్రభుత్వమువారు తలంతురు. బార్డోలీలో పంటలు పోయినందువలన కాదు ఇప్పుడు బకాయి లున్నది; రైతులు శాసనోల్లంఘనములో పాల్గొని పన్నులను నిరాకరించినందువల్ల. ఎవరైనా ఒకవ్యక్తి ఏదైనానష్టము వచ్చినప్పుడు పన్నులను చెల్లించగలడా లేదా అనేవిషయ మాయాసందర్భములనుబట్టి విచారించవలసియున్నది. బార్డోలీలో పన్నులను వసూలుచేయు సందర్భమున ఒక్కటే జప్తు జరిగినది. కలెక్టరు న్యాయముగా ఈ సందర్భములను విచారించుచున్నాడా లేదా అనేవిషయము ఆయన కొందరురైతుల కిప్పించిన శిస్తుల రిమిషనును బట్టియే తెలియగలదు. ఆయన అంతవరకు ౧౫ వందల రూపాయలను ముజరా ఇప్పించెను. ౧౨ వేల రూపాయీలవరకును ఆపియుంచెను. పోలీసువారు భూమిశిస్తుకొరకు కేవలము గ్రామములకు తీసుకొని పోబడుటలేదు. రెవిన్యూశాఖోద్యగస్థులు శిస్తుల వసూలు నిమిత్తము గ్రామములకు పోవ భయపడిన సందర్భములలో మాత్రమే వారి సహాయ మపేక్షించబడెను. మమ్లతుదారునుగాని, లేక గ్రామములో పన్నులను వసూలుచేసే మరి యొక అధికారినిగాని రక్షించుట వారిపని. జప్తులు చేయబడిన ఇళ్లను కాపలాకాయుటయును, కొన్ని సందర్భములలో గ్రామకౌకర్లకు సహవాసముగా పోవుటయును తప్ప వారికి వేరేపని లేదు."

జులై మధ్యకాలములో గాంధీ సిమ్లాకు పోయినప్పుడు ఈ నేరారోపణములను ఇండియాప్రభుత్వమువారికి తెలియచేసెను. తరువాత ౧౦ రోజులలో తలవని తలంపుగా మరియొక పరివర్తనము కలిగెను. గాంధీ సూరతుజిల్లా కలెక్టరు కొకఉత్తరము వ్రాసెను. దాని నకలును బొంబాయి గవర్నమెంటువారికికూడా పంపెను. అందులో బార్డోలీపన్నుల వసూళ్లనుగూర్చి తన అభిప్రాయమును వివరించెను.

బొంబాయిప్రభుత్వమువారి ప్రత్యుత్తరము కేవల మాశాభంగకరముగా నుండెను. సిమ్లాఅధికారులు బొంబాయిగవర్నమెంటువారిని సమర్థించిరి.

తరువాత గాంధీ ఈవిషయము మధ్యవర్తులద్వారా పరిష్కరింపబడవలెనని సూచించెను. ఇందుకు సంబంధించిన ఉత్తరప్రత్యుత్తరము లీ క్రింద నుదాహరింపబడినవి :

౧౯౩౧ జూను ౧౪ వ తేదీని గాంధీ బోర్సాదునుండి ఇండియా ప్రభుత్వ కార్యదర్శియగు హెచ్. డబ్ల్యు. ఎమర్సనుగారికి వ్రాసిన ఉత్తరములోని ముఖ్య భాగము :

"స్థానిక ప్రభుత్వములవారు మన రాజీని సరిగా అమలుజరుపుతూండిరో లేదో అని మీరు జోక్యము కల్పించుకొని తెలుసుకొనుట కష్టముకావచ్చును. ఒకవేళ మీరు జోక్యము కలిపించుకొన్నప్పటికీ యెక్కువ ప్రయోజనకారికాదని నాఅభిప్రాయము. కాబట్టి, ఆ రాజీమరతులకు సరియైన వ్యాఖ్యానములను చేయుటకు ఒక శాశ్వత పంచాయితీబోర్డు నియమింపబడతగిన తరుణము వచ్చినది. వారు మన ఉభయపక్షముల వారిని రాజీషరతులను సరిగా నిర్వర్తించునట్లు చేయుటకుకూడా తగిన జాగ్రత్త తీసుకొనవలెను."

## విచారణనుగూర్చి

౧౯౩౧ జూను ౨౦ వ తేదీని ఇండియా ప్రభుత్వ కార్యదర్శి ఎమర్సను గారికి బోర్సాదునుండి గాంధీ వ్రాసిన ఉత్తరపుసకలు :

"మద్రాసు గవర్నమెంటువారు పికెటింగును గూర్చి పంపిన నివేదికతోపాటు మీరు జూను ౧౬ వ తేదీని వ్రాసిన ఉత్తరము చేరినది. ఆనివేదిక నిజమైనయెడల మా వాళ్లదే తప్పు కాని ప్రతిరోజూ మద్రాసునుండి మా కాంగ్రెసుప్రచారకులు పంపే నివేదికలనుబట్టి చూచినయెడల మీరు మద్రాసుప్రభుత్వమునుండి అందుకుంటున్న నివేదికలను నాకు నమ్మవీలు లేకున్నది. మద్రాసులోని మా కాంగ్రెసుప్రచారకులు పూర్తిగా నమ్మదగినవారు. వారు కళ్లార చూచిన విషయములనే నాకు వ్రాస్తూండిరి. కాని, దీనివలన మన ఉభయులకును ఇంతకంటె యెక్కువ సమ్మతి కుదురదు. కాంగ్రెసుకు సంబంధించినంతవరకు రాజీషరతులను తూ,చా తప్పకుండా అమలులో పెట్టవలెనని నాకోరిక. కాబట్టి నే నిప్పుడొక సూచన చేస్తూన్నాను. పికెటింగును గూర్చి స్థానిక ప్రభుత్వమునకును, కాంగ్రెసుకును తగాదావచ్చినప్పుడు ఆతగాదాను వెంటనే విచారించి పరిష్కరించుటకు ఇద్దరు నియమింపబడవలెను. వారిలో నొకరిని ప్రభుత్వము వారును, రెండవవారిని కాంగ్రెసువారును నియమింపవలెను. ఏచోటులలో అయితే పికెటింగు శాంతియుతముగా జరుగుటలేదని ఆ ఇరువురు మధ్యవర్తులును నిర్ణయింతురో ఆచోటులలో పికెటింగు పూర్తిగా ఆపివేయబడవలెను. పికెటింగు శాంతియుతముగా జరుగుతూన్నప్పటికీ ప్రభుత్వమువారు వాలంటీరులపైన కేసులను పెట్టియున్నయెడల వాటిని వా రుపసంహరించుకొనుట కంగీకరింపవలెను. ఈ విధముగా మీరు

[illegible]

లేనియెడల మీ రింతకంటెను మంచిసూచనను, ఇంతకంటె ఉభయులకును ఎక్కువ అంగీకారముగా నుండదగిన దానిని సూచింపవచ్చును. ఈలోగా మీ ఉత్తరములో ఉదాహరింపబడిన ప్రత్యేక నిందారోపణములనుగూర్చి నేను విచారింతును."

ఇండియాప్రభుత్వ కార్యదర్శి గా. హెచ్. డబ్ల్యు. ఎమర్సను ౧౯౩౧ జులై ౪ వ తేదీని సిమ్లానుండి ఈ దిగువ ప్రత్యుత్తరమును గాంధీకి వ్రాసెను:

"మీరు, సంధిషరతుల వ్యాఖ్యానములను గూర్చి నిర్ణయించుటకొరకు శాశ్వత పంచాయతీబోర్డు నియమింపబడవలసిన తరుణము వచ్చిన దని మీ జూను ౧౪ వ తేదీ ఉత్తరములో ఉదాహరించితిరి. తరువాత మీ జూను ౨౧ వ తేదీ ఉత్తరములో పికెటింగునుగూర్చి స్థానికప్రభుత్వమునకును, కాంగ్రెసునకును తగాదా వచ్చినప్పుడు తక్షణము విచారించుటకొరకు విచారణబోర్డు నియమింపబడవలెననీ, దానిలో ఒకరు కాంగ్రెసుచే నామినేటు చేయబడినవారును, మరొకరు రాష్ట్రీయప్రభుత్వముచే నామినేటు చేయబడినవారును ఉండవలె నని కొన్ని సూచనలను మీరు చేసియుంటిరి. మన రాజీని గూర్చి సాధ్యమైనంతవరకు తగాదాలు రాకుండుటకై మీరు చేసిన సూచనను నేను శ్లాఘించవలసియున్నది. కాని సామాన్యచట్టమునకు విరుద్ధముగా పికెటింగుచేయబడినపుడు మాత్రమే పోలీసువారు కేసులు పెట్టినట్లుగాని, పెట్ట నుద్దేశించుచున్నట్లుగాని మాకు తెలియవచ్చినది. మీ సూచనను బట్టి ఇటువంటికేసులు కోర్టులో విచారింపబడేముందు మీరు సూచించిన బోర్డువారిచే విచారింపబడవలెను. ఈ బోర్డువారి నిర్ణయముపైన తరువాతికార్యక్రమ మాధారపడి యుండును. అనగా, ఈ కేసులలో న్యాయశాస్త్రప్రకారము పోలీసువారు నిర్వర్తించవలసిన ధర్మములు విచారణబోర్డు వారికి బదిలీ చేయబడిన వన్నమాట. ఆ విచారణబోర్డువా రిద్దరును ఏకాభిప్రాయమునకు రాకపోవచ్చును. కాని పోలీసువారుమాత్రము న్యాయశాస్త్రప్రకారమే నిర్వర్తించవలసియున్నది. కనుక మీరు చెప్పిన సూచన ఆచరణయోగ్యము కాదు. అంతేగాక ఈ సందర్భములో పోలీసువారి అధికారమును తగ్గించుటకు కూడా మన రాజీలో ఉద్దేశింపబడలేదు.

"ఇటువంటి సందర్భములలో పికెటింగు న్యాయశాస్త్రప్రకారము జరిగినదా, లేదా అని నిర్ణయించవలసినది ఆ కేసులను విచారించిన కోర్టువారు. ఆ కోర్టువారు పికెటింగు శాస్త్రవిరుద్ధముగా జరిగిన దని నిర్ణయించేయెడల రాజీషరతుల ప్రకారము వెంటనే పికెటింగు ఆపివేయబడవలెను. మీ ఉత్తరములో సూచింపబడిన పంచాయితీ బోర్డుల విషయములో కూడా ఈ చిక్కే అనువర్తించును. మన రాజీ మూలకముగా ఆ అర్థములకు సంబంధించినవిషయములోను, వ్యక్తిస్వాతంత్ర్యమునకు సంబంధించిన

విషయములోను పరిపాలనావ్యవహారములను కొనసాగించువిషయములోను కాంగ్రెసు కొన్ని ధర్మములను నిర్వర్తింపవలసియున్నది. అవగా, కాంగ్రెసు వాటిని సరిగా నిర్వర్తింపనియెడల విపరీతములైన ఫలితములు కలుగును. పికెటింగు విషయములో వ్యక్తులు మామూలుచట్టమునకు భిన్నముగా ప్రవర్తించినయెడల ఇపుడు జరుగుతూన్న పద్ధతిగానే కేసులు పెట్టబడును. ఇక, లా ఆర్డరులకు మొత్తముపైన భంగము కలిగే యెడల గాని, ప్రభుత్వవ్యవహారములకు చిక్కు వచ్చేయెడలగాని ప్రభుత్వమువారు పంచాయితీబోర్డుకే తగాదాలను పంపి, చేతులు ముడుచుకొని ఊరకుండజాలరు. ఆ చివరిక్లాజు వ్రాయబడినప్పుడు పంచాయితీబోర్డుమాట ఉద్దేశింపబడలేదు. ప్రధాన బాధ్యతలు గల ప్రభుత్వము తన ధర్మములను సరిగా నిర్వర్తింపవలెనన్నయెడల అది అవలంబింపబడదగిన పద్ధతి కాదు. రాజీ సరిగా ఆచరణలోనికి రావలెనన్నచో ముఖ్యముగా అది మన ఉభయుల సద్భావముల పైనను ఆధారపడియుండవలయును. గవర్నమెంటువారికి సంబంధించినంతవరకు వారు రాజీషరతులకు సరిగా కట్టుబడి ఉండవలెననియే కోరుతున్నారు. స్థానిక ప్రభుత్వములవారు రాజీప్రకారము, వారు నిర్వర్తించవలసిన ధర్మములను ఎంతో జాగ్రత్తగా నిర్వర్తించుచున్నట్లుగా మాకు తెలుస్తున్నది. ఎక్కడైనా కొన్ని సందేహాస్పదములైన సందర్భము లుండక తప్పవు. వాటినికూడా రాష్ట్రీయప్రభుత్వములవారు మిక్కిలి జాగ్రతగా విచారించుటకు పూనుకొనిరి. ఇండియాప్రభుత్వమువారుకూడా తమకు తెలియవచ్చిన సందేహాస్పదములైన సందర్భములను స్థానికప్రభుత్వమునకు వ్రాసి, అవసరమైనయెడల ఆయావిషయముల సత్యమును తెలుసుకొనవలెనని వారిని కోరగలరు."

౧౯౩౧ జూలై ౨౧ వ తేదీని గాంధీ-ఇండియా ప్రభుత్వకార్యదర్శి ఎమర్సను గారికి సిమ్లానుండి వ్రాసిన ఉత్తరము :

"నేనీ సాయంకాలము వైస్రాయిమందిరములో చేసిన వాగ్దానముప్రకారము రాజీషరతులను గూర్చిన వ్యాఖ్యానములను నిర్ణయించుట కొక నిష్పక్షపాతమైన పంచాయితీసంఘ ముండవలెనని కోరుతూ ఈ ఉత్తరము వ్రాస్తున్నాను. ఈక్రిందివిషయములను గూర్చి ప్రభుత్వమువారికిని, కాంగ్రెసువారికిని అంగీకారము కుదురనియెడల ముఖ్యముగా వీటికి సరియైన వ్యాఖ్యానము తక్షణము చేయబడవలెను :

(౧) పికెటింగు సారాయిదుకాణములకును, సారాయివేలములకును కూడా వర్తించునా ?

(౨) పికెటింగు చేయబడుతూన్న దుకాణమునకు ఉభయపార్శ్వ ముల్లో వాలంటీరు నిలబడవలెనని రాష్ట్రీయ ప్రభుత్వములు నిర్ణ[illegible] కలదా ?

(౩) ఒకషాపుకుగల అన్నిగేట్ల దగ్గరను పికెటింగు చేయుటకు పి౦౧ తిని వాలంటీర్ల సంఖ్యను నిర్ణయించుటకు ప్రభుత్వమువారి కధికారము కలదా ?

(౪) శాంతియుతమైన పికెటింగును నిష్ప్రయోజనముగా చేసేనిమిత్తము కల్లు దుకాణదారు లైసెన్సులేని గంటలలో లైసెన్సులేని ప్రదేశములందు కల్లును అమ్ముకొనేటట్లు చేయుటకు ప్రభుత్వమువారి కధికారము కలదా ?

(౫) సంధిపత్రములోని ౧౩, ౧౫ సూత్రముల విషయములో ప్రభుత్వమువారికిని, కాంగ్రెసువారికిని అన్వయభేదములు కలిగినవి. కాబట్టి, వాటికి సరియైన వ్యాఖ్యానములు చేయించుట.

(౬) ౧౬ (ఏ) క్లాజులో 'తిరిగి యిచ్చుట' అనేమాటకు వ్యాఖ్యానము.

(౭) శాసనోల్లంఘనములో జోక్యము కల్పించుకొన్నవారియొద్దనుండి తుపాకీలు స్వాధీనము చేసుకొనబడిన సందర్భములో సంధిషరతులప్రకార మవి ఇప్పుడిచ్చివేయబడవలెనా ?

(౮) ౯ వ ఆర్డినెన్సుక్రింద స్వాధీనపరచుకొనబడిన ఆస్తులు తిరిగీ యిచ్చివేయబడుటకుగాని, కర్ణాటకపల్లపు భూములు తిరిగి యిచ్చివేయబడుటకు గాని ఈ సంధిషరతులు వర్తించునా ? ఈ ఆస్తులు తిరిగీ యిచ్చివేయబడుసందర్భములో ప్రభుత్వమువారు కొన్ని క్రొత్తషరతులను నిర్ణయించుట కధికారము కలదా ?

(౯) ౧౯ వ క్లాజులోని "పర్మెమెంటు" అనేమాట కర్థము నిర్ణయించుట.

(౧౦) విద్యాశాఖవారు శాసనోల్లంఘనములో పాల్గొనిన విద్యార్థులను అసలు చేర్చుకొనకుండుటకుగాని, లేక వారిని పాఠశాలలలో చేర్చుకొనేముందు వారిపై కొన్ని షరతులను వర్తింపజేయుటకుగాని అధికారము గలదా ?

(౧౧) శాసనోల్లంఘనములో పాల్గొనినందుకు పింఛనులను స్వాధీనపరచుకొనిగాని, లేక గ్రాంటులను మంజూరు చేయకగాని వ్యక్తులను, సంస్థలను శిక్షించుటకు ప్రభుత్వమున కధికారము కలదా ?

ఈపంచాయితీసంఘము (Tribunal) నకు పంపబడవలసినవిషయము లివే కావు. ముందుముందు ఇంకాకొత్తసమస్యలు బయలుదేరవచ్చును. అవికూడా వారికిపంపబడవలెను. పంచాయితీబోర్డువారు ఉభయులనుండి వ్రాతమూలకములైన వాఙ్మూలములను తీసు

కొని, ఉభయపక్షముల వకీళ్లు చెప్పేవాదములను వినవలెను. వారి నిర్ణయమును ఉభయ పక్షములునూ అంగీకరించితీరవలెను. మన సంభాషణసందర్భములో ప్రభుత్వము వారికిని, కాంగ్రెసుకును సత్యనిర్ధారణలో భేదాభిప్రాయములు కలిగినప్పుడు పంచా యితీబోర్డు చేయవలసిన విచారణనుగూర్చి యిదమిత్థమని చెప్పజాలనంటిని. కాబట్టి దానిని గూర్చి ఇపు డిక్కడ వ్రాయలేదు. కాలము గడచినకొలదీ సత్యనిర్ధారణ చేయ వలసిన సందర్భములుకూడా కొన్ని రావచ్చును. అటువంటి సందర్భములను కూడా విచారించుటకు పంచాయితీబోర్డు కావలెనని నే నప్పుడు కోరవచ్చును. అయినప్పటికి పంచాయితీకి చెప్పుకొనవలసిన అవసరము లేకుండానే మనలో మనము భేదాభిప్రాయ ములను సమన్వయించుకోవలెనని కోరుతూన్నాను.”

౧౯౩౧ జులై ౩౦ వ తేదీని సిమ్లానుండి భారతప్రభుత్వ కార్యదర్శి ఎమర్సను గాంధీకి వ్రాసిన ఉత్తరము :

“మీ జులై ౨౧ వ తేదీ ఉత్తరమునకు కృతజ్ఞతాపూర్వకవందనములు. (ఎ) మార్చి ౫ వ తేదీని జరిగిన రాజీకి వ్యాఖ్యానము చేయుటకు మీ రొక నిష్పక్షపాత మైన సంఘమును కోరి యుంటిరి. (బి) రాజీ షరతుల వ్యాఖ్యానములో ప్రభుత్వము వారికిని, కాంగ్రెసువారికిని భేదాభిప్రాయములు కలిగినయెడల భేదాభిప్రాయ ములు కలిగిన ఆయా విషయము లా పంచాయతీకి పంపబడవలె నని మీరు వ్రాసితిరి. ఆ ప్రత్యేకవిషయములను కూడా ఉదాహరించితిరి. మీరు జూను ౧౪ వ తేదీని వ్రాసిన ఉత్తరములో, రాజీషరతులకు వ్యాఖ్యాన మొసగించుటకును, వీటిని సరిగా ఆచరణలో పెట్టించుటకును ఒక శాశ్వతమైన పంచాయతీబోర్డు ఉండవలె నని కూడా వ్రాసితిరి. ౧౯౩౧ జులై ౪ వ తేదీని ప్రభుత్వమువారు వ్రాసిన ఉత్తర ములో ఆ సూచన అంగీకరింపబడుటకు వీలులేదని కొన్ని కారణము లుదాహరింప బడినవి. మీరు జులై ౨౧ వ తేదీని వైస్రాయిని దర్శించినపుడు మీ జూను ౧౪ వ తేదీ ఉత్తరములోని సూచనను ప్రభుత్వమువా రంగీకరింప జాలనియెడల రాజీ షరతుల వ్యాఖ్యానమును నిర్ణయించుట కొక పంచాయతీసంఘము స్థాపింపబడుట కైనా అంగీకరించవలెనని కోరితిరి. కొంత చర్చ జరిగినపిమ్మట పంచాయతీసంఘ మునకు పంపబడదగిన ముఖ్యవిషయములను ఉదాహరించి పంపవలసినదని మిమ్ములను వైస్రాయి కోరెను. మీ సూచనలు చేరినవెంటనే వాటిని విచారించుటకు కూడా వైస్రాయి అంగీకరించెను.

*ఇండియా ప్రభుత్వమువా రీవిషయములను గూర్చి మిక్కిలి జాగ్రత్తగా విచా రించిరి. ప్రభుత్వమువారికిని, కాంగ్రెసుకును సత్యనిర్ధారణవిషయములో భేదాభి

ప్రాయములు కలిగినప్పుడు వాటిని విచారించేనిమిత్తము ప్రస్తుతము పంచాయితీ సంఘముకొరకు పట్టుపట్టనని మీరు చెప్పినసంగతిని ప్రభుత్వమువారు గమనించినారు. అంతేగాక అటువంటి పంచాయితీకొరకుకూడా పట్టుపట్టవలసిన అవసరము కొన్ని కొన్ని సందర్భములలో రావచ్చునని మీరు సూచించిన విషయమును కూడా ప్రభుత్వమువారు గమనించకపోలేదు. ఇక మీరు జూను ౧౪ వ తేదీన వ్రాసిన ఉత్తరమునకునూ, ఈ ఉత్తరమునకునూ భేద మేమిటనగా, ఇందులో శాశ్వతపంచాయతీసంఘ ముండవలెనను పెద్ద విషయమునుగూర్చి కొన్నాళ్లు నిలిపియుంచుటకు మీ రంగీకరించితిరి. వ్యాఖ్యానమునుగూర్చిన విషయములలో మాత్రము తత్క్షణము పంచాయితీసంఘ మేర్పాటు చేయబడవలెనని మీరు ప్రభుత్వమువారిని కోరితిరి. నేను జూలై ౪ వ తేదీని వ్రాసిన ఉత్తరములోని కారణముల ప్రకారము మొదటి విషయములను గూర్చి ప్రభుత్వమువా రిదివరకు వెల్లడించిన అభిప్రాయములను మార్చుకొనజాల కున్నందుకు విచారపడుతూన్నారు.

"౪. ఇంతకంటె నెక్కువ పరిమితములైన సూచనలను, అనగా వ్యాఖ్యానము చేయుటలో భేదము వచ్చిన విషయములమీద నిర్ణయముల గావించుటకు పంచాయతీ పెట్టవలెనను వానిని గవర్నమెంటువారు మరల విచారించిరి. మీ యుత్తరములో నీ తెగ్రిందికి వచ్చునని యుదాహరించిన పదునొకండంశములను, ఈ యంశములనుగూర్చి పంచాయతీ కంగీకరించినయెడల, గవర్నమెంటువారికి సహజములైన బాధ్యతలనుబట్టి వెలువడగిన క్లిష్టాంశములను ప్రత్యేక శ్రద్ధ తీసికొని విచారించిరి. సామాన్యన్యాయ తంత్రమునుగాని, నిత్యపరిపాలనా తంత్రమునుగాని తాత్కాలికముగ నిలిపివేయు నెట్టి యేర్పాటునకును గవర్నమెంటువా రంగీకరింపజాలరని మీరును నంగీకరింతురుగదా! నిత్యపరిపాలనతంత్రమునకు సంబంధించిన వ్యవహారములలో దీర్పుచెప్పుటకై గవర్నమెంటువారి బాధ్యతను మరొకరి యధికారమున కప్పగింపవలసిన యేర్పాటునకుగూడ గవర్నమెంటువా రంగీకరింపజాలరు. మరియు ఫలితార్థములో ప్రత్యక్షముగనైనను, పరోక్షముగనైనను కాంగ్రెసువారికి మాత్రమే సదుపాయముచేయుచు దక్కినప్రజల కవకాశ మీయక, న్యాయస్థానముల యధికారమున కతీతమైయుండు ప్రత్యేకపాలన క్రమము నేర్పాటుచేయుటకుగూడ గవర్నమెంటువా రంగీకరింపజాలరు. మార్చి ౫ తేదీని గావించుకొన్న యొడంబడికలో నిట్టి సదుపాయములు చేయవలయు నని యెక్కడను లేదు.

"౫. ఈపై సూత్రముల ననుసరించి మీ యుత్తరములో వ్రాయబడిన కొన్ని యంశముల నే నిచ్చట బరిశీలింపవలయును. మొదటి మూడంశములును పికెటింగునకు సంబంధించి సర్వసాధారణముగ నున్నవి. పికెటింగునకు సంబంధించిన యిట్టి వ్యవ

హారములలో గొన్ని ప్రత్యేకసంపర్భములనుబట్టి ప్రత్యేకచర్య యావశ్యక మగును. అట్టిచో గవర్నమెంటువా రిప్పుడు తమ కార్యనిర్వాహక, న్యాయశాఖల యధికారములకు భంజకముగా, శాంతిభద్రతలకు విరుద్ధముగా, వ్యక్తిస్వాతంత్ర్యమునకు దూరముగా సర్వసాధారణమైన యాజ్ఞను జారీ చేయజాలరు. ఈ యభ్యంతరములవలన మీరు సూచించినవానివంటి సర్వసాధారణాంశములకు తావే లేదు. ఇక ప్రత్యేకవిషయములను గూర్చియు గవర్నమెంటువా రనుమతింపజాలరు. ఏలయన జూలై ౧౪ తేదీని నేను వ్రాసినలేఖయందలి కారణము లెట్లున్నను, నిట్టివాని కంగీకరించినయెడల నిట్టి సందర్భములయందే తక్కువ ప్రజలను లేని సౌకర్యము లీకేసులకు సంబంధించిన వారికి జేయవలసి వచ్చును. ఇక నాల్గవయంశము విషయములో మీరు తెలియజేసినవిధముగా, రాష్ట్రప్రభుత్వములవారు ఎక్సైజు శాసనమును భంజింప ననుమతించుచున్నా రనుటకు ఇండియా గవర్నమెంటువారియెదుట తగినసాక్ష్యము లేదు. ఇక ఎక్సైజు వ్యవహారములు న్యాయశాస్త్రానుసారముగ బాలింపబడుచున్నవా యనునంశమునకు సంబంధించినంతవరకు ఎక్సైజు వ్యవహారములను రాష్ట్రప్రభుత్వము లెట్లు పాలింపవలయునని విచారణచేయుట కొకపంచాయితీ నేర్పరచుట సాధ్యముకాదు. పైగా నది రాష్ట్రపాలనములోని విషయము. ౧౦, ౧౨ అంశములు వేరువిషయమునకు సంబంధించినవిగాని చాల ముఖ్యమైనవి. వీనిలోని విషయ మొడంబడికసమయమునందు జర్చింపబడియుండలేదు. ఈ విషయములో పంచాయితీని నియమింప నంగీకరించినచో నాపంచాయితీవారు గవర్నమెంటువారి యనుమతి లేకుండగనే యొడంబడిక యంశములను మూలార్థవిపరీతముగా వ్యాఖ్యింపజేయవచ్చునను సిద్ధాంతము నంగీకరించిన ట్లగును.

“౬. ఈ నిదర్శనములనుబట్టి కేవలము వ్యాఖ్యానములను వివరించుటకే యైనను పంచాయితీ నేర్పరచుటయందు జాల చిక్కులు పుట్టునని గవర్నమెంటువారికి తోచుచున్నది. ప్రతివిషయమునందును నిది విపరీతవ్యాఖ్యాన మగునా, కాదా యని విచారణయు, వివాదమును బుట్టి, దానివలన మరల గొత్తయిబ్బందులు పుట్టునేగాని పూర్వపు చిక్కులు తొలగిపోజాలవు.

“ ౭. ఈ యంశములలో చాలభాగ మిదివరకే గవర్నమెంటువారు జాగ్రత్తతో పరిశీలించిరి. ఈవిషయములో నేను ౧౯౩౧ జూలై ౨ తేదీని విద్యార్థులను గూర్చి వ్రాసిన ౪౨౯౧ నెం. లేఖను, ఆయుధములలైసెన్సులను గూర్చి ౧౯౩౧ జూను ౨౪ తేదీని వ్రాసిన డి ౩౪౦౧-౩౧ యుత్తరమును చూచుకొనగోరుచున్నాను. ఒడంబడికలోని ప్రత్యేకాంశములు భంజింపబడినవని మీరు నాకు సిమ్లాలో

నిచ్చిన జాబితాలో నీ యంశములక్రిందకు వచ్చునవి చాల ఉన్నవి. ఆ జాబితా వచ్చిన కొలదిరోజులకే రాష్ట్రప్రభుత్వములకు బంపబడినది. వారి సంజాయిషీ వచ్చినతరువాత నొడంబడిక భంజింపబడినదో, లేదో గవర్నమెంటువారు నిశ్చయించుకొనగలరు. ఇంకను ముందుముం దిట్టి ప్రత్యేకాంశములయం దొడంబడిక భజింపబడకుండ గవర్నమెంటువారు జాగ్రత్తపడగలరు. ఏలయన నొడంబడికను బూర్తిగా నిర్వహించుట గవర్నమెంటువా రొక గౌరవముగా భావించుచున్నారు. మీరు గూడ నట్లే భావించుచున్నారని గవర్నమెంటువారు విశ్వసించుచున్నారు. ఇట్టి మనోవృత్తితో మెలగినయెడల నీ చిక్కులు తీరిపోవును గాని పంచాయతీ వలన దీరజాల వని గవర్నమెంటువారు విశ్వసించుచున్నారు"

సంయుక్తరాష్ట్రములలో కౌలుదారులైన కృషీవలులపై నిర్బంధచర్యలు సాగిపోవుచుండెను. భూములనుండి తొలగింపబడిన కౌలుదారుల స్థితిని గాంచి పండితమదనమోహనమాలవ్యా ప్రభృతులైన న్యాయవాదుల మనస్సులు కరగిపోయెను. గాంధీగారు యు. పి. గవర్నరు సర్ మాల్కము హెయిలీగారి కొక తంతివార్తను బంపిరి. కాని వారిసమాధానము చిక్కులి యాశాభంగకర మయ్యెను. ఇట్టి నీరసములైన పరిస్థితులలో నాలుగుమూలలనుండియు ఫిర్యాదులు వచ్చిపడుచుండగా నోర్చుకొనలేక గాంధిజీ ౧౯౩౧ అగస్టు ౧౧ తేదీని వైస్రాయిగారికి తంతివార్త బంపిరి:

"బొంబాయి గవర్నమెంటువారి కడనుండి యిప్పుడే వచ్చిన యుత్తరమును బట్టి నా లండను ప్రయాణ మసంభవమై పోయెనని చెప్పుటకు విషాదము నొందుచున్నాను. ఆయుత్తరములో ప్రత్యేకాంశములను గూర్చియు, లానుగూర్చియు ప్రప్రధానములైన సారాంశముల నెత్తి రెంటియందును గవర్నమెంటువారికే చరమనిర్ణయాధికార మున్నదని వ్రాసిరి. దీని యర్థమేమనగా, గవర్నమెంటువారును, ఫిర్యాదీలును పార్టీలుగా నున్న యొడంబడిక విషయములో గవర్నమెంటువారే ప్రాసిక్యూటరులై వారే జడ్జీలగుదు రని తెల్లమగుచున్నది. కాంగ్రెసువారు దీని నంగీకరింపజాలరు. బొంబాయి గవర్నమెంటువారిలేఖను, నేను పంపిన తంతివార్తకు సమాధానముగా సర్ మాల్కము హెయిలీగారు పంపిన తంతివార్తను గలిపి చదువుకొని, సంయుక్తరాష్ట్రమునందును, పెషావరు ప్రాంతములను, తక్కినరాష్ట్రములయందును నిర్బంధవిధానము పూర్తిగా సాగిపోవుచున్నదని విని, యివి యన్నియు నేను మీకు వాగ్దానము చేసినప్రకారముగ లండనుకు బోగూడదనుటకు దగినలక్షణములుగా గనబడుచున్నవి. నే నేవిషయమును నిర్ధారణ చేసికొనకముందు మీకు తెలియజెప్పుట మంచి దని యీ వార్తను బంపుచున్నాను. మీజాబు వచ్చిన తరువాత నా నిశ్చయమును బ్రకటింతును."

## వైస్రాయి సమాధానము (౧౯౩౧ ఆగస్టు ౧౩)

"మీరు చెప్పిన కారణములవలన కాంగ్రెసువారు రౌండు టేబిలు సభలో ప్రాతినిధ్యము వహించుటకు గావింపబడిన యేర్పాటులను నిర్వర్తింప నిష్టపడకపోయిన యెడల నేను చాల విచారము నొందుదును. ఈ కారణములు సరియైనవని నే నంగీకరింప జాలను. గవర్నమెంటువారి పద్ధతిని, దానికిగల కారణములను మీరు తప్పుగా నర్థము చేసికొనుచుండుటవలన నీసంశయములు పొడసూపినవి. ఆగస్టు ౬ వ తేదీని సర్ మాల్కమ్ హెయిలీగారు పంపిన తంతివార్తవలన సంయుక్తరాష్ట్ర వ్యవహారములో మీకు బుట్టిన సంశయములును, ఆగస్టు ౧౦ తేదీని సర్ ఎర్నెస్టుహాట్సనుగారి ప్రయివేటు కార్యదర్శి వ్రాసిన లేఖలోని ౪ వ పేరావలన గుజరాతువ్యవహారములో మీకు జనించిన సంశయములును, దీరియుండు నని తలచితిని. అదియుగాక జూలై ౩౧ తేదీని నేను మీకుస్వయముగా వ్రాసినలేఖను మరల జ్ఞాపకము చేయుచున్నాను. ఒడంబడికకు సంబంధించినంతవరకు సర్వవిషయములను నేను స్వయముగా శ్రద్ధతో పాలించెదనని యందు వాగ్దానము చేసియుంటిని. దానివలననైనను మీ రిట్టి చిన్న విషయములకై పుట్టిన పోరాటములను ద్రోసిపుచ్చి, మీ, నా జీవితముల దాటి భారతీయుల భవితవ్యమును నిర్ణయింపబోవు రాజ్యాంగతంత్రమును గూర్చినచర్చలలో పాల్గొందు రని తలచియుంటిని. కాని మీ లేఖయే మీ అంత్యనిశ్చయమైనచో మీరు రౌండుటేబిలుసభకు రాజాలరని నేను ప్రధానామాత్యునకు దెలియజేయవలసియుండును."

## గాంధీజీ నిరాకరణము (౧౯౩౧ ఆగస్టు ౧౩)

"మీరు వాగ్దానముచేయుచు తంతివార్త నిచ్చినందులకు నావందనములు. నేను స్థితిగతులనుబట్టి నా నిశ్చయమును గావించుకొనవలయును. మీ కిం దేవిధముగను నొడంబడికకు విరోధము గనరాకపోయినయెడల, దానిని గురించి మనకు దృష్టిభేద ముండి యుండవలయును. ఇప్పుడు నే నిదివరకు దెలియజేసిన నా నిశ్చయమును నెరవేర్చుటకంటె నాకు వేరు త్రోవ లేదు. నేను లండనునకు బోవలయునని నాశక్త్యనుసారము ప్రయత్నించియు విఫలుడనైతిని. ఇట్లే ప్రధానామాత్యునకు తెలియజేయుడు. ఈ యుత్తరప్రత్యుత్తరములను నేను పత్రికలకు బంపవచ్చు ననుకొనుచున్నాను."

వైస్రాయిగారియొద్దనుండి గాంధీగారికి వచ్చిన తంతివార్త (సిమ్లా, ౧౯౩౧ ఆగస్టు ౧౪):

"మీ నిశ్చయమును బ్రధానామాత్యునకు దెలియజేసితిని. ఈనాడు సాయంకాలము ౪ గంటలకు మన యుత్తర ప్రత్యుత్తరములలో నవసరమైనదానిని పత్రికలకు బంపుచున్నాను. మీరు నట్లే చేయవచ్చును."

కాంగ్రెసు రౌండుటేబిలు సభయందు బాల్గొనుట కభ్యంతరములు పుట్టవచ్చు నని జూనుమాసమునుండియు ననుమానములు రేగినను, కొంతమంది మాత్రము పరిస్థితులు చక్కబడవచ్చు నని చివరవరకును ఆశపడుచుండిరి. వారు నిరాశ చెందవలసిన చోట నాశపడుచుండి రని చెప్పుట సత్యదూరము కాదు. అయినను రాకపోకలు భగ్నమగునను నూహతో కాంగ్రెసువా రూరక కూర్చుండుటకు వీలులేదు. ఒడంబడిక సంపూర్ణముగ నెరవేరినయెడల వారు దానికి సంసిద్ధపడి యుండవలయును. కావున గాంధీజీ వైస్రాయితోను, బొంబాయి, యు. పి. ప్రభుత్వములతోను నుత్తరములు నడుపుచుండగా, కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమువారు తమ మామూలువిధిని నిర్వర్తించుకొనుచుండిరి. ఇక మనము కొంచెమునేపు దాని నరయవలయును. వర్కింగుకమిటీవారు జూలై ౨౦ తేదీని సమావేశమై ఇండియాకును బ్రిటీషువారికిని గల లావాదేవీలను గూర్చిన రిపోర్టు నంగీకరించిరి. ప్రధానవాక్కుల సంఘమువారు మచిలీపట్టణములో సమావేశమై నివేదికను తయారుచేసిరి. వర్కింగుకమిటీవారు దానిని ఆలిండియా కాంగ్రెసుకమిటీవారి యెదుట నుంచుటకు తీర్మానించిరి. హిందూస్థానసేవాదళమునకును కాంగ్రెసునకును గల సంబంధమునుగూర్చి కొన్ని సంశయములు పుట్టెను. అందుచేత నాదళమును కాంగ్రెసుయొక్క ముఖ్యవలంటీరుదళముగా నంగీకరించి అది వర్కింగుకమిటీవారి యధీనమునగాని, వారిచే నియమింపబడిన యుద్యోగి యధీనమునగాని పనిచేయుచుండవలయునని తీర్మానించిరి. ఆ దళముయొక్క కర్తవ్యములను వరుసగా నిర్ణయించిరి. రాష్ట్రీకాంగ్రెసుసంఘములు సరియైన వలంటీరుదళముల నేర్పాటు చేయవలయును. వారెల్లరును కాంగ్రెసు సభ్యులై ప్రధానదళముయొక్క నిబంధన లన్నిటిని బాటించుచుండవలయును. మొదట కాకినాడలో ప్రథమ సమావేశము జరిపి తదాది కాంగ్రెసునకు పరమోపకారము చేయుచు డాక్టరు హార్డికరుగారి యాజమాన్యమున నడచుచున్న సేవాదళము కాంగ్రెసున కనుబంధమై ధర్మబద్ధములు, శాంతిపూర్వకములు నైన పద్ధతులతో స్వరాజ్యమును సంపాదింతుమన్న కాంగ్రెసు సిద్ధాంతము నంగీకరించెను. తరువాత కాంగ్రెసుయొక్క 'పురాణగ్రంథము' వచ్చెను. అది సాంఘికసమస్యా పరిష్కారమును గూర్చిన యొడంబడిక. దానిని సర్వాంగముగ నిక్కడ నుదాహరించుచున్నాము.

వర్కింగుకమిటీవా రీ ప్రకటనము కావించుచున్నారు:

"కాంగ్రెసు నెగ్గినను నెగ్గకపోయినను, మొదటినుండియు నిష్కళంకమైనజాతీయతనే లక్ష్యముగా బెట్టుకొన్నది. సాంఘికభేదములను రూపుమాప యత్నించినది. ఈ జాతీయతను సాధించుటలో లాహోరుసందర్భ మాపాదింపబడిన యీ తీర్మానము శిఖరతుల్యమైనది:

'నెహ్రూరిపోర్టు పరాస్తమైనది గావున సాంఘికసమస్యనుగూర్చి కాంగ్రెసువారి యభిప్రాయము వెల్లడించుట యనవసరము. స్వతంత్రమైన భారతదేశములో సాంఘికసమస్యలు కేవలము జాతీయమయిన పద్ధతులమీదనే పరిష్కరింపబడగలవు. కాని ముఖ్యముగ సిక్కులును మహమ్మదీయులు, తక్కిన మయినారిటీసంఘములును నెహ్రూరిపోర్టు పరిష్కారమున కసంతృప్తి నొందియున్నందున భావిరాజ్యాంగతంత్రములో నెవరికైనను నసంతృప్తిని గలుగజేయు సాంఘిక సమస్యాపరిష్కారము కాంగ్రెసున కంగీకార్యము కానేరదని కాంగ్రెసువారు ప్రకటించుచున్నారు.'

"కావున నీ సాంఘికసమస్యను సాంఘికభేదపూర్వకముగ బహిష్కరించుట కాంగ్రెసునకు శక్యముకాదు. అయినను భారతజాతిచరిత్రమునందు క్లిష్టమయియున్న యీ సమయమున పైకి సాంఘికభేదవంతమయ్యును సాధ్యమైనంత జాతీయస్వరూపము గలిగియున్న పరిష్కారమును వర్కింగుకమిటీవారు సూచించుట మంచిది యని తోచినది. కావున వర్కింగుకమిటీవారు సంపూర్ణమయిన పర్యాలోచనముచేసి యీస్కీమును తయారుచేసినారు:

'౧. (ఎ) రాజ్యాంగతంత్రమునందు ప్రధానహక్కులనుగూర్చిన యంశములో సమస్తసంఘములవారికిని వారివారి విజ్ఞానభాషాలిపులును, మతములును, దేవాదాయములును సంరక్షింపబడు నని పూచీ నీయవలెను.

(బి) రాజ్యాంగమునందలి ప్రత్యేకసూత్రములద్వారా 'వ్యక్తిశాసనములు' సంరక్షింపబడవలయును.

(సి) ఆయారాష్ట్రములయందున్న మైనారిటీసంఘముల రాజకీయాదికములైన హక్కులను సంరక్షించు నధికారము భారతప్రభుత్వమున కుండవలయును.

'౨. మెజారిటీ పొందిన స్త్రీపురుషు లెల్లరికిని వోటింగు హక్కుండవలయును. (ప.రా.—కరాచీతీర్మానము ననుసరించి వర్కింగుకమిటీవారు మెజారిటీ వోటింగు హక్కునకు బద్ధులైయున్నారు. ఇప్పుడు దానిని మార్చి, మరియొకవిధమైన ఫ్రాంచైజును సూచించుటకు వీలులేదు. కాని కొందరి కీ విషయములో దురభిప్రాయములు ప్రబలియుండుటచే నొకయంశమును విశదముచేయవలసియున్నది. వోటింగు హక్కెట్టిదైనను నది యెక్కువమందికి లభించి, జాబితాలయందు సంఘముల జనాభా కనుగుణముగా నుండవలయునని కాంగ్రెసువారి యభిప్రాయము.

'3. (ఎ) భారత భావిరాజ్యాంగమునందు జాయింటు ఎన్నికవర్గముల మూలమున ప్రతినిధుల నెన్నుకొనుపద్ధతి నెలకొల్పవలయును.

(బి) సింధురాష్ట్రమున హిందువులకును, అస్సాములో మహమ్మదీయులకును, పంజాబు పశ్చిమోత్తర పరగణాలయందు సిక్కులకును, మరి యేరాష్ట్రమునందైనను మొత్తము జనాభాలో నాల్గవవంతుకంటె తక్కువగానున్న హిందూమహమ్మదీయులకును ఫెడరలు శాసనసభయందును, రాష్ట్రశాసనసభలయందును జనాభా దామాయిషా ననుసరించి స్థానములను రిజర్వుచేసి యంతకుమించిన సీట్లకు ప్రయత్నింప నధికారమీయవలయును.

'౪. ఉద్యోగము లిచ్చుటకై పార్టీలతో సంబంధములేని పబ్లికుసర్వీసుకమీషను నేర్పరుప వలయును. వా రుద్యోగుల గుణప్రమాణనిర్ణయముచేసి, పబ్లికు సర్వీసులు సమర్థములయి యుండునట్లు చూచుచు నన్ని సంఘములవారికిని సర్వీసులయందు సమానమయిన యవకాశము కలుగునట్లు చేయవలయును.

'౫. ఫెడరలు, రాష్ట్రీయ మంత్రివర్గములను నియమించునప్పుడు మైనారిటీల హక్కులను గమనించు సంప్రదాయము నేర్పరుపవలయును.

'౬. పశ్చిమోత్తరపు సరిహద్దురాష్ట్రమును, బెలూచిస్థానమును తక్కిన రాష్ట్రములతోబాటు సమానమైన రాజ్యాంగసౌకర్యములను బొందవలయును.

'౭. సింధుదేశీయులు ఖర్చులు భరించినచో నా దేశమును వేరుగా నొక రాష్ట్రమును గావింపవలయును.

'౮. భావిభారతరాజ్యాంగము ఫెడరలురాజ్యాంగము కావలయును. భారతదేశక్షేమమునకు విరుద్ధముగానిచో నంత్యనిర్ణయాధికారము రాష్ట్రములకే (ఫెడరేటింగు యూనిట్టులకే) యుండవలయును.'

“కేవల సాంఘిక భేదవాదమునకును, కేవల జాతీయవాదమునకును మధ్యేమార్గముగా వర్కింగు కమిటీవారీ స్కీము నవలంబించిరి. దేశీయులెల్లరును నీ ప్రణాళిక నామోదింతురని యాశించుచు, నాయా సంఘములవారెల్లరకును ననుమోదకరములైన ప్రణాళికలను సూచించినయెడల వర్కింగుకమిటీవారు లాహోరుతీర్మానము ననుసరించి విధికృత్యముగా వానిని శిరసావహింపగల రని వాగ్దానము చేయుచున్నారు.”

విదేశవస్త్రములను, నూలును బహిష్కరించు ప్రమాణపత్రము వ్రాయబడినది. ఈ ప్రమాణపత్రమునకు విరుద్ధమైన మరి యే ప్రమాణ పత్రమైనను ప్రమాణము కాజాలదని తీర్మానింపబడినది:

“వర్కింగుకమిటీవారు వేరొక తీర్మానము చేసి దీని నన్యథాకరింపనంతవరకును నీ షరతులప్రకారము మేము వర్తింపగల మని ప్రమాణము చేయుచున్నాము.

౧. దూది, పట్టు, ఉన్నినుండి తీసిన విదేశీనూలును మేముకొనము, విక్రయింపము. అట్టి నూలువలన తయారుచేసిన వస్త్రములను కొనము, విక్రయింపమని ప్రూచీ పడుచున్నాము.

'౨. కాంగ్రెసువారలు నంగీకరింపని మిల్లులు తయారుచేసిన నూలు గాని, వస్త్రములను గాని మేము కొనము, అమ్మమని ప్రూచీపడుచున్నాము.

'3. మా దగ్గరనున్న దూది, ఉన్ని, పట్టులతో తయారుచేసిన విదేశీనూలును మేము విక్రయింపము. దానివలన తయారుచేసిన వస్త్రములనుగూడ విక్రయింప మని ప్రూచీ పడుచున్నాము.'

తరువాత క్రిందటి సంవత్సరపు మహోద్యమములో మాసిపోయిన అస్పృశ్యతా నివారణసంఘమును పునరుద్ధరింపవలయును అని తీర్మానించి, సేట్ జమ్నాలాలు బజాజిగారి నా కార్యమునందు నియోగించిరి. ఆ సంఘమువారి కవసరమైనచో క్రొత్త సభ్యులను జేర్చుకొనునధికార మీయబడెను.

మిల్లుల పెత్తనపు కమిటీ, యీ మిల్లులయందలి కూలివాండ్ర స్థితిగతుల విషయములో వర్కింగుకమిటీవా రిట్లు తీర్మానించిరి. "దూదిమిల్లుల పెత్తనపు కమిటీవారు కాంగ్రెసుప్రమాణపత్రము నంగీకరించిన మిల్లులలో నెందైన కూలిజనమునకు కష్టనష్టములు సంభవించినచో వానిని సాధ్యమైనంతవరకు సామరస్యమువలన బొసగ ద్రోసి కూలివాండ్ర స్థితిగతులను బాగుచేయుటకు ప్రయత్నింపవలయును."

సాంఘికసమస్యాపరిష్కారములో నంత్యనిర్ణయపుహక్కు ఫెడరేషను కీయా నిట్టుల కొసగబడె నని యెరుగుదుముగదా! ఈ యంత్య నిర్ణయపు హక్కులను గోరుట యొక వేలము వెఱ్ఱి. అది యూహలలో మాత్రమే యున్నదిగాని యింతవరకు దాని స్వరూప మిట్టిదని నిర్ణయించినవారెవ్వరును లేరు. రాష్ట్రము లొకదానితో నొకటి సంబంధము లేక యుండుచోట నీ విషయము నెత్తవచ్చునుగాని, భారతప్రభుత్వమునకును రాష్ట్రప్రభుత్వములకును పరిపాలనశాఖలు జాగ్రత్తగా విశదీయబడి యుండిన భారతదేశములో నిట్టి వాదోపవాదములు వట్టి యుబుసుపోకలే యగును. అది యెట్లున్నను చిట్టచివరి తీర్మానముమాత్రము గాంధీజీ చేసినదే. ఆయన తనకు సహజమైన ప్రతిభావిశేషమువలన 'తరువాత విచారించినప్పుడది భారతదేశక్షేమమునకు విరుద్ధముగా నుండనియెడల' నను విశేషవాక్యమును గలిపినాడు. ఇందు నిజమే మన, మహమ్మదీయులు తమ చేతులలో నొక యధికార ముండవలయు నను కొన్నారు. హిందువు లెక్కువగానున్న రాష్ట్రములలో మహమ్మదీయుల నవమానింపవచ్చును, అప్పుడీ యధికారము వారిని శిక్షించుటకు బనికివచ్చును. కాని భాగస్థుని

కనుమాన మున్నప్పుడు వాని కొక రక్షణము నిచ్చుటయే మంచిది. కాని గాంధీగారు చొప్పిన వాక్యమువలన మరల పునర్విచారణ కవకాశము కలిగినది. దీనితో నన్ని పార్టీలవారును సంతృప్తి చెందినారు.

ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటీ ౧౯౩౧ ఆగస్టు ౬, ౭, ౮ తేదీలయందు సమావేశమై చాల ముఖ్యములైన తీర్మానములను గావించినది. అందు మొదటిది బొంబాయి అక్టింగుగవర్నరుగారిని హత్య చేయుటకు ప్రయత్నమును, బెంగాలులో జడ్జి గార్లిక్ గారి హత్యను గూర్చినది. ఈ దుర్మార్గములను ఖండించుచు బొంబాయి గవర్నరుగారిని ఫెర్గూసనుకాలేజీ కతిథిగా బిలిచినతరి నాయనను హత్యచేయ బ్రయత్నించుట నీచాతినీచమని యీ కమిటీవారు ఖండించి చెప్పిరి.

పతాకకమిటీవారి నివేదిక నంగీకరించి, భారతజాతీయపతాక త్రివర్ణశోభితమై పూర్వమువలెనే రంగు లొకదానిక్రింద నొకటి యుండునట్లు పైనుండి క్రిందికి కాషాయ, శ్వేత, హరితవర్ణము లుండునట్లును, మధ్యగా శ్వేతభాగమున నీలవర్ణ భాసితమగు రాట ముండినట్లును తీర్మానించిరి. ఈ వర్ణములు గుణములను దెలుపును గాని సంఘములను దెలుపవు. కాషాయవర్ణము శౌర్యత్యాగములను, శ్వేతవర్ణము శాంతి సత్యములను, హరితవర్ణము విశ్వాసౌదార్యములను, రాటము పేదలపాలిటి భాగ్యమును ప్రకటించుచుండును. నూతన జాతీయపతాకను ఆగస్టు ౩౦ తేది ఆదివారమునాడు ప్రదర్శింపగోరిరి. ఆనాడు పతాకోత్సవము కావింపవలయు ననిరి. ప్రధానహక్కుల కమిటీవారి నివేదికను బరిశీలించి, పూర్వోక్తములైన హక్కులను, విధులను అంగీకరించిరి.

ఈ సమావేశములోనే ప్రధానహక్కులతీర్మానమును పూర్ణముగ సంస్కరింపబడినరూపమున నంగీకరించిరి.

ఈరోజులలోనే బొంబాయిలో సమావేశమైన వర్కింగుకమిటీవారు భగత్సింగు దహనవ్యవహారమును పరిశీలించి, యిందారోపింపబడిన యపరాధము లాధారరహితము లని త్రోసివైచిరి. పశ్చిమోత్తరరాష్ట్ర కాంగ్రెసుకమిటీ అఫ్ఘనుజీర్గా, ఖుదాయి ఖిద్మత్ గారులనుగూర్చి ముఖ్యమైనయొకతీర్మానము చేయబడినది. దాని నీక్రిందపొందుపరచుచున్నాము.

"ఈకమిటీవారు పశ్చిమోత్తరరాష్ట్రప్రతినిధులతో గూడి విచారించి, సరిహద్దు రాష్ట్ర కాంగ్రెసుకమిటీని మరల నిర్మించి, అఫ్ఘనుజీర్గా నం దైక్యమొనరింపవలయునని తీర్మానించుచున్నారు. ఖుదాయి ఖిద్మత్గారులు కాంగ్రెసువలంటీరుదళమునం దొక భాగము కావలయునని తీర్మానింపబడినది. ఈక్రింద నుదాహరింపబడిన ప్రకటన

వర్కింగుకమిటీవారిచే ప్రకటింపబడినది. కమిటీవారి తీర్మానము లిందు పొందుపరుప బడినవి.

"పరిహద్దురాష్ట్రములో కాంగ్రెసు కార్యక్రమమును గూర్చియు, నచ్చటి రాష్ట్రీయకాంగ్రెసు సంఘమునకును, ఖుదాయిఖిద్మత్గారులకును గల పరస్పరసంబంధమును గూర్చియు కొన్ని భేదాభిప్రాయములు గలిగియుండుటచే వర్కింగుకమిటీవారు ఖాన్ అబ్దులు గఫారుఖాను, ఖాను అలీగల్ ఖాన్, హకీము అబ్దుల్ జలీల్, పీర్ భక్షు, ఖాను అమీరు మహమ్మద్ ఖాన్, శ్రీమతి నిఖో దేవి గార్లతో పశ్చిమోత్తరరాష్ట్రమునందలి భావికార్యక్రమమునుగూర్చి సంప్రతించి యున్నారు. ఈ సంప్రతింపులవలన భేదాభిప్రాయములు విడిపోయి సరిహద్దురాష్ట్ర నాయకులు కొన్ని తీర్మానముల ప్రకారము కార్యతంత్రము నడుప నంగీకరించినారు. అఫ్ఘనుజిర్గా కాంగ్రెసు కార్యక్రమమును నిర్వర్తించుచుండె ననియు, ఖుదాయి ఖిద్మత్గారు లీకార్యక్రమము నమలులో బెట్టుటకు వలంటీరులవలె బనిచేయుచుండి రనియు నిరూపింపబడెను. కాని అఫ్ఘను జిర్గాకు వేరుగా నొక సంఘటనక్రమ ముండుటచేత నది కాంగ్రెసు సంస్థయందు భాగము కాజాలదు. జిర్గావారు రకరకముల జెండాలను వాడుటచేతగూడ కొంతకల్లోల మదయించెను.

"కావున ప్రస్తుతమున్న రాష్ట్రీయకాంగ్రెసు సంఘమును, అఫ్ఘను జిర్గాయును నేకమై యేర్పడిన కాంగ్రెసుసంఘము కాంగ్రెసునిబంధనల ననుష్ఠించవలయునని సరి హద్దురాష్ట్రనాయకు లంగీకరించినారు. ఇట్లు క్రొత్తగా నెన్నుకొనబడిన సంఘమే రాష్ట్రీయకాంగ్రెసుసంఘ మగును. సరిహద్దురాష్ట్రభాషలో దానిని సరిహద్దు రాష్ట్రపు జిర్గా యని పిలువవచ్చును. అట్లే జిల్లాలయందును, నగరమునందును ఉన్న కాంగ్రెసు సంఘములుగూడ జిర్గాలని పిలువబడవచ్చును. అవిగూడ సచ్చముగ కాంగ్రెసు సం ఘములే యనువిషయము నిర్ధారణ చేయబడినది. ఖుదాయి ఖిద్మత్గారులును, వర్కింగు కమిటీవారును క్రొత్తగా చేసిన తీర్మానము ననుసరించి కాంగ్రెసు వలంటీరుదళము కాగలరు. ఖుదాయిఖిద్మత్గారు లను పేరుమాత్ర ముండవచ్చును. ఈ సంఘములన్నియు సంపూర్ణముగ కాంగ్రెసు నిబంధనల ననుసరించి నడుపబడవలయును. ఇకమీదట జాతీయపతాకనుమాత్రమే వాడవలయును.

"వర్కింగుకమిటీ ప్రార్థనము ననుసరించి సరిహద్దురాష్ట్ర నాయకు లైన ఖాన్ అబ్దుల్ గఫూర్ ఖాన్గారు రాష్ట్రమున కాంగ్రెసుద్యమమును నడపుటకై యంగీక రించిరి."

వర్కింగుకమిటీవారు గాంధీ-ఇర్విను ఒడంబడిక మరకులకును, జాతీయప్రయోజనములకును ననుకూలముగా కాంగ్రెసువారు రౌండుటేబిలుసభయందు ప్రాతినిధ్యము వహింపజాలరు, వహింపగూడదునని యిష్టము లేకపోయినను కష్టముమీద తీర్మానింపవలసివచ్చినదని యొక తీర్మానము గావించిరి. కాని ఢిల్లీ యొడంబడికమాత్ర మింకను నమలులోనే యున్నదని యీక్రిందివాక్యములతో నిర్ధారణగా నిరూపించిరి:

రౌండుటేబిలుసభలో కాంగ్రెసువారు పాల్గొనగూడదని వర్కింగుకమిటీవారు ఆగస్టు ౧౩ తేదీని గావించిన తీర్మానమునుబట్టి, ఢిల్లీయొడంబడిక దీనితో నంత ముందినట్లుగా నర్థము చేసికొనవలదని యీకమిటీవారు విశదముచేయుచున్నారు. కావున కాంగ్రెసుసంఘములవారును, కాంగ్రెసుసభ్యులును సరియైన యాజ్ఞలు చేయబడువరకును ఢిల్లీయొడంబడిక మరకులను కాంగ్రెసుకు సంబంధించినంతవరకు జాగ్రత్తగా నెరవేర్చుచుండవలసిన దని హెచ్చరించుచున్నాము."

కాని యేదేని నూతనసందర్భములు హఠాత్తుగ సంఘటిల్లినచో వర్కింగు కమిటీని సమావేశపరచుటకు వీలులేని సందర్భములయందు "వర్కింగుకమిటీవారి పేరిట నధ్యక్షుడు వ్యవహరింపవచ్చు" నని యధికార మిచ్చిరి.

సర్. టి. బి. సప్రూ, జయకరుగార్ల ప్రయత్నములవలన చివరకు గాంధీగారు లండను వెళ్లుటకు వీలు గలుగునను వదంతులతోడను నాశలతోడను నారోజెల్ల మణిభవనము నిండిపోయెను. కాని సాయంకాల మగునప్పటికి భవనమునుండి వెలికి వచ్చిన కాంగ్రెసునాయకు లట్టియాశల కవకాశము లేదనియు, గాంధీజీ లండను వెళ్లజాలడనియు పత్రికా ప్రతినిధులకు దెలియజేసిరి. అప్పటికిని కొందరు నిరాశ చెందక యెట్లయినను తుదకు మంచిఫలమే సమకూడు ననుచుండిరిగాని, యింతలో గాంధీజీ రాత్రి ౮-౪౫ గంటలకు మణిభవనమును వెలువడి బొంబాయి సెంట్రలు స్టేషనులో గుజరాతు మెయిలునందొక మూడవతరగతి పెట్టెలో కూర్చుండుసరికి వారియాశలు నిరాశలయ్యెను.

ఆ సాయంకాలము సర్ ప్రభాశంకరు పటాణీగారు గాంధీజీతో నరగంటసేపు ప్రసంగించిరి. ఆయన ముల్తాను నౌకమీద లండనుకు బోవనెంచియు ప్రయాణము నాపివేసెను. అసోసియేటెడుప్రెస్సు ప్రతినిధి యాయన నెంత నొక్కి యడిగినను తన ప్రయాణము నాపుకొంటి ననుటకు మించి యేమియును జెప్పినాడు కాడు.

ఇట్లు రౌండుటేబిలు సభానాటకమున ప్రథమాంకములోని మొదటి రంగము ముగిసెను. ఆగస్టు ౧౫ తేదీని డాక్టరు సప్రూ, జయకరు, ఎ. రంగస్వామి అయ్యంగార్లు గాంధీ నొకటి రెండుసార్లుచూచి లండనుకు ప్రయాణమైరి. ఈ విషయమును

గూర్చి జరిగిన యుత్తరప్రత్యుత్తరములను చదివినచో నధికారవర్గముయొక్క చిత్తవృత్తి తెలియనగును. సెక్రటేరియటువా రొడంబడికను ద్రోసిరా జనిరి. బహుశః వారు పూనాదురంతమువలన కలత నొంది యుండవచ్చును. కాంగ్రెసు కార్యతంత్రమంతయు మాటిమాటికిని మంచి యనువైనసమయమున నేదోయొక దౌర్జన్యకృత్యమువలన భంగమునొందుచు వచ్చినది. ఈ సమయమున బొంబాయి ఆక్టింగు గవర్నరు సర్ హెచ్. హాట్సనుగారిని హత్యచేయుటకై ఫెర్గూసను కళాశాలయం దొకవిద్యార్థి ప్రయత్నించుట యెంతయు శోచనీయము. కాని హాట్సనుగారుమట్టుకు ౧౯౨౯ డిశెంబరు ౨౩ తేదిని ఇర్విను ప్రభువు శాంతివహించినట్లే శాంతి వహించియుండెను. పూనాదురంతమునకు గాంధీగారు తనదుఃఖమును వెల్లడించి, ఆక్టింగు గవర్నరుగారు నిరపాయముగ నున్నందుల కభినందించిరి. వర్కింగుకమిటీవారును, ఆల్ ఇండియా కాంగ్రెసుకమిటీవారు నీ దురంతమును ఖండించుచు సముచితములయిన తీర్మానముల గావించిరి. కాని గాంధి - ఇర్విను ఒడంబడికకు దోషములు పట్టుట కింతకంటె లోతైన కారణములు గలవు. ఈ దోషములన్నియు వర్గీకరింపబడినవి. గాంధీగారి ఖండనములకు ఆగస్టు ౨౮ తేదిని గవర్నమెంటువారు వరుసగా సమాధానములు వ్రాసిరి. కాంగ్రెసువారు మరల అక్టోబరు మాసములో వానికి సమాధానములను ప్రకటించిరి. గాంధీగారురౌండుటేబిలు సభలో పాల్గొనుటకు నిరాకరించి, వర్కింగు కమిటీవారి యామోదముతో తన నిశ్చయమును ఆగస్టు ౧౩ తేదిని వైస్రాయిగారికి బంపుటకే సంధిభంజన మొక కారణము. నిజమునకు వ్యవహారమును రసాభాసము చేసినది. జూలై ౩౧ తేదిని ఎమర్సనుగారు వ్రాసినలేఖ (పైని జూడుడు.) తరువాత ఆగస్టు ౧౦ తేది బొంబాయి గవర్నరుగారి లేఖయు నంతకు తగ్గియుండలేదు. సర్ మాల్కము హెయిలీగారి తంతివార్తలో మాటమెత్తన యున్నను నదియును విపరీత ఫలదాయకమే యయ్యెను. అన్నిటికంటె మించిపోయినది బార్డోలీలో పన్నుల వసూళ్లయందు గావింపబడిన నిర్బంధచర్యలు. బార్డోలీయందు ౨౨ లక్షలకును ౨౧ లక్షలు చెల్లింపబడినవి. బాకీదారులు కష్టదశలో నున్నారు. గాన పన్నులు చెల్లించుటకు గడువు కావలయునని కాంగ్రెసు కోరెను. గుజస్తుబాకీ రెండులక్షలవరకునుండెను. ప్రజల కష్టదశనుబట్టి యీ బకాయిలో చాల భాగము గవర్నమెంటువారిచే నంగీకరింపబడినదే. (ఆథరైజు చేయబడినదే.) గవర్నమెంటు అధికారులు గుజస్తు బాకీలను, హాలుసాలు బాకీలను గూడ పోలీసువారి బెదరింపులతో వసూలు చేయ జొచ్చిరి. పన్నులను వసూళ్లిప్పించుటకుగాని బిగించుటకుగాని, కాంగ్రెసువారి కేవిధమైన యధికారములేదని గవర్నమెంటువారి వాదము - ఈ యర్థ మొడంబడికలో లేదనియు, దానిని గవర్నమెంటువారు సహింపజాలరనియు స్పష్టముగ వ్రాసిరి.

ప్రజలను భయపెట్టి, యక్రమమైన యధికారముచేసి శిస్తు వసూళ్లను జేయుటకు పోలిసు వారిని వినియోగించిరని రుజువుచేయుటకు కాంగ్రెసు సిద్ధముగా నుండెను. ఇంతియును నిట్లు వసూలుచేయబడిన బకాయిశిస్తు లొక్క లక్షగూడ లేకుండెను. పన్నుల వసూళ్ల విషయములో వద్దనుటకుగాని, కద్దనుటకుగాని గవర్నమెంటువారి కధికార మున్నదిగాని, కాంగ్రెసువారి కిం దెట్టిజోక్యము లేదని గవర్నమెంటువారి వాదము. బ్రిటిషువారి యధికార మింకను బోలేదు. వారు దీనిని పరిమర్శనముగా జూపింపవల యును. వసూళ్లొక లెక్కలోనివి కావు. వారికి డబ్బుతో లెక్కలేదు. వారికి గావల సినది ప్రతిష్ఠ; ౧౯౧౭ లో మాంటాగ్యూగారు ప్రకటించిన ప్రతిష్ఠ యది.

గాంధీగారు లండను వెళ్లకపోవుట కింకొక ముఖ్యమైనకారణ మున్నది. గవర్న మెంటువారు రౌండుటేబిలు సభకు డాక్టరు అన్సారీగారిని ప్రతినిధిగా బంపకపోవు టయే యాకారణము. కోరినచో కాంగ్రెసువా రాయనను బంపియేయుందురు. ఆయన కాంగ్రెసుసభ్యు డగుటయేగాక భారతదేశములో నొక మహోపక్షమైన జాతీయ మహమ్మదీయ సంఘమునకు నాయకుడు. మహమ్మదీయులెల్లరును దేశాభ్యు దయ విరోధులు కారు. వారిలో కేవలము జాతీయమైన దృక్పథము కలిగి పూర్ణస్వరా జ్యమునకై (ముకమ్మల్ అజడీ) పెనగులాడు నొక విశిష్టసంఘ మున్నది. కాని ఇర్విను ప్రభువు పండిత మదనమోహన మాలవ్యా, శ్రీమతి సరోజినీదేవి, డాక్టరు అన్సారీగార్లను రౌండుటేబిలు సభకు ప్రతినిధులుగా నిరూపించెదనని గాంధీకి వాగ్దానముచేసియుండుట యెల్లరకు తెలిసిన రహస్యమే. మొదటివా రిర్వురిని నామినేటు చేసి అన్సారీగారిని వదలివేసిరి. విల్లింగుడను ప్రభువు పెద్ద చిక్కులో పడెను. ఇర్విను ప్రభువుచేసిన వాగ్దాన మాయనకు దెలియకపోలేదు. కాని మహమ్మదీయులు స్వరాజ్య మును గోరుటలేదని రౌండుటేబిలు సభలో ప్రకటితమగుట బ్రిటిషువారికి ప్రయోజనకర ముగానుండును. ఇర్విను ప్రభువు కావించిన వాగ్దానమును దీర్పుమనగా అన్సారీగారి ప్రాతినిధ్యమునకు మహమ్మదీయ ప్రతినిధు లంగీకరించుటలేదని విల్లింగుడను ప్రభువు సమాధానము చెప్పెను. వా రంగీకరింపకపోవుట నిశ్చయమే. అంగీకరించినచో వారు మహమ్మదీయ ప్రతినిధు లేల యగుదురు? భారత ప్రతినిధులే యయ్యెడి వారు. దేశములో ననేక సహచర వర్గము గలిగి, యచ్ఛమైన జాతీయాదర్శములతో సాంఘిక విభేదములను లేశమైన నంగీకరింపజాలని అన్సారీగారి ప్రాతినిధ్యమును వా రెట్లొప్పుకొందురు? కాంగ్రెసువా రొకసాంఘికసమస్యాపరిష్కా రమును ప్రకటించిరి. దానిని రౌండుటేబిలు సభలో నొక హిందువుసును, నొక మహమ్మదీయుడును గూడి స్థిరీకరింపవలయును. గవర్నమెంటువారి కిది తెలియును. అందుచేత వారు కాంగ్రెసుశరీరములోని మహమ్మదీయాంగమును గోసివైచి కాంగ్రె

మును స్తంభింపజేయ సంకల్పించుకొనిరి. ఇట్టి సందర్భములలో గాంధీజీ జాతీయ గౌరవమునకు భంగములేని మార్గమును ద్రొక్కి రెండు టేబిలుసభకు బోనని నిరాకరించెను.

మరల సమరసన్నాహములు జరుప నారంభించిరి. సత్యాగ్రహులు సమర సన్నాహము చేయుటకు మాటమాత్రమే యవసరము. దానికి గావలసిన సామగ్రి యేదియును లేదు. గవర్నమెంటువారివలె లాఠీలు, సిబ్బందిని చూచుకొన నక్కర లేదు. ప్రజలతరఫున నవసరముకొలది వలంటీరులు వచ్చుచుందురు. అయితే మానవుని యోర్పున కొకమేర యున్నది. సత్యాగ్రహసమరమునందుగూడ నెంతమంది సిబ్బందియున్న, నెంతధనమున్న నంత మంచిది. ఈ విషయమై తరువాత తెలిసికొందము. కాని ఆగస్టు ౧౪ తేదీ నంతయు సమరసన్నాహమయమై కన్పట్టెను. విల్లింగ్డనుప్రభువుమాత్రము చాల మర్యాదతో వర్తించుచు నెప్పుడేచిక్కువచ్చినను తనతో గలసికొని సంప్రతించవలయు నని గాంధీజీకి సలహాయిచ్చుచుండెను. కాని గాంధిజీ ప్రార్థనము లక్కరకు రాలేదు. దేశము విచారములో మునిగిపోయెను. మాలవ్యా సరోజినీదేవులు సప్రూ, జయకరు, అయ్యంగార్లు వెళ్లిన ముల్తాను నౌకమీద వెళ్లక ప్రయాణము మాపుకొనిరి. గాంధిజీ తన యభిప్రాయము నిట్లు సరళముగా జెప్పగల్గెను:

“గవర్నమెంటుకును, కాంగ్రెసుకును నొక యొడంబడికయుండి, దాని షరతులకు వ్యాఖ్యానము చేయువిషయమున భేదాభిప్రాయములు గల్గి యుభయపక్షములు దానియెడల నపరాధములు చేసినప్పుడు, లోకములో నన్ని యొడంబడికలకును నే నిబంధనలు చెల్లునో యవి యన్నియు నీయొడంబడికకుగూడ జెల్లును. అందును నీ యొడంబడిక యొకవంక నొక మహాప్రభుత్వమునకును, మరియొకవంక యావద్భారత జాతికిని బ్రాతినిధ్యము వహించుచున్న యొక మహాసంస్థకును మధ్య చేసికొనబడిన దగుటచే దీని కా నిబంధనలన్నియు జెల్లును. పైగా నీయొడంబడికను న్యాయస్థానములలో జెల్లించుకొన వీలులేకపోవుటవలన, దీని విషయములో భేదములు పుట్టి వాని నుభయులు నంగీకరింప జాలనప్పుడు నిష్పక్షపాతమైన పంచాయితీని నియమించుట గవర్నమెంటువారికి మరింత విధివత్తర మైయున్నది. ఇట్టి తగాదా వ్యవహారములను పంచాయతీవారి తీర్పునకు బెట్టవలయు నను కాంగ్రెసువాదమును గవర్నమెంటువారు త్రోసిపుచ్చినారు.”

నిజమునకు గాంధిజీ శాంతి కవకాశము లేకుండ నెన్నడును జేయలేదు. స్థానికాధికారు లొడంబడిక షరతులను బూరించి, ‘త్రోవచక్కజేసిన వెంటనే లండనులో బోయి పడుదు’ నని చెప్పెను. ఆయన యున్నాళ్లను ప్రతిరాజకీయవేత్తయొక్క

మనస్సునందును రహస్యముగా దాగియున్న యభిప్రాయమును బహిరంగముగా జెప్పివైచెను. "ఇక్కడి సివిలు అధికారులకు నేను రౌండుటేబిలుసభకు బోవుట యిష్టములేదు. ఒకవేళ వారిష్టపడినచో కాంగ్రెసువారెన్నటికిని సహింపలేని పరిస్థితులలో నేనుసభయందు పాల్గొనవలయునని వారితాత్పర్యము" గాంధిజీ కాంగ్రెసు పేరిట దేశములో నొక 'మారట ప్రభుత్వమును' స్థాపింప జూచుచున్నా డని దురభిప్రాయపడుచుండిరి. ఇట్టి గుప్తసంస్థను సహించి యూరకుండరాదని వారి యభిప్రాయము. అందుచేత గాంధిజీ బొంబాయినుండి అహమ్మదాబాదునకు బోవుచు దన యాజమాన్యముక్రింద నొక మారటప్రభుత్వమును సాగింపవలయునని తానెన్నడును దలపలేదనియు, పంచాయతీబోర్డును స్థాపింపవలయు నని తానెన్నడును పట్టు పట్టలేదనియు, తనకు గావలసిన దెల్ల న్యాయముమాత్రమే యనియు విల్లింగుడనుప్రభువున కొక యుత్తరము వ్రాసెను. ఆలేఖ యిది:

"పరిస్థితులు చకచక మారిపోవుచుండుటచే దాము జూలైలో స్వయముగా వ్రాసిన యుత్తరమునకు జవాబు వ్రాయజాలకపోతిని.

"ఆజాబునందలి నిష్కల్మషతను నే నభినందించుచున్నాను. తరువాత పుట్టిన యుదంతము లన్నియు నాలేఖను నిస్సారముగ జేసివైచినవి. నేను ఆగష్టు ౧౩ తేదీని యిచ్చిన తంతివార్తలో విన్నవించుకొన్న రీతిగా నీ యుదంతములన్నియుగూడి మన దృక్పథములయందే భేద మున్నట్లు తెలియజేయుచున్నవి.

"మీరు కావించిన నిశ్చయమువలనను, నా కిక్కడనున్న బాధ్యతలను బట్టియు నేను రౌండుటేబిలుసభకు బోజాలనను తీర్మానము నెంతయో మహాతురతతో విచారించి విచారించి, విధితప్పక చేసికొంటి నని మీకు తెలియజేయుచున్నాను.

"నేను పంచాయతీబోర్డును స్థాపింపవలయునని పట్టుపట్టితిననియు, నొక 'మారట ప్రభుత్వమును' నాయాజమాన్యముక్రింద నడుప నెంచితిననియు మీరు తలచి, తన్మూలమున నిట్టి నిశ్చయము చేసి రని విని చాల విషాదము నొందితిని.

"పంచాయితీబోర్డును స్థాపింపవలయు నని నేను గోరినది నిజమే. కాని యది న్యాయ మని చెప్పితినిగాని, దానిని స్థాపించితీరవలయునని నేనెన్నడును పట్టు పట్ట లేదు. పైగా నాకు జరుగవలసిన న్యాయము జరుగుచున్నంతవరకు నేను సంతృప్తుడనై యుందునని మీతో స్పష్టముగ జెప్పియుంటిని. ఇది పంచాయతీబోర్డును స్థాపించి తీరవలయు నని పట్టుదల కాదని మీరును నంగీకరింతురు.

"ఇక 'మారట ప్రభుత్వము' విషయములో మీ రొకతరి నా విషయమై చమత్కారముగ నిరూపించినప్పుడు, నేను జిల్లాయధికారి నగుకొనుట లేదనియు, నేనును

నాసహచరులును వాలంటరీప త్రికల్లగను, గా మోద్యోగులుగను బనిచేయుచుంటిమనియు, నిదర్శనను గవర్నమెంటువారి జిల్లాయధికారుల యనుమతితోడనే చేసితి మనియు తెలియజెప్పియుంటిని. దానితో మీకు బుట్టిన దురభిప్రాయము తొలగిపోవు నను కొంటిని. అందుచేత సత్యదూరములైన యీ యభిప్రాయమువలన మీ నిశ్చయము గావించుకొన్నచో నేను చాల విచారము నొందెదను.

"కాని యిప్పుడీ లేఖ వ్రాయుట, యిక నింతతో మీరు ఢిల్లీయొడంబడిక యంతమైన ట్లెంచుచున్నారా, లేక కాంగ్రెసువారు రౌండు టేబిలుసభయందు బాల్గొనకపోయినను నొడంబడిక కేమియు భంగములేదని యెంచుచున్నారా? యను విషయమును దెలిసికొనుటకే ఈనాడు వర్కింగుకమిటీవా రీతీర్మానమును గావించిరి:

'ఆగష్టు ౧౩ తేదీని వర్కింగుకమిటీవా రిక కాంగ్రెసు రౌండు టేబిలుసభ యందు బాల్గొనజాల దని కావించిన తీర్మానమునుబట్టి ఢిల్లీఒడంబడిక యంతమొందిన ట్లెంచరాదని యీ కమిటీవారు తెలియజేయుచున్నారు. కావున కాంగ్రెసుసంఘ ములును, కాంగ్రెసుసభ్యులునుగూడ వర్కింగుకమిటీవారు ప్రత్యేకముగ నాజ్ఞచేయు వరకును కాంగ్రెసుకు సంబంధించినంతమట్టుకు ఢిల్లీయొడంబడికషరతులను బూర్తిగా నెరవేర్చుచుండవలయు నని యీ కమిటీవారు హెచ్చరించుచున్నారు.'

"దీనివలన నీ సంకటస్థితిలో గవర్నమెంటువారిని బాధింపవలయునను కోరిక కాంగ్రెసువారికి లేదని మీరు తెలిసికొనవచ్చును. కాంగ్రెసువా రింకను నొడంబడి కను నిలుపుటకే సంసిద్ధులైయున్నారు. కాని దీనికి రాష్ట్రీయప్రభుత్వములవారుగూడ ననుకూల పరిస్థితుల గల్పింపవలయును.

"కాని యీ యానుకూల్యము వారియొద్ద నేమాత్రమును గనబడుటలేదని నేను మీకు వ్రాసిన లేఖలయందును, మన సంభాషణములందును దెలిపియే యున్నాను. దేశములో నాలుగుమూలలనుండియు కాంగ్రెసుప్రచారకులను ద్రొక్కివైచి, కాంగ్రెసుకార్యక్రమమును భగ్నముచేయుటకు తగిన చర్యలను గవర్నమెంటువారు జరుపుచున్నారని వార్తలు వచ్చుచున్నవి."

గాంధిజీ యీ యుత్తరమునకు త్వరగా సమాధానము వ్రాయింపు డనియు, తన యారోపణలకు త్వరలో బరిహారము చేయింపుడనియు, లేనియెడల కాంగ్రెసుప్రచా రకు లాత్మసంరక్షణము చేసికొనుట కనుమతినీయు డని త్వరపెట్టుచున్నారనియు వ్రాసి లేఖను ముగించెను. గవర్నమెంటువారికిని, ప్రజలకును నడుమ కాంగ్రెసు మధ్యవర్తిగా నుండుటకు గవర్నమెంటువా రొప్పుకొనకపోయినను గాంధిగారు గణింపలేదు. గవర్నమెంటును బాధింపవలయుననిగాని, వంచననేయవలయుననిగాని

యాయునను లేదు. కాని సివిలుసర్వీసులవారి విరోధభావముమూలముగా నొడంబడి కను గవర్నమెంటువారే భగ్నము చేయుచుండిరనుటమాత్రము తేటతెల్లముగా నుం డెను. ప్రధానాప్రధానములను గాంధీ చక్కగా గ్రహించుచుండెను. సివిలు సర్వీసుల వారు భారతదేశమునకు సంపూర్ణస్వాతంత్ర్యమును వహించు హక్కుగలదని యంగీ కరించుట లేదని యాయన గ్రహించెను. 'కావున సివిలుసర్వీసులవా రెల్లరును నీ హక్కు నంగీకరించువరకును కాంగ్రెసు సంపూర్ణస్వాతంత్ర్యమునకై రాయబార ములు జరుపుట కవకాశము లేదు. ఎంత కష్టనష్టములు వచ్చినను కాంగ్రె సింకను త్యాగపథము ననుసరింపవలయును. బార్డోలీవ్యవహారము నా కగ్నిపరీక్షయైనది. అది సివిలియనుల చిత్తవృత్తి నెరుగుట కుద్దిష్టమైనది. దాని నా దృష్టితో బరిశీలించినచో నది యల్పవిషయము కాదని తెలియును.' అని గాంధీ చెప్పెను. గాంధిజీ 'చార్జి షీటు'ను బ్రచురించుటకు సిమ్లానుండి ఆగస్టు ౧౪ తేదీన వచ్చిన తంతివార్తచే నధి కారము పొందియున్నను, దానిని ప్రచురించుట. గవర్నమెంటువారిపై సవాలు వేయుటవంటిదని కొంద రభిప్రాయపడిరి. డాక్టరు సప్రూజయకరులు ముల్తానునాక మీదినుండి యట్లే తంతివార్త పంపిరి. దానివలన తాము వైస్రాయితోడను, స్టేటు సెక్రెటరీతోడను శాంతిరాయబారములు జరుపుట కభ్యంతరము కలిగె నని యభి ప్రాయపడిరి. గాంధీగారి యుత్తరమునకు వైస్రాయిగారు పంపిన సమాధాన మాశా జనకముగ లేకుండెను. ఆయన యీ యైదుమాసములనుండియు కాంగ్రెసువారి చర్య లన్నియు, నందును ముఖ్యముగ యు. పి. యందును, పరిహద్దురాష్ట్రమునందును కాంగ్రెసువారిచేతలు శాంతికి మూలచ్ఛేదకములై, ఢిల్లీయొడంబడికను సంపూర్ణముగా భంజించుచున్న వనెను. కాంగ్రెసువారు రెండుటేబిలుసభలో బాల్గొనకపోవుట యొడంబడికయొక్క ప్రధానలక్ష్యమునే భంజించుట యనిరి. కాని గవర్నమెంటు వా రప్పటప్పటికి బుట్టు ప్రత్యేకసందర్భములకు దగినదానికిమించి యెట్టి ప్రత్యేకచర్య లను నైకొనరని వైస్రాయిగారు వాగ్దానముచేసిరి. గాంధీగారుగూడ నొడంబడికను నిలువబెట్టు వైస్రాయిగారి నిశ్చయమును బరమాదరముతో స్వీకరించి, కాంగ్రెసు పక్ష్యు లెల్లరును మిక్కిలి జాగరూకులై యొడంబడికను మన్నింపవలయునని ప్రకటిం చిరి. ఆయన కొన్నివిషయములను గురించి స్వయముగా మాట్లాడుట కనుజ్ఞనీయుడని వైస్రాయిగారికి తంతివార్త నంపెను. వైస్రాయిగారు నందుల కంగీకరించిరి. అంత గాంధీజీ వల్లభాయిపటేలు, జవహరలాలు, ఆగస్టు ౧౫ తేదీనే ముల్తానునాకమీద లండనుకు దూసికొనిపోక నిలచిన మిత్రుడైన సర్ ప్రభాశంకరు పట్టానిగారును వైస్రాయిగారిని సందర్శించిరి. వైస్రాయిగారు తమ కార్యనిర్వాహకవర్గమును సమా వేశపరచిరి. చిట్టచివరకు గొన్ని యడ్డంకులు పుట్టి గిట్టినతరువాత వ్యవహారము

కుదుటబడెను. వెంటనే గాంధిగారు ఆగస్టు ౨౯ తేదీని లండనుకు బ్రయాణమగుటకై బొంబాయి వచ్చుటకు సిమ్లానుండి స్పెషలురైలుబండిమీద బయలుదేరిరి.

ఈ విధముగా గాంధిగారికిని, ఇండియాగవర్నమెంటు ప్రతినిధులకును సిమ్లాలో జరిగిన సంభాషణముల ఫలితముగా గాంధీజీ కాంగ్రెసుతరఫున రౌండు టేబిలు సభయందు బాల్గొనవలయునని యేర్పాటు చేయబడెను. అట్లే ఆగస్టు ౨౯ తేదీని గాంధిజీ బొంబాయినుండి నౌకయెక్కి లండనుకు ప్రయాణమైరి.

* * * * * *

ఈ యొడంబడికను ఇండియాగవర్నమెంటువారు ప్రచురించిరి. దానితో బాటు గాంధిగారు ఇండియాగవర్నమెంటు హోముడిపార్టుమెంటు కార్యదర్శియైన ఎమర్సనుగారికి వ్రాసినలేఖను, ఎమర్సనుగారు గాంధిజీకి వ్రాసినలేఖనుగూడ ప్రచురించిరి. ఆలేఖలుగూడ నా యొడంబడికలోని భాగములే. ఆ ప్రకటనమును, లేఖలను నిట నుదాహరించుచున్నాము:

## గవర్నమెంటు ప్రకటనము

౧. వైస్రాయిగారికిని, గాంధిగారికిని జరిగిన సంభాషణములకు ఫలితము రౌండుటేబిలుసభలో గాంధీగారు కాంగ్రెసుప్రతినిధులై పాల్గొందురు.

౨. ౧౯౩౧ మార్చి ౫ వ తేదీని గావించుకొనినయొడంబడిక సజీవముగనేయుం డును. ఈ యొడంబడికవిషయములో దోషములు జరిగినవని నిర్ధారణ చేయబడినచో ఇండియాగవర్నమెంటువారును, రాష్ట్రప్రభుత్వములును వానిని దిద్దుబాటుచేసి, యా విషయమై యెవ్వరు తెలియజేసినను శ్రద్ధతీసికొని దానియందలి షరతులన్నింటిని జాగ్రత్తగా బాలింపగలరు. కాంగ్రెసువారుగూడ ఒడంబడికషరతులను సక్రమముగ బాలింపగలరు.

3. సూరతుజిల్లాలో పన్నుల వసూళ్ల విషయములో బార్డోలీ తాలూకా యందును, వలాదు మహాలునందును ౧౯౩౧ జూలై నెలలో రివిన్యూ ఉద్యోగులు పోలీసువారితోగూడి కొన్ని యూళ్లకు బోయి పోలీసువారిదౌర్జన్యముమూలముగా రయితుల శక్తికిమించిన పన్నులను, బార్డోలీతాలూకాలో దక్కిన యూళ్లయందు జరిపిన పద్ధతిగా గాక, వసూలుచేసి యుండిరా యనునది వివాదాంశమైయున్నది. అందుచేత ఇండియాగవర్నమెంటువారు బొంబాయిగవర్నమెంటువారితో సంప్రతించి, వారి సంపూర్ణానుమతితో నీ వ్యవహారమును గూర్చి యీ క్రింద చేర్కొనబడిన యంశముల ననుసరించి విచారణ జరుపబడవలయు నని నిశ్చయించినారు. ఇందలి విచారణాంశము లివి:

“బార్డోలీతాలూకాలోని కొన్ని యూళ్లయందలి ఖాతేదారులు పోలీసువారి దౌర్జన్యమువలన ౧౯౩౧ మార్చి ౫ తేదీ తరువాత నాతాలూకాలోనే కొన్ని యూళ్లయందు పోలీసువారి సహాయములేకుండ జేయబడిన వసూళ్ల పద్ధతి నవలంబించినయెడల చెల్లింపవలసియుండు మొత్తముకంటె నెక్కువమొత్త మిచ్చునట్లు నిర్బంధింపబడిరా? అట్లు వసూలు చేయబడియున్నచో నామొత్త మెంత? ఈ విషయములలో దేనిని గురించియైనను సాక్ష్యమును బొందవచ్చును.”

ఈ విచారణ జరుపుటకై యిండియా గవర్నమెంటువారు నాసిక్ జిల్లాకలెక్టరు ఆర్. సి. గార్డనుగారిని నియమించిరి.

౪. కాంగ్రెసువా రిదివరకు గావించిన యారోపణముల గూర్చి యిండియా గవర్నమెంటువారును, రాష్ట్రప్రభుత్వములవారు నిట్టివిచారణ చేయింపగోరుటలేదు.

౫. ఈ యొడంబడికషరతులకు సంబంధించని యితరములైన యారోపణలను కాంగ్రెసువారు చేసినయెడల నట్టివి మామూలు పరిపాలనతంత్రము ననుసరించి వ్యవహరింపబడును. వానిని గూర్చికూడ విచారణ చేయవలసియున్నచో, నట్టిదాని కట్టి స్వరూప ముండవలసినదియు దానికి సంబంధించిన రాష్ట్రప్రభుత్వములవారు మామూలు పద్ధతిగా నిర్ణయింతురు.

గాంధిజీ ఎమర్సనుగారికి వ్రాసినలేఖ — సిమ్లా ౧౯౩౧ ఆగస్టు ౨౭:

“ప్రియమైన ఎమర్సనుగారికి

మీరు క్రొత్తచిత్తును వ్రాసి దానితోబంపిన యుత్తరమునకు నావందనములు. సర్ కవాస్జీగారు మీరు సూచించిన మార్పులను నాకు తెలియజేసినారు. నాసహచరులును, నేనును మీ చిత్తును జాగ్రత్తతో బరిశీలించితిమి. ఈ చెప్పబోవునంశములలో దక్క మా కది యంగీకార్యముగనే యున్నది:

“౪వ పేరాలో గవర్నమెంటువారు సూచించిన యభిప్రాయమును కాంగ్రెసు తరఫున నే నంగీకరింపజాలకున్నాను. ఏల యన నొడంబడికకు బట్టినదోషమునకు దగిన పరిహారము చేయనిసందర్భములలో ప్రస్తుతము ఢిల్లీయొడంబడికప్రకారము సత్యాగ్రహము నిలుపబడినదిగాన విచారణచేయించుట యత్యావశ్యకమై యుండును. కాని యిండియాగవర్నమెంటువారును, రాష్ట్రప్రభుత్వములును విచారణ కంగీకరింపజాలనిచో నీసూత్రము నిలిచియుండుటకు నా కభ్యంతరము లేదు. దానికి ఫలిత మే మగుననగా, నిదివరలో నిరూపింపబడిన యంశములను విచారణ చేయింపవలయు నని కాంగ్రెసు నొక్కి యడుగకపోయినను దురదృష్టవశమున నేదేనిఆపదపుట్టి దానికై

విచారణచేయించుట కవకాశము లేనందున కాంగ్రెసువా రాత్మరక్షణము గావించు కొనుటకు ప్రత్యక్షప్రతిక్రియాకలాపము సాగింపవలసివచ్చినచో సత్యాగ్రహము విరమింపబడినను నట్టిపద్ధతి నవలంబించుటకు కాంగ్రెసువారికి స్వేచ్ఛ నొసగవలయును.

"కాని సాధ్యమైనంతవరకు ప్రత్యక్షప్రతిక్రియాతంత్రముపొంత బోక చర్చలు విశ్వాసపూర్వక హేతువాదములవంటి సాధనములచేతనే కోరికలను దీర్చుకొనుటకే కాంగ్రెసువారు ప్రయత్నము చేయగలరని నేనిప్పుడు గవర్నమెంటువారికి వాగ్దానముచేయ నవసరములేదు. ముందుముందు దురభిప్రాయములు పుట్టకుండుటకును, కాంగ్రెసు విశ్వాసద్రోహము చేసిన దనుసపవాదము రాకుండుటకును కాంగ్రెసువారిస్థితి నిక్కడ జెప్పవలసివచ్చినది. ఈ చర్చలు సఫలము లయ్యోనేని యీ యుత్తరమును, దీనికి మీ రిచ్చు సమాధానమును గవర్నమెంటువారిప్రచురణముతో గలిపి ప్రకటింతురని విశ్వసించుచున్నాను.

ఇట్లు
ఎమ్. కె. గాంధి"

ఇండియాగవర్నమెంటు, హోముడిపార్టుమెంటు, సిమ్లా, ౧౯౩౧ ఆగస్టు ౨౩.

"ప్రియమైన గాంధిగారికి

ఈనాటి మీలేఖకు వందనములు. అందు మీరు కొన్నియభిప్రాయములను సూచించుచు, చిత్తుప్రకటనము నంగీకరించియున్నారు. ఇదివరకు మీరు గావించిన యారోపణలవిషయమై విచారణ చేయింపవలయునని కాంగ్రెసువారు పట్టుపట్ట రనునంశమును గవర్నరుజెనరలు ఇన్ కౌన్సిలువారు గుర్తించినారు. కాంగ్రెసువారు ప్రత్యక్ష ప్రతిక్రియాతంత్రమును బరిత్యజించి, చర్చలు, విశ్వాసపూర్వక హేతువాదములవంటి సాధనలతో కార్యసాఫల్యమునకు బ్రయత్నింతురని వాగ్దానము చేయుచు మున్ముందు కాంగ్రెసువారు జరుపవలసియుండు చర్యలనుగురించి చెప్పియున్నారు. గవర్నరు జెనరలు ఇన్ కౌన్సిలువారుగూడ కాంగ్రెసు ప్రత్యక్ష ప్రతిక్రియాతంత్రమునకు దిగదనియే మీతోబాటు విశ్వసించుచున్నారు. ఇక గవర్నమెంటువారి యభిప్రాయముకొరకు మీకు ఆగస్టు ౧౯ తేదీ పైప్రాయిగారు వ్రాసిన లేఖను జూడవలయునని కోరుచున్నాను. గవర్నమెంటువారి ప్రచురణమును, ఈనాటి మీయుత్తరమును, నా యీ సమాధానమును గలిపి ప్రచురింపబడును.

ఇట్లు
హెచ్. డబ్లియు. ఎమర్సను'

బార్డోలీయందు దోషవిచారణ జరుగవలసియుండెనని గుర్తించుకొనవలయును. మిగిలిన దోషము లన్నిటికిని పరిహారము లేనియెడల ఢిల్లీయొడంబడిక యున్నను ఆత్మరక్షణార్థమై ప్రతిక్రియాతంత్రము నవలంబించుహక్కు కాంగ్రెసువారికి గల దని నిర్ధారణ చేయబడినది. ముందు ముందు రాబోవు దోషములకు విచారణ యుండ వచ్చును, లేకపోవచ్చును. విచారణ లేక పరిహారమును లేకయున్న సందర్భములలో కాంగ్రెసువా రిష్టమైనచో ప్రజల హక్కులను రక్షించుటకు ప్రతిక్రియాతంత్రము నవలంబింపవచ్చును.

అయినను కాంగ్రెసుసంఘములును, కాంగ్రెసుసభ్యులును ఢిల్లీ యొడంబడిక యింకను సజీవమై యున్నదని మనస్సులో నుంచుకొని, కాంగ్రెసుసభాధ్యక్షునికి దెలియకుండ తమంతట తాము దానిమరతుల నెవ్విధముగను భంగింపరాదు. గవర్న మెంటువారియందుగాని, వారియుద్యోగులయందుగాని దోషమేదేని గన్పడినచో దానిని శాంతియుతముగ హేతువాదములచేత దీర్ప బ్రయత్నింపవలయును. ఈ ప్రయత్నములు విఫలములైనచోట కర్తవ్యమునుగూర్చి కాంగ్రెసుప్రెసిడెంటుసల హాను బుచ్చుకొనవలయును.

ప్రస్తుత మున్నదోషములు కొన్నిటిని గాంధిమహాత్ముడు గవర్నమెంటువారికి బంపిన ' ఛార్జిషీటు ' లో చేర్చెను. వానికి గవర్నమెంటువారు సమాధానముల బంపిరి. కాంగ్రెసుసంఘములవారెల్లరును ఈదోషములను, వానిసమాధానములను జాగ్ర త్తగా బరిశీలించి వానిపై మరల దమ యభిప్రాయములను వ్రాసి యహమ్మదాబాదు ఆల్ ఇండియా కాంగ్రెసుకమిటీకి బంపవలయు ననిరి. ఇంకను క్రొత్తదోషము లున్నచో వానినిగూడ ద్వరగా తెలియజేయవలయు ననిరి.

గాంధిజీ లండనుకు బ్రయాణమై వెళ్లెనుగాని అందు విజయము లభించునసెడి యాశమాత్ర మాయనకు లేకుండెను. అయినను రాష్ట్రప్రభుత్వములు, సివిలు సర్వీసు వారు, ఆంగ్లేయవ్యాపారులు కాంగ్రెసురాయబారము సఫలీకృత మగుటకై కాంగ్రె సుకు దోడ్పడుదు రని యాయన యాశించెను. గాంధిగారును, కాంగ్రెసుప్రెసిడెం టును గవర్నమెంటువారితో సిమ్లానగరమున ఆగస్టు ౨౭ తేదీని క్రొత్తగా చేసికొన్న యొడంబడికను కాంగ్రెసువర్కింగుకమిటీవారు ౧౯౩౧ సెప్టెంబరు ౧౧ తేదీని జరి గిన సమావేశములో నామోదించిరి. వర్కింగుకమిటీవారి యీ సమావేశములో మరి యొక ముఖ్యవిషయమునుగూర్చి తీర్మానించిరి. ఇండియను బొగ్గగనులవారు బట్ట మిల్లులవలెనే కాంగ్రెసుతో నొడంబడిక చేసికొని ప్రజల జాతీయోద్యమమునకు సాను భూతి జూపుచు, వారిపెట్టుబడిలో ౧౦౦ కి ౭౫ పాళ్లు కేవలము భారతదేశప్రధనమై

డైరెక్టరు లందరున్ను భారతీయులై వచో నీబొగ్గుగనుల నభిమానించవలయునని కాంగ్రెసు వారు దేశములోని పారిశ్రామికసంస్థల కన్నిటికిని, ముఖ్యముగా బట్టలమిల్లులకును రికమెండు చేయుదురు. మానేజింగు ఏజెంటుగారి ఫరములో విదేశీయు లెవ్వరు నుండ రాదు. వారు బొగ్గుఫరలను సమప్రమాణమునబెట్టి మంచిసరకునమ్ముచు స్వదేశీప్రచార మునకు దోడ్పడవలయును. వారి యజమానులు జాతీయోద్యమమునకు విరుద్ధమగు ప్రచారమును చేయరాదు. ఏవో ప్రత్యేక కారణము లుండిన దక్క భారతీయులనే యుద్యోగులుగా నియమింపవలయును. భీమా, బ్యాంకింగు, ఎగుమతి దిగుమతు లన్నియు దేశీయములైన కంపెనీల ద్వారానే జరుపుకొనవలయును. ఇట్లే ఆడిటర్లు న్యాయవాదులు, నౌకలయేజెంటులు, బ్రోకర్లు, కంట్రాక్టర్లు నందరును భార తీయులై యుండవలయును. వ్యాపారముకొరకు గొను వస్తువు లన్నియు స్వదేశీ సరకులే కావలయును. అధికారవర్గమువారు స్వదేశీబట్టలను ధరించవలయును. గనుల కూలీలకు తగిన వేతనములు, నౌకరీవసతులు మున్నగునవి సముచితముగా నుండ వలయును. గనులయొక్క జమ ఖర్చు లెక్కలను ప్రతిసంవత్సరము కాంగ్రెసుకు బంపుచుండవలయును.

అక్టోబరు, నవంబరు మాసములయందు భారతదేశమునందును, ఇంగ్లాండు నందును జరిగిన మహోదంతములను దెలిసికొనుటకు ముందు గాంధీజీప్రయాణమును గూర్చి కొంత చెప్పకొందము. గాంధీజీతో మహాదేవదేశాయి, దేవదాసుగాంధీ, ప్యారీలాలు, మీరాబెనుగా ర్లుండిరి. శ్రీమతి సరోజినీదేవి యాయనతోగూడ నుండెను. వారిని తీసికొని వెళ్లనిచ్చిన సామగ్రి మిక్కిలి స్వల్పము. ప్రయాణమునకు ముం దేమియు వ్యవధి లేకపోవుటవలనను, ప్రయాణము జరుగునో, జరుగదో యసలు తెలియకపోవుటవలననే సామగ్రి చాల స్వల్పమైయుండెను. కాని గాంధీజీ కోర చూపులతో అది మరింత స్వల్పమై పోయెను. వారికి ఏడెనులో మనఃపూర్వకమగు స్వాగత మొసగబడెను. అచ్చటి యరబ్బులును, హిందువులునుగూడ గలసి, కొంత కష్టముమీద నొక వినతిపత్రమును సమర్పించిరి. రెసిడెంటు సభావేదిక యొద్ద భారత జాతీయపతాకను గట్టనీయడయ్యెను. పాపము వా రేమియు తోచక యూరకుండిరి. తుదకు గాంధీజీయే యాగ్రంథిని విడదీసివై చెను. గాంధీజీ యాహ్వానసంఘాధ్యక్షుడైన ఫ్రమోజుకవాస్జీ దిన్షాగారిని బిలిచి తా నిట్టి పరిస్థితులలో వినతిపత్రమును స్వీకరింప జాల ననియు, గవర్నమెంటుకును, కాంగ్రెసుకును నొడంబడిక జరిగినది గావున గవర్నమెంటువారు పతాక కభ్యంతర పెట్టరా దనియు రెసిడెంటుగారికి గబురుచేయు మని చెప్పెను. ఈవాదము వచ్చి, రెసిడెం టనుమతింపగా జాతీయపతాక నెత్తిన చోట గాంధీజీ ప్రజ లిచ్చిన వినతిపత్రమును స్వీకరించెను

ఏడెనువాసులు ౩౭౮ గినీలు సమర్పించిరి. ఈ బహుమానమును, వారి వినతి పత్రమును నభినందించుచు గాంధీజీ యిట్లుపన్యసించెను:

"మీరు నా కింత గౌరవము చేసినందులకు మీ కెల్లరకును వందనములు. ఈగౌరవము నాకుగాని, నాసహచరులకుగాని యుద్దేశింపబడినది కాదని యెరుగుదును. ఇది కాంగ్రెసుకు గావించిన గౌరవము. ఆకాంగ్రెసుకు నేను రౌండుటేబిలు సభలో ప్రతినిధిగా బోవుచున్నాను. జాతీయపతాకవిషయమున మీ కార్యక్రమములో నభ్యంతరము కలిగెనని వినియుంటిని. భారతీయుల సమావేశములో, నందును ప్రజానాయకు లాహ్వానింపబడినచోట జాతీయపతాక లేకుండుట నే నూహింపజాలను. జాతీయపతాకగౌరవమును రక్షించుటకై యెందరో లాటీదెబ్బలు తినిరనియు, బలువురు ప్రాణములను గోల్పోయి రనియు మీ రెరుగుదురు. జాతీయపతాకను గౌరవింపకుండ మీ రే ప్రజానాయకుని గౌరవింపజాలరు. ఇప్పుడు కాంగ్రెసుకును, గవర్నమెంటుకును నొడంబడిక జరిగినది. కాంగ్రె సిప్పుడు విరోధివర్గము కాదు, మిత్రవర్గమే. కావున జాతీయపతాక నెత్తనిచ్చుటతో జాలదు; కాంగ్రెసునాయకుల నాహ్వానించినప్పుడు దానికి గౌరవస్థానము నొసగవలయును."

నౌకమీదగూడ గాంధీజీ యాశ్రమమందువలెనే నిత్యప్రార్థనలు, రాటము, పిల్లలతో నాటలుగా ప్రొద్దుపుచ్చుచుండెను. గాంధీజీ మంచి వెరగాడు. ఆయన యొకరోజు సాయంకాలము నౌకమీదనున్న యొకమిత్రునకు నేడువందల రూపాయల ఖరీదుగల యొక సేలువ నేడువేల కమ్మితినని చెప్పి మిత్రవర్గ మెల్లరకును బరమాశ్చర్యము కలుగజేసెను. మాడెంజగ్లులు పాషాగారును, వాఫిడ్ పక్షనాయకుడైన సహన్ పాషాగారును గాంధిజీ కభినందనముల బంపిరి. జగ్లులుపాషాగారి యభివందనము హృదయస్ఫూర్తిగలిగియుండెను. నహస్ పాషాగారి యభినందనమునందలి యాత్మీయత యది చదివిననే బోధపడగలదు. దాని నీక్రింద నుదాహరించుచున్నాము:

"మహానాయకుడు శ్రీ గాంధిగారికి, రాజపుటానా

"నేడు స్వాతంత్ర్యమునకై పోరాడుచున్న ఈజిప్టుదేశముతరపున మావలెనే స్వాతంత్ర్యసంగ్రామమున నిమగ్నమైయున్న భారతదేశమునకు నాయకులైన మీకు స్వాగత మొసగుచు, మీరు సుఖప్రయాణము చేసి క్షేమముగా స్వదేశమునకు దిరిగి పోవుదురు గాక యని హృదయపూర్వకముగ గోరుచున్నాను. మీ యన్వేషణకు దగిన ఫలము లభించునుగాక! మీ మహత్తరమైన యాత్మనిశ్చయమునకు దగిన మహాఫలము మీకు లభించునుగాక యని పరమేశ్వరుని ప్రార్థించెదను. మీరు తిరిగీ స్వదేశమునకు బోవుతరి మీదర్శనము చేసికొందును. అప్పుడు ఫెరోలజన్మస్థానమైన యీ దేశమునకు

మీదర్శనభాగ్యము లభింపకలయును. అప్పుడు మీ ప్రయాణమున కట్టిఫలము సంధి ఇంచినను మా వాఫిడ్ పక్షమువారును, ఈజిప్టుదేశీయులును మీ దేశక్షేమము నర్థించి మీరుచేయుచున్న ఘనకార్యములను, మీధర్మముల నాచరించుటకై మీరొనర్చినమహా త్యాగముల నభినందించి నతులొనర్చుట కవకాశము కలుగగలదు. పరమేశ్వరుడు మీకు చిరాయువును ప్రసాదించునుగాక పరమేశ్వరుడు మీ ప్రయత్నములకు నిత్యమైన విజయమును జేకూర్చుగాక! సూయజువద్దను, పోర్టుసెడ్డువద్దనుగూడ మా ప్రతినిధులు మాస్వాగతమును తెలియజేయుటకు మిమ్ము దర్శింతురు.

ముస్తఫా ఎల్ నహాస్ పాషా,
వాఫిడ్ ప్రెసిడెంటు."

పోర్టుసెడ్డువద్ద ఈజిప్టుప్రతినిధులు గాంధిని జూచుట కనుమతి యొసగబడ లేదు. కాని భారతీయప్రతినిధులు కయిరోలో గాంధిజీని దర్శింపగలిగిరి. నహాస్ పాషాగారి ప్రతినిధి యొక్కడు మాత్రము మిక్కిలి కష్టముతో నాయనదర్శనము చేసికొనగలెను.

మార్సెల్సునగరమును సమీపించుచుండగా గాంధీజీ తనబడ్జెట్టును తయారు చేసెను. అది యొక్కనికి గాదు, చాలమందికి.

మహాత్ముడు మార్సెల్సు చేరగానే రోమను రోలండుగారి సోదరి మెడిలైను రోలండుగారు వచ్చి హృదయపూర్వకమైన స్వాగత మొసగెను. రోమనురోలండు గారు వ్యాధిగ్రస్తు లగుటవలన రాలేకపోయిరి. మెడిలైను రోలండుగారితో గూడ ప్రైవటుదంపతులు వచ్చిరి. ప్రైవటుగారు ౧౯౨౨-౨౩ సం. ఉద్యమములో ఇండియా ప్రభుత్వమువారిచే 'ఊరుపేరులేని బండిపంతు' లని వర్ణింపబడుటవలన ప్రశస్తి చెందిన స్విజర్లండు దేశపండితుడు. కొందరు ఫ్రెంచివిద్యార్థులుగూడ వచ్చి గాంధీజీకి స్వాగత మొసగిరి. గాంధీజీలండనులో ఈస్టెండునందు మురియేలు లిస్టరు కన్యయొక్క గృహమున, నిత్యమును గొణగొణ లాడుచుండు హోటలుల మధ్యను, బావురు మనుచు నసహ్యముగానుండు గృహముల మధ్యనున్న కింగ్సులేహాలులో బస చేసెను. లండనులో నెంతమందియో గాంధీజీ నాహ్వానించుటకు గని పెట్టుకొని యుండిరి. ఆదివారములనాడు వచ్చి శాంతముగా పల్లెటూళ్లలో గాలము గడపికొనుటకు ఎందరో పిలిచిరి. ఒకమిత్రుడు గాంధీజీ యూస్టనురోడ్డు మీదనున్న ఫ్రెండ్సు మీటింగు భవనమునందిచ్చిన యుపన్యాసమును కింగ్సులే హాలునుండి న్యూయార్కు మహాజనుల కిచ్చిన 'బ్రాడ్కాస్టు' సందేశమును చదివి, యేబది పౌండులకు చెక్కు పంపించెను.

గాంధీజీ లండనులో వెస్టెండును పరిత్యజించి ఈస్టెండునందు బస చేసెను. బ్రిటిషు గవర్నమెంటువారి యాతిథ్యమును బరిహరించి, మురియేల్ లీస్టరు కన్న యిచ్చిన యాతిథ్యమును స్వీకరించెను. ధనవంతుల సాంగత్యము మాని పేదజనుల సంగడమున వసించెను. 'గాంధి బాబాయి' కొయ్య పాంకోళ్లతో, దుప్పటి కప్పుకొని, ఈస్టెండులోని బాలు రెల్లరకును సుపరిచితుడయ్యెను. ప్రతిరోజు ప్రొద్దుటిపూట ఈ స్టెండు బాలురెల్లరు నాయన చుట్టును జేరుచుండిరి. గాంధిజీ–ఆయన సాయం ప్రార్థనలు–ఇటు లాంకషైరు కూలివాండ్రకును, నటు బిషప్పులు ఆర్చిబిషప్పులకును నతిథియైన గాంధి–గాంధిజీ మామూలుదుస్తులతో సార్వభౌముని సందర్శించుట – ఇవి యన్నియు నీగ్రంథమున ప్రస్తుతములు గాకపోయినను నివి భారతీయులకు నిత్యోత్సాహ వర్ధకములైన యుదంతములు. భారతీయులకు జగజ్జీవన మంతయు నేకఖండమే. దానిని వేరువేరు ఖండములుగా జేయుటకు వలనుపడదు.

గాంధిజీ రౌండు టేబిలుసభయం దెట్లు వర్తించినదియు నిప్పుడు మనము తెలిసికొనవలయును. ఫెడరలు నిర్మాణ సంఘములో నాయన యొసంగిన యుపన్యాసము మొత్తముమీద రౌండు టేబిలుసభలో నాయన యిచ్చిన యుపన్యాసము లన్నిటికిని జక్కని పీఠికాప్రాయముగ నున్నది. ఆయన కాంగ్రెసుచరిత్రము, దాని జన్మము, దాని దృక్పథము, దానిపద్ధతులు, దాని లక్ష్యమును వివరించుచు, సంక్షిప్తమయ్యు సమగ్రమగు చరిత్రమును సంగ్రహముగా తెలియజేసెను. దానినే యీ గ్రంథమునకు పీఠికగా నమర్చితిమి. కాంగ్రెసుజన్మమునకు గారకుడై దానిని బోషించి పెంచిన ఏ. ఓ. హ్యూముదొరగారిని బ్రశంసించెను. కాంగ్రెసుకును గవర్నమెంటుకును, కాంగ్రెసుకును దక్కిన రాజకీయపక్షములకును గల భేదములను వెల్లడిచేసెను. కరాచీ తీర్మానమును చదివి దాని యాంతర్యమును గొలదిగా వివరించెను. సెంట్రలు బాధ్యతయు ఫెడరేషనును భారతక్షేమరక్షణలు నను నీ మూడుప్రధానాంగములచే జిత్రితమై యున్నకాంగ్రెసు ఆదర్శమునకు ప్రధానామాత్యుని ప్రకటనము ఏవిధముగ జాలక యున్నదో ప్రకటనముగా దెలియజేసెను. ఇప్పుడు కావలసినది వట్టి రాజ్యాంగప్రకటనము కాదు. సమానప్రతిపత్తి గలిగి యీరెండు దేశములు భాగస్వాములుగా నుండదగిన వ్యవహారప్రణాళికను నిర్మింపవలయు ననెను. తాను పూర్వము బ్రిటిషు పౌరుడై యుండినస్థితికిని, నిప్పుడు తిరుగబాటుదారు డైయున్నస్థితికిని బోల్చి చూపించెను. సామ్రాజ్యభావ లక్ష్యమునకును, మిత్రదేశము లాడబడియుండు నొక కామన్వెల్తులక్ష్యమునకును గల భేదమును వివరించెను. ఇది యొక వ్యాపారస్థుడు తన వ్యాపారము నితరుని కప్పగించుటవంటి దనెను. ఇర్వురు భాగస్వాములు విడిపోవునప్పుడు జమాఖర్చు లెక్కలను సరిచూచుకొందు రను సామ్యమును దెచ్చెను

ఇంగ్లాండు కష్టములలో చిక్కుకొని యున్నతరిని బాధించుటకు మేము దొంగ పోటుగాండ్రము కామనెను. ఇంగ్లాండు భారతదేశమును కత్తితో గాక ప్రేమ సూత్రముచే బంధించియుంచినయెడల బ్రిటిషువారి బడ్జెట్టును మేమే సరిపుచ్చి యిత్తుమని వాగ్దానము చేసెను.

మైనారిటీకమిటీయందు మాట్లాడుచు గాంధి కొన్ని సత్యవాక్యముల నాడెను. ఆయాసంఘముల ప్రతినిధులు తమతమ ప్రత్యేకాభిప్రాయములను చేతనైనంత తీవ్రముగా బ్రకటింప బలవంత పెట్టబడుచున్నారని యాయన స్పష్టముగా తెలియజెప్పి, చాలవరకు దాపరిక మావంతయైన లేకుండజేసెను. ఈసాంఘికసమస్య యిచట ప్రధానము కాదు. రాజ్యాంగనిర్మాణమే యిచట నవసరమై యున్నది. ఈ ప్రతినిధుల నెల్లర నారువేలమైళ్ల దూరమునుండి పిలిపించినది సాంఘికసమస్యను బరిష్కరించుటకా యని గాంధిజీ ప్రశ్నించెను. ఈ ప్రతినిధులు తిరిగి స్వదేశమునకు బోవులోపల భారత స్వాతంత్ర్య ప్రతిపాదకమై, సగౌరవమై క్రియానుగుణమైన యొక రాజ్యాంగతంత్రమును నిర్మించి, పార్లమెంటువారి యనుమతికి సమర్పింపగలిగితి మని సంతృప్తి జనింపవలయును. సర్ హ్యూబర్టుకారును, వాని యనుచరులును మైనారిటీలస్కీమును దయారుచేసి సంతృప్తినందుటకు తన కభ్యంతరము లేదని చెప్పుచు నెటు విచారించినను వారు గావించినది శవమును గోసి పరీక్షించుటయే యగునని తెలియజెప్పెను. ఎట్లయినను గవర్నమెంటువారిస్కీము భారతీయు లధికారవర్గముతో బాటధికారమునుబంచుకొనుననదియేగాని బాధ్యతాయుతమైన ప్రభుత్వమును స్థాపించునదికాదు. "వారికి శుభమగుగాక! కాంగ్రెసుకు దానితో నెట్టి జోక్యమును నుండదు. స్వాతంత్ర్యవృక్షము నెన్నటికిని బెరుగనీయని యిట్టిస్కీమున కంగీకరించుటకంటె కాంగ్రెసు మరికొన్ని సంవత్సరములయినను నడవులబట్టి తిరుగుటకు వెనుదీయ" దని గాంధీజీ ప్రకటించెను. మరియు నాయన యిట్లు నుడివెను. "అస్పృశ్యు లనబడు వారినిగూర్చి యొకమాట. తక్కిన సంఘములవారి వాదములు నా కవగత మగుచునే యున్నవి. కాని యస్పృశ్యులతరఫున జేయబడిన వాదము మాత్రము మిక్కిలి క్రూరాతిక్రూరమైన యాఘాతము. ఇది నిత్యమైన మహాప్రాచీరము కాగలదు. అస్పృశ్యులను ప్రత్యేకసంఘముగా విడదీయుట మా కిష్టము లేదు. సిక్కు లట్లు నిత్యముగా నుండవచ్చును. అట్లే మహమ్మదీయులును, క్రైస్తవులునుగూడ విడిపోయి యుండవచ్చును. కాని యస్పృశ్యులు సార్వకాలికముగ నట్లు విడిపోయియుందురా? వారెన్నటికిని నస్పృశ్యులుగనే యుందురా? నేను హిందూమతము నశించుటకైన నంగీకరింతునుగాని యస్పృశ్యతాదోషము నిలిచియుండుటకు మాత్ర మంగీకరింప జాలను. అస్పృశ్యుల రాజకీయహక్కులనుగురించి వాదించెడువారు భారతదేశము

నెరుగరు. భారతదేశములోని సంఘనిర్మాణ మెట్లు జరిగినదియు వారికి దెలియదు. కావున దీని నే నొక్కడనే నిరోధింపవలసియున్నను నా ప్రాణము లర్పించిరైనను దీనిని నిరోధించెదనని చెప్పుచున్నాను." ఈవిషయములో ప్రధానామాత్యుడు మధ్యవర్తిగా నుండవలయు ననుదానికిగూడ గాంధిజీ యభ్యంతరము చెప్పలేదు. కాని యది సిక్కులు, మహమ్మదీయులనుగూర్చి మాత్రమే జరుగవలయును. ఇతరసంఘములకు ప్రత్యేకప్రాతినిధ్య మిచ్చుటకు దా నెన్నడు నంగీకరింపజాలడు. ఈ విషయములో ప్రధానామాత్యుడు నిష్కల్మషముగా నొక ప్రశ్న యడిగెను. "ఇందలి సభ్యులలో ప్రతివారును నీ సాంఘికసమస్యను బరిష్కరింపవలయు నని నన్ను గోరుచు దానికి బద్ధులమై యుండెద మని ప్రమాణముచేయుదురా అది చాల మర్యాదాపూర్వకమైన విషయమే యని నాతలంపు" అని యాయన ప్రశ్నించెను. సాంఘిక సమస్యాపరిష్కారము ౧౯౩౨ జానులో బ్రచురింపబడినప్పు డది నైటుషేపరుతో సమానప్రతిపత్తిగలిగిన ప్రభుత్వమువారి తీర్మానమా, లేక ప్రధానామాత్యునితీర్పా యని వాదము జనించెను. రౌండుటేబిలు సభా ప్రతినిధు లెల్లరును సంతకములుచేసియుండక పోవుటవలన నది తీర్పుగాజాలదు. కావున నది యొకసూచనయే యగునుగాని, యెల్లరును శిరసావహింపవలసినది కాదు.

౧౯౩౧ నవంబరు ౧౮ తేదికి బ్రిటిషుమంత్రివర్గమువారికి రౌండుటేబిలు సమావేశముపై విసుగుపుట్టెను. ప్రధానామాత్యు డుపన్యాసములు పూర్తియైన తరువాత నీకమిటీకి సున్నా చెప్పి రాబోవువారములో ప్లీనరీసమావేశమును జరుప నిశ్చయించినారని శాంకేప్రభువు ప్రకటించెను. బెన్నుగారు దీని కభ్యంతరపెట్టి, యీవిధముగా గవర్నమెంటువారు రౌండుటేబిలుసభను చంపివేయుచున్నారని ప్రకటించెను. సర్ శాయన్యాలుహోరుగారు ప్రస్తుతసందర్భములను బరిశీలించి, యింతటితో నీ యధ్యాయమును ముగించి, ప్రధానామాత్యుడు క్రొత్తగా నియమింపబోవు కార్యతంత్రము ననుసరించుటయే మేలని నిరూపించెను. సైన్యముల వ్యవహారమును గూర్చి చర్చలు జరుగుచుండెను. అందుగూడ బాల్గాని గాంధిజీ కొన్ని సత్యములను వెల్లడించెను. తాను సగౌరవమైన యొడంబడిక చేసికొన నెంచి యింగ్లాండునకు వచ్చెను గావున నవసరమైనచో లండనులో నింకను గొన్నాళ్లుందు నని యాయన తెలియజేసెను. కాంగ్రెసుకు బాధ్యతాయుత పరిపాలనమువలన జనించు బాధ్యతల నన్నిటిని వహింపదగిన సామర్థ్య మున్నది. సైన్యములను, విదేశవ్యవహారములను బూర్తిగా వదలివేసినను కాంగ్రెసు నిర్వహించుకొనగలదు. అవసరమైనచో గొన్నిసర్దుబాటులు ప్రత్యేకముగా జేయవచ్చును. ఇప్పుడు భారతదేశములోనున్న సైన్యము దేశాక్రమణమునకై యుద్దిష్టమైనది. అం దేయేజాతులవా రున్నను వా రెల్లరును మాకు విదేశీయులే యగు

మురు. నేను వారితో మాట్లాడుటకు వీలులేదు. వారు బహిరంగముగా నాతో వ్యవహరించుటకు వీలులేదు. కాంగ్రెసువారిని స్వదేశజన్యులుగా జూడవలయు నని వారికి మొదటినుండియు నేర్పిరి. ఇట్లు వారికిని మాకును మధ్య నొకగోడ కట్టబడినది. బ్రిటిషుసైన్యము భారతదేశములో బ్రిటిషువారి ప్రయోజనములను సాధించుటకును, విదేశీయుల దాడి రాకుండ జేయుటకును, నంతఃకల్లోలముల నడంచుటకును నిలిచి యున్నది. ఆ సైన్యముయొక్క కర్తవ్య మిదియే. కాని వ్యవహారములను తూచినట్లు సరిగా పట్టుటకై బ్రిటిషుసైన్య మున్నది. సైన్యము పూర్తిగా దేశీయులపరము కావలయును. కాని సైన్యములుగాని, ప్రధానసేనాధిపతి కాని, సిక్కులుగాని, రాజపుత్రులు గాని నా యధికారము నంగీకరింపరు. కాని బ్రిటిషుప్రజల సద్భావముతో నా యధికారమును నిర్వహింపగోరుచున్నాను. బ్రిటిషు సైన్యములకుగూడ వారు భారతదేశమునం దున్నది విదేశీయులు దండెత్తి రాకుండ రక్షించుటకుగాని బ్రిటిషు ప్రయోజనములను సాధించుటకు గాదని తెలియజేయవలయును." ఇది యంతయు నా స్వప్నమని గాంధిజీ తెలిపెను. "బ్రిటిషు రాజకీయవేత్తలకును, బ్రిటిషు ప్రజలకును నా యీ స్వప్నమే యొక మహోద్యమ మగునట్లు వారి యంతరంగములను నేను వశము చేసికొనజాలను. ఈ కార్యము సాధింపబడువరకును సైన్యములమీద మాకు సంపూర్ణాధికారము లభింపనేని దానికొరకు నేను ప్రళయమువరకైనను నిరీక్షించుచుందును. భారతీయుల కాత్మరక్షణశక్తి యున్నది. మహమ్మదీయులు, సిక్కులు, రాజపుత్రులు, ఘూర్ఖాలు భారతదేశమును రక్షింపగలరు. రాజపుత్రులు వేలకొలది విజయములచే బ్రసిద్ధికెక్కిన వీరజాతి."

ఇంతకును దీనితత్వ మేమన నాంగ్లేయు లెప్పుడో యొకనాడు తమవిధిని నిర్వర్తింతురని గాంధిజీ యాశయము. "బ్రిటిషువారికి భారతదేశముపై బ్రేమను జనింపజేయవలయును. భారతీయు లీయధికారమును పొందుట కొక శతాబ్దము జరుగవలయు నని బ్రిటిషువారు తలచినచో నాశతాబ్దకాలమును కాంగ్రెసువారు మహత్తరమైన యగ్నిపరీక్షకు లోనుగావలయును. వారీశతాబ్దికాలమును దుఃఖమును,నపనిందను బొందుచు నవసరమైనచో తుపాకిగుండ్లకుగూడ నగ్గము కావలయును." ఆయన రక్షణలనుగురించి మాట్లాడుచు, నవి భారతదేశక్షేమమున కుద్దేశింపబడినవన్నను ఇర్విను ప్రభువు చెప్పినట్లుగా నవి భారతదేశమునకును, ఇంగ్లాండునకుగూడ రక్షకములగునని ప్రకటించెను. "మన ముభయులమును స్వేచ్ఛాపూర్వకమై సమానప్రతిపత్తిగలిగిన వ్యవహారప్రణాళికయందు భాగస్వాముల మగుచున్నప్పుడే రక్షణయు కేవలము భారతదేశమునకుగాని, కేవలము ఇంగ్లాండుకుగాని రక్షకమైయుండజాలదు." ప్లీనరీసమావేశములో ప్రసంగించుచు స్వాతంత్ర్యము చర్చలవలనను,రాయబారములవలనను లభించు

నను మూఢవిశ్వాసము తనకులేదని గాంధీజీ తెలియజెప్పెను. "కాని యిందొక్క విషయమును నిరూపింపవలసియున్నది. సభానిర్వాహకులు మొదట మెజారిటీయభిప్రాయమునుబట్టి యేతీర్మానమును గావింపమని వాగ్దానము చేసియుండిరి. కాని యిప్పు డీ సమావేశమునందుగాని,కమిటీలయందుగాని తీర్మానమువెంబడి తీర్మానమును మెజారిటీ యభిప్రాయము ననుసరించి చేయుచున్నారు. వానియెడల నసమ్మతిని దెలుపు 'నొక్కని' పేరైనను నమోదు చేయుటలేదు. ఆ యొక్కడు నెవరు? కాంగ్రెసు యిక్కడ సమావేశమైన పార్టీలలో నొక పార్టీయా? కాంగ్రెసు భారతదేశములో నెనుబదియైదుపాళ్ల ప్రజలతరఫున ప్రాతినిధ్యము వహించుచున్నదనియిదివరకే చెప్పియుంటిని. కాంగ్రెసుచేసిన సేవయే యధికారముగా, నది సంస్థానపతులు, భూస్వాములు, విద్యావంతులతరఫునగూడ ప్రాతినిధ్యము వహింపగలదు. తక్కిన ప్రతినిధు లందరును చిన్న చిన్న సంఘములకు ప్రతినిధులు. సాంఘికభేదముల కతీతమైన సంస్థ కాంగ్రె సొక్కటియే. కాంగ్రెసు జాతివర్ణమతభేదములను గణింపదు. కాంగ్రెసు సార్వజనీనమైనది. కాంగ్రెసునకు సామాన్యజను లందుకొనలేని మహత్తరలక్ష్య ముండవచ్చును. కాని నేడు కాంగ్రెసు నిత్యప్రవర్ధమాన మగుచు, మారుమూలలనున్న పల్లెటూళ్లకు గూడ ప్రాకుచున్నది. అయినను మీరు కాంగ్రెసును నలుగురితోబాటొక పార్టీగా బరిగణించుచున్నారు. కాని యెప్పటికైనను సాంఘికభేదముల నెరుంగని దగుటచే కాంగ్రెస్సే మీతో వ్యవహరింపగల దని యెరుగుదురుగాక! కాంగ్రెసు మారటప్రభుత్వమును సాగింప నెంచుచున్నదని కొందరు తలచుచున్నారు. సరియే. మారణసాధనసాహాయ్యము లేకుండ నట్టిది సాధ్య మగునేని దానికి నే నిష్టమునే చెందుదును. కలకత్తాకార్పొరేషనుమీద నొకనింద పడవైచిరి. కాని కాంగ్రెసువారు సంజాయిషీ కోరగా కార్పొరేషనుమేయరు తన తప్పునొప్పుకొని, దౌర్జన్యపద్ధతికి దగిన పరిహారము చెప్పినాడు. కాంగ్రెసు అహింసాత్మకమైనది గాని హింసామయమైనది కాదు. కావుననే సత్యాగ్రహము ప్రారంభింపబడినది. దీనికి గూడ సహింపలేకున్నారు. కాని దాని నెవ్వరును నిరోధింపజాలరు. స్మట్సునేనానియే దానిని నిరోధింపజాలకపోయెను. ౧౯౦౮ లో నిరోధించినను ౧౯౧౪ లో లొంగవలసివచ్చెను. బోర్సాదునందును, బార్డోలీయందును సత్యాగ్రహము విజయము నొందినది. షెమ్సుఫర్డుప్రభువు దాని నొప్పుకొన్నాడు. భారతీయులు బాధల నొందుచుండ నాంగ్లేయులు బాధ నొందరని తలపవలదని గిల్బర్టు ముర్రేగారు నాతో జెప్పిరి. అట్టి మహాజను లాంగ్లేయులయందు గొందరున్నారు. ఇర్విన్‌ప్రభువు ఆర్డినెన్సులను బెట్టి భారతదేశమును బరీక్షించిచూచెను. కాని యాయన యోడిపోయెను. అదను తప్పకముందే

మీరు కాంగ్రెసు లక్ష్యమును గుర్తింపవలసియున్నది. పే రెయ్యది పెట్టినను కాంగ్రెసుకు స్వాతంత్ర్యమే లక్ష్యమైయున్నదని గాంధిజీ చెప్పెను. మొత్తము మీద నీ సభలో నేకాభిప్రాయము లేకుండెను. వా రంగీకరించిన యేక భావ మొక్కటియైనను లేకుండెను. దీనికి గాంధిజీ కష్టము నొందెను. మాటల కనేకార్థము లున్నప్పుడు వాని నెవరికి దోచినట్లు వా రర్థము చేసికొనుచున్నప్పుడు సమావేశములో నొకయొడంబడిక గావించుట దుస్తరము. “ఒక మిత్రుడు నాకు వెస్టు మినిస్టరు స్టాట్యూటును నిరూపించి యందు ‘డొమినియను అను శబ్దము నర్థమును గుర్తించితిరా’ యని యడిగెను. అవును గుర్తించితిని. అందు డొమినియనుల నేకరువు పెట్టిరి గాని వాని స్వరూపమును నిర్వచింపలేదు. ౧౯౨౬ లో డొమినియనులను గూర్చి యిట్లు నిర్వచింపబడినది: “డొమినియను లనగా బ్రిటిషు సామ్రాజ్యమునందు సమాన ప్రతిపత్తిగలిగి, యొకదాని కొకటి యెవ్విధముగను నాంతరంగిక వ్యవహార ములందుగాని, విదేశవ్యవహారములయందుగాని లోబడియుండక యన్నియును గూడి బ్రిటిషు సామ్రాజ్యమునకు సామంతములై, బ్రిటిషుజాతి సమ్మేళనమునందు సభ్యత్వము గలిగి యొప్పు స్వతంత్రసంఘములు.” ఈ నిర్వచనమైనను నిప్పు డంగీకరింపజాల కున్నాము. ఈజిప్టుదేశ మిందు లేదు. దీనినుండి బయటపడితిమి గదా యని నేను సం తోషించుచున్నాను. నాకు పూర్ణ స్వరాజ్యము కావలయును. పూర్ణస్వరాజ్యమనగా మీ యర్థమేమో బోధపడుటలేదని యొక యాంగ్లేయరాజకీయవేత్త నాతో ననెను. సంపూర్ణస్వాతంత్ర్యమనగా నింగ్లాండుతో భాగస్వామిత్వమా యనియడిగెను. అవును, పరస్పరలాభము నొందు భాగస్వామిత్వము. నేను మైత్రికొరకే ప్రాకులాడుచున్నాను. ముప్పదియైదుకోట్ల జనసంఖ్య గలిగినజాతికి వాళ్యలు, విషప్రయోగములు, తుపాకిగుం డ్లతో నావశ్యకతలేదు. దాని కాత్మనిశ్చయ మొక్కటియే కావలయును. ఇది మాకు వలదని చెప్పగలిగిన సామర్థ్యముకావలయును. భారతజాతి యిప్పు డాసామర్థ్యమును గడించుచున్నది.” తరువాత గాంధీజీ రక్షణలను గురించి మాట్లాడుచు రాబడిలో నెనుబదిపాళ్లు ముందుగనే దారముకట్టినప్పు డేమంత్రియును పరిపాలనమునకునుసాగింప జాలడని తనతో ముగ్గురు రాజకీయవేత్తలు చెప్పిరనెను. భారతదేశమున కధర్మములైన యేప్రయోజనములను మీరు సాధింపనక్కరలేదని తెలిపెను. భారత క్షేమంకరము లైన రక్షణలు ఆంగ్లేయులకు నపాయకరములు కానక్కరలేదని చెప్పెను. ఈ రక్ష ణల విషయములో జయకరుగారికిని, దనకే పొసగలేదు. ఇక సర్ శాప్రూలుహోరు గారికిని దనకును నెన్నడును గుదురదని చెప్పెను. ఆయన యింకను నిట్లు నుడివెను: “భారతదేశము పలువిధములయిన కష్టములు గడచిబ్రదికినది. మహామారి, చలిజ్వరము, పాములు, తేళ్లు, పులులబారిబడకుండ దప్పించుకొనినది అది యొంతకష్టము వచ్చి

నను భయపడదు. పరమేశ్వరుడు సాక్షిగా, షష్టిపూర్తియైన యీ దుర్బల కాయమున క్షాక్కమారణకాలమునిండు. మీనికిని, నీతడు ప్రతినిధిగానున్న సంస్థకును నొకమూల యందు జోటొసగుడు. మీరు పైకి నన్ను విశ్వసించుచున్నట్లు నా సంస్థను విశ్వసించుటలేదు. ఒక్క క్షణమైనను నాసంస్థనుండి నన్ను వేరుగా భావింపకుడు. ఆ మహాసముద్రములో నే నొక్క జలబిందువును. ఆ సంస్థకంటె నే నధికుడను గాను. ఆ సంస్థకంటె నే నెంతయో తక్కువవాడను. నాకు మీరు చోటిచ్చిన యెడల నాసంస్థనుగూడ విశ్వసింపుడు. లేనిచో మీరు నాయెడల జూపు విశ్వాసము గడ్డిపరకవంటిదై పోవును. కాంగ్రెసిచ్చినదిగాక నాకు కించిత్తయినను నధికారము లేదు. కాంగ్రెసెట్టిదియైనను దానిని మీ రవలంబించినచో నిక నరాజకోద్యమమునకు స్వస్తి చెప్పవచ్చును. ఈ నాడు మీ రీ హత్యాకాండకు సుశిక్షితమై సక్రమమన్నట్లుండు మీ హత్యాకాండతో జయింప జూచెదరు. మీరు సత్యమును గుర్తింపజాలకున్నారు. ఈ యరాజకులు వ్రాసెడి వ్రాతలు తమరక్తముతో వ్రాయుచున్నారని మీరు చూచుటలేదా? మాకు స్వాతంత్ర్యము కావలయునుగాని మీరిచ్చు గోధుమరొట్టె లక్కరలేదు. ఆస్వాతంత్ర్యము లేనన్నాళ్లును తాము నిద్రపోక దేశమును నిద్రపోనీయనివారు వేలకొలది యున్నారు."

డిశెంబరు ౧ తేదిని సమావేశము ముగిసెను. గాంధిజీ యధ్యక్షున కభినందనము లొసగెను. "మనము విడిపోవుచున్నాము. మన త్రోవలు వేరైనవి. ఇక రాబోవు తుపానులను సహించుటయే మానవజీవనగౌరవము. నాభవితవ్య మెట్టి త్రోవలబట్టునో నాకు తెలియదు. కాని యది యెట్లైనను నేను గణింపను. నేను పూర్ణముగ విరుద్ధమార్గమున బోవలపియున్నను, మీకుమాత్రము నాహృదయపూర్వకముగ నభినందనము లొసగెదను." ఆపత్సూచకములైన యీ మాటలతో నాయన రౌండుటేబిలు సభను వీడెను. అప్పటిస్థితి యేమన, కాంగ్రెసు రౌండుటేబిలుసభలో బాల్గొనుటకు జేయబడిన ప్రధాననియమమగు నిర్బంధవిధాన పరిత్యాగము పూర్తిగా భగ్నముచేయబడెను. వంగాలు సంయుక్తరాష్ట్రములందు రేగుచున్న పరిస్థితులనుగాంచి గాంధిజీ మిక్కిలి సంకటపడెను. భారతదేశములో నిర్బంధవిధానము సాగించుటకును, ఇంగ్లాండులో నధికారమును వదలుకొని భారతదేశమునకు స్వాతంత్ర్యము నిచ్చెదమని వాగ్దానము చేయుటకును సామరస్యము కుదురుటలేదని తలచెను.

గాంధీజీ రౌండుటేబిలుసభకుబోవుచున్నప్పుడు గవర్నమెంటువారు బార్డోలీ తాలూకాలో పన్నులను వసూలుచేయుచున్నప్పుడు జరిగిన పోలీసు అత్యాచారము అను గురించి విచారణ చేయింతుమని యొప్పుకొనిరి. ఈ విచారణ చేయుటకై ఆర్. సి. గార్డనుగారు నియోగింపబడిరి. ఆ విచారణ ౧౯౩౧ అక్టోబరు ౫ తేదిని ప్రారంభ

మర్యాదను. భూలాభాయి దేశాయిగారును, కాంగ్రెసుప్రెసిడెంటు వల్లభాయిపటేలు గారును వారితోగూడ నుండిరి. దేశాయిగారీ విచారణలో కాంగ్రెసుతరఫున ప్రతినిధిగా నుండెను. మొట్టమొదటనే గవర్నమెంటుప్లీడరు దేశాయిగారు వచ్చుట యక్రమ మనియు, కాంగ్రెసువారు ప్రత్యేకముగ సమావేశము చేసి యొక వకీలును ప్రతినిధిగా నెన్నుకొనవలయు ననియు నభ్యంతరపెట్టెను. కాని యా యభ్యంతరము తోసివేయబడెను. రయితులు తమకు శక్తి యున్నంతవరకు పన్నులు చెల్లింపవలయు నని యుభయపక్షములవారును నంగీకరించిరి. సత్యాగ్రహులై కష్టనష్టములను బడనివారప్పుచేసియైనను పన్నులను జెల్లింపవలయును. దేశాయిగా రనేక లేఖలను, వ్యాసములను, తంతివార్తలను సాక్ష్యముగా జూపెను. 'రాయం' గ్రామమున కలెక్టరు పదునేనుగురు పోలీసు భటులతో దాడిపెట్టె నని బార్డోలీనుండి వచ్చిన తంతివార్తను జూపించెను. ఇట్లే టింబెర్వా, రాజపురి, లంభా, మనగపూరు, నవఫాలీ, గోర్ధ, అల్లుడ్, జమేనియా గ్రామములలో గూడ నిట్టిది జరిగెను. విచారణ కొంతవరకు జరిగెను. తరువాత మార్చి ౫ తేది మొదలు ఆగస్టు ౮ వరకు ఇండియా గవర్నమెంటు వారును, బొంబాయి ప్రభుత్వమువాడును నీ విషయమై పంపిన యార్డరు లన్నియు జూడవలయు నని కాంగ్రెసుప్రతినిధి కోరెను. ఒడంబడికలో నుదాహరింపబడిన పన్నుల ప్రమాణమును ఆ యార్డరులవలన దెలిసికొనవచ్చును. కాంగ్రెసు తన వాదమును నెగ్గించుకొనుటకు గవర్నమెంటువారు సాక్ష్యము నేల సమకూర్పవలయునో గార్డనుగారికి దెలియలేదు. కాంగ్రెసువారీ యారోపణలు చేయుటకుముందు వారి యొద్ద తమ వాదములు నెగ్గించుకొనుటకు దగిన సామగ్రియంతయు నుండియుండవలయును. దానిని బట్టియే వారు తమ వాదమును ఋజువు చేసికొనవలయునని యాయన చెప్పెను. గవర్నమెంటువారు చేసిన ప్రత్యేక ప్రకటన మేదైన నున్నచో నది వేరుమాట యగునని విచారణోద్యోగి తెలిపెను. దానిమీద కాంగ్రెసువారు తా మా కాగితముల నడుగుటకు గారణమును జెప్పుచు వాని స్వరూప మిట్టిదనికూడ దెలియచేసిరి. గార్డనుగారిట్టి యవ్యక్తము, నసమంజసము నైన కోరిక దీర్చుటకు వీలు లేదని త్రోసిపుచ్చెను. దేశాయిగారీ తీర్పును ఖండించిరి. "కాంగ్రెసువారిప్పుడీ గవర్నమెంటు సాక్ష్యమును గోరుటవలన కాంగ్రెసుయొక్క సాక్ష్య సామగ్రియందు హఠాత్తుగా నేదో లోపము కన్పడుటవలన నీ రికార్డులను గోరి రని ప్రతివాదులు తలచిరి. దీనినిబట్టి సత్యాసత్యములను నిర్ణయించుటకై చేయబడు నీ విచారణలో ప్రతిపక్షు లెట్టి చిత్తవృత్తితో దోడ్పడుచున్నది దెలిసివచ్చుచున్నది.

ప్రజాక్షేమమును వారెంతగా గోరుచున్నదియుకూడ దెలియనగుచున్నది. ప్రతిపక్షుల యీ చిత్తవృత్తి మూలమున నేను పొందిన యభిప్రాయమునకు మరింత బలము

గలుగుచున్న" దని దేశాయిగారు తెలిపిరి. వల్లభాయిగారు రయితు కిట్టి ప్రకటనము కావించిరి. "విచారణయొక్క ధోరణి విరోధభావముతోనుండి, పక్షపాతవృత్తి గలిగియున్నది. కాని కాంగ్రెసు వకీలిక నీవిచారణ నిరుపయోగమని నిర్ణయించువరకును దీనిని సాగింపదలచుకొన్నాను." నిజమునకు గవర్నమెంటువారి రికార్డునుబయటపెట్టక పోవుటవలన, వారి క్రాసుపరీక్ష నడ్డుకొనుటకు వీలులేకపోయెను. అప్పుడు విచారణ పట్టి నిరుపయోగ మని తేలిపోయెను. అంతట వల్లభాయిగారు విచారణలో బాల్గొన మాని ౧౯౩౧ నవంబరు ౧౩ తేదిని గాంధీజీ కిట్లు తంతివార్తనంపిరి.

"పదునొకండు ఊళ్లలోను నేదూళ్లయందు ౨౬ ఖాతేదారులు, ౭౧ సాక్షులు విచారింపబడిరి. అయినూళ్ల నీ విచారణక్రిందికి రావని నిషేధించిరి. మల్లుతుదారు విచారణలో గొన్ని ముఖ్యాంశము లొప్పుకొనిన తరువాత గవర్నమెంటు రికార్డులు పై సాక్ష్యముకొరకు కీయబడజాలవని విచారణోద్యోగి తెలిపెను. విచారణయొక్క ధోరణి పూర్తిగా విరోధభావయుతమై పక్షపాతమును దెలియజేయుచున్నది. దీనికి భూలాభాయిగారుగూడ నొప్పుకొని విచారణలో బాల్గొనిరి."

"వల్లభాయి."

సంయుక్తరాష్ట్రములో మంచి ప్రాముఖ్యము గలిగిన వ్యవహార మొక్కటి మూసికొని వచ్చుచుండెను. ఇదియే భారతరాజకీయ వ్యవహారములను దరువాత రెండు వత్సరములవరకును నిర్ణయించినదని చెప్పవచ్చును. ఈ రాష్ట్రమునందు తాలూకాదారులు, జమీందారుల క్రింద నున్న రయితుల స్థితి దుస్సహమైయుండెను. పన్నుల వసూళ్లలో నేమాత్రమును సదుపాయము చేయబడకుండెను. వారి కష్టము లసహ్యములై యుండెను. తాలూకాదారులు జమీందారులును గవర్నమెంటువారికున్న బాధ్యతను వహింపలేదు. ఆర్థికమాంద్యమువలన రయితులుపడుచున్న కష్టములను గణింపలేదు. వారు సంపన్నులు. గవర్నమెంటువారి యండ జూచుకొని సుఖముగా మనుచుండిరి. కష్టపడి పనిచేయవలయునను విచారము లేదు. ఎవరైన రైతుల తరపున గొంచెము కల్లోలము చేసినచో నది రాజద్రోహమనియు, సత్యాగ్రహమనియు, నరాచకమనియు పేరులుపెట్టి గవర్నమెంటువారిసహాయమును గోరుచుండిరి. భారతదేశములో దక్కిన పక్షములవారు రయితులయెడ హృదయపూర్వకముగ సానుభూతి వహించినను క్రియాకలాపమునకు దిగకపోవుటవలన, ప్రజలతరఫున రాజకీయ పరిపాలనా సంబంధమైన యే వ్యవహారము నిర్వహింపవలసివచ్చినను నది కాంగ్రెసుపాల బడుచుండుట యొక దురదృష్టము. అందుచేత సంయుక్తరాష్ట్రమునందలి కాంగ్రెసుప్రచారకు లెల్లరును గవర్నమెంటువారి సహాయము నొందిన తాలూకాదారుల, జమీందారుల

క్రోధమునకు గురిగ్రైరి. ఈరాష్ట్రమునందు అక్టోబరు, నవంబరు, డిసెంబరు నెలలలో రేగిన రయితుల కల్లోలమునుగూర్చిన గ్రంథమంతయు బ్రచురింపబడినది. కాని యది యంతయు పెద్దగ్రంథమగుటచే నిచ్చట దానినంతను బ్రచురించుటకు వీలులేదు. ఆ గ్రంథమునందే యొక గవర్న మెంటుప్రచురణమునకు టీకరూపమున సర్వవిషయ ములును సంగ్రహముగ జెప్పబడినవి.

ఢిల్లీయొడంబడికయైనతోడనే యునైటెడు రాష్ట్రకాంగ్రెసు కమిటీవారు రాష్ట్రప్రభుత్వముతో నుత్తర ప్రత్యుత్తరములు నడపిరి. ప్రజల కష్టములను గవర్న మెంటువారికి దెలియజేయుటకును, కాంగ్రెసువారి యభిప్రాయమును వారికి దెలియజెప్పుట కును గోవిందవల్లభపంతుగారు సంయుక్తరాష్ట్ర కాంగ్రెసుకమిటీవారిచే నియోగింప బడిరి. రయితుల కల్లోలమే రాష్ట్రకాంగ్రెసుకమిటీవారి నెక్కువగా నాకర్షించినది. ఉత్తర ప్రత్యుత్తరము లన్నియు నెక్కువగా దీనినిగురించియే జరిగినవి. పండితజవహర లాలునెహ్రూగారుగూడ గవర్న మెంటువారికి లేఖలు వ్రాసిరి. పండిత గోవిందవల్లభ పంతుగారును, జవహరలాలునెహ్రూగారును గవర్న మెంటు ప్రధానకార్యదర్శితోడను తక్కిన యధికారులతోడను చాలమారులు ప్రత్యక్షముగా సంభాషించిరి. పండిత జవహరలాలునెహ్రూగారు సర్ మాల్కము హెయిలీగారితో రెండుసార్లు సంభా షింప యత్నించెనుగాని వీలులేకపోయినది. గాంధిమహాత్ముడుగూడ నీరయితుకల్లోల ముల శ్రద్ధదీసికొని ఇండియా గవర్న మెంటువారికిని, స్థానికాధికారులకును లేఖలు వ్రాయుటయేగాక సర్ మాల్కము హెయిలీగారిని గలసికొని సంభాషించిరి.

ఢిల్లీయొడంబడికతరువాత సంయుక్తరాష్ట్రమునందలి రయితుల స్థితిగతులు పూర్తిగ దిగనాశిల్లెను. ధరలు పూర్తిగా పడిపోయినను రిమిషనులు చాల తక్కువగా నిచ్చిరి. దీనివలన రయితులదుస్థితి యతిశయించెను. దానితోబాటు రయితులను భూములనుండి తొలగించుటవలనను, నిర్బంధచర్యలు గైగొనుటవలనను పుండుమీద కారముచల్లిన ట్లయ్యెను. చాల పల్లెటూళ్లలో రయితు లడలగొట్టబడిరి. వారిపై నెన్నో దురంతములను గావించిరి. ఇట్లు కల్లోలమునొందిన యూళ్లకేగి యక్కడి పరిస్థితులను తెలియజేయుటకై కాంగ్రెసుకమిటీవారు విచారణసంఘముల నియమించిరి. ఈరిపోర్టు లన్నిటిని విచారించుటకై యొకరాష్ట్రీయవిచారణసంఘమును నియమించిరి. ఈసంఘ మును పంతుకమిటీ యనుచుండిరి. వీరి రిపోర్టు ౧౯౩౧ సెప్టెంబరులో బ్రచురింప బడెను.

ఈమధ్యగా గాంధిజీయును, రాష్ట్రకాంగ్రెసుసంఘమువారును రయితులకష్ట ములను నివారించుటకై ప్రయత్నములు చేయుచునే యుండిరి. ౧౯౩౧ ఆగస్టులో

ఇండియాగవర్నమెంటువారికిని, గాంధిజీకినిజరిగినసంభాషణలలో సంయుక్తరాష్ట్రపు రయితుకల్లోలము ప్రత్యేకముగా విచారింపబడెను. ఇందు తగిన పరిహారము చూపకపోయినయెడల రయితులకు సత్యాగ్రహమును ప్రారంభించు హక్కు కలదని నిరూపించెను. ౧౯౩౧ ఆగస్టు ౨౮ తేదిని గాంధిజీ ఎమర్సనుగారికి వ్రాసిన యుత్తరములో (ఇది సిమ్లా యొడంబడికలోని భాగమే.) నీహక్కు నిరూపింపబడెను. "ఏదిదైన దుస్తరమైన యాపదసంభవించి దాని విషయమై విచారణచేయించుట కవకాశముండదేని, దానికి బరిహారముసేయుట కాంగ్రెసు విధి యగుటచే నసహాయోద్యమము విరమింపబడినను కాంగ్రెసువారు ప్రత్యక్షప్రతిక్రియాతంత్రమును బ్రారంభించు హక్కుండవలయును." కాంగ్రెసువారి యీస్థితి తరువాత ఎమర్సనుగారి లేఖయందు గూడ గుర్తింపబడినది.

ఈ సంయుక్తరాష్ట్రపు రయితు కల్లోలమునుగూర్చి కాంగ్రెసు ప్రెసిడెంటు సర్దారు వల్లభాయిగారుగూడ ఇండియాగవర్నమెంటువారికి వ్రాసి రని మనము గుర్తుంచుకొనవలయును.

ఈ విధముగా నీసమస్య నేదో విధముగ బరిష్కరించుటకై కాంగ్రెసువారు గవర్నమెంటువారితో బూర్తిగా సహకార మొనర్చిరి. సిమ్లా యొడంబడిక తరువాత గూడ నుత్తరముల నరికించిరి. కాని ప్రయోజనము కలుగలేదు. రయితు లనేకులు భూములనుండి తొలగింపబడిరి. నిర్బంధముచేసి పన్నులు వసూలుచేసిరి. అక్కడక్కడ రయితులపైబడి కొట్టిరి. ఈఘోరకర్మము మామూలు వసూళ్ల రోజులు దాటిపోయిన తరువాతగూడ సాగుచుండెను.

క్రిందటి సంవత్సరపు చిక్కులను విడదీసికొనకముందే, ౧౩౩౯ ఫసలీ ప్రారంభమగుటవలన క్రొత్త వసూళ్ల విషయములో మరల క్రొత్త యాపద తటస్థించెను. రయితు లిదివరకే చితికిపోయియుండియు మరల నీయాపద నెదుర్కొనవలసివచ్చెను. స్థానికప్రభుత్వము ప్రకటించిన రిమిషను లేమాత్రము చాలకుండెను. భూములనుండి తొలగింపబడినవారికిగాని గుజస్తు బాకీవిషయమునగాని రయితుల కష్టములగూర్చి కాని యేవిధమైన యేర్పాటులను జేయరయ్యెను. ఇవియన్నియు నిట్లుండగా నొక మాసములోపల శిస్తులన్నిటిని బూర్తిగా చెల్లింపనియెడల నిదివర కిచ్చిన రిమిషనులను గూడ రద్దుచేయుదుమని యధికారులు ప్రకటించిరి. పైగా రయితులు ముందు శిస్తుకట్టి తరువాత నభ్యంతరములను విన్నవించుకొనవలయు ననిరి. ఈప్రకటనముతో వ్యవహారము పూర్తిగా చెడిపోయెను. పైగా రిమిషనులను నిర్ణయించుటలో కాంగ్రెసు వారితోగాని, మరి రయితు ప్రతినిధు లెవ్వరితోగాని గవర్నమెంటువారు సంప్రతించియుండలేదని గుర్తుంచుకొనవలయును.

అధికారుల ప్రకటన మైనతోడనే అలహాబాదు జిల్లాకాంగ్రెసు కమిటీవారు రయితులీ పన్నులను చెల్లింపజాలరని ప్రకటించిరి. తక్కిన జిల్లాలుగూడ నింతకంటె దుస్తరమైన యవస్థలో నుండెను. స్థానికప్రభుత్వమువారికి మరల లేఖలు వ్రాసి, భూములనుండి తొలగించుట మున్నగు విషయములలో రయితుల కెంతయన్యాయము జరుగుచున్నదియు నిరూపించిరి. అలహాబాదు జిల్లా పరిస్థితులను మాదిరికై విచారించుటకు కొందరు స్థానికాధికారులు, సెటిల్మెంటు ఆఫీసరు, కాంగ్రెసు ప్రతినిధులును గూడిన యొక సమావేశ మేర్పాటుచేయబడెను. గవర్నమెంటువారు ప్రధానాంశములనుగూర్చి చర్చింప నిరాకరించుటచే నీ సమావేశము విఫలమయ్యెను. ఇదివరకు చేయబడిన నిబంధనల నమలులో బెట్టు విషయమునుగూర్చి వారు సమాలోచింతు మనిరి. కావున వ్యవహారముయొక్క యాంతర్యము తడవబడలేదు.

తరువాత సంయుక్తరాష్ట్ర కాంగ్రెసుకమిటీవారీసమస్యనుగూర్చి సర్వవిషయములను విచారించుటకై స్థానికాధికారులతో నొక సమావేశమును గావించుట కెన్నియో ప్రయత్నములను గావించిరి. రాష్ట్రీయ కాంగ్రెసుకమిటీవారు గవర్నమెంటుతో రాయబారములు నడుపుటకై యొక స్పెషలు కమిటీని నియమించిరి. ఈ ప్రయత్నములు సఫలములు కాలేదు.

ఈ యుత్తర ప్రత్యుత్తరములలో కాంగ్రెసు రయితులకు దగిన పరిహారము కలుగు నెట్టి పరిష్కారమున కైనను నంగీకరింతు రని తెలియజేయబడెను. వసూళ్లు వచ్చునప్పటికి రయితులు వచ్చి తా మేమి చేయవలయునని యడుగుచుండిరి. రాష్ట్ర కాంగ్రెసుకమిటీవారికి రాయబారములను మానుకొన నిష్టము లేకుండెను. కాని రయితులు వచ్చి సలహా యడిగినప్పుడు, వారిని సంపూర్ణముగ నాశనము చేయగలిగి న్యాయమునకు విరుద్ధమైయున్న పన్నులను చెల్లింపుడని చెప్ప లేకుండిరి. కావున రాష్ట్ర కాంగ్రెసు కమిటీవారు కాంగ్రెసు ప్రెసిడెంటుగారి యనుమతిని గైకొని, రాయబారములు జరుగునంతవరకును దాత్కాలికముగ బన్నులను చెల్లింపబోకుడని రయితులకు సలహాయిచ్చిరి. కానితాము రాయబారములు జరుపుటకు సర్వసిద్ధముగ నుంటిమనియు, వ్యవహారము పరిష్కృతమైన వెంటనే తమ సలహా నుపసంహరించుకొందు మనియు దెలియజేసిరి. రాయబారములు పూర్తియగు వరకును గవర్నమెంటువారు వసూళ్ల నాపినచో దాము తమ సలహాను రద్దుచేసెద మని సూచించిరి. గవర్నమెంటువారీ సూచన నంగీకరింపలేదు. కాంగ్రెసువారు పన్నులు చెల్లింపవలదను సలహాను ముందుగా నుపసంహరించుకొనవలయునని గవర్నమెంటువారనిరి. ఇక కాంగ్రెసుకమిటీవారు రయితులను పన్నులను నిలిపియుంచుడని మరల సలహాయిచ్చుట దక్క వేరేమియు జేయజాలకపోయిరి. వ్యవహారము లిట్లు

ముదిరిపోయినను కాంగ్రెసుకమిటీవారుమాత్రము తా మీ విషయమున నొడంబడిక కుదుర్చుటకై సర్వవిధముల బ్రయత్నింతుమనియు, దీనికి దగిన పరిహారము వచ్చు సూచనలు గనబడినను, లేక వసూళ్లు నిలుపవడినను రయితులు పన్నులను నిలుపవలయు నను తమ సలహా నుపసంహరించుకొందు మనియు బ్రకటించుచునేయుండిరి. పన్నుల నిరాకరణోద్యమము నిలుపబడినగాని ప్రజాప్రతినిధులతో సమావేశమున కంగీకరింపమని గవర్న మెంటువారు పట్టుపట్టిరి. కాని తాముమాత్రము కాంగ్రెసు ప్రచారకులలో పెద్దతలకాయలను జూచి యరెస్టులను జేయుచునేయుండిరి. తుదకు గాంధీజీ యింక నైదు రోజులలో నింగ్లాండునుండి వచ్చుననగా పండిత జవహరలాలు, షేర్వానీ, పురుషోత్తమదాసు టాండనుగార్ల నరెస్టుచేసిరి. నిజమునకు జవహరలాలు, షేర్వానీ లకు వారున్నచోటులనుండి కదలగూడదని నోటీసులను జారీచేసిరి. జవహరలాలుగారు గాంధిగారు తిరిగివచ్చువాడు బొంబాయిలో వర్కింగుకమిటీ సమావేశమునకు వచ్చిరి. జవహరలాలుగారు ప్రజాసేవయందు బుట్టిన యవసరములో గవర్న మెంటువారి యాజ్ఞను మన్నింపజాలకపోయిరి. అందుచేత నాయనను గవర్న మెంటువా రరెస్టు చేసిరి. షేర్వానీగారుగూడ నిట్లే యరెస్టుచేయబడెను. తరువాత నిర్ధారికిని నిషేధపు టుత్తరువుల నుల్లంఘించినందులకు శిక్షలు విధించిరి.

ఇక బెంగాలులో మూడవ సమరరంగ ముండెను. సంధికాలములో చాలదురం తములు జరిగెను. బహుశః ఆ ప్రాంతములనున్న యరాజకోద్యమము నడచుటకై యీ దురంతము లుద్దిష్టములై యుండవచ్చును. చిటగాంగుపట్టణమునందును, నా జిల్లా యందును ౧౯౩౧ ఆగస్టు ౩౧ తేది మొదలు మూడుదినములు జరిగిన ఘోర కృత్యములను గూర్చి విచారించుట కొక ప్రజాసంఘ మేర్పాటుచేయబడెను. కొందరు యూరపియనులును, మరి కొందరు రౌడీలును నొకరాత్రివేళ నొక ముద్రాక్షరశాలయందు బ్రవేశించి, సమ్మెటలతోడను, నినుపచువ్వలతోడను యంత్రములను బగులగొట్టి, యా ముద్రాక్షరశాల మానేజరును, తక్కినవారిని బట్టుకొని చావమోదిరి. వర్కింగుకమిటీవా రీ రిపోర్టును ఢిల్లీలో ౧౯౩౧ నవంబరు ౧౭, ౧౮, ౧౯ తేదీలయందు విచారించి "ప్రజలకు భీతావహము కలుగజేయ నెంచి పోలీసువారును, నధికారవర్గమును రౌడీల, యూరపియనుల సహాయముతో నిరపరాధులైన ప్రజల యెడల గావించిన దుండగములను" ఖండించుచు దీర్మానించిరి. రౌడీలను బ్రేరేపించి, సాంఘికసంఘర్షణము కలదను నపనిందను బుట్టించుటకై యెన్ని ప్రయత్నములు కావింపబడినను చిటగాంగులో సాంఘిక సంఘర్షణ జనింపక పోవుటకు కమిటీవారు సంతృప్తినందిరి. బెంగాలు గవర్న మెంటువా రిట్లు కష్టనష్టములు చెందినవారికి దగిన పరిహారము నిచ్చి యీ దురంతములను

గావించినవారిని తగినరీతిగా శిక్షించుట ధర్మ మని వర్కింగుకమిటీ వారు సూచించిరి. జైళ్లకు బయటనున్న ప్రజ లీ విధముగ బెంగాలులో బ్లాకు అందు టూను పద్ధతులచే బీడింపబడుచుండగా జైళ్లలోను, డిటెన్యను శిబిరములందును నున్న వా రింతకంటె నెక్కువ దురంతములకు బాల్పడుచుండిరి. హిజిలీ డిటెన్యన్ శిబిర ము నందు జరిగిన దురంతములో నిరువురు డిటెన్యూలు ప్రాణములను గోల్పోయిరి. ఇరు వదిమందికి గాయములు తగిలెను. వర్కింగుకమిటీవా రీవిషయమును విచారించుటకై గవర్నమెంటువారు నియమించిన కమిటీవారి నివేదికను నిరీక్షించుచు,"నిరాయుధులై డిటెన్యను శిబిరములలో బంధింపబడియున్న వారి ప్రాణములను రక్షించుట గవర్న మెంటువారి విధికృత్యమనియు, నిస్వార్థను ప్రజలు తమ యసమ్మతిని దెలియజేయు చున్నను విచారణలేకుండ బంధింపబడినవారి విషయములో తమ విధుల గుర్తింపలేని వారిని దగినట్లు శిక్షింపవలయు" ననియు గవర్నమెంటువారికి సూచించిరి. ఈసమా వేశమునందే వర్కింగుకమిటీవారు యు. పి. రయితుకల్లోలమునుగూర్చి విచారించిరి. అలహాబాదు జిల్లాకాంగ్రెసు కమిటీవారు రయితుల దుస్థితిని విచారింపకుండ గవర్న మెంటువారు పన్నుల వసూళ్లను ప్రారంభించినందున సత్యాగ్రహమున కనుజ్ఞ నిమ్మని కోరిరి. దీని కనుజ్ఞ నిచ్చుటకు ముందు సంయుక్తరాష్ట్ర కాంగ్రెసు కమిటీవా రీ ప్రత్యక్ష ప్రతిక్రియా తంత్రమునుగూర్చి జాగ్రత్తగా విచారింపవలయునని వర్కింగు కమిటీవారు సూచించిరి. అందుచేత అలహాబాదుజిల్లా కాంగ్రెసువారి యర్జీని యు. పి.రాష్ట్రకాంగ్రెసుకమిటీకి బంపించుచు సంయుక్తరాష్ట్రకాంగ్రెసుకమిటీవారుగూడ నిది సత్యాగ్రహమునకు దగిన విషయమేయని యంగీకరించినయెడల నీ యర్జీని విచా రించి సిమ్లా యొడంబడిక ప్రకారము దానిని దగినవిధమున బహిష్కరించుటకు ప్రెసి డెంటుగారి కధికార మొసగిరి.

ఈ సమావేశములోనే వర్కింగుకమిటీవారు ఉప్పుమీద క్రొత్త డ్యూటీని విధించుట దోషమని నిరూపించిరి. ఈవిషయములో ఇండియా గవర్నమెంటువారు ఢిల్లీ యొడంబడికను భగ్నము చేసి రనిరి. వర్కింగుకమిటీ కరెన్సీ మారకపు పద్ధతిని గూర్చికూడ మరియొక తీర్మానము గావించిరి. ఇంగ్లాండులోని బంగారు విలువ తరిగి పోయినందున ఇంగ్లాండు బ్యాంకువారు సెప్టెంబరు ౨౧ తేదిని మూడురోజులు సెలవు పుచ్చుకొని బంగారపు ప్రమాణము నెత్తివేసిరి. ఇండియా నాణెమైన రూపాయను ఇంగ్లాండువారి పౌండునోటుకు ముడిపెట్టియుంచవలెనా, లేదా ! దానిని స్వేచ్ఛగా వదలి బంగారపుధరనుబట్టి సరియైనధరను బొందనీయవలయునా యని విచారము పుట్టెను. ఇంగ్లాండువారు రూపాయను పౌండునోటుతో ముడిపెట్టిరి. అది వారికి లాభము. దీనివలన భారతదేశములో బ్రిటిషు దిగుమతులకు సౌకర్యము కలుగును.

భారతదేశములోని బంగారమంతయు నింగ్లాండు చేరును. ఈవిధముగా నొక తీర్మానము చేయబడెను.

గవర్నమెంటువారు పెషావరు ప్రాంతముల మరియొక నిప్పు ముట్టించిరి. ఖుదాయి ఖిద్మత్గారులను గురించి మనము వినియే యుంటిమి. వారు సరిహద్దు రాష్ట్రవాసులలోని కెల్ల మంచి గడితేరిన వీరులు. వీ రెల్లరును నసహాయోద్యమమునకై సుశిక్షితులై కాకలుదీరియుండిరి. వీ రొకలక్షమంది ఖాను అబ్దులు గఫూరుఖానుగారి నాయకత్వమున బనిచేయుచుండిరి. ఖుదాయి ఖిద్మత్గారులు ఆగస్టుదనకను కాంగ్రెసుతో సంబంధములేకయుండిరి. ఢిల్లీ యొడంబడికయైనప్పటినుండియు గాంధిగారు సరిహద్దురాష్ట్రమునకు బోయి వీరి సంఘటన పద్ధతులను బరిశీలించి వచ్చుటకు గవర్నమెంటువారి యనుమతిని గోరుచుండిరి. ఈ విషయములో ఆయన ఇర్విన్‌ప్రభువు ననుమతికోరెను. కాని వా రిప్పుడు కాదనిరి. ఆ సంవత్సరమంతయు నిట్టిజవాబే వచ్చెను. అందుచేత నాయన సరిహద్దురాష్ట్రమునకు దేవదాసుగాంధిని బంపెను. ఆయన వెళ్లి యొక యద్భుతవృత్తాంతమును దెలియజేసెను. తుదకు వర్కింగుకమిటీవారు ఖుదాయిఖిద్మత్గారులను కాంగ్రెసులో జేర్చుకొనిరి. వీరు కాంగ్రెసు వలంటీరులైనను వీరి పద్ధతులన్నియు మిలిటరీ పద్ధతులు. బ్యాండు, ఈలలు, ఎర్రని యూనిఫారములు,—వీనితోడను, తన సచ్ఛీలత్యాగ వినయ గౌరవములచేత పెషావరుగాంధి యని పేరువడసిన నాయకునితోడను వీరు చూడవచ్చినవారికెల్ల నమృతమూర్తులై తోచుచుండిరి. ఏమో, యెవరికి దెలియును? ఈ పెషావరు గాంధి సాధురూపములో, నీసత్యాగ్రహి కన్నులలో నేమిదాగియున్నదో! ఈతడు బహుశః సరిహద్దునందున్న తెగలతో సఖ్యముచేసి, అమీరుతో జతపడి, యొక రాష్ట్రమును నిర్మించి, యుండియా మీదికి దాడివెడలునేమో! లక్షమంది రక్తవస్త్రధారులైన పఠానులు. వారిని నమ్ముటకు వీలులేదు. అందుచేత పశ్చిమోత్తరపరగణా కమిషనరుచేసిన దర్బారుకు రాలేదను నెపమునను, నాతడు సంపూర్ణ స్వాతంత్ర్యమును ప్రబోధించెనను కారణమునను నిరపరాధియైన ఖాను అబ్దులు గఫూరుఖానుగారును, నట్లే నిరపరాధియైన యాయన తమ్ముడు ఖానుసాహెబుగారును గాంధిజీ యింక గొలది రోజులలో నింగ్లాండునుండి తిరిగి వత్తురనగా నరెస్టుచేయబడిరి. ఈవిధముగా గాంధిజీ తిరిగివచ్చునప్పటికి వ్యవహారమంతయు రసాభాసమైయుండెను. గుజరాతులో జరిగిన యత్యాచారములను గూర్చిన విచారణ నవంబరు ౧౩ తేదీని నిష్ఫలమయ్యెను. వల్లభాయిగారు తొందరపాటువాడు గావున నాయన యీ విచారణనుండి తొలగెనని తలపవలదు. ఎప్పుడును శాంతముగనుండి యడుగువేయుట కాలోచించు భూలాభాయిగారే

యందుండి విరమించుకొనిరి. సంయుక్తరాష్ట్రములలో గవర్నమెంటువారి సలహో మీద భూస్వాములిచ్చిన రిమిష నెందును జాలనిదయ్యెను. గవర్నమెంటువారు ప్రజా ప్రతినిధులు దాసోహమని రయితులకు పన్నులు చెల్లింపవలదని యిచ్చిన సలహో నుప సంహరించుకొనినగాని వారితో సమావేశమై మాట్లాడమని భీష్మించుకొనిరి. ఆ వ్యవహార మట్లు ముదిరి, తుదకు గాంధిగా రైదురోజులకు వత్తురనగా జవహరలాలు షేర్వాణీగార్ల యరెస్టులో ఫలించెను. పైగా నీవార్త గాంధీగా రున్న నౌకమీదికి తంతివార్త పంపబడినను గవర్నమెంటువారు దానిని నిలిపివేసిరి. పశ్చిమోత్తర పరగణాలో గఫూరుఖానుగారును, వారి సోదరుడును, వారి కుమారుడును స్టేటుఖైదీలు చేయబడిరి. ఇక బెంగాలులో నొక్కదురంతము కాదు. రెండు కాదు. చిటగాంగు హిజిలీ యుదంతములు రెండేయైనను నిట్టి వెన్నోయుండి యీ రూపమైన గాయ మెన్నటికిని మానక క్రుళ్లి నిత్యముగా నన్లే బాధించునట్లు కనబడెను.

ఇట్టి పరిస్థితులలో గాంధీజీ ౧౯౩౧ డిశెంబరు ౨౮ తేదీ ప్రాతఃకాలము బొంబాయిలో దిగెను.

# 1. మరల అడవికి

---

[అజద్ మైదానములో మీటింగు-గాంధి తనదీక్షను మరల వివరించుట-స్థితిగతులను తెలుసుకొనుట – గాంధి వైస్రాయిల మధ్య టెలిగ్రాములు – వర్కింగుకమిటీతీర్మానములు – బెంగాల్ సర్క్యులరు – తిరిగీ యుద్ధమునకు గవర్నమెంటుసన్నాహము చేసుకొనుట-ఎమర్జన్సీ అధికారముల అర్డినెన్సు-తీవ్రయుద్ధము – రాజకీయమహాసభలు – ఆశ్రమములగతి – బీహారు – ఆంధ్ర – బెంగాల్ – బొంబాయి – మధ్యరాష్ట్రములు – ఢిల్లీ – గుజరాత్ – కర్ణాటక – కేరళ – పశ్చిమోత్తర సరిహద్దు పరగణా – సింధు – తమిళనాడు – ౧౯౩౩ లో బెంగాల్ గుజరాత్ కర్ణాటకములలో జరిగిన సంగతులు]

లండనునుంచి వచ్చుచున్న భారతప్రజాప్రతినిధిని తగురీతిని ఆహ్వానించుటకై భరతవర్షములోని అన్నిప్రాంతములనుండియు ప్రతినిధులు బొంబాయికి చేరిరి. తనకు యెదురుకోలు నిచ్చుటకై స్టీమరుమీదికి వచ్చిన మిత్రులతో గాంధి సల్లాపము లాడెను. కొందరిని భుజలములమీద తట్టెను. కొందరిని గ్రుద్దెను. వృద్ధమిత్రులగు అబ్బాస్ తయ్యాబ్జీగారిగడ్డముపట్టుకొని లాగెను. సుంకముల ఆఫీసుహాలులో మామూలు ఆహ్వానము జరిగెను. పిమ్మట బొంబాయి రాజవీధులయందు మహోత్సవము సాగెను. ఇట్టి మహోత్సవము రాజులకుగూడ నోరూరజేయును. రాజకీయనాయకులును, కాంక్షాపరులగు రాజకీయవేత్తలును తన్ను మెచ్చుకొను ప్రజాసామాన్యమునుండి ఇట్టి గౌరవము పొందుదురు. కాని భారతీయులు ఆనాడు ఆహ్వానించుచున్నది యెవరిని? పరరాజ్యముల గ్రసించు వీరుని కాదు. నిరంకుశుడగు రాజునుండి బలాత్కారముగ ప్రజలకు హక్కులను లాగికొని వచ్చుచుండు రాజకార్య ధురంధరుని కాదు. రణరంగమున పరాక్రమకార్యము నొనర్చి వచ్చుచుండు యోధాగ్రేసరుని కాదు. వా రాహ్వానించుచున్నది ఒక యోగిని, సత్యాగ్రహిని, ప్రపంచము వదలివేసినవానిని; కాని దానియందే యుండి దానికొరకు పనిచేయు వానిని. ఆయన కేమియు స్వార్థము లేదు. తనకు కావలసినది యేదియు లేదు. అయినను ఆయోగి రెండు తిరుగటిరాళ్లమధ్యపడి నలుగుచున్నాడు. పైన "లా" అను పేర గవర్నమెంటుచేయు దౌర్జన్యములు ఒక తిరుగటిరాయి. అడుగున నిస్సహాయులై, నిర్వీర్యులై పడియున్న ప్రజల బానిసత్వము యింకొక తిరుగటిరాయి. ఈరెండు

రాళ్లమధ్యపడి ఆయన నలుగుచున్నాడు. ఆయనకు జీవితములో ఒకటే ఆశయము కలదు. తన మాతృదేశమునకు దాస్యవిముక్తియు, ప్రపంచజాతు లన్నిటియందు పరస్పరస్నేహము, భ్రాతృభావము పెంపొందించుటయు ఆయన జీవితాశయము. ఇంత కంటె ఆయనజన్మకు కారణము లేదు. ఆరోజున బొంబాయిలోనున్న మొగవురుషు లన్న వారందరు రోడ్లమీద నుండిరి. స్త్రీలందరు ఆకాశమునంటుకొను పట్టణపు మేడల వసారాలలో నిండియుండిరి. బొంబాయిలో దిగీదిగగానే గాంధిగారుచేసిన మొట్ట మొదటిపని యేమనగా, అక్కడచేరిన ప్రజాసమూహమునుగూర్చి ఉపన్యసించుటయే. అప్పటికే జనులు యావన్మంది అజద్ మైదానమునకు చేరిరి. గంభీర వాక్యములతో గాంధిగారు వారియెదుట తనహృదయమును విప్పి చెప్పెను. శాంతికొరకు శాయశక్తుల పనిచేసెద నని చెప్పెను. అస్పృశ్యులను హిందూమతమునుండి పోనివ్వనను దీక్షను మహాత్ముడు మరల ఈ సభయందు నొక్కి చెప్పెను. ఇందుకై తన ప్రాణములనైన సరే ఒడ్డెదనని మహాత్ముడు చెప్పెను. ఈ సమయమందుగాని, లండనులో రౌండు టేబిలు కమిటీయందుగాని మహాత్ముడు చెప్పిన యీ వాక్యములను యెవరును అంతగా గమనించలేదు. ఈ మాటప్రకారము మహాత్ముడు ప్రాయోపవేశమునకు గడంగు నని యెవ్వరును కలలోనైన తలచలేదు. మహాత్ముడు పెట్టుకొనిన యీవొట్టు చాలమంది అప్పుడే మరచిపోయిరి. ఈమాట వట్టి వాక్చాతుర్య మని కొందరు అనుకొనిరి. కాని గాంధిగారు వట్టిమాటలు చెప్పువాడు కాడు. వట్టికోతలు కోయువాడు కాడు. అని అందరికి తెలియును. అతడు అవునంటే అవును, కాదంటే కాదు. ఆయనమాటకు రెండవ అర్థము లేదు.

అన్ని రాష్ట్రములనుండియు వచ్చినప్రతినిధులు చెప్పుకొను గోడులనుగూర్చి వినుటలోనే గాంధిగారికి మూడురోజులు సరిపోయినవి. గాంధి యేమిచేయవలెను? ఒకప్రక్క బెంగాలునుండి సుభాస్ బోసున్నూ, మరి నలుగురు మిత్రులున్నూ వచ్చి, బెంగాలులో ప్రభుత్వము ఆర్డినెన్సుల పేర చేయుచున్న ప్రజాపీడనమును గురించి యేకరువుపెట్టసాగిరి. అట్లే సంయుక్తరాష్ట్రమువారు, వాయవ్యరాష్ట్రమువారు తమ గోడును వెళ్లబోసుకొనిరి. సంధికాలములో యీ ఆర్డినెన్సులు చాటుచాటున మణిగియుండి పనిచేయుచుండెను.

ఈ నిరంకుశశాసనములు విల్లింగుడను ప్రభువు యింగ్లీషు సంవత్సరాది పండుగ నాడు తనకిచ్చిన బహుమతులని గాంధిగారు ఛలోక్తిగా ననిరి. కాని శాంతిని నిలువ బెట్టుటకు యెన్నిమార్గము లైతే యున్నవో అన్నిమార్గములు తరచిచూచినగాని దేశమును తిరిగీ యుద్ధ మను అగాధములోనికి దించువాడు కాడు గాంధి. ఇది నిజమైన సత్యాగ్రహిలక్షణము. అన్ని ప్రాంతములనుండియు ప్రజలు వచ్చి ఉదయము మొదలు

సాయంకాలమువరకు తమబాధలను చెప్పుకొనసాగిరి. అన్ని రాష్ట్రములలోను అధికారులు చేయు దుండగములను చెప్పుకొనసాగిరి. దేశము అష్టకష్టముల పడుచుండెను. బహు దీర్ఘకాలము పెనగులాడినను కర్నాటకమునకు బాధానివారణ కాలేదు. ఆంధ్ర రాష్ట్రములో రీసెటిల్‌మెంటు ద్వారా భూమిపన్ను నూటికి రు. ౧౮-౧౨-౦ లు హెచ్చుచేయబడి వసూలుచేయుటకు సిద్ధముగా నుండెను. పన్నులివ్వమను మాట వినబడితే ఆర్డినెన్సు వేస్తానని మద్రాసుగవర్నరు ఊరుముచుండెను. ఇట్టి మొర లెన్నియో ప్రజలు గాంధిగారికి చెప్పుకొనిరి. ఇక తాను లండనునుంచి తీసుకొనివచ్చిన మొర లెన్నియోకలవు. వానినన్నిటిని గాంధిగారు తన స్నేహితులతో వెళ్లబోసుకొనిరి. అసలు రౌండు టేబిలు కాన్ఫరెన్సుకు వెళ్లుటకే గాంధిగారికి యిష్టములేదు. దానికి అవలక్షణములు జులై, ఆగష్టు నెలలలోనే కనబడెను. కాని 'నీవు వెళ్లితీరవలె' నని వర్కింగు కమిటీవారు పట్టు పట్టిరి. ఈ మధ్యలో గవర్నమెంటువారు సంధిషరతులను భంగపరచిరను కారణమున 'నేను లండనుపో'నని గాంధిగారు అనుటకు అవకాశము చిక్కెను. కాని యెట్లాగైనా సరే గాంధిగారిని కట్టకట్టి స్టీమరులో పడవేసితీరవలెనని లండనులోని లేబరుగవర్నమెంటు పట్టుపట్టెను. గాంధిగారు ఎట్లాగైతే నేమి లండను వెళ్లిరి. సంగతులు కళ్లార చూచిరి. ఒకసంగతి ఊహించుటకును, ప్రత్యక్షముగా చూచుటకును చాలా తేడావున్నదిసుమా యని గాంధిగా రనిరి. వారు మిత్రులతో అన్న మొదటిమాటే యిది. మితవాదుల గుణము గాంధిగారికి ఇండియాలో తెలియును. కాని లండనులో ప్రత్యక్షముగా జరిగిననాటకము గాంధిగారినే ఆశ్చర్యపడజేసెను. అట్లు జరుగునని ఆయన యెన్నడూ అనుకొనలేదు. మహమ్మదీయుల తత్త్వము గాంధిగారు యెరుగుదురు. వారియొక్క మనస్సు యెటు వాలునోకూడ వారికి తెలియును. కాని లండను గుండ్రబల్ల సభలో జరిగిన కసాయిపని మహాత్ముని దిగ్భ్రాంతి నొందించెను. ఏమైనా సరే యికమీదట యేవిధమైన కులతత్వమునకు కాంగ్రెసు చోటివ్వరాదని మహాత్ముడప్పుడు మనస్సును దృఢపరచుకొనెను. కాంగ్రెసుయొక్క తత్త్వము యెట్టి కల్తీలేని నిర్మలమైన జాతీయతత్త్వముగా ఉండితీరవలెనని ఆయన సంకల్పించెను. ఈ కులమత తత్త్వములతో పూర్వమువలెనే చెలగాట లాడుచున్నయెడల యిండియాకు మోక్షములేదని ఆయన గట్టిగా చెప్పెను. కులమతతత్త్వములవాసన యీషణ్మాత్రమైన లేకుండ కేవలము జాతీయ తత్త్వముమీదనే భావిభారత రాజ్యాంగము నిర్మింపబడుటకు తా మంగీకరింతు మని సిక్కు మహమ్మదీయ సోదరులు తనకు వాగ్దానము చేయవలెనని మహాత్ముడు కోరెను. లండనులో తాను చూచినదానివల్ల కలిగిన మనోభావములచే మహాత్ముని మనస్సు నిజముగా సంకటపడెను. అయితే తనముందుకర్తవ్యము నిర్వికార చిత్తముతో నిశ్చయించుకొనవలసియుండెను. మనశ్శాంతి, సమత్వము, నిర్వికారచిత్త

ము ఆయనసామ్మొలు. తనయందును తనప్రజయందును, మహాత్మునకు అపారమైన విశ్వాసము కలదు. ప్రజలు తన్ను నమ్మిరి. తాను ప్రజలను నమ్మెను. తనయెదుట పెద్ద అగాధము కనుపట్టెను. ఈ అగాధము తాను దాటగలడా? లేక యీ అగాధమును పూడ్చుటకై మనుష్యులను (చచ్చినవారిని బ్రతికినవారిని) అందులో పడవేయవలెనా? మనుష్యుల కళేబరములతో యీ బ్రిడ్జి కట్టవలెనా? ఆయన మనస్సులో యీ భావములన్నియు సముద్రపు అలలవలె లేచిపడుచుండెను. ఆయనయందు పెద్దతుపాను రేగుచుండెను. ఇట్టిస్థితిలో ఆయన భావికర్తవ్యమునకు గడంగెను. కాంగ్రెసు వర్కింగు కమిటీ ఆయనతో నుండెను. ఆయన గమనించినది ౧౪ మంది వర్కింగు కమిటీ మెంబర్లనే కాదు. యావత్తు హిందూదేశము ఆయన మనస్సులో నుండెను. భారతవర్ష ప్రజలందరిపక్షమున ఆయన విల్లింగ్డన్ ప్రభువునకు టెలిగ్రాముఇచ్చెను. వెంటనే జవాబు వచ్చెను—దీర్ఘమైనజవాబు!—అరిష్టమును సూచించు జవాబు! గాంధిగారు వెంటనే త్రిప్పికొట్టి జవాబు పంపెను. కాని ప్రయోజనము కలుగలేదు. ఆటెలిగ్రాము నిట పూర్తిగా వివరించెదము:

(౧) ౨౯-౧౨-౩౧ వ తేదీన గాంధిగారు వైస్రాయిగారికి యిచ్చిన టెలిగ్రాము:

"నేను నిన్న బొంబాయిలో నోడదిగేటప్పటికల్లా ఆర్డినెన్సులు, వాయవ్యపరగణాలో తుపాకుల కాల్పులు నాకెంతయో ప్రియులగు మిత్రుల అరెస్టులు, అన్నిటికంటె ఆశ్చర్యము బెంగాల్ ఆర్డినెన్సు నన్నెదుర్కొనును నని నే ననుకొనలేదు. వీనిని బట్టి మనమధ్య స్నేహభావ మిక కట్టుబడెనని నే ననుకొనవలెనేమో నాకు తెలియకున్నది. లేక నేను మీదగ్గరకు వచ్చి కాంగ్రెసుకు యికముందు నడకనుగూర్చి నేనేమి సలహా చెప్పవలసియుండునో మీతో సంప్రదించుటకు ఏమైనా అవకాశ మున్నదేమో తెలుసుకొనగోరెదను. ఇందువిషయమై మాట్లాడుటకు నన్ను రమ్మనెదరా? మీప్రత్యుత్తరమునకు నిరీక్షించుచున్నాను."

(౨.) ౩౧-౧౨-౩౧ వ తేదీన వైస్రాయి ప్రయివేటు శక్రటరీగారినుండి గాంధిగారికి వచ్చిన టెలిగ్రాము :—

౨౯ వ తేదీన ఆర్డినెన్సులను గురించి మీరు ఇచ్చిన టెలిగ్రాము చేరి వైస్రాయిగారు చాలా సంతోషించినారు. బెంగాలు విషయములో అక్కడ గవర్నమెంటు వుద్యోగస్థులను సాధారణజనులను నీచముగ వధించుచున్న దుర్మార్గుల దుష్కృత్యముల నాపుటకై సాధ్యమైన అన్నిచర్యలను ప్రభుత్వమువారు చేయుట అవసరమయ్యెను. అది అవసరమే.

"దేశములోని అన్ని రాజకీయపార్టీల వారితోడను, ప్రజలలో అన్నితరగతుల వారితోడను స్నేహభావముతో నుండుటయే తనకును తన ప్రభుత్వమునకును కోర్కె యని వైస్రాయిగారు తమతో మనవిచెయ్యమన్నారు. ముఖ్యముగా వీలైనంతత్వరలో ప్రవేశపెట్ట సంకల్పించిన రాజకీయ సంస్కరణల విషయములో అన్ని పార్టీలవారి సహకారమును వైస్రాయిగారు కోరుచున్నారు. అయితే సహకార మనునది పరస్పర ముండవలెను. సంయుక్తరాష్ట్రములలోను, వాయువ్య పరగణాలోను కాంగ్రెసువారు చేయుపనులయెడ ప్రభుత్వమువారు మిత్రభావమును గాని, సహకారభావమును గాని చూపజాలరు. ఇండియాయొక్క క్షేమమును కోరువారు యిట్టి కార్యములయెడ సాను భూతిచూపుట కుదురదు.

"ఇక సంయుక్తరాష్ట్రముల విషయములో రైతులకు సాధ్యమైనంత సౌకర్య ముల నిచ్చుటకు గవర్నమెంటువారు ఒకమూల ప్రయత్నము చేయుచుండగా సదరు రాష్ట్రీయ కాంగ్రెసుకమిటీవారు పన్నులనెగబెట్టు వుద్యమము సాగించినసంగతి మీకు తెలిసియేయున్నది. ఆవుద్యమము యిప్పుడు తీవ్రముగా సాగుచున్నది. కాంగ్రెసువారు యీ పని చేసినందువల్ల దేశములో కలుగగల అరాజకస్థితిని కులకక్షలను తరగతుల కక్ష లను నివారించుటకై గవర్నమెంటువారు చర్య తీసుకొనక తప్పినదికాదు. చూస్తూ వూరుకుంటే దేశమునకు యీ అరిష్టము లన్నియు కలిగితీరును.

"పశ్చిమోత్తరసరిహద్దుపరగణాలలో అబ్దుల్ గఫూర్ ఖానున్ను, ఆయనచే నడుపబడుచున్న సంఘములున్ను గవర్నమెంటుకు వ్యతిరేకముగా అనేక చర్యలను నిరంతరము చేయుచుండిరి. మతద్వేషములనుకూడ పురికొల్పుచుండిరి. వారి సహకార మును పొందుటకై ఆ రాష్ట్రముయొక్క ఛీఫ్ కమీషనరు చేసిన ప్రయత్నముల నన్ని టిని గఫూర్ ఖాను వర్గమువారు నిర్మొగమాటముగా తోసివేసిరి. లండనులో ప్రధాన మంత్రిగారు చేసిన ప్రకటనను గఫూర్ ఖాన్ వర్గమువారు నిరాకరించి తమకు సంపూర్ణ స్వాతంత్ర్యము కావలెనని ప్రకటించిరి. అబ్దుల్ గఫూర్ ఖాన్ అనేక వుపన్యాసము లను చేసెను. ప్రజలందరు తిరుగుబాటు చేయవలసెననుమాట తప్ప అందులోయింకొక అర్థము కనుపించదు. సరిహద్దుజాతులలో అల్లకల్లోలము పుట్టించుటకై ఆయన అను చరులు అనేకప్రయత్నములు చేసిరి. ఛీఫ్ కమీషనరు వైస్రాయిగారి మాటమీద యెంతో ఓపికపట్టియుండెను. గఫూర్ ఖానుతో సహకారమును పొందుటకు ఛీఫ్ కమీ షనరు ఆఖరునిమిషమువరకు ప్రయత్నముచేసెను. ఆరాష్ట్రములో రాజకీయసంస్క రణములను ప్రవేశపెట్టుదమను చక్రవర్తిగారిసంకల్పము సాధ్యమైనంతత్వరలో అమలు పెట్టిన సందర్భమున గఫూర్ ఖాన్ సహాయమును ఛీఫ్ కమీషనరు యెంతో కోరెను.

గఫూర్‌ఖాన్ వర్గముయొక్క చర్యలు శ్రుతిమించి రాగమున పడేవరకూ గవర్న్మెంటువారు యెట్టితీవ్రచర్యలు గడంగ లేదు. త్వరలో ఆయన గవర్న్మెంటుతో కయ్యమునకు కాలు ద్రువ్వుటకు బహిరంగమైన ప్రయత్నము చేయసాగెను. ఆ రాష్ట్రముయొక్క శాంతికి, అక్కడ నివసించుచున్న నానా జాతుల శాంతికి వీరిచర్యలు ఉపద్రవకరముగా కనబడుచుండెను. ఆలసించిన విషమించునట్లు కనిపించెను. గత ఆగస్టునెలలో గఫూర్‌ఖాన్ ఆరాష్ట్రములో కాంగ్రెసు ఉద్యమమును నడిపించుటకు పూనుకొన్నట్లు వైస్రాయిగారికి తెలియవచ్చినది. ఆ పూనికను కాంగ్రెసు బలపరచి ఆయన తయారుచేసిన వాలంటీరుసంఘములను కాంగ్రెసువారు ప్రత్యేకముగా ఆమోదించునట్లున్నూ వైస్రాయిగారికి తెలియవచ్చినది. పైన వివరించినట్టి ప్రయత్నములు చేయుచున్న మనుష్యులతోగాని, సంఘములతోగాని దేశశాంతికి జవాబుదారీ వహించిన వైస్రాయిగారెట్టి సంబంధమును పెట్టుకొనజాలరని వారు మీతో గట్టిగా చెప్పుచున్నారు. మీరు యీమధ్య యిండియాలో లేరు. రౌండుటేబిల్ వ్యవహారముకోసము లండను వెళ్లియున్నారు. మీరు అక్కడ వ్యవహరించినసందర్భమునుబట్టిచూడగా కాంగ్రెసువారు సంయుక్తరాష్ట్రములలోను, వాయవ్యరాష్ట్రములలోను చేసినపనులతో మీరు యేకీభవింతురని వైస్రాయిగారు అనుకొనజాలరు. ఆచర్యలకు మీరు జవాబుదారులని కూడ వారు నమ్మరు. ఈ నమ్మకమే నిజమైనయెడల వైస్రాయిగారు మిమ్ములను చూచి తమ అభిప్రాయములను మీతో వెల్లడించుటకు అంగీకరింతురు. రౌండుటేబిల్ సందర్భమున యేసహకారమైనే చూపబడినదో అట్టి సహకారమును నిలువబెట్టుటకు మీపలుకుబడిని యెంత బాగుగా వినియోగించవలెనో అందువిషయమైకూడ వైస్రాయిగారు మీతో ముచ్చటించగలరు. అయితే ఒకసంగతిమాత్రము మీతో యిచ్చట గట్టిగా చెప్పవలసియున్నది. బెంగాలు, సంయుక్తరాష్ట్రములు, వాయవ్యపరగణాలలో యిండియా గవర్న్మెంటువారు బ్రిటిషుప్రభుత్వమువారి సంపూర్ణమైన అనుమతితో విధిగా అవలంబించవలసివచ్చిన చర్యలనుగురించి మాత్రము వైస్రాయిగారు మీతో యెంతమాత్రము ముచ్చటింపజాలరని తెలుసుకొనవలెను. ఏపనికొరకైతే యీచర్యలు గావింపబడెనో ఆపని నెరవేరువరకు ఈచర్యలు యేమైనాసరే అమలులో నుండితీరవలసినదే. సత్పరిపాలనకు అవసరమగు శాంతిభద్రతలను సంస్థాపించుటయే యీచర్యలయొక్క సంకల్పము. మీనుండి జవాబువచ్చినతరువాత యీ ఉత్తరప్రత్యుత్తరములను వైస్రాయిగారు ప్రచురణ చేయదలచినారు."

౩. ౧-౧-౩౨ తేదీన గాంధిగారు వైస్రాయియొక్క ప్రయివేటుశ్రకటరీగారికి యిచ్చిన టెలిగ్రాము:

“౨౯ వ తేదీన నేను యిచ్చిన టెలిగ్రాముకు జవాబుగా వైస్రాయిగారు యిప్పించిన టెలిగ్రాముకు వారికి వందనములు. నేను ఎంతో మిత్రభావముతో చేసిన సూచనను వైస్రాయిగారు యీ రీతిగా నిరాకరించినందుకు నాకు చాలా విచారముగా నున్నది. వారియొక్క మహోన్నతపదవికి యిది తగనిరీతి యని నాకు ఖేదమగుచున్నది. నిజస్థితిని తెలుసుకొనగోరు సత్యాన్వేషిగా నేను వైస్రాయిగారికి విన్నవించుకొంటిని. గవర్నమెంటువారు గావించిన అసాధారణ తీవ్రచర్యలను గురించి గవర్నమెంటువారేమి చెప్పదలచుకొన్నారో విని తెలుసుకొనుటకై నేను కాంక్షించితిని. నాయొక్క మనవిని, హృదయమును గ్రహించుటకు బదులుగా వైస్రాయిగారు ముందుగనే నిరాకరించిరి. నేనెంతో ఘనముగా చూచుకొన్న నామిత్రులు తప్పుచేసిరని ముందుగానే నేననవలెనని వైస్రాయిగారు అనుచున్నారు. ఒకవేళ నే నిట్టి అపాత్రచర్యకు పాల్పడి నామిత్రులను నిందించి వైస్రాయిగారిసన్నిధికి పోవుటకు సిద్ధపడినను కూడ జాతికంతకు చావుబ్రతుకులతో సమానమగు ఈ ఆర్డినెన్సులవిషయము చర్చించుటకుకూడ నా కవకాశము లేదట.

“నాదృష్టిలో ఆర్డినెన్సులయెదుట ఈ రాజకీయసంస్కరణలు వట్టిగాలిగా కనిపించుచున్నది. ఈ నిరంకుశశాసనములను తీవ్రముగా యెదిరించనియెడల జాతి నిర్వీర్యమైపోవుట తప్ప వేరొండు లేదు. ఏవో అబద్ధాలు సంస్కరణములు వచ్చునను సందేహాస్పదమైన ఆశకొరకు జాతిని చంపుకొనుటకు ఆత్మగౌరవముగల యే భారతీయుడును ఒప్పుకొనడు. జాతి చచ్చినతరువాత ఈసంస్కరణలు ఎవరికి కావలెను? ఇచ్చిన సంస్కరణలను పనిచేయుటకుగాని, అనుభవించుటకుగాని జాతియే యుండదు. ఇక సరిహద్దు రాష్ట్ర విషయములో అక్కడ జరిగిన వని చెప్పబడుసంగతులను కొన్నిటిని మీరు టెలిగ్రాములో నేకరువుపెట్టితిరి. అవి నిజ మనుకొన్నను గవర్నమెంటు తీసుకొన్న తీవ్రచర్యలకు వానిని కారణములుగా చెప్పుటకు వీలుకనబడదు. ప్రజల ప్రేమను చూరగొన్న నాయకులను అరెస్టుచేయుట, న్యాయచట్టమతిక్రమించిన ఆర్డినెన్సులను చేయుట, మనుష్యుల అర్థప్రాణములకు నిలుకడ లేకుండపోవుట, నాయకుల అరెస్టులకు అసమ్మతిని తెలుపుటకు ప్రజలు ఉత్సవాదులు చేయసాహసింతురా యను అహంకారముతో నిరాయుధులును, శాంతిపరులును అగు ప్రజాసమూహాములపై తుపాకులు కాల్చుట—యీచర్యల కన్నిటికి యెంతమాత్రము కారణము కన్పట్టదు. గఫూర్ ఖాన్ గారు సంపూర్ణస్వాతంత్ర్యమునకు తనకు హక్కు కలదని గట్టిగా వాదించినారన్నచో తప్పేమున్నది? అది జన్మహక్కు. అట్టిప్రకటనను ౧౯౨౯ వ సం.రములో లాహోరు కాంగ్రెసే జంకు కొంకులేక ప్రకటించియుండలేదా? లండనులో నేను బ్రిటిషు గవర్నమెంటుయెదుటనే నదురుబెదురు లేక గట్టిగా

వాదించియుండలేదా? కాంగ్రెసు నన్ను తన తరఫున ప్రతినిధిగా నెన్నుకొని లండను సభకు పంపదలచినప్పుడు యీ సంపూర్ణ స్వాతంత్ర్యమునుగూర్చి అక్కడ గట్టిగా వాదింపవలసినదని కాంగ్రెసు నాకు ఆజ్ఞాపించి పంపలేదా? కాంగ్రెసు నా కిట్టి ఆజ్ఞ నొసగిన సంగతి వైస్రాయిగారికి తెలిసియుండియు వారు నన్ను లండనుకు పంపియున్న సంగతిని వైస్రాయిగారు మరచిపోయినారా? గఫూర్‌ఖానుగారు షేక్‌కమీషను దర్బారుకు రానున్నా రనుట దోషమా? ఈ దోషమునకు విచారణ లేకుండ జైలులో త్రోయుట శిక్షయా? గఫూర్‌ఖానుగారు జాతిద్వేషములను పురికొల్పుచున్నా రన్నమాట నిజమే అయినా అది నిశ్చయముగా విచారకరమైన సంగతియే. తా నట్టితప్పు చేయలేదని గఫూర్‌ఖానుగారు నాయెదుట స్వయముగా చెప్పినారు. పోనీ, ఆయన జాతిద్వేషము పురికొల్పినమాటయే నిజమని మీరు వాదించేయెడల అతడు బహిరంగ విచారణకు తగడా? ఈ నిందకు సమాధానము చెప్పుకొనుటకు అవకాశ ముండవలెను గదా? ఇక సంయుక్తరాష్ట్రములు విషయములో వైస్రాయిగారికి వినవచ్చిన సంగతులు నిజము కావు. ఏలయనగా కాంగ్రెసువారిచేత అచ్చట పన్నుల నెగబెట్టు ప్రయత్నము అనుమతింపబడలేదు. జరిగినసంగతి యేమనగా, గవర్నమెంటుకు కాంగ్రెసుకు మధ్య రాయబారములు జరుగుచున్నకాలములో శిస్తువసూళ్ల తరుణము వచ్చెను. శిస్తులు యిస్తారా లేదా యని ప్రజలకు వత్తిడివచ్చెను. ఆ సందర్భములో రాయబారముల పర్యవసానము తేలువరకు శిస్తులను చెల్లించుపని ఆపవలసినదని కాంగ్రెసువారు రైతులకు తప్పనిసరిగా సలహా యివ్వవలసివచ్చెను. అదిగాక రాయబారముల పర్యవసానము తేలువరకు శిస్తువసూళ్లపని తాత్కాలికముగా అధికారులు ఆపుజేసేయెడల రైతుల కిచ్చిన యీసలహాను వుపసంహరింతు మని కాంగ్రెసుతరఫున షేర్వానీగారు మాట యిచ్చిరి. కాబట్టి మీరు టెలిగ్రాములో చెప్పినట్లుగా యీ విషయ మంత తేలికగా త్రోసివేయదగినది కాదని నేను సాహసించి చెప్పగలను. సంయుక్తరాష్ట్రములలోని రైతులు ఆర్థికముగా నలిపివేయబడుచున్న సంగతియెల్లరకు తెలిసిన విషయమే. ఈసమస్య యీనాటిది కాదు. ఇందులో కోట్లకొలది రైతుల శ్రేయస్సు ఇమిడియున్నది. తనపాలపడిన ప్రజల శ్రేయస్సునకై పాటుపడు యెట్టి ప్రభుత్వముగాని కాంగ్రెసువంటిసంస్థ అడుగకుండా యిచ్చు సహకారమును ఆప్యాయముగా స్వీకరించును. ఈ కాంగ్రెసు యెట్టిది? ప్రజాసమూహములపై కాంగ్రెసుకు గొప్పపలుకుబడి కలదని అందరుఒప్పుకొన్నవిషయమే. విశ్వాసముతో ప్రజలను సేవించుట తప్ప కాంగ్రెసుకు వేరొండు ఆశ లేనిసంగతియు లోకవిదితమే. అదిగాక నే నిక్కడ యింకొక సంగతిని మనవిచేయ దలచినాను. ఏమనగా, దుర్భరమగు ఆర్థిక పీడనమునుండి విముక్తినొందుటకై సర్వవిధముల ప్రయత్నములుచేసి నిష్ఫలులైనవారికి

పన్నుల నిరాకరించుట తప్ప గత్యంతర మేదియు కానరాదు. ఈపన్నుల నిరాకరణము యిట్టిసందర్భములో ప్రజలకు సహజమును, సనాతనమును అయిన జన్మహక్కు. దీనిని యెవరును తీసివేయజాలరు. దేశములో వట్టిపుణ్యానికి యేరూపమునగాని అల్లకల్లోలము తెచ్చిపెట్టెద మను తలపు కాంగ్రెసునకు యేకోశమందును లేదు. ఇట్టి తలపు కలదని చెప్పు సూచనను నేను నిరాకరించి తీరవలెను.

"ఇక బెంగాల్ విషయము-హత్యలను ఖండించువిషయములో కాంగ్రెసుగవర్నమెంటుతో యేకీభవించుచున్నది. ఇట్టి నేరములను తుడిచివేయుటకు అవసరమగు చర్యలను చేయుటలో గవర్నమెంటుకు కాంగ్రెసు మనఃస్ఫూర్తిగా తోడ్పడగలదు. కాని విప్లవకారుల దౌర్జన్యకృత్యములను కాంగ్రెసువారు యెంత నిర్మొగమాటముగా ఖండింతురో అంత నిర్మొగమాటముగానే ప్రభుత్వదౌర్జన్యమునుకూడా నిందింతురు. బెంగాలు ఆర్డినెన్సు పేరిట జరుపబడుచున్న ప్రభుత్వదౌర్జన్యకృత్యములతో కాంగ్రెసునా రెట్టి సానుభూతిని చూపజాలరు. అదిగాక "[illegible]" పేరిట గవర్నమెంటు చేయు ఘోరకృత్యములను కాంగ్రెసు తనయొక్క అహింసాతత్వమునకు లోబడి శాయశక్తుల రోధించి తీరును. సహకారము ఉభయులయందు పరస్పరము ఉండవలెనని తాము చెప్పినమాటతో నేను మనఃపూర్వకముగా యేకీభవించుచున్నాను. కాని మీ టెలిగ్రాము యావత్తు చదివిచూడగా సహకారమంతయు మా కాంగ్రెసే చేయవలెననియు, గవర్నమెంటు పక్షమునుండి [illegible] సహకార మేమియు రానక్కర లేదనియు ప్రభుత్వమువారి అభిప్రాయమైనట్లు నాకు నిష్కర్షగా కనబడుచున్నది. ఇంతకంటె వేరు అర్థమా నాకు కనిపించలేదు. ఆర్డినెన్సులకు సంబంధించిన విషయములను చర్చించుటకే వీలులేదని వైస్రాయిగారు ఒక్కపెట్టున త్రోసివేయుట చూడగా నాకు యిందు వేరు అర్థ మేదియు కన్పడుట లేదు. ఈవిషయములకు రెండుపక్షము లున్నవి. ప్రజాపక్షము నాకు తెలిసినంతవరకు చెప్పితిని. కాని ఒక నిర్ధారణకు వచ్చుటకుముందు రెండవపక్షము, అనగా గవర్నమెంటు పక్షముకూడా విని మరీ కాంగ్రెసుకు సలహా యిత్తమని యుంటిని.

"ఇక మీ టెలిగ్రామములో చివరపేరాను గురించి ఒకమాట చెప్పెదను. సంయుక్తరాష్ట్రములలో గాని, వాయవ్యరాష్ట్రములలో గాని మావారు చేసినపనులకు నైతికముగా నేను జవాబుదారి కానని చెప్పజాలను. అయితే నేను లండనులో ఉన్న సమయమున మావారు ఆరాష్ట్రములలో యేయేపనులు చేసినారో తప్శీలుగా నాకు తెలియదని ఒప్పుకొందును. అందుకోసమే, అనగా ఆసంగతులు తెలుసుకొనుటకొరకే నేను మీవద్దకు రాదలచితిని. ఈసమయమున విశదముగా చర్చి

తెలుసుకొని కాంగ్రెసుకు ఉచితమగు సలహా ఒసగుట అవసరము గనుకనే నేను యెంతో సద్భావముతో, మనస్సులో యేమియు పెట్టుకొనకుండా వైస్రాయి గారిని దర్శించగోరితిని. వారియొక్క సలహాను నిర్మొగమాటముగా, మనస్పూర కోరితిని. నాసద్భావమునకు, మైత్రికి వారు అనుగ్రహించిన జవాబు యెంతమాత్రము బదులుకాదని నా అభిప్రాయము. నా మనస్సులో కలిగిన అభిప్రాయమును వైస్రాయిగారికి చెప్పకుండా దాచుకోలేదు. మరియు యిప్పటికైనను మించినది లేనియెడల వైస్రాయిగారు తమ నిశ్చయమును పునర్విమర్శించుకొని యెట్టి షరతులు విధించకుండా మిత్రునిగా నన్ను రప్పించుకొని చూడగోరెదను. నామటుకు నేను మనస్సులో నేమియు పెట్టుకొనకుండా వారు చెప్పసంగతు లన్నిటిని సావధానముతో విని పరిశీలింతు నని వాగ్దానము చేయుచున్నాను. నేను మనస్సులో యెట్టి సంకోచమును పెట్టుకొనక ఆయారాష్ట్రములకు పల్లి అధికారుల సహాయముతో రెండు పక్షములను పరిశీలించిచూచెదను. ఇట్లు పరిశీలించినమీదట తప్పు ప్రజలదే యని నాకు నిశ్చయమైనయెడల ఆసంగతిని నేను బహిరంగముగా ప్రకటించుటకు జంకను. "తప్పు ప్రజలది; నేనును వర్కింగుకమిటీకూడా యీ విషయములో మోసపోతిమి. 'గవర్నమెంటు చేసినది రైటు' అని నిశ్చయమైనయెడల నేను యీసంగతిని బహిరంగముగా ఒప్పుకొని తదనుగుణముగా కాంగ్రెసును నడిపింతును."

"గవర్నమెంటుతో సహకారము చేయవలెనను కోర్కెతోపాటు నాకున్న నియమములు కూడా వైస్రాయిగారికి మనవి చేయవలసియున్నది. అహింస నాకు సంపూర్ణ ఆదర్శతత్త్వము. శాసనోల్లంఘనము ప్రజలకు-ముఖ్యముగా తమప్రభుత్వములో పలుకుబడి లేనప్పుడు-స్వభావసిద్ధముగుహక్కు అని నానమ్మకము. అంతేకాదు, దౌర్జన్యమునకు, కత్తులతో లేచి తిరుగుబాటు చేయుటకు బదులుగా యిది మంచిప్రత్యామ్నాయాస్త్రము మని నావిశ్వాసము. కాబట్టి యిది నాసిద్ధాంతము. దీనిని నేను త్రోసివేయజాలను. ప్రజలను నడిపించుటకు నాకిక ముందు నేరే అవకాశము ఉండదని పుకారులు వినవచ్చుచున్నవి. ఈపుకారులు అసత్యమని యెవరును అనలేదు. పైగా యిప్పటి గవర్నమెంటు చర్యలును యీపుకారులకు బలమిచ్చుచున్నవి. కాబట్టి నా అహింసా సిద్ధాంతము ననుసరించి యికమీద నడుపవలసిన శాసనోల్లంఘన కార్యక్రమమును గూర్చి కాంగ్రెసుకు సలహా నిచ్చితిని. ఆసలహాను వర్కింగుకమిటీవారు ఆమోదించిన శాసనోల్లంఘన తీర్మానమును తాత్కాలికముగా జేసిరి. ఆ తీర్మానము నకలును యిందుతో పంపుచున్నాను. ఇప్పటికైనను వైస్రాయిగారు నన్ను చూచి నందువల్ల ప్రయోజన మున్నదని తలచినట్లయితే యీతీర్మానముయొక్క ఆచరణ ఆపుదల చేయబడును. మాఉభయుల సంప్రదింపుకల్ల యీతీర్మానము అమలులో పెట్టు

అవసరము వుండకపోవచ్చు ననే ఆశచేత చర్య ఆపుదల చేయబడును. మా వుభయుల మధ్య జరిగిన యీ వుత్తర ప్రత్యుత్తరములు దేశమునకెంతో ప్రాముఖ్యమైనవి. వీనిని ప్రచురించుటలో ఆలస్యము చేయరాదను సంగతిని నేను వొప్పుకొందును. అందు కొరకే యీ టెలిగ్రాములను, వర్కింగు కమిటీ తీర్మానములను ప్రచురణనిమిత్తమై పత్రికలకు పంపుచున్నాను."

## వర్కింగ్ కమిటీ తీర్మానములు

"మహాత్మాగాంధిగారు యింగ్లండునుండి తిరిగివచ్చి చెప్పిన సంగతులను వర్కింగు కమిటీవారు విన్నారు. బెంగాల్ సంయుక్తరాష్ట్రములు, సరిహద్దుపరగణాలలో జారీ చేయబడిన అసాధారణనిరంకుశశాసనములవల్లను, ఖాన్ అబ్దుల్ గఫూర్ ఖాన్, షేర్వానీ, పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ మొదలైన అసంఖ్యాకుల అరెస్టులు, సరిహద్దు రాష్ట్రములో నిరపరాధులను కాల్చుటలు, అందువల్ల చాలామంది చనిపోవుట, యింకనూ చాలమందికి గాయములు తగులుట మొదలగు అధికారులచర్యలవల్లను దేశములో యేర్పడినపరిస్థితిని వర్కింగు కమిటీవారు ఆలోచించినారు. మరియు మహాత్మాగాంధి గారు పంపిన టెలిగ్రాముకు బదులుగా వైస్రాయిగారు యిచ్చిన టెలిగ్రామునుకూడా వర్కింగు కమిటీవారు చూచినారు."

"ఈ మూడురాష్ట్రములలో అధికారులు గావించిన ఈ చర్యలున్నూ, యితర రాష్ట్రములలో గావించిన చిల్లరచర్యలును వైస్రాయిగారినుండి వచ్చిన టెలిగ్రామును చూడగా ప్రభుత్వపద్ధతి సంపూర్ణముగా మారితేనే తప్ప లేకపోతే కాంగ్రెసువారు గవర్నమెంటుతో యిక యెట్టి సహకారమును చేయుట దుస్సాధ్యమని స్పష్టపడు చున్నది. ఈ చర్యలును టెలిగ్రామును ఏమి సూచించుచున్నవనగా అధికారమును ప్రజలచేతులలో పెట్టుదమను తలంపు అధికారవర్గమునకు యేకోశమునకూడా లేదనియూ, పైపెచ్చు జాతినంతను నిర్వీర్యము చేసివేయవలెనని వారితలంపు అయినట్లును స్పష్ట పడుచున్నది. కాంగ్రెసుతో ఒకమూల సహకారము కావలెనని పైకి చెప్పుచున్న ప్పటికి కాంగ్రెసునందు గవర్నమెంటుకు నమ్మకము లేనిసంగతికూడ తేటతెల్ల మగు చున్నది."

"ఇటీవల బెంగాలులో కొందరు వ్యక్తులవల్ల యేకారణముచేతనైతే నేమి జరుప బడిన దౌర్జన్యకృత్యములయెడ అసహ్యము చూపువిషయములో వర్కింగుకమిటీవారు యెవరికినీ తీసిపోరు. అయితే యిటీవల జరుపబడిన చర్యలవల్లనూ, నిర్మించిన నిరంకుశ శాసనములద్వారాను ప్రభుత్వము చేయుచున్న దౌర్జన్యకృత్యములనుకూడా అంతే

అసహ్యముతోడనే కాంగ్రెసుకమిటీవారు ఖండించుచున్నారు. ఇటీవల కొమిల్లాలో యిద్దరు కన్యలు చేసిన హత్యలు జాతికి చాలా అవమానకరమైనవని వర్కింగుకమిటీ వారు గుర్తించినారు. దేశమునకు గొప్పప్రతినిధియైన కాంగ్రెసుద్వారా స్వాతంత్ర్యమును సంపాదించుటకు అహింసాదీక్షను పూనిన సందర్భములో యిట్టి హత్యలు దేశమునకు చాలా హానిచేయును అని వర్కింగుకమిటీవారి నిశ్చితాభిప్రాయము. అయితే యీసందర్భమున ప్రభుత్వమువారు నిర్మించిన బెంగాల్ ఆర్డినెన్సును సమర్థించుటకు యెంతమాత్రము అవకాశము లేదు. ఎవరో కొందరు చేసిన తప్పు కొరకై దేశమునంతను శిక్షింపజూచు యీనిరంకుశశాసనము సమర్థనీయము కాదు. అసలు యిట్టి హత్యలకు మూలకారణ మేమో అందరెరుగుదురు. తగిన కారణమునకు మందు వేయవలెననే కాని యింకొకవిధముగా చేయరాదు."

"బెంగాల్ ఆర్డినెన్సుకే ఆధారము లేనప్పుడు సంయుక్తరాష్ట్రములలోను, సరిహద్దురాష్ట్రములలోను ప్రయోగించిన శాసనములకు అసలే ఆధారము కన్పట్టదు. రైతులబాధ నివారించుటకై సంయుక్త రాష్ట్రములలో కాంగ్రెసువారు సాగించిన చర్యలు సమర్థనీయము అని వర్కింగుకమిటీవారి అభిప్రాయము. సంయుక్త రాష్ట్రములలో రైతులు ఘోరముగా ఆర్థికసంకటమునకు లోనైనసంగతి అందరు అంగీకరించిన విషయమే. అన్ని యితరవిధములవారు ప్రయత్నము చేసి విఫలులైన సంగతియు అంద రెరిగినదియే. ఇట్టి సందర్భములో పన్నుల నెగబెట్టుట యెవరికైనగాని (యితరమార్గము అనుసరించుటకు అవకాశము లేని) సహజమైన హక్కు" అని వర్కింగుకమిటీ వారి అభిప్రాయము."

"సంయుక్తరాష్ట్రముల కాంగ్రెసుకమిటీ ప్రెసిడెంటు అయిన షెర్వానీ గారున్ను, కాంగ్రెసు జనరల్ సెక్రటరీ అయిన పండిత జవహరలాల్ నెహ్రూ గారున్ను, గాంధిగారితో సంప్రదించి వర్కింగుకమిటీ మీటింగులో పాల్గొనుటకు బొంబాయికి పోవుచుండగా వారిని పట్టుకొని జైలులో వేయుటలో గవర్నమెంటు వారు తమ ఆర్డినెన్సులో తలపెట్టిన దానికంటె కూడా యెక్కువదూరము దాటి వెళ్లిరి. ఈ ఆర్డినెన్సు సంయుక్తరాష్ట్రములలోని పన్నుల నిరాకరణోద్యమమునకు సంబంధించినది గదా? బొంబాయిలో సంయుక్తరాష్ట్రముల పన్నుల నిరాకరణ మేమున్నది?"

"ఇక సరిహద్దు రాష్ట్ర విషయములలో ఆర్డినెన్సు ప్రయోగించుటగాని, ఖాన్ అబ్దుల్ గఫూర్ ఖాన్ గారిని, వారి అనుచరులను పట్టుకొని విచారణ లేకుండ జైలులో వేయుటకుగాని యెట్టి అవసరము లేనేలే దని గవర్నమెంటువారు చెప్పినమాటలను

బట్టియే స్పష్టపడుచున్నది. ఆరాష్ట్రములో నిరపరాధులు, నిరాయుధులునగు ప్రజల మీద కట్టిపుణ్యానికి తుపాకులను కాల్చుట కేవలము రాక్షసకృత్యమని వర్కింగు కమిటీవారు తలచుచున్నారు. ఈ సందర్భమున పరాక్రమశాలు లగు సరిహద్దుప్రజలు చూపిన సహనమును, స్థైర్యమును వర్కింగు కమిటీవారు అభినందించుచున్నారు. పరాక్రమధను లగు సరిహద్దుప్రజలు ప్రభుత్వము తమ్మెంత చీకాకుపరచినను అహింసాతత్త్వమును వీడక యిట్లు స్థైర్యముతో నిలబడి పోరాడినయెడల వారియొక్క పరాక్రమము, పడినబాధలు యిండియాయొక్క స్వాతంత్ర్యసిద్ధిని దాపునకు చేర్చగలదను విషయములో వర్కింగు కమిటీవారికి యెట్టి సంశయమును లేదు."

"ఈ ఆర్డినెన్సుల నిర్మించుటకు కారణభూతమైన అంశము లేమి? మామూలు కోర్టులను, యితరశాసనసభలను రద్దుపరచవలసిన అవసర మేమి కలిగెను? ఈ ఆర్డినెన్సు క్రింద నిట్టికృత్యము లేల చేయవలసివచ్చెనో నిష్పాక్షికముగా బహిరంగవిచారణ చేయవలెనని వర్కింగు కమిటీవారు ఇండియా గవర్నమెంటువారిని కోరుచున్నారు. ఇట్టి విచారణ చేయబడునుకొని తనసాక్ష్యము నిచ్చుటకు అవకాశ మిచ్చినయెడల అందుకు వర్కింగుకమిటీవారు సంసిద్ధముగా నున్నారు."

"ప్రధానమంత్రిగారు లండను రౌండుటేబిల్ కాన్ఫరెన్సులో చేసినప్రకటనను వర్కింగుకమిటీవారు విచారించియున్నారు. పార్లమెంటుసభలలో జరిగిన చర్చలను గమనించినారు. కాంగ్రెసు కోరిన కోర్కెలతో పోల్చిచూడగ యివి చాల అసంతృప్తికరముగను, అసంపూర్ణముగనున్నవని వర్కింగుకమిటీవారి అభిప్రాయము. సంపూర్ణ స్వాతంత్ర్యము - అనగా కోశ, దండములపైనను, పర ప్రభుత్వములతోడి సంబంధ విషయములకు క్షేమమునకు సంపూర్ణస్వాతంత్ర్య ముండవలెను. ఇందుకు ఏమాత్రము కొరవడినను కాంగ్రెసుకు సంతృప్తి లేదు. అయితే దేశక్షేమమునకు అవసరమని నిరూపింపగల మినహాయింపులు (సేఫ్‌గార్డులు) మాత్రము ఉండవచ్చును"

"కాంగ్రెసు జాతిమతవివక్ష లేకుండ యావత్తుదేశమునకు ప్రాతినిధ్యము వహించి మాట్లాడుటకును, పనిచేయుటకునూ కాంగ్రెసుకు అధికార మున్నసంగతిని బ్రిటిషు గవర్నమెంటువారు రౌండుటేబిల్ సభలో అంగీకరించలేదనువిషయము వర్కింగు కమిటీవారు గమనించినారు. మరియు సదరుసభలో వివిధమతములవారికిని ఐక్యము కుదురలేకపోయె నను సంగతినిగూర్చి కమిటీవారు విషాదము పడుచున్నారు. కాబట్టి భారతజాతి కంతకును ప్రాతినిధ్యమువహించుటకు కాంగ్రెసుకు శక్తికలదని నిరూపించుటకు దేశీయులెల్లరు ఎడతెగనికృషి చేయవలసినదని వర్కింగు కమిటీవారు దేశమును

హెచ్చరించుచున్నారు. కేవలము జాతీయసిద్ధాంతములపై నిర్మింపబడిన రాజ్యాంగ ప్రణాళిక దేశములోని అన్ని సంఘములవారికీ అంగీకారమగులాగున దేశములో వాతావరణమును పెంపొందించుటకును దేశీయులు పాటుపడవలెనని వర్కింగు కమిటీవారు కోరుచున్నారు. ఈలోపుగా వైస్రాయిగారు సవరు జవాబును పునర్విమర్శించుకొని ఆర్డినెన్సులవిషయములోను, అంతర్క్రింద యిటీవల జరిగిన అధికారుల చర్యలలోను తగుపరిహారము నిచ్చేయెడల కాంగ్రెసువారు గవర్నమెంటుతో సహకారము చేయుటకు సిద్ధముగానున్నారు. మరియు నిశ్చయముగా రాజ్యాంగవిషయమునుగూర్చిన సంప్రతింపులలో కాంగ్రెసు కోరు సంపూర్ణస్వాతంత్ర్యమునకు అవకాశ మిచ్చి యీస్వాతంత్ర్యము లభించులోగా [illegible] పరిపాలనను ప్రజాప్రతినిధుల సంప్రతింపులతో సాగించేయెడలనున్నా, కాంగ్రెసువారు గవర్నమెంటుతో సహకారము చేయుగలరు"

"పైన ఉదాహరించిన పద్ధతులకు సంతృప్తికరమగు జవాబు గవర్నమెంటునుండి రానియెడల ఢిల్లీసంధిని గవర్నమెంటువారు పూర్తిగా త్రోసివేసినందుకు నిదర్శనముగా కమిటీవారు ఎంచుకొందురు. సంతృప్తికరమగు సమాధానము రానియెడల తిరిగీ పన్నుల నిరాకరణముతో సహా యీక్రింది షరతులకు లోబడి శాసనోల్లంఘనము తిరిగీ ప్రారంభింపవలసినదని వర్కింగు కమిటీవారు దేశమును కోరుచున్నారు."

(౧) ఏ ప్రాంతములోని ప్రజలుకాని యీ పోరాటములోని అహింసాస్వభావమును, దానిలోని సాంకేతికములను గ్రహింపకపోయినయెడలనున్నా, అర్ధప్రాణముల నాశనమునకు సంసిద్ధులుగా లేనియెడలనున్నా, యితరబాధలు పడలేనియెడలనున్నా ఆ ప్రాంతమువారు గాని, జిల్లావారుగాని, గ్రామమువారు గాని శాసనోల్లంఘనము చేయవలసినపని లేదు.

(౨) ఎంతచీకాకు కలిగినను మనస్సులోను, వాక్కులోను, క్రియలోను అహింస అనేది అవలంబించవలెను. ఈ పోరాటము మనలను పీడించువారిమీద కసితీర్చుకొనుటకు కాదు. మనమే ఆ బాధలుపడి మనలను హింసించువారి మనస్సును మన ఆత్మపారిశుద్ధ్యముచే మార్చుటయే ఈ పోరాటముయొక్క ఉద్దేశ్యమని యెల్లరును గ్రహించవలెను.

(3) గవర్నమెంటు ఉద్యోగస్థులు, పోలీసులు జాతీయోద్యమమునకు వ్యతిరేకులైనవారు- వీరలకు బాధ కలిగించు తలంపుతో సాంఘికబహిష్కారము చేయరాదు. అహింసాతత్త్వమునకు ఇది విరుద్ధము.

(౪) అహింసతో కూడిన పోరాటములు ద్రవ్యాపేక్ష లేనివని యెరుగవలెను. కాబట్టి డబ్బిచ్చి యెవరినీ వాలంటీరులుగా చేర్చరాదు.

కాని జైలుకు వెళ్లినట్టిగాని, ఈ ఉద్యమములో చనిపోయినట్టిగాని వాలంటీర్ల యొక్క పేదకుటుంబికులకు ఆశ్రితులకు తగుమాత్రము మనువృత్తియిచ్చుట సాధ్యమైన చోటనెల్ల చేయవచ్చును. ఈ విషయములలో యెన్ని కష్టములు వచ్చినను సరే, యీ పోరాటము వలంటీరులు సాగించవలసినదే యని వర్కింగుకమిటీవారు కోరుచున్నారు.

(౫) ఎట్టి పరిస్థితులలోనైనా సరే అన్నివిధములైన విదేశవస్త్రములను అవి యింగ్లీషువైననూ సరె లేక యితరదేశమువైననూ సరే బహిష్కరించుట యెల్లరకు విధి.

(౬) కాంగ్రెసులో చేరిన స్త్రీపురుషు లందరు చేతితో వడికి చేతితోనేసిన ఖద్దరును ధరించుట విధి. హిందూదేశపు మిల్లులలో తయారైన బట్టకూడా పనికిరాదు.

(౭) కల్లుదుకాణములను, విదేశీగుడ్డల దుకాణములను తీవ్రముగా పికెటింగు చేయవలెను. స్త్రీలు ముఖ్యముగా ఈపనికి పూనుకొనవలెను. అయితే యెక్కడను దౌర్జన్యము యెంతమాత్రము పనికిరాదు.

(౮) లైసెన్సు లేకుండా వుప్పును ప్రోగుచేయుట, తయారు చేయుట అందరు తిరిగి సాగించవలెను.

(౯) ఉత్సవములు ఊరేగింపులు సాగించేయెడల నిర్భయముగా తమచోటుల నుండి కదలకుండా లాటీదెబ్బలు, తుపాకిగుండ్లు తినుటకు సంసిద్ధమైనవారే ఈ వుత్సవాదులలో పాల్గొనవలెను.

(౧౦) శాంతిసమయములో సైతము పీడాపరులచే తయారుచేయబడిన వస్తువులను బహిష్కరించుట తప్పుకాదు. యేలననగా పీడింపబడువారు పీడించువానితో వర్తకవ్యాపారము పెట్టుకొనుటగాని, పెంపొందించుటగాని విధికాదు. కాబట్టి బ్రిటిషు సంస్థలను తీవ్రముగా బహిష్కరించవలెను.

(౧౧) నీతి, అవినీతులతో సంబంధము లేని అన్నిచట్టములను శాంతిసహితముగా వుల్లంఘించవలెను. ప్రజలకు హానికరమగు ఆర్డర్లనన్నిటిని సాధ్యమైనచోట్ల వుచితమైనచోట్ల వుల్లంఘించవలెను.

(౧౨) ఆర్డినెన్సులక్రింద జారీచేయబడు అన్ని అక్రమపుటుత్తరువులను నెమ్మదిగా వుల్లంఘించవలెను."

(౪) ౨-౧-3౨ తేదీని వైస్రాయిసెక్రటరీగారినుండి గాంధిగారికి వచ్చిన టెలిగ్రాము:

"మీరు ఒకటవతారీఖున యిచ్చిన టెలిగ్రాము అందినది. వైస్రాయిగారును, గవర్నమెంటువారును దానినిగురించి ఆలోచించినారు. కొన్ని షరతులకు గవర్నమెంటు ఒప్పుకుంటేనే తప్ప లేకపోతే దేశము తిరిగి శాసనోల్లంఘనము కొనసాగించ

వలెనని మీ సలహాపై కాంగ్రెసుకర్యాలోచకమిటీవారు తీర్మానించినందులకు గవర్న మెంటువారు చాలా విచారపడుచున్నారు.

లండనులో ప్రధానమంత్రిగారు యిండియాకు రాజకీయ సంస్కరణములు యిచ్చెదమని చెప్పినమాటను సాధ్యమైనంతత్వరలో అమలుజరుపుటకు యిండియాలోను ఇంగ్లాండులోను యెంతో పాటుపడుచున్న తరుణములో కాంగ్రెసువారు యిట్టి తీర్మానము చేయుట మరింత విషాదకరము. 'మాషరతులకు వొప్పుకుంటే సరేసరి; లేక పోతే శాసనోల్లంఘనము చేస్తా' మని యిట్టి రాజకీయ సంస్థగాని బెదరించే బెదరింపులకు జవాబుదారీగల యేప్రభుత్వమును బెదరజాలదు. మీఅభిప్రాయమునాధారముచేసుకొనియే గవర్న మెంటు నడవవలెనని మీ టెలిగ్రాములో కనబడుచున్నది. ఇట్టిస్థితిని యిండియాగవర్న మెంటువారు యెంతమాత్రము అంగీకరింపజాలరు. స్థితిగతుల నన్నిటినీ జాగ్రత్తగా ఆమూలాగ్రముగా పరిశీలించి యితర వుపాయము లన్నియు నిరర్థకమైనపిమ్మటనే గవర్న మెంటువారు యిట్టిచర్యకు దిగిరి. దాని నిప్పుడు మీ అభిప్రాయముప్రకారము మార్చుకొనవలసినదని కోరుట అసంభవము.

శాసనోల్లంఘనము చేసెదమని మీరు బెదరించుతూవుంటే నేను మిమ్ములను ఆహ్వానింపగలనని మీ రెట్లనుకొనగలరు? మీ రనుకొనగలరని వైస్రాయిగారు యెట్లు నమ్మగలరు? ఆహ్వానించిన ప్రయోజన మేమి వుండగలదు? కాంగ్రెసువారు తలపెట్టిన వుద్యమమువల్ల కలుగబోయే ఫలితముల కన్నిటికీ మిమ్ము కాంగ్రెసును గవర్న మెంటు వారు జవాబుదారీ చేయుచున్నారు. ఈ వుద్యమము నెదుర్కొనుటకు అవసరమగు అన్నిచర్యలు గవర్న మెంటువారు చేయుదురు."

(౫) 3-3-3౧ వ తేదీని గాంధిగారు వైస్రాయిసెక్రటరీగారి కిచ్చిన టెలిగ్రాము:

"ఈరోజు వచ్చిన మీ టెలిగ్రామునకు వందనములు. వైస్రాయిగారును, ప్రభుత్వమువారును చేసుకొన్న నిశ్చయమునకు విచారము తెలుపక తప్పదు. మనస్సులో వున్నమాటలు నిర్మొగమాటముగా చెప్పుట బెదరించుట యనుట సరి కాదు. ఢిల్లీసంధి శాసనోల్లంఘనము అమలులో వున్న సమయముననే ప్రారంభమై కొనసాగినను సంగతిని గవర్న మెంటు మరచిపోయిరా? మరియు ఢిల్లీసంధి కుదిరిన పిమ్మటకూడ శాసనోల్లంఘనము తాత్కాలికముగా ఆపబడెనేగాని పూర్తిగా వదలుకొనబడలేదను సంగతికూడ నేను గవర్న మెంటుకు జ్ఞాపకము చేయవచ్చునా? ఈ విషయమును నేను లండను వెళ్లుటకుపూర్వము గత సెప్టెంబరులో సిమ్లాలో వైస్రాయి

గారును, వారి గవర్నమెంటునుకూడ అంగీకరించి బలపరచియుండిరికదా! కొన్ని పరిస్థితులలో కాంగ్రెసుశాసనోల్లంఘనమును తిరిగి సాగించవలసివచ్చునుసుమా యని నేనప్పుడే గట్టిగా మీకు తెలియజెప్పియుండలేదా? అట్లయినప్పటికినీ మీరు నాతో రాయబారమును త్రుంచివేయలేదే! శాసనము నుల్లంఘించినయెడల దానికి శిక్షయుండునని మీరు అనియుండవచ్చును. అయితే యేమి? అది నావాదమును యెంతమాత్రము ఖండించజాలదు. శాసనోల్లంఘనమునకు శిక్ష గలదని తెలిసియుండియే మేమీపనికి గడంగుచున్నామని అర్థము. అంతే. ఈమాటకు గవర్నమెంటుకు కోపమువచ్చియున్నయెడల వారు నన్ను లండనుకు పంపకుండా వుండవచ్చునుగదా? అట్లుగాక వైస్రాయిగారు ఆశీర్వదించి, మరి నన్ను లండనుకు పంపిరి. గవర్నమెంటుచేయు ప్రతిచర్యయు నాతీర్పుపై ఆధారపడవలె నని నేను కోరితి నని చెప్పుట న్యాయము కాదు. పరి కాదు. అట్టికోరికను నేను యెన్నడూ కోరలేదు. కాని ఒక్కసంగతి మాత్రము మనవి చేతును. చట్టసమ్మతమును, ప్రజాసమ్మతమును అయిన యేప్రభుత్వముగాని ప్రజాసంస్థలయొక్కయు, తత్ ప్రతినిధులయొక్కయు సలహాలనుకోరి సానుభూతితో విచారించుననను అంశముమాత్రము నేను విప్పిచెప్పక తప్పదు. గవర్నమెంటుచేసిన యేదైన చర్యలకుగాని, శాసనములకుగాని ప్రజలు అసమ్మతిచూపినప్పుడు వారి అసమ్మతిని అపోహమును పోద్రోలుటకై ప్రజాప్రతినిధులకు విషయము లన్నియు తేటతెల్లముగా విప్పిచెప్పి, ప్రజాందోళనము శాంతిపరచుటకు గవర్నమెంటు తగు అవకాశము ప్రజాప్రతినిధులకు ఇచ్చుచుండుట ప్రభుత్వమునకు యెల్లప్పుడును ధర్మము. నేను పంపిన టెలిగ్రాములలో యీఅర్థముతప్ప యింకొక అర్థములేదు. ఎవరిపక్షము న్యాయమో కాలమే నిరూపించగలదు. ఈఉద్యమము మనస్సులో యెట్టి కల్మషముగాని లేకుండ కేవలము అహింసాపద్ధతిని సాగించుటకు కాంగ్రెసువారు సర్వప్రయత్నములు చేసెదరని గవర్నమెంటుకు గట్టిగా చెప్పుచున్నాను. ఇందువల్లవచ్చు అన్నిఫలితములకు కాంగ్రెసున్నూ, దానికి విధేయప్రతినిధి అగు నేనున్నూ జవాబుదారీల మని మీకు వేరుగా జ్ఞాపకము చేయనక్కరలేదు."

సౌకర్యనిమిత్తమై యీటెలిగ్రాములన్నిటినీ ఒకచోట గుత్తెచ్చి వ్రాసితిని. కాని యీకథ ఆరురోజులలో జరిగిన కథ.

ఇండియాతరఫున రౌండుటేబిలుకు వాణిజ్యప్రతినిధిగా వెళ్లిన బెంతాల్ గారు 30 వ డిసెంబరు తారీఖున గాంధిగారిని చూచి చాలసేపు మాట్లాడెను. గాంధిగారి పద్ధతి వర్తకులకు చాల భయోత్పాతముగా నుండెననుట నిర్వివాదము. వారికి యిట్టి భయము వుండుట సహజము. ఏల ననగా బహిష్కారోద్యమము ప్రజలచేతులలో

యెంత బలిష్టమైన ఆయుధమో తదుపరిజరిగిన అనుభవమువల్ల స్పష్టమైనది. నిజమే కాని యీ బెంతాల్ గారున్నూ, వారితోటి ప్రభుత్వపక్షపాతులున్నూ తమ భావములను అనాడే తీవ్రముగా వెల్లడించియుండిరి. ఇంతకాలమైననూ వారివాక్యములోని తీవ్రత మనకు యిప్పటికిన్ని గోచరించుచున్నది. వారు తమ వర్తకసంఘమువారికి రహస్యముగా పంపుకొనిన సర్క్యులరులోనుండి కొన్నిభాగము లిట ముద్రింతుము :

“వ్యవహారము యేదో విధముగా వీలైతే కుదుర్చుకొని తీరుదమను గట్టి నిశ్చయముతో మేము లండను వెళ్లితిమి. అయితే బేరము యేదోవిధముగా కుదుర్చుకుందామని వున్నప్పటికీ డెబ్బువిషయములోను, వర్తకసౌకర్యవిషయములోను యూరోపియను వర్తక సంఘమువారి కోరికలలో ప్రధానమైనదానిని దేనినిగాని వదలిపెట్టకూడదను నిశ్చయముకూడ నామనస్సులో దృఢముగా నుండెను. మరి యితర విషయములలోకూడ యూరోపియనుసంఘమువారి అభిప్రాయప్రకారమే పోవలెనని యుంటిమి అయితే కాంగ్రెసు, హిందూ మహాసభ, భారతవర్తక సంఘము,- ఈమూడుశక్తులు కలసి సేఫ్‌గార్డులను తగ్గించివేయుటకు ప్రయత్నించు నని మా కప్పుడే గోచరమైనది.”

“రౌండుటేబిలు సభలోకూడ మొదటినుండి చివరవరకు ఈసంగతే కన్పట్టెను. రౌండు టేబిలు సభఫలితము చూచినయెడల గాంధిగాని, భారత వర్తక సంఘముగాని చక్రవర్తిగారికడ్డకు పోయినందువల్ల బ్రిటిషు గవర్నమెంటు నుండి సంపాదించుకొన్న లాభము మచ్చునకు, ఒక్కటియైనను లేదని స్పష్టము కాగలదు. రిక్తహస్తములతో గాంధి యిండియాలో దిగినాడు.”

“ఇంకొక విషయములోకూడ గాంధి నిరర్థకు డయినాడు, మతవివాద పరిష్కారము చేయుటకు గాంధి పూనుకొని లోకమందరియెదుట విఫలు డయినాడు.”

“మహమ్మదీయులు వుత్సాహముతో గట్టిజట్టుగా నిలబడినారు. జాతీయభావము కల ఆలీఇమాం కూడ పోరుపు కరిగింపలేదు. మహమ్మదీయులు పేకమున్కలను మొదటినుండి చివరవరకూ బహుచాకచక్యముతో ఆడినారు. వారు మనకు మద్దత్తు చేస్తామన్నారు. అన్నమాటను ఘట్టిగా నెరవేర్చుకొన్నారు. అయితే అందుకు బదులుగా బెంగాలులో తమ ఆర్థిక దుర్గతిని మాత్రము మరచిపోవద్దని మనలను కోరినారు. యూరోపియనుదుకాణములలోను, కంపెనీలలోను తమవారికి వుద్యోగములు యిచ్చు విషయములో మనము చేయగలిగినంత శక్తివంచన లేకుండా చేయవలెనని కోరినారు. తమకు, తమసంఘమునకు ఆర్థికముగా వుపకారము కలుగుటకై వారిట్లు కోరినారు.”

"మొత్తముమీద ఇండియా కంతటికీ యేదో ఒకపద్ధతి నిర్ణయించి కొనసాగింపవలెనని బ్రిటిషుజాతి సంకల్పించుకొనెను. కాని యెన్నికలైనతరువాత అధికారములోకి వచ్చిన పార్టీవారు యీ రౌండుటేబిలుసభను బ్రద్దలుకొట్టి కాంగ్రెసును విచ్ఛిన్నము చేయవలెనని గట్టిగా తలచుకొనిరి. కేంద్రప్రభుత్వములో అధికారమక్కర లేదని చెప్పు మహమ్మదీయులకు ఇందువల్ల బలే సంతోషమయ్యెను. గవర్నమెంటువారు నిస్సందేహముగా తమపద్ధతిని మార్చుకొనిరి. రాష్ట్రస్వాతంత్ర్యముతో సరిపుచ్చి కేంద్రాధికారముమాట చూస్తాములే అని చెప్పి దూసికొనిపోవ సంకల్పించిరి. కాంగ్రెసుతో పోరాటము విధిగా జరిగితీరవలెనని మేము నిశ్చయించుకొంటిమి. అది యెంతత్వరలో వస్తే అంత మంచి దని అనుకొంటిమి; చెప్పుకొంటిమి. అయితే కాంగ్రెసు మళ్లీ లేవకుండా అణగగొట్టి, మనము జయము పొందవలెనంటే సాధ్యమైనంతమందిని మనవైపునకు త్రిప్పుకొనవలసివుండు ననికూడ నిశ్చయించుకొంటిమి. ముసల్మానుల విషయమై ఫరవా లేదు. అల్పసంఖ్యాకు లందరును కలిసి చేసికొన్న ఒడంబడికయున్నూ గవర్నమెంటువారి ధోరణియున్ను, ముసల్మానులను మనవైపున గట్టిపరచెను. స్వదేశసంస్థానాధీశులును, యితర అల్పసంఖ్యాకసంఘములునుకూడ మనపట్టుననే యుండెను."

"అయితే యింక కావలసిన ముఖ్యవిషయము యింకొకటి యున్నది. సప్రూ, జయకర్, శాస్త్రి మొదలగు సామాన్యహిందువులనుకూడ మనవైపునకు త్రిప్పుకొనుట ముఖ్య మని తోచినది. వారు కాంగ్రెసుకు యెదురుతిరిగి పోట్లాడకపోయినను వారు కాంగ్రెసుకు మద్దతుచేయకుండా చేసుకొంటిమి. అది ఒకచిన్నవుపాయమువల్ల జరిగినది. ఎట్లాగంటే ఫెడరేషను అంటే వారికి యిష్టము. దానికి యూరోపియనులుకూడా ఒకవిధముగా ఒప్పుకొన్నట్లే. కాబట్టి ఫెడరేషను పోదు అని వారికి మనస్సులో గట్టిగా నమ్మకము కలిగేటట్టు చేస్తే చాలు. ఈవుపాయమే మేము అవలంబించాము. వీరిని సంతృప్తిపరచటానికి ఒక్కటేవిషయము కలదు. ఒకేచట్టములో రాష్ట్రస్వాతంత్ర్యము, కేంద్రబాధ్యతకూడ యిమిడ్చితే వీరు సంతృప్తిపడుతారు. కాబట్టి ఆ ప్రకారముచేయవలసినదని మేము గవర్నమెంటుకు గట్టిగా నొక్కి చెప్పితిమి. రాష్ట్రస్వాతంత్ర్య మొక్కటియే యిండియామీద బలవంతముగా పెట్టుటకు వీలులేదు. దీనిని పనిచేయుటకు ముసల్మను లొక్కరివల్ల కాదు. కాంగ్రెసు పలుకుబడిగల రాష్ట్రములు కేంద్రప్రభుత్వమును తీవ్రముగ ఎదుర్కొని అనేకకష్టములు కలిగించును. ఒక్కొక్కరాష్ట్రముకలకత్తాకార్పొరేషనుఅగును. కాబట్టిరకరకాల,తమాషాతమాషా వాళ్లతో స్నేహము కలుపుకొంటిమి. మావాదన గవర్నమెంటుకు నచ్చినది. రౌండు టేబిలుసభ యావన్మందీ (అనగా ౧౬౦ కి ౧౦౦) హిందూరాజకీయనాయకులతో

కయ్యాము పెట్టుకొని పగిలిపోకుండా ౧౦౦ కి ౯౯ మంది సభికులయొక్క సహకార వాగ్దానములతో చల్లగా అంతమొందెను. మాలవ్యావంటిమనిషికూడ ఈ ౯౯ మందిలో చేరెను. గాంధి ఒక్కడే కమిటీలో చేరుటకు యిష్టపడలేదు.”

“ముసల్మానులు యూరోపియనులకు గట్టిస్నేహితులైనారు. తమకు లభించిన దానితో వారు బాగా సంతృప్తిపడ్డారు. మనతో కలసిమెలసి పనిచేయుటానికి తయారుగా నున్నారు.”

“రాజకీయసంస్కరణము అవసరమని మేము ఒప్పుకొన్నామంటే మీ రేమో నని పొరపాటుపడవద్దు. ప్రతిరాష్ట్రములోను ప్రజాప్రభుత్వము యేర్పడవలె నని మా వుద్దేశ్యముకాదు! గవర్నమెంటు దిట్టముగా నడవటానికి యేమార్పులైతే అవసరమో అవి చేయవలె ననిమాత్రమే నా అభిప్రాయము.”

న్యాయముగా ఇండియాకు చెందవలసిన హక్కులను యిత్తుమని లేబరుగవర్న మెంటుచేసిన ప్రకటనను త్రోసిపుచ్చుటకై ఇంగ్లండులో టోరీపార్టీవారున్నూ, వారి మిత్రవర్గమున్నూ యెట్లు పనిచేసిరో పైనవివరించిన బెంతాల్ సర్క్యులరులోని వాక్య ములే చాలును. తమ స్వార్థమునకై దేశము * అమ్ముకొన సంసిద్ధపడిన ముసల్మాను వర్గమునకును, ఇండియాను శాశ్వతముగా బానిసత్వములో పడవేసి యుంచకోరిన బ్రిటిషువర్గమునకును స్నేహము లండనులో అప్పటికప్పుడు కలిగినది కాదు. రెండవ రౌండు టేబిలుసభకు చాలాకాలముక్రిందటనే దీనికి పునాదులు యిండియాలోను, యింగ్లాండులోనుకూడా పడెను. వేయేల, గాంధిగారికీ ఇర్విన్ ప్రభువుకూ సంధి కుదిరినప్పుడే యీసంధికి ఇష్టములేనివా రందరును వెంటనే సమిగూడి జాతీయోద్యమ మును చెడగొట్టుటకు పన్నాగము పన్నిరి. ఇండియాగవర్నమెంటు కార్యస్థాన మైన సిమ్లాలోనే యీకుట్రలో కొంతభాగము జరిగెను.

ప్రభుత్వమువారు చేసిన సవాలుకు వర్కింగుకమిటీవారు జవాబు నిచ్చుటకు తీర్మానించినపిదప వర్కింగుకమిటీమెంబర్లు యెవరిరాష్ట్రమునకు వారు మరలిరి. వారు చేయవలసినపనులు విశేషము కన్పట్టలేదు. ౧౯౩౧ మార్చి ౪-వ తేదీన యెక్కడ వదలిపెట్టినారో గవర్నమెంటువారు అక్కడనే మరల ప్రారంభించిరి. సంధికాలము లోనే వేలకొలది లాటీలను వారు తయారుచేయించిరి. యుద్ధమును మరల ప్రారంభిం

---

*రౌండుటేబిలుకాన్ఫరెన్సులో తాను ఆనాడు యింగ్లీషువారికి చేసిన వుప కారమునకు బదులుగా తనను ఒకరాష్ట్రమునకు ప్రభువుగా చేయవలసినదని సర్ ఆగాఖాన్‌గారు గవర్నమెంటును నిలువబెట్టి అడిగినట్లు యిటీవల ఢిల్లీశాసనసభలో బయలుపడిన అంశమే రౌండుటేబిల్ రహస్యకథను చెప్పక చెప్పుచున్నది.

చుటకు తగు సన్నాహములు చేసికొనుటకే యీసంధికాలమును వారు వుపయోగించు కొనిరి. యుద్ధము మరల యేక్షణముపట్టిన ఆక్షణము ప్రారంభ మగుటకు సర్వము సిద్ధముగా నుండెను. గాంధిగారు లండనునుండి వచ్చుటతోడనే యిక యుద్ధము అనివార్య మయ్యెను. అప్పటికే 3 ఆర్డినెన్సులు జారీచేయబడెను. ఇంకనూ కొన్ని వైస్రాయి గారి జేబులో తయారుగా నుండెను. ఎప్పుడుపడితే అప్పుడు బయటికి దుముకుటకు సిద్ధముగా నుండెను. ౧౯౩౨ జనవరి ౪ వ తేదీన గవర్నమెంటుదాడి ప్రారంభ మయ్యెను. ప్రతికాంగ్రెసుసంఘమును, దాని సంబంధముగల ప్రతిసంస్థయు అక్రమ సంఘముగా నిషేధింపబడెను. కాంగ్రెసువారిని ఆర్డినెన్సుకు వ్యతిరేకముగా పనిచేసినను చేయకపోయినను సరే పట్టుకొని బంధించిరి. ఇట్టి నిరంకుశశాసనము "శాసన విరుద్ధమైన శాసన"మని ఆరోజులలో చెప్పుకొనబడసాగెను. గవర్నమెంటుచేసిన యీ చర్యకు మనము గొణుగుకొన నక్కరలేదు. సంధి అంతమొందినది. సేనానాయకుడు "తయారు" అని వుషారుచేసినాడు. ఇది అంతయు యెందుకు? కాంగ్రెసువారందరు సంధికిపూర్వమున్న పాతజైళ్లలో పాతగదులలోనికి వచ్చి, యథారీతిగా నుండవలసిన దని గవర్నమెంటువారు కాకిచేత కబురుపంపితే కాంగ్రెసువారు అట్లే చేసెడివారు. కాని యిట్టిపనిచేయుటకు గవర్నమెంటుకు సాహసము లేకపోయెను. ఇట్లు చేసి యున్నచో శాసనోల్లంఘనోద్యమమునకు గలుగగల విచిత్రప్రతిభ గవర్నమెంటుకు యిష్టములేదు. తాము వదలిపెట్టినకొసనే గవర్నమెంటువారు మరల పట్టుకొనిరని చెప్పితిని. కాంగ్రెసు అన్ననో అంతయు మొదటినుండి ప్రారంభించవలసివచ్చె. మొదటి ౧౯౩౦ పోరాటములో లాఠీ చివరభాగమునందు వచ్చెను. ౧౯౩౨ ఉద్యమములో సత్యాగ్రహిని మొట్టమొదటగా యెదుర్కొన్నమిత్ర మదియే. ఆరువారములలో ఈవుద్యమమును అణచివేసెద నని విల్లింగుడను తలచినట్లు చాలమంది చెప్పుకున్నారు కాని ఆరువారములు మిక్కిలి కొద్దికాలము. సత్యాగ్రహము దీర్ఘకాలము గాని తేలని విషయము. అందుచేత విల్లింగుడన్‌గారి కోరిక నెరవేరలేదు. ౧౯౩౦ సం.లో మిక్కిలి కష్టపడి వుద్యమభారము నంతను మోసిన గుజరాతుగ్రామములను గాంధిగారు సందర్శింపబోవదలచిరి. కాని యింతలోనే గవర్నమెంటువారు ఆయననూ, వల్లభాయి పటేలుగారినీ, ౧౯౩౨ సం.రం జనవరి ౪ వ తేదీన రాజకీయఖైదీలుగా పట్టుకొని యెక్కడికో పంపివేసిరి. ఖాన్‌సాహెబ్, జవహరలాల్ నెహ్రూలు ముందే జైలుకు నడచిరి. మిగతానాయకు లందరూ వారి ననుకరించిరి. సత్యాగ్రహులు వేలకొలది ముందుకు వచ్చిరి. ౧౯౨౧ లో వారిసంఖ్య ౩౦,౦౦౦. అదే గొప్పసంఖ్యగా అప్పు డనుకొనిరి. ౧౯౩౦-౩౧ లో ౧౦ నెలల కొద్దివ్యవధిలో ౯౦ వేలమంది స్త్రీలు, పురుషులు, పిల్లలు జైళ్లకు వెళ్లిరి. ఇక దెబ్బలు తిన్నవారి

సంఖ్య లెక్కలేదు. జైలుకు వెళ్లినవాళ్ల సంఖ్యకంటె దెబ్బలు తిన్నవారిసంఖ్య ౩,౪ రెట్లకంటె తక్కువయుండదు. మరల లేవకుండ లాఠీలతో కొందరిని చావబాదిరి. "పిల్లి, యెలుకకథ"గా కొందరిని పట్టుకొనుట, వదలివేయుట, మరల పట్టుకొనుట, వదలివేయుట నాటకముతో విసిగించిరి. "కాంగ్రెసు ఆఫీసురహస్యములు చెప్పుతావా లేదా? కాగితములు యెక్కడ వున్నవి? పుస్తకములు యెక్కడ వున్నవి? చందా దారుల లిస్టు యేది? వాలంటీర్ల లిస్టు యేది? చూపించు" అని కాంగ్రెసులో పని చేయువారిని పోలీసులు నిర్బంధించిరి. కాంగ్రెసుయువకులను నోట వచింపరాని దుర్భాషలాడిరి. చెప్పరాని శిక్షలను కనిపెట్టి అమలుజరిపిరి. ఒక హైకోర్టుప్లీడరు తన పేరు, చిరునామా యివ్వనందుకు పోలీసువారికి కోపమువచ్చి ఆయనగడ్డములోని వెంట్రుకలను ఒక్కొక్కదానిని లాగి బాధించిరి. చూడండి!

కొత్తపరిస్థితులు యేర్పడినప్పుడెల్ల కొత్త ఆర్డినెన్సులు పుట్టుకవచ్చెను. అవి అప్పటి కప్పుడు జారీకాబడుచు వచ్చినను సౌకర్యార్థమై అన్నిటిని ఒక్కచోటనే గుచ్చెత్తి చెప్పెదము. గాంధిగారు లండనులో నుండగానే బెంగాల్ ఆర్డినెన్సు జారీ చేయబడినసంగతి యిదివరకే చెప్పితిమి. బెంగాలులోని దౌర్జన్యోద్యమము నణచుటకు యీ ఆర్డినెన్సును చేసితి మని గవర్నమెంటువారు చెప్పిరి. ఆసందర్భములో కేసులవిచారణలు త్వరత్వరగా ముగియుటకు యిట్లు చేసితి మనిరి. గవర్నమెంటువారి చేత అధికారము పొందిన యేవుద్యోగస్థుడుగాని యేమనిషినైనా సరే అనుమానముతగులుతే వానిపేరు, వూరు చెప్పుమని అడిగి తెలుసుకొని ఆమాటలు నిజ మని రుజువు అయ్యేవరకూ ఆతనిని ఒకరోజు అరెస్టులో నుంచుటకు అధికార మిచ్చిరి. ఆమనిషిని అరెస్టుచేయుటలో ఆఫీసరు యెట్టి వుపాయమునైనాసరే అవలంబించవచ్చును. ఏయిల్లు అయినా సరే గవర్నమెంటుకు కావలసినన్ని రోజులు యిచ్చితీరవలసిన దని గవర్నమెంటువారు ఆయింటి యజమానినిగాని, అందులో కాపుర మున్నవారినిగాని అడుగుటకు అధికారము కలదు. ఆయింటిలోని సామానుతో సహా గవర్నమెంటుకు యిచ్చివేయవలెను. దానికి అద్దెగాని, ప్రతిఫలముగాని గవర్నమెంటుయిస్తే యివ్వవచ్చును, లేకపోతే లేదు. ఆవిధముగానే యేవస్తువునైనా కోరుటకు కలెక్టరుకు అధికారమివ్వబడెను. ఎవరుగాని యేయింటిలోనికిగాని, యేస్థలములోనికిగాని రైళ్లలోనికి సహా పోకూడదని కలెక్టరు నిర్బంధించవచ్చును. అట్లే రహదారీనికూడ అరికట్టవచ్చును. ఎవరెవరివద్ద యెన్నెన్ని బండ్లు వున్నవీ కలెక్టరు కోరినప్పుడు లెక్క దాఖలుచేయవలెను. అవి అన్నీ తనకు అప్పగించవలసినదని కూడా కోరవచ్చును. కత్తులు, మందుసామానుల అమ్మకము నిషేధించవచ్చును. వానిని కలెక్టరు లాగుకొని స్వాధీనముచేసుకొనవచ్చును. శాంతిభద్రతలనెలకొల్పువిషయములో భూస్వాములు, స్కూలుమాస్టర్లు

మొదలగువారు వచ్చి తనకు సహాయము చేయవలె నని కలెక్టరు యెవరినిబడితే వారిని కోరవచ్చును. ఇండ్లసోదాలు చేయించవచ్చును. ఒకప్రాంతములో నివసించు ప్రజలందరిపై కలిపి జుల్మానావేయుటకు గవర్నమెంటుకు అధికారము యివ్వబడెను. ఈ జుల్మానా కొందరిమీద వేయుటకుకూడా గవర్నమెంటుకు అధికారము కలదు. వేసిన జుల్మానాను గవర్నమెంటు రివిన్యూబాకీవలె వసూలు చేయవచ్చును. ఈ శాసనమును వుల్లంఘించినవారికి ఆరునెలలుజైలు, లేక జుల్మానా, లేక రెండున్నూ, పారిపోయిన వారితో యితరుల కెవ్వరికీ వుత్తరప్రత్యుత్తరములులేకుండా చేయుటకు తగునిబంధనల నేర్పరుచుటకు స్థానికప్రభుత్వమునకు అధికార మివ్వబడెను. వారిజాడలను తీయుటకు నిబంధనలు చేయబడెను. రాజుగారి ప్రజల అర్థప్రాణములకు హాని కలుగకుండా నివారించుటకున్ను, పోలీసుసైన్యమునకు రక్షణ నిచ్చుటకున్ను, ఖైదీలుతప్పించుకొని పారిపోకుండుటకున్ను నిబంధనల చేయుటకు గవర్నమెంటుకు అధికార మివ్వబడెను. ఈ ఆర్డినెన్సుక్రింద అధికారు లేమిచేసిననూసరే, సివిల్‌కోర్టులోదావాచేయుటకు వీలులేదు. ఈ నేరములను విచారించుటకు కొత్తకోర్టులు, ప్రత్యేకపు మేజిస్ట్రీటులు యేర్పరుపబడిరి. ఈకోర్టులలో విచారణకు కొత్తరూల్సు పెట్టిరి. ముద్దాయి యెదురుగా లేకపోయినా సరే యీకోర్టుల్ను విచారణ సాగించి శిక్షించవచ్చును.

సంయుక్తరాష్ట్రీముల ఆర్డినెన్సు ౧౯౩౧ డిసెంబరు ౧౪ వ తేదీని జారీచేయబడెను. గవర్నమెంటుకుగాని, స్థానికాధికారులకుగాని, భూస్వామికిగాని యివ్వబడతగిన యేబాకీగాని "నోటిఫైడ్" బాకీ అని గవర్నమెంటు ప్రచురించవచ్చును. అట్టి బాకీ గవర్నమెంటుశిస్తువలె వసూలుచేయబడవచ్చును. ప్రజాక్షేమమునకు విరుద్ధముగా పనిచేయుచున్నాడని యేమనిషిని గురించియైనా అధికారులకు అనుమానము తోచే యెడల ఆమనిషిని అచ్చటినుండి వెళ్లగొట్టవచ్చును. నీవు ఫలానివిధముగా నడుచుకొనవలెనని ఆజ్ఞాపించవచ్చును. ఈ ఆజ్ఞ నెలరోజులవరకు అమలులో వుండును. ఏ భూమినిగాని, యింటినిగాని అందులో వుండు యావత్తుసామగ్రితో సహా గవర్నమెంటుకు అప్పగింపజేయవలె నని గవర్నమెంటువారు ఆ యింటియజమానినిగాని, భూమియజమానినిగాని కోరవచ్చును. దీనికి ప్రతిఫలము యిస్తేయిస్తారు, లేకపోతే లేదు. ఏయింటిలోనికిగాని, స్థలములోనికిగాని యెవరూ పోకూడదని కలెక్టరు నిషేధింపవచ్చును. ఎవరిస్వాధీనములోనున్న బండ్లనుగాని, యితరవాహనములనుగ్గాని కలెక్టరుకు ఒప్పగించి ఆయన చెప్పినట్లు చేయవలెను. శాంతిభద్రతలను స్థాపించుటలో స్కూలుమాష్టర్లు, రైటర్లు యెవరుపడితే వారు గవర్నమెంటు కోరినప్పుడు వచ్చి సహాయము చేయవలెను. పైన వివరించినబాకీలు యెగబెట్టవలసినదని బోధించుచున్నట్లు అనుమానము తగిలినయెడల అట్టివారికి రెండుయేండ్లశిక్షు, లేక జుల్మానా, లేక రెండున్నూ.

ఏగవర్న్మెంటువుద్యోగస్థునిగాని నీ పని చేయవద్దని బోధించినయెడలగాని, పోలీ
సులో చేరవద్దు, మిలిటరీలో చేరవద్దు అని బోధించినగాని అట్టివారికి యేడాదిశిక్షు,
లేక జుల్మానా.

ఒక ప్రాంతములో నివసించువారిమీద అందరిమీద కలిపి మొత్తముగా
జుల్మానా వేయవచ్చును. నిషేధింపబడిన గ్రంథములోనుండి వాక్యములను వుచ్చరిం
చినవారికి ౬ నెలలు శిక్షు, లేక జుల్మానా. ౧౬ యేండ్లలోపు కుర్రవాండ్రమీదవేసిన
జుల్మానా తండ్రినుండిగాని, గార్డియనునుండిగాని వసూలుచేయవచ్చును. తండ్రి
ఇవ్వనిచో అతడే ఈనేరము చేసినట్లు యెంచి అతనికి ఖైదువేయవచ్చును. ఇట్టివుత్త
రువులను సివిల్‌కోర్టుద్వారా యెదిరించుటకు వీలులేదు.

సరిహద్దుపరగణాలను గురించి ౧౯౩౧ సం.రం డిసెంబరు ౨౯ వ తారీఖున
ఆర్డినెన్సులు జారీచేయబడెను. వానిలో ఒకటి పైన వివరించిన సంయుక్తరాష్ట్ర
ముల ఆర్డినెన్సునుపోలి పన్నుల నెగబెట్టుటకు సంబంధించినదై యున్నది. ఇంకొకటి
అవసరాధికారములకును, మూడవది అక్రమాదిసంఘములకును సంబంధించినది. అను
మానముతగిలిన మనిషిని వారంటులేకుండా అరెస్టుచేసిఒకరోజు ఖైదులోనుంచవచ్చును.
లోకల్ గవర్న్మెంటు అనుమతితో రెండునెలలు ఉంచవచ్చును. ఈకాలపరిమితిని
గవర్న్మెంటు మరల మరల పొడిగించుచుండవచ్చును. ఏమనిషినిగాని నీవు యిక్కడ
నుండి వెళ్లిపో, నీవు ఇట్లా నడుచుకో, అట్లా నడుచుకో, నీవు ఇక్కడకు రావచ్చును,
అక్కడకు రాకూడదని ఒకనెలవరకు గవర్న్మెంటు వుత్తర్వుచేయవచ్చును. ఇట్టి ఉత్త
రువు నుల్లంఘించినయెడల రెండుయేండ్లు శిక్షు. ఎవరియింటినైనను సరే గవర్న్మెంటు
స్వాధీనముచేసుకొనవచ్చును. యేయింటికిగాని పోకుండా నిషేధించవచ్చును. రోడ్లు,
కాలువలు మూసివేయవచ్చును. ఏవస్తువునైనా సరే వర్తకులు గవర్న్మెంటు చెప్పి
నట్లు కొనవలెను. లెక్కలు దాఖలుచేయవలెను. తమవద్దనున్న సరకులన్నీ గవర్న్
మెంటుకు యిచ్చివేయవలెను. అదేవిధముగా యెవరివద్ద యేవస్తువున్నా సరే గవర్న్
మెంటు కోరినప్పుడు యిచ్చివేయవలెను. బండ్లు కావాలంటే యెవరివద్దవున్నాసరే
కలెక్టరుకు యిచ్చివేయవలెను. ఆయుధములు, మందుసామానుల అమ్మకము కలెక్టరు
చెప్పినట్లు జరుగవలెను. ఎవరినైనా సరే పోలీసుపని చేయవలెనని గవర్న్మెంటువారు
కోరవచ్చును. శాంతిభద్రతలను కాపాడుటకు యెవరినైనా సరే గవర్న్మెంటు కోర
వచ్చును. పదిమందికి పనికివచ్చే ఏపనినైనా చేయు యజమాని అందునుగురించి గవర్న్
మెంటు యేపని చేయమంటే ఆపని చేయవలెను. లేకపోతే గవర్న్మెంటు ఆయజ
మానినుండి దానిని వూడలాగుకొందురు. పోస్టు, టెలిగ్రాము, టెలిఫోను మొదలయిన

వాటిని కలెక్టరు యిష్టమువచ్చినట్లు చేయవచ్చును. ఉత్తరాలు, బంగీలు పగులదీసి చూడవచ్చును. రైళ్లలో పడవలలో యెంతస్థలము కావలిస్తే అంతస్థలము సదరుకంపె నీల యజమానులు గవర్నమెంటుకు యిచ్చితీరవలెను. ఫలానిమనిషినిగాని, ఫలాని సరకునుగాని యెక్కించుకుపోకూడదని గవర్నమెంటు నిషేధించవచ్చును. రైలులో వెళ్లుచున్న ప్రయాణీకులను యెవరినిగాని బయటికి గెంటివేయవచ్చును. పోతూవున్న రైలును యెక్కడపడితే అక్కడ ఆపి మనుష్యులను దింపివేసి పోలీసులను, సిపాయిలను యెక్కించుకొనిపోవచ్చును. ప్రయివేటుగా యిండ్లలో పెట్టుకున్న మీటింగులలో కూడ టిక్కట్లువున్నా సరే, లేకపోయినా సరే పోలీసులను పంపించవచ్చును. సోదాలవిషయములో ప్రత్యేకాధికార మివ్వబడెను. గవర్నమెంటు నౌకర్లు పనిచేయరాదనిగాని, యెవరూ పోలీసులో మిలిటరిలో చేరకూడదనిగాని ప్రోత్సాహముచేస్తే శిక్ష. ఏగవర్నమెంటు వుద్యోగస్థునిమీదనైనా అసహ్యముపుట్టించే వాక్యములనుగాని పుకారులనుగానిచేస్తే శిక్ష. ప్రజలమీద వుమ్మడిగా జుల్మానావేసి ల్యాండురివిన్యూవలె వసూలుచేయవచ్చును. గవర్నమెంటువారి రహస్యపు రికార్డులనుగూర్చి యేమైనా సంగతులు బయట పడవేస్తే శిక్ష. ౧౮ యేండ్లలోపు పిల్లవాండ్రుచేసిన తప్పులకు తండ్రులకు శిక్ష. మామూలుకోర్టులస్థానే యీ నేరమునకుగాను కొత్తకోర్టులు పెట్టిరి.

ఇంకొక ఆర్డినెన్సులోని సంగతులు యేమనగా—యేదైనాచోటును గవర్నమెంటువారు "నోటిఫై" చేయవచ్చును. అట్టిప్రదేశములలో యెవరువున్నా సరే వారిని వెళ్లగొట్టి గవర్నమెంటు ఆక్రమించుకొనవచ్చును. చరాస్తులను స్వాధీనముచేసుకోవచ్చును. అట్టిచోటులోనికి యెవరైనా వస్తే శిక్ష. అక్రమసంఘములకు సంబంధించిన డబ్బును గవర్నమెంటు కాజేయవచ్చును. అటువంటిడబ్బు యెవరివద్దనైనా ఉన్నట్లు అనుమానముతోచేయెడల ఆతడాడబ్బును గవర్నమెంటు చెప్పినట్లు తప్ప యింకొకవిధముగా ఉపయోగించరాదు. అట్టిడబ్బుకు సంబంధించిన లెక్కలు తనిఖీ చేయుటకు, యితరవిధముగా చేయుటకు గవర్నమెంటుకు అధికారము యివ్వబడెను.

జనవరి ౪వ తేదీన మరి నాల్గు కొత్త ఆర్డినెన్సులు జారీచేయబడెను: ౧. అవసరాధికారముల ఆర్డినెన్సు. ౨. అక్రమప్రోత్సాహపు ఆర్డినెన్సు. ౩. అక్రమసంఘముల ఆర్డినెన్సు. ౪. బహిష్కారము పికెటింగు ఆర్డినెన్సు. మొదటి ఆర్డినెన్సుక్రింద యివ్వబడిన అధికారములు పైన వివరించిన అధికారములను పోలియున్నవి. అవికాక అచ్చుఆఫీసులకు సంబంధించిన నిబంధనలు యిందులో మరింత కఠినముచేయబడెను. రెండవ ఆర్డినెన్సు పన్నులకు సంబంధించినది. పన్నులను యివ్వకూడదని బోధించినవారికి శిక్ష. ఎవరికైనా, యెవరైనా "నోటిఫైడు" లా

వున్నయెడల దానిని వసూలుచేసిపెట్టవలసిన దని కలెక్టరును కోరవచ్చును. అప్పుడు కలెక్టరు ఆబాకీని ఆ అసామీకి గవర్నమెంటు లాండురివిన్యూవలె వసూలుచేసిపెట్ట వచ్చును. ఇక అక్రమసంఘముల ఆర్డినెన్సుక్రింద సదరు అక్రమసంఘములకు సంబంధించినయిండ్లను, డబ్బును, యితర స్థిరచరాస్తులను గవర్నమెంటు స్వాధీనముచేసుకొన వచ్చును. ఇందువిషయమైన యితర అధికారములును పైన వివరించినమాదిరిగానే ఉన్నవి. శాంతిభద్రతలకుభంగము కలిగించుచున్న దని గవర్నరుకున్నూ, అతనిమంత్రి మండలికిన్నీ తోచినట్లయితే వారు యేసంఘమునుగాని అక్రమసంఘముని ప్రకటించవచ్చును. ౪వ ఆర్డినెన్సు పికెటింగుకు, బహిష్కారోద్యమమునకు సంబంధించినది. ఒకడు యింకొకనిని విసిగించుట, యిబ్బందిపరచుట, బహిష్కరించుట నేరముగా చేయబడి, ఆరునెలల శిక్ష, లేక జరిమానా విధింపబడెను. ఒకనిని వుడికిలించుటకు శవముమాదిరిగా కట్టి ఊరేగించుట నేరముగా చేయబడి ౬ నెలల శిక్ష, జరిమానా విధింపబడెను.

ఈ ఆర్డినెన్సులపేరట గవర్నమెంటు అతివిశాలమగు అధికారములు పొందిన దని స్పష్టము కాగలదు. ఈ అధికారములు దేశమందు అన్నిప్రాంతములకు వ్యాపించెను. ఈ ఆర్డినెన్సులకాలము, అనగా మొదటి ఆరుమాసములు పూర్తికాగానే అవి మరల యింకొక ఆరుమాసములవరకూ పొడిగించబడెను. ౧౯౩౨ నవంబరులో యివి అన్నీ కలిపి గట్టిచట్టముగా చేసివేసిరి. అక్రమసంఘములు, పికెటింగు, బహిష్కారము, అచ్చుకూటములు యీ ఆర్డినెన్సులక్రిందికి తీసుకురాబడెను.

౧౯౩౨ మార్చి ౨౬ వ తారీఖుననే "ఈ ఆర్డినెన్సులు చాల తీవ్రముగానున్న" వని యిండియా సెక్రెటరీయైన శామ్యూయల్ హోరుగారే పార్లమెంటుసభలో వొప్పుకొనవలసివచ్చెను. ప్రజల నిత్యజీవితములో జోక్యము కలిగించుకొనని అంశ మొక్కటికూడ లేదు.గవర్నమెంటు యిట్టిసర్వవ్యాపకమగు ఆర్డినెన్సులను చేయుటలో కారణ మున్నది. ప్రజలు నలుముఖముల చుట్టబెట్టి మంటబెట్టుదురని గవర్నమెంటుకు నిజముగా హడలు పుట్టినది. ఇండియా తమచేతినుండి జారి, అరాజక స్థితిలోనికి పోకుండా వుండవలెనంటే తమకు ఈ ఆర్డినెన్సులు వుండితీరవలె నని గవర్నమెంటువారు నమ్మిరి. మాలవ్యాగారు ౧౧౦౦ మాటలుగల టెలిగ్రామును యింగ్లండుకు పంపదలచగా పోస్టలు అధికారులు దానిని మామూలురేట్లకు పంపుటకు నిరాకరించిరి. ౧౯౩౧ లో చేసిన ముద్రణాచట్టము ౧౯౩౧ అక్టోబరు ౯ వ తేదీన అనగా సంధికాలములో ముగిసిపోయెను. అయితే ౧౯౩౨ సం. రంలో చేసిన క్రిమినల్ లాచట్టములో అచ్చుఆఫీసులకుసంబంధించిననిబంధనలు శాశ్వతముగా దిట్టపరచబడెను

ఇవి ౧౯౧౦ వ సం.పు ముద్రణాచట్టములోని అధికారములను బోలియున్నవి. ఇండియా గవర్నమెంటు చేసిన యీ ఆర్డినెన్సులు చట్టములు గాక బొంబాయిగవర్నమెంటువారు తమ రాష్ట్రమునకు ప్రత్యేకముగా చట్టములను చేసుకొనిరి. ఇందు ప్రత్యేకముగా పన్నులనిరాకరణమునకు సంబంధించిన నిబంధనలు కలవు. పన్ను యెవరైనా యివ్వకపోతే వారు బుద్ధిపూర్వకముగా యివ్వలేదనియే నిర్ధారణ చేయబడెను. అట్లు కాదని రుజువుచేసికొనుభారము ఆమనిషిమీద పెట్టిరి. ఈఆర్డినెన్సులు నిరంకుశాధికారములు. అసలు నిజముగా సంధికాలములోనే గవర్నమెంటువారి ఆలోచనలో నుండెను. ౧౯౩౧ సం.రం అక్టోబరు ౧౧వ తేదీన బొంబాయి యూరోపియనుసంఘ కార్యదర్శి బొంబాయి గవర్నమెంటు హోముసెక్రటరీకి పునహాలో యూరోపియను లందరు విందుచేస్తున్న సమయమున ఒక ఉత్తరమును వ్రాసెను. శాసనోల్లంఘనము తిరిగీ తలయెత్తుతే వెంటనే ఘట్టిగా మొత్తవలసినదని ఈ యూరోపియనులు గవర్నమెంటు శక్రటరీకి సలహా నిచ్చిరి. ఇది అంతా యెప్పుడు జరిగినది ? కాంగ్రెసుతో సంధి చేసుకొందు మని లండనులో రౌండుటేబిల్ చుటూ అందరూ కూర్చున్న సమయములోనే. ఈ యూరోపియనులు గవర్నమెంటు శక్రటరీకి చెప్పిన సలహాలు యేవి అనగా- కాంగ్రెసు జెండాను నిషేధించవలెను. కాంగ్రెసు వాలంటరులు డ్రిల్లు చేయుట, పంక్తులలో నడవటం కూడదు. గత శాసనోల్లంఘనోద్యమములో జోక్యమున్న వారి నందరిని నిర్బంధములో పెట్టవలెను. వారి నందరిని శత్రురాజ్యపు ప్రజల్నుగా యెంచి నిర్బంధించవలెను. కాంగ్రెసుకు డబ్బు రాకుండా అన్నిమార్గములను కట్టించివేయవలెను. ఏయేచోట్లనుండి కాంగ్రెసుకు డబ్బు వస్తున్నదో ప్రత్యేకము ఆర్డినెన్సు వేసిచూడవలెను. కాంగ్రెసు షరతులకు వప్పుకొన్న మిల్లువారందరిచేత ఆ ఎగ్రిమెంట్లను రద్దుపరిపించవలెను. అట్లా రద్దుపరచని మిల్లులవారి సరుకుల యెగుమతి దిగుమతులకు రైళ్లలో చోటు ఇవ్వరాదు. రాజకీయ ఆందోళనవల్లనూ, బహిష్కారోద్యమమువల్లనూ ఆర్థికముగా యెవరినీ బాగుపడనివ్వరాదు. ఇవి వారు చెప్పిన సలహాలు.

౧౯౩౨-౩౩ సం.లో జరిగిన విషయములు ౧౯౩౦-౩౧ లో జరిగిన వానినే చాలవరకు పోలియున్నవి. అయితే యుద్ధము మాత్రము అంతకంటె యెక్కువ తీవ్రముగాను, పట్టుదలతోను జరిగెను. ప్రభుత్వనిర్బంధము వెనుకటికంటె బహుకఠినముగా నుండెను. దానితోపాటు ప్రజలబాధలు బహుఘోరముగా నుండెను.

జనవరి ౪ వ తేదీ వేకువజామున మహాత్మాగాంధీగారిని, కాంగ్రెసుప్రెసిడెంటు వల్లభాయిపటేలుగారిని అరెస్టు చేయుటతో గవర్నమెంటుముట్టడిప్రారంభమయ్యెను. అవుదయముననే పైన వివరించిన ౧౯౩౨ సం. ఆర్డినెన్సులు దేశము నలుముఖముల

ఠనూ జారీ చేయబడెను. ఇండియా యావత్తూ యీ ఆర్డినెన్సులతో కప్పబడినది. రాష్ట్రీయ కాంగ్రెసు కమిటీలు, జిల్లా తాలూకా కాంగ్రెసుకమిటీలు, జాతీయ పాఠశాలలు, యితర జాతీయసంస్థలు అక్రమసంఘములుగా ప్రకటింపబడెను. వాటి తాలూకు యిండ్లు, సామానులు, డబ్బు గవర్నమెంటు పట్టుకొని లాగుకొనిరి. పెక్కండ్రు కాంగ్రెసునాయకులను ఉన్నవారిని ఉన్నట్టుగా పట్టుకొని జైళ్లలో మూసివేసిరి. పైకి చూడగా కాంగ్రెసునాయకులు లేరు. డబ్బు లేదు. తలదాచుకొనుటకు యిల్లు వాకిలి లేదు. ప్రభుత్వము యీ విధముగా అమాంతముగావచ్చి కాంగ్రెసు మీద గబాలున పడినప్పటికీ వెనుకను జైళ్లబైట నున్న కాంగ్రెసువారు తెల్లబోలేదు. ఎక్కడివారు అక్కడ ఉత్సాహముతో ఉద్యమము సాగించిరి. ౧౯౩౦ సం.లో వలె వర్కింగుకమిటీవారు ఆయా కమిటీలలో కలుగు ఖాళీలను పూర్తిచేయ దలచలేదు. తన్ను అరెస్టు చేయుదురని తెలిసినతోడనే తన తరువాత కాంగ్రెసు ప్రెసిడెంటుగా ఒకరితరువాత ఒకరు వుండతగిన నాయకుల జాబితాను సర్దార్ వల్లభాయిపటేలుగారు వ్రాసియుంచెను. వర్కింగుకమిటీవారు తమ అధికారము లన్నిటినీ ప్రెసిడెంటుకు ఇచ్చివేసిరి. ఆయన తమ తరువాత వచ్చు నాయకులకు ఇచ్చివేసెను. వారు అరెస్టు అయినప్పుడు యింకొకరిని నామినేటు చేసుకోవచ్చు ననిరి. రాష్ట్ర సంఘములలో కూడా యిట్లే జరిగెను. ఈ రీతిగా రాష్ట్ర, మండల, తాలూకా, గ్రామ, సంఘ అధికారములు కూడ ఒక వ్యక్తుల పరంపరకు సంక్రమించెను. వీరినే సామాన్యముగా "డిక్టేటరు" లనుచూ వచ్చిరి. శాసనోల్లంఘనము నడపువారికి యే శాసనము వుల్లంఘించవలెనో ఏరుకొనుట మొదట కష్ట మయ్యెను. ఏ చట్టముపడితే ఆచట్టమును ఉల్లంఘించకూడదు గదా? అయితే వాటి పున్యామా అని ఈ ఆర్డినెన్సులు వచ్చిన తరువాత ఈ చిక్కు నివారణ అయ్యెను. ఈ ఆర్డినెన్సులు సర్వవ్యాపక మగుటచేత నే చిన్న పని చేసినను శాసనోల్లంఘనమే అయ్యెను. కాబట్టి ఎక్కడివా రక్కడ తమకు తోచిన చట్టములను ఏరుకొని ఉల్లంఘింప సాగిరి. మధ్యమధ్య కాంగ్రెసు ఆక్టింగు ప్రెసిడెంటులు కొన్ని కొన్ని శాసనములను ఉల్లంఘనమునకై శిఫార్సుచేయుచుండిరి. కల్లుదుకాణములు, విదేశీగుడ్డల దుకాణములు, బ్రిటిషువస్తువుల దుకాణములు పికెటింగు చేయుట యిండియా కంతకును సర్వసామాన్యమైపోయెను. సంయుక్తరాష్ట్రములలో విరివిగానున్నూ, బెంగాలులో కొన్ని చోట్లనున్నూ శిస్తుల నెగబెట్టు పని ముఖ్య మయ్యెను. బెంగాలు, బీహారు రాష్ట్రములలో కొన్నిచోట్ల చౌకీదారీపన్ను యెగబెట్టబడెను. మధ్యపరగణాలు, బీరారు,కర్నాటకములలోను,సంయుక్తరాష్ట్రములు, మద్రాసురాజధాని, బీహారులలో కొన్నిచోట్లను ఫారెస్టు చట్టములు వుల్లంఘింపబడెను. చాలచోట్ల ప్రజలు లైసెన్సు

లేకుండ వుప్పుచేసియు, అమ్మియు వుప్పుశాసనమును తిరస్కరించిరి. ౧౪౪వ సెక్షను ధిక్కరించి అన్నిచోట్ల మీటింగులు వూరేగింపులు జరుపబడెను. ప్రాముఖ్యమైన దినములు ప్రత్యేకశాసనోల్లంఘునదినములుగా చేయబడెను.

ఉదా: దండియాత్రరోజు, మోతీలాలునిర్యాణమురోజు, సరిహద్దు రాష్ట్రపు రోజు, చనిపోయిన వీరులరోజు, జెండారోజు మొదలగునవి.

గవర్నమెంటువారు కాంగ్రెసుఆఫీసులను, ఆశ్రమములను స్వాధీనపరచుకొనిరి గదా? వాటిని తిరిగీ ముట్టడించి పట్టుకొనుటకై కాంగ్రెసువాలంటీర్లు ఈభవనములపై దాడి వెడలిరి. వీటికే కాంగ్రెసుదాడు లని పేరువచ్చెను. అర్డినెన్సులకు భయపడి కాంగ్రెసుకు సంబంధించిన కాగితము లేవియు అచ్చుఆఫీసులు ప్రచురింపలేదు. అందుచేత కాంగ్రెసువారు నిషేధింపబడిన కరపత్రములను, కాంగ్రెసురిపోర్టులను సైపుచేసియు, సైకులోస్టయిలుచేసియు విరివిగా పంచిపెట్టిరి. కొన్ని అచ్చుఆఫీసులు తమ పేరులేకుండా ఈ కరపత్రములను అచ్చువేసి ఇచ్చెను. ఒక్కొక్కప్పుడు వూరుపేరు లేని అచ్చుఆఫీసు పేరులు, మనుష్యులపేర్లు వాటిపై ముద్రింపబడుచుండెను. పోలీసువారు యెంత మెలకువతో ఉన్ననూ ఈకరపత్రములు క్రమముగా ప్రచురింపబడుట ఆశ్చర్యము. దేశములో యేమూల యేమి జరుగుచున్నదీ ఈ కరపత్రములద్వారా ప్రచార మగుచుండెను. పోస్టు టెలిగ్రాపు ఆఫీసులు కాంగ్రెసుకు వుపయోగపడవు కదా? కాబట్టి కాంగ్రెసువారు ఆయారాష్ట్రములలో తమ స్వంత యేర్పాటులను చేసుకొనిరి. ఆల్ ఇండియా ఆఫీసునుండి అన్నిరాష్ట్రములకు జిల్లాలకుకూడ ఎప్పటి వార్తలు అప్పటికి వచ్చుచుండెను. ఈ వార్తలను తెచ్చుచున్న కాంగ్రెసువాలంటీర్లను అక్కడక్కడ పోలీసువారు పట్టుకొని శిక్షించుచుండిరి. ఈకాంగ్రెసు తపాలా ఉద్యమము ౧౯౩౦సం.రం ఆఖరుభాగమున ప్రారంభమై ౧౯౩౨వ సం.లో మిక్కిలి ప్రావీణ్యతను బడసెను. ఈకరపత్రములు ప్రచురణ అగుచున్న ఆల్ ఇండియా కాంగ్రెసు ఆఫీసునుగాని, రాష్ట్రకాంగ్రెసు ఆఫీసుగాని యెక్కడవున్నదో కూడ గవర్నమెంటువారు కనిపెట్టలేకపోయినారు. ఎప్పుడైనా ఒకసారి యేఆఫీసునైనా పట్టుకుంటే ఇంకొకసారి ఇంకొకచోట అది మొలచుచుండెను. గవర్నమెంటును తబ్బిబ్బుచేసి ప్రజలకు అమితోత్సాహము కలిగించిన ఇంకొకవిషయ మేమిటంటే, కాంగ్రెసు మహాసభలు, జిల్లా మహాసభలు దేశమునందంతటను జరుగుట. కొన్నిచోట్ల వాలంటీర్లు రైలులో నెక్కి గొలుసును లాగి రైళ్ల నాపివేసిరి. కొన్నిచోట్ల టిక్కట్లు లేకుండా ప్రజలు గుంపులుగా రైలులో నెక్కి రైల్వేవారికి నష్టము కలిగించిరి. కాని ఇది సరి కాదని కాంగ్రెసు పెద్దలు మాన్పించిరి.

బహిష్కారము తీవ్రరూపము దాల్చెను. ప్రత్యేకవారములు ప్రత్యేక అంశములకొరకు ప్రత్యేకింపబడెను. విదేశీబట్టలు బహిష్కరించుటకు ప్రత్యేకము ఒక వారము, ఇంగ్లీషుమందులు, ఇంగ్లీషుబ్యాంకులు, యింగ్లీషుభీమాకంపెనీలు, విదేశ పంచదార, కిరసనాయిలు, అమాంబాపతు బ్రిటిషు సరకులు బహిష్కరించుటకు వేరు వేరు వారములు యేర్పాటుచేయబడెను.

నాయకులను అరెస్టుచేయుటతో గవర్నమెంటు వూరుకొనలేదు. ఆర్డినెన్సులలో చెప్పిన అన్ని అధికారములను పూర్తిగా వినియోగించిరి. ఆర్డినెన్సులను యెంతో దూరమాలోచించి చేసినప్పటికీ వాటి బుద్ధికి అందని విషయములుకూడ కొన్ని దరిమిలాను కనుపడినవి. అరెస్టులు గుంపులుగుంపులుగా జరిగిన వని వేరుగా చెప్ప నక్కరలేదు. కాని వాటిలోకూడా కొందరుకొందరిని యేరియేరి చేసిరి. కొందరిని వదలివేసిరి. ఇండియామీద మొత్తము జెయిలుకు వెళ్లినవారిసంఖ్య లక్షకు తక్కువైయుండదు. క్యాంపుజెయిళ్లు, టెంపరరీజైళ్లు యెన్ని పెట్టినా చాలేటట్టు కనుపడలేదు. శాసనోల్లంఘనము చేసిన అందరిని అరెస్టుచేయకుండా అందులో కొందరినే ముఖ్యమైనవారిని యేరుకొని మిగతావారిని వదలివేయవలసివచ్చెను. బయట వుంటే మళ్లా అందరినీ పోగుచేసి వుద్యమమును సాగిస్తారనే అనుమానము వున్న వారినే జైలులోనికి తీసుకొనిరి. ఇక జైలులోకూడా వీళ్లతో వేగటము గవర్నమెంటుకు కష్టమయ్యెను. అందుచేత నూటికి ౯౫ మందిని "సి" క్లాసులో పడవేసిరి. కొద్దిమందిని "బి" క్లాసులో వేసిరి. ఎక్కడో పేరుకుమాత్రము కొందరికి "ఏ" క్లాసు నిచ్చిరి. ఈ ఏ, బి, సీ. తరగతులు ౧౯౩౦ సం.లో పుట్టినవి. అంతకుపూర్వము లేవు. రాజకీయఖయిదీలను ప్రత్యేక మొకతరగతిగా అంగీకరింపజాల మని గవర్నమెంటువారు నిరాకరించినప్పటికీ, వీ రందరికీ కనీసము వారివిద్య, సంఘములో పలుకుబడి విచారించి కనీసము బి. క్లాసు అయినా యిత్తురని గవర్నమెంటువారిమాటలనుబట్టి అనుకొనవలసివచ్చెను. కాని యది జరుగలేదు. బి. ఏ., ఎం. ఏ. ప్యాసు అయిన గ్రాడ్యుయేట్లు, కాలేజీప్రొఫెసర్లు, లాయర్లు, భాగ్యవంతులగు వర్తకులు, గొప్ప జమీందార్లు, పెద్ద భూస్వాములు, ప్రజలకోసరము పాటుపడు పరోపకారులు - అందరినీ కట్టకట్టి "సి" క్లాసులో పడవేసి, యెరుకల యానాది దొంగఖయిదీల కిచ్చు దిక్కుమాలిన కూడు, గుడ్డ నిచ్చిరి. భాగ్యవంతు లని గవర్నమెంటువారే యెంచి వేలకొలది రూపాయల జుల్మానా విధించినట్టివారికే "సి" క్లాసు యివ్వబడెను. ఇతర సంగతులు యెట్లున్నప్పటికీ తమ మనస్సులలో ధర్మమని తోచిన అభిప్రాయముతో దేశమునకు స్వాతంత్ర్యము సంపాదించుకొను మహోన్నత సంకల్పసిద్ధికొరకై బుద్ధిపూర్వకముగా జైళ్లను వరించిన స్త్రీపురుషులు నీచమగు జైలునిబంధనలకు తేలికగా లొంగుదు

రనుకొనుట పొరపాటు. ఎట్లా కూర్చోమంటే అట్లా కూర్చుండుట, చేతులు పైకె త్తుట, దింపుట మొదలగు కొన్ని జెయిలునిబంధనలు వారికి హీనముగా తోచెను. బాగుగా బ్రతికినవారికి, మంచి జీవితాదర్శములందు నమ్మకము గలవారికీ జెయిలు పరిస్థితులు కొన్ని సహ్యముగా కనుపడలేదు. అందువల్ల తరచు సత్యాగ్రహులకును జెయిలు అధికారులకును సంఘర్షణలు కలుగుచుండెను. తత్ఫలితముగా కొందరికి అనేకరకముల జైలుశిక్షలు గలుగుచుండెను. ఇవిగాక కొట్లలో పడవేసి కొట్టుట, చిత్రవిచిత్రవిధములుగా హింసించుట జైళ్లలో జరుగుచుండెను. ఇవి జైలుగోడల మధ్య జరుగునుగాన బయటపడునను భయము జైలుఅధికారులకు లేదు. నాసికు జైలులో ఒక ఖైదీని ఒకవికారరూపములో కూర్చొనవలసినదని చెప్పినప్పుడు ఆఖైదీ నిరాకరించెను. అందుకు ఆతనిని పట్టుకొని ఘోరముగా చావబాదిరి. ఈసంగతి బయటబడి జైలరుమీదను, అతని అనుచరులమీదను కేసుపెట్టబడి వారికి శిక్షకూడా విధింపబడెను. సత్యాగ్రహిఖైదీలమీద లాఠీచార్జీ చేయుట మామూలు అయిపోయెను. టెంపరరీజైళ్లలో మరీ అధ్వాన్నముగా నుండెను. అవి కేవలము టిన్నురేకుపాకలు, వేసవికాలములో నెత్తిమాడుచుండును. చలికాలములో చలి వణికిస్తుంది. ఈపాకలలో మనుష్యులను కిక్కిరిసినట్లు త్రోసిరి. అందువల్ల కలిగిన అపారిశుధ్యము దుర్భరము. కొన్నిజైళ్లలో పరిస్థితు లంతచెడుగా లేనిమాట నిజము. అయితే అట్టివి బహుకొద్ది. ఖాయపుజైళ్లలో కొన్ని అధ్వాన్నముగా నుండెను. చాల జైళ్లలో — ముఖ్యముగా క్యాంపుజైళ్లలో రాజకీయఖైదీల ఆరోగ్యము సంతృప్తికరముగా లేనట్లు కనబడుచున్నది. సంవత్సరము పొడుగునా అన్ని ఋతువులలోను జిగటవిరేచనములు, నెత్తురువిరేచనములు, సాధారణ మైపోయెను. వానకాలములోను, చలికాలములోను చాలామందికి ఊపిరితిత్తులు చెడిపోయెను. చాలామంది జైళ్లలోనే చనిపోయిరి. పర్మ్నెంటుజెయిళ్లలోకూడా యట్లే జరిగెను. ఆయాజెయిళ్లలో అక్కడనున్న జైలరు, సూపరింటెండెంటు మొదలగు జైలుఅధికారుల మంచిస్వభావమును, లేక చెడ్డస్వభావమును బట్టి ఖయిదీల స్థితిగతులు వుండుచుండెను. యెక్కడో ఒకరిద్దరు తప్ప చాలచోట్ల యీ జైలధికారులకు విచక్షణజ్ఞానముగాని, న్యాయబుద్ధిగాని తక్కువ.

ఉద్యమప్రారంభములోనే జనసమూహములను, ఉత్సవములను లాఠీలతో చెదరగొట్టు ఉపాయమును పోలీసులు అవలంబించిరి. ఉద్యమము యేమాత్రమైనా తలచూపిన చోట్లు అన్నిటిలో యిండియామొత్తముమీద లాఠీచార్జి తిననిచోటు లేదు. చాలచోట్ల తగిలినదెబ్బలు చాలా ప్రమాదమైనవి. దెబ్బలు తిన్నవారిసంఖ్య మిక్కుటము. సత్యాగ్రహులు వూరేగింపుగా వెళ్లుచున్నప్పుడుగాని, మీటింగుచేస్తున్నప్పుడుగాని, ప్రభుత్వపు పోలీసుల స్వాధీనములో నున్న యిండ్లమీదకు దాడి వెడలుచున్నప్పుడుగాని,

పికెటింగు చేయుచున్నప్పుడు గాని యేమి జరుగుచున్నదో తమాషా చూదా మని యితరజనులు గుంపులు గూడుట మామూలు. ఇట్టి సందర్భములో పోలీసులు లాఠీ చార్జి చేయునప్పుడు బుద్ధిపూర్వకముగా శాసనోల్లంఘనము చేయవచ్చినసత్యాగ్రహీలని గాని, వూరికే తమాషా చూడవచ్చిన బయటివారని గాని విచక్షణలేకుండా అందరిని కలిపి చావ బాదుచుండిరి. చూడవచ్చినవారిని మాత్రము చావ బాది, సత్యాగ్రహీలను మెదలకుండా అరెస్టుచేసి తీసుకువెళ్లిన సందర్భములుకూడా కలవు. సత్యాగ్రహీలకు కూడా దెబ్బలు తగిలినసంగతి వేరుగా చెప్పనక్కరలేదు. వీరికి బయట బజారులలో అందరితో బాటు జరిగిన వడ్డనము గాక నెమ్మదిగా పోలీసు లాకపులో ఖైదీ కొట్లలో ప్రత్యేకపు దెబ్బలు వడ్డించబడుచుండెను. చాలచోట్ల నోట వచింపరాని బాధలు, హింసలు పెట్టబడెను. ఆఫీసరుయొక్క బుద్ధిచాకచక్యమును బట్టిన్నీ, వానియొక్క పశుత్వమునుబట్టిన్నీ ఈ చిత్రవధలు యెప్పటికప్పుడు రకరకములుగా సృష్టింపబడుచుండెను. స్త్రీలు, బాలురు, పసిపిల్లలుగూడ ఈ చిత్రవధలను తప్పించుకొనలేక పోయిరి. సత్యాగ్రహీలు జెయిళ్లకు, దెబ్బలకు, చిత్రవధలకు, చివరకు తుపాకీ గుండ్లకు కూడ జంకరనిన్నీ, వాళ్ల ఆస్తులను ముట్టుకుంటేమాత్రము లోబడుతారనిన్నీ గవర్నమెంటు కనిపెట్టెను. అందుచేత చాలామందిమీద దుర్భరమగు జరిమానాలను వేసిరి. కొన్నిచోట్ల యీ జరిమానాలు అయిదు స్థానములవరకుకూడా (అనగా పది వేల వరకుకూడా) పెరిగెను. వందలు వేలు సామాన్యమే. ఈ జరిమానాలు,శిస్తులువగైరాలు వసూలుచేయుటకై శిక్షింపబడినవారి ఆస్తులనే గాక వారి జాయంటు కుటుంబముల యొక్కయు, కొన్నిచోట్ల బంధువులయొక్కయు, చూడవచ్చిన చుట్టముల యొక్కయు ఆస్తులనుకూడా పట్టుకొని వేలమువేయుచుండిరి. ఇదికూడా ప్రజల కంత బాధలేకపోయెడిదే కాని, యెంతో విలువగల ఆస్తులను టోలీకి,దమ్మిడీకి, వేలమువేయుచుండిరి. "లా"ప్రకారము జరుగు జప్తులు వేలములుగాక "లా"ను మించిచేసిన అక్రమములు ప్రజలకు మరింత దుర్భరమయ్యెను. కొన్నిచోట్ల యివి లూటీలక్రింద పరిణమించెను. భూములు, యిండ్లు,నగలు,పశువులు, నిలువపంటలు విచక్షణ లేకుండా అమ్మివేయబడెను. కొన్నిచోట్లతగులబెట్టబడెను. ఈరోజువరకుగూడభూములు,యిండ్లు వాకిళ్లులేకుండాఅల్లాడుచున్నప్రజలు గుజరాతు, కర్నాటక, సంయుక్తరాష్ట్రములలో కలరు.వీరియొక్క బాధవీరుబుద్ధిపూర్వకముగా స్వరాజ్యముకొరకు తెచ్చిపెట్టుకొన్నది. అనగా వీరివద్ద డబ్బులేక శిస్తు చెల్లించకపోలేదు. తమ ఆస్తులను కాపాడుకొనదలచుకొన్నట్టయితే వారి శిస్తులను, జరిమానాలను తేలికగా యిచ్చివేయగలిగెడివారే. అయినప్పటికీ గవర్నమెంటువారు అనవసరముగా యీ బాధలను వారిపై పెట్టిరి. గవర్నమెంటుకు కావలసినది కేవలము శిస్తుడబ్బులే అయినట్లయితే యింతింత

ఆస్తులను ప్రజలనుండి లాగుకొనవలసినపని నిజముగా లేదు. గుజరాతురైతులు పడిన బాధలు వర్ణించుట దుష్కరము. అయినను వారు లొంగలేదు. కొన్నిచోట్ల శిక్షార్థపు పోలీసులను వేసి వూళ్లమీద డబ్బు వసూలు చేసిరి. బీహారులో యీపోలీసులను పెట్టిన నాలుగైదుచోట్లనుండియే నాల్గులక్షల డెబ్బదివేల రూపాయలను వసూలు చేసిరి. పోలీసులను పెట్టినచోట్ల వారు చేసిన అక్రమములకు మిడ్నపూరుజిల్లాలోని హిందూ ప్రజలు దద్దరిల్లిపోయి వూళ్లు విడిచిపెట్టి పోయిరి. ఇట్లు లేచిపోవుటలో వారు పడ్డ అష్టకష్టములు వర్ణనాతీతములు. అనేకమంది స్త్రీలు దోవలో చనిపోయిరి.

కొన్నిచోట్ల వూళ్లకువూళ్లు కలిపి జుల్మానా వేసిరి. చాలచోట్ల ప్రజలపై తుపాకులు కాల్చిరి. అనేకమందికి గాయములు తగిలెను. కొందరు చచ్చిరి. ఈ విషయములో వాయవ్యపరగణా ప్రజలు యెక్కువ నష్టపడిరి.

ఈవర్ణనలు యింక చాలును. ఎన్ని చెప్పినను వీనికి తరుగు లేదు. మనుష్యులపేర్లు, వూళ్లపేర్లు చెప్పదలచుకుంటే తరగవు. కాంగ్రెసు తరఫున పురుషులు, స్త్రీలు, పిల్లలు చేసిన అమాంబాపతు శాసనోల్లంఘన చర్యలనున్నూ, గవర్నమెంటు అధికారులు చట్టప్రకారముననూ, చట్టమునకు మించిన్నీ, శాసనములకు అతీతముగానున్నూ, విరుద్ధముగానున్నూ చేసిన చర్యలనున్నూ, తత్ఫలితముగా ప్రజలు అనుభవించిన బాధలనున్నూ ఒక్కొక్కటే పూర్తిగా చెప్పదలచుకొన్నయెడల ఒక పెద్ద భారత మగును. అవి రోళ్లా రోకళ్లం పాడినను తీరదు. ఉద్యమము ఆసేతు హిమాచలము వ్యాప్తమైనది. రాష్ట్రములు రాష్ట్రములతో పోటీపడి ఉద్యమమును సాగించినవి. కేవలము బ్రిటిషుయిండియాలోనే కాదు, స్వదేశప్రభువుల సంస్థానములలోకూడ ఈ ఉద్యమము వ్యాపించెను. ఢెంకనాల్ సంస్థానము యిందుకు నిదర్శనము.

గవర్నమెంటు స్వాధీనపఱుచుకొన్న ఆశ్రమములు, కాంగ్రెసు భవనములు పడగొట్టబడెను. కొన్నిచోట్ల తగులబెట్టబడెను.

వార్తాపత్రికలకు గట్టిదెబ్బ తగిలినది. చాలపత్రికలకు ధరావతు నడిగిరి. కట్టిన ధరావతులు గవర్నమెంటు కాజేసి మళ్లీ ధరావతు కోరిరి. ఈ ధరావతులు కట్టలేక చాలపత్రికలు మూలబడెను. గవర్నమెంటు యేమిచేసిపోవునో అను భయముచేత చాలపత్రికలు బయటవచ్చుటయు మానివేసెను.

ఈ బీభత్స భయానక బంధనమునుండి ఒక్క దివ్యాంశము మాత్రము మనోహరముగా కన్పట్టుచున్నది. మొత్తముమీద ప్రజలు శాంతిని వీడలేదు. మహాత్ముని అహింసాపద్ధతి ప్రజలకు గాఢముగా నచ్చినది. అందువల్ల కొద్దివారములలో ముగియును అని గవర్నమెంటువారు అనుకొన్న వుద్యమము నెలలతరబడి సాగుటకు అవకాశ

మేర్పడెను. అదిన్నీగాక యింకొక విషయముకూడ చెప్పవలసియున్నది. గవర్నమెంటువారు తమ చట్టములనే దాటి తమ శాసనములనే అతిక్రమించి యేటుపట్టిన అటు అడ్డదిడ్డముగా వ్యవహరించి నాగరిక ప్రభుత్వ పద్ధతిని సమస్త న్యాయధర్మములను మంటగల్పు మార్గములను అవలంబించియుండకపోయినచో యీ వుద్యమమును వారు అసలు పట్టనేలేకపోయెడివారని నిస్సంశయముగా చెప్పవచ్చును. ఇందతిశయోక్తి యెంతమాత్రమూ లేదు. బహిరంగప్రచారమునకు దోవలన్నియు మూసివేయబడుటచేత చాలమంది కాంగ్రెసువారు తమకు తెలియకుండగనే రహస్యమార్గములలోనికి దిగిరి. దీనిలోకూడ వారు చాలచాకచక్యమును చూపించిరి.గవర్నమెంటువారు అనేకరకముల పోలీసులను - మామూలుపోలీసు, రహస్యపుపోలీసు, స్పెషల్ పోలీసులు - దేశమన్నిమూలలా పెట్టిరి. కాని కాంగ్రెసువాలంటీర్లు వీరిని కూడ మరపించి పనిచేసిరి. కాంగ్రెసు ఆఫీసులు నెలకొల్పుట, కాంగ్రెసు కరపత్రములను క్రమము తప్పకుండా ప్రచురించుట మొదలగువానిని గురించి చెప్పియుంటిమి. యే సమయమున ఏ కార్యక్రమము అవలంబింపవలెనో యెప్పటికప్పుడు కాంగ్రెసు ఆఫీసులనుండి ఆజ్ఞలు వచ్చుచుండెను. సత్యాగ్రహోద్యమమునకు పెద్ద ధనము అవసరము లేకపోయినను యింత పెద్ద స్కేలుమీద ఉద్యమము నడుచుచున్నప్పుడు డబ్బు కేవలము లేకుండా సాగదు. డబ్బులేనందువల్ల యెప్పుడూ ఎక్కడా ఉద్యమము నిలిచిపోలేదు. డబ్బు వచ్చేది యెక్కడనుండో యెవరికీ తెలియదు. పేరులేని దాత పేరుతెలియని గృహీతకు యిచ్చుచుండెను. ఆట్టిస్థితిలో ఆడబ్బు దమ్మిడీకూడ బీరుపోకుండా యీ వుద్యమమునకే వినియోగపడుటయు, ఆ అల్లకల్లోలపురోజులలో దీటికి దమ్మిడీలతో సహా లెక్క వ్రాయబడుటయు ఆశ్చర్యము! ఆరోజులలో కాంగ్రెసు ఆఫీసులును మనుష్యుల జేబులలోనే యుండెను. ఈరహస్యమువల్ల వుద్యమమునంతను ఒకవ్యక్తి నడుపుటకు అవకాశము చిక్కెను. అయితే యేది వచ్చిననూ సరే లక్ష్యము చేయకుండా బహిరంగముగా ఉద్యమమును సాగించి ప్రజలలో ఉన్నతభావములను మేల్కొలుపుటకు బదులుగా పోలీసులకు కాంగ్రెసువారికి తెలివితేటలలో పందెముగా ఇది పరిణమించెను. మనవారి తెలివికి మెప్పువచ్చునేగాని వేరొండు ఫలితము కలుగలేదు.

ఈఅధ్యాయము ముగించుటకు ముందు ౧౯౩౨-౩౩ సం ల ఏప్రియల్ నెలలో ఢిల్లీ, కలకత్తాలలో జరిగిన కాంగ్రెసుమహాసభలనుగూర్చి చెప్పవలసియున్నది.పోలీసువారు యెంతజాగ్రత్తగా ఉన్ననూ ఢిల్లీసభ జరిగితీరినది. చాలామంది ప్రతినిధులు ఢిల్లీకి వచ్చుచుండగా దోవలోనే పట్టుకొని అరెస్టు చేయబడిరి.

ఈమహాసభఢిల్లీ చాందినీచౌకులో "క్లాక్ టవరు" క్రిందజరిగినది.పోలీసులువెయ్యికండ్లతో కనిపెట్టి చూచుచున్ననూ మీటింగుస్థలములోనికి అయిదువందలమంది ప్రతిని

ధులు ప్రవేశింపగలిగిరి. క్లాకుటవరులో సభ జరుగునని కాంగ్రెసువారు చేసిన ప్రకటనతమ్మును ఏమరుపాటుకు చేయబడినదని పోలీసులు తలచి వాలంటీర్ల కోసరం యింకెక్కడనో వెదకుచుండిరి! మరికొందరు పోలీసులు యింకొకచోట "అకాలీల" వుక్సవముతో నుండిరి. పోలీసు చాందినీచౌకువద్దకువచ్చుసరికే, ప్రతినిధులచ్చట సమావేశమై తీర్మానములు చేయసాగిరి. అహమ్మదాబాదువాస్తవ్యులగు సేత్‌రణచోడ్ దాసు అమృతలాలుగారు యీసభకు అగ్రాసనాధిపత్యము వహించిరి. వార్షికనివేదిక చదువబడెను. నాల్గు తీర్మానములు చేయబడెను: (౧) కాంగ్రెసుయొక్క సంపూర్ణ స్వాతంత్ర్యాదర్శము. (౨) శాసనోల్లంఘనము తిరిగి ప్రవేశపెట్టబడినందుకు సంపూర్ణ ఆమోదము. (౩) మహాత్మాగాంధిగారి ఆహ్వానము ఆలకించి దేశము అత్యద్భుతముగా జవాబు యిచ్చినందుకు దేశము అభినందించబడెను. గాంధిగారి నాయకత్వమందు సంపూర్ణ ఆమోదము తెలుపబడెను. (౪) అహింసాసిద్ధాంతమందు విశ్వాసము తిరిగి చెప్పబడెను. అధికారులు యెంత చీకాకుపరచినను దేశము-ముఖ్యముగా పరాక్రమశాలులగు సరిహద్దురాష్ట్రపు పఠానులు-అహింసను వీడనందుకు అభినందించబడిరి.

మాలవ్యాగారు యీఢిల్లీ మహాసభకు అగ్రాసనాధిపత్యము వహింపవలసియుండెను. కాని వారిని దోవలోనే అరెస్టుచేసిరి. ఈసంరంభకాలములో జైలుబయట నున్న నాయకులు యీయన ఒక్కడే. ఆయన లండనునుండి యిండియాలో అడుగు పెట్టినది మొదలు వయోభారమును గమనింపక, తన శరీరారోగ్యమును పాటింపక కృషి చేసెను. గవర్నమెంటు చేయుచున్న నిరంకుశచర్యలను ఆయన నిర్మొగమాటముగ ప్రచురించుచుండెను. కాంగ్రెసువారికి ధైర్యమిచ్చుచు తన అపూర్వశక్తిచేతను, మొక్కవోనిదీక్షచేతను కాంగ్రెసులో పనిచేయువారిని హుషారు చేయుచుండెను. ఏమైనా సందేహములు, చిక్కులు వచ్చినప్పుడు కాంగ్రెసువారు సలహాకొరకు వీరివద్దకే పోవుచుండిరి. వారి ఆశలను మాలవ్యాగారు యెప్పుడునూ నిరర్థకపరచలేదు.

# ౨. చక్రము మారినది

[గాంధీ ఆమరణాంతోపవాసదీక్ష - పూనా ఒడంబడిక - పూనా ఒడంబడిక అంగీకరింపబడుట - స్వాతంత్ర్యసందేశము - ఉపవాసప్రతిమునకు కర్త గా- గాంధీ కళ్లెములు లాగిపట్టుట - హరిజనోద్యమమునకు గాంధీకి వచ్చిన అపూర్వ సహాయము - గాంధి తిరిగి ఖైదీయే - గాంధి అస్పృశ్యతానివారణ ప్రచారమున కంగీకరింపబడుట - మైనారిటీలసంఘములో గాంధీప్రమాణము - గాంధీ సర్ సామ్యూల్ హోరుకు వ్రాసిన ఉత్తరము - ప్రత్యేకనియోజకవర్గము హానికరము - "మరణము పొందువరకును ఉపవాసము చేయుదును". మతవిశ్వాసము - సర్ సామ్యూల్ హోర్ ప్రత్యుత్తరము - గాంధీజీ ప్రధానమంత్రికి వ్రాసిన ఉత్తరము - ప్రధానమంత్రి జవాబు - గవర్నమెంటువారి నిర్ణయము విశదపరుపబడుట - రక్షణలు తాత్కాలికములు - ప్రభుత్వాధికారము స్వల్పము - ప్రభుత్వ నిశ్చయము మారలేదు - గాంధీజీకి చిట్టచివరి ప్రత్యుత్తరము - నిర్ణయమంతే - బొంబాయి ప్రభుత్వమునకు గాంధీ ఉత్తరము - "నా జీవితస్వప్నము" - న్యాయముకొరకు - మానవాభ్యుదయముకొరకు పోరాటము - ఎరవాడసంధి - ఇతర ఉపవాసములు - ఠాగూరునిర్ణయము - ఆయనభావపరివర్తనము - రాజేంద్రబాబు ప్రకటనము - కలకత్తాకాంగ్రెసు నిషేధింపబడుట - తీర్మానములు - గాంధీయొక్క ౨౧ రోజుల ఉపవాసము - గాంధి రాస్ గ్రామమునకు పోవ నుద్దేశించుట - నిర్బంధము, విడుదల - తిరిగి అరెస్టు - బీహారుభూకంపము - జవహరలాల్ అరెస్టు, ఖైదు - శాసనసభా ప్రవేశ కార్యక్రమము.]

రెండవ రౌండుటేబిలుసభలో బ్రిటిషుప్రధానమంత్రి మాక్డొనాల్డు సాంఘిక సమస్యనుగూర్చి తాను మధ్యవర్తిపరిష్కారము చేసెద నని, అందు కక్కడకు వచ్చినవా రందరును అంగీకరించి సంతకములు పెట్టవలెనని కోరెను. కాని, ఆ మధ్యవర్తిపరిష్కార మెన్నడును జరిగియుండలేదు. ఈ విషయములు పాఠకులకు తెలిసియేయుండును. ప్రధానమంత్రి అసాధారణపద్ధతి నవలంబించెను. సాధారణముగా ఒక పెద్దమనిషిని మధ్యవర్తిత్వము చేయవలసినదని పార్టీలు పిలిచెదరు. ఇక్కడ తనంట తాను మధ్యవర్తిత్వము చేసెదనని ప్రధానమంత్రి పార్టీలను

పిలిచెను. కాబట్టి అది అపజయము పొందకతప్పనిసరి యైనది. కనుక అల్పసంఖ్యాకుల విషయములో ప్రభుత్వమువారు చేసిన నిర్ణయము వైటు పేపరులోని తక్కిన నిర్ణయములతో పాటుదే గాని అదియొక మధ్యవర్తితీర్పు కాదు. తరువాత 'అంటరానివాండ్రను' హిందూసంఘమునుండి చీలదీయుటకు చేయబడిన ప్రయత్నములు తన ప్రాణము లొడ్డి నిరోధింతునని గాంధి రెండవ రౌండుటేబిలుమహాసభలో చెప్పినమాటలు చదువరులకు జ్ఞాపక ముండియుండును. గాంధి ఇపుడా కఠినప్రతిజ్ఞను నిలుపుకొనవలసిన తరుణ మాసన్నమైనది. ఆయన ౧౯౩౨ మార్చినెలలోనే భారతరాజ్యాంగ కార్యదర్శి కీ విషయమునుగూర్చి ఒక ఉత్తరమును వ్రాసెను. దానిని పరోక్షచో ఉదాహరింతుము. లోథియనుకమిటీవారు జనవరి ౧౭ వ తేదీని ఓటింగు హక్కులనుగూర్చి, ఎన్నికస్థానములనుగూర్చి విచారించుటకు భారతదేశమునకు వచ్చిరి. కాలముగడచిపోవుచుండెను. లోథియనుకమిటీవారి నివేదిక తయారుకాగలదు. మన మాలోచిస్తూండగానే తమపనులను. తాము చక్క బెట్టుకొనుటలో బ్రిటిషువారు మంచిచాకచక్యము గలవారు. కాబట్టి గాంధీ తీవ్రముగా ఆలోచించి ౧౯౩౨ మార్చి ౧౧ వ తేదీని సర్ సామ్యూలుహోరు కొక ఉత్తరము వ్రాసెను. నిమ్నజాతులకుగాని, అంటరానివాళ్లకుగాని ప్రత్యేక నియోజకవర్గములను సృష్టించుటకే ప్రభుత్వమువారు నిర్ణయించేయెడల తాను మరణము పొందునంతవరకును నిరాహార దీక్ష పూనెదనని, ఆ ఉత్తరములో గాంధి స్పష్టపరచెను. ౧౯౩౨ ఏప్రిలు ౧౩ వ తేదీని సర్ సామ్యూల్ హోరు ప్రత్యుత్తరము పంపెను. అది కేవలము మామూలుగా అధికారులు పంపే ప్రత్యుత్తరమువంటిదే. "ఆయన లోథియను సిఫార్సులకొరకు వేచియుండవలెను. సమయము వచ్చినప్పుడు గాంధి అభిప్రాయములు విచారింపబడును." ఇవి ఆయనమాటలు.

అగస్టు ౧౭ వ తేదీని మాక్డొనాల్డు తన నిర్ణయమును ప్రకటించెను. ఆ నిర్ణయమే మధ్యవర్తితీర్పుగా వాడబడుతూన్నది. (అనుబంధము ౯) కాని దానిని మధ్యవర్తితీర్పనుట తప్పు. గాంధీ ఆ నిర్ణయమును ప్రతిఘటించినయెడల ఆయన తప్పు చేసినట్లుగా ప్రపంచకమునకు తోపజేయుటకు ప్రధానమంత్రి బుద్ధిపూర్వకముగా చేసిన ప్రయత్నమది. నిమ్నజాతులకు ప్రత్యేకనియోజకవర్గము లేర్పాటు చేయబడుటే గాక అదనపు వోట్లున్నూ, సాధారణ నియోజకవర్గములో స్థానములను పోటీచేసే హక్కున్నూకూడా వారికి ప్రసాదింపబడెను. ఈ నిర్ణయము కసిగాద్దీ చేయబడినది. అగస్టు ౧౮ వ తేదీని గాంధి తనకార్యవిధానమును నిర్ణయించుకొనెను. దానినిగూర్చి ప్రధానమంత్రికి విశదపరచెను. ౧౯౩౨ సెప్టెంబరు ౨౦ వ తేదీని ఉపవాసవ్రతము ప్రారంభ మగునని ఆయనకు తెలియబరచెను. మాక్డొనాల్డు సావకాశ

ముగా సెప్టెంబరు ౯ వ తేదీని గాంధికి ప్రత్యుత్తరమిచ్చెను. ఈ ఉత్తర ప్రత్యుత్తరములన్నీ సెప్టెంబరు ౧౨ వ తేదీని ప్రచురింపబడెను. ప్రధానమంత్రి నిమ్నజాతులనుగూర్చి గాంధికి శత్రుభావ మున్నట్లుగా నిందారోపణ చేసినవిషయమును ఇక్కడ నిరసించుటకు మాత్రమే ఉదాహరింపబూనితిమి. సాంఘికనిర్ణయములను గూర్చిన లోపాలోపములతో మన కిప్పుడు ప్రసక్తిలేదు. అందులో కొంతభాగము పూనా ఒడంబడికతో గిటుపడెను. తక్కినదికూడా గిటుపడ నున్నది. పూనా ఒడంబడిక ఏవిధముగా పరిణామము పొందినదో మనము తెలుసుకొనవలెను. గాంధినిరాహారదీక్షయొక్క ప్రత్యక్షఫలిత మిది.

గాంధీ, బ్రిటిషుప్రధానామాత్యులమధ్య జరిగిన ఉత్తర ప్రత్యుత్తరములు ప్రకటింపబడినపిమ్మట ఆయన నిరాహారదీక్ష పూనేలోగా ప్రపంచక మల్లాడి పోయినది. వ్యక్తులు, సంస్థలు, జాతులు - అందరూకూడా ఈ మహాపదనుండి ప్రపంచకమును తప్పించుట కెవరికి తోచిన ప్రయత్నమును వారు చేయబూనిరి. గాంధిసందర్శనముకొరకు జైలధికారులకు దరఖాస్తులు పెట్టబడెను. కాని అవి త్రోసివేయబడెను. ప్రపంచకపు కొట్టకొననుండి పూనాకు తంతివార్తలు దుమికినవి. గాంధీని ఆయననిర్ణయమునుండి తప్పించుట కనేకప్రయత్నములు చేయబడెను. మిత్రు లాయనప్రాణములను సంరక్షింప చూచుచుండగా శత్రువులు వింతగా చూడనొడగిరి. గాంధీనిరాహారదీక్ష దేశము నల్లకల్లోలము చేసెను. ౯ సంవత్సరములక్రిందట ఆ ఎరవాడజైయిలులోనే గాంధి కాకస్మికముగ గర్భకోశములో జబ్బు (Appendicitis) చేసెను.

ఇప్పుడాయన బుద్ధిపూర్వకముగా మరణించేటంతటివరకును నిరాహారదీక్ష పూనెను. కాబట్టి దేశ మొక్కసారి చింతానిమగ్నమైపోవుటలో వింత లేదు. ప్రధానమంత్రినిర్ణయము నిర్మూలింపబడవలెను. ప్రధానమంత్రి తనంతట తా నాపనిని చేయడు. కాబట్టి అది హిందువులలో ఒడంబడికమూలమున జరుపబడవలెను. అందుకొరకు మహాసభ జరుగవలసియుండెను. అది ౧౯ వ తేదీని జరుగవలెనా లేక ౨౦ వ తేదీని జరుగవలెనా అని ఆలోచనలు ప్రారంభ మయ్యెను. గాంధి ప్రాణము సంరక్షింపబడవలెను. ఈ విషయములో నిమ్నజాతినాయకుడే ముందు పూనుకొనుట చాలా కీర్తిప్రదమైన విషయము. రావు బహద్దరు యం. సి. రాజా ప్రత్యేకనియోజకవర్గములను ఖండించెను. సప్రూ గాంధీని విడుదలచేయవలె నని కోరెను. కాంగ్రెసువాదులు ప్రజాభిప్రాయములను కేంద్రీకరించి రాజీచేయబూనుకొనిరి. పండితమాలవ్యా, వయోవృద్ధుడు గనుక ఆయనకు మంచిఆలోచన తోచెను. వెంటనే ఆయన నాయకుల సమావేశమును జరుపవలె నని ఆలోచించెను. ఇంగ్లండులో

లాన్సుబరీ, పోలక్, ఆండ్రూసు లీ సందిగ్ధస్థితిని గూర్చి ఆంగ్లప్రజలకు తెలియ చేయ నారంభించిరి. ఇంగ్లండుదేశ మంతటా ప్రార్థనలు జరుపబడవలె నని పలుకుబడిగల పెద్దల సంతకములతో ఒక ప్రకటనము చేయబడెను. హిందూదేశ మలో సెప్టెంబరు ౨౦ వ తేదీ ప్రార్థనోపవాసదినముగా తలపబడెను. ప్రధాన మంత్రినిర్ణయమును మార్పుచేయించుటకు ప్రారంభింపబడిన ఈ ఉద్యమము భారతదేశములో అస్పృశ్యతాకళంకమును నిర్మూలించునట్టిదిగా పరిణమించినది. కలకత్తా, ఢిల్లీ మొదలగు నగరములలో అంటరానివార్లకొరకు దేవాలయద్వారములు తెరవబడెను. గాంధీ ఉపవాసవ్రతమును ప్రారంభించినవెంటనే విడుదల చేయబడు నని ప్రపంచక మాశించెను. కాని, కొన్నినియములతో ఆయన కర్హమైన ఒక గృహస్థునింట ప్రత్యేకముగా నుంచుట కాలోచింపబడినది. గాంధీ, తా నెట్టివర తులకు లోబడుటకుగాని, ప్రభుత్వమువారికి వ్యయప్రయాసలు కలిగించుటకు గాని ఇష్టపడనని వ్రాసెను. ప్రభుత్వమువా రందుకు వెంటనే అంగీకరించిరి. ఆయన కిష్టము లేనిపద్ధతులను బలవంతముగా ఆయనపైన ప్రయోగించుట మానివేసిరి.

పూనా ఒడంబడికయొక్క పరిణామచరిత్ర మిచ్చట వివరముగా నుదాహరించుట మాకు సాధ్యము కాదు. ఈసభ మొట్టమొదట బొంబాయిలో మాలవ్యాజీచే సమావేశపరుపబడెను. తరువాత దానికార్యరంగము పూనాకు మార్చబడెను. దీనిని గూర్చిన వివరములను తెలుసుకొనవలె నన్నవారు గాంధీ ఆంతరంగిక కార్యదర్శి ప్యారీలాల్‌చే వ్రాయబడిన 'మహోపవాసము' (The Epic Fast) అనే గ్రంథమును చదువతగును. డాక్టరు అంబేద్కర్ వెంటనే రాయబారములలోకి దిగెను. అమృతలాల్ తక్కర్, రాజగోపాలాచారి, చునిలాల్ మెహతా, పండిత మాలవ్యా, బిర్లా, సర్దార్ పటేల్, సరోజినీదేవి, జయకర్, అంబేద్కర్, యం. సి. రాజా, రాజేంద్రప్రసాదు, హృదయనాథకుంజ్రు మొదలగువారి సహాయముతో ఒక ప్రణాళిక తయారుచేయబడెను. అది గాంధీ ఉపవాసవ్రత మవలంబించిన అయిదవరోజున అన్ని పక్షములవారిచేతను అంగీకరింపబడెను. నిమ్నజాతులు వారి ప్రత్యేకనియోజకవర్గములను పోగొట్టుకొని, సాధారణ హిందూ నియోజకవర్గములతో మాత్రమే సంతృప్తి పడిరి. (ఇదివరకే బ్రిటిష్ నిర్ణయముప్రకారమే వారు సాధారణ హిందూనియోజకవర్గములలో చేర్చబడి యుండిరి.) కాని కులీనహిందువులు వారికి కొన్ని సంరక్షణలను అంగీకరించిరి. ఒకటి, వారికి వివిధశాసనసభలయందలి సాధారణనియోజకవర్గములలో కొన్ని (౧౪౮) ప్రత్యేకస్థానము లేర్పాటు చేయబడెను. రెండు, వారిలో వారు ప్రతిప్రత్యేకస్థానమునకును నలుగు రభ్యర్థుల నెన్నుకొనవలెను. సాధారణనియోజనవర్గము లీ నలుగురిలో నొకరిని వరింపవలసియున్నది. ఈ ఒడంబడిక అంగీకారమైన

భావముతో గాని మార్చబడుటకు వీలులేదు. నిమ్నజాతుల ప్రయిమరీ ఎన్నికలు ౧౦ సంవత్సరముల కాలమువరకూ కూడ కొనసాగవచ్చును.

ప్రధానమంత్రి నిర్ణయమునను మార్పు చేయవలసినంతవరకు పూనా ఒడంబడికే బ్రిటిష్ ప్రభుత్వమువారిచే అంగీకరింపబడెను. ప్రధానమంత్రి నిర్ణయము (Award) నకు వెలిగానున్న విషయములలో మాత్రము బ్రిటిష్ ప్రభుత్వమువారు తమ తీర్పును నిలిపి యుంచిరి. నిమ్నజాతినాయకు లీ ఒడంబడికకు సంతోషించుటకు కారణము కలదు. ఎందువలన ననగా, ప్రధానమంత్రినిర్ణయములోకంటె వారికి రెట్టింపుస్థానములు లభించినవి. అంతేకాక వారి జనసంఖ్యాధామాషాను మించి వారికి ప్రాతినిధ్యము లభించెను. ౧౦ సంవత్సరములతరువాత రిఫరెండమును జరుపవలెనన్న విషయముదిట్టచివరక్షణలో వాదప్రతివాదములకు కారణమయ్యెను. గాంధీ రిఫరెండమును పుచ్చుకొనుటకు ౧౦ సంవత్సరములకంటె ౫ సం. లుండిన బాగుండు నని సూచించెను. దానిని ఆలస్యము చేసినయెడల ప్రజలు సందేహింతు రని ఆయన భావించెను. కాని అంబేద్కర్ కులీనహిందువుల సదుద్దేశమును పరీక్షించుటకు కాక, నిమ్నజాతులవారిలో ప్రతికూలముగా వోట్లిప్పించేనిమిత్తము ప్రచారముచేయుటకొరకు ఎక్కువ కాలపరిమితి ఉండవలె ననెను. గాంధీ ౫ సంవత్సరములే కాదు, "నా జీవితాంతమువరకును పరిమితి ఉన్నను నా కభ్యంతరము లే"దనెను. చిటచివరకీ యావత్తువిషయమూ, ముందుముందు పరస్పరాంగీకారముతో నిర్ణయింపబడవలె నని రాజగోపాలాచారి సూచించెను. గాంధీ సెబాసనెను. ౨౬ వ తేదీని రవీంద్రనాథటాగూరు గాంధీని దర్శించెను. సరిగా ఆనాడే బ్రిటిష్మంత్రివర్గమువా రొడంబడిక నంగీకరించినట్లు వార్తవచ్చెను. ఇంగ్లండు ఇండియాదేశములలో ఒకేసారి ౨౬ వ తేదీ ఉదయమున పూనాఒడంబడిక అంగీకరింపబడినట్లుగా ప్రకటింపబడెను. హేగ్ భారతశాసనసభలో ఈ క్రిందివిషయములతో ఒక ప్రకటనమును గావించెను:

(౧) ప్రధానమంత్రి నిర్ణయించిన ప్రత్యేకనియోజకవర్గములకు బదులుగా ఎరవాడ ఒడంబడిక ప్రకార మంగీకరింపబడిన రాష్ట్రీయశాసన సభలలోని నిమ్నజాతులప్రాతినిధ్యప్రణాళిక పార్లమెంటుకు సిఫారసుచేసే నిమిత్త మంగీకరింపబడినది.

(౨) ఎరవాడా ఎగ్రిమెంటు ప్రకారము నిమ్నజాతుల కేర్పాటు చేయబడిన రాష్ట్రీయశాసనసభల స్థానములసంఖ్య బ్రిటిష్ ప్రభుత్వమువారిచే అంగీకరింపబడినది.

(3) నిమ్నజాతుల క్షేమముకొరకు ఎరవాడ ఒడంబడికలో నిర్ణయింపబడిన హామీలు కులీనహిందువుల స్పష్టములైన వాగ్దానములుగా బ్రిటిష్ ప్రభుత్వమువారిచే భావింపబడినవి.

(౪) నిమ్నజాతిప్రతినిధులు కేంద్రశాసనసభ కెన్నికొనబడుపద్ధతిని గూర్చి, వారి వోటింగు హక్కులనుగూర్చి పూనాఒడంబడికలోని షరతులను ప్రభుత్వము వారు వెంటనే అంగీకారము తెలుపజాలరు. కేంద్రశాసనసభల ప్రాతినిధ్యమునుగూర్చి, వోటింగు హక్కులనుగూర్చి ఇంకా విచారణలోనున్న కారణమున వెంటనే నిర్ణయింప వీలులేదు. కాని ప్రభుత్వమువారు దానికి వ్యతిరేకులుమాత్రము కారు.

(౫) కేంద్రశాసనసభలో బ్రిటిష్ హిందూదేశమున కేర్పాటు చేయబడిన సాధారణ స్థానములలో నూటికి ౧౮ వంతున నిమ్నజాతులకు ప్రత్యేకింపబడవలెననీ, ఆ వి తరగతిహిందువులకును వారికిని ఒడంబడికమీద జరుగవలెననీ బ్రిటిష్ ప్రభుత్వ మంగీకరించెను.

గాంధీకి కావలసినది కేవలము తన భౌతికశరీరమును రక్షించుకొనుట కాదు. ఎవరి కోసము తానీ ఉపవాసము ప్రారంభించెనో, లక్షలాదిగాగల ఆ ప్రజల నైతికజీవితములను రక్షించుట ఆయనకు ముఖ్యము. చిట్టచివరకు పండిత హృదయనాథకుంజ్రు, సి. రాజగోపాలాచార్యులు గాంధీని సంతృప్తిపరచగలిగిరి. గాంధీ ౨౬ వ తేదీ సాయంకాలము గం ౫-౧౫ లకు, ప్రార్థన జరిగినపిమ్మట, పారణచేయుట కంగీకరించెను. గాంధీప్రాణము తాత్కాలికముగా రక్షింపబడెనన్నమాట సత్యము. కాని ఆయన నిరాహారదీక్షను మానుకొనుట కంగీకరించిన తత్క్షణము అస్పృశ్యతానివారణమునకు తగిన సంస్కరణము శ్రద్ధగా కొంత నిర్ణీతకాలములో జరుపబడనియెడల తాను తిరిగి ఉపవాసవ్రతము నవలంబింతునని గాంధీ ఖండితముగా చెప్పెను. ఆయన అందుకొరకు కాలనిర్ణయము చేయుదలపెట్టెను. కాని ఆయన కావిషయములో అంతర్వాణి ఇదమిత్థమని చెప్పలేదు. గాంధీ "స్వాతంత్ర్యసందేశము" ప్రతి అంటరానివాని ఇంటిలోనికి చొచ్చుకొని పోవలెను. సంస్కరణము గ్రామములకు సంబంధించి ఉన్నప్పుడే అది సాధ్యమగును. నిమ్నజాతులసమస్యకు ఆదర్శప్రాయమైన పరిష్కారము కలిగెయెడల అదొక్కటే వివిధసంఘముల మధ్యను ఐకమత్యమును చేకూర్పగలదని గాంధీ ఆశయము.

ప్రజలు ఉపవాసదీక్షావసరమునుగూర్చి, దాని శక్తినిగూర్చి శంకించిరి. గాంధీ సెప్టెంబరు ౧౫, ౨౦ వ తేదీలలో దానినిగూర్చి వివరించెను. ఉపవాసవ్రతమునుగూర్చి ఆయన అభిప్రాయ మిది: జ్ఞానముకొరకును, ప్రాయశ్చిత్తముకొరకును, ఉపవాసముచేసే పద్ధతి ఈ నాటిదికాదు. అది అతిపురాతనమైనది. అది క్రైస్తవమతములోను, మహమ్మదీయమతములోనుకూడ ఆచరణలోనున్నది. ఆత్మపరిశుద్ధతకొరకు హిందూమతములో నిర్వర్తింపబడే ఉపవాసదీక్షలు వేనవేలు. ఆత్మపరిశుద్ధతకోస మెంతో ప్రయత్నము

చేసి, “మిక్కిలి మెమ్మదిగా పలికే నా అంతర్వాణిని స్పష్టముగాను, సరిగాను వినగలిగే శక్తిని సంపాదించుకొంటిని. నే నీ ప్రస్తుతప్రాయశ్చిత్తకాండను ఆ అంతర్వాణీ ప్రబోధము ననుసరించియే ప్రారంభించితిని. కొందరు ఉపవాసవ్రతమును ఇతరులను వేధించుటగా భావింతురు. ‘ప్రేమ బలవంతపెట్టును, కాని వేధించదు.’ అని నేను చెప్పుదును. న్యాయసత్యములుకూడా ఇంతే. అవి బలవంతపెట్టును గాని బాధించవు. నా ఉపవాసవ్రతమును న్యాయ మనే త్రాసుతో తూచవలెనని కోరుదును. పై వారి కిది బాల్యచాపల్యముగా కనిపించవచ్చును. నాకుమాత్రి మట్లు కాదు. నే నింకను త్యజింపదగినవస్తు వేదైన నాదగ్గర ఉన్నయెడల దానిని ఈపాప తుయార్థ మిచ్చివేయగలను. కాని నా ప్రాణముకంటె నాయొద్ద మరేమీ లేదు. నేనుద్దేశించిన ఈఉపవాసవ్రతము నాయందు నమ్మకము గలవారికి ప్రతికూలముగాను, నాయందు విశ్వాసము లేనివారికి అనుకూలముగాను ప్రారంభింపబడినది.” అని ఈ విధముగా ఆయన చెప్పినందువలన ఆయన అవలంబించిన ఈ ఉపవాసవ్రతి మాంగ్లాధికారప్రపంచకమునకు గాని, భారతదేశములోని ఆయనప్రతికూలురకుగాని వ్యతిరేకముగామాత్ర ముద్దేశింపబడలేదని స్పష్టమైనది. అది న్యాయసంస్థాపనార్థము ప్రారంభింపబడినదని నమ్మిన అసంఖ్యాకులగు భారతీయులకు ప్రతికూలముగా నుద్దేశింపబడెను. వీటన్నిటికంటె “అది హిందూఅంతరాత్మను నిజమైన మతధర్మమునకు ప్రబోధించుట కుద్దేశింపబడె” నని గాంధీ చెప్పెను. గాంధీ, ఇంతకాలమునుండీ తన హృదయములో క్రోధద్వేషము లింకా ఏమూలనైనా కలవేమో యని పరిశోధించుకొన ప్రారంభించెను. కాని తనలో క్రోధద్వేషభావములున్నట్లుకనుపించలేదు. ఆయన అందరియందును సద్భావముతోను, నిష్కళంకములైన ఆశయములతోను ఈ దీక్షను పూనుకొనెను.

పూనాఒడంబడికను ప్రధానమంత్రి అంగీకరించి, గాంధీఉపవాసవ్రతమును విడిచిపెట్టినవెంటనే, బొంబాయిలో తిరిగీ నాయకులసభ సమావేశమయ్యెను. అందులో అస్పృశ్యతానివారణమునకు హిందూసంఘము హామీ యిస్తున్నట్లుగా తీర్మానింపబడెను. ఈ తీర్మానానుసారముగానే ఘనశ్యామదాసుబిర్లా అధ్యక్షతక్రింద హరిజనసేవకసంఘము స్థాపింపబడెను. దానికి సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసైటీకి చెందిన అమృతలాల్ ఠక్కర్ కార్యదర్శిగా నియమింపబడెను.

౧౯౩౨ సెప్టెంబరు ౨౫ వ తేదీని బొంబాయిలో పండితమాలవ్యా అధ్యక్షతక్రింద జరిగినసభలో ఈ క్రింది తీర్మాన మామోదింపబడెను:

“నేటినుండి పుట్టుక చేత హిందువులలో ఎవడూ అంటరానివాడుగా పరిగణింప బడకూడదు. ఇంతవరకునూ ఆ విధముగా పరిగణింపబడుతూన్నవారు పబ్లికు నూతులను, పబ్లికుపాఠశాలలను, పబ్లికురోడ్లను, తక్కిన పబ్లికు సంస్థలను తదితర హిందువులవలెనే ఉపయోగించుకొనుటకు హక్కు కలిగియుందురు. ఈహక్కు మొట్టమొదటి అవకాశములోనే న్యాయశాస్త్రమునందు చేర్చబడును. ఈ లోగా ఆ విధముగా చేర్చబడనియెడల స్వరాజ్య పార్లమెంటులో అన్నిటికంటెనూ మొట్ట మొదటిచట్టము దానినిగూర్చియే చేయబడవలెను.

“అంటరానివాళ్లని పిలువబడేవారిపైన ఆచారపరంపరగా వేయబడిన ఆంక్షల నన్నిటినీ తొందరలో శాంతియుతమును, ధర్మసమ్మతమును అయిన పద్ధతులతో తొలగించుట హిందువుల ధర్మమని ఈసభవా రంగీకరిస్తున్నారు. అంటరానివాళ్లు దేవాలయప్రవేశ మొనరించుటకుకూడా హక్కుండవలెను.”

అతిపవిత్రమైన ఆ ఉపవాసవ్రతము దాని సంపూర్ణఫలితమును పొందినది. అస్పృశ్యతానివారణముకొరకు దేశమంతటా ప్రచారముజరిగినది. ఈ నూతనోద్యమము వలన శాసనోల్లంఘనములో పాల్గొనిన కొందరికి సంతృప్తి కలిగినది. రెండవసారి గాని, మూడవసారిగాని జైలుకు పోవవీలులేనివా రీ పనియందు నిమగ్నులైరి. అస్పృశ్యతానివారణ కార్యక్రమముమూలమున కాంగ్రెసుపనికి భంగము రాకూడదని, కాంగ్రెసువాదులను హెచ్చరికచేయుట మంచిదనికూడా కొందరు భావించిరి. కాంగ్రెసు నాక్రమించకుండానే తగినంతమంది అస్పృశ్యతానివారణ ప్రచారకులను తయారుచేయజాలక, దేశము గడ్డుపోలేదు. గాంధీ అనేక సందర్భములలో కాంగ్రెసేతరు లీపనికి పూనుకొనవలె నని చెప్పెను. ఆయన ఈ పనిని బిర్లా, ఠక్కర్ లాంటి వారికి అంటగట్టుటలోనే అస్పృశ్యతానివారణ ప్రచారకులను కాంగ్రెసుప్రచార కులనుండి విడదీయవలెనని కోరిక ఉన్నట్లు స్పష్టము కాగలదు. ఏమైనప్పటికీ కాంగ్రెసుకు స్పష్టమైనపని అస్పృశ్యతా నివారణ కార్యమునకు లాభ మైనది. గాంధీ ఉపవాసవ్రతము మూలమున ఆ ఉద్యమమునకు ప్రోత్సాహ మెక్కువ కలిగెను. యువకులు కొందరు తొందరపడసాగిరి. వారిని గాంధి కళ్లెములు లాగిపట్టవలసి వచ్చెను. దేశములో అనేకమంది హరిజనులను దేవాలయములలో ప్రవేశపెట్టించుటకు ఆమరణాంత ముపవాసము చేయబూనుకొనిరి. అసహాయోద్యమసందర్భమున శాస నోల్లంఘనమున కుత్సాహపడినట్లే, బాలురైన కొంద రుద్రేకపరులు తమస్థితిని, తమ పరిసరపరిస్థితులను గమనించక ఈ తీవ్రమైన ఉపవాసవ్రతమునకు పూనుకొనిరి. ౧౯౨౧, ౨౨ లో అనేక సందర్భములలో గాంధి తన పలుకుబడిని వినియోగించి యువకులతొందరపాటును నిరోధించగలిగెను. ఇప్పుడుకూడా అటే చేసెను.

గాంధి ఆదేశానుసారముగా హరిజనోద్యమములో అనేకమంది సౌఖ్యము కల్పించు కొనిరి. ఆయుద్యమవ్యవహారములుకూడా ప్రతిగంటకూ, ప్రతినిమిషమునకూ పరివర్తనము పొందెనవి. భోపాలునవాబు హిందూ సంస్కరణోద్యమమునకు ౫౦ వేల రూపాయలు విరాళము నిచ్చెను. ఫాదరు విన్‌స్లో భారతి క్రైస్తవసంఘమునకు ప్రత్యేకనియోజక వర్గము పనికిరాదని సోదర క్రైస్తవులచేత సంతకములు చేయించి, ఒక విజ్ఞప్తిని ప్రకటించెను. షౌకతాలీ గాంధి విడుదలచేయబడవలె నని కోరుచూ, హిందూ మహమ్మదీయ సఖ్యమునకు ప్రయత్నించెను. దేశములో సంఘీభావము కుదురవలెనని అన్నిపక్షములవారును ప్రయత్నింపసాగిరి గాంధి ఉపవాసవ్రతసందర్భమున మిస్ లాయనను చూడవచ్చుటకు కల్పింపబడిన అవకాశములు ఆకస్మికముగా సెప్టెంబరు ౨౬ వ తేదీని ప్రభుత్వమువారిచే తీసివేయబడకుండినయెడల సాంఘిక సమస్య తప్పకుండా కుదిరి ఉండేది. గాంధిని చూడదలచుకొన్న జయకరుకు అందు కనుజ్ఞ ఈయబడలేదు. సరోజినీదేవి తిరిగి స్త్రీలజైలుకు పంపివేయబడెను. కస్తూరిదేవి గాంధిదగ్గరనుండి పంపివేయబడెను. మిత్రులు రావీలు లేకుండా చేయబడిరి. ఎప్పటివలె గాంధి ఖయిదీ అయ్యెను. అయిదురోజులు ముందుగా కస్తూరిదేవి విడుదల చేయబడి గాంధిదగ్గర నుండుట కవకాశము కల్పింపబడెను. హరిజనోద్యమమునకు కల్పింపబడిన అవకాశములను వెంటనే తీసివేయుటవలనను గాంధి ప్రతిఘటించెను. అది పూనాసంధిషరతులకు విరుద్ధమని ఆయన అనెను.

దీర్ఘమైన ఉత్తరప్రత్యుత్తరములు జరిగిన పిమ్మట గాంధి అస్పృశ్యతానివారణప్రచారమును సాగించుటకు కల్పింపబడిన నిర్బంధము లన్నీ తీసివేయబడెను. ఇప్పుడు మిస్ లాయనను దర్శింపవచ్చును. ఉత్తరప్రత్యుత్తరములను జరుపవచ్చును. హరిజనప్రచారమునుగూర్చి పత్రికలలో వ్యాసములు వ్రాయవచ్చును. ఈ సందర్భమున ఇండియాగవర్నమెంటు హోముమెంబరు హేగ్ నవంబరు ౬ వ తేదీని ఈ క్రిందిప్రకటనమును భారతశాసనసభలో కావించెను.

"ఇటీవల అస్పృశ్యతానివారణ కార్యక్రమసందర్భమున మిత్రులను దర్శించుటకును, ఉత్తరప్రత్యుత్తరములు జరుపుటకును, తన కెక్కువ స్వేచ్ఛ కావలె నని గాంధి కోరెను. శాసనోల్లంఘనోద్యమముతో అస్పృశ్యతానివారణమున కేమీ సంబంధము లేదనీ, అది కేవలము నైతికవిషయికమైన మతసంస్కరణ మనీ గాంధి సూచించి ఉండుటచే ఆ విషయములో మే మాయనప్రయత్నముల కభ్యంతరములను కల్పించదలచుకొనలేము. కాబట్టి అస్పృశ్యతానివారణమునకు సంబంధించినంతవరకు ఆయన పత్రికలకు వ్రాసుకొనుటకుగాని, ఉత్తరప్రత్యుత్తరములు జరుపుకొనుటకుగాని, మిత్రులను దర్శించుటకుగాని ఏమీ అభ్యంతరము లేదు. కాని రాజకీయ విష

యములలోమాత్రము గాంధిపైన ఇదివరకున్న నిరోధములలో యేమీ మార్పు కలిగింపబడలేదు. ఈ విషయము సైక్రాయియొక్క ఆంతరంగిక కార్యదర్శి మాలానా షౌకతాలీకి ఇదివరకే వ్రాసెను.”

గాంధి ఉపవాసవ్రతమునుగూర్చిన ఉత్తరప్రత్యుత్తరములనూ, పూనా ఒడంబడికయొక్క నకలునూ ఈక్రింద నుదాహరింతుము.

గాంధి ౧౩-౧౧-౩౧ వ తేదీని లండనులో రౌండుటేబిలు సభయందు అస్పృశ్యతనుగూర్చి ఇచ్చిన ఉపన్యాసములోని భాగ మీక్రింద నుదాహరింపబడినది:

“నేను దానిని ప్రాణము లొడ్డి నిరోధింతును”

“ఇతర అల్పసంఖ్యాకుల హక్కులను నే నర్థముచేసుకొనగల్గుదును. అన్నిటిలోకీ అస్పృశ్యుల హక్కులనుగూర్చిన విషయము నాకు మిక్కిలి బాధాకరముగానున్నది. అది శాశ్వతకళంక మని నా యభిప్రాయము.

“భారతస్వాతంత్ర్యసంపాదనకు బదులుగా కూడ అస్పృశ్యుల ముఖ్యప్రయోజనములను నేను విక్రయింపజాలను. నేను విశాలభారతదేశములోని అస్పృశ్యులకు ప్రాతినిధ్యము వహించునట్లుగా భావింతును. నే నీవిషయము నా వ్యక్తిపరముగానే కాక కాంగ్రెసుపక్షమునకూడ చెప్పగలను. అస్పృశ్యులయొక్క వోట్లుతీసికొనబడేయెడల అందరికంటెను నాకే యెక్కువవోట్లు వచ్చునని నావిశ్వాసము. నేను ఆసేతు హిమాచలము సంచారముచేసి అస్పృశ్యుల అంత్యము తొలగించుటకు ప్రత్యేకనియోజకవర్గములుగాని, ప్రత్యేకస్థానములుగాని ప్రయోజకరములు గావని ప్రచారము చేయగలను. అస్పృశ్యత పూర్వాచారపరాయణులకు కళంకముగాని అంటరానివాండ్లకు కాదని విశ్వసించే హిందూసంస్కర్తలు నేడు చాలామంది కలరు. ఈ సంగతి యీ కమిటీవారున్నూ, యావత్ప్రపంచమున్నూ తెలుసుకొనుగాక. మా ఎన్నికలపట్టీలలోకాని, మా జనాభాలెక్కలలో కాని అంటరానివాళ్లు వేరుగా ప్రత్యేకింపబడుట మాకక్కరలేదు. శిక్కులు శాశ్వతముగా అట్లేయుందురుగాక! మహమ్మదీయులును యూరోపియనులు నట్లే యుందురుగాక! అస్పృశ్యులు శాశ్వతముగా అట్లుండగలరా! అస్పృశ్యత జీవించుటకంటె హిందూ మతము మరణించుటే నా యిష్టము. కాబట్టి డాక్టరు అంబేద్కరుకు అస్పృశ్యులను ఉద్ధరించవలెనని ఎంతకోరిక యున్నప్పటికీ, ఆయనశక్తిసామర్థ్యములయందు నా కెంత గౌరవ మున్నప్పటికీ ఆయన పొరపాటుపడుతున్నాడని నేను చెప్పక తప్పదు. బహుశా ఆయనకు కలిగిన దురదృష్టపు అనుభవములవలన ఆయన తాత్కాలికముగా నిట్లు పొరపాటుపడియుండవచ్చును. ఈ మాట చెప్పుట నాకు చాలా కష్టముగానున్నది. కాని యీమాట చెప్పనియెడల నా

ప్రాణసమానమైన అస్పృశ్యతానివారణోద్యమమునకు హాని కలిగెంచినవాడ నగుదును. నాకీ ప్రపంచక మంతా పట్టము కట్టినప్పటికీ వారి హక్కులను నేను తృణీకరింప జాలను. భారతదేశములోని అంటరానివాండ్లందరి పక్షమున అంబేద్కరు ప్రాతినిధ్యము వహించినట్లు మాట్లాడుట సరియైనది కాదని నా భావ్యతను గుర్తించియే నేను చెప్పుచున్నాను. అది హిందూమతములో చీలికను పుట్టించగలదు. అందువలన నా కది సంతృప్తికరముగా లేదు.

"అస్పృశ్యులు క్రైస్తవమతములోగాని, మహమ్మదీయమతములోగాని కలిసిన యెడల నాకు భయము లేదు. నే నది సహింతును. కాని ప్రతిగ్రామములోను హిందూ మతమునందు రెండు చీలిక లుండుటమాత్రము నేను సహింపజాలను. అస్పృశ్యుల రాజకీయహక్కులనుగూర్చి మాట్లాడేవారికి నేటి భారతీయ సంఘనిర్మాణమును గూర్చి యేమియు తెలియదు. కాబట్టి నే నొక్కడనే దీనిని నిరోధింపవలసియున్నయెడల దీనిని నా ప్రాణము లొడ్డియైనా నిరోధింపగల నని శపథము చేయుచున్నాను."

## మహాత్ముని ప్రథమలేఖ

౧౧ మార్చి ౧౯౩౨, ఎరవాడ సెంట్రలుజైలు.

"ప్రియమైన సర్ శామ్యూయలు గారికి

"రౌండుటేబిలు మహాసభయందు మైనారిటీలహక్కులను చర్చించునప్పుడు నిమ్నజాతులకు ప్రత్యేకపు టెన్నికవర్గముల నిచ్చినచో నాప్రాణము లిచ్చియైనా దానిని నిరోధించెద నని నాయుపన్యాసాంతమున జెప్పినమాట మీకు జ్ఞాపక మున్నదనియే యెంచెదను. అది నే నావేశములోగాని, అలంకారముగ గాని చెప్పినమాటగాదు. అది నేను మనఃపూర్తిగ జెప్పినవిషయమే. ఆప్రకటనమునకనుసరించి నేను భారతదేశమునకు వచ్చినతరువాత ప్రత్యేకపు టెన్నికవర్గములు, ముఖ్యముగా నిమ్నజాతులకు పనికిరావని ప్రజలను హెచ్చరింపదలంచితిని. కాని అది జరుగుయోగము పట్టలేదు."

"నన్నిప్పుడు చదువనిచ్చుచున్న వార్తాపత్రికలనుబట్టి గవర్నమెంటువారు సాంఘికపరిష్కారమును కొలదికోజులలో జేయుదు రన్నట్లు కనుపడుచున్నది. ఆ తీర్పులో నిమ్నజాతులకు ప్రత్యేకపు టెన్నికవర్గముల నిచ్చినచో, నప్పటి నా ప్రమాణమును చెల్లించుకొనుటకు దగినచర్య గైకొందు నని మొదట తలచితిని. కాని నా యుద్దేశమును ముందు బ్రిటిషు గవర్నమెంటువారికి దెలియబరచకుండుట మరియాద కాదు. నా ప్రతిజ్ఞకు నే నిచ్చినంత ప్రాముఖ్యమును గవర్నమెంటువా రియ్యకుండుట సహజమే."

"నిమ్నజాతులకు ప్రత్యేకపుటెన్నిక వర్గముల నేర్పాటుచేయుటలో గల దోష ములనన్నిటినీ యిక్కడచెప్పను. నేనుగూడ నస్పృశ్యులలో నొకడుగానే భావించు కొనుచున్నాను. వారికిని యితరులవ్యవహారములకును జాల భేద మున్నది. వారు శాసనసభలలోనికి వచ్చుట నాకిష్టములేక కాదు. ఇతరసంఘములవారికి వోటింగు అర్హ గుణములు ఎంతకఠినములుగానున్నను నిమ్నజాతులకు విద్య లేకపోయినను, ఆస్తి లేకపోయినను మైనారిటే వెళ్లగానే వారి స్త్రీపురుషు లెల్లరును వోటింగుహక్కును బొందవలయు ననిదే నా యభిప్రాయము. కాని నిమ్నజాతులకు ప్రత్యేకపుటెన్నిక వర్గములు కేవలము రాజకీయదృష్ట్యా ఎట్టివైనను, వారికిని, హిందూమతమునకును నుప ద్రవకరము లని నా నిశ్చయము. నిమ్నజాతులు తక్కిన హిందువులతో నెంత కలిసిపోయియుండిరో, వారిపై నెంతగా నాధారపడియుండిరో తెలిసికొన్న గాని ప్రత్యేకపుటెన్నికవర్గములు వారి కెంత హానికరము లయినదియు గ్రహింప జాలము. హిందూమతమునకు సంబంధించినంతవర కీ ప్రత్యేకపుటెన్నిక వర్గములు దానిని ఛిన్నభిన్నములు చేసి కలుషము వనిచేయుగలవు. ఈనిమ్నజాతుల విషయము నా కొక మతధర్మసంబంధమైన కార్యము. రాజకీయవ్యవహారదృష్టి యెంత ముఖ్య మైనను నది మతధర్మప్రాముఖ్యమునుం బోరు పేరులు లేనిదగును. నేను చిన్నతనము నుండియు నస్పృశ్యజాతులకొరకు పని చేసితిని. వారికొర కనేక సమయములలో నా సర్వస్వమును ధారవోసితిని. ఈమాట జ్ఞాపక ముంచుకొని వారికొర కీ విషయమునందే యేల యిట్లు ప్రాకులాడుచుంటినో గ్రహింపవలయును. ఇది నేను గర్వస్ఫూర్తితో చెప్పుటలేదు. నిమ్నజాతుల నిట్లు శతాబ్దములకొలదిగా నీచదశలో నుంచినందులకు హిందూసంఘీయు లెన్ని ప్రాయశ్చిత్తములు చేసికొన్నను పాపపరిహారము కానే రదు. కాని ప్రత్యేకపుటెన్నికవర్గములు దానికి తగిన ప్రాయశ్చిత్తములు గానేరవు. ఇంతకాలమును వారనుభవించుచున్న నైచ్యమునకు ప్రతిక్రియలు గానేరవు."

"కావున నిమ్నజాతులకు ప్రత్యేకపుటెన్నికవర్గముల నేర్పాటుచేసినచో నేను మరణపర్యంతమును నుపవాసవ్రతము ధరించెద నని గవర్నమెంటువారికి తెలియజేయు చున్నాను."

"అయితే నేను ఖయిదీగా నుండగా నీదీక్షవహించుటవలన గవర్నమెంటువారికి చాల యిబ్బంది గలుగునే యని చాల దిగులుపడుచున్నాను. పైగా కొందరికి వైరితన మగను, నంతకంటె నధర్మముగనుకూడ గనబడు నిట్టిపద్ధతులను నావంటివాడు రాజ కీయవ్యవహారములలో ప్రవేశపెట్టుట యనుచితముగా తలతు రనియు నెరుగుదును. దీనికి నేను జెప్పగలిగిన దెల్ల యీపద్ధతి నాజీవములో నొక భాగమేగాని యిది యొక పద్ధతిగాదని, ఇందులకై నాయంతరాత్మ నను [illegible]

మునకు రావలసివచ్చినచో కేవలము విషయయోగ్యతను బట్టియే నిర్ణయింతుమని మాత్రము నేను చెప్పగలను. లోథియన్ ప్రభుసంఘము సంచార మింకను పూర్తిగా లేదనివసంగతి మీ రెరిగినదే. వారినిర్ణయములు మాకు చేరునప్పటికి ఇంకను కొన్ని వారములు గడచును. ఆరిపోర్టు మాకు చేరినపిమ్మట వారిసూచనలను మేము చాల శ్రద్ధగా గమనింపవలసియుండును. ఆసూచనలతోపాటు మీరును, మీపక్షమువారును ఇంత గట్టిగానొక్కి చెప్పుచున్న అభిప్రాయములనుగూడ గమనించినపిమ్మటనే మేము కార్యనిశ్చయము చేతుము. మాస్థితిలో నున్నచో మీరైనను ఇట్లే చేయుదురని నా నమ్మకము. కమిటీ రిపోర్టు వచ్చినపిమ్మట దానిని శ్రద్ధగా విచారించి కార్యనిశ్చయము చేయకపూర్వము ఈ వివాదమునందలి ఉభయపక్షములవాదము గమనించవలసియుండును. ఇంతకన్న నేను చెప్పజాలినది లేదు. ఉన్నదని మీరు అనుకోరనియే నే నూహింతును."

"ఇక ఆర్డినెన్సులనుగూర్చి ఇదివరకు నేను బహిరంగముగాను, రహస్యముగాను చెప్పినదానికంటె ఇప్పుడు క్రొత్తగా చెప్పవలసినదిలేదు. సక్రమప్రభుత్వము యొక్క పాదు కదలించేప్రయత్నం జరుగుచున్నప్పుడు ఆర్డినెన్సులు అవసరమేనని నావిశ్వాసము. ఇండియాప్రభుత్వమువారుగాని, రాష్ట్రప్రభుత్వాలుగాని తమకు సంక్రమించిన అపారాధికారాలను దుర్వినియోగం చేయడంలేదని, అత్యాచారములు జరగకుండా తమ శక్తివంచనచేయక ప్రయత్నిస్తున్నారని నేను నమ్ముచున్నాను. న్యాయశాస్త్ర గౌరవమును, ప్రభుత్వగౌరవమును రక్షించుటకును, మా ఉద్యోగులను, ఇతరసంఘములను దౌర్జన్యమునుండి రక్షించుటకును అవసరమైనంతకాలము తప్ప అనంతర మీ అసాధారణాధికారము లుపయోగింపము.

సామ్యుయల్ హోరు"

ఎరవాడ సెంట్రలుజైలునుండి ౧౮-౮-౩౨ తేదీని గాంధిగారు ప్రధానామాత్యునకు వ్రాసిన ఉత్తరం :

"ప్రియమిత్రమా !

౧౧-౩-౩౨ న నేను సర్ సామ్యుయల్ హోరుగారికి అస్పృశ్యుల ప్రాతినిధ్యమునుగూర్చి, వ్రాసిన ఉత్తరమును, ఆయన మీకును మంత్రివర్గమునకును చూపియేయుందురు. దానిని ఈ ఉత్తరములో భాగముగాయెంచి దీనితో గూడ కలిపి చదువ గోరెదను.

"అల్పజాతులప్రాతినిధ్యమునుగూర్చి బ్రిటిషుప్రభుత్వముచేసిననిర్ణయమును చదివి నేను శ్రద్ధగా ఆలోచించితిని. ౧౩-౧౧-౩౧ తేదీని సెయింటుజేమ్సు భవనమున

రౌండుటేబిలుకాన్ఫరెన్సుయొక్క మైనారిటీసుకమిటీలో నేను చేసిన ప్రతిజ్ఞను బట్టియు, సగ్ సామ్యుయల్ హోరుగారికి నేను వ్రాసిన లేఖనుబట్టియు నేను నా ప్రాణములొడ్డి మీ నిర్ణయమును మార్చవలసియున్నది. అట్లు చేయవలెనన్న కేవల జలాహారినై ప్రాణములు విడుచుటకు వ్రతము పూనుటకంటె ఇతరమార్గము నాకు కన్పించుటలేదు. ఇతరసంఘములతోపాటు అస్పృశ్యులకుగూడ ఓటుహక్కు ఏర్పరచి సామాన్యనియోజకవర్గములనుండి వారు ఎన్నుకోబడేటట్లు చేయవలెనని నా ఉద్దేశము. బ్రిటిషుప్రభుత్వము బుద్ధిపూర్వకముగాగాని, ప్రజారంజనకొరకుగాని ఇటువంటి మార్పు చేసేవరకూ నా ఉపవాసవ్రతము సాగుతూనే ఉంటుంది.

"పైవిధంగా ఈలోపుగా మార్పుచేయనిపక్షంలో ౨౦–౯–౩౨వ తేదీ మధ్యాహ్నమున ఈ యుపవాసదీక్ష ప్రారంభమగును.

"మీరు ముందుగానే జాగ్రత్తపడుటకు వ్యవధియుండుటకుగాను ఈ ఉత్తరమును కేబిలుతంతిద్వారా పంపవలసినదని ఇచటి అధికారులను కోరుతున్నాను. ఎంత ఆలస్యంగానైనా ఈలేఖ మీకు చేరటానికి తగిన సావకాశం ఉన్నదనే నా అభిప్రాయం.

"నేను సర్ సామ్యుయల్ హోరుగారికి వ్రాసిన యుత్తరమును, ఈ ఉత్తరమునుగూడ వెంటనే ప్రకటించవలసినదని కోరుతున్నాను. నాసహచరులైన వల్లభాయిపటేలు, మహాదేవదేశాయిగార్లకు తప్ప ఈరహస్యము ఇతరులకు నేను తెలియనీయకుండా కాపాడి జైలుమర్యాదను గౌరవించితిని. మీరు వీలు కలిగిస్తే ఈ యుత్తరములవలన ప్రజాభిప్రాయం మార్చుట నాకోరిక. కాబట్టి వెంటనే వీనిని ప్రకటింపగోరుచున్నాను.

"నే నిట్లు నిశ్చయించుకొన్నందులకు విచారంగానే ఉన్నది. కాని నే నేమి చేయుదును? ధర్మానువర్తినైన నా కింతకంటె మార్గంలేదు. సర్ సామ్యుయల్ హోరుగారికి వ్రాసిన ఉత్తరంలో ఇదివరకే తెలిపాను. ఈ సంకటస్థితినుండి తప్పించుకొనుటకు మీరు నన్ను విడుదలచేసినప్పటికీ ఉపవాసవ్రతము ఆగదు. మీ నిర్ణయమును ప్రతిఘటించుటకు నా కిపు డింతకంటె ఇతరాళ కన్పించుటలేదు. గౌరవదూరమైన మార్గముచేత విడుదల సంపాదించాలనే కోరిక నాకు లేదు.

"ప్రత్యేకప్రాతినిధ్యము అస్పృశ్యులకును, హిందువులకున్నూ చెరుపుగూర్చునని నా అభిప్రాయం సరియైనది కాకపోవచ్చును. నేను పొరపాటుపడుచుండుటయు సంభవము కావచ్చును. ఇది పొరపాటే యైనచో నా ధర్మానుష్ఠానమున ఇతరవిషయములలోగూడ నేను ప్రమాదము పడుచున్నట్లే. ఆపక్షాన నా యీ ప్రాయోపవేశదీక్ష నా

ప్రమాదమునకు ప్రాయశ్చిత్తము కాగలదు. అంతేకాదు. నా అప్రమాదతను నమ్మికొని శిశువులవలె నన్ననుసరించు అసంఖ్యాకులగు స్త్రీలకు, పురుషులకు నాభారము తీరిపోవును. అట్లుగాక నా అభిప్రాయం సరియైనదే యనుచో - సరియైనదనే నావిశ్వాసము-ఇరువదియైదుసంవత్సరాలనుండి నేను చాలవరకు జయప్రదముగానే అనష్ఠించుచున్న నాధర్మాచరణమునకు ఈ ప్రాణోపవేశవ్రతము ఉచితపరిణామము కాగలదు.

ఇట్లు: విశ్వాస్యుడైన మీమిత్రుడు,

మో. క. గాంధి"

౮-౯-౩౨ తేదీని ౧౦ డౌనింగుస్ట్రీటునుండి ప్రధానామాత్యుడీయుత్తరమున పంపిన జవాబు:

"ప్రియమైన గాంధిగారికి,

"మీ ఉత్తరము నాకు ఆశ్చర్యమునేగాక హృదయపూర్వకమైన సంతాపమును గూడ కూర్చినదంటే నమ్మండి. అస్పృశ్యులవిషయంలో ప్రభుత్వంచేసిన నిర్ణయము యొక్క నిజాభిప్రాయం గుర్తించకుండానే మీరు పొరపాటుపడి, ఆ ఉత్తరం వ్రాసియుంటారని నే ననుకోవలసివచ్చింది. హిందూసంఘమునుంచి అస్పృశ్యులను శాశ్వతంగా వేరుచేయడానికి మీ రెంతమాత్రం ఒప్పుకోరని మాకు తెలిసియే ఉన్నది. రౌండుటేబిలుకాన్ఫరెన్సుయొక్క మైనారిటీకమిటీసభలోను మొన్న సర్ సామ్యుయల్ హోరుగారికి వ్రాసిన ఉత్తరంలోనూకూడా మీ అభిప్రాయం మీరు స్పష్టంచేసి ఉన్నారు. హిందూసంఘం యావత్తున్నూ మొత్తంమీద మీ అభిప్రాయంతో ఏకీభవించుననిన్నీ మే మెరుగుదుము. అందుకనే అస్పృశ్యుల ప్రాతినిధ్యం నిర్ణయించేటప్పుడు మీ అభిప్రాయాన్ని మేము మిక్కిలి శ్రద్ధతో గమనించియున్నాము.

"అస్పృశ్యసంఘములనుండి మా కెన్నివో విన్నపములు వచ్చినవి. సంఘంలో వారికి ఉండుకున్న ఇబ్బందులు మీరు ఎరిగినవే. కాబట్టి శాసనసభలలో అస్పృశ్యుల క్షేమమును రక్షించుటకు ఉచితమైనన్ని స్థానములను వారికి పంచిపెట్టుట మావిధియని తలచుచున్నాము. హిందూసంఘమునుండి వారిని వేరుచేసేపని యేదిన్నీ మేము చేయగూడదనికూడా జాగ్రత్తపడినాము. మార్చి ౧౧ వ తేదీని వ్రాసిన మీ ఉత్తరంలో కూడా శాసనసభలో వారికి ప్రాతినిధ్యం ఇచ్చేవిషయంలో మీకు ఆక్షేపణ లేదని తెల్లము చేసినారుగదా!

"ప్రభుత్వనిర్ణయప్రకారం అస్పృశ్యులు హిందూసంఘములోనే ఉండి, వారితోపాటు ఓటుహక్కును అనుభవిస్తారు. అయితే, మొదట ఇరవైసంవత్సరాలవరకు వారు హిందూసంఘంలో ఓటర్లుగా ఉంటూనే పరిమితములైన కొన్ని ప్రత్యేక

కస్థానములద్వారా వారి హక్కులను రక్షించుకొనే సదుపాయంకూడా పొందుతారు.
ప్రస్తుతస్థితిలో అట్టి యేర్పాటు అవసర మని మేము నమ్ముచున్నాము.

"ఈరీతిగా ప్రత్యేకస్థానము లేర్పాటుచేసిన ప్రదేశములలోగూడా అస్పృశ్యులు సామాన్య హిందూనియోజకవర్గములతోపాటు ఓటు చేస్తూనే ఉంటారు. కాబట్టి ఈ రెండువోట్లద్వారా వారి హక్కులను రక్షించుకొనుటకున్నూ, హిందువులతో ఏకీభవించియుండుటకున్నూ అవకాశ ముంటుంది.

"మీరు చెప్పినట్లు అస్పృశ్యులకు ప్రత్యేకప్రాతినిధ్య మనేది మేము బుద్ధిపూర్వకంగా మానివేసి వారి నందరినీ హైందవసామాన్య వోటర్లజాబితాలోనే చేర్చితిమి. ఇట్లు చేయుటవలన అగ్రవర్ణులైన అభ్యర్థులు ఎన్నికలలో అగ్రవర్ణుల వోట్లతోపాటు అంత్యజుల ఓట్లుగూడా యాచించవలసియుంటుంది. కాబట్టి సర్వవిధాల హిందూసంఘైక్యము భద్రపరచబడినదికదా!

"అయితే బాధ్యతాయుతపరిపాలన ప్రారంభదశలో శాసనసభలయందు మెజారిటీలోనున్న పార్టీవారికే యధికారము చిక్కును గావున, మీరు శామ్యుయల్ హోరుగారికి వ్రాసిన యుత్తరములో నంగీకరించిన ట్లగ్రవర్ణములవారిచే శతాబ్దముల కొలదిగా ననేకవిధవైచిత్ర్యములపాలు చేయబడిన నిమ్నజాతులవారు, దేశమున తొమ్మిదింటిలో నేడురాష్ట్రముల శాసనసభలయందు తమఘోషను వెల్లడించుకొనునట్లవకాశము గలుగజేసితిమి. దీనిని సముచితమైన ప్రతిమానవుడు నంగీకరించవలసినదే. ప్రస్తుత పరిస్థితులలో స్థానముల రిజర్వేషనులవలన నిమ్నజాతులకు సరియైన ప్రతినిధులై, వారికి బాధ్యతపడగలిగినవారి నెన్నుకొనుట యశక్యము. ఎట్టివిధమైన ఫ్రాంచైజ్ పద్ధతి పెట్టినను అట్టిప్రతినిధు లందరును అగ్రవర్ణముల హిందువులచేతనే యెన్నుకొనబడువా రగుటచేత దానివలన ప్రయోజనము లేదని యీ విషయమును గూర్చి మేము విచారించలేదు.

"నిమ్నజాతులవారికి హిందూయెన్నికవర్గములో స్థానము లిచ్చియు, వేరుగ ప్రత్యేకపు ఎన్నికమండలముల నేర్పరచుటకును, మహమ్మదీయులు మున్నగువారికి వేరుగ ప్రత్యేకపుటెన్నికవర్గముల నేర్పాటు చేయుటకును చాలా భేద మున్నది. ఇందుల కొక యుదాహరణము చూడుడు: ఒక మహమ్మదీయుడు హిందూజనరల్ ఎన్నికమండలములో వోటు చేయజాలడు! కాని నిమ్నజాతీయుడైన వోటరు హిందూజనరల్ ఎన్నికమండలమునందు స్వేచ్ఛగా వోటు చేయవచ్చును.

"మహమ్మదీయులు ఏప్రాంతమం దెన్ని సీట్లను బడయవలయునో నిర్ణీతమైయున్నది. అంతకంటె నాప్రాంతములో వారి కెక్కువసీట్లు రావు. అదియునుగాక వారికి

కొన్ని రాష్ట్రములలో జనాభా దామాషాకంటె నెక్కువసీట్లు వచ్చును. నిమ్నజాతులవారు ప్రత్యేకపుటెన్నికమండలములద్వారా నెన్నుకొనుసభ్యుల సంఖ్య చాలా స్వల్పము. ఈసంఖ్య నిమ్నజాతుల జనాభానుబట్టి నిర్ణయించినది కాదు. శాసనసభలలో నిమ్నజాతులచే ప్రత్యేకముగా నెన్నుకొనబడి, వారికష్టసుఖములనుగూర్చి చెప్పకొనగల కొందరు వక్తలను ప్రవేశపెట్టుటకే యీపద్ధతి యవలంబింపబడినది. వారి ప్రత్యేకపుసీట్లన్నియెడలను వారి జనాభా దామాషాకంటె దక్కువగనే యున్నవి.

"మీ యుద్దేశము నా కర్థమయినంతవరకు, మీరు మరణపర్యంతము నిరశన వ్రతదీక్ష వహించుటకు గారణము నిమ్నజాతులవారికి హిందువులతోబాటు జాయంటు ఎన్నికవర్గము లుండవలయునని కాదు, అది యిదివరకే లబ్ధమయినది. హిందువుల యైకమత్యమును సంరక్షించుటకును గాదు. ఏలయన దానికిని నిదివరకే యవకాశము చేయబడినది. ఇంతకును మీ రీదారుణనిశ్చయముచేసిన దిన్నాళ్లను నానావిధములైన యగచాట్లకును బాలగుచున్న నిమ్నజాతులవారితరఫున శాసనసభలలో నలుగురు ప్రతినిధులు రాకుండజేయుటకే యని తేలుచున్నది.

"ఇట్లతిసౌమ్యములు, నతిజాగ్రతాయుతములునైన యిట్టి సూచనలను గావించినను మీ రిట్టి నిశ్చయమును గావించుటకు గల కారణ మేమిటో యెరుగజాలక, మీరు యథార్థవిషయముల గ్రహింపకయే యిట్లు గావించితి రని తలచుచున్నాను.

"మైనారిటీసమస్యను భారతీయులు సొంతముగా బరిష్కరించుకొనజాలక గవర్నమెంటువారిని కోరుటవలననే, నా కిష్టములేకయే యీతీర్పు నొసగుట కంగీకరించితి. ఇప్పు డాతీర్పు నొసగితి. ఇక దాని నందు పేర్కొనబడిన షరతులవలనగాని మార్చుటకు వీలులేదు. కావున గవర్నమెంటువారి తీర్పు మారజాలదనియే మీకు సమాధానము చెప్పవలసివచ్చునేమో యని భయపడుచున్నాను. ఆ సంఘములవారు తమలో దా మొడబడినగాని, గవర్నమెంటువారు కష్టించి యాయా విషయముల మంచిచెడ్డలనుబట్టి నిర్ణయించిన యెన్నికల యేర్పాటులకు బదులు మరియొకయేర్పాటును ప్రవేశపెట్టజాలము.

"మీ యుత్తరప్రత్యుత్తరము లన్నియు మార్చి ౧౧ వ తేదీని మీరు హోరుగారికి వ్రాసిన యుత్తరములతోబాటు ప్రచురించవలసినదని కోరినారు. మీరు ప్రస్తుతము ఖయిదులో నుండుటవలన మీ నిరశనవ్రతమునకు కారణము ప్రజలకు వివరించి చెప్పుటకై యవకాశము లేకపోవుట యన్యాయ మని తలచుచుంటిని గావున మీరు మరల కోరినచో నట్లే ప్రచురింపగలవాడను. కాని గవర్నమెంటువారి తీర్పును మరల

వివరముగా పరిశీలించి మీరు నిశ్చయించినచర్య సమంజస మగునో, కాదో నిశ్చ యించుకొనవలసిన దని కోరుచున్నాను.

జె. రామ్సేమాక్డొనాల్డు."

గాంధిగారి తృతీయలేఖ

సెప్టెంబరు ౯వ తేదీని మహాత్ముడు రామ్సేమాక్డొనాల్డుగారికి ఈలేఖవ్రాసెను:

"మీరు నిష్కల్మషముగా బూర్ణముగా లేఖవ్రాసినందుల కభినందనములు. అది యీనాడే చేరినది. కాని నేను తీసికొనదలచినచర్యకు నా మనస్సున కెన్నడును తట్టని వ్యాఖ్యానము చేసినందులకుమాత్రము విచారపడుచున్నాను. ఎవరి ప్రయోజన ములను పాడుచేయుటకై నేను చావనుంటి నని మీ రనుచున్నారో, యాసంఘమునకు నేనే ప్రతినిధి నని యిన్నాళ్లును వాదించుచున్నాను. ఇట్టి దారుణనిశ్చయమే యిట్టి యపవ్యాఖ్యానములకు తావొసంగ దని నేను తలచియుంటిని. ఇది నా కొక ధర్మ విధి యని మరల తెలియజేయుచున్నాను. నిమ్నజాతులకు డబుల్ వోట్లున్నంతమాత్ర మున వారి నవి రక్షింపవు. అది హిందూసంఘమును విభక్తము గాకుండా చేయజాలదు. నిమ్నజాతులకు వేరుగ సెన్నికవర్గముల నేర్పాటుచేయుటయందే హిందూమతమును నాశనముచేయు మహావిషప్రయోగ మున్నది. అది నిమ్నజాతులకును ప్రయోజన కరము గాదు. మీ రెంత సాదరసౌహార్ద్రభావములతో నున్నను నీయుభయపక్షముల వారికిని నింత మతపరమ్ప్రాధాన్యము గలిగిన యీ సమస్యలో మీరు సరియైన పరి ష్కారమునకు రాజాల రని చెప్పనిండు!

"నిమ్నజాతులకు మీ రెక్కువ ప్రాతినిధ్య మొసగుడు. నాకభ్యంతరము లేదు. నేను కాదనుచున్న దెల్ల వారు హిందూసంఘములో నుండ నంగీకరించిన్నాళ్లునను నేకొలదిరూపముగనైనను వారిని వేరుచేసి విభక్తుల జేయుట తగ దనుచున్నాము. మీ తీర్పు నిలిచియుండి, ఇటులే రాజ్యాంగవిధాన మమలులోనికి వచ్చినచో, నింతకాలమును నిమ్నజాతులవారిని సర్వప్రవృత్తులయందును నుద్ధరింపవలయు నని యావజ్జీవము ధారపోసిన భారతసంఘసంస్కర్తల కష్ట మంతయు గంగపాలు చేయ చుంటి రని మీ రెరుగుదురా?

"కావున మీకు తెలియబరచిన నా నిశ్చయమును అనిచ్ఛాపూర్వకముగనే యవలంబించియుండవలసివచ్చిన దని విన్నవించుచున్నాను.

"మీ యుత్తర మపార్థములకు దావీయవలసియున్నది గాబట్టి నేను నిమ్నజాతుల సమస్యను ప్రత్యేకము తీసికొన్నందున మీతీర్పునందు తక్కిన విషయము లన్నిటితో

డను నే నేకీభవించుచుంటిననిగాని, యంగీకరించుచుంటిననిగాని యర్థము కాదు. అందు చాల భాగములలో చాలదోషము లున్నవని నా యభిప్రాయము. కాని, నిమ్నజాతుల విషయములో నాయంతరాత్మ నన్ను ప్రేరేపించినట్లుగా దక్కినదోషముల విషయములో నన్నీ యాత్మోపహారక్రమమునకు ప్రేరేపించుట లేదనిమాత్రము చెప్పుచున్నాను.

ఇట్లు,

యం. కె. గాంధి."

మహాత్ముఁ డుపవాసవ్రతమును ప్రారంభింపబోవుచు బొంబాయిగవర్నమెంటు వారికి స్టేటుమెంటును ౧౫-౯-౩౨ న బంపెను: ఇది ౧౬-౯-౩౨ న పత్రికలలో ప్రకటింపబడెను.

"నేను ప్రారంభింపబోవు నీ యుపవాసవ్రతము పరమేశ్వరు నుద్దేశించి, యాయనప్రవృత్తిని నిర్వహించుటకై, యాయనయాదేశానుసారముగనే యని వినయవినమితుడనై విశ్వసించుచు ప్రారంభింపబడినది. ఇప్పట్టున ప్రజలు కొంత కొంత చక్కనగుటకై యవకాశ మిచ్చుటకు మిత్రులు కొందరు నన్నీ యుపవాసవ్రతమును గొన్నాళ్లాపుమని కోరిరి. ప్రధానమంత్రికి వ్రాసినయుత్తరములో నుదాహరించినకారణమున దక్క ఆగంటనైనను మార్చుటకు నాకు కర్తృత లేకుండుటకు విచారించుచున్నాను.

"ఇట్టుపస్థితమైన యీ నిరశనవ్రతము నాయందు విశ్వాస మున్నవారిమీదనే గాని, వారు భారతీయులైనను సరే విదేశజులైనను సరే, నాపై విశ్వాసము లేనివారిపై చేయబడుటలేదు. అందుచేత నిది యాంగ్లేయాధికారిలోకముపై కాదు. నాయందును, నేను పూనుకొనిన ఉద్యమమునందును విశ్వాసము గల యాంగ్లేయ స్త్రీపురుషులకే యిది యుద్దిష్టము. అదియునుగాక, వారు హిందువులైనను మరి యెవ్వరైనను నాయందు విశ్వాసములేని భారతీయులపైనను గాదు. కాని నా యుద్యమము ధర్మబద్ధమైనదే యని విశ్వసించునెట్టి ప్రవృత్తికి జెందినవారైనను నట్టిభారతీయుల కొరకే యిది యనుష్ఠింపబడుచున్నది.

"అన్నియు నట్లుండ హిందువుల యంతరాత్మకు చురుకుపుట్టించి ధర్మప్రవృత్తియందు ప్రబిష్టులను చేయుటకే యిది సంకల్పింపబడినది. ఈ నిరశనవ్రతమును బూనినది శత్రుతయావేశమును బుట్టించుటకు గాదు. ఈ నిరశనవ్రతమువలన, నాభారమది యెంత ......నను, దాని నెల్ల అస్పృశ్యత్వము అకళంకమునైన ధర్మతులయం దిడగోరుచున్నాను. ......చేత నా ప్రాణములను రక్షింపవలయునను అనుచితత్వర, ఆవేగత్వరమును

బనికిరావు. ఆయన యిచ్ఛచేతగాక 'తృణాగ్రమపి నచలతి' యనునభియుక్తోక్తిని నేను పూర్ణముగా విశ్వసింతును. ఇంకను నేవ కవసర మైనచో నాయనయే యీశరీరమునం దీజీవుని నిలుపగలడు. అతనియిచ్ఛ లేనిదే యెవ్వరును దీనిని రక్షింపజాలరు. మనుజ సామాన్యముగ జెప్పినను నిది యింకను కొన్నాళ్లు ధరించియుండగల ననియే తలచు చున్నాను.

"ప్రత్యేకపు టెన్నికవర్గములే కడపటి విషబిందువైనది. చాతుర్వర్ణ్యహిందూ నాయకులకును, నిమ్నజాతిప్రతినిధులకును పైపూతయొడంబడిక జరిగినంతమాత్రమున ప్రయోజనకారి కాదు. ఒడంబడికలు సమర్థ మైనవి కావలయు నన్నచో సత్యము కావలయును. హిందూలోక మింకను అస్పృశ్యతను తల్లివేళ్లతో బెల్లగించుటకు సంసిద్ధము గాకపోయినచో నావంతయేనియు సంశయింపక నన్ను బలియీయవలసి యుండును.

"జాయంటు ఎన్నికవర్గముల నంగీకరింపనివారిపై నిర్బంధ మించుకయేని నుండ రాదు. వారి యసహ్యభావమును నేను సులభముగానే యెరుగగలను. నాపైన విశ్వా సము నొందుటకు వారికి సర్వాధికారములు నున్నవి. మరి నే నిన్నాళ్లును అస్పృశ్యు లనువారిని పాడిపాడిగా రాచివేసిన యగ్రవర్ణులను కుహానానామమున బిలువ బడుచున్న చాతుర్వర్ణ్యములోనివాడను గానా ? ఇంత జరిగినను నింకను వారు హిందూసంఘములో నుండుటయే మహాద్భుతము. అయితే వారి విరోధభావము నిట్లు సమర్థింపగలిగినను వారు తప్పుత్రోవను బడిరనియే నా విశ్వాసము. వారికి చేతనైనచో నిమ్నజాతులను హిందూసంఘమునుండి విడదీసి వారి నొకప్రత్యేకసంఘ ముగా జేసి హిందూమతమునకు శాశ్వతమైన కళంకముగా నట్టె పెట్టవలయు నని వారియూహ. దానివలన వారికి క్షేమ మొదవినచో నట్టిదానికి నా కభ్యంతరము లేదు. కాని యీ అస్పృశ్యతయొక్క సర్వరీతులను నేను పూర్ణముగా నెరుగు దును. వీరు చాతుర్వర్ణ్యమువారిమధ్యమున వారికొరకు బ్రతుకు చుండిన వా రగుటచే వారిజీవితము లవి ఎట్టివైనను వారిలో బూర్తిగా నల్లుకొని పోయినవి. కావున వారి నిపుడు విడదీయుట యశక్య మని నేను నిశ్చయించు కొంటిని. ఈ సమష్టికుటుంబములోని భాగస్వాములే వారును. ఇన్నా ళ్లును గలసియున్న హిందువులపై దిరుగబాటు చేయుటయు, హిందూమతమును బరిత్యజించుటయుగూడ సమంజసములే కాని యిదిమాత్రము నా యూహ పోయి నంతవర కెన్నటికిని బనికిరాదు. హిందూమతములో నింతకాలమును వారి కెంత యిష్టములేకపోయినను నిబద్ధుల గావించి యుంచిన యనిర్వచనీయమైన సూత్ర్మవిశేష మేదో యున్నది. ఈ యొక్క విషయమే దాని నిత్యానుభవమున్న నావంటివాడే

విభజనమును ప్రాణమును పోగొట్టుకొనియైనను నిరోధింపవలసిన యావశ్యకతను నిరూపించుచున్నది.

"ఈ నిరోధముయొక్క యంతరార్థములు గంభీరములు. హిందూసంఘములో నిమ్నజాతులకు బూర్ణస్వాతంత్ర్యము నొసగని యే యొడంబడికయు నిపుడు సంకల్పింపబడిన యీ విభజనమునకు దగినప్రతిక్రియ కాజాలదు. ఇం దెట్టి విశ్వాసభంగము జరిగినను నది నాకును, నికముందు నావలె నూహించువారికిని అత్మోపహారదినము కొంతవరకుమాత్రమే నిలిపియుంచగలదు. ఇట్లు సాంఘికముగాగాని, పారత్వవిషయములలోగాని, రాజకీయములందుగాని యస్పృశ్యుల నిట్లే బాధలుపెట్టుచుండినచో నావంటి యొక్క సంఘసంస్కర్తయేగాక దేశములో బెరిగిపోవుచున్న యనేక సంస్కర్తలుగూడ నిరశనవ్రతముల బూని సత్యాగ్రహమునకు బూనుకొన్నచో సహింప గల్గుదురేమో శాధ్యత గలిగిన హిందూసంఘనాయకు లాలోచించుకొందురుగాక! ఈ నిమ్నజాతులకు విముక్తి నొసగి హిందూమతమున కెన్నోతరముల నాటి యీ మూఢాచారమును బాపుటకై ప్రాణములను తృణప్రాయములుగా జూడ గల్గిన యిట్టిసంస్కర్తలు దేశములో ననేకు లున్నారనియే నా విశ్వాసము.

"నాతో బాటు సహచరులై యుండిన తోడిసంఘసంస్కర్తలుగూడ నీ నిరశన వ్రతముయొక్క విశేషార్థములను గమనింతురుగాక!

ఇది నాకు వట్టిభ్రాంతియు గావచ్చును, లేక జ్ఞానజ్యోతి యైనను గావచ్చును. భ్రాంతి యైనచో నన్ను వదలివేసి యీప్రాయశ్చిత్తమును శాంతముగా చేసికొననిండు! దీనితో హిందూమతమును దిగలాగుచున్న పెద్దభారము వదలిపోవును. లేక జ్యోతి యైనచో, నీయార్తిచే హిందూమతము పరిశుద్ధమగునుగాక. అప్పుడు నన్ను విశ్వసింపనివారి హృదయములుగూడ కరగునుగాక! ఇక నా నిరశనవ్రత మెందులకు ప్రయోగింపబడుచున్నదో కొంతకొంత దురభిప్రాయము లున్నట్లున్నవిగాన నిమ్నజాతులకు శాసనసిద్ధముగా నేరూపమునసైనను ప్రత్యేకపుటెన్నికవర్గము లుండగూడ దనియే యిది ప్రారంభించితినని మరల జెప్పుచున్నాను. ఆబెదరింపు పూర్తిగా మానినంతనే నేను నిరశనవ్రతమును మానుకొందును. సీట్ల రిజర్వేషనునుగూర్చియు, అసలీ వ్యవహారమునంతను బరిష్కరింపవలసిన యుచిత పద్ధతిని గూర్చియు నాకు కొన్ని గట్టియూహ లున్నవి. కాని యిప్పుడు ఖయిదీ నగుటచే ఆ సూచనలను బ్రకటించుట కనర్హుడ నని యెంచుచున్నాను. కాని చాతుర్వర్ణ్యనాయకులును, నిమ్నజాతిప్రతినిధులును గూడి జాయంటు ఎన్నికవర్గములు

ప్రధానముగా జేసికొనిన యే యొడంబడిక నైనను నంగీకరింపగలరు. ఆ స్కీము సర్వహిందువులును బహిరంగసభలలో నంగీకరించినది కావలయును.

"ఒక్క విషయమును నేను వివరించి చెప్పవలసియున్నది. ఈ నిమ్నజాతిసమస్య సంతృప్తికరముగా బరిష్కారమైనంతమాత్రమున గవర్నమెంటువారొసగిన సాంఘిక సమస్యాపరిష్కారము నంతను దక్కిన యన్నివిషయములందును నంగీకరించితినని తలపరాదు. అందు గొన్నియంశము లెట్టిప్రజాస్వామికరాజ్యాంగము నైనను సరళిగా నడువనీయవు. అట్టివానికి నేను ప్రత్యేకముగా నభ్యంతరము చెప్పెదను. అదియును గాక, యీసమస్య సంతృప్తికరముగా బరిష్కారమైనంతమాత్రమున నిక నిర్మింపబడనున్న రాజ్యాంగవిధానమునకు నేను బద్ధుడను గాజాలను. ఇవి రాజకీయవ్యవహారములు. వానిపై నేను వ్యక్తిగత అభిప్రాయము చెప్పుట కధికారము లేదు. పైగా ఖైదీనైన నేను నా అభిప్రాయముల నిపుడు చెప్పరాదు.

"నానిరశనవ్రత మేకవ్రతావస్థితము. నిమ్నజాతి సమస్య ధర్మవిషయము. యీశ్వరాజ్ఞవధారణచేత నది నాది యని యెంచుకొనుచున్నాను. దానిపై నా కొక పవిత్రమైన ధర్మకర్తృత్వ మున్నది. దానిని నేను తప్పించుకొనరాదు.

"జ్ఞానసిద్ధికి, పాపపరిహారమునకు నిరశనవ్రతధారణ మతి ప్రాచీనసంప్రదాయము. క్రైస్తవమహమ్మదీయధర్మములం దిది నే నెరుగుదును. పుణ్యాభివృద్ధి పాపనివారణములకై నిరశనవ్రతధారణము చేసిన యుదంతములతో హిందూమతము నిండియున్నది. కాని యిది యొక భాగ్యమైనచో విధిగూడను. అదియునుగాక, నాకు జేతనైనంత వరకు నేను దాని నొక శాస్త్రముగా సమర్థించితిని.

"అందుచేత నిం దధికారి నైన నేను, నామిత్రుల ఆలోచన లేకగాని, మిథ్యాదరముచేతగాని, వెర్రి సానుభూతివలనగాని నన్ను అనుకరింపవలదని హెచ్చరించుచున్నాను. అట్టివా రెల్లరును, కష్టించి పనిచేసి, యస్పృశ్యులకొరకు నిస్వార్థసేవ చేసి యర్హత సంపాదించుకొందురుగాక! అప్పుడు వారు నిరశనవ్రతము చేయవలసిన యవసరము కలిగినచో ఆజ్యోతి దానియంతట నదియే ప్రాప్తమగును.

"ఇక చివరిమాట. నన్ను గురించి నాకు తెలిసినంతవర కీ నిరశనవ్రత మొక్క ప్రాణిమీద నైనను ద్వేషముగాని, క్రోధముగాని లేక నిష్కళంకమైన భావముతో ప్రారంభింపబడుచున్నది. నామట్టుకు నా కిది అహింసయొక్క వ్యక్తీకృతి. ఇది అహింస కత్యంతరక్షణోపాయము. కావున నాకుగాని, నా యుద్యమమునకుగాని విరోధులుగా నున్నవారితో వాదోపవాదములయందు దౌర్జన్య ముపయోగించినవారు వాత్మృతిని త్వరపరచినవా రగుదురు. అన్ని విషయములందును గాకపోయిన నీ విష

యమునం దైనను జయము లభింపవలయునన్నచో సంపూర్ణమర్యాదా సౌమనస్యము లత్యంతావశ్యకములు."

సెప్టెంబరు ౨౦ - తేదీని పత్రికా ప్రతినిధులు జైలులో గాంధిజీతో సంభాషించుట కనుమతింపబడిరి. ౨౧-౯-౩౨ న ప్రెస్సు ఆఫ్ ఇండియాపత్రికలో నా వృత్తాంత మిట్లు ప్రకటించిరి :

"తొమ్మిదిమాసములకు మరల నేడుసాయంత్రము ౫-౩౦ వేళ ఎరవాడ జైలులో పత్రికాప్రతినిధులు గాంధిమహాత్ముని దర్శించుట కనుమతి లభించెను. మహాత్ముని ముఖమున నేడు వెడలిన సంభాషణము అతి ధారాళమై భావగంభీరమై చెవులపండువొనర్చినది. మహాత్ముడు ప్రాయోపవేశదీక్ష గైకొనినపిమ్మట నైదుగంటలకు ఆవిషయమును వారితో చర్చించు భాగ్యము లభించిన యేపత్రికాప్రతినిధిహృదయము ముగ్ధము కాదు ?

"వేలకొలది ఖయిదీలు తయారుచేసిన శుద్ధ స్వదేశీదుప్పట్లు, జంబుఖానాలు మొదలగు వివిధవస్తువుల మడతలతో నిండియున్న గడమంచెలున్న యొక సన్నని పొడుగుపాటి గదిలో మేము ప్రవేశించితిమి. చాలదినములనుండి భారతదేశమే కాక యావత్పాశ్చాత్య ప్రపంచమును, ప్రాచ్యఖండమున చాలభాగమునుగూడ ఏమహావ్యక్తి దెసకు తమ దృష్టులు నిగుడ్చుచున్నదో ఆపురుషు డచట నొక కుర్చీలో నాసీనుడై యుండి మందహాసముతో మాకు స్వాగత మొసగెను.

"'ఈవ్యవహారము సుఖాంతమగునా' యని మేము ప్రశ్నింప, "నాయాశ దుర్దమమైనది. ఈశ్వరుడు అనుగ్రహించినచో, ఈయుపవాసము మృతిపర్యంతము సాగదు" అని ఆయన మారుపలికెను."

"తనతోపాటు ఉపవసింతు మని అనేకులు తంతివార్తలు పంపినవృత్తాంతము మా కెరిగించి పిమ్మట మహాత్ము డిట్లు చెప్పెను : "నాతోపాటు ఇతరులు ఉపవసింపవలదని కోరుచున్నాను. నేను ప్రబలమైన యీశ్వరప్రేరణచే నీ దీక్ష బూనితిని. అట్టి ప్రేరణ స్పష్టముగా కలిగిననేతప్ప లేనిచో నితరు లెవ్వరును ఉపవసింపగూడదు. ఆత్మశుద్ధికొరకో, ఈవిషయమున ఏకీభావము తెలుపుటకో ఒక్కరోజు ఉపవసించుట నేను కాదనను. అంతియేకాని ఇట్టిదీక్షల కందరు నధికారులు గారు. ఈ ధర్మనిర్వహణమునకు ఆత్మసంయమము గలవారే అధికారులు.

"పిమ్మట ప్రస్తుతవిషయమగు అస్పృశ్యుల ప్రాతినిధ్యమునుగూర్చి ప్రస్తావించితిమి. తాను ఐదుదినముల క్రితము బొంబాయిప్రభుత్వమున కంపిన స్టేటుమెంటు నింకను ప్రచురింపనందులకు మహాత్ముడు ఆశ్చర్యమును వెలిబుచ్చెను. ఈలోపల జరిగిన వ్యవహారములనుబట్టి యిపుడు తిరిగి ఆస్టేటుమెంటును రచించుట కష్టమగు నని చెప్పి,

కుడను తన కొత్తస్టేటుమెంటు పాతదానిపై నాధారపడినది కాదనియు, దాని కను బంధప్రాయ మనియు చెప్పెను.

"నే నేమియు దాచిపెట్టలేను. ప్రస్తుత విషయమునుగూర్చి జెయిలులో నున్నవాడను నే నేమి చెప్పగలను! ఇపుడు నిర్బంధము తొలగినది గావున ముందుగా పత్రికలవారికి నాయభిప్రాయము తెలుపుచున్నాను. నే నీ దీక్షబూనుట ప్రత్యేకప్రాతినిధ్యమును ప్రతిఘటించుటకే గాని స్థానములను ప్రత్యేకించుట నేను కాదనను. శాసనరీత్యా స్థానములను ప్రత్యేకించుటకు నేను సుతరాము అంగీకరింపక చేటు గూర్చుచున్నాననుట కొంతమట్టుకు నిజమే. స్థానములను శాసనరీత్యా ప్రత్యేకించుటకు నేను నాడును, నేడును వ్యతిరేకినే కాని అట్టి ప్రణాళికనుగూర్చి ఇంతకు మున్ను ఎవరును నాయభిప్రాయ మడిగియుండలేదు. కావున ఆవిషయమున నే నిద మిత్థమని నిర్ణయింపవలసిన అగత్యము లేకపోయినది. నాలో నే నావిషయమును తరచి చూచుకొన్నమీదట నాకు కలిగిన అసంతృప్తిని వెల్లడించితిని. అట్లు స్థానములు ప్రత్యేకించుటచే మేలుకలుగకపోగా సహజపరిణామమున కభ్యంతరము లేర్పడి, కీడే కలుగునని నాబుద్ధికి తోచుచున్నది. స్థానములు ప్రత్యేకించుట ఎత్తులు పెట్టి నిలుపుట వంటిది. అట్టి ఎత్తులమీద నిలుచుట దౌర్బల్యమునకే కారణము కాగలదు.

"ప్రజలు నన్ను నవ్వకున్నచో నాకుగల ఒక్కహక్కును గూర్చి విన్నవింతును. నేను పుట్టుకచే స్పృశ్యుడనైనను 'అస్పృశ్యతను' వలచి చేపట్టితిని. నేను కోరునది అస్పృశ్యులలో పైమెట్టుమీదనున్న ఏపదిమందికో ప్రతినిధిని కావలెననికాదు. అస్పృశ్యులలో గూడ నెన్నియో కులములు, అంతరములు నున్నవి. కాబట్టి అట్టి అస్పృశ్యులలో అధమాధములుగా నెంచబడుచు, 'చేరరాని వారుగా చూడరానివారు'గా పరిగణింపబడుచున్న దౌర్భాగ్యులకు నేను ప్రతినిధి నని చెప్పుకొనగోరుచున్నాను. వారి కష్టపుకుండ నిండి తొణకులాడుచున్నది. అట్టివారిని నేను మలబారులోను, ఒరిస్సాలోను చూచితిని. వా రెప్పటికైన అగ్రజాతులవారి సంస్కారప్రయత్నములచే బాగు పడవలయునేకాని స్థానములు ప్రత్యేకించుటచే గాదు. ప్రత్యేకప్రాతినిధ్యముచే నట్టి దీనుల కిక నెన్నటికిని తరణోపాయము దొరకదను కారణముచేతనే నేను తల్లడిల్లి వివశుడనై పోతిని. ఇపు డాప్రత్యేకప్రాతినిధ్యము తొలగిపోయినచో నాఉపవాసదీక్షకు గల కారణము నామకః తొలగినట్లే యగును గాని, యథార్థమునకు, అంతమాత్రముచే నాదీక్ష ఫలప్రదమైనదని యెంచుకొనరాదు. నేను అస్పృశ్యతను వరించితి నని చెప్పనే చెప్పితిని. కావున అట్టి నేను అస్పృశ్యులకు, స్పృశ్యులకు ఏదో పైపూతలు పెట్టి సమాధానము కుదుర్చుటతో తృప్తి జెందజాలను.

"అస్పృశ్యతను కూకటివేళ్లతో పెల్లగించివేయవలె ననియే నేను కోరేది. అందుకే నేను బతికియున్నాను. అందుకొరకై సంతోషంగా ప్రాణాలు వదులుతాను. కాబట్టి నూతనచైతన్య మివ్వగల సమాధానము నాకు కావాలి. అట్టి రాజీకి ఫలం ఎప్పుడో ముందుముందు కనపడుటకాదు. ఇప్పుడే కనిపించవలెను. అటువంటి సమాధానం కలుగవలెనంటే దేశమంతట స్పృశ్యులు, అస్పృశ్యులు ఏకీభవించాలి. తమ ఐకమత్యం ప్రకటించాలి. ఊరకే లాంఛనాల కొకరి నొకరు కౌగిలించుకుంటే లాభంలేదు. మనసులు కలిసి సోదరభావంతో చేతులు కలపాలి. ఇట్టి మహాభాగ్యం ఎప్పుడు లభించునా అని యేళ్లయేండ్లనుంచి నేను కలవరిస్తున్నాను. దాని సిద్ధికొరకే నేడు యజ్ఞగుండంలో దూకుతున్నాను. బ్రిటిషుప్రభుత్వమువారి నిర్ణయము నాకు దుర్భర మైపోయింది. దానితో చావుబతుకులు తేల్చుకొనవలసివచ్చింది. ఇట్టి వ్యాధుల నిదానములో నే నందేవేసిన వైద్యుడను గావున గుణము నట్టే పట్టివేసితిని. కాబట్టి ప్రత్యేకప్రాతినిధ్యము తొలగిపోయినను వ్యాధి మళ్లీమొగం పట్టినట్లగునే కాని నిశ్శేషముగాదు. అందువల్ల బొంబాయిలో చేరిన పెద్దలను, ఇతరులను తొందర పడి కార్యనిశ్చయం చేయవద్దని హెచ్చరిస్తున్నాను.

"హిందువులు తమసాటిమతంవారికి చేసిన ఘోరాపచారాలకు ప్రాయశ్చిత్తం జరుగవలెనంటే ఈ మహత్కార్యంకొరకు నాప్రాణ మొక లెక్కలోది కాదు. నూరుమంది తమ ప్రాణము లర్పించినను చాలదు. కాబట్టి నాకోస మని ధర్మపథము నించుకయు తప్పవద్దని వేడుకొంటున్నాను. నా ఉపవాసవ్రతఫలమును నేను ధర్మ పక్షమున ఒడ్డుచున్నాను. దానిచే హిందువులు నిద్ర మేల్కొని ధర్మనిర్వహణమునకు సిద్ధపడినచో నా కంతియే చాలును. అట్లుగాక నాయందలి మమత్వముచే నేదియో మసిపూసి మారేడుకాయచేసి నన్ను బ్రతికించుకొని, మరల నిద్రకు బడుదురేని ఘోరాపరాధం చేసినవా రగుదురు. నా బ్రదుకు దుఃఖపూర్ణము, దుర్భరము నై పోవును. ప్రత్యేకప్రాతినిధ్యం తొలగిపోయినచో నే నీవ్రతం మాని బ్రదుకుదు నన్న మాటే గాని, నేను కోరే సజీవమైన, పరిపూర్ణమైన, హృదయపూర్వకమైన సమాధానం కుదరనిచో నేను దుఃఖభాజనుడనై, జీవచ్ఛవము నైపోదును. ప్రస్తుతవ్రతము చాలించిన వెంటనే సత్యసమాధానసిద్ధికొరకు పునఃప్రాయోపవేశసంకల్పం నేను చేయవలసి వస్తుంది.

"ఇది యంతయు నితరులకు కుర్రతనంగా కనపడవచ్చునుగాని నాకుమాత్ర మట్లు కాదు. ఈ ఘోరపాపం రూపుమాపుటకొరకు నే నర్పింపగలిగిన దీ శరీర మొక్కటే. ఇంకేమైన నున్నచో దానినిగూడ నీయజ్ఞకుండమున వ్రేల్తును.

"ఈ అస్పృశ్యత నిజముగా రూపుమాసిపోయినచో హిందూసంఘకళంకం సంక్షాళితం కావడమే కాకుండా ప్రపంచమంతట దీనివలన సత్ఫలము చేకూరగలదు. అస్పృశ్యతను నిర్మూలించడంకొరకు నేను సల్పుచున్న యీ పోరాటము మానవజాతి యంతటిలోనున్న కలుషములనుగూడ పారదోలుట కేర్పడినది. నా సంకల్పము స్వచ్ఛమైనదైతే, సాధ్యమైనంతవరకు నేను క్రోధమాత్సర్యదూరుడనైనట్లయితే మానవజాతిలోనున్న ఉత్తమశ్రేణి యంతయు నాకు అండగా నిలుస్తుందనే విశ్వాసంతోనే నేను సర్ సామ్యుయల్ హోరుగారి కొలేఖ వ్రాసితిని. కాబట్టి నా సంకల్పశుద్ధిని నమ్ముకొని, హైందవజాతిని నమ్ముకొని, మానవస్వభావమును నమ్ముకొని, తుదకు అధికారివర్గమునుగూడ నమ్ముకొనియే ప్రబలవిశ్వాసంతో నేనీ ఉపవాసమునకు పూనుకొంటి నని మీరు తెలిసికొనవలెను.

"అస్పృశ్యతపై నేను దండువెడలుటచే మనవ్యవహారపు చిక్కులన్నియుగూడ పరిష్కారము కాగలవు. రాజకీయంగా స్వరాజ్యం సంపాదించడంకంటె కూడా దీనికి పరమప్రయోజనం కలదు. ధర్మమనే పునాదిమీద కట్టని రాజ్యాంగనిర్మాణమునకు ప్రాణ ముండదు. ఇన్నాళ్లనుంచీ దుర్భరకష్టములపాలై నవయుచున్న కోట్లకొలది జనులకు తమ కడగండ్లభారం తొలగుననే విశ్వాసము నేడు కలిగినది. ఆ ధర్మవిశ్వాసబలముమీదనే రాజ్యాంగసౌధం నిర్మింపవలసిఉంది. ఆంగ్లేయాధికారులు ఈ రెండవపక్షమును చూడలేకపోవుటవలననే అవివేకులై స్వసామర్థ్యము నమ్ముకొని కోట్లాది ప్రజల భాగధేయమును తమ చిత్తమువచ్చినట్లు త్రిప్పుటకు సాహసించుచున్నారు. కోట్లకొలదిప్రజ లనగా కాళ్లక్రింద నలుగుచున్న అస్పృశ్యులే కాదు; నెత్తినెక్కి కూరుచున్న సవర్ణులుకూడ నని నా అభిప్రాయం. కాబట్టి అధికారుల ఈ యజ్ఞానమునుగూడ (అజ్ఞాన మంటున్నాను. తప్పు పట్టకుందురుగాక) తొలగించి మేల్కొలుపుటకే నా సహాయశక్తులతో దీనిని ప్రతిఘటించవలెననే ఆత్మప్రేరణ నాకు కలిగింది."

"నిన్న తమ్ము చూడవచ్చిన రాయబారులకు కొన్ని సూచనల నందిచ్చితిమనియు, అవి బొంబాయిలో నేడు పత్రికల కందుననియు మహాత్ముడు చెప్పెను.

"పిమ్మట ఫొటోగ్రాపు తీసికొను ప్రసక్తి వచ్చినది. మహాత్ముడంతట తనఉత్తర క్రియలనుగూర్చి ఛలోక్తిగా నేదియో అనెను. నే నంతట 'నిన్న మీకుమారులు దేవదాసుగారు మిమ్ము చూడవచ్చిరి గదా! పిమ్మట నెటుపోయి యెటువచ్చినను వారికి చెప్పవలసిన మాటలేమైన చెప్పితిరా?' అని అడిగితిని. మహాత్ముడు చటాలున నిట్లు అద్భుతమగు సమాధాన మిచ్చెను:

"నాతండ్రి ప్రాణముల్లైనా వదులుకొంటాను గాని, మీరు తొందరపడి అస్పృశ్యులకు అపకారకమైన నిర్ణయము చేయుటకు ఒప్పుకొనను అని బొంబాయి సభలో నాకు మారుగా నాపుత్రుడను అతడు చెప్పవలసిన దని కోరితిని."

"మీ యుపవాసము కొనసాగు ననియే మీ యుద్దేశమా యని నేను అడిగితిని. మహాత్ముడు "అందరవలె నాకును బ్రదుకవలెననియే ఉన్నది. నీటికి ప్రాణములను రక్షించే శక్తి యెంతైనా ఉంది. వసరమైనపుడెల్ల నేను నీరు తాగుతూ ఉంటాను. హిందువుల అంతరాత్మకు, బ్రిటిః వారి అంతరాత్మకుగూడ ప్రబోధము కలిగించుట కొరకు, ఈ యాతన అంతమొందించుటకొరకు నే నెట్లయిన బ్రదికియుండుటకే ప్రయత్నించుతా నని నమ్మండి. నా ఆక్రోశము దేవదేవుని చెవుల దూరి తీరును." అని జవా బిచ్చెను.

## ఎరవాడ సంధిపత్రం

"(అస్పృశ్యుల ప్రాతినిధ్యమునుగూర్చి, వారి క్షేమమునకు సంబంధించిన ఇతర విషయములనుగూర్చి అస్పృశ్యుల తరఫున తక్కిన, హిందూసంఘంతరఫున వ్యవహరించిన పెద్దలు పరస్పరం చేసికొన్న ఒడంబడిక ఇది.

(౧) సామాన్య నియోజకస్థానములలో కొన్ని అస్పృశ్యులకుగాను (రిజర్వు) అట్టె పెట్టబడును. రాష్ట్ర శాసనసభలలో స్థానము లిట్లుండును—

| | |
|---|---|
| మదరాసు | ౩౦ |
| బొంబాయి, సింధులు | ౧౫ |
| పంజాబు | ౮ |
| బీహారు, ఒరిస్సాలు | ౧౮ |
| మధ్యపరగణాలు | ౨౦ |
| అస్సాము | ౭ |
| బెంగాలు | ౩౦ |
| సంయుక్తరాష్ట్రములు | ౨౦ |
| మొత్తం | ౧౪౮ |

ప్రధానమంత్రినిర్ణయములో రాష్ట్రసభల స్థానముల మొత్తములనుబట్టి ఈ సంఖ్యలు నిర్ణయింపబడినవి.

(౨) ఈ స్థానములకు ఎన్నికలు ఈ దిగువ ఉదాహరించినవిధానమునకు లోబడి సాముదాయికనియోజకవర్గములద్వారానే జరుగును.

సామాన్యనియోజకవర్గముల జాబితాలో రిజస్టరైన అస్పృశ్యవోటర్లందరును ఆయా సభ్యత్వస్థానములలో నొక్కొక ఓటర్లసంఘముగా నేర్పడవలెను. అట్టి సంఘములు సింగిలువోటుపద్ధతిని ఒక్కొక్కరిజర్వుడు స్థానమునకు నలుగురేసి అస్పృశ్య అభ్యర్థుల నెన్నుకొనవలెను. అట్లు ఎన్నుకోబడిన నలుగురును, సామాన్య నియోజకవర్గములద్వారా ఎన్నుకోబడుట కభ్యర్థులు కాగలరు.

(౩) కేంద్రశాసనసభకుగూడ అస్పృశ్యుల ప్రాతినిధ్యము రెండవ షరతులో ఉదాహరింపబడినప్రకారము సాముదాయికనియోజకవర్గములద్వారా సీట్లు రిజర్వు చేయుటవలన ఏర్పాటుచేయబడును.

(౪) కేంద్రశాసనసభలో బ్రిటిషిండియా సామాన్య నియోజకవర్గములవంతుకు వచ్చిన స్థానములలో నూటికి పద్దెనిమిదిచొప్పున అస్పృశ్యులకు రిజర్వుచేయబడును.

(౫) రాష్ట్రశాసనసభలకు, కేంద్రశాసనసభకు అస్పృశ్యాభ్యర్థుల నిర్ణయమునకు ముందు జరుగవలసిన ప్రారంభపుటెన్నికపద్ధతి (రెండవ షరతు ప్రకారము) మొదట పదిసంవత్సరముల పిమ్మట అంతమొందును. లేదా ౬ వ షరతులో చెప్పనున్న పద్ధతిని పరస్పరాంగీకారముతో ఈలోపలనే అంత మొందించుకొనవచ్చును.

(౬) ఈసంధిదారులందలి ఉభయపక్షముల సంఘములవారు పరస్పరం ఒడంబడిక యేదైనా చేసికొనేపర్యంతము ౧, ౪ షరతులలో చెప్పినప్రకారం రాష్ట్రసభలలోను, కేంద్రసభలోను అస్పృశ్యుల ప్రాతినిధ్యం రిజర్వుసీట్లపద్ధతినే సాగుచుండును.

(౭) రాష్ట్రసభలకు, కేంద్రసభకు అస్పృశ్యుల ఓటింగు హక్కు లోథియను కమిటీరిపోర్టు ననుసరించియుండును.

(౮) లోకలుబోర్డు ఎన్నికలలోను, ఉద్యోగనియామకములోను అస్పృశ్యుడనే కారణంచేత ఎవ్వనికీ, ఎట్టి అభ్యంతరములూ చూపబడవు.

ఉద్యోగనియామకమునకు తగిన అర్హత యున్నచో, పై సందర్భములలో అస్పృశ్యులకు యుక్తమగు ప్రాతినిధ్యము సంపాదించుటకు సర్వప్రయత్నములును చేయబడును.

(౯) ప్రతిరాష్ట్రములోను విద్యకుగాను ఖర్చుపెట్టె సొమ్మునుండి, అస్పృశ్యుల విద్యకు తగినంత సొమ్ము ప్రత్యేకింపబడును.

| | |
|---|---|
| మదనమోహనమాలవ్యా | బి. యస్. కామత్ |
| తేజబహదరు సప్రూ | జి. క. దేవధర్ |
| యం. ఆర్. జయకర్ | ఏ. వి. ఠక్కర్ |
| బి. ఆర్. అంబేద్కర్ | ఆర్. క. ధకేల్ |
| శ్రీనివాసన్ | పి. జి. సోలాంకి |
| యం. సి. రాజా | పి. బాలూ |
| సి. వి. మెహతా | గోవిందమాలవ్యా |
| సి. రాజగోపాలాచారి | దేవదాసుగాంధి |
| రాజేంద్రప్రసాద్ | విశ్వాస్ |
| జి. డి. బిర్లా | బి. యన్. రాజభోజ్ |
| రామేశ్వరదాసు బిర్లా | గవాయి |
| శంకరలాలు బాంకరు | |

సెప్టెంబరు ౨౫ వ తేదీని బొంబాయిలో జరిగిన హిందూసభ చివరి సమావేశములో ఈక్రింది చేవ్రాళ్లుగూడ చేర్చబడెను-

| | |
|---|---|
| లల్లూభాయిశామల్‌దాస్ | పి. కోదండరావు |
| హంసమెహతా | జి. క. గడ్గిల్ |
| క. నటరాజన్ | మను సుబేదార్ |
| కామకోటి నటరాజన్ | అవంతికాభాయి గోఖేలు |
| పురుషోత్తమదాస్ ఠాకూరుదాస్ | క. జె. చిటాలియా |
| మధురాదాస్ వాసాంజీ | రాధాకాంత మాలవ్యా |
| వాల్చందు హీరాచంద్ | ఏ. ఆర్. భట్టు |
| హెచ్. యన్. కుంజ్రూ | కోలం |
| క. జీ. లిమాయి | ప్రధాన్" |

ఈ ప్రథమోపవాసవ్రతమునకును, తత్ఫలితమగు పూనాపాక్టునకును సంబంధించిన మరియొక విషయంకూడా ఇచట చెప్పవలసియున్నది. హరిజనోద్ధరణార్థం మలబారులో చాల కృషి చేయుచున్న కేలప్పనుగారుకూడ ఆత్మప్రేరితులై మహాత్మునితోపాటు ప్రాయోపవేశవ్రతమును పూనిరి.

గురువాయూరుకోవాలయపుట్రస్టీలచే అస్పృశ్యులకు తదాలయప్రవేశమిప్పించుటయే వారి మనోరథము. సందర్భము లన్నియు విచారింపగా ట్రస్టీలకు తగినంత వ్యవధి యివ్వకుండా ఉపవాసవ్రతము పూనినట్లు మహాత్మునకు తో[illegible] విజయము

సిద్ధమని మహాత్ముని ఒప్పింపజూచిరి కాని మహాత్ముడు తనకు గావలసినది తాత్కాలికవిజయము కాదనియు, ఆవ్రతము ధర్మసమ్మతమా కాదా అనేదే ప్రస్తుత మనియు చెప్పెను. ఈ సందర్భమున కేలప్పనుగారి కంపిన తంతివార్తలు రెండును ఉదాహరించుచున్నాము :

## ౨౯ వ సెప్టెంబరున ఎరవాడనుంచి పంపిన తంతి

"ఉపవాసవ్రతము కొన్ని మాసములవరకును ఆపి యుంచవలసిన దని నిన్ను కోరవలసినదిగా కోరుచు జామొరిన్ గారు నాకు తంతినంపిరి. ప్రస్తుతం దేవాలయప్రవేశం పూర్వాచారులకు బాధ కల్గించుననియు, వారిని పీడించుట అన్యాయమనియు వారి అభిప్రాయము. ఈ ముఖ్యవిషయమును గమనించి ఉపవాసము చాలింపదగునేమో యోచింపవలెను. జామొరినుగారి తంతివార్తలోని అంశములనుబట్టి చూడగా వారికి తగినంత సావకాశం ఇవ్వలేదేమో అని కూడా ఆలోచింపవలెను."

## ౨ వ అక్టోబరున ఇచ్చిన తంతి

"నీతంతి చేరినది. కార్యనిశ్చయ మొనర్చుటలో తాత్కాలికఫలితములు గాదు విచారింపవలసినది. నా తంతివార్త ననుసరించి నీవు ఉపవాసము మానుటయే ధర్మసమ్మతమని మరల చెప్పుచున్నాను. ఈశ్వరానుగ్రహమున్నచో ఈభారమున నాపాలు నేను భరింపగలను. నీ యంగీకారమును తంతిద్వారా తెలుపవలెను."

ముందుముందు కేలప్పనుగారు ఉపవాసవ్రత మొనర్పవలసిన అవసరముకలుగునేని మహాత్ముడుగూడ ఆయనతోపాటు ఉపవసింతునని తనస్టేటుమెంటులో స్పష్టముగా మాటయిచ్చెను. తగినంత వ్యవధిలేకుండా ఉపవాసం పూనుట మహాత్మునకు దోషముగా తోచుటచే కేలప్పనుగారి కావిషయము నచ్చజెప్పి ఉపవాసము మాన్పించిరి.

డిసెంబరు ౨ వ తేదీని రత్నగిరివాసులగు యస్. పి. పట్వర్ధనుగారు ఉపవాసవ్రతము పూనిరి. ఆయన జెయిలులో పాకీపని చేయుటకు అనుమతి కోరగా అధికారు లంగీకరింపరైరి. గాంధీగారీవిషయమై బొంబాయిప్రభుత్వమునకు వ్రాసినను ఫలములేదయ్యెను. పట్వర్ధనుగారంతట ఆహారము క్రమముగా తగ్గించి క్షీణించిపోవుటకు వ్రతము పూనిరి. రాజీమాటలు జరిగే రోజులలో రాజీ కుదరనిపక్షమున తాముగూడ నుపవసింతుమని మహాత్ములు బాసచేసిరి కావున ఆప్రకారం తాముకు ఉపవాసవ్రతము పూనిరి. కాని అధికారులు పట్వర్ధనుగారి విన్నపమునుగూర్చి ఆలోచించుటకు సమ్మతించుటచే రెండు దినములలోనే వ్రతసమాప్తి యయ్యెను. పిమ్మట వారముదినములలోనే ఇండియామంత్రి జెయిలురూల్సులో అవసరమగు మార్పులుచేసి, సవర్ణులు పాకీ

పని చేయుటకు గల అభ్యంతరములు తొలగించుటచే నీ సత్యాగ్రహము జయప్రద మయ్యెను.

౧౯౩౨లో శాసనధిక్కారోద్యమము ఎలా వృద్ధిచెందినదన్నీ తెలిపితిమి. పూనా పాక్టు ఉపాఖ్యానములుగూడ వివరించితిమి. ఈ విధముగా అస్పృశ్యతానివారణవిషయమై మహాత్ముని ఆనతి నెరవేర్చుటకై ప్రజలు చేసిన సన్నాహముపలన శాసనధిక్కారోద్యమముమాత్రం కొంత మందగించెను.

ఏది యెట్లయినను కాంగ్రెసు ప్రోగ్రాము మాత్రము కొనసాగింపబడుచునే యున్నను, శాసనధిక్కారము మందగించుటకు మరియొక కారణముగూడ గలదు. అప్పటి సంగతిసందర్భములను బట్టి చూడగా రహస్యమార్గము లవలంబించితేనేగాని ఉద్యమం సాగేటట్లు కన్పించలే దని మున్నే చెప్పితిమి. అట్లు రహస్యసాధనము లుపయోగించుట సత్యాగ్రహమునకు తగనిపని. దాని మూలసూత్రములకును, రహస్య సాధనములకును సహజవిరోధము. కాబట్టి మహాత్ముని ఉపవాసతరుణమున కాంగ్రెసు ప్రముఖులందరును స్వేచ్ఛగానొకచోచేరుటకు అవకాశము లభించినది గాన వారందరు ఈ విషయమున సంప్రదింపులు జరుపుకొనుటకు వీలు చిక్కుటచే తత్ఫలితముగా రెండుప్రకటనలు గావించిరి. అందు మొదటిదానిలో కాంగ్రెసువారికి సత్యాగ్రహమే ప్రధానమనియు, జెయిలుకు వెళ్లజాలని కాంగ్రెసువారు అస్పృశ్యతానివారణకార్య మున కాంగ్రెసు సంబంధములేని జాతీయవాదులు చేయు కృషికి తోడ్పడవచ్చు ననియు తెలుపబడినది. శాసన ధిక్కారసందర్భమున అవలంబించుచున్న రహస్య మార్గములను మానుకొనవలసిన దని రెండవ ప్రకటనలో తెలుపబడినది.

౧౯౩౨ సం.లో గవర్నమెంటు దాడి ప్రారంభమైనది. జనవరి నాల్గవ తారీఖున రాజగోపాలాచారి, అనంతరము రాజేంద్రప్రసాదుగారు కాంగ్రెసు ఆక్టింగు ప్రెసిడెంటు అయ్యెను. అంతవరకు జరిగిన వుద్యమ చరిత్రనున్నూ, అప్పుడు ప్రజల అందరి మనస్సులోవున్న సమస్యను విశదీకరించుచూ ఆయన ఒక ప్రకటనను తయారు చేసి, దానిని ఆరోజున దేశమంతటను చదివి వార్షికోత్సవము చేయునట్లు అన్నిరాష్ట్రీయకమిటీలకును తాఖీదులు పంపెను. అనేకచోట్ల సభలుజరిగెను. ఆసభలలో అరెస్టులు, లాటీచార్జీలమధ్య ఈ ప్రకటన చదువబడెను. ప్రెసిడెంటు రాజేంద్రబాబే ౧౯౩౩ వ సం. ౧౦ జనవరి ౬వ తేదీన అరెస్టుకాబడెను. అటుపిమ్మట ఆనీగారు ప్రెసిడెంటు అయ్యెను. ౧౯౩౨ జనవరిలో వుద్యమము ప్రారంభించినప్పుడు వల్లభాయిగారు ప్రసిడెంటుగా నుండిరి. ఆయనతరువాత ౩౩ వ సం. ౧౦ జులైవరకు రాజేంద్రప్రసాద్, డాక్టరు అన్సారీ, శార్దూలసింగ్, దేశపాండ్యా, డాక్టరు కిచ్లూ రాజగోపాలా

చారి, మరల రాజేంద్రప్రసాదు, అనే క్రమముగా ప్రెసిడెంట్లుగా నుండిరి. ఇక సెక్రటరీలుగానుండి ఆ కష్టసమయములో పనిచేసినవారిలో జయప్రకాశ నారాయణ్, లాల్ జీ మెహురోత్ర, కృపాలిని, ఆనందచౌదరి, జుగుల్ కిషోర్ అగరువాలా పేర్కొనవచ్చును.

౧౯౩౩ వ సం.రపు చరిత్ర క్లుప్తముగా చెప్పెదను. దీనిలో కలకత్తాలో జరిగిన కాంగ్రెసుమహాసభ ప్రధానమైనది. ఈ కాంగ్రెసుకధయున్నూ, సెప్టెంబరువరకు జరిగిన చరిత్రయున్నూ ౧౯౩౩-౩౪ కు కాంగ్రెసు సెక్రటరీ వ్రాసిన నివేదికలో పూసగ్రుచ్చినట్లు చెప్పబడినవి. వానినుండి యీదిగువ అంశములు గైకొనబడినవి.

## కలకత్తా కాంగ్రెసు

ఈ కాంగ్రెసు ౩౨ వ సం.రం ఏప్రిపియలులో జరిగిన ఢిల్లీ కాంగ్రెసువలెనే గవర్నమెంటు ఆంక్షక్రింద జరిగినది. శాసనోల్లంఘనము తగ్గిపోవుచున్న రోజులలో ఈసభ యేర్పరచబడినను ప్రజలు చూపిన వుత్సాహము, నిరోధకశక్తి గత సభలో చూపినదానికంటే హెచ్చుగా నుండెను. చాలారాష్ట్రములు తమవంతు ప్రతినిధుల సంఖ్యను సంపూర్ణముగా పంపెను. అన్నిరాష్ట్రముల మొత్తముమీద ౨,౨౧౦ మంది ప్రతినిధులు ఎన్నుకొనబడిరి. ఈసభకు మాలవ్యాగారు అగ్రాసనాధిపత్యము వహించుటకు అంగీకరించుటవల్ల ప్రజల వుత్సాహము హెచ్చెను. మోతీలాల్ నెహ్రూగారి సతి వృద్ధురాలు అయ్యు, అనారోగ్యముగానుండియు ఈకాంగ్రెసుకు రాదలచినందువల్ల ప్రతినిధులకు అమితోత్సాహముకలిగెను. మార్చి ౩౧ వ తేదీని ఈ మహాసభ కలకత్తాలో వుత్సాహపూరితమైన వాతావరణలో జరిగెను. డాక్టరు ప్రఫుల్లఘోషుగారు ఆహ్వానసంఘాధ్యక్షులుగా నుండిరి. ఈ కాంగ్రెసు జరుగకుండాచేయవలె నని గవర్నమెంటువారు పడనిపాటులేదు. మాలవ్యాగారిని కలకత్తాకురానివ్వలేదు. మధ్యత్రోవలో అసన్ సోల్ రైలుస్టేషనువద్ద వారిని అరెస్టుచేసిరి. వారితో వచ్చుచున్న మోతీలాల్ నెహ్రూ సతిని, డాక్టరు సయ్యద్ మహమ్మదునూ మరి యితరులను కూడ అరెస్టుచేసి అసన్ సోల్ జైలుకు తీసుకొనిపోయిరి. ఈసభకు వచ్చుచున్న ఆక్టింగు ప్రెసిడెంటు అనేగారిని కూడ మధ్యత్రోవలో పట్టుకొని జైలులో వేసిరి. ఆహ్వానసంఘసభ్యులను, ఉద్యోగులను అరెస్టులోనుంచిరి. కలకత్తాలో అనేకమంది కాంగ్రెసు నాయకులకు నిషేధపుటుత్తర్వుల నిచ్చిరి. వారిలో ముఖ్యులు సేన్ గుప్తగారిభార్య, డాక్టరు మహమ్మదు ఆలం. దాదాపు వెయ్యిమందిప్రతినిధులను ఆయా రాష్ట్రములలో బయలుదేరుచుండగనో, లేక మధ్యత్రోవలోనో పట్టుకొనిరి. మిగతావార్లు కలకత్తాకు చేరగలిగిరి. గవర్నమెంటు నిషేధపుటుత్తర్వు అటుండగనే షుమారు ౧౦౦౦ మంది

ప్రతినిధులు నిర్ణయింపబడిన సభాస్థలములో సమావేశమైరి. తత్క్షణమే పోలీసులు వారి మీదపడి, శాంతముగా కూర్చున్న వారిమీద లాఠీలవర్షము కురిపించిరి. చాలమంది ప్రతినిధులకు తీవ్రమైన దెబ్బలుతగిలెను. సేన్‌గుప్తాగారి భార్యను యితర కాంగ్రెసు నాయకులను అరెస్టుచేసిరి. బలవంతముగా సభను ఆపవలెనని పోలీసులుచేసిన యత్నము నిష్ఫలమయ్యెను. ఏలననగా లాఠీదెబ్బలు వర్షించుచున్ననూ లోపలవరుసలలో నున్నవారు తమచోటులలోనే కదలక కూర్చొని, చేయదలచుకొన్న యేడు తీర్మానములను చదివి ప్యాసుచేసేవరకు కదలలేదు. ఈ సందర్భమున అరెస్టుచేసినవారిలో చాలామందిని సభ అయిపోగానే వదలిపెట్టిరి. కొందరిని విచారించి శిక్షించిరి. సేన్‌గుప్తాగారి భార్యకు ౬ నెలలు శిక్షలభించెను. ఏప్రియల్ 3 వ తేదీని మాలవ్యాగారిని అసన్‌సోల్ జైలునుండి వదలిపెట్టిరి. వారు కలకత్తాకు వెళ్లి పోలీసులు కాంగ్రెసు సభను యెంతఘోరముగా చెదరగొట్టినది తిరుగులేని సాక్ష్యముతో దేశమునకు ప్రకటించిరి. దీనికి విచారణపెట్టవలసినదని మాలవ్యాగారు గవర్నమెంటుకు సవాలుచేసిరి. సవాలుకు జవాబు లేదు.

౧౯౩౩ వ సం.రం మార్చి ౩౧ వ తారీఖున కలకత్తాలో సమావేశమైన ౪౭ వ కాంగ్రెసుమహాసభ చేసిన తీర్మానములు :

## ౧. స్వాతంత్ర్యాదర్శ తీర్మానము

౧౯౨౯ లో లాహోరులో ౪౪ వ కాంగ్రెసు ప్యాసుచేసిన సంపూర్ణస్వాతంత్ర్యాదర్శమును ఈసభవారు మరల నొక్క ప్రకటించుచున్నారు.

## ౨. శాసనోల్లంఘనము న్యాయసమ్మతాస్త్రము

శాసనోల్లంఘనము ప్రజలహక్కులను సంరక్షించుటకు మిక్కిలి న్యాయమైన సాధనమని ఈసభవారు అభిప్రాయపడుచున్నారు. జాతియొక్క ఆత్మగౌరవము నిలువబెట్టుటకున్నూ, జాతియొక్క ఆదర్శము పొందుటకునూ కూడా యిదేసాధనము.

## 3. శాసనోల్లంఘనకార్యక్రమము సాగింపవలెను

3౨ వ సం.రం జనవరి ౧ వ తేదీని వర్కింగుకమిటీవారి తీర్మానము ఈ కాంగ్రెసు బలపరచుచున్నది. గత ౧౫ మాసములనుండి జరిగిన చరిత్రను పరిశీలించి చూడగా ప్రస్తుతస్థితిలో శాసనోల్లంఘన వుద్యమమును బలపరచి విస్తరింపజేయుట అవసర మని ఈసభవారు గట్టిగా నమ్ముచున్నారు. కాబట్టి వర్కింగుకమిటీవారి తీర్మానములో వివరింపబడినరీతిగా వుద్యమమును యెుక్కువదీక్షతో, బలముతో కొనసాగించవలసిన దని ప్రజల నందరిని ఈమహాసభవారు కోరుచున్నారు.

### ౪. బహిష్కారము

దేశములోని అన్ని తరగతులవారు విదేశవస్త్రములను సంపూర్ణముగా బహిష్కరించి ఖద్దరునే వాడవలసిన దనియు, బ్రిటిషువస్తువులను బహిష్కరింపవలసిన దనియు ఈ మహాసభవారు కోరుచున్నారు.

### ౫. శ్వేతపత్రము

మహాత్మాగాంధీగారు లండనునుండి వచ్చినదే తడవుగ జాతీయవుద్యమమును అణచి, జాతిని నిర్వీర్యముచేయుటకై కఠోరమగు నిర్బంధవిధానమును సాగించి, ప్రజానాయకులను, వారి అనుచరులను జైళ్లలో వేసి, జన్మహక్కులగు వాక్ స్వాతంత్ర్యాదులను అరికట్టి, పత్రికల నోళ్లను మూసి, సివిల్‌లా తీసివేసి మార్షల్‌లా పెట్టి నానాహంగామా చేయుచున్న బ్రిటిషుప్రభుత్వమువారు నిర్మించినరాజ్యాంగ ప్రణాళిక భారతదేశప్రజలకు యెంతమాత్రము అంగీకారము కాదనియు, దానిని వారు ఆలోచనకైనను తీసికొనరనియు ఈ కాంగ్రెసుమహాసభవారి అభిప్రాయము. ఇటీవల శ్వేతపత్రములో ప్రచురించిన రాజ్యాంగప్రణాళికనుగూర్చి ప్రజలెవ్వరును మోస పోరని కాంగ్రెసు నమ్ముచున్నది. ఇండియాయొక్క శ్రేయస్సునకు అది విరోధి. ఈ దేశములో పరప్రభుత్వము శాశ్వతముగా పాదుకొల్పుటకు అది వుద్దేశింపబడినది.

### ౬. గాంధిగారి వుపవాసము

౧౯౩౨ వ సం.రం సెప్టెంబరులో గాంధీగారు ప్రారంభించిన వుపవాసము జయప్రదముగా ముగిసినందుకు ఈ మహాసభవారు దేశమును అభినందించుచున్నారు. అంటరానితన మనునది అచిరకాలములో రూపుమాయుననియు ఈసభవారు ఆశించు చున్నారు.

### ౭. ప్రాథమికహక్కులు

కాంగ్రెసువారు సంకల్పించిన స్వరాజ్య మన నేదియో ప్రజాసామాన్యము బాగుగా తెలిసికొనుటకుగాను ప్రజలకందరకును తేలికగా తెలియునట్లు వివరించుట అవసరము. ఈ వుద్దేశ్యముతో ౧౯౩౧ లో కరాచీ కాంగ్రెసులో చేయబడిన ౧౪ వ తీర్మానమును (ప్రాథమిక హక్కులనుగూర్చిన తీర్మానమును) ఈ సభవారు మరల నొక్కి వక్కాణించుచున్నారు.

### గాంధిగారి వుపవాసము

కలకత్తా కాంగ్రెసు అయిన కొద్దిరోజులకే తలవనితలంపుగా దేశములో ఒక విశేషము జరిగెను. హరిజనవుద్యమము సాగించువారిలో యెక్కువ పవిత్రతను సత్య

మగు సేవానురక్తిని పురికొల్పు తలంపుతో గాంధిగారు ౧౯౩౩ సం.రం మే ౮ వ తేదీన ౨౧ దినముల ఆత్మపారిశుద్ధ్య వుపవాసము ప్రారంభించిరి. ఈ వుపవాసమును గూర్చి గాంధిగారు యిట్లు చెప్పిరి. "హరిజనవుద్యమ సందర్భమున నాకును నాతోడి వారికిని యెక్కువ జాగరూకతా, పారిశుధ్యమూ కలుగుటకై నాహృదయావేదనను, ప్రార్థనపూర్వకముగా వెల్లడించుటయే ఈ వుపవాసముయొక్క సంకల్ప" మని ఆయన చెప్పెను. "అందుకొరకే నేను ఈ దీక్షలోనుండి సురక్షితముగా బయటపడ వలె ననియు, ఈ దీక్షలో నేను చచ్చినను, బ్రతికిననూ ఈ దీక్షను ప్రేరేపించిన సంకల్పము కొనసాగవలెననియు ఇండియాలోను ఇతర దేశములలోను గల నా మిత్రు లందరును ప్రార్థనచేయవలసినదని కోరినాను. ఈ వుపవాసముయొక్క ఫలితము నాకు యెట్లున్ననూ "సత్యము మరుసపరచిన ఆ బంగారుమూత తెరువబడుగాక" యని నాసనాతనమిత్రులు ప్రార్థించవలసినదని కోరుచున్నాను." ఒక పత్రికాప్రతినిధితో గాంధిగారు యిట్లు చెప్పిరి. "మతసంబంధమైన యేవుద్యమముగాని, ఆవుద్యమస్థాప కుల తెలివితేటలమీదగాని, భౌతికసాధనములమీదగాని ఆధారపడియుండదు. కేవలము ఆధ్యాత్మికశక్తిమీదనే ఆధారపడియుండును. ఆధ్యాత్మికశక్తికి బలము నిచ్చునది వుపవాస మని అందరికిని తెలిసిన విషయమే."

ఈ వుపవాసమునకు చెప్పబడిన కారణమునుబట్టిన్నీ, గాంధిగారు ప్రకటించిన మనోభావమునుబట్టిన్నీ గాంధిగారిని వెంటనే వదలిపెట్టుచున్నా మని గవర్నమెంటు వారు ఆరోజుననే ఒకప్రకటన చేసిరి. ఆరోజుసాయంత్రమే ఆయనను వదలివేసిరి. విడుదల ఐనతక్షణమే గాంధిగారొక ప్రకటనచేసిరి. దానిలో ఇక ఆరువారములలో శాసనోల్లంఘన వుద్యమమును నిలుపుదలచేయుచున్నామని ప్రకటించిరి. గాంధిగారు చెప్పినమాట లివి: "ఈనావిడుదలను ఒక సంతోషకార్యముగా నే నెంచను. నిన్న పటేలుగారు చెప్పినట్లు ఈవిడుదలను ఆధారముచేసికొని శాసనోల్లంఘన వుద్యమ మును నే నెట్లు నడుపగలను? కాబట్టి ఈవిడుదల నాకు భారమైనది. సత్యాన్వేషియు, ఆత్మగౌరవముగలవాడును అగు నామీద యిప్పుడొక పెద్దభారము పడినది. ఈవుప వాసము యెట్లునూ సాగించి తీరవలసినదే. ఏవిషయములోగాని నేను వుద్రేకపడ రాదు. ఎట్టి సంబంధమైన చర్యలలోను నేను పాల్గొనరాదు. ఇతరవిషయములను గురించి అనగా హరిజనోద్యమములనుగాక యితరవిషయమునుగురించిన యోచనలు నామనస్సులోనికి రానిచ్చినయెడల అసలు యీ వుపవాసముయొక్క సంకల్పమే భగ్నమగును.

"అయితే నేను యిప్పుడు విడుదలఅయినాను గనుక శాసనోల్లంఘనమునుగురించి కొంత అయినను నాశక్తిని వినియోగించక తప్పదు. అయితే యిప్పటికి యింత

మాత్రము చెప్పగలను. శాసనోల్లంఘనమునుగురించి నా అభిప్రాయ మేమియుమారలేదు. ఇందు పాల్గొనిన అసంఖ్యాకులు చూపిన ధైర్యసాహసములకు, స్వార్థత్యాగమునకు వారిని నిస్సంకోచముగా అభినందించుచున్నాను. అయితే దానితోపాటు యింకొక విషయముకూడ నేను చెప్పవలసియున్నది. ఈ వుద్యమములో ప్రవేశించిన రహస్యపు పనులే ఈ వుద్యమవిజయమునకు నాశకారణమైనవి. కాబట్టి ఈ వుద్యమము కొనసాగించేయెడల రహస్యపుపనులు మానివేయవలసిన దని అందరికిని మనవిచేయుచున్నాను. ఇందువల్ల శాసనోల్లంఘనము చేయుటకు ఒక్కడుకూడా రాకపోయిననూ ఫరవాలేదు. ప్రజాసామాన్యము బెదరె నమటలో సంశయము లేదు. ఆర్డినెన్సులు ప్రజలను అణచిపెట్టినవి. ఈనిరుత్సాహమునకు మనవారు అవలంబించినరహస్యపద్ధతియేకారణమని నా అభిప్రాయము. ఈ వుద్యమతత్వము యేమనగా దీనిలోనికి యెంతమందివచ్చినారనికాదు ప్రశ్న. ఎట్టి గుణములుగలవారు వచ్చినారనునది ప్రధానవిషయము. నేను ఈవుద్యమము నడుపుచున్నయెడల మందికంటెగుణమును యెక్కువగా కోరుదును. ఈ గుణము లభించేయెడల వుద్యమప్రభావము తక్షణమే పైకి లేచును. ప్రజాసమూహము మీద పనిచేయుచున్నప్పుడు యిది తప్ప వేరుమార్గము లేదు. ఇక ఉద్యమము నడిపించు విషయమై నేను యేమియు చెప్పజాలను. ఈ అభిప్రాయములను నేను యిన్నాళ్లనుండియు నా మనస్సులో బంధించియుంచితిని. వీనినిగురించి సర్దారు వల్లభాయిగారు సంపూర్ణముగా యేకీభవించుచున్నారు.

"నాకు యిష్ట మున్ననూ లేకపోయిననూ యింకొకమాట చెప్పెదను. ఈ మూడువారములలో శాసనోల్లంఘనము చేయువారి అందరిమనస్సులు చాల ఆతురతతోనుండును. కాబట్టి కాంగ్రెసు ప్రెసిడెంటు అనేగారు వుద్యమము ఒక నెలవరకు గాని, లేక ఆరువారములవరకుగాని ఆపుదలచేస్తూ ఒక ప్రకటనచేస్తే బాగుంటుందని నా అభిప్రాయము.

"ఇక గవర్నమెంటుకు ఒక మనవిచేసెదను. దేశములో నిజమైన శాంతిని వారు కోరేయెడల, ఇప్పుడు దేశములో నిజమైన శాంతి లేదని వారు తలచేయెడల, ఆర్డినెన్సు పరిపాలన నిజమైన పరిపాలన కాదని వారికి తోచేయెడల వారీ అవకాశము తీసికొని ఖైదీలనందరిని యెట్టిషరతులును కోరకుండ వదలిపెట్టవలెను.

"ఈ వుపవాసములోనుంచి నేను బయటపడేయెడల దేశస్థితిని సమగ్రముగా పరిపాలించుటకు నాకవకాశము కలుగును. కాంగ్రెసునాయకులకు,గవర్నమెంటుకును కూడా సలహాచెప్పుట కవకాశము కలుగును. నేను యింగ్లండునుండి వచ్చినపిమ్మట యెక్కడైతే కథ తెగిపోయినదో అక్కడనుండి మరల యెత్తుకొందును.

"నాప్రయత్నమువల్ల కాంగ్రెసుకు, గవర్నమెంటుకు సంధికుదరక శాసనోల్లంఘనము తిరిగి ప్రారంభమైన యెడల గవర్నమెంటువారు తిరిగిఆర్డినెన్సురూలునుసాగింపవచ్చును. గవర్నమెంటుకు సంధిచేసికొనవలెనని సంకల్పముంటే దానికేదోమార్గము దొరకకపోదు. అందువిషయమై నాకు సందియము లేదు.

"చాలమంది జైళ్లలోనుండగా శాసనోల్లంఘనము విరమింపబడదు. సర్దారు వల్లభాయి, ఖాన్‌సాహెబు అబ్దుల్‌గఫూరుఖాన్, పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ మున్నగువారు బ్రతికియుండగనే పూడ్చబడినప్పుడు శాసనోల్లంఘనము మానివేయబడజాలదు.

"శాసనోల్లంఘనము మానివేయుటకు జైలుబయటవున్నవారి కెవ్వరికీ అధికారములేదు. నేను అరెస్టుఅయినప్పుడు వున్న వర్కింగుకమిటీయే ఆపని చేయగలిగినది. ఇక శాసనోల్లంఘనమునుగురించి యెక్కువ చెప్పను. ఇప్పటికే చాలా హెచ్చు చెప్పినాననుకొంటాను. అయితే నేను చెప్పదలచుకున్నది నావంటిలో శక్తివుండగానే చెప్పవలసియున్నది గనుక చెప్పినాను.

"పత్రికావిలేఖకులు నన్నిక నేమియు బాధింపకుందురుగాక. నన్ను చూడదలచుకున్నవారు యిక్కడికి రాకుండా ఓపికపట్టవలసినదని మరల కోరుచున్నాను. నేను యింకా జైలులోనే వున్నాననుకోండి. రాజకీయ చర్చలకుగాని, మరియే చర్చలకుగాని నాకు వోపికలేదు. నన్ను యెవరు యేమి మాట్లాడించకుండాయుండండి. నాకు సంపూర్ణమైన శాంతికావలెను. ఈ విడుదలను దుర్వినియోగపరచనని గవర్నమెంటుకు మనవి చేయుచున్నాను. ఈదీక్షలోనుంచి సురక్షితముగా బయటపడిన పిమ్మట రాజకీయ వ్యవహారములు యింకను యిట్లే అంధకారముగా నున్నయెడల నేను శాసనోల్లంఘన వుద్యమమును రహస్యముగాగాని,బహిరంగముగాగాని నడిపించుటకు నన్నేమియు చేయనీయకుండా యథాప్రకారముగా తీసికొనివెళ్లి యరవాడజైలులో వున్న నామిత్రులతో కలపవలసినదని గవర్నమెంటును కోరెదను. జైలులో నామిత్రులను వదలిపెట్టి వచ్చితినేమో యని నేను అనుకొనుచున్నాను.

"సర్దార్ వల్లభాయిపటేలుగారితో కలసివుండుట నాకొక భాగ్యముగానుండెను. సాటిలేని పరాక్రమము, దేశముయెడ తీవ్రప్రేమజ్వాల వారికి గలవని నేను యెరుగుదును. కాని వారితో నేనుయిన్నాళ్లుకలసి కాపురముండలేదు. అట్టిభాగ్యమునాకు గత ౧౬ మాసములనుండి కలిగినది. ఆయన నాయెడచూపిన వాత్సల్యము మాఅమ్మగారిని జ్ఞాపకము చేయుచున్నది. పటేలుగారియందు మాతృవాత్సల్యమున్నదని నే నిదివరకెరుగను. నాకు యేమాత్రము బాధకలిగినను ఆయన చివాలున పడకమీదనుండి లేచివచ్చెడి

వాడు. నాసౌఖ్యమునకు కావలసిన ప్రతిచిన్న అంశమును ఆయన స్వయముగా అజమా యిషీ చేసేవాడు. ఆయనయు, యితరమిత్రులున్నూ కుట్రచేసి నన్నుయేమియు చెయ్య నిచ్చెడివారుకారు. ఏవైన రాజకీయసమస్యలను మేము చర్చించుచున్నప్పుడు గవర్న మెంటుకు వుండే కష్టనిష్ఠురములను పాపము ఆయన యెంతో సానుభూతితో చెప్పు చుండేవాడు. ఇది నిజమని గవర్నమెంటుకు నమ్మబలుకుచున్నాను. బార్డోలీ, కైరా రైతులయెడల ఆయనకు గలప్రేమను నేను యెన్నడును మరువజాలను."

గాంధీగారు యీ ప్రచురణచేసి చెయ్యడముతోటే శాసనోల్లంఘనము ఆరు వారములకు ఆపుదలచేయుచూ ఆనేగారుకూడ కాంగ్రెసు ప్రెసిడెంటు హోదాలో ఒక ప్రకటనచేసిరి. గవర్నమెంటువారుకూడ ఆలస్యము చేయకుండా తమ జవాబును ప్రకటించిరి.

రాజకీయఖైదీలను విడిచిపెట్టుటకు శాసనోల్లంఘనము తాత్కాలికముగా ఆపి నాము అనుమాట చాలదని గవర్నమెంటువారు ప్రచురించిరి. ఈవిషయములో కాం గ్రెసుతో రాజీకి దిగుటకున్నూ సంసిద్ధముగా లేమని గవర్నమెంటువారు అనిరి. ఇం డియాగవర్నమెంటువారు మే ౯ వ తేదీన సిమ్లానుండి యీదిగువ ప్రకటనలను చేసిరి:

"గాంధిగారిని విడిచిపెట్టినామంటే శాసనోల్లంఘనఖైదీలను విడిచిపెట్టు విష యమై గవర్నమెంటుపద్ధతిలో మార్పు కలిగెనని ఎవరును అనుకొనకూడదు. ఆయన గవర్నమెంటుతో యెంతమాత్రమూ సంబంధము లేకుండా కేవలము హరిజనోద్యమము కోసరమే, దీర్ఘవుపవాసము ప్రారంభించు చున్నానని చెప్పినాడు గనుక వదలిపెట్టి నాము. ఖైదీలను వదిలిపెట్టువిషయములో గవర్నమెంటుయొక్క అభిప్రాయములను గతనెల యేప్రియల్ ౧ వ తేదీన శాసనసభలో మాహోమ్‌మెంబరు చెప్పనేచెప్పెను. ఆమాట లివి: 'నిజముగ శాసనోల్లంఘనమును కాంగ్రెసువారు తిరిగి లేవనెత్తదలచు కొనకపోతే ఆసంగతి స్పష్టముగా యెందుకు చెప్పరాదు ? ఖైదీలను వదిలిపెట్టిన తరు వాత గవర్నమెంటుపరతులు కాంగ్రెసుకు యిష్టము లేకపోతే మళ్లా మానెత్తిమీదికి శాసనోల్లంఘనము తెచ్చిపెడుదామని కాంగ్రెసుమనస్సులో యేమైన వుద్దేశ్యము దాగియున్నదా యేమి ? శాసనోల్లంఘనము మళ్లా ప్రారంభిస్తామనే బెదిరింపు వున్నంతకాలము కాంగ్రెసుకు మాకు రాజీలేదు.'

"అనవసరముగా దీర్ఘకాలము ఈఖైదీలను వుంచుకోవలెననిమాకులేదు. అయితే వీళ్లను వదిలిపెడితే మళ్లీ శాసనోల్లంఘనము సాగిస్తారనే భయమువున్నంతసేపు మేము వాళ్లను వదలిపెట్టదలచుకోలేదు. తొందరపడి వీళ్లను వదలిపెట్టి మళ్లా కొంపమీదికి

తెచ్చుకోదలచుకోలేదు. గవర్నమెంటు స్థితినిసరించి పార్లమెంటు సభలో యిండియా మంత్రిగారే యిట్లు జెప్పిరి. 'ఖైదీలను వదలి పెడితే వుద్యమము మళ్లా రాదని మాకు గట్టినమ్మకము కలగాలి.'

"కేవలము తాత్కాలికముగా వుద్యమము ఆపినామంటే చాలదు. శాసనోల్లంఘన వుద్యమము విరమించుటకుగాని, శాసనవిరుద్ధమను చర్యలను మానువిషయమైగాని రాజీకి దిగు తలంపు మాకు లేదు."

"గవర్నమెంటువారు యిచ్చిన యీ అభావపు జవాబు వచ్చినసమయమందే వియన్నానుండి విఠల్ బాయిపటేలు, సుభాసుచంద్రబోసుగార్ల వుత్తరమున్నూ వచ్చినది. శాసనోల్లంఘనము ఆపుదలచేయుటలో గాంధిగారు చేసిన పని బాగుండలేదు. అది వోటమిని ఒప్పుకొన్నట్లు అగును.*

"మరియు వా రిట్లువ్రాసిరి : 'రాజకీయనాయకులుగా గాంధిగారు అపజయము పొందినారు. ఆయన యిక పనికిరాడు. కాంగ్రెసును కొత్తసిద్ధాంతములమీద కొత్త పద్ధతిని తీవ్రముగా మార్చి పునర్నిర్మాణము కావింపవలసిన తరుణము వచ్చినది. దీనికి కొత్తనాయకుడు కావలెను. జీవితమంతా ఆయన స్వంతపద్ధతులతో పనిచేసిన గాంధిగారిని యీ కొత్తపద్ధతిని నడిపించవలసినదని కోరుట న్యాయము కాదు. కాంగ్రెసు యావత్తు యిట్టి మార్పును పొందేయెడల చాలా ప్రశస్తముగాయుండును. ఒకవేళ కాంగ్రెసు అంతా కొత్తపద్ధతికి మారనియెడల కాంగ్రెసులోనే తీవ్రవాదు లందరును కలసి ఒకపార్టీని నిర్మించవలెను'

"గాంధిగారి విడుదలవల్ల కలిగిన అవకాశమును పురస్కరించుకొని కాంగ్రెసు నాయకులందరును ఒకచోట సమావేశమై దేశస్థితిని ఒక్కసారి సింహావలోకనముచేసి చూచుట మంచిదను అభిప్రాయము కాంగ్రెసువారిలో గట్టిగా కలిగెను. ఇట్టి సమావేశము గాంధిగారికి బాగా కులాసా చిక్కినతరువాత చేస్తే బాగుంటుందను తలంపుతో కాంగ్రెసు ప్రెసిడెంటుగారు వుద్యమమును మరియొక ఆరువారములు వాయిదా పొడిగించిరి. ఉపవాసము దీర్ఘమైనది. ముందు స్థితిగతులు యెట్లుండబోవునో యెవరికిని గోచరించుటలేదు. ఇట్టి సందిగ్ధసమయములో దేశముయొక్క

---

* ఈ యిద్దరినుండి వ్యతిరేకవిమర్శన వచ్చినది యిదే మొదటిసారి కాదు. వీ రిరువురును ఈ వుద్యమసమయములో అనారోగ్యమువల్ల దూర దేశములో వుండవలసివచ్చెను. తన స్వంత కష్టములతోపాటు గాంధిగారు ప్రపంచములో అందరి వ్యతిరేక విమర్శనలను వోపికతో, ధైర్యముతో, ఆత్మవిశ్వాసముతో భరించిరి. గాంధిగారు తమ దీక్షను జయప్రదముగా ముగించి మే ౨౯వ తేదీన పారణచేసిరి.

కండ్లన్నియు పునహాలో గాంధిగారు వుపవాసముచేయుచున్న "శాకర్ సే" దొరసాని గారి "పర్ణకుటి"మీదనే వ్రాలియుండెను. గాంధిగారు దీక్షను ముగించి ప్రాశన చేసి నప్పుడు దేశమంతయు పరమేశ్వరునకు చేతులెత్తి మ్రొక్కిరి. ఎట్టి అవాంతరముకలుగ కుండా తీవ్రమైన చివరరోజులుకూడా గడచి వ్రతము సవ్యముగా వుద్యాపన అయి నందుకు లోకమంతయూ సంతసించెను.

పూనాసభ:—దేశముయొక్క రాజకీయపరిస్థితి సింహావలోకనము చేయుటకు కాంగ్రెసునాయకుల సమావేశము ౧౯౩౩ వ సం.రం జులై ౧౨ వ తేదీన పునహాలో జరిగెను. ఆనేగారు చిన్నవుపన్యాసముతో సభ ఉపక్రమించిరి. గాంధిగారు తమఅభి ప్రాయమును క్లుప్తముగా సభవారికి చెప్పిరి. చర్చజరిగెను. సభ రెండవనాటికి వాయిదా వేయబడెను. మొదటిరోజున జరిగిన చర్చల సారాంశమునంతా ఆమూలాగ్రముగ వివ రించుచూ తనసూచననుగూడ బొందుపరచుచూ గాంధిగారు తనస్టేటుమెంటును యిచ్చిరి. సభవారు కొన్నిసూచనలు చేసిరి. శాసనోల్లంఘనము యెట్టి షరతులు లేకుండ విరమింపబడవలెనను తీర్మానము ఓడిపోయెను. వ్యక్తిశాసనోల్లంఘన తీర్మా నము కూడ వోడిపోయెను. తుదకు గవర్నమెంటుతో రాజీపడుటకు గాంధిగారు వైస్రా యిని దర్శించవలెనని సభ అనుమతించెను. గాంధిగారంతట వైస్రాయికి టెలిగ్రామి చ్చెను. శాంతికి అవకాశము లేమైనా వున్నవేమో పరిశీలించు నిమిత్తమై తమ దర్శన ముకావలెనని గాంధిగారు ఆటెలిగ్రాములో వైస్రాయిని కోరిరి. శాసనోల్లంఘనము ముందుగా వుపసంహరించినగాని తనను చూచుటకు అంగీకరింపజాలనని వైస్రాయి జవాబు పంపెను. అందుకుబదులుగా ఈసభలో జరిగిన విషయములను గురించి సరి యైన సంగతులు పత్రికలలో పడలేదనియు, అట్టివానిని ఆధారము చేసికొని నాకు దర్శనము నిరాకరించుట సరికాదనియు, తన్ను రానిచ్చినచో గౌరవప్రదమగు సంధికీ సభలో చర్చజరిగెనని తాను రుజువుపరచెదనియు గాంధిగారు మరల వ్రాసిరి. కాని ప్రయోజనము లేకపోయెను. కాబట్టి జాతిగౌరవము నిలువవలెనన్నయెడల వుద్య మము సాగించుటతప్ప వేరుమార్గము కనబడలేదు. అంతట సమష్టి శాసనోల్లంఘనము ఆపి వ్యక్తిశాసనోల్లంఘనము ప్రకటింపబడెను. సమష్టిశాసనోల్లంఘనము ఆపబడెను గాన కాంగ్రెసుసంస్థలు, వార్ కౌన్సిళ్లు విరమింపబడెను.

వ్యక్తిశాసనోల్లంఘనము:—గాంధిగారు తనకు ప్రియమైన సబర్మతి ఆశ్రమ మును రద్దుపరచిరి. దీనివుద్దేశ్యమేమనగా యీవుద్యమములో వేలకొలది గ్రామస్థులు నానాబాధలుపడి, యిండ్లువాకిళ్లు పోగొట్టుకొనినప్పుడు తనకుమాత్రము ఈ ఆశ్రమ మెందుకని ఆయన దానినికూడ ఆహుతిచేసెను. ఆశ్రమములోని యావన్మందినీ అన్ని పనులూకట్టిపెట్టి వుద్యమములోనికి రమ్మనెను. ఆశ్రమములోని చరాస్తినంతను యితర

ప్రజాసంస్థలకు యిచ్చివేసి ఆశ్రమము ఖాళీచేసెను. ఈఆశ్రమమును యితరుల కెవ్వరి కైన యిచ్చినయెడల దానిపై శిస్తును గవర్నమెంటుకు యిత్తురను తలంపుతో అభూమిని, అందలి బిల్డింగులను, నిలువపంటను గవర్నమెంటే తీసికొనవలెనని గాంధీగారు కోరిరి. కాని గవర్నమెంటువారేమియు జవాబుచెప్పలేదు. అందువల్ల ఆశ్రమమునంతను గాంధీగారు హరిజనోద్యమమునకు యిచ్చివేసిరి. దండీయాత్ర సమయమున స్వరాజ్యము వచ్చువరకును ఆ ఆశ్రమమునకు రానని గాంధిగారు శపథముచేసిన సంగతి చదువరులకు జ్ఞాపక ముండవచ్చును. ఆరోజునుండి ఆయన ఆశ్రమమునకు రాలేదు. ఒకసారిమాత్రము జబ్బుగానున్న ఒకస్నేహితుని జూచుటకు పరాయిమనిషివలె వచ్చెను. ఆశ్రమమును హరిజనసంఘమునకు యిచ్చివేయుటతో యిహలోకముతో తనకుగల ఆఖరుసంబంధముకూడ ఆయన తెంచివేసికొనెను. తనను యింక యీలోకమునకు అంటిపెట్టునది యేది?

"౧౯౩౩ వ సం. ఆగస్టు ౧ వ తేదీన గాంధీగారు రాస్ అను గ్రామమునకు యాత్ర బయలుదేరవలసియుండెను. ౧౯౩౦ సం.రం ఫిబ్రవరినెలలో వల్లభాయి పటేలుగారు అచ్చటనే అరెస్టు అయిరి. అప్పటినుండియు ఆగ్రామము యిండియా నంతటను ప్రఖ్యాతిగాంచెను. కాని గాంధిగారిక తెల్లవారి యాత్రసాగింతురనగా, ఆ రాత్రి రెండుజాములకే గాంధిగారిని, ౩౪ మంది ఆశ్రమవాసులను అరెస్టుచేసి జైలుకు పంపిరి. ౪ వ తేదీ వుదయమున ఆయనను వదలివేసి యరవాడగ్రామమువదలి పూనాలో వుండవలసినదని ఆయనమీద వుత్తర్వు జారీచేసిరి. ఈవుత్తరువును గాంధిగారు వుల్లంఘించి రని వేరుగ చెప్పనక్కరలేదు. కాబట్టి వదలిపెట్టిన అరగంటకే గాంధిగారిని మరల పట్టుకొని ౧ సం.రం శిక్షవేసిరి.

"గాంధిగారిశిక్షతోపాటు వ్యక్తిశాసనోల్లంఘనము అన్నిరాష్ట్రములలోను ప్రారంభమయ్యెను. మొదటివారములోనే వందలకొలది జైలుకు పోవసంసిద్ధులైరి. అక్టింగు ప్రెసిడెంటుగారైన ఆనేగారు ఆగస్టు ౧౪ వ తేదీన పదముగ్గురతో కలసి అకోలానుండి యాత్రసాగించునప్పుడు అరెస్టుచేయబడెను. ఆయనతరువాతవచ్చిన ప్రెసిడెంటు శార్దూలసింగుగారుకూడ వెంటనే జైలుకు నడచిరి. అయితే జైలుకు వెళ్లకపూర్వము ఆయన ఒకపనిని చేసెను. అక్టింగు ప్రెసిడెంటుహోదాలను, డిక్టేటరు హోదాలను రద్దుపరచెను. ఉద్యమమును నిజముగా వ్యక్తిశాసనోల్లంఘనము చేయుటయే ఆయనవుద్దేశ్యము. గాంధిగారు చూపిన మార్గమును దేశమందు అనేకమంది కాంగ్రెసువారు అనుసరించిరి. ౧౯౩౧ ఆగస్టుమొదలు ౧౯౩౪ మార్చివరకును వ్యక్తులు యెడతెగకుండ వుద్యమమును సాగించిరి. అన్నిరాష్ట్రములనుండీ రిపోర్టు తెప్పించిన గాని

యేరాష్ట్రములో యెంతపని జరిగినదీ పూర్తిగా చెప్పుటకు సాధ్యపడదు. చివరిరోజులలో యెంతమంది జైళ్లకు వెళ్లినదీ రికార్డులేదు. వేలకొలదిమంది అప్పటిపరిస్థితులలో శాయశక్తుల పనిచేసి స్వాతంత్ర్యోద్యమమును నడపిరని చెప్పిన యిచ్చట చాలును.

గాంధిగారి విడుదల:— జైలులో హరిజనపత్రికను నడపుటకై లోగడ యిచ్చిన అవకాశములను గవర్నమెంటువారు ఈపర్యాయము యివ్వుటకు నిరాకరించినందువల్ల గాంధిగారు తిరిగి వుపవాసము ప్రారంభింపవలసివచ్చెను. జైలులో పెట్టిన కొద్దిరోజులకే యీస్థితి యేర్పడెను. గవర్నమెంటు బిర్రబిగిసియుండెను. గాంధిగారిస్థితి నానాట క్షీణించుచుండెను. అయిదవ రోజు, అనగా ఆగష్టు ౨౦ వ తేదీని ఖైదీగానే ఆయనను పునహా అస్పత్రికి తీసుకు వెళ్లిరి. ౨౩-వ తారీఖు నాటికి ఆయనప్రాణమునకే మోసము వచ్చునట్లు కనబడెను. అంతట ఆయనను యెట్టిషరతులునులేకుండ వదలివేసిరి. తలవనితలంపుగా కలిగిన యీవిడుదలవల్ల యేమిచేయవలెనో గాంధిగారికి తోచలేదు. అరెస్టుచేయుట, వుపవాసముండుట, దానిమీద విడుదలయగుట అను నీచమగు యీపిల్లి యెలుక చెలగాటమునకు గాంధిగారు యిష్టపడరైరి. గవర్నమెంటు తనను వదలిపెట్టినను తానింకను జైలులోనే యున్నట్లు భావించుకొనుచూ ఈసంవత్సర శిక్షాకాలము పూర్తి అగువరకును తనపై కొన్ని నిబంధనలను స్వయముగా పెట్టుకొనుటకు గాంధిగారు నిశ్చయించుకొనిరి. ఈలోపుగా, అనగా ౧౯౩౪ సం.రం ఆగష్టు మూడవతారీఖు లోగా తీవ్రమగు యేశాసనోల్లంఘనకార్యమును చేసిగాని జైలుకు పోకూడదనియు ఆయన నిశ్చయించుకొనెను. అయితే యెవరైనా వచ్చి తనను సలహా అడిగేయెడల వారికి తగుసలహాను చెప్పుటకును వుద్యమము తప్పుత్రోవలపోకుండా చూచుచుండుటకునూ అవకాశము ఆయన వుంచుకొనెను. ఈకాలమున యెక్కువగా హరిజనోద్యమమును సాగించుటకై ఆయన పూనుకొనెను.

జవహరలాలు విడుదల:—మోతీలాలు నెహ్రూసతి ఆరోగ్యము నానాటికి క్షీణించుచుండెను. ఈసమయమున ఆమెస్థితి అపాయకరమయ్యెను. కాబట్టి శిక్షాకాలము పూర్తికాకమునుపే కొద్దిరోజులకు ముందుగా జవహరలాల్ నెహ్రూగారిని వదలిపెట్టి ఈ అపాయకరస్థితిలో తన తల్లిగారివద్ద నుండుటకు గవర్నమెంటువారు ఆయనకు అవకాశమివ్వదలచిరి. అందుచే ఆగష్టు ౩౦ వ తేదీన ఆయనను వదలివేసిరి. మోతీలాలునెహ్రూసతి ఆరోగ్యము చక్కబడగానే పునహాలో ఆరోగ్యము కోలుకొనుచున్న గాంధిగారిని చూచుటకై జవహరలాల్ నెహ్రూగారు పునహా వెళ్లిరి. ౧౯౩౧ సం.లో రౌండుటేబిల్ సభకు గాంధిగారిని సాగనంపినప్పుడు చూచిన చూపు. దరిమిలా ౨ యేండ్లకు యిప్పటికి వీరు వుభయులును కలిసికొనిరి. దేశపరిస్థితు

లను గురించియు, దేశములో జరుగవలసిన కార్యక్రమమును గురించియు మిక్కిలి స్నేహపూర్వకమునైన చర్చలు వుభయులమధ్యను జరిగెను. ఈచర్చల సారాంశము వుత్తరప్రత్యుత్తరములుగా రికార్డు అయివున్నది అది దేశ మంతకును తెలియు నిమిత్తమై ప్రచురింపబడెను.

"హరిజనయాత్ర:—తనకు విధించిన శిక్షాకాలము పూర్తి అగుపర్యంతమూ హరిజనోద్ధరణకై పనిచేసెదనని పట్టిన వ్రతము ననుసరించి గాంధిగారు ౧౯౩౩ సం.రం నవంబరునెలలో యిండియా అంతటను చుట్టివచ్చుటకు హరిజనయాత్ర బయలుదేరిరి. ౧౦ నెలలలో ఆయన యిండియా అంతనూ చుట్టివచ్చెను. ప్రతిరోజు అంటరానితనమును గురించిన సమస్యలను పరిష్కరించుటయే ఆయన పనిగా నుండెను. ఈయాత్రవల్ల అసాధారణమగు ప్రచారము జరిగెను. సమావేశమైన జనసమూహమున్నూ, వుత్సాహమున్నూ ౧౯౩౦ సం.రపు రోజులను తల పించుచుండెను. ఈ వుద్యమమునకై ఆయన ఈ యాత్రలో వసూలుచేసిన డబ్బు సుమారు ౮ లక్షల రూపాయలు. ఈ కాలములో దేశమందు ఆర్థికదుస్థితి ప్రబలి యుండెను. జనులు అప్పటికి కొద్దిరోజులక్రిందటనే చాల చందాలను యిచ్చి యుండిరి. అయినప్పటికీ అనుకొన్నదానికంటె యెక్కువసొమ్ము వసూలగుట గొప్ప విశేషము. ఈయాత్రలో రెండు విషాదకరమగు సంగతులు జరిగెను. ౧౯౩౧ సం.రం జూన్ ౨౫ వ తేదీని పునహాలో మహాత్మునకు చావు తప్పెను. పునహా మునిసిపాలిటీ వారి ఆహ్వానపత్రము లందుకొనుసందర్భములో యెవరో ఆయనమీద బాంబువిసరిరి. ఆమనిషి యెవరో యీ రోజువరకును పట్టుపడలేదు. ఆదెబ్బయే తగిలియున్న యెడల దేశమున కెంత అరిష్టమో వాటిల్లెడిది. అంటరానితనము తీసివేయవలెనని గాంధిగారుచేయుచున్న వుద్యమమునకు వ్యగ్రుడైన యెవడో యీపని చేసెనని అను కొనిరి. ఎవరి మోటారుకారునో చూచి అదే గాంధిగారికారు అనుకొని వాడు బాంబు విసరెను. ఈతప్పుగురివల్ల నిరపరాధులగు యేడుగురకు గాయములు తగిలెను, కాని అంత అపాయము చేయలేదు. ఇది అయిన ౧౫ రోజులకే అజమీరులో ఒక సంగతి జరిగెను. ఈపర్యాయము హరిజన అభిమానముగల ఒకఆయన వ్యగ్రుడై విచ క్షణను కోలుపోయి, హరిజనోద్యమమునకు మిక్కిలి వ్యతిరేకుడగు లాల్‌నాథు అను కాశీపండితునితల లాఠీతో రెండు చెక్కలుగ పగులగొట్టెను. ఇందుకు పరిహారముగ గాంధిగారు వారమురోజులు ఉపవాసముచేసిరి. ప్రజాబాహుళ్యమునకు సంబంధించిన విషయముల చర్చలో ఒకరియెడ ఇంకొకరు ఇట్టి అసహనము చూపినందుకు శిక్షగా గాంధిగారు తానే ఏడురోజులు ఉపోషముండెను.

“హరిజనపనినిమిత్తమై గాంధిగారు అఖిలభారత యాత్ర బయలుదేరెను. కాని డిశంబరునెలలో గొప్ప సమస్య ఎదురొ్కనెను. గురువాయూరు దేవస్థానము విషయములో కేళప్పన్‌గారు సదరు దేవస్థానపు ట్రస్టీలకు 3 నెలల నోటీసుయిచ్చియుండెను. ౧౯౩౪ సం.రం జనవరి ఒకటవ తేదీన యేదో ఒకతీర్మానమునకు రావలసియుండెను. బహుశః అది కేళప్పన్‌గారికి, గాంధిగారికికూడా ప్రాయోపవేశమును తెచ్చిపెట్టునేమో కూడాను. అందుకొరకై గురువాయూరు దేవస్థానమునకు పోవువారి వోట్లు తీసికొనుటకు నిశ్చయింపబడెను. ఈ సందర్భములో జరిగిన పని చాల జయప్రదముగా నుండుటయేగాక ప్రజాప్రబోధముగా నుండెను. ఈలోగా డాక్టరు సుబ్బరాయన్‌గారు మదరాసురాజధానిలో దేవాలయప్రవేశబిల్లుకు నోటీసు నిచ్చిరి. ఇందువిషయమై గవర్నమెంటుతీర్పుకు దేశము యెదురుచూచుచుండెను. గురువాయూరు యెన్నికలో నూటికి ౭౭ మంది దేవాలయప్రవేశమునకు అనుకూలురుగా ఓట్లనిచ్చిరి. ఈ క్రింది అంకెలు గమనింపదగియున్నవి. ఓట్లనిచ్చినవారు ౨౦, ౧౬౩ మంది ఓట్లనిచ్చుటకు నిరాకరించినవారి సంఖ్య యిందు చేరలేదు. అనుకూలురు ౧౫,౫౬౩ అనగా ౧౦౦ కి ౭౭. వ్యతిరేకులు ౨,౫౭౯ అనగా ౧౦౦ కి ౧౩. తటస్థులు ౨,౦౧౬ అనగా ౧౦౦ కి ౧౦ మంది ఇందులో గొప్ప విశేషమేమనగా ౮ వేలమంది స్త్రీలు దేవాలయప్రవేశమునకు అనుకూలముగా ఓట్లనిచ్చిరి.

ఇందువల్ల గాంధిగారిప్రాయోపవేశము తప్పిపోయినది గాన దేశము సంతోషించెను. అందుచేత నూతన సంవత్సరము శుభముతో ప్రారంభమయ్యెను. కాని శాసనోల్లంఘనవిషయములో మాత్రము అభివృద్ధి సంతృప్తికరముగా లేకపోయెను. విడుదల అయిన ఖైదీలు అలసిసొలసి యుండిరి. సమష్టి శాసనోల్లంఘనము విరమించినయెడల తాము వ్యక్తిశాసనోల్లంఘనము సాగింతు మని పునహాలో వాగ్దానముచేసిన రాష్ట్రనాయకులు యెవరో కొద్దిమంది తప్ప తమ మాటను సాగించలేదు. జైలునుండి విడుదల అయినవారు మరల జైలుకు పోవుటకు అశక్తులో, లేక అయిష్టులో అయియుండిరి. అందుకు సిద్ధపడినవారికి జైలు దొరకుట లేదు. గవర్నమెంటువారు కాంగ్రెసువారిని జైలులో పెట్టుటకు బదులుగా లాఠీచార్జీ చేసియో, సబుజైళ్లలో హింసించియో వదలిపెట్టుచుండిరి. అరెస్టు చేయుట, వదలిపెట్టుట, మరల అరెస్టు చేయుట, వదలిపెట్టుట సాగించిరి. ఇది వాలంటీర్లకు చాల విసుగుగా నుండెను. శిక్ష వేయుటవల్ల కలుగగల విశ్రాంతి వారికి లేకుండెను. పిల్లి యెలుకను నోటితో పట్టుకొని వదలిపెట్టును. మరల పట్టుకొని మరల వదలిపెట్టును. అది దానిని చంపను చంపదు, వదలిపెట్టను వదలిపెట్టదు.

"బీహారు భూకంపము:—౧౯౩౪ సం.రం జనవరి ౧౬-వ తేదీని పత్రికలు విప్పి చూచేటప్పటికల్ల ఎన్నడు కనివిని యెరుగని భూకంపంవల్ల బీహారురాష్ట్రము దద్దరిల్లి పోయెనను ఘోరవార్త హిందూదేశమంతయు విని దిగ్భ్రాంతిచెందెను. కొన్ని నిమిష ములకాలములో రాష్ట్రముయొక్క స్వరూపమే గుర్తుతెలియకుండా మారిపోయెను. వేలకొలది భవంతులు మట్టిపాలై భూగర్భములో పూడిపోయెను. భూగర్భములోనుండి యిసుక పైకి చిమ్మి విశాలమగు పంటప్రదేశములను పూడ్చివేసెను. భూమి అడుగున ౧౫ వందల అడుగుల లోతునుండి ౧౧౦ డిగ్రీల వేడితో నీరు పైకిచిమ్మెను. నదులన్నియు యిసుకతో పూడిపోయెను. కోట్లకొలది ప్రజలకు అన్నమిచ్చు పంట లన్నియు యిసుకక్రింద పూడిపోయెను. వేలకొలదికుటుంబములు నాశన మయ్యెను. తల్లితండ్రులులేని బిడ్డలు, భర్తలను కోలుపోయినయిల్లాండ్రు, పూడిమిక్రిందపడిచచ్చి బిడ్డలు గల తండ్రులు దేశమున హాహాకారము చేయసాగిరి. ఇది పోయిన అంతయు ఒక్క కనురెప్పపాటులో జరిగెను. ప్రకృతి బీహారురాష్ట్రములో ఒక్కక్షణములో చేసినపనిని వట్టి పొడిఅంకెలేమి వర్ణించగలవు? అయినప్పటికీ కొన్ని అంకెల నిచ్చెదను. ౩౦ వేల చదరపుమైళ్ల విస్తీర్ణములో యీ భూకంపము కలిగెను. ఒక కోటిన్నర ప్రజలకు బాధకలిగెను. ౨౦౦౦౦ మంది చనిపోయినట్లు లెక్కవేయ బడెను. ౧౦౦౦౦౦౦ యిండ్లు కూలిపోయెను. ౬౫౦౦౦ బావులు, చెరువులు పూడి పోయెను. సుమారు పదిలక్షల యెకరముల పంటలు యిసుకక్రింద పడిపోయెను.

"ఇంతఘోరమగు దురవస్థను యెదుర్కొనుటకై బీహారు రాష్ట్రమువారు కాక యావత్తు యిండియా తక్షణమే పూనుకొనెను. ఒకకోటి రూపాయలకు మించి చందాలు వసూలు చేయబడెను. బీహారు సెంట్రల్ రిలీఫ్‌కమిటీవారికి జూన్ ఆఖరుకు చేరిన సొమ్ము యిరువదియేడు లక్షలకు మించెను. ఇండియా అన్ని ప్రాంతముల నుండి నాయకులు, వాలంటీర్లు బీహారుప్రజలకు సహాయము చేయుటకై పరుగెత్తిరి. ౨౫౮ సెంటర్లలో రెండువేలమంది ప్రజలు చేసిన సహాయము కమిటీవారు యిటీవల ప్రచురించిన రిపోర్టువల్ల తెలియగలదు.

"ఇతర రాష్ట్రములనుండి వెళ్లిన నాయకులలో జవహరలాల్ నెహ్రూ గారు ఒకరు. వారు కేవలము సానుభూతి చూపుటకే కాక స్వయముగ సేవ చేయుటకై వెళ్లిరి. ఒకసారి ఒకపడిపోయిన యింటిక్రింద బ్రతికివున్న మనుష్యు లెవ్వరో యింకా వున్నారని తెలిసినప్పుడు నెహ్రూగారు తక్షణమే వాలంటీర్ల డ్రస్సు వేసుకొని పలుగు పార భుజమున పెట్టుకొని కొంతమంది జట్టును తన వెంటబెట్టుకొని ఆయింటివద్దకు వెళ్లెను. అందరితోపాటు ఆయనయూ పలుగు

పారలతో అపూడికనంతను త్రవ్వి తట్టలలోయెత్తి నెత్తిన పెట్టుకొని దూరముగా పోసి వచ్చెను. ఈ భూకంపమువల్ల గాంధిగారు తన టూరుప్రోగ్రామును మార్చుకొనవలసి వచ్చెను. ఆసమయమునసే బీహారులో వరదలుకూడ వచ్చుకాలము సమీపింపజొచ్చెను. అందువల్ల అక్కడ పనిచేయువారికి మరింత కష్టమయ్యెను. ఇందువిషయములో తగుసలహాలు చెప్పుటకు గాంధిగారు బీహారులో ఒక నెలరోజులు వుండిరి. ఆసమయమున అన్ని ప్రాంతములనుండి వచ్చినవారు అక్కడ సభచేసి బీహారు సెంట్రల్ రిలీఫ్ కమిటీని స్థాపించి ప్రజలబాధల నివారణార్థమై గొప్ప యేర్పాటును చేసిరి. ఇట్టి యేర్పాటులను కాంగ్రెసు యిటీవల యెన్నడూ చేసియుండలేదు. బాధపడిన పట్టణములను, గ్రామములను గాంధిగారు దర్శించిరి. బాధపడ్డ ప్రజలను స్వయముగా చూచి వారి బాధనివారణకు తగు యేర్పాటులు చేయించిరి. తనవద్ద తరిఫీదు అయిన వాలంటీర్లను బీ హా రు కు పంపించిరి. భూకంపమువల్ల ఆ రాష్ట్రములో గలిగిన చిక్కుసమస్యలు యింకనూ యెన్నియో యున్నవి. బయటివారి కవి పూర్తిగా అవగాహన అగుట కష్టము. (బీహారులో కాంగ్రెసువారుచేసిన బాధానివారణకార్యములను గురించిన వివరములు ౯ వ అనుబంధములో కాననగును)"

బీహారులో సంచారము ముగిసినపిమ్మట జవహరలాల్ నెహ్రూగారికి మరల జైలుప్రవేశము కలిగెను. కలకత్తాకు వెళ్లినప్పుడు బెంగాలుపరిస్థితిని గురించియు, మిడ్నపూరు జిల్లాలో అప్పుడు జరిగిన సంగతులను గురించియు ఆయన రెండు వుపన్యాసముల నిచ్చెను. బెంగాలులో విప్లవకారులను గురించి నీచముగా మాట్లాడుట తప్ప గవర్నమెంటుకు యింకొకమాట రాదు. వారియెడ మంచిమాటను వారు సహించలేరు. విప్లవోద్యమము యెందుకుపుట్టినదో దాని నెదుర్కొనుటకు గవర్నమెంటువారు యెట్టిపద్ధతులను అవలంబించుచున్నారో నెహ్రూగారు ఈ వుపన్యాసములలో విప్పి చెప్పిరి. బీహారులో మానవబాధానివారణార్థమై పనిచేయుచున్న సమయములో నెహ్రూగారిని అరెస్టు చేయకుంటే యెంతో బాగుండేది. ఆయన తిరిగి అలహాబాదు వెళ్లేటప్పటికల్ల జైలుగేట్లు ఆయనకోసము తెరచుకొని సిద్ధముగా నుండెను. కలకత్తా వుపన్యాసములకై ఆయనకు ౨ యేండ్లు శిక్షవిధింపబడెను.

ఆర్డినెన్సు పరిపాలనఫలితముగా దేశములో యేర్పడిన చిక్కుసమస్యను పరిష్కరించుటకు శాసనసభాప్రవేశ మవసర మని తలంచిన నాయకుల సంఖ్య ౧౯౩౩ సం. జులైలో పునహాలో సభ జరిగినునాటినుండియు క్రమముగా హెచ్చుచుపోసాగెను. ఈ క్రొత్తపంథాకు ఒక రూపము నిచ్చుటకై యిట్టి అభిప్రాయము కలవారందరును ఒకచోట సమావేశమగుటకు యేర్పాటు జరిగెను. ఈసమావేశము ౧౯౩౪

సం. మార్చి ౩౧వ తేదీని ఢిల్లీలో అన్సారీగారి అధ్యక్షతక్రింద జరిగెను. స్వరాజ్య పార్టీ మరల లేవదీసి వ్యక్తిశాసనోల్లంఘనములో పాల్గొననివా రందరును పునహాసభలో గాంధిగారి స్టేటుమెంటులో సూచింపబడిన నిర్మాణకార్యక్రమమును కొనసాగించుటకును, యెన్నికవర్గములను చక్కగా యేర్పాటుచేయుటకును తీర్మానించబడెను. రాబోవు ఎసంబ్లీ ఎన్నికలలో యీ పార్టీవారు పాల్గొనుట అవసరమని కూడ ఈసభ తీర్మానించెను. ఈ ఎన్నికలు రెండు ముఖ్యసిద్ధాంతములమీద జరుగవలె ననికూడ తీర్మానింపబడెను: (౧) నిర్బంధశాసనములను రద్దుపరిపించుట, (౨) శ్వేతపత్రములో చెప్పబడిన సూచనలను త్రోసివేసి గాంధిగారు రౌండుటేబిల్ సభలో చెప్పిన పద్ధతులమీద దేశముయొక్క కోర్కెను అమలు జరిపించుట. ఈ తీర్మానములు చేసినపిమ్మట వానిని గురించి గాంధీగారితో చర్చించి ఆయన అభిప్రాయమునుకూడ తీసికొని వానిని మరీ అమలులో పెట్టుదమను తలంపుతో యీ సభవారు డాక్టరు అన్సారీ, భల్లాభాయిదేశాయి, డాక్టరు భిదన్‌రాయిగార్లను గాంధీగారి వద్దకు రాయబార మంపిరి.

ఆ సమయమున గాంధీగారు భూకంపమువల్ల బాధపడిన బీహారుప్రాంతములలో సంచారము చేయుచుండిరి. ఆరోజు, అనగా ౧౯౩౪ సం.రం ఏప్రియల్ ౨వ తేదీ ఆయనకు మౌనవ్రతమురోజు. అందువల్ల ఆయన ఆరోజున సహార్సా అనుఒకమారుమూల ప్రదేశమందు వుండెను. ఢిల్లీలో యేమి జరుగుచున్నదియు ఆయనకు తెలియదు. వారితో సంబంధము లేకుండగనే ఆయన స్వతంత్రముగా ఒకస్టేటుమెంటు వ్రాసి పత్రికకు పంపుటకు సిద్ధముగానుండెను. ఆ సమయమందే "మేము మిమ్మలను పాట్నాలో చూచుటకు రాయబారము వచ్చుచున్నాము"మను వర్తమానము డాక్టరు అన్సారీనుండి గాంధీగారికి వచ్చెను. వారు చెప్పునది కూడ విన్నపిమ్మటనే తాను స్టేటుమెంటు పత్రికకు పంపవచ్చునని తలచి గాంధీగారు అప్పటికి వూరుకొనిరి. రాయబారులతో పూర్తిగా చర్చించిన పిమ్మట దానిని ఏప్రియల్ ౭వ తేదీని గాంధీగారు ప్రకటించిరి. ఈ ప్రకటనకు పూర్వము వారు అన్సారీగారికి ఒక వుత్తరము వ్రాసిరి. దానిని, అస్టేటుమెంటును కూడ ఈ దిగువ ప్రచురించుచున్నాము:

## గాంధిగారు అన్సారీగారికి వ్రాసిన ఉత్తరం (పాట్నా ఏప్రియల్ ౫ తేదీ)

ప్రియమైన అన్సారీగారు

ఇటీవల ఢిల్లీలో కొందరు కాంగ్రెసువారు సమావేశమై చేసిన తీర్మానములను గూర్చి నాతో చర్చించి నా అభిప్రాయమును తెలిసికొనుటకుగాను మీరున్నూ, భల్లాభాయి, డాక్టరు భిదన్ గారులునూ పనికట్టుకొని పాట్నాకు వచ్చుట చాలాసంతోష

కరమైన విషయము. స్వరాజ్యపార్టీని తిరిగి లేవనెత్తుటలోను, రాబోవు ఎసంబ్లీ ఎన్నికలలో పాల్గొనుటకును మీరు చేసిన తీర్మానములను నేను ఆమోదించుటకు సంశయింపను.

"ప్రస్తుతస్థితిలో శాసనసభలయొక్క ప్రయోజన విషయమై నాకు గల అభిప్రాయములు అందరికిని బాగా తెలిసినవే. ౧౯౨౦ సం. లో నా అభిప్రాయము లెట్లుండెనో మొత్తముమీద యిప్పుడును అట్లే యున్నవి. అయితే యేకారణముచేత గాని, వ్యక్తిశాసనోల్లంఘనము సాగించుటకుశక్తిగాని, యిష్టముగాని లేనివారున్నూ, శాసనసభాప్రవేశమందు నమ్మకముగలవారున్నూ శాసనసభలో ప్రవేశించి దేశక్షేమమునకు అనుకూలమని తాము నమ్మిన కార్యక్రమమును నిర్వర్తించుటకై ఇతరులతో సహకారముచేయుటయు ప్రతికాంగ్రెసువ్యక్తికీ హక్కున్నూ, విధియున్నూ కలదు. ఈనాపై అభిప్రాయమునకు లోబడి నేను యెల్లప్పుడును నాకు చేతనైన సహాయమును ఈపార్టీకి చేయుటకు సంసిద్ధముగా నున్నాను.

ఇట్లు విన్నవించు విధేయుడు,

గాంధి."

## గాంధిగారి స్టేటుమెంటు

పాట్నా, ఏప్రియల్ ౭-౧౯౩౪.

"సత్యాగ్రహాశ్రమమున నివసించుచు, నాకు సహవాసులై, ఇటీవలనే జైలునుండి విడుదలను పొంది, రాజేంద్రబాబు కోరికమీద నాచే బీహారునకు బంపబడిన కొందరు మిత్రులతో స్వయముగా జరిపిన సంభాషణమే నన్నీప్రకటనముచేయ బురికొల్పినది. ఆప్రసంగవశమున నాకు చిరపరిచితుడును, యోగ్యుడును నగు నొక సహవాసి జైలునిబంధనల ననువర్తింప నిచ్ఛగింపక, తనకు విధింపబడిన కార్యములను నెరవేర్చుటకు బదులు, చదువుకొనుటయందే కాలమును వినియోగించువా డని నాకు తెలియవచ్చినది. నిస్సందేహముగా నిది సత్యాగ్రహ నియమములకు వ్యతిరేకము. పూర్వముకంటె నెక్కువగా నాచే ప్రేమింపబడుచున్న యొకమిత్రుని లోపముకన్న నాయందున్న లోపమే దీనివలన స్పష్టముగా గోచరించెను. తన బలహీనతను నే నెరిగియేయుంటినని నామిత్రుడు తలచెను. అత డట్లే వచించెను. కాని నే నంధుడను. నాయకునిలో నంధత్వము క్షంతవ్యము గాదు. సత్యాగ్రహము నమలు జరుపుటకు తాత్కాలికముగా నే నొక్కడనే ప్రయత్నింపవలెనని నాకప్పుడు వెంటనే గోచరించెను.

“గడచిన జూలై మాసములో పూనానగరమున సమావేశము జరిగినప్పుడు సత్యాగ్రహు లనేకులు నడుముగట్టుట ముదావహమేయైనను సత్యాగ్రహముయొక్క సందేశమును జీవింపజేయుటకు ఒక్కడుమాత్ర ముండిన జాలునని నేను వచించియుంటిని. ఇప్పుడు, నేను విశేషము ఆత్మపరీక్ష గావించుకొనినమీదట సత్యాగ్రహము పూర్ణస్వరాజ్యమును ప్రాప్తింపజేయు జయావహమైన సాధనముగా నుండవలెనని, దానిబాధ్యతను, ప్రస్తుత పరిస్థితులలో, ఒక్కడుమాత్రమే, అనగా నేను మాత్రమే వహింపవలెననియు, ఇతరు లెవరును వహింపరాదనియు నిశ్చయమునకు వచ్చితిని.

## సత్యాగ్రహములో కలితీ

“సత్యాగ్రహసందేశమును దేశమున వ్యాపింపజేయు నవసరమున కొంత కలితీ యేర్పడుటచే దాని నిజతత్త్వమును జనసామాన్యము పరిపూర్ణముగా గ్రహింపజాలక పోయెనని నాకు తోచుచున్నది. ఆధ్యాత్మికసాధనములు అనాధ్యాత్మికమార్గముల ద్వారా బోధింపబడినప్పుడు వానిశక్తి సన్నగిలునని నాకు స్పష్టమైనది. ఆధ్యాత్మిక సందేశములు స్వయముగానే వ్యాప్తి చెందును. హరిజనపర్యటనసందర్భమున అన్ని యెడలను ప్రజాసామాన్యము ప్రదర్శించిన యుత్సాహమే ఇందులకు ప్రబల నిదర్శనము. ప్రజలలో బయలుదేరిన అత్యద్భుతమైన ఈయుత్సాహము స్వతస్సిద్ధముగనే బహిర్గతమైనది. తండోపతండములుగా సభలకు హాజరైన యా ప్రజాసముదాయములను, వారి కార్యోత్సాహమును గమనించి హరిజనసేవకులు సైతము రిచ్చవడిరి. అట్టి దృశ్యములను వా రదివర కెన్నడును గాంచియుండలేదు.

“సత్యాగ్రహము కేవలము ఆధ్యాత్మికమైన అస్త్రవిశేషము. దాని యాధ్యాత్మికశక్తిని గుర్తెరిగిన యాచార్యు డొకడు దగ్గరనుండి దాని యుపయోగమును కనుపెట్టుచుండినయెడల, దానిశక్తిని ఎరుగని స్త్రీపురుషులచే గూడ, ఐహికప్రయోజనములకైనను దానిని వినియోగింప జేయవచ్చును. ప్రతివాడును శస్త్రచికిత్సోపకరణముల నుపయోగింపజాలడు. కాని నిపుణుడైనవాడు వెనుకనుండి, వాని నేరీతిని ఉపయోగింపవలెనో తెల్పుచున్నయెడల చాలమంది వాని నుపయోగింపవచ్చును. సత్యాగ్రహాస్త్రమును వినియోగించుటలో నేను సాధనావస్థయందున్న నిపుణుడను. అందుచే తన శాస్త్రమును కూలంకషముగ తరచిచూచిన శస్త్రచికిత్సా నిపుణునికంటె చాల జాగరూకతతో మెలగవలసియున్నది. నే నింకను సాధకుడను. సత్యాగ్రహియైనవాడు తనకు చేరువనున్న దానిపై దృష్టి నిగుడ్పక, ముందున్నదానికై తడుములాడుకొనుట యుక్తము కాదు. సత్యాగ్రహతత్త్వమున కది సరిపడదు.

"ఆశ్రమవాసులతో జరిగిన ప్రసంగముల ప్రోద్బలమువలన ఆత్మపరీక్ష చేసికొనగా, ప్రత్యేకముగ కొన్నికష్టములను నివారింపజేసికొనుటకు గాక కేవలము స్వరాజ్యముకొరకు సత్యాగ్రహము నవలంబించుటను నిలిపివేయ కాంగ్రెసువాదులకు సలహా నివ్వవలెనను నిశ్చయమునకు నేను వచ్చితిని. వారు సత్యాగ్రహమును నాకొక్కనికే వదలివేయవలెను. ఆ శాస్త్రమును నాకంటె బాగుగ తరచిచూచితి నని యింకొకడు బయలుదేరి నమ్మకము పుట్టించిన తప్ప, లేనిచో నాజీవిత మున్నంతవరకును నాసలహా లేనిదే ఎవరును దానిని ఉపయోగింపకూడదు.

"నేను సత్యాగ్రహమునకు కర్తను, ప్రారంభకుడను అను నుద్దేశముతో నీయభిప్రాయ మిచ్చుచున్నాను. కావున ప్రత్యక్షమునగాని, పరోక్షమునగాని నాసలహామూలమున స్వరాజ్యసిద్ధికై పాటుపడుచున్నవారందరును ఇకనుండి దయచేసి సత్యాగ్రహము చేయకుందురు గాకయని కోరుచున్నాను. ప్రస్తుత స్వాతంత్ర్యసమరమునకు ఇదియే ఇండియాకు అత్యంత క్షేమకరమని నేను బాగుగ విశ్వసించుచున్నాను.

## నిజమైన సత్యాగ్రహము

"మానవుని యుపయోగార్థమై కనిపెట్టబడిన అస్త్రములలో నుత్తమోత్తమమైన దీనివిషయమై నేను వట్టిమాటలతో కాలముపుచ్చుట నాకిష్టములేదు. సత్యాగ్రహము దౌర్జన్యముయొక్కయు, యుద్ధముయొక్కయు ఆవశ్యకతను పూర్తిగా తొలగించివేయునని ఇదివరకనేకపర్యాయములు చాటియుంటిని. అరాజకవాదుల హృదయములను, అరాజకవాదులను రూపుమాపు నుద్దేశ్యముతో దేశమునంతను నిర్వీర్యము చేయుచున్న పరిపాలకుల హృదయములను కరగించివేయుట కది యుద్దేశింపబడెను. కాని, చాలమంది శ్రద్ధాభక్తులు లేకుండ సత్యాగ్రహ మవలంబించుటవలన— గొప్పఫలితములు కొన్ని కలిగినను—అరాజకవాదులలోగాని, పరిపాలకులలోగాని మొత్తముమీద నది హృదయపరివర్తనము గలిగింపజాలకపోయెను. సత్యాగ్రహములో కత్తిలేమియు లేకుండ నున్నయెడల ఇరువురను కరగించితీరవలెను. ఈ పరమసత్యముయొక్క యాథార్థ్యమును పరిశోధింపవలెనన్న అందులకు దగియున్నవ్యక్తి యొక్కడే దాని యాచరణభారమును వహింపవలెను. ఈపరీక్ష ఇంతవర కెప్పుడును చేయబడియుండలేదు. ఇక ఇప్పుడు చేయవలసియున్నది. సత్యాగ్రహ మనిన మామూలు శాసనోల్లంఘనముగా పాఠకులు భ్రమపడకుందురుగాక. శాసనోల్లంఘనముకంటె దాని వ్యాప్తి అతిబహుళము. సత్యాగ్రహ మనిన సత్యముకొరకు అన్వేషణము. ఈ యన్వేషణము కేవలము దౌర్జన్యరహితమైన మార్గములమూలముననే జరుగదగియున్నది.

## కాంగ్రెసువాదుల కర్తవ్యము

"శాసనోల్లంఘనమును విరమించి ఖాళీగానున్న సత్యాగ్రహు లిప్పు డేమిచేయ వలసియుండును ? స్వార్థపరిత్యాగము, స్వచ్ఛందదారిద్ర్యము అను సౌందర్యకళను వా రభ్యసింపవలెను. జాతీయనిర్మాణమున కుపకరించు కార్యములయందు వారు నిమగ్నులుకావలెను. స్వయముగా నూలును వడికి, బట్టలను నేసి ఖద్దరువ్యాపకమునకు దోడ్పడవలెను. ప్రతి జీవితపథమునందును ఇతరులయెడ సౌహార్దముతో ప్రవర్తించి సాంఘికైక్యమునకు చేయూత నొసగవలెను. తమయందు అస్పృశ్యతాదోషము ఏమాత్రము ఏరూపమున నున్నను తొలగించుకొనవలెను. కల్లు, సారాయము, గంజాయి మొదలగు మత్తుపదార్థములను సేవించువారితో స్నేహ మలవరచుకొని వారిదురభ్యాస ములను మాన్పించవలెను. ఈసేవాకార్యము లన్నియు బీదవానికి దగిన యుపపత్తిని మాత్రము గల్పించును. ఇంత బీదతనము ననుభవింప నిచ్ఛలేనివారు జాతీయ ప్రాముఖ్యముగల పరిశ్రమలలో పాల్గొని హెచ్చుజీతములను పొందవచ్చును. శాసనములకు స్వయముగా బద్ధులై ప్రవర్తించుట విధియని తెలిసికొని యాప్రకారము నడచుకొను వారే సత్యాగ్రహ మవలంబింపదగినవా రని ప్రజలు గ్రహింతురుగాక !

"ఈ ప్రకటనము గావించుటచే కాంగ్రెసుయొక్క అధికారమును నేను చలాయించుచుంటినని అనుకొనవలదు. సత్యాగ్రహమువిషయమై నా మార్గదర్శిత్వ మును కోరువారల కిది సలహామాత్రమే"

"రెండవ తేదీ సోమవారమునాడు సామాన్యవ్రతదినమున సహర్సాలో నేనీ ప్రక టనమును వ్రాసితిని. వ్రాసి రాజేంద్రబాబున కివ్వగా నతడు అచ్చటనుండిన మిత్రు లకు జూపించెను. మొట్టమొదట వ్రాసినప్రతిలో తరువాత గొన్నిమార్పులు చేయ బడినవి. కొంత సంగ్రహము చేయబడియెను కూడ. కాని సారాంశము మాత్రము సోమ వారమునాటిదే నామిత్రులందరికి చూపించి, సంతోషింపవలసినయవకాశము నాకు లేకపోయినందులకు చింతిలుచున్నాను. కాని నా నిశ్చయము సమంజసమనుటలో నా కెట్టి సందేహమును లేకపోవుటచే, మిత్రుల యభిప్రాయము తెలిసికొనుటకు ఆగి, ప్రకటనమును బహిరంగపరచుటలో ఆలస్యముచేయకూడదని భావించితిని. ఈనానిశ్చ యమును ఈప్రకటనమునందు వెల్వడిన ప్రతిమాటయు తీవ్రమైన ఆత్మపరీక్షకును, ఈశ్వరసంప్రార్థనమునకును ఫలితములై యున్నవి. ఈ నిశ్చయములలో ఏవ్యక్తిపైనను ఎట్టి దురూహయు లేదు. ఇన్ని సంవత్సరములనుండియు నాపైబడియున్న మహా బాధ్యతను గుర్తించి, వినయపూర్వకముగ నాలోపముల నే నొప్పుకొనుటయే ఇందలి యభిప్రాయము."

మహాత్మాగాంధీగారి స్టేటుమెంటులోని ప్రతిమాటయు తీవ్రమైన ఆత్మపరీక్షకును, ఈశ్వరసంప్రార్థనమునకును ఫలితములై యున్నవి. సత్యాగ్రహసందేశము దేశమున వ్యాపించుటలో కొంతకర్తి యేర్పడెను. మరియు హరిజనయాత్రలో ప్రజల మనోభావములు ఆయనకు ప్రస్ఫుటమయ్యెను. వీటి నన్నిటినీ గాంధీగారు మనస్సులో బాగా ఆలోచించుకొని ఈ వుద్యమమందు ప్రావీణ్యతగల తానొక్కడే ఈ అస్త్రము ప్రయోగింప దగునను నిశ్చయమునకు వచ్చెను. శస్త్రవైద్యమునందు ప్రావీణ్యత గలవాడే శస్త్రమును ప్రయోగింపదగును. ఈ నిశ్చయఫలితముగా బహుజనుల వుల్లంఘనపద్ధతి నిలిపివేయుబడెను.

ఈ సమయమందే అన్సారీగారుకూడ ఒక ప్రకటనను జేసిరి. గాంధిగా రిచ్చిన సంపూర్ణ ఆమోదమువల్ల కాంగ్రెసునందు చీలిక తప్పిపోయెను. శాసనసభలలోను, బయటనుకూడ పోరాటము సాగింపవచ్చుననియు అందువల్ల విద్యార్థులలోను, ప్రజలలోను కలిగిన రాజకీయ అసంతృప్తి, మాంద్యము విడిపోవుననియు అన్సారీగారు ఆ స్టేటుమెంటునందు ప్రకటించిరి.

స్వరాజ్యపార్టీని దిట్టపరచుటకై ౧౯౩౪ మే ౨, ౩ తేదీలలో రాంచీపట్టణములో సభ జరిగెను. ఈ సభయొక్క ప్రధానోద్దేశ్యములలో ఒకటి యేమనగా, గాంధీగారు అనుగ్రహించిన ఆమోదమును ఆల్‌యిండియా కాంగ్రెసుకమిటీచేత గూడ సంపాదింపవలెనని.

అంతకు కొద్దిరోజులుపూర్వము ఢిల్లీలోచేయబడినతీర్మానములు ఆమోదింపబడెను. స్వరాజ్యపార్టీయొక్క నిర్మాణమును మార్చి స్థిరపరచిరి. ఈమార్పుయొక్క వుద్దేశ్యము యేమనగా, పార్టీయొక్క అంతరంగికవ్యవహారములలోగాని, డబ్బువిషయములలోగాని కాంగ్రెసుసలహా అక్కరలేదనిన్ని, ఇతరవిశాల సమస్యలమీద కాంగ్రెసుసలహా ననుసరించవలెననిన్నీ తీర్మానింపబడెను. వారాసభలో నిర్వచించినకార్యక్రమ మిది. దేశముయొక్క పురోభివృద్ధిని సత్వరపూర్ణస్వాతంత్ర్యసిద్ధిని అటంకపరచు అన్నిశాసనములను రద్దుపరపించుట, రాజకీయఖైదీలను విడిపించుట, దేశనాశకరము శాసననిర్మాణము నిరోధించుట, గ్రామముల పునర్నిర్మాణములుచేయుట, వ్యవసాయము, డబ్బుమారకము, కరెన్సీ, కార్మికసమస్యలు మొదలగువానిలో దేశక్షేమకరము సంస్కరణలను చేయుట, కాంగ్రెసువారు నిర్ణయించిన నిర్మాణకార్యక్రమము సాగించుట — యివన్నియు యీ పార్టీయొక్క ప్రోగ్రాముగా నిర్ణయించబడెను.

ఈ విషయములన్నియు ౧౯౩౪ సం. మే నెల ౧౮, ౧౯ తేదీలలో పాట్నాలో సమావేశమైన ఆల్‌యిండియా కాంగ్రెసుకమిటీలో చర్చింపబడెను. గవర్న

మెంటువారు అన్ని కాంగ్రెసు కమిటీలను నిషేధించిరిగాని ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటీనిమాత్రము యేలనో విలివేయలేదు. గాంధిగారి శిఫార్సుప్రకారము శాసనోల్లంఘనము నిలుపుదల చేయబడెను. మరియు స్వరాజ్యపార్టీకి సంబంధించిన ఈదిగువ తీర్మానముకూడ చేయబడెను:

"దేశముయొక్క ఆదర్శమునా చేరుటకై చేయు మహాప్రస్థానములో శాసనసభాప్రవేశముకూడ అవసరమగు మెట్టు అని నమ్మువారు కాంగ్రెసులో పెక్కుమంది యున్నారుగాన అందునిమిత్తమై డాక్టరు అన్సారీ, పండిత మదనమోహనమాలవ్యాగార్లు కలసి ౨౫ మందికి యెక్కువలేని పార్లమెంటరీబోర్డు అను ఒకబోర్డును నిర్మాణము చేయుటకు ఆల్ యిండియా కాంగ్రెసుకమిటీవారు వీరిని యిందుమూలముగా నియమించుచున్నారు. ఈబోర్డుకు డాక్టరు అన్సారీగారు ప్రెసిడెంటుగా నుందురు. ఈబోర్డువారు కాంగ్రెసు తరపున శాసనసభలకు యెన్నికలను నడిపించవలయును ఇందునిమిత్తమై వలయు ద్రవ్యమును వసూలుచేయుటకున్నూ, ఖర్చుపెట్టుటకున్నూ ఈబోర్డుకు అధికార మివ్వడమైనది.

"ఈబోర్డు ఆల్ యిండియా కాంగ్రెసుకమిటీకి లోబడియుండును. దానికి సంబంధించిన వ్యవహారములను పరిష్కరించుటకు అవసరమగు అంగనిర్మాణమున్నూ నిబంధనలనూ చేసికొనుటకు దానికి అధికార మివ్వడమైనది. ఈ నిబంధనలను అంగనిర్మాణమున్నూ వర్కింగు కమిటీవారి ఆమోదమునకై దాఖలు చేయవలెను. అయితే ఈ ఆమోదము వచ్చులోగా యివి అమలు జరుపబడవచ్చును.

"అప్పటప్పటికి నిర్ణయింపబడు కాంగ్రెసు విధానమును శాసనసభలో నిర్వర్తించుటకు వాగ్దానము చేసినవారిని మాత్రమే ఈబోర్డువారు ఎన్నికలలో అభ్యర్థులుగా నిలుపబెట్టవలెను."

# 3. ప్రతీక్షణము

[శాసనోల్లంఘనపు ఆపుదల-పాట్నాతీర్మానము - పాట్నాలో వర్కింగు కమిటీసమావేశము - సామ్యవాదికక్షి - గవర్నమెంటునిషేధము-కాంగ్రెసు పునర్నిర్మాణము - వార్ధా బొంబాయితీర్మానములు - సర్దారు వల్లభాయిగారి విడుదల - కాశీలో వర్కింగుకమిటీసభ - జవహరలాల్ విడుదల - తిరిగి పట్టుపడుట - జాతీయకక్షి - ఖాను అబ్దుల్ గఫూరుఖానుగారి విడుదల - వర్కింగుకమిటీవారియొక్క చివరిసమావేశము-గాంధిగారు కాంగ్రెసు నుండి విరమించుట - ౨౧ రోజుల ఉపవాసవివరం - ఆత్మపునీతము - ఉపవాసమునకు ముఖ్యముగా మనోనిశ్చయ ముండవలెను - అనుకోనిసువార్త - గాంధిగారి స్టేటుమెంటు-కథకు అడ్డము - "నేను విడుదలను దుర్వినియోగపరచను-"గాంధీగారికి పటేలుగారిసంరక్షణ - అల్పత్వమున కవకాశము లేదు-మార్జాలమూషికఖేలనము కాదు - గురుయూరులో ప్రజాభిప్రాయము - డాక్టరు అన్సారీగారికి గాంధీగారిలేఖ-కాంగ్రెసుపునర్నిర్మాణము-విమర్శకులకు ప్రత్యుత్తరము-పశుబలమునకు ప్రత్యామ్నాయము - అహింసాయుద్ధమునందు సేనానియొక్క అధికారము - రాజకీయమునందు ఆధ్యాత్మికము - బార్డోలీతీర్మానము - పఠానులకు అభినందనములు - శాసనోల్లంఘనముయొక్క విరమింపు ఉచితమే - కఠినశిక్షణము అవశ్యకము - బెంగాలుయొక్క యిక్కట్లు - ప్రజలనిర్బంధము - జవహరలాలు, గఫూరుఖాను, వల్లభాయిలు - జైళ్లవెలుపట పెద్దజైలు - వెనుకటిచరిత్ర - కవున్సిలుపని విలువలేనిది - పరిస్థితులమార్పు - పండిత మాలవ్యాగారియందు విశ్వాసము - గవర్నమెంటువారి సదుద్దేశము - గాంధీగారు మానుకొన్నతరువాత వారిస్టేటుమెంటు - దృక్పథమునందలి మార్పులు - భయంకరమైన నిర్బంధము - సామ్యవాదులకూటము - స్వతంత్ర సంస్థానముల సమస్య - అస్పృశ్యత - అహింస - అహింసయొక్క అపజయము - సత్యాగ్రహము - పూర్ణస్వరాజ్యము - సాధనము సాధ్యము భిన్నములు కావు - వైమనస్యములు ఖాయములైనవి - కాంగ్రెసుకార్యక్రమము-మన సేవకులలో అవినీతి - కాంగ్రెసును పరిశోధించవలెను - ఖద్దరు ఫ్రాంచైయిస్ - ఖద్దరును వాడుకగా ఉపయోగించుట - ప్రతినిధులసంఖ్య వెయ్యికి

తగ్గింపు - ఉపసంహారము - బొంబాయికాంగ్రెసు - అఖిలభారత గ్రామో ద్యోగసంఘము - గాంధీగారి నిర్గమనము - క్రొత్త కాంగ్రెసు - రాజేంద్ర బాబుగారి ఉపన్యాసము - బొంబాయి తీర్మానములు - ప్రదర్శనములు - కాంగ్రెసుపార్లమెంటరీబోర్డు-ఎన్నికలదాడి-జె. పి. సి. రిపోర్టుమీద అసెంబ్లీ వారి తీర్పు - జిన్నాగారి సవరణ - శాసనోల్లంఘనముయొక్క విరమింపును గూర్చి వర్కింగుకమిటీమీటింగు - కాంగ్రెసుశిక్షణమునుగూర్చి నియమావళి- ఆంధ్రదేశములో కరవు - జె. పి. సి. రిపోర్టునుగురించి అఖిలభారతదినము - సాంఘిక ఐక్యమునుగూర్చి సంభావణలు-నిర్బంధవిధానముయొక్క ఎడతెగని నడవడి - కాంగ్రెసుమ్యూజియము-డిఫెన్సుఫండు-బెంగాలులో నిషేధము - కాంగ్రెసు అధ్యక్షుని ప్రత్యుత్తరము - సరిహద్దురాష్ట్రములో కాంగ్రెసు పునర్నిర్మాణము - సరిహద్దువారు సాంఘికతత్వమును నిరోధించుట - క్వెట్టా భూకంపము - వర్కింగుకమిటీతీర్మానము - ఉద్యోగస్వీకారము - కాంగ్రెసు స్వదేశసంస్థానములు-కాంగ్రెసుచరిత్ర-గవర్నమెంటు ఆఫ్ ఇండియా శాసనము-దినదినము హెచ్చుచున్న కాంగ్రెసుప్రెసిడెంటుయొక్క బాధ్యతలు]

కాంగ్రెసు వెంటనే సమావేశము కావలెనను కోరిక ప్రబలియుండుటచే యీ సభను బొంబాయిలో ౧౯౩౪ వ సం. అక్టోబరు చివరవారములో జరుపుటకు తీర్మానింపబడెను. అ. భా. కాం. కమిటీతోపాటు వర్కింగుకమిటీవారు పాట్నాలో ౧౮, ౧౯, ౨౦ మే ౧౯౩౪ న సమావేశమయిరి. శాసనోల్లంఘన విరామమును గూర్చియు, శాసనసభాప్రవేశమునుగూర్చియు వీరి శిఫార్సులు అ. భా. కాం. కమిటీ వారు అంగీకరించగా దేశములోని కాంగ్రెసువారిని ఆ తీర్మానమును శిరసావహించ వలసినదని వ. క. కోరిరి. ఈప్రకారము ౨౦-౫-౩౪ న ఉద్యమము విరమింపబడెను.

అప్పుడే వ. క. వారు జూలై ౧౯౩౩ లో తాత్కాలికపుప్రెసిడెంటుగారు జారీచేసిన ఉత్తరువులను రద్దుచేసి దేశమంతటను కాంగ్రెసుసంఘముల పునరుద్ధారణ చేయవలసినదిగ తీర్మానించిరి. అన్నిరాజధానులలోను ఇట్టికార్యములు నిర్వర్తించుటకుగాను కొందరు పెద్దమనుష్యులు నియమింపబడిరి. శాసనోల్లంఘనవిరామము చేతను, ఆక్టింగు ప్రెసిడెంటుయొక్క అధికారము అంతమగుటచేతను, ఖాయపు ప్రెసిడెంటగువల్లభాయిపటేలు కారాగృహమందుండుటచేతను రాబోవు కాంగ్రెసు వరకు జమ్నాలాలుబజాజిగారిని ఆపదవియందధిష్ఠింపజేసిరి.

చాలా తర్జనభర్జనలు జరిగినపిమ్మట పాట్నాతీర్మానములు చేయబడెను. ఒక పక్షమున వోటేంజ ర్లింకను తీవ్రముగా కవున్సిలుప్రవేశమును నిరసించుచుండిరి. వీరు

గాంధీగారి అనుచరులు; ఇంకొకప్రక్కను గాంధీగారి ఆదర్శములను శిరసావహింప కున్నను సామ్యవాదు లనువారు కవున్సిలుప్రవేశమునకు విరోధులు. కాని గాంధీగారు లేచి మాట్లాడేసరికి ప్రతిఘటనమంతయు దూదిపింజవలె ఎగిరిపోయెను. పాట్నా సమావేశసమయమున గాంధీగారు ఉత్కళమునందు హరిజనోద్యమప్రచారముకొరకు సంచారము చేయుచుండిరి. ఈకాలినడక క్రొత్తగా ఆయనచే అవలంబింపబడెను. ఇందువలన పరిమితప్రదేశములకు పోయి, పరిమితవిరాళములను వసూలుచేయవలసివచ్చెను. కాని రైలుమీదను, మోటారుమీదను ప్రయాణముచేయుటవల్ల కేవలము డబ్బువసూలుకొరకు ఒకయంత్రముగా తాను మారిపోయినట్లు ఆయనకు తోచెను. అంతకన్నా హీనము,— ప్రయాగరాష్ట్రములో ఈయనను వాయువిమానమునందు సంచారము చేయించవలెనని ఆలోచనలు జరుగుచుండెను. ఇవన్నియు ఆయనకు రుచించలేదు. క్రొత్తయేర్పాటును ప్రారంభించి కొనసాగింప బద్ధసంకల్పు డయ్యెను. కాని పాట్నాసమావేశమువల్ల దీని కభ్యంతరము కలిగినది. ఈ ఆభ్యంతరమునకు కారకుడుకూడ తానే. ౭-౪-౩౪ వ తేదీని తాను ప్రచురించిన స్టేటుమెంటే ఆకారణము. దాని నములలో పెట్టకతప్పదు. తనకు మినహా శాసనోల్లంఘనోద్యమమును ఎత్తివేయవలసియుండెను. దాని ఉత్పత్తి కూడ ఫిబ్రవరి ౧౯౩౦ లో తనతోనూ, ఉప్పుసత్యాగ్రహముతోనూ ప్రారంభ మయ్యెను. ఉద్యమ మెలా ఆరంభింపబడెనో ఆవిధముగానే అంతమయ్యెను. పాట్నాలో జరిగిన అ. భా. కాం. క. లో వీ రిచ్చిన రెండు ఉపన్యాసములలోను తమ హృదయమునందలి ఆవేదనను వీరు పొర్లింపజేసిరి.

ఇండియా దేశములోని సామ్యవాదికక్షియొక్క జననముకూడ ౧౯౩౪ వ సం. మే మాసముననే. ౧౭-౫-౧౯౩౪ న పాట్నాలో జరిగిన వీరి మొదటి అఖిలభారత సమావేశమునకు అధ్యక్షులుగా నున్నది ఆచార్య నరేంద్రదేవుగారు. వీరి ద్వితీయసమావేశము బొంబాయిలో జరుపుటకును, అప్పటికి అఖిలభారతసంఘమును నిర్మించుటకు గాను వలయు నియమావళిని సిద్ధముచేయుటకునూ ఒక ఉపసంఘము నియమింపబడెను. పాట్నామీటింగు అనంతరము ఈ పార్టీవారి సంస్థలు పలుచోట్ల స్థాపింపబడినవి.

పాట్నా తీర్మానములవలన కాంగ్రెసుయొక్క కేంద్రమే మారెను. శాసనోల్లంఘనమునకు చీకటిరోజులు వచ్చెను. కవున్సిలు ప్రవేశమునకు వెన్నెలరోజులు వచ్చెను. వర్కుషాపులో యంత్ర మాగినట్లు, విద్యుద్దీపములు ఆరిపోయినట్లు, యెత్తుమీది వస్తువు క్రిందపడినట్లుకంటె ఎక్కువ త్వరితముగా శాసనోల్లంఘనము పదచ్యుతి పొంది దాని స్థానమున శాసనసభాప్రవేశ మధిష్ఠించెను. గాంధీగారి కొక్కరికే శాసనోల్లంఘ

నాధికారము ఉంచబడెను. ఉల్లంఘనము చేయుటకు సంసిద్ధులయినవారుమ ఎవరును లేరని కాదు. పాట్నాతీర్మానములవలన ఏర్పడినస్థితి యట్టిది. పాట్నానుండి వెంటనే గాంధిగారు ఉత్కళరాష్ట్రము వచ్చి, అక్కడనుండి ప్రయాగరాష్ట్రములో హరిజన ప్రచారము సల్పిరి. వీరు రాజకీయములలో జోక్యము కలిగించుకొనకుండుట కేర్పరచుకొనిన దీక్ష ౪ వ ఆగస్టుతో (౧౯౩౪) అంతముకానున్నది. ఉపవాసముమూలమున ఆయన విడిచిపెట్టబడుటచే ఆయన స్వయముగా ఈదీక్ష పూనెను. ఉపవాసమే లేనిచో ౪ వ ఆగస్టుతో వీరిపైన విధించబడిన శిక్ష అంతమయ్యెడిది. "ఈలేదీ యనంతరము వీ రేమిచేయ నుద్దేశింతురు? సరిహద్దురాష్ట్రమును సందర్శించుటకు వీరి కనుజ్ఞ యొసగకపోయినను అచ్చటకు పోవుటలోనే వ్యక్తిశాసనోల్లంఘన మొనరింతురా? లేనిచో వీరు తనకుమాత్రము ఉల్లంఘనాధికారము నిలుపుకొన్న ప్రయోజన మేముండును? అయితే, ఒకప్రక్కను కవున్సిలు ప్రవేశమునకు అనుమతినిచ్చి, మరొకప్రక్కను తాను కారాగారప్రవేశ మొనర్చి దేశమునంతను దుఃఖసముద్రములో ముంచుచు పరిస్థితుల నల్లకల్లోలము చేతురా? గాంధిగారి తత్వముమాత్ర మిట్టిది కాదు." అని ఇవ్విధముగా లోకులు పరిపరివిధముల నాలోచించుచుండిరి. దేశములో చేయవలసిన పని ఎంతో యున్నది. ౧౯౩౨ వ సంవత్సరారంభమున ఒక్క అ. భా. కాం. కమిటీతప్ప దేశములోని కాంగ్రెసుసంస్థ లన్నీ అశాస్త్రీయము లని ప్రభుత్వమువారు శాసించిరి. గవర్నమెంటువారు వెంటనే ౧౨-౬-౧౯౩౪ న ఈ నిషేధమును తొలగించిరి గాని బంగాళాలోను, సరిహద్దురాష్ట్రములోను, హిందుస్తాను సేవాదళమువంటి కాంగ్రెసుకు సంబంధించిన కొన్ని సంస్థలపట్లను మాత్రము నిషేధము తొలగింపబడలేదు. కొన్ని రాష్ట్రములలో కాంగ్రెసువారి భవనములును, ఆస్తులును, లెక్కలపుస్తకములును, కొన్ని ఆశ్రమములును ౧౯౩౫ వ సం. మధ్యవరకూ ప్రభుత్వస్వాధీనములోనే వుండెను. ఖయిదులో నున్నవారిని విడుదలచేయుటకూడ తొందరగా జరుగునని గవర్నమెంటువారు ప్రకటించిరి. కాని ముఖ్యముగా గుజరాతులోను, తదితర ప్రాంతములయందును ఖయిదీలు విడుదల చేయబడలేదు. గుజరాతులోని స్వదేశసంస్థానములకు చెందిన కొందరు కాంగ్రెసువారు బ్రిటిషు ఇండియాలో చిరకాలవాస్తవ్యులై యుండియున్నను వీరిని బ్రిటిషుఇండియాకు ప్రభుత్వమువారు రానియ్యరైరి. బ్రిటిషు ఇండియాలోనున్న కాంగ్రెసువారికి వివిధకార్యములపై ఇతరదేశములకు పోదలచినపుడు పాసుపోర్టుల నీయరైరి.

దేశమునం దంతటను కాంగ్రెసుసంఘములు పునర్నిర్మితము లయినపిమ్మట జూనుమాసములో వార్ధాలోను, బొంబాయిలోను వర్కింగుకమిటీవారు సమావేశమై స్వయముగా వడికిననూలుతో నేసినఖద్దరు, అస్పృశ్యతానివారణము, మద్యపాన

నిషేధము, సాంఘికసామరస్యము, జాతీయవిద్య, గ్రామోద్యమాభివృద్ధి, గ్రామపున ర్నిర్మాణములతో కూడిన నిర్మాణ కార్యక్రమావలంబనమును గూర్చి తీర్మానములను గావించిరి. సరిహద్దురాష్ట్రములోని ఖుదాయిఖిద్మత్ గార్లకు వర్తింపజేసిన నిషేధ మును తొలగింపకుండుటలో గవర్నమెంటువారి అసందర్భపు చర్యను సూచించుచూ కమిటీవారు తీర్మానించిరి. ఇందుపై గవర్నమెంటువారు అసందర్భము నొప్పుకొనిరి గాని నిషేధమును తొలగించలేదు.

బొంబాయిలో జరిగిన తీర్మానములలో ముఖ్యమయినది శ్వేతపత్రమునకును సాంఘిక ప్రాతినిధ్యమునకును సంబంధించినది. కాంగ్రెసు పార్లమెంటరీబోర్డు(పా.బో) వారి ప్రేరణపై వర్కింగుకమిటీవారు తమ లోకవిదితమయిన తీర్మానమును గావించిరి. తీర్మానమునకు పూర్వము జరిగినచర్చలలో ఒకపక్షమున మాలావ్యా, ఆనేగార్లకును రెండవపక్షమున వ. క. వారికిని మధ్య గల భావభేదములు వెల్లడికాగా, మాలవ్యా ఆనేగార్లు వ. క. తోను, పా. బో. తోను తమకుగల సంబంధమునకు రాజీనామా నిచ్చిరి. కాని ఇంకను సమగ్రముగా చర్చలు చరిగినచో ఇట్టివిపత్తు నివారింపబడ వచ్చునను ఆశతో ఈ రాజీనామాలు అప్పటికి నిలిపియుంచబడెను.

శ్వేతపత్రమునుగూర్చి వర్కింగుకమిటీతీర్మానము ఈవిధముగా నున్నవి: "శ్వేతపత్రము ఎవ్విధముగాను ప్రజల యభీష్టమును తెలియజేయజాలదు. ఇండియాలో అన్ని రాజకీయశాఖలవారిచేతను యిది ఖండింపబడినది. కాంగ్రెస్ పరమావధికిని దీని కిని చాలాదూరము. పరమావధియొక్క మార్గమును అడ్డగించుచునేవున్నదికూడాను. దీనికి గత్యంతర మొక్కటే గలదు. దేశములో వుండేటటువంటి యుక్తవయస్కులగు జను లెల్లర వోటుమీదను-అవసరమైతే అల్పసంఖ్యవారికి ప్రత్యేకప్రాతినిధ్యమునిచ్చి కాన్ స్టిట్యూయంట్ అసెంబ్లీ (కా.అ.) అను ఒక ప్రతినిధిసంఘమును సమావేశపరచి దాని ద్వారా రాజ్యాంగనిర్మాణమును తయారుచేయుటయే. శ్వేతపత్ర మెప్పుడయితే శిథిల మైనదో అప్పుడే సాంఘికప్రాతినిధ్య తీర్మానముకూడా జారిపోయినది. కా.అ.యొక్క విధులలో ఒకటి మైనారిటీలకు ఉండవలసిన ప్రాతినిధ్యముల నిర్ణయించుట, వారి యొక్క హక్కులను కాపాడుట అయివుండును. అయితే దేశములో వివిధసంఘములు ఈసాంఘికతీర్పునుగూర్చి వివిధాభిప్రాయములు గలవగుటచే దానినిగూర్చి కాంగ్రెస్ వారు తమ యభిప్రాయమును చెప్పటగూడ ఆవశ్యకము.

"కాని కాంగ్రెస్ అనేసంస్థ దేశములో అన్నికక్షులవారికిన్ని సమానముగానే ప్రతినిధి అయియుండుటచే యీతీర్పునుగురించి కలిగినటువంటి భిన్నాభిప్రాయము లుంటూయుండగా అట్టి భిన్నాభిప్రాయము లున్నంతకాలము ఈతీర్పును కాంగ్రెసు

అంగీకరించనూజాలదు, తిరస్కరించనూజాలదు. అయితే సాంఘిక సమస్యమీద కాంగ్రెసుసంస్థయొక్క నీతిని ప్రకటించుట అవసరమే.

"జాతీయపద్ధతిమీద పరిష్కరింపబడని విధానము సైద్ధానినీ కాంగ్రెస్ ఉపపాదింపజాలదు. అయినప్పటికీ కాంగ్రెస్ ఇంతవరకుమాత్రము అంగీకరించుటకు శపథము చేసినది. కేవలము సంపూర్ణమగు జాతీయవిధానము ననుసరింపకపోయినను దేశములోని వివిధకక్షులవారు అంగీకరించినదానిని కాంగ్రెసువారు అంగీకరింతురు. వారు తిరస్కరించువిధానమును కాంగ్రెసు తిరస్కరించును."

"జాతీయప్రమాణమునుబట్టి విచారించి చూచినచో సాంఘికనిర్ణయము ఎంతమాత్రమూ తృప్తికరముగా లేదు. అంతేగాక యింకా యితర కారణములవలనగూడా దానినిగూర్చి తీవ్రమైన ఆక్షేపణలు గలవు."

"కాని యింతవరకు స్పష్టము. దీనివల్లను యిబ్బందులు కలుగకుండా వుండుటకు మనము మనదేశములో అన్నిపక్షములవారూ అంగీకరించేవిధానమును ఆలోచించవలయును. కాని కేవలము అంతరంగికవిషయమైన ఈసమస్యనుగూర్చి విదేశీయులైన బ్రిటిషువారికిగాని, యితరులకుగాని విజ్ఞాపనచేయరాదు."

గవర్నమెంటువారు ఖైదీలను గునుస్తూగునుస్తూ నెమ్మదిగా కొందరిని వదలిపెట్టినప్పటికీ వల్లభాయిపటేలునుగాని, గఫూరుఖానునిగాని, జవహరలాలునుగాని వదలిపెట్టుటకు వారి కిష్టములేనట్లు స్పష్టమయ్యెను. వీరిలో మొదటి యిరువురును విచారణలేకయే గవర్నమెంటు కిష్టమున్నంతకాలము స్టేటుఖైదీలుగా నిర్బంధములోనుండవలసినవారు. కాని అప్పటిలో వల్లభాయిపటేలుకు ముక్కులో తీవ్రమైనబాధ గలుగుటచే డాక్టరులచే వారిని పరీక్షచేయించి, ఆపరేషను అవసరమనియెంచి ౧౮ వ జూలైన వారిని విడుదలచేసిరి.

జూలై మాసాంతములో కాశీనగరమందు వర్కింగుకమిటీవారు సమావేశమై ఆనే మాలవ్యాగార్లతో సాంఘికనిర్ణయమునుగూర్చి చర్చజరిపిరి. వర్కింగుకమిటీవారు ఈతీర్పును అంగీకరించనూ అంగీకరించము, తిరస్కరించనూ తిరస్కరించము అను భావమును వదలుకొనకుండా ఇతరవిధముల సమాధానపడుటకు ప్రయత్నించిరి. సాంఘికనిర్ణయమువిషయమై మనస్సాక్షిసంబంధమైన ఆక్షేపణలు గలవారిని ఎన్నికలలో నభ్యర్థులుగ అంగీకరించుటకు కాంగ్రెసువారు తగిన మినహాయింపులు చేయించవచ్చునని గాంధీగారు యిచ్చిన సలహా వారిద్దరకును రుచింపక పా.బో.లోను వ.క.లోను తమపదవులకు రాజీనామా యిచ్చిరి. బెంగాలుయొక్క పరిస్థితులు చూడగా సాంఘిక

నిర్ణయమునుగూర్చియే గాక పూనా ఒడంబడిక ననుసరించి హరిజనులకు తమ రాజధానిలో యెక్కువస్థానములివ్వబడినవి అనికూడా బెంగాలీలకు వైమనస్యము కలిగెను.

స్వదేశీ ఉద్యమమునుగూర్చి ప్రజలమనస్సులలో కొన్నిసందేహములు కలుగుటచే ఖద్దరుప్రాముఖ్యము నెంతమాత్రమును తగ్గింపకూడదనీ, మిల్లుబట్టకును ఖద్దరుకును యేవిధమయిన పోటీ కాంగ్రెసువేదికపైనగాని, కాంగ్రెసు ప్రదర్శనములలోగాని అంగీకరింపకూడదనీ, వడుకునూలుబట్టనే ప్రోత్సాహముచేయవలె ననీ స్పష్టపరుపబడెను. ఇంకను యితరవస్తువులనుగూర్చి యీదిగువవిధముగా తీర్మానము చేయబడినది :

“ మన కవసరమైన అన్నివస్తువులును సాధ్యమైనంతవరకు గృహపరిశ్రమలవల్ల ఉత్పత్తి అయినవిగా నుండవలెను. ఈవిషయములోకూడా పనివాళ్లయొక్క శ్రేయస్సునుగూర్చిన్నీ, కూలినిగూర్చిన్నీ, ధరలనుగూర్చిన్నీ కాంగ్రెసువారు యిచ్చిన సలహా నంగీకరించిన ఉత్పత్తిదారులే ఆదరింపబడవలెను అని వర్కింగుకమిటీవారు తీర్మానము చేసిరి. ఈపైసూత్రముయొక్క ఉద్దేశ్య మేమనగా ప్రజలందరును స్వదేశీ అభిమానమును మానకుండా తాము స్వయముగా ఉపయోగించే ప్రతివస్తువున్నూ స్వదేశీవస్తువే అయియుండునట్లు చూడవలెను. ఎక్కువ మూలధనముతోను, గొప్పగాను నడుపబడే పెద్ద పరిశ్రమల విషయమై కాంగ్రెసువారి ఆదరణ అనావశ్యకము. గవర్నమెంటువారే సహాయము చేయుచున్నారుగదా”

కాంగ్రెసుయొక్క క్రమశిక్షావిధానమునుగూర్చి ఒకతీర్మానము గావింపబడినది. కాంగ్రెసుతీర్మానములకు వ్యతిరేకముగా సంచరింపరాదనిన్నీ, ప్రచారము సలుపరాదనిన్నీ, యిట్లుగా ప్రవర్తించు కాంగ్రెసు కార్యనిర్వాహకసభ్యులు కాంగ్రెసునియమావళి ౩౧-వ సూత్రముక్రింద ౨౮-౫-౧౯౩౪ తేదీన గావింపబడినశిక్షాస్మృతికి లోబడి శిక్షింపబడుదురనీ దీనిసారాంశము.

వర్కింగుకమిటీవారు శ్రీయుత ఆనేగారు అర్పించిన రాజీనామాను అంగీకరిస్తూ ఆట్టి రాజీనామాను ప్రేరేపించినవారియొక్క ఉత్కృష్టభావమును, వారు చేసిన గొప్ప సేవను కొనియాడిరి. ఆసమయమునందే డాక్టరు మహమ్మద్ ఆలంగారుకూడా వర్కింగుకమిటీపదవికి రాజీనామా యిచ్చిరి. అయితే కారణములు వేరు.

ఆనేగారున్నూ, మాలవ్యాగారున్నూ పైరీతిని తమ రాజీనామాలను అర్పించిన పిమ్మట, ఆగస్టుమాసాంతములో కలకత్తానగరమునందొకమహాసభను సమావేశపరచిరి. అందులో శ్వేతపత్రమును, సాంఘికనిర్ణయమును ఖండించి వేరే పార్టీని నిర్మించుకొని ఆపార్టీద్వారా శాసనసభల లోపలను, బయటను వీటిని ఖండించుచూ, ఆందోళన జరుపవలెననీ, శాసనసభలకు ప్రత్యేకముగా అభ్యర్థులను నిలువబెట్టవలెననీ నిర్ణయించ

బడెను. వ. క. వారు అ. భా. కా. క. సమావేశమును గావించి సాంఘికతీర్మానమును పునర్విమర్శనము చేయించవలసినదనీ ఆసభలో తీర్మానించబడెను.

ఆగస్టుమాసాంతములో తలవనితలంపుగా ఒక మేలు కలిగెను. అబ్దులుగఫూర్ ఖానుగారు అంతవరకును ఖయిదులోనే యుండిరి. సరిహద్దురాష్ట్రము గాంధీగారి తత్వమును సంపూర్ణముగ నవలంబించిన రాష్ట్రములలో నొకటి. రక్తపానమును గోరు సింహములవంటి పఠానులు మేకపిల్లలవలె అహింసాతత్వము నవలంబించిరి. వారిపై నమలుజరుపబడిన పరిపాలనావిధానము అనాగరికకాలమునాటి పరిపాలనమువంటిది. అయినను వారు గాంధితత్వమును విడనాడలేదు. అట్టి రాష్ట్రములోని నిజస్థితిని స్వయముగా తెలిసికొనుటకు గాంధిగారికి గవర్నమెంటువారు అనుమతి నొసగలేదు. ఇట్టి సందిగ్ధస్థితియందు హఠాత్తుగా గఫూరుఖానుగారున్ను, ఆయనసోదరుడు డాక్టరు ఖాన్‌సాహెబుగారున్ను ఆగస్టునెల కడపటివారము విడుదలచేయబడిరి. కాని వారి స్వదేశమైన పెషావరురాజధానికి పోరాదని నిషేధపుటుత్తరువు లొసగబడెను. ఈ రాష్ట్రములో శాసనోల్లంఘనమును మానమనగానే వెంటనే ప్రజలు కాంగ్రెసు ఉత్తరువును అంగీకరించిరి.

సెప్టెంబరుమాసములో వ. క. సమావేశమై కాంగ్రెసు ఆదర్శము సంపూర్ణ స్వరాజ్యమేననియు, ఆ ఆదర్శమును కేవిధముగాను భంగముకలిగింపలేదనియు తీర్మానించెను. రాబోవు ఎన్నికలలో కాంగ్రెసు అభ్యర్థులకు కాంగ్రెసువారందరును మనస్ఫూర్తికి సంబంధించిన ఆక్షేపణలు లేనంతవరకు సహాయము చేయవలెననియు, యితర పక్షములవారికి నారెవరును సహాయము చేయరాదనియుకూడ ఆసభ తీర్మానించెను.

ఆనే మాలవ్యాల నూతనపక్షము వ. క. వారి సాంఘిక నిర్ణయమును గూర్చిన తీర్మానమును పునర్విమర్శ చేయించుటకు అ. భా. కాం. సం. యొక్క మీటింగు చేయవలసినదని కోరియున్నారు. కాని విషయముయొక్క స్వభావమునుబట్టిచూచినా ఎన్నికలయొక్క సన్నిహితతనుబట్టి చూచినా యిట్టిమీటింగుచేయుటకు వీలులేదని వర్కింగుకమిటీ తీర్మానించుచు అవసరమయినయెడల ప్రత్యేకసమావేశమును కోరుచు అ. భా. కా. క. సభ్యులు ౩౦ మంది దరఖాస్తుపెట్టవచ్చునని తెలియజేసిరి. లోగడ వర్కింగుకమిటీవారు సాంఘికనిర్ణయమునుగూర్చి చేసిన తీర్మానమును అభ్యర్థులమీద నిర్బంధము చేయవలదని ఆనే మాలవ్యాగార్లు కోరిరి గాని యీకోరిక నిరాకరింపబడెను. కాని గాంధిగారుమాత్రము ఒకవిధమైన రాజీసలహా యిచ్చిరి. కాంగ్రెసు అభ్యర్థులకున్ను జాతీయపార్టీ అభ్యర్థులకున్ను పోటీ వచ్చినప్పుడు వారియొక్క బలాబలములను అంచనావేసి దుర్బలులు తొలగవలసినదని వారి అభిప్రాయము. ఇది ఎదిరి

వారికి రుచించలేదు. ఏ॰ ఎట్టున్నను ఆనీ మాలవ్యాగార్ల పత్యత్వములను పోటీచేయవలదని పా. బో. తీర్మానించెను. కలకత్తాలోను, సింధులోను కాంగ్రెసుపక్షము పోటీ చేయకూడ దని ఏర్పాటు చేయబడెను.

సెప్టెంబరుమాసములో ఒకగుకంటివార్త దేశమునందు వ్యాపకమైనది. అది వరకు జులైమాసములో గాంధీ దేశసంచారసందర్భమున ఆయనను చూచుటకు వచ్చిన ఆంధ్ర, బెంగాల మిత్రులతో తాను కాంగ్రెసులోనుండి వెళ్లిపోవడము ఉత్తమము గాదా అని ఆయన సూచ్చటిస్తూండేవారు. కాని యింత బహిరంగముగా ప్రసంగింపబడినను పత్రికలలో వెల్లడి కాలేదు. చివరకు వెల్లడి అయినప్పుడు దేశమంతా కలవరపడ్డది. ఈ వెల్లడిచేయడంలోకూడా కాంగ్రెసునియమావళిని మార్చవలెనని గాంధిగారు తెలియబర్చినారు. కనుక దేశములోని వివిధపక్షములవారు వివిధరీతులుగా చర్చలు, తర్కములు, వాదప్రతివాదములు జరుపుట తటస్థించినది. "ఈయన కాంగ్రెసులోనుండి ఎందుకు వెళ్లాలి? వెళ్తేవెళ్లాడు, నియమావళిని ఎందుకు మార్చాలి? ఈయన మార్పులు అంగీకరిస్తే ఉంటాడా? అవి కాకపోతే వెళ్లిపోవాడు ఇప్పుడే ఎందుకు వెళ్లాలి? ఎన్నికలైనతరువాత వెళ్లకూడదా? ఎన్నికలముందరా పోవడం? వెళ్లేవాడు అసలు బొంబాయికాంగ్రెసుకు ఎందుకు రావాలి?" అని దేశమునందు సంచలనము కలిగినది. ఇవన్నియు వికటవాదములు కావు. ప్రజలమనస్సులోని ఆలోచనలు. కొందరు పూర్వపక్షసిద్ధాంతములను తర్కించకనే యూహ్యబుద్ధిచేతను, దివ్యదృష్టిచేతను తమకర్తవ్యమును నిర్ణయించుకొందురు. వారు ప్రవక్తలు. కొందరు పెద్దల నిర్ణయముల ననుసరింతురు. వారు భక్తులు. వారివిశ్వాసమే వారికి రక్ష. కొందరు మంచిచెడ్డ లాలోచించి పర్యవసానమును తేల్తురు. వారు బుద్ధిమంతులు. కొందరు హేతువాదము ననుసరించీ, తర్కము ననుసరించీ నిర్ణయించుకొందురు. వారు మేధావంతులు. కొందరు తమమతము నవలంబించి యితరులవాదములను చొరనీయరు. వారు మూర్ఖులు. మరికొందరు తాము యితరులు నచ్చచెప్పినను తమభావములు వదలజాలరు. వారు దుర్బలులు. కాని స్నేహితులు, విరోధులు, అనుచరులు, ప్రేక్షకులు అందరూకూడా గాంధీగారి యీజటిలప్రకటనచే సంక్షుభితులైరి:

గాంధీమహాత్ముడు సెప్టెంబరు ౧౭న చేసిన యీదిగువ ప్రకటనను పత్రికలలో ప్రకటించెను.

## మహాత్ముని స్టేటుమెంటు

"కాంగ్రెసుతో సంబంధము వదులుకుంటానన్న మాట నిజమే. బొంబాయి కాంగ్రెసువరకును కాంగ్రెసును విడువవల దని మిత్రులు కొందరు నాతో చెప్పిరి

అందుకు సమ్మతించితిని. కాంగ్రెసులో నుండి, చురుకుగా పని చేయకుండా ఉండ కూడదా అని గోవిందవల్లభపంతు, అహమ్మద్ కిద్వాయిగార్లు ఒకమధ్యమార్గమును సూచించిరి. కాని వల్లభాయి, కలాంఆజాదు గార్లు అట్లు కూడ దనిరి. కాంగ్రెసుతో సంబంధము వదలుకొనుటకు సమయ మేతెంచిన దని నా యభిప్రాయము. చాల మంది యీ యభిప్రాయముతో ఏకీభవించకపోయినను వల్లభాయిగారు మాత్రము నాతో ఏకీభవించిరి. సంగతిసందర్భము లన్నిటిని ఆలోచించి బొంబాయి కాంగ్రెసు జరిగిన పిమ్మట కాని యీ విషయమును నిర్ణయించకుండుటకు నేను నిశ్చయించితిని.

"అక్టోబరువరకును నానిర్ణయమును ఆపియుంచుటకు కారణము గలదు. కాంగ్రెసులోని విద్యావంతులు చాలమంది నా పద్ధతులతోను, నాపద్ధతులకు సంబంధించిన కార్యక్రమముతోను విసిగి వేసారి రని నాయభిప్రాయము. కాంగ్రెసుయొక్క క్రమవికాసమునకు నే నడ్డాతగులుచున్నానని కూడ వారి తలంపు. కాంగ్రెసు కేవలము నాయాధిపత్యముచే ప్రజాసభ్యుల స్వతంత్రవివేచనకు తావు లేకుండ పోవుచున్నదని కూడ వారి యుద్దేశము. ఈవిషయముయొక్క యథార్థత లేక బొంబాయి కాంగ్రెసులో తేలుట కవకాశము కలదు. నాయభిప్రాయములకు గల కారణములను, వానికి సంబంధించిన సలహాలను నుంచుచు తెలియచ్చినయెడల కాంగ్రెసు ప్రతినిధులు లేక వానిపై తీర్మానమును వోట్లచేత నిర్ణయింపగలుగుదురు.

"నాకారణము లివి— కాంగ్రెసుసభ్యులకును నాకును అనేక ముఖ్యాంశములయందు భేదములు పొడచూపుచున్నట్లు నాకు గోచరించినది. కాంగ్రెసు సభలో విద్యాధికులు నాయెడల చూపుచుండిన విశ్వాసమును, భక్తిని ఎవరియెడలను చూపియుండలేదు. నాపద్ధతులయెడల వారికి అసమ్మతియుండియు, నా యెడలనుండు ప్రేమచే వారు వానికి లోబడుచుండిరి. కాని, వారికి నాపై గల భక్తివిశ్వాసములను పురస్కరించుకొని ఇక నెక్కువకాలము వారికి, నాకును గల భేదమును గమనింపకుండ నుండజనదు.

"వారికిని నాకును గల భేదము లివి:

## ఖాదీనియమము

"నాకార్యక్రమములో రాట్నము, ఖద్దరు ప్రధానస్థాన మాక్రమించుచున్నవి. కాని కాంగ్రెసులోని విద్యాధికులు నూలువడుకుటను పూర్తిగ మానివేసిరి. చాలమందికి దానియందు విశ్వాసము లేదు. నాలుగణాల సభ్యత్వపద్ధతికంటె స్వయముగ వడికిన నూలును పంపుటయే నాకెక్కువ యిష్టము. ప్రప్రథమమునుండియు, కాంగ్రెసునిబం

వనములలో ఖాదీనియమము నిష్ప్రయోజనముగా నుండెను. ఈ కపటనాటకమునకు స్వస్తి కావలెనని చాలమంది నాతో చెప్పిరి. కేవలము నాయెడల వారికుండు ప్రేమచేత ఖాదీనియమము కాంగ్రెసుకార్యక్రమమున నుంచబడినదే కాని, వారికి దానియందు విశ్వాస ముండి కాదు. ఈ విషయమును నేను బాగుగనే గ్రహించి యుండవలసినది. ఈ దేశములోని కోటానుకోట్ల కాయకష్టజీవులకు పాటకజనమునకు నిష్కళంకమైన అహింసాపద్ధతులచే స్వాతంత్ర్యము సమకూర్చవలసి యున్నయెడల ఖాదీనియమము అత్యవసర మని నాదృఢవిశ్వాసము. పనిలేని, తిండిలేని పాటకపుజనమునకువలె, విద్యాధికులు భగవంతు డిచ్చిన చేతులను వినియోగించకుండుటవలన కేవలము పరాన్నభుక్కులై పోవుదురు. కావున రాట్నము మానవుని ఆత్మగౌరవమును, సమానప్రతిపత్తిని చిహ్నము. వ్యవసాయమున కిది ఉపవృత్తి. వ్యవసాయమును, రాట్నమును ప్రజలకు ఊపిరితిత్తులవంటివి. మనము ఈ రెంటిలో నొకదానిని మాత్రమే ఉపయోగించుటవలన నశించుచున్నాము. ఖాదీనియమమును కార్యక్రమము నుండి తొలగించుట యనగా కాంగ్రెసునకును, పాటకజనమునకును గల సజీవసంబంధమును త్రెంపివేయుట యగును. ఆ నియమము ఉన్నంతవరకు దానిని ఆచరణలో పెట్టునట్లు నిర్బంధింపక తప్పదు. కాని ఎక్కువమందికి దానియందు విశ్వాసము లేనప్పుడు దానిని నిర్బంధపరచుట సాధ్యము కాదు.

## పార్లమెంటరీ ఎన్నికలు

“పార్లమెంటరీబోర్డుసంగతి నాలోచింపుదము. సహాయనిరాకరణమునకు నేను కారణభూతుడనైనను, దేశముయొక్క ప్రస్తుతస్థితిగతులలో శాసనోల్లంఘనము విరమింపబడినసమయమున, కాంగ్రెసు పార్లమెంటరీ బోర్డును ఒక శాఖగా నేర్పాటు చేసికొనుట అత్యవసర మని నాకు స్పష్టమైనది. కాని యీవిషయములో తీవ్రమైన అభిప్రాయభేదములు పొడచూపినవి. పాట్నాలో జరిగిన అల్ ఇండియా కాంగ్రెసుకమిటీయందు నే నీ కార్యక్రమమును దెల్పినందుకు నా సహచరులలో చాలమందికి కష్టము కల్గినది. నాయందు ప్రేమచే వారు తమ అభిప్రాయములకు విరుద్ధముగ పార్లమెంటరీ బోర్డును సమర్థించిరి. వ్యక్తిగతాభిప్రాయములను కొంతవరకు నిరోధించుకొని, ఇతరుల అభిప్రాయములతో ఏకీభవింపగల్గుట ఏ సంఘాభివృద్ధికైనను అత్యవసర మనుట నిశ్చయము. కాని దాని కొకమేర కలదు. ఇట్లు మాటిమాటికిని ప్రతిదినము స్వాభిప్రాయములను అరికట్టుకొనుట చాల పీడాకరము. ఈ విషయము నాకు బాగుగ బోధపడినది. దీనిని ప్రజలకు దెలుపకుండ మరుగుపరచజాలను. నన్ను ప్రతిఘటించుటకు చాలమంది వెరచుచుండిరి. ప్రజాస్వాతంత్ర్యవాదినైన నాకు ఇది యెంతయు లజ్జాకరము.

శుష్కవిప్లవులయొక్క సమానప్రపత్తికలిగి వారివలె నిర్వచనలేనటువంటి శక్తితో గూడ
వ్యక్తిని వినియోగించు నేను ప్రజాస్వాతంత్ర్యవాది నని నా స్వభావము అంగీకరించదు
అనియే నా యభిప్రాయము.

## సోషలిస్టుపార్టీ

"సోషలిస్టులు కాంగ్రెసులో ఒక పార్టీగ నేర్పడుటకు నేను ఎంతయో సంతో
షముతో అంగీకరించితిని. వారిలో చాలమంది గౌరవపాత్రులు, త్యాగశీలురు, నా
సహోదరులు. అయినను వారు ప్రకటించిన కార్యక్రమములో నేను ఏకీభవింపజాలను.
కాని వారి మతప్రచారస్వాతంత్ర్యమును అడ్డుటకు నేను ఇష్టపడువాడను గాను. కాం
గ్రెసులో వారు అధికసంఖ్యాకులైనయెడల, నేను కాంగ్రెసులో నుండజాలను.
నేను వారియెదుట నిలిచి ప్రతిఘటించుట నా కిష్టము లేదు. నేను ఏ సంఘము
లలో పనిచేసితిని గాని ప్రతిఘటనపక్షములో నుండి సాధించుట నా మతము కాదు.

## సంస్థానములు

"కాంగ్రెసు సంస్థానములపరిపాలనలో జోక్యము కల్పించుకొనరాదనియు,
సంస్థానప్రజల ఆందోళనములో పాల్గొనరాదనియు కొందరు వాదించుచున్నారు.
ఇది సరియని నేను సలహా యిచ్చియుంటిని. ఈ విషయమై నేను దీర్ఘముగ నాలో
చించినను నా యభిప్రాయమును మార్చుకొనజాలకున్నాను.

## అస్పృశ్యత

"అస్పృశ్యతావిషయములో నా త్రోవ వేరు. అస్పృశ్యతావిషయము నా దృష్టిలో
ధర్మమునకు సంబంధించినది; మతసంస్కారమునకు సంబంధించినది. చాలమంది
కాంగ్రెసుసభ్యులకు ఈ త్రోవ సమ్మతము కాదు. సత్యాగ్రహము సాగుచున్న రోజు
లలో హరిజనోద్యమమును జేసి ప్రజలదృష్టిని దీనికై మరల్చుట గొప్పపొరబాటని
చాలమంది అభిప్రాయము. నేను ఈ యుద్యమమును నా అంతర్వాణి ననుసరించి
నడిపినాను. నే నింకొకమార్గము నవలంబించుట అసంభవము.

## అహింస

"ఇక తుదివిషయము. కాంగ్రెసు అహింసాపద్ధతి నవలంబించి ౧౪ సంవత్స
రములైనది. కాని చాలమంది దానిని ఒక రాజనీతిగ నవలంబించుచున్నారు. కాని
నా కది కేవలము ధర్మపక్షము. కాంగ్రెసువారు అహింసను ఇంకను ఒక ధర్మపక్షముగ
స్వీకరించకపోవుట వారి దోషము కాదు. నేను దీనిని సరిగ బోధచేయకపోవుటచేతను,
క్రమమైన ఆచరణయందు పెట్టకపోవుటచేతను ఈ లోపము వాటిల్లినది. కాని ఈ

ప్రచారమునందును, ఆచరణయందును నేను బుద్ధిపూర్వకముగ ఎట్టిలోపమును చేయ లేదు. అయినను కాంగ్రెసువారి జీవితములో అహింసాతత్త్వము అంతర్వ్యాపితము కాలే దని ఊహింపవలసివచ్చుచున్నది.

శాసనోల్లంఘనము

“అహింసాతత్త్వమును గుర్తించే పరిస్థితి కూడా లేనప్పుడు శాసనోల్లం ఘనరూపము అస్పష్టముగా నుండుట సహజము. గడచిన ౨౮ సంవత్సరములనుండియు తీవ్రమైన ఆలోచనతో పరిశీలనచేసి అనుసరించుచుంటిని. అయిననూ అది సాంతముగ బోధపడి నదని నేను చెప్పజాలను. మానవజీవితమునందు శాసనోల్లంఘన సందర్భములు అరుదుగ నుండరాదు. అందుచేత దాని పరిశీలనకు ఎక్కువ అవకాశము ఉండనేరదు. జననీజన కులకు, ఉపాధ్యాయులకు, పెద్దలకు, మతిరాజకీయాది విషయములయందు విధేయులవారికి సత్యాగ్రహము లవసరము. నేనీ విషయమున నెన్నిలోపములు కలవాడనైననూ, ఈ విష యములో నేనొక్కడనే అనుభవజ్ఞుడ నగుటచే కొంతకాలమువరకు నేనొక్కడనే సత్యాగ్రహము చేయుదునని నిశ్చయించుకొనుటలో ఆశ్చర్యము లేదు. ఇంతటి దోష ములను తగ్గించుకొనుటకు, ఇంతటి గర్భితశక్తులను గనుటకును ఈ నిర్ణయము మనవ సరము. ఈ విషయముపై ఇటీవల చేయబడిన తీర్మానములను బట్టి కాంగ్రెసువారు అను కూలముగా బోధచేసినను, నాకిది నాతోపాటుగా శోధింపచేయ జాలకపోయినది యనుట స్పష్టము. కాని అది వారితప్పు కాదు. తీర్మానములందు సరియైన నమ్మకము లేకయే వారు నాకు అనుకూలముగ వోటుచేయుట వారికెట్లు కష్టము కలిగించినదో నాకును అట్లే కష్టము కలిగించినది. ఆకష్టము వారికి ఉండకూడదు, నాకును ఉండ కూడదు. మనమందరము కోరుచున్న ఆదర్శములు మనము సాధింపవలసినయెడల ఎవరి విశ్వాసముల ననుసరించి వారు స్వేచ్ఛగాను, ధైర్యముగాను ప్రవర్తించుట అవసరము.

మన లోపము

“సత్యాగ్రహమువలన ముఖ్యముగా రెండు ఫలితములు సిద్ధింపజాలకపోయినవని నేను పాట్నాలో చేసిన ప్రకటనయందు తెల్పియుంటిని. మనలో అహింసాతత్త్వము పూర్తిగా జీర్ణించి యుండినయెడల అది స్వయముగ ప్రభుత్వమువారిచే గమనింపబడి యుండెడిదే. మన యకార్యములవలన ప్రభుత్వమువారు ఆర్డినెన్సులను ప్రయోగించి యుండలేదు; ఎట్లయిన మన ఉత్సాహమును అణచివేయుటకు ప్రయోగించిరి. కాని సత్యాగ్రహములయందట్టి దోషములు లేదని మనము వాదించుట తప్పు. అహింసా సిద్ధాంతముపైని మనకు భక్తి యుండినచో అది స్వయముగ వ్యక్తమై యుండెడిదే. దౌర్జన్యపరులకు తమ దౌర్జన్యసిద్ధాంతమునందుకంటె మనకు అహింసాసిద్ధాంతముపై

నెక్కువశక్తి యున్నదని ఆచరణపూర్వకముగ మనము చూపి యుండలేదు. పైగా వారికివలెనే మనకును మనస్సులో దౌర్జన్యభావము లున్నవని వారు తలచునట్లు చేసితివి. ప్రత్యక్షముగా దౌర్జన్యకార్యములు చేయుటమాత్రము మన కిష్టము లేదు. 'దౌర్జన్యభావము రెండు తెగలవారికిని సమానమే యైనయెడల దౌర్జన్య కృత్యములు చేయుటయా, మానుటయా అను విషయము వ్యక్తిగతాభిప్రాయములను బట్టి యుండును' అని వారు వాదించుచున్నారు. వారి వాదన యుక్తమైనదే. నేనింత వరకు అహింసాసిద్ధాంతమువిషయమై చాలా కృషి చేసినమాట నిజము. అనేకులు త్యాగసాహసములను జూపించియున్నారు. కాని, మన అహింసాప్రవృత్తి త్రికరణ శుద్ధిగ నుండలేదనిమాత్రమే నేను చెప్పుచున్నాను. ప్రభుత్వమువారికి, అరాజక వాదులకు అహింసాతత్వముయొక్క శక్తి సామర్థ్యములను ప్రదర్శించి చూపి, స్వాతంత్ర్యాదిలక్ష్యముల సాధించుటకు అది ఎంతయు తగియున్నదని సాధన విశేషములచే విశదీకరించుట నా విధియైయున్నది.

## సత్యమే నా దైవము

"ఈ ప్రయత్నమునకే నా జీవితము అంకితమైనది. దీనికి నాకు సంపూర్ణస్వాతంత్ర్య ముండవలెను. నా దృష్టిలో సత్యాగ్రహము సమష్టిగతమైన జీవితధర్మము. సత్యమే నాదైవము. అహింసామార్గమే భగవంతు నన్వేషించుటకు త్రోవ. దేశస్వాతంత్ర్యమునకు, ప్రపంచ స్వాతంత్ర్యమునకుగూడ అదియే మార్గము. ఈ యన్వేషణము కొరకే నేను రాజకీయములలో ప్రవేశించితిని. కాని, కాంగ్రెసులోని విద్యాధికులబుద్ధి కిది నచ్చనప్పుడు, వారి శ్రద్ధాభక్తుల నిది చూరగొనజాలనప్పుడు నేను చేయవలసిన దేమి? ఇప్పుడు గాకపోయిన నింకొకప్పుడైనను వారు దీనిని గ్రహించితీరుదురను దృఢ విశ్వాసముతో, భగవంతుడే యుద్బోధితముగ నాచే నేదైనను పలికించి, ఏదైనను చేయించునను నమ్మకముతో, కేవల మొక్కడనై నేను పనిచేయవలసియున్నది. ఇట్టి అత్యంతముఖ్యవిషయములందు కేవలము వోట్లిచ్చుటయు, సంతోషముతో ఆమోదము తెల్పుటయు నిష్ప్రయోజనములే గాక, ఉద్యమమున కరిష్టదాయకములుగూడనగును."

## సంపూర్ణస్వాతంత్ర్యము

"పూర్ణస్వరాజ్యము విషయమై నా యర్థమే కాంగ్రెసువారందరును గ్రహించుచున్నారా యను సందేహము కలుగుచున్నది. ఇండియాకు సంపూర్ణస్వాతంత్ర్యము కావలెననియే నా యాశయము. ఆంగ్లమున సంపూర్ణస్వాతంత్ర్యమునకు ఎట్టి అర్థమున్నదో, అట్టి అర్థములోనే నేను దానిని వాడుచున్నాను. కాని సంపూర్ణ స్వాతంత్ర్యముకంటె పూర్ణస్వరాజ్యము వేయిమడుగులు అధిక మని నాతలంపు. కాని పూర్ణ

స్వరాజ్య మనుమాటకూడ కావలసినయర్థమును పూర్తిగ ధ్వనించుటలేదు. ఏ వ్యస్త పదముగాని, ఏ సమాసపదముగాని సంపూర్ణాభిప్రాయమును ద్యోతకము చేయజాలకున్నది. అందుచేతనే స్వరాజ్య మన నేమో అన్నిసార్లు నిర్వచింపవలసివచ్చినది. ఆ నిర్వచనము లన్నియు సరియైనవే. కాని వాటినన్నిటిని కలిపి చూచినను ఇంకను చాల కొరవడియున్నట్లే గోచరించును.

## పద్ధతులు—ఫలితములు

ఈ సందర్భమున నాకును, చాలమంది కాంగ్రెసువాదులకును గల మరియొక భేదమును తెలుపవలసియున్నది. పద్ధతులకును ఫలితములకును అవినాభావసంబంధమని ౧౯౦౩ నుండి నేను చెప్పుచునేయున్నాను. పద్ధతులు వివిధములై పరస్పరవిరుద్ధము లైనయెడల, ఫలితములును అట్లే వివిధములు కాకతప్పదని నా యభిప్రాయము. పద్ధతులు మనచేతులలో నున్నవిగాని, ఫలితము లుండవు. కాని మనమందరమును ఏకాభిప్రాయులమై ఒక నిర్దిష్టమైనపద్ధతులనే అవలంబించుచున్నయెడల, ఫలితములనుగూర్చి మనము ఆందోళన పడనక్కరలేదు. కాని యీ సత్యము చాలమంది కాంగ్రెసువారికి ఆమోదకరమైనట్లు తోచదు. పద్ధతు లెట్టివైనను సరే, ఫలితమే ముఖ్యమని వా రభిప్రాయపడుచున్నారు.

## రక్తకవచులు

ఈ భేదాభిప్రాయములే ప్రస్తుత కాంగ్రెసు కార్యక్రమమును స్తంభింపజేసినవి. మనఃపూర్వకముగాక, కేవలము వాచికమైన స్తుతిమాత్రమే వారు చూపుచుండుట వలన దాని నాచరణలో పెట్టజాలకపోయిరి. దేశమున కిప్పుడు కాంగ్రెసుకార్యక్రమముతప్ప ఇంకొకటి సూచింపజాలను. అస్పృశ్యతానివారణము, హిందూమహమ్మదీయైక్యత, మద్యపాననిషేధము, ఖాదీపరిశ్రమ, స్వదేశీదీక్ష, (గ్రామపరిశ్రమల పునరుద్ధరణము), గ్రామపునర్నిర్మాణము—ఇవియే దేశభక్తిపరు లైనవారు కొనసాగింపవలసిన పనులు. నామట్టుకు నేను వాయువ్యరాష్ట్రమందు ఏగ్రామములోనో పీఠము వేసికొని పనిచేయవలెనని యున్నది. రక్తకవచులు (ఖుదై ఖిద్మత్గారులు) నిజముగ అహింసాపరులే యైనయెడల, హిందూమహమ్మదీయసఖ్యమునకు తోడ్పడగలరు. త్రికరణశుద్ధిగ వారు అహింసావ్రతులై, హిందూమహమ్మదీయసఖ్యమునే వారు మనఃపూర్వకముగ గోరుచున్నయెడల, వారి మూలమున దేశమునకు ముఖ్యమైన రెండుఫలితములను మనము సాధింపగలము. మనలను భయపెట్టుచున్న ఆఫ్ఘనుసమస్య పూర్తిగ నశించిపోగలదు. రక్తకవచులు అహింసావ్రతులనుమాట ఎంతవరకు సత్యమో నేను పరీక్షింప నాతురపడుచున్నాను. ఖాదీసందేశమునుగూడ నేను వారికి దెలుప

గోరుచున్నాను. కాంగ్రెసునకు లోపలనున్నను, బయటనున్నను ఇట్టివిధమున నా తోటివారిని సేవచేయుటకే నేను వాంఛించుచున్నాను.

## కాంగ్రెసుసంస్థలలో అక్రమకార్యములు

"ఇక చివరకు మిగిలినది కాంగ్రెసుసంస్థలలో జరుగుచున్న అక్రమకార్యముల విషయము. చెప్పవలసిన దిదివరకే చెప్పియుంటిని. ఇంకచెప్పినను, కాంగ్రెసే దేశప్రజలకు ప్రతినిధి యనియు, ఇతరసంస్థలకంటె శక్తిమంతమనియు నా యభిప్రాయము. మొట్టమొదటినుండియు అది త్యాగము చూపి, దేశమున కుదారమైనసేవ యొనర్చినది. అనేకములైన తుపానుల నెదుర్కొనినది. నిర్దుష్టశీలురైన అనేకమంది స్త్రీపురుషుల సభ్యత్వమును గలిగియున్నది. ఇట్టిసంస్థను వదలివేయుట నాకు సంతాపకారణమే కాని, కాంగ్రెసుకు బయటనుండియే దానికి, అనగా దేశమునకు ఎక్కువసేవ చేయగలుగుదు నని నాకు నమ్మకము కుదిరినప్పుడే నే నట్లు చేయుదును.

"నేను సూచించిన అన్నివిషయములపైన నా కాంగ్రెసు అభిప్రాయమును పరిశీలించుటకై ఈక్రింది సవరణలను విషయనిర్ణయసభలో ప్రతిపాదింపదలచుచున్నాను:

౧. "సక్రమము,శాంతియుతము"(legitimate and peaceful)అను మాటలకు బదులుగా "సత్యబద్ధము, అహింసాత్మకము" (truthful and non-violent) అను మాటలను నేను చేర్పగోరుచున్నాను. "సక్రమము, శాంతియుతము" అను మాటలకు బదులు "సత్యబద్ధము, అహింసాత్మకము" అని నేను వాడుచుండుట చాలప్రతిఘటనకు కారణమయ్యెను. అందుచే నీప్రతిపాదనము అవసరమైనది. గమ్యస్థానమును జేరుటకు సత్యాహింసలు అవసర మని కాంగ్రెసువారు నిజముగ నమ్ముచున్నయెడల, నిస్సంకోచముగ నా యీసవరణను ఆమోదింపవలసియుండును.

౨. నాలుగణాల చందానియమమునకు బదులు ప్రతిసభ్యుడును తాను స్వయముగా వడికి చక్కగా అసుపోసిననూలును నెలకు ౨౦౦౦ అడుగుల చొప్పున పంపవలెనను నియమమును ప్రవేశపెట్టగోరుచున్నాను. ఈవిషయమై వాదప్రతివాదముల నిట చేయనవసరము లేదు. మనది నిజముగ ప్రజాప్రాతినిధ్యసంస్థయే యైనయెడల, మిక్కిలి తక్కువ కూలి తెచ్చుకొను పాటకజనమునకే ప్రతినిధులము కావలసియున్నయెడల, ఈ నూలుపద్ధతికన్న మంచిది మరియొకటి లేదు. నూలు వడుకు వృత్తివలన గిట్టుబాటగు కూలి అత్యంతము స్వల్పమేయైనను అదియే అత్యంతము గౌరవప్రదము. యుక్తవయస్సువచ్చిన ప్రతివ్యక్తికి వోటింగుహక్కు ఉండవలెనను సిద్ధాంతమున కిది మిక్కిలి చేరువ. దేశమునిమిత్తము ప్రతిదినము ఒక అరగంటసేపు కాయకష్టపడగల ప్రతి

వ్యక్తికి ఇది సులభసాధ్యము. దానివలన ఆర్థికప్రయోజనము-మాట యటుంచుడు. విద్యుతలె కాయకష్టముకూడ తనకు తానే ఫలరూపము కాదా? మనము నిజమైన ప్రజాసేవకులమే యైనయెడల, ప్రజలనిమిత్తము వడుకుట మనము గౌరవప్రదముగ భావింతుము. "పశుబలమునకు కరవాలము ఎట్లు చిహ్నమో, రాట్నము అహింసకు ప్రజాసేవకు, నమ్రభావమునకు చిహ్నం" మని మౌలానా మహమ్మదాలీ నుడువుచుండెడివాడు. అందుకనియే దానిని జాతీయపతాకములో చేర్చుటకు అందరును ఆమోదించిరి. ప్రతిగృహములోను రాట్నధ్వని తప్పక వినబడవలెననియే అది సూచించుచున్నది. రాట్నసందేశమునందు కాంగ్రెసువారికి నమ్మకము లేనియెడల దానిని జాతీయపతాకమునుండి తీసివేయవలెను. కాంగ్రెసుప్రణాళికనుండి ఖద్దరు నియమమును కూడ తీసివేయవలెను. ఖద్దరునియమపాలనమునందు అగౌరవకరమైన మోసకృత్యమున కాస్పదము గల్గుట సహింపరానిది.

౩. కాంగ్రెసు రిజిస్టరులో వరుసగా ఆరునెలలు పేరులేనివాడు ఎవడును ఏ కాంగ్రెసు ఎన్నికలోను పాల్గొనరాదు. అన్నినాళ్లును, అనగా ఆయారు నెలలును అతడు శుద్ధఖద్దరు ధరించువాడై యుండవలెను. ఖద్దరునియమమును అమలు పరచుటలో చాల ఇబ్బంది కలిగినది. ఒక వోటరు సాధారణముగా ఖద్దరు ధరించువాడా, కాడా అను విషయము నిర్ణయించుటకు ఆయా కమిటీల అధ్యక్షులకు అధికారములిచ్చినయెడల ఈ యిబ్బంది చాలవరకు తొలగిపోగలదు. దీనివిషయమై కాంగ్రెసు ప్రెసిడెంటుకు అప్పీలుచేసికొను అవకాశముకూడ నుండవచ్చును. వోటింగు సమయమున పూర్తిగ ఖద్దరు ధరింపనివానిని నిత్యమును ఖద్దరుధరించువానినిగా భావించుటకు వీలులేదు. కాని, ఎంత జాగరూకతతో చేయబడిన కఠిననిబంధనలైనను అధికసంఖ్యాకులు వానిని ఇచ్ఛాపూర్వకముగ నమలులో పెట్టనియెడల ప్రయోజనము నుండనేరదు.

౪. కాంగ్రెసుసభ అత్యధికసంఖ్యాకమైపోయినది. కాంగ్రెసుసభకు ప్రతినిధులు ౬,౦౦౦ అని యున్నను, వీరందరును కాంగ్రెసుసభ కెప్పుడును హాజరై యుండుటలేదు. నేనీ ప్రతినిధులను వేయిమందికి మించకుండ నుండునట్లు చేయుటకు సవరణలు ప్రతిపాదింపనున్నాను. ప్రతి వేయిమందివోటరులకు ఒక్కప్రతినిధికంటె ఎక్కువమంది ఉండగూడదు. ఈ సవరణవలన కాంగ్రెసునకు ప్రతినిధులసంఖ్య తగ్గినను, పని చక్కగ జరుగుటకు వీలగును. ప్రేక్షకులను ఎక్కువగా రానిచ్చుటకు ఏర్పాట్లను చేయవచ్చును. కాని, అత్యధికసంఖ్యాకులగు ప్రతినిధులకు సౌకర్యము లొనగూర్చుటెట్లా యను ఆహ్వానసంఘమువారి అనవసరాందోళనము చాలవరకు తగ్గును. కాంగ్రెసునకు ప్రతిష్ఠ, ప్రజాప్రాతినిధ్యగౌరవము, పలుకుబడి ప్రతినిధుల సంఖ్యను బట్టి వచ్చుచుండుటలేదు. ఒకదినముకంటె ఇంకొకదినము అధికముగ అది చేయు

చున్న సేవనుబట్టియే దానికి ప్రతిష్ఠ యేర్పడుచున్నది. పాశ్చాత్యదేశములోని ప్రజాస్వాతంత్ర్యవిధానము ఇప్పుడు పట్టుదప్పి ఊగిసలాడుచున్నది. ఒక విధముగ ఆ విధానము నిరర్థకమైపోయినదనియే చెప్పవచ్చును. నిజమైన ప్రజాస్వాతంత్ర్యతత్త్వమును నిరూపించి, దాని జయమును భారతదేశము ప్రపంచమునకు చాటునుగాక! కాలుష్యము, కపటనాటకము ప్రజాస్వాతంత్ర్య విధానమునకు ఫలితములుగ నుండగూడదు. కాని ప్రస్తుతమున ఈ కాలుష్యమే, ఈ కపటనాటకమే కానవచ్చుచున్నది. జనబాహుళ్యమునుబట్టి ప్రజాస్వాతంత్ర్యము పరిశీలింపబడదు. ప్రజల ఆశయములకు ప్రాతినిధ్యము వహించువారు కొలదిమందే యుండినను, వారి కూటమియే ప్రజాస్వాతంత్ర్యసంస్థ యని పేర్కొనదగియుండును. బలాత్కారముచే ప్రజాప్రతినిధి ప్రభుత్వము నిర్మింపబడజాలదని నానమ్మకము. ప్రజాస్వాతంత్ర్యతత్త్వము బాహ్యము నుండి తెచ్చిపెట్టుటచే అలవడునది కాదు. ప్రజలు తమంతట తామే అలవరచు కొనవలసినది.

"నేను పేర్కొన్న ఈ సవరణలను కాంగ్రెసుసభకు వచ్చెడి కాంగ్రెసువారిలో చాలమంది ఆమోదింతురని నాకు తోచదు. ఏమైనను, కాంగ్రెసుకార్యవిధానమును నేను వదలిపెట్టియున్నయెడల, మన గమ్యస్థానమును త్వరలో చేరగలుగుటకు ఈ సవరణలు అవసర మనియే నాతలంపు. సభ్యులైనవారు త్రికరణశుద్ధిగ ఆయా కార్యవిధానములందు ఇచ్ఛాపూర్వకముగ పాల్గొననియెడల ఏసంస్థయు విజయమును బడయజాలదు. అనుయాయులైనవారు తమ నాయకుల ఆదేశములను నమ్మకముతోను, విధేయతతోను, తెలివితేటలతోడను నిర్వర్తింపనియెడల, ఆ నాయకునిశ్రమయు నిష్ఫలమగును. కావున నేను పైని సూచించిన ముఖ్యవిధానములలో ఎట్టి రాజీపద్ధతియు పనికిరాదని స్పష్టమగుచున్నది. కావున కాంగ్రెసువారు నాపై అభిమానమును వేరుగ నుంచి, పైవిషయములను స్థిరచిత్తముతో పరిశీలించి తమబుద్ధికి వచ్చినట్లు ప్రవర్తింతురుగాక!"

బొంబాయి కాంగ్రెసుసభ గాంధి రాజీనామా లేకపోయినట్లయితే నీరసముగా నుండేది. దీనికితోడు కాంగ్రెసునియమావళియందు చేయగోరిన మార్పులు గూడ కొంతవరకు ఉత్సాహమునకు కారణము లయ్యెను. ౧౯౩౪ సం.లోని తరువాతి కాంగ్రెసు యథావిధిగ సమావేశము కానున్నదనువార్తయే ప్రజల మనస్సులకు కొంత విశ్వాసము కలిగించినది. జనము పక్షవాతము వచ్చినరోగివలె నిశ్చేష్టితమై యుండుట చేత ఏవిధమయిన కలయిక పొందగలిగినా కొంతమేలే అనే భావము వ్యాపకమైనది. కాంగ్రెసు నియమావళియొక్క సంస్కరణప్రణాళిక ముఖ్యముగ అచిరకాలములో

వా. బో. సామ్యవాదము, సాంఘికతీర్మానము యివన్ని మరుగుపడెను. కాంగ్రెసు కేవలము నేత్రోత్సవముగా చూడదగిన సమావేశముగా గాక వ్యవహారసంస్థగా నుండ వలె నని గాంధీఆలోచన. అందుచేత ప్రతినిధులసంఖ్యను వేయికి తగ్గించి, వారే అ. భా. కా. క. సభ్యులుగా నుండవలెననీ, వారిలోనుండి రాష్ట్రీయకమిటీలు ఏర్పా టుచేయబడవలయుననీకూడ ఆయన చెప్పియున్నారు. నిజంగా గాంధిగారు కోరింది యిది: రాజధానికమిటీలు సమావేశమై కాంగ్రెసుగా పనిచేసి తిరిగీ విడిపోయి, రాజ ధానికమిటీలుగా కాంగ్రెసుఆజ్ఞలను శిరసావహిస్తూ దేశమంతా ఒక్కసూత్రము మీదను కార్యమును నడిపించవలె ననియే. ఇంతేకాక కాంగ్రెసుసభ్యులు ముఖ్యముగా ఎన్నికపదవులను గోరువారు అనుదినము కాయకష్టము కొంత చేసి దానియొక్క ఫలి తమును దేశదారిద్ర్యనివారణ కర్పించవలెనని గాంధిగారి ఆదర్శము. స్వరాజ్య మనగా అందరికీ అన్నవస్త్రాదులు లభించుట అను నిర్వచనమూ సరియైన దైనచో వాటిని వృత్పత్తిచేయుగలిగినది కాయకష్టమే. కనుక ప్రతివారునూ సంస్కారముగా యిట్టి శ్రమను గావింపవలె నని వారి తలంపు. మూడవమార్పు ఏమనగా, ప్రతికాంగ్రెసు మెంబరున్నూ వోటుచేయుటకు ఆరుమాసముల ముందు సభ్యుడుగా చేరియుండవలెను. ఇందువల్ల ఎన్నికలకు ముం దప్పటికప్పుడు మెంబర్లను చేర్పించు దురాచారము పమసి పోగలదు. నాల్గవది, కాంగ్రెసుప్రెసిడెంటు తనమంత్రివర్గమును తాను నియమించు కొనవలెనని. కాంగ్రెసు అభ్యర్థులు నిత్యఖద్దరుధారులుగా నుండవలె నను కట్టుదిట్టము అయిదవది. ఆరవది కాంగ్రెసులక్ష్యమునకు చెందినమార్పు. ఈలక్ష్యము పూర్ణస్వా తంత్ర్యము. ఇందుకు సాధనములు "శాస్త్రసమ్మతములై నవి, శాంతియుతము లైనవి." ఇప్పుడో, యీసాధనములు సత్యవంతములై నవి, అహింసానుసరణము లైనవిగా నుండ వలెనని గాంధిగారు మార్పుచేయదలచిరి. ఈ చివరిమార్పు సుపానువలె పనిచేసెను. సభలోని జనముయొక్క మనస్సులు చెల్లాచెదరై పోయినవి. కాని తనచుట్టూ పెద్ద తుపాను రేగుచున్నప్పుడే గాంధిగారియొక్క నిశ్చలత, స్థైర్యము, ధీరత్వము కనబడు నది. తనయొక్క సవరణల నన్నిటిని ఆయన రెండువర్గములుగా విభజించెను. కేవలము కాంగ్రెసునిర్మాణవిధానసంబంధములై నవి కొన్ని, సత్యాగ్రహవాసనలుగలవి కొన్ని. రెండవతరగతివాటిని వర్కింగుకమిటీవారి యిష్టమువచ్చినట్లు చేయవచ్చునని ఆయన వదలివేసెను. మొదటితరగతివాటిని తా నుపపాదింతు ననియు, వాటి కంగీకారము విశ్వాస సూచకముగ ఎంచుకొందు ననియూ ఆయన చెప్పెను. కాని ఆగంతుకముగ వర్కింగు కమిటీవారు రెండుతరగతుల సవరణలను అంగీకరించిరి. కాంగ్రెసుకూడా చాలవర కంగీకరించెను. ఒక కాంగ్రెసులక్ష్యములోని సాధనములకు వర్తించు మార్పుమాత్రము

౧౯౩౬ కాంగ్రెసువరకు వాయిదా వేయబడినది. కాంగ్రెసు ప్రతినిధుల సంఖ్య ౨౦౦౦ గా నిర్ణయింపబడెను. పట్టణములకు ౫౧౧ మండి, పల్లెలకు ౧౪౮౯ మందీ నిర్ణయింపబడిరి. ఖద్దరుధారణము పూర్వమువలెనే వుంచబడెను. శరీరశ్రమ ఎన్నుకోబడిన మెంబర్లకు వర్తింపచేయబడెను. ప్రతినిధులసంఖ్య సభ్యులసంఖ్యతో లంకెవేయబడి ౫౦౦ సభ్యుల కొక ప్రతినిధి ఏర్పాటుచేయబడెను. అ. భా. కా. క. సభ్యులు కాంగ్రెసుప్రతినిధులలో ౧౫ వ వంతు వుండునట్లేర్పాటు చేయబడెను.

అయితే ఒక్క ప్రశ్నకు సమాధానము చెప్పవలసియున్నది. కాంగ్రెసునియమావళిని బొంబాయి సమావేశములో ఎందుకు సంస్కరించవలసి వచ్చినది? దీనికిని గాంధీగారి నిర్గమనమునకును సంబంధము గలదు.

దేశమునకు విరామము చిక్కినది. విశ్రాంతికాలమే యిల్లు సవరించుకొనవలసినకాలము. రేపటి కేమి సంభవించునో, వెల్తురున్నప్పుడే చక్కబెట్టుకోవలయును. గాంధీగారు సేనాని. తాను నాయకత్వము వహించినను, వదులుకొన్నను సేనలోని లోపములు చూపించుట సేనానివిధి.

బొంబాయిలో ఎన్నుకోబడిన తీర్మానము నియమావళికి సంబంధించిన మార్పులు గాదు; సాంఘికతీర్పుయొక్క ఖండనమూ కాదు; పార్లమెంటు బోర్డుయొక్క నిర్మాణమూ గాదు. అఖిలభారతగ్రామోద్యోగసంఘముయొక్క నిర్మాణమే అది. అంతగా అందరిదృష్టిని ఆకర్షించకపోయినప్పటికీ అన్నిటిలోను ఎన్నికగా ఎంచుకోవలసిన తీర్మానమదేనని చెప్పవచ్చును. ఖద్దరు గ్రామోద్యోగములలో కెల్ల మొట్టమొదటిది. దేశముయొక్క కళాశిల్పములే దాని సభ్యతకు నిదర్శనములు. విజ్ఞానము లోకమున కంతకూ చెందినసొత్తు. కౌశలముతో కూడిన కళాసౌష్ఠవము సభ్యతకు నిక్కమైన లక్షణము. వీనివల్లనే సృజనశక్తి పెంపొందును. సౌందర్యభావము ప్రబలును. అట్టికళలూ, చేతిపనులూ నశించిన మనగ్రామములను తిరిగి స్వయంసంపూర్ణములుగా గావించుటయే గాంధీ పరమోద్దేశ్యము. దేశముయొక్క ఆర్థికవిధానమును పరిష్కరించి తదనుగుణముగ విద్యావిధానమునుగూడ మార్చుట అత్యవసరము. వీటిని గూర్చిన గాంధీగారి భావనలు విప్లవకరములు. ఒకపక్కను సభామండపము వంటి ప్రాసాదములునూ, నాటి నంటి మరియొకప్రక్కను బురదలో నుండెడు గుడిసెలునూ, సముద్రములతరబడి వ్యాపారమునూ, కొంపెలతరబడి వుత్పత్తినీ గాంధీగారికి నచ్చవు. పేదవానియొక్క ఎండురొట్టెమీద పిల్లైతే ఒక నేతిబొట్టు వేయగలెననుటయే ఆయన పరమావధి. ఇట్టి ఆశయములను నెరవేర్చుటకుగాను అఖిలభారత చరఖాసంఘమును, అఖిలభారత గ్రామోద్యోగసంఘమును నిర్మింపబడ్డవి.

బొంబాయిలోని సంఘటనములలో మిక్కిలి ముఖ్యమైనది గాంధీగారి నిర్గమన మని చెప్పవచ్చును. ఆయన ఆ విషయములను రహస్యముగా కప్పిపెట్టలేదు. కాని సత్యమును సంపూర్ణముగ చెప్పెను. సత్యమును, అంత సత్యమును చెప్పి సత్యముతప్ప వేరెద్దియూ చెప్పనివారింకా కొంత సత్యమును మరుగుపరచినారనే అనుమానమునకు లోనగుదురు. గాంధీ తానేమాట చెప్పినను, చెప్పినదానివిలువ చెప్పినట్టుగా కట్టవలె ననీ అందులో వెనుకతగులు లున్నట్టు భావింపరాదనిన్నీ ఆయనకోరిక. కాని ప్రజలు దానిని గమనించరు. ఏది ఎట్లున్నను గాంధీ కాంగ్రెసునుండి వెళ్లుటలో దేశీయుల సంపూర్ణవిశ్వాసమును కలిగియుండుటయేకాక వారిహృదయపూర్వక ఆహ్వానమును కూడ పొందగలిగియున్నారు. ఆయనకు కావలసిన నొక్క గ్రామోద్ధరణము. ఖద్దరందును, అహింసాతత్వమునందును విశ్వాస మెవనికి గలదో వారు సామ్యవాదులు గానీ, ఇతరులుగానీ ఆయనదృష్టిలో పవిత్రులైన కాంగ్రెసువాదులు. ఆయనకంటె సామ్యవాది యెవరు? పేరునకును వాదమునకును కాదు. ఆస్తిని వదులుకొని ఆశ్రమమును మార్చుకొన్న సామ్యవాది.

'గాంధీగారు కాంగ్రెసునుండి వెళ్లిపోయినారుగదా! ఇక వారేమి చేస్తారు?' అని కొందరన్నారు. 'ఏమి చెయ్యలేరు?' అని మరికొందరన్నారు. ఆయన చెయ్యవలెనంటే శాసనోల్లంఘనమును ఆయనచేతులలోనే అట్టిపెట్టుకొన్నారు. చరఖా సంఘమున కాయన అధ్యక్షుడు. గ్రామోద్యోగసంఘకార్యక్రమమును నడుపవలసిన వారు ఆయనే. నిర్మాణకార్యక్రమము, విధ్వంసకార్యక్రమము, కట్టడము పడగొట్టడము అంతా ఆయనచేతులలోనే ఉండిపోయినది. అయితే మన కేమి మిగిలిన దని కొందరడిగినారు. మన కేది కావలెనంటే అదే కలదని జవాబుచెప్పినారు కొంతమంది. ఏడులక్షల గ్రామములను పునరుద్ధారణచేయుట సులభసాధ్యము కాదు. పోనీ శాసనోల్లంఘనము చేతామని కోరిక గలిగినచో నాయకత్వము వహించుటకు గాంధీగారెప్పుడూ సంసిద్ధులే. కాని ఆయనతోడ్పాటు మన కాయనషరతులమీద లభించును గాని మన షరతులమీద లభించదు. ఆయనషరతులు కష్టతరములైనవిగావు. త్యాగమును బూని మనహృదయరంగములను పరిశుద్ధము చేసికొనవలె నని రాయన. ఆయన అహింసాతత్వముతో మన ఆయుధములకు చికిలీపట్టవలె ననిరి. తాను దేశముపైనను, కాంగ్రెసుమీదను ఒక పెద్దబరువుగా నుండి వాటిని కుంగదీయుచున్న ట్లాయనకు తోచెను. తాను తన వ్యక్తిత్వమును లోపింపచేసికొనినకొలది కాంగ్రెసునూ కుంగదీయుచున్నట్లుగా ఆయన భావించెను. యుద్ధమునకు సన్నద్ధము చేయవలెనా, ఆయన రావలెను. దేశమునందు శాంతి నెలకొల్పవలెనా, ఆయన లేనిది జరగదు.

తండ్రిచాటున పెరిగిన పిల్లలవలె ఆయనచాటున దేశము మరుగుపడిపోవుటయేగాక వ్యక్తతను గోల్పోవుచున్నారు. అభినివేశ మంతరించుచున్నది. సృజనశక్తి పోయినది. అందుచేత కొంతకాలము తాను దూరముగానున్న యెడల దేశమునకు హితవు కల్గు నను భావముతో ఆయన తాత్కాలికముగ తొలగిపోయెను. ఆయన దేశమున కొక లక్ష్యము నేర్పాటుచేసెను. ఒక బావుటా నిలబెట్టెను. ఒక నాయకత్వమును స్థాపించెను. ఏకోణాన పిలిస్తే ఆయన అకోణాన రానున్నారు.

బొంబాయికాంగ్రెసుయొక్క జయము ముఖ్యముగా అధ్యక్షులైన రాజేంద్రప్రసాదుగారి సమర్థతా చాకచక్యములనుబట్టియే లభించెను. ప్రెసిడెంటుగారి ఉపన్యాసము రసవంతముగనూ, రాజ్యాంగసంస్కరణములనుగూర్చి వారు చేసిన విమర్శనలు సహాయకరములుగనూ ఉండెను.

"స్వాతంత్ర్యము పరులకు కష్టముగాని, నష్టముగాని కల్గించెడి లక్ష్యము గాదు. స్వతంత్ర మనగా యితరులతో సంబంధమును వదలుకొనుట గాదు. ఒక దేశము మరియొక దేశమును కొట్టుకుతినటము మానవలసిన దని స్వాతంత్ర్యమున కర్థము. అన్నిజాతులవారున్నూ పరస్పరముగా స్నేహభావము కల్గివుండవలె నని దానిభావము. అది ఎవరికిని కీడు సహింపదు. దానిని పొందుటకు సాధనము అహింస. ప్రపంచకము నంతను ఆకర్షించదగినమహత్వ మిది. లోకసంగ్రహాపేక్షయే అహింసాతత్వమునకు మూలము. ఇది భయమును పారదోలును. మన దేశమున కితర దేశములపై దాడిజేయవలె నని కోరిక లేదు. అందువలన మనకు మిక్కుటమగు సేన లనావశ్యకము. ఇతరులకు కీడు కోరనివారు ఇతరులయొక్క ఆదరణను, సద్భావమును ఆకర్షింతురు. ఇట్టి స్వాతంత్ర్యము బ్రిటిషువారికి గుండెజెదురు గలిగింపరాదు. అయితే యిప్పటి అస్వాభావికములైన పరిస్థితులను శాశ్వతముగా నుంచవలె ననుకోరిక వారు వదలుకొనవలెను. ఈయన ఆదర్శముకొరకు దేశములోని యువకు లపారమైన త్యాగమును చూపినారు. మనసాధనము లపూర్వములైనవి. ప్రపంచమంతయు అత్యుత్సాహముతోను, ఎక్కువ ఆశతోను మనము చేయు యత్నములను చూచుచున్నది. మన మతమును మనము వదలక మనోనిశ్చయముతో పనిచేతుముగాక. సత్యాగ్రహమునకు తాత్కాలికముగా అభ్యంతరములు గలుగవచ్చును. కాని సత్యాగ్రహము అపజయము నెరుగదు. లోయల్ కవి చెప్పినట్లు సత్య మెప్పుడూ వురికంబముమీదనే ఉండవచ్చును. అసత్యము సింహాసన మధిష్ఠింపవచ్చును. కాని భవిష్యత్తంతయు వురికంబమునే ఆశ్రయించియున్నది. మబ్బుకమ్మిన యీభావికాలమువెనుక నీడజాడలలో భగవంతుడు తనసృష్టిని సాదర భావముతో కనిపెట్టుచుండును."

బొంబాయి కాంగ్రెసులో గావింపబడిన తీర్మానములను పరిశీలింతము. అది వరకు వర్కింగుకమిటీవారు పా. బో.ను గూర్చియు, స్వదేశినిగూర్చియు, నిర్మాణ కార్యక్రమమునుగూర్చియు, వలసపోయిన భారతీయుల యిక్కట్లనుగూర్చియు చేసిన తీర్మానములు ధ్రువపరుపబడెను. దేశము చేసిన త్యాగము నభినందించి శాసనోల్లంఘనమునందు విశ్వాసము ధ్రువపరుపబడెను. కాని అహింసతో కూడిన అసహాయోద్యమము ఒక్కటే స్వరాజ్యసాధన మని చెప్పిన తీర్మానము చిట్టచివర నిమిషములో అన్ని సాధనములకంటెను యిది మంచిసాధన మని మార్చబడినది. జవహరలాల్‌గారి భార్య కమలాదేవి నెహ్రూగారి అనారోగ్యమునుగూర్చి సానుభూతి తెలుపబడెను.

“కాంగ్రెసువారి తోడ్పాటు ఉండినను లేకపోయినను స్వదేశిని ప్రోత్సహించుచు దేశమంతటను సంస్థలు నెలకొల్పబడినవి. కాని ‘ఏది నిజమైన స్వదేశి’ అను విషయమై ప్రజలలో చాల కలవరము బయలుదేరినది. మొట్టమొదటినుండియు కాంగ్రెసు ప్రజాసామాన్యముతో నేకీభావమును పొందియుండుట అందరికిని తెలిసిన విషయమే. కాంగ్రెసునిర్మాణకార్యక్రమములో గ్రామపునరుద్ధరణ మనునది యొక ముఖ్యవిషయము. గ్రామపునరుద్ధరణ యన, ప్రధానమైన నూలు వడుకుపరిశ్రమతో పాటు తక్కిన గ్రామ పరిశ్రమలను గూడ ఉద్ధరించుట ముఖ్యావసరము. దీనిని కాంగ్రెసువారు ప్రత్యేకముగా చేయవలసియున్నది. అందువలన గాంధిగారి సలహాను గైకొనుచు అఖిలభారత గ్రామపరిశ్రమల సంఘము నొకదానిని ఏర్పాటుచేయుటకు జె. సి. కుమారప్పగారికి అధికార మీయబడినది. ఆ సంఘము ఆయా పరిశ్రమల అభివృద్ధికిని, గ్రామముల నైతిక, భౌతిక శ్రేయమునకును పని చేయవలెను. స్వకీయ నిర్మాణవిధానము నేర్పాటు చేసికొనుటకును, కావలసిన ధనమును వసూలు చేయుటకును దాని కధికారము కలదు.”

“ప్రదర్శనముల నేర్పాటుచేయుటయు, ప్రకటనకై ఆకర్షణీయములైన పద్ధతుల నవలంబించుటయు అమితముగ వ్యయకారణము లగుచున్నందువలన ఆహ్వానసంఘము వారికి ఆ బాధ్యతలు లేకుండచేయుట అవసరము. దీనిమూలమున చిన్నచిన్న ప్రదేశములకు కాంగ్రెసును ఆహ్వానించుటకు వీలు లేకయున్నది. ఇకనుండి అట్టి బాధ్యతలు ఆహ్వానసంఘమువారి కుండరాదు. వీని యేర్పాటులను అఖిలభారత చరఖా సంఘమువారును, అఖిలభారత గ్రామసంఘమువారును చేయవలెను. అట్లు చేసినచో ప్రజలకు, ముఖ్యముగా గ్రామస్థులకు, ఉత్సవప్రదముగను ఉండును; బోధనానుకూలముగను ఉండును; ఈ రెండు సంఘముల వారును తమ కృషికి ఉదాహరణ పూర్వకముగ ప్రచారము చేసినట్లుగను నుండును.”

డాక్టరు పట్యాలుగారు దీనిని ప్రతిఘటించిరి. ఇంకను చర్చ జరుగవలెనని కొందరు కోరుటచే తీర్మానమును వోటుకు పెట్టుట వాయిదా వేయబడినది.

"వేలకొలది సత్యాగ్రహులు-స్త్రీలు, పురుషులు, యువకులు, వృద్ధులు-పట్టణములనుండియు, పల్లెలనుండియుగూడ వచ్చి ధైర్యస్థైర్యములతో పలుకష్టముల కోర్చి త్యాగము చూపినందులకు వారిని కాంగ్రెసు ప్రశంసించుచున్నది. అహింసాత్మకమైన సహాయనిరాకరణము, సత్యాగ్రహము లేకయుండినయెడల దేశ మింత ప్రబుద్ధమై యుండెడిది కాదు. గాంధీజీ విషయమున తప్ప ఇతరులవిషయములో సత్యాగ్రహము విరమింపబడుటయే అవసరమును, అపేక్షణీయమును ఐనను, దౌర్జన్యసాధనలకంటె అహింసాత్మకమైన సహాయనిరాకరణ సత్యాగ్రహములే అనుసరణీయము లని తెల్పుచు వానియందలి యచంచలవిశ్వాసమును కాంగ్రెసువారు ప్రకటించుచున్నారు. దౌర్జన్యపద్ధతి హింసించువారిని, హింసింపబడువారినిగూడ హింసాకూపములో బడద్రోయును."

"అత్యవసరసందర్భములో ఏర్పాటు చేయబడినందువలన ఇప్పటిపార్లమెంటరీ బోర్డును ఒకసంవత్సరమువరకుమాత్రము ఉంచవలె ననియు, తరువాత దానిని ఎన్నికల పద్ధతిమీద ఏర్పాటు చేయవలె ననియు క్రిందటిసెప్టెంబరులో కాంగ్రెసు పార్లమెంటరీబోర్డువారే తీర్మానించిరి. ఆ తీర్మానమును కాంగ్రెసు ఆమోదించుచున్నది. ఇప్పటిబోర్డు ఆయువు ౧౯౩౫ మే ౧-వ తేదీతో ముగియగలదు. తరువాత అఖిలభారత కాంగ్రెసుకమిటీవారిచే ఎన్నుకొనబడిన ౨౫ గురు సభ్యులుగలబోర్డు ఏర్పాటుకావలెను. అట్లు ఎన్నుకొనబడినబోర్డువారు ౫ గురకు మించకుండ ఇతరుల నెవరినైనను తమతోపాటు సభ్యులనుగా ఎన్నుకొనవచ్చును. ప్రతిసంవత్సరము కాంగ్రెసుసభ జరిగినపుడెల్ల పార్లమెంటరీబోర్డు ఎన్నికలు జరుగుచుండును. ఇప్పటి బోర్డునకున్న అధికారములే ఎన్నుకొనినబోర్డునకుకూడ ఉండగలవు."

తరువాత మహాత్ముడు కాంగ్రెసునుంచి విరమించుటనుగూర్చి యీ క్రింది తీర్మానము చేయబడెను :

"మహాత్మునినాయకత్వమందు కాంగ్రెసునకు విశ్వాస మున్నది. ఆయన తన నిర్ణయమువిషయమునుగూర్చి తిరిగీ యోచింపవలసిన దని యీ సభవారు కోరుచున్నారు. కాంగ్రెసునుండి వెడలిపోకుండ ఆయనను అపుటకు చేయబడిన ప్రయత్నములు విఫలము లైనందున, ఇన్నాళ్లును ఆయన దేశమున కొనర్చిన సేవకు సభవారు కృతజ్ఞతను దెల్పుచున్నారు. అవసరమైనపుడెల్ల మహాత్ముడు కాంగ్రెసువారికి సలహా నొసగుచుండవలె నని యీ సభవారికోరిక."

బొంబాయికాంగ్రెసు పైతీర్మానములను గావించి, కార్యక్రమమును ముగింపక పూర్వము కాంగ్రెసును మరుసంవత్సరము సంయుక్తరాష్ట్రమున కాహ్వానించుతీర్మానము అంగీకరింపబడినది.

ఇట్లు సత్యాగ్రహాశకము మారి శాసనసభాప్రవేశశక మారంభ మయినది. దేశమంతటను పోలీసులాఠీలబదులు కాంగ్రెసులాఠీలు పరుగులిడుచుండెను. లాఠీచార్జి లాగిపోయినవి. ఉపన్యాసములచే దిక్కులు ప్రతిధ్వనించుచుండెను. కొంతకాలమునుండి బంధింపబడినవాక్కు తిరిగీ స్వేచ్ఛ నొందగలిగినది. ఎన్నికల ఉత్సాహము అమేయము. కాంగ్రెసుసందేశమును తాత్కాలికముగనైనప్పటికి మూలమూలల గ్రామగ్రామములకు వ్యాపింపచేయగలిగితిమి. ప్రతి నియోజకవర్గమునందలి పోరాటములలో ఎసెంబ్లీస్థానములకు కాంగ్రెసుసభ్యులు నిలువబడిరి. చెన్నపట్నములోని వర్తకసంఘప్రాతినిధ్యమునుగూర్చి రామరావణయుద్ధ మయ్యెను. షణ్ముఖంచెట్టిగారు గవర్నమెంటు అభ్యర్థి. స్వామి వెంకటాచలంచెట్టిగారు కాంగ్రెసుఅభ్యర్థి. కాంగ్రెసు గవర్నమెంటులయొక్క బలాబలముల తారతమ్య మీయెన్నికలయొక్క ఫలితముమీద ఆధారపడియుండెను. గవర్నమెంటుఉద్యోగు లనేకవిధముల షణ్ముఖంచెట్టిగారికి సహాయము చేసిరి. ఈయన ఇండియాగవర్నమెంటుయొక్క బహుమతులకు పాత్రుడు. సర్ మహమ్మద్ ఉస్మాన్, బొబ్బిలిరాజాగార్ల కోడి ఓడి చివరకు కాంగ్రెసుకోడియే గెలిచెను. షణ్ముఖంచెట్టిగారు అట్టావాకు పోయి బ్రిటిషుసామ్రాజ్యమునకు వర్తకవిషయములలో మహోపకార మొనర్చిన వీరుడు. ఆయన రాగానే అసెంబ్లీఅధ్యక్షపదవి ఆయనకు ప్రభుత్వమువారు లభింపజేసిరి. ఇట్టి గవర్నమెంటుపక్షపాతియొక్క అపజయము నిజమయిన కాంగ్రెసుజయమైనది. ఈయెన్నిక అన్నిటిలోను ముందుగ జరుగునట్లు గవర్నమెంటువారు గంపంత ఆశతో ఏర్పాటుచేసినారు. షణ్ముఖంచెట్టిగారి 'జయము' దేశమంతటికి మార్గదర్శకముగా నుండగల దని వారిభ్రమ. దక్షిణ ఇండియా ఎన్నికలలో కాంగ్రెసుకు పరిపూర్ణవిజయము చేకూరెను. సంయుక్తరాష్ట్రములోకూడ ౧౯౩౭ వ సం. లోవలె కాక యీసారి ఎక్కువవిజయము ప్రాప్తించెను. బీహారు, అస్సాము, కర్ణాటకము, మహారాష్ట్రము, గుజరాతురాష్ట్రములలో కాంగ్రెసున కఖండవిజయము సంప్రాప్తమయ్యెను. బెంగాలులోని జయము చాల వరకు జాతీయపక్షమువారిది. అన్నిటిలోను వెనుకపడ్డది పంజాబురాష్ట్రము. అక్కడ కాంగ్రెసుకు లభించినది ఒక్కస్థానముమాత్రమే. మొత్తముమీద బెంగాలుగాక కాంగ్రెసుకు లభించిన తక్కినస్థానములు ౭౭. బెంగాలులోని ఆ స్థానములవారున్నూ ఒక్క సాంఘికనిర్ణయముమీద తప్ప తక్కినవిషయములలో కాంగ్రెసుతోపాటు ఉండేవారే.

అసెంబ్లీ అధ్యక్షపదవికి టి. ఎ. కె. షెర్వానీగారిని కాంగ్రెసుతరఫున నిలువబెట్టి ఓడిపోయిరి. ఎన్నికలు జరిగిన అచిరకాలములో ముగ్గురు ప్రతినిధులు చనిపోవుట తటస్థించెను. నాగపూరువాస్తవ్యులగు అభయంకరుగారును, బంగాళాలో శాస్మాలుగారును, అలహాబాదులో షెర్వానీగారును అకాలమరణముల నందిరి.

## అసెంబ్లీచర్యలు

ఇకనుండి మరియొకసారి కాంగ్రెసుయొక్క కార్యక్రమము శాసనసభలకు గూడా వ్యాపకమయినది. కావున అచ్చటి విశేషములు మనము పరీక్షించవలెను. జనవరి ౨౧ వ తారీఖున ఢిల్లీలోని అసెంబ్లీయొక్క మొదటిసమావేశము జరిగినది. భూలాభాయిదేశాయిగారు అసెంబ్లీలో కాంగ్రెస్‌పార్టీకి నాయకులు మోతీలాల్ నెహ్రూగారియొక్క స్థాన మలంకరించా రన్నమాట. వారివలెనే వీరును గొప్ప లాయరులు. అంతకన్న విశేషం, బొంబాయిలో వీరు చాలాకాలము అడ్వొకేటుజనరలుగ నుండిరి. ఈపదవి గవర్నమెంటుఉన్నతోద్యోగములకు పోవు మెట్టు అయినప్పటికి వీరు అవన్నీ వదలుకొని దేశసేవకు పూనుకొన్నారు. ఈయననాయకత్వముక్రింద అసెంబ్లీలో గవర్నమెంటుకు దెబ్బమీదెబ్బ తగిలెను. మొట్టమొదటిది గ్రామోద్యోగసంఘమునుగూర్చి. కాంగ్రెసువా రిందునుగూర్చి గావించిన తీర్మాన మిదివరకే సూచింపబడినది. గవర్నమెంటు ఇందులో ఏదో మెనుభూత మున్నదని అనుకొని యీసంఘపు పనులవిషయములో గవర్నమెంటుఉద్యోగులు ఎట్టిసహాయ మొనర్చరాదనిన్నీ, ఎట్టి సంబంధమును పెట్టుకొనరాదనిన్నీ రహస్యపుతాఖీదు జారీచేసియుండగా అది బయటబడెను. ఇందుకుగాను గవర్నమెంటువారిచర్యను ఖండించుచు అడ్జరన్‌మెంటుతీర్మానము అసెంబ్లీలో ఉపపాదింపబడెను. కాని వోట్లు తీసికొనబడక చర్చతోనే ముగిసెను. దీనినే యింగ్లీషులో "టాకీడ్ ట్" అని వాడుదురు. శరత్చంద్రబోసుగారిని గురించి మరియొకతీర్మాన ముపపాదింపబడినది. ఈయన నిర్బంధములో నుండగానే యీయనను అసెంబ్లీకి ఎన్నుకొన్నారు. కాని అసెంబ్లీమీటింగులకు రానీయక వీరిని నిర్బంధములోనే ఉంచిరి. అందుకుగాను గవర్నమెంటువారిమీద తీసుకురాబడిన నిందాతీర్మానము ౫౮-౫౪ వోట్లచే గెలిచెను. 3 వ తీర్మానము అన్నిటిలోకి గొప్పదని చెప్పవచ్చును. ఇది ఇండియాకున్ను బ్రిటనుకున్ను ఉండవలసిన వర్తకపు ఏర్పాటుకు సంబంధించినది. ఇది చాలా విచిత్రమైనది. ఒకప్రక్కను స్వరాజ్యము రాగలదని చెప్పుచు, యింకొకప్రక్కను భవిష్యత్తు కంతకూ ఒక వర్తకపు ఒడంబడిక ఏర్పాటు చేయబడవలె నని జా. పా. క. (జాయింటు పార్లమెంటరీకమిటీ) వారి రిపోర్టులోనే సూచింపబడినది. అది సూచింపబడుటకు మున్ముందుగా ఈఒడంబడిక చేసికొన

బడెను. అందుమూలమున ఇండియాయొక్క స్వేచ్ఛకు భంగము కలిగినది. దీనియొక్క వివరములు ౭ వ అనుబంధములో వివరింపబడినవి. ఇందులో ఒక్కమరతునుమాత్రము సూచింపవలసియున్నది. బ్రిటనునుండి దిగుమతి అయ్యేటటువంటి వస్తువులమీద వేయబడే పన్నులవల్ల ఇండియాలో చేయబడు ఆవస్తువులనే బ్రిటిషువస్తువులకంటె చౌకగా అమ్మేటకు వీలుంగలిగించునట్లుండరాదని దీనినిర్ణయము. ఈ ఒడంబడికకు సంతకము పెట్టిన దెవరు? ఇంగ్లండులో మంత్రివర్గమువా రుండు వైట్ హాల్ అను భవనములో రెండుగదులు గలవు. ఒకగదిలో బ్రిటిషువర్తకపుమంత్రి ఉంటాడు. మరియొకపిల్లగదిలో ఇండియాకు సంబంధించిన వర్తకపుకమిషనరుంటాడు. ఈ ఒడంబడికకు సంతకములు పెట్టినవారీ రిద్దరును. ఇంతకన్న విపరీత ముండజాలదు. దీనిని ఖండించు తీర్మానము ౬౬-౫౮ వోట్లచే నెగ్గడములో ఆశ్చర్యము లేదు. మరియొకజయము-ఖుదాయిఖిద్మత్గార్స్ అను సరిహద్దురాష్ట్రములోని గఫ్ఫార్ ఖాన్ గారి సేవాసంఘము. ఈపదమున కర్థము భగవత్సేవకులు. వీరిపై నిషేధములు తొలగింపబడనందున గవర్నమెంటువారిచర్యను ఖండించుచు గావించిన తీర్మానము ౭౫-౬౬ వోట్లవల్ల జయమొందెను. ఇంకా గవర్నమెంటువారి పన్నులవిధానపుపద్ధతులు సయామునుండి దిగుమతి యగుచున్న బియ్యము మున్నగు ౨౫, ౩౦ విషయములనుగూర్చి కాంగ్రెసుకు అఖండ విజయము కలిగినది. కాని అన్నిటిలోకి ఉత్కృష్టమైనది జాయింటుపార్లమెంటరీ కమిటీరిపోర్టుకు సంబంధించినది. ఇప్పటికి శ్వేతపత్రి మనే తొండము దిరి జా.పా.క. రిపోర్టను కొసరవిల్లి అయినది. దీని ఖండనమే అసెంబ్లీవారియొక్క లక్ష్యములలో నగ్రిమస్థానము నుండెను. ఇట్టిఖండనమునుగూర్చిన వివరముల నిప్పుడు పరిశీలింతము. కాంగ్రెసువారీప్రణాళికప్రకారము శాసనము గావింపబడరా దని నిర్దుష్టమైన తీర్మానము నుపపాదించిరి. రాజధానులసభలలో ఈవిషయములగూర్చిన తీర్మానముల చర్చయందు గవర్నమెంటుసభ్యులు పాల్గొనియుండలేదు గాని అసెంబ్లీలోమాత్రము పాల్గొన నిశ్చయించిరి. అందుచే అసెంబ్లీఅభిప్రాయము కేవలము ప్రజాప్రతినిధుల అభిప్రాయముగా నుండజాలకపోయెను. కాంగ్రెసువారి తీర్మానములకు భిన్నాగా రీతిసవరణల నుపపాదించిరి:

"(౧) ఇండియాలో వివిధసంఘములవారు కలిసి ఒకప్రణాళిక నేర్పాటు చేయువరకును ప్రధానమంత్రిగారు చేసిన సాంఘికనిర్ణయము నీసభవారంగీకరించుచున్నారు.

"(౨) రాజధానిపరిపాలనకు సంబంధించినంతవరకు ఈప్రణాళిక ఎంతయు అసంతృప్తికరముగను, ఆశాభంగకరముగాను వున్నది. ఇందుకు కారణము లేమనగా, శాసనసభలలో ఉన్నతసభ యని రెండవసభ యేర్పాటుచేయుట, గవర్నర్లకు నిచ్చి

వటువంటి విశేషాధికారములు, పోలీసురూల్సును, సి. ఐ. డి. శాఖను మంత్రిస్వాధీనము నుండి తప్పించుట, ఈకారణములచే పరిపాలన ప్రజాప్రతినిధుల అదుపులో నుండ జాలదు. ఈ ఆక్షేపణలను తొలగించనంతవరకు ఈప్రణాళిక ఇండియాలోని యే తెగ వారికినికూడ సంతృప్తికరముగా నుండజాలదు.

"(3) అఖిలభారత ఫెడరేషను అనుయేర్పాటు స్వతస్సిద్ధముగా చెడ్డదనిన్నీ, బ్రిటిషు ఇండియాప్రజలకు అంగీకారము కాజాలదనిన్నీ అయినచే ఈప్రణాళికను ఇంతటితో విరమించి బ్రిటిషుఇండియాలోని ప్రజలకు నిజమైన బాధ్యతాయుత ప్రభుత్వము నొసగ గల విధానమును వెంటనే అమలులో పెట్టునుద్దేశ్యముతో యిప్పటిస్థితిగతులంతయు పునర్విమర్శనచేసి ఆలస్యముచేయకుండా భారతీయుల అభిప్రాయమును వెంటనే సంప్రతింపవలెను."

దీనిమీద జిన్నాగారి మొదటిసవరణకు కాంగ్రెసువారు తమ తటస్థ భావమును చూపించుచు మరియొకసవరణను చేసిరి. కాంగ్రెసువారిసవరణ పోయి జిన్నాగారి మొదటిసవరణ గెలిచెను. ఈసమయమందు కాంగ్రెసువారు వోట్లను ఇవ్వ లేదు. తీర్మానములోని ౨, ౩ భాగములు ౭౪-౫౮ వోట్లవల్ల గెలిచెను కాంగ్రెసు వారు దీనికిఅనుకూలముగ వోటిచ్చిరి. ఈ చర్చసందర్భములో గవర్నమెంటులామెంబరు కాంగ్రెసువారియొక్క రాజనీతి నిర్వక్రముగ నుండెననియు, జిన్నాగా రవలంబించిన పద్ధతి వక్రగతిచెందిన దనియు నుడివిరి.

ఇంకను అసెంబ్లీలో రైల్వేపరిపాలననుగూర్చి దేశాయిగారు ఖండించిరి. ఈ విషయమునుగూర్చియూ, మరికొన్ని యితరవిషయములనుగూర్చియు గవర్నమెంటు వారు అనేకసార్లు వోడిపోయిరి. రైల్వేవుద్యోగములు భారతీయులకీయవలెను అను తీర్మానము ౭౧-౪౪ వోట్లవలన గెలిచెను. ౩ వ తరగతిరైలుప్రయాణీకుల సౌకర్య ములు, కార్మికులకష్టములు, వ్యవసాయపుసంబంధమైన వస్తువుల రవాణాచార్జీల తగ్గింపు మున్నగువిషయములనుగూర్చి 'కోత' తీర్మానము లుపపాదింపబడెను.

అసెంబ్లీచర్యలు ప్రారంభింపకముందే బొంబాయిలో నియమింపబడిన నూటన వ. క. డిసెంబరు ౫, ౬ తేదీలలో సమావేశమయి జా. పా. క. నివేదికను దిసుపవిధముగ ఖండించెను. శ్వేతపత్రమును కాంగ్రెసువా రిదివరకే ఖండించినారు.

"ప్రజాప్రతినిధి సభవారు (Constituent Assembly) తయారుచేయు ప్రణా ళికయే ప్రమాణముగ నుండవలెను. శ్వేతపత్రతిరస్కారమును స్వయంనిర్ణయవిధానమును ఇటీవల జరిగిన అసెంబ్లీయెన్నికలద్వారా ప్రజలచే అంగీకరింపబడినట్లు స్పష్టమయ్యెను. ఇంతేగాక జా. పా. క. వారి నివేదిక శ్వేతపత్రముకంటెకూడ కొన్నివిషయములలో

వెనుకంజ వేయుచున్నది. దీనిని ప్రజ లిదివరకే ఖండించియున్నారు. జా. పా. క. నివేదికలో ఇమడ్చబడిన పరిపాలనాపద్ధతి ఇప్పుడున్న పరిపాలనావిధానముకంటె ఎక్కువ అపాయకరము కాగలదు. దేశముపైనున్న పారతంత్ర్యమును పరరాజ్యఅనుభవమును ఇంకను పెంపొందించగలదు. కావున యీ ప్రణాళికను పూర్ణముగ తిరస్కరించవలెను. అసెంబ్లీసభలో కూడ సభ్యులు తిరస్కరింపవలెను."

వర్కింగుకమిటీవారియొక్క కోరికను అసెంబ్లీసభ్యులు ఏవిధముగ నెరవేర్చినది లోగడ తెలుపబడినది. వర్కింగు కమిటీవారు పాట్నాసభలో మరికొన్నితీర్మానములు గావించిరి. "కాంగ్రెసుమెంబర్లను విరివిగ చేర్చి సంఘములను బలపరచవలె ననియు, గ్రామపరిశ్రమలనుగూర్చి తగిన సంజాయిషీ సంపాదింపవలెననియు కరాచీతీర్మానములో సూచింపబడిన ప్రజలప్రాతిపదికహక్కులు విధులుగూర్చియు, దేశమునకు అనువగుఆర్థిక విధానమునుగూర్చియు ప్రజాప్రబోధము గావింపవలెనన్ని సుభాశ్చంద్రబోసుగారు తమతండ్రిగారి మరణసందర్భమున భారతదేశమునకు వచ్చియున్న స్వల్పకాలములో ఆయనయొక్క స్వేచ్ఛాసంచారమునకు కలిగించిననిర్బంధములనుగూర్చియు, అసెంబ్లీ లోని కాంగ్రెసుసభ్యులు నిరంతర ఖద్దరు ధారులుగా నుండవలెననియు, సాంఘికతీర్పుపై కాంగ్రెసువారి అభిప్రాయమును మార్చవలసినదిగ కోరిన కోరికను అంగీకరింపజాల మనియు" వర్కింగుకమిటీచే తీర్మానములు చేయబడినవి.

ఈచరిత్రయొక్క ఆఖరుసంవత్సరపు చరిత్రయొక్క వృత్తాంతమును సంగ్రహముగా చెప్పెదను. అభయంకరు, గిద్వానీగార్ల అకాలమరణమునకు వ. క. వారు తమ దుఃఖమును తెల్పుచు ఈసంవత్సరము పూర్ణస్వరాజ్యదినమునజరుపవలసిన సభలయందు జరుగవలసిన చర్యనుగూర్చి దిగువసలహా నొసంగిరి:

" శాసనోల్లంఘనము విరమింపబడిన కారణముచేత ఎచ్చటను కాంగ్రెసువారి చర్యలు ఆయాస్థానములయందు అమలులోవుండే నిషేధపు ఉత్తరువులకుగాని, ఆర్డినెన్సులకుగాని వ్యతిరేకముగా నుండరాదు. ఊరేగింపులు నిశ్శబ్దముగా జరిపి నియమితస్థానములలో జరుగుసభలకు పోయి ఉపన్యాసములు లేకుండా దిగువతీర్మానమును సభ అంతయు లేచి నిలుచుని అంగీకరింపవలయును. సభలు నిషేధింపబడినచో ప్రతికుటుంబమును తమయిండ్లలో సమావేశమయి తీర్మానములు గావించి సమీపముననున్న కాంగ్రెసుకమిటీకి తెలియజేయవలెను. తీర్మానము గావింపకపూర్వము జాతీయపతాకము నెత్తవలయును.

తీర్మానము: ఈ పవిత్రదినమున పూర్ణస్వరాజ్యము మన జన్మహక్కని జ్ఞప్తికి తెచ్చుకొని దానిని సంపాదించువరకు విశ్రాంతి గైకొనము. ఇందుకుగాను శక్తి

కొలది మనోవాక్కాయకర్మణా సత్యాహింసవ్రతమును అవలంబించెదము. ఇందుకు వలయు త్యాగము నంతయు చేసెదము. ఇందుకు నిదర్శనముగ ౧. జాతిమతభేదములు లేకుండ అందరును సమాన మని యెంచుకొనెదము. ౨. మత్తుపదార్థముల త్యజించెదము. ౩. వడుకునూలుబట్టలనే ధరించెదము. ఇతరగ్రామపరిశ్రమలను పోషించి విదేశి వస్తువుల బహిష్కరించెదము. ౪. అస్పృశ్యతను నివారించెదము. ౫. అన్నము లేక మాడిపోవు కోట్లకొలది జనులకు సాధ్యమైన అన్నివిధముల సేవ చేసెదము. ౬. జాతీయ నిర్మాణమునకు ఆవశ్యకమగు అన్నివిధముల పని చేసెదము. వారతాళములుచేయరాదు. ప్రతివారున్నూ ఏదో ఒకవిధమైననిర్మాణకార్యమును చేయవలెను."

జార్జిరాజుగారి రజతోత్సవసందర్భమున [illegible]తీర్మానము చేయబడినది:

"కాంగ్రెసువారికి రాజుగారి ఆయురారోగ్యాభివృద్ధినిగూర్చి సద్భావముతప్ప మరేద్దియు నుండజాలదు. కాని రాజుగారిపేరట నడుపబడు యీపరిపాలనమాత్రము జాతియొక్క రాజకీయ, ఆర్థిక, నైతికాభ్యుదయములకు అత్యంతహానిని కలుగజేసినదను విషయము కాంగ్రెసువారు మరువజాలరు. రాజోత్సవ [illegible] పరిపక్వమై దేశముయొక్క భాగ్యము నింకను [illegible] దారిద్ర్యమును పెంపొందించగలవు. అందుచే యీయుత్సవములో కాంగ్రెసువారు ఎవ్విధముగను పాల్గొనవలె ననుట సాధ్యము కాదు. కాని ఇందుకు వ్యతిరేకముగ ప్రదర్శనములుగాని, సభలుగాని జరిపి ఆంగ్లేయులయొక్కయు, తదితరులయొక్కయు మనస్సులకు నొప్పి కలిగించరాదు. అధికారులు అనివార్యముగా స. క. నా రవలంబించిన యీ పద్ధతి యొక్క ధర్మమును గ్రహించి జాతీయగౌరవమున కట్టిభంగమును కల్పింపకుండెదరుగాక."

బట్టలమిల్లులనుగూర్చి కాంగ్రెసువారియొక్క అభిప్రాయమును స్పష్టపరచవలసి యుండెను. ౧౯౩౦ వ సంవత్సరములో యీమిల్లులకు కాంగ్రెసువా రిచ్చిన సర్టిఫికెట్టు లికమీద ఉండరా దనియు, కాంగ్రెసువా రందరూ ఖద్దరునే ధరించవలెననియు తీర్మానింపబడ్డది. ఆంధ్రదేశమునందలి రాయలసీమకరవుసందర్భమున ప్రజలకు సహాయము చేయవలసిన దని విజ్ఞాపనపంపుటకు ప్రెసిడెంటుగారికి అనుజ్ఞ యీయ బడెను. ౭-౨-౩౫ వ తేదీని జా. పా. క. నివేదికను ఖండించుటకు దేశమునం దంతటను సభలు గావించ మనిరి. జనవరి ౨౩, మార్చి ౩౧ మధ్యను కాంగ్రెసు ప్రెసిడెంటు రాజేంద్రబాబుగారికిని ముస్లింలీగు అధ్యక్షులగు జిన్నాగారికిని మధ్య హిందూ మహమ్మదీయ ఐక్యతనుగూర్చియు, సాంఘిక తీర్పుయొక్క రద్దునుగూర్చియు సంభాషణలు జరిగెను. కాని ఫలితము లేకపోయెను.

శాసనోల్లంఘనోద్యమముయొక్క విరామమువలన గవర్నమెంటువారి నిర్బంధ విధానము మరింత హెచ్చెనుగాని తగ్గలేదు. జా. పా. క. వారి నివేదికాఖండనమువల్ల వారి కోపము మరింత పెంపొందెను. స్వల్పకారణములకు కూడ ప్రాసిక్యూషనులు సాగించుచుండిరి. ఇంక బెంగాలునిర్బంధితులకు గతీమోక్షము లేకుండెను. వీరి సంఖ్య ౨౮౦౦ లు. ఎక్కడ చూచిన ఇండ్లసోదాలు ప్రబలుచుండెను. అలహాబాదు లోని స్వరాజ్యభవనము, బీహారురాష్ట్రీయకమిటీకార్యాలయము ప్రభుత్వమువారి సోదా లకు లోనయ్యెను. బొంబాయిలో అబ్దుల్‌గఫూరుఖానుగారికి ౨ సం. ముల శిక్ష విధింపబడెను. పంజాబులో సత్యపాలుగారికి సంవత్సరముశిక్ష ప్రాప్తించెను. బంగాళా లోని నిర్బంధితుల కుటుంబములు మల మలమాడుచుండ నిర్బంధములను గూర్చి ఖండిం చుటకును, కుటుంబముల సహాయార్థము చందాలు పోగుచేయుటకును ౧౯ మే ౩౫ న ప్రత్యేకదినముగా జబ్బలుపూరు అ. భా. కాం. క. లో చేయబడెనుగాని వంగరాజ ధానియందు ఈసభలనుగూర్చిన ప్రకటనలనుగూడ నిషేధించుచూ ఉత్తరువులు జారీ చేయబడెను. ఈ ఉత్తరువును ఖండించుటకు వంగరాష్ట్రములోని పత్రికలు ఒక రోజున తాని ప్రచురణమును ఆపివేసినవి.

జబ్బలుపూరునందు ౨౪, ౨౫ ఏప్రిలు తేదీని అ. భా. కాం. క. సమావేశమై క్రొత్తపార్లమెంటుకుబోర్డును, ఎన్నికలతోగాదా పంచాయితీబోర్డును ఎన్నుకొనెను. కాం గ్రెసుసంఘములు, హిందుస్తానీసేవాదళము, కార్మికసంఘములు, యువజనసంఘములు, ఖుదైఖిదమత్‌గారులు మొదలుగా గల సంస్థలపై యింకను నిలిపియున్న నిషేధము ఖం డింపబడెను. ఫిరోజాబాదులో హిందూమహమ్మదీయసంఘర్షణసందర్భమున డాక్టరు జీవరాముగారియింటిని రోగులు బిడ్డలు సహితము కుటుంబమును తగులబెట్టినవిపత్తును గూర్చి కమిటీవారు వగచిరి. స్వదేశసంస్థానముల ప్రజలయొక్క హక్కులకొరకు వారు సలుపవలసిన పోరాటమునుగూర్చి పూర్ణమయిన సానుభూతిని వెలిపిరి.

బీహారుభూకంపము ౧౫ జనవరి ౩౪ సం. మున సంభవించిన విషయము చదు వరులకు తెలిసియేయున్నది. క్వెట్టాలో మరియొకభూకంపము ౩౧ మే ౩౫ వ సం. మున సంభవించి దేశమునంతయు దుఃఖమున ముంచివేసెను. క్వెట్టా సైనికపట్టణ మగు టచే జనులకు ప్రథమమున జనులకు సహాయ మొనర్పవలసినది గవర్నమెంటువారే యని యొప్పుకొనకతప్పదు. కాని యితరులు పట్నములోకి వచ్చి సహాయము చేయరా దనెడి నిషేధము దురవగాహము. గాంధిగారుగాని, రాజేంద్రప్రసాదుగారుగాని క్వెట్టాకు పోవ ననుమతిని పొందజాలకపోయిరి. కాబట్టి కాంగ్రెసువారును, ప్రజలును చేయవగిన ఏర్పాటులు క్వెట్టాకు బయటనే జరుపవలసివచ్చెను. యావత్తుదేశమునందును ౩౦ వ

జాను క్వెట్టాసానుభూతిదినముగ పరిగణింపబడెను. గవర్నమెంటువారిచర్య యీ విషయమై కేవలము అపనమ్మకముతోను, అనుమానముతోను నిండియున్నట్లు కనుపించుటచే వ. క. వారు ౧-౮-౩౫ న యీ దిగువతీర్మానమును గావించిరి:

"భూకంపమువల్ల క్వెట్టాకును, బెలూచిస్థాన్‌లోని పరిసరప్రాంతములకును ధననష్టమునకును జననష్టమునకును యీ సభవా రెంతయు వగచుచూ ఆట్టికుటుంబముల వారికి తమ సానుభూతిని తెలుపుచున్నారు. ప్రెసిడెంటుగారు కేంద్రసహాయసంఘమును స్థాపించుచు జరిపినచర్యను ఈసభవారు ఆమోదించుచునూ గాయములు తగిలిన వారికి ఎంతయు కష్టపడి సహాయ మొనర్చినవా రందరకును, ధనసహాయ మొనర్చిన వారికిని వందనముల నర్పించుచున్నారు. అధికారులు క్వెట్టాలో తమకున్న సిబ్బందితో సహాయ మొనర్చెదమన్న విషయమును గమనించుచూ ప్రత్యక్షముగా చూచిన ఉద్యోగుల, తదితరులయొక్క సాక్ష్యమునుబట్టి త్రవ్వుపని రెండుగోజులతోనే ముగించక యింకను సాగించి, బయటనుండి వాగ్దత్తము చేయబడిన సహాయము నంగీకరించియుండి నచో పాతుకొనిపోయిన జను లనేకులు రక్షింపబడియుండెద రని యీ సభవారి అభిప్రాయము. (౧) ఇతరులు సహాయము చేసెద మన్నప్పుడు గవర్నమెంటువారికి తగిన సాధనసంపత్తి గలదని, వారు చెప్పినమాటకు తగిన ఆధారము కనుపించ దని, (౨) ఇట్టి సహాయమును నిరాకరించుట సమర్థింపదగని చర్యయని, (౩) విపత్తులో తగిన సహాయముచేయుటకుగాను పరిసరప్రాంతములనుండి తనుజనమును పిలిపించవలసియున్నదని, (౪) క్వెట్టాలోని ప్రతి ఐరోపావాస్తవ్యుని లెక్కయు తేల్చియుండ ఇండియన్ వాస్తవ్యులవిషయమై తగినయత్నము గావింపబడక రక్షణసహాయముల విషయమై ఇట్టి భేదభావమే చూపబడెననియు ప్రజలచే మోపబడినట్టియు, కొన్ని సందర్భములలో ఉద్యోగీయులచే ప్రచురింపబడిన స్టేటుమెంట్లవలన సమర్థింపబడినట్టియు దోషారోపణలను విచారించుటకు ఉద్యోగులు, తదితరులు కలిసిన యొకసంఘమును నియమించవలెనని యీ సభవారి అభిప్రాయము."

వార్ధాలో సమావేశమయిన వ. క. వారు విచారించిన ముఖ్యవిషయము మరియొకటిగలదు. అది మంత్రిపదవీస్వీకారవిషయము. దీనినిగూర్చి విచారించుట కిది తరుణము కాదనియు, వచ్చే కాంగ్రెసునకే ఇట్టి అర్హతకలదనియు, యీలోపుగా యిందు విషయమై వ్యక్తులు ప్రకటించుభావములు కాంగ్రెసుభావములు కావనియు తీర్మానింపబడెను.

స్వదేశసంస్థానములనుగూర్చి వార్ధాసభయందు కొంత ఆందోళన జరిగెను. అంతకుపూర్వము గవర్నమెంటు ఆఫ్ఇండియాబిల్లుసందర్భమున భూలాభాయిదేశాయి

గారు సంస్థానాధీశులహక్కులనుగూర్చి తమ లీగల్ అభిప్రాయమును వ్రాసియిచ్చియుండిరి. ఇంతేకాక మైసూరులాయరులయెదుట ఈయన యీ విషయమును గూర్చి ఉపన్యాస మివ్వటం తటస్థించెను. ఈ రెండు సందర్భములలోను వీరు వెలి బుచ్చినభావములు తమహక్కులకు భంగకరములుగ నుండె నని సంస్థాన ప్రజలు తలచి ప్రత్యేకపు అ. భా. కా. క.ని గావింప నోటీ సిచ్చిరి. అందుమీద వ. క. వారీ దిగువతీర్మానమును గావించిరి:

"స్వదేశసంస్థానములనుగూర్చి కాంగ్రెసువారిభావములు వారితీర్మానములలో పొందుపరుపబడి యున్నప్పటికి, వాని నింకను స్పష్టపరచమని సంస్థానప్రజలు కోరుచుండుటచే సంస్థానాధీశ్వరులను గూర్చియు, సంస్థానప్రజలనుగూర్చియు యీ దిగువ స్టేటుమెంటును వ. క. వారు జారీచేయుచున్నారు:

"బ్రిటిషుఇండియాప్రజలతో సమానముగా సంస్థానప్రజలకుకూడ స్వరాజ్యము జన్మహక్కని కాంగ్రెసు గమనించుచున్నది. కావుననే సంస్థానములలోకూడ బాధ్యతాయుతప్రభుత్వము సాగించవలెనని ప్రకటించియుండెను. మరియు సంస్థానప్రజలకు ప్రాతిపదికపుహక్కులు గ్యారంటీ చేయవలసిన దనిన్నీ, బాధ్యతాయుతప్రభుత్వములను తమ సంస్థానములలో స్థాపించవలెననిన్నీ సంస్థానాధీశులకు కాంగ్రెసు విజ్ఞాపనచేసియుండెను. ఇంతేకాక సంపూర్ణ బాధ్యతాయుతప్రభుత్వస్థాపనమును గూర్చి సంస్థానపుప్రజలు గావించు శాంతియుతమగు సకలయత్నముల సమర్థింతుమని కాంగ్రెసు శపథము చేసియున్నది. సదరు శపథమును యీ కమిటీవారు ధ్రువపరచుచున్నారు. పైవిధమున పూర్ణమగు బాధ్యతాయుతప్రభుత్వమును స్థాపించుట తమ యొక్క శ్రేయస్సుకే వినియోగించునని సంస్థానాధీశులు గమనించుట యుక్తముగ నుండును. కాని సంస్థానములలో ఇట్టియత్నములు గావించుబాధ్యతయు, భారమును సంస్థానప్రజలమీదనే పడునని వారు గ్రహింపవలెను. కాంగ్రెసు సంస్థానాధీశులపట్ల తమకుగల కేవలమునైతికమైనట్టియు, స్నేహరీత్యాపొందదగినట్టియు పలుకుబడి ... త్రమే వినియోగించగలదు. సాధ్యమయినప్పుడల్లా తప్పక వినియోగించును. బ్రిటిషుఇండి... ప్రజలున్నూ, సంస్థానప్రజలున్నూ అన్నివిధములా ఒకవర్గమునకు చెందినవారే ...యి యున్నను, కాంగ్రెసుకు యిప్పటిపరిస్థితులలో యింతకన్న వేరెద్దియు శక్తి లేదు. వాగ్వాదపువేడిలో కాంగ్రెసుయొక్క హద్దును మరచిపోవచ్చును. మరేపద్ధతి నవలంబించినను మనకు నష్టదాయకమే. రానున్న సంస్కరణప్రణాళికవిషయమై సంస్థానములకు సంబంధించినంతవరకుమాత్రము కాంగ్రెసు జోక్యము కలిగించుకొనవలె నని అభిప్రాయము వెలిపుచ్చబడెను. ఈప్రణాళిక ప్రజాభిప్రాయ విరుద్ధ మనియు, కాన్స్టిట్యూ

యంటు అసెంబ్లీవల్ల నేర్పరచబడు నూతనప్రణాళిక వచ్చువరకు దీనిని తిరస్కరించవలె ననియు కాంగ్రెసు అనేకపర్యాయములు చెప్పియుండెను.

“సంస్థానప్రజలకు మాత్రము కాంగ్రెసు అభయహస్తమిచ్చుచున్నది. సంస్థానాధీశుల సహాయమును కొనుటకుగాను ప్రజలశ్రేయస్సు నెప్పుడును పోగొట్టజాలదు. కాంగ్రెసు ప్రథమమునుండియు ప్రజాసామాన్యముయొక్క శ్రేయస్సునేకోరి, దానికి వ్యతిరేకమైన ధనికుల ప్రతిఘటించుచున్నది.”

వార్ధాలో జరిగిన కడపటి తీర్మానము కాంగ్రెసుయొక్క ౫౦ వ జన్మదినోత్సవమునకు సంబంధించినది. ఈ ఉత్సవము ఏబదిసంవత్సరములక్రిందట ౧౮౮౫ సం.లో మొట్టమొదట ఏరోజున సమావేశమయ్యెనో అట్టి ౨౮ వ డిసెంబరు తేదీని తప్పకతిని జరుపవలెనని తీర్మానింపబడెను.

వార్ధాసమావేశ మయిన కొద్దిరోజులకు 3 వ సెప్టెంబరున జవహరలాలు విడుదలచేయబడెను. ఇందుకు కారణము వీరిభార్యయొక్క అనారోగ్యము. ఆయన వెంటనే ఐరోపాలో ఆమె యున్నచోటికి వెళ్లవలసిన దనిరి. తన శిక్షాపరిమితిలోపుగ ఇండియాకు వచ్చినచో తిరిగి ఖైదులోకి వెళ్లేయేర్పాటు.

3౫ సం. అక్టోబరుమాసములో అ. భా. కా. కమిటీ మదరాసులో సమావేశమయ్యెను. కాంగ్రెసు జరిగినపుడు తప్ప ప్రత్యేకముగా సమావేశమగుట కిదే మొదటిసారి. ఉద్యోగ స్వీకారము, సంస్థానసమస్య యీరెంటినిగూర్చి తీవ్రమగుచర్చ జరుగునని తలంచిరి గాని కడపటికి వ. క. వారి తీర్మానములే ధ్రువపరుపబడెను. రాజధానిసభలకు ఎన్నికలు చాలదూరమై యుండుటచేతను, ఈనాటిపరిస్థితులు అనిశ్చయములై యుండుటచేతను ఉద్యోగస్వీకారమునుగూర్చి యిప్పుడు చర్చించుట అనుచితమని ఆసభ తలచెను. మరియొక చిన్నవిషయము: వంగరాష్ట్రమునుండి అ. భా. కా. సంఘమునకు రావలసిన రు ౫౦౦/- లు పూర్తిగ చెల్లించనందున ఆరాష్ట్రపు సభ్యులీసభయందు పాల్గొనజాలరని తెలుపబడెను. ఇంతేకాక సెంట్రలు కలకత్తాకాంగ్రెసుకమిటీనిగూర్చి వ. క. వారు చేసిన యేర్పాట్లను వంగరాష్ట్రీయకాంగ్రెసుకమిటీవారంగీకరింపనందున వీరిపై తగుచర్య నేల తీసికొనరాదని వంగరాష్ట్రమువారికి నోటీసీయబడెను.

కథ ముగించకపూర్వము ఒక విషయము చెప్పవలసియున్నది. నూతన గవర్నమెంటు ఆఫ్ ఇండియాశాసనము ౨-౮-3౫ న రాజుగారి అంగీకారమును బడసినది. ఈ శాసనమునుగూర్చిన చర్చ వివరించుట అనావశ్యకము. కాని యీ నాటకమంను

చివరిరంగముమాత్రము తెలిసికోవగ్గది. కామన్సుసభలో మేజరు మిల్నరుగారు ౫-౬-౩౫ న మాట్లాడుచూ సర్ శామ్యూల్‌యలు హోరుగారిని కథానాయకునుగాను, చర్చిలుగారిని దొంగగాను పోల్చెను. "చివరకు రాజు దొంగను కొట్టేశాడు. ఈ రోజున రక్తస్రావము లేకుండా పరిష్కారము చేస్తాడు. కాని వీరిద్దరు రంగమును వదిలేసరికి చట్టాపట్టాలు పట్టుకుని బయటికిపోతారు." ౧౯౩౫ లో ఆడబడిన యీ నాటకమే ౧౯౨౦ స. లోకూడ ఆడినారు. పార్లమెంటులో పైకి ఎన్నిపార్టీలున్నా అసలు అందరియుద్దేశ్యము ఒక్కటే. సంస్కరణప్రణాళికాస్వరూపము బ్రిటిషు వారికి బ్రిటిషురాజ్యముగను, భారతీయులకు స్వరాజ్యముగాను అగుపించవలెననియే వారందరి ఆంతరంగికాభిప్రాయము. ఈ ద్విముఖిని చిత్రించుటకే యింతకాలయోచన జరిపినది. మంత్రివర్గమువారు 'రాజు' వేషము వేసినా, ఎదిరివారు 'దొంగ' వేషము వేసినా ఇందుకొరకే. నాటకపురంగస్థలమైన పార్లమెంటుభవనమును వదలగానే కపట వేషధారణమును వదలివైచి తమ నిజస్వరూపమును దాల్చి 'ఆహా! ప్రజలను ఎవ్విధ ముగా భ్రమింపజేసితిమి' అని ఒకరినొకరు అభినందించుకొందురు.

ఇంక కాంగ్రెసు అధ్యక్షునిగూర్చి ఒక్కమాట చెప్పి ఉపసంహారమునకు బోవు దము. కాంగ్రెసు అధ్యక్షులు సంవత్సరముపొడుగునా అధ్యక్షత వహింపవలెనని మొద టిలో బెసంటమ్మగారు ప్రతిపాదించారు. అప్పటినుండీ అధ్యక్షులు అప్పుడప్పుడు జరుగు కమిటీలకు అధ్యక్షత వహించుటతప్ప దేశసంచారముచేసి దేశముయొక్క పరిస్థితులను స్వయముగా పరీక్షింపజాలరైరి. ఇట్టి ఉత్కృష్టకార్యమును పూనుకొనినది రాజేంద్రబాబు. వీరి ఆరోగ్య మంత మంచిదిగాదు. కాని వీరి కార్యదీక్షయు, ఓపికయు అపారము. లేని యెడల యీసంవత్సరము వీరు కర్ణాటకము మహారాష్ట్రము బేరారు పాంచాలము మధ్య రాష్ట్రములలో కొంతభాగమునను, తమిళనాడు ఆంధ్ర కేరళరాష్ట్రములలోను సం చారము, ప్రచారముచేసియుండగలిగెడివారు కారు. ఈ సంచారమునందు కాంగ్రెసుకు ధనసేకరణముచేసి ఆయారాష్ట్రములకు ముప్పాతికవంతు నిచ్చివైచిరి. గాంధిగారి నిర్గమనమువల్ల రాజేంద్రబాబుగారిభారము రెట్టింపయినది. గాంధిగారున్నంతకాలము ఆయనే కార్యభారమునంతను వహించెడివారు. ఇవ్విధమున కాంగ్రెసు అధ్యక్షత పువ్వు లయ్యగాక కంటక సింహాసనమయ్యెను. కాంగ్రెసుసంస్థ గవర్నమెంటుకు ప్రతిగ పరిణ మించినది. కాంగ్రెసు ఆదర్శములను గవర్నమెంటువారణచివేయుచున్నారు. కాంగ్రెసు వారి గ్రామసేవతో గవర్నమెంటువారు పోటీపడుచున్నారు. కాంగ్రెసువారి అహింసా సత్యములను గవర్నమెంటువారు తృణీకరించుచున్నారు. ఇట్టి విరోధము మధ్యకాంగ్రెసు ఏబదిసంవత్సరములబట్టి దీక్షవహించి పనిజేయుచున్నది. ఎప్పటికప్పుడు ఆదర్శములను

విపులముచేసికొని కడపటకు సత్యాగ్రహతత్త్వమును ప్రజల కలవరచగలిగినది. ఈ మహాత్కార్యము ఒక్కమానవుని ప్రజ్ఞావిశేషముచే, మాహాత్మ్యముచే కొనసాగింపబడినది. ఈయనగారు తన భరతభూమియందు పుట్టినను తన యౌవన కౌమారదశలను విదేశమున సత్యాన్వేషణములో గడపి వార్ధక్యమున తన నూతన ప్రయోగములను జన్మభూమికి వర్తింపజేయు నుద్దేశముతో కాంగ్రెసును చేబట్టెను. "గాంధిగారి ఆట కట్టిందికాదా? సత్యాగ్రహము ఎన్నోతగ్గిందికాదా? కాంగ్రెసు పరాజయము పొందినదకాదా?" అని ప్రజలు పరిపరివిధముల ప్రశ్నించుచున్నారు. ఈ మూడుప్రశ్నలకు సమాధానమిచ్చి, యీ గ్రంథమును ఉపసంహరించెదము.

# 4. ఉపసంహారము

కడచిన యేబది సంవత్సరముల చరిత్రను సంగ్రహముగ దెల్పితిమి. పూర్వభాగము నందుకంటె ఉత్తరభాగమునందు ఎక్కువ వివరముగ విమర్శించితిమి. ఈ ఏబది సంవత్సరముల కాలములో దేశమును ఉన్నతపథమున నడపుటకు అనేక ప్రముఖులుద్భవించిరి. దాదాభాయి నౌరోజీ కాంగ్రెసుకు మూడుపర్యాయములు అధ్యక్షపదవి వహించి, కాంగ్రెసు వాఙ్మయమునందు 'స్వరాజ్య' పదమును ప్రప్రథమమున ప్రవర్తింపచేసెను. ప్రథమ సభాపతియగు డబ్ల్యు. సి. బెనర్జీయు, భారత శృంగధ్వని యని చెప్పదగిన సురేంద్రనాథబెనర్జీయు రెండేసిపర్యాయములు సభాధిపత్యము వహించు గౌరవమునకు పాత్రులైరి. అట్టి గౌరవమే శ్వేతాంబరధారి మాలవ్యా పండితునకును, మోతీలాలు పండితునకును, సర్ విలియం వెడ్డర్బరన్ గారికిని లభించినది. ౫౧ సభాపతులలోను ౮ గురు మహమ్మదీయులు-తయాబ్జీ, సయానీ, నవాబ్ సయ్యద్ మహమ్మద్ బహద్దర్, హస్సేనుఇమాం, అబుల్ కలాం అజద్, హకీం అజ్మల్ ఖాను, మహమ్మదాలీ, డాక్టరు అన్సారీ. జెండ్ అవెస్తాపరిజ్ఞానశాఖచే భారత సంస్కృతి మహాస్రవంతిని సమృద్ధిపరచిన పారశీక సంఘప్రతినిధులు దాదాభాయి నౌరోజీ, సర్ ఫిరోజిషా మెహతాగార్లు. ఈ సభాపతులలో ఇతర రాష్ట్రీయుల కంటె వంగ రాష్ట్రీయులే అధికులు. డబ్ల్యు. సి. బెనర్జీ, ఆనందమోహనబోసు, రమేశచంద్రదత్తు, లాల్ మోహనఘోషు, సి. ఆర్. దాసు, ఓమణ్ నారాయణధార్, మాలవ్యా మోతీలాలు, జవహరలాల్ గార్లు మహాకోసలరాష్ట్రీయులు. హసేన్ ఇమాం, రాజేంద్ర ప్రసాద్ గార్లు మిథిలాప్రాంతస్థులు. లాలాలజపతిరాయిగారు పాంచాల రాష్ట్రీయులు. మధోల్కరుగారు మధ్యరాష్ట్రములనుండియు, గాంధి, వల్లభాయి పటేలుగార్లు ఘూర్జరరాష్ట్రమునుండియు సభాపతులైరి. బొంబాయినుండి, తయాబ్జీ, సయానీ, మెహతాగార్లేకాక వాచా, గోఖ్లే, చందావర్కర్ గార్లు బయల్వెడలిరి. మద్రాసునుండి ఆనందాచార్యులుగారు. వీరు ఆంధ్రులు. సర్. సి. శంకరనాయర్ కేరళపుత్రుడు. సి. విజయరాఘవాచారి, శ్రీనివాసయ్యంగార్లు తమిళులు. బిసెంటు, సరోజినిదేవులవంటి నారీశిరోమణులుగూడ కాంగ్రెసుసింహాసన మధిష్ఠించిరి. ఈ అధ్యక్షమండలిలో యూల్, వెబ్, వెడ్డర్ బర్న్, కాటన్ వంటి యూరపియను ప్రముఖులును గలరు. ఈ అధ్యక్షపరంపరను జూచిన కాంగ్రెసు కేవలము దేశీయమహాజన

సభయే కాక నిజముగా అంతర్జాతీయసంస్థ యని చెప్పుట కవకాశము కలదు. ఈ సభ పతుల అధ్యక్షోపన్యాసములు రెండువేల ముద్రితపత్రములను మించియున్నవి. వానిని జి. ఎ. నటేశన్ కంపెనీవారు రెండుసంపుటములలో ప్రచురపరచిరి. ఇట్టి సాహిత్యము ను ఈ జూబిలీసందర్భమున ప్రచురపరచినందుకు వారు ప్రజల కృతజ్ఞతకెంతయు పాత్రులు.

గత అధ్యాయములో వేసికొనిన ప్రశ్నలనుగూర్చి యిప్పుడు ప్రస్తావించెదము. కాంగ్రెసు విఫలమయ్యెనా? గత దశాబ్దములో కాంగ్రెసు చిరకాలానుగతమైన మన రాజనీతికి నూతన భావములను, నూతన లక్ష్యములను ఒసగినదను విషయము ఎవరును కాదనజాలరు. మానవక్షేమమునకు సంబంధించిన రాజనీతిశాస్త్రము ఒక్క హిందూదేశమునే కాక యావత్ప్రపంచమును కలవరపరచుచున్న సాంఘిక ఆర్థిక సమస్యలను పరిష్కరించువిధమున నిర్వచింపబడినది. రాజనీతి ధర్మము కడచిన ౧౫-౧౬ సంవత్సరములలోను నిమ్నతలమునుండి ఊర్ధ్వమునకు గొంపోబడినది. ఈధర్మోద్ధరణ జగత్ప్రసిద్ధుడైన గాంధి మహాత్ముని సారధ్యమున జరిగెను. దీని అజేయత్వమును గూర్చి గిల్బర్టు మర్రే పండితుడు సమంజసముగను సూత్రప్రాయముగను ఇవ్విధమున వ్రాసినాడు: "ఈషణ్మాత్రమైనను ఇంద్రియసుఖములను లక్ష్యపెట్టని, ఎవ్విధముగను భాగ్యభోగప్రశంసల నాశించని తాను ధర్మమని నమ్మినదానిని అనుష్ఠించుటకు పూనుదీ యని గాంధితో వ్యవహరించుట కడు కష్టసాధ్యము. ఈతడు ఉపద్రవకరుడైన శత్రువు. వీనిని సాధించుట బహుదుర్లభము. ఏలయన వానిశరీరమును నీవు ఎల్లప్పుడును స్వాధీనపరచుకొనగల్గుదువు గాని వీని ఆత్మను మాత్రము కించిత్తయినను వశపరచుకొననేరవు."

ఇట్టిమహాబోధకుని ఆధ్వర్యమున కాంగ్రెస్సు రాజనీతిని దేశసేవగ స్వీకరింపగల్గినది. విద్యాధికులలో ఉదారమైన సంస్కృతియొక్కయు, ఉన్నతదేశభక్తియొక్కయు ఆవశ్యకతను ప్రబోధించినది. జానపదులకు నేతృత్వము గల్పించుటకు పాటుపడినది. కాంగ్రెసు రాజనీతియందు నూతనధర్మమును స్థాపించినది. రాజనీతి ధర్మబాహ్యమైనది కాదు. ధర్మము ఒక ప్రత్యేకసంప్రదాయమునకు గాని, ఒకవిశిష్ట సిద్ధాంతమునకుగాని కట్టువడి యుండునది కాదు. ఏది ఉదారజీవనమునకు, త్యాగశక్తికి ఆత్మార్పణబుద్ధికి దారి జూపునో అదియే ధర్మము. మనము సామాన్యముగా రాజనీతినిగూర్చి మాట్లాడునపుడు స్పర్థాభూయిష్ఠమైన వ్యవహారములనే ఆలోచించెదము. కాని కాంగ్రెసు ఆ పాలిటిక్సును జీవితమునంతను పరస్పర సహకారప్రతిపత్తితో ప్రవర్తింపచేయు ధర్మముగ మార్చివైచెను.

అప్పటినుండియు భారతజాతీయనిర్మాణమునకు సత్యము, ధర్మము మూల సూత్రములైనవి. లోకములో అసత్యము సత్వరముగను, సులభముగను విజయము గాంచు చుండును. మోసము, కాపట్యము సత్యమును, ధర్మమును సులభముగ వంచించుచుం డును. నిజమే! న్యాయశాస్త్రము తర్కము గెల్పును పొందుచుండుననుట వాస్త వము. కాని యీగెల్పులు, ఈ జయములు అసంపూర్ణములు, తాత్కాలికములు. ఆగెలు పులు విజేతలనే తుదకు సంకటపరిస్థితులలోని కీడ్చును. గత యూరపియన్ మహా సంగ్రామమున విజేతలకు నిజమైన జయము సిద్ధింపలేదు. ఇండియాపై యింగ్లాండునకు గల్గిన గెలుపును అట్లే శాశ్వత సౌఖ్యదాయకమైనదిగాదు. రౌండుటేబిల్ కాన్ఫరెన్సుల ద్వారా బ్రిటిషురాజ్య తంత్రజ్ఞులు నిర్ణయించిన రాజనీతి భారతదేశమును శాశ్వతముగ ఇంగ్లాండుయొక్క మహాసౌధమునకు దొడ్డిదావిడివలె చేసియుంచజాలదు. వారు ప్రయోగించిన ప్రతిప్రచండశాసనము తిరిగి శాసనకర్తలకే తగిలినది. అవి ప్రజలలో ప్రతి ఘటనశక్తిని ఉద్దీపింపచేసి ఇప్పుడు శాసన తిరస్కారరూపమున వ్యక్తమగుచున్నవి. మన అపజయములు నిజముగా అపజయములుగావు. ప్రతి అపజయము జయమునకు గొంపోవు సోపానము. అపజయపరంపరల చరమపరిమితియే జయము.

ఈ దృష్టితో కాంగ్రెసుయొక్క కార్యక్రమమును పరిశీలించెదము. కార్యక్ర మమునందు రెండుభాగములు కలవు. ఏ నాగరకప్రభుత్వమును ఖండింపజాలని విధ మున గవర్నమెంటును ప్రతిఘటించుట ఒకటి. త్రికరణశుద్ధితో గూడిన అహింస ఆసమరమునకు ముఖ్యసూత్రము. గాంధీ ఇండియాయొక్క 'ఛీఫ్ కాన్‌స్టేబిల్' అని పేరుపడినాడు. ప్రభుత్వమువారు అతని సత్యాగ్రహసిద్ధాంతమును దుస్సహమైనదానినిగా భావించినట్లు కన్పట్టవచ్చును. కాని సత్యాహింసలు ప్రజల భావముల నాకర్షించిన విధమును ఎవరు ఖండింపగలరు? రాజకుటుంబములు నాశనము చేయబడుచున్న కాల మిది. రాజరికములు తలక్రిందులైనవి. ప్రజాతంత్రములు కుంగిపోవుచున్నవి. రాజ్యాంగములో పార్టీపద్ధతి అదృశ్య మగుచున్నది. ఎన్నికలలోనేగాక దౌర్జన్యము చేతనే ఎదుటిపార్టీ లేకుండ జేయబడుచున్నవోజులివి. ఇట్టి కాలములో అహింసను గూర్చి మాట్లాడుట పరిహాసాస్పదముగ నుండవచ్చును. కాని రక్తపాతముచే చేకూరిన జయములను రక్తపాతముచేతనే నిలువబెట్టుకొనుటనో, కోలుపోవుటనో తటస్థించు చున్నది. ఎప్పుడు రెండుదేశములమధ్య పొసగిన వివాదములను పరిష్కరించుపట్ల పశు బలమునే న్యాయదేవతగ నంగీకరింతుమో, అప్పుడే ఆ న్యాయదేవత దేశములోపల సంఘసంఘమునకు, వ్యక్తివ్యక్తికి కలుగు వివాదములను పరిష్కరించుటకు దొరకొను చుండుట నిశ్చయము.

కాంగ్రెసు కార్యక్రమమందలి నిర్మాణకార్యవిభాగము అతిసరళమైనది. ఆయ్యది దేశములోని విద్యాధికుల నాకర్షింపలేకపోవచ్చును. విద్యాధికులైన మనము పట్టణములలోను, బస్తీలలోను వాసము చేయుచున్నాము. విదేశవస్త్రములను ధరించుచున్నాము. విదేశభాషలో వ్యవహరించుచున్నాము. విదేశీయజమానులయొద్ద నౌకరీ చేయుచున్నాము.పట్టణములలోనివ్యక్తులను పరిశీలింపుడు. పరిశీలించినయెడల పట్టణములోని ప్రతిరెండవమనిషియొక్క జీవనోపాధికి, ఐశ్వర్యాభివృద్ధికి, పేరుప్రతిష్ఠలకు విదేశప్రభువుల అనుగ్రహమే ఆధార మని తెలియును. ఈవిషయము స్థూలముగ జూచిన బోధపడదు. మన నిజ యజమాను లెవరో మనకు సరిగ తెలియదు. కాని తరచిచూచిన వారు కాన్‌స్టేబిల్‌నుండి ఎక్సైజుఇన్‌స్పెక్టరువరకు, బ్యాంకు ఏజంటునుండి ఇంగ్లీషుజడ్జివరకు గురుపరంపరవలె నున్న సంగతి హృద్గతమగును. డి. పి. డబ్ల్యు. లాస్కరు, రివిన్యూ కలెక్టరు, జెండిమ్యాజిస్ట్రేటు వీ రెల్లరు బ్రిటిషు ఎంపైరులిమిటెడ్ అనే కంపెనీ యొక్క ప్రతినిధులు. ఆ కంపెనీకి ఇండియాగవర్నమెంటు డైరెక్టర్ల లోకలుబోర్డువంటిది. వివిధరాజధానిప్రభుత్వములు ఈ బోర్డునకు సబు ఆఫీసులు బ్రిటిషుప్రభుత్వము సప్తప్రాకారములమధ్య సుప్రతిష్ఠితమైయున్నది. సైన్యము, పోలీసు, పబ్లిక్‌సర్వీసులు, కోర్టులు, కౌన్సిళ్ళు, కాలేజీలు, లోకల్‌బాడీలు, బిరుదాంకితులు ఈ ప్రాకారములు. నూటికి ౯౦ మంది గ్రామస్థులు రివిన్యూ అధికారులకు భయపడుచుందురు. పట్టణములలోని ప్రజలు మునిసిపాలిటీలు, లోకల్‌బోర్డులు, ఇన్‌కమ్‌టాక్సు ఆఫీసరులు, ఎక్సైజుఅధికారులు, పోలీసు మొదలగువారికి జడియుచుందురు. ఇట్టిసందర్భములలో దౌర్జన్యమైన భీతిని పారద్రోలి, దానిస్థానమున అహింసాపూర్వకమైన విశ్వాసమును, ధైర్యమును నెలకొల్పుట అత్యావశ్యకము. కావున కాంగ్రెసు నిర్మాణకార్యక్రమము పట్టణములలో నుండు కాంగ్రెసుసేవకులలో జనసామాన్యముతోడి సాహచర్యమును, సాంగత్యమును పెంపొందించునటుల నేర్పాటు చేయబడినది. ఖద్దరువిషయమును గమనింపుడు. అది బీదలకు ఉపపత్తిని గల్పించుటయేగాక మన దాస్యచిహ్నములను విసర్జించి ఆత్మగౌరవమును అలవరచుకొనుటకు తగిన అవకాశములను గల్పించుచున్నది. మన గృహముయొక్క పవిత్రతను కాపాడుచున్నది. కర్మకారులయొక్క ఆనందప్రదమైన కర్మవిద్యలను పోషించుచున్నది ప్రజలకు నిరాడంబరజీవన విధానమును బోధించుచున్నది. నిరాడంబరముతో భావౌన్నత్యము సిద్ధించును. ఆత్మగరిమ, స్వావలంబనము, ఆత్మవిశ్వాసము, ఆత్మోపలబ్ధి చేకూరును. ఖద్దరుద్వారా ఆర్థికవిషయములలో దేనిని పొందజూచుచున్నామో దానినే నైతిక జీవితములో మద్యపాననిషేధమువలననూ, సాంఘికముగా అస్పృశ్యతానివారణవలననూ పొందజూచుచున్నాము. మద్యపాననిషేధోద్యమమును రాజ్యాంగము అభ్యంతరపెట్టుట కేవలము నీచమని చెప్పవలసి

వచ్చుచున్నది. ఇది ఎక్కువగ పరామర్శించవలసినవిషయము కాదు. దేశము నందు ప్రధానములైన హిందూమహమ్మదీయసంఘముల మతములు ఏకగ్రీవముగ మద్యపానమును నిషేధించుచున్నవి. ఈనిషేధము ననుసరించియే యీ దేశమున నీయుద్యమము నడచుచున్నది. కాంగ్రెసు దీని నింకను బలపరచుటకు పికెటింగు ప్రారంభించుటతోడనే గవర్నమెంటు కాంగ్రెసుమీదికి ఉరుకుచున్నది.

అస్పృశ్యతానివారణవిషయములోకూడ కాంగ్రెసునకు చాట్లు తప్పినవికావు. బ్రిటిషు ప్రధానిగారి తీర్పు భగవంతు డేకముచేసినవారిని జీల్చివేయునటుల హరిజనులకు ప్రత్యేకనియోజకవర్గము నేర్పాటుచేసెను. కాని భరతవర్ష నాయకుని ఘోరోపవాసదీక్ష ఆ అన్యాయపు తీర్పును కొంతవరకు సవరించి హిందూసంఘమును రక్షింపగల్గెను. ప్రజానుమతితోనైనను దేవాలయములోనికి హరిజనులను రానిచ్చుటకు ధర్మకర్తలకు గల లీగలు ప్రతిబంధకమును తొలగించుటకై ఉద్దేశింపబడిన బిల్లువిషయములోకూడ గవర్నమెంటువారు ప్రతిఘటించిరి.

దేశము నెదుర్కొనుచున్న సమస్య అతిక్లిష్టమైనది. అటు ప్రభుత్వమూ భేదోపాయ మవలంబించుచున్నది. పట్టణములా గ్రామములకు ప్రతికూలములు. విద్యాధికులా జనసామాన్యముతో కలవరు. స్వల్పసంస్కరణములునైతము వారికి గిట్టవు. ఖద్దరనిన వారి కసహ్యము. సర్వకులసమత్వమును పాటింపరు. ఇట్టిపట్టణవాసులతో ఆంగ్లవిద్యాధికులతో లాయర్లతో షాహుకార్లతో వర్తక స్రమాట్టులతో స్వారాజ్యసంపాదనము దుస్సాధ్యము. కొత్తత్రోవ త్రొక్కవలెను. గ్రామములలో నివసించు ప్రజలయందు జాతీయావబోధము ప్రబుద్ధము కావలెను. వారి విశ్వాసము నాకర్షించునవి ఉపన్యాసములు కావు. పత్రికలు కావు. ప్రజాసేవయే ప్రజావిశ్వాసము నాకర్షింపగల్గినది. ఈవిశ్వాసము నాకర్షింపుడు. కాంగ్రెసు దేశవిమోచనకై తలపెట్టిన కార్యక్రమము సర్వజనాదరణీయ మగును. స్వరాజ్యము చెట్టునుండి రాలు పండువంటిది కాదు. స్వరాజ్యము జాతీయనిర్మాణవిధానము. ప్రతిప్రజాసేవాకార్యమును స్వరాజ్యసౌధమునకు బునాదియగును. ప్రతి సాంఘిక సంస్కరణము స్వరాజ్యగోపురమునం దొక అంతస్తుకాగలదు. ఈ విధానము శీఘ్రగమనముకలది కానిమాట నిజము. కాని దానిఫలితములు మాత్రము సుస్థిరములై వెలయును. కాంగ్రెస్సు ఈ సందేశమునే గ్రామగ్రామమునకు ప్రతిధ్వనింప జేసినది. కాంగ్రెసు గ్రామమునకే నాయకత్వ మిచ్చినది.

కాంగ్రెస్సుకార్యక్రమమును నిర్వహించుటలో ఒక కొత్తపద్ధతి ప్రవర్తింపచేయబడినది. ఈ పద్ధతి యింకను ఆరంభదశయం దున్నది. ఇంకను అవయవస్ఫూర్తి

కలుగలేదు. ఆరంభదశలో దీనిస్వరూపమును వర్ణించుట కష్టతరము. కాని ఇందు ప్రబలములైన శక్తులు గర్భితములై యున్నవను విశ్వాసము కలదు. ప్రతికక్షులు మమ్ముల పరిహాసము చేసెదరుగాక. శత్రువులు మమ్ము ద్వేషించెదరుగాక. మహోద్యమము లన్నియు ఈ అవస్థలను దాటకతప్పదు. ప్రతిమహోద్యమమును ఆరంభమున బుద్ధిపూర్వకముగనో, లేక అజ్ఞానముగనో దాని ఆభాసరూపముగ భావించి, పరిహసించుట సాధారణమైనది. రసాయనశాస్త్రప్రకారము తత్వతః వజ్రమునకును బొగ్గునకును భేదములేదు. కాని వజ్రమునందున్న సహజకాంతి బొగ్గులో చెప్పుటకలదు? అట్లే సత్యాగ్రహమును "ప్యాసివు రెసిస్టెన్సు" (సాత్విక నిరోధము) ను స్థూలముగ ఒకటిగ గోచరించినను అంతరమున విశేష తారతమ్యము గలదు. గాంధీ కాంగ్రెసు రంగమున ప్రవేశింపకపూర్వము ఒకవిధమైన 'ప్యాసివురెసిస్టెన్సు' ఉద్యమము ప్రారంభింపబడినది. బెసంటమ్మ దాని కారూపము ఇయ్యకపోయినను ప్రజలు దానిని సాత్విక నిరోధమనుకింపనే భావించిరి. గాంధీ యీదేశమునకువచ్చి చాంపరానులో సత్యాగ్రహము నవలంబించినప్పుడుగాని, కాంగ్రెసుద్వారా కాల్పుశాసనములు, ఖిలాఫతు అక్రమము, పంజాబుదురంతము మొదలగు సందర్భములలో సత్యాగ్రహమును ప్రయోగించినప్పుడుగాని అయ్యది వెనుక హోమురూలు ఉద్యమసందర్భములో తలపెట్టబడిన సాత్వికనిరోధమువంటిదే నని కాంగ్రెసునాయకులు సహితము అభిప్రాయపడిరేగాని.

కాంగ్రెసు ఉద్యమమే క్రమానుగతముగ అనేకరూపములను దాల్చినది. అది వివిధనామములచే నిర్దేశింపబడుచుండెను. 'ప్యాసివురెసిస్టెన్సు' అహంకారద్వేషపూరితము. అందు దౌర్జన్యాంకురముకూడ ఉండవచ్చును. నాన్ కోఆపరేషనుకూడ ఆగ్రహజన్యము. శత్రుహింస కోరకపోయినను శత్రువును నష్టపరచవలెననెడి కోరిక లేకపోలేదు. సివిల్ డిసొబీడియన్సు సందర్భమున మొదటిలో 'సివిల్' అను విశేషణముయొక్క ప్రయోజనము అంతగా గుర్తింపబడలేదు. పిమ్మట క్రమ క్రమముగ సత్యాగ్రహముయొక్క స్వరూపము వ్యక్తమైనకొలదియు సివిల్ డిసొబీడియన్సు అనగా వినయపూర్వకమైన, అహంకారవర్జితమైన, ప్రేమపురస్సరమైన డిసొబీడియన్సు అని బోధపడజొచ్చెను.

సత్యాగ్రహముయొక్క మూలము ప్రేమఅహింసలయందు కలదని క్రమముగా గ్రహింపగలిగితిమి. "అహింస యనగా దౌర్జన్యరాహిత్యమే కాదు. అయ్యది భావప్రపూర్ణమైన శక్తి. అయ్యది ప్రేమతుల్యము-కేవలము ప్రేమయే. ఇతరులను తగులబెట్టునది కాదు. తనను తాను ఆహుతిచేసికొను ప్రేమ." ఒక్క చౌరీచౌరాదౌర్జన్యమును యే. ఈ దేశములోని ఒక్క గోరక్ పూరుజిల్లాయొక్క అపరాధమునకేగాక యావ

ద్భారత దేశముయొక్క అపరాధముగ భావించి ౧౯౨౨ ఫిబ్రవరిలో బార్డోలీయందు చేయబడిన ఉపసంహారపు తీర్మానమునుబట్టి సత్యాగ్రహము ఎట్టి ఆధ్యాత్మికశక్తియో, ఎట్టి శాంతినిగ్రహములను గోరునో తెలిసికొనగలిగితిమి. గవర్నమెంటువారి జలియను వాలాబాగు హత్యలు దేశమునందు సత్యాగ్రహసమరమును పురికొల్పినప్పుడు, చౌరీ చౌరాలో అట్టి హత్యలనే ప్రజలు గావించినప్పుడు ఆసత్యాగ్రహము ఉపసంహరింప బడుట అనివార్య మనువిషయము చిరకాలమునకుగాని ప్రజలకు బోధపడలేదు.

సత్యాగ్రహము సకలసద్గుణములసారము. సత్యము ధర్మమునకు మూలము. అహింస యనగా ప్రేమ, దాని పరిపూర్తి. దేశమునకు క్రొత్తలోకము దృగ్గోచర మైనది. అందు ద్వేషములేదు, భయములేదు, భీరుత్వములేదు. కోప, క్రోధములకు అందు తావులేదు. నూతనలోకమున ప్రేమ, ధైర్యము, సహనము, తపసు- ఇవియే రాజ్య ముచేయును. ఇందు గౌరవమునకు ప్రమాణము భాగ్యము కాదు, సేవ. ఇందలి లక్ష్యము విజయముకాదు, శత్రువుయొక్క పరివర్తనము.

సకలవిధములైన భయములును స్వార్థము నాశ్రయించుకొని యుండును. స్వార్థము నొక్కమారు త్యజించితిమేని భయము లన్నియు పటాపంచలగును. మృత్యువును సైతము వరింపగలుగుదుము. ప్రతి సత్యాగ్రహి నిజముగా సత్యాన్వేషకుడు. వాడు తోటిమానవుని జూచి భయపడడు. గవర్నమెంటునకు భీతిల్లడు. సంఘమునకుజంకడు. దారిద్ర్యమునకు క్రుంగడు. మరణమునకు వెరవడు. నాన్‌కో ఆపరేషను ఆత్మసంయమ ముతో గూడిన సాధన. త్యాగపథమునందలి శిక్షణము. దయారససంకలితమైనధీరవృత్తి. ఒక్క ప్రుటులో నీయుద్యమనిర్మాత, ఈ సత్యాగ్రహప్రవక్త ఈ నీచ రాజకీయ వ్యవహారములను పరమోత్కృష్టమైన, ఆధ్యాత్మికమైన మహాధర్మముగా రూపొం దించెను.

ఈ యుద్యమముయొక్క తత్వము నింకను పరిశీలించెదము. ఇందు హిందూ సామాజిక నీతియొక్క మూలసూత్రముకలదు. ఆసూత్రమే 'అహింసా పరమోధర్మ' మను మహావాక్యమునందు సంగృహీతమైనది. 'లోకాస్సమస్తా స్సుఖినోభవంతు' అను ఆశీర్వాదము కేవలము నిర్మమత్వమునే విధించుటలేదు. ఏసుక్రీస్తుయొక్క మహా బోధయగు 'శత్రువును ప్రేమింపుడు' అను క్షమారూపకమైన ధర్మముగూడా శాసించు చున్నది. ఉపకారికి నుపకారముచేయుట లౌకికధర్మము. ప్రేమగలవానిని ప్రేమించుట, దయాస్వరూపునియెడల అహింసతో వర్తించుట ఒక విశేషముకాదు. పశుబలముతో గూడిన బ్రిటిషు ప్రభుత్వముతో పోరాడుట యెట్లు అని ప్రజలు నిరాశావశులై ప్రశ్నిం చెదరు. ఇక సత్యాగ్రహ మెవ్వరితో? సత్యసంపన్నులైన వశిష్ఠజనకాదులతోడనా?

మేతెంచినది. కాని చౌరీచౌరాయందు పరీక్షలో ఓడిపోయినది. అయినను కాంగ్రెసు నిరాశ చెందలేదు. సత్యాగ్రహము ఉపసంహరింపబడినప్పుడు పెద్దపెద్దలు గూడ అసమ్మతిని దెల్పిరి. కాని గాంధీ వజ్రసంకల్పుడు. సత్యాగ్రహి మిత్రులకుకూడ భయపడడు. ఒక్క సత్యమునుగూర్చియే భయపడును. గాంధీ ఆరు సంవత్సరములు ఈ యుద్యమమును విరమింపజేసెను. పిమ్మట దేశములో జరిగినవిషయములు సువిదితములు. అవియే సత్యాగ్రహముయొక్క అమోఘశక్తిని చాటుచున్నవి. అవి పురాణగాథలవలె కన్పట్టును. కలలోని దృశ్యములవలె గోచరించును. కాని అవి సత్యాగ్రహబోధయొక్క అనుష్ఠానమందలి ప్రతిభావిశేషములు.

కడచిన యేబది సంవత్సరములలోను దేశపరిణామమునందు అనేక అభ్యుత్థానపతనములు సంఘటించినవి. అభ్యున్నతి యెప్పుడును సరళరేఖవలె నుండదు. వర్తులాకారమైన సోపానపరంపరవలె పరిభ్రమించును. ౧౯౦౬ లోని స్వదేశి బహిష్కారము, జాతీయవిద్య, స్వరాజ్యము-ఇవియే పునఃపునః క్రొత్త క్రొత్త రూపములతో మనల నావరించుచుండెను. ౧౯౧౭ లో ఈకార్యక్రమమే నిర్వచింపబడినది. కాని ఆకార్యక్రమమే సాత్త్వికనిరోధ మను ఉన్నతపథమున నడచెను. ౧౯౧౯-౨౧ లో అదియే తిరిగి ఇంకను ఉన్నతమైన శాసనోల్లంఘన రూపము దాల్చెను. ౧౯౩౦-౩౪లో సత్యాగ్రహశిఖరము నధిరోహించెను. ఈ కాంగ్రెసుఅభివృద్ధి పర్వతశృంగమును ఎగబ్రాకు రైల్వేమార్గమును బోలియున్నది. పర్వతారోహణము కష్టసాధ్యమైనది. దిగజారుట సులభము. సత్యాగ్రహము అతికఠోరమైన సాధన. శాసనసభాప్రవేశము అంతకఠినము కాదు. యుద్ధమునందలి విశ్రాంతిరములు. నిజముగ నిది ఆరోహణమేగాని పతనము కాదు. కాని స్వరాజ్యసిద్ధికి ఇంకను పైకి పోవలసియున్నది.

స్వరాజ్యము సాధనగాని సిద్ధికాదు. ప్రయత్నముగాని ఫలితముకాదు. దిక్కుగాని గమ్యముకాదు. పునాదులను దిట్టపరచుచుండుటకు గృహనిర్మాతను శిఖరమేల సిద్ధము కాలేదని యెవరును ప్రశ్నింపరు. సామాన్యమైన యిల్లును కట్టుటలోనే పునాదులు గట్టిపడుటకు కొంతకాలము పట్టును. స్వరాజ్యసౌధనిర్మాణమునకు తగినపునాదులను దిట్టపరచుట కెంతకాలము పట్టునో యూహింపుడు.

ఈ యేబదిసంవత్సరములలో మన మెట్టి ప్రయత్నములను గావించితిమో వివరించితిమి. ఇప్పుడు బాట సుస్పష్టముగ గోచరించుచున్నది. గృహమును కర్మనిద్యానిలయముగ జేయవలెను. గ్రామమును భారతజాతీయతకు కేంద్రస్థానముగ జేసెదము. ఈ జాతీయసౌధమునకు సమానప్రతిపత్తి పునాది. స్వాతంత్ర్యము శిఖరము. సౌభ్రాత్రము బంధనసూత్రము. సంఘమును భిన్నాభిన్నములు చేయు సమత్వముకాదు. పొట్టి

చెట్లతో సమానముచేయుటకు పొడుగుచెట్లను తలకొట్టుట కాదు. సమానప్రతిపత్తి యనగా ఎల్లరకు సమానమైన సివిలుహక్కులు సకలాభినివేశముల అభిరుచులు సంపూర్ణముగ వికసించుటకు సమానావకాశములు. ఎల్లరకు సమానతూకముగల వోటింగు అధికారము. ఎల్లరకు తగిన సమానధర్మ స్వాతంత్ర్యము. ప్రజోపయోగకరములైన స్వాతంత్ర్యము లెన్నియో యింకను సాగవలసియున్నవి. ప్రాచీన సాంఘికవ్యవస్థలు యథారీతిని ఉండజాలవు. పీడితులకు బాధలు తొలగునటుల అజ్ఞానతిమిరములు చెల్లాచెదరగునటుల జ్ఞానదీపములు గృహగృహమున వెలుగునటుల దేశము సుఖావహముగ నుండునటుల భారతసంఘము పురోభివృద్ధి నందవలసియున్నది. ఈలక్ష్యము నుపలక్షించియే కాంగ్రెసు ప్రప్రథమమున దేశమునకు రాజకీయస్వాతంత్ర్యము నభిలషించుచు స్వతంత్రునిగ జేయువ్యక్తిని, ఉదారునిగజేయు భావమును ఎల్లరకును మూలస్వత్వములుగ గ్యారంటీ చేయుచున్నది. ౧౮౮౫ లో బొంబాయినగరమున పుట్టిన కాంగ్రెసు నది యీ యేబదిసంవత్సరములలోను అవిచ్ఛిన్నముగ ప్రవహించుచునేయున్నది. ఒకప్పుడది సన్ననికాల్వ. ఇంకొకప్పు డది విశాలమైన ప్రవాహము. ఇక్కడ అరణ్యములను భేదించెను; అక్కడ పర్వతములను తెగగోసెను. ఒకప్పుడు సరోవరమువలె నిస్తరంగమై, శాంతిగంభీరమై యుండెను. మరియొకప్పుడు ప్రబలమైన జలపాతమువలె ఉత్తుంగతరంగితమై భీకరరూపము దాల్చెను. ఈ జాహ్నవి యింకను ప్రవహించుచునే యున్నది. సలిలములు సమృద్ధము లగుచున్నవి. వర్ష వర్షమున నూతన భావములు వర్షించుచున్నవి. నవ్యాదర్శములు రేకెత్తుచున్నవి. పరంపరానుగతమైన ప్రాచీనసంస్కృతి ఇంకను సమగ్రమై సంశోధితమై విశ్వజ్ఞానసాగరమున సంగమించుటకు పరుగిడుచున్నది.

# భారతజాతీయమహాసభ అధ్యక్షులు (1922-1931)



సి. ఆర్. దాసు

గయ : 1922



అబుల్ కలామ్ అజద్

ఢిల్లీ (ప్రత్యేక) : 1923



మహమ్మదాలి

కాకినాడ : 1923



సరోజినీదేవి

కాన్ పూరు : 1925



ఎస్. శ్రీనివాస అయ్యంగారు
గౌహాతీ : 1926



డా. అన్సారీ
మద్రాసు : 1927



పండిత జవహరలాల నెహ్రూ
లాహోరు : 1929



వల్లభాయి పటేల్
కరాచి : 1931

# 1. యుద్ధానంతర రాజ్యాంగ సంస్కరణములు

[సామ్రాజ్య శాసనసభలోని అదనపుసభ్యులు ౧౯ మంది యుద్ధానంతర రాజ్యాంగసంస్కరణములనుగూర్చి వైస్రాయిగారికి సమర్పించిన విజ్ఞాపనపత్ర మీదిగువ నుదాహరింపబడినది. మొత్తముమీద అనధికారసభ్యులు ౨౭ మంది కలరు. వీరిలో ఇద్దరు ఆంగ్లోయిండియనులు. కొన్ని ప్రత్యేకకారణములవల్ల వారిని సంప్రతించియుండ లేదు. మగ్గురుసభ్యులు గైరుహాజరైరి. ముగ్గురు భారతీయులు విజ్ఞాపనపత్రముమీద సంతకముచేయుటకు నిరాకరించిరి. వారెవరనగా:—(౧) నవాబు సయ్యదు నవాబాలీచౌదరీ, (౨) అబ్దుర్ రహీం, (3) సర్దారు బహదూరు సర్దారు సుందరసింగు మజీదియా.]

యుద్ధము సమాప్తమైనపిమ్మట నాగరకప్రపంచమం దంతటను ప్రజాపరిపాలనాధర్మములు నూతనవికాసమును పొందగల వనుట నిస్సంశయము. అంతర్జాతీయవ్యవహారములయందు ధర్మసంరక్షణార్థమై బ్రిటిష్ సామ్రాజ్యాధీశులు ధనరాసులు లెక్కచేయక వెచ్చించిరి. రక్తధారల ప్రవహింపజేసిరి. దుర్బలస్థితిలోనున్న చిన్నచిన్న దేశములవారిని రక్షించునిమిత్తమై యీ మహాసంగ్రామములోనికి బ్రిటిష్‌వారు దిగియుండిరి. భారతదేశముకూడ యీ సంగ్రామములో తన ధర్మమును తాను నిర్వర్తించి పాల్గొనెను. ప్రపంచపరిస్థితులన్నియు చక్కబడవలసి యున్న వనెడి నూతనకాంక్ష భారతజాతికికూడ కలిగినది. యుద్ధానంతరము భారతదేశ పరిపాలనావిషయము క్రొత్తదృష్టితో పరికింపబడునని యీ దేశవాసులకు కొన్ని ఆశలు కల్పింపబడినవి. అభిలాష ప్రబోధింపబడినది. ౧౮33 సం॥ర ముందు భారతదేశపు చార్టరు ఆక్టు అమలులోనికి వచ్చినదాదిగా నిదానముగా, నిలుకడగా భారతజాతి నూతనవికాసమును పొందుచు వచ్చినది. బ్రిటిష్‌వారి ఏలుబడిక్రింద భారతీయులకు నూతనచిత్తవికాసమును, రాజకీయపరిజ్ఞానమును కలిగినవి. సిరిసంపదలు పెంపొందినవి. వీనికన్నింటికిని భారతీయులు ఆంగ్లేయులకు కృతజ్ఞతాబద్ధులై యున్నారు.

౧౯౦౯ సం॥ వరకును భారతదేశపరిపాలన యావత్తును భారతీయులతో సంప్రతించనటువంటి భారతీయేతరమైన అధికారవర్గమువల్లనే యథేచ్ఛగా సాగింపబడుచుండెను. ౧౯౦౯ సం॥ లో రాజ్యాంగసంస్కరణము లమలుపరచబడినప్పుడు భారతదేశ పరిపాలనా వ్యవహారములను నడిపించుటకు మొట్టమొదటి పర్యాయముగా

భారతీయులకు కొంత ప్రసక్తి కలుగజేయబడెను. ఈ వ్యవహారప్రసక్తి చాలా మిత
ముగా నుండెను. భారతీయులనుకూడ యీ దేశ రాజ్యాంగవ్యవహార రంగములోనికి
ఆంతరంగిక సలహాదారులుగా స్వీకరించుటకు గవర్నమెంటువారు ఉద్యుక్తులై యు
న్నారనుట కీరాజ్యాంగసంస్కరణములు తార్కాణము లని భావించి భారతీయులు
యీ సంస్కరణప్రణాళికను ఆమోదించిరి. శాసనసభలయందు అనధికారసభ్యుల
సంఖ్యమాత్రము హెచ్చింపబడెను. కొన్ని విషయములగూర్చి సభలో చర్చలు
చేయుటకును, ప్రశ్నలు వేయుటకును అవకాశము లొసగబడెను. కేంద్రశాసనసభలో
అధికారవర్గప్రతినిధు లగు సభ్యులే అధికసంఖ్యాకులై యుండిరి. రాష్ట్రీయ శాసన
సభలయందు అనధికారసభ్యుల సంఖ్యాధిక్యత యున్నప్పటికిని, వారిలో ప్రభుత్వ
నియోజిత సభ్యులును, యూరోపియను సంఘప్రతినిధులును చేరియుండిరి.
ప్రజలను ముఖ్యముగా బాధించెడి చట్టములుగాని, పన్నుల నిర్ణయములు
గాని సభలో చర్చకు వచ్చినప్పుడు అట్టి చట్టములవల్లను, పన్నులవల్లను బాధింప
బడనట్టి యూరోపియనుసభ్యులు గవర్నమెంటువారినే సమర్థించెదరు. నామినేటెడు
సభ్యులు గవర్నమెంటువారిచే నియమింపబడినవారగుటచేత వారును ప్రభుత్వ
పక్షమునే యనుసరింతురు. ఇటువంటి యనేకసందర్భములలో ప్రత్యక్షముగా జరిగి
యున్నట్లు మనకటి అనుభవమే ఋజువుచేయుచున్నది. కాబట్టి రాష్ట్రీయశాసన
సభలలోని అనధికారసభ్యుల సంఖ్యాధిక్యత మోసపుచ్చువలె భ్రమింపజేసెనే గాని,
ప్రజాప్రతినిధులకు అందుకల్ల నిజమైన పలుకుబడియును, ప్రాబల్యమును లభింపనే
లేదు. రాష్ట్రీయ శాసనసభలైతేనేమి, కేంద్ర శాసనసభలైతేనేమి, నిజమైన ప్రభు
త్వాధికారము లేనివై గవర్నమెంటువారికి కేవలము సలహాదారుల సంఘములవలె
నున్నవి.

ఈ రాజ్యాంగసంస్కరణములు రాకపూర్వము ప్రజలకుగాని, ప్రజాప్రతినిధు
లకువారికిగాని దేశపరిపాలనావ్యవహారములయం దేరీతిగా ప్రసక్తి, ప్రమేయము లేక
యుండెనో ఇప్పుడును అదేరీతిగా నున్నది. కాకపోతే, ప్రభుత్వ కార్యనిర్వాహక
వర్గములో భారతీయులు కొందరు ఉండుట తటస్థమైనది. కాని వీరిని నియమించే
అధికారముకూడ గవర్నమెంటువారి చేతులలోనే యున్నది. అట్టి కార్యనిర్వాహక
మంత్రులను ఎన్నుకొని నియమించుటలో ప్రజల కేమాత్రమును ప్రమేయము లేదు.

౧౯౧౯ సంవత్సరపు రాజ్యాంగసంస్కరణములను అమలుపరచుటలో గవర్న
మెంటువారియొక్క యుద్దేశము బ్రిటిష్‌ప్రధానమంత్రివాక్యములలో తేటతెల్లమగు
చున్నది. భారతీయ శాసనసభలగూర్చిన చిత్తుచట్టముయొక్క ద్వితీయ ప్రతిపాదన
కామన్సుసభలో జరిగినప్పుడు (౧౯౧౯ ఏప్రిలు ౧ వ తేదీని) బ్రిటిషుప్రధానమంత్రి

యిట్లు చెప్పియుండెను:—"శాసనసభలలోని వ్యవహారము లన్నియు అధికారవర్గము వారు తమ యిష్టానుసారము ఆడించెడి బొమ్మలు కావనెడి భావము ప్రజలకు కలుగ జేయుట ప్రస్తుతపరిస్థితులలో వాంఛనీయ మై యున్నది." కాని యీ వాంఛితము సిద్ధింపలేదని మనవిచేయుచున్నాము. ఈశాసనసభలయొక్కయు, నిర్వాహకవర్గముల యొక్కయు నిర్ణయవిధానము మాట యటుండ నిచ్చి, భారతీయులకుగల తీవ్రప్రతిబంధ కములు కొన్ని గలవు. ఈప్రతిబంధకములవల్ల వారి ఆత్మగౌరవమునకే న్యూనత కలుగు చున్నది. ప్రజలయందు గల యుత్తమప్రజ్ఞాసామర్థ్యములు వ్యర్థమగుచున్నవి. ఒసగ బడిన రాజ్యాంగవిధానసౌకర్యములను వారు వినియోగించుకొనజాలకున్నారు. ఆయుధ శాసన మీదేశములోని యూరోపియనులకును, ఆంగ్లో యిండియనులకును వర్తించ కుండ, స్వదేశీయులగు భారతీయులకు మాత్రమే వర్తింపజేయబడుచున్నది. వాలంటీరు పటాలములలో చేరుటకు భారతీయులు అర్హులని పరిగణింపబడుచున్నారు.

పటాలములలోని పెద్దయుద్యోగపదవులు భారతీయులకు నిరాకరింపబడినవి. ఇవన్నియు ప్రబలప్రతిబంధకములు. ఒక్క దేశములోనే రెండుజాతులవారియెడల పక్షపాతి భేదబుద్ధితో వ్యవహరించుచు యీ ప్రతిబంధకములను కల్పించుచున్నారని భారతీయులు భావించుచున్నారు. ఈ భేదబుద్ధి లేకపోయినను, ఈ ప్రతిబంధకములు అనర్థకములే యగును. ఆత్మరక్షణార్థమైన ఆయుధములు ప్రజలు తమవద్ద నుంచుకొన రాదని నిషేధించుటవల్లను, పరతునియమముల నేర్పరచుటవల్లను జనసామాన్యము నిర్వీర్యమై ధైర్యసాహసములను గోల్పోయినది. అసహాయస్థితిలోనికి వచ్చిరి. కాబట్టి భారతదేశములోని భారతీయుల ప్రస్తుతస్థితి ఎట్లున్న దనగా తమదేశ పరిపాలనా వ్యవహారములను నిర్ణయించి నడిపించుటకు వారికి అవకాశము లేదు.

బ్రిటిష్‌సామ్రాజ్యవాసులైన తదితరజాతులవారికి యీ దేశములో లేని ప్రతి బంధకములు కొన్ని భారతీయులకు మాత్రమే కల్పింపబడినవి. అందువల్ల వారు పూర్తిగా అసహాయస్థితిలో నున్నారు. ప్రభుత్వమువారే యీ దేశమునుండి కూలీలను పోగుచేసి కంట్రాక్టు షరతులమీద వారిని బ్రిటిష్ వలసరాజ్యములకు పంపుచుండుట వల్ల యీ దేశవాసులందరును కూలిజనులే యనెడి యభిప్రాయము ప్రపంచములో ఏర్పడుచున్నది. ఈకంట్రాక్టుకూలీల స్థితి బానిసలస్థితికంటె ఏమాత్రమును ఎక్కువగా లేదు. భారతీయులుకూడ బ్రిటిష్‌సామ్రాజ్యములోని తదితర ప్రజాసంఘములతో సరి సమానమైన పౌరులుగా న్యాయశాస్త్ర రీత్యా పరిగణింపబడినప్పటికినీ, బ్రిటిష్ సామ్రాజ్యములో వీరు అల్పులుగానేయున్నారు. బ్రిటిష్‌సామ్రాజ్యములో భారతజాతికి గల ప్రతిపత్తి చాలా హీనముగానే యున్న దని ఆసియాఖండములోని యితరప్రాచ్య

దేశములవారుగూడ భావించుచున్నారు. ఈ హైన్యము భారతీయులకు చాలా తల
వంపులుగా నున్నది.

నూతన విద్యావికాసమువల్లను, విదేశపర్యటనమువల్లను, స్వతంత్రప్రజాప్రభుత్వ
ములను చూచివచ్చుటవల్లను ప్రబోధితులయిన యీ దేశ యువకులకు యీ హైన్యము
దుర్భరముగనున్నది. ఇటువంటి బాధకములును, ప్రతిబంధకములును ప్రజలను పీడించు
చున్నప్పటికిని, ఉన్నతపదవులందున్న బ్రిటిషు రాజకీయవేత్తలును, సార్వభౌములును ఈ
దేశవాసులకు ధర్మసమన్వితమైన ఆదరణ చూపబడునని అప్పుడప్పుడువాగ్దానములు చేయు
చుండుటవల్ల ప్రజలు ఆశతో, నమ్మకముతో నిలువగల్గియున్నారు. ఇప్పుడు సంభ
వించిన యీ విషమసమయమందు భారతీయులు తమకును, తమప్రభుత్వమునకును
మధ్యనున్న గృహచ్ఛిద్రముల నన్నింటిని లెక్కచేయక సామ్రాజ్యసంరక్షణార్థమై
నడుముకట్టి నిలువబడిరి. భారతీయ సైనికులు ఐరోపారణరంగములకు జీతబత్తెముల
కాసపడెడి కూలిభటులవలెగాక బ్రిటిషుసామ్రాజ్యమును కాపాడవలసిన బ్రిటిష్ పౌరుల
మనెడి భావముతో వెడలియుండిరి. ఇంగ్లాండు దేశమునకు సంభవించిన యీ చిక్కును
తొలగించవలెననెడు సంకల్పమే ప్రజలనందరిని ఆవేశించెను. భారతదేశమునుండి బ్రిటిష్
పటాలములును, భారతీయపటాలములును పంపివేయబడినప్పటికిని భారతదేశము ప్రశాం
తమై అల్లకల్లోలము లేక యున్నది.

మహాసంగ్రామమందు భారతీయులు చేసిన సేవాసహాయములను కొనియాడుచు
బ్రిటిష్ ప్రధానమంత్రిగారు ఆంగ్లేయుల మనోగతభావములనే యీక్రిందిరీతిగా వెల్ల
డించియుండిరి: "మన సమష్టిశ్రేయమును, భవిష్యదభ్యుదయమును కాపాడుటకు
భారతీయులు మనతో సరిసమానులైన జాయింటుసంరక్షణకర్తలై యున్నారు."
భారతీయులు తాము వెల్లడించిన ప్రభుభక్తికి పారితోషికమును కోరరు. కాని,
ప్రజలకు ప్రభుత్వమువారియందు భక్తివిశ్వాసములు లేవనెడి దురభిప్రాయ ముండుట
వల్లనే భారతీయు లీప్రస్తుత హీనదశలో నుంచబడుచున్నారు. కనుక, అట్టి దురభి
ప్రాయము తొలగిపోవలెనని కోరుచున్నారు. భారతీయులు ప్రభుభక్తిలేనివారనుట
నేడిక పుక్కిటిపురాణము కావలెను. ఇకనుండియు భారతీయులు క్రిందిజాతివా
రనెడిభావ మంతరించి సరిసమానమైన మిత్రులుగా పరిగణింపబడవలసి యున్నారు.
అట్టిభావ మేర్పడినయెడల బ్రిటిష్‌వారి ఏలుబడిక్రింద భారతీయులకు స్వపరిపాలన
స్వాతంత్ర్యము లభింపగలదనెడి నమ్మకము భారతీయుల కేర్పడును. అట్టి స్వపరిపాల
నార్హత భారతీయులకు కలుగజేయుటయే బ్రిటిష్‌వారి సంకల్పమై యున్నదని
బ్రిటిష్‌ప్రభువులును, రాజ్యాంగవేత్తలును తమంతటతాము పలుమారు పల్కియుండిరి.
ఆమాటల నిపుడుచెల్లింపదగును. కేవలము చల్లని ప్రభుత్వము కావలెననిగాని, సమర్థమైన

పరిపాలన కావలెననిగాని భారతీయులు కోరుటలేదు. తమకు బాధ్యతాధికార ముల నొసగెడి ప్రభుత్వవిధానమే భారతీయులకు వాంఛింపదగినదై యుండును. ఈ రీతిగా యోచనచేయగల్గుటయే ప్రభుత్వమువారి దృక్పథమందు జరుగవలసిన మార్పు.

యుద్ధము ముగిసినపిమ్మటకూడ భారత దేశముయొక్క పరిస్థితులు యథాపూర్వ ముగానే యుండినయెడలను, తగినమార్పేమియు జరుగనియెడలను యీ దేశవాసులందు అసంతృప్తి, ఆశాభంగము తీవ్రముగా కలుగగలవు. ఈ ఉభయదేశోపద్రవసందర్భ మున సమష్టిగా కష్టించి భారతీయులు తోడ్పడి శుభమును చేకూర్చుటవల్ల కలిగిన ప్రయోజనమంతయు వ్యర్థమగును. భారతీయుల మనోరథములు భగ్నములైనవసెడు విషాదముమాత్రము స్థిరముగా మిగిలియుండును. గవర్న్మెంటువారుకూడ యీసంగతి సందర్భములను గమనించుచున్నారనియు, యీ దేశమునకు కావలసిన నూతనరాజ్యాంగ సంస్కరణవిధానములగూర్చి ఆలోచించుచున్నారనియు మేము నమ్మియున్నాము. అట్టి నూతనరాజ్యాంగసంస్కరణము ఏరీతిగా నుండదగునో గవర్న్మెంటువారికి వినయపూర్వకముగా యీతరుణమున విన్నవింపదలచితిమి. ఆ నూతనసంస్కరణములు సమూలమైన సంస్కరణములుగా నుండవలెను. ఈ దేశపరిపాలనయందు ప్రజలకు నిజ మైన, సమర్థమైన అధికారప్రపత్తిని కలుగజేయవలెను. ప్రజలను అసహాయులను చేయు నట్టియు, ప్రజలను హీనదశలో నుంచునట్టియు పైజెప్పిన దుస్సహప్రతిబంధకములను తొలగింపవలెను. ఆయుధధారణమున్ను, సైనికోద్యోగపదవులున్ను లభింపవలెను. ఈయభిప్రాయదృష్టితో యీక్రింది వ్యవహారమార్గములను మీరు శ్రద్ధగా ఆలోచించి ఆమోదింపగలందులకై నివేదించుచున్నాము:

(౧) రాష్ట్రీయ శాసనసభలయందును, సామ్రాజ్యశాసనసభయందును ఉండెడి కార్యనిర్వాహకవర్గములలో సగముమంది భారతీయు లుండవలెను. ఈ కార్యనిర్వా హకవర్గములయం దుండెడి యూరోపియనులు సాధ్యమైనంతవరకును ఇంగ్లాండులో రాజకీయ వ్యవహారతంత్రానుభవము గల అనుభవజ్ఞులైన విద్యాధికులుగా నుండవలెను. అట్టివా రుండుటవల్ల వారికిగల ప్రపంచ వ్యవహారానుభవలాభము భారతీయులకు చేకూరగలదు. ఈ కార్యనిర్వాహకులుగా నుండెడి భారతీయులుగాని, యూరోపియ నులుగాని పరిపాలనాధికారము వహించిన ప్రభుత్వోద్యోగులుగా నుండినవారై యుండ నక్కరలేదు. ఇంగ్లాండులోని మంత్రులకువలెనే ఆయా వ్యవహారశాఖల యందు గల వ్యవహార వివరములను, పద్ధతులను తెలియజేయుచుండగల ఖాయమైన అధికారులు చేయూతగా నుండగలరు. కార్యనిర్వాహక సభ్యులుగా నుండి ఆయావ్యవ హారశాఖలను సమర్థతతో నిర్వహించగల అర్హులైన భారతీయులు తగినంతమంది సర్వదా లభించుచునే యుండగలరు. ఈ విషయములో గత కొలది అనుభవజ్ఞానమే

లలో ౧౬౦ కి తక్కువయుండరాదు. చిన్నరాష్ట్రములలో ౬౦ మొదలు ౭౫ కు తగ్గియుండరాదు.

(౪) సాలుసరి ప్రభుత్వాదాయవ్యయ మదింపు లెక్కలన్నియు సర్కారువారి బిల్లుల రూపమున శాసనసభలో ప్రతిపాదింపబడవలెను. సుంకములను, పన్నులను గురించి నిర్ణయించుటలో భారతీయులు సర్వస్వతంత్రులై యుండవలెను.

(౫) భారతదేశ పరిపాలనా వ్యవహారములకు సంబంధించిన అన్ని విషయముల లోను చట్టములను శాసించుటకును, తీర్మానములను చేయుటకును కేంద్ర శాసనసభకు అధికారముండవలెను. రాష్ట్రీయ పరిపాలనా వ్యవహారము లన్నింటి యందును రాష్ట్రీయ శాసనసభల కధికారముండవలెను. సైనిక వ్యవహారములను నిర్ణయించుట, విదేశరాజ్యాంగ వ్యవహారసంబంధములు, యుద్ధసంకల్పమును ప్రకటించుట, శాంతిచేయుట, సంధిపత్రము వ్రాసికొనుట (శాసనసభ ఒప్పుకొనవలసినవి మాత్రమందు చేరవు), ఇండియా గవర్నమెంటువారి యధికారమందుండబడకూడదు. వ్యవహారముల బందోబస్తుకొరకై సపరిషత్కుడైన గవర్నరు-జనరలుగాని, సపరిషత్కుడైన గవర్నరుగాని ప్రతిఘటనాధికారమును కలిగియుండవచ్చును. కాని, అట్టి ప్రతిఘటనాధికారము కొన్ని షరతు నియమములకు లోబడియుండవలెను.

(౬) ఇండియా కార్యదర్శి సభ నంతయు రద్దుచేయవలెను. బ్రిటిష్ వలస రాజ్యముల కార్యదర్శి వలసరాజ్యముల విషయములో ఎట్టి హోదాను, వ్యవహార సంబంధమును కలిగియున్నారో, అట్టి సంబంధమునే ఇండియా కార్యదర్శి కూడ కలిగియుండవలెను. ఇండియా కార్యదర్శికి సహాయముగా యిద్దరు సహాయకార్యదర్శు లుండవలెను. వీరిద్దరిలో ఒకరు భారతీయుడై యుండవలెను. ఇండియా కార్యదర్శి యొక్కయు, సహాయ కార్యదర్శులయొక్కయు జీతములను ఇంగ్లండు ప్రభుత్వము వారి వ్యయపట్టికలో చేర్పవలెను.

(౭) భారతదేశమును బ్రిటిష్ సామ్రాజ్యములో చేరిన సమాఖ్యగా నిరూపించుటకై ఏ ప్రభుత్వవిధానమును నిర్ణయించినప్పటికిని, స్వపరిపాలితములైన అధినివేశ రాజ్యములకు గల ప్రతిపత్తినే భారతదేశమునకు ప్రజానిర్వాచిత ప్రతినిధివర్గముల ద్వారా కల్పింపవలెను.

(౮) ఇండియా గవర్నమెంటువారి ౧౯౧౭ ఆగస్టు ౨౦ వ తేదీ గల లేఖలో సూచింపబడినరీతిగా రాష్ట్రీయప్రభుత్వములు సర్వస్వతంత్రములైనవిగా నుండవలెను.

(౯) సంయుక్త పరగణాలకును, తదితర పెద్దరాష్ట్రములకును బ్రిటనుదేశము నుండి రప్పింపబడిన గవర్నరులు నియమింపబడవలెను. ఆరాష్ట్రములకు కార్యనిర్వాహకవర్గము లుండవలెను.

(౧౦) స్థానిక స్వపరిపాలనావకాశము పూర్తిగాగల విధాన మొకటి వెంటనే అమలు పరచబడవలెను.

(౧౧) యూరోపియనులకు ఏపద్ధతుల ననుసరించి ఆయుధ ధారణమునకు హక్కు ఒసగబడుచున్నదో అదేరీతిగా భారతీయులకు గూడ హక్కు ఒసగబడవలెను.

(౧౨) భారతదేశములో నెలకొల్పబడిన భారతదేశీయ పటాలములందు సైనికోద్యోగులుగాను, వాలంటీరులుగాను భారతీయులు చేర్చుకొనబడుటకు అనుమతి నొసంగవలెను.

(౧౩) పటాలములోని ఉన్నతోద్యోగ పదవులను ఏషరతుల ప్రకారము యూరోపియనుల కొసగుచున్నారో అట్టి షరతులనే యనుసరించి భారతీయ యువకులకు గూడ ఒసగవలెను.

ఇట్లు

| | |
|---|---|
| మణీంద్ర చంద్రనంది (కాసింబజారు), | బి. నరసింహేశ్వర శర్మ, |
| డి. ఇ. వాచా, | మీర్ అసద్ అలీ, |
| భూపేంద్రనాథబాసు, | కామినీకుమారచందా, |
| బిషన్‌దత్ షుకల్, | కృష్ణసాహే, |
| మదనమోహన మాలవ్యా, | ఆర్. యస్. థంజదేవ్ (కనిక), |
| కే. వి. రంగస్వామి అయ్యంగారు, | యం. బి. దాదాభాయి, |
| మజ్రుల్‌హక్, | సీతానాధరాయి, |
| వి. యస్. శ్రీనివాసన్, | మహమ్మదాలీ మహమ్మదు, |
| తేజ్ బహాదూరు సప్రూ, | యం. ఎ. జిన్నా. |
| ఇబ్రహీం రహీంతుల్లా, | |

# 2. కాంగ్రెసు లీగు ప్రణాళిక

౧౯౧౬ డిశంబరు ౨౯ వ తేదీని భారతకాంగ్రెసు మహాసభలోను, ౧౯౧౬ డిశంబరు ౩౧వ తేదీని అఖిలభారతముస్లింలీగు సభలోను ఈతీర్మానమామోదింపబడెను:

"(ఏ) ఇండియాలోనున్న గొప్పజాతులు ప్రాచీననాగరకతను వారసత్వమువలన బడసినవి; పరిపాలనమునందు చాల సామర్థ్యమును నెల్లడించినవి; ఇండియాలో బ్రిటిష్‌పరిపాలన యేర్పడినదిమొదలు నూరేళ్లలోను విద్యావిషయమున చాల అభివృద్ధిని బడసినవి. ఇపుడున్న ప్రభుత్వవిధానమువలన ప్రజల సహజమైన వాంఛితములు సఫలము కాలేదు. ప్రస్తుతకాలపరిస్థితులకును, అవసరములకును యిది పనికిరాలేదు గావున "సాధ్యమైనంతత్వరలోనే ఇండియాకు స్వపరిపాలన మిచ్చుట బ్రిటిష్‌వారి పద్ధతియు, అభిప్రాయమునై యున్నది" అని శ్రీసార్వభౌమచక్రవర్తిగారొక ప్రకటన చేయుటకు తగినసమయ మిపుడు తటస్థించినదని కాంగ్రెసువారు తలంచుచున్నారు.

"(బి) అఖిలభారత ముస్లింలీగువారు నియమించిన ఉపసంఘమువారితో కలసి భారతకాంగ్రెసు స్థాయిసంఘమువారు సిద్ధపరచిన విధానములోని రాజకీయసంస్కరణములను మా కొసగుటమూలమున స్వపరిపాలనమునకు నిర్ధారణమైన ప్రథమప్రయత్నమును చేయవలెనని కాంగ్రెసువారు కోరుచున్నారు.

"(సి) సామ్రాజ్యపునర్నిర్మాణమునందు ఇండియాను డిపెండెన్సీ స్థానమునుండి పైకిలేవనెత్తి సామ్రాజ్యములో స్వపరిపాలనముగల యితరదేశములతోపాటు సమానభాగస్వామినిగా చేయవలెను."

సంస్కరణవిధానము

౧. రాష్ట్రీయశాసనసంఘములు.

౧. రాష్ట్రీయశాసనసంఘముల సభ్యులలో ౪/౫ వంతు మంది ఎన్నుకొనబడవలెను. ౧/౫ మంది నియమింపబడవలెను.

౨. పెద్దరాష్ట్రముల శాసనసంఘములలో సభ్యులసంఖ్య ౧౨౫ మందికిని, చిన్నరాష్ట్రములలో ౫౦ - ౭౫ మందికిని తక్కువగా నుండగూడదు.

౩. వోటరుల సంఖ్యను వీలైనంతవరకు హెచ్చించవలెను. ఆ వోటరులవలననే శాసనసంఘముల సభ్యులు ఎన్నుకొనబడవలెను.

౪. ప్రాముఖ్యముగల అల్పసంఖ్యాకసంఘములకు ఎన్నికలద్వారా తగని ప్రాతినిధ్యమును కలుగజేయవలెను. రాష్ట్రీయశాసనసంఘములలో యీదిగువను వివరింపబడిన అంశలవారిని ప్రత్యేకనియోజకవర్గములద్వారా మహమ్మదీయులకు ప్రాతినిధ్యముండవలెను.

పంజాబు—ఎన్నుకొనబడిన భారతీయ సభ్యులలో సగముభాగము

| | | | | |
|---|---|---|---|---|
| సంయుక్తపరగణాలు | ,, | ౧౦౦ కి | ౩౦ | స్థానములు |
| బెంగాలు | ,, | ,, | ౪౦ | ,, |
| బీహారు | ,, | ,, | ౨౫ | ,, |
| మధ్యరాష్ట్రములు | ,, | ,, | ౧౫ | ,, |
| మదరాసు | ,, | ,, | ౧౫ | ,, |
| బొంబాయి | ,, | మూడవవంతు | | |

ప్రత్యేక యింటరెస్టులకు ప్రతినిధులకు నియోజకవర్గముల ఎన్నికలలో తప్ప భారత (యింపీరియలు) శాసనసంఘమునకును, రాష్ట్రీయశాసనసంఘములకును సంబంధించిన మరియే యెన్నికలలోను యేమహమ్మదీయునకును పాల్గొనగూడదు.

ఇంపీరియలు శాసనసంఘసభలో గాని, రాష్ట్రీయశాసనసంఘముల సభలలో గాని అనధికారసభ్యులెవరైన యీ రెండుజాతులలో నేజాతికైన సంబంధించిన బిల్లునుగాని, బిల్లులోమార్పునుగాని, తీర్మానమునుగాని ఉపపాదించినపుడు ఆ శాసనసంఘములో నున్న ఆజాతికి చేరినసభ్యులు ఆ ప్రశ్నను నిర్ణయింపవలసియున్నచో ఆశాసనసభలో ఆజాతికిచేరిన సభ్యులలో ౩/౪ మంది దానికి ప్రతికూలురుగానున్నచో దానినిగూర్చి చర్చించగూడదు.

౫. రాష్ట్రీయశాసనసంఘాధ్యక్షుని నెన్నుకొనుటకు రాష్ట్రీయసంఘమున కధికారముండవలెనుగాని ఆరాష్ట్రముయొక్క గవర్నరు శాసనసంఘాధ్యక్షుడుగా నుండగూడదు.

౬. ఒకసభ్యుడు శాసనసంఘసభలో నొకప్రశ్న నడిగినప్పుడు దానికి సంబంధించిన యితర అనుబంధ ప్రశ్నల నడుగుటకు అతని కొక్కనికి మాత్రమేగాక తక్కిన సభ్యులకు కూడ అధికార ముండవలెను.

౭. (ఏ) కస్టమ్సు, టపా, టెలిగ్రాఫు, టంకసాల, ఉప్పు, నల్లమందు, ఇనుపదారులు, సైన్యము, నౌకాదళము, ఇండియాసంస్థానములు చెల్లించు కప్పములు ఇవి తప్ప తక్కిన ఆదాయవసతు లన్నియును రాష్ట్రమునకే చెందవలెను.

(బి) ఆదాయవసతులను విభజించ గూడదు. రాష్ట్రీయ ప్రభుత్వములం భారతప్రభుత్వమునకు చెల్లింపవలసిన మొత్తములను నిర్ధారణచెయ్యవలెను. తలవని తలంపుగా విపరీతపరిస్థితు లేర్పడుటవలన ఆ మొత్తములను సవరింపవలసిన అవసరము కలిగినచో వాటిని సవరించుటకు వీలుండవలెను.

(సి) రాష్ట్రీయ పరిపాలనకు సంబంధించిన అన్ని విషయములను, అనగా బదుళ్లను పుచ్చుకొనుట, పన్నులను విధించుట, పన్నులను మార్చుట, ఆదాయవ్యయపట్టి కనుగూర్చి వోటుచేయుట మున్నగువాటినన్నిటిని గూర్చియు చర్చించుటకు రాష్ట్రీయ శాసనసంఘములకు సంపూర్ణాధికార ముండవలెను. వ్యయములకు సంబంధించిన అన్ని అంశములను, ఆదాయమును సమకూర్చుటకు వేరువేరు సాధనముల సూచనలను బిల్లులలో చేర్చి రాష్ట్రీయ శాసనసంఘములవారిచే నామోదింపబడుటకు వాటిని శాసనసంఘ సభలలో నుపపాదించవలెను.

(డి) రాష్ట్రీయప్రభుత్వముయొక్క పరిశీలనకు లోబడి అన్నివిషయములను గూర్చిన తీర్మానములపైనను చర్చ జరుపుటకు శాసనసంఘమువారు చేసిన నిబంధనల ప్రకారము చర్చింపబడుట కధికార ముండవలెను.

(ఇ) రాష్ట్రీయశాసనసంఘసభలో నొక తీర్మాన మామోదింపబడునెడల దానిని గవర్నరు తిరస్కరించినయెడల తప్ప లేనిచో దానిని నెరవేర్చుటకు ప్రభుత్వ కార్యనిర్వాహకవర్గమువారు బాధ్యులై యుండవలెను. ఒక సంవత్సరమునకు తక్కువ కాని కాలానంతరము రాష్ట్రీయశాసనసంఘసభలో ఆతీర్మానమే మరల నామోదింప బడినచో ప్రభుత్వవర్గమువారు దానిని విధిగా కొనసాగింపవలెను.

(ఎఫ్) ప్రజలకు చాలముఖ్యమును, అవసరమును, నిర్ధారణమును అగు నొక విషయమునుగూర్చి అడ్జర్న్మెంటు తీర్మానము నుపపాదింప గోరునెడల ఆ సభకు వచ్చినవారిలో ౧ వ వంతు మందికి తక్కువ కాకుండా దానిని బలపరచినచో దాని నుపపాదింపవచ్చును.

౧. సభ్యులలో ౧ వంతుకు తక్కువ కానివారు కోరినచో ప్రత్యేకముగా రాష్ట్రీయశాసనసంఘసభను జరుపవలెను.

౯. ధనమునకు సంబంధించిన బిల్లులనుగాక తక్కినబిల్లులను ఉపపాదించు విషయమున రాష్ట్రీయశాసనసంఘమువారు చేసిన నిబంధనలకు లోబడి అట్టి బిల్లుల నుపపాదించవచ్చును. దానికి దొరతనమువారి అనుమతిని కోరవలసిన అవసర ముండ గూడదు.

౧౦. రాష్ట్రీయశాసనసంఘ సభలలో నామోదింపబడిన అన్ని బిల్లులును గవర్నరు ఆమోదించినపిమ్మటనే చట్టములు కావలెను. వాటిని గవర్నరుజనరలు తిరస్కరింపవచ్చును.

౧౧. సభ్యుల అధికారపరిమితి అయిదేళ్లుగా నుండవలెను.

౨. రాష్ట్రీయప్రభుత్వములు

౧. ప్రతిరాష్ట్రమునకును ఒక గవర్నరు వుండవలెను. సాధారణముగా ఇండియను సివిలుసర్వీసుకుగాని, యేపరమైనంటు సర్వీసుకుగాని చేరినవారిని గవర్నరుగా నియమింపగూడదు.

౨. ప్రతిరాష్ట్రంలోను ఒక కార్యనిర్వాహకసంఘ ముండవలెను. గవర్నరును యీ సంఘమును కలిసి రాష్ట్రీయ కార్యనిర్వాహకప్రభుత్వముగా నేర్పడవలెను.

3. సాధారణముగా యిండియను సివిలుసర్వీసు శాఖవారిని కార్యసంఘసభ్యులనుగా నియమించగూడదు.

౪. కార్యనిర్వాహకసంఘసభ్యులలో కనీసము సగము మందియైనను యిండియనులుగా నుండవలెను. రాష్ట్రీయశాసనసంఘమునకు ఎన్నుకొనబడిన సభ్యులు వీరిని ఎన్నుకొనవలెను.

౫. వీరికి అధికారకాలము అయిదేళ్లుగా నుండవలెను.

3. సామ్రాజ్యశాసనసంఘము

౧. సామ్రాజ్యశాసనసంఘమున ౧౫౦ మంది సభ్యు లుండవలెను.

౨. వారిలో ౪/౫ వంతు మందిని ఎన్నుకొనవలెను.

3. రాష్ట్రీయశాసనసంఘములకు సంబంధించిన మహమ్మదీయుల నియోజకవర్గముల పద్ధతిని వీలైనంతవరకు సామ్రాజ్య శాసనసంఘమునకు వోటరుల సంఖ్యను హెచ్చించవలెను. సామ్రాజ్యశాసనసంఘసభ్యుల నెన్నుకొనుటకు రాష్ట్రీయశాసనసంఘములలో ఎన్నుకొనబడిన సభ్యులుగూడ నొక నియోజకవర్గముగా నుండవలెను.

౪. ఎన్నుకొనబడిన యిండియనులలో ౧/3 మంది మహమ్మదీయు లుండవలెను. వీరిని వివిధరాష్ట్రములలో మహమ్మదీయ నియోజకవర్గములు ఎన్నుకొనవలెను. రాష్ట్రీయశాసనసంఘములకు ప్రత్యేకమహమ్మదీయ నియోజకవర్గములచే ఎన్నుకొనబడిన మహమ్మదీయసభ్యుల అంశకు వీలైనంతవరకు చేరునట్టి అంశప్రకారము వీరు ఎన్నుకొనబడవలెను.

వరా—ఒకటవ సెక్షను ౪ వ క్లాజు వరతులను చూడుడు.

౫. ఈశాసనసంఘసభ అధ్యక్షుని శాసనసంఘసభ్యులే యెన్నుకొనవలెను.

౬. ఒకసభ్యుడు సభలో నొక ప్రశ్న నడిగినపుడు దానికి సంబంధించిన యితరఅనుబంధప్రశ్నల నడుగుటకు అతని కొక్కనికిమాత్రమేగాక తక్కినసభ్యులకు గూడ అధికార ముండవలెను.

౭. శాసనసంఘ సభ్యులలో ఏ వంతు మందికి తక్కువ కానివారు కోరినచో ప్రత్యేకముగా శాసనసంఘసభను జరుపవలెను.

౮. ధనమునకు సంబంధించిన బిల్లులనుగాక తక్కినబిల్లులను ఉపపాదించు విషయమున నీశాసనసంఘమువారు చేసిననిబంధనలకు లోబడి అట్టిబిల్లు నుపాదించవచ్చును. దానికి దొరతనమువారి అనుమతిని కోరవలసిన అవసర ముండగూడదు.

౯. ఈశాసనసంఘసభలో నామోదింపబడిన అన్ని బిల్లులను గవర్నరు జనరలు ఆమోదించిపిమ్మటనే చట్టములు కావలెను.

౧౦. ఆదాయవసతులు, వ్యయాంశములు మున్నగు ఆర్థికవిషయములకు సంబంధించిన సూచనలన్నియును బిల్లులలో నుండవలెను. అట్టి ప్రతిబిల్లుపైనను మొత్తము ఆదాయవ్యయ పట్టికపైనను సామ్రాజ్యశాసన సంఘమువారు వోటుచేయు నిమిత్తము వాటినన్నిటిని ఆ శాసనసంఘసభలో నుపపాదింపవలెను.

౧౧. సభ్యుల అధికారపరిమితి అయిదేళ్లుగా నుండవలెను.

౧౨. ఈదిగువ వివరింపబడిన విషయములు నిర్ధారణగా సామ్రాజ్యశాసన సంఘమువారి పరిశీలనకు లోబడియుండవలెను:

(ఏ) దేశమున కంతటికినిగూడ వర్తింపదగిన చట్టములను చేయుటకు వీలైన విషయములు.

(బి) అంతరరాష్ట్రీయ ఆర్థికసంబంధమునకు అనుకూలించిన రాష్ట్రీయ శాసనములు.

(సి) ఇండియా సంస్థానములు చెల్లించు కప్పములు తప్ప తక్కిన సామ్రాజ్య ఆదాయమునకుమాత్రమే సంబంధించిన ప్రశ్నలు.

(డి) సామ్రాజ్యవ్యయమునకు మాత్రమే సంబంధించిన ప్రశ్నలు, దేశరక్షణము నిమిత్తము చేయబడిన సైనిక వ్యయముల విషయమున సామ్రాజ్య శాసనసంఘసభలో నామోదింపబడిన తీర్మానములకు గవర్నరుజనరలు కౌన్సిలువారు బాధ్యులు కానవసరము లేదు.

(ఇ) ఇండియాదేశపు పన్నులను (టారిఫులు - కస్టమ్సు డ్యూటీలు) సవరించుట, విధించుట, మార్చుట, పన్నులను సెస్సులను రద్దుచేయుట, ఇపు డున్న నాణెముల - బాంకింగు పద్ధతిని మార్చుట, దేశమునందలి పరిశ్రమలలో అన్నిటికినిగాని లేక అర్హమైనవాటికిగాని సహాయములను చేయుట, వివాళముల (బౌంటీ) నిచ్చుట.

(ఎఫ్) మొత్తము యిండియా దేశపరిపాలనకు సంబంధించిన అన్ని విషయములను గూర్చియు తీర్మానములు.

౧౩. ఈశాసనసంఘసభలో నొకతీర్మానమామోదింపబడునెడల దానిని గవర్నరు జనరలు తిరస్కరించినయెడల తప్ప, లేనిచో దానిని నెరవేర్చుటకు కార్యనిర్వాహక ప్రభుత్వమువారు బాధ్యులై యుండవలెను. ఒక సంవత్సరమునకు తక్కువ కాని కాలానంతరము యీశాసనసంఘసభలో నాతీర్మానమే మరల నామోదింపబడినయెడల ప్రభుత్వవర్గమువారు దానిని విధిగా కొనసాగింపవలెను.

౧౪. ప్రజలకు చాల ముఖ్యమును, అవసరమును, నిర్ధారణమును అగు నొక విషయమునుగూర్చి అట్టిదన్నమెంటుతీర్మానము నుపపాదింప గోరునెడల ఆసభకు వచ్చిన వారిలో ఏ వ వంతు మందికి తక్కువకాకుండా దానిని బలపరచినచో దాని నుపపాదింపవచ్చును.

౧౫. రాష్ట్రీయశాసనసభలో గాని, సామ్రాజ్య శాసనసభలో గాని ఆమోదింపబడిన ఒకబిల్లును తిరస్కరించుటకు రాజప్రతినిధి (క్రౌను) గారు తమకు గల అధికారమును వినియోగింపగోరినచో అది ఆమోదింపబడిన తేదీమొదలు ౧౨ నెలల లోపలనే దానిని వినియోగించవలెను. అటుల తిరస్కరింపబడిన వార్త శాసనసంఘమునకు తెలుపబడిన తేదీమొదలు ఆబిల్లు అమలులో నుండదు.

౧౬. సైనికవ్యవహారములు, ఇండియాకు సంబంధించిన విదేశ రాజకీయ వ్యవహారములు, యుద్ధమును ప్రకటించుట, సంధిని ప్రకటించుట, ఒడంబడికలను చేసుకొనుట మున్నగు విషయములలో యిండియా దొరతనమునకు గల అధికారములలో కల్పించుకొనుటకు సామ్రాజ్యశాసనసంఘమున కధికారము లేదు.

౪. ఇండియా ప్రభుత్వము

౧. ఇండియా గవర్నరుజనరలు భారత ప్రభుత్వ ప్రధానాధికారిగా నుండును.

౨. అతని కొక కార్యనిర్వాహకసంఘ ముండవలెను. దానిలో సగముమంది యిండియను లుండవలెను.

౩. సామ్రాజ్య శాసనసంఘసభ్యులే కార్యనిర్వాహక సంఘమునందలి భారతీయుల నెన్నుకొనవలెను.

౪. సాధారణముగా యిండియను సివిలు సర్వీసువారిని కార్యనిర్వాహక సంఘ సభ్యులనుగా నియమించగూడదు.

౫. ఇంపీరియలు సివిలుసర్వీసు వుద్యోగుల నందరిని నియమించు విషయమున అధికార మంతయును యీ విధానము ప్రకార మేర్పడు యిండియా దొరతనమునకే యుండవలెను. ఇపుడున్న వర్గములనుగూర్చి బాగుగా నాలోచించియును, సామ్రాజ్య శాసనసంఘమువారు చేయునట్టి నిబంధనలకు లోబడియును యీ ఉద్యోగులను నియమించవలెను.

౬. ఇండియా గవర్నమెంటువారు సాధారణముగా రాష్ట్రీయ స్థానికవిషయములలో కలుగజేసికొనగూడదు. రాష్ట్రీయ ప్రభుత్వములకు నిర్ధారణగా నియ్యబడని అధికారము లన్నియును యిండియా గవర్నమెంటుకు చేరును. రాష్ట్రీయ ప్రభుత్వముపైని యిండియా ప్రభుత్వమునకు సాధారణముగా జనరలు సూపర్వీజను, సూపరింటెండెన్సు అధికారము లుండును.

౭. ఈ విధానముప్రకార మేర్పరుపబడిన యిండియా దొరతనమువారు శాసన నిర్మాణ ప్రభుత్వ విషయములలో సాధ్యమైనంతవరకు యిండియామంత్రికి లోబడ నవసరము లేదు.

౮. ఇండియా ప్రభుత్వమువారి లెక్కలను స్వతంత్రముగా తనిఖీ (ఆడిటు) చేయు పద్ధతి యుండవలెను.

౫. ఇండియామంత్రిసంఘము

౧. ఇండియామంత్రిసంఘమును రద్దుచేయవలెను.

౨. ఇండియామంత్రి జీతమును యిండియా అంచనాలలో (ఎస్టిమేటు) చేర్పవలెను.

౩. స్వపరిపాలనము గల అధినివేశముల (డొమినియను) ప్రభుత్వముల విషయమున అధినివేశముల (కోలనీ) మంత్రి కెట్టి స్థాన ముండునో యిండియా ప్రభుత్వ విషయమున యిండియామంత్రికిగూడ వీలైనంతవర కట్టిస్థానమే యుండవలెను.

౪. ఇండియామంత్రికి యిద్దరు ఖాయమైన అండరుశెక్రటరీలు సహాయము చేయుచుండవలెను. వారిలో నొకడు ఎల్లప్పుడును భారతీయుడుగానే యుండవలెను.

౬. ఇండియా—సామ్రాజ్యము

౧ సామ్రాజ్యవ్యవహారములను పరిశీలించుటకును, పరిష్కరించుటకును నిర్మింపబడు అన్ని సంఘములలోను ఇండియాకు అధినివేశనములతోపాటు సమానహక్కులును, సమానప్రాతినిధ్యము నుండవలెను.

౨. బ్రిటిషు సామ్రాజ్యమునందంతటను ఇతర దేశీయులగు పౌరులతో సమానమగు గౌరవమును, హక్కులును భారతీయులకుగూడ కలుగవలెను.

౮. సైనికాది విషయములు

౧. రాజచక్రవర్తిగారి సైనిక నౌకాదళములలో కమిషన్డు ఉద్యోగములను, నానుకమీషన్డు ఉద్యోగములను భారతీయులకుగూడ నియ్యవలెను. వారికి యిండియాలో సైనికవిద్యను నేర్పుటకును, ట్రెయినుచేయుటకును, వారిని నియమించుటకును తగిన యేర్పాటులను చెయ్యవలెను.

౨. ఇండియనులు వలంటీరులుగా చేరుట కంగీకరింపవలెను,

3. ఇండియాలో న్యాయవిచారణశాఖకు సంబంధించిన అధికారములను కార్యనిర్వాహకాధికారుల కియ్యగూడదు. ప్రతి రాష్ట్రములోను న్యాయ విచారణ శాఖాధికారు లందరును ఆ రాష్ట్రమునందలి ఉన్నతోన్నత న్యాయస్థానమునకు లోబడి యుండవలెను.

# 2 ఎ. ముల్సీపేట సత్యాగ్రహము

—

ముల్సీపేట పూనాకు ౩౦ మైళ్లదూరమున నున్నది. జి. ఐ. పి. రైల్వేకును, బి. బి. సి. ఐ. రైల్వేకును, బొంబాయి నగరమునకును ఎలెక్ట్రిసిటీని సమకూర్చునిమిత్తము అపర్వత ప్రాంతమునందలి నదులకును, జలపాతములకును కట్టలను కట్టించుటకు ౧౯౨౦ లో తాతాసవరుకంపెనీవారొక యేర్పాటును ప్రారంభించిరి. ముల్సీపేటలో వరిపంట మిక్కిలి బాగుగా పండును. అచట నివసించునట్టి మావలాల పూర్వీకులు శివాజీమహారాజుసేనలో శౌర్యవీర్యస్థైర్యాదులకు చాల విఖ్యాతిని బడసిరి. తాతాకంపెనీవారిచే నియమింపబడిన వందలకొలది కార్మికులు తమ భూములలోనికి వచ్చుటను చూచగానే మావలాలకు కలవరపాటు కలిగినది. వారు పూనా వెళ్లి "మా భూములను కాపాడుకొనుటకు మే మేమి చేయవలెను?" అని తమ మిత్రుల నడిగిరి. అపుడు దేశమునం దంతటను అసహాయోద్యమము చాల ప్రబలనుగా నుండెను. ౫౦ గ్రామములలో ౧౧౦౦౦ మంది స్త్రీలును, పురుషులును, బిడ్డలును భూములను యిళ్లను గూడ గోల్పోవునట్టి స్థితి యేర్పడెను.

శ్రీయుత ఎన్. సి. కేల్కరుగారి అధ్యక్షతక్రింద ముల్సీపేటలో బహిరంగ సభ జరిగినది. "మా భూములను మేము మరల వశపరచుకొందుము. లేదా సత్యాగ్రహ మొనరించి ప్రాణములను వదలెదము." అని మావలా లందరును సభలో తెలిపిరి. వారటుల కృతనిశ్చయు లగుటచే అందులకు నాయకత్వమును వహించుటకు పూనా నాయకులు సంసిద్ధులైరి. అందుల కొక చిత్తుప్రమాణపత్రమును తయారుచేసిరి. దానిపైని ౧౨౦౦ మంది మావలాలు సంతకములుచేసినచో సత్యాగ్రహమును ప్రారంభించవలెనని నిశ్చయించిరి. వి. ఎం. భుస్కుటేగా రా ప్రాంతమునం దంతటను సంచారముచేసి ప్రమాణపత్రముపైని ౧౩౦౦ మంది మావలాలచేత సంతకములుచేయించిరి. బారామతిలో జరిగినసభలో నాయకులలో నభిప్రాయభేదములు కలిగినను సత్యాగ్రహమును ప్రారంభించుటకు వారు సన్నద్ధులైరి. దీనినిగూర్చి మహారాష్ట్రదేశమునం దంతటను ప్రజలలో నధికమగు సంచలనము కలిగినది. చాలమంది ధనము నిచ్చిరి. మరి పెక్కుమంది స్వయముగా సేవచేసిరి. మావలాలు ప్రత్యేకముగా వెయ్యిరూపాయలఖరీదు గల బియ్యము నిచ్చిరి.

౧౯౨౧ ఏప్రిలు ౧౬ వ తేదీని, అనగా పరమపవిత్రమగు శ్రీరామనవమి పుణ్య దినమున సత్యాగ్రహము ప్రారంభించునట్లు నిశ్చయింపబడెను. "ఇది కేవలము కాంగ్రెసువారి ఆజ్ఞప్రకారము జరుపబడకపోయినను కాంగ్రెసువారి విధానములో నొకభాగముగానే దీనిని మేము ప్రారంభించితిమి. ఇది సఫలమైన, కాంగ్రెసు యొక్క ప్రతిష్ఠ అధికమగును. గాంధీసిద్ధాంతమునకు విజయము చేకూరును. విఫలమైనచో బాధ్యత మాది" అని మహారాష్ట్ర నాయకులు తెలిపిరి.

శ్రీరామనవమిరోజున ౧౨౦౦ మంది మావలాలు స్త్రీలతోను, బిడ్డలతోను రంగమునకు వచ్చిరి. పూనానుండి ప్రధాననాయకు లందరును వచ్చిరి. వారందరును వెళ్లి కట్టమీద కూర్చొనిరి. వెంటనే అచట పనిచేయుచున్న కంపెనీ కార్మికులు ౫౦౦౦ మందియును పనిచేయుట మానివేసిరి. గాంధీజీ అహింసాసిద్ధాంతమును పూర్తిగా ననుసరించుచు వీరీరీతిగా నెలరోజులు సత్యాగ్రహము నొనరించిరి. కంపెనీవారు పనిని నిలిపివేసిరిగాన నీరీతిగా నిది సఫలమైనది. వర్షకాలములో ప్రధానవిషయము జరిగినది. వ్యవసాయదారుల కందరికిని ఋణములు చాలా హెచ్చుగా నుండుట సహజముగాన మావలాలకుగూడ ఋణములు చాల హెచ్చుగా నుండెనుగాన వారుగూడ తమకు బదులిచ్చిన షాహుకారుల యనుగ్రహమున కధీనులుగా నుండిరి. ఇటుల ఋణగ్రస్తులుగానున్న మావలాలకు సత్యాగ్రహమునుగూర్చి ఆందోళన కలిగినది. సత్యాగ్రహము విరమింపబడినచో కంపెనీవారు తమభూములకు ముజరాను చాలతక్కువగా నిచ్చెదరని వీరు భయపడిరి. నాయకులలో కొందరుగూడ వీరికి తోడ్పడిరి. తగినంత ముజరాను గాబట్టుటకు వీరు కంపెనీమేనేజరులతోను, యింజనీరులతోను రాయబారములను జరిపిరి. సత్యాగ్రహ మొనరించుచున్న మావలాల కీసంగతి యేమియును తెలియదు. ఈవాగ్దానములను నమ్మి కంపెనీవారు హెచ్చుగా ముజరాల నిచ్చెదమని వాగ్దానము చేసిరి. కంపెనీ మేనేజరులకును, దొరతనమునకును ఒడంబడికలు జరిగినవి. లాండు అక్విజిషను చట్టము ప్రకారము భూములపై కంపెనీకి హక్కు కలిగినది. సత్యాగ్రహులు తమ భూములనే కోరుచున్నారుగాని ముజరాలు ఎంత హెచ్చుగానున్నను వాటిని వారపేక్షించలేదు. అన్ని రాష్ట్రములలోను కాంగ్రెసువారిలో మార్పు కోరెడువారు, మార్పు కోరనివారు అను రెండుపక్షము లున్నవి. మహారాష్ట్రములోగూడ నీ రెండుపక్షములు నున్నవి. మార్పుకోరనివారిలో మిక్కిలి హెచ్చుమంది గాంధీజీ పద్ధతిని మనఃపూర్వముగా ననుసరించుచుండిరి. వారీసత్యాగ్రహమున మావలాలకు తోడ్పడుటకు దీక్షబూనిరి. వీరికి కంపెనీవారును, షాహుకారులును ప్రతిపక్షులుగా నున్నారు. ఈసత్యాగ్రహము రెండున్నర సంవత్సరములపాటు జరిగినది.

౧౯౨౧ డిసెంబరులో రెండవసారి సత్యాగ్రహము ప్రారంభింపబడెను. సత్యాగ్రహులను అరెస్టుచేయుట, శిక్షించుట, భయపెట్టుట, బాధించుట మున్నగునవి మిక్కిలి హెచ్చుగా జరిగినవి. ఎస్. ఎం. పరాంజపే, డాక్టరు ఘటకు, పి. ఎం. బాపటు, వి. ఎం. భుస్కుటే, దస్తనీ, డాక్టరు పల్నాలీ, జే. ఎన్. కరండికరుగార్లు మున్నగువారిని చాలమందిని అరెస్టుచేసి వారికి శిక్షలను విధించిరి. మొత్తము ౧౨౫ మంది మావలాలును, వలంటీరులు నాయకులు స్త్రీలు మున్నగువారు ౫౦౦ మందియును చెరసాలల కేగిరి. ఈసత్యాగ్రహమునిమిత్తము ౭౫౦౦ రూపాయలు వ్యయమైనవి. స్థానికనాయకులు, యితర నాయకులు మున్నగువా రందరును చెరసాలలకు పంపబడిన పిమ్మట హెచ్చు ముజరాల నంగీకరింపవలెనని షాహుకారులును, మార్వాడీ పక్షము నాయకులును మావలాలను అత్యధికముగా బతిమాలిరి. చివరకు సత్యాగ్రహమును వదలివేయవలసివచ్చినది. ఈసత్యాగ్రహము నిమిత్తము పి. ఎం. బాపటుగారు మున్నగువారు కడవరకును పనిచేసిరి. వీ రిందుల కత్యధికమగు త్యాగమును చేసిరి. ఈసత్యాగ్రహమువలన కంపెనీవారు మావలాలభూములనిమిత్తము వారికి చాల హెచ్చుగా ముజరాల నిచ్చిరి. ఆధనమంతయును షాహుకారులకే లభించినదిగాన వేలకొలది రైతులు తమయిండ్లను, భూములనుగూడ గోల్పోయిరి.

రద్దుపరచవలెను. లేక (బి) నూతనరాజ్యాంగవిధాన మేర్పడిన పిమ్మట జరుగునట్టి మొదటి ఎన్నికలు ప్రత్యేకనియోజకవర్గములవలననే జరుగవలెను. మొదటిశాసనసభ యొక్క పంచమసంవత్సర ప్రారంభమునందు సమష్టినియోజకవర్గము లుండవలెనా? లేక ప్రత్యేకనియోజకవర్గము లుండవలెనా? అను విషయమున ప్రజలందరివద్దను వోట్లు పుచ్చుకొనవలెను. (రిఫరెండం)

(బి) వికల్పవిధానము-జాతీయపక్షము:—(ఏ) మొదటి పదియేళ్లలోను సమష్టినియోజకవర్గములే యుండవలెను. పదేళ్లు గడచినపిమ్మట నియోజకవర్గములను గూర్చి ప్రజలందరివద్దను వోట్లుపుచ్చుకొనవలెను. (రిఫరెండం)

(బి) మొదటిశాసనసభకు మహమ్మదీయసభ్యులలో సగముమందిని (౧౦౦ కి ౫౦) సమష్టినియోజకవర్గమువారును, తక్కిన సగముమందిని (౧౦౦ కి ౫౦) ప్రత్యేకనియోజకవర్గములవారును యెన్నుకొనవలెను. రెండవశాసనసభలో ౨/౩ వంతు మందిని సమష్టినియోజకవర్గమువారును, మూడవవంతువారిని ప్రత్యేకనియోజకవర్గమువారును యెన్నుకొనవలెను.

అటుపిమ్మట సమష్టినియోజకవర్గములు మాత్రమే యుండవలెను. యుక్తవయసు వచ్చినవారి కందరికిని వోటింగుహక్కు లుండవలెను.

(సి) పైదానికి సవరణ, కొందరు మిత్రులుచేసిన సూచన:— మొదటి శాసనసభలో 2/3 వంతు మందిని ప్రత్యేక నియోజకవర్గములును, మూడవవంతు మందిని సమష్టి నియోజకవర్గములును యెన్నుకొనవలెను.

రెండవ శాసనసభలో సగముమందిని ప్రత్యేక నియోజకవర్గములును, తక్కిన సగముమందిని సమష్టినియోజకవర్గములును యెన్నుకొనవలెను.

అటుపిమ్మట సమష్టినియోజకవర్గములు మాత్రమే యుండవలెను. మైనారిటీ వదలినవారి కందరికిని వోటింగు అధికార ముండవలెను.

మొదటి ౫ యేళ్లును ప్రత్యేక నియోజకవర్గమును, తరువాత ౫ యేళ్లును సమష్టి నియోజకవర్గమును నుండవలెను. ఈ రెండింటినిగూర్చియు ౯ వ సంవత్సరారంభమున ప్రజలందరివద్దను వోట్లు పుచ్చుకొనవలెను (రిఫరెండము). లేక 2/3 వంతు మంది ప్రత్యేక నియోజకవర్గముచేతను, మూడవవంతుమంది సమష్టినియోజకవర్గము చేతను యెన్నుకొనబడవలెను. ౫ వ సంవత్సరారంభమున వీటినిగూర్చి ప్రజ లందరి వద్దను వోట్లు పుచ్చుకొనవలెను. (రిఫరెండము.)

(డి) మౌలానా షౌకతాలీగారి సూచన:—పూర్తిగా గాని, కొంత వరకు గాని సమష్టినియోజకవర్గముల నేర్పరచినప్పుడు మొదటి ౨౦ యేళ్ల వరకును మౌలానా మహమ్మదాలీగారి ఫార్ములా నంగీకరించవలెను.

(ఎఫ్) భోపాలులో రెండవసభలో సూచన:—మొదటి ౫ యేండ్లును ప్రత్యేకనియోజకవర్గములు. అటుపిమ్మట మౌలానా మహమ్మదాలీగారి ఫార్ములాతో సమష్టినియోజకవర్గములు. ఏ శాసనసభలో నైనను మహమ్మదీయసభ్యులలో ౧౦౦ కి ౬౦ మంది అంగీకరించినచో యీ ఫార్ములాను వదలివేయవచ్చును.

(జి) సిమ్లాలో కడపటి ఫార్ములా:—మొదటి పదియేళ్లును ప్రత్యేకనియోజకవర్గములు. తరువాత సమష్టినియోజకవర్గములు. ఏశాసనసభలో నైనను మహమ్మదీయ సభ్యులలో ౨/3 వంతు మంది సమష్టినియోజకవర్గముల కంగీకరింపకపోయినచో వాటి నేర్పరచగూడదు.

# 3. ఫరిద్వారు సూచనలు

౧. ఇటుపైని ఇండియా రాజ్యాంగవిధానమునందు ప్రజలకు ప్రాతినిధ్యము లభించుటకు మైనారిటీవదలినవారి కందరికిని వోటింగుహక్కు నియ్యవలెను. సమష్టి నియోజకవర్గముల నేర్పరుపవలెను.

౨. (ఏ) మైనారిటీవదలినవారి కందరికిని వోటింగుహక్కు కలుగును గాన నొక రాష్ట్రముయొక్క జనసంఖ్యలో ౧౦౦ కి ౨౫ కు తక్కువగానున్న అల్పసంఖ్యాక సంఘములకు మాత్రము జనసంఖ్యనుబట్టి దేశీయ (ఫెడరలు) రాష్ట్రీయశాసన సభలలో ప్రత్యేకస్థానము లుండవలెను. ఇతరస్థానములకు పోటీ చేయుటకుగూడ వారికి హక్కు లుండవలెను.

(బి) ఒకరాష్ట్రమునందలి జనసంఖ్యలో మహమ్మదీయులసంఖ్య ౧౦౦ కి ౨౫ కంటెను తక్కువగా నున్నచో జనసంఖ్యనుబట్టి ఆరాష్ట్రీయశాసనసభలో మహమ్మదీయులకు ప్రత్యేకస్థానము లుండవలెను. ఇతరస్థానములకు పోటీ చేయుటకు గూడ మహమ్మదీయులకు హక్కు లుండవలెను. ఇతర సంఘములకు వెయిటేజీ నిచ్చియున్నచో మహమ్మదీయులకుగూడ వెయిటేజి నియ్యవలెను. ఇపుడు మహమ్మదీయులకున్న వెయిటేజీని నిలువబెట్టవలెను.

(సి) మైనారిటీవదలినవారి కందరికిని వోటింగుహక్కునియ్యనియెడలను, లేక జనసంఖ్యనుబట్టి వుండవలసినంతమంది వోటరులసంఖ్య వోటరుల జాబితాలో నుండక పోయినయెడలను, మైనారిటీవదలినవారి కందరికిని వోటింగుహక్కు నిచ్చువరకును, లేక జనసంఖ్యనుబట్టి వుండవలసినంతమంది వోటరులసంఖ్య వోటరులజాబితాలో నుండుటకు వీలగునట్లు హెచ్చుమంది వోటింగు అధికారము నిచ్చువరకును, పంజాబులోను బెంగా లులోను మహమ్మదీయులు అల్పసంఖ్యాకులుగా నున్నను, సమానసంఖ్యగానున్నను వారికి ప్రత్యేకస్థానము లుండవలెను.

3. ఫెడరలు శాసనసభలు రెండిటిలోను మొత్తము సభ్యుల సంఖ్యలో మూడవ వంతు మంది మహమ్మదీయు లుండవలెను.

౪. ఉద్యోగముల నిచ్చుటకు నిర్ణయింపబడిన అర్హతల కనిష్ఠపరిమాణము ననుసరించి పబ్లికు సర్వీసు కమీషనరువారు ఉద్యోగముల నిచ్చుచుండవలెను. ఏ సంఘ

మునకునుగూడ నుద్యోగములలో న్యాయముగా చెందవలసిన స్థానములు లభించకుండ చేయుగూడదు. లోవరుసగేడు వుద్యోగములవిషయమున గుత్తపద్ధతి (మొనాపాలీ) యుండగూడదు.

౫. ఫెడరలు మంత్రివర్గములోను, రాష్ట్రీయ మంత్రివర్గములోను మహమ్మదీయులకు తగిన ప్రాతినిధ్య ముండవలెను. అందులకు వేరువేరు శాసనసభలలో వేరువేరు పక్షములవారందరును అంగీకరించిన ప్రకారమొక కరారునామా (కన్వెన్షను) జరుగవలెను.

౬. సింధుదేశమును ప్రత్యేకరాష్ట్రముగా చేయవలెను.

౭. బ్రిటిషు యిండియాలో యితరరాష్ట్రములలో నెట్టి పరిపాలనా విధానముండునో అట్టి పరిపాలనావిధానమే నార్తువెస్టు సరిహద్దురాష్ట్రములోను, బెలుచిస్తానులోను గూడ నుండవలెను.

౮. ఇటుపైని యిండియాలో ఫెడరలురాజ్యాంగవిధాన మేర్పడవలెను. ఫెడరేషనులో చేరిన రాష్ట్రములకు శేషించిన అధికారము లుండవలెను.

౯. (ఏ) పౌరుల కందరికి వారి విజ్ఞానము, లిపి, విద్య, వృత్తి, మత ధర్మాచరణము, మత ధర్మాదాయములు, ఆర్థికవసతులు - వీటి విషయమున పూచీ నొసగునట్టి ప్రధానహక్కులు గూడా రాజ్యాంగవిధానమునం దుండవలెను.

(బి) ప్రధానహక్కులను, వ్యక్తినిబంధనలను బాగుగా కాపాడుటకు రాజ్యాంగ విధానమున స్పష్టమైన యేర్పాటు లుండవలెను.

(సి) రెండు ఫెడరలు శాసనసంఘ సభలలోను మొత్తము సభ్యులలో $\frac{3}{4}$ వంతువారు అంగీకరించినపుడు తప్ప రాజ్యాంగవిధానమునందు ప్రధానహక్కులను మార్చగూడదు.

పరమరహస్యము:—వికల్ప(ఆల్టర్నేటివు) సూచనలు- నిబంధనలు (ఫార్ములా) భోపాలు నిబంధనలు.

(ఏ)అఖిలపక్షఫార్ములా:—(ఏ) పదేళ్లుగడచినపిమ్మట మైనారిటీ వదలిన వారికందరికి వోటింగుహక్కు నియ్యవలెను. సమష్టినియోజకవర్గముల నేర్పరచవలెను. పదియేళ్లలోపుననే యెపుడైనను ఫెడరలు శాసనసంఘసభలోగాని, రాష్ట్రీయశాసన సంఘసభలోగాని మహమ్మదీయసభ్యులలో అధికసంఖ్యాకులు సమష్టి నియోజకవర్గములకు సమ్మతించునెడల ఆశాసనసంఘమునకు మాత్రము ప్రత్యేక నియోజకవర్గములను

# 4. ఖైదీలవర్గీకరణమును గూర్చిన గవర్నమెంటు ఉత్తరువు

## ప్రభుత్వప్రకటన నకలు

పత్రికాప్రకటనార్థమై జెయిలునిబంధనల విషయమై ఇండియా గవర్నమెంటు వారు చేసిన ముఖ్యమైన నిర్ణయములు యీక్రిందిరీతిగా వెల్లడిచేయబడినవి:

జెయిలునిబంధనలను కొన్నివిషయములలో సవరించవలయునని ఇండియా గవర్నమెంటువారు కొంతకాలమునుండియు ఆలోచించుచుండిరి. ఈ విషయము రాష్ట్రీయప్రభుత్వముల కెరిగింపబడెను. వారు అనధికారప్రముఖులతో విరివిగా సంప్రతించి ప్రజాభిప్రాయమును తెలిసికొనిరి. అంతట ఆయారాష్ట్రీయప్రభుత్వముల ప్రతినిధులసమావేశ మొకటి యీ విషయమై జరుపబడెను. ఇండియా గవర్నమెంటు వారుకూడ అసెంబ్లీసభలో ప్రముఖులైన మెంబర్లతో యీ విషయమై చర్చించిరి. చర్చింపవలసియుండిన విషయములు చాల కఠినమైన క్లిష్టమైనవిషయములుగా నుండెను. అందువల్ల అభిప్రాయభేదము లెక్కువగా నుండెను. ఈవివిధాభిప్రాయభేదమును ఇండియా గవర్నమెంటువారు పూర్తిగా అంగీకరింపజాలకపోయినను వారి యభిమతములను గౌరవించుటకై చాలవరకు యత్నించిరి. ఎక్కువ ముఖ్యమైనవిషయములలో ఇండియాగవర్నమెంటువారు కొన్ని నిర్ణయములను చేయగల్గిరి. భారతదేశ మందంతటను సర్వత్ర సమానసూత్రమునే వర్తింపజేయుటకై యీనిర్ణయములను చేసిరి. ఆనిర్ణయములు ఈదిగువ ప్రకటింపబడినవి :

### ఖైదీలవర్గీకరణము

శిక్షితులైన ఖైదీలు (ఏ) తరగతి, (బి) తరగతి, (సి) తరగతి యను మూడు తరగతులుగా విభజింపబడుదురు. ఈక్రింది అర్హతలు గలవారు (ఏ) తరగతిలో చేర్చబడుదురు: (౧) వారు సత్ప్రవర్తనకలవారై జెయిళ్లలో నుండుటకు అలవాటు పడనివారై యుండవలెను. (౨) వారికి సంఘములో ఉండే గౌరవమునుబట్టియు, విద్యనుబట్టియు, జీవితపద్ధతులనుబట్టియు హెచ్చు హోదాగా బ్రతుకునట్టివారై యుండవలెను. (౩) వారు యీక్రింది రకపు నేరములనుబట్టి శిక్షితులు కానట్టివారై యుండ

వలెను: (ఏ) క్రూరకార్యములు, అవినీతికరకృత్యములు, స్వలాభార్థమైన దురాశాపూరిత కృత్యములు (బి) రాజద్రోహముగాని పూర్వపన్నాగములతో చేసిన దౌర్జన్యము (సి) సొత్తునుగూర్చిన రాజద్రోహనేరము (డి) ప్రేలుడు వస్తువులను, తుపాకులు వగైరా ఆయుధములను, ఇతర ఉపద్రవకరమైన ఆయుధములను నేరముచేయు నిమిత్తమైగాని, నేరము చేయబడుటకు సహాయకారిగాగాని స్వవశమందుంచుకొనుట. (ఇ) ఈ ఉపవచనములయందు చేరెడి నేరములను పురికొల్పుటగాని, సహాయముచేయుటగాని.

సంఘమందు గౌరవప్రతిపత్తిని గల్గి విద్యగల్లను, జీవితపద్ధతివల్లను మంచిస్థితిలో నున్నవారందరును "బి" తరగతి ఖైదీలలో చేర్చబడుదురు. అలవాటుగా జెయిలుకు పోవునట్టి ఖైదీలు పూర్వాపరసందర్భాలోచన లేకుండ అంతమాత్రముచేత "బి" తరగతిలోనుండి మినహాయింపబడజాలరు ఈవర్గీకరణము చేయుటకు అధికారము వహించిన ప్రభుత్వోద్యోగి తన యుక్తాయుక్తవిచక్షణను వినియోగించి శిక్షితునియొక్క గుణశీలమును, పూర్వసందర్భములను గమనించి యీ తరగతిలో చేర్చబడునట్లుగా నిర్ణయించగలడు. అతని నిర్ణయము రాష్ట్రీయప్రభుత్వమువారిచే ఖాయపరచబడవలెను, లేదా మార్పుచేయబడవచ్చును.

"ఏ" తరగతిలోగాని, "బి" తరగతిలోగాని చేరనట్టి ఖైదీలు "సి" తరగతిలో చేరెదరు.

శిక్షితులను ఆయాతరగతులలో చేర్చెడి అధికారము హైకోర్టులకును, సెషన్సు జడ్జీలకును, జిల్లా మేజస్ట్రేటులకును, స్టయిపెండియరీ ప్రెసిడెన్సీ మేజస్ట్రేటులకును, జిల్లా మేజస్ట్రేటులద్వారా సబుడివిజనలు మేజస్ట్రేటులకును, ఒకటవతరగతి మేజ మేజస్ట్రేటులకును ఉండును. "ఏ" తరగతిలోగాని, "ట" తరగతిలోగాని చేర్చబడుటకై జిల్లా మేజస్ట్రేటు ప్రథమతః రాష్ట్రీయ ప్రభుత్వమువారికి సిఫార్సుచేయవలెను. వారు సదరుసిఫార్సులను ఖాయపరచవచ్చును, లేదా పునర్నిర్ణయము చేయవచ్చును.

## ఖైదీల ప్రత్యేకసౌకర్యములు

ఇండియా గవర్నమెంటువారి నిర్ణయములు నిర్ధారణ కాకపూర్వమే వానిని గూర్చి కింవదంతులుగా కొన్ని యూహాకల్పనలు దేశములో ప్రచారమయ్యెను. ఈ త్రిగుణాత్మక వర్గీకరణమును గూర్చి ఈవర్గీకరణమువల్ల ప్రస్తుతపు ఖైదీలకు గల ఫలితమునుగూర్చియు దురభిప్రాయములు బయలుదేరినవని సదరు కింవదంతులవల్ల తెలియుచున్నది. "ఏ" తరగతి ఖైదీలందరును ఆతరగతిఖైదీల కేర్పడిన సౌకర్యముల నన్నింటిని పొందగలరు. జాతిభేదమునుబట్టి యీ తరగతిఖైదీలు హెచ్చుసౌకర్యములను వేనిని పొందుటకర్హులు కాజాలరు. స్పెషలుతరగతి ఖైదీల కిప్పుడు ఏర్పడి

యున్న ప్రత్యేక సౌకర్యము లన్నియు "ఏ" తరగతి ఖైదీలకు కొసగబడును. అనగా ప్రత్యేకవసతి కవసరమైన మంచము, బల్లవగైరా సామానుపరికరములు, సన్నిహితులతో సమావేశసంభాషణలకు సమంజసమైన అవకాశములు, శరీరసాధక మునకు అవకాశములు, బాహ్యశౌచమునకును, స్నానాదులకును కావలసిన తగిన ఏర్పాట్లు చేయబడును.

ఇతరవిషయములలో యీక్రిందినిర్ణయములు చేయబడెను.

"ఏ" తరగతి "బి" తరగతి ఖైదీల ఆహారము మామూలు "సి" తరగతి ఖైదీల కివ్వబడు భోజనముకంటె మేలైనదిగానుండును వారియొక్క భోజనము మనిషి ౧ కి ఎంత విలువగలదిగా నుండవలెనో నిర్ణయింపబడును. ఆ విలువమొత్తములోపలనే వారి భోజనపదార్థములు మారుచుండవచ్చును. "ఏ" తరగతి "బి" తరగతి ఖైదీలయొక్క హెచ్చుగాక మైన భోజనపు-ఖర్చును గవర్నమెంటువారే భరించవలెను ప్రస్తుతము స్పెషలుతరగతి ఖయిదీల జెయిలుభోజనమునకు అనుపానముగా వారు ఇతర ఆహారద్రవ్య ములను తెప్పించుకొనుట కనుమతింపబడిన రీతిగానే "ఏ" తరగతి ఖయిదీలకు యీ ప్రత్యేకసౌకర్య మొసగబడును.

స్పెషలు తరగతి ఖైదీలు తమ కిష్టమైన గుడ్డలను తాము ధరింపవచ్చుననెడి సౌకర్యము యథావిధిగానే యుండును. "ఏ" తరగతి ఖయిదీలు గవర్నమెంటు వారి ఖర్చుమీద తమకు దుస్తులు సప్లయిచేయబడవలెనని కోరేయెడల "బి" తరగతి ఖయి దీలకు సప్లయిచేయబడు దుస్తులే సప్లయిచేయబడును. "బి" తరగతి ఖైదీలకు "సి" తరగతి ఖయిదీలకంటె కొన్నివిషయములలో మెరుగైన దుస్తులే కొన్ని మార్పులతో యివ్వబడును.

## వసతిసౌకర్యములు

"ఏ" "బి" తరగతుల ఖయిదీలకొరకై ప్రతిరాష్ట్రములోను ప్రత్యేకమైన చెరసాల లుండుట వాంఛనీయము. అట్టి ఏర్పాటు ఆయారాష్ట్రీయప్రభుత్వములకు గల ద్రవ్యాధారమును బట్టియుండును గనుక ఎప్పటికైనను అట్టి ఏర్పాటును చేయవలసి యున్నదని లక్ష్యముగా నుంచుకొనవలెను. ఈలోపుగా ఆయారాష్ట్రీయప్రభుత్వముల వారు ప్రస్తుతము జయిళ్ల యభివృద్ధికిగల ద్రవ్యావకాశములను పరిశీలించి తమ శక్తి లోపము లేకుండా అట్టి ఏర్పాట్లను చేయుటకు ఆలోచించగలరని ఇండియా గవర్నమెంటువారు నమ్ముచున్నారు.

"ఏ" "బి" తరగతి ఖైదీలకు యీప్రత్యేకవసతిని మాత్రమే గాక యీతరగ తుల ఖైదీలను కనిపెట్టి చూచుచుండుటకై జెయిలులలో ప్రత్యేకసిబ్బంది యుండవలె

వని ఇండియా గవర్నమెంటువారు కోరుచున్నారు. ఈ విషయమై వీలైనంత త్వరలో శ్రద్ధ వహింపగోరుచున్నారు.

పై జెప్పినవర్గ విభేదసూత్రము ననుసరించి జెయిళ్లలో "ఏ" "బి" తరగతుల ఖైదీలకు నిర్ణయింపబడు కొయకష్టము ఖైదీల తాహతునుబట్టియు, వారి గుణశీలమును బట్టియు, వారి పూర్వజీవితవిధానమునుబట్టియు, వారి పూర్వసందర్భమునుబట్టియు నిర్ణయింపబడవలెను.

## ఖైదీలకు చిత్తరంజకమైన వ్యాసంగములు

విద్యాధికులైన చదువనేర్చిన ఖైదీలకు తగిన గ్రంథ కాలక్షేపములు చిత్తవికాసమునకు తగిన వ్యాపకములుగా సమంజసమైనవి కొన్ని షరతునియమములకు లోబడి ఏర్పాటుచేయబడవలెనను మూలసిద్ధాంతమును ఇండియాగవర్నమెంటువారు అంగీకరించుచున్నారు. జెయిళ్లలో నుండెడి గ్రంథభాండాగారములలో ప్రస్తుతస్థితిగతులనుగూర్చి పరిశీలించవలసినదిగా రాష్ట్రీయ ప్రభుత్వమువారిని కోరెదము. అట్టి గ్రంథభాండారములు లోపభూయిష్ఠములుగా నున్నయెడల వాటిని సంస్కరింపవలసినదనియు, అట్టి భాండారములు లేనియెడల వాటిని ఏర్పాటుచేయవలసినదనియు కోరెదము. జెయిలు సూపరింటెండెంటుగారి యనుమతితో పుస్తకములను, పత్రికలను బయటనుండి తెప్పించుకొని చదువనేర్చిన ఖైదీలు చదువుట కనుమతింపబడుదురు.

స్పెషలుఖైదీలకు ఏషరతులననుసరించి అమలులోనున్న రూల్సు ప్రకారముగా వార్తాపత్రికలు చదువుకొనుట కనుమతింపబడుచున్నవో అట్టి షరతులనే యనుసరించి "ఏ" తరగతి ఖైదీలకుగూడ ననుమతింపబడును. అనగా, రాష్ట్రీయ ప్రభుత్వమువారి యంగీకారముతో కొన్ని ప్రత్యేకసందర్భములలో అనుమతింపబడును. రాష్ట్రీయ ప్రభుత్వములవారు జెయిలువార్తాపత్రిక నొకటి ప్రకటించేయెడలను, లేదా అటువంటి దొకటి ప్రకటింపదలచినయెడలను యీపత్రిక వారమున కొకసారి చదువనేర్చిన ఖైదీలకు సప్లయిచేయబడును. అక్షరాస్యులైన ఖైదీలకందరికిని యీపద్ధతి వర్తించును. రాష్ట్రీయ ప్రభుత్వములవారు అట్టివారపత్రిక నొకటి ప్రకటింపజాలని యెడల "ఏ" "బి" తరగతుల ఖైదీలకొరకై పన్నెండుగు రుచుగర్చునీద రాష్ట్రీయప్రభుత్వమువారు ఆమోదించిన ఏ వారపత్రికనైనను సప్లయి చేయవచ్చును.

"ఏ" తరగతి ఖైదీలు పక్షమున కొకమారు ఒక ఉత్తరమును వ్రాసికొనుటకును, ఒక ఉత్తరమును స్వీకరించుటకును, బయటివారితో సంభాషించుటకును అవకాశ మొసగబడును. ప్రస్తుతమున్న పద్ధతిప్రకారము నెల కొకమారు కాదు. "బి" తరగతి ఖైదీలు నెలకొకమారు ఉత్తరమువ్రాసి, ఉత్తరమును స్వీకరించి బయటివారితో సెవ

రితో నైనను సంభాషించుట కవకాశ మొసగబడును. ఆయా జెయిళ్ల నిబంధనల ప్రకారము ఇప్పుడున్న దీర్ఘకాలాంతరముల ప్రకారముగా కాదు. వీరితో జెయిలులో మాట్లాడిన సంగతులుగాని, వీరికిచేరిన ఉత్తరములలోని సంగతులుగాని బహిరంగముగా ప్రకటింపబడినయెడల పైజెప్పిన ఉత్తరప్రత్యుత్తర సంభాషణసౌకర్యములు రద్దు చేయబడును, లేదా తగ్గింపబడును.

## విచారణలోనున్న ఖైదీలకు జరుగుబాట్లు

సాంఘిక గౌరవ ప్రతిపత్తినిబట్టియు, విద్యనుబట్టియు, జీవిత విధానమును బట్టియు యుక్తమయిన జీవితపద్ధతులకు అభ్యాసపడినవారు నేరవిచారణలోనున్న ఖైదీలైనయెడల వారికి ప్రత్యేకమైన జరుగుబాటు జెయిలులో నుండవలెనను సిద్ధాంతమును ఇండియా గవర్నమెంటువారు ఆమోదించుచున్నారు. కాబట్టి వారి పూర్వజీవిత విధానపు హోదానుబట్టి విచారణలోనున్న ఖైదీలు రెండుతరగతులుగా విభజింపబడుదురు. వారిని ఆయాతరగతులలో చేర్చుటకు నేరవిచారణచేయు కోర్టువారికి అధికారముండును. కాని, వారి నిర్ణయము జిల్లామేజస్ట్రేటుయొక్క అంగీకారమునకు లోబడియుండును. ఇందులో మొదటిరకమువారికి పైజెప్పిన "ఏ" "బి" తరగతి ఖైదీల కీయబడు భోజనమీయబడును. రెండవరకమువారికి "సి" తరగతి ఖైదీలకీయబడు భోజనమీయబడవలెను. విచారణలోనున్న ఖైదీలలో రెండురకములవారికిని జెయిలులో ఇవ్వబడుభోజనమునకు తోడుగా వారిస్వాంతఖర్చుమీద యితర ఆహారద్రవ్యములను వారు జెయిలు అధికారులద్వారా తెప్పించుకొనుట కవకాశ ముండును. అమలులోనున్న మార్పు ప్రకారము వారు తమ స్వాంతదుస్తులనే ధరించుటకు అనుమతింపబడుచున్నారు. కాని, కొన్ని సందర్భములలో విచారణలోనున్న ఖైదీలు సరియైన స్వాంతదుస్తులు లేకయున్నను తమ స్వజనులద్వారా బయటనుండి మంచిదుస్తులను తెప్పించుకొనజాలని యెడలను జైలుల అధికారులే తగినదుస్తులను వీరికి సప్లయి చేయవలెననియు, అట్టి దుస్తులు మామూలుఖైదీల దుస్తులవంటివిగా నుండరాదనియు ఒకసలహా యివ్వబడెను. ఈ సలహాను రాష్ట్రీయప్రభుత్వములవారు అనుసరింపగలందులకై ఇండియా గవర్నమెంటువారు ఆమోదించి తెలియజేయుచున్నారు.

అమలులోనున్న జెయిలు నిబంధనలను విశాలభావముతో అన్వయించి వర్తింపజేయుటవల్లను, ఇప్పుడు సూచింపబడిన మార్పులను అనుసరించుటవల్లను ఖైదీలకు మంచి ఖానాలను, గదులను ఏర్పాటుచేయుటవల్లను ప్రస్తుత దరియాప్తులవల్ల వాంఛనీయమని భావింపబడిన అభివృద్ధులను చేయుడమగును. కనుక ఆయా రాష్ట్రీయ ప్రభుత్వముల వారు ఇప్పుడు జెయిళ్లలోనున్న వసతిసౌకర్యములను వృద్ధిచేయుటకును, ఇప్పుడున్న

ఆధా గావకాశములను ప్రశస్తమగు రీతిని వినియోగించుటకును శ్రద్ధవహించి శక్తివంచన లేక పూనుకొనగలరని ఇండియా గవర్నమెంటువారు తలచుచున్నారు. నేరవిచారణలోనున్న ఖైదీలలో కొందరు నిత్యవిధిగా జెయిల్లకు అలవాటుపడినవారును, ఘోర నేరమును చేసినవారును ఉందురు. ఇదివరకు శిక్ష ననుభవించియుండనివారును ఉందురు. ఇదివరకెన్నడును శిక్ష ననుభవించియుండనివారిని రెండవరకమువారితో చేర్చక ప్రత్యేకముగా నుంచవలయునను విషయమును ఇండియాగవర్నమెంటువారికి తమ యభిప్రాయమును నివేదించినవారిలో చాలమంది నొక్కి చెప్పియుండిరి. ఇప్పుడమలులో నున్న పద్ధతి ప్రకారముగా యిట్టి వ్యత్యాసము జెయిల్లలో పాటింపబడుచున్నదనే తెలియుచున్నది గనుక యీ విషయమై క్రొత్తగా ఉత్తరువులను జారీచేయవలసిన యగత్యము లేదని ఇండియా గవర్నమెంటువారు తలచుచున్నారు.

పైన చెప్పబడిన పద్ధతుల ననుసరించి ఆయారాష్ట్రీయ ప్రభుత్వములవారు తమ జెయిలు నిబంధనావళులను సవరించి మార్పు చేయవలసినదనియు, ఖైదీలచట్టములోని ౬౦ సెక్షను క్రింద అవసరమైన క్రొత్తరూల్సును తయారుచేయవలసినదనియు ఇప్పుడు కోరబడుచున్నారు. అట్టి రూల్సు సవరణలను చేయులోపుగా, వీలైనంతవరకు యీ క్రొత్త సంస్కరణములను వెంటనే అమలులో నుండవలసినదిగా కోరడమైనది.

# 4. ఎ. ౧౯౩౦ జూలై, ఆగస్టులలో జరిగిన శాంతి సూచనలు

౧౯౩౦ జూలై ఆగస్టునెలల్లో చెరసాలలలోనున్న కాంగ్రెసునాయకులకును, తమకును జరిగిన లేఖలను ప్రకటించుచు, సర్ తేజబహాదరు సప్రూ, ఎం. ఆర్. జయకరుగా రిటుల వ్రాసిరి :

"దేశమున శాంతిపరిస్థితులను కలిగించుటకు రెండునెలలనుండి మేము చేయుచున్న ప్రయత్నములకు సంబంధించిన విషయముల నీదిగువను వివరించుచున్నాము.

౧. పండిత మోతీలాల్ నెహ్రూగారు రౌండుటేబిలుసభలో పాల్గొనుటను గూర్చి లండను డెయిలిహెరాల్డుపత్రిక ప్రత్యేకవిలేఖరి జార్జి స్లోకోంబుగారితో ౧౯౩౦ జనవరి ౨౦ వ తేదీని సంభాషించిరి.

౨. అటుపిమ్మట కొలదికాలములోనే స్లోకోంబుగారు బొంబాయిలో మరల మోతీలాలుగారితో సంభాషించిరి. అటుపిమ్మట స్లోకోంబుగారు కొన్నిషరతులను వ్రాసి మోతీలాలుగారి కిచ్చిరి. అటుతరువాత బొంబాయిలో మోతీలాలు, జయకరు, స్లోకోంబుగార్లు ముగ్గురును మాత్రమే కలిసికొనినప్పుడు ఆ షరతులను మోతీలాలుగా రామోదించిరి. జయకరుగారుగాని, మరెవరయినగాని యీషరతులనుగూర్చి రాజప్రతినిధి (యిర్విన్ ప్రభువు)తో సంభాషించుటకు ఆధారముగా నుంచుటకు షరతులుగల పత్రముతాలూకు ఒకనకలును మోతీలాలుగారి అంగీకారముతో స్లోకోంబుగారు జయకరుగారికి పంపిరి.

౩. అటులనే ఢిల్లీలోనున్న సప్రూగారికిగూడ నొక ప్రతిని పంపుచు స్లోకోంబుగారు లేఖవ్రాసిరి. "ఈషరతులపై నాధారపడి మనము మధ్యవర్తులుగా రాజప్రతినిధితో సంభాషించుటకు మోతీలాలుగా రంగీకరించిరి." అని స్లోకోంబుగారు సప్రూగారికి వ్రాసిరి.

## మోతీలాలుగా రామోదించిన షరతులు

బొంబాయిలో ౧౯౩౦ జూను ౨౫ వ తేదీని యీ షరతులను మోతీలాలుగా రామోదించిరి.

"భావి భారతరాజ్యాంగవిధానమునుగూర్చి రౌండుటేబిలుసభవారు సమగ్రమైన స్వేచ్ఛతో ఎట్టి సూచనలను చేసెదరో, ఆసూచనలపైని పార్లమెంటువా రెట్టిభావమును వెల్లడించెదరో యిపుడు వూహించుట కవకాశము లేకపోయినను భారతదేశమునకు గ్రేటుబ్రిటనుతో అనేక సంవత్సరములనుండి సంబంధ మేర్పడుటవలనను, ఇండియా లోని ప్రత్యేకావశ్యకతలను, స్థితిగతులనుబట్టియును రౌండుటేబిలుసభవారు నిర్ణయించెడురీతిని కావలసిన మార్పులను, బదలాయింపులను చేసుకొను పద్ధతిని ఇండియాకు సమగ్ర బాధ్యతాయుతప్రభుత్వము నేర్పరుపవలెనను వాదమును తాము బలపరచెదమని బ్రిటనుదొరతనమువారును, యిండియా దొరతనమువారును రహస్యముగా వాగ్దానము చేయునెడల, వారట్టుల వాగ్దానము చేసెదరను విషయము నాకు బాధ్యతగల మధ్యవర్తి తెలిపినయెడల నేను దానిని స్వయముగా గాంధీజీకిని, పండిత జవహరులాలునకును తెలియ జేసెదను. దొరతనమువా రిట్టివాగ్దానమును చేయుటయును, కాంగ్రెసువారు దాని నామోదించుటయును జరిగినచో దేశమున మొత్తముమీద సమాధాన మేర్పడును. అపుడు కాంగ్రెసువారు సత్యాగ్రహమును విరమించుటయును, దొరతనమువారు కఠినశాసనములను రద్దుపరచి రాజకీయఖైదీల నందరిని విడుదలచేయుటయును అటుపిమ్మట రెండుపార్టీల వారును కలసి అంగీకరించిన షరతులపైని కాంగ్రెసువారు రౌండుటేబిలుసభలో పాల్గొనుటయును జరుగగలవు." అని మోతీలాలుగా రనిరి.

## రాజప్రతినిధికి లేఖ

ఈషరతులపత్రము నాధారముగా చేసికొని మేము సిమ్లా వెళ్ళి గత జూలై నెలలో మొదటివారమున రెండుసారులు రాజప్రతినిధితో సంభాషించితిమి. దేశమునందలి స్థితిగతులను తెలియజేసితిమి. చివరకు యీలేఖను జూలై ౧౩ వ తేదీని సిమ్లానుండి రాజప్రతినిధికి వ్రాసితిమి.

"ప్రియమైన ఇర్విన్ ప్రభువా,"

"దేశమునందలి రాజకీయ పరిస్థితులను మీకు మేము తెలుప గోరుచున్నాము. వెంటనే దేశమున శాంతిని నెలకొల్పుటకు కొన్ని యేర్పాటులను చేయుట అత్యవసరమని మేము తలచుచున్నాము. సత్యాగ్రహోద్యమమునందు గల ప్రమాదములను మేము గ్రహించియేయున్నాము. మీ కిద్దరికిని దానితో నెట్టి సంబంధమును లేదు. దానిని గూర్చి మా కెట్టి సానుభూతియును లేదు. ప్రస్తుతము ప్రజలకును, ప్రభుత్వమునకును సంఘర్షణ మేర్పడుటచే దొరతనమువారు కఠిన శాసనముల నమలులో పెట్టవలసిన అవసరము కలిగినది. అందువలన ప్రజలలో మన

స్థాపము కలిగినది. దేశమునకు స్థిరమగు లాభమును గలిగింపదగిన యథార్థములగు కార్యములను నెరవేర్చుటకు వీలులేకుండ పోవుచున్నది. ప్రస్తుతస్థితిని చక్కబరచుటకును, దేశమున సహజపరిస్థితులను నెలకొల్పు విషయమున తోడ్పడునట్లు కాంగ్రెసునాయకులను ప్రోత్సాహపరచగలుగుదు మను నాశవలనను, నమ్మకమువలనను వారిలో కొంతమందితో దీనిగూర్చి చర్చించుట దేశమునకును, దొరతనమునకును మేము నెరవేర్పవలసినవిధి యని మేము తలచుచున్నాము."

"సత్యాగ్రహమును ప్రతిఘటించుట తప్పనిసరి యని మీరును, మీ దొరతనమువారును తలచుచుండినను రాజ్యాంగవిధానసమస్యను అందరును అంగీకరించి నిర్ణయించుటకు కల అవకాశముల నన్నిటిని అన్వేషించవలెనని మీరు మనఃపూర్వకముగా కోరుచున్నారని మీ ఉపన్యాసమునుబట్టి మేము తలచుచున్నాము. మేము దానిని సరిగా గ్రహించితిమనియే భావించుచున్నాము. కాంగ్రెసువారుసత్యాగ్రహమును విరమించినచో దొరతనమువారు చేసిన అవసర నిబంధనలను కొనసాగింపవలసిన అవసరముండ దని మేము నమ్ముచున్నామని వేరుగా తెలుపనవసరము లేదు."

"మా అభిప్రాయములను గాంధీ, పండిత మోతీలాలు, పండిత జవహరలాలుగార్లకెరిగించి దేశహితార్థము మావిజ్ఞప్తి నామోదించి మిక్కిలి గొప్పదగు రాజ్యాంగవిధానసమస్యను శాంతిపరిస్థితులలో పరిష్కరించుట కవకాశమును కలుగజేయవలె నని మేము వారిని కోరునిమిత్తము వారి ముగ్గురితోను సంభాషించుటకు అనుమతి నియ్యవలెనని మేము మిమ్ములను కోరుచున్నాము. మేము వారివద్దకు వ్యక్తిపరముగానే వెళ్లెదముగాని ప్రభుత్వప్రతినిధులుగాను, లేక యేపార్టీయొక్క ప్రతినిధులుగాను వెళ్లుట లేదని మేము స్పష్టపరుపగోరెదము.

"చెరసాలలోనున్న వీరిని చూచుటకు మీ రనుమతి నియ్యగోరునెడల అందులకు కావలసిన సౌకర్యముల నన్నిటిని మాకు కలుగజేయునట్లు స్థానిక ప్రభుత్వములకు ఉత్తరువులను పంపగోరెదము. మీరు అనుమతి నిచ్చునెడల మేము వారితో రహస్యముగా సంభాషించుట కంగీకరించవలెను. మేము సంభాషించునపు డచట ప్రభుత్వోద్యోగు లెవ్వరును నుండగూడదు. సాధ్యమైనంతత్వరలోనే మేమువారిని కలుసుకొనవలసియున్న దనిగూడ విన్నవించుచున్నాము.

"దీనికి ప్రత్యుత్తరమును 'ఎం. ఆర్. జయకరు, మాలెబారుహిల్లు' అను అడ్రెసుకు పంపగోరెదము.

చిత్తగించవలెను,

తేజబహాదూరు సప్రూ, ఎం. ఆర్. జయకరు."

## రాజప్రతినిధి ప్రత్యుత్తరము

"ప్రియమైన జయకరుగారు,

"జూలై ౧౬ న మీరు వ్రాసిన లేఖ చేరినది. దేశమున మరల శాంతిపరిస్థితులను కలిగించుటకు సర్వశక్తులను వినియోగింపదలచితి మని మీరును, సప్రూగారును తెలిపియున్నారు. దానినిగూర్చి గాంధీ, మోతీలాలునెహ్రూ, జవహరలాలునెహ్రూగార్లతో సంభాషించుటకనుమతిని కోరితిరి. జూలై నెల ౯ వ తేదీని శాసనసభలో నే నుపన్యసించినపుడు సత్యాగ్రహమును, నూతనరాజ్యాంగవిధానమునుగూర్చి నా అభిప్రాయమును, నాదొరతనముయొక్క అభిప్రాయమును నిర్ధారణ చేయుట కవకాశము కలిగినది. సత్యాగ్రహమువలన భారతదేశమునకు చాలనష్టము కలుగుచున్నదని మేము తలచుచున్నాము. ఇండియాలో చాల ముఖ్యసంఘములును, వర్ణములును, పక్షములునుగూడ నిట్టిభావమునే వెల్లడించెను. కావున వారి సహాయముతో దొరతనమువారు తమ సర్వశక్తులను వినియోగించి దీనిని ప్రతిఘటించుచునే యుండవలెను. అన్నివర్ణములవారును అంగీకరించిన నూతనరాజ్యాంగవిధాన మేర్పడవలెననిగూడ మేము ముఖ్యముగా కోరుచున్నామని మీరు సరిగానే గ్రహించితిరి.

"స్టాట్యుటరీ కమిటీవారి సూచనలను పరీక్షించిన పిమ్మట యిండియా దొరతనమువా రెట్టి సూచనలను చేయునదియును, రౌండుటేబిలువా రెటుల నిర్ణయించునదియును, చివరకు పార్లమెంటువారెటుల నిర్ణయించునదియును నే నిపుడూహించుట కెట్టి అవకాశమును లేదు. భారతీయులం ప్రస్తుతము యేప్రత్యేక శాఖలనుగూర్చి బాధ్యతను వహించుటకు వీలులేదో వాటినితప్ప తక్కినశాఖల పరిపాలనములో వారి కధికమగు నధికారము లభించునట్లు వారికి తోడ్పడవలెనని నేనును, యిండియా దొరతనమువారును, బ్రిటనుదొరతనమువారును కోరుచున్నా మని నేను తెలిపియేయున్నాను. ఆప్రత్యేకశాఖ లేవి? వాటికిచేయవలసిన యేర్పాటులేవి? అనువిషయములను రౌం. టే. సభవారే నిర్ణయింపవలెను. రెండుపక్షములకును పరస్పరవిశ్వాసమున్నచో అంగీకారము కలుగుట అసాధ్యము కాదనియే నేనెల్లపుడును తలచుచున్నాను. మీరు చేయదలచిన యీప్రయత్నమువలన దేశమున శాంతిని నెలకొల్పుటకు సహాయము చేయగలుగుదు మని మీరు నమ్మునెడల మీప్రయత్నమున కభ్యంతరమును కలిగించుట నాకును, నాదొరతనమునకునుకూడ న్యాయముకాదు. మొదటినుండియును సత్యాగ్రహమును సుస్థిరముగా ప్రతిఘటించుటలో దొరతనమునకు తోడ్పడుచున్నవారి సహకారము చాల ముఖ్యమైనదనికూడ నేను తలచుచున్నాను. నేను మీప్రయత్నమున కభ్యంతరములను కలిగింపవలె

వనివారు కోరరనియే నేను తలచుచున్నాను. ఇండియాదేశమున శాంతిని నెలకొల్పవిమి త్తము దేశసేవానిరతితో మీరు ప్రయత్నించుటకు కావలసిన యేర్పాటుల నన్నిటిని చేయవలెనని మీవద్దనుండి ప్రత్యుత్తరమురాగానే నేను ఉత్తరువులను పంపెదను

చిత్తగించవలెను,

ఇర్విను."

## నెహ్రూలకు గాంధీజీ రెండు లేఖలను వ్రాయుట

మాకును, రాజప్రతినిధికిని జరిగిన రెండు లేఖలను పట్టుకొని మేము పూనాలో ఎరవాడచెరసాలకు వెళ్లి ౧౯౩౦ జూలై ౨౩, ౨౪ తేదీలను గాంధీజీతో సంభాషించితిమి. మాకును, రాజప్రతినిధికిని జరిగిన సంభాషణలోని ముఖ్యవిషయములను, స్థితిగతుల నన్నింటిని మేము గాంధీజీకి తెలియజేసితిమి. అలహాబాదులో నయినీచెరసాలలోనున్న మోతీలాలునెహ్రూ, జవహరలాలు నెహ్రూగార్ల కిచ్చుటకు గాంధీజీ మాకొకనోటును, ఒక వుత్తరమును వ్రాసి యిచ్చెను.

(౧) ఇండియాకు సంపూర్ణస్వరాజ్యము నిచ్చుసందర్భమున తాత్కాలిక దశలో అవసరముగు రక్షణలనుగూర్చి మాత్రమే రౌండుటేబిలుసభలో చర్చించుటకు నాకెట్టి ఆక్షేపణయునులేదు. ఆసభలో యిండిపెండెన్సుసమస్య నెవరైన తలపెట్టినచో దానిని తిరస్కరించగూడదు. రౌండుటేబిలు సభానిర్మాణమునుగూర్చి నేను బాగుగ తెలుసుకొనకుండ కాంగ్రెసువారు రౌండుటేబిలుసభలో పాల్గొనుటకు నే ననుమతింపజాలను.

(౨) రౌండుటేబిలుసభ సంతృప్తికరముగా నున్నచో సత్యాగ్రహమును విరమించుట సహజఫలితమే యగును. కేవలము శాసనములను తిరస్కరించుటకు మాత్రమే యిపుడు జరుపబడుచున్న శాసనోల్లంఘనముమాత్రమే విరమింపబడును. సారాను, సీమగుడ్డలను విక్రయించగూడదని దొరతనమువారు ఉత్తరువు చేయువరకును సారా సీమగుడ్డల దుకాణములవద్ద మాత్రము పికెటింగు జరుగుచునేయుండును. ప్రజలు ఉప్పును చేసుకొనుచునే యుండవలెను గాన ఉప్పుచట్టములోని శిక్షానిబంధనలను అమలులో పెట్టగూడదు. దొరతనమువారియొక్కయు, యితరులయొక్కయు ఉప్పుడిపోలపైని కాంగ్రెసువారు దాడులను సలుపరు. ఈ షరతును తక్కినషరతులలో చేర్చక పోయినను వ్రాతమూలకముగా వీటికి అంగీకరించినచో నేను సమ్మతించెదను.

౩. (ఏ) సత్యాగ్రహము విరమింపబడగానే సత్యాగ్రహఖయిదీలలోను, ఇతర రాజకీయఖయిదీలలోను చెరసాలలలో శిక్ష ననుభవించుచున్నవారిని విచారణ పూర్తి

కానందున చెరసాలలో నుంచబడినవారిని యావన్మందినిగూడ విడుదల చెయ్యవలెను. దౌర్జన్యముచేసినవారిని, దానిని ప్రోత్సాహపరిచినవారిని తప్ప తక్కినవారి నందరిని విడుదల చెయ్యవలెను.

(బి) ఉప్పుచట్టము, ప్రెస్సుయాక్టు, రివిన్యూయాక్టు మున్నగువాటిక్రింద దొరతనమువారు వశపరుచుకొనిన ప్రజలసొత్తులను మరల వారి కిచ్చివేయవలెను.

(సి) శిక్షింపబడిన సత్యాగ్రహులవద్దనుండియు, ప్రెస్సుయాక్టుక్రిందను వసూలు చేయబడిన జుర్మానాలను, సెక్యూరిటీలను మరల నిచ్చివేయవలెను.

(డి) సత్యాగ్రహకాలమున రాజీనామా నిచ్చినట్టియు, బర్తరఫుచేయబడినట్టియు గ్రామోద్యోగులలోను యితరవుద్యోగులలోను మరల తమ వుద్యోగములలో చేరగోరు వారికి ఉద్యోగముల నియ్యవలెను.

వ. రా :—అసహాయోద్యమము జరిగినప్పటి విషయములకు గూడ నివి వర్తింప వలెను.

(ఇ) రాజప్రతినిధి చేసిన ఆర్డినెన్సుల నన్నిటిని రద్దుచేయవలెను.

ఖైదులోనున్న వారికి రాజకీయవిషయములు సరిగా తెలియవు గనుక వాటి పైని ఖయిదీలు యిట్టి అభిప్రాయములను తెలుపకూడదు గాన నా అభిప్రాయము కేవలము తాత్కాలికమే. ఉద్యమముతో నాకు సంబంధ ముండినపుడు నా అభిప్రాయమునకు నేను కోరునట్టి విలువను నేనిపుడు కోరకూడదనియే నేను తలంచుచున్నాను. మోతీలాలునెహ్రూ, జవహరలాలునెహ్రూ, వల్లభాయిపటేలుగార్లకును ఉద్యమమును కొనసాగించుచున్న వారికిని జయకరుసప్రూగార్లు దీనినిచూపించవచ్చునుగాని పత్రికలలో నెంతమాత్రమును ప్రకటింపగూడదు. ప్రస్తుతము దీనిని రాజప్రతినిధికి చూపించగూడదు. ఈషరతులు అంగీకరింపబడినను ప్రస్తుతము నేను కోల్పోయిన ఆత్మవిశ్వాసము నన్ను విడుదల చేసినపిమ్మట నాకు మరల కలిగిననేగాని నేను రాం. టే. సభకు వెళ్లజాలను. ఆసభకు ఆహ్వానింపబడిన భారతీయులందరును కలసి ముందుగా నాలోచించి అంగీకరించి వారందరును కలిసి కోరదగిన రాజ్యాంగవిధాన కనిష్ఠపరిమాణమును నిర్ణయించవలెను. నేను రాజప్రతినిధికి వ్రాసిన లేఖలోని పదకొండు అంశములలోను యిమిడియున్న ఉద్దేశము నెరవేరునా అని ప్రతిపక్ష రాజ్యవిధానమును అవసరము వచ్చినప్పుడు పరీక్షింపుటకు నాకు స్వాతంత్ర్య ముండవలెను.

ఎం. కె. గాంధి,

ఎరవాడ సెంట్రలుజెయిలు, 23 జూలై 1930.

## పండిత మోతీలాలుగారికి గాంధీజీలేఖ

" నాస్థితి చాల అసందర్భముగానే యున్నది. నాస్వభావమునుబట్టి చెరసాలలకు వెలుపల జరుగుచున్న విషయములనుగూర్చి నేను నిర్ధారణగా నభిప్రాయమును తెలుపజాలను. వ్యక్తిపరముగా నాకు సంతృప్తి కలిగింపదగిన అంశములను మాత్రమే చాల చిత్తుగా వ్రాసి మన మిత్రుల చేతి కిచ్చితిని. స్లోకోంబుగారిచేతికి లేఖ నిచ్చుటకు నాకిష్టము లేకపోయినది. మీతో సంభాషింపవలె నని మాత్రమే నే నతనితో చెప్పితిని. కాని సంభాషణను పత్రికలలో ప్రకటించుట కతఁ డనుమతిని కోరుటచే నేను దానిని తిరస్కరింపజాలక పోతిని. మిమ్ములను చూడక ముందే దానిని ప్రకటించుటకు నేను సమ్మతించితిని. గౌరవప్రద మగు పరిష్కారము జరుగుటకు సక్యాకాలము వచ్చినచో దాని కభ్యంతరము కలిగించుటకు నే నంగీకరింపను. అట్టికాల మింకను రాలే దనియే నేను తలచుచున్నాను. పండిత జవహరలాలుగారి అభిప్రాయమే కడపటినిశ్చయముగా నుండవలెను. మీరును నేనును మనఅభిప్రాయములను జవహరలాలుగారికి తెలుపగలము. నే నెంతవరకు వప్పగలిగినదియును నేను సప్రూ జయకరుగార్ల కిచ్చిననోటులో స్పష్టపరచితిని. నికరమైన కాంగ్రెసుపద్ధతికిని, ప్రజలలో ప్రస్తుతముకలిగిన మనోభావమునకును నాస్థితి అసందర్భముగా నున్న దని జవహరలాలుగారు తలపవచ్చును. లాహోరు తీర్మానమునకు భిన్నముగాకుండ మీరు మరెట్టిబలీయములగు సూచనలను చేసినను నే నంగీకరించెదను. నానోటులోనివిషయములను మీ రామోదింపజాలనిచో వాటికి మీ రెట్టివిలువను యియ్యనవసరములేదు. నేను రాజప్రతినిధికి వ్రాసినమొదటి లేఖలో వివరించిన ౧౧ అంశములను మీకును, జవహరలాలుగారికిని అపుడు నచ్చలేదు. ఇప్పటికిని మీఅభిప్రాయ మటులనేయున్నదా? ఇండిపెండెన్సుయొక్కసారమంతయును వాటిలో నున్నదని నేను గాఢముగ నమ్ముచున్నాను. భారతీయులు వెంటనే అమలుజరుపజాలనివాటిని నే నంగీకరింపజాలను. ఈ నోటులో నేను మూడిటినిమాత్రమే పేర్కొనినను. తక్కిన ఎనిమిదింటిని నేను వదలుకొనలేదు. సత్యాగ్రహసందర్భమున నే నీమూడుఅంశములను వివరించితిని. ఇప్పటివరకు మనకు చేకూరినస్థితిని భంగపరచునట్టి ఒడంబడికకు నేను సమ్మతింపను.

ఎరవాడమందిరము, ౨౩ జూలై ౧౯౩౦. ఎం. క. గాంధి."

మేము ౧౯౩౦ జూలై ౨౭, ౨౮ తేదీలలో నయినీజయిలులో మోతీలాలు, జవహరలాలుగార్లను చూచితిమి. రాజప్రతినిధికిని, మాకును జరిగినలేఖలను, గాంధిగారిచ్చిన నోటును, ఉత్తరమును వారు చదివిరి. సంగతుల నన్నిటిని మేము వారి కెరిగించి

తిమి. జవహరలాలు, మోతీలాలుగార్లు కలసి ఒకనోటును, జవహరలాలుగారు ప్రత్యేక ముగా నొకలేఖను గాంధీజీకి వ్రాసి మాకిచ్చిరి.

## ౧౯౩౦ జూలై ౨౮ వ తేదీని నెహ్రూగార్లు వ్రాసిననోటు

“సప్రూ జయకరుగార్లతో మేము చాలసేపు సంభాషించితిమి. వారు ఎరవాడ జయిలులో గాంధీజీతోను, నయినీజయిలులో మా యిద్దరితోను సంభాషించుటకు సంబంధించిన పూర్వవృత్తాంతమునంతను వారు మా కెరిగించిరి. వీలయినచో సత్యాగ్రహమును పూర్తిగాగాని, తాత్కాలికముగాగాని విరమింపజేయుటయే తమ యుద్దేశమని వారు తెలిపిరి. శాంతి స్థాపింపబడవలెనని వారు ముఖ్యముగా కోరుచున్నారనుట నిశ్చయము. భారతీయులు స్వరాజ్యసంపాదనమున కిదివరకే చాల త్యాగములను చేసి యున్నారు. భారతప్రజలకు గౌరవప్రదమును, స్వాతంత్ర్యపరము నగుపద్ధతిని శాంతిని నెలకొల్పుటకు గల అవకాశముల నన్నిటిని మేము సంతోషముతో నన్వేషించెదము. కాంగ్రెసుతీర్మానములలో ముఖ్యవిషయములలో సవరణలను చేయుటకు మా కెట్టి అధికారమును లేదు. కాంగ్రెసువారు పూనుకొనిన ప్రధానాంశము ఆమోదింపబడినచో కొన్ని పరిస్థితులలో వివరములలో మాత్రము మార్పు చేయవచ్చు నని మేము సలహా నియ్యగలుగవచ్చును. దీనికి వెంటనే ఒక చిక్కు యేర్పడినది. మే మిద్దరమును చెరసాలలో నున్నాము. కొంతికాలమునుండి బాహ్యప్రపంచముతోను, జాతీయోద్యమముతోను మాకు సంబంధము పూర్తిగా తెగిపోయినది. మాలో నొకరికి మూడునెలలనుండి ఒక్క దినపత్రికనుగూడ నిచ్చుటలేదు. గాంధీజీకూడ పెక్కుమాసములనుండి చెరసాలలోనే యున్నాడు. మొదటి భారతకాంగ్రెసు కార్యసంఘమున మాతోపాటు సభ్యులుగా నున్నవారందరునుకూడ చెరసాలలలోనే యున్నారు. ఆసంఘము అక్రమసంఘముగా ప్రకటింపబడెను. భారతకాంగ్రెసు మహాసభ తరువాత సర్వాధికారము గల భారత కాంగ్రెసు స్థాయిసంఘసభ్యులు ౩౬౦ మందిలోను దాదాపు ౨౬౦ మంది చెరసాలలో నున్నారు. మాకు జాతీయోద్యమముతో నిప్పుడెట్టి సంబంధమును లేదుగాన మేము తక్కినకార్యసంఘసభ్యులతో, ముఖ్యముగా గాంధీజీతో నాలోచించకుండ నిర్ధారణగా నొకపని చేయువిషయమున బాధ్యతను వహింపజాలము. అన్నిప్రధానవిషయములనుగూర్చియు ముందుగా ఒడంబడిక జరిగినగాని రౌండుటేబిలుసభలో నెట్టి లాభమును మాకు కలుగదు. ఆఒడంబడిక చాల ముఖ్యమయినది. దానిలో సంశయమున కెట్టి అవకాశము నుండగూడదు. అంతయును స్పష్టముగా నుండవలెను. దానికి విపరీతార్థమును తీయుట కెట్టిఅవకాశము నుండగూడదు. తాము సప్రూ, జయకరుగార్లు, స్వయముగా నీప్రయత్నమును చేయుచున్నాముగాని ప్రభుత్వప్రతినిధులుగా చేయుట లేదని

వారిద్దరును స్పష్టముగా తెలిపిరి. ఇర్విను ప్రభువు లేఖలో గూడ నిది స్పష్టముగానే యున్నది. కాన దీనికి ఇర్విన్ప్రభువును, యిండియాదొరతనమును బాధ్యులుకారు. కాని కాంగ్రెసుకును, బ్రిటిషుదొరతనమునకును అట్టిఒడంబడిక జరుగుటకు అవకాశమును కలి గించుటలో వీరు కృతకృత్యులు కావచ్చును. గాంధీజీతోను, తక్కిన భారత కాంగ్రెసు కార్యసంఘసభ్యులతోను ఆలోచించకుండ మేము నిర్ధారణగా నేవిషయములను సూచింప జాలముగాన సప్రూ, జయకరుగార్లు తెలిపిన విషయములను, ౧౯౩౦ జూలయి ౨౩ వ తేదీని తాను వ్రాసిన నోటులో గాంధీజీ చేసిన సూచనలనుగూర్చి మే మిపుడు చర్చింపదలచుకొనలేము. గాంధీజీనోటును మేము చూచితిమి. దానిలో ౨, ౩ విషయ ములకు సామాన్యముగా మే మంగీకరించెదము. కాని వీటికిని, మొదటివిషయమునకును సంబంధించిన వివరములనుగూర్చి మేము గాంధీజీ మున్నగువారితో చర్చించగోరెదము. అటుపిమ్మటనే మేము మా అభిప్రాయములను తెలిపెదము. మేము వ్రాసిననోటును రహస్యముగా నుంచగోరెదము. గాంధీజీ ౨౮-౮-౩౦ న వ్రాసిననోటును యెవరు చూచెదరో వారికి మాత్రమే దీనిని చూపదగును" అని నెహ్రూ లిద్దరును కలసి నోటులో వ్రాసి మా కిచ్చిరి.

### జవహరలాలుగారు ౨౮-౭-౩౦ న గాంధీజీకి వ్రాసిన లేఖ

"ప్రియమైన బాపూజీ— మేమును, మీరును చెరసాలలోనే యుండినను మరల నింతకాలమునకు మీ కీలేఖను వ్రాయగలిగినందులకు నేను చాల సంతసించుచున్నాను. నేను మీ కొక పెద్దవుత్తరమునే వ్రాయగోరెదను. కాని ప్రస్తుతస్థితిలో నేనటుల వ్రాయ వీలులేదు. కావున ప్రస్తుతాంశమునుగూర్చి మాత్రమే వ్రాసెదను.

సప్రూ, జయకరుగార్లు నిన్న నిచటికి వచ్చి నాన్నగారితోను, నాతోను చాల సేపు సంభాషించిరి. నేడు వారు మరల వచ్చెదరు. నిన్నవే వా రన్నివిషయములను మాకు తెలిపిరి. మీరు వ్రాసిన నోటును, లేఖలను మాకు చూపించిరి. మరల వారితో సంభాషింప నవసరము లేకుండనే మే మిద్దరమును చర్చించి యేదో యొక నిర్ధారణ చేయగలమని మేము తలచితిమి. నేటి సంభాషణలో క్రొత్తవిషయము లేవైన వెలు వడునెడల మా అభిప్రాయమును మేము మార్చుకొందుము. మేము సప్రూ, జయకరు గార్ల కిచ్చిన నోటులో యిప్పటివరకు మాకు కలిగిన అభిప్రాయములను తెలిపి యున్నాము. అది సంగ్రహముగానే యున్నను, మా భావములను మీరు తెలుసు కొనగలుగుట కది చాలునని నమ్మెదము. తండ్రిగారును, నేనును యేకీభవించియే యిట్లు నిర్ణయించితిమి. మొదటి విషయము, అనగా రాజ్యాంగ విధానమును గూర్చి మీ అభి ప్రాయము మాయిద్దరికినిగూడ సరిగా నచ్చలేదు. నేటి యథార్థస్థితికిని, మనము చేసి

ప్రమాణములకును అది అనుగుణముగా నున్నట్లు కనబడలేదు. "మా కిదివరకు చేకూరిన స్థితిని భంగపరుచునట్టి ఒడంబడికకు మే మంగీకరింపజాలము." అని మీరు తెలిపినదానితో నే మిద్దరమును పూర్తిగా నేకీభవించితిమి. కావుననే మనము బాగుగా నాలోచించకుండ యేవిషయమును నిర్ధారణచేయ వీలు లేదు. ఎదుటిపక్షమువారు సంతృప్తికరమగు సూచన లింకను చేయలేదు. కాన మనము తొందరపడి తప్పటడుగు వేసెదమేమో యని నేను భయపడుచున్నాను. నా అభిప్రాయమును నేను మితముగానే వెల్లడించుచున్నాను. నాకు సంఘర్షణమే ప్రియతమము. దానివలన నేను సజీవుడనుగా నున్నాననుభావము నాకు కలుగును. గత నాలుగునెలలలోను మన దేశమున జరిగిన విషయములవలన నాకు చాల ఆనందము కలిగినది. నాదేశీయులగు స్త్రీలు, పురుషులు, బిడ్డలు మున్నగువా రందరును చేయుచున్న దేశసేవకు నేను చాల గర్వపడుచున్నాను. దేశీయులలో మిక్కిలి హెచ్చుమంది శాంతినే కోరెదరు, గాని సంఘర్షణమును కోరరు. కావున నేను నా మనోభావముల నడచివేసి శాంతియుతమగు భావము నలవరుచుకొనుటకు గట్టిప్రయత్నము చేయుచున్నాను. మీకు మీ దివ్యశక్తివలన నవ్యభారతమును సృష్టింపగలిగినందులకు నేను మిమ్ముల నభినందించు చున్నాను. ఇటుపైని యేమి జరుగునో నాకు తెలియదు. ఇదివరకు జరిగిన పనివలన మన జీవితములు సార్థకమైనవి. చర్వితచర్వణముగా గడచుచున్న మన జీవితమునందు చారిత్రిక ఘనతగల యొక వికాస మేర్పడినది. ఈ నయినీ చెరసాలలో కూర్చుండి నేను అహింసాసాధనముయొక్క అద్భుతశక్తినిగూర్చి ఆలోచించుచున్న కొలదిని దానియందు నాకు నమ్మకము మరింత అధిక మగుచున్నది. అహింసా సిద్ధాంతములపట్ల దేశీయులు చూపించిన విశ్వాసము మీకు అసంతృప్తికరముగా నుండలేదనియే నేను తలచెదను. చాల అరుదుగా దౌర్జన్యములు జరిగినను దేశీయు లందరును అహింసానిరతులుగానే యుండిరి. నే ననుకొనినదానికంటె నది చాల అద్భుతముగా కనబడెను. మీ ౧౧ విషయములను నే నింకను పూర్తిగా నామోదింపగలిగి యుండలేదు. అ వన్నియును ముఖ్యమయినవే యని నే నంగీకరించెదను. కాని అవి యిండిపెండెన్సుకు ప్రతినిధులు కాజాలవు. "వెంటనే అమలులో పెట్టుటకు భారతజాతికి అధికార మియ్యబడని విషయములతో మన కెట్టి జోక్యమును లేదు." అను మీ అభిప్రాయముతో నేను పూర్తిగా నేకీభవించుచున్నాను. ౮ రోజుల క్రితము నాన్నగారికి యింజక్షనుచేసిరి. అప్పటి నుండియు ఆయనకు ఆరోగ్యము సరిగాలేదు. ఆయనకు నీరసము చాల అధికమయినది. నిన్న సాయంకాలము సప్రూ, జయకరుగార్లతో చాలసేపు సంభాషించుటవలన ఆయన చాల అలసిపోయిరి.

జవహరలాలు."

"నా ఆరోగ్యమునుగూర్చి ఆలోచింపవద్దు. ఇది తాత్కాలికము. రెండుమూడు రోజులలో నాకు ఆరోగ్యము కలుగునని నమ్మెదను. ప్రియమిత్రుడు
మోతీలాలు నెహ్రూ."

మరా:—"నేను మేము మరల సప్రూ, జయకరుగార్లతో సంభాషించితిమి. మే మిదివరకు వ్రాసిన నోటును వారికి చూపించగా వారు దానిలో కొన్ని సవరణలను చేయగోరిరి. అందువలన నే మాసవరణలను చేసితిమి గాని అవి ముఖ్యమైనవి కావు. మా అభిప్రాయము స్పష్టముగానే యున్నది. దీనిని మీ రామోదింతు రని నమ్మెదను. జవహరలాలు."

## జయకరుగారు మరల గాంధీజీని చూచుట, గాంధీజీ తెలిపిన విషయములు

౧౯౩౦ జూలై ౩౧ వ తేదీని జయకరుగారొక్కరుమాత్రమే ఎరవాడచెరసాలకు వచ్చి గాంధీజీతో ఆనాడును ఆగస్టు ౧-౨ తేదులలోనుగూడ సంభాషించిరి. గాంధీజీ తెలిపిన యీరెండు అంశములను జయకరుగారు వ్రాసిరి.

"(౧) భారతీయులు సామ్రాజ్యమునుండి విడిపోవగోరినపుడు విడిపోవుటకు వారికి హక్కుకలదను నిబంధన రాజ్యాంగవిధానమునందు వ్రాయబడవలెను. ౧౧ విషయములనుగూర్చి సంతృప్తికరముగా పనిచేయుటకు భారతీయులకు హక్కును, అధికారమును కలవను నిబంధనగూడ దానిలో నుండవలెను. లేనిచో దానిని గాంధిగారంగీకరింపజాలరు.

(౨) గాంధిగారు రౌండుటేబిలుసభలో నీ విషయములను వెల్లడించినపుడు గాంధిగా రిదివరకు వాటినిగూర్చి నాకు తెలుపలేదని చెప్పుటకు రాజప్రతినిధికి అవకాశ ముండగూడదు గాన యిపుడే యీవిషయములను రాజప్రతినిధికి తెలుపవలెను. "ఇదివరకు బ్రిటనుదేశీయుల కియ్యబడిన సౌకర్యములను, హక్కులను గూర్చి ఒక స్వతంత్రన్యాయస్థానములో విచారణను జరిపించుటకుగూడ యిండియాకు హక్కు ఉండవలెను." అని గాంధిగారు రౌండుటేబిలుసభలో వాదించెదరు.

## కాంగ్రెసునాయకులు ఎరవాడచెరసాలలో కలసి ఆలోచించుట- వారి షరతులు

౧౯౩౦ ఆగస్టు ౧౪-౧౫ తేదీలలో గాంధి, మోతీలాలు, జవహరలాలు, వల్లభాయిపటేలు, డాక్టరు సయ్యదుమహమ్మదు, జయరాందాసు దౌలతరాం,

శ్రీమతి సరోజనీదేవిగార్లు ఎరవాడచెరసాలలో మాతో (సప్రూజయకరుగార్లతో) సంభాషించిరి. రాజప్రతినిధికి చూపించుటకు వారందరును కలసి ౧౫ వ తేదిని వ్రాసి మా కిచ్చిన లేఖ యీ దిగువను ప్రకటింపబడెను.

"ప్రియమిత్రులకు - బ్రిటిషు దొరతనమునకును, కాంగ్రెసునకును శాంతియుతమగు సమాధానమును కలిగించుటకు మీరు పూనుకొనినందులకు మేమందరమును మిక్కిలి కృతజ్ఞులముగా నున్నాము. మీకును, రాజప్రతినిధికిని జరిగిన లేఖలను మేము చదివితిమి. మీతో చాలసేపు సంభాషించితిమి. తరువాత మాలో మేము చర్చించితిమి. దేశమునకు గౌరవప్రదమగు సమాధానము లభించుటకు పక్వకాల మింకను రాలేదనియే మేము నిశ్చయించితిమి. గత ౫ నెలలలోను భారతీయులలో నత్యద్భుతమగు ప్రబోధము కలిగినది. దేశీయులలో అన్నిమతములకును చేరినధనికులును, పేదలునుగూడ అత్యధికము లగు కష్టములకు గురియైరి. కాని స్వరాజ్యము చేకూరుటకు యీకష్టములు చాలవు. అవి నైరంతర్యముగా కలుగలేదు. సత్యాగ్రహమువలన దేశమునకు హానికలిగినది. అది శాసన విరుద్ధము. దాని కిది తగిన సమయము కాదు-అని మీరును, రాజప్రతినిధియును తలచుచున్నారు. మీఅభిప్రాయముతో మే మేకీభవింపజాలము. ఆంగ్ల దేశములో చాలసారులు హింసతోకూడిన విప్లవములు జరిగినట్లు ఆంగ్ల దేశచరిత్రలో చాలవృత్తాంతములు కలవు. వాటిని ఆంగ్లేయు లందరు నిస్సంశయముగా ప్రశంసించిరి. అటుల ప్రశంసింపవలెనని మాకుగూడ బోధించిరి. సత్యాగ్రహ ఉద్యమము అహింసాత్మకముగా జరుగవలెనను నుద్దేశముతోనే ప్రారంభింపబడెను. ఆచరణమునందుగూడ నది అత్యధికముగా నహింసావిధానమునందే జరుపబడెను. అట్టి ఉద్యమమును రాజప్రతినిధిగాని, ధీశాలియగు మరేయాంగ్లేయుడైనగాని నిరసించుట యెంతమాత్రమును న్యాయముకాదు. ఈ ఉద్యమమును ప్రభుత్వోద్యోగులలోను, యితరులలోను యెవరైన నిరసించినను వారితో తగవులాడుట మావుద్దేశము కాదు. దేశీయులలో అత్యధికసంఖ్యాకులు ఉద్యమములో చేరుటవలననే దానిని ప్రారంభించుటకు ప్రబలమగు నాధార మేర్పడుచున్నది. వీలైనచో పూర్తిగాగాని, తాత్కాలికముగా గాని సత్యాగ్రహమును నిలిపివేయవలెనను మీఅభిప్రాయముతో మేముగూడ నేకీభవించుచున్నాము. మనదేశీయు లగు పురుషులను, స్త్రీలను, బిడ్డలను అనవసరముగా చెరసాలలకు పంపుటవలనను, దెబ్బలకును యింకను దుస్సహములగు బాధలకును గురిచేయుటవలనను మాకెట్టిఆనందమును కలుగదు. కావున గౌరవప్రదమగు సమాధానము కుదురుటకు అన్ని అవకాశములను సాకల్యముగా నన్వేషించెదమని మీకును, మీద్వారా రాజప్రతినిధికిని మేము వాగ్దానము చేయుచున్నాము. దీనిని మీరు విశ్వసింపదగును. కాని అట్టిచిహ్నము మా కింకను గోచరించుటలేదని మేము స్పష్టముగా తెలుపుచున్నాము. భారతదేశమున కేది శ్రేష్ఠమైనది అనువిషయ-

మును భారతీయులకు స్త్రీ పురుషులే నిర్ణయింపవలెను అను భావమును ప్రభుత్వోద్యోగులను నాంగ్లేయులు అంగీకరించి రనుటకు మా కింకను యెట్టిసూచనలను కనబడుట లేదు. ప్రభుత్వోద్యోగులు తరుచుగా సదుద్దేశముతోనే అనుకూలములగు ప్రకటనలను చేయుచుందురుగాని వాటియందు మాకు నమ్మకములేదు. ఆంగ్లేయులు శతాధికవత్సరములనుండి భారతీయులను పూర్తిగా వశపరచుకొని వారిపై వీపుల నెక్కికూర్చుని చాల లాభములను బడయుచున్నారు. కాన నందువలన యిండియాలో నైతిక ఆర్థిక రాజకీయములలో కలిగిన వినాశనమును తెలుసుకొనగలుగు శక్తిని వారు గోల్పోయిరి. ఇటుపైని వారు మావీపులమీదనుండి దిగవలెను. ఇదివరకు వారు చేసిన అక్రమములకు ప్రాయశ్చిత్తముగా మేము అభివృద్ధినొందుటకు తగినసహాయమును చేయవలెను. నూరేండ్లనుండి బ్రిటిషువారు యిండియాను ఆక్రమించుకొనియుండుటచే నూరేండ్లనుండియు దేశీయులు క్రమముగా క్షీణించిపోవుచున్నారు. దేశీయులమగు మేము మరల మంచిస్థితికి రాగలుగునట్లు వారు తోడ్పడుటయే తమముఖ్యకర్తవ్య మని వా రింకను తెలుసుకొనియుండలేదు. మనదేశములో మీరును, మీవంటివిద్యాధికులు మరికొందరును యీవిషయమున భిన్నాభిప్రాయులుగా నున్నారని మే మెరుగుదుము. ప్రస్తుతము వారిలో తగినంతమార్పు కలిగినది గాన వారు జరుపదలచిన సభలో మేము పాల్గొనవగునని మీరు నమ్ముచున్నారు. మా కిట్టినమ్మకము లేకపోయినను శక్తివంచనలేకుండ మీకు సహకారమొనరించెదము.

స్నేహభావముతో మీరు చేయుచున్న ప్రయత్నమునకు ప్రస్తుతస్థితిలో మే మెంతవరకు తోడ్పడగలిగినదియును యీ దిగువను వివరించితిమి.

మీ లేఖకు రాజప్రతినిధి వ్రాసిన ఉత్తరములో నుపయోగింపబడిన భావనుబట్టి చూచినచో, నిరుడు లాహోరులో కాంగ్రెసుమహాసభలో సిద్ధపరుపబడిన కేమనలు డిమాండు తీర్మానము జరుపదలచిన సభవలన నెంతవరకు నెరవేరునో గ్రహించుటకు వీలు లేకున్నది. భారతకాంగ్రెసు కార్యసంఘసభవారును, అవసరమైనచో స్థాయి సంఘమువారును సమావేశమై ఆలోచించి నిర్ధారణచేయకుండ మేము స్వతంత్రించి నిష్కర్షగా నేమియును చెప్పగలిగియుండలేదు. కావున వ్యక్తిపరముగా మా అభిప్రాయమును మాత్రమే తెలుపుచున్నాము.

(౧) ఏ. భారతీయులు బ్రిటిషుసామ్రాజ్యమునుండి విడిపోగోరినపు డటుల విడిపోవుటకు హక్కుకలదని స్పష్టముగా వ్రాయబడవలెను. (బి) ఇండియాకు సంపూర్ణ జాతీయప్రభుత్వమును వారు దేశరక్షక సైన్యముపైనను ఆర్థికములపైనను పరిపాలనాధికారము ఉండవలెను. గాంధీజీ రాజప్రతినిధికి వ్రాసినలేఖలోని ౧౧ అంశములనుగూడ

పరిపాలనాధికారముక్రిందకు రావలెను. జాతీయప్రభుత్వము దేశీయులకే బాధ్యముగా నుండవలెను. (సి) బ్రిటిషువారి హక్కులు, సదుపాయములు, ప్రభుత్వఋణము మున్నగునవి న్యాయమైనవా కావా అని దేశీయులమేలుకోరకు జాతీయప్రభుత్వము వారు నిర్ణయింపగోరినచో వాటినిగూర్చి స్వతంత్రమగు నొక న్యాయస్థానమున విచారణను జరిపించుటకు యుండియాకు అధికార ముండవలెను.

వ.రా:—అధికారమును దేశీయులకు వశపరచుచున్న కాలమున దేశహితార్థము జరుగవలసిన సర్దుబాటులను భారతీయులచే నియమింపబడిన ప్రతినిధులే నిర్ణయింపవలెను.

(౨) ఇవన్నియును సాధ్యములేయని బ్రిటిషుగవర్నమెంటువారుతలచి యిటుల సంతృప్తికరమగు ప్రకటనను చేసినచో సత్యాగ్రహమును అనగా కేవలము తిరస్కరించుటయే పనిగా కొన్ని శాసనములను తిరస్కరించుటను మాత్రము నిలిపివేయదగునని మేము కాంగ్రెసుకార్యసంఘమువారికి సలహాయిచ్చెదము. దేశమున సారాను, సీమగుడ్డలను విక్రయించగూడదని దొరతనమువారు ఉత్తరువుచేయువరకును కాంగ్రెసువారు యీ దుకాణములవద్ద శాంతియుతముగా పికెటింగు చేయుచునే యుందురు. ప్రజలు ఉప్పును తయారుచేయుచునే యుండవలెను. గాన ఉప్పుచట్టములో పీనలు క్లాజులను అములులో పెట్టగూడదు. దొరతనమువారియొక్కయు, యితరులయొక్కయు ఉప్పు కొఠారులపై కాంగ్రెసువారు దాడులను సలుపరు.

(౪) సత్యాగ్రహమును విరమించుటతోపాటు (ఏ) దౌర్జన్య మొనరించినందులకును, దానిని ప్రోత్సాహపరచినందులకును శిక్షింపబడినవారిని ఆ సందర్భమున విచారణ లేకుండనే నిర్బంధమునం దుంచినవారిని తప్ప తక్కిన సత్యాగ్రహ ఖైదీలలోను, రాజకీయఖైదీలలోను శిక్ష ననుభవించుచున్నవారిని విచారణ పూర్తికాకుండ నున్నవారినిగూడ వెంటనే వదలివేయవలెను. (బి) సాల్టుయాక్టు ప్రెసుయాక్టు రివిన్యూయాక్టు మున్నగువాటిక్రింద దొరతనమువారు వశపరుచుకొనిన ప్రజలసొత్తులను మరల ప్రజలకిచ్చివేయవలెను. (సి) శిక్షింపబడిన సత్యాగ్రహులవద్దనుండియును, ప్రెసుయాక్టుక్రిందను వసూలుచేయబడిన జుర్మానాలను సెక్యూరిటీలను మరల నిచ్చివేయవలెను. (డి) సత్యాగ్రహకాలమున రాజీనామా యిచ్చినట్టియు బర్తరఫు చేయబడినట్టియు గ్రామోద్యోగులలోను యితర ఉద్యోగులలోను మరల ఉద్యోగములలో చేరగోరు వారికి మరల ఉద్యోగముల నియ్యవలెను.

నోటు:—(3) వ దానిలోని షరతులన్నియును అపహాయోద్యమకాలమునకు గూడ వర్తించును. (ఇ) రాజప్రతినిధి చేసిన ఆర్డినెన్సుల నన్నిటిని రద్దుచేయవలెను.

(౪) పైని తెలుపబడిన ప్రారంభవిషయము లన్నియును సంతృప్తికరముగా పరిష్కరింపబడిన పిమ్మటనే జరుపదలచిన సభానిర్మాణము కాంగ్రెసువా రాసభలో పాల్గొనుట మున్నగు విషయములను పరిష్కరింపవలెను.

(సంతకములు చేసినవారు) మోతీలాలు నెహ్రూ, ఎం. కే. గాంధి, సరోజనీ నాయుడు, వల్లభాయిపటేలు, జయరాందాసు దౌలతరాం, సయ్యదు మహమదు, జవహరలాలు నెహ్రూ.

## కాంగ్రెసు నాయకులకు సప్రూ, జయకరుగారు వ్రాసిన లేఖ

౧౯౩౦ ఆగస్టు ౧౬ వ తేదీని మేము బొంబాయిలో మలబారు హిలునుండి వారి కిటుల ప్రత్యుత్తరమును పంపితిమి.

"ప్రియమిత్రులారా— మేముమిమ్ములను పూనాలోను, అలహాబాదులోనుకలుసు కొనినపుడెల్ల మీరు మమ్ము చాల ఆదరించి మేము తెలిపినవిషయములను శాంతముగా వినినందులకు మాకృతజ్ఞతను తెలుపగోరుచున్నాము. మిక్కిలి దీర్ఘకాలము జరిగిన యీ సంభాషణలవలన మీకు చాల యిబ్బందిని కలుగజేసినందులకును ముఖ్యముగా మోతీలాలు నెహ్రూగారికి అస్వస్థతగా నున్న సమయమున వారు మాష్వాలమున అలహాబాదునుండి పూనాకు రావలసివచ్చినందులకును మేము చాల చింతిలుచున్నాము.

సత్యాగ్రహమును విరమించవలెననియును, రౌండు టేబిలుసభలో పాల్గొనవలెననియును కాంగ్రెసుసభవారికి మీరు సూచించుటకు ముందుగా జరుగవలసిన షరతులను వివరించుచు పూనాలో మీ రొక లేఖను మా కిచ్చితిరి. (౧) ౨౦-౬-౧౯౩౦ వ తేదీని అప్పటికి భారత కాంగ్రెసు అధ్యక్షుడుగా నున్న మోతీలాలుగారు బొంబాయిలో స్లోకోంబుగారితో సంభాషించినపుడు తెలిపిన విషయములను ముఖ్యముగా (౨) ౨౫-౬-౩౦ ని బొంబాయిలో స్లోకోంబుగారు మోతీలాలుగారికి వ్రాసియిచ్చినట్టియు, మోతీలాలుగారిచే నామోదింపబడినట్టియు స్టేటుమెంటులోని షరతులనుబట్టి మే మీ రాయబారమును జరుపబూనితిమి.

ఈ రెండుపత్రములను స్లోకోంబుగారు మాకు పంపిరి. దానిపైని సమాధానమును కలుగజేయువిషయమున గాంధీ, మోతీలాలు, జవహరలాలుగార్లతో సంభాషించుటకు అనుమతిని బడయుటకు మేము రాజప్రతినిధిని సందర్శించితిమి. పైని తెలుపబడినరెండవ పత్రముయొక్క నకలును మీరు మావద్దనుండి తీసుకొంటిరి. ౧౫ వ తేదీని మీరు మా కిచ్చిన్న లేఖను రాజప్రతినిధికి పంపవలెనని మీరు కోరితిరి. మే మందుల కంగీకరించితిమి. వీటినన్నిటిని ప్రకటించవలెనని మీరు తెలిపితిరి. మీరు మా కిచ్చిన లేఖను రాజప్రతినిధి పరిశీలించినపిమ్మట వీటినన్నిటిని మేము పత్రికలలో ప్రకటించెదము.

సత్యాగ్రహమును విరమించినపిమ్మట దేశమునందలి స్థితిగతులు చాల అనుకూలమగు నని మేము మీకు తెలిపితిమి. మే మటుల నమ్ముటకు కారణము లున్నవి. అహింసాత్మకమగు నుద్యమమున పనిచేసి చెరసాలలకు వెళ్లినవారి నందరిని వదలి వేసెదరు. చిటగాంగుకును, లాహోరుకుట్రకేసుకును సంబంధించిన ఆర్డినెన్సులు తప్ప తక్కిన అన్ని ఆర్డినెన్సులును రద్దుచేయబడును. రౌండుటేబిలుసభలో తక్కినరాజకీయ పక్షముల ప్రతినిధులసంఖ్యకంటె కాంగ్రెసుప్రతినిధులసంఖ్యయే హెచ్చుగా నుండును.

మోతీలాలుగారు మాతో సంభాషించినపుడు తెలిపిన సంగతులకును, మోతీలాలుగా రామోదించిన స్లోకోంబుగారి స్టేటుమెంటులోని సంగతులకును, రాజప్రతినిధి మాకు వ్రాసినలేఖలోని సంగతులకును భేద మేమియును లేదని మేము నిర్ధారణగా మీకు తెలిపియేయున్నాము.

టి. బి. సప్రూ, ఎం. ఆర్. జయకరు."

సప్రూగారికి రాజప్రతినిధి వ్రాసిన లేఖ

తరువాత మాలో జయకరుగారొక్కరే ౧౯౩౦ ఆగస్టు ౨౧ వ తేదీని సిమ్లావెళ్లి కాంగ్రెసు నాయకులు వ్రాసియిచ్చినలేఖను రాజప్రతినిధికి చూపించి దానినిగూర్చి రాజప్రతినిధితో సంభాషించిరి. సప్రూగారు ౨౫ వ తేదీని సిమ్లా చేరిరి. ౨౫, ౨౮, ౨౯ తేదీలలో మే మిద్దరమును రాజప్రతినిధితోను, యిండియా ప్రభుత్వసంఘసభ్యులలో కొందరితోను చాలసారులు సంభాషించితిమి. అలహాబాదులోను, పూనాలోను నున్న కాంగ్రెసునాయకులకు చూపించుటకు రాజప్రతినిధి మా కిచ్చిన లేఖ నీ దిగువను చూడదగును.

"ప్రియమైన సప్రూగారు! ఇపుడు చెరసాలలో నున్న కాంగ్రెసునాయకులతో మీరును, జయకరుగారును సంభాషించుటవలన తేలినఫలితములను మీరు నా కెరిగించి నందులకు మీకు వందనములు. ఆగస్టు ౧౫ వ తేదీని వారందరును కలసివ్రాసి మీకిచ్చిన లేఖను, అటుపిమ్మట మీరు వారికి వ్రాసినలేఖను ప్రతులను మీరు నాకు పంపితిరి.

ఇండియాలో మరల శాంతిని నెలకొల్పుటకుగాను మీ అంతట మీరు దేశ సేవానిరతితో ప్రయత్నింప బూనినందులకు నేను మిక్కిలి సంతసించితినని మీ రిద్దరును తెలుసుకొనగోరెదను. మీ రీకార్యమునకు పూనుకొనుటకు గల కారణములను మరల వివరించుటవసరమే."ప్రస్తుతము దేశీయులు ఏశాఖలయొక్క బాధ్యతను వహింప గలస్థితిలో లేరో వాటివిషయమున ప్రత్యేక యేర్పాటులను చేయుపద్ధతిని తక్కిన అన్ని శాఖలలోను అధికమగు పరిపాలనాధికారమును భారతీయులు పడయగలుగునట్లు సహాయముచేయవలెనని నేనును, యిండియాదొరతనమువారును ముఖ్యముగా కోరుచుంటిమి.

బ్రిటిషుదొరతనమువారుగూడ నటులనే కోరుచున్నారనుటకు నా కెట్టి సంశయమును లేదు." అని జూలై ౧౬వ తేదీని నేను మీకు పంపిన లేఖలో వ్యాఖ్యానము చేసియున్నాను. భారతీయులకు వశపరుప వీలులేని శాఖలను, వాటి విషయమున చేయవలసిన యేర్పాటులను గూర్చియు, యితర విషయములనుగూర్చియు లభించిన ఆధారములను బట్టి ఆలోచించుట రౌండుటేబిలుసభవారికి సంబంధించినది. జూలై ౯వ తేదీని నేను శాసనసభలో నుపన్యసించినపుడు తక్కిన అన్ని విషయములను గూర్చియును తెలిపియేయున్నాను.

(౧) రౌండుటేబిలుసభకు వెళ్లువా రందరును నూతనరాజ్యాంగ సమస్యకు సంబంధించిన అన్ని యంశములను నిర్నిరోధముగా పరీక్షింపవచ్చును. (౨) ఆసభలో నేర్పడిన సమాధానము నాధారముగా గైకొని బ్రిటిషుదొరతనమువా రటుతరువాత పార్లమెంటులో బిల్లు నుపపాదించెదరు. ఐచ్ఛికముగా మీరు పూనుకొనినకార్యమునకు కాంగ్రెసునాయకులు మీకిచ్చిన లేఖలోని విషయములు సహాయకములుగా లేవని మీరు గ్రహించియేయుందురు. మొత్తముమీద నాలేఖలోని ధోరణినిబట్టియు, దానిలోని వివరములనుబట్టియు, సత్యాగ్రహమువలన దేశమునకును, ఆర్థికస్థితికిని గొప్ప నష్టము కలిగినదని వా రంగీకరించుటకు వారు పూర్తిగా నిరాకరించుటను బట్టియు ఆలేఖలో వివరింపబడిన అంశములను గూర్చి సాకల్యముగా చర్చించుటవలన నెట్టి లాభమును కలుగదని నేను తలచుచున్నాను. ఆ లేఖలోని సూచనలపై నాధారపడి చర్చించుట కెట్టి అవకాశమును లేదని నేను స్పష్టముగా తెలుపక తప్పదు. మీరు మరల కాంగ్రెసునాయకులను చూడగోరినచో దీనిని స్పష్టముగా వారి కెరిగింపగోరెదను.

ఆగష్టు ౧౬ న మీరు వారికి వ్రాసినలేఖలోని కడపటివాక్యమునుగూర్చి అంతకు పూర్వము మనము సంభాషించినపుడు "సత్యాగ్రహము విరమింపబడినచో లాహోరు కుట్రకేసునకును, చిటగాంగునకును సంబంధించిన ఆర్డినెన్సులను తప్ప తక్కినఆర్డినెన్సులను అమలులో పెట్టవలసినఆవశ్యకత తొలగిపోవును. ఏలనగా సత్యాగ్రహమువలననే వాటి నమలులో పెట్టవలసిన ఆవశ్యకత కలిగినదిగాన సత్యాగ్రహము విరమింపబడగనే ఆయావశ్యకత తొలగును" అని తెలిపియుంటిని. సత్యాగ్రహఖైదీలను విడుదలచేయుటనుగూర్చి "సత్యాగ్రహము విరమింపబడగానే అన్ని రాష్ట్రములలోను ప్రభుత్వములవారు సత్యాగ్రహ ఖైదీలనందరిని, అనగా శిక్షననుభవించుచున్నట్టియు, విచారణలోనున్నట్టియు రాజకీయఖైదీలలో దౌర్జన్యనేరములకు సంబంధించినవారినితప్ప తక్కినవారినందరిని విడుదలచేసెదరని నేను వ్యాఖ్యానము చేయజాలను. ఈ ఖైదీలవిషయమున విడివిడిగా సానుభూతితో నాలోచింపవలెనని రాష్ట్రీయదొరతనముల నన్నిటిని కోరెదననుటకంటె

హెచ్చుగా నే నెట్టి వాగ్దానములను చేయజాలను" అని నేను మీతో స్పష్టముగానే తెలిపియున్నాను. సత్యాగ్రహము విరమింపబడినపిమ్మట రౌండుటేబిలుసభలో కాంగ్రెసువారి ప్రాతినిధ్యమువిషయమున వారిప్రతినిధులసంఖ్య మిక్కిలి హెచ్చుగానుండవలెనని కాంగ్రెసువారు కోరుటలేదని మీరునాకెరిగించితిరి. "కాంగ్రెసునకుతగినంతమంది ప్రతినిధు లుండునట్లు చూడవలెనని బ్రిటనుదొరతనమునకు సూచించుటలో నెట్టికష్టమును నుండదనియే నేను తలచెదను" అని నేను మీతో చెప్పితిని. కాంగ్రెసునాయకులలో ఆ సభకు వెళ్లదగినవారని వారు తలచెడు నాయకుల పేర్లపట్టికను వారునాకు పంపదగుననికూడ నేను తెలిపితిని. మీరు మీప్రయత్నములు సఫలమగునని ఆశించితిరి. అవి ముఖ్యముగా సఫలము కాదగినవేనని నేనుగూడ తలచుచున్నాను. అవి విఫలమగునెడల అందులకుగల కారణమును వాటి పూర్వోత్తరములను దేశీయులకందరికిని తెలుపుట ముఖ్యావసరము గాన వీటినన్నిటిని త్వరలోనే పత్రికలలో ప్రకటింపవలసియుండును. అందుకొరకు నాయొక్కయు, నాప్రభుత్వముయొక్కయు స్థితిని మీరును, జయకరుగారును స్పష్టముగా తెలుసుకొనవలెను.

(సం) ఇర్విను

వైసురీగలులాడ్జి, సిమ్లా, ౨౮ ఆగస్టు ౧౯౩౦.

## రాజప్రతినిధితో జరిగిన సంభాషణల సారాంశము

కాంగ్రెసునాయకులు మాకిచ్చిన లేఖకు సంబంధించిన కొన్ని ముఖ్యాంశములను గూర్చిగూడ మేము రాజప్రతినిధితో సంభాషించితిమి. వాటిఫలితమును గూడ కాంగ్రెసునాయకులకు తెలుపుటకు రాజప్రతినిధి అంగీకరించెను.

ఆగస్టు ౨౮ వ తేదీని మేము (సప్రూ జయకరుగార్లు) సిమ్లానుండి బయలుదేరి ౩౦-౩౧ తేదీలలో నయినీచెరసాలలో మోతీలాలు, జవహరలాలు, సయ్యదు మహమదు గార్లతో సంభాషించితిమి. రాజప్రతినిధి మాకు వ్రాసిన లేఖను వారికి చూపించితిమి. సంభాషణల వివరములనుగూడ తెలిపితిమి. ఆగస్టు ౧౫ వ తేదీని కాంగ్రెసునాయకులు మాకిచ్చినలేఖలో నున్నట్టియంశములలో ఆగస్టు ౨౮ న రాజప్రతినిధి మాకిచ్చినలేఖలో సమాధానములు లేనివాటినిగూర్చి మేము వారికి తెలిపితిమి. సమాధానము కుదురుటకు వీలగు వంశములనుగూడ నెరిగించితిమి. వాటి నీదిగువను చూడదగును.

(ఏ) రాజ్యాంగవిధానమునుగూర్చి ౨౮-౮-౩౦ న రాజప్రతినిధి మాకిచ్చిన లేఖలోని రెండవ పేరాలోని నాలుగు ముఖ్యాంశములలోను తెలుపబడెను.

(బి) ఇండియాదేశము సామ్రాజ్యమునుండి విడిపోగోరినప్పుడటుల విడిపోవుటకు హక్కు వుండవలెనని గాంధీగారు రౌండుటేబిలు సభలో నుపపాదింపగోరిన విషయ

మునుగూర్చి రౌండు టేబిలుసభలో నెట్టి నిర్బంధములు నుండవుగాన ఎవరైనను ఏ విష యమునైనను ఆసభలో నుపపాదింపవచ్చును. కాని ఆ విషయము నిప్పుడు గాంధిగా రుపపాదించుట యుచితముకాదని రాజప్రతినిధి తెలిపెను. గాంధిగారు దీనినిగూర్చి యిండియాదొరతనము నడిగినచో "దీనిని బహిరంగప్రశ్నగా మే మంగీకరింపము" అని రాజప్రతినిధి జవాబుచెప్పెను. అప్పటికినిగూడ గాంధిగారు దీనినిగూర్చి పట్టుపట్టినచో గాంధిగారివుద్దేశ మిటుల నున్నదని ఇండియాదొరతనమువారు ఇండియామంత్రికి తెలిపెదరు.

(సి) దేశీయఋణము మున్నగు విషయములనుగూర్చి స్వతంత్రమగు న్యాయ స్థానమున విచారణను జరుపుటకు యిండియాకు అధికారముండవలెనను విషయమును కాంగ్రెసుప్రతినిధులు సభలో నుపపాదించుటనుగూర్చి - ఋణములనన్నిటిని పూర్తిగా తిరస్కరించుటకు రాజప్రతినిధి అంగీకరింపజాలడు గాని యిండియాదేశపు ఆర్థిక బాధ్యతలనుగూర్చి విచారణ జరుగవలెనని సభలో నెవరైనను ఉపపాదింపవచ్చును.

(డి) ఉప్పుచట్టములోని షరతును అమలుజరుపగూడదను విషయమునుగూర్చి- (౧) సైమనుసంఘనివేదికలోని సూచన ఆమోదింపబడినచో ఉప్పు పన్ను రాష్ట్రీయ ప్రభుత్వములకు చెందును. (౨) దొరతనమున కిదివరకే ఆదాయము చాల తగ్గిపోయి నది కాన వుప్పుపన్నును దొరతనమువారు వదలుకొనజాలరు. శాసనసభలో ఉప్పుచట్ట మును రద్దుచేయవలెనను తీర్మాన మామోదింపబడునెడలను అందువలన కలిగెడినష్టమును పూర్తిచేయుటకు తగిన సూచనలు చేయబడునెడలను, రాజప్రతినిధియును యిండియా దొరతనమువారును దానినిగూర్చి యోచించెదరు. అది అమలులో నున్నంతకాలమును దానిని బహిరంగముగా తిరస్కరించువారిని శిక్షింపకుండుట రాజప్రతినిధికి సాధ్యము కాదు. శాంతిసద్భావములు మరల నేర్పడినపిమ్మట బీదవారికి ఆర్థికముగా సహాయ ముచేసి వారి దుస్థితిని తొలగించుటనుగూర్చి భారతనాయకులు రాజప్రతినిధితోను, ఇండియా దొరతనముతోను చర్చింపగోరినచో భారతనాయకుల సమావేశమును రాజ ప్రతినిధి యేర్పాటుచేయుట కంగీకరించెను.

(ఇ) పికెటింగు విషయమునుగూర్చి- పికెటింగుచేయువారు ప్రజలలో నెవరికైన యిబ్బందిని కలిగించినను దౌర్జన్యమొనరించుట భయపెట్టుట నిరోధించుట మున్నగుపను లను చేసినచో న్యాయశాస్త్రప్రకారము తగిన చర్యను జరుపుటకును స్థితిగతులనుబట్టి న్యాయాధికారమును బడయుటకును దొరతనమున కధికార ముండును. ఈషరతులకు లోబడి శాంతి నెలకొనినపిమ్మట పికెటింగు ఆర్డినెన్సు రద్దుచేయబడును.

(ఎఫ్) ఉద్యోగులను మరల పనిలో చేర్చుటనుగూర్చి–ఈవిషయము రాష్ట్రీయ దొరతనములకు సంబంధించినది. ప్రభుత్వమున కనుకూలురుగా నున్నవారిని దొరతనము వారు పనులలోనుండి తొలగింపరు. తదితరములైన ఖాళీలు కలిగినచో సత్యాగ్రహ సమయమున ఉద్రేకమువలన రాజీనామాల నిచ్చినవారిని, తొలగింపబడినవారికిని రాష్ట్రీయదొరతనములవారు మరల నుద్యోగముల నియ్యగలరు.

(జి) ప్రెసు ఆర్డినెన్సు క్రింద వశపరుచుకొనిన ప్రింటింగు ప్రెస్సులను మరల నిచ్చి వేసెదరు.

(హెచ్) జుల్మానాల సెక్యూరిటీల మొత్తములను మరల నిచ్చుటనుగూర్చి–రివిన్యూ బాకీల క్రింద విక్రయింపబడిన సొత్తులను యితరులు కొనియున్నచో వారిహక్కులనుగూర్చి ఆలోచింపవలసియుండును. జుర్మానాల మొత్తములను మరల నిచ్చువిషయమునగూడ చిక్కు లున్నవి. స్థానిక ప్రభుత్వములవారు పరిస్థితుల నన్నిటిని బాగుగా గమనించి న్యాయముగా వీలైనంత సహాయము చేసెదరనిమాత్రమే రాజప్రతినిధి తెలిపెను.

(ఐ) ఖైదీలవిడుదలనుగూర్చి–జూలై ౨౮ వ తేదీని రాజప్రతినిధి మాకు వ్రాసిన లేఖలోనే తెలుపబడెను." అని సప్రూ జయకరుగార్లు మోతీలాలు, జవహరలాలు, సయ్యదు మహమ్మదుగార్ల కెరిగించిరి.

## నెహ్రూగార్లు గాంధిగారికి వ్రాసిన కడపటినోటు

వ్యవధి తక్కువగానే యుండినను పైని సూచింపబడిన పద్ధతులపై నింకను రాయబారములను జరుపుట కవకాశము కలదని మేము నెహ్రూ, సయ్యదుమహమదు గార్లతో మాట్లాడిన రెండుకడవలలోను స్పష్టముగా తెలిపితిమి. ఈ పద్ధతులపైని సమాధానమున కంగీకరింపజాల మని వారు తెలిపి గాంధిగారి కిచ్చుటకు ౩౧ ని మా కొకనోటు వ్రాసియిచ్చిరి. దాని నీదిగువను చూడదగును.

"నిన్నను నేడును మేము మరల సప్రూ జయకరుగార్లతో దీర్ఘకాలము మాట్లాడితిమి. ఆగస్టు ౨౮ ని రాజప్రతినిధి వారికి వ్రాసినలేఖనకలును వారు మాకిచ్చిరి. ఆగస్టు ౧౫ న మనమందరమును కలిసి వ్రాసి సప్రూ జయకరుగార్ల కిచ్చిన లేఖలోని సూచనల ననుసరించి చర్చించుట అసంభవమని యీలేఖలో యిర్విను ప్రభువు స్పష్టముగా తెలిపెను. సప్రూ జయకరుగార్ల ప్రయత్నమున నెట్టిఫలితమును కలుగలేదని అతడు నిర్ణయించెను. మన మందరమును బాగుగా నాలోచించియే ఆలేఖను వ్రాసితిమి. వ్యక్తిపరముగా మనమెంతవరకువెళ్లగలిగినదియును దానిలోస్పష్టపరచితిమి."కొన్ని ముఖ్యమరతులు నెరవేరిననేగాని యేపరిష్కారమునుగూడ సంతృప్తిని కలిగింపజాలదు గాన వాటినిగూర్చి

బ్రిటను దొరతనమువారు సంతృప్తికరమగు ప్రకటనను చేయవలెను. వారట్టి ప్రకటనను చేసి దానితోపాటు మేము మాలేఖలో సూచించిన కొన్ని యేర్పాటులనుగూడ వారు యిండియాలో చేయునెడల సత్యాగ్రహమును విరమింపదగునని మేము భారత కాంగ్రెసుకార్యసంఘమునకు సూచించెద" మని మన మా లేఖలో వ్రాసితిమి.

ఈ ప్రారంభకృత్యము లన్నియును సంతృప్తికరముగా నెరవేరిననే గాని లండనులో జరుగనున్న రౌండుటేబిలుసభానిర్మాణము ఆసభలో కాంగ్రెసువారు పాల్గొనుట మున్నగు విషయములను నిర్ణయింప వీలులేదు. ఈసూచనలపై సాధారణపడి చర్చించుటకే వీలులేదని యిర్విన్ప్రభువు తనలేఖలో వ్రాసెను. ఇట్టిస్థితిలో వారికిని మనకును సమాధానంశ మేదియును కనబడుటలేదు. ఈలేఖలోనివిషయము లటుండ ఇండియాలో బ్రిటిషు గవర్నమెంటువారి ధోరణినిబట్టి గూడ శాంతిని నెలకొల్పవలెనను కోరిక వారికి లేదని స్పష్టమగుచున్నది. ఢిల్లీలో భారతకాంగ్రెసుకార్యసభ జరుగునని ప్రకటించగానే అది అక్రమసంఘమని దొరతనమువారు ప్రకటించుట, ఆసంఘసభ్యులలో చాలమందిని అరెస్టుచేయుట మున్నగుకార్యములనుబట్టి మరొకవిధముగా నాలోచించుటకు వీలులేదు. దొరతనమువారిచర్యలలో కొన్ని "అనాగరికములు" "క్రూరములు" అని మనము తలచుచున్నాము గాని అట్టి చర్యలను ఢిల్లీ అరెస్టులను యితర అరెస్టులను గూర్చి మన మేమియును చెప్పదలచుకొనలేదు. ఇట్టి చర్యలకు మనము స్వాగత మిచ్చెదము. శాంతిని నెలకొల్పగోరుటయును, శాంతిని నెలకొల్పగల సంఘముపైని దీకొనుటయును పరస్పరవిరుద్ధములని మనము తలంచుచున్నాము. మన మీవిషయమును వెల్లడించుట న్యాయమనియే నమ్ముచున్నాము. ఇండియాదేశమునందంతటను గూడ కార్యసంఘమును వారు నిషేధించిరి. కార్యసంఘసభ దేశమునందెచటనుగూడ జరుగకుండ చేయుటకు ప్రయత్నించిరి. వీటినిబట్టి చూచినచో జాతీయసంఘర్షణము వలన నెట్టిఫలితములు కలిగినను దానిని కొనసాగింపక తప్పదనియే తలపవలసియున్నది. శాంతి కట్టి అవకాశమునులేదు. భారతప్రజల ప్రతినిధులుగా మాటలాడుట కర్హతగల వారినందరిని బ్రిటిషుయిండియాయందంతటను చెరసాలలో నిదివరకే బంధించిరి. ఇటుపైనిగూడ బంధించెదరు.

ఇర్విన్ప్రభువు లేఖవలనను, బ్రిటిషు గవర్నమెంటువారు జరిపిన చర్యలవలనను సప్రూ జయకరుగార్ల ప్రయత్నములు విఫలమైనవని స్పష్టమగుచున్నది. ఈవుత్తరమును వారు మాకు తెలిపిన కొన్నిసమాధానములనుబట్టి చూచినచో నిదివరకు మనకు లభించిన స్థానమునుండి గూడ నివి మనలను వెనుకకు లాగుచున్నవని తెలియగలదు. మనభావమునకును, ఇర్విన్ప్రభువుభావమునకును విపరీతమగు భేద మున్నది గాన వివరములనుగూర్చి ఆలోచించుటఅనవసరము. ఈలేఖలోని కొన్నివిషయములను ముఖ్యముగా మీకుచూపిం

చగోరుచున్నాము. ఈ లేఖలోని మొదటిభాగములో శాసనసభలో ఇర్విన్‌ప్రభు వోస
గినఉపన్యాసములోని విషయములును, జూలై ౧౬ న ఇర్విన్‌ప్రభువు సప్రూ జయకరు
గార్లకు వ్రాసినలేఖలోని వాక్యములను మరల వివరింపబడెను.

ఈవాఙ్మూలము చాల అనిర్ధారణగా నున్నదిగాన దానివిలువను గ్రహించుట కెట్టి
అవకాశమును లేదు. మనమందరమును కలసి వ్రాసినలేఖలో మన మీ విషయమును
తెలిపియేయున్నాము. ఈవాఙ్మూలమున కేయర్థమునైనను చెప్పవచ్చును. లేదా అది నిరర్థ
కముకూడ కావచ్చును. భారతప్రజలకు బాధ్యముగు సంపూర్ణ జాతీయప్రభుత్వ మేర్ప
డుట, దేశరక్షక సేనపైనను, ఆర్థికములపైనను అధికార ముండుట, వీటిని భారతీయులం
వెంటనే బడయగోరుచున్నారని గుర్తింపవలెనని సమష్టి లేఖలో మనము స్పష్టముగా
వ్రాసితిమి. మామూలుగా రక్షణ లనుబడువాటిని, ఆయప్యమునుగూర్చి మన మాలో
చింపనేలేదు. అధి_రమును వశపరుచునపుడు యిట్టి సర్దుబాటులు విధిగా జరుగ
వలసియేయుండును. భారతీయులచే నియమింపబడిన ప్రతినిధులు వీటిని నిర్ణయింపవలె
నని మనము తెలిపియున్నాము.

ఇండియా దేశము సామ్రాజ్యమునుండి విడిపోవుట, ప్రభుత్వబురుము మున్నగు
వాటిని గూర్చి స్వతంత్రస్థానమున విచారణజరుగుట మున్నగు సంశయములనుగూర్చి
రౌండుటేబిలుసభలో నుపపాదించుట కెట్టి అభ్యంతరమును లేదని మాత్రమే ఇర్విన్
ప్రభువు తెలిపెను. ఇది క్రొత్తసంగతి కాదు.

ఇండియా దేశము సామ్రాజ్యమునుండి విడిపోవుటనుగూర్చి గాంధీజీ ఇండియా
దొరతనమును నిర్ధారణగా నడిగినపో "దీనిని బహిరంగప్రశ్నగా మేము అంగీకరింప
జాలము." అని యిర్విన్‌ప్రభువు తెలుపునని కాంతిమూర్తులు మా కెరిగించిరి. ఈ విష
యములనుగూర్చి మనము రౌండుటేబిలుసభలో నుపపాదించెదమని వారు యిండియా
మంత్రికి తెలుపుటతప్ప మరేమియును చేయజాలరని రాయబారులు తెలిపిరి.

ఆర్థికవ్యాపారములలో వ్యక్తిపరములగు కొన్నిటినిగూర్చి విచారణ చేయుటకు
మాత్రమే యిర్విన్‌ప్రభు వంగీకరించును అని వారు తెలిపిరి. విచారణ అటులనే జరిగినను
మనము సూచించినట్లు దాని వ్యాప్తి ఇండియాలో బ్రిటిషువారి హక్కుల కన్ని
టికిని దేశీయబురుః మనబడుదానికిని గూడ వర్తింపవలెను. ఈ రెండుప్రశ్నలును
ముఖ్యతమములు గాన ముందుగా వీటినిగూర్చి ఒడంబడిక జరుగు టవసరమని సమష్టి
లేఖలో మనము నిర్ధారణగా తెలిపియున్నాము.

ఖయిదీలవిడుదలనుగూర్చి రాజప్రతినిధిసూచన చాలసంకుచితముగను, అసం
తృప్తికరముగను ఉన్నది. అహింసాత్మకమగు సత్యాగ్రహమున పాల్గొనినవారి నంద

గని విడుదలచేసెదరనిగూడ తానువాగ్దానము చేయజాలననియును, యిది రాష్ట్రీయప్రభుత్వములకు వదలెదననియును ఇర్విన్‌ప్రభువు తెలిపెను. ఇట్టివిషయములో స్థానికప్రభుత్వములును, స్థానికాధికారులును సానుభూతిని ఔదార్యమును చూపించెదరని మనకునమ్మకములేదు. అహింసానిరతులగు తక్కిన ఖైదీల విడుదలనుగూర్చి యిర్విన్‌ప్రభువులేఖలో నేమియును వ్రాయబడలేదు. సత్యాగ్రహము ప్రారంభము కాకపూర్వమే కాంగ్రెసువారిలో మిక్కిలి హెచ్చుమందికి కారాగృహవాసశిక్ష విధింపబడెను. మీరటు కేసుఖైదీలు యిప్పటికి ౧౨ నెలలనుండి చెరసాలలో నున్నారు. ఆకేసు విచారణ యింకను పూర్తికాలేదు. వీరినందరిని వదలివేయవలెనని సమాప్తిలేఖలో మనము స్పష్టముగా వ్రాసియున్నాము.

బెంగాలు లాహోరుకేసుల ఆర్డినెన్సులను రద్దుచేయ వీలులేదని యిర్విన్ ప్రభువు సూచించెను. వాటిని రద్దుచేయకపోవుట కెట్టికారణమును లేదు. రాజకీయఖైదీలలో దౌర్జన్య మొనరించినందులకు శిక్షింపబడినవారిని విడుదలచేయుటకు మన కెట్టిఅభ్యంతరమునులేదు. వారినిగూడ విడుదలచేసిన నో మనము మరింత సంతసించెదముగాని సత్యాగ్రహ ఉద్యమము కేవలము అహింసాత్మకమగుటచే దౌర్జన్య మొనరించినందులకు శిక్షింపబడినవారి విడుదలనుగూర్చి మన మేమియును వ్రాసియుండలేదు. దౌర్జన్యమున పాల్గొనిన స్వదేశీయులకేసులవిచారణ ఆర్డినెన్సుక్రింద నేర్పడిన ఎక్‌స్ట్రార్డినరీకోర్టులలో జరిగినచో వారు అపీలుచేయుటకు వీలుండదు. వారికి మామూలుహక్కులుండవు గాన మామూలుకోర్టులలోనే విచారణజరుగవలెనని కనీసపక్షముగా మనము నొక్కి చెప్పెదము.

బహిరంగన్యాయస్థానమునందు విచారణయనబడు చర్య జరిగినపుడు క్రూరముగా కొట్టుట మున్నగువిచిత్రచర్యలు జరిగినవి. కావున మామూలుకోర్టులలోనే విచారణ జరుగవలెను. ముద్దాయీల నిటుల బాధించుటచే వారిలో కొందరు అసమ్మతిని తెలుపుటకు చాలకాలమునుండి నిరాహారదీక్షను బూనియున్నా రనియును, వా రిపుడు మృత్యుముఖమున బడనున్నా రనియును తెలిసినది. ఇపుడు బెంగాలు ఆర్డినెన్సును రద్దుపరచి బెంగాలుశాసనసభలో నామోదింపబడిన చట్టము నమలులో పెట్టిరని తెలిసినది. ఈ ఆర్డినెన్సును దానినిగూర్చి చేయబడిన చట్టమునుగూడ మేము అంగీకరింపజాలము. ఇపుడున్న బెంగాలుశాసనసభ ప్రజాప్రతినిధిసభ కాదు. కాన ఆసభలో నామోదింపబడిన చట్టమున కెట్టివిలువయును లేదు.

ఇటుపైని సీమగుడ్డలదుకాణములకద్దను, సారాయిదుకాణములవద్దను పికెటింగు చేయుటనుగూర్చి పికెటింగు ఆర్డినెన్సును రద్దుపరచుటకు ఇర్విన్ ప్రభువు అంగీకరించెనని తెలిపిరి గాని అవసరమని తోచినపుడు పికెటింగును నిరోధించుటకు మరల

న్యాయాధికారమును గైకొందుననియును సిమ్లాలో మరల నా ఆర్డినెన్సును అమలులో పెట్టుటమున్నగు యేర్పాటులను చేసెద ననియును యిర్విను ప్రభువు మన కెరిగించెను. ఉప్పుచట్టము మున్నగువాటిని గూర్చిన ప్రత్యుత్తరముకూడ చాల అసంతృప్తికరముగా నే యున్నది. ఉప్పువిషయమున మీరు ప్రవీణులని అందరును అంగీకరించినందున దానినిగూర్చి మేము మిచట విశదీకరించుటనవసరము. వీటినిగూర్చి మన మిదివరకు తెలిపినభావములను మార్చుకొనుట కెట్టికారణమును కనబడదు.

మన సమష్టిలేఖలో వివరింపబడిన అన్ని ముఖ్యసమస్యలకును మరి పెక్కు యితరవిషయములకునుగూడ యిర్విను ప్రభువు అంగీకరించలేదు. ఇర్విను ప్రభువు దృక్పథమునకును, మనదృక్పథమునకును అపారముగు భేద మున్నది. ఈనోటును మీరు శ్రీమతి సరోజనీదేవి, వల్లభాయిపటేలు, జయరాందాసుదౌలతరాంగార్లకు చూపించి వారితో నాలోచించి సప్రూజయకరుగార్లకు ప్రత్యుత్తరమును వ్రాసియిచ్చెదరని తలచెదము. వీటినన్నిటిని ప్రజలకు వెంటనే తెలియజేయవలెనుగాన నిటుపై నెట్టి ఆలస్యమును జరుగగూడదని మేము తలచుచున్నాము. వీటిని ప్రకటించుటయేగాక ప్రస్తుతము భారతకాంగ్రెసుకు అధ్యక్షుడుగానున్న ఖాలికఉజ్జమానుగారికి వీటినకళ్లనన్నిటిని పంపవలెనని మేము సప్రూజయకరుగార్లను కోరుచున్నాము. ఇపుడు పనిచేయుచున్న భారతకాంగ్రెసు కార్యసంఘమునకు వెంటనే తెలుపకుండ మన మేపనిని చేయగూడదని మేము తలచుచున్నాము."

(సం) మోతీలాలు, సయ్యదుమహమదు, జవహరలాలు.
నయినీ సెంట్రలు ప్రిజను, ౩౧ ఆగస్టు ౧౯౩౦

## నాయకుల సమష్టి ప్రత్యుత్తరము

౧౯౩౦ సెప్టెంబరు ౬-౭-౮ తేదీలలో ఎరవాడ చెరసాలలో మేము మరల గాంధీజీ మున్నగు కాంగ్రెసునాయకులతో సంభాషించితిమి. నెహ్రూ, సయ్యదు మహమదుగార్లు నయినీచెరసాలలో మా కిచ్చినలేఖను వారికిచ్చితిమి. వారితో సాకల్యముగా చర్చించితిమి. అటుపిమ్మట వారందరును కలసి వ్రాసి మా కిచ్చినలేఖ నీ దిగువను చూడదగును.

"ప్రియమిత్రులారా!—౨౮-౮-౩౦ న రాజప్రతినిధి మీకు వ్రాసినలేఖలోని అన్ని విషయములను మేము చాల శ్రద్ధగా పరిశీలించితిమి. ఆ లేఖలో లేని విషయములనుగూర్చి మీరు రాజప్రతినిధి నడిగి తెలుసుకొనిన సంగతులను మీరు దయతో మా కెరిగించితిరి. మోతీలాలు, సయ్యదుమహమదు, జవహరలాలుగార్లు మీద్వారా మాకు

పంపిన నోటులోని అంశములనుగూడ మేము సాకల్యముగా పరీక్షించితిమి. వారుముగ్గురును తమ నిశ్చితాభిప్రాయములను నోటులో వివరించిరి. రెండు రాత్రులలో వీటి నన్నిటినిగూర్చియు అధికమగు నాతురతతో మే మాలోచించితిమి. వీటివలన కలిగిన అన్ని అంశములనుగూర్చియును మీతో పూర్తిగను స్వేచ్ఛగను చర్చించితిమి. ప్రస్తుతము మాకు బాహ్యప్రపంచముతో నెట్టిసంబంధమును లేదు గాన భారతకాంగ్రెసు పక్షమున మేము మాటలాడగలుగునంతవరకు ఆ సంఘమునకును, దొరతనమునకును సమాధానాంశము లేవియును మాకు కనబడలే దని మేమందరమును కలసి నిర్ధారణ చేసితిమి. ఆ విషయమును మీకు తెలిపియున్నాము. నయినీచెరసాలలోనుండి ముగ్గురు నాయకులును కలసి వ్రాసిపంపిన నోటులో వారు తెలిపిన అభిప్రాయములతో మేము పూర్తిగా నేకీభవించుచున్నాము. గత రెండునెలలలోను మీరు అమూల్యమగు మీ కాలమును వ్యయపరచి చాల ప్రయాసకుగూడ లోనై దేశాభిమానముతో శాంతికొరకై సంధి రాయబారములను జరిపితిరి. మేము మా అభిప్రాయమును మా మాటలలో మీకు తెలుపవలెనని మోతీలాలు ప్రభృతులు సూచించిరి కాన శాంతి నెలకొనుటకును, సంధి యేర్పడుటకును అడ్డుగానున్న ప్రధానములగు చిక్కులనుగూర్చి మిక్కిలి సంగ్రహముగా వివరించెదము.

30-౬-30 ని మోతీలాలుగారు స్లోకోంబుగారితో సంభాషించిరి. ౨౫-౬-30 ని స్లోకోంబుగారు మోతీలాలుగారికి పంపిన స్టేటుమెంటును మోతీలాలుగా రామోదించిరి. ఆసంభాషణలోని షరతులను సంతృప్తిపరచుటకే ౧౬-౭-30 న రాజప్రతినిధి మీకు లేఖను వ్రాసె నని మేము తలచితిమి. ఆరీతిగా చూచినచో ఆషరతులకు యెట్టిసంతృప్తియును కలుగలేదని ౧౬-౭-30 తేదీగల రాజప్రతినిధిలేఖలోని భావమువలన మేము గ్రహింపగలిగితిమి. సంభాషణలోను స్టేటుమెంటులోను ప్రస్తుతమునకు సంబంధించిన భాగముల నిచట నుల్లేఖించితిమి. "రౌండుటేబిలుసభలో చర్చింపబడవలసిన విషయములను మీరు నిర్ధారణగా తెలుపకుండ మేము లండనువెళ్లి మాకుఅధినివేశస్వపరిపాలనమునియ్యవలెనని కోరుటకు గలకారణములను తెలుపవలెనని మీ రనునెడల నేనందుల కంగీకరింపను. భారతదేశమునకు స్వాతంత్ర్యము నిచ్చునట్టి రాజ్యాంగవిధాన మాసభలో సిద్ధపరుపబడును. ఇండియా యొక్క ప్రత్యేకపరిస్థితులను అవశ్యకతలను ఇదివరకు యిండియాలో జరిగిన రాజకీయాందోళనమును బట్టి దానిలో పరస్పర సంబంధము, కొన్నికు సవరణలు చేయబడును" అని మీరు స్పష్టముగా తెలిపినచో రౌండుటేబిలుసభలో పాల్గొనవలె నను నాహ్వానము నంగీకరింపవలెనని వ్యక్తిపరముగా నేను కాంగ్రెసువారికి సూచించెదను. మా గృహమున మేమే యజమానులముగా నుండవలెను. ఇండియాలోని బ్రిటిషుపరిపాల

కులం రాజ్యాధికారమును బాధ్యతగల భారతప్రభుత్వమునకు వశపరచునట్టి కాలములో పహేతుకములగు షరతులను మే మంగీకరించెదము. భారతజాతీయప్రతినిధులు బ్రిటిషు జాతీయప్రతినిధులతో సమానస్థాయీగా వీటినిగూర్చి చర్చించుటకే రౌండుటేబిలుసభ జరుపవలెను." అని సంభాషణలో మోతీలాలుగారు స్లోకోంబుగారితో తెలిపిరి.

"ఇండియాకు సంపూర్ణబాధ్యతాయుత ప్రభుత్వము నియ్యవలె ననునంశమును బలపరచెదమని రహస్యముగా దొరతనమువారు వాగ్దానముచేసెదరు. ఇండియా దేశము యొక్క ప్రత్యేకపరిస్థితులు అవశ్యకతలు బ్రిటనుకును యిండియాకును చిరకాలము నుండి యున్న సంబంధము వీటినిబట్టి రౌండుటేబిలుసభలో నిర్ణయింపబడినరీతిని పరస్పరము సర్దుబాటులును మార్పుకు సంబంధించిన షరతులును జరుగవలసియుండును." అని స్లోకోంబుగారి స్టేటుమెంటులోనున్నది.

"ఏ శాఖలను ప్రస్తుతము భారతీయులకు వశపరుప వీలులేదో వాటివిషయమున ప్రత్యేక యేర్పాటులను చేయుపద్ధతిని వీలైనంత హెచ్చుగా పరిపాలనాధికారమును భారతీయులు పడయగలుగుటకు శక్తివంచనలేకుండ సహాయముచేయవలెనని నేనును, యిండియాదొరతనమునుగూడ ముఖ్యముగా కోరుచున్నాము. బ్రిటనుదొరతనమువారు గూడ నటులే కోరుచున్నారను విషయమున నాకెట్టిసంశయమునులేదు. ఆశాఖలేవి, వాటినిగూర్చి చేయవలసినయేర్పాటులెట్టివి? అను విషయములను రౌండుటేబిలుసభ వారే పరిష్కరించెదరు. రెండుదేశములవారికిని పరస్పరవిశ్వాసము కలుగునెడల సమాధానము కుదురుట అసాధ్యము కాదనియే నేను నమ్ముచున్నాను" అని యీఅంశమును గూర్చి రాజప్రతినిధి వ్రాసెను.

మోతీలాలుగారి భావమునకును రాజప్రతినిధిభావమునకును చాలభేద మున్నది. "రౌండుటేబిలుసభలో పాల్గొనుటవలన స్వాతంత్ర్యముగల భారతదేశ మేర్పడును. అపుడు పరిపాలనావిధాన మిపుడున్నట్లుండదు." అని మోతీలాలుగారు భావించిరి. "కొన్ని శాఖలను ప్రస్తుతము భారతీయులకు వశపరుప వీలులేనుగాన వాటి విషయమున తగిన యేర్పాటులను చేయుపద్ధతిని భారతపరిపాలనమున వీలైనంత అధికమగు భాగమును భారతీయులు పడయగలుగునట్లు వారికి సహాయము చేయవలెనని నేనును నా దొరతనమును బ్రిటీషుమంత్రివర్గమును మనఃపూర్వకముగాకోరుచున్నాము"అనిమాత్రమే రాజప్రతినిధిలేఖలో నున్నది. లాంస్డౌను సంస్కరణము లను పేరుతో యిదివరకే తెలిసియున్న సంస్కరణములతో ప్రారంభమైన సంస్కరణముల పద్ధతిని మరికొన్నిటిని గూడ భారతీయులు పడయుటకు సహాయము చేసెదమని మాత్రమే రాజప్రతినిధి సూచించెను. మేమును మోతీలాలు, జవహరలాలు, సయ్యదు మహమ్మదు

గార్లను కలసి వ్రాసి ౧౫-౮-౩౦ న మీ కిచ్చిన లేఖలో మేము చేసిన వ్యాఖ్యానము సరియైనదే యని మేము తలచుచుండుటచే కాంగ్రెసుకు ఏవి సంతృప్తికరములు కావని మేము తలచితిమో వాటిని మేము వివరించితిమి. తన మొదటి లేఖలో రాజప్రతినిధి తెలిపిన భావములనే యిపుడు మీరు తెచ్చినలేఖలో నతడు మరల నుల్లేఖించుటయే గాక నతడు మా లేఖను తృణీకారభావముతో తిరస్కరించెనని చెప్పవలసి వచ్చినందులకు మేము చింతించుచున్నాము. మా లేఖలోని సూచనలపై నాధారపడి చర్చలను జరుపుటకు మాత్రమేగాక వాటిని గూర్చి ఆలోచించుటకు సయితము అవి అర్హములు కావని రాజప్రతినిధి వ్రాసెను.

సామ్రాజ్యమునుండి విడిపోవుటకు యిండియాకు హక్కు వుండవలెనని గాంధిగారు నిర్ధారణగా ఇండియా దొరతనమునడిగినచో దానిని బహిరంగప్రశ్నగా దొరతనమువారు భావింపరని రాజప్రతినిధి తెలుపునను విషయమునుగూడ మీరు మా కెరిగించితిరి. ఇండియాకు లభింపవలసిన రాజ్యాంగవిధానములో నిది ముఖ్యతమము. దీనిని గూర్చి చర్చ యనవసరమని మేము భావించుచున్నాము. ఇపుడు ఇండియాకు సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వము లేక సంపూర్ణ స్వపరిపాలనము అను పేరో లేక మరియొక పేరో గల స్వరాజ్యము లభించు నెడల పరస్పర సంబంధమును తొలగించుకొనుటకు యిండియాకు బ్రిటనుకునుగూడ స్వాతంత్ర్య ముండవలెను. ఇటుపైని ఈ సామ్రాజ్యములో ఇండియా యొక భాగముగా నుండదు. కామనువెల్తులోయిండియాసమానగౌరవముగల స్వతంత్రభాగస్వామిగా నుండవలెనని యట్టిసంబంధ మవసరమని భారతీయులునిర్ణయించవలెను. లేనిచో నది సాగదు. మోతీలాలుస్లోకోంబు గార్లకు జరిగినసంభాషణలో నీయంశముస్పష్టముగా తెలుపబడెనని మీరు గ్రహించియేయుందురు. ఇది సాధ్యము కాదని బ్రిటిషు దొరతనమును బ్రిటిషువారును యెంతకాలమువరకు తలచుచుందురో అంతకాలమును కాంగ్రెసువారు స్వాతంత్ర్యసంరంభమును సాగించుచునేయుండవలెనని మేము తలచుచున్నాము.

ఉప్పుపన్ను చాల సామాన్యమైనవిషయమే యైనను రాజప్రతినిధి దీనికిగూడ నంగీకరింపకపోవుటవలన దొరతనమువారిచిత్తవృత్తి మరింత స్పష్టమగుచున్నది. పన్నెండు నెలలను సిమ్లామెట్టలపై నివసించుచున్న భారతదేశపరిపాలకులు సమదేశమున నివసించుచు నిరాహారులుగానున్న కోట్లకొలది ప్రజల కష్టములను గ్రహింపజాలరు అను విషయము మిక్కిలి స్పష్టముగానే తెలియుచున్నది. కాని ఈనిర్భాగ్యులు అహర్నిశలు కష్టపడి పనిచేయుచుండుటవలననే సిమ్లాలోనుండి బ్రిటిషువారు పరిపాలనమును సాగింపగలుగుచున్నారనుట కెట్టిసంశయమును లేదు.

నిరుపేదలగు ప్రజలకు ఉప్పు ముఖ్యావసరము. మనుష్యులకు గాలియును నీరును ఎటుల ముఖ్యములో, ఉప్పుకూడ నటులే ముఖ్యము. ఈమూడును దైవదత్తములు. అట్టి ఉప్పుపన్నును నిలుపబెట్టుటకు గత ౧౧ నెలలలోను చాలమంది నిరపరాధులగు ప్రజల తలలు పగులగొట్టబడి రక్తపాతము కలుగజేయబడినది. ఈపన్ను మిక్కిలి దుర్నీతికర మనువిషయము నిప్పటికిని దొరతనమువారు గ్రహింపజాలనిచో భారతనాయకుల సమావేశమును రాజప్రతినిధి యేర్పరచినను గూడ దొరతనమువారు దీనిని గ్రహింపజాలరు.

ఉప్పుపన్ను రద్దుచేయగోరువారు దానికి సరియైన మరియొక ఆదాయపద్ధతిని చూపవలెననుట మరింత అవమానకరము. ఇపుడు ప్రజలను పీల్చిపిప్పిచేయుచున్న యీ ప్రభుత్వవిధానమును చేతనైనచో సుస్థిరముగాను శాశ్వతముగాను చేయవలెననియే దొరతనమువారు కోరుచున్నారనుటకిది సూచకమైయున్నది. ప్రపంచమునందన్ని దేశములలోనుగూడ ప్రజలచే తిరస్కరింపబడిన చట్టములను యితరకారణములవలన దొరతనమువారు రద్దుచేయజాలనపుడు వాటిని ప్రజలు ఉల్లంఘించినను ఉపేక్షించుచునే యుందురు. ఇది మామూలుగా జరుగుచునే యుండును. తక్కిన విషయమును గూర్చి మేము తెలిపిన ప్రజాభిప్రాయమునుగూడ రాజప్రతినిధి అంగీకరింప జాలకపోయెను. కావున అనేక ముఖ్యవిషయములలో బ్రిటిషు గవర్నమెంటునకును కాంగ్రెసునకును మధ్య అనుల్లంఘనీయమగు నఖాత మేర్పడినదని మేము చూపించగలిగితిమనియే తలచుచున్నాము.

మీరాయబారములు విఫలమైనందుకు మీరు ఆశాభంగమును చెందనవసరము లేదు. స్వాతంత్ర్యమునిమిత్తము కాంగ్రెసువారు ప్రబలసంఘర్షణమును జరుపుచున్నారు. కాంగ్రెసువారిందుల కవలంబించిన అహింసాసాధనము ప్రపంచమునకును పాలకులకునుగూడ క్రొత్తదగుటచే మరికొంతకాలమైనగాని వారు దానిని గ్రహింపజాలరు. కొన్ని నెలలనుండిమాత్రమే దేశీయులు కష్టముల ననుభవించుచున్నారు గాన దీనిమహిమను దొరతనమువారు గ్రహింపజాలక పోవుటలో వింతయేమియును లేదు. ఎవరు ఎట్టిలాభమును న్యాయముగా బడసినను కాంగ్రెసువారు దాని కెట్టినష్టమును కలిగింపరు. ఆంగ్లేయులతో కాంగ్రెసువారి కెట్టివివాదమును లేదు. దుస్సహమగు బ్రిటిషువారి ఆక్రమణముపట్ల తమ ఆగ్రహమును వెల్లడించుటలో తమకు గల నైతికశక్తినంతను వినియోగించెదరు. ప్రజలు కడవరకును అహింసానిరతులుగా నుండునెడల అచిరకాలములోనే ప్రజల అభీష్టము నెరవేరగలదను నమ్మకము మాకు గలదు. అధికారపదవులలో నున్నవారు సత్యాగ్రహమునుగురించి తరుచుగా చాల అవమానకరమును ఆగ్రహకరమునగు భాష నుపయోగించుచున్నను కూడ మే మిటుల చెప్పుచున్నాము.

దేశమునందు మరల శాంతిని కలిగించుటకు మీరు మిక్కిలి అధికముగ శ్రమకు పాల్పడితిరి. కాంగ్రెసు సంఘముల యాజమాన్యమును వహించిన వారితో నిటుపైని రాయబారములను జరుపుటకు తగినకాల మింకను రాలేదని మేము సూచించుచున్నాము. మేము ఖైదీల మగుటచే మాకు అనుపపత్తు లుండుట సహజము. మా అభిప్రాయములు మేము వినినవార్తలపైననే ఆధారపడియుండును గాన వాటిలో పొరపాటు లుండుట కవకాశమున్నది. కాంగ్రెసుసంఘముల కిపుడు నాయకులుగా నున్నవారు మాలో నెవరినైన చూడగోరవచ్చును. దొరతనమువారు మాకలెనే మనఃపూర్వకముగా శాంతిని కోరుచెడల కాంగ్రెసునాయకులు మమ్ములను చూచుట కెట్టినిరోధము నుంచగూడదు.

(సం) ఎం. కే. గాంధి, సరోజనీనాయుడు, వల్లభాయిపటేలు,

జయరాందాసుదౌలతరాం.

ఎరవాడ సెంట్రలు ప్రిజను, ౫-౯-౧౯౩౦.

ఈరీతిగా నాయకులు వ్రాసినలేఖను మాకిచ్చిరి. మేమురాయబారుల మగుటచే మాద్వారా జరిగిన ఉత్తరప్రత్యుత్తరములను సంభాషణలనుగూర్చి మేమెట్టివ్యాఖ్యానము చేయకుండ వీటినన్నిటిని ప్రజలు తెలుసుకొను నిమిత్తము అన్నిలేఖలను అన్ని ముఖ్యవిషయములను పత్రికలలో ప్రకటించుట మాముఖ్యకర్తవ్యమైయున్నది. వీటిని ప్రకటించుటకు రాజప్రతినిధియును కాంగ్రెసు నాయకులును గూడ మా కనుమతి నిచ్చిరి.

(సం) టి. బి. సప్రూ, ఎం. ఆర్. జయకరు.

ఎరవాడ, ౫—౮—౧౯౩౦.

# 5. భారత మిల్లుల వాగ్దానము

—

మేం యీ క్రిందివిధముగా వాగ్దానము చేయుచున్నాము:

౧. ప్రజల జాతీయ ఆదర్శముపట్ల మాకు సంపూర్ణ సానుభూతి గలదు.

౨. కంపెనీవాటాదారుల పెట్టుబడిలో నూటికి ౭౫ తక్కువ కాకుండా భారతీయులధన ముండును. (కాంగ్రెసు అధ్యక్షుడు నియమించిన ప్రత్యేకసంఘము యీ విషయమై కొన్ని కంపెనీలకు ప్రత్యేక అవకాశ మొసగవచ్చును.)

3. కంపెనీ గౌరవనీయ డైరెక్టర్లు భారతీయులుందురు. వీరు గాక కంపెనీ కార్యనిర్వహణమును సాగించు డైరెక్టర్లలో నూటికి ౬౬ మందికి తక్కువ కాకుండా భారతీయు లుందురు. (కంపెనీ గౌరవనీయ డైరెక్టర్లు భారతీయేతరు లున్నచో బోర్డులో భారతడైరెక్టర్లు అధికసంఖ్యాకు లుందురు.)

౪. మేనేజింగు ఏజంటు ఫరంలో విదేశ అభిమాన ముండదు.

౫. ఏజంటు ఫరంలోని భాగస్థులు గాని, ఫరంగాని, తదితర విదేశ ఇన్‌షూరెన్సు కంపెనీపట్ల అభిమానము కలిగియుండరు. విదేశనూలు, లేక విదేశ గుడ్డలు దిగుమతి పట్లగూడ అభిమానము కలిగి యుండరు.

౬. మిల్లు గుడ్డలకు, ఖద్దరు పోటీలేకుండ చేయుట, మా మంచికే గుడ్డ నాణ్యమును తగ్గకుండా చేసి, సరసమైన ధరలకే యిచ్చుట మున్నగు పనులవలన స్వదేశీ ప్రచారమునకు తోడ్పడుదురు.

౭. మిల్లు యజమానులు, కార్యనిర్వహణమును సాగించువారు పైకి లోపల గూడ భారతీయులపట్ల అభిమానము కలిగి భారతీయులకు మేలు చేయుచుందురు.

పైని చేసిన వాగ్దానము ననుసరించి మే మీక్రింది విధముగా మెలంగుదుము.

౧. మిల్లుల కార్య నిర్వహణముతో సంబంధము గలవా రెవరయిన జాతీయ ఉద్యమమునకు ప్రతికూల ప్రచారము సాగింపరు. భారత దేశమున బ్రిటిషు ప్రభుత్వము వారి తరఫున గాని, వారి ప్రేరేపణచే గాని జాతీయ ఉద్యమమునకు ప్రతికూలముగా సాగించు ప్రచారమున పాల్గొనరు. అట్టి ప్రతికూలప్రచారమును తమంతట తాము సాగింపరు.

౨. కొన్ని ప్రత్యేక కారణము లుండిన తప్ప సర్వసామాన్యముగా భారతీయు లనే కంపెనీలలో ఉద్యోగులనుగా నియమించెదరు.

౩. మా కంపెనీ ఇన్‌షూరెన్సు వ్యాపారమును సాధ్యమైనంత త్వరలో భారత ఇన్‌షూరెన్సు కంపెనీలద్వారా సాగించెదము.

౪. మా బ్యాంకు, నౌకావ్యాపారమును సాధ్యమైనంతవరకు భారత బ్యాంకులు, భారత నౌకాకంపెనీలద్వారా సాగించెదము.

౫. మేము ఇప్పటినుండి వీలైనంతవరకు భారతీయులనే మా ఆడిటర్లు, ప్లీడర్లు, నౌకల ఏజంట్లు, సరకు కొనుటకు, అమ్ముటకు బ్రోకర్లు, కంట్రాక్టర్లు, సరకు సప్లయిదారులుగా నియమించెదము.

౬. స్టోరు సరకంతా వీలైనంతవరకు భారతదేశమున తయారైనదే కొనెదము. స్వదేశీ సరకు ఉపయోగించుటకు వీలు లేనప్పుడు మాత్రమే విదేశ సరకును కొందుము. (తప్పనిసరిగా కొనవలసిన విదేశసరకు జాబితాను ఇందు చేర్చితిమి.)

౭. "బాయికాట్" జాబితాలో చేర్చిన మిల్లులలో తయారగు నూలు దారము, విదేశనూలు, విదేశపట్టు, కృత్రిమపట్టును మేము వాడము.

౮. "బాయికాట్" జాబితాలో చేర్చిన మిల్లులలో తయారగు విదేశ నూలును, గుడ్డకు అద్దకమునకుగాని, చలువచేయుటకు గాని తీసుకొనము.

౯. మామిల్లులలో తయారగు ప్రతితానుకు రెండుచివరలా మా కంపెనీ ముద్రలను వేయుదుము. సరియైన ముద్రలు వేయకుండా గుడ్డను బైటికి పంపము.

౧౦. మా గుడ్డలకు ఖాదీ పేరున ముద్రలు వేయము.

౧౧. ఈ క్రింద నుదాహరించిన రకము గుడ్డను తయారు చేయము.

౧౮ నంబరు నూలుకంటె ముతకనూలుతో చలువచేసినవి, లేక చేయనివి గుడ్డలు తయారుచేయము.

డ్రిల్లు, ట్విల్లు, రంగుదుప్పట్లు మున్నగు ముతకరకములను తయారు చేయుటకు మిల్లులకు స్వాతంత్ర్య ముండును.

౧౨. వీలైనంతవరకు క్రయ విక్రయములను భారత కంపెనీలతోనే చేయుదుము.

౧౩. మా మిల్లుల కార్యనిర్వహణముతో సంబంధముగలవా రందరును స్వదేశీ గుడ్డనే ధరించెదరు.

కంపెనీపేరు...............

చిరునామా...............

ఏజంటు, లేక యజమానిపేరు.

## భారతీయేతర మిల్లుల వాగ్దానము

మేము మీ క్రిందివిధముగా వాగ్దానము చేయుచున్నాము.

౧. ప్రజల జాతీయ ఆదర్శముల పట్ల మాకు సంపూర్ణసానుభూతి గలదు.

౨. కంపెనీ వాటాదారుల పెట్టుబడిధనములో నూటికి ౫౧ వంతులకు పైగా భారతీయులధన ముండును. (కాంగ్రెసు అధ్యక్షుడు నియమించిన ప్రత్యేకసంఘము యీవిషయమై కొన్ని కంపెనీలకు ప్రత్యేక అవకాశ మొసగవచ్చును.)

3. గౌరవనీయ డైరెక్టర్లు కాక మామూలు డైరెక్టర్లలో నూటికి ౬౬ మందికి తక్కువ కాకుండ భారతీయు లుందురు. (గౌరవనీయ డైరెక్టర్లు భారతీయు లుండిన పక్షమున బోర్డులో భారత డైరెక్టర్లు అధికసంఖ్యాకు లుందురు.)

౪. ఏజంటు ఫరంలోని భాగస్థులు విదేశనూలు, విదేశగుడ్డల దిగుమతిపట్ల అభిమానము కలిగియుండరు.

౫. మిల్లుగుడ్డలకు ఖద్దరుకు పోటీ లేకుండ చేయుట, మామూలు ననుసరించియే గుడ్డ నాణ్యమును తగ్గకుండా చేసి, పరసమైన ధరలకే యిచ్చుట మున్నగుపనుల వలన స్వదేశీప్రచారమునకు తోడ్పడుదుము.

౬. మిల్లు కార్యనిర్వహణములను సాగించువారు పైకి లోపలగూడ భారతీయుల పట్ల అభిమానము కలిగి వారికి మేలు చేకూర్చు చుందురు.

పైని చేసిన వాగ్దానము ననుసరించి మేము మీ క్రిందివిధముగా మెలంగుదుము :

౧. మిల్లుల కార్యనిర్వహణములను సాగించు వా రెవరును జాతీయ ఉద్యమము నకు ప్రతికూలప్రచారము సాగింపరు. భారతదేశమున బ్రిటిషుప్రభుత్వమువారి తరఫునగాని, వారి ప్రేరేపణచే గాని జాతీయ ఉద్యమమునకు ప్రతికూలముగా సాగించు ప్రచారమున పాల్గొనరు. అట్టి ప్రతికూలప్రచారమును తమంతట తాము సాగింపరు.

౨. కొన్ని ప్రత్యేకకారణము లుండినతప్ప సర్వసామాన్యముగా భారతీయులనే ఉద్యోగులుగా నియమించెదరు.

3. మాకంపెనీ ఇన్షూరెన్సు, బ్యాంకు, నౌకావ్యాపారమును సాధ్యమైనంత వరకు భారత ఇన్షూరెన్సు, భారతబ్యాంకులు, భారత నౌకాకంపెనీల ద్వారా సాగించెదము.

౪. మేము ఇప్పటినుండి వీలైనంతవరకు భారతీయులనే మా ఆడిటర్లు, ప్లీడర్లు, నౌకల ఏజంట్లు, సరకు కొనుటకు, అమ్ముటకు బ్రోకర్లు, కన్ట్రాక్టర్లు, సరకు సప్లయిదారులుగా నియమించెదము.

౫. స్టోరు సరకంతా వీలైనంతవరకు భారతదేశమున తయారైనదే కొనెదము. స్వదేశీసరకు ఉపయోగించుటకు వీలు లేనప్పుడు మాత్రమే విదేశసరకుల కొందుము. (తప్పనిసరిగా కొనవలసిన విదేశసరకుజాబితాను ఇందు చేర్చితిమి.)

* (మిల్లులు సప్లయి చేయును)

౬. "బాయికాట్" జాబితాలోచేర్చిన మిల్లులలో తయారగు నూలు, దారము' విదేశనూలు, విదేశపట్టు, కృత్రిమ పట్టును మేము వాడము.

౭. "బాయికాట్" జాబితాలో చేర్చిన మిల్లులలో తయారగు విదేశ నూలు గుడ్డ అద్దకమునకు గాని, చలువచేయుటకు గాని తీసుకొనము.

౮. మామిల్లులలో తయారగు ప్రతితానుకు రెండు చివరలను మాకంపెనీ ముద్రలను వేయుదుము. సరియైన ముద్రలు వేయకుండా గుడ్డను బైటికి పంపము.

౯. మాగుడ్డలకు ఖాదీపేరున ముద్రలు వేయము.

౧౦. ఈక్రింద ఉదాహరించిన రకముగుడ్డను తయారు చేయము:

చలువచేయనివి గాని, చలువచేసినవి గాని ౧౮ నంబరు నూలుకంటె ముతక నూలులో గుడ్డలను తయారుచేయము.

డ్రిల్లు, ట్విల్లు, రంగుదుప్పట్లు మున్నగు ముతకరకములను తయారు చేయుటకు మిల్లులకు స్వాతంత్ర్య ముండును.

౧౧. వీలైనంతవరకు క్రయ విక్రయములను భారత కంపెనీలతోనే చేయుదుము.

౧౨. మా మిల్లుల కార్యనిర్వహణముతో సంబంధము గలవా రందరును స్వదేశీ గుడ్డనే ధరించెదరు.

కంపెనీ పేరు..................................................

చి రు నా మా..................................................

ఏజంటు, లేక యజమానిపేరు..................................................

## బొంబాయిరాష్ట్రీయ కాంగ్రెసుసంఘమువారి వాగ్దానము

ప్రజల జాతీయ ఆదర్శములపట్ల మాకు సంపూర్ణసానుభూతి గల దని మేము వాగ్దానము చేయుచున్నాము. జాతీయప్రభుత్వము స్వదేశీఉద్యమమును ప్రోత్సహించుచున్నందున మేము సంతసించుచున్నాము.

ఖద్దరును కాపాడుటకై మేము మా గుడ్డలపై ఖద్దరుపైనుండునట్టి ముద్రలను వేయము. మా మిల్లులలో తయారగు గుడ్డలను ఖద్దరుపేరుతో అమ్మము. మీకమిటీ వారు సమ్మతించిన కొన్నిరకముల గుడ్డను తప్ప మామూలుగుడ్డను ౧౦ నం. నూలుకంటె ఎక్కువ ముతక నం. నూలుతో తయారుచేయము.

మా స్వదేశీమిల్లు పరిశ్రమను నిలువబెట్టి అభివృద్ధిలోనికి తీసుకొనివచ్చుటకుగాను మేము మీక్రిందివిధముగా మెలంగుదుము:—

౧. మిల్లులయజమాని కార్యనిర్వాహకులు ప్రస్తుతము భారతీయులు. ఇకముందు గూడ అటులే యుండును. పైకి లోపల భారతీయులపట్ల అభిమానము కలిగియుందుము. భారతీయులమేలుకే కృషి సల్పుచుందుము.

౨. మిల్లుల కార్యనిర్వహణముతో సంబంధము గలవా రెవరును జాతీయ ప్రతికూలప్రచారమున పాల్గొనరు.

3. కంపెనీవాటాదారుల పెట్టుబడిలో నూటికి ౭౫ కు తక్కువ కాకుండా ప్రస్తుతము భారతీయులధన మున్నది. ఇకముందు గూడ అటులే యుండును. ప్రత్యేక అవసరములందు కాంగ్రెసు అధ్యక్షుని అనుమతిపై ఇందులకు భిన్నముగానుండవచ్చును.

౪. గౌరవనీయ డైరెక్టర్లు కాకుండా మామూలు డైరెక్టర్లలో నూటికి ౬౬ మందికి తక్కువకాకుండా ప్రస్తుతము భారతీయులున్నారు. ఇకముందుగూడ అటులుండును.

౫. కంపెనీ కార్యనిర్వాహకులు భారతీయులుగా నుందురు. (మిల్లుల అనుమతిపై ఒక జాబితాను తయారుచేసిరి. భారతీయేతరులగు ఏజంట్లచే నిర్వహింపబడుచున్న కొన్ని మిల్లులు గలవు. ఈ మిల్లులు ఈ షరతును తప్ప మిగత షరతుల కన్నిటికిని సమ్మతించును.)

౬. ప్రత్యేక అధికార మున్నప్పుడు తప్ప సర్వసామాన్యముగా భారతీయులనే ఉద్యోగులుగా నియమించెదరు.

౭. మిల్లులు సాధ్యమైనంతవరకు భారత స్వదేశీసరకునే కొనును. వీలైనంతవరకు తమ వ్యాపారమును భారతబ్యాంకులు, ఇన్షూరెన్సు, షిప్పింగుకంపెనీల ద్వారా సాగించెదరు.

౮. బొంబాయిరాష్ట్రీయ కాంగ్రెసుసంఘమువారు స్వదేశీ కావని ప్రకటించిన మిల్లులకు చెందిన విదేశనూలు, గుడ్డ రంగువేయుటకుగాని, చలువచేయుటకుగాని తీసుకొనము.

౯. మిల్లులు విదేశనూలును వాడవు. ౧౯౩౦ సం॥ డిసెంబరు ౩౧ తేదీతర్వాత కృత్రిమపట్టు, మందుదినుసులలో ముంచిననూలు వాడరు.

౧౦. మిల్లులలో తయారైన ప్రతిగుడ్డపైన కంపెనీముద్ర వేయుదురు.

౧౧. మిల్లుయజమాని, మిల్లు ఏజెంటు, మిల్లుకార్యనిర్వాహకులతో సంబంధము గలవా రెవరును ప్రత్యక్షముగాగాని, పరోక్షముగాగాని విదేశనూలు, గుడ్డలను దిగుమతిచేసి వాటితో వ్యాపారము సాగింపరు.

౧౨. జాతీయ ఉద్యమముచే ప్రోత్సహింపబడిన స్వదేశీప్రచారమునకు మిల్లులు ప్రతికూలముగా మెలంగవు. మధ్యవారు లాభము పొందుటకు అవకాశ మొసంగక సరసమైన ధరలకు మిల్లులు స్వదేశీగుడ్డను సప్లయిచేయును. ప్రస్తుత మున్న సరకును ౧౯౩౦ సం॥ డిసెంబరు ౩౧ తేదీలోగా మార్చి ౧౨వ తేదీ ధరలకే అమ్మెదరు. అప్పుడప్పుడు వివిధరకముల ధరలు ప్రజాసామాన్యమునకు తెలియునటుల ధరల జాబితాను ప్రకటించుచుండును. అప్పుడప్పుడు బొంబాయిరాష్ట్రీయ కాంగ్రెసు సంఘమును కలుసుకొని సరసమైన ధరలకు స్వదేశీగుడ్డను సప్లయిచేయుటకు అనుకూలించు సాధనములను అములునం దుంచెదరు.

# 6. సాంఘికసమస్యా పరిష్కారము

ఆంగ్ల ప్రభుత్వమువారు సాంఘికసమస్యాపరిష్కారప్రకటన గావించిరి. పూర్తి వివరము లీ క్రిందివిధముగా నున్నవి :

(౧) రెండవ రౌండుటేబిలుమహాసభ సమాప్తమైనప్పుడు ఆంగ్ల ప్రభుత్వమువారి పక్షమున డిసెంబరు ౧ తారీఖున ఆంగ్లప్రధానామాత్యుడు గావించిన ప్రకటనలో సాంఘికసమస్యా విషయమై రౌండుటేబిలుసభలో పొందజాలని ఏకమత్యము వివిధ సంఘములవారికిని కలుగనిచో తాత్కాలికముగు నొక పరిష్కారమును ఆంగ్లప్రభుత్వమువారు గావించెదరనియు, నూతన రాజ్యాంగవిధాన ప్రారంభమునకు సాంఘిక సమస్యను ఆటంకముగా నుండనివ్వరనియు స్పష్టముచేయబడెను. సదరు ప్రకటనమును తరువాత రెండు పార్లమెంటు మహాసభలును ఆమోదించియుండెను.

(౨) వివిధసంఘములును సాంఘికసమస్యాపరిష్కార విషయమై ఏకాభిప్రాయమునకు రాకుండుట నూతన రాజ్యాంగనిర్మాణమునకు ఆటంకముగా నున్నదని గత మార్చి ౧౯ వ తారీఖున ఆంగ్లప్రభుత్వమువారికి తెలియవచ్చినందున తద్విషయమై తాము జాగ్రత్తగా పునరాలోచించుచున్నట్లు చెప్పిరి. నూతన రాజ్యాంగవిధానములో మైనారిటీల సమస్యయందలి కొన్ని ముఖ్యవిషయములను గూర్చిరైనను పరిష్కారము జరుగనిచో నూతన రాజ్యాంగనిర్మాణమునందు అభివృద్ధి యేమియు జరుగజాలదని యిప్పుడు ఆంగ్లప్రభుత్వమువారు నమ్ముచున్నారు.

## ఏవిషయముమీాద పరిష్కారము చేయబడినది ?

(౩) కాలక్రమేణ పార్లమెంటు మహాసభవారి యెదుట నుంచబడు భారత రాజ్యాంగవిధానమునకు సంబంధించిన సూచనలలో ఈక్రింద వివరింపబడు పరిష్కారమును అమలుపరుపదలచి యున్నారు. ప్రస్తుతము రాష్ట్రీయశాసనసభలలో ప్రాతినిధ్యము విషయమై మాత్రమే పరిష్కారము చేయబడుచున్నది. క్రింద ౨౦ పేరాలో తెలియజేయబడిన కారణమువలన భారతశాసనసభయందలి ప్రాతినిధ్యము యిప్పటికి ఆపుచేయబడినది. మా పరిష్కారపద్ధతిని యిట్లు సంకుచితపరుచుటవలన రాజ్యాంగ విధాన నిర్మాణమునకు సంబంధించిన అనేక యితర ముఖ్యవిషయములపై నిర్ణయము జరుగవలసియున్నదని గ్రహింపవలెనన్నట్లు అర్థమగుచున్నది. కాని వివిధసంఘములవారికి

ప్రాతినిధ్యమిచ్చు పద్ధతులును, సభ్యులసంఖ్యలును తెలుపబడినతర్వాత యితర సాంఘిక సమస్యల విషయమై ఆయా సంఘములు తమంతటతామే ఏకాభిప్రాయమునకు వచ్చు రను ఆశతో ఈ నిర్ణయములు గావింపబడినవి.

(౪) ఈ నిర్ణయమును మార్చువిషయమై చేయబడు ఆలోచనలలో బ్రిటిషుప్రభుత్వమువారు యెంతమాత్రమును పాల్గొనజాలరని ఆంగ్లప్రభుత్వమువారు స్పష్టముచేయుచున్నారు. అన్ని పార్టీలవారును ఏకగ్రీవముగా కోరనిది దానిని మార్చుటకు యేమహాజరునుగాని ఆలోచింపరనిగూడ స్పష్టము చేయుచున్నారు. కాని వివిధసంఘములవారును కలసి ఏకగ్రీవముగా నొక పరిష్కారపద్ధతిని తయారుచేయుటకు ఆటంకము కలుగజేయు నుద్దేశ్యము ప్రభుత్వమువారి కేమియు లేదు. కావున యావద్భారతదేశవిషయమైనను సరే, కొన్నికొన్ని రాష్ట్రముల విషయమైనను సరే పరిష్కారము పరస్పరము వివిధసంఘముల అంగీకారము పొందిన దైనచో ఈ ప్రణాళికకు బదులు వివిధసంఘములకు అంగీకారమైన ప్రణాళికనే యామోదింపవలసిన దని పార్లమెంటుసభవారికి బ్రిటిష్‌ప్రభుత్వమువారు సిఫారసు చేసెదరు.

## పరిష్కారములోని ముఖ్యలక్షణములు

(౫) గవర్నరు రాష్ట్రములయందలి శాసనసభలలోను, పెద్దలసభ యున్నచోట్ల ప్రజాప్రతినిధిసభలలోను సభ్యత్వములు దిగువ ౨౪ వ పేరగ్రాఫులో తెలుపబడినరీతి నుండును.

## ప్రత్యేక నియోజకవర్గములు

(౬) మహమ్మదీయ, ఐరోపీయ, సిక్కు సభ్యత్వములకు ఎన్నికలు ప్రత్యేక నియోజకవర్గములద్వారా నుండును.

౧౦ సంవత్సరముల తరువాత ఈయేర్పాటును మార్చుటకు రాజ్యాంగవిధానములో యేర్పాటు (వివిధ సంఘములవారి సమ్మతితో) గావింపబడును. వివిధసంఘములవారి యభిప్రాయములను తెలిసికొనుటకు తగిన యేర్పాటులు చేయబడును.

(౭) మహమ్మదీయ, సిక్కు, భారత, క్రైస్తవ, ఆంగ్లోహైందవ, ఐరోపీయ నియోజకవర్గములలో వోట్లు నివ్వనివా రందరు సామాన్య నియోజకవర్గములో వోటు నివ్వదగియుందురు.

(౮) బొంబయిలో కొన్ని నిర్ణీత“ప్లూరల్ నంబరు” సామాన్య నియోజకవర్గములలో మహారాష్ట్రములకు ౭ స్థానములు ప్రత్యేకింపబడును.

(౯) నిమ్న జాతులలో వోట్లు కలవారు సామాన్యనియోజకవర్గములలోనే వోటు చేసెదరు. ఈ ఒక్క మార్గముచేతనే నిమ్నజాతులకు తగిన ప్రాతినిధ్యము చేకూరక పోవుటవలన దిగువ ౨౪ పేరగ్రాఫులో తెలుపబడినట్లు వారికి ప్రత్యేకస్థానములు కొన్ని యివ్వబడును. ఈస్థానములకు ఒక్క నిమ్నజాతివోటర్లు మాత్రమే సభ్యుల నెన్నుకొనదగి యుందురు. ఈ విధముగా వోటుచేయుదగినవారు సామాన్య నియోజక వర్గములోకూడ వోటుచేయు నధికారము కలిగియుండును. నిమ్నజాతులు చాల హెచ్చు గానున్న ప్రదేశములలో మాత్రమే యిట్టి యేర్పాటులు చేయబడును. మద్రాసులో తప్ప రాష్ట్రమంతయు వారి నియోజకవర్గముగా నుండరాదని యుద్దేశింపబడినది.

వంగదేశములో కొన్ని సామాన్యనియోజకవర్గములయందు వోటర్లలో నధిక భాగము నిమ్నజాతులకు జెందగలరని తోచుచున్నది. కావున విచారణ జరుగువరకు ఆ రాష్ట్రములో నిమ్నజాతులు ప్రత్యేక నియోజకవర్గములనుండి ఎన్నుకొనవలసిన సభ్యులసంఖ్య నిర్ణయింపబడలేదు. బెంగాల్ శాసనసభలో నిమ్నజాతులకు ౧౦ స్థానములకంటె తక్కువ యుండరాదని మాయుద్దేశము.

ప్రత్యేక నిమ్నజాతుల నియోజకవర్గములలో వోటుచేయు హక్కుగలవా రెవరో యింకను నిర్ణయింపబడలేదు. "ఫ్రాంచైజుకమిటీ" నివేదికలో వివరింపబడిన సూత్రములపై నవి ఆధారపడియుండును. ఉత్తర హిందూస్థానమునందలి కొన్ని రాష్ట్రములలో కొన్ని మార్పులు చేయుట అవసరమైయుండును.

## ఇతర మైనారిటీలు

కొంతకాలమునకు పైన ఈప్రత్యేక నిమ్నజాతి నియోజకవర్గములు అవసరము కావని ఆంగ్లప్రభుత్వమువారు తలచుచున్నారు. ఆపేరగ్రాఫులో యివ్వబడిన అధికారములద్వారా అవి ఈలోగా మార్చబడనిచో ౨౦ సంవత్సరముల తరువాత నవి అంతమొందునట్లు ఉద్దేశింపబడినది.

(౧౦) భారత క్రైస్తవుల స్థానములకు ప్రత్యేక నియోజకవర్గముల ద్వారా ఎన్నికలు జరుగును. రాష్ట్రమునందలి క్రైస్తవులందరును కలసి యెన్నుకొనుపద్ధతి అనాచరణీయముగా కనబడుచున్నది. కనుక రాష్ట్రములో ఒకటిరెండు ప్రత్యేకప్రదేశములలో మాత్రమే ఈనియోజకవర్గము లేర్పరుపబడును. ఈనియోజకవర్గములకు వెలుపల నుండు భారతక్రైస్తవుల సామాన్య నియోజకవర్గములలో వోటుచేతురు. బీహారు ఒరిస్సా రాష్ట్రములలో భారతక్రైస్తవుల సంఖ్యలో నధికభాగము అనాగరిక కొండ జాతులు. కనుక అచ్చట ఏర్పాటులు వేరు విధముగా నుండవలసివచ్చును.

## ఆంగ్లో-హైందవులు

(౧౧) ఆంగ్లో-హైందవులు ప్రత్యేక సాంఘికనియోజకవర్గములద్వారా సభ్యుల నెన్నుకొందురు. వీరి నియోజకవర్గము రాష్ట్రమంతయు నై యుండును. టపాద్వారా వీరు వోటుచేయదగియుందురు. కాని యిందువిషయమై తుదినిర్ణయ మేదియు జరుగలేదు.

(౧౨) వెనుకబడినజాతులవా రెంతమందిని ఎన్నుకొనవలె నను విషయము యింకను విచారణయం దున్నది. ఈ తెగవారికి ఇవ్వబడిన స్థానములు తాత్కాలికమైనవని యెరుగవలెను.

## స్త్రీల ప్రాతినిధ్యము

(౧౩) నూతన శాసనసభలలో కొద్దిమంది స్త్రీలయినను ఉండుట చాల ముఖ్యమని బ్రిటిష్‌ప్రభుత్వమువారు తలచుచున్నారు. స్త్రీలకు కొన్నిస్థానములు ప్రత్యేకింపనిది వారికి తగినప్రాతినిధ్యము రాదని వారు తలచుచున్నారు. మరియు ఒక్క సంఘమునకు జెందిన స్త్రీలు హెచ్చుగా శాసనసభల కెన్నుకొనబడరాదనియు, వివిధ సంఘములవారును ఎన్నుకొనబడవలెననియు వారు తలచుచున్నారు. కావున ప్రత్యేక సాంఘికనియోజకవర్గము లేర్పరుపబడినవి. దిగువ ౨౪-వ పేరగ్రాఫులో తెలుపబడినట్లు వివిధసంఘములకు ప్రాతినిధ్యము కల్పింపబడినది.

## ఇతరులు

(౧౪) కార్మికులకు నిర్ణయింపబడిన స్థానములకు ఎన్నికలు సాంఘికపద్ధతిపై నాధారపడవు. ఎన్నికవిషయమైన యేర్పాటు లింకను నిర్ణయింపబడవలసియున్నవి. కాని "ఫ్రాంచైజుకమిటీ" వారిచే సిఫారసు చేయబడినట్లు "లేబరు"నియోజకవర్గములు కొంతవరకు ట్రేడుయూనియన్ నియోజకవర్గములుగాను, కొంతవరకు ప్రత్యేకనియోజకవర్గములుగాను ఉండును.

(౧౫) వాణిజ్య పరిశ్రమలకును, "మైనింగు" (గనులు) తేయాకు తోటలవారి ప్రాతినిధ్యము "ఛేంబర్సు ఆఫ్ కామెర్సు" మున్నగు సంఘములద్వారా నుండును. ఇంకా విచారణ చేసినగాని వీనిసంబంధమయిన యేర్పాటులు నిర్ణయింపబడజాలవు.

(౧౬) భూస్వాముల ప్రతినిధులు ప్రత్యేకభూస్వాముల నియోజకవర్గములచే నెన్నుకొనబడుదురు.

(౧౭) విశ్వవిద్యాలయప్రతినిధు లె ట్లెన్నుకొనబడవలెనను విషయము యింకా విచారణయం దున్నది.

(౧౭) ప్రాతినిధ్యమునకు సంబంధించిన వివిధ విషయములను నిర్ణయించుటలో బ్రిటిష్‌ప్రభుత్వమువారు వివరములలోనికి దిగుట అసంభవమని తలచుచున్నారు. ఓటరు నియోజకవర్గములు నిర్ణయింపబడవలసియున్నవి. ఈపని సాధ్యమైనంతత్వరలో భారత దేశమునందు జరుగవలెనని వారి యుద్దేశము.

సభ్యులసంఖ్యలలో అక్కడక్కడ కొన్నిమార్పులు చేయవలసి యుండును. ఈ మార్పులు చేయుటకు ఆంగ్లప్రభుత్వమువారి కడ్డుండదు. కాని వివిధసంఘములకు దామాషాలో తారతమ్యము హెచ్చుగా నుండుటకు వా రంగీకరింపరు. బెంగాలు, పంజాబు విషయమై యిందులో నిర్ణయింపబడిన సంఖ్యలకు మార్పు లేవియు చేయ బడవు.

## రెండవ శాసనసభ

(౧౮) రాష్ట్రములలో రెండవ శాసనసభ విషయమై రాజ్యాంగ చర్చలలో హెచ్చుప్రాముఖ్య మొసగబడలేదు. ఈ విషయము యింకా చర్చింపబడదగియున్నది. ఏరాష్ట్రములలో రెండవశాసనసభ యుండదగును, ఆ శాసనసభలో యెందరు సభ్యు లుండవలెను, ఎట్లు యెన్నుకొనబడవలెను- అనువిషయమై యింకా చర్చజరిగి నిర్ణ యము జరుగవలసియున్నది.

క్రింది శాసనసభలో వివిధ సంఘములకు గల దామాషాను భంగపరచు పద్ధతి యేదియు పైశాసనసభలో నుండరాదని బ్రిటిష్ ప్రభుత్వమువారి యుద్దేశ్యము.

## భారత శాసనసభ

(౨౦) భారతశాసనసభలో యెంతమంది సభ్యులుండవలెను, వా రెట్లు ఎన్ను కొనబడవలెను అనువిషయమై యిప్పుడు ఆంగ్లప్రభుత్వమువారు నిర్ణయింపజాలరు. ఎందువల్లననగా భారతసంస్థానములుగూడ ప్రతినిధులను పంపవలసియున్నవి. సంస్థాన ము లెంతమంది సభ్యులను పంపవలెను, బ్రిటిష్ ఇండియాలోని రాష్ట్రము లెందరిని పంపవలెను అను విషయము యింకను చర్చింపదగియున్నది. ఆ సభలో వివిధసంఘ ములయొక్క ప్రాతినిధ్యము తగినట్లు విచారింపబడును.

## సింధు విభజన

(౨౧) రాష్ట్రముయొక్క ఖర్చులకు తగినఆదాయముండుచో సింధును ప్రత్యేక రాష్ట్రముగా చేయవలెనని బ్రిటిష్‌ప్రభుత్వమువా రిదివరకే అంగీకరించియుండిరి. భారత సమాఖ్య ప్రభుత్వపు ఆదాయవ్యయములసందర్భమున ఈ రాష్ట్రముయొక్క ఆదాయ వ్యయములును, విచారింపబడనున్నవి. కనుక బొంబాయిరాష్ట్రమునందలి శాసనసభకు

ప్రత్యేకముగాను, బొంబాయి సింధురాష్ట్రీయ శాసనసభలకు కలసియు లెక్కలను తయారుచేయుట మేలని బ్రిటిష్ ప్రభుత్వమువారు తలంచుచున్నారు.

(౨౨) బీహారు-ఒరిస్సారాష్ట్రమునకు మేమిచ్చిన లెక్కలు ప్రస్తుతరాష్ట్రమునకు సంబంధించియున్నవి. ఉత్కళమునకు ప్రత్యేకరాష్ట్రమును నిర్మించు విషయమై విచారణ జరుగుచున్నది.

(౨౩) ౨౪ వ పేరగ్రాఫులో మధ్యరాష్ట్రముల శాసనసభ విషయమై చెప్పియుంటిమి. ఇందువలన భావిభారత రాజ్యాంగవిధానములో బేరారునుగూర్చి అంత్య నిర్ణయము గావింపబడెనని సంశయింపరాదు.

## (౨౪) వివిధరాష్ట్రముల శాసనసంఘములలో స్థానముల నిర్ణయము

మదరాసు-౨౧౫:—జనరలు-౧౪౭ పురుషులు, ౬ స్త్రీలు - నిమ్నజాతులు ౧౫, వెనుకబడియున్న ప్రాంతములకు ౧, మహమ్మదీయులు-౨౭ పు. ౧ స్త్రీ, ౨౯ దేశియక్రైస్తవులు-౭ పు. స్త్రీ-౯, ఆంగ్లో - యిండియనులు ౨. యూరోపియనులు ౩, వాణిజ్యము, పరిశ్రమలు, గనులు, తోటలు ౬, భూస్వాములు ౬ విశ్వవిద్యాలయము ౧, కార్మికులు ౬.

బొంబాయి-సింధు ౨౦౦:— జనరలు-౯౨పురుషులు ౫ స్త్రీలు, నిమ్నజాతులు ౧౦, వెనుకబడియున్న ప్రాంతములకు ౧, మహమ్మదీయులు-౬౨ పురుషులు ౧ స్త్రీ ౬౩, దే. క్రై స్తవులు ౩, ఆం. ఇండియనులు ౨, యూరోపియనులు ౪, వాణిజ్యము వగైరా ౭, భూస్వాములు ౩, విశ్వవిద్యాలయము ౧, కార్మికులు ౭.

బెంగాలు-౨౫౦:—జనరలు-౭౭ పు. స్త్రీ. ౨, ఆం-ఇండి-౩-పు. స్త్రీ ౧.౪ దే. క్రై, ౨, యూరో. ౧౧, వాణిజ్య ౧౯, భూస్వాములు ౫, విశ్వవిద్యాలయము ౨, కార్మికులు ౮.

సంయుక్తరాష్ట్రములు-౨౨౭:—జనరలు-౧౪౭ పు. ౪ స్త్రీ. నిమ్నజాతులు ౧౨, మహమ్మదీయులు-౬౪ పు. ౨ స్త్రీ-౬౬, దే. క్రై ౨, ఆం. ఇం. ౧, యూరో ౨, వాణిజ్య ౩, భూస్వాములు ౬, విశ్వవిద్యాలయము ౧, కార్మికులు ౩.

పంజాబు-౧౭౫;—జనరలు ౪౨ పురు, ౧ స్త్రీ, సిక్కులు ౩౧ పురు. ౧ స్త్రీ, మహమ్మ ౮౪ పురు. ౨ స్త్రీ, దే. క్రై. ౨, ఆం. ఇం. ౧, యూరో ౧, వాణిజ్య, ౧, భూస్వాములు ౫, విశ్వవిద్యాలయము ౧, కార్మికులు ౩.

బీహారు ఒరిస్సా ౧౭౫:—జనరలు ౯౬ పు. ౩ స్త్రీ, నిమ్న ౭, వెనుకబడియున్న ప్రాంతములకు ౮, మహమ్మ-౪౧ పు, ౧ స్త్రీ, దే. క్రై ౨, ఆం. ఇం. ౧, యూరో ౨, వాణిజ్య ౪, భూస్వాములు ౫, విశ్వ వి. ౧, కార్మిక ౪.

మధ్యరాష్ట్రములు, బేరారు ౧౧౨:—జనరలు ౭౪ పు-3 స్త్రీ, నిమ్న ౧౦, వెనుకబడియున్న ప్రాంతములకు ౧, మహమ్మ ౧౯, ఆం-ఇం ౧, యూరో ౧, వాణిజ్య ౨, భూస్వాములు 3, విశ్వ వి ౧, కార్మి ౨.

అసాము ౧౦౮:—జనరలు ౪3 పు. ౧ స్త్రీ, నిమ్న ౪, వెనుకబడియున్న ప్రాంతములకు ౯, మహమ్మ 3౪, దే. క్రై. ౧, యూరో ౧, వాణిజ్య ౧౧, కార్మిక ౪.

సరిహద్దురాష్ట్రము ౫౦:—జనరలు ౯, సిక్కులు 3 మహమ్మ 3౬, భూస్వాములు ౨.

సింధు ౬౦:—జనరలు ౧౭ పు-౧ స్త్రీ, మహమ్మ 33 పు-౧ స్త్రీ, యూరో ౨, వాణిజ్య ౨, భూస్వాములు ౨, కార్మిక ౧.

సింధురాష్ట్రము లేకుండ బొంబాయి-౧౭౫:—జనరలు-౧౦౪ పు- ౫ స్త్రీ, నిమ్న ౧౦, వెనుకబడియున్న ప్రాంతములకు ౧, మహమ్మ-౨౯ పు-౧ స్త్రీ 3౦, దే. క్రై 3, ఆ.-ఇం. ౨, యూరో 3, వాణిజ్యము ౭, భూస్వాములు ౨, విశ్వ వి. ౧, కార్మికులు ౭.

## వాణిజ్యము, పరిశ్రమలు, గనులు, తోటలు

ఈసంస్థల ప్రతినిధులను యూరోపియనులు ఎన్నికొనవలెనా, యిండియనులు యెన్నికొనవలెనా అను విషయమును స్థిరపరుప వీలులేదు. కావున ఈసంస్థల ప్రతినిధులలో ఎంతమంది యూరోపియను లుందురో, ఎంతమంది ఇండియను లుందురో నిర్ధారణగా తెలుప వీలులేదు. కాని ఊజ్జాయింపున నీరీతిగా నుండవచ్చును.

| రాష్ట్రము | యూ. | ఇం. | మొ. |
|---|---|---|---|
| మదరాసు | ౪ | ౨ | ౬ |
| బొంబాయి సింధు | ౫ | 3 | ౮ |
| బెంగాలు | ౧౪ | ౫ | ౧౯ |
| సం. రా. | ౨ | ౧ | 3 |
| పంజాబు | | ౧ | ౧ |
| బీహారు, ఒరిస్సా | ౨ | ౨ | ౪ |
| మ. రా. బేరారు | ౧ | ౧ | ౨ |
| అసాము | ౮ | 3 | ౧౧ |
| సింధు | ౧ | ౧ | ౨ |
| బొంబాయి ప్రత్యేకము | ౪ | 3 | ౭ |

## బొంబాయిలో మహారాష్ట్రులు

బొంబాయి జనరలు సీట్లులో సింధును విడదీసినను, మానినను గూడ ౮ స్థానములు మహారాష్ట్రులకు ప్రత్యేకింపబడును.

## బెంగాలులో నిమ్నజాతులు

నిమ్నజాతులసంఖ్య ౧౦ కంటె హెచ్చుగా నుండదు. జనరలు సీట్లు ౭౦ లోను ౧౦ స్థానములు నిమ్నజాతులకు ప్రత్యేకింపబడును. మిగతా ౬౦ జనరలుసీట్లు నుండును.

## పంజాబులో భూస్వాములు

ఈ స్థానములలో నొకటి జమీందారులకు ప్రత్యేకింపబడును. భూస్వాముల స్థానములలో ౪ స్థానములకు ప్రత్యేకములవారిని సమష్టినియోజకవర్గములవారెన్నుకొందురు. ఆనలుగురిలోను ౧ హిందువు, ౧ సిక్కు, ౨ మహమ్మదీయులు నుందురు.

## ఆసాములో స్త్రీలు

ఆసాములో ౧ స్త్రీస్థానము కలదు. దీనికి షిల్లాంగులో సాంఘికేతర నియోజకవర్గమువారెన్నుకొందురు.

## మెక్డొనల్డుగారి సమాధానప్రకటన

"భారతదేశమునందలి సాంఘిక సమస్యను గూర్చి బ్రిటను దొరతనమువారు నేడత్యంత ముఖ్యతమమగు ప్రకటనను చేయుచున్నారు. కాన నేను కేవలము ప్రధాన మంత్రిగా మాత్రమేగాక భారతమిత్రుడనుగానే గత రెండేండ్లనుండియు అల్పసంఖ్యాకులసమస్యనుగూర్చి చాల శ్రద్ధబూనుచుండుటచే యీ పరిష్కారమును గూర్చి నేనొకటి రెండు విషయములను తెలుపగోరెదను.

భారతదేశమునందలి సాంఘికవిషయములలో కల్పించుకొనవలెనను నభిప్రాయము మా కెంతమాత్రమును లేదు. దీనిని భారతీయులే పరిష్కరించుకొనునట్లు మేము మొందటి రౌండుటేబిలు సభలోను, రెండవ శాసనసభలోనుగూడ చాల ప్రయత్నము చేసితిమి. మే మీసమస్యను పరిష్కరింపబూనినచో ప్రతిసంఘమువారును తమ కోరికల ననుసరించి వానిని విమర్శించెద రను విషయమును మేము మొందటనే తెలిసికొనియుంటిమి. కాని మొత్తముమీద దేశముయొక్క లాభమునే చూడవలసియుండునను విషయము నన్ని సంఘములవారును గూడ గ్రహింపగలుగుదు రనియే మేము నమ్ముచున్నాము. బ్రిటిషు కామనువెల్తులో ఇండియాకు నూతనస్థానము నొసగుటకు ఏర్ప

రుపబడుచున్న రాజ్యాంగవిధానమును నెరవేర్చుట కందరును కలసి పనిచేయవలసి యున్నది.

## అందరును అంగీకరింపనిచో ఈపరిష్కారమును సవరింపవచ్చును

సాంఘికసమస్యను భారతీయులు తమలో తాము పరిష్కరించుకొనజాలక పోవుటచే రాజ్యాంగవిధానమును నిర్మించుటకు నిరోధము కలిగినది. అందువలన విధి లేక బ్రిటనుదొరతనమువారు దీనిని పరిష్కరించుటకు పూనుకొనిరి. దీనిని పరిష్కరింప వలె నని రౌండుటేబిలుసభకు వచ్చిన అన్నిపక్షముల ప్రతినిధులును నన్ను పదింబదిగా కోరిరి. అందువలన నే నాసభలో వాగ్దానము చేసియుంటిని. పిమ్మట పార్లమెంటు వారుగూడ ఆమోదించిరి. అందువలన దొరతనమువా రీపరిష్కారమును నేడు ప్రక టింపదలచిరి. ఇంతకంటె మంచి విధానమును వివిధసంఘములవా రీలోగా నిర్ణయింప గలిగినయెడల తప్ప లేనిచో నీవిధానమును, దొరతనమును కాలక్రమమున పార్లమెంటు సభలో నుపపాదింపవలెననియే దొరతనమువా రుద్దేశించిరి.

ఆబిల్లు చట్టముక్రింద మారులోపల నెప్పుడైనను వివిధసంఘములవారికి పరస్పరము అంగీకారము కలుగునెడల మేము మిక్కిలి సంతసించెదము. కాని అట్టి రాయబారము లను జరుపుటవలన ప్రయోజన మేమియును కలుగ దను గట్టినమ్మకము వెనుకటి అనుభ వమువలన దొరతనమువారికి కలిగియుండుటచే వా రిట్టి రాయబారములలో కల్పించు కొనరు. కాని ఒకరాష్ట్రమునుగూర్చిగాని, పెక్కురాష్ట్రములనుగూర్చిగాని, భారత దేశమునంతటిని గూర్చిగాని అన్నిసంఘములవారును ఏకీభవించి యొక నిర్ణయమును చేయగలిగినచో ఈ పరిష్కారమునకు బదులుగా దాని నుపపాదించుటకు దొరతనము వారు సిద్ధముగానే యున్నారు.

## ప్రత్యేకనియోజకవర్గముల ఆవశ్యకత

రాష్ట్రములలో అల్పసంఖ్యాకసంఘములు తమ హక్కులను కాపాడుకొనుటకు ప్రత్యేకనియోజకవర్గములు ముఖ్యతమము లని తలచుచున్నారు. అనేక సంవత్సరముల నుండి ప్రత్యేక నియోజకవర్గము లేర్పరుపబడి పని చేయుచున్నవి. రాజ్యాంగ సంస్కరణములు చేయబడిన ప్రతిసారియును ప్రత్యేక నియోజకవర్గములు పరిగణింప బడుచునే యుండెను.

ఇప్పటికిని అల్పసంఖ్యాకసంఘములవారు ప్రత్యేక నియోజకవర్గములకే అధిక ముగు ప్రాముఖ్యము నిచ్చుచున్నందున సమష్టినియోజకవర్గములే యుండవలెనని దొర తనమువారు ముఖ్యముగా కోరుచుండినను గూడ ప్రత్యేక నియోజకవర్గములను రద్దు

పరచుటకు వీలు కలుగలేదు. ప్రత్యేక నియోజకవర్గము లిదివర కేర్పరుపబడుటకు గల కారణములనుగూర్చి నే నిప్పు డాలోచింపగోరుటలేదు. అది అనవసరము. ఇటుపైని ప్రత్యేకరక్షణవిధానముతో పనిలేకుండ గొప్పసంఘములవారును, కొద్ది సంఘముల వారును స్నేహభావముతో కలసి శాంతముగా పనిచేయవలెననియే నేను కోరుచున్నాను. ఈలోగా దొరతనమువారి ప్రత్యేక అపూర్వ ప్రాతినిధ్యవిధానమునే కాపాడవలసి యున్నది.

## నిమ్నజాతుల స్థితి

నిమ్నజాతులు అధిక సంఖ్యాకులుగా నున్న రాష్ట్రములలోని శాసనసభలలో వారికి విశ్వాసపాత్రు లగువారే ప్రతినిధులుగా నుండవలెను గాని శాశ్వతముగా నిమ్నజాతి యొకటి యేర్పరుపగూడదు. కాన వారికి ప్రత్యేక నియోజకవర్గము లుండకూడదు. కావున నిమ్నజాతులవారు హిందూ సమష్టివర్గములలోనే వోటుజేసెదరు. ఆ రీతిగా ఎన్నుకొనబడిన ప్రతినిధి నిమ్నజాతులపట్ల తనకు గల బాధ్యతను గుర్తించును. కాని ౨౦ యేండ్లవరకును నిమ్నజాతి వోటరులు హెచ్చుగానున్న స్థానములలో ప్రత్యేక నియోజకవర్గములుగూడ నుండును. వారు కొందరిని ఎన్నుకొందురు. ఇందువలన నిమ్నజాతులవారిలో కొంతమంది రెండుసారులు వోటుచేయుట కవకాశము కలుగును గాని ప్రస్తుతస్థితిలో వారిస్థితిని వృద్ధిబొందించుటకును, వారి హక్కులను కాపాడుటకును ఇది అవసరమే యగును.

## స్త్రీల హక్కులు

ఇటీవల కొన్ని వత్సరములనుండి ఇండియాలో స్త్రీల ఉద్యమము ప్రధానోద్యమములలో నొకటిగా నేర్పడినది. ఇండియాలో స్త్రీలు ఉన్నతవిద్య నభ్యసించి ఎక్కువ పలుకుబడిని బడయగలుగువరకును ఇండియాదేశము పడయగోరుచున్న స్థానమును బడయజాలదు. స్త్రీలకు ప్రత్యేక "కమ్యూనలు" ప్రాతినిధ్య మొసగుటకు చాల ప్రబలములగు నాక్షేపణలు కలవు కావున స్త్రీలకు ప్రత్యేకస్థానముల నేర్పరుపవలెను. అన్ని సంఘములలోను స్త్రీలకు స్థానము లుండవలెను. మరియొక మార్గము లేదు.

ప్రస్తుతము భారతదేశమునం దేర్పడిన స్థితినిబట్టి వివిధసంఘములలో సంఘర్షణ మేర్పడినందున సామరస్యము కలిగింపవలెనను నిష్కపటమగు నుద్దేశముతోనే ఈ పరిష్కారము చేయబడెను. కాన ప్రస్తుత మిది యేసంఘమువారికిని సంపూర్ణమగు సంతృప్తిని కలిగింపజాలదు. కాని యిది నూతనదశలో పని జరుగుటకు సాధనభూతము కాగలదు. ఈ సమస్యను పరిష్కరించుటకు భారతీయులు చాలసారులు ప్రయత్నించి విఫలులైరను విషయమును మరవగూడదు.

దీనిని భారతీయులే పరిష్కరింపగలరు. నూతనరాజ్యాంగవిధానమును పూర్తి చేయుట కింకను చాల విషయములను పరిష్కరింపవలసియున్నది. కాని వాటిని పరిష్కరించుట కదివరకు సాంఘికవాదములవలన నిరోధ మేర్పడినది. ఇపు డీపరిష్కారమువలన నా నిరోధము తొలగగలదని దొరతనమువారు నమ్ముచున్నారు. నూతన రాజ్యాంగవిధానము కొనసాగుటకు వివిధసంఘములవారు సద్భావముతో సహకార మొనరించుట ముఖ్యావసర మను విషయమును యీవిషమసమయమున ఇండియాలోని వివిధసంఘముల నాయకు లందరును బాగుగా గ్రహింపవలెను." అని మెక్డనాల్డుగారు ప్రకటించిరి.

## రౌండుటేబిలు మహాసభ "మైనారిటీస్"ఒడంబడిక—సాంఘికసమస్యా పరిష్కారము శిఫార్సులను ఒకదానితో ఒకటి పోల్చుట

రౌండుటేబిలు మహాసభ "మైనారిటీస్" ఒడంబడికలోని శిఫార్సులను, బ్రిటిషుప్రభుత్వమువారి నిర్ణయమును ఒకదానితో ఒకటి పోల్చుటకు వీలగునటుల యీ దిగువ ప్రచురించుచున్నాము. లండనులో సమావేశమైన అల్పసంఖ్యాకుల సంఘములవారి కోర్కెలకు బ్రిటిషుప్రభుత్వమువారి నిర్ణయమునకు ఎంత వ్యత్యాస మున్నది ఇందుమూలమున స్పష్టమగును.

ఒక్కొక్క సంఘములో నుండు వివిధశాఖలవారికి ఏవిధముగా స్థానములను పంచవలసినది విమర్శించి "మైనారిటీస్" ఒడంబడికలో వివిధసంఘములకు కావలసిన మొత్తముసంఖ్యను మాత్రమే తెలియజేసిరి.

ప్రభుత్వమువారి పరిష్కారమున వివిధశాఖలవారికి వేరువేరుగా అవసరమగు స్థానములను స్పష్టపరచిరి. వివిధసంఘములస్థానములను కనుగొనవలె ననిన వివిధశాఖలలోనుండి ఒకేసంఘమువారి సంఖ్య కనుగొనవలసియుండును.

ప్రత్యేక శాఖలనుండి వచ్చినవారి సంఖ్యను కలుపుకొనకపోయినను వివిధ సంఘములవారు "మైనారిటీస్" ఒడంబడికలో ప్రభుత్వమువారు ప్రసాదించిన సాంఘికసమస్యాపరిష్కారములోని స్థానములను ఒకదానితో ఒకటి పోల్చి చూడవచ్చును.

| రాష్ట్రము | శాసనసభ్యసంఖ్య | | హిందువులు | | | మహమ్మదీయులు | క్రైస్తవులు | ఆంగ్లో ఇండియన్లు | యూరోపియనులు | అనాగరిక జాతులవారు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | సవర్ణులు | హరిజనులు | మొత్తము | | | | | |
| అస్సాం | మై. ఒ. | 100 | 38 | 13 | 51 | 35 | 3 | 1 | 10 | - |
| | ప్రభుత్వ. | 108 | 44 | 4 | 48 | 34 | 1 | - | 7 | 9 |
| బెంగాలు | మై. ఒ | 200 | 38 | 35 | 78 | 102 | 2 | 3 | 20 | - |
| | ప్రభుత్వ. | 250 | 70 | 10 | 80 | 119 | 2 | 4 | 11 | - |
| బీహారు ఒరిస్సా | మై. ఒ. | 100 | 51 | 14 | 65 | 25 | 1 | 1 | 5 | 8 |
| | ప్రభుత్వ. | 175 | 99 | 7 | 106 | 42 | 2 | 1 | 2 | 8 |
| బొంబాయి | మై. ఒ. | 200 | 88 | 28 | 116 | 66 | 2 | 3 | 18 | - |
| | ప్రభుత్వ. | 200 | 87 | 10 | 97 | 68 | 3 | 2 | 4 | |
| మద్రాసు | మై. ఒ. | 200 | 102 | 40 | 142 | 30 | 14 | 4 | 8 | 2 |
| | ప్రభుత్వ. | 215 | 184 | 18 | 152 | 29 | 9 | 2 | 3 | 1 |
| పంజాబు | మై. ఒ. | 100 | 141 | 10 | 24 | 51 | 5 | 5 | 2 | - |
| | ప్రభుత్వ. | 175 | — | — | 43 | 86 | 2 | 1 | 1 | - |
| సం. రా. | మై. ఒ. | 100 | 44 | 20 | 64 | 30 | 1 | 2 | 3 | - |
| | ప్రభుత్వ. | 228 | 132 | 12 | 144 | 66 | 2 | 1 | 2 | - |
| మ. రా. | మై. ఒ. | 100 | 58 | 20 | 78 | 15 | 1 | 2 | 2 | 2 |
| | ప్రభుత్వ. | 112 | 77 | 10 | 87 | 14 | 1 | 1 | 1 | 2 |

# 7. ఇండియా-ఇంగ్లాండు వర్తక ఒడంబడిక

## ౧౯౩౫

ఇండియా - ఇంగ్లాండువర్తక ఒడంబడికపై బ్రిటిషుప్రభుత్వముతరఫున సర్ వాల్టరు రన్సిమన్‌గారు, భారతప్రభుత్వము తరఫున సర్ బి. యన్. మిత్రగారు లండనులో జనవరి ౧౦ తేదీ సంతకములు చేసిరి. భారతపరిశ్రమలలో దేనికైన పీలైనంత రక్షణచేకూర్చవలెనని టారిఫ్‌బోర్డువారిని కోరినచో భారతప్రభుత్వమువారు ఆ పరిశ్రమ సంగతి సందర్భములను విచారించి ఆ పరిశ్రమకు సంబంధించినవారికి తగినసమాధాన మొసగాదరని ఒడంబడికలో గలదు.

రక్షణ చేకూర్చినకాలములోనే పరిశ్రమలకు సంబంధించిన అంశములలో ఏవైన మార్పులు కలిగినచో భారతప్రభుత్వమువారు బ్రిటిషు ప్రభుత్వమువారి కోరిక ననుసరించి లేక తమంతటతామే అప్పటికి అమలునందున్న సుంకములవిధానము అనుకూలముగా ఉన్నది లేనిది విమర్శించెదరు. ఒడంబడికలోని మూడవ "ఆర్టికల్" ననుసరించి యీ విచారణ సలిపెదరు. అట్టి విచారణసందర్భమున యునైటెడు కింగ్‌డంలో ఆ పరిశ్రమతో సంబంధముగలవారి విన్నపముల నన్నిటిని విమర్శించెదరు.

### ఒడంబడిక పూర్తివివరములు

కొత్త ఢిల్లీ, జనవరి ౧౦, ౧౯౩౫

యునైటెడు కింగ్‌డంలోని సార్వభౌముని ప్రభుత్వము తరఫున సర్ వాల్టరు రన్సిమన్‌గారు, భారత ప్రభుత్వముతరఫున సర్ బి. యన్. మిత్రగారు నిన్న లండన్‌లో ఇండియా - ఇంగ్లండు వర్తక ఒడంబడికపై సంతకములు చేసిరి. ఈ ఒడంబడిక అటావావర్తక ఒడంబడిక సప్లిమెంటు. ఒడంబడిక పూర్తివివరము లీక్రిందివిధముగా నున్నవి.

అటావా వర్తకఒడంబడిక సాగుచుండగానే దానితోపాటు యీ క్రింది షరతులను అమలునందుంచుటకు బ్రిటిషుప్రభుత్వ, భారతప్రభుత్వములు సమ్మతించెను.

౧. భారతదేశ ఆర్థికపరిస్థితులను చక్కబెట్టుటకుగాను భారతపరిశ్రమకు విదేశదిగుమతులనుండి రక్షణ చేకూర్చవలెననినచో భారతదేశములోని పరిశ్రమలు యునై

టెడు కింగ్‌డం విదేశములలోని పరిశ్రమలకంటె ఎక్కువరక్షణ అవసరముగునంతటిస్థితిలో నుండవలెనని బ్రిటిషు భారత ప్రభుత్వములవారు అంగీకరించిరి.

౨. భారతప్రభుత్వ రెవిన్యూ ప్రస్తుతపరిస్థితులలో దిగుమతిపన్నుపై ఎక్కువగా ఆధారపడియున్నది. కావున దిగుమతిపన్నూను నిర్ణయించునప్పుడు యీ విషయమును గమనింపవలెనని బ్రిటిషు ప్రభుత్వమువారు అంగీకరించిరి.

## రక్షణ నియమములు

3. టారిఫ్ బోర్డువారు తగురీతిగా విచారించిన తర్వాత ౧౯౨౩ సం. ఫిబ్రవరి ౧౬ తేదీ భారతశాసనసభలో ఆమోదింపబడిన తీర్మానమున కనుగుణముగా రక్షణ తప్పనిసరి యని భారత ప్రభుత్వమునకు తోచినపక్షముననే పరిశ్రమలకు రక్షణ చేకూర్చెదరు.

రక్షణ చేకూర్చునప్పుడు దిగుమతిసరకుపర భారతదేశములో నున్న అదేమాదిరి సరకుపరతో సరిసమానమగునంతవరకె రక్షణ చేకూర్చెదరు. అంతకుమించి రక్షణ చేకూర్చరు. ఈ "ఆర్టికిలు"లోని విషయమును గమనించి యునైటెడు కింగ్‌డంనుండి వచ్చుసరకుపై తక్కువ దిగుమతిపన్నును విధించెద మని భారతప్రభుత్వమువారు వాగ్దానముచేసిరి

విదేశములనుండి వచ్చుసరకు దిగుమతిపన్నును యునైటెడు కింగ్‌డంనుండి వచ్చు సరకుదిగుమతిపన్నును మార్చునప్పుడు యునైటెడు కింగ్‌డం సరకుకు నష్టము కలుగులాగున సుంకములను మార్చకూడదు.

రెవిన్యూ అవసరమైనప్పుడు దిగుమతిసరకులపై రక్షణపన్నుకు మించిన సుంకమును విధించుహక్కు భారత ప్రభుత్వమునకు గలదు. ఈ "ఆర్టికిల్" లోని ఒప్పందములు భారత ప్రభుత్వమువారి పై హక్కుకు అడ్డుపడవు.

## వెంటనే విచారణ

౪. భారతపరిశ్రమకు వీలైనంతవరకు రక్షణ చేకూర్చుసమస్య టారిఫ్ బోర్డువారివిచారణకు వచ్చినప్పుడు యునైటెడు కింగ్‌డంలో దీనికి సంబంధించిన ఏపరిశ్రమకైనను పరిస్థితులనుగూర్చి చెప్పుటకు అవకాశ మొసగి భారత ప్రభుత్వమువారు వాటికి సమాధానము లొసగెదరు. రక్షణ చేకూర్చినకాలములోనే పరిశ్రమలకు సంబంధించిన అంశములలో ఏవైన మార్పులు కలిగినచో భారత ప్రభుత్వమువారు బ్రిటిషు ప్రభుత్వమువారి కోరిక ననుసరించి, లేక తమంతట తామే అప్పటికి అమలునందున్న సుంకముల విధానము అనుకూలముగా నున్నది, లేనిది విమర్శించెదరు. ఒడంబడికలోనికి

3 వ "ఆర్టికల్" ననుసరించి యీ విచారణ సలిపెదరు. అట్టి విచారణ సందర్భమున యునైటెడు కింగ్‌డంలో ఆ పరిశ్రమతో సంబంధము గలవారి విన్నపముల నన్నిటిని విమర్శించెదరు.

౫. భారతదేశమున రక్షణపన్నుకు గురియగు సామగ్రిని తయారుచేయుటకు అనుకూలించు ముడిసరకును, సగము తయారైన సరకును భారతదేశమునుండి ఎక్కువగా యునైటెడుకింగ్‌డంలోనికి దిగుమతిచేయు విషయమై బ్రిటిషుప్రభుత్వము శ్రద్ధవహించును. వివిధ వర్తకసంస్థల సహాకారముతో చేయవలసిన పనినిగూర్చి బ్రిటిషుప్రభుత్వము ఆలోచించును. అటావా ఒడంబడికలోని ౮ వ "ఆర్టికల్" ననుసరించి భారతప్రత్తి యునైటెడుకింగ్‌డంలో ఎక్కువగా చెల్లుబడి యగునట్టుల బ్రిటిషుప్రభుత్వము శ్రద్ధవహించుచున్నది. ఇదేమాదిరి ఇకముందుగూడ భారతప్రత్తి విరివిగా చెల్లుబడియగునటుల శ్రద్ధవహించెద మనియు, పారిశ్రామికపరిశోధనకు, వ్యాపారసమస్యల పరిశీలనకు, పారిశ్రామిక ప్రచారమునకు తోడ్పడెద మనియు బ్రిటిషుప్రభుత్వమువారు వాగ్దానము చేయుచున్నారు.

౬. ఇండియన్ పిగ్ ఐరన్ పన్ను లేకుండానే యునైటెడు కింగ్‌డంలోనికి దిగుమతి యగుచున్నది. యునైటెడ్ కింగ్‌డం నుండి భారతదేశములోనికి దిగుమతి యగు ఇనుము, ఉక్కు సామగ్రిపై విధింపబడు పన్ను యునైటెడు కింగ్‌డంకు అనుకూలముగా నుండునంతకాలము యీ సౌకర్యము భారతదేశమునకు ఒసగుచుందుమని బ్రిటిషుప్రభుత్వమువారు వాగ్దానము చేయుచున్నారు. ౧౯౩౪ సం. ఇండియన్ టారిఫ్ ఆక్టులోని 3 (౪), 3 (౫) సెక్షనులు దీనికి సంబంధించినవి. వీటిని ౧౯౩౪ సం. ఇనుము ఉక్కు సుంకము చట్టములోని ౨ వ సెక్షనులో సవరించిరి. ఈ సెక్షనుకు, ౧౯౩౪ సం. ఇండియా ఇనుము ఉక్కు రక్షణ చట్టమునకు విరుద్ధముగా నుండక యునైటెడు కింగ్‌డంకు అనుకూలముగా నున్నప్పుడే పైన ఉదాహరించిన సౌకర్యము భారతదేశమున కొసగబడును.

౭. యునైటెడు కింగ్‌డం భారతదేశములోని సుప్రసిద్ధ పారిశ్రామిక ప్రముఖులు సమావేశమై చేసిన నిర్ణయములు, ఒడంబడికలు, రిపోర్టులను విమర్శించుటకుగాను బ్రిటిషు భారతప్రభుత్వములవారు ఎల్లప్పుడు సిద్ధముగా నుందురు.

## మోడిలీస్ ఒడంబడిక

అటావా వర్తక ఒడంబడిక పర్లిమెంటుకు సంబంధించిన సర్ వాల్టర్ రన్సిమన్ (ఇంగ్లాండులోని ట్రేడుబోర్డు అధ్యక్షుడు), సర్ బి. యన్. మిత్ర (లండన్‌లోని ఇండియా హైకమీషనరుగార్లు)ఉత్తరప్రత్యుత్తరము లీ క్రిందివిధముగానున్నవి:

## సర్ వాల్టర్ రన్సిమన్‌గారి మొదటిలేఖ

"ఇకముందెప్పుడైనా కాలనీలు, ప్రొటెక్టొరేట్లు విదేశీనూలుగుడ్డలతో పోటీచేయుటకు ప్రత్యేకచర్య గైకొనినపక్షమున బ్రిటిషు ప్రభుత్వమువారు కాలనీలు ప్రొటెక్టొరేటు ప్రభుత్వముల సమావేశ మేర్పాటుచేసి భారతనూలు గుడ్డలలో వివిధ రకములకు యునైటెడు కింగ్‌డం నూలుగుడ్డల కొసగు ఆదరణ చూపవలెనని కోరెదరని బ్రిటిషు ప్రభుత్వము తరఫున నేను వాగ్దానము చేయుటకు నాకు అధికార మొసగిరి. లంకాషైరు రాయబారులు బొంబాయిమిల్లుల యజమానుల సంఘము ౧౯౩౩ సం॥ అక్టోబరు ౨౮ వ తేదీని చేసికొనిన ఒడంబడిక అమలునందుండువరకు లేక రెండు దేశముల నేతపరిశ్రమల నిర్వాహకులు క్రొత్త ఒడంబడిక చేసికొనునంతవరకు పై ఒప్పందము చెల్లును."

## సర్ వాల్టర్ రన్సిమన్‌గారికి సర్ బి. యన్. మిత్రగారి ప్రత్యుత్తరము

"నేటి తేదీతో మీరు వ్రాసిన సం. ౧ ఉత్తరము చేరినది. రెండవ సర్ చార్జి నున్నంతకాలము వర్తించుచుండునటుల చేయునప్పుడు యునైటెడు కింగ్‌డం నూలు గుడ్డలపై సుంకము ౨౦% పౌనుకు ౩ ౧/౨ అణాల చొప్పున, తదితర సామాను గుడ్డలకు ౨౦% తగ్గించెదరని భారతప్రభుత్వము తరఫున నేను ఒప్పందము చేయుచున్నాను. లంకాషైరు రాయబారులు, బొంబాయిమిల్లు యజమానుల సంఘము వారు ౧౯౩౩ సం. అక్టోబరు ౨౮ వ తేదీని చేసికొనిన ఒడంబడిక అమలునందుండు నంతవరకు యీ విధముగా సుంకము తగ్గింపబడును. రక్షణపన్ను ఒసగు మిగతా కాలమున అప్పటి పరిస్థితులను బట్టి ఈలోగా మాకు కలిగిన అనుభవజ్ఞానమును బట్టి పన్ను విధించెదము. "రెండవ సర్ చార్జి అన్నింటికి వర్తించకుండునటుల చేయునప్పుడు" అను పదమునకు అర్థమేమన సర్ చార్జి తీసివేసినంత ఎక్కువ తీసివేసి నప్పుడు పూర్తిగా అన్ని రకములకు తీసివేయుట అని అర్థము కాదు."

(సం.) బి. యన్. మిత్ర.

"నేటి తేదీతో మీరు వ్రాసిన రెండవ నం. లేఖ అందినది (సం) రన్సిమన్." అని సర్ వాల్టర్ రన్సిమన్‌గారు సర్ బి. యన్. మిత్రగారి లేఖ అందినటుల సమాధాన మిచ్చిరి.

# ౮. బీహారు భూకంపము

౧౯౩౪ సం. జనవరి ౧౫ తేదీ బీహారురాష్ట్రమున ఎక్కువ ప్రాంతము తీవ్రతరమైన భూకంపమువలన నాశనమైనది. భూగర్భశాస్త్ర ప్రవీణులు ఇంతటి విపరీతమైన భూకంపము ప్రపంచమున ఇదివరలో రాలేదని అభిప్రాయమును వెల్లడించిరి. భూకంపము తటస్థించిన ప్రాంతము చాల ఎక్కువగా నుండెను. కలిగిన నష్టముగూడ ఎక్కువగా నుండెను. ఎక్కువనష్టము కలిగిన ప్రాంతముయొక్క విస్తీర్ణము రమారమి ౩౦,౦౦౦ చ. మైళ్లుండెను. ఇందులో చాంపరాన్, ముజఫర్పూరు, దర్భంగ, సరన్, మాంఘీరు, భగల్పూరు, పూర్ణియాజిల్లాలలోని అత్యధికభాగము గలదు. భూకంపమువలన నష్టపడిన ప్రజలసంఖ్య రమారమి ౧ కోటి ౫౦ లక్షలుండెను. చనిపోయినవారిసంఖ్య సుమారు ౨౦,౦౦౦ లుండుననియు, కూలినట్టియు, చెడినట్టియు ఇండ్లసంఖ్య ౧౦ లక్షలనియు అంచనావేసిరి. చెడిన బావులు, చెరువులు రమారమి లక్ష. భూమిలో యేర్పడిన పగుళ్లనుండి పైకివచ్చిన ఇసుకవలన సుక్షేత్రమువంటి పొలములు ౮ లక్షల ఎకరములకు పైగా కప్పబడినవి. ఇదేవిధముగా పైకివచ్చిన నీటివలన మైదానములన్నీ నీటిమయమైనవి. రైల్వేలైనులు, రోడ్లు చాలభాగము చెడిపోయెను. కొన్నినెలల తరబడి పెక్కుప్రాంతములలో ప్రయాణమునకు ఎక్కువ ఇబ్బందిగా నుండెను.

ప్రభుత్వమువారిసహాయము నటుంచి, బీహారు సెంట్రల్ రిలీఫ్‌కమిటీ అను పేరుతో అనధికారసంఘ మొకటి యేర్పడి నష్టపరిహారమునకు ఎక్కువగా తోడ్పడెను. ఈ సంఘమున కాంగ్రెసుప్రముఖులు ఎక్కువమంది గలరు. సత్యాగ్రహ ఉద్యమమున శ్రీకృష్ణజన్మస్థానమును సందర్శించిన కాంగ్రెసువాదులే నష్టపరిహారమునకు నడుములు కట్టుకొనిరి. 'నష్టపరిహారకార్యక్రమమున ప్రభుత్వముతో సహకారము సల్పెదమని సంఘాధ్యక్షులగు, బాబు రాజేంద్రప్రసాదుగారు ప్రకటన గావించిరి. ప్రభుత్వమువారు వీరి సహకారమును తగురీతిగా వినియోగించుకొనిరి. నష్టపరిహారనిధిని అపేక్షించుచు రిలీఫ్‌కమిటీవారు ప్రకటించిన విన్నపమునకు వెంటనే విరివిగా ధనవిరాళములు వచ్చిపడినవి. ౨౮ లక్షల రొక్కము సమకూడెను. ఇదికాక దుప్పట్లు, వస్త్రములు, బియ్యము, పిండి, పాత్రసామగ్రి, మందులు, తేయాకు, రోగులకు ఆహారము, ఇంటికలప, బొంగులు, బాదులు, ఇనుపరేకులు, టార్పాలినులు, డేరాగుడ్డలు మున్నగునవి మొత్తము మూడులక్షల విలువగల సామగ్రి చేరెను.

ఒకసంఘము యేర్పడకున్నచో నష్టపరిహారకార్యనిర్వహణము సాగుట దుర్లభము. రిలీఫ్‌కమిటీ జిల్లాకు ఒక ఏజంటువంతున నియమించెను. మొత్తము ౨౫౦ చోట్ల నష్టపరిహారకార్యక్రమమును ప్రారంభించిరి. దేశములోని వివిధప్రాంతములనుండి డబ్బు, సామానేకాకుండా, మహాత్మాగాంధి, సేటు జమనాలాల్ బజాజ్, పండిత జవహరలాల్ నెహ్రూగార్ల నాయకత్వమున వాలంటీర్లు వచ్చిరి. పండిత నెహ్రూగారిని రాజద్రోహనేరమునకు కారాగృహమునకు పంపుటవలన నష్టపరిహారమున ఎక్కువసేవ చేయజాలకపోయిరి. సహాయము ఎక్కువగా అవసరమగు దినములలో ౨,౦౦౦ మందికి పైగా వాలంటీర్లు పనిచేసిరి. వీరిలో వైద్యులు, ఇంజనీర్లు, ప్రవీణులగు ఎకౌంటెంట్లు, ఆడిటర్లు, సుప్రసిద్ధ ప్రజాసేవకులు గలరు.

కూలిన ఇండ్లనుండి మట్టిని తీయుట, శవములను దహనముచేయుట, పోయినవారు పోగా మిగిలియున్నవారికి తినుటకు తిండి, కట్టుకొనుటకు గుడ్డ, తలదాచుకొనుటకు వసతిగృహము, మంచినీటిసప్లయి, వైద్యసహాయము మున్నగుపనులు వెంటనే అవసరమైనవి. భూకంపమువలన చెరకుఫ్యాక్టరీలు మూలబడెను. రైతులు తమ చెరకును వినియోగపరచుకొనుటకు బెల్లమును తయారుచేయగానగలను సప్లయిచేయుట గూడ వెంటనే అవసరమైనది. అత్యవసర నష్టపరిహార కార్యనిర్వహణమునకు రిలీఫ్ కమిటీవారు ౬,౦౦౦ మణుగుల ధాన్యము, ఆహారమునకు రు ౨౦,౦౦౦ రొక్కము, ౫౫,౦౦౦ దుప్పట్లు, లెక్కలేనన్ని వస్త్రములు సప్లయిచేసిరి. ౨,౦౦౦ బావుల నుండి పూడికను తీసిరి. ౩౯౯ క్రొత్తగనుబావులను యేర్పాటుచేసిరి. ౬౨,౦౦౦ వసతి గృహముల నిర్మాణమున సహాయముచేసిరి. పంచిపెట్టిన వస్తుసామగ్రిగాక అటుండ పై పనులకు ఒకలక్ష ౯౦ వేలకు పైగా ఖర్చుపెట్టిరి.

నూతిపెల్లాభాగముకు ఖనిర్మాణకార్యక్రమమును ప్రారంభించిరి. ముందుగా నీటిసప్లయివిషయమై శ్రద్ధవహించిరి. కమిటీవారు సుమారు ౬౦౦౦ బావులను త్రవ్వించిరి. సుమారు ౬౦౦ చెరువులనుండి మట్టిని తీయించిరి. యాచనను ప్రోత్సహింపకూడదని కమిటీవారు ముందుగానే నిశ్చయించిరి. ఏదో ఒకపనిని చేయించుకొని ఆహారమిచ్చిరి. చాలమందిని గ్రామములోని తోట్లను మరమ్మతుచేయుటకు, కాలువల నుండి మట్టినిత్రవ్వుటకు, భూకంపమువలన చెడిన నదిఒడ్డును బాగుచేయుటకు వినియోగించిరి. ఈవిధముగా పనిచేయించుకొనుటకు కమిటీవారు రమారమి లక్ష రు. వ్యయపరచిరి. ఈరకమునష్టము ఎక్కువగా చాంపరాన్‌లో కలిగెను. ఈమూటిరి పనిపాటలు చేయించి అక్కడి ప్రజలకు ఆహారము పంచిపెట్టుటకు నాలుగులక్షలకుపైగా ఖర్చుపెట్టిరి.

భూకంపములకులను ఎక్కువగా నష్టపడిన ప్రదేశములు నష్టపడని ప్రాంతములు గూడ జూలై అగస్టు నెలలలో విపరీతమైన వరదలకు గురియైనవి. ఇందు మూలముగ నష్టపడిన ప్రజలను కాపాడి వారికి నష్టపరిహార మొసగు పని అక్టోబరు నెలవరకుండెను. పశువులను రక్షించుట అత్యవసర సమస్యయైనది. వాటి మేత శాశనమైనది. కమిటీవారు సుమారు ౧౫౦ పడవలు వాడిరి. వీటిలో ౧౦౦ పడవలను ప్రభుత్వము వారి ఇష్టము వచ్చునటిగా వినియోగించుట కొసగిరి. వరదలనుండి ప్రజలను రక్షించు ప్రయత్నమున ఒక వాలంటీరు నీటిలో మునిగి చనిపోయెను.

౧౯౩౪-౩౫ సం. చలికాలములోను, తర్వాతను కమిటీవారు గృహనిర్మాణముకు ఎక్కువ సహాయముచేయ మొదలిడిరి. ఇందులకు సుమారు రు. ౭ లక్షలు ఖర్చు పెట్టిరి. ఒక మాదిరి ఇండ్లకు, పాకలకు కమిటీవారు సుమారు రు. ౩ లక్షలు ఖర్చు పెట్టిరి. చిన్న గుడిసెలు నిర్మించుకొనుటకు బీదలకు చేసిన సహాయము గూడ ఇందు చేరియుండెను.

నీటిసప్లయికి ౫ లక్షల ౩౫ వేలకు పైగా ఖర్చు పెట్టిరి. ఆహారమునకు రు. ౨౭ లక్షలు, పశువుల మేతకు రు. ౭౫,౦౦౦. విరాళముల నొసగినవారు రు. ౪౫,౦౦౦ పశువుల మేతకు ప్రత్యేకించిరి. వైద్యసహాయమునకు రు. ౩౭,౦౦౦, విత్తనములకు రు. ౩౬,౦౦౦. చౌకధరకు విత్తనములు, కలుపు వల్లయి చేయుటకు కొంత ఖర్చు పెట్టి వీటిధర పెరుగకుండునటుల చేసిరి.

ముజఫర్పూరుజిల్లాలో కొన్ని క్రొత్తప్రాంతములందు పెక్కు గ్రామములను నిర్మించు పని జరుగవలెను. అంతర్జాతీయ వాలంటీర్ల నాయకుడు స్విట్జర్లెండు దేశీయుడు అను పియరి సెరిసోల్ గారి యాజమాన్యమున యీ పని జరుగుచున్నది. వైస్రాయి నష్టపరిహారనిధి, బీహారు సెంట్రల్ రిలీఫ్ కమిటీ నిధినుండి ఇందులకు డబ్బు ఖర్చు పెట్టుచున్నారు.

పొలములు భూమిలోపలనుండి వచ్చిన ఇసుకచే కప్పబడినవి. ఈ ఇసుకను తీసివేయుట బహుప్రయాస యగునని భయపడిరి. ఈ కష్టమును ప్రకృతి తొలగించెను. ఈ ఇసుక మొదట భయపడినంత ప్రమాదకరమైనది కాదు. ఇసుకచే కప్పబడిన ప్రదేశములో చాలాభాగము బాగుగానే ఫలించుచున్నది. కమిటీవారి పని పూర్తి కావచ్చుచున్నది. ప్రత్యేకపనులకు వేరుగా నుంచిన పైకము తప్ప మిగతా నిధిలో చాలవరకు ఖర్చయినది. మూడు నెలల కొకసారి కమిటీవారు లెక్కలను, రిపోర్టులను ప్రచురించుచున్నారు.

భారతజాతీయమహాసభ అధ్యక్షులు



నెల్లి సేనుగుప్త

కలకత్తా : 1933.



(1) హ్యూమ్, (2) నౌరోజీ, (3) వెడ్డర్‌బర్న్

కాంగ్రెసుస్థాపకులు

9

# అఖిలభారత జాతీయమహాసభ

ఆరంభమయిన 1885 మొదలు 1834 వరకు జరగిన సమావేశముల

వివరములు తెలుపు పట్టిక.

| తేదీ | స్థలము | ప్రతినిధుల సంఖ్య | ప్రేక్షకుల సంఖ్య | స్వాగతసంఘాధ్యక్షులు | సాధారణ, సంయుక్త సాధారణ కార్యదర్శులు | అధ్యక్షులు |
|---|---|---|---|---|---|---|
| -12-1885 | బొంబాయి | 72 | ... | ... | ... | డబ్ల్యు. సి. బెనర్జి |
| -12-1886 | కలకత్తా | 432 | ... | డా. రాజేంద్రలాల్ మిత్ర | ఏ. ఓ. హ్యూమ్ (సమ్మిళితుడై) | దాదాభాయి నౌరోజీ |
| -12-1887 | మద్రాసు | 606 | 3000 | రాజా సర్ టి. మాధవరావు | ,, | బద్రుద్దీన్ తయ్యాబ్జీ |
| -12-1888 | అలహాబాదు | 1248 | 5000 | పండిత అయోధ్యానాథ్ | ,, | మిస్టర్ యూల్ |
| -12-1889 | బొంబాయి | 1889 | 4000 | ఫిరోజిషా యమ్. మెహతా | ఏ. ఓ. హ్యూమ్ (నియుక్తుడై) | సర్ విలియంవెడ్డర్ బర్న్ |
| -12-1890 | కలకత్తా | 677 | 7000 | మనమోహన్ ఘోష్ | ,, | ఫిరోజిషా మెహతా |
| -12-1891 | నాగపూరు | 812 | 3200 | సి. నారాయణస్వామి నాయుడు | 1. ఏ. ఓ. హ్యూమ్ (జ. సె.)<br>2. అయోధ్యానాథ్ (జాయ.జ) | పి. ఆనందాచార్లు |
| -12-1892 | అలహాబాదు | 625 | 2600 | పండిత విశ్వంభరనాథ్ | ,, | డబ్ల్యు. సి. బెనర్జి |
| -12-1893 | లాహోరు | 867 | 3200 | సర్దార్ దయాళుసింగు | 1. ఏ. ఓ. హ్యూమ్ (జ. సె.)<br>2. అనందాచార్లు (జాయ. జ) | దాదాభాయి నౌరోజీ |
| -12-1894 | మద్రాసు | 1168 | 4000 | పి. రంగయ్యనాయుడు | ఏ. ఓ. హ్యూం | అల్ఫ్రెడ్ వెబ్ |
| -12-1895 | పూనా | 1584 | ... | యస్. యమ్. భిడె | ,, | సురేంద్రనాథ బెనర్జి |
| -12-1896 | కలకత్తా | 784 | ... | సర్ రొమేశ్ చంద్రమిత్ర | 1. ఏ. ఓ. హ్యూం (జ. సె.)<br>2. ఇ. డి. వాచా (జా. జ.) | మహమ్మద్ రహీంతుల్లా సయ |
| -12-1897 | అమరావతి | 692 | ... | జి. యస్. కపర్డి | ఏ. ఓ. హ్యూం | సి. శంకరనాయర్ |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| -12-1898 | మద్రాసు | [illegible] | ... | [illegible] | ,, | |
| -12-1899 | లక్నో | 740 | 3500 | బన్సీలాల్ సింగు | ,, | రొమేశచంద్ర దత్తు |
| -12-1900 | లాహోరు | 567 | ... | కాళీప్రసన్న రాయ్ | ,, | యన్. జి. చందావర్కర్ |
| -12-1901 | కలకత్తా | 896 | ... | మహారాజబహదూర్<br>జగదింద్రనాథరాయబహదూర్ | 1. ఏ. ఓ. హ్యూం<br>2. డి. ఇ. వాచా | డి. ఇ. వాచా |
| -12-1902 | అహ్మదాబాదు | 471 | ... | అంబాలాల్ దేశాయి | ఏ. ఓ. హ్యూం | సురేంద్రనాథ బెనర్జీ |
| -12-1903 | మద్రాసు | 588 | 5500 | న. సయ్యద్ మహమ్మద్ బహదూర్ | ,, | లాల్ మోహనఘోష్ |
| -12-1904 | బొంబాయి | 1000 | ... | సర్ హెచ్. మెహతా | 1. ఏ. ఓ. హ్యూం (జా. సె.)<br>2. డి. ఇ. వాచా<br>3. జి. కె. గోఖ్లే (జా. జ.) | సర్ హెన్రీ కాటన్ |
| -12-1905 | కాశీ(బెనారస్ | 758 | ... | మాధోలాల్ | ఏ. ఓ. హ్యూం | జి. కే. గోఖ్లె |
| -12-1906 | కలకత్తా | 1663 | 2000 | డా. రసవిహారీఘోష్ | ,, | దాదాభాయి నౌరోజీ |
| -12-1907 | సూరతు | 1600 | 5400 | త్రిభువనదాసుమాలవి | ,, | డా. రసవిహారీఘోష్ |
| -12-1908 | మద్రాసు | 626 | ... | వి. ఆ. కె. కృష్ణస్వామిరావు | ,, | ,, |
| -12-1909 | లాహోరు | 243 | ... | హరికిషన్‌లాల్ | 1. డి. ఇ. వాచా<br>2. డి. ఏ. ఖేర్ | మదనమోహనమాలవ్యా |
| -12-1910 | అలహాబాదు | 636 | 4000 | పండిత సుందరలాల్ | డి. ఇ. వాచా | సర్ విలియం వెడ్డర్‌బర్న్ |
| -12-1911 | కలకత్తా | 446 | ... | భూపేంద్రనాథబాసు | ,, | పండితబిషన్‌నారాయణధార్ |
| -12-1912 | బాంకీపూర్ | ... | 4500 | మజ్రుల్ హక్ | ,, | ఆర్. యన్. మధోల్కర్ |
| -12-1913 | కరాచీ | 550 | ... | హరిశ్చంద్రరాయి విషన్‌దాస్ | ,, | నవాబ్ సయ్యద్ మహమ్మద్<br>బహదూర్ |
| -12-1914 | మద్రాసు | 866 | ... | సర్ యస్. సుబ్రహ్మణ్య అయ్యర్ | 1. సయ్యద్ మహమ్మద్<br>2. యన్. సుబ్బారావుపంతులు | భూపేంద్రనాథబాసు |

| తేదీ | స్థలము | ప్రతినిధుల సంఖ్య | స్వాగతసంఘాధ్యక్షులు | సాధారణ, సంయుక్త సాధారణ కార్యదర్శులు | అధ్యక్షులు |
|---|---|---|---|---|---|
| -12-1915 | బొంబాయి | 2259 | డి. ఇ. వాచా | నవాబ్ సయ్యద్ మహమ్మద్ యన్. సుబ్బారావుపంతులు | సర్ యస్. పి. సిన్హా |
| -12-1916 | లక్నో | 2801 | గౌ. పం. జగత్‌రాయణ్ | ,, | గౌ. బాబు అంబికాచరణ మజుందారు |
| -12-1917 | కలకత్తా | 4967 | పి. బి. వైకుంఠనాథసేన్ | సి. పి. రామస్వామిఅయ్యర్, ఖుర్ గ్రీ, ది. బ. పి. కేశవపిళ్లై | అనిబిసెంట్ |
| 1918 సెప్టెంబరు అవసరకాం. | బొంబాయి | 8500 | విఠ్ఠలభాయి జె. పటేల్ | ,, | హసన్ ఇమాం |
| -12-1918 | ఢిల్లీ | 4869 | హకీమ్ అజమల్ ఖాన్ | వి. జె. పటేల్, ఫజలుల్ హక్ పండిత గోకర్ణనాథమిశ్ర | మాలవ్యా |
| -12-1919 | అమృతసరము | 7031 | స్వామి శ్రద్ధానంద | వి. జె. పటేల్ పండిత గోకర్ణనాథమిశ్ర, అన్సారి | మోతీలాల్ నెహ్రూ |
| 1920 సెప్టెంబరు | కలకత్తా | ... | బి. చక్రవర్తి | ,, | లాలాలజపతిరాయ్ |

| | | | | | |
|---|---|---|---|---|---|
| | | | | అన్సారి,<br>సి. రాజగోపాలాచారి, | |
| -12-1921 | అహ్మదాబాదు | 4726 | వి. జె. పటేల్ | మోతీలాల్ నెహ్రూ,<br>సి. రాజగోపాలాచారి,<br>వి. జె. పటేల్,<br>ఎ. రంగస్వామి అయ్యంగార్ | జయిలులో ఉన్న సి. ఆర్ దాసుకుగాను హకీం అ మల్ ఖాన్ (అక్టింగ్ ప్రెసిడెంటు) |
| -12-1922 | గయా | 3248 | బ్రజకిషోరప్రసాదు | యం. మొఅజ్జం అలీ,<br>వల్లభభాయి, జె. పటేలు,<br>బాబురాజేంద్రప్రసాద్ | సి. ఆర్. దాసు |
| సరకాం. | ఢిల్లీ | ... | అన్సారి | ,, | మౌలానాఅబుల్‌కలాం ఆజా |
| -12-1923 | కాకినాడ. | 6188 | దేశభక్త కొండా వెంకటప్పయ్య | జవహర్‌లాల్ నెహ్రూ,<br>షఫుద్దీన్ కిచ్లూ,<br>గంగాధరరావు దేశపాండే,<br>డి. గోపాలకృష్ణయ్య | మౌలానామహమ్మదాలీ |
| -12-1924 | బెల్గాము | 1844 | గంగాధరరావు దేశపాండే | సాహెబ్ కిరెషీ,<br>బి. యఫ్. బరూచా,<br>జవహర్‌లాల్ నెహ్రూ | మహాత్మా గాంధీ |
| -12-1925 | కాన్పూరు | 2688 | డా. మురళీలాల్ | అన్సారి,<br>ఎ. రంగస్వామిఅయ్యంగార్<br>పండిత సంతానం | సరోజినీ దేవి |
| -12-1926 | గౌహతి | 3000 | టి. ఆర్. ఫూకర్ | ,, వి. జె. పటేల్ | యస్. శ్రీనివాసఅయ్యంగా |